# హిమధామార్కధర పరిణయము

మ. ధరణీపాలకుఁ డాత్మరాడ్విభుఁడు యుద్యత్సింధుగంభీరుఁ డం
బరధాముండు యశఃకరుండు ఘనశుంభద్దివ్యహృత్పంకజా
కరుఁ డుల్లాసములుప్పతిల్ల వరసౌఖ్య ప్రాభవౌన్నత్య సు
స్థిరభాగ్యంబులొసంగి బ్రోచుత ధరిత్రిన్వీరయారాణ్మణిన్

మ. అఖిలాదోషపయోధిమధ్యమున సత్యంబావగింజంతగా
నక దుర్గండజలప్రవాహపుఁ దరంగశ్రేణి ఘోషించువా
రికిగా జీవరసంబుఁజిల్కు మహిమోర్వీనాథునైర్మల్యభూ
రికరాబ్జద్యుతి వీరయార్యమణిఁ గూర్మిన్బ్రోచి రక్షించుతన్

మ. విలసచ్ఛీతమయూఖ భానుకిరణ ప్రేమాంకురజ్వాలలు
జ్వలతీవి న్మెయిసోక లేఁజెమట కాల్వల్గట్ట మంధాద్రిశీ
తలవాతూలముఁదన్ప దిగ్వనితబృందంబిమ్ముదీవింపఁ బౌ
రులు మెచ్చం దివినాథుఁడేలును సుధీరున్వీరయాధీమణిన్

**కవిజనప్రార్థన**

మ. నడువంబూనిన బాలకుం దవనిపై నన్బడ్డఁ దొట్రిల్లిచూ
చెడువార ల్జెయిఁబట్టిలేపక నగం జింతిల్లడే వానినొ
ప్పెడు నాకావ్యమునందు దోషములు వెవ్వేలుండఁ గైతాసతీ
పుడమీశుల్గని గేళిసేయనకటా మోమెత్తజాలంగదా?

సీ. నేలపైదోగాడి నిలుచుండి తప్పటడ్గులవేయు మీదు ముద్దుల సుతుండొ?
కనులపండువగాగఁ గొనిచాకు మీచిన్ని రమణీయమైన గోర్వంకపిట్టొ?
యబ్జాకరముల రమ్యమ్మునడయాడగా పెంచెడు మీదు రాయంచకొదమొ?
చెంగు చెంగునదూక సింగారమనియింట జెలఁగిమేపెడు మీదు జింకకూనొ?

తే.గీ. నడకలనొ? పాటలనొ? చెంగు లిడుటలోనొ?
తప్పులుండిన సంతోష తరముగాదె?
యట్టిచందంబు కవుల రాపట్టిగాగ
[illegible]

# విజ్ఞాపనము

ఆర్యులారా!

నేనీ గ్రంథము రచించుటలో నాముఖ్యోద్దేశమేమన, సర్వజనానురంజకముగా యొక్క చిన్న ప్రబంధము లిఖించి, కవితాసామ్రాజ్య ధురంధరులు నాబాల కవిత్వము జూచి సంతోషించి నాయెడ పుత్రవాత్సల్యముంజూపు భాగ్యంబుఁ బడయనై యున్నది. ఇయ్యది యెల్లయు కల్పనయే.

# ఉపోద్ఘాతము

హిమవత్పర్వత శిఖరమునందు నుదయించెడాకాశగంగ యొక్క ప్రాంతమునందు తారక యనుపేర నొక్క పట్టణము గలదు. అందు సూర్యధరుండను నొక్క రాట్కులోద్భవుండైన బాలకుండు నొక్క వృద్ధాంగనచేఁ బెంపఁబడుచుండి ద్వాదశవర్ష ప్రాయుడైనపు డరణ్యం బునకు వేటకైపోవుచు గంగానదీతటంబున చెలికత్తెలతో జలకమాడు క్షీరసాగరుని కుమార్తె యగు చంద్రధరినిగాంచి వారితో నటవిఁజేరి "స్వయంవర" విధి వివాహమాడు. తదనంతరము యిల్లుఁజేరి కొన్ని వర్షములకు సతిపతులు యుగ్రారణ్యక్రీడ సల్పబోయి యందు తెరవు దప్పి వేరువేరైపోదురు. చంద్రధరి యేడ్చుచుఁబోవుచుండ నొక్క మునివర్యుండు జాలిగొని యామెనోదార్చి యొక పర్ణశాలయందుంచ, మరికొన్ని యేండ్లకు సూర్యధరుండు రూపుమారి యతిదుఃఖా క్రాంతుడై యాపర్ణశాలకు సాయంకాలసమయమునఁజేరి పంచలో నిద్రింపుచు భార్యానామంబెత్తి బిగ్గరిగా పలువరింప చంద్రధరిమేల్కొని రాజుపైబడి యేడువ నాతఁడు మేల్కొను నంత మునుపటిమౌని యరుదెంచి వారినోదార్చి యాశీర్వదించి కుమార్తెతో స్వపురంబునకు దన్పు. మద్దోషంబుల పండితులు మన్నింతురుగాక.

ఇట్లు బుధజనవిధేయుడు,
గుర్రం జాషువాకవి,
నేత్రావధాని,
వినుకొండ

# హిమధామార్కధర పరిణయము

శా. శ్రీభూభృన్నికరంబపత్యపుగతిన్ సిగ్గందుచుండంగ నం
భోభృద్బృందపథంబునంటు హిమవద్భూమీధరాంగ్రబు పై
శోభాబంధురయై జనించెడి పయశ్శుద్ధాంబు వౌగంగ యే
భూభాగంబున బారుచుండు నటనొప్పుం దారకాప్రోలనన్

వ. ఆపట్టణంబున

ఉ. రూపమునందు మన్మథుని రూపణసేయక వేల్పుపెద్ద వి
ద్యాపటిమంబునందు నిక దానగుణంబున సూర్యపుత్రు నౌ
రా! పరిపూర్ణ శౌర్యమున నాభృగుసూను ధనంబునందు నా
శాపతియౌ కుబేరు నెక సక్కెములాడుదు రాపురప్రజల్

ఉ. తెల్లనిసౌధరాజముల దీప్తులు నింగినిదాకుచుండ మే
నెల్ల విభూషణావళుల నెంచి ధరించి చరించు రాజకాం
తల్లలిత ప్రకారముల దారిగమించు విమానరూఢులన్
బల్లవపాణులన్బిలచి బంతులయాటలనుంద్రు వెన్నెలన్

శా. ఆపౌరాంగనలీగతిన్ గలసి క్రీడాశన్ విజృంభించుచో
దీపించున్ఘనభూషణంబులరుచుల్ దీపాంకురచ్ఛాయలన్
వ్యాపించున్ దిశలన్ సురాంగనలు యాహా చూడరేయంచు నా
నాపూవర్షముఁ గ్రుమ్మరించుదురు వింతన్ యాకసంబుండియున్

మ. ఉదయంబందున భూసురోత్తములు విధ్యుక్తంబు గంగానదీ
యుదకస్నానముఁజేయఁబ్రత్యహముఁబో హుమ్మంచుమంత్రంబులన్
యెదలోనన్బఠియింపుచుండఁ బువుకై యేతెంచు భృంగావళుల్
మదఝుంకారముఁజేయుచందమున వేమారున్ మదిన్దోచెదున్

సీ. అందు మందార మాకంద సుందరవృక్ష బృందమానందంబు విందుగొల్పు
నతిసుగంధంబు భూతతిగుప్ప నల్దిశల్ గాంక్షగల్గును పూల గనులcజూడ
బురిలోన సంగీత పుంగవాకరమైన వీధులు మృదుగీతి బెనగుచుండు
నూహింప వేదాంత హోంకారమఖిల పండిత వాక్చమత్కృతీ యుతముcజెందు

తే.గీ. నిట్లునైసర్గికములందహీనభోగ
భాగ్యములచేతcదనవారి యోగ్యమయిన
భూతలంపుస్వర్గంబుగా బోల్పబడుచు
పురముతారకాపురిదేవపురముగాదె

కం. అచ్చోబండుట పూవుల
గుచ్ఛంబులుc బండ్లపిండు గొప్పగుcదేనెల్
హెచ్చుగc గానంబడు బూ
గుచ్ఛంబులుc జూడనఖిల గోర్కెలు బాయున్

సీ. అడుగువేయగ స్వచ్ఛమయిన జలముల తోడ నెఱిబారుఘనవాహినీలపిండు
నడుగువేయగ దట్టమైన పూతతులతో వర్ధిల్లెడుద్యానవనులపిండు
నడుగువేయగక్రూరమైనమృగములతోను గ్రమములౌ ఘనయరణ్యములపిండు
నడుగువేయగ రమ్య మయిన సస్యములతో రాజిల్లునట్టి క్షేత్రములపిండు

తే.గీ. కలయగాంచినc దేనెపట్టులతొ నిండి
నెలకు మూడేసివర్షము ల్గలగి ప్రొద్దు
కలర మూడేసిసార్లు గోవులు నిరతముc
బాలనిడుచుండు నవ్వీట శ్రీలుగలిగి

సీ. ఇంటింటcజూడగా కంటికింపైయొప్పు పంచరంగులచిల్క పంజరములు
యింటింటcజూడcగా నెలమిచెంగునcదూకు చక్కనిపొడలేడి శాబకములు
యింటింటcజూడc నహీనపూజలుసల్ప నలరిపెంచినయట్టి తులసితరులు
యింటింటcజూడ నేటేటకాపుంగాయ దగినట్టి మేలైన ద్రాక్షతరులు

తే.గీ. లలితమైనట్టి పువులు గులాబితరులు
చోద్యమైయొప్పుచుండు రాజుల గృహముల
యందు వసియించు జనుల భాగ్యంబుఁదెలుపఁ
దరమె కవులకైనను దివి సురలకైన

వ. ఆపురం బిట్టి సకల భాగ్యములచేఁ దనరారుచు భాస్కరుని యాతపం బెన్నఁడేనియు సోకకుండ నిరతంబు మందమారుతమయంబై క్షేత్రంబులు దున్నకుండినను పుష్కలముగాఁ ఫలింపుచుఁ జనుల కౌన్నత్యపథంబిచ్చు వసుంధరయై యుండు. తత్పురంబున యెల్లరు బ్రాహ్మణులేయైయున్నను కొన్ని రాజగేహంబులు గలవు. అందొక్కయింట నొక వృద్ధురాలును ద్వాదశవర్ష ప్రాయుఁడైన యొక్క రాజసూనుఁడును గలరు. బాలకుఁడు శౌర్యాలంకారభూషితుఁడును నిరుపమసత్యశాలియు సౌందర్యంబునఁబూర్ణేందుముఖుఁడై రఘుకులపయోధిభాస్కరుఁడై యొప్పుచుండె

మ. ఘనుఁడై భూరిగుణోన్నతిన్ రఘుకులాగణ్యుండునై శాత్రవా
జన గర్వారియునై నిశాటజనసంసద్భేదుఁడై మంజుభా
షణుఁడై కోవిదరంజనుండయి దురాచార క్రియాఖండనుం
డును గంభీరుఁడునైన సూర్యధరుఁడుండున్ దత్పురిన్ భానుఁడై

మ. తమగేహంబున బాంధవప్రకరిచేతన్ యుద్ధరంగస్థలి
న్దమిఁబట్టంబడినట్టి ఖడ్గముల చేతన్ బట్టి యాయావిధుల్
ల్దమిమీరన్ గరిడీన నేర్చుకొనుచున్ దద్రాజసూనుండు ధీ
రమనఃపూర్ణుఁడు ధర్మశాలిగ ధరన్ రాజిల్లుఁదారాపురిన్

మ. రవివంశోద్భవుఁడైన బాలకుఁడు విభ్రత్వంబు జన్మింప గాం
డివవిద్యాపరుఁడై భుజాబలిమిఁ జాటింపంగ వ్యాఘ్రావళిన్
వివిధారణ్యమృగోత్కరంబులను యన్వేషించి భీతిల్ల బా
ణవితానంబుల బారదోలును యనంతప్రజ్ఞ బాహుళ్యతన్

వ. పిన్ననాడే యిట్లఖిలమృగముల భీతి యొక్కింతయు లేక బారదోలుచు బాణముల నేసి నికాయంబుల నొప్పిగల్గించుచు పరాక్రమమునుఁ జూపుచు నొక గురువుచెంత

సీ.	ముదుసలితోఁగొంత ముచ్చటించునుగాని గజతురంగముల నెక్కదలంచు
నవ్వజెప్పెడుగాథ లాలకించునుగాని సాముకత్తులకు పూజలను సల్పు
లోకభోగముదెల్ప నూకొట్టుగాని శాత్రవుల యుద్ధంబు స్వాంతముననెంచు
గురువుతో నిసుమంత కొసరినవ్వునుగాని మృగయావిహారంబు నెదఁదలంచు

తే.గీ.	కాంతలనుగాంచుఁగాని యేకాంతమందు
మోముఁ బైకెత్తిచూడఁగఁ బోడు దురిత
మంచు వారలతో మాటలాడఁబోడు
సూర్యధరుఁడిట్టులుండును చోద్యమొదవ

ఉ.	ఆవసుధాధిపుత్రుని మహాద్భుతరూపసుభాగ్యతన్ పురం
ధ్రీవనితామణుల్గని వరించి యతండువసించు యింటికే
దోవిధి కార్యమున్నటుల నో ముసలమ్మయటంచుఁజేరిరా
గా వెనుకంజవేసి తన కార్యముపై మనసుంచి పోవగన్

సీ.	విల్లుచేనంది రావీధిఁబోయెడువేళ మల్లెపూవులుకొన్ని జల్లువారు
వాల్గంటఁజూడగా పండ్లుపటపటనొక్కి కరుణతో మెటికలు విరుచువారు
యాకస్మికంబుగా నాతడగుపడువేళ గుండెఝల్లన లోన గొణుగువారు
నీలకుంతలముల నీటుజెడకుండగా బాయకఁబాపట్లు దీయువారు

తే.గీ.	పట్టుచీరెలు తప్పక గట్టువారు
తిలకములదిద్ది జవ్వాజి జిలుకువారు
జూడలేదన్న కోపాగ్ని జొచ్చువారు
యెందరోగల రవ్వీటియందుఁ నెన్న

వ.	ఇట్లనేకభంగుల సూర్యధరునికి మోహముఁబుట్టింప బాధపడుచు వనితలు విసికి యూరకుండిరి. కొన్ని వత్సరంబులకు పూర్ణవయఃస్కుఁడై సకల విద్యాగరిష్ఠుఁడై యొక్కనాడా వృద్ధవనిత యనుజ్ఞ గైకొని

సీ. మణిగణహార గుంభనవిద్యుతుల్దారి కిరుపార్శ్వములయందు మురువుఁజూప
కమనీయగాత్ర మక్కజమైన బంగారుయే వేరుగాదని యెంచఁబడగ
వామబాహువుక్రింది భాగంబునందున బృహచ్చాపంబట్టు నిట్టుగదల
ప్రక్కగావైచిన వాలుపట్టురుమాల వాతాహతంబున వసుధఁజార

తే.గీ. సరగమృగయావిహారార్థ సంతసమున
లేత చిరునవ్వు మోమునఁ బూతఁబూయ
మాటికొకసారినిలిచి సమస్తరవము
బాగుగా నాలకించుచుఁ బయలుదేరె

కం. గంగానది కిరుప్రక్కల
నుం గలిగినయట్టి వనవినూతనతరులన్
శృంగారమయినపండుల
నుం గని కౌతుకముహెచ్చి నోరూరంగన్

వ. రాజు తరువుల నారోహించి మంచిఫలముల

ఉ. కొన్ని రసాలవృక్షమున గొన్నిటి నక్కదలీమహీజమున్
తిన్నగఁద్రెంచి రాసుతుఁడతిత్వర నేటినిదాటువేళ రా
మిన్నిని పూర్ణ చంద్రముఖి మేటివధూటి సువర్ణగాత్రి రూ
పోన్నతిమించుదానిని రఘూద్భవి నుజ్వల తేజిగాంచెదున్

వ. సూర్యధరుం డారాజకుమార్తెను విలోకించి పోఁగాలురాక నదీ తీరంబున నొక సైకతవితర్దికముపై గూర్చుండి చూచుచుండె. ఆ సుందరాంగనకు

మ. కుడిపార్శ్వంబున చామరల్విసరు చాకుల్పోకలన్ నోటిలో
నిడువార ల్ఘనతాళవృంతముల నెంతేవీచి పన్నిటితో
నొడలున్ నింపెదువారు నందియల నెంతో దోమువారల్ సఖిన్
గడుమోదంబొనరింప రాజుగనియెన్ గంగానదీతీరమున్

మ.	జిలుగుంబయ్యెదపై మరుద్ధతిని ముంజీరాడువేణీభరిం
జెలులందిర్వురు నూనెలంజమర నందేయొక్కతవ్వాటిము
ద్దులుకుల్కం జడనల్లువేరొకతి యందున్మల్లెపూలుంచిcబు
న్గల బుక్కాయినినింపు వస్త్రముల ముంగోటన్సుగంధమ్ములన్

శా.	ఆరాపుత్రిక జల్కమాడుతరి డాయన్‌బోయి నీలాలకల్
బారుల్జేసియుc జిక్కుదీసి వలువల్ బైcగప్పి కెంగేలులన్
నీరంబింకcగనొత్తువారు ఘనవేణిన్ దీర్చి ముక్తామణీ
హారంబుల్ మెడనేయువారల ప్రభూతాశ్చర్యుcడై చూచెడున్

సీ.	నీలకుంతలిమోము ఫాలభాగమునందు ముద్దుగా తిలకంబు దిద్దువారు
యమ్మరోప్రొద్దెక్కె నంచుc బిరబిరనేగి తెల్లపూవులచీరె దీర్చువారు
యాచీరెకిదియంగటంచు బరీక్షించి వడినీలిరవికెను దొడుగువారు
యిడినబెండునుతీసి యెలమిముకురంధ్రంబు మంచిముత్తెపుబులాకుంచువారు

తే.గీ.	వేగc జెవులకు కమ్మలc బెట్టువారు
క్రొత్తపూసరుల్జక్కగా గూర్చి తెచ్చి
యివిగొ ధరియించుమని మెడ నేయువారు
వరుసదీరcగాcగాంచె నా వసుధరేడు

తే.గీ.	ఇటుల పనికత్తె లిరువంక లేగుcదెంచ
మేన జవ్వాజివాసనల్ మిగులుcగొట్ట
సకల భూషణంబులకాంతి యఖిలదిశల
ఘనముగాcబర్వ మత్తేభగమన గదలె

సీ.	మొదటకాంతలcజూచి మొగమునెత్తనివాcడు రెప్పవేయక కాంత కొప్పుగాంచె
మొదటకాంతలcజూచి బెదరిపోయెడువాcడు పిలుతునాయని లోన దలచుచుండె
నాకులిత్తుము రమ్మటన్నc జేcజాచని వాcడు తానేయడ్గc బాలుపడియె
నలరువిల్కాడు డాయcగ బారcదోలెడు వాcడు తలcజేర్చి పోరాడcదొడcగె

తే.గీ. వనితలెందున్నఁ దొల్గెదువాఁడు నాఁడు
యడుగుఁజాడల వనమున కరిగె రాజ
పట్టి తనుఁజూడ నొకప్రక్క బక్షిబట్ట
బరుగులిడుచుండె మన్మథు బాధబడుచు

వ. ఆరాజకుమార్తె తన చెలికత్తెలతో నవ్వనంబున విరులు చిదుముచు వాల్గంట నవమన్మథాకారుడైన రాజశిఖామణినిగాంచ రాజుయొక్క విలోకనతీక్ష్ణబాణములు హృదయంబున గాఢంబుగా నాట

మ. చెలులారా పెనుదవ్వురాఁ బదము లిస్సీ నెత్తురుల్ గ్రమ్మె ని
ర్మలదేహంబునఁ జెమ్మటల్జిలికె భారంబయ్యె నిచ్చోట కో
కిలరావంబుల సొంపులన్ వినిన భృంగీరావముల్ విందమీ
తలమున్ జిమ్మరె రాలనేరరె శుభాస్థానంబు గావించరే

వ. ఇట్లనుచున్న రాకుమార్తెను వచ్చుటకు తీవరించుచున్న చెలికత్తెలతో

శా. అమ్మా రమ్మికపోదమంచుఁ దివి మార్తాండుండు చండాగ్నిఁబై
జిమ్మన్ జూడక మాటలాడితిరె వంచింపంగనాయేమి సా
ధ్యమ్మా పిట్టశిరంబుపట్టుమని ప్రీయన్ గాచుచుండంగ దే
హమ్మాయేమిటి బండయా యినుమ యుక్కా తెల్పరేకాలకన్

వ. అని వారల కోపించినదై తనుజేసి పరులపై తప్పుబెట్టె నన్నట్టు తన హృదయంబు రాజకుమారునిమీదనుండ యెండపై నడకపై యడ్డుబెట్టి యొక్క వృక్షచ్ఛాయన గూరుచుండి రాజును జూచుచు

మ. ననవిల్తుండు మనుష్యరూపున యరణ్యంబున్ చరింపంగ వ
చ్చెనొ గాండీవియొ భానుసూనుడొ చిరంజీవుండు గాంగేయుడో
ననుగాంక్షించి వనంబుజేరెను యటైనన్ నాదుభాగ్యంబె యే
మనినన్ గూడకఁబోయెనా గృహము డాయంబోను చావిందునే

సీ.	ఈరాజుముఖకాంతి యెల్లరాజులముఖాబ్జములుమూయించెడు జంద్రుఁబోలు
ఈరేడుబాహువు లెల్లరాజులగెల్వ నొప్పుభార్గవుని బాహువులుగాని
యీభూధవుని సత్వమెల్లరేడులతల ల్వంగఁజేసిన రాము బలిమిఁబోలు
యీపృధ్విపతిచూడ్కి యెల్లకాంతలమానసుల నీరుఁగావించు చూడ్కిగాని

తే.గీ.	వేరుగాదల్పరాదు యీ భూరమణుని
వాక్యరసమెట్టిదోవినఁగ వాంఛగలిగె
చుంబనం బెన్నగా హృదయంబుగల్గె
నహ హ! యెందబ్బు నచ్చోటె యమరపురము

వ.	అని వర్ణించి మరల

శా.	ఏనేరీతిగఁబిల్చెదన్ వనితగానే? సిగ్గుగాదా? సరే
యీనాడిట్టులొనర్ప భూజనులు నన్నే యెంచుచున్ తత్ఫలా
నా నారీమణిజేసె లెమ్మిటుల యన్నన్ నామనంబొప్పునే
పోనీ పూరుషుడా 'చెలామణి' యగున్ ముల్లోకముల్మెచ్చగన్

మ.	అకటా యేమియొనర్చుదాన నిపుడాహా లచ్చిపుత్రుండు మా
టికి బాణంబుల నన్నుఁదాకుటకు రెంటిన్ దన్పగాసాగె నిం
తకు నేఁదాళితి నింకఁదాళగలనా నామానసున్ యిప్పుడిం
కొక శస్త్రంబిదెహెచ్చి తాకఁదొడఁగెన్ యూహింతునేదోపథిన్

వ.	అని యిట్లు చింతించి తుదకు

చం.	చదువుయెరుంగనా చెలగి చక్కగఁ గమ్మలిఖింపలేనె యే
కొదువ యిదేమికాగితము కోర్కెలిఖింపఁగఁ గొంచుఁబోవనా
ముదితలు లేరె యీవరకు మూధవధూమణినైతిగాని పం
పుదు నిపుడైన మారుశరముల్మది గాఢముగాక పూర్వమే

సీ.	పూనిపట్టినకలంబును౯ దేప విదళింప౯ జేతికంకణములు జిటుకుమనియె
త్వరితమ్ము(వ్రాయఁగుంతలము లిరుపార్శ్వంబు లందునొకరీతిగా పొందుగుల్కె
వినుచూలిదాలి నువ్విళ్లూగుకాగితంబునుయొత్త పటపటా యనదొడంగె
మేనుగంపింపపూబోడి లిఖియింపగా కుదురైన తన గబ్బిగుబ్బలదరె

తే.గీ. చెక్కిళులపైని కమ్మలయొక్క కాంతి
లేతయెండలగాసె విఖ్యాతిబూన
నట్టులిఖియించి కమ్మరాచిట్టిపట్టి
చెలియ నొకదానిఁజెంతకు జేరఁబిలిచి

కం.	చెలియా యీచీటిని మా
వులనీడం గూరుచున్న భూపతికిమ్మా
నిలువుము ప్రత్యుత్తరమా
వల నీతోఁజెప్పుదాక బాగుగరమ్మా

వ.	అని చెప్పి చేతికిచ్చి తన్పె. సూర్యధరుండు వారితో వనంబుఁజేరి కన్నులవిల్తు శరాహతుండగుచు నొక మావినీడను గూరుచుండి కాంతను వర్ణింపసాగె

సీ.	పట్టుకోకనుగట్టి ఫాలభాగమున సింధూరతిలకంబు ముద్దుగను౯దీర్చి
పైటానిరవిక సంపదలొప్ప ధరియించి వజ్రాలసరులు పాపట్లు౯దీర్చి
ఘనకచగ్రంధి సింగారమొప్పారగా విరులు సరసంబుగా దురిమిసరిమి
బింబాధరములపై వెలుగులుప్పొంగగా లలితమైనట్టి బులాకిఁబెట్టి

తే.గీ. గజ్జలందియల్బాయక ఘల్లుమనగ౯
జెలులు వింజామరల్వీసర నలుకమీర
యిచటికరుదెంచి నట్టి యీ యింతియెవరొ
భళిర! యిక్కాంత సుగుణాలవల్లి గాదె

మ.	తొలుతం దైవము లేతముత్తెముల విద్యుద్విస్ఫులింగంబులో
పల మూసన్గరిగించి క్రొంబసిడితో భామామణింజేయుచా
సలిలంబద్దుచు ముద్దుగానిలిపె భాస్వద్భూరిసౌందర్యధు
ర్యల శీతాంశుని రూపుమించ భళి! దేహంబొప్పు సూర్యప్రభన్

శా. రాకాచంద్రునిబోలుc మోముయును భారంబౌ కచగ్రంధి విం
డ్లాకారంబులcబోలుc గన్బొమ లహల్యాదేవి లావణ్యమున్
శ్రీకాంతామణిcబోలుకొను విలసచ్ఛీతామణీభాసురిన్
యీకాంతామణి గల్గి జెన్నలరు మేలీ కాంత భూకాంతయో

వ. హా! యీపె కర్ణములేమి?

ఉ. బంగరుగిన్నెలో మృదువిభాషణభూషణలైన చిప్పలో
రంగుcజెలంగు ముంగురులు గ్రమ్మరcజల్కములాడు బావులో
యంగుదలిర్పc గుండలములంటుట నెంచ సుధారసంబుcజే
దంగ విలాసమొప్పగ ముదంబుగనిల్పిన గిల్కలొప్పెడున్

తే.గీ. కాంతగాదిది! రతనాల బంతిగాని
బంతిగాదిది సొగసుల దొంతిగాని
దొంతిగాదిద్ది మరుని పూబంతిగాని
బంతిగాదిది ముద్దుల కుంతిగాని

సీ. కన్నులో! యివి తెల్ల గలువలో ముత్తెంపు చిప్పలో రావెండి చేపలొక్కొ
మోవియో బంగారు బావియో ఘనమైన యమృతంబునకు గేహంబొకోమొ
కరములో ముద్దుల కలువతూండ్లో మరు జాజిదండములొ కీరములమెడలొ
వేణియో కాలాహి రాణియో సరఘల పక్షములపిండొ సంపదలగీమొ

తే.గీ. దంతములొ! లేక యాణిముత్యాలపాళొ!
పెదవులో! సుధారసమొల్కు గదులొ! నదులొ
తెలుసుకొన మేటికష్టంబు గొలుపుచుండు
నహహ! యీకాంతరూప మేమనగ వచ్చు

సీ. చిగురాకువిలుకాని చేతిపైనరయాడు తులలేని బంగారు చిలుకగాని
పద్మాసనమున సంపద్భూరివైభవ ఠీవినొప్పెడు లక్ష్మిదేవిగాని
యఖిలవిద్యాప్రౌఢి నలరు మర్త్యులజిహ్వ బాయకనుండు వాగ్వాణి గాని
గాధేయుగూడి చక్కని పుత్రుcబడసి నింగికిలేచినట్టి మేనకయోగాని

తే.గీ. వేరుగాదీపె నిలయమే యూరొకాని
జూడఁగా నక్క పరమును జూచినట్టు
లబ్బె నాకీపెగన్పించు టదియెచాలు
నహహ! యెవ్వారికీపె భార్యగఁజెలంగు

ఉ. ఆరజమైన క్రొంబసిడియా యని విభ్రమమొందఁజేయుమేన్
సారసనేత్రిచన్గవ విచారముఁజేయ పసిండికొండలౌ
బారలమించువెంద్రుకల వర్ణనఁజేయగ నీలమేఘము
ల్మారి వధూటికీల్జడ ప్రమాణములయ్యె ననంగ గన్పడున్

శా. ఈకాంతామణిగాంచ మౌనుదయినన్ యింద్రుండుతా నైనహో
లోకంబేటికటంచుఁ బైఁబడరె పొల్లుల్గావు నాయోచనల్
రాకాచంద్రముఖీముఖీయనికవుల్ వ్రాయంగ నేసాటియా
యీకాంతామణికేదగున్ భళిరె! మేలీకాంత శ్రీకాంతయౌ

మ. కోనగోరంటిన పాలుగార్వనిత నాకున్ జెందునాయంచు మో
విని నేత్రంబుల దేహము న్జనులత ద్వేణిన్ బరీక్షించుచు
న్ఘనమోహంబు శిరంబుకెక్క నెదియున్ గాన్రాకమూర్ఛిల్లివెం
టనెమేల్కొంచుమరేమిదోచకొకకంటన్ జూచుచున్నిక్కుచున్

వ. మరల తనలో

చం. పిలిచినబల్కునో పలుక వేరుమృదూక్తిమరేమిగల్గె నీ
కలికితొమాటలాడ నరకంట మదీయ ముఖాంబుజంబు మి
క్కిలి గనినంతమాత్రమె సుఖింతునె బెండిలియాడి ముందుగా
దలచుటతప్పు దైవమెటు దాను సఖీమణినాకుదాచెనో

సీ. ఈరాజముఖికన్ను లెనయు పంకేజపత్రంబులేసరసిగాన్రావులేవు
ఈ యిందుముఖిపెదవు లెంచిపోల్పంగనొప్పెడు దొండపండులేపృధ్విలేవు
ఈ భామతనుకాంతితో బోల్పఁదగినట్టి బంగారమెందుజూడంగలేదు
ఈలేమచెక్కిళ్ళు యెంచిజతగూర్పగా నద్దాలుయెవ్వారి యొద్దలేవు

తే.గీ. కడకుగా(న్రాక యిదిబోల్ప బడునటంచు
కవులు గతిలేకబోల్చుటే గానితగిన
పోల్కెలంబోల్చువారలీ భూమిలేరు
భళిర యీకాంతభాగ్యమే భాగ్యమహహ!

మ. నగముత్తెంబులుగారు భాషణల నాణ్యంబౌసుధాధార విం
తగc బైcగారును తాకునట్టిదెదియో తథ్యంబు బంగారమౌ
వగవన్ లక్ష్మిగృహంబుcదొల్గునెవరీ పద్మాక్షి బెండ్లాడగా
దగునో సర్వసుఖోన్నతిన్ జెలcగు చింతల్ పొంతకున్ జేరకన్

వ. అని యివ్విధంబున తనతో తానే మాటలాడుకొనుచు వనితను వర్ణించుచు తన్ను కాంత సౌందర్యమునకంటె తక్కువగ నెంచికొనుచు గృహంబు మరచి తదేకధ్యాన పరాయణుండై చూచుచుండు సమయమ్మున

తే.గీ. ప్రక్కగా ముసుకువైచిన రాణిచెలియ
కాగితంబొక్కచేత చక్కగనుcబట్టి
కులుకుచటునిటు గాంచుచు నలుకమీర
యందియలుమ్రోయ తనయొద్ద కరుగుcదెంచె

వ. ఆ లేమ తనవైపునకేవచ్చుటగాన్చి వెఱగంది చూచుచుండ

ఉ. సిగ్గునమోమువాంచి తన చీటినిరాజునకిచ్చి యేమినా
కెగ్గుయొనర్చునోయని యహీనభయంబున నొక్కప్రక్క పూ
మొగ్గలగోయుచున్ దిరిగి ముద్దుమొగంబున నవ్వుజూపరా
జొగ్గునొ లేదొయంచు మది నూహజనింపగ వేచియుండగన్

వ. రాజు యంత

సీ. చీటిచేనంద నంచితరత్నహారముల్ గదలసాగెను మోదమొదవ మేన
జెలికత్తెయెదురుగా నిలుచుండసంతోష బాష్పజలమ్ములు బడియెనేల
మోహాంధకారంబు ముమ్మరించుటచేత వెడగురీతిగను తబ్బిబ్బుcజెందె
కదలగాcజేతు లక్కరములుగా న్రాక పిచ్చిగీతలరీతిc బెంపుమీరె

తే.గీ. దిశలుఁగనుపింప కొకరీతిఁ దెలివిఁదప్పె
నిట్టులొకకొంతకాలంబు నెద్దిఁదోఁచ
కవనిపతి తెలివిఁదెచ్చుక నరసిచదువ
సాగె సంతోషపూరిత స్వాంతుఁడగుచు

జాబు– రాజకుమారుఁడా! విను సర్వభూతేజా! నీవేల యీయరణ్యమున దిరుగుచున్నావు. పురముఁ బాసి వచ్చిన మాకు సహాయ మెద్దియయినఁ జేయుము. నీనామంబు యెద్దియో యెరుకఁజేయుము. నాకు దాహమాయె. మీరు కనికరించి యెందైనఁ దెచ్చియిండు. యింత నేజేయు కార్యము యెద్దియు లేదు, రక్షింపుము

ఇట్లు చంద్రధరి వ్రాలు.

వ. అని లిఖియింపఁబడియున్న కమ్మనుఁ జదువుకొని కొంతయోచించి హా! యేమిది? యీజాబు వింతగానున్నదే. లోకులనుమానింతురని సుంతయయిన యోజింపక, వనితయయిన తానే నాకు ముందు కమ్మలిఖించె, క్రొత్తవాడనైన నన్ను మంచిచెడ్డల నర్థించబూని సహాయమడుగుచున్నది. హా! సంతోషమేయని పూర్ణామోదితుడై యిక యిచ్ఛదీర సంభాషింతునని తనలో

చ. చిలుకలకొల్కి నాకొరకుఁ జీటినిఁబంపగ దానినంది యా
వలఁ జదువంగవచ్చునని భావము గాంతలభించెనంచుఁ జం
కలు గులికించితిన్ జదువఁగా యదిబోయె నిరాశలబ్బె! హా
తలఁచుట యొందుఁగల్గుటది తథ్యము వేరుగనుండునక్కటా

వ. అని యిట్లు తలచి అయినను మరలి చదువుదునని చదివి కాదు యిందేదో మర్మముండు నయిన మొదటి యక్షరమునుఁ జివరయక్షరమునుఁ జదివెదనంచుఁ జదువుకొన రాజా! నీపురమెద్దియో యెరుకజేయుము యని యుండ నంత నపరిమితానంద పూరితుడై చెలినిఁగాంచి, యో కాంతా! కదలుము నేవచ్చుచున్నాఁడ నని బయలుఁదేరి

సీ. ఇదిదారి యిదిదారి యేతెంచుమంచు వంకరదారులందు డొంకలకుబోవు
నిదిపువ్వు యిదిపువ్వు యిభయానకొరకు ద్రెంపుమటంచు లేతపత్రములఁద్రెంచు
నిదిలేడి యిదిలేడి ముదితకిత్తుమటంచు గోమాయువులఁగోరి కొట్టఁబోవు
యిదిచిలు యిదిచిలు యింతికిత్తుమటంచు భ్రమరములనుబట బరుగులెత్తు

తే.గీ. నతివిమోహాంధకారుడై యబలఁజేరు
నంత నక్కాంత సిగ్గుచే గాంతుమోముఁ
జూఁడఁగా లేకఁ గ్రిందికిఁ జూచుచుండ
పోయి దరిజేరి ముదమునప్పుడమి రేడు

వ. అట్లు దరిచేరి ఓవనితామణీ! నీరాజ్యంబెద్దియో యెరింగింపుము. నీ తండ్రిపేరేమని యడుగ నాకాంత తనదేశంబు రాజపుత్రదేశమనియు, తన తండ్రిపేరు క్షీరసాగరుఁడనియుఁ దెల్పి

మ. విను గంగానదిప్రాంతమందలరు సద్వృక్షంబులన్ కోకిలా
నినదంబు ల్సెలయేళ్లు బూతతులుఁ గంటేజాలుఁ గైలాసమం
చునుమాతండ్రికిఁ దెల్పుయాత్రికుల హెచ్చున్‌గాంచి యిబ్భూమిదా
గనుకాంక్షల్జనియించి యేగితిని జంకంబోక గాల్నడ్కకున్

వ. అంత నారాజు

మ. పడతీ వెన్కకుఁబోవనేల నిటనన్ వైవాహికంబాడుమే
పుడమీశాత్మజుగానె శౌర్యమున యేభూరాజుమించున్ నను
కడుమోదం బెడలింపవే దెలిపి నిక్కంబైనచో రమ్మిదే
యడవిన్ కోరికతో స్వయంవరముగమ్మా యేలయోచింపగన్

సీ. కల్కిరో రసధార లొల్కముద్దులమోమునెత్తిమాటాడవే శృతులుసోక
గోలరో చిన్ని ముత్యాలుగారగ నోరుదెరచిమాటాడవే తేజమొప్ప
నెలతరో విండ్లబోల్నిదు కన్బొమలసొరునుఁజూతు మాటాడు కనులనెత్తి
పొలతిరో మేటివేనలిఁజూతుఁ దమిమీర మరలిమాటాడవే శిరముద్రిప్పి

తే.గీ. వనితరో వెండిపూల పల్వరుసఁగాంతుఁ
గొసరి యొకసారినవ్వవే విసుకకుండ
నలర నీపైటచెంగున నబలలెల్ల
జిల్కినటువంటి జవ్వాజిఁ జిల్కుకొంత

వ. అని రాజకుమారుడు మోహాతిశయంబునఁ బల్కఁ గాంత హృదయంబున నిశితబాణములవలెనాటి వారిర్వురు స్వయంవరవిధి వివాహమాడిరి. అంత నాచెలులు

సీ. ఒక కాంత పూదండలకుఁ గొల్కులంజేయునొక కాంత గంధంబు నొప్పితీయు
నొకరాజముఖి వీపులకుఁజిల్కు బన్నీరు నొకరాజముఖి రాణిముఖముఁ గడ్గు
నొకలేమ సత్యభూపకులంబుపై మంగళారతుల్పాడ నొకతంది చదువు
నొకపద్మముఖి వారికఖిలభూషణములన్ ధరియింప నొక్కతె సరిగఁజేయు

తే.గీ. నిటుల వారలిర్వురు పెండ్లి నెలమిఁజేసు
కొనఁగ నాకాశముననుండిఁ గ్రొత్తపూల
వృష్టిగురిపించిరమరులు స్పష్టముగను
మేలుమేలంచు దిక్పురంధ్రీలుఁ బలుక

వ. ఇట్లు భూపతి తనభార్యయయిన చంద్రధరితోఁ జెలికత్తెలతో యింటికి మరలె. అక్కాలంబున వృద్ధురాలు తన మనుమ డరణ్యమునకేగి సాయంకాలసమయమునకు రాలేదని భీతిచే

సీ. విమలమౌ తెల్లకేశములు వాతోద్ధూతమై వెండితీగెలన నల్లలాడ
పసిడివర్ణంబున వర్ధిల్లుదేహంబు ముడుతలై మోమున ముందుజార
వణకుచఁబడకుండ బట్టిన చేకఱ్ఱ మొనదాకనే పొటుపొటుకుమనగ
కర్ణకుండలములు ఘనభారమునజారి భుజములపైని యిమ్ముగఁజనింప

తే.గీ. మనుమడెచ్చోటనుండెనో మరలలేదె
యంచు నత్యాస నూరి సరిహద్దువరకు
నరిగి కుడిచెయ్యి రవికాంతి కడ్డుజేసి
ముందునకుఁజూడఁదొడగె నమ్ముసలికాంత

వ. ఇంతలో రాజు కలయవచ్చి తన యవ్వను గలసుకొని గృహముఁ జేరె. వెంట నరుదెంచెడు స్త్రీ బృందమును గాంచి యా ముదుసలి చంద్రధరినిగాంచి పదాహతంబయిన కాలాహిమాడ్కి చిఱ్ఱుబుఱ్ఱుమనుచు గొణుగుచుండ

చం. అదిఁగని వేగ సూర్యధరుఁ డవ్వనుఁ దగ్గిరబిల్చి సంతసం
బొదవగఁ దేనెలొల్కెడు మృదూక్తులు గర్ణరసాయనంబుగా
నెదయిసుమంతఁదాచక వరించి స్వయంవరమాడినట్టి కొ
మ్మిది మరి వేరుగాదు వినవే కనవేయని తెల్పె సొంతమున్

వ.	అంత

సీ.	అమ్మరో! ఫలహార మారగించుమటంచుఁ బిండివంటలఁదెచ్చి బెట్టుముందు
కలికిరో! నీదుయల్కలు చిక్కుఁబడెనంచు తలనంటి బాగుఁ జిక్కులనుఁ దీయు
కన్నెరో! మా యింటి పన్నీటితో జలక మాడిచూడుమటంచు వేడుకొనును
యందమౌ నీకాలు గందె రాల్సోకగా ననికాళ్లనొత్తును వణకుతోడ

తే.గీ.	ఇంటిలోనున్న చీరెల నెలమిఁదెచ్చి
కట్టుకొమ్మంచుఁ దనచేతఁ గట్టిచెలుల
కఖిల సత్కార్యములఁజేయు నాపురమున
వనితలాశ్చర్యమొంది యవ్వనితఁగనిరి

వ.	అంత కొన్ని దినములు గడచిన వెన్కఁ జంద్రధరి

మ.	ధరణీపాల వచించెదన్ వినుము కాంతారంబుల నర్వసుం
దరవృక్షావళిఁ బూవితానముల నానాపక్షిరావంబులన్
కరులన్ సింహములన్ సరర్ఝురుల శృంగార ప్రవాహంబులన్
కరుణన్జూపుము కొంచుపొమ్మిపుడు వేగన్కోర్కెనీడేర్చుమా

వ.	అని వేడుచున్న సతీమణికోర్కె నీడేర్చుటకాసూర్యధరుండుయిట్లనె నోకాంతా!

పంచచామరము : ప్రభాతకాలమందు సద్ది బత్తెముల్తయారుగా
గఁ బేర్మిఁభూషణల్ ధరించి కాననంబుబోవనై
శుభప్రధానమైనగంట జూచిపోదమట్టులే
నభః ప్రవాహ విస్తృతి గనన్ మహాద్భుతంబగున్

వ.	అని దెల్పినవాడై యుదయ కాలమందున తన సఖినిలేపి సద్దిబత్యములతో బైలుఁ దేరి కాంతారంబుజొచ్చిరి. యంత కొంతయెండెక్కె

సీ. ఎండవేడిమి తాకకుండ భామినిశిరంబున ఖండువాను యిమ్ముగనువైచు
ముండ్లు కాల్సోకు నా ముదితకంచును దారి కంటకమ్ములను ప్రక్కలకు నెట్టు
తనకాంత దాహంబు గొనెనేమొయని చిన్ని చెంబుతో మంచినీరంబుఁ దెచ్చు
పెనుదవ్వరాగ నావనితడస్సెనటంచు ఘనతరుచ్ఛాయలఁ గడగఁజేర్చు

తే.గీ. క్షుత్తుఁగొనెనేమొయని కొన్ని చూతఫలము
లరసి కొనివచ్చు వినవచ్చు కరులఘీంకృ
తులకుఁ భయమొందునంచు ముందునకుఁబోవు
దూరమగునంచు మాటికి దారినిలుచు

వ. ఇట్లుఁ బ్రయాణముఁజేయుచు నామహారణ్యమధ్యంబునకుఁ బోయి యెండవేడిమి తగ్గువరకు నొక్క వటవృక్షముక్రింద బరుండి సాయంకాల సమయమ్మున లేచి కన్పించు భృంగసంఘముల మృగముల వర్ణింపుచు భార్యతో

మ. కలికీ మెత్తనిపూవు మొగ్గలపయి న్గొతూహలిఁన్ దేనెకై
యళిబృందంబుచరింపఁ దావులుస్వకార్యఖ్యాతిమై నాసికం
బులసోకన్ చిగురాకులంటుచు భరమ్మున్జిన్ని శాఖావళిన్
బలిమింబట్టిన నాల్గుతీగెలపయిన్ బాలింపు రాజిల్కలన్

మ. అదిగో యంచలపిండు మేల్నడకతో నబ్జాకరంబందు వె
న్కిదిగో సింగము గర్జనంబిడుచు నిన్నే గాంచె వాల్గంట నే
మిది విభ్రాంతిజనింపుఁ దుమ్మెదలు సుమ్మీ నీడగానుంట నీ
యెదఁ బ్రేమింపుము యింతిరో మనకు నెంతేప్రేమఁజూపించెదున్

తే.గీ. హరితవర్ణంపుటాకుల యందు బసిడి
కాంతులను గ్రక్కుచునుఁబండి కనులకింపుఁ
గొల్పుచుండెదుఁబండ్లు శకుంతవితతి
ప్రీతినిడుకొన్న చిన్ని దీపికలనొప్పు

చం. కిలకిలలాడుచుం జెవులు గింగురుమన్నట్లు నాల్గుదిక్కులం
బలికెడు ఫక్కిసంతతుల బారులు నింగికి తోరణంబులై
విలసిలుచుండెఁ జూచితివె పిల్లనఁగ్రోవులనూదుచెంచుతల్
జెలగి విహారముల్సలుపఁ జిత్రముకాదె మదీయభామినీ

శా. ఈకాంతారముఁజొచ్చుకున్న మనమింకేనాడు వీక్షింతుమీ
వాకాభీకరగర్జనంబుల దరీభాగంబులన్ జక్రవా
కాకూర్మానిమిషావళిన్ మృగవిహంగాభృంగసింగారపు
ష్పాకోలాహల నిర్మితాపాదల రాజంబుల్ వధూటీమణీ

వ. మరియు నో కాంతా!

మ. శిరమున్ కేశములొక్కచోముడి విరాజిల్లంగఁగావించి సు
దరమౌ పూవులఁబంక్తి పంక్తులుగ వింతన్‌నిల్పి యవ్వాటిపై
జిరకాంతీవిలసన్మహా నెమలికుంచె ల్నీటుగాఁగ్రుచ్చి యుం
గరము న్నేన్గులదంతపుంబిరుదులం గైఁజేతురీచెంచుతల్

సీ. వినవె దూరమునుండి వినవచ్చు కలకంఠ నిస్వసంబులసొంపు నెలతమిన్న
కనవె మధువాని శృంగారకుసుమాలి ఝుంకారమిదు తేంట్ల నింపార సఖియ
యారగింపవె ఫలాభారమ్ముఁ దరివంగ నేలనంటెడుపండ్ల గోల బాల
తెంపవే పుష్పాలిఁ దియ్యమామిడిగున్న లంటుచుండెడుమల్లెలబలనీవు

తే.గీ. రత్నకంబళములఁబోలి రమ్యమయిన
పచ్చికలనీవుశయనింపు మిచ్చదీర
గూరుచుండవె పొదరిండ్లఁగోర్కెఁదీర
బిల్వవేహంసములఁ బేళ్ళ బెట్టికలికి

కం. మురళీరావమువిపినా
సరసీరుహనేత్ర లైన సాధ్యులు చెంచుల్
చరియించు యాలమందల
కొరకై గుంభింపుచుండ్రి కోకిలవాణీ

మ.	మదమత్తేభకళేబరంబిదిగొ యున్మాదంబుచే ఘీంకృతు
ల్వెదఁబెట్టన్విని పుండరీకమెదియో భేదించికుంభస్థలిన్
మెదడున్ భక్షణఁజేసిపోయెనట వల్మీకంబులన్‌జిమ్మె డా
మదభల్లూక సమూహముల్ కనవె శుంభత్తన్వి! కన్యామణీ!

సీ	గంధంపువృక్ష ప్రకాండంబులందున బారెడు యురగ ఫూత్కారమిదిగొ
మృగయునివేటుచే మిగుల బాధనుఁజెంది ఘోషించుబెబ్బులి కూతలివిగొ
వాయసమ్ములబాధ బడలేకఁ "గుమకువ" మంచు బోయెడు కోకిలావళదుగొ
యవనీధరంబులు గ్రవనాంతరంబున బోరాడెననన్నేస్గు పోరులవిగొ

తే.గీ.	క్రౌంచబకహంసచక్రవాకముల నాద
ములనువిను భాస్కరాతపంబునకు చెట్ల
చెట్లనీడలను నిద్రవోయెడు నెమలిపిట్ట
లరపులనువిను తేపకాహ్లాదమబల

శా.	వింటన్‌బాణమునిల్పి తన్మృగయుడా వృక్షస్థలిన్‌డాగి ప్ర
క్కంటన్‌మేసెడు లేడినేయశరమాహాచూడవేహుమ్మటం
చంటన్ బారుచునుండెఁ జీల్చునుదరంబా? రక్తసిక్తంబగున్
కంటన్ జూడఁగలేము రమ్మబల యుగ్రంబౌమృతంబయ్యెడున్

శా.	వృక్షచ్ఛాయలఁజేర మారుతుఁడు పూవిల్కానిశస్త్రాళిచే
యక్షీణూత్సుకుఁడైయ్యునాంజనిసతీ యాలింగనప్రక్రియన్
రక్షణ్యానుభవంపుమారుతము గేలన్‌గుప్పెనో యన్నమా
డ్కి క్షేమంబగు వాతులంబమరుకంటే స్త్రీశిఖారాణ్మణీ!

చం.	ఇఁకమనమిందు నిల్చుటది యెట్టుల భానుఁడుపశ్చిమాంబుధిన్
మొకమునుఁద్రిప్పి పాన్పునకు బోవుచుఁదోచె ముఖాంబుజాతముల్
ముకురములందు కజ్జలము బూసినచందములాయెఁ దూర్పుకొం
డకు శశిజేరవచ్చె విలుడాలుశరంబులఁదాల్చె మారుడున్

వ.	సూర్యాస్తమయమైనపిమ్మట

కం.	ఇందిందిరబృందంబులు
పొందుగ నిద్రింపసాగెఁ బూచెన్ గల్వల్
కందోయి కింపుదనరగఁ
జందురుఁడుదయించె రిక్కజాతము దోచెన్

మ.	బిలముల్ జొచ్చెఁదమంచుబోయి యెరనన్వేషింప ఘూకంపుమూ
కలుస్వస్థానములందుబాసె నళిమూకల్ నిద్రవోయెన్ శశం
బులు క్షేత్రంబులఁగ్రుమ్మరెన్ యురగముల్ పూత్కారముల్ బెట్టె క
ల్వలుబూచెన్ కమలాలువేమొగి×వోరన్రాశశుండ భ్రమన్

మ.	పగడపుఁబంతిచందమున బ్రాగ్దిశయందునఁ జంద్రుడొప్పెవిం
తగనుడు సంసదులత్తెలివి దప్పె నళుల్గనుమూసె కల్వపు
ష్పగణముబూయగాఁ గమలపాళిదళంబులు మూసెనంత మా
నుగ మదనుండు యమ్ములను నూరదొడంగె హిమంబుపేరెదున్

వ.	సూర్యధరుఁడు కాంతతో చంద్రునిఁజూపి

సీ.	వెలుగులదొరమాయ వినువీధి సంచరించెడు కుముదబాంధవుడు యితండు
వెన్నెలేలోకంపు కన్నతల్లియటంచుఁ బిల్పొందుకాంతికి వేరువీఁడు
తారతో రతిఁగూడి తనగురువుతో మున్ను యాహవంబెన్నిన ద్రోహివీఁడు
దుగ్ధాబ్ధికుమరుండు తులలేనితోషిత ధాముడౌమరు మేనమామ వీఁడు

తే.గీ.	శశముఁలోఁదాల్చి కవులచే శశియటంచు
బిల్వఁబడుచుండు వీఁడుయే కల్వపువుల
నిద్రమేల్కొల్పు నిరులజెండెడుభటుండు
చంద్రుఁడను పేరుగల్గిన సఖుఁడువీఁడు

వ.	మరలి భార్యతో

శా. నీరేజంబులపైఁ జరింపుచెటుఁగాల్నిల్పంగ లేకన్ మహో
గ్రారణ్యంబునఁ జెట్టుచెట్టునకు నాహారంబుకై దిర్గి త
న్నీ రేజాప్తుఁడు గ్రుంకనీతరువుపై నిద్రింపుచుండెన్ సఖీ
తారానాథునికాంతి గన్పడును సీతాకోకచిల్కల్గదా

మ. చినపక్షుల్ నిదురింపఁ భీతిఁగొనిరే జీకట్లభారమ్ము యం
తనె ఘూకంబొకటేగుదెంచి మనపొంతన్ డాగియున్నట్టి పి
ట్టనుబట్టెన్ మరణాభయంబలమి కంఠంబెత్తి ఘోషింపసా
గెను యయ్యో! యెటుఁదాళువాఁడఁజని రక్షింపంగరావేసఖీ

వ. అంతకోడిగూయ భార్యతో

మ. అబలావింటివె! కొక్రుకో!! యనుచుఁగూయంగోడి యిందాకయే
విభవంబియ్యది నిద్రలేక నిటగంభీరాటవిన్ ప్రొద్దుబు
చ్చు భరంబేరికిఁగల్గె నాగడమె యచ్చోఁబండి నిద్రింపుటే
శుభమైతోచుచునుండెఁ గొంతయినఁ బక్షుల్ గూయలేదింకెటన్

వ. యిట్లనేకభంగుల భార్యకు వనవిచిత్రంబుజూపి కోడిగూయ నొకచో నిర్వురు శయనించిరి. యుదయమున సూర్యధరుండు మేల్కొని

మ. చెలియాలెమ్మికఁ బక్షులందముగఁ గూసెన్ మందవాతూలమొ
ల్కలు శారీరములంటెఁ తూర్పుదిశ కెక్కంబూనె భానుండు దే
వళముల్జేరెదివాంధముల్ మదను తాపంబీల్గెఁ దారల్ నభో
తలమున్ దాగెను తామరల్విరిసె నిద్రంబోకు పొద్దెక్కెడున్

వ. అనగా భార్యమేల్కొని, నాథా!

తే.గీ. కొంతతడవింక నిద్రింపఁ గోర్కెగలిగె
రాత్రి తెలవారుదాక నరణ్యమందు
తిరిగితిమి కోడిగూయంగ సరగఁబండిఁ
బడకలనుఁజేరి యిపుడు లేవగను మేలె?

శా. యేమీ యింకొకఘంటబందుకొని నాయిచ్ఛాంత్యమౌదాక ని
దే మీతావుననుండఁగోరితిని మీరేలేపి నానిద్రయం
దామోదంబునుఁబాపినారిటుల నిద్రాసక్తి నేత్రద్వయం
బేమో యెఱ్ఱబడెన్ మహాభరముగాదే? రాజచూడామణీ

వ. అనగానే సూర్యధరుడు

సీ. పండవేభామ నీయండఁగాపుందు నా తొడలపై శిరముంచి ఘడియసేపు
నిదురింపవే చెట్టు నీడ నింపొందగా కొసరుగాబట్ట చేవిసరుచుందు
పరువుమా నాయొక్క బంగారుచేలంబు పాన్పుగా నీక్రిందఁ బరగురీతి
యేరవే యీరాలనెలమి నీదగుమేను దద్దురుల్గట్టక ముద్దుజూప

తే.గీ. బారఁదోలుము పక్షుల బలుకకుండ
పూవులనుఁదెంపవే కొన్ని ముదముగాగ
నీకు సౌగంధమిడగ వేణినధరింపు
మింతకేనేమిజేతునో యింతిజెఁపుమ

వ. చంద్రధరి నిద్రింపుచుండగా సూర్యధరుఁడు

ఉ. మామకమోహనాంగి యిటమైమరపున్ నిదురింపసాగెయే
నేమియొనర్చువాఁడను మరేమియుదిండికిలేదు యీవనం
బా మిగులైనసాంద్ర కటకావృతమౌ పొదరిండ్లపూరమే
దీ ముదమొంది పోబురికి నెచ్చటఁదెచ్చి బుభుక్షదీర్చెదన్

ఉ. ఇంతకు రెండుదివ్సరము లెట్టులొఁ బండ్లభుజింపుచుండె నా
యింతిబలావిహీనమయి యేమియొనర్పను జేతఁగాక న
త్యంతవిచారసాగరము నందునఁ గుందుచునుండె దీనిపై
గొంతుకఁగోసినట్టగును ఘోరముగానిపుడన్న మెన్నకన్

వ. అని చింతించి దిక్కులుచూచి

కం. అల్లవిగో యామావిన
మెల్లనఁజరియించు రెండు మేలగుగువ్వల్
విల్లునఁగూల్చెదఁ గాల్చెద
మల్లీలేవంగనిత్తు మామకసఖినిన్

వ. అని విల్లుఁబూని బైలుఁదేరెనంత నాపక్షులలో నాడపక్షిగని మొగపక్షితో

చం. అడుగొ కిరాతుడచ్చట విహారముఁజేయుచునుండెఁ బొంచి నా
కడుపునఁ భీతిహెచ్చె మనకాలకుబుద్ధినిఁ జెప్పగావలెన్
వడిశరమెప్పుడో తగులు వద్దని మేతకు యొక్కదండ మీ
యడవికి యొక్కదండమిడి యంబరవీధికి లెమ్ము నాయకా

వ. అనుచిట్లు మాటలాడెడు బక్షులలొ నొక్కదాని తద్బాణంబునఁ గూలనేయ

చం. విలవిలలాడి ప్రాణమును వీడెఖగంబు శరంబుదాకఁ గో
కిలలు శుకాబకానిచయ క్రేకులు తద్విపినామహీరుహా
స్థలులనువీడి భీతిఁగొని సత్వముఁజూపిఖగోళవీధిఁకూ
తలనిడెఁ బక్షమారుతహతంబయి రాలెను పండుటాకులున్

వ. అంత రెండవకవి

సీ. చింతచేనొకకొంతఁ జెరలాడిచెరలాడి పతిశవంబునుఁజేరి బాష్పజలము
విడిచివలయంబుగా నడచి నడలేకఁబ్రాకుచుఁ గాళ్ళుతడబడ గూరుచుండి
విలపించి విలపించి వినువీధిఁ గొంతకాలము దిశలఁ గొంతకాలంబుఁ జూచి
దుఃఖానలంబులో దులలేకరవులఁ గన్నులు యెఱ్ఱవారి పిల్లలనుదలచి

తే.గీ. పోవనొక కొంతదవ్వుకుఁ బోయిపోగ
రెక్కలవిరాకయుండ ముందొక్క తరువు
నెరగి కూర్చుండి చూచెదు మృగయుఁగాంచి
దుఃఖముతొనిట్లుబల్కె నాఖక్కి సరగ

మ. కఠినాత్మా విను మాదుకూనలకు వేగన్ దిండిఁగొంపోవ నీ
యటవిన్ జేరిచరించు దీననిరపాయంబైన మావంశమం
దిటు మమ్మిద్దరిబాపి దుఃఖవనధిన్ యిారీతిఁబైఁద్రోయ నీ
కెటుడెందంబదియబ్బెఁ జంపుటకు నీకెట్లాడెరా హస్తముల్

శా. గూడుంజేరఁగ నాసతో నరచుచున్ కూనద్వయంబిప్డు నా
నేడీ? తల్లిరొ యొంటిగానరుగ మీకేమైనవాటిల్లెనా
గూడుంబాయఁగ దారిఁదొల్గితిరె మాకు దెల్పుమీ యన్నమా
గోడింతంతయె దెల్పఁగా మరణమున్ క్రూరాత్మ యోజింపవా

సీ. కనులుదెర్వని నాదు చినకూనలిటు దుఃఖమొందఁజేసితి మాయుసురుదగుల
ఘడియబాయనిమమ్ము గడఁగబాపితివి నీసతి నిన్నుఁజూడని చావురాను
యాబూతిమాయన్న మరయఁజంపితివి యుగ్రాటవిన్ కాలాహి కాటువేయ
కమనీయగాత్రు రక్తాసిక్తునుంజేసితొప్పినీకండల నుడుకఁబెట్ట

తే.గీ. పిల్లలనుఁజూడకుండ విపినమునందు
క్షణములోఁజంపితివి నీదు కండ్లుబోను
యిన్ని శాపంబులందొక్క టెందునైన
దగులుఁబోరోరిచావ పురుగులుబడును

కం. అవిశాపముఁబై బెట్టియుఁ
జనెనాకవిపతినివీడి జాలిజనింపన్
మనమున భార్యందలపుచు
జనునంతనెజెట్టునీడ సతిలేకుంటన్

సీ. వక్షస్థలంబున బరగువారలుమాల కన్నీటికాలువ ల్గలసిమునుగ
వామహస్తంబున బలిమిఁబట్టినవిల్లు చేతిచెమటలజారి చెంతఁబడగ
రమణీయమైన వజ్రాలహారంబు మేన్వణుకఁబంగారురొమ్మునఁజలింప
పిల్వఁబోవగనుఁజెంగల్వగుమ్ములమాట రాకమేల్బింబాధరంబుగదల

తే.గీ. దిక్కులనుజూడcగా(నాక దేపతేప
కిమ్ముcగన్నీరుcగొనగోట జిమ్మిచిమ్మి
పాదముల్బెనగిపదగనంభోదళాక్షు
డటవిలోcదిరుగయత్నించె నబలకొరకు

వ. ఇట్టు దిరుగుచు నాసూర్యధరుండు (ప్రాణేశ్వరినిదలంచి

శా. హా! నాముద్దుమిటారి!! మేల్పసిడిదేహ(ప్రజ్వలీ!!! మత్తభృం
గానీలాలకి! రావధూమణిరొ! హా! కాంతాశిరోరత్నమా!
హా! నామౌక్తికభూధరంబ! వనితా!హా! నామనోభూషణీ!
హానాచేతివరాలహంసమ! మదీయ(ప్రేమరుజ్మండలీ!

సీ. మృదుమధురభాషణామృతమేదురంబైన నీవ(క్తమిప్పుడే టీవిcజలగు
పూర్ణావలోకనాంభోజదళనే(త్రయుగ్మంబిప్పుడెట్టుల డంబుమీరు
సంగీతరస(ప్రసంగవాగ్విభవనిస్వనిcదేలుకర్ణావిభవమదెట్టు
ముత్యాలద్యార(ప్రభూతకాంతులుసోకు నీయొదలేరీతి(శ్రేయమొప్పు

తే.గీ. కర్కతరశైలగమనమృగావిహార
విపినసీమాంతరాజనిత భీష్మరవము
శృతులసోకంగనేరీతి యిందువదన
దిరుగుచున్నావుపథిదప్పి దీనహృదయి

మ. గెనలా! యింతనెలేచిపోనెటులనొగ్గెన్ నీదుహృద్పంకజం
బెనయన్ ని(ద్రనుcబాపిలేపెనని నీ కేమైనcగోపాగ్ని రే
గెనె! యేడ్పింపcగజెట్ల చాటునవనిన్ గెంబువ్వుప(త్రంబులం
దునగన్పట్టనిరీతిcడాగితివెయేదో తెల్పిమన్నింపవే

వ. ఇట్లనుచు

సీ. సహకారభూజసంసదులార! మందార తరులార! వాయసోత్కరములార!
పుండరీకవనేభ పుంజంబులారయో యభ్రజలధరులార హయముమీర
కోకకలహంసకాకోలగృధ్రములార జంఝురీటములార జలధులార
యబ్జాకరములార యాలసంఘములార పారావతములార బకములార

తే.గీ. కుసుమసంతతులార గుట్టలార
సర్పజాలములార సరఘులార
ఘూకములారయో చెంచు గోలలార
చంద్రధరిఁగాంచరేయెందు సాధ్వీమణిని

మ. మనలన్గాచిననిమ్మచెట్లమొదలన్ మాటాడుచున్పండ్లభ
క్షణఁజేయన్ మరుదంకురల్ పయిని సోకన్ సర్వపక్షుల్మనో
వనజామోదతరంబుగాఁబలుకటల్ భావింపుకాలంబుహృ
ద్వనజంబంతగుభీలునన్ గదలునే పంకేజపత్రేక్షణీ

సీ. భర్మోపమాంగినీ ఫాలభాగమునసింధూరతిలక ప్రభల్ దొలఁగకున్నె
కోకిలవాణినీకుల్కుగుబ్బలపైని చెమటచేలేరుచుల్ జెదరకున్నె
నారీలలామసుందరమైననీవేణి విపరీతకష్టాప్తి వీడకున్నె
మత్తేభయానశుంభద్దివ్యగండభాగములు హీనోత్కళల్ గాకయున్నె

తే.గీ. ఇన్నిహీనంబులకునోర్చి యెట్లునన్ను
గాన కేయుగ్రవనములో గలయఁదిరుగు
చుంటివికనిన్నుఁజూచుట హో!యదెప్పు
డబ్బునని ఘోరదుఃఖంబు నందునుంటి

సీ. చిగురాకుమేనిపైఁ జన్నిదంతాహతానొక్కులన్నియుఁజిల్క ముక్కులనగ
బింబాధరంబుపై గుంభించెడుమిసొంగ యమృతాంశునిమేటి యణువులనగ
నల్లనౌనీదుధమ్మిల్లంబుపైధూళి పూవిల్తుమేనిపుప్పొడియనంగ
మదనుశరాహతి యుదయించిన స్వేదయింపుసుధాంబుధీ తుంపురులన

తే.గీ. మనదుయాస్థానమదిగొప్ప మదనలోక
మనగ విలసిల్లి వృక్షంబు యాకసంబు
గాగ తగనొప్పె సంతతీకలెవెపొదల
నీడలే మనకుఁ బహుగొప్ప మేడలబల

ఉ. నీదు సుభాషణల్వినక నేటికినాల్గుదినంబులాయె నం
భోదళనేత్రిరో శృతులు పూర్ణవిచారవిమగ్నలయ్యె తృ
ష్ణాధికమయ్యె వాగ్రసము నానఁగనుల్నినుఁజూడఁ దల్లి పా
ల్మోదముఁగ్రోలనెంచి శిశువుల్గను చందము వేచియుండెదున్

మ. మనతారాపురిఁజేరగానెపుడు ప్రేమన్ బంధుమిత్రాదులన్
గనుటేనాడులభించు నిత్తరి మహోగ్రక్రూరకాంతారమం
దునఁ బ్రాణంబులువీడుటేకడకుఁ జెందున్గాని వేరున్నదా?
చనుటేమింకిటఁ గొంపమున్గినది రాజ్యప్రాజ్యమింకబ్బునే

ఉ. ఏమిమహాదురంబు జగదీశునిదృష్టియొనర్చియుంటిమో
భామిని యింతకష్టమగు భారములన్ మనయిర్వురొదలన్
సామియిడంగనిన్గనని చావునునీకును నాకునట్టు లే
భూమినవేరెపాతకులు పూర్ణసుఖంబులదేలుచాద్యులై

శా. దీనాలోకన! మంజుభాషణల పృథ్వీణృత్సమూహంబులున్
పోనీరై యలనాడుకాననము మమ్ముందిట్టి శాపంబులె
న్నో నేర్పుంపయిబెట్టె పక్షొకటి యేమోయద్ది యేతెంచనౌ
ప్రాణింజంపితి దానిపెన్మిటిని ఘోరంబౌ మృతంబొందగన్

వ. హా దైవమా!

చం. అలఘుకృపప్రభావళులనారసి నాపయిజల్లె మత్సతీ
తిలకము నాదునేత్రముల దృష్టిగనంబడఁజేసి మత్పురీ
జలములఁ ద్రావఁబ్రాప్తి విలసద్భవదంఘ్రియుగప్రభూత నీ
డల దయసేయు; కాంతఁగనుటన్బుజియింతును భక్తితోడుతన్

వ.	ఇట్లనుచు వనితందలచి

సీ.	నీపత్రములసౌరు నెనయునేత్రమ్ముల నారిగాన్రాదె పంకేరుహంబ?
యరయనీతూండ్లబోల్కరములు గలయట్టి కొమ్మగానరెమీరు తమ్ములార?
మీపక్షములసొంపు జూపు ధమ్మిల్లంబు గలకాంతకానరే యళులవితతి
మీకంఠమృదుగీతి యేకమౌవాగ్ధాటి గలకాంతయెద్ది కోకిలములార?

తే.గీ.	అఖిలసామ్రాజ్యభోగంబులందుచుండి
దైవవశమున నీకర్కతరములైన
తెరవులను తరువులను దిరుగు దీనమతిని
రామచిలకమా! కనవె చంద్రధరి నిందు

సీ.	కాంతరో! నాడునాగళమునందిడిన మల్లెలహారముల్ దున్గి క్రిందబడియె
వనితముద్దులగుల్కు బంగారుకండువ దారిబాహువునుండి జారిబడియె
నీటుగానిలిపిన నిగ్గుపాపటిబొట్టు రాలెనడ్గడ్గుకు రజముగాగ
రాకేందుముఖిరొ! వస్త్రంబులెల్లయుమాసి మొనకొర్రులంటగా జినిగిపోయె

తే.గీ.	యిట్టినావేషముంజూడ నీవు బాష్ప
జలమువిడి నన్ను నీదు కౌగిలనుజేర్చి
బొబ్బలిడకుందువే పద్మముఖిరొ! మంజు
వాణి పూబోడి యలికులవేణి బోణి

వ.	ఇట్లనుచు మరల తనలో

చం.	కనుగొనలీనుబాష్పజల కాలువలంటి కళావిహీనమై
దనరెడుమోముతో బలువిధంబుగ జిన్గినబట్టతోడ భా
ర్యనువిడి యొంటివాడ బువులమ్మినచోటనె గట్టెలమ్ముభం
గిన పురమెట్టుజేరుదు సఖీమణి నడ్గిన నేమిచెప్పుదున్

వ.	అని యివ్విధమున ననేకవిధముల భార్యనుదలంచుచు నరణ్యంబున గ్రుమ్మరుచుండ భానుండుగ్రుంకె

మ. తిమిరమ్మాకసవీధిభూతలము సంధిల్లంగ నక్షత్రసం
ఘము వజ్రంబులబోలిగన్పడ భుజంగ శ్రేణి ఫూత్కారరా
వము నల్దిక్కులఁభీతిఁగొల్ప నొకచెంపన్ జిమ్మెటల్ గూయ దూ
రమునన్ నక్కలుగూయగా సకలమర్త్య శ్రేణి నిద్రింపగాన్

వ. అంత నాసూర్యధరుండు దీర్ఘనిశ్వాసమువిడిచి మార్గాయాసము నాయరణ్య మధ్యమున నొక్క చోటగూరుచుండె. అంతనొక్క సింహము మాటిమాటికి ఘోరగర్జనం బిడుచు, సకలతరుసముదాయంబులు చలించునట్లు నొక స్త్రీశవంబు నీడ్చుకొని వచ్చుచుండె

మ. కనులందగ్ని కణంబులుట్టిపడ తత్గర్జప్రచండోద్ధతిన్
వనిలో సర్వమృగావళుల్ బెదరి భూభాగంబు గంపింప భీ
తిని చెర్లాచెదరై పరంపరలు శక్తిన్ జూపి పారంగగాం
చెను రాజేంద్రుడు భీకరంబయిన తస్సింహప్రతాపంబటన్

వ. ఇట్లు మోసుకొనిపోవు సింహముయొక్క ప్రతాపంబును యోచించనివాడై తత్కళేబరంబును భార్యదా! కాదా! యని యోజించి భార్యదేయని నిశ్చయించుకొని

సీ. కొలిమిలోనుండి గ్రక్కునబైకిదీసిన యినుపగుండ్లనగన్ను లెర్రపడగ
రఘువంశభవుల విక్రమబాహుసత్వపాండితి మోముభీకరోద్ధతి జెలంగ
క్రొమ్మించులభ్రమార్గమ్ము కాంతిలుమాడ్కి బాణంపువాదర పదనుగుల్క
రాత్రికాలమున దారలకాంతియనునట్లు దాపిన వెండిపూల్దనరవెంట

తే.గీ. విల్లుమోపెట్టి శరము సంధిల్ల బాహు
బలిమిదీపింపలాగి కోపంబుహెచ్చ
విడువజంఝామరుద్వేగ వీరరవము
దిశలు గంపింపుమాడ్కి యేతేరి దాకె

వ. అంత నాసింహము

సీ. కీలాలధార నింగికిcజిమ్మిపారగా ఘోషించి భూమిపై గూలిపడియె
నిశితబాణంబదంటిన వెంటనే మేన గాయమగుపడె సారంగంబురీతి
ముంగాలcజిమ్మిన ఘూరజంబక్కజంబుగలేచి దివినcగ్రొంబొగలనొప్పె
బ్రాణంబువీడు కాలముననురుమాడిన లావుతద్భూమికళ్లమునcదోచె

తే.గీ. ఇట్టిచిత్రంబునెల్ల రాపట్టిచూచు
చుండు సమయంబు క్షుద్బాధ మెండుగలుగ
దిరుగుచున్నట్టి జంబుకంబరగికాంచి
పడిన స్త్రీశవంబుననోటcబట్టి కదలె

ఉ. సందడిలోనవిందనెడు సామితcగైకొని నక్కరాజు మె
ల్లందరిcజేరి యీడ్చుక నరణ్యములోc దన బొక్కజేరి మే
ల్విందని బంధుమిత్రులను బిల్చి విభాగములెన్నొజేసి యా
నందము కూతబెట్టుచు ఘనంబుగ బంతిన బెట్టుచుండగన్

వ. ఇట్లు జంబుకంబుకబృందము సంతోషింపుచుండ సమీపమందుండిన వ్యాఘ్రంబు ఖాంద్రించి దుమికి యాకళేబరంబును కొంచుcబోయెనంత

తే.గీ. కొన్నిభీతిచే నచ్చోటc గూలిపడియె
గొన్నిపోబోయి కాళ్ళు బెన్గొనగ నేళ్ళ
లోనcబడెc గొన్ని తన్నుక బ్రాణములను
విడచె మరికొన్ని తెప్పరిలి వెళ్లిపోయె

వ. అంత నారాజకుమారుడు భార్యశవముం జూడcబోగా నచ్చోట లేకుండుటచే విచారగ్రస్తుcడై

మ. అకటా! యింతకు నేమిచేయcగల నాహా దైవమా యిప్డు మా
మకచింతాబ్ధితరంగసంఘములు వేమారెక్కువైపొర్లె భూ
పకులాదిత్యుcడcగాన సింహమును జంపన్ ధైర్యధుర్యుండనై
చకితున్నాకిదె దున్నితిన్యయిన నాసాధ్వీమణిన్ జూడనే

సీ. మందానిలోద్ధూత బృందాలకములు బాయక లలాటమున నాట్యమ్మొసలుప
కుడిపార్శ్వమునగాలి కదరుచుండెడుఁజిల్గు పైటమృదంగరవమ్ముఁదెలుప
తేపకుమాటనాలాపముంజేయ వచ్చెడుశబ్దమార్మనీ సృతియనంగ
నెలమావితతుల కొమ్మలనధిష్ఠించి యాలించువక్షులు సభాప్రీతిఁ దెలుప

తే.గీ. వేడినన్ దురుమబడినట్టి విరులసౌర
భంబు నాసికలకూర్మి బహుగఁజేయ
లలితముగఁ గాలిమెట్టె తాళమునఁ జెలగ
నిర్జనప్రదేశముననొక్క నెలతదిరుగు

వ. ఆ కాంతాలలామ

చం. చిలుకలఁబల్కరించి వనసీమలమామకనాయకుండు మి
త్రులఁజలఁగాంచినారెయని దుఃఖముఖంబున నేలజూచి కో
విలలుచరింపుచోట సుమబృందముపై నడయాడు షట్పదం
బులగని యద్గునప్పడతి పూవిలుకానిమదాగ్ని హెచ్చగన్

ఉ. మాటికి నోటనుండియొక మాటవచింపగఁ గీరశారికా
కూటమువల్కు పల్కులలొ గూడి సమానముగాగనొప్పు న
బ్బోటిపదద్వయంబు పెనుముల్లులుదాకగ నిస్సిమన్నచో
తేటుల ఝుంకృతిన్ గలయు తియ్యనిపల్కులు పండ్లబోలుచున్

మ. తనమేల్వయ్యెదచేత బాష్పములు చింతగ్రమ్మగా నద్దుకొం
చును వాల్గన్నులఁ గొంతసేపటికి తత్పూనంబులన్ దీనదృ
ష్టినవీక్షింపగ గంధవాహకము దాసీగాగనేతెంచెనో
యన నోదార్చువిధంబు నాసికల దాయన్ బీల్చు శాంతించుచున్

శా. ఆభామామణి మేనలేజెమటగాయన్‌జూచి ప్రేమమ్ముచే
శోభాతీతములైన వక్షముల వీచున్ వీవెనల్ గాగ న
య్యో! భామామణి చింతజెందకుము యత్యుల్లాసముంబొందుమ
మ్మా! బాధేలనె? యన్న మాడ్కిఖగముల్ యచ్చోనిడున్ గూతలన్

చం. అలసి జలమ్ముఁద్రావజని నంతనె వాతహతిన్ చలింప న
ప్పొలతి ముఖంబుఁజూచుకొని పుట్టెడుదుఃఖముపొర్లి రాగ నీ
సలిలము కేవిరోధమును సల్పితి నాప్రతిబింబమైన యిం
పలరగఁజూచుకోనివగ హోయని కూలబడెన్ నదీతటిన్

వ. ఇట్లు కూలఁబడి ప్రాణేశ్వరుని దలంచి,

సీ. మోహనాకార నీస్నేహంబుదూరమ్ము యౌటగాననె జలంబలలనుంట
సఖుడ నీతోఁగూడి సరసమాడుట దూరమౌటనే క్షుద్బాధ యలమిగొనుట
ప్రియుడనీతోఁగూడి క్రీడింపకుంటనే కంటకమ్ములునాదు కాళ్ళఁబడుట
ప్రాణనాయకనీదు వక్త్రంబుముద్దాడకుంటచే దాహంబు వెంటఁబడుట

తే.గీ. నీదుకరకంజముల చల్వ నీడఁబాసి
యుంటచే నాతపము నెత్తికంటుకొనుట
యెందునున్నాడవో యెట్లుగందు నటవి
లోననున్నాడవో రాజధాని గలవొ

చం. నిముసముబాయనట్టి తరుణీమణినెట్టుల బాసియుంటివా
కమలహితుండు నాకొరకు కాంతులఁజల్లుచుఁబాయకుండె ను
త్తమప్రియ నీవునన్విడుటఁ దల్పవిచిత్రముగాదె నామనో
శ్రమమును యెట్లుదెల్పుకొనజాలుదునో లలితాంగసంగమా

ఉ. మెత్తనినీదుహస్తముల మిక్కిలిమక్కువనంటుచెక్కు లి
పుడ్తమనాయకా కమలి హోరనియేడ్చుటచేఁగృశించె పె
న్మత్తగజంపు నీగమనమా మదినెంచగదారి నీపదా
లొత్తిన సైకతంబు విధియుక్తముగాగనిపించు నాకృతిన్

చం. నెతికురులందుఁజెన్నలరు నీటగుమల్లెలు నిన్నుగాంచగా
మురిపెముఁజెంది తమ మోములు వాడినశించెనక్కటా!
సరసుడ నీముఖాబ్జమున చక్కనికాంతులు సోకకుంట ముం
గురులు ముఖాబ్జమున్ బడుట గూడెనహామసికుండజేయుచున్

వ. ఇవ్విధంబున నాదీనస్త్రీ యార్తధ్వనిఁజేయుచు యమితోగ్రాటవి లోనఁ బోవుచుండ నాధ్వనివిని యొక్క ముప్పన్నెమెకంబు ఖాండ్రింపుచు వచ్చుచుండె నది గని భయకంపితయై కొమ్మలునరికిన మోడువలె నిలుచుండె

ఉ. కన్నులవారిపూరములు కాటుక రెప్పలఁదెల్లఁజేయ భీ
తిన్నలినాక్షినెమ్మొగము తెల్లనవోవగ వేణిజార మే
నన్నవచెమ్మటల్బొదవ నాల్గుదిశల్గని దిక్కులేక న
త్యున్నతికంఠమెత్తి వనిహోరని యేడువఁజొచ్చె నివ్విధిన్

మ. గగనాశీన! మహోన్నతా! యఖిలలోకస్తుత్యమృత్యుంజయా
నిగమాగోచర! నిర్వికార! జనితానిత్యుండ సౌఖ్యాకరా
జగతీరక్షణ! పాపఖండన! మహేశాసద్గుణాంభోనిధీ!
మగువన్ దీనను నన్నుగావవ! దురంబాయేమి? రక్షించినన్

సీ. చూతునాప్రాణేశు సుందరవక్త్రంబు సరగవ్యాఘ్రంబుచేఁ జంపఁబడనె
కాంతునానాదు భూకాంతుచక్కనిమేను నిక్కమ్ముగోళ్ళచే రక్కఁబడనె
యరతునాభూతేజు కరయుగంబులసౌరు పెనుకోరధారచే బీకఁబడనె
కందునాయవనీశు కందోయినికముందు నురుపదంబులచేత నొత్తఁబడనె

తే.గీ. అకట! యేపాపమొనరించి తవనిలోన
దైవమా! నన్నురక్షించు దయగుణాఢ్య
నాదుపతిఁజేర దయఁజూపుమో దయాత్మ
యంచువిలపించెఁ గ్రాల్గంటి యటవిలోన

మ. అనిదుఃఖించెడుఁగాంతఁజంపఁబులి ఘోరాకారమొప్పార గ్ర
న్ననమేనెల్లయుబుల్కరించి నలుదిక్కుల్గాంచి ఖాండ్రించి కా
ననమెల్లం బ్రతిఁబల్కఁ బైకెగసి యంధత్వమ్ముపెన్బొందయం
దున దూకన్ యొకపెద్దకొమ్రదచి మేనున్‌బాసెఁ జిత్రంబుగన్

వ. అంత నక్కాంత నిర్జీవియై కొంతకాలముండి తిన్నగా నాయంధకారమున కఠిన మృగ శిలామృణ్మయప్రదేశమునందు నేడ్చుచుఁబోవ నాయార్తధ్వనిని విని యొక్కమునీశ్వరుండు

సీ. తనువెల్లభూతిచే ఘనముగాదీపింప తులసిపూసలదండ గళముఁదాల్చి
జింకచర్మంబు యాసీనపీఠికగాగ నరచేతఁగంగాయి నమరబెట్టి
చిటుకనీరముఁజల్లి బొటనవ్రేలెక్కించి బలిమిచేనలిపి వేజిలుమువైచి
తడిగుడ్డతోఁజుట్టి త్రాటినిప్పునువైచి రెండుహస్తములతో లీలనెత్తి

తే.గీ. బాహువులు హెచ్చుతగ్గు గన్పడగ నోట
జేర్చి నిశ్వాసముంజంపి జెలగిపెద్ద
పీల్పునొగిబీల్చి ధూమంబు విడుచువేళ
చేరువన యార్తనినదంబు చెవినిసోకె

వ. అంత నామౌని యిందెవ్వరో ప్రాణభయమున నార్తరవముఁ జేయుచున్నారని దిగ్గునలేచి రక్షింప నిశ్చయించుకొని యాకాంతను జేరవచ్చుచుండ నక్కాంత చీకటిలో గానలేక నిశాచరుడనితలంచి

చం. పరమదయాళ యేమి పెనుపాపమొనర్చితిఁ దెల్పుమందు భీ
కరమగు దుష్టబెబ్బులి ముఖంబుననుండి భవన్మహాత్మ నా
మరణముబాసె నింత నొక మాయనిశాచరుఁడేగుఁదెంచె నీ
కరుణమరెంతజూపుదు యికన్ కడగాదె మదీయజీవముల్

వ. అనుచున్న వాక్యము లా మునివిని కాంత భీతిల్లెనని పెద్దగా

మ. వనితా నేను కిరాటుగాను విను సంపద్భూరిభూలోకభా
గ్యనిధానంబు త్యజించి నిశ్చలత ఘోరారణ్యమధ్యంబున
న్మునినై వెల్గుచునుందు నార్తనినదంబుల్ వింటి రక్షింపయే
గినవాడన్ యిదె భీతినొందకుము రక్షింతున్ బరీక్షింపుమా

వ. అని దెల్పి చెంతఁజేరి

శా. నీదేదేశము! యీమహావనికి నీవెట్లేగినావెట్లునీ
కీ దౌర్భాగ్యదశల్ లభించె నబలా! యేరాజునీతండ్రి! దా
యాదుల్మిత్రులులేరె! నీతనువుగాయాలెట్టులయ్యె వనిన్
యేధర్మాత్ములుజూడరా దెలుపవేమీ వేగ నాలించెదన్

వ. అని దయారసము లొల్క మాటలాడు మునిపల్కు లాలించి చంద్రధరి.

చం. అనవిని రాచమిన్న వినయంబు సుధారసమొల్క మెల్లగా
తనదుపసిండిపయ్యెద ముదంబున వారగవైచి సిగ్గుచేఁ
దనతలవాల్చి చేతుల యెదన్ నిలిపించి విచారమగ్నయై
మునివరుముందు బాష్పజలముల్ ధరరాలగఁదెల్పె నిత్తరిన్

మ. మునినాథా విను నాదుదీనచరితంబున్ తారకాపట్టమం
దున నాపెన్మిటి యేవసింతుము పదాతుల్ యేన్గులున్ గుర్రముల్
ఘనరాజ్యంబునుగల్గి భూపతులమై కల్యాణభాగ్యోన్నతిన్
దనరార్వారము దారిదప్పి వనిమధ్యన్ వేరువేరైతిమీ

వ. అనగా ముని దయార్ద్రహృదయుఁడై

ఉ. అమ్మరొ! చింతఁజెందకుము యారయుమల్లదెపర్ణశాల నీ
కిమ్మగువాసముండు మవనీశుఁడు యిందులఁజేరుదాక యా
కమ్మని చెట్లపండ్లను సుఖంబుగఁ భక్షణసల్పుచుండు రా
రమ్మని వెంటబెట్టుకొని రమ్యవనంబును జేరెనత్తరిన్

సీ. అమ్మరో! నీవు జలకమ్ములాడగ మంచి సెలయేరుప్రవహించు గలయఁజూడు
మమ్మరో! నీవు సంధ్యావేళవిహరింప మంచిమల్లెలతోట లెంచిచూడు
మమ్మరో! నీకు నాహారంబుగా తియ్య మావిఫలములఁజూడు మీవనమున
యమ్మరో! నీకు శయ్యగనుండ నీపచ్చికల బయళ్ళవెచాలగాంచుమివిగొ

తే.గీ. ఆడుకొనజింకపిల్లల నరయుమవిగొ
మాటలాడంగ గోర్వంక కూటమదిగొ
యేదినీకిందు తరుగొ నాకెరుకఁజేయు
మనుచు నమ్మౌనివర్యుఁ డవ్వనిత నడిగె

వ. ఇట్లా మునిచెప్పి వెళ్ళిపోయిన యెన్మిది మాసంబులకు నిండు గర్భిణియయ్యె. పతిరాక కెదురుచూచుచు యిష్టదేవతా ప్రార్థనంబులు సల్పుచుండె

మ. నవమాసంబులునిండెనప్పడతి కందంబొప్పగా ముద్దుపా
ప వినూత్నంబుజనించె రాట్కులమహా వారాశికిన్ కాంతియై
యవనీకాంత శకుంతలన్ రవి నహల్యాదేవినిన్ లచ్చినిన్
రవివంశోద్భవలైన కాంతలతతిన్ రాజిల్లగన్ మించుచున్

వ. ఆ బాలిక రూపమునందు తన జననీజనకులకంటే నొక రెట్టధికంబుగ జనియించినదై దినదినప్రవర్ధమానయై బెరగుచుండె యిట్లుండ

చం. మునివరుడొక్కచేత ఫలముల్ యొకచేత సుమంబులన్ సము
ద్ఘనమణిహారభూషితకుఁ గ్రమ్మరదెచ్చెడువేళగాంచి బి
డ్డను వెసఁబిల్చియెత్తి యిచటన్ దగదీవెనలిచ్చిపొమ్ము యే
దినమునవత్తువోయనుచు దీనమ్మృదూక్తులచేతులుంచగన్

వ. అంత ముని యెత్తుకొని ముద్దుఁబెట్టుకొని

కం. నీపేరు రూపవతియగు
నాపగనీకఖిలసుఖము లంపునుతల్లిన్
గాపాడునీదుజనకుని
యీపృధ్వికిబంపువేగ మేయని పల్కెన్

వ. అంత నాయాడపాపవచ్చి రానిమాటలతో మునివరునిముందు నిల్చి

తే.గీ. టాటపన్నులదిను మిటాయిదినుము
పాతబారుదుయినుమన పచ్చియిదిగొ
కూతగూయుచునున్నది కోటులయిగొ
సూరుసూరుముయంచును జూపుచుండ

వ. ఆమాటలకు తల్లియు వృద్ధమునియు నవ్వుకొనిన పిదప పిల్లను తల్లి కిచ్చి అమ్మా! నీపతి త్వరలో వచ్చునని ధైర్యముజెప్పి సకలాశీర్వాదములనిచ్చి వెళ్ళిపోయె నంత కొన్నాళ్లు జరిగె నొక్కనాడు సంధ్యవేళ

సీ. ధూళితోఁదులదూగె డాలకంబులతోడ పంకసిక్తంబైన బట్టతోడ
మురికిదేహముతోడ భుజముపైనొకసంకతాలితోనొకచేత ధనుసుతోడ
నమ్ములనొకచేత నాహారమునకు జంపినపక్షులతొ పండ్ల పిండుతోడ
వెడగురూపముతోడ పెనువిచారముతోడ కదుచిన్నవోయిన కనులతోడ

తే.గీ. మాటిమాటికిఁగన్నీరు గోటగీటు
కొనుచు విల్లెక్కుబెట్టి పక్షులకుఁబొంచు
చడవిలోసంచరించుచు నరుగుదెంచు
నరునిఁగనె రూపవతి బై దిరుగుచుండి

వ. అంత నాబాలిక తల్లింజేరఁబోయి

శా. అమ్మా!వీడువెడంగు యాగృహముడాయన్ వచ్చుచున్నాడు యొ
క్కమ్మున్ విల్లుననిల్పి పక్షులను వేయన్ బొంచుచున్నాడు శ్రే
యమ్మా యీతనిమోముఁజూచితిని సంధ్యావేళ భీతిల్లితిన్
రమ్మా యెవ్వడొ తెల్పుమీ మనసుభారం బెంతయో దోచెడున్

వ. అంత తల్లి బయటికివచ్చి కిరాతుఁడనిచెప్పి లోపలికిబోయె కొంత సమయమ్ము నకు భానుడుగ్రుంకె

మ. చలిగాడ్పుల్ మెయిసోకఁగుల్లుజినుకుల్ సామర్థ్యముంజూపఁ దా
రలపై మేఘముగ్రమ్మగా నిరులుతోరంబై గగన్మండలిన్
యలమన్ సూర్యధరుండు యాచలికి దేహంబెల్లగంపింప మిం
చులకాంతిన్ యొకపర్ణశాలగని యచ్చోఁజేరె దుఃఖింపుచున్

వ. అంత నాపర్ణశాలఁజేరి చలికిఁ గజగజవణకుచు తన వలువఁ బరచుకొని పరుండి తన కష్టదశలు భార్య యరణ్యములో సింహమువల్ల జంపఁబడుట జ్ఞప్తికిఁ దెచ్చుకొని దుఃఖముపొర్లివచ్చి.

శా. నాడాకాననమందు సింహమొకటన్యాయంబుగా నాదుపూ
బోడిన్‌జీల్చెఁగదా మహోగ్రముగఁ దత్ఫుల్లాబ్జపత్రేక్షణల్
జూడంబోదునె! నేనుమాత్రవనీశున్‌గా మనంబోదునే
నేడే మృత్యువునన్ను జంపుటకు క్షోణీరక్షకా పంపవే

తే.గీ. పుట్టినది మొదలు యీకష్టమును దురంత
మయిన దుఃఖంబునెరుగ నాహో మదీయ
జన్మఫలమేమి? దైవమా సదనమందు
సుఖముగానుండుటెన్నడుఁ జూతు నకట

వ. ఆహా నానామంబును నాసఖీమణినామంబును సరిగా జాలుటయు రూపంబుల నిరుపమానసౌందర్యులమౌటయు భూజనులుగాంచి భళిర యీవధూవరుల దైవము కూర్పుట వింతయని ముక్కుపై వ్రేళ్లిడుచునుండిరిగదా యనుకొనుచు మార్గాయాసమున గాఢనిద్రా భరితుడయ్యె

వ. అంత చంద్రధరి యీ మనుష్యుడెవరు భార్యను దలంచుచున్నాడే యేమి యీతని సతి మరణించెనా, యీతలంపులన్నియు మాసతి పతులఁ జాలవరకు పోలియున్నవని తిన్నగా లేచి దీపమును ముట్టించి పంచలోనుండిన వానిఁజేరవచ్చి యాపాదమస్తకమును గాంచినిశ్చ యముగా వీడు కిరాతుడేయని తలంచి మాకష్టములవంటి కష్టము లెందరో పొందుచుండలేదా యని తిరిగిపోయి పండుకొనిన కొన్ని నిముసములకు

మ.   కలికీ! చంద్రధరీ! నభోమణియుగ్రుంకంబోయె రారమ్మికన్
కలికీ! చంద్రధరీ! మహానసము దుఃఖంబెట్లు నీకబ్బెనే

వ.   అని రెండుసార్లు పలవరించెను. వెంటనే త్రుళ్ళిపడిలేచి నాపెన్మిటియే రూపము మారియున్నాడని పైబడి హా! ప్రాణనాథా! సకలసామ్రాజ్యభోగంబుల నిరంతర మానంద భరితుడవైయుండు నీకా యీ కష్టదుఃఖములు. హంసతూలికలపైబరుండు నీకా యీ సన్నని వలువ పాన్పు. వివిధరసయుతంబయిన యన్నంబు నారగించు నీకా యీ కాల్చిన పక్షుల బారు అనుచుండ సూర్యధరుండు దిగ్గునలేచి బొబ్బపెట్టి కౌగలించుకొని దైవముందలచి

సీ.   పతితోడ ఘోరయాపదల సౌఖ్యంబుల బాయనినాముద్దు పడతిదొరకె
నంగహీనుడనైన యడిగియన్నముఁదెచ్చి పతినిఁబోషించు నా వనితదొరికె
పతినిదైవమ్ముగా భావమందుననెంచి నిష్టదప్పనినాదు నెలతదొరికె
యిన్నిదినములనుండి యేనుజెందెడికష్టములబాపుచిన్ని పొలతిదొరికె

తే.గీ. దైవమా నేను దలచిన చావుదప్పె
నదియు నీభాగ్యమే యిందువదన కిందు
నిలయముంజూపి రక్షించి నేటిదినము
నన్ను యిచ్చోటజేర్చితి సన్నుతింతు

వ.   అని దుఃఖించు పతినిఁగాంచి చంద్రధరి

శా.   నాథా యింతటికష్టకాలములు యే నాడైనరావంచు నెం
తో ధైర్యంబులనాడుగల్గె తుదకెంతో దుఃఖమున్బొంది పై
గాఁదిండైనను వేళకింతదొరుకంగాలేదు కాంతారమే
యీదౌర్భాగ్యముఁ గల్గఁజేసెనిక వేరే తల్పుటేమున్నదే?

వ.   అంత రూపపతి మేల్కొని వచ్చి

శా.   అమ్మాయెవ్వరు? నానయాయితడు? యట్లైయున్నవాడేమి? రా
జ్యమ్మున్నేరుగలేదటే? యటవిలోనా? యుంటనిన్ జూడనో
యమ్మా! రాతిరిహీనుగాఁదలచి సంధ్యావేళనిన్ బిల్చితిన్
నమ్ముంగావలె తండ్రిద్రోహమున కన్యాయంబు చేకూరదే

వ. అని తండ్రిపైఁబడి యేడువదొడఁగె

వ. వారి యేడ్పులువిని మునీశ్వరుండువచ్చి సంతోషముతో నోదార్చి ధైర్యముంజెప్పి సకలవిధముల దీవించి యూరికిదన్పె. వారు తారకాపురిలో పుత్రపౌత్రాభివృద్ధిగలిగి వినువీధి సూర్యచంద్రులవలె వారి సంతానము నక్షత్రములవలె వర్ధిల్లిరి

గద్యము

ఇయ్యది శ్రీ జగతీపాలోద్యద్యశఃకర కరుణాపాషాణాస్థగితక్షోణీభృ
ద్బృందనిచయ ప్రభూతగంధవహాఘ్రాణితుండును సుతాహృత్సం
భూత శోణప్రవాహామృతాస్వాదితుండును నైర్మల్య జీ
వాహితుండు నయిన శృతగిరిపుర నివాస శ్రీ
గుర్రంవారి వంశాకలశపాథోధీశ్వరుండై
న వీరయాఖ్య జ్యేష్ఠకుమారుండై
న జాష్వాకవి ప్రణీతము

# విజ్ఞాపనము

ఆర్యసోదరులారా! నాకుబహుకాలము నుండియు క్రైస్తవగాథలను పద్యకావ్యమున రచించుటకు నభిలాష గలదు. రచించిన పుస్తకమునచ్చొత్తించి నాకుబ్రోత్సాహముగలిగించు వారు లేమింజేసియాస దొలంగి విరమించి యుంటివి. కొంత కాలము క్రిందట కొందరు క్రైస్తవ సోదరులు, నన్ను నాటక రూపమున దావీదుచరిత్రమును వ్రాయుడు మేము ముద్రింపింతుమని వాగ్దానమునిడి, వ్రాసిన పిమ్మట కవిత్వము కఠిన పాకమనియు పాటలు లేవనియు నెపంబులుబెట్టి నాకు నిరుత్సాహముఁగలిగించిరి. ప్రప్రథమము నుండియు సహాయకులు జిక్కకుండిరి గదాయను విషాదాన లంబీ విషయంబున ప్రజ్వరిల్లినన్ను మరింత వేధించుటంజేసి తదుద్యమంబును తలపెట్టుటచాలించి నేటివఱకు క్రైస్తవేతరు లయాదరణంబు గొంతవృద్ధి బొందితిని. ఇట్లుండ గొంతకాలము నుండి నన్నాశ్రయించి కవిత్వమున గృషిఁ జేయుచున్న రేపల్లె తాలూకా కూచనపూడి గ్రామ వాసులగు కర్రాభూషణము గారి జ్యేష్ఠ పుత్రులు శ్రీ యోసేపుగారు నిండైన మనంబున వేడుటంజేసిక్రీస్తు జననమును ప్రకటించునీనాటకమును కొద్దికాలమున రచియించితిని. దీనినాద్యంతంబు నాలించి యానందభరితమానసులై శ్రీయోసేపుగా రీగ్రంథముద్రణంబునకు వలయుధనంబునిడి విశేషించి కాపీరైటును బుచ్చుకొని నాయాశాలత నింతవికసింపఁజేసిరి. క్రైస్తవకవులయందభిమానము క్రైస్తవ సోదరులకుండనిచో భాషాకాంత యేమొగము బెట్టుకొని మన మధ్య జరింపఁగలదు. యింక నాయమ హైందవపండిత జనారణ్యముల మధ్య సీమలను వీడి రాగలదా? ప్రాజ్ఞులీ విషయమును జింతించుచు లోపములను మన్నింతురుగాక.

ఇట్లు

జి. జాషువ

శా. నన్నుత్సాహ సమేతునిన్ సలిపి మాన్యంబైన యీ కావ్యక
న్యన్నీవింపుఁబరి గ్రహించితి వనంతజ్ఞాన సంభూత సం
పన్నైపుణ్యమునన్ జెలంగునది యీ బాలాలలామంబు శో
భన్నిండారుము కర్రవంశ జలధి ప్రాలేయరుఙ్మండలా

భవచ్ఛ్రేయోభిలాషి

జి. జాషువ

# చిదానందప్రభాతము

:: నాంది ::

ఉ. అంతములేని భాగ్యమునకాస్పదమై తగు సింహపీఠికా
ప్రాంతమునన్ జెలంగి ధృతి వాసి లతాంగిని మేరికన్యకా
కాంత శుభాంక సీమమృదు కంజములోయనఁ దాండవించు దో
షాంతము లేసునాథుని పదాంబుజముల్ మిమునోముగావుతన్

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర : (నలుదిక్కులు పరికించి) సఖుడింకను రాకున్నవాఁడు సభ్యులెల్లరును నేత్ర పర్వముగా నిండియున్నవారు, ఓహో యాబింబాధరు లెల్లరును దేవాలయమునకుఁబోయి.

సీ. అకలంకచరితల మని తెల్పుటకు సూచకములైన శుభ్రాంశుకములుగట్టి
ప్రభునితో బంధింపఁబడియుంటిమని తెల్ప నవ్యవేణీబంధనములుదాల్చి
భువనయాత్రాయత్న బుద్ధి నిరూపింప వేదపుస్తకదండ వితతిబట్టి
సర్వలోకాంభోజ బంభరస్థితిజూప తతగీతికా నినాదములుసల్పి

తే.గీ. అల కపాలస్థలోద్భూత గళితరుధిర
విమలధారాసుధానదీ పృథుతరంగ
డోలికా మాలికా లసత్కేళిసల్పి
వచ్చుచున్నారు నాటక భవనమునకు

యింకను నాటకారంభముగాకున్న విసుగుకొందురు. చెలుని బిలిచి చూచెద. మిత్రమా!

తెరలో

(రెండవవాడు) ఇదుగో వచ్చుచున్నాను (ప్రవేశించి)

రెండ : వయస్యా! నీవువచ్చి యెంత కాలమైనది.

సూత్ర : నేనును యింతకుముందేవచ్చితిని.

రెండ : మంచిది మిత్రమా! యీదినము ప్రదర్శింపబోవు నాటక మెద్ది.

సూత్ర : భగవన్నందనుండగు క్రీస్తునాథుని జననమహాత్మ్యమును ప్రకటించు "చిదానంద ప్రభాత" మను నాటకము.

రెండ : [illegible]

యభిమతం బీనాడు సిద్ధించినది. మిత్రమా! దీనిని రచించిన కవి యెవరు?

సూత్ర : యెఱుంగవా? నేత్రవధానంబునను చిత్రలేఖనమునను, ఆశుకవిత్వంబునను నిపుణతగాంచి పండితశిరోమణులచే మన్నన గాంచి ప్రస్తుతము గుంటూరు ట్రైనింగు పాఠశాలయం దాంధ్రోపాధ్యాయులుగనున్న జాషువ నామాంకులు.

రెండ : ఓహో! వారా,

సీ. ఘనులున్గుఱ్ఱము వీరయార్యునకు లింగమ్మాంబకున్ నెయ్యపున్
దనయుల్ ప్రస్తుత మాంగ్లభాషగరువంగా నొంగవోల్పట్టణం
బునం జెన్నొందెడు నిశ్రయేల్బుధుఁడు తమ్ముల్వీరికిన్ నేనెఱుం
గనె దీవ్యత్కవిచంద్రుజాషువ యశోక్రాంతాఖిలా శాంతునిన్

సూత్ర : వయస్యా; పరిపూర్ణ యౌవనవిలాసమున భాసిల్లులతాతన్వింబోలుచు పంటవలంతి యీవసంతాగమంబున వివిధ విద్రుమలతాలతాంత ప్రతిష్ఠంబై యానందమును గలిగించుచున్నది.

రెండ : మిత్రమా అదిగాదు, క్రీస్తుజనననాటక వీక్షణకుతూహలంబున నీసభ నలంకరించిన వనజాస్యలతో భూకాంతయు

తే.గీ. పైరులనియెడు పచ్చని బట్టగట్టి
సుమవితానంబులను భూషణములు దాల్చి
తతపికీనినాదోచ్చవాద్యములతోడ,
జేరవచ్చెదునని తలంచెద వయస్య!

సూత్ర : బాగుగా వర్ణించితివి. మనము పాత్రలను సిద్ధపరచెదము. రమ్ము (నిష్క్రమింతురు).

# చిదానందప్రభాతము

ప్రథమాంకము

మరియమ్మ ప్రవేశము - సీను - అంతఃపురము

పాట. (తెరలో)

మ. ఘనశైలంబుల సూచికాగ్రమున నాకాశంబునన్ వార్ధియం
దున పాతాళమునన్ తమంబునను చేతోవీధివాతంబునం
దున వైశ్వానరునందు నెందయినఁదన్నున్‌జూడ గాంక్షించు భ
క్తునకున్ దర్శనమిచ్చు దైవతపతిన్ గొండాడెదన్ నిత్యమున్

పరమనివాసుండై రెప్పవాల్పక జీవకోటిని సృజించుచు లయంబుసేయుచు, భుక్తి నిడుచు, భువనములనేలు భగవంతుఁడు నాహృదయ పద్మాసనాసీనుఁడై నిరంతరము పరిఢవిల్లుగాత ఓ జగదీశ్వరా! నిండు జవ్వనమున విరాజిల్లు నాకెట్టి శోధనలును సంభవింపకుండ జేయుము. నను వరించి నాపై మనంబునిల్పి యున్న పురుషకుంజరుని జిరాయురుపేతుని గావింపుము. భావికాలమున దంపతులమగు మేము పవిత్ర పుత్ర పౌత్రాభివృద్ధిచే విరాజిల్లుచు భగవత్సేవ మరువకుండున ట్లనుగ్రహింపుము.

(గాబ్రియేలు ప్రవేశించి)

గాబ్రి : తథాస్తు తథాస్తు భావికాలమునఁగాదు, యిప్పుడే నీకభిమత ఫలంబీయఁదలచి యున్నవాఁడు.

మరి-తె : ఔరా! యిది దూత కంఠస్వరముగా నున్నది యేమి? నాకభిమత ఫలసిద్ధియగునా.

గాబ్రి : అవును. యిప్పుడే సంభవించినది.

మరి-తె : ఓహో! యెవఁడో మహనీయుండు నాసామీప్యమునఁ బొడకట్టుచున్నవాఁడు అయ్యా నీదాసురాలి వందనము నవధరింపుము.

గాబ్రి : నీ యభివందనంబు లింతముందే భగవంతుడవధరించె కన్యకా!

శా. లోకారాధ్యుఁడు, సృష్టికిన్‌విభుఁడు స్వర్లోకాధినాథుండు త
ద్రాకా చంద్రసహస్రదీధితిచయ ప్రత్యక్షతేజోధిక
వ్యాకీర్ణాంగుఁడు రాజరాజు, శమితోఁద్యద్వైరిశ్రీదేవుఁడే
నీకున్ నందనుఁడై జనించు నలివేణీ ధన్యతన్ బొందుమా!

పరిశుద్ధాత్మబలంబున నీవిపుడే గర్భమునుదాల్చెదవు. నీజన్మము సార్థకమయ్యె.

లోకములకధినాథుండగు సృష్టికర్తకు నీవుతల్లివని ముల్లోకములచేఁ గొనియాడఁబడుచు, స్వర్గసౌఖ్యముల జూరలాడెదవు. నీగర్భము పవిత్రము. నీజీవనమకల్మషము. నీకీర్తి యచ్యుతము. సంతసింపుము.

మరి–తె :అనగా! వనితలయందుఁ గడునల్పురాలనగు నన్ను శ్రీభగవంతుఁడేల యీమహత్కార్యమును వహించుట కేర్పరచుకొనియెనో తెలియకున్నది. శుద్ధ హృదయలును పతివ్రతాశిరోవిభూషణలునై పరిఢవిల్లుగరిత లెందరులేరు. వారిపాద లేశంబున కేనియును సాటిరాని కన్యనగు నాకీకార్యము భరింపరానిది, అకటా.

గాబ్రి : నీవు భయపడకుము. అది భగవంతుని సంకల్పము.

మరి–తె : హా! పరమేశ్వరా.

మ. ఎరుగన్ గర్భపువేదనంబెపుడు మాతృస్తన్య పానంబుపై
మఱలింకన్గనుమాయలేదు దవసామ్రాజ్యైక దీక్షామనోం
బురుహన్ నీకును దాసురాలను కరంబుల్ మోడ్చి సేవింతునో
పరమేశా ననుఁదల్లిగాఁగొనుట సైపంజాల మన్నింపవే

గాబ్రి : అమ్మా! అట్లనకుము. దైవయత్నమునకు మారు మాటాడకుము. లేకున్న తన కోపమునకుఁ బాత్రీభూతవయ్యెదవు.

మరి–తె: అయ్యా భగవత్సంకల్పమును శిరసావహించి విశ్వసించితిని. కాని నరకాంతను విశేషించి ముగ్ధను వెఱపుండునుగదా.

గాబ్రి : అవునవును. నీకుఁదగిన ధైర్యస్థైర్యములు దేవుడు తప్పకయనుగ్రహించునని విశ్వసింపుము.

మరియు

ఉ. మంటిని ముద్దగా సలిపి మానవునిన్ సృజియించి తోడు వా
ల్గంటినొకర్తు జేసిబహుళంబగుకీర్తిఁ జెలంగిజీవులన్
బంటవలంతి నింపిన యనంతు డగోచరు డాదిదేవుడే
కంటికిరెప్పగా సతము గాయడె? నీకు సముద్భవిల్లినన్

(సంవాదము. పాట)

గాబ్రి : ఆశిశువున కేసనిపేరు పెట్టెదము. నీకు శుభముకలుగుగాక. (నిష్క్రమించును)

మరి–తె: దీనురాలనగు నాపై దైవమునకుఁ గలిగిన ప్రేమంబునకు నేనే ప్రతిక్రియఁజేసి

కనంతంబగునుపకృతి. దీనులయందు తనకుగలయక్కటికం బీనావిషయం బున విస్పష్టమగుచున్నది. జగద్రక్షకా

తే.గీ. ధరణి ధరమును శిరమునఁ దాల్చినట్టి
మూషికముభంగి నాగర్భమునను నిన్ను
దాల్చియుంటిని యీసముద్రంబునుండి
నన్నుఁగడతేర్పవే వందనములు నీకు (అవనికపడును)

యోసేపు పాట

యోసే : (తనలో) ఔరా! లోకము నాకింక పాడుగదా?

చం. గొనములపోవు సుందరత కున్నిలయంబు, కడానిబంతి జ
వ్వని సుకుమారిసత్కులవివర్ధని పెండిలియాడువాడనం
చు నెవరిపైని హృదయ సూనమునిల్పితి నట్టికన్య యొ
క్కనిరతి సౌఖ్యమున్ బడసి గర్భము దాల్చిన దక్కటక్కటా!

ఆహా! కాలవైపరీత్యము. యీమోహబంధనములనుండి విముక్తుడనగుటకు నాకుదారి తెలియకున్నది. చిరకాలమునుండి వివర్ధమానములగు నాయాశాలతలు చిగిరించి నామనోవీధి నలముకొని సాంద్రములై విలసిల్లుచున్నవి. ఓసీ గోముఖవ్యాఘ్రమా! తడిగుడ్డతో నా కంఠమును గోసితివిగదే? నీకనిష్టుండనైన నీమనోనిశ్చయం బిసుమంత నాచెవినిబడవేసియుండిన నాకీదుఃఖముండకుండును గదా. నిన్ను వరించినంతమాత్రమున నింతవిషాదమున ముంచితివా? నీచక్కదనంబే నన్ను మోసపుచ్చినది. నిన్నననేల.

తే.గీ. లలితమైసొంపుమీరు గులాబికుసుమ
మునకు ముందు లధోభాగమున గలుగుట
తెలిసి నినుగోరుకొనిన యీ కలుషమతికి
మహినివలవదే శాస్తి యీ మాత్రమైన

కటకటా యీదుఃఖానలంబు నన్ను దహింపకమానదు.

ఉ. నేను వరించినట్టి నవ నీరజగంధి నొకండు బుద్ధిమై
పూని హరింపజూచి మది బోవనెటుల్ సహియించువాడ నా
పైననుజూచి భూజనులు పక్కున నవ్వినచో భరింపగా
నౌనెశిరంబు నెత్తగలనా పదిమందిని నంబుజాననా

ఎంతసాహస మెంతసాహసము, యెంతమోసము, యెంతఘోరము, యెంత వింత, యెంత విషాదము, యెంత భయంకరము, యెంతదుష్కృతము, యెంతసిగు ఆహా!

తరుణీమణీ! నీభక్తి! నీ సద్గుణము, నీనమ్రభావము, నీకీర్తి, నీప్రేమ, యెంతయో విచిత్రముగా మార్పుజెందినది. నిముసమైనను నిన్నుదలంచని సమయము నాకు గలిగియుండదు. యీషన్మాత్రమైనను నీయందనిష్టభావము నాకుండదు. నిన్నుదలంచుచు సంతసించుట తప్ప మరి యేలోపమును నాయందులేదు. అట్టి నా సంతోషజలధిలో నీదుష్కృతికి బాల్పడి బడబానలంబు బడవైచి పున్నెము గట్టుకొంటివా.

మ. కలికీ! నిన్ను వివాహమాడుటకు నే గాంక్షించియున్నప్పుడే
వలదన్నన్ నినుగొట్టువాడెవఁడు నీ పై మోహదీపంబు ప్ర
జ్వలితంబుం బొనరించి గప్పుమని యార్పంజూతువా సద్యశః
ఫలమింతేని లభించెనా యపయశ ప్రాప్తిన్ విడంబిపుమీ!

తలంచుకొలంది నాదుఃఖ మతిశయించుచు పొంగిపొరలుచున్నది. యీమనోతాప మింకజల్లబడునా!

తే.గీ. నిదురబట్టదు సంతోష మొదవబోదు
మనసునెమ్మదిలేదు సమస్తజగము
బహుళ శోభావిహీనమై పరిఢవిల్లు
తెరగు గనుపట్టె సుఖముల తెన్నుదప్పె।

(కొంత తాళి) విచారింప ముగ్ధకింతటి తెగువగలుగదని నిశ్చయించెద. ఎవ్వడో యీయకృత్యమునకు బాల్పడి వెన్నవంటి తన మనంబును గరగించి లోపరచుకొని యుండును. కాంత లతిశీఘ్రముగా శోధనలయందు జిక్కుచుందురు. అందుచేత నియ్యబల కీదుర్దశ నెవ్వడోదుష్టుడు బహుప్రయాసముల దెచ్చిపెట్టియుండును. (కోపము నభినయించి) ఓరీ! క్రూరకర్మా.

ఉ. కన్నెలపాడుజేయుటకుఁ గంకణమున్ ధరియించు పాప సం
ఛన్నమనస్క నీవు బలశాలివో దుర్బలశాలివో యెఱుం
గ న్నిజమైన పౌరుషము గల్గిన జెచ్చెర నంబుజాననన్
గొన్న జగంబుమెచ్చునిది గూడునె చిక్కినసంహరింపనే

మదంబున కన్నుగానక యెంతపనిజేసితివిరా! మూఢా! నీకించుకేనియు దైవభీతి లేదా! ఛీ! జడమతీ నీవు నాకంటబడకుండుటకు ప్రయత్నించిన ధన్యుడవయ్యెదవు. కాదేని నీవక్షమునుబగిల్చి నీరుధిరంబును పుడిసిళ్ల గుటకుగుటకుమని త్రావకుందునా! నీవంటిదుష్టుని మరణమునకు లోకము సంతసింపదా! భగవంతుడును నీహత్య పాపమని తలంచడు. (లలాటమును గొట్టుకొని) హా! నాకెంతపిచ్చి. ఆయబలపైని గల మోహోద్రేకమున నేనేమి ప్రేలుచుంటినో నాకు దెలియకున్నది. యెవనినోసంహరించుటకు

నాకేమిబట్టినది. యిదినాకు నిక్కువముగా భార్యకాదు. వరించిన కన్య. యంతమాత్రము ననే నింత దురపిల్లరాదు. ఎవరియక్రమమో యనుభవింపవలసిన వంతు నాకు వచ్చినది కాని వేరుకాదు. యీవిచారమణంగుటకు దైవధ్యానమే ప్రధానకార్యము (చేతులు జోడించి) హే పరమేశ్వరా!

చం. ఎవనిమనంబులో దురిత మింత జనించునో ధర్మువెట్టి మా
నవుని హృదంతరాళమున నవ్యగతిన్ మొలకెత్తుచుండునో
భువి నతిసూక్ష్మబుద్ధి గని ముందఘమున్ బరిమార్చి వెన్క ధ
ర్మువు నభివృద్ధిసేతు పరిపూర్ణదయన్ గరుణాపయోనిధీ!

దేవా నాకు శాంతిని కలుగజేయుము. (అని శయనించును) (త్రుళ్ళిపడిలేచి) ఆహా యిది నిక్కువంబగునా ధగధగ మెరయు ధవళాంబరమును దాల్చి శీతకరకిరణోపమాన ప్రభాజాలములతో స్వప్నమునఁ బొడసూపిన యిమ్మహనీయుడెవ్వడు. నన్ను దుఃఖమునుండి దరికిజేర్చుటకుగా జనుదెంచిన భగవంతుడని దృఢమగుచున్నది. అమృతరసోపమానములును శిరీషకుసుమపేశల సుధామధురములు నగు మందమందమృదులసితంబు లతో నాతడెద్దియో నాకు బోధించినట్లున్నది. ఆ దివ్యస్వరూపదర్శనము నాకన్నుల గట్టినట్లున్నది. విషాదానలంబున మిగుల శోషించి నిద్రించుచు ప్రమత్తుఁడనై తద్వాక్యంబుల నంతగా బాటింపక యెంత తప్పుజేసితిని

(తెరలో)

భక్తశిరోమణీ! యోసేపునామధేయా; సంశయింపకుము చింతవిడువుము.

యోసే : (ఆలించి) అయ్యా, నీ వెవ్వరు?

(తెరలో) నేను శ్రీభగవంతునికి సారథినగు గాబ్రియేలనుదూతను.

యోసే : (తనలో) ఆహా; యేమినాభాగ్యము (ప్రకాశముగా అయ్యా) నీ యాగమమునకు గారణమేమి?

(తెరలో) నిన్ను దుఃఖసముద్రమునుండి దరిజేర్చుటయే.

యోసే : సంతసము, నీదాసుడు, నీస్వరూపము నారయజెల్లునా.

గాబ్రి : ఇదిగో వచ్చుచున్నాడ. (అని రంగమును ప్రవేశించును)

యోసే : (నమస్కరించును)

గాబ్రి : (దీవించి) సుజనవంద్యా, అకలుషమతియు దైవధ్యాన పరాయణచిత్తయు కాంతా శిరోవిభూషణంబునగు మరియాంబ గర్భమునుదాల్చినదని నీవు విచారింపవలదు. యీయమ జగదారాధ్యుఁడును, పాపపరిహారుండును,

సజ్జనావన దక్షుండునగు భగవంతుని పరిశుద్ధాత్మాప్రభావపాటవంబున గర్భము ధరించినది. యీ విశుద్ధగర్భమున,

మ. కరుణాసాంద్రుడు, భక్తలోకసుమనః కంజాతభానుండు దు
ర్భరదుర్వారమహోగ్రకిల్బిష గజేంద్రవ్రాతసింహుం డభం
గురకైలాసవిభాసితస్ఫుటయశ కూపారుదాత్మాంబుజ
స్ఫురితేందిందిరుడిద్ధకీర్తియశుడు ద్భూతుండుగాబోయెడిన్
ఇమ్మహితకీర్తి,

సీ. పాపకూపమునందు బడియున్న వారల నుదితవాత్సల్యత నొడ్డుజేర్చు
నరకలోకాధీశు కరవాలమునగూలి సమయువారలకు నౌషధములిచ్చు
దురితంపుటేనుంగు తుండంబుననుజిక్కి భీతిల్లువారల విడిచిపుచ్చు
బలితంపుదోష శృంఖలములచేఁగట్ట బడినవారికి ముక్తి పథమొసంగు

తే.గీ. తవిలి కిల్బిషభుజగ సందష్టులైన
వారలకు నెత్తనుండె శిల్వధ్వజంబు
జీవజలధారలిపుడ దోసిటధరించి
తెచ్చుచున్నాడు దూతలు మెచ్చిచూడ

పొమ్ము నీసతీరత్నమున కుచితకృత్యముల నిర్వహింపుము (అని అదృశ్యుడగును)

యోసే : (విభ్రాంతితో) ఆహా, యీ మహాత్ముని దర్శనం బొనరించి నేనెంతయు ధన్యుండనయితి. మింటికి చూచుచు యీ లావణ్య విగ్రహము, మేఘములను జీల్చుకొనిపోవు మరాళరాజమో యన్నట్లు పాండురద్యుతి గగనతలంబు నావరింప.

సీ. గగనాంగనా కరాగ్రమున తాండవమూడు ముద్దుల చిన్నిపావురమనంగ
పక్షయుగ్మముతోడ వసుధకు డిగ్గి దిక్కులకెక్కు చంద్రమండలమనంగ
ప్రభుయేసునాథుని ప్రకటితోద్యమమున కందళించిన కీర్తి కాంతయనగ
పగలురాత్రియుఁ గాంతి బాయక మింట నక్కజముగా మెరయు నక్షత్రమనగ

తే.గీ. ప్రణుతికెక్కిన యాకాశ వనమునందు
ఁబూచి శోభిల్లు మాలతీ పుష్పమనగ
జలధరంబులు దూదిపింజములభంగి
పాయలైపోవ దివికి వేంచేయుచుండె

యగు సతీరత్నమును నోటికివచ్చినట్లు తూలనాడితిని. పాపము శాంతించుగాక. దైవప్రేరితుండై యీదూత నాకు బొడసూపకున్న నెట్టి యకృత్యమునకు బాల్పడియుందునో, మూఢులగు నన్నుబోంట్లు దైవసంకల్పముల నెఱుంగలేక తీవ్రపడి, ముందు రానున్న సౌఖ్యములకు వెలియగుచుందురు.

తే.గీ. అతిభయంకర భుజగ ఫణాగ్రమందు
మణివితానంబులభియించు మాడ్కిగాక
జనములకు జొప్పడెడు నరిష్టములయందు
నెదవిచారింప సౌఖ్యము లిమిడియుండు

భగవన్మహిమంబు వర్ణనాతీతము. (చేతులుమోడ్చి)

ఉ. కన్నులజూతమన్న నెట గన్పడ వూక్తులనాలకింత మం
చన్న వినంగరావవి ప్రియంపడి యూహయొనర్పరూపమె
ట్లున్నొ గ్రహింపలేము కరుణోదధి నీమహనీయకార్యముల్
గన్నభరింపకున్నది జగంబధికంబుగ రూప యుక్తమై

పరమపితా! తెలియక చేసినదాసుని తప్పిదంబును మన్నింపుము (కొంచెమాగి) నేనిప్పుడుపోయి యా కంజాయతాక్షి నాదరించెద (నిష్క్రమించుచున్నాడు)

(రాజసభ, కైసరు సింహాసనాసీనుఁడై. మంత్రీ సహితుఁడై యుండును)

మంత్రి : (రాజుతో) ప్రజాపాలనంబున మీకున్న నిపుణత్వము రాజుల కెందునుఁగలిగి యుండ దని నిశ్చయించెద. శత్రురాజులనోడించి కప్పములను గొనుచు దుష్టుల శిక్షించుచు, సుజనుల నాదరించుచు, జోరులనణంచుచు, భీరులఁగాచుచు, జారులనేచుచు రాజ్యమున కెంతయు సౌఖ్యమును గూర్చితిరి.

చం. వినుతభుజాబలంబున వివేకమునన్రణకేళి, రాజ్యపా
లనమున సాహసంబునఁ దలంపగనీకు సమానుడౌ నరేం
ద్రుని గనమెందుఁబుట్టరు చతుర్వనరాశిపరీత భూతలం
బున నుతిసేయఁజెల్ల దె మిమున్ వసుధాతలనాథచంద్రమా!

సీ. నీకీర్తినర్తకి నిఖిలదిక్కులయందు నాట్యంబుజేయుచు న్నదికడంగి
నీరాజ్యరమ కమనీయకాంతులతోడ ప్రాకుచున్నది దిశా ప్రాంతములకు
నీఖడ్గకాలాహి నెత్తిత్రావుచున్నది యరిరాజసమితి ప్రాణానిలములు
నీ బాహుపరిఘ సన్నిహిత దుర్జనశిరః పేటికానికరముల్ ప్రీల్చుచుండె

తే.గీ. నీకు సములెవ్వరయ్య నిర్ఛిద్రభరిత
దశదిశ యశస్స్వరూప? సాంద్రప్రతాప
అమలగుణదీప చటులశౌర్యప్రతాప
త్రుటితపాపకలాప యూదులకుభూప

క్రైస : మంత్రీ! సంతసము, సంతసము నీకు నాయందుఁగల భక్తినైపుణ్యము లగణ్యములు. నీవంటి మంత్రిసత్తములున్న నాకేమి కావలయును.

తే.గీ. శౌర్యసంపన్నుఁడైన భూజానికవని
మంత్రివరులైనవారు ధీమంతులుంట
ప్రణుతరోచిర్వితాన విరాజమాన
మైన మణికిఁగడాని పొత్తమరుటగద

నాకిట్టి యపారరాజ్యపాలనాశక్తియు మీబోంట్లబుద్ధి చాతుర్యముననే సంభవించినది.

మంత్రి : రాజా! మీరట్లనకుడు. మహీపతుల యాదరణంబులేక యెట్టివారులును నిలువఁ జాలరు. అట్టిచో మాజ్ఞానబీజములు మీచరణదాస్యము చేతనే విరాజిల్లునుగాని, గురులగు మీరు మాచేఁ బ్రవర్ధితులుగానేరరు.

తే.గీ. కమలజాండంబు లెందును గమలమిత్రు
కిరణతాడనంబున విచ్చి మెరయుగాని
కమలమిత్రుండు భాసిల్ల గలఁడె యెందుఁ
బద్మములచేత నిది యసంభవముగాదె

వేడుకొంటినని కినియకుడు.

క్రైస : మంత్రీ మనము ప్రసంగవశమున నియమిత కార్యాలోచనంబును మరచి యుంటిమి. గతద్వాదశాబ్దములనుండి, ప్రజాసంఖ్య జననమరణసమన్వితము గా నెరుఁగవలసియున్నది. నీవీకార్యమును చక్కపెట్టుటకు సంసిద్ధుడవగుము. మరియు సర్వలోక ప్రజాసమూహములు, రాబోవు మాసము భానువారము నాటికి, జన్మస్థానములకుఁ జేరవలయునని ప్రకటింపుము.

తే.గీ. చండశాసనబిరుదాంకితుండు ఘనుఁడు
కైసరైగూప్తు నానతి కఠినమనుము
రాక తక్కిన యట్టివారలకుఁ దగిన
శాస్తివిధించునదియుఁ బ్రచండమనుము

మంత్రి : జగదీశ్వరా! చిత్తము అట్లేకావింతును నాకు సెలవొసంగుడు.

కైస : పోయిరమ్ము

(మంత్రి సెలవుగైకొని నేపథ్యము వంకదిరిగి)

మంత్రి : యీతనికి నాయందు నిండైనవాత్సల్యమును నాస్తుతి పాఠమునఁ గలిగించు కొంటిని. యిచ్చకములకు సంతసింపని మానవుడెందునులేడు. గర్భశత్రువైన ను ముఖస్తుతి యనుబంధమునఁ గట్టి వశపరచుకొనవచ్చును.

తే.గీ. కరువలంఘించు నొకశునకమునుఁ బిసిత
ఖండమునువైచిచోరుఁడు కైవసంబుఁ
జేసికొనునట్లు ముఖస్తుతి జేసి చంప
దలచుకొనివచ్చు మృత్యువు న్గెలువవచ్చు.

సమయమునననుసరించి నరుల నుతించుచు నన్నుబోంట్లెందరో ఘనులదయకుఁ బాత్రీభూతులై యైహికసౌఖ్యములుఁ వడయుచుందురు. యీ కీలెఱుంగడేని మాయా మేయంబగులోకమున నరుండు కష్టములననుభవించుచుండును. అట్టి వాని నమాయ కుడందురు. స్తుతి వచనములు పలుకకున్నను తనతేని ముఖంబున నెట్టివాఁడును విభుని దుష్కార్యముల కడ్డుజెప్పరాదుగదా? దుష్టునితో నీవు దుష్టుడవని వచించిన నతడాగ్ర హింపకమానఁడు, నీకార్యములు మంచివన్ననతడెంతయు సంతసించి సేవకావృత్తికినిఁ బాల్పడును.

తే.గీ. స్తోత్రపాఠకులౌ మనుజులనుమించు
శత్రువులు లేరు నరులకు మిత్రులార!
వెన్నుఁబొదవిన కత్తులై వెలయువీరి
బారిబడకుండు దదియునపాయకరము (నిష్క్రమించును)

కైస : నిక్కముగా నాయందు సేవకులకుఁ గలభక్తిభావంబే రాజసేవకులకును గలుఁ గనేరదు. పాలనము నారసి జనములు సంతసించుచుండ మహీపాలునకే విపత్తుసంభవించును. యీయమాత్యుని స్తుతివచనంబులచే నాహృదయంబు పట్టరాని సంతోషమున వెలయుచున్నది.

(తెరలో! రాజా అంతఃపురమునకు, రమ్మనుచున్నారు)

ఓహో! వేళయైనది. మీదట కార్యమును విచారించెద. (నిష్క్రమించును)

# చిదానందప్రభాతము

ద్వితీయాంకము

యోసేపు ప్రవేశము

సీను–అంతఃపురము

యోసేపు :ఆహా యీ తలిరుఁబోడి పూర్ణగర్భవతియయ్యు నిరాయాసముగా గృహ కృత్యములు నిర్వహించుట దలంచ నాకెంతయు నాశ్చర్యమగుచున్నది. దైవవాగ్దానమునకు లోపముండునా పరిశుద్ధాత్మ యీ యబలకు నలుదిక్కులఁ దాండవమాడుచున్నది గాని వేరుగాదు. వేరుగా తాండవమాడనేల.

తే.గీ. భువనములకు సమస్త జీవులకు నెల్ల
మూలమైయున్న దేవుని ముద్దుబిడ్డ
యాత్మగర్భంబులో బాపఁడైవెలుంగు
చుండగా రక్షణంబేటి కుండవలయు

(కొంతతాళి) అట్లనియూరకుండరాదు. సాధ్యమైన కార్యములఁ తోడ్పడుట నావిధి

(తెరలో)

తే.గీ. అరసిర్రాయంగనయ్యె జనాళిసంఖ్య
ప్రభువునానతి వచియింప వలసె యూద
యానివాసులారా! నిర్ణయంపుదినము
లతి సమీపించె జననభూములకుఁబొందు

యోసే : (ఉలికిపడి) ఔరా! జననభూములకు నిర్దిష్టదినమునకుఁ బోవలయుననితేని యానయట; ఎక్కడి నజరేతుపురము యెక్కడి బెత్లేహేము. (విచారమునభినయించి) యీ నిండు చూలాలిని వెంటగొని యే నెట్లీ ప్రయాణమును గొనసాగించెదను. అక్కటా! దుర్భరము. దుర్భరము. తానొకటితలంప దైవ మొకటితలంచునట. యీశిశుజన్మాంతరమునఁ గొన్నిదినంబులు తాళి నిమ్మళముగా జననభూమికిఁ బోదలచియుంటిని.

ఉ. ఈ యమనిండుగర్భవతి యీదినమో యిపుడో! తలంప రే
పో! యెపుడో! వినిశ్చయము పుత్రునిగాంచెడు కాలమింతకున్
డాయగ వచ్చెనేటి పయనంబు కడుంగడుదూరమింతలో
బాయదు తేనిశాసనమవారణమేగతి పోక తక్కెదన్

సీ. ప్రసవించుకాల మప్పటికి సమీపింప నేనేరిపంచకు నేగువాఁడ
ప్రసవవేదనమును భరియింపలేకున్న లలనకేమంత్రసానులనుబిలుతు
నెత్తురుగందునా పొత్తిగుడ్డలనుంచి వెలది యెచ్చట పండ బెట్టఁగలదు
నిఱుపేదలనుచు గణింపకుండినఁ గట్ట యందు మమ్మింకెవ్వ రాదఁరింత్రు

తే.గీ. యిసుకవైచినరాలన ట్లెందు జనులు
నిండియుండెద రొకచోట నిలుచుటకునుఁ
దలముఁ జిక్కదేవిధమున మెలగువాఁడ
దైవమా! యేదిదారి నీ దాసునకును

జగద్రక్షకా! నీ ప్రభావంబున మాకే యపాయమును సంభవింపదని నిశ్చయించు కొని ధైర్యమునవలంబించినను దారిద్ర్యదశయందున్న మేము నిన్ను గాంచి మనంబులు చిక్కఁబట్టఁగలమా? ఈ నీజననంబింక నేరియందుఁగొనసాగకుండును. లోకరక్షకుండ వగు నీవు మాతోఁ గష్టములననుభవించుట మాగర్భములకు గాయముగాని ఱంపపుఁ గోతగదా!

సీ. నరజన్మమెత్తనున్నాఁడవైనప్పటి కీదరిద్రులకె జనింపవలెనె
దీనత్వమునఁబుట్ట దెగియించి తీవైననింతశాంతత వహియింపవలెనె
ఒకరికి బిడ్డగా నొప్పియుండితివైన నీనన్నె తండ్రిగా నెంచవలెనె
తలచినాడవు మహీతలి కేగుదేరంగఁ దెలివినీనాడె యేతెంచవలెనె

తే.గీ. అహహా! స్వర్లోకనాథ నీ యంతరంగ
మతి విచిత్రంబు యాగమం బద్భుతంబు
యిపుడు నీస్థితిఁ బరికింప నేమిసెప్ప
తోషదంబయ్యు నెంతయు దుఃఖకరము

యేమిసేయుటకుఁ గాల్లాడకున్నవి (కొంత విచారించి) యెట్లైనను రాజునాన జవదాటరాదు.లేకున్న నాక్రూరరాజేమి శిక్ష విధించునో అప్పు డీశిశువునకునుఁ గష్టము సంభవించును. ఆదుఃఖము మనంబుల దహించును.

ఉ. బీదలమైన మాకు నిటు వేలుపుమిన్నదయార్ద్రబుద్ధి స
మ్మోదమున న్గుమారుఁడయి పుట్టగఁబేదతికంబు నెంచుచున్
ఖేదముఁజెందనున్న మది కిన్ గొడుకన్నను సంతసంబుగా
దే! దయమాలిపుత్రుఁడు సహించుటకోర్తునె పాలికష్టముల్

ఓహో! సూర్యాస్తమయమగుచున్నది. పక్షులు గూండ్లకుఁ జేరుచున్నవి. లోకబాంధవుడస్తమించుచు నిలయములకుఁ బొండని యానతివచ్చెనని యొండొంటితో సంభాషించు కొనుచున్నవో యన్నట్లు కలకలారావములను జేయుచున్నవి. సకాలమునకు నేను నాజనన భూమికిఁబోవలయునుగదా? అదిగో భానుమంతుఁడు కాంతిని దగ్గి యపరదిక్కాంతధరించిన సిందూరతిలకమట్లు పొడసూపుచున్నాడు. చీకటులప్పుడే బ్రహ్మాండము నావరించుచున్నవి. రహస్య సంచారములను జేఁయుచుస్వస్థానమునకు బోవని ప్రజానీకములతేనికి నివేదించుచారులవలె సూర్యుఁడు పూర్ణముగా గ్రుంకెనో లేదో కనుగొని చంద్రున కెరిగింప నేగు భటులరీతినక్కడక్కడ తారకలుఁ బొడసూపుచున్నవి. (కొంచెమాగి) ప్రాతఃకాలమున సతీమణితో ప్రయాణముఁ జేసెదను గాక పలువురు సంసిద్ధులగుచున్నవారు వీరితో గఁలసిపోయిన మార్గశ్రమమంతగా నుండదు. (నిష్క్రమించును)

జ్ఞాని ప్రవేశము. (పాట)

ఈ నక్షత్రమొక ఘనుని జన్మమును సూచించుచు మింట నవీన కాంతులు వెదజల్లుచున్నది. యీతారకాదర్శనంబున.

మ. పులకల్మేనజనించె నిండెహృదయాంభోజంబు మోదంబునన్
విలసన్ముక్తిపథంబుఁజేకొనుట కువ్విళ్ళూరుచుండె న్మనం
బెలమిన్ లోక విభుండొకండుదయమయ్యెన్ రండు రండంచుఁ బా
పులఁబిల్వన్ సమకట్టెనోయనుతలంపు ల్పుట్టెడిన్ నా మదిన్

ఉదయించిన రాజెవ్వడైయుండును, సామాన్యమానవుండైన నక్షత్రము సాక్ష్యమిచ్చునా. నిజముగా నీతడు జగదుద్ధారణాపరాయణ స్వాంతుండగునొక్క వేలుపుమిన్న. యీచుక్క తూర్పుగానచడి పోవుచునన్ను వెంబడింపుమని సైగసేయుచున్నట్లు తోచుచున్నది.

సీ. కాబోలు! నిది నిశాకరుగెల్వదీపించు గగనభామామణి కంకణంబు
కాబోలు! నిది కళంకములేక క్రొత్తగాఁ దళుకొత్తు కుముదబాంధవునిజోడు
కాబోలు! నిది ఖరకరమండలపుసంగముముఁగోలుపడినయమందకాంతి
కాబోలు! నిది సృష్టికర్తవైరిని గెల్చి క్రమతనిల్పినపాండురధ్వజంబు.

తే.గీ. మీకొఱకురక్షకుండు జన్మించునంచుఁ
జెలగిభక్తులుమున్ను వచించినట్టి
ఘనుఁడుబుట్టుచు శుభలీలఁ గరతలమున
ముందు దాల్చినమహిమ గాబోలునిదియు

(గ్రంథమును విప్పిచూచి) “నేడు రక్షకుఁడు పుట్టియున్నాఁడు” (అనిచదివి) ఆహా! యేమినాభాగ్యము. నిజముగానాకు రక్షకుఁడు పుట్టియున్నాడు (మరలచూచి) తూర్పున నక్షత్రము పుట్టుట మీకానవాలు (అనిచదివి) యీ విషయమును విచారింపక యెంత కాలయాపనము గావించితిని! యీ ప్రభువును సృష్టికర్తను యుద్ధారకుని గన్నులార గాంచు కాలము సమీపించినదిగదా?

తే.గీ. ఏనుజీవించియుండు కాలానప్రభునిఁ
గాంచఁ గాబోలుననుచుఁ దలంచియాస
లుడిగితిని గాని వినిరాశ లుడిగెజన్మ
సార్థకంబయ్యెనాథుఁడు జన్మమయ్యె

వైళంబ పయనమైపోవలయును. యీనక్షత్రమునాకు దారి జూపుచు ముందు నడచుచున్నది. (నిష్క్రమించును)

గొల్లలు ప్రవేశము

సీను–పురబాహ్యప్రదేశము

మొ : (మింటికిఁజూచుచు)
మిత్రమా! అదిగో చూడుము.

చం. పడఁతుక లెవ్వరో ధవళ వస్త్రములన్ ధరియించి యక్కడ
క్కడ నడయాడుచుండిరి బెడంగులుమీరగ నంబరంబు న
ల్గడలను గాంతిమంతమయి క్రాలుచునుండె నవీనలీలఁ గే
రడమగునో నిజంబగునొ గ్రాహ్యముగాదు వచింప మిత్రమా!

రెం : అక్కడక్కడచరించుటగాదు. మేఘపథంబున సందులేక దీపించు మెఱపు తీవియలట్లు పెక్కురు దృగ్గోచరమగుచున్నారు. వీరు కంజాక్షులఁబోలియుఁ గంజాక్షులుగాక, పురుషులఁబోలియుఁ బురుషులుగాక, ఱెక్కలు గలిగియుఁ బక్షులుగాక రమణీయ కాంతులు వెదఁజల్లుచుఁ గన్నులు మిఱుమిట్లు గొలుపు చుండిరి. ఓహో వీరిచక్కదనం బపూర్వముగానున్నది.

సీ. ఆననబింబంబు లంబుజాతంబులో! కన్నులుకలువలో! గండుమీలొ!
శారీరలతలు ప్రచలిత సౌదామినీ గణములో! నాసలు కాంచనములో!
కరములు పల్లవోత్కరములో! బాహువుల్కమలనాళంబులో! కరికరములో!!
పెదవులుమేలైన బింబంబులో కేశ బంధనంబులు మధుపములగములో!

తే.గీ. అంశుకంబులో! లేక చంద్రాతపములో!
నరులో! దేవతలో! వియచ్చరులో! కాక
భక్తజనములకీర్తి సంపదలు మాన
వాకృతులఁదాల్చె నొక్కొ! ఘనైకవృత్తి!

మొద : (ఆలించి) శ్రవణానందకరమై, హృద్యమై, వర్ణనాతీతమైన శబ్దమెద్దియో వినవచ్చుచున్నది సుమా, ఆలకింపుము.

మ. ఇది కంఠధ్వనియో! విపంచిరవమో యింద్రాంగనానూపురాం
గదమంజుక్వణనంబొ! నాకతటినీ కంజాతజాతాసవో
న్మదభృంగీనినదంబొ! దైవతపతంగధ్వానమో! యామినీ
మదదంతావళగండభాగపరిశుంభద్ఘంటికారావమో!

రెండ : వయస్యా! ఇదికేవల శబ్దమునుగాదు. గొప్ప భావములను సూచించు గానము. (కొంతతాళి) పలువిధములగు పాటలు వినవచ్చుచున్నవి. మరియు నందనేక వాద్యధ్వనులును వెలయుచున్నవి. ఈరాగములు స్వర్గసంబంధములై వర్ణింప వీలుగాకున్నవి.

మొద : దీనిని యోజింప నొకమహనీయుని జననమహోత్సవమును జాటుచున్నదని స్ఫుటమగుచున్నది. (పైకిజూచి) ఆసమూహమునుండి యొకవ్యక్తి దిగివచ్చు చున్నది. (భయమునభినయించి) అబ్బో! యీవెలుగు సహింపఁజాలము. ఇతడేమి యకృత్యమునకు బాల్పడునోగదా! అకటా! మనకెవ్వరు శరణము (అని రెండవవానిని గౌగిలించుకొనును)

రెండ : వయస్యా! భయపడకుము. మనకు దైవమేదిక్కు. ఈతడు దైవప్రేరితుఁడై యెటకో పోవుచున్నాడు. (కొంచెమాగి) ఆహా! యీవ్యక్తి యెంతశీఘ్రముగా మనలసమీపించినది.

(తెరలో)

చం. భయపడకండి మీకు శుభవార్తను దెచ్చితి గొల్లలార! ని
శ్చయమిది సంతసింపుడి నిశాకరతుల్య యశోవిలాసి దు
ర్ణయ తిమిరప్రభాకరుఁడ నారత సద్విభవోజ్వలుండు న
క్షయ కరుణాఢ్యుడిద్ధగుణశాలి ప్రభుం డుదయించె దక్షుడై

మొద : (ధైర్యమునవలంబించి) అన్నా, ఈవ్యక్తి యేమోవచించుచున్నది (ఆలింతురు) (తిరిగి పద్యము వినబడును)

వయస్యా యెవ్వడో లోకరక్షకుఁడు పుట్టియున్నాడట. అతడు పాపములను జెండివేయునట, ప్రభుండట.

మొద : నేను మొదటచెప్పలేదా? లేకున్న నిట్టియద్భుతప్రదర్శనము సంభవించునా?

ఉ. ఎందరు బుట్టుచుండరు మహీతలనాథులు కీర్తిమంతు లిం
కెందరు జన్మమెత్తరు యహీన పరాక్రమశాలురైన వా
రెందరు పృథ్వియందు నుదయింపరు కల్గునె యిట్టివింత యా
నందకరుండితం డఘవినాశకు డార్తశరణ్యుడఁయ్యేడిన్

యింతటి యఘనమూర్తిని దర్శింపని జన్మమేటికి?

రెండ : మిత్రమా, యీతఁడు సమీపించుకొలంది నాహృదయమున నెలకొనియున్న భయము లీనమగుచు నుత్సాహ మలముచున్నది.

మొద : అవును నాకును ధైర్యముకలిగినది,

(దూత ప్రవేశించును) పాట

గాబ్రి : మీకుశుభంబగును గాత (గొల్లలునమస్కరింతురు)

గాబ్రి : (దీవించి) గొల్లబోయులారా! బెత్లెహేమున రక్షకుడు మీ కొఱకుబుట్టియున్నాడు. ఆత్మస్వరూపియై మహిమతోననారతముఁ గోటానగోట్ల దూతలచే మ్రొక్కలందు భగవంతుఁడు దీనుఁడై నరావతారమెత్తి పశువుల తొట్టిలోఁబండబెట్టఁబడి యున్నాఁడు.

తే.గీ. పాపమను నగ్నిచే గాల్పఁ బడెడునరుల
హృదయములు చల్లబడియె సహింపరాని
యలుకఁదీండ్రించు దేవున కతులితంపు
శాంతిఘటియించె నీబిడ్డ జననమగుట

సీ. బంధింపబడియున్నఁ పరలోక రాజ్యంపు ద్వారము ల్తెరువంగఁ బడియెనిపుడు
ఆదాముచేదూరమైనదేవునియొక్క ఘనమైత్రి కిప్పుడు గతులుగలిగె
మదమెక్కి చరియించు మొదటిద్రాకోనుగుండెలుబ్రద్ధలౌటదిక్కులకుఁబారె
పెద్దకాలము గనిపెట్టుచునున్న భక్తుల జాండములకుఁగోర్కులుఫలించె

తే.గీ. ఎలమి నేదేనుతోటలో సృష్టికర్త
సర్పమునుగాంచిపెట్టిన శాపఫలము,
నేటికీడేరె యాదరణీయులగుట

ఆలసింపకుండు పోయి వీక్షింపుండు

మొద : అయ్యా! మేమెక్కడ కనుగొనంగలము

గాబ్రి–

ఉ. ఎక్కడకేగునప్పటికి యీరలు జూతురొయొక్కయింటి పైఁ
జుక్కవెలుంగుచుంట యొక జోటికుమారునిఁ బొత్తిగుడ్డలన్
జక్కగఁజుట్టుచున్ బసులశాలఁబరుండగఁజేయుచుంట మీ
రెక్కడ చూతురోయతఁడె యేసుఁడు తల్లియునాలతాంగియే!

ఇదే మీ కానవాలు నేనుపోయివచ్చెదను. (అని నిష్క్రమించును)

రెండ : ఆహా, మనమెంత పుణ్యులము ప్రభుని జననమునుగూర్చి యెరిగించుటకు దేవుని దూత మనకొఱకు చనుదెంచుటచే మనభాగ్యమునకు మేరగలదా? దైవమునకిట్టి యనురాగము పాపులమగు మనయందుఁ గలుగుట సర్వోత్కృష్టము.

మొద : వయస్యా, ఈశిశువునారసి మనమూరకుండరాదు,

కం. అనఘంబౌ సర్వేశ్వరు
జననంబును దర్శనంబు సర్వజనులకు
న్వినిపింప వలయుడెందము
లనువినుతి యొనర్పగావలయును వయస్యా!

రెండ : అవునుమనమికజాగు సేయరాదు. పురంబుఁగడుదూరమున నున్నది. సూర్యోదయమునకు పూర్వమీచిట్టడవిని దాటవలయును (సీనుదిరిగివచ్చి)

మొద : ఓహో తూర్పు రేఖలు తెల్లనయినవి పిట్టలుపీచుపీచుమనుచున్నవి. అదిగో; ప్రభువుదయించె నేనింక నిలువజాలనని మొగముమాడ్చుకొని పోవునారకాధిపతి కరణి నరుణోదయ మగునని తలచి.

చం. వెలుగులతేని పోకఁగని పెట్లనిశీథమునన్ గలంచు మ
మ్ములనిత డౌరనల్లనయి పోయెదునంచుఁ దలంచి మెల్లనన్
బిలములు దాటెనోయనగ విశ్వమునందొక వింతచీకటుల్
గలయగ చంద్రమండలము కాంతిఁదొఱంగెడిఁ బశ్చిమాద్రిపై

రెండ : బాగుగావర్ణించితివి. మిత్రమా! తూర్పునబారఁజూడుము

ఉ. తూరుపుకొండపైఁగలయదోచెడి వేడిమయూఖముల్ రయం
బారఁబయోజముల్ దళితమయ్యె శుభానిలముద్భవించెను
ద్ధారకుడుద్భవిల్లెనని తద్దయునెంతయుఁ గౌతుకంబునన్
మీరెడుభక్తరాడ్హృదయ నీరజసంతతికిన్ సమానమై

మొద : మిత్రమా! ఇదిచిట్టడవియయ్యె లతాకుడుంగములచేత సాంద్రమై నేత్రానంద ముఁ గొలుపుచున్నది. రాత్రియంతయు మన్మథుఁడు బాణములకైచిదిమి పనికిరామి విడిచి పోయెనోయన తరువులక్రిందపుష్పములు చిత్తుబిత్తుగా రాలియున్నవి. మరియు మనపదాఘాతరవమున బెదరి.

సీ. విడువక చంటిపాల్గుడుచుపిల్లలు వ్రేల పరుగులు వారు వానరచయంబు
అప్పుడప్పుడు జన్మమయ్యె తల్లులమించి పరుగెత్తు హరిణశాబక గణంబు
చిగురుటాకుల నట్టె సగముభుజించి శీఘ్రుతమింటికెగయు పికవ్రజంబు
పుక్కిళ్లఁబట్టిన పుష్పరసంబు భూమికి జారలేచు తుమ్మెదలకదుపు

తే.గీ. భువనరక్షణదక్షుండు బుడుతఁడగుచు
నుద్భవించుటఁ దెలిసి పోనుద్యమించి
గొల్లలకుమించి గమియింప జెల్లుననుచు
బారుచున్నవో! యని యెంతు భావమునను

రెండ : అవును జీవులన్నియు సంతసింపవలసిన సుదినంబుగదా

(నిష్క్రమింతురు)

# చిదానందప్రభాతము

## తృతీయాంకము

(ఒకసేవకునితో హేరోదు ప్రవేశించును)

సీను – సభాభవనము

హేరో : (భృత్యునిఁజీరి) సార్వభౌముఁడగు కైసరుని యాజ్ఞననుసరించి జనములు నివాసములకుఁ జనుచున్నారు గదా?

భృత్యు : దేవా! చిత్తము యిప్పటికి వారము దినములనుండి మార్గములు సందులేకు న్నవి. శకటములనెక్కి వచ్చువారును, కాలి నడకలఁ జనుదెంచువారును,

డోలికలనధిష్ఠించి వచ్చువారును, తురగారోహకులై యేతెంచువారును, గజములపై ప్రయాణము సలుపువారునునై జనంబులు దిగ్దేశములకుఁ బోవుచున్నారు.

హేరో : భళీ! ఈతేని రాజ్యపాలన మెంతవరకు వ్యాపించియున్నది. దేశములన్నియు నీధరాధినాధుని యాధిపత్యమునకు జిక్కియున్నవి గదా! యింతటి సామ్రాజ్యము రాజనామమును ధరించియున్న నాకునుఁ గొంతకలిగియుంట నేను ధన్యుఁడనైతిని.

శా. నాయాజ్ఞన్ జవదాటువాఁడొకఁడుఁ గానన్ రాదు చర్చింపఁగా
దాయల్గల్గరు నాకుభూపతులు శాంతంబైన నాపాలనం
బా యింద్రాదులకేని శక్యమగునే యత్యద్భుతంబైన యా
దాయంబెందునుఁగల్గునే వసుధ భృత్యా! నాకు సాదృశ్యమై!

రణకోవిదుండనగు నాకుసములైన రాజులు వార్ధివలయిత భూమండలంబున నెందయినఁగలరా! నాభావమునకు వ్యతిరిక్తకార్యముండియున్న శిశువుల నేనియు నతికించి కోర్కెనీడేర్చుకొందును. దయయు, గరుణయు నట్టి విషయంబున నాయందు నివసించుటకు వీలుండదు.

సేవ : రాజా! నిక్కము వక్కాణించితిరి.

హేరో : (చింతనభినయించి) సేవకా! హఠాద్గతి నాహృదయమున నేదోభయము నెలకొని శరీరముకంపింపఁ జేయుచున్నది.

పాట

తే.గీ. ఉర్విపైనెవ్వడో దైవ ముద్భవించి
రాజనామంబుఁదాల్చి దుర్భరముగాగఁ
గలతపెట్టినమాడ్కి నకారణముగ
వణకుచున్నది నాదేహవల్లి భృత్య!

యెన్నడు లేని యీక్షోభకుఁ గారణమేమైయుండును?

భృత్య : రాజా! భయఁపడవలదు. అప్పుడప్పుడు శరీరదౌర్బల్యమును బట్టి మేనులువడఁకుచుండును. యిందులభయంబువలదు. (నేపథ్యమువంకదిరిగి) యీతనికి సంభవించిన మనోవైకల్యము నారయ నెవ్వఁడో మహాత్ముఁడు పుట్టినట్లున్నది యింతడంబమా! యింతగర్వమా! తన్నుఁదాను బొగడుకొనుచు నెదురులేక త్రుళ్లుచున్న వీనికిట్టి యపశకునములు గాక శుభశకునములగునా,

తే.గీ. దీప్తివెలుగొందుచుండెడు దీపకళిక
మలగుటకుముందు భగ్గున మండునటుల
మరణభూమికి డాసెడు మానవునకు
ముందుగా గర్వబీజము ల్బుట్టుచుండు

(తెరలో)

రాజా! మీదర్శనార్థమెవ్వరో ద్వారమున వేచియున్నారు

హేరో : శీఘ్రము ప్రవేశపెట్టుము (జ్ఞానులు ప్రవేశించి) (వంగి సలాములు సేతురు)

హేరో : మీరెవ్వరు?

మొద-జ్ఞా: భూపతీంద్రా! మేముజ్ఞానులము, బహుదూరము నుండివచ్చితిమి.

హేరో : మీరాక కేమిహేతువు.

రెండ-జ్ఞా : యూదుల రాజుగాపుట్టిన వానినారయుటకు

మూడ-జ్ఞా : మహీశా! అతడెక్కడనున్నవాడు!

హేరో : (ఉలికిపడి) ఔరా! యెంతచిత్రము. నామనఃక్షోభమను ననలంబుజ్ఞానుల వాక్యానిలంబునఁబ్రజ్వరిల్లి మరింతయుడికించుచున్నది. యేమీ! యూదుల రాజు పుట్టెనా! యెక్కడ పుట్టియున్నాడు. నాకన్న నింకరాజెవ్వఁడు (ఆగ్రహచిత్తుఁడై)

(పాట-ఔరా) (కొంతతాళి) వీరుపొరబడిరి కాబోలు యూదులకు రాజైన హేరోదుఁడెక్కడనని యడుగఁబోయి యిట్లని యుందురు. వేగిరపడక నిమ్మళముగా తెలిసికొనియెదగాక. (ప్రకాశముగా) జ్ఞానులారా! యూదుల రాజెవ్వడందురా. కాకనొకఁడు పుట్టెనందురా! (జ్ఞానులొండొరుల మొకములు జూచుకొని)

మూడ-జ్ఞా : అధిపా! కాదుకాదు. యూదులకు రాజుగా పుట్టిన వాఁడెక్కడ. అదిగో తూర్పునఁ బరికింపుఁడు.

సీ. తనకాంతిజాలంబు వనజాప్తమండలంబునకు బెట్టిదఁపు సిగ్గునుఘటింప
తన ఘనోదయము పద్మవనికిఁ గుముద వనంబునకునుఁ దత్త రంబుఁగొలుప
తనచలచ్చలనంబుఁ గనుఁగొన్న భక్తసంతతులకు మునుముందు దారిఁజూప
తన మండలంబు విస్తరిలి ప్రాకుచుఁబోయి యాకాశమార్గంబు నావరింప

తే.గీ. తన ఘనంబైనవర్తులత్వంబునాక
భామినీకర్ణకుండల ద్వందములతొ
స్పర్ధవహియింప నంబర పథమునందుఁ
గ్రమతదీపించు నదిగొనక్షత్రమొకటి

మేమీ నక్షత్రమును తూర్పునఁజూచి ప్రవక్తలు మున్ను ప్రవచించిన ఱేడుద్భవించెనని వచ్చియుంటిమి

హేరో : ఔరా! యీతనిజన్మమునుగూర్చి ప్రవక్తలువచించిరా! (సేవకునిఁజూచి) నీవుపోయి మన యాస్థానపండితులను పిలుచుకొనిరమ్ము.

(ఇద్దరు గ్రంథములుపట్టుకొని రంగము ప్రవేశింతురు).

హేరో : (కూర్చుండ నియమించి) పండితులారా, యెవ్వండోరాజు జన్మించెనని తూర్పున నక్షత్రము పుట్టియున్నదట. ఇది, ప్రవక్తలును ప్రవచించిరట. మీరును గ్రంథములను విప్పి నిజమును దెలుపుడు.

(పండితులు గ్రంథములు విప్పిచూచి)

పండి : లోకరక్షకుఁడును యూదుల రాజగువాఁడు పుట్టును. తూర్పున నక్షత్రము పుట్టుటయే యానవాలు (అని చదివెదరు)

హేరో : (కోపము నభినయించి) (తనలో) వీని నిప్పుడే సంహరించుట సమంజసము. యెచ్చట బుట్టియున్నవాడో కనుఁగొనవలయును. (ప్రకాశముగా) జ్ఞానులారా.

చం. పుడమి నరేంద్రుఁడొక్కరుఁడు పుట్టుట నా కెరిగించితీరు యె
క్కడ జనియించెనో యెరిగి క్రమ్మర నాకునుఁ దెల్పినట్టిచో
తడయక నేగుదెంతు వసుధాతలనాథుని జన్మమన్న నె
వ్వఁడు మదిసంతసింపఁడు ధృవంబుగనెవ్వఁడు మ్రొక్కకుండెడిన్.

ఆహా! మీరు నాకావిషయము నెఱిగించి యెంతమేలు జేసితిరి. మీకు నేనేమి బహుమానమీయవలెనో తెలియకున్నది. మరల నా కెఱిగించినచో మిమ్మూరక పంపరాదు.

రెండ : జగదీశ్వరా! మీబహుమానములు మాకువద్దు. మీయాదరణంబును మాకవసరములేదు. మీరడుగుటఁజేసి తిరిగివచ్చి యెరిగింతుము. మాకింక సెలవిండు. పోవలయును.

హేరో : శీఘ్రము పోయిరండు. మీకొరకెదురు చూచుచుందును సుమా! (అని

జ్ఞానులు : చిత్తము

హేరో : భృత్యా, యీజ్ఞానులు తిరిగివత్తురా

సేవ : దేవా! అదెట్లుచెప్పగలను.

హేరో : రాకున్న చేయవలసినదేమి?

సేన : మీచిత్తము.

హేరో : ఔరా! రారుగా! అట్లయిన ఫలముననుభవింతురు.

సేన : రాజా! మీయాగ్రహానలంబునకు మేరగలదా?

హేరో : సరే విచారింతము. (నిష్క్రమించును)

సేవ : (నేపథ్యమువంక దిరిగి) నేను తలంచినంత జరిగినది. యీబాలుని జన్మమున లోకరక్షణమే కలిగినను, యీదుష్టరాజుచే లోకశిక్షణయే కలుగకమానదు. యెంత ఘోరముగానున్నదోయని భయమగుచున్నది. (నిష్క్రమించును)

(తెరలో) జోలపాట

మరి : తండ్రీ! పోరుబెట్టకుము. నన్ను ధన్యురాలినిగావింపcబుట్టితివా! నీ పరమ సింహాసనముకన్న నీయల్పురాలి యంకభాగము నీకు సౌఖ్యప్రదముగా గన్పట్టినదా? తండ్రీ, యేసుప్రభూ! నీ మోము చంద్రునిcజూచినంతనే నాయాకలి దప్పులు దీరినవి.

ఉ. ధీవినుతప్రభావ భవదీయ దయామతినాదు చంటిపా
ల్ద్రావగ జన్మమెత్తితివె తండ్రి! పసుల్వసియించుశాలలో
నీవుపరుంటcగాంచ ధరణీతలి నెవ్వనిగుండె నీరమై
పోవదు? సృష్టికర్తవుc బ్రభుండవు చెల్లునె యిట్టి చెయ్దముల్

నాయనా! యీపేదతికముతో నిన్నెట్లుభరింపcగలను. నిన్నెట్లు బెంపవలయునో తెలియకున్నది. అకటా నాకు నెడతెగని విషాదమును బెట్టితివా పాపినగునేను, నీకుతల్లి నని యెట్లుపిలుపించుకొనcగలను. తండ్రీ నీయాత్మ స్వరూపమును జూపి, నాకిప్పుడే ధైర్యముc గలుగcజేయుము.

సీ. పటుకర్కతరములీ పశువులశాలలు విమలంపుc బరమ సౌధములెనీకు
గబ్బుకంపులనీను కసవుదిబ్బలపిండు యమలరత్నవితర్దికములెనీకు
అలిగిఅంకెలుబెట్టు నాలపోతులగము ల్లోలతగొల్చువేలుపులెనీకు
కణతుపిదములు లోకపుదుగదారలు లలితంపుజీవజలములెనీకు

తే.గీ. కఠినపాపాభిభూత దుష్కరధరిత్రి
ఘనతమీరెదునాక లోకంబెనీకు
గురుమలీమసములు పొత్తిగుడ్డలౌర
శాశ్వతానందమహిమ వస్త్రములె తండ్రి

(తెరలో) పాట

హే! లోకరక్షకా! హే సజ్జనావనదక్షా! హే యేసుప్రభూ! పాపులము, నీదృష్టి యందల్పులము, మమ్మునుమన్నింపుము, మన్నింపుమునాథా! నీమహిమనేత్రములతో మావంకఁజూడుము. మా వందనముల నవధరింపుము.

(గొల్లలుప్రవేశించి నమస్కరించి)

ఒక గొల్ల : హే శతకోటి మార్తాండసదృశ తేజోవిరాజా

తే.గీ. కలరుభక్తులునిన్నుర్విఁ గొలుచువార
లెందరో వారిపాదారవిందరజము
బోలనటువంటిమమ్మును ముదముతోడఁ
గాచిరక్షింపవేదేవ! కరుణఁజూపి

రెండ–గొల్ల : (మరియమ్మతో) అమ్మా! ఈపుత్రునిఁ గాంచిన నీవును సామాన్యవు గావు నీకీర్తి కేకొలంతయును గల్గనేరదు. దూతలునీకు పరిచారికలై సహాయము సేయగలరు. పేదఱికమున నుంటివని చింతింపకుము.

మూడ–గొల్ల : పతివ్రతా, యిదిపసులశాలగాఁదలంపకుము మోక్ష గృహము

(జ్ఞానులును, యోసేపు ప్రవేశింతురు)

(జ్ఞానులు నమస్కరింతురు)

మొద–జ్ఞా :(విచారముతో) కట్టా! యీభగవంతునకు సంభవింప వలసిన కష్టమా యిది.

సీ. దివ్యపీఠమునందు తేజరిల్లెడు వాఁడు పశువులపాకలోఁ బండవలసె
సృష్టికిమూలమై చెలువారు దేవుండు సృష్టిచేఁ గష్టము జెందవలసె
దేవాది దేవుండు దిక్కుఁగాగలవాఁడు దిక్కులేక ధరిత్రి దిరుగవలసె
జగతికి తండ్రియై నెగడుచుండెడువాఁడు తండ్రిగా నొకనరు న్దలఁపవలసె

తే.గీ. జీవజలములచేఁదృప్తి జెందువాఁడు
పతితజలములు ద్రావఁ బాల్పడఁగవలసె
కటకటా! పాపిలోకమా కరుణ లేక

హో! దుర్భరము, దుర్భరము

మొద : సీ.

తారనారసి మున్ను తత్తరంబొందిన యుల్లమీనాటికి చల్లబడియె

రెండ : భయదాటవులలోన బడిన కష్టములన్ని ప్రభువ! యీనాటికి పాసిపోయె

మూడ : జగదేకనాథుండు జన్మించునని మున్ను పలికిన వచనముల్ ఫలితమయ్యె

గొల్ల : దిక్కులేక ధరిత్రి దిరుగాడుపాపుల కీనాడు సిద్ధించె నింద్రపదవి

యోసే : తే.గీ. నీప్రభావంబుఁగానక నేను తప్పుఁ

జేసియున్నాడ నన్ను శిక్షింపకయ్య

మరి : నిన్ను పుత్రునిగాఁగాంచి నెగడుచున్న

కన్నియను దోషమనక రక్షణము నీవె

జ్ఞానులు – పాట

మొద : సీ.

కన్నడసేయకు మన్న నిన్నుభజించు పతితులమొరలకు ఫలములిడక

రెండ : భూపాలవంద్య నీ భువనైకమహిమా ప్రభావంబునెన్న నెవ్వరికితరము

మొద : మోహనమూర్తివై పొలఁతి మేరీగర్భమునఁబుట్టినావె మమ్ములను గావ

గొల్ల : కల్యాణ కల్య సంకల్పంబులగు కరచ్ఛాయలుమామీద జల్లుమనఘ

గొల్ల : తే.గీ. తోడి దూతలమహిమకుఁ దుల్యులనుచు

మమ్ముఁగరుణించి నీదు రాజ్యమ్ము నీవె!

యోసే : దేవగాంధారిసుస్వర దివ్యగాన

ముల నుతించెద మశ్రాంతమునుయెహోవ!

(యెల్లరు నమస్కరించి యేకగ్రీవముతో)

తండ్రీ! మాకింకసెలవిమ్ము పోయివచ్చెదము యీ పాపులమరువక, నీకడగంటి చూపులఁ బ్రసరింపఁజేసి లోకాంతమున నీస్వర్గమునఁ జేర్చుకొనుము.

(తెరలో)

జ్ఞానులారా! హేరోదుయొద్దకుఁ బోవలదు, అతఁడు దుర్మార్గుడు. బాలునిపై నసూయాపరవశుఁడై యున్నవాఁడు. శీఘ్రముగా మారుదారిని పురమును దాటిపొండు. మీకుదోడుగా నిదిగో నేను వచ్చుచున్నాను (నిష్క్రమించును)

## హేరోదు కోర్టు

హేరో : (తనలో) ఈజ్ఞానులింకను రాక తక్కుటకు హేతువేమి. నా యందు వీరికేమో సంశయము కలిగియున్నది. అసూయాజనకంబులగు వాక్యములనాడి యుండనుగదా (విచారించి) వీరురాకున్ననేమి. యీతనిఁ గనుగొనుటెంతపని.

ఉ. నాకువిరోధియై ధరణి నాథుఁడొకండుదయించి నిల్చునే
లోకమునందు వీనిని ఖలున్ గులహీనుని సంహరింపఁగా
నాకు నశక్యమౌనె! కరుణారహితంబగు నాదుఖడ్గ ద
ర్వీకర మిట్టితుచ్ఛపు ధరిత్రితలేంద్రుల మ్రింగదెందరిన్

ఈ జ్ఞానులు స్వార్థపరాయణులై వారికార్యమును జక్కపెట్టుకొని నన్ను మఱచి యుండిరి కాబోలు, నేనెంతయోఖండితముగా జెప్పితినిగదా! వారు నావాక్యములు పాటిసేయకున్నట్లు తోచుచున్నది. (కోపమునభినయించి) ఓరోరి! జ్ఞానులారా! మీరు పురంబునుదాటి యుంటిరో లేదో తెలిసినదికాదు. లేకున్న హేరోదు మిమ్మూరక విడిచిపుచ్చడని యెఱుంగుడు (యోజించి) ఇప్పుడు సేయవలసినదేమి? నారాజ్యమునంద లి పసిపిల్లల నెల్లరిని జంపించినఁగాని యీ బాలుఁడు మరణింపఁడు. ఆహా! మంచియు పాయమును బన్నితిని (ప్రకాశముగా) ఓరీ! యెవఁడురా! అక్కడ! (సేవకుడు వచ్చి)

సేవ : దేవా! యేమియాజ్ఞ.

హేరో : నీవుపోయి దయాదాక్షిణ్య రహితులగు నిద్దరు భటులను బిలుచుకొని రమ్ము.

సేవ : చిత్తము (అని నిష్క్రమించును)

(భటులు ప్రవేశించి నమస్కరింతురు)

హేరో : మీరు పురము ప్రవేశించి

సీ. జోలపాటలచేత చొక్కి యుయ్యేలలందు నలసి నిద్రించుచున్నట్టివారి
నిద్రమేల్కొనితల్లినింజూచి పాలకై యాకొని యేడ్చుచున్నట్టివారి
తల్లిచన్నులపూరి ద్రావితృప్తినిఁ జెంది యలరివ్రేల్జీకుచున్నట్టివారి
జనునినిఁ గనిపెట్టుకొని సమీపమ్మున నలయక దోగాడునట్టివారి

తే.గీ. రెండు సంవత్సరంబులు నిండనట్టి
వయసుగలిగిన బిడ్డల బట్టికరుణ
నెంతమాత్రముఁజూపక యెగుర వేసి
నటికివేయుడు రెండు ఖండములు గాగ

(పాట, సంవాదము)

మొద-భ : (రెండవవానితో) ఎంతదుష్కృతమునకుఁ బాల్పడవలసి వచ్చినది. చంటి బిడ్డలను సంహరించుట కెంతకఠినాత్ముఁడైనను సాహసించునా! యింత పాపమెందైనఁగలదా?

చం. బుడుతలు నోరెఱుంగరు ప్రఫుల్లమనస్కులు తప్పటడ్గులే
సెడు కసుగందులెక్కరణి జెండగ నయ్యెడిఁ జేతులాడునే
కడయిడరాని శోకమున గాల్లపయింబడు తల్లిదండ్రులన్
గడుసరి ద్రోసివేయుటకు గా! హృదయంబది సమ్మతించునే!

ఉ. వచ్చియురానిమాటలను బల్కుచు ఱొమ్మునఁజేర్చి ప్రేమ పా
లిచ్చెడు మాతృసంతతికి నెంతయు మోదము నించు పాపలన్
మచ్చటు లాసిధారఁ గృప మాలివధించి కటా! కఠోరమౌ
చిచ్చును బెట్టఁ జెల్లునె? యి సీ!తలిదండ్రుల కన్నకడ్పులన్

రెండ : మిత్రమా! నీవింతజాలిగలవాఁ డవయినఁ తొలుత నేలరావలయును?

మొద : యీ విషయమని తెలియదుగదా?

రెండ : రాజాజ్ఞ యయినది. అదెట్టికార్యమైనను నిర్వహింపక వీలులేదు.

మొద : అయ్యో! నీహృదయము పాషాణమో! వజ్రమో తెలియకున్నది. పసిబిడ్డలం జంపుట కింతసాహసమా!

రెండ : ఓహో, తెలిసినది, తెలిసినది. నీతో వాదమేల నేను పోయెదను (అని నిష్క్ర మించును)

మొద : పోయినఁబోనిమ్ము రాజుగారు నాకు మరణదండన విధియించినను సరే నేనీకార్యమొనరింపను. (అని వెళ్ళిపోవును).

(యోసేపు ప్రవేశించును)

యోసేపు: ఆహా! యీనిశీథమెంత భయంకరముగానున్నది. నరుని మనంబునావరించు, శోకమట్లీచీకటి బ్రహ్మాండమునావరించి విరాజిల్లుచున్నది. మరియు, మింటదీ పించు నగణితములగు తారకాతతులు నాకు దేవుని మహిమంబును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నవి. భగవద్ధ్యానమునకు రాత్రికన్నను నిర్మలమగు సమయమున్నదా (చేతులు జోడించి)

చం.	ఒకనికి సౌఖ్యజీవనము నొక్కనికిన్ గడలేని బాధ వే
రొకనికిసంతసంబును మరొక్కనికిన్ గడుదుఃఖమున్ శుభా
త్మక! భవదీయ చాతురిఁ గ్రమంబుగఁగూర్చుచు జీవకోటిమా
నక భువినేలు నిన్నెఱుఁగ నావశమేఁ తలపోయరక్షకా!

నరున కేసమయంబున నెట్టివిపత్తు సంభవించునో యెఱుంగజాలఁడు. మరియు నేవేళ నెచ్చటకుఁ బోవలయునోయన్నియు దైవనిర్ణయములై యుండును.

(గాబ్రియేలు ప్రవేశించి)

గాబ్రి : ఔనౌను. నీవు నిప్పుడు పరదేశమునకుఁ బోవలసియున్నది.

యోసే : (తనలో) ఆహా! నేనుతలంచిన విషయమిప్పుడే స్థిరపడినది. (నమస్కరించి) అయ్యో! యెక్కడకుబోవలయును.

గాబ్రి : ఐగుప్తుకు బోవలసియున్నది. దుర్మార్గుఁడగు హేరోదు బాలుని జంపనుద్యమించుచున్నాడు. ఆలసింపక శిశువును భార్యను వెంటబెట్టుకొని ప్రస్థానమును గావింపుము. లేకున్న పాపనికి ముప్పువాటిల్లును, నడువుము, నీకు ముందు నేను వచ్చుచున్నాడను.

యోసే : చిత్తము

(అవనికపడును)

సమాప్తము

దేవగాంధారి	1. స్తుతి పాటలు	చాప్‌తాళము

మరాళీ సమప్రభాళీ! కలితయశోళీ! యఘతమోహేళీ! భక్తాళి! సన్మృణాళి! ।మరా।
అతికరుణా! తతభరణా! యరివిదారణా
యస్మన్మతోద్ధారణోదారచిత్తంబునన్ నిల్వవేనేడు ।మరా।

కమాచి	2 రాగము	ఏకతాళము

ఎపుడు నీయానతిన్ నడువగానెంతుము మేరీశాబకమా ॥యె॥
కోపగింపకుము పాపమెన్నకుము దాపునన్ నిలిచికాపాడు ॥యె॥
నీపదాబ్జంపు తేనియసోనలాని మత్తిల్లఁజింతింతుమో చింతింపకుందుమో
నీ కరుణారసపూరితైక వీక్షణములన్ నిలుపకుండిన హా! మాకుదిక్కుగలదే పరమపితా!
యీ కాయములనిత్యములు లోకసుఖంబులు నిలువము హే భయద శిల్వమృత్యునాశకా!
ప్రకాశకా!
మానుతులుగైకొనవే మమునేలవె మహితసుఖములీవె ॥యె॥

ముఖారి	3 గాబ్రియేలు మరియమ్మ సంవాదము పాట	ఆటతాళము

గాబ్రి : గగనమంతా నిండియున్నాదే! భూగగనమంతా నిండియున్నాదే! జగములకు విభుఁడు సర్వప్రభుండు ॥గగ॥

మరి : అయ్యా! జగమునందున జన్మమెత్తిన మగువలకుశక్యంబే దేవుని ఘనతరం బుగ గర్భమునఁదాల్ప భావముననిల్పి ధైర్యంబుఁగొల్పి యల్పురాలికినుత్తరం బిమ్మి!

గాబ్రి : అమ్మా!సృష్టికర్తకు శక్యమౌనుగదా! యుఁత్కృష్టమై గడుఁగష్టమైనన్ నష్టమేల దనర్చునిందుముఖీ!

మరి : అయ్యా! ప్రభువునానతిపై విరుద్ధ ప్రలాపములు మ×××××
కును శుభములబ్బ గరంబునిల్పగదే భక్తాధినాథా!×××××
రోధీ! యబలనౌటఁదలంచి కావగదే!

గాబ్రి : అమ్మా! నీకుదీవెనలిచ్చెదైవంబు! మన్నించెమున్నే శోభాకరుండా! శ్రీకరునకీవిష్ట రాలవికన్

హిందుస్థానితోడి | 4 యోసేపుపాట | ఏకతాళము.

అకటకటా! నేనధముండనీచుడ వికలస్వాంతుండ వెడంగుండ జడమతి! శుకవాణికి నాకును
సంగమసౌఖ్యకలన గలుగదు కలుగదు కలుగదు

యెవ్వనిచేతికి జవ్వనిజిక్కెనొ నివ్వటిగర్భంబద్భుతగతి క్రొవ్వుననే నీ కోమలియెడ
మిక్కుటమగునను రాగంబునిల్పితిని యేకాలంబున కేమిఘటిల్లునో యెవ్వం
డెఱుంగు మహీతలమునను శోకమయ్యె నయ్యోకరుణాకర యేకరణిని
సహింతుఁ దలంతును ॥అక॥

బ్యాండు స్వరము | 5 హేరోదుపాట | చతుశ్రగతి.

ఔరౌరా! నేరాజునుండ వేరేరాజుదయంబయ్యెనుగా

యీ కరవాలంబునకు వానినే నెరగావింపక విడచెదనా!

అతిభయంకరుండను కరుణారహితుండ నభేద్యబలుండ మహో

ద్ధతరూపుండ పరాక్రమోన్నతుడ నాహవదోహల చిత్తుండన్

ఆహా! సహింతు రేమహీపతి సమూహమీకఠోరవాక్యము

చుక్కఁజూడ నెక్కసముగ దిక్కులందుదీపించెడి ॥ఔ॥

బ్యాండు స్వరము | 6 యోసేపు పాట | చతుశ్రగతి

ఓరి! జడమతీ! కలుషమతీ! నుగుణవతీలలామమున్ జెఱతువుగా

క్రూరకార్యమని తలంపవో మదంబునన్ మీరితి ॥ఓరి॥

అనదల పాడుసేయ నెంచితివి యతివలకు సిగ్గునించితివి

జనపతి పాలనమున కొచ్చెముఁ గలిగించితివిమూఢ

యింత పాపమా! యింతఘోరమా! యింతసాహసమ ॥ఓరి॥

బేహాగ్ | 7 జ్ఞానులపాట | ఏకతాలము

ఔరా యేమిమహాత్మ్యము నక్షత్రము, ప్రభావధుర్యము

తారలుబుట్టవె నీరదపథమున యీ రామణీయమే తారలకు గలదు పుట్టిన చోటున

హిందూస్థానిముఖారి 8 యాసేపు పాట ఏకతాళము.

పోవుచున్నాడే! యంబుదపథంబున ॥పో॥

సేవకభక్తరాజీవముల మధువుఁ జేకొని చనుబంభరమును దెదడుచు ॥పో॥

కేవలపరిశుద్ధుఁడితఁడు దైవమునకు సారథియట! యీవసుంధరా రక్షకుని వెంట తోడి
తెచ్చి విడిచిమగిడి ॥పో॥

శహన 9 గొల్లలపాట ఆదితాళము

అదేపరికింపుము సురవర్త్మంబునఁ బొడసూపుచునున్నారు కాంతిస్థిరవైభవులై ॥అదే॥

కరములయందున్ ధరియించిరి తంబురలువీణియలన్ రాణింపంగన్ ॥అదే॥

బారువ 10 గొల్లలరణ్యమునఁ బాడుపాట ఆదితాళము

ఆహా! వనీతలంబు సౌఖ్యప్రదంబు

దివ్య ప్రసూనాభిశోభితపథంబు

శుకపికవిసరంబుల్ బకహంసఖగంబుల్

ఔరా! సకలమృగచయంబుల్ బహుళంబుల్లతాతతులు ॥ఆహా॥

ఫీలు 11 గాబ్రియేలు పాట ఏకతాళము

భీతిల్లకుడీ! తెలిపెదనొకవిషయమ్మునమ్మి ॥భీతి॥

భూతలనాథులకు నాథుఁ డాతతగుణశాలి సముద్ధృత దోషకరి

వ్రాతుఁడు జన్మించెనింక ॥భీతి॥

కడచెలొకమునకు దుఃఖ కరకాలోద్ధతభయంబు

విడిచెమహీతల వైరివివిధహృదయావాసవృత్తి

నడువుఁడు నడువుఁడు రక్షణ వడయుడు వడవడయుడు

బ్యాండు స్వరము 12 యోసేపుపాట చతుశ్రగతి

ఇసీ యెంతకార్యమొనరించితివే "పంతంగించినాతో" సంతసించుచున్నాఁడటంచుఁ
గొండంత పరాభవమున ముంతువె చీ ॥యెంత॥

బుద్ధిమంతుడవుఁ పుణ్యపురుషుఁడవు పూవుబోఁడి యట్టిదియె వివాహంబొదు
మంచుఁ బెద్దలు వచియింపఁగ శ్రద్ధతోడ నాలించినాఁడ దుర్బుద్ధి దలంచితివా
మదించి హా! యికన్నీదునెత్తిపైనిఁ బెట్టుకొని యేలుకొమ్ము నాథునిన్ సర్వమా
॥యెంత॥

బేహాగ్ 13 జ్ఞానులు ఆదితాళము

కృపాస్వరూపా! ప్రేమామయా! దైవరాయా
మాపాపభరములకైపుట్టితివెనాథ ॥కృపా॥
హే సర్వప్రపంచసంస్తుతోదయా చిన్మయా
నినుఁగనిసంతసమున మునిఁగియున్న మమ్మును గరుణించి దయను గురియింపఁగదే
॥కృపా॥

బేహాగ్ 14 హేరోదు ఏకతాళము.

కలతగల్గెడిన్మనో కమలంబున నధికంబుగ యేమిసంభవించెడి నో ॥కల॥
తనువునఁజెమ్మటలుమించెఁ దత్తరపాటుదయించె
ఆత్మభయంబునుగాంచెడి నరయకారణంబుడదు ॥కల॥
జగమంతయురోదన ధ్వనులతోనిండిన కరణి నగుపడుచున్నది
వినబోవగవినిపింపదు రావము ॥కల॥

స్వరము 15 భటుల సంవాదము చతుశ్రగతి

మొ : ఓ సఖుఁడ జాగుసేయ నేలనింక తరలుమా తరలుమా
రెండ : ఈ కఠినకార్యమెట్లుసేయఁ జెల్లెడిని చెపుమా!
నీకును బిడ్డలులేరా! మానవజన్మముగాదో?
పాపభీతి లేదా దురాత్మ
మొ : భూపునానయైనది సూ!

రెండ : భూపుఁడైననేమి వానిఁపై పతియైయున్న నేమి!

యీపనికే నోపుదునే చాలుపోర దుర్మదాంధుడా యేలనన్ను శోధించెదవునీ చుఁ

డా నామనము సమ్మతించునె

ముఖారి 16 యోసేపుపాట ఏకతాళము

హే! దయానిధీ! పాలింపవేకృపన్ లేదుశరణ మీదీనునకు

పేదటికంబయయో! తరియింతుమె! హా! దేవనిన్ను గుమారునిగా గాంచి

యేవేళకునేవైఖరితో విలసిల్లుదువో తండ్రి సేవకుఁడెఱుగంగఁజాలునేవసుధాతలజీవి

సేవఁజేతు నావనింపవేరా ననుఁ దప్పుజూడకఖిలాఘౌఘప్రముఖారి ॥హే॥

కన్నడ 17 జ్ఞానులు మరియమ్మ, యేసేపుపాట ఏకతాళము

మొ : అనఘా! మమ్ముగావ! నరిగినాడనా! భువికి

నిన్నుఁగాంచిసంతసము! నిండిపారెమదిని

రెండ : కరుణాపయోనిధీఁశుభాంగ కన్నులెత్తిచూడవే!

మూడ : పరమవాసము పాపికన్యకు పాపనిగా జనియింపజే××× నాపాపము

మరి : కట్టా! నేనేరీతిగా బెంతునుతండ్రి యెట్టులభరింతురాపు×××

ఓసుగుణోదయ! బుధజననుత కావుకావుమా.

యోసే : ఆహా! దైవమా! నామొరాలింపుమా!

చక్రవాకము 18 భటునిపాట ఏకతాళము

అరరే! నీవే రాననిపల్కుట! కతిచిత్రంబయ్యె!

కతిచిత్రంబయ్యేన్

భటుడిటులాడున్ దలపగన్ యీపతియానవినన్ యెందరినీగతి ఖండింపలేదో!
యెంతటిదోషముఁ గావింపలేదో యీవునెఱుంగవొకో! భయమతీ!
యీవునెఱుంగవొకో సేవకుండవుగాదో ప్రభునిచే జీవించుటలేదో!

॥అర॥

బారువ 19 హేరోదు పాట ఆదితాళము

భూతలంబున భూపులుగలరే! భూపులుగలరేనాతోపాటిఘనులు ఖండితానేక వైరి వ్రజంబు

ఘనరాజ్యభారంబు నిశాతకౌక్షేయంబు యతిభయంకర రౌద్రాకారంబుగల్గు వారలు వందిమాగధప్రజాభినందితప్రభావుండ ॥భూత॥

దేవగాంధారి 20 దేవగాంధారి ఏకతాళము

దేవా! సుధీనుతప్రభావా! దివ్యదయాభావా! నిత్యామోదవిరావా కలుషములు హరింపధరణి కవతరించినట్టి శ్రీ వరకృపాకఖర కర తనూజిత నిశాకరప్రభో

హేభక్తలోకకల్ప మహామహీజాతా శాశ్వతానందదాతా

రక్షింపవే! ప్రేమనీక్షింపవేమమ్ముపేక్షింపకే దేవగాంధారివినుతా ॥దేవా॥

# భారత మహాశయుల కొౕక విజ్ఞాపనము.

ఆర్యసోదరులారా, “కుశలవోపాఖ్యాన”మను నీ చిన్నిగ్రంథమును నేను వ్రాయబూను కొనుట నాశక్తికి మించిన పనియైనను మన్మిత్రులగు వారిప్రోత్సాహమున దీనిని క్లుప్తముగారచించి ‘శీతాంశోరమృతార్పణం’బనునట్లు భాషాయోషకొౕక స్వల్పభూషణముగా నొసంగితిని. వచన కావ్యములను వ్రాయుటయందు నాకాదరణ తక్కువగుటం జేసియు విశేషించి నాకిది ప్రథమోద్యమం బగుటను నవలాపండితులకిందు దోషము లసంఖ్యాకములుగాఁ దోపక మానవు. గ్రంథము నందలి సమాసములను భావములను గ్రహించకున్నను ప్రాచీన కవియగు వేంకటకృష్ణప్పనాయక ప్రణీతంబైన వచనకావ్య జైమినిభారత మామూలాగ్రము నేను బఠించు టంబట్టి నాకొౕక విధమగు నుత్సాహము నానందమునుఁ గలిగి నాయత్నమునకింత సహాయపడినది. మరియు నిందలిసమాసములును కథయును ‘వాణి నారాణి’ యని వచించి సాల్వగుండ నృసింహభూపాలునిచే బహూకృతుల నంది నిరర్గళ గంగాప్రవాహమునకీడగు ధారణా పటిమంబుఁ గలిగి పేరెన్నికఁ గన్న పిల్లలమఱ్ఱి పిన వీరభద్రకవి రచించిన జైమిని భారతమునందలి శ్రీరామచరిత్రనుండి మిక్కిలిగా గ్రహించి మరి కొంత కథను కంకంటి పాపరాజుకవి రచితంబగు నుత్తర రామాయణము నుండి పుచ్చుకొని యక్కడక్కడ వర్ణనా సౌష్టవమునుగలిగించి యేతత్కథ పద్యకావ్యమునం దాదరణ తక్కువగు వారికి సహాయకరముగా సీతాదేవి రసాతలమునకుఁ బోవువరకు రచించితిని. ముఖ్యముగా నీగ్రంథమునుఁ బఠించు స్త్రీజనంబులకు నీతిదాయకము గాక మానదని నాతలంపు. ఉభయ భాషాప్రవీణులగు మహానుభావులకు నాయుద్యమంబు నవ్వును గలిగించినను పుత్రవాత్సల్యమును జూపి దోషములను మన్నించి నాకు ప్రోత్సాహమునుఁ గలిగింతురని ప్రార్థించుచున్నవాడ.

సీ. సర్వశాస్త్రములు బొజ్జలనిండ దిగద్రావి “బ్రేవు బ్రేవు” మటంచుఁ ద్రేపువారు
కావ్యకన్యక నూడిగపుకత్తెగా జేసికొని యుపకృతులందు కొనెడువారు
అరచేత గానవిద్యానీరధినిగాంచి “గుటుకు గుటుక్కు”న గ్రోలువారు
వ్యాసునిగెల్వఁ బోవగనెంచి కాలంబు మించెరా యని సకిలించువారు

తే.గీ. ఖడ్గవాదంబు సేయుదుష్కరగజముల
పయికి సింగంపుఁబిల్లలై పరగువారు
నిర్మలాంతరంగముల మన్నింపకున్న
ఘనసభాంతరంబున దిక్కు గలదెనాకు!

సీ. రసనభాగమునధీరత(బహ్మరాణికి నిరతదాసీత్వంబు నిర్ణయించి
జయకాంక్షవేదము ల్జదువుకాంచన గర్భు పద్మపీఠమునకు బారcదోలి
సమయంబుసేసి సప్తములరాయనిగెల్చి అమితభూభరణ కృత్యము విధించి
జతనిల్వ నేర్పుcగాంచబడు బృహస్పతియంచు అనిమిషగురుకార్యమునుఘటించి

తే.గీ. కావ్యకన్యక నంకభాగమునcదాల్చి
ప్రౌఢిcజెన్నారు ఘనకవి బ్రహ్మలకును
అస్మదభివందనంబుల నతిముదమునc
జల్లువాడను మంగళాక్షతలుగాగ

సీ. అభిమాన మిసుమంత యైన లేకుండిన వట్టిసలాములు గొట్టువారి
ముఖమున మన్నించి మోము ద్రిప్పినమాత్ర ఇంచుకనాల్క సారించువారి
కవితారసజ్ఞత కలుగకుండియు నెందు పరులమెప్పుకు తప్పుబట్టువారి
ఎదిరించి వాదింప బెదిరి మ్రుచ్చులరీతి జెలగి కొండియములు జెప్పువారి

తే.గీ. పరులమంచికి సంతోష పడకచిత్త
మెరియ నొంటరిగా మూతి విరచువారి
అఖిలలోకాధి నాథుcడు నాదిదేవు
డుర్వి నాపాలబడనీయ కుండుగాక

ఉ. అర్థ మెఱుంగజాలక మహారసవత్తరమైన గ్రంథము
ల్వ్యర్థము లంచు నెంచి యిదియా? కవితం బొకచోటనేని కం
దార్థము రాగముల్ గలుగ వంచు వచించెడివారి గోష్ఠికిన్
ప్రార్థనcజేతు నాకు గనరాక తొలంగుటకై నిరంతమున్

ఇట్లు బుధజనవిధేయుcడు
జి. జాషువ

# కుశలవోపాఖ్యానము

మొదటి భాగము

తండ్రి పంపునఁ బదునాలుగేండ్లు శ్రీరాముఁ డరణ్యావాసము సలిపి, కదన రంగమున, రావణకుంభకర్ణాది కుటిలరాక్షసులఁదునుమాడి, అగ్నిముఖమున జానకిఁ జేపట్టి లక్ష్మణవిభీషణ సుగ్రీవ జాంబవత్ప్రముఖులు గొల్చి రా నయోధ్యఁజొచ్చి పురజనులెదుర్కొనఁ దేరుడిగ్గి వసిష్ఠునకు సాష్టాంగ వందనం బాచరించి జనయిత్రులగు కౌసల్య కైకేయి సుమిత్రాదులకు మ్రొక్కి యనుజన్ములగు భరతశత్రుఘ్నుల భుజాంతరముల నుంచుకొని సుమంతప్రముఖులగు నమాత్యులకును, బంధువర్గమునకును, సముచిత ప్రియభాషణముల హృదయసంతాపముల నుడుగఁజేసి, మహేంద్ర వైభవమున సింహాసనం బధిష్ఠించి, పరిపాలించు సమయంబున, భర్తృవియోగచింతచే శుష్క శరీరయై, పుత్రుని యరణ్యావాసంబున జీవచ్ఛవంబయైయున్న కౌసల్యాదేవి, రఘునాథునిఁ గౌగలించుకొని గద్గద కంఠియై, అన్నారాఘవ, వసిష్ఠాదిమునులు, నీపుత్రుడప్రమేయుఁడు నక్షరుఁ డవిచ్ఛిన్నుండు మహానుభావుండు. ఈతని కతంబున నీవు ధన్యవైతివి. నీజన్మంబు సార్థకం బయ్యె నని మును వచింప విశ్వసింపనైతిని నాయనా! ఆవాక్యంబులు నేటితో నిక్కువంబులయ్యె విశ్వసించితి ననుచు చిరకాల వియోగమున దుఃఖంబును, కుమారుని దర్శనముచే నానందము నొక్కసారి పెనఁగొన భరింపలేకున్న తల్లికి మ్రొక్కి తన కరణ్యావాసము కతంబున, లభింపఁబోవు సత్యవాక్య పరిపాలనాలబ్ధ గౌరవంబును నైహికాముష్మిక ప్రసంగంబులఁ గావించి దుఃఖోపశమనంబుఁ జేసి సుఖంబుగఁ గాలముఁ గడుపుచుండె. జగద్విఖ్యాతమగు రామరాజ్యమును వర్ణింప నేరితరము. శ్రీరాముని రాకఁగాంచి యాకాశవధూటి యానంద బాష్పములు గురియింపు చున్నదో యన నెలకు మూడువానలు గురిసె. ధేనువులు సన్నవిసి పిదికె. భూకాంత పతిరాకఁ దలంచి నవ్యమాల్యాంబర భూషణభూషితాంగి యయ్యెనో యన సస్యసమృద్ధి వెలసె. భీతిఁగొని జారచోరకులు విరమించిరి. పొలతుల వైధవ్యములు దొలంగె. తల్లిదండ్రులు పుత్రశోకమును జూడరైరి. నెలవులేక దరిద్ర దేవత హరిదంతముల గుహాంతర్భాగములదాగె. ప్రాణికోటి నిరామయస్థితి వహించె. దుర్భిక్షపరుగులిడం జొచ్చె! లోకములానందించె. దేవతలభినందించిరి. ఇట్లు కువలయానంద కరమగు రామ రాజ్యమున కేకొఱంతయు లేకుండెను.

శైశవక్రియల నొప్పుబాలురే చింతలేకుండినను సంసారసాగరంబును దరింపలేక నిరంతరమును విచారించు గృహమేధింబోలి శ్రీరామునకు మట్టుకు "నాపుత్రస్య లోకోస్తి" యను స్మృతినిబట్టి మనో దుఃఖము లేకపోలేదు. లోకమునందు మానవునకు సుఖదుఃఖములు చిరకాలము నట్లేయుండవు. ప్రకృతిననుసరించి చూచిన నీవిషయము బాగుగా తేటపడును. వృక్షములకు వసంతాగమమట్లు సుఖంబును గ్రీష్మమట్లు దుఃఖంబును మానవుని వెన్నాడి

తిరుగుచు దైవ నిర్ణీతములై యుండును. దశరథనందనుండగు శ్రీరామునకీదుఃఖము బహుకాలముండక సద్గుణగరిష్ఠుండును, జగదభిరాముండగు రాముని కాంతార వాసములచే శుష్కింపఁజేయుట చాలక సంతానరహితు నొనర్చి మరిమరి దుఃఖింపఁజేయు టనుచితంబని కరుణించి కష్టములు కొంతకాలము విడువఁదలంచి పారిపోయెనోయన సీతాదేవి కచిరకాలమునచే ప్రథమగర్భము నిలిచి సంతోషితాంతరంగు నొనరించె;

ఒకనాడు శ్రీరాముఁడు తన శయన గృహంబున మృదుశయ్యపై నిశీథమున నిద్రించుచుండ, నవనీజాతను గంగాతీరమున విడువఁబంచినట్లు కలగని దిగ్గనలేచి, గుండియ తటతటఁ గొట్టుకొన మేను తీవియగదల, భయాభ్రాంత చేతస్కుఁడై కారణమారయఁ జాలక మనంబుపరిపరి విధంబులఁబోవగుందుచు నిదురింపనొల్లక యారాత్రి నిముసమొక బ్రహ్మ కల్పంబుగాఁ గడపి ప్రత్యూషమున సంధ్యావందనం బాచరించి, గురుండగువసిష్ఠునిఁ బిలువఁబంచి తానర్ధనిశీథమునఁ గన్నస్వప్నమును వివరింప, వరిష్ఠ తపోగరిష్ఠుండగు వసిష్ఠుండు యోజించి సీతాగర్భ రక్షణార్థమాదుస్వప్న దోషముతొలంగునట్లొక యజ్ఞంబుచేయ వలయునని యాజ్ఞాపించుటయు, మహాప్రసాదంబని శ్రీరాముఁడు లక్ష్మణునిఁబంపి మిధిలేశుండగు జనకుని రప్పించి కనకసోపాన శృంగాటకముచే నుజ్వలంబగు మణిమంటపము నిర్మింప, సుముహూర్త మున వసిష్ఠుండు సీతారాములనందుంచి పుణ్యాహమైన పిదప నాజ్యతిలలతో జయహోమ మాచరించి పృధివీజాతయు, సద్గుణోపేతయునగు సీతాదేవి ధమ్మిల్ల బంధంబునందొక సూత్రవేష్టనం బమరించి, గోధూమయజ్ఞాంగమాలికా యుగళంబుగళంబునందుంచె. పిమ్మట రఘువరుండు భేరీకాహళ నినాదంబులు దిక్కులు పిక్కటిల్లఁజెలంగ సాధుశ్రేణి, పరమాన్నంబున సంతుష్టాంతరంగుల నొనరించి, గజముల, గుఱ్ఱముల, నగ్రహారములఁ రత్నముల దానమొనరించె, అంత జనకుండ పరిమితానందంబంది తన రాజ్యం బెల్ల శ్రీరామున కర్పణమొనరించి గౌతమమునితో వనంబులకుఁ జనియె. దాశరథియు సమస్త మనోదుఃఖరహితుఁడై భువినిఁ బాలింపఁదొడఁగె.

కాంతారవాసులగు భిల్లులకు పట్టణవాస్తవ్యమును, జనపదవాసులై మహదైశ్వర్యములచే నంతఃపురంబుల నివసించు భోగులకు వనవాసాభిలాషయు నప్పుడప్పు డంకురించుచుండును. ఇట్లుదయించు కాంక్షలన్నియు మానవునకుఁ గొనసాగుట దుస్సాధ్యము. ధనహీనులై యనాగరికులగు నడవిజనుల కైశ్వర్య జీవనప్రాప్తి లభింపకున్నను, భాగ్యశాలురగు వారి మనోభీష్టంబు లొకతీరునఁ గొనసాగుచుండును. అట్టియాశాబీజంబు జనకజయం దుద్భవించినదై పూర్ణముగాఁ గొన్న సాగియు మనోవ్యధాకరణంబయ్యె.

విమలగుణ సాంద్రుండగు రాఘవేంద్రుఁడొకనాడు తనయర్ధాంగియగు సీతాల తాంగితో శుద్ధాంతంబున నుండి సరసాలాప విలాసక్రీడా పరతంత్రుఁడైయుండ జానకి వినయ వినమితోత్తమాంగయై యంజలి ఘటియించి, వల్లభా! నామదియందు నొక వాంఛింతంబువొడ

మినది యేమనఁ దొల్లిటియట్లు తాపస్వినులతో స్వర్ణదీతటాంచల భూములయందు వనంబులఁ గ్రొద్దులుపుచ్చఁ దలంతుననుటయు, రఘువరుండాత్మవదరి తానుగన్న దుస్స్వప్నదోషంబునకు వనిత గోరినకోర్కె గాఁదలంచి. మనోవైకల్యముఁదోపనీక కొంతయోజించి నిశ్చితాత్ముఁడై సీతదిక్కుఁజూచి, ప్రేయసీ! నీయభిమతంబు సేయఁదలంచితిని యెల్లి సౌమిత్రితోఁ బయనమైపోవునది యని వచించి యభ్యంతరమందిరంబు విడిచి సభామందిరంబు సొచ్చి సీతతలఁపు జ్ఞప్తికిఁ దెచ్చుకొని బహుభంగుల యోజించుచు నారాత్రి గడపి ప్రభాతమునఁ జారులఁ బిలువఁబంచి సీతాపునర్గ్రహణంబునఁ బౌరులేమి తలంచు చుండిరో యెరింగిరండని పంపి వారిరాకకై ప్రతీక్షించుచుండెను. గూఢచారులు పురంబుఁ బ్రవేశించి వృత్తాంతంబు నారసి తిరిగి వచ్చి కన్నీరు జొటజొటరాల నినకులేశ్వరునిఁ గాంచి నోట మాటరాక నిలుచుండిరి. అంత రాము డాచారుల విధంబుఁ బరిశీలించి. చారులారా! సత్యముఁ బలుకుడు వెఱువకుడు. వేగిరింపుఁడని వచించుటయు నందొక దూత విషణ్ణవదనుఁడై డగ్గుత్తికతో నిట్లని వాక్రుచ్చె. దేవా! నీవు సాక్షాద్విష్ణుండవు. సీత లోకపావని, మీదాంపత్యము వర్ణనీయము. మీనామోచ్చారణ నఘంబులు బారు. యశంబులు మీరు. యిట్టి మిమ్ముఁ దూలనాడిన దురాత్ముని దుర్భాషల నేలినవారితో వక్కాణింప నోరాడకున్నదని కన్నీరు వఱదలైపార నేడువదొడఁగె.

నరునిహృదయం బనవరతము సుఖంబును, ఘనంబును, సంతోషంబును గోరునదై పాలవెల్లువంబోలి నానాముఖములకుఁ బరువెత్తుచు కష్టదుఃఖములకుఁ జిక్కకుండుటకు బహువిధములఁ బ్రయాసపడుచుండును. విధివశంబున సంభవించు చిలుగులనెంతటి వాఁ డేనియు భరింపవలయును గదా? ఆత్మ హితాహితంబుల నొరులచే నెఱుగవలసి వచ్చినప్పుడు శీఘ్రముగా తెలిసికొనువఱకు హృదయమెంతయో యాతుర పడుచుండును. అట్లు చారుని సందిగ్ధ భాషణంబులచే హెచ్చరించఁబడి శ్రీరాముని హృదయపద్మంబు పవనవేగమున కన్నను వేగమునుదాల్చినదై యాతురపడఁ బీఠమునుండి లేచి సేవకా వైళంబ నివేదింపుము ఆలసింపకుమని బిగ్గరగా వచించుటయు సేవకుండు చెప్పక విధిలేదని నిశ్చయించుకొని యిట్లని చెప్పఁదొడగె స్వామీ! మీయానగైకొని యేము ప్రచ్ఛన్న వృత్తిఁ బట్టణంబుసొచ్చి పలువురి సంభాషణంబు లాలించితిమి కాని యెందును నేయపవాదంబును వినిన వారము కాము. తుదకు నొకచోట చాకివాని గుడిసెకలదు. దానికనతి దూరమున నిలిచిన నిమేషమున నొకవృద్ధుఁడగు మడివేలు తనకూతును వెంటగొని కుటీరమునకు రానమ్ముదుసలి జామాతపండ్లు పటపటఁ గొఱకుచు బడియ చేతఁబట్టుకొని రుద్రునిమాడ్కి బయటికివచ్చి మామనవలోకించి కన్నుల నుండి యగ్నికణంబులురాల నోరీ! మూర్ఖా! వృద్ధుఁడవయ్యును బుద్ధినీకు లేశంబునులేదు. నేటికి నాల్గుదినంబుల క్రింద నిల్లువెడలిపోయిన యానీచురాలిని వెంటగొని తిరుగనాతో సంసారముఁజేయింప నెంచివచ్చితివా? ఛీ!ఛీ! పొమ్ము సమస్తజనుల వస్త్రములను శుద్ధిఁగావించు సద్వంశమునకుఁ గళంకముఁదే నుద్దేశించితే నీవు. దనుజ

గృహీతయగు సీతను దిరుగదెచ్చుకొని యేలుచున్న రాముండననుకొంటివే. యని తిరస్కరింప నతఁడు తలవంచుకొని కూతుఁగొంచుఁ జనియె. మహాత్మా! యీ విషయము నారసి కటకటా! జగత్పావనియగు సీతామహాదేవికిని మీకును దుఃఖమును దెచ్చిపెట్టి లోకగర్హితులమగు చున్నవారమని వచించుటయు నిర్హేతుకముగా నింత కాలయాపనమేల యొనర్చితినని తలంచితీవ్రగమనంబునఁ జనుదెంచి హఠాద్గతి నొక్కసారిగా శోకదేవత శ్రీరాముని హృదయ వీధిపై వ్రాలెనో యన పిడుగుపాటున కీడగు నయ్యపవాదంబుతేనిశ్రవణపుటంబులం భేదించుకొని లోనికిఁ జొచ్చి మనోఫలకంబును శతధాభిన్నంబులొనర్ప శ్రీరాముండు హా! యని మూర్ఛిల్లి నేలకొఱగె.

రాజులయైశ్వర్యభోగంబులెంత యుత్కృష్టములో సంభవించు కష్టములు నంత దుర్భరములై యుండు. ఆహా, విధియెంత నిర్దయుఁడు, జనకుని మరణంబునేనియుఁ జూడఁ బ్రాప్తిఁగల్గించక తొల్లి పదునాలుగేండ్లరణ్యముల నిడుమలపాలొనరించియు నంతఁదనివిదీరక సీతా వియోగమును దెచ్చిపెట్టిదానితో విరమించక రావణుని శక్తిచే లక్ష్మణుని మూర్ఛితుం గావించి కడలేని దుఃఖంబునెత్తిపై నునిచి శోషిల్లఁజేసియు జాలిగొనక కష్టములు గడచి నిజరాజ్యంబేలు కొనుచు సుఖించుచుండె నౌరా! వీనినింతటితోఁ బోవనిచ్చెదనాయని తిరుగనిట్టిదుస్సహతరమగు నపవాదకుంతంబునుఁ దాల్చి తలంచునప్పుడెల్ల నిరంతరము గ్రచ్చుటుచితంబని కాబోలు పరబాధాసహిష్టుండగు రామునకీ దుర్దశఁగావించుట. మూర్ఛపోయిన రఘువరుండు కొంతసేపటికి ప్రాణఁదెచ్చుకొని బాష్పపూరిత నేత్రుండై శోకానల దందహ్యమానమానసుండై నిలుకడలేక పొరలిపొరలి వచ్చుదుఃఖము నాపుకొనలేక ఒక్కొక్కతరి బిగ్గరగా నేడ్చుచునేడువజాలక మదిలోనఁగుళ్లుచు, ధైర్యంబు వహించుచు, వహింపజాలక యాత్మహత్యఁజేసికొన బోవుచు, దైన్యము పూనుచు దీర్ఘశ్వాసంబు విడచుచు విడువలేక పీఠముపైఁ బొరలుచు నిశ్చలత్వము వహించుచు వహింపలేక చలించుచు, నులికి పడుచు, హాహాకారంబులు సేయుచు తన జన్మమును నిందించుకొనుచు భక్తితో భగవధ్యాన మొనరించుచు లేచినిలువఁబోయి కాలు రాక కూలఁబడుచు నిట్లు చిత్రగతుల నారాత్రితెల్లవారు దనుక శ్రీరాముండు భూతలనారకవ్యధా భారమును తరించుచుండె.

తూరుపురేఖలు తెల్లనాయె. చల్లనిగాడ్పులు వీచె కాకులు గూయసాగె. జగములు మేల్కొనియె, మన్మథుడు విటీవిటుల వేచివేచి యలసి తన విల్లెక్కుడించె. జలజపాణులు నిజమంజీరధ్వనులెసఁగ భాండంబులు పూనినదులకుఁబోసాగిరి. అంత కాలమను పురుషుఁ డాకాశమను యుద్ధభూమి నావరించిన చీకటులబలంబుల పై విడుచు శతఘ్నినుండి యెఱ్ఱగా గ్రాగి తొలుదొలుత బయలువెడలి వచ్చు భయంకరమగు నిప్పుముద్దయోయన పూర్వపర్వతశిఖర భాగమున భానుడుద్భూతమయ్యె.

అంతనగ్రజుని దర్శింప సముచితాంబరములను దాల్చి లక్ష్మణ భరతశత్రుఘ్ను లేతెంచి

దీర్ఘదుఃఖభారముచే నవ తోత్తమాంగుఁడై జాగరారుణలోచనుండై కన్నీటిధారలచేఁ గమలి యొఱ్ఱనైయున్న చెక్కిలిజంటచేఁ జూపరుల గుండియ లవియఁజేయు దుస్థితినొప్పునగ్రజన్మునిఁ గని నివ్వెరపాటుఁజెంది వినూతన లీల రక్తమాంసములచే మానవస్వరూపమున విశ్వకర్మచే నిర్మింపఁబడిన వెఱబొమ్మలోయనఁ జేష్టలుదక్కి నిలుచుండిరి. రామభద్రుఁడనుజన్ముల ముఖావ లోకనం బొనరించి, కంఠమెత్తి యేదువఁబోయి మరలనది కోపముగా మార్చుకొని దుఃఖక్రోధ స్ఫుటితములగు గంభీరాలాపముల నిట్లనియె. అనుజులారా! వినుఁడు. మీ కగ్రజన్మునియందు భక్తిగలదేని, సత్యవ్రతంబును మరువరేని, శ్రీరాముఁడు మీతో జీవింపఁ గోరితిరేని, మనతండ్రి కిని వంశమునకునుఁ గీర్తిఁదేఁదలంతురేని యేను నుదువఁబోవు వాక్యముల ననుసరింపుడు. కాదేని మీరు ముప్పురు నొక్కసారి ఖడ్గములఁబూని నాకంఠమును ముత్తునియలు గావింపుడని వచియింప నాపల్కులు కర్ణకఠోరములై, హృదయభేద్యములై, జీవములతో దహించు పంచాగ్ను లై తోపకారణ మారయఁజాలక యెన్నడులేని యిట్టి వాక్యము లగ్రజుఁడేల వచించునోయను సంశయంబును, భయంబును, దుఃఖంబు నొక్కసారి మనంబు నావరింప కన్నీరు జొటజొట గార వ్రేళులఁ జిమ్ముకొనుచునుండ నంత లక్ష్మణుం డెలుగెత్తి అన్నా! రాఘవ! యేల యీలీల సందిగ్ధవచనంబుల మమ్ము దుఃఖపెట్టెదరు? మాయందు గాని సీతాజగన్మాతయందుఁగాని దోషమేమైనఁగలదా? జనన మాదిగ నీపదపద్మముల నాశ్రయించి తిరుగు మానవ బంభరము లట్లు చరించు తమ్ములముగదా? పదునాలుగేండ్లు కాంతారముల నిన్నుఁగొలిచి పదరాని యిడుమలంబడిన లక్ష్మణుండఁగానో నేను, అన్నా! యని శోకించుచు వెదకుచు దండకాటవి నున్న మిమ్ముఁజేరి బహుభంగులవగచి నీపాదుకలు శిరంబునదాల్చికొంచు వచ్చి తత్సహాయమున నింతదనుక రాజ్యపాలనం బొనరించిన భరతుండుగాడో యితఁడు. నీసమస్త ప్రభావంబు నెఱింగి నిశ్చలతవహించి మనంబున నిన్నుఁ బూజించుచుఁ గాలముగడపిన శత్రుఘ్నుండు గాడోయితఁడు. యినకులతిలకా నీకు మతిభ్రమ యైనదాయేమి. మీరింత చింతాక్రాంతవదనులై యుండవలసినంత భారమేమి సంభవించె? భక్తలోక భ్రమరంబులకు నానందకరమగు భవన్ముఖాంబురుహం బేల దుఃఖభాజనమయ్యె? నీలమేఘచ్ఛాయ నీసడించు మీ శరీరంబు స్వేదజలావృతమై కాంతిరహితమై యుంటకెద్దిగతము? విశ్వవిఖ్యాత యశోధురంధర యగు భూజాతంగాని, మిమ్ముగాని యెవ్వండేనియు నిందసేయడు గదా? అట్లయినవాఁడు పదునాల్గు భువనంబులకుఁ బారినను భూమ్యాకాశములు తలక్రిందయినను, పర్వతములు శిథిలీభూతమందినను, సముద్రంబులింకినను, బాడబానలంబు చల్లబడినను, తరుణుండు శైత్యతవహించినను, లోకము లల్లాడినను, ఆ బ్రహ్మగాని, యా సురవైరిగాని, యయ్యమరవిభుఁడుగాని, యాబృహస్పతిగాని, యా శేషఫణి గాని నా ఖడ్గధారచే ఖండీభూతుఁడు గాక మానడు. మహాత్మా! వచింపుడు, వచింపుడని క్రోధ ఘూర్ణమానమానసుండై పల్కుటయు, భరత శత్రుఘ్నులును ఖడ్గములఁ బూని తీవ్రపడఁజొచ్చిరి.

శ్రీరాముని హృదయధామంబు సౌమిత్రివాక్యములచే నీషదానంద కందళితమై యపవాదజాత దుఃఖంబు నొక్కింత డిందుపరచె. తమ్ములకుఁ దనయందుఁ గల భక్తిభావంబుల నెఱింగి గర్వపడవలసిన వాఁడయ్యును, భావిభార్యావియోగదుఃఖంబును దలంచి తనజన్మమే నిరర్థకమని నిశ్చయించుకొని సమస్తానందములకును దూరపఱచుకొనిన వాఁడయ్యె. మనుజుని జీవితమునందు పుత్రకళత్రములతో సంసార సుఖంబు ననుభవించుటయే మహోత్కృష్టము, అదిలేని వాఁడు మనుపీనుగుగాని వేరుకాదు. దారసుతులపైఁ బ్రవర్ధితములగుచున్న మోహవల్లుల నొక్కసారిగాఁ ద్రెంచుకొనుట కెట్టి పాషాణ హృదయమున కేనియు నవిలంఘనీయము.

అట్లుండఁ బరమశాంతమున కాలవాలమై, కరుణారసంబున కాధారమై, నిష్కళంక ప్రేమానిధానమైన శ్రీరాముని హృదయపంకేరుహంబు నిజభార్యానిషేధంబున కీయకొనక యెంతబాధ నందు చుండెనో, యప్పటికా రఘువరునకుఁ గాక నలువకేనియు నెఱుగ రాదు.

సహనమునందు రామునకెనయైన వాఁడు ముల్లోకంబులలేడనుట నిర్వివాదాంశము. అపవాదభారంబును సహింపని వాఁడై, యర్థాంగి పైఁగల యనురాగాతిశయంబు నధోలోకము నకుఁ ద్రొక్కినవాఁడై నిజభార్యాపరిత్యాగంబే సమంజసంబని నిశ్చయించుకొని తమ్ములబారజూచి తమ్ములారా! మీరెంతటి కార్యంబేనియుఁ గొనసాగింపఁగల సమర్థులరగుట నాకును లోకమునకును విదితంబు. మీయందిట్టి సామర్థ్యముండియు నాయిచ్ఛఁగొన సాగించుట యందసమర్థులరయ్యెద రనుట నిక్కవంబు. యేలయన మీకిది మీరినకార్యంబు. ఐనను మీరిప్పట్టున నాయానతి ననుసరించి యిదిమీకు దుఃఖభాజనమై, హృదయదారుణ మేయైనను కొనసాగింపక తీరదు. లక్ష్మణా! పురవైరియు, బ్రహ్మయు నిరపరాధులు.

ఆ నీప్రయత్నమిప్పటి నాయుద్యమంబున కూతగా నొసంగితివేని నిరంతరాయముగఁ గొనసాగుననుటయు భరత లక్ష్మణుల హృదయంబు లెన్నియో తలంచుటచే నిజమెఱుంగఁ జాలక శత్రుఘ్నునివంకఁజూడ నాతండగ్రజునిఁజీరి సంగతి నెఱుంగ హృదయము లాతురపడు చున్నవి. మీవదనారవిందంబు నరయ దుఃఖ మతిశయించుచున్నది. వాక్యములను వినుచుండ గుండియ లవియుచున్నవి. మమ్మీ వాక్యములచేత గృశింపఁజేయక శీఘ్రమె వచింపుడు దాచకుఁడనుటయు రఘుకుల వారిధిసోముండగు రాముండు కాలవిలంబన మొనరింపరాదని అనుజులారా! వినుడు "దనుజగృహీతయగు సీతను విమోహియై శ్రీరాముండు గొనివచ్చి యేలుచున్న వాడని" లోకులాడు నపవాదంబు నా హృదయ వీధిఁ బ్రద్దలుగావించినది. ఇంకసహింపఁజాల. మానము పోయిన మీదట ప్రాణమేల ధరింపవలె! తమ్ములారా! మీకింక వదిన లేదు. మీ రెవ్వరికిని మఱందులుగారు. భూజాత స్వప్నదర్శనఁపు మానవ వ్యక్తి. దశరథున కగ్రసంభవుండగు రాముఁడు బ్రహ్మచారి. నిర్భాగ్యుఁడు. కౌసల్యాదేవికిఁ గోడలులేదు. జనకునకు జామాతంగానని కఠినముగా వచించునప్పుడు లక్ష్మణ భరత

శత్రుఘ్నుల శ్రోత్రపుటంబులు బ్రద్దలయ్యె, మేను తీవియలు వణకె. స్వేదజలంబు రోమరోమంబు నను బొడసూపె. సభామండపమునందే పదార్థమును బొడసూపదాయె. యెందుఁజూచిన జనకజయే గన్పట్టె. కన్నీరులోడిక గట్టినట్టు గారదొడఁగె. పదంబులు స్తంభీభూతములయ్యె. నిశ్వాసమువెచ్చనాయె. ఆహా! యిదియంతయుఁ బవిత్ర చరిత్రయునప్రమేయప్రభాభాస మానయగు సీతాదేవిపై మఱందులకుఁ గల భక్తి నైపుణ్యముననేగదా? ఇట్టి దశలోనాభవనంబు కొంతవఱకు నిశ్శబ్దమై రామలక్ష్మణ భరత శత్రుఘ్నుల మనోదుఃఖమునకు సహింపఁజాలక మొగము మాడ్చు కొనెనో యనఁ గాంతిరహితమై సూపట్టె. శ్రీరాముని సింహాసనము నందలి వజ్రపంక్తి విభుని కృష్ణశరీర ఛ్ఛాయచే నసితరూపమును దాల్చి సీతావియోగదుఃఖమును దలంచివనరుచుండెనో యనం జూపరులకుఁ దోచుచుండె. ఇన్ని విషయంబులు నేతత్కాల విచారము నభివృద్ధిఁ బొందించుచున్నను గొంతవడికి సౌమిత్రి ధైర్యమును దెచ్చుకొని, అగ్రజునారసి అన్నా! నీవు ధర్మాధర్మ విదుండవు. పరబాధా సహిష్టుండవు. రాజనీతి విశారదుండవు. కరుణామయుండవు. నీవెఱుంగని విషయంబును, నీవెఱుంగని ధర్మంబునులేదు. మీమహిమా ప్రభావంబున కీషన్మాత్రుండనగు నాహితోపదేశం బొందాలింప వేడుకొనియెద.

అజ్ఞుల వాక్యంబులను పాటిఁజేసి నిజభార్యయు విశేషించి నిండు చూలాలియు, పరమ పతివ్రతామణియునగు సీతా మహాసాధ్వీరత్నమును బరిత్యజింపరాదు. ఆయమ కల్మషచిత్తయైనఁ గరుణారహితుండై సమీపించు ప్రతి పదార్థమును భస్మీభూతముఁగావించు నగ్ని దేవుఁడేల దహింపక విడుచువాఁడు, అమేయచరిత్రులగు బృందారకులేల సాక్ష్యముల నిచ్చువారు. ఇన్నియును మీరు కన్నులారఁ గాంచియే యుందురు. సీత లోకపావని యని మీరెఱింగియు నిప్పుడిట్టి యపవాదభీతిచే విడనాడఁజూడు టెంతవిచారకరము. కుక్కకూతకు సింగంబు వెఱువనేల? బుద్ధిహీనుఁడు తన కార్యములన్నియు సద్ధర్మంబు లనియు, నొరుల కృత్యంబు లధర్మంబులనియు దలచి నోటికి వచ్చినట్లు ప్రేలుచుండు నంతమాత్రముననే సజ్జను లాతని దుష్కృతముల నాచరింపరుగదా? అగ్రజా, యోచింపుము. ఇంత తెగువఁ బూనకుము. మమ్ములను, బంధువర్గములను, పరమసాధ్వియగు, పృధివీజాతను దుఃఖసముద్రమునఁ బడఁ ద్రోసి మీరు నీదుఃఖవారిధిఁ బడఁబోకుడు. రక్షింపుడు రక్షింపుడని వచింప భరత శత్రుఘ్నులు నన్నపాదముల పైఁబడి లక్ష్మణుని ప్రార్థన ననుసరించి దుఃఖముఖులై దీనముతో మొఱఁ బెట్టుకొనిరి.

అనుపమాన దయాస్వరూపియైన శ్రీరాముని హృదయంబు తమ్ముల ప్రార్థనంబు నంగీకరింప వలసినదయ్యు జనాపవాదంబు తీక్ష్ణమై యుంటచే నప్పటి కీయకొన బహుభంగుల కష్టపడవలసినదయ్యె. పిమ్మట రాఘవేంద్రుఁడు తమ్ముల నారసి తమ్ములారా! మీకు వదినపైఁ గల యనురాగాతి శయంబునకుఁ జిక్కినవారై యిట్లు పల్కు చుంటిరి. వైశ్వానరుండు దహింప కయే విడుచుగాక, సీత లోకపావని యగుట నిక్కువంబేయగుగాక, సురలు మతించియే

యుం(డుగాక, సమయమునుబట్టి విడనాడకతప్పదు. యీయపవాదంబు నాచెవులు సోకినదాది నన్ను జీవములతో దహించుచున్నది. పల్కు వారజ్ఞులు గానీ తజ్ఞులుగానీ మీ హితోపదేశములతో నాకుఁబనిలేదు. సీతపై మీకనురాగమున్న రాముని విసర్జింపుడు. లేక రాముని పైనున్న సీతను విసర్జింపుడు. వేయిమాటలేల రామునకిక సీతలేదు. సీతకింక రాముండు లేడు. నాయాజ్ఞకు బద్ధులై నేను చెప్పునట్లు గావింపుడు కాదేని నేను బోయెద సీతాసహితులై రాజ్యభారమును వహింపుడని పీఠమునుండి లేచిపోవు రామునిఁ గైదండఁ బూని యనుజత్రయంబు వారింప లక్ష్మణుండశ్రుధారాపూరితలోచనుండై యగ్రజా! మాపైనింత యాగ్రహంబేల? శరీరమునకుత్త మాంగంబునుబోలు మదగ్రజులగు మీరు వోవమాకేల జీవనంబు? ఏలరాజ్యంబు? భోగంబులేల? జనకునిమరణానంతరమున మాప్రాణంబులకు ప్రాణంబవై దేహములకు దేహంబవై, నేత్రములకు నేత్రమవై, యైశ్వర్యములకు నిధివైపోషించు చుంటివి. నేడేలతెగువఁ దాల్చితివో తెలియఁజాలవని వచియించు తమ్మునిమాట కడ్డువచ్చి రాఘవమానవేంద్రుండు కంఠమెత్తి, భరతా! లక్ష్మణా! శత్రుఘ్నా! వినుడు. యెల్లి ప్రభాతమునఁ బయనమై సీతను వెంటగొని గంగాతీరమున విడిచి రావలయును లేకున్న మీరు నాకు దమ్ములుగారు. రాముండు లేడని ఖండితముగా వచింప భరతలక్ష్మణ శత్రుఘ్నులు హా! యని కర్ణంబులు మూసికొని దిక్కుదోచక నిలువ రాముండు లక్ష్మణుంజీరి యీకార్యమును నీవే కొనసాగింపుము. మారు మాటాడకుము పొమ్మనుటయు సౌమిత్రిశరీరంబు గగుర్పొడిచె. కన్నులు పచ్చనయ్యె. భూతదయాపరిపూర్ణ మనస్కుఁడగు ధర్మవేత్త తేని శాసనంబున నరహత్యకుఁ బాల్పడవలసివచ్చి నట్లప్పటిస్థితి లక్ష్మణునకుభరింపరానిదయ్యె నన్నయానతిజవదాటని సౌమిత్రి యామనోవేదన సహించి చేయక తప్పదని నిశ్చయించుకొనుచుండ రఘువరుండిట్లని యానతిచ్చె. అనుజా! లక్ష్మణా! నీవు ధరణీజాతను వనంబులకు గొంపోవు టసాధ్యంబని తలంపకుము. దీనికి నీకొక యుపాయంబుఁ జెప్పెదను వినుము మున్నొకసారి మీవదిన నాతో నంతఃపురంబున నుండి "మనోహరా! మునికాంతలతో గంగాతీరంబున గొన్నినాళ్ళుండఁదలంచెద నాకోర్కె నీడేర్పు"దని వేడుకొనియె. యేను నందులకీయకొంటిని. అదిసాకుగా నీవీకార్యంబుఁ గొనసాగింపుము. మఱొండుచితంబుగాదని పల్కి పీఠమునుండి చివాలున లేచిపోయెను.

భరతశత్రుఘ్నులగ్రజన్ముని చండశాసనంబునకును, సీతాదేవికి సంభవించిన కష్టమునకును మనంబుల గుందుచు దలంచుచుఁ తలంకుచు చేయునది లేకవిషణ్ణవదనులై గృహములకుఁ జనిరి. ఆ మందిరంబున నొంటిగా విడువఁబడినలక్ష్మణునకట్టి యేకాంతస్థలంబు నిర్జనారణ్యముగా మదికిఁ దోప ముందు తనచేఁ గాంతారముల డింపఁ బడఁ లోపు జానకి వ్యథ వింత రుచిచూచిన వాడయ్యె. కటకటా భర్త రాక మదిఁగోరుచు దన యూడిగంపుఁ జెలులతో నంతిపురిసమస్త పరిచర్యల నందు సీతాదేవి తన్ను గూర్చి విధింప బడిన యీ నిష్ఠురపు పతియాజ్ఞ నెఱుంగదుగదా? మానవుని జీవితంబు నిట్టిదయే తాను

మరణఁపు మెట్టుపై నిలిచియుండియు గ్రహింపఁజాలక మూఢుఁడు లోకము తనకు శాశ్వతమని తలంచి సమస్తదుష్కార్యముల నొడిగట్టుకొనుచు భావికాలమున నైశ్వర్యముల ననుభవింప నెన్నియో ప్రయత్నములు సేయుచుండును.

# కుశలవోపాఖ్యానము

రెండవ భాగము

జానకిపై నిందమోపిన దుష్టులపై నాగ్రహించి లోకములఁ గాల్చి వేయ బ్రయత్నించు చున్నాఁడోయన మార్తాండుండు నభోమండల మధ్యవర్తియై తనసహస్రకిరణముల నతి తీక్ష్ణముగా భూమిమీదికిఁ బ్రసరించుచు దుర్నిరీక్షుఁడై యుండెను. విష్ణువాహనములగుటచే గ్రద్దలు మేఘపథంబును సమీపించి వలయముగాఁ దిరుగుచుండెను. భువనపావని యగు సీతా దుఃఖమును దలంచి పౌరులిండ్లనుండి విచారించుచుండిరోయనం బట్టణమునందంతగా నరసంచా రముండదయ్యె. లక్ష్మణుని మనోతాపమునకు సూర్యునితాపమును తోడైనదై మరింత యుడికింప భుజింపనొల్లక శయనాగారమునకుఁ బోయి పరుండి నిదుర బట్టక సేవకునిఁ బిలిచి యెల్లి ప్రాతఃకాలమున గంగానదీ తీరవనంబులకు బోఁ బయనము కావలయునని సీతకు వార్తనంపెను.

భర్తయగు శ్రీరామునిఁ దానర్థించిన కోర్కె నీడేర్చెనని తలంచి యమాయిని యగు నాసీత కౌతుకారంభయైవలయు పదార్థముల నతి జాగరూకతతో సిద్ధముఁ జేసికొనుచుండెను. ఆనాఁడట జానకీదేవి హృదయ మెంత సంతసించుచుండెనో లక్ష్మణుని హృదయమునంత విచారగ్ర స్తమైయుండెను. అట్టి దశలో సీతాలక్ష్మణులు సమయ మతిక్రమించుచుండిరి. తనకు సంతోషమిక నెన్నిదినంబులకో సంభవించునని కాబోలు పాపము! నిష్కళంకచరిత్రయగు నమ్మహీజాత యానాడపరిమితానందమునందుచుండెను. సంతోషమధికమగుచు గమ్యస్థానముఁ జేరువరకుఁ దీవ్రపడు సీతమనంబునకు నిముసమొక యుగముగా దోచుచుండెను. తాను మునికాంతలతోఁ బ్రొద్దులుపుచ్చువిషయంబును తన పరిచారికాశతంబు నకు వివరించుచు గంగానదీప్రవాహవర్ణనము గావించుచుఁ గాలమేల కాకున్నదని విసుకుకొనుచు నిట్లు చిత్రగతుల తీవ్రపడుచుండెను.

సాయంకాలమయ్యె, వేలావనభూమియందుఁ బరిపక్వమై కాలమను చిలుక ముక్కు పోటునఁ గదలి యూడిపడ్డ దానిమ్మపండోయన పద్మబాంధవుఁడు పడమటికొండ శిఖరమున వ్రాలె, సీతావియోగ వ్యధలకు సూచకములగుచుఁ జీకటులు బ్రహ్మాండము నావరింపసాగె, భర్తృవియోగ దుఃఖమున దుఃఖింపనున్న జనకజ ముఖపద్మమున కెనయై తామరలు మొగిడె. రాముని సతీపరిత్యాగదీక్షఁ బరీక్షించనెంచి పూవుటమ్ములఁ దాల్చి చెఱకువింటినెక్కిడి బ్రహ్మచారుల నేచుచు మన్మథుఁడు పయనమయ్యె. నిశాకాలచక్రమిట్లు తిరుగుచు లోకముల

సుఖనిద్రఁదేల్పుచుండె. నిర్విచారులగు మానవులకు నిశాసమయము విశ్రాంతిఁ గలిగించినను జార చోరకులకు రోగులకుఁ జింతాపరితప్తచిత్తులగు వారికి బాధాకరముగాక మానదు. అట్లా నాటిరాత్రి సీతాలతాంగికి సంతోష ప్రదమయ్యు రామ లక్ష్మణ భరత శత్రుఘ్నులకు విచారకారణమై వీరితోపాటు జానకీదేవికిని నిద్రాసౌఖ్య మొనగూర్పనిదయ్యె. ప్రభాతమున లక్ష్మణుండు సుమంతునిఁ బిలిచి రథమా యత్తపరపుమని చెప్పి తానునుచిత వస్త్రములను ధరించుకొనఁబోయె. లక్ష్మణుని యాజ్ఞకు బద్ధుఁడై సేవకుడు రథముఁబన్ని యజమానుని రాకకై ప్రతీక్షించుచుండెను. శీఘ్రకాలముననే సౌమిత్రిసనుదెంచి రథమునెక్కి సీతానిశాంత ద్వారమునకు బోనిమ్మని చెప్పతృటికాలమున రథంబు తద్వారంబు సమీపించె, మఱదిరాకకై వేచియున్న సీత తత్పూర్వమే సమస్తకార్యముల జక్కపెట్టి కొన్నదై మువ్వురత్తలఁచేరఁ బోయి సాష్టాంగంబుగా మ్రొక్కి కౌసల్యం గాంచినీపుత్రుఁడు నాకోర్కెనీడేర్చె గంగాసరిత్తీరభూములఁ గాంచి వచ్చెదనాకు సెలవిమ్మని యడుగ సదయహృదయగు నమ్మహాదేవి కోడలింజూచి యొంటరి దానవు కంటకపరివృతంబులగు నరణ్యంబులనెట్లు గడచెదవు? వదనబింబంబును గడునీరసంబై చూపట్టుచున్నదని ప్రశ్నించుటయు సీతపతిభక్తిని వెల్లడించుచు వనవాసియుఁ గంటక మర్దనుండగు దాశరథి నామనంబున నుండ నాకేయశుభంబును గల్గనేరదని చెప్పివారి సెలవుఁగైకొని రథంబు సమీపించియెక్కి కూర్చుండెను.

తనకు రానున్న కష్టములనెఱుంగక పరిపూర్ణసంతోషమున నాతురపడుచు రథమునెక్కు సీతాదేవి నారసి లక్ష్మణుని హృదయము చలించె. దుఃఖము కుత్తుకబంటియౌటచే నోటమాట రాక మొగము మరల్చుకొని కొంతవడికి నిబ్బరముందెచ్చుకొని సూతునిఁజూచి యగ్ర జాజ్ఞాపరిపాలనాసక్తిచేతనో సీతాదుఃఖము బహుకాలము చూడజాలకనో శీఘ్రముగా రథముఁ దోలుమని చెప్పె. ఆయమ్మ దుఃఖము నెఱింగినవై గుల్మములు ముఖములు వాల్చికన్నీరు విడుచు చునడువ నారంభించె. సంతోషమతిక్రమించు సీతాదేవికెనయై రథముపురవీధుల నతిక్రమించు చుఁబోవుచుండెను. భాస్కరుఁడు కళలఁదప్పినల్లనగుచుఁబొడసూపె. ఘూకములు సమీపవృక్షములపై నిల్చి కూయసాగె. దిక్కుల లోఁ జీకటులు దోచె. రథధ్వజములూడె, జనకజకుఁ గుడికన్నదరె. ఆ కారణముగా హృదయమున భయంబునెలకొనియె, అట్లనియు దుర్నిమిత్తములై కను పట్టుటయు జానకి లక్ష్మణుని జూచి, లక్ష్మణా నాహృదయంబుచేయి వెట్టి కలంచినట్లాందోళన మందుచున్నది. దృష్టికన్నియునమంగళసూచకములగుచున్నవి. కారణము తెలియదు. మఱందులకును రఘుకుల వారిధిసోముండగు రామునకు నింటశుభమేకదా? బంధువర్గమునందెవ్వరికి నేచిలుగుకలుగలేదుగదా?

అని తన దుర్దశనెఱుఁగక ప్రశ్నించు సీత వాక్యములు లక్ష్మణుని వాగ్ద్వారమునకు బంధనములయ్యె. తనజన్మమునం దతడంత దుఃఖము నెఱుంగడు. కలుషరహితమై యట్లు పృచ్ఛించునా తల్లికతండేమి యుత్తరంబీయఁగలడు. సౌమిత్రి మనంబు కఱగి నీరై ప్రవహింపసాగె. రామునియందుతన కెంతభక్తియో సీతయందును లక్ష్మణునకంతభక్తి

భూజాత యందు మాతృవాత్సల్యముగల యమ్మహాత్మునకు నాదుఃఖము తరించుటకన్నను మరణమే మేలనితోచె. రూపములేకయే ఖడ్గరూపమును దాల్చి కఠినములు గాకయే కఠినములై గోచరములు గాకయే మనోగోచరములై యానాడు లక్ష్మణుని హృదయంబు నాయమ వచనములు గాయముజేయకయే గాయపరుపఁజొచ్చె. తల్లీ నేనేల యింత దుష్కర్మమునకుఁ బాల్పడితిని. అగ్రజుండేల నన్నీకార్యమునకు నియమించె? నిన్ను దుఃఖముల పాలొనరించువిధి యీ కార్యమును గొనసాగింప నీఖలుని చండాలుని నిష్కరుణామతినిఁ గ్రూరునగు నన్నుఁ బుట్టించె గాబోలు! అయ్యయ్యో! లోకమాతవగు నిన్నేల నాదుష్టుండు నిందించె! నిందించెబో. చారుఁడేల వినిచె వినిచెఁబో దాచక వాఁడేల మాయన్నకుఁజెప్పె? చెప్పెఁబో, రాముఁడేల కినుకవహించె, వహించెఁబో నిన్నేల త్యజించె? త్యజించెబో వనములకేల బంపఁదలంచె? తలంచెఁబో యింతటి యకృత్యమునకు నన్నేలబంపె, కటకటా! దుశ్శకునంబు లన్నియు నీకని యెఱుంగవా–మఱదీ దుర్నిమిత్తంబులేమని యర్థించు నీకేమియుత్తరం బీయఁగలను. అని యిట్లు తనలోఁ దానను కొనుచుఁగుళ్లుచుండ తనప్రశ్నల కుత్తరం బీయకుంటచే సీత మరింత బెదరి మఱదీ! యేలనీముఖము దైన్యమును సూచించుచున్నది. ధృతిఁ దొలంగి మీయన్నను గొల్చుచు వనంబు లకు వచ్చునప్పుడును, ముఖాముఖి నింద్రజిత్తుతోఁ బోరునప్పుడును, రావణుని శక్తి యురంబున నాటినప్పుడును, నీవదనమింతటి దైన్యముఁ దాల్పదాయె, సాధు దూషణమొనరింపవు, పరుల విత్తము నపహరింపవు. శరణాగతులను విడువవు. పరసతులఁ గన్నెత్తి చూడవు. బ్రాహ్మణ భక్తియు, రామసేవయు నీకుఁదిరమగుచునుండును. అప్రమాణచరితుండవగు నీ వేయపరాధ మొనరించి యుందువని నిశ్చయించగలను. అన్నకోపించెనా? తమ్ములు తూలనాడిరా? మా యత్త సుమిత్రాదేవి నొవ్వనాడెనా? మార్గాయాసమున బడలితివా? లక్ష్మణా! యేలపల్కవు? కన్నెత్తిచూడవు, కన్నీరుగార్చెదవు, లోలోనగుళ్ళెదవని బహుభంగుల ప్రశ్నించుచుండె.

వాయువేగంబున రథం బుపక్రమించుచుఁబోయి పోయి పావనంబైన గంగాతీరమును సమీపించె. ఉత్తుంగతరంగమాలికలతో ఘోషించుచు జాహ్నవిసమీపమునఁ బొడసూపె, సూర్య రశ్మిచే వెండితీగలవలె తళతళ మెరయు వీచికాసముదయంబును, ప్రవాహ వేగమున నుద్భవించు మర్మరధ్వనియు సమీపించుకొలఁది నతిశయింప సీతాలక్ష్మణులు సంతోష దుః ఖములచే నతిశయించి తీరమును జేరి రథమునుండి క్రిందికి దిగిరి. తటములయందు నిండార వికసించి నేత్రానందమును గలిగించు వృక్షజాతములనుండి రాలిన పుప్పొడులచేతను జలమధ్యమున వృద్ధిఁబొందు తామరపూవులనుండి నిరంతరము ధారలై స్రవించు మకరందము చేతను గండుతుమ్మెదలపాటునఁ గదలి పదురజంబుచేతను గంధబంధురంబై యానందముఁ గలిగించుచు జలోపరి భాగమునుండి బయలువెడలు సన్న తెమ్మెరలును, శారద రాత్రుల జ్ఞప్తికిఁ దెచ్చు జలకణస్పర్శనంబును, శ్రవణానందదాయకములై నిత్యము నతిశయించు కలహంసారావంబులును, సీతమనంబునఁ బెనఁగొని యున్నదుశ్శకునభీతిని

మఱపించియు లక్ష్మణుని హృదయము నపహరింపఁజాలనివయ్యె. కలుషరహితయుఁ బవిత్రచరిత్రయునగు జానకీ దేవికి సమానమై స్వచ్ఛజలంబులతోఁ బొరలిప్రవహించుచు ధగధగమెరయుచున్న భాగీరథి లోకమాతయగు సీతాసందర్శనంబున నుప్పొంగి యర్ఘ్యమిచ్చుచున్నదోయనగట్టుపైకిఁ బొరలి పాదములను దడుపుచుండె. కువలయానందకరమై, సత్కవిసేవితయై, తనభర్తయగు రాఘవుని కీర్తినిఁగడుంగడుఁబోలుచున్న జాహ్నవింజూచినప్పుడా యమయానందమునకు మేర లేకుండెను. భర్తయగు శ్రీరాముఁడాదివ్యనదీ దర్శనంబున జ్ఞప్తికిరా నాయమ నిర్మలమతియై దండకారణ్యముల ఖరదూషణాది రాక్షసులఁ దునుమాడినవాఁడును, తరిమి మారీచుని శిరంబు భేదించిన వాఁడును, గిరులచే సముద్రమును బంధించిన వాఁడును, రావణకుంభకర్ణాది రాక్షసుల దెగటార్చినవాఁడునగు రామునకు భద్రములు చేకూరుగాతమనుచుఁబెక్కుగతుల దీవించుకొనుచుఁదలంచుచు లక్ష్మణ సహితయై మొలబంటినీట నమ్మహానది నుత్తరించి యవలిదరిఁజేరి రుచిరాంబరములను ధరించి గమనోన్ముఖయయ్యె. నదీతీరము నుపక్రమించి పోవు సీతాదేవి మనోవీధినుండి యారవంత యానందము నుపక్రమించి వెనుకటి విచార మాక్రమించె. తన విచారభారమును తిరుగజ్ఞప్తికిఁదెచ్చుచునతిశయింపఁజేయ సమకట్టెనో యన వనదంశకముల ఝుంకృతులును, యీలపురువుల ఝింకృతులను, కొమ్ముటేనుంగుల ఘీంకృతులును, కర్ణకఠోరములై యొప్పుచుండె.

అంత నాజగదేకమాత మఱంది నారసి దీనాలాపములతో దావానలములుక్రొంబొగలు నుభయప్రదములగుచున్నవి. సింహశార్దూలశరభ గండక మృగసమూహములుఁ గఠినముగాఁ గూయుచున్నవి. కఠినపాషాణపథంబులు ప్రయాణమునకు నిరోధకారణములగుచుఁ బాదములను నొప్పించుచున్నవి. వికటములై యుగ్రములగు కంటకకుడుంగములు దట్టములై యడ్డగించుచున్నవి. దాశరథింబాసిన నాకేల సన్మార్గములు గానవచ్చునని వెఱచుచునిట్లు చంచల మనస్కయై మార్గమును గమించుచుండె. ఆయమ్మను విడువవలసిన పాతకభూమియ గుటఁ గాబోలు సౌమిత్రికిఁ గాళ్ళు ముందునకు సాగవయ్యె. సచ్చరిత్రుఁడగు లక్ష్మణుని యానందవాక్య ధ్వనులచేతను, వికసిత నయనార వింద దృష్టిప్రసరణము చేతను బావనపఱుపఁబడ నోచుకొనక పోవుటఁ గాబోలు నా శాపపుతలంబున బాష్ప నిరోధిత నేత్రుఁ డగుటచే తను కుత్తుక బంటియగు దుఃఖముపొంగి పొరలుటచేతను సౌమిత్రికి దిక్కుదోచక నోటమాటరాదయ్యె. తడబడునడక తోడను యస్ఫుటితమగు మహాశోకము తోడను వెంబడించు మఱంది నారసి సీత లక్ష్మణా! పురంబు వెడలినదాది నీనోటనొక్కపల్కేనియు బల్కవైతివి. తదేక దృష్టిని వెంబడింతువు. కన్నీరుగార్చెదవు, హెచ్చరించబోయి యూరకుందువు, మొగమునెత్తిచూడవు, తోచుచున్న దుశ్శకునంబులకును విశేషించి నీయున్కికిని నాహృదయము తత్తరపడుచున్నది. మఱదీ! సంగతిని వివరించి నామనంబునకు శాంతినిఁ గలుగఁజేయుము. వేగిరింపుమని యడుగ లక్ష్మణుండు వదినపాదములపైఁబడి బోరుబోరున నేడ్చుచు తనపూర్ణ

శోకమును వెళ్ళబోసికొన వీలులేక భరింపలేకున్న మనంబునకు కొంచెము విశ్రాంతినిఁగలుగఁ జేసికొని తల్లీ! పతినిఁబాపి నిన్నుఁగానలఁడించిన క్రూరుఁడ, భాగ్యహీనుఁడ నీకీ కాంతారవాసక్లేశంబు నొడగూర్ప మఱంది రూపమునఁజన్మించిన చండాలుఁడ, శీఘ్రమేశపింపుము. దగ్ధుని గావింపుము, శిక్షింపుము శిక్షింపుమని యేడువనారంభించెను. ఆవాక్యములకును లక్ష్మణుని యేడ్పునకును కారణమెఱుంగమి సీతమనంబు నానాముఖములకుఁ బరుగులెత్తుచుండఁ గొంతవరకుయోజించి కంఠమెత్తి లక్ష్మణా! యేలయాత్మదూషణమొనర్తువు? అంతటియకృత్యము నేమియొనరించితివి? శపియించుటకు నాయందేదోషముఁ గావించితివి? మీయన్నయాజ్ఞ లేకనన్నుఁగొంచువచ్చితివా? కాకమాతృదూషణ మొనర్చితివా? యనియడుగుటయు లక్ష్మణుండింతకుఁ బూనివచ్చి చెప్పకతప్పదని గుండెనిబ్బరము సేసికొని వచింపఁబోవఁ గాలుసేతులు గదలింపఁజేయుచు హృదయవీధి భయాభ్రాంతుల ముంచుచు బాధించుచున్న శోకదేవత స్పష్టముగా వచింపనీకకుత్తుక నొక్కిపట్టెనోయన తడబడుపల్కులును హీనస్వరము నేర్పడ తల్లీ యన్నయాజ్ఞలేక యేనినుఁ గొంచురాలేదు. మాతృదూషణమునొనరింపలేదు. మరేతలంపుననుగాదు. లోకాపవాదభీతిచే నిన్నుఁ జేపట్టియు సహింపజాలక వనంబుల డించిరమ్మని నీపతియాజ్ఞనిడియె జననీ, నిందుచూలాలివి యొంటరిదానవు, యేమి యూహించి దినంబులు గడపెదవని వచియించెను.

రాము బాణములవలె రాము వాక్యములను వాడిగలవై యుండునని నిరూపణ సేయ రామాజ్ఞ హృదయసీమంబును బగుల్ప జంఝూమారుతాహతిం గూలు పుష్పవల్లింబోలి యా రామ రామాయని భూమిఁ గూలె. ఆయమ్మ దుఃఖభారంబు నెఱింగినవాఁడగుట లక్ష్మణుం డూరడిల్లుమనియేని వచించక యెలుగెత్తి యేడ్చుచుఁ గొంత వడికి సీతకు శీతలోపచారములను గావించెను. సీత మూర్ఛఁదెలిసి లేచి కొంత సేపు నిర్మలాకాశమును కొంతసేపు దిక్కులను మరిఁగొంత తడ వుర్విని బరీక్షించి కట్టెదుట శిలావిగ్రహము పోల్కి నిశ్చేష్టుఁడై నిల్చియున్న లక్ష్మణునిఁ గాంచి లక్ష్మణా నిజముగా పతి యిట్టి దుస్తరపు టాజ్ఞ నిచ్చెనా? నిజముగా నీవు లక్ష్మణుండవా? గంగాతీరమా యిది? వనమధ్యమా యిది? అయ్యయ్యో మఱదీ అయోధ్యాపుర వీక్షణ ప్రాప్తి నాకింకలేదా? రామ ముఖదర్శన భాగ్య మెడమయ్యెనా? అత్తలకు నాపరిచర్య విషమయ్యెనా? సీతకు రామాంకసీమానివాసమున కది యవధికాబోలు? పొలయల్కల మారుబుజ్జగింపుల కది కడసారి గాబోలు? చంద్రబింబమున కెనయై యమల మణిమయ కుండల ప్రభాభాసమానమై పర మౌనిబంభర పంకేరుహమై, కమ్రస్మిత కౌముదీ విలసనంబైస్థిర తర దయారసాల వాలమై పెంపొందు నాథుని వదనబింబము నీకాయమున జూడ గాబోలు! ఆశమ, ఆకరుణ, ఆశాంతి, ఆముజ్జ్వవంబు, ఆరూపు, ఆవిలాసము, ఆప్రసన్నత ఆనెనరు, ఆప్రియము రఘువరుండు మరచె గాబోలు! కటకటా! నా జన్మము నావచనము, నాపాతివ్రత్యము, నా ప్రభావము, నావిమలత్వము నాకోర్కె వమ్మె నేటికి విపరీత స్థితిం

దాల్చెనా? నాకింక దిక్కెవ్వరు తెరవెద్ది? ఖగములారా! మృగములారా! ముజ్జగములారా! మీరైనను మన్నాథుని హృదయమును గరగింపకుంటిరా! ఓ హుతాశనా! నీవు నాయందుఁ జల్లనై రామ భూవిభుని కోపమున కేల సాయపడితివి? ఓ తల్లీ భూదేవీ! నీగర్భవాసమున జన్మించిన సీతకేల యీకష్టములు గల్గించితివి? ఆహా! యెంత విపరీతము నే నీశోకము నెట్లు భరింతును? వజ్రమునకన్న గఠినమై పర్వతమునకన్న భారమైన యీయపప్రథ నెట్లు మోయఁ గలనని శోకించు సీతాదేవి మనోవ్యథ గాంచుచు సహింపఁ జాలక కన్నీరు ధారలైపారి భూమీ తలంబును దడపుచుండ నొక్కపెట్టున బొబ్బవెట్టి యేడ్చి యాయమ్మ నవలోకించి కంఠమెత్తి యస్పష్టములగు వాక్యములతో తల్లీ కాంతామతల్లీ! పతియాజ్ఞ యవిలంఘనీయము. నీ దుస్థితి దుర్భరము విధివ్రాలు తప్ప నెవరితరము? రామపాద జలరుహంబులు మనంబున నిల్పియెట్టులో కాలమును వెళ్ళఁబుచ్చుము. అమ్మా, గర్భవతివి యీ దీనుని వాక్యముల నాలించి యాత్మహత్యకు బాలుపడకుము. మమ్ము మరచినను పతిని మరువకుము. యీరడిల్లు మూరడిల్లు మని వచింప జానకి లక్ష్మణునితో మరదీ నాకష్టములకు నీవేమి సేయగలవు? అన్న యాజ్ఞను నెఱవేర్చితివి. ఇక నయోధ్యకుఁ బొమ్ము. నాగతి యెట్లు కానున్నదో యట్లగును. ముప్పురత్తలకు నామ్రొక్కుగా నీవు మ్రొక్కుము. బంధుగుల నెల్లర నడిగితిననుము. రామదేవునితో నీమూర్తి మనంబున బాయదనుచు జననింద నిన్నుం జెందనీక నీయాజ్ఞ ననుసరించి వనసీమలఁ జరించుచున్నదనుము. నీవే తనకు దైవంబ వనుము. నీ యాజ్ఞానువర్తనంబె తనకుఁ బదివేలనుము. పొమ్మనుటయు, లక్ష్మణుం డాయమ్మకు బ్రదక్షిణించి, చంద్రార్కులను, మునికాంతలను, మృగంబులను, పంచభూతంబులను జీరి పరమపతివ్రత, అపారగుణాకర, భూజాత, కరుణోపేత, ధరణిజనుల తలలోని నాల్క, రామ భూపాలుని యర్ధాంగలక్ష్మి, విధికృతంబునఁ గానల డింపఁబడియె, నెట్లు రక్షించెదరో భారమంతయు మీపై నిడి పోవుచున్నాడనని వచించి సెలవు గైకొని యడు గడుగునకుఁ దిరిగి చూచుచు పోలేకపోలేక వత్సమును బాసిపోవు ధేనువు భంగి పంచప్రాణములు సీతాసమీప భూమిని డించి జీవచ్ఛవంబై రథము నధిరోహించి పోవుచుండెను.

రథము నిర్గమించుకొలఁది సీతాదేవి హృదయమున శోకమధిక మగుచుండెను. కొంతతడవు రథంబును, మరి కొంతసేపు ధ్వజంబులును పిమ్మట రథపరాగంబు ననంతరంబు వట్టిబయలు నాయమ్మకు దృష్టి గోచరమయ్యెను. తదుపరి జానకీదేవి కట్టెదుట నేపదార్థమునుఁ బొడసూపక రామదేవుని మూర్తి నల్దిక్కులఁ దోచుచుండెను. పతిభక్తికి నిధానంబగు నా రామనాథునితో ముఖాముఖిగా మాటలాడుచున్నట్లు దలంచి ప్రాణేశ్వరా! మాటాడవా? యీ దీనురాలి మొఱాలింపవా? నీ యంకపీఠమున నిల్పుకొనవా? నీమంద స్మిత చంద్రికల నాపైఁ బ్రసరింపవా? నేరమా? యీలేమ నీకు భారమా? యని ప్రశ్నించుచుఁ గొంతకాలము తన దురవస్థ మఱచి యుండెను. ఆయమ తన మనోవిచారము మఱచియుంట దుఃఖదేవత కసూయాజనకమగుట గాబోలు, నావ్యక్తిని తన కట్టెదుట దోపనీక వైళంబ

యంతర్ధానమందించె నో యన భూజాతకు వస్తువర్గము దృష్టి గోచరమై యెప్పటి దుఃఖ పయోనిధిని బడవైచెను. పుట్టెడు బలగ మాయమ్మ కుండియు, దిక్కులేక వన వాసక్లేశమనుభవించుటఁ దలంప భక్తుల కాశ్రయ దుర్గమై రక్షించు యీశ్వరుని కరుణ కేవలము సీతా లతాంగియందు విపరీతస్థితి ననుసరించె ననుట నిర్వివాదాంశము. ఇక నాతల్లికి తెరవెక్కడిది? యెవరు రక్షకులు? నిలయమేది? చెలు లెవ్వరు? దుఃఖవిరామ మెట్లు? కట్టా! నిరంతర పరిచారికాసహస్ర శోభితయై, యమూల్యముక్తాహార భానుచ్ఛాయాపరివ్యాపితకంబుగ్రీవయై, నిష్కుటాంతరవిహారసంతోషి తాంతరంగయై, భవ్యసౌధాంతశ్చకితానేక మాణిక్యరత్న రోచిర్వితానానందక్రీడా తత్పరయై, చెన్ను వహించు పృధ్వీజాత కరణ్యావాస ప్రాప్తియు, దుర్భర దుర్వార దుస్సహాపవాదారోపణం బును, భర్తృ వియోగంబును, బంధుజన విద్వేషంబును, సంభవించుట కొంచె మాలోచింప నప్పటి కాయమ్మ కెట్టి దుస్థితియో; యెంత భారంబో; చదువరుల మగుమనకును గొంత తేటపడక మానదు. అట్టి దశయందున్న వారికి వన్య మృగంబులు తప్ప మరి దిక్కెవ్వరు? నిరాధారయై, కొమ్మలు దెగిన మోడువలె నిల్చి దుఃఖంబును వెళ్లఁబోయుచున్న సీత నూరార్పఁ దలంచి కాబోలు పులుంగుల గములు నెలుంగుల మూకలు సన్నిహితములై కూయనారంభించె, తమ్మి చూలికేనియు వారింపరాని యాశోకమును నోరెఱుంగని జంతుజాల మెట్లుపోగొట్టఁ గలవు. ఆ నిర్జనారణ్యమున నొండు తెఱవులేక వ్యసనాక్రాంతయై యున్న జనకజకు తన కష్టములు సర్వమును స్మృతిదర్పణంబునఁ గానుపింప నెలుగెత్తి బోరున నేడువసాగె. ఆ యార్తధ్వని నల్దిక్కులకు వ్యాపించుటచే దిగ్రమణీ సంఘంబులు కన్నీరు గార్చె. పాషాణములు కఱిగి నీరై ప్రవహించె. పక్షు లెఱను వెదకవయ్యె. మృగంబులు చలించక నిలిచె, జానకియు నట్లేడ్చి యేడ్చి సొమ్మసిలి భూమిపై వ్రాలె.

మనుజునిపట్ల దైవవాత్సల్యము వేలాతీతమైనది. నరుని దుష్ప్రవర్తనముచే సంఘటించు వేదనలయందును పరమేశ్వరుఁడు చేయివిడువక పోషించుచుండును. అట్టిచో సత్యసంధులగు వారికి సంభవించు కష్టములయం దాపరాత్పరుని దయకు మేరయుండునా? నిముసము దుః ఖింపఁ బదినిమేషములు సంతసమును గలిగించు భగవంతుఁ డనివార్యమనోవేదన ననుభవించు భూజాత కెంత సంతోష మీయకుండును. ప్రస్తుత మాయమ్మ కట్టి దశ పట్టకున్నను దిక్కు లేని తన జీవనమునకు దిక్కుఁజూపి కొంతయూరట గల్గింప నెంచి మునికుంజరుండగు వల్మీకజన్ము నటకుఁ బంపి తన శాశ్వతకీర్తి కాంతకు శోభనాపాదించెను. కఠిన మనస్కుల గుండియల నేనియు దయారసవాహినులవలెఁ బ్రవహింపఁ జేయఁజాలు సీతాదేవి యార్తధ్వనిఛాత్ర సహితుండై సమిత్కుశయూపకలాపఖండన స్వీకృతికి నేగుదెంచి యున్న వామలూరుజుని శ్రవణములు సొచ్చి చింతాపరవశు నొనరించెను. అపరిచితుల కకారణ బంధు జనులగు మునులకు శిరోభూషణంబగు నమ్ముని వృషభుఁ డాదీనారావ మాలించి యనాథ స్త్రీ కంఠధ్వనిగా నెఱింగి వెదకుచు వచ్చి విముక్తకచ బంధయై, యశ్రూదక

సిక్తవక్త్రయై, కపోలకీలితాంగుళియై, విగళిత విలాసాననయై, యూర్పు సెగలచేఁ గమలి మలీమనంబులై యున్న రద నచ్ఛదయై, చూపరులకుఁ గడుజాలిఁగలిగించు దీనదశచే నొప్పుచుఁ దన్ముహూర్తముననే మూర్ఛఁదేఱి యచలిత దృష్టియై నింగిఁ గనుఁగొనుచున్న ధరణీజాతం జూచి యమృతరసోపమానములగు పలుకులతో"మానవతీశిరోమణీ నీవెవ్వతె"? వని ప్రశ్నించెను.

చండభాస్కరుని కిరణతాపంబున శోషిల్లు నెమలి పిట్టకు మేఘ ధ్వనిని బోలి ఆవాక్యము కడు హృద్యంబై తోప సీత దిగ్గున లేచి యతి చంద్రుని చరణతోయరుహంబులపైఁ బడి నమస్కరించెను. దుఃఖ దశయందున్న వారల నాదరించు రక్షకుల పొంత దుఃఖము పొంగి పొరలుట సహజమగుట సీతాదేవికి జనక సమానుండగు నమ్మునినిఁ జూచిన తోడనే చెప్పరాని దుఃఖముప్పొంగ మునినాథా! నేను శ్రీరాముని భార్యను, నాతండ్రి జనకుడు, దశరథేశుని కోడలను, నాపేరు సీత జనాప వాదమునకు వెఱచి నాభర్త నన్ను వనములకుఁ బంచె. కలుష రహితను యేపాప మెఱుంగను రక్షింపుము రక్షింపు మని యేడ్చుచు వచియించె.

విపన్నుల నాదరింపఁ గంకణముఁ గట్టుకొన్న సంయమిశ్రేష్ఠులకు లోక పవిత్రయు పతి విదూరయునై యకారణవేదనల ననుభవించు సీతపై ననుగ్రహము పుట్టకుండునా? వాల్మీకి మనం బాదీనాలాపములకు యగ్నిసమీపమున నుంచిన ఘృత భాండంబును బోలి కఱగి పొంగి పొరల అమ్మా యూరడిల్లు మూరడిల్లుము. నీవృత్త మంతయు దివ్యదృష్టిచే నెఱింగినాడ. కొలది కాలంబుననే పతితో సుఖంబుండఁగలవు, మార్తాండ తేజో సమానమూర్తులును విరోధి శిరోధి ఖండన చణులునగు యిద్దరు పుత్రలఁ గనియెదవు. భయపడకుము. యీ నీ వేదనలు నిన్నుద్ధరింప ఘటిల్లినవి కాని వేఱుగాదు. లెమ్ము, నా యాశ్రమమున నుండుము. నీజనకుఁ డొకండును యేనొకండునుగాను. సద్గుణాభిరాముఁ డగు రాముండు భర్త. పంక్తిరథుండు మామ. దుష్ట రాక్షసవనీకుఠారుండగు జనకుండు జనకుఁ డు. పరిపూర్ణ యశోధురంధర యగు వసుంధర తల్లి. తల్లీ! నీచరితంబు లోక వందితము యెఱబఱికము లేక నాకడనుండుము. ఈయాశ్రమము నీది మునికాంతలు నీకు వయస్యలని వచింప సీత మనంబున దుఃఖంబున డిందుపడియున్న కౌతుకాంకూరంబులా వచోమృతసేచనంబున మొలకలెత్తి వికసింప మునివరుని వెంబడించి యాశ్రమముఁ జేరి మునికాంతలచే నుపచరింపఁబడుచు నాశ్రమ వృక్ష వితానముల శోభం గాంచుచు జాతి వైషమ్యముడిగి సంచరించు జంతు సంతానముల నారయుచు తన మనోదుఃఖము నొక్కింత మఱచి కాలముఁ గడపు చుండెను. పతిభక్తిలేని మానిను లెట్లుండినను పతివ్రతలకెట్టి యాదరణలభించియు పతివిదూరలయునచో మనంబునఁ గుళ్ళుచుందురు. జానకి వాల్మీకి యాశ్రమంబున సమస్త సౌఖ్యముల ననుభవించుచుండియు రామదేవుని మూర్తి మనంబున బాయక యనారతముఁ బూజించుచునేయుండెను.

హృదయము నాకర్షింపజాలిన వివిధ కుసుమంబు లాయాశ్రమమున నున్నను పూజకై కోయునేకాని కురుల ముడవదు. చిలుకలకు మేతబెట్టును గాని సంతసమునఁ బలుకులఁ గఱపదు. చిగురుటాకుల సెజ్జ లొరులకుఁ గూర్చును గాని శయనింపదు. మధువుల నర్ఘ్యమిచ్చు ను గాని యానదు. జలము దెచ్చుచు గాని క్రీడసల్పదు. ఇట్లా లతాంగి భర్తృముఖ సందర్శనమునకై వ్రతంబులు సేయుచు దినములు దాటుచుండ నొక సుముహూర్తమున నిరువురు పుత్రులుద్భ వించిరి.

జననీ జనకులకు పుత్రముఖదర్శనము దుఃఖాబ్ధినుండి తరియించు తెప్పవంటిదై యానం దదాయక మగుచుండును. పుత్రులంగ విహీనులై దుష్టులేయై యున్నను తల్లి కట్టి కుమారులఁ గాంచిన నొకప్పుడైన నొక విధమగు సంతసమును నెనరును గలుగుట స్వభావసిద్ధమును ప్రకృతి ధర్మమునై యున్నది. అట్లుండ నవమన్మథా కారులును సూర్యతేజోసమాన మూర్తులునై సర్వాంగ సౌష్ఠవమున ముద్దులు మూటఁగట్టుచున్న నవ్వరకుమారద్వయంబు సీత కెంత సంతోషము గలిగించి యుండును. ఇక నామె యేవిచారమును లేక పూర్ణానంద భరితయై యుండునని మన చదువరులు తలంతురేమో వారి జననం బాయమ కధికానందమే యైనను పతియగు రామభూదారుఁడుండనుండ నీ సుతులఁ జూచి యెంత యానందించి యుండునో కదా చూచి సంతసించు భాగ్యము నాకు లేక పోయెనను విచారముమట్టు కామెహృదయ కుహరమున క్షణ క్షణమును గలకవేయుచుండెను.

మునిసత్తముఁడగు వాల్మీకి జానకి మనోవిచారమును గ్రహించి మునికాంతలచే సపర్యల ను జేయించుచు, మంచిఫలములఁ బెట్టించుచు, వింతవింతలగు నితిహాసములఁ జెప్పుచు రామునిఁగూర్చి ధైర్యముఁజెప్పుచు, పుత్రులకు విద్యాభ్యాసముఁ జేయుచు నిట్లు బహు భంగుల నాదరించుచుండెను. మన కథానాయకులగు నయ్యిరువురు బాలకులను "కుశ లవు"లను పేరులం బఱగుచు వాల్మీకి చెంత నానారథ గజ తురగాధిరోహణాది విద్యలును, వివిధాస్త్ర కళా రహస్యములు గఱచుచు, మహాసత్వసంపన్నులై మునుల దీవెనల నందుచు సూర్యవంశజులను నామమును సార్థకము జేయుచుండిరి.

ఆబాలురు శైశవమునుండియు భయవిరహితులగుట యెట్టి కార్యమునేనియు నశ్రమ మునఁ గావించుచు, భయంకరములై మదించి తిరుగు కొమ్ముటేనుంగుల, సింహముల, శార్దూలముల, శరభముల, గండకముల, గుక్కలంబోలి పట్టుచు, నెక్కుచు నాశ్రమ సమీపము లగు మహా వృక్షములకు బంధించుచు, సురాసురదుర్నిరీక్ష ప్రతాపులై యొప్పుచుండిరి. వారికిఁ బండ్రెండు వత్సరముల ప్రాయమురాగా మునినాథుఁడు జాతకర్మోపనయనాది సత్కర్మములఁ గావించి బహుజనుల చతుర్విధాహారములఁ బరితుష్టమనస్కులఁ గావించెను. ఆబాలురకు జననమునుండియుఁ బితృముఖదర్శనము లేమింజేసి, యావిచార మొక్కింతయును వారికి

పిలుచుండిరి. వామలూరుజునియందు వారికిఁ జనువధికమగుటంజేసి బాల్యచాపల్యమున తెల్లనై జనపనారవలె తళతళమెరయు తాతగడ్డమును బట్టి లాగుచు అతి దీర్ఘములై గ్రంథులుగట్టి వ్రేలు శిరోజములఁ బెనవేయుచు దండకమండలువులఁ బట్టి పరుగులిడుచు, భుజములపై కెక్కుచు, పైఁబడి పొరలుచు బాధించుచున్నను, పరమకరుణాసనాథుండగు ముని నాథుఁడెన్నఁడేనియుఁ గనియక స్వంతబిడ్డలకన్న నెక్కుడు ప్రేమతో జూచుచు సంతసించు చుండెను. సీతాదేవి వాల్మీకియాశ్రమ మునఁ దన కుమారులతో యెంత సుఖము ననుభవించు చుండెనో, యెంత దుఃఖము ననుభ వించుచుండెనో యీ విషయమునుబట్టి పాఠకులు గ్రహింప గలరు. ఇక నయోధ్యాపురంబునకు మనంబులు మరల్చి రామలక్ష్మణుల వృత్తమునుఁ గొంత తలపోయుదము.

# కుశలవోపాఖ్యానము

మూడవ భాగము

సీతను వనంబులడించి రథము నెక్కిన లక్ష్మణుండు క్షణక్షణముఁ దిరిగిచూచుచు వదిన మరుగైపోయిన నావల నారయుచు దుఃఖము మిక్కుటమగుట నేడ్చుచాలించి వెఱ్ఱిచూపుజూచుచు నాతల్లిని విడచితి, తల్లీనీ కెట్టిగతి యెట్లుండుదువు యెవ్వరుదిక్కు, అమ్మా పలుకవేమి, యీ కెలకు, యీదారి, యీస్థలము, ఈ వృక్షము, ఈకుడుంగము, ఈయేరు, నాతల్లితో దాటితి ఆగడియ ఆపోక మరల సంభవించునా అయ్యయ్యో పరమేశ్వరా మాదిక్కు మాయాశ్రయము, మాప్రాపు, మారక్షణ, మాతేజము దూరమయ్యె, మాకేదిగతి యనుచు అనుపమానమగు వేదన ననుభవించుచు సౌమిత్రి పురము ప్రవేశించెను. గంగానది నాతడెట్లు దాటెనో మార్గప్రయణ మెట్లు కొనసాగెనో యాతని కొక్కింతయును దెలియదు, పురమధ్యమున రథము పోవుచున్నను బహువిధ వాద్యధ్వనులు వినబడుచున్నను బహుజను లనుగమించుచు న్నను శృంగారములగు సౌధమాలికలు దృష్టిగోచరము లగుచున్నను అందెవ్వియు నాతని మనంబు నాక్రమింపజాలనివయ్యె. రథంబు గమియించి గృహాంగణమును సమీపించిన తోడనే సౌమిత్రికి సీతాదుఃఖమొక్కింత దగ్గి మరియొకవిచారము మనోవీధీ మధ్యమున తళుక్కుమని మెరసి వివశు నొనరించెను.

ద్వారమును సమీపించి లక్ష్మణుండు రథముడిగ్గి సారథిని బొమ్మని చెప్పి మెల్లమెల్లన గృహము ప్రవేశించెను. లక్ష్మణుని యేతత్కాల విచారమెద్దియో మనకు బాగుగా తేటపడును. ఇట్టి కార్యమొనరించి యన్నమొగము నెట్లుచూతు, నేమని వచియింతుననునదియే యాతని దుఃఖకారణము. జననింద కోర్వఁజాలక పత్నినివర్జించి వనముల డించిరమ్మని పంపిన రాముని మనమునం దీషణ్మాత్రమేనియు నెమ్మదిలేక బహుగతుల నూగుచు దీవ్రవ్యథాదూయ మానమగు చుండెను. తా నుద్వాహమైనదాది భార్యకు నన్నియు భరింపరాని కష్టములు

సంభవించుటయుఁ దుదకు లోకమునుబట్టి తనచే విడనాడ బడుటయుఁ దలచుకొనినప్పు డమ్మహాత్ముని దుఃఖమునకు మేరలేకుండెను. తన యర్ధాంగినిఁ బురము దాటబంచినదాది రాముఁడు నిద్రా సౌఖ్యములకు వెలియై శుష్కించుచుండెను. అపప్రథాభారమును సహింపజాలక యప్పటికి సీత నట్లంపెఁగాని పూర్ణముగా త్యజించుటకు గాని యుంచుకొనుటకు గాని రాముని హృదయం బీయకొనకపోవుచు వచ్చుచున్న యూయలవలె నిలుకడలేనిదై తన రారుచుండె. అట్టిమనము నిశ్చలత వహించక మరణమువరకుఁ బీడింపకమానదు. ఐనను రఘువరుఁడు మేరుసమాన ధైర్యహృదయుఁ డగుటచే యెట్టులో మనంబును బిగ్గఁబట్టి సమయమునతిక్రమించుచు లక్ష్మణుని రాకకై యెదురు సూచుచుండెను. సౌమిత్రి యన్నముఖావలోకనమునకు వెఱచియు “గుడిమ్రింగిన వానికిఁ గుడిలోనిలింగమెంత”యను లోకోక్తిననుసరించి యగ్రజుని మందిరంబుఁ జొచ్చి మునుపటికన్నఁ గళావిహీనుఁడై లలాటకీలితాంగుష్ఠుఁడై బహుయోచనా పరవశుఁడై యున్న రాముని మ్రోలనిలిచె. రాముఁడనుజునిఁగాంచి లక్ష్మణా! సీతయేదని ప్రశ్నించెను. లక్ష్మణుని కావాక్యము చెవిని బడిన తోడనే నిలుపుకొనినను నిలువక దుఃఖముప్పొంగ గ్రుడ్లకు నీరుదెచ్చుకొని గద్గదస్వరమున నగ్రజా! నీ యాజ్ఞానుసరణి గంగాకూలమున డింపఁబడినదని యుత్తరంబిచ్చెను. రామునకా వాక్యము కర్ణశూలమైనాట హా! సీతా! హా! భూజాతా! హా ప్రాణేశ్వరీ! హా! పతివ్రతా! హా! జగదేకసుందరీ! హా! జనకజా! యీ క్రూరకర్ముఁడగు రాముని భర్తగాగ్రహించి యెట్టి దుఃఖమనుభవించుచుంటివి, నీకుదిక్కెవరు, అయ్యో సీతా! నాకఠిన శాసనమును విని విధి నెంతదూరితివో యెంత పలవించితివో నీసౌఖ్యపయోనిధికీ రాముఁడు బాడబానలమయ్యెనా లేకలేక గర్భమును దాల్చితివని సంతసించు భాగ్యమీరామునకు లేకపోయెనా అంతఃపురమున నెవరినిగాంచి నీ పతి సంతసించును, కడసారి చూపైనను జూడనయితిని గదా? నీమృదుతల్పములు, నీ విహారరంగములు, నీ రత్న వేదులు, నీ యారామములు, నీ మోహంపు చెలులు నీకికలేరుగదా! ప్రేయసీయని నేనెవ్వరిని జీరెదను? భార్య నడవుల పాలొనరించి రాజ్యసుఖము ననుభవించుచుండె. రాముఁడెంత నిర్దయుఁడను నింద నాకు వచ్చెనా? హా! దైవమా! నాకిక మనశ్శాంతి యెట్లు? యీదుఃఖము నెట్లు తరింతును? లక్ష్మణా! నిజముగా విడచి వచ్చితివా? యేమనియె, నన్నడిగెనా? ఛీ! ఛీ! యింత నిర్దయుఁడనగు నన్నే యడుగవలయునా యని పలుదెఱంగులఁ దలంచుచు శోకింపఁజొచ్చెను. అంత లక్ష్మణుండు జగదభిరామా రామా! లోకపావనులు, పూజ్యులు నగు మీరిట్లు పలవింపఁ దగదు. ఆపదలయందు మీబోంట్లకు ధైర్యమే ప్రధానము. బేలలై మీరిట్లు శోకింప నికమమ్ము నడుగవలయునా? మీచిత్తానుసారముగ నాయమ్మ నందుడించి వచ్చుచుండ నన్నుఁ జీరి, యన్న యాజ్ఞను కొనసాగించితివి. పతిపాద పంకేరుహములు నాకాశ్రయదుర్గములు, పతియే దైవము, భర్తకు జననిందఁ జెందనీక కానలఁ జరించెదను. పతికి నామ్రొక్కుగా నీవు మ్రొక్కుము. నెమ్మి నాపైఁ గొంత నిలుపు మనుము. నాకు దిక్కు దైవమే యనుము.

కట్టి యిక్కట్టు సంభవించినందుల కెంతయు వగచి ధైర్య మవలంబించి, దినములు గడచుకొలందియుఁ గడచిపోవుచున్న విషాదమున రాజ్యము సేయుచు కొన్నినాళ్ళకు వసిష్ఠునిబిలిచి, పౌలస్త్య సంహారజాత మహాదోషపంకంబును బాపుకొను నుపాయం బడుగ నమ్మునిచంద్రుండు తురంగమేధము సేయుఁడని వచించెను. రాముడు తత్క్రతు విధానంబు వచింపుడన గురుండు సంతోషితాంతఃకరుణుఁడై యిట్లు చెప్పదొడఁగె, రాఘవేంద్రా! గోక్షీర తనువును, కుంకుమ శిరోధియు, పీతవాలంబును, అసితశ్రవంబునైన గుఱ్ఱం బవశ్యంబు, అట్టి తురంగమును బూజించి, దాని శరీరరక్షకై యతి శౌర్యధనులైన వీరవరులను బంపనోపును. మరియు ఋత్విజులును ఉత్తమ ద్విజులైన వారనేకు లుండవలయును. వారికి దానంబుగా నొక్కొక్క వేదండంబును, నలువురు భటులును, పూజ్య గోశతంబును, నూఱుగుఱ్ఱంబులును, వేయి బారువు లర్థంబును, నాలుగు తూముల ముత్యములును గావలయును. ఈసవనము సేయ భార్యా సహితుండు గావలయును. ఐనను బంగారముచే సీతా స్వరూపమును గావించి కొనసాగించెదను. చింతింప వలదని వచింప రామభద్రుఁడు భటునొక్కనిఁ బంపి లాయనము నుండి గుఱ్ఱమును దెప్పించెను.  ముని వరుఁ డాహరిని గాంచి విస్మితుఁడై పలువురు భూసురులకు దక్షిణలిడి యజ్ఞము నిరంతరాయముగఁ గొనసాగించి

కం. మిత్రకులాగ్రణి దివిజ
స్తోత్ర పరాక్రముఁడు వీరసూః కౌసల్యా
పుత్రుఁడు రఘుపతి విడచిన,
సత్రహయముఁబట్టుదుర్విసాహసులున్నన్

అనునర్థమిచ్చు వీరవాక్యములు నొక జాంబూనద పత్రికపై వ్రాసి యాఘోటకమునకు లలాటభాగమునఁ గట్టివిడియించెను.

ఆ తురంగమున కంగరక్షగా మూడక్షౌహిణీల సైన్యముతో సురాసుర దుర్నిరీక్ష ప్రతాపుఁడగు శత్రఘ్నుండు పయనమై యన్నకు మ్రొక్క రఘువరుండు శిరంబునఁ జేతులుంచి అనుజా శత్రుఘ్నా! నీకు శుభంబగును, దిక్పతి సందోహసమేతులై హరిహర బ్రహ్మలేతెంచినను నీకు విజయము చేకూరును, పోయిరమ్మని దీవించి సాగనంపెను. యజ్ఞఘోటకంబును వాయువేగమును దాల్చి సమస్తభూములు నిరాఘాటముగ దాటిపోవుచుండఁ గొందరు రాజన్యులే తెంచి తత్ఫాలసంస్థితంబగు జాంబూనద పత్రికా లిఖితంబగు సందేశంబు నారసి విభ్రాంతులై నతులొనర్చ హయంబు పోయిపోయి వామలూరుజుని యరణ్యానిం బ్రవేశించెను.

పటుతరసజ్యకార్ముకహస్తుఁడై వనంబునఁ గ్రుమ్మరు లవుండా తురగము నారసి వటు వ్రాతములతో డాసి తద్భిరుదాక్షరపంక్తి బఠించి పకాలున నవ్వి రాఘవ మనుజేశ్వరుని తల్లి

వీరమాతయట, రాఘవుఁడువిడిచిన హయమట, సాహసులున్నఁ బట్టవలయునట. ఆహా! కుశలవులఁగన్న సీతాకాంత గొడ్డువోయినది గాబోలునని యాగ్రహాయత్త చిత్తుఁడై శీఘ్రమున బోయి యయ్యజ్ఞ సైంధవంబు మెడ యందుఁ దన యుత్తరీయమును దగిల్చి యొక కదళీ తరువునకు బంధించె. వటుకుమారు లాబాలుని ధైర్యమున కచ్చెరువంది చేరఁబోయి మిత్రమా, మనకేల యానిరర్థకవైరము గుఱ్ఱమును విడియింపుము దీనితో నల్లదెబహుసైన్యము వచ్చుచున్నయది. మీజనివినిన నిన్నుఁగొట్టును. మీయన్న కుశుండును నీకుఁ దోడు లేదు, శాంతింపుమని వచింప లవుండు దండతాడితమైన భుజంగంబుభంగి నెగిరిపడి వటుకుమారులఁగని మీరుమునిసుతులు, నేను సీతాతనయుఁడ, రాజధర్మము నేనెఱుంగుదు. పగఱ గెలిచిన గీర్తివహించెదను. కాదేని మరణించి కైవల్యప్రాప్తినందెదను. భీరులగు మీరు శూరబాలుఁడనగు నాకు హితోపదేశముఁ జేయఁజాలరు. అన్న లేడనియు, తల్లి కోపించుననియు భయపడుటకు క్షుద్రవంశమున నుద్భవించలేదు. పావనంబైన క్షత్రియవంశమున జన్మించితిని. మాతల్లి వీరమాత నేనువీరుఁడను. చేతనున్న యస్త్రశస్త్రములు దివ్యములు. వయస్సున బాలుఁడనయ్యును పరాక్రమంబున వయోవృద్ధుఁడను, ఒరులనండనుంచుకొని రణము సేయువాఁడను కాను. ముల్లోకము లెత్తి వచ్చినను వెనుకంజనిడి మాతల్లికిని వంశమునకును కళంకముఁదేజాలను. ఇదియు మీరె చూతురుండుండను నంతలో భూమ్యా కాశములు విఱిగిపడెనో యన్నట్లు భయంకరధ్వనులతో సైన్యము సమీపించెను. బహు విధములగు వృక్షములచేతనీరంధ్రంబైన వనంబు రథంబులచేతను, తురంగములచేతను, సింధురములచేతను యుష్ట్రములచేతను ఖడ్గములచేతను, ముసలములచేతను, తోమరముల చేతను, చక్రములచేతను, పదాతులచేతను. నింపఁబడి మరింతచిక్కనై యిసుక వైచినను రాలదయ్యె. ఉన్నతములగు వృక్షములు వియన్మార్గమునంటుచు, బాలుఁడగు లవుని రక్షింపుమని దేవేంద్రునకు మొరపెట్టి కొనుచున్న వోయనఁ దోచుచుండె; మృగములు నానాముఖములకు పరుగులెత్తుచుండె, భేరీనినాదములు, హయహేషలు, కరటిఘీంకృతులు, దిగంతములఁ బ్రతిధ్వనులిడుచు భయప్రదము లగుచునుండె, మహీజాతకదంబములు సేనావాహినీ సమూహములు సమానములై కలసి పొడసూపఁజూపరులకు వనంబు దండెత్తెనో, వనంబుపైకి సైన్యము దండెత్తెనో యను శంకఁగల్పించుచుండె. అంత సైన్యం బేకగ్రీవముగ “హయంబును బట్టిన దుండగీఁడెవ్వఁడని” ప్రశ్నింప, సప్త సముద్రము లొక్కపెట్టున ఘోషించినట్లయ్యె. ఆభీకర నిర్ఘోషమునకు వటుకుమారులు గజగజవడకుచు మిన్నకుండిరి. సహస్రసమదవేదండ ఘీంకార ధ్వనికి సముత్సాహంబునఁ జెంగలించు సింహశాబకముపగిది నబ్బాలవీరుఁడగు లవుండు ముందునకు దూకి, యుగ్రక్రోధుఁడై వైరుల హృదయదారుణమగునట్టు లెలుగెత్తి, యధ్వర ఘోటకంబును నేను బంధించితిని. నాపేరు లవుఁడు. ప్రాణముల నాశింపనివారలైన సైంధవ బంధమోక్షణము సేయుడు. కాదేని పొండని వచియించెను. బలంబులాతనిఁ జీరికిఁ గొనక

కాల్వుఱికరంబులు శరంబులఁ దునిమివైచెను. వైచుటయు బలంబులుక్కుమిగిలి యొక్కుమ్మడి లవునిపైకి ముసలచక్రానితోమరములఁ బరగించెనుఁ బాలుఁడవి యస్త్రమంబునఁ దుత్తునియలుగావించి నిర్భీతిమై నిలువ శత్రుఘ్నుండు రథంబునుద్ధతిమై దోలుకొనుచు లవునిగదియ నతండు మహేశ్వరమంత్రసంస్మరణస్ఫూర్తి భాసిల్లి పదిబాణములచే నాతని వక్ష స్థలంబును జిల్లులుగావించెను. శత్రుఘ్నుఁడబ్బాణ ఘాతములచే నించుక మూర్ఛవోయి వెంటనే తెలిసి యుగ్రుఁడై మూడమ్ములనాతని పైకిఁ బరగించెను. లవుండవి తప్పించుకొని రోషభీషణుండై శాత్రవ లోకభయంకరముగా ధనుర్గుణధ్వనినిగావించి యొకవిశిఖమున ధ్వజంబును, ఒక శరమున సూతుని సాయకచతుష్కమునఁ జక్రరక్షకులను, మరినాల్గు బాణముల రథ్యంబులను బడవైచి మరియు నిశాత భల్లంబొండువైచి వైరిహృదయంబగలించెను. లవణాసురవిరోధి కడుం గనలి మున్ను లవణాసురునిఁ దునిమివైచిన దివ్యబాణంబు నొకనూతన శరాసనమున సంధించి, బాలునిపైఁబ్రయోగింపఁ జేతులురాక యించుక కరుణవహించి లవునిజూచి “వత్సా! శీఘ్రంబె సంగ్రామమును బాసిపొమ్ము. ఈ బాణంబమోఘం” బని హెచ్చరించెను. సైతేయుం డాభీకరశరమునీక్షించి కుశుండున్న దీని నిర్ఘాతంబొన రించియుండునని తలంచియైన నేనునుదునిమివైచెదఁ గానిమ్ము మాతల్లి మహిమాన్విత మహీజాత యని యెదుర్కొనియె. శత్రుఘ్నుండు కరుణించియు లవుని ధైర్యస్థైర్యంబుల నారసి యితడసాధారణ ప్రజ్ఞానిధి యని గ్రహించి బాణమును వదలెను. శిలీముఖంబు విద్యుద్వేగమునుదాల్చి జ్వలనజ్వాలలుగ్రక్కుచు దిక్కులు వెలిగించుచు నేగుదెంచుటఁ గాంచి సీతాసుతుండు బాణము నొద్దెను. అస్త్రము వమ్ముగాక యేగుదెంచి లవుని కోదండంబును రెండుఖండములు గావించి యురోభాగమున దూఱ భూసుతాసుతుండు వివశుఁడై నేలకొఱగె. లవుని మూర్ఛగని బలములు సంతసించి శంఖకాహళ ఢక్కారావంబులు గావించెను. రామానుజుండు రక్తసిక్తాంగుఁడై పడియున్న లవుని మనోహర స్వరూపమునకును, పరాక్రమ గుణంబులకును, విస్మితుఁడై యీతండు రాఘవుని సాక్షాత్కారంబని తలఁచి తన రథముపైఁ బెట్టుకొని యజ్ఞఘోటకంబు పోవుచున్నదెసకు రథము మరలించి పోవుచుండెను.

అట యాశ్రమమున జానకీదేవి పుత్రుఁడగు లవుఁడు రామికిఁ, జింతించి కారణం బెఱుంగక మార్గము నెదురుసూచుచుండెను. వటుకుమారులు మూర్ఛితుఁడగు లవుని వైరిరాజన్యుఁ దరదంబుపై నిడి కొనిపోవుటఁ గనుంగొని శోకాకులచిత్తులై యిండ్లకు మరలి తెలతెలవోవుచున్న మొగంబులతోఁ గన్నీరుగార్చుచు, నడువలేక నడువలేక నడచుచు కడచిన వృత్తాంతము నాద్యంతమును మనంబులఁ దలపోయుచుబాలుని ధైర్యసాహసాది గుణంబుల నెంచి వర్ణించుకొనుట కేనియు వీలులేమి సంభాషణములుమాని యాశ్రమము సమీపించిరి. వటువులతో దర్భలకై వనముల కేగిన లోహితకుమారుని రాకకై ప్రతీక్షించు చంద్రమతీదేవిం బోలి ద్వారమున నిలిచి చూచుచున్న సీతాదేవిని గాంచినతోడనే మునికుమారులగుండెలు

పుత్రముఖ సందర్శనమునకు తీవ్రపడు భూపుత్రికి సంయమి బాలవర్గమునఁ దనసుతుఁడు పొడసూపకుంటచే మనంబు చలింపఁ బరుగుపరుగున నెదురువచ్చి బాలురఁ గాంచి "నాయనలారా! మా లవుం డేడి" యని ప్రశ్నించెను. వటువులొకరిమొగంబు లొకరు చూచుకొని మరిమరి ప్రశ్నించు భూపుత్రిం జీరి, తల్లీ, నీనందనుండును మేముగలసి వనమధ్యమునఁ గ్రమ్మరుచుండ, యెఱ్ఱని శిరంబుతోఁ బీతవర్ణముగల వాలమును పాలవలె ధవళమై మెరయుచున్న శరీరమును హరి నీలమునుబోలు కర్ణములును గల్గి నిటల సీమానిబద్ధకాంచనపత్రంబైన యొక్క దివ్యహయము వాయువేగమున నేతెంచెను. ఆ తురంగ విలాసమును మేమచ్చెరువంది చూచుచుండ భవత్తనూభవుండాపత్రికాలిఖితంబైన యక్షరపంక్తిని బరికించి పండ్లుపటపటఁ గొఱికి యేమీ! యీహయంబును విడిచిన వాడు వీరుఁడట, సాహసులు పట్టవలయునట; ఔరా! వీరమాతయగు మాజనని జానకి గొడ్డువోయిన దాయని మేమెంత వారించినను నిలువక మమ్ముఁదూలనాడి గుఱ్ఱమునుబట్టి యొక కదళీవృక్ష మూలమునకుఁ గట్టివేసెను. ఇంతలో బ్రహ్మాండము బ్రద్దలగునట్లు బహువిధ వాద్యధ్వనులులియ నొక సేనావాహిని సమీపించి తురంగమును బట్టినవాఁ డెవ్వఁడని పృచ్ఛించెను. లవకుమారుండు సైన్యమధ్యమునకు దూకి యేనులవుండ ఈ ఘోటకము నాచే బంధితంబు రండు రండాజికి రండని వైరము బెంచుకొని దేవతలభినందించునంతటి శౌర్యముతోబోరి బలంబులం బటాపంచలు గావించెను. వైరి రాజన్యుండొకఁడు రథంబునధిష్ఠించి నీపుత్రునితో ఘోరముగాఁ బోరియొక దివ్యశస్త్రమున మూర్ఛితునిజేసి రథంబుపై నెక్కించుకొని పోవుచున్నాడనివచించిరి. లవుని వృత్తమును నివేదింప మొదలు బెట్టినదాదిగజగజవడకుచున్న సీతయొక్క శారీరలత మూర్ఛితుండయ్యెనను వాగ్వాతమున మిక్కుటముగా దూల నాయమ హా! లవా! యని కూలి పడియె. "గోరుచుట్టుపై రోకటిపోట"న్నట్లు భర్తయగు రాముఁడు నిర్దయుఁడై తన్నుఁ బరిత్యజించుటచే వేగుచున్న పృధ్వీసుతకు సుతునిదారుణవార్త యెంతటి దుఃఖమునుగలిగించి యుండును. సీత కొంతసేపటికిని తెలివిఁదెచ్చుకొని తనూజునిఁ దలంచు కొని హా! కుమార! హా! రఘుకులవార్ధి పూర్ణశీతమయూఖా! నిముసమైనను నన్నుబాయక యదిదెమ్మిది తెమ్మని పోరుబెట్టుదువే! తండ్రీ! ఇప్పుడెందున్నావు. బాలుఁడవగు నీకీవైరమేల? ముక్కు పచ్చలారని ముద్దుబిడ్డడవని యావైరిరాజున కేనియు జాలి పుట్టలేదా! యమ్మహాస్త్రంబు నీయురంబుననాటగా నన్నుఁ జీరి యేమని పలవించితివోకదా? తండ్రీ! మీతండ్రిచే విడువబడి వగలఁగుందుచున్న నీ తల్లినగునాకు నీముఖారవింద దర్శనమున శాంతించు భాగ్యము లేదా? చిట్టిపట్టీ! అన్న లేని వైరమేల గావించితివి! నీకప్పుడే నూరేండ్లు నిండినవా? భగవంతునకు నేనేమియపరాధ మొనరించితిని. నిన్ను జూచి నీ ముద్దుపల్కులువిని నీసాహసధైర్యగుణంబుల నెంచి సర్వ జనులును సంతసించుచుండిరని మృత్యుదేవతకుఁ గండ్లుమండెనా? నాయనా! యొకమారు పలుకవేమి. యనుచు నెదుట నిలిచి చూచుచున్న మునిపుత్రుల గుండెలవియునట్లు

ఫలములు పుష్పములుc గందమూలములనుదేర వనములకుc బోయిన కుశుండు వామలోచనమదరుటచే భయమంది, సమరచిహ్నములను గాంచుచు నాశ్రమమునకు మరలి వచ్చుచు తస్కరులచే ధనంబుcగోల్పడినట్లున్న భూపుత్రినిc గాంచి తనలో ఆహా! మునిపుత్రులు చింతాపరవశులై చెక్కిటc జేతులుంచి తనరుచున్నారు. తల్లి దుఃఖించుచున్నది. లవుండెదురేగడు. ఆశ్రమము కళారహితమై యున్నది. యేదో చిలుగు కలిగినట్లున్నదని తలంచుచు నంబనుసమీపించెను. అగ్రసంభవుని ముఖబింబము నారసి సీతకు దుఃఖ ముప్పొంగc గౌగిలించుకొని యేడ్చి కడచిన వృత్తాంతమును వివరించెను. కుశుc దనుజునిపై వాత్సల్యమునc గొంత వగచి ధైర్యమవలంబించి లేచి తల్లికిc బ్రణమిల్లి జననీ, బాణాసవతూణీరకవచముల నొసంగుము. తమ్మునిc బట్టిన పాపాత్మునిc జంపి నీపుత్రునిc గొనివచ్చెద నన్ను దీవింపుమని తల్లి దీవెనలంది కార్ముకాది మహాస్త్రములు ధరించి విలయకాలమేఘమెదిరి గర్జిల్లునట్లు దిక్కులద్రువమల్లc జఱచుకొనుచు సమరదోహలియై, తరువులు శైలములుc జూర్ణములైపోవ దిగంతములc గావిరి చిమ్మచీకటులనీన నరుదెంచు చుండెను.

అదిచూచి పతాకినులు సింగపుబిల్లను గాంచి పరువులెత్తు సింధురములభంగి బారుచుండ శత్రుఘ్నుcడారసి సేనానితో భువనములు నాశనముcజేయc బైకొనివచ్చు యుగాంత కాలవృషభధ్వజునిc బోలి యల్లదెబాలవీరుcడు వచ్చుచున్నవాcడు, మధ్యాహ్న కాలమార్తాండునివలె మొగము ప్రకాశించుచున్నది. నేత్రగోళముల నుండి విస్ఫులింగము లెగయుచున్నవి. కవచకార్ముకాదిమహాస్త్రములు దివ్యకాంతుల నీనుచున్నవి, ఉరుమకయే పిడుగులు వడుచున్నవి. వఱఁకులు గూయుచున్నవి. యొఱలనుండి యకారణముగా నాయుధములు విఱిగిపడుచున్నవి, మరియు రథికులశిరోభాగములc గాక ఘూకములు వ్రాలుచున్నవి. జయపతాకలయగ్రముల నిర్నిమిత్తములై ధూమకందళములు కందళించుచున్నవి, నీకార్ముకవిద్యాసంపత్తిచేత కీడుcగలుగకుండ రణవిముఖునిc జేసిరమ్ము పొమ్మనుటయు సేనావాహుcడు చుఱుకుగల సేవలc గూర్చుకొని తక్షణమే జానకీసుతు నెదుర్కొని బహుబాణములచేc గుశుని ముంచివేసెను. కుశుం దనుజాపజయసంజాతకోపపరీ తుండై యుంటచే పరిపూర్ణనైపుణి మెరయ నాతని ప్రతిబాణమును తుత్తునియలు చేసి తురంగధ్వజచక్రరక్షకసమేతముగా సేనానిపదంబులు, హస్తమును విచ్ఛేదించెను. అగ్రజుని పాటుc జూచి నగుండను శూరుం డాశానేకపసన్నిభంబగు నిభంబు నధిరోహించి కుశుని మార్కొని శక్తిబాణమును పరగించెను. కుశుండు చిరునవ్వునవ్వి యావిశిఖంబును మూడునారా చముల భంగపరచి యంతc దనివి సనక మరి నాల్గుకఱకుటమ్ములచేనక్కరిపదంబులు త్రుంచి వైచెను. రణకోవిదుండగు నప్పగతుండాద్విరదం బుర్వికిcగూలకమున్నె నేలకుఱికి భీకరంబగు నొక్కగదను దాల్చి యెదుర్కొనుటcగాంచి సైతేయుండాతనిగదతో హస్తంబును, దునుగున ట్లొకయంబకంబును వదలెను. అది వాని గదాహస్తంబునుత్తరింప నగుండు

సవ్యదోర్మండలమునఁ జక్రమును దాల్చెను. కురుండదియును దునిమివైచె. అంత నమ్మేటిమగండు కొమ్ములు నఱికినమోదువలె నిలిచి పట్టలేనంతటి యాగ్రహమున నర్కునిఁ బట్టు రాహువువలె మీదికుఱక సీతాసుతుండు తనశరవిద్యానైపుణి ప్రకటితమగున ట్లొక వాడియగు బాణంబున వాని శిరంబును వ్రక్కలించెను, విరోధి రణభూమిపైఁ గూలుటయే దడవుగా కుశుండు విజృంభించి సేనలవెంటఁ దగిలి చిత్రవధఁ గావించెను. బలయుతులగు తనసైన్యాధి పతుల వ్రేల్మిడిఁ జంపి కాలుని నిలయమునకంపి బలముల లేళ్లభంగి వేటాడుచు వెనుదగిలి పర్వులెత్తు నబ్బాలుని శౌర్యధైర్యపరాక్రమంబుల కెంతయు విభ్రాంతిపడుచు లక్ష్మణానుజుండు భటులపాటుఁ దలచి మహా కోపంబున నేగుదెంచి తెంపులేనటుల భీషణములగు నాశుగముల వర్షించెను.

బాణవర్షమునమునిఁగి కుశుండు రోషకషాయితాక్షుఁడై యుక్కు మిగిలితూపుల నాల్గెక్కిడి శతాంగమును జూర్ణముచేసి పటుతర భూరివిషానలకీలలు గ్రక్కు నొక్క విశిఖంబునఁ బేరురనునగులుప నతండు పర్వతసాను భాగమునుండి భూమికిఁ గూలిపడు భద్రదంతావళము చాడ్పునఁ దేరినుండి పడియె.

అట్లు గూలిన శత్రుఘ్నునిఁజూచి సైన్యసంఘము హతాశచే దైన్యము వహించి దిక్కులకుఁ బర్వులెత్త మొదలుబెట్టెను. ఆకీలెఱింగి లవుండన్నకుఁ దోడుపడి మఖతురంగము నొక భూజమునకు గట్టివైచి సమరోత్సాహియై నిలువ కుశుఁడు మారుతమైత్రినిఁ జండ తరంబై వెలుఁగొందు హుతాశనునివలె భాసిల్లుచుండెను. హత శేషు లయోధ్యకుఁ బరుగెత్తి, హయమేధదీక్షితుఁడై, యజ్ఞవేదికా సీమామధ్యమున మౌనిజన పరివృతుఁడై, శాతకుంభ సీతాసమేతుండై, తిలసమిదాజ్యవర్తితహోమధూమవిలారక్తలలిత కర్ణాంతనేత్రుఁడై, కురంగశృంగ హస్తుఁడై, పెంపుదనరు రామభద్రునిఁ గాంచి సప్రణాములై దేవా! యధ్వరఘోటకం బుద్వృత్తి సకలదిక్కులనుఁ ద్రొక్కుచుఁబోవ నడవిలో నొకవటువు దానినిఁ బట్టి రంభాపాదపమునకు బంధించెను. అతఁడు కొంతతడవు మాతోఁ బోరి తుదకు నీయనుజుని చేతఁ బట్టువడియెను. ఇంతలో మార్తాండ తేజోసదృశుండును, మహాహవకోవిదుఁడును, శాతాసిచాపధరుడునగు నొక బాలవీరుఁడు వచ్చి బలశతంబుల పైకుఱికి కసిదీరునట్లు మీయనుజన్ముని గూలిచెనని వినయముతో మొరవెట్టిరి. ఆవాక్యముల నాలించి రాముఁడు ఓరీ మీకు వెఱ్ఱిపట్టినదో లేక భూతము సోకెనో మార్గశ్రమమున మతిఁ దప్పితిరో, నాతమ్ముఁ డహితులచేఁ గూలునా? ఇదినమ్మరాదని వచించెను. భటులు తమభక్తిని వెల్లడించి నిజంబని వక్కాణించిరి. రాముఁడు కళవళమునంది ఆహా, లవణాసురుని నెక్కటి కయ్యంబున గూలిచిన నా తమ్ముఁ డొకనిచేఁ గూలెనా? అనుజా! ఎన్నడు నెదురుత్తరం బీయవు కదా అర్భకునకుఁ జిక్కితివా? నీగుణంబులు వర్ణనీయములుగదా యని కొంత పలవించి లక్ష్మణుని జూచి శీఘ్రమె పోయి వైరిని గూల్చి తమ్ముని బ్రతికించి భాస్కరవంశప్రవరుల

నర్కకులప్రదీపకుండును రామపాదాంభోజ బంభరుండును, భండన భీముండును నిర్జితవైరి రాజన్యమండలుండును భువనభయంకరప్రతాపుండును బహుశస్త్రాస్త్రవిద్యాప్రవీణుఁడు నగు సుమిత్రాసుతుండు పయనమయ్యెను.

# కుశలవోపాఖ్యానము

## నాల్గవభాగము

అష్టమదంబులచేత నగరాజములకును రాజసంబుఁ జూపఁజాలిన గజసహస్రముల తోడను, నిరాఘాట జవసత్వములచేతఁ బవమానవేగమున కవమానమును గలిగింపఁజాలిన ఘోటకవర్గముల తోడను, దేవేంద్రుని దివ్యరథమునకన్నను వేయిరెట్లధిక తేజస్సమానములై దీపించు రథవ్రాతములతోడను, దుర్వారమైన గర్వాటోపమున హరికిశోరములు గోహరికి వెనుదీయని భటకదంబములతోడను, ప్రళయభైరవ హుంకారధ్వనుల ధిక్కరింపజాలు భయదపటహనాదములతోడను, సమరసన్నాహియై రఘురామునకు మ్రొక్కి లక్ష్మణుఁడు ప్రయాణము సేయుచుండెను. రథచక్రములచేత పరిక్షుణ్ణమైన భూరజము నింగికిలేచి యెల్లని క్రొత్తచీకటులు గల్పించుచుండెను. భటులు కరముల ధరియించిన కత్తులయొక్క ధవళమరీచులచే గగన భాగమున మేఘములులేని మెఱుపులు బుట్టుచుండెను. తేరులపై మెరయుచున్న పతాకముల కాంతులు వింతవింత రంగులు గల్పించుచు నేత్రానందము సేయుచుండెను. కవచముల యొక్కయు విండ్లయొక్కయు నానావిధ బాణజాలములయొక్కయు నపూర్వమైన నిర్మాణలీలబలము ధైర్యసాహసములు చెప్పకయే చెప్పుచుండెను. వేదండములపిండులు తొండములచే మేనఁ జల్లుకొను దుమ్ముచేతను తురంగజాలములు ముంగాళ్ళ గిట్టియలచే నేలను దన్ని చిమ్మివేయు రజః పుంజంబునుగలసి యేకమై సైనికులకు నెల్లని తెరలవలె విరాజిల్లుచుండెను. మిక్కిలి భయంకరములై మ్రోయుచున్న వివిధ వాద్యధ్వనులు దిక్కుంభిగములకు చెవులు చీదరలు గొలుపుచుండెను. ఇట్లు రణవైభవలీలఁ గదలివచ్చి సౌమిత్రి వాల్మీకివనముఁ బ్రవేశించి రణ శయ్యపైఁబడి ధూళిధూసరగాత్రుఁ డైపొలుపొందు తమ్మునిఁ బరీక్షించుచుండెను. కదనవిద్యా విశారదుండును శాత్రవతిమిరభాస్కరుండగు కుశుండాసైన్యకలకలం బాలించి లవుని గాంచి అనుజా! తమ్ముని చావుచే నాగ్రహచిత్తుఁడై వైరి బహుసైన్యములతో సమీపించె కర్తవ్యంబేమని పృచ్ఛింప లవుండు సమరమనువాక్యము చెవినబడినతోడనే సముత్సాహసమేతంబై శరీరమునఁ బులకలంకురింపఁ గుశునిఁ గాంచి అగ్రజా, సెలవు పెట్టుము విరోధిసేనలఁ బిప్పిరిచేసెదను. యుద్ధమునకుఁ గడంగుమని తొల్లి శత్రుఘ్నునిచేఁ దనకార్ముకంబు భగ్నంబౌటఁ దలంచి భక్తినియమపురస్సరముగా లలాటతటసమేతాంజలియై పద్మ బాంధవునిఁదలచి తమః పటలతిరస్కరా, సహస్రకరమస్కరా! అహస్కరా! గృహీతసుమనస్కరా! భాస్కరా! భజే యని

లస్తకమును రత్నాలంకృతమును, సమిద్వీరులగు నరాతిజనుల సంహరింపఁజాలు క్రమవిద్యా చిహ్నములుగల యల్లెత్రాటిచేఁ చెంపుమీఱుచాపంబు నిడి పంపివేసెను.

సహజ తేజఃపరిపూర్ణదేహుఁడగు లవుండు విప్రవటు వేషమునఁ బ్రజ్వరిల్లుచు సూర్యదత్తంబైన వింటినిదాల్చి కృత్రిమబ్రాహ్మణ వేషధారియై భార్గవునికడ విద్దియ నేర్వఁబోవు భానుసుతుండగుకర్ణుని వలెఁ బొడసూపుచుండెను. కర్ణుండననేల సూర్యదత్తంబులగు కర్ణకుం డలకవచకార్ముకములను సంగ్రహింపఁ గపటభూసురుఁడై రాధేయుని వంచించిన మహేంద్రుని భంగి విరాజల్లుచుండెను. మహేంద్రుఁడననేల పితృవధజాతకోపంబున రాజవర్గములను రూపుమాపఁ గంకణముఁదాల్చిన భార్గవరామునివలెఁ బ్రకాశించుచుండెను. భార్గవరాముఁ డననేల? బాహుదర్పంబునను, ఆ కర్ణాంతనేత్రయుగళంబునను, యంగ సౌష్ఠవంబునను, విక్రమ గుణంబులను; నిజజనకస్వరూపప్రతిబింబిక దర్పణంబనఁదగు వదనబింబంబునను, తన మహిమా ప్రభావమున లోకములను బెగ్గిలజేయుచు ననుజన్మలకు తనశక్తినిఁ బ్రకటింపఁ దలంచి బాలుఁడై పొడసూపుచున్న రాఘవరాముండోయను సంశయమును గల్పించుచుండెను. ఇట్లరుగుదెంచి లవుం డన్న కాకార్ముకంబును జూపి వాల్మీకిమునీంద్ర కరుణాలబ్ధమంత్రజ పంబున మార్తాండుఁ డొసంగుటయు దాని రహస్యములును వివరించెను. అంత బాలవీరులు దలపడి సౌమిత్రినిఁ దాకి పోరఁ గరటిస్యందనఘోటవీరభటయుక్తమగు తత్సైన్యమున యోజ నార్థము గూలిపోయెను. ఆనెగులు నారసి సేనానియగు కాలజిత్తుఁడు లక్ష్మణునకు బాసటయైవచ్చి పెక్కుసైన్యములతో లవునిఁ జుట్టుముట్టి కరులుశతంబు, కరికరదములు సహస్రము, యొకయరదమునకు హరిశతంబు హరిశతంబునకు నూటిసంఖ్య పరివారముగాఁ గ్రమ్ముకొనుటయు లవుఁడారసి యంతకునివలె నాగ్రహించి, గర్జించి దశచతుష్కభ్రముల ముహూర్తకాలమున పటుప్రహరణహతులచే త్రుంచివేసెను. కరవాలములను, నఖరములను, బాణాసనములను, పరిఘలను, ప్రాసములను, ముసలములను, గుంతములను, తోమరములను, శూలములను దాల్చినవాఁ డై దుగ్ధజలధిని మథించిన మంధరశైలము చాడ్పున మెరసి లవుండు సేనాసముద్రమును మథించిమించినవాఁడై చాలించి కుశునిఁగానక నానాస్త్ర ఘాతముల దిగబాఱుచున్న నెత్తురుటేరులుగల శారీరుఁడై పార్శ్వములను జూచుచు నిలుచుండెను. భయంకరాహవశ్రమంబునను స్రవించురక్తధారలచేతనునొచ్చి నిలిచిన లవున కగ్రజుఁడు గానుపింపమి, మిక్కిలి విచారమావహిల్లి కర్తవ్యమును మఱపించెను. అట్లు పరాకునున్న లవకుమారుని రాఘవక్షితిపతిలెంకయై శరణుఁజెందినవాఁడును, బలాఢ్యుడు మున్ను లవణాసురునికి మాతులుఁడై యొప్పినవాఁడునునగు రుధిరాక్షనామధేయనిశాటుండు సనుదెంచి లవునికరస్థశరాసనమభ్రవీధికిఁ గొనిపోయెను. లవుఁ డపహృత చాపుఁడై చక్రమును గేలబూని చక్రిపటిమనుఁ జూపి దేశికవరేణ్య కృపార్జితమైన మంత్రమును బఠించి విహంగమును బట్టఁజాలు దేగ విధముగ నుప్పరమున కెగసి దైత్యుని దఱుముచు వెంటఁ

ఆబాలునిప్రతాపమునకు వెఱచి సైనికులు గజశరీరమార్గణ రంధ్రముల వెంట జొరఁబడి గగనమును దొంగిచూచువారును భగ్నమైన శతాంగకూబరచక్రములక్రింద నొదిగి మిన్నకుండువారును, భటవిగ్రహముల యొక్క కుప్పలచాటున నక్కువారును, హయకబంధములను పైకి దొర్లించుకొని పీన్గులవలెబండుకొనువారునునై యీతఁ డెవ్వరి మీదికొఱగునా యని యస్త్రములనువదలి కళవళించుచుండిరి, అది గనుఁగొని దశరథమంత్రికుమారులగు సింహచంద్ర కాల ధార్మికమదన శత్రుసూదన జితశ్రమామల శరన్నద సుకేతులను పదుగురు సాహసు లాగ్రహించి జ్యాఘోషములు చదలంటుకొనునట్లు మ్రోయించి లవుని చేతిచక్రమును చిద్రుపలగునట్లు పదిశరములు వదలిరి. చక్రము హతమైన వెంటనే లవుం డిలాచక్రముమీదికి దుమికి గదనుగొని వైవనత్యంతశౌర్యదశరథులగు నద్దశరథమంత్రిసూనులు దశరథులు నిముసమాత్రమునఁ గూలిపడిరి.

అంత మదోద్ధతుండగు రుధిరాక్షుడు క్రమ్మరవచ్చి యొక్క గదాఘాతమున లవుని శిరమగలించెను. ఆదెబ్బచే గ్రమ్మికొనునెత్తుటిచే బాలుఁడును గొంతవిసంజ్ఞుండై వెంటనే తెలిసి కుంతమున దానవుని గొంతుకను ద్రుంచివేసి ముషితంబగు నయ్యర్కచాపమును బుచ్చుకొనెను, దైతేయునిఁ గెడపిన సైతేయునిపైకి సైన్యముఁగవియ నడగిన చంద్రనిప్పు సమీపముననున్న తృణజాలములదహించి కాఱడవినిదహించునట్లు అంటివచ్చిన సైన్యములను పెక్కుభంగులఁ గూలిచి మిగిలినసేనలను బాధించుచుండ, కుశుఁడాతరుణమునుగనిపెట్టి యపూర్వమృగేంద్ర పరాక్రమోన్నతుఁడై లక్ష్మణు నెదుర్కొనియె. పటుశౌర్యముననిట్లు మార్కొనిన కుశునిపైకి సౌమిత్రియైదు బాణములను బరగించి యురమును బగిలింపఁ గుశుఁడు సమీరశరమును సంధించి సమిద్ధీరుండవైన నిలువుమనుచు విడువ ముహూర్తమాత్ర మాతనిరథము బొంగరము కైవడి గిరగిర దిరిగి విస్మయమును గల్గించెను. ఇట్లు దిరుగు నరదపుభరమున నాల్గురథ్యములును బ్రాణములను వదలెను. గుఱ్ఱములు చచ్చుటెఱిగి లక్ష్మణుండు కట్టలుక వహించి మఱొండు రథమునెక్కి యస్త్రపంచకమున నబ్బాలుని కిరీటకవచములను దునిమివైచెను. వైచుటయును గుశుండు కుబుసమును విడచిన మహాసర్పమువలెఁ బ్రకాశించి నవ్వుచు నక్కాకుత్స్థునిఁజేరి, మకుటకవచముల భారమును వాపిన పరమోపకారివగు నీకుఁ బ్రత్యుపకారంబుగా నాబాణపంక్తులచే నీసైన్యభారమును దీరిచెద ననుచు నాగ్నేయాస్త్రమును బ్రయోగింపఁ దజ్జనితంబైన మహార్చిచ్ఛట లమ్మహాసైన్యమును దగ్ధముఁ గావించెను.

ఇట్లు రణమంతయు దారుణమైన శిఖిశరశిఖలచే బరిచ్ఛన్న మగుటఁ గాంచి దాశరథి వారుణాస్త్రమునువైచి తద్విశిఖము నుపసంహరించెను. అగ్నిబాణము వమ్మగుటచేఁ గుశుండలిగి వాయవ్యాస్త్రమును వింటఁగూర్చి విడువఁ దదాశుగ ప్రభవంబగు మహామారుతంబు చతురంగబలంబులను నభోమార్గము నుద్ధూతమొనరింప మాంజిష్ఠంబున రణలక్ష్మికుల్లెడఁబట్టినట్లు గన్పట్టుచుండెను. సేనావాహిని కుశకుమారుని సమీరశరమున

నబ్బాలునియురమును గాడనేసెను. ఇట్లు నొప్పించి కుశుని గాంచి బాలుఁడవు, రణపద్ధతు లెఱుంగవు. నాశౌర్యమును దలంపవు, ఆలమును దొలగుమని వచింపఁ గుశుండలిగి యొక్క మహోగ్రశరమున వాని శరమునుఁ ద్రుంచివైచెను. కాలజిత్తుడు గూలిపడుట సౌమిత్రి పరికించి, క్రోధితహృదయమున భిండి వాలఖడ్గాది బహువిధాశుగసాధనములను నిగిడింపఁ గుశుఁడన్నియునుఁ దునుమిడైచి వామలూరుభవుఁ డిచ్చిన పన్నగబాణపంచకమును బ్రయోగించెను. ఆపంచబాణములు నప్రతిహతమగు నగ్నికీలలను గ్రక్కుచు నేగి యురోభాగమును దాక లక్ష్మణుండు చరమగిరి నస్తమింప వాలిన భానుమంతుండోయనఁ క్షితిపయినిఁ బడియెను. దురంబున సౌమిత్రి కూలుటయే తడవుగా కుశుం డొకవాలుఁ దాల్చి పార్శ్వమునఁ బోరుచున్న తమ్మునితోఁ గలసి యింద్రుఁడువజ్రధారచే కులపర్వతములను గూల్చునట్లు సైన్యములను ద్రుంచివైచెను. ఇట్లు విజయలక్ష్మి నధిష్టించి యక్కుశలవు లిరువురును జగదేకశూరులై మెరసి హర్షప్రఫుల్లమనంబుల తో నాశ్రమమునకుఁ బయనమై పోవుచుండిరి. ఆసమయమున యజ్ఞదీక్షమై గంగాపుణ్యవాహినీ తీరమున యతులతో నర్వాసనమున నున్న రఘువరుండు భరతునిఁజూచి తమ్ముడా! భరతా! శత్రుఘ్నునిఁ గూలిచి హయమునుబట్టిన చోరకులను ద్రుంచి తమ్ముఁడికను రాకుండుటకుఁ గారణమెద్ది? చలమున బోరి బాలకులు గూలిరో! లేక జీవితేచ్ఛ శరణంబును వేడికొనిరో; కాక మిక్కిలి శోకమున వారి తల్లిపుత్రభిక్షఁ గోరుకొనియెనో! తెలియకున్నది. జన్నముపక్రమించుట కింక దివసత్రయము మాత్రమే కలదు. ధూర్తులగు నబ్బాలకులు నన్నును విభీషణాదులను గణియింపనట్లున్నది. శీఘ్రమె బుద్ధి సంపన్నులగు భటులనుబంపి యచ్చటి రణక్రమము సర్వము నెఱింగిఁపుమని యానతిచ్చెను. భరతుఁడన్నయాజ్ఞ నంది బలయుతులగు నేవురు భటుల నేర్పరించి రామక్ష్మావరుని సమ్ముఖమునకుఁ బంప రాముఁ డాదూతలతో కొమరులు సాపరాధులయినను క్రోధాతిరేకమున వధియింపఁ బూనక సమ్మోహనాస్త్ర ప్రయోగమునఁ బట్టుకొని తెండు. మరియ నబ్బుడత లస్మత్స్వరూపులనియును శౌర్యధనులనియును వినియుంటిని.

తడవుసేయక పొందనివచియించు నాసమయంబున గంటుల వెంట శోణితంబు గురియుచుండ హతశేషులగు కాల్బలముకొందరు బారుతెంచి రఘువరుని పాదజలరుహమ్ములపైఁ బడి మహాత్మా! సుమిత్రాసుతుఁడగు లక్ష్మణుండాజిమధ్యమునఁ గుశుని శరాభిఘాతమునఁ గూలిపడియెనని వచియించి వెండియుఁ గాలజిత్ప్రముఖులగు వీరవరుల మరణంబులను వినిచిరి. ఆవాక్యములు వినినంతనే రఘువరుండు పరశుచ్ఛిన్నంబైన సాలమట్లు వీపువిఱిగిపడి మూర్ఛవోయెను. భరతుడన్నను సమీపించి హిమాంబుపూరములు కన్నులపైఁజల్లి వీనులయందుఁ గప్పురమునూద గొంతవడికి మూర్ఛఁ దేరి, యెలుగెత్తి యేడ్చుచు, అనుజా! లక్ష్మణా! పదునాలుగేడులు వనముల నాహారనిద్రలను దొఱఁగి నన్ను రక్షించితివి. దేవతాకదంబములు నుతియింప నింద్రజిత్తును గీటడగించితివి. కట్టా! నిన్ను మాణవకమాత్రుఁ డెట్లు నిర్జించెను. తండ్రీ! నీవులేని రాజ్యము నాకేల? ముఖ

దీక్షాపేక్షచేల? ఐశ్వర్యంబులేల? సుఖంబులేల? నాజన్మమేల? హా! తమ్ముడా! నీవంటి తమ్ములిక నా కీ జన్మమున లభింతురా! భార్యారహితుండనగు నాచింత నెవరి ముఖమునుజూచి వాపికొందును, యెవరిని లక్ష్మణాయని పిలువఁగలను. రాజ్యభోగములేకున్నను, వనముల నంతకాలమును నీసేవయేగదా నాకుసమస్త సౌఖ్యదాయకమగుట, నాయాశ్రయమా; నాదక్షిణ భుజమా! హా! నా సహజన్మా! నీయగ్రజునిఁ బిలువవేమి? నీభక్తి తాత్పర్య గుణజాలములకీరాముఁడు కృతఘ్నుఁడు గదా? నాయనా; యెందున్నాడవు? ఇంతలో స్వర్గపురికిఁబయనమైతివా? జీవచ్ఛవంబై నీయన్న యిందుండ నందెవరినిఁజూచి సంతసింతువు? నీకన్నముం దీరాముండుతీరియున్న నీమరణవార్తను వినియుండడుగదా? ఓమృత్యుదేవీ! మున్ను రావణునిశక్తి నాటి కూలిన నాతమ్మునిఁ గరుణించినీవేగదా? విడిచితివి, ఇప్పుడా నీ కరుణయేమయ్యె? పత్నీరహితుఁడై కృశించు రాముని ననుజన్మరహితు నొనరింపఁదలంచితివా? యీరామునిపై నీ కంతకసి యేలపట్టె ననుచు, శోక జలనిధింబడి మునుంగుచుఁ దెఱవుఁగానక బాధపడుచు భరతునిఁజీరి బాణతూణీరములను దెమ్ము వైళంబ పోయిభండనంబున డింభకుల ఖండించి వచ్చెదనని భయంకరముగా వచించెను,

భరతుఁడన్నకుఁగేల్మోగిచి, అగ్రజా! సంగ్రామభీరులై వచ్చివచియించిన చారుల వాక్యములనునమ్మరాదు, మహాభుజులగు లక్ష్మణశత్రుఘ్నులకు మరణముకలదా? అది మూర్ఛయైయుండనోపునని కొంత శాంతినిఁ గలిగింప రాముడుచారులఁజీరి బాలురగువారల కంతటి శౌర్యమేల కలిగె? కడుపిన్నలంటిరిగదా? అదృశ్యుండై తోడ్పడు బృందారకుఁ డెవ్వఁ డే నియునుండెనా? యనిప్రశ్నింప, దూతలు వినమ్రులైదీనాలాపములతో దేవా? మున్నుశత్రుఘ్నుఁడు నిర్జించిపట్టిన బాలునకు నగ్రజుండొకఁడరుదెంచి సైన్యములను దరుముచుండ లవకుమారుఁడు తప్పించుకొని, సూర్యునకునమస్కరింప నంతభాస్కరుఁడు ప్రత్యక్షంబై, భువనైక తేజస్సమాన విరాజమానంబగు నొక్క కార్ముకము నిచ్చెను. సూర్యదత్తమగు శరాసనంబునంది బాలుఁడు సూర్యునివలె మెఱసి శూరులగునీతమ్ములను గూల్చి యజేయుఁ డై వెలుగుచున్నవాఁడు, మరియువారు పాపలైపొడసూపియుఁబాపలుగారు. కేవలము నారాయణాంశ సంభూతులరగు వేలుపు బిడ్డలుగాని వేఱుగాదని వచియించిరి,

ఆవాక్యములనా కర్ణించి రాముడు మహాక్రోధియై సింహమువలె గర్జిల్లి, నింగికిఁజూచి, భాస్కరా! యెంతపనిఁజేసితివి? అహితులకు సాయపడి హితులకహితంబొనఁ గూర్చితివా? నిత్యమును నిన్ను సేవించు సేవకులపై విరోధమును గల్పించుకొనుట నీకుధర్మమా? మరియును నీవు సర్వసాక్షివియును, లోకబాంధవుఁడవుగదా? అధర్మమెట్లవలంబించితివని నిష్ఠురోక్తులాడుచుండెను. భరతుడు సమరసన్నాహియై యగ్రజునకు దండప్రణామంబులాచరించి, రఘూద్వహా; తురగతస్కరుల క్షణమాత్రమునఁ బట్టిబంధించి నీకడకుఁగొనివచ్చెదననుజ విమ్మనుటయు రఘువరుండు తమ్మునిదీవించి

వృక్షచరయామినీచర వీరయోధుల సహాయముగా బంపెను. కేకయరాజనందనుడు బలంబులతోఁ పయనమై జాహ్నవీ విశాలతటమునకు బోయి పవమానసూనుఁడగు హనుమంతునిఁజేరి యతనితో సౌమిత్రుల చందమునారసిరమ్మని పంపనతఁడు సని లక్ష్మణశత్రుఘ్నుల సందిటనిఱికించుకొని నిముసమాత్రమునఁ గొనివచ్చి భరతుని ముందుబెట్టెను. మూర్ఛితులైయున్న సహోదరుల విధంబవలోకించి భరతుడు మిగులబొగిలి శూరాగ్రగణ్యులగు నీవీరుల శరనిహతిఁ బరిభవించినవారు దారకులా! బృందారకులా యని కొంతచింతించి రథమునెక్కి దేవదత్తమును పూరించెను. ఆశంఖధ్వని నాశ్రమమార్గోన్ముఖులై పోవుచున్న కవలలాలించి సమరోత్సాహమున మఱలి, కోదండ గుణధ్వనులుగావింప నమ్మౌర్వీక్వణశంఖారావములకు దిక్తటములు వ్యాఘూర్ణము లగుచుండెను.

అట్టిసమయమున నిక నిప్పటి మహాహవంబు దుర్నిరీక్ష్యమన్నటుల భానుమంతు డస్తాద్రికిఁ బోయెను. నీడజాలముల శకుంతములు శయనించెను. చక్రవాకములు కుడుంగముల దూఱెను. చెవులు గింగిరుమనునట్లు నిలకోళ్ళు గూయనారంభించె. కమలజాండములు మొగిడె. చుక్కలుపిక్కటిల్లె. నీలాంబరమునుదాల్చి యామినీకాంత పయన మయ్యె. ఘూకములచేఁ బట్టువడి ప్రాణభీతిచేత చిన్నిపిట్టలు గూయసాగె. సైనికులమార్గ శ్రమమును బాపదలచి సన్న తెమ్మెరలు వీవనారంభించె. భరతున కపజయంబన్నట్టు లేవంకను నక్కలు గూయుచుండె. తమ్మిచూలివలె బక్షపాతబుద్ధి నాయందు లేదని యెఱుకఁజేయనో యననిశావధూటి తనమంత్రశక్తిచే సమస్తలోకము నంధీభూత మొనరించెను. మదనుడమ్ములను సానబట్టుచుండ నిఱుపార్శ్వముల రేగిననిప్పురవ్వనోయన మిడుంగురుంబురువులు తళుకు తళుక్కున మెఱయుచుండెను. గుఱుపెట్టి నిద్రించు జీవరాసుల నిస్వనంబులను తరంగ ధ్వనులుగా గ్రహించి నిశావాహిని జగముపై బ్రవహించుచు కాల సముద్రమునఁ బడుటకై పరుగెత్తుచుండెను.

పరస్పర వదనబింబములును గానరాక క్రమ్ముకొను చిమ్మచీకటులతో కదనభూమి భయప్రదమగుచు నుండు సమయమున లవకుమారుఁ డన్నకుఁ దోడ్పడి ప్రకాశవంతములగు బాణజాలములను బఱపి యేతత్కాంతులచేత నంధకారపటలమ్మఖిలమ్మును ఖిలమ్ముఁ గావించెను. కాష్టంబులను గొడ్డటనఱికినట్లుబలంబుల నఱికినఱికి లవుండొక్క కఱకుటసిని విడువ నందుండి క్రొమ్మిడుఁగురు లుద్భవించి బలములఁజుట్టుముట్టి దహించివేసెను. కుశుండునుఁ గార్ముకటంకృతులఁ గావించి, యక్షుద్రక్రోధాతిరేకమున బ్రోచ్చలద్భ్రూయుగా ననుండై, చండార్కకర్కశ బాణంబులచే సేనల బిలుకుమార్ప నాత్మబలంబులందు దుర్ద శంబరికించి భరతుండు చింతాపరవశుఁడై యేమిచేయుటకును దోచక నిలుచుండెను. అంతకుశుండు పైకురికి ఓరీ! తమ్ములుకూలిపడిన సమీపమునకు నిన్నును దైవముగొని వచ్చుటచే మాకానందమగుచున్నది ఇప్పుడెందఱిగెదవు? కుశునియెదుటఁబడియు నీవింక మరలిపోఁగలవా? రఘురాముని యేడుకాండములు గెకేయసుతుని మరికొండపపకమున

సుషేణుని వేయికోలల వాయుపుత్రుని నూరుబాణములఁ బవమానసూనుని యేనూఱువాడితూపుల నీలుని, ఇన్నూరువిశిఖముల గవయుని, త్రిసహస్రసాయకముల జాంబవంతుని గూలిచి విపుల తేజుండై నిలువ సురలచ్చెరువంది కుశునిపై మందారపుష్పవర్షమును గురియించిరి. అంతట ఘోరతరమైన కుశుని వీరసమరమును జూచువేడుకమై చనుదెంచెనోయనఁ బొడుపుఁగుబ్బలిపై భాస్వంతుఁడు పొడసూపెను. ఉదయ పర్వతపీఠికాగ్రము నలంకరించిన దినరాజునకు వింజామరలు వీచిహాయిఁగూర్చుచుండెనోయన మందవాతము విహరించెను. కుశలవుల విజయమునకు సంతసించి స్తోత్రగానములు సలుపుచున్నవో యన సుస్వరములఁ గోయిలలు గూసె. వికసించిన పుష్పకలాపములపైకి మధువులానఁబోవు తుమ్మెదలట్లుకూలిపడిన సైనికనికాయములు నేత్ర పర్వములగుచుండ రాపులుంగులు పైపై నడయాడుచుండెను. బ్రహ్మాండము నావరించిన తమంబుచే దిక్కుదోచక భయంకరమై యొప్పిన కదనము ప్రభాతమున లోకములకు వెలుగునాపాదించిన రవిప్రభలచే బీభత్సమై చూపట్టు చుండెను.

ఇంతలో కొంతమూర్ఛదేరి ప్రేరితసైన్యుండై యెదిరింపనున్న రాముతమ్ముని మూడమ్ములచేత చాపమును దునిమి మఱికొన్ని యుగ్రబాణములచేఁ దేరిపైఁగూల్ప మరుత్సూనుండును, దెలివిఁదెచ్చుకొని, లేచి, యలుకవహియించి మహాశైలమునొక దానినిఁ బెకలించి దారకులపైనేయ నదిపడకమున్నే శరపరంపరలచే శకలంబులొనరించి కుశుఁడు బలప్రకరంబులను బరిమార్చివైచెను. హతశేషులు రామక్షితిపతికడకు బఱుగెత్తి తెలియఁ జేయగొంతవగచివిభీషణసూర్యతనూజసహితుఁడై మహారథము నధిష్ఠించి బయలువెడలెను. అట్లుచతురంగ బలపరివృతుండై దాశరథిచనుదెంచి భండనముఁ జేరి వీతభయులై బృహచ్చాపధరులై, యాత్మప్రతిబింబములై, మనోహరాకారులై, ఇనసమతేజులై, ప్రకాశించుచున్న బాలురను వీక్షించెను. రాముఁడా బాలుర నారసి కరుణాప్రేరితమనంబున మృదుమధురవాక్యములతో, అర్భకులారా; తండ్రి యెవరు; మీ జనని యెవ్వతె? మీకు జాతకర్మ సంస్కారముల నెవరు గావించిరి? ఎట్లు ధనుశ్శాస్త్రకోవిదులైతిరి? మీకీ యుద్ధ చాతుర్యమెట్లు కలిగె? మిమ్ము నొంటివిడిచి జననీజనకులు మనంబు లెట్లు చిక్కబట్టిరి? తెలుపుఁడని ప్రశ్నించెను. భయంబనుమాట స్వప్నమునందైన నెఱుంగక ప్రతాపమునే యుగ్గుఁబాలతో ద్రావివర్ధిల్లిన యాబాలకులకు రాముని యాదరణవాక్యములు నవ్వును గల్పింప మోమోటములేక ఓరీ! వైరీ! ఈ తేటలకు లొంగి బేలలమై తురంగమును విడుచువారముకాము. రణభూమిఁ జేరి శత్రువీరుల పరాక్రమమునకు వెఱచి కూర్మినిఁజూపి గోత్రవిమర్శనమునకు మొదలుబెట్టి తప్పించుకొనఁజూచు భీరులు క్షత్రియవంశమున నున్నవారని మాకిప్పటికిని, దెలియదు. ఇంత భయముఁగలవాఁడవేయయిన రణమునకు రాకున్న నెంతబాగుండును. నీయాటలిక్కడ సాగిరావు. రోటఁదలఁదూర్చితివి యిక రోకంటిపోటునకు భయము పడనేల? రమ్ము వైరము సేయుము. ఇందుమూలమున మీతల్లికో కాక మాతల్లికో వీరమాతయను నామము

రావలయును. ఇదివరఅకెందరితో నిట్లు మైత్రినెఱపి తప్పించుకొంటివి.

నీ జన్మమున కిది కడసారిగాఁ దలంచుము పాపము! తమ్ముల మరణమునకు దుః ఖించుచు నింటనుండక యిచ్చటికేల వచ్చితివి? నీవునుగూలిన నిక వారినిఁ దలంచి దుః ఖింప నన్నయ్య లెవ్వరుందురు? అని పెక్కుగతుల నొవ్వనాడిరి.

# కుశలవోపాఖ్యానము

## అయిదవ భాగము

తమ ముద్దుపల్కులచేతను రూపములచేతను చూపఱులకు ముద్దునుగలిగించుచున్న యాబాలురెంత హైన్యముగా దూలనాడినను కోపించుకొనక శ్రీరాముడు యెలనగవు జూపి యింకను వారివాక్యంబుల నాలింప గుతూహలంబు వొడమ మిక్కిలిదీనముగా మునుపటివలె బృచ్ఛించెను. బుడుతలకు రాముని పునఃప్రశ్ననంబున మిక్కిలి జనవు గలిగి నోటికివచ్చినట్లు తూలనాడి తుట్టతుదకు రామునిజీరి యింతదీనముగా మొరవెట్టుకొను నీకు మాజన్మ వృత్తాంతమును వివరింపకుంట యనుచితంబని వచియించి మాకు జాతకర్మముఖ సంస్కారములు వేదశాస్త్రకార్ముకాది వివిధాస్త్రప్రౌఢిమలును వాల్మీకి గావించె. మాజనని సీతాదేవి యని వచించిరి. సీతయను వాక్యంబు చెవినిఁబడిన తోడనే రాముండు మూర్ఛబోయి రథముమీద నొఱగి యొక్క ముహూర్త కాలమునకు దెలిసి మరేకారణంబుననో విశ్వసింపక సూర్య పుత్రునిజీరి నిజమెఱుంగుమని యాజ్ఞనిచ్చెను. సుగ్రీవుండును బరీక్షించి రాఘవేంద్రా, యిమ్మహాత్ములు పురాణపూరుషుని మూర్తులు. సందేహములేదు. రూపరేఖావిలాసపరాక్రమ గుణంబుల చేతను మీ కుమారులనియే నిరూపింపవచ్చునని వచియించుచుండ నీలుండొక్క మహాక్షోణీధ్రమును సీతాతనూజులపైఁ బడవైచెను. వైచుటయు బాలకులా నగంబును తూపులచేత బొడిపొడి గావించి నీలుని రూపంబు రక్తబిందువులచే నేర్పడునట్టు లొక గోల నాతని యురంబున నేసి కూలిచిరి. శాంతించి యాందోళనమొనరించు మహాసర్పములను జెనకిన యెలుకలభంగి సైన్యసంఘంబు లాబాలవీరుల జెనకి వైరమును బెంచుకొనిరి. అంత నక్కుశలవు లిరువురును సింహపు పిల్లలవలె సైన్యమధ్యమునకు జెంగలించి భయంకర మూర్తులై నానాస్త్రములను బరగించుచు ఖడ్గాదిమహాసాధనంబుల నుపయోగించుచు సైన్య శతంబులను జీల్చి వేయుచుండిరి. రామప్రేరితమగు నమ్మహాసైన్యముతో గుశలవులును దేవబలదర్పయుతులై, సూర్యదత్తంబులగు మహాస్త్ర సాధనములను దాల్చినయక్కుశలవులతో సైన్యంబును నాడు భువన భయంకరముగా బోరుచుండిరి. ఇరుపార్శ్వంబుల నున్న వారలును ప్రాణముల నాశింపక పోరికిదలపడిన యమ్మహా యుద్ధమును వర్ణించుటకు శేషుని వేయినోళులును జాలవు. ఏడు సముద్రము లేకమైనట్టు లామహా యుద్ధము నిముసమాత్రం బేనియు విరమింపక బహుకాల మతిశయించుటచేత భూమి పగిలిపాయలగుచు నుండెను.

భూమినుండి రజంబెగయదయ్యె. బలహీనులగు సైనికులును, లాగలేని గుఱ్ఱములును, సన్నపాటి యేనుంగులును, పాతవగు రథంబులును రుధిరనదంబులబడి కొట్టుకొనిపోవుచుండెను. దిగబడిన శతాంగముల నెత్తుకొనువారును, లేవలేని గజంబులబట్టి లాగి లాగి లేవమి కోపించి యంకుశంబులు విఱుగువరకు కుంభస్థలముల గ్రుచ్చువారును వైరులశరాహతిచే గూలిపడు హయంబులను విడిచి రెండవ గుఱ్ఱమునకై బరుగులెత్తువారును, విరిగినశతాంగములు బోవిడిచి నూతనస్యందనముల నెక్కువారును, భగ్నధ్వజంబుల జక్కపెట్టుకొనువారును, శరాసనములు విరిగిపోవ బాణతూణీరంబులునువదలి కత్తుల ద్రిప్పుచు దూకువారును, తలలు దెగినవారును, చేతులు విరిగినవారును పంచాంగుళములును దెగిపోవ దిక్కుదోపక చూచువారును, ప్రాణములను విడుచుచు, హా!హతోస్మి! హా!హతోస్మి! యనువారును, నేత్రద్వయంబును బాణాభిఘాతంబులుచే లొట్టలై యెటుబోయియు దెబ్బదినువారును దాహమగుటచే నీరులేక రక్తమున నూరిన జలంబులను ద్రాగి చచ్చువారును క్షుద్బాధచే బోరజాలక కూలిపడువారును మంత్రశరంబులచే గిరగిరతిరిగి పడువారును, కాలుజారి పడిలేచునంతలో రథంబులక్రిందబడి చచ్చువారును గలిగి రణంబతిభీకరమగుచుండెను. మరియుఁ దుముత్రైన చక్రాసిధనురాది సాధనములును జింపులైన మైమఱువులును జిద్రుపలైన సీసకంబులును, నలియైనచిదములను త్రుంపులైన చామరంబులును, దునుకవైన తొడవులును, గలిగి సమరంబు బీభత్సమగుచు జూపట్టె. అట్టియెడ భూతసంఘంబులు జిఘాంసాపేక్ష గ్రమ్ముకొని కడుపులుబ్బమెక్కి పుష్కలముగా దొరుకు మాంసపు బ్రోవులపైబడి తాండవము లాడుచుండెను. మానవకళేబరమును మింటికి జిమ్మి కందుకక్రీడనాడు డాకినులును దంతిదంతమ్ములబట్టి యాడు పిశాచములును, భుజమున గూబరంబును ధరించి సోలు భేతాళులును, గలిగి భండనంబు దుర్నిరీక్ష్యమగుచుండెను. నిర్భరంబగు నిజసైన్యసంఘము నిట్లుపీన్గుపెంటల గావించిన యక్కుశలవుల ప్రతాపంబున కెంతయు విభ్రాంతుండై కొంతవడికి రామమూర్తి భ్రాతృవ్యధాక్రోధంబున సహింపజాలక దేవతా భయంకరంబైన దనవిల్లెక్కిడి హాలాహలకల్పంబులగు బాణంబుల గుశునిపై గురియించెను. రాముకార్ముక నిర్ముక్తనారాచంబులాకుశునకు హిమధామకిరణపాతం బులట్లు హాయిగూర్ప కుశుండుసంతసించి వాడితూపులను బ్రయోగించి రథయష్టిపై నొరిగిపడునట్లుగొట్టెను. అదిగన్గొని కుశుండు సమీపించి రఘుప్రవరుని బొరలించి కుండలాంగద మణిహారవల్లికలను గైకొనియె. లవుండును భరతాదియోధుల యాభరణంబులను బుచ్చుకొని క్రుక్కుమిక్కనకపడి యున్న యనిలతనూజ భల్లూకనాథులంగాంచి కుశునితో నగ్రజా, దశరథతనయుల రథంబుల నెక్కించుకొని యివ్వనచరులనుగొని యాశ్రమంబునకు బోవుదమని వచియించుచుండ ననిలజుండు జాంబ వంతునారసి మహాత్మా! చూచితివే, రాఘవులయవస్థ మనమనగ నెంతవారము. శుభాశుభంబుల ననుభవింపకుంట యవ్వనజగర్భునకేనియు తరంబె.

కుతికిన బ్రాణహానియు నొప్పమి సంభవించుట నిశ్చయంబని చేష్టలుదక్కి పడియుండిరి. జానకీసుతులరదముల నెక్కి వలీముఖప్రముఖాది వీరులఁ దేరుపై బెట్టుకొని విజయలక్ష్మీ సహితులై నభంబువిరిగిపడునట్లు పాంచజన్యములను బూరించుచు, పర్ణశాలకుబోయి విజయబద్ధులై పడియున్న తరుచరవీరుల నంబముందునిడి నమస్కరించి సమస్తమును వివరించిరి.

పుత్రుల సాహసకర్మము నాలించి సీతాకాంత విస్మయాక్రాంతయై తనయుల ముద్దు బెట్టుకొని తనయులారా! వనంబుల నజ్ఞాతవాసనై పడియున్ననాపాటు మీచే బయలుపడినది. జింకపిల్లలు సింహమును గెలిచినట్లు రాఘవుని మీరు గెలిచితిరి. దైవికమును తెలియుట కేరికిని శక్యంబుగాదని వచించి, లవునిజూచి, నాయనా! వరుణసంభవుండు రాకమునుపే నీవీ జాంబవంతుని సమీరసూనుని రణభూమిని డించిరమ్మని వచియించె. జననియానతిని శిరసావహించి లవుం డావీరుల యుద్ధభూమిని విడిచి మగిడివచ్చెను. యావద్వృత్తాంతమును నారదునిచే విని వాల్మీకి యాశ్రమమునకు వచ్చి, యాశ్రమద్వారమున మూర్తిమంతంబులై లోకములను హరింపఁ బ్రయత్నపడు నస్త్రవేదములట్లు వెలుగు నతులతేజులగు జానకీ నందనుల నారసి వారిచే బూజితుఁడై చేరదీసి, యిట్లనిప్రశ్నించెను. చిఱుతలారా! మీకుఁ గయ్యము వాటిల్లెనని నారదునిచే వినియుంటిని. సంగ్రామ మేల సంభవించె? యస్త్రశస్త్ర పాతంబులచే నొవ్వరుగదా? మగంటిమిని విడిచి, యుద్ధభీరువులై పారియుందరుగదా? ఆవాక్యములు నాలించి కుశుండు, లవుడు హయంబును బట్టుటయు, సౌమిత్రులంతరించుటయు, నగచరులతో భరతుండరుదెంచుటయు, రాముండు గూలుటయు, నాదిగాగల సర్వ విషయంబును బూసగ్రుచ్చినట్లు మునివరునకు నివేదించెను. మునినాథుండు హాహా కారంబులను సలిపి, సమీపభూమియందు ఖండితంబై యున్న వ్యూహంబునకు జొచ్చి మంత్రితంబైన జలంబును బ్రోక్షింప, సుఖనిద్రజెంది మేల్కొనినట్లు రాఘవుండును దేజరిల్లి బాలార్కునివలె జూపట్టుచుండెను. దేవదుందుభులు మొరసెను. స్వర్ధేనువు దుగ్ధదారలుగురిసెను. మందార కుసుమములు చిత్తజల్లుగా వర్షించెను. అమృతధారలచే నభిషిక్తములగునంగములతో వరాసుర వానరబలంబులునులేచినిలిచె. అంత రఘురాముండు సోదరసహితుఁడై వల్మీకజన్ముని బహూకరింప మునినాథుండును నా రాఘవులను దీవించి తేనెలొలుకు పలుకులతో రాఘవా, నీవు సాక్షాన్నారాయణుండవు. సీత లక్ష్మి. నీకార్యములు నిగమోక్తములు. ఈ భువన సముదయంబు నీచే నిర్మితంబు. రాగద్వేషములు నిన్నుబొంది నిలువజాలవు. నిన్నెఱుంగుట యత్తమ్మిచూలికేనియు నసాధ్యంబు. తనయుడు బాల్యచాపలంబున దప్పుగావించినను జనకుండు గరుణింపనోపును గాని నిగ్రహింపరాదు. అదియటులుండ సుతులు నిరంతరమును జూపుచుండు శౌర్యతేజములును జనకునకు సౌఖ్యావహములు. చిఱుతప్రాయంబుననే తాటకను వధించితివి. జమదగ్ని సూనునిగర్వము నడంచితివి. ఖరదూషణాది రాక్షసుల నేపడంచితివి. మారీచుని చర్మవర్మములను జించితివి.

లవణపయోనిధిని బంధించితివి. తుదకు దశకంఠుని సంహరించితివి. అట్టి నీ చటుల తరమైన బాహాప్రతాప విక్రమాటోపమునకు నంగలించి. నిలుచుట పురహరాదులకును తరంబుగాదు.

చెక్కుమీటిన బాలుగారు శిశువులననెంతవారు. వరుణునిచే నాహ్వానింపఁబడి పాతాళ భూమికి నేనరిగియుంటచే నింతటికార్యము జరిగియున్నది. నిన్ను నేరనికతంబున నీతనయు లింతటిపనికి బూనుకొనిరి గాని వేరుగాదు. వారి యవివేకంబులు మన్నించి యేలుకొనుమని వచియింప రాముండును సంతోషమానసుండై యనఘా, మీదర్శనభాగ్యంబు మాకబ్బుటయే సర్వకార్యసిద్ధులును మాకు గలుగుటకు గారణ భూతమైయున్నది. బాలకులను బిలువబంపుడు చూడవలయునని నాకెంతయు గోరిక లూరుచున్నవని దీనముగా వచియించెను. మునీంద్రుండు సంతసించి శిష్యతతినిబంప గురునియాజ్ఞనువిని కోదండవల్లకీహస్తులై జానకీనందను లేగుదెంచి వాల్మీకి సమక్షమున నిలిచిరి. అట్లు నిలిచి తాత యానతిని గైకొని దురితాపహరంబగు రామాయణంబును నానారాగ రచనలజూపి చదివి యఖిలజన మనః ప్రమదంబు గావించి తుంబురు నారదులను బ్రతిఘటించిరి. నిర్దయబుద్ధిమై లోకాపవాద భీతిచే నొంటరి పక్షివలె వనంబుల డింపబడిన నిజభార్యయగు భూజాతను దలంచుచు బహుదుఃఖితమతియై పొగులుచున్న రామునకు నట్టి చక్కని పుత్రకులను గాంచి సుఖంబుండియుండెనని వినునప్పుడును కన్నులార నబ్బాలకుల నారసినప్పుడును యెంతసంతోషము గలిగియుండెనో వ్రాయనెవరి శక్యమగును. మహాత్ముండగు రాముండానందమును భరింపలేక కొడుకులపైబడి యాలింగనమాచరించి పునఃపున చుంబనంబుల గావించి హర్షభాష్పధారలచే నడ్డగింపబడిన నేత్రములతో గద్గదస్వరమునవలంబించి సౌమిత్రినిజూచి లక్ష్మణా ముఖవిభ్రమంబునను రుచిర తరంబులగు నవయవాది సౌకుమార్యమున జానకీస్వరూపమును బాణ సంధానసమగ్రశక్తిచేతను దంటతనంబునను బాహువిక్రమ నైపుణ్యమున మదాకృతియు నిక్కుమారవరులయందు తెల్లమగుచున్నదని వచియింప లక్ష్మణుండు అగ్రజా, మున్ను దేవరయానతి ననుసరించి యుత్కటంబగు గర్భవేదన నందుచున్న ధరణీజాతను కృపాహీనుండనై యీ విషమాటవిని విడిచి వచ్చితిననుచుండ లక్ష్మణుని వాక్యములను సంయమీంద్రుండందుకొని మఖయూపదారు హరణార్థము, శిష్యసహితుండనై జాహ్నవీ తటంబునకు వచ్చి సమీపమున యార్తధ్వని నాలించి తడవుసేయక పోయి శోకపరీతయు రజఃపటలంబున వివర్ణ కీర్ణకచభారయై యొప్పుచున్న యొక వధూలలామంబు నారసితిమి. కాంచి నీవెవ్వరు యేల దుఃఖింతువని యడుగ నయ్యబల దీనాలాపములతో నేను జనకనందనను నాభర్త రఘువరుండు నింద్యనైతినని భర్తనన్ను వనములద్రోయించెనని పాదములపైబడియె. ఆనారీమణిదుఃఖము నామనో వీధిని గలగించుట చే కడుంగడుగరుణించి యూఱడించి మదాశ్రమంబునకుఁ గొంపోయి యయ్యమను బరిచరింప మునికాంతల నియమించితిని. అట్లా పడతి కొంతశాంతించి జీవించుచుండఁ గతిపయదినంబు లకు వంశవర్ధనులగు

నీబాలురం గనియె. వీరికిజాతకర్మాదివిధుల నేను గావించితిని. వైదేహియు సుఖంబుగనున్నయది. మాకు జనకవిభుండెంతవాడో దశరథుండు నంతవాడు. దశరథుండెంతయో నీవు నంతవాడవు. నీవెంతవాడవో నీపుత్రులు నంతవారు. బాలురాహవోన్మదరిపు వాహినీవిదళనక్రమ ధనుర్విద్యా సంపదలయందును బ్రసిద్ధులు. వేదశాస్త్రములను బఠియించిరి. నీభాగ్యమునకు మేరకలదా? రాఘవరామా! నీకే కొఱంత వసుంధరయందు గలిగియుండు ననుచుండ, రాముండు కేలుమోడ్చి మహాత్మా! క్ష్మాతలంబున మీకృపగల్గినవారలు కృతకృత్యులు. అట్టి మీయనుగ్రహంబున నభివృద్ధినిబొందు మముబోంట్లను బేర్కొనుట మీకు దగదు. మీకృపాపాంగవీక్షణ జాలముల నీరామునియందు నిత్యమును వ్యాపింపజేసిన జాలుననుచుండ వాల్మీకి కనుసన్నలచే నర్భకులు తండ్రికిగరంబులు ముకుళించి జనకా! మోహపరవశులము యూహాపోహపరిజ్ఞాన మూఢబుద్ధులము ఆత్మద్రోహులము మమ్ముక్షమించి యేలుకొనుమని మొరబెట్టుకొనిరి. పుత్రుల ముద్దుపలుకుల కెంతయు సంతసించి మరిమరి గౌగిలించుకొని మూర్ధఘ్రాణమును గావించి గర్భమున బొంగిపొరలు వాత్సల్యమున తనయులారా! మీతప్పులను జనకుండనగు నేను మన్నింపకుందునా నాజీవనమును నాయైశ్వర్యభాగ్యంబులును నారత్నముల ప్రోవులమీరుగాక మరెవరుగలరు. మీకన్న నికలోకమున నాకధికమెద్ది గలదు? భయపడకుడని బిడ్డలనూఱడించుకొని, దానవ మర్త్యవానర పతాకినులను బరివేష్ఠించి నడువ నధ్వరాశ్వ సహితుండై యయోధ్యానగరంబు జొచ్చియందు రచితాధ్వర మంటపవేదియందు నిష్టభృత్యానుజమంత్రిబాంధవసమన్వితుండై నిండుకొలువుండి హృదయ విద్యావినయ శీలుండగు మునివతంసుని బిలిచి పరమసాధ్వియగు నాసీతాలతాంగి నాడుజగద్విదితముగా హవ్యవాహన ముఖమున దనప్రభావంబును జూపుటయు గగనవాణిచే సాక్ష్యంబులనందుటయు నిందలి ప్రజలేరు నెఱుంగరు, కావున యీజనముల కెల్లరకును సందేహనివృత్తియగు చందంబొనరింపుడు ధరిత్రీనందనను రావింపుడని విన్నవించెను. రామునానగైకొని వాల్మీకి సీతాదేవిని గొంచువచ్చి నిర్దిష్టస్థానంబగు గోమతీతటంబునలంకరించిన సభాసమీపభూమి నిలిపెను. దేవేంద్రుని బేరోలగంబును తిరస్కరింపఁజాలు నమ్మహాసభాంతరాళమున భరతాది సోదరులును, సుగ్రీవాది వానరులను, విభీషణాదిరాక్షసులును విదేహరాజ కేకయరాజ ప్రముఖబాంధవులును, బ్రవర్ధనాదిమిత్రులును, సుమంత్రాదిమంత్రిజనంబులును, మధుమద్విజయభద్రాదినర్మసఖులును బరివేష్టించి కొలువ పృధివీసుతాకధితావితథశపథవచోవిధా శ్రవణ కుతూహలంబున బఱతెంచిన వసిష్ఠ వామదేవ పులస్త్య విశ్వామిత్ర మైత్రేయ భృగు చ్యవన పరశరాత్రేయ కాత్యాయన గౌతమ శ్వేతతంతు భరద్వాజ వాలఖిల్య మౌద్గల్య మాండవ్య మార్కండేయ కౌండిన్య కణ్వ ప్రస్కణ్వ ఋష్యశృంగ మతంగ శతానంద జాబాలి గాలవ దూర్వాస పర్వత నారదాదిమునుల శాంతరసార్ద్రంబులగు చూడ్కులు సభాస్థానంబును పావనపరుప మాళవ చోళగౌళ మళయాళ మగధ మత్స్యమద్ర

శిరస్థకిరీట రత్నమణులు పదాగ్రభాగ గండపెండేరములకు వింతరుచుల నాపాదింప మహోన్నత వైభవంబున బెంపువహించుచు శ్రీరాముడు సర్వాసనాశీనుండై యుండెను. వల్లభుండగు రఘు వరుండ తన్నుఁ బ్రల్లదంబులాడిన క్షుల్లజనంబులు విశ్వసింప విశ్వ వర్ణితంబైన బ్రహ్మర్షీశ్వరసభామధ్యంబున నిలిపి శపథంబులు పలికింపనుండెనని యెరింగి, యమ్మానవతి యెనలేని దుఃఖంబు మనంబున బెనంగొన కనుగొనలయందున బొటిల్లు కాటుకకన్నీరు ఱెప్పలతుద నప్పళించుచు, నప్పరమ తపస్విదిక్కు చూడ్కులు నిగిడించి, మహాత్మా, వట్టిసంశయంబులంబడి నాపతి యిట్టి సభామధ్యంబున నిలుప నెట్లు సాహసించె. ఎట్టి పుట్టువులబుట్టినను, యెంతవానిచేబట్టినను, యెట్టి యిల్లుమెట్టినను, ఆఅడినోములు నోచిన ననువంటిమచ్చెకంటి తత్ఫలంబు లనుభవింపకతీరునే! రచ్చలోనికివచ్చి బాసయిచ్చి పొమ్మని పుడమితేడు నుడివినమాట జవదాటగూడునే! మంచిదని తెగువదోపంబలికి, పాయని శోకాంధకారంబును వెనుక వేసికొనెనోయన నపరభాగంబున గనుపట్ట కీలుగంటుతో భుజపత్రవల్కలోత్తరీయంబున నాచ్ఛాదించిన ఘనస్తనకనకకలశ యుగంబుతో ప్రపదంబులుపై దిగజాఱ గట్టిన వలిపెంపునాఱచీరెతో బహుకాలపరీత రఘువల్లభాయల్లకభరంబున గృశియించిన మోహనాంగములతో నిటలతటంబున నెఱసిన చికురనికరంబులతో కపోలముకురంబులపై దిగజాఱు నయనఖంజనాంజన సమాజసాశ్రుజల ధారాప్రవాహంబులతో నిట్టూరుపు సెగల బొగిలిన చిగురుమోవితో, చిన్నబోయిన చిన్నారిముద్దు మొగంబుతో, నాద్యంతములు తానుబడిన యలజడితలంపున బుట్టు నివ్వెఱపాటున జేడ్పడు చిత్తంబుతో మహాసభామధ్యంబున నెట్టుకొని నిలిచి నిర్లజ్జనై యెట్లు మాటలాడుదునను భయమున బొడము స్వేదకంపంబుతో నిన్ని యగచాట్లకులోనయ్యు దనవలె బ్రాణంబులకు నాసబూనిన మానవతులు గలరేయను తలంపున బాదుకొను దీనభావంబుతో గడగడవడకు నెన్నడుముతో, నెడనెడం దడబడు నడుగుఁదామరలతో, తల్లీ నీకడుపునబుట్టి యిట్టిరట్టున కొడిగట్టితినిగదా యను నట్టలంపువగపున బుడమిపై నెలకొలుపు చూడ్కులతో దైవంబు నలువురిలోఁ దన్నుఁ దలవంచుకొనం జేసెగదా యను విన్నదనంబున వంచిన శిరంబుతో కరకమలంబులు ముకుళించుకొని యవ్వాలు గంటిమిన్న పంటవలంతి యట్లిడుకొలువున్న బహిర్మండపంబునకు వాల్మీకివెంట నరుగుదెంచు నప్పుడయ్యొప్పులకుప్పను తప్పక చూచి యయ్యయ్యో తల్లీ! రామభద్రు నంతటి పట్టభద్రుని చెట్టబట్టిన నిన్నువంటి సౌభాగ్యవతికి నట్టడవుల నెట్టుకొని నారచీరలు గట్టుకొని యిట్టియగచాట్లకు లోబడవలసెగదా యనువారును యీ యుత్తమురాలి గుణంబు లెఱింగియుఁ బతంగకుల పుంగవుండంతరంగంబునగరుణ దొఱంగి యడవులద్రోచి యెంత సాహసంబుజేసె చూచితిరే యను వారును, అవనివిభుండు లోకాపవాదభయంబున గళత్రాభిగమనంబువిడుచుట దొడ్డుగాదతనిమాట జవదాటక! యప్పరమపావని తపోవనంబుల డాసిగాసికోర్చి ప్రాణంబులు భరించుట దొడ్డనువారును, యేకపత్నీ వ్రతుండగు రఘునాథుని ధైర్యస్థైర్యంబులు సీతాసతి

నానాజనంబుల కోలాహలంబులు నలుదిక్కు లంబిక్కటిల్లి చతుస్సముద్ర ఘోషంబులొక్క దిక్కునగ్రిక్కిటిసినట్టు, లొప్పుచుండ జానకి చనుదెంచి రఘువీరుని పురోభాగంబున నిలిచె. దివ్యమణీరమణీయవిమాన కోటులతో బృందారకులు విచ్చేసి యంతరిక్షములనలంకరించిరి. అంతబై నుండి దేవతలును గ్రిందినుండి సకలజన సమూహములును వీక్షించి వాల్మీకిమహర్షిశేఖరుండు, అచ్చటిజనుల కలకలంబు చేసన్నల వారించి ప్రావృడంభోదగంభీర ఘోషమున రామునిజీరి జనాపవాద గతశంకంగొని నిందు చూలాలియగు నిమ్మహాదేవిని వనంబులడింప మదాశ్రమంబున నీపుణ్యస్వరూపులగు కుశలవుల గనియె. వీరునీకుమారులు యీయమ విలసితధర్మచారిణి, వివేకసతీమణి, వీరలంగైకొని యిక సుఖియింపుము. సీతయందే దోషమును లేదు. శ్రుతుల నేర్చి యధికతరతపోధనుడవై ప్రచేతనుని నందనుడనై నేనన్నతములాడ. మనోవచఃక్రియల నన్యమెరుంగదు. సద్గుణోన్నతిని క్షీరవార్ధినందనకును హిమాచలవరేణ్యజకును సమాన! క్షమాసమున్నతి ధారుణియు ధైర్యసముదగ్రత మేరుమహీధరంబును చారుపతివ్రతాత్వమున జానకియు బెద్దలనుట విశ్వవిదితము. సర్వసుపర్వులు వియన్మరుదగ్నితో యములు సారసవైరి భాస్కరులుసాక్షిగా సీతాహృదయంబున నీషణ్మాత్రము దోషంబులేదని సాక్ష్యమిచ్చుచున్నవాడ. భూసుతకొఱకై నేనుబొంకియున్న పెద్దకాలము నేనుగావించిన తపంబు నిష్ఫలమై పోవుగాక యనివచింప శ్రీరాముండు లేచి వాల్మీకింజూచి యనఘా, మీరువచియించిన యీవాక్యములకు నామనంబెంత సంతసించు చున్నది. ఇంక సీతయు సర్వ జనసమ్మతంబుగా శపథంబుపలికిన మేలగునన గగనమునుండి వారిజసంభవాది సురవర్యులు మేలుమేలని నుడివి పుష్పవృష్టిని గురియించిరి. గంధ సారగిరియు సారసమీరమును వీచె. అంతసీత నాథునిపదకంజములపై బడి మ్రొక్కి కరాంబుజములు మొగిడ్చి సభికులు విస్మయమంద కట్టెలుంగున రాముని పదాబ్జములను మానక కొల్చుదానినయిన, జాగ్రత్స్వప్నసుషుప్త్యాదుల యందును, బతియాజ్ఞను దాటనిదాననేయయిన భూదేవీ! తల్లీ, నన్ను నీలోనికి గొంచుపొమ్మన శతకోటి శతకోటిఘోషంబు ననుకరించి సంవర్తసమయసముదితజలధర సంఘ సంఘర్షణోజ్ఞాతనిర్ఘాతజాతస్ఫీత నినాదంబు ననుసరించి తత్సభా మధ్య రత్నగర్భాగర్భంబునుండి యొక్క నిర్ఘోషం బావిర్భవించె. అప్పుడు పుడమి బిట్టవిసి పటిల్లునన్ బగిలిన యప్పట్టున మహాభీలంబగు నొక్కమహాబిలంబు గనుపట్టి నంత నబ్బిలంబునుండి బహునాగ కన్యాకాపరివేష్టితయై భూదేవి సనుదెంచి, తనయంగౌగిలించుకొని యనిమిషకన్యకాకర కీలితకనకకలశ విలసిత భోగవతీ జలంబుల ముఖప్రక్షాళనంబు గావించి, కస్తూరిబొట్టు వెట్టి కొప్పుచక్కగ సవరించి, మందార కుసుమమాలికలందురిమి దివ్యాంబర భరణాదులలంకరించి ఘనసార గంధసార కస్తూరాది పరిమళంబులలంది యసమానమగు నొక్కమణి పీఠంబుపైనుంచుకొని యింద్రాది దేవతలు మందారకుసుమంబులు గురియింప భుజంగపుంగవులు బంగరుబెత్తంబులు గొని

బరాబరులొనర్ప రసాతలంబునకుం గొనిపోయె. అమ్మహాప్రభావంబునకు నద్భుతంబంది బ్రహ్మాది దేవతలందరునుఁ దమలోదాము జగతీ నందన పాతివ్రత్య సత్యధర్మంబుల నభినందించు నెలుంగులు నంతరంగంబులు గలంగి సీతాంగననుగూర్చి విలపించు సభాసదుల యాక్రందనధ్వనులు నేకీభవించి భూనభోంతరంబు లావరించె. అమ్మహా కలకలంబున నేలంబడి పొరలిపొరలి యేడ్చువారును అయ్యయ్యో! శ్రీరామభద్రుని యర్ధాంగలక్ష్మి నేటితోమాస్వామి నెడబాసిపోయితేయని బిట్టుగా ప్రలాపించువారును, యేమియు ననలేక శోకవ్యాకులితేంద్రియులై మూర్ఛలమునుగువారును, యీలోకాపవాదం బింతజేసెగదా యనువారును, కుశలవులంజూచి, అక్కటా! తల్లిలేని బిడ్డలైతిరే యన్నలారా! యనువారును, ఆహా! సీతాదేవి చరిత్ర తలపోయ శక్యముగాదని వెడగులై చూపట్టువారును, నైతత్సమయంబున నాస్థానంబు శోకదైన్య నిదానంబైయుండె, అంత శ్రీరామునకు లోకమంతయు నిస్సారమై శూన్యమైకనుపట్ట దీనభావంబున ధైర్యంబుపోనాడి లోచనపంకేజము లశ్రుధారలమునుగ శోకాక్రాంతుండై మూర్ఛిల్లి వెంటనే తెలిసి నిజభార్యందలంచి సభాసదుల గుండియలవియునట్లు శోకింప జొచ్చెను. అట్లు తన దుఃఖము నకుఁ గొంత శాంతి గలిగించుకొని, యత్తయగు భూదేవిపైగినిసి బ్రహ్మాండభాండంబు బగులించి వైచెదనని బ్రహ్మాదిదేవతల గర్భనిర్భేదకంబుగాబలికి తన పలుకుల తళుకులేక నిరాకులస్థితిని బ్రవర్తిల్లు ధారుణిపై బుట్టిన రోషంబునఁబెదవులదర నిడుదకన్నుఁ గ్రేవల బెడిదంపు మిడుగుఱులు చెదర తటతట గటతటంబులు చలింప ముకుపుటంబుల బ్రకటతరోచ్ఛ్వాసంబు విజృంభింప నిటలతటంబున వికటభ్రుకుటిఘటిల్ల రదన పటలంబున బటపటార్భటులుప్పతిల్ల ముఖంబు జేవురింప నెమ్మేన జిఱు చెమ్మటల తెమ్మలావరింప విశ్వభయంకరుండై సకల ప్రపంచంబు నొక్కట నుక్కడించి దిగమ్రింగ నప్పళించు విలయకాల మృత్యుమహౌద్ధత్యంబున బలిమిని జెలువారి యేరికిని దేరిచూడరాక కోపంబు రూపంబుగైకొన్న కోపునహుంకరించి, హుంకారంబు నివ్వటిల్ల నవ్వీరాధి వీరుండు క్రూరవీక్షణంబుల నిప్పులు కుప్పలువడ నప్పుడమి నట్టెవీక్షించి యీక్షణంబున నిను నిర్భేదించి నీగర్భంబునను్న యతల వితలాది సప్తపాతాళలోకంబుల జీకాకుగావించి, నీవు ధరించిన సరిత్సముద్రగిరి పుర, గ్రామ, వన, కాననాదులతోడ నీయందుగల నిఖిలజంతువుల నిర్మూలించి నిన్ను భరియించిన వరాహాది కులపర్వతభుజగంబుల తునుకులుగా నొనరించెద, తాళుమనిచెంతనున్న లక్ష్మణుచేతి శరాసనంబు నొడిసిపుచ్చుకొని చాపంబు నెక్కుపెట్టి, నారి సారించెను, అనిర్ఘోషంబున బీటలు వారి దిక్కులు వ్రక్కలయ్యె. చుక్కలురాలె. సముద్రములు పంకిలములయ్యె. అండజా భాండంబు పగిలినట్లయ్యె, దిక్పాలురు దిగులుజెందిరి, గంధర్వులు తల్లడిల్లిరి, సిద్ధులు చేడ్పడిరి, కింపురుషులు కంపించిరి, రాక్షసులు కళవళించిరి, నరులు మూర్ఛిల్లిరి. అట్టి సమయంబున కాకుస్థుండు ప్రత్యాలీఢ పాదస్థుఁడై చండకోదండంబున గాండంబులు దొడిగి, యే యంగడగు నయ్యవసరంబున బంకజాసనుండరుదెంచి,

యయ్యురుగుణాఢ్యుని హస్తంబులు పట్టుకొని, రామావతార ప్రభావంబును సీతామహిమంబును బొగడి బహుప్రకారంబుల నుతియించి కోపోపశమనంబు గావించెను. అంతశ్రీరాముండు శాంతించి తత్క్రతుశేషంబును సమాప్తినొందించి, తన్మహామునులచే నభినందింపంబడి దేవతాదీవనలనంది హితమంత్రి పురోహిత బంధుసామంత ప్రముఖులగువారితోడను, కుమారద్వయంబుతోడను, యనుజన్ములగు భరత లక్ష్మణ శత్రుఘ్నులతోడను, సకలదేశాధినాయకులతోడను, పురంబుఁ జొచ్చి, ప్రజల మన్ననలతో నిత్యంబు బ్రకాశించుచుఁ జిరకాలము రాజ్యభారమును వహించి కాలము గడపుచుండెను.

సమాప్తము

# పీఠిక

ఇది మద్విరచితములైన గ్రంథములలో నయిదవది. ఇంతకు భాషాభిమానులు నా యెడలఁ జూపిన సానుభూతియే యీ గ్రంథ రచనమునకు నన్ను బురికొల్పినది. నాటకవిరచనము నాకుఁ గ్రొత్తయగుట నిక్కావ్య శరీరమున నేవేని ఛిద్రములు రసజ్ఞులకుఁ గోచరింపవచ్చును. దోషైకదృక్కులకు నేను జేయఁదగిన మనవిలేదు. గుణగ్రహణపారీణులగు వారిందలి గుణలేశములను గ్రహించి నన్ను గృతకృత్యునిఁజేయ బ్రార్థితులు. అవతారిక వ్రాసిన రోషనారా గ్రంథకర్తలును, గుంటూరు మిషన్ బాలికా బోధనాభ్యసన పాఠశాలా పండితులును నగు శ్రీ కొప్పరపు సుబ్బారావుగారికి నా కృతజ్ఞతా పూర్వక వందన సహస్రముల నర్పించుచున్నాడ.

జి. జాషువ

# ఈ నాటకమున వచ్చుపాత్రలు

## పురుషులు

1 భీష్మకుఁడు

2 రుక్మి

3. శిశుపాలుఁడు

4. విదూషకుఁడు

5. అగ్నిద్యోతనుఁడు

6. కృష్ణుఁడు (కథానాయకుఁడు)

7. బలరాముఁడు

8. సాత్యకి

9. జరాసంధుఁడు

10. దంతవక్త్రుఁడు

11. పౌండ్రకుఁడు

12. విదూరదుఁడు

13. సాల్వుఁడు.

## స్త్రీలు

1. దేవేరి (రుక్మిణి తల్లి)

2. రుక్మిణి (కథానాయిక)

3. తరల–రుక్మిణి చెలికత్తె

4. లలిత–రుక్మిణి చెలికత్తె

5. చతురిక–రుక్మిణి చెలికత్తె

6. రాధ

# కృతికర్తకు

మ. కడుపుబ్బన్ గిరిజాకుచద్వితయ దుగ్ధంబాని మిన్నేటిలోఁ
బడిబింబించెడు చంద్రబింబము సితాబ్జంబంచుఁద్రుంచన్ గరం
బిడు వేదండముఖుంగనుంగొని "మృడానీ చూడవే" యంచు న
వ్వెడు శంభుం డిడుగాత భద్రములు శోభిల్లన్ గృతిస్వామికిన్

సీ. శ్రీగుళ్ళపలివంశ సింధురాకాపూర్ణ తుహినకరుండు బంధుహితకరుఁడు
సకలసన్ముని జనసంస్తూయమానైక శాంతపరుండు పరంతవుండు
రంగాంబ రాజయ్య ప్రకటదంపతుల తనూభవుం డింతీ మనోభవుండు
వితరణ విద్యావివేక నూతన భానునందనుండు, బుధాభినందనుండు

తే.గీ. పృధుల సత్కీర్తికాంతి గర్వితమరాళ
హీరడిండీర నవమల్లికారటన్న
భోనదీస్విన్న నవసుధాంబుధి సుతుండు
ననఘుఁ డవని వేంకటరామ యబ్రువుండు

తే.గీ. అట్టి రసికుఁడు సరసగుణాన్వితుండు
తోషితస్వాంతుఁడగుచు నిస్తులమనీష
వేడికొనఁ గృతినిచ్చుచున్నాఁడ దశ ది
గంతములఁ దనకీర్తినిండారుగాత!

జి. జాషువ

# నాంది

మ. పసుపుం బుట్టములన్ ధరించి చెలువొప్పన్ బెండ్లి పీటంబునం
దుసమారూఢతనంది బిట్టలరుచైద్యున్ దుర్నిరాశాపటు
వ్యసనాబ్ధిన్ బడవైచి భూరిబలులన్ వంచించి శ్రీరుక్మిణీ
కుసుమాంగిన్ గొనిపోయినట్టి కుహనా గోపాలుఁడేలున్మిమున్

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర : (దిక్కులు పరికించి) ఆహా; నేడుగదా? సుదినము. శ్రీరుక్మిణీ కల్యాణమును గన్నులారఁజూచి ముక్తిఁజెంద భక్తులెందరో వచ్చి సభనలంకరించి యున్నారు మానటి యింకనురాకున్నది. (కంఠమెత్తి) నటీ! నటీ!

(నటి ప్రవేశించి)

నటి : ఆర్యపుత్రా! వచ్చుచున్నాను. ఏమట్లు తొందరఁ జేసెదవు?

సూత్ర : తొందరఁజేసి పిలువకున్న నీవు త్వరగా వచ్చుదానవా? అంతభాగ్యమా?

నటి : ఇప్పుడంతగత్యమేమున్నది?

సూత్ర : నేడు మనపురమున శృంగార రసప్రధానమగు నపూర్వనాటకమును బ్రదర్శింపఁ బోవుచున్నారు. అదుగో! చూడుము.

మ. రయజాతశ్రమనీర బిందువులు జారందేహమందెల్ల నం
దియలున్ మట్టెలు ఘల్లు ఘల్లుమన వేణీ బంధముల్వీడి మ
ల్లియ లాడాడఁదొఱంగ మారుని శరాళిన్ బోని చిన్నారి ము
ద్దియలేతెంతురదే! కనుంగొనుము నాతీ; పేరెముల్వాఱుచున్

నటి : (చూచి) ఊ! యీనాటకములగోల మన కెల్లకాలమున్నదియే కదా?

సూత్ర : నటీ! యేమట్లు నిరసించెదవు? నాటక ప్రదర్శనములనుచితంబులని నిందించు రసహీనులతోఁ జెలిమిఁజేసితివా యేమి?

నటి : చెలిమిఁజేయుటగాదు. ఈమధ్యఁ గొందఱు విద్వాంసులు ముచ్చటించుకొనుచుండగాఁ జూచితిని. ఇది నేనడుగఁదలంచితిని. నీవేజ్ఞప్తికిఁ దెచ్చితివి. ఆర్యపుత్రా! వారి యభిప్రాయమేమి?

సూత్ర : ఏమున్నది. వారి మందవిచారమే! యోజించిన బుద్ధిమంతులట్లనరు.

కం. అడcగిన పతిభక్తికి నే
రృడని స్వదేశంపుభక్తి భావమునకు (స
క్కెదుధర్మువునకు నె
క్కుcడైన నోషధులుదూరకుమి! నాటకముల్

నటి : సరేకాని! నేడు ప్రదర్శింపcబోవు నాటకమేమో చెప్పక పోతివి?

సూత్ర : నేటినాటకమా! ప్రసంగవశమునc జెప్పమఱచితిని. అత్యద్భుత శృంగార రసప్రధానమగు శ్రీరుక్మిణీ కల్యాణము.

నటి : ప్రదర్శించువారెట్లు ప్రదర్శించినను ప్రేక్షకులు మట్టుకప్పటి శ్రీ రుక్మిణీ కృష్ణుల యన్యోన్యాను రాగములను బ్రత్యక్షముగా దర్శించునంత చక్కగా రచింపc బడినది.

నటి : ఆహా! అంతమంచినాటకమా?

సూత్ర : కాకున్న నిన్నేల తీవరింతును.

నటి : ఆర్యపుత్రా! గ్రంథకర్తలెవరు?

సూత్ర : వినుము.

మ. పలుకుందొయ్యలి గుబ్బలోని కవితా పాండిత్యమెల్లన్ రసాం
చలమందున్ గయిcజేసికొన్న రసవత్సద్గ్రంథ నిర్మాణమం
జులధాటీసుకళాకళా కలయశస్కున్ జాషువాఖ్యున్ మహా
త్ములు శ్రీవీరయ లింగమల్లనిరి కాంతా! యెంత ధన్యాత్మలో

వీరే! చిదానందప్రభాత, కుశలవోపాఖ్యానాది గ్రంథకర్తలు. గుంటూరు బోధనాభ్యసన కళాశాలయం దాంధ్రపండితులు. మనమిక పాత్రలను సిద్ధము సేయుదము రమ్ము.

(నిష్క్రమింతురు)

# రుక్మిణీ కల్యాణము

ప్రథమాంకము

సీను–ఉద్యానవనము

(రుక్మిణీదేవి, తరల, లలిత, చతురిక ప్రవేశింతురు)

రుక్మిణి : చతురికా! నందనోద్యానమున కీడగు నీపూవుఁదోట నా కెంతయుఁ గన్నుల పండువు సేయుచున్నది.

చం. ఫలములు మెక్కి మెక్కి శుకపాళి, చివుళ్ళను మేసిమేసి కో
యిలలు, సుమంబులందు జనియించుమరందముఁద్రావిత్రావి తే
టులు, మదమెక్కిచొక్కి వెగటుంగని నిశ్చలపారవశ్యతన్
సలుపఁదొడంగె శ్రావ్యముగఁ జక్కనిమంగళ గీతనాదముల్

(అనుబంధము–1)

చతు : అమ్మా! నవయౌవన మంకురించి విమరల లావణ్యమునఁ బెంపు మీరు లతాతన్వింబోలి వసంతసమయ సంపత్తిచే వనము శోభిల్లుచుండదా? విశేషించి యిది యుషఃకాల మగుట వనక్రీడా పరతంత్ర స్వాంతలగు మనబోంట్లకు మేరలేని యుత్సాహము కలుఁగక మానదు.

రుక్మిణి : అవునవును. మనకేకాదు ప్రత్యూషమున మేల్కని దేవదేవుని స్తుతించుచున్నట్టు లేవంకను.

తే.గీ. సరసి జాగారముల నిద్ర సలిపిమేలు
కాంచి పాడుచునున్నారు చంచరీక
బాలికలు, నర్మగర్భసంభాషణములఁ
బఱుఁగుచున్నారు, పులుఁగు దంపతులు చెలియ

మదోన్మత్తులగు మూఢమానవు లభినందింపకున్నను సృష్టియే వేయినోళ్ళ భగవంతునిఁగీర్తించుచున్నది.

చతు : రాజకుమారీ; మంచివిషయము నాలోచించితివి.

తరల : అమ్మా! ఇదంతయును విష్ణుని మాయయేకదా?

రుక్మిణి : (తనలో) ఆహా! యీతరల మన్నాథుని జ్ఞప్తికిఁ దెచ్చినది. లీలామానుష విగ్రహుండగు శ్రీకృష్ణభగవానుండే యాది నారాయణుండు. (ప్రకాశముగా)

పదునాల్గులోకములను గర్భకుహరమునఁదాల్చి క్షీరసాగర విహార మొనరించు నమ్మహాత్మునకు దక్క నొరుల కింతటి శక్తిగలదా?

లలిత : అమ్మా! నిక్కువము. జన్మ సార్థకమగుట కమ్మహాత్మునిఁ బూజింపవలయును. ఏతత్పూజావిహీనులకు గతులుండునా?

తే.గీ. మంధర నగంబు నెత్తె యమరులఁగాచెఁ
గమలగర్భుని బొడ్డునఁ గనియె నబ్ధి
కల్లుఁడైమించె సిరిని బెండ్లాడి చిలువ
తేనిఁ బానుపుగాఁ దాల్చె సృష్టి నిలిపె

రుక్మిణి : (తనలో) ఈ లలిత వాక్యములు నావీనులకు విందుజేయుచున్నవి. ఆబాల గోపాలమును రమాధవుని మహిమమెఱింగియుంట నేను గర్వించుచున్నదాన. (ప్రకాశముగా) లలితా! దేవ దేవుని ప్రభావము నీ వెఱింగియుంట నాకెంతయు సంతోషము. పేర్కొనుటకా మహత్కార్యము లనంతములుఁ బూజించుట మనకిప్పట్టున విధియై యున్నది. నీవును తరలయును బుష్పములను చిదిమి తెండు. ఇందు విష్ణుని బూజింతము.

(తరల, లలితయును నిష్క్రమించుచున్నారు.)

రుక్మిణి : చతురికా! నీకొక రహస్యమును చెప్పెదను. కడుపులో దాచుకొనవలయును.

చతు : అమ్మా! మీ రహస్యములను దాచక బయలుపరతునా? అట్లయిన నా స్నేహము దూష్యము కాదా?

రుక్మిణి :

మ. ముదమారన్దుతంబుఁ బోనడఁచి యీభూభారముం బాపగా
యదువంశంబున దేవకీ తనయుఁడై యావిర్భవించె న్దయా
హృదయుండాదిమవిష్ణు పెంపలరు శ్రీకృష్ణుండునా నీవెఱుం
గుదె? భావింతువె? వింటివే? నిగమముల్ ఘోషింపఁగా నెచ్చెలీ!

ద్వారకానగరం బమ్మహాత్ముని వాసస్థానము. మును లాయన బిడ్డలు.

చతు : అప్పుడప్పుడు వేదశాస్త్రపారంగతులగు భూసుర శ్రేష్ఠులు ప్రశంసించుకొను చుండ వినుచుందును.

రుక్మిణి : అతఁడు నావరుఁడు.నాయిష్టదైవము. చతురికా! భద్రము సుమా! రహస్యమిది.

చతు : అమ్మా! నన్నట్లు గ్రుచ్చి యడిగెదవేల? (కొంచెమాగి) ఇది నీతలిదండ్రు లెఱుంగుదురా?

రుక్మిణి : నాయభీష్టము నెఱుంగుదురో లేదో నేనెఱంగను కాని వారును దగిన విభుండాతఁడే యని నిశ్చయించిరనిమాత్ర మెఱుంగుదు. (విచారము నభినయించి) చతురికా! మాయన్నకాతఁ డనిష్టుడని తెలియుచున్నది. అందుచేత విచారించెదను.

చతు : అమ్మా! నాకీవిషయము విన్నదాది శరీరముప్పొంగుచున్నది. ఎట్టిదాంపత్యము! యెట్టిసంబంధము! శ్రీమద్దేవదేవుని చెట్టబట్టు నీకు నెచ్చెలినైయుంటచే నాజన్మము తరించినది. (విచారముతో) అయ్యో! అమ్మా! పానకములోని పుడకవలె మీ యగ్రజుండెట్టి దుష్కృతికిఁ బాల్పడునోకదా? (కొంతతాళి) రాజకుమారుఁడై, సర్వశాస్త్రములు చదివి ధర్మమెఱింగిన తానేల? కోరినవానినిఁ గాదనును. ఇది యసంభవము.

రుక్మిణి : అయ్యో! చతురికా! అనరాదుగాని అంతటి మూర్ఖుడుండునా? పట్టినపట్టు విడచువాఁడనుకొంటివా? వట్టి పెడకట్టియ గదా?

చతు : అట్లయిన నాతఁడేరినిఁ గోరుకొనుమనును?

రుక్మిణి : (మూతి విఱచి) ఏరినా? అదేటికి లెమ్ము.

చతు : అమ్మా! చెప్పకూడదా? నన్ను నమ్మవా?

రుక్మిణి : నిజముగా చెప్పకూడదు. చెప్పరాదు. చెప్పను. నేడో రేపో నీవే విందువు (ముందుకు నడచి) యీతరలాలలితలు రాకున్నవారు. పోయి చూతము రమ్ము. (అని నిష్క్రమింతురు)

(రుక్మిప్రవేశము)

రుక్మి : జననీ జనకులు నాపరిపంథియగు కృష్ణునకుఁ జెలియలి నీయఁబ్రయత్నించు చున్నట్లు తెలియుచున్నది. వీరి కెంతమౌఢ్యము. పండువంటిబిడ్డ నొక వెఱ్ఱిగొల్ల నికిఁ గట్టిపెట్టి యగచాట్లపాలు జేయఁజూచుచున్నారు. కటకటా! నామిత్రుఁ డగు శిశుపాలుఁడీవిషయమును విన్న నెంతదుఃఖించునో కదా?

చం. హరియట చక్రధారియట యద్భుతవిక్రమ శాలియంట భూ
భరమును వాపువాఁడట కృపారహితాత్ముని గొల్లవాని ము
ష్కరుని పరాత్పరుండని ప్రశంసయొనర్తురె? కట్ట! మంచి సె
బ్బరయను భేదమున్నె తలపన్విపరీతపుఁ గాలమేర్పడన్

(కొంచెముతాళి) వీరి కోరికయు నుద్యమంబింకను రుక్మిణి యెఱుంగదు. వీరి సంగతిని తనతోఁ జెప్పక పూర్వమే నేనా శిశుపాలుని పై ననురాగము బుట్టునట్లాతని

వనమున నున్నదని విదూషకుఁడు చెప్పియున్నాఁడు. నేను పోయి సంభాషించెద. (ముందుకునడచి పారఁజూచి) అదిగో ఆచెట్టునీడఁ గూర్చుండి చెలికత్తెలతో సంభాషించుచున్నది. నేనుదాగియుండి ఆ విషయమేమో తెలిసికొనియెద (ఆలించి) ఔరా యేమిచిత్రము. కృష్ణునిపై గానముఁ జేయుచున్నది. వీని నామమెట్లు తెలుసుకొన్నదో తెలియఁజాల. ఇక నాయుద్యమంబు కొనసాగదు. (ఆశ్చర్యము నభినయించి) ఈ కృష్ణుండు దొంగయును దుర్మార్గుండుగదా? సర్వలోక విదితుఁడై కొనియాడఁ బడుటయును విచిత్రముగా నున్నది. "పదుగురాడుమాట పాటియై ధరఁజెల్లు" అన్నట్లు యెంతపాపాత్ముఁనేనియు మంచివానిగాఁ బొగడి కీర్తిఁదేగూడదా! ఛాందసులగు బాపలు వీనినింత యుచ్చదశకు తెచ్చి పాపమును మూటగట్టుకొనుచున్నారు. (యోజించి) ఈపె కీతని నామధేయపరిచయము కొద్దికాలమునుండియే యయియుండును. ఇప్పుడే భయపెట్టిన నూరకుండును. (నిష్క్రమించును)

(రుక్మిణీదేవి, లలితా, చతురికాతరలా సహితయై

పూవుదండలల్లుచుఁ గృష్ణునిపైఁ బాటఁబాడుచుండును)

(అనుబంధము-2)

(రుక్మి హఠాత్తుగా ప్రవేశించి కోపముఖుఁడై)

రుక్మి : ఛీ! నోరుమూసికొనుము.

రుక్మిణి : (ఉలికిపడిలేచి) అగ్రజా! నిర్హేతుకముగా నాపై నాగ్రహింపదగునా? నాయందే లోపమున్నది? వనవిహారము సేయవచ్చిన నన్నుఁ జెలులముందుఁగ్రించుదన మున నగౌరవపరచుట మంచిదికాదు.

రుక్మి : వనవిహారమే సేయుచున్న నేలకోపింతును?

రుక్మిణి : అట్లుగాక మరేమి లోపమున్నది. పూవులు గ్రుచ్చుచుండుటయా?

రుక్మి : దుర్మార్గుడును నాకు విరోధియగు కృష్ణునిగదా? నీవుకొనియాడి పాడుచున్నది.

రుక్మిణి : కృష్ణుఁడు విష్ణునపరావతారము కదా?

రుక్మి : ఛీ! ఛీ! నీకెవరు చెప్పిరి?

రుక్మిణి : అన్నా! వేదములు ఘోషింపవా? మునులు నుతింపరా? లోకములు గొండాడవా?

రుక్మి : ఓసీ! వెఱ్ఱిదానా! వీఁడు దొంగయును గ్రూరకర్ముఁడు. చమత్కారులగు కవులు తమ విద్యానైపుణి మెఱయ శ్యామలదేహమును అబ్జనేత్రములును సరిపరచి

నందైనను నారాయణుని లక్షణము లీతనికిఁ గలవా? నక్కెక్కడ నాగలోక మెక్కడ వీరి కిర్వురకును హస్తిమశకాంతరము గలదు.

సీ. అతఁడు పర్వతమెత్తి యమరుల రక్షించె నితడట్టి పర్వత మెత్తఁగలఁడె?
అతఁడు మ్రింగిహరించె నతిదావపావకు నితఁడగ్ని మ్రింగి సహింపఁగలఁడె?
అతఁడు బొడ్డునఁగాంచె నబ్జగర్భుని మున్ను యితఁడు గాంచునె? బమ్మ నింద్రియమున
అతఁడు సెజ్జగఁదాల్చె నాశీవిషాధిపు నితఁడు పామునఁబండి బ్రతుకఁగలఁడె?

తే.గీ. పూర్వ పుణ్యమ్ముచేత నపూర్వమైన
చక్కదన మబ్బినంత నీశ్వరునకెనయె?
కోఱ లున్నంతమాత్రానఁ గుక్కసింహ
మునకు సాటియె? మదిఁదల పోయవలదె?

రుక్మిణి : (తనలో) ఓహో! యితఁడజ్ఞాని, మూఢుఁడు. ఇంత చక్కని వాఖ్యానమునకు బూనికొన్న వీనితో భాషించుట క్రోధకారణము. నిరుత్తరనై యింటికిఁబోవు టుచితము.

(అని చెలికత్తెలసైగచేసి పిలుచుకొని నిష్క్రమించును)

రుక్మి : (తనలో) ఈమె నిరుత్తరయై పోవుటఁదలఁప నిజముగా నావాక్యములను విశ్వసించినట్లున్నదని స్పష్టపడుచున్నది. ఇక నాతనిఁదలంపదు. ఒకవేళ జననీ జనకులు బోధించినఁ దిరుగఁ గోరుకొనునా? (తాళి) అయినఁగానిమ్ము. పట్టిన పట్టు వదలక ప్రజ్ఞనీడేర్చుకొనుటలో నాయంతటివాఁడుముల్లోకములలో లేఁడు.

మ. జనకుండడ్డము జెప్పిన న్జనని వత్సా! తాళుమన్నన్ జగ
జ్జనులెల్ల న్సరిగాదు నీకనినఁగాంక్షన్రుక్మిణీదేవియే
నను నన్నా! పతిభిక్షపెట్టుమనిన న్నాప్రజ్ఞఁ జెల్లింతు న
వ్వనజాతేక్షణుఁ జేరనీయ నెటులో భంజింతు నుద్వాహమున్

(నిష్క్రమించును)

సీను-అంతఃపురము

(భీష్మకుఁడు భార్యా పుత్ర పుత్రికా సమేతుఁడై పీఠమునలంకరించి యుండును)

భీష్మ : (భార్యతో) ప్రేయసీ!

చం. సురచిరకీర్తిపెంపలర సూనుల కెల్లరకు న్వివాహము
ల్జరిపి తదీయవైభవ విలాసముఁ గన్నుల కర్వుదీరగా
నరసితిమింకఁ గాంచన సమంచిత కోమల గాత్రి రుక్మిణీ
తరుణికిఁ బెండిలిన్ సలిపి దానఁగృతార్థతఁ జెందఁగోరెదన్

నిండుజవ్వని నింటనుంచుకొనుట మనకును భావ్యముగాదు. లేకలేకపుట్టిన యాడుపడుచుగదా? యని మరి కొంతకాల మింటనుంచు కొందమన్న నపుడైన నొకయ్య కీయవలయును. కావున మన తనువు లుండగనే తగిన వరునకిచ్చి సంతసించుట సమంజసము. (విచారము నభినయించి) సంతసమా? యెక్కడి సంతసము.

చం. ఇలువెడలంగ నీకయెపుడేని పసిండి బెడంగు ముద్దుటు
య్యెలలఁ బరుండఁబెట్టుకొని యెంతయు మక్కువఁ బెంచినట్టి బి
డ్డలను సహించుచున్ గట కటా పెరవారికి నంటఁ గట్టగా
వలయుఁగదా? కుమారిత వివాహము ఖేదముగాక మోదమే?

నా రతనాలమూట! నాయనుంగుపాప! నాపుణ్యములపంట! (రుక్మిణిం జేరదీసి) అమ్మా! రుక్మిణీ! నోట నాల్కలేనిదానవు. ఘడియ విడిచి యుండలేవు. లోకాచారమును బట్టి యొకరిచేతఁ బెట్టఁ దలంచినాము. తల్లీ! యెట్లుసహింతువు (అని ముద్దు బెట్టుకొనును) (కుమారునితో) కుమారా! నీ చెలియలి నెవరికీయఁ గోరెదవో వచింపుము?

రుక్మి : మీ రెవరికీయఁ దలచితిరి?

తల్లి : నాయనా! అదియేకదా నిన్నడుగుట?

రుక్మి : కాదుకాదు. మీయభీష్టమును తెలియజేయుఁడు?

భీష్మ : పుత్రకా! మాయభీష్టమా?

రుక్మిణి : (తనలో) నాకు సంతోషమో! దుఃఖమో! ప్రారంభించుటకిదియే యాదిఘడియ.

భీష్మ : దాచనేల? శ్రీకృష్ణుఁడు తగినవాఁడని మా యభిప్రాయము. ప్రభావమా? తక్కువకాదు. చక్కదనమా? లోకాతీతము. యశమా? దిగంతశ్రాంతము. భుజబలంబా? వర్ణనారహితము. కులమా? పావనమైన యదువంశము.

రుక్మి : (కోపము నభినయించి) మంచిసంబంధమును గోరుకొంటిరి. గొల్లఁడా? మన యింటి కల్లుండు కటకటా! జనకా! మీరింత మూఢమతులని యెన్నడును దలంచలేదు. తెలియనిరీతిగా యీకన్యను గుండమునఁ ద్రోయఁ జూచుచున్నారు గదా? వాఁడతిదుర్మార్గుండు. తుచ్ఛుఁడు. చోరుఁడు. జారుఁ డు. మాయకాఁడు. లోభి.

(అనుబంధము-3)

సీ. వెన్నదొంగ యటంచుఁ బేరంది వ్రేపల్లెఁ బదుగురి నోళ్ళలోఁ బడినవాఁడు
చీరెలుదొంగిలి చెట్లపైనిడి గోపికలనేడిపించిన తులువవాఁడు
తల్లియన్నను గూళతనమునఁ జంపి నిందవహించినట్టి నిర్దయుఁడువాఁడు
మాయలుపన్ని సమరమందు శత్రులఁ దెగవేయఁజూచు మాంత్రికుండువాఁడు

తే.గీ. యెండలకు వానలకుఁగొంక కెపుడు నాలఁ
గాచుకొను గొల్లవాఁ డదిగాక నల్ల
వాఁడు మనరుక్మిణికి నీడు గాఁడు తగఁడు
పల్కకుఁడు వానినామంబు వలదు వలదు

పాపము మిమ్ముల ననఁబనిలేదు. ఇట్టి నీచమతిని మహాత్ముఁడని మీకు బోధించినవాని ననవలె. బోధించినను యక్తాయుక్తముల నాలోచింపవలదా?

భీష్మ : (తనలో) వీని సంభాషణముఁబట్టి యోజింప శ్రీహరి వీని శత్రుజాలములో ముఖ్యుఁడని తెలియుచున్నది. ఇతఁడు పట్టినపట్టు విడుచువాఁడు గాఁడు. ఇక నీవివాహము కొనసాగుట దుర్లభము. అయినను సాధ్యమైనంత మట్టుకు వాదించిచూచెదను. (ప్రకాశముగా) కుమారా! మునివంద్యుఁడగు శ్రీకృష్ణుని నిర్హేతుకముగాఁ దూలనాడుట నీకు శ్రేయోదాయకముగాదు. నీవన్న ట్లాతఁడు దొంగయును జారుండు నయిన లోకము లభినందించుట కవకాశముండునా ఒకవేళ నతనియందున్న యభిమానముచేతఁ గొందరుమాత్రము పరాత్పరుం డనిన ముజ్జగము లొప్పుకొనునా? తనయందెంత ప్రభావములేకున్న దృష్టి కకృత్యములుగా నున్ననుమహత్కార్యములట్లుభక్తగణములు భావించునట్లు సేయఁగలఁడా? ఇది దృష్టాంతరము కాదా? వేఱుగా నడుగనేల? నీవాతని జగదుపకృతులను వినియుండ నట్లున్నది. వినుము.

సీ. విషదుగ్ధమునఁ జంప విచ్చేసినట్టి భూతకిఁ జంపెఁ బురుటింట దనరునాఁడు
ఫణిమౌళిపైఁదాండవమునాడెమృదుపదాబ్జములు గుల్కించి శైశవమునందుఁ
దనుఁజంపఁగాఁ బ్రయత్నముసేయు కంసునిఁబొత్తిగుడ్డలనున్న పుడెహరించె
యెలప్రాయమందు నావులఁ గాయఁబోయివత్సాసురు నొక్కసంహతినడంచె

తే.గీ. నతఁడు సామాన్యుఁడే? కైట భాంతకుండు!
చండ కరమండ లోద్దండ మండితప్ర
తాపదీపితమూర్తి! విదళితరాక్ష
సేశ్వర స్వచ్ఛకీర్తి శ్రీకృష్ణమూర్తి

ఇవన్నియునుఁ గన్నులారఁ జూడమా? యిందొక్క విషయమేనియు మనుష్య మాత్రులకు సాధ్యమా? తనయా? కొంచెమాలోచింపుము. నిర్హేతుక జాయమాన వైరమును బెంచికొని లోకదూష్యుఁడవు కాకుము.

రుక్మి : (చెవులుమూసికొని) జనకా! మీరెట్టిబేలలు. ఉన్నవికొన్ని లేనివికొన్ని గల్పించుచు మంచివానిని చెడ్డవానిగా చెడ్డవానిని మంచివానిగాఁ జేసి లోకములను తలక్రిందు సేయఁజాలు బాపనయ్యలును, నడవులలో ముక్కు మూసికొని తపించు మునులును పొట్టగడవక దేశసంచారములు చేయు సన్యాసులును చెప్పిన మాటలను బట్టి మీరీ పనికిఁ బూనికొంటిరిగాని వాని వంశీయుల స్థితిని కొంచెమైనను తలంచితిరా?

సీ. ప్రేలికల్ధరియించి వీధివీధికి బోయి యన్నిజాతులకుఁ బాలమ్ముకొనుట
చలిదిమూటలను వీపులకంట బిగియించి కాననమ్ముల నాలఁ గాచికొనుట
పండుగుకాలాన వాలో! వాలో! యని కేరుచు సివము నెక్కించుకొనుట
అన్నంబు నీరంబు నాశింపక యహర్నిశంబులు గొఱ్ఱెల సాకుకొనుట

తే.గీ. వంకకఱ్ఱలు పాగాలు వంకకాళ్ళు
బిళ్ళచెప్పులు చింపి గొంగళ్ళుహేయ
కరముగాకుండు నెందు నెవ్వరికి నెట్లు
మంచి సంబంధమనుచుందలంచినారు?

హరహరా! యింతటి యశంబుగాంచి, యింత పరాక్రమశాలివై కుండిన పురాధీశ్వరుండవగు నీయంతటివాని కగ్రసంభవుడనై కటకటా! వెఱ్ఱిగొల్లనికి మఱంది ననిపించుకొందునా? నేనుకాకున్నను మీరైన నల్లుఁడని యనిపించుకొనుట కెట్లోపుదురు? నాయనా! నాముద్దు రుక్మిణి గోపాలునకా యర్ధాంగియగుట? యెంతకష్ట మెంత కష్టము! జనకా!

కం. అతఁడే కావలయునొ! యింకఁ
గుతలము నన్నీదు కన్నెకుం బురుషుఁడు లే
డొ! తలపయిన్గొమ్ముగలా
దొ! తెలుపుమీ? యధికమేమి దోచెనొ! నీకున్

భీష్మ : (స్వగతము) ఈతఁడు భగవద్విరోధి. నాసామవాక్యము లీతని కోపాగ్ని కాజ్యధారలగును గాని జలధారలుగావు. (తలయూచి ప్రకాశముగా) నాయనా! మనము క్షత్రవంశజులము గదా? క్షత్రియులకు స్వయంవరము ముఖ్యమైన వివాహము. రుక్మిణీ దేవి కోరికను గనుగొందము. (అని రుక్మిణిం జీరి) అమ్మా!

రుక్మిణి : (సిగ్గు నభినయించును)

భీష్మ : భయములేదు చెప్పుము?

రుక్మిణి : శ్రీహరినిఁదక్క నొరులఁ జేపట్టను.

భీష్మ : (కుమారునితో) కుమారా! వింటివా?

రుక్మి : వినుట కేమున్నది? ఇది మీయుపదేశము కాని వేరుకాదు.

భీష్మ : పుత్రకా? మేముపదేశించితిమని తలంపకుము. ఆ హరినామధేయ రూపధే యములను ప్రభావములను ప్రకృతి బోధింపదా? పోనిమ్ము! నాయనా! నీవేరికీయ దలంతువు?

రుక్మి : జనకా! నేనేరికీయఁ దలంచిన నేమిప్రయోజనము? మీప్రయత్నములు మానరుగదా? వినుము.

చం. ఎవనికరాసి శాత్రవ మహీధవభీకరమై చెలంగునో!
యెవఁడు దిగంతకీర్తి వహియించెనొ! సంగరభీముఁడెవ్వఁడో!
యెవఁడతిలోక రూప విజితేక్షుశరాసనుఁడో! యతండు పా
ర్థివ తిలకుండు మీరెఱుఁ గరే? శిశుపాలుని ధర్మలోలునిన్

మున్నొకసారి మీతో రుక్మిణీ వివాహ విషయమున నేనాతనిని మీతో వివరింప మీరు నీయకొని తలయూచితిరికదా? ఆవిషయము నేనాతనితోఁ జెప్పియుండలేదా? అప్పటినుండియు నాయందు బంధుభావమును జూపుచు నెంతయుఁ బ్రేమించుచుండును. ఇప్పడిట్లు మోసపుచ్చిన నతఁడెంత యాగ్రహించును? రాజు లనృతదూరులు గదా?

తే.గీ. క్షత్ర వంశజుఁడయ్యు భీష్మకుఁడు మాట
దప్పెనట బాపురే! రాజ తతికితండ
యశముఘటియించె నని జనులనిన నకట!
యేను వీనుల విని సహియింపఁగలనె?

తండ్రీ! కృష్ణునితో మనకు సంబంధము తగదు. మన కులము గాదు. మనకుఁ దగినవాఁడు కాఁడు. రాజహంసములతోఁ గాకులు గలియఁజాలునా! యీవాద మింతటితో విరమింపుఁడు. ఎవరయిన విన్న నవ్విపోవుదురు. సాటివారిలో తలయెత్తి సంచరింపఁ జాలను.

భీష్మ : (నివ్వెఱపడి తనలో) ఆహా! యేమి వీని కల్పనాచాతుర్యము! రుక్మిణీ వివాహ మున మున్నెన్నఁడో ముచ్చటించెనట. అప్పుడు శిశుపాలుఁడన్నఁ దలయూచితినట. నావలనఁదన కపయశమట! ఇతని కొక్క సజ్జన దూషణము

వీనితో నింక వాదించుటయును నాకు తగదు. ఏమందును?

చం. అనృత మిదందునా? యనిన నాతఁడు నీదనృతంబనున్ నిజం
బని వచియింతునా? యనిన నాతనికీయ తప్పదంచుఁ బ
ల్కను తగదందునా? యనిన గోపముచే నితడెట్టికీడు సే
యునో! యటులైనగూతునకు నోలివివాహము భంగమయ్యెడన్

వివాహభంగము ముందగుటయును గలదా? ఇప్పుడే యయియున్నది. ఏమయినను సరే. వీనితో మొండివాదము చేయుటకన్న భారమంతయును రుక్మిణిపై నిల్పెదను. (ప్రకాశముగా) పుత్రకా! నేనీయకొంటి ననుచుంటివి. సరియే కాని మన రుక్మిణి యొప్పుకొనవలదా? బలవత్తరవివాహమ చేయఁదగునా! వధువొప్పుకొనకున్న తండ్రిగాని వాని ముత్తాతగాని యేమి చేయగలఁడు?

రుక్మి : జనకా! అట్లనకుము. బాల్యచాపలమునఁ గన్యయొక తుచ్ఛుని ననర్హునిఁ గోరుకొన్నఁ బెండ్లిచేతురా యేమి? సాధ్యమైనంత వరకు బోధించి వీలుగాకున్న గద్దించి మళ్ళింపవలయును. తానాడిన దాట పాడినదిపాటగా సంతసింతురా? మీరూర కుండుడు. నేనొప్పించెదను. (అని రుక్మిణిని జేరఁ బోవఁ దల్లి యడ్డపడి)

తల్లి : నాయనా! మంచిమాటలతో బోధింపుము కాని బెదరింపకుము. ఈమె దుఃఖమును నేను సహింపఁజాలను. వట్టిపిరికిది. నీవన్న మరింత భయపడుచుండును.

రుక్మి : అమ్మా! నీవు వూరకుండుము. (అని రుక్మిణితో) అమ్మాయీ! మామాట విని గృష్ణునిపై నాస విడువుము. లేకున్న గష్టము సంభవించును.

రుక్మిణి : అన్నా! ఇంత యధర్మ మెందయినఁ గలదా? ఇది రాజ ధర్మమా? అనిష్టుఁడగు నొకనిఁ గట్టిపెట్టఁ దలఁచి బాల్యము నుండియునుఁ బ్రేమించు మనోధవుని విడనాడుమని బోధించుట సహోదరుల లక్షణమా? ఈవిపరీతము నాయందే కలుఁగ వలయునా!

తే.గీ. మోహమను దివ్వె నాహృదంబుజమునందుఁ
బ్రజ్వరిల్లుచునుండె నా పద్మనాభు
గనుగమించుచు గప్పున నార్పివేయ
నలవియే? లేదె నీకును ననుభవంబు

నన్ను మరి మరి ప్రశ్నింపకుము. వినుము.

మ. కసరంగావలదన్న! నాయెడ పరీక్షాభావమింతేని మా
నసమందు న్దలపోయఁగా వలదు జన్మంబింతకున్దీరి నీ
యసికి న్నన్నెరఁ జేసినన్ హరిని సత్యంబేను జేకొందు నా
పసుపుం గుంకుమ నిల్పి నన్నుఁ గరుణింపం బూనరా! సోదరా!

రుక్మి : (కోపోద్దీపితుఁడై) ఛీ! ఛీ! దురాత్ములారా! నీ మొగము చూడరాదు. ఇదిగో నాప్రతిజ్ఞ వినుము. నీవా వనమాలిని వరించినచో,

(అనుబంధము-4)

మ. నినుఖండించి భవచ్ఛిరంబు కడన న్నీచాత్మశీర్షంబుఁగూ
ల్చినమీఁదన్ గృతకృత్యమానసుఁడనై చెన్నారెదన్ దప్పినన్
గను మీమీసలు నర్ధమస్తకము నే క్షౌరంబుఁ గావించుకొం
దును నీకన్నులతోఁ గనుంగొనుదొ లేదో! తాళుమీ సోదరీ!

(అని కత్తిఝుళిపించును)

(తల్లియు భీష్మకుఁడును జెవులుమూసికొందురు)

(తల్లి కుమారునిఁ గౌగిలించుకొని)

తల్లి : నాయనా! నీకేల యీనిరర్థక వివాదము. నాతండ్రీ! ఒక్కగాని యొక్క బిడ్డ. దాని ముద్దు చెల్లింపరాదా? నాపట్టీ! నా మాట వినుము. పెద్దన్నవగు నీవే యాగ్రహించిన దాని కడుపెట్లు తరించును.

చం. తనయుఁడ! యీపెఁగన్నది మొదల్పయినుంచినఁ బక్షులొక్కట
న్గొని చనునొక్కొ! చీమలవి గుట్టునొ కాశ్యపిపైని నుంప నం
చును గడుఁ బ్రేమతో నిటుల జోయని నిద్దురఁబుచ్చుకొంచునుం
బెనిచితిఁ జేతుల న్గుడువఁ బెట్టితిఁ జక్కెర పాలు మీఁగడన్

(అనుబంధము-5)

సీ. కృష్ణునకేబిడ్డ నీయఁ దలంచిన నీతండ్రి పల్కు మన్నింపుమయ్య
వెన్నునిపై నాసఁ బెట్టి తపించు చెల్లెలి ముద్దునొప్పి చెల్లింపుమయ్య
నామంచిగోరఁడ న్నయనుచు శోకించు సోదరి దూషణఁ జొరకుమయ్య
వైరముల్బెట్టి వివాహంబుఁ జెడఁగొట్టె నితఁడను నింద వహింపకయ్య

తే.గీ. అమ్మదుఃఖించుననుచు నీయయ్య కోప
పడునటంచు నీచెలియలు వగచుననుచుఁ
బెండ్లి చెడునంచుఁ బదుగురు విందురనుచుఁ
దలఁచి శాంతించురా! నాదు తండ్రికావ!

రుక్మి : (కఠినుఁడై త్రోసివేసి) అమ్మా! నీవెంత వేడినను నామనంబు గఱుఁగదు. కానిండు. నాయత్నమును గానిచ్చెదను. (అని నిష్క్రమించును)

(తల్లి రుక్మిణిని గౌఁగిలించుకొని)

తల్లి : తల్లీ! దుఃఖింపకుము. శ్రీమన్నారాయణుండే నీకు దిక్కు. నీవన్నట్లు శ్రీకృష్ణుఁడు భక్తులపాలిటి రక్షకుండయిన నిన్నాదరింపకపోఁడు. రమ్ము అంతఃపురమునకుఁ బోవుదము.

(రుక్మిణి తల్లియును నిష్క్రమింతురు)

భీష్మ : ఆహా! ఎంతకష్ట మెంతకష్టము! ధర్మవిరుద్ధముగా నీతఁడీతలిరుబోఁడిని దుఃఖపెట్టఁ జూచుచున్నాఁడు. రాజధర్మముల నెతింగి క్షత్రవంశసంజాతుఁడై యితఁడిట్టి యకృత్యమునకుఁ బాల్పడుట మా ప్రాకృతకర్మఫలముగాని వేరుగాదు. (దుఃఖమునభినయించి) కట్టా! తల్లియొడిలోఁ గూర్చుండి ముద్దు మాటలాడుచు నేఁటివర కానందమును గల్గించు నా ప్రాణము, నాభాగ్యము, నారతనాలమూఁట, చంపెదను ఖండింతునని కత్తి ఝళిపించి నపుడెంత భయపడియుండెనో! సహింపఁజాల హా! కుమారా! నీకేల యింత మౌఢ్యము పట్టువడినది! (కొంచెము విచారించి)

ఉ. ఇంటికిఁబెద్ద నావెనుక నెక్కఁగనుండెడువాఁడు గద్దె వా
ల్గంటియుఁ బూర్వపుణ్యమునఁ గల్గె నొకర్తుక ముద్దుగుమ్మ నా
వంటి యభాగ్యుఁడున్గనెడు భామినిగాదు విరించి కేటికో
కంటుజనించి యిర్వురకుఁ గల్గఁగఁజేసె మహద్విరోధమున్

చం. యదుకులజున్వరించి హృదయంబున గంపెడుప్రేమతోడ ను
న్నది సుత; పుత్రుఁడొక్క నరనాథున కీయఁదలంచె; నేరి కె
య్యెది వచియింతమన్న సహియింపరు పెండిలిభంగమయ్యె నె
మ్మదికి విచారకారణము మానినిగాయమునయ్యె నక్కటా!

ఈ వేదన నన్నింతలో నెడబాయునటు లేదు. మనుష్యమాత్రుఁడనుగాన సహించుకొనవలయును. ఏమిచేసినను శ్రీహరియొక్కఁడే (చేతులుజోడించి) అంభోజాక్షా! యీ దుఃఖసాగరమును దరించుటకు నీకన్న నావ మాకు లేదు. (నిష్క్రమించును)

# రుక్మిణీ కల్యాణము

ద్వితీయాంకము

సీను - శిశుపాలుని సభారంగము

(శిశుపాలుఁడు విదూషకునితోఁ బ్రవేశించును)

శిశు : విదూషకా! నాకు రాత్రినుండియు నేదో శనిపట్టినట్టు లేమియుఁ దోచకున్నది. మొన్న నా వివాహ విషయమున మిత్రుఁడగు రుక్మితో ముచ్చటించుచుండ నతఁడు తన తండ్రి కుమారితను నాకీయఁ దలంచి యుండెనని నాతోఁ జెప్పె. అప్పటినుండియు నాహృదయము మదనబాణపరంపరలఁ గొట్టఁబడుచున్నది. వారేమైనను మనసు మార్చుకొని యుండరుగదా? అట్లయిన నీ శిశుపాలుఁడు జీవింపఁగలడా. ఆహా! ఆ రుక్మిణీ విలాస మేమని చెప్పుదును!

సీ. అమితసౌందర్య పయఃపయోనిధి నపూర్వము జనించిన మేటి రత్నమనఁగ
రమ్యవసంత శారదరాత్రుల మరుండు పదునుబెట్టెడు పుష్పబాణమనఁగ
మేఘమధ్యమున భ్రమించుచు నుర్విపైఁ దెగిపడ్డ క్రొమ్మించు తీవెయనఁగ
మకరధ్వజుఁడు దక్షిణకరంబునందాల్చు తులలేని పుష్పకందుకమనంగఁ

తే.గీ. దొల్లి నుతిమీర దుగ్ధపాథోధియందుఁ
గ్రమతఁబుట్టిన శ్రీరమా కాంతయనఁగ
వర్ణనకుమీరి, లావణ్య వతులఁగేరి,
జగతి వర్ధిల్లుచెండె భీష్మకకుమారి

విదూ : (నేపథ్యమువంకఁదిరిగి) ఈవెఱ్ఱిబాగులవాఁడు తుంటరియగు రుక్మిమాటలు నమ్మి, యానందించుచుంటఁ జూడనాకు నవ్వువచ్చుచున్నది. ఆయమ యాది లక్ష్మియై వెలసి తదంశమున రుక్మిణీదేవియయ్యె. ఇఁక నామె శ్రీహరినిఁ జేపట్టకవీనిని జేపట్టునా! నిన్నయామె వివాహపుయత్నమున జరిగిన విషయ మీతఁడెఱుంగఁడు కాఁబోలు. పాపము! ఎంత మదన తాపమునందుచున్నాఁడు. సంగతినివివరించి మదనతాపమునకుఁ దోడు నిరాశాతాపమును బుట్టించెదను. (ప్రకాశముగా) రాజేంద్రా! మీరు రుక్మిమాటలను నమ్మియుంటిరి కావి విను శ్రీహరికీయ నిశ్చయించిరట

శిశు : (అదరిపడి లేచి) ఆ! విదూషకా! ఇది నిజమా! నీతో నెవరు చెప్పిరి?

విదూ : నేను చారనాయకుని వలనఁ దెలిసికొంటిని.

శిశు : (కోపముతో) ఎంతమోస మెంతమోసము. ఓరీ! రుక్మీ!

(అనుబంధము-6)

మ. అరరే! యెంతటి మాయకాఁడవుర! మూఢా! నాకుమోహంపుటం
కురము న్బుట్టఁగఁజేసి, త్రుంచితివె! సంకోచింపవే! రాజులుం
డిరె సత్యమ్ముఁదొలంగి నాలుకలు రెంటిందాల్చు నీవంటి ము
ష్కరులౌరా! యిఁకనీ మొగంబు నరయంగాఁజెల్లునే ప్రొద్దునన్

ఎంతపని జరిగినది! ఇంత మిత్రద్రోహమెందైనఁ గలదా! నేను వరించిన కన్యను మరొక్కఁడు వరించెనని విని సహించుట నా హృదయమునకు గాయములేని బాధగదా. అందుఁ జేకొనునది నాకాబాల్య విరోధియగు కృష్ణుఁడఁట ఓరీ! రుక్మీ! నీ జన్మ మింతటితో సమాప్తమైనదని నిశ్చయించుకొనుము. (అని కత్తిఁబట్టుకొని)

మ. విమతక్షత్రియరాజ కంధరబిలావిర్భూతరక్తప్రవా
హములందు న్జలకంబులాడి ప్రథితంబై మీరు మన్మండలా
గ్రము నీకుత్తుక నుత్తరించుటకు నాల్కల్జాచుచుండు, న్మదాం
ధ! మృషావాదవిఖండనైకయజమాన ప్రేషితక్రోధమై

ఇప్పుడే నీజననీ జనకులఁ గన్నులారఁ జూచుకొనుము.

విదూ : రాజా! మీరు నిర్హేతుకముగా రుక్మిని దూషింపనేల? అతఁడొకవేళ నీయకొన కుండె నేమో!

శిశు : (శాంతించి) ఔనౌను! ఆశాభంగ సంజాత కోపపరీతచేతస్కుఁడనై యేమిప్రేలుచుంటినో తెలియకున్నాఁడ. ఇప్పుడేమి చేయవలయునో తెలియకున్నది. అతఁడీయుదయమున వచ్చెదనని చెప్పియున్నాఁడు. అంతయును దెలియును. ఓరీ! యెవఁడురా! అక్కడ?

సేన : (ప్రవేశించి) స్వామీ! యేమియాజ్ఞ

శిశు : విదర్భదేశభూపాలనందనుని రథము వచ్చియున్నదేమో కనుఁగొనుము.

సేన : (చిత్తము అని నిష్క్రమించి తిరిగి వచ్చి) రాజా! రుక్మిగారు వచ్చుచున్నారు.

శిశు : సరే; నీవుపొమ్ము (సేవకుఁడు నిష్క్రమించును)

(రుక్మి ప్రవేశించును)

(శిశుపాలుఁ డెదుర్కొని కూర్చుండ నియమించి)

శిశు : మిత్రమా! మీప్రయత్న మేమయినది?

రుక్మి : ఏమిప్రయత్నము!

శిశు : రుక్మిణీ వివాహప్రయత్నము.

రుక్మి : అది నా ప్రయత్నముకాదు, మాతలిదండ్రుల యత్నము. వారు కృష్ణున కిత్తుమని నాతో సంభాషింప నేనొప్పుకొనక వాని దుశ్చేష్టలను వివరించితిని. వారవి గణింపక రుక్మిణి నడుగుమనిరి. అంత నేను సోదరినడుగ నామె వెన్నుఁడని వచించె. వెంటనే నేనాగ్రహించి యిట్లని ప్రతిజ్ఞఁ బూనితిని.

శిశు : ఏమని?

రుక్మి :

మ. నిను ఖండించి భవచ్ఛిరంబుకడ నన్నీచాత్మశీర్షంబుఁ గూ
ల్చినమీఁదన్ గృతకృత్యమానసుఁడనై చెన్నారెదన్ దప్పినన్
గను మీమీసలు నర్ధమస్తకము నే క్షౌరంబుఁ గావించుకొం
దును నీకన్నులతోఁ గనుంగొనుదా! లేదో! తాళుమీసోదరీ! అని

శిశు : (చిరునవ్వు నవ్వి తనలో) నాకే పెండ్లిచేయవలెనని వాదించెనో లేదో కాని నాగర్భవిరోధియగు కృష్ణునకు మాత్ర మీయవలదని పలికి నాకుఁ గొంత శాంతిని గలిగించి యొక్క మేలు చేసెను. (ప్రకాశముగా) తరువాత.

రుక్మి : తరువాత నాయభీష్టమును గోరుకొనిరి. నేను శిశుపాలుఁడంటిని.

(అనుబంధము-7)

శిశు : (తనలో) ఆహా! సత్యవాక్య పరిపాలనా పరతంత్రమానసుండగు మిత్రుని నిష్కారణముగా దూషించి నేనెంతపాపము గట్టికొంటిని? (కౌగలించుకొని) వయస్యా! నీవునాయందొనరించిన మహోపకృతి నెఱుంగక యిట్టి యుద్య మంబు జరిగియున్నదని వినినంతమాత్రమునఁ, గలుషించి తూలనాడితిని. అదిమానసమును బాధించుచున్నది, క్షమింపుము.

రుక్మి : మిత్రమా! భయపడవద్దు. నేను నీకింకను నుపకృతియొనర్చిన వారిలోఁ జేరలేదు. నామాటకొనసాగించినఁగదా?

శిశు : ఇంటికిఁ బెద్దవు, నగ్రతనూజుండవు నగు నీమాటఁ ద్రోసిపుచ్చి యన్యున కిచ్చి వివ్వుఁ బరిభవింతురా!

రుక్మి : అవునుగాని నేనొక యుపాయమును జెప్పెదను వినుము

చం. ఎనయఁ బయోజనాభుని పయిన్నలినాక్షికి మోహవల్లరు
ల్బెనఁగొనిపోకమున్నె శుభలీల వివాహముసేతు నీకు నా
యనుఁగుఁ జెలి; న్నిజంబిది వయస్య! యశక్తుఁడనైన రాజనం
దను లరయంగ ముండనముఁ దాల్చెద మీసలు దీసి పందనై!

నీవు మాత్రము సంసిద్ధుఁడవై యుండవలయును. జరాసంధవిదూరద పౌండ్రకాది వీరులకు శుభలేఖల నంపుము. ఒకవేళ వనమాలి యెత్తివచ్చినను పరంతపుఁడగు జరాసంధు డశ్రమంబునఁ బారఁదోలఁ గలఁడు. ఇఁక నాకు సెలవిమ్ము, నేను పోయివచ్చెదను. (నిష్క్రమించును)

శిశు : నేనిక సంశయింపవలసిన దేమున్నది! తప్పక రుక్మిణి నాకు దేవేరి యగును.

విదూ : రుక్మి రాజకుమారుఁడైనను కుండినలో ముసలమ్మయును సరకు సేయదు, తుంటరియనియును సత్కార్యవిఘ్నకారకుండనియును బేరువడసియున్నాఁడు. అట్టి తాను పెండ్లిసేయువాఁడును, యీయన చేసికొనువాఁడునఁట. ఇందు పెండ్లికుమారుఁడైన మారాజుగారును, వీరికిఁ బెద్దబావగాబోవు రుక్మిగారును కృష్ణునకుఁ బెట్టినపగతురు. తనకుఁ గానున్న వివాహప్రాతికూల్యము వీరిద్దరే చేయఁబూనుకొనిరని యా మహానుభావుఁడే వినినఁ దప్పక పిండిబెట్టి పెద్ద పెండ్లిచేయును.

శిశు : (తనలో) రుక్మిణి నాసౌందర్య మెన్నఁడును జూచియెఱుంగదు, వనవిహారము నకుఁ బోవుసమయమును గనిపెట్టి యేదోనెపము గల్పించుకొని పోయి కన్పించి నాయందు మక్కువఁ బుట్టించు కొందును. (ప్రకాశముగా) విదూషకా! యిపుడెంత ప్రొద్దెక్కినది?

విదూ : దేవా! అదిగో!

మ. చరమాశాప్రియ భామినీసురత కాంక్షాబద్ధుఁడై హేళి, యం
బరమార్గాంతరగామియై చనుచుఁదన్మధ్యస్థితిన్నిల్చి భీ
కరుఁడై మెండగు నెండలన్నెఱపి లోకంబేర్చుచున్నాఁ, డవే
సరగ న్బారఁదొడంగె నెందు మృగతృష్ణావాహినీ సంతతుల్

శిశు : (స్వగతము) ఇప్పుడు మధ్యాహ్నమైనది. ఎల్లి ప్రభాతమున వనమునకుఁ బోయెదనుగాక (విదూషకునితో) మనమిఁకఁ బోవుదము రమ్ము. (నిష్క్రమించుచున్నారు)

విదూ : ఈతఁ డామహాదేవిని జేపట్టుట కెంతగాఁ గృతనిశ్చయుఁడయ్యె

తే.గీ. ఎవ్వరనియెంచినాఁడొ! పూర్ణేందువదనఁ
ప్రకటవార్నిధిపుత్రి స్వారాజ్యకన్యఁ
దొడరి చేపట్టఁగా మహాత్ముఁడు జనించె
ద్వారకాపురమధ్య విహారి శౌరి (నిష్క్రమించుచున్నాఁడు)

ద్వితీయ రంగము

సీను–ఉద్యానవనము,

(విచారముతో రుక్మిణి ప్రవేశించును)

రుక్మిణి :

శా. నీపైఁగోరిక నిల్పియుండుట మదాంధీభూత బుద్ధి న్మహా
కోపోద్దీపితుఁడయ్యె నగ్రజుఁడు; ఓ గోపాలచూడామణీ!
యాపాపిష్టి నృపాలసూనునకు నీయంబూనియున్నారు న
న్గాపాడంగదె నీప్రియాంగనను, కృష్ణా! దేవకీ నందనా!

నాథా! నీకన్న నాకింక దిక్కులేదు. నీ చక్కని వదనారవిందముఁజూచు భాగ్యమును గల్పించి నన్నావనింపుము. కాకున్న నీ దీనురాలు జీవింపఁజాలదు. (కొంచెము నిల్చి) ఆహా! వివిధవర్ణములయిన పక్షు లెక్కడనుండియో వచ్చి మధురుతము సేయుచున్నవి. మరియు నివి రమణీయమగు వనమును విడిచి పోఁజాలక చెట్టుచెట్టున కెగురుచుఁ బండ్లుదినుచున్నవి. వీనికివలెనే నాకును ఱెక్కలున్ననిప్పుడే పోయి విభునితో నావ్యథలను జెప్పుకొందును గదా! ఇందుఁగొన్ని ద్వారకానగరము దిశ నుండి వచ్చుచున్నవి. కమలనయనుని వృత్తము నెఱుంగకుందునా?

సీ. అరవిందముల తేనెలానెడు భృంగమా! ద్వారకనుండియా వచ్చుచుంట
నునుగాయలన్మ్రింగఁ జనుచుండు కీరమా! ద్వారకనుండియా వచ్చుచుంట
చివురుజొంపములఁ గూసెడు పరభృతకాంత! ద్వారకనుండియా వచ్చుచుంట
పసరుపిండెలనెల్ల మెసవుచిక్రోడమా! ద్వారకనుండియా వచ్చుచుంట

తే.గీ. కుశలమా! మత్ప్రియుండు! శ్రీ గోపకుండు
భక్తజనవిపద్భారంబు వాపువాఁడు
చక్రధారుండు! గోపికా జారకుండు
దేవకీ నందనుండు! సందీప్తయశుఁడు

కృష్ణా! యౌవనమున నీవు గాక నాకేమియును గన్పించుట లేదు. రాత్రిం దివము

నీమూర్తినిఁ దలపోయు నన్నుఁ గడకేమి చేయుదువు? ఈవిపత్సముద్రము తరించుటకు నీ సహాయమే నాకుఁదెప్పు. అబ్జపత్రములను నిరసింపఁ జాలు నీయాకర్ణాంత నేత్రములతో నన్నారసి, పండువెన్నెలలవంటి నీ మందహాసమును నాపయిఁ బ్రసరింపఁ జేసి కౌగలించుట నాకెన్నఁడు ప్రాప్తించును? నాథా! నీవు నన్ను మఱచినను నీ రుక్మిణి మఱచునదికాదు. సర్వజ్ఞుండవగు నీవు నా వృత్తము నెఱుంగకుందువా! (కొంచె మూరకుండి) అయ్యో! యీచతురిక యింకను రాకున్నది. అప్పుడే రెండు జాములయినది. నాయుద్యమమునకుఁ గాలముండునా?

(చతురిక ప్రవేశించును)

చతు : ఈరాకుమారి నాతోఁగలసివత్తునని చెప్పి ముందేవచ్చియున్నది. మనోనాథుని దలఁపోసికొనుచు నిష్ఠురపుటగ్రజుని చలమునకు నిందించుకొనుచున్నది. నిద్రాహారములుమాని శుష్కించి కడుదీనముగాఁ గన్పట్టు నీమెదుఃఖమును జూచి సహింపఁజాల. ఆ శ్రీహరికింకను దయపుట్టదా? (సమీపించి) అమ్మా! నీవు వచ్చి యెంత కాలమైనది.

రుక్మిణి : చతురికా! నే నుదయముననే వచ్చితిని.

చతు : నేను వచ్చువర కుందునని చెప్పితివిగదా?

రుక్మిణి : చెలీ! అందుకు నన్ను క్షమింపుము. నిన్ను వనమునకుఁ బంపుదని తరలాలలిత లతోఁ జెప్పివచ్చితిని.

చతు : ఔనఁట! వారు నాతోఁ జెప్పినారు.

రుక్మిణి : (విచారము నభినయించి) చతురికా! నాస్థితి యెంత దుర్భరముగా నున్నదో యెఱుఁగుదువా? మాయన్న నేవలచిన వానిని మాని పరుని గట్టుకొమ్మని వేధించుచున్నాఁడు. పద్మనాభునిఁ జేపట్టకున్న నేను జీవింతునా? ఇతనికెంత పిచ్చి! బలాత్కారమున వివాహ మెట్లు కొనసాగును! ఇంత పాప మెందైనఁ గలదా? ఈ రుక్మిణి పుట్టకున్న నీ వివాద మింటనుండదుగదా? (అని కన్నీరు విడుచును)

చతు : అమ్మా! చింతింపకుము. భక్తకల్పద్రుమంబగు నీరజనాభుని యందు మనంబు నిల్పియున్న నీకిట్టి ప్రాతికూల్యము లేమిచేయఁగలవు?

ఉ. ఆయదువంశసంభవుఁడు నానవమోహనగాత్రుఁడట్టి చ
క్రాయుధుఁడామునీంద్ర విపదంబుధరశ్వసనుండు, వేగ వి
చ్ఛేయు నృపాలనందనులు సిగ్గుపడన్నినుఁగొంచుఁబోవు, నో

రుక్మిణి : (కౌగలించుకొని) చతురికా! నీవాక్యములు నావిచారాగ్నికి వర్షధారలై నిబ్బరమును గల్పించుచున్నవి.

చతు : (తనలో) ఈలతాతన్వి విచారమును మఱచి కొంచెము శాంతించునట్లున్నది. నాగానవిద్యానిపుణత్వ మేర్పడునట్టు లొకపాటఁబాడి కొంతయానందము గల్పించెదను. (ప్రకాశముగా) అమ్మా! రుక్మిణీ! వివిధ కుసుమ ఫలకలిత తరుషండ మండితంబై యీవనము నిన్నుబోంట్లకు సంతోషభాజన మగుచు విచారముల నడచుచున్నది. (పాట)

(అనుబంధము-8)

రుక్మిణి : నెచ్చెలీ! నీకంఠస్వర మెంత మధురముగా నున్నది!

తే.గీ. కమలనాభుఁ డిచ్చట నాలఁ గాచుకొనుచు
మురళిఁ దాలిచి చెవుల కపూర్వమైన
విందుసేయుచుఁ బల్కించు విధముదోచె
వనజముఖి! నీదుముద్దుల పాటకతన

మఱియు నింకొక విశేషమును గ్రహించితివా?

చం. వివిధములైన పక్షులవె వేలకొలందిగ నిట్లువచ్చుచు
న్నవియునుఁ బోవుచున్నవియు నైనవి, భావము నెంచు నామనో
ధవుని విలాసవీక్షణ శతంబులు నావియు నిట్లుబోవుచు
న్నవియును వచ్చుచున్నవియు నైనవి ద్వారక కీపురానికిన్.

చతు : (స్వగతము) ఈమెకుం గృష్ణుఁడు దక్క నొండేమియుఁ గన్పట్టుటలేదు.

రుక్మిణి : చతురికా! ఈమన్మథుఁడు నాయగ్రజుని కన్నను గ్రూరుఁడై నన్ను వేచుచున్నాఁడు.

చతు : (తనలో) ఓపంచబాణా! నీకయిన నీకన్యపై దయపుట్టదా?

చం. చెలువఁపు మల్లెక్రొవ్విరుల సెజ్జలపైఁబవళింపఁ బూవుటం
చులు, లలితంపుటగ్రములు సోఁక శరీరము గందిపోవు నె
చ్చెలికి; రమాకుమార! కలుషించి భవన్నిశితాంబకవ్రజం
బులునిగిడింపఁబోకుము నమో! యనిమ్రొక్కెదసన్నుతించెదన్

ఈబాల కీదుఃఖము ప్రాప్తించుటకు రుక్మిగదా కారణభూతుఁడు. హా రుక్మీ! నీవు ధర్మము నెఱింగిన వాఁడవనుకొంటినిగాని యిట్టివాఁడవని కలనైనఁ దలంపను. అనుఁగుఁ జెల్లెలి పెండ్లికి విరుద్ధముగాఁ గత్తికట్టిన నీకేమి లాభమో తెలియదు

రుక్మిణి : చతురికా! నాకీతరుణమున శ్రీహరి తక్కమతి రక్షకులులేరు. కష్టదశయందున్న దీనులను రక్షించుటకై కంకణముగట్టుకొన్న నీరజాక్షుఁడు నన్నునాథను జేయఁడు. నామనోభీష్టముతో నా నిర్భంధజీవనమును నమ్మహాత్ము నకుఁ దెలిపి సఫలీకృత మనోరథనయ్యెదను. దీనికి నీవు సాయపడవలసినది. నేఁడీ వనమునకు నిన్నుఁదెచ్చుటలో నాముఖ్యోద్దేశమే యది.

చతు : తల్లీ! నీకు సాయపడక మరెవ్వరికి సాయపడియెదను. నీకొఱకై యగ్నినుఱుకు మన్న నుఱికెదను. సెలవిమ్ము.

రుక్మిణి : అగ్నిద్యోతనుఁడను పాఱుఁడు విష్ణుభక్తులయం దగ్రగణ్యుఁడు. నీవాతనిఁ బిలుచుకొని రమ్ము. నేనిందే యుండెదను.

చతు : సరే పోయి వచ్చెదను. (నిష్క్రమించుచున్నది.)

రుక్మిణి : (తనలో) ఈయత్నము కొనసాగిన మాతల్లిశాంకరిని బుష్పమాలలతో నలంకరించి పూజించెదను. నాథా! నీవిప్పుడేమి చేయుచున్నావు. నావ్యధలనర యుచుంటివా? ఈయభాగ్యరాలు నీకొఱకెంతబాధపడుచున్నదో తెలిసికొనుము.

(అనుబంధము - 9)

సీ. హంసతూలికలపై నత్తమిల్లెదమన్న సదయతఁ గంటికి నిదురరాదు
తూగుటుయ్యెలలందు నూగుదమనుకొన్న సుంతయు మేనికి సుఖములేదు
మధురభోజనములు మాయమ్మ దినిపింప నింతయునోటికి హితవుగావు
చిలుకల ముద్దుపల్కులు వింద మనుకొన్నఁ గటకటా! చెవులకుఁ గటువులయ్యె

తే.గీ. నీవులేకున్న నాకింక నేలతల్లి
యేల నాతండ్రి యన్నలు నేల విభవ
మేల, హారంబులేల, ధరింప భూష
లేల, లోకంబుఁ దుదకు నాకేల కృష్ణ!

మనోహరా! నీహృదయమిప్పుడు చూచుచున్న మునిజనులలో నేను కలనో లేనో!

ఉ. ఎన్నఁడు నిన్నుఁగాంచెదనొ యింపు కవుంగిటఁ జేరియుందునో
యెన్నఁడు నీపదాబ్జముల భృంగముభంగిఁ జరించుచుందునో
యెన్నఁడు "ప్రేయసీ" యనుట యేనువినంగలదాననోకదా!
యెన్నఁడు నిన్నుఁగూడి సుఖియించెదనో! యదువంశభూషణా!

(శిశుపాలుఁడు ప్రవేశించును)

శిశు : (స్వగతము) (పాట)

ఆహా! మంచి సమయమునకు వచ్చితిని.

తే.గీ. అగ్రజునియాజ్ఞమీరి మోహాతిశయత
వెన్నుని వరించియున్న యీకన్నెమోము
దమ్మికిప్పుడు నాముఖదర్శనంబు
ప్రొద్దుపొడుపగునో! నెలపొడుపెయగునొ! (అని సమీపించి)

ఏమయినను, నీమె చక్కఁదనముఁ గన్నులారఁ జూచు సమయము లభించి నందున సంతసించుచున్నాఁడ. నిజముగా మానవకాంతల కీసోయగ ముండునా! ఈమె పలుకు పలుకునకుఁ దేనియలు చిలికి కలికిమిన్నలకు సిగ్గునాపాదించదా? పల్కరించె దను. (ప్రకాశముగా) మించుబోడీ!

(అనుబంధము 10)

రుక్మిణి : (ఉలికిపడి లేచి తనలో) ఔరా! ఇతఁ డెవఁడో రాజకుమారుఁడు. ఇక్కడికి వచ్చిన కారణమేమి? కటకటా! నన్ను బలాత్కరింపఁడుగదా! (భయము నభినయించి) (ప్రకాశముగా)

రుక్మిణి : అయ్యా! మీరెవరు?

శిశు : మీ యాప్తవర్గములోని వాఁడను.

రుక్మిణి : అయ్యా! మీ నామధేయమేమి?

శిశు : నా నామధేయమా (సంశయించి) అదేటికిలెమ్ము

రుక్మిణి : (ఆశ్చర్యము నభినయించి) పోనీ మీరువచ్చిన కారణమేమి?

శిశు : కారణమా? (సంశయించును)

రుక్మిణి : (స్వగతము) వీని సంభాషణమును బట్టి యితఁడు చేదిపతియగు శిశుపాలుఁ డని తోచుచున్నది. వీనితో భాషించుట భావ్యముకాదు. పూలనెపమున స్థలాంతరమునకుఁ బోయెదను. (సాగుచున్నది)

శిశు : (తనలో) ఈమదగజరాజయాన నన్ను గ్రహించి పరాఙ్ముఖియై పోవుచున్నది. (పెదవిఁ గొరికికొని) లోకాతీతమగు నడబెడంగున కంచలు చేరవచ్చి పదములకుఁ బెనఁగుచున్నవి. ఔరా!

సీ. చెలియశారీరంపు జిలుఁగుపుత్తడిచాయ నింగికి బంగారు నీరువోయు,
లలనసోయగపు నవ్వులపాండిమంబు, దిఙ్మండిలిసన్న సున్నంబుసేయు,
కలికిచిన్నారి చూపులనీలిమంబు దిక్కులనిండఁ గల్వపూవులను గురియు,
నాతియందంపు సన్నని మధ్యమంబెల్లఁ గొమసింగములకు సిగ్గునుఘటించు,

తే.గీ. నీలకచబంధవిస్ఫురన్నీరదమున
కాసపడి మయూరములు నాట్యములుసల్పు
మరుని గజ్జలగుఱ్ఱంబు కరణి నౌర!
కదలి ముందుకు సాగుచున్నది లతాంగి.

పోయి కలసికొందును. (కొంతనడిచి నిలిచి) వలపులేనికన్నెలతో సంభాషించుటకన్న హైన్యము మఱొకటిలేదు. అట్లని పోదమనుకొన్న నీయపూర్వ విలాసము నాకన్నులతోఁ గాంచినప్పటినుండి విడిచిపోవుటకు బుద్ధిపుట్టకున్నది. (యోజించి) దాని మనోగతభావమును గనుఁగొనకయే నేనిట్లుతలంపరాదు.

చం. ఉవిదకుఁ బట్టరాని వలపున్నను మోవిమరల్చి తమ్మిక
న్గవ నరజేవురించి నెఱికన్బొమల న్ముడియించి వీతమా
ర్దవగళమున్వహించి, యధరంబును బంటిమొనన్గదించి కై
తవపు టనిష్టము న్నెఱపదా సహజంబెకదా? లతాంగికిన్

(చేరఁబోయి) రాకుమారీ! నీకైవచ్చిననాకుఁ బరాఙ్ముఖివై పోవుట ధర్మమా?

రుక్మిణి : (చుఱచుఱఁజూచి) పరస్త్రీలకడకు లోకాచార విరుద్ధముగా వచ్చుట నీకు ధర్మమయిన నాకు నిన్నుఁ బరాభవించుట ధర్మముకాదా?

శిశు : నీ వొంటరిదానవనియే తోడువచ్చితిని.

(అనుబంధము 11)

రుక్మిణి : (తనలో) ఇతనివాక్యములు మిక్కిలి విపరీతములుగానున్నవి. (ప్రకాశముగా) నాకుఁ దోడుగావచ్చుటకు నీవెవరు? లేని సంబంధములు గల్పించుకొని నిన్ను నీవే హాస్యము చేసికొనకుము. నీ పల్కులు మానాభిమానములుగల రాకొమరుండవని యర్థమిచ్చుటలేదు. చాలు చాలు పొమ్ము. ఇట్టిపల్కు లిఁక నెందు నాడకుము. యువకుఁడవయిన నీవు కన్యనగు నాకుఁ దోడుగా వచ్చితిననుట “తాడెక్కితి వేలరా! యన్న దూడగడ్డి” కన్నట్లు విరుద్ధార్థము నిచ్చుచున్నది.

శిశు : (తనలో) అక్కటా! ఈమె నన్ను బాగుగా గ్రహించినది. నాపై నీషణ్మాత్ర మను

బరువుదక్కదు. "కన్నమునఁదేలుగుట్టినట్లు" మౌనముగా దాటిపోవుట మంచిది. ఇట్లందునుగాక. (ప్రకాశముగా) రాకుమారీ! తోడుగావచ్చితి నన్న మాట నీ కపార్థమిచ్చిన క్షమింపుము. నేనీ వనవిహారమునకు వచ్చి సాంద్రములయిన నికుంజములమధ్యమున నడయాడునిన్నుఁగాంచి ముందు నీవు దీనాలాపము లాడుచుంట నాలకించి యెవరో విపద్దశనున్న రాజపుత్రియని యోదార్చి యాదరించుటకువచ్చి యిట్లాడియుంటిని. మరేదుర్భావమునఁగాదు.

రుక్మిణి : (తనలో) ఆహా! యేమిచక్కగాఁ దప్పుకొనుచున్నాఁడు. "గుంటలోఁబడి లోతుగొలుచుట" కన్నట్లు తన తెలివి నెట్లుపయోగ పఱచినను లోపమున కతుకకున్నది. ఇతఁడెన్నటికి నన్నుఁదలంపకుండునట్లు సందిగ్ధముగా నాయభిమతంబు శ్రీకృష్ణునిపై నున్నదని వివరించి పంపెదనుగాక. (ప్రకాశముగా) రాజనందనా! నిజముగా నీవు సద్భావమునఁదోడువచ్చితి వనుకొనుము.

తే.గీ. భక్తబంభరములకు దీవ్యత్ప్రసవము
భవ్యసుమనఃపయోజ రాడ్బంభరంబు
నలిననాభుఁడు కరుణింపఁ దలఁచుకొన్నఁ
దోడు నా కేల? తనమూర్తి తోడుగాక

ఆకృష్ణుఁడున్నఁ జాలునుఁ

శిశు : (స్వగతము) ఆహా! నే నెవనిని గూర్చి ప్రశంసింపఁదలఁచి వచ్చితినో యట్టి నాశత్రువుండయిన కృష్ణుని నామధేయమును దానే ప్రసంగవశమున బయలు పఱచినది. ఈమె నాకుఁ బ్రాప్తించినను బ్రాప్తించకున్నను, ఆగొల్లని ననవలసిన నాలుగు మాటలు నీపెయెదుటఁబల్కి శాంతించెదనుగాక.

(ప్రకాశముగా) ఆకృష్ణుఁడెవరు?

రుక్మిణి : ఎఱుఁగవా? ఆదివిష్ణు నపరావతారమై యుదయించిన మధుసూదనుని.

శిశు : వెఱ్ఱిదానా! వార్ష్ణేయుఁడగు కృష్ణుఁ డాదివిష్ణువగునా? కటకటా! ఎంతమాట వినవలసివచ్చినది (అని చెవులుమూసికొని) ఈ విషయమును గల్పించి లోకములను మోసపుచ్చిన కవుల నేమిచేసినను బాపము లేదు.

ఉ. వాఁడొకగొల్లవాఁడు బలవంతుఁడుగాఁ, డెపు డేనిబోరికిన్
రాఁ, డొకవేళవచ్చినఁ బరాభవమే సమకూరు; ధీరుఁడా?
కాడు, కురూపి యొక్కయర కాసునకుం గొఱగాఁడు, గొల్లపూఁ

రుక్మిణి : (తనలో) ఇతఁడును మాయన్నగారు నొక్కలగ్నమునఁ బుట్టినట్లున్నది. వీనికి బుద్ధివచ్చునట్లు తగిన ప్రత్యుత్తరములిచ్చి పంపివేసెదను. (ప్రకాశముగా) రాజకుమారా! వెడగుఁదనమున నజ్ఞానులగు మానవులు శ్రీహరిని నిందించుచు నేతత్కార్యముల యందుఁగల ప్రభావమును గ్రహింపరు వినుము.

సీ. దేవకీ పుత్రుఁడై తేజరిల్లిన మాత్ర గొల్లఁడే దేవతా తల్లజుండు
పసుల రూపమునఁ గన్పడినంత మాత్రాన గోవులే! యవి మునికుంజరములు
నీలమేఘచ్ఛాయ నెగడు చుండిన మాత్రమునఁ గురూపియె! జగన్మోహనుండు
నెనరుంచి యుద్ధభూమిని దొలంగినమాత్రయసమర్థుఁడౌనె! చక్రాయుధుండు

తే.గీ. దురితకర్ముల హరణంబు నెఱపినంత
మాత్ర దుష్టుఁడే యమల ధర్మస్వరూపి
శుభదమార్గ ప్రథీరథ చోదకత్వ
మాయన వహించినంత వార్ష్ణే యుఁడగునె?

శిశు : (తనలో) ఈనవ్వులబండి కాతనియందు మక్కువ మిక్కుటము గానున్నది. నే నెంతహైన్యముగామాటాడిన నవియెల్లను దేవతార్థమున వర్ణించుచున్నది. (విచారమునభినయించి) ఈపరితాపము నన్నింతలోఁబాసిపోదు. రుక్మి నాకీమెనర్పింప నభిలషించుచున్నాఁడుగాని లాభములేదు. తుద కాతఁ డేమిచేయఁదలఁచెనో తెలియదు. ఎట్లయినను సహించితీరవలయును. కాని విరోధియగు కృష్ణునెప్పటికైనను గడతేర్చి పగతీర్చుకొందుఁగాక (పండ్లుగొఱికి) ఓరీ! కంసనాశనా!

శా. నీదుర్నీతియుఁ గృత్రిమక్రియలు నీ నింద్యస్వభావంబు; మో
హాదిభ్రాంతు లడంగి వెఱ్ఱులయి ఘోరారణ్యసీమన్ ఫలా
స్వాదపక్రియ జీవముల్నిలిపి నిష్ఠన్మీరుసన్మౌను లా
మోదింప న్మితిమీఱిమిట్టిపడ కంభోజాతపత్రేక్షణా (నిష్క్రమించును)

రుక్మిణి : అమ్మా! యీభూతమునన్నుఁదొలఁగిపోయినది. (కొంచెమాగి) చతురిక యింకను రాకున్నది (పాఱఁజూచి) ఆహా! నెచ్చెలి పాఱునితో సమీపించినది. ఈమె యుపకృతు లెట్లుమఱువఁ గలను.

(చతురిక, అగ్నిద్యోతనుఁడు ప్రవేశింతురు)

రుక్మిణి : (లేచియెదుర్కొని) అయ్యా! నమస్కారము (నమస్కరించును)

అగ్ని : (నెత్తినఁజేయినిడి)సర్వకార్యసిద్ధి రస్తు! కల్యాణ ప్రాప్తిరస్తు! (అని దీవించి) అమ్మా!

రుక్మిణి : మీరు నా కీసమయమున సాయపడవలసి యున్నది. నాకష్టము మీవలన గట్టెక్కవలెనుగాని యితరుల చేతఁగాదు.

అగ్ని : రాకుమారీ! నీకంతకష్టమేమి సంభవించినది?

రుక్మిణి : (కన్నీరు విడిచి చతురికవంకఁజూచును)

చతు : ఆర్యోత్తమా! యీతలిరాకుఁబోఁడి కృష్ణునకు సందేశముఁ బంపఁదలఁచి యున్నది. అది మీరు కొనసాగింప వలయును.

అగ్ని : ఏమని?

చతు : వచ్చి చేకొనుమని

అగ్ని : దాని కింతరహస్యమేల? జననీజనకు లుండలేదా?

చతు : (విచారమునభినయించి) అయ్యో! ఆ రుక్మి వినిన బ్రతుకనిచ్చునా? తలిదండ్రు లనెదిరించి కృష్ణనామమును విన్నమాత్రమున మండిపడుచు నీగుణవతి నెన్నియో బాధలు పెట్టుచున్నాఁడు.

రుక్మిణి : (చేరవచ్చి)

తే.గీ. భూసురగ్రామణీ! సర్వభువనములను
నీమహత్కార్యమహిమంబు నెగడునటులఁ
బద్మనాభున కీనాదు పాట్లు దెలిపి
నన్ను రక్షింపవే! వందనములు నీకు

(అని పాదములపైఁబడును)

అగ్ని : (లేవఁదీసి) అమ్మా! భయపడకుము. ఇది నాకు శుభసమయము. నిన్నాకృష్ణ భగవానుఁడనాథనుజేయఁడు.

సీ. ఎవ్వాని కుక్షిలో నిమిడియేపారుచు నుండు నీబ్రహ్మాండభాండమెల్ల
నెవ్వాని పదముల నింపుజనించె నా గగనసంభూత గంగాభవాని
ఎవని పొక్కిట జనియించి పెంపువహించె నిరుపమజ్ఞాని వాణీధవుండు
ఎవఁ డద్భుతస్థితి నెక్కిరింతగఁదాల్చె దళితోరగున్వినతాకుమారు

తే.గీ. నెవ్వఁడవతార దశకంబు నెత్తిభువన
సప్తకము నేలనుండెఁ బ్రశస్తకీర్తి
నట్టి నారాయణునకు నర్థాంగి వగుచు

నాభాగ్యమునకుఁ గొదువలేదు. అమ్మా! నీవాదిలక్ష్మివని నమ్ముచున్నవాఁడ. కాకున్న నీయనురాగ మంతటి మహాపురుషునియందు నిలుపుట కెవ్వతె సాహసించును! మీ వివాహము నిరంతరాయముగఁ గొనసాగును. శ్రీమన్నారాయణుండు తన మహత్త్రి యలను నిరూపించుట కిట్టి యుపద్రవముల నాతఁడే సంకల్పించుచుండును. నిన్నుఁ దుచ్ఛమానవుఁడు చేపట్టి భరింపఁజాలఁడు. చెప్పవలసిన దేమోచెప్పుము.

రుక్మిణి : భూదేవగ్రామణీ! నామాటలుగా నిట్లుచెప్పుము.

ఉ. రమ్మను, వేళలేదను, కరమ్ముగ్రహింపకయున్నఁజావుని
క్కమ్మను రుక్మిణీరమణిఁ గైకొనిపోవఁగ నుర్వి నీకెసా
ధ్యమ్మను, పెండ్లిరేపను, సహాయములేరను, వెంబడింప సి
ద్ధమ్మను సాక్షినేనను నితాంతదయాకర! పోయిరాఁగదే.

సీ. నీ మనఃప్రియ రుక్మిణిని శిశుపాలున కుద్వాహ మొనరింప నుండిరనుము
నినుఁగోరికొన్న మానిని మఱొక్కనిచెట్టబట్టి, ప్రాణములతో బ్రతుకదనుము
నీవు రక్షించిన నీలవేణులలోన నీకన్యనొకతెఁగా నెంచు మనుము
భక్తులఁబోషించు భగవంతుఁడవుగానఁ బిలిపించుకొన హక్కు గలుగుననుము
ప్రహ్లాదునేలఁ గంబములోనఁబుట్టిన వెనుకటి కరుణఁ జూపింపు మనుము
యేలిన, నామీఁద నేలకుండిన, నిప్పుడేలిన నామేలు సాలుననుము

తే.గీ. ఎఱిఁగియుందువు సర్వంబు నెఱిఁగియుండి
యెఱుఁగనట్లుండి యెఱుఁగని నరులచేత
నెఱుఁగఁ బఱపించుకొందు, వే నెఱుఁగఁజేయ
నెంతదానను గడకింతి నేలుమనుము.

అయ్యా! పోయిరమ్ము! నీరాకకై ప్రతీక్షించుచుందును.

అగ్ని : అమ్మా! సరే నేను పోయివచ్చెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

రుక్మిణి : చతురికా! నీ ఋణమెట్లు తీర్చుకొనగలను?

చతు : తల్లీ! నాకేమియు నవసరములేదు, ఆపద్మనాభునితో నీవు సుఖమగనునున్నఁ జాలును.

రుక్మిణి : చెలీ! మనకు వేళయయినది పోవుదము.

(చతురికతో రుక్మిణి నిష్క్రమించును)

# రుక్మిణీకల్యాణము

తృతీయాంకము

సీను–అరణ్యము

(అగ్నిద్యోతఁనుడు ప్రవేశించును)

అగ్ని : (స్వగతము) కమలనాభునియందుఁగల యాసచేత నాజవసత్వములకు మించిన దూరము నడచివచ్చితిని. ద్వారక యింకనుఁగడుదవ్వున నున్నట్లున్నది. ఎక్కడ కుండిననగరము! యెక్కడ ద్వారక! (పాఱఁజూచి) ఆహో; యెంతనడచిన నీకాంతారమున కంతుగన్పింపదు. సాంద్రములై వియన్మార్గమునంటు నిమ్మహీరుహము లెంతటిధైర్యశాలికేని భీతినిబుట్టింపక మానవు.

సీ. చటులదంతావళచ్ఛటలపైకుఱుకు సింగపుఁదండముల భీమగర్జనములు
మృగయుల బాణంపు టేటులఁజెలరేగి కాండ్రించు పులుల భీకరరవములు
మఱ్ఱియూడలకు సమంబుగా వ్రేలెడు త్రాచుపాముల ఫూత్కృతస్వనములు
కార్చిచ్చుమంటలఁ గాలి పటేలున బ్రద్దలౌ వెదురు గఱ్ఱల నినదము

తే.గీ. లాకటఁగలంగి పోరు భల్లూకరాళ్ళు
లాయగండకోద్దండ కోలాహలంబు
లఖిలదిక్కులు మార్మోయ నతిశయిల్లి
కలఁచుచున్నవి మొదటఁ బాంథులమనంబు

సూర్యుఁడు తల్లిగర్భమునఁ బడుటకై పరుఁగిడుచున్నాఁడు. కూనచీకఁటు లప్పుడే యక్కడక్కడఁ బొడముచు నాశావలయము కుంచీకృతముఁ జేయుచున్నవి. లోకబాంధవుఁడగుటచేతఁ బ్రభాకరుఁడు పూర్ణముగా శక్తిహీనుఁడయ్యును దననామము సార్థకమగునట్టు లింకను గొంతవెలుఁగు లోకమునకుఁ జిమ్ముచున్నాఁడు. వెలుఁగుండఁ గనే నేనీవనము దాటెదనుగాక! (ముందుకునడచి) అమ్మయ్యా! వనము దాటివచ్చితిని. అదిగో ద్వారక సమీపముననున్నది. కాని యిది నిశాసమయము. పద్మనాభుని దర్శనము నాకుఁచిక్కదు.

ఒకచోట శయనించి యుదయముననేస్వామివారి దర్శనము చేసెదను. ఓహో! దూరమునుండి చూచువారల కీపురమెంత శృంగారముగా నున్నది.

మ.	ఘనదేవాలయకుడ్య కేతనమరుద్గాఢాహతిన్ ఘంటికా
నినదంబశ్రుతపూర్వమై వెలయుచుం డెన్మోహినీమోహమం
దనరత్నాంకుర రాగసంచయమన న్గన్పట్టెడిన్దివ్యకాం
చన సౌధాంతరదీపికాసమితి యాశాదంతురచ్ఛాయలన్.

ద్వారక సమీపించుటచేత నా హృదయము కృష్ణభగవానుని దర్శనమునకై పొంగి పొరలుచున్నది. ఆహా! యీమహాభాగునిఁ జెట్టబట్టు మారుక్మిణీదేవి యెంత భాగ్యశాలిని. వీరి సంయోగసిద్ధికై పాయపడుచున్న నాకును ముక్తిగలుఁగదా?

మ.	హరిపాదాంబుజ సేవనాపరత దేహత్యాగులౌ సన్మునీ
శ్వరనామాక్షర పంక్తిరాగములతో సంధించుచున్నాడుచుం
దురు దేవాంగన లెల్లకాలమున సంతోషధ్వనిన్ జాహ్నవీ
సరసప్రాంతవనీ వనాంతర సమంచల్లోలసంచారలై

(నిష్క్రమించును)

## రెండవ రంగము

### (కృష్ణుని శయనాగారము)

కృష్ణు : (పడకపై నుండి మేల్కొని తనలో) రాత్రియంతయును నా కొక దీనురాలి ప్రార్థనంబు చెవినిసోకుచు నన్ను సందిగ్ధవిచారమున ముంచివేసినది. మరియు మొన్నఁబ్రణయకలహమున రాధను విడిచివచ్చి నేటి కింక నాయిందుముఖితో ముచ్చటింపకుండుటచే హృదయమునకు విశ్రాంతి కానరాకున్నది. నేనెంత కఠినాత్ముఁడను. ప్రణయ కలహోద్రేకమున.

ఉ.	చిక్కనికన్బొమ ల్ముడిచి చెక్కు చుఱుక్కునఁజీరినంత నా
చక్కెరబొమ్మ నిక్కపు విచార మెదన్దలపోసి దుఃఖము
న్నగ్గుక్కుకొనంగలేక కనుగొల్కుల వెంబడి బాష్పబిందు లొ
క్కొక్కటి రాల్చెఁ జందురుని నుండి తొఱంగు తుషారవారినాన్

దుఃఖాతిశయమున నన్నెంతకఠినాత్ముఁడని నిందించినదో; నేనా సమయమున రుక్మిణీ కరపరిగ్రహణమునుదలంచుచుఁ దనప్రశ్నములకు విసుగుకొనియుంటిని. పోయి బుజ్జగించి తమిదీర ముచ్చటించెదనుగాక (పొఱఁజూచి) ఓహో!

ఉ.	"కుక్కురుకో"యటంచుఁదొలి కోళులుగూళులఁగూసెఁదూర్పునన్
జుక్కపొటుక్కునన్ బొడిచె సొంపుగఁ బక్షులుఁగూయసాగె న
ల్దిక్కులుఁ దెల్లనాయెఁ బరదేశులుఁ బోఁబయనంబులైరి యా

కావున నేను యమునాతరంగిణికిం బోవలసియున్నది. లోకబాంధవుం డుదయ గిరిశిఖర మలంకరింపకమున్నే నదీజలములఁ గ్రుంకిడి శుచినై యుదయించిన వెంటనే మిత్రున కర్ఘ్యమొసంగెదను. (నిష్క్రమించుచున్నాఁడు)

సీను–ఉద్యానవనము

(రాధ విచారముతో నొక వేదిక నధిష్ఠించియుండును)

(అనుబంధము 13)

రాధ : కటకటా! నాథు నెడబాసిన నాజీవనమునకుఁ దెరవెక్కడిది. నిష్కారణముగా విభునిచిత్తమును గలఁచి మేరలేనిదుఃఖమనుభవించు నేనెంత బేలను.

సీ. చెలువొప్ప నాదుచెక్కిలిఁ జీరినప్పుడు మురువుగా మెటికలు విఱువనైతి
"ఇటురమ్మ"టంచుఁగౌగిటఁ జేర్చినప్పుడు ధృతి రొమ్ముమీఁద నొత్తిగిలనైతి
పెనఁగి గట్టిగఁబట్టి నను ముద్దుగొనువేళ నెలమోవిపానక మీయనైతి
గిలిగింతబెట్టి యర్మిలిఁజూపుసమయానఁ జిరునవ్వు వెన్నెల ల్గురియనైతి.

తే.గీ. విసిగి కోపించి ననుడించి వెడలు వేళ
కినియనని పోయి పతినడ్డగింపనైతి
ధవునికైదండవిహరించు దాన నిపుడు
దైవమా; యిట్టు లొంటరి దాననయితి

పోయి యపరాధమును మన్నింపుమని యడుగ నిశ్చయించుకొన్న బాపిష్ఠి యభిమానము విడిచిపోవకున్నది. నాథా! నీకోపమింకను జల్లారలేదా? మున్నెన్నఁడు నింతవిలంబన మొనరింపని నీవెట్లు మనంబును చిక్కఁబట్టితివో తెలియదు. (విచారించి) విభుఁ డంతయనాదరణమున విడిచిపోవుటకు నాయందంతటి దోషమేమికలదు?

ఉ. బత్తులప్రార్థనంబు వినవచ్చెనొ కాక పదాంగనారతిన్
జిత్తము గోరెనో! కనలి చీయని, రోసి విరక్తిఁజెందెనో!
యిత్తరిఁగారణంబది యొకింత యెఱుంగమిఁ దామరాకుపై
ముత్తియమట్లు నెమ్మనము ముందుకు వెన్కకు బర్వులెత్తిడిన్

ప్రత్యూషమున యమునాజలాప్లావనంబునకు విభుఁడు దినదినమున వచ్చు మార్గమిది. నేనిందే కనిపెట్టి యుండెదను.

(కృష్ణుఁడు ప్రవేశించి)

కృష్ణ : (సంతోషము నభినయించి) (స్వగతము) ఓహో! రాధ యిక్కడనే యున్నది. రత్నవేదికనధిష్ఠించి భూమి కవతరించిన సాక్షాల్లక్ష్మీదేవియోయన

నీయారామమున కెంతయు శోభ నాపాదించుచున్నది. ఊర్పుసెగలచేఁ గమలి యెఱ్ఱవాఱిన కపోలములకుఁ దన చిగురాకుఁ గేలినిఁ గీలించి మిక్కిలి దీన భావమును వహించి జాలిఁ గొలుపుచున్నది. (సమీపించి ప్రకాశముగా) కల్యాణీ! నీవువచ్చి యెంతకాలమైనది?

రాధ : (మొగము ద్రిప్పికొని) ఎంతకాలమైననేమి మీకిప్పుడు మాతో నేమియవసరము.

కృష్ణ : (నవ్వి) తలిరాకుబోఁడీ! యెంతమాటాడితివి! నీతో నవసరమే లేకున్న నికఁ గృష్ణునకుఁ బ్రాణములతో నవసరమందునా?

రాధా : కాంతలపట్లఁ బురుషులెంతకును సమర్థులు.

కృష్ణ : అయినఁ గావచ్చునుగానీ నీ విషయమునమట్టుకీ కృష్ణుఁడసమర్థుఁడు (అని కౌగలించుకొని)

మ. నిను నాపున్నెపుఁ బంటగాఁదలఁచి మన్నింతున్బయోజాక్షి నీ
వినుతాలాప కలాపముల్వినుటకు వ్విళ్ళూరుచుందున్మనం
బున గర్వింతును నీమనోహరలసన్మూర్తిత్వమున్గాంచి మ
న్ననతో నన్నరకంటఁజూచి పరమానందంబునన్ దేల్పవే!

రాధ : (చిఱునవ్వునవ్వి) మనోనాయకా! తుచ్ఛురాలగు నన్ను మీరా కొనియాడుట! మీపాదసేవకురాలనుగదా?

కృష్ణ : అవునుగాని; ప్రేయసీ! అప్పటి నావిముఖత్వమున కేమి తలంచితివి?

రాధ : మనోహరా! మీరే విముఖులయిన నింకఁ దలఁచుటకు మతి నిలిచియున్నఁ గదా? (చేయిపట్టుకొని) నాథా! మీరప్పు డేమో యోజించుచుంటిరి! అది నాకుఁ జెప్పరా?

కృష్ణ : (స్వగతము) శ్రీరుక్మిణిజ్ఞప్తికివచ్చినది! మానినీ; నీకరగ్రహణ ప్రాప్తి నాకున్నదో లేదో! (ప్రకాశముగా) అదిపరమ రహస్యము.

రాధ : (స్వగతము) నాతోఁ జెప్పఁగూడనంతటిరహస్య మేమున్నది. (యోజించి) (తలయూచి కృష్ణునితో) కొత్త పెండ్లాము కాదుగదా?

కృష్ణ : (నవ్వి) యింతీ! నీకన్నియు నిట్టియూహలే!

రాధ : గ్రుచ్చియడిగిన మరలఁ గోపింతురేమోయని భయమగుచున్నది! ఒకసారి యనుభవించితినిగదా! పోనిండు ముందుకునడచి వనచిత్రములను జూతము రండు!

(కొంతనడిచి విభునితో)

ఉ. అంటియు నంటనట్టుల ఖురాగ్రము లుర్విఁజెలంగ జెంగున
న్మింటికి దాటుచు న్ధరణి నిల్చుచుఁ బచ్చికమేయుచున్దగ
న్బెంటుల కఱ్ఱునాకుచును వేడుక శాద్వలమధ్యసీమల
న్జంటలుగట్టి మెల్లనఁ బ్రచారముసేయుఁ గురంగజాలముల్

నందనందనా! జంతు సంతానముల దాంపత్యప్రభావ మెంతని కొని యాడెదను; దుఃఖమననెట్టిదో యెఱుంగని వీని యానందము వర్ణనీయము!

కృష్ణ : మానినీమణీ! కష్టసుఖము లేజీవులకుండవు? అదిగో! చూడుము!

మ. చిగురాకున్ బిక మర్ధభాగము భుజించె, న్దానినర్ధంబు నిం
పుగనర్పించె నిజాంగనామణికి; సమ్మోదంబుతో నారగిం
పగయత్నించు పికాంగన న్గగనసీమామధ్య సంచారుఁడై
ఖగనాథుండు హరించె నెవ్వరికిఁ గల్గంబోవు? దుఃఖవ్యధల్.

జన్మమెత్తిన ప్రతిజీవమునకు గష్టసుఖములు సమానములు.

రాధ : స్వామీ! నిజము, తత్వముగూర్చి తలంచిన నంతముండదు.

కృష్ణ : (ఆశ్చర్యము నభినయించి) రమణీలలామా! వన మీయుదయమున నాకన్నులకు నూతనముగాఁ బొడసూపుచున్న దేమిహేతువు?

రాధ : నాకుమట్టు కెప్పటివలెనున్నది.

కృష్ణ : ఓహో! తెలిసినది.

శా. నీచే దోహదకృత్యముల్గొనకమున్నే కేతకీభూజము
న్పూచెఁ న్పొన్న చిగిర్చె చూతమును బెంపున్దాల్చె నీమేనిశో
భాచాతుర్యమున న్సుగంధతవహింపన్సాగె మందానిలం
బో! చామీకరగాత్రి! హంసములు డాయున్మందమందధ్వనిన్

రాధ : మనోహరా! మీపాదసేవయే కదా దీనికింగారణము. నీభక్తుల కేవిషయమునఁ గొఱంతకలదు?

కృష్ణ : అబలా! నీభక్తికి సంతసించితిని. (మింటికిఁజూచి) తపన మండల మప్పుడే నభోమండల మధ్యభాగ పరిసరప్రాంతములకు సమీపించినది. రమ్ము ముందావృక్షచ్ఛాయల విశ్రమింతము. (నిష్క్రమించును)

(అగ్నిద్యోతనుఁడు ప్రవేశించును)

అగ్ని : (స్వగతము) కార్యాతురుఁడ నయిన నాకు రాత్రియంతయును శ్రీకృష్ణుని మూర్తి మనోగతమయి తాండవమాడుచు సంతోష సంభ్రమములను బురికొల్పుట చేతఁ దృప్తిగా నిద్రింపనయితిని. విష్ణుభక్తుఁడనయిన నాకుఁ గమలనాభుని దర్శించెడు శుభసమయము సమీపింప నిదురబట్టునా? ఆరుక్మిణీదేవికి నానామమే స్ఫురించుటయు నాప్రాకృత పుణ్యవశమునఁగాని వేరుగాదు (విచారము నభినయించి) కట్టా! అట్టితల్లి కిట్టియిక్కట్టు లాకట్టడి బ్రహ్మ పెట్టినందుల కిట్టలంపుశోకము పొరలివచ్చుచున్నది.

మ. నను మన్నించి నమస్కరించునెడఁ గన్యారత్నముప్పొంగు వె
చ్చనికన్నీటికణంబులన్గురిసె నస్పష్టధ్వనిన్ దీనయై
వినిచె న్గొన్నిరహస్యముల్ హృదయ నిర్భేద్యంబులై నెమ్మనం
బునుబాధించెడి, విన్నచో నలిననాభుం డేమివాక్రుచ్చునో!

మురవైరిపైఁ తన కెంతమక్కువ లేకున్న తెగువంఁజేసి యిట్టి సందేశము నంపునా? యీయుద్యమంబును గడునాశ్చర్యముగానున్నది. పురుషుని చిత్తము నెఱుంగకయే ముగ్ధ లిట్లుకబురంపరు. ఒకవేళ నాతఁడీయకొనకున్నఁగన్యాశతంబునఁ దనకపఖ్యాతిగదా? (కొంచెముతాళి) కాకున్న జన్మజన్మములకు నాహరి కర్ధాంగియై యుదయించు నాదిలక్ష్మియా? (విచారించి) తానట్లు పద్మాలయాంశమున జనించి యున్న నీవిఘ్న మేలతటస్థించును. తటస్థించుట కేమి! విధినిర్ణయంబులయిన సత్కార్యములు కొనసాగునెడ నప్పుడప్పుడు దుష్టులచే నిట్టిచేతలును గావింపఁబడుచుండును. ఇదియును సద్భక్తుల భక్తిభావములను స్థిరపరచుటకు సాధనంబని నిశ్చయింపవచ్చును. ఈవివాహము కొనసాగునప్పటికి వాసుదేవుఁడెందరిని సంహరించి తృప్తిపడనున్నాఁడోకదా!

చం. అతఁడు మురారి, తాలిచెడు నట్టిది చక్రము, దుష్టనిగ్రహం
బతని యభీప్సితంబు తనయందనురాగము నిల్పియున్నదీ
యతివ, సహోదరుండు కమలాక్షుఁడుగాదని మందుచుండె ని
క్కతమునఁ దాండవింపవె! యఖండరణస్థలి శౌరిబాణముల్

అవతారమూర్తియగు నమ్మహాత్మునిపైఁ గత్తిఁగట్టుట కొఱవిఁగొని తలను గోకికొనుట. అట్టి విరుద్ధాచరణంబు లీతనిపట్ల నేమిసేయఁ గలవు! కాని పురుషోత్తముని చెట్టబట్టు వైదర్భికి ముందు సుఖజీవన మేర్పడి యున్నను తల్లిదండ్రులు చేతులారఁదన చేతనిడి సంతసించు భాగ్యము లేకపోయెఁగదా యని విచారించెదను. (తాళి) ఉదయమున శ్రీ కృష్ణభగవానుఁడు యమునకుఁ బోయియుండెనని దెలిసినది! పోయి కలసికొందును. (ముందుకునడచి పాఱఁజూచి) ఓహో! ఆడబోయిన తీర్థమెదురయ్యె శ్రీహరి సమీపమునఁ

(అనుబంధము 15)

మ. కరుణాపూరితనేత్ర గుంభిత సమగ్రస్ఫార వీక్షాపరం
పర లాశావలయంబునంటి దివిషన్మార్గంబున న్నిండి క్ర
మ్మరి రాధాసతిపై విలాసగతి ప్రేమన్నాట్యమాడంగ భా
సురచంద్రోపలవేదికా తలమునన్ జూపట్టె రమ్యాకృతిన్

శా. ఆకన్నుంగవయంద మాఘనసమానాంచచ్ఛరీరంబు తీ
రా కౌశేయపటంబుఁ దాల్చినవిధంబాఫాలభాగంబు సొం
పా కమ్రస్మిత చంద్రికా విలసనంబామోవియందంబు నా
హా! కన్నారఁగనుంగొనంగలుఁగు భాగ్యంబబ్బె నాకిత్తఱిన్

అబలావినోదక్రీడాపరాయణుండయి యున్నవాఁడు. ఇప్పుడు దర్శించుటు చితముగాదు. ఉచితమేలకాదు?

ఉ. గ్రాహముఖంబునన్ బడిన గంధగజం బొకమారు పాహిమాం
పాహి యటంచుఁ గుయ్యిడనపారముదావ హదబ్ధికన్యకా
మోహవినోదము ల్విడిచి పోయి జలగ్రహము న్వధించె సం
దేహములేల యార్తులకు దేవునిపజ్జ స్వతంత్రముండదే!

ఈ మహాభాగుం డిటేవచ్చుచున్నాఁడు.

(శ్రీకృష్ణుఁడు ప్రవేశించును)

కృష్ణ : (అగ్నిద్యోతనునిఁ జూచి తనలో) ఇతఁడొక సద్బ్రాహ్మణునివలె నున్నఁది. నాకొఱకే వచ్చియుండునా (ప్రకాశముగా) ఆర్యోత్తమా! నమస్కారము.

అగ్ని : కల్యాణమస్తు! సద్విజయప్రాప్తిరస్తు.

కృష్ణ : భూదేవశిరోమణీ! మీరాకకుఁ గారణమేమి? మీదేపురవరంబు?

అగ్ని : బ్రహ్మాండనాయకులగు మీరు నారాకకుఁ గారణంబెఱుంగరా? దేవా! మాది కుండిన.

కృష్ణ : (స్వగతము) ఓహో! రుక్మిణిపంపిన సందేశహరుఁడై యుండవచ్చును. (ప్రకాశముగా) అయ్యా! శ్రీరుక్మిణి కుశలయా?

అగ్ని : కుశలయేకాని....

కృష్ణ : (ఆతురముతో) కాని యని సంశయింతురేల? ఆపెకేమయిన గష్టము సంభవించెనా?

అగ్ని : కష్టమా? మానవజన్మమెత్తిన నన్నియునుఁ గష్టములే కదా!

కృష్ణ : అవును. అట్టి కష్టము లేరికి లేవు? ఉపద్రవ మేమియును లేదుగదా?

అగ్ని : లేకున్న నీసేవకుఁ దేలవచ్చును.

కృష్ణ : అవనీదేవకులోత్తమా! శీఘ్రమేవచించి నాసందేహమును నివారింపుఁడు.

అగ్ని : యదుకులోత్తమా! సావధానచిత్తులరై యాలింపుఁడు. విదర్భదేశాధీశ్వరుం డయిన భీష్మకుఁడు బహుకాలమునుండియు మీ గుణగణంబుల నాగతానాగతులగు పాంథులవలన విని తన పుత్రిక నీయదలంచి యొకనాఁడు తన యగ్రతనూభవునితో నాలోచింపఁగా నతఁడు మిమ్మును మిక్కిలి హీనముగాఁ బల్కి శిశుపాలున కామెనిచ్చుటకు సంకల్పించి విశ్వప్రయత్నములు చేయుచున్నాఁడు. శ్రీరుక్మిణి తత్పూర్వము నుండియును మీయందు మనంబునిల్పియుండి హరినిఁ దక్క నొరులఁ గైకొన ననిపల్కగా నాతఁ డాగ్రహవ్యగ్రుఁడై కరవాలమున నఱుకఁ బోయెనట.

కృష్ణ : (కోపముతో పండ్లుగొఱికి) ఆ! దురాత్మా! నీకెంతకావరము, తొందరపడకుము (అని) తరువాత

అగ్ని : తరువాత నోస్వామీ! అతఁడు శిశుపాలునకు నిన్నీయకున్న నన్ను మారుపేరునఁ బిలువుమని శపథముఁజేసి ప్రజ్ఞకై యెల్లి లగ్నమని చెప్పి బందుగులకు శుభలేఖలంపి రావించినాఁడు. ఇదంతయు నారయుచున్న యక్కన్యాలలామ తన దుఃఖమును భరింపలేక దిక్కేది యని నన్ను రహస్యముగాఁ బిలిచి.

తే.గీ. భూసురగ్రామణీ! సర్వ భువనములను
నీమహత్కార్యమహిమంబు నెగడునటులఁ
బద్మనాభున కీనాదు పాట్లు దెలిపి
నన్ను రక్షింపవే వందనములు మీకు

అని పలికి నామాటలుగా నిట్లు చెప్పుమనియె.

సీ. నీమనఃప్రియ రుక్మిణిని శిశుపాలున కుద్వాహ మొనరింప నుండిరనుము
నినుఁగోరికొన్న మానిని మరొక్కనిఁజెట్ట బట్టి ప్రాణములతో బ్రతుకదనుము
భక్తులపోషించు భగవంతుఁడవుగాన బిలిపించుకొన హక్కు గలుగుననుము
నీవురక్షించిన నీలవేణులలోన నీకన్య నొకరిగా నెంచుమనుము
ప్రహ్లాదు నేలఁ గంబములోన బుట్టిన వెనుకటికరుణఁ జూపింపుమనుము

తే.గీ. యెఱిఁగియుందువు సర్వంబు నెఱిఁగియుండి
యెఱుఁగనట్లుండి యెఱుఁగని నరులచేతఁ
నెఱుకపఱపించుకొందు వే నెఱుక జేయఁ
నెంతదానను గడ కింతి నేలుమనుము
మరియు

ఉ. రమ్మనె, వేళలేదనె కరమ్ముగ్రహింపకయున్నఁ జావుని
క్కమ్మనె, రుక్మిణీసతిని గైకొనిపోవుట కుర్వినీకె సా
ధ్యమ్మనె, ఁబెండ్లిరేపనె, సహాయములేరనె వెంబడింప సి
ద్ధమ్మనె, సాక్ష్యమిమ్మనె, నితాంతదయాకర! తోడి తెమ్మనెన్
మహాత్మా! మరొక సంగతి,

ఉ. ఆయమ నీయెడన్నిలిపినట్టి దురంతమహానురాగ మా
కాయజువేదనాభరము కన్గొనినంతనె జాలిగల్గె నా
కేయననేల శత్రువులకేని సమున్నతవజ్రపర్వత
ప్రాయములైనచిత్తములు పారవె పూర్ణదయానదంబులై!

తే.గీ. శారదాభర్తనిర్మించు సమయమందు
నెంత సంతోషపడియెనో యంతకంటి
నీరుఁగార్చుచునున్నాఁడు నెలఁతనుదుటి
వ్రాలుఁ దప్పింపగా వశపడమి శౌరి!

మ. నిను నాకన్యకు భర్తగాఁదలచి తన్నీరేజగర్భుండు బా
లను నిర్మించిన వాఁడెకాని శుభవల్లావణ్యలీలాకళా
జనకంబైన తనూవిలాసమున కాశ్చర్యంబునిండారఁగ
న్గొనుచు న్మందమతిన్ లిఖింపనగు నీ ఘోరవ్యధాభారముల్

ఉ. ఆలలనాగళస్వనము నందు జనించెడు తేనె లింపుగాఁ
గ్రోలఁదలంచి తద్భ్రమరకోటి నిరంతరమంటియుండెనో
నాలసదింద్రనీలముల నవ్వుశిరోజములొప్ప రుక్మిణీ
బాలికసోయగంబున నభచ్చరకాంతలఁగాలఁదన్నెడిన్

మ. అనఘాత్ముండవు నీవెఱుంగనిదిలే దావంతయు న్గాని భ
క్తునివాక్యంబుల నాలకించుటకు నుద్యుక్తుండవైనాఁడ వం
దున నింకొక్కవిశేషమున్ దెలుపనెంతున్బుద్ధిలోఁగన్య నీ

కృష్ణ : (కొంచెమువిచారించి స్వగతము) ఔరా! దురాత్ముఁడగు రుక్మి యెంతపనికిఁ బూనుకొనియె! వీనికి నాయందీయనిష్టభావముదయించుటకు నాకాబాల్య ద్వేషియగు శిశుపాలుఁడే కారణము. కటా! నామనోహారిణిని గ్రహించి భరించువాఁ డాతుచ్ఛుఁడగు చేదిపతియా? (శిశుపాలునుద్దేశించి) ఓరీ! శిశుపాలా!

మ. నిను ముక్కంటిని నాకరాంబుజముల న్నీతల్లి ముద్దార ని
ల్పిననాఁడా నయనంబు మాసెననుచు న్భీతాత్మయై నీమఱం
దిని మన్నింపుము నూరుతప్పులకు ప్రార్థింతున్మురారీ! యటం
చును నీయాయువు భిక్షమెత్తెననియోర్చు న్నాగదాచక్రముల్

తే.గీ. కమలగర్భుండు నీయందుఁ గరుణఁబూని
యాయువుంబోయుఁగాక నీ యపకృతముల
సంఖ్యనిండిననాఁడు మచ్చుటులచక్ర
ధారఁదునుమాడు వాఁడ బాంధవవిపక్ష!

(రుక్మినుద్దేశించి) రుక్మీ! నిర్నిమిత్తశత్రుత్వమును కల్పించుకొనిన నీమౌఢ్యము నకు నే నచ్చరువందుచున్నాఁడను (తలయూచి) శిశుపాలు నెప్పుడు స్నేహించితివో యప్పుడే నాకు పగతుఁడవయితివి. నీరు పల్లమునకు బారి మిట్టకెక్కనట్లు దుర్జనులు సజ్జనులదారిబట్టరు; శిశుపాలునకు గాక మరొక రాజసూనున కీయనెంచిన నాక్రోధాగ్ని నింత రవుల్చియుండవుగదా? పోనిమ్ము.

మ. అనుగుంజెల్లెలిగా జనించినది కన్యారత్న మెట్లో భవ
ద్ఘనపూర్వార్జితపుణ్యలేశమున శస్తంబయ్యె నీజన్మ మ
క్కనకాంగీపటుబాష్పబిందువు లమోఘజ్వాలలై నీసుఖం
బను వృక్షంబును గాల్చివేయవె? దురాత్మా బంధువిద్వేషకా!

చేదిపతి కిచ్చుటకుగాని మరొకని కిచ్చుటకు గాని నీ కాపెపై నేమి యధికారమున్నది?

చం. అవనిభరంబు మాన్పుటకునై యదువంశమునందుఁబుట్టి శ్రీ
ధవుఁ డిటు ద్వారకానగర తల్లజమందు వసించుచుండ నా
ధవళ పయోజనేత్ర నొక దాయకిడ న్దలపోయ నీవెవం
డవు? కొనువాఁడునెవ్వఁడు? దృఢంబుగ బీపుకుఁడెవ్వఁడెంచినన్

(ప్రకాశముగా) భూసురవర్యా! సమయమునకు వార్తను దెచ్చి మేలు చేసితిరి. మీకు నేబుణస్థుఁడను. మీరు మగిడిపోయి నామాటలుగా నిట్లు చెప్పుఁడు.

సీ. వైరి భూపాలక పద్మనాళబలంబు కృష్ణ కుంజరము సహింపదనుము
నినుచేదిపతికీయ నీయన్నకేకాదు శాంకరీపతికి నసాధ్యమనుము
యీనాఁడె కాదిఁక నెన్ని జన్మములకు నేని నీవగుదు నా దానవనుము
నానామహోర్త సంతానమ్మునకు యదు ప్రవరుండు గలఁడు శరణ్యుఁడనుము

తే.గీ. పట్టునది చక్రమనుము తాపంగనేల
శౌర్యముంకువఁజేసి రాజన్యతతికి
దిగ్భ్రమ జనింపఁగాఁ గొనితెత్తునిన్ను
జగతి నెత్తింతు నొక జయస్తంభమనుము

ఉ. ఒంటరిదాననై పొగులుచుంటి నెఱుంగఁడు నాథుఁడంచుఁ బ
య్యంట మొగంబునందిడి భయాకులవై విలపింతువేమొ క్రీ
గంట సమస్తమున్ దెలియఁ గాఁగలనేర్పరి తమ్మికంటి! నీ
కంటికి నెన్నిబాష్పములు గార్తువో! యీతఁడు నన్నిగార్చెడిన్

మ. నవముక్తామణులట్లు గల్లముల వెంటన్జారు కన్నీటి బిం
దువుల నెల్లన గోటఁజిమ్మి విలసద్దోర్దండ పీఠాగ్రతాం
డవిత స్వర్ణపటంబున న్విసరుమాన్యంబైన దాస్యంబు యా
దవసింహంబు వహించు నందనుక నిద్రాణుండు గానేర్చునే.

మ. కలికీ నేనిక నొక్కిచెప్పఁదగు వాక్యంబిద్ది నీమోవి తే
నెల నాశింపనిచో మురారి నరయోనిన్జన్మమెత్తండు కే
వలరక్షోహరణంబె హేతువని సంభావింతువో దానికై
విలసచ్చక్రగదాకృపాణములులేవే! దేవదత్తంబులై!

ధరణీనిర్జరవంశోత్తమా! చెప్పవలసినవన్నియును జెప్పితిని. వేద వేద్యులరగు మీరు దీని ననుసరించి మరేమయినను జెప్పి యూరడింపఁగలరు. పొందు (అని నమస్కరించును)

అగ్ని : చిత్తము, (అని సెలవుపుచ్చుకొని)

(నేపథ్యమువంకఁ దిరిగి)

మ. విడువన్నేరఁడు కన్యకామణిని గోవిందుండు, గోవిందునిన్
విడువన్నేరదు రుక్మిణీరమణి తన్విజ్జేది భూమీశుఁడున్
విడువన్నేరఁడు, రుక్మిపంతమును దప్పింపండు యుద్ధంబులో
విడువన్నేరవు శౌరిబాణములు విద్వేషప్రజానీకమున్ (నిష్క్రమించును)

కృష్ణ : హా! రుక్మిణీ కఠినరాక్షసమధ్యమునఁ జిక్కిన సీతాలతాంగినిఁ బోలి నీవెట్టి బాధల ననుభవించుచున్నావు!

(అనుబంధము 16)

సీ. కృష్ణుని పేరింక నెత్తకుమనుచుఁ గోపించి మీయన్న గద్దించునపుడు
అతఁడె కావలెనన్న నత్యాగ్రహమునఁ జంపెదనంచుఁ గత్తిఁజూపించునపుడు
గర్వాంధుఁడై కన్ను గానక నాపేర క్రించుదనమున దూషించునపుడు
పుత్రునకడ్డంబు వోవక నీతండ్రి యదయుఁడై కన్నార నరయునపుడు

తే.గీ. యెంతదుఃఖించియుంటివో యెఱుఁగఁదరమె
కటకటా! తమ్మిచూలికే కాలమందు
నెగ్గుఁగావించితివొ! యతఁడిట్టివెతలు
నుదుటలిఖియించె మూడుబంతులుగఁ దీర్చి

(నిదానించి)

మ. అరవిందాక్షుఁడనై జనించి యతిబాల్యంబందభేద్యక్రియా
కరణంబుల్పచరించి దిగ్భరిత విఖ్యాతిన్విడంబించి యో
హరిణీలోచని! నిన్ను నేలని మదీయంబైనబాహాబల
స్ఫురణంబేటికి జన్మమేటికి మహర్షుల్విన్న నిందింపరే!

కల్యాణీ! మారశింజినీటంకారములు శ్రవణపుటంబులను భేదింపఁ బూవుటల్లులు మనోవీథిం జీల్చుచున్నవి. ఈతాపము నీయధరసుధారసధారల గాక మరొండువిధమున శాంతించునా? హా! మీనకేతనా! నీవెంతకఠినాత్ముఁడవు.

ఉ. వావిఁదొఱంగి నీగురుని పైఁ గుసుమాంబకపంక్తులేయునో
భావజ! నీవు లోకములపైఁ గలుషించుట వింతయే? మహా
దేవుఁడు శంభుఁడింతయు మదిందలపోసియె రూపుమాపెగా
కా విధినున్నచో హరహరా! తెఱవుండునె జీవకోటికిన్

(తలయూచి) మానవజన్మమెత్తి న్యాయాన్యాయవేద్యుఁడై నలువ నియమించిన

ప్రకృతిధర్మంబగు వావివరుసలను బోనాడి సోదరిగానున్న రుక్మిణీకరగ్రహణంబునభిలషించు శిశుపాలపశువు నిందనీయుఁడు గాని; రూపవిహీనుఁడవై పక్షపాతములేక నీకు విధింపఁడిన వృత్తిని సార్థకము సేయు నిన్నేలనిందింపవలె? ఇది విపరీతమని యబ్బురపడనేల.

సీ. పరులమంచి కసహ్యపడి చిత్తమెటియంగ లోలోనఁ గ్రుళ్ళెడు లోభిమతులు
అబ్బినజుట్టును నబ్బకుండినఁ గాళ్ళుఁ బట్టయత్నించునపాత్రమతులు
యెదుటగొప్పగఁబల్కి మదినీర్ష్యఁబూని కుట్రలువన్నుచుండెడు తులువమతులు
తమరాజ్యమొరుల హస్తములనిల్పి శరీరముల నమ్ముకొనియెడు మూఢమతులు

తే.గీ. అరులదరుమంగలేక దేహములఁదాచు
కొనుచు జేనెడుపొట్టకై ఘోరదాస్య
మునకులోనైనవారు కాబోలు నిట్లు
ప్రబలుచున్నారు కలియుగా రంభవేళ (నిష్క్రమించును)

# రుక్మిణీ కల్యాణము

చతుర్థాంకము

సీను–రుక్మిణీ శయనమందిరము

(రుక్మిణి ప్రవేశించును)

రుక్మిణి : (దుఃఖముఖియై)

మ. మకరిన్ ద్రుంచి కరీంద్రమున్మనిపి శుంభత్కీర్తిఁజేకొన్న య
య్యకలంకంబగు సత్కటాక్షమిపు డీయబ్జాక్షిపైనేల జూ
పకయున్నాఁడవొ! తప్పుగాఁ దలతువో భక్తాళివారించిరో!
యకటా! నాకిక దిక్కులే రెవరు కృష్ణా యేలరాకుందువో!

ప్రాణకాంతా! ఈపరితాపమెన్నటికేని దొలంగునో! తొలంగదో! నీయంకతలముననిల్చి నీవచోమృతధారలు గ్రోలుటగాక మరొండు నాకు సుఖప్రదంబుకాగలదా? నాథా! ధర్మవిరుద్ధ ప్రవర్తకుండగు రుక్మి నిన్నుఁ దూలనాడుట విని సహించుటకన్న మరణమే మేలని తోచుచున్నది. యదుకిశోరమా! స్వప్నమునందైనను భక్తుల మొఱలకుఁ బ్రమత్తుఁ డవుకాని నీవిప్పుడేల నాకుఁ బరాఙ్ముఖుఁడవై యుంటివి. ఛీ! రుక్మిణీ! నీవెంత పాపిష్ఠి

పాట్లననుభవించు నీ బ్రదుకెంతహేయమయినది. దీనురాంద్ర కష్టకాలమును దీర్ఘము సేయుట పరబ్రహ్మమునకును వినోదకరము గాబోలు!

మ. తలిదండ్రుల్దయమాలి యగ్రజుని క్రోధజ్వాలకు న్భీతులై
తొలఁగన్ధర్మవిరుద్ధవర్తనపుఁ జాతుర్యంబుఁజూపింప మి
క్కిలిగా రుక్మిచెలంగె, నిన్నిటను దుఃఖింపంగ నున్నట్టి నా
చలితస్వాంతము నవ్వుచున్నది విశేషంబైన విభ్రాంతిమై.

నందసూనా! లోకరక్షణపరాయణుండవగు నీకొక్క దీనురాలినిరక్షించుట భారమా.

చం. కలుషపథానువర్తనుల గాదిలిచెల్లెలు చేదిరాజు ము
న్వలచిన ముద్దరాలు తలపన్ననుబోంట్ల కనర్హురాలు ఛీ
వలదని యెంతువో సురవిపక్షకులాగ్రణు నొక్కదైత్యునిన్
బొలియఁగఁజేసి నందనునిఁ బ్రోవవె? జానకి నేలకుంటివే?

శా. లీలన్నీపదసారసంబుల రజో లేశంబులే; దేవభూ
పాలావాసనితాంతమంగళ శుభప్రారంభముల్సేయఁగాఁ
జాలున్ దత్పదదర్శనోత్సవ విలాసప్రాప్తియా గోపికా
జాలంబందఁగనట్టి భాగ్యమును భిక్షంబెత్తెదన్ నాయకా!

రాధాసతీ! నీవు నోచిననోము నేనేల నోచనయితిని. నీవయినను నాథునిఁ బుత్తెంచరాదా? ఆడుజన్మమెత్తిననీకు నిట్టిదుఃఖ మనుభవవేద్యము కాకున్నదా? సపత్నీ విరోధసంజాతకోపమున నూరకొంటివా?

సీ. చెంచుబిత్తరిని వరించె నీతఁడటంచు నెఱిఁగియుండియును సహించుకొనవె?
వననిధిసుందరీ వల్లభుండని బుద్ధి నూహించుకొనియును నూరకొనవె?
వైదేహికొకమాటు ప్రాణనాయకుఁడంచు భావించి మదిఁజిక్కఁ బట్టుకొనవె?
గోపికాసతుల మక్కువనేలుచుంటఁ గన్నారఁజూచుచుఁగోపమణచుకొనవె?

తే.గీ. అట్టి నీశాంతబుద్ధి నాయందునిల్పి
యడ్డగింపకుమమ్మ పద్మాక్షునందు
నీకుఁ గల్గిన బాధ్యత నాకుఁగలదు
నాకెకాదింకఁ గలదు ముల్లోకములకు

సందేశహరుండగు నగ్నిద్యోతనుఁడింకను మరలి రాక నావిషాదమును దీర్ఘము సేయుచున్నాఁడు.

మ.	ధరణీదేవుఁడు వృద్ధుఁడావిషమ కాంతారప్రయాణవ్యథా
భరుఁడై చిక్కెనొ! పద్మనాభుని ముఖాబ్జాతాభిసందర్శన
స్థిరభాగ్యంబులభింపదో! విభుఁడు సందేశంబునాలించి ని
ష్కరుణాబుద్ధి ననాదరింప నది వక్కాణింప శంకించెనో

ప్రస్తుతకాల వైపరీత్యమునుబట్టి పురుషోత్తముఁడు నన్ననాదరించెనని శంకించుట విశేషాంశముగాదు. కష్టసముద్రమునీదు మానవునిపట్ల నొక్కొకపరి దైవమును మొగముఁ ద్రిప్పుకొనుచుండును.

(తెరలో)

అమ్మా! యెవఁడో బ్రాహ్మణుఁడు మీదర్శనార్థమైవచ్చి ద్వారమున వేచియున్నాఁడు.

రుక్మిణి : (ఆతురమునలేచి) సేవకా! అరచెదవేలరా! వారి నిటుగొని తెమ్ము.

(అగ్నిద్యోతనుఁడు ప్రవేశించును)

రుక్మిణి : (నమస్కరించి స్వగతము)

తే.గీ.	దర్పకానలభూరినిదాఘతప్త
చకితమగుచున్న మన్మన శ్చాతకమున
కితని సందేశమేఘ నిర్గతములయ్యె
డు నవి వర్షబిందువులొ పిడుగులొ! యెఱుఁగ

అగ్ని : తల్లీ నీనోము ఫలించినది. నీకు దీర్ఘాయువగుగాక.

(అనుబంధము 17)

రుక్మిణి : హరిముఖావలోకనంబును జేయజాలని నాకు దీర్ఘాయువేటికి.

అగ్ని : కొలఁదికాలముననే చేయఁగలవు. అమ్మా! నేను నీకడసెలవు పుచ్చుకొని ద్వారకపోయి రాత్రియగుట నొక్కచో నిద్రించి ప్రభాతమున యాదవసింహుని దర్శనార్థమై నగరమునకుఁబోవ మహాత్ముఁడంతకుముందు యమునాకల్లోలి నీనిర్మలజలావగాహనార్థ మరిగియుండెనని దౌవారికునిచే నెఱింగి యేత న్మార్గాభిముఖుండనై పోయి వికసితనానాకుసుమశోభితం బగునొక పూవుఁదోటఁ బ్రవేశించితిని. అందొక యెలమావిగున్న నీడ నిందూపలవేదిపై నాసీనుఁడయి యాజగన్మోహనాకారుఁడు రాధావినోదియయియుండఁ బొడఁగంటిని.

రుక్మిణి : (స్వగతము) ఆహా! రాధాసతీ! బాల్యమునుండియుఁ బురుషోత్తముని సేవించుచున్న నీకిట్టివిచారము స్వప్నవృత్తముగదా! (ప్రకాశముగా) అయ్యా! తరువాత.

అగ్ని : తరువాత నోయమ్మా! ప్రేయసీవినోదక్రీడలఁ బరవశుఁడగు శ్రీహరిదర్శనము నకు సంశయించి గజేంద్రరక్షణదక్షుఁడగు భగవంతునకు నాహతాద్దర్శనంబు కోపకారణముగాదని సమీపించి చిరకాలమునుండియు మధుసూదనునిజూచు వేడ్కనువ్విళ్ళూరుహృదయము తృప్తివహించునట్టు లాజగన్మోహనాకార మహా సౌందర్యామృతంబును నేత్రాంజలులతోఁ ద్రావితిని.

సీ. ఆకాంతపైనున్న యవిగాని కన్నులాలోకించుచుండె ముల్లోకములను
నాతిపైనిలిచియున్నవిగాని కరములు నిలిచియున్నయవి భక్తులశిరముల
నవనినంటుచనున్నయవిగాని పదములు పరగుచున్నవి వైరి ఫణిఫణముల
పెనఁగియున్నవిగాని వెలఁదిని బాహువు ల్పెనఁగియున్నవి భవ భీతజనుల

తే.గీ. వసుధపైనున్న రీతిఁ గన్పట్టెఁగాని
కడుపులో సప్తలోకము ల్గలిగియుండె
అట్టి భగవంతుఁడెందు గన్పట్టకుండు
లోక మాతఁడు నాతఁడె లోకమగుట.

యీనా సందేశమా రహస్యవేదికి "చర్వితచర్వణము" గాకుండునా యని వెనుదీసియైనను భక్తుల మొఱలనాలించుట సర్వేశ్వరుఁడభిలషించునని నీవృత్తమాద్యంత మును నివేదించితిని. తానదియుంతయు నాలించి నామాటలుగానిట్లు చెప్పుమనియె! వినుము.

సీ. వైరిభూపాలక పద్మనాళబలంబు కృష్ణకుంజరము సహింపదనుము
నినుఁజేదిపతికీయ నీయన్నకేకాదు శాంకరీపతికి నసాధ్యమనుము
యీనాడెకాదిఁక నెన్నిజన్మములకు నేని నీవగుదు నాదానవనుము
నానామహర్షసంతానంబునకు యదుప్రవరుండు గలఁడు శరణ్యుఁడనుము

తే.గీ. పట్టునది చక్రమనుము దాపంగనేల?
శౌర్యముంకువఁజేసి రాజన్యతతికి
దిగ్భ్రమ జనింపఁగాఁ గొనితెత్తు నిన్ను

మ. నవముక్తామణులట్లు గల్లములవెంటన్‌జారు కన్నీటిబిం
దువుల న్మెల్లనం గోటఁజిమ్మి విలసద్దోర్దండ పీఠాగ్రతాం
దవిత్తస్వర్ణపటంబునన్ విసరు మాన్యంబైన దాస్యంబు యా
దవసింహంబు వహించునందనుక నిద్రాణుండు గానేర్చునే?

ఉ. ఒంటరిదాననై పొగులు చుంటి నెఱుంగఁడు నాథుఁడంచుఁ బ
య్యంట మొగంబునందిడి భయాకులవై విలపింతువేమొ క్రీ
గంట సమస్తమున్ దెలియఁ గాఁగలనేర్పరి తమ్మికంటి నీ
కంటికి నెన్నిబాష్పములు గార్తువొ! యీతఁడు నన్నిగార్చెడిన్

మ. కలికీ! నేనిఁక నొక్కి చెప్పఁదగు వాక్యం బద్ది నీమోవి తే
నెల నాశింపనిచో మురారి నరయోనిన్‌జన్మమెత్తుండు కే
వల రక్షోహరణంబె హేతువని సంభావింతువో దానికై
విలసచ్చక్రగదా కృపాణములు లేవే? దేవదత్తంబులై

తల్లీ! నీకు శుభముకలుగును. పురుషోత్తముఁడు తప్పక నిన్నుఁ జేపట్టును. నీవాదిలక్ష్మివిగాని వేరుగాదు. నాకిఁక సెలవిమ్ము. పోయి వచ్చెదను.

రుక్మిణి : (పాదములంటి) ఆర్యవర్యా! నామన మిప్పటికిఁ గొంత శాంతించినది. మీఋణము నేనెట్లు తీర్చుకొనఁగలను. తీర్చుకొనుటకుఁ దగినపరిదాన మేమున్నది? శ్రీనారాయణుండే మిమ్ముఁ దృప్తి పఱుఁపగలఁడు. పోయిరండు.

(అగ్నిద్యోతనుఁడు రుక్మిణి నిష్క్రమింతురు)

సీను–అంతఃపురము

(భీష్మకునిభార్య పీఠముననుండును)

(అనుబంధము 18)

దేవే : (విచారముతో) కటకటా! పుత్రుని కఠినహృదయము గరుఁగ కున్నది. ఎంత చెప్పినను దానుబట్టినకుందేటికి మూడే కాళ్ళనుచున్నాఁడు. ఈ వివాదము కన్నబిడ్డలలో నుదయించుటచేత నాగర్భము రెండుపక్షములఁ గోయఁ బడుచున్నది. ధర్మాధర్మములను విచారించిన సుతునియుద్యమంబు ఘోరముగా నున్నది. తప్పని వచింతమన్న నితఁడప్పుడే నేయివోసిన అగ్నివలె మండిపడుచున్నాడు. మూర్ఖుడని యూరకొన్న నందరు నేకీభవించినన్ను విసర్జించిరని మాకడుపులు దరుగుకొనిపోవునట్లు చిన్ని కూఁతు రేడ్చుచున్నది.

సీ. పద్మనేత్రయుగంబు భరియింప లేదంచు నెలరాలమేడల నిలుపనైతి
బింబాధరంబు గంపించునోయని శుకపాళిబంధకముల వదలనైతి
సారంగగమనంబు సరణి దప్పు నటంచు సింహపీఠికలందుఁ జేర్పనయితి
చన్నుగొండలు పరుషత డిందునోయంచు నురువజ్రహారంబు లునుపనయితిఁ

తే.గీ. జెక్కుటద్దంబు లొకవేళ చిట్లుననుచు
నెంచి బాష్పపాతము నంట నీయనయితి
నంతగారాబమునఁ బెంచి యకట! తుదకు
బాలముద్దును జెల్లింపఁ జాలనయితి

ఉ. ముట్టదు భోజనంబు నొకపూటయుఁగస్తురిబొట్టు మోమున
న్బెట్టదు, విప్రకోటివినిపించెడు దివ్యకథాకలాప మూ
కొట్టదు, తానమాడదు, దుకూలములన్గుసుమాంగకంబున
న్గట్టదు, పల్కరింపదు శుకంబులఁ బండదు హంసతూలికన్

ఇంతదశ ననుభవించుచున్నను నకళంకమయిన తన హృదయాకాశమున దుఃఖమేఘ మొక్కటియే మసలుచున్నది గాని వేఱువిధమగు నీర్ష్యాదంభోళియు నుద్భవించుటలేదు. కల్యాణగుణంబులన్నియు నిట్లు మూర్తీభవించియుండవచ్చును.

సీ. తనదుర్గతిని మదిన్ దలపోసితలయూచి యొకసారి డెందంబు లూపివిడుచు
తొట్రిల్లుమత్తసింధురపు నడంజూపి చెలఁగి చిత్తాబ్జము ల్గలఁచి విడుచు
దీనావలోకనానూనబాణంబులు పరపించి యెద గాయఁపరచి విడుచు
నిప్పుకల్గురిసెడు నిట్టూర్పులన్ బుచ్చి హృదయవీధులను దహించి విడుచు

తే.గీ. వేడికన్నీటిధారలు విడిచివిడిచి
కఠినబుద్ధులు సలసలఁ గాచివిడుచు
కొసరిమాటాడముత్తెము ల్గురియునట్టి
తల్లి నేతల్లి విడిచెడిఁ దాల్మివిడిచి

మధుసూదనా! నీనామశ్రవణమాత్రమున నీముగ్ధ కెంతటియనురాగమును నీయందుఁబుట్టించితివి. నీవు పరమాత్ముఁడవని వేఱుగాఁదలంపవలయునా? నీయట్టి యవతారపురుషుని జామాతగాగ్రహించుట నాకు లభించునా? జనములు ప్రశంసించుకొనునట్లు నీ వాదినారాయణుండవేయయినఁ గమలాలయాసదృశయగు నాదుహితను జేపట్టి మాకానందము గల్పింపుము. ముం దీయంగనామణి నీతో సుఖింపనున్నను బ్రస్తుత

మ. అనయంబున్ దవనామమంత్రపవనం బన్నంబుగాఁ జండకుం
డినకాంతారమునం దయోగ్యమృగకోటిన్ నీదు జాయాతప
స్విని కాలంబు నుపక్రమించెడిని నీచిద్రూపసందర్శనం
బున ముక్తింగలిగింపవే! దుహిత నామోదింపవే! కావవే!

(రుక్మి ప్రవేశించి)

రుక్మి : (స్వగతము) ఓహో! జనని యిక్కడనే యున్నది. (చేరఁబోయి ప్రకాశముగా) అమ్మా! నన్నుఁబిలిచిన కారణమేమి?

దేవే : నాయనా! వచ్చితివా? రమ్ము కూర్చుండుము.

రుక్మి : నాకుఁగూర్చుండుటకు వ్యవధిలేదు.

దేవే : కుమారా! యేమంత యగత్యము.

రుక్మి : అది నీవెఱింగియే యుందువు. ఊ. మాటిమాటి కాప్రశంస యేల?

దేవే : (యోజించి) స్ఫురింపలేదు. నాయనా చెప్పుము.

రుక్మి : ఏమున్నది. మన రుక్మిణీ వివాహ ప్రయత్నము.

దేవే : వరుని నిశ్చయింపలేదుగదా?

రుక్మి : (కోపము నభినయించి) నిశ్చయింపలేదా? ఆనాఁడే నిశ్చయించితిమికదా? శిశుపాలుఁడని నీవు వినలేదుకాఁబోలు.

దేవే : అతని నీచెల్లె లామోదింపలేదుగదా?

రుక్మి : ఐననేమి? ఆమోదించినను నామోదింపకున్నను శిశుపాలునకే యీయవలెను. (విసిగికొని) ఊరకపిచ్చిప్రశ్నలచేతఁ గాలయాపనము చేయకుము.

దేవే : తండ్రీ! కోపపడెదవేమిరా! అంతగారాబమునఁ బెంచుకొన్న కూఁతు నయోగ్యునకిచ్చి దుఃఖపెట్టెదవా?

రుక్మి : (కోపముతో) యేమంటివి

(అనుబంధము 19)

తే.గీ. చేదిరాజ్యంబుఁ దనభుజ సీమఁదాల్చి
పాలనాదీర్ఘచక్రంబు లీలనడపు
వాఁడయోగ్యుండె? నోరెట్లు వచ్చె! సింగ
మును గనుంగొని నొక్కి జంబుకమనంగ

అనిష్టప్రలాపములకు మేరయెక్కడిది? అతని కేమిలోపము. రూపమున మరుఁడు. జ్ఞానమున గురుఁడు. భండనమున హరుఁడు.

దేవే : నాయనా! శిశుపాలుఁడు యోగ్యుఁడేయగునుగాక. వధువు గోరకున్న బలవద్వివాహము ధర్మమా?

రుక్మి : తల్లీ! తక్కువకులమువాఁడును దుర్మార్గుఁడునయిన గొల్లని వరించి కళంకరహితమగు వంశమునకుఁ గొండంతయవమానమును దెచ్చిపెట్టుట నీబిడ్డకు ధర్మమైన విషయమా? తల్లుల కాదుబిడ్డలపై యనురాగమన్నట్లు నీవు కూతురు పక్షమున వాదింతువుగాని నాపక్షమునబల్కవుగదా? పల్కినఁబల్కకున్నను నాకేమి? అమ్మా! నన్ను విసిగింపకుము. నాచలము నీకు బాగుగాఁదెలియును. మేరువుగ్రుంగినను రుక్మి పంతమును విడుచువాఁడుగాఁడు.

దేవే : పుత్రకా! నన్నేల నిందింతువు! తల్లికి సంతానమున నొకరిపై ప్రేమయు నొకరిపై నీర్ష్యయునుగలదా? శరీరమున నంగకము లన్నిటికిని బోషణమొక్కటియేకదా! తల్లినిగాన కడుపుచిచ్చుఁబట్టలేక చెప్పితిని. నాకంత మాత్రము స్వాతంత్ర్యములేదా? నాయనా! నామాటవిని యీపట్టువిడువుము. (అని చేతులు పట్టుకొనును)

రుక్మి : (విడిపించుకొని) ముసలివారి వలనఁ గలిగెడు కష్టములే యివి. ఎంతచెప్పినను మీపట్టునువిడువక "పెద్దలమాటను త్రోసి వేయరాదు" అను బొల్లి సామెతనుబట్టి యూగులాడుచు శాస్త్రవేత్తలయిన కుమారులను సయితము సాధించుచుందురు. నాకు సెలవిమ్ము.

దేవే : నాయనా! నామనవి నేమిచేసితివి?

రుక్మి : నామనవిని నీవేమిచేసితివో నేనదేచేసితిని.

దేవే : తండ్రీ! నీకేల యీపట్టు?

రుక్మి : నీకు నీబిడ్డ కేలనో నాకు నందులకు.

దేవే : (నిట్టూర్పువిడిచి తనలో) కటకటా! వీఁడు కఠినాత్ముఁడు! పుత్రిక కేదిగతి. (ప్రకాశముగా) అయ్యా! ఇప్పుడీతీవ్ర మెక్కడకు.

రుక్మి : ఎక్కడకా! వివాహమునకు శుభలేఖలంపుటకు.

దేవే : (స్వగతము) ఆడుదాననగు నేనేమిచేయగలను? బిడ్డతోపాటు నిలువున నీరయి

చం. బ్రతికిననాల్గునాళ్ళవనిపైసుగుణాఢ్యులఁ బుత్రులన్ శుభ
స్థితిఁగని వారి మన్ననలు చేకొని సర్వసుఖంబులంది యు
ద్ధత తనయా విరోధపరితాపమునందక దాటిపోవు దం
పతులె యదృష్టవంతు లలవారె; జగద్ధితపుణ్యమూర్తులున్ (నిష్క్రమించును)

రుక్మి : రుక్మిణి నేడంతఃపురమున విష్ణుపూజఁజేయుచున్నదని తెలిసినది. పోయి నిరోధించెదను. (నిష్క్రమించును)

సీను–అంతఃపురము

(రుక్మిణి చతురికాసహితయై పటములను బూజించుచుండును)

రుక్మిణి : (పటమునుజూపి చతురికతో) యీపట మేమో చెప్పఁగలవా?

చతురి : (చూచి) చెప్పఁగలను. ఇది చేఁప; ఇతఁడు జాలరివాఁడు.

రుక్మిణి : (నవ్వి) చతురికా! ఎంతపిచ్చిదానవు! ఇదియా నీవూహించితివి?

చతు : ఊహించుట కిందు విశేషమేమున్నది? జాలరివాఁడు చేఁపలను బట్టఁడా?

రుక్మిణి : అవునుగాని, ఇది చేఁపగాదు. ఇతఁడు జాలరియునుగాఁడు.

చతు : సరిసరి; యిప్పుడు నీవు పిచ్చిదానవో నేను పిచ్చిదాననో తెలిసినది; నీవెంత చదువుకొన్నదానవయినను నన్నుఁ దలక్రిందు చేయఁజాలవు లెమ్ము!

రుక్మిణి : చతురికా! వినుము. ఇది మత్స్యావతారము. సోమకుండను వాఁడు వేదముల నుహరించి యబ్ధిఁజొచ్చి డాగియుండ నతని జంపి వేదములను గొని వచ్చుటకై శ్రీమన్నారాయణుండు మత్స్యమయ్యెఁగాని యిది కేవలము చేఁపకాదు.

చతు : అమ్మా! క్షమింపుము. ఇతఁడెవరు?

రుక్మిణి : అతఁడే బ్రహ్మ! వేదము లితనివే!

చతు : తెలిసినది. అమ్మా! మూర్ఖురాలనగునే నిది గ్రహింపఁగలనా?

రుక్మిణి : చతురికా! శాస్త్రవేత్తలయ్యు నిట్టిదేవమహిమారహస్యములను దెలియని వారు పలువురున్నారు. ఉదాహరణముగా మాయన్నగారిని జూడరాదా? సాక్షాద్విష్ణుండగు శ్రీకృష్ణునిఁ గేవలము మర్త్యునివలెఁ దలఁచి యెంతవిరోధముఁ బెంచుచున్నాఁడో నీవననెంతదానవు.

చతు : అవును కన్నులారఁజూచుచున్నానుగానా? (ఉలికిపడి) యెక్కడనైన నుండి వినుచున్నాఁడేమో! తొలుత నాతఁడు ప్రచండకోపి.

చతు : నీవుమట్టుకు భయపడవలదా? ముక్కోపియగునాతఁడు నిన్నును నన్ను నేమయినఁజేయఁగలఁడు.

రుక్మిణి : భీతార్తులకు శరణ్యుఁడగు నిందిరారమణుని సేవించువారికి వెఱపేల? యిదిగో! యీపటమును జూడుము. హిరణ్యకశిపుని దుండగములకు సహింపలేక సురలు తన్నుశరణువేడఁగా నభయహస్తము నిచ్చుచున్నాఁడు. ఆహస్తమెట్టిదో యెఱుంగుదువా?

మ. అదియేగంధగజేంద్రము న్నిమిరి నీరాటవ్యధాభూతగ
ద్గదిక న్మానిపె; చక్రమున్విసరె నీల్గన్ రాహుదేవారిపై
యదియే సింహనఖంబులన్ బొలిచె నిత్యంబున్ రమామానినీ
మృదులాంగంబులఁ దాండవించెడిని జుమ్మీ! దేవతారాధ్యమై.

ఈ పటమునకుఁ బూవుదండ లలంకరింపుము.

చతు : (పటముపుచ్చుకొనును. ఇద్దరును బూజించుచుందురు)

(రుక్మి ప్రవేశించును)

రుక్మి : (స్వగతము) ఔరా! యీ రుక్మిణి నిజముగా విష్ణులీలా చిత్రపటములను గొలుచున్నది. (తలయూచి) యీమె కన్యయయ్యు నించు కేనియును ముఖ పరిచయములేని కృష్ణునిపై నింతటికూర్మిఁ బెంచికొనుట చిత్రముగా నున్నది. ఆమాయలమారియగు దేవకీసుతుఁడు నేనింటలేనివేళ నెన్నఁడేనియును వచ్చి సోదరితో భాషించి యుండఁడుగదా? భాషించియుండెనా తప్పక మరులుగొలిపి యుండును. ఒక్క మారుక్మిణియేకాదు; ఆడుజన్మమెత్తిన ప్రతివ్యక్తియు వాని దృష్టిమాత్రమున వశీకృతగాక మానదు. వానియందము మండిపోను. బొగ్గువంటి దేహము. తెల్లని మిడిగ్రుడ్లు, వికారములయిన వెండ్రుకలు, సిగలో నెమలి పింఛము, ఛీ!ఛీ! వర్ణించుటకును మనసు రాకున్నది. అట్టి చక్కనయ్య లోకమెఱుంగని బాలికల కపరమన్మథునివలెఁ గాన్పించును గాబోలును. వానినేలయనవలె? అందము చందము యోగ్యతా యోగ్యతలు, కులము, గోత్రము, నెఱుంగక లోబడెడు నాడుదాని ననవలె! మీదుమిక్కిలి పుట్టించిన బ్రహ్మ ననవలె; న్యాయమాలోచించిన మా శిశుపాలునితో నతఁ డేయంశమున సాటివచ్చును? ఛీఛీ! ఇది మాకు సోదరియై జన్మించి యెంతపనికిఁబూనుకొన్నది! ఈ నీచురా లావికృతాకారునిఁ బెండ్లియాడి సూర్య పంచకమోయన విరాజిల్లు తనసోదరులమగు మాకు రాహువువంటి మఱఁ దిని దాపటింపఁజేయఁ దలఁచికొనినట్లున్నది.

చం. ఇనసమతేజులైన సుతులేవురు మారునిమోహనాంబకం
బున కెనయైనకూఁతు రలపూతచరిత్రుఁడు భీష్మకావనీం
ద్రున కని ముచ్చటించుకొను తోడినరేంద్రులు గొల్లవానికిన్
దనయ నొసంగెనంచు వినినన్ సహపంక్తికిఁజేరనిత్తురే!

ఏకళంకములేని యస్మద్వంశపయోనిధియం దీతుచ్ఛురాలు హాలహలంబై యుదయించినదిగదా? సద్గుణవంతులమును, పరాక్రమైక జీవనులమును నగు మాయన్నదమ్ముల కీర్తినిది కొంచెమేనియు యోజింపదు గాబోలు. తల్లిగారిశోకమునకు వెఱచి యింతవరకు శాంతించి నయమున బోధించితిని. ఇఁక భయమున లోబఱచుకొనక తప్పదు. లేకున్న పెద్దవాఁడవు నీవుండియు నెట్లుమాన్పవయితివని పదుగురు నన్ను నిందింతురు (సమీపించి ప్రకాశముగా) అమ్మాయీ!

(అనుబంధము 20)

రుక్మిణి : (భయము నభినయించి స్వగతము) ఇతఁడు రానేవచ్చినాఁడు, కటకటా! యీపటములనుజూచి నాయిష్టదైవమును దూషించునేమో! సహింపఁగలనా? యేమిసేతును? (విచారించి ప్రకాశముగా) అగ్రజా! యేమిసెలవు?

రుక్మి : ఈపూజలెవరికి? యీపటము లెవరివి?

రుక్మిణి : అన్నా! యిది దైవపూజ! యీపటములు భగవద్విలాసలీలా సూచకములు.

రుక్మి : దైవమన్న నేదైవము?

రుక్మిణి : అగ్రజా! దైవము లెందరుకలరు? ఒక్కఁడేకదా భగవంతుఁడు.

రుక్మి : అవు నతనికిఁ బేరులేదా?

రుక్మిణి : ఆపేరే దైవము.

రుక్మి : ఆదైవ మవతారముల నెత్తలేదా?

రుక్మిణి : ఎత్తినాఁడు

రుక్మి : అట్లెత్తిన యవతారముల కొక్కొక్కనామధేయ ముండలేదా?

రుక్మిణి : ఉన్నది.

రుక్మి : ఉన్న నిప్పుడు నీవట్టి భగవదవతారములలో నేయవతారము నేపేరుతో నొప్పు దానిని బూజించుచుంటివి?

రుక్మిణి : నీవే చూచి చెప్పరాదా?

రుక్మి : (పటములుపచ్చుకొని) ఇది వామనావతారము; యిది రామావతారము; యిది

మత్స్యావతారము; సరియేకాని వీని నొక మూలనుంచి పుష్పమాలలచే నలంకరించిన యాపటమేమిటి? (పుచ్చుకొని) కృష్ణుఁడు గోపికలవస్త్రముల పహరించుట (అని చదివి) (కోపముతో) ఛీ! మూర్ఖురాలా! దైవపూజావ్యాజము న నీ వ్యభిచారిని సేవించుచుంటివా? యీటక్కులు నాయొద్దనా? (అని పగులఁ గొట్టును)

రుక్మిణి : అన్నయ్యా! నీవు నిజముగా మూర్ఖుఁడవుగాకున్న నాపటము నట్టుల బ్రద్దలు కొట్టెదవా?

రుక్మి : (ఉరిమిచూచి) ఏమంటివి? నేను మూర్ఖుఁడనా? యీపటమందేమున్నది?

రుక్మిణి : భగవన్మహిమ మున్నది.

రుక్మి : వస్త్రములన్నియునూడ్చి దిగంబరలనుగాఁ జేయుటయా మహిమ?

రుక్మిణి : అందెంతో తత్వ మిమిడియున్నది.

శా. మాయామృణ్మయముల్శరీరములు సుమ్మాయంచు శాఖాళి న
మ్మాయావస్త్రములన్ దగిల్చి యతిరమ్యంబైనగీతం బదే
మ్రోయించు న్మురళీనినాదమున సంబోధించుచున్ జెట్టుపై
మాయామానుషవిగ్రహుం డల నిలింపశ్రేణి యాలింపఁగన్

రుక్మి : అబ్బా! యేమితెలివి నేర్చితివి! యేమి తత్వజ్ఞానము! రాజ గృహమునఁ బెరిగి నేర్చిన తత్వజ్ఞానమే యిట్లుండ, రేపు గొల్లవాండ్ర కోడలవై నేర్చు తత్వమెంత యుద్దండముగా నుండునో! చాలు చాలు గ్రంథమిఁకఁగట్టిపెట్టు.

(అని మరొకపటము పుచ్చుకొని) కాళీయమర్దనము (అని చదివి) యేది యేది! దీనిలో నిమిడిన తత్వమేది?

రుక్మిణి : (స్వగతము) దేవదూషకుఁడగు నీతనికి నావాక్యములు చెవిని నాటవు. (ప్రకాశముగా) అగ్రజా! వినుము.

మ. బలవంతుండగు కాళియాహి పటుగర్వచ్ఛన్నబుద్ధిన్ నిర
ర్గళసంచారము సేయుచుండఁగ రమాకాంతుఁడు శ్రీకృష్ణుఁ డా
వులఁగాయం జని మౌళిపైనిలిచి మోముల్ర్ముంగగా ముద్దు గ
జ్జెలపాదంబున మెట్టి గర్వమునడంచెన్ జిన్ని నాట్యంబుతో

గర్వితమతులగు నిన్నుబోంట్ల కిట్టి శాస్తికాగలదని యాచిత్తరువు వేయినోళ్ళఁ జాటుచున్నది.

రుక్మి : (మండిపడి) ఆ! దురాత్మురాలా! గర్వితమతినని నన్నుఁ దూలనాడు నిన్నిప్పు దేమిచేసెదనో చూడుము (అని పైకిఁబోవును) (చతురికవారించి)

చతు : రాకుమారా! శాంతింపుము. ఈయమ్మ తన పటములను పగులఁగొట్టితివని కోపమునఁ దెలియక పలుకు మాటలను పాటి సేయకుము.

రుక్మి : (నెట్టి వైచి) చతురికా! నాకడ్డమురాకుము,

తే.గీ. ఇంటివారి కెల్లరకు ననిష్టుఁడయిన
తుంటరినిఁగోరి బొల్లినీతులను గఱపి
క్రించుదనమున నిట్లు గర్వించునట్టి
దీని ఖండింపకుండినఁ దెఱవు గలదె?

చతు : అయ్యా! మీప్రతాపమంతయును నోరెఱుంగని బాలపైఁ జూపనగునా?

ఉ. అన్నవు, తండ్రి పీఠమున కర్హుఁడ, వాగమవేత్త, వెల్లవి
ద్వన్నుతకీర్తిసాంద్రుఁడవు బాపురే! యాగ్రహవృత్తి నిట్టు లీ
కన్నియఁ ద్రుంపఁజూతువె యొకానొకదోషము గల్గినంతనే
మొన్నటిదాక చంకనిడి మోసిన సోదరిగాదె ముద్దుగా!

లేక లేక కలిగిన యాడుపడుచని నీ జననీ జనకులు మిక్కిలి గారాబమునఁ బెంచుకొనుచు నెన్నండును గోపించియెఱుంగరని నీవెఱుంగవా? అట్టిబాల నీకఠోర హుంకృతికిఁ దాళగలదా?

రుక్మి : ఔనౌను! అందుచేతనే యిట్లు కానిపట్టుబట్టియున్నది. అదియును మాలోపమే!

చతు : అయ్యా! కానిపట్టేమున్నది. తెలియనితనమునగాని మరేమియునుగాదు. కాకున్న మీయభిప్రాయమునకు వైరుధ్యముగా నాచరించునా?

రుక్మి : ఇదియేమి? ఆచరించుటలేదా? పాపమింతప్రేమ గలదానవు బోధింపరాదా?

చతు : నాయనా! బోధింపకేమి? బోధించుచునే యుంటిని!

రుక్మి : బోధింపవలసిన దేమున్నది. రేపు లగ్నము నిశ్చయము. శుభలేఖల నంపు చున్నాను. సర్వము సిద్ధమయియున్నది. ఈపిచ్చిభ్రమలు మాని సిద్ధముగా నుండవలయునని నొక్కి చెప్పుము. ఈయాటలు సాగవనుము, వేయిమాట లేటికి (అని సమీపించి)

శా. ఓలిన్నీకిదె సూత్రబంధనముసేయున్ దప్పదాచేదిభూ
పాలుం డెల్లి యమాత్యబాంధవ బలవ్రాతంబుతో వేణుగో
పాలుం డాహవదీక్ష నిల్చినఁబరీభావవ్యథాదేవి ని
ర్మూలశ్రీవరియించి యంకమునఁజేరున్ నీకు నున్మారుగా

ఉ. నీవిటు కంటినీటను మునింగిన లాభములేదు, చక్రియా
కావఁడు నిన్నుఁగాచుటొక కార్యముగా దటయుద్ధభూమిఁద
న్గావఁగ నెవ్వరోపెద రఖండబలాఢ్యుఁడు చేదిరాజు నా
నావిషయాధినాథహరి నాగబలధ్వజుఁడై యెదిర్చినన్

ఉ. నీమొర నాలకించుటకు నిన్నుఁ గవుంగిటఁ జేర్చుకొంటకై
భామిని! నీలలాటమున వ్రాసినవాఁ డలతమ్మిచూలితొ
ల్బాముఁ జేదిరాజు నదిబాయునె నీవిటు లెల్లకాలమున్
భీమతపంబుఁ జేసినను విశ్వము గ్రుంకిన నబ్ధిలింకినన్ (నిష్క్రమించును)

చతు : (మెటిక విఱిచి తనలో) చేదిరాజు మారుక్మిణీదేవికి మగఁడని బ్రహ్మదేవుఁడు వ్రాసెనఁట! యితఁడు చూచివచ్చెనఁట! బ్రహ్మవ్రాయు టబద్ధముగాని యితఁడు వ్రాయుచున్నట్లున్నది. జరాసురశిశ్వర్ధశరీరముల కాయువుం బోసి బృహద్రథున కర్పింపఁగా దయ్యపుఁ బిల్లవలెఁబెరిగిన జరాసంధుని సాహాయ్యమున నొళ్ళుతెలియక ప్రేలు శిశుపాలుఁడు మహా బలశాలియఁట! అతఁడు విజయలక్ష్మిని వరించునఁట. చక్రధరుఁడగు కృష్ణుఁడు పరాభవలక్ష్మిని జేపట్టునఁట. ఏమిప్రవక్త! నిక్కముగా నితఁడు మొదట బల్కిన వాక్యము కృష్ణభగవానుని యనుగ్రహమున విపరీముగాఁ బరిణమించి మారుక్మిణీదేవి దుఃఖము నపనయించునుగాక. నేనిట్లు దీవించెదను. (ప్రకాశముగా) అమ్మా!

శా. ఓలి న్నీకిదె సూత్రబంధనము సేయున్ దప్ప దావేణుగో
పాలుండెల్లి, యమాత్యబాంధవ బలవ్రాతంబుతోఁ జేదిభూ
పాలుం డాహవదీక్షనిల్చినఁ బరీభావవ్యథాదేవి ని
ర్మూలశ్రీవరియించి యంకమునఁ జేరున్ నీకు నున్మారుగా!

రుక్మి : చతురికా! దుఃఖదశయందున్న నన్ను నీవెన్ని విధముల నాదరించుచుంటివి? ఆకాత్యాయని నాయందు దయయుంచి నీవన్నట్లు సిద్ధింపఁజేసిన నీఋణము నెట్లయినఁ దీర్చుకొందును. చూచితివిగదా? వీని ప్రగల్భములు.

చతు : తల్లీ! దుష్టుని ప్రల్లదములు పాలపొంగువంటివి. నీవు వాని మాటలను దలఁచుకొని వ్యాకులపడకుము.

రుక్మిణి : (కృష్ణునుద్దేశించి)

(అనుబంధము 22)

మ. జనకుండన్నకు బుద్ధిసెప్పునను నాశాబంధమూడెన్ లతాం
గిని మాయమ్మ యశక్తురాలు, భవదంఘ్రిద్వంద్వమే ప్రాప్తి కా
చిన శిక్షించిన నెట్టకేలకు రమా సీమంతినీ పాదదా
సినిఁగాఁ గొమ్మదెచాలు నీమొగము నీక్షింతున్సదా శ్రీహరీ!

సీ. నాథ! నీచేత మన్ననలందు సింధుకన్యావిశ్వమంగళ జీవనంబు
విభుఁడ! నీయక్కున విలసిల్లు కౌస్తుభ హారంపు నిత్యకల్యాణనియతి
అనఘ! నీమేనిపై నల్లాడు పచ్చనిబట్టకబ్బినయట్టి భాగ్యరేఖ
సామి! నిన్ దాలిచి సంచరించెడి పక్షి నాథుని పూర్వపుణ్యక్రమంబు

తే.గీ. కడకు నీకాళులొత్తుడి గంపుఁ జెలుల
హస్తకమలంబు లందు దీవ్యత్సుఖంబు
కల్గునో! కల్గదో నాకుఁ గల్గకున్నఁ
జిక్కఁబట్టునె వైదర్భి జీవనంబు

(చతురికతో) చతురికా! పోదమురమ్ము!

(ఇద్దరు నిష్క్రమింతురు)

(సీను–ద్వారకానగరము. కృష్ణుని మందిరము)

(కృష్ణుఁడు బలరామ సాత్యకిసహితుఁడై పీఠమునలంకరించి యుండును)

బల : (కృష్ణునితో) తమ్ముఁడా! కోరుకొన్నవరుని మానుమని బలవంత పెట్టుటకు భీష్మకుఁ డంతమూర్ఖుఁడా? క్షత్రియధర్మము నెఱుంగఁడా?

కృష్ణ : ఎఱుంగకేమి! అగ్రనందనున కెదురాడఁజాలక యిట్టి పనికిఁబూనుకొని యుండవచ్చును.

బల : కుమారుఁ దేమనును?

కృష్ణ : శిశుపాలున కిమ్మనును!

బల : కటకటా! సచ్చరిత్రయగు నారుక్మిణీదేవికి బ్రహ్మదేవుఁడు కర్కోటకుండయిన సోదరు నేల బుట్టించెను? వాణీధవుండు సృష్టి యందుఁ జతురుఁడయ్యును,

తే.గీ. వెనుక వేదముల్మ్రతిచిన వెఱ్ఱియగుట
నిందునకుఁ గళంకంబు, దినేశ్వరునకు
రాహుపీడన, మఖిల ధర్మజ్ఞులందుఁ
దుష్టులను సృష్టిఁగావించి దూష్యుఁడయ్యె!

కృష్ణ : అన్నా! స్రష్ట నేలనిందింపవలె? అదృష్టవిహీనయైన వైదర్భిపూర్వజన్మమున నోచిన నోమట్టిది! కాకున్న నీయంతరాయము లేలకల్గును. (పండ్లుగొఱికి) దురాత్ముఁడు రుక్మినాపోటు రుచిచూచి యెఱుఁగఁ, దండుచేతనే దూషించుటకు సాహసించె!

సాత్య : (తీవ్రముగా లేచి) అన్నయ్యా! యేమీ? రుక్మిదూషించెనా? ఔరా! వాని కేమిపోవుకాలమా? (రుక్మినుద్దేశించి) ఓరీ! రుక్మీ! స్వకులనాశకా!

(అనుబంధము 23)

చం. పరహిత లోలమానసుఁడు భక్తుల కల్పకుజంబు సమ్మనీ
శ్వరవినుతాంఘ్రి పంకజుఁడు స్రష్టను బొడ్డునఁగన్నవాఁడు మం
ధరగిరినెత్తినట్టి బలదర్పయుతుండు, మురారిరాజ భా
స్కరుఁ డెటులాడితీవు కలుషంబులు కొమ్ములు లేనిదున్నవై

అగ్రజా! పశుప్రాయుఁడగు నారుక్మిని సోదరసమేతముగా ఖండించి కన్యను గ్రహించుట కిది కారణముగాఁ దీసికొనఁగూడదా?

బల : తమ్ముఁడా! ఒకసోదరసమేతముగానే కాదు, బంధుమిత్రసమేతముగా నిర్మూలింపవచ్చును. ఇతనికి మిత్రుఁడైన శిశుపాలుఁడును వానికి సహాయుఁడై వచ్చు జరాసంధుడును మన కాబాల్యవైరులు.

కృష్ణ : అగ్రజా! యిందొకజరాసంధశిశుపాలురేగాక బాల్యమునుండియు నన్నాక్షేపించు వైదర్భీవివాహవిఘ్నకారకులైనవారెల్లరును శత్రుకోటిలోనివారుగాని వేరుగాదు. కాకున్నను.

మ. అరయన్ రాజకులప్రసూతయగు కన్యారత్నమున్ మత్తబం
భరవేణిన్ గులధర్మమున్విడి యధర్మశ్రీవిడంబింప ని
ష్ఠురవృత్తిన్ బలవద్వివాహమునకున్ జొప్పించుయత్నంబు దు
ర్భరమై నన్నుడికించుచున్నది జ్వలజ్వాలాయమానంబుగన్

నేనాలసింపరాదు. యెల్లి లగ్నమని యగ్నిద్యోతనుఁడు సందేశమునుదెచ్చె! దారకునిఁబిలిచి ప్రాతఃకాలమున రథము సిద్ధము చేయుమని యాజ్ఞాపించెదను.

ఉ.	కన్నియఁ దెత్తువో! రిపుల ఖండనఁజేతువొ! పెండ్లికార్యము
న్బన్నముఁజేసివత్తువొ! కృపామతి నాకెఱిగింపు తమ్ముఁడా!

కృష్ణ :	కన్నియఁ దెచ్చినన్ రిపుల ఖండనఁజేసినఁ బెండ్లికార్యము
న్బన్నముఁజేసివచ్చిన రణంబున నిల్చినఁగాదె? యగ్రజా!
వేయిమాటలేల

చం.	ప్రకటగదావిభిన్న నరపాలక దివ్యకిరీటసన్మణి
ప్రకరములోలి నాకుఁ దలఁబ్రాలుగ ఖండితవీరసైనికా
నికరశరీరలోహితము నిర్మలచందనకర్దమంబుగా
సకియఁ బరిగ్రహింతు నల సంగరరంగవివాహవేదిపై!

బల : (స్వగతము) అట్లయిన సాత్యకీసహితుఁడనై నేనును బయన మయ్యెదను.

కృష్ణ : ఓరీ! యెవఁడురా! అక్కడ!

సేవ : (ప్రవేశించి) దేవా! యేమియాజ్ఞ!

కృష్ణ : నీవుపోయి దారకునిఁ బిలుచుకొనిరమ్ము.

సేన : చిత్తము (అని నిష్క్రమించును)

(దారకుఁడు ప్రవేశించి నమస్కరించును)

కృష్ణ : దారకా! యెల్లి కోడిగూడిసిన వెంటనే రథ మాయత్తపరపుము. నీరథగమన చాతుర్యము ప్రకటితమగునట్లుగా సూర్యోదయ మగునప్పటికిఁ గుండినకు జేర్పవలయును.

దార : చిత్తము! అట్లేకావించెదను. (అందరు నిష్క్రమింతురు)

# రుక్మిణీ కల్యాణము

పంచమాంకము

సీను–శిశుపాలుని కొలువుకూటము.

(శిశుపాల జరాసంధ విదూరథ పౌండ్రక సాల్వాదివీరులు పీఠముల నలంకరించి యుందురు)

శిశు : (జరాసంధునితో) మిత్రమా! మన హితుండగు రుక్మి యీ నా వివాహమునకై

కెంతయు నమ్మికగలదు, నిన్నటి దినమున వార్తాహరుఁడువచ్చి యువరాజు గారు వివాహము సర్వసిద్ధము జేసిరనియు, నెల్లి లగ్నమనియుఁ గబురంపిన వెంటనే పయనమై రావలయునని నాతోఁజెప్పె! యిప్పుడాతని పునస్సందేశమునకే యాలసింపవలసివచ్చె. సందేశహరుఁడు వచ్చువేళ యయినది. (తాళి) దుర్మార్గుఁడగు కృష్ణునిచే నెట్టి విఘ్నమును సంభవింపదుగదా?

జరా : (నవ్వి) మిత్రమా! విఘ్నమా! కృష్ణునిచేతనా? ఆతఁడింకను రుక్మిణీదేవినిఁ గన్నెత్తి చూడఁగలఁడా?

ఉ. కొండలు పిండిచేయు భటకుంజరయూథము వెంటరా సము
ద్దండబలుండు సాల్వుఁడు గదాధరుఁడైన విదూరదుండు నా
దండును, నేనుఁ బౌండ్రకుఁడు దద్దయునీకు సహాయమైన భూ
కాండ మడంగదే? రిపుల కాంతలగర్భము లుర్విడుల్లవే?

గోవిందు నదలించుట కిందరేల అతనికి నానామధేయ మేన్గునకు సింహ స్వప్నముగదా?

సీ. ఇంకెనే! పటురక్త పంకంబు తన్మధురాపురీభండన ప్రాంతభూమి
మాసెనే! మత్కాండ మండల ముద్రిత క్షతములుత్తుంగ వక్షమ్మునందు
శాంతించెనే! భేరి శంఖనిస్వనచలీకృతబలిష్ఠాష్టదిగిభచయంబు
తేరెనే! హరిఖురోద్ధితరజః పటలికా కలితపూతాభ్రగంగార్ఘురంబు

తే.గీ. డిందుపడియెన్! చండమండితమహోగ్ర
కుండలీకృతకోదండ గుణనినాద
సంచకితమానసవ్యథా జనకవిస్ఫు
టాంజనములైన విపుల భయాంకురములు

సాల్వు : వయస్యా! ఆకృష్ణహతకునకు నాపోటురుచిచూపవలయునని యెన్నాళ్ళ నుండి యో తలంచుచున్నాఁడ. వాఁడు కుండినకు వచ్చుటయే నాకోరిక. మనశిశుపాలుఁడన్నట్లు పెండిలిఁ బన్నముసేయ దైవమాతనిఁ బ్రేరేపించినచో భగవంతునకు నేనెంతయుఁ గృతజ్ఞుఁడ నయ్యెద.

పౌండ్ర : సాల్వా! అట్టినీతలంపు నాకిప్పటినుండియే కాదు! కంసమరణానంతరముననే వొడమినది.

విదూ : మీరుమాత్ర మాతఁడు వచ్చినఁ బగఁదీర్చుకొందమని తలంచుచున్నారు కాఁ

కొని నాగదాదండమునకు వానిని సోదరసమేతముగా బలియీయ నిశ్చయించుకొంటిని.

విదూష: (నేపథ్యమువంక దిరిగి) ఈవెఱ్ఱివిదూరదుఁడు ద్వారకకుఁబోయి శ్రీకృష్ణుని దన గదకు బలియిచ్చునట. ఆమహాత్ముఁడు రాకతక్కఁడు. వీరినందరినిఁ బొరి గొనకపోఁడు. ఈదుష్టపంచకమున కెచ్చటను జయమబ్బకున్నను బ్రగల్భముల లో నొకరి నొకరు దీసిపోవరు, మిత్రులారా!

శిశు : (సంతోషముతో) మీవాక్యములు నాకుఁ జెవులపండువు సేయుచున్నవి. మీ వంటి మిత్రవర్గమున్న నాకేమికొదువ?

తే.గీ. లాలితకళత్రమోహ లీలావిలాస
కంచుకితగాత్రవిస్ఫురత్కౌతుకంబు
నిజహితాలాప సమ్మోద నియతియందు
నర్థమునకైనఁ బ్రతిసేయ నగునె? జగతి

రుక్మిణీకరపరిగ్రహణదోహలంబును కృష్ణనిర్యాణకరణ సమగ్రసముదితోత్సాహంబును నాకిప్పుడే కలుగుచున్నట్లున్నది.

విదూష : (నేపథ్యమువంక దిరిగి) అంతమట్టుకే! రుక్మిణీకరపరిగ్రహణ దోహలంబున కుమారు దుఃఖంబును; కృష్ణనిర్యాణకరణమున కుమారితని నిర్యాణకరణంబును సమీపించుచునే యున్నది. జయాపజయములు సుఖదుఃఖములు దైవాధీనములని యార్యులు నుడివిననుడువు లిట్టిజడబుద్ధులు తలంతురా! వీరే సృష్టికర్తలవలె నున్నది. ఈయధమాధములు నిశ్చయించుటకును, ఆదౌర్భాగ్యుఁడు సంతసించుటకును సరిపోయినది. ఎవరైనబుద్ధిమంతులు విన్న నవ్విపోయెదరను బిడియమైనను లేదుగదా!

శిశు : (ఆతురముతో లేచి) మిత్రులారా! మీవాక్యములకుఁ దగినట్లు;

ఉ. వందితవాగ్విభూతిఁ దెలుపందగ నాకిదె దక్షిణాంబక
స్పందన మయ్యెడిన్ బరవ శంబగుచున్నది మేను,

పౌండ్ర : మేటియా
నందముగల్గెఁగన్నియఁగొనన్ మునుముందిదె యానవాలు గో
విందునిపై జయంబు నుడివెన్ దలపోయఁగ సంతసింపుమీ

విదూ : నీకింక నెట్టియంతరాయములును గలుగవు.

తే.గీ. తమ్మిగద్దియ నుండువిధాత వట్టి
సంశయంబులు మదినిల్పి సంతతంబుఁ
దత్తరిల్లెడు నిన్ను నధైర్యపడకు
మనుచునున్నాఁడు శుభదచిహ్నములఁదట్టి.

సాల్వు : నెచ్చెలీ! నీకు నేఁ డిదియేకాక నాకన్నులకుఁ బ్రకృతియం దనేక శుభసూచకములు దోచుచున్నవి.

మ. చెలిమి న్మల్లియతావులన్ గొనుచు వీచెన్ మందవాతంబు ది
క్కుల కీ రెండలుజిమ్మె భాస్కరుఁడు నీకున్ముందుగా సేసలన్
దలపైనింపఁదలంచినా మనువితానన్ గొమ్మలందూలు నా
జిలుఁగుంబూవులఁ గూనగాడ్పులకురాల్చెన్ వృక్షసంతానముల్

శిశు : (తత్తరము నభినయించి) తమ్ముఁడా! మీయాశీర్వచనములకు ప్రతికూలముగా నావామభుజం బదరుచున్నదేమి? ఇది నా కమంగళము కాదుగదా?

సాల్వు : అన్నా! నీకమంగళము ప్రతిహతమగునుగాక! ఒకవేళ నది యమంగళమ యినఁ గృష్ణునకుఁ జెందెడుఁగాక!

విదూష : (నేపథ్యమువంక దిరిగి) వీరిశకునపరీక్ష్యానిపుణత్వ మెంతశ్లాఘనీయము! యీవిరుద్ధప్రలాపములను వినుచు నేనూరకుండి సహింపఁజాల, నాకుఁ దోచినభావ మిదియని వచించెదను. (సాల్వునితోఁ బ్రకాశముగా) అయ్యా! మీయన్నగారిశకునములనుబట్టి నాకుఁదోచినవిషయమును వచింపుమందురా?

సాల్వు : విదూషకా! కాదనువా రెవరు? వచింపుము.

విదూష : మీదఁగోపింపరుగదా?

సాల్వు : ఇందు కోపమేమున్నది?

విదూష : వినుఁడు

చం. ఒకశకునంబునన్ దలఁచుచుండెద నీమనతేనిపేర భీ
ష్మకపురిఁ బెండ్లియత్నము సమస్తము సిద్ధముఁజేసిరంచుఁ, గ
న్యక మనవానికా? కమల నాభునకా? లభియించు నన్నప్ర
శ్నకు వినుచున్నదుష్టశకునంబున నుత్తరమీయఁ గొంకెదన్

జరా : (ఆగ్రహించి) విదూషకా! చాలుచాలు; శుభకార్యములకుఁ బోవుభూపతుల కశ్లీలములను గల్పించు తెలివి నెక్కడ సంపాదించితివి? (శిశుపాలునితో)

కం. స్థాణుఁడు గణములతో గీ
ర్వాణవిభుఁడు సురలతోడ వచ్చిన నస్మ
ద్బాణపరంపరలు గత
ప్రాణులఁగావింపవే మురహరునితోడన్?

పౌండ్ర : జరాసంధా! నీప్రయత్నమక్కరలేకయే

తే.గీ. ఒక్కసింహంబు సింధుర యూధమెల్లఁ
జించి చెండాడునట్లు విజితవిరోధి
మండలుఁడ నేను జాలనే? మదనజనకు
బలశతంబులు పింజపింజలు ఘటింప!

ఒక్కక్షుద్రగోపకుని సాటివానిగాఁ దలంచి యింత రాద్ధాంతముసేయుట మనబోటి ప్రతాపశాలురకు మానహాని!

(దౌవారికుఁడు ప్రవేశించి)

దౌవా : స్వామీ కుండిననుండి సందేశహరుఁడు వచ్చి ద్వారమున వేచియున్నాఁడు.

శిశు : (స్వగతము) ఓహో! ఇతఁడు కుమారభూపతియగు రుక్మి నిన్నఁబంపిన చారుఁడు (ప్రకాశముగా) ఓరీ! శీఘ్రముగా బ్రవేశపెట్టుము.

దౌవా : (నిష్క్రమించును. సందేశహరుఁడు ప్రవేశించును)

సం : (లేఖనిచ్చును)

శిశు : (చిరునవ్వునవ్వి) అభీష్టసిద్ధిరస్తు! (ఇట్లు చదువును) శ్రీమదఖండ భుజాదండ ఖండితవైరిరాజన్యమండలపిచండిల దిశామండల కీర్తి మండలుఁడును నానా రాజన్యమకుటాగ్రరత్న ప్రభాభాసమాన పదాంభోజయుగళుఁడునగు చేది రాడ్విభునకుఁ గుండినపురాధీశ్వర భీష్మకనందనాగ్రజరుక్మినామధేయుఁడు వ్రాయుట!

మ. మనయందు న్బరివర్ధమానమగు శుంభత్ప్రేమభూజంబు శో
భనబాంధవ్యలసత్ఫలంబు ఫలియింపన్ గారణంబైన మో
హనకాలంబిపుడేగుదెంచె ననవద్యశ్రీవిడంబించు మా
నినితో లగ్నము సిద్ధమయ్యెను మఱందీ! వేగమిచ్చేయుమీ! ఇట్లు రుక్మి.

జరా : సంతోషము. వయస్యా! మనకింక నాలస్యమేమి?

శిశు : ఆలస్య మేమున్నది! ఈయుత్తరమునకే యింతవర కెదురుచూచితిని. (సాల్వునితో) తమ్ముఁడా! బలములతోనీవు ముందు నడువుము! మేమిదే

సాల్వు : సరే! నేను పోయెదను (నిష్క్రమించును)

విదూ : మిత్రమా! సారథులు రథములతో మోసల నిల్చియున్నారు.

(అందరు నిష్క్రమింతురు)

విదూష : ఈ పెండ్లికి రుక్మియే లగ్గము సిద్ధముఁజేసిన దండధరుఁడు తనపగ్గమును సిద్ధముఁజేయును. పాపము! ఈశిశుపాలుఁడు తన బలసహస్రములను మధుసూదనునిచక్రమున కాహుతిఁజేసికొను టెఱుఁగఁడు. ఎఱుఁగకేమి! లీలా మానుషశరీరుండగు శ్రీకృష్ణునిపరాక్రమం బీతని కపూర్వమా? యెఱింగియు నిట్లుమిట్టిపడు వీనికిఁ దగినశాస్తి కావలసినదే? శ్రీకృష్ణక్రోధానలంబునకు శలభాయమానులుగానున్న వీరినెల్లర నితఁడు పురికొల్పుకొని పోవుచుండ నేనేల యూరకొందును? నేనా రుక్మిణీ దేవికి దీవెనలు పురికొల్పెదను.

సీ. తనబంధువులె తన్నుఁ గొనిపోయి యన్యదేశీయులకీయం జూచెదువిధంబు
జాతిమతాచారసరణిఁ దప్పిచరించు యగ్రజన్ముల నిందితాభిమతము
మలినులై లోకమాన్యుల మిత్రులను గౌరవింపనిరాజుల వెడఁగుఁదనము
విమతరాజాగమ విప్లవం బెఱుఁగక తలలెత్తిచూచు నింతుల తెఱంగు

తే.గీ. యరసి కన్నీటిధారలు గురియు ధరణి
కన్యకాదుఃఖమడగించు గాత! యుర్వి
భాసిలు మహోత్ముఁడేగి కైలాసమెక్కి
కాంచు మాతండ్రి బాలగంగాధరుండు (నిష్క్రమించును)

(రుక్మిణీదేవి యంతఃపురమున శయ్యపైఁ బరుండియుండును)

రుక్మిణి : (స్వగతము) మనోహరా!

సీ. వనవింటిదొర తనమునివ్రేల సారించు వరశరాసన గుణధ్వానములకు
నుడురాయఁ డలమింటి నడిమినుండి విదల్చు పాండురచంద్రికా షండములకు
నెలదేటిపిండులఁ గలసి కూతలువెట్టు కఠినపికాంగనా గానములకు
కుసుమసౌరభ్యంబు గొని దిక్కులఁజరించు వడిగల చల్లని వాయువులకు

తే.గీ. బెదరి తపియించి మదిదప్పి వివశనయితి
నెల్ల బలగంబునకు నేను హేయనయితి
నధికదుఃఖంబుచే సగమయితి నింక
పద్మలోచన! నీప్రేమ వడయనయితి!

శా. ఏలీల న్ననుఁగొంచుఁబోఁదలఁచితో యీకన్య కాౖవ్రాత లే
నేలేదో! కలదో! యదెప్పటికొ! యిందే నిల్చియున్నాఁడవే
మో లావణ్య శరీర! దోషముగలాదో!మున్ను నాయందు, రా
ధాలోలాక్షి సహింపదో! సమధికార్తౖత్రాణదీక్షామతీ?

ౖప్రాణదయితా! లగ్నం బీదినంబేకాదా? నీకన్నముందు చేది రాజువచ్చిన నతని మోముఁ జూడవలయునా?

శా. ఆనందంబున నీమొగం బరయుభాగ్యంబబ్బదే పెండ్లినాఁ
డైన న్నాకనునాసమై సకలసౌఖ్యశ్రీవిసర్జించి యు
న్నా నిన్నాళులు మేనుదాలిచి యనంతా! వత్తువో! రావొ! లే
దా? నాకేమియనుజ్ఞ నిచ్చెదవు నాథా ౖమొక్కి ౖప్రార్థించెదన్

ఆహా! దుఃఖభాజనమైన నాజన్మమును గల్పించిన ౖబ్రహ్మకేనేమి యపరాధమును గావించితిని? సోనవానలవలెఁగురియు నాకన్నీటి ధారలంబోలి క్షణక్షణ మహాయుగ ములను దఱుగకున్నవి.

మ. అకలంకాత్మక! రేయునుంబవలు ముక్తాహారనై నేఁడెకా
దొకకల్పంబు తపింతుఁగాని కడకీ యోషాలలామంబు నీ
దుకృపాలింగనలీలకున్దగునొ లేదో! యన్నశంకావిమ
త్తకరీంౖద్రంబు కలంచెడిన్ హృదయపద్మంబు న్నితాంతంబుగన్

(పూవుదండలు చేతఁబట్టుకొని చతురిక ౖప్రవేశించును)

చతు : (స్వగతము) కటకటా! యీకురంగలోచని తుంటవిల్కాని యలుఁగుదెబ్బల కోర్వఁజాలక యెంతఁగాఁబొగులుచున్నది.

సీ. చిలుకపిట్టలకుఁ బల్కులునేర్పు నతనాభిచిలుకలపల్కుల కులుకుచుండె
కలకంఠకలనాదములకింపలరుభామ కలకంఠతతికి వెక్కసముఁజెందె
ఘనహంసములకుఁ బోకడలు సూపు లతాంగి ఘనహంసములకుఁజీకాకుపడియె
మృగశాబకములకు మేతఁబెట్టు మృగాక్షిమృగశాబములఁ జేర నీయకుండె

తే.గీ. నౌర! యిది కంతుశరలాఘవాతిశయమొ!
శైశవము ౖగుంగినంతనె సంభవించు
ౖప్రథితయౌవనాంకుర పాటవంబొ కాక

సంకల్పమాత్రమున బ్రహ్మాండమును గల్పించి తన మాయా మహార్ణవమధ్యమున నిల్పి బొంగరమువలె నాడించుమాధవున కీకన్యకా వశీకరణం బొక లెక్కయా? ఈసుంద రాంగి డెంద మానందకిశోరము హృదయారవిందమున కెప్పుడు లగ్నమయ్యెనో! యప్పుడే యీయమకీభక్తి వైరాగ్యము లంకురించినవి. ఈస్మరుం డెంతకఠినకర్ముఁడు.

తే.గీ. తెలవమోహంబుచేత వేదికనమర్చి
అసమనారాచుఁడను సోమయాజి తన శ
రానలంబును దరికొల్పి పూనిప్రేల్చు
చున్నవాఁడౌర! రుక్మిణి హోమగవిని

(ప్రకాశముగా) అమ్మా! రుక్మిణీ! నీవీశ్వరపూజకై దుర్గాలయమునకుఁ బోయెద వని నీకిదే మాల్యములను గొని తెచ్చితిని.

రుక్మిణి : చతురికా! నీకు నాయందుఁగల ప్రేమాతిశయమగణ్యము. వనమాలి యురంబునఁ బెంపుమీరు వనమాలికా గంధమును దివారాత్రు లనుభవించు నా కీవనమాల్యము లింపుసేయునా?

చతు : అవునుగాని! నీ వీవనమాలలను శాంకరీదేవి కర్పించినచో నీకామె వనమాలి నర్పించును. అమ్మా! లగ్న మీనాఁడే కదా?

రుక్మిణి : అవును నీవెఱుంగవా?

చతు : అవును! యెఱుంగుదును గాని రాజులెవ్వరును రామింజేసి సంశయించితిని.

రుక్మిణి : నెచ్చెలీ! అదియే నాకోరిక. నామనోధవుఁ డొక్కఁ డేతెంచినఁ జాలును.

చతు : అమ్మా! ఒకవేళ నతఁడు రాకున్ననో?

రుక్మిణి : చతురికా! యే మట్లు ప్రశ్నించెదవు? సందేశ మంపియుండఁడా? (స్వగతము) ఈమెకు నామనోనిశ్చయమును గొంచెము బయలుపఱచెదను (ప్రకాశముగా)

ఉ. కుండిన భూమిపాలునకుఁ గూతురనై జనియింపకున్నఁ గృ
ష్ణుండును దేవకీవర తనూభవుఁడై యుదయింపకున్న రా
కుండునొ! యూరకుండునొ! పయోజముఖీ! ననువీడి శౌరి రా
కుండఁడు శత్రులన్ నురుమకుండఁడు చేకొనకుండఁ దస్త్రముల్

చతురికా! ఇది పరమరహస్యము; మదినుంచుకొనుము.

చతు : (స్వగతము) యీామె వాక్యములయం దేదో మహిమమున్నది, (ప్రకాశముగా) అమ్మా! నీవింతటి దృఢనిశ్చయము గలిగి యుండియు నిట్లు బొగులనేల?

ఉ. అంబుజనాభునిన్ దెగడి యాతనికిం దగు నన్నుఁ జుట్టప
క్కంబులుఁ జేదిరాజునకుఁ గట్టఁ జలంబునఁజేయు దుష్ప్రయ
త్నంబులు గాయమేమియుఁ గనంబడ నీయవు గాని చిత్తవీ
థింబడి కోయుచుండె విషదిగ్ధనిశాతశిలీముఖంబులై

(తెరలోఁ గలకలము)

రుక్మిణి : (ఆలించి) చతురికా! యీకోలాహలమేమి?

చతు : అమ్మా! నాకును గోచరింపలేదు.

(తరల ప్రవేశించును)

తర : అమ్మా! వివాహము సర్వసిద్ధమైనది. శిశుపాల మహారాజు చతురంగవాహినీ పరివృతుఁడై పురము ప్రవేశించి బహూకరింపఁబడుచున్నాఁడు. యువరాజు గారు మిమ్ము నలంకరించుకొని దేవ్యాలయమునకుఁ గొంచురావలయునని మాకాజ్ఞాపించినారు.

చతు : తరలా! చేదిరాజుతో మరెవరైన వచ్చిరా?

తరల : జరాసంధ పౌండ్రకాదివీరులును బంధుపరివారములతో వచ్చుచున్నారని లలిత చెప్పఁగా వింటిని.

చతు : ద్వారకనుండి యెవరును రాలేదా?

తరల : ఏమో! అది నాకుఁ దెలియదు. మనము దేవిగారి నలంకరించుకొని పోకున్న మాటవచ్చునుసుమా!

చతు : అవును పోవుదము (రుక్మిణిం జీరి) అమ్మా! మన మింకఁబోవుదము.

రుక్మిణి : (విచారముతో) కృష్ణా! గడియ వచ్చినది.

ఉ. ఓరమణీయరూప! వికచోత్పలపత్ర విశాలనేత్ర! దు
ర్వారవిచారవార్ధిఁబడి పారముఁజేరఁగ లేక నీకరాం
భోరుహ మూతఁగాఁ గొని విమోహతవ్రేలుచునున్న దాన నే
తీరునఁ బ్రోతువో! పరమ దీనను మానవతిన్మురాంతకా! (నిష్క్రమించును)

సీను–గౌర్యాలయము.

(భీష్మకుఁడు రుక్మి, శిశుపాలుఁడు, జరాసంధుఁడు, దంతవక్త్రుఁడు, విదూర దుఁడు, సాల్వుఁడు, పౌండ్రకుఁడు నాలయప్రాంగణము నలంకరించి యుందురు)

(రుక్మిణి, చతురిక, లలితలతోఁ బూలపళ్లెరమును బటుకొని ప్రవేశించును)

రుక్మిణి : (పూవుదండలు చేతఁ బట్టుకొని)

(అనుబంధము 24)

శా. ఓసర్వేశ్వరి! యోగిరీశతనయా! యోనిత్యకల్యాణి! గౌ
రీసీమంతిని! నేత్రనిర్జితచకోరీ! ప్రావృడంభోదగ
ర్జాసాక్షాద్ఘనభాషిణీ! హరశిరోరంగత్తరంగాగ్రగం
గాసేవ్యాంబుజగంధగంధినిజాంగప్రాప్త సంతోషిణీ!

శా. అంబా! శంభుని యర్ధదేహమున నైక్యంబంది జీవింప మో
దంబార న్దపమాచరించితివి కాదా? యట్టినీకేల వే
ద్యంబైయుండదు నావిచారము సమస్తం బీవె యోజించి సూ
త్రంబున్గట్టవె కంఠసీమమున దుర్గా! తల్లి! కాత్యాయనీ!

శా. ఏదే వేదన సంభవించునెఁడదల్లీ! మమ్ముఁ గాపాడ రా
వా? దీనస్థితినున్న భక్తుల భరింపన్ జాలు భర్గుండుగా
డా! దాక్షాయణి! నీమనోహరుఁడు నీయందట్టి భారంబు లే
దా! దండింతువొ! యాదరించెదవొ! పాదాక్రాంతముగ్ధాంగనన్

మ. వనజాతేక్షణుపై విరాళియలయింపన్ జొచ్చె నాతండు వ
చ్చునొ! రాఁడో! కొనిపోవునో! విడుచునో! శోధింపనున్నాఁ డొ పం
పినసందేశ మబద్ధమో! జనని! యేమీ పల్కవా? శౌరికిన్
నను నర్పింపవె! తెల్పవే! నిలుపవే! నాకాఁపురం బంబికా!

(అని పూవులు గీలించి తిరిగి)

(అనుబంధము 25)

అకటా! యింకను నానాథుఁడు రాఁడయ్యెను. సందేశమును నమ్మికొని మింటి కెగయనున్న నాప్రాణములను బొందియం దెట్టులోనిల్పి మాసములు దినములు రాత్రులు పగళ్ళు గడియలు దాటివచ్చితిని. అయ్యయ్యో! దుర్మార్గులు నన్నుఁ బరివేష్టించియున్నారు. అపవిత్రులగు వీరు నన్ను బలవంతము సేయుదురుగదా! కృష్ణా! సందేశమేమయ్యె? ఆవాక్యములు నీనోట బహిర్గతములయ్యెనా? అయిన నిట్టి యాశాభంగ మేలకల్గును (తలయూచి) వృద్ధుఁడగు బాపఁడు ద్వారకకుఁ బోవఁజాలక నాకు వెఱచి యిట్టి మిథ్యా సందేశమును గల్పించి తెచ్చియుండును. అగ్నిద్యోతనా! నన్నెంతగా మోసపుచ్చితివి? నిక్కము వక్కాణించిన నాహృదయ మిప్పుడింత యల్లాడదు గదా? ఎప్పుడో మేనువాయనున్న నన్నిట్టి యపోహములగు పల్లులచేఁ ద్రుప్పిపరచి విరోధులకుఁ బట్టి

యిచ్చితివా? నాప్రాణత్యాగమునకు మార్గమేది? (కొంతతాళి) సత్యనిష్ఠకై పంచప్రాణము లను ధారవోయు మహాత్ముఁడబద్ధమాడునా? దూరమాలోచింపక యుత్తములను నిందింపరాదు. పట్టువిడువక కృష్ణభగవానుని బ్రార్థించెదను.

రుక్మి : చతురికా! యింకను బూజ ముగియలేదా?

రుక్మిణి : అక్కటా! కృష్ణా! ఈ నీచులు నన్ను బలాత్కరించునట్లున్నది.

ఉ. రామునిబాహుపీఠిఁ దనరారి మహాభ్యుదయంబులంది సం
గ్రామబలిష్ఠులౌ సుతులఁ గాంచిన భూమిభవన్మదారులన్
బాముల పాలుసేసెదవె? నాపయినింకఁ గృపారసంబు రా
దా? మురవైరి! భక్తవరదా దవదారగదా! చిదాంగదా!

మ. గడెసే పొక్కయుగంబు గాఁ గడిపితిన్ గంజాయతాక్షా! దివం
బులు రాత్రుల్పటికాసహస్రములు రేపో! మాపో! యేతెంచి కా
వఁడె! నాథుండని, యిప్పుడేమనితలంపన్ జాలుదున్నాథ! నా
ల్గడుగు ల్సాగెడు కాలమున్నది మహాత్మా! ముంతువో! తేల్తువో

సీ. చక్రమా! వైరిశిక్షణమాచరింప రావేమి? నీపతి యానతీయలేద?
శంఖమా! భీమనిస్వనముఁ గుప్పవదేమి? ప్రియుఁడు నిన్నింకఁ బూరింపలేద?
శార్ఙ్గమా! శితశరాసారంబుఁ గురియవేమీ?నాథుఁడింక నెక్కిడఁగలేద?
నందకమా! యరీంధనముల ఖండింపవేమి? వల్లభుఁడు ధరింపలేద?

తే.గీ. అమ్మ! కౌమోదకీ! యేటికాలసింతు
బిసరుహాక్షుఁడు చేకొని విసరలేద?
వైనతేయ! యమందతఁ బారుదెంచి
కమలనాభుని దేవేమి? కావవేమి?

(దిక్కులు పరికించి) అయ్యయ్యో! నేనేమిసేతును. మన్మథాగ్ని నాదేహమును దహించుచుండ వెచ్చనిపొగలు రోమరంధ్రముల నుండి వెలువడుచున్నవి. ఇఁక జీవింపఁ జాలను. నందనందనా! నాకడసారివాక్యము లాకర్ణింపుము.

మ. నరలోకంబున నిన్నుఁగూడికొని యానందించుసద్భాగ్య మీ
యరవిందాక్షికి లేదు; కల్గు నను నాశాంకూర మీనాఁటితోఁ
బరిపూర్ణంబుగ నాశమందె నయిన న్వైకుంఠమం దుండవా?
యరుఁగంజాలవె? చిక్కవా? వెరుకలేవా? కూడవా? మాధవా!

(అని మూర్ఛపోవఁ జెలికత్తె లూతనిడి యుందురు)

(తెరలో)

స్రగ్ధర. రాకాచంద్రాననా! సారసనయనుఁడు దుర్వారబాహాబలోద్య
న్నాకద్వేష ప్రజాఖండనకరణ కళానవ్యచక్రాయుధం బీ
లోకంబు ల్భీతిచేడీలువడఁగొనుచుఁ గాలుండునావచ్చె భూభృ
ల్లోకంపుంగర్భపిండాలుడులిచి నినునేలున్ భయంబందనేలా!

(కృష్ణుడు ప్రవేశించును)

శా. దంభోళిన్ గొని జంభవైరి సురరాడ్దంతావళంబెక్కి దో
స్తంభంబొప్పఁగ నేగుఁదెంచినను భాస్వచ్ఛూలగంభీరుఁడై
శంభుం దుద్ధతినిల్చినన్ గడకు నాశాచక్రమల్లాడి ది
క్కుంభుల్ మ్రొగ్గిన నిన్నుఁబాయఁడు సుమీ గోవిందుఁడోకన్యకా!

శా. నాకంఠంబునఁ బ్రాణముల్నిలిచియుండన్ దుచ్ఛరాజన్యు లీ
రేకా దబ్జభవాదిదేవతలు నిన్నీక్షింపఁగాఁజాలు వా
రే? కన్నెత్తి వచింతు భీష్మకకుమారీ! వేయివాక్యంబు లే
లా? కాలూనునె? మక్షికంబు సురసేవ్యంబైన నీమేనిపై
(అని చేయిపట్టుకొని నిలిచి)

(అనుబంధము 26)

శా. ఈకన్యామణిఁ గోరుకొన్నవరుఁడేడీ?యడ్డగింపంగ రాఁ
డా? కొంపోవఁగఁబెండ్లికూఁతు, నతఁడేలా వట్టియత్నంబులె
న్నో కావించినమీరు దండిమగలిం దున్నారు వీక్షింత మే
దీ! కాసంత యెదిర్చినన్ దెలియు నాతిన్నేను గొంపోయెదన్

(అని రుక్మిణితో నిష్క్రమించును) (అవనిక పడును)

పంచమాంకము సమాప్తము.

# రుక్మిణీ కల్యాణము

షష్ఠాంకము

సీను–పురబాహ్య ప్రదేశము

(జరాసంధుఁ డాగ్రహమునఁ బ్రవేశించి)

జరా :

చం. నిలునిలు దుర్మదాంధ! తరుణీమణి దొంగిలి యెందుఁబోవఁగాఁ
దలఁచితివీవు? మత్పటు గదాహతి నీతల వ్రక్కలింతు గుం
డెలు పెకలింతుఁ గ్రొవ్వడఁతు నీబలగంబును బిప్పిఁజేసి గ్ర
ద్దల కెఱఁజేతు నెత్తురులు ద్రావుదుఁ జిమ్ముదు మాంసఖండముల్

ఓరీ! పరకాంతాపహర్తా! నిత్యమహోగ్రకల్మషప్రవర్తకా! యెంత దూరము పోయెదవురా; (దిక్కులు పరికించి)

శా. ఆవంకం బరువెత్తుఁడీ! యడుగొ కన్యాతస్కరుం డేమి సా
ళ్వా! వెంటాడవు పౌండ్రకా! కలసిరావాలస్యమా? దంతవ
క్త్రా! వారింపు విదూరదా! కదన మారంభింపుఁడీ యోధులా
రా! వైళంబ యదల్పుమీ నడుపుమీ రథ్యంబులన్ సారథీ

(నిష్క్రమించును)

(సాల్వుఁడు ప్రవేశించి)

కం. పోనీకుఁడు దుర్మార్గు న
నూనశరాగ్నుల దహించి నురుమాడుఁడు త
త్సేనావాహిని మాధవుఁ
డైన నతనియబ్బ యైన నభవుం డైనన్

శా. అన్నన్నా! యిది యెంతపాపము! వివాహధ్వంసియై వీఁడు శుం
భన్నాళీకముఖిన్ హరించికొనిపోవన్ నిల్చియున్నారలిం
కనేత్రంబులు విప్పరో! వెరతురో! కాకున్న బాహాబలం
పున్నైపుణ్యముచాలదో! యలమెనో! భూతంబులంగంబులన్ (నిష్క్రమించును)

(పౌండ్రకుఁడు ప్రవేశించి)

పౌండ్ర : ఓరోరి! చండాలుఁడా! ముష్కరాధమా! మాయాతస్కర వ్యాపార పారంగతా! యెంతపనిఁజేసితిరా!

ఉ. ఓరి! పరాకున న్నిలిచి యుండ హఠాద్గతినేగి చేదిభూ
దారునిదారఁ దొంగిలి యథార్థపువీరునిఁబోలె వీటికిన్
బారెదవేల? కుత్తుకను బ్రాణములుండినఁ బౌండ్రకుండు ని
న్నూరకపోవనీఁడు చలమూనిన నీయది కోడెత్రాచురా.

(విదూరదుండు ప్రవేశించి)

శా. ఖండీభూతునిఁ జేయవేమిటికి ఖడ్గంబుండదా చేత? సా
ల్వుండేమయ్యె? జరాసుతుండును బలంబుగ్రమ్మలేదా? గదా
దండంబున్గొని నేనువచ్చితిని, భీతస్వాంతులై పోరఁబో
కుం డేడీ! యదువంశపాంసనుఁడు నాకుం జూపుమీ పౌండ్రకా!
నెచ్చెలీ! యేడీ మాయగొల్లఁడు?

పౌండ్ర : విదూరదా! ఏమంటివి. "భీతస్వాంతులై పోవనీకుఁడనియా" యెట్టిమాట! పిరికితనమనుమాట కలలోనైన నెఱుంగని మన రాక్షసవంశమున కిది లజ్జావహము గదా? ఆదుర్మార్గుండు చిక్కిన నీసహాయమును జరాసంధుని సహాయమును గావలయునా? అదిగో చూడుము! రథంబు వాయువేగంబునఁ బోవుచున్నది. నిలిచి పోరాడినఁగదా బలాబలంబులు దేటపడుట.

విదూ : అన్నా! అట్లైన వెంటాడుదము రమ్ము; యిది ప్రసంగమునకు వేళగాదు.
(నిష్క్రమించుచున్నారు)

(దంతవక్త్రుఁడు ప్రవేశించి)

కం. వెనుకఁబడె దంతవక్త్రుఁడు
ననుఁగలియఁగలేఁ డటంచు నమ్మితివేమో!
విను మింతదవ్వు గా దిం
కను దవ్వున కరిగియున్నఁ గలసెదను హరీ!

తే.గీ. పిన్నతనమున మెసవిన వెన్నముద్ద
లన్నియును నేఁడు గ్రక్కింతు నాగుమింక
మూర్ఖుఁడా నాదుపిడికిటి పోటుచేత
నీకుఁ దప్పదు మరణంబు నీరజాక్ష!

శా. నీగర్భంబును వక్రదంతములతో నిర్భిన్నముంజేసి పు
న్నాగం బంబుజనాళముల్జిదుముచందం బాంత్రముల్త్రుంతునో
రీ! గోపాలక! వేడుకొమ్మిపుడు బ్రాహ్మీనాథుఁడో! గీర్విభుం
డో! గంగాధరుఁడో! నభోమణిసుతుండో!వచ్చి కాపాడఁగన్

(నిష్క్రమించును)

(రుక్మిణీ కృష్ణమూర్తులు ప్రవేశింతురు)

రుక్మిణి : మనోహరా! శాంతింపుఁడు! శాంతింపుఁడు. మీభుజపరాక్రమ ధైర్యస్థైర్యగాంభీర్యాదిగుణంబుల కచ్చెరువు పడి ప్రాణభయమునఁ బిల్లులవలె నొదిగి మీరు దాటి వచ్చిన పిమ్మటఁ గుక్కలవలెమొరుగుచున్న తుచ్ఛులమాటలకుఁ గినియ నేల? వీరిపై మీరు పోరినను బోరకున్న నొక్కటియే. రథము నిల్పక పోవనిండు. ఈపునఃకలహము కాలయాపనమునకుఁగాని ప్రయోజనమునకుఁగాదు. నామాట మన్నింపుఁడు.

కృష్ణ : కల్యాణీ! నీమాట మన్నింపనని తలంపకుము. కాని యీజరాసంధుఁడు మున్నెన్నఁడో నన్నోడించితినని మహాగర్వియై యొళ్ళు తెలియక ప్రేలుచు హేయవాక్యముల నుచ్చరించుచున్నాఁడు. వానికి నా వాడికోలలచేతఁ గొంచెము బుద్ధిసెప్ప నిశ్చయించుకొంటిని. తరుణమును వచ్చియున్నది. అతనికే కాదు రాక్షస వర్ణమున కంతటికిని శాస్తి కావలసియున్నది.

(తెరలో)

చం. నిలునిలు దుర్మదాంధ! తరుణీమణి దొంగిలి యెందుఁబోవఁగాఁ
దలఁచితివీవు? మత్పటుగదాహతి నీతల వ్రక్కలింతు గుం
డెలు పెకలింతుఁ, గ్రొవ్వడఁతు, నీబలగంబునుబిప్పి జేసి గ్ర
ద్దల కెఱవైతు నెత్తురులు ద్రావుదుఁ జిమ్ముదు మాంసఖండముల్

కృష్ణ : (ఆలించి) దేవీ! వింటివా వాని ప్రగల్భములు? నన్నింక వారింపకుము.

మ. వ్రతభంగు ల్మతిలేనిదుష్టులు, తృణప్రాయు, ల్మదోన్మత్తులై
అతినీచోక్తులు వల్కుచుండిరి మదీయానూనచక్రాగ్ని కా
హుతిఁ గావించెద వీరినెల్లరిని (తిరిగి చూచి) నోహో డాసియున్నారలో
యతివా! యించుక తాళుమీ! కదనవిద్యానైపుణిన్ జూపెదన్

(జరాసంధుఁడు ప్రవేశించి)

జరా : ఓరోరి యదుకులాధమా! పందవలెఁ బారెదవేమిరా! నీగరుశత్రువుండనైన జరా

సంధుని బారిఁబడి నీవింకను జీవింపఁగల వనుకొంటివా? మున్నుమధురాపురభండ నంబునఁ గరుణించి విడిచినందున కెంతగాఁ గ్రొవ్వితివి?

కృష్ణు : (రథము దిగినిల్చి) జరాసంధా! విలువలేని కంచుగిన్నెవలె వట్టి ప్రగల్భము లేలగూసెదవు. పెనంగినమీదటఁ దేటపడు బలాబలములు. మాటలతో వ్యక్తీకరించుకొనుట వీరధర్మముకాదు. నేనీకన్యను దొంగిలితినో! పరాక్రమమునఁ జేపట్టితినో నీవ యెరుంగుదువు. నీకును నీపరివారమునకును వెరచి పారుట కాదు. కృతార్థుఁడనై రథంబు మరలించుకొని నిరాటంకముగా గమనోన్ముఖుండనైతిని. మున్నెన్నఁడో యోడించితినని గర్వపడకుము. వినుము.

మ. కడిమిన్ భూతలమెల్లజుట్టి తన చంకన్నిల్పికొన్నట్టి దై
త్యుఁడు నీకన్నను గొమ్ములన్నబలపట్టితుండీల్గియున్నాఁడు మూ
ర్ఖుఁడ! యాత్మస్తుతిగాదు నీకులము నిర్మూలంబుగావింపఁ గృ
ష్ణుఁడు జన్మించె వసుంధరాతలమునందున్ దేవతావంద్యుఁడై

అనన్యసామాన్యమైన నాభుజబలంబును వేరుగా నీకు వివరింపనేల? క్షణకాలమునకు ముందు నీవు చూచియుండవా? మీసము లున్నవాఁడ వడ్డగింపకుంటివేల? లేనిపోని కూతలు గూయుచున్న నీమిత్రబృంద మప్పుడుండలేదా? ఈపౌరుష మప్పుడేమూలదాచుకొంటిరి?

జరా : ఓరీక్షత్తా! నీబిభీషికలకును నీభుజబలంబునకును వెరచి యూరకుంటిమని సంతసించుచున్నావు కాఁబోలు పాపము!

సీ. పుడమికిఁ జెందిరంపుంజాయలర్పించు మురిపెంపు టడుగుఁ దామరలతోడ
ప్రతిబింబితాఖిల వస్తుజాండంబులై కొమరారు చెక్కుటద్దములతోడ
పవలు తమ్ములకెల్ల భయము నాపాదించు మాయాముఖేందు బింబంబుతోడ
వనమయూరముల కబ్బ్రమంగొల్పు పశ్చాల్లంబమానకచంబుతోడ

తే.గీ. మించు నిరసించుచిన్నారి మేనితోడ
మంచుకొండలపట్టినర్చించునట్టి
పడఁతిసోయగంబునఁ జిక్కు వడితి మపుడు
నీకు వెనుదీసి కాదురా నీరజాస్య!

(నవ్వి) వెట్టిగొల్లఁ డనుమాటను సార్థకముఁ జేసితివిగదా.

కృష్ణు : ఏమిచక్కగా వివరించితివి? జయాపజయంబులను సమానంబుగాఁదిలకించు నీకిట్టి వ్యర్థప్రలాపములయం దసమానపాండితి గల్గియుండుటకు

వల్లించుటకు నీహృదయమెట్లు సాహసించినది? ఛీ! ఛీ! యసత్యవాదీ! దీని కేమి వాక్రుచ్చెదవు?

 మ. బలవద్దిగ్గజకర్ణ భేదనముగా బ్రహ్మాండభాండంబు వ్ర
క్కలుగా భూతగణంబు ఘూర్ణిలఁగ శంఖంబొత్తనా? యీ సుమం
గళి నాతో నరదంబునెక్కుతరి గాద్గద్యంబునన్ జేదిరా
డ్తిలకుం దెద్దియొపల్క నీవపుడు శాంతింపం బ్రయత్నింపవా?

కృష్ణ : ప్రాణభీతిచేతఁ గ్రుక్కిన పేనువలెఁ బడియుండియును, దానికొక మృషా కల్పనంబును సృజించి సిగ్గులేక చెప్పుకొను నీతో విశేషించి ధర్మ నిరూపణం బునకు వాదించుట నావంటిశూరుల కనుచితంబు. ఓరీ! జరాసంధా! నీవింత యన్యాయప్రలాపముల గ్రంథము వ్రాయబూనునపుడు నీయంతరాత్మనిన్ను గద్దింపదా? సూర్యచంద్రులైనను జ్ఞప్తికిరారా? పంచభూతములు గదలింపవా? ఛీ! ఛీ! అసత్యదేవత నీరూపము ధరించివచ్చినదని నిశ్చయించు చున్నాఁడ. ఔరా! యెంతవింత!.

జరా : ఓరీ! కృష్ణా! దొంగతనమునకు, జారత్వమునకును, బుట్టినిల్లైన నీ హృదయ మును గొంచెము బరిశీలించిచూచుకొనుము. నీరంగమెఱుంగని వాని యెదుట నీ వెంత నిష్టనభినయించినను జెల్లునుగాని నీబ్రతుకంతయుఁ గొనగోటనుంచుకొనిన యీజరాసంధునియెదుటఁ జెల్లదు. మరియు నిప్పుడు నిన్ను దూరము దాటిరానిచ్చినంత మాత్రముననఁగదా నీవిట్లు మిట్టిపడుట? మున్ను నిన్నెన్నిసారు లోడించితినో మరచితివా? అట్టి నిన్నుఁ జూచి భయపడి యూరకుంటినని స్థిరపరచుకొనుటకు నీయంతరాత్మ నిన్ను గద్దింపదా?

కృష్ణ : ఓరీ! రాత్రించరాధమా! నన్ను గెలుచుటకు నీకును నీయబ్బకును వాని యబ్బకును సాధ్యముకాదని ముందే వాక్రుచ్చితిని గదా?

తే.గీ. భయదగతిఁగుంభికుంభము లృగులఁగొట్టి
మెదడు భుజియించు సింగముం గదలిచి యొక
వేళ జీవింపవచ్చు; గోవిందుఁజెనకి
బ్రతికిపోదురె? బ్రహ్మాది భర్గులైన

జరా : బ్రహ్మాదిభర్గు లొకవేళ జీవింపకపోవచ్చునేమోకాని, నేనుమట్టుకు నిన్నుఁజెనకుటే కాక జయించి యున్నాఁడనుగదా? ఛీ! మందబుద్ధీ! అట్టినాపరాక్రమంబుఁ

ఉ. మున్నురణంబున న్గెలిచి పొంకమడంచిన శౌర్యశాలినే
నన్ను మనంబున న్మరచి నాఁడవుగా! యధమా! యొకింత నీ
కన్నులువిప్పి నామొగము గాంచుము కాంచఁగనేల యిప్పుడున్
దన్నిన దిక్కునీకెవఁడు ధర్మవిఘాతక! వంశనాశకా?

(తెరలో)

ఉ. ఓరిదురాత్ములార! హరియొక్కఁడ, నల్వురుమీర లివ్విధిన్
వైరయుసేయవచ్చితి రవక్రపరాక్రమవిక్రముండు మీ
వైరి హలాయుధుం డిదుగొ వచ్చె రణం బొనరింపనెంచినన్
వారిజనాభుఁడేల యిఁక నాపయిఁజూపుఁడు మీప్రతాపముల్.

(పై పద్యము చదువుచు బలరాముఁడు ప్రవేశించును)

బల : ఓరీ! దుష్టరాత్రించరా! యేమనిప్రేలితివి? శ్రీకృష్ణుని గెలిచితి ననియా

చం. అలసత నెన్నఁడో కదన మందున నించుకయూరకున్నచో
గెలిచితినంచు గర్వపడి గేలియొనర్చితె యేది యిప్పుడుం
బలుకుమ పండ్లురాల్తు శిశుపాలుఁడొకండును వాఁడొకండు నీ
పలువయొకండు నీవొకఁడవా! మగవారయి యద్దగించుటల్

దుర్మదపరిపంథివిదారణచణుండౌ నీముసలిముందట నీయాటలు సాగవు. మారు బల్కక దారిపట్టుము. లేకున్న నాఖడ్గమున కెరఁజేయక మానను.

జరా : ఓరీ! ప్రేలరీ! తమ్మునకు బాసటయైవచ్చితివా? నేనును ఒక మగవాడ ననియే తలంచితివిగా? నాగఁటిని మూపునఁదాల్చి ఖడ్గాదిసాధనముల నుపయోగించు వీరుల లజ్జాకరముగా దిష్టిబొమ్మవలె సంచరించు నీకెవఁడు వెఱచునని గర్వించితివి?

ఉ. ముగ్గురి నొక్కమారడచి పోవుదమన్న తలంపు బుద్ధియం
దగ్గలమయ్యె మత్పటుభుజార్గళచండగదాభిఘాతకున్
నిగ్గరు శౌరిసాత్యకులు నీవును, జెప్పెద నొక్కమాట సం
యగ్గజరాజతుండమున కడ్డమె సారసదీర్ఘనాళముల్

కాని మీయన్నదమ్ములలోని లెక్కకు నింకొక్కఁడు తక్కువయ్యెనని వెనుదీయు చున్నాను.

(సాత్యకి ప్రవేశించి)

శా. అన్నా! మూర్ఖునితోడ నింతతడవేలా! వ్యర్థపుంబల్కు లిం
కన్నీవేలవధింప వగ్రజుని చక్రం బేలశాంతించె శ్రీ
మన్నారాయణ! యానతి మ్మతనిద్రుంపన్మచ్ఛరాగ్నిందహిం
తున్నీకున్మతి రామదేవునకు సంతోషంబు నిండారఁగన్

(జరాసంధుని జీరి) దేవదానవదుర్నిరీక్ష్య ప్రతాపుండగు మదగ్రజుని నెదరి నీవింకను జీవించియుండినందున సంతసింపుము. ఇమ్మహానుభావుఁ డసాధారణ ప్రజ్ఞా సముద్రుఁడనుట పిపీలికాది బ్రహ్మపర్యంతంబు విదితంబయ్యు నీకుఁ దెలియకుండుటచే నచ్చెరువొందుచున్నాఁడను.

శా. మంధాద్రిప్రతిమాన ధైర్య బలవన్మాంసాశనోన్మత్తదు
ర్గంధే భోన్నత కుంభభేదన కళాప్రావీణ్యుఁ డాతండు గ
ర్వాంధత్వంబునఁ దూలనాడితివి మాయన్నన్ మురారిన్ జరా
సంధా! నీమద ముక్కడంతు నిలుమీ సంగ్రామ రంగంబునన్

మ. హలి సామాన్యుఁడె దేవతావినుత శౌర్య ప్రస్ఫురన్మూర్తిది
జ్ఞలనామౌక్తిక హారనిర్మలయశో లావణ్యసంభాసి దో
ర్బలభీముండు మహానుభావుఁ డితఁడౌరా! క్రొవ్విదూషించినం
దులకై యంగిడి కంటునట్టులుగ జీల్తున్ రమ్ము నీనాలుకన్

(అని పైకిఁబోవ బలరాముఁడు పట్టుకొని)

బల : తమ్ముఁడా! కొంచె మోపికపట్టుము.

జరా : ఆహవజయంబునఁ దీసిపోయినను మీరొకరికొకరు దీసిపోవరు. ఆహా! భగవంతుఁడు నాకిట్టితరుణము దయచేసినందులకు నేనెంతయుఁ గృతజ్ఞుం డను. ఓరీ! సాత్యకీ! పిట్టచిన్నదైనను గూత ఘనమన్నట్లు నీవు జిట్టెఁడున్నను నిక్కి బారెఁడు చేసికొనుచున్నందుకు సంతసించితి. బలరామా! తమ్ముఁడు మమ్ములనెల్లర నొక్కమారు మ్రింగివేయునట్లును కరుణించి శాంతిపరుచు నట్లు నభినయించుచు లేని గౌరవమును నిల్పికొనుటయందు నీచాకచక్యము మెచ్చుగొనఁదగినది సుమా! మరియు నీకు మూతిమీసములు నెరయుకాలము వచ్చియున్నను ధర్మమార్గము ద్రొక్కనిష్టపడనందుకు విచారించెదను, పరమపావనమగు యశోదాగర్భమున మీరొక్కనక్షత్రముననే జన్మించి నందుల కనుకొనవలయును.

చం. అనుజుఁ డధర్మము న్సలిపెనంచు నెఱింగియు బుద్ధిగాదు ర
మ్మనక ప్రయోజకుండవు మహాఘనకార్యముఁ జేసినాఁడ వం
చును బురికొల్పుచుంటివి యశోదకు నందునకున్ జనించి తా
ల్చినసుయశంబు నేఁటికి భళీ! యయశంబుగమారెరా! హలీ!

కృష్ణ : (ఆగ్రహముతో) అగ్రజా! వీని నింకను వధింపక ప్రేలనిచ్చుటచేత మితిమీరి యొళ్ళు తెలియక వాగుచున్నవాఁడు. నాకడ్డమురాకుము. వీనినిదే నాచక్ర ధారకు బలియిచ్చెదను (అని చక్రముఁదాల్ప బలరాముఁడు వారించి)

బల : తమ్ముఁడా! పిచ్చుకపయి బ్రహ్మాస్త్ర మేలప్రయోగించెదవు? ఇంకను మితిమీరి నఁ జూచుకొందము కొంచెముండుము. వీనిని సైన్యసమేతంబుగా నామార్గణ కాంతారమున దిగ్భ్రమఁజెందించి మద్ధనుఃపాండిత్యమును వెల్లడించెదను

(అని బాణములు వదులును)

జరా : మిత్రులారా! పోయి సైన్యములఁ బురికొల్పెదము రండు. (అని జరాసంధాది వీరులు మెల్లమెల్లఁగా నిష్క్రమింతురు)

బల : సోదరా! చూచితివిగదా? వీనిగతి? గవ్వకుం గొఱగాని నిష్ప్రయోజకుల డం బము బుద్బుదముంబోలి క్షణకాలమున రూపు మాయుచుండును.

(బలరామకృష్ణ సాత్యకులు నిష్క్రమించుచున్నారు)

(దుఃఖితముఖుఁడై శిశుపాలుఁడు ప్రవేశించుచున్నాఁడు)

శిశు : హా! రుక్మిణీ!

సీ. చేతిలోఁ జేయివైచెదనంచు నీయన్న ప్రతినలు నినుఁగూర్చి పలికినపుడు
వనమధ్యమున నేను భాషించుసమయాన నీకడకంట మన్నించినపుడు
"ఆదుకొందుము వయస్యా"! యంచునచట సాల్వజరాసుతులు నచ్చఁబల్కినపుడు
పసుపు బట్టలతోడ! వచ్చి యింతకుముందు చెలిమి భార్గవిని బూజించినపుడు

తే.గీ. దక్కితివటంచు నెదద సంతసముఁ జెంది
విఱ్ఱవీగితిగదే! పిట్టపిడుగువోలె
నింతపని యగునంచు నేనెఱుఁగనైతిఁ
గడుపుఁజింపుట పాడియే? కమలనయన!

హరహరా! నాకిది స్వప్నదర్శనమువలె నున్నది! నిజముగానే నేను శిశుపాలుఁ డనా? ఇది కుండినయా? ఇది కుండినయును, నేను శిశుపాలుఁడను గాక మరేమగును!

కేలకల్గును. ఆహా! భీష్మకకుమారీ! రుక్మిణీరమణీ! నన్నేమిచేసితివి? ఆపాపిష్ఠికృష్ణుఁడు నిన్నపహరించెనా! లేక నీయిష్టానుసారముగ నిట్టి యకృత్యమునకుఁ బాల్పడితివా! అయ్యయ్యో నాకొంప కెసరువోయుట కీగొల్లఁ డెక్కడదాపరించె. ఓయీశ్వరీ! నీవైనను వారింపవైతివేమి? దుష్టనాశంకరివగు నీవేల యీదౌర్మార్గ్యమును జూచి యోపికఁబట్టితివి? భాగ్యహీనుఁడగు నీశిశుపాలుని యనర్థకాల మాహాత్యము నిన్ను నావరించెనా తల్లీ! నాకు దారిచూపుము. ఈపరాభవానలంబు నన్ను దహించివేయుచున్నది. నా శరీరమున జీవములున్నట్లు తోపకున్నది! ఈమదన తాపమునకు దుఃఖతాపము తోడ్పడి నన్ను వివశునిఁగా జేయుచున్నదికదా!

మ. అరవిందానన! నీకరగ్రహణ కార్యానంతరంబైన దు
ర్భరమారాంబక కీలికీలలు సమాప్తంబందునంచున్ హృదం
తరమందుం దలపోయుచు న్గడపియున్నానింతకాలంబు బా
పురె! మారాగ్నికిఁదోడుగాఁ బరిభవంపుంగీల లంటించితే!

ఉ. గొల్లఁడు మాయకాఁడు ప్రతికూలము సేయకపోవఁడైన నీ
యుల్లము నాపయిన్నిలిచి యున్నది చాలునటంచునెంచి రం
జిల్లితిఁగాని దుర్భరవిశేష విషాదపరాభవంబు నీ
వల్లఘటించునంచుఁ దలఁపంగదె బంభరరాజకుంతలా!

నేనెంతగా మోసపోయితిని! జరాసంధుఁడు పల్కిన వాక్యములన్నియు మరచి పిల్లివలెఁజూచుచు నొదిగియున్నవాఁడు. వట్టి కూతలు గూసిన సాల్వాదివీరులందరుఁ గిక్కురుమనక రాతిబొమ్మలవలె నిలిచి చూచుచుఁ జేసన్నలఁ బ్రోత్సహించునన్ను లెక్కసే యరైరి. ఒకరినేల యనవలె? పరులనండనుంచుకొని పెండ్లికొడుకునైవచ్చిన నాయవివే కమునే నిందించుకొనవలెను. వీరు నామిత్రులగుట నప్పటికట్లు వాగ్రుచ్చిరిగాని నిజముగాఁ జేయుటకుగాదు. కాకున్న నీవిషయమునఁ బోరాడుటకు వారికేమి పట్టినది? రాజవంశ మునఁబుట్టి భార్యాహర్తనుసంహరింపక మిన్నకున్న నా యసమర్థత్వమెంత హేయమైనది ఆహా! పరాక్రమమా! యెందుదాగితివి? సాహసమా! నీకేమిలోపము? భుజబలంబా! యేల విజృంభింపవు? శిశుపాలా! యింకను బ్రతికియుంటివేల? అక్కటా! యీవివాహము నన్ను మన్మథాగ్నిచేఁ గాల్చుటగాక పరాజయాపయశంబులచేతను గాసిపెట్టుచున్నది. హా! సుందరాంగీ! నన్నింత వ్యర్థునిగావించుట కేయపరాధంబుఁ జేసితిని. నీకుఁగలయందైనను గీడుదలంపక సతతంబును నీయభ్యుదయమును గోరుచు దినములు పుచ్చినందుల కిదియా నీవు నాకుఁ జూపిన యుపకృతి.

మ. నను꜀గామింపనిదానవైన, వనిలోనన్ నాడు నాతో వచిం
చినచో రాలునె? నోటిముత్తియము లిస్సీ మానినీ! తేనె꜀బూ
సిన ఖడ్గంబవు꜀ జుప్పనాతివని కొంచెంబేని యోజింప꜀జా
లని యీపాపపు మందభాగ్యునకు నేలా! కల్ల వీదండనల్

లోపమంతయును నాదిగాని నీదికాదు. యేవోకొన్ని విరుద్ధములైన యుత్తరముల నిచ్చినంత మాత్రమున నవియన్నియు నుచితములుగా సరిచేసికొని వట్టి భ్రమను వృద్ధిచేసికొన్న నాబుద్ధిహీనతచే నా కీశాస్తి కలిగినది. ఇంతకు నీపై నుదయించిన నిర్హేతుక జాయమాన గాఢానురాగమే ముఖ్యకారణము. అట్టి నాతమోంధీభూతమానసంబు నీ ప్రాతికూల్య ప్రవర్తనంబులను గమనింపనీక నీదర్శన లేశమే, వేయేలని చంద్రోదయము నాకాంక్షించు చకోరకమట్లు పొంగి పొరలి నన్ను మోసపుచ్చినది. (తలయూచి) భళీ! భళీ! వాసుదేవా! భాగ్యంబన్న నీయదియే భాగ్యము.

మ. కరికుంభంబుల నొక్కగుద్దునకు వ్రక్కల్సేయ꜀గా꜀ జాలుసం
గరగాంగేయుల దృష్టిమాత్ర꜀జలితాంగప్రాణులంజేసి సుం
దరిచిన్నారికరంబు వట్టితివి కృష్ణా నీయదృష్టంబు నా
దురదృష్టంబును నేకకాలమున నిందున్ ధాత సంధించుటన్.

(తెరలో)

మ. చతురంగధ్వజినీ సమేతము జరాసంధుండు మూర్ఛిల్లె, ను
ద్ధతి సాల్వుందును బోరి సొమ్మసిలె, వేదండావళుల్ మ్రొగ్గె, దీ
నత రేవంతులు꜀ దూలి, రాహవము తీక్ష్ణంబయ్యె! కృష్ణానుజుం
డతిరోషంబున దారసిల్లె శిశుపాలా! కాచుకొమ్మీ వెసన్

(శిశుపాలు꜀ డాలించి)

శిశు : ఓహో కదనము భీకర మగుచున్నది కా꜀బోలు! ప్రాణమును గాచుకొమ్మని విదూరదు꜀డు హెచ్చరించుచున్నా꜀డు. ప్రాణములకన్నను మిన్నయగు నా రుక్మిణీసతిని గోలుపోయిన నాకు꜀బ్రాణముపై నేమియాస!

(తెరలో)

మ. హరి చక్రంబుధరించె, దిగ్గజము లల్లాడెన్, స్ఫులింగంబు లం
బరవీధి న్జనియించె, భూమివడకెన్ వార్ధుల్ గలంగెన్, ధరా
ధరసంతానము డుల్లె꜀ గేతనముల న్జన్మించె ధూమంబు, స్రు

శిశు : ఔరా! యుద్ధము మిక్కిలి భయంకరమగుచున్నది. చక్రి చక్రమును దాల్చి విజృంభించెనఁట! నేనింక నెదుర్కొనకుండుట సరికాదు (నిష్క్రమించును)

సీను-యుద్ధరంగము

(రుక్మిణీ కృష్ణ బలరామ సాత్యకులు ప్రవేశింతురు)

(రుక్మి ప్రవేశము)

రుక్మి : ఓరీ! ఆభీరాధమా! యెవఁడవురా! నీవు?

ఆ.వె. మాకులంబుగాదు మాగోత్రమా కాదు,
భుజబలాన మమ్ముఁ బోలరావు,
యెందుఁబుట్టినావో! యెక్కడివాఁడవో!
మాకు దాపరించితే? కులఘ్న!

ద్రోహీ! యిదేటి పాపకాలము? ఇట్లెందరికాపురముల కెసరువోసి యెందరిని గులభ్రష్టులం జేయఁదలంచితివి? పరమ దుర్మార్గుండవగు నిన్నుధరించి వసుంధర యెట్లు సహించుకొని యున్నది? పందా! నీదుండగముల కిప్పటికే లోకమంతయు నట్టుడికిన ట్లుడుకుచుండ నింకను నీకభిమానమేలలేదు? ఛీ!ఛీ! నీది పశుజన్మమో మానవ జన్మమో యూహింపరాదు?

కృష్ణ : తరళలోచనీ! నీ సమస్త విషాదమునకుఁగారణ భూతుఁడును నా కాబాల్య శత్రుండును నైన నీయగ్రజుండు వచ్చుచున్నవాఁడు. ఈతనిఁ బరిమార్పవల యునని నేనెంతయు నభిలషించుచున్నాను. నీసోదరుండని నాకడ్డము రాకుము. వీఁడు నీపక్షమునఁజూపిన నిష్కరుణాత్వంబును దలఁచిన నాశరీరము భగ్గునఁ గాలుచున్నది (అని చక్రమును దాల్చును)

రుక్మిణి : ప్రాణదయితా!

పంచచామరము. ఎఱుంగనేరఁ డీతఁడించు కేనియున్ భవన్మహా
విరాజితప్రభావమున్ వివేకహీనత న్మిమున్
దురుక్తులాడుచున్నవాఁడు తోయజాక్ష! నాసహో
దరుండు వీనిపైఁ గరాశి దాల్పకుండు మ్రొక్కెదన్

నాకగ్రజుండని క్షమింపకున్నను నిన్నెఱుంగక నిందించు రక్షోనాథులలో నొక్కని గాఁబరిగణించి యిప్పటికి క్షమింపుఁడు. కాకున్నను మీరొండొరులన్యులుగారు. నేఁ టినుండి యు మీయిరువురకు స్వాతంత్ర్యము గలిగియున్నది.

తే.గీ. అతఁడు నిన్ను మరందిగా నతని నీవు
బావగాఁ దలంచుట కెగ్గు వడిన నెన్ను
కొనకపోవునే; జగము కాదనుట కెవని
తరము? మాధవ! బాంధవ ధర్మమిద్ది

నాథా! బంధుద్వేషి యను నపఖ్యాతి నీకును, సోదరఘాతుకురాలను నిగర్హణము నాకును బ్రభవింపదా? మగనిపక్షమునఁ జేరియనుంగు సోదరునిఁ జంపించె నని లోకము నన్నుఁ బ్రువ్వఁదిట్టదా?

బల : తమ్ముఁడా! శాంతింపుము. వీఁడు శుంఠ! తగిన శాస్తిఁజేసి పంపుము గాని చంపకుము.

కృష్ణ : మనోహారిణి! భయపడకుము. నేనితనికిఁజేయవలసిన పరాభవముఁ జేసి పంపెదను. వీని ప్రాణమునకు నీవు భాగ్యదేవతవైతివి. (ముందుకు వచ్చి) (చిరు నవ్వునవ్వి) దయచేయుఁడు బావగారు! మాపై నలుకవహించినట్లు పొడగట్టుచున్నారే!

రుక్మి : ఛీ!ఛీ! పందా? ప్రాణభీతిచేత వావివరుసలు గల్పి తప్పించు కొనఁజూచుచుంటివా? 'బావా' యని సంబోధించిన నీనాల్కను జీలికలు చేసెదను జూడుము.

కృష్ణ : బావగారూ! మనకిప్పుడు నూత్నబంధుత్వము కల్గుటచేతఁ బిలిచితిని. కోపమా?

రుక్మి : దురాత్మా? ద్విపాదపశువవగు నీతో నెక్కడి బంధుత్వము? యెక్కడివావి? నాతోఁ గాకున్న నొండుచోటునను నీకు వావి గలదా?

తే.గీ. అక్కసెల్లెంద్రు వదినెలు నత్తలు బిన
తల్లులుండరె? గోపికా తరుణులందు
నెల్లరకునీవె మగఁడవు నింపుకాఁడ
వుఁగద? పసరమా! నీదియుఁ బుట్టువగునె?

కృష్ణ : బావగారూ! మీరు లోకాచారవిరుద్ధప్రవర్తకులనియు సోదరిఁగోరుకొన్న వరుని పరిత్యజించుమని బెదరించు పరమమూర్ఖులరను కొంటిని గాని యింతటి ధర్మజ్ఞులని యెరుంగనందుకు క్షమింపుఁడు.

రుక్మి : ఓరీ! క్షుద్రగోపకా! నేను సోదరీమణిని వరించిన వానిని కాదనను గాని నీవు తగవని పట్టువట్టితిని.

కృష్ణ : మరెవ్వరి చెట్టబట్టుమంటివి?

రుక్మి : శిశుపాలుని

కృష్ణ : అందుకేమనియె?

రుక్మి : ఇష్టపడదయ్యె.

కృష్ణ : కోరనివానిని గట్టిపెట్టుమని పట్టుబట్టుట రాజధర్మమా?

రుక్మి : అగ్రజుండనయిన నాయభీష్టానుసారమునఁ బ్రవర్తింపవలదా?

కృష్ణ : రాజపుత్రికలకు సోదరుల యభీష్ట మేలకావలయును? సోదరుఁడవైన నీవాతఁ డెట్టివాఁడైనను బూజనీయుఁడని సంతసింపవలయునుగాని కాదనుటకు బ్రహ్మ కేనియుఁ దరమా? వరించునది నీ చెలియలుగాని నీవు గాదు.

రుక్మి : అట్లైననింటికిఁ బెద్దనగు నాకోరిక కొనసాగింపరాదా?

కృష్ణ : నీకుఁ గోరిక గలిగియున్న నీవు పెండిలియాడుటయే సమంజసము. కోపించినఁ జెప్పఁజాలను సుమా!

రుక్మి : (ఆగ్రహముతో) యేమంటివి? నేను పెండ్లియాడునది శిశుపాలునో విజయలక్ష్మినో చూడుము.

ఉ. ఆలినిభర్తకున్ మగని నాలికి దూరముసేయునట్టి గో
పాల పిశాచమా! చెనఁటి పల్కులు వల్కుకుమిప్పుడిందు బిం
బాలిక దక్కెనంచు ముదమందకు నిన్నువధించి నేఁడు భూ
తాళికి విందుసేతుఁ దులువా కలనన్నిలు దెబ్బఁజూపెదన్

(అని పైకిబోవును)

(కృష్ణుఁడెదురువచ్చి జుట్టుపట్టుకొనును) (అవనిక పడును)

(రుక్మి ముండితశిరస్కుఁడై ప్రవేశించి)

రుక్మి : (విచారముతో స్వగతము) హా సోదరీమణీ! రుక్మిణి!

తే.గీ. తమ వివాహంబులందు సోదరులకింపుఁ
గూరిచెడు నన్గుఁ జెలియలున్నారుగాని
యింతటి పరాభవంబుఁ జేయించువారు
గలరె? చెల్లెలా! నానోముఫలముగాక

నేనీస్వరూపమున నెక్కడికిఁబోవఁగలను? ఎట్లు తల్లిదండ్రుల మోముఁజూడ గలను? ఈయవమానము నాకు జన్మ జన్మములకు మాసి పోవునదికాదు. తన బలము

రుక్మి : (నేపథ్యమువంకc దిరిగి)

సీ. నవకుసుమాంగి! సుందరి! రుక్మిణీదేవి! నాకు సోదరి! నరనాథసూన!
గురుభక్తిమీరి పెక్కులు పురాణంబులు చదివిన జ్ఞానవిశాలహృదయ
పోతుటీcగకునైనc బోరాని శుద్ధాంతమునc బెంపcబడినట్టి పూజ్యచరిత
లౌకికాచారము ల్గలనైన నెఱుcగని ముగ్ధ! బాంధవులకుc బుణ్యభూమి

తే.గీ. బిడియపడలేదు వెనుకంజ వేయలేదు
హరిని వరియించె నౌరౌర యబ్బకైన
బ్రహ్మకైనను కన్యల స్వాంతములను
గనకc బెండ్లిసేయcగ హక్కు గలుగదెందు

సీ. తనసత్వమెదిరి సత్వము నెఱుంగక బలాఢ్యులతో విరోధించు తులువలార!
మహనీయులను వేషమాత్ర నల్పులనుగాc దలచి నిందించెడు మలపలార!
ఒకనిcగోరెడు పిల్ల నొకనికి నర్పించి గొంతులుగోసెడు క్రూరులార!
"యింతవాcడను ముందు కిదిచేతునని" ప్రతిజ్ఞలు పల్కుచుందు నజ్ఞానులార!

తే.గీ. చెప్పవలసినదేమి వీక్షింపలేద?
యిప్పటికి నేను ధన్యుండ కృష్ణమూర్తి
జాలిగలవాcడు విడచె మీసాలు గొఱిగి
నూకలున్నవి నాకింక లోకమందు

(నిష్క్రమించును)

పెండ్లికోర్టు.

సీను–ద్వారకానగరము శ్రీకృష్ణుని మందిరము.

(బలరామ సాత్యకి మంత్రిబాంధవ పురోహిత జనులతో రుక్మిణీకృష్ణులు కల్యాణమందిరమున వివాహవేదిక నలంకరించి యుందురు.)

అగ్ని : (ప్రవేశించి చూచి స్వగతము)

సీ. ఏయమ్మ హరినామధేయ శ్రవణమాత్ర పిన్ననాటనెకూర్మిc బెంచుకొనియె
యేయంబ తనబాష్ప తోయమేఘమునకు కమలనాభునిc జాతకమునుజేసె
యేతల్లి హరిశక్తి నెఱింగింప దలcచి మిథ్యావిరోధం బింట నభినయించె
యేమాతమత్పురాకృతపుణ్యవశమున సందేశహరునిగా సంగ్రహించె

తే.గీ. అట్టి రుక్మిణీదేవి రమాంశజాత
ద్వారకాపురీ కలశకూపారమందు
నబ్జనాభునితోడ కల్యాణపీఠి
నాకు సాక్షాత్కరించె! జన్మము తరించె!

ధన్యోస్మి! ధన్యోస్మి! (అని సమీపించి ప్రకాశముగా)

శ్రీమల్లక్ష్మీనారాయణులకు నిరంతర కల్యాణ మహదైశ్వర్య ప్రాప్తిరస్తు (అని అక్షతలు సల్లును)

(రుక్మిణీ కృష్ణులు లేచి నమస్కరింతురు)

కృష్ణ : అవనీదేవ శిఖామణీ!

తే.గీ. ప్రసవ సంపర్కమునకు నవ్యాజబాంధ
వుండయినయట్టి వాయుదేవుని విధాన
మాకు నిర్వ్యరకీవు సంబంధ బాంధ
వంబుఁ గల్పించినావు కృపాసముద్ర!

రుక్మిణి : (చేరవచ్చి)

శా. నాకన్నీటికిఁ దోడుగావిడిచి యున్నావన్న కన్నీరు; కాం
తాకందర్పుని దేవకీసుతుని సందర్శించి రప్పించి యీ
నాకల్యాణమున స్సహాయకుఁడవై నాకాపురంబున్ ద్రిలో
కీ కీర్తిన్ నిలఁబెట్టినాఁడవు ధరాగీర్వాణవంశోత్తమా!

దాని కుపకృతులంజలులు గాక మరి సమానములు లేవు. పుచ్చుకొనుడుఁ మమ్ము దీవింపుడు. (అని నమస్కరించును)

అగ్ని : అమ్మా! దీర్ఘాయురస్తు! మీకు విశేషించి దీవెనలీయగలంత వాఁడనుగాను; దేశము నిట్లు దీవించెదను.

భరతవాక్యము.

తే.గీ. కలుషమతులకరంబులు దొలఁగి లోక
మాత రుక్మిణిభర్తతో మనువిధాన
మాభరతఖండ బహుళ సామ్రాజ్యలక్ష్మి
యలరుగాత! మనోనాథు! నంకసీమ

(అవనిక పడును)

# అనుబంధములు

(అనుబంధము 1)

వారె! హా! యీవనముగను... వరకుసుమాకరమై
ధరాదేవి కలాపయోయనఁగ దోపదేచెలి ॥వారె॥
వికచవిచికిలామోద సమాయత భ్రమరవిసరచలిత లలితకిసలయంబై
మలయాహార్య సమీరశాబక గళన్నానాసుమానీకమై,
పికపాళీయుగళీ కుహూకుహూనినాదాశాంతవిశ్రాంతమై,
ఆహోహో, నామది మోదముగొన్నది భాసురమైనది ॥వారె॥

(అనుబంధము 2)

సుమదామములన్ నిను పూజింతుము మముదయజూడుము కరివరదా!
1. కమలభవాదులు। గనజాలనియా। ఘనమహిమముగల । అమలునినిన్ను
2. సుమసుకుమారమై । శ్రుతిసీమంతమై । శుభదాయకమై । కొమరారెడు నీపదయుగళము ఘన ॥సుమ॥

(అనుబంధము 3)

భళి! భళి! చక్కని సంబంధంబుఁ గోరినారే! పక్కున నవ్వదె లోకము । అలివినీలకుంతల మంజులవిద్యుల్లలితాంగికి । యిలనాతలనాథుఁడ వగు నీబిడ్డకు । నాచెల్లిలికి భళి! భళి!
1. కమలాలయ కెనయగు గంగాసమాచారిత్రకు। కమలనయనకు ఘనవేణికి ।
మనరుక్మిణికి నిపుడు ॥భళి॥

(అనుబంధము 4)

ఛీ! యేమనిపల్కినావు నీవు సోదరీ! ఆయదువంశుం డాత్మనాయకుండె। బిడియమున్ గడచితె విడచితె ॥ఛీ॥
1. మాయకాని నొకనిగోరి । హేయపరతువే కులంబు
యిక సహింపన్ । దయవహింపన్ । కనికరింపన్ ॥ఛీ॥

(అనుబంధము 5)

ఈగతిన్ త్వరపడగనగునె తనయ! నాహితము నాలకింపుమా

ముకుపచ్చలైన నారని దిది చిరుమురిపెంపుకూనగదర తనయా!
నిన్ను పెద్దయన్నయని యెందుమురిసెడు చెలియలుగద యొకతెగద
ముగుదగద ॥ఈ॥

(అనుబంధము 6)

ఔరా! మోసకాడ। యగునే యిటులనృతంబులాఁడ
ప్రియమిత్రుండ వటంచునెంచితిని । ప్రేమించితివని విశ్వసించితిని
ఖలమతి యీ విధముగనా। గళమును గోయఁగఁదగునే ॥ఔ॥

(అనుబంధము 7)

నిరపరాధివి నిన్ను పరుషంబులనాడితిని । నన్ను క్షమింపుము
మురహరి కీయంజూచిరి । తరుణీమణినని వినుచున్ । గురుతర
కోపమున మేను । నరయక మదిభరియింపక ॥నిరప॥

(అనుబంధము 8)

వనము నరయుమమ్మా శోభనము మనోహరమయ్యెడి
కనులకు నానందంబు న్గొలిపెడిన్
విమలజలంబులతో బారెడు సెలయేళుల్
సుమసముత్కరంబులతో సొంపారుకుజంబుల్
హాయిన్ జేయు వాయువుల్ వీచున్ ॥వనము॥

(అనుబంధము 9)

ఎటులసైతునీ । కుటిలవిచారుల । కఠినాత్ముల నగ్రసంభవులనే
పటుతరమౌఢ్యాంధత నను చైద్యుని । పాలబడవేయగా దలచిరి ॥ఎ॥

(అనుబంధము 10)

ఔరా! యీసుందరము బహుదుర్లభము
సారసదళముల । గేరెడుకన్నులు । తారాపతి కెనయగు వదనంబు
యేరీతిఁగఁజేసెనో పద్మభవుం । డేమనికొనియాడెద నాయెద ॥ఔ॥
ఇది నాకులభించినా । యింద్రపదవి నందినట్లేగదా! యేమగునో
నాకుకడకు ॥ఔ॥

(అనుబంధము 11)

రుక్మి : రాజ యిటులనాడఁగ న్యాయమా?

పరసతులతో బలుకఁదగునా ॥రా॥

శిశు : పరునిసతి నీ వెటులచెపుమా?

పలుకరించుటే । పాపంబా?

రుక్మి : దురాగతము మది । దలచెదవేమో!

దూరముగా నుండుమా । రాజ యిక

దూరముగా నుండుమా ।

శిశు : అకటకటా! యీగతిని వచింపన్ ।

అపరాధంబేమి? చెలియ నాయపరాధంబేమి?

రుక్మి : అపరాధమొ కాదో నాకేలా।

ఆవలికి పోవేలా ॥రాజయిటు॥

(అనుబంధము 12)

శోకముడుగుము నీకుశుభమగును । రాకాచంద్రవదన। గుణసదన।

నీకతంబునన్ । నాకుధన్యత । చేకూరెడు గడియవచ్చె నింతకు ॥శో॥

హరి సామాన్యుఁడు గాఁడు । ఆలముననను వెనుకంజవేయుఁడు

అరులఁ దునుమకుండఁడు । నిన్ను విడువఁబోడు ॥శోక॥

(అనుబంధము 13)

నేనెంతభాగ్య హీనురాలనో! కటకటా!

శ్రీనాథు నెడబాసి । చింత ననుభవించు ॥నే॥

తనకినుక నెటుల నణపఁగలనొ చనువున । దనుఁజేరెడు విధమెట్టులనో

కనఁజాలనిమనమున గుందుచుంటి ॥నే॥

(అనుబంధము 15)

ధన్యునైతిగా! హా! ధన్యునైతిగా!

తాపసాళికుముదచంద్రు । చంద్రసదృశకీర్తిసాంద్ర

మురహరునిన్ । గిరిధరునిన్ । కరివరదున్ । కనుగొనుటా ॥ధ॥

1. పాలకడలి దనరువాని । పాపమేని పడకవాని.

శ్రీవరునిన్ । శుభకరునిన్ । సురవినుతున్ । గనుగొనుటా ॥ధ॥

(అనుబంధము 16)

జలజనయన ! నాకొఱ కెన్నివెతలు । సంభవించె నీ వేగతినుంటివొ!

పలుగాకులలో । పల నుదయింపఁగ । నలువలిఖించెఁగాబోలు

నీనుదుట ।జలజ॥

1. నిరతమునన్ను । స్మరియించుకొనుట । యదయుచునుందును । అన్ని యెరుగుదును । మరువలేదు । మరువలేదు కాని ! శరణమిచ్చు లోపల పాపులచే ॥జల॥

(అనుబంధము 18)

ఆహా! యెంతటి! యవిచారుఁడునా । యాత్మజుఁదరయన్

యేమియొనరించెద ॥ఆహా॥

మూఢత యితఁడా ముద్దుల చెలియలి ॥ మురిపెముఁదీర్పఁగ నరయఁడు మదిలో ॥ఆహా॥

యెటుల పరిణమించునో । యేమి సంభవించునో । యింక నేగతి చెలరేగునో ॥ఆహా॥

(అనుబంధము 19 నుండి అనుబంధము 26 వరకు అలభ్యము)

సీ. నీరేజ గర్భుని యూరుభాగమునకు! వన్నెబెట్టినయది వైశ్యకులము!
అలకాధిపతియగు నలకుబేరుని సిరి పరిహసించెదునది వైశ్యకులము
దారిద్ర్యదేవిని దరిజేరనీయక భంగపెట్టెదునది వైశ్యకులము
అతిశాంతగుణమున కావాసమైజగద్వందితంబైనది వైశ్యకులము

తే.గీ. వనధికన్యకనిరతంబు వలచివచ్చి
వాసముండెదు నట్టిది వైశ్యకులము
ఒరుల దరిజేరి ధృతిమాలి తిరిపమెత్త
బాలుపడనిది తలపోయ వైశ్యకులము

# కన్యకాపరమేశ్వరి

సీ. శ్రీమంతమైన కృష్ణా మండలంబున వసుధ కన్యాహార పదకమనఁగ
పెనుగొండ యనునొక వీడు పెంపలరారు వైశ్యరత్నముల కావాసమగుచు
నందు సుమశ్రేష్ఠియనునొక వణిజుండు గలఁడు ధనాఢ్యుండు గమలనాభు
సేవనా పరతంత్రచిత్తుండు సరసుఁడు నర్థి చింతామణి యలఘుచరితుఁ

తే.గీ. డఖిల బాంధవమిత్ర హృదబ్జహేళి
సత్యసంధుఁడు దుష్ట పాషండవైరి
సజ్జనవిధేయుఁడ కలుషాచారపరుఁడు
అందముగలాఁడు నాతని కాతఁడీడు

తే.గీ. అతని భాగ్యంబు సుగుణంబునతనిధర్మ
కర్మసంతతి నరసి యాగ్రామవాసు
లైన వర్తకులెల్లరు నతిముదమునఁ
బెద్దతికమిచ్చి తగ గౌరవింతురెపుడు

తే.గీ. అతఁడు వరియించెఁ గుసుమాంబ యనులతాంగి
నన్నపూర్ణకు నుద్దియౌ యతివమిన్న
సకలయాచక కల్పవృక్షంబు గరిత
ధర్మగుణముల ప్రోవు యందములతావు

వ. అమ్మిథునంబు సంతానంబులేమి

సీ. కట్టించి రెన్నియో కమనీయ దేవాలయములు పాంథులకు సత్రముల గములు
వేయించి రెన్నియో విమలపంకేజాకరములు మేలైన మార్గముల గములు
చేయించి రెన్నియో క్షితిదేవతలకు దానంబులు నుపనయనముల గములు
వ్రాయించి రెన్నియో వణిజ కులాచార ధర్మముల్ పెక్కు పొత్తముల గములు

తే.గీ. బీదసాదల కన్నంబు బెట్టినారు
అదియు నిదియననేల పుణ్యంబునెంత
చేయవలయునొ యంతయుఁ జేసినారు
వైశ్యదంపతు లభిమత ప్రాప్తికొఱకు

తే.గీ. ఎందును ఫలంబుగానక బృధివిసురుల
యభిమంతబున గోస్తని యనుతరంగి
ణీసమీపంబునందుఁ బూనికమెరయంగ
పుత్రకామేష్ఠియను జన్నమునుసలిపిరి

వ. అంత నయ్యగ్నికుండంబున శివారమణి ప్రత్యక్షంబై ఫలంబులనిడియెఁ బిమ్మట నమ్మిథునంబు గోహిరణ్య దానంబుల బ్రాహ్మణులఁ దృప్తులంజేసి సుఖంబుగ గాలంబు గడపుచుండఁ గుసుమాంబ గర్భవతియై యొక్క శుభ లగ్నంబున వాసవాంబయను కన్యను విరూపాక్షుండను బాలునిఁగవలవారలం గనియె. నబ్బాలబాలికలు దినదిన ప్రవర్ధమానులై యేడవయేటఁ బాఠశాలం బ్రవేశ పెట్టఁబడి సకలవిద్యలు నేర్చి యౌవన వంతులైరి. అందు వాసవకన్య వైశ్య కన్యాశిరోమణియై పెరుగుచు

సీ. జననీజనకుల పూజనమును మరువదు పెట్టిపోతలయందు వెలతిపడదు
అతిథి పూజనమున కాయాసపడదు భాగ్యంబున్నదని మదిగర్వపడదు
సద్గ్రంథపఠన మశ్రద్ధ గావింపదు పెద్దలసుద్దుల విసుగుకొనదు
దేవతార్చన మొక్కదినమేని మానదు గర్వితమతుల సంగతికి బోదు

తే.గీ. కాలమొక్కింత వ్యర్థముగా గడపదు
అమిత సంభాషణంబు సేయదు పరులకు
మనసునొప్పింప దొరలుచే మాటబడదు
వదనజిత చంద్రబింబ! యవ్వాసవాంబ

వ. అక్కాలంబున రాజమహేంద్రము రాజధానిగా విష్ణువర్ధన విమలాదిత్యుఁడు వేంగిదేశమును పరిపాలించుచు దేశసంచారము వెడలి, పెనుకొండఁజేరి వణిగ్వరులచే బహుకరింపంబడి కాన్కలు గొనుచు నమందానంద మనస్కుండై దానికిఁ ప్రతిఫలంబుగా దాంబూలంబీయ నిశ్చయించి వైశ్య శిఖామణుల యందెన్నదగిన కుసుమశ్రేష్ఠి పత్నిం బిలిపించి తాంబూలంబు నిచ్చుచు నామెవెంట సనుదెంచిన వాసవ కన్యంగాంచి మోహ పరవశుఁడై తనమంత్రితో నక్కన్యనంతఃపురమునకు రావింపవలయునని చెప్ప నాతండు వైశ్యులరావించి భూనాథుని యభిమతంబును వచింప భేరులొప్పరైరి! దాని కాతండాగ్రహించి మీపురంబును కొల్లగొట్టి బాలం గొనిపోయెదమని బెదరించె. వైశ్యులప్పటి కూరకుండి రాజును సాగనంపి సభ జేసి కులాచార విరుద్ధంబని నిశ్చయించి మహీనేతకు రాయబారమంపిరి. ఆతడందుల

కాగ్రహించి సందేశహరులను బందీగేహమందుంచి బలవంతముగ గన్యంగొని తెండని సైన్యములను బనిచె. వణిజులదియెఱింగి నూటరెండు గోత్రములవారు వాసవ కన్యాసహితులై మానమును నిల్పుకొననెంచి యగ్ని ప్రవేశమునకు గృతనిశ్చయులైరి. అంతఁ బట్టణమున

సీ. క్రమముగానగ్నికుండములు ద్రవ్వెడువారు చెలువుగాపన్నీరు జిలుకువారు
ముంగిళ్ల ముత్యాల ముగ్గులనిడువారు జక్కగా కలయంపి జల్లువారు
కదళికా స్తంభ సంఘముల నెత్తెడువారు యవని గంధంబున నలుకువారు
కుసుమ మాలికలను గూర్చుచుండెడివారు నలఘు తోరణ పాళి నిలుపువారు

తే.గీ. స్నానములు చేయువారు నూత్నంబులయిన
వస్త్రములు దాల్చుకొనువారు ఫాలమందు
దిలకములు దిద్దుకొనువారు దేవభవన
ములకు జనువారు నైరి వైశ్యులుపురమున

వ. అందుఁగొందరు,

సీ. "కడసారిముద్దిదే కొడుక" నీకని బుగ్గఁ గరచి కన్నీరంబు గార్చువారు
"ఎత్తుకొమ్మని"చేతులెత్తు పాపల విడనాడజాలక త్రొక్కులాడువారు
"మీబిడ్డరీతి బ్రేమింపు" డంచును బంధు వితతికాత్మజుల నర్పించువారు
వహ్నికోగిరము గావలసెగా మనమంచు బిట్టుగా బొబ్బలు బెట్టువారు

తే.గీ. బంధుజనులను విడచి పోవంగలేక
తిరిగిచూచుచు జనువారు తెగువజేసి
ముందు బరువిడువారును బుద్ధినచ్యు
తాంఘ్రియుగమున నిల్పు వారైకదలిరి

తే.గీ. ధనము ధాన్యము పుత్ర సంతతికొసంగి
శాసనంబులువ్రాసి వైశ్యప్రవరులు
వాద్యములతోడ నేగి యవ్వాసవాంబ
బాలికాంబరములతో నలంకరించి

తే.గీ. కుసుమసరములు వైచి కుంకుమముఁ బసుపు
దేహమున నద్దికొనివచ్చి దేవళమున
దైవపూజలుసల్పి యందరును గలసి
వేగ నగ్నికుండము సమీపించుచుండ

వ. కుసుమాంబ దుఃఖమును పట్టజాలక బిడ్డకాళ్ళ కడ్డువచ్చి

తే.గీ. ఎన్నివ్రతములు సల్పితిమెన్నినోము
లేము నోచితిమమ్మరో యీవుమాకు
కలుగ! గలిగియు సుఖియింప వలవిధాత!
వ్రాసె నీరీతి మామందభాగ్యవశత!

సీ. గోమతీ తటమున గోర్కె నీ జనకుండు జన్నంబుసలిపెడు సమయమందు
అగ్నికుండంబున నంబిక పొడసూపి ఫలముల నిడియెడు పట్టునందు
పిమ్మట నాతల్లి ప్రేమచే నీవు నా కడుపునంబడిన యక్కాలమందు
శుభముహూర్తంబున సోదరసహితవై జననంబునందిన క్షణమునందు

తే.గీ. పొందియుండిన సంతోషమునకుగాను
అనుభవించుచునుంటి నేడంతకంత
దుఃఖవేదన కూతురా! దుష్టరాజు
పొట్టబెట్టుచు యేవేళ బుట్టినానొ

తే.గీ. లేకలేక జనించిన లేమవనుచు
పెంచితి పసిండిడోలికా వితతియందు
నక్కటా!యగ్నిపాల్సేయ నయ్యెకడకు
నీశరీరంబు! నాపూజ నీటఁగలిసె

తే.గీ. అనుచుఁ గౌగిటఁజేర్చి యత్యంతశోక
తప్తమానస యగుచున్న తల్లినరసి
డెందము చలింపనీయక మందమంద
మధుర భాషణముల నిట్లు మారుపలికె

సీ. నాతల్లి నీ విట్లు నాకోసమేడ్చిన! లాభమే! సర్వకాలంబు నొక్క
తీరుననుండునే భూరిభాగ్యంబులు! శాశ్వతంబులె నేఁడు చావకున్న
మరియొకనాఁడేని మరణంబుతప్పదు! యెందరు మరణింప రిద్ధయశులు
వారికన్నను గొప్పవారమే! కీర్తికై తనువులు విడచెడు తరుణమందు

తే.గీ. దుఃఖమెన్నఁడు వలవదు దుర్యశమున
ధరణి జీవించుకంటె సద్యశమునంది
చచ్చుట శుభంబు! కీర్తిచే జచ్చువారు!
చచ్చియును జావబోవరు జనని వినవే!

తే.గీ. ఏను నీవును జనకుండు నీలుగుటయె!
యెన్నఁదగినది కాదు వీరెల్ల రిట్లు
మనకునైచావ సంసిద్ధ మానసాబ్జు
లగుట దలపోయవమ్మ మాతా యొకింత

తే.గీ. ఆడుదానను నేను దేహమును విడచి
యిందరి హరింపవలసెగా యకట యెంత
క్రూరురాలను! యిటువంటి కూతునకయి!
వగవనేలనె? సంతోష పడకతల్లి!

తే.గీ. అనుచు నవ్వాసవాంబయత్యంతతోష
పూరిత స్వాంతయగుచు ముమ్మారు కుండ
మునకుఁజుట్టును తిరిగి యమ్మర విరోధిఁ
దలచి కుప్పించి కుండమధ్యమున దుమికె

తే.గీ. ఆమెవెనువెన్క నొక్కొక్క రగ్నిజొచ్చి
తనువులు దొఱంగి స్వర్గసౌధంబునందు
జేరిశాశ్వతకీర్తి నార్జించిరహహా!
వైశ్యకులజులు శాంతభావమున ఘనులు

వ.	అంత పట్టణంబంతయు

సీ.	తలిదండ్రిలేని బిడ్డలమైతిమనుచు బావురుమని యేడ్చు సోదరులతోఁడ
అక్కరో! మనకిక దిక్కెవ్వరేయంచు నొకట శోకించు బాలికలతోఁడ
పాలకై యేడ్చెడు పసిపాపలను గాంచజాలక మూల్గెడు జనులతోడ
యీ ఘోష నీయింట నెపుడు జనించురాయని తేనిఁబల్కు నంగనలతోఁడ

తే.గీ	అగ్నిచే గాల్పఁబడెడు దేహములనుండి
బయలువెడలెడు చిటపట ధ్వనులతోడ
నిండి పట్టణంబపుడు వర్ణింపరాని
ఘోరమై భీతినెలకొల్పె పౌరతతికి

వ.	అంత వివాహసన్నదుఁడై పెనుగొండకు దరలివచ్చు విమలాదిత్యుఁడు మార్గమధ్యంబున వాసవ కన్యామరణంబును భటులచేవిని మూర్చవోయి మదగజంబు నుండి భూమింగూలె! వాసవకన్యా శాపంబున నతనిశిరము శకలంబు లయ్యె! మంత్రులాతని కళేబరంబును పల్లకియందుంచి పురంబునకుఁ గొంపోయిరి. అతని పుత్రుండైన రాజరాజ నరేంద్రుఁ డాతనికి దహనసంస్కారంబు లాచరించి పట్టాభిషిక్తుఁడయ్యె

సీ.	అవ్వాసవాంబవైశ్యశిఖామణులకిప్డు స్వకుల దేవతయై ప్రపంచమెల్ల
బూజింపఁబడుచుండు బూఁవుఁబోడులకును గరపుచునుండె విఖ్యాతగుణము
కులమున గీరితి గూర్పంగజాలెడు నొక్క కుమారుఁడో యొక్కసుతయొ
కలిగి యుండినజాలు గాకదురాత్ములు! అపయశంబు ఘటించు నట్టిసుతులు

తే.గీ.	నూరుగురు గల్గనేటికి భూరికాంతి
మంతమై పెంపుమీరెడు వజ్రమొకటి
చాలు బండెడుగులక రాలేల నిప్పు
యోజనముగాక కలదె ప్రయోజనంబు

# విజ్ఞాపన

భారతమహాశయులారా!

భాషలయందుఁ బేరెన్నికఁగాంచిన మన తెలుంగ్గైంద్ర జాలముంబోలి భరత ఖండమును వశీకరించుకొన్న హూణభాషాసముద్రమున లీనమై రూపుమాసిపోయినది. ఇటీవలఁ గొందరు ప్రముఖులుదయించి చక్కని నాటకములనురచియించి భాషాకన్యక నలంకరించి సేవించుచు యథాగౌరవమునొసంగిరి. ఇంతలో 'చలనపటప్రదర్శన యంత్రము' లేర్పడి నాటక ప్రదర్శనములతో పాటు నాటకరచయితల యాశాంకూరములను సమూలముగా బెకలించి యధఃపతనమొనరించినవి. దానితో నాకుదయించిన నిరుత్సాహమునకు మేరలేదు. అట్టితరుణమున రుక్మిణీ కల్యాణమును ప్రథమంబునఁ బ్రదర్శించిన శ్రీరాధాకృష్ణవిలాస సభవారు నన్నుఁ బ్రోత్సహించి యీనాటకమును వ్రాయుమని కోరగా గాలిందూలు దీపకళికవలె నాహృదంతరాళమున మెలంగుచున్న యాశాలతతోఁ గలంబుఁజేపట్టితిని. కాలమునుబట్టి నాటకము లన్నియుఁ గేవలము వచన కావ్యములై పోవుటఁగన్నవాఁడనగుట పద్యములధికమైన నేతన్నాటకాభిమాను లాదరింపర నియుఁ గేవలము వచనంబయిన పద్యరచనాభిమానులు మూతిఁజిట్లింతురనియు నుభయుల చిత్తముల ననుసరింపవలసిన వాఁడనైతిని. వీరిచిక్కు వదలించుకొంటినని యానందింప నవకాశమీయని 'మట్లు' మట్లనువారికి "ప్రదర్శనమునకు వచ్చినప్పటి కవియును బూర్తిఁజేయుదును లెం" దను సమాధాన బాణములతో వారినిగూడఁ దలలూగించుచు నాల్గంకములతోఁ బరిపూర్తిఁగావించితిని. గాథ మిక్కిలి చిన్నదగుట మూలమునకు భిన్నమైన మాయాసునీతినిఁ బ్రవేశపెట్టి ధ్రువోత్తముల బంతులాట యాదిగా గల విషయములను గల్పించితిని. ఈర్ష్యాపిశాచావృత చేతస్కులై శ్లేషకవిత్వ సింహమనందగిన భట్టుమూర్తి యంతటి మహానుభావుని నేటికిని నిరసించు బుద్ధిమంతుల దృష్టికి నాకవిత్వము రేణుకల్పముగాకపోదని నేను బాగుగా యెఱుంగుదును. తుమ్మెదలు తృణీకరించినంత సంపంగి పరిమళహీనమగునా? కవిత్వతత్త్వ మెఱింగి కుల భేదములను గణింపక గుణములను బయలుపరచు విద్వత్కవులకు జోహారుతోపాటు నాటకము నర్పించుచున్నాఁడను. గుణైకదృక్కులు నన్నాదరింతురుగాక.

జి. జాషువ

## ఈ నాటకమున వచ్చు పాత్రలు

పురుషులు :

1. ఉత్తానపాదుఁడు
2. ధ్రువుఁడు (కథానాయకుఁడు)
3. ఉత్తముఁడు
4. మాధవుఁడు } చెలికాండ్రు
5. జయుఁడు } చెలికాండ్రు
6. ఇంద్రుఁడు
7. బృహస్పతి
8. నారదుఁడు
9. యక్షుఁడు
10. ఆది విష్ణువు

స్త్రీలు :

1. సునీతి (ధ్రువుని తల్లి)
2. సురుచి (ఉత్తముని తల్లి)
3. మల్లిక (సురుచి దాసి)
4. లక్ష్మి
5. రాక్షసాంగన

# ధ్రువవిజయము

:: నాంది ::

మ. ఒక కాంతామిష బాలునొక్కని మదవ్యాఘ్రోగ్రశుండాలగం
డకశార్దూలమృగాలవాలమగు కాంతారంబునం జేర్చి వా
నికి దివ్యన్మునిజీవనం బిడి ప్రశాంతింజేసి దుఃఖంపునా
టక మాడించి యశంబు జాటిన నిశాటధ్వంసిమిమ్మేలుతన్!

(నాంద్యంతమున సూత్రధారుఁడు ప్రవేశించి)

సూత్ర : పూచిన తమ్మికొలనువలె సభాసదులతో నాటక భవన మలంకరింపఁబడినది. దేవగురునంతటి వానికి బొమ్మఁగట్టజాలిన విద్వత్కవు లెందరిందుగలరో యీ నాఁడు ప్రదర్శింపబడఁబోవు నాటకరత్న మిట్టి రసికాగ్రేసరులచేఁ గొనియాడఁ బడినను నిరసింపఁబడినను నాకుఁగీర్తియే. కాని నావిద్యావైదుష్యమును వెల్లడించి శిరఃకంపము సేయింపఁ బ్రయత్నించెదను గాక (కొంచెము నడచి) యిట్టి మహనీయుల ప్రథమదర్శన భాగ్యము నాకేగాని మా నటి కెన్నఁడును లభింపదు. సొమ్ములు సవరించుకొనుచు రెండడుఁగులు వెనుక వచ్చునేకాని ముందురాదుగదా? పిలిచి చూచెదను. (యెల్గెత్తి) నటీ! నటీ!

(తెరలో)

నటి : ఆర్యపుత్రా! వచ్చుచున్నాను.

సూత్ర : నటీ! పిలిచినఁగాని రాకూడదని సమయము సేసికొంటివాయేమి?

(నటి ప్రవేశించి)

నటి : కలసి పోఁగూడదని నీవు సమయముఁజేసికొనగా నేనేల చేసికొనరాదు?

సూత్ర : సరిసరి! కూర్మయానవగు నీతో నేను గలసి రావలయునా? అట్లయినఁ దెల్ల వారినట్లే.

నటి : శీఘ్రయానులగు మీరు వెనుకవచ్చినచోఁ గాలపరిమితి సరిపోవదా? కాకున్నను మీరు ముందువచ్చి చేసిన కార్యమేమి?

సూత్ర : ఏమియును లేదా? సభాస్తారుల బహూకరించి యాశీర్వదించితిని.

నటి : (సిగ్గునభినయించి) ఓహో! పొరబడితిని! క్షమింపుఁడు. నేడేదో నాటక ప్రదర్శనమని చెప్పియుంటిరి.

సూత్ర : నటీ! నీమందగమనముతో పాటు మందమతియును దాపరించినదా?

నటి : ఆర్యపుత్రా! నేడు ప్రదర్శింపఁబడు నాటక మేమి?

సూత్ర : కరుణ రసప్రధానమగు ధ్రువ విజయము

నటి : గ్రంథకర్త సమర్థుఁడేనా?

సూత్ర : వెఱ్ఱిదానా

కం. కప్పురఁపుధూళి మేన
స్గుప్పినక్రియ నోటఁ దేనె గురిసినగతి మే
ల్పుప్పొడులు చిందినట్టులు
చెప్పంగలవాఁడు కవిత సితపద్మముఖీ!

మరియు

తే.గీ. వెడఁగురూపంబుఁ దనకుఁ గల్పించి బ్రదుకు
కుకవులఁదలంచి డెందానఁగుందుచుండు
కావ్యకన్యక నోదార్చుకవివరేణ్యు
లందు ముఖ్యుం డితండు పుష్పామలాంగి!

నటి : అట్లయిన నాంధ్రలోకమునకుఁ జిరపరిచయులే; నామధేయము?

సూత్ర : జాషువా గారు!

నటి : రుక్మిణీకల్యాణ కుశలవోపాఖ్యాన చిదానంద ప్రభాతాద్యనేక గ్రంథకర్తలా? వీరు కవివరులును పండితవరులునని వినియుంటిని.

సూత్ర : అవును, గుంటూరు ఎ.ఇ.యల్.యం. బోధనాభ్యసన పాఠశాల యందు.

నటి : నవరసస్యందియగు నీనాటక ప్రసవమును నేడు ప్రదర్శించుచే మనము ధన్యులమగుచున్నాము.

సూత్ర : మనమేకాదు ప్రేక్షకులును.

నటి : నిస్సందేహముగా; ఇక్కవిచంద్రుని గర్భమునఁ గని యానందించు జననీజనకు లెవ్వరు?

సూత్ర : తే.గీ. తత్వజలనిధి! యదుకులోత్తముఁడు శాంత
మూర్తి; గుఱ్ఱమువంశాబ్ధిపూర్ణతుహిన
కరుఁడు, శ్రీవీరయార్యుఁ డిక్కవికిఁదండ్రి
అమలగుణవల్లి! శ్రీలింగమాంబ తల్లి!

నటి : మనమింకఁ బాత్రలను సిద్ధముసేయకున్న సభాజనులు విసికికొందురు.

నటి : అవును! పోవుదము! అదిగో! కథానాయకుఁడగు ధ్రువుఁడు బంతులాడ దండమునకు వచ్చుచున్నాఁడు. (నిష్క్రమింతురు)

# ధ్రువవిజయము

## ప్రథమాంకము

(సీను–క్రీడారంగము)

(బంతులాడుచు నుత్తముఁడు జయుఁడు ప్రవేశింతురు)

ఉత్త : జయా! నిన్న ధ్రువునితో నాడిన బంతులాటలో నేనోడిపోయితిని. తిరుగ నతని నోడింపవలయును. పోయి పిలుచుకొనివచ్చెదవా?

జయు : మిత్రమా! ధ్రువునకు బంతులాట యన్న నెంతయు మక్కువ. క్షణకాల ముందుము. అతఁడే వచ్చును, యిదియేకదా? మనక్రీడారంగము.

ఉత్త : అవునుకాని, మనరాక నాతఁడు తెలిసికొనవలదా?

జయు : అతని సహచరుండయిన మాధవునితో నేనింతకు ముందే చెప్పియుంటిని. యీతఁడాతనికిఁ జెప్పును. చెప్పినవెంటనే తప్పకవచ్చును. (పారజూచి) రాజ కుమారా! అదిగో! ధ్రువుఁడును మాధవుండును వచ్చుచునే యున్నారు.

ఉత్త : (చూచి) అవునౌను; రానిమ్ము. నెచ్చెలీ! ఆతనినోడించుటయే కాక పన్నిదము నిడి కందుకమునుకూడ నపహరింపవలయును. కడు మెలకువతో నాడవలయును సుమా!

జయు : మిత్రమా! యీమెలకువ నిన్న నేమైనది?

ఉత్త : వయస్యా! అన్ని వేళలును మనవికావుగదా?

జయు : ఈవేళయును మనదికాకున్ననో?

ఉత్త : ఓహో! నీవప్పుడే బల్లిపలుకు లారంభించినట్లున్నదే! సరిసరి.

జయు : రాకుమారా! బల్లిపలుకులుగావు! కోపగింపకుము. గెలుపు నిర్ణయించుట యజ్ఞానసూత్రముగదా?

ఉత్త : అవునుగాని నిరీక్షణయుండదా?

(ధ్రువ, మాధవులు ప్రవేశింతురు)

మాధ : (ధ్రువునితో) రాకుమారా! అరుగో! జయోత్తములు మనకై యెదురుచూచుచున్నారు.

ధ్రువు : మాధవా! యీయుత్తమునకు నిన్నటికందుకక్రీడలో నపజయము కలిగినది. అందుచేత నేడెట్లయిన నోడింపవలయునని ప్రయత్నించును. యీజయుఁడు బంతులాటలో నేర్పరి. వీనిసహాయమున నన్ను గెలుచునేమోయని సందేహిం చున్నాను.

మాధ : మిత్రమా! జయుని నేర్పరితనమును నావద్ద పొగడకుము. ఆతని నేనోడింపఁ

ధ్రువు : నెచ్చెలీ! సంతోషము, పోవుదము రమ్ము, (సమీపించి యుత్తమునితో) ఉత్తమా! క్రొత్తబంతిని తెచ్చినట్లున్నదే?

ఉత్త : అవును దీని నీదినమే తెప్పించితిని, దీనికిఁ గారణమున్నది.

ధ్రువు : ఏమికారణము?

ఉత్త : ఎవరుగెలిచిన వానికి బంతుల నిచ్చివేయుట.

మాధ : అయితే నాది ప్రాతబంతియే?

ఉత్త : నీవును మాజయుఁడును బంతులనోడ నవసరములేదు. మే మిరువురమే పందె మొడ్డికొందుము.

ధ్రువు : సరే ఆడుదము రమ్ము! (తెరలోనికిపోయి తిరిగివచ్చి నేను గెలిచితిని అని బంతిని పుచ్చుకొనును)

(ఉత్తముఁడు ప్రవేశించి)

ఉత్త : ధ్రువా! నేను చూడలేదు. మరలనాడుము.

ధ్రువ : ఉత్తమా! నిన్ను చూడవద్దంటినా? అధర్మముగా ప్రవర్తింపకుము. మీవిజయునిఁ జెప్పుమనుము. (విజయునితో) జయా! గెలిచితినా లేదా? సత్యము చెప్పుము.

జయు : ఏమో! మీసంగతి మాకుపట్టదు. (మాధవునిఁజూచి) మాధవా! మనమాడు కొందుము రమ్ము.

మాధ : అదేమిజయా! కన్నులారఁ జూచితివిగదా? చెప్పరాదా? కోమటిసాక్ష్యము చెప్పెదవేల?

ఉత్త : నేను చూడవలయునుగాని జయుఁడును గియుఁడును నాకు సాక్షులుకారు (రూక్షముగా) ధ్రువా! మరల నాడెదవా లేక నాబంతి నిచ్చెదవా?

ధ్రువ : ఉత్తమా! నీకింత యన్యాయముతగదు. నీ విటువంటి వాఁడవనియే యాటకు గొంకుచుందును.

ఉత్త : ఔనౌను, ఎవరియన్యాయము తెలియుచునేయున్నది. నీవు నాకన్నులు మూసి యాడువాఁడవనియే బంతినీయఁ గొంకుచున్నాను. ఇదంతయునేల! నాబంతి నాకిమ్ము లేక మరల నాడుము.

ధ్రువ : ఉత్తమా! నేను బంతి నీయను. మరల నాడను. పట్టువిడువక పనిచేయు వారిలో నేనగ్రగణ్యుఁడను. నీ వేమి చేసెదవో చూచెదను. మాధవా! రమ్ము పోదము.

(అని మాధవునితో నిష్క్రమించును)

ఉత్త : జయా! నీవు తొలుత యేమనిపలికితివో అట్లే జరిగినది.

జయు : అయ్యా! నేనేమిపలికిననేమి! నీకు సామర్థ్యముండిన గదా?

ఉత్త : ఇంతమాత్రముననే బంతిపోయినదని తలంపకుము. నే నిప్పుడేపోయి మాయమ్మతో చెప్పి బంతి నిప్పించుకొందును. నీవట్లు చూచుచుండుము.

జయు : (తనలో) ఆహా! యేమిసమర్థత అమ్మకు చెప్పి బంతి నిప్పించుకొనునట. కుఱ్ఱ వానివద్ద మంచిగుణములే యున్నవి. పేరుత్తముఁడుగాని గుణములయంద ధముని వలెనున్నది (నిష్క్రమింతురు)

సీను–అంతఃపురము

(సురుచి యుత్తానపాదుఁడు పీఠము నలంకరించియుందురు)

ఉత్తా : ఇంతీ! నేఁడు నీ వేదియో యోజించుచున్నట్లున్నది అది నాతోఁ జెప్పుము.

సురు : చెప్పిన ఫలముండవలదా?

ఉత్తా : ప్రాణేశ్వరీ! యీ యుత్తానపాదుఁడు నీ యభీష్టములకుఁ గల్పద్రుమంబని యెఱుంగవా?

సురు : నీకల్పద్రుమత్వం బొక్క సురుచియందుననేకాదు.

ఉత్తా : కాక మరెందైనఁ గలదా.

సురు : కలుగఁకున్న నీవిచారమేల?

ఉత్తా : మనోహారిణీ! ఎచ్చటనో చెప్పుము.

సురు : ముద్దుల పెండ్లామగు సునీతియందు.

ఉత్తా : మానినీ! నామానప్రాణములన్నియు నీకు గుత్తకిచ్చి సేవజేయుచున్నను విశ్వ సింపకున్నావు. పాపము! సునీతి యుత్తానపాదుని పట్టమహిషి యను వాక్య దోషముగాక యెన్నఁడయిన దానిముఖముజూచితినా?

సురు : పాపమని, కరుణారసంబును వ్యక్తీకరించుచున్నట్లున్నది. పోయి చూడరాదా? నేనడ్డగించితినా.

ఉత్తా : (తనలో) బహునారీలోలురగు పురుషులకు నరకబాధయన్న నెక్కడనోలేదు. (ప్రకాశముగా) అయ్యయ్యో! అబలా! నేనాయర్థముతో ననలేదు క్షమింపుము.

సురు : ప్రాణేశ్వరా! పొరపాటున ననియుందురు. దీనికి మీరింత కలవరపడ నవసరము లేదు. పోనిండు నాయీప్సితమును చెప్పమందురా?

ఉత్తా : అవశ్యము చెప్పవలసినదే.

సురు : కొనసాగింతురా.

ఉత్తా : తప్పక కొనసాగింతును

సురు : నాచేతిలో చేయివేయుఁడు

ఉత్తా : ప్రేయసీ! అన్నమాటను దప్పువాఁడననియేకదా? నీవిట్లడుగుట.

సురు : మీరు సత్యవాక్యబద్ధులని నేనెఱుంగుదును కాని నాకోర్కెయిది.

ఉత్తా : (చేతిలోచేయివైచి) ఇంకఁజెప్పరాదా?

సురు : ఏమియును లేదు. ఉత్తముని రాజ్యాభిషిక్తునిజేయుఁడు.

ఉత్తా : దీనికా ఇంతయుపోద్ఘాతమును రచించితివి?

సురు : సునీతింగూర్చికాదు; దీనికేనని సంతసింపకుఁడు ముందు దీనికి జవాబిండు.

ఉత్తా : మనోహారిణీ! నీయభీష్టానుసారముగా యుత్తమునకే రాజ్యమిచ్చెదను. కాని సునీతింగూర్చి నన్నింక శోధింపకుము.

సురు : నాథా! శోధింపను మీరు ముందెట్లు ప్రవర్తింతురో గమనింతును. అప్పుడుగదా?

ఉత్తా : సరే! గమనింపుము.

(తెరలో అమ్మా! అమ్మా!)

సురు : నాయనా! ఉత్తమా! రమ్ము!

(దుఃఖముఖుఁడై యుత్తముఁడు ప్రవేశించును)

(ఉత్తానపాదుఁడెదురుసని యెత్తుకొని వచ్చి యంకమున గూర్చుండఁ బెట్టుకొనును).

ఉత్తా : నాయనా! యేమట్లు దుఃఖముఖుఁడవైయుంటివి! నిన్నె వ్వరైనఁ దూలనాడిరా!

సురు : కుమారా! చెప్పుము.

ఉత్త : (కొసరికొసరి) అమ్మా! మరే! నాబం తే (ఊరకుండును)

సురు : ఆ! నీబంతి యేమైనది.

ఉత్త : నేనును జయుఁడు నాడుకొనుచుండ ధ్రువుఁడువచ్చి తీసుకొనిపారిపోయినాఁడు. (అనియేడ్చును)

సురు : (బుజ్జిగించి) ఏమీ! వానిపొగరు. వానికిని వానితల్లికిని సకలైశ్వర్యములు జరుగుటలేదు గాని లేకున్నవానికిఁ బట్టపగ్గములుండునా? (భర్తతో) నాథా! వింటివా! మీరిచ్చినదే యీచనవు. (కుమారునితో) నాయనా! వానికిఁ దగిన శాస్తిఁజేసి నీబంతినిప్పించెదను లెమ్ము యేడువకుము.

ఉత్తా : కాంతా! యేలోపమున్నను నానెత్తిపైకి దొర్లింతు వేల? నేనీతనిబంతిని హరింపుమంటినా!

సురు : నోటననవలయునా? నాకొడుకు, నాబంగారమని ముద్దులాడుటలేదా?

ఉత్తా : కన్నదోషమున నెత్తికొంటిని.

సురు : అట్లనా? వానినేయెత్తుకొనరాదా? మధ్య వీఁడేటికి (అని కోపముతో) నాయనా! నాతొడపైఁగూర్చుండుగాని రమ్ము. (అనికొడుకు నెత్తుకొనబోవ వారించి)

ఉత్తా : పోనీ! యిఁక నదియును మానివేసెదను లెమ్ము.

సురు : నిజముగా మానివేసెదరా?

ఉత్తా : నిజముగా మానివేసెదను. నీవు గమనింపవలసినదానిలో నిదియును గమనింపుము.

(ధ్రువుఁడు బంతినాడుచు ప్రవేశించును.)

ఉత్తా : (స్వగతము) ఆహా! కుమారుఁడు రానేవచ్చినాఁడు. కన్నతండ్రినగుట స్వతంత్రమున నాపైకిఁ బ్రాకఁజూచును. కఠినాత్ముఁడనై యెట్లుచేతులారఁ ద్రోసివేయఁగలను. సవతిపైఁగల యీర్ష్యచేత నీపాపరూపిణి నోరెరుంగని బాలుని ముట్టరాదని శాసించుచున్నది.

తే.గీ. అర్కకాంతము చేరువనల్లలాడు
నినుపముక్కను బోలి నెమ్మనము కన్న
కొడుకు నారసి ముద్దిడుకొనఁగ నౌర!
పరుఁగులిడుచున్న దెటు చిక్కఁబట్టువాఁడ

ఉత్త : అమ్మా! అదుగో! వచ్చుచున్నాఁడు ధ్రువుఁడు.

సురు : కుమారా! రానిమ్ము. నీవూరకుండుము.

(ధ్రువుఁడు తిరిగిచూచి)

ధ్రువ : (తనలో) ఓహో! జనకుఁడును బిన్నమ్మయు నిందున్నారు. ఉత్తముఁడు తండ్రి గారితొడపైఁ గూర్చున్నాఁడు. నేనును నాయనగారి తొడపైఁ నాశీనుఁడనై కొంతవిశ్రమించెదను. (ముందుకు నడచి నిలిచి) ఉత్తముఁడు నిన్న నాతోనాడి బంతినోడె. తల్లితో నేమేమికూర్చి చెప్పియుండెనో (తలయూచి) చెప్పినఁ జెప్పనిమ్ము! నాయనగారు లేరా. నేనన్యాయముజేయలేదు. (అని పరుగిడుచుఁ బోయి తండ్రిపైకిఁ బ్రాకుచుండ సురుచి తొలఁగలాగి)

సురు : (కోపముతో) ఒరీ! ఎవఁడురా నీవు! మహారాజుపై కెగఁబ్రాకెదవు. యేదోముల్లె దాచియుంచినట్లు పరుగెత్తివచ్చితివి.

ధ్రువ : (విభ్రాంతిపడిచూచి) అమ్మా! నాయనగారి తొడపైఁ గూర్చుందమనివచ్చితిని.

సురు : ఛీ! నోరుమూయుము. నీకు నాయనగా రెవరు?

ధ్రువ : తల్లీ! యేమట్లు తూలనాడెదవు?

సురు : తల్లీగిల్లీయనకుము చెంపలు వాయించెదను. నీతల్లి యిక్కడలేదు. రాజ గృహమున నేమూలనో దాస్యము చేయుచున్నది. దానియొద్దకుఁబోయి సంబోధింపుము. పాపము! కుఱ్ఱవాఁడు యెంతశ్రమపడివచ్చినాఁడు!

మహారాజు నూరుభాగము నెక్కుటకు నీకేమి బాధ్యతకలదనుకొంటివి. భూనేత యుపపత్నులలో నామావశిష్టయగు సునీతిగర్భమున నుదయించి నంత మాత్రమునఁ దనయంకసీమమున కర్హుఁడ ననుకొంటివిగా! పుల్లెలునాకుకుక్క పురోడాశమునకుఁదగునా? నీకును నీతల్లి సునీతికిని కడుపు కింత కూడు బెట్టుచుంటిమని సంతోషింపుము, యిటువంటి పిచ్చి యాశలు బెట్టుకొని పరుగులెత్తి తల్లితో నిలువెడలఁ గొట్టించికొనకుము.

చం. మనమునఁ గీడెఱుంగని యమాయకురాలనుగాన నీవు నీ
జననియు నింటిలో నిలువఁజాలితి రిన్నిదినాలు వీరుజే
సిన చిలుఁగేమిలెమ్మనుచుఁ జిత్తమునందు దయారసంబు బూ
నినకతన భళీ! మదిజనించెడి దొడ్డగుణాలు డింభకా!

తే.గీ. తండ్రియంకాన నుండుచిత్తంబుగలగఁ
దొలుత నాగర్భమున బుట్ట కలసునీతి
గర్భమునఁ బుట్టనేల బింకాన నింక
సంచరింపఁగ నేలరా! సవతికొడుక!

న్యాయ మాలోచించిన భువనలక్ష్మిం బెండ్లియాడి యేలఁ గల సమర్థుండును, సర్వలక్షణలక్షితుండును, విక్రమోద్దాముండు నగు మాయుత్తమునిఁగొలిచి జీవింప వలసిన నీవు తన సమక్షమునఁ దండ్రియూరువు నెక్కఁదలంచిన నీమౌఢ్యమునకుఁ దగినశాస్తి కావలసియున్నది. వయసున బిన్నవని యిప్పటికి క్షమించితిని. ఇక మెల్లన దారిబట్టుము. నీకుఁబుట్టిన యీ దురాశలంబోలి నీతల్లికి నేమైన నుద్భవింపనున్న వేమో పోయి బుద్ధిగా మెలంగవలయునని చెప్పి గౌరవమును నిలుపుకొనుము. కాకున్న ప్రమాదము సంభవించునని చెప్పుము. రేపు మా యుత్తముఁడు రాజ్యాభిషిక్తుఁడగువఱకే నీయాటలును నీతల్లి నీటులును.

ఉత్త : అమ్మా! నిన్న నాబంతిని తీసుకొని పారిపోయినాఁడే.

సురు : ఔనా! నీకును బంతులాటలా? ఓహో! యేమి భోగము. యేదీ యాబంతి నిటులిమ్ము. (అని లాగికొని యుత్తమున కిచ్చును.)

ధ్రువు : (దుఃఖముతో తండ్రివంకఁ జూచును)

ఉత్తా : (స్వగతము) ఆహా! దుర్భరము. దుర్భరము.

తే.గీ. హృదయకమలాంతరమున జనించునాదు
కనికరపుఁదేనియలు ద్రావఁగాఁదొడంగెఁ
గుపితజాయావిఘూర్ణితాక్షుల జనించి

సురు : రాజుగారివంకఁ జూచుచున్నావే! యింకను నిన్ను హర్షించుననియేనా (ఉత్తాన పాదునితో) ఓహో! పుత్రునిపై వ్యామోహమింకను తొలఁగిపోనట్లున్నది. కుమారునిఁ దూలనాడితినని కోపవీక్షణములను జిమ్ముచున్నారు.

ఉత్తా : (తనలో) నాకర్మ మిట్లు మండిపోవుచున్నది. వినరాని మాటలు నోరెరుంగని బాలు ననుటఁ జాలించి నన్ను సాధించుచున్నది. వికటభ్రుకుటీ దుర్నిరీక్షణ మాత్రవికలీభూత సకలాంగక సమదాటోపవిరోధిజాతుండనగు నన్నీ కాంతా వ్యక్తి నిరర్థకునిఁ గావించి బద్ధునిఁజేసివైచినది. యీలోపము నాయందుననే కాదు. పురుషజన్మమెత్తిన ప్రతివానికి నీ రోగమే.

తే.గీ. వేదనాయకుండయిన గోవిందమూర్తి
నెలఁతచేతన కాల దన్నించికొనియె,
నాకు నాశాస్తి కలుగకున్నందుచేత
సంతసించెద నుత్తమజనుఁడ ననుచు
(ప్రకాశముగా) ప్రేయసీ! నన్నింకను సాధింతువేల?

సురు : కొడుకుననుచుండఁ గోపమువచ్చినదేమో యని సందేహించితిని. మన మిక పోవుదమురండు (ధ్రువునితో) ఓరీ ధ్రువా! ఇవన్నియును డొక్కలో దాచికొనుము.

ఉత్తా : (స్వగతము) ఆహా! యీపసిబిడ్డకు దుఃఖమును దెచ్చిపెట్టిన ఘోరపాపిని నేను. ప్రాపంచకసౌఖ్యమునకై పురుషులు బహుకాంతాసంగమంబును గోరి బిడ్డల భావిదుర్దశలనుచింతింపరు (చేతులు జోడించి)

మ. నను మున్నెన్నిభవంబులన్నిలుప నున్నావో ధరాదేవిపై
మనమారన్భరియింతు నేమిలిఖియింపంబూనిన న్నాశిరం
బునఁ బ్రార్థించెద నిన్ను నిద్దరిని పూవుంబోఁడలన్గల్గజీ
వనమున్ వ్రాయకు వ్రాయఁబోకుము తలంపంబోకు, భాషాపతీ!

(నిష్క్రమింతురు)

ధ్రువు : హా! పరమేశ్వరా! నీవెక్కడనున్నావు. ఈధ్రువుని విషాద నాటకమును జూచుచుంటివా? లేదా? సకల మానవవృత్తములకు సాక్షీభూతుండవగు నీవేలచూడ కుందువు. దౌర్భాగ్యుండగు నీధ్రువునిం బుట్టింపనేల? యిల్లుదాటి పోవఁజాలని పసితనమున నింతకష్టదశను గల్పింపనేల? పసిబాలురకుఁ గష్టములను గల్పించి వినోదించుటకుగాను ధ్రువునకు బ్రధాననాయక పాత్రను ధరింపఁజేసితివా? నన్నాదరించువారెవ్వరు?

ఉ. సారెకు బాల్యచాపలవశంవదులై పరువెత్తుబిడ్డలన్
గోరికనెత్తి చంకనిడికొందురు తండ్రులు తండ్రిచెంతకున్
బేరెమువారి యెత్తుకొనవేయని చేతులుసాచ నక్కటా
మారుమొగంబువెట్టియవమానమొనర్చెదుతండ్రులుందురే

యీతఁడు నాకుఁ దండ్రియా! తండ్రీ యని పిలిచిన నానాలుక చీలుకలుగా కున్నది. యెట్టయెదుట ననరానిమాట లాడించిన వీనిమొగమును చూడరాదు. ఆహా! ఆ సురుచి వాక్యములు తలంచుకొన్న నాగుండెలు బ్రద్దలగుచున్నవి. తనకుమారుఁడు రాజ్యాభిషిక్తుఁడైన నేనును నాతల్లియును దాస్యము జేయవలయునట. దుర్భరము. ఉత్తమక్షత్రియకులమునఁబుట్టి వీరమాతయగు సునీతీదేవీగర్భశుక్తిముక్తాఫలంబనై విలసిల్లు నేను నా సహజన్మడు రాజ్యాభిషిక్తుఁడై రాజ్యమేలుచుండ పౌరుషమునుజంపు కొని సేవజేతునా? (తల్లినుద్దేశించి) జననీ! జనకునిచే ననాదరింపఁబడిన ధ్రువుని నీకడుపునఁగని యెంతచింతకుఁ బాలగుచుంటివి. నిన్నోదార్పగల మహానుభావులెవ్వరు? ములుకులవంటి సురుచివాక్యములకుఁ గ్రుంగియున్న నా హృదయము నీదుఃఖమును జూచియోర్వగలదా? యెట్టిదుర్దినము. కలలోనైన నొరులుదూషింపని పరమసాధ్వివగు నిన్నాక్రూరురాలు నిష్కారణముగా నిందించుచుండ వినుచు సహించిన నేనెంతపౌరుష హీనుండను. విభుఁడు నన్నునాదరించినను బుత్రునైన నాదరించుచుండెనని నేటివరకుఁ గొంత మనశ్శాంతిని గల్పించుకొని నాశుభోదయమునకుఁ బ్రాకులాడునీవు యీ నాపరాభవంబును వినియెట్లు శాంతింతువు. కటకటా! సర్వస్వతంత్రుఁడగు జనకుని యంకమునకుఁ బాధ్యుఁడనుగాక మారుదల్లిచేత నిందా వాక్యనారాచనిర్భిన్న మనస్కుడనై, పరాభవదందహ్యమానసకలాంగకుండనై, యింకను యీగృహమున నిలువసాహసించు టెంత వ్రీడాకరము. (తండ్రినుద్దేశించి) ఓరీ; జనకుఁడా విష ప్రాయమైన నీగర్భము గొడ్డువోవక నాజన్మవ్యాజమున ఫలించు టాశ్చర్యముగానున్నది. కన్నకొడుకును బెంచికొన నెఱుంగక యగచాట్లపాలుజేయు నీవంటి పాషాణ హృదయు నకుఁ బుట్టక యరణ్యములలో వన్యమృగముల కుదయించిన నేఁడు నాకీవిషాదము ప్రాప్తించి యుండదుగదా? (కొంతతాళి) నేనిప్పుడే జనని కీసమాచారమును వివరించి గత్యంతరమును యోజించెదను. (నిష్క్రమించును)

సీను, అంతఃపురము

(సునీతి ప్రవేశించును)

సునీ : నాసౌఖ్య మంబరకుసుమ మయినను సునీతి యుత్తానపాదుని పట్టమహిషి యను బిరుదంబుమట్టుకు లభించినది. నాసపత్నియగు సురుచితో నిరంతర ముండియు నాతో, బ్రియముగా మాటాడిననెంతయు నానందించి యుందును.

నూరిపోయుచున్నదోగాని నన్నుఁ బురుఁగువలెఁ జూచుచుండును. నాశయనాగారమున నేదియో మరచి చుక్కదెగిపడ్డట్లు నిన్న నటకువచ్చుచుండఁజూచి నాలోనేనెంతయో పొంగిపోయితిని. వచ్చినదేతడవుగా మగిడిపోయె. దానికై మహారాజును గద్దించుచున్నదని ప్రధానదూతిక నేటియుదయమున నాతోఁ జెప్పినది. ఆడుపుట్టువునఁబుట్టిన సురుచికింతమూర్ఖమేల? తేనిపైఁదనకున్న స్వాతంత్ర్యము నాకు నున్నదిగదా కాకున్నను నాపై నిట్లు కత్తులు నూరుటకుఁ దన కేయపరాధ మొనరించితిని.

సీ. అంతిపురమున సర్వాధికారంబు తానే సేయుచున్న సహించుకొంటి
నాచెంత కేతేరెనా చూచి యెదురేగి యడుగుల మడువుల నిడుచునుంటి
తాను దుకూలము ల్ధరియించి నా కెట్టి బట్టల నంపిన గట్టికొంటి
నను దూతికలచెంత నవ్వులాడుచునున్నఁ గోపంబు లోలోనఁ గ్రుక్కికొంటి

తే.గీ. నేది తానాచరించిన నెంచకుంటి
నేటి కింకను దన్ను మన్నించుచుంటి
సర్వమునఁ దన్నుఁ బూజించు సవతిమీదఁ
గచ్చ సాధింపనేల? య మ్మచ్చకంటి

నాపైఁగల యనిష్టభావమున నాథుఁడు కుమారునిఁ గూడ ననాదరించుచునట్లు తెలియుచున్నది. నాగతియెట్లయినను పుత్రున కేకష్టమును రాకున్నఁజాలునని వేయి దేవుండ్లకు మ్రొక్కుకొనుచున్నదాన. (సురుచినుద్దేశించి) అమ్మా! సురుచీ! విభునివశపరచుకొని నన్ననాథను జేసినను కుమారునితో నన్నడవులకుఁ దరుమకున్నందునఁ గొంతయానందించుచున్నదాన. (ఉలికిపడి ఆలించి) మాధ్రువుండేలకో యేడ్చుచున్నట్లున్నది.

(ధ్రువుఁడు దుఃఖముతో ప్రవేశించును)

(పరుగిడిపోయి యెత్తుకొని) నాయనా! ధ్రువా! యేల యేడ్చెదవు! నిన్నెవరైనఁ గొట్టిరా? తండ్రీచెప్పుము. త్వరగా చెప్పుము. నాభాగ్యమునీవు! నాసౌఖ్యమునీవు! నీవుకన్నీరు గార్చినచో నేను చచ్చిపోయెదను.

ధ్రువు : (వెక్కి వెక్కియేడ్చును)

సునీ : కొడుకా! ఏమిరాప్రమాదము, నీవుయేడ్చుచు నన్ను నిలువుననీరు జేయకుము. సంగతి వివరింపుము.

ధ్రువ : (యేడ్చుచు) తల్లీ! ఈవార్త నీ కెట్లువినిపింతును.

సునీ : అంతఘోరవార్తయా! అంతిపురమున నెల్లరు సుఖులై యున్నవారా?

ధ్రువ : నా-య-న-గారి-తొ-డ-పై-గూ-ర్చుండ-బోగా-అమ్మ-

ధ్రువు : గెంటివేయుటయే గాక యనరాని మాటలాడి యేతన్నిందావాక్యమహా దండమున నన్నాపాదమస్తకము మర్దించినది.

సునీ : (కన్నీరువిడచి) నేను తలంచినంతయయినది. (సురుచి నుద్దేశించి తనలో) ఓసీ! సురుచీ! మాసౌఖ్యజలనిధి కౌర్వశిఖివై నీవెక్కడ దాపరించితివి. (కుమారునితో ప్రకాశముగా) నాయనా! యేమని నిందించెను?

ధ్రువ : తల్లీ! యేమని వివరింతును. జనకుని యంకము నెక్క దగవనియు, నీవును నీతల్లియును మాకుదాస్యము జేయవలయుననియు, చీ! చీ! పొమ్ము నేనుండగా మరి యొకమారిటు వచ్చిన నీచెంపలువాయించెదననియు. అయ్యయ్యో! తల్లీ! తలంచిన నాశరీరము మండిపోవుచున్నది. యింతయేల యేమాటలాడిన మనమిల్లువిడిచి పారిపోయెదమో! అవన్నియుఁగూర్చినట్లు పలికినది.

సునీ : నాయనా! నీతండ్రిగా రేమనలేదా?

ధ్రువ : తల్లి! అతఁడు నాకుఁదండ్రిగాదు. విరోధి. వానిఁదలంచిన రౌరవప్రాప్తి యగును. పాపమాతఁడేమనఁగలఁడు? ప్రముచ్చువలె గూర్చుండి కుమారునెత్తి కొని మోయుచున్నాఁడు. ఆతఁడొకమారు నావంకఁజూచినంత మాత్రమున నెన్నియో చీవాట్లుపెట్టి తటాలున గొలుసు గట్టిన కుక్కవలె నీడ్చుకొని పోయినది. అమ్మా! నాకేదియో దారిజూపుము. నేనిక నొక్కగడియ యేని యీ యింట నుండఁ జాలను.

మ. జనకుం డిట్టు లనాదరించినను బ్రాంచన్నీలమేఘామలాం
గుని ప్రహ్లాదవరప్రదు న్దళీతరక్షోమండలు న్నాగత
ల్పుని సేవించినచో సమాదరణగల్గు న్నాకు నావంటివా
నిని దౌర్భాగ్యునిఁగన్న బండలయినన్ నీర్గావాకో! తల్లిరో!

సునీ : (యేడ్చుచు) ఓసీ! సురుచీ! పాపిష్ఠులారా! నీది బిడ్డలఁ గన్న కడుపుగాదా? నీకును గుమారుఁడుండలేదా ముక్కుపచ్చలారని నాబిడ్డను నిర్దయమనస్కవై త్రోసివేయుటకు నీకుఁజేతులెట్లాడెనే. అంతఃపురమున సమస్త వైభవములతోఁ దులఁదూగవలసిననన్ను మహారాజగ్ని సాక్షిగ వివాహమాడిన పట్టమహిషినగు నన్ను, నసూర్యంపశ్యనగుననన్ను, నుత్తమక్షత్రియ వంశాభి జాత్యనగు నన్నుఁ, గొడుకుతో గోడాడించు నిన్నీ పాపమంటి బాధింపకుండునా? ఇంతఘోర మెందేనికలదా? సత్కులపయః కూపారహిమధాముండును, శ్రీమదుత్తమ క్షత్రవంశ రాజసింహకిశోరుండును, రూపజితపుష్ప నారాచుండును, బాహువిక్రమ ప్రచండమార్తాండుఁడును, పూజ్యసుగుణ మహార్ణవ గంభీరభావుండునగు నా కుమారుండు నీకుమారునిం బోలి తండ్రి యంకమున

నెక్కఁజాలఁడా? ఆహా యేమి కాలవైపరీత్యము, నా కుమారు నంటి నెట్టిన నీహస్తము భిన్నభిన్నములు గాక పోయెనే; పుత్రునితో శోకాగ్నిం బడి పొగులు నావలె నీవు నగ్నిలోఁబడి భస్మీపటలమయ్యెదవుగాక. పుడమిం బడు నాకన్నీటిధారలు మహాసముద్రములై పరిణమించి నిన్ను నీకుమారునితో సహ ముంచివేయకుండునా? దిక్కులేక యరణ్యములకుఁ బారిపోవు నాపుత్రునివలె నీపుత్రుఁడును వనభూములలో విరోధులచేఁ బొలియకుండునా.

శా. నానాథుండిటులెంత నీకువశుడైన న్నాకుమారుండునా
తోనున్నాఁడని మోముసూచికొని సంతోషించుచుంటి న్నిశా
టీ! నీకంతనె రెండునేత్రములు మండె న్నేటికాతండు న
ధ్వానంపున్వని కొక్కపక్షిగతిఁబోవంజొచ్చె శాంతింపవే!

ఓ యుత్తానపాదచక్రవర్తీ! బిడ్డలఁబెంచికొన నెఱుంగని నీవు కన నెట్లెఱింగితివి? నాసవతిచేత నాకొడుకునకింత యవమానదుఃఖమును గల్పించితివి. నీముద్దుల భార్య యొరుల దూషించుచుండఁజూచి యానందింప నీకంత యిచ్ఛగలదేని నన్ననిపింప రాదా? నాబిడ్డను నీయంకమునఁ జేర్చికొనకున్నను సమీపముననుండ నిచ్చిన నిన్నెవ్వరు కొట్టెదరు. నేను నీకంతభారమైనను పంచవర్షములు పూర్ణముగా నిండని ధ్రువుండును భారమయ్యెనా

సీ. అరయలే దింక శ్రీకరమైన సుతుని యుద్వాహ వైభవము నేత్రములతోఁడ
కన్నేరమున కింకను దృష్టిదీరగా జవిచూప వుజ్జ్వలైశ్వర్యభుక్తి
విని సంతసింప వింకను వీను లలరంగ గారాబుకొడుకు చిన్నారినుడులు
వికసింపలే దింక ప్రియపుత్రు నాశాలతాపోతములు దోహదములచేత

తే.గీ. కన్నసూనుని జీవిత గ్రంథమందు
మొదటియధ్యాయమేనియు ముగియలేదు
గర్భమో! సముద్రమొ నీది కరుణమాలి
తరుముచున్నావు ఘోరకాంతారములకు?

ఒక్కపసిపాపను భరింపలేని నీవు విశ్వంభరాభారమును భుజస్కంధమునఁ దాల్చి యెట్లు భరింపఁగలవు. పడవలసిన కడగండ్లన్నియు నేనుబడుచుంటినిగదా? నీమనం బెన్నంటికేని గఱుంగదేయను మొండియాసను బెట్టుకొని కన్నులలో నూపిరినిల్పి జీవము నిల్చికొనివచ్చుచుండ నీదౌర్మార్గ విశారదత్వమును గడకు కుమారునిపైకిఁ బొరలించితివి. నా కష్టము లెన్నటికి గట్టెక్కును. (కుమారునితో ప్రకాశముగా) నాయనా! మనకింక శరణ మిచ్చువారు లేరు, మునిజనమానస పంకేజ విహరణ చంచరీకుండును, ఆర్తజనశర

మ. తనపుత్రుండు విహంగనాథుcడమృతార్థంబేగుచోవేడ్కని
చ్చిన శ్రీమన్వినతాసతీఘనతరాశీర్వాదముల్గల్గు నీ
కును దాస్యంబునువాసె నాయమకులాంకురంబవీవా విమో
చనభాగ్యంబును నాకుcగూర్చెదవు శాశ్వత్కీర్తిమైపుత్రకా!

లోకబాంధవుcడు తనచండకిరణంబులు నీశిరంబునకు రేయెండలను జేయును గాక. అరణ్యమృగములు నిన్నాదరించును గాక. శకుంతములు తమపక్షపుటంబులను నీకు ఛత్రములcc గావించునుగాక. వేయేల యనాథజనుల కాధారప్రాయమగు శ్రీమన్మహావిష్ణుని దక్షిణహస్తచ్ఛాయ నీశిరంబున ననారతము నడయాడుచుండును గాక. పొమ్ము. నాకొకముద్దుబెట్టుము.

(ముద్దుబెట్టుకొని దుఃఖించును)

ధ్రువు : అమ్మా! నీవు శోకహతవయిన నాప్రయత్నమున కంతరాయము కల్గును. యిది దుఃఖమునకు వేళగాదు. నేను మరల వచ్చువర కోపికపట్టుము. కష్టములు కాపురముండవు. నీమానసమున నీశ్వరధ్యానమును మరువకుము. నీపుత్రుని చిన్నియుపదేశ మాలింపుము.

శా. ఇంక న్నాపినతిల్లి నేరములు ముం దేమేనిcగల్పించి ని
శ్శంక న్నీ కెటువంటి దుర్గతిని సంస్థాపించునో యప్పుడే
వంక న్నీకు శరణ్యముండమిననున్ భావించి శోకైకధూ
మాంకజ్వాలలcగ్రాగి మజ్జనకు నోయమ్మా వినిందింపకే!

నేను పోయివచ్చెదను. (అని తిరిగిచూచుచు నిష్క్రమించును)

సునీ : (కన్నీరు దుడిచికొనుచు) హా! కొడుకా! నీయెడబాటుచే ద్రవీభూతమగుచున్న నామానసంబెన్నటికి ఘనీభవించును. వ్యామోహమా! నీవు కొంతకాలము నావంకకు రాకుము

సీ. ఓసూర్యభగవానుcడా సేమమున నిల్లుసేరుపుమయ్య నాచిన్నిసుతుని
గిరిరాజులార గహ్వరగర్భములలోన నెట్టుదాచెదరొ నాచిట్టివాని
మునులార! యీబాల మునికి మీరే సుమ్ము దుర్గమాటవులలో తోడునీడ
కడుపార బిడ్డలcగన్న చెంచుతలార! సదయతc జూడకుండెదరె తనయు

తే.గీ. నమ్మలక్ష్మి! భవన్నాథు నమలచరణ
కమలసేవనమునకు డెందము మరల్చి
వచ్చుచున్నాఁడు నాకన్నవాఁడు వీనిఁ
దుదకు నాకెప్పుఁ దప్పగించెదవొ తల్లి!

(అవనికపడును)

# ధ్రువవిజయము

## ద్వితీయాంకము

సీను–అరణ్యము

(హరినామస్తుతిఁజేయుచు నారదుఁడు ప్రవేశించును)

నార : మాయాపూరితమైన భువనమండల మజ్ఞానియగుమానవునకు బ్రహ్మానంద కరమై నరకకూపమున కీడ్చికొని పోవుచుండును. జ్ఞానియగు వాని కిదంతయు ను జుగుప్సాకరమైతోచు. సృష్టిస్థితిలయముల కాధారభూతుండగు పర బ్రహ్మంబు క్షణభంగురంబులయిన ప్రాపంచకసుఖంబుల నాశించి సంసార మహాపంకనిమగ్నులగుచుండు మనుష్యసంతానమును జూచి చింతించుచుఁ దరింప నుద్యుక్తుఁడగువానికై యానందించుచుండు. ఈశ్వరతత్వమును గ్రహించి భగవత్పూజావిలీనుండగు సుగుణి విధి నిర్ణీతంబగు యాయుష్కా లమును గడచి తుచ్ఛశరీరంబును విడచి యాత్మను బ్రహ్మాధీన మొనర్చుటకై వసుంధరయందు సంచరించవలసియుండును. అట్టి తన జీవయాత్రా సమయముననే తన్మాయాసంతమసంబు వాతావరణముంబోలి నలుదెసలఁ గ్రమ్మికొనుచుండును. అయ్యది హరినామస్మరణంబను భానుప్రభాప్రతానమున విదళీభూతమైపోవును. దైవచింతనామృతమును చవిఁగొనినవాఁడు భగవద్దర్శ నంబు నభిలషించును. తను నన్వేషించువానికి నీశ్వరుండును గులవయో భేదంబును పాటింపక, సాక్షాత్కరించును. యీయుదయమున నాదివ్యదృగ్ద ర్పణంబున దైవాన్వేషణకుతూహలచేతస్కుఁడైన బాలుఁడొకఁడు పొడసూపి నన్నానందింపఁజేసె. అతనికి మంత్రోపదేశమొనరించి దారి చూపుమని శ్రీమన్మహావిష్ణువు నాకాజ్ఞనిడియె. ఈతని కతంబునఁ దపోగర్వితమతులగు మునిజనులకు శృంగ భంగమును భగవత్సృష్టివైచిత్ర్యపాటవంబునకు శాశ్వ తకీర్తియును దప్పకజేకూరును. ఆహా! దైవలీలావిలాసములయం దానందించు భక్తుని భాగ్య మవర్ణ్యముగదా! ఫలపత్రాంబుభక్షణంబున శరరీమును నిలిపి నిర్జరారణ్యముల వసించుమమ్ముబోంట్లకు దైవచింతనమే

నేనీవనము ప్రవేశించి యా బాలునిఁ గనుగొనియెద. (నిష్క్రమించును)

(దీనాననుడై ధ్రువుఁడు ప్రవేశించును)

ధ్రువు : పితృమరణానంతరమున బిడ్డ లనాథులై కడగండ్లఁ బడుదురనెడు ప్రపంచ ధర్మ మీధ్రువుని యందు విపరీత స్థితిందాల్చియున్నది. లోకమున నన్నుఁ బోలుదౌర్భాగ్యుఁడెందయినగలఁడా? (దుఃఖమునభినయించి) కటకటా! ఆనాఁడు మాయమ్మను విడచివచ్చుతరి నతిదీనములగుతన చూపుటలుం గులను నాపైఁబఱపి హృదయ మర్మములను భేదించినది. నేనిట్లరణ్యములఁ దపించుచున్నను వీట మాతల్లియైనను సుఖించుచున్న నామనస్సు కెంతవిశ్రాంతి కలిగియుండును.

తే.గీ. కాఱుమబ్బునఁ బుట్టునగ్గలఁపువర్ష
ధారలకుఁ గల్గుఁగాని యంతంబు కట్ట!
వెచ్చనై క్రాగి బయటికి వెడలివచ్చు
తల్లికన్నీటిధార కంతంబు లేదు

(తాళి) ఆహా, శోకహతయగుచున్న మాతల్లి నూరడించి ధైర్యము సెప్పిన నేను కర్తవ్యమును మరచి తుచ్ఛవ్యామోహ బిలంబునఁబడి గించుకొనుచున్నాను. ఆశామహా పాశమప్పుడే నాకరపదంబులకు బంధమును ముడివేయుచున్నది. పరమేశ్వరా! నోరెరుంగని బాలుండనగు నాకు నిన్నుపాసించు విధమును తెలియఁజేయువార్వెరు? నాహృదయాందోళనా ప్రవాహమిట్టుకొట్టుకొని వచ్చినదిగాని నేనేమియు నెఱుంగను. నీ వెట్లు నాకు ప్రసన్నుఁడవయ్యెదవు. నాకుఁ దత్వోపదేశమొనరించుట కిందు మున్యాశ్రమ మేనియు లేదే. జ్ఞానవేత్తలగు మునిజనులకు వాసయోగ్యంబవైన యో మహారణ్యమా! నన్నొకయాశ్రమమునకుఁ గొనిపొమ్ము. ఓకంటక కుదుంగములారా! నాకొకమార్గదర్శి పొడసూపువరకు బాధపెట్టకుఁడు. అబ్బా! సూర్యకిరణములచేత గ్రాగి వర్షపాతమున బ్రద్దలైన యీగులకరాళ్ళు కత్తులవలె నాపాదములను జీల్చి వేయుచున్నవి. ఈశ్వరాయ త్తచిత్తుండనగు నాకాకలిబాధ పూర్ణముగా నశించినదిగాని తుచ్ఛశరీర మరణ్యమార్గ ప్రయాణవ్యధలు సహింపకున్నది. ఈ ముండ్లపొద లెండవేడిమిచే నుదయించెడు జలకాంక్షమై నారక్త మాస్వాదించుటకు గాబోలు శరీరమును బ్రద్దలు జేయుచున్నవి. (ఆలించి) ఆహా! యీయీరముల చల్లని నీడలందు పెద్దపులులు హాయిగా నిద్రించుచు గుఱకలిడుచున్నవి. యేవిచారమును లేని యీమెకముల పావనజీవన సౌఖ్యము నాకు లేదుగదా? విశ్రాంతి లేక దివారాత్రములునుఁ జెవులు గింగురుమనునట్లు చకచక ఝింకృతులనొనర్చుచున్న యీ యీలపుర్వుల యాశయంబేమో? ఇది నిక్కముగా నచ్యుత

నాపాదించుచుఁబ్రోత్సాహము చేయుచున్నట్లున్నది. (ఆశ్చర్యమునభినయించి) ఔరా! యీ వనకోకిలా సముదాయములు ముదావహంబయిన పంచమస్వరమున నేక కాలమునఁ గూయుటకుఁ గారణమేమి? (ఆకర్ణించి)

తే.గీ. సారగాంధర్వగాయకేశ్వరుఁడెవండొ
మృదునఖంబులఁ దంత్రుల మీటి శృతులు
చక్కగాగూర్చి పంచమ స్వరమునందు
వీణెపైఁ బాడుచున్నాఁడు విపినవీధి

యీ కోకిలల కలకలారావమున కిదియే కారణము. యేమియీతని గాన మాధుర్యము. యిదిహరినామ సంకీర్తనము. దైవాన్వేషణ పరాయణుండనగుననుఁబోలు ననాథుఁడు కాదు గదా? యీయార్యపురుషుఁడు నాకు సహాయపడఁగలడు (నిష్క్రమించును)

(నారదుఁడు ప్రవేశించును)

సీ. పొక్కిలితమ్మిపూవున బమ్మ నాల్గుమోముల వింతతుమ్మెదపొలుపుఁ దెలుప
చైతన్య మందిన చక్కనిబంగారు సొమ్ముగా సిరికాంత రొమ్మునుండ
పాదాబ్జమకరందబహుళప్రవాహంబు గంగాలసన్నామకము వహింప
వదనభాగమునకు భానేందు లనయంబు నమలనేత్రాబ్జధన్యతను బూన

తే.గీ. పూవుఁబంతులచందాన భువన రాశి
నాటలాడించు నాదినారాయణుండు
నామనోగేహవీధి ననారతంబు
జ్ఞానడోలిక నూగుచున్నాఁడు గాదె

ఒక్క నాయందేకాదు. సమస్త భక్తజనమానస వీధులందును విహరించుచు నలరు చుండును. (పారఁజూచి) అదిగో నాగానమాలించుచు నీముద్దుబాలుఁడు నావైపునకే వచ్చుచున్నాఁడు. యీపసిబాలునిఁజూచిన నాకెంతయు జాలిగల్గుచున్నది. (ముక్కునవ్రేలు గీలించి) ఈప్రాయమున నీతని కీవైరాగ్యబీజమెట్లంకురించినది. పవిత్రచరిత్రుఁడగు నీతనికా ఇట్టికష్టదశ. యీపాలపాపఁడు గహనమార్గగమనప్రయాసను లక్ష్యపెట్టక సంచరించుట నాకాశ్చర్యముగా నున్నది. పాదములు కంది పొక్కులెత్తి నెత్తురులు గురియుచున్నను, మేనుచీల్చికొని పోవుచున్నను, నెత్తిమాడుచున్నను, వదన మెండిపోవుచున్న నలయకున్నాఁడు.

సీ. నవ్యపాదాబ్జ విన్యాసభారంబున ముద్దుఁగుల్కెడు చిట్టిఁబొజ్జ గదల
అపరంజివంటిదేహమునుండి ధరణికి ధారలై చెమటముత్యాలు రాల
అనిల వేగమున రేగినముంగురుందేంట్లు ముఖసరోజమునిండ ముసురుకొనఁగ
గాడ్పుదెబ్బల బిట్టుగంది నెత్తురులూరు చెలువులౌ పాలబుగ్గలు నటింప

తే.గీ. భయము నదలించి, భక్తితత్త్వమున మించి
శ్రమమును జయించి యనశన వ్రతము దాల్చి
కాననేందిర గన్నచక్కందనాల
యభినవంబైనమునిబాలుఁ డనఁజరించు

(ధ్రువుఁడు ప్రవేశించును)

ధ్రువు : మునిచంద్రా నమస్కారము. యీదీనునకు దారిచూపి పుణ్యముఁ గట్టుకొనుము. (నమస్కరించును)

నార : ఇష్టార్థసిద్ధిరస్తు, దీర్ఘాయురస్తు, అర్భకా! భయపడకుము నీకు దారిఁజూపుటకే నేనరుదెంచితిని. అజహరసుర ముఖ్యామరసేవిత పాదసరోజుండును, దీనజనాప్తబాంధవుండునగు శ్రీమత్పుండరీకాక్షుండు నీయందుఁ గరుణఁ బూని నన్నిటకంపియున్నాఁడు. యేతత్తపోవిధానంబు సర్వంబును నీ కుపదేశించెదను, నీమహోద్యమంబు బ్రహ్మాండ భాండంబులు నిలుచునంత వరకుఁ గొనియాడబడుచు, నీకమరత్వమును గలిఁగించుగాక. అసహాయయై సమస్తకష్టముల ననుభవించుచు సవతి పోరున వేగుచున్న నీతల్లి నీ పునర్దర్శనంబున పరమానంద భరితయై నీతో సుఖియించు గాక. నీకుఁదపః ఫల ప్రాప్తిలభియించువరకును, మురాంతకుని దక్షిణహస్తము తోపాటు వనదేవతాసముదాయము నీకుఁదోడునీడలై పోషించునుగాక.

మ. పటు సంసారమహాపయోధులు తరింపన్ లేక వైరాగ్య లం
పటులై చేతఁగమండలంబును శిరోభాగంబునందున్ జటా
పటలంబుల్ధరియించుకృత్రిమముని వ్రాతంబులున్ బోలవె
న్నటికిన్నీ కొనగోటియంచునకునెన్నన్ బాలమౌనీంద్రమా!

నీకిదె తత్వోపదేశముఁ జేయుచున్నాను. (చెవిలో నూదును) ప్రాతఃకాలమున నదీస్నానమాచరించి నియమిత మంత్రాక్షరంబులను జపించుచు సూర్యాభిముఖుండవై పద్మాసనంబుననుండి నేత్రములుమూసి దివ్యతత్త్వమున కిచ్ఛావశవర్తివై కార్యసిద్ధికలుగు [illegible]

శా. రేలన్వెన్నెలమంచు నీతలను వర్షింపండుచంద్రుం, డహః
పాలుం డాతపమంటనీయఁడు వనీబాలానిలాలోలవ
ల్లీలావణ్యవతు ల్వికస్వరసుమాళీదివ్యముక్తామణీ
పాళిన్ నింతురుగాత మెల్లప్పుడు నవ్యాజానురాగంబునన్

ధ్రువు : తాతా! నీమనుమని దొకమనవి నాలకింపుము. మీరు మార్గమధ్యంబున మా పురంబునకుఁబోవఁ దటస్థించెనేని

శా. పుత్రాయటన్న మార్మోయుదిక్కులతోఁడఁ బరితపించెడు మందభాగ్యురాలు
అంతఃపురాంగన యయ్యు ఛాయాదాసి గాక సాయములేని కష్టజీవి
పుత్రవతియుఁగాక పూర్ణంబుగా గొడ్డురాల్గాక తగునిరర్థకశరీర
నాయాసయేజీవనఁపుటూతగాఁబూని దినములు వెలిఁబుచ్చు దీనచరిత

తే.గీ. పంచప్రాణము ల్నావెంటఁ బంపివేసి
యచట బొందియే కల్గురూపావశిష్ట
కలదుమాయమ్మ యేరీతి బలికి యెట్టు
లామె నోదార్పగలవొ! జోహారు తాత!

(అని సాష్టాంగదండ ప్రణామము జేయును)

నార : (లేవఁదీసి) బిడ్డా! తలకకు మట్లేకావించెదను.

(అవనిక పడును)

(సీను–ఒక విశాల ప్రదేశము)

(విల్లుపట్టుకొని యుత్తముఁడు ప్రవేశించును)

ఉత్త : (వెదకుచు) జయా! జయా! నన్నుఁగికురింపఁజాలవు లెమ్ము. సమీపమున దాగిన నిన్నుఁబట్టుకొనఁజాలనా! రమ్ము! రమ్ము! ప్రస్థానమునకుఁ గాలము లేదు.

జయు : (ప్రవేశించి) ఉత్తమా! నన్నెట్లు చూచితివి? నీకన్న ముందువచ్చిగదా దాగికొంటిని.

ఉత్త : నీవెప్పుడు వచ్చిననేమి. నాకు వేయికన్నులుగలవు.

జయు : అట్లయిన నీ వింద్రుఁడవు గాబోలు

ఉత్త : అవును భోగమున

జయు : అట్లయిన నేనెవ్వఁడను?

ఉత్త : నాకింద్రభోగము జరుగుచున్న ప్రియమిత్రుండవగు నీకేమి కొదువ. (చేయి వైచితట్టి) నెచ్చెలీ! యెఱుఁగవా? మాయయ్య నన్నుఁ బట్టాభిషిక్తునిఁజేసెదనని మొన్న మాయమ్మతో వాగ్దత్తమిచ్చినాఁడు.

జయు : మిత్రమా! నిజమా!

ఉత్త : అవును.

జయు : (చంకలుతాటించి) సంతోషము, మిత్రమా! నీపట్టాభిషేకమహోత్సవదినమున నేను కడుపునిండ గారెలు తిందును.

ఉత్త : ఓయి వెఱ్ఱివాడా! యేమికోరికఁగోరుకొంటివి. నేననుభవించునవన్నియు నీవనుభవింపఁగలవు.

జయు : నెచ్చెలీ! తెలియకడుగుచున్నాను. పట్టాభిషేకమనగా నేమి? నే నెన్నడును చూడలేదు.

ఉత్త : ఆదినమునుండి రాజ్యమేలువాఁ డితఁడని నిరూపించి సర్వాధికారసూచకముగా శిరమునఁ గిరీటమును ధరింపఁజేతురు.

జయు : మిత్రమా ఆకిరీటము నే నెప్పుఁడైన పెట్టుకొని మాయత్తగారింటికిఁ బోయెద నీయవా?

ఉత్త : (నవ్వి) పిచ్చివాడా! దానినిధరించుటకు రాజ్యాధిపతియగు వానికిఁదక్క నొరుల కధికారమున్నదా?

జయు : ఎవరికినిఁ దెలియకుండ దిరుఁగదెచ్చి యిచ్చెదనులే

ఉత్త : అది నీకేమిప్రయోజనము. యొరులెఱుంగకుండ ధరించిన నెంత యానందమో! యూరకొన్ననంతేకదా? యీ విషయ మితరులు విన్న నీకు శిరచ్ఛేదన భాగ్యము కలుగును.

జయు : మిత్రమా! ఏమి శిరచ్ఛేదనమా! యేమిటికి?

ఉత్త : అవును! కిరీటధారణమును గోరుట, రాజ్యాపహరణమును గోరుటయే. అట్టివాఁడు మరణమునకుఁ బాత్రుఁడు.

జయు : నీవయిన నంతియేనా?

ఉత్త : నేను మాత్ర మొరులరాజ్య మపహరింపఁజూచినచో నంతియే కలుగును.

జయు : ఈరాజ్యము మట్టుకు నీయొక్కనిదే కాదుగదా?

ఉత్త : కాక మరెవనిది?

జయు : పట్టమహిషీతనూభవుండయిన ధ్రువుఁడు లేఁడా?

ఉత్త : ధ్రువుఁడెచ్చట నున్నాఁడు. అడవులకుఁ బారిపోయినాఁడు; పోకున్నను,

రాజచంద్రుఁడేకుమారునకీయఁ దలంచునో, అతఁడే యగ్రసుతుండును పట్ట మహిషీ నందనుండును.

జయు : ఉత్తమా! న్యాయమాలోచించిన రాజ్యమతనిదేకదా?

ఉత్త : (స్వ) ఓహో! యీతఁడు చల్లగానాకుఁ గ్రోధరసమును ద్రావించుచున్నాఁడు (ప్రకాశముగా) జయా! ధర్మాధర్మములు నిరూపించుటకు నీవెవ్వరు, నోరు మూయుము.

జయు : ఏమియుత్తమా! అట్లుతూలనాడెదవు! కోపమువచ్చి నట్లున్నదే?

ఉత్త : రాదామరి! నీసంభాషణ మట్లేయున్నది.

జయు : (స్వ) దుర్జనసాంగత్య ఫలమిది. ముద్దుఁబెట్టుకొనఁబోవ ముక్కుఁగరచినట్లీతఁడు నాహితవాక్యములకుఁ జెలరేగి నాకుఁ దప్పకకీడుజేయును (ప్రకాశముగా) పోనిమ్మీ ప్రయాణ మెక్కడకు.

ఉత్త : వేటకుఁ బోవలయునని నిన్ననే చెప్పలేదా?

జయు : మిత్రమా! నన్ను క్షమింపుము నాకురాదీరదు.

ఉత్త : జయా! కారణమేమి?

జయు : ఏమున్నది. నిష్కారణము.

ఉత్త : నిష్కారణముగా రానసుట ధర్మమా?

జయు : యేమియునులేదు. అడవులలో రాక్షసులుందురు. నీనోరుమంచిదికాదు. యేమేని సంభవించిన నీవు సమర్థుఁడవు నేనసమర్థుఁడను యిన్నిమాటలేల! నేను లేకున్న మాయిల్లు చిన్నబోవునని మాయమ్మనిన్నఁ బొరుగింటివారితో ననుచుండగా విన్నాను. అదిమొదలిల్లు దాటివచ్చుటలేదు.

ఉత్త : రానని ఖండితముగాఁ జెప్పరాదా? యీయసంబద్ధ ప్రలాపములేల?

జయు : అంతేననుకొనుము.

ఉత్త : సరే! నీవు రాకున్నమానె నేనేపోయెదను (నిష్క్రమించును)

జయు : (నేపథ్యమువంకఁదిరిగి) సచ్చరితుఁడగు ధ్రువుఁడే కాకియై యడవులఁ గుందుచుండ నితఁడు రాజ్యమేలునట. అదియును జూచెదను. అతనితల్లి గోడాడిన ట్లితనితల్లి గోడాడదా? (నిష్క్రమించును)

(సీను–కొల్వుకూటము)

(ఉత్తానపాదుడు ప్రవేశించును)

ఉత్తా : కన్నులు దెఱువని పుత్రు నరణ్యములకుఁ దరిమిన నేనెంత పాపాత్ముఁడను.

యెండఁగన్నెఱుఁగని కొడుకు దిక్కులేక యడవులంబడి వాపోవుచుండ నేవన్య మృగ మాకలిఁ దీర్చికొనెనో!

సీ. చిగురుటాకులవంటి చిన్ని చేతులతోడ నలరుబంతుల నాటలాడువేళ
గల్లుగల్లురని కాళ్ళ గజ్జెలల్లాడ మందిరమున గునగునఁ దిరుగువేళ
చెలువంబుఁగురియు వీనులఁ జిన్నిమద్దికాయలు వ్రేల ముచ్చటలాడువేళ
మల్లె మొగ్గలవంటి తెల్లనిపాలదంతములు దీపింపంగ నవ్వువేళ

తే.గీ. మనసుదీరంగఁ గౌఁగిఁటఁ జొనిపి శిరము
మూరుకొంటి నెన్నఁడొ! యట్టి ముదము నాకుఁ
గూర్చువా రెవ్వరున్నారు కొడుక సురుచి
హస్తమునఁ గీలుబొమ్మనై యాడుచుండ

చటుల మనస్కయగు సురుచి యానాఁడు నిన్నుమెడఁబెట్టి యావలకు గెంటు నపుడు నావంకఁ బఱపిన నీదీన వీక్షణము నాహృదయమున మాసిపోవునా! కామాంధ కారము నేత్రముల కెగదట్టి బహునారీ సంగమ కుతూహలడోలాయమానహృదయుండ నగు నాకు నీవంటి యుత్తమకుమార పరిష్వంగ సౌఖ్యమెక్కడిది. (కొంతతాళి) సురుచి లేనిగౌరవము నిల్పికొనుటకై నిందించినంతఁమాత్రమున నింతతెగింపనేల?

(తెరలో)

రాజా! నారదముని వచ్చి మీదర్శనార్థమై వాకిట నిల్చియున్నాఁడు.

ఉత్తా : శీఘ్రమే ప్రవేశపెట్టుము. (తనలో) యీమునిచంద్రునిచే పుత్రుని సేమమెఱుంగఁగలను.

(నారదుడు ప్రవేశించును)

ఉత్తా : (లేచి యెదుర్కొని) మునివరా! నమస్కారము.

నార : దీర్ఘాయురస్తు (తనలో) యీతని మొగము మనోవేదనమును సూచించు చున్నది. దీనికిఁ గారణము ధ్రువుని వియోగమో! సురుచీదేవిపాద ప్రహారమో! యేమెఱుంగనట్లభినయించి విషయమునుదననోట రాఁబట్టెదను. (ప్రకాశముగా) రాజా! విచారముగానున్నా రేల?

ఉత్తా : మునినాథా! సర్వరహస్యవేత్తలగు మీకుఁ దెలియని దేమున్నది. పుత్ర వియోగమున.

నార : (తలయూచి) (స్వ) సరే! యిది కుమార పశ్చాత్తాపము. (రాజుతో) పుత్ర వియోగ

మన్న నాకర్థము కాలేదు యేకుమారుఁడు.

ఉత్తా : ధ్రువుఁడు.

నార : ధ్రువుఁడు ఇంటలేఁడా! యెక్కడకుపోయె

ఉత్తా : అడవులకు

నార : రాజా! ఏమివిచిత్రము. వత్సరపంచకము పూర్ణముగ నిండనిబాలుఁ డడవులకుఁ బోయెనా? అవునుగాని నీకు భార్యలెందరు?

ఉత్తా : యతిచంద్రమా! నాకిద్దరు భార్యలు, నిద్దరు పుత్రులు. (విచారము నభినయించి) యింకను నిద్దరా!

నార : సరిసరి తెలిసినది. బహుభార్యా ప్రియునకుఁ గుమారుఁడై యుదయించుటయే పూర్వ జన్మపాపఫలము. పోనిమ్ము. ఆతనికంత తెగువయేల కలిగినది.?

ఉత్తా : ఏమియునులేదు! ఆతఁడు నాతొడపైఁగూర్చుండ రాగా సవతి తల్లి గెంటివేసినది.

నార : ఏమియును లేదందువేల గెంటుటయేనా! దూషించెనా?

ఉత్తా : అవును.

నార : ఇదంతయును నీ సమక్షముననే కదా!

ఉత్తా : (స్వగ) ఆహా! యీనారదుఁడు చల్లగా నాహృదయమును గోయుచున్నాఁడు (ప్రకాశముగా) మహాత్మా కఠినాత్ముఁడనగు నా యెదుటనే జరిగినది.

నార : చూచుచున్న నీవు జాయారత్నమును వారింపలేదా?

ఉత్తా : ఆరాకాసి వారించిన నూరకొనునా?

నార : మౌనముద్రనువహించితిరి కాఁబోలు నింకనేమి? భార్యా క్రీడలకు వినోదించుచున్న మీరే కారణభూతులు.

ఉత్తా : ఔను, కామప్రియుండనగు నేనే హేతుభూతుఁడను. మునీంద్రా! నాయనాథబాలుఁ డేమయ్యెనో దివ్య దృష్టి నారసిచెప్పి నాయుత్తలపాటు నడఁచివేయుఁడు.

నార : కన్నార నరసియేవచ్చితిని. ధ్రువుఁడు సుఖుఁడైయున్న వాఁడు. మీరుచింతింపకుఁడు. కొలదికాలమునవచ్చును. పరమేశ్వరుఁడాతనిని సర్వవిధముల నాదరించును.

ఉత్తా : మహాత్మా! నాకైనను దల్లికైన నేమేనిఁ జెప్పిపంపెనా?

నార : చెప్పకేమి.

ఉ. ప్రన్ననిగండ భాగములపై దిగజారెడు కంటినీటితో
నన్నములేక వీపునకు నంటి రహించెడు చిన్నిపొట్టతో
సన్ననికంఠనాదమున జాలిజనింపఁగ నన్నుఁజూచి ప
ల్కెన్ననుముత్తియంబులబలెన్మది గ్రుంగఁగనాల్గుమాటలన్

సీ. జీవించియేని చచ్చినవానివలె నున్న తనయు నెన్నఁటికేని దలంతువయ్య
నాదుఃఖవహ్ని యన్నంబుగా జీవించు తల్లినిఁ గరుణ నోదార్చుమయ్య
అడుగకుండఁగ నిల్లు వెడలి వచ్చితినంచు మనమున నెన్నండు గినియకయ్య
పరనింద ననుఁగూర్చి ప్రాకనీయక గుట్టు గాఁజెప్పి కాలంబుఁ గడపుమయ్య.

తే.గీ. నాదుపినతల్లి సురుచి కానాడుకోప
దహన ముదయించె నామె శాంతత వహింప
మ్రొక్కుచున్నాఁడ ననుమయ్య ధ్రువచరిత్ర
మిట్టులున్నది నిందింప నేరి నయ్య

ఉత్తా : (స్వ) ఆహా! ఏమి నాకుమారుని హృదయ సౌకుమార్యము (ప్ర) మునినాథా! యిప్పటికి మనమునఁ గొంత శాంతికలిగినది. కుమారుని క్షేమసమాచార మును జెప్పి నన్ను స్వస్థచిత్తు నొనరించిన మీకు నేఁ గృతజ్ఞుఁడను.

నార : రాజా! నాకు సెలవిమ్ము నేను తిరుగ బ్రహ్మలోకమునకుఁ బోవలయును.

ఉత్తా : చిత్తము! పోయిరండు. మరియొకపరి మీపాదస్పర్శనమున నీదీనుని గృహమును పావన మొనరింపుఁడు.

నార : (తనలో) కలహభోక్తనగు నాకు ధ్రువుఁడు కొంత యోగిరమును సమకూర్చె. యీతని తపోదహనమున నీభువనములు తలక్రిందులు గాకపోవు. దేవతలు కలవర పడకపోవరు. వారినిఁ గన్నారఁజూచి కొంతశాంతించెదను గాక.

(నారదోత్తానపాదులు నిష్క్రమింతురు)

ద్వితీయాంకము సమాప్తము.

# ధ్రువవిజయము

తృతీయాంకము

(సీను–అరణ్యము)

ఉత్తముని ప్రవేశము.

ఉత్త : మృగయావినోదినై దూరము గణింపక మహారణ్యమునకు వచ్చి చిక్కుకొంటిని. యేమార్గమున వచ్చితినో యెక్కడకు పోవలయునో తెలియదు. జయుఁడేమని శపించెనో గాని వనమున నొక్క మృగంబేనియుఁబొడ సూపదయ్యె నందుచే బ్రొద్దునరయక తిరిగితిరిగి వేసారితిని. ఆహా! నాశరీరము వడకుచున్నది. క్షుద్బాధయును బిపాసయు నన్ను దుర్బలునిఁ జేయుచున్నవి. యిందు నాకాహా రమెట్లు లభించును. నాతల్లిని నేను తిరుగఁ గలసికొందునా! అదిగో! సూర్యుఁ డు పడమటి కొండ నెత్తముల నలంకరించుచున్నాఁడు. నాకేదో ముప్పు వాటిల్లునట్లున్నది.

తే.గీ. కాఱుచిచ్చున నర్ధంబు గాలిపోయి
యెండినవిశాలబదరికా వృక్షశాఖ
నెక్కి ననుఁజూచి కన్నుల నెఱ్ఱజేసి
కూయుచున్న దల్లదె పెద్ద గుడ్లగూబ

వల్లభ నెడబాసిన చక్రవాకమదిగో నావలె నొంటియై నలుదెసలం బరువెత్తుచుఁ గువకువఁ గూయుచున్నది. ఓచక్రవాకమా! నిన్నుఁ బోలిన యసహాయుఁ డిదే నీకుఁదో దుత్తముఁడున్న వాఁడు నాకడకురమ్ము (తలయూచి) ఆపత్కాలమున నెవరికెవరు? దీనికి నాపలుకులు వినిపించుటలేదు. మా ధ్రువుం డీవనముల కేగదా వచ్చియుంట (విచారము నభినయించి) ఆహా! ధ్రువా! యిన్నాళ్ళీకీకారణ్యముల నెట్లు తలఁదాచికొంటివి నీకిట్టి కష్టములు గల్పించిన మాతల్లియొక్క మహాపాతకమే యీదినమున నన్నుఁ జుట్టుకొన్నది. నీవు నింటనున్నచో నేడు నాకీదుర్గతి రాదుగదా (బెదరిపడి) ఏదో! భయంకరారావము వినవచ్చుచున్నది. భూతమో! రాకాసియో నావైపునకువచ్చుచున్నది. నన్నుఁదప్పక భక్షించును.

(తెరలో)

మ. భయదాశీవిషసన్నిభంబులగు మద్బాణాళికింగొంకి ని
ర్భయుఁడైచండమయూఖముల్జొనుపనేరం డర్యముండున్మదా
లయ మీఘోరవనప్రదేశమని, విల్కాఁడా భళీ నీదు ప

ఓరీ! నరాధమా! వేటకాండ్రకు వేటకాఁడగు యక్షుని కంటబడి నీవెక్కడకుఁ బోగలవు (యక్షుఁడు ప్రవేశించును)

ఉత్త : (తనలో) నాకు మరణము నిశ్చయము. యీతఁడెవ్వఁడొ మహాశూరునివలె నున్నాఁడు. భండన భీముండును ప్రతాపవంతుఁడగు నుత్తానపాదున కుదయించిన నేను చేతులు తెగినవానివలె నీతని హస్తమున మరణింతునా! శక్తికొలఁదిపోరి నారాజపుత్ర నామమును సార్థకము జేసి కొందును.

(ప్రకాశముగా) ఓరీ! అకారణవైరీ! వనమధ్యమున నెంతయసహాయుఁడై చిక్కినను యీయౌత్తానపాది నీకు వెన్నిచ్చిపాఱువాఁడుకాఁడు. వనంబులును మృగంబులు నొకరి సొత్తులు కావు. మృగయులకై యరణ్యములు సర్వేశ్వరుఁడే సృజించె. ప్రతిరాజేంద్రునకు ఖేటఖేలనంబు మహానందకరంబు. నేను పార్థివపుత్రుండనుగాన యేతద్వ్యసనంబునం దగిలి చనుదెంచితిని. నీయుత్తరువు నాకేల? మొనగాఁడవున్నావని చాటింపించితివా? వనము గడించితివా? ధనాశాభూతపీడిత మనస్కుఁడగు కుబేరుని కింకరుఁడవగు నీకెవ్వఁడు వెఱచునను కొంటివి. దుర్గమకంటకతరుషండ మండితం బును, విశేషజంతు రాహిత్యంబును నిర్జనంబునగు నివ్వనంబు మృగయాయోగ్యం బుగామి నొరులు ప్రవేశింపరు. అది నీపరాక్రమంబని సంతసింపకుము రమ్ము. నీవేమి చేసెదవో చూచెదను.

శా. బాలుండొంటరిగాఁడు పోయిబెదరింప న్గంపితస్వాంతుఁడై
వాలుంగోలలుఁబారవైచి పురికిం బర్వెత్తునం చెంచితో
కూళా! కాండకళాపటిష్ఠబలవత్క్రూరారి రాట్కుంభికుం
భాళీభేద మోద మేదురితరంహత్సింహపోతంబురా
నిన్నిపుడే స్వర్గమునకుఁ బంపెదను చూడుము

యక్షు : ఓరీ! రాజపుత్రపశూ! నాయనుజ్ఞ లేక నావనంబులఁ బ్రవేశించియు బెట్టుగా వాగుచున్నాఁడవే. ఒక్క పోటునకు భిన్నభిన్నములయ్యెదు నీకింతకావరమా! రమ్ము పోరుదము వనమధ్యమున జిక్కి దారెఱుంగని నీవు నాశరారణ్యమున నెట్లు గడచిపోగలవో చూచెదను (అని బాణమువదలును)

ఉత్త : (కొంతవరకు పోరి నేలఁగూలును)

(స్వగతము) అకటా! నాకెట్టి దుర్దశప్రాప్తించినది. మహారాజనందనుండనై జన్మించి తుదకు దిక్కులేని ఒక్క యక్షుని శరసర్పమునకుఁ గబళాయమానుండనైతిని. (తల్లి నుద్దేశించి)

తే.గీ. ధ్రువుఁడు కానలకేగెఁ బుత్రుండు పట్ట
భద్రుండగునంచు సంతోషబాష్పములను
విడిచితివి నాఁడు తల్లి! యిప్పుడు తిలోద
కములు విడనుంటి వెట్టి దుష్కాలమొక్కొ!

ఈ శరాఘాతమున నారక్తమంతయునుగారి శోషవచ్చుచున్నది. నాల్క పిడుచ వారుచున్నది. శ్వాస మాడుటలేదు. ప్రపంచమంతయును దలక్రిందులగుచున్నది. హా-హా-హా-హా అని తన్నుకొని ప్రాణములు విడచును.)

యక్షు : (సమీపించిచూచి) పాపమీతఁడు మరణించినట్లున్నది. బెదరించి పంపఁ దలంచితినిగాని యీతని పౌరుషవాక్యములకుఁ గలుషించి సంహరించితిని. యీతని మోముఁజూడ వయసునఁ గడుచిన్నవలెఁ దోచుచున్నది. యీతనికై జననీ జనకు లెదరు సూచుచున్నారు కాఁబోలు! కాలగతి నెవరు తప్పింపగలరు.

తే.గీ. నరునిజీవన మొకచిన్న మెరుపుతీవ
వంటి దయ్యది తనకు శాశ్వతమటంచుఁ
దలఁచి యుప్పొంగు మూఢచిత్తులను గాంచి
హృదయమున నవ్వుకొనుచుండు మృత్యుదేవి
(నిష్క్రమించును).

దేవలోకము.

సీను-ఇంద్రుని కోర్టు.

(ఇంద్రుఁడు బృహస్పతితో నాసీనుఁడై యుండును)

ఇంద్రు-

చం. అనలము గానుపింపదు సురాలయహాటకవీధులందు వె
చ్చనిపొగ లుద్భవించె దివిషన్నది పెల్లుడికెన్ సుపర్వభా
మినులు తుషారభూధరము మీదికిఁబేరెమువారి రొక్కవై
పునకు దిగంబడెన్ భువనముల్ గతమెయ్యదియోగురూత్తమా!

నందన మందారవనవాటికలు వాడబారుచున్నది. అస్వేదగాత్రములకు స్వేదజలం బంకురించుచున్నది. శతసహస్ర గ్రీష్మము లేకీభవించినట్లు భయంకరోష్ణము లతిశయించి నా వేయిగన్నులను మండించుచున్నవి. సురగజేంద్రమును మదీ యోచ్ఛైశ్రవంబును గాలు నిలువక నానాముఖములకుఁ బారుచున్నవి.

డు సవతితల్లిచే నవమానింపఁబడి దానికిఁ బ్రతీకారము చేయ మహారోష మునఁ దపముసేయు చున్నాఁడు. ఆబాలుని యుగ్రతపంబునఁ బ్రభవించిన యగ్నిజ్వాలలు చతుర్దశభువనంబుల నావరించినవి.

ఇంద్రు : మహాత్మా! మీవాక్యములు విపరీతములుగానున్నవి. బాలున కింత సామర్థ్యమా!

బృహ : అమరవల్లభా! నేనీవిషయము నారదునిచే నెఱింగితిని. తొలుత నాకు నీతని చరిత్రము విపరీతముగాఁ దోచెగాని కడకు విశ్వసించితిని. అతఁడు వయసునఁ జిన్నగాని శౌర్యధైర్యసాహసాద్యుత్తమగుణములయం దసమానుఁడు. నారాయణుండాతనికి శీఘ్రకాలమున సాక్షాత్కరింపవలెగాని కాకున్న నీభువనక్షోభ తొలంగదు. ముందింక నేయుపద్రవము రానున్నదో యని నాకును సందేహముగా నున్నది.

ఇంద్రు : అట్లయిన మనము హరిని దర్శించి యీవిప్లవంబును దొలఁగింపఁ బ్రార్థింప వలయును.

(తెరలో)

దేవేంద్రా! రక్షింపుము రక్షింపుము. యుష్ణతాపమునకు సహింపలేక సురలు దిగంతము లకుఁ బారుచున్నారు.

బృహ : దేవానీకములు హరిద్భాగములకుఁ బారుచున్నారని మాతలి కేకలిడుచున్నాఁడు

ఇంద్రు : మనమిక గత్యంతరము యోజింతమురమ్ము! (నిష్క్రమింతురు)

సీను–అంతఃపురము

(సురుచి మల్లికయనుదాసితో ప్రవేశించును)

సురుచి : ఓసీ! మల్లికా! వేటకై వనములకుఁబోయిన కొడుకు మరలిరాకుండుటచే నాదృష్టికి ప్రపంచమంతయును నిస్సారముగానున్నది. ఆనాఁడు కొడుకు నాకడ సెలవు పుచ్చుకొని గుమ్మముదాటగా నాశిరంబునఁ గుడ్యమత్స్యంబు పడియె. అప్పుడే కలవరపడితిని! నేటికి రెండు దినముల నుండి యసహాయుడై యెందుండఁగలఁడు! యెచ్చటఁగుడువఁగలఁడు? మల్లికా! కొడుకు తిరిగి నా కండ్లఁబడునా! నాకేమియును దోచుటలేదు. ప్రాణము లెట్లో బిగ్గఁబట్టి రాత్రి గడిపితిని. కన్నులు లొట్టలు వోవ నేఁడు మధ్యాహ్నమువరకు జూచి శుద్ధాంత పరిచారకునడవి కంపితిని. వాఁడింకను రాడయ్యె (పారజూచి) అదిగో ప్రొద్దు గ్రుంకుచున్నది. (భయమునభియించును)

మల్లి : అమ్మా! యేమట్లు తత్తరపడియెదరు.

సురు : మల్లికా! మిన్నువిరిగి నాపైఁ బడినట్లున్నదే! నాహృదయ మేలనో యకారణము గా జేయివెట్టి కలఁచినట్లున్నదే. శరీరమున ముచ్చెమటలు వోయుచున్నవి.

మల్లి : దేవీ! బెదరకుము. నీకుమారున కేభయములేదు. అడవుల నతఁడు సజీవుఁడై యున్నాఁడు. అందు మునులుందురు. ఒకవేళ దారిదప్పినను వారాతని నాదరింతురు.

సురు : మల్లికా! యమార్గములఁబడి రాత్రిరాకున్న నుదయమేలరాఁడు?

మల్లి : అమ్మా! వనవిచిత్రములను జూచుచు నిల్లుమరచి యుండును. ఉత్తముఁడింకను పసివాఁడుగదా?

సురు : అదేమోనే! మల్లికా! నీవెంత చెప్పినను నాయాత్మ విశ్రాంతిలేక మిక్కిలిగా యల్లాడుచున్నది. (నింగినారసి) అదిగో! యొంటిగా కుమారు నడవుల కేలపంపితివని నన్ను గోపించువానివలె నభోమణి యస్తంగతుఁడగుచుఁ గషాయకాంతులను గుప్పుచున్నాఁడు. మల్లికా! సేవకుఁడు వచ్చుచున్నాఁడేమో చూడుము.

మల్లి : (పోయిజూచి) అమ్మా! మీపరిచారకుఁడు పరుగెత్తుకొని వచ్చుచున్నాఁడు.

సురు : (బెదరిచూచుచు గాద్గద్యమున) మల్లికా! మల్లికా! యింకనెక్కడకుమారుడు. యీతని మొగమున నెత్తురు చుక్కలేదు. యేదో యశనిప్రాయమగు వార్తను దెచ్చుచున్నాఁడు.

(సేవకుఁడు ప్రవేశించును)

సురు : (యెదుర్కొని) ఓరీ! సేవకా! మాయుత్తమ కుమారుఁ డేడిరా!

సేవ : దేవీ! పోయినరాత్రి మీకుమారు నొకయక్షుఁడు సంహరించెనని యొకముని నాకుఁజెప్పె.

సురు : హా భగవంతుఁడా (అని నేలఁగూలును)

మల్లిక : (యుపచారముచేయ మూర్ఛదేరి)

సురు : హా! యుత్తమకుమారా! రూపజితజయంతా!

ఆ.వె. నన్ను మట్టిఁజేసి నాకిన్నినీరంబు,
విడుచువారు లేరు కొడుక నాదు,
బ్రదుకుతెల్లవారె వసుధ నెన్నిదినాలు,
మొండికట్టె నింక మోయవలెనొ!

మల్లి : తల్లీ! యూరడిల్లు మూరడిల్లుము.

సురు : కుమారా! అయ్యయ్యో! నేనేమియూహించి దినంబులుగడపెదను. ఆపాడువేట నీకేలప్రాప్తించినది. నా యనుఁగుపట్టీ! గంపంతబలంగము నీకుండియును దిక్కు లేనిచావుఁజచ్చితివా! ఆపాపిష్ఠియక్షునికంటనేలఁబడితివి? పసివాఁడవగు నిన్నుఁజంపుట కాదురాత్ముని చేతులెట్లాడినవి, నాకడుపునఁ జిచ్చురవుల్చుట కతనికే నేమిచేసితిని. (యక్షునుద్దేశించి) ఓరీ! యక్షుఁడా! నీభుజబలంబు నోరెరుంగనినాబిడ్డపైఁజూపి నీవుపొందిన బహుమానమేమి? పోరాడుటకు నీకింకశూరులు లేరా? నాకుమారునిముద్దుమోమునారసినప్పుడేని నీకుజాలి పుట్టదా? నీవెంతకఠినాత్ముఁడవు (కొంత విచారించి) నాసవతి కుమారుఁడగు ధ్రువుని సచ్చరిత్రు నానాఁడు కఠినాత్మనై గెంటివేసిన మహాపాతకమున కిది ప్రాయశ్చిత్తము. కలనైన నన్నుఁబల్లెత్తుమాట వచింపనిగరిత సునీతి నష్టకష్టముల పాలొనర్చుటగాక తనయందనుండి జీవించుయేకపుత్రునడవులకుఁదోలితిని. ఆయనాథుల కన్నీరమే నాకీగర్భవేదనము ప్రాప్తింపఁజేసినది. (సునీతి నుద్దేశించి) అమ్మా! సునీతీ! నాకొడుకును నేనును శాశ్వత బ్రహ్మకల్పముగా జీవింతుమని గర్వాంధనై నీకెన్నియో కడగండ్లుగల్పించితిని. తల్లీ! నన్ను క్షమింపుము, (తాళి) నాయనా! యుత్తమా! నాకింక నీరాజభోగమేల? నీతోనేనును మరణింతును.

మల్లి : అమ్మా! శాంతింపుము, శాంతింపుము.

ఉ. నాయన ముద్దుబెట్టుమనిన న్వదనంబున హాసచంద్రిక
ల్గాయ నరాళకేశపటలమ్ము భుజంబునఁ జిందులాడఁగా
నాయెడ కేగుదెంచు నలనాటికుమారుని రూపధేయమ
య్యో! యెటుజూచిన న్మెదలుచున్నది కన్నులలోన మల్లికా!

(లేచి) (ఆతురతతో బయలు కౌగలించుచు) అదుగో! నాకుమారుఁడుత్తముఁడు. నాయనా! యుత్తమా! యుత్తమా! యెప్పుడువచ్చితివి? దిగంబరుఁడవైతివేమి? నీశరీర మున గాయములేమి? శరక్షతము లనుచుంటివా, (ముందుకు నడచుచు) రమ్మను చున్నావా? తండ్రీ! కన్నీరుగార్తువేల? అయ్యో! అయ్యో! ఆరథమెక్కడకు? యీ ప్రయాణ మెక్కడకు? స్వర్గమునకా? నాయనా! పోకుము పోకుము; నేనుకూడ వచ్చుచున్నాను (అని పరుగెత్తును)

మల్లి : అక్కటా! యీయమ్మ పుత్రశోక మతిశయింప నున్మత్తయై పారిపోవుచున్నది. నేనేమిచేయఁగలను. యీమెకేమి ముప్పువాటిల్లునో కదా? నేనుపోయి మహారాజుగారి కీవార్తఁ దెలియఁజేసెదను (నిష్క్రమించును)

సీను – పాలసముద్రము

(ఆదివిష్ణువు లక్ష్మీ సమేతుఁడై నాగశయ్యా నలంకరించియుండును.)

లక్ష్మి : మనోహరా! మీచిత్తమిప్పుడన్యథాయత్తమై యున్నట్లున్నది, యేదీనుని మొరాలించుచున్నారు.

విష్ణు : ప్రేయసీ! నేనొకయపూర్వమునివరుని స్తోత్రార్ణవమున మునిఁగి తేలుచున్నాను. యీతఁడు నీకు శ్రుతపూర్వుడు.

లక్ష్మి : నాథా! నేనెరుంగని మునినాథుఁడెవరు?

విష్ణు : నీవేకాదు నేనును గనివినియుండను.

లక్ష్మి : మనఃకాంతా! ఎవరోనాకుఁ జెప్పరా?

విష్ణు : పంచవర్షప్రాయుండగు నొకరాజపుత్రుఁడు

లక్ష్మి : చాలుఁజాలు లెండు. నన్నెంతబేలనుజేయుచున్నారు.

విష్ణు : మునినాథుఁడగునామ మాతనికిఁజాలదు. మునినాథులకు నాథుఁడనవచ్చును.

లక్ష్మి : అయినఁగావచ్చునుగాని బాలుఁడందు రేల?

విష్ణు : దాననే శ్రుతపూర్వుఁడని వచించితిని!

లక్ష్మి : ప్రాణప్రియా! ఆగుణవంతుని నామధేయము.

విష్ణు : ధ్రువుఁడు అతని తపోదీక్ష నన్నెంతయుఁ బ్రీతునిఁగావించుచు సర్వలోకముల నుఱ్ఱూతలూగించుచున్నది.

లక్ష్మి : నాయకా! ఆవచ్చునది శతమఖుండుగదా? సురసంఘములు వెంటనడువ నీకడకు తత్తరమునఁ జనుదెంచుచున్నాఁడు. మీకవతారశ్రమను గల్పించుటకై క్రవ్యాదనాథుఁడెవ్వండయిన నుదయింపఁడుగదా?

విష్ణు : తరుణీమణీ! కాదుకాదు యీ బాలుని తపోమహిమంబున కాగలేక యిటువచ్చుచున్నారు.

(దేవేంద్రుఁడు సురలతో ప్రవేశించి)

దేవే–

కం. హేయాపద్బాంధవ! చ

క్రాయుధ! వికచాబ్జలోచనా! సురమునిరా

ఢ్గేయా! నగధర! శ్రీభా

హే! దానవధ్వంసీ! హేనాగశయనా! భస్మీభూత సమస్తకిల్బిషతూలసంచయా! హే! దేవతాకోటీ మకుటసంఘటిత పద్మరాగమణి ప్రభావిభాసిత పాదసరోజా! సామజవరదా! హే! గోవిందా! రక్షింపుము, రక్షింపుము.

విష్ణు : దేవేంద్రా! మీయాగమంబును నేనెఱుంగుదును. మీరింకమరలిపొండు, నేనిదే(ధ్రువునకుఁ గామితార్థముల నీయఁ బయనమగుచున్నాను.

దేవే : సురలారా! మహావిష్ణువు మనకుఁ బ్రసన్నుఁడయ్యె నికపోదమురండు. (నిష్క్రమింతురు)

(అవనికపడును)

సీను – ఉత్తానపాదుని సభాభవనము

(మంత్రిసహితుఁడై యుత్తానపాదుఁడు విచారముతో పీఠము నలంకరించియుండును)

మంత్రి : భువనవల్లభా! ధీరోదాత్తులరగు మీరుప్రాకృత జనునింబోలి శోకింపఁదగదు. పాంచభౌతికమగు శరీరమనారతమును కష్టభాజనమును క్షణభంగురమునై యున్నది. నరున కేక్షణమున నేమిసంభవించునో యెఱుంగరాదు. మరణ మెల్లరకును సామాన్యము, గతించినవారికై సజీవులు దుఃఖింపరాదు, ప్రపంచ మెవరికిని శాశ్వతముగాదు. దేహయాత్రాకాలము సమాప్తమయినచో మనము మేనుదొఱంగి స్వర్గమార్గ మనుసరింపకతప్పదు.

ఉత్తా : అమాత్యా! నాజీవనమంతయు నిట్లే తెల్లవారు చున్నది. నేటి కింకను సుఖం బెట్టిదో యెఱుంగను. వంశోద్ధారకులగు నిరువురు సూనులు కలిగినందుల కెంతయు నానందింపవలసిన నేను మరణకాలమున దుఃఖముతో శ్మశానము నకుఁ బోవలసినవచ్చినది. పుత్రులులేని వాని వైభవ మరణ్యచంద్రికయే కదా? నాకీరాజ్యమేల? యీభవనములు నాకేల? తోడి రాజులెల్లరును భార్యాసుతులతో రాజ్యసుఖంబుల ననుభవించుచుండ నేను కష్టదుఃఖములకు లోనై వేదనా సామ్రాజ్యమునకు సార్వభౌముఁడనై కాలము గడపుచున్నాను. (కుమారుల నుద్దేశించి) పుత్రులారా! నేను మీకేమి యపరాధమును జేసితిని! నాగతియేమి చేసితిరి? మీయందనాదరమును సూపిన ఘోరపాపినే యగుదునుగాక. కన్న దోషముననేని నా కంటఁబడరాదా? ఉత్తమకుమారా! యక్షుని నారాచమునకు నీ ప్రాణములు ధారవోయునపుడు నీ జీవమెంత యల్లాడినదో. నాయనా! నన్నెంతగాదూరితివో! కడసారిచూపేనియును నాకు భిక్షపెట్టక నాయందు నిర్దయ బుద్ధివహించి యేల యీమృగయా వినోద కేళి నవలంబించితివి? నాకు నీకోర్కె నొక్కింత జెప్పియున్న సహాయముగా రాణువనంపియుండనా?

దనుగదా? (తలయూచి) కడుపునఁగన్న సూనులయందుఁ బక్షపాతమును గనుపరచిన నీకిది శిక్షయని కాఁబోలు నీమారణ కరవాలమున నా గర్భము నగోచరముగా బ్రద్దలుగావించితివి.

మంత్రి : స్వామీ! యూరడిల్లుఁడూరడిల్లుఁడు

ఉత్తా : సచివవరా! నాగర్భము దరికొనిపోవుచున్నది. యేమి తలంచి నిబ్బరింపఁగలను. అక్కటా! వసుంధరయందు సంతానవంతుఁడై యానందించి కడకు దుఃఖపుఁ గూటి ననుభవించు వానికన్న ననపత్యుఁడే వేయిరెట్లు ధన్యజీవి.

ఉ. కడుపున కంటిపట్టికొని కాల్చుచునున్నది నేటిదాక య
ప్పుడుధ్రువబాలుఁడొక్కటరవుల్చినయేడుపుటగ్గియింతలోఁ
బిడుఁగువలె న్వినంబడిన వీనిహతాన్మరణంబున న్గరం
బుడుకుచునున్నదాత్మయెటులోపిక పట్టుదుమంత్రిసత్తమా!

(తెరలో)

రాజేంద్రా! సురుచీదేవిగారు పుత్రమరణవార్తను విని యడవులకుఁ బారిపోవు చున్నది.

ఉత్తా : (ఆలించి) సేవకా! యెవ్వరును వారింపలేదా? వెంటాడలేదా?

(తెరలో)

పరిచారికలెందరు పట్టుకొన్నను విడిపించుకొని వాయు వేగమున నడవిఁ జొచ్చినది. మేమింతవరకు వెదకి వేసారితిమి.

ఉత్తా : ఆహా! భగవంతుఁడా! నాయెడల నింతనిర్దయుఁడవైతివేల. (మంత్రితో) యింక నాజీవనవల్లి కాధారమే మున్నది. యావిపత్ప్రభంజనమునకు నాయాత్మతూలాయమానమై హరిత్తులకుఁదరుమఁగొట్టఁబడుచున్నది. యింక మీరాజు మీకులేఁడు. నేనిదే విరాగినైపోయెదను.

(అనిలేచిపోవుచుండ మంత్రి వారించి)

మంత్రి : ధరణీనాథా! మీరు మేరుసమానధైర్యమనస్కులరు. శోకదేవతకు వశీకృతు లైనచో లోకులునవ్వెదరు. శాంతింపుఁడు. శాంతింపుఁడు ఆహవదోహలురగు మీరు మీకష్టములకుఁ గారణభూతుఁడగు యక్షుని సంహరింప కూరకుండు టసమంజసంబు, కావున పర్యవసానము యోజింపుఁడు.

ఉత్తా : (కొంతశాంతించి) మంత్రీ! నీబుద్ధికి మెచ్చితిని. ఔను కర్తవ్యమంత కన్న నికలేదు.

మొనగాఁడవగు నిన్నుఁగని యానందించు నీతల్లికిఁ బుత్రశోకమును సమకూర్ప నిదే యుత్తానపాదుఁడు పయనమగుచున్నాఁడు.

ఉ. ఒక్కనిమత్కుమారుసుగుణోత్తరునుత్తము సంహరించినీ
జక్కులవంగడానికి విసంబును బోసితివౌర మత్సుతుం
డెక్కడజచ్చెనో! యచట నీవునుజచ్చితి వింకనెత్తురు
గ్రుక్కుచు, (మంత్రితో) మంత్రీ! విల్లును శరంబులు దెమ్ము వధించివచ్చెదన్

# ధ్రువవిజయము

## చతుర్థాంకము

(సీను-అరణ్యము సురుచి ప్రవేశము)

సురుచి: అబ్బా! అరణ్యమన నిదియేకాఁబోలు. చండభాస్కరుని కోడిన యంధకారమునకు పగటికాలమున నిది రహస్యమందిరమువలె నున్నది. యీనిశాసమయమున వ్యాపించిన చీకటులు క్రిక్కిరిసిన ముండ్లపొదలచే నినుమడించి నిమ్నోన్నత ప్రదేశములను సమానము జేయుచున్నవి. కుమారుని కళేబరము నెక్కడ వెదకికొనఁగలను (ముందుకుఁజూచి) అదిగో! నా కనతిదూరమున మానవ వ్యక్తులు నడచుచున్నట్లున్నది. అయ్యలారా! విగతపుత్రయగు నీదీనురాలికి మార్గమును జూపి పున్నెముగట్టుకొనుఁడు. (తిరిగి చూచి యాశ్చర్యమున భినయించి) ఆహా! యేమి యాశ్చర్యము. యీ వ్యక్తులెంతలో నదృశ్యములయ్యెను. (తలయూచి) వీరు మనుష్యులుగారు నిశాచరములగు భూతములు, యిప్పుడే నిద్రమేల్కొనినయీక్రూరసత్త్వము లాహారార్థమై యేవంకను సంచరించుచున్నవి. ఓ సింహశార్దూలము లారా! మీరేల శ్రమపడియెదరు? నన్ను భక్షించి యాకలిదీర్చుకొనుఁడు. కోరుకొనువారికి మరణమెక్కడిది? కటకటా! కుమారుని శవము చెంతకు నన్నెవరు కొంపోయెదరు. నభోమార్గమున నిలిచి సమస్త పదార్థముల నరయుచున్న నక్షత్రములారా! మీరు నాసుతుని జాడ నెఱుంగరా! ఓనిర్ఝరమా! కొడుకు సజీవుఁడై వనముల గ్రుమ్మరుచు నీలో నీరమును ద్రావి సేదదీర్చికొని యుండును. నీతో నేమేనిఁజెప్పియున్న నాకెఱింగించి హృదయమునకు శాంతినెలకొల్పుము. ఓవిపిన దేవతా! సర్వలక్షణ సమన్వితమైన మాయుత్తముని రూపము నేటితో నీగర్భమున లీనమొనరించుకొని తృప్తిఁబొందితివా లేదా? లేకున్న నిదిగో నన్నును హరించి నీకోర్కె నీడేర్చుకొనుము. (దిక్కులు పరికించి) అప్పుడే మూడుయామములు దాటినవి.

యే ప్రాణియును నడయాడుటలేదు. సర్వజీవులకును విశ్రాంతిదం బయిన యానిశాసమయమున వేదనంబడుచుఁ జరించు దుఃఖజీవిని నేనుగాన మరెవ్వరుందురు. అదిగో రాత్రియంతయు నేకధాటిగా వెలింగి తమనిర్ణీత కార్యమును జక్కపెట్టుకొన్న చుక్కలకు సెలవొసంగి విశ్రాంతినిచ్చు నధికారి వలె వేగురుజుక్క తూర్పునం బొడచినది. గబ్బిలంబులు నెలవులకుఁదిరిగిపో వుచున్నవి. నాకట్టి విశ్రాంతిని జేకూర్చువారెవ్వరు? ఉత్తమ నక్షత్రముదయించిన గదా! యింక నెక్కడనుదయించును! యుదయించుటకుమా రస్తమించి నాజీవన ప్రపంచమును శాశ్వతాంధకారమున ముంచితేల్చె! నిన్నటి సాయంతనము మొద లిప్పటివర కమార్గములన్నియు గమించి వేసారితిని. శోషవచ్చుచున్నది. ఉత్తముని పీనుఁగునేనియుఁ జూచుభాగ్యము నాకులేదు. ఆహా! నాకాలు సేతులు బలహీనములై ప్రేలికలవలె వ్రేలాడుచున్నవి. యిఁక నడుగుఁదీసి పెట్టంజాలను (అని కూలఁబడి)

సీ. ఇంక నెక్కడ దాగితే? యుత్తమకుమార! పులులు ముందుగఁ బొట్టఁ బోసికొనెనె
యక్షుఁడా! చూపరాదా? పాపనిశవంబుఁ బ్రాణాలు బలిగొన్నవాఁడవుగద
ధ్రువబాలకా! గుణార్ణవ! వింటివయ్య సోదరునియకాలదుర్మరణవార్త
మృగ భామలార! తోడుగరాక చూచుచు న్నారు మీ దాడుజన్మంబుగాదె!

తే.గీ. స్వర్గమున నందనునితోఁడ సంతసించు
మార్గ మేదేని వెదకి నెమ్మనమునందు
శాంతి నెలకొల్పి యొక్కింత సాయపడరె
ధర్మ మెఱిఁగినపంచభూతంబులార

(నింగిజూచి) ఆహా! నాప్రార్థననాలించి నన్ను గుమారునితోఁ గలపుటకై కారుచిచ్చు నాకు నలువైపుల గ్రమ్మికొనివచ్చుచున్నది. బృందారకులు నాకై దివ్యవిమానమును గొనివచ్చి రమ్మని పిలుచుచున్నారు. మాయుత్తముఁడును నాకైయెదురుచూచుచున్నాఁడు ఓ దవదహనమా; యిదిగో నన్నాహుతిఁగొనుము. (అని పరుగిడును)

(అవనిక పడును)

సీను–అరణ్యము

(ఒక రాక్షసస్త్రీ ప్రవేశించును)

రాక్ష : ఆదివిష్ణువు దానవాంగననగు నన్నుబిలిచి, బాలముని యగు ధ్రువుని శోధించి తపోభంగ మొనర్చుమని శాసించె.

నిశ్చయుఁడై కొన్ని యబ్దములనుండియును జలింపక కార్యమునుసాధింప దీక్షవహించినయీబాలుఁడు నామాయా ప్రపంచమునఁ దగుల్కొనునా! కార్య సాఫల్యమునకై పట్టువిడువక ప్రయత్నించుటలో నెట్టివాఁడో నామధేయమే వేయినోళ్ళఁజాటుచున్నది. యీతని తపోదహనము పదునాల్గులోకముల నావరించి జీవ రాసులనెంతయుఁ దపింపఁజేయుచున్నది. యిట్టిప్రజ్ఞానిధిని సమీపించుటకు నాహృదయము వెనుకంజవేయుచున్నది. తపోవిధానములను భంగము సేయుటలో విశారదులగు మారక్కసి కొలమువా రింతక మున్నే యుద్యమించి యీతని తీక్ష్ణదృష్టిపాతమున నిరుత్సాహులై చాలించి యేతదాశ్రమమన్న నామడ దూరమునఁగాని చరింపరు. మున్నీయాశ్రమమున తపమాచరించిన మహర్షుల నెందరినో యాడుదాన నగునేన బెదరించి తరిమివేసితిని. అట్టి నాకీతఁడెంతో భయంకరుఁడై కనుపించుచున్నాఁడు. (విచారించి) యేరూపమునఁబోవ నాకీపనిసాధ్యమో! (తలయూచి) మంచి యూహపొడమినది. యీతనితల్లియగు సునీతివలె మాయారూపమునఁబోయి మిథ్యావిషయమును గల్పించి మోసపుచ్చెదను. భేష్ చక్కగా యోజించితిని. స్త్రీలలోఁదెలివిగలవార లెవరన్న నన్నేచెప్పవలెను. నారూపముఁ, దెలివితేటలు, నానీటు, నాగోటుఁ, దిలకించి మావారెల్లరును నిజముగా నిదిరాక్షసవంశమునఁ బుట్టవలసినదిగాదని చెప్పుచుందురు. అందుచేతనే లోకారాధ్యుఁడగు కమలనాభుఁడీపనిఁ గొనసాగించుటకు నన్ను నియమించె. యీపనిని నిర్విఘ్నముగా గావించి బహుకాలమునుండియు నాహృదయమున నున్న కోర్కె దీరునట్లు గంధర్వు నొకని వివాహమాడెదను. ధ్రువుని యాశ్రమ మీసమీపమున నేయున్నది. (తొంగిచూచి) అదుగో! యిప్పుడే గుండము వ్రేల్చుచున్నాఁడు (నిష్క్రమించును)

(సీను–ధ్రువుఁడు సమాధియందుండును)

ధ్రువు–

మ. కనుదమ్ముల్ కరుణామరందములు గ్రక్కన్మోముచంద్రుండు చి
క్కనిలేనవ్వుల వెన్నెలల్గురియ మేఘశ్యామలాంగంబు తె
ల్లనిసంద్రంబున కింద్రనీలములు సల్లన్ జిల్వపైఁ బవ్వళిం
చినగోవింద! యనాథబాలుని గటాక్షింపంగదే! కేశవా!

(సునీతిదేవి రూపమున రాక్షసి ప్రవేశించును)

రాక్ష : (స్వగతము) కృత్రిమస్వరూపమును ధరించివచ్చితినిగాని లేని ప్రేమను బుట్టిం చుకొని 'కుమారా'! అనిపిలుచుటకు సిగ్గగుచున్నది. కంఠస్వరముమగుదించె

నా ముప్పు వాటిల్లును. భాషించెనా పురవిషయమై పృచ్ఛింప నేమెఱుంగని నేనేమని సదుత్తరములనిత్తును (తలయూచి) యేమైననుసరే! యింతకుఁబూని వచ్చి వెనుదీయరాదు. (ఆతురతనభినయించుచుఁబోయి) కుమారా! నాయనా! ధ్రువా! నీకోర్కెయీడేరినది. యీయుగ్రతపంబునుమాని యింటికిరమ్ము. తండ్రీ! పలుకవేమి? నీ కన్ను లెత్తి యొకమారు నావంకఁజూడుము. నన్ను విడిచి వచ్చినది మొదలు నీకన్న మెవరుపెట్టిరి. యేమారగించుచుంటివి? నిద్రాహారములు మాని సఖంబవై పొడసూపునీరూపము నాగర్భమును గోసి వేయుచున్నది. నీముద్దుమోమును జూచుటకై యరణ్యాబాధలను లెక్కసేయక తిరిగి వేసారి నేటికి గనుఁగొంటిని. యీకష్టములు నీకేల? నీకై కొనితెచ్చిన యీ ఫలాహారములారగించి నాతో ముచ్చటించుము

మ. అలనాఁడీవు పురంబువాయునెడ నోరారంగనెల్గెత్తి "చిం
తిలకమ్మా" యని యూరడించితివి తండ్రీ! యిప్పుడారీతి వీ
నులకుం బందువుగా వచింపు మెద సంతోషించెద న్దమ్మిక
న్నుల నొక్కించుక విచ్చి నామొగమునందున్ దృష్టి సారించుచున్

(తనలో) నావాక్యము లీతనిచెవులఁ జొచ్చుటలేదు. మహాదీక్షను వహించి శిలాకృతింజెందియున్నాఁడు. యీమునులకీపాపిష్ఠి తపంబెవఁడు నియమించెనో కాని యెట్టివాఁడీ తపమారంభించినను తుద కీశ్వర ప్రత్యక్షము మాట యట్లుంచి మూగతనము నంధత్వమును, జెవుడును ప్రారంభముననే మూర్తీభవించును.

(ధ్రువుఁడు కన్నులఁ దెఱచిచూచి)

ధ్రువు : (స్వగతం) ఏమి ఆశ్చర్యము. జనని యిచ్చటనున్నది. నేను తపస్సమాధి యందుంటినా! అంతిపురముననుంటినా! కాకున్న నసూర్యంపశ్యయగు తల్లి నాకేల పొడసూపును. (కొంతతాళి) కాదుకాదు. నిజముగా తల్లియే వచ్చి యున్నది. (ప్రకాశముగా) అమ్మా! శుద్ధాంతమునువిడిచి యెట్లు రాగలిగితివి.

రాక్ష : నాయనా! రాజ్యాభిషిక్తునిఁజేయ ధ్రువునిఁగొని రమ్మని మీతండ్రి పంపగా వచ్చితిని.

ధ్రువు : తండ్రిగారు నిన్నంతిపురము విడిచి యరణ్యములకు బోయిరమ్మని యొంటి గాఁ బంపెనా? కడుచిత్రముగానున్నది. జనకుఁడంతమౌఢ్యముగాఁ బ్రవర్తించునా? కాకున్న ముద్దుకొడుకైన యుత్తముఁడుండ నతనిగాదని నాకిచ్చుట కెట్లు కృతనిశ్చయుఁడు కాఁగలఁడు. సురుచి యూరకొనునా? యీగాథ మిక్కిలి శోచనీయము. తల్లీ! పరమభక్తురాలవగు నీవు ఫలితమునకు వచ్చిన తపంబును

మానుమని బోధింతువేల? నిరంతర మీశ్వర ధ్యానానందమునఁ దేలియాడు నాహృదయమునకు రాజ్యాభిషేక వైభవోల్లాసమింపుసేయునా?

రాక్ష : నాయనా! ఆహారములేక నీవు మిక్కిలి కృశించియున్నావు. రాజ్యభోగము లనుభవించి బలముపొంది శత్రుమారణమొనరించి కీర్తివహింపుము. నీకీకష్ట మేల?

ధ్రువు : తల్లీ! యుత్తముండును, సురుచియు సేమముగ నున్నారా!

రాక్ష : (స్వగతము) వీరెవ్వరో నేనెఱుంగను. యేమనిచెప్పవలయును? యీతని చరిత్రమంతయును నాకు పూర్ణముగా దెలియదు. సునీతినెన్నడో చూచిన జ్ఞాపకముననుు దన కథను విష్ణుదేవుఁ డెఱిగించుటచే నీతని నామధేయము నెఱింగితిని. యీప్రశ్నమున కేయుత్తర మర్హమో? (ప్రకాశముగా) నాయనా! వారును నీకొఱ కెదురుచూచుచున్నారు.

ధ్రువు : (బెదరిపడి) మూర్తీభవించిన యీర్ష్యాపుంజమోయనఁబెంపారు సురుచి, రాజుగారు నిజపుత్రునిఁగాదని రాజ్యము నాకీయఁదలచుకొన్నఁ బ్రాణత్యాగమున కేని దెగించును గాని సహించుకొనునా! యీమె సంభాషణ ము సందేహాస్పదముగా నున్నది. నిజముగా నీ యంగనావ్యక్తి నాతల్లి సునీతియా!

(తేరిపారజూచి)

ఉ. ఈసతిరూపురేఖల నొకింతయు నంబకుఁదీసిపోదు; మా
యాసహితప్రలాపములు, నాననమర్ధము దాచికొంట, యీ
వేసము, నోరువిప్పఁ బ్రభవించునసహ్యపుఁబీన్గుమాంసఁపు
న్వాసనయుం గనుంగొన మనంబున నా కనుమాన మయ్యెడిన్

నిక్కముగా నిది రక్కసిలేమ. నన్నువంచించుట కీవేషమునవచ్చినట్లున్నది. దీనితో వృథాసంభాషణ మాచరించుచుఁ గొంతకాలము వ్యర్థము గావించితిని, (కోపముఖుడై ప్రకాశముగా) ఓసీ మాయానిశాటీ! నీయాట లిక్కడ సాగిరావు! శీఘ్రమే నాయాశ్రమము దాటిపొమ్ము! భువనపావనయగు మజ్జననీరూపమున వచ్చితివిగా! ఛీఛీ దుష్టురాలా!! నాయెదుట నిలువకుము. లేకున్న నీప్రాణములు దక్కవు.

రాక్ష : (భయము నభినయించి తనలో) ఓహో! నాగుట్టు బయటఁబడినది. యిక నాయత్నము నిష్ఫలము. నానిజరూపమును జూపి భయపెట్టెదను. అయిననింకఁ గొంత కాలము తల్లివలె నభినయించెదను. (ప్రకాశముగా)

నాయనా! నేను రాక్షసినిగాదురా! నిన్నుఁగన్నతల్లి సునీతిని. తండ్రీ! యబ్దములు గడచిపోగా నన్నుగుర్తింపఁ జాలవా! నన్నిట్లు నీయందుఁ బ్రేమమున్నదో లేదో యని పరీక్షించుచున్నావా? నీవు నన్నెంత విసర్జించినను యీసునీతి నీపాద ములకడఁ బ్రాణములు విడుచునదిగాని విడిచిపోదు. కుమారా! యేదిక్కు లేక దివారాత్రులు నీమూర్తిని ధ్యానించు నన్ను నీవే యిట్లు తూలనాడిన నాకాధార మెవరు? తండ్రీ? (అని దుఃఖము నభినయించును) యీ పాదుతపము నారంభించినవారు తల్లిఁదండ్రులరూపములను గూడ మరచిపోయెదరు గాబోలు. పుత్రకా! దీర్ఘకాల తపోభారమున భ్రమఁజెంది నన్నిట్లు తూలనాడితివని యెఱుంగుదును. నేనేమనుకొనను లెమ్ము! నన్ను బాగుగా పరిశీలింపుము, యీచేతులతో నానాఁడు నీకన్నము దినిపింపనా? ఈమోవి తో ముద్దిడుకొననా? నీతల్లినికానా? కాకున్నగాని యొకముద్దిచ్చి శ్రమపడి వచ్చిన నాఋణముఁ దీర్చుకొనుము. యింకను నీమూర్ఖపుఁబట్టు మానలేదు గదరా? అయ్యయ్యో! పాలుగారు బుగ్గలను, నడచుచున్నఁ గదలుచుండు చిన్ని బొజ్జయునుఁగరఁగి శల్యావశిష్టుఁడవైన నీరూపము నన్ను దహించుచున్నది. మరల నాచేతియన్న ముఁదిన్నఁగాని నీ కెప్పటి దేహమురాదు.

(అని చేతులుసాచి సమీపించును)

ధ్రువు : ఓసీ! క్రవ్యాదాంగనా! చేరరాకుము. నీమాయలు నీ టక్కులు నే నెఱుంగుదును. ముట్టుకొంటివేని శపించెదను.

రాక్ష : నీవేమిచేసినను సరే! అక్కడఁజచ్చుదానికన్న నీచేతులలో మరణించుటయే నాకు భాగ్యము. యెట్లో మొగము జూచితిని. నీహృదయ మిట్లు మారిపోయిన నేనేమి చేయుదును. నాకర్మమట్లున్నది కాఁబోలు. నాయనా! చంపుము. నా కుత్తరక్రియలు నీవే యొనరింపుము.

(అని పాదములయొద్ద పడును)

ధ్రువు : ఓసీ! మాయలాఁడీ! నీవిచ్చోటువాసిపోవేని యిదిగో! యీదండమున నీశిరము భిన్నముజేసెదను.

(అని దండముఁగొని పైకివచ్చును)

రాక్ష : (దిగ్గున లేచి) శృతిముదిరినది. నాసామర్థ్యమీతని యొద్ద మిథ్యయయ్యె! యిక నానిజరూపము వహించెదను. (అని నిజరూపమునవచ్చి) ఓరీ! ధ్రువా! నిన్నిప్పుడు నాదీర్ఘదంష్ట్రలతో నమలి చప్పరించెదను. నీవీయాశ్రమమును విడచిపారిపోయిన జీవింతువు లేదా నీతపము గిపము గంగఁ గలిపెదను

(తలయూచి) అమ్మా! పిల్లవాఁడు దండముగొని కొట్టువానివలె వచ్చినాడు. నీ యొద్ద నున్న యీ పెంకితనమునకే యిట్టిగతి సంభవించినది కాకున్న రాకుమారున కీకర్మమేల?

ఉ. ముచ్చటమీరుముద్దుమొగముంగలబాలకుఁడంచునెంచిపో
నిచ్చితిఁగాని దేహమున నింతటికావర మున్నదంచు నీ
విచ్చటఁగాలు బెట్టినపుడేకనుఁగొన్నయెడన్ దురాత్మ! నిన్
బచ్చడిఁజేసి నంజుకొననా యుదయంబునఁ జల్దికూటిలో

ధ్రువు : (తనలో) ఆహా! యేమిదీనియలీక విద్యాకౌశలము. కామరూపిణియగు దీనివైఖరిందిలకించి విశ్వసింపకుంటినిగాని లేకున్నఁబ్రమాదము సంభవించి యుండును. సునీతీదేవి తృటికాలమున ననీతీదేవియైనది. (ప్రకాశముగా) ఓసీ! పిశితాశనాంగనా! నీరోష భీషణ ఘోషణంబులకు ధ్రువుఁడు బెదరిపోడు. మేనికి లేని పోనియాయాసమేల గల్పించికొందువు. మజ్జననీ నామ ధేయ ధారణ వాసనావశంబున నీయాయువున కనపాయత్వము సిద్ధించినది.

తే.గీ. చూపులకు వ్రేలెఁడున్నాఁడు పాపఁ డేమి
సేయఁగలఁడంచు నెద సంతసింతు వేమొ
దహన మెంతైననేమి పదార్థరాశి
కావలయుఁగాని మించి దగ్ధంబుసేయ

నాకమండలోదకంబునిదే యభిమంత్రించి చల్లెదను. నీగతి యేమగునోచూడుము. (అని కమండలువును బట్టుకొనును)

రాక్ష : అబ్బో! నాప్రాణము లికదక్కవు! (అని అరచుచు పారిపోవును)

ధ్రువు : అబ్బా! నాకు స్త్రీహత్యాపాతక మంటుకొనకుండ నీ భూతము వదలిపోయినది. (అని సమాధినుండి)

మ. ననుఁబోల్వానిఁగుమారు నొక్కనినిఁగన్నా రాతనిన్బెంచిపె
ద్దనుగావించినదొడ్డదంపతుల రాతం డింటఁబన్నంబునం
దినవాఁడే? పినతల్లిచేత నెపుడేనిన్ దెల్పరే! శ్రీరమా
వనజా తేక్షణులార! తోడుపడరే! పాలించిలాలింపరే!

హే! దీనబంధూ! సుధార్ణవసంచారా! సుకుమారుండగు మన్మథనందనుం డయో నిర్మిత శరంబులు భరింపలేఁడని మృదుల పుష్పములను బాణములుగా నొసంగి తియ్యని

నాకర్ణింపఁజాలని నవనీత చేతస్కుండవు. పసివాఁడనయిన నామహావ్యథలఁ గనుఁగొనుచు నేలయూరకొంటివి. పరమదుర్మార్గుల నేనియు ధ్యానమాత్రమున నాదరించునంతటి నీదివ్యచిత్త ఫలకమున నా స్తవంబేల చిత్రింపఁబడదు. యేల నిన్నుఁ బ్రసన్నునిఁగావింపదు. పదునాల్గుభువనములలోఁ జీమచిటుకుమన్న లెక్కింపఁజాలు మహిమాస్వరూపుఁడవు మేధా సంపన్నుఁడవు. జ్ఞానానంద మహాప్రపంచమునకు నభోమణివి. అట్టి నీదృగ్దర్పణంబున దీనుడయిన ధ్రువబాలుని వ్యధానాటకము గోచరింపకుండునా! కాలవైపరీత్యమును బట్టి నాపినతల్లివంటి కాఠిన్యము నీయందును సముద్భవించెనా?

శా. వాలుంగన్నులబెళ్కుచూపులుదయింపగల్మిపూఁబోడికెం
గేలన్ బాదము లొత్తుచుండ ననురక్తిన్ దేవతాకన్యకా
జాలంబు ల్కలకంఠకంఠరుతి రాజద్గీతముల్సేయ గో
పాలా! పాలసముద్రమందు నిదురింపంబూనినావేమొకో

యెంతకాలము నన్నీఘోరతపోదహనమధ్యమున నేచఁ దలించితివి. యెన్నఁడు జాలివహింతువు. నన్ను సఫలీకృతమనోరథునిగావింప నిష్టపడవేని నాజీవన సంధ్య నంతరింపఁజేయుము. నీభక్తప్రపంచము మధ్యమున మినుకుమినుకు మనుచున్న నాయాత్మజ్యోతి నార్పి నీలోఁగలిపికొనుము. యేపాపమెఱుంగని నాయందు బందుగుల కు ద్వేషాంకూర ముదయించినట్లు నీకును నిష్కరుణాత్వంబు వొడమినదా? ప్రహ్లాదాది భక్తులరక్షింపనై యవతారములఁదాల్చివిసికి విశ్రాంతినందుచు నామొరలాలించి యవతారశ్రమంబు ప్రాప్తించునని వెనుదీయుచుంటివా! దేవా! కాదుకాదు! నీదివ్య స్వరూపమున సాక్షాత్కరించినఁ జాలును. భాషించుట కష్టమయినఁబోనిమ్ము. క్రీగంట నారయుము. నన్నొక్కపరి యేతద్వీక్షాలేశమే నాదుఃఖతూలికలకు భూరికీలా కలాపమై భస్మీభూతము సేయఁగలదు.

ఉ. ఏనిక నేలగా పరుఁగులెత్తవె! రక్కసిబాలు నేలఁ గం
బానజనింపవా! ధ్రువునిపై ననురాగముఁబూనవేల దే
వా! నరకేసరీ! మరతువా; వినవా, కలశాంబురాశివీ
చీనినదంబునన్ జెవులు చిల్లులు వోయెనె బుద్ధిపోయెనే

ఓకమలాసతీ! నినుఁబోలు నాతల్లి సునీతినరసి పుత్ర వియోగదుఃఖభారమునఁ గృశించు తన్నుఁ గరుణించి పతితోఁజెప్పి పంపరాదా? శీఘ్రముగా నన్నామెకప్పగించి నీలోకమాతృకానామమును సార్థకముజేసికొనుము. నావంటి నీకొడుకు పంచబాణునితో నానందించు నీ కాలము నొక్క నిమేషము నాకొఱకు వినియోగించిన నేనిల్లు సేరనా!

ఓజనార్ధనా! నీవేనాకు సాక్షాత్కరింపకున్న నాకీ శరీరధారణంబేల? నానాకష్టములకుఁ దావలంబయిన శరీరమును భిన్నభిన్నములు సేసి హోమకుండమున వ్రేల్చి యాక్షణంబున నీతో నేకీభవించెదను.

శా. నాపై నీవు ప్రసన్నభావమును పూనంబోవకున్న న్దరి
త్రీ పూతంబగు నీదయాపటిమ వ్యర్థీభూతముంబొందునే
మో! పద్మాయతనేత్ర! నీదువిహంగపుందేజిపై నామనో
తాపంబార రమాసమేతముగఁ బ్రత్యక్షంబుఁగమ్మచ్యుతా

చం. కడుపునఁ గన్నతండ్రియె నికారమొనర్చిన ఘోరపాపపుం
బుడుతయితండు నేఁగరుణఁబూనఁగ రాదనుకొందువేమొ నా
యెడ నపరాధమున్న భరియింపకు మేన తరింతు లేనిచో
నడుగుఁగదల్పనీయనుసుమా సిరితో నిను నబ్జనాభుఁడా!

(పాల్కడలిలో లక్ష్మీనారాయణులు ప్రత్యక్షమయ్యెదరు)

ధ్రువు : ధన్యోస్మి! ధన్యోస్మి!

నారా : సునీతినందనా! ధ్రువకుమారా! నీభక్తికి నేను సంతసించితిని. ప్రహ్లాదాది భక్తుల యనంతరమున నంతటియానందమును నాహృదయ గేహమున నించి ప్రత్యక్షముఁజేసికొన్న మునికుంజరుండవు. ప్రాయమునకు మించిన నీమహాసాహసంబునకు భువనసప్తకంబాశ్చర్యనిమగ్నములగుచున్నవి. నీనామధేయమాచంద్రార్కముగాఁ జంద్రతారలయం దెన్నఁబడును గాక. పొమ్ము నీకభీష్టసిద్ధికల్గును. శత్రుకోటికి గర్భ శాత్రవుండవై సమస్తైశ్వర్యములతో గొన్ని మన్వంతరములు భువనసామ్రాజ్యభారమునుదాల్చి ఖ్యాతి నందెదవుగాక. యేకపుత్రయగు నీజనని నీతో నిరంతరము సుఖించుచు విగతదుఃఖయగును గాక.

ధ్రువు : మహాత్మా! నీభక్తవాత్సల్య మేమనివర్ణింపఁగలను. మానవకోటియం దధముండను. తృణప్రాయుండనగు నాస్తవంబునకు ప్రమోదభరితచేతస్కుండవై సాక్షాత్కరించుట నీయదభ్రకరుణావిదగ్ధతను వెల్లడించుచున్నది. కమలనాభా! ధన్యుఁడనైతిని. నాకుఁ జిరకాలము నీచరణరాజీవయుగళసేవనాపారవశ్యసుఖమును ప్రసాదింపుము.

విష్ణు : సరే! నీయభిమతంబులన్నియు ననుగ్రహించితిని. జననీ జనకులు నీకొఱకెదురుజూచుచున్నారు. వైళంబ చనివారిని గలసికొనుము.

(లక్ష్మీనారాయణులు నిష్క్రమింతురు)

ధ్రువు : శ్రీమన్మహావిష్ణుని యనుగ్రహమునకుఁ బాత్రుఁడనయిన నాభాగ్యమునకు మేరలేదు. పరోపకారపరాయణయును, పవిత్రచరిత్రయగు మాయమ్మ సునీతిదేవి వేడికన్నీటి బిందువు లాదినారాయణునిఁగదలించి కొంచు వచ్చి నన్ను ధన్యునిఁజేసినవి. సంతోషముతో నిల్లుజేరి తల్లిమొగము జూతునుగాక!

(నిష్క్రమించును)

(సీను–అరణ్యము)

(యక్షుఁడు ప్రవేశించును)

యక్ష : (స్వగతము) మున్నీయరణ్యమున నాచేఁగూలిన బాలుఁడసహాయశూరుండగు నుత్తానపాదభూపతి నందనుండనియు, సమరగాండీవియగు నాతనియ గ్రజన్ముండందుచేఁ గలుషించి, యక్షనాశన దీక్షంబూని విలయ కాలరుద్రుని వలె నాపైనెత్తి వచ్చుచున్నాఁడనియుఁ దెలియవచ్చుచున్నది. ఒక్కబాలునిఁజంపి మావంశమున కంతటికిని లేనిపోనియారాటమును దెచ్చిపెట్టితిని. అతని మరణమున నాకులభించిన యశంబును రాజ్యమును లేదు, పాప మాకుఱ్ఱవాఁ డిప్పటికేనియుఁ దలఁపునకు వచ్చిన హృదయమెంతయు వ్యాకులపడును. ఇప్పటినాసింహావలోకనము గతజలసేతుబంధనము వలెనున్నది. అసంఖ్యసేనాసమేతుండును విష్ణుదర్శనప్రాప్త వరగర్వపటిష్ఠుండు నగు ధ్రువుని నేను జయింపఁగలనా? వట్టిమాట. నేఁడు నాకేవంకఁజూచినను జయసూచకములు కానవచ్చుటలేదు. ఈయుదయమున విల్లుబట్టుకొనఁగా యెవ్వరోలాగి వేసినట్టు చేతినుండిజారిపడినది. రాజరాజును దర్శింపఁబోవు దమనుకొన్నఁ గాలుముందునకు సాగుటలేదు. అనవద్యశోభావిభాసితమగు నాభవనలక్ష్మికిఁగబరీభరకనకకలాపంబయిన, కనకవనము వాడబారినది. (విచారించి) ఆహా! కాలాగ్నికి శీతలమువలె భయపిశాచము నన్నావరించి విపరీత కాలమును సృష్టించుచున్నది. నాధనుశ్చంద్రుఁడిట్టి శతసహస్రోత్తాన పాదుల నేనియు, శతపత్రశతంబుల నొనర్పజాలును.

ఉ. అంబుధిమధ్యబాడబశిఖావళిమింటికిఁబ్రాకి మూడు లో
కంబులు గ్రమ్మనీ శివుని కంటిదవానలమారనీ, గిరీం
ద్రంబులు వెన్న ముద్దలవిధంబున నీరయిపోవనీ నట
త్సాంబునిలీలనాట్యమును సల్పెదనాహవరంగసీమలన్ (నిష్క్రమించును)

(తెరలో)

మహాస్రగ్ధర: విదళింతు న్నీ చమద్విద్విషదుదరములన్ బిన్నభిన్నంబులైపోఁ
గదనక్ష్మాచక్రంబునన్ భీకరరుధిరనదుల్ గట్టిపారన్ గరాళ
ప్రదరౌఘంబుల్ దదాశావలయమదకరి వ్రాతమెల్లన్ గలంపన్
విదితోద్యత్కీర్తికాంతుల్ వెలయవిసరెదన్ విశ్వవిశ్వంభరాలిన్

ఓరోరీ! యక్షధూర్తులారా! రండు, రండు విల్లుబట్టనెఱుంగని పసివానినిఁగూల్చి మిట్టిపడు మీరింక నెందరున్నను బొలియించిగాని యీధ్రువుఁడు శాంతింపఁడు, (శాంతించి) యిప్పటికిఁ గొంత శత్రుమారణమాచరించి నాఁడను, సోదర ఘాతకుండు నేటిదినము నాకంటబడి నాకత్తికిబలియగుట హృదయము కొంత నిమ్మళించినది. మాయుత్తముని మ్రింగివేసిన దీయరణ్యమే కావచ్చును. ఆహా! యుత్తమా! నాశుభాగమమును జూచి సంతసింతువనియు దొలుత నీతో నాయరణ్యజీవన వృత్తాంతము నెఱిఁగించి సద్గోష్ఠి నెఱపుదమనియు నెంతో తలంచితిని. నీమరణవార్త నాకుతూహలమును దుఃఖముగా మార్చివేసినది. (సురుచినుద్దేశించి) అమ్మా! సురుచీ! కొడుకు మరణము నిన్నెంతగా గాసిపెట్టెనో! కుమారాన్వేషణము సేయు నీవంటి దీనురాలిపై నిష్కరుణవహించి భస్మముసేయుట కాదహనమున కేమియపరాధము చేసితివి. నీమూలమునగదా? రాజభోగాతిశయ లబ్ధమదగర్వతిమిరావృతమై నిమీలితమై యున్న నాజ్ఞాననేత్ర మక్షయభాగ్యప్రదంబయిన యీశ్వరధ్యానమునకు దెరువబడుట! నీవంటి యుపకారిణియగు తల్లి నాకుఁజిక్కునా! తొలుత నీమేలును గ్రహింపక నిందించిన నామౌఢ్యమును నీకు వ్యక్తీకరించి నీపాదములకు నమస్కార మొనర్చుకొంద మని యభిలషించిన నాకిల్లుచేరిన వెంటనే తెలియవచ్చిన మీచావు నన్ను జీవములతోఁ జంపివేసినది. క్షమాపణగోరుకొని నీపాదములంటుటకు నీస్వరూపము నాకెక్కడ లభించును. సర్వపదార్థభక్షకుండయిన ధూమాంకుఁడు నీ శారీరభక్ష్యమున నాకలిదీర్చి కొనెనోలేదో! (అగ్ని నుద్దేశించి) ఓస్వాహావధూనాయకా! నీభోజనప్రయత్నమునకును, నీక్షుత్తునకు మేర లేదుగదా?

ఆ.వె. కొడుకుచచ్చి గోడు గోడుననేడ్చుచు
నడవులన్ని వెదకు నబలయందు
జాలిలేక బూది సల్పినాఁడవు వేలు
పందు రెట్లు హవ్యవాహ!

అమ్మా! నీవులేని రాజ్యము నాకేల? నీకుమారునకు బట్టముగట్టుకొని మహా సంతోషమున జీవనము సేయవలయునని కొండంత యాశతో నెదురుచూచిన

మనుభవింపఁగలనా? నేను తిరిగి వచ్చువరకు జీవించియున్న నీకోర్కెనవిఘ్నముగా కొనసాగించి నీఋణము, దీర్చికొనియుందును. నాకన్న ముందుగా దేహయాత్ర దీర్చుకొని స్వర్గసౌఖ్యమును జూఱలాడుచున్నావు. నీకుమార ప్రాణాపహారియగు యక్షుని వంశమును గొంతవఱకు నిర్మూలించి యొక్కింత కృతార్థుఁడనైతిని, తల్లీ! మీయాత్మలకు శాంతి లభించునుగాక, నీకిదేనమస్కారము. (నిష్క్రమించును)

(సీను-సభామందిరము)

(ఉత్తానపాదుఁడు సునీతి, మంత్రిపురోహిత దండనాథులతో పీఠముల నలంకరించి యుండును. ధ్రువుఁడు సింహాసనాసీనుడై యుండును.)

పట్టాభిషేకము

# ప్రార్థన

శా. శ్రీవాతాశనహారముల్పడలిరాశీభూతముల్గాహిమ
గ్రావంపుందొలిముద్దు కూఁతురలరంగా గంగయుప్పొంగ సం
ధ్యావేళన్ జరమాద్రివేదికల నాట్యంబాడు శంభుండు గౌ
రీవామాపతిప్రోచు మత్కృతిపతిన్ శ్రీశైలపత్యగ్రణిన్

సీ. శ్రీమందహాసచంద్రికలే మహాత్ముని తళుకుమేనునకు ముత్యాలసరులు
పాలమున్నీటి శుభ్రస్విన్నవీచికా జాలమెవ్వానికుయ్యాలతొట్టి
తమ్మిబిడ్డని నిరంతర వేదగానమే గుణగణ్యునకు మేలుకొలుపుపాట
గళమునఁదళుకొత్తు కౌస్తుభరత్నమెవ్వాని యింటికి నూనెలేని దీపము

తే.గీ. అట్టి మాయిందిరా మనోహరుని కరము
కరము ఛత్రాయమానమై క్రాలుగాత
ప్రథితరావూరికుల నిశాబాంధవునకు
సత్యవాచాభిరతికి శ్రీశైలపతికి.

మ. హరకోదండమురెండుగా విరిగి భూమ్యాకాశముల్మ్రోయ×
ర్ఘరరావంబుదయించువేళ ముదమొప్పన్ జానకీరాఘవే
శ్వరులన్యోన్య ముఖావలోక నరసవ్యాపారులైచిమ్ము మే
ల్దరహాసాంకురముల్మదీయ కృతిభర్తన్ శ్రీయుతుంజేయుతన్

ఉ. వేలుపుఁబిచ్చగాని ననుఁబెండిలియాడితి వెంతవెఱ్ఱి యి
ల్లాలవుమేలుమేలని విలాసముగా బరిహాసమాడు శుం
డాలవిరోధిపై కులుకు నవ్వులబువ్వులురువ్వ దుర్గ శ్రీ
శైలపతిన్ వదానవరసారమతిన్ మనుచున్ దయామతిన్

చం. ఘనముగఁబల్కనేర్చుచు మొగంబులు నాలుగుగల్గుతేటిరా
యనివలెఁ దమ్మిపీటననయంబు నివాసముసేయు వేదని
స్వనముల దొడ్డవేలుపలవాక్సతి కంఠమునందుఁదావిఁ×
ట్టిన నెఱనీటుకాఁ డిడుగడిందిఁగృతీశునకున్ జిరాయువౌ

మ. తన దేహద్భువులంచరాయని తనూదావళ్యమందేకమై
తనరన్ హంసలతాంగియో తలపఁగాంతాహంసియోయంచు నె
త్తినరెప్పార్పకచూచు దేవతలు సందేహింప వాహ్యాళికిన్

# పూర్వకవిస్తుతి

మ. తొలుతన్ గంధవతీకుమారుఁడు మహాత్ముండిద్ధగీర్వాణ వా
గ్జలధిం దాచెమనోజ్ఞభారతకథాజాలంబు నద్దానిమే
ల్తెలుఁగున్ గబ్బముగా రచించిన జగద్గేయుల్కవీంద్రుల్ గుణో
జ్వలులౌ నన్నయతిక్కయజ్వలను సంభావింతు శుంభన్మతిన్

మ. హరివంశంబున లోకమోహన సముద్యద్గీతముల్గుప్పి సుం
దరమందారలతాంతసంభవ సుధాధారాళి వర్షించున
క్కరణిన్ గావ్యసుధా ద్రవంబఖిలలోకంబెల్లవ్యాపింపఁగా
హరివంశంబు రచించె సోమకవిసింహంబాతనిన్ గొల్చెదన్

మ. సరళంపుం గవితాగతి న్నల హరిశ్చంద్రీయమున్ శ్లేషవా
క్పరిపాకంబు తరంగవేగమువహింపన్ శ్రీవసుక్ష్మాతలే
శ్వరగాథానిచయంబు సత్కవులుమెచ్చన్జెప్పి భాషాసతిన్
బరిపాలించిన భట్టుమూర్తి కవిరాణ్మత్తేభమున్గొల్చెదన్

వ. అని యిట్లిష్టదేవతా ప్రార్థనంబును సనాతనకవిజనాభివందనంబుగావించి.

మ. అకలంకంబగు సత్కవిత్వమునసూయాగ్రస్తులైకీర్తిసే
యక మూతింబిగియించు వారలకు సాష్టాంగంబుగామ్రొక్కిజం
కకలోపంబులుమోమునన్ బలికివెన్కన్గీర్తిగావించు వా
రికి జోహారొనరింతుశాంతమతి నర్థిభూతచిత్తుండనై

వ. యెల్లవారికిఁబ్రణమిల్లి యొకరసవన్నూతన ప్రబంధంబు రచియింపఁ దలఁచు నవసరంబున

సీ. మాతృగర్భంబున మసలుకాలంబున నబ్ధికన్యకపెండ్లి యాడెనెవని
నలనల్లమాటలనాడునాఁడెవని జిహ్వాపల్లవమున సత్యమువసించె
కౌమారమునఁబుస్తె గట్టించికొనియె నెవ్వనిచేతగానసంపల్లతాంగి
బిడియంబువీడి యిప్పుడుకీర్తికన్యక వలఁచి యెవ్వనివెంటఁ బరుగులెత్తు

తే.గీ. ఏకపత్నీవ్రతుండయ్యు నెవ్విధమునఁ
దాల్చె దక్షిణనాయకత్వంబటంచు
జనములద్భుతపడుదు రెవ్వనిఁదలంచి
యట్టి శ్రీశైలపతి సద్గుణార్ణవపతి

వ.	నిరంతరేతిపురాణేతిహాస ఘంటాపథపథికుండగుట హిరణ్యగర్భుండును దీన జనపోషణపరాయణుండగుటనాది నారాయణుండును, ఆత్మనామధేయైక పత్నీవ్రతత్వ సమలంకతుండగుట శంభుడునై మూడుమూర్తులవిభూతియు, సుంపతి విభూతియు, విభూతియుంగల్గి పరిఢవిల్లుచు నిష్టసఖులు పరివేష్టించికొలువ నిండుకొలువుండి.

మ.	ఒకనాఁడిష్టకథావినోదియయి యేదోమాటపై నెట్టి వా
నికిపుణ్యంబులభించు, నెవ్వఁడుధరా నీరేజమిత్రేందు తా
రకముల్నిల్చినయంతదాక బుధవారస్తోత్రగానార్హ నా
మకుఁడై యొప్పును చెప్పుడంచుఁబలికెన్ మాధుర్యధుర్యోక్తులన్

తే.గీ.	జలధరధ్వానమునకు మాల్వలుకునట్టి
భూరిదిగ్దంతులోయన ముద్దు ఫణితిఁ
బలికి రొక్కొక్క రొక యభిప్రాయమెనయఁ
దనకునచ్చిన మిత్రసత్తముఁడు దక్క

కం.	విని తనకెమ్మోవికిఁ దా
పినముత్తియమనఁగ నవ్వువెన్నెలొలయ నా
తని దిక్కుచూడ నతఁడో
"యనఘా విను" మంచుఁబల్కె నతిహర్షమునన్

తే.గీ.	ధరణినున్నది సప్తసంతానచయము
యిందుజీర్ణించిపోవదు కృతియొకండు
కృతినిఁచేపట్టువాఁడు శాశ్వతకుటుంబి
తేజరిల్లును కీర్తిపుత్రికలఁగాంచి

వ.	అని తన యభిమతంబున కనుగుణంబుగా వాక్రుచ్చు సుహృన్మణింగొండాడి, యెవ్వండిక్కాలంబునంగల కవులయందాదరణీయుండో యని కొండొకతడవూహించి, బ్రాహ్మణేతరుండనయి సమాదరణంబు లేమిం జీర్ణించుచున్న చాతురీగరిమంబునెఱపి యొండు రెండు గ్రంథములునొడివి కవిమండలంబున మినుకు మినుకునఁ దళుకొత్తు నాయందు గరుణాతరంగితాంతరంగుండై కులభేదంబను శంకంగళంకితంబుగావించి నన్నుంబిలిచి.

సీ. వ్రాసినాఁడవు సుధా వర్షమక్కరదీరఁ గురియంగ రుక్మిణీ పరిణయంబు
చెప్పినాఁడవు కవిశ్రేణి సన్నుతిజేయ ధ్రువవిజయముఁకుశలవచరిత్ర
వెలయించినావు నిర్మలభక్తితాత్పర్యమెనయఁ గ్రైస్తవులకేసుని జననము
పలికినాఁడవు చాటుపద్యంబులను కబ్బపుం గన్నియకుఁజారు భూషణములు

తే.గీ. జాషువానామకంబున జన్మమెత్తి
ధరణి లింగమవీరయ దంపతులకు
నుతులు గూర్చెదు పురుషభారతివి నీవు
నమ్ముమీమాట కవితనీసొమ్ముసుకవి

కం. నీచేఁజెప్పింపశివా
జీ చరితంబెల్లగతులఁజెల్లునయా వి
ద్యాచణ తదితరసత్కవి
వాచస్పతులున్ననిష్ట పడను కవీంద్రా!

వ. అని సబహుమానంబుగా

శా. తాంబూలంబున రత్నకాంచన పదార్థద్రవ్యముల్నించి మో
దంబాస్యంబున మందహాసమయిచిందన్ మేల్మిబంగారుహ
స్తంబందుంధరియించి "యోసుకవిచంద్రా! సంగ్రహింపంగదే
తాంబూలంబ"ని నాకొసంగె నతిశాంతవ్యాపితాలాపుఁడై

వ. అంతనేనానందంబుకందళింపనందికొని మదీయమనంబున వరాన్వేషణ పరత్వంబునఁగరంబు చరించు కవితాకన్యా ముఖపద్మమునరసి "యీసరసుని వరింతువే" యని పలుకుటయు మురిసికొని చిరకాలంబునుండి యెఱింగియున్నయదిగాన

మ. లలనామండల మన్మథుండు సుగుణాలంకారుఁడంకస్థితో
జ్వల విద్యారమణీవినోదియనిచెప్పన్ విందునీప్రాఁత సొ
మ్ములతోఁగాపురమొల్లనంచువదనంబున్వాంచి కావ్యంపుతొ
య్యలి గాద్గద్యము దోఁపగాఁబలికె హృద్యాలాపదీనధ్వనిన్

కం. అన నేనాయమ వదనం
బును ముద్దిడికొనుచు నెనరు ముప్పిరి గొననో
తనయా! భయమందకు చ
కని సొమ్ములుబెటి పంపఁగలనని పలెన్

వ. అంగీకారసూచనంబుగా తలనెగురవేయుటయు గృతిపతి వంశావతారంబభి
వర్ణించెద.

సీ. ప్రకటదివ్యోర్ధ్వపుండ్రమ్ములు కొల్వుదీరం దివ్యతరమైన రచ్చపట్టు
పవనడింభకుల దెబ్బలకోడు ముంగురుం గూనలల్లాడునిగూఢసీమ
ఆయురారోగ్యభాగ్యాక్షర పంక్తి చెక్కంబడు వెడదబంగారుపల్లకి
మోముఁగల్వకుఁ జెన్నుఁబుట్టించు వృద్ధిక్షయము నందరానిచంద్రార్ధరేఖ

తే.గీ. మాధవుని చిన్నిపాదపద్మములు సోఁకి
పావనతఁగాంచినట్టి దివ్యస్థలంబు
అట్టి మాబ్రహ్మలాలాటమవనియందుఁ
బుట్టి నిల్లగునే పుణ్యపూరుషులకు

తే.గీ. తనరునా వర్ణమను పుష్పవనమునందుఁ
బుట్టిరావూరి కుల కల్పభూరుహంబు
అందుశ్రీశైలపతి మకరాంక ఫలము
జననమందెను కీర్తి పుష్పములనడుమ

తే.గీ. ఆ మహాత్ముని గర్భమందవతరించె
నారసింహుఁడు కలియుగనారసింహుఁ
డగుచుఁబొక్కిటఁదమ్మియు ఖగతురంగ
మఱుత వనమాలకాంచనాంబరము విడిచి

కం. అరిజనరక్షః పతులకు
నరసింహుండనఁగవెలసె నరసింహుఁడు మే
ల్కరమున జక్రముఁదాల్పక
యురగమునన్నిద్రవోవకుండ ధరిత్రిన్

తే.గీ. సింధుగంభీరుఁడగు నరసింహమూర్తి
కుదయమందెను వెంకయాఖ్యుండుకీర్తి
కౌముదీచేలములతోడ గగనదంతి
కంటఁదడిబెట్ట మల్లెకుఁగన్నుకుట్ట

తే.గీ. చంద్రబింబము తనకీర్తి సౌధమునకు
భిత్తికాదర్పణంబుగా వెలయకున్న
లీలఁదనయింటఁదిరుగు కేళీకురంగ
మందు బింబింపనేల? చిహ్నంబుగాగ

సీ. చాచెనా! తన కరాబ్జము కవీంద్రులవైపు అదివారిదారిద్ర్యమపహరించు
పలికెనా! మృదుశబ్దపంక్తియార్తులతోడ నదివారిశోకంబునపనయించు
చల్లెనా! తనకటాక్షములనాథులమీద అవివారికభ్యుదయంబునించు
చిమ్మెనా! వరదరస్మితపాళి దిశలకు నది వారిజాస్యల మదిఁగలంచు

తే.గీ. అనుచు జనములు తనదు జీవనపుగాథ
లష్టదిగ్భిత్తికలమీద నచ్చుగుద్ది
వల్లెవేయఁగ సుగుణసంపత్తి రూప
మందినటులొప్పె వెంకయాఖ్యద్విజుండు

తే.గీ. అబ్జబాంధవుఁడెలమి ఛాయాపురంధ్రిఁ
బెండ్లియాడినగతిఁ దానుఁ బెండ్లియాడె
రామమాంబను నిజహృదారామమునకు
జారుమండనమైన వసంతలక్ష్మి

కం. ఆనారీగర్భము సం
తానరహితమగుటగుణనిధానన్ బుధస
మ్మానసుమాసమ, సురగజ
యానన్ జానమ్మఁబరిణయంబయ్యెల×

సీ. విభునిరొమ్మును సింహపీఠంబుగావించుకొన్నయిందిరకు సిగ్గునుఘటించి
ప్రియునకునర్ధనారీత్వంబు గల్పించు భవునిరాణికిఁ దలవంపునింపి
హృదయేశ్వరుని జిహ్వనెక్కి తాండవమాడు భాషాలతాంగి గర్వముగుదించి
ప్రాణనాథుని శిరోగ్రమునొవ్వకుప్పించి పైఁబడ్డ దివిజస్రవంతిఁదెగడి

తే.గీ. తనపతిపదాంబుజంబు లాత్మంధరించి
పతికిముప్వేలుపులభూతిపట్టు వడగఁ
గన్నుమూయకదను సురాంగనలు సూడఁ
గాపురమొనర్చె జానమాంబా పురంధ్రి

కం. ఆపుణ్యాంగనయందు మ
హాపుణ్యుండైన వెంకయార్యుఁడు సత్యా
లాపుం బుత్రునిఁగనె గౌ
రీపదసేవా ధురీణు శ్రీశైలపతిన్

తే.గీ. ముజ్జగంబులు ప్రేమించు ముద్దులాని
సరసగుణసమున్నతుని శ్రీశైలపతిని
యేమితపమున శ్రీవెంకయేంద్రుడౌర
కన్నవాఁడొకో చచ్చియెందున్నవాఁడొ

కం. పరమపవిత్రుని నిర్మల
చరితుని శ్రీశైలపతిని శత్రులె నుతియిం
తురు మనకేమిటికనుకొని
యరిషడ్వర్గంబుసేర దంతికమునకున్

సీ. బ్రహ్మవ్రాసినదరిద్రత దానపుంజేఁత మాయించు నపరరాధేయుఁడగుచు
జడకాలగతి కుంటువడియున్నసత్యంబు సవరించు నవహరిశ్చంద్రుఁడగుచు
కృశియించిపోవునాశ్రితరక్షణంబును వెలయించునలపాండవేయుఁడగుచు
కలిదౌష్ట్య కలన శోషిలుదీర్ఘశాంతికి దరిజూపు దశరథతనయుఁడగుచు

తే.గీ. విభుధగణములు ముక్కున వ్రేలునిల్పి
"భళి! భళీ! మేలు! మేలు! సెబాసు భూసు
రాగ్రణీయని" తలలూచి యభినుతింప
బ్రబలుచున్నాడు శ్రీశైలపతి విభుండు

సీ. యాచించువాఁడులేఁ డన్నలోపమెకాని లేదన్నలోపంబు లేనిదాత
ఘంటంబుచేఁబూను కవికళంకమెకాని గుణకళంకములేని కోవిదుండు
చిత్రలేఖకునికుంచియపొచ్చెమేకాని సొగసుపొచ్చెములేని సుందరుండు
ప్రాపుజేరెడువాని భాగ్యహీనతకాని ప్రేమహీనతలేని విశ్వభర్త

తే.గీ. కువలయంబేలఁ డన్న తక్కువయెకాని
సత్యపరిపాలనముసేయు చక్రవర్తి
చెలిమిమై కృతి కన్యకు జిక్కెగాని
చిక్కఁడెన్నండనాచారశృంఖలమున

ఉ. ఆసమెయిం గురూత్తముని యండన బాల్యమునందు నక్షరా
భ్యాసమొనర్చునప్పుడు లవర్ణదవర్ణములన్ననంగుళి
న్యాసము జేసి దిద్దమిఁగదా? కవికోటికిఁగృష్ణరాయఁడై
వాసిగడించె బ్రహ్మకులవార్ధిపయోనిధియయ్యెఁదెల్లనై

తే.గీ. మంచుమలపట్టిపట్టికిమన్మథారి
యస్త్రకళనేర్పినట్లు బాల్యంబునందు
శైలసుతపట్టి నెనయు శ్రీశైలపతికిఁ
గఱపె సత్యవాగ్విద్య వెంకయ్యబుధుఁడు

సీ. తన యభ్యుదయము శాత్రవజనాసూయతాగ్నిజ్వాలికలకు గుగ్గిలమువేయఁ
తనదానపటిమ పేదలనేచు నినుఁపగజ్జెలతల్లి కినుఁపసంకెలలువేయఁ
తనయోరిమి కృతఘ్నతామనస్కులనెల్ల గారించినిలువుననీరుసేయ
తనగానకళ శారదాదేవి క్రొంగుబ్బగవకుఁ బయ్యెదకప్పుఁ గలుగఁజేయఁ

తే.గీ. తనయశశ్చంద్రికలు దిగంతములఁగాయ
నిజకులాంబుధియుప్పొంగి నింగిముట్టఁ
గవిసమూహము కంఠభాగమునఁ బద్య
మాలికలువైచుచుండు శ్రీశైలపతికి

సీ. సిరిలేమ గీములనిరసించు కన్నులఁ గరుణారసంబుకాపురము సేయ
జింకతాల్పునకుఁ బొచ్చెముదెచ్చుమోమున నిండుగాంభీర్యంబు తాండవింపఁ
గమ్మని పల్కుల కిమ్మైన నాల్కపై సత్యవాగ్దేవి విశ్రాంతివడయ
యెలమావిచిగురుల నెనయుహస్తమునందు కల్పభూజము పంట వెలుంగ×××

తే.గీ. సకలజనములు వినుతి డోలికలుగట్టి
హాయిగానూచుచుండ సింహాసనంబు
లేనియొకచక్రవర్తియై లీలనేలు
చుండు శ్రీశైలపతి ధరా మండలంబు

తే.గీ. వెన్క శ్రీశైలపతి విరి వింటి వాని
భస్మమొనరించి యాదూరు పాసిపోవఁ
బుష్కరమూర్తియై జగంబులు నుతింప
మరులరావూరివంశ సంచయముగాంచె

సీ. ఆత్మేశ్వరునిమోముటద్దంబుఁగనుఁగొని కొప్పుదిద్దిన దివ్యగుణవిశిష్ఠ
ప్రాణనాథుని బాహు వల్లరీరజ్జుల నుయ్యేలలూగినయుత్పలాక్షి
జీవితేశుని రొమ్ముసెజ్జల నిరతంబు గునికినిద్రించిన కోమలాంగి
నాథుని ముసి ముసి నవ్వు లేవెన్నెల సంచారమొనరించు సరళహృదయ.

తే.గీ. పతిముఖంబున వెలువడు పలుకులెల్ల
గూర్చి శిరమున గీలించుకొనుపడంతి
మరణదేవత వదనగహ్వరముఁ జొచ్చి
దైవఘటనంబుచే నిల్లు దాటిపోయె

మ. తనువుందానుతొఅంగుటెట్లెటిఁగెనో ధైర్యంబువోనీయకం
తన కన్నీటిని లోనఁగ్రుక్కికొని"నాథా యొక్కమారిట్లు ర
మ్మని" చేసన్నలుచేసి లాలిత విలోలాలోకనాలాన బ
ద్ధునిఁ గావించియు నూరడించెనిదిగాదో శీలమబ్జాక్షికిన్

సీ. ఆయమ్మ పాదవిన్యాసంబునంగదా మెట్టతామరల కామెతలు చిక్కె
ఆ తల్లి మధురవాక్యవ్యాప్తిచేఁగదా కోయిలముద్దుగాఁ గూయనేర్చె
ఆ రామమేని బంగారు రంగునఁగదా సంపంగికుసుమంబు సాటికెక్కె
ఆ చాన సవినయవ్యాయామమున గదా సాధ్వీత్వమునకు ప్రశస్తిగలిగె

తే.గీ. ఆ లతాతన్వి యైదువరాలితనము
చేఁగదా భర్తృనంకాన సిరివసించె
ఆసతిగుణంబుచూచి కాదా యకాల
మరణమాశించి నిందల ద్రుందునిపుడు

మ. పరమామ్నాయవిహారి యాఘనుఁడు సంపాదించు దీవ్యద్యశోం
కురముల్భారతరాజ్యలక్ష్మికి దళత్కుందప్రసూనంబులై
తరళంపున్ముకురంబులై యమలచంద్రజ్యోత్స్నలై మేలిక
ప్పురపుందిప్పలునైరహించు నిరతంబున్నారదాభ్రంబునన్

మ. తనకీర్త్యంచిత చంద్రికాలవము చేతన్ జిల్లుఁతెల్లందనం
బునుగల్పించిన యామహాత్ముని ఋణంబున్ దీర్చుకోనెంచి క్ర
న్నన శ్రీశైలపతి స్థిరాహ్వయమునన్ వర్ధిల్లుటన్ బిల్లని
చ్చినవాఁడయ్యెహిమాచలుండు గజలక్ష్మీసంభవధ్వంసికిన్

కం. పరిణయమయ్యెం గడు సుం
దరుఁడగు శ్రీశైలపతి ముదంబున నతిసుం
దరి దరహాసవినిర్జిత
శరదిందుచ్ఛవిని శ్రీవిశాలాక్షి సతిన్

కం. ఆయమపాయకపతికిం
జోయవలెంగాపురంబు సలిపెం దమకున్
గాయంబులు రెండైన
న్గాయంబులు మదులురెండు గానీకుండన్

తే.గీ. వారిదాంపత్య సంపద వారిస్నేహ
భావవల్లరులారీతి పల్లవింప
దున్న గుఱ్ఱమునెఱరౌతు కన్నుగవకుఁ
గలిగెనెక్కడలేని చెంగల్వకలిమి.

తే.గీ. ప్రియునికౌగింటనకటరాత్రిందివంబు
నలరు నిల్లాలి దయమాలి తొలఁగఁదీసె
భ్రాతృజీవన సిరులనోర్వంగరాని
కటికకన్నులవానికెక్కడిది కరుణ

శా. అర్థాంగంబుశరీరసర్వమున గోయంబద్దరీతిన్ దదీ
యార్థాంగీమణిదేహమున్ విడిచిపో వ్యర్థంబులైతోచె స
ర్వార్థంబుల్సుఖముల్ త్రిలోకములు విద్యాకీర్తులర్థివ్రజ
స్వర్థేనూత్తమకీర్తికాసుమకలంబ స్ఫూర్తిమన్మూర్తికిన్

కం. తెలిచూపుచలువఁదనమునఁ
గలువల చెలికానిచంద్రికలంజందనపుం
బలుకులఁ బోషించెడు కాం
తలకు విశాలాక్షిమండనంబు ధరిత్రిన్

సీ. మందయానల శిరోమాణిక్యమనుమాట మొలనూలి పైడి గంటలు వచింప
అంబుజాస్యలకెల్లనవతంసమనుమాట కులుకు ముంగురు ఁదుమ్మెదలువచింప
మానవతులకెల్ల మండనంబనుమాట ననలెత్తు సిగ్గుకూనలువచింప
పుణ్యకాంతలకెల భూషణంబనుమాట సతతపూజా పరిశ్రమవచింప

తే.గీ. ప్రాణనాథుని హృదయ ప్రపంచమునకు
ప్రమదచంద్రికావిమలవర్షములుగురిసి
యంతరించిన శ్రీవిశాలాక్షి సతినిఁ
దలఁచి విలపించు నిపుడు భూతలసవిత్రి

ఉ. అక్షరమైనశీలము న యాచరణంబను విద్దెనొజ్జయై
శిక్ష యొనర్చు నాకపురి సింధురయానలకంచు ధాత లో
భక్షతచిత్తుఁడై మరణ పట్టికలో విలిఖించె శ్రీవిశా
లాక్షి సతీమతల్లిని వాయన్విడదేవిధి కన్నుగుట్టినన్

తే.గీ. జీవితేశుని కన్నీరు చిలుకరించి
యంకముఁదొఱంగెనన్న కళంకమొకటి
చొప్పడక యున్న మగని శుశ్రూషణమున
వెలఁది కేపాటినాఁటి సావిత్రిగాథ

మ. కడకంటన్నునుమందహాసములు నిక్కంజక్కణంబైన ప్రే
ముడి సంద్రంబునఁజొక్కపుం భుజయుగంపుందెప్పలందొప్ప గూ
ర్చెడునారీ తిలకంబకాలమున మా శ్రీశైలపత్యంకము
న్విడియున్వీడదు భావ పంజర సుఖానిర్భూతసంచారముల్

సీ. అవ్యక్తమధురవాక్యఁపుఁదేనెమేదించి భర్తకన్నముఁబెట్టు పరమసాధ్వి
జిగిమించుబెళుకుక్రొన్నెగవుమల్లెలుగ్రుచ్చి పతినిశృంగారించు వనజగంధి
కడుఁగోమలంపుటంకపుఁ బానుపులమీద నాథుని జోకొట్టు నవ్యచరిత
తొగరంగుజిగురు చేతుల చల్వలంటంగ మగనిమజ్జనమార్చు మాననీయ

తే.గీ. ప్రాణనాథుని ప్రణయసామ్రాజ్యమునకుఁ
పట్టముంగట్టి లాలించు భవ్యచరిత
కీర్తిమిగిలించి స్వర్గమెక్కినదె యకట!
యందములచాది శ్రీవిశాలాక్షిదేవి

మ. చిరకాలంబును జీవితేశుఁడుశుభశ్రీ మీఱఁగా పెద్దని
ద్దరమైకన్నులు మూసి స్వర్గపురమందుం దివ్యమందార భా
స్వరసంతానలతాంతకందళకదంబచ్ఛాయలం గుందప
శరణంబుంబొనరించుచున్నయవి రాజత్పీఠికాయంబుతో

తే.గీ. పొరయునా విప్రయోగంబు దరియలేక
విసముసేవించె దేహంబు విడుచుకొఱకు
విషమమృతమయ్యె నంతనా విషరసంబు
గుడిచి శ్రీశైలపతి మిత్తిగొంగయయ్యె

కం. జనకుని యనుమతమునఁ జే
కొనె మ× శ్రీశైలపతి సుగుణవతిని దయా
వినయమతిని శ్రీలక్ష్మాం
బనునామము భిన్నమైన ప్రథమార్ధాంగిన్

సీ. పరిణయంబునఁ దలంబ్రాలుపోసెడువేళఁ గోమలేక్షణములఁగొంత గడపి
తనతోడ సనెకల్లుదన్ను కాలంబునఁ కులుకునవ్వులురువ్వి కొంతగడపి
గళమున సూత్రంబుఁగట్టు నప్పుడు గాత్ర కుసుమంబు సోకించి కొంతగడపి
శేషహోమాంతికసీమకేతెంచుచు దంతియానముజూపి కొంతగడపి

తే.గీ. కడపెసర్వంబు ప్రథమసంగమమునందు
ప్రియునిడెందంబునందావరించి యున్న
ప్రథమపత్నివియోగ దుర్భరభరంబు
లలితముఖబింబ! వెంకట లక్ష్మమాంబ

సీ. అక్షికోణంబుల యందలంకారంబుగా భర్తృ మంగళాంగంబునిల్పి
వినయ వివేకాది బీజము ల్మొలకలెత్తనెత్తనైన డెందమునవాటి
చెలువైన కంకణంబులుపెట్టి పోఁతలు తొగరుబంగారు చేతులకుఁదొడిఁగి
చెవితుమ్మెదలుగోరు జిలుఁగు పుట్టుకతేనె పలుకుబ్రువ్వులలోన నిలువఁజేసి

తే.గీ. శ్రావ్యరవములఁదనవిలాస ప్రశంస
ముద్దుకటకంబులొండొండు ముచ్చటింప
పూవువిలుకానిపుట్టుక ముందునాఁటి
లచ్చివలెనింటనడయాడు లక్ష్మమాంబ!

ఉ. ఆ లలనా విలోలదరహాసము రాశివిభూతి పూతయై
బాలశశాంకమై గగన వాహినియై, దళుకొత్తుచుండ శ్రీ
శైలపతీస్థిరాహ్వయము సార్థకతం గన నొప్పుచుండు శ్రీ
శైలపతి ప్రభుండు ఘనసార తుషార పటీర కీరులన్

షష్ఠ్యంతము

కం. ఏవంవిధ గుణమణికి ర
సావాసితమధురగాన సాగరునకు దే
వావాసద్విపరాజ య
శోవారునకరిజనాబ్జ శుండాలునకున్

వ. అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూను మహా ప్రబంధంబునకుఁ
గథాక్రమంబెట్టి దనిన

సీ. నురుగునవ్వులతోడఁ బరుగులెత్తు భుజనాగ్రముఁజెంగలించిగంగమ్మగులుక
సామేననున్నదుర్గామానినీమణి చిరుతచందురునితో సరసమాడ
పునుకదండలమధ్యమున వ్రేలు రాచపాములు ఫణామణుల నిప్పుకలుగురియ
దనుజాంతకంబు ముమ్మొనవాలుసర్పంబునొకచేతిలోన నాలుకలుసాచ

తే.గీ. సడలిదిగజారు వేదండ చర్మపటము
నంచితంబుగఁ గటి సవరించికొనుచు
భర్గుఁడొకనాఁడు నిర్మల స్వాంతుఁడగుచు
వెండిమల నెత్తములఁ గూరుచుండియుండ

శా. క్రుంగెన్ భూరమణీమణీ వ్యధలునీకున్ భద్రముల్రాసమి
ద్రంగాకాశనదీసుతా! భళి! మహారాష్ట్ర ప్రచండార్క వా
సిం గైకొమ్మనుముద్దుపాట వినవచ్చెన్ గానలందుండి త
ద్గంగాదివ్యతరంగరావములు క్రింగన్ గించిదస్పష్టమై.

ఉ. కమ్మనితేనెలై చెవులఁగ్రమ్ముశివాజి జయప్రబోధ రా
వమ్ములలో మునింగిన భవాని శరీరమెఱుంగకంకసీ
మమ్మునఁబాలకేద్చెడు కుమారునిగాంచదు భక్తుఁడన్నని
క్కమ్ముగఁబుత్రరత్నములకన్న మహాత్ములు పెద్దసేయరే

తే.గీ. పూనివినువాఁకలోనికరానితమ్మి
పుప్పొడిదుమారములచెల్మి పొసన్మలయు
కూనతెమ్మెరలను గూడికొని పినాక
పాణికా గానమింపుగా బరిణమించె

కం. మృదుండటు పూచిన కన్నుల
వెడలెడునబ్బురంపుంజూపుం బిల్లలందన పెం
దొడతిన్నెనున్న నెయ్యంపుం
బడంతిపయింబఅపి వేగపడి పల్కెనిటుల్

కం. ఎవరీమరాటవీరుం
డెవరిచ్చటం బాడువార లీతనిగాథా
నవసుధలు సోరి మనజా
హ్నావి వనములు చిగురుబెట్టినవి చూడుముమా!

కం. అనవిని సర్వజ్ఞులకా
తనిచరితముదెలియకున్నదా? చెప్పెదనై
ననుచునగి పయ్యెదకొం
గునుజక్కంజెక్కి పూనికొనె వివరింపన్

శా. దేశద్రోహులంజెండి యెల్లెడల శాంతిచ్ఛాయగల్పింప దే
వీశస్త్రంబు కరంబునన్మెఅయనావిర్భావమందెన్ మరా
టా శౌర్యజ్వలనంబరాతి జనకాండంబున్ దహింపన్ ధరి
త్రీ శాతోదరి సంతసింపంగ పురారీ! మానవాకారమై

తే.గీ. ఆ మహాత్ముని చారునామాక్షరములు
చెవులసోంకిన యంత దారువులు కాని
భరతపుత్రులమేనులు పల్లవింప
వెలయు మనవనంబులు పల్లవించుటరుదె

కం. అమరసతులు గంగాస్నా
నములాడంగ నిటకు దినదినంబేగి విలా
సముగా నాతనిపై గా
నముసేయుచు నుందురీవనంబులనభవా!

సీ. సగర మాంధాత్రాది షట్చక్రవర్తుల యంకసీమలనిల్చినట్టి సాధ్వి
కమలనాభుని వేణుగానసుధాంబుధి మునింగితేలిన పరిపూతదేహ
కాళిదాసాది సత్కవికుమారులంగాంచి కీర్తినందిన పెద్దగేస్తురాలు
బుద్ధాదిమునిజనంబుల తపంబున మోదబాష్పములీడిచిన భకురాలు

తే.గీ. సింధుగంగానదీ జలక్షీరమెపుడుఁ
గురిసిబిడ్డలఁబోషించుకొనుచునుండు
పచ్చిబాలెంతరాలు మాభరతమాత
మాతలకు మాత సకలసంపత్సమేత

ఉ. ఆరమణీమణీపరిణతాంతరగర్భబిలంబు నుండి ధౌం
డీరకుమారకుల్సమరనిష్ఠితబుద్ధులు సత్యదానసం
చారులు భారతీయులు విశాలభుజుల్జనియింతురర్థిమఁ
దారులు, మొన్నమొన్నజననంబయిరేలనొ శుష్కముష్కరుల్

సీ. గోగర్భములను పెక్కులుసించి తనమేనఁ దనరునమూల వస్త్రములుజించి
ప్రకటదేవాలయ వ్రాతంబు పడఁదన్నిడంబైన తనకిరీటంబుఁదన్ని
రమణీయతరపురాణములు దగ్ధముజేసి తనసొమ్ములన్నిదగ్ధంబుచేసి
సకల వర్ణములకశాంతి కల్పనజేసి తనకశాంతంబు కల్పనము చేసి

తే.గీ. పుణ్యకాంతల ధమ్మిల్లములు విదల్చి
తనమనోహరధమ్మిల్లమును విదిల్చి
భారతాంగనా నవ్యశృంగారకళకుఁ
గజ్జలముఁబూసెనా తురుష్కవ్రజంబు.

# శివాజీ

కథాప్రారంభము

కం. శ్రీరావూర్యన్వయదీ
పా! రమ్యగుణప్రసిద్ధ బాంధవజన పు
ష్పారామమాధవా! శా
రీరద్యుతి జితదినేశ శ్రీశైలపతీ!

సీ. శాత్పురాపర్వతస్రఙ్మాలికలు కసుగందక గళమునందందగింప
ఆరబీయసముద్రమాప్తబాంధవుని భావమున గంభీరభావములు గఱప
వాణిగంగానదీబాలిక వీచీ విపంచికల్చెంతమ్రోయించుచుండ
మానికుదుర్గంబు మాన్యజయాభి చిహ్నములైన పట్టుజెండాలుబట్ట

తే.గీ. సహ్యగిరి కానన విహార సరసపవన
పులకితశరీర చలిత కుంతలయు నగుచు
శత్రురాజులకభ్ర పుష్పంబు భాతి
తేజరిల్లు మహారాష్ట్ర దేశలక్ష్మి!

శా. ఆ దేశంబున సంభవించిరి రణవ్యాపార పారీణ బా
హాదర్పప్రతివీరగంధగజ రంహత్సింహులూహా మహా
యాదోనాథులు మా పదాబ్జ భజనావ్యాసంగులుద్యద్ధను
ర్వేదాచార్యులు, భారతీయజనయిత్రీపుత్రముక్తామణుల్

తే.గీ. ఆమహారాష్ట్రవంశమం దవతరించి
వీరుఁడు శహాజి జిజయను వీరకాంతఁ
బెండ్లియాడెఁ గుమారుడావిర్భవింప
నాఁడుననునీవు పెండిలియాడినట్లు

కం ఆజంపతులకుఁదొలుతఁ ద
నూజిత భాస్కరుఁడు శతమనోజసమాన
భ్రాజిత రూపంబున శం
భాజీ నామమున నొక్కబాలుఁడుపుట్టెన్.

వ. ఆశహాజీవీరుఁడు

చ.	వదలక పెద్దకాలము నవాబులకొల్వుననుండెఁ దానహ
మ్మదు నగరంబునందు నభిమానముమానముఁదక్కి సింగపుం
గొదమనుపిల్లిగా సలుప గోరుచుఁ బిల్లిని పెద్ద సింగపుం
గొదమను న్సేయగోరునొకకుంచియనల్వకుఁ జేతనుండదే

ఉ.	వ్రాలటులుండగా తురకరాజులఁగొల్చెదు భర్తమీదని
ల్లాలొకసారి లేఁత హృదయంబున జాలి వహించు దేశ క
ల్లోలములన్నియుం దలపులోఁ బ్రతిబింబితమై భయంకర
జ్వాలికయై వెలుంగునొకసారి జిజా గిరిజామనోహరా!

మ.	పలుకున్నాథునిఁ గూడుచో యవనసేనావారిధిం దాటిపో
వలెనంచుం బలుమారు రూక్షగళరావంబొప్పనమ్మానినీ
తిలకంబోర్తురె భారతీయజనయిత్రీ పుత్రికల్ వీరకాం
తలు దేశస్వమతాభిమానములుడిందన్ నీచదాస్యవ్యథల్.

మ.	చెవియొగ్గన్ బ్రతిచెప్పఁడెన్నఁడు శహాజీవీరుఁడారామగా
రవమేపార వచించువాక్యములు నారాచంబులేయైననౌ
నవునెవ్వండెదిరించు దుష్పథచరుండై యాత్మజాయోపదే
శ వచోస్త్రప్రనిశాతహేతి విపులజ్వాలా విదగ్ధాంగుఁడై

కం.	ఆ రీతి వారి హృదయ వి
కారములభివృద్ధినందు కాలంబునన
న్నారీమణికింగర్భాం
కూరము పొడసూపె నన్నుఁ గొలుచు కతమునన్

కం.	కడుపుననున్నకుమారుని
బెడిదఁపుఁగోపాగ్ని పెచ్చుపెరిగెనొయనన
ప్పడితికి నాథునియెడ నే
ర్పడియెం గోపంబనిష్టభావంబభవా!

తే.గీ.	ఆ జిజాబాయి నన్నుహృదబ్జ మందు
మరువక "భవాని! స్వకులాభి మానియయిన
పట్టినొసఁగుము నీపేరు బెట్టుకొందు

కం. ఎడనెడ నేడవనెలజొరఁ
బడఁబుట్టకవెంటవచ్చు పాపందునుఁ బు
ట్టెడు కోపఁపుఁబాపలున
య్యెడఁదోడై నడువఁ బుట్టినింటికిఁబోయెన్

కం. ఆ మీద మరుఁడు శహా
జీ మనమునఁ గొల్పుఁదీరి శీఘ్రమున జిజా
భామను మరపితుఖాయను
కోమలిని వరింపఁబూవుఁ గోలలువైచెన్

వ. అట్టి తరుణంబునఁ బుట్టినింట జిజాబాయి మూడుమాసములు గడపి నా పూజ
యందప్రమత్తయయిప్రవర్తింప

ఉ. ఆయమ గర్భవీధులవిహారముపూరితిఁజేసి విస్ఫుర
త్కాయముతోశివాజియవతారమునెత్తె రహస్యమేల నా
థా! యవతారమెత్తితి నరాకృతినేనసుమా! యశశ్చవు
ల్గాయఁగశాలివాహనశక క్షయ వత్సర మధ్యవేళలన్

శా. ఆ సర్వేశ్వర విగ్రహంబు జననంబైనంత నాకాశవీ
ధీ సంచారవిలాసినీతతి జయేతిధ్వానముల్సేసె ఢి
ల్లీ సుల్తానులయంతరంగములు ప్రీలెన్ వీచెవాతూల బా
లా సంతానము భావిబారతజయోల్లాసంబు సూచించుచున్

చం. తురకల దైవతంబగు విధుండలఖానునేచు వీరభా
స్కరుఁడుదయింపఁ దేజముపసల్దిరుగం బఱుగెత్తిత్వజ్జటాం
తర గహనంబునంబడి పదంబుగదల్పఁడు లేనిచో దయా
భరణ! కళంకితాత్ముఁడగువానికి నీ యెడ భక్తినిల్చునే!

చం. ధవుని వియోగబాధ పరితాప దవాగ్నికిఁ పుత్రదర్శనో
త్సవ మిసుమంత శాంతినిడఁ జాలియు చాలకపోయె నీచభూ
ధవపద సేవనారతినతండెడబాయమి పెచ్చుమీరి యు
ద్భవమయి మండుచుండెడు క్రుధా దవవహ్నికి శాంతిసేయగన్

తే.గీ. భరతనందన! యవనసంపదహరించి
నాఋణంబును దీర్పుమన్నాయటంచు
నొనరcబల్కుచుc బుత్రున కుగ్గcబెట్టు
నుగ్గుగా దది క్షాత్రంపుటగ్గిగాని

ఉ. ఓలిcబసిండిముత్తియcపు టూయెలతొట్టులనుంచినిద్రవో
రా! లలితాంగ! ముద్దులసుతా! యని జోలలబాడుచుండునా
బాలునితోc దదంతికప్రజ బాలుడునిద్దురవోవు పల్కుము
త్యాలెడలన్ జిజారమణి యంతిపురంబుల మధ్యసీమలన్

చం. జిలిబిలి జోలపాటలకుజెక్కిన వీరరసార్ద్రశబ్దపం
క్తులు పెఱతేనెలై చెవులకున్మెలమెల్లన సోకcగల్కి న
వ్వులుగురియించుచుం బసిcడి మువ్వలు మ్రోయపదంబులెత్తి కే
కలనిడుచుండుబాలుc డధికంబుగమెత్తని తల్లిపొత్తులన్

శా. సారంగాంకునిcజూపి యాపడcతి "యోజాబిల్లి! యోచంద
మా! రావే" యనికంఠమెత్తి వచియంపన్ బాలుcడుద్వేగియై
పోరుంబెట్టునతండు మ్లేచ్ఛులకు దేవుండౌట బాల్యంబునం
దారంభించుగదా? మదిష్టులకు దివ్యజ్ఞానసంపద్దశల్

సీ. అలధనంజయుని బాహులcగౌcగిలించి శోభిల్లి భారతవీరరసము
ధర్మసంభవుని నేత్రముల గంతులుబెట్టు పరకామినీ మాతృభావశక్తి
పరశురామునిమేటి పరశుధారలనెక్కి విశ్వసన్నుతిc గన్న విజయధాటి
దేవతావిద్వాంసుc భావరంగమునc బెంపుగ నాట్యమాడిన బుద్ధిబలము

తే.గీ. పాలలోనుగ్గులో బొందుపరచి తల్లి
యుదయసాయాహ్నములc బోయుచుండc బెరిగి
మెలcగుచు శివాజి తప్పటడ్గులనువైచెc
గలcగి తురకలు తప్పటడ్గులనువేయ

సీ. కరచినాడఖిల విఖ్యాతగాథాపూత వరగీతికలు పాలు మఱచినాcడు
యెతిcగినాడవని మాతృవ్యధాభారంబు మురిపెంపుటుయ్యాలc దొఱcగినాcడు
యుడికినాcడరివిజయోత్సవార్భటులకు బుడిబుడి కవచాలుc దొడిcగినాcడు

తే.గీ. యవన దుందుభి ధ్వానంబు లాలకించి
పట్టుదట్టీలుకటి మీదంగట్టినాఁడు
భావిమానవ విజయ ప్రబంధమునకుఁ
దనరుఁగద శైశవంబుపోద్ఘాతమగుచు

ఉ. పుట్టఁగనుండె మ్లేచ్ఛవనముల్దహియించెడు కారుచిచ్చుకా
బట్టి జిజాసతిన్మగనిఁబాపె విధాత యతండువైరి స
ప్రాట్టుల యందనుండెడు కుమార్గచరుండని తమ్మిపట్టికీ
గుట్టులెఱుంగుశక్తి సిరికోమలి యుగ్గునఁబోసిపెంచదే?

సీ. జనని వర్షించు దీవెనల గొజ్జఁగినీట నభ్యంజనస్నానమాచరించు
తల్లి వల్లించు హైందవ వీర వర్ణనార్ణవములంబడి శరీరంబు మఱచు
జనయిత్రి సల్పుపూజాభోజనంబు భోజనముగాఁ గల్గి భోజనము విడుచు
అంబ చూపించు జన్యక్షేత్రములమీద నడుగులు ముద్రవేయంగఁబారు

తే.గీ. తురకలను మాటచెవిలోనఁ దూరినంతఁ
జిన్నికత్తులు చేఁబూని చిందులాడు
భారతకుమారుఁడౌర శివాజితేడు
పిల్లమొనగాఁడు నడయాడు పిన్ననాఁడు

తే.గీ. ఆ కుమారుని దేహమధ్యంబునందు
రక్తమిషఁ బారుచుండు క్షాత్రంపునదులు
తరమెవర్ణింప? భరతసంతానమైన
వీరమాతృకాగర్భగంభీరమహిమ.

తే.గీ. కాలకల్లోలినీతరంగంబులయిన
యారువర్షంబులు శివాజి యధిగమింప
వలచిపెండ్లాడఁ బసుపుబట్టలు ధరించి
యవతరించెను విజయకన్యకలు దిశల

శా. అంచన్మోహనలీల లింపెసఁగఁ బుత్రాకారతన్నాకు జ
న్మించెన్ దెందములోని కోరికలు సందేహంబు లేదంచుఁ బో
షించున్మించు మెఱుంగుహస్తములఁ బూజించున్ జగన్నాథుఁ గ
టించున్ రకలఁదీరరాజముల నాడించున్ శుభస్నానముల్

వ. అట్లా జిజాబాయి విజాపురంబున నిజతనూజుని శైశవక్రీడా వినోదంబులనరసి మురిసికొనుచు విపక్షశిక్షాదక్షణానుకూలంబులును, స్వకులస్వమత పరిపోషణ క్రమమార్గాంగీకారంబులును, వీరరసోద్బోధకనిర్వక్రవిక్రమ దోస్సారసారపరిస్ఫారంబులును, భారతకాంతా కర్ణాలంకారంబులును, యకలంకంబులును, యచేతన పదార్థచేతనీకృత సమర్థమసమర్థంబులును, అకలంకంబులునగు గీతంబు గఱపుచు సంరక్షించుచుండు సమయంబున నహమ్మదునగర భూపతులకుఁ బ్రతిపక్షులగు.

ఉ. మొగలుదండనాయకులమోఘ బలాఢ్యులు దుష్టచిత్తుల
చ్చోఁగల దుర్గరాజములు శూరతముట్టడి జేయుచుండి కా
రాగృహమందునుంచి రొకరాతిరి బాలశివాజితో శహా
జీ గృహిణిం జిజాసతిని సింధురయానను నిర్దయాత్ములై

చ. బుడుత శివాజిచిట్టి పదముల్తడబాటుననూదికొంచు వెం
బడిఁజనుదేర మస్తకమువంచి, తనూలత దూల మేలిక్రొ
మ్ముడివిడి వెన్నునంబడఁగఁ బుట్టెడు దుఃఖము పొర్లి చెక్కుల
న్దడప జిజావిలాసినియనాథ చనెం జెరసాలలోనికిన్

మ. చకితస్వాంతమునన్ గలంగదు తురుష్కశ్రేణికిన్ గాని, త
ల్లికి బందీగృహవేదనాభరముఁ గల్పించెంగదా వీనిపు
ట్టుక యంచున్ జనులాడు కొందురని యేడ్చున్ గామినీరత్న మం
బకపద్మంబులు నిండి బాష్పములురోభాగంబునన్ బారగన్

మ. తెలివిన్ దక్కదిలాపురంధ్రి నిజపుత్రీ బాష్పవర్షాంబుధా
రలనార్ద్రీకృతవక్షయయ్యు నలకారాగారమందము
ల్జిలుకన్ గంతులు వేయుబాలుని శివాజింజూచుచున్ బల్కుప
ల్కులనాలించుచు లేఁత క్రొంజిగురుటంఘ్రుల్ సోకిముద్దాడుచున్

ఉ. మానవతీలలామ యభిమానము మానక మానవాధము
ల్గానులు గానరాఁదనువుగానని కిన్కనిజాననంబునన్
బూనికృశానుకీలలఁ గనుంగవఁ జిమ్ముచునుండు నిట్టిచో
యీనిన సింగపుంబడఁతి కెట్లుపమింతును కంతుహంతకా!

చ. తురకల దౌష్ట్యమున్ బుటుకతో వివరించెడు తల్లి వాక్సుధా
క్షరములు సత్యవంతములుగా నెదనమ్మ విధాతయే యుదా
హరణముగా శివాజి నిటలాంతరమందు రచించి మున్నెయే
ర్పరచిన కష్టకాలమనవచ్చుఁగదా? మదవారణాంతకా?

వ. ఆ తరుణంబున మోగలులఁగొల్చు శహాజీ బందులు కొందరా సుందరాంగిని బందీగృహవిముక్తం జేయందలంచి తేని కడకుంజని "శహాజీ పునర్వివాహమొనరించి కొనియె నీ పడంతి కాతని కెట్టి సంబంధంబులేద"ని పల్కి యాతని సమ్మతి పరచి బంధ విముక్తంజేయఁ గ్రోధ జ్వాలా సంతప్త కాంచన శరీరయై, మరాటా బాలసింహంబనందగు శివాజికింబాలు గుడుపుచుఁ దటాలున లేచి భటమండలంబు నొక్క గ్రుక్కన మ్రింగెదనుండుండని యర్థమిచ్చు చూపులనగ్గి మిడుఁగురులు గురియ, చిట్టి మట్టియల పొట్టియులివులు తురకవజీరులకు వికారముఁబుట్టింప, శాత్రవనాశన సూచన కేతనంబనందగు పయ్యెదను బొడ్డునఁజెక్కి బిరబిరవెడలి.

చ. తనువుననంటెమ్లేచ్ఛ సరదారుల నీచకళంకపంకిలం
బని తలపోసి చేరువజలాశయ నిర్మల తోయమందు క
ట్టిన వసనంబుతో కదువడింబడి తానముసేయకుండ నిం
టనడుఁగు బెట్టదయ్యెనుపడంతి మృడా! యది యేమి నీమమో

వ. అట్లా వీరపతివ్రత నిజధామంబున వసించుచుండ నట నహమ్మదునగరంబున

ఉ. ఆస చెనంగనచ్చటిధరాధిపుఁడెప్పుడుఁబోరుచుండు ఢి
ల్లీసులతాను తోడుతఁజలింపని శౌర్యరమా సమున్నతో
ల్లాసము మీరఁగా విజయలక్ష్మి కనుగ్రహముప్పతిల్లవే
దాసరిరాజులందొకరియందును, మందులుగాఁదలంచెనో

ఉ. పావన విక్రమక్రమ దివాకరుఁడై పొలుపొందు యుద్ధగాం
డీవిశహాజి, యాత్మధరణీ ధవుఁడింపలరంగలచె బా
హావహనప్రతాపమున నాహవరంగములన్ దురుష్కధా
త్రీవరులన్ దురాగతచరిత్రుల గోహనన ప్రధానులన్

చం. తరుగని సామిభక్తి సరదారుతనంబసమాన భీమసం
గరగరిమంబు మీర మొనగాఁడని పేరు వహించి శత్రుభూ
వరులకుగాలమై యచటి పార్థివచంద్రుని కొల్వుశాలకా
భరణముగా మెలంగె, పురవారవధూరసనప్రచారియై

ఉ. కోరికపల్లవింపఁ దనకున్ ధరణీశ్వరుడందునిందు జా
గీరులుపాయనంబు లొసగెన్ దనరాజ్యములోననవ్వియే
వీర శివాజి కట్టఁదలపెట్టు మహోద్యమసౌధరాజి కా
ధారములయ్యెఁ జిత్రము గదా? పరమేశ్వర నీ విలాసముల్

చం. బలుఁడగు నా శహాజి వరపాలఁప్రజాబిలికూన గాయు వె
న్నెలలకు రాజచంద్రుపద నీరజవీధుల నొప్పుగోరు చు
క్కలకు ఋణంబు దీరఁదగు కాలము చేకూరఁబోలు ముఖ్యమం
త్రులకు ధరాధినేతకు విరోధపుటగ్గి జనించెనచ్చటన్

చం. సరగ శహాజివీరుఁడు విజాపురభూపతి నాశ్రయించి కా
పురమొనరించుచుండి, మునుముందు పరిగ్రహియించెనింతిని
న్జిరుతశివాజినక్షుల జనించుముదశ్రులవుల క్కుమారరా
డ్వీరుఁడు ధరింపఁబోవు మకుటస్థితవజ్రపురవ్వలైతగన్

తే.గీ. కొడుకు చక్కనివాఁడనుకొని శహాజి
మురిసికొనుచుండుగాని మున్ముందు తనకు
శాశ్వత యశఃప్రసన్నపుష్పములు పూయు
కల్పతరువను గుట్టెఱుంగండతండు

సీ. మేటిమరాటభూమీవధూమాణిక్య ధమ్మిల్లమునకుఁ గుందనఁపుఁ బూవు
దర్పితారాతిభూధవధార్తరాష్ట్ర సమూహంబునకు మొక్కవోని పిడుగు
యవనసామ్రాజ్యమహాసుధా సౌధవ ప్రస్థానములకు ఫిరంగిగుండు
ఆసేతుహిమగిరి వ్యాపిత భరతకాంతా బాహుపంజరాంతరఁపుఁజిలుక

తే.గీ. విమతరాజన్యకీర్తి వస్త్రములనెల్లఁ
గొట్టిమట్టాడు బలమైన కొండ యెలుక
క్రమముగా బాల్యరజ్జుబంధములు వదల
నెదుగుచుండె ధరాదేవి యెదురుచూడ

వ. అంతఁ గొంతకాలంబునకు శహాజి

ఉ. భారతవీరబాలుని శివాజిని మోదముతో నవాబు ద
ర్బారునకొక్కనాఁడు బలవంతముగా గొనిపోయె పచ్చిసిం
గారఁపుఁ బట్టుకుచ్చులొరగంబడి వ్రేలుకుళాయి మంచిబం
గారఁపుగుండ్ల పేరులు నిగారఁపుటంగి తుఱంగలింపఁగన్

వ. ఆ సమయంబున నవాబుశేఖరుండు వైభవమ్మున దేలుచు

ఉ. చెక్కులనుండిక్రొంజెమట చింది పడన్నెలరాలుకాడలన్
జెక్కినచామరంబులను చేకొనికాంతలు వీవ, మంత్రులున్
దక్కినభృత్యకోటి సరదారులుఁ గొల్వఁగఁ గొల్వుమింటికిన్
జుక్కలరాయఁడై వెలుఁగుచున్ గొలువుండెఁ బసిండి గద్దెపై

వ. కుమారునితో రాజద్వారంబు సమీపించిన శహాజీ వీరుఁడు.

మ. చిటిత్రేలూతగ వెంబడించెడు శివాజీ హస్తమున్వీడి, ముం
గిట నమ్రీభవదంగుఁడానత బలగ్రీవుండునై, ఫాలసం
ఘటితానూనకరద్వయంబమర, "సర్కార్సలామంచు", వి
స్ఫుటకంఠంబునఁబల్కెఁ జెంగటఁదనూజుండుగ్రుఁడై చూడగన్

శా. ఆరాజేంద్రుని యోలగంబు మహిమంబా సింగపుంగద్దె యా
నారీ మండలకుండలీనటన మానానామణిస్తంభ గం
భీరాగారవిచిత్ర చిత్రచయమో విశ్వేశ్వరా! యాశివా
జీ రాజన్యకుమారచంద్రు నుడికించెన్ బాడబజ్వాలలై

కం. ధరణికి దిగిమెలఁగెడు చం
దురుఁడోయన నా శహాజితోవచ్చెడు సుం
దరుఁడైన మన శివాజిని
వరియించె నవాబుతేని వరవీక్షణముల్

చం. తనకుసలాముసేయని కతంబునఁబుట్టిన యల్కతోడ మో
హనవదనంబుఁజూచి యుదయంబగు నెయ్యము వియ్యమంది మో
మున కెలనవ్వుబువ్వుతొడవున్ రచియింపఁగఁజేరఁజీరి కాం
చనమణులంబరంబుల నొసంగె నవాబు నవాభియాతిన్

మ. తను రక్షింపఁగ లంచమిచ్చెనని పాదస్వర్ణమంజీర ని
స్వనముల్గేలియొనర్పఁజేకొని నమస్కారంబుఁగావింపకుం
డనె నిండోలగమెల్ల విస్మయమునందన్ బాలవీరుండు చ
య్యననేతెంచెను తండ్రి చెంతకుఁ బదన్యాసోజ్వలద్భూషుఁడై

చం. అమితపరాక్రమస్థిరవియన్మణికాగలఁ దన్నమేటి గ
ర్వమునకు ముగ్ధుఁడయ్యుఁ బరరాజుల సేవనమందునేమి మో
సము ఘటియిల్లునోయని విచారముచేయుచు నింపుమీరు వా
క్యముల శివాజికి న్నుడువగాఁ దొడఁగెన్ బహుళోపదేశముల్

మ. జననంబాదిగ మాతృకామణి నిజ స్వాంతంబునన్ గట్టుచుం
డిన శౌర్యోన్నతదుర్గరాజబలవన్నిర్మాణచాతుర్యమెం
తని వర్ణింతును, తండ్రిబోధలకు రవ్వంతేనిఁ గంపింపఁడ
య్యెనహో భారతమాత! నీవెకదతల్లీ! కన్నదాపుత్రికన్

శా. షాజీరాజు శివాజినందునుపఁగా శంకించి వైళంబ పూ
నాజాగీరునకంబతో ననిపెఁ బ్రాణస్నేహితుడైన దా
దోజీనామక భూసురుండభినవద్రోణుండు సంరక్షకుం
డై జాయా సహితంబ కాపురముసేయంబోవనచ్చోటికిన్

శా. ఆజానేయ గజాధిరోహణ సమస్తాస్త్రప్రయోగాది వి
ద్యాజాలప్రతిభాధురంధరుని జేయంజొచ్చెనవ్వీట దా
దోజీ కొండమహీసురుండు గురుచంద్రుండై గురుండై గురుఁ
డై, జాతి స్మయజాతమత్సర దురూహాధ్వాంత భాస్వంతుఁడై

తే.గీ. శంతనకుమారునకు మున్నుఁజామదగ్ని
యస్త్రకళ నేర్పఁజూచు గంగమ్మబోలి
యవని సురునొద్ద విద్యలనభ్యసించు
పట్టినారసి యాజిజాబాయి మురియు

సీ. స్థిర దిశాదంతుల చెవులు చిల్లులువోవ గొనయంబుననయంబు గోటమీటు
మిన్నులక్ష్యముచేసి మెఱయుచుక్కలు రాల మొనలున్న కఱకుటమ్ములను వదలు
ముసలితామేటి మూపుంజిప్పకంపింప మేలైన నలని గుఱ్ఱాలనెక్కు

తే.గీ. సాము గరిడీలలో పరిశ్రమమునోర్చి
నిలువఁజాలక చెమటకన్నీరు విడిచి
బాల్యము గతించిపోయి సంప్రాప్తమైన
పసరు మిసమిసలాడు యౌవనఁపువేళ

సీ. ప్రవహించుచుండె నవ్యయదయానిర్ఝరాంభఃపూరమీక్షణాబ్జముల నుండి
అలరారుచుండె భయానకరసము నీలమునీనుమొలకమీసముల మీద
వాసముండె నిజైక పత్న్రవతంబు నాణ్యంబైన చిగురు గడ్డంబునందు
విలసిల్లగాఁ జొచ్చె విజయాంకపాళి దీర్ఘములైన బాహుదండముల మీద.

తే.గీ. తురకనెత్తుటికాల్వలఁదోగియాడ
వేగపడఁజొచ్చె కెంజేతి విచ్చుకత్తి
కలికి మిన్నలచూపు సుంకములు గొనుచుఁ
బడుచుఁదనమనుసొమ్ము శివాజి కమర

ఉ. కాయము సౌరు నెమ్మోము కాంతి, భుజంబులనేలు విక్రమ
శ్రీయుఁదలంచి యమ్మొఱుపుచేడియ భూమికి డిగ్గి యున్నదే
మోయని సంశయింపఁబని యుండని చక్కనిచుక్కయౌ సయి
బాయినిఁబెండ్లియాడెను శివాజి విరాజితసద్గుణవ్రజిన్

సీ. పతిభక్తితో దేశభక్తిసేయము చేయనవతారమెత్తిన చివురుగుత్తి
శీలమ్ముతో శౌర్యశిఖివాసమొనరింప నావిర్భవించిన మావిగున్న
విద్యతో, శాంతివివేకముల్గమికూడ తనువుఁ దాలిచిన చందనపుతావి
కులగౌరవంబుతో చెలువమైక్యమునంద మానినీత్వముఁగన్న మల్లెమొగ్గ

తే.గీ. పలుకనేటికి వీరశివాజి దొరకు
జనని తిన్పించు వీర్యభోజనమునందు
నమృతమును సృష్టి జేయుమంత్రాంగబలము
భవ్యగుణసీమ యాసయీబాయిలేమ

కం. తడసినచో నా వీరుని
పడచుఁ దనంబెల్ల విజయభామల పాలం
బడుటెల్లెరిఁగినదో యా
పడఁతి ముందెవలచి యంకభాగముజేరెన్

ఉ. అంటినఁగందిపోవు కుసుమాంగిని పెండిలియాడి కామపు
న్మంటల స్రుక్కుచున్నిదురమానియు, మానఁడదేలనో ధరా
కంటక పాటనోద్యమ వికస్వరభావమునౌర! కయ్యపున్
దంటకు గెల్పుటింతియెకదా? సుఖదాయిని దానవాంతకా!

చం. బలయుతులై పిఱుందునెడబాయని కూరిమికాండ్రతో దిశా
వలయ జయార్జనంబు నెఱపం దలపోయుచు భీకరాటవీ
స్థలగిరిశేఖరోన్నతపథంబుల లోయలఁ గందకంబుల
న్మెలఁగుచుమావళీ జనులనేస్తమొనర్చెను కార్యసిద్ధికై

వ. ఆ మావళీలకుఁ దావలంబులయిన ప్రాంతంబులంగల వనంబులతి భయంకరంబులై కలువలచెలికాని వెలుంగులకులకంబుల చెలువంబులు మెలంగనీయని బలితంబులగు పసరుటాకులవిసరంబుల నెసకమెసగుచు నింబదలై నింగిని దొంగిచూచు తరునికరంబులు గలిఁగి, పగలు పొగరుసనిన చీఁకటుల కూటంబులకు నిలువనీడలై, పగతురగు మృగయుల తెగలు విడుచు పదనుటలుగుల బలిమిగల దెబ్బలకు నిబ్బరింపక బొబ్బరించు బెబ్బులులను దరంబుల దాచికొను పొదలకదుపులకునిక్కలై, యదనయిన యాకఁటికిఁ గదల రేగిమెదడు బువ్వకు గదిసికొని వచ్చు సింగంబుల నఖభల్లంబుల కందక చిందర వందరలై ముందు ముందు మంద దప్పిపారుచుండు నేనుంగు పిండులనండజేర్చికొని గుండెదడలు దీర్చు కందరంబులు గల కొండలతండంబులకు నిధానంబులై యెఱిఁగిన పొరుగునరులకుఁగాక, పరుల జొరనీయనిచిక్కు త్రోవలకు తావులై, తేటనీటితో దాటులు బెట్టుసెలయేటి కూటంబుల తరగల నురువుల మరుగున సరసతం జెరలాడు చిరుగాడుపుల తాడనంబులనూడిపడు పలుదెఱంగులగు రంగులు గల జిలుగుఁబువ్వుల మవ్వంపు మెత్తలున్న పచ్చికబయళ్ల యందు బొందులు మఱచి తనివిసనంబోవు మేయుచు తమ నీడలు సూచి బెదరిపడు లేటి పడుచులనిడువాలుఁగన్నుల బెడంగులంగని యొడలు పులకరింపఁదమ పడంతుల క్రాల్గన్నుల నరసి యలరు విలుకానికింజిక్కి, చెక్కివైచిన చక్కినక్కడక్కడఁ గల చక్కని నెలరాల నున్నని తిన్నెలపై సురత సుఖంబనుభవించు శబరమిథునముల మణితనినాదములు విని గేలిసేయుకరణి చల్లని నీడల నిచ్చు కడిమి చెట్ల కొమ్మల నూయెలలూగుచు కిలకిలారావంబులు సేయు కోతిమెత్తముల నామోదించు నట్లు మార్మ్రోయు లోయల నిలువజాలక కూయుచు ఱెక్కలు తాటించిపైకి లేచు వివిధ

పక్షిజాతంబులకు నిలయంబులై, యిగురు బెట్టిన మొగలిబంతులతావి పొగరుల వచ్చు పాప ముగుదల పడగల నడిమి రతనాల కెంపు రంగులంగని సంజకెంజాయలని బ్రమసి ముకుళించికొను కమలములుగల కొలకులం జల క్రీడలాడు వేల్పుకన్నియల బంగరుమేని పసలంగని యెదంద పసలుడివోవ బరుఁగులిడు తపసిమూకలకు తానంబులై, కొండచిలువ నెలతలమోములకు జిక్కి తప్పించుకొని పోవలేక బెనఁగు కాఱుదున్నల కేకలు విని వీకంబరువులెత్తు చెవుల పోతుల వెనుదగిలిపోవు చెంచువరాంద్ర లేతపిఱుందుల కదలికలకు మెచ్చి తలలూచుచున్న వోయన వాయువునకాపాద మస్తకములూచు వెదురు పొదల రాపిడులు ద్రోపులకు నిలువ లేక వెడలి వచ్చు నెలుఁగుబంటుల కిరవులై భూదేవి శివాజికి విజయము నెఱపఁగట్టి యుంచిన దొంగదారులు గల కట్టనిదుర్గంబులో యనఁదనరుచుఁ జీమచిటుకుమన్నఁ బలుకుచుండి మావళీలకు స్వాధీనంబులైయుండు.

కం. ఆమావళీలు నిరత
స్వామిప్రియకరులు, భూరిబలులాశ్రిత ర
క్షామహిత మనస్కులు సం
గ్రామ భయంకరులు కాని గర్భదరిద్రుల్

తే.గీ. చండతరమైన వారిదోస్సారపటిమ
వసుధసార్థక్యమంద శివాజి ఘనుడు
అవతరించెనొ కాకున్ననాశివాజి
నేర్పువెలయింపవారె జన్మించినారొ!

తే.గీ. ధనమున దరిద్రులగుట సత్యంబెకాని
విక్రమారోగ్య సంపత్కుబేరులగుదు
రదియెటింగియె కాబోలు నధిక రీతి
మృత్యువంటదు వారి నూతేండ్లవరకు

తే.గీ. వారిననిమొన నెదిరించి బలిమిమెఱసి
గెలిచిన మగండులేఁడు భూతలము నందు
నబలయై గెల్చె నట్టి వీరాధి వీర
తిలకములనౌర యినుఁపగజ్జెల పడంతి

తే.గీ. బొక్కెడన్నముఁబెట్టిన పుణ్యమూర్తి
కొఱకుఁబ్రాణార్పణముసేయఁ గొంక రలఘు
కార్ముకముఁబూని రణభూమిఁ గాలునిలిపి
రేని, వెన్నీయ రఖిలభూతేశనీకు

సీ. ఎదిరించివచ్చిన మదపుటేనుఁగుల తొండములు తుండెములు గొట్టంగలారు
కోఱకత్తులనెదుర్కొనివచ్చు మేటిసింగముల యంగములు చెక్కంగలారు
వాలముల్దూలఁబై బడివచ్చు పెద్ద బెబ్బులులయుబ్బులు నేల గలపఁగలరు
కుఱుచకొమ్ములు దీటుకొనివచ్చుఁ యడవిపందుల కంధరంబులు ద్రుంపఁగలరు

తే.గీ. పవన జవమునఁ బర్వులు వారుచున్న
లేళ్లముంగాళ్లుగొట్టి డొల్లింపఁగలరు.
అనఘ! ఆమావళీల దివ్యాస్త్రమహిమ
వినుతికెక్కిన మనయర్జుననకు లేదు.

సీ. విహరించుచుందురుఁ విల్లెక్కుడించక అడవియేనుంగు తత్తడులమీద
కుడువఁబెట్టుదురు మక్కువ మీర గారాబు బుడుత లేడిచిన బెబ్బులులజున్ను
పితుకుచుందురు మూడు వేళల పిల్లల నదలించి పురిటి సింహముల పాడి
సాగించెదరు మదుత్సవవేళలరథాలు బలము గల్గిన యెల్గుబంట్ల చేత.

తే.గీ. పడగపాముల రత్న దీపములచాయ
సంచరింతురు కొండల చఱులలోన
వారివిక్రమమింక చెప్పంగనేల
కాననము లెల్ల భీతిల్లి కట్టువడియె

కం. ఏ విధిసేయమొనర్చెనొ
కో! వారలతో శివాజి యొదగడె విడువం
బోవరతని పదయుగ రా
జీవంబులు గొలువఁదారసిలు తుమ్మెదలై

వ. ఇట్లు తన మనోనిశ్చితకార్యగేహంబునకు సోపానంబులయిన మావళీల వశీకరించికొని, విద్విషణ్మమీనాథ ప్రాణవాయుకబళనోత్సాహావేశంబున మిట్టి పడు భవానీఖడ్గ వాతాశనంబును కరంబున ధరించి వీరరసంబు నూరిపోయుచు దేశద్రోహకథాకథనంబుసేయ.

సీ. కల్పింపఁజాలె కర్కశదేహములమీద యడఁగిపోవని పులకాంకురములు
పట్టింపఁజాలె పావనములౌ మోముచందురులకుఁ గ్రొత్తనెత్తురుల సిరులు
అంటింపఁజాలె నాయతములౌ నీరజాంబకముల కలుకనిప్పుకలవేడి
పెట్టింపఁజాలెనుద్వేగంబులైన దంతశ్రేణికలకు నూతనఁపుసాన

తే.గీ. సృష్టిసేయంగఁజాలె నర్ధేందురేఖ
లమలరుచులీను నధరదేశములమీద
యవనదుర్భరపాలనా హాలహలంబు
క్రమత నమ్మావళీల కర్ణములఁ జొచ్చి

తే.గీ. తొడరి నిరతంబుఁదనకు దాదోజినేర్పు
స్వీయసంస్థానపాలనోపాయ విధులు
భావముననంటవయ్యె భవాని కత్తి
వైరిహననక్రియాపరత్వముననుంట

కం. ఆ విధమున నాయవని మ
హీవరదర్పాపహరణ హృదయులయిన య
మ్మావళులను రణరంగక
ళావేద్యులఁ దన బలంబులను గావించెన్

తే.గీ. తనకుదక్షిణ భుజములై వెనుకముందుఁ
బాయక చరించు బహువీరనాయకులను
గలిఁగి యాతండసంఖ్య బాహులు గలట్టి
నాలుగవ వింత వేలుపనం దనర్చె

తే.గీ. సరసత శివాజి రాజన్యశాణముునను
కషణ సంస్కారమందిన కారణమున
మేటి బలవంతులైన యయ్యాటవికులు
చికిలిఁజేసిన కత్తుల చెలువుఁగనిరి

తే.గీ. భీమరణరంగములఁ దాండవింపనున్న
వారి యుత్సాహజృంభణ భ్రమణమునకు
నిలువఁజాలక మెలమెల్లఁ దొలఁగిపోయె

తే.గీ. అనఘ! నీపినాకంబుము మ్మొనలుబోలి
ముగురువిలుకాండ్రు కొలుతురెప్పుడు శివాజి
పదములే, సాజి, తానాజి, బాజి యనఁగ
నేటుదప్పరువింటి పోరాటమందు

సీ. సాదికివెన్నీయఁజాలివైరులవెన్ను లందన్నదాటునాలఁపుగుఱాలు
మావతు సింగాల మన్నించి యెదిరి సింగాల మన్నింప లొంగనిగజాలు
వెడద సింగాణుల విశ్రమింపక శత్రు శిరముల విశ్రమించెడు శరాలు
తొలిపాపరాయని తలలూచి రథికునౌదలనూచని మహోన్నతఁపురథాలు

తే.గీ. చిక్కుచీఁకట్ల గమివసించెడు వనాలు
పలువితములైన రాతి కొండలబిలాలు
యనతికాలపరిశ్రమంబునలభించె
సమిదభంగుర విజయవత్సాధనాలు

సీ. వాలుఁగత్తుల వాతఁబడక పారువిరోధి కరులకండలు జెండు కంటకములు
శరపాతములు దప్పిపరచు వీరాలి కంఖాణమ్ములను గూల్చు కందకములు
గండ్రగొడ్డఁటికి జిక్కక దారిబట్టు మల్లులనల్లుకొని పట్టినిలుపులతలు
వికటభల్లముల కందక దండుదప్పు సాధనకాండ్ర కంతుజిక్కని పథములు

తే.గీ. తురకరాజుల బాహులత్రుప్పుడుల్చి
మనశివాజి కొసంగెఁ గాననపురంధ్రి
దైవమనుకూలుఁడైన యత్నంబునందు
గోరిపట్టిన దెల్లబంగారు గాదె?

ఉ. ఆరయమ్లేచ్ఛరాజుల మహాకలుషంబులు పండిపోవుటే
కారణమస్మదీయమగు కత్తిశివాజి ధరించియుంటకో
వారణవైరి! యీ భరతభామిని కన్నుల కిప్పుడిప్పుడే
కూరుకుపట్టుచున్నయది కొంచియమీతఁడు జన్మమెత్తుటన్

సీ. కట్టింపసాగె దీర్ఘములైన దుర్గరాజములనర్గళసాహసంబు మెఱయఁ
మ్రోయింపసాగె జీమూతగర్జా సమగ్రములైన విజయశంఖవ్రజంబు
ఎత్తింపసాగె, భూభృచ్ఛిరోగ్రములనుద్ధతి మీర సమరపతాకపాళి
చేయింపసాగె, శింజిత శింజినీరంజితములైన మండలాగ్రముల పిండు

తే.గీ. యేరికొనసాగె, నాత్మజాగీరులోన
నుక్కుతున్కలకెనయైన యుద్ధభటుల
ఆహవోత్సాహ జలధిమధ్యంబునందు
నిదురలేదా శివాజికంటికి పురారి!

మ. ప్రళయస్వప్న కదంబముప్పతిల నారంభించె నమ్మొగలే
యులకుల్లోలములయ్యె మేనులు గజ వ్యూహంబు కన్నీటి బొ
ట్టులురాల్చెన్ గలహ ప్రచండులు మరాటుల్ కొంకణుల్ మావళే
యులు దట్టీలు బిగించి నంతననదేమో! సర్వభూతేశ్వరా!

శా. శ్రీమత్కిన్నరకన్యకాకరవిపంచీ తంత్రికాసంచర
న్నామా! మాధవ పాదపంకజపరిన్యస్తామల స్వాంత తా
రామార్గాంతరలంఘమాన ఘనసార స్వచ్ఛ కీర్తి ప్రభా
భామా మానస విత్తసంగ్రహణరూపా! పాలితద్రవ్యపా!

ఇది
శ్రీ గుఱ్ఱము వంశకలశపాథోనిధానరాకాసుధాకర
వీరయాఖ్యజ్యేష్ఠతనూభవలింగమాంబా
సుపుత్రజాషువాఖ్యప్రణీతంబైన శ్రీ
శివాజీప్రబంధంబునందు ప్రథ
మాశ్వాసంబు సంపూర్ణంబు

## ద్వితీయాశ్వాసము

కం. శ్రీలక్ష్మాంబాప్రేక్షణ
రోలంబస్ఫురితముఖసరోజా! సురక
ల్లోలిన్యబ్జ మరంద ఝ
రీలాలితమధురవచన! శ్రీశైలపతీ!

తే.గీ. అవధరింపుమావిధి యుద్ధ యజ్ఞమునకు
ఋత్విజుండైన యమ్మరాటేశ్వరుండు
సరగఁ దోరణదుర్గరాజమును తొలుత
మచ్చునకు ముట్టడించెఁబెంపచ్చు పడఁగ

తే.గీ. విమత సస్యంబులను పీల్చి పిప్పిసేయు
? శ్రీశివాజీబ్రహ్మచేత సృష్టింపఁబడిన
గండుమిడుతల దండనఁ గ్రమ్మికొనియె
నేలయీనిన గతి మరాటీలదండు

తే.గీ. ఆమరాటీల తురఁగరింఖాగ్రకోటి
జిమ్మఁ గలుషించి రేగిన దుమ్ముతెరలు
కెంపుఁజీకఁటి గుములు బుట్టింప నభవ
పగలు చుక్కలు గాసె, గూబలు చరించె

మ. సమరోత్సాహఁము మేనఁ గ్రొంజెమటలైఁ జన్మింపనున్మత్తనా
గములంబోలి రయంబునం గదనరంగక్షోణికేతెంచు వీ
రమరాటీల నిశాతఖడ్గముల తీవ్రజ్వాలకుందూదిపిం
జములై దుర్గబలంబు వ్రేల్మిడిని భస్మంబయ్యె సర్వేశ్వరా!

సీ. సవ్యహస్తమున వాసముసేయునంబికా ఖడ్గధారలనగ్నికణములురల
మునిపిఱుందుల నంటి ముద్దాడు తూణీర వరము గాండీవిసంపదలు నెఱప
పారసీకుల్లాయి పైనుండి దిగజారు కలికికుచ్చులు సోయగమును జిమ్మ
ఆపాదమస్తకంబావరించిన వజ్రవర్మంబు రణపటుత్వమును జాట

తే.గీ. పంచకల్యాణి హరినధిష్ఠించి తిరుగు
సింహసంహనుఁడగు శివాజిని వరించి
కాలహరణంబును సహింపఁజాలకేమొ

తే.గీ. అరయదుర్గంపుఁ బెండ్లికూతురుతనంబుఁ
దేటపడఁజేయఁగాబోలు దృఢముమీరఁ
దిరుగ నిర్మింపఁజేసి, సుందరములయిన
క్రొత్తసొమ్ములనిడి యేలుకొనియెనతఁడు.

కం. ఎన్నఁడు గడించెనో యా
యున్నతదుర్గంబు ద్రవ్యమో యీశ్వర! మే
ల్సొన్నాటంకఁపుఁదిప్పల
వెన్నో కుడ్యములు ద్రవ్వనెడఁ బ్రాప్తించెన్

కం. ఆ ధనముచే సమీప ధ
రాధరమున నొండుదుర్గరాజంబరి భూ
మీధతతికిన్ భేద్యము
గా ధృతిఁగట్టించి రాజగడ నామమిడెన్

కం. భారతదేవీదుఃఖ ని
వారణకారణములగు శివాజీ కార్య
స్ఫాటీరపరీమళములు ది
జ్నారీగేహములనెక్కినాట్యంబాడెన్

తే.గీ. అతని సాహసకృతములం దద్భుతముగ
మంత్రపాండితిలేకున్న మదనవైరి!
బీజపురినవాబుండు నవీనమైన
వెఱపుసత్తికిఁజిక్కి తబ్బిబ్బువడునె

ఉ. తత్తరమందియేని సులతానుఁడు రాచరికంపు ఠీవిపే
టెత్త శివాజికీపనుల నింకఁ దలంపకుమంచు వ్రాసి చే
యుత్తరమంపె నయ్యవన యోధుల కుత్తుకలుత్తరించు క్రొం
గత్తి మనుష్యభూమికను గాంచుట గానఁడతండుబేలయై

ఉ. సాటివచింపరాని బలశాలి శహాజి దినేశులీల క
ర్ణాటక భూమిలోదొరతనంబు వహించి తురుష్కరాజ్య చం
డాటవి సింహమోయనఁ బ్రియాసహితంబనివాసముండి యే
టేటయశః కుమారికల వృద్ధియొనర్చుదొడంగె దిక్కులన్

ఉ. నందనుఁడాచరించు యతనంబుల మోగలుమండలంబునం
దుందనకున్నకీరితి నిధుల్గతియించునటంచుఁ గుంది మ
ధ్యందిన భానుమండల విధంబున నిప్పులు గ్రక్కుచుండె, బా
లేందుధరా! యెఱుంగఁడత డీజగదుద్ధరణ ప్రరోహమున్

కం. నిక్కఁపుఁగోపరసమువెలి
గ్రక్కెడు వాక్యములనొక్క కమ్మనని పె న
ల్దిక్కులఁ గల తనకీరితి
దక్కింపు మటంచుఁ దండ్రితనమేరుపడన్

చం. జనకుని యుత్తరంబును బిజాపురనాథుని యుత్తరంబుఁజే
కొని తన కార్యసిద్ధికనుకూలముగా సదుపాయమొందుక
ల్పన మొనరించి యానలకు బద్ధుఁడనంచు లిఖించి పంచి పూ
నిన పనిమానఁడయ్యె రణనీతివిశారదుఁడో దయామయా!

కం. జాజీమోహితియుఁభిరం
గోజియుఁ బ్రతికూలురగుటఁ గుహనాతంత్ర
భ్రాజితుఁ డతఁడేవిధమున
నో, జిత్తులనొనర్చి యేలుచుండెను సాంబా!

ఉ. కొన్నిదినాలకాతఁడలకోండన కోటను ముట్టడించి కై
కొన్న యశంబుతోఁగలయు కోరిక పుట్టఁగఁబోలు బాహు సం
సంపన్నుఁడు నీలకంఠుఁడను బ్రాహ్మణ రాజుగతింపగా లభిం
చెన్నవరత్న రోచులను జిమ్ముపురందర దుర్గరాజమున్

శా. దాదోజీధరణీసురోత్తముడు వార్ధక్యంబు మీరన్ తత
ప్రాదుర్భావ రుజానిపీడితవపుర్వల్లీసముల్లోల చిం
తా దుర్దాంతపయోనిధి న్మునుఁగుచు న్మంచంబుప్రాపించె గం
గాదేవసుతుఁ డంపసెజ్జపయిఁ గ్రుంకం బోవుచందంబునన్

ఉ. పిన్నటినాటి నుండి విలువిద్దెలు విద్దెలు సెప్పికద్పునం
గన్నకుమారులీలఁ దనుఁగాచిన రెండవతండ్రి మంచమె
క్కన్నిజభక్తితత్పరత కానఁబడన్ ఘనుఁడా శివాజి స
ల్పెన్నిరతోపచారములు వేసరకెంత కృతజ్ఞుఁడో శివా!

కం. భాసురమగువైకుంఠపు
రీ సోపానములనిల్పి ప్రియమార కుమా
రా! సెలవిప్పింపు శివా
జీ! సనుచున్నాఁడనని వచించి శిరమునన్

మ. కరపద్మంబులునిల్పి నీవు జగతీకల్యాణసంధాయి, వం
బరవీధిన్ భవదీయ సద్విజయభామాలాస్య మాచంద్రభా
స్కరతారంబుగ నిల్చుగాతమనివీకన్ బల్కుచున్ బెద్దని
న్దురవోయెన్మదిబాపనయ్య పటు మృత్యుద్వారతల్పంబునన్

కం. కనుదమ్మిదోసిళులనిం
చిన యశ్రు ధనంబొసంగి జిజకొడుకు మరా
టనరేంద్రుండు గురువు ఋణ
ము దీరిచికొనియె వెడలబొంగెడు చింతన్

వ. అంతనతండబ్బాడబరాయని కుత్తరక్రియలాచరించి క్రమ్మర రాజ్య సంపాదనా కుతూహల స్వాంతుడై వాదోజీ ప్రియ శిష్యుండును దనకు హితము సేయు నెచ్చెలి కాఁడగు నాబాజీ సోనదేవుం గల్యాణ దుర్గమును సాధింపఁ బంపనతంబు కతి పత సేనాసహితుండై హఠాద్గతి ముట్టడించి యేతద్దుర్గాధీశ్వరుండగు

ఉ. మూలనహమ్మదున్ గెలిచి పొంపిరి వోయెడు విక్రమంబుజే
జేలునుతింపనా సమరసింహుఁడు దుర్గ జయంబుతోడ బి
బ్బీలవశీకరించికొని వీరశివాజి కొసంగనర్థచం
ద్రాలిక నొక్కలేమను ప్రియంబునఁ దెచ్చె నవాబు కోడలిన్

మ. ఘన సౌందర్యఁపుఁదిప్పలైతగు తురుష్కస్త్రీలయం దాలతాం
గిని బంగారు మెఱుంగుబొమ్మ ఖచరద్గీర్వాణవిద్యాధరాం
గనలయ్యంగన మోముటద్దమును రాకాచంద్రబింబభ్రమం
గని మోదింతురమాసరాత్రుల బుభుక్షాపీడిత స్వాంతలై

కం. నీలములగడ్డిమేపి మ
దాలికిఁ దేనియలు జూపి యంబుదములఁగు
త్కీలములపాలుసేయం

తే.గీ. ధాత భూతలినున్న సౌందర్యరాశిఁ
శ్రమతఁదూచిన రెండు భాగములుచేసి
ముద్దులాడికి సాబాలు పొందుఁజేసె
గాని, బిబ్బీనిఁజేయుటొక్కటియె కొఱఁత

తే.గీ. తళకుఁజిఱునవ్వు మల్లెపూవులను బూచి
విభునికంతానఁ గీలించు వేళలందు
పడతి చెల్వంబువర్ణింప వలయుఁగాని
గంధసింధురహర! యిది గాదువేళ

ఉ. బేడిసకన్నులన్ బదనుబెట్టిన చూపులకత్తులేసి వే
టాడుచు నొందు నొండొరయు నాత్మకుచద్వితీయంబునందు రా
పాడుచుఁబిండిజెసెనభియాతి బలంబుల భావసీమల
చ్ఛేడియ దానిచెల్వమును చెప్పగనేల? భుజంగభూషణా!

ఆ.వె. కత్తికత్తి యొఱయు కదనరంగమునకు
మడమదిరుగ కెక్కు మావలీల
ధైర్యకంచుకములు తరుణిసోయగమున
పక్కుపక్కుమనుచు బగిలిపోయె.

సీ. కందిపూనేతలంగామీద ముదురు చెంగావిదాపిన కంచుకమ్ముతోడ
కుదురైనగాగరా, గువ్వకన్నుల యద్దకపునిద్దపుంజీర కప్పుతోడ
బంగారుగిలుకు మువ్వలమ్రోతగల పచ్చరాలు చెక్కిన మొలనూలితోడ
కెంపులముక్కు ముంగెరవెంటఁబెదవి నల్లన ముద్దులాడు బులాకితోడ

తే.గీ. పసిఁడి గొలుసులు తమ్మిగుబ్బలనటింపఁ
బిట్టు పూచిన తంగేడు చెట్టువోలె
మదపుటేనుంగు నడకల గదలివచ్చు
కలికినారసి సురలౌడుగఱచి కొనిరి

సీ. కొప్పుమబ్బుననున్న కొదమసంపెగదండ మెలమెల్లచిన్నారి మెఱుపు లీన
అనువైన మేనుమోహన గంధలతనుండి కొమరునెత్తావి మొత్తములు వీవ
బటువుగుబ్బల జక్కవలు పయ్యెదందూర సరళకంకణపు గర్జలు జనింప
కౌలికి దపినహారముల నుండి దిగజారి వజ్రాలవడగండు వసుధరాల

తే.గీ. తొగరు జిగిమీరు కెమ్మోవిదొండపండు
ముగ్గిచిలుకలనూరింప మాటిమాటి
కా యవనకాంత పటుగద్గదారవమున
నిలిచి కురియంగసాగె కన్నీటి వాన

సీ. మెరుగుబుగ్గలను గ్రమ్మెడుచెమ్మటలఁదోగి యలఁతి కుంకుమచర్చలంతరింప
నిగ్గుకన్నులులేని నెమలి పింఛియఁపు వేనలినుండి పూవు మొగ్గలు తొఱఁగ
చిరువెచ్చ కన్నీరుచింది కందిన కల్వ కన్నుల కాటుక గరఁగిపోవ
నడువనేరిచిన కుందనపుఁ దమ్ములు బోలు దొడ్డ పాదముల లత్తుక స్రవింప

తే.గీ. పిడికిఁట నడంగు నాలి నెన్నడుము దూల
తమ్మరసమంటి మెరయుదంతములు దోప
కొదమకోయిల కంఠానఁ గుమిలికుమిలి
కలికి విలపించుచు శివాజి కడకు వచ్చె

మ. వనితా రత్నము కోమలాంగముల లావణ్యంబు మిట్టాడ వం
చిన మోమెత్తక చిట్టి మట్టియలు, మంజీరంబులున్ ఘల్లుఘ
ల్లున మ్రోయఁజనుదెంచువేళ గరుణాళుండమ్మరాటేంద్ర చం
ద్రుని చిత్తంబునఁ గానవచ్చినది నీరూపంబు, గోపధ్వజా!

ఉ. వేగిరపాటునన్గనక పీఠము డిగ్గి నమస్కరించి త
ల్లీ! గిరిజాసతీ! భగవతీ! జగతీశుభకారిణీ! భవా
నీ! గజగామినీ! యనియనిందగతి న్నుతియింపసాగె నా
థా! గుణనీయమీ సుగుణ మాతని దివ్యకథాసుధాంబుధిన్

మ. పరకాంతావదనాంబుజంబెవని దీవ్యన్నేత్రవీధిన్నిరం
తరమున్ తల్లి మొగంబు చందమునఁ గన్పట్టున్ నటేశా!యతం
డురురాజన్మణి పుష్పకాంతరమునందూరేగుచుండున్ వియ
చ్చరనారీకర చామరానిల సమాజంబొప్పనాకంబునన్

శా. శ్రీవైకుంఠనిశాంతముక్తి కులనారీ సంగమారంభ దీ
క్షావైదుష్యమువెల్లడించు బుధలోక గ్రామణుల్ మా ధరి
త్రీవామాసుకుమారు లైహికసుఖాబ్ధిన్ దేలరేనాడు, శం
పావల్లీరుచిభాజనంబనుచు సంభావించి మృత్యుంజయా!

కం. విరివిల్లుదునిఁగి యమ్ముల
కఱకు దనంబడఁగి పుష్పకాండుండు మహా
పరిభవమునంది ప్రవరుని
చరితముఁ దలపోసి కొనుచుఁజనియె మహేశా!

తే.గీ. తరుణి రూపంబు నొకకొంత తడవుజూచి
భగవదనవద్యనిర్మాణపాటవమున
కబ్బురంపడి భక్తి గొండాడి వేగ
భూషణాంబరములనిచ్చి పూజఁజేసి

కం. అంబా! నీపతితోడ సు
ఖంబుండుమటంచు భటనికాయమ్మును వెం
టంబనిపె నెనరు బలుకులఁ
బంచిన శోకంబువిరియబార పురారీ!

మ. సిరిముద్దాడఁ బసిండి ఘంటమున వ్రాసెన్ దేవతా సత్కవీ
శ్వరుఁడానంద రసార్ద్రగీతములు గీర్వాణాంగనల్ బాడుచుం
దురు రాత్రిందివమాశుభాక్షర సుధాస్తోక ప్రవాహంబు శ్రీ
కరముల్సోకుటఁ బారిజాత కుసుమక్షామంబు లేదచ్చటన్

వ. ఆ విధంబున నంకురించు తన కీరితి కప్పురంపుబరిణ నుండి వెలివడు నయగుణంబులను కమ్మతావులు ప్రోవు వైదిశావలయంబును జుట్టికొనుచుండనుపక్రమించు శ్రీ శివాజీ కార్యములకులికి యట బీజపూరున.

కం. ధీ బలుని శహాజినిఁగా
రా బద్ధునిఁజేసెఁ దురకరాయఁడు, "శ్రేయాం
సీబహు విఘ్నానీ" యను
ప్రాఁబలుకు జగంబునందబద్ధంబగునే?

కం. ఆవార్తనిశిత శూలం
బై వీనుల సోకఁదలక కతి ధీరతతో
నావీరశిఖామణి క్రో
ధావేశుండయ్యె బాడబానలముక్రియన్

కం. తతమేధావిని యగునిజ
సతితో మంతనమొనర్చి షాజానుమహీ
పతితో నళీకమగు సం
గతి నెరపె శివాజియం జిఘాంసాపేక్షన్

మ. మొగలాయీజగతీవిభుండగు నవాబుండండమ్యేన వే
లగుఱాల్దండున కాధిపత్యముననల్పప్రీతినర్పించి, శీ
ఘ్రగతిన్ షాజికిబంధముక్తి నెఱపంగా కమ్మనంపించె, యు
ద్ధగరిష్ఠుండగు బీజపూరుపతి కాత్మందత్తరంబెత్తగన్

కం. అవిలంఘ్యమైన ఢిల్లీ
కువలయపతి యానఁదప్పు కొనజాలకయ
య్యవన విభుఁడు తడవొనర్పక
శివాజి జనకుని కడింది చెఱవిడిపించెన్

వ. అంతఁగొన్ని దినంబులకు

తే.గీ. కనకగిరి దుర్గమును బట్టుకొనఁదలంచి
తండ్రి పంపుననరిగి, యుద్ధతిఁ బెనంగి
మోగలేయుల దుస్తంత్రములకుఁ జిక్కి
పరమపదవికిఁబోయె శంభాజియాజి

చం. జనకుఁడు బందినుండిన విచారమసారముగా విషానలం
బునకెనయైన సోదరుని భూరివిషాదము చుట్టుముట్టెఁ జొ
చ్చిన సదనంబుఁజొచ్చి సుఖజీవులఁజింతలపాలు సేయఁబై
కొనుట విలాసకృత్యమనుకొందు వసుంధరఁ గష్టదేవికిన్

తే.గీ. భ్రాతృమరణంబునకు హేతుభూతుఁడయిన
బలియుఁడబ్జులుఖాను శివాజియనెడు
పద్మనాభుని భావప్రపంచమునకుఁ
గలియుగంబున నవహేమకశిపుఁడయ్యె

వ. ఆ సమయముననట డిల్లీ నగరంబున

సీ.	కోపంబు చివర ముక్కుననెక్కి నడయాడ నరరూపమెత్తిన తురకకోతి
కరచరణాద్యంగకములఁ గంటికిఁదోచు కరుణలేశములేని కటిక తనము
అనుఁగుసోదరుల జీవనసంపదలను మ్రింగందోడబుట్టినఁకాలయముఁడు
హిందూమతంబనుఁ వృక్షరాజమునగాసింబెట్టు మొగలాయి చీడపురుగు

తే.గీ.	షాజిహానుండు ప్రాకృతజన్మ మందుఁ
గడఁగి యార్జించి నట్టి దుష్కర్మఫలము
పాపి, యౌరంగజీబు ఢిల్లీ పురానఁ
జెలువు మీరఁగఁబట్టాభిషిక్తుఁడయ్యె

తే.గీ.	అతఁడు సింహాసనము నెక్కినంత నిఖిల
సజ్జనశ్రేణిచేఁ బరాజయమునంది
కుందిచెరలాఁడుచుండు దుర్గుణములెల్ల
నిండుముదమున నేతెంచి నెత్తి కెక్కె

సీ.	జనవంద్యుఁడగు నక్బరునిఁజూచి మురిసిన ధర్మదేవతకుఁ బాదములువడఁకె
షర్షాగడించిన శాశ్వతగౌరవ గాంగేయనిలయంబు కన్నుమాసె
హుమయూను రాజవర్యుఁడు నాటి పోయిన కీర్తి వల్లరులు శుష్కింపసాగె
మెలమెల్లహరిదంతములకు దాటులుబెట్టు మోగలురాజ్యంబు పొలుపుదరిగె

తే.గీ.	మనమరాటేంద్రునండ నెమ్మది సుఖించు
భరతమాతకుఁ దిరుగఁదత్తరము దోచె
నింతయేటికి యవనభూకాంతులెల్లఁ
బ్రాణ వాయువు లఱచేతఁబట్టుకొనిరి.

సీ.	జనకుని బంది నుంచిన బుద్ధిమంతుఁడు భ్రాతలఁజంపిన బాహుశాలి
మ్రొక్కువారల హస్తములు ద్రుంచు నెఱదాత తలపన్నుదగిలించు ధర్మవర్తి
గానపాండితికి వెక్కసపడు రసికుఁడు చిలుగులు సృష్టించు సిద్ధమూర్తి
గుడి మసీదును జేసికొను మహాభక్తుండు పరమతస్థులనేచు పరమయోగి

తే.గీ.	నిందకెదురెక్కు సత్కీర్తి నిస్తులుండు
ఆశ్రితుల జంపనెంచు దయామయుండు
క్షితిపతిత్వంబుబూని యాశీనుఁడగుట
నెమిలి పీఠము కన్నుల నీరునించె

చం. జముఁడ దయాపరుండన బ్రచండతమీర నిరంకుశాధికా
రము వెలయన్ దురాగత పరత్వమునన్ సులతానుగారు రా
జ్యములు తపింపఁజేయు సమఁయంబునఁ గానఁగనయ్యె భావ నే
త్రమున శివాజిరాజు నిజ దర్పతమోదిన రాజబింబమై

కం. అంకురితమయ్యెఁ బటుభీ
త్యంకూరము డెందమందుఁ యవనపతికి వై
రాంకురముతోడ, దుష్టుల
కంకుశములుగారె సజ్జనాగ్రణులు హరా!

కం. ఏపున జృంభించు శివా
జీ పగతునిరూపుమాపుచిత్తంబున ఢి
ల్లీపుండతియత్నచయ
వ్యాపారమునందు మగ్నుఁడయ్యె మహేశా!

శా. ఆనీతాత్మ శతాంగ సైనికతురంగానీక మున్మీలిత
ధ్యానంబై నడువన్ రయంబున రణోత్సాహంబుమీరన్ జిజా
సూనుం డిద్దమరాటమేటిధరణీశుం డొక్కనాఁడర్థరా
త్రానన్ రావుపురంబుపై నడచె దోర్గర్వం బఖర్వంబుగన్

తే.గీ. మౌనము వహించు రేయను మానవతికి
ననుగుణంబుగ నడచు సైన్యములనేర్పుఁ
జకితనక్షత్ర నేత్ర సంచయము విచ్చి
గగనభామిని విసువకకాంచుచుండె.

తే.గీ. అయ్యనీకిని యందు నెయ్యము దలిర్ప
నొరుల దృష్టికిఁ గానరాకుండు కొఱకు
నిశల గారాడు నొకమోహినీ లతాంగి
తఱచు చీకఁటి రంగు దిద్దం దొడంగె

సీ. ప్రాణికోటులను నిద్రాదేవి పొత్తుల నుంచి యుయ్యాలల నూచువేళ
కాముకుల్దనిసి సంగడికత్తియల గబ్బి గుబ్బలఁబడి కన్నుఁ గూర్కువేళ
సమయపూరుషుని హెచ్చరికమై కొక్కురోకోయని తొలికోడి కూయువేళ
కునుకు నిదుర మేలుకొని తూరుపున వేగుచుక్క కన్నులు విచ్చి చూచువేళ

తే.గీ. దీపికా శోభమెలమెల్లఁ దెమలు వేళ
మందపవనాంకురంబులు మలయువేళ
కొఱవి దయ్యాలపటిమంబు దరుగువేళ
వైరి పురి ముట్టడించె, శివాజి దండు

తే.గీ. కలహభేరిని మ్రోయించి గవిని దాటి
పట్టణముఁ జొచ్చు మావళీ బలము నరసి
తత్తరంబున లేచి మొత్తములు గట్టి
తురకలెదిరించి పోరసాగిరి పురారి!

కం. ఇరువాగుఁ గలసికొని భీ
కరలీలఁ బెనంగువేళ గాఢతిమిర వి
స్ఫురణంబున గుఱుతెఱుఁగక
నరకికొనిరి తమ్ముఁదా మనంగ ధ్వంసీ

కం. తరవారు నఱకుడుల బలు
నెఱియలబడి చిలుపచిలుప నెత్తురుఱక న
క్కఱకు తురకలెఱుక సెడక
పిఱుతివియక రణము జొచ్చి పెనఁగిరి కినుకన్

తే.గీ. దేవలోకపు వృద్ధరంభావధూటి
పొందునందున్న చిత్రమేమో మహేశ
పక్కుపక్కున శిరములు బగులగొట్టి
కొని బలంబులు గుట్టలై కూలుచుండె.

తే.గీ. బాహువీరులు యుద్ధదేవత కొసంగు
మ్రొక్కుబడు లేమొ నెత్తుట మునిఁగి తేలు
చుండె, మొండెముల్బాహువులూరువులు క
పాలములు గుండియలు నాటి భండనమున

తే.గీ. చిక్కుచీకఁటి పోరు వీక్షించుకొఱకు
గగన వీధిని బారులు గట్టిచూచు
సురలబుద్ధికిఁ దోచె "ముసుంగులోని
గుదులాట" భావంబు సదుణగరిష

శా. హేతిచ్ఛాయల దాయలంగని "భవానీ! శాంకరీ!" యంచు ని
ర్ఘాతంబుల్బలె మావళేయు లెదురెక్కన్నిక్కిరాలేక ప్ర
జ్ఞాతాత్పర్యముఁ దక్కి పీనుఁగులక్రిందన్నక్కిన మ్లేచ్ఛపా
దాతంబా తరుణంబు నందనలనేత్రా! త్రస్త కోదండమై

సీ. బ్రహ్మాండమగల దీర్ఘములైన కోటకొమ్మలఁబ్రేలు పలుఫిరంగులవెలుంగు
కఠినంపుటుక్కు ముక్కలఁజిమ్ము నలమందుఁ బొదిగిన పెదచిచ్చు బుడ్ల వెలుఁగు
గగనంబు చిత్తు బిత్తుగఁ గ్రమ్మికొనివచ్చు తులలేని యంపకోలల వెలుంగు
చెరలాడు మిడుఁగురుం బురువులట్లొరయు కత్తులఁబుట్టునగ్గి రవ్వల వెలుంగు

తే.గీ. ప్రక్కలగుచున్న కుంభి కుంభములనుండి
తెమలిపడుచున్న మంచి ముత్తెములవెలుఁగు
లెడతెగక పెచ్చుమీరినల్లడలఁగ్రమ్మి
తెల్లవాఱక మునుముందె తెల్లవాఱె.

ఉ. ఆ సమరాంగణంబున భయంపడి పిక్క బలంబుఁజూపు కాం
డాసనఖడ్గధారులున వారుణ ధారలు కండ్లఁజూచి పే
రీసున గిఱ్ఱునన్ దిరిగి యిద్ధపరాక్రమవిక్రమ క్రియా
భాసురులై పెనంగిరి శివా!పగవారు నవాబు సైనికుల్

ఉ. ఏపు రవంతయుం దఱుఁగ కీవలనావలనున్నవారు కు
ట్టూపిరియాడునంత వరకుగ్రవదాగ్రహమూర్తులై భుజా
టోపముఁజూపుచుండిరి, కడుందిరమైన యశఃపురంధ్రితో
గాపురముండఁగోరిన మగండు శరీరము లెక్కసేయునే

వ. ఆ యోధనంబు భీకరంబై జయంబు దుర్లభంబుగా దోప

ఉ. మించిన రోషవేగమున మీసముదీటుచుఁ గేకబెట్టి రెం
డంచుల కత్తికేల నడయాడ ఁదురంగము దండునందు దూ
కించి, జిజాతనూభవుఁడు కింకిరిఖానుల వేల్పువీటినె
క్కించుచు సంచరించెఁ బరికించఁగరాని కరాళరూపియై

శా. ఇంట న్నాపదసన్నిధాన భజనంబే స్వర్గరాజ్యస్ఫుర
ద్ఘంటామార్గముగా మెలంగెడు జిజాకాంతాప్రభావంబు మై
నంటన్ బింబితమైన రెండవ మదీయాకారమీతండు ము
క్కంటీ! యాయరిసేనపైకొనుట కింకన్నిబ్బరంబుండునే

సీ. ఒకదేహమునకు వేరొక దేహమంటించి కత్తలానుల మెడల్గత్తిరించి
కరపరంపరలు ముక్కలు ముక్కలొనరించి కరికోటిఁ గిరికోటిగా నొనర్చి
పొట్టలనున్న ప్రేవులను మాయముజేసి రౌతులమీద గుఱ్ఱాల నిల్పి
నెత్తుటి వరద మన్నీల కతలు నేర్పి మోముదమ్ములను వీపులకు మలిపి

తే.గీ. అమ్మరాటుని పాణిమధ్యముననలరు
నస్మదీయాంకితంబగు నాయుధంబు
చిత్రగతి రణస్థలిఁబ్రదర్శింపసాగె
చక్షుభీకరమగు నింద్రజాల విద్య

ఉ. చిక్కని పచ్చి నెత్తురులు చేరలతో దిగద్రావి మాంసము
న్మెక్కి కపాలపాత్రికలనించిన క్రొవ్వుభుజించి యెమ్ముల
న్ముక్కలు జేసి యందుఁగల మూలుగుఁబీలిచి తృప్తి దీరి మ
త్తెక్కిచరించుచుండె, హృదయేశ్వర! నీచపిశాచసంఘముల్

తే.గీ. అలికముననగ్గి కన్నులేదయినఁగాని
సారతరమైన నీనామధారణమునఁ
దురకల నతండు నవమన్మథులను జేసి
వేల్పుఁగన్నెలకర్పించె విశ్వనాథ

తే.గీ. మూడు రాకాశి పల్లెలు బూదిజేయు
నీశివత్వంబు నెమ్మేన నిలిపి కొన్న
వీరునకు నొక్క రాకాసివీటి పోరు
నాథ! నల్లేరుపైఁబండి నడక గాదె

కం. ఆతని కరాసి ధారా
జాతద్యుతి మునిఁగి తేలు శాత్రవసేనా
వ్రాతంబెఱుంగదయ్యేఁ బ్ర
భాతంబును, బొదుపొడుపు భావజవైరీ!

కం.	కనుకని బరచెడు తురకల
వెనుకొని చీకటులు సడలి బిలములలో దా
గినవయ్యె నిందుధర! యెం
దును దొంగకు దొంగ దొరకు దొర తోడుగదా

కం.	తూరుపు దెసతొొయ్యలినవ
వారిజహితమండలంపుఁ బళ్లెరమునఁ గ్రొ
న్నీరెండ పచ్చికపురఁపు
టారతులిడసాగె, జయవిహారులకు, హరా

సీ.	సమరయోధులమేని చెమట బిందువులచేఁ నలఁతిగాడుపులదాహములు దీర్చి
................................
................................
................................ (అయిదు పద్యములు అలభ్యము)

తే.గీ.	అన్నతలతేరి కొమ్మున కంటఁగట్టి
పరిభవించుట కన్నార నరయుచున్న
యనుజుఁడుగ్రత దాకె దవానలంబు
నిడుదనాల్కల కెదురెక్కు మిడుత కరణి

తే.గీ.	కుమతి రాజుల గొొంతులకోత కతనఁ
బదును ముదురైన రాజు శివాజి చేతి
కత్తి కాతఁడు రెండవకబళమగుచు
నగ్రజుని తోడ యమునింటి కతిథియయ్యె

సీ.	చిరఁజిరంజిందునెత్తురు వసంతముజిమ్మి కెంపురంగుల కలయంపిజల్లి
మెదడుగందపు రొంపి మదముతోనలికి యెమ్ములదుమ్ముతోనిగ్గు ముగ్గుబెట్టి
శరసహస్రములఁబందిరులందముగఁగట్టి పుఱ్ఱెలతోరణమ్ములు రచించి
బలితంపుఁబీన్గు గుట్టలవేదికలు దీర్చి పొలబువ్వ గ్రద్దపిట్టలకు బెట్టి

తే.గీ.	చిరుత బూబుల గొనబు పుస్తెలు హరించి
భీమదుందుభి ధ్వానంబు పిక్కటిల్ల
కదనకన్య శివాజిరాట్కంఠ సీమ
ముదముగెసేసె విజయంబు పూలదండ

తే.గీ.	అంతనా రాజ వీరభాస్వంతుఁడెలమి
జయపతాకంబునెత్తించి సత్వరముగ
రోహిడాదుర్గమును దాకియాహవంబు
సలిపియోడించె నచ్చటి శత్రునృపతి

కం.	ఆ పురిభూపుని నిజసే
నాపతి బాజీప్రభుండనంతబలుఁడు త
ద్భూపుఁడు గతింప మహరా
టాపతి సేవింపగా గడంగె నటేశా!

శా.	నాకుల్మెచ్చ మహాబలేశ్వరముపొంతన్ పావనంబైన కృ
ష్ణా కల్లోలవతీ తటంబున ధరాశాతోదరీ చారు భూ
షా కల్పంబగు దుర్గరాజమును తేజంబారగట్టించె నా
థా! కీర్త్యబ్జముఖీనివాస నిలయంబై మింటఁగన్పట్టగన్

కం.	భూపతిశేఖరుఁడపుడు ప్ర
తాపగడ సమాహ్వాయంబు, దానికినిడి మా
రోపంతుపింగళుని గుణ
దీపు నిధీచాతురిన్నుతించె విరించీ!

కం.	అలబీజపూరుపురినే
దులశాహిగతింపఁదన సుతుండాలీయే
దులశాహిగద్దెనెక్క
న్గ లనికి రిపుకోటిగంధ గజములనెక్కన్

తే.గీ.	అతడు సుల్తాను కొడుకు కాడను నెపంబుఁ
గల్పన మొనర్చి వాని సంగ్రామ సీమ
శిక్షితునిఁజేతునని గొప్పసేనతోడ
వచ్చె నౌరంగజేబు దుర్వారలీల!

ఉ.	టక్కరిఖాను బెబ్బులి పటాలముతో నవురంగజీబుడే
దిక్కున వాలునోయని మదిందల పోసి, విసంబుబూసి మే
ల్కక్కసపుంగటారి తెగలన్ తరవారుల సానబట్టి విం
డెక్కిడి యంపకోలలు వహించిరి మేటి మరాటపోటరుల్

ఉ. ఆదిని గోలకొండను రయంబునఁదాకి జయించి హైదరా
బాదునుకొల్లగొట్టి, తరువాత విజాపురిముట్టడించి, ధా
త్రీదయితుండు సంధి పొనరింప నవాబుఁడవారితాహవో
న్మాద తురుష్కవీర కరినాథులతో మరలెం బురానికిన్

ఉ. మోగలు కాఋమబ్బువిడిపోవ శివాజి భవాని తల్లి నా
తోఁగలదంచు సమ్మదముతో కరనాటకసీమకేగి బా
హాగరిమంబునన్గలఁచె నచ్చటి దుర్గములాత్మయోధ పు
న్నాగచయంబు భిన్నములొనర్చి హరిత్తులసంచరింపగన్

వ. అనంతంబా ఛత్రపతి చమూపతులతో నరిగి

ఉ. సోరణగండ్లలోనొదిగి చుక్కలు డాగుదుమూతలాడు జూ
నారు గడంబుదాకి యవన క్షితినాథునిఁజంపి పారసీ
స్వారిగుఱాలు మేలయిన పట్టుదుకూలములోపినంత బం
గారము, చాందినీపని చొకాటఁపుఁదేరులు సంగ్రహించుచున్

తే.గీ. కడు రయంబునఁ దనరాయగడముఁజేర్చి
యది యెఱింగిన సుల్తానుఁడలుగు నంచు
"స్వామివారికి నేను సేవకుఁడ" ననుచు
గల్లజొబ్బిలు పలుకు గాన్కలను బనిచె

ఉ. అడ్డములేక చేయఁగల యంత దురాగతమాచరించునా
దొడ్డనవాబుఁడందుకు కుతూహలుఁడై తెలిదాలుజిమ్మునా
ల్గడ్డము దువ్వుచున్ బకపకన్నగి యచ్చపురాచసింగపు
న్బిడ్డ శివాజి రాజునొక భీరునిగా దలఁచెన్మనంబునన్

తే.గీ. ఆ యలంఘీరు పాదుషాహా శివాజి
మొదటఁబంపిన సందేశమునకు నుచ్చి
కూరిమియొనర్చు నర్థంబు గూడియున్న
యుత్తరమునంపె, కపటంబు పొత్తిగట్టి

తే.గీ. తానుసృష్టించు కపటయత్నములలోన
శ్రీశివాజీ ధరాజాని చిక్కెననుచు
దలఁచెనా వెట్టిరాజు చిత్తమున కాని
తెలియఁడాతండు రాజనీతిజ్ఞుఁడగుట

తే.గీ. నాటికింకను దృఢముగా నాటికొనని
నిజమహీరాజ్యమను క్రొత్తనిమ్మమొలక
కప్పటికి మొగలాయి ఝంఝూనిలంబు
దెబ్బదప్పిన దనుచు శాంతించెనతఁడు

కం. ఆలఁపుటన్నము గుడిచిన
వాలుంగత్తులకుఁ బిండివంటలు గుడుపం
బోలువనాళికి మృగయా
కేళికిఁజనె నొక్కనాఁడు కృతక కిరాతా!

శా. బారీటెల్జిరుకత్తులమ్ములపొదల్బాణాసనంబుల్జిరా
ల్బారల్డప్పులు బూని యప్పరిజనంబుల్గొల్చిరాఁ గెంపుటం
బారీయేనుఁగు నెక్కి చక్కని జేరీ మాంధాళిపాగా తురా
సౌరుం జిమ్ముచుఁబోయెఁ గానలకు రాజన్యుండనన్యోద్ధతిన్

కం. ఖలులమదంబడచెదు భూ
తల నాథుండనుచు సమ్ముదంబునఁదలకొ
మ్మలు గదలించి పూవుంగ
న్నులు విచ్చి వనాంగనల్గనుంగొనిరి శివా!

సీ. నిదురించు బెబ్బులిన్గదలించి గుజ్జుకత్తులఁజీరి చర్మంబు లొలిచియొలిచి
యమ్ముటేటుల సరోషమ్ములై చెలరేగు సింహాలనాలుకల్జించి చించి
గమకించి ముష్టియుద్ధముసేయు నెలుగుల వెన్నులు రెండుగా విరిచి విరిచి
అలిగినయడవియేన్గులపుట్టియలు లేఁవ బెద్దబల్లెంబులు విసరి విసరి

తే.గీ. చిరుతపులి మొత్తములతలల్జెండి చెండి
చిక్కణంబగు నవ్వనక్షేత్రములకు
మెగమునెత్తురు మళ్లు నిర్మించి రపుడు
భీమబలులగు మావళీ వేటకాండ్రు

కం. కరుణించి లేటి పిండులఁ
బొరిగొనరల దుష్ట సత్వములఁద్రుంచియు ని
ష్ఠురమైన రాతి గుండె
న్గరఁగింపదె సాధుజీవనంబు త్రిశూలీ!

తే.గీ. గాయముల నుండి కాల్వలు గట్టిపారు
వేడినెత్తుటఁ దడిసిన ద్విపములంతఁ
బరువులిడసాగె ఘీంకృతి ధ్వనులు సెలఁగ
నడువఁగల కుంకుమంపు కొండల విధాన

తే.గీ. ఎవరు బిలిచినఁబలికి గౌరవము సేయు
దిగ్గజంబులు మీకుఁ బ్రతిస్వసంబు
లీయవని శబ్దవావలికేగనీక
విపిన సంతతి మార్మ్రోసి వెక్కిరించె

ఉ. క్రొవ్వున, మద్ది మ్రానులను కోఱలఁజెండుచుఁబోరుసేయ గా
ర్దవ్వేడు పందులమ్ముల గళద్రుధిరాంగములైధరాతలిన్
గువ్వలు కువ్వలై పడియె, కూలెడు సింగఁపు రాచవారికి
న్బువ్వులసెజ్జయైన వనభూమికి నల్లని పట్టుదిండులై

ఉ. తీయని పండులన్గుడిచి దీర్ఘమహీరుహ విస్త్రతచ్ఛద
చ్ఛాయలవిశ్రమించి శుకజాతము ముచ్చటలాడుచున్మరా
టేయులయమ్ముదెబ్బలకు నీల్గుమృగంబులఁజూచి "రామరా
మా" యనిలేచిపోయె ననఘా! పరితాపమువెల్లడించుచున్

తే.గీ. ఒడలు క్రొంజెమ్మటలగ్రక్కుచున్నగాని
కఠిన పాషాణకలితమార్గములలోన
వేటమానరు కాసంతవిసువుఁగొనరు
వ్యసనదేవికిఁ గెంజేతి బంతులగుచు

మ. తఱచైచీకటులీనుకిఱ్ఱుమను కాంతారంబునంజొచ్చి చి
చ్ఛుఱటమ్ములగ్గరియించుచు న్మెగములన్జక్కాడిరావింటి నే
ర్పరు లాజన్మవనీ విహారులు మహారాష్ట్ర క్షమాజాని క
ర్బురపాటునరుపాటమోఘముగ నుప్పొంగంగ గంగాధరా!

తే.గీ. అప్పటికి మిట్ట మధ్యాహ్నమై నభోంత
రాళమున విశ్రమించె మార్తాండుఁడధ్వ
గులకు మృగతృష్ణలంజూపిసవిలరాశి
మాయమొనరించు టక్కరిమాంత్రికుండు

సీ. పలుచనలైన నీడల జాండములకుఁ జిక్కనినీలిరంగు కల్పనము జేసి
బాటసారులకు నీర్వట్టును బుట్టించి తెలినీటి దిగుడుబావులకుఁ దరిమి
మిసమిసలాడు క్రొంబసరుటాకులడాలు వేడిచేతులఁబిండి పిప్పిజేసి
తలలెత్తి చూచుప్రాణుల కన్నుగవ మీద కిరణంపు సూదులు పరపి పరపి

తే.గీ. సుజన దుర్జన భేదంబుజూడకుండ
నెల్లవారల నొకరీతి నేలుకొనుచు
యముని జనకుని తనము నిక్కముగఁదోపఁ
దపనమండలమయ్యె మార్తాండు డంత!

వ. అంతనాశహాజేయుండు మృగయా విహారంబును జాలించి ససైన్యుండై యొక్క జలాశయంబున శ్రమంబు వోనవగాహనంబాచరించి, వన్యఫలంబులఁదని విసనంగుడిచి, సుగంధసుమలతానికుంజంబులంజొచ్చి కోమల వులగుపూవులచే నావరింపఁబడిన యొక్క శాద్వల ప్రదేశంబున శయనించి, ప్రకృతి రామణీయకంబున కచ్చెరువందుచు, చల్లని పిల్ల వాయువులు శరీరంబునంటి జోకొట్ట నప్రయత్ననిమీలితలోచనుండై కొండొకతడవు హాయి హాయి మని నిద్రించి మేల్కని, సమీపలతాగృహంబునల్లుకొన్న విశాల పత్రములపై దృష్టిసారించి, మందసమీరణాలోలంబులగు నేతచ్ఛదంబులు రమ్మని సైగసేయుచున్న వని యూహించి నిదానించి చూడనప్పత్రాంతరంబుల ముత్తియంబులు దాపిన మచ్చున బొడకట్టు చక్కని యక్కరంబులరసి తటాలునఁ బోయి

మ. శివరాజా! ప్రతిభాధురంధర! శహాజీనందనా! దీనబాం
ధవ! హిందూ ధరణీశుభంకర! మహాత్మా! సద్యశచ్చంద్రికా
ధవళీభూతదిశావకాశ! రిపుకాంతా సూత్ర విధ్వంసనో
త్సవకేళీ పరతంత్ర! నీకిదెనమస్కారంబు వీరాగ్రణీ!

శా. ఆటోపంబున నీ జయోన్నతిని దేవావాసముల్పొంగి ఘం
టాటంకారములన్నుతించెడి మరాటాక్ష్మాపతీ! దేవతా
కోటుల్నీటునటించెడిన్ దివి, దిశాకుడ్యంబులన్నేటికే
దాటెన్నీవిజయంబు సూరినుతసాంద్రఖ్యాతి నూరేగుమీ!

సీ. నీ బాహువులు నిల్వనీడలయ్యెను గదా? పొలుపొందు మా ధరా పుణ్యవతికి
నీ కత్తికొనమీద నిలిచియున్నవి గదా పరరాజ శరనిధి బాడబంబు
నీ జయధ్వజరాజు నెగడుచున్నది గదా యరీదుర్గభర్మహర్మ్యములమీద
నీ గుఱ్ఱపుంగిట్టె నించుచున్నది గదా గెలుపు మొల్కలకు బాదులనుదిశల

తే.గీ. త్వద్ధనుర్మేఘమున నంపవానగురిసి
నిండు కీరితి పంటపండింపుమయ్య
కలియుగంబున దురక రక్కసుల నురిమి
రఘుపతివి గమ్ము రాజమార్తాండనీవు

మ. అనయంబున్దన దుర్భరస్థితికి బాష్పాంభోదముల్గొంతశాం
తినిఁగల్పింప నిలింపసంతతికిఁ గన్నీరూరశోకించు భూ
జనయిత్రీమణి నూరడించి, యమితోత్సాహంబుగల్పించి, ప
క్కుననవ్వించితివయ్య పావననభః కుల్యాపదేశంబునన్

సీ. వెలయింపవే కంచువిగ్రహంబుల కంఠభాగాలఁజెంగల్వ బంతులాట
తొలఁగింపవే జగద్దూషణప్రదమైన గోమాతృకలమేలి గొంతుకోత
నిల్పవే దాయమన్నీలరొమ్ముల మీద లీలమై కఱకు బల్లెములముద్ర
సాగింపవే రణస్థలపు మగ్గములందు సరిలేని విజయవస్త్రముల నేత

తే.గీ. కలని వెన్నిచ్చి పారుముష్కరులచేతి
యంపగమి కీవు త్రుప్పు బట్టింపుమయ్య
తివిరినీచేతి చల్వపందిళ్ల నీడ
వసుధఁబాలింపు మోజ, శివాజ రాజ!

కం. "శ్రీరామభక్తుఁడైనతు
ఖారాముం డని పఠించి కౌతుకమునఁ" గ
న్నీరొలికెలేత గడ్డము
పెరె, నెమ్మేన గగురుపాటు జనింపన్

తే.గీ. ధర్మసంస్థాపనా ప్రయత్నంబునందు
దోహదంబయ్యె నమ్మహాత్ముండు కాన
సమరవిధులైన తురకరాజన్యులెల్ల
స్వాంతమున దోచిరావగింజలవిధాన!

కం. పూతములగు నమ్ముని కెం
జేతుల స్పర్శనమువలన చెలువందినయ
య్యాతతపత్రములు మహా
పాతకనాశకములనుచుభావించె శివా!

మ. అని చింతించుచు భక్తిసంభ్రమత మేనల్లాడగానల్లన
ల్లనఁదత్సాంద్రలతానికుంజ మవలీలం దూఱిముంజేతి కం
దిన పత్రంబులు కొన్ని గోసికొని తండ్రీ! నీదయాలాపము
ల్నను ధన్యుంబొనరించెనంచుఁ దలపైన్దాల్చెన్ పవిత్రంబుగన్

కం. దళములు చేకొని తనక
న్నుల కద్దుచు మాటికింగనుంగొనుచు సుని
శ్చలభక్తిగదుర ముని కం
జలియొద్దుచునగుచు మదగజమునెక్కె శివా!

తే.గీ. ఏడుగుఱ్ఱాలయరదంబునెక్కియున్న
ప్రొద్దు, పడమటిదెసనంట బోకమున్న
మత్తగజమునధిష్ఠించి మన శివాజి
పురమునకు వచ్చె భటకోటి ముందునడువ

తే.గీ. అలయనూరుని చమకు దెబ్బలకు బిట్టు
పేరెములు వాఱు సూర్యుని వారువములు
క్రక్కునెత్తురువోలి చెంగల్వ సిరుల
సాంధ్యరాగంబు దోచె పశ్యల్లలాట!

సీ. చరమదిక్సతి మనోహరమైన కెమ్మోవి ముచ్చటదీరంగ ముద్దులాడి
సరసకేతెంచు దిక్పతులకడ్డంబుగా చిరుతచీఁకటి గుంపు తెరలుదింపి
తలలెత్తినిక్కి దిక్కులుసూచు కూనపిట్టలకు తల్లులపొందుగలుగజేసి
గగనదేశంబు చుక్కలకుటుంబములకు నలసి నాలుగుజాములద్దె కిచ్చి

తే.గీ. తానొసంగిన వెలుఁగు వస్త్రములు దాల్చి
తోడచెరరాడ వచ్చు చందురుని మోము
చూడరాదని కాబోలు సూర్యబింబ
మనుఁగు చెలి తోడ జలధి మధ్యమున దుమికె

కం. "దిన దినముఁగ్రుంకు జీవన
ము ను కట్టడిబ్రహ్మ ఫాలమున నేలలిఖిం
చెనురా! నాథా! నీ" కని
వనజాంగన లేడ్చిరెడలు బంభరరవళిన్

సీ. సాంధ్యరాగానలజ్వాలికావళిజిమ్మ దివిగ్రమ్ము క్రొంబొగ లెగలనంగ
కనుమూయు కెందమ్మి వనములు విడనాడి కారాడు నెలదేటి కదుపులనఁగ
విన్ను మెగంబు నాభీబిలంబున జింది మొనసిన కస్తూరి ప్రోవులనఁగ
రేనెలంతుక సంతరించు కీల్జడమీది చిగురు గల్వల నీలి సిరులనంగ

తే.గీ. తాండవంబాడు శివుని మధ్యమున వ్రేలు
ఘనగ జాచిన మేవంకఁ గ్రక్కుచున్న
చిక్కణములయిన నునుడాలు చిన్నెలనఁ గ
గండు చీకట్లు బలిసె దిక్తటములందు

తే.గీ. ఆకసంబను ప్రాఁత కట్టడవియందు
బెరిగి యదనైన చీఁకటి తరుచయంబు
రాత్రియను వసంతంబు సంప్రాప్తమగుట
చుక్కపూవులు పూచె తళుక్కురుమని

మ. చిరునవ్వాననసీమ నుట్టిపడఁ గెంజేతన్రతీదేవి, క్రొ
వ్విరి కోలల్జిరి వీలొనర్చియిడఁ బూవిల్కాడు జృంభించి నె
త్తురు గన్పట్టని గూఢ సంగరమున న్దూలింపజొచ్చె న్ధర
నరులన్నిన్నరవానిఁ జేసిన ప్రచండప్రజ్ఞ దీపింపగన్

తే.గీ. సౌబలుఁడు సుయోధనుని పక్షమునఁజేరి
వ్యసన విజయంబునకు దోడుపడిన యట్లు
అల్లుఁడొనరించు నీచప్రయత్నమందు
దూర్పుదెసకెక్కి నెలమామ తోడుపడియె

సీ. కడలిరాయని ముద్దు కడుపున జన్మించి సిరితోడఁబెరిగిన చిన్నవాఁడు
నలిననాభునిపెండ్లినాఁడు సోదరినవ్వఁ పాదాలు గడిగిన బావమఱఁది
పండువెన్నెలఁజిమ్మి పైరులఁ బండించి ధరణికన్నముబెట్టు ధర్మరాజు
రక్తసంబంధంబు రవ్వంత లేకున్న మానవావళికెల్ల మామగారు.

తే.గీ. కులటలెంతంతగా తిట్టికొనుచునున్న
చింతకాసంతయందని శాంతమూర్తి
జింకపిల్లను ప్రియమారఁజంకఁబెట్టి
పొడుపు కొండలకెక్కె వెన్నెల మగండు

ఉ. గానకళాప్రవీణ! సుమకాండ సమంచిత రూపధేయ! వి
ద్యానవనీరజాసన! నిరంతర సూనృత వాగ్విహార! గం
గానట దూర్మికాయతి వికస్వర భూరియశః ప్రకాండ, స
న్మానిత సత్కవిప్రవరమండల! పోషితసూరిమండలా

ఇది
శ్రీ గుఱ్ఱమువంశకలశపాథోనిధానరాకాసుధాకర
వీరయాఖ్యజ్యేష్ఠతనూభవలింగమాం
బాసుపుత్రజాషువాఖ్యప్రణీ
తంబైనశ్రీశివాజీప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసంబుసంపూ
ర్ణంబు

## తృతీయాశ్వాసము

కం. శ్రీః మహితమందహాస
స్తోమాపహృతాశ్రిత ప్రచురదుఃఖ కదం
బా! మాన్యప్రాభవ ల
క్ష్మీమండిత బాహుదండ శ్రీశైలపతీ!

కం. అవధారుమమ్మహీపతి
యువతీ సహితముగఁ బూజలొనరించె మఁణీ
భవనమున నాటిరేయి న
భవ! చంద్రుఁడు తుహినమోద బాష్పములు విడన్

మ. మునిసందర్శన వాంఛయందొక యుగంబున్, ప్రేయసీ బాహుబం
ధనమందొక్కనిమేషమై తనరె నాథా! దారుణీదార చం
ద్రునకారాతిరి కాలచక్రగతి వైరుధ్యంబు గాకున్నె మ
ర్త్యునిచింతాసుఖ జీవనాది దశలందున్ నిక్కువంబేకదా?

కం. మునిని వెదకి తెచ్చుట క
జ్జననాథుఁడు తనిపె గూఢచారుల నుదయం
బుననినున కర్ఘ్యమీయక
మునుప నియత కాలకృత్యములు దీర్పకయే.

తే.గీ. అమరాటేయులా తుఖారామమునినిఁ
గాంచిరొక సాంద్రతరమైన గహనసీమ
ముక్తికామిని కామించి ముద్దుఁగొనఁగ
నెమ్మొగంబున శాంతంబు జిమ్ముచాని

వ. ఆ సమయంబున సమాధినుండి యుద్గమించు మునినాథుఁడు

కం. అరమోడ్పుభరము చేతఁ దొ
గరుడాలిసుమంత బెరయు కనుఁదమ్ములతో
గురియించె శీతలేక్షణ
పరంపరలు వారినడక బడలికలుడుగన్

మ. మునిమూర్ధన్యుని సాదరంబులగు చూపుం బుంజముల్ నోరులే
కన ప్రశ్నించె శివాజిసేవకుల యోగక్షేమముల్ మోమునన్
జననంబై తొలుకాడు క్రొన్నగవు వాత్సల్యంబుతో పెట్టి పో
యని సత్కారములాచరించెనిదిగాదా? నేరుపుక్షధ్వజా!

కం. యతిపాదపల్లవములకు
నతులొనరిచి యమ్మరాటనాయకులవనీ
పతి చిత్తమెఱుక పరచిరి
నతమస్తక వినయ కంఠనాదంబులతో

వ. తుఖారామసాధూత్తముండు చిత్తంబునఁ గౌతుకంబు పేటెత్త భూపతి సత్తముని బత్తికిం గరంబునెత్తి నమస్కరించి, కించిజ్జ్ఞుండనగునే నమ్మహాభాగునకుం గురుత్వంబు వహింపనోపుదునే, జగదారాధ్యుండుగు రామదాసుండ, యర్హుడు తత్సంయమి తల్లజునిఁ బ్రార్థింపుడనుచు.

కం. మీకును మీ శివరాజున
కాకల్పాంతంబు విజయమని యమ్ముని లే
తాకుంజేతులు శిరములు
సోకఁగ నాశీర్వదించె శుభ్రాంశుధరా!

వ. తపసికడ సెలవుగైకొన్న రాజకింకరులు

తే.గీ. అతని పలుకులు మంచిముత్యములకన్న
భద్రముగఁదెచ్చి విభునకర్పణముజేసి
రనఘ! మనరామదాసభక్తుని మొగంబు
వేడ్క నెమ్మదిలోన బింబితముగాగ

ఉ. ఎన్నఁడు రామదాసముని కేను నమస్కృతిసేతు నెన్నఁడ
ప్పున్నెపుఁ బల్కులన్గలుషముల్దరియించెద నెన్నఁడమ్ముని
స్విన్న కరాంబుజద్వయము శీర్షమున న్ధరియింతునంచుఁ బు
చ్చె న్నులివెచ్చ యూరుపులు చిత్తమునందు నిరాసలూరగన్

తే.గీ. సాధుసంగతి నెఱప నుత్సాహియయ్యు
శత్రుభంజనమున నిరుత్సాహికాఁడు
రాజమునియను బిరుదు సార్థకముసేయు
వసుమతీంద్రుండు గలఁడె? శివాజి కాక

ఉ. బత్తుని రామదాసముని భాస్కరునిం గొనితేరఁబంచె రా
జోత్తముఁడిష్టసేవకుల యోధసహస్రము వెంబడింప సూ
రత్తునతండుదాకి, బవరమ్మొనరించి, జయించి, ద్రవ్యపుం
దిత్తులు బండ్లతోడఁగొనితెచ్చె జయేందిరతో మహేశ్వరా!

కం. నాలుగు దెసల శివాజీ
వాలు మహా భయదవృత్తిఁ బరువులిడుటచేఁ
గూళల కన్నుందమ్ములు
వాలవు రాత్రిందివంబు బాలేందుధరా!

వ. అప్పుడు బీజపురాధీశ్వరుండు శహాజేయుండజేయుండై దిశా విజయ పరి
భ్రాజితుండై పెంపెసఁగుటెఱింగి యాత్మగతంబున.

మ. శివపంచాననమెన్నఁడో పురము భస్మీభూతముంజేయు ని
క్కువ మంచు న్దలపోసి మానసము గగ్గోల్గా నిరాహారియై
యవనేశుండు తపింపసాగె, భవదీయంబైన నామంబు మూ
డవకంటం గల మంటలన్వెలుఁగుచుండంబో్రహస్యంబుగా

కం. ఆ నరపు సచివుడబుజు
ల్ఖానుండుద్దండ రణకళా కుశలుఁడు షా
జీనందనుఁదెచ్చెదనని
పూనె ఖడ్గంబు మిత్తి ముందునడువగా

మ. సులతానుండు శుభంబునీ కనుచు మెచ్చుల్మీర ముత్యాల దం
డలు సాహేబుని కంఠమందిడ నరిష్ట ప్రాప్తిసూచించు గూ
బలు గుగ్గూయని కూసెఁ గాకముల రావంబుల్సెలంగె న్సభా
స్థలిఁజూపట్టెనతండు కొండొకనిమేషంబర్ధ దేహంబుతో

కం. శకునంపుఁ బట్టింపులు చూ
చుకొనంగా నీదు కాలచోదితుని నికా
యెకినడిపించు గదా మి
త్తికిఁ గలనేరుపును మెచ్చితిని భూపపతీ!

మ. ఒకవంక న్విభుఁడొక్కవంక యముఁడుద్యోగించి ప్రేరేచఁ గం
టికిఁగెంపెక్కఁ దురంగ రత్నమునదిష్ఠించెం దురుష్కుందు నూ
టికి సర్దారులు భండనప్రియులు కొండీరాదివీరుల్మహో
త్సుకులై మీసలు దీటుచున్నఁటకుఁ గత్తుల్బూని వెంటాడిరాన్

సీ. హందంగనలకుఁ బాయక తాళగతినేర్పు నాలంపుటాట గుజ్జాలబారు
తతకర్ణతాళవృంతములశ్రాంతులు వాపు జగడంపుఁబొగరు టేనుగులదండు
తలలపై మింటి చుక్కలనాటలాడించు కంచుపోతల శతాంగములపాళి
యినుఁపకోటలను తుత్తునియలుగావించు మేలైన కీల్ఫిరంగీల బండ్లు

తే.గీ. నిలిచిపోరాడు బిరుదు మన్నీలబలము
నలుకెలంకుల వెన్నాడి నడువ యుద్ధ
యాత్రకేతెంచుఖానునందలిగి యేమొ
ధూళిజల్లుటమానదిలాలతాంగి

ఉ. ఆగతి మొగలేయులు రయంబునతెక్క గదల్పకేగు తూ
నీగలఁబోలి కట్టడవులేళులు దాటుచు దీవ్యతీర్థయా
త్రాగత పాంథకోటుల దయారస హీనత మట్టుచున్నివా
జీ గజవైరి యాగ్రహము జెందఁగవచ్చి రనంగ భంజనా!

సీ. గిలకలమీద నక్కీవెన్నెలలుగాయు కెంబట్టునిలువుటంగీధరించి
పీతవర్ణఁపుటరబ్బీ పాగనుండి ప్రక్కకుజారఁ బికిలి యూకలనమర్చి
పైడిపువ్వుల రవ్వపని జగ్గునిగ్గుల పిడిబాకు మొలనుండి వ్రేలవైచి
ప్రజ్ఞ వక్కాణించు బంగారుబిరుదులు ముచ్చట మీర రొమ్మున నమర్చి

తే.గీ. కొమరు ముచ్చెలు నిడుద పాదముల బూని
కంఠమున రత్నమణి మాలికలు వహించి
గడ్డము గలట్టి చిగురువిల్కాని లీల
కట్టె గుఱ్ఱముపై ఖాను గదలివచ్చె.

తే.గీ. ఆయువు గతించెనను రహస్యంపుఁబలుకు
నెటులెటింగినదో వాని నిటలసీమ
పటుపథాయాస మిష నేడువందొడంగె
సారెదిగజారు స్వేదబాష్పములు గురిసి

వ. అట్లు తురుష్కవాహిని యాహవదోహలతమెరయఁ బ్రస్థానంబుగావించుచు మార్గమధ్యంబులంగల పురవరంబులఁగొల్లగొట్టుచు, దేవభవనముల నిర్మూలించె

కం. భాసురములైన దేవా
వాసంబుల శోభ నాడు పగర కనుల క
య్యో! సూది పోటుగాకు
న్నే సాంబా! మతవిరోధమేఁ కారణమై

కం. అకటా! కాలనదీ వీ
చికలకు రవ్వంత చెక్కుచెదరకదేమో
యొకయల్పవాహినీ వీ
చికలకు దేవళములెల్ల శిథిలములయ్యెన్

తే.గీ. ఒక విచిత్రంబు వినుము చండకరమైన
యబ్జులుని దండయాత్ర శహాజిసుతుని
కర్ణములు సోకినంతఁ గక్కసఁపుటుక్కు
గోళులొకచేత మొలిచె, శుండాలదమన!

మ. అఫ్జుల్ఖానుని నామధేయమను నాజ్యంబా శివాజీ ధరా
ధిపు శౌర్యానలమంటి తీవ్రముగనుద్దీపింపఁ బూనాపురీ
విపిన ప్రాంత సమీప దుర్గమరిదుర్భేద్యంబుగా నెంచి గు
ట్టుఁపుఁగాలాడిన జాడలేకరిగె జాగ్రత్సైనికోపేతుఁడై

తే.గీ. ఆ వనంబులలో నడయాడుచుండు
నలఁతి చీమయు మావళేయులు రచించు
నడుఁగు జాడల కలవాటు పడకయున్న
వెలికి రాజాలవన్న దాయలకుఁ దరమె

సీ. కాపురం బొనరింపగా నీదు చాయాలతాతన్వి నబ్జబాంధవుని తోడ
కన్నెత్తి పరికింపగా నీయదిరుల గుంపుకలను రేపొలంతుక మొగంబు
కాలాడనడయాడగా నీదు క్రొత్తచుట్టములన్నఁ జిక్కుటీరములలోన
గౌరవంబును దక్కగా నీదు తలవంచ కేతెంచునెట్టి భూనేతనేని

తే.గీ. పలుకు పలికినఁ దిరుగు చెప్పంగ నేర్పి
మోవిఁగదలించుచో బీరువోవనీయ
దింతనేర్చిన వనమురానీయఁగలదె
తురక దండును ప్రాతబందుగులపైకి

తే.గీ. ఆప్రతాపగడంబున కన్నిదిశల
నలమికొని యున్న యీ యరణ్యానిలోని
సింహగర్జనమున కభ్రసింధురంబు
బెదరి కన్నీటిపాటుమానదు పురారి!

తే.గీ. స్థలము భాగించుకొనుచు వృక్షమ్ములెపుడు
రాచుకొనుచుండు దీర్ఘవైరములు బెరిగి
కొంపలకు నిప్పులంటించుకొన్నవరకు
విసువుఁ గొనఁబోవదేలాసికసి మహేశ!

కం. జననాథుఁ డగ్గడీకే
గిన విషయంబెఱిగి సంచకితుఁడై చింతా
వనధిఁబడెఖానుఁ డరిభం
జన యత్నమసాధ్య మని విశాలమనస్కా!

ఉ. సేనలనొండుచో నిలిపి సేయమొనర్చినచో మరాటభూ
జాని లభించునంచు నొకజాబు రయంబునవ్రాసి తోడిసే
నానికొసంగిపుచ్చె; కుహనాకలనాచణమైన శ్రీశివా
జీనృప మత్తకుంజరము చిక్కునె టక్కరి పల్కుటుచ్చులన్

కం. ఆరాయబారి ఘనకాం
తారంబు తరించి యాప్రతాపగడంబు
న్జేరి శివాజీకి నమ
స్కారముఁగావించి చేతి కమ్మనొసంగెన్

వ. ఇచ్చకు నచ్చిన తెఱంగభినయించుచు నప్పత్రికనువిచ్చి

కం. ఓ రాజన్య కురంగాం
కా! రాకాచంద్రచంద్రికా రమ్యయశో
వారా! వారితరిపుదో
స్సారా! శూరోత్తరా జిజాసుకుమారా!

ఉ. నీవు మహానుభావుఁడవు నీ భుజవీర్యము విశ్వధారుణీ
దేవికి వజ్రకంచుకము దిక్కులు నీవిజయోగ్ర శింజినీ
రావములాలకించి ప్రతిరావముసేయుచు మేలుమేల్చిరం
జీవివి గమ్మటంచదె వచించెడు నన్న శహాజినందనా!

కం. ఏనును నీ జనకుండును
క్ష్మానాయక తొల్లి చెలిమికాండ్రమగుట నీ
పైనాకెంతో కలదభి
మానంబేనెంత ముసలిమానుడనైనన్

కం. పేరబుజుల్ఖానుఁడు, స
ర్దారుండను బీజపూరు రాజ్యమ్మునన్
కూరిమికైవచ్చితి నను
వేరుగఁ దలపోయకయ్య వీరశివాజీ!

వ. అని చదివి సత్వరంబ దుర్గంబు జొచ్చి జననీ సమక్షంబున లేఖం బఠియించి వినిచిన వీరకాంతయు, వీరమాతయగునమ్మదవతీ లలామంబగ్రనందన ప్రాణాపహరణకారణ ప్రతివీరనామ శ్రవణంబునఁ గుబుసంబు విడిచిన భుజంగి తెఱంగుననుప్పొంగి కుమారుం గౌంగిలించుకొని, తొల్లింటి కసిందీర్చి కొనంగల కాలంబువచ్చెంగుమారా! కృతకహితంబభినయించి రావింపుమిందుల కంబభవానియునీయకొనంగలందని నిజప్రతాప ధనంజయంబునకుఁ బాణింధమంబగుట.

ఉ. ఏలినవారికేనెపుడు భృత్యుఁడ సాహెబుగారియాన ము
త్యాలకిరీట తుల్యముగదాల్తు శిరంబుననిట్టి నన్ను భూ
పాలురుమీరు కూర్మి నెరపం బిలిపించుట కీర్తివర్ధశా
మూలముగాదె, చేకొనుము మ్రొక్కులు నబ్జులుఖానుసాహెబా!

ఉ. మీరు నవాబుగారి కడ మేటిమహారథులేనుకూడ స
ర్కారుల కొల్వు జేసుకొనగా తగు మార్గముజేసి యింత స
త్కారముఁగట్టుకొందు సులతానుకు రాజ్యము ధారవోసి మీ
పేరును జెప్పుకొందు రణవీర పరంతప ఖానుశేఖరా!

శా. సేవాధర్మముఁబూని మత్పిత శహాజీరాజు మీయండ బా
హావైదుష్యముఁజాటి మీవలన మాన్యక్షేత్రముల్గాంచలే
దో; విశ్వాసములేని మూర్ఖుఁడనుగానో యోధనాథాగ్రణీ
మీవెంటన్ దయతోడ నన్నుగొని పామ్మీ! తప్పుమన్నింపుమీ!

కం. నా మనవి నాలకించి కృ
పామతి వేరొండు కడకు వచ్చినచో మీ
తో మాటలాడగలన
య్యా! మనమారంగ నిది రహస్యంబు సుమీ!

తే.గీ. అనుచు లిఖియించి ఖానుమత్స్యమున కొద్దు
ఉక్కుగాలంబు బోలిన యుత్తరమును
రాయబారికొసంగి శీఘ్రమునఁ బనిచె
సమరమునదిట్ట యతండుపాయములపుట్ట

మ. కనుసన్నన్ బనిసేయు నమ్మకపు విల్కాంద్రన్ జగామత్తుటే
న్గను మోచేతుల గ్రుమ్మజాల్మగలదండున్ కొండలందాచి జా
రినప్రాకారములన్నిమేషమున నిర్మింపించి డాచేతయా
నినవాడయ్యె నఖాంకురంబు లరిరాణ్ణిర్భేదనోద్యుక్తుడై

కం. వనకాంతకు మనషాజీ
తనయునకేలాటి సౌహృదమొకానీ ప
న్నిన పన్నుగడను తనకడు
పున దాచిన దొరులకెఱుక పుచ్చదునాథా!

చ. యమసదన ప్రవేశమునకై చరణంబులు తీవరింప, డెం
దమునకు శాంతిలేక నయనమ్ములు లొట్టలువోవరాయబా
రమునకు వచ్చునుత్తరమురాకకుఁ జూపుమరల్పుఁడయ్యెన
కమును దినంబు ఖాను దొరగారు విరామము లేక శంకరా!

తే.గీ. కోటకు సమీపముననొండుచోట నొక్క
మంటపము సిద్ధపరపించి మనుజవిభుఁడు
లలితసుమమాలికలతో నలంకరించె
ఖానుతోఁగూడు సాంకేతిక స్థలముగ

కం. భూతలనాథుఁడు ధీరుని
నేతాజీపాలకరుని నిలిపెంబటు పా
దాతంబుతోఁ బ్రతాపగ
డీ తూరుపుదిక్కు రణపటిష్ఠుండుగదా!

కం. ఐదు ఫిరంగీలు గడీ
మీద నిలిపి నేర్పుమీర మెలఁగు మరాటా
సాదనకాండ్రన్నిలెపె గ
దాదండములిచ్చి పొదల దాపున నభవా!

వ. ఇంతలో రాయబారి యబ్జులుని కడకుఁబోయి

మ. ఎలనవ్వుల్మెలకెత్తనుత్తరము నందీయంగ నుప్పొంగి య
బ్జులుఁడందున్న విశేషమున్గదివి యామోదించి జల్తారు ము
చ్చెలుపాదంబులఁబూని మస్తమున నుష్ణీషంబు చిన్నారి చెం
గులు జారంధరియించి రాఁదొడఁగె నిగ్గుంగడ్డమల్లాడగన్

వ. యవనదండనాయకుండు సేవక ద్వితీయుండై డాయంజనుచున్నవాఁడని విని శహాజేయుండాయోధనంబునకు సేనలనాయత్తపఱచి వైళంబ తను త్రాణంబు ధరించి మేలివలిపంబుఁబూని జననీపాద పయోరుహంబుల వ్రాలి కన్నుల కద్దికొని యనుజ్ఞ నిమ్మని పల్క నారాజమాత తనూభవుని శిరంబును ముద్దాడి భవానీ ఖడ్గంబును పూజించి యొసంగుచు.

శా. అన్నా! శాత్రవగర్భభేదనముసేయ న్నిన్ను వెన్నాడి వ
చ్చున్నా తల్లి భవాని, నీకఱకు విచ్చుంగత్తిపై నుండు ధా
త్రిన్నాదివ్య పతివ్రతాత్వమున వ్యర్థీభూతమౌగాక నీ
యన్నంజంపిన వాని దోర్బలము పుత్రా! గెల్పునీదేసుమీ!

సీ. వైరినెత్తురు బొట్టు వదనాబ్జమునఁగ్రాల ముదమారఁ దిరిగి వచ్చెదవుగాక
పగవానిబలమైన వక్షస్థలముమీద కదనంపుజయము వ్రాసెదవుగాక
శత్రునెమ్మేనిమాంసఁపుగండ లెగజిమ్మి బీభత్సవృత్తిఁ జూపెదవుగాక
పరిపంథి తలమీదఁ భవదశ్వరాజంబు వెడదగిట్టలు ముద్రవేయుఁగాక

తే.గీ. స్వర్గమున నుండి యన్నశంభాజి నీకు
కుసుమకింజల్క వర్షంబుఁగురియుఁగాక
భరతమాతృక మోద బాష్పములు విడిచి
ప్రేమనిను దెచ్చి తిరుగనర్పించుఁగాక

సీ. తినిపించెదవుగాక యినుఁపకత్తుల కీవు ముదురు కందన గాయ భోజనంబు
త్రావించెదవుగాక దండిబల్లెములకు పరులక్రొవ్వేడి నెత్తురుల తేనె
మెట్టించెదవుగాక నట్టువ గుఱ్ఱాల బలుల శుద్ధాంత రంగ స్థలముల
కీలించెదవుగాక గెలుపుజెండా పూలు కంచుకోటల మస్తకముల మీద

తే.గీ. అనఘతరమైన నీప్రతాపానలమునఁ
గాల్చెదవుగాక పగవారి కండక్రొవ్వు
కవుల ఘంటమ్ములను సమగ్ర ప్రశస్తి
దాల్చెదవు గాక యాచంద్రతారకముగ

ఉ. నీయది సింహవాహనము నీకరవాలము శంభురాణి, దీ
ర్ఘాయువునీకు నా సలిపినట్టి నిరంతర పూజనంబు నీ
దాయలగర్భపిండములు ధారుణిఁగూల్చి నటింపుమన్న రా
ధేయుఁడవై కిరీటివయి దేవనదీతనయుండవై సుతా!

కం. అని పలికి కత్తినిచ్చినఁ
గొని బొడ్డున దాచి యంబకు నమస్కారం
బొనరించి రోషవృత్తిఁ బ
యనమయ్యె శివాజి కృతక హాసనాననుఁడై

తే.గీ. సింహమునుబట్టి రెండుగా జీల్చివేయ
జాలు తానాజి వెనువెంట సాగిరాగఁ
జెలిమిదొలుకాడు నట్టులబ్బులుని కడకు
వచ్చె జితులమారి శివాజి గుజు

తే.గీ. దొంగవెఱవు మొగానఁ దుఱంగలింప
నెదురు వచ్చుటఁగని యహంకృత మనస్కుఁ
డైన ఖానుండు చిన్న నవ్వాననమునఁ
జెంగులిడ నల్లనల్లనఁజేరవచ్చె

కం. కనక కశిపుఁడలనరసిం
హునిడాసినలీల యవన యోధాగ్రణి య
ల్లనడాసి శివాజీరా
జును కౌగిఁటనొత్తి పట్టె శుండాలహరా!

ఉ. ఆతని బాహుబంధమిసుమంతవదల్చి చెలాకుజేసి డా
చేతి నఖాంకురంబులు కచిక్కున పొట్టకు గ్రుచ్చిచీల్చె భూ
నేత, తురుష్కుఁడాగ్రహము నెక్కొననుక్కునఁ జెంగలించి సం
ఘాతము చేసె వైరి తల కాయపయిన్నిశితాయుధంబునన్

తే.గీ. తలనుదాల్చిన పటు శిరస్త్రాణ పటిమ
గాయపడ నీయదాతని కత్తి వ్రేటు
వీర భూపతితడవు గావింపకపుడ
వాలువీచి విరోధి గర్భము నగల్చె

కం. ఆ యవనవీరుఁ డపు "ద
ల్లా"యని పెనుకేకఁబెట్టి యవని బడియె కా
లాయతన ద్వారంబిరు
పాయలుగా వ్రీలితనకు బాటయొసంగన్

కం. అంతక నివాస మార్గం
బెంతయిఱుకు కన్నమో మహేశ్వర బలవ
ద్దంతిగతిదన్నుకొనె నొక
కొంతతడవతండు మేను గోల్పోవు తరిన్

ఉ. మోసము తెల్లమై కినుకఁబూనిన సయ్యదుబందు ఖడ్గము
న్దూసి శివాజిపైఁ గలియదోర్బలభీముఁడు తానుఁడంతలో
కాసె బిగించి పైకుఱికి గర్భము దూసి పడంగ నుగ్రవ
త్రాసముగ్రుచ్చి కూల్చె తన పాలిరణంబు సగంబు దీరఁగన్

కం. వీరమరాటీలంతట
వారితలలు కత్తిరించి బారీటెలపై
నూరేగించిరి రణభే
రీరవములఁ గోటసత్తి ప్రీత్యర్థంబై

ఉ. ఖానునియార్తనాదములు కాచిన సీసఁపునీటిపోతలై
వీనులకంటగాయ వనవీరులు కొందరు దండుదప్పియ
క్కానన సీమలంబడి యెకాయెకి పర్వులు వారి మార్గము
ల్గానక దీనులై పగరకత్తుల వాతకు జిక్కి రత్తరిన్

చం. బురుజులపై ధమీలు మని మ్రోసి ఫిరంగులనుజ్జ్ఞ సేయ స
త్వరమరాట సేన నలువంకలగ్రమ్మి పెనంగి యేటుకి
ద్దరిని హతంబుసేయ నరదంబులు నమ్ముల వాహనంబుల
న్గరులదొఱంగి పారెననఘా! యవన ప్రతివీరసైన్యముల్.

ఉ. వేడిమివీడకున్న రిపు వీరునినెత్తురు బొట్లు గ్రక్కుకొ
వ్వాడి కటారితో తిరిగి వచ్చు కుమారునిఁజూచి నవ్వుదొ
ల్కాడ జిజాసుమంగళి ప్రియంబున బోయికవుంగిలించి ము
ద్దాడి ముదశ్రుపూరమున నాతనికిం దలయంటె నంతటన్

మ. శివభూదారుఁడు దండనాథుని వధించెన్ మోసగావించి యా
హవరంగంబునఁ గానలన్మడిచె సైన్యంబన్న దుర్వార్తయ
య్యవనాధీశుని కర్ణరంధ్రముల జ్వాలాభీలమై సోకినన్
యవి భిన్నంబగు నద్రివోలి పడియెన్ధాత్రీస్థలి న్శంకరా!

తే.గీ. ఘన శివాజీ రాజు తాల్చెడు ఖడ్గ ధాటి
నేమని వచింపవచ్చు నర్ధేందుజూట
ఖానుకుత్తుక దెగిన తక్షణమునందు
దెగియెఁబెండ్లామువేలి పుస్తెయునువీట

కం. ఆనాడు బీజపూరా
హా నిస్వనభరితమై ఖగాలాపకళా
హీన దినాంకాపర ది
జ్ఞానవతింబోలె నభమండలమకుటా!

సీ. కన్నీటిజడివాన కల్పనంబొనరించి కొమరు బిబ్బీలగండములు గడిగి
భగవంతునెపుడుఁ బిల్వని వజీరులనోట నల్లా పదంబును వల్లెవేసి
విజపూరి నడివీథిఁ విజయనగారాల నిశ్శబ్దశయ్యల నిద్రబుచ్చి
విధివిరామములేని పెనుమసీదులమీద ఖాజీల కేక పొంకములదంచి

తే.గీ. శివపదంబున గల సమంచిత బలంబు
తురక రాయల చిత్తాల కెఱుకపరచి
నేలనాలుగు చెరగులు నిండికొనుచుఁ
బరువులిడసాగె ఖానుని మరణవార్త

కం. బలవదరాతిని మట్టి ప్ర
బలసేనా సహితుఁడై శివాజి సమరదో
హలియై జింజిరపైకిఁ గ
దలె దిగ్విజియేచ్ఛ మదిని తాండవమాడన్

సీ. రొమ్ముజూపిన విక్రమమ్మొడ్డి నిర్జించి వెన్నుఁజూపినఁ బ్రాణభిక్ష బెట్టి
చేసాచి దేబెరించిన వాని దనియించి యడుగులంటిన వాని కభయమిచ్చి
బాహుదర్పముఁజాటువాని మన్ననఁజేసి చెలిమిఁగోరిన వానిఁజేరదీసి
యసమవిక్రముని సేయమున భృత్యునిఁజేసి కపటికిఁగపట సంగతిని నెఱపి

తే.గీ. రాజనీతికి భిన్నమురాక యుండ
తొడలి యేయెండకాలాటి గొడుగుబట్టి
ఛత్రపతి యన్నపేరు విశ్వంబునందు
సార్థకము సేయుచుండె చంద్రార్ధమకుట!

తే.గీ. శ్రీ శివాజీ ఘనాఘనం చిమ్ముచున్న
గెలుపుఁబిడుగుల రవళికి నిలువలేక
బీజపురి రాజు శివరాజు బిలుకుమార్ప
సేనతో యుద్ధమునకు సిద్దీని బంపె

శా. ఆ సిద్దీ వెనువెంట నబ్జులుని నెయ్యంపుగుమారుండు బా
హో సంరంభముమీర వారువము నందారూఢుఁడై రాగర
న్యాసప్రాసకృపాణ బాణచటులోగ్రాకారమై వైరి సే
నా సాంద్రాగ్ని శివాజిపైఁ గవిసెనంతన్ దంతిచర్మాంబరా!

కం. అత్తరిజింజీరాపతి
పత్తేఖానుండు ప్రబలవైరియొకఁడు దం
డెత్తెంగొంకణమునకు మ
హత్తర యుద్ధప్రవీణమగువాహినితో

కం. అంత శివాజీ భూమీ
కాంతునిదండించుబుద్ధిగ దురగవాడీ
ప్రాంతాధికారి యగు సా
వంతుండును దండుతోడ వచ్చెఁ పురారీ!

ఉ. నాలుగు దిక్కులందు యవన ప్రతివీరులు చుట్టుముట్ట భూ
పాలుఁడొకింతయేని ధృతివాయక దగ్గరనుండు వీరశుం
డాలముల్గంగడీలుగల నాలుగు దిక్కులకంపి తాను ప
న్హాళగడీకిఁ బోయెననఘా! మొనగాఁడనగా నితండకా!

కం. బీరంబున సిద్దీజో
హారుండును దండుతోడ నరుదెంచి శివా
జీరేడున్న మహోదు
ర్గారణ్యము ముట్టడించె నహిరాజధరా!

సీ. అగ్గిదేవుని నాటలాడింపగాసాగె జేములు నేతల గుడారముల మీద
పట్టంపుఁగరులగీపెట్టింపఁగా సాగె కసవు రవ్వంత చిక్కంగ నీక
గిరి శిలాఫలకముల్గురియింపంగా సాగె నిద్రించు తురకమన్నీల మీద
మెండుగా కుత్తుక లెండింపగా సాగెఁ గూపాలగరళంబు గుమ్మరించి

తే.గీ. శాత్రవ ప్రేక్షకాంగముల్జలదరింప
? నటకుఁ డొక్కండుఁ దోపకుండని వినూత్న
చిత్ర నాటకమును ప్రదర్శింపసాగె
శూరసేనాని తానాజి సూత్రధారి

తే.గీ. తురక బెబ్బులిగమ్ములు క్రిక్కిరిసియున్న
? వనము బోనున బంధింపఁబడుట వలన
నడవులకుఁ బ్రాతబంధుగులగు మరాట
మృగయుల వినోదకేళికి బెగడుజెందె

తే.గీ. తురకమొనగాంఁడ్ర కినుకకుఁ దోడు నీడ
లయిన పలుకత్తులా సమయంబు నందు
బాహువీర్యముతోడ నిష్ఫలములయ్యె
విశ్వనాయక! యిది క్రొత్త వింతసుమ్ము

కం. ఇడుమలు మెండైనను భయ
పడకనిలిచి తురకదండు వైరిగడీ న
ల్గడలం గ్రమ్మెపటుత్వము
గడలు కొనఁగ రోషమదరగా కలకంఠా!

చం. ముసలితనంబునన్ బ్రిదిలిపోవుపురాతనమైన కోటయ
క్కసపసదోప నల్దెసలఁగ్రమ్ము తురుష్కుల కెట్టులేనిఁ గై
వసమగునంచుఁ గొండొకయుపాయము బన్ని శివాజి నేర్పు పెం
పెసఁగ హితంబుఁజేసి చనియెన్మరురేయి పరాయికోటకున్

తే.గీ. అనఘుఁడాతండు తప్పించుకొనుట కొఱకు
కటికి చీఁకటి పుట్టముల్గట్టివచ్చి
రాత్రియుందోడుపడె, సచ్చరిత్రులకును
ప్రకృతికినిఁ గల్గుఁగాబోలు బాంధవంబు

ఉ. మోసము జోలవాడ గనుమూసిన యా సులతానుసేన ని
ద్రాసతి చేతఁజిక్కి దినరాజుదయాచలవీడులం బద
న్యాసమొనర్చుటే యెఱుగ దంబరకేశ! స్వదేశభక్తుల
న్గాసియొనర్చువారియెడఁ గాలముకూడ విరుద్ధమే కదా!

సీ. యమునిబుట్టించి లోకమునేచు వీరుండు పక్షికూతలు మెచ్చు పండితుండు
మరణించిజన్మించు వరమున్నమొనగాఁడు మింటినిఁబాలించుమేటిరాజు
కలువకన్నులు మూసి గాసింపఁగలదిట్ట నీడ కన్నియను బొందెదు విభుండు
నీరదంబును సేయ గారడీపనివాఁడు నిప్పు బట్టలు బూను నీటుకాఁడు

తే.గీ. కాలుదించని గగన జంఘాలికుండు
ప్రామినుకులనుగాచి కాపాడుబంటు
పొడుపుదెస పొలంతుక యంకమునకు నెక్కి
వేగ దోగాడె నల్లపొద్దు పిలవాఁడు

సీ. కాకిపిట్టలగీతికారావమాలించి సమయంపు నిదురమంచంబు డిగ్గి
మలయాచలముమీది యలతివాయువులచే నిఖిలలోకంబును నిద్రలేపి
నెలరేడుచెలికాని వెలుగులు హరియించి పడమటి కొండలపాలుజేసి
సేవించువారి దోసిటి నీటబింబించి తనలోక బాంధవత్వంబు నెఱపి

తే.గీ. పద్మినీకాంత ప్రణయ కోపము గుదింప
జలకణపు ముక్కుపుడక సొమ్ములనొసంగి
యమున నక్కునఁబూని యుయ్యాలలూచి
మిహిరమండల ముదయాద్రి మీదమెఱసె

కం. చిక్కిన శాత్రవవీరుని
దక్కించు కొనంగలేని దండునుగని యే
దిక్కునఁ గాసారంబులఁ
బక్కున నవ్వందొడంగె పద్మసుమంబుల్

మ. జగతీ నాథుఁడు దాటిపోయిన సమాచారంబు తోరంపు టా
శుగమై సోకిన శోకపూరిత మనస్కుండై తురుష్కుండు, గం
ధగజేంద్రంబునఁ గూరుచుండి తనసేనావారముంగొంచు పె
ల్లుగఁజింతించుచుఁబోయె బాష్పజలమేలోపంబు శూలాయుధా!

ఉ. కామకదాయలన్ గెలువగా గలవాఁడు సమర్థుఁడైన సి
ద్దీగడంచుఁ గౌతుకమతిం దలపోయు నవాబుగారిఁ యా
శామహనీయదుర్గములు జారిగుభిల్లునఁగూలిపోయె సం
గ్రామ పరాఙ్ముఖంబయి పురంబును జొచ్చుబలంబునారయన్

కం. లంచముఁగొని సిద్దీ విడి
పించె శహాజేయుననుచుఁ బృథివీపతి భా
వించె, నిజంబిది యెందును
మంచికిఁజనఁ జెడుగురాకమానదు నాథా!

శా. కింకన్ బొంకము పెచ్చు మీర బడబాగ్ని జ్వాలయై రాట్కురం
గాంకుండంతట బారుటీటెగొని యశ్వారూఢుఁడై దాయల
న్గుంకింపంగల పోటు బంట్లమొనతో గుఱ్ఱాలతో నాలపు
నంకానాదముతో జిజాసుతునిఁ బట్టంబోయె శూలాయుధా!

సీ. పదనునవ్వుల దిశా వలయంబు నవ్వించు వాలాల నల్లగడ్డాలవారు
విమతులగర్భపిండెములూడి పడదన్ను నాలుగంకెనల గుఱ్ఱాలవారు
యజమానిచిత్తంబు నెఱిగి క్రమ్మరి వచ్చు నాడెం పుటగ్నిబాణాలవారు
ముగురిగుండెలనొక్క పోటులజవిచూచు తాళప్రమాణభల్లాలవారు

తే.గీ. యుర్విమండలమెల్ల నుఱ్ఱూతలూచి
తల్లడిలఁజేయునుక్కు రథాలవారు
హృదయవాంఛను విపుల దోహదములగుచు
పూనిచనుదేరఁగదలె సుల్తాను గారు

కం. ఆ కఱకు తురకసేనల
రాకకు బెగడందు దిక్తటంబుకాపై
భీకర గజాష్టకంబట
లేకుండిన నిలిచి యుండలేవు నటేశా!

తే.గీ. పచ్చి కోపపు టపరరూపములు బోలి
దాపునకువచ్చు వైరి దంతావళముల
నంటి యాకటఁదూలు సింహముల కరణి
బొంగిరమ్మావళేయులనంగదమన!

ఉ. అంతనవాబుఁడేడు ప్రళయార్కుని కైవడి సహ్యపర్వత
ప్రాంత సమీపదుర్గములపైబడి యక్కడి పౌజుదారుల
న్గొంతులు గోసి కోటకొనకొమ్మలఁ గట్టుచుఁబెచ్చు మీరి శు
ద్ధాంతసతీజనంబు ముదంబునబట్ట దొడంగెఁ గామియై

మ. తనదుర్గంబులు ముట్టడించి మహదౌద్ధత్యంబునంగెల్చి లో
గొను సుల్తానునకింతయేని భయసంకోచంబులన్ బూనక
మ్మనుజాధీశ్వరుఁడాత్మసైనిక కదంబ స్ఫూర్జదుత్సాహశౌ
ర్యనిరూఢిన్ గడిమీరితాకె నరి దుర్గశ్రేణి నుద్వేగియై

వ. ఇవ్విధంబున మ్మరాటానరేంద్ర సింహశాబకంబు నవాబుని రాజ్యంబును జొచ్చి రాజాపురంబున మున్ను సిద్దీకిందోడుపడిన శ్వేతముఖులం గొందఱంజెఱగొని దవళీవీరుని సంహరించి యతనిరాజధానియగు శృంగారపురంబును గొల్లగొట్టి తత్పూర్వసంస్థానపు సచివునకాధిపత్యంబొసంగి వీర కరుణంబులు

ఉ. పోటరియై నవాబుఁడరి భూములనెల్ల జయించుచుండి క
ర్నాటకసీమలో తురకరాజులు కొందరు నిగ్రహించి పో
రాటము రేచినారను దురాగత వార్త లెటింగి పెద్దయా
రాటముతోడ భండనపరాఙ్ముఖుఁడై చనియెంబురాంతకా!

కం. శివరాజేంద్రుని గెలిచెద
బవరంబుననని ముదమున వాడీ ధరణీ
ధవుఁడగు సావంతాఖ్యుఁడు
నవాబునకువార్త నంపె నాగవిరోధీ!

ఉ. దానికి సంతసించి సులతానుడు మున్ను శహాజిరేని మో
సాన వశీకరించి చెరసాలకు దెచ్చిన కూర్మికాని బా
జీని బలంబుతో నతనిఁ జెంతకు సాయముసేయఁబంచె నీ
శాన! శివాజి కోపఁపురసంబున గత్తికి సానబెట్టఁగన్

ఉ. అతని ముధోళు పట్టణమునందొక రాతిరి సేనతో హఠా
ద్గతిఁజనిముట్టడించి కినుకం జిరుకత్తులఁ జెండిచంపె భూ
పతి జిజనందనుండు, గుణవంతుఁడు తండ్రిఋణంబు దీర్చినం
దితునొనరింప సుంత వెనుదీయునె యంధక దైత్యభంజనా!

తే.గీ. అంతసావంతుఁడుదిత భయంబుమెఱయ
బలముతో సత్వరంబ గోవాకుఁబోయి
బుడుత కీచుల సాయంబు వడయగోరి
యాత్మనాయక! వ్యర్థప్రయత్నుఁడయ్యె

కం. సావంతుఁడెందుజూచిన
నావంత జయంబుగనమి నతి దీనత బా
హావీర్యంబుడివోవఁ గృ
పావారిధియగు శివాజి పదములు గొలిచెన్

చ. అలుగున గెల్వరాని విజయార్కుఁడయయ్యునతండు మ్రొక్కువా
రల గురుదైన్యవృత్తికిఁ బరాజితుఁడై కరుణాసుధాంశుఁడై
వెలయు మహానుభావుఁడని విశ్వము సన్నుతి సేయుచుండు
పలుకులుగాదె నాదమరభామలు బాడిరి జాహ్నవీతటిన్

వ. ఆ సావంతుడు మహారాష్ట్రకులజుండును నిజవంశంబయిన భోసలేకుంజెందియుంట దయామయుండగు శహాజేయుండతనినాదరించె. సావంతుండు శివాజికిసావంతుండై సేవజేయుచుc గృతఙ్ఞుcడయ్యెc బిమ్మట క్షమాధవుండు రాయరీమావణ దుర్గంబులు బలిష్ఠంబులుగా నిర్మింపించి సముద్రప్రాంతంబునc గల తన రాజ్యమును గాసించు పత్తేఖానునిపైకి దండువెడలి యోడించిననతండు భయభ్రాంతుండై సంధిసేయ మన్నించి తదంతిక ప్రాంత బేహారులగు నాంగిలేయులం బట్టికొని ఫిరంగులుం గటారులును దక్కుంగల యుద్ధోపకరణంబుల గ్రహించి యకుంఠీభూత పరాక్రమంబున ×రుత నిజోద్యమంబున కంతరాయం బావంతనందక తనరాజ భాస్కరతనెఱపు తరుణంబున బీజపూరి నవాబుండు వైరి జయంబున విఫల మనోరథుండై దివారాత్రులు విచారించుచు శహాజిని రావించి శివాజీ సమర ప్రయత్నంబులు మాన్పించి తనకు చెలిమికాని నొనరింపుమని యభీప్సితంబుం దెలుపనతండు వల్లెయని చిన్ని కుమారుని వెంట బెట్టుకొని పుత్రదర్శనార్థంబై పయనమగుచు గుమారుcడగు శివాజికి వార్తనంపిన గురుభక్తి పరాయణుండు నమ్మహానుభావుండు తురంగస్యందన వేదండంబులు వెంటనడువ రాజచిహ్నంబుల మెఱయనెదురేగిన శహాజి వీక్షించునంత.

సీ. ఆనందలీల దేవావాసములలోన ఘంటలుమ్రోయించు కన్నతల్లి
భయమింతలేకయంభారావములుసేయు గోవులతో నింపుగులుకు లేమ
స్వచ్ఛందముగ దిశాష్టకమురంజిల్లగా వేద ఘోషముసేయు వినుతశీల
యిమ్ములు విడిపోక రొమ్మున కరముంచి హాయిగా నిద్రించు నబ్జవదన

తే.గీ. మున్నురామునిభుజపీఠమున వసించి
కులుకు చిరునవ్వు వెల్లువల్గురిసికొనుచు
సర్వభోగంబులందిన సచ్చరిత్ర
భరత మాతృక చిత్తానcబ్రతిఫలించె

శా. సంతోషంబున నశ్రుపూరములు సంజాతంబులై చెక్కులన్
గంతుల్ వేయగ దట్టమైగగురు మొల్కల్ మేనజన్మింపcగా
దంతిన్ డిగ్గి కవుంగిలించి నిజపుత్రస్పర్శనానంద డో
లాంతస్సీమ శరీరమున్మరచెనాథా ప్రేమజోకొట్టcగన్

ఉ. దట్టఁపుటగ్గినేలెడు ప్రతాపము మిట్టిపడంగ దాయలన్
గుట్టలపాలుజేసి జనకుండును తల్లియు నండనుండగా
పట్టము గట్టుకోగల ప్రభాత విభాకరుఁడై చెలంగు మే
ల్పట్టినిఁగన్నదంపతులు స్వర్గము గోరుదురా మనోహరా!

కం. జనకుండునుఁ దనయుఁడు న
ట్లొనరఁ గౌగలించు నమ్ముహూర్తంబున నె
వ్వని కౌగిఁట నెవడుం
డినదియు నొండొరు లెఱుంగనేరరు నాథా!

మ. భువన క్షేమము గోరినందనుఁడు సంపూర్ణ ప్రభావంబు తాం
డవమాడ న్నిడువాలుఁగత్తికి దిగంతఖ్యాతిఁ గల్పింప శా
త్రవసేనా పరితప్తుఁడై నవయుచున్నానుండి కన్నీటిబిం
దువులన్ గారిచె కానుపింపని మహా దుఃఖంబుదగ్రంబుగా

కం. వరసుతుఁడు సద్గుణంబుల
గురుని గెలిచి కీర్తి పెండ్లికొడుకగు ననన
బ్బురమకదా పుత్రాచ్ఛే
త్పరాజయంబనుచు బుధులు పల్కుట వినమే?

ఉ. గుత్తఁపు జాళువా గొలుసుగుత్తులతోఁ దులదూగుచున్న క్రొ
మ్మెత్తల పల్లకీల నుతిమీరు సమున్నత వైభవంబు ద
ళ్మొత్త నసుంగుఁదండ్రిని సహోదరునింగొనితెచ్చెఁ గొంగవా
ల్గత్తుల నీడలో నిజబలం బిరువంకల వెంబడింపఁగన్

కం. జనకునిఁ గనకఁపు టాసన
మున నునిచి హిమాంబుపూరమున పాదయుగం
బును గడిగె భక్తి నెమ్మన
మున నంకురమై మొగానఁ బూవులు పూయన్

తే.గీ. ? పుత్రుండొనరించు నుపచారపూజనముల
కుల్లమునఁ బ్రేమవాహిని వెల్లివిరియ
నా శహాజీరాజు శివరేని నాదరమున
నంతికమునకు బిలిచి దీర్ఘాయువనుచు

ఉ. కూటికి విక్రమం బొరులకున్ దెగనమ్మిన యట్టి నీచ మా
ర్గాటుఁడనైన నాకు నదయంబయితేమిటికోయి తండ్రి మో
మోటముఁజూపి నీ యొసఁగుపూజలు గైకొనబోవమేనికి
న్గాటని కత్తిపోటులయి నన్నుడికించుచునున్న వాత్మజా

మ. నిను వీరోత్తరుగానొనర్చి! భవానీ తల్లి! నీ తల్లిపా
వన చారిత్రిణు వీవొనర్పగల సేవా పూజన ద్రవ్యమ
ప్పనఁగావించి తరింపుమీ తనువు నీభాగ్యంబున న్గార్మినం
దన నాజన్మము ధన్యమయ్యె జనకత్వప్రాప్త మాత్రంబునన్

మ. నిను సామాన్యునిగాఁ దలంచితిని గానీ నీ భుజాదండ భం
డన పాండిత్యము భారతీయులకనన్య ప్రాభవప్రాప్తిఁ గ
ల్పనఁగావించి దిగంత దేశముల నేలంజాలునం చేనెఱుం
గనురా! యింతకుమున్ను నీవపరదుర్గాదేవివాత్మోద్భవా!

సీ. హైందవవీరసింహములకు నీ నామ మారిపోవని ప్రతాపాంకురంబు
కవిరాజ ఘంటికాగ్రములకు నీగాథ జారిపోవని యలంకారశక్తి
వసుధాసుమంగళీ వ్యథలకు నీ పల్కు బహుళనిష్ఠురమైన వజ్రఘోష
వైరి భూపాలదోః పటిమకు నీమూర్తి శివుని మోమున గల చిచ్చుకన్ను

తే.గీ. తల్లి దండ్రులు గోరు సద్గతుల కెల్ల
నీపవిత్రోదయంబె ఘంటాపథంబు
కొసరి పూజించు నీ తల్లి కొంగునందు
శాంభవి యొసంగు నమృత భిక్షంబవీవు

ఉ. ఏనిపుడేగుదెంచిన యభీష్టముఁదెల్పెద బీజపూరు సు
ల్తానునితో విరోధము గదల్పక కూరిమిసేయుమన్నయ
ట్లేని ముదంబు మీరఁ గృతకృత్యుఁడనై చనువాఁడ నీవు ప్ర
జ్ఞానిధివంచు సేయమునొనర్పదలంచిన వాఁడురా సుతా!

కం. నామోముఁగని నవాబుని
తోమైత్రి యొనర్పుమయ్య దుష్టుడకాని
మ్మా ముసలిమానుదొర కొడు
కా! మనుచున్నాఁడవారికడ నేను గదా!

తే.గీ. తండ్రి కోరిక మల్లికాదామమట్లు
శిరమున వహింతునని పల్కి ధరణి పతికి
భర్మమణి భూషణంబులుపాయనముగ
సొరిదిఁ బుత్తెంచె నభిమత సూచనముగ

చం. సుతునిశుభోదయంబునకు శూరశహాజిమనంబు లోన న
ద్భుతమిగురొత్తగా నచటి దుర్గమునందొకమాసముండి ప
ర్వతములలో గుమారుఁడరిరాజులగెల్చిన యుద్ధభూవుల
న్నతనపుఁగోటలన్ జిగిగుఱాలను జూచుచునుండె మెచ్చుచున్

తే.గీ. అరగొఱంత లేని సమ్ముదితాత్ముఁడగుచు
జనకుఁడూరికిఁబోవనమ్మను విభుఁడు
శ్రీశహాజేయుఁడందందు శిథిలములగు
మేటికోటలు తిరుగ నిర్మింప జేసె

కం. నాటికి పదియారేడులు
దాటినవాతండు పటు కదనయాత్రా జం
ఝాటము నెఱపుట హిమకర
జూటా! పలుమాటలేల! శూరుండతఁడే

వ. అప్పటికెన్నియో దుర్గంబుల నేడువేలగుఱ్ఱంపు దళంబునేబదివేల కాల్బలంబుంగల ప్రబలరాజన్యుండై స్వరాజ్యంబునకుఁ దోరణంబుంబ్రతిష్ఠించి రాయరదుర్గంబు నివాసముగా నొనర్చికొని యేతద్భూధరంబరాతుల కభేద్యంబు గాఁజెక్కించి స్నిగ్ధంబుగావించి యంతందనివి దనక

శా. ఉల్లోలంబగుచున్న దర్పమున నత్యుత్సాహియై శాంభవీ
తల్లీ పుత్రునకండ నుండుము దిగంతశ్రేణి నీ కత్తితో
నల్లాడించెదనంచు నుత్కటసమిద్యాత్రార్థమై దండుతో
ఢిల్లీ రాజ్యమువంకఁ దీవ్రతర దృష్టింజూచె మృత్యుంజయా!

సీ. విరమింపనీయండు విజయభేరిరవంబు దిక్కరీంద్రము లెంతపొక్కుచున్న
చాలింపనీడు గుఱ్ఱాలనాటకములు కుతలమెంతగ మొత్తుకొనుచునున్న
యొఱలనుంపఁగనీయఁడుక్కుకత్తుల గమిరేయెండలెంతగా గాయుచున్న
నిలువనీయండొక్కతలిఁ బుష్పకంబుల దుమ్ము చీకటులెంత గ్రమ్ముచున్న

తే.గీ. కాలునిల్వంగ నీడు మన్నీలదండు
చెమట వానలు బిట్టుగాజిందుచున్న
చెప్పనేమిటికిక శివాజీ నరేంద్రుఁ
డరుల నిలమీద బ్రదుకనీయండు నాథ!

ఉ. వందితదాననిర్జిత దివాకరనందన! సత్కవీంద్ర దై
నందిన సన్నుతోజ్వలితనామ! దయామధులిప్తలోచనా
ళిందశుభప్రభాతతచలీకృత దుష్టదరిద్రతావ్యధా
బృంద! మరందబిందు సమవిశ్రుతవాగుధధీ! సుధీనిధీ!

ఇది
శ్రీ గుఱ్ఱము వంశకలశపాథోనిధానరాకాసుధాకర
వీరయాఖ్యజ్యేష్ఠతనూభవలింగంమాం
బాసుపుత్రజాషువాఖ్య ప్రణీ
తంబైన శ్రీశివాజీ ప్రబంధంబునందు
తృతీయాశ్వాసంబుసం
పూర్ణంబు

## చతుర్థాశ్వాసము

కం. శ్రీశైలాధిపపాదకు
శేశయ యుగళీమిళింద! శ్రితజనరక్షా
కౌశల! భారతజనయి
త్రీ శోకాపనయాంతరంగ శ్రీశైలపతీ!

కం. వినుము జగద్భీకరమగు
తనసేనాబాడబంబు దశదిశలకుఁజి
మ్మినవాఁడై కొండొకవా
హినితోఁ దానొక్కదిక్కుకేగె పురారీ!

శా. మారోపంతుపదాతిదండు నడిపింపన్ వీరనేతాజి పా
ల్కారుండశ్వదళంబుతోఁ గదలి యుగ్రక్రోధుఁడై పోయి ఢి
ల్లీ రాజ్యంబును చుట్టుముట్టుకొని కాల్పించెన్ బుర శ్రేణి నా
గారాతీ! పురదగ్ధయత్నములు నీకానందదంబుల్గదా?

ఉ. మోసపుకూరిమిన్నెరపి ముందెపుడోశివరేని కన్నుల
న్మూసి జయింతునంచుఁ దలపోయుచు నేమరి యూరకున్న ఢి
ల్లీసులతాను డెందము చలింప విషాదము నందుచుండెఁ గుం
భీసన భూషణా! కపటవృత్తులు సాగునె యెల్లవేళలన్

కం. తనమేనమామయును ద
క్కినమును పాలించు రాజగీష్పతియగు వీ
రుని శాహిస్తేఖానునిఁ
బనిపె నవాబుండరాతి భంజనమునకై

శా. ఖానుండల్లుని యానతిం భటతురంగస్యందనాన్వీతుఁడై
పూనాదుర్గము ముట్టడించి విజయంబున్బొంది యామీదఁద
త్సేనాసంఘముతోడఁబోయి యెదిరించెన్ జాకణీకోట నీ
శానా! యచ్చటి బంట్లు భార్గవుని మెచ్చంబోరు శౌర్యంబునన్

కం. దాని విభుండు ఫిరంగో
జీనర్సాళా ప్రతాప సింధువు మనీషా
జీ నందనునానతలం
బూని మెలగువాఁడు వీరపురుషుండు శివా!

చ. తురకల దండుపైకొనిన తోడన నోడకకోటవారు ని
బ్బరమునినిల్చి శాత్రవులపై శరవర్షము జిమ్ముచున్నడీ
బురుజుల నుండి పొంగడఁగిపోవని నూనియ గ్రుమ్మరింపసా
గిరి పయికెక్కువాఁడఱచి గీల్జునఁ గుంభినిఁగూలి చావఁగన్

ఉ. ఉబ్బునఁ గోటపైకెగయనొండొకదూతగఁబ్రాకి వచ్చునా
లబ్బి పటాలమున నిచలంబున నెట్టని చింతనిప్పుక
ల్గుబ్బున జిమ్మినన్ జిటుకలోపలఁ గుంకుడు గాయలంతలౌ
బొబ్బలరోగముల్దగిలి భూమిని ద్రెళ్లగ జాజినాంబరా!

కం. సరభసమునఁ దురకలతో
నిరునెలలు బెనంగె నమ్మహీనాథుఁడు కా
తరమతిగాఁ డాత్మేశ్వర
మరాట శబ్దమునఁగల్గు మహిమంబేమో!

ఉ. తూలని నిండు సాహసముతోఁ దురకల్బురుకెక్కి పెద్దక
న్నాలురచించి కోటకిరునాలుగు దిక్కులమందుగ్రుక్కి పె
న్వ్రాలదగుల్పఁ గుద్యములు జారిగుభిల్లునఁగూలెఁగాని న
ర్పాళుని వీరసైనికుల సాహసపుంబస జారదింతయున్

తే.గీ. గోడలూడుటఁగని తురుష్కులు చెలంగి
బల్లెములు బూని లోనికిఁ బర్విలిడుట
కోటలో నున్న పోటుమరాటసేన
చూచి రొమ్మిచ్చిపెనఁగె విస్ఫురితశక్తి

ఉ. కూలిన కోటనుండి కనుగోనలఁగెంపు తుఱంగలింపనా
భీలపరాక్రమంబు ముఖబింబములన్నటనంబుసేయఁగా
వాలుమరాటదండు పగవారికి బోను దొఱంగు కోడెసిం
గాల బలంబుగా నెదలగానఁబడె న్నటనాథురంధరా!

కం. అసిముసలకుంత విసరము
విసరి ముసలిమాను తెగల బీడించియు న
క్కసమున గొంతులు గోరికెద
రసమ సమరసింహులేకదా త్రిపురహరా!

ఉ. చేతులతీట వోవననిసేయుచు నెత్తురు క్రొత్తకాల్వలం
దీతలు గొట్టునమ్మగల నేమని వర్ణనసేయుదానఁ గుం
తీతనయున్నదీతనయునిం గృపవీరునిసాటిసేయ నా
చేతము సంశయించెడిని సింధురభంజన! భక్తరంజనా!

ఉ. గొంతున జీవమున్న వరకున్ బొరలాడుచునేని కత్తుల
స్గంతములేసి దాయలను గూల్చు మరాటులునేలఁగూలు మే
లింతయులేమి దిగ్భ్రమవహించిరి ఖానులు దీనికే గదా
చింతకుఁజేవచావదని చెప్పుదురార్యులహార్యకార్ముకా!

తే.గీ. కలసిపోరాడు నమ్మహాకలహమందు
సమరయోధుల హృదయదేశములుదూరి
గుజ్జుకత్తులు పిడిబాకుగుములు తనివి
సనఁగఁ క్రొవ్వేడి రుధిర భోజ్యములు గుడిసె

కం. పిడిగుద్దులరవళియుఁ ద
త్తడి గిట్టెల యులివు మడెమతన్నుల ధ్వని న
ల్గడలందు వడ్లు దంచిన
వడువునఁ బ్రతిశబ్దమీనెఁ బర్వతధన్వీ!

తే.గీ. ఆ రణగ్రంథమందు భయానకంబు
రౌద్రబీభత్సములును మాత్రంబెకాక
కరుణఁ జిత్రించి రనఘ చూపరులఁవలన
వీరులకుఁగూడగలదె? కవిత్వపటిమ.

తే.గీ. దండిరాపులుంగులకు భూతములకమ్మఁ
దలకుతల కాలునకుఁగాలు దొలఁగఁదీసి
మనుజమాంసఁపుటంగళ్లు దనరఁజేసె
సమరమనియెడు కటికి కసాయివాఁడు

సీ. నిండారు పీనుంగు కొండలలోనుండి జేగురువాగులు చింది పాఱఁ
జదనైన యేనుంగు మెదడుగుట్టలమీదఁ బటువీరసింహముల్పరువులెత్త
బొందులు దప్పు ప్రేవుందీవె పొదరిండ్ల పొలదిండి పులుఁగులు కలహమాడ
బురదలుదేరు నెతురు కొలంకులలోన తెలిపుఱె తమ్ములు తేలియాడ

తే.గీ. యొఱరు వెడలిన ఖడ్గంపుటురగచయము
వెఱకొఱకు దిక్కుదిక్కుల దిరుగులాడ
సమరదేవత ప్రతిసృష్టి సలిపియున్న
భయద కాంతారమైతోచె భండనంబు

వ. అసంకుల సమరంబున నేరికిందేఱి చూడరాక విహారముచేయు మరాటుల కరవాలములకు నిజసేనావారంబంతయుం గబళాయమానంబగుటం గన్నారంగనిశాహిస్తేఖానుండు మానసంబున ననూనంబు గానగ నరసాళుని యప్రతిమప్రతాపంబునెంతయుంగొని వారి సంధిఁగావించి హతశేషంబయిన తురుష్కబలంబుతోఁబూనాకుఁబోయి యలంఘీరుపాదుషా సహాయముతో సైన్యంబుంబుత్తెంబువరకట వసించునవసరంబున నట సింహగడంబున ఖానుని దండయాత్రనాలించి సమరసన్నాహియై శివధరాధవుండొక్కనాటి రేయి తన భటమండలంబుతోవచ్చి ఖానుని మందిరంబుఁజొచ్చి వానికుమారునిఁ జంపి వైరిపైఁబడంజూచునంత నతండు మేల్కని గవాక్షమార్గంబున బరువులిడి మరాటుల బారి నుండి ప్రాణరక్షణం బొనరించికొని శివాజి సింహగడమునకు బోవఁదిరిగి వచ్చి ప్రాతఃకాలంబున సేనతోఁబోయి సింహగడమును దాకె.

మ. బలవత్సింహముతో నెదిర్చు హరిణవ్రాతంబులట్లా తురు
ష్కలు తత్సింహగడంబు దాకిన మహాశూరుండు షాజేయుఁ డా
కులచిత్తంబునఁ దత్తరిల్లక ఫిరంగుల్ప్రేలిపింపన్ విరో
ధులపైఁదొల్కరిజల్లువోలికురిసెన్ దోడ్తోనయోగోళముల్

తే.గీ. ఆ ఫిరంగులదెబ్బలకతని రథము
లన్నియొకటికి రెండులై యధికసంఖ్య
లయ్యు లెక్కకు నొకఁటిలేదయ్యెనిదియు
నైంద్రజాలముగా దోచు నభ్రకేశ!

ఉ. చాకణుకోట వారి గురుశౌర్యమునం గసుగంది శాత్రవా
నీకము సింహదుర్గమను నిప్పులకుంపటి కాగలేక చీ
కాకు పడెన్ ధరారమణి గర్భము చల్లఁగఁగన్న శౌర్యనీ
రాకరులమ్మరాటులనఘా! యొకమాత్రపురాఁడెదిర్చునే!

కం. శరపాతంబుల గిరగిర
దిరిగి తురకబంటులవనిఁ ద్రెళ్లిరి పెను బొం
గంరములకరణి మరాటుల
శరపాటవమెన్న నెవరి శక్యంబు హరా!

తే.గీ. గగనమునకంటు నా సింహగడము మీద
దాగిపోరాడు మావళీ దండునంట
నెగురలేవయ్యొ మావళీలేయునమ్ము
లొరగిపడు వారి ప్రాణవాయువులు దక్క

తే.గీ. రణమెడలిచన్నవచ్చు దుర్యశమునకును
రణము సలిపిన విడనున్న ప్రాణములకుఁ
గుండె నెంతయు నా తురుష్కుని బలంబు
చురుకు చురుకున సోకునంపఱలకన్న

కం. తనకుంబ్రదక్షిణము స
ల్పిన తురకలమీద నంపపిండు విసరి చం
పిన దనఘ! దుర్గదేవత
కనివిన మీలాటి వింత కామవిరోధీ!

సీ. రౌతులుగూలి గుఱ్ఱాలు పేరెములెత్త దంతులు గూలి మావంతులదర
రథికులుర్విఁదొఱంగి రథములు కళదప్ప భల్లాలు ముక్కలైభటులు గూల
విండ్లు ఖండంబులై విలుకాంద్రు బెగడంద చేయీటెలూడి యాశ్వికులు బెదర
పరిఘలు వ్రక్కలై బాహువీరులుబార బలమర్ధమైచమూపతులు గుంద

తే.గీ. దైన్యమువహించు తురకల దండు నరసి
సింహదుర్గంబు నిప్పులు జిమ్ముగాని
కరుణఁబూనదు, విసువదాగ్రహముచెడదు
యనుఁగుచుట్టాలఁబట్టి యీయదు పురారి!

ఆ.వె. కాలుతెగినవాఁడు కన్నుపోయినవాఁడు
ముక్కు తెగిన వాఁడు మూల్గువాఁడు
భిక్షమెత్తకుండ పెడబొబ్బలిడుకొంచు
గదన వీధులందుఁ గానఁబడిరి

కం. తురకల దండపుడు జయేం
దిరయందాసలు దొలంగి తిరిగి చనియె దు
ర్భరదుఃఖమున గతించిన
పరివారము ఫలముగా కృపాకమనీయా!

కం. వరునేరికొని జయేందిర
పరిణయమగు పట్టునందు బాహుబలమె కా
దరయుట సౌశీల్యంబును
పరీక్ష యొనరించు ననుచు భావింతుశివా!

మ. అరిసేనాలవణాంబురాశి నిజ బాహాపాండితింద్రచ్చిచె
చ్చెరసూరత్తునుముట్టడించి కొనితెచ్చెన్ ద్రవ్యరాసుల్గుఱా
లరదంబు ల్జిగిపల్లకీల్గురుమహీహారంబులారాజ భా
స్కరుఁడాశాలత పల్లవింపఁగ మహేశా వైభవోపేతుఁడై

తే.గీ. ఆతరుణమందు బసవపురాంతికమున
నున్నవనముల వేటాడుచుండి వాజి
నుండి శ్రీశహాజీవీరుఁడుర్విఁ గూలి
స్వర్గమునకేగెఁ గీర్తి పుష్పకమునెక్కి

తే.గీ. అబ్జులుని కత్తి వ్రేటున కల్లనాఁడు
సరకుసేయని ధైర్యమంధరమునకట
మన శివాజిని జనకుని మరణవార్త
వెడఁగు కేకలుపెట్టించి పుడమిఁగూల్చె

శా. ఆరాజన్యుఁడు శోకవేగమున నీరైపోవుచిత్తాన గ
న్నీరూరం దనలోఁ గుమారిలుచు తండ్రీ పుత్రకుండిమ్మరా
టా రాజ్యంబునఁ బట్టభద్రుఁడగుచుండ న్గన్నులంజూడకే
స్వారాజ్యంబును జూడఁబోయితివె నా ప్రారబ్ధమిట్లున్ననే

ఉ. ఏనుదయించుటే యెఱుఁగవీవు విజాపురికేగుదాకయం
దే ననుఁదృప్తిగా నిలువనీయక యంబనుతోడుజేసి పూ
నానగరాననుంచితివి నాయభిలాషగతించి పోయెతం
డ్రీ! నగజాత నాయెడలనేమిటికై దయదప్పి యున్నదో!

కం. అని జననీ సహితుండై
వనరి ధనము లక్షలాది వ్యయపరచి రయం
బున నుత్తర కర్మలు స
ల్పినవాఁడై తండ్రి ఋణము వీగెఁ బురారీ!

మ. శివశబ్దంబున రాజశబ్దమును జేర్చెన్ నాణెములుద్దిభూ
ధవతన్ దిక్కులు నించి నిక్కముకదా త్వన్నామము దద్ధరా
జవిలాసంబలరారుచుండుట మహేశా! నీప్రభావంబునన్
శివనాముండగు నమ్మరాటునకు వచ్చె రాజరాజద్దశల్

వ. పిమ్మట నమ్మరాటుల దళమ్ములంగొని సముద్రప్రాంతమునం గల పట్టణంబులను జయించి నౌకాదళంబుంబ్రోవు చేసి యాకస్మికంబ బహనూరు పట్టణమును బట్టుకొని యపారధనంబునార్జించి సింహగడమునకు బంపి గోకర్ణమునకుఁబోయి యెన్నియో దానధర్మంబులు సలిపి కానువారు పురంబునం గల యాంగిలేయుల వశీకరించుకొని చండ ప్రచండుఁడై సింహగడమునకువచ్చె నంత నలంఘీరు బాదుషాహ్ తన సామంతుఁడగు జయసింగును నెయ్యంపుం గుమారునండగు మోఅజీమునకు సాయంబుగా నిడి శివాజిపైకంప మోగలేయులు వ్రేటు వడిన క్రోల్పులులవలె రోషరూషిత నయనానీనులై వెడలివచ్చి మరాటులనెదరింప.

ఉ. అమ్మహనీయ శత్రునివహంబును గెల్చుటసాధ్యమంచు డెం
దమ్మున సంశయించి జననాథుఁడుపాయసనాథుఁడాత్మ దు
ర్గమ్మునఁ గొంకణేయుల మరాటులఁ గూరిచి ముచ్చటించి సే
యమ్మున మోగలేయ సమరాంబునిధిం దరియించె నేర్పునన్

కం. మోయాజీముఁడు సేనా
నాయకులంగొని ముదంబునం డిల్లీకిం
బోయి మరాటుల సంధివి
ధాయకమెరిగించె సమ్మతము తేటపడన్

ఉ. సేయఁపు శృంఖలాచయము చే శివభూపతి నెట్టు లేని కా
రాయతనంబులో నునుపనౌనని యాయవురంగజీబు భూ
నాయకుఁ డాత్మలోమురిసి నన్నొకమారిటఁ జూచిపొమ్ము ర
మ్మాయని చెప్పి పంపె శివమానవ నాథున కాదరంబునన్

కం.	మురిపెంపు చీని చీనాం
బరములు రత్నములు తన కుపాయనముగా
తురకల యొడయఁడు చెలిమికి
గురుతుగ బంపించె నృపునకున్నిటలాక్షా!

కం.	తన సరదారులతో మం
తనము సలిపి వారి యభిమతంబున ఢిల్లీ
జననాథుని కడకేగఁదలం
చినవాడై పయన మయ్యె శివరాజు శివా!

తే.గీ.	అనుఁగు సేనానులందర్వులయిన ముగురి
కాత్మరాజ్యంబు నర్పించి యైదునూరు
లశ్వములు వీరులొక్క సహస్రసంఖ్యఁ
గొనుచుఢిల్లీకిఁ జనె జిజావనిత కొడుకు

కం.	ఆరట్టాశ్వము నెక్కి కు
మారుఁడు శంభాజి మనకుమారుని వలె న
మ్మారుని వలెరా శివ భూ
దారుఁడువైభవముతో గదలెభూతపతీ!

వ.	శివరాజు మార్గమధ్యంబునం గల పుణ్యక్షేత్రంబుల నరసి మధురాపురంబున
మీనాక్షికింబ్రణమిల్లి గోహిరణ్య దానంబుల భూమీనిర్జరుల దనియించి.

ఉ.	ఆవల నర్మదానదమునం దవగాహన మాచరించి బృం
దావనమందు నాలుగుదినంబులు పుచ్చి రమేశుఁడందు గో
పీ వనితాజనంబు వలపించిన చోటులు నేటి తిన్నెలం
దావుల గాయుచోటులు బ్రియంపడి చూచె మహోక్షవాహనా!

వ.	అనంతరంబచ్చోటు వాసి ప్రయాణోన్ముఖుండై

కం.	ఔరంగజీబెదుర్కొని
గౌరవమునఁ గొంచు పోవగా సచివుల స
ర్దారులఁ బంపమికిఁ క్రూధాం
కూరము శివతేని కన్నుఁగోనల మొలిచెన్

కం. భటసమితి తోడ ఢిల్లీ
పుటభేదముఁ జొచ్చి నెయ్యపుం గుమరునితో
స్ఫటికశిలాభర్మమణీ
ఘటితమగు నవాబు మహలుకడ కేతెంచెన్

సీ. రతనంపుకంబాల జతలపైఁ దాపిన బంగారు తీవెలపనితనంబు
తులలేనిగతి జీవకళయుట్టిపడు పచ్చరాతి టక్కరి పావురాల సొబగు
గుమ్మాలకడ నేన్గు కొమ్ముతోఁజెక్కిన సింగాలజంటల శిల్ప విద్య
యెదురైన వారి నెమ్మదినుంచి బంధించు తళమైన నిగ్గుటద్దాల మెఱుఁగు

తే.గీ. ద్వారముల జీరువారు ముత్యాల మేలి
నిడుద గొలుసుల జాలరీ నిగ్గుజగ్గు
ప్రేక్షకులమీద నొగి రాచరికము నెఱప
దరిపి వెన్నెలఁగాయు భూధవుని మేడ

సీ. నడి కొప్పులంటఁ బుప్పొడి దువ్వగుప్పించు మల్లెతోటలపూత పిల్లనవ్వు
యెండ కన్నెఱుఁగనీకుండ నౌదలఁగప్పు నెలమావిగున్నల చలువచూపు
పోతుటీఁగనుచొచ్చి పోనీని మన్నీల యలుఁగుజోడింపుల యాదరింపు
యరిని కన్నెత్తనీయక నాల్గు దిక్కులు బాలించు బలుఫిరంగీల చెలిమి.

తే.గీ. పవన పుత్రికాతతి సమర్పణముచేసి
శుద్ధకాళింది నెఱపెడు చుట్టఱికముఁ
దలఁచి గర్వించి తారకా తతుల తోడ
మండనముసేయుఁ బాదుషా మందిరంబు

వ. మరియు నలుగెలంకుల నెలరాతి సోపానంబులు దాపిన బొద్దన బావుల యందకాలములఁబుష్పించు కలువ పూవులంగని మొగంబులువంచి తేనె కన్నీట దలపోయు తమ్ములం గరుణింపక ముక్కులం బొడిచివైచి ముక్కలు సేసి తూండ్లంగబళించుచుం గొలకొలంగూయు కలహంసల తెలుపు టెఱకల నరసి శారదాభ్రభ్రమనెగిరిపడు బేడిసలలటుక్కున మ్రింగి నింగికెగయు లకుముకి పిట్టల మేనిరంగులకుమెచ్చి తన గోపురంబుల నిలిపికొని గౌరవించుచు నేవంక బృంహితంబులు సేయు నున్నతంబులగు పట్టఁపుదంతులకు హయహేషాని స్వనంబులఁ బ్రతివాక్యములు చదివించుచు నందనున్న కొలంకులం దన నీడఁ జూచికొని వలిగాడులంగదలు తరగలం దలయూచికొనుచు నవరత్న

కలితద్వారనేత్రంబుల నంతిపురవిలాసినీ జనంబు దళుకుతళుకున బ్రతిఫలింప నప్పుడప్పుడు తన వైభవంబున మేనుమరచి కఱఁగిన చంద్రకాంతమణుల నెపంబున నానందబాష్పములు విడుచుచు నహోరాత్రంబులుఁ గన్నుమూయని సుధావసనధారిణియై నీలమణులు బొదివిన కప్పుకొప్పున సూర్యలాంఛనంబులయిన యెఱ్ఱని కేతనంబులను గులాబి దామంబులు బూని చూరుటక్కునం జెక్కినరాతి బొమ్మబిడ్డల నాదరించుచు బెంపుడుపావురంబుల గుడ గుడధ్వనులకు బ్రతిసెప్పుచు దఱుఁగని వైభవమ్మున నెమ్మది సుఖించు నలంఘీరుని గృహేందిరందాయంజని యాత్మజ ద్వితీయుండై శివరాజుండు లోనికిం జొచ్చి సభామందిరంబున బ్రవేశించి

సీ. వెలలేని మంచి పచ్చలుపొందుజేసిన కనకంపుఁజిలుగు ఱెక్కలు ధరించి
తొమ్మిది రతనాల దొడ్డరంగుల నీను సిరుమించు నిడుద పింఛియము బూని
కళలూరు నీలాలగండు రవ్వలతోడఁ దళుకొత్తు మెత్తని తనువుఁదాల్చి
చిలువరాయని కంతుజిక్కని నిక్కంపు విమలంపుఁ గెంపుపాదములు గలిఁగి

తే.గీ. మొగలేయుల బ్రాగ్జన్మపుణ్యవశత
నన్న పానీయవాంఛ రవ్వంతలేక
కొలువు శాలకు గద్దెయై వెలసియున్న
నెమిలి పిట్టను జూచె నేత్రములు దనియ

సీ. నవ్వెఱుంగని మోమునన్నాటకంబాడు పాపిష్ఠి పచ్చి కోపంబు తోడ
కన్నుగోనలనెల్ల గడెలు పిల్లలుసేసి కారాడుపాడు నిష్కరుణ తోడ
పొడవులై తగు నరముదిమి మీసములపై భాసిల్లు టక్కరిపగ్గె తోడ
యుపవాసములఁ జిక్కియున్నదేహంబును పాలించు నిజమతభక్తి తోడ

తే.గీ. స్వేచ్ఛ సంతోషమెదలలోఁ జెదరిపోయి
బిక్కు బిక్కునఁ బ్రాణాలు బిగ్గఁబట్టి
కొలువు గావించు సేవకావళులతోడ
గద్దెపైఁ బాదుషా రాజు గానవచ్చె

కం. కొడుకుందానుందురకల
యొడయునకు సలామిచేసి యొకదెసనిలువం
బడి సెలవు నుడువునకు జిజ
పడతికొడుకు వేచియుండె బాలేందుధరా!

సీ. మునిబాహువుల ధరాపుణ్యకాంతామణి యాశీనయై యాటలాడువాని
కరవాలధారనుత్కట విక్రమ జ్వాల మొలకెత్తి పదనెక్కి వెలుఁగువాని
తొలిగుజ్జువేల్పు జిత్తులమారి తనమెల్ల మూర్తిత్వమున వెళ్లఁబోయువాని
కోరమీసములతో కూరిమిపాటించు ప్రజ్ఞ వైరులమీదఁ బఱపువాని

తే.గీ. విమత భూపాలకుల మంగలమున వైచి
విపుల శౌర్యానలంబున వ్రేల్చువాని
శివధరాజాని నవురంగజీబుచూచె
గుండె ఝుల్లనఁ గఱకుచూడ్కులు రహింప

చ. అరవెలిదోచునిండగు ననాదరణంబున బాదుషాధరా
వరుఁ డెలనవ్వు నెమ్మొగముపైఁ గడుమందముగా నటింపఁగా
శిరముఁగదల్చి గౌరవముసేయక సింగఁపు మేలిగద్దె ముం
దరనిలిపెన్మరాట జననాథుని సారయశో నభోధునిన్

కం. ఆసుల్తాను నరేంద్రుని
మోసముసర్వంబు డెందమునఁదోచ క్రుధా
భాసురముఖుఁడయ్యెఁ బథా
యాసముతోడై శివాజి యంధకవైరీ

మ. కనుఁగోనల్చిగురింప రోమములునిక్కంజెక్కులల్లాడవె
చ్చని యూర్పుల్జనియింపఁ గెంపువదనాబ్జంబెల్లవ్యాపింప నే
చిన రోషంబున దంతముల్గొఱికి షాజీనందనుండానవా
బునిపైఁజూడ్కి నిగిడ్చియిట్లనియె నంభోభృన్నితాంతధ్వనిన్

కం. గౌరవ జననాథు లలం
ఘీరునవాబేంద్రులనుచుఁ గీర్తింతురు భూ
దారులు నా పట్టుననది
వైరుధ్యంబగుచుడిందు పడియె నవాబా!

ఉ. ఊరికిఁజేరఁబిల్చి యిటులోలగమందుఁ బరాభవింప స
ర్కారులకేమి లాభమొ పరాక్రమశాలురు మొగలాయి ధా
త్రీ రమణీమనోహరులు ధీరులు నీముని తాతలెవ్వరీ
తీరుననాచరించిరి మదిందలపోయుము మేచ్ఛభూపతీ!

ఉ. నీ విభవంబు నీ బలము నీ సులతానుతనంబుఁజూచి భీ
తావహచిత్తుఁడై కొలుచునట్టి నిరర్థకుఁడంచు నెంచియు
న్నావనుకొందునన్ను జననాయకపోటు మరాటరాజు మై
త్రీ వశుఁడంతెకాని వ్యతిరేకుఁడమిత్రతకంచెఱుంగుమీ!

ఉ. స్థానబలంబుజూచుకొని సాహెబుగారిటులాచరింపఁగా
బూనఁగఁబోలు రాజులకుఁబోలని యీలఘుశౌర్యవృత్తి సు
ల్తానుల కేలపట్టువడె ధారుణి పై మొగలాయివారికిన్
న్యూనతఁదెచ్చిపెట్టితి వహోమొనగాడవు రాజశేఖరా

ఉ. వీటనుజిక్కినాఁడనను భీతిరవంతయులేదు నాకు నీ
లాటినవాబు లింక పదిలక్షలు సేరిన లేక్కసేయ వే
మాటలికేల యిట్టి యవమానమునొండొకఁడాచరింప నీ
పాటికి నాకటారి తలవ్రక్కలుసేయదె భూధవాగ్రణీ

కం. అని పలికి కత్తిఝుళిపిం
చినఁ దురకలతేడు బెదరి శీఘ్రంబ జిజా
తనయునిఁ గారాగేహం
బునకంపెం గొడుకు తోడ మొనసినకినుకన్

తే.గీ. పట్టణమువీడనీక శివాజి దళము
నపుడ రక్షకభటకోటికప్పగించి
బర్తరుపుజేసె కత్తుల బట్టనీక
పరమ నిష్ఠురుఁడగు ఢిల్లి పాదుషాహ

తే.గీ. అలుకనిప్పులఁ గందిన యాననములు
పచ్చినెత్తురుముద్దలై ఫరిఢవిల్ల
చేయునది లేక యా మావళేయభటులు
స్రుక్కిరటఁ గట్టువడ్డ త్రాచుల విధాన

మ. జననంబాది విరోధియై తగు శివక్ష్మానాథుఁడానాడు చి
క్కిన సంతోషమున నవాబుడు సభాగేహాన నెత్తించెఁ గే
తనముల్దానమిడెం బకీరులకు భృత్యశ్రేణి కర్పించెవే
తన ముల్రెండు మణుంగులపుడు త్రినేత్రా! తుషచేతసుడై

తే.గీ.	నూతనంబుగ యవన మహీతలేశు
డాచరించెడు ధర్మకార్యములకలరి
శివనరేంద్రునిఁగీర్తి జేసిరి విరోధు
లయ్యు డిల్లీ పురప్రజలంధకారి!

ఉ.	తానటుబందియై తురకదాయలరాయని చేతఁజిక్కి సే
నానిచయంబుతో ననుఁగు నందనునింగొని యిల్లుసేరు య
త్నాన నవాబు నెమ్మనమునం గరుణింపంగ స్నేహపూర్వకం
బైన సదుత్తరంబనిపె నాశివభూపుడుపాయ పాండితిన్

కం.	తన ప్రజ్ఞాగరిమకు లొం
గినవాఁడని తురక తేడు కిలకిల నగి ప
త్తనమెడలిపోని విడిఖై
దున కుత్తరు విచ్చె నిచ్చతోడఁ గపర్దీ!

వ.	అంత నాలుగు దినంబులు చన్నపిదపఁ దన భటులకు ఢిల్లీనగరంబనారోగ్యకరంబగుచున్నదను నెపంబున నలంఘీరు భూజానికి మరొండు లేఖనంపి యతని ముదలం దళంబును స్వదేశమునకునంపి కుమారునితోఁ దాను శత్రుపురంబునుండి వెలువడునుపాయంబున వీటంగల హిందూ మహ్మదీయోద్యోగులతోఁ జెలిమి సలిపి యనుదినంబు వారికిం గంపలలోఁ గానుకలనంపుచుం దిరుగ వారియుపాయనంబుల పరిగ్రహించుచు నొరులకు సంశయంబు తగులని తెఱంగునం గొన్నివాసరంబులభినయించి విశ్వాసపాత్రులగు తన భృత్యులంగొందఱనందందు మాయాభూమికలఁజరింప శాసించి యూరువెలువడినతోడ నూరని బాడఁదత్తీగుల సిద్ధముసేయించి యొకనాఁడు.

ఉ.	కానుక గంపలం దొదిగి ఖానులకన్నులమూసి పుత్రుడుం
దాను పురంబుదాటి యటదాచిన గుఱ్ఱములెక్కి నిర్భయం
బూని మనంబెలర్పఁ దనయూరికిఁబోవఁ దొడంగెనిట్టి ప్ర
జ్ఞానిధి నెందునేని కనినాఁడవె? విశ్వములోననీశ్వరా!

తే.గీ.	ఛత్రపతి పట్టణము దాటి చన్నవార్త
కఱకు తురకలు ముయ్యేడు గడెల వరకు
దెలియరచ్చటి విడిది మందిరమునందు
[illegible]

కం. ఆ లో మరాట ధరణీ
పాలుని గుఱ్ఱాలు దౌడుబట్టి మహద్వా
తూలముతో యవనేశుని
గేలిసలుపుచరిగె డిల్లికిం దూరంబై

చం. తెరచిన కన్నులంబడక తెంపున గంపలలోఁ బరుండి ట
క్కరి శివభూపుఁ డాత్మభటకాండము నుండి తొలంగిపోయె నే
ర్పరితనమిట్టిదౌనని నవాబు సెబాసని మెచ్చె సన్నుతిం
పరె? పగవారలేనియు నమానుషవృత్తులకు క్షమాహనా!

ఉ. దాయగుఱాలదండు వెనుదాకినఁ దాఁగను మూసినంత గం
గా యమునా తరంగిణులుఁ గారదవుల్తరియించి మాయమై
పోయె సమర్థుఁడై యనుఁగుఁబుత్రుఁడు నీడగ వెంబడింప నా
థా? యితడెన్నఁడశ్వహృదయంబనువిద్దియ నేర్చినాడొకో!

కం. ఆనాడకొడుకుతో మధు
రానగరముజేరి యొకమరాటుని కడఁ ద
త్సూనున్నిలిపిగయామా
ర్గానొకండరిగెఁదైర్థికజనంబులతో

ఉ. ముండనమాచరించుకొని భూతిమొగంబునఁబూసి సంచియున్
దండముఁబట్టి కాయవసనంబులతో నవధూతయై ద్విష
న్మండలముత్తరించి నవమాసము లేగిన వెన్క షాజి పు
త్రుండిలు సేరె భాస్కరుఁడు తోయద పంక్తిఁ దొలంగి నట్లుగన్

కం. మనుమఁడుఁ గుమారుఁడును బో
యిన దాది జిజాపొలంతి హృదయ మెరీయ భో
జనముమరచి పూజనముల
నొనరించుచునుండె రాత్రియుంబవలభవా!

ఉ. ఆయమసేయుపూజనము లాపదలందొలఁగించి మించు వ
జ్రాయుధముల్గుమారున కనారతమట్టి సతీజనంబ కా
దాయ వనీతలంబుఁ బ్రళయంబును మున్గనీయకుండు శూ
లాయుధ! భారతాంగనకు నటి కుమారితలే కుమారితల్

సీ. కండశర్కరపానకముఁగుజ్జుగాఁబోసి నేయిజొత్తిల్లు మిఠాయిఁబెట్టి
పెరతేనె మడ్డి ద్రావినయంత ద్రావించి పండిన గజనిమ్మ పండు లిచ్చి
దొడ్డలర్వాలు కుత్తుకలంటఁ దినిపించి యాసలు దీర పాయసముఁబోసి
మొలకెత్తు పెసరపప్పులనానవాలిడి కొదమకొబ్బెర చేతి కొలంది యొసగి

తే.గీ. అనఁటి పండులు మ్రగ్గిన పనస తొనలు
పళ్లెములు నిండుగా దెచ్చి పంచిపెట్టి
వెగటుగొట్టఁగ దిండి పండుగలు నెరపె
శ్రీ జిజాబాయి పుత్రుని సేవకులకు

కం. ఏలిక యిలుసేర ఫిరం
గీలుం జిందములు మ్రోసి కేకలిడి హరి
జ్జాలముల కెఱుకపఱచె శి
వాలయముల మ్రోసెఘంట లైదుదినంబుల్

తే.గీ. ఎడము లేకుండ నొగిఁగాల్పఁబడు ఫిరంగి
పొగల కహములు నిశలయ్యె భూతనాథా!
బాణసంచుల గండు రవ్వల వెలుగున
నెల్లరాత్రులు బవళులయ్యెం బురారి!

చం. ఒనరఁ బ్రతాపదుర్గమున నుత్సవముల్పచరించి కూర్మి నం
దనుఁగొనిరా మరాటసరదారుల నంపి నవాబుచేతఁ జి
క్కిన తనకోటల న్గెలిచి కేవలశౌర్యశిఖిం దహింపఁజొ
చ్చెనరి మహీతలేశుల వజీరులఁబూర్ణదయా విహీనుఁడై

వ. అట డిల్లీ నగరంబున శివాజిం జెరసాలనుండి జయసింగునికుమారుండగు రామసింగుండెడలనడపె నను సంశయంబున నౌరంగుజీబుండతని పదభ్రష్టునిఁజేయ నత్తరుణంబున విజాపురిపైదండెత్తిన జయసింగుండెఱింగి కుమారుని దెసఁ దురకనరపుండు నెఱపిన నిర్దాక్షిణ్యంబునకుఁ గినిసి కొలువు సాలించికొని యహమ్మదునగర రాజులనాశ్రయింప నౌరంగజీబుండు జోధపురాధీశ్వరుండయిన యశవంతసింగునకు సేనాధిపత్యమునిచ్చి జ్యేష్ఠనందనుండగు మోయాజీమును దక్షిణమునకు సుల్తానునిఁజేసి శివాజిపైకి బంపె.

కం. అంతకుమున్నేమారో
పంతుఁడు దుర్గములనెల్లఁబట్టికొనె ద్విష
త్ప్రాంతమున నది శివ భూ
కాంతున కెంతయునుఁ గౌతుకంబయ్యె మృడా!

తే.గీ. అంత యశవంతసింగు మోయాజిములను
గురుదళంబులతో యెదుర్కొనుటెఱింగి
శివనరేంద్రుఁడు సేనలు సిద్ధపరచి
కాచుకొని యుండె జాగరూకతవహించి

ఉ. ఆ యశవంత సింగునకు నర్థముకానుకగానొసంగి షా
జేయుఁడు సంధి జేసికొని శ్రీ సులతానును కూర్మికొని గాఁ
జేయుమటంచుఁ గోరిక వచించి రణప్రళయంబుదాటె దే
వా! యసమర్థుఁడై వెఱచెనంచుఁ దలంపకుమంతమాత్రనే!

తే.గీ. అపుడతనితోడఁ బోరాడుటనుచితముగఁ
దలచి యలఘీరు పాదుషాహో దండనాథుఁ
డయిన యశవంతసింగుని యభిమతంబు
చక్కపడ ఛత్రపతితోడ సంధి సలిపె.

చం. తురకల కూరిమిన్నెరపితోడన బీజపురంబు దాకి వీ
రరసము మోముదమ్మిని విరాజిల నాజినిఁ దాండవించి పా
మరులనరాతి భూపతుల మట్టి కరంబులు గట్టజేసె నీ
శ్వర యలగోలకొండ నరపాలుడు సంధికి వచ్చి కొల్వగన్

తే.గీ. ఘన శివాజీరాజ్యమపుడు కొంకణము మొదలు
?
విరివిఁజాకణపురిదాక విస్తరిల్లె
ముదమున నవాబు బీరారుభూమి కూడ
నేలు కొమ్మని యిచ్చె నగేంద్ర ధన్వి!

ఉ. సాలునకైదులక్షలు విజాపురభూపతి గోలకొండభూ
పాలుఁడు మూడులక్షలకు పైకము కప్పముగట్టుచుండ గు
఩్ఱాలదళంబు గాల్బలము ద్రవ్యమపారముగా గడించియు
నాలక కతి దింపఁడొకనాడిది రాజరహస్యమీశ్వరా!

వ. అట్లు కొన్ని మాసములు సమరయాత్ర గావించి సఫలీకృతమనోరథుండై నిజపురంబునకువచ్చి.

శా. పోరాటంబులు మాని శాంతిలి జిజాపుత్రుండు రెండేడులు
ర్వీరాజ్యస్థిర రక్షణోచిత విధుల్స ృష్టించు బాలనా
ధౌరంధర్యముఁబూని యెల్లెడల ముద్రాశాలలన్నిల్పుచుం
బ్రారంభించెఁ జెలామణిన్ సలుప నాణ్యంబుల్శివాంకంబునన్

కం. జనసౌఖ్యోచితమగు పా
లనమునకై యష్టమంత్రులన్నిలిపె దళం
బును గడి దుర్గంబులదా
పుననుంచె విరోధి భూమిపులు భీతిల్లన్

సీ. తిరుమల పింగళే సరదారునకుఁ బేషరా సదుద్యోగమర్పణముఁజేసి
ఆబాజి సోనదేవను మరాటునకు బొక్కసముపై సర్వాధికారమిచ్చి
అణ్ణాజి నఖిలరాజ్యవ్యవహారంబు బాలించునున్నత పదవి నుంచి
దత్తాజిపండితుందన దినచర్యలు సకలంబువ్రాయు లేఖకుని జేసి

తే.గీ. వాజిసేనల మీద దోబతుని నిలిపి
దళముఁబోషింపనుంచె బ్రతాపగుజరు
నిందుశేఖర! శివభూతలేశ్వరుండు
జాణ సుమి రాజ్యపాలనా చతురిమమున

తే.గీ. ప్రతిభమిట్టాడగా వత్సరద్వయంబు
తన మహీరాజ్యరక్షణార్థంబు తగిన
కట్టుబాటులు నిర్మించి కత్తిబట్టి
కొనియె నరి రాజ కంఠ కర్తనముసేయ

కం. మును జయసింగుని చేఁజి
క్కిన సింహగడులుఁదిరుగ గెలువఁదలచె వీ
రుని కోరికడిందదు బొం
దిన జీవములున్న నొక్క దినమ కపర్దీ!

కం. ఒక దినమున సేనానా
యకులనురావించి యెవ్వడా సింహగడము బ
ట్టుకొనంగలఁడనఁ గదనో
త్సుకుఁడై తానాజి వీరసూర్యుడు లేచెన్

శా. తానాజీ రణ పండితుండురు భుజాదర్పంబు దీపింప భూ
జానింజూచినమస్కరించి శివరాజా! నందనోద్వాహమీ
వేనా కుంబ్రతిగానొనర్పుము రణోర్వింగూలినన్నేను లే
దా నా పుత్రునిపెండ్లితోడ జయభామాహస్త మేనంటెదన్

చం. అని శపథంబు సేసిన మహా కుతుకంబున గౌఁగిలించి య
క్కుననిడి పైడిసొమ్ములు దుకూలములం బహుమానమిచ్చి
తనయ నిరంతరంబును గృతజ్ఞుఁడనయ్యదనంచు వేయిమం
దిని మొనగాండ్రనంపె ధరణీ విభుఁడాఁతఁడు కోరు దిట్టలన్

కం. సాయముగ బోయెసూర్యా
జీయను తమ్ముండు వీరసింహుడు రణగాం
గేయుఁడు రామునకు సుమి
త్రేయుఁడు తోడైన పద్ధతిం ధమరుధరా!

సీ. చుక్కలునెత్తి పైకెక్కి ముచ్చటసేయు కొండగద్దియనెక్కి కూరుచుండి
పూర్వ పశ్చిమముల మొనసి పురందర పర్వతమాలనినిబ్బరమొసంగ
దక్షిణోత్తరముల దండి గండములరమైలు మింటికినిల్చి మైత్రిసేయ
నలరాతి పెనుగోడ నాల్గుదిక్కుల గ్రమ్మి కన్నతల్లి విధానఁ గాచుచుండ

తే.గీ. బురుజుకొప్పుల సౌందర్యమును శరీర
ధవళిమ మగడ్త నీటి యద్దంబునందు
గవిని కన్నులఁగనుఁగొని గర్వపడుచు
నుండు నాసింహగడ దళదుత్పలాక్షి

సీ. కన్నులఁబారింప గలదు తూరుపుదిక్కు దీరానదము నొక్కనిమిషమాత్ర
కాంక్షలు మాయింపగల దుత్తరంబున సారహీనంపుటెడారి జూపి
కామంబుబుట్టింప గలదు దాపున దోచు పూనాపురౌన్నత్యభూతి నెఱపి
గర్వంబు బోధింప గలదు నైర్ఋతి మూల రాయదుర్గంబును డాయ బిలిచి

తే.గీ. తనవిభుండగు నుదయ ఖానునిఁదలంచి
యుదయభానుని కడ్డము గదియఁబంపె
తిరిగి పంపింప డానందభరితుఁజేసి
శిఖరముల కెక్కి చూచెడు చెలిమికాని

చం. అటరసపుత్ర వీరులు భయంకరమూర్తులు వేయిమంది యొ
క్కటనతిజాగరూకులయి కాచుచునుండ యశస్వియుద్ధలం
పటుఁదుదెభానుఁడాదళము పాలనజేయుచునుండు నీతడెం
తటి మగడో మహేశ! మన తానుడు సింహగడంబు దాకగన్

చం. అమవసనాటి రేయి విభునానతిఁ దానుఁడు మావళీయసై
న్యముఁగొనివచ్చి కోటలకు నైర్రుతి దిక్కునఁజేర్చి మోకుసా
యమున మరాట కాల్బలము నందు సగంబెగబ్రాకఁజేసె దు
ర్గము రసపుత్ర వీరులకు గాని దినంబతఁడెట్లెతింగెనో!

తే.గీ. బలమునర్ధంబుమీదికి బ్రాకనిచ్చి
రాతి పతనంబునెపమున రాజపుత్ర
వీరులను లేపి పోరుగల్పించె భూత
నాథ దుర్గంబనెడు చుప్పనాతి ముండ

తే.గీ. కోటకొమ్మల కెక్కిమరాట వారు
దాగియుండిరి కుడ్యబాంధవుల నీడ
కలవరంబునఁ గన్నులు నులుపుకొనుచు
వచ్చు పగతురజంప భూతముల కరణి

ఉ. ఆ రసపుత్రశూరులు భయంపడకర్ధనిశీథమందె దు
ర్వారపరాక్రమంబున శరంబులుఁ గత్తులు బూని మావళీ
వీరులఁదాకి గర్భములు ప్రేవులు గుట్టలుగాగ గుమ్మిదో
స్సారముఁ జూపఁజొచ్చిరి నిశాసతి కన్నులు గోరగింపగన్

కం. ఉదరములు జీల్చి భుజసం
పదమెలయఁగఁ గోట నుండి పడవిసర ధరా
సుదతి ప్రతిధ్వనిశోకము
గదుర బలాపించెఁగందకపుగన్నీటన్.

కం. ఇరుదెసలనున్నబలముల
బిరికికిదానంబులేక వీరరసము వి
స్ఫురితమగుట మృత్యువునకు
నరజీవ కదంబ భోజనంబు లభించెన్

ఉ. పీనుగుపెంటలై రణము భీకరమై కనుపట్టుచుండగా
తానుఁడు దండులోబడి ప్రతాపము రూపము దాల్చినట్టు ఖ
డ్గాన విరోధులన్నఱుకగా ప్రవహించె వినూత్నరక్త గం
గా నదులుర్వీమీదికి నగంబుననుండి జరజ్జరధ్వనిన్

కం. అంతనుదేఖానుండు కృ
తాంతుని గతి నిశితమండలాగ్రముఁగొని దు
ర్దాంతరుషంగవిసె నతని
దంతిందంతియయెదిర్చు తాకిన లీలన్

ఉ. ఆకలహంబు చూడవలెనద్భుత మొక్కనికన్న నొక్కఁడా
రాకులు వల్లెవేసిన మహారణ శూరులు రాత్రియౌట పె
న్జీకఁటి యేటిలోపలమునింగినదిద్దరినేర్పులేనిచో
నాకుల పుష్పవృష్టికల నాకమహీజము లేమినందదే

తే.గీ. ఇరువురు బలంబు విక్రమస్ఫురణమెరయఁ
బోరి కొక చిన్నిగురిగింజ వారలేక
చెంతఁగారాదు మృత్యువు సిగ్గుఁజెంది
కింకనొకచోట నిల్చిగ్రుక్కిళ్లు మ్రింగ

ఉ. తానుఁడు రాజపుత్ర సరదారుని తోడఁబెనంగువేళ మే
లైన ఫిరంగి గుండొకటి యాతని వక్షముదాకి కూల్చెనీ
శాన! మరాటవారపుఁడసాభుజాబలమేచి దీనులై
మేనులు వాయజొచ్చిరి ధమీలునగూలు తుపాకి దెబ్బలన్

మ. అరిసేనాపతి గూలినంత రసపుత్రానీకముప్పొంగి ది
క్కరులూటాడ జయధ్వనుల్సలిపి శుభశ్రేణిమ్రోయింప స
త్వరుఁడై సేనల గోటకొమ్మకెగయంబ్రాకించి పెంపెక్కు ని
ర్భరరోషంబునదాకె దాయలను సూర్యాజీ మగండీశ్వరా!

కం. అతఁడన్న మరణమున దుః
ఖితమతి గాఁడపుడు కోరకితమైన క్రుధో
న్నతి కన్నులకెగదట్టగ
హుతాశనుని లీలమండుచుండి నటేశా!

కం. గెలిచితిమని సంతసమున
నెలనవ్వులుదేరఁ గేకలిడు శత్రు బలం
బుల గ్రమ్మి బల్లెములఁ గ
త్తులఁగ్రుమ్మిరి మావళీలు త్రుటి కాలములో

చం. కలహసముద్రమీదిరి ప్రకాండముచొక్కినతోడనే సము
జ్వలభుజశక్తిమై కలియబద్ధ మరాటులకా రణంబు మి
క్కిలి సులభంబుగా దనరె గెల్పుపడంతి తనంతఁదాన కౌ
గిలియిడి కోట కొమ్మలను కేతన వీధులకెక్కె వ్రేల్మిడిన్

తే.గీ. జయము తనవారిదనెడు నుత్సాహవార్త
శివమహీజాని విని యుల్లసితమనస్కు
డగుచు రయమున మేలివాహనముమీద
వచ్చె హసనంబు మోమున బ్రతిఫలింప

కం. వచ్చిన తోడన తానుం
దెచ్చటనున్నాఁడు కుశలియేయని యనిలో
జచ్చుటెఱిఁగి శివభూపుం
డుచ్చైర్నాదంబొనర్చి యుర్వింబడియెన్

ఉ. సింగములేక వట్టి గుహచిక్కిన నేమి ప్రయోజనంబు నా
కుం గుడిచేయి నిక్కముగ కూలినదేనిక నేమిసేతు నే
రింగని ప్రేమతోఁబలుకరించెద తానుని పేరనక్కటా
మ్రింగినదా రణంబనెడు మృత్యువునా జగదేకవీరునిన్

వ. అనుచునున్మాదియుంబోలి దుర్గమున జూచికంఠమెత్తి

ఉ. ఉంకువజేసె ప్రాణములయో రణధీరుఁడు తానుఁడట్టిశో
భంకరుఁడేగె నీ విపుడభాగ్యవనాథవుముండమోసి నా
యంకముజేరఁగోరతగవాయిది సాధ్వికి చూడరాదు నీ
వంకఁ గళంకవర్తీనిక్షపాచరరూపిణి దుర్గభామినీ!

కం. అని సూర్యాజి పయింబడి
జననాథుఁడు వగచెనాత్మసైన్యము నిల జె
క్కిన బొమ్మలై కఱంగగ
దన వాత్సల్యంబు దేవతలు వినుతింపన్

ఉ. కూలిన తానుఁడే నయన గోళములం గనుపట్టుచుండ భూ
పాలుఁడు వాజినెక్కి పరివారముతోఁబురిజేరి దీనుఁడై
నాలుగు నాళులుండె నశనంబును గోరక శోకవారిధిన్
దేలుచు నిట్టి ప్రేమ జగతీధవులందరు దగ్నిలోచనా!

చం. నిరత పరోపకార పరినిష్ఠిత మానస పుండరీకు ని
ర్జర తరుణీ విలోకనచరన్మహనీయవిలాసమూర్తి మే
దురకరుణా కటాక్ష గురుదోర్యుగపీత పరిస్ఫురద్ధనేం
దిర! కవితా మనోజ్ఞ జగతీపరిపాలన! సత్యఖేలనా!

ఇయ్యది
శ్రీ గుఱ్ఱమువంశకలశపాథోనిధానరాకాసుధాకర
వీరయాఖ్యజ్యేష్ఠతనూభవలింగమాం
బాసుపుత్రజాషువాఖ్య ప్రణీ
తంబైన శ్రీశివాజీ ప్రబంధంబు
నందు చతుర్థాశ్వాసంబు
సర్వంబుసంపూర్ణంబు

# పంచమాశ్వాసము

కం. శ్రీ లక్ష్మాంబా బాహుల
తా లాలితకేళికాసుధాధామఁసము
న్మీలిత కీర్తి రమాశుభ
చేలాంచల తాళవృంత శ్రీశైలపతీ!

కం. వినుమతఁడనంతరము తా
నుని కూరిమి ముద్దునందనునకు వివాహం
బొనరిచెవైభవమున నం
దన వనిఁజెరలాడు తానునకు మోదముగాన్

ఉ. రాజపురంధరుండు సమరస్థిరుఁడై విజయంబుఁగను సూ
ర్యాజిని సింహదుర్గమున రాజునొనర్చియనంతరంబు శం
భాజికి పెండిలిన్సలిపి మాసమురోజులు సన్న మీద వి
భ్రాజదురు ప్రతాపమున భండనయాత్ర కుఁబోయె నాయకా!

మ. తొలుతం జింజిరముట్టడించి బలవంతుండైన సిద్దీని కొం
డల పాల్సేసి వశీకరించుకొని యంతన్పూరతుందాకి సే
నలతోదోపిడి జేసి పట్టణములోనంగల్గు ద్రవ్యంబుగో
నెలతోఁజేకొని పోయె, శౌర్యమునకంటెన్ వైభవంబున్నదే

తే.గీ. దాయదావూదుఁడను మొగలాయి మగఁడు
ప్రబలసేనా సమేతుఁడై వచ్చి దాకె
నంత మహలూరు పట్టణాభ్యర్ణసీమఁ
బ్రళయసంగ్రామమయ్యె దర్పకవిరోధి

కం. ఆ యవనేశుని సుభట ని
కాయమునకుఁ దోడు రాయగాభిరాయనుబి
బ్బీయొకరిత బోరాడె న
జేయయగుచుఁ గసిమసంగు సింహికలీలన్

ఉ. సాహసమంగసౌష్ఠవము చక్కదనంబుఁ దురంగలింపం బో
రాహవరంగ మధ్యమున కంబికయై శివరేని సైనిక
వ్యూహములంగలంచి విజయుండు ప్రమీలకుఁజిక్కెనన్న సం
దేహము వాపెనప్పుడు సతీమణి యోధుల మానసంబునన్

తే.గీ. అమలసౌందర్యమున హృదయములు గెలిచి
శౌర్యమునఁ గెల్చెనరుల దోస్సారగరిమ
అలికలోచన! రెండు గెల్పులు లభింప
నువిద రణమున నోడియునోడదయ్యె

ఉ. ఆవనితావిలాసవదనాబ్జము జూచికఁలంగిపోయి కా
మావిలచిత్తులౌ భటులయందొక కొందరకింతి చేతిలో
చావుమనోహరంబయి ప్రసన్నముగా గనుపట్టెనక్కటా
పూవుల వింటి వాడు రణభూములయందును దాపరించునే

చం. తురకలు మావళీదళముతోడ బెనంగగలేక యస్త్రము
ల్దొరఁగి పలాయనంబగుచు దోయరుహాక్షి×××× జయేం
దిర వెనువెంటఁ బంపిరవనీధవుఁడైన శివాజి చెంతకుం
బరమకృతజ్ఞులై వృషభవాహన! యేమనవచ్చు మ్లేచ్ఛులన్

కం. గొనములతిట్టయుఁ గరుణా
వనధియనందగు శివాజి పడఁతి మగటిమిం
గొనియాడి యాదరంబున
ననిపెం బట్టణమొసంగి యర్ధేందుధరా!

ఉ. అంతటఁ బ్రొద్దుగ్రుంకె సమరాంగణభూమి స్రవించురక్తపుం
గాంతులు పశ్చిమాశపయిగాంతిలె జుక్కలనిక్కె యామినీ
కాంతకు నాగరంబులనగా పిలతెమ్మెర వీచెఁజీకటు
ల్దొంతరలై పయింబడె బులుంగులు గూర్కెఁ గులాయ పంక్తులన్

తే.గీ. చిక్కిన ధనంబు విజయంబుచేత బట్టి
స్వపురమునకేగుదెంచె శివాజిరాజు
యుదయభానునిబాలమయూఖ ×××
నాటి రేబోటినెడల గెంటకయమున్న

కం. సూరతునుకొల్లగొట్టి య
పారంబగుధనముతో శివాక్షితిపుడుబో
నౌరంగుని కనులంటని
కారపువేంద్రమున మండగాజొచ్చె శివా!

చం. నలుబదివేల కాల్బలము నాలుగువేల గుఱాలు పుష్పకం
బులనిడి యోధనాథుఁడగు మోబతుఖానుని బంపె మావళీ
యులనెదిరింప ఘోరతరయుద్ధము పబ్బముగా దలంచుశూ
రులు గదమావళీలలసి రోయక రొమ్మిడి క్రమ్మిరుగ్రులై

కం. తమకన్న వైర్యనీకం
బమితముగనున్నదలక కారణమున ఖ
డ్గములకు సంతుష్టిగ భో
జ్యము చిక్కిన దనుచునలరిం××××

చ. కడచినవెల్ల యుద్ధములుగావు మరాటులు మావళీలుత
త్తడులు గజంబులెక్కినఁ బ్రతాపముగాదని నేలమీద బ
ర్విడుచుఁ దురుష్కసైనికులు బెగ్గిలనేవురకొక్కరుండుగా
విడివడి పోరసాగిరురుభీషణభాషల సర్వభూషణా!

ఉ. నిండిన కోపవేగమున నిప్పులు గ్రక్కుచు మావళీల్గదా
దండముల న్ధరించి యరదంబులు చూర్ణము చేసి విద్విష
ట్కాండముతో బెనంగిన విధంబు భయంకరమందు మస్తము
ల్పండిన దోసపండ్లవలె పక్కున ప్రీలి పడెన్సహస్రముల్

కం. నలినలియై పుట్టెలుపెం
కులుసున్నపురాసులట్లు కూలిపడియె న
క్కలహమున నీకుఁగంచం
బులు సొమ్ములు లేవు రాజభూషణవింటే

కం. ఆనాడు బ్రదికి పోయిన
నేనాటికి శివమహీతలేశుని బలవ
త్సేనలతోఁ గలహమునకు
రాననుకొనె ఖానుఁడంతరంగమున శివా!

కం. ముదమునఁగొనివచ్చిన నలు
బదివేల బలంబులోన బదివేలట న
క్కదనపు సత్తికి బలియై
యెదగలచె దురుష్కవాహినీశున కీశా!

ఉ. ఖానుఁడు దీనుఁడై ధరణికాంతుని పాదములాశ్రయించి స
న్మానమునంది పెద్ద యవమానముతో దనసేనతోడ సు
ల్తానునివీటి కేగిన దళంబులు జైమహదేవయన్జయ
ధ్వానములాచరింపగ శివాజియుఁ గోటకుబోయె నీశ్వరా!

వ. అంతనొకనాఁడు.

సీ. మోముచందురుఁడు విభూతివెన్నెలతోడ నవశాంతి తుహినబిందువులు గురియ
మానక రామనామక మంత్రములుసెప్పు తంబురబాహాగ్రతటి నటింప
ఆర్గురు దాయల నలుక చూపులు చూచు కాయపుట్టము మేనగంతులిడఁగ
హృదయ శల్యములగు తృష్ణలు హరియించు చిటి కమండలువు డాచేత వ్రేల

తే.గీ. ధరణి సర్వంబుఁబాదముద్రణముచేతఁ
బావనముసేయు శ్రీరామభక్తవరుఁడు
పున్నియఁపు రాజ్యమేలెడు భూమిపుండు
రామదాసుండు చనుదెంచె రాజు కడకు

ఉ. మేడకు రామదాసముని మిత్రుఁడు నెయ్యమొనర్ఛ వచ్చుచు
న్నాఁడనుమాట నెమ్మనమునం గుతుకంబురచింప లేచి కా
లాడఁబరుంగువారి చరణాబ్జములంబడిమ్రొక్కె రాచరే
రేడు శివాజి భక్తుని శరీరము గగ్గురు పాటు నందఁగన్

కం. మునిరాజు శివాజీరా
జును గని దిగ్విజయమస్తు శుభమస్తు మరా
టనరేంద్రుల కని నెఱమన
మున దీవించెం బ్రియంబు మోమున దోపన్

చం. ఘనతర రాజ్యసంపదల కన్న మునీంద్రుని యాగమంబు ద
ర్శనమిరుమ్ముమ్మడుంగులు ప్రశస్తతమంబయి గానుపింప న
మ్మనుజవిభుండు భూరి బహుమానములం దనియించె మావళీ
జనుల మరాట వీరుల నిశాకరశేఖర ముక్తకాంక్షుఁడై

కం. వెలగల రతనcపుcబనియం
దలముననిడి భక్తితోడ దన పట్టణ వీ
ధులనూరేగించె దళం
బుల తూర్యధ్వనులు మిన్నుముట్ట నటేశా!

తే.గీ. మహితధారుణీరాజ్యసంపదలు సోకి
క్షోణిపులు కన్నులుండియు గ్రుడ్డివార
లగుట తథ్యంబుగద యీతcడగణిత ప్ర
శాంతమున గ్రుడ్డియగునిందు సంపదలకు

కం. ఆసాధుభక్తవరుని జి
జాసూనుని భక్తిప్రోల్లసన్మంగళ కై
లాసశృంగసుఖద డో
లాసీమలనూచి జోలలంబాడె మృడా!

ఆ.వె. అపుడురామదాసుcడామహాత్ముని గన్న
జనని మోమునరసి సంతసంబు
వెల్లివిరియ మధురసల్లాపములతోడ
నిట్టులనియె నెనరుమిట్టి పడcగ

ఉ. ఓ రమణీమణీ! చిరతరోజ్వలమంగళ మమ్మ నీకు నీ
పేరమరావతీనగరవీధుల వీణెలుమీటి పాడుచు
న్నారు సురాంగనల్దినదినంబు ధరాసతి ధన్యయై నమ
స్కారములందుచున్నది దిశాపతిచేత జిజాపొలంతుకా!

సీ. నీకుమారుని కత్తిcనించు నెత్తురు మడ్డి కువలయాంగనకుc గుంకుమపుబొట్టు
నీపట్టినాటించు నిగ్గుకీరితి తోట ధారుణీసతికి ముత్యాలమాల
నీపుత్త్రు డొత్తించు నిండు శంఖధ్వని క్షోణీశుభాంగికి జోలపాట
నీ నందనుండెక్కు నీటు గుఱ్ఱపుహేష భారతాంగనకు నిబ్బరపు చిన్నె

తే.గీ. నీ సుతునిc బాసిపోని మన్నీలమూక
క్ష్మాలతాంగికిc గూర్మిచుట్టాలు తల్లి
మా ధరాదేవి నీ దివ్యమహిమదలచి
యెన్నిమారులు ముద్దాడియున్నదొక్కొ

సీ. నీ వెన్నునందుపండిన పంటయేకదా! భారతీలకు సుఖైశ్వర్యకరణి
నీ నిష్కళంకపూజా నిశ్చలత కదా ప్రణవమంత్రమునకుఁబట్టుకొమ్మ
నీకాలిమెఱుగుటందెలచప్పుడేకదా! యరివధూహంసలకభ్రఘోష
నీ నాల్కనుదయించు నీతిబోధలకదా! హిందూ సతీ యశ స్సృష్టిబలము.

తే.గీ. నీలసన్నామకంబున నిలిచియున్న
యక్షరద్వయమాశ్రితరక్షణంబు
నీవు సామాన్యకాంతవుగావు తల్లి
కలియుగంబున కపరశాంకరివిగాని

చం. అని కొనియాడి యాపొలతిహస్తము నందొకరక్షగట్టి మో
మున మునివ్రేలనద్దిన విభూతి రజంబున బొట్టు బెట్టి దీ
వెనలిడి శంభురాణి శుభవీక్షణముల్గను నీ కుమారునిన్
మనుచుతమంచుఁ బల్కెమునినాథుఁడు ప్రేమనటన్మనస్కుఁడై

వ. అంతనప్పరమయతీంద్రుఁడు శివాజి నేకాంతముగాఁగొనిపోయి మంత్రోప దేశంబు చేసి కృష్ణబోధితమగు కర్మయోగంబునుపదేశించి కర్తవ్య దక్షత, రాజ్యపాలన, దుష్టశిక్షణ శిష్టరక్షణంబులను రాజధర్మంబులు గరపిన, రాజమునియగు శివాజి యుప్పొంగి గురుదక్షిణగా రాజ్యంబు నర్పింప విగతరాగుండగు సంయమీంద్రుండు రాజ్యపరిగ్రహణంబున కీయకొనక నాకుంబ్రతిగానీవే ధరణీ పరిపాలనము నెరపి ధర్మమును బ్రతిస్థాపింపుమని

కం. ఆశీర్వాదముచేసి ద
యాశాలి మునీంద్రుఁడరిగెనంతట శివధా
త్రీశుఁడు ముదితుఁడయి నిజ ని
వేశమునకుఁ బోయెఁ బల్లవిత భక్తి శివా!

ఉ. ఆసమయంబునుండి ధరయంతయు రాముని భక్తుఁడైన స
న్యాసి దటంచు కాయవసనంబునఁగేతనమెత్తి ముత్తెపుం
బూసల తావళంబొకటి బూని పసిండి విభూషణంబులం
దీసి ధరింపఁజొచ్చె నవనీపతి మేఁద్రు×రొకపేరులన్

కం. శివరాజు సన్యసింపగ
నవనీకంటకుల జెందునభిలాష సము
ద్భవమయ్యెc దిరుగనిది ధ
ర్మ విరుద్ధంబనకు పగర తల(వ్రాలు శివా!

ఉ. ఆటగుఱాలదండిరువదైదు సహ(స్రములారువేలుపో
రాటపు మత్తుటేన్గులు ఫిరంగులు నాలుగు వేలు మావళీ
పోటరులు న్మరాటు లిరుముప్పదివేల బలంబు తోడc గ
ర్ణాటక సీమకేగె శివరాజు మునీం(ద్రుని యానసీశ్వరా!

కం. తానీషా గోల్కొండపు
రీనాథుcడు ఛ(త్రపతికిc(బియమి(త్రుcడు స
న్మానించె నెదురువచ్చి మ
హానందముతోడ బథ(ప్రయాసముడిందన్

వ. అటనమాత్యపదవిం బొదలునక్కన్నయుమాదన్నలు శివాజి నెంతయుగౌరవించి చెలిమి సలిపిన నట సేనతో మాసముండి గొల్గొండcబాసి మార్గమధ్యంబున శ్రీశైల మల్లికార్జుని సేవించి పిమ్మట

ఉ. సేనలతో రహస్యముగcజేరువ పల్లెలు కొల్లగొట్టి జిం
జీనెదిరించి యందలి వజీరుల నోడిచి వీరుcడైన జిం
జీనగలేకొసంగి యటcజిక్కిన కోటలపాలనంబు స్వా
ధీనములోన నుంచుకొని దిగ్విజయంబు గడించె నీశ్వరా!

ఉ. (ద్రావిడ భూమినున్న తమరాజ్యములన్ని జయించి దుర్గము
ల్దైవసము న్బొనర్చుకొని గాసిలచేయుచునుండె నమ్మరా
టావిభుcడంచు మొగలు పటాలముతోడ విజాపురంభూ
మీవిభుcడు(గుcడై చని సమిత్తులిcదాకెశివాజి సేనలన్

కం. కలియుగసురబలమనదగు
నలశివనరపుని బలంబు లరివనమున క
గ్నులు గద మహేశ్వరా! తుర
కలకెక్కుడి జయము జిక్కగలదు రణమునన్

కం. నాదుమరాటులు గురిసెడు
వాడి యలుగుజల్లుకె దిరుపడి పోరం గా
లాడకవిరోధి జాందం
బూడని బాడెన్నవాబు నుల్లంబెటియన్

కం. ఆరణమగు భీకరకే
ళీరంగములోన మావళీయుల బాహా
భూరికరాసి కుమారీ
వారముతలకాయ పూవుబంతులనాడెన్

కం. పొలికలని పడంతుకక
మ్ముల చుట్టతికమున ద్రవ్యమునకు బదులు గు
ట్టలుగా లభించె నిటల
జ్వలనేక్షణ పగతురొమ్ము జల్లెడ సొమ్ముల్

కం. ఒరలెడలు నమ్మరాటుల
కరవాలములించుకంత కరుణింపక నె
త్తురు కన్నుల జూడనిదే
మరలి చనవు మొక్కవోవు మారవిరోధీ!

ఉ. బీరముదక్కిసైనికులు పేరెమువారిన జూచి కోరిక
ల్జారి నవాబుగారతి విచారముతో నిజరాజధానికిం
జేరె మరాటులంత జయ నిస్వనముల్పచరించి పోయివే
లూరుపురంబు దాకిరి విలోకభీకర చండమూర్తులై

కం. ఆకోటజయించె మరా
టాకాంతుని సేనలుత్కట ప్రతిభనకుం
ఠీకృతవీర్యమున జయ
శ్రీకి శివాజీకి నెట్టి సేయంబొకదా!

వ. విజాపురంబునకుం జెందిన దుర్గములను గెలిచి మరాటులలో సమర్థులగు వారి నధిపతులంగావించి కానుక లీయని ఖాను పురంబులనెల్ల పరశురామప్రీతి గావించుచు సంచరించు తరుణంబున నపజయసంజాత క్రుధా దవానలదందహ్యమాన మనస్కుఁడగు విజాపురీశ్వరుండు సహియింపక యిదే

యదనని సేనాపతులతోఁజని పన్హాళా దుర్గమును దాకి ఁదానిం గొల్లగొట్టి సమీప గ్రామముల గారించి లభించిన ధనంబుతో తిరిగి చనునవసరంబున దక్షిణ దిగ్విజయయాత్రంబూర్తి చేసి తిరిగి వచ్చు శివాజీ యెటింగి దండుతో వీరుండగు నిరోశికాటరును చంపిన

ఉ. ఆనరనాథునానఁ దలయంద ధరించి మరాటుఁడమ్ముస
ల్మానులదాకియోర్చి విభులంజెరపట్టి ధనంబు భక్తిమై
ఱేనికొసంగినం గుణ గరిష్ఠుఁడు షాజి సుతుండు మెచ్చి స
న్మానముచేసి యెవ్వరి ధనంబును వారి కొసంగెఁబల్లెలన్

కం. మాదన్న గారు శివధర
ణీదయితునకనిపె నురుమణీకనక విభూ
షాదులు కానుకగా సం
పాదిత దిగ్విజయ వధూ వివాహమునకునై

ఉ. రాయగడంబులోన శివరాజొకమాసము విశ్రమింప ఢి
ల్లీ యవన ప్రజాపతి యళీకపరాయణుండుగ్రమూర్తి య
న్యాయముగా విజాపుర జయార్థము సేనలనంపదీనులై
సాయము గోరినం జనె ప్రచండచమూనిచయాభిరాముఁడై

కం. అదిగని వెరవున మొగలా
యిదళంబులు తిరిగి చనిన నేపున భీమా
నది నుత్తరించి శివరే
ని దండు మొగలాయి ధారుణింబడియె మృడా!

కం. నగధీరులగు మరాటా
మగల మ్మొగలాయి జగతి మండలమును కొ
ల్లగొని చనుట గని రుషగదు
రగ మోయీజీము సంగరమునకు వచ్చెన్

ఉ. సంగిమనే పురంబు కడ సంగరమయ్యె శివాజి సేన కౌ
రంగునిసేనతో స్మరహరా! దురమందర గంటలోన నే
నుంగులు నెత్తుటేరులమునుంగుచుఁదేలుచు భూతకోటిన
ర్థింగొనివచ్చు తెప్పలగతిం గనుపట్టె భయంకరంబుగన్

కం. కొమ్ములతోయుదరంబుల
గ్రుమ్మియదమజొచ్చె నేనుగులు పగతుర యాం
త్రమ్ములు తామరతూండ్ల వి
ధమ్మున వెలికురికి ధరణితలి గురియ హరా!

కం. వీరస్వర్గము నందెడు
వారును వెన్నిచ్చిచచ్చువా రధికంబై
మీరి యమామరభటులకు
దీరిక లేదయ్యె నాటి దినము కపర్దీ!

మ. బలవన్మావళ వీర బాహులతికా బంధంబులంజిక్కి దు
ర్బలయై యూర్పులునించు రంభ సహియింపంజాలదయ్యెం దురు
ష్కల దోరంతర పీడనంబునకు నీఘోరవ్యథావృత్తి పె
ద్దలు మీరొప్పనిదే లిఖించునె మహాత్మా! బ్రహ్మ నిశ్శంకుఁడై

కం. సురకాంతాకూటమునం
దురకలకు మరాటులకును దురమయ్యె భయం
కరముగ స్వర్గమునఁ బున
ర్మరణంబులు లేమివిసిలి మానరునాథా!

కం. మోయాజీముని సేనప
లాయనమయి కాననంబులంబడియె మరా
టేయుల యలుగులు సమరపు
టాయాసము దొరగ నొరలయందొదిగె శివా!

చం. కలనసహాయుఁడై రిపులగర్వమడంచినదానికై కృత
జ్ఞులగు విజాపురీశ్వరులు శూరశివాజి కొసంగిరంతఁ గో
సలమును ద్రావిడంబును మ×వుడు ఖానునిప్రేరణంబునన్
జెలిమికి సాటి విత్తరువనిం బొడకట్టదు చంద్రశేఖరా

తే.గీ. అనుఁగు సుతుఁడగు సంభాజియంతలోన
వైరి పక్షముజేరి భూపాలగడము
దాకి యౌరంగజేబుని దళసహాయ
మున మరాటుల హింసింపమొదలు బెటె

కం. లలిత గుణాఢ్యుని కడుపున
ఖలుని మహాదానశీలి కడుపున నీతిలో
ఖల బుట్టించెడు పలుకుల
వెలఁది మగఁడు నేలయో వివేకియొ చెపుమా!

ఉ. పౌరుషహీనుఁడై యనుఁగు పట్టి విరోధులనాశ్రయించి ని
ష్కారణమింటిపైకెదురుకత్తి వితాన మరాటవారితో
బోరొనరించు మాటవిని మూర్ఛితుఁడయ్యె శివాజి కామసం
హారక! దుష్కుమారులు కదా పిత కంతములేని శాత్రవుల్

వ. అంతఁగొంత వడికిఁదెలిచి కొంతవగచి దుస్సహవాస ఫలంబుగా నిశ్చయించి
యుపదేశములఁజక్కపడంగలండని

సీ. గెలిచినాడను దిశావలయంబు నాతల్లి శాంకరీశుభకటాక్ష ప్ర×
మట్టినాడనువైరి మానవేంద్రులనెల్ల మీజేజె పూజనావ్యాజశ×
కట్టించినాఁడ దుర్గములు ముప్పది రెంటి నరి వజీరుల గుండె లావటిల్ల
గడియించినాడ లక్షలకు రత్నంబులు ధననాయకునకు దంతములు పులియ

గీ. ధాత్రి మీతల్లి మంగళసూత్ర పటిమ
డాయసంద్రంబులన్నియు ద్రచ్చినాఁడ
మీ యదృష్టంబనుచుఁబొంగి పోయినాఁడ
నుడిగి మిత్తిని డాయంగనున్నవాఁడ

శా. నాయైశ్వర్యము నాభుజోబలము నానందంబు సర్వంబు మీ
రైయున్నారు కుమారులార పగవారై వైరులంజేరుచో

(అసంపూర్ణము, అముద్రిత రాతప్రతి)

# శ్రీ శారదాస్మృతి

సీ. శ్రీరాము గొనియాడు కూరాడకుల హీర హారవల్లరికి శృంగారపదక
మైన లక్ష్మీనృసింహాఖ్యుండు భూసుర పుంగవుం డమలదయాంగదుండు
అన్నపూర్ణకు నుద్ది యగు సర్వలక్షాంబఁ బరమకల్యాణి నుద్వాహమయ్యె
ఆ జంపతులకు రతీజాని కెనయైన గోపాలరత్న మాఖ్యుండు వెంక
టప్పయ్య విబుధుండు నచ్యుతరామయ్య వెంకటానందాఖ్య విమలయశుఁడు
రామచంద్రయ్య నిర్మలచిత్తుఁ డగు బాల కృష్ణరాయాభిధుం డిద్ధసుగుణుఁ
డనెడు నార్గురుపుత్రు లంబికారమణికి శీలంబుఁ గఱపెడు శేషమాంబ
జానకమ్మయు సమంచచ్ఛాంతవతి మంగతాయమ్మ మాచమ్మ తరళనేత్ర
లాత్మజాతలు బుట్టి రందు శ్రీబాలకృష్ణారావు పిన్నలి సత్కులమున
కంగదంబయిన దయాశాలినియు సుందరాంగియౌ కామేశ్వరాంబ యనెడు

తే.గీ. సతినిఁ బెండిలియాడె త త్సతికి జనన
మందె శ్రీ శారదాంబ! గుణావలంబ
వనిత గొనముల కలరి దేవతలు మెచ్చి;
తొడరి కొంపోయి రనుఁగుబందుగులు కుంద

సీ. మెఱుఁగు బంగారు తామరగద్దె విడనాడి రాయంచకొదమ గుజ్జుమును విడిచి
చిటిచిల్క చెలికత్తె చెలిమి దూరముజేసి మురిపెంపు మెట్ల కిన్నెరఁ దొఱంగి
నెలవంక విరిగుత్తి నెరుల దిద్దుట మాని నలువకౌఁగిటి జీవనంబు మఱచి
అమరభామలొసంగు నభ్యర్చనము దక్కి వేదవిహారంబు వీటిబుచ్చి

తే.గీ. పావనంబైన కూరాడవంశమందుఁ
గరుణ కామేశ్వరీ దివ్యగర్భసీమ
శారదానామకంబున జననమందె
శారదాదేవి సుగుణపుంజములదీవి

సీ. కాకిచిప్పలవంటి కన్నుఁదమ్ములు చూచి ముసిముసి మొలక నవ్వులను జూచి
ముదురు తేటులనేలు ముంగురు ల్పరికించి జిలుఁగుఁదేనియల మాటలను జూచి
మేలిమిం దులకించు మేనివన్నియఁ జూచి కుదురైన తళుకుఁ జెక్కులను జూచి
అడుగిడం గందు పాదాంబుజంబులఁ జూచి తొగవన్నె లేతచేతులను జూచి

తే.గీ. పలువరుసతీరు విండ్లను బరిహసించు
కనుబొమలసౌరుఁ గనుఁగొని కౌతుకమునఁ
గన్న తనతల్లిదండ్రులకన్న ముందు
ముజ్జగంబులు లోలోన ముద్దులాడె

కం. ఆమీదఁ గొన్నినాళ్లకుఁ
గామేశ్వరి దేవి మేలుగాఁ గనియె గుమా
రీమణిని, మహిని రెండవ
కామేశ్వరి నంచితప్రకాశితగాత్రిన్

వ. ఆ బాలికా ద్వితయంబునందు శారదానామ కన్యాతిలకంబు, శుక్లపక్ష బాలశశాంకరేఖనాఁ జెన్నారుచుఁ గ్రమంబున జదువ వ్రాయ జతురయై,

మ. కళచెం బిన్నటినాఁడ వేడుక లసద్గాంధర్వవిద్యన్ ఫణా
ధరసంతానము మోదబాష్పములు చిందం దల్లియంకాన నూ
పురపుంగజ్జె నటించుకాలమునఁ బూవుంబోడ్లకు న్శారదా
సరసీజేక్షణ నామవాసన కళాసంపత్తిసంధింపదే

ఉ. కోయిలకుత్తుక న్నలువకూరిచి దాచిన తేనెపాటలో
తీయఁదనంబు మోహనగతిం జిటిమాటల నూరజొచ్చెఁ గం
దోయి నమేయశీలము వినూత్నవిలాసము బల్లవించెఁ జాం
పేయవిలాసనాస కరవింద విశాల విలోలనేత్రకున్

కం. విరిసెడు మల్లియతో నురు
పరిమళము వృద్ధిజెందు పగిది దనరె సుం
దరి ధీవికాసము సగుణ
పరిమళము బంధుమధుపవర్గం బలరన్

తే.గీ. తరుణిసోయగ మిగురించి ధరణిజనుల
కనుల వికసింపజేసెడు కలికిప్రాయ
ముననె జనయిత్రి మిత్తికి బోనమయ్యె
విధికృతంబున డాగినవింతయేమొ

మ. సతి కైలాసముజేరినం ఘనుఁడు కృష్ణారావు రవ్వంత దుః
ఖితుఁడయ్యున్ ధృతివాయ కింట ననురక్తిం బెంపసాగెం గుమా
రితలం గూనల నభ్రవీధి నిజనారీరత్న ముప్పొంగు ప
ద్ధతి నుర్వీజనసంచయంబు ముకుమీదన్ వ్రేళుల న్నిల్పఁగన్

మ. అనుఁగుంబ్రేయసి మానినీతిలకమన్యాయంబుగా వీడిపో
యినఁ బ్రారబ్ధవిధిం దలంచుకొని యెంతేఁ జింతిలున్గాని న
వ్విన ముత్యంబులు మూటగట్టు సుతలన్వీక్షించి హర్షాంబుధి
న్మునుఁగు న్మైమఱచు న్నుతించు భగవంతున్భక్తినుద్దాముఁడై

ఉ. బాలల నిర్వరం బెనుచుఁభారము నెత్తిన నంటగట్టగాఁ
బోలదు బాపనయ్య కనుపోలిక నిర్దయుఁడైన బ్రహ్మయు
య్యేలఁ జెలంగు పాప నలమృత్యుముఖంబునఁ ద్రోసె నక్కటా
మేలని కీ డొనర్చుటకుమేటి సమర్థులుగారె వేలుపుల్

కం. మూలుగు నక్క తలపయినఁ
దాళఫలము పడ్డపగిది ధరణిసురున కి
ల్లాలివియోగముపైఁ బ్రియ
బాలాదుఃఖంబు హృదయపథముఁ గలంచెన్

వ. ఆ సమయంబున శారదాబాలిక పితరు నంతరంగం బునఁ బాదుకొన్న దురంతచింతాభరంబు నెఱింగినదై

మ. జననీదుఃఖము, సోదరీమరణ మశ్రాంతంబు డెందాన మా
ననిగాయంబు లొనర్చి పేర్చిన ననూనవ్యాకులస్వాంతుఁడై
జనకుం డింకను గ్రుళ్లునోయని సముత్సాహాంకురశ్రీలు మో
మున మిట్టాడఁగ చిట్టికోయిలపదంబు ల్వాల్కు వెంటాడుచున్

కం. ఆశారదాంబికాగుణ
వైశద్యము, వినయమధుర వాగ్భూతి, మనః
పేశలతయు దండ్రికిఁ జిం
తాశాంతి ఘటించెఁ గొన్నినాళ్లు గతించన్

మ. కొడుకుంగూతురు బంధుబృందమన నాకున్నేటి కీబాలయే
కలసర్వస్వమటంచు నంచితకళాకాండంబుఁ జెప్పించి పా
ఱుఁడు, సారాశయుఁ డొక్క బ్రాహ్మణకుమారుం దెచ్చి పొచ్చెంబు చొ
ప్పడకుండం జనమండలం బలర నుద్వాహంబు గావించి తాన్

ఉ. కోరిక నందనుంచుకొనిగోమునఁబెంచిన కొన్ని నాళ్ళ కీ
డేరిన వేడుక ల్పలిపియిష్టజనంబులు సమ్మతించి యా
శీరవము ల్పొనర్పఁ బతిచేతుల కర్పణచేసెఁ జెక్కులం
జారెడు బాష్పబిందువులు సాక్ష్యములై మది కింపు సేయగన్

కం. నా యనువా రెవ్వరు నా
నాయనకుం గలుగరని మనం బెరియ జలే
జాయతలోచన శాంతిలు
నాయకుని పదాబ్జసేవనావ్యాజమునన్

సీ. పరులకొంపలవంక పాదంబిడదు కించిదపవాద సర్పభయంబు బెరసి
అత్తమామలమాట కడ్డంబు పలుకదు పతిభిక్ష నిడ్డ దేవతలటంచు
విభుఁ దూరలేనిచో విరులు కీలింపదు కాంతారచంద్రికాగతిఁ దలంచి
యభ్యాగతుల సేవయం దెన్నఁ డలయదు శాంబరీవిష్ణురూపంబు లనుచు

తే.గీ. పెట్టుపోతల నొక్కింత వెలితిపడదు
వేయి వచియింపనేల యుర్వీతలమునఁ
బావనపురంధ్రి కుండంగవలయునన్న
చిన్నె లీయమ్మయందె పుంజీభవించె

చం. కలికి లలాటభాగమునఁగాంచనగర్భుని ఘంటమేమి చి
క్కులు గలిగించెనో, విభునకుం దనయం దనురాగ మూడి చి
ల్లులకు నివాసమై తనరెఁగోమలిజీవన మంతనుండి దు
ర్బలత శరీరవల్లి కెగబ్రాకె విచారమె యూతకఱ్ఱగా

మ. అనురక్తిం దనతో మనోవిభుఁడుమాటాడంగ నానాడు భో
జన మింతేని భుజించు లేనగవుచర్చ ల్జెక్కులంబూను కొ
ప్పునఁ బూదండలు మెండుగా దురుముఁ దాంబూలంబు సేవించు; నా
ఘనకన్నం గలదే పతివ్రతల కెందున్ స్వర్గము న్మార్గమున్

మ. సరసాలాపములాడ దాస్యమున హాసం బెన్నడుం బూనఁ డా
సరసీజానన దక్షతం బలుకరించం గొంచెపుందృష్టి మో
మరవెట్టున్; మొరవెట్టి కష్టము సుఖంబాలింపు మన్నం క్రుధో
ద్ధురతం దద్దురు లెక్కమోదు; నిదిగాదో కర్మ మర్మం బిలన్

ఉ. రాతిరియుం బవ ల్మగనిరట్టున కోరిచి గుట్టుగా మహా
యాతన నీదుచుం బొరుగుటమ్మల వీనులకెక్కనీదు సా
కూతవిలోకనప్రభలు కొంచెముసేయదు భర్తృనాజ్ఞకు
న్మూతి బిగింప దొక్కదినము న్మనముం దనువుం జిగుర్పగన్

వ. మనః కాంతుం దంత నయ్యింతి న్నిశాకాంతార్థ లలాట న్శారదాంబికను వెంటంగొని నిజాము రాజ్యంబున వరంగలుపురంబుఁజేరి యుద్యోగియై వసియించు చుండ

ఉ. ఆరమణీలలామ వినయంబునఁ గొల్చుచు ముత్తెమట్లు సం
సారము సేయుచుం బతి బ్రసన్నమనస్కుఁడుగామి వేదనా
భారమునం గలంగుచు దివంబులు పుచ్చుచునుండి నీర మా
హారము మానియుంట సగమయ్యె విషజ్వర మంటె నంతటన్

మ. జ్వరబాధ న్విరిమేనిసోయగము తప్తంబయ్యెనేగాని, సుం
దరిడెందంబునఁ బాదుకొన్న భగవత్కైంకర్యసంపత్తి సొం
పు రవంతేనియు లూనమైచనదు, వమ్ముం జెంద దాత్మేశభా
సురపూజాపరతంత్రభావమని మెచ్చుం గామినీకాండముల్

కం. అటఁ గొన్నాళ్లకు బంభర
కుటిలాలక మిత్తివాతకుం దొలఁగి పరి
స్ఫుటితారోగ్యము నందెం
బటు వేదన లనుభవింపవలె ముం దనుచున్

ఆ.వె. జబ్బువడ్డనోటి  చవ్వందనముద్రోసి
యింపుఁ గూర్పు కూర యింటలేమి
కఠినరోగబాధకన్న నన్నులమిన్న
భావమందుఁ గుమిలి పరితపించె

శా. సారశ్రీ ననలెత్తి గుత్తిగొను పూజాపుణ్యము ల్పండి చె
న్నారంబోలును భద్రలక్షణముహూర్తారంభ వేళన్ మృడా
నీరామాసకటాక్షవీక్షణ సమున్మేషంబున న్సారదా
సారంగేక్షణ దాల్చె గర్భము సతీ సంతోష సందర్భమున్

కం. ఇరుమూడునెలలు పైకొన
గరియానకు మన్ను మెసవగా మందముగా
దిరుగంగా పుల్లని గర
గరగల పచ్చళ్లు నంజగా మనసయ్యెన్

ఉ. ఇల్లను మాటమాని హృదయేశుఁడు కార్యనెపంబుమీద నే
పల్లియకో ప్రయాణమయివాసిచనం దిన బువ్వలేక వే
విళ్ళ దలంగుచుండి విలపింపదు లోకము విన్న మెల్లగా
నల్లరిచేయునంచు, సతులబ్బిన భర్తలు ధన్యులేకదా?

ఉ. వారమునాఁడు చుక్కతెగి పడ్డవిధంబున నిల్లుచేరి యా
నారి జలం బొసంగఁ జనినం, గనులెఱ్ఱనజేసిఁ యోసి! నీ
వారికి నుత్తరంబులను వ్రాసిన నెత్తురుఁ గండ్లఁజూతు నీ
తీ రొకవింతగావొడము దృష్టి కదేమని కొట్టుఁ దిట్టుచున్

కం. నీదేహ మేల చిక్కిన
దీదశ? భోజనము లేదటే? విటచింతా
వేదనచే గాదుగదా?
కాదా నాదయిన గడన కర్చెట్లగునో!

మ. అనినం గన్నుల నీరుగ్రుక్కికొని నాథా! ధర్మమార్గంబుఁద
ప్పని యర్ధశరీర నిట్లనకు మవ్యాజానురాగంబు త్వ
ద్ఘనపాదాంబుజసీమల న్నిలిపి నీకల్యాణముంగోరి పూ
జనము ల్సేయుదు నిష్టదేవతల కశ్రాంతం బనాహారనై

కం. అని కనుగోనల బాష్పాం
బునదులు జనియించి పునుకు పునుకున బ్రవహిం
చిన ననకేలం జినుకుచుఁ
గనికరము సృజించి విభుని గలచుం బెలుచన్

సీ. పొగలేక మండెడు మగనికోపజ్వాల నలఁతి కన్నీటజల్లుల నడంచి
తరుగనివిభుని నిందాబాణములపిండు వినయసాధనముల విఱచివైచి
కడలేనినాథుని కఱకుమాటలదీటు ముద్దుపల్కుల మొక్కవోనఁ గొట్టి
కనరాని ప్రాణకాంతుని సంశయాబ్దంబు నమలచారిత్రవాత్యలనదల్చి

తే.గీ. భర్తగీచినగీటు దప్పక, కడింది
కష్టములకోర్చి పతిపాదకమలసీమ
చిఱుతచూలాలు శారదా చిగురుబోఁడి
కాపురము సేయుచుండె రాగము రహింప.

కం. పడతి నట నునిచి యతఁ డ
క్కడ నిక్కడఁ గొలువువెదుకగా నరిగిన నా
థుఁడు మగిడివచ్చి తన కగు
పడువఱకుం గుడువ దెంత వాత్సల్యంబో

వ. అట్లక్కలికి మనః కాంతుని స్వాంతంబున కావంతయు గటువుసోకనీక నీడవలెంగూడి వాడిపోయిన మగని యనురాగవల్లరిం దన సల్లలితంబులగు వాక్సుధాంబువులం బ్రవర్ధిల్లఁ జేయుచుండ సంసారఛిద్రంబుల కనుంగుచుట్టంబో యన జ్వరపిశాచంబు తిరుగ వేధింప నారంభించిన

చం. జనకుఁడు సొంతగీమునకు సత్వరతం గొనివచ్చి మంచి వై
ద్యుని గుదిరించి యౌషధవిధు ల్పదిలంబుగ నాచరించుచుం
డిన నది యేమిచిత్రమొకొ నిప్పుల కుంపటిగా జ్వరంబు వ్రే
ల్చినయదిగాని తగ్గినది లేదు నిమేష మహర్నిశంబులున్

ఉ. నీడను తోడుజేసికొని నిత్యము కొల్వను బానిసత్వపు
న్వేడినెపంబున న్మలయు వృద్ధుఁడు తజ్జనకుండు నీరముం
గూ డను మాట మాని సుతకుం బరిచర్య లొనర్చె; నింటిలో
జేడియ లేని పూరుషుని జీవితమన్న నిరర్థకంబెకా

కం. తగునుపచారంబులు పె
ల్లుగ నొనరుచు మామపై నలుకవొడమి, జే
రగనీకు నీదు పిత నని
తెగడి, మగం డింతి కానతిం గావించెన్

వ. అటుల నాజ్ఞాపించి కొండొకగీమున నుంచిన నోర్చికొని జ్వరపీడితయగుచు నలజడి వడుచుండ జనకుండును జామాతం గినియక సమస్తోపచారంబు లొనర్చుచు ధనవ్యయం బునకు జంకక వెజ్జు లడిగినంత దక్కువ సేయక యొసంగి సదౌషధంబుల నిప్పించినఁ గొంతకాలంబునకు రోగంబు నివారించె నంతకు మున్నఁ గార్యార్థియై చనిన జీవితేశుండు రామికిం జింతించుచు జనకుని సద్బోధలం గఱచుచు దన తొలిచూలాలితనంబునకు జంకుచు నుపవాస వ్రతంబు లాచరించుచుండి నెలలు నిండిన

కం. వాడిన పుష్పముగతి నీ
ళ్లాడెడు ప్రొద్దులు సమీపమై తూలెడు పూ
బోడిం గుమారిత న్నడ
యాడగనీకుండ జనకు దరయుచునుండన్

వ. ఒక్క సుముహూర్తంబున

కం. జననీమానసమునఁ బెన
గొనిన విషాదంబడంచు కులుకునగవు మో
మునఁ దొఱకుచుండ నొక చ
క్కని పుత్రుఁడు బుట్టె సోయగముగుమివోలెన్

ఉ. సూనున కుగ్గుబెట్టుకొనుచుం జిగియూయెలనుంచి యల్లనం
గానము సేయుచుం గరయుగంబున దాలిచి ముద్దులాడుచు
న్మానసవీధి నెక్కొనినఁ మన్యువుఁ గొంతయడంచుకొన్నదై
మానిని తంఁడ్రియింటఁ గొని మాసములుండెఁ బ్రమోదచిత్తయై

కం. అట నొక దినమున విభుఁడె
చ్చటినుండియొ వచ్చి, తంఁడ్రిసన్నిధిఁ గడుము
చ్చటమీరనున్న దారం
బుటుకునఁ గొనిపోయె దూరభూమివసింపన్

ఉ. అంతట గుంతకల్లుపురమందుఁ గుమారునిఁ దన్నునుంచి యొ
క్కింత ధనంబు గ్రాసమున కిచ్చి మగండు తొలంగిపోయె బా
లెంతతనంబుపోవని జలేజదళేక్షణ బిడ్డతోడ యే
కాంతముగా వసించ నయిదారు నెల ల్విలసన్మనోధృతిన్

తే.గీ. గ్రాసమున కని తన మనఃకాంతుఁ డిచ్చి
పోయిన ధనంబు వ్యయమయిపోయె నంతఁ
చంటి బిడ్డకు రోగంబు సంభవించెఁ
దనకు క్షయ సోకె భీతి డెందమున దాకె

కం. నిసువునకు రోగమొగి వె
క్కసమయి తన కంటియున్న క్షయ రోగము పె
ల్లెసగుట నేద్చె సతీమణి
పసి కోయిలలీల గుండె పగిలి దిగులునన్

ఉ. మందు నొసంగు వారుఁ దనమాటకు నుత్తరమిచ్చువారు నిం
టం దగువేళ కన్నము నిడంగలవారు జలం బొసంగు వా
రుం దుద కింటఁ దోడుగ బరుండెడు నమ్మలు లేక శారదా
సుందరి బొబ్బవెట్టె; రొదసోకి కఱంగె శిలాసహస్రముల్

వ. మీదనొకనాటి మధ్యాహ్న వేళ,

సీ. కన్నీటివేడిమిం గమలినవదనంబు బెడిదంపు టెండల కుడికిపోవ
మండిన కత్తెరమంటి పెద్దలు సోకి ముద్దుపాదంబులు పొక్కు లెత్త
హద్దుపైకొనిన జాడ్యcపుcదీవరంబునc దరుగక నోట నెత్తురులు గురియ
గాలిసోకినc దూలు కనకవల్లికబోలి యడుగడ్గునకు దేహ మలసిపోవ

తే.గీ. కొంగునెత్తిసె ధరియించి కూర్మిపట్టిc
జంకనిడుకొని దిక్కులు జాలినందc
గామినీత్వంబు గైకొన్న కరుణకరణి
శారదాదేవి యలనల్ల నూరుసొచ్చె

ఉ. వచ్చెడుశారదారమణి వంక యెగాదిగ జూచి యొక్కచం
చచ్చపలాయతాక్షి యెదజాలివహించుచుc జేరబిల్చి "నీ
వెచ్చటి కేగుచుంటి? కులమేమి? సభర్తృకవా? మొగాన మే
ల్లచ్చనము ల్గనంబడు విలాసిని; శాంతిలు" మంచు బల్కుచున్

వ. నిజగృహంబునకుc దోడ్కొనిపోయి యాసనంబునc గూర్చుండ నియమించి నీ చారిత్రంబేమనియోదార్చిన.

కం. విరిదమ్మి కన్నుcగవపై
బిరబిర నీరంబు నిండ వెలది యపుడు బా
వురుమని యేడిచి పలికెం
గొరవంకరొదం మృదూక్తి కుంటువడంగన్

ఉ. ఏనొక దిక్కులేని సతి నీతcడు నాదుకుమారకుండు ము
య్యేనుదినాలుక్రింద రుజ యేర్పడి నేటికి వృద్ధినందె నా
చేనొక కాసులే దనుcగు జీవితనాథుcడు నూరలేడు త
ల్లీ! నిజమాడవే! బ్రదుకునే! కొడు, కేమి యుపాయ మంగనా!

తే.గీ. నాకునాతండ్రియిచ్చిన నాగరంబు
గాక సొమ్ములు లేవు నిక్కము వచింతు
నిది కుదువ యుంచుకొని ధన మిచ్చి తేని
తండ్రి కిప్పించుకొందును తంతివార

కం. అని యాపె పాదముల వె

చ్చని బాష్పాంబువులఁ గడిగి చంటిబుదుత నుం

చిన నాయిల్లా లాత్మం

గనికరము వహించి ప్రాణకాంతుననుజ్ఞన్

వ. ఆ నగం గుదువయుంచుకొని కొంతపైకం బొసంగిన నించుక శాంతించి యానాడె జనకునకుం దంతివార్త ననిచినం జని మనుమనిం గొమారితం గొనివచ్చి గుంటూరునం దనగీమున నుంచి చికిత్సలు సేయుచుండ

ఉ. బాలునిరోగ మించుక నివారణమంది లతాంగి వ్యాధియు

ద్వేలముగా వివృద్ధిఁగని వ్రేల్చుచు నెత్తురుఁగుండ లాదిగా

గూలిచిన న్విచారమునకుం గుఱియై కృశించియున్న యి

ల్లా లపు దూలబెండువలెనై పసఁ తూలదు బుద్ధినైపుణిన్

ఉ. మేను దొఱంగుకాలము సమీపముగాఁ జనుదెంచె నంచుడెం

దాన నెఱింగి భావము ననంతునియందుఁ దొలంగనీక క

న్గోనల కౌతుకభ్రమ లనూనముగా వెదజల్లుచు న్విషా

దానలదగ్ధుఁడౌ జనకునారసి దాఁ జిరునవ్వు రువ్వుచున్

మ. జనకా! నాతనుయాత్ర తీరినది భాస్వన్మంగళస్వర్గభూ

మినిఁ జూడం జనుచున్న దాన ధరణీమిథ్యాసుఖశ్రీలు చెం

దనివంచుం; గను మల్లదే సుమవిమానశ్రేణులం దెచ్చి ర

మ్మనుచున్నారు సురాంగనామణులు నాన్నా! నన్ను బంపింపవే

కం. ననుఁ గన్న తండ్రి యింకొక

మనవిగలా దిఁతడు కూర్మి మనుమఁడు నన్నుం

గనిపెంచినట్లు వీనిం

బెనుపుము నేలేని కొఱంత వెలితిపడంగా

ఉ. నీకు నమర్త్యనాయక వనీవనవీథులనుండి మాలికా
నీకము లంపుచుండెదము నేనునుఁ దల్లియు; నుల్లమందు నీ
వాకులపాటు నందకు; మిహంబు తిరంబని నమ్మబోకు, మా
నాకపురంబు నీకు నొకనాడు నివాస మగుంగదా పితా!

కం. అని పలికి బాష్పకణములు
కనుగొనలం జిమ్మి హాయి గలిగెననుచు స్వ
ర్గనికేతనమున కరిగెం
గొనములగని శారదాంబ గుంటూరుపురిన్

శా. సంతోషింపుము శారదారమణి భాషానాథగీర్వాణ భూ
కాంతానంతవిలాసమందిరముల న్గంగాపగానిర్ఝరీ
కాంతారాంతరవాతపోషిత కుడుంగశ్రేణులం దింక ని
శ్చింతం దల్లిని గూడి నాకజలజాక్షీ సాహచర్యంబులన్

సీ. మహితప్లవంగనామక వత్సరమునందు మార్గశీర్షాంచిత మాసమందు
బహుళాష్టమీ శనివారంబునం దుద్భవంబందె శ్రీశారదాంబరమణి
అనుగుబందుగులకునల్లారు ముద్దుగా బెరిగె పెండిలియాడి వరకుమారు
గని తండ్రికిచ్చి యక్షయవర్ష కార్తీకశుద్ధదశమి(14.11.1926)యందు సూర్యవాస

తే.గీ. రమున ధర నెడబాసి స్వర్గమున కేగె
జనకునకు నాప్తమిత్రులకును తదీయ
జీవనచరిత్ర మొక మహాచిత్రనాట
కమును గావించి యింద్రజాలమును మించి

సీ. ఘనకీర్తియుతుఁడు వేంకటరామధీరుండు ధర నేసతికిఁ దల్లితండ్రియయ్యె
అనఘచరిత్ర దుర్గాంబామహాదేవి తానేచెలికిఁ దల్లితల్లియయ్యె
మహిళాశిరోమణి మహలక్ష్మమాంబ యే తరుణికిఁ దాఁబెద్ద తల్లియయ్యె
కమనీయ గుణశోభి కామేశ్వరీ సాధ్వి తగ నేయమకుఁ గన్నతల్లియయ్యె

తే.గీ. నాసుగుణరాసి శారద యమరపురికి
నరిగెఁ బిన్నలి కూరాడ యన్వయములు
గంద్రపుకొలంబు లలరించి, కన్నతల్లి
జనకుఁ, దనభర్తఁ గన్న వంశంబులగుట

చం. అనయము మేనమామలు గుణాఢ్యులుశ్రీయుతులౌ కుటుంబరా
వును నరసింహరావు విభవోజ్జ్వలుఁ డా నయశాలి నాగభూ
షణమును జేయు మన్ననలఁ జాలగ బేరును పెంపుఁగాంచి యా
గొనములరాసి, శారద వికుంఠముజేరె హరిన్ భజింపఁగన్

blank

# కృతిపతి ప్రశంస

తే.గీ. బ్రహ్మకులమునఁ గల యన్వవాయములను
రాణఁజెన్నారు శ్రీసింగరాట్కులమున
ప్రథితయశుఁడైన మల్లపరాజుగారు
ప్రభవమందెను గొనములు పరిమళింప

కం. ఆరమ్యకీర్తిశాలికిఁ
గోరికలు ఫలింప ముద్దుఁగొమరుఁడు లక్ష్మీ
నారాయణుండు పుట్టెఁ బ
యోరాశికిఁ బూర్ణహిమమయూఖుండుబలెన్

ఉ. తాలిమి మేల్మిసొమ్మయి సదా వదనంబు నలంకరింపఁగా,
నాలుకమీఁద సత్యవచనంబు నివాసముసేయ, దొడ్డయి
ల్లా లగు జ్ఞానమాంబిక ప్రియంబునఁ గొల్వ, సుఖాంబురాశిలోఁ
దేలుచు నాగుణాఢ్యుఁడు ప్రతీతి వహించు సుధీజనంబులన్

కం. నాముద్దులకృతికన్యా!
యీమంగళమూర్తి జీవితేశుఁడుగా, ని
త్యామోదకుసుమవిసరము
మోమున వికసింప నంకమున నుండఁగదే!

మ. అనుకూలుండగు నీమనోహరుని నామాంకంబు దిగ్దేశరా
డ్జనజిహ్వాంచలసీమల న్నిలుపు మాచంద్రార్కమున్ జాటిపో
వని నీజవ్వన మస్మదాంధ్రవిషయ ప్రాగ్దేశదీపంబుగా
మని, భాషాలలితాంగి కూఁతయిడు మమ్మా! కావ్యకన్యామణీ!

జి. జాషువ

# విజ్ఞప్తి

పారసీకకవులలో పిరదౌసి ప్రథమగణ్యుఁడు. గజనీ మామూదు భరతఖండమును పదునెనిమిది మాఱులు పరితపింపఁజేసిన కాలమున నితఁడు షానామా యను గ్రంథము నతని కంకితము చేసెను. "దేశచరిత్రలెన్ని యోయుండ విదేశీయుని చరిత్ర మన కేల" యని కొంద ఱూహింప వచ్చును. ఖండాంతరవాసులైన షేక్స్పియరు, కీట్సు, బైరన్ మొదలయిన కవుల జీవితచరిత్రములు మనకుపఠనీయములగుచుండఁగా కళావీరుఁడగు పిరదౌసికవి చేసిన పాపమేమి? జాతిమతభేదములను పరిగణింపక విశ్వమానవ సోదరత నెఱపు దివ్యపురుష లిక్కవిజీవితము ననాదరింపరని విశ్వసించి నేనీచరిత్రమును పద్యకావ్యముగా రచించితిని.

పారసీకవాఙ్మయమున నితని గ్రంథమున కగ్రస్థాన మీయఁబడినది. ఇక్కవి షానామాగ్రంథమున నమృతమయము లయిన యఱువది వేల పద్యములను చిత్రించినాఁడు. భారతీయులకు భారతగ్రంథముపైఁ గల భక్తి గౌరవములు పారసీకుల కితని గ్రంథముపైఁ గలవు. ఇతని కలమున నమృత బిందువులు కలవు గాని, దురదృష్టదేవత తాండవించినది. నే నీతని చరిత్రము నయిదేండ్లక్రిందట నొకానొక మాసపత్రికయందు చదివి స్తంభించి పోయితిని. నాఁటనుండియు నే నిక్కథ నొక చిన్నిప్రబంధరూపమున వెలువరింపఁ దలఁచియుంటిని. నాకోర్కి నేఁటి కీడేరినది. కథ కేవలము చిన్నదగుట, కవి గ్రంథరచనమునకుఁ బూనుకొన్న కాలమున నుత్తరకథా సూచకముగా నొకదివ్య స్త్రీదర్శనమును, అటవీమధ్యమున నిషాదసమావేశమును, మఱికొన్ని చిన్ని మార్పులను గల్పించితిని. రెండుమూఁడుచోట్ల నా కీతని చరిత్ర చూడ తటస్థించినది. కాని మొదట నేను చూచిన కథకును తరువాత చూచిన దానికి విశేషభేదము గోచరించినది. పారసీక పండితులు రచన కనుకూలముగా నేను చేసిన మార్పులను మన్నింతురు గాక! మరియు, పిరదౌసి గజనీ విడిచి పాఱిపోవునప్పుడు వర్ణింపఁబడిన కీకారణ్యములు, సింహము, పులి మొదలగు జంతుసముదాయము దేశనైసర్గికస్థితి స్వభావములకు విపరీతములుగా నున్నను, అవి యతని వ్యథా నిరూపణార్థ కల్పితములుగా పరిగణించి సహృదయులు నా సాహసమును క్షమింపఁ బ్రార్థితులు.

నే నీగ్రంథమును బందరు తాలూకా నందిగామ గ్రామవాస్తవ్యులును, సంపన్నులును నగు శ్రీ సింగరాజు లక్ష్మీనారాయణగారికి అంకిత మిచ్చితిని. గ్రంథము నామూలాగ్రముగా విని సంతసించి, అది తమతండ్రిగారి కంకిత మిమ్మని కోరి నాకు ప్రోత్సాహ మిచ్చి ముద్రణ వ్యయము నొసంగిన మా పాఠశాల ప్రధానోపాధ్యాయులయిన మహారాజశ్రీ సింగరాజు మల్లప రాజారావు గారికి కృతజ్ఞతాపూర్వక వందనసహస్రముల నర్పించుచున్నాను.

# కథాసంగ్రహము

ఒకనాఁడు గజనీ మామూదు నిండుకొలువుండి, పారసీకకవులలోఁ బ్రథమగణ్యుం డనఁబరఁగు పిరదౌసి కవిని రావించి షానామా యను గ్రంథమును (రాజ చరిత్ర) రచించి తన కంకితము చేసినచోఁ బద్యమున కొక్క దీనారము (బంగారునాణెము) నొసంగెదనని వాగ్దానము చేసె. అంత నక్కవి సమ్మతించి గ్రంథరచనమున కుద్యమించి, ముప్పది సంవత్సరములు శ్రమపడి యఱువది వేల పద్యములు వ్రాసి ముగించి, రాజసభా మధ్యమునఁ బఠించి, సకలకవి పండిత జేగీయమానమయిన తనకవితానైపుణ్యమును బ్రకటించి గ్రంథమును ఱేని కర్పించి స్వగృహమునకుఁ బోయె. అనంతరము రాజుగా రేకారణముననో బంగారమునకు మారు వెండినాణెములను బుత్తెంచిరి. చిరకాల సంవర్ధమానంబగు నాశాగేహంబు విచ్ఛిన్నంబగుటఁ గవివరుం డెంతయు వగచి, రాజును నిందించుచుఁ గొన్ని పద్యములను వ్రాసి పంపె.

అంత భూభర్త యాగ్రహించి కవినిఁ బట్టి చంపుఁ డని భటుల కాజ్ఞసేయ పిరదౌసి సతీసుతాసమేతుఁడై గజనీ విడిచి స్వగ్రామమయిన తూసుపట్టణముఁ జేరి తల దాఁచుకొన నిశ్చయించి, బహుప్రయాసతో నరణ్యములు నిర్గమించి కతిపయవాసరంబులకు పారసీకము చేరి నివసించుచుండె. కవిహననోద్యుక్తుఁడయిన మహమ్మదు సామంతరాజులు సేయుహితో పదేశమున శాంతి వహించి, కవిఋణము దీర్చుకొనఁదలఁచి, యొకనాఁడఱువదివేల దీన్నారము (బంగారునాణెము)లుష్ట్రములపై నిడి వీర భటుల కర్పించి కవి కొసంగుఁడని పనిచె. కాని ప్రయోజన మేమి? ధనము తూసుపట్టణము తూర్పుగవిని ప్రవేశించెను, కవిశవము పడమటిగవిని నుండి ప్రేత భూమికిఁగొంపోఁబడెను.

అంత రాజభటులు హేమరాశిని కవి యిల్లు సేర్చి పిరదౌసి కుమార్తెను పరిగ్రహింపుమని ప్రార్థింప, "నాతండ్రిని నిరంతరము దుఃఖపెట్టిన నీచమైన ధనమును నేను ముట్టను" అని యామె నిరాకరించె. ఈఘోరవార్తను విని మహమ్మదుగా రెంతయుఁ జింతించి, యేతద్ధనముతో తూసుపట్టణమున పిరదౌసిపేర నొకసత్రశాలఁ గట్టించెను. దానిచిహ్నములు నేఁడును గలవు. కాని యిందొకరికి కీర్తి, యొకరికపకీర్తియుఁ దక్కినది. ఇద్దఱును గాలగర్భమునఁ గలసిపోయిరి. తారతమ్యము లింతియ.

# పిరదౌసి

ప్రథమాశ్వాసము.

చం. మును గజనీమహమ్మదుఁ డభూతపరాక్రమశాలి, వీరవా
హినులబలంబుతోఁ బదియు నెన్మిదిమాఱులు కత్తిదూసి, చి
క్కనిరుధిరంబులో భరతఖండము నార్ద్ర మొనర్చి, సోమనా
థునిఁ బెకలించి, కైకొనియెఁ దొమ్మిదివన్నెల రత్నరాసులన్

సీ. బంగరునాణెముల్ బస్తాల కెత్తించి మదపుటేన్గులమీఁదఁ బదిలపఱచి
లేఁతపచ్చల నేరి గోతాలఁ గుట్టించి లొట్టిపిట్టలమీఁద దిట్టపఱచి
కురువిందమణులను కుంచాలఁ గొలిపించి పరువుటెద్దులబండ్లపై నమర్చి
మొలకవజ్రముల జాలెలఁబోసి కూర్పించి గుఱ్ఱాలమూఁపులఁ గుస్తరించి

తే.గీ. పదియు నెనిమిదివిజయరంభల వరించి
గాంగజలమున నెత్తుటికత్తి గడిగి
సర్వము హరించి హిందుదేశంబు విడిచి
గజనిమామూదు గజనీకిఁ గదలిపోయె

మ. కులుకుం బూఁతపసిండికుడ్యములపైఁ గుట్టాణిముత్యాలుఁ బ
చ్చలుఁ జెక్కించి, చిరత్నరత్నఖచిత స్తంభంబు లెత్తించి, మే
డలు గట్టించి, మసీదుల న్నిలిపి, తుష్టస్వాంతుఁడై, పెంపునం
గొలువయ్యెన్ దనసింహపీఠిక ననుంగుం బత్ను లుప్పొంగఁగన్

తే.గీ. భారతక్షోణిఁ గల్గు దేవస్థలములు
చెదరి గజనీపురాన మసీదు లయ్యె;
నిప్పటిమసీదు లేరూప మెత్తఁగలవొ
కాల మెఱుఁగును, ధారుణీగర్భ మెఱుఁగు

తే.గీ. హిందువుల దోర్బలము నాశ్రయించి బ్రదుకు
ద్రవ్యసంపద, తురకభూధవునిఁ జేరి
కాఁపురం బుండె నతనిఖడ్గమును వలచి
సిరి నిజంబుగ వట్టి టక్కరిది సుమ్ము

తే.గీ. ఎందుఁ జూచినఁ దనకత్తి కెదురు లేక
కోరినంతధనమునకుఁ గొదవ లేక
దాయబలఁగంబులను గన్ను మూయనీక
యేలుబడి రాజ్యమునఁ జలాయించుచుండె

తే.గీ. నగరిమొగసాల నుండు గంధద్విపంబు
దంతములమీఁద వ్రాయించెఁ దనచరిత్ర
దనరు దిగ్దంతుల పదాఖుదంతములకుఁ
గలుపుకొనఁబోలు విజయసంగ్రామసంఖ్య

కం. ఒక్కొక్క వీరభటునకు
నిక్కం బగు నతని యుద్ధనిపుణత్వంబున్
జెక్కించి యిచ్చె నీలపు
టక్కరములతోడ బిరుదుటడిదంబులపై

కం. వడి గలసేనాపతులను
కడానిసాలువులతోడఁ గంకణములతో
గడియింపరాని పచ్చల
పిడికిళ్ల బహూకరించె విద్వత్సభలన్

మ. తనకావించిన యుద్ధయాత్రల కమర్త్యత్వంబు గల్పింపఁ గో
రినవాఁడై యల పారసీక సుకవిశ్రేణీశిరోభూషణం
బనఘుండౌ పిరదౌసినామకవి నాహ్వానించి యొడ్డోలగం
బున నుద్గ్రంథముసేఁత కై యొసఁగెఁ గర్పూరంపుఁ దాంబూలమున్

ఉ. ఓ కవివర్య! నీసుకవితోజ్జ్వలవాఙ్మయపుణ్యభూమిలో
నాకుఁ గృతిప్రధానసదనంబు రచింపుము శాశ్వతంబుగన్
మాకులభూషణంబులగు మానవనాథులఁ గావ్యదేహ ది
వ్యాకృతులం బొనర్పుము చిరాయురుపేతులఁ జేయు మిద్ధరన్

ఆ.వె. కవినిఁ గన్న తల్లిగర్భంబు ధన్యంబు
కృతినిఁ జెందువాఁడు మృతుఁడు గాఁడు,
పెరుఁగుఁ దోఁటకూర విఖ్యాతపురుషులు
కవిని వ్యర్థజీవిఁగాఁ దలంత్రు

ఆ.వె. తమ్మిచూలి కేలుఁదమ్మినిఁ గలనేర్పు
కవికలంబునందుఁ గలదు గాన
నీశ్వరత్వ మతనికే చలామణి యయ్యెఁ;
నిక్కువముగఁ బూజనీయుఁ డతఁడు

తే.గీ. క్షణము గడచిన దాని వెన్కకు మఱల్ప
సాధ్యమే మానవున కిలాచక్రమందు?
దాఁటిపోయిన యుగములనాఁటిచరిత
మరలఁ బుట్టింపఁ గవియ సమర్థుఁ డగును

కం. ఒక్కొక్క పద్దియంబున
కొక్కొకబంగారురూక యొసఁగెదను కవీ!
మక్కామసీదుతో డని
వక్కాణించెన్ మహాసభామధ్యమునన్

తే.గీ. మానవేంద్రుని సత్యవాగ్దానమునకు
హృదయగోచర మగుచు వర్ణింప రాని
యద్భుతావేశ మంగంబు నాక్రమించె
స్వాంతమునఁ దోఁచె నూత్న నిసర్గకవిత

సీ. పారసీకగ్రంథభండారముల నెల్లఁ గదలించి తీయనిపదము లేటి
వ్యంగ్యవాచ్యార్థమహాంభోనిధానంబుఁ దరిచి ముత్యములు రత్నములుఁ గూర్చి
లలితంబు లైన యలంకారముల నెల్లఁ బొరలించి మేలైన సరకు లెత్తి
దిరిసెనపుంబూవుకరణి ముద్దులు గారు శయ్యావిలాసంబు సంతరించి

తే.గీ. శాసనము లన్ని పరికించి సకలరాజ
?
చరితలందింత సత్యంబు జాఱనీక
ఆర్యసన్నుత షాహనామాభిధాన
భాసుర గ్రంథరచన కుపక్రమించె

తే.గీ. వానిడెందంబు సోఁకిపోవని తలఁపులు
వానికనుసన్నఁ దలలు వంపని యుపమలు
వానికలమునఁ గులుకుఁ జూపని పదములు
మందునకు లేవు నాటి వాఙ్మయమునందు

తే.గీ. వసుధ శాసింపఁగల సార్వభౌముఁ డగును
ధీరుఁ డగు, భిక్షకుం డగు, దీనుఁ డగును
దుఃఖితుం డగు నిత్యసంతోషి యగును
సత్కవి ధరింపరాని వేషములుఁ గలవె?

చం. తెలుఁగుఁగవిత్వపుంజిగి, విదేశపుఁగైతలచెన్ను, ద్రావిడే
యుల కవనంబులోని పసయుం బొసఁగన్ రచియించుచుండెఁ గే
వలరసబంధురం బగు ప్రబంధము, సర్వపదార్థధర్మముల్
దెలియఁ దదంతరాంతరవిలీనతఁ గొండొకపిచ్చివానిగన్

తే.గీ. అంత నొకనాఁటిరాత్రి నిజాలయమునఁ
బుష్పశయ్యను బవళించి ముమ్మరముగ
ముసరుకొనివచ్చు తలఁపుగుంపులను, రసముఁ
బొందుచేయుచుఁ గన్నులు మోడ్చియుండ

శా. ఆకాలంబునఁ బారసీకసతులందాకారరేఖాగుణ
శ్రీకిం బట్టపురాణియైన యొక రాజీవాక్షి యేతెంచి నా
యాకూతంబు ఫలించునే? కవివరేణ్యా! నీకు నా రూప మం
గీకారం బగునే! యటం చడుగసాగెం బ్రౌఢవాగ్వైఖరిన్

చం. చెలువము సౌరభంబు వెదచిమ్మెడు లేఁతగులాబిమొగ్గకున్
దుల యగు నాదుజవ్వనము దోసిటఁ బట్టి భవత్పదాంబుజం
బులకడ నిల్చితిం బ్రణయపూజకు వేళ యతిక్రమించె నీ
కులసతి నయ్యెదం గవితకున్ జిరకాలము తల్లి నయ్యెదన్

ఆ.వె. ముద్దరాల, నంతిపురుల నుండెడిదానఁ
దెగువఁ బూని, సిగ్గుతెరలు చీల్చి
బయలువడిన నాదు పావనస్నేహంబుఁ
జెప్ప నేల పారసీకకవికి?

మ. తను వెల్లన్ బులకింపఁ జిత్తమున నుత్సాహంబు రెట్టింప, నం
గన కెంగేలు గ్రహించి, ప్రేమరసదిగ్ధం బైన వాల్చూపునన్
గని యాశ్లేష మొనర్చినన్ గఱకుబాణం బొందు డెందాన గ్రు
చ్చినయట్లయ్యె; నతండు త్రుళ్లిపడి లేచెం గంపితాంగంబునన్

ఆ.వె. హృద్యకావ్యరచన నేకాగ్రత వహించి,
కళవళంబు లేని కవిమనస్సు
గాలి కెదురు గట్టు కాచగోళం బయ్యె,
గండుచేఁప దాఁకు కమలమయ్యె

తే.గీ. నరుని సుఖదుఃఖములముందు నడచి వచ్చు
నీడలే స్వప్నములుసుమ్ము నిశ్చయముగ
కాలచక్రంబు గంభీరగమనమందు
దాఁగికొని యెన్ని యెన్ని చిత్రములు గలవొ?

మ. అతఁ డారాతిరి కన్ను మూయక తదీయ స్వప్నవృత్తాంత మ
ద్భుత మైనన్ దలపోయుచుండె, నపు డంభోజాప్తుఁడున్ దూర్పుఁగొం
డతలన్ గుంకుమ చల్లెఁ బశ్చిమగిరిన్ భస్మచ్ఛవిన్ జంద్రుఁడున్
మృతుఁ డై వ్రాలె నభస్సునం దణఁగిపోయెం దారకాగోళముల్

మ. క్రమ మొప్పన్ సులతానుమేడల నగారా మ్రోసె, నాహూతనా
దముల న్నిండె మసీదు, లక్షనులస్కంధావారమం దాట గు
ఱ్ఱము కెంజూలు విదల్చి హేష లిడెఁ, బిర్దౌసీ కవీంద్రుండుఁ గా
ల్యములన్ దీర్చి వసించె నింటిమొగసాలన్ మేలిపీఠంబునన్

చం. అపు డొకపారసీకుఁడు రయంబున వచ్చి సలాము చేసి తొ
ట్రుపడునెలుంగుతోఁ గవివరు ల్దయసేయుఁడు తత్ క్షణంబ మీ
విపులసుఖైకసౌధము గుభిల్లునఁ గూలిన దమ్మగారు వ్రా
సి పనిపిరంచు నిచ్చెఁ దన చే నొక యుత్తరము న్వినమ్రుఁడై

ఆ.వె. వత్సరత్రయంబు వయసువచ్చినముద్దు
కాలుసేతు లుండి కదలుముద్దు
పుత్రనామకమున మొదటఁ బుట్టిన ముద్దు
మానసీయ యింక మనకు లేదు

కం. అని తన భార్యామణి వ్రా
సిన కమ్మఁ బఠించి సుకవిశేఖరుఁ డపుడే
తనతూసునగరమునకుఁ బ
యనమయ్యె నయోమయవ్యధాకులితమతిన్

కం. కొడుకునెంజిలి హృదయంబుఁ గోయుచుండ
నన్న పానీయములు ముట్టఁడయ్యె నతఁడు,
కాలపురుషుండు దినదినాకారుఁ డగుచు
భావుకునిలీల నోదార్చి పోవుచుండె

శా. రెండేఁడు ల్సనినంతఁ జక్కనికుమార్తెన్ గాంచి సానందుఁడై
గండూషించె మనోవిచారము నలంకారంబులున్ జిన్నెలు
న్నిండం గావ్యము వ్రాయఁజొచ్చె మరల న్నిద్రాసుఖత్యాగియై
పండాకుంబలె నయ్యెఁ "బాపము" తనూప్రాబల్యరక్తచ్యుతిన్

సీ. ముదురుకోయిల కంఠమున నివాసముసేయు కొసరింపుఁ గూఁతల గుట్టు దెలిసి
ప్రతిపుష్పగంధగర్భముఁ జీల్చికొని వచ్చు పిల్లగాడ్పుల జన్మవృత్త మరసి
మేఘంబుతెరచాటు మెఱపుబోగముసాని మోసగింపుల యర్థమును గ్రహించి
శరధినాయకుని క్రొన్నురువు పిల్లల తీఱుబడిలేని యాటల భావమెఱిఁగి

తే.గీ. ముగ్ధమోహనసౌందర్య పూర్ణమైన
ప్రకృతిరమతోడ స్నేహభావమున మెలఁగి
ముప్పదేఁడులు సర్వాంగపుష్టి మెఱయఁ
గబ్బము రచించె పిర్దౌసి కవివరుండు

చం. కృతి ముగియించి యష్టనుమహీపతిదర్శన మాచరించి సం
గతి వివరించినన్ నృపతి గడ్డము దువ్వుచు మందహాస వా
సితముఖుఁడై "భళీ, సుకవి శేఖర! యెల్లి సభాంతరస్థపం
డితులసమక్షమందునఁ బఠింపుము ర"మ్మని పంపె నాతనిన్

మ. అనుమానం బిసుమంత లేని హృదయుండై పెద్దయంభోధి నీఁ
దినవానింబలె, హేమసమ్మిళిత కీర్తిన్ గాంచు కౌతూహలం
బున, లజ్జావతియై స్వయంవరసభాభూమిం బ్రవేశించు ము
గ్ధను బోల్గ్రంథముఁ జంకఁబెట్టుకొని యాస్థానంబు డాయం జనెన్

ఉ. మేలిమి వీడకుండు కరిమ్రింగి వెలార్చిన వెల్గపండులన్
బోలి నృపావలంబమున బొజ్జలుపెంచిన పెద్దపెద్ద దా
ఢీల తురుష్కపండితుల ఠీవికిఁ దావలమైన కొల్వు గ
ర్వాలస దృక్కులం గనుచు నాతఁడు చొచ్చెఁ దదంతరాళమున్

కం. ఎలనవ్వు నెమ్మొగంబున
గులుకం గృతినందు పెండ్లికొడు కష్టనుభూ
తలనాథుఁ డపుడు కౌతూ
హలియై చనుదెంచి గద్దియను వసియించెన్

ఉ. ఆనతి నంది సొంపు తడియారని షష్టిసహస్రపద్యసం
ధానితమైన గ్రంథము ముదంబున విచ్చి పఠింప సాగె సు
ల్తానుల రాజ్యపాలన విధానము తంత్రి సబక్తజీను ము
స్నీనిన లేటికొమ్మఁ దనియించుట లాది గలట్టి ఘట్టముల్

సీ. కంపంబు గదుర చెంగట నిల్పు నొకసారి యుక్కుపుప్పొడిరాలు యుద్ధభూమి
పులక లుప్పొంగఁ గన్నులఁ గట్టు నొకసారి చెడుగురాజుల యేలుబడులబొమ్మ
ఆనంద మొదవఁ బ్రత్యక్షించు నొకసారి మగువల కడకంటి మంత్రశక్తి
దయ నిండిపారఁ బ్రదర్శించు నొకసారి బక్కచిక్కిన పేదవాని బ్రతుకు

తే.గీ. సున్నితంబైన కవిమనస్సున వసించు
కల్పనాశక్తి బహువిధగతుల మెఱయ
పాదుషాతోడ నతని దర్బారుసీమ
నంచితానందజలనిధి ముంచి తేల్చె

కం. పదములపొందిక గుఱ్ఱపుఁ
గదనున కెనవచ్చు పద్యగమనము రససం
పదయును స్వభావశబలత
కదలించె సభాంతరాళ కవులమనంబుల్

కం. అరమోడ్పుఁగనులు పులకిత
శరీరములు పొందుపఱచి సత్కవివరుఁ డా
తురకలదొర కొలువును కి
క్కురుమననీ కెలమి నేలుకొన మొదలిడియెన్

ఉ. ఆ సులతానునోలగమునట్టు లొకానొక రాజరీవి ము
మ్మాసము లేలి గ్రంథము సమాప్తముఁజేసి యొసంగిపోయె పి
ర్దౌసి నిజాలయంబునకుఁ దత్ఫలితంబుగ వెండినాణెముల్
బాసదొలంగి పంపె నరపాలుఁడు పండితు లేమి చెప్పిరో?

శా. ఎన్నోకొండలు గుండెలోఁ గరఁగిపోయెన్ వార్ధిసంతానముల్
గన్నీరయ్యె సమస్తలోకము నిరాకారస్థితిం బొల్చె ను
త్పన్నంబయ్యె విషాదమేఘపటల ధ్వాంతౌఘ మాశాలత
ల్పున్నాలయ్యె నగాధకూపజలరాసుల్ దోఁచె పిర్దౌసికిన్

తే.గీ. ధనము మరలించి, మానవేంద్రునకు బంపి
పొరలుకొని వచ్చు దుఃఖంపుఁ దెరలనడుమ
నాకృతి వహించియున్ననిరాశవంటి
యుత్తరము వ్రాసె నిందాసహోక్తికముగ

శా. ఓ సుల్తాను మహమ్మదూ! కృతకవిద్యుద్దీపముల్ నమ్మి యా
శాసౌధంబును గట్టికొంటి నది నిస్సారంపుటాకాశమై
నా సర్వస్వము దొంగిలించి నరకానం గూలిపోయెన్ వృథా
యాసప్రాప్తిగ నిల్చినాఁడ నొక దుఃఖాక్రాంతలోకంబునన్

ఉ. పూని కరాసికి న్మనుజభుక్తి యొసంగెడు ఱాతిగుండె సు
ల్తానుల కస్మదీయ కవితాసుధఁ జిందినపాతకంబు నా
పై నటనం బొనర్చినది వాస్తవ మిట్టి స్వయంకృతైక దో
షానలదగ్ధమై చనిన యర్థము నాకు లభింపఁబోవునే

ఉ. ఇంక విషాదగీతములకే మిగిలెన్ రసహీనమై మషీ
పంకము నాకలమ్మున నభాగ్యుఁడ నైతి వయఃపటుత్వమున్
గ్రుంకె శరీరమం దలముకొన్నది వార్ధకభూత మీ నిరా
శాంకిత భాష్పము ల్ఫలములైనవి ముప్పదియేండ్ల సేవకున్

ఉ. ఒక్కొకపద్దియంబునకు నొక్కొకనెత్తురుబొట్టు మేనిలోఁ
దక్కువగా రచించి వృథాశ్రమ మయ్యెఁ గులీనుఁడైన రా
జిక్కరణిన్ మృష ల్పలుకునే? కవితాఋణ మీయకుండునే
నిక్క మెఱుంగనైతి గజనీసులతాను మహమ్మదగ్రణీ

శా. అల్లా తోడని పల్కి నా పసిఁడి కావ్యద్రవ్యము న్వెండితో
జెల్లింపం దొరకొన్న టక్కరివి; నీచేఁ బూజితుండైనచో
నల్లాకు న్సుఖమే? మహమ్మదునృపాలా, సత్యవాక్యం బెవం
డుల్లంఘింపఁడొ వాఁడెపో నరుఁడు, ధన్యుం డిద్ధరామండలిన్

ఉ. హాయిగ నీయశస్సు వెలయంగల చక్కని మేడ గట్టి దీ
ర్ఘాయువుఁ బోసినాఁడను త్వదన్వయవల్లికి; వట్టిచేతులన్
బోయెద నంధకారమున ముగ్గి సుఖంబులఁ ద్రొద్దుగ్రుంకె రా
జా, యిఁకఁ దాండవించెద భయంకరఖేదతమాలవాటికన్

చం. చిరముగ బానిసీని నభిషేక మొనర్చితి మల్లెపూవు ట
త్తరు లొలికించి, మాయజలతారున రాదుగదా పసిండి, యో
కఱకుతురుష్కభూపతి, యఖండమహీవలయంబునందు నా
శిరమునఁ బోసికొంటిని నశింపని దుఃఖపు టగ్నిఖండముల్

చం. అలసట దీర్చుకొందును మహమ్మదురాజులతో సమాధి శ
య్యలపయి ముప్పదేఁడుల ప్రయాసకు డెందము గందిపోయె ని
ర్మలమగు చిత్తశాంతి కిఁక మార్గములే దెనలేని పండు వె
న్నెల గురియించు నాకవిత నీకు లభించె నసత్యవాదికిన్

మ. కనులన్ గెంపు నటింప మైమఱపు హుక్కా ద్రావు సుల్తాను లే
ఖను వాల్చూపులతోఁ బఠించుకొని యాకంఠంబుగాఁ గ్రోధ మె
క్కిన వ్రేటుంగొను కోడెపెద్దపులిమాడ్కిన్ లేచి సేనాపతిన్
గని పిర్దౌసినిఁ బట్టి చంపుఁ డని యాజ్ఞాపించె నుద్దండతన్

ఉ. అక్కట పండువంటిమరియాదకు నెక్కిన మీకులీనతన్
దక్కువచేసి వ్రాసినవిధంబునఁ బద్దియముల్ ధ్వనించెడిన్
చక్కనిమల్లికాసుమమునన్ జరియించి మదద్విరేఫముల్
తెక్కలురాచి యందు సవరింపఁగఁ జాలునె నీలివన్నెలన్?

చం. నరపతి ప్రేమతో నొక తృణంబొ పణంబొ యొసంగె దానితోఁ
గరము వహింప కిక్కరణిఁగాఱులు కూయునె పారసీకుఁ డె
వ్వరు రచియింపలే రితని పాటికవిత్వ? మటంచుఁ బల్కఁ జొ
చ్చిరి సభలోన నిచ్చకపు జీతము లందెడుపండితబ్రువుల్

ఉ. పాపము పండెనో కవిని బట్టి వధింపఁ దలంచినాఁడు భూ
మీపతి బాసఁ దప్పి యుపమింపఁగరాని కృతఘ్నుఁ డౌర! యా
శోపహతి న్గరం బుడుకుచున్న కవీంద్రుని వేఁడి రక్తధా
రాపతనం బమంగళకరం బనుచుండిరి ధర్మతత్పరుల్

తే.గీ. రాజుతలమీఁద కవి కప్పురంబు చల్లె
సుకవితలమీఁద రాజు నిప్పుకలు విసరె
కొంద ఱేపుణ్యమో చేరుకొనియె ననిరి
కొంద ఱేపాపమో పట్టి కుడిపె ననిరి

కం. సరసకవిరాజపూజా
పరతంత్రుం డొకఁడు మిగుల వ్యాకులపడి యా
పిరదౌసికడకు వేగమ
యరిగి మహమ్మదునికఱకు టానతి వినిచెన్

చం. అరువదివేల దిన్వరము లస్త్రములై తుద కిట్లు కుత్తుకన్
దఱుగుట కుద్యమించిన విధానము సర్వము నాలకింపఁగా
పిరదవుసీ ముఖాబ్జమునఁ బిన్ననిన వ్వదయించె మింట నీ
శ్వరుఁడు కలండొ లేఁడొ! యను సంశయము న్దళుకొత్తె నెమ్మదిన్

చం. కృతి యొకబెబ్బులింబలె శరీరపటుత్వము నాహరింప, శే
షితమగునస్థిపంజరము జీవలవంబున నూఁగులాడఁగా,
బ్రతికియుఁ జచ్చియున్న ముదివగ్గు మహమ్మదుగారి ఖడ్గదే
వతకు రుచించునా? పరిభవవ్యథ యింతట నంతరించునా?

తే.గీ. ముత్యముల కిక్కయైన సముద్రమునను
బెక్కుమాఱులు మున్కలు వేసినాఁడ
భాగ్యహీనుఁడ ముత్యమ్ము వడయనయితి
వనధి నను మ్రింగ నోరు విచ్చినది తుదకు

తే.గీ. అనుచు విలిఖించె నొకపద్దియము మసీదు
గోడపయి నమ్మహాకవికుంజరుండు
వేగుఁబోక నమాజు గావింప వచ్చి
చదువుభక్తుల నెమ్మేను జలదరింప

# పిరదౌసి

## ద్వితీయాశ్వాసము

మ. ఇనబింబంబు గతించెఁ బ్రాఁతవడిపోయె న్నింగియు న్నేల, పొం
చిన క్రొంజీఁకటు లఱ్ఱుసాఁచి వెలిఁగించెన్ దారకాదీపముల్
మన దౌర్భాగ్యకవీశ్వరుం డపు డవేలంబైన నైరాశ్యమున్
వనితారత్నము వెంబడింపఁ బయనింపన్ జొచ్చె నుగ్రాటవిన్

మ. జలదంబు ల్నలుపెక్కి యాకసమునన్ సంచారముం జేసె భూ
లలనారత్నము స్నానమాడునని వేళాఘంటికల్ మ్రోసెఁ, గ్రొం
జలిగాడ్పుల్ చెలరేఁగి దేహముల నంటన్ గూండ్లలోఁ బండి కూ
నలపై ఱెక్కలు గప్పి కన్నుమలిపెన్, నానాశకుంతచ్ఛటల్

మ. తనకల్యాణియుఁ గూఁతురున్ జటుల కాంతారంబులం బాదచా
రిణులై వచ్చుట చూడఁజాలక కవి శ్రేష్ఠుండు వర్షించు వె
చ్చని కన్నీటికిఁ గారణంబగు మహీశమ్మన్యునిం బండ్లు నూ
ఱిన యట్లంబరవీధియం దుఱిమి యార్చెన్ గర్భిణీమేఘముల్

సీ. చిటిపొటిచినుకులు చిలుకరించెనుగాని కుంభవర్షంబును గురియ లేదు
ఉఱుములఁ బలుమాఱు హుంకరించెను గాని పిడుగుకైదువుల గుప్పింపలేదు
కడలేనిమెఱుపుతీఁగలు పెంచుకొనుఁగాని నేత్రావరోధంబు నెఱపలేదు
చలిగాడ్పుమొలకల వెలువరించెనుగాని కసరి యీదరగాలి విసరలేదు

తే.గీ. అతిరయంబున గగనంబు నాక్రమించి
బలిసి గద్దించి యటునిటుఁ బరువులెత్తి
తెలివి సెడి క్రమక్రమముగాఁ దేలిపోయెఁ
గవికుటుంబినిఁ గరుణించి కాఱుమొయిలు

చం. పకపకనవ్వుచు న్నభము పట్టునఁ దోఁచె ననంతకోటితా
రక లది యర్ధరాత్రము కరంబున బెబ్బులి వేఁట మాని కూ
రికి గుఱువెట్టుచుండెఁ బొదరిండ్లఁ బరుండి తమాలపల్లవ
ప్రకరము లంధకారమును రాజ్యము సేయఁదొడంగె సఖ్యతన్

తే.గీ. ఆ నడికిరేయి భీకరకాననమునఁ
బయన మొనరించు కవికుటుంబంబు నరసి
తారకాదివ్యనేత్రపద్మములు విచ్చి
కాచి రక్షించుచుండె జగద్గురుండు.

ఉ. వాఁగుల వంకలన్ గిరుల వన్యమృగంబుల సూదిఱాలయం
దాగహనోగ్రభూములు నిజాంగనతో గమియించి పూర్వది
గ్భాగము తెల్లనై మలయ వాయువు లల్లన వీవ నొందుచో
నాఁగి, భజింపఁ జొచ్చెఁ బరమాత్ముని మోహనపద్యపంక్తులన్

సీ. విత్తనంబున మహావృక్షంబు నిమిడించి సృష్టించి గారడీ సేయువాఁడఁ
కడుపులో శిశువును గల్పించి పదినెలల్ మోయించి యూపిరి వోయువాఁడ,
సద్భక్తవరులకు సాక్షాత్కరించియు నున్నచో టెఱిఁగింప కున్నవాఁడ,
పొటమరింపకముందె పుష్పసంతతులకు వింతగా రంగులు వేయువాఁడ,

ఆ.వె. చెలువ మొప్పఁ బుడమి సృష్టించి మాకిచ్చి
అనుభవింపుఁ డనుచు నాన తిచ్చి
నిలువ నీడలేక నిల్చిన కలవాఁడఁ,
కడుపు నిండ నన్నుఁ గన్నవాఁడ!

ఉ. కుంకుమపంకముం బులుము కొన్నవి తూరుపుకొండనెత్తముల్
పంకజబాంధవుం దరుణ పాదముల న్నిగిడించె, మింట నే
ణాంకుఁడు చిన్నవోయి చరమాచలసానుతటంబు లెక్కి మై
జింకయుఁ దాను గడ్డిగఱచెన్, బెనుచీఁకటు లార్చెఁ గాకులై

సీ. సంజకెంజాయలో జలకంబు సవరించి పఱతెంచు సూర్యబింబంబులోన
పదునాఱుదినముల పరువు వచ్చిననాఁటి చంద్రుని ధవళహాసములలోన
పూలతోఁటలతోడ ముద్దుముచ్చట సెప్పి చెఱలాడు మొలకతెమ్మెరలలోన
నీలమేఘంబుల నెఱియలలోఁ గుల్కి పరువెత్తు మెఱపుగర్భములలోన

తే.గీ. హాయిగాఁ బవ్వళించి బ్రహ్మాండములను
బల్కరించుచు నున్న దివ్యస్వరూప,
హృదయమును జీల్చి పూజ లర్పించుకొందు
నందుకొనిపొమ్ము, వ్యవధి లే దనక రమ్ము

ఉ. గాలికిఁ దూఁగియాడు గిజిగానికులాయముఁ జూపి నాకు నీ
పోలిక లాత్మతోఁ గఱఁగి పోసితి, ధన్యుఁడ నైతి కొండలం
దేలినమబ్బులోన నెలుఁగెత్తి శరీరము పుల్కరింప రా
గాలపనం బొనర్చితివి యర్థము గా దెఱిఁగింపు మీశ్వరా!

చం. అలసట లేక హోరుమని యార్చుచుఁ బారెడు నిమ్నహానదిన్
గులుకు తరంగమాలికలకున్ గిలిగింతలు పెట్టి ఫేనపం
క్తులనటనావిలాసములకుం దలయూఁచుచు నేను మ్రొక్కినన్
గిలకిల నవ్వి నన్నుఁ దిలకింపనికారణ మేమి దైవమా?

చం. కరమున నీవు సున్నితముగాఁ జికిలీ లొనరించి పుష్పవ
ల్లరుల నలంకరించుచు దళంబులు మోడిచి వాడి వత్తలై
తొరఁగిన వృద్ధపుష్పముల దుఃస్థితికిం గరుణించి యశ్రువుల్
గురిసితి వట్టి నీకనులలోనఁ జెమర్చె నజాండభాండముల్

ఉ. ఆ నిదురించుపెద్దపులి యాస్యబిలంబున కెన్ని జంతువుల్
బోనములై యదృశ్యమయి పోయెనొ రేపటిభుక్తికిన్ దయా
రైనమృగంబు లేపొదలయందవుగాము లెఱుంగ కింపుమై
మేనులు వాల్చెనో యెఱింగి మిన్నక చూచుచు నంగలార్తువా?

శా. నాకుం దోడయి నిద్ర మేలుకొనియుంట న్నీదుకన్గోనలన్
రేకెత్తెన్ జిగురాకువన్నెలవి నిండెన్ బూర్వదిగ్భిత్తులన్
నీ కేకానుక లీసమర్థుఁడగు నీనిర్భాగ్యుఁ డీ దేహమున్
నీ కిత్తున్ దలవాల్చి పొమ్మెలమిఁ దంద్రీ, నామనశ్శయ్యలన్

ఆ.వె. నన్నుఁబోలు కోటినరుల మృత్తిక నుండి
వెలువఱింప శక్తి గలిగియుండి
నన్ను విడువలేక కన్నుమూయ వదేల?
యెట్లు తీర్చుకొందు నీఋణంబు?

చం. ప్రకృతి పదార్థజాలములపై నుదయాస్తమయంబులందు నీ
యకలుషపాణిపద్మము రహస్యముగా లిఖియించి పోవు టొ
క్కొకసమయాన నేను గనుఁగొందునుగాని గ్రహింపఁజాల నెం
దుకు సృజయించినాఁడవొ ననున్ ఘనుఁడా, యసమగ్రబుద్ధిగన్

ఉ. ము న్నొకనాఁడు నాకనుల ముం దొక సుందరి గానవచ్చి, య
త్యున్నతపర్వతాగ్రమున నుండి గుభాలునఁ గూలఁ ద్రోసి పో
యె న్నను, నాఁటిదృశ్య మిపు డీసులతానుని గాథలోన ను
త్పన్నముఁ జేసి చూపితివి దైవమ నేఁటికి కన్ను విప్పితిన్

శా. ఈ విశ్వంభర నీయనుగ్రహములో హిందోళముం బాడుకొం
చావం తేని యెఱుంగకున్నదిగదా న్యాయ్యంబు నన్యాయ్యమున్?
దేవా, యెక్కడిదీ ప్రశాంతగుణ? మాదిత్యుండు బ్రహ్మాండపుం
ద్రోవన్నిల్చునె తెల్లవాఱునె ప్రభూ క్రోధంబు నీకుండినన్

ఆ.వె. కమలహితుఁడు పుడమిఁగల పదార్థములను
హేమరసముచే మొలాముచేసె
నీకుఁ గోపమున్న నిన్న మొన్నటివంటి
వార లేనిసుప్రభాత మగునె?

ఉ. ఈ తొలికోడికంఠముననే యినబింబము నిద్రవోయెనో
రాతిరి, తూర్పుఁగొండ లభిరామము లైనవి దీనివక్రపుం
గూఁతలమర్మ మేమి కనుఁగొమ్మని యల్లన హెచ్చరించి ప్రా
భాతసమీరపోతములు పైకొనియెం దొలిసంజ కానుపుల్

ఉ. వేగురుఁజుక్కతో నిలిపివేసిన నీ రచియించు లేఖకుం
గాగితమైన యాకసమునన్ జిరునవ్వులఁ గుమ్మరించుచున్
డాఁగెదవేల యర్ధవదనంబున? యేమని వ్రాసికొంటివో
నాగతు లందులోనఁ గరుణానిధి చిత్తము విహ్వలించెడిన్

ఉ. పిట్టలఁ బీచుపీచుమనిపించుచు వేగుఁబదంతి దోసిటన్
బట్టెఁ గులాబిగుత్తుల నభంబునఁ బుప్పొడి దుమ్ము రేఁగ నీ
విట్టి నిసర్గపూజలకుఁ దృప్తి వహింతువొ? నా స్తవంబులోఁ
బట్టముఁ గట్టుకొందువొ? కృపానిధి, గుండెలు గుమ్మరించెదన్

తే.గీ. ఆగడపుమబ్బుశయ్యల నపరశిఖరి
బుడుతచంద్రుఁడు నిద్దుర వోవుచుండె
ఈ చెఱువునీట నతని కుయ్యేలలు గట్టి
జోలవాడుచు నావంకఁ జూడవేమి?

చం. కులికిన స్వాతిమేఘములకుం దలయెత్తిన కాకిచిప్పలన్
నిలిచినవానచిన్కులు మణిత్వముఁ దాల్చి సముద్రమందిర
స్థలుల నలంకరించినవి స్వామి, యనూహ్యములైన నీదు చేఁ
తలకు నమస్కరింతును గృతజ్ఞుఁడ నయ్యెదఁ గ్రుంగిపోయెదన్

చం. గొలుసులు గట్టి నీవలనకుం బరువెత్తెడు నాదు దీన దృ
క్కుల నెదిరించి వచ్చినవి కొండలపిండులు కొమ్ములొడ్డి లో
యల నిదురించు నీ ముదురుటంధతమంబుల నీపదాంక ము
ద్రలు గమనింపఁజాలను పరాత్పర, నాకు శరణ్య మేదిరా!

చం. సుకము లశాశ్వతంబు లనుచుం బొగరెక్కిన కొమ్ముటేన్గు వా
రక చెవు లూఁచి, తుమ్మెద దొరన్ బెదరించు ననుక్షణంబు నీ
సకలచరాచరంబునకు సామ్యములై, నెఱసున్న పోలికన్
నికటజలాశయంబుల జనించిన బుద్బుదముల్ నశించెడిన్

ఉ. చీమ చిటుక్కుమన్నఁ బ్రతిసెప్పుచుఁ గోపము సేయుచున్న యీ
భూముల సుప్రశాంతి పరిపుష్టి వహించిన దిట్టితావు నీ
కోమలపాదసేవకులకుం దగియున్నది పూజసేయఁ దం
డ్రీ మొగ మింతసూపు మిటనెవ్వరు లేరు పరాయి లీశ్వరా!

ఆ.వె. భూతపంచకమున మున్గి తేలుచునున్న
నీ యనంతశక్తి నిశ్చయముగ
నాకుఁ బట్టుఁగొమ్మ నా వజ్రకవచము
సిలుఁగు లేమిచేయఁగలవు నన్ను?

ఉ. కొండలనుండి క్రిందివఱకుం దలక్రిందుగఁ జెంగలించి యీ
యెండినయేటిలోనఁ బ్రవహించిన యీ సెలయేటినీటిలో
గుండము లప్పుడే కుదురుకొన్నవి పాంథుల నాహరింప, బ్ర
హ్మాండవిలాస నీకవన మద్భుత మర్థగభీర మీశ్వరా!

ఉ. ఏమిటి కెక్కువెట్టితివి యింద్రధనుస్సును మింటిచాయ నా
సామి? పయోదమాలికల చాటున సూర్యుఁడు నక్కినాఁడు, తా
నే మపచారము న్సలిపి యిట్టి విపత్తును దెచ్చిపెట్టె నీ
భూములు నిల్చునా భువనమోహన, నీవు పరాక్రమించినన్

మ. సరదాగా భుజశక్తి మీఱ నెపుడో క్ష్మానామకంబైన బొం
గరమున్ ద్రిప్పితి వీపరిభ్రమణవేగం బింత చల్లాఱినన్
జరుగ న్నేర్చునె లోకవృత్తము మహేశా! యప్పు దేదిక్కుగా
నొఱగుం? బర్యవసాన మెట్లగునొ యంచూహింతు నున్మాదినై

# పిరదౌసి

## తృతీయాశ్వాసము

కం. ఒకకొన్ని గడియ లక్కవి
ప్రకృతిమహత్త్వంబు నీశ్వరప్రణయంబున్
జకచకితవికచకవితా
ప్రకాశవాగ్గుంభనములఁ బ్రస్తుతిచేసెన్

కం. పడమటికిఁ బ్రొద్దు వాలిన
నడుగడుగున కులికిపడెడు నబలలతోఁ దా
నడు గొకయామడగా న
య్యడవిని బయనింపసాఁగె నంత నొకదెసన్

చం. కెలఁకుల వైరిగుల్మముల గిట్టలచప్పుడు గోచరించినన్
దలఁకి సమీప పర్వత కదంబితభూర్జవనంబు సొచ్చి బె
బ్బులులు కరు ల్గిరు ల్భూరులు మొత్తములై విహరించు పెద్దలో
యలఁ బెడదారులం బడి ప్రయాణము చేయుచునుండ నత్తఱిన్

ఆ.వె. ప్రొద్దు గ్రుంకెఁ బెద్దపులి యేటి కేతెంచె
పంది కోఱకత్తి పదునువెట్టె
ఆకసంబు భూమి యఖిలపదార్థము
లంధకారజలధియం దణంగె

సీ. దెసలు బీఁటలువాఱ వసవట్టి పోరాడు కొదమసింగములకు బెదరిపడుచు
త్రాటితోఁపులఁ గల్లు ద్రావు భల్లుకముల గుటగుట ధ్వనులకుఁ గుదులుగొనుచు
నూహింపరాని యేవో మ్రుక్కిడిమృగాల వెట్టికూఁతలకు తబ్బిబ్బువడుచు
కొఱవిదయ్యముల టక్కరి దివ్వియలఁ జూచి యూరు దగ్గఱెనంచు నూఱడిలుచు

తే.గీ. కొసరి నివ్వరిధాన్యంబుఁ గొఱికి నమలు
నెలుక మునిపంటిసవ్వడి కులికిపడుచు
త్రోవ గమియించు నాఁటిపాంథుల నదేమొ
అదరి బెదరించె నొక యెండుటాకుకూడ

కం. మునుకొన్న సాధ్వసంబున
కనుల కరణ్యమున వృక్షగణ మరిగణమై
కనుపట్ట నతనిగళమును
బెనఁగొనఁగా సాగి రనుఁగుబిడ్డయు సతియున్

కం. ఆదీనులఁ గని యొక్క ని
షాదవిభుఁడు కనికరించి చనుదెంచి దయా
మేదురములైన పలుకుల
చేఁ దద్దయు భీతి మాన్పి చేతిధనుస్సున్

ఉ. ఎక్కిడి, రండు మీకు భయ మేమియు లే దని రొండి కోరఁగాఁ
జెక్కిన బొట్టెకట్టియలు చే నమరించి, నిసర్గతేజమున్
గ్రక్కు మొగంబుడంబున గుణధ్వనిఁ జేయుచు దారిఁజూపుచున్
జిక్కు టరణ్యము న్గడవఁ జేసెఁ గవీంద్రుని నగ్రగామియై

తే.గీ. పొడుపుగుబ్బలి తొలుదొల్త బూదివంటి
ధవళవర్ణంబుఁ దాల్చి యంతట పసిండి
నిగ్గు మెదిపిన చెంగల్వ మొగ్గఁ దొడిగె
నేగుజామున నూసరవెల్లివోలె

ఉ. అంతటఁ బారసీక సరిహద్దులు కన్నుల గోచరించె భా
స్వంతుఁడు తూర్పునం బొడిచివచ్చె నిషాదుఁడు భక్తిగుంభిత
స్వాంతుఁడు కేలు మోడ్చి కవిసత్తమునిం గని స్వామివారు న
న్నింత యనుగ్రహించి సెలవిచ్చిన నేనును బోయి వచ్చెదన్

కం. అని పలికి, స్వామి యాదెస
నినరశ్మల నెండమావు లేర్పడి యపుడే
వనధింబలెఁ గన్పడు నటు
సనకుఁదది యెడారి కడు నసాధ్యము దాఁటన్

ఉ. ఆ కనుపించు పర్వతపుటంచున నున్నది పెద్దచెర్వు మీ
రాఁకలి గొన్నచో నిలిచి యచ్చట చల్ది భుజింపవచ్చు సా
మీ, కనుచూపుమేర పిడియేనుఁగు పిండులు టేకుమ్రాఁకులన్
గూఁకటి వ్రేళ్లతోఁ బెఱికి కూల్చుచు నుండును పెళ్లుపెళ్లునన్

ఉ. కొంచెము సాగినన్ జెఱువు కొమ్మున మీ కుడిచేతివాలుగా
మంచివిశాలమైన యొక మార్గము దాపునఁ గానుపించు మా
చెంచులగూడెముల్ పుడమి చేడియ చన్నుల క్రేవఁ దాల్చు రో
మాంచమొకో యనం దనరు నందలికొండల కీవలావలన్

సీ. ఈ గ్రచ్చుపొదలయందే నిర్భయము మీఱ బెబ్బులుల్ పిల్లలఁ బెట్టుచుండు
ఈ జలాశయములందే జంటలై వచ్చి యెదలైన యేనుంగు లీఁతలాడు
ఈ కొండలోయలందే నిశీథమునందు దయ్యాలు గుంపులై తాండవించు
ఈ తాండ్రతోఁపులందే జంతువుల మ్రింగి కొండచిల్వలు మత్తు గొని పరుండు

తే.గీ. తెరువరులఁ బట్టి కట్టి తస్కరులగుంపు
నిత్య మిచ్చోటఁ బగలెకూనీలు సేయు
అనఘ చూపుల కిది యరణ్యంబు గాని
బ్రహ్మసృష్టిని వింతయాపదలపుట్ట

శా. వాసింగన్న మహమ్మదీయులకు సేవ్యంబైన మక్కా కర
బ్బీసన్న్యాసులు పోవుత్రోవ లవి; యాపెన్గొండనెత్తమ్ములం
దాసీనుండగు వానిదృష్టికి నభోవ్యాలంబముల్ రత్నరు
గ్రాసుల్ గన్పడుఁ గాంధహారనగర ప్రాసాదకుంభాగ్రముల్

మ. అదిగో, చూడుఁడు రావులుంగుగము లభ్రాంతంబునం దూలు నం
బుదపుం దున్కలునాఁ జలించెడిని; తద్భూభాగమందున్న పె
న్నదితీరంబులె పారసీకుల శ్మశానక్షోణు; లచ్చోటఁ జూ
డఁ దగున్ మర్త్యుల యస్థిపంజరపుగుట్టల్, మాంసదుర్గంధమున్

ఉ. దోరగఁ బండి గుత్తులయి దొంతులుగట్టినపండ్లు వ్రేల, వే
మారునుఁ దేనెపట్టుల భ్రమన్ గలిగించుచు నున్న మేలిఖ
ర్జూరపుతోఁపులం దిరుగుచుం బసియొంటెలు మేపు పారసీ
పౌరులు గానుపింతు రిరువంకల త్రోవల కింతదాపునన్

మ. అవలన్ బచ్చికపట్టులం జిలుఁగు నీహారంబు భక్షించి, చే
రువ ద్రాక్షాఫలపక్వసౌరభమిళత్ స్రోతస్సులం దేలి వా
యువు లింపార మెలంగుచుండునవి మీకుత్సాహముం గూర్పకుం
డవు సుమ్మీ! యట నున్నవృక్షముల నీడన్ గొంతశాంతింపుఁడీ!

ఉ. క్రొత్తగఁ బుట్టు పుట్టగొడుగుల్బలెఁ బెద్దయెడారిపొంత, ని
ట్లుత్తరదిక్కుగా వెలయుచున్నవి కొన్ని గుడారముల్ దొరా!
ముత్తెపు వర్తకంబునకుఁబోవు నరబ్బులు నిల్చుతావులం
దత్తితరుప్రకాండములనాని పరున్నవి వారియుష్ట్రముల్

ఆ.వె. ఈయెడార్ల గండు టిసుకతిప్పలమీఁది
వెట్టచేతఁ బిగిలి పిల్లలయిన
నిప్పుకోడిగ్రుడ్లు నీటికుండలు వారి
కొంటెపాడి వారి కుగ్గుపాలు

ఆ.వె. పచ్చిపసుపుముద్దవంటి దేహచ్ఛాయ;
అందమై విశాలమైన నుదురు;
కట్టుబొట్టువాలకముఁ జూడ మీరును
పారసీకు లనుట స్పష్టపడియె

కం. ఈపుష్పకోమలులతో
నీపర్వతమయవనాళి నిట్లొంటరిగా
నీపగిది సిలుఁగులం బడు
నోపిక మీ కెట్టు లబ్బె నోముసలిదొరా!

కం. ఎఱుఁగనివారో యనుకొని
యెఱిఁగించితి నింతవట్టు నేమేమొ, దొరా!
కరుణ న్నను మన్నింపుం;
డరుగుఁడు ప్రొద్దెక్కె నింక ననిపలుకుటయున్

ఉ. వానిమృదూక్తినైపుణియు, వాని వినమ్ర విధేయభావమున్
వానిపరోపకార నిరవద్యగుణ ప్రతిభావిశేషమున్
వాని శరీరసౌష్ఠవము, వానిభుజార్గళమాంసలత్వ మిం
పైన కృతజ్ఞతార్థకృతులై వెడలెన్ పిరదౌసివాక్కునన్

వె. అతనిఁ గౌఁగిలించి ఆనందసంతుష్టి
చిహ్నితంబు, లమృతశీతలములు,
గాద్గదికములును, ప్రగాఢదైన్యంబులు
నయిన పల్కు లౌలయ ననియె నిట్లు

చం. నరులు గడించిపెట్టిన వినాశన సూచకమైన పాప మీ
ధరణి కసహ్యమై బహువిధంబుల మూలుగుచున్న దన్న, ఈ
శ్వరుని క్రుధావిలోకన దవానలముల్ నినువంటివారికై
వెఱచి దహింపకున్న వనిపించె మనంబు నిషాదవల్లభా!

ఉ. నాదుతనూపటుత్వమును, నాకవితాతపనీయరాశి భూ
మీదయితుం డొకండు బలిమిం గొని నన్ను వధింపఁ జూచె; నీ
నాదుచరిత్ర విన్నఁ గరుణన్ జెమరించు శిలాసహస్రముల్,
నీదుమనంబు లేఁత నవనీతము ముందె కరంగెఁ జూపులన్

కం. ఈ నరసియున్న తలయును
హీనతఁ గనియున్న నేత్ర దృష్టియు, వృద్ధం
బైన శరీరం బఱువది
పైని పడినవయసు నాకుఁ బ్రాప్తంబయ్యెన్

కం. ఆముసలిపడఁతి నా భా
ర్యామణి; యాపదుచు కూఁతు రయ్యా, నే నీ
కోమలుల రక్షణార్థం
బే మేను దొఱంగ సంశయింతు నిషాదా!

చం. ప్రకృతిరహోనభంబున నిరమ్మదముల్ బలె గోచరించి యొ
క్కొకపరి యూఱడించి చనుచుండును దేవుని దివ్యలీల; లా
సుకమును జూఱలాడు పరిశుద్ధులు వోయినత్రోవఁ ద్రొక్కి, నే
నిఁక విడియించుకొందు ధృతిహీన మదీయశరీరభారముల్

కం. నీకుఁ గృతజ్ఞుఁడ నయ్యెద
నీకాయం బుండుదనుక నిఁక సెల వని బా
ష్పాకులిత నేత్రయుగళుం
డై కదలెఁ గవిప్రకాండుఁ డబలలతోడన్

కం. కనుచూపుమేరవఱ క
వ్వనాటుఁ డీక్షించి పిదప స్వసదనమునకున్
జనియె విషాదముతో న
య్యనఘుని దౌర్భాగ్యచరిత మాత్మఁ గలంపన్

# పిరదౌసి

చతుర్థాశ్వాసము

కం. అట గజనీ సులతానుని
భటాళి పిరదౌసికవిని బట్టుకొనుటకై
చటులకరవాలకరముం
గుటిలముఖం బగుచుఁ గదలె గుజ్జాలపయిన్

కం. ఒక పేదవానిఁ జంపుట
కకటా, ఆశ్వికదళంబులా! యని పౌరు
ల్చకితులయి చూడఁ జని క్ర
మ్మికొనిరి తచ్ఛూన్యగేహమును రాజభటుల్

మ. సకుటుంబంబుగఁ బారసీకకవి యీసౌధంబునం దుండి యిం
తకు ముందే చనె నన్నవార్త విని సేనా నాయకుం డింత చిం
తకు లోనై, పనిచెం బటాలమును నానాదిక్కులన్ బ్రోచ్ఛలత్
భ్రుకుటీఖడ్గనటీకఠోరుఁడయి, యూర్పుల్ నిప్పులై క్రాలఁగన్

ఉ. అల్లన రేఁగి సైంధవ ఖురాహతి భూమిరజంబు లెల్లెడా
లు ల్లెడలై రహింపఁ జని యూళుల నేళులఁ బక్కణంబులన్
జల్లెడ వట్టి చూచి కవి జాడ లెఱుంగక రాజభీతిచే
నుల్లము లూఁగఁగా నిజపురోన్ముఖులై రఘఘన్ భటోత్తముల్

కం. పిరదౌసి యీశ్వరస్తుతి
నెఱపిన వనభూమి శత్రునేత్రంబులకున్
మఱుఁగుపడియెనొ మరేమో,
యరిదళములు తొలఁగి నడచె నపమార్గమునన్

తే.గీ. దిక్కఱిన వంటయింటికుందేటి నొక్క
పారసీకునిఁ జేజేఁత జాఱవిడిచి
స్వామి కవమతిసేయు లుచ్ఛా లటంచు
యవనభూపాలుఁ డెంతయు నాగ్రహించి

తే.గీ. తనదివాణంబుఁ గొలిచి, యబ్దములనుండి
కలహములలోన రక్తముఁ జిలుకుచున్న
భటులఁ గొందఱఁ గట్టించి బందిచేసె
నెటిఁ గృతజ్ఞత లెఱుఁగ దా నృపునియలుక

కం. పిరదౌసికవికి నెవ్వఁడు
శరణం బిడు నతఁడు నాకు శాత్రవుఁడగు నం
చురుకార్పణ్య మెలర్పఁగఁ
బరమానా లిచ్చి చాటఁబనిచె నృపులకున్

శా. షానామా యను గ్రంథరాజమున కీక్ష్మాభర్త తా భర్తయై
పూనెన్ శాశ్వతమైన కీర్తిమకుటంబున్ మౌళి; నేతత్కృతి
గ్లానిన్ గుందుమహాకవి న్మదుసలిన్ ఖండింప నుంకించి స
న్మానించెన్ భళి, దొడ్డవాఁ డనుచు సంభాషించె దిగ్దేశముల్

కం. సామంత భూమిపాలుర
లో మంచియుఁ జెడ్డ నింతలోఁ దలఁచు లస
ద్ధీమతులు కొంద ఱది విని
సామోక్తుల వ్రాసి రిట్లు సందేశంబుల్

సీ. గడియించితిరిగదా, కనకరత్న చయంబు ధననాయకునకు దంతములు పులియ;
వణఁకించితిరిగదా, పదియు నెన్మిదిమాఱు లఖిలభారత హరిదష్టకంబు;
అగలించితిరిగదా, హైందవదేవతాగర్భముల్ రత్నరక్తములు చింద;
సృష్టించితిరిగదా, ఇస్లాముమతమును బాపనయ్యల గృహాభ్యంతరముల;

తే.గీ. ఇట్టి మీపేరు మృతిలేని కృతులలోనఁ
బొదివి పూజించియిచ్చిన పుణ్యమూర్తి
నమలతపనీయరాశి నోలార్చవలెనొ;
తెగడి నైరాశ్యమున ముంచి తేల్చవలెనొ?

శా. మక్కాలోఁ బయిగంబరుండగు మహమ్మద్‌గారిగోరీపయిన్
బక్కాకీర్తుల వెల్లవేసిన మహాభక్తాగ్రగణ్యుండవై
చిక్కంబట్టితి రేల? యొక్కకవి మీచేఁ గోరుద్రవ్యంబు మీ
హుక్కాఖర్చుకు సాటిరాదుగద, రాజోత్తంస, యోజింపుమా!

కం. కవి శాశ్వతుఁ దుర్వర నా
రవితారముగా వసించు రాజా, మీరో
కవితాకన్యకు పతు లా
రవితారముగా సహింతు రా యపకీర్తుల్?

సీ. దాదాపు నాల్గువందలమంది కవులు గానము సేయు మీ దివాణంబు ఠీవి
అల్లాకుఁ బ్రీతిసేయం గాఫరులమీఁది కుఱుకు మీకత్తివాదరపసందు
సకిలించి శత్రుమత్సరము వెల్లడిచేసి కాల్ద్రవ్వు మీఘోటకములపసరు
పసిఁడిజల్తారు టంబారీలయొఱపునఁ దిరుగు మీ గజముల గరువతనము

తే.గీ. మాయవనరాజ్యమునకుఁ బూర్ణాయువులని
తలఁచుకొనుచుందు మెపుడు సుల్తాను వృషభ
లలితకళలు విడంబించు నెలవు మీదు
నిండుకొలువున కవులకన్నీరు తగదు

కం. షానామాగ్రంథంబున
భూనాయక, మేలిరత్నములు గలవుగదా
వానికినై యఱువదివే
ల్దీనారము లీయ వెనుకదీయుట తగవే

కం. మీరు కళాపోషకు లను
కీరితిఁ బోనాడఁ దగదు, కృతికన్యక బం
గారంబు మణులు గురిసెడు
క్ష్మారాజ్యవధూటికన్నఁ జక్కనిదిగదా!

కం. ఆవాక్యములు ధరాపతి
భావమునకు నచ్చి క్రోధభారచ్యుతుఁడై
కేవలపండితగోష్ఠిం
దావర్షత్రయము గడపెఁ దా నస్థిరతన్

తే.గీ. కవులు కలకంఠకుహుకుహూకారమధుర
భావగుంఫితకవిత చెప్పందొడఁగిరి;
పండితులు తదంచిత రసాస్వాదనంబుఁ
జేసి సోత్సాహులై విమర్శించుచుండ్రి

సీ. ఒకకవీశ్వరుని కైతకు మెచ్చుకొని నోటినిండ మాణిక్యము ల్నింపినాఁడు
ఒక పండితుని విమర్శకు చిత్త ముప్పొంగ కనకచేలంబులు గప్పినాఁడు
ఒక గాయకునిపాటకు మేను పులకింప దోసిట ముత్యాలు పోసినాఁడు
ఒక యాటవెలఁదియాటకు సెబాసని పల్కి కొంగున వరహాలు గురిసినాఁడు

తే.గీ. ఏమి చెప్పుదు నిత్యసంతృప్తిఁ దేల్చి
విపులవాఙ్మయసేవ గావించినాఁడు
దానవలయంబు లిరుగేలఁ దాల్చినాఁడు
పిరదవుసి నేమొ పూర్తిగా మఱచినాఁడు

కం. ఒక వాసరముఖమున నిం
చుకయించుక కన్నువిచ్చి సూర్యునికిరణ
ప్రకరములు ప్రాఙ్ముఖంబున
వికసించెడువేళఁ గాకి ప్రేలెడువేళన్

ఉ. పానుపు డిగ్గి, మేలివలిపంబును గట్టి పదాలజాళువా
మానికపుంజడావుల నమర్చి మసీదున కేఁగి భక్తి న
ల్లాను భజించివచ్చుచు నిలాతలనాథుఁడు గాంచె భిత్తికా
ధానము బాష్పహేతుక కథానక మప్పిరదౌసి పద్యమున్

చం. "కృతి యొకబెబ్బులింబలె శరీరపటుత్వము నాహరింప శే
షితమగు నస్థిపంజరము జీవలవంబున నూఁగులాడఁగా
బ్రతికియుఁ జచ్చియున్న ముదివగ్గు మహమ్మదుగారి ఖడ్గదే
వతకు రుచించునా? పరిభవవ్యథ యింతట నంతరించునా?

తే.గీ. ముత్యముల కిక్కయైన సముద్రమునను
బెక్కుమాఱులు మున్కలు వేసినాఁడ
భాగ్యహీనుఁడ ముత్యంబు వడయనైతి
వనధి నను మ్రింగ నోరువిచ్చినది తుదకు

–పిరదౌసి"

కం. ప్రత్యక్షరమున నశ్రుల్
ప్రత్యక్షముసేయుచున్న పద్యయుగము పె
న్వ్యాత్య యగుచుఁ గలఁచెం భూ
పత్యగ్రణిహృదయ మనెడు వనజాకరమున్

ఉ. ఏలిక పారసీకునకు నిచ్చెద నన్న పసిండి నూలు బ
స్తాలకుఁ బట్టి యొంటియల షట్కముపై నిడి వీరులైన ము
ల్లాలపరంబుచేసి, పదిలంబుగ సత్కవి కప్పగింపుఁ డం
చోలి ననుజ్ఞఁజేసె బురినున్న సుధీమణు లుల్లసిల్లఁగన్

కం. అట పిరదౌసికవియు న
ప్పటి కొకయేఁడాదినుండి పరిపూర్ణజరన్
జటులామయపీడితుఁడై
కటకటఁ బడుచుండెఁ బేదకాఁపురపు సిరిన్

తే.గీ. పెండ్లి కెదిగిన కూఁతురు ప్రియవధూటి
చింతచే డస్సి బిట్టు కృశించి కుమిలి
చేతనయిన సపర్యలు సేయుచుండఁ
దనువు చాలించె నేమందు దైవఘటన!

తే.గీ. సుకవి దేహంబు ప్రేతభూమికి లభింప
అర్థ మప్పుడె శూన్యగేహమును జేరె,
నిమిషభేదంబు నడుమ సంధింపఁబడిన
ఈరహస్యంబుఁ గనుఁగొన నెవరితరము?

మ. ఇది నాతండ్రిని కష్టపెట్టిన శరం బీ స్వాపతేయంబు ము
ట్టుదునా, నాజనకుండు కంటఁ దడిఁబెట్టున్ స్వర్గమం దుండి, నా
ముదితండ్రిన్ దయతోడ నేలిన నవాబుండైన మీస్వామికిన్
బదివేలంజలు లంచుఁ బల్కుఁడని బాష్పస్విన్న దుఃఖాస్యయై

కం. కులగిరులు గరఁగి పోయెడు
పలుకులు దైన్యంబు చిందిపడఁ బలికె నొగిన్
చెలువమున వెలయు కవిసుత
యెలఁబ్రాయపుటింపు విడని మృదుకంఠార్తిన్

చం. ధనము మరల్చుకొంచు సులతానుభటుల్ గజనీకిఁ బోయి య
య్యనఘుని దుఃఖవార్తను మహమ్మదుగారికి విన్నవించినన్
దన యవివేకమున్ దన కృతఘ్నతయున్, గవి కీర్తిశేషుఁడై
చనుటయు, వజ్రఘాతముల చందమునన్ గలఁచెన్ హృదబ్జమున్

తే.గీ. కొలువు చాలించి కన్నీరు గ్రుక్కుకొనుచు
బిరబిరం బోయి శయనమందిరముఁ జొచ్చి
ద్వారములు మూసికొని కవీశ్వరునిఁ దలఁచు
కొనుచుఁ దనుఁ దాను నిందించుకొనఁ దొడంగె

ఉ. ఓయి కృతఘ్నుఁడా, భవమహోదధిలో నిఁకఁ దేలియాడు మా
హా! యపఘున్ ధరాతలమునంతయుఁ గావ్యసుధాస్రవంతిలో
హాయిగ నోలలార్చిన మహామహుఁడౌ పిరదౌసితోడ స్వ
ర్గీయసుఖంబు నీకుఁ దొలఁగెన్ మనుపీనుఁగవై చరింపుమా!

ఉ. న్యాయము దప్పి యీప్రళయ నాటకదృశ్యముఁ జూచినాఁడ వీ
కాయ మిఁకేల? భూపతిని కాయమునం దలయెత్తఁజాలుదే?
శ్రీయును బౌరుషంబును బ్రసిద్ధియునుం గల రాజవంశమం
దీయపకీర్తి చుట్టుకొనియెం జరలేని కృతిస్వరూపమై

మ. మురువున్ గూర్చు ప్రబంధకావ్యరచనాపూజ్యుల్ విపశ్చిద్దినే
శ్వరులున్నారు చతుశ్శతాధికముగా పాండిత్యముల్ సూపుచున్
పిరదౌసీకవివాక్కునం గల రసావిర్భూతి గన్పట్టునే?
వరహీరంబును గాలఁ దన్నుకొను నిర్భాగ్యుం డెవం డుర్వరన్?

కం. అని పశ్చాత్తప్తుండై
వనరి యతనిపేరఁ దూసుపట్టణమునఁ జ
క్కనిసత్రశాల గట్టిం
చె నవాబుఁడు కవిఋణంబు చెల్లింపంగన్

తే.గీ. దానిశైథిల్యములు నేఁడుఁ గానఁబడును
పారసీకులు చూచి కన్నీరు విడుతు
రఁట మహమ్మదుగారికి నపయశంబు
నిండు సత్కీర్తి కవికిని నిలిచిపోయె

మ. గజనీపట్టణవీధులన్ నృపుని కంకాళంబు సప్రాణమై,
రజనీమధ్యములందుఁ గ్రుమ్మరుచు నార్తధ్వానముల్ సేయునం
చు జనశ్రేణి వచించుచుండు, నవునౌ క్షోణీస్థలిన్ వీడినన్
వృజినం బూరకపోవునే? నరుని శాంతిజ్యోతిఁ జల్లార్చదే?

blank



యెరిచెర్ల శ్రీకాంత్, జాషువ, యెరిచెర్ల సామ్రాట్. 14 నవంబరు 1962

శా. ఆనందంబునఁ జంద్రమండలమునం దాసీనవై, యన్నముం
బానీయంబులు మాని రాట్నమున జ్యోత్స్నాసూత్రముల్ దీయు న
వ్వా! నీ కెవ్వరుఁ జుట్టపక్కములు లేరా! సంశయంబయ్యె నా
కా నీరేజవిరోధిలో నలుపు నీవా? యిట్టియా? మట్టియా?

# అంకితము

సీ. అకట! తల్లాప్రగ్గడాన్వవాయసుధాబ్ధిరాజు శ్రీసూర్యనారాయణాఖ్య
సుకవికిఁ గారాలసుతవై యుదయమంది సిరిగలవారి మందిరము సొచ్చి
కనకంపుబొమ్మలఁ గల్పవల్లీ కమలాంబికలను కడుపారఁ గాంచి
వ్యాధిగర్భంబునం దదృశ్యవై స్వీయకథ యెల్ల నొక స్వప్నకథ యొనర్చు
శ్రీ సింగరాజు లక్ష్మీ కళావతిదేవి! విధుమండలమున జీవించుచున్న

తే.గీ. వృద్ధవనితను బోలి బింబింపవమ్మ
శాశ్వతంబుగ నీదువంశంబునందు
ననుఁగుబిడ్డలయందు నీ కంకిత మిదు
స్వప్నకథయందుఁ గృతి కధిపత్ని వగుచు

సహృదయకులకు,

పోషించుదాతలు లేక వర్తమానయుగమునఁ గవితా కళ సన్నగిల్లినది. "నిరంకుశాః కవయ" అను సూక్తి కపార్థములను కల్పించి, వ్యర్థరచనలు సేయు బుద్ధిమంతులు బయలుదేరినారు. సమదృష్టి యుపన్యాసవేదికల కాహుతియై పోవుచున్నది. దుర్భరదారిద్ర్యము కవుల నాశ్రయించుటంజేసి యుత్తమకావ్యము లముద్రితములై మూలుగుచున్నవి. ధనవంతుల పసిఁడిసంచులు కారణాంతరములకు ఖర్చుపెట్టఁబడుచున్నవి. పరిస్థితు లెట్లున్నను రచనాకండూతికి గుఱియగు నాకల మూరకుండక స్వప్నకథను ప్రసవించినది. ఇక్కావ్యమున 'స్వప్నకథ,' 'అనాథ' యను రెండు కథలు కలవు. ఇందు మొదటిది సమగ్రము, రెండవ దసమగ్రము. ఒకటి మూట గట్టఁబడినగాలి, యొకటి సలసలగ్రాగి చిందిన కన్నీటిబిందువు. అసంపూర్ణమయిన 'యనాథ'కథ పాఠకులకు వింతగాఁ దోప వచ్చును. కాని, మనోగతభావము సమగ్రముగా వ్యక్తీకరింపఁబడిన మీఁదట నాదృష్టి కిక్కథ సమగ్రము. అందువలన ననాథ పురవీధులలో విడిచిపెట్టఁబడినది. కావ్యశిల్పమున కన్న నభిప్రాయప్రకటనమే నాపరమావధి. సహృదయులకు నాయుద్దేశము స్పష్టము. వారాదరించినఁ జాలును, తదితరులతో నాకుఁ బనిలేదు.

జి. జాషువ

# స్వప్నకథ

ఉ. నే నొకనాఁడు స్వప్నమున నింగికి రివ్వున లేచి చంద్రబిం
బానికి దాపునం గనుల పండువు సేయుచునున్న వింత మై
దానమునందు వ్రాలి ప్రమదంబున దిక్కులు సూచుచుండ నా
పై నునులేఁత వెన్నెల తుపానులు వీచె మనోహరంబుగన్

కం. అచ్చెరువు పడుచుఁ బచ్చల
పచ్చికబయలునఁ జరింపవలె నని తిరుగం
జొచ్చితి నపు డొక కమ్మని
యుచ్చైర్నాదంబు శ్రవణయుగళిన్ దాకెన్

ఆ.వె. ఇంద్రధనువువంటి హృదయంగమంబైన
వన్నె చిన్నె లీను వలువగట్టి
బాలుఁ డొక్కరుండు కేళి సల్పుచు నుండె
కాఱుమబ్బుడోలికలఁ బరుండి

ఆ.వె. నన్ను రాచుకొనుచు నలువంకలకుఁ బారు
మెఱపుఁదీవియలను నొరయుచున్న
వాని చక్కఁదనము వర్ణింపవలె నని
కలము నందికొంటిఁ గౌతుకమున

చం. అతఁడు, కికాకిక న్నగి వియత్తలమెల్ల ధ్వనించిపోవ స్వా
గతము కవీశ! ర మ్మిచటి కాలువగట్టున నున్న రత్నరం
జితమగు నస్మదీయగృహసీమను నించుక విశ్రమించి నీ
కత వివరింపుమం చెదురుగా నట చెంగురు లల్లలాడగన్

కం. కలయో! నిక్కువమో! యను
తలంపు చిత్తంబునందుఁ దళుకొత్తఁగ భూ
తలమునఁ బడియెదనో యని
యులుకుచు గగనమునఁ దిరుగుచుంటి నతనితోన్

మ. మొలిచెన్ తెక్కలు మూపునం బులకరింపుల్ దేహమం దెల్ల శో
భిలె మాధుర్యములైన భావములతో విస్ఫీధిఁ బొన్నంగిపి
ట్టలతోఁ దేలికగాఁ జరించితి మఖండంబైన వేగంబునన్
దలపై ముత్తెపుగుత్తులట్లు గ్రహముల్దారల్ బ్రకాశింపఁగన్

తే.గీ. గగనగంగమ్మ కవ్వలిగట్టునందు
దేవతలు స్నానమాడెడు రేవుపొంత
రాజహంసలపాదముద్రలు రహించు
నిసుకతిన్నెల వ్రాలితి మిద్దఱమును

ఉ. ప్రాకిన యేలకీ లతల పందిటితోడ సనాతనంపు నా
జూకుల కిక్కయైన యొక సుందరసౌధముఁ జొచ్చి చూచినా
మేకులు రాట్నముంగలుగు వృద్ధవిలాసినిఁ బ్రాయమంతయున్
జీకినదాని వెండి నగిషీపనిదంపపుఁగట్లపీటపై

ఉ. చూపులు వాడిపోయినవి శోభిలు దేహపటుత్వమెన్నఁడో
కోపము సేసె యౌవనముఁ గూరికె నా యనువారు బిడ్డలుం
బాపలు లే రహో! తుహిన మండల మెన్నఁడు సొచ్చియున్నదో
యోపికమాత్రమే నిలిచి యున్నది తోడయి గ్రుడ్డిగువ్వకున్

కం. పదములచప్పుడు విని మా
కెదురు నడచివచ్చి మధురహృదయంబున న
ప్పదిరెండేడుల బాలుని
వదనము ముద్దాడి విపులవాత్సల్యమునన్

తే.గీ. తేరకొనిచూచి పిలిచి యాతిథ్యమిచ్చి
నాయనా రమ్మటంచుఁ జందనపుఁబీట
వయిచి భుజియింపుఁడని నాకు బాలకునకుఁ
దామరాకులలో నమృతంబు వోసె

చం. ఎలమి సముద్రపుం జిలుక యీకల కుంచియఁ బూని తాటిక
మ్మలభర మోపలేని జిగిమాలినకర్ణము లూఁగియాడఁ గో
మలమగు జాజిపూవులదుమార మలంది చరించు లేఁత గా
డ్పు లొలయ వీచుచుండె నగుమోమున సాదరవీక్షణంబులన్

కం. ముసలమ్మ చేతియన్నము
మెసవుచు బాలకునితోడ మెలఁగుచు నేదో
వ్యసనమునఁ జిక్కి మఱచితి
వసుంధరాతలము రెండుపదివాసరముల్

సీ. ముంజేత వడు వెన్నపూసముద్దలవంటి మింటిచుక్కలతోడ మేలమాడి
మొగలిపుప్పొడివర్షమును బోలు తఱచైన పొగమంచుతెరల దోబూచులాడి
కటికిసంధ్యాగ్నిలోఁ గరఁగిపోవని క్రొత్త స్వాతిమబ్బుగుఱాలస్వారి జేసి
చదలేటినీట మజ్జనమాడు తెఱగంటి రాచకన్నెలమీఁద రాలు రువ్వి

ఆ.వె. మంచువాలుచందమామ మండలమున
నిల్లు మఱచి తిరుగు పిల్లవానిఁ
గ్రమ్మరింప మూఁడుకాళుల ముసలమ్మ
తిరుగుచుండు నౌర! దినదినంబు

కం. ముక్కున నూపిరి నిలిచిన
దిక్కు దెసయు లేని ముసలితెఱవ హసనమున్
జక్కనిగుణంబుఁ గనుఁగొని
యక్కజపడుచుండుఁ బ్రత్యహంబు నెడందన్

మ. ఒకనాఁ డగ్గలమైన వేగమున నేయుం జీరలున్ రైక లిం
కొకఁనా డింపుదలిర్ప రాట్నమున దీయుం జంద్రికాధారలన్
జికిలీజేసిన పట్టునూ ల్జిలుఁగువన్నెల్ గన్నులన్ దన్ప దై
వికశక్తుల్ గల వృద్ధురాలికడ స్తంభించుం దిశాగోళముల్

కం. అవగారి చిత్రచరితము
సవిస్తరముగా నెఱింగి చనవలెనని దూ
ది వడుకుసమయంబునఁ జే
రువగాఁ గూర్చుంటి నొక్కరో జుదయమునన్

చం. కరమున దూదిపింజలు మొగంబున నవ్వు దుఱంగలింప న
న్నరసి, "విశేష మేమి? కొడుకా!" యని తీయఁగఁ బల్కరించినన్
జరణము లంటి మ్రొక్కి "దివసంబులు పెక్కు గతించె, నేను చం
దురునిపొలంబుఁ జేరి కృపతో ననుఁ గ్రమ్మరఁ బంపు మవ్వరో!"

ఉ. నీవు మహత్తుగల్గిన మనీషిణి వెన్ని యుగాలు దాటె న
వ్వా! వనజారిలోకమున వాసము సేయఁదొడంగి యెవ్వరీ
భావుకుఁ? డాప్తులుం గులమువారు గలారటె? మర్త్యకాంతవో
దేవతవో వచింపు మని తీయనిపల్కున హెచ్చరించితిన్

కం. ముగ్గినపండగు నమ్ముది
వగ్గది విని రెండు మూఁడు బాష్పకణంబుల్
నిగ్గు డిగియున్న చెక్కులు
డిగ్గన్ గాద్గదిక సంఘటిలిన యెలుఁగునన్

తే.గీ. నా వయస్సెంతో చంద్రమండలము వయసు
నించుమించుగ సరిపోవు నెంచిచూడ
నాచరిత్రంబు నిన్న మొన్నటిది గాదు
యెన్నియుగములు దాటిపోయెనొ కుమార!

సీ. ఆకాశరామ నీల్లాడుచక్కదనాల బుడుతచుక్కల కెల్లఁ బురుడువోసి
అలవోక నిండు జాబిలి రాట్నములమీఁద మేలైన వెన్నెలనూలు వడికి
విభునిదుర్దశఁ జూచి విలపించురోహిణీ నారీవతంసంబు నూఱడించి
గ్రహణకాలమునందుఁ గలుషితంబైపోవు నుడుపతిపుట్టంబు లుదికిపెట్టి

తే.గీ. ప్రసవ వేదనcబడు వేల్పుcబడతుకలకు
వీనుమిగిలిన మంతరసాని నగుచు
నమవసకుcగూడc గన్ను మూయను కుమార!
కవులు వర్ణించుజింకను గాను నేను

ఉ. ఏను పరోపకారమునకే తను వెల్ల వ్యయించినాను, అ
జ్ఞానులు దాచుకొందురు క్షణక్షణకర్కశతైలయంత్ర మె
వ్వానిబలంబుc బిండ దొకపక్షమున న్నశియించు చంద్రుcడున్
మానునె? విశ్వలోక సదనానికి సున్నముcగొట్టుచేతలన్

ఉ. నేనొకరెడ్డిసానికి జనించిన మానవకాంత నన్న నా
దీనచరిత్రలోన నినదించురసంబు విషాద మందులో
నానినగుండెతోడ గగనంబున కెక్కితిc జావు లేదు నా
మేనికిc జంద్రమండలసమిద్ధసుధాశనకారణంబునన్

కం. జననీజనకులు నేc బొడ
మినరెండవవారముననె మృత్యువునకు భో
జనమై చనినా రే నపు
డనాథ నయి గుడిసెలోన నఱచుచునుంటిన్

తే.గీ. తల్లిదండ్రులcc జంపిన దానవి యిది
యాదరించిన నేమి ప్రమాద మగునొ
యనుచుc గొఱకొఱలాడి న న్నంటరయిరి
పౌరకాంతలు భీతి గొప్పది గదన్న!

తే.గీ. పదిదినాలకుముందు గర్భమునc బండి
నిదురవోయిన చిన్నారి నిర్మలాత్మ
యాcకcటం దూలు ప్రత్యేకవ్యక్తి యయ్యె
పాంచభౌతికమైన దేహమునc జొచ్చి

తే.గీ. గుడిసెకొప్పున నెన్నఁడో గూఁడు గట్టి
డాఁగుకొనియున్న కొండొఁకనాగమయ్య
వాని డాపునఁ బెట్టిన తేనెపట్టు
ముట్టెతో నొత్తెఁ గ్రొందేనె లుట్టిపడఁగ

కం. వా యెండ నేడ్చునా కా
తీయనిమధురసము కంఠ దేశంబున నా
ప్యాయముగఁ గురియ రోదన
సేయుట మానితిని కొంతసేపు కుమారా!

కం. కాలముచేసినతల్లి త
దాలయమున నాగమయ్యయై నిలిచెనొ! కా
కీలాటి వింత గలదే?
వ్యాళములకు మానవులకు వైరంబు గదా!

చం. గరిటెడు పాలు నాచిఱుత కంఠమునం దిడువారు లేకపో
యిరి కొడుకా! యనుంగు జనయిత్రి దివంబు నలంకరించినన్
గరుణకుఁ దావలంబగు నొకానొకపేదకుటీరమందు నేఁ
బెరిగితి రెండునాళ్లు విలపించుచు సర్పము పిండు తేనెలన్

మ. ఒక రే యాకలి దీరి యంగకము లందుల్లాస ముప్పొంగ నూ
రక మింటిం గని నవ్వుచుంటి నతిజీర్ణంబైన మాయింటిలో
నికి లేవెన్నెలచేతులం జొనిపి నానిగ్గుంగపోలంబు లం
టి కృపాశీతలదృష్టులం బుదుకుచుండెం జంద్రుఁ డానందుఁడై

చం. శిరమున నున్న రత్నమణి చెమ్మగిలం బడగెత్తి యాడుచుం
దిరుగుచునుండె మండలగతి న్ననుఁ బెంచినపాపతల్లి మం
దిరముకొనన్ సమస్త ధరణీవలయంబును గాఢనిద్రలో
గుఱకలు వెట్టుచుండెఁ బసికూనమనంబువలెం బ్రశాంతమై

మ. అలరుంబాన్పుల నున్న దంపతులగాఢాశ్లేషణం గంది వె
న్నెలపన్నీటను దాప మార్చుకొనుచుండె న్మందవాతూలముల్
నెల మాపేదకుటీరమస్తమున నూనెన్ బాదముల్, రెండు జా
ముల యీ దేర్పడియె న్నిశాసతికి భీముండయ్యెఁ గాముండునున్

ఉ. ఎప్పుడు కన్నుగూర్కితినొ! యే నపు డింకొకలోకమందు మా
యప్పయు నంబయు న్ననుఁ బ్రియంబునఁ గౌగిటఁ గ్రుచ్చి కన్నులన్
జిప్పిలు బాష్పపూరములచే నభిషేక మొనర్చి, యేదియో
చెప్పుట వింటిఁ దత్తుహిన శీతలదృష్టులఁ దేలిపోవుచున్

తే.గీ. కాచగోళంబులో దీపకళికవోలి
కంటి కగుపించుచున్నది కడుపుఁజిచ్చు
వేయి వచియింపనేల నక్కాయమందు
నాస్వరూపంబు లేని స్థానంబు లేదు

తే.గీ. తనివిదీరక ముద్దాడుతల్లిగారి
యమృతమయమూర్తి నాకుఁ బ్రత్యక్షమయ్యె
నాకుటీరంబు నారూపు నా యుయేల
దిక్కుదెసలేని నా ఘోరదీనదశయు

మ. పరలోకంబున దేహము న్మఱచి స్వప్న స్వల్పసంతోషమే
దురితస్వాంతతఁ దల్లియంకతలమందు న్నిల్చియున్నట్టినా
సరదా బూడిదపాలుగా గుడిసెపజ్జన్ ఱెక్కలల్లార్చి కు
క్కురుకో యంచును గోడి కూసి నను మేల్కొల్పెన్ వికారధ్వనిన్

తే.గీ. ఉదయసూర్యునికిరణంబు లొక్క టొకటి
నాకుటీరంబుకప్పు కన్నములనుండి
పసిఁడితీవెలవలెఁ జొచ్చి వ్రాలుచుండె
సలలితములైన తల్లిచూపులవితాన

తే.గీ. కడుపుపండిన యొకసాలెపడఁతిమిన్న
ప్రియముతో నన్నుఁ గొనిపోయి పెంచుకొనియె
దనదు సంతాన మనెడు ముత్యాలమాలఁ
గొలికిపూసనువలెఁ జూచికొనియె నన్ను

కం. ఇంతంతదాననై భగ
వంతునికృపఁ జపలశైశవంబుఁ గడచి ని
శ్చింతంబు నమలసుమనః
కాంతంబగు బాల్యదశను గడచితి నంతన్

చం. మిసమిసలాడు యౌవనము మేలిమిబంగరువన్నె మేనికిన్
బొసఁగె గులాబిబుగ్గలకుఁ బోఁడిమిహెచ్చె నలంక్రియక్రియా
వ్యసనమునందుఁ జిక్కి మగవానిసమక్షముఁ గాంక్ష సేసితిన్
గుసగుస ముచ్చటన్ వినుటకున్ మనసయ్యె రహస్య మేటికిన్

తే.గీ. చణకుచణకున దొణికి నిస్వనము సేయు
జలభరితమైన బిందె బుజానఁ బెట్టి
యువకులకుఁ గోర్కు లూరఁ గొండొకదినమున
నచ్చపుటొయారమున నీరు దెచ్చుచుంటి

చం. తిరిపెపుఁగూటికై బడుగు దేహము నీడిచికొంచు వీధులన్
దిరిగెడు పేదవాఁ డొకఁడు దృష్టిపథంబున గోచరించినన్
గరుణ వహించి యాతని మొగంబు నెగాదిగఁజూచి గేహమున్
మఱచి పసిండి విగ్రహము మాదిరి చేష్టలు దక్కి నిల్చితిన్

తే.గీ. వానిమోమునఁ గల దైన్యభావమునకు
కఱఁగిపోయిననాగుండెకాయనుండి
పై కుబికివచ్చు కన్నీటివఱదలోన
నోలలార్చితి నానిల్చియున్న నేల

ఉ. కాఱుమొయిళ్లు గ్రమ్మిన మొగంబునఁ బేదఱికంబుముద్ర చె
న్నారఁ బునాదు లూడిన వయస్సునఁ గంచము చేతఁబట్టియా
హారముకోసమై తిరుగునాముసలయ్యకటాక్షముల్ నిరా
శారుచిరంబులై, పలుకసాగె దయాంకితభావగీతముల్

తే.గీ. ఒకఁడు చిన్నమ్మకరడోల నూగుచుండ
నొకఁడు పెద్దమ్మకటికదృష్టికిఁ దపించు;
ప్రకృతిజనయిత్రి యనుఁగుగారాలసుతుల
నొకని ద్వేషించు నొకని నభ్యుద్ధరించు

కం. చిన్నప్పటినుండియు నా
కన్ను పరులకష్టములను గని యొరువలే
దన్నా! బడాయిగా దీ
వెన్నెల నాకనుల నుద్భవించుచునుండున్

కం. నా సౌందర్యశ్రీలకు
దాసుండై కట్టుపడ్డ తరుణుం డొకఁ డా
శ్వాసించు నెపముతోడ
న్నాసన్నిధి కరిగి, చిన్ని నవ్వులు గురియన్

తే.గీ. 'రాజవీధిని శృంగారరసము లొలుక
జలముఁ గొనివచ్చుపట్టుగాజులపడంతి
మోదుగుంబుష్పమట్లు నెమ్మొగము గంద
దుఃఖపడియెద వేల హేతువులు లేక?

సీ. బాలాతపంబు చుంబనము గావింపని చిఱుతబుగ్గలు సొమ్మసిల్లిపోయె
పసుపుఁబూఁతలతోడఁ బనిలేక శోభిల్లు చిన్నారి మేన ముచ్చెమట వోసె
పడుచువారికి రాయబారంబుఁ బంపించు కన్ను లశ్రువు లూరి చిన్నవోయె
ప్రణయదేవత కాపురము సేయఁ దగియున్న వదనలావణ్యంబు వట్టిపోయె

ఆ.వె. దర్శనీయమైన త్వద్విలాసమునకు
ముజ్జగంబు మంత్రముగ్ధమయ్యె
జలభరమున నీ భుజంబుగ్రుంగc దొడంగె
బిందె దింపుమందువే లతాంగి!'

కం. అనిపలుకరించు యువకునిc
గనుcగొని కనుగొనక యోరగాc దొలcగి గృహం
బున కేగుదెంచి, విషయము
జనయిత్రికిc జెప్పి నాcటి సాయాహ్నమునన్

తే.గీ. నేను వడికిననూలు మగ్గాన దార్చి
తల్లియనుమతి నర్ధరాత్రమున కేను
సత్వరంబుగ నాలుగజాల బట్ట
నేసి యొసcగితిc బేదవానికిc గుమార!

తే.గీ. నాcడు మొదలుగ నాభోజనంబునందు
సగము నిరుపేద కిడి తక్కుసగముతోడ
జీవనము సేయుచుంటి నా జీవితంబు
సార్థకం బయ్యెనని పురజనులు వొగడ

ఆ.వె. నన్ను బెంచునతివ కన్నసంతానంబు
వాసికెక్కునన్నుc బగ వహించి
గాసిపెట్టసాగెc గాలక్రమంబున
మారుతల్లి దివికి జారిపోయె

ఆ.వె. ఆ యసూయ పెద్దదై యక్క సెల్లెంద్రు
ఇల్లు వెడలనడిచి రేమి సెప్ప
బిచ్చగానితోడ భిక్షుకురాలనై
యండలేనిదాన నయితి నన్ను!

కం. ధనవంతుఁడు దొంగభయం
బునఁ దల్లడ మందినట్లు పురవిటనిచయం
బునకుఁ దలంకితి నెఱ జ
వ్వనమునఁ దులదూఁగు మందభాగ్యఁ గుమారా!

తే.గీ. పాప మీశీలవతి కెంత పాటు వచ్చె
ననుచు నొకనాఁడు రెండునాళ్లచట నిచట
నన్నముం బెట్టి కొందరు మిన్నకుండి
రంతియ కదన్న! మనుజుల యాదరింపు?

చం. మిలమిలలాడు మేనిపయి మృత్తిక చేరుకొనెన్, బ్రసూనకో
మలత నశించె వస్త్రములు మాసి క్రమంబుగ జీర్ణమయ్యెఁ జూ
పుల నిశితత్వముం బలుకుఁ బొందిక తొంటియొయారపున్నడల్
దొలఁగె, దరిద్రదేవికృపలో నొకలోపము లేకపోవునే?

కం. హెచ్చినయాకఁట బ్రతికియుఁ
జచ్చినగతిఁ జూపఱుల కసహ్యముగఁ బురిన్
బిచ్చం బెత్తెదు ననుఁ గని
పిచ్చిదనుచుఁ బేరువెట్టి పిలిచిరి పౌరుల్

కం. సుకములకు దూరమై కూ
టికి గుడ్డకు రోసి తల్లడిలువేళను మా
నక పోషణఁ జేసితిఁ గా
టికిఁ గాళులు సాచు న క్కడిందిదరిద్రున్

తే.గీ. లేమిచేఁ గందిపోయిన నామనస్సు
నందు సంతృప్తి తాండవ మాడఁదొడఁగె
విలసితములైన కలిమిలేములనుగూడ
కడలు పరికించునెడల సౌఖ్యంబు గలదు

కం. ఓరంతప్రొద్దులును బరి
చారికవలె ముసలివానిచరణంబులు వే
సారక భజించు న న్నొక
జారిణి యని తలంచి నింద సలిపిరి లోకుల్

కం. ఇతఁడుం బండ్లూడిన పెను
ముతుకం డిది ముద్దరాలు పొసఁగదనక యి
ట్లతికించుచుంద్రు లోకులు
సతులకుఁ బురుషులకు నోటిచాపల్యమునన్

తే.గీ. స్వాంతము నెఱుంగు దుర్భిణీయంత్రములను
నలువసృష్టించియున్న మానవునిజిహ్వా
యనృతమును సృష్టిసేయునా? యవకతవక
గమన ముండున? భువనచక్రమున కిట్లు

సీ. ఒకలేమ కసరి కుక్కకుఁ బోలి పులిసిన పిడికెడెంగిలికూడు విసరివేయ
ఒకతల్లి సహజధార్మికురాలు కరుణించి కమ్మని కూరలుం గబళ మేయ
ఒకచుప్పనాతి పెట్టకపోయకయ నోటికండూతిఁ బరుషవాక్యములు వలుక
ఒక కుటుంబిని నన్ను నికటానఁ గని యింటఁ జొరఁబడి గడియవైచుకొనియుండ

ఆ.వె. ఒక్కనాఁడు గుడిచి యొకనాఁడు పస్తుండి
నెత్తికొంగుమీఁద నిదురవోయి
ముసలివానితోడ మూఁడేండ్లు కష్టాంత
నాటకంబు నడపినాను నేను

ఆ.వె. పేదతికము పెద్దవింతచదువులబడి
దానిలోన లజ్జ గానఁబడదు
ఉదర మొజ్జ యగుచు నోరంతప్రొద్దులు
నోర్మి విద్దె నేర్పుచుండు నచట

కం. ‘అబలను దరిద్రురాలను
కబళం’బని యొక్కయింటికడ నిలిచితి బా
డబు లున్న వాఁడ నొకనాఁ
డబలామణి యోర్తు రాజహంసనడకతోన్

ఉ. గుమ్మము సేరవచ్చి పలుకుంబులకండము గుమ్మరించుచున్
‘కొమ్మ! మొగంబు తామరస కోరకముంబలె నీదులేఁతప్రా
యమ్మువచించుచున్నది కటా! జవరాల వినుంపగజ్జలు
న్నమ్మకుఁ జిక్కినావు మహిషాంగనకుం జిగురాకుపోలికన్

చం. ఋణము లొనర్చి నాదు మగఁడీలిగె నాకనుపించు నాలుగం
కణములమిద్దె బచ్చులమొగంబునఁ బెట్టితి నద్దెకొంపలో
మిణుకుచు సొమ్ము లమ్ముకొని మెక్కితి నిన్నటిదాక దేహ ధా
రణ మెటుసాగునో? విధవరాలను బిడ్డల కేమి పెట్టెదన్

తే.గీ. దానకండూతి గలుగుహస్తంబు నాది
పేదవారికి లే దనలేదు నేను
బిచ్చ మిడలేని నారిత్త వేడియూర్పు
లందుకొన్నావు మందభాగ్యవు నిజంబు’

మ. అని కంటన్దడివెట్టు నయ్యతివ సౌమ్యస్వాంతమున్ గూలిపో
యినసంసారచరిత్రమున్ బరులకేదే నీయనై లేమియం
దును నిట్టూర్పు నిగుడ్చు దానగుణ మాదుర్దాయు నామానసం
బున నానందవిషాదమేఘపటలంబున్ దీర్చె గాఢంబుగన్

కం. ‘నీ కన్న మందభాగ్య ల
నేకులు గలరమ్మ చూచితే లోలాక్షీ!
యీకుల మాకుల మన’ కని
యాకారము లేనియంతరాత్మ వచించెన్

ఉ. ఆమెపదాల వ్రాలి నిటలాంచలమంట నమస్కరించి సా
ధ్వీమణి! మందభాగ్యలగు పేదలవ్రాతఫలంబుగాక నీ
ధామము లేమి దేవతకుఁదావలమౌనె? ప్రశాంతిదీపమం
దాముద మింకునే? పరహితార్థుల కిట్టివిపత్తు మూడునే?

తే.గీ. అనుచుఁగన్నీటిపలుకుల ననునయించి
నా గడించిన నాలుగణాలడబ్బు
ప్రియముతో బాపనమ్మ కర్పించుకొంటి
జన్మము తరియించె నని చిత్తశాంతిఁ గంటి

శా. ఈడున్ జోడును లేనిసంపదల నూయే లూఁగుసంపన్నులన్
మూఁడంతస్తుల మేడ గట్టుకొని సంతోషించుచున్నట్టి మా
ర్వాడీవర్తకుఁ డొక్కరుండు మును నావాల్చూపుగాయాలచేఁ
బీడింపంబడువాఁడు నావదనమున్ వీక్షించి గుర్తించుచున్

ఉ. అక్కట! సాలెవారిజవరాలవు గావొ లతాంగి! నీవు? నీ
చక్కఁదనంబుఁ దొల్లిఁటి మజా! యెటు వోయె? బజారులోన నీ
చిక్కనివాలుఁజూపులు రచించిన తుమ్మెదతోరణాలలో
నుక్కిరిబిక్కిరై సొగయుచుండెఁగదా! మగవారిచిత్తముల్

కం. కడలేని కాలవాహిని
సుడిగుండము లెన్ని గలవొ! చూచినవాఁడున్
వడిదుడుకు లేక బ్రతుకుం
బడవ నడుపుకొనినవాఁడు వసుధం గలఁడే?

కం. అని తొంటి కొద్దిపరిచయ
మున నాయెడ నింత సానుభూతి నెఱపి త
ద్ధనవంతుఁ డాదరంబున
దినవెచ్చం బీయ సమ్మతించె ముదమునన్

తే.గీ. ధనికుఁ డిడుచుండు దినవెచ్చమును గ్రహించి
పేదవడియున్న బ్రాహ్మణవిధవ కొసఁగి
కోరి వృద్ధునిఁ బోషించుకొనుచునుంటి
నలువురిందుల భిక్షాటనంబుఁ జేసి

ఉ. ఏ నొకనాఁడు భిక్షఁ గొని యింటికి వచ్చితి నర్ధరాత్రి లేఁ
డానడలేనివృద్ధుఁడు గృహంబున నాతనిచింపిగుడ్డలున్
వానిపదాంబుజంబులను వాయనితాతలనాఁటి చెప్పులున్
గాంఁగనయ్యె ముంతయును గంచముఁ జింతిలుఁబందులుం బలెన్

కం. అందందు వెదకిచూచితి
నెందు నతనిజాడ లేమి హృదయము వగులన్
గ్రిందంబడి పొరలుచు నా
క్రందన మొనరించితిని మొగంబుం గందన్

శా. శ్రేణుల్ గట్టిరి పౌరు 'లేమిటికి జచ్చెన్ వృద్ధుఁ డేమయ్యెనే
యేణీలోచన! తచ్ఛవం' బనుచుఁదద్వృత్తాంతమున్ జెప్పినన్
'జాణా! వృద్ధునిఁ జంపితే' యని యమర్షస్వాంతులై తిట్టుచున్
ఠాణాకుం గొనిపోయి రిద్ద రది గూడం బాడియౌ నెంచినన్

ఉ. ఆ చెఱసాలజాలకములందుఁ బ్రసన్నముఖాంబుజంబునన్
దోఁచి, కటాక్షమాలికలతో నభిషేకముఁజేసి ప్రేమవా
చాచతురత్వ ముట్టిపడ సాంత్వనముల్ వచియించుచుండు న
బ్బాచులతేనివంటి శుభమూర్తి యొకం డల వృద్ధునాకృతిన్

కం. తాతా! యెందుంటివి? నా
యాతనలకుఁ బార మున్నదా? యని చింతా
ఘాతమున నలిగిపోయిన
చేతంబున నఱచి సొమ్మసిల్లిపడుటయున్

తే.గీ. ఘంటc గొట్టిన లీల నాకర్ణయుగళి
మ్రోయుచున్నది దేవతామూర్తిగళము
స్వప్నముం గాదు జాగ్రదవస్థ నున్న
నాకు వినవచ్చె వక్ష్యమాణంబుగాను

కం. దీనులపాలిcటిభాగ్య ని
ధానమ! నాతల్లి! నీసుధాజీవిత గా
థానవ్యకుసుమసురభిళ
మై నాహృదయంబు స్వర్గ మానందించెన్

చం. మొలిచినయౌవనంబు వృధపుచ్చి దరిద్రుల దేబెరింపుచూ
పులను గఱంగి, స్వీయసుఖముం బలియిచ్చినమచ్చెకంటి! చిం
తిలవల దూఱడిల్లుము వినిర్మలమైన భవచ్చరిత్రలో
వెలసిననిందలన్ దుడిచివేయును కాలము సత్యబద్ధమై

తే.గీ. కోరుకొనుమమ్మ! తల్లి! నీ కొంగునిండ
వరము లిచ్చెద నని సమీపమున నిలిచె
మూcడుగాళులముసలయ్య గాc డతండు
బ్రహ్మతేజస్వి! యొక వేల్పుcబడుచువాcడు

తే.గీ. కలుషగర్భితమైన భూవలయమందు
నేను జీవింపలే నరనిముసమయినc
దావకపదాబ్జముల సన్నిధానమునకు
నన్నుc గొనిపొమ్మనుచుc బల్కినానొ లేదో!

చం. ఒకసుడిగాలి రివ్వున మహోద్ధతి నాకడవీచి నన్ను మిం
టికిc గొనివచ్చి చంద్రధరణి న్నిముసంబున నిల్పిపోయె న
ర్భకుcడయి నన్నుc దన్పుచు నవారిగ నాపరిచర్య లందు న
య్యకలుషమూర్తి తొంటిముసలయ్య సుమా! యనుమాన మేటికిన్

కం. అని కథ ముగియించినతో
డన రాట్నపుఁద్రాడు పుటపుటం దెగిపోయెన్
గనువిచ్చి చూచినంతన
దినకరమండలము తూర్పుదిక్కున నవ్వెన్

## అనాథ

తే.గీ. పరులదుర్గతిఁ గని గుండెగఱఁగి వగచు
సదయహృదయులవీక్షణాంచలమునందుఁ
బుట్టుచుండును కన్నీటిబొట్టు వోలె!
ఏఁడి భగవంతుఁ డని సంశయింతు వేల?

---

ఉ. అన్నముఁ బెట్టవే యనుచునల్లరిచేయుననుంగుబిడ్డలన్
దిన్నగ నూరడించుచు విధిం దలపోయుచు నొక్క పేదరా
లన్నముఁ దిన్న కొండొకధనాఢ్యుని బంగరుమేడముంగిటన్
దిన్నెల వేగుచుండె నతిదీనత మున్నొకనాఁటి రాతిరిన్

ఉ. ఏతలి కన్నదో! వ్యథలనీదుట కీనిరుపేదరాలి న
న్నాతికి బిడ్డ లార్వురు తినంగల తెక్కలు రానివారు రం
జీతని యెంచెనో నలువ సేయువిలాసమొ! చంటిబిడ్డయన్
బ్రోతఁ దగిల్చుచుం బురుడువోసిననాఁడ గతించె భర్తయున్

తే.గీ. అతఁడు వోయినవెనుకఁ బిత్ర్యమగుధనము
జోలెయును సంచి దొరకె నిల్లాలి కయయొ!
బిడ్డలా నేదరులు చంటిబిడ్డ యొకతె
యెట్లు పోషించు? నెటువోవు! నేది దిక్కు?

తే.గీ. అధికదైన్యంబు మోముల నధివసింప
నడచుపీనుంగులో యనఁ గొడుకుఁగుఱ్ఱ
లామెవెనువెంట నడువ గ్రామాంతరంబు
వాసి వచ్చిన దొక యమావాస్యనాఁడు

ఆ.వె. ఒడలిమీఁదిబట్టయును సత్తుగాజు లా
జోగురాలియాస్తి భోగ మెల్ల?
నేడుపొట్ట లింక నేరీతి నిండునో
బ్రతుకు లెట్లు తెల్లవాఱఁగలవొ!

ఉ. 'నాయనలార! మీకడుపునం గల యాకఁటిచిచ్చు లార్ప నా
కాయముదక్క గవ్వయును గల్గదు నాకడఁ దెల్లవాటినం
బోయి గడించి తెచ్చెదను బోనము నోపికపట్టుఁడయ్య అ
మ్మాయికిఁగూడఁ బాలు కఱవైనవి యన్నములేమి నాకునున్'

ఆ.వె. అనుచు నురలివచ్చు నశ్రుబిందువులను
దుడిచికొనుచు జంటిబుడుతదానిఁ
జిచ్చికొట్టుచుండె క్షితిమండలం బెల్లఁ
గునికి నిద్రవోవు కుటిలరాత్రి

కం. ఉప్పరము నీలియద్దపుఁ
జిప్పవలెం గనటువోయి చెన్ను వహించెన్
గప్పరకప్పరచీకఁటి
తిప్పలపై నింక నావరించుచునుండెన్

ఉ. విచ్చినమల్లెపూవువలె వేకువయయ్యె ద్విరేఫఝుంకృతిన్
మచ్చరకించు రాట్నపునినాదము లొప్పె గళుక్కు లుక్కు మం
చచ్చట నిచ్చటం జిలుఁగు టందెలుమ్రోయ జలంబు దెచ్చుచున్
ముచ్చటలాడు నూరి ననబోఁడులసందడు లయ్యె నయ్యెడన్

మ. పదియారేఁడుల నిండుజవ్వనము లావణ్యంబు మిట్టాడ ను
న్నది లే దన్నప్రశంసకెక్కి పిడికింటన్ జిక్కుమధ్యంబుతో
బెదురుంజింకకనుంగవం గలుగు తన్వీరత్న మాయింటికు
ట్టది చూచెం గలయంపిఁ జల్లుచు వసారాయం దనాథాంగనన్

శా. ఓసీ! యెవ్వతె వీవు? నీమగనిసొమ్మున్నట్లు పాపిష్ఠురా
లా! సంసారము బెట్టినావు మొగసాలన్ లేచిపొమ్మంచు నౌ
దాసీన్యంబుగ మాటలాడి, జలపాత్రన్ గాలితోఁ దన్నినన్
గాసంతేనిఁ గలంక కయ్యబల సంతానంబు వెంటాడఁగన్

తే.గీ. కదలి చనుదెంచి వీధివృక్షములనీడఁ
గూలఁబడి తూలుచుండెఁ గొడ్కులును దాను
అంత నొకబుద్ధిమంతురా లాదరిద్ర
మూర్తులం జూచి కరుణించి ముదలకించి

ఆ.వె. ఓసి పేదరాల! యూర నేఁ డొకగొప్ప
పెండ్లి గలదు నీకు బిడ్డలకును
గడుపునిండ బువ్వ గల దాగృహస్థుండు
పెట్టుపోఁతలందు వెలితిపడఁడు

ఆ.వె. చలిది గలదు రమ్ము సంతానముం గూడి
ప్రస్తుతంబు క్షుత్తు వాపుకొనుము
బాలు రక్కటకట తూలుచునున్నారు
అన్న మెప్పు డింత తిన్నవారొ!

కం. ఆకలిదప్పులు దీరెను
నీకమ్మనిమాట విన్న నిర్మలహృదయా!
లోకంబునందు నెల్లఋ
రాకాసులవంటి కఠినురాం డ్రుండెదరా?

చం. చుఱుకుచుఱుక్కునం బలుకు సూదులు గ్రుచ్చి యదల్చి కాపుసుం
దరి జలకుండికం బదమునం బడదన్నినచేఁత చిత్తమున్
గఱకఱఁ గోయగా నయిన గాయము మాన్పె భవన్మృదూక్తి త
ల్లిరొ! యెవరింటఁ బుట్టితివి? లేమలలో నను నుద్ధరింపఁగన్

 మ. అనుచున్ గన్నుల నీరుగ్రుక్కుకొని యయ్యైతావులన్ క్షుత్తునన్
గనులుం బొట్టలు గ్రుంకి దీనముగ నాక్రందించుసంతానమున్
గని, తల్లీ! చనుదెమ్ము నీసుతులభాగ్యం బంచునుం బోయి వే
కొనితెచ్చెం బులిగూడు భిస్సటము నాకుంబొత్తులం గొంగునన్

తే.గీ. కుడువు మనిచెప్పి బంగారుగుడులు గట్టి
పెట్టుచుందురు నరులు నైవేద్యములను
సృష్టికర్తకు దాని భుజింపఁ డతఁడు
భిక్షుకునిచేతి యెంగిలిపిడచ గాక

క. అది యారగించి పేదల
యుదరంబులు చల్లఁబడియెనో లేదా! నభ
స్సదనమునఁ దిరుగు మేఘము
లుదరంబుల నించికొనియె నుదధిజలంబుల్

సీ. ఏనుంగుచెక్కిళ్ళపై నివాసము సేయు కన్నుమిన్నెఱుఁగని గర్వమునకు
కరుణాలవం బెఱుంగని క్రోలుపులినోట వర్ధిల్లు క్రూరస్వభావమునకు
అత్తప్రత్తిదళంబులం దుట్టిపడుచున్న నినుముట్టరాదను నియమమునకు
పురివిచ్చియాడు నెమ్మిలకంఠమునఁ దోఁగు కలదు నా కను నహంకారమునకు

తే.గీ. గండుటెలుకలప్రత్యంగకమున నలరు
పరులకొంపలు దినివేయు స్వార్థమునకుఁ
జిక్కువడకున్న నిరుపేద బక్కదాన!
కరుణ కిరవైనదాన! స్వాగతము నీకు

చం. కినియుచుఁ బ్రొద్దు నెత్తిపయికిం బయనించినదాక, భూమిశ
య్యను బవళించి పొంత నడయాడుచుఁ బాడుచు నున్న కూర్మినం
దనులను ముద్దులాడుచు ముదంబునఁ దేలుచుఁ బొద్దుపుచ్చుచుం
డెను తరుకోటరంబున నటించెడుపక్షుల నొక్కపక్షియై

తే.గీ. పంగనామాలు నుదుటఁ దుఱంగలింప
పట్టుపంచెలు బొజ్జలఁ బరిహసింప
బోజనమునకు బిరబిరఁ బోవుచున్న
విత్తవంతుల నరసె నప్పేదరాలు

మ. ఎడగాఁ బొమ్మని చీదరించుకొనువా రీవంక నావంక నొ
త్తిడిసేయం గర మెత్తి మ్రొక్కుచు మహాదీనంబుగాఁ బ్రక్కకున్
బుడుతల్ దానుఁ దొలంగుచుం బెదరుచుం బుత్రీసమేతంబ కా
అడవిన్ దాటినయట్లు కష్టమున రథ్యల్ దాటి శీఘ్రంబుగన్

కం. పెండిలిగీముం గని క
ట్టెండ కచట నున్న నింబవృక్షముకడఁ గూ
ర్చుండెం గొడుకులతోఁ బెను
గండము గడచినవిధంబుగాఁ గరుణముగాన్

ఉ. త్రొక్కుడుబండిపై నడక క్రొత్తగ నేర్చినషోకిలా యొకం
డెక్కడనుండియో యచటికేగుచు నంకెకురాని భార్యతో
జిక్కుల నందుభర్తవలెఁ జేతులపట్టుఁ దొలంగి వ్రేల్మిడిన్
ముక్కున నెత్తు రొల్కఁ బడిపోయె గుభిల్లునఁ బేదరాలిపై

చం. ముసలిది చచ్చె చచ్చెనని మూఁగిరి కొంద ఱతండు క్రుద్ధుఁడై
కనరుచు లేచి కన్నులకుఁ గావరమా? యటఁ జావకుంటివా?
పసరమ! యంచు రక్తమునఁ బైవసనంబు మునుంగుచుండగా
విసుగును సిగ్గు నాస్యమున వ్రేల గమించుచునుండె వీథులన్

కం. పిల్లలు ‘గీ బే’ యనుచును
గొల్లున రోదింపఁ గట్టుకోక రుధిరపు
న్వెల్లువను మునుఁగ నల్లన
నల్లాడుచు లేచెఁ బేదరాల్ రాల్గరుగన్

ఉ. ఏఁడు సముద్రముల్ గడచి యెక్కడ నేపనిమీఁదఁ బోయి యు
న్నాడవురా! పరాత్పరుఁడ! నాకడగండ్లకు మేర యున్నదా?
యేడకుఁ బోవుదాన? నెటు లీకసుగందులపొట్ట నించు నీ
యాఁడు దటంచు నేడిచె మహాకరుణంబుగ డొక్క క్రుంగగన్

కం. అక్కడ నిలిచిన వారల
నొక్కండును నేల కొఱఁగియున్న పడఁతిపై
నక్కటిక మూని ముట్టరు
దిక్కుదెసయు లేనివారి స్థితి యింతె కదా?

చం. అట నొకమేడపై సరసమాడుచు దంపతు లిద్ద రప్పుడ
చ్చట గుమిగూడియున్న జనసంఘము నారసి పృచ్ఛసేసి యా
రటపడి క్రమ్మరం బ్రణయ రాజ్యవిహారము సేయఁజొచ్చి ర
క్కట! సుఖ మొక్కచోటఁ గడగం డ్లొకచోటఁ గదా వసుంధరన్!

కం. పరమేశువిలాసమ్ములు
కరము దురూహ్యములు శిశువుకాయమునందున్
జిఱుగాయమేని లే కతి
సురక్షితముగా హసించుచుం బడియుండెన్

తే.గీ. ఓయి! నాస్తికుఁడా! విను మొక్కమాట
అరసియుందువు ఘోరదృశ్యంబు నిచట
మృత్యుదేవతకోఱలు మెఱయునపుడు
శిశువు నేమహాశక్తి రక్షించెనోయి!

సీ. పరువెత్తివచ్చు పర్వతమాలికలవంటి జలధిభంగముల నవ్వలికి గదిమి
బ్రహ్మాండగోళంబుపైఁ బ్రయాణము సేయు నినబింబమును తూలనీక నిలిపి
పెళపెళార్భటుల మర్త్యులమీఁది కుఱికెడు పిడుగుల నోరగా విసరివయిచి
సృష్టిలో నొకచిన్ని చీమ కాలము సేయ పొడమినకన్నీట మునిఁగి తేలి

తే.గీ. గడియ తీరిక లేక లోకమును గావ
పరువులిడుచుండు దీనులపాలివాఁడు
నిజకరాబ్జంబు నీచిట్టి నిసుగు మీఁద
నిలిపె నొకనిమేషం బది నీ వెఱుఁగవు

ఉ. చేరువ నుండి యప్పుడఁతి చేటు సమస్తముఁ జూచుచున్న సం
సారులలో నొకండు కడు జాలి వహించి భిషక్కునింటికిం
జేరిచి యండ నుండ నొకని న్నియమించి చికిత్ససేయగా
నారువరాలరొక్కము నిరాకులుఁడై యిడె వెజ్జుదోసిటన్

కం. ఓ లలన! నీమగండొక
మాలది పడిపోవ నంటి మైలవడియె వై
ద్యాలయముఁ జేర్చినాఁ డిఁక
నీలాగుననయినఁ గుడియు నెడమయు లేదా?

తే.గీ. ఎవ్వరికి లేని పుణ్యంబు నితఁ డొకండె
నాచికొనివచ్చుఁగాఁబోలు నాతిమిన్న!
యెవరికర్మము వారిది నీ వెఱుఁగవొ?
ముక్తిగలుగునె మాలలఁబులిమికొనిన?

ఆ.వె. అనుచు నమ్మలక్క లతనియిల్లాలికిఁ
ద్రాపి రెలమిఁ గ్రోధరసము నబల
శివము పట్టినట్టు చిందుద్రొక్కుచునుండెఁ
బ్రకుపితోగ్రశంభురాణి వోలి

కం. గంగను మునిఁగినభక్తుని
యంగంబుల నోలలాడునానందం బు
ప్పొంగెడునెదతో సదనము
ముంగిట నడుగిడినభర్తమోముం గనుచున్

కం. రావలవ దింటిలోనికి
నావల నిలుచుండి స్నానమాడు మనుచుఁ గ
న్గ్రేవల నదరులు గురియగ
నావెలఁది వచించె విభు ననాదరణమునన్

చం. ఇది యొకక్రూరురాలు ఇపుడేను వివాదము పెట్టుకొన్నచోఁ
బదుగురు నన్నుఁ దిట్టి తలవంపులు సేయుదు రూరకుంట యి
య్యదనున నుత్తమం బని, నిజాంగన నిల్పినచోట నిల్చి కో
విదమతి స్నానలీల నెఱపెం గులభేదపిశాచతృప్తికై

తే.గీ. భోజనముఁ జేసి కేలఁ దాంబూల మంది
పోకచెక్కలు రెండింటి బుగ్గ నునిచి
చిఱుతరతనాలపీట నాసీనుఁ డగుచు
నింతి నాహ్వాన మొనరించి మృదులఫణితి

చం. 'అలుక శమించెనా? జలక మాడినయంతనె? మాలదానిపి
ల్లలకడగండ్లు చూచి బహుళంబుగఁ దప్తము నందు నామనో
జలజము మైలవడ్డ దది స్నానము చేసెనె? వెఱ్ఱిదాన! యీ
వెలుపలిశుద్ధి జీవులకుఁ బెట్టునె? పోయునె? ముక్తినిచ్చునే?'

కం. స్నానము సంధ్యావందన
మేనాఁడో! మరచినాఁడ విపుఁ డీవు కిర
స్తానులలోఁ గలయుటకొఱ
కా నీతులు సెప్పుచుంటి? వనుచు విముఖియై

చం. పరుగిడునల్లత్రాచువలె భామిని కీల్జడ సంచలింపఁగా
శిరము మరల్చి లేచి నిరసించుచు ముంగిఁటి కేగె నంత నా
సరసుఁడు కోపగింపక, విచారము సేయక, స్వీయకార్యత
త్పరుఁ డయి లేచిపోయెఁ బెడవాదన సేయరు నీతికోవిదుల్

కం. తనపనులు మాని మరునాఁ
డనాథశరణాలయంబునందు విడిచె న
య్యనదకుమారులఁ గరుణా
వననిధులకుఁ బరహితంబు పబ్బంబు గదా?

తే.గీ. మేనిగాయంబు లలనల్ల మానిపోవ
వనిత కాలక్రమంబునఁ బట్ట గట్టె;
వసుధపై నూక లున్న సంపన్నుఁడెంతొ
బడుగుపేదయు మృత్యుదేవతకు నంత!

కం. ఒకయరుణోదయమున భి
క్షకుఁ బోవుచునుండ నిందు కౌతుకమతులై
పకపక నవ్వుచు మూగిరి
స్వకుమారులు చుక్క లూడిపడినవిధమునన్

ఉ. పోయినప్రాణముల్ మగుడఁ బొందినిఁ జొచ్చినలీలఁ దంఁద్రులా
రా! యని కౌగిలించుకొని యాసమెయిం గడు ముద్దులాడి తా
నీయెడ నాయెదం బికిరమెత్తిన రొక్కము నాఖదమ్మిడీ
లాయమ పంచియిచ్చె హృదయంబును బంచినలీల వారికిన్

కం. అన్నము సరిపోవునె? నా
కన్నకొడుకులార! విసిఁగి కసరుకొనరుగా
చిన్ని సహోదరు? నచ్చట
నున్నమహామహులు చూతురో మిమ్ముదయన్?

కం. జగడములు బెట్టుకొనకుఁడు
వగఁగుందిన నాదరించువా రెవరన్నా?
యగచాట్ల నందు నడపీ
నుగు నే నుండుదునొ చత్తునో! సుతులారా!

కం. అని పెద్దకొడుకుకడుపునఁ
దనశిరమును నిలిపి కొంతతడవు వగచి రం
డని పిలుచుచదువులయ్యను
గని చేతులు మోడ్చి బాష్పగంగాముఖియై

ఆ.వె. వీరు దిక్కులేనివారు పంతులుగారు!
ప్రేమతోడ నాదరింపవలయుఁ
గూలి నాలి జేసి కొంతశక్తికొలంది
ముట్టఁజెప్పుకొందు ముందు కనుచు

కం. చరణముల నంటినం గురు
వరుఁడు కనికరించి దుఃఖపడవలదు సతీ!
పరమేశ్వరుండు లేఁడా?
నరుండు నరు నుద్ధరించునా? వెఱిదానా!

చం. లలన! యొకమ్మ పెట్టు కబళంబు భుజించుచు మందభాగ్యవై
నలువురియిండ్లపంచల దినంబులు బుచ్చెడు నీబహూకృతుల్
వలయునె? తప్పుసు మ్మిటులఁబల్కుట వర్ణన కందరాని బి
డ్డలపయి నున్న మోహ మకటా! పలికించు ననేకరీతులన్

కం. బారెడుప్రొద్దెక్కిన దిఁక
రా రం డని పిలువ బిరబిరం జెలియలికిన్
నూరారుముద్దు లిడి చని
రూరు వెడలి బాలు రంబయుం జనుదేరన్

చం. "ఇది పొలిమేరరాయి, జననీ! యిఁక నిల్వుము రేపటెండయు
మ్మదమునఁ గందిపోవును సుమా! మన చిట్టిది వచ్చిపోవుచుం
డెద" మని పెద్దవాఁడు దయనీయముగా వచియింప శోకవా
రిదమువెలార్చు బాష్పనిబిరీసతరంగితగండభాగయై

చం. చినిగినపైఁటకొంగు నొకచేతఁ దనూజశిరాన నుంచి నం
దను లెడమై నిరీక్షణ పథంబును దాఁటినదాకఁ జూచి వె
చ్చనిహృదయంబుతో నడువసాగె ననాథ పురంబువంకకున్
గనుల మెలంగుబిడ్డల వికాసముఖంబులు సంస్మరించుచున్

ఉ. పచ్చనివన్నెతోఁ జిగురుబట్టి పసందులు సింద నాలిగా
ద్వుచ్చలితంబు సేయఁ దలలూచుచు నున్న పొలాలు దాటి య
య్యచ్చఁపు జోగురాలు పురమల్లనఁ జొచ్చి కుమార్తె నెత్తి పా
లిచ్చుచుఁ గూరుచుండె నొకవృక్షమునీడ క్షుధాకులాంగియై

సీ. ఎవఁ డారగించు నమృతభోజనంబున గలిసెనో యీలేమ గంజిబువ్వ
ఎవఁడు వాసము సేయు శృంగారసౌధాన మునిఁగెనో యిన్నారిపూరిగుడిసె
ఎవనిదేహముమీఁదిధవళాంబరములలో నొదిగెనో యిన్నాతిముదుకపంచె
ఎవఁడు దేహము సేర్చు మృదుతల్పములలోననక్కెనో యీయమ్మకుక్కిపడక

తే.గీ. వసుధపై నున్నభోగసర్వస్వమునకు
స్వామిత వహించి మనుజుండు ప్రభవమందు
నెవఁ డపహరించె నేమయ్యె నీమెసుఖము
కలుష మెఱుఁగని దీనికొడుకులసుఖంబు?

కం. ఉఱుములు మెఱుములు గలయొక
శరదము గగనమున మసలి క్షణకాలమునన్
గురిసెం బ్రచండవర్షము
నిరులు గవియ మన్ను మిన్ను నేకమగుగతిన్

కం. జడివాన గురియులోపల
నడువీధికి నడచి మనయనాథ శిశువుతో
గడగడ వడఁకుచు నొకచా
వడిలోనికిఁ బోయి నిలువఁబడియె బెదరుచున్

ఆ.వె. వానలోనఁ దడిసివచ్చిన పెంపుడు
కుక్క కుపచరించునొక్కపురుషుఁ
డాగ్రహించి పంచ నంటుకొన్నావంటే
యరుగు మరుగు మనుచు నాదరించె

ఉ. ఈ పసిబిడ్డతోడ నిపుడేడకుఁ బోయెదనయ్య! యిచ్చటన్
గాపుర ముందునా? యుదయకాలమునుండియుఁ బచ్చిగంగ లే
దోపిక జారె మీసుకృత మూరకపోవునె? వర్షమాగని
మ్మో పరమోపకారి! యని యూపిరి కన్నుల నిల్పి పల్కినన్

కం. కనికరపుమొలకఁ లాతని
యనాదరణ మలమియున్న యంతఃకరణం
బునఁ బొటమరింప నిష్టము
ననిష్టమును దెలుపుమౌన మతఁడు వహించెన్

గీ. అతనిపెండ్లాము కరుణారసార్ద్రహృదయ
నాథునకు లేనికొన్ని సుగుణములు గలది
మంచి కుదురైనయాఁడుది మాటకారి
యదియునుం గాక చదువుకొన్నదియుఁగూడ

కం. మెడ దిరుగనిసొమ్ములతో
వడి వంకయు లేని హసితవదనముతో సం
దెడుకొప్పుతోడ మదనుని
పిడియేనుఁగువోలె వచ్చి ప్రియవచనములన్

కం. ఎవ రైననేమి? రక్షణ
మవశ్యకర్తవ్యమే కదా? నరులకు ధ
ర్మమునకును గలుగునే కుల
వివక్షతయుఁ జిన్న పెద్దభేదము నాథా!

తే.గీ. అని మనోహరునుల్లంబు కనికరింప
మధురమధురంబుగాఁ గొన్ని మాటలాడి
పేదరాలికి భోజనభిక్షపెట్టి
ప్రేమ వర్షించె నాఁటివారిదముకరణి

తే.గీ. మగఁడు గొట్టిన రోదించి మానుకొన్న
పెద్దగయ్యాళివలె వాన వెలిసిపోయె
మమత లుడిగినసన్యాసిమనసువోలె
గగనమండలం బెల్ల నిష్కలుష మయ్యె

సీ. ఆకటం దూలు సస్యశ్యామలక్షేత్రకన్య గడుపు చల్లగా భుజించె
బక్కచిక్కినకొండవాగుం దటాకంబు జిటుకలో నుప్పొంగి చియ్యబట్టె
ముమ్మాయిముత్యంబువోలితామరమీఁద వర్షబిందువు తాండవంబు సేసె
నడయాడురతనంబు వడువున నాడాడ ఆరుద్రపురువు ప్రత్యక్షమయ్యె

తే.గీ. చెలఁగి చేయార దానంబు జేసి చేసి
కొఱత వడియున్న వాని కాపురమువోలి
యుబ్బు సెడి తూలె నొకచిన్ని మబ్బుతునుక
యుత్తరంబుగ దిక్కుల కొత్తిగిల్లి

# విజ్ఞప్తి

పఠితృమహాశయులకు –

తెలుఁగుపత్రికలకుఁ దలమానిక మైన భారతి దోఁగాడనేర్చిననాఁటఁగోలెఁ బ్రౌఢయై, వలపులూరఁ బలుక నేర్చిననేఁటివఱకు మేన నూనినపద్యవ్యాసములే నేఁటి కీగ్రంథరూపమును దాల్చినవి. ఇందలి పద్యములలో విశేషభాగ మింతకుముందే రసపిపాసువుల పరిచయము నకుఁ బాత్రములగుట నా భాగ్యముగాని వేఱుగాదు. పత్రికా ముఖమున నన్నెఱిఁగిన సహృద యులు లేఖాముఖమున నాకుఁ జూపునాదరాభిమానముల నరసి, 'భాషాభిమానము తెలుఁగు నాటఁ జావలేదు, నాజన్మము ధన్యమైన' దని సమ్మదాశ్రువులు రాల్చుచు, ధనాభావమున నిరంతరముఁ గుమిలిపోవు నాయాత్మ కూఱటఁ గల్పించుకొనుచుందును.

ఈ సందర్భమున 'ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేకదా' యన్న చేమకూరి వేంకటకవిమాట నించుక యనాదరింపవలసివచ్చినందునఁ బ్రాజ్ఞులు మన్నిం తురుగాక. నే నేగతి రచియింతునో చెప్పఁజాలనుగాని, సమకాలీనులవాత్సల్యమునకు గుఱియైతినని చెప్పికొనుపుణ్యము నాకుఁ గల్పించిన తెలుఁగువారికి నేను గృతజ్ఞుఁడను. ఎవరో యొకరిద్దరు బుద్ధిమంతులమాట నిటఁదడవనేల?

శ్రేయమునకు విఘ్నములు మిక్కుటముగదా? ఈ గ్రంథమున కంతరాయము లెన్నో కలిగినవి. నేఁడు తొలఁగినవి. నా రచనలు తెలుఁగుపొలమున నీషన్మాత్రమైనను జైతన్యమును గలిగింపఁజాలినచో, నా కిఁక నేమి కావలయును? 'గడన కెక్కినయాంధ్రపుత్రుఁడను నేను' 'మడమద్రిప్పనియాంధ్రవీరుఁడను నేను' అని వాకొన్న నాగీతము, నావాణి, శాశ్వతకీర్తిని నాకు సమకూర్పఁగలదు. నిరతిశయానంద సామ్రాజ్యమున కధినేత నయ్యెదను.

మఱొక మనవి. ఇందలి పద్యములు, భావములు, జాతీయము లందందుఁ గవికుమారులు తమ వ్రాఁతలలోఁ బ్రయోగించుకొనుచున్నారు. తొలుత నుండి నారచనలు భారతిం దిలకించురసజ్ఞు లందలి ముందు వెనుకలను గమనించి, సత్యమును నిర్ధారింతురు గాక. నిర్భరానందమున నే నీకృతిని బరిచితాంధ్రలోకమునకు సమర్పించుకొనుచున్నాను. దీని నెన్ని భాగములుగా నరసి యానందింపఁగలదో నా తెలుఁగు తల్లి! భారము తనదిగాని నాది గాదు. భిన్నభిన్న శీర్షికలు గలనాయీకావ్యకుసుమదళములను గుత్తిగట్టి తనజననీజనకుల కంకితమిప్పించి సరస్వతికొప్పున నుంచునవకాశముఁ గల్పించిన ప్రాడ్వివాకశిరోమణులును గుప్తదానశౌండులును గుంటూరువాస్తవ్యులు నగు మ.రా.శ్రీ ఏకా దండయ్య పంతులు గారికి నమస్కారములు.

జి. జాషువ

# అంకితము

సీ. శ్రీమదాత్రేయగోత్రీయుఁ డార్వేలనియోగి భూసురుఁడు గుంటూరు వాసి
ఏకాన్వవాయంబు హీరహారమునందు వెలుఁగొందునురవైనకొలికిపూస
దానంబులోఁ గ్రొత్తదారిఁ ద్రొక్కినదాత ఆడంబరములేని న్యాయవాది
కులమువారలు పెంచుకొనుప్రతిష్ఠాభర్మ హంసికాయువు బోసినట్టిఘనుఁడు

తే.గీ. వసుధ గ్రుంగినఁ బట్టినపట్టు విడని
ఆధునికభగీరథుఁడు దండార్యమౌళి
అట్టిప్రాజ్ఞునిజనయిత్రి కంకితమయి
నాకవిత్వంబు చిన్నారినవ్వు నవ్వె

# భరతమాత

సీ. సగరమాంధాత్రాది షట్చక్రవర్తుల యంకసీమల నిల్చినట్టిసాధ్వి
కమలనాభునివేణుగానసుధాంబుధి మునిఁగి తేలిన పరిపూతదేహ
కాళిదాసాదిసత్కవికుమారులఁ గాంచి కీర్తి నందిన పెద్ద గేస్తురాలు
బుద్ధాదిమునిజనంబులతపంబున మోదబాష్పము ల్విడిచిన భక్తురాలు

తే.గీ. సింధుగంగానదీ జలక్షీరమెపుడుఁ
గురిసి బిడ్డలఁ బోషించుకొనుచునున్న
పచ్చిబాలెంతరాలు మా భరతమాత
మాతలకు మాత; సకల సంపత్సమేత!

# కృతిస్వామినీ ప్రశంస

శా. శ్రీయేకాన్వయరత్నభూషణము, లక్ష్మీసుప్రసన్నేక్షణ
చ్ఛాయాభాసితుఁ డైనదండయను భాషాపోషకుం బున్నెముల్
బూయన్ గాంచినరుక్మిణీసతి నెదంబూజించి, యే నంకితం
బీయం బూనితి నస్మదీయకృతి బ్రాహ్మీదేవతాప్రీతిగన్

శా. ఏలోకంబున నుంటివో; సుగుణవల్లీ! రుక్మిణీదేవి! యిం
దాలంబం బిసుమంత లేనికృతికన్యాజాలముం బ్రేముడిం
బాలింపంగలపుత్రరత్నమును సంపన్నుం బ్రసాదించినా
వీలోకానకు, నీబుణగ్రసిత మయ్యెన్ దెల్గుసాహిత్యమున్

మ. మును నీ విచ్చట నిల్పిపోయినయశోమూర్తిం బ్రపూజించి, యీ
తెనుఁగుంగబ్బము ఖండగీతికలు భక్తిన్ నీకు నర్పించితిన్
వనితాలోక విలాసభూషణమ! సుబ్రహ్మణ్యునిల్లాల! చ
క్కనినీదివ్యచరిత్ర మత్కృతికి బంగార్నీరు వోయించుతన్

మ. విసు వొక్కింతయు లేక నాథుని మనోవీధిం బ్రవర్తించి, సా
రసనేత్రాసముదాయనిర్మలశిరోరత్నంబు నాఁ గీర్తి పె
ల్లెసఁగన్ డెబ్బదినాలుగేండ్లు మని, ప్రాణేశాంఘ్రిపద్మస్థలిన్
బసుపుం గుంకుమతో గతించితివి నీ భాగ్యంబు సామాన్యమే

సీ. ఒకనాఁడు నీచంక నుండి నీముద్దులజలకంబు లాడిన చంటివాఁడు
ఒకనాఁడు నీపెట్టునోగిరంబు భుజింప మారాముచేయు బంగారుకొండ
ఒకనాఁడు నీచిత్తమూగ 'నమ్మా'యని పలుకరించిన నీదు భాగ్యరాశి
ఒకనాఁడు నీదేహ ముప్పొంగ నలనల్లనుడువ నేరిచికొన్న కడుపుఁబంట

తే.గీ. దండయాగ్రణి నీకూర్మితనూభవుండు
ఖండకావ్యంబు కృతిని నఖండభక్తి
నంకితంబుగ నిప్పించె నందికొనుము
తనువు పులకింప, హస్తపద్మములు సాఁచి

మ. గెలనా! నీతనుజన్ముతోఁడ సహపంక్తిన్ బంచభక్ష్యాలతోఁ
గలమాన్నంబు భుజించుబాలకుల మూకంజూతువో! వారు పే
దలు, విద్యార్థులు, కట్టుఁబుట్టములు విత్తం బిచ్చి పోషించి, దా
తలలో దాతయనం బ్రసిద్ధివడసెన్ దల్లీ! సుతుం డిద్ధరన్

కం. సంపాదించినవిత్తము
సంపాదన మాని సకలసత్కర్మల వె
చ్చింపం బూనినదండయ
పెంపుం దెగువయును గలయభిజ్ఞులు గలరే.

కం. కఱ కొక్కించుక పలుకుల
మెఱుపువలెం దోచుగాని మెత్తనివెన్నన్
దిరిసెనపుఁబూలగుత్తిం
దొరయు న్నీసుతునిహృదయ తోయజ మబలా!

ఉ. ముచ్చట సెప్పుచో నడుగcబోయినవాని హృదంతరాళమం
దిచ్చునొ; యీయఁడో; యని యొకించుక సంశయ మంకురించుc దా
నిచ్చిన నేస్గుపాడియసుమీ! తినువానిలలాట రేఖలోc
బొచ్చెముగాక, నీసుతునిc బోలువదాన్యులు లేరు మానినీ!

ఉ. ఊరక వెట్టిగా నొసcగి యుక్త మయుక్తమనాక, పేరుకై
బారలు సాcచc డన్నిట శుభంబని తోచినగాక, యిచ్చుచో
నేరివియున్ సిఫారసు లొకింతయు గిట్టవు, రుక్మిణమ్మ! యే
తీరునc గంటి విట్టి, యొరదీసిన కత్తిని, భక్తసత్తమున్?

కం. రేయింబవ లొరులకు మే
ల్సేయవలయు ననెడునమల చింతయకానీ
నీయాత్మజునకు మరి వే
రేయోచన లేదు శర్వరీనాథముఖీ!

సీ. కొమరునిధర్మ కార్యముల పోషణమున మొలిచె, మేల్కిరితిమొగలితోcట
సుతుcడు గట్టించుప్రోన్నతసత్రశాలల మొరసె, యాత్రికులకిన్నెరలవినుతి
తనయుండు ద్రవ్వించు ఘనతటాకములలోc జెలcగె, బేడిసమీలచెంగనాలు
తనుజుండు నెఱపుసంతర్పణంబులలోన నిండెc బేదల కేల నేతిజిడ్డు

తే.గీ. నందనునివదాన్యత రంగనాథునెదుట
బ్రహరితోcగూడ నొకమంటపంబు మొలిచె
దైవభక్తుల పెనుజాబితాలయందు
ప్రథమమునc జేరె నీకన్నవానిపేరు

మ. తన జన్మస్థలిc బ్రత్తిపాటిపురి సత్రం బొండు గట్టించి, బా
వినిc ద్రవ్వించి, పురాణమున్ జరుప నుర్వీనిర్జర శ్రేష్ఠు నొ
క్కని నిల్పె న్నెలజీత మిచ్చి, ఘనభక్తశ్రేణి దండాభిధా
నునిc గీర్తింతు రనారతంబు నది నిన్నున్ ధన్య గావింపదో

కం. సమదృష్టి నే్త్రయుగమున
సముద్భవము నంద నిత్యసత్యవ్రతుఁడై
కొమరారుసుతునిశిరమున
నమరులతోఁ గురియు మమ్మ యాశీస్సుమముల్

కం. కులశీలరూపగుణముల
కలాప మగురుక్మిణమ్మగారిసరస ని
మ్ముల నేగతి మెలఁగెదొ! యొ
ప్పులకుప్పా! నాదుకబ్బపుంగ్రొమ్మెలఁకా!

కం. పతికి సతి, సతికిఁ బతి యను
నితాంతధర్మంబుఁ దలఁచి నీకొమరుఁడు నీ
పతి నిటువలె నా రెండవ
కృతిపతిఁ గావించె, మోదమేకద నీకున్

ఉ. మేలిగుణాలకుం బసిఁడి మేడ, దయాపరురాలు, దొడ్డయి
ల్లాలు, కుమారమానవిభవాఢ్యుల గాంచినచల్లనమ్మ, స్వ
ర్గాలయరత్నదీపమయి యంబరవీధులనాడు, రుక్మిణీ
శీలవతీలలామ గళసీమకు మత్కృతి జాజిదండయౌ

## గిజిగాఁడు

మ. జిలుగుంబంగరు రంగులం గులుకు మేల్చిన్నారి పూగుత్తిసొ
మ్ములు గీలించిన తుమ్మకొమ్మలకు నీవు న్నీసతీరత్న మూ
యెలగీమున్ దగిలించి రేఁబవలు హాయిం దూఁగరా; గాద్పుబి
డ్డలు మీ కూడిగ మాచరింప, గిజిగాడా! నీకు దీర్ఘాయువౌ

ఉ. తేలిక గడ్డిపోచలను దెచ్చి, రచించెద వీవు తూఁగుటు
య్యేలగృహంబు, మానవుల కేరికి సాధ్యము గాదు, దానిలో
జాలరు, లందులో జిలుఁగు శయ్యలు, నంతిపురంబు లొప్పగా
మేలు భళీ! పులుంగుటెకిమీడవురా! గిజిగాడ నీడజా!

చం. కులుకు పసిండినిగ్గుల దుకూలములన్ ధరియించి, ముద్దుబి
డ్డలును, బడంతి, నీపొదిcగిట న్నిదురింపcగc, గన్నెగాడ్పు లూ
యెలసదనంబు నూcచ, భయమింత యెఱుంగక కన్నుమూయు, నీ
యలఘుసుఖంబు మాకు గలదా? గిజిగా! యొకతేని కున్నదా?

తే.గీ. అందమున నీకు నీడగు నందగాcడు
గృహవినిర్మాణమున నిన్ను గెలుచువాcడు
వైభవంబునc బోలు దేవతలతేcడు
లేcదురా! గిజిగా! మొనగాcడ వోయి!

ఉ. నీ గిజిగానినామకము నీ తెలివిం బ్రకటించుగూడు, నీ
మైc గలసోయగం, బవని మానవకోటికి ముద్దుసేయు నో
యీ! గిజిగాడ! భీతిలకు మీవు ధరాతలి నున్నబిట్టుగా
వాగెడు నాస్తికు ల్తలలువంతు రనంతునిచెంత ఖిన్నులై

## సాలీడు

శా. నీలో నూలు తయారుజేయుమర గానీ, ప్రత్తిరాట్నంబు గా
నీ, లే దీశ్వరశక్తి, నీకడుపులోనే లీనమై యుండునో;
యేలీలన్ రచియింతు వీజిలుcగునూలీపట్టుపుట్టంబులో
సాలీcడా! నిను మోసగాcడవని విశ్వంబేల దూషించెడిన్?

శా. ఢక్కామల్లుపసందు నేతపనివాండ్రా, నీయుపాధ్యాయు? లి
ప్డొక్కండున్ గనరాcడు, డాగుకొనినారో? నీదుగర్భంబునం
దిక్కాలంబున నిన్ను మించుపనివాcడే లేcడు; దుర్వృత్తికిన్
దిక్కై, నీయసమానకౌశలము వ్యర్థీభూతమై పోయెడిన్

మ. పురువుం గుంపును మోసపుచ్చుటకుc గాబోల్గాంగమగ్గాలపై
మురిపెంపుంబని యుల్లిపట్టువలిపంబుల్ నేసి, నీమందిరాం
తర దేశంబున నారcగట్టి యొకపొంతం బొంచినా, వోరి ట
క్కరి! సాలీcడవు గావు దొంగవని వక్కాణింపవే లోకముల్

మ. తలపం బున్నమనాటి వెన్నెలల దిద్దంజాలు నీనూలు పో
గులసింగారముఁ జూడ వచ్చి, యసువుల్గోల్పోయెడిన్ బ్రాణు లో
తులువా? నెత్తురు ద్రావు నేఁతపను లెందుం జూడ మోరంత ప్రొ
ద్దులు నీ కీయుదరంభరిత్వ మనుకొందుం బెండ్లమున్, బిడ్డలున్

మ. ఒఁక పర్యాయము, కాందిశీకుఁడగు వీరోత్తంస మొక్కండు కొం
డకు నీ వల్లినగూటియం దొదిగియుండన్ దాయ లేతెంచి, నీ
మొక మోటంబున నమ్మి నీదునిలయంబున్ దొంగియుం జూడ రిం
దుకు నిన్నుం గొనియాడి, యీశ్వరుని వైదుష్యంబు నూహించెదన్

# నెలబాలుఁడు

తే.గీ. గగనకల్యాణిగండభాగమున నిద్ద
కాలపురుషుని గురునక్షత్రముఁబోలి
మంచునవ్వుల నదె చందమామబుడుత
జననమైనాఁడు పశ్చిమశైలశిఖరి

తే.గీ. నిండుపున్నమనాటి కీనీటుకాఁడు
కళలు పదియారు నేరిచి గర్వపడును
అమరులు భుజింతు రితనిదేహమును గమిచి
యమవసకుఁ గానరాఁ డీతఁ డల్పజీవి

చం. కుముదము తేనెతో నెదురుకొన్నది పూజకు, చందమామ, యం
దము గలవాఁడు చుట్టమని నాలుగుదిక్కులనుండి సర్వలో
కము తలయెత్తి పిల్లనెలగానికి వందన మాచరించె, సాం
ద్రము లగువీనిచూపు లమృతంబును జిందును శీతలంబులై

ఉ. చుక్కపొలంతి నీకొఱకు స్రుక్కుచునున్న దమాసనుండి కెం
పెక్కినకన్ను మూసికొనియెం గుముదంబు, నిశావధూటి, నీ
చిక్కనిమంచువెన్నెల భుజించుచకోరము కంటినీరు న
ల్దిక్కులఁ జిమ్ముచున్నది, మదించి జగంబును మ్రింగెఁజీఁకటుల్

ఉ. పున్నమనాఁడు నీవు పరిపూర్ణశరీరుఁడవై, సుధావిలా
సోన్నతి నవ్వుచుం బొడముచుందువు లోకము సంతసింప, వో
క్రొన్నెలబాల! యారుపది రోజులజీవికి నవ్వు వచ్చునే?
యన్నము వట్టునే? పరహితార్థివి నీకు విచార మున్నదే.

మ. అదిగో! సింహికపట్టి నీ తెరవునందడ్డంబుగా నిల్చి, నీ
రదకుంజంబున నక్కినాఁ డతని దంష్ట్రల్ గ్రూరముల్ సుమ్ము, నీ
మృదుదేహంబును గాసిపెట్టుకొని యిట్లెన్నాళ్ళు లోలోనఁగ్రు
ళ్ళెద వన్నా! ధరణీహితార్థము నిశాలీలావతీవల్లభా!

## నెమిలినెలఁత

మ. తలపైఁ గల్కితురాయి, కంఠమున నిద్దాతళ్కుఁగ్రొమ్మెల్క ప
చ్చలహారంబు ధరించి, కాటుకవిలాసం బొప్పువాల్గంటి తె
ప్పల నానందము నిండ, నర్తిత నిజప్రాణేశ్వరుం జూచు, నె
మ్మలరాణీ! యిటు చూడవే నుతిశతంబుల్ నీకు నీభర్తకున్

శా. పొన్నుంగన్నులు నెత్తి కెక్కఁ గులికింపుంగంఠగర్వంబునన్
నిన్ను న్నీ చెలికత్తెలం బ్రణయకంధి న్ముంచి తేలింప, నీ
సాన్నిధ్యంబున నాట్యమాడు పతిపజ్జన్ బారవశ్యంబునన్
గన్నుల్ మోడ్తువు నిచ్చలు న్నెమిలిచానా! యెంతపుణ్యాత్మవో

ఉ. కోరిన పాపటోగిరముఁ గూరిచి నీమది పల్లవింపఁ జి
న్నారిమనోజ్ఞషడ్జమ నినాదముల న్నిను బుజ్జగించు, బం
గారపుఁగంటికుల్కుల మగండు మహేంద్రునియంతవాఁడు నీ
చేరువ నాడెడి న్నెమిలి చేడియ! నీకుఁ గొఱంత గల్గునే!

ఉ. ఉఱు ముఱిమెం దళుక్కు మనుచున్నది మించను మోసకత్తె, యం
బరమున మబ్బు లేలినవి, మంజుల కేంకృతు లొప్ప నీమనో
హరుఁ డురుపింఛదీధితుల నారతు లీయఁ దొడంగెఁ, గేకిసుం
దరి! పొదరిండ్ల తీవెపరదాల మఱుంగునఁ జెంగలింపవే!

తే.గీ. భర్త హొంబట్టుజిలుఁగుటంబరము దాల్చి
విపినవీధులలోఁ దాండవించుచుండఁ
జేరువను నిల్చి మాసినచీరఁ గట్టి
మురిసికొను పతివ్రతవు సుందరులలోన.

## తుమ్మెద పెండ్లికొడుకు

ఉ. కొండల నందుగుంజిగురుఁ గొమ్మలు మేసి మదించుభద్రవే
దండకపోలదాన జలధారలఁ దానము లాడఁబోయి, యు
ద్దండకఠోరకర్ణములు దాకిన మూర్ఛిలితో! మరేల రా
కుండెద? వీవిలంబనము నోర్చునె? తేటిపడంతి షట్పదా!

ఉ. కూరిమి పల్లవింప నదిగో సుదతీమణు లెల్ల నీముఖాం
భోరుహదర్శనార్థమయి పుప్పొడిపుట్టములన్ ధరించి, కా
సార నికేతనాంగణవిశాలతలంబుల విశ్రమించి యు
న్నా, రిఁక రాకయున్న దహనంబునఁ గ్రుంకెద రోయిషట్పదా!

ఉ. కాకులు కూసినంతన, యెకాయెకి నిద్దురనుండి లేచి, మా
ధ్వీకము దొంగిలింపఁ బరువెత్తితి వబ్జహితుండు క్రుంకునం
దాక, సుధాధనాపహరణం బొనరించెద వేలనోయి! నా
ళీకవనంబు కన్ను ముకుళించిన నీగతి యేమి? షట్పదా!

ఉ. తమ్ములచుట్ట మస్తగిరిదాగె, మృగాంకుఁడు తూర్పుకొండ నె
త్తమ్ముల కెక్కి, చిక్కని సుధారసభుక్తిఁజకోర బంధుబృం
దమ్ముల కిచ్చె, నింతవరదాక గృహమ్ముఁ దలంపవేల? నీ
తుమ్మెద పెండ్లికూతుల నెదుర్కొన రాగదవోయి, షట్పదా!

ఉ. పూవులు దాచుకొన్నమధువుం దనివోవఁగఁ గ్రోలి, యింటికిం
దేవలెనన్నయాస, నలుదిక్కుల కెక్కెడు నీచరిత్రయం
దేవ జనించి, పద్మవనమెల్ల మొగంబు మరల్చె, నిట్టితృ
ష్ణావిలబుద్ధి, తమ్మిచెలికంపకపోవదు నిన్ను షట్పదా!

ఉ. మొన్న వివాహ మాడితివి,ముద్దుపడంతులఁ, బెండ్లియైనయం
త, న్నవమల్లికామధునదంబులఁ జొచ్చితి, వెంతకాల మీ
క్రొన్ననతీవెజొంపములఁ గూతలు బెట్టెద? వింకనైన రా
కున్న, జగంబు మెచ్చదనియుం దలపోయ విదేల? షట్పదా!

ఉ. బంగరుపూవుటిండ్ల తలవాకిలిఁ ద్రొక్కనిబిచ్చగాని, ని
న్నుం గని నవ్వుచుండు సుమనోనిచయం బిది యేటివింత, నీ
యంగనకంతమం దలరదా? యలనాటిసువర్ణసూత్ర మో
భృంగకుమారకా! కుదువబెట్టవుగా? మధుమద్యపాయివై

# దీర్ఘ నిశ్వాసము

మ. తెలుఁగుంబాసకు వన్నె దెచ్చిన, జగద్వీరుండు, మాకృష్ణరా
యలు గట్టించినవజ్రదుర్గముల, శుద్ధాంతప్రదేశంబులన్
దలక్రిందై, తపమాచరించెడిని సంతానార్థమై, గబ్బిగ
బ్బిలపుంగుబ్బెత, లక్కటా! మొయిలు గప్పెం బూర్వమర్యాదకున్

శా. పన్నీటన్ దలసూపి, కాపుగొను రంభామల్లికావాటికల్
జిన్నాదేవిగులాబితోటలు, నశించెన్గచ్చ లుమ్మెత్తలున్
గన్నేరుంబొద లావరించినవి, రంగత్తుంగభద్రానదిన్
బన్నుండె న్మనమోహనాంగికవితాప్రాగల్భ్య సౌరభ్యముల్

ఉ. నాయకురాలి మాయ కదనంబున, మా పలనాటిపౌరుష
శ్రీ యడుగంటె, గడ్డి మొలిచెం బులిచాఱలగద్దెమీద, కెం
జాయ మొగానఁ గ్రమ్మ జలజ ప్రమదామణి నాగులేటిపై
వ్రాయుచునున్న దిప్పటికి బాలునిశౌర్యకథాప్రబంధముల్

ఉ. వాసిని గన్న రెడ్ల పరిపాలన, కొండలదండలన్ శిలా
శాసనసంగతి న్నిలిచి చచ్చియుఁ, జావదు, రెడ్డిరాణి మై
బూసినకుంకుమంబుఁ బసుపుంబస లంటినకన్నెతొండ, నేఁ
డూసరవెల్లియై, నవయుచున్నది పండువెదుళ్ళసందులన్

# శల్య సారథ్యము

సీ. అహిమస్తములకు నొయ్యారంబు నేర్పించు వలపుఁబిల్లనఁగ్రోవిపాటగాఁడు
పసితనంబునయందు పడగపాముల నెక్కి చిందులాడిన గొల్లచిన్నవాఁడు
పదియారువేలగోపస్త్రీలతో నుండి యపకీర్తి నందని యందగాఁడు
లోకాంతమున మఱ్ఱియాకుఁదెప్పం దేలి తలదాచుకొన్న చిత్రస్వరూపి

తే.గీ. భాసురములైన తనచేరదేసికనుల
మచ్చుఁ జల్లెడు వేలుపుమాంత్రికుండు
తొడరి విజయునియరదంబుఁ దోలుచుండె
కాంచి విల్లందుకొనుము భాస్కరకుమార

చం. ములుకులు, నీధనుస్సున విముక్తములై చని, కృష్ణమూర్తికిన్
వలఁగొని యావల న్నరుని పైఁ, గసిబూనుట దుస్తరంబుగా
దలప, విదేటివెఱ్ఱి? భుజదర్పము వెన్నునిముందు సాగునే?
మలపుదునా రథంబు? అనుమానము దోఁచె జయంబు కర్ణుడా!

మ. వ్యయమైపోయినయమ్ముల న్మరల గూర్పన్, దక్ష మైయున్న య
క్షయతూణీరము విచ్చి, పార్థుఁడు శరాసారంబు గుప్పించినన్
జయ మాదేవుఁ డెఱుంగు, గుఱ్ఱములపై, నాపై, భవత్సేనపై
దయ జూపించుట కూపిరాడగలదా? దౌర్భాగ్యధానుష్కుఁడా!

ఉ. తూలిన పందికై, హరుఁ డెదుర్కొని రేచినగ్రుద్దులాట కు
స్తీల, బలిష్ఠుఁడై కళికుఁ దేలినవాఁడు మహేంద్రసూతి, యా
శూలికి గుండె లే దతనిఁ జూడ నెగాదిగ, యుద్ధభూమిలో
రాలఁదలంచితో, పరశురామునిశిష్యుఁడ నన్నబిఱ్ఱునన్

మ. బలవంతుం డగుశౌరి, రోషము రగుల్పం బార్థుఁడున్, గెంపుచూ
పులవేగంబునఁ దూపుల న్నడిపి, నీమూర్ధంబు ఖండింపఁడా?
తలపై శాపము లాడునీకు నొకయుద్ధం బేల? నీరక్తమున్
బొలయున్, గాకులు, గ్రద్దలుం గుడుచు నేమో! నేఁడు సూతాత్మజా!

తే.గీ. ఖాండవము నర్జునుఁడు గాల్చుకాలమందు
పరువులెత్తినముసలిసర్పమును వింటఁ
దొడిఁగినాఁడవు గాఁబోలు విడువ వలవ
దబ్జనాభుఁడు, గరుడవాహనుఁడు సుమ్ము

మ. ఇలకున్ గ్రుంగె రథంబు చక్ర మిపు డేదీ? నీకు గత్యంతరం
బలుక, న్నీప్రతిపక్షి, గాండివధరుండై, చెండుచున్నాఁడు నీ
బలమున్, గాలము లేదు స్యందనము లేవందీసికొ మ్మేటికీ
తలపోత ల్మరణంబు వేదుకొనరాదా? కర్ణ! బీభత్సునిన్

## భారతవీరుఁడు

తే.గీ. ఘనకురుక్షేత్రసంగ్రామగగనమునకు
భానుమంతుఁడ వై, వైరివర్గములను
కలఁచి, గెలిచినదండిమగండ వీవు
కర్ణ! కారణ మేమి? దుఃఖపడ నింక.

తే.గీ. సమరధర్మంబు విడి ధనంజయుఁడు పంపె
నతనిచేఁ జచ్చె రాధేయుఁ డనెడుపల్కు
పుట్టె నను చింత కలదు కాఁబోలు నీకు
నట్లు కాదయ్య! గెలుపు నీయదియె కర్ణ!

తే.గీ. ధర్మముఁ దలంచి, నినుఁ గన్నతల్లి ననుఁగు
సోదరుల రేణువులభాతిఁ జూచినాఁడ
వౌర! నీస్వామిభక్తి, నీయద్వితీయ
సుగుణసంపద వర్ణింప నగునె కర్ణ!

శా. వీరాగ్రేసర! నీవు పాండవబలాబ్ధిన్, మందరం బట్లు, దో
స్సారంబార మథించి, యంచితయశస్సారంబు, లోకంబునన్
బారంజల్లినసద్ధనుర్ధరుఁడ వెవ్వం డీడురా నీకుఁ? గ
ర్ణా! రాజన్యుల కెల్ల నీచరిత మన్నన్, గర్ణపేయం బగున్

శా. కింకన్ రుద్రునిఁబోలి, తేరినడుచక్కిం జేరి, దృప్యద్ధను
ష్టంకారం బొనరించుచున్, విమతకంఠశ్రేణిఁ జెండాడు, నీ
వంకన్ జూడఁ గిరీటియంతటిప్రతాపస్ఫారమార్తాండుఁడే
జంకె, న్నీ కెదురెక్కువీరుఁ డొకఁడు న్జన్మించునే? భానుజా!

మ. జననంబందినతత్క్షణంబ, కఠిన స్వాంతంబునన్, గంగ క
ప్పనగావించినక్రూరురా లనక, లోభస్వాంతయై, కుంతి, 'నా
యన! కర్ణా! సుతభిక్షరా' యనఁగ నాహా! మారుమాటడ కి
చ్చిన విఖ్యాతవదాన్యమాన్యుఁడవు పొచ్చెంబేది? నీకీర్తికిన్!

చం. అరదము గ్రుంగిపోయినపుడైనను, భార్గవరాముశాపవా
క్సరణి, శరంబు లూహ కెడసన్నపు డేనియు, శల్యుఁడెన్ని ని
ష్ఠురములు వల్కుచున్న, రణశూరత దక్కక, వైరివీరకం
ధరపటుకర్తనోద్యమమునం, జెలువారవె? సూర్యనందనా!

మ. ఒక పాంచాలికి భర్త లేవురని, మర్త్యుల్ గూడి మాటాడువా
డుకయే, కర్ణకఠోరమై మసలుచుండున్ డెందమం, దట్టివా
నికి, నా కాఱవభర్తృనామము ధరన్నిర్మింప కంచు న్మురా
రికి వాక్రుచ్చి, యశంబుఁ జాటవె? ధరిత్రీమండలిన్ భానుజా!

తే.గీ. పార్థనామంబు చెవిలోనఁ బడినయంత
భగ్గుమని మండిపోవు నాపాదమస్త
కంబు నీ కట్టిమీవైర కారణంబు
చాటుచున్నది కర్ణ! నీ స్వామిభక్తి.

ఉ. చండగభస్తిమండల మొసంగిననాతొలిచూలికాన్పు క
ర్ణుం దను, కుంతిమాటకు తనూలత కంపము నంద, ధర్మసూ
నుం డెలుఁగెత్తి యేడిచి, నినుం గొనియాడుచుఁ బల్కె, "నట్టిశూ
రుం డిఁక పుట్టఁబోఁడ"ని, నిరూపణచేయుచు, సూర్యనందనా!

మ. చెవుల న్గుండలముల్ ప్రభావిభవరాజిన్ జిమ్ముువర్మంబుఁ బు
ట్టువుతోఁ గల్గినముద్దుబిడ్డఁడవు, నీటుం గోటు దీపింప, రెం
డవమీనాంకుఁడువోలి విల్లు గొని, జన్యక్షోణులం జొచ్చి, శా
త్రవనాశం బొనరించునిన్నుఁ గని కర్ణా! కుంతి యెట్లోర్చెనో!

చం. మివులఁ బవిత్రవంతమయి, మేదినిఁ గాలువ గట్టి, మర్మరా
రవము సెలంగ, నీదురుధిరంబు స్రవించుచు "అర్జునా! యధ
ర్మువు, భవ" మంచు నెంత వలపోసెనొ శత్రుకళేబరంబు లం
టవలసె నంచు, నెంత వనటం బడినాఁడవొ, కర్ణ! కూలుచోన్

చం. నరుఁడు బృహన్నలాఖ్య, నలనాఁడు విరాటుని గొల్చుచుండి, యు
త్తరునకు సాయమై, కురుశతంబును మూర్ఛిలఁగొట్టునాఁడు, భా
స్కరసుతుఁడోడె నందు రని, కన్నుల నీ రిడకయ్య! శక్తులై,
గురుఁడు, నదీసుతుం డెదురుకొన్నది లేదుగదయ్య, భానుజా!

## బుద్ధమహిమ

మ. సరవి న్నీకడకంట వెల్గిన యహింసాజ్యోతికిన్, గొండలున్
గఱఁగింపంబడె వెన్నపూసలవలెన్, క్ష్మామండలం బెల్ల, నీ
చరణాబ్జంబుల ముద్దుఁగొన్నది, మహీశగ్రామణీ! జ్ఞానభా
స్కర! బుద్ధప్రభు! నీ సుధోక్తులను సంస్తంభించె, ముల్లోకముల్.

ఉ. నీ వల రావిచెట్టునకు నేర్పిన భూతదయారసోక్తిలో,
భూవలయంబు బాష్పజలపూరితలోచనమయ్యె, బింబిసా
రావనిభృత్సభాభవన మార్ద్రమనస్కతఁ గ్రుంగిపోయె, నీ
పావనబాహుపీఠమునఁ, బ్రాణము దక్కినగొఱ్ఱెపిల్లతో.

ఉ. పాములు గాలిమేత లలవా టొనరించుట కీవు కారణం
బేమొ! త్రిదండిరాజపరమేశ్వర! నీదుపదాంకముద్రలోఁ
జీమయు, హాయిగా నిదురజెందిన దెక్కడి దీయకారణ
ప్రేమ? జోహారు! నీనయనవీధులఁ దాండవమాడుశాంతికిన్

చం. కఱకుకసాయివాని చిరుకత్తియు, నెత్తురు సూడలేదు, నీ
చరణరజంబు సోకిన రసాతలసీమలలోన, నిప్పు డు
ర్వరఁ బెకలించి చూచు ప్రతివానికి, నీమహనీయవిగ్రహో
త్కరములు దర్శనం బిడు, నఖండదయారసదిగ్ధముద్రలన్

ఉ. దీనము లైనచూపుల వధించెడువానికి మొక్కి, "అన్న! నా
కూనల కండ లేదు కనుగొమ్మ" ని గద్గదనిస్వనంబుతో
లోనఁ దపించి, నాల్గుదెసలుం బరికించుచు, 'బుద్ధదేవ! రా
వే! నను బ్రోవవే!' యని జపింపనిజంతువు లేదు మేదినిన్

ఉ. పైకొని రెండువేలయిదువందలయేండ్లు వయస్సు వచ్చియున్
నీ కమనీయబోధలకు నిగ్గు రవంతయుఁ దగ్గ లేదు, హిం
సాకరణంబు పాప మను శబ్ద మశోకుని ఱాతిగుండెలన్
దాకి, యగల్చి, యాదినమునన్ గదలించెడి నష్టదిక్కులన్

## భీష్ముఁడు

తే.గీ. వృద్ధవీరుఁడ! నీవయస్సెంత చెపుము?
తండ్రి మరణించియే మూఁడు తరము లయ్యె
నౌర! భారతయుద్ధమధ్యంబునందు
పడుచుపార్థుని తల్లడ పరచినావు.

ఉ. కోడెవయస్సు ని న్నలమి గోటికి మీసము జిక్కునాఁడు, ము
య్యేడిరునాళ్ళు పోరు వెలయించినభార్గవరాముఁ డెంత య
ల్లాడెనొ! మూఁడుగాళ్ళముసలయ్యవు నేఁటి కెదిర్చి కృష్ణుఁడున్
గ్రీడియుఁ, దల్లడిల్లి రవని న్నిను గెల్చుమగండు బుట్టెనే?

మ. "వెలిమావుల్ రుధిరంబు గ్రక్కె, గతిదప్పెం దేరు, సంధించు న
మ్ములతో గాండివ మూడె, సాగవు కరంబుల్, బావ! ఆలంబు నా
వలగా" దంచు ధనంజయుండు కనులన్‌బాష్పంబుల న్నించఁడే?
బలమో! లేక మహత్వమో! యిది తలంపన్ రాదు, గంగాసుతా!

ఉ. ఆరయ నీవు ధర్మజున కాయువు పట్టెటిగింపకుండినన్
శౌరియు, సవ్యసాచి, మరునాఁడు రణంబున నిల్తురే? కృపా
పారగ! నిక్కపుంగినుక పైకొని నీవు ధనుస్సు బట్టినన్
నీరయి పోవె? లోకములునింగి గుభిల్లునఁ గూలిపోవదే?

ఉ. అంబ, శిఖండి యయ్యె నతఁడాదుది, వానిమొగంబు జూడ నం
చుం, బరిపూర్ణపౌరుష విశుద్ధికి భంగము గల్గకుండ, వి
ల్లంబులు బారవైచితివి, యర్జునవీరుని కీర్తి నిల్ప, గం
గాంబిక ధన్య యయ్యెనుగదా? నినుఁ గాంచి, ధనుష్మదగ్రణీ!

సీ. గురువు గొడ్డలిఁ ద్రిప్పుకొని తప్పుకొనుదాక మరలి వెన్కకు రాని మార్గణంబు
ముత్తరంబులనుండి ముదిరి ముద్దలు గట్టి చేవ డిందనిపచ్చి యౌవనంబు
వసుసప్తకము సానబట్టి జీవము వోసి యొసఁగుకక్కసఁపుటాయుధబలంబు
స్వర్గతరంగిణీస్తన్యంబు బలిమిని సంప్రాప్త మైన తేజశ్చయంబు,

తే.గీ. గవ్వకుం గాని పాడు శిఖండిముందు,
వ్యర్థపుచ్చితె? పార్థునిపరువుకొఱకు
జగము నగరించునీదివ్యశంఖరవళి,
పవ్వళించెనె? యమ్ములపడకమీద

తే.గీ. కౌరవునియాస గంగలోఁ గలసిపోయె,
పరశురామునివేడి నిశ్వాసములకు,
నింద్రగిరి క్రాఁగి బూదియయ్యెను గదోయి,
శంతనకుమార! నీవిల్లు జారిపోవ

## రాజరాజు

తే.గీ. నిన్నుఁ బోలుమహీనేత నిక్కువముగ
బుట్టెనో! పరాశరదివ్యమునిసుతుండు
మున్ను మాతాత, పరిహాసమునకుగాను,
కల్పనముజేసి వ్రాసెనో! కౌరవేశ!

కం. మాతాత సత్యవంతుఁడు
పూతము లగునాల్గువేదములు వ్రాసిన వి
ఖ్యాతకవీంద్రుం డాతని
చేతికల మబద్ధములు వచింపదు సుమ్మీ!

సీ. వ్యాసకల్పితమహాభారతామ్నాయంబు, గుట్టుగా నినుఁ దిట్టుకొనుచునుండ,
ముగురుసత్కవుల పెంపుడుకావ్యరాజంబు, పదిమందిలో బట్టబయలుసేయ,
నింతలంతలు సేయు, దృశ్యప్రబంధాళి, మొత్తమై ని న్నాడిపోసుకొనఁగ,
చెప్పుడుమాటకుఁ జెవి యొగ్గుభువనంబు క్రూరాత్ముఁ డని పండ్లు నూరుకొనఁగ

ఆ.వె. తొడలు తెగినబాధతో, యింతదుష్కీర్తి
తోఁ, బరాజయంబు తోడు రాగ
నరకమునకుఁ బోయి నావొ! స్వర్గమునకు
జేరినావొ! నీవు కౌరవేంద్ర!

శా. నీ సావాసము జేసి, ముజ్జగముఁ బిండింజేయగాఁజాలు, రా
ధాసూనుం డొకవ్యర్థ జీవి యయి, నిందాబద్ధుఁ డైపోయె, నీ
యాసల్ భీముగదాభిఘాతమున నుగ్గై, యూరుయుగ్మంబుతో
నీసింహాసనసీమ దుఃఖపడుచుండె న్నేడు, కన్నీళ్ళతో

సీ. సవ్యసాచికరాన సాము నేరిచికొన్న బలమైనక్రొవ్వాడిబాణములకు
వాయుసూనునిబాహుబలముతోఁ బోరాడు మొక్కవోవనిపుట్టెడుక్కుగదకు
పాంచాలినులివెచ్చ బాష్పాంబువులఁ దేలు వజ్రనిష్ఠుర శాపవాక్యములకు
యమతనూభవుని దీనాలోకములఁ దోగి దీపించుశీతలాలాపములకు

తే.గీ. సకలభువనంబు లాలించి సమ్మతించు
వనజనాభునిశుభ రాయబారమునకు
సమ్మతింపక, రక్తనిర్ఘరములందుఁ
దానమాడితి వేల? గాంధారితనయ!

ఉ. అంటcగరానియగ్ని కెనయైనది ద్రౌపది, యట్టిసాధ్వి ప
య్యంట మొగానc బూని, యకటా! యని యశ్రులు రాల నేడ్చినన్
దుంటరివై, సహోదరులతో సభలోనc బరాభవించినా
వంట, మఱందివై, వదినకా? మొనగానితనంబు సూపుటల్

మ. కురుభూపాలుcడు బుద్ధిమంతుcడని వాకోబూనితిం గాని, యా
దరణీయంబులు హేతువు ల్గలుగవద్దా? నీచరిత్రంబునన్
గరళాన్నంబును, మాయజూదమును, లాక్షాగేహమున్, ద్రౌపదీ
పరిభావంబు, భయంకరంబులయి చూపట్టుం, గురుక్ష్మాపతీ!

ఉ. నీయతనంబు లన్నియును నెత్తురుకూడు భుజించి మాయమై
పోయెగదా? వృథాపయశముం దలదాల్చిననీకు నేcడు నిం
డాయువుc బోసినారు కవు, లక్కట! పెం దొడలూడి, కుంటివై,
యీయవమానజీవితమునెట్లు సహింతువయా! సుయోధనా!

# శ్మశానవాటి

శా. ఎన్నో యేండ్లు గతించిపోయినవి గానీ, యీశ్మశానస్థలిన్
గన్నుల్ మోడ్చినమందభాగ్యుc డొకcడైనన్ లేచిరాc డక్కటా!
యెన్నాళ్లీచలనంబు లేని శయనం బే తల్లు లల్లాడిరో!
కన్నీటం బడి క్రాcగిపోయినవి, నిక్కం బిందు పాషాణముల్

శా. ఆకాశంబును కాఱుమబ్బుగము లాహోరించె, దయ్యాలతో
ఘూకంబుల్ జెరలాడసాcగినవి, వ్యాఘోషించె నల్దిక్కులన్
గాకోలంబులు, గుండె ఝల్లుమనుచున్నంగాని, యిక్కాటియం
దా కల్లాడినజాడ లే దిచట సౌఖ్యం బెంత క్రీడించునో!

సీ. ఇచ్చోట నేసత్కవీంద్రుని కమ్మనికలము, నిప్పులలోనc గఱcగిపోయె
యిచ్చోట నేభూము లేలురాజన్యుని, యధికారముద్రిక లంతరించె
యిచ్చోట నేలేcతయిల్లాలి నల్లపూసలసౌరు గంగలోc గలసిపోయె
యిచ్చోట నెట్టిపే రెన్నికం గనుగొన్న చిత్రలేఖకుని కుంచియ నశించె

తే.గీ. ఇది పిశాచులతో నిటాలేక్షణుండు
గజ్జె గదలించి యాడురంగస్థలంబు
యిది మరణదూతతీక్షణదృష్టు లొలయ,
నవని బాలించుభస్మసింహాసనంబు

చం. ముదురుతమస్సులో, మునిఁగి పోయినక్రొత్తసమాధిమీదఁ, బైఁ
బొదలుమిణుంగురుంబురువుపోలిక, వెల్గుచునున్నదివ్వె, ఆ
ముద ముడివోయినన్, సమసిపోవుట లే దది దీప మందుమా?
హృదయముసుమ్మి, నిల్పి చనియెన్, గతపుత్రక, యేయభాగ్యయో!

చం. కవులకలాలు, గాయకుల కమ్మనికంతము లీశ్మశానపుం
గవునులఁ ద్రొక్కి చూచెడి నొకానొఁకనాఁ డలకాళిదాసభా
రవులశరీరముల్, ప్రకృతి రంగమునం దిపు డెంతలేసిరే
ణువు లయి, మృత్తికం గలిసెనో! కద? కుమ్మరివానిసారెపై

శా. ఆలోకించిన గుండియ ల్గఅగు, నాయాపిల్లగోరీలలో
నేలేబుగ్గలసౌరు రూపఱియెనో! యేముద్దు నిద్రించెనో!
యేలీలావతిగర్భగోళమున వహ్నిజ్వాల జీవించునో!
యీలోకంబున వృద్ధిగాఁదగిన యేయే, విద్య లల్లాడునో!

మ. ఇట నస్పృశ్యత సంచరించుటకుఁ దావే లేదు, విశ్వంభరా
నటనంబున్ గబళించి, గర్భమున విన్యస్తంబు గావించి, యు
త్కటపుంబెబ్బులితోడ మేఁక నొఁకప్రక్కన్ జేర్చి జోకొట్టి, యూ
ఱటఁ గల్పించునభేదభావమును, ధర్మం బిందుఁ గారాడెడిన్

ఉ. వాకొనరాని గొప్పధనవంతునినిద్దపుఁబాలఱాతి గో
రీకడఁ బారవేయఁబడి, ప్రేలికలం బొరలాడుప్రేత మే,
యాకఁటిచిచ్చునన్ గుమిలి, యార్చి, గతించిన పేదవాని దౌ
నోకద! వానికై వగవఁ డొక్కఁడు, దాచదు కాటినేలయున్

# శిశువు

సీ. బొటవ్రేల ముల్లోకములు జూచి లోలోన నానందపడు నోరులేనియోగి
తల్లిదండ్రులతనూవల్లరీద్వయికి వన్నియc బెట్టు తొమ్మిది నెలలపంట
అమృతంబు విష మనువ్యత్యాస మెఱుcగ కాస్వాదింపc జను వెఱ్ఱిబాగులాcడు
అనుభవించుకొలంది, నినుమడించుచు మరందము జాలువాఱుచైతన్యఫలము

ఆ.వె. భాష రాదు, వట్టి పాలుమాత్రమె త్రాగు
నిద్ర వోవు, లేచి నిలువ లేcడు,
యెవ రెఱుంగ రితని దేదేశమో కాని,
మొన్న మొన్న నిలకు మొలిచినాcడు

సీ. గాన మాలింపక కన్నుమూయనిరాజు అంబకౌగిcటిపంజరంబు చిలుక
కొదమకండలు దేరుకొనుపిల్లవస్తాదు యుయ్యేల దిగని భాగ్యోన్నతుండు
ఊఊలు నేర్చినయొకవింత చదువరి సతిని ముట్టనినాటి సాంబమూర్తి
ప్రసవాబ్ధి తరియించి వచ్చిన పరదేశి తనయింటి క్రొత్త పెత్తనపుదారి

తే.గీ. ఏమిపనిమీద భూమికి నేగినాcడొ!
నుడువ నేర్చినపిమ్మట నడుగవలయు
నేండ్లు గడచిన ముందు ముం దేమొకాని
యిప్పటికిమాత్ర మేపాప మెఱుcగc డితcడు

సీ. నవమాసములు భోజనము నీర మెఱుcగకపయనించు పురిటింటి బాటసారి
చిక్కుచీకcటిc జిమ్ము జేనెడుపొట్టలో నిద్రించి లేచిన నిర్గుణుండు
నునుcజెక్కిళుల బోసినోటినవ్వులలోన ముద్దులు చిత్రించు మోహనుండు
అక్షయం బైన మాతృక్షీరమధుధార లన్నంబుగాc దెచ్చుకొన్నయతిథి

తే.గీ. బట్ట గట్టcడు, బిడియానc బట్టువడcడు
ధారుణీపాఠశాలలోc జేరినాcడు
వార మాయెనొ! లేదొ! మా ప్రకృతికాంత
కఱపియున్నది వీని కాకలియు నిద్ర

సీ. ఊయేలతొట్టి యే ముపదేశ మిచ్చునో! కొసరి యొంటరిగ నూకొట్టుకొనును
అంబతో తన కెంత సంబంధమున్నదో! యేడ్చి యూడిగముఁ జేయించుకొనును
పరమేశ్వరుం దేమి సరసంబు లాడునో! బిట్టుగాఁ గేకిస ల్గొట్టుకొనును
మూనాళ్ళలోన నెప్పుడు నేర్చుకొనియెనో! పొమ్మన్నచోఁజిన్న బుచ్చుకొనును

ఆ.వె. ముక్కుపచ్చలారిపోయి, ప్రాయము వచ్చి
చదువు, సంధ్య, నేర్చి బ్రదుకునపుడు
“నాదుపసిడికొండ, నారత్న” మని తల్లి
పలుకుపలుకు లితఁడు నిలుపుకొనునె?

సీ. తనచేతిగిలకపండునకు ముచ్చట సెప్పు పలుకలే దనుచుఁ గోపంబుసేయు
పొరుగింటియిల్లాలి సరసఁ జీదరఁ జెంది పరులన్న భేదభావమును జూపు
మకరందమునకు సమ్మతిఁ జూపి నోరూరి, దరిజేరి, రుచులభేదములు దెలియు
ప్రతిశబ్ద మీనునుగ్రధ్వాన మాలించి, కంపించి తల్లినిఁ గౌగిలించు

తే.గీ. దాయ లార్గురు నొకరు నిద్దరును దప్పు,
చేరుకొన్నార లీతనిచిత్తవీధి
జగతి నీతని జాతకచక్రమందు
పొంచియుండున దపయశంబో! యశంబొ!

## బాష్పసందేశము

శా. ఆలోకింపు మొకింత భారతకుమారా! నిండుపెద్దమ్మచే
గాలింపంబడి, దుమ్ముచే మలయునంగశ్రేణి దూల న్నిరా
శాలంబంబున, నీమహోన్నతసుధాసౌధంబుక్రీనీడలం
దాలుంబిడ్డలు బిచ్చమెత్త, నిరతంబల్లాడుమానుష్యమున్

శా. నీసోదర్యులు వారు, కా రనుచు సందేహింతువో? వీరిస్వే
చ్ఛాసామగ్రి గతించి వత్సరసహస్రంబుల్ సనెన్, దీని కీ
వే, సాక్ష్యంబును, గారణంబు నిపు దేమీ మించిపోలేదు, ఆ
శ్వాసింపంగదవయ్య, భారతతనూజా! ప్రాంతచుట్టంబులన్

చం. కుడుము నొసంగఁ బందు వనుకొందు రమాయకు లిప్పుడైన, నీ
మడులును, మాన్యము ల్పసిఁడి మాడువు లిమ్మన రింట నుండుపెం
పుడుపసరంబు లట్టులు మముం గణియించినఁ జాలునంచు, నీ
యడుగుల నంటి దీనముగ నంజలిఁబట్టిరి ధర్మభిక్షకై

మ. అనుఁగుందమ్ములు దిక్కుమాలి, పురబాహ్యక్షోణిఁ గారాడ, హె
చ్చినసౌభాగ్యసువర్ణమందిర సమాసీనుండవై, హాయిగా
కనుమూయం దగవా? పరాకుపడి, యింకన్మేలుకొమ్మీ! ధరా
జనయిత్రీమణి, తమ్ముఁగుఱ్ఱలకు స్వేచ్ఛాభిక్ష లర్థించెడిన్

శా. ఆనందంబున నీసహోదరులు విద్యాస్వీకృతిం జెందినా
రీనాఁ డల్లదె, శుభ్రవస్త్రములతో నేతెంచుచున్నారు, నీ
తో నిత్యోచితదైవపూజకని, సంతోషంబునన్ జేరనీ
వేని, న్నీ వొక రాక్షసాకృతివి సుమ్మీ! భారతీనందనా!

మ. కరుణావీరుఁడు భారతీయుఁ డని దీర్ఘవ్యాసముల్ వ్రాసి, నీ
కొఱకై, వైరికి వెన్నుఁజూపని యనుంగుంజుట్టముల్ వీరు, దు
ర్భర దాస్యంబు సహింప నోప రనుకంపం బూననొ నింక, నీ
తరళాపాంగము పేరుగన్నది యభూతన్యాయతాదృష్టికిన్

శా. కారుణ్యంబున నంటరానితనమున్ ఖండింపవా? యీ నిరా
ధారవ్యక్తులఘోషణంబు వినరాదా? నీకు నాంగ్లేయులన్
మారాజ్యం బిడుడంచు వేడుకొనుచున్నా విట్టినీ కిత్తురా?
ప్రారంభంబున నిన్ను దిద్దుకొను మయ్యా! కోర్కె సిద్ధించెడిన్

మ. కర మింపారెడు నీ విభూతికి శిరః కంపంబుఁ గావింపవా?
పరదేశంబులు పూర్వ, మీదినము నీస్వార్థక్రియాపేక్ష, సో
దరవిద్వేష మెతింగి, మూతి విఱచున్ దద్దేశముల్, నీయశోం
బరమున్ జిమ్మట గొట్టుచున్న దిఁక విప్పంబోలు నేత్రాబ్జముల్

శా. "మాముత్తాతలనాటి నుండి నిను సన్మానించి, నీకోసమై
మామేనం గలరక్తబిందువుల సంపత్తి న్సమర్పించినా
మేమో; నీహృదయంబులో నెనరు లేదీషత్తు, నింకెన్నఁ ద
న్నా! మాకష్టము గట్టుకెక్కు" ననుచున్నా రేమి వాక్రుత్తువో!

# తెలుఁగు తల్లి

సీ. కృతు లందుటకు పల్లకీమోయ దొరఁకొన్న కృష్ణరాయఁడు రాజ్య మేలునాఁడు
మనుమసిద్ధియును తిక్కన గన్నకావ్యంబు కోరచూపులు జూచుకొన్ననాఁడు
తెలుఁగురాయనియొప్పులొలుకుగుప్పిటిలోన లేఁతకస్తురి గుబాళించునాఁడు
ముత్యాలమందిరంబుల సత్కవులమీద బంగార మేరులై పారునాఁడు

తే.గీ. కవులపల్కులు వేదవాక్యంబు లగుచు
క్షితితలంబును కంపింపఁజేయునాఁడు
గారవంబున న న్నేల గాంచ వైతి!
తెలుపఁగదవమ్మ! ననుఁ గన్న తెలుఁగుతల్లి!

సీ. అలసానికులజుఁ డూయెలమంచములనుండి పసిఁడిలేఖినిఁబూని వ్రాయునాఁడు
పోతనార్యునిగేహమున భారతీదేవి చిగురుఁజేతుల వంటజేయునాఁడు
భువనభీకరుఁడు వేములవాడభీమన్న గంగ్రాజునకు జోలెఁగట్టునాఁడు
శ్రీనాథకవి పాండితీనైపుణము మీఱ డిండిమభట్టు నోడించునాఁడు

తే.గీ. కనులఁ జూచెడుభాగ్యంబుగలిఁగియున్న
నేఁడు నాకవిత్వంబు రాణించియుండు
గారవంబున న న్నేల గాంచవైతి?
తెలుపఁగదవమ్మ! ననుఁ గన్న తెలుఁగుతల్లి!

సీ. పసుపుముద్దల నుంచి పతికి రోసముఁ బోయు వీరపత్నులు బుట్టి పెరుగునాఁడు
ప్రతిన దప్పక వైరివక్షముల్ బెకలించు వెలమబెబ్బులులు జీవించునాఁడు
కాళిందిలోఁ గత్తిఁగడిగి, తల్లికిఁ జూపు శివరాజు పగతుఱఁ జెండునాఁడు
తమ్మిమొగ్గరము లుద్ధతిఁ జీల్చికొనిపోవ పిల్లవిల్కాం డ్రుద్భవిల్లునాఁడు

తే.గీ. పిటికినెత్తురు నాలోన వెలయ దేమొ;
రంభ, నాపేర నుత్తరాల్ వ్రాయు నేమొ;
గారవంబున న న్నేల గాంచవైతి?
తెలుపఁగదవమ్మ! ననుఁ గన్న తెలుఁగుతల్లి!

సీ. అలఘుదాతల దానజలధిలోపల మున్గిపెద్దమ్మ కన్నీరు విడుచునాఁడు
శరణాగతత్రాణ బిరుదంబు రాజుల నెడదఱొమ్ములమీద వెలుఁగునాఁడు
అన్యకాంతలమోములందుఁ బూరుషజాతి కన్నతల్లులమూర్తిఁ గాంచునాఁడు
సహజపావనమైన సర్వసమత్వంబు ప్రతినేత్రమునఁ జాలువాఱునాఁడు

తే.గీ. వారి కబ్బినకీర్తిసంపత్తిలోనఁ
గొంతలోఁ గొంత నేఁ బంచికొందు నేమొ;
గారవంబున నన్నేల గాంచవైతి?
తెలుపఁగదవమ్మ! ననుఁ గన్న తెలుఁగుతల్లి!

## శిల్పి

తే.గీ. చేత మిగురొత్త నొకనల్లఱాతియందు
మలఁచినాఁడవు, భయదసింహములతలలు
వసుధఁ గన్పట్టు సర్వపర్వతములందుఁ
జిత్రముల నెన్నిగతులఁ జూచెదవొ! నీవు

తే.గీ. సున్నితం బైన నీచేతిసుత్తెనుండి
బయలువడె నెన్ని యెన్ని దేవస్థలములు
సార్థకము గాని యెన్ని పాషాణములకుఁ
గలిఁగె నీనాడు పసుపుఁగుంకములపూజ

తే.గీ. కవికలంబునఁ గలయలంకారరచన
కలదు కలదోయి శిల్పి! నీయులిముఖమున
కాకపోయినఁ బెనుఱాతికంబములకుఁ
గుసుమవల్లరు లేరీతి గ్రుచ్చినావు?

తే.గీ. ప్రతిమలు రచించి యొకమహారాజుచరిత
వల్లెవేయింపఁగలవు చూపఱులచేతఁ
గవనమునఁ జిత్రములు గూర్చు కవికి నీకుఁ,
దారతమ్యంబు లే దబద్ధంబు గాదు

తే.గీ. ఱాల నిద్రించుప్రతిమల మేలుకొలిపి
యులిని సోకించి బయటికిఁ బిలిచినావు
వెలికి రానేర్చి, నీపేరు నిలుపకున్నె
శాశ్వతుఁడ వోయి; నీవు నిశ్చయముగాను

మ. తలయెత్తెన్ గద, నీదుచాతురి? యజంతాగహ్వరశ్రేణిఁ, గే
వలపాషాణములందు, జీవకళ నిల్పంజాలు, నీ సుత్తెలో
మొలుచు న్మానవవిగ్రహంబులు, మహా పుణ్యుండ వయ్యా! హరి
త్తులు, నీ బొమ్మలచెంత, ముగ్ధగతినందున్, శిల్పికంఠీరవా!

మ. నునుపుల్ దీర్చి, మదంబు జిందిపడ నేన్గున్ గున్నలన్ జెక్కివై
చినచాతుర్యము, నీశిరోగ్రమున నిల్చెన్, సత్కిరీటాకృతిన్
తెనుఁగుందేశము నిన్నువంటి పనివానిం జూచి, యుప్పొంగుచుం
డును, నీ లేమిఁ దలంచి కంటఁదడిబెట్టున్, శిల్పవిద్యానిధీ!

మ. తెలిఱాతిన్ జెలువార నచ్చర పడంతిన్ దిద్ది, యాసోగ క
న్నులపజ్జన్ నిను నీవు దిద్దుకొని, సంతోషించుచున్నాఁడవా?
భళిరే! శిల్పి! జగంబులోనఁ జిరజీవత్వంబు సృష్టించుకో
గలనీ కెవ్వఁడు సాటివచ్చును, నమస్కారంబు నీప్రజ్ఞకున్

## ఇంటిగెలుపు

సీ. శ్రీరాముఁ డేకొండ శిఖరానఁ గన్నీట నాలించె సీతాపహరణగాథ
దాటించె నేవీటిదాపున నైతమ్మ పట్టి, మేల్పొట్టేలివాహనంబు
కోటకొమ్మలమీదఁ గ్రుచ్చినా రేవీటి తెలుగురాజులు విరోధుల శిరాలు
ముత్యాలతో నారఁబోసినా రేవీటి నృపతు లేటేట బండినయశస్సు

తే.గీ. భాస్కరునిదానధార లేపట్టణంబు
చారుచరితకు బంగారునీరు వోసె
అట్టివినుకొండకడుపునఁ బుట్టుకతన
ధన్యుఁడను నేన; యుత్తమోత్తముఁడ నేన!

కం. ఇంగువ గట్టినగుడ్డవ
లెం, గీరితికప్పురంబు లేశములు, చరి
త్రం గోచరింప, నిప్పుర
మందు దొలఁగి కాలదండహతి ని ట్లయ్యెన్

ఉ. ఏ నిపు డన్యదేశమున నెట్టిమహానగరాన నున్న, స్వ
స్థానముఁ జేరుచో, నగుచు స్వాగత మిచ్చు నగంబుమీది యీ
శానుని దివ్యమంటపము చాయలు, ప్రోన్నతమైన టిప్పుసు
ల్తానుమసీదుగుబ్బల విలాసము, లేశము విస్మరింతునే

శా. ఏకాలంబుననో నశించినవి, మున్నీలాటి సత్కారపుం
బోకి ట్లీపురి, నస్తమించె జరమాంభోరాశి మార్తాండుఁడున్
శ్రీకాంతుండు పునఃప్రతిష్ఠఁ బొనరించెన్ గ్రమ్మఱన్, దెల్గుభా
షాకళ్యాణి! పచారిసేయుము జయేచ్ఛం బంచకల్యాణిపై

మ. సకు లింటన్ గెలిపించినార లిఁక, రచ్చం గెల్తు నెందేని, సా
ర్థక మయ్యెం గవితాపరిశ్రమ, విధూతంబయ్యెఁ జింతాతమ
శ్శకలంబుల్, దొలికోడి గూసిన దుషస్సంధ్యారుచిం దేలు, మా
మకపూర్వాశ జనింపఁడో; జిఱుత సంపత్సూర్యుఁడింపారగన్

మ. జననంబందితి మీసమక్షమున, మీసాన్నిధ్యమం దాడినాఁ
డను గోలీలు, బజారుదుమ్ము మొల నంటన్ బాలురం గూడి, యీ
వినుకొండన్ గనుగొన్న, నాహృదయ మావేశంబునం బొంగిపో
వును, మీ రిచ్చిన నీయకున్న, సహజంబుల్ భక్తితాత్పర్యముల్

శా. నానిశ్చేయము విన్నవింతు వినుఁ డాంధ్రక్షోణి పొంగార, మీ
వాని న్నన్ను బహూకరించితిరి, లోపం బింత రాకుండగా
నీనూరారులు వెండినాణెములు, వేయిన్నూరుబంగారుసో
పానాలైనవి, మీ యశస్సతి వసింపంబోవుసౌధానకున్

ఉ. పోయె నమాసరే లిపుడు పున్నఁపువెన్నెల వచ్చె, యుల్లమున్
గోయిలపిట్టయై, తెలుఁగు కొమ్మతల న్నివసించె, హాయిగా
గూయకపోవునే; చిగురు కోకలతోఁడ వసంతలక్ష్మియున్
డాయఁగ వచ్చెఁ, బుష్పవదనంబునఁ బ్రేమమరంద మూరఁగన్

## రాజదర్శనము

ఉ. మానిత రావువేంకటకుమారమహీపతి సూర్యరాయ, భూ
జాని! హసాదు, మీస్థిర విశాల వితీర్ణికి, నేను నేఁడు పెం
పూను కవిప్రపంచమున నొక్కమిణుంగురుఁబుర్వు నున్నతిన్
గానక సంచరించెడు నొకానొకపేదను వృద్ధికాముఁడన్

మ. అల దిగ్దంతులవంటి పండితులకావ్యాంభోధులం దూర్మిశ
య్యల నుయ్యాలల నూఁగు మీ చరణదివ్యద్దర్శనార్థంబు రాఁ,
దలఁ కె న్నాకవితాకుమారి, నరనాథా! ముద్దరా లేమి సొ
మ్ములతో రావలెనో? యెఱుంగదు, భయంబున్ దీర్చి, మన్నింపవే

మ. శరణం బిచ్చిరి నాయనాథకవితాచంద్రాస్యనీక్షించి, ము
గ్గురు శ్రీమంతులు వర్ణఖండనవిదగ్ధుల్, వారియాలంబన
స్థిరత న్నేఁ డొకయింటిదై నిలిచి, పొల్చెన్గాని, లేకున్న బం
ధురసన్యాసముఁ బుచ్చుకొన్న దయియుండున్, సూర్యరాయాధిపా!

మ. స్మరణీయుం డగుసిద్ధిరా 'జనుఁగుమామా!' యంచుఁదిక్కన్నతో
నెఱపెన్ జుట్టఱికంబుఁ, గ్రొత్త దను సందేహంబు లేదో మహీ
వర! మన్నింపుము సాహసోక్తులు, కవిత్వప్రాప్తిమై, నేను ద
గఱచుటంబను రాచవారి కనుదీకాలేశ ముందు నదా?

సీ. అతిమనోహరభావనాకాశపథమునఁ బ్రాలుమాలక పల్లటీలుగొట్టి
శైరీషకుసుమ కేసరఁపుగుత్తిని మొత్తు మెఱుఁగుశయ్యలమీద మేను వాల్చి
యుపలంబులోఁ జెమ్మ లూరించు కమ్మని వ్యంగ్యవీచిక లెక్కి పరువు లెత్తి
చిరకాలమునఁ బుట్టి చివికిపోయినప్రాఁత భూషణంబులు జూచి మూతి విఱచి

తే.గీ. గ్రంథరూపంబుఁ దాల్చుభాగ్యంబు లేక
కంటఁ దడివెట్టుచుండు నాకవనపటిమ
ఏమిసేయుదుఁ బ్రోచురాజేంద్రుఁ డేఁడి?
కర్ణుఁ డేమాయెఁ? గులపరీక్షకులనడుమ!

శా. సాంగోపాంగముగా రచించితిని భాషాశుద్ధి, మారాటరా
సింగంబైన శివాజిరాజుకథ, శ్రీశ్రీశైలపత్యాహ్వయుం
డంగీకారమునన్ వరించె, నవనీశా! కోరినన్, దానిమై
సింగారంబు నొకింత సూపెదను దాక్షిణ్యాక్షి నర్పింపవే!

మ. మనుచారిత్రము, కృష్ణభూవిభుఁడు సన్మానించు నుయ్యేల పా
న్పున, మృష్టాన్నములందుఁ గప్పురపుఁదాంబూలంబులం దంకురిం
చినయానందరసంబులోఁ బొటమరించెన్ భూపతీ! పొట్టనిం
డనిమాబోంట్లకలంబు లెక్కరణి విన్నాణంబుఁ జూపించెడిన్?

ఉ. నాకవితావధూటివదనంబు నెగాదిగఁ జూచి, రూపరే
ఖాకమనీయవైఖరులుగాంచి, "భళీ! భళి!" యన్నవాఁడె, "మీ
దేకుల" మన్నప్రశ్న వెలయించి, చివుక్కున లేచిపోవుచో
బాకునఁ గ్రుమ్మిన ట్లగునుపార్థివచంద్ర! వచింప సిగ్గగున్

# గుంటూరు సీమ

సీ. శ్రీనాథకవిశిరస్సీమ నట్టువ ద్రాక్కు దీనారములకు మదింపుగట్టి
బాలచంద్రునిలేఁత పచ్చలపిడిబాకు మొలిపించుయశము గాదెలకుఁ బోసి
యెఱగడ్డపాటిలో నొఱిగిన తెలుఁగుమన్నీలశౌర్యంబు మానికలఁ గొలిచి
వేమన్న యోగి గుప్పిన జాళువాకెత తులము వేయివరాలు విలువ సెప్పి

తే.గీ. భాస్కరునిదానధారాప్రవాహసమితి
నబ్ధినాథున కిడి వివాహం బొనర్చి
పేరు మ్రోసిన వీరగుంటూరుక్షితికి
నతు లొనర్పని యాంధ్రమానసము గలదె?

ఉ. ఆలకు వన్నె నిచ్చు నమరావతిశిల్పులనేర్పు పెంపు, దే
వాలయగర్భముల్ వొగడ, నభ్యుదయంబునఁ గృష్ణవేణిలో
వాలుగచేపతళ్కులకు వంకలు దిద్దినసుప్రతిష్ఠలోఁ
దేలినరెడ్డిరాజులసతి న్నుతియింపనిభూము లున్నవే?

మ. అల కృష్ణాజలధార, పెంపకముసేయం బండు, బంగారుతీ
గలమాగాణులు పట్టుచీరలయి శృంగారింపఁగాఁ, బూర్వరా
జులదోశ్శౌర్యము లుగ్గడించెదురణక్షోణీస్థలుల్, రత్నభూ
షలుగాఁ బొల్చెదువీరభూమినిఁ బ్రతిష్ఠాజ్యోతి వెల్గించెదన్

మ. కలఁతన్ జెందినతొంటి నాగరకతాగంధంబు, జీరంగిజె
క్కలరైకల్ ధరియించి, మోటుసొగసుల్ గైసేయునాసామిక
న్యలతో డాఁగుడుమూఁతలాడఁ గని, యానందించుగుంటూరుమం
డలముం గన్నుల కద్దుకొన్నవి, కవీంద్రస్వర్ణపద్యావళుల్

మ. తలపోయం గవిసార్వభౌమునిమరందస్వాదుకావ్యంబు ల
ప్పలనాటం గలజొన్నబువ్వకు, గురుత్వప్రాప్తిఁ గల్పించి, పూ
విలుకానయ్యకుఁగూడఁ గొంతరుచిఁ జూపెం దింత్రిణీపల్లవం
బులతో బచ్చలికూర, చిత్రములు మద్భూమీచరిత్రాంశముల్

## సమదృష్టి

ఉ. ఖద్దరుబట్టఁ గట్టికొని, కన్నుల నీరము చిందిపాఱ, నీ
ముద్దుకుమాళ్ళతోఁ జెఱకుఁ బోయెద వేటికి తల్లి? పూర్వపుం
బెద్దఱికంబుఁ దెచ్చుకొని పిల్లలతో సుఖియింతు నందువా?
వదు, వృథావ్యధల్, భరత భామిని! విన్ద్రదరాదర సనీ!

సీ. పూర్వకాలచరిత్రముల నిద్రితములైన, శుభదినంబులు లెక్కఁజూచుకొనుచు
భూగర్భమున రత్నములలోనఁ గలసిన కఱకువీరుల కొడుగఱచికొనుచు
చెదపుర్వుపొట్టలో జీర్ణించిపోయిన వాఙ్మయంబునకు వివాదపడుచు
గజవాహనములపై గజనీకిఁ బోయిన పసిఁడికి గుండెలు బాదుకొనుచు

తే.గీ. పొట్టనింపుల నాటకంబులఁ జరించు
కొడుకులకు స్వేచ్ఛ లేదని కుందె దేల?
స్వేచ్ఛ లేకేమి సోదర ద్వేషమునకు?
తిరిగిచూడుము నట్టింటిదెబ్బలాట

చం. కలమునఁ గిర్తిశేషులకుఁ గాయము లీయ సమర్థులైన బ్ర
హ్మలు కవిరాజు, లట్టిడుల కన్నము లేదుగదమ్మ! దేశభా
షలు విలపించుచున్నవి, విజాత్యభిమానము చెంగలించె, నో
చలిమలమేల్ముసుంగుదొరసాని! కుమారుల దిద్దుకొందువా?

చం. విమలతపంబునం బురిటిబెబ్బులికంటి కహింస నేర్పు, సం
యములను గన్నదానవుగదా? జననీ! భవదీయపుణ్యగ
ర్భమున నగస్త్యసోదరులు భ్రాతృవిరోధులు పుట్టి రేలనే?
అమరనదీదళత్కమలహార! యచంచలధర్మగామినీ!

మ. సమవర్తిప్రియసూనునేత్రయుగళిన్ సందీపితం బైన ధ
ర్మము తూర్యధ్వనిఁబోలి భారతకథా మధ్యంబునన్ మ్రోయు, నా
సమభావం బిపుడేది? స్వార్థయుతవాచారూపముం దాల్చె, నో
సమశీతోష్ణసుఖప్రదాయిని! అహింసాలోచనోద్భాసినీ!

కం. చక్కని కవితకు, కులమే
యెక్కువతక్కువలు నిర్ణయించినచో, నిం
కెక్కడిధర్మము తల్లీ?
దిక్కుంజర వేదికాప్రతిష్ఠితగాత్రీ!

# పశ్చాత్తాపము

చం. మును తెరచాటునన్ జరిగిపోయిన కర్ణునిజన్మగాథ, యే
మని వివరింతురా! శమనజా! యతఁడే, భవదగ్రజుండు, నా
కును రవికిన్ జనించి, ధృతిఁ గోల్పడి డాగినమందభాగ్యుఁ డ
య్యినజునియెంగిలిన్ గుడిచియేకద పొల్చె, భవచ్ఛరీరముల్?

తే.గీ. భాస్కరసుతుండు, నాదుగర్భమునఁ దొలుతఁ
గునికి, నిద్రించి, లేచి పోయిన యనంత
రమునఁ బొడమినలేఁత దేహములు మీవి,
వాని జ్యేష్ఠత్వమే, నీకు వచ్చె నన్న!

ఉ. ఎందుకు గంటినో; తెలియ దీయినబింబసమానమూర్తి, నా
క్రందన మాచరించు కసుగాయను, కుండలమండితాంగుఁ గా
ళింది కొసంగితిన్ జవుకళించెడుదుఃఖముఁ గ్రుక్కుకొంటి, నీ
కుందు గతించునే? తలఁచుకొన్న సహించునె! మాతృగర్భముల్?

శా. "నీకన్యాత్వము మొక్కవోదు విను కుంతీ!" యంచు, నేరీతి న
న్నూకొట్టించెనొ? భానుమంతుఁ, డొక విద్యుత్సన్నిభాంగుండు, ది
వ్యాకారుం డుదయించెఁ బుత్రుఁడు, కుమారా! వాఁడె కర్ణాఖ్యుఁ డి
ట్లేకాకింబలె నయ్యె, వీనిమృతి కేనే హేతువున్, ధర్మజా!

శా. కానీనుం డనువెచ్చనైనపలు కాకర్ణించి, లజ్జాముఖుం
డై, న న్నేమి శపించియుండునొ; తనూజా! "దానకర్ణుండ వ
న్నా! నాకొంగున భిక్షపెట్టు" మని నేనర్థించినన్ నవ్వి, ఆ
హా! నన్నుం గృతకృత్యఁ జేసినవిధంబాత్మం బ్రపీడించెడిన్

మ. అకటా! యెన్నిదినాలు దాతును కుమారా! ధర్మజా! మర్మభే
దకమై, పొంగులువాఱుకర్ణునిచరిత్రం బానిరాలంబజీ
వికి, మీయన్నకు, స్వర్గసౌఖ్యములు గల్పింపంగదోయీ! తిలో
దకదానం బిడి, కొంత నాదగు మనపాపంబు చల్లారెడిన్

# క్రీస్తు

మ. నిను వెన్నాడి నభంబునం దమలకాంతిం జిమ్మునక్షత్రమున్
గని, రాజన్యులు తల్లడిల్ల, మరియా గర్భంబునం బుట్టి, బొ
ట్టనవ్రేల్చీకుచు, బేతలేముపురి గోష్ఠంబందుఁ బన్నుండుచ
క్కనివాఁడా! యెవరయ్య నీవు? పరలోకం బింపు నర్తించెడిన్

మ. తొలి, నీదర్శన మిచ్చి గొల్లలకుఁ జేతోమోదముం గూర్చి, జ్ఞా
నుల రావించి, పసిండికానుకల సందోహంబు చేనంది, యె
ద్దులకొట్టంబునఁ దొట్టిలో నొక దరిద్రుంబోలి నిద్రించు, ము
ద్దులతేఁడా! యెవరయ్య నీవు? మొరసెన్ ద్యోవీథిఁ దూర్యధ్వనుల్

మ. “పరమం బైనవిశుద్ధవర్తన మదంభప్రేమయున్ దాల్మియున్
మరియాకన్యకుఁ బిట్టిపాపఁడువలెన్ జన్మించె” నంచుం బసుల్
గర మన్యోన్యము ముచ్చటించుకొనులీలన్ నిక్కి ‘అంబా’ యటం
చఱచెం బుచ్చము లూఁచి నీకెలఁకులం దాలానబద్ధంబులై

సీ. ఒక చెంపఁ గొట్ట వేఱొక చెంపఁ జూపించి పరమశాంతము స్పష్టపఱచునాఁడు
పరుల నిన్నుంబోలి భావించి మన్నించి ప్రేమపుష్పము సమర్పించునాఁడు
పేద సుంకరియింట విందులో భుజియించి సమదృష్టిమహిమంబు జాటునాఁడు
శుభ్రాంశుకమున శిష్యులపాదముల నద్దినమ్రభావము నుర్వి నాటునాఁడు

తే.గీ. నీవు నిలిచిన పున్నెంపునేలమీద
చిఱునగవుమీఱ మొలిచినగతికపోఁచ
యెండిపోలేదు నేఁడు శ్రీయేసునాథ
వచ్చిపోవయ్య! మాయింటివఱకు నీవు

శా. ఏ దేశంబున నీ సుబోధనలు, వాహిన్యాకృతిం దాల్చి, నా
నాదేశంబుల విస్తరించి, భవకాండజ్వాల చల్లార్చెనో!
ఆ దేశంబె, త్వదీయరక్తనదులం దాప్లావముం జేసె, నిం
దేదో, వేదరహస్య మున్నయది తండ్రీ! క్రీస్తు! మృత్యుంజయా!

మ. కఱకుంబల్లెపుఁబోటు, నీయెదమప్రక్కన్ దాకఁ, గ్రొన్నెత్తురుల్
గురిసెన్ గుండెలనుండి నీవపు"డనుంగుందండ్రి! నీబిడ్డలన్
గరుణింపందగు" నంచుఁ బల్కినయనూనం బైననీయోర్మికిన్
ధరణీధ్రంబులు బ్రద్దలై కరఁగలేదా? ప్రొద్దు చల్లాఱదా?

సీ. సొలొమోనుగుడికుడ్యములఁ బ్రతిధ్వనియించు భవదీయబాల్యవిద్వజ్జయంబు
గాలలీలసముద్రకల్లోలపంక్తిని గద్దించు నీ యధికారరేఖ
శవకదంబములకు జవసత్వముల నిచ్చి బ్రదికించు నీదివ్యవాఙ్మహత్తు
జలరాశిమీద స్వేచ్ఛావిహార మొనర్చి యలరు నీ పాద చిహ్నములవరుస

తే.గీ. చెప్పి, చూపించి, మాఫలస్తీనుభూమి,
పొంగిపోవుచు నున్న దిప్పుడునుగూడ
ప్రేమతత్త్వంబు రూపించి విశ్వములను
కౌఁగిలించిననిన్ను నేఁ గౌఁగిలింతు

# వీరపూజ

చం. ఇలను భరింపనై పెరుఁగు నేనుఁగుపిల్లలవంటి పాండుపు
త్రులు, గరిడీలలో గురునితోడఁ బరిశ్రమ సేయుచుండఁగా
మొలకమెఱుంగు చన్నుఁగవమోసల గగ్గురుపాటుఁబూని, కౌఁ
గిలి యిడినట్టిదిగ్విజయగేహిని! ఢిల్లికి నీకు సేమమా?

మ. తళుకుంగత్తులయుక్కుపుప్పొడులు చిందన్ దాఁకుకౌరవ్యసే
నలతోఁ బోరుకిరీటిపుత్రుఁడు, ప్రచండం బైన తేజంబునన్
జలజవ్యూహముఁ జీల్చి చిక్కువడి ప్రాణ త్యాగముం జేయ, గు
బ్బలు పొంగం దలఁబ్రాలు వోసితివి రంభా! యెంతపుణ్యాత్మవో!

మ. ధరణిం గ్రుమ్మరువింత భాస్కరుఁడు రాధాపుత్రుఁ డానాఁడు, సం
గరభూమిన్ బహువీరసైనికశిరః కాండంబుఁ జెండాడుచో
అరుణుండుం గనుసన్నసేయఁగ విషాదావాప్తితో నీకుఁ జె
చెర నుప్పొంగినచేఁపుఁబాలకుఁ, జెమరెన్ రాలు, కుంతీసతీ!

చం. కదలెదుపందుటాకువలెఁగార్ముకమున్ ధరియించి, క్రీడి కే
ల్గదలుపనీక యమ్ములు వెలారిచి, వహ్నిశిఖాచయంబునాఁ
బొదలినవాఁడు, మూడుజగము ల్దలక్రిందులు చేయఁజాలు, మా
ముదుసలిబ్రహ్మచారి పడిపోయిన భూములు పూజనీయముల్

ఉ. లీల, ననేకమానవ కళేబరముల్, నులివెచ్చనెత్తుటన్
దేల, నఖండచండకరతేజుఁడు,పార్థుఁడు గాండివంబుతో
నాలములో నటించు సమయంబున, నింద్రుని వేయిగన్నులన్
రాలినమోదబాష్పములు రత్నములై నిలిచెం, బయోధులన్

తే.గీ. నెఱికురులమీఁద, బంగారునీలమణులు
వెలయుచందాన, నెమిలికన్నులు రహింప
వెన్నుఁడు, రథంబు నడిపినవీరభూమి
స్వచ్ఛమానస గంగమ్మ సంచరించు

## ఆంధ్రభోజుఁడు

మ. ఇపు డాకృష్ణధరాతలేశ్వరుఁడు లేఁడేమాయెనో! నాటి యు
ద్ధపుఢంకానినదంబు, మా తెలుఁగు విద్యాభారతీనాట్యమం
టప, మయ్యష్టదిశామదేభముల క్రీడారంగ మెం దున్నదో!
విపులాసుందరి దొంగిలించినది, తద్వృత్తాంతమాణిక్యముల్

ఉ. పోటరి కృష్ణరాయనృపముఖ్యుఁడు ఖడ్గముఁ బట్టునాఁడు, కుం
దేటికిఁగూడ పౌరుషమునిండినగాథలు సెప్పి మీసమున్
దీటిన తెల్గువీరులకు, నేఁడు కనుంగవ చెమ్మగిల్ల, వ్యా
ఘ్రాటము గూడుగట్టె నవురా! యతఁ డెక్కినసింహపీఠికన్

ఉ. కాలము చక్రముంబలె, యెకాయెకి దొల్లుచుఁ బోవుఁగాని, రాఁ
జాలదు వెన్క కొక్క నిముసంబు గతించిన, దీనిగర్భమున్
జీలిచినన్ గనంబడు, నశేషమహీతలవృత్త, మిందులో
మూలుగుచున్న దాంధ్రుల విభూతి, శతాబపరంపరాహతిన్

మ. కడచూడంబడరానికాల మను, రక్షఃకాంత గావించు, గా
రడియం దబ్బు లెడారు లైనవి, విచిత్రస్వప్నవృత్తంబులై
నడచుం బెద్దలజీవితంబు లిపు, డీనాట్యంబునం దెన్నఁడో
కడచెన్ రాయలవారి రాచఠీకపుం గల్యాణగాథాంకముల్

మ. వలపోయుం దలపోసి నేటికిని, పంపావీచులం దామరా
కులనీడం గొలువైనచేఁప లిపు డుద్ఘోషించెడిన్ గోటగో
డలలో నీలపురుంగు, లాంధ్రుల ప్రతిష్ఠాజ్యోతి చల్లాఱెనే?
బలియై పోయెనె! కాలభూతమునకుం బ్రాచీనరాట్సంపదల్?

చం. ముదమున గండపెండియరపుం జిఱుగజ్జెలమ్రోఁతతోడ, నీ
సదనమునందు గ్రుమ్మరుల సత్కవితాసతితాతగారి, య
భ్యుదయము విన్న, నాహృదయ మూరక పొంగులువారి నాఁడు నే
నుదయము నందనైతి ననియున్ దలఁచున్ నులివెచ్చయూర్పులన్

తే.గీ. పసిఁడిమూటలు వీపులపై నటింప
నాంధ్రకవికుమారుల సాగనంపినావు
అపుడు పుట్టినకవులభాగ్యముఁ దలంచి
యొదుగఱతురు నిర్భాగ్యు లాధునికులు

చం. ఎనిమిదిమంది దిగ్గజములీవల నావల నిల్చి, విశ్వమో
హనకవితామధూళిమ వియన్నదుల న్నిను ముంచి తేల్చినన్
దనియక, క్రొత్తక్రొత్త కవనంబునకుం దలయూఁచి, చేయిసాఁ
చిననినువంటిరాజు, కవిశేఖరుఁ డింకొకమాఱు పుట్టునే?

కం. సుందరము లైనకబ్బము
లంది బహూకృతు లొనర్తు వఁట! పాదము లం
దందియలు దొడిగి స్వయముగ
నెందుంటివి? కృష్ణరాయపృథివీశమణీ!

సీ. మనుచరిత్రమునఁ బెద్దన పోఁతవోసిన కృష్ణరాయనిలసత్కీర్తినగరు
ముక్కుతిమ్మన తెల్గుభూఖండమున నాటు పారిజాతమహీజపరిమళంబు
వరదరాజమ్మ కంబముపొంత నిలిపిన మగనిపేరిటి సుధామలసరస్సు
ఆంధ్రభోజునికరం బభ్యుద్ధరింపఁగాఁ గులికి నవ్వినతొంటి తెలుఁగువాణి

తే.గీ. కాలధూర్తాంగనావక్త్రగహ్వరమున
సమసిపోవునె? భువన ముచ్చలిత మైన,
వార్ధకంబును, మరణ, మెప్పటికి లేదు
ఆంధ్రరాజుల లీలావిహారములకు

## మాంపాహి

శా. ఏదీ! నా కిఁక స్వేచ్ఛ? యీభువన మధ్యేమార్గయానంబునం,
దీదౌర్భాగ్యపుజిహ్వ కట్టువడిపోయెన్, శుష్కవేదాంతమున్
బూదింబోలినవర్ణభేదమును, నేవో! రిత్తసిద్ధాంతముల్
నాదీక్షాభవనంబులో వెలుఁగుజ్ఞానజ్యోతిఁ జల్లార్చెడిన్

చం. ఒమరుఖయాముబోధ విని యువ్విళులూరుచు, వెన్నరొట్టెతో
సుమరస మానినావు, వెలసుందరి సిద్ధము సేయుమాంసఖం
డములు పులావుతో మెసవినాఁడవు, స్వర్గసుఖంబునందు భా
గము గలదందు, వియ్యది దగా యగు, మానుము పిచ్చియూహలన్

శా. వాసించున్ జెలి! నీకనుంగవను కైవల్యంబు, నీదృష్టికిన్
దాసత్వంబు వహింతు నంచు మధుర ద్రాక్షారసం బాను, భో
గాసక్తుండు మహానుభావుఁ డని, వ్రాయంబూనినా, రీకవి
వ్యాసర్షుల్, పఠియింపఁజాల నిఁక మిథ్యాభారతగ్రంథముల్!

ఉ. ఈరహదారిలో నడువు, మీశ్వరదర్శన మబ్బు నంచు, నా
ధారము లేనిపుక్కిటి కథల్ వినిపించెడుమోసగాఁడ! ధి
క్కారము చేయు తెల్లదొరగారికి ముచ్చెలు మోసి, మిత్రునిన్
జేరువ నున్నవాని నిరసించెద వెక్కడివైపరీత్యమో!

చం. అనృతపిపాసి! యేచెఱకు నందుఁ దయారగునోయి! నీవు నే
ర్చినపలుకుల్? దుబారుగ నశించిన రాజులజీవితంబుతో
మనకుఁ బనేమి? తెల్లనిసమాధినిఁ బోలిననీచరిత్రచే
మనుజులు మోసపోయిరి, ప్రమాదము లీవిషమప్రసంగముల్

## రత్నచ్యుతి

మ. ఒకరత్నంబును జేతఁబట్టుకొని, యూరూరం బ్రదర్శించి, చా
లక, ఖండాంతరసీమ లెక్కి, నిజవాల్లభ్యంబు నూరించుసా
ర్థకతాదివ్యకుటుంబినీమణి, మదాంధ్రక్ష్మాలతాతన్వి, యా
యొకరత్నంబును బాఱవేసికొనె, నయ్యో! యెట్లు శాంతించునో!

చ. రతనము జాఱిపోయినదిరా! సుకుమారకుమారులార! మీ
యతనము లింక సాధ్యపడ, వాంధ్రధరాతల మెల్లఁ జిక్కుటం
ధతమసవార్ధిలో మునిఁగెనా? మనగాంధికిఁ జెప్పినారొ! లే
దొ! తెలుపుఁ దంచుఁ గేకలిడుచున్నది చూచితిరే? ధరాసతిన్

ఉ. ముప్పదియెన్మిదేండ్లు నినుమోసినయాంధ్రధరాసవిత్రికిన్
గొప్పున దిద్దిపోయితివి, కోమలకాంచనదామకంబు, నీ
యొప్పును, సత్కళాప్రతిభయుం గల, కొండొకయాంధ్రవీరుఁ డిం
కెప్పటికిన్ జనింపఁగలఁడే? జనియించినయేని దక్కునే?

మ. నినుఁ గామించినకీర్తిగోపికలు, నీ నిర్యాణవార్తాహతా
ద్ఘనబాణంబున ఱొమ్ము గ్రుద్దుకొని, నీ గంభీరగాథావిమో
హనబృందావనవీధులం బరువులేయన్‌జొచ్చె, నీశోక వా
హిని నేరీతిఁ దరింతురో, తెలియదోయీ! రత్నగోపాలకా!

సీ. కృష్ణవేణీతరంగితతరంగములందు దేశీయగానంబు దిద్దినావు
జాతీయపౌరుషస్వచ్ఛందరక్తంబు చీరాలరణసీమఁ జిందినావు
పులిని గ్రుద్దుకు జంపఁ గల దేహదార్ఢ్యంబు మును బందిలో ధార వోసినావు
శతకోటిమనుజస్వరసౌందర్యంబుపీడరోగమున కరిగించినావు

తే.గీ. పలుకుపలుకున హాస్యసంపదలు గురియు
సహజవైదుష్యమునకు నిచ్చలును పొంగు
నాంధ్రసోదరలోక మల్లాడ నపుడ
స్వర్గ మెక్కితి వేల? గోపాల! నీవు

సీ. బహువిధంబుల గ్రుక్కఁబట్టి యేడువఁజొచ్చె సగ మైన నీదు దీక్షాకుమారి
పాడెకట్టెలమీఁదఁ బడి మొత్తుకొన సాగె దిక్కులేని భవత్సతీలలామ
హృదయంబు బ్రద్దలై పొదల, దిక్కులు సూచె మితిలేని నీబంధుమిత్రకోటి
ప్రకృతిసుందరవైభవం బేది, కళ దప్పె క్షేమాంక మైన నీరామనగరు

తే.గీ. దాసు వోయిన యలకల్కతాపురంబు
పగిది, గుంటూరుపురి శోకభరిత మయ్యె,
నయ్యయో! ఆంధ్రరత్న! నీయాగమమున
స్వర్గపట్టణ మానందభరిత మయ్యె

సీ. ధనవంత మైనలండనుపట్టణమునందుఁ దెల్గునేలకు వన్నెఁ దెచ్చినావు
స్వాభిమానముఁ జాటు వంగరాష్ట్రమునందు గౌరవాభ్యుదయంబుఁ గాంచినావు
రాజమహేంద్రపురాన "యల్టీ" దాక సిరి మీఱఁ బాఠంబుఁజెప్పినావు
ఒకయుపన్యాసంబునకు నూఱుఁబదునార్లుగాఁ గట్నములు మూటఁగట్టినావు

తే.గీ. పెదవిఁ గదలించి, నీవు నవ్వింపనట్టి
భారతీయుఁడు, నొక తెల్లవాఁడు, లేఁడు,
ఇంతచాతుర్యజలనిధి వింతలోన
రూపుమాసితివే, రత్నరూపకృష్ణ!

సీ. భౌతికశారీరపంజరంబేగదా? చితిమీఁద దగ్ధంబుఁ జేసినావు
క్షణభంగురం బైనసౌందర్యమేకదా? మృత్యుదేవతకు నర్పించినావు
కంటికిం గనరాని కంఠస్వరమెకదా? కాలవాహినిలోనఁ గలిపినావు
ఊటాడి జాఱునాయుర్దాయమేగదా? వెట్టిబ్రహ్మమొగాన వేసినావు

తే.గీ. మరణధాటికి, జరకుఁ, దత్తఱముపడని
తతయశఃకాయ మిప్పుడు దాల్చినావు,
ఇపుడు జీవించియున్నాఁడ వింద్రసభకు
రత్నదీపంబు లేనికొఱంతఁ దీర్చి

సీ. మహితస్వరాజ్యోద్యమము పోరి కెదురెక్కి మదమద్రిప్పని వీరమండనుండు
గాంధిభక్తుని జిహ్వఁ గదలించి, వెలలేనిరత్నంబుఁ గొన్న సార్థకపురుషుఁడు
వాసికెక్కిననేర్పు మూసలో గుండెఱాల్గఱగింపఁజాలు నఖండవక్త
పరుల వంచించుటక్కరిభక్తులకు నల్గి,కొఱడాలు సృష్టించుగుణనిధుండు

తే.గీ. దినము గడచుట కింట బత్తెంబు లేక
నిత్యసంతర్పణంబులు నెఱపుభక్తుఁ
డాంధ్రవైభవధ్వజ మూడి యవని గూలఁ
గూలిపోయెనె! మారత్నగోపకుండు

## శబ్దశాసనుఁడు

సీ. మాసిపోయినశిలాశాసనంబులమీఁదఁ దరువోజ వోలి ప్రత్యక్ష మగుచు
ద్రవిడభూపతుల బాంధవ్యంబుకతమున ధ్వని సన్నగిలి నంగిదాన వగుచు
రాటాలకడఁ గూనరాగాలు పచరించు పండుటవ్వలనోట బయలువడుచు
ఇంటింటికడ బిచ్చ మెత్తుజంగములగుమ్మెటపాటలో మిట్టిమిట్టిపడుచు

తే.గీ. పొలుపు దఱిఁగిననిన్ను నభ్యుద్ధరింప
రాజరాజులసభఁ గప్పురంబుతోడ
నందుకొన్నాఁడు తాంబూల మాంధ్రవాణి
శబ్దశాసనకవిలోకచక్రవర్తి

సీ. శబ్దసాధుత్వంబు సాధింప భ్రష్టవాఙ్మయమహాటవి నెంత నవసినాఁడొ!
ప్రబలదుర్భరకథాపదకంబు గుదిరింపఁ దలవాయ నెన్నాళ్ళు తలఁచినాఁడొ!
గౌతమీగంగ యంగము నంటి దీవించిపనుప, నేరేవున మునిఁగినాఁడొ!
పసుపు రాచిన తాళపత్రంబు చేఁబూని శ్రీకార మేనాఁడు చెక్కినాఁడొ!

తే.గీ. తెలుఁగునుడికారమున నమృతీకరించి
భారతామ్నాయమునకు జీవముల నూఁది
తేజ ముడిగినస్వీయజాతీయరక్త
నాళములు పుల్కరింప గానంబుఁజేసె.

సీ. వేఁగిరాజులసతీవితతికి గరువంపునడక నేర్పినది నన్నయ్యరచన
తెనుఁగుభాషాపద్మమునకు జాఱనివన్నెఁ బట్టించినది కవిబ్రహ్మపలుకు
కంచుఢక్కల నోరుగట్టించి జయకేతనముల నెత్తినది శ్రీనాథుజిహ్వ
ప్రతిలేని యపవర్గపదవివంకకు రహదారి దీసినది పోతనచరిత్ర

తే.గీ. విజయనగరాధిపుల భుజావేదికలకు
నందలంబులు మోయుమర్యాద గఱపి
తనివిఁ గొన్నది మొన్న పెద్దనకవిత్వ
మాంధ్రభారతీ! నీ తేజ మద్భుతంబు

## అయోమయము

తే.గీ. "నాకవిత్వంబునందు రత్నములు గలవు,
వానిఁ బెకలించి చూపెడు వాఁడు లేఁడు
కాల మిట్లున్న దని" మొనగాఁడు వోలెఁ
బలుకుకవిగాఁడ! యేటికి స్వాతిశయము?

కం. ఏవీ? యారతనంబులు
నీవే పెకలించి చూపి, నీయింటికిఁ గొం
పోవోయి! యట్లొనర్పఁగ
నీవలననెగాదొ! యింక నీల్గెద వేలా?

ఉ. "ఇయ్యది నూత్నపుంగవిత, యీకవనంబును జూచెనేని, న
న్నయ్యయుఁ గొయ్యవాటి చనఁడా?" యని వెఱ్ఱిమొగాలు, పప్పురా
మయ్యలు, కొందఱన్న విని, యాత్మను బొంగుదె? వడ్లగింజలో
బియ్యపుగింజగా కిది, కవిత్వమటోయి! బడాయిఁ గొట్టఁగన్

కం. కమ్మనిభావము గల ప
ద్య మ్మొక్కటి వ్రాయఁజాల వన్నిటిలో, "ము
గ్ధమ్మో! ప్రణయంబో" యని
యుమ్మలికించెదవు నీదియుం గవనంబా?

మ. ధ్వనిచే ముద్దులుగాఱు, భావములు చిందన్, ముచ్చటల్ సెప్పుచున్
దెనుఁగుంగబ్బపుముద్దులాఁడి, మును జన్మించెన్, గవిబ్రహ్మ దా
ల్చినఘంటంబున, నీయభావకవితాచిత్రాంగి, నీతిక్కనా
ర్యునిముం దేల ప్రవేశపెట్టెదు? చిరాయుస్సారదూరీకృతన్

మ. వరిగడ్డింబలెఁ, బేలవం బగునభిప్రాయంబు గర్భంబులో
నిఱికింపబడి, పెద్దమూఁగదయి పోయెన్ గబ్బ, మీసొమ్ము లూ
సరవెల్లుల్, చరణంబు సాగని నికృష్టం బైనమార్గానఁ జీఁ
దఱఁ బుట్టించెద వేల? శ్రోతల కనర్థవ్యర్థవాచాలతన్

చ. కవిసమయంబుఁ దప్పి, నుడికారపుసొంపును బాడుసేసి, నీ
వెవతుకకోసమో! కుమిలియేడ్చుచుఁ జక్కని తెల్గుకైత కా
యువులు గుదించి, యేమిటి కయోమయముం బొనరింతు వీవు? నీ
కవనము పాడుగాను, వెడఁగా! యిఁకనేనియు రమ్ము దారికిన్

కం. ఇమ్మాడ్కిఁ బ్రణయమధుర ర
సమ్ముం జవిసూపి, నిన్ను సాధించుచు, నీ
గమ్మత్తు సేయు, నెవ రా
యమ్మాయి? వచింపరాదఁటయ్యా! మాతో

## కళాశాల

శా. అంతశ్శత్రుల సంహరింపఁగల బ్రహ్మజ్ఞానపాథోధి, నీ
స్వాంతంబున్ దనియించుపండితుఁడు, కృష్ణస్వామి, నీస్వామియై
చెంతన్నిల్చి, కుమారవర్గమును దాల్చెన్, బాహుమధ్యంబునన్
సంతోషింపుము దత్తమండలకళాశాలా! విశాలాశయా!

మ. పరువుల్ వాఱెడు నీ కుమారులసుధాభావప్రపంచంబులో,
గరళంబున్ జిలికింపఁబోకుము, కళాకాంతారజీవన్మునీ
శ్వరు లీబిడ్డలు, గారడీబ్రతుకు మెచ్చంబోవ రావేశ బం
ధురముల్ వీరిహృదంతరాళములు, విద్యుద్వాహినీమాతృకల్

ఉ. తాతలనాఁటిచీఁకటి మదద్విపమున్ బొలియించి, లోకమున్
బూతముసేయ నీ సుతులు పోవలె నిచ్చట శిక్షఁబొంది, కెం
జేతులు సాఁచి యంకమునఁ జేరినవీరల కందఁజేయవే
నైతిక సాంఘికప్రకృత నాటకదోషవిఖండనాస్త్రముల్

## సఖి

ఉ. తూరుపు తెల్లవాఱినది, తోయజబంధుఁడు నీదు చూపుటం
కూరము దొంగిలించు నను కొందును, ముందుఁ బరిగ్రహించు నా
చారము నాది, మేల్కొనుము చల్లనిగాడ్పులు నిద్రలేచి, సం
చారముసేయుచున్నవి, ప్రసన్నములై, మనకోస మంగనా!

ఉ. ఱెప్పలు వాల్చుకాలమును రేల ఘటించెడునిద్రవేళ, నీ
యొప్పున కప్పగించుట కయో! ప్రతిబంధక మయ్యె నంచునే
నెప్పుడు గుందుచుందును సఖీ! గతియించినఱెప్పపాటులో,
నిప్పటినీవిలాస మొక యించుక లేఁతగదా! వయస్సునన్?

ఉ. కాలము ముందుఁ జిక్కునని కన్నులు మూసి వచించుచుండు మూ
ర్ఖాళి, యెవండు వ్రాసియిడు నయ్యది యేరికి భుక్తమౌనొ? వ్యా
లోలములైనదేహములలో సుఖ ముండదు ముందు, నర్ధచం
ద్రాలిక! వ్రక్కలింతు హృదయంబున నీహృదయంబుఁ జేర్పవే!

ఉ. రేపనుమాటలో మనశరీరము సంశయ మన్నయర్థమున్
గాఁపుర మున్న, దీ దినమునం గడచన్న దసంశయంబు, చా
నా! పరిపుష్టినందు ప్రణయంబును దూరము సేసికొన్నచో,
పాపమొ! పుణ్యమో! యెఱుఁగవచ్చునె? ఖేదము రాజ్య మేలెడిన్

ఉ. పాలకులై, ప్రపంచవిభవంబును జుట్టినగొప్పవారి గో
రీ లవిగో! శ్మశానమునఁ బ్రేయసి! వారిప్రశంస లెల్ల ని
ర్మూలములయ్యె, బొంది విడిపోవకముందు సుఖించువారిదే
మే లనుకొందుఁ, గాలము గమింతము రమ్ము, కవుంగిలింతలన్

ఉ. 'తాళుము, తాళు'మం చొక విధంబున నూఱటపుచ్చఁజూతు వె
న్నాళులు తాళు మందువు? మనంబులు చేరువయైనమీఁద నీ
కాలవిలంబనంబు నరకంబుగదా సఖి? కీలుగంటులోఁ
బూలు, సుగంధముం దొఱఁగిపోయిన, ముద్దునఁ దీపి నిల్చునే?

ఉ. కేవలరత్న కాంతులను గేరెదునీజిగిమోవిగిన్నెలో
నీవఱకే మరందరసమించుక యంచులు దాఁటుచుండె, న
య్యో! వనితా! తదీయ లవమొల్కిన నేను సహింపఁజాల, నా
భావము దోసిలొగ్గెడిని బండిన నవ్వున నందఁజేయవే

చం. హృదయము శాంతిలేనిబ్రతుకెందుల? కూఱటఁ జెందుమంచుఁ బ
ల్కుదు రపవర్గవాదులు, తలోదరి! లాభము గానరాదు, నీ
పెదవులనుండి చిందిపడు, పిన్ననినవ్వును దేనెమాటతో
మెదిపినభుక్తిపాత్రము సమీపము సేయుము, కోడి గూసెడిన్

ఉ. కామిని! కౌతుకం బనెడు గ్రంథము, నేఁటికిఁ బూర్తియైన దే
మో! మన, కెల్లి పైఁబడఁగనున్నది దీర్ఘవిచారమో! గృహా
రామము పూచియున్నది, కరంబున నున్న పసిండివీణతోఁ
బ్రేమరహస్యముల్ వలుకవే! కడకన్నుల మ్రొక్కు లిచ్చుచున్

# యుగంధరమంత్రి

ఉ. అక్కట! యుక్కుసంకెలలుహస్తములం దగిలించి, ఢిల్లిభూ
భుక్కునిసేన పట్టుకొనిపోయెఁ బ్రతాపనరేంద్రసింహమున్
నిక్కె నఖండగౌతమిని నిల్పినదాయల యోడచాఁప, నీ
వెకుడ డాఁగియుంటివి? వహింపుము టక్కరిపిచ్చి వేషమున్

ఉ. పౌరుషరాశి, రుద్రనరపాలునిచేతి శరంబు నాలుక
ల్గోరుచు నోరుగల్లుపురిలోఁ బడియున్నది, తేనిగుఱ్ఱముల్
ధారుణిఁ దన్నుచున్నవి, బలంబులు భీతిపిశాచివాతఁ గం
గారగుచుండె, లెమ్మిఁక! యుగంధర! ముక్తి కుపక్రమింపుమా

మ. అదె! గోదావరి దాఁచియుంచినది, రాజాశ్రూదకం బబ్జినీ
మృదుపత్రాంకుర హేమపాత్రికల, లెమ్మీ! యందుఁ గర్తవ్యము
న్నది, యాలింపుమి యోరుగల్లుపురి చింతాక్రాంతమై మూల్గుచు
న్నది, మంత్రీ! యిఁక నీ యళీక రచనానాట్యంబు సాగింపుమా!

శా. లేనవ్వు ల్బలసెన్ విరోధులకు డిల్లీకోటలో, రుద్రభూ
జానిన్ దాయలు నవ్వులాడుకొని రాశాతాండవం బైన ప్ర
జ్ఞానైపుణ్యము మీఱఁగాఁ దెలుఁగుజెండా నుద్ధరింపంగదే
యానందద్యుతు లోరుగల్లుపురిమధ్యన్ గుప్ప వోయింపుమా!

## జేబున్నీసా

తే.గీ. జీవితేశ్వర! మనసుధాజీవితంబు
లంతరించెనె! యొకకౌఁగిలింతలోన,
నాథ! మనవినూతనయౌవనముల కపుడ
వయసునిండెనె? యొక్క చుంబనముతోడ

ఉ. ఈ సులతానుకూఁతు రొకతే సకలంబున మందభాగ్య, య
య్యో! సఖ! గుండెలోఁ గఱఁగుచున్నవి సీసపుకొండ, లింక నా
శ్వాసము గల్గనేర్చునె? ప్రశాంతి వహించిననీసమాధితో
బాస యొనర్చి చెప్పెదను వద్దిఁక నాకు సుఖప్రసంగముల్

మ. తొలఁగె న్నాతలపోఁత లన్నియును, నీతో భస్మమై, గాలిలోఁ
గలసెన్ భావికుటుంబినీత్వము, మనః కాంతా! దురంతవ్యధా
జ్వలనంబే, శరణంబు నాకు నిఁక నీబందీనిశాంతంబునన్
బలి గావింతును ప్రాణపంచకము తపంబెన నీమూరికిన్

ม. కవితాతూలికతో లిఖించి నిను శృంగారించి, పూజించి, మా
నవలోకంబున కప్పగింతును, మనోనాథా! వనక్షోణిలో
భవదీయం బగుమేను నాకొఱకునై భస్మంబు గావించుకొం
టివి, నే నీఋణ మెట్లుతీర్చికొని శాంతింతున్ ధరామండలిన్?

సీ. మొగలురాజన్యునిపగడాలమేడలో వసియింప దింక నీప్రణయలక్ష్మి
ఢిల్లీనవాబులమల్లెతోఁటలవంకఁ బరికింప దింక నీవలపుఁజిలుక
ఔరంగజేబునియపరంజిగిన్నెలో భుజియింప దింక నీముద్దులాఁడి
పాదుషానగరిలోఁ బట్టుపాన్పులమీఁదఁ బవళింప దింక నీపాదదాసి

తే.గీ. అగ్బరాదిపితామహు లధివసించు
ప్రాంతగోరీలకడ నిన్నుఁ బాడుకొనుచుఁ
దిరుగుచున్నది నీతరి తీపులాఁడి
యగ్నిలో న న్ను పాసించు త్యాగమూర్తి!

## నికుంజము

ఉ. ఆఁకొనియున్న తేంట్ల, మధురాన్నముఁ బోకిరిగాలిపిల్లవాఁ
డాకులపెట్టినాఁడు, చిగురాకులకోకలు గట్టుకొన్న, పుం
స్కోకిలవాణి! పుష్పితనికుంజవిలాసిని! తేనెలేని పూ
రేకుల శుష్కవీధుల, ద్విరేఫము గానముసేయఁ బోవునే?

ఉ. బోగముసానులై, కుసుమపుం జిఱునవ్వులు చిమ్మి, తేంట్లకున్
ద్రాగుడు నేర్పుచుందురుగదా? వనకన్యలు, కాకిగూఁటిలో
మూఁగతనంబునం బొదలు ముద్దులకోకిల, పాట గట్టి, మి
మ్మాగముసేయుచున్నది, గయాళిసుమీ! మధుమాససంగతిన్

## హిందూరమ

శా. ఖాదీరాటపువింత తుమ్మెదలు, ఝూంకారించె, నీయింటిలో
నీదారిద్ర్యము గోఁచిపాఁతవలెఁ బన్నెన్ గాంధిబైరాగి, బా
లాదిత్యప్రభతోడ స్వేచ్ఛ యను సంధ్యాలక్ష్మి రానుండె, నే
[illegible]

శా. నీగర్భంబున గాంధి పుట్టినపుడే నీకష్టముల్ చుట్టలై
యేగెన్, గుంద్రనిబల్ల లేఖపడి పోయెన్ సీమదేశానఁ గా
కేగోసాయిపిసాళిన వ్విటుల మోహింపించె ముల్లోకమున్?
సాఁగింపంగల వింక శాంతియుతసంసారంబు హిందూరమా!

శా. తల్లీ! నీతలమీఁద శాశ్వతసమాధానంబు ఘోషించు, మే
ల్కొళ్ళాయిం గని నవ్వుకొన్నజను లాంగ్లుల్, నేఁడు నీపుత్రునిన్
లిల్లీపూల నలంకరించి, నుడు లాలింపంగ నున్నారు, నీ
ఢిల్లీ గుండెలు నిబ్బరించుకొని, చెండింపింపు మస్పృశ్యతన్

# విజ్ఞప్తి

పరిత్రులోకమునకు–

కాలముతోఁబాటు ప్రజల యభిరుచులు మాఱినవి. కవులు విశృంఖలవిహారము సేయుచుఁ బలుపోకలఁ బోవుచున్నారు. గంగ, త్రిపథగ యయ్యును సముద్రముననే కలి యునట్లు, కవిత యెన్ని పెడత్రోవల నడచినను రసానంద సముద్రమున సంగమింపవలయును గదా? అది లేనివ్రాఁతలు తలవ్రాఁతలని పెద్ద లందురు. ఈ యిరువదవశతాబ్దమునఁ గనులు దెఱచిన నవయువకు లీకబ్బపుందుపానునఁబడి కలవరపడుచున్నారు. ప్రామాణ్య మేదని ప్రశ్నించుచున్నారు. గ్రంథకర్తల సమాధానములతో నెంతవఱ కేకీభవించుచున్నారో తెలియదు. ఇట్టి సందిగ్ధకాలమున నుద్గ్రంథరచన కుత్సహించువాఁ డెవఁడు? వ్రాసినఁ జదువునోపిక పాఠకున కెక్కడిది? కావునఁ బ్రజాభిరుచికి నుచితము లగు చిన్ని చిన్ని వ్యాసములు గల భారతివంటి పత్రిక లవతరించినవి. నేఁడు పరాధీనుఁ డైన తెనుఁగువాని కిట్టి ఖండ కావ్యములు నిమిషములమీఁద ముగిసి తీఱుబడివేళల నింపు సేయుచుండును.

ఇది నా కావ్యశకలముల రెండవ ఖండము. మొదటి భాగముతోఁబాటిదియును నజ్ఞాతవాసమును ముగించుకొని వెలువడి నాశ్రమను సార్థకముఁ జేసినది. పేటికావాసము చేయునారచనలు చూచుకొని,

ఉ. “ఆలయమందముద్రితములై, తెరచాటున దాఁగియున్న బి
బ్బీలవిధాన, మత్కృతులు పెక్కులు వ్రాఁతలతోఁగృశించుచున్
జీలికలయ్యె, నుద్ధతి నశించె, విచారము కాఱుచీఁకటిం
బోలి, యెడందలో నిలిచిపోయె, సుమింపవు క్రొత్తకబ్బముల్”

అని యొకపరి, నిట్టూర్పుఁబుచ్చితిని. నాయం దనుగ్రహముంచి, నా యీ రెండు కబ్బములను దమ జననీజనకులకుఁ గృతి నిప్పించి ముద్రింపించిన దీనబాంధవులు, న్యాయవాదులు, సంపన్నులు నగు మ.రా.శ్రీ. ఏకా దండయ్య పంతులుగారికి నే నెంతయుఁ గృతజ్ఞుఁడను. ఇట్టి కుమార మౌక్తికముం గన్న శ్రీ ఏకా రుక్మిణీ సుబ్రహ్మణ్యదంపతుల కంకితముచేయఁబడి నాకృతులు ధన్యాకృతులైనవి. పరమ పదించిన వారి నామము లీకృతిముఖమున నాచంద్రార్కము నిలుచుఁగాక! ఉత్తమకవు లనేకులు తెలుఁగుశారద నెన్నియో సత్కృతుల నలంకరించి కృతకృత్యులైరి. నా యీయలఁతికావ్యములు భాషాదేవికి ముక్కుపుడక యగునో ముంగర యగునో.

జి. జాషువ

# అంకితము

మ. కలవా, రాంధ్రనియోగిభూసురులు, నేకావంశజుల్, న్యాయవా
దులు, గుంటూరినివాసులున్, సమసుబుద్ధుల్, దండయాభిఖ్యు, లు
జ్జ్వలధీశాలురు, వారితండ్రులను సుబ్రహ్మణ్యులం బెండ్లియై
కులుక న్నేర్చినకావ్యగుచ్ఛ మిది నాకుం గూర్చు నానందమున్

జి. జాషువ

# భరతమాత

సీ. ప్రమథనాథుని నీరు ద్రావింపఁజాలిన వజ్రాలకొడుకులఁ బడసినావు
నరకాధిపతిగుండెఁ గరఁగింపఁజాలిన వెలఁదిమిన్నల కుగ్గుఁ బెట్టినావు
బ్రహ్మయంతటివాని వణఁకింపఁజాలిన మునుల మూఁపున నిడి మోసినావు
అంటినంతన పాప మడఁగింపఁజాలిన తీర్థకోటుల ముగ్గి తేలినావు

తే.గీ. ఉర్వి పుట్టకముందె నీ వుంటి వేమొ;
సకలశాస్త్రపురాణము ల్చదివినావు
గొనబుసిరి గల భాగ్యశాలినివి నీవు
భారతాంబామణీ! నమస్కార మమ్మ!

సీ. జలకంబులాడించుచెలికత్తెగద నీకుఁ గనకాంబుజాఢ్య గంగాభవాని
తలమీఁదిగుండుమల్లెల దండగద నీకు? నత్యున్నతోరుహిమాలయంబు
పూఁతబంగారుసొమ్ముల పెట్టెగద నీకు? సిరివెలంది చరించుసింహళంబు
ముద్దు గాఁౘెడునిగ్గుటద్దంబుగద నీకు? నింబారు హిందూమహాంబురాశి

తే.గీ. ఇట్టి నినుఁ జూచి బిచ్చంబుఁ బెట్టు మనుచు
నన్నిదిక్కులు యాచించుచున్న వమ్మ!
యైకమత్యంబు గల్గి నిన్ననుభవించు
కొఱఁత పూరింపవే మాకు భరతమాత!

# కృతిపతిప్రశంస

శా. శ్రీదండార్యుని, వజ్రనిస్తులయశస్విన్ గన్నయేకాన్వయ
ప్రాదుర్భావపవిత్రవర్తనుఁడు, సుబ్రహ్మణ్యసద్బ్రాహ్మణుం
డీదివ్యాస్యకుఁ గావ్యకన్యకకు, భర్తృత్వంబుఁ దాల్చెన్, శుభా
పాదుల్గారె, గతించియుం బరహితవ్యాపార పారాయణుల్.

తే.గీ. ఎన్నఁడో, పూర్వ మందల మెక్కునర్స
రాజను మహామహుఁడు సమర్థత మెఱయఁగ
వ్రాసినాఁడఁట పెనుజమాబందిలెక్క
లన్నియును నద్భుతముగ నొక్కాకులోన

శా. ఆకౌశల్యముఁ జూచి, యప్పటినిజా మాశ్చర్యధుర్యాత్ముఁడై
యేకావా రనిపిల్చిన న్మఱలిపోయెన్ గట్టుపల్యాఖ్య, యా
యేకావంశమునందుఁ బుట్టి, ధరణీ బృందారకాగ్రేసరుల్,
లోకారాధ్యులు వోయిరెందఱొ; బుధుల్ పూర్ణప్రభావోదయుల్

కం. ఆవంశజలధిలోపల
నావిర్భావంబు నంది రన్నమరాజున్
గోవిదుఁడు నర్సరాజా
శావాసితకీర్తిమూర్తి జన్నమరాజున్

కం. జన్నమరాజగుణాఢ్యుని
కన్నకొడుకు సుబ్బరాజు గాంచెఁ దనయు వి
ద్వన్నుతుని దండలింగం
బన్నీతినిధాను వంశ మానందింపన్

కం. ఆదండలింగనామకుఁ
డాదర్శగుణాలవాల యగునన్నమయం
దీదండయార్యతాత మ
హౌదార్యాంచితుని గొండయాఖ్యునిఁ గాంచెన్

మ. స్మరణీయుం డగుకొండయార్యునకు నాంచారమ్మకున్ దత్తుఁడై
మురువున్ గూరిచి, రుక్మిణీసతికరంబున్ బట్టి, యేకాన్వయా
భరణంబున్ మనదండనామకు నదం భస్వాంతునిం గాంచి, య
ప్పరలోకంబున నున్నవాఁ డిపుడు సుబ్రహ్మణ్యుఁడుత్సాహియై

కం. ఓసుబ్రహ్మణ్య! యశో
భాసుర! నీకొడుకు విలిచి పంపినకృతి, వి
ద్యాసుందరి, యిది, యమర స
భాసీమం బెండ్లియాడి పాలింపఁదగున్

తే.గీ. తనుజుసంప్రార్థనము నన్యథాకరింప
కామహోత్ముఁడు మత్కృతిస్వామి యయ్యె;
పుత్రుఁ డిచ్చిన నా తొలిపుష్పసరము
నఱుతఁ గీలించినది, రుక్మిణమ్మ తొలుత

ఉ. ఒక్క కుటుంబమందె విభవోజ్జ్వలమూర్తులు, పుణ్యదంపతుల్
చొక్కపుఁ బ్రేమబంధములుసుంత విభిన్నము గాకయుండఁగాఁ
జిక్కిరి, నాదుకావ్యసరసీరుహనేత్రల నాదరింప, నే
నక్కను ద్రొక్కివచ్చితినొ నాఁటిముహూర్తవిశేషమోకదా!

కం. ప్రణుతింపఁదగినపితరుల
ఋణం బిటులఁ దీర్చుకొడుకు లేరీ! విద్యా
చణుఁ డవనీసుర చూడా
మణి, దండయగాక తెలుఁగు మాగాణమునన్

మ. వినుతించుం బదివేల నాలుకలతో విశ్వంభరాదేవి, నీ
తనయుం దండయనామకోత్తముని స్వార్థత్యాగి నీక్షించి, చ
ల్లనివేళం దలపోసికోవలె, గుణాలంకార! యీవంశవ
ర్ధను నేపూజ యొనర్చి కాంచితివొ! సుబ్రహ్మణ్య మాన్యాగ్రణీ!

మ. కరుణ న్నీ కొమరుండు గర్తపురిలోఁ గట్టించె, నానాముసా
ఫరు లుండం బెనుసత్రశాల నట ద్రవ్యం బెంత వెచ్చించెనో
చెఱువు ల్గుంటలు బావు లెన్నియొ ప్రతిష్ఠించె న్మహాదాతయై
చిరకీర్తిం గనినాఁడు, నేఁ దది రహించెం, బచ్చకప్పూరమై

చం. అనదలు, గ్రుడ్డివారు, వికలాంగులు, నీ తనయుండు వెట్టుభో
జనమునఁ దృప్తులై, పలుకు చల్లని దీవెనవాక్యముల్, ప్రతి
ధ్వను లొనరించుచున్నవి కదా? హరిదంతములందు, రుక్మిణీ
వనితకు, నీకు, నచ్చట శ్రవఃకుహరంబులఁ దాఁకుచుండవా?

కం. తనపుట్టువు కారణమున
వినుతి గనినప్రత్తిపాటివీట న్నీ నం
దనుఁ డనుపమవితరణగుణ
సనాథుఁ డొకసత్రశాల సంస్థాపించెన్

కం. ఓపికఁ బురాణకాల
క్షేపం బహరహము జరుప జీతంబిడి, వి
ద్యాపారగు నచ్చట నొక
బాపనపండితుని నేరుపా టొనరించెన్

సీ. విద్యార్థులకు ద్రవ్యభిక్షంబుతోఁగూడ సరసాన్నదానంబు సలిపినాఁడు
కవి గతించుట నింట నవయుకబ్బము లచ్చు పోయించి యూపిరి వోసినాఁడు
తనపేరు దెలుపరా దనెడిషరతుమీఁద సత్కాళాపోషణ జరిపినాఁడు
ప్రేమ నాకృతు లచ్చు వేయించి లోకాన సర్వ సమత్వంబుఁ జాటినాఁడు

తే.గీ. ఆర్జనము మాని స్వార్జితమైన ధనము
పుణ్యకర్మల కర్పింపఁబూనినాఁడు
ఆశ్రమము లేదు గాని నీ యాత్మజుండు
భోగములు మాని యొక వింతయోగి యయ్యె

తే.గీ. పలుకుఁ బలికినఁ గఱకు గన్పడును గాని
వెన్నవంటిది దండయాభిధునిమనసు
'ఆది కొంచెము తర్వాత నధిక' మన్న
సూక్తికి నిదర్శనంబు నీసుతునిచెలిమి

మ. సరసత్వంబునఁ గార్యదీక్షణు సదాచారంబునం దన్నిటన్
దెఱవా! దండమనీషితోడ దొరయున్నీరాజు, శ్రీరుక్మిణీ
పరిచర్యాపరితుష్టమానసుఁడు సుబ్రహ్మణ్యుఁ డేరీతిఁ గాఁ
పురమున్ జేయుదొ! కూఁతురా! కవికులం పుం గ్రొత్తముత్తెదువా!

## హెచ్చరిక

సీ. ఘనఘనాఘనము చీఁకటిమేడ వెలిగించు మెఱపుదివ్వెల నూనెతఱుఁగలేదు
పవలు రాతిరి తీఱుబడి లేక ఘోషించుతోయధీశునిగొంతు రాయలేదు
ఇనబాలకుని దినమ్మును గర్భమునఁ బూను పొడుపుదిక్సతికాన్పు లుడుగ లేదు
ఋతురాజు ధారుణీసతికి సొమ్ములు పెట్టి కులికించుపని మానుకొనఁగలేదు

తే.గీ. విశ్వనిర్మాతచల్లనివీక్షణమున
నేటికినిఁ గెంపుచాఱ గాన్పింపలేదు
మూర్ఖలోకమ! దినమెల్ల ముగియలేదు
దీప మున్నది హృదయంబు దిద్దుకొనుము

తే.గీ. విసుగుకొనలేదు సృష్టికి విశ్వభర్త
పాలపాపలజన్మల మూలకమునఁ
దెలుపుచున్నాఁడు శాంతిసందేశములను
విశ్వమా! ధర్మమును గూడఁబెట్టు మిపుడ

తే.గీ. నమ్మకము లేని నీజీవనమున కవధి
గుండెగడియారమున దాఁగియుండు నేమొ
లెక్క ముగిసిన నాట చాలించుకొనును
త్వరపడుము మూర్ఖ! ధర్మనిర్వహణమునకు

ఉ. నాటుము విత్తనం బొకటి నాలుగునాళ్ళకు మొక్కయై, మహీ
పాటన మాచరించికొని వచ్చును ధర్మము దప్పకుండ, "నీ
వేటికి ధర్మముం దొలఁగి? తేను పరాత్పరునానఁ గొంచెమున్
దాట" నటంచుఁ జెప్పెడువిధంబునఁ దోఁచుఁగదా? నతాంగమై

తే.గీ. సృష్టి తనధర్మమును నిర్వహించు నన్న
నీశ్వరుని మనఃకమలంబు తృప్తిపడదు
భక్తికిరణంబు నీలోనఁ బ్రజ్వలింపఁ
బరమపితకంట మోదబాష్పములు నిండు

# ఆంధ్రుఁడను

సీ. బహుదేశములను బేర్వడసి మీసముదీటు భరతఖండంబు నాపాఠశాల
స్తనయుగంబున గానసాహిత్యములు గల్గు భాషావధూటి నాపంతులమ్మ
సాందీపనిసమక్షమందు విద్య గడించు వనమాలి నాసహపాఠకుండు
భక్తి వైరాగ్యభావముల తావలమైన భాగవతంబు నాబాలశిక్ష

తే.గీ. గంటము ధరించి మోహనాక్షరము లెనయఁ
బ్రతిఫలించెడు నా మహోన్నతవిభూతి
వ్రాసికొందును దశదిశాఫలకపంక్తి
గడనకెక్కినయాంధ్రపుత్రుఁడను నేను

సీ. ఘనపురాణగ్రంథకర్త, దేవర్షి వ్యాసుండు మాయాస్థానపండితుండు
శివధనుఃఖండనాంచిత బాహువీరుండు భూసుతాభర్త మాపొరుగువాఁడు
ముల్లోకవిజయంబు పుంజీభవించిన భీముండు మాయూరిసాముకాఁడు
గానవైదుషి ఊలుగరఁగుభక్తుఁడు త్యాగరాయండు మాయింటిగాయకుండు

తే.గీ. శీతనగశృంగసీమ నాసీనుఁడ నయి
యద్భుతము లైన బిరుదుపద్యములు సదివి
వేడ్క మ్రోయించుకొందును విజయభేరి
మడమ ద్రిప్పనియాంధ్రవీరుఁడను నేను

సీ. మాశిల్పనైపుణ్యమహిమంబు ఘోషించుతాజమహాలు నుదాహరించి
మాకవిత్వవిలాసమార్దవంబుం జిందు ఘనుఁ దిక్కకవిని మచ్చునకుఁ జూపి
మాధనుర్విద్యారమావైఖరిం జాటు వీరుఁడౌ గాండీవిపేరుఁ జెప్పి
మాసతీశీలసంపద లచ్చు గ్రుద్దించు సావిత్రి మాంగల్యచరిత మెన్ని

తే.గీ. భరతమాతకు గగ్గురుపాటు దోఁప
గగనమండలి మార్మ్రోఁయఁ గంఠ మెత్తి
పందె మొద్దెద విశ్వప్రపంచమందు
నుడువు దప్పనియాంధ్రభూపుఁడను నేను

సీ. సర్వభూముల కహింసాసూక్తి బోధించు దయకు నాచిత్త మద్దాలమేడ
గండుపేదలను బంగారు గుప్పిటఁ దన్పు నీవికి నాచేయి తావలంబు
అత్యనాథులఁ గాంచి, యశ్రూదకముఁ జిమ్ము కరుణకు నాగుండె పురిటిగీము
మంజులాలంకారమకరంద ముప్పొంగు కవితకు నాజిహ్వ కల్పతరువు

తే.గీ. క్రమ్ముకొని వచ్చు కీర్తిమేఘములమీఁద
నమలసంతోషరసవిమానముల నెక్కి
హాయిగా సంచరింతు నహర్నిశంబు
నిడుమ లందని విత్తవంతుఁడను నేను

సీ. శ్రీకృష్ణరాయధాత్రీనాయకుని సమగ్రప్రతాపము దీపకళిక మాకు
రాజరాజనరేంద్రరమణీయసద్యశః కాండంబు పందురేయెండ మాకు
మన్నెబొబ్బిలిదండిమగలదోస్సారంబు సహజనిష్ఠురకవచంబు మాకు
అరిరాజమూర్ధన్యపరిభావపంకంబు మురువు మీఱెడుచుక్కబొట్టు మాకు

తే.గీ. విలసితములైన యుద్ధగ్రంథములు రచించి
యుడుపథంబున వలపుటంగడులు దీర్చి
అమ్ముకొందును సిద్ధసాధ్యాంగనలకు
రాణఁ జెలువారునాంధ్రవర్తకుఁడ నేను

## వివేకానంద

మ. దొరసానమ్మలు బొమ్మలై, కలికిముద్దుంగన్నుల న్నిండుట
చ్చెరువున్మక్కువ నింపఁ, జక్కదనమున్ జిన్నారిలేఁబ్రాయమున్
మెఱయన్, హైందవవేదసారమును గంభీరోక్తుల న్నీపయిన్
గురియించెన్గద; మా నరేంద్రమునిచంద్రుం డోచికాగోపురీ!

మ. దయతో నాటిసభావిభుం డిడిన, క్లుప్తం బైనకాలాన, మీ
నయగారాజలపాత వేగము నుపన్యాసంబునం బూని, దు
ర్జయవేదాంతరహస్యతత్త్వమును బూర్ణప్రజ్ఞ దీపింప, న
వ్యయవాగ్ధోరణి వెల్లడించినది, మా వాఁడే! చికాగోపురీ!

సీ. రామకృష్ణునిదయారత్న సౌధమునందు వాసంబొనర్చిన బ్రాహ్మణుండు
ముక్తికాంతాగళంబునఁ బుస్తెం గీలింప వడి వంక లేకచొప్పడినమగఁడు
కాషాయవస్త్రంబు గట్టినపదవికి మరియాద నిల్పినపరమయోగి
ప్రజ్ఞాబలంబునఁ బాషండమతములఁ గారించుపండితాఖండలుండు

తే.గీ. గంగమాంబిక హిమవదగ్రమునసుండి
యవని కేగిననాటివేగాతిశయము
వానివాక్కున నిలిపి గుప్తంబుసేయ
సాటియెఱుఁగనివక్తృపంచాస్య మితఁడు

శా. "ఆవాల్గన్నులలోనిదివ్యకళ లోకాతీత, మావిగ్రహ
ప్రావిర్భావ మలభ్య" మంచు భవదీయక్షోణికీర్తింపలే
దా? విశ్వంబులు కందిపోవఁగ వివేకానందకర్మంది న
ప్పూవున్ మృత్యువు మెచ్చి త్రుంచుకొని కొంపోయెం, జికాగోపురీ!

మ. ఎలఁబ్రాయంబున రోదసీకుహర మధ్యేమార్గమున్ దాటి, వే
ల్పులతో మంతనమాడునాతనియశంబున్ జూచి, యావేయిగ
న్నులవాఁ డోర్వక కొండెము ల్వలికియుండున్ బ్రహ్మతోఁ గట్టి! య
చ్చెలువంపుంగని నగ్గిలోన నిడి వ్రేల్చెన్, ముప్పదాతేండ్లకే!

మ. తెలవార్వేళఁ గషాయదీధితుల నుత్తీర్ణత్వముం జెందువె
ల్గులతేనింగను శ్వేతజాతులకు, మాగోసాయికాషాయకాం
తులఁబ్రాంతు ల్తల యెత్త, 'నల్లదె! నరేంద్రుల్, పండితుల్, గేలుమో
డ్పుల మన్నించిన భారతీయముని, చూడుం' డం డ్రుషస్సంధ్యలన్

## తాజమహలు

చం. ముదిరిన ప్రేయసీప్రణయమూర్తి తిరోహితమైనయంతనే
యెద నపు డగ్నిపర్వతములెన్ని పెఠిల్లున బ్రద్దలయ్యెనో
కద? మొగలాయిరాజు తెలిగన్నుల రాల్చినబాష్పధారలే
పొదలి, ఘనీభవించినవి, ముద్దుల తాజమహాలుపోలికన్

తే.గీ. అదికదా? దేశదేశాలయంజలింపు
లందుకొన్నట్టి, శిల్పకళాపణంబు
భారతీయులగర్వసర్వస్వమునకు
మూలకందము? మొగలుబిబ్బీలసొగసు

ఉ. ఒక్కొకఱాతిలో నిమిడి యున్నవి నేఁటికి, షాజహానుభూ
భుక్కునెడందతో నుడికి పోయిననాడులలోని రక్తపుం
జుక్కలు, ముప్పదేం డ్లెటుల స్రుక్కెనొ? తాజమహాలు బల్లెమై
ప్రక్క వసింపఁగా, జెయిలు పాలయి, పుత్రునిక్రూరచర్యలన్

తే.గీ. అమవసనిశీథినీసహస్రములఁ గూలి
పాదుషా పాడినాఁడు దుర్భరవియోగ
భావగీతంబులం దచ్చు వడ్డరచన
దేవి ముంటాజమహలు నిద్రించుగోరి

తే.గీ. ఎన్నియుగములవఱకు సహించుకొనెనో!
తెలుఁగుశిల్పులచాతురీవిలసనంబు
యమునయొడ్డునఁ బూఁచి దిగంతములను
యశము నించిన తాజమహాలు కొఱకు

తే.గీ. మగనిఱొమ్మునఁ గుంపటి రగులఁ బెట్టి
కాయము త్యజించెనే! మొగలాయిరాణి
తెనుఁగుశిల్పులపనివానితనము నొకటఁ
గుప్పవోయింపవలె ననుకొనియె నేమొ!

చం. వెడగులు పాదుషాలతల వేసిననిందల కుత్తరంబుగాఁ
బిడిచినఁ బాలుగాఱు నును వెన్నెలక్రొన్నెలఱాలయచ్చపుం
బెడఁగుదనంబుతోడఁ గను విందులు సేయుచుఁ దాజమాలు క
ట్టడము కళిందజానదిజడంబుల శుద్ధియొనర్చు నిప్పుడున్

# భారతవీరుఁడు

ఉ. “ఈకవచంబుఁ గుండలము లీయకు మల్లదె దొంగబాపఁడై
నాకవిభుండు వచ్చెడిని నాయనుఁగుంగొడుకా!” యటంచు, మ
ర్త్యాకృతి నుండి పల్కెడు సహస్కరునిం గని నవ్వి, యవ్వియే
పోకడపెట్టునీసుగుణ మున్నుతియింపఁదరంబె? భానుజా!

శా. గంగాపుత్రుడు, రాజునానతి శతాంగశ్రేణి యర్పించునాఁ
డంగీకారముగాక నీ కొకరథం బర్పించెనేగాని, యో
యంగాధీశ్వర! యుగ్రవత్కదనపంచాస్యంబవౌ నీకు నీ
యంగత్రాణములున్ రథంబులును సాహాయ్యంబు లేమాత్రముల్

ఉ. సంగరమందు నీకుఁ దొలి సాయక మైనభుజంగభర్త, పా
ర్థుం గుఱిజూచుచో, నది విరుద్ధగతిం జని టెక్కెముం గిరీ
టాంగదము ల్దహించి, “యినజా! ననుఁగ్రమ్మఱ నేయు” మన్న ‘ఛీ
యెంగిలిబాణ మేయ’ ననవే! రణవీరుఁడ వీవు భానుజా!

శా. నీనేర్పున్, సహజప్రతాపవదనోన్మేషంబు, నీక్షించి, యా
ర్యా౯శైత్యముఁ దోఁపనీక, కులగోత్రప్రశ్నలం దెచ్చి, ల
జ్జానిర్జీవునిఁగా నొనర్చెడుకృపాశ్వత్థామలే లేక, క
ర్ణా! నీ వేరికిఁ దీసిపోయెదవు? మార్తాండాత్తతేజస్వివై

ఉ. అంబుజనాభునంతటి మహాత్ముఁడు పార్థుని తేరిమీఁద గు
ఱ్ఱంబులు దోలుచుండ, సమరం బొనరింపఁ దెగించునే? లలా
టాంబకుఁడైన, నీ తెగువయబ్బురముం గలిగించు వీరలో
కంబున నీకుఁ జాలినమగండు జనింపఁడు సూర్యనందనా?

ఉ. “భారతయుద్ధరంగమునఁ బాండుతనూభవమధ్యముండొ? లే
దా? రవిజుండొ? తీఱవలెఁ దథ్యము నా కటుగాక కంటికిన్
గూరుకు రాదు రా” దనుచు ఘోరముగా శపథంబుచేసి, నీ
కూరిమితేనికై తనువుఁ గోల్పడి తెంతటి సాహసుండవో!

తే.గీ. ఫల్గునుఁడుదక్కఁ దక్కినపాండుసుతులు
భండనంబున నీచేతఁబడినయపుడు
తల్లికిచ్చిన వరము చిత్తమున మెఱసి
యడిద మెత్తనిసత్యసంధుఁడవు కర్ణ!

చం. 'కుడిభుజ మైనకర్ణుఁ డనిఁ గూలె, సమస్తము దీఱె' నంచు డీ
ల్పడి, ధృతరాష్ట్రనందనుఁడు పాండుకుమారుల కోహటించి, య
మ్మడువునఁ జొచ్చె, శూరజన మండన! నీవు గతింపకున్న, భీ
ముఁడు తొడ గొట్టి నీనృపుని ముందఱ నిల్చి గదన్ ధరించునే!

ఉ. "నాయరదంబు గ్రుంగిన దనంత! కిరీటి! క్షణంబు తాళుఁడో
యీ! యిది యుద్ధధర్మ" మని యీవు వచించుచునున్న, నిన్ను న
న్యాయముగా వధించిన ధనంజయుఁడా విజయుండు? నీవు కా
వా? యకటా! యిదెక్కడి నిరర్థకధర్మమొ! సూర్యనందనా!

కం. 'కర్ణునితల భారత' మని
దుర్ణయవాక్యముగఁ బల్కుదురు జనులో శౌ
ర్యార్ణవ! నీచరితము సం
పూర్ణముగ నెఱుంగ లేకపోవుటవలనన్

# శిశుప్రబోధము

మ. పురిటింటన్ జరణంబు మెట్టి, భువనంబున్ జూచి, కంఠంబు బొం
గురువోవం బలవింతు వేమిటికి? నీకున్నాకలోకంబు క్ర
మ్మఱ రాదోయి! దిగంబరీ! యిచటికామక్రోధలోభాలకున్
గుఱియైపోవక తప్ప దూఱడిలి బంధువ్రాతమున్ దన్నుమా!

శా. ఊరుంబేరును లేక, యేగగనమందో లీనమై యున్నయా
త్మారామున్నిను, రక్తమాంసఘట మధ్యంబందు బంధించి, ని
స్సారంబైన మనుష్యమండలనివాసప్రాప్తి శాసించినాఁ
డేరాజో! యతఁడే సమర్థుఁడగు నోయీ! ముక్తి నీ కీయఁగన్

ఉ. ఏడువ కన్న! నిన్నువలెనేడిచినా రొకమాఱు భూపతుల్
గూడ, మహీతలం బనెడు కుంపటిలోఁ బడినాఁడ వప్పుడే
మూడునిమేషముల్ గడచె, ముందిఁక నీ కుదయించి, యెంద ఱి
ట్లేడుతురో గ్రహింపు మిది సృష్టిరహస్యమురా స్తనంధయా!

చం. చవిఁగొనినావు నీజనని చన్నుల ప్రప్రథమైకదుగ్ధబిం
దువుఁ, బెనుమాయలోఁ బడి కనుంగవ మూసితి వూఱడిల్లి, మా
నవత ఘటిల్లె, నిచ్చటిక్షణ క్షణకష్టసుఖంబు లల్లనన్
గవిసెఁ ద్వదాయువు న్నఱుకు కాలమునం దివి యుత్తమాంశముల్

కం. పరమంబగు వత్సలతా
శరనిధి యనఁ జాలు తల్లిసముఖంబున నీ
మరణమువఱకుం దఱచగు
పరలోకసుఖం బొకింత ప్రతిబింబించున్

## అఖండగౌతమి

సీ. శబ్దశాసనునిద్రాక్షాకవిత్వమును గామించి, యెన్నాళులాలించినావొ!
విష్ణువర్ధనమహీవిభునిశాసనమును దలఁదాల్చి, యేరీతి మెలఁగినావొ!
రెడ్డిరాట్పతులపారాణివన్నెలు దేలు నలలతో నెబ్బంగిఁ గులికినావొ?
చాళుక్యనృపతులసంగరశ్రమ వోవఁ గలువపుప్పొడి యెంత చిలికినావొ!

తే.గీ. భద్రగిరిరామపాదుకాస్పర్శనంబు
గణన కెక్కిన కోటిలింగాలపూజ
కలిగి పయనించుహంసికాగమన వీవు
గౌతమీగంగ! రమ్ము స్వాగతము గొమ్ము!

సీ. త్ర్యంబక గ్రామానఁ బ్రభవంబుఁ గన్నావు అడవులలోనఁ దోఁగాడినావు
ఉపనదీజలముల నొడలు పెనిచినావు కొండలఁ బింపిళ్లు గూసినావు
కలువకన్నులసోయగంబుఁ దాలిచినావు తేటికాటుక రేఖ దిద్దినావు
ముత్యాలసరులు ఱొమ్మున నిల్పుకొన్నావు గంభీరహృదయంబు గాంచినావు

తే.గీ. వేఁగిరాజ్యానఁ బంచమవేద మైన
భారతగ్రంథమందుఁ బర్వత్రయంబు
చదువుకొన్నావు శబ్దశాసనునియింటఁ
బతికి వినిపించి మన్నన వడయు మమ్మ!

మ. నలినీగంధము దోఁగువీచికల స్నానంబాడుసంధ్యామరు
త్తులు క్రీడించెడునీవిశాలపులిన స్తోమంబునన్ బత్రమున్,
గలముం బూని, చరించునాంధ్రకవిలోకగ్రామణిన్, దమ్మిపూ
వుల నెన్నాళులు పూజచేసికొనినావో! పుణ్యగోదావరీ!

మ. పదిరెండేడుల చిన్న దానవయి, యంభశ్శీఘ్రయానంబుతో
నుదధిం గూడఁగఁబోవు నీహొయలు, నీ యొయ్యారమున్ రీవియున్
గుదురుం జూపి, సమస్తతైర్థికుల కో గోదావరీదేవి! స
మ్మదముంగూర్చెదు పుష్కరంబులను బ్రహ్మాండంబు గొండాడెడిన్

ఉ. పుట్టి గతించిపోయెదునృపుల్ ధరణీవిభవంబుఁ గోరి, నీ
గట్టున నుగ్రసంగరముఖంబున నెందఱు గ్రుంకినారొ! నీ
పొట్టకు వారియస్థికలు భోజనమయ్యెఁ గదమ్మ! చావులే
నట్టి, సుధాశరీరమహిమాన్విత! వందన మమ్మ! గౌతమీ!

# పంచముఁడు

చం. కలకలలాడుచక్కనిముఖంబునఁ గాఱుమొయిళ్ళు గ్రమ్మఁ జె
క్కుల దిగజాఱుబాష్పములు కుంభినిఁ బుణ్యనదీనదంబులై,
జలధులు గట్టి చుట్టుకొన సర్వదిశల్పరికించుచున్న పి
ల్లలు గలదాన! భారతవిలాసిని! యూఱటఁ జెందు మంబికా!

సీ. అస్పృశ్యతాజాడ్య మాత్మనాశనమార్గ మనుమాట కన్వయం బయ్యెఁగాని
యీశ్వరసృష్టిలో హీనుండు ఘనుఁడు లేఁడనుసూక్తి సమ్మత మయ్యెఁగాని
ఐకమత్యము లేమి నగుపరాధీనత యద్దానఁ జూచిన ట్లయ్యెఁగాని

తే.గీ. అన్యదేశాలు పరిహాస మాడినపుడు
ఆత్మఁ గుందుట పరిపాటి యయ్యెఁగాని
హరిజనుల నుద్ధరించు ప్రయత్నమందు
వెనుకముం దాడుచున్నవి పెద్దతలలు

ఉ. పూవులుఁ బండులుం బసుపుఁ బూఁతలు కానుక లంది, ధర్మపుం
ద్రోవ లెఱింగి, యర్చకులతో వచియింపక మిన్నకుండి రీ
దేవత లాదిమాంధ్రులకు దేవతలుం బగవారలైనఁ ద
ల్లీ! వసుధాస్థలిం బ్రదుకు లెట్టుల వీరికిఁ దెల్లవాఱెడిన్

తే.గీ. ముసలివాఁ డైనబ్రహ్మకుఁ బుట్టినారు
నలువురు కుమారు లనుట విన్నాము గాని
పసరమునకన్న హీనుఁడభాగ్యుఁడైన
యైదవ కులస్థుఁ డెవ్వరమ్మా! సవిత్రి!

ఉ. వేద చతుష్టయంబు ప్రభవించినవ్యాసుని దివ్యవాణిలో
మాదిగ లుందురా? రుధిర మాంసములుం గలయంటరానివా
రాదిమవాసు లక్కటకటా! తలపోసిన నల్లగుండెలో
సూదులు మోసులెత్తును కృశోదరి! యెట్లు సహించుకొందువో.

## మాతృప్రేమ

సీ. మాతల్లి, కడుపులో మసలుప్రేముడి చింది జలధులై యిలమీఁద నిలుచు నేమొ
మాయమ్మ, నామీఁదమలపుచల్లని చూపు మంచువెన్నెలఁ బుక్కిలించు నేమొ
మాయంబనోటికమ్మనిమాట తేనెయే కలశవారాశిలో మొలిచె నేమొ
మామాతకౌఁగింటిమఱుఁగున గలహాయి స్వర్గీయధృతి కనుప్రాస మేమొ

తే.గీ. చేరి తన మేనినెత్తురుటేరులందు
నేను నిలువీఁత లీఁదనినెలవు లేదు
జననదినమునఁ బురిటిమంచాలమీఁద
నేను దనగుండెకాయనై నిలిచినాను

ఉ. నాతల నొచ్చినన్ దనమనంబున మిన్నులు గ్రుంకిపోవ, శో
కాతురయై, యెదుర్కొనుమదంబమొగంబునఁ బ్రాణవాయువుల్
పాతరలాడుచుండు, బహు భంగుల, నాకొఱకైశరీరమున్
గోఁతకు నప్పగింపఁగలుగున్ భగవంతుఁడు ప్రశ్నసేసినన్

చం. అఱువదియేండ్లు నాదగు శిరోగ్రము నెక్కినఁ దల్లికంటికిన్
జిఱుతను గాకపో నిది, విచిత్రము, నే నిలు దాఁటిపోయినన్
మరలినదాఁక నా వెనుక మాయమజీవము మూఁడుగాళ్ళతో
దిరుగుచునుండు, నీఋణము దీఱదు రక్తము ధారవోసినన్

తే.గీ. తల్లిగర్భానఁ బొడముపాత్సల్యజలధి
పుట్టుమొదలుగ నామీఁదఁ బొరలుచుండు
మానవాకారమునఁ జెప్పలేను గాని
దానిపరిమితిఁ గొలుచుకొన్నాను నేను

సీ. పొదుఁగుగిన్నెను బాలు వోసి దూడకు నిచ్చి యఱ్ఱు నాకెడుపాఁడియావుచెంత
బొండంపుఁదిత్తులు నిండఁ దెచ్చినమేఁత బిడ్డకుఁ దినిపించుపిట్టచెంత
పాలిండ్లపట్టు దప్పనిపిల్లతోఁగూడఁ గొమ్మకొమ్మకు దాఁటుకోఁతిచెంత
తాంబూలరాగదంతముల నవ్వులసంత తుల మోయు దానిమ్మమెలఁత చెంత

తే.గీ. చలువకన్నీట నాదుమస్తకము నంటి
వృద్ధజనయిత్రి యభిషేక మిచ్చుచుండు
వడకుఁదన మేలు తన కరాబ్జములనీడ
బ్రదికెదనుగాక నూఱేండ్లవఱకు నేను.

## అర్ధరాత్రము

తే.గీ. ప్రళయకాలాంబుదంబు లంబరము నేలి
యుఱుముచున్నవి భువన ముఱ్ఱూఁత లూఁగ
గుసగుసలు వోవుచున్నది కువలయంబు
కలదుగాఁబోలు నెత్తుటిగాలివాన

ఆ. మంచిరోజు లెందు మాయమైపోయెనో
కలహభేరి మ్రోసెఁ గంత మెత్తి
కలవరించురాజ్యములహడావిడిఁ జూచి
మృత్యుదేవి వీణె మీటుకొనియె

కం. నేఁడో! రేపో! రక్తపుఁ
గూడుఁ గుడిచి, యేమిపాడుకొనునో! భాషా
వ్రీడావతి, యేదేశము
పాడువడునొ! యెంతకీడువాటిల్లెడినో!

తే.గీ. పొటమరించినపోరాటములనెపమునఁ
బ్రసవవేదనవడు ధరావలయమునకు
జననమందునొ! లేదొ! ప్రశాంతిశిశువు
మలయునో! లేదొ! యానందమారుతంబు

ఉ. ఈకలహోసవోన్మద మహీవలయంబు, పిశాచయోగ్యమై
చీఁకటికోనయై, యశుభ చిహ్నిత మైననిశీథమందు, న
య్యో! కనుమూసి తూలిపడియున్నది, ముక్తకరాళఖడ్గమై
యేకడ డాఁచెనో! తెలియ దిద్ధపరాక్రమగర్వబీజముల్

చం. కలకలలాడుసంపదల కౌఁగిట నూయెలలూఁగుధారుణీ
శులు శయనించినారు రణ శూరులకత్తులకాపలాలలో
బలిసినగుడ్లగూబల రవంబున నీనడురేయి యేయమం
గళములు పల్కెనో! పసిఁడి కంటులు నవ్వెఁ గికాకికధ్వనిన్

## బుద్ధుఁడు

సీ. నవనవోల్లసితకాననశోభలకుఁ దక్కి పండుటాకునఁ జిందుబాష్పజలము
మొలకమీసాలకోమలసంపదలు రోసి ముసలయ్యకొఱకు వాపోవుకరుణ
తళుకుటద్దాలమేడలపోఁడిమిం దాఁచి పాడుగోడలకు నల్లాడుదృష్టి
చెలువారుపండువెన్నెలనిగ్గులకుఁ బాసి కటికిచీఁకటికి దుఃఖపడుప్రేమ

తే.గీ. లుంబినీవనభూములాలంబనముగ
బుద్ధనామంబుఁ దాల్చి యుద్భూతమంది
నవ్యతరధర్మసంస్థాపనం బొనర్చి
దిక్తటంబుల వెలసి యదృశ్య మయ్యె

సీ. మాతృగర్భమునందె, భూతకోటిం గాంచి జాలితో నభయ మొసంగినావు
గాయంబు గలయంచరాయనిం గొని పెంచి కన్నీట దాహంబు గడపినావు
నడలేక మడిదున్నుబడుగుటెద్దును జూచి నెనరుఁజూపుల మేను నిమిరినావు
తనువుఁ జాలించి పోయినజీవి నీక్షించి నడుమునక్కున ప్రీలి నలిగినావు

తే.గీ. ప్రాజ్యసామ్రాజ్యదివ్య వైభవమునందు
నమ్మకము దప్పి బోధివృక్షమ్మునీడ
గుండెదిగు లెల్ల నీముందు కుప్పవోసి
ప్రజ్వరిల్లితె శాంతిదీపంబ వగుచు.

మ. నిదురంబోయెడుమించుతీవె యగునీ నేస్తంపుటిల్లాలిక్రొం
బొదిగింటం గనుమూసి పాల్గుడుచు, నీపుత్రుం బరీక్షించి, మే
నెదుగ న్మద్దిడఁబోయి, నిల్చితివి గాదే? నీదువైరాగ్యసం
పదకు న్గంపము నందుచున్నయది దేవా! మేను బుద్ధాగ్రణీ!

సీ. అరమైలు నిను సాగనంపి నీ సెలవు గైకొని రాదె? నీయింటిగోపురంబు
కాటుకతో దీనగతి మ్రొక్కు లిడలేదె? తెలివి దప్పెడునింటిదీపకళిక
ముంగాల ధరణిఁ జిమ్ముచుఁ గంటఁ దడిఁబెట్టదా?నీదుపంచకల్యాణి హయము
వజ్రకాంతులఁ దెల్లవాఱి శోకింపదా? భాసిల్లు నీదు సింహాసనంబు

తే.గీ. అంధకారంబు నీకు సాయముగ నడువఁ
జుక్కమొత్తము లోలోన స్రుక్కుచుండ
నూరు లేనిప్రయాణంబు గోరి నీవు
నాటినడురేయి నీయిల్లు దాఁటినపుడు

సీ. నీయింటియాటకన్నెలు పన్నకము సేయు వాల్చూపుటుచ్చులఁ బట్టువడక
నీమనోహరమణీనిలయము ల్పుట్టించు మోహాంబునిధిలోన మునుక లిడక
నీఖడ్గనిచయంబు నిత్య ముద్రేకించు చేతులతీఁటకుఁ జిక్కువడక
నీ లేమచంకగారాలపట్టి రచించు కడుపుఁజిచ్చునకు ఖంగారుపడక

తే.గీ. స్వర్గనిర్గత మగుదివ్యవాణిపిలుపు
కర్ణములు సోక నుత్తర క్షణమునందు
సకలవిజ్ఞానమున రాచఱికముసేయఁ
బరువులెత్తవె? బుద్ధభూపాలచంద్ర!

సీ. కుంటిగొఱ్ఱెను మోసికొనివచ్చునినుఁ జూచి గొల్ల లేమని మ్రొక్కుకొన్నవారొ!
కన్నీటినీప్రసంగము నాలకించిన బింబిసారుం డెంత బెగ్గడిలెనొ
ఆఁకట న్నలిఁగి నీ వవనిఁ గూలిననాఁడు ఖగసమూహం బెంత బెగడుగొనెనొ
బావురు మనునీదుపసిఁడిగద్దెం జూచి జననీజనకు లెంత వనరినారొ!

తే.గీ. శాంతిమకరంద మొలుకునాస్యంబు నరసి
సన్నిహితభూమిఁ గారాడుజంతుకోటి
యెట్టిపున్నియమును మూటగట్టుకొనెనొ
పూజితక్షమావిభ్రాజ! బుద్ధరాజ!

## సందేహడోల

తే.గీ. పుణ్యపాపంబులని జగంబులు నుతించు
నేది? పుణ్యము, పాప మెయ్యేది? మహాత్మ
రెంటికి ఫలంబు లిడి సమర్థింతువంట
తెలియఁజేయుము, నన్ను గద్దించుకొనుము

తే.గీ. సృష్టికర్తవు నీవు నీ సృష్టిలోని
మానవుండ నే, నిద్దఱిమధ్య మనకు
ముసుఁగులో గ్రుద్దులాటలు పొసఁగ వింక
హక్కు గలదయ్య! ప్రశ్న సేయంగ నిన్ను

తే.గీ. మోహనపదార్థములు కుప్పవోసియున్న
క్ష్మాతలం బనుకైతవమందిరమున
నన్నుఁ బుట్టించినావు, మానవుఁడ నగుట
ననుభవించితి నందు కేమందు వీవు

తే.గీ. కరుణ నీలోన జన్మంబు గాంచు నంట
నీవె కరుణకుఁ గడలేనినిలయ మంట
జీవి నొకజీవి కన్నంబుఁ జేసినావు
నాథ! యిది సూచి నాగుండె నలిఁగిపోవు.

తే.గీ. పక్షపాతంబు లేదు దైవమున కండ్రు
ఖలుఁడు సుఖియించు గుణశాలి కష్టపడును
కడకు నిద్దఱిదెస నొక్కకంట నరయు
మృత్యుదేవత నేల నిర్మించినావు?

తే.గీ. సిలుఁగు లన్నియు ననుఁ బరీక్షించుకొఱకు
నీవు సృష్టింతువఁట యిది నిక్కమయిన
జీవితం బెల్ల నే నిట్లు చివుకుచున్న
సర్వలోకేశ! యేది విశ్రాంతి నాకు?

తే.గీ. ఎఱుఁగఁ జేయక నను సృజియించినావు
తగవు దప్పిన దండింపఁదలఁతు వంట
'వట్టి దిది' యన్న ననుఁ 'బిచ్చివాఁడ' వందు
రందుకే నాకు సంశయం బంకురించు.

తే.గీ. స్వర్గనరకంబు లున్న వచ్చుటికి నరులఁ
బుణ్యపాపంబులే కొంచుఁ బోవు నండ్రు
పల్కుదురు గాని కనివచ్చువాఁడు లేఁడు
ఈరహస్యంబు రూపింప వేల? నాథ!

తే.గీ. జగతి పుట్టిన దాదిగాఁ జచ్చియున్న
భక్తు లెందఱు భూమిగర్భమున లేరు?
వారిగతి యేమి? వా రెల్ల స్వర్గసీమ
నుందురా! యానతీయ వేమోయి నాథ!

# కృష్ణదేవరాయలు

సీ. ఆంధ్రులభావనాట్య స్థానములలోన నాడునీకావ్యకన్యకల నరసి
యనిఁ గన్నుమాయ కింకనుఁ దోఁచునీసమి త్కంఖాణఖురళికాంకములఁ జూచి
కలితశౌర్యజ్వాలఁ గరఁగించి పోసిన జయశాసనస్థిరాక్షరము లెంచి
పెద్దనార్యునిచిత్తవీథి కందక దాఁటి దిశలఁ దాండవమాడు తేజ మెంచి

తే.గీ. చిరము నీరాజ్యలక్ష్మి వర్షించుబాష్ప
పూర మదె! తుంగభద్రాఖ్యఁ బూని పాఱు
చుండు నిప్పుడు బళ్లారిమండలమున
నాంధ్రకవిచంద్ర! కృష్ణరాయక్షితీంద్ర!

సీ. మహితాంధ్రభోజనామకరత్నము వహించి క్రాలువిశాలవక్షస్థలంబ
పరభీకరప్రభావమ్ము బయల్చిమ్ము సరిలేనికోరమీసములజంట
చతురబ్ధివలయితక్ష్మాభారమునకుఁ బెంపున నిక్కి కనుచుండు భుజయుగంబు
దురమున నిప్పులు గురిసి, దీనులయందు దయను గుంభించు నేత్రద్వయంబు

తే.గీ. అష్టదిగ్గజవాగమృతార్ద్ర మగుచుఁ
బావనం బైన నీ సభాభవనవిభవ
మక్కటా! జీర్ణనగరకుడ్యాంతరములఁ
బండి నిద్రించెనే? కృష్ణపార్థివేంద్ర!

సీ. భాషాసముద్రకుంభప్రభవుఁడ వయ్యు విద్వత్కవుల గారవించినావు
ప్రతిపక్షరాజభార్గవరాముఁడవ యయ్యు వెన్నిచ్చుచో విడిపించినావు
వైరిరాణ్మకుటశుంభత్పదాబ్జుండ వయ్యుఁ బెద్దన్నపదము సేవించినావు
అర్థార్థిజనకల్పకానోకహమ వయ్యు సత్కృతులకుఁ జేయిసాఁచినావు

తే.గీ. ఔర! శ్రీకృష్ణరాయ! నీయంతవాని
దివికి నర్పించుకొన్నమాదేశజనుల
భాగ్యహీనత నొక్కి చెప్పంగలేక
చిలువరాయఁడు వేయినాల్కలు వహించె

సీ. కవివరేణ్యులు నీకుఁగా సృష్టిఁ గావించు కృతికన్యకలను దుఃఖితలఁ జేసి
ఆవాడపతి శకందరుఁ డాదినృపు లంపు కానుకబండ్లు వెన్కకు మరల్చి
ముదురువెన్నెలఁ గాయుముత్యాలగద్దియఁ బర రాజధూర్తులపాలు చేసి
నిరతంబుఁ బగఱనెత్తురుటేరుల మునుంగు కత్తి కాఁకటిచిచ్చుఁ గలుగఁ జేసి

తే.గీ. కుడియెడమలను నీతోడఁ గూడి తిరుగు
సుకవికులకోకిలంబుల శోకజలధి
ముంచి, యలబృహస్పతివ్రాఁత మంచి దగుట
దివికిఁ బోయితె? శ్రీకృష్ణదేవరాయ!

ఉ. ఆయతవర్ణనావిభవ మచ్చువడం బనిపూని విష్ణుచి
త్తీయము వ్రాసినావు కవిధీరులగుండెలు తల్లడిల్ల, నేఁ
డీ? యొకఁడేని మీసముపయిం జెయివైచి, రచించుసత్కవి
ధ్యేయుఁడు, క్లిష్టకావ్యమన కేమి? యశక్తులు కృష్ణభూపతీ!

సీ. ఆశీర్వదించినారా? వ్యాసవాల్మీకి బృందారకమునీంద్రు లెదురువచ్చి
కన్నావె? కవిభయంకరుఁ గాళిదాసు? భోజుం దున్నవాఁడె? విశ్రుతగుణుండు
రంభ నీతోడఁ గేరడ మాడునే? దానఁ గోపించునే నలకూబరుండు?
బలభేది వేయిగన్నులఁ జూచి నిను గౌరవించుచున్నాఁడె? కోవిదులలోన

తే.గీ. తిరుగ నీనెయ్యపుంగవీశ్వరులగోష్ఠి
జరుగుచున్నదె? దేవేంద్రపురమునందు
నెచట నుండిన నేమి, శ్రీకృష్ణరాయ!
భరతపుత్రుల నొకకంట నరయు మయ్య!

# సంసారసాగరము

తే.గీ. రాఘవునిమేలివింటినారాచమునకుఁ
దనివిదీఱనికుంభజుదాహమునకుఁ
జిక్క కేరీతి దాఁటివచ్చితివొ! నీవు
సంకటకదంబ! సంసారసాగరంబ!

తే.గీ. త్రవ్వఁబడలేదు సగరనందనులచేత,
సంగమింపదు వాహినీసముదయంబు
ఏవిధి; గభీరతన్ దాల్చినావొ! నీవు
సంకటకదంబ! సంసారసాగరంబ!

తే.గీ. రంగదుత్తుంగభంగతిమింగిలాకు
లం బయినవార్ధి దాటఁగలాఁడు నరుఁడు
నిన్నుఁ దరియింపఁజాలఁడు నిక్కువంబు
సంకటకదంబ! సంసారసాగరంబ!

తే.గీ. నీయుదంతం బెఱింగి, గాంగేయుఁ డొకఁడె
మునిఁగి తేలఁడు నీయందు, మునిఁగి నీదు
వనటఁ గుందక వచ్చె నొడ్డున కెవండు?
సంకటకదంబ! సంసారసాగరంబ!

తే.గీ. శమదమాది ప్రవిమలగుణములు గలిగి
తపముఁ గావించుగాధినందనునిఁ దొల్లి
మేనకామిషంబున నాక్రమించుకొనవె?
సంకటకదంబ! సంసారసాగరంబ!

తే.గీ. ఈశ్వరధ్యానదివ్యదమృతముఁ గ్రోల
నభిలషించుకుటుంబిహృదంబకంబు
తెరువు మూయునభేద్యభిత్తికవు నిజము
సంకటకదంబ! సంసారసాగరంబ!

తే.గీ. సాంద్రనీలాంబుధరపరిచ్ఛన్న మైన
కృష్ణపక్షనిశీథమందేని దిక్కు
దోఁచెడిం గాని, నీయందుఁ దోఁచ దకట!
సంకటకదంబ! సంసారసాగరంబ

తే.గీ. భూమిభారంబు మాన్ప నుద్భూతుఁ డయిన
రామునంతటివాఁడె నీప్రళయగర్జ
కాఁగఁజాలక తలక్రిందు లయ్యెఁగాదొ?
సంకటకదంబ! సంసారసాగరంబ!

తే.గీ. ఉదధి! యొకసారి యుప్పొంగు నొక్కసారి
నిమ్మళించును గాని శాంతింప వీవు
గగన మంటుచుఁ గష్టభంగములతోడ
సంకటకదంబ! సంసారసాగరంబ!

## లోకబాంధవుఁడు

తే.గీ. అది, యనేహఃప్రవాహవీచ్యంతరమున
నశుభదేవత జీవుల నాహరింపఁ
బ్రకృతినిం డాఁగి, యాస్యగహ్వరము విచ్చి
తాండవించెడు, మట్టమధ్యాహ్నవేళ

తే.గీ. అది, భయంకరమృత్యుదంష్ట్రాంతరాళ
జనితవిషవహ్ని, మెఱసిపోయినప్రదేశ
మది, విషాదనీరదపూరితాంబరమునఁ
బ్రభవమందినపిడుగులు వడినతావు

మ. మృగతృష్ణల్ పొగదుమ్ములో మెఱసి భూమీమండలిన్ జుట్టి, పై
కెగసెన్ నాల్కలు ముద్దగట్టుకొని పోయెన్ జీవులల్లాడె, వి
ప్పగ రేఁగెన్ వగుడాకుతోడ సుడిగాడ్పుందయ్యముల్ ప్రొద్దుకున్
బొగరెక్కెం, బదిరెండు గొట్టె నపు డెండున్ గంట లుత్కంఠతన్

తే.గీ. గుబురుకొనియున్న తింత్రిణీకుజములందు
నాకుగొడుగులనీడల నధివసించి
పులుఁగుబడుచులు గుసగుసల్ వోవుచుండె,
మెలఁగుసుడిగాడ్పుటురవడి కులికిపడుచు

తే.గీ. సవితృమండలకిరణఘర్షణము వలనఁ
బ్రత్తికాయలు చిటపటఁ బగులుచుండె
"రింగు" మని మింటి కెగసి యేట్రింతపిట్ట
ఈలవేయుచు నొగి పల్లటీలు గొట్టె

తే.గీ. గాలి, దినునుక్కురబ్బరుకత్తలాని
నెక్కి, శరవేగమున వీటి కేగువేడ్కఁ
బయన మొనరించునను తెప్పపాటులోనఁ
దాఁకె, మఱపించి దుష్ప్రమాదముపిశాచి

ఉ. రబ్బరుబండికొమ్ములు కరంబుల జాఱెను, దృష్టి కడ్డమై
మబ్బులు గ్రమ్మె, మీదటిప్రమాద మెఱుంగను గాని, లేచి నా
జబ్బను, సప్తలోకములు సాగరము ల్మెఱుము ల్విషధ్వనుల్
గుబ్బటిలన్ గ్రహించితి, దిగుల్పడి; దయ్యము లీనుతావునన్

తే.గీ. యోచనాశూన్యమై, బాధయో భయంబొ
యనుభవించెడు నాహృదయమునఁ దాఁకె
"నయ్యయో!" యనుకరుణ కిల్లైనపలుకు
కుటిలతీక్ష్ణాతపముఁ జీల్చుకొనుచు వచ్చి

చం. అది యొక దేవదూతపలుకా యని, కొంచెము నిబ్బరించి, క
న్ను దెఱచి, చూచినాఁడ నొక నూతనపాంథు నిఁకేమి సెప్ప, నా
సదయుఁడు తొమ్ము గొట్టుకొన సాఁగెఁ బదింపది మాట లేల? నా
కొదవినకష్ట మచ్చువడి యున్నది, వానిముఖాంబుజంబునన్

తే.గీ. కిరణములతోడ ననుఁ గంటగించి చూచు
తరణి కెవఁ డిచ్చె లోకబాంధవసమాఖ్య?
పరుల బాధలు గని గుండె గరఁగి వగచు
పాంథ! నీవయ్య! త్రైలోక్యబాంధవుఁడవు

## అనసూయ

సీ. విజయవిలాసుని వినుతింపఁ దలఁచిన జక్కన్న కోరమీసాలు దువ్వె
జక్కన్నకవనంబు చక్కని దని పల్కఁ బినవీరకవి నాల్క వెళ్ళఁబెట్టెఁ
బినవీరకవి పల్కు వెలఁదికి మగఁ డన్న గండపెండారంబు ఘల్లు మనియెఁ
బెద్దన్న కవితకుఁ బెదతాత యని పల్క రామభూషణుఁ డంబరంబు సూచె

తే.గీ. భట్టుమూర్తికిఁ గవిరాజపట్ట మీయఁ
దిట్టి లింగఁడు చేఁపలబుట్ట సూపె,
నందఱందఱు మహనీయు లని తలంచి
యొకనమస్కార మొనరించి యూరకుంటి

ఉ. నన్నయతిక్కనాది కవినాథులపంచమవేద మంతలోఁ
బిన్ననినవ్వు దోఁప నగుపించి, "మహాత్ముల విస్మరింతురే?
పిన్నలు, మంచి" దంచు నుడివెన్, దలవాల్చితి నంత "వారి దే
మున్నది మమ్ముఁజూడు" మనుచుండిరి, భోజసభాకవిప్రభుల్

మ. పదలాలిత్య మెసంగ, దండి, వచియింపం జొచ్చె, "నర్థంపుసం
పద, కావ్యేందిర కంగపుష్టిఁ గలిగింపం జాలు" నంచున్ సభా
సదులందుండి వచించె, భారవి, స్వహస్తన్యస్తకాదంబరీ
మద మేపారఁగ, "భుక్తశేష" మని సంభాషించె బాణాఖ్యుఁడున్

మ. ఉపమానంబులనిగ్గు దోఁప, బహుకావ్యోత్పత్తిఁ గావించి, వా
ర్ధిపరీతాఖిలధారుణీతలనుత శ్రీ నందికొన్నట్టి, నే
రుపరిన్ గాంచితిఁ గాళిదాసకవివర్యున్ జెంత నక్కాళికా
చపలాక్షిన్, జపలాసమంచితవపు స్సౌందర్య లీలావతిన్

మ. “అలకాపట్టణమార్గమధ్యమున మేఘాకారతం జొచ్చి, నీ
పలు కస్మన్మదభంజనంబు నొనరింపన్ సాఁగె, దిఙ్నాగుఁడన్
విలసత్కావ్యకళావిశారద! కృపాభిక్షార్థి” నం చొక్కఁ డం
జలి యొగ్గెన్ జని, కాళిదాసకవి కీషత్కంఠగాద్గద్యతన్

మ. “పరిపూర్ణప్రతిభావిభాసి యగువిద్వాంసుం డసూయామతిన్
బరికింపండు పరాయికబ్బములు దిఙ్నాగాభిధానా! హరి
ద్వరదంతిప్రతిమానపండితమహేంద్రా! నీక్షమాదృష్టి, సం
స్మరణీయం” బని మ్రొక్కె, భూమిపతి మెచ్చన్, గాళిదాసాఖ్యుఁడున్

కం. ఆపలుకు లచటిగర్వో
ద్దీపితు లగుకవులమది గుదించె, నసూయా
తాపములు దీఱెఁ, గాళీ
భూపతులమొగాన నమరె ముసిముసినగవుల్

## తబిసివస్తాదు

తే.గీ. అవి మహాయోగి వేమనకవివరుండు
జీవయాత్రను వెళ్ళఁబుచ్చిన దినాలు
అవి యతనిగోరువెచ్చని యమృతవాణి
తెనుఁగుఁబొలమున స్వారిచేసిన గడియలు

కం. పెదకంటిరెడ్ల పెంపుడు
కొడుకయి, నివసించు నొక్కగోరా జావుం
బడఁతుకలవలపులయనం
గుడు నయి, రేనాట నొక్క కుగ్రామమునన్

చ. పిడెకెడు కొమ్ముతో, నడుగు వేసిన గుల్కెడుకండపుష్టితోఁ,
బుడమిని జీరువాఱుజిగి ముద్దులకుచ్చులగంగడోలుతో,
నెడమబుజాన నించక శయించినపట్టెడుచెండుతో, కడుం
గడు బెడఁగెనదె, శివుని నందినిఁ గొండలపాలు సేసెడిన్

ఆ.వె. దాని, వెడఁదవెన్నుపై నాల్గుతూముల
ముత్తియముల నాఱఁబోయవచ్చు
దానికాటుకకనుఁదమ్ముల నిడువాలు
చూపు, గర్వమునకుఁ గాఁపురంబు

ఆ.వె. దానిఱంకె విన్న ధేనుసంఘంబులు
మేఁత మాని బెదరి మిన్ను సూచు
జీవితేశ్వరుండు శీలంబులను సంశ
యించె ననుచు సంశయించుకరణి

ఆ.వె. చూఁడియాలు; దానిసుందరాకృతిఁ జూచి
దినదినంబు మురిసికొనుటకతన
నదను దప్పకుండ నుదయించు నాయెద్దు
నీడ లయినకోడెదూడగములు

తే.గీ. కన్నులరమోడ్చి, వీధిశృంగాటకమున
నెమరువేయుచు నాయెద్దు నిలిచియుండ,
దానిమోహనమూర్తి నద్దమునఁ బోలెఁ
జెక్కుచుందురు ఱాలపై శిల్పివరులు

కం. పసిపిల్లవలెఁ బురంబున
మసలుచుఁ, బసిపిల్ల లడ్డుమసలినఁ, గొమ్ముల్
విసరక, బుసకొట్టక, య
బ్బసవన సాధించెఁ బ్రజల వాత్సల్యంబున్

ఆ.వె. కాలు నేల రాచి, గదిమి, ఱంకెలు వెట్టి,
మోర యెత్తి, వాలము న్నిగిడ్చి,
దానిమీఁద వైర మూని, కొండొకయెద్దు
యుక్కు మిగిలి తాఁకె, నొక్కనాఁడు

ఉ. త్రాగిన వానికన్నుల విధంబున నేత్రము లెఱ్ఱవాఱ, భూ
భాగము దద్దరిల్ల, వృషభంబు ఖణిల్లున ఱంకెవెట్టి, తూ
నీఁగ విధానఁ బోయిపడియెం బ్రతివీరునిమీఁద నంతలో
మూఁగిరి పౌరులాసమరముం గనువేడుక జిఱ్ఱుకొట్టుచున్

కం. పుచ్ఛెలపై నిసుమంతలు
పెచ్చు లెగయ గుండియలు గుభిల్లురు మనఁగా
నెచ్చిది, లొచ్చిది, యని వా
క్రుచ్చ నలవిగాక కుమ్ముకొనుచుఁ బెనంగెన్

ఆ.వె. తలలు వగిలి రక్తధారలు, మృత్యువు
చాఱ లగుచు నేల జాలువాఱ
నాలపోతుజంట యంత కంతకు రోష
మతిశయింపఁ బోరె నలపు లేక

కం. అదలించి, కొట్టి, యింతయు
బెదరక, పిఱుతివక, పెనఁగువృషభములకుఁ ద
ప్పదు మరణ మనుచు నాసలు
వదలిరి, పురజనులు దిగులువడి కన్గొనుచున్

ఆ.వె. వంగపండువంటి పచ్చనిమైచాయ
యుంగరాలు దిరిగియున్న కురులు
బూదిపూఁతలేని పుట్టగోఁచుల లేఁత
యోగి, యొకఁడు వేగ నుఱికి వచ్చి

కం. ఉఱు ముఱిమినట్లు, 'థే' యని
యఱచి, సమీపించి, చఱచె నఱచేతులతోఁ
జిఱుప్రక్క లదర, నెద్దులు
పఱచెం గ్రొన్నురువు నోటఁబడ దిక్కులకున్

తే.గీ. అతఁడు వేమన, భువనమాయాతమస్సుఁ
జీల్చి, చెండినబలశాలి సిద్ధమూర్తి
సకలసామ్రాజ్యభోగపిశాచములను
గోఁచిపాఁతకు బలియిచ్చికొన్నఘనుఁడు

## భూకంపము

తే.గీ. కారుమేఘాలు నీమీఁదఁ గంటగించి
పిడుగుగాయాలు మేనఁ గావించుచున్న
నచలవై, ధైర్యవృత్తిఁ బాయవు గదమ్మ?
అవని! నేఁడేల? గడగడలాడినావు?

చం. వదలక నీయురంబున నివాసము సేయుచరాచరంబు, నీ
యుదరమునందు డాఁగవలదో? తుద, కీనడుమంతరంపుటా
పద లొదవించి, నీకడుపు వ్రక్కలు సేయుననంతశక్తి, యెం
దుదయము నంది? నీయెడఁద నూఁచెడి నమ్మ! క్షమాధిదేవతా!

మ. ఇటలీలో ననలంబుఁ గ్రక్కె నొకభూ భృన్మౌళి నీయానతిన్
బుటభేదంబులు భస్మమైనవి, జపానుం బోయె నీమధ్య, ని
ప్పటి నీయాగ్రహ మిండియాదెస మరల్పం గారణంబేమి? కొఁ
గిఁటిబిడ్డం గబళించుతల్లి గలదే? కిగ్గాడి విశ్వంభరా!

ఉ. ఉత్తమపట్టణంబు లయయో! నిముసంబున వల్లకాడులై
నెత్తురు గ్రక్కెఁ జూపఱుల నేత్రయుగంబులు గోరగింప, భూ
భృత్తులు గ్రుంగి, తోయము లదృశ్యము లైనవి విశ్వధాత్రి! నీ
తత్తఱపాటునన్ బ్రకృతి తన్వి యొనర్చెను గారడీపనుల్

కం. మతములు పోరాడఁగ నీ
కుతలపతులు పెనఁగులాడుకొని చావఁగ నీ
రతనాలగర్భవతి! నీ
గతి దప్పవు జాలిపడవుగదవె, సవిత్రీ!

కం. ఇది పూజాసమయం బిది
ఖుదానిలయ మీతఁ డర్చకుం డనుచుఁ దలం
చెదవో, లేదో? కాశ్యపి!
కుదిలించితి వేల? శివునిగుడిని, మసీదున్

## కవితాలక్షణము

తే.గీ. సందిటకు రానివృద్ధభూషణము లెన్నొ!
తనువునఁ దగిల్చి, కావ్యసుందరిని దిద్ది,
బరువు మోయించి, తత్త్వంబు మఱచిపోవు
కవి యెఱుంగఁడు వ్యంగ్యవాగ్గర్భమహిమ

తే.గీ. పొదుగుబరువున నలనల్లఁ బదము లిడుచుఁ
గదలి చనుదెంచుజన్నంపుమొదవునట్లు,
విపులరసభావభరితగంభీరగమన
మమరి చూపట్టవలయుఁ, గబ్బములకుదురు

మ. అసమానంబుగ ద్వ్యర్థికావ్యరచనావ్యాయామముం జేసి, స
ర్కసుదేరా బిగియించి, సూరకవి, యాకాశంబునన్ బల్లటీ
ల్బసికీ ల్గొట్టియుఁ గావ్యతత్త్వమును జూపంగోరి, గ్రంథాంతర
ప్రసవంబుల్ వెలయింపఁడే? నవరసప్రాధాన్య ధన్యోక్తులన్

సీ. మద మరాళంబుల కుదురైన నడకలో రాణించు సహజంబు రాజసంబు
కదనుద్రొక్కు గుఱాల గర్వంపు మెడల వంపుల నుట్టిపడు కులుకుల పసందు
నెలకూన లంటని నిండుజవ్వని కుచద్వయి నేలు వలరాచవాని బిగువు
కలికి గులాబి మొగ్గల మీది విశ్వమోహనమైన సున్నిత మైనమెదుపు

తే.గీ. మధుర రసమును గడుపున మాటుకొన్న
ద్రాక్షఫల గుళుచ్ఛముల యందముల తూఁగు
వర కవీంద్రుని కావ్యప్రపంచమందుఁ
బ్రతి పదంబున మదికి దర్శనమొసంగు

# చీఁకటి

తే.గీ. ఉచ్చనీచత్వములకుఁ జేయూఁత లొసఁగు
చంద్రసూర్యులతోడ మత్సరము నెఱపి
ప్రకృతిసౌందర్యమును గావుపట్టి మ్రింగి
సమత బోధించునంధకారము రహించె

తే.గీ. మధుర ఫలముల గరువంపు మహిమతోడ
మిసమిసలు గుల్కుతియ్యమామిడివనాలు
ముదురుఁజీఁకటి కడుపున నొదిగిపోయి
తూలుచున్నవి, జడలదయ్యాలపగిది

తే.గీ. మెఱపుఁదీఁగలచుఱుకైననఱకుడులకుఁ
బాయ విచ్చినకౌఁగిటిపట్టునుండి
గుట్టు గనుపింపఁ దనకొంప గూలినట్టు
లల్లుకొనిపోవు నెంతనియామకంబొ

తే.గీ. చమురుబిఱ్ఱున వెలుఁగుదీపములకుతుక
నులిమి వేయుటకొఱకు నీడలవిధానఁ
బొంచియున్నవి చీఁకటిమొలక లకట!
సహజవైరంబు మాన్పునౌషధము గలదె?

తే.గీ. జీర్ణదేవాలయముల వసించుకతనఁ
గటికిచీఁకటిలోని చక్కనిగుణంబు
నవగతముచేసికొన్న దివాంధ మొకటె
పగలు వలదని శ్లేషగాఁ బలుకసాగె

తే.గీ. ప్రళయకాలాన సూర్యబింబము నశించుఁ
జిక్కుచీఁకటి రాజ్యంబుఁ జేయు నపుడు
పతనమును గోరు పగలు శాశ్వతము గాదు
పెంపు నిలుచునె నడుమంతరంపుసిరికి

ఆ.వె. కన్ను పొడుచుకొన్నఁ గనరానిచీఁకటి
జలధిలోన సుప్రశాంతి గలదు
ఇనునివేయిచేతు లెఱుఁగనియొకవింత
ధర్మగుణము చల్లఁదనము గలదు

## ధన్యజీవి

ఉ. క్రొవ్వినకాఱుదున్నవలెఁ గొమ్ములతోఁ బడఁగుమ్ముచున్న పె
ద్దవ్వకు లేమిదేవతకు నంజలిఁ బట్టెదఁ దద్గళంబులో
గవ్వలపేరు నాగృహముఖంబున మ్రోఁగినఁ జాలు గంజిలో
బువ్వకు మాధురీమహిమ పుట్టి, క్షుధాసుఖ మర్థమయ్యెడిన్

ఉ. ఆసకు నాస తోడుపడి యల్లరిసేయు నెడందతోడ, న
భ్యాస మొనర్చినాఁడను నభంబున మేడలు గట్టువృత్తి; యా
రాసభయాన, యెండిననరాలది, నన్ను వరించినంత, ని
ద్రాసుఖ మర్థమైనది, విదాహము దీఱె; నిఁకేమి కావలెన్?

చం. తుకతుకలాడురక్తమున, దూఁకులు వెట్టిడిపొరుషంబుతో,
నొకనికిఁ దగ్గిపోవ నను నుబ్బరమెల్ల నశించిపోయె, గుం
డెకు బరువైనతొంటిబిరిడీపను లిప్పుడు లేవు, లేముల
మ్మకు దయ రాక యుండినఁ, బ్రమత్తత నేమి యొనర్చి యుందునో!

చం. తిరిపెపుదమ్మిడీ తనివి దీపముగా వెలిఁగించి, దీపమే
యెఱుఁగని నా కుటీరమున నృత్య మొనర్చు మహాపిశాచి, చిం
పిరితలచిక్కులమ్మ, తరి బీయతుఁ జేసెడి నన్ను, భూమికిన్
బరువుగ, గబ్బిలాయిగ, తృణంబుగఁ, జుల్కనగా, హుళిక్కిగా,

మ. చెఱకుం బిండినలీల నాబలము నోడ్చెన్ గానుగం బట్టి, యా
పిరివో, దెమ్ములప్రోవు నిల్చినది, నావేషంబు నీక్షించి, నా
సరసన్నిల్చుట కేవగించుకొని జ్యేష్ఠాదేవి భీతిల్లు, నిం
కొరుఁ దేలాగున నిబ్బరించు నిపు డోహో! వింతధన్యాత్ముఁడన్

ఆ.వె. కలికమునకు నేను గావలె ననువాఁడు
నెఱిఁగియున్న వాఁడు ధరణి లేఁడు
ఈయనంతసౌఖ్య మేరాజు చవిఁజూచు
నేఁడు నామనంబు నిశ్చలంబు

## చనవు

కం. వ్యాసమునీ! భారతమును
వ్రాసినకవినాథ! పాండురాజసుతులలో
దోసము లేదా? యేదీ
నాసంశయములు నివారణము సేయఁగదే

శా. ఏకాలంబున జన్మమెత్తితివొ, నీయిష్టంబె చట్టంబుగా
నూకొట్టించితి వెల్లలోకములు నిన్నూహింప, సత్కీర్తిచే
నీకున్ గడ్డము తెల్లవారువఱకా, నీతొంటిమర్యాద, చిం
తాకంతైన నశింపలే దిపుడు తాతా! నానమస్కారముల్

మ. మనలో మాటకుఁ జెప్పుకొందము, తలంపన్ ధర్మరాజేమిస
జ్జనుఁడో చెప్పుము? తాతపాదములపజ్జన్ జేరి, యుబ్బించి, యా
తనిసంహారరహస్యముల్ తెలియ లేదా? యర్ధరాత్రాన, నె
వ్వనికేనిన్ వివరింపు మిట్టికుటిల వ్యాపారముల్ మెత్తురే?

మ. పసివాఁ డేటికిఁ దమ్మిమొగ్గరముఁ జీల్పంబూని యేతెంచెఁ? బా
లసులై, కౌరవు లెల్లఁ జంపిరని వేళాకోళమున్ జేతు ర
ప్పసివాఁ డెల్లర ముద్దుఁబెట్టుకొనిపోవం గోరెనా? యేటి
రసహీనం బగుధర్మనిర్ణయము, పారాశర్య? వాక్రువ్వుమీ!

మ. గురుఁ డస్త్రంబులు పాఱవైచునని, యేస్గున్ ద్రౌణిగాఁ బోల్చి, "కుం
జర" మన్నందుకు ధర్మరాజును మహీచక్రంబు నిందించెడిన్
నరుఁ డంతన్ నఱకెన్గురూత్తమునికంఠం, బిందులో నున్నధ
ర్మరహస్యం బెఱిఁగింపవే? దయ దలిర్పన్, మౌనిలేఖర్షభా!

మ. "తనయా! జూదపుసొమ్ము కూడ" దనినంతన్, రాజరాజాంబికే
యునివాచాపరిబద్ధుఁడై, యొసఁగలేదో! గెల్చుకొన్నట్టిభూ
మిని గౌంతేయుల కిందులో సుగుణ మేమీ! లేదు కాఁబోలు, ని
చ్చినదే మేలని చేయిసాఁపఁడె మహర్షీ! ధర్మజుం డోడియున్

మ. అకటా! ద్రోణుని మట్టిబొమ్మకడ, విద్యాస్వీకృతిం జెంది నం
దుకుఁ, బార్థుం దలయేకలవ్యుని నిషాదున్ జూచి మన్నింప నో
పక, యంగుష్ఠముఁ గోరుకొమ్మనియెఁ, జాపాచార్యునిన్ మత్స్యగం
ధికుమారా! కురురాజు స్వార్థపరుఁ డౌనే? క్రీడితోఁ బోల్చినన్

మ. తనసాపాటుబలంబు నమ్మికొని, యుద్దండంబుగన్ దట్టి గ
ట్టినభీముండునుఁ దొండిచేసి పడగొట్టెం బాప, మారాజరా
జును, గౌరవ్యలదుష్టకార్యములతో జోడించినన్ దీటౌనే?
వినువారుండినఁ జెప్పువారలకు లేవే? వ్యర్థవాదాంశముల్

# రచ్చ గెలుపు

సీ. పూర్వచాళుక్యభూపులరత్నసదనంబు తెనుఁగుమొక్కలు నాటుకొనినతోఁట
శబ్దశాసనుని భాషాభారతీసేవ ఫలసిద్ధి నందినప్రాంతనేల
దక్షిణగంగ, తాతలనాటికథలు సెప్పుచు నెల్లపుడు సాఁగిపోవు తెరువు
ఉద్దండకవిధాటి కొడలు పొంగులువాటి హర్షాశ్రువులు సిమ్మునగ్రభూమి

తే.గీ. రెడ్డిరాజులఖడ్గవారిదమునీడఁ
బండుసత్కీర్తి పూఁచినపంటచేను
ఎడమచరణాన బిరుదంబు దొడిగి, సుకవి
మదగజము లేగునెలవు, రాణ్మందిరంబు

ఉ. చిచ్చఱకంటివానిసతి, సింహము నెక్కి సవారిసేయునం
డ్రిచ్చుటఁ, బూర్వదక్షిణమహిం బరిపాలనసేయఁ, బుణ్యపుం
బిచ్చకు బ్రాఁతియే? నగర వీధులఁ, బూర్వచళుక్యసంపదల్
ముచ్చటసెప్పుఁ గన్నుఁగవమూసి, మనంబున నాలకించినన్

మ. అరచాటైన ముసుంగుతోఁ, గలికియొయ్యారంబుతోఁ, దెల్గుసుం
దరి; మానన్నయభారతంబు, పతిచెంతన్నిల్చె నిచ్చోట, భా
సురకీర్తిన్ జెలువారుపండితకవీశుల్, పుట్టుతా విచ్చటన్
జరణంబుల్ చలియింప, నేమనుచు వాచానైపుణిం జూపెదన్

శా. ఈదృఙ్మోహనరాజమందిరములో, నీవేంగిదేశంబులో,
నీదిగ్దంతులు గూడియున్న సభలో, నీపూర్వచాళుక్యరా
డాదిత్యప్రభ తేజరిల్లినప్రపూజ్యక్షోణిలో, సాంద్రమ
ర్యాదన్ జెంది, మదీయవాణియుఁ బవిత్రం బయ్యె, జన్మంబుతో

మ. మును 'గున్నేశ్వరరావు' వారిచరణంబుల్ గొల్చుచు, న్నాఁడు తీ
యనిగోదావరినీరు ద్రావితిని, నాల్గైదేఁడు, లామీఁద వ్రా
సినకబ్బంబుల కబ్బెనో; మధురిమశ్రీ, తెల్గుదేశంబుమ
న్నన గొంటిం గొనుచుంటిఁ, దన్మహిమ లుండంబోలు, నిన్నీటికిన్

ఉ. ఆదిని రుక్మిణీపరిణయంబును వ్రాయుచు, నిన్నదీశిలా
వేదుల విశ్రమించితిని; బెక్కుదినంబులు, కావ్యవీధులన్
జీఁదఱఁజెందునాహృదయ సీమరహింపఁగ వీచునంబుజా
మోదము, వీచికాపవనముం దనువు న్గదలించు నిప్పుడున్

చం. చకచక లీనుతొమ్మిదిరసంబులు చిప్పిలు మేలికావ్యసృ
ష్టికి జిగియందెవేసిన ప్రసిద్ధ కరుల్గలరీపురానఁ,"దా
నొక కవి యయ్యె, నిందు" ననునుజ్జ్వలకీర్తికి నోఁచికొంటి నం
గకములు పుల్కరించెఁ, గలగాక నిజం బగునేనిఁ, బుణ్యుఁడన్

తే.గీ. గౌడడిండిమభట్టునికంచుఢక్క
పగులఁగొట్టించు కవిసార్వభౌమునిల్లు
భాస్కరునికత్తి మెఱసిన ప్రథనభూమి
శిరము నెరసిన వినుకొండసీమ మాది

ఉ. రాయనిమంత్రిభాస్కర ధరావరుఁ డేలినవీటఁ బుట్టియున్
సాయము లేక, సాశ్రునయనంబుల నా రచియించుకైతకున్
గాయము పొంగి, నా కొసఁగినాఁ డొకబ్రాహ్మణదాత, వేయిరూ
పాయలు, క్రుంగిపోవు రసభావపరంపర మోసులెత్తఁగన్

శా. అంగీకారము సూపి మద్విరచిత వ్యాసంబులన్, భారతిన్
శృంగారించినవిశ్వదాతలను బూజింతున్, మహాభక్తి, నా
లంగా గట్ట నెఱుంగనట్టికృతిబాలాజాలమున్ మెచ్చుచున్
మాంగల్యంబును గట్టినట్టి, బుధులన్మన్నింతు, నశ్రాంతమున్

# రాజదర్శనము

సీ. తెలుఁగువాఙ్మయలక్ష్మికలికిదేహమునందుఁ గలదు నానిర్మాణకలన కొంత
నూఱుతేకుల నేటి భారతీప్రసవాన దొఱఁగు నా తేనెబిందువులు కొన్ని
సకలాంధ్రకవికోటిజాబితాలోపల నానామమునకు స్థానంబు గలదు
పండితుల్ మెడఁజుట్టి పంపినబిరుదంబు లున్నవి నాకడ నొండు రెండు

తే.గీ. కవికి వలసినకొన్నిలక్షణము లెట్లొ
పెద్దలయనుగ్రహమున లభించెఁ గాని
ధాత్రి నిశ్చింతముగ జీవయాత్ర గడపు
లక్షణము లేదుగద, విక్రమక్షితీంద్ర!

కం. అంతరము లెఱిఁగి కవులకు
సంతోషముఁ బంచిపెట్టుసామర్థ్యము, భూ
కాంతులు సత్కవులగుతమ
కెంతేనియుఁ గలదు విక్రమేశ్వర వింటే!

ఉ. ఈకవిగానిజీవిత మదిట్టులఁ గష్టసుఖాలమధ్యఁ బిం
డీకృతమై నశింపవలెనే? నరనాథ! తెలుంగువాణికిన్
జాకిరి చేయసాఁగి; కడచన్నవి పాతికవత్సరాలు, నా
యాఁకటిపాట మాన్పినమహాత్ములు లేరు, రసజ్ఞశేఖరా!

ఉ. ఆలయమందముద్రితములై, తెరచాటున డాఁగియున్న బి
బ్బీలవిధాన మత్కృతులు పెక్కులు వ్రాఁతలతోఁ గృశించుచున్
జీలిక లయ్యె, నుద్ధతి నశించె, విచారము కాఱుచీఁకటిం
బోలి, యెదందలో నిలిచిపోయె, సుమింపవు క్రొత్తకబ్బముల్

శా. ప్రాయంబున్, గవితాచమత్కృతి, నశింపంజొచ్చె, సంసారబా
ధాయాదోధితరంగసంహతివిధూతం బైనచిత్తంబుతో,
వేయిన్నూటపదారు లందికొన నువ్విళ్ళూరునాకైత కిం
కేయొయ్యారము నిల్పి, యేసొగసుఁ జేయింతున్? దయావారిధీ!

## జయంతి

మ. విమతోద్దండుఁడు కృష్ణరాయనియరబ్బీగుఱ్ఱముల్, సాంపరా
యములో దాయలకోయఁబడ్డతలకాయల్ పిండిగా, రక్తనా
ట్యము గావించినవీరభూములకు నాహ్వానించి, నాజన్మ ధ
న్యముఁ గావించినమీకు నావలపుఁగాన్కల్, దోసెఁ డర్పించెదన్

తే.గీ. ఆంధ్రశారద కృష్ణరాయని కొలువున
మునుపు దీర్ఘాయువులు పోసికొనకయున్నఁ
బొరయునే మీకు నాకుఁ జుట్టఱిక మిటులఁ
గలుగునే నేటియీవార్షికములగొడవ.

చం. ఇపుడు ప్రపంచవైణికుఁడు, కృత్రిమయుద్ధకఠోరగాన మా
లపనము సేయసాఁగె, శుభ లక్షణలక్షిత మైనశాంతిమం
టపమున ధర్మదేవత వడంకఁ దొడంగె, నికృష్ట మైనస్వా
ర్థపరత చియ్యవట్టినది, రాఁగలగాలిదుమార మెట్టిదో!

సీ. చీనాపడంతిముచ్చెలవంటి సాంఘిక ప్రతిబంధకము లన్ని పగులఁ దన్ని
సరిక్రొత్తయుడుకునెత్తురు వోసి మేల్కొల్పఁ గల తేట తెలుఁగుకైతలు పఠించి,
సమయంబు నెంతేని నమిలి మ్రింగుపురాణ గాథావళులకు, సమాధిఁజేసి
భావదాస్యమునందు బంధించు చిలిపి విశ్వాసంబులకు ఫులుస్టాపుఁ బెట్టి

తే.గీ. ఆధునిక నాగరకతామహాపిశాచి
కోఱలకుఁ జిక్కి, ధీశక్తిఁ గోలుపడక,
నడుపుకొనవోయి! స్వీయవిజ్ఞానరథము
బ్రతికిచెడియున్నవీరభారతకుమార!

## తుపాను

సీ. కొమ్మ పుట్టెఁడునీడ గురియ నీ పెనుమట్టి పాంథుల నొకశతాబ్దము భజించె
కొల్లాపురపుసత్తికొలువుల కీచింత తొలిపూవుకులుకునవ్వులు వెలార్చె
యెఱగాలికఱవునాఁ డీనింబతరుశాఖ లంబాడిదయ్య మలంకరించె
గరుటాలమంతుఁ డాఖరికాన్పు లీజువ్వి పైకొమ్మపైఁ దెల్లవార్చికొనియె

తే.గీ. ధరణిఁ బుట్టిననాటివృత్తాంతములకు
శాసనములైన యిమ్మహీజములబ్రతుకు
మొన్నటితుపానుబీభత్సమున నశించి
మూఁడువారాలకథలోనఁబూడిపోయె

చ. చిలిపితుపానుదెబ్బలకుఁ జింది జలాశయమందుఁ బడ్డపూ
వులముఖసీమలం దొలఁగి పోవఁగలేదు విలాసలక్ష్మి యూ
యెలల వసించుబిడ్డలముఖేందులఁ గ్రమ్మఁగలే దహో! జల
ప్రళయనిశాటినోటఁ దలవాల్చిన మాతృవియోగమేఘముల్

## మేల్కొలుపు

తే.గీ. కాలవాహిని యుగతరంగములనడుమ
నున్నదో! లేదొ! భవ్యభాగ్యోదయంబు
ఎల్లదిశ లొప్పు లొలుకఁ బ్రొద్దెక్కిపోయె
భరతజనయిత్రి! కన్నులు తెఱువ వేమి?

మ. తరముల్ పెక్కులు కాలచక్రమున నంతర్ధానముం జెందె, సో
దరదేశంబు లఖండవైభవసముద్రస్నానముం జేసెఁ బే
దఱికంపుంబొగదుమ్ము గుమ్మములపొంతన్ దాండవంబాడ, సో
[illegible]

మ. వలదమ్మా! యివి ప్రాఁతనాటకము లభ్యస్తంబు గావించి, నీ
తలఁపు ల్సాగక మొద్దువాటినవి, నూత్నజ్యోతి ముట్టించుకో
వలె, నుత్సాహసమేతులయ్యు సుతు లీబందాలలోఁ జిక్కి, దు
ర్బలులైనా రిఁక నూటిపోసికొనవే! స్వాతంత్ర్యభావౌషధుల్

ఉ. ఉన్నవి పిచ్చినమ్మకములుప్పుకు రానివి నీయెదందలో
నెన్నఁడు సొచ్చెనో; చరణమెత్తి, శుభాశుభముల్గణింతువో
యున్నతురాల! యీపిటికి యూహల కాహుతియై, ప్రయత్నముల్
చన్నవి రిత్తలై, యవి తలంచి గడింపు మభీష్టసిద్ధులన్

తే.గీ. సకలశుభములు నీసమక్షమునఁ జేఁపి
నిలిచియున్నవి వేల్పుటావులవిధానఁ,
బిదుకుకొనవమ్మ! బంగారుబిందియలకు
నాలసించినఁ బరులపాలగును బాలు

చం. అటఁ గనుగొమ్ము! పశ్చిమమునందుఁ, దురుష్కలసుందరాంగి, చీఁ
కటిపరదాలతోడ బురఖా దొలఁగించి, సమంచితాశయ
చ్ఛటలు చిగుర్పఁగాఁ జదువుసంధ్యలు నేర్చిన దమ్మ! విద్యకై,
గుటకలు మ్రింగునీయనుఁగుఁ గూఁతుల కిమ్ము, కలమ్ము, ఖడ్గమున్

## కవిప్రశంస

ఉ. గంటలు గొట్టి మీమధుర కావ్యము లాంధ్రుల మేలుకొల్పి, యిం
టింటను బాదుకొన్నవి, కవీశ్వర! కోఁతకు వచ్చియున్నమీ
పంటను గోసికొమ్ము తిరుపత్యభిధానుఁడు లేఁడు, భాగముం
గొంటకు, నీవిచారమునఁ గుందెద మింతకు వేంకటేశ్వరా!

చం. తెలుఁగుజగాన నేఁడు గడిదేటిన బాలకవీంద్రు లెల్ల, మీ
పలుకులపందిటం జిగురువట్టిన మొగ్గలు, మీవధానకౌ
శలమున నూఁగిపోయిన దిశావలయంబు ప్రసాదబుద్ధిమై
వలగొని, మీ కొసంగెడు నుపాయనముల్ గొనుమయ్య! సత్కవీ!

ఉ. కొబ్బరికాయపాకమునకుం గుఱియై, తలబొప్పిగట్టు ప్రాఁ
గబ్బములెల్ల మూలఁబడఁగా, నొకతీయనిత్రోవఁ ద్రొక్కి, మీ
రబ్బురపుంబ్రబంధములనల్లి, దిశావిజయంబుఁ గాంచినా
రుబ్బునఁ, గీర్తిడోలికల నూఁగితి రేమనవచ్చు మిమ్ములన్

మ. ఎదురై మిమ్మదలించి గెల్వఁగలవాఁ డీయాంధ్రదేశంబునం
దుదయింపం డిపుడు న్నిరంకుశులరై, యూరురఁ గ్రీడించినా
రది మీపుణ్యఫలంబు, వేంకటకవీంద్రా! సాంద్రకీర్తిద్యుతిన్
ముదిమిం గాంచినమీకలంబుల కివే పూజానమస్కారముల్

శా. నీవుం దిర్పతియున్ సభాంతరముల న్నేర్పుం బ్రదర్శించి, వి
ద్యావైశద్యము గల్గుపండితకవీంద్రశ్రేణితోడన్ సవాల్
గావింపం బులకించిపోయిన విశాలం బైనయాంధ్రోర్వి, మీ
శ్రీవృత్తంబుఁ దలంచి, చెప్పుకొనఁజొచ్చెన్ దేశదేశాలతో

సీ. ఇలు దాఁటి నీవు రావలెఁగాని నీపదంబులు నమస్కృతులలో మునిఁగి తేలు
చేసాఁచి నీవు యాచింపంగవలెఁగాని మణులతో నీకొంగు దొణఁకిపోవు
తలఁ పూని నీవు చేఁ గల మందవలెఁగాని సిసలైన కవనంబు చెంగలించు
మతి నెంచి నీవు సమ్మతిఁ జూపవలెఁగాని బిరుదాళి నీఱొమ్ము తుఱఁగలించు

ఆ.వె. నీకు షష్టిపూర్తి నెఱపి మాబందరు
నిఖిలదిశలఁ బూజనీయ మయ్యె
వార్ధకమున గౌరవకిరీటమును బూని
సంచరింపు మయ్య! సత్కవీంద్ర!

శా. ఏఁడీ? నీకును దోడునీడ, చెలికాఁ డేమాయె, సాహిత్యస
మ్రాడాఖండలుఁడైనతిర్పతి? కవీంద్రా! జోడుతోడాలతో
మీడాకాలి నలంకరించి, మిము నెమ్మిన్ మేము పూజింపఁగా
లేఁ డేమందుము! కాలరాక్షస కరాళీభూతమర్మక్రియన్

# జాకి

శా. ఏకాలంబుననో! ఋణంబువడి నన్నినాళ్లు సేవించి, నేఁ
డీకాయంబు పరిత్యజించితివి, జాకీ! నాకు మర్యాదతోఁ
దోఁకాడింపుల స్వాగతంబు లిడి సంతోషించునీదృష్టికిన్
నాకన్నన్ మొనగాఁడు నుత్తముఁడుఁ గన్పట్టండుగా? యుర్వరన్

శా. పెట్టుంబోఁతలు సన్నగిల్లె ననుచున్ విశ్వాసహీనాత్ములై
చుట్టాలుం జనినారు, నీకడుపుఁజిచ్చున్ దీర్చుమృష్టాన్నమున్
బెట్టన్ జాలనినాయెడ న్గలుగునీప్రేమానుబంధం బహో!
పట్టు న్వీడదు; నీకృతజ్ఞతకు నాస్వాంతంబు నీరయ్యెడిన్

శా. ఇల్లేమైనది? నీవునుం బయనమై యేతెంచియున్నావు, నీ
చెల్లాటంబులు గట్టిపెట్టు మని కొంచెం బేను గోపించుచో
నిల్లాలింబలె, మోము వంచుకొని యప్డేయింటి కేతేరవో
యల్లా! పెండిలినాఁడు, నీవినయ విద్యాలీల లూహించెదన్

చం. 'హృదయము చీల్చి చూడు మిది యిచ్చకమో! యభిమానమో! గ్రహిం
చెద' వని యాఁకట న్గొగిలి చిక్కినగర్భముఁ జూపి, యెన్ని యో
బదవలు వద్ద నే నెదమపాదమునన్ బ్రహరించుచుండితిన్
బదములు నాలు గున్నయొక భక్తుని నిన్నుఁ బరాభవించితిన్

ఆ.వె. నోరు లేదు గాని చేరి నీ వొనరించు
పనులలోన వింత భాష గలదు
నీవు నేనుఁ దప్ప నితరు లెఱుంగరు
కనులతోడ నవ్వఁగలవు నీవు

మ. చెలికాఁడు న్నినుఁబోలి యింటికడ గస్తీసేయునా? విచ్చుక
త్తులతోఁ బైకొనుచోరులం గవియ నుద్యోగించునా? నాకునై
బలియై, ప్రాణము లొడ్డువాఁ డెవఁడు? నాబంగారుజాకీ! నమ
స్సులతో నీకు సమాధిఁజేసితిని, నశ్రుస్నాన మాడించితిన్

ఉ. వాసనఁ జూచి నాయకుఁడు పాదము లూఁదినతా వెఱుంగున
భ్యాసము సేయుభృత్యుఁడు ప్రపంచమునం దొకఁ డున్నవాఁడె? వి
శ్వాసము నీకులానికి నిసర్గవిభూషణ మమ్మ! యిట్టి సా
వాసము చచ్చిపోయినది బాహుబలం బుడివోవుకైవడిన్

చం. 'ఎవఁడవు నీవు? రావలవ దిచ్చట స్వామి శయించినాఁడు, నీ
కవమతి వచ్చుఁ బొమ్మ' నెడు నర్థము దోఁప నదల్చి, భీకరా
రవములు సేయుచుండెదవు రాత్రులఁజీమ చిటుక్కుమన్న, బాం
ధవులకు లేని గౌరవము నాయెడ నీ కెటులబ్బె నాప్తుఁడా!

మ. ఒడయం డొంటరిగాఁడు, కష్టములు రావో? యర్ధరాత్రాన నం
చడుగుంజాడల వెంబడించెదవుగాదా? జాకి? నీ విప్పు డి
క్కడ నిశ్వాసము లేనినిద్రవడి యింకన్ మేలుకో వేలొకో!
నడువం బాదము లాడకున్నయవి శ్వానస్వామి! నీస్వామికిన్

## చీట్లపేక

సీ. నాలుగురంగుల వాలుజూపులసాని, అతికాలభుక్తికినాటపట్టు
గెలిపించి యోడించు కులుకునవ్వులపిల్ల కలహమ్మునకు నిందుకారణంబు
వ్యసనవల్లికలకు బల మైన చేయూఁత తొలఁగించుకొనరానిజెలగపట్టు
ప్రొద్దెఱుంగని మోహమునకుఁ జింతామణి నలునిల్లు గూల్చిననంగనాచి

ఆ.వె. నెత్తిగొఱిగి పంపు నెల్లూరినెఱజాణ,
కితవజాండములకు బ్రతుకుఁదెరువు,
త్రాగుడునకుఁ గొంత దగ్గఱచుట్టమ్ము
చేతిడబ్బుపోక, చీట్లపేక

ఉ. జోకరుగానిఁ దోడుకొని, చుక్కలచక్కదనంబు మీఱ, "మూ
డాకులయాట, యెత్తిళులు, నడ్డు, షర"త్తని మ్రోయుచున్న,
పేకబొజంగి నన్ను వలపింపకు మింతట బుద్ధివచ్చె, నీ
యాకులపాటులోఁ గలుగు నాకులపాటుఁ దలంప సిగగున్

శా. అంగీకారనినాదముల్, పటుతర వ్యాహారముల్, భ్రూకుటీ
భంగాక్షేపణముల్, పరస్పర జయవ్యామోహవాదధ్వనుల్,
సంగీతంబులు, కూనరాగములు, నీలల్, దీర్ఘనిశ్వాసముల్,
నింగిన్ దాఁకుచునుండు, నీదురిత కేళీరంగమధ్యంబునన్

మ. నిఖపేదన్ గరుణించి పాపమని కానీ ధర్మ మర్పింపఁ జి
ల్లర లేదంచుఁ దొలంగులుబ్ధుఁడు, సముల్లాసంబుతో మేటి తెం
పరియై, నూటికి నూఱు లొడ్డి విరమింపం డక్కటా! పేకసుం
దరి! నీముక్కలు, మోహనాస్త్రములు చింతాసౌధసోపానముల్

మ. 'అనుగుంబిడ్డఁడు బావిలోఁ బడియె నన్నా! లేచిరమ్మన్నఁ దె
చ్చున దీమార్గమెకా యటంచు వచియించున్ జూదగాఁ' డందు రిం
దున సందేహము లేదు, కేవలము మందుండై, విషగ్రస్తుఁడై
తనరున్, రంగ మలంకరించిన మహాతత్వజ్ఞుఁడున్ వ్రేల్మిడిన్

మ. గెలుపా! యీయెల సంశయంబునకు మ్రొగ్గెన్, బేస్తులా; రెండురూ
కలపైచిల్కు; కుదేళు లిచ్చుకొన నింకం బావులాకాని గా
వలె, నీఘోరవిపత్తు మస్తమున సంప్రాప్తించెనా? వాఁడు 'వి
హ్వలనాగేంద్రము పాహి! పాహి!' వఱకై యబ్జాక్షుఁడున్ రావలెన్

ఆ.వె. పేకయాటలోని ఫించెనీదారుండు
చుట్ట త్రాగుకొనుచుఁ జూడ వచ్చి
'చెఱచి' తనుచు ముక్కు చిట్లించుకొనిపోవు
పేకయాట గుండెపీకులాట

## ఆశ్వాసము

చం. రవిజునిపేరు నాపితికి రక్తపుగుండెలలోనఁ బౌరుష
చ్ఛవుల నలంకరించినది స్వాతిశయంబునఁ బొంగిపోయి, నా
కవనము తెల్గుజోదుల ముఖంబున గీతిక లాలపించి, పె
ల్లవమతిచేఁ గృశించు కమలాప్తతనూభవు నూఱడించుతన్

శా. నీపే రెత్తిన నామనఃకుహర మంధీభూతమై, క్షుబ్ధమై
వాపోవున్, దనువెల్లఁ గంచుకితమై వ్యాలోలమై పొల్చుఁ, గ
ర్ణా! పౌరందరుఁడేయు బాణముల యన్యాయ్యధ్వనుల్ నాచెవిన్
రాపాడున్, గఠినంబులై, మన విచిత్రస్నేహ మూహించితే

మ. రవిజా! భారతసంహితం జదువ నారంభించి, నీతోడ నా
హవమున్ జొచ్చిననామనం బవలిదృశ్యంబున్ సమీక్షించి, యో
రువలే దీవు గతించినన్ దగినవీరుం డెవ్వఁ డుండున్, గథా
సవ మంతన్ జవి లేనిదై, పోదమి, యుత్సాహంబు ఛేదించెడిన్

మ. దెసలం బుక్కిటఁబట్టుకొండొకమహాతేజస్సమూహంబు, నీ
లసమానాకృతినుండి లేచి, రవి నాలంబించుచో, వైరిమా
నసముల్ నీకు నమస్కరించినవి, కర్ణా! వీరచూడామణీ!
యసువుల్ వోయిన నేమి నీయశము బ్రహ్మాండంబు నోలార్చెడిన్

ఉ. ఒక్కొకబాణఘాతమున నుట్టటలూఁగినపార్థుతేరిపై
టెక్కెమునందుఁ గొందలపడెన్ గపిరాజు దినేశపుత్ర! నీ
చిక్కనిబాహుసారము రచింపకపోవఁడు, సూర్యశిష్యుఁడై
నిక్కము వల్కువాఁ డతఁ డనింద్యచరిత్రుఁడు సత్కవీంద్రుఁడున్

## సార్వభౌమనిర్యాణము

చం. ఇనునకుఁ జావులేని జగమేలుమహోన్నతకీర్తిశాలి, న
ల్లనిమనభారతావని విలాసిని మెచ్చినశ్వేతభర్త, వం
దనము లొనర్చుచున్ శతశతఘ్నులు మ్రోయఁ జరించుజార్జిరా
ড్డినమణి క్రుంకెనే; చరమదిక్సతి చీఁకటిచీరఁ గట్టఁగన్

మ. కనుగొమ్మల్లదె! మిత్రమండలి పతాకాకుంచితగ్రీవమై,
వినిపించున్ దనసార్వభౌముని మృతిన్, విశ్వప్రపంచంబుమో
మున నాభీలవిషాదరేఖ మసలెన్, మూల్గెన్, బకింగ్హాము భ
ర్మనిశాంతంబు పునాదిఁలాలు పులకింప,న్నీలిదీపాలతో

శా. ఈదేశాల నఖండవైభవముతో నేటేటఁ బుష్పించు, ఢి
ల్లీదర్బారు, చరిత్రలో నొదిఁగి తాల్చెన్, నీయశోమూర్తి, రా
జాదిత్యా! ప్రపితామహాదిగురు లాహ్వానించిరో, మింటి? కే
మాదేశింతువు, నీకుమారులకు రాజ్యశ్రీకి నిల్లాలికిన్?

కం. కొహినూరువజ్రదీపం
బహర్నిశల వెలుఁగు నీగృహంబున లేదా?
మహనీయసౌఖ్య మెందుల
కిహము విడిచి స్వర్గపురికి నేగితివి ప్రభూ?

తే.గీ. మూఁడుమూర్తులు నీవుగా ముద్దు లొలుకు
వేల్సుయువరాజు నీప్రతిబింబ మగుచు
మకుటమును దాల్పనున్నాఁడు మస్తకమున
దివిజులను గూడి యాశీర్వదింపు మనఘ!

## ప్రబోధము

తే.గీ. పండినపొలాలమంచెలపయి వసించి
కొదమబెళగువ్వతో గావుకూఁతఁబెట్టు
కాపుపడుచుల తెలుఁగుశృంగారకలన
చెక్కు చెదలేదు, యెరవు దెచ్చినది లేదు

చం. అనుకరణంబునందుఁ, దెలుగయ్యలు నమ్మలు దొడ్డవారు, కా
వున నివసింపసాఁగినవిపో; పెరవారిపసందుపోకడల్
తెనుఁగుఁదనంబు రాట్నమునఁదీసెడు దారముతోడ మూల్గసా
గినది, పురాతనాంగనల గేయములన్ శ్రుతి గల్పి పాడుచున్

శా. ఓ కాఫీతపసీ! తెనుంగునకు నాయుఃప్రాణముల్ గ్రుంగి, హిం
దీకిన్ గల్గును చోటు లేదనుచు వాదింపంబ్రయత్నింతువా?
ఆకర్షించువిదేశవాసనల కిల్లైయున్ననీయింటియం
దీకాసంతలు రాష్ట్రభాషలకు లేవే? తావు లూహింపఁగన్

చం. అవమతి వచ్చునో! తెలుఁగుటంగన చక్కదనంబు, మాటమా
ర్దవమును లెక్కసేయవు, సదా పొరుగిండులపుల్లగూరలోఁ
జవులు వచింతు నీసహజచాపల మూదునె? యింగిలీషుచి
ల్కవు, వచియింపనేర్తువె, బలా? చిరకాలపురామశబ్దముల్

ఆ.వె. నాగజెముదుపురుగులాగున నీచుట్టు
మూఁగియున్న నేఁటినాగరకత
తెలుఁగుదనముతోడఁ దినివేయదో; నీయ
శోలతాంతములను వాలకమును

## ఆవేదన

తే.గీ. పగలు గూబలు రాతిరి పావురంబు
లేలుబడిసేయుజీర్ణదేవాలయమున
వెలుఁగుచున్నది నేతిదిబ్బెములవరుస
చిలిపిచీఁకటి నాయింటఁ జిక్కఁబడియె

తే.గీ. ఆశిలావిగ్రహంబున కాహుతి యయి
పోవుచున్నది నాపేదభోజనంబు
నోరెఱుంగని జీవజంతువులతలలు
పొరలుచున్నవి దానిమందిరము నెదుట

తే.గీ. ఎమ్ములను బిండి, మూలుగు లిగిరిపోవఁ
గృషియొనర్చెడుపశువుల నెండగట్టి
ఆతినందికి గందపుఁబూఁతఁ బూసి
మ్రొక్కుచున్నది భువనంబు మోకరించి

తే.గీ. అరరె! బొందినిఁ బ్రాణ మున్నంతవఱకు
జాలిపడువాఁడు లేఁడు ముజ్జగమునందు
చచ్చి, మరుభూములం దొకసత్తి నగుచు
నిట్టు లొకమూఁగిబొమ్మనై పుట్టువఱకు

తే.గీ. తాతముత్తాతల కపాలదామములను
గళమునం దాల్చియున్న విగ్రహమునెదుట
కుప్పిగంతుల నిడుమేఁకకూనమనసు
కలఁతఁజెందదు, ప్రిదిలి ముక్కలయి చనదు

తే.గీ. మరణ మెఱుఁగక యజమానిపిఱుఁద నడచి
హేతిపాలైన లేఁత చింబోతుకనులు
మూఁతవడలేదు, కన్నీట మునుఁగలేదు
వెలుఁగుచున్నవి గాజుబిళ్ళలవిధాన
నిట్టలపుటచ్చెరువు గ్రుక్కవట్టు నేమొ!

తే.గీ. బందుగులప్రాణములతోడ బంతులాడు
ధవునియానతి గుడికిఁ బ్రదక్షిణించు
నెడ్ల కేభాషతో నెవ్వఁ డెఱుక పఱచు
నుజ్జ్వలం బైనసత్యాగ్రహోద్యమంబు

తే.గీ. ఆపవిత్రకవోష్ణరక్తాంకిత మయి
ఆర్ద్రమైన తదాలయ ప్రాంగణమున
శ్రుతిపురాణేతిహాససంగతము లైన
శీర్షములుగూడ సవినయశ్రీ వహించు

తే.గీ. అది మతావేశపరులవిహారభూమి
యట నహింసకుఁ దావు రవ్వంత లేదు
'కాదు వల'దన్న బౌద్ధభిక్షకునికుతిక
నులుముచున్నారు పురిటిబెబ్బులులపగిది

# భూమిక

ఇది నా వ్రాసిన మూడవ ఖండకావ్యము. మాతృవియోగంతో నారంభమైన నా దుఃఖము పశ్చాత్తాపము, అశ్రుపూజ, ధర్మకిరీటము, శిల్పి, తెలుగువెల్లు, తిక్కయజ్వ మున్నగు పద్య వ్యాసములతో నుపశమిల్లినది. నా మొదటి, రెండవ ఖండకావ్యములు తెల్గుదేశమున నాల్గు చెరగులకు పయనించి ఆంధ్రుల అభిమానాన్ని కౌగలించినాయి. నిర్ధనుఁడైన కవికి జాత్యాదరణకన్న భాగ్యమేమి కావలయును. నా మూడవ ఖండకావ్యము తెలుగు మన్ననలకు గురికాగలదని విశ్వసించుచున్నాను.

జి. జాషువ

# కృతిస్వామినీ ప్రశంస

మ. చని యేలోక మలంకరించినదొ। శ్రీజవ్వాది లక్ష్మాఖ్యానా
యుని ప్రాణేశ్వరి కాదిలక్ష్మమకు, విద్యుద్దేహకున్ మేలిమం
డనమై నాదగు ఖండకావ్యకృతి, చింతాశల్యముం బాపి, య
ప్పెనుగొండ ప్రభు నూఱడించి ప్రమదాబ్ధిం దేల్చి లాలించుతన్

శా. శ్రీమద్గంధము వీరరాఘవునకున్ శ్రీరత్తిమాదేవికిం
బ్రేమంపు న్మలిచూలి బిడ్డవయి, పేర్మిన్ లక్ష్మయాఖ్యక్షితి
స్వామిస్వామితఁగన్న సద్గుణ కదంబా ఆదిలక్ష్మాంబికా
ఆమోదింపఁగదమ్మ నాదు కృతికన్యామాన్య గీతాంజలిన్.

మ. నగవుల్ సిందు నవీనమంగళ కళానంద స్వరూపంబుతో
పగలున్ రేయి పరోపకారముల నాహ్వానించు చిత్తంబుతో
భగవద్భక్తిరసాభిరామమయి ఆబాల్యంబు శోభిల్లు నీ
సొగసుల్ సిమ్మెదు మూర్తి నిత్యముఁ దలంచున్ భర్త కన్నీళ్ళతో

శా. నీపేరన్ మహిళాసమాజమునకున్ నిర్మింపగాజేసె, వి
ద్యాపీఠంబును గోస్తనీతటమునం దాత్మేశ్వరుం; డందు నీ
రూపంబున్ గని యంజలింతురు కళార్థుల్ మృత్యువు న్నీయశో
దీపం బారుపజాలునే తెలుగు సాధ్వీ యాదిలక్ష్మాంబికా!

మ. వెలయించెం గవితాసరస్వతికి మీ పెన్గొండలో నాశ్రయ
స్థలముల్ నీదయితుండు లక్ష్మయ జమీందారుండు లక్ష్మాంబ! పు
త్రులునుం బుత్రికలయ్యె సత్కవుల సూక్తుల్; నేడు పెంపారు నీ
బలగంబున్ మృతి ముట్టనేరదు తలంపన్ బ్రహ్మకల్పాంతమున్

ఉ. డంబములేదు. కొండొకపడంతి నెఱుంగదు, నిన్ను దక్క ల
క్ష్మాంబిక జీవితేశ్వరుఁ డహర్నిశమున్ భవదీయ దివ్యరూ
పంబు ద్వితీయ పత్నివలె భావనసేయుచు నెల్ల భోగవ
ర్గంబు త్యజించెఁ జాటు మమరావతి నీపతి నీతివృత్తమున్

మ. మును ముంటాజమహాలు మృత్యువదనంబున్ జొచ్చినన్ బెండ్లియా
డని షాజానునవాబు డమ్మొగలు రాష్ట్ర ప్రాణనాథుండు నీ
యనుగుం భర్తను బోలునే? మఱి వివాహం బాడగాలేదు, నీ
తనయుల్ భక్తి భజించుచున్నను. సమస్త శ్రీలు కేల్మోడ్చినన్

శా. కన్నీరిప్పటి కారలేదు, సతి లోకస్వామినీ నీకృపా
స్విన్నంబైన కటాక్ష వీక్షణములం జెన్నొందు భృత్యాళికిన్
త్వన్నాథుండగు లక్ష్మయప్రభుని యాత్మన్ ముద్రితంబైన నీ
పున్నెంపుం గమనీయరూపమునకున్ ముత్యాల పూజాప్లుతుల్

కం. గారాల సుబ్బమాంబా
మారణవార్తాశరంబు మదినాటి, కళా
వీరుని, భర్తను లక్ష్మయ
గారించి గతించినావుగా! లక్ష్మాంబా!

కం. మనుమలను, మనుమరాండ్రన్
గనుఁగొను భాగ్యంబులేక గతియించిన ని
న్ననయంబుఁ దలఁచి చింతా
వననిధి నోలాడు నాంధ్రవనితా జగముల్

సీ. వలపుల నీచేతి పక్వాన్నములచేత దృప్తంబులై యున్న భృత్యవితతి
నీ వంపు పథ్యాల నియతి నెగ్గినయట్టి సంతానవతులు బాలెంతరాండ్రు
అన్నవస్త్రాది దానాదికంబులచేత విలసిల్ల గండుపేదల సహస్ర
మనయంబు నీముద్దు టనునయింపులచేత నలరిన యూరియిల్లాండ్ర మూక

తే.గీ. ఆది లక్ష్మాంబ! నీ వియోగాగ్ని శిఖల
గ్రాగుచున్నది నేడు, నిక్కముగ తల్లి!
అచ్చు వడ్డవి నీదు నామాక్షరములు
దిక్తటములందు దీనికి తిరుగులేదు

శా. ఏ కష్టాలు ఘటిల్లినం దమకలే దీనాటికి న్నాథుఁడో
వైకుంఠక్షితివాసినీ! తెలుఁగు చెల్వా! ఆదిలక్ష్మాంబికా!
వాకొంద్రాంధ్రులు కృష్ణరాయఁ డనుచుం బ్రాణేశ్వరున్నేడు నీ
శోకంబున్ దరియింపనేరదు, కవీశుల్ బెక్కు రోదార్చినన్

చ. స్వయముగ వంట సల్పి సరసంబగు భోజ్య మొసంగునాఁడు, నీ
ప్రియుని శరీర వల్లరి, నవీనముగా ననలెత్తునాటి య
వ్యయమగు కాంతిపుంజము శతాంశము లే దిపు; డెట్టు లోర్చెదో
దయఁ బెడబాసి ఆంధ్రవనితామణి! లక్ష్మయ రాణివాసమా!

సీ. రతనాలతోడ నారతు లిచ్చుచున్నారు నవకవుల్ నీ ప్రాణనాయకునకు
ఆయుర్విభూత్యాప్త లాశించుచున్నారు పండితుల్ నీ మనోవల్లభునకు
కలిగి బంగారు గొడ్గులు పట్టుచున్నారు భృత్యులు నీజీవితేశ్వరునకు
అగ్రసింహాసనా లమరించుచున్నవి సభలు నీ జీవిత ప్రభువరునకు

ఆ.వె. వీణియలకు సకల వైణిక ప్రవరులు
కఱపుచుంద్రు నీదు కాంతు చరిత
మిన్ని వైభవముల నీదులాడుచునున్న
నాదమఱచి యెఱుగడమ్మ నిన్ను!

శా. నీ సంతానము రామశాస్త్రి మృతినందెన్ బాముకాటంది; య
మ్మా! సాధ్వీమణి! జీవితేశ్వరుఁడు, చింతాంభోధి నిర్మగ్నుఁడై
గాసింజెందుచు నున్నవాఁ డిపుడు నీకల్యాణపుంబాద వి
న్యాస శ్రీకెడమైన గేహమున నానందంబు పెంపారునే?

కం. అమ్మా! నాయన యని ల
క్ష్మమ్మా! నీ మనుమరాండ్రు మనుమ లకట! జే
జెమ్మం దాతను బిలిచెద
రమ్ములుగద మాకు వారి యాలాపంబుల్

ఉ. వేంకటరామశాస్త్రి పృథివిం బెడవాసిన యంతనే, గుణా
లంకృతయైన మేటి ధనలక్ష్మి యనందగు నర్సమాంబ! దే
వాంక మలంకరించె, విభవాంశు పరంపర నాట్యమాడు, మీ
పొంకపు వంశమంతయు దమోజలధిన్ మునిగెన్ బతివ్రతా!

ఆ.వె. రామశాస్త్రి నీదు రత్నాల తొలిచూలి
తనయుపేర మేటి ధర్మశాల
స్థాపనం బొనర్చి తనిసె నీదయితుండు
తెరచె విక్రమాఖ్య దేవవర్మ!

సీ. మాయమైపోయె నీ మధురాంక పీఠాన గోమున బెరిగిన రామశాస్త్రి
కన్నీటితో పూజ గైకొనుచున్నారు యిలువేలుపులు నీవు గొలుచువారు
తలిలేని బిడ్డలంబలె కుందుచున్నది సతము నీదగు భుజిష్యాజనంబు
ఆశించు నేఁడు నీ యమృత హస్తాహారమారగించిన తొంటి యతిథికోటి

తే.గీ. ఏండ్లు గడచినగాని ప్రాణేశు నెడద
మెరయుచున్నది నేడు నీమీది మరలు;
యిపుడు పెనుగొండవాసు లూహించుచుందు
రాధునిక కన్యకాంబ వంచాదిలక్ష్మి

కం. శ్రీరంగనాయకులు నీ
గారాల సుతుండు గాంచె ఘనతరవంశాం
కూరముల, నాదిలక్ష్మిన్
వీర శ్రీరాఘవాఖ్యు విశ్రుతమతులన్

కం. నరసింహమూర్తి భూమీ
శ్వరునకు దత్తుండు; రామశాస్త్రి మరణమ
న్నరఘాతమున గతించెన్
మరునాఁ డర్ధాంగి, భువన మాన్యాశయయై

కం. బందరుపురిలో సత్కవి
బృందమును దవించి కొడుకు పెండ్లి సలిపె, నీ
యందాల విభుడు లక్ష్మయ
కుందగు రాజన్యవరుడు క్షోణిం గలడే!

కం. చెక్కాన్వవాయమునకే
దక్కె న్నీసుతుల బంధుతాగౌరవంపుం
బుక్కాయికీర్తి సౌరభ
మక్కా! శ్రీయాదిలక్ష్మి! ఆంధ్రవధూటీ!

మ. ధృతిమంతుల్ పదివేవురుం దగరు సాధ్వీ! లక్ష్మయాభిఖ్య భూ
పతితో; నీవెడబాసి నంతటనె, సంప్రాప్తించెనెన్నే సుఖ
క్షతముల్, గష్టములన్నియుం గెలిచి, భాషాపూజ గావించి య
ద్భుత దివ్యధ్వజమెత్తి నీదు పతి సంతోషింపు మాంధ్రాంగనా!

సీ. ప్రకృతంబునను మూరరాయర గండఁడై వర్ధిల్లుచున్నాఁడు ప్రాణవిభుఁడు
కవిదిగ్గజములు శృంగారించుచున్నవి జవ్వాదివారి యస్థానవాటి
దీవించెడిం గళాదేవతాకోటి నీ వలపులరాయని వంగడమును
కోరుచున్నది దివ్యగోదావరీదేవి జవ్వాదిపతికి శాశ్వతజయంబు

తే.గీ. ప్రకృతి సర్వంబు నీ మనోవల్లభునకు
నంజలి ఘటించుచున్నదో యాదిలక్ష్మి
నీ వియోగాగ్ని చల్లారిపోవలేదు
గణ్యవుగదమ్మ వీరరాఘవ కుమారి!

# కన్నతల్లి

తే.గీ. కనులలోఁ బుత్రులము మేము గదలుచుండఁ
దనువెఱుంగక కన్ను గూర్కినది లేదు
చిక్కఁజీఁకటిఁ గుంకుడు చెట్లనీడ
నిదురబట్టినదా తల్లి! నేడు నీకు

శా. ఇల్లున్ వాకిలి లేనిదానివలె, నేడీ శాకినీ ఢాకినుల్
బిల్లల్ సేయు శ్మశానభూములను భ్రాపింపంగనేలా? జగం
బెల్లన్ జీఁకటిముద్దయై పోడమె తల్లీ! నీ వియోగంబునన్
జిల్లుల్ వడ్డది మానసం బుబికి వచ్చెన్ వేదనానీరధుల్

ఉ. నేనును తమ్ముడున్ గలసి నీవు పరున్న సమాధిపెట్టియన్
బూని భుజాన దాల్చితిమి పున్నెము మూటవహించులీల, నీ
మానసమోర్చునా జనని! మాకు నొకించుక భారమైన, నం
భోనిధులెన్ని పెల్లగసి మ్రోసినవో మముఁగన్న కడ్పునన్

ఉ. ఒంటిగనుందువా యిచట? యూరికిబొమ్మని యాజ్ఞయిత్తువా?
కుంటుచుఁగఱ్ఱతో నెదురుకో లొనరించుచు ముద్దులాడు, నీ
వింటను లేక యున్న సుఖమెక్కడిదే మముగన్నతల్లి! కౌ
గింట నమర్చి మేను పులకింపఁగ దీవెనలిచ్చి పంపవో!

చం. నలుబదియేండ్లు దాటినవి నాకిపుడున్ ననుముద్దులాడు, ము
ద్దులజననీ! భవన్మధుర దుగ్ధము రక్తము రంగరించి, యు
గ్గులనిడినావు, నీహృదయ గోళములోపల నేనుఁ దమ్ముఁడున్
మెలగని తావులేదు గణనీయము నీజననీత్వ మువ్వరన్

తే.గీ. కొడుకులను మమ్ము వాసాలకులను జేసి
మురిసికొని చంద్రశిలలీల గరఁగినావు
పుణ్యములతల్లి! నీపాలపుష్టికతన
కవనబాలిక నాజిహ్వ నవతరించె

మ. తరుగింతేనియు లేని నీమహిత పుత్రప్రేమ, యేతల్లికిన్
బురమాయించి త్యజించి పోయితివి మమ్మున్నీశరీరంబుతో
మరణాంతంబున జన్మమే కలిగినన్ మాతల్లి! నీకడ్పునన్
మరలన్‌బుట్టెద వేయిజన్మములకున్ దమ్ముండు వెంటాడఁగన్

మ. నిరుడీనాటికి గల్గునీమహిత సాన్నిధ్యంబు నేఁడక్కటా!
మరుగై, నీవుపరుండుమంచమొకటే మాకిందుబ్రత్యక్షమై
పురికొల్పున్ బరితాపవహ్ని ననయంబున్ గర్భదేశంబునన్,
దిరిపెంబెత్తిన జూపువా రెవరు? ధాత్రిన్నీశుభాకారమున్.

సీ. ఎనుబదేడులవయస్సున దర్పితంబైన, నీ పెద్దతలకు మాణిక్యపూజ
జీవితేశుఁడు మన్నుజేయు నీ దివ్య మంగళసూత్రమునకు నిక్కంపువినుతి
అమ్మలకాదర్శమై ఆలుగరఁచు నీమాతృత్వమునకు నమశ్శతంబు
బలగంబుపూల పూజలఁదెల్లవాటిన, నీదీర్ఘనిద్రకు నీలిగొడుగు

తే.గీ. నిన్నుఁదమిమీఱ తొమ్మున నిలుపుకొన్న
నీసమాధికి వేడికన్నీటిపూత
కొడుకుల సుఖంబునకు మేను కొల్లబెట్టు
జీర్ణమూర్తికి నెత్తురు చిలుకరింపు

తే.గీ. నిత్యవిశ్రాంతి నానందనిలయమందు
దిరుగుచున్నావుగాఁబోలు దిగులు లేక
సర్వసంసారబాధావిషజ్వరమున
కౌషధంబైన మరణంబు నభినుతింతు

## అశ్రుపూజ

ఆ.వె. నీవు లేనినాఁడు నేనుద్భవించితి
నీవుకల్గునాఁడు నేను లేను
నాల్గువందలేండ్లు నాకు నీ కెడమయ్యె
నెట్లుజూతునిన్ను కృష్ణరాయ

తే.గీ. నీవుగోమునఁబెంచి మన్నించినట్టి
తెలుఁగుశిల్పము నిన్ను చిత్రింపఁగలదు
పెద్దనాదుల కవనంపు ముద్దియలకు
సుకవిరాజన్య! నీ కవళికలు గలవు

తే.గీ. వేడికన్నీటితో నీదు విజయనగర
శిథిల భూములఁబడి పూజజేసినాను
తుంగభద్రానదీ పుణ్యతోయములను
క్రుంకులిడినాడ వెచ్చని గుండెతోడ

ఆ.వె. తొల్లినిన్నుగన్న తుంగభద్రానది
బ్రదికియున్నదిపుడు పార్థివేంద్ర
నేటి తుంగభద్ర నిన్నెఱుంగనియట్లు
నడచుచుండె నంగనాచివోలి

చం. దరిసెనమిచ్చె నీసతులతామరమేడ, కడానివన్నెలన్
దురకల యుక్కుసమ్మెటల దుండగముల్ బ్రకటించుగాయపుం
గుఱుతులతోడ, కృష్ణనృపకుంజర! బావురుమంచుఁదోచుకుం
జరముల శాల, లారని విషాదమురేచె హృదంబుజంబునన్

సీ. తలవంచలేదు విఠ్ఠలరాయదేవుఁడు పటుశతాబ్దాభీల భారమునకు
నవసిపోలేదు సాసువుగణేశునిబొజ్జ బహుకాల దీర్ఘోపవాసములకు
తఱిగిపోలే దుగ్ర నరసింహమూర్తికిఁ జక్షుర్ద్వయమున వెచ్చందనంబు
దసిలి పోలేదు కోదండరామస్వామి తనువులో బిగువు కుందనపుఁదళుకు

తే.గీ. జీవకళ దప్పలేదాంధ్ర శిల్పమునకు
విజయనగరాన రత్నాల విపణివీథిఁ
గృష్ణరాయేంద్ర నీవజ్రగేహసీమఁ
బురుఁగుమెదలదు పొగరాజుపోల్కిలేదు

# పశ్చాత్తాపము

శా. నాదేశంబు సమస్త మానవ సమానత్వంబు గుర్తించునో
లేదో, సూర్యుని పుట్టినింటి దెస నోలిన్ సుప్రభాతోజ్వల
శ్రీ దైవాఱునో! భావదాస్యమునఁ బ్రాచీనాంధకారంబులో
నీదంబూనునొ! భావి భారతరథం బే మార్గమున్ ద్రొక్కునో

సీ. పగవాని మదపుటేనుఁగు దంతములు దాకి కదలిపోయినది నా కంచుకోట
చిరకాల దాస్యంపు టిఱుకు పంజరమున గ్రుగ్గిపోయినది నా మగతనంబు
అన్యభాషా మారుతాఘాతమున జేసి వన్నెదగ్గినది నా వాఙ్మయంబు
కుల పిశాచమ్ముల కుమ్ములాటలలోన గ్రుక్కిపోయినది నా సుప్రతిష్ఠ

తే.గీ. సీమదేశానఁ జదివివచ్చెద నటంచు
చేతిలోఁ జేయివైచి వచించిపోయి
మరలిరాదాయె నాదు సంపద్విభూతి
కట్టువడ్డది నా దొడ్డ కాపురంబు

శా. ఆ రాటాల కుటీరమధ్యమున నధ్యాసీనుఁడై యున్న గాం
ధీ రాజర్షిదరస్మితం బభయ సందేశంబులందించి, నీ
వీరత్వం బుపసంహరింపుమని నేర్పెన్ బ్రేమసిద్ధాంత మి
ట్లూరింపంబడి కట్టుకొందు నిపుడెన్నో మేడ లభ్రంబునన్

కం. పదుచుం బిల్లల ముసలికి
ముడిబెట్టితి, పసుపుఁ గుంకుములకు న్వెలియై
గడియించిన నా పాపము
వదువున నిపు డా యనాథ ప్రత్యక్షమగున్

మ. ఇపుడస్పృశ్యత బాపుకోఁ దలతుగానీ, నమ్మ రీపేద లీ
యుపకారుల్ గడగొట్టు తమ్ములది నాయుల్లంబు గారించి న
న్నపహాస్యంబుల పాలుజేసెడిని, మర్త్య స్పర్శ నెగ్గించు నా
కృపణత్వంబును సారమున్ దెలిసిపోయెన్ దేశదేశాలకున్

# శిల్పి

ఆ.వె. పదియు నాఱుమంచు పలకలొక్కొక్కటి
కుదురుకొన్న చంద్రగోళమందు
చెవులపిల్లి బొమ్మఁ జిత్రించినాఁడదే
ఆకసంబునందు నాది శిల్పి

ఆ.వె. ఇంద్రధనువులోని యేడువన్నెల శోభ
నెమిలిపింఛియమున నిలిపినాఁడు
భూ నభోంతరాళములఁ దాండవించెడు
వాని కుంచె మనకు గానరాదు

ఆ.వె. కన్నుముక్కునోరుఁ గడుపును గాయంబు
జెక్కినాఁడు నల్లచీమలోనఁ
దలఁచిచూడవాని యులియెంత చిన్నదో!
యెంత సున్నితములొ! మృదుకరములు

ఆ.వె. ఎండుపుల్లలొండు రెండెట్లుసంధించి
యూపిరెంతలోన నూదినాఁడొ
గొల్లభామయగుచు కులుకుచున్నది
ఇంతకన్న శిల్ప మెందుగలదు?

ఆ.వె. వట్టికెంపురంగు పడమట కుంభించి
యింపుగొలుపుచుండు హృదయములకు
సర్వ లలితకళలు సవరింపజాలని
జీవశక్తి యతని చేతగలదు

ఆ.వె. చందమామ బేడిసకు శరీరముమీద
వెండినీరు చిలికి విడిచినాఁడు
దానిచక్కఁదనము దానియొయ్యారంబు
హాయిఁగూర్చుఁ దర్శనీయమగుచు

ఆ.వె. ఊహతోడమనసు నుయ్యాలలందుంచి
చింతలెల్లఁబాపి చికిలిసేయు
సహజ కళలకున్న సామర్థ్యమట్టిది
పలుకనేల, పట్టువడవు కృషికి

# ధర్మకిరీటము

మ. నను నీవంటక కంటగించుకొనుచున్నా వన్నచో నార ము
గ్గినపండైన సబర్మతీ తబిసి, మూకీభావముంబూని, భో
జనమున్ ముట్టఁడు, సర్వలోకము తమ స్సంఛన్నమై, దద్దరి
ల్లును హిందూసుత, ముందువెన్కలు సమాలోచింపు మింపారగన్

చం. వడికిననూలుపోగునఁ బ్రపంచపుటేన్గును గట్టి, ఆజ్ఞలో
నడపుమహానుభావుఁడశనంబును మాని విరోధిగుండెలో
పిడుగులుగుప్పువాఁ డమృతబిందువులన్ దనబోసినోట జి
మ్మెడు ప్రతిలేనివక్త, ప్రణమిల్లుము గాంధి పదాలదాపునన్

సీ. శబ్దగ్రహణయంత్ర సమితి నబ్ధులుదాటి యూరేగినది వీని సారవాక్కు
అంటరాని తనంపు టసుర కుత్తుకనొక్కి సమయించినది వీని జాలిగుండె
సత్యాగ్రహప్రవాసమున దిమ్మరవోయి కడముట్టినది వీని కాయపుష్టి
సార్వభౌముని విందు సమయాన జమలేక విహరించినది వీని పిలకజుట్టు

తే.గీ. సాధనముజేసె మహదహింసావ్రతంబు
వానిపాదాల జాతీయ పాదరక్ష
ఆదిమాంధ్రుల మమ్ముల నాదరింప
కరుణజిందెడు వీని వీక్షణయుగంబు

ఉ. ఈ గుజరాతుకోమటి సహింపఁడు పంచమజాతిహింస, నీ
యాగమశాస్త్రబాలికల కాయువుగావలె నన్న స్వేచ్ఛలో
భాగ మొసంగి నీ గృహము బంచకుబిల్వు మరుంధతేయులన్
శ్రీగలభారతీయ; సవరింపుము ధర్మకిరీటమౌదలన్

ఉ. 'చిత్తముదేవరా'యనుచుఁ జెప్పినమాటకు దాటిపోక, నీ
యొత్తిడికేడుకోట్ల జనమోర్చుచునుండె ననాదినుండియున్
బెత్తెడుభూమి లేని నిఱుపేదలమై, యిటు లంటుదోషమన్
గత్తులబోనులోనఁ గలకాలముఁ గ్రుల్లి కృశింపమందువా

## తిక్కయజ్వ

ఉ. మక్కికి మక్కి, మూలమును మారుపుసేయక స్వీయకల్పనా
ఫక్కికిఁ దావొసంగి రసభావ పరంపర నూత్నశోభలన్
గ్రక్క, దెలుంగు భారతము వ్రాసి సరస్వతి నుద్ధరించు మా
తిక్కనమంత్రి మందను నుతింపని జిహ్వ నిరర్థకంబగున్

శా. ఏఱాప్రెగ్గడగాదు, నన్నకవిగా, దిం కెవ్వరుంగాదు, నీ
సారప్రజ్ఞ యనన్యసాధ్యము, కళాసౌరభ్య సంపత్తిచే
పూరాపడ్డది తెల్గు శారద, షరాబుల్ లేరు నీ నేర్పు బం
గారంబున్ వెలగట్టిచెప్ప, కవిశక్రా! తిక్కయజ్వప్రభూ!

ఉ. శ్రీనిధియైన యమ్మనుమసిద్ధి బహూకృతులంది నీదు వా
గ్ధేనువు పిండిపోయినది తీయని మేలిపయస్సు, నేడు పెం
పూను తెలుంగునాళముల కూపిరివోసిన నీదు భారతం
బీనెడు నేటి కుజ్వలదహీన చమత్కృతి రత్నదీధితుల్

మ. కలమున్ ఖడ్గముబట్టు వీరుడవు, నీ కావ్యప్రపంచంబు లో
పల బ్రహ్మాండము నల్లపూసయయి కన్పట్టున్, మనుష్య ప్రవృ
త్తులు నిన్నుం బలె నాకళించెడు సమర్థు ల్లేరు, నీ పాద ము
ద్రలచే బోల్చు యశస్సు సింహపురికే దక్కెన్, గవిగ్రామణీ!

శా. అల్లుండై నిను మామగారనుచు నాహ్వానించు రాజన్యుడున్,
నెల్లూరన్ నెలకొన్న దేవుడును, నీ నేస్తంబునన్ గీరితిం
గొల్లంగొట్టిరి తెల్గుదేశమునకున్ గొప్పందనంబబ్బె నీ
వలన్, నీ కవితాచరిత్రకు నమోవాకంబు విద్వత్పవీ!

సీ. తెనుగుభాషా లోకమును శిరస్సునఁబూని సడిసన్న కుండలీంద్రుడవు నీవు
నృపతిగోల్పడియున్న నెల్లూరిరాజ్యంబు మరలదెచ్చిన మంత్రిమణివి నీవు
భావచిత్రములు కుప్పలువోసి పఠితృలోకమునేలు చిత్రలేఖకుడ వీవు
హరిహరాదులను దీర్ఘాయుష్కులంజేయు కవనమల్లెడు సృష్టికర్త వీవు

తే.గీ. దేవభాషకు రవ్వంతదీసిపోని
సభ్యతాస్ఫూర్తి తెలుఁగుభాషకును గూర్చి
గడనకెక్కిన మాతృభక్తుడవు నీవు
ధ్యేయుఁడవు మాకు చక్కని తిక్కమంత్రి!

## తెలుఁగు వెలుఁగు

మ. జననంబందె నపూర్వవైఖరులతో, సంగీతసాహిత్యమం
డన! నీ తెల్గుమిటారి చెన్నపురివీటన్ గజ్జెమ్రోయించుచున్
దనువుప్పొంగఁ బురాతనాంధ్రవిభవోద్యానంబు రేకెత్త, మో
హనగానంబుల నాలపింపగదవయ్యా! ఆంధ్రయోధాగ్రణీ!

మ. ఒకనాఁడాంధ్రునికత్తి, శాత్రవ బలవ్యూహాలపై రక్తనా
టకమున్ సల్పుట విస్మరింపకుము, గాఢంబైన పాశ్చాత్యశో
భకు నీవిప్పుడు లోభివైతివి, ప్రదీప్తంబైన నీ ప్రజ్ఞనూ
రకపోనీక సముద్ధరింపుకొను మాంధ్రా! వీరయోధాగ్రణీ!

శా బోళావాఁడవుగాన నీదు విభవంబున్ సత్కళామర్మముల్
జాలాభాగము కొల్లబెట్టితివి, నీశాస్త్ర ప్రపంచంబులో
మేలెల్లన్ గబళించినారు పరభూమీశాగ్రణుల్, నేటికిన్
బోలేదేమియు దిద్దుకొమ్ము బలగంబున్ స్వీయవిజ్ఞానమున్

సీ. తలికోటయుద్ధాన నళియరామునివల్ల ప్రిదిలిపోయినది నీ వీరదట్టి
మాయనాయకురాలి మారాముడులచేత శమియించె నీ బాలచంద్రరేఖ
బుద్ధిమాలిన చిన్నిపొరపాటు కతమున వితమయ్యె నీ కొండవీటిపటిమ
ఉత్సాహయుతమైన యుడుకునెత్తురులేక ప్రాప్తింపలేదు రాష్ట్రధ్వజంబు

తే.గీ. పరువుదూలిన నీ యనాదరణకతన
మేటి నీ భాషపొలిమేర దాటలేదు
పరుల విజ్ఞానమునకు సంబరముపడక
కడగి యొత్తుము నీ వీర కాహళంబు

సీ. చీనాపెగోడాల సిగమీది పుష్పమై పొడమె, నీఱాతి చెక్కడపుచెణుకు
అరవపాటకుల తంబురకు ప్రాణమువోసి కులికె, నీ చిన్నారి తెలుఁగు బాణి
హిమవద్గిరులదాక జృంభించి పగవాని తరిమివెన్నాడె, నీ కఱకు టలుగు
మొగలురాజుల సభాభూముల నూరేగె నీ జగన్నాథ పండితునిపలుకు

తే.గీ. ఎందుఁజూచిన నీయశస్యందనములు
నడచిపోయిన జాడ లిప్పుడును గలవు
దిక్తటంబులమరల నెత్తింపవోయి
తెలుగుమన్నీల పసుపునిగ్గులపతాక

మ. తెలుగుం గేసరులున్, మహర్షులును, గాంధీశాంతి సేనాపతుల్
గల రాంధ్రప్రముఖుల్ త్వదీయులు భుజస్కంధంబునందింత్రు, నీ
అలఘుశ్రేయము లీనమోచినవి రాష్ట్రార్థంబు యత్నించి నీ
బలముం గొంచియ మాకళించుకొనరా! ప్రఖ్యాత వీరాంధ్రుడా!

## గోవు

మ. పెరుగుంబాలు ఫలించుచున్ నిరతమున్ విశ్వంబుఁబోషించు, ని
న్న అవం గుత్తుకగోయు దాయలకు ద్రవ్యాశన్ సమర్పించు, ము
ష్కరులన్ గొమ్ముల జిమ్మవేమిటికి? స్వచ్ఛంబైన నీ వెన్నతో
విరచింపం బడెనేమొ నీమనసు దేవీ! ఆవు ముత్తైదువా!

మ. నికటక్షోణుల జెంగనాల నిడునా నీకూర్మి బిడ్డండు, కా
టుక కన్నుల్ గల కోడెగాడ వల దుష్టుల్ నిన్ను పాలార్చు చే
తకుఁ జింతింపడు కోపగింపడు, విచిత్రంబమ్మ! మీమాతృ పు
త్రక సంబంధము, లోకపావన చరిత్రా! ధేనుమాణిక్యమా!

మ. అడవింబెబ్బులి నీ తనూరుధిర మాహారించునే కాని, మీ
గడయు న్నీ నవనీతమున్ గుడువ నాకాంక్షింప దెన్నండు, నీ
విడు సర్వస్వము నారగించుచు కృపాహీనమ్ములై వార్ధకం
బడరందూలు నినున్ వధించెడు మనుష్య వ్యాఘ్రముల్ క్రూరముల్

మ. అసువుల్ నిల్పెదవమ్మ! బిడ్డలకు క్షీరాహారమర్పించి, నీ
నిసువుల్ పస్తులుసేయ, నీ ఋణమునన్ దిక్చక్రముల్ బ్రుంగెడిన్
బసరాలన్ రతనంబవైన నిను సన్మానింపఁ బండించు ని
ప్పసుపుం గుంకుమ చాలునా గుణకదంబా! ధేనుకాంతామణీ

ఉ. గజ్జెలు మువ్వలున్ జిగురు కంఠమునం జెలువార గన్నులన్
గజ్జలరేఖ ముద్దులొలుకన్ ముకు పచ్చల కోడెదూడ, నీ
పజ్జ నటింప నీ వెవని పంచ వసింతువో, వాని యింట సం
పజ్జలజాతలోచన నివాసము సేయు నిజంబు నైచికీ!

ఆ.వె. కవణ మాహరించి, కమ్మని దుగ్ధంబు
భువనముల కొసంగు పూజ్యురాలు
చంపువాని నమ్మి చనుదెంచు వెఱ్ఱిది
ఆవుతల్లి! యఘము లడచుగాక

సీ. అనుఁగు లేదూడ యంభారావ మాలించి పొదుగున దుగ్ధంబు పొంగిపోవ,
గరువులలోఁ బచ్చిగడ్డి మేయుటమాని తత్తరంబున నింటి దారిబట్టి,
కట్టుగంబంబున నట్టిట్టు మల్లాడు కన్నపుత్రుని యంతికమున నిలిచి,
శిరము చుంబించి హెచ్చిన మోహమున జిన్నికొడుకు గుఱ్ఱకు చన్ను గుడుపుకొనుచు,

తే.గీ. అఱ్ఱునాకెడు నినుగాంచి యాగ్రహించి,
బడియచేబూని దండించు స్వామినరసి,
కలతఁజెందక తొలగి యవ్వలకుఁబోవు
నీదు సహనంబు నాగుండె నీరుసేయు

మ. కుదురుంగొమ్ములు, సోగకన్నుల బెడంగున్, స్వచ్ఛమైశారదాం
బుదముంబోలు శరీరమున్, బొదుగు పెంపున్గల్గి, గర్వంబుగా
పదముల్ మెట్టుచు, రాజసంబు తులకింపన్ బొల్చు, నీయందమే
మదిరాక్షీమణికున్నదో తెలుపుమమ్మా! ధేనురంభాంగనా!

సీ. నీ పేడకలయంపి నీటమజ్జనమాడి కలకలలాడని నిలయమేది?
పాపభంజకమైన నీ పంచితంబంటి సంశుద్ధినందని స్థానమేది?
ప్రియమార నీ పాలు పెరుగు లాహారించి బొజ్జబెంచని భోగపురుషుఁడేడి?
నీ వెన్నగాచిన నేతి సంగతిగూడి రుచినేర్చుకొనకున్న పచనమేది?

తే.గీ. నీ కుమారులు మనుమలు నిన్ననేడు
చెమటలూడ్చుని బెత్తెడు క్షేత్రమేది?
కటాకటా! తల్లి! నీరక్త కర్దమమున
నోలలాడని రవ్వంత నేలయేది?

తే.గీ. కత్తిచేఁబూని నీతల గత్తిరింప
నికటమున నిల్చియున్న హంతకునిజూచి
చెప్పుకొన నోరులేని నీచిత్తమందు
నెన్ని భావాలు చుట్టలై తన్నుకొనునొ!

తే.గీ. నిద్దపుం బెద్ద క్రొమ్మంచు ముద్దబోలి
ముద్దులొలికించు నీదివ్య మూర్తియందు
ఆర్త శిశుపోషకంబైన యభయముద్ర
ప్రతిఫలించెడు నమ్మ విస్పష్టముగను

చం. వెలగలయట్టి నీరుధిర బిందువులెన్ని వ్యయించి పాలుగా
జిలికెదవోకదా? మొదవు చేడియ! నీబలమెల్ల యిమ్మను
ష్యులకిడి, వృద్ధురాలవయి స్రుక్కిననీకు గటారిపోటులా
ఫలితము? భారతీయుని కృపా పరతంత్రత గొడ్డువోయెనే?

ఉ. హాళినిగూర్చు కొండొక మహాకవి కబ్బమువోలి, నిండు
చూలాలితనంబుతో గరువులందు విహారముసేయు నీ సము
ద్వేలశుభస్వరూప మరవింద నివాసిని కాటపట్టు, నీ
కాలిడునేలకీడగునె? కాశికయున్, గయయున్, బ్రయాగయున్

తే.గీ. కానవచ్చిన, ప్రత్యక్షదైవమట్లు
సత్కరించెదరొక ప్రయోజనముగోరి
నీదు నడుమంతరపు జావు నిలిపివేయఁ
దొడయ రొక్కరు, పరమఘాతుకులు నరులు

తే.గీ. 'ఆత్మవత్సర్వభూతాని' యన్ననుడువు
వల్లెవేయుదు రది నోటి జొల్లువోవ
దీనియాథార్థ్య మెపుడేని తేల్చిచెప్ప
యోగ్యురాలవు నీవు నోరుండునెడల

శా. నీకున్నెత్తురు మాంసమున్నటులగానీ జీవమున్నట్లుగా
నీ కాసంత తలంతురో తలపరో యీ మాంసభుక్కుల్, నరుల్,
రాకాసుల్, నిను జేతనా రహిత యంత్రంబట్లు గావింతురో
గోకల్యాణి! శిలోచ్చయంబులు కరంగున్ నీయభాగ్యాప్తికిన్

కం. తిట్టిన దిట్టవు కొట్టిన
గొట్టవు యజమానిమాటకుం దిరుగ వహో!
గుట్టుగల సతులపాపట
బొట్టువు నీ సహనగుణ మపూర్వంబు గవీ!

కం. నీ గంగడోలు నందము
నీ గుండ్రని కొమ్ముతీరు నీ నడబెడగున్
వ్రేగైనపొదుగు కుదురున్
నీ గిట్టలసొగసు ప్రేక్షణీయములు గదా?

కం. ఇచ్చెదవుగాని క్రమ్మర
బుచ్చుకొనవు ప్రతిఫలంబు పుడిసెడునీరున్
బచ్చిక దిని జీవింతువు
సచ్చరితవు నిన్నువంటి జంతువు గలదే?

## వ్యాప్తి

కం. మన సంస్కృతి, మన సభ్యత
మన విజ్ఞానంబు బహుళమర్యాదలతో
వననిధులు దాటియున్నది
తెనుఁగుం గవళికలు లేని దేశముగలదే!

మ. అటుజావా, యిటు సింహళంబువఱకున్ వ్యాపించి, భీమంబుగా
నటకాయించు శతాబ్దమాలికలచే నట్టిట్టుగా, కుగ్ర సం
కటముల్ దాటి, క్షణక్షణోజ్వల కళాకాంతుల్ జలాయించు, వి
స్ఫుట దివ్యాంధ్ర విశాల నాగరతకున్ జోహారు గావించెదన్

శా. ఊరేగెన్ దొలి రెడ్డిరాజుల జగాయొడ్డోలగంబందు బం
గారుందేరుల గొండవీటి దెలుఁగుం గల్యాణి, శ్రీనాథుఁడ
య్యెట్టాప్రెగ్గడయున్ మెఱుంగులిడగా, యేభాషకున్ లేని యొ
య్యారంబున్ గులుకు న్నడల్గలవు సత్యం బాంధ్రవాగ్దేవికిన్

## మేఘుఁడు

ఉ. ఏనుఁగుపిల్లమాదిరి మహీధరశృంగ మలంకరించి, నె
మ్మే నిసుమంతలో బెనిచి, మింటిని కౌఁగిటఁబట్టి, బృంహిత
ధ్వానము లాచరించు నవవర్ష పయోధర! భేకసంఘముల్
గానము చేయుచున్నవి, జగంబున నింపుము కుంభవర్షముల్

ఉ. మద్దెలకాఁడు నీ హృదయమధ్యమునన్ నివసింపకున్న నీ
గద్దరి గర్జనధ్వనులు గల్గుట కేమికతంబు? చెల్వమున్
ముద్దులు మూటకట్టు నగుమోము తళుక్కునజూపి డాగు న
మ్ముద్దియలెల్ల నీ యనుఁగు పుత్రికలే కదరా? వలాహకా!

# గుసగుసలు

కం. ఇరువురు క్రైస్తవ భక్తులు
నిరతము వేదాంతఘన వనీవనములలో,
దిరిగెడువా రొకపల్లియఁ
బరమ రహస్యములు కొన్ని ప్రకటించిరిటుల్

ఆ.వె. బాట చూపగలము స్వర్గలోకమునకు
ప్రేమధనము పంచిపెట్టగలము
మా మతంబు నమ్మి మా వెంటబడి రండు
మీకు ముక్తిగల్గు లోకులార!

కం. సోదరులము మనమందర
మీ దేహము నీటిబుడక, యెల్లర మొకటే
లేదు కులంబంతరమని
వేదగ్రంథంబుచదివి పృథుకంతములన్

కం. శ్రుతికిన్, గాత్రంబునకున్
జతపడనివి, ఛందమునకు జతపడనివి, వా
రతికించుకొన్న పాటలు
ముతకవి గానంబుచేసి ముదితాశయులై

కం. పాపులు వీరెల్లరు నీ
ప్రాపకము లభింపఁజేయవలయునని మన
స్తాపమున కనులుమోడిచి
పాపము గురుయుగళి మ్రొక్కె భగవంతునకున్

ఆ.వె. కొంతయర్థమగుచు కొంతయర్థముగాక
వారిబోధ పల్లెటూరిప్రజకు
తాత వేసికొన్న తాంబూలమును బోలి
యుబుసుపోకకోస ముపకరించె

సీ. మాలక్రీస్తునికన్న మాదిగ క్రీస్తుఁడే యరవీసెగొప్పవాఁడనియె నొకఁడు
మాట భక్తియె కాని మనసులోపలభక్తి బూటకంబని లేచి పోయెనొకఁడు
కరణాల చదువెల్ల కడముట్ట జదివినారని మనంబున మెచ్చుకొనియె నొకఁడు
మాలమాదిగలకు మతమున్నదాయంచు జాతివిద్వేషంబు జరిపె నొకఁడు

ఆ.వె. రామసామికన్న సామిలేడనుకొని
మనసు గట్టిజేసికొనియె నొకఁడు
చదువుకొన్నమాత్ర జాతి రాగలుగునా
యనుచు కంటగించుకొనియె నొకఁడు

తే.గీ. ఈ సువర్తమాన మిచ్చోటపండించి
యేసు మనకు శుభము లీయగలఁడు
పోయివత్తమనుచు బోధకు లిద్దరు
బోయి రెవరి గూడెములకు వారు

తే.గీ. మాలబోధకుఁడెన్నడో మాదిగింట
గుడిచినాడని య మ్మాలగూడెమునకు
నెడముగానుంచి దాహంబు నీయరనుచు
గుసగుసలుగల్గు నిది తేల్చుకొనుటలెస్స

## మనలో మాట

సీ. నిలిపిరే తెలుఁగు మన్నీలు కొండల మీఁద జాతీయ విజయ రాష్ట్రధ్వజంబు
మాన్పిరే సుకవి సమ్రాణ్మత్తగజముల దరిలేని యాచనాదైన్యవృత్తి
కొమరారునే దివ్య సుమ గుళుచ్ఛములచే నాంధ్రవాఙ్మయ మహోద్యానవాటి
పునరుద్ధరించిరే ముంటాజమహలుకు పేరుదెచ్చిన శిల్పకారిగరిమ

ఆ.వె. విజయనగర రాజవీధి దిగ్గజములు
మోసి చన్నకవన భువనరథము
నుజ్వలముగ మరలనూరేగ జేసిరే
మాన్యులార! రిత్తమహములేల?

చం. కినిసి చనెన్ విశాఖపురికిన్ మనవిశ్వకళాలయంబు, రే
చిన యల దత్తమండలపు జిక్కుల నుక్కిరిబిక్కిరై, జగ
జ్జనవినుత ప్రతాపముఖసాహసశక్తులుగల్గు నాంధ్ర నం
దనునకు దాపురించెనె క్షణక్షణదర్ప మనైకమత్యమున్

మ. సరదాగాదుగదా? తెలుంగులకు భాషావేషవైముఖ్య, మీ
వరకే ద్రావిడభూమి బ్రహ్మరథమున్ బట్టెన్ కవిశ్రేణికిన్,
వెరవుల్ సూపె విగాయక ప్రతతికిన్, నీయొక్క పద్యంబుతో
సరిరా వెల్ల కవిత్వముల్ తెలుఁగువత్సా! ఆంజనేయప్రభూ!

## ఇంటి గుట్టు

తే.గీ. పంచములలోన మాదిగవాఁడ నేను
పంచమీయులలో మాలవాఁ డతండు
ఉభయులము క్రైస్తవమతాన నొదిగినాము
సోదరత గిట్టుబాటు గాలేదు మాకు

ఆ.వె. దేవు డొకడు మాకు దేవళంబులు రెండు
దేశమొకటి మాకు తెగలు రెండు
మాటవరుస కొక్క మతమందుమే కాని
కుల సమస్యవద్ద కుమ్ము దుమ్ము

ఆ.వె. వాని నేను నన్ను వాఁడన్న పడజాల
మితరు లెవ్వరన్న నేమి లేదు
మాకు సంధిసేయు మాటెత్తదనికాని
మతమునేని మేము మానగలము

ఆ.వె. మాల యేసుక్రీస్తు మాదిగలకుగాఁడు
మాదిగేసుక్రీస్తు మాకుగాఁడు
ఒకడు చిలువరించు నొకడు స్నానంబిచ్చు
నిరువురేకమగుట కేదిదారి

ఆ.వె. వాని గుడిసెమీఁద వాలిన కాకి, నా
గుడిసెమీఁద వాలగూడ దెపుడు
కాకులందు మాలకాకి మాదిగకాకి
రూఢిసేయు మా విరోధములను

ఆ.వె. హిందువులనుచూచి యెగతాళి చేసెద
మింటనున్న మురికి కేవగింప
మొరుల తప్పిదంబు లోరుచుకొనలేము
సొంతతప్పుమాకు చురుకులేదు

ఆ.వె. మతములో నొకింత మాటపొత్తేకాని
పొత్తులేదు మాకు పొరుగులేదు
సిగ్గువిడిచి హెచ్చు తగ్గులకోసమై
తన్నుకొంట మాకు తప్పులేదు

ఆ.వె. చదువువల్ల పగలు సర్దుబాటగునంచు
సీమదొరలు చదువు చెప్పినారు
కచ్చేరీలకెక్కి గబ్బు గబ్బైనాము
చదువు మందుగాదు జాతి రుజకు

ఆ.వె. అంటరానితనపు టడుసులో బొరలాడు
పేదవార మండలేదు మాకు,
మా కులాల గొడవ మాకుంచి మీలోన
గలుపుకొనుడు సుగుణ జలధులార

ఆ.వె. మమ్ముజూచి మాదు మాట పొందికజూచి
నడకజూచి యొడ్డు పొడవుచూచి
ఎవరు గొప్పవారొ! ఎవరు తక్కువవారొ!
తేలబలుకుడయ్య! ధీరులార!

## జిజాబాయి

శా. అన్నా! శాత్రవగర్భ భేదనము సేయ న్నిన్ను వెన్నాడి వ
చ్చున్నాతల్లి భవాని! నీకఱకు విచ్చున్ గత్తిపైనుండు, ధా
త్రిన్నాదివ్య పతివ్రతాత్వమున వ్యర్థీభూతమౌగాక, నీ
యన్నన్‌జంపిన వానిదోర్బలము పుత్రా! గెల్పు నీదేసుమీ

సీ. వైరి నెత్తురిబొట్టు వదనాబ్జమున గ్రాల ముదమార తిరిగి వచ్చెదవుగాక
తినిపించెదవుగాక యినుపకత్తులకీవు ముదురు కందనగాయ భోజనంబు
త్రావించెదవుగాక దండి బల్లెములకు పరులక్రొవ్వేడి నెత్తురుల తేనె
కీలించెదవుగాక గెలుపు జెండాపూలు కంచుకోటల మస్తకములమీఁద

తే.గీ. స్వర్గముననుండి యన్న శంభాజినీకుఁ
గుసుమకింజల్క వర్షంబు గురియుగాక
భరత జనయిత్రి, మోద బాష్పములు విడిచి
ప్రేమనినుదెచ్చి నాకు నర్పించుగాక

ఉ. నీయది సింహవాహనము, నీ కరవాలము, శంభురాణి, దీ
ర్ఘాయువు నీకు నా సలిపినట్టి నిరంతర పూజనంబు, నీ
దాయల గర్భ పిండములు ధారుణిగూల్చి నటింపుమన్న! రా
ధేయుఁడవై, కిరీటివయి, దేవనదీతనయుండవై, సుతా!

ఉ. వేడిమి వీడకున్న రిపువీరుని నెత్తురుబొట్లు గ్రక్కు క్రొ
వ్వాడి కటారితో తిరిగివచ్చు కుమారుని జూచి నవ్వు దొ
ల్కాడ జిజా సుమంగళి రయంబున బోయి కవుంగిలించి, ము
ద్దాడి, ముదశ్రుపూరముల నాతనికిన్ దలయంటె నత్తఱిన్

## నేటి కైత

మ. కవితావాహిని చీలి పాయలయి ఆగంబై యథేచ్ఛారతిన్
బ్రవహింపం దొడగెన్ బురాతనపు త్రోవల్పుంతలుం బాడు వ
డ్డవి, ఛందోనియమాది కూలములు భ్రష్టంబయ్యె నీ మందు వే
సవియం దింకునొ! సంగమించునొ! రస స్వర్గీయ పాథోనిధిన్

చం. ముసిరిన భావజాలమును బూడిదలోపలఁ బుంపి, కుత్తుకల్
బిసికి, యగాధ శబ్ద వనవీధులదాచి, కవిత్వమన్నచో
విసిగి, శపించిపోయెదరు, వీనులు శూన్యములై సభాసదుల్
రస మరికట్టు యీ గులకఱాల బిగుంపుల కేమి హేతువో

ఉ. మొత్తముమీఁద నాంధ్రకవి ముఖ్యులు పెట్టిన కట్టుబాట్లలో
నుత్తమ మధ్యమాధమము లున్నవి, వానిని కొద్దిగా మరా
మత్తొనరింపనౌ ననెడు మాటకు నేనును సమ్మతింతు, నీ
బిత్తల తోఁకబీకుడు కవిత్వపు ఫక్కి ననాదరించెదన్

## సుబాసు బోసు

శా. బందీవై, పహరాజవానుల కనుల్ బంధించి, యేరీతిగా
హిందూమాతను వాసి, వాలితి జపాన్ పృధ్విన్ మహావీర! ఖా
మందుల్ సీమదొరల్ తలంచిరి జగన్మాన్య ప్రతాపారణీ!
యెందున్నావు! గతింపలేదు గద తండ్రీ! బోసువీరాగ్రణీ!

ఉ. స్వాగతమిచ్చెనే! పొగరు వట్టిన పొట్టిజపానుభూమి నీ
యాగమనంబుజూచి యవురా! పరరాజుల గడ్డ నీ మహా
త్యాగము నాకళించినది, దైవతశక్తులు గల్గు నస్త్ర శ
స్త్రాగమవేది! చూచి చనవా? యొకమార్నిను గన్నదేశమున్

శా. ఈడుం జోడును లేని నీ వచనవహ్ని జ్వాలచే నెందరో
యాడంగుల్, కరవాల పాణులయి సైన్యాధీశలై లేచి నీ
నీడన్నిల్చిరి! విశ్వవీరుఁడవురా! నేతాజి వీరాగ్రణీ
యేడున్నేడగు లోకముల్ కుమిలిపోయె న్నీ వియోగంబునన్

ఉ. ఆరని నిప్పుముద్దలటు లాస్యబిలంబున నిర్గమించు, నీ
వీరరసోక్తి మాలికలు విశ్వములన్ దహియించునంచు కం
గారయినాడు గాంధిముని, కన్నుల నీరిడుచున్నవాఁడు నే
డో రణరంగభార్గవ! సముజ్వలరత్నము జారిపోవుటన్

శా. ఆసల్ లేవుగదన్న భారతికి నీయాకారమున్ జూచి, నీ
యూసుల్ వీనులవిందుగా వినగ, యెట్లోదారుపుం జెందునో,
ఓ సూర్యప్రతిమానతేజ! దయలేదో! దర్శనంబీయవో!
బోసూ! సద్విజయోస్తు నీ ప్రతిభకున్ పూజ్యప్రతాపాగ్నికిన్

చం. కులుకులకొప్పులో ముడిచి కొన్నది భారతి నీ యశస్సు, నీ
తళుకుల ఖడ్గరాజమును దాల్చి తరించినదన్న జాపనీ
ప్రళయము, తల్లినీకు ఋణపడ్డది, బోసుమహానుభావ, నీ
చెలిమిని చూఱలాడెదు నసీబమరెన్ జపనీయసీమకున్

చం. పరమపదింపలేదు మనబాబు సుబాసనుమాట దిగ్దిగం
తరములమ్రోగుచున్నది యథార్థము కాదుగదా? సుబాసుభా
స్కర! యుదయింపవే భరతఖండము కోటికరాలపూజ నీ
కొరకు తయారొనర్చె కయికొమ్ము పొనర్పుము సింహనాదమున్

శా. కాబూల్‌బాబువలెం దయారయి నిజాగారంబువోనాడి, నీ
వే బైరాగిముఠాలలోగలసి, యేయేకష్టముల్ దాటి, య
క్కాబూల్ భూములు నిర్గమించి జపనీగడ్డం బ్రవేశించితో!
బాబూ! బ్రహ్మకెఱుంగరానియవి నీప్రస్థానిక వ్యూహముల్

సీ. పరుగులెత్తెనుగదా పగవానిగుండెలో ప్రతిలేనివెఱపు గుఱ్ఱపురథాలు
ప్రవహించె బహువీరభరతపుత్రులమేన దసిలిన పూర్వప్రతాపగంగ
పుష్పించె బంగారు పూలరేకుల మీఁద నమరి నీ మధుర నామాక్షరములు
హుంకరించినది దివ్యులు పూలువర్షింప సమరరంగమున నజాదుపౌజు

తే.గీ. యున్నయటులుండి చెరసాల నుత్తరించి
యుగ్రరణరంగమున శంఖమెత్తినిలిచి
మెరసి మొలకెత్తు నీ కోరమీసములకు
వందనసహస్రములు బోసుబాబువీర!

శా. కొండాడె న్నిను దేశదేశములు యుక్కుందున్నయై, నీ యజా
ద్దండెత్తించె స్వతంత్రభారత పవిత్రోచ్చండముల్ జాళువా
జెండాల్, దండి తుషారపర్వత శిరస్సీమన్, పిశంగచ్ఛవుల్
నిండారెన్ నుతి కంది చాపులకు రానేరావు నీపగ్గియల్.

మ. అదిగో! నీవు తయారుచేసిన యగణ్యంబైన సైన్యంబు మా
కొదవెన్ ధైర్యము, వీడిపోయినవి యుక్కున్‌బంధముల్, నేటికె
న్నదికోట్లై తగు నీ సహోదరులకున్ శౌర్యంబు సృష్టించు, నీ
కిదిగో, మా నిజరక్తపూజ రణవేదీ! బోసువీరాగ్రణీ!

## భట్టుమూర్తి

ఉ. అంతము గానరాని బహుళాద్భుత సత్కవితాప్రపంచ మా
వంత చలించునోయను భయంబున రాయలు నిల్పునష్ట ది
గ్దంతులలోన చెప్పుకొనగా దగుశ్లేష కవిత్వచండ భా
స్వంతుడ వీ వహో! సరస భట్టుకవీ! కవితాకళానిధీ!

ఉ. దాటవశంబుగాని కవితా నియమోన్నత భిత్తికల్ నిరా
ఘాటజవంబున న్నెగసి గంతులు వెట్టెడు నీదుశ్లేష వా
గ్ధాటికి పెద్దనాదికవిదంతులు తత్తర మందలేదె, యా
నాటికి నేటికింక నొకనాటికి నీ కెదురేరి సత్కవీ

ఉ. "కాపు కవిత్వమెవ్వరికిఁ గమ్మదనం బగునంచు" నెన్నియో
లోపము లెన్ని నిన్ను సభలో నవమానముసేయు లింగనిన్
గోపముసేయ కింక ననుకొమ్మని చక్కదనాల కబ్బపుం
గాపులు గాచిపోయితివిగా కవితా దివిజద్రుమంబునన్

## నీలిమబ్బులు

ఉ. గాలికి సాగి యుత్తరముగా పయనించెడు నీలిమబ్బు లీ
నేలకు డిగ్గలేదనుచు నింద యొనర్తువు కర్షకోత్తమా!
బేలవు, మాయమబ్బులవి భీరులబాలుర బుగ్గిజేసి బౌ
ద్ధాలయ గర్భముల్ కలచియాడు జపానుల బాంబు క్రొంబొగల్

ఉ. గౌతమ బుద్ధదేవుని మొగంబున నెత్తురుబొట్టులే దహిం
సా తిరుమంత్ర రాజము ప్రచారముచేసిన చోట రక్తమం
దీతలు కొట్టెడిన్ బ్రళయమృత్యువు, దానిభయంకరాట్టహా
సాతత కాంతులే మెఱపులై కనుపట్టెడి నీకు గర్షకా!

ఉ. హేయపు నల్లమందు కయిపెక్కి యొకానొకనాడు తొంటి చీ
నాయువకుండు కట్టుకొనినా దుడివోవని పిచ్చిగోడ, నీ
వాయు విమానదాదుల జపాను తుపాకుల భిన్నభిన్నమై
పోయెడు భిత్తికా శకలముల్ గదరా! పిడుగుం బరంపరల్

## చెలికాడు

కం. చినతనమున నిరువురమును
వినుకొండ పురానగలసి విహరించిన నీ
కనకమయ మధురరూపము
కనులమెలగు మసక మసకగా సవసవగా

మ. కవినై వచ్చితి నీ సమాధికడకున్, గన్పట్టదయ్యెంగదా?
భవదీయామృత రూపధేయము, పరబ్రహ్మమ్మునం దైక్యమై
తివా! సృష్టిం జితియించి పోయితివో? నీదేహంబదే పుష్పమై
యవతారించినదో! తిమోతి! చెలికాడా! మందభాగ్యోదయా!

సీ. ఏ పల్లవంబవై రూపంది ననుచూచి చిరునవ్వుతో సైగ చేసినావొ!
ఏ దివ్యరత్నంబవై దృష్టికందక యెందుండి యారతులెత్తినావొ!
ఏ నాలి గాడ్పులో నిమిడి నాకెదురేగుదెంచి మక్కువ గౌఁగిలించినావొ!
ఏ పుట్టతేనెవై, ఏ చెట్టునందుండి యింపార నాకర్ఘ్యమిచ్చినావొ!

తే.గీ. మాయకూపాంబువులలోన మర్మరించు
కరుణ కిరవైన యలనాటి మరణగాథ
చెలిమిమై యే విహంగ కూజితముతోడ
చెప్పుకొన్నావొ! నాతోడ చెలిమికాడ!

# కృతజ్ఞత

శా. ఏకాలంబున నెట్టిపుట్టువున యందే నోముల న్నోచి న
న్నీకాలంబునఁ గంటివో! యనుఁగు తల్లీ లింగమాంబాసతీ!
నా కామించినవాణి చేసికొను పుణ్యంబెల్ల పండయ్యె, నా
డాకాలన్ ధరియించినాడ బెజవాడన్ గండపెండారమున్

మ. తొడిగెంగాలికి చెళ్ళపిళ్ళకవి ముద్దుం గండపెండారమున్
ముడిచెం గొప్పున నా కళాసతి యశంబున్ బుష్పగుచ్ఛంబుగా
నడచెం గుబ్బపుదండు నా వెనుక. నాంధ్రంబెల్లఁ బొంగారఁగా
జడజన్మంబున నే మహాకవుల పూజల్ సల్పి మెప్పించితో

మ. ఘనతంగన్న పురంధ్రి య క్కనకదుర్గాదేవి సాధింపఁజా
లని విఖ్యాతి గడించుకొన్నయది శ్రీలందేలు బెజ్వాడ ప
త్తన మీనాడు; కవీడ్గజంబులు గజేంద్రస్యందనారూఢులై
తనివింజెందిరి, సభ్యతామకుటమున్ దాల్చెన్ ధరాదేవియున్

శా నాకన్నన్ మొనగాంధ్రు సత్కవివరుల్ నాకన్న విద్యానిధుల్
నాకన్నన్ రుచిగాఁ దెలుంగుకవితల్ గల్పించువా రుండగా
నాకీ బంగరు గండపెండియరమున్ బాదాన గీలించి పె
న్నాకీ నాతల నిల్పినావుగద? బెజ్వాడా! పురగ్రామణీ!

చం. చెళపిళ సత్కవీశుఁడు ప్రసిద్ధుఁడు, వీరశతావధాని యాం
ధ్రుల శుభరక్తనాళముల రూపమునెత్తిన బ్రాహ్మణుండు, నా
పలుకులరాణిపాదమును బంగరుగగ్గెరతో నలంకృతుల్
సలిపె, నికేమి కావలె ప్రశస్తి కవిత్వ కళావధూటికిన్

మ. కళలన్ బోషణసేయు దాతల కలంకారంబు శ్రీబంకరా
ములుపాత్రుండని మెచ్చినారు కవిభూపుల్ నీ యశోలక్ష్మి బి
డ్డలు పాపల్ గలదై రహించెడి కవీడ్గంధేభదానాంబు ధా
రలలో స్నానముచేయు మంచిత చరిత్రా! రాములుగ్రామణీ!

మ. రసికోత్తంసము నర్శిబాబుకవిసారథ్యంబు గావింపఁగా
యసమానంబగు నిమ్మహారథము గమ్యస్థానముం జేరె, య
భ్యసనీయంబులు మీప్రయత్నములు సర్వాంధ్ర క్షమాదేవతా
లసమానంబగు దృష్టి మీ కిడు ననల్ప శ్రీయశోభాగ్యమున్

మ. ఉమరాలీష కవీంద్రనందనుఁడు నయ్యూర్ భూమిపాలుండు, దా
నమునం బేర్గల చల్లపల్లి విభుఁడున్, నా మేటి సన్మానకా
ర్యమునం బాల్గొని నిల్చినారు; విబుధ బ్రహ్మల్ ప్రశంసింప ను
త్తమ గంధద్విపమెక్కితి న్దెలుఁగు కేంద్రంబైన బెజ్వాడలో

శా. పాండిత్యంబునఁ బేరుగన్న కవిరాడ్భాస్వంతలోకంబుచేఁ
గొండాడంబడు మేటి పేదలకు దిక్కున్ మొక్కు వైశ్యాన్వయా
ఖండాలంకరణంబు దాతృమణి విఖ్యాత్యబ్ధినాథుండు, శ్రీ
చుండూర్వేంకటరెడ్డిగారికి నమస్సుల్ దూమె దర్పించెదన్

శా. వాసింగన్న తెలుంగు వైశ్యుల శిఖావజ్రంబులై పోల్చి స
న్యాసిగ్రామణి గాంధి చిత్తమున యం దాసీనులైనారు నా
యీ సన్మానసభా జయప్రదులు సాహిత్యాభిమానుల్, కళా
వాసుల్, శ్రీ బెజవాడ పట్టణపువాస్తవ్యుల్, ప్రశంసార్హులై

శా. ఖుమ్మెక్కున్ బొనరించి నాసభకు నిగ్గుం జగ్గు గల్పించి సా
యమ్మున్ సల్పిన తెల్గుసోదరుల వాగర్థ ప్రసూనంపుదా
మమ్ముల్ గట్టి యలంకరించెదను రామస్వామి శ్రీ చౌదరీం
ద్రమ్మున్ జాస్తికుల ప్రదీపకుని ధర్మజ్ఞున్ బెనర్జ్యాఖ్యునిన్

మ. తెలివిందేటలు చిందగా వెఱచి సందేహించు నా కబ్బపుం
జెలువం జిన్నతనంబునంగని కృపాస్నేహ ప్రసన్నార్ద్ర వా
క్కులచేఁ బ్రౌఢ నొనర్చినట్టి ఘనుమాల్కొండాఖ్య రెడ్డిప్రభున్
దలఁతు న్నతుభయంకరు న్దెలుఁగురత్నంబు న్దయారంభునిన్

కం. శ్రీ సూరిబాబు నటకా
గ్రేసరు బి.యె రాజుగారి శ్రీ బయనకులో
ద్భాసిని రాఘవు దలతును
రాసిక్యాంచితుల సుకవి రాట్కింకరులన్

మ. ఎపుడో పెద్దనగారి పాదమున శ్రీకృష్ణక్షమాజాని స
త్కృపఁ గీలించెఁ బసిండిగగ్గెర జగత్కీర్తి ప్రభూతంబుగా
ఇపు డీ జాషువ తాల్చినాడనఁగ, సాహిత్య ప్రపంచంబులో
తపమే కారణ మీ యభేదమునకున్ దథ్యంబు ముమ్మాటికిన్.

శా. ఈ జాతి ప్రళయంబునం బ్రతుకలే వేసత్కళా దేవతల్
నాజన్మంబు నిరర్థకంబనుచు చింతాస్వాంతమై కుందునా
సాజంబైన కవిత్వదేవతను ప్రోత్సాహించి యీ సత్సభా
రాజం బిచ్చె ననంత కావ్యరచనా రాజన్మనో ధైర్యమున్

మ. అలిబేగాఖ్యుఁడునుం గబీరుషయు విద్యావార్థి గోవిందరా
జులు నాయందు నొసంగు దోహదములన్ శోభిల్లి సన్మానమం
గళవృక్షంబు ఫలించె, వారికి నమస్కారంబు లర్పించె తె
ల్గులు దీవింపఁగ నేన్గు నెక్కి యెద పొంగుల్వార నూరేగెదన్

మ. నగరాలే జగదేకవీరులని యానందించె నీనాడు మా
సొగసుం గత్తియ తెల్గుదేవత యశస్సుల్ సత్యధర్మాగమా
ధ్వగులౌ చిట్టిని రత్నపాత్రు కవినిం బంకాన్వయున్ రాములన్
పొగలంబిమ్ము యధార్థవాది కవిబాబుం గాంచి పోషించుచున్

మ. ఎలమిన్ గర్భపుజిన్నె లేరుపడిపోయె న్నా కళాలక్ష్మికిన్
ఫలియించెన్ గుజరాతుకోమటి శుభస్వప్నంబులం గోరికల్
మలగెన్ జాతిమత ప్రచండ దవధూమజ్వాల నిస్తేజమై
కలిగెం గీరితిహాసముల్ కనకదుర్గాదేవి కెమ్మోవిపై

సీ. ఈనాడు నా కావ్యశృంగారవతి నోచికొన్న నోములతోట కుట్మలించె
ఈనాడు నాదువాగీశ్వరీపాదపంకజమున పసిడికంకణము పూచె
ఈనాడు గుజరాతు వృద్ధయోగీంద్రుండు కనుచున్న కలలు నిక్కంబులయ్యె
ఈనాడు నన్ను మోహించి వచ్చిన కైత గంధసింధురముపై కాలు నిలిపె

ఆ.వె. ఆర్ద్రహృదయులైన హైందవ సోదరుల్
మతము గలిగి కళను మఱువలేదు;
శక్తిగలిగి నాదు జాతీయ మిత్రులు
మతము మఱగి, కళను మఱచినారు

సీ. వేంకటాద్య్రప్పరాడ్విభుఁ డుయూర్దయితుండు నందాల గీతగోవిందకర్త
స్వప్నంబునను శాత్రవప్రకాండంబునకు చిలుగునెంచని దయాసింధు విభుఁడు
రాసిక్య మెఱిగిన రాజశేఖరులందు మిగులుగా లెక్కింపఁదగిన సుకవి
చలువలతేని వెన్నెలకు వంకలుదిద్దు శీతలేక్షణములఁ జెలగురాజు

సీ. గండపెండెరంపు ఘనసభాలక్ష్మికి
నచ్చినట్టి ప్రణయనాథుఁడయ్యె;
శంకమాని గెలుపు ఢంకా బజాయించి
ప్రశుభ రచనముల కుపక్రమింతు

ఆ.వె. ఏనుగునెక్కి నేను పురి నేగెడు వేళ నిరస్తనీరదం
బైన నభస్సునుండి తుహినాంశుని వెన్నెలపూలవాన నా
పైని నిమేషకాలము ప్రవర్షితమయ్యె; యనంతసృష్టి స
న్మానము నందితిన్ దెలుగునాటి కపూర్వము లీ విశేషముల్

శా. నామిత్రుండగు నర్శిబాబనె, శ్మశానక్షోణి నిద్రించుచున్
నీ మాధ్వీక కవిత్వగాంగఝరులన్ దృప్తంబులై సత్కవి
స్తోమంబుల్ గురియించుచున్నవి ముదశ్రుశ్రేణియంచట్లుగా
కీ మాయాసుమవర్షముల్ గురియునే యిట్లర్ధరాత్రంబునన్

కం. వేంకటరత్న కవీశు క
ళంకము లేనట్టి కావ్య లలనామణి, ని
శ్శంకముగ నేలుగాత, మ
హంకారరుల గుండె మండలాగ్రంబు గతిన్

కం. అత్తోట రత్నమను నొక
యుత్తమ హరిదాసు నేటి యుత్సవమునకున్
విత్తనము నాటె, నాకుం
బత్తుఁ దతని కిచ్చువాడ బ్రథమాశిషముల్

కం. నను జూచి యేకలవ్యుల
మని యిచ్చకమాడి యిట్టి యవసరములలో
వెనుకేసుగాంధ్రునుం గల
రనఘులు పేళ్ళుగ్గడింప కభినందింతున్

కం. మనమార నాదు కవితా
తనయావదనంబు జూచి తనువు మఱచు, శ్రీ
పెనుగొండ దొరకు, లక్ష్మయ
కనామ యాయుర్విభూతు లాసింతు నెదన్

కం. మనమును మాటయు నొక్కటై
తనరారెడు కమ్మకులజు దానపరుని పే
ర్కొనువాడ నలరి మవ్వపు
గొనముల వనరాజు బుచ్చికోటయ భోజున్

కం. రేయింబవళ్ళు నాదు స
భాయోషిజ్జయము గోరి పాటువడిన కా
ర్యాయ త్తమతికి రామయ
నాయని కగుగాత! భవ్యనవ్య శుభంబుల్

కం. మనికొండ విశ్వనాథా
ఖ్యుని దానకరంబు భద్ర కుంజరముపయిన్
దనరారు నాదుకవితా
వనితకు నూరారు లిచ్చి బహుమానించెన్

# విజ్ఞప్తి

సహృదయ మహాశయులగు పాఠకులకు,

ఇది నా నాల్గవ కావ్యఖండము. స్వతంత్రదినంనాటి సంతోషగీతాలు మీదటి నిరాశాగీతా లిందున్నాయి. క్షమా సంస్థాపనాచార్యుడైన మహాత్ముని మహితసందేశం మారుదారిబట్టింది. కులమతాల బురఖాలతో దుష్టశక్తులు స్వేచ్ఛా విహారం చేస్తున్నయి. సత్యాగ్రహ సమరకాలంనాటి త్యాగదృష్టి, నిజాయితి, పరస్పర విశ్వాసం, సంఘీభావం మృగ్యమైంది. సత్యధర్మప్రవక్తలైన కవు లనేకులు ప్రణయ వ్యాధిగ్రస్తులై సనాతనకర్దమాన్ని ప్రజానీకానికి పులుముచున్నారు. అశాంత్యసమానతలకు కొత్తపాదులు నెలకొల్పబడుతూ యున్నయి. విశ్వప్రేమ విశ్వసమత నాశించు అధికమతుల కసహ్యమైన వాతావరణం తయారైంది. మూడవసంగ్రామ దేవత మొగసాల హుంకరిస్తుంది. అధికారపిపాస నియంతృతాపరత్వ మడుగడుగున దృశ్యమానమౌతుంది. నిత్యవిలాపాలు, నిప్పచ్చరాలు నిఖిలదిక్కుల నినదిస్తున్నాయి. ధర్మేతరాలైన స్వార్థనృత్యాలకు నేను వ్యతిరేకిని. బాపూజీ, బుద్ధుడు, క్రీస్తు, నడచిన వజ్రమార్గంలో నేనొక అజ్ఞాత ప్రవాసిని. లక్ష్యం చేరలేని దుర్బలుడనని యెఱుగుదును. కాని ప్రయత్నం దోషంకాదుగదా? విశ్వ మెన్ని వెట్టివేషాలు వేసినా మహాత్ముల ప్రేమ శంఖధ్వనికి మృతిలేదు, క్షతిలేదు. మరణం లేని మానవత్వాన్ని కామించు కవితావీణపై నేను మ్రోయించిన వ్యథాతంత్రులే ఖండకావ్యాలు.

లలితకళాభ్యుదయాకాంక్షలు, మధురమంజులహృదయులు, ప్రకృతం బృందావన పుర డిప్యూటీ కలెక్టరులయిన శ్రీశ్రీశ్రీ కే.పి. సామ్యుల్ గారి నీ కృతికి పతిగా జేసి కృతార్థుణ్ణయ్యాను.

జి. జాషువ

# అంకితము

కం. పలికినది చేసి, చేసిన
పలికెదు సామ్యూలు బుధుడు ప్రాణేశ్వరుడై
యలరింప నాదు కృతిసుత
యలఘుమతుల సానుభూతి కగ్గంబగుతన్

ఆ.వె. ఎంత ప్రేమయున్న నెంతాదరంబున్న
బయలుపడని క్లుప్తభాషణుండు
పదవిగల్గునన్న భావంబు కలనైన
దలపనట్టి సహజధార్మికుండు

ఆ.వె. జాలికనికరంబు సర్వాంగకములందు
నిండిపారు సుగుణ మండితుండు
కే.పి.సాముయెలుడు మాపిల్లకాత్మేశు
డగుటకతన ధన్యమయ్యె రచన

కం. వలపుల సతివై డిప్టీ
కలెక్టరుని గీముజొచ్చి గర్వింపక కా
గలవారిం జెలియంద్రన్
కళాసతుల నాదరమున గావుము బిడ్డా!

కం. పతిదొడ్డవాడు హృదయం
బతికోమల మమృతమధురమాలాపం బ
ప్పతికీడగు సతియన య
త్కృతితనయా! తెమ్ము వినుతిగీతార్చనముల్

జి. జాషువ

# క్రీస్తు

సీ.	పరలోక మానంద పారవశ్యమునంది జిలిబిలి గానాలు చిలుకరింప
నవనవోజ్వల భూరి నక్షత్ర ముదయించి ఘనభక్తతతికి మార్గంబు చూప
బహుదూరభూముల వాసంబు గావించు జ్ఞాను లేతెంచి కాన్కల నొసంగ
యూదుల రాజు హేరోదు తత్తర వోయి పసరు పాపల కత్తిపాలు చేయ

ఆ.వె. పడతి మరియమాంబ కడుపున నుదయించి
పశుల కోష్ఠమందు పడక వైచి
మనుట శిశువు వోలి చనుబాలు ద్రావుచు
న్నాడు నేడు క్రీస్తునాథమౌళి

సీ.	పరమసామ్రాజ్యంబు పాలించు విశ్వాల యొడయని కొక్కగా నొక్క కొడుకు
సర్వమానవులకు సర్వేశ్వరుని తోడ గొప్ప లావాదేవి గూర్చువాడు
పాపాత్మకములైన పదునాల్గు జగముల కష్టముల్ కడతేర్చి కాచువాడు
ప్రేమాంకురంబును విశ్వాస మొలిపించి దొసగును జక్కాడు తోటమాలి

తే.గీ. క్షతి యెఱుంగని చక్కని సహన విద్య
పంచి పెట్టెడు వేల్పుల పంతులయ్య
దేవదేవుని మధుర సందేశములను
మోసికొని వచ్చినాడు నే డేసురాజు

సీ.	వణకిపోయినది విశ్వంభరావలయంబు కడుపున గన్నయ్య కన్ను మూయ
బ్రద్దలైనది మహా పర్వతప్రచయంబు శిలువపై జనకుండు పలువరింప
మాసిపోయిన యది మార్తాండ బింబంబు బ్రహ్మాండపతి మోము వాడిపోవ
బ్రదికి లేచినవి సద్భక్తుల దేహముల్ ప్రభువు గుండెలలోన బల్లెమాడ

ఆ.వె. సృష్టికర్త మేను శిలువకొయ్యల కెక్క
సర్వసృష్టి రమణి జర్జరించె
కొయ్యవారె నఖిల కువలయచక్రంబు
యేసుక్రీస్తు 'పారదేసు' కెగయ

# స్వేచ్ఛాదినము

సీ. అస్తమించినది మ మ్మంధకారమునందు బంధించు జాతుల వాని దాడి
వీడిపోయినది మా వేడిరక్తంబును గావుబట్టిన బూచిగాని భయము
దౌడుదీసినది మా తాత తండ్రుల వెంట దగిలి వచ్చిన యదంతరపు బ్రదుకు
తొలగిపోయినది మా తలలపై నడయాడి కనులెఱ్ఱజేయు కిగ్గాడి జెండ

తే.గీ. కునికి నిద్రించు నలుబదికోట్ల వీర
భారతీయుల విక్రమ స్ఫారవహ్ని
మేలుకొన్నది నేడు లోకాలు మెచ్చ
భూమి శాసించు సార్వభౌముడను నేడు

మ. తనురక్తంబు కవోష్ణవంత మయి చైతన్యంబు సంధిల్లె తె
ల్లని మంచం గరగించుచుం దరణి బాలస్వామి తోతెంచె తీ
యని యూహల్ పొరలెత్త జాతి కభయం బందించుచున్ బచ్చప
చ్చని స్వేచ్ఛాదిన ముద్భవించె దశదిగ్జాలాభిరామంబుగన్

మ. ఉదరార్థంబు ధరించినాడ మునుపెన్నో వేషముల్ మాతృ శా
రద వంకం బెరచూపులం బఱపితిన్ రాజోక్తి కామించి సి
గ్గొదవు న్నేడు తలంపరా దిపుడు పూర్ణోత్సాహ గంగా మహా
నదు లెన్నో ప్రవహించుచున్నవి మది న్నానాశుభచ్ఛాయలన్

శా. నాజాతి న్నడిపించుకో దగిన పంథాలో నిరోధింపగా
రాజు ల్లేరిక నుత్తమోత్తమ కళా బ్రాహ్మీ సుధాగారముల్
బూజున్ దుల్చి యఖండలంబిడి పునఃపూజల్ ప్రతిష్ఠించెదన్
రోజుల్ నావి పొలంబు నాది వెలయింతున్ దిగ్జయ స్తంభముల్

మ. అల నాగమ్మలు బాలచంద్రు లభిమన్య బ్రహ్మానాయాది యో
ధులు జన్మింతురు క్రమ్మరన్ కరకు కత్తుల్ గల్గియున్ రిత్త చే
తులు జోడించి నమస్కరించితిమి విద్యుచ్ఛక్తి సంపన్నమై

మ. సకలోర్వీం బెదరించు నాంగ్లుల తమాషాదర్పమున్ జూచి యూ
రక భీతిల్లితి మింతకాలమును మా రాటాల ఝుంకార ఘో
షకు చిత్తైనది ముజ్జగంబును శుభోషస్సంధ్య బంగారు తూ
లికతో నా సుఖజీవితార్థముల నోలిన్ దిద్ది ముద్దాడెడిన్

మ. వెనుకన్ దీటిన కోరమీసములకున్ బే రేమియున్ లేదు రా
జిన కోపానల మెల్ల నాతనువునన్ జీర్ణించి వమ్మయ్యె నీ
దిన మాంధ్రోర్వి కిరీటధారిణి యనర్ఘీభూత రాజన్య శా
సన భీత్యుద్ధతి గోచరించ దిక నాశబ్ద ప్రపంచంబునన్

మ. కలుపుంగోలుతనంబు లేదను నపఖ్యాతిం దలం దాల్చి మా
టలతో బ్రొద్దులు బుచ్చి కోల్పడితి రాష్ట్ర ప్రాప్తి నా చెడ్డ రో
జులతో నాకు బ్రమేయ మేమిటికి? నా సోదర్య దేశంబు లౌ
దల లాడింపగ జాతిలో పురుష రక్త జ్యోతు లెత్తించెదన్

సీ. హలము సోకిన నమృతాన్నంబు గురిసెడు తల్లినేలకు నేటికోళ్ళు సలిపి
పర దాస్యమున నంటు బడియున్న నెమ్మేని యడుసు గంగను నీట గడిగివైచి
కలమును కులముతో గొలిచి బేరములాడు వైషమ్య భావంబు వదలివైచి
తెల్లతోలునకు భీతిల్లి ప్రక్కల కేగు పిరికి కండలలోన కరకు నింపి

తే.గీ. తాగ్యమూర్తుల పూత రక్తస్రవంతు
లింకి మొలిచిన స్వేచ్ఛా మహీజ మహిత
మంజుల చ్ఛాయలందు వాఙ్మయ వధూటి
కర్ఘ్య మిడుచున్నవారు నే డాంధ్ర కవులు

సీ. లోక లోకాల శిల్పుల పొగరల నెల్ల శిక్షించి దిద్దు నా శిల్పవిద్య
అన్యదేశీయ గాయన గాయనులచేత కీర్తింపబడ్డ సంగీతవాణి
అలగుజాండరుని గుండెలలోన నిద్రించి నెగడు నా కదన పాండిత్యగరిమ
ప్రాక్తనంబైన భారత సంస్కృతిం జాటు కమనీయమైన నా కట్టుబొట్టు

ఆ.వె. కటకు దాస్య కీలి కను మాసెనో యంచు
వెఱచి కంట నీరు బెట్టినాడ
ప్రతిభ కొల్లగొట్టు పగవాడు గల్గునా
చావలేదు తెల్గుజాతి చేవ

తే.గీ. మునుపు కాబట్టని తనంబు ముమ్మరింప
మిత్రునకు తోడుపడకుండ మిన్నకుంటి
బానిసతనంబు తనదారి బట్టి పోవ
స్వార్థంబున కిప్డు నాలోన స్థలము లేదు

సీ. అపరంజిగురిసి మా కన్నంబు దినిపించు తల్లి భారతి నేడు దక్కె మాకు
పదియు రెండగు పుణ్యనదులు నదంబులు చిరకాలమునకు జే జిక్కె మాకు
అమరసన్నుతమైన హస్తినాపుర రత్న పీఠంబు తిరుగ బ్రాప్తించె మాకు
తలవంచి పగర కత్తులకు జోహారించు దీనభావము నెమ్మదించె మాకు

తే.గీ. అననుభూత రసానంద జనితమైన
చేతన జ్యోతి దిక్కుల చెంగలించి
గోచరంబయ్యె మా నేత్రగోళములకు
అచ్చముగ భారతీయుడ నయితి నేడు

## తహతహ

తే.గీ. భారతీయుల స్వేచ్ఛా ప్రభాతమునకు
నేటితో నెలల్ పండ్రెండు దాటిపోయె
ఘనుడు బాపూజి స్వర్గాన కాలుమోపి
వేడికన్నీటి మాసంబు లేదు గడచె

శా. నట్టింటన్ జెలరేగుచున్న రిపుసంస్థాన ప్రమాదాలచే
నట్టిట్టైన స్వతంత్రరాజ్యరమ కే యాపత్తు రాకుండగా
యె ట్టోదారిచి యాగబట్టి విజయంబేవంక మ్రొగ్గించి యీ
చెట్టన్ మాన్చెదో చక్రధారిణి! నమస్తే! భారతాంబామణీ!

శా. సందైనం గబళించి వేయుటకు నీసంసారమందున్న పూ
సందుల్ సాయముచేయ శాత్రవులు పజ్జంబొంచియున్నారు ని
స్సందేహంబుగ గెల్పు నీకునగు గచ్చన్ గట్టి డీకొమ్ము నే
డాందోళించెదు దుండగమ్మును, వయస్యా! సోదరగ్రామణీ!

మ. నిరుడీనాడు జయేతినాదములతో నీనిద్ర మేల్కొల్పి నీ
యరచేతం బడినట్టి భారత స్వరాజ్యానంద కాలంబునం
దెరుసుం బోకడలున్ మతాంతరపు బ్రత్యేకత్వముల్ లేవు నీ
కరముల్ మోడ్చి నమస్కరింపుమలచర్కా సాధురాణ్మూర్తికిన్

ఉ. వేచియున్నవి భవత్ప్రేమవీక్షణము నర్థించి జాతీయ పరిశ్రమములు
వ్రతము సల్పినవి నీ పరిపాలనము గోరి ఆలపాలయి కళాజాలకములు
కేలుసాచినది ని న్నాలింగనము చేయ దిక్కువాసిన ధర్మధేను రమణి
కుములుచున్నది నీదు విముఖతా హతిజేసి స్తన్యమిచ్చిన కన్న తల్లిభాష

ఆ.వె. రత్నపీఠ మెక్కి రాజిల్లు భారత
ప్రభుత కొక్కయేడు వయసు వచ్చె
అలుగుబట్టి వైరి నదలించి శాంత గం
భీర శుభ సుఖముల పిదుకవోయి

సీ. ఆసేతుశీత నగాగ్రంబు వరకు నిశ్చల శాంతిరమకు పాదులు ఘటించి
శ్రేయస్సునకు నంతరాయంబు గల్పించు దుష్టశక్తుల నెల్ల దుడిచివైచి
ప్రబలమత ద్వేషరక్త రాక్షసుల ఝుంఝూటంబు బొలిమేర దాటదరిమి
చనిన మాజీదాస్యమునకు హేతుకమైన వార్గిక వైరభావము నడంచి

తే.గీ. నవ్యజాతీయ సింహాసనంబునందు
కరము వెలుగొందు లేత రాచటికమునకు
వార్ధకములేని బహుశతాబ్దముల పూజ
కరుణతో భిక్షయిడుగాక గాంధిబాబు

## నవభారతము

చం. కొదమ స్వతంత్రతా విభవఘోషలు దిక్కుల పిక్కటిల్లగా
ఖదరు మునీంద్రు నాత్మకు సుఖం బొనగూర్చి దరస్మిత ప్రజా
వదనవిలాస ముట్టిపడ బంగరుపీఠ మలంకరించె, ము
ప్పదిపదికోట్ల భారత రిపబ్లికు రాజ్ఞి సమగ్ర గాత్రియై

సీ. తావులేదిక మతాంతర కులాంతరములు చిత్రించు సిగపట్ల గోత్రములకు
విలువలేదిక ధనాఢ్యులు ప్రయోగము చేయు బంగారు సంచుల పలుకుబడికి
ఎడములేదింక సాహిత్యవేదిక సంకుచిత దృష్టిగల కళాయతనములకు
చోటులేదిక పొట్టకూటి పేదల నెల్ల గతుకు దుష్టుల ఘాతుకత్వమునకు

తే.గీ. కరకు చిరకాల పరతంత్ర కషణకలన
పుటము లందిన త్యాగి సముత్కరంబు
పెత్తనముచేయు స్వేచ్ఛా నవీన భరత
రత్నసింహాసన ప్రజా రాజ్యమందు

మ. యువరాజుల్ ప్రజలెల్లరీదినము నవ్యోత్సాహ గంగాఝరుల్
బ్రవహించు న్నవనాడులం దచల దర్పంబున్ బ్రసాదించుచున్
జివురించె న్నవభారతంబు ప్రభుతా చిహ్నంబుతో సర్వ మా
నవ సౌహార్ద విభాత కాంతులు దిగంతశ్రేణి రాణింపగన్

మ. ఘనసత్యాగ్రహ దీర్ఘయజ్ఞమునకున్ గాయంబు లర్పించి పో
యిన యజ్ఞాతపు దేశభక్తు లనఘుల్ దృప్తాంతరంగంబునన్
గనుచున్నారు పయోద వేదికల నక్షత్రాక్షులై గాంధి వీ
రుని పజ్జన్ గరమెత్తి వారికి జొహారుల్ సల్పి యర్చింపుడీ!

మ. తెలదొంగల్ దినిరందువేల? మనయాస్తిన్ నల్లమార్కెట్లలో
నలదొంగల్ దినకుండ జూచుకొని యజ్ఞంబై విమూఢాశయా
కులమైయున్న యనుంగుదేశమున సంక్షోభంబు మాయించి ని
శ్చలశాంతిన్ వెలయించి నీదు ప్రతిభాశకుల్ బ్రదర్శింపుమా!

మ. కలవందం దలవాటుపడ్డ నరరక్తస్వాదనాభీలశ
క్తులు ప్రచ్ఛన్నముగా, సమర్థులగు యోధుల్ బల్వురున్నారు భీ
తిలరా దేరికి, గాంధిదేవుని కృపాదృష్టిన్ భవత్వాలనో
జ్వల సామ్రాజ్యము నిల్పుకొ మ్మనుగు వత్సా! మేరుధీరుండవై

సీ. పూడునా కూటి కల్లాడు పేదల డొక్క ముప్పూట లభిమతంబులు ఫలింప
నడచునా ధర్మంబు నాల్గుపాదములతో కులతత్వముల గాలి కుంటులేక
దిగివచ్చునా ధనాధిపుల మందపు జూపు సామాన్య మానవ సదనములకు
అణగారునా నితాంతాభిజాత్యపు మంపు చిరుతచట్టాల దాక్షీకమునకు

తే.గీ. ఒక మహాత్యాగిమీది నమ్మకమువలన
కరగతంబైన యధికార కనకముద్ర
బహుళ కల్లోల గర్భిణీ భరత సతికి
దక్కునే స్వార్థరహిత వర్తనము లేక

మ. అకలంకంబగు హేతువాదమును, సత్యాన్వేషణాసక్తి, సాం
ఘిక కల్యాణ పిపాస, పాక్షిక దవాగ్ని న్నెట్టు దుర్దాంత శా
బ్దిక పాండిత్యము నాదరింపని లసద్విజ్ఞాన మింటింట పా
దుకొనుంగాత విశాల భారతమునందున్ లోకవిఖ్యాతమై

## అల్లుడు

మ. పురుషాకారత నున్నజా లతనిలో పుంస్త్వంబు లేకుండినన్
భరత క్షోణి వివాహము న్నెరపి సంభావించు టాచారమై
చిరకాల స్థిరసాంప్రదాయమయి నిల్చెన్, నాకు నారీతిగా
జరిగెం బెండిలి తంతు పెద్దల సమక్షంబందు మున్నెన్నడో!

ఉ. ఏ నొక యమ్మగన్న బలహీన లతాలలితాంగి నేలుచు
న్నానను గర్వ మేర్పడియె నా హృదయంబున నత్తమామలున్
బానిస లన్న పిచ్చి జొరబారిన దల్లు డటన్న మాటచే
పూనకమయ్యె నా కుబుసుపోవని యంకమ సత్తి చిహ్నముల్

తే.గీ. అత్తమామలు చేయు మర్యాద లెట్టి
గొప్పవైనను లోపముల్ గోచరించె
అల్లుని తనంబులోని మహాత్త్య మేమొ
పెండ్లి తంతున గల దొడ్డ బిగువదేమొ

కం. మదన జ్వరౌషధంబులు
మదవతులని నేర్చుకొన్న మాట మనసులో
కదనుం ద్రొక్కుట కతనన్
హృదయము లేకుండ భార్య నేల దొడగితిన్

కం. కొట్టుటకు తిట్టుటకు నొక
పట్టా జన్మించినట్లు భావించి, వెతల్
బెట్టితి నిల్లాలిని నా
పెట్టు శ్రమల నోర్చె సతియు విధి యనుకొనుచున్

కం. సతు లొనరించిన పూర్వా
ర్జిత కర్మంబనుచు నిందచేసితి సకియన్
నుతియును మోక్షం బెరుగని
సతీమణియు నమ్మె పరమ సత్యం బనుచున్

ఆ.వె. ఎంత గడ్డిగఱచి యెన్నిండ్లు దూరిన
సంఘశక్తి నాకు సాయమయ్యె
పడతి గడపదాట పదివేల కనులతో
పట్టియిచ్చి బ్రువ్వ తిట్టిపోసె

ఉ. ఆలియు నన్ను జూచి వెఱగందుచు నెత్తురు జచ్చి యావ జీ
వాలును గ్రుంగిపోవ బలవద్రతులం బరితృప్తి నందు నా
వాలకముం గనుంగొని నిబద్ధమనఃకుహరాన నెట్టి శా
ర్దూలముగా దలంచుకొని రోజులు నెట్టుచు తాల్మి నందెనో

చం. బెదిరిన గుండెతో వలపుపెంపరి పుల్కలులేని మేనితో
సదమల భావముల్ పదముసాచని శూన్య మనస్సుతోడ నా
మదనపిశాచ తృప్తి కొక మందయి కాపురమాచరించి. నా
సుదతి కనెం గుమారకు లశుంతల కుంతితధీచరిత్రులన్

శా. పుట్టింటం గబళంబులేని విషయంబున్ లేమియుం గన్యకున్
బొట్టుంగట్టిన యంతనే మరచి యుబ్బున్ గర్వ మేపారగా
పట్టుంబుట్టములన్ ధరించుకొనుచున్ బక్వాన్నముల్ మెక్కుచున్
బెట్టున్ జేసితి నత్తమామలపయిన్ బెండ్లాము తమ్ముంద్రపై

కం. అల్లుడ నని నిక్కిన నా
కల్లు డొకడు దాపరించి యధికారముతో
నిల్లుం జొచ్చె న్నే నిపు
డల్లుండనుగాను మామనై కూర్చుంటిన్

## వీరేశలింగ కవి

శా. వీరేశాఖ్యుడు, లింగధారి, కవితావేశుండు సత్కావ్యముల్
నూరుల్ గూరిచి జాతిదేవతకు కన్నుందోయి నర్పించుచున్
క్రూరాచార మహాపిశాచి కెదురై క్రొంగొత్త ఖడ్గాలతో
కోవల్దీసిన యోద్ధకాంధ్ర సుకళాక్షోణుల్ ఋణగ్రస్తముల్

సీ. తెలుగు శారదకు నత్తులు ముంగరలు దీసి క్రొంగొత్త తొడవులు గుస్తరించి
పరిహాసమన్న కోపముచేయు గడ్డలో నవనీత హాస్య వాఙ్మయమునాటి
పసి వితంతువుల దుర్భర దీనతకు గుంది కూలిపోయిన కాపురాలు నిలిపి
గడనచేసిన చిల్లిగవ్వతో సర్వంబు శరణాలయములపై జల్లివైచి

ఆ.వె. మరణమునకు దక్క మరితీరుబడిలేక
కలము దించనట్టి కవివరుండు
కందుకూరి కులుడు కాలుమెట్టినచోట
కాలుమెట్టలేదు కలుషజనము

ఉ. నన్నయ మున్నుగాగల సనాతన సత్కవి జీవితంబులన్
గన్నుల గాంచిన ట్లమృతఘుంటమునన్ వెలయించి భాషకున్
జిన్నెలు వన్నెల న్నిలిపి నేడు మహాకవులైనవారి కిం
తన్నముబెట్టి పోయిన మహాత్ముని, దేశము విస్మరించునే?

మ. ఒకవంకన్ బదివేల కంఠములతో హుంకారముల్ సల్పి, సాం
ఘిక శార్దూలము చప్పరించుటకు లంఘింపన్ రవంతేని జం
కక దీక్షారథమున్ మరల్పక కళాక్షాత్రంబు జూపించు ధా
ర్మికవేదండుని యుక్కుగుండెలు మహేంద్రీ నీకు నాదర్శముల్

ఆ.వె. చిలకమర్తి నారసింహ సత్కవి నీకు
శిష్యుడయి ప్రసిద్ధి జెందినాడు
మ్రొక్కి నీపదాలు ముద్దాడు కతమున
రాణ్మహేంద్రపురము రాణకెక్కె

# తెలుగుగడ్డ

తే.గీ. వెలుగు లెగజిమ్ము పట్టాభి గెలుపుతోడ
బలము రెట్టింప విజయాలవాడనుండి
నవకవీశాన మధురకంఠములతోడ
పలుకుచున్నది నేడు నా తెలుగుభేరి

సీ. ఆంధ్రాళి మోదంబు నాశించి పోయిన తిక్కనార్యుని వాణి తృప్తినంద,
గజ్జెలందెలకాలు గదలించి మన్నెబొబ్బిలికోట దొలికోడి పలికి కులుక,
నడువీధులందు రత్నము లమ్ముకొన్నట్టి తెలుగుల సంపత్తి తలపుకెక్క
ఖండాంతరముల బంగారు పూజలుగొన్న కలికి పోగరమేను పులకరింప

తే.గీ. మూడుకొండల శివలింగములు రహింప
నాలసింపక రాష్ట్రసింహాసనమున
నధివసింపుము జయము నీయందుగలదు
దీవ్యదాశయసుమవల్లి! తెలుగుతల్లి!

సీ. పిసినికాయను పట్టు వసనంబు నిమిడించు చేనేతపనుల కాశీస్సు లొసగి
తులలేని యలకొండపలి బొమ్మపనివారి పనితనంబునకు జీవనము చూపి
గడనకెక్కిన కూచిపూడివారి వరకథాకళి నాట్యకళ కింత కబళ మొసగి
అరవదేశమున బావురుమంచు శోకించు త్యాగయ్య గానంబు నాదరించి

తే.గీ. మృదుల జాతీయ కవనశారదల సొగసు
సకల దేశాలలో ప్రదర్శనము జేసి
సంతరింపుము శాంతి సాంసారసుఖము
దీవ్యదాశయసుమవల్లి! తెలుగుతల్లి!

మ. ఘనగాంధేయ శకప్రకాశలవమింకన్ సోక కత్యంత ప్రా
క్తనపుం జీకటి చిందులాడెడు విముగ్ధప్రాంతముల్ నిద్ర మే
ల్కొన శంఖారవ మాచరింపు మిక నుగ్గుంబాలతో ఘుంటమం
దిన విద్వాంసులగన్న వీరజనయిత్రీ! ఆంధ్రరత్నక్షితీ!

మ. కులముల్ కొమ్ములతోడగుమ్ముకొని చిక్కుల్ పెక్కుసృష్టించు పె
ద్దల కాలాలు గతించిపోయినవి స్వాతంత్ర్యంబు సిద్ధించె రా
జుల సింహాసన మెక్కినారు ప్రజ లెచ్చుం దగ్గులం బాపుజీ
హాలికశ్రేష్ఠుడు దున్నినా డిపుడు లేవంతస్థు లాంధ్రక్షితీ!

మ. పెను స్వార్థంబు మహాపిశాచమువలెన్ బీడింప దేశంబు చి
క్కిన శల్యంబయి తూలిపోయినది యాకీడుం దొలంగించు చ
క్కని మార్గం బుపదేశమిచ్చుకొని ముక్తాస్వచ్ఛభావంబు నీ
యనుగుంబిడ్డలలో సృజింపుము త్రిలింగాద్రిక్షమాభూషణీ!

శా. ఆలాపించిన సత్కవీశ్వరుల దివ్యాశీర్వచశ్శక్తిచే
నాలంబించిరి భారతీయులు స్వరాజ్య స్వర్ణదండంబు లే
దాలంబంబు కవిప్రపంచమున కమ్మా! వాఙ్మయోద్యానఘున్
బాలింపంగల దాతలంగని రసజ్ఞత్వంబు చాటింపుమీ!

మ. పెనుగప్పాలకు పెద్దబిడ్డయయి దృప్తిన్ దాత ముత్తాత లీ
డ్చిన యజ్ఞాన పురారథంబు చనుగాడిం బడ్డ దేశాన నూ
తన శక్తుల్ జిగురించునే? సమహితత్వ జ్యోతి రేకెత్తునే?
జననీమండన! జాలిగుండియల కృపాకంఠభూషావతీ!

# నేటినెలత

సీ. గ్రహియించినది నేటి కామినీ తిలకంబు బురఖాల కెరయైన బుద్ధి బలము
తెలిసికొన్నది నేటి కలికి ముద్దుల గుమ్మ యుబ్బించు గాథ లందున్న కిటుకు
అర్థమైనది నేటి యంబుజాతాస్యకు లేలేత బుదుత పెండ్లిండ్ల సేగి
ఆకళించినది నేడమలోక్తి చాతుర్య పసిడి సొమ్ముల రిత్త బరువు చేటు

తే.గీ. కాంత మగవారితో చేయి గలపకున్న
తలప నేల యనర్థంబు తప్పు దనుచు
భారతక్షోణి చిత్తంబు కోరగింప
కలము బట్టిన దీనాటి వెలది మిన్న

# ప్రబోధము

మ. పురుషుల్ నెత్తిని కొమ్ము నిక్కిన మహాత్ముల్ గారు నీకన్న సుం
దరి! స్వార్థాత్మకమైన సంఘము నినున్ శాసించి యాజన్మ దు
స్తర దాస్యంబున గట్టివైచినది విద్యాస్పర్శ లేకుండగా
పరదా దాటి స్వతంత్రవీధుల పదాబ్జంబూని క్రీడింపుమీ!

కం. నీ కడుపున జన్మించుచు
నీ కమ్మని పాలుద్రావి నెగడిన మగవా
దేకారణమున ఘనుడని
యూకొట్టితి వతని వంచనోక్తి స్ఫురణల్

ఉ. పిల్లల గాంచి పెంచి పృథివిం బొదలించెడు మాతృమూర్తివై
యుల్లములేని శాసనపు టుచ్చులకుం గురియై తపింతువే
తల్లి! విదేశ సుందరుల దంతరపుం బ్రదుకుల్ సహింతురే?
కల్లలు విశ్వసించి సమగౌరవహానికి సమ్మతింతురే?

శా. గడ్డాల్ మీసము లున్నవార మనుచున్ గర్వించి మీ నైపుణుల్
గొడ్డుంబోవగ పూరుషుల్ నెరపు యుక్తుల్ నమ్మి సేవించుచున్
గుడ్డల్ దొడ్డనగల్ ధరించుకొని షోకుల్ జేసి మోదింతువా
బిడ్డా! యెంతటి వెఱ్ఱిదానవు కళావిశ్వంబు నీక్షింపుమీ!

శా. ఎన్నేండ్లాయెనొ పూరుషుం డొక డసాహిత్యాంబు పూరంబులో
దున్నంబోలి చరింపసాగి? పెడబుద్ధుల్ దప్పి పోలేదు, గ
ర్వోన్నత్యంబు నశించలే దబల విద్యాపూర్ణయై తోడు రా
కున్నన్ దేశము నిద్ర మేలుకొనునే యుత్ఫుల్ల కంజేక్షణా!

శా. నీవింటం బడియుండు మేనొకడ సంధింతుం బ్రజాశ్రేయమున్
పూవుంబోం డ్లబలల్ మనోహర పదాంభోజ ప్రపూజావిధుల్
గావింపం బరలోక మబ్బునని వక్కాణించి వాగ్దేవితో
సావాసం బదలించు పూరుషుని మోసం బెప్ప వారింతువో

చం. ముదుపులు గట్టి పూజరుల పొట్టలు నించుచు రోగియైన పు
త్రుడు మరణింప దేవతల దూషణచేయక సర్వసత్కళా
జడధి మథించి విశ్వపరిషత్సభయం దొక సభ్యురాలివై
నడువుము భారతీయలలనా మగవానికి తోడునీడవై

## సన్మానం

ఉ. పట్టెడు గుండెతో సుకవి పండితకోటి నెదిర్చి, సత్కవీ
ట్పట్టము గట్టుకొన్న మెదవంచని వేంకటశాస్త్రి, యిమ్మహా
పట్టణవాసియౌ ననెడు పల్కు చెవింబడినంత నన్ను బో
ల్జిట్టికవుల్ భయంబుడిగి జిహ్వ గదల్పగ దొమ్మలుందునే?

మ. పరభాషా రభసంబునం దసిలి దర్పం బేది, యత్యంత దు
ర్భర దీనస్థితి నున్న తెన్గునుడి గర్వస్ఫూర్తిమై, గండపెం
డెరముల్ దాలిచి యేన్గు నెక్కినది పోటీలేని శ్రీ వేంకటే
శ్వర పంచానన గర్జలన్, వివిధభాషారూప సర్వస్వయై

చం. పిరికికి దావులేని సుకవిత్వ ధురుల్ వెలయించు వేంకటే
శ్వరకవి సాహచర్యమున పండితులం బ్రసవించి యున్న బం
దరుపురి చీరికిం గొనదు ధాతను మీ యసమానగౌరవా
దరమున నేడు నాదు కవితాసతి దాల్చె మణికిరీటమున్

శా. నాకుం బంగరు గండపెండియరమున్ దానంబు గావించి, యీ
ర్ష్యా కాలుష్యము లేని వాక్కున బ్రశంసల్ సేయు విద్వత్కవీ
ద్రాకాచంద్రుడు చెళ్ళపిళ్ళకవి లేడా నమ్మ నస్మచ్ఛుభం
బాకాంక్షించి యశశ్శరీరమున రాడా నేడు సానందుడై

శా. కాయం బుబ్బగ పెద్దనార్యకవి దిగ్దంతిన్ బ్రశంసించుచున్
రాయల్ లేదని వెచ్చనూర్చెదు కవీంద్రశ్రేణి నోదార్చి, గాం
గేయ స్నానములన్ దనించిన మిమున్ గీర్తించెదన్ సత్కళా
శ్రేయస్కాముల, సత్యవాఙ్నిరతులన్ బృందావనీ పౌరులన్

ఉ. తావులుజిమ్ము భక్తి కవితాకుసుమాంజలి గ్రుమ్మరించి బృం
దావన పౌరకోటికి గృతజ్ఞుడనయ్యెద పంచుకొండు భా
షావిదులార! మీ ప్రణయ సత్కృతు లందిన యాంధ్రశారదా
దేవత కాంచకుండదు సుధీజన సన్నుత కావ్యసంతతిన్

మ. కవితాపూజలు లేని దేశమున మౌర్ఖ్యం బుగ్ర భేతాళ తాం
డవనృత్యం బొనరించు, మానవతయున్ నామావశిష్టంబగున్
కవిపూజాపరతంత్రమై నవయుగాంకంబైన మద్భారతం
బవతారించుత సత్యశాంతి సమతాబ్రాహ్మీ స్వరూపంబునన్

## కవిబ్రహ్మ

ఉ. శీతలమై సుధా ప్రణయచిహ్నితమై కవితా ప్రపూతమై
చేతము నూచు నీకలికి చిక్కని కౌగిట నెన్నిమారులో
పూతలుబూయు నాతనువు పొంగులు భంగమొనర్చి యే కళా
భూతలి కేగినావు కవిపుంగవ! వేంకటనర్సయాగ్రణీ

సీ. సాగి ముస్తాబైన సన్మాన కన్యకు దారిలోననె గుండె జారిపోవ
సేకరించిన శుభాశీర్వాద మాలికల్ సౌరభ్య మధువు కన్నీరు నించ
అపరంజి గుప్పిళ్ళ నభిషేక మొనరించు ఆప్తమిత్రుల యాశ లణగిపోవ
దివ్యప్రబంధముల్ తీర్థమాడినకైత అనుగుబిడ్డలతోడ నలమటింప

తే.గీ. నిఖిల పల్నాటి తెలుగు మన్నీల కెల్ల
జీవములు వోయు బ్రహ్మ కుజ్జీవి వీవు
ప్రతిభ లోర్వని కట్టడి బ్రహ్మ కినుక
కరగిపోయితె వేంకట నరస సుకవీ!

మ. కదమున్ ద్రొక్కుచు నిక్కు నీకలము దగ్గం బౌటచే, దెబ్బ తి
న్నది సాహిత్యము మాటలేటికి కవీంద్రా! లేత పాకాలతో
పదనై జానుతెనుంగు శబ్దములతో ప్రత్యక్షమై మేనికిన్
గుదుపుం గూర్చు కవిత్వ మల్లగల దక్షుం దేడి నీవూడినన్

## భిషక్కు

మ. కనికారంబు కటాక్షపంక్తుల కలంకారంబు గల్పింప, చి
క్కని గాంభీర్యము జిమ్ము మీసముల పక్కా ఆంధ్రవేషంబుతో
కనువిందుల్ పొనరించు త్యాగియగు డాక్టర్ పాలకోడేటితో
జనియెన్ రాజమహేంద్రపట్టణపు రాజ ద్రాజతా సంపదల్

మ. ధనమాశింపక రోగపీడితుల బాధా శాంతియే డబ్బుగా
తనివిన్ జెందెడు వెజ్జు లెవ్వ రనినంతన్ బాలకోడేటి వం
శ్యుని వాక్రుచ్చి యహంకరించు గుణమాన్యుల్ దెల్లువారిప్పు డ
యన్యఘుం గోల్పడి కంట నీర్విడుతు రాహా! యెంత దౌర్భాగ్యులో

చం. నడుము బిగించి యాంధ్రుల సనాతన సత్కళ లాదరింప ముం
దడుగిడు నట్టి స్వార్థరహితాత్ముడు శ్రీగురుమూర్తి నామధే
యుడు, కవితాప్రియుండు, మధురోజ్జ్వలమూర్తి యఖండగౌతమీ
జడముల డాగెనే? యొక రసజ్ఞత దుర్విధి దొంగిలించెనే?

## రాష్ట్రపతి

మ. మును పీవే తెలుగుం బ్రకాండుని జయంబు న్నీజయం బట్లు నె
మ్మనమందుందలపోసియుంటివౌమహాత్మా! యమ్మహాయోద్ధ! టాం
డనుతో బోటి యొనర్చి రాష్ట్రపతి పీఠంబెక్కె నేత జ్జయ
ధ్వనులబ్రాంతమునిండె, నీ మధుర వృత్తాంతంబు నాలించితే

మ. మన పట్టాభిని దిగ్జయేందిరలు సన్మానించి చేపట్టి నం
తన నాంధ్రాళి భుజార్గళంబు లెగసెన్ బ్రహ్మాండ మంటంగ, నీ
యనురాగంబ ప్రధానహేతువు మహాత్మా! ప్రేమనిండార నీ
యనుగున్ భక్తున కాశిషంబులిడి దీర్ఘాయుష్కునిం జేయవే?

మ. ప్రతిభావార్థి సుబాసు బోసుని పరీరంభ ప్రథం గన్న భా
రత జాతీయ సభావిలాసిని ప్రహర్ష స్వాంతయై నీ మహో
న్నత ప్రేమాదరమున్ గడించిన యఖండత్యాగి చండాంశు న
ద్భుత మేధానిధి జెట్టబట్టినది బాబూ! ఆంధ్రికిం గోడవై

## ద్వారం

మ. తనువుల్ పుల్కల పూలతోటలయి యాత్మల్ స్వార్గికానందగా
హనమున్ సల్ప ప్రపంచముం గుదిపి యుయ్యాలూచు నీగాన మో
హినికిన్ నీకును, నీ ఫిడేలునకు వేయేం డ్లాయురైశ్వర్యముల్
తెనుగుం గడ్డ యహంకరించినది మేల్మేల్ గాయకాగ్రేసరా!

కం. పేరైన ఫిడెలు విద్వ
ద్వీరులు జోహారు చేయ దిగ్గజములపై
నూరేగి తెలుగు ప్రజ్ఞా
భేరి బజాయించినావు వేంకటసామీ!

శా. ఉన్నా రెందరొ వైలనిస్టులు కళాయోధాగ్రణుల్ భావముల్
జిన్నెల్ వన్నెలు గూర్చి శబ్దమునకున్ జీవంబు పోషించు నీ
విన్నాణంబు గలట్టి వాడొకడు నావిర్భావమున్ జెందెలే

ఉ. నీవు ఫిడేలు దాల్చి కమనీయ నినాదఝరీ మరంద మా
లా వివిధ స్వరూప రస లక్ష్మల సృష్టి యొనర్చు లాఘవం
బీవర కెవ్వ రెందు గడియించి యెఱుంగరు నీదు వ్రేళ్ళలో
నేవరమున్నదో యెరుగ రెవ్వరు ద్వారము వంశభూషణా!

ఆ.వె. చెవులుబట్టిపిండి శిక్షించి, జడమైన
కట్టె కెట్లు విద్య గఱపినావొ!
అంగులీయకంబు లంటియంటకముందె
నీ ఫిడేలు మధుర నిధులు గురియు

## రంగా

మ. తనురక్తంబు కిసాను రైతుల హితార్థంబై యహోరాత్రు ల
ప్పన గావించు కిసానువీరుడవు నిస్వార్థుండ వీ వుద్భవిం
చిన యానంద దినంబునం బులకరించెన్ దేశ మో రైతుమం
డన! రంగాభిధ! వర్ధిలం దగు ననంత బ్రహ్మకల్పాంతమున్

సీ. రైతురంగా యన్న ఖ్యాతి కుళ్ళాయిగా దాల్చిన దీన బాంధవవిధుండు
బాపూజి దివ్య జిహ్వా ప్రశంసలనంది చెరసాల ముద్ర దాల్చిన ఘనుండు
ఆచార్య పీఠంబు నరకాల నెగజిమ్మి తల్లి నారాధించు త్యాగధనుడు
జాతీయ కళల కాస్కారంబు గల్పింప నుబలాటపడు రసజ్ఞోత్తముండు

ఆ.వె. అన్యదేశయాత్ర లాచరించి విశాల
చిత్తవృత్తి గడన చేసినట్టి
ప్రతిభ చరితుడైన రంగా మనీషి వ
ర్ధిల్లు గాత! నుతుల పల్లకీల!

## లోపము

కం. హిందూ మహమ్మదీయుల
పొందొక్కటి కొఱత భరత భూముల స్వేచ్ఛా
నంద స్వర్గంబున కని

కం. నెత్తుటి ముద్దై కటకుం
గత్తులు చేపట్టి యున్న కాశ్మీరములో
మిత్తువ నటించె మతమను
సత్తికి నరబలియ మేటి సాదంబు గదా?

శా. బందీగేహనివాసఖేదయుత దౌర్బల్యాంగకుల్, గాంధి క
ర్మంది బ్రహ్మపథానువర్తు లెటు నిర్వర్తించి సంధింతురో
పొం దీరెండు మతాలవారలకు మాపూర్ణస్వరాజ్యార్కు డీ
మందేహవ్యథ నస్తమించదుగదా మధ్యందినప్రాయుడై

శా. సంపాదించిన డబ్బు దుస్తులకు దర్జా కాగమింజేసి నే
కొంపల్ గాలిచి లంచగొండినయి నాకు న్నన్ను గన్నమ్మకున్
గంపెండంతటి స్వీయజాతికి నసత్కారంబు గావించితిన్
కంపించుం దను వాంగ్లనాగరకతానర్థంబు నూహించినన్

## ఆత్మస్తుతి

ఆ.వె. సొంత రాజ్యమంచు సంతోషపడ్డాము
దొరల నూరుదాట దరిమినాము
చేతులార బాపుజిని జంపుకొన్నాము
సానుభూతి సభలు జరిపినాము

ఆ.వె. ప్రజల రాజ్య మనుచు ప్రకటించుచున్నాము
నందనములు పెక్కు నాటినాము
వేదఋషులు వోలి సాదంబు దగ్గించి
కరువుమీద కత్తి గట్టినాము

ఆ.వె. వల్కలాజినములు పట్టాంబరాలుగా
ఆకులలము లంబు లన్నముగను
మడమ ద్రిప్పకుండ నడిపించుచున్నాము
ప్రజల నోలి రామరాజ్యమునకు

ఆ.వె. ఇంటి దొంగవాని నేమిచేయగలేము
బయటి దొంగవాని పట్టగలము
అంటరానితనము నదలించు శాసనాల్
చేయగలము నిలుపు చేయలేము

ఆ.వె. కులమతాలు లేని బలమైన జాతిగా
మార్చదలచినాము మానవులను
కులమతంబు లెన్ని కలకాలములలోన
నడపదడప మాకు నవసరములు

ఆ.వె. మద్యపానమెల్ల మండలంబుల నిషే
ధించి గాంధికోర్కె దీర్చినాము
పదియు నేడుకోట్ల పైచిల్కు నష్టంబు
ప్రజలమీద బులిమి పడసినాము

ఆ.వె. స్వర్గమందు కొంత ప్రతిఫలంబేదియో
ముట్టనట్టి పనికి బూన మేము
పూర్వజన్మ కర్మముల నమ్మకముచేత
కష్టసుఖములందు కలతపడము

ఆ.వె. ప్రాతకథలమీద ప్రాత రోజులమీద
ప్రాతచదువుమీద భ్రమత మాకు
క్రొత్త మార్పులన్న క్రొత్తందనంబన్న
నిక్కనీము, కడపద్రొక్కనీము

## ప్రశ్న

సీ. చాటించితివి ప్రజా సామ్రాజ్య ధేనువు నిండార శుభములు పిండుననుచు
నిందించితివి సీమనృపుల రాచఱికంబు నట్టింటిలో చిచ్చు బెట్టుననుచు
యుగ్గడించితి రాట్న మొక్కటే దేశ దారిద్ర్యంబు నదిమి నిర్జించు ననుచు
వాకొంటి వల్ల స్వేచ్ఛా కేతనము నీడ బంగారు పంటలు బండుననుచు

ఆ.వె. రాజ్య పీఠమెక్కి రాజదండము బట్టి
మూడు వత్సరాలు ముగిసిపోయె
దొరల రాచఠీకమె మెరుగయ్యె ననిపించి
మారుపల్క వేల మంతిరన్న

సీ. సమసిపోలేదు విశ్వాసంబు దేశాన జాతీయ శాసనసభలయందు
పట్టూడిపోలేదు భక్తితాత్పర్యంబు మహితమహామంత్రి మణులయందు
తగ్గిపోలేదు సోత్సాహాతిరేకంబు స్వాతంత్ర్యదినమహోత్సవములందు
చరణ మూనగలేదు సందేహలేశంబు బాపూజి గన్న స్వప్నములయందు

ఆ.వె. కడుపునిండ కూడు నొడలినిండుగ బట్ట
కోరుచున్న దిపుడు భారతంబు
ప్రజల కామితాలు పాటింపలేని స్వ
రాజ్యమేల? రామ రాజ్యమేల?

సీ. ఆజన్మ పరిశుద్ధ మగు మహాత్ముని నల్ల మతమహావ్యాఘ్రంబు గతుకునపుడు
అస్పృశ్యతావారణాసక్తి నీలోన పల్లెపల్లెల సన్నగిల్లినపుడు
మానవత్వమును సంహారంబు గావించు జాత్యహంకృతి మెడ సాచినపుడు
స్వేచ్ఛాప్రదాత చచ్చిన మరుక్షణమున మొసలి కన్నీ రీవు విసరునపుడు

తే.గీ. తెరమరుఁగున నీవు సాధించుచున్న
కృతకనటనంబు జూచి శంకించుచున్న
ప్రజల యనుమానముల నెట్లు బారద్రోలి
దరికిజేర్తువొ సామ్రాజ్య ధర్మనౌక!

సీ. ఉడుకు నెత్తుటి కూటి కొడిగట్టు గూండాల ప్రళయ తాండవ భీతి వాయలేదు
చిలిపిచీకటివర్తకుల జాతి చిత్తాలు కనికారమున మ్రగ్గి కరుగలేదు
భూరి మౌఢ్యము తట్టుముట్టాడు జాతిలో ఐకమత్యజ్యోతి సోకలేదు
క్రూరసాంఘిక దురాచార భూతంబుల నెదిరింపగల గుండెలెదుగలేదు

ఆ.వె. కరువు లొక్కవంక కాటకా లొకవంక
హింస లొక్కవంక నెసగుచుండ
ప్రకృతములు గాని వనదేవతా ప్రతి
ష్ఠలకు నుత్సవాలు సలుపనేల?

సీ. కులము చక్రములు మేకులు గొట్టి దట్టించు పరమఛాందసపు కావ్యములవలన
అరచేత వైకుంఠ పురము బ్రదర్శించు నగ్న వేదాంతవాఙ్మయమువలన
బాహ్యప్రపంచానుభవ మెఱుంగని భోగశీలురపయి పెత్తనాలవలన
అమలుచేయంగ దాహతులేక వెనుదీయు నడుమంతరపు శాసనాలవలన

తే.గీ. నైతికంబుగ ప్రకట వైజ్ఞానికముగ
సాంఘికంబుగ నాయువుల్ సమసియున్న
దీనజాతికి ముక్తి సాధింపగలవె
మాయనృత్యాల తెర చించివేయగలవె?

సీ. ఆత్మ ప్రయోజన వ్యామోహ ధాటికి కరము మోడ్చని సంస్థ గానరాదు
పెనువార్ధికనిశాతవిషవిలోకమున కుమిలిపోవని కళారమణి లేదు
అసమానతలను చెండాడి విజ్ఞానంబు నాటు విద్యావిధానంబు లేదు
మూడుపూటల డొక్క బూడ్చి పేదల క్షుత్తు వాపజాలిన దయాపరుడు లేదు

తే.గీ. యున్నవాడును లేనివా డున్నవాని
మానవేతరమగు మెహర్బాని కొఱకు
ప్రాకులాడెడు వాతావరణమునందు
విశ్వ సౌఖ్యంబు నెట్లు స్థాపింపగలవు

## చదువు

తే.గీ. ఉగ్రసాంఘికశాసన వ్యూహములకు
వెఱచి తలవాల్చు కామినీ విశ్వమందు
బ్రద్దలగుచున్న స్వాతంత్ర్య భావగీతి
చదువుకొంటివె? సకల శాస్త్రప్రవీణ!

తే.గీ. ఆలుబిడ్డలు కూటి కల్లాడుచుండ
కంట దడిబెట్టు శుష్కకంకాళమూర్తి
డొక్కలో నిస్వనించు నిష్ఠురపు శోక
మాలపింతువె? భూరిగాయనవరేణ్య!

తే.గీ. విశ్వవిద్యాలయంబులు బిందుచున్న
తరళ విజ్ఞాన మధుర దుగ్ధంబు ద్రావి
బలిసివచ్చిన యున్నత పట్టభద్ర
క్షితిని ప్రేమించు టభ్యసించితివె నీవు!

తే.గీ. హృదయ ముందని నీ యెన్బదేండ్ల ముదుక
కౌగిటం బడ్డ పసిపత్ని కడుపులోన
సతత మేపారు సంకుల సమరఘోష
శ్రుతులు సోకునె? కృపలేని సోమయాజి

ఆ.వె. గుళ్లు గోపురాల కోసరంబై నీవు
ధారవోయుచున్న ధనము జూచి
కటికి పేదవాని కడుపులో నర్తించు
కత్తు లెన్నొ లెక్కగట్టగలవె?

ఆ.వె. కృష్ణమూర్తిపేర నేసుక్రీస్తునిపేర
భిన్నమతము లుద్భవిల్లు నపుడు
విశ్వశాంతి గోరు విజ్ఞుల చిత్తాల
కంటినీరు కొలువ గలవె నీవు

తే.గీ. శృతికి కటువయ్యె నని యపశృతికి గినిసి
స్థాయి సవరించుకొనెడు వాగ్గేయకార!
విలువగల నీదు మధుర జీవితపు వీణె
బెట్టు దప్పినదని లక్ష్యపెట్టవేమి?

# కవి

శా. బూటుల్ కోటులు నున్నతోన్నత పదంబుల్ జూచి యాశించి, ము
ప్పూటల్ బోయి ప్రదక్షిణించి కవితాపుష్పాంజలుల్ సల్లి, యా
రాటంబుం బడుచున్న శుష్కిత కవీంద్రా! యెండగు ఝ్ఝాలలో
నూటల్ రావు రసజ్ఞమూర్తులగువా రున్నారు ప్రచ్ఛన్నులై

చం. మెద దుదుకెత్త రేబవలమేయ రసోచిత భావరత్నముల్
వెదకి మృదూక్తులం బొదిగి పేశల కావ్య సరంబు లల్లి శా
రద నలరించునట్టి కవిరాజువు నీవు దరిద్ర మూర్తివై
బ్రదుకుట జాతి కెల్ల తలవంపులురా రసరాజ్యనాయకా!

సీ. కమనీయకనకకంకణఝుణం ఝుణలచే గడనకెక్కినది నీ యెడమకాలు
పదునాల్గు లోకాల పరమ రహస్యముల్ వెదకి తెచ్చునది నీ విశ్వదృష్టి
సకల మానవ మానసముల సామ్రాజ్యంబు సలుపజాలినది నీ సత్యవాణి
భస్మరాసులలోన స్వర్గ సహస్రముల్ సృష్టింపగలది నీ చేతికలము

తే.గీ. కాలపురుషుని నాశనఖడ్గహతికి
చెదరిపోనిది నీ సుప్రసిద్ధజన్మ
కుడుచుటకు గల్గి కడు దరిద్రుడవు నీవు
కుడుచుటకు లేక భాగ్యవంతుడవు నీవు

సీ. నీ దృక్పథమునందు నిఖిల ప్రపంచంబు నగ్నసుందరమైన నల్లపూస
నీ మానసము దయారామాభివృద్ధికి అమృతంబు జిల్కు వర్షాగమంబు
నీ చరిత్రము గాఢనిద్రాదరిద్రాణ కుతలచక్రమునకు కోడికూత
నీ వాణి వికటభావావేశరభసకు గిరిదాటరాని సుగ్రీవముద్ర

ఆ.వె. సుప్రశాంతిరత్నశుద్ధాంతముల నిల్చి
తపమొనర్చు యోగధనుడ వీవు
భావదాస్యమునకు నీ వతీతుడవంద్రు
ప్రజ్ఞ విస్మరింపవలదు సుకవి!

సీ. నీచేత వినుతులందిన యొక్క కవిరాజు సంతాన దాన భాస్కరుడు నేడు
నీపద్దులోబడ్డ వ్రేపల్లె గొల్లడు సతులున్న యొక బ్రహ్మచారి నేడు
నీయొప్పుకోలు నందిన పాండవుల పెండ్లి క్షతిలేని విశ్వ సమ్మతము నేడు
నీ తిరస్కార వహ్నిం బడ్డ కర్ణుండు కులహీను దగు నభాగ్యుండు నేడు

తే.గీ. వలపు లూరించు నీచేతి కలముమీద
వాలియున్నది సర్వలోకాల బ్రదుకు
పలుకదగదైన భావదౌర్భాగ్యమునకు
కారకుడ వీవు స్వకుల దీక్షా కవీశ!

## సవతి తల్లి

కం. కాకికులాయంబున నొక
కోకిల ప్రసవించి రెండు గ్రుడ్లిడిపోయెన్
కాకం బవి తన వని యవి
వేకంబున బొదిగి మంచి పిల్లలు జేసెన్

కం. కాకియు దన కొడుకులవలె
కోకిల కొడుకులను బెంచుకొనె మక్కువతో
యీకలు టెక్కలు మొలిచిన
దాక నిజాత్మజులటన్న తాత్పర్యమునన్

ఆ.వె. ఈడు వచ్చువేళ నింతుల కంఠముల్
మధుర మధుర మగుచు మారు కరణి
మూగవోయి యున్న బుడుత కోయిల జంట
మాధవాగమమున మాట నేర్చె

చం. కొడుకుల పల్కులో చిఱుత కోయిల పిట్టల పల్కులో బయ
ల్పడియెడు తారతమ్యమును వాయసకాంత గ్రహించి యాగ్రహం
బడరగ మోసమయ్యెనని యాప్తుల జుట్టల జీరి ముక్కునం
బొడుచుచు దన్నసాగె పికపుత్రకుల న్నిజమాతృహీనులన్

ఉ. చేసిన నేరమున్ దెలిపి శిక్ష యొనర్తురు కన్నతల్లు లా
వాసము దాటలేని పసివారిని కన్నకుమాళ్ళ నిట్లు పే
రీసున జంపనేల జననీ! యని దీనత కూనకోయిలల్
దోసిలి బట్టి మ్రొక్కె వగతో పగబట్టిన వాయసాంగనన్

ఆ.వె. కులము దాచుకొన్న ఖిలఘాతుకులు మీరు
వంశ మెల్ల మైలవడ్డ దిపుడు
పరభృతములు మీరు బలిభుక్కులము మేము
తల్లి లేదు మీకు తండ్రి లేదు

ఆ.వె. కులము లేనివాడు బలగముండనివాడు
పనికిరాడు నేటి భారతమున
కలుపుగోలుతనము కట్టుబాటును గల్గు
స్వచ్ఛమైన కాకిజాతి మాది

కం. మాలో నొక్కని జెనకిన
కూళం గనిపెట్టి వాని గోరీకడ పిం
డాలం దినుదాక కృధా
జ్వాలలు శమియింప వఖిల బలిభుక్తతికిన్

ఉ. కోయని కూసినం గగనగోళము సర్వము దద్దరిల్ల మా
వాయసజాతి గుంపులయి వచ్చి సహాయ్య మొనర్చి న్యాయ మ
న్యాయము దీర్చిపోవు భువనంబున నోరుగలట్టివానిదే
యీయుగమందు రాజ్యము జుమీ గమనింప వివాద మేటికిన్

చం. కులము మహాసముద్ర మను గొప్ప రహస్య మెఱింగికాదె? పె
ద్దలు ధిషణా ధురంధరులు త్యాగ మొనర్చినవారు వోలె నీ
తులు వచియించుచుం గులము తోకలు మానరు త్రుంచివేసినన్
మొలిచెడు కల్పవృక్షముల మొక్కలు నిక్కము వర్ణజాండముల్

కం. కాకులకు కోకిలంబుల
కేకాలమునందు మైత్రియే లేదు కదా
మీకేల సిగ్గులేదో
నాకూనల కూడు గుడిచి నను గికురింపన్

ఉ. మొగ్గలవంటి నా సుతుల ముద్దుమొగాల పసందు లక్కటా
బొగ్గులవంటి మీ తనులపొత్తునవాడి కళావిహీనమై
తగ్గిన వీ వసంతుని రథప్రథమోత్సవ పుష్పపూజ నా
ముగ్గురు పుత్రులే జరుపబోయెడువారని మీ రెఱుంగరే?

ఆ.వె. తీగసాగినట్లు దివ్యగాంధర్వంబు
వెల్లడించు నా కుమాళ్ల సరస
కంఠ మెత్త మీకు గల్గునా తాహత్తు
కూళలార! సవతి కొడుకులార!

ఆ.వె. సవతికొడుకు లన్న శబ్దంబు నాలించి
కన్నతల్లి గాదు కాకమనుచు
వాస్తవం బెఱింగి పరువెత్తసాగె భ
యాకులంబు లగుచు కోకిలములు

శా. ఆ నిర్భాగ్యవనప్రియార్భకులు పుష్పారామముల్ సొచ్చి క్రొం
దేనెల్ ద్రావుచు పల్లవప్రసవ భుక్తిన్ గష్టముల్ వాసి లో
కానందంబుగ బాడనేర్చి ఋతురాజాస్థాన విద్వాంసులై
వీనుల్ విందుగ బాడుచుందు రిపుడున్ విశ్వైక్య వేదార్థమున్

## కోతి

శా. ఎన్నోయేండ్లకు ముందు మానవుల కీవే వంశనాథుండవై
యున్నా వందురు డార్విన్నాది మహనీయుల్ మానవాకారపుం
జిన్నెల్ జేష్టలు గోచరించెడిని వీక్షింపంగ నీలోన తి
మ్మన్నా! దగ్గరవాడవే కద మనుష్యశ్రేణి కేనాటికిన్

కం. తొమ్మిది వ్యాకరణాల్ సాం
తమ్ముగ బఠియించి రామ ధరణీశునకున్
నమ్మిన బంటగు హనుమన
తమ్ముడవా లేక యది కథా కల్పనమా!

ఉ. పుట్టకముందె మీ చిలిపి మోమున వార్ధక లక్షణంబులన్
బెట్టి సృజించునో నలువ పిల్లలు బెద్దలు నొక్కరీతిగా
బుట్టెదరేమి చిత్రమిది పోకిరి చేష్టలకున్ జగంబునన్
బెట్టినపేరు మీకులము పెట్టినపేరగు హాస్య విద్యకున్

ఆ.వె. చిత్రమైన నీదు చిలిపిచేష్టలు జూచి
బోకరింపు జూచి బొమలు సూచి
విస్మరింపగలదు విశ్వ మొక్క క్షణంబు
సంకటమును ప్రకృతి పంకిలమును

శా. ని న్నీక్షించి హసించనట్టి నరుడున్ నీపై దయాభావము
త్పన్నం బందనివాడు గానమునకున్ వైముఖ్యమున్ జూపువా
డున్నాడా సకల ప్రపంచమున నాయుర్భూతి నిండార తి
మ్మన్నా! హాస్యకళాసముద్రమున మమ్మోలార్పు మశ్రాంతమున్

కం. స్వాతంత్ర్యానంతరమున
నేతెంచిన క్షామమునకు హేతువులని మీ
కోతుల సంహారం బొక
నీతిపరుడు చెప్పె మొన్న నీ వెఱుగుదువా?

శా. లంకాయుద్ధమునందు రాముని పటాలంబై నిశాటాబ్ధి ని
ట్టింకుల్ సల్పినవారు మీ కులమువారేనంచు యాథార్థ్యమో
బొంకోపల్కెను వామలూరుజుడు తత్పుణ్యంబునం దక్కె మీ
కింకన్నూకలు నేలమీద కపిదేవీ! రామరాజ్యంబునన్

కం. కరువులకు కారకులు సో
మరి పౌరులటన్న నిజము మదినెంచక యే
మెరుగని మీపై బులుముట
దురాగతము గాదె రామదూతలరాణీ!

## గుంటూరు

ఉ. కొమ్మనతండ్రి భాస్కరు డకుంఠితతేజు డఖండ సత్కవి
త్వమ్మున గూడ తిక్కన పితామహుడేలగ పట్టణాలకున్
సొమ్మయి గర్తపట్టణము శోభిలు నాడును నేడు యావదాం
ధ్ర మ్మొకయెత్తు, గుంటురుపుర మ్మొకయెత్తు కళాప్రతిష్ఠలన్

ఉ. పెట్టినపేరు ముందడుగు వేయుట కెట్టి మహోద్యమంబులన్
బెట్టినపేరు మంజుల కవిత్వ పటుత్వరసైకపుష్టికిన్
బెట్టినపేరు గుండెగల వీరవరేణ్యజనుః ప్రశస్తికిన్
పెట్టినపేరు గర్తపురి విద్యకు గానకళా ప్రసిద్ధికిన్.

సీ. ఏస కొంచెములేని హృదయంగమంబైన సిసలైన తెలుగు రంజిల్లుచోటు
కట్టులో బొట్టులో కడమ సీమలయందు నగ్రతాంబూలంబు నందుచోటు
ఆజాను బాహువులై కోరమీసాల మగవారు దండిగా మసలుచోటు
కంటి కింపైన చక్కని యందగత్తియ లింటింట విద్యుత్తు లీనుచోటు

తే.గీ. అవల పల్నాడు కొండవీ డివల నిలిచి
జనన మెత్తిన చిఱుత బాలునకు గూడ
గురువులై వీరగాథలు గరపుచోటు
వీర భాషాభిరామ గుంటూరుసీమ.

## రేడియో

ఆ.వె. నాల్గువంద లిచ్చి నట్టిల్లు సగమిచ్చి
మెచ్చి చేతులార దెచ్చుకొంటి
రేడియోమెషీనుచేడియా! దయచేసి
పాడకుము! చవిడి పాతపాట!

ఆ.వె. సత్యతృష్ణలేని జన్మచ్ఛవాలైన
చదువుకొన్న మూర్ఖజనముతోడ
కలసి మెలసి తిరుగు గమ్మత్తు ధర్మాలు
చెప్పి నామనస్సు చెఱతువేల?

ఆ.వె. కులమతాల సౌధములు గూలిపోనీక
కాపలా యొనర్చు కవులచేత
వ్రాయబడ్డ ప్రాతరచనలు వినిపించి
బాధపెట్టవలదు వలదు రమణి!

ఆ.వె. వెన్న దొంగిలించు వింతచోరునితోడ
ప్రణయచర్య జరుపు రాధ చరిత
ప్రసవవేదనంబు బడుచున్న భూమిలో
శీలమెట్లు సృష్టిచేయగలదు

ఆ.వె. బంటుమొదలు రాజువఱకు లంచముదిన్న
వింతకథలు మాకు వినుచుచున్న
హృదయశాంతి జేయు యింపైన వార్తలు
వినుచు టెన్నడమ్మ! విన్నువాణి!

ఆ.వె. అన్నమునకు లోక మల్లాడుచుండగా
క్షామహతికి నేల జర్జరింప
వేణుగానభుక్తిబెట్టి యెన్ని యుగాలు
విశ్వచయము నేడిపింతువమ్మ!

ఆ.వె. రేయిబవలు భారతీయ సంస్కృతిపేర
గండశిలలు సూపి కథలు సెప్పి
గటికిపేదవాని కడుపులో గల చిచ్చు
గడపగలవె నీవు గగనవాణి!

ఆ.వె. జాతిదృష్టిలేని జహ్వారాఖ్యుని గూడ
కంటగించువారు గలుగు ధరణి
గొప్పదనుచు జెప్పుకొని మిట్టిపడు నీకు
ధరణిమీద స్వేచ్ఛ దక్కగలదె?

# గుణపాఠము

ఉ. పిట్టలమీద నాకు గల ప్రేముడి నన్నొక చిట్టిదొంగగా
నెట్టిన చిత్రగాథ జననీ! వినుపింతు తిరస్కరింప కూ
కొట్టి క్షమింపు మప్పటికి కొంచెము చీకటివడ్డ బైట గా
ల్పెట్టగ జంకునట్టి కడు పిన్నవయస్కుడ గ్రామరత్నమా!

చం. జనకుడు లేడు వీట, ననుజన్ముడు నేనును కన్నతల్లి భో
జనములుచేసి యింటి మొగసాల బరుండితి మంత నేదియో
తినుటకు దిండిలేని యొక దీనకుటుంబము మాగృహంబు పం
చను దలదాచుకోదలచి సంజకడన్ జనుదెంచె దీనతన్

ఆ.వె. ఆ కుటుంబి కొడుకు నాకన్న కొంచెము
లేతవాడు నోరులేనివాడు
సాకుచుండె నొక్క చక్కని కౌజును
ప్రాణసమత పంజరాన నుంచి

ఉ. పక్షిని జూచి నా కది యవశ్యము కావలెనంచు నుమ్మి రెం
డక్షులమీద రాచుకొని యంబకు జాలి జనింప మందమం
దాక్షరగద్గదోక్తి వినయంబున గోము నటించి వేడితిన్
వక్షముమీద వ్రాలి బహుభంగుల నేడ్చితి సన్నసన్నగన్

కం. చక్కగ న న్నోదారిచి
మక్కువ దీర్పంగ ననుగుమాత మృదువుగా
రొక్కమున కిత్తురా మీ
పక్కిని మావాని కనుచు పాంథుల నడిగెన్

కం. విత్తమనుమాట కించుక
మెత్తంబడి రధ్వగులును మిధ్యానిద్రా
యత్తుదయి యుండి కథ యా
వత్తును విని లేచి కొడుకు బావురుమనియెన్

చం. కుదిరిన బేరమున్ జెదరగొట్టిన పాంథుల పిల్లవాని చం
పుదమనునంత యాగ్రహము ముమ్మరమై విధిలేక కోపపుం
బదను నణంచుకొంచు దలవాల్చితి, పంజరమందు పక్షికా
ల్గదిలినయప్పుడెల్ల గదలన్ దొడగెన్ హృదయంబు చింతచే

శా. ఆలోచించితి పక్షికోసర ముపాయా లర్ధరాత్రంబుదా
కా లోబాంథకుటుంబముం గమన దీర్ఘాయాస భారంబునన్
దూలెన్ గాఢసుషుప్తి గర్భమున నిందుం దంధుడై యస్తమ
త్క్ష్మాగ్రంబున విశ్రమించె పెళుసెక్కెన్ జీకటుల్ గ్రమ్మరన్

తే.గీ. కూసె నడిజాముకోడి, దిగ్గోళకములు
ముమ్మరించిన చీకటి ముసుగు జొచ్చె
పేట నిశ్శబ్ద జడనిధి మాటు మణిగె
నప్పటికి నాకు నొక యుపాయంబు దట్టె

చం. నిసుగును నిద్రబుచ్చి కడు నేర్పున మంచము డిగ్గ మాతకున్
బొసగని నేర్పునన్ వెనుకముందులు సూచుచు శయ్య డిగ్గి, మా
నసమున రైలుబండ్లు పయనం బొనరింప విహంగచౌర్యసా
హస మొనరించితిన్ దనివినందితి రెండవ కోడికూతతో

ఉ. పిట్టను గూటితో నొక వివిక్తతలంబున దాచి యేమిలే
నట్టుల శయ్యపై నొరగి యవ్వలి కీడు దలంచి గుండియల్
దిట్టముజేసికొంచు కడతేర్చితి నాటి నిశీథ శేషమున్
పిట్టలు గూసె నల్గడల వేకువయయ్యె హరిత్తటంబులన్

కం. నిద్దుర మేల్కొని పాంథులు
ప్రొద్దెక్కిన దనుచు లేచిపోవుచు గుండెల్
గ్రుద్దుకొని వెదకసాగిరి
ముద్దు కవుజుకొఱకు నాల్గుమూలలు వగతో

శా. నేనున్ గొంచెము సానుభూతిపిలకల్ నేత్రంబులం బూని లో
నానందించుచు వారి తోడన విహంగాన్వేష గావించితిన్
దీనుండై విలపించు బాలకుని యార్తిన్ జూచి మా యమ్మయున్
గానీ కాసిడినట్టి దృశ్య మిపుడున్ గండ్లన్ బ్రవర్తించెడిన్

ఉ. వారు నిరాశజేసికొని పైనముగట్టుచు పక్షిపోక ని
ర్ధారణ చేయలేక బహుధా తలపోయుచు నుండునంత నా
నేరము బైటబెట్టుటకు నేర్చినదో యన గూయసాగె, చి
న్నారి విహంగమంబు సదనంబున నుండి కికాకిక ధ్వనిన్

కం. తెలవారినట్లు నేనున్
దెలవారిన మోముతోడ ధృతిచెడి భీతిన్
వలవల యేడ్చుచు నల్లన
నిలు సొచ్చితి పక్షిగొంచు నేగిరి పాంథుల్

ఆ.వె. తల్లి నన్ను బిలిచి దండించి వినిపించె
దొంగతనము వలని దొడ్డసేగి
తల్లిబోధకన్న దట్టంబుగా పిట్ట
నేర్పి పోయె నాకు నీతిగీతి

# జోలపాట

చిచ్చో హాయీ!
ఏడువకు నాయన్న!-ఏడువకు తండ్రి!

ఏడిస్తె నీకండ్లు-ఎఱుపెక్కుతాయి
ఎఱుపు జూచి తల్లి-కరిగిపోతాది ॥ చి॥

గంపంత బలగంబు-కలుగునాయన్న!
కన్నీరు నీకేల? కలంత నీకేల? ॥చి॥

పందిట్లో అబ్బాయి-పారికాడాడు
కొత్తపండని రాజు-కొంగుబట్టాడు ॥చి॥

ఊకొట్టి నాయన్న-ఉగ్గుతాగాడు
నీలాల యుయ్యాల-నిద్రబుచ్చింది ॥చి॥

కలలోన దేవతలు-కతలు సెప్పారు
నాయన్న నిద్దర్లో-నవ్వుకొన్నాఁడు ॥చి॥

పిరికిపాటకు తండ్రి-విసిగి యేడ్చాడు
వీరగానము లాల-పింపనవ్వాఁడు ॥చి॥

గిలకపండుకు తండ్రి-పలికి నవ్వాడు
నవ్వులో భావాలు-నాట్యమాడాయి ॥చి॥

ఉయ్యాలలో సూర్య-డుదయించినాఁడు
వంగడానికి సుప్ర-భాత మొలికింది ॥చి॥

బాలచంద్రునిచేత-పచ్చల్లబాకు
నాయన్న! నిను జూచి-నవ్వుకొన్నాది ॥చి॥

రెడ్డిరాజులనాటి–దొడ్డదుందుభులు
కన్నయ్య బుట్టంగ–కదలిమ్రోగాయి ॥చి॥

ఖడ్గతిక్కన పంచ–కల్యాణి హయము
సకిలించి నాయన్న–సరస నిల్చింది ॥చి॥

ఆంధ్రపౌరుషశక్తి–ఆంధ్రతేజంబు
అబ్బాయి, యుగ్గుతో–నారగించాడు ॥చి॥

కొండవీటిరెడ్ల–దండికీరితికి
బుజ్జోడు కట్టాడు–గుజ్జన్న గూళ్లు ॥చి॥

కృష్ణరాయని వీర–గీతాలు విన్న
ముద్దులయ్యకు మేన–పులకలెత్తాయి ॥చి॥

అభిమన్యుకథకు మా–అందాలకూచి
కళ్ళల్లొ కెంపుల్లు–కారాడినాయి ॥చి॥

భీమసేనునివాడి–బీభత్సుగరిమ
నా చిట్టితండ్రిలో–నాటుకోవాలి ॥చి॥

వీరబొబ్బిలికత్తి–వీగిపోయింది
కన్నయ్య ఖడ్గంబు–కళదప్పబోదు ॥చి॥

ఓరుగంటి పతాక–లొరిగిపోయాయి
బంధింపరాయన్న–పట్టుదట్టీలు ॥చి॥

గజ్జెల్ల మొలత్రాడు–ఘల్లుమన్నాది
పగవాని గుండెల్లు–భళ్లుమన్నాయి ॥చి॥

చక్కని నాతండ్రి–చదువుకెళ్ళాడు

సాగినాకనాతండ్రి–సాము నేర్చాడు
కొండల్లో పరసేన–గుండె జారింది ॥చి॥

కన్నతండ్రి లేచి–కాలూనినాఁడు
చినచిన్న గరిడీలు–సిద్ధమైనాయి ॥చి॥

దోగాడరాయన్న! –దోగాడరన్న!
నాగులేటి వీర–నాట్యరంగాల ॥చి॥

కలికి కమ్మని తెల్గు–కవనగంగమ్మ
చక్కనయ్య నోట–జాలువాఱాలి ॥చి॥

ఆయుస్సు మాయన్న–కమరియుండాలి
శ్రేయస్సు దేశాల–చిందులాడాలి ॥చి॥

# ఒకమాట

కుదుపులేక పదం రాదని నా నమ్మిక–స్వరాజ్యలబ్ధితో దేశంలో దుశ్శక్తులు, సచ్ఛక్తులు విచ్చలవిడిగా లేచి వీరంగాలు వేయడం, ధర్మం గాయ పడడం, కవుల్ని కదపడం, వారు నాలుగనడం అదొక కావ్యంకావడం పరిపాటైపోయింది. అటువంటి కావ్యఖండాల్లో యిది అయిదవది. సంఖ్య యెంతవరకు పెరుగుతుందో చెప్పడం కష్టం. మునుపు వంచన, అవినీతి, వర్గదృష్టి, మతపిచ్చి, యొక ముసుగులో యుండేవి. ఇప్పుడాతెర కాస్త పోయింది. స్వేచ్ఛగా రంగం మీద నిల్చి పరస్పరం సవాళ్ళకు తయారైనయి. కవియన్నవాడి చూపు, దాని పరిమితి, అసలు రంగు, తూకం, వైశాల్యం అటో యిటో తేల్చుకోడాని కిది బలే తరుణం. క్షుభ్యమాచమై చురుకెక్కియున్న దేశం మోసాన్నిట్టే పసిపట్టగలదు. కవుల కిది పరీక్షాయుగం. విశ్వధర్మం, విశ్వమతం, ధీరవాక్కు నేడవసరం. అష్టకష్టదేవతాకటాక్షవీక్షణానికగ్గమైన నవ్యయుగాన్ని నేటి కవి యెటు నడిపించి ధన్యుడౌతాడో కాలం నిర్ణయిస్తుంది. భయకంపితమై హింసాపీడితమై యున్న ప్రజానీకానికి కవివాక్కు ఆశా కిరణాన్నందించాలి. మిట్టపల్లాల్ని సమంచేసి చూపాలి. హింసిత ప్రజల మూకీబాష్పాలకు నోరిచ్చి రచ్చకెక్కించాలి. కవుల ఆత్మవేదనోపశమనాని కిది ఒక సాధనం. దేశం చిమ్ముతూయున్న కన్నీటి చెమ్మలే యీ కావ్యం. వినండి. విమర్శించండి. నమస్కారం.

జి. జాషువ

# నేను

సీ. నివసించుటకు చిన్న నిలయ మొక్కటి దక్క గడనసేయుట కాసపడను నేను
ఆలుబిడ్డలకునై యాస్తిపాస్తులు గూర్ప పెడత్రోవలో పాద మిడను నేను
నే నాచరించని నీతులు బోధించి రానిరాగము తీయలేను నేను
సంసారయాత్రకు చాలినంతకు మించి గ్రుడ్డిగవ్వయు గోరుకొనను నేను

ఆ.వె. కులమతాలు గీచుకొన్న గీతల జొచ్చి
పంజరాన గట్టువడను నేను
నిఖిలలోక మెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు, విశ్వనరుడ నేను

సీ. వాస్తవజ్ఞానసంపత్తి ఖూనీ చేయు గాథలు జీర్ణంబుగావు నాకు
ఒకజాతి శ్రేయస్సునకు సాయ మొనరించు కపట సంస్థలు నాటకములు నాకు
అనుభవంబునకు గిట్టని నభఃకుసుమ వేదాంతముల్ ప్రబల స్వార్థములు నాకు
ప్రజల రక్తంబు నాస్వాదించు రాజకీయములు గుండెలకు భారములు నాకు

ఆ.వె. సహజమైన ప్రకృతి సౌఖ్యంబు లొక వ్యక్తి
దొంగిలించి మనుట దొసగు నాకు
నిఖిలలోక మెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు, విశ్వనరుడ నేను

సీ. తలిదండ్రిలేని బిడ్డల జూచి కన్నీరు దానంబుచేయు నేత్రములు నావి
జంతుకోటికి గల్గు స్వామిభక్తిని మెచ్చి తృప్తినందెడు నవ్యదృష్టి నాది
సకల కార్మిక సమాజముల జీవిత కథానకము లాలించు కర్ణములు నావి
కఠినచిత్తుల దురాగతములు ఖండించి కనికార మొలికించు కలము నాది

ఆ.వె. దొడ్డపదవులెక్కి గడ్డిమేసెడువారి
నెత్తిపొడుచు చిత్తవృత్తి నాది
నిఖిలలోక మెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు, విశ్వనరుడ నేను

సీ. అంగనామణుల దాస్యక్రూరబంధముల్ చిక్కముల్ చేయార వ్రక్కలించి
అంటరానితనంపు టడుసులో దిగబడ్డ యనుజుల దుఃఖంబు నపనయించి
నవ్యభారత సుధానగరంబులో జిచ్చు దరికొల్పు ప్రబలశాత్రవుల నణచి
ప్రేమసంగతమైన విద్యార్థి జగమున నగ్నభావావేశనదులు మలిపి

ఆ.వె. సౌఖ్యసౌరభంబు సర్వభూములు నిండ
పాడుకొందు దిశల నాడుకొందు
నిఖిలభువనమెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు, విశ్వనరుడ నేను.

సీ. సకల విశ్వంభరా సంస్కారి జడదారి గాంధి జన్మించిన గడ్డయంచు
జీవకోటుల నమస్కృతుల కగ్గంబైన బుద్ధు దుద్భవమైన భూమియంచు
రామాజనోద్ధారి రామమోహనసూరి కాలుమోపిన జగానేలయంచు
పరమార్థమను సుధాభాండ మందించిన పరమహంసలగన్న ధరణియంచు

ఆ.వె. యురము నిక్కబల్కి యుద్రేక మొదవించు
కవనమల్లు నవ్యకవినిగాను
నిఖిలలోక మెట్లు నిర్ణయించిన నాకు
తరుగులేదు, విశ్వనరుడ నేను

## మాత

మ. కులగోత్రంబులుగల్గు బిడ్డడవు నీకు న్నీవు స్నేహించు పి
ల్లలకున్ గల్గెడి నంతరంబులని బాల్యంబంద విద్వేషపున్
మొలకల్ నాటి యహంకృతిన్ గఱపి తప్పుంద్రోవ జూపించు మా
తలు శాంత్యున్నతికిన్ విషక్రిములు విద్యామందిర స్తంభముల్

సీ. కొడుకుల నేరాలు మడిచి దాపున నున్న పరుల నెత్తులమీద బారవైచి
అలఘు మోహమున బిడ్డల యేడ్పు సవరింప తీయతీయని చిరుతిండ్లు నేర్పి
ఆత్మజాతుం డవాచ్యములు పల్కుచునున్న వద్దు కాదన కెత్తి ముద్దులాడి
సుతు లుగ్రరోగపీడితులైన సమయాన ఔషధంబీక దయ్యముల కెఱగి

ఆ.వె. ఈడురాకముందె వేడుకకోస మ
ర్థంబులేని పెండ్లితంతు నెఱపి
భావిజీవితములు పాడుసేయు వధూటి
తల్లిగాదు, జంగుబిల్లిగాని

ఉ. పెద్దలు సేకరించి పడవేసిన ద్రవ్యము బోలెడంత మా
వద్ద గలాదు, కూటికిని బట్టకు మాకు గొఱంతలేదు, మా
ముద్దుసుతుండు, మా కనులముందు నటించిన జాలు నెందు కీ
విద్దెలు మాకునందు రవివేకిను లమ్మలు వేఱుపుర్వులై

ఉ. బూచులజూపి బాలకుల పూపమనస్సుల మోసులెత్తు వీ
రోచిత ధీరభావముల యుబ్బు లడంచుటచేత, భీరుతా
నీచగుణంబు లేర్పడుట నేరరుకొందరు తల్లు లిట్టి పై
శాచికవత్సలత్వములు జాతికి తీరని వజ్రఘాతముల్

ఆ.వె. ఆదిగురువులైన యంబయు నయ్యయు
మృదువులైన సుతులయెదదలందు
వక్రగుణము జిల్కి పట్టభద్రులజేయ
గొప్పపదవిదక్క గుణమురాదు

## నవ భారతము

కం. నిక్కంపు భరతపుత్రుల
మ్రొక్కులు ఫలియింప గాంధి మునితపమున జే
జిక్కిన స్వేచ్ఛాస్వర్గము
దక్కునె? మనకనుచు పిచ్చితలకాయలకున్

కం. నవభారతోదయంబున
యువకుల చిత్తములలోన నుత్సాహ ఝరుల్
ప్రవహించి పల్లవించెను
గవితోద్యానములు సత్యగంధాఢ్యములై

సీ.	జాతీయతాపదేశమున బాదులు ద్రవ్వి నాటుచున్నారు పోరాటములను
వాస్తవదృష్టి చొప్పడనీక భయపెట్టి చదివించుచున్నారు చచ్చుకథలు
ప్రాచీన శిల్పసంపదలన్న మిషపెట్టి చేకూర్చుచున్నారు జీర్ణశిలలు
భరత సంస్కృతికి డెబ్బది యర్థములు చెప్పి పట్టించుచున్నారు వర్గదృష్టి

మ.	సకలదేశ మహిత సౌభాగ్య సంపత్తి
మనకు గిట్టదనుచు మభ్యపరచి
కులమతాల దొడ్డ గుండాలు ద్రవ్వించు
స్వార్థపరుల దాడి నరికట్టి దేశంబు
పరువునిలుపుకొమ్ము భరతపుత్ర!

మ.	తతసందేహనివర్తి సల్పెడు పదార్థ జ్ఞానశాస్త్రంబు వి
స్తృతమై కన్నులు విచ్చు కాలమున గాంధేయ ప్రజారాజ్యశో
భిత సింహాసనసీమలో నవనవ స్వేచ్ఛాయుగ స్వచ్ఛమా
రుతముల్ వీచెడుచోట సాగవు ఫకీరుల్ పాడు గీతార్థముల్

సీ.	మలుపుచున్నారు త్రోవలు సన్నసన్నగా వాల్మీకిముని తపోవాటికలకు
పలుకుచున్నారు నీతులు తీయతీయగా శాసనసభ్యతాస్థానములకు
భాషించుచున్నారు వర్ణాశ్రమ క్రూర ధర్మోద్ధరణకు నర్థాంతరములు
చదివించుచున్నారు కొదమ జిహ్వలచేత రాజకుటుంబాల రక్తరభస

ఆ.వె. అభ్యుదయము చిందియాడు దేశములతో
మైత్రి సల్పి మనసు మార్చుకొన్న
మానసీయ రెట్లు మమ్ముద్ధరింతువో
న్యాయదృష్టిగల్గు నవయుగంబ

మ.	కవిరాజుల్ కవిసార్వభౌములని బంగారంబు వర్షించి, యు
త్సవముల్ సల్పి బహూకరించితివి నీదర్బారులో, విశ్వమా
నవ సౌభ్రాత్రము సృష్టిచేయగల గ్రంథం బొండు నిర్మించి, యా
హవదాహంబు హరించి సంకుచితభావావేశముల్ మాన్పిరే?

మ. చిరకాలంబు మతప్రచారకులు కుస్తీపట్లు నేర్పింప, సో
మరులై, ప్రాక్తనజన్మకర్మల జగామద్యంబు సేవించి దు
ర్భరదాస్యంబు సహించు దేశజుల నిద్రల్వాయ కష్టాలతో
చురుకెక్కించిన నీకు సందెడు నమస్సుల్ నవ్యరాజ్యేందిరా!

మ. దొరలన్ దేవతలంచు మెచ్చుకొని యుద్యోగాలు సాధించి, యా
దొరలన్ దోలెడువేళ, గాంధిని మహాత్ముండంచు సేవించి, య
క్కరదీరన్ నడువీధిలో నతని రక్తంబాని, దూషించు మే
ల్దొరలున్నారు సుమీ! ప్రజాభ్యుదయ శత్రుల్, చిత్రచిత్రాశయుల్.

సీ. వ్యవహారమున కందుబాటుగాని యనాది యుగధర్మముల గొప్ప లుగ్గడించి
యనుభవంబునకు గిట్టని యయోమయములౌ వేదాంతములచేత బెదురుబెట్టి
అనుమానములకు దోహద మిచ్చు కపటంబు స్వార్థసంస్కృతి కుపాయములుసెప్పి
పసిపిల్లకేని విశ్వసనీయములుగాని గారడీ బ్రదుకు లేకరువుపెట్టి

తే.గీ. పుట్టలకు గుట్టలకు నరుల్ బుట్టినట్టి
బుట్టు కందని కల్పనాభువనములను
ముకురమున జూపు నైంద్రజాలికులు గలరు
కొదవ విద్యార్థి! కనిపెట్టి బ్రదుకవోయి.

## ఓటు

ఉ. కూటికి గుడ్డకున్ బ్రజలు, కొంగరవోవుచునుండ నీటుగా
మోటరుబండ్లపై నగదుమూటలతో కలవారి వోటు భి
క్షాటన సాగుచున్నయది జాగ్రత! దేశనివాసులార! మీ
యోటులు స్వీయభారత సముజ్జ్వలగాత్రికి సూత్రబంధముల్.

మ. ఒక పర్యాయము చేయి జారితిరి మీ వోటుల్ దగాదేశనా
యకులన్నమ్మి, సమస్త కష్టములపాలై దేశ మల్లాడె, వా
లకముల్ మారిచి వారు, వారి హితులున్ లాలింపగా వత్తు రిం
డ్లకు బండ్లెక్కి, ప్రజాహితార్థులవలెన్ ద్రవ్యంబు వ్రోగించుచున్

చం. చివికి చరిత్రచే నలిగి చేతికి జిక్కక జీర్ణమైన ధ
ర్మవులను, దుష్టరాజుల ప్రభుత్వములన్ జొనిపించి, సర్వమా
నవసమతాప్రశాంతపరిణామ యుగాన, మతప్రవృద్ధికా
యువులను బోయు వంచకులు నుందురు కొందరు రామబందులై

కం. పదవులకుగాక దేశా
భ్యుదయార్థము గాదు వీర లూరూరి ప్రజన్
ముదమార బల్కరించుట
పదు లిరువదు లిత్తుమనుట పౌరప్రముఖా.

శా. యమ్మెల్సీలు నసెంబ్లి మెంబరులు మున్నార్జించి రెంతేని ద్ర
వ్యమ్మున్ మేడలు గట్టినారనుచు నీ వభ్యర్థివై నిల్చి, దే
శమ్మున్ వంచనచేయ జూచెదవె, నీ స్వార్థంబు గీర్తించినన్
వమ్మైపోవును నీవు కట్టిన ధరావత్తున్ బ్రజాప్రేమమున్

సీ. చూచినావా? ఘనక్షుద్బాధితంబులై ప్రాణాలు బలిగొన్న ప్రాంతములను
కనినాడవా? మానమును దాచుకొనలేక యిలుదాటిరాక చింతిలెడు సతుల
నించినావా? కంటినీరొక్క చిటికెడు నిలువ నీడలులేని నేలమీద
వ్యయపెట్టితివె? యొక్క దయగల వాక్యంబు కదు ననాథప్రేతగణముమీద

ఆ.వె. లోకమెట్టు చన్న నాకేమి యనుకొని
ధనము సేకరించి దాచుకొనుచు
నదను చిక్కెననుచు నభ్యర్థివైతివా?
మాటలేల దొరక దోటుభిక్ష.

సీ. తిరుపతి వేంకటేశ్వరుని కొండల మందిరాల నాయుష్కర్మశాల దెఱచి
పొన్నూరిపురిలోన నున్నతోన్నతమైన ఆంజనేయుని విగ్రహమును నిలిపి
అఖిలాంధ్ర భరతనాట్యప్రదర్శనముల దయతోడ నాయకత్వము వహించి
స్త్రీజనాభ్యుదయ వార్షిక మహోత్సవముల తేరగా విందుల నారగించి

ఆ.వె. నేలమీద కాలు నిలుప కంబరవీధి
ఖేచరుల విధాన క్రీడ సల్పి
ప్రజల కొఱకు పాటుబడ్డాడనని పల్కు
మంత్రివర్యు లింక మాకు వలదు

# సంస్కృతి

సీ. హృదయానలేని లాహిరీ భక్తిభావంబు నటియించి యభివందనంబు లిడుట
తనవారు కాకపోయిన మహేంద్రుడకాని పొరపొచ్చెముల నాడిపోసికొనుట
అవసరంబుల పట్టులం దిండ్ల కేతెంచి పొందులు గావించి పూసుకొనుట
శపథాలు పదివేలు సలిపి యాసలు గొల్పి విసిగించి మొగము దప్పించుకొనుట

ఆ.వె. కట్టుబాటులేక, కార్యక్రమములేక
కష్టములకు లాభనష్టములకు
తెలివిసుంతలేక తలవ్రాత కేడ్చుట
నగ్నమైన నేటి నాగరకత

సీ. బడుగుపేదలకు బొక్కెడు కూడు బెట్టక మృతుల కేటేట నామెతలు పెట్టి
జోహారు లొనరించు జోగి నవ్వల నెట్టి జడజంతువులకు హస్తములు మొగిచి
తలిదండ్రిలేని బిడ్డల నాదరించక వల్మీకములునిండ పాలుబోసి
మగడు జచ్చిన కూతు నగచాట్ల పాల్సేసి నింబమ్రాకులకు పెండ్లిండ్లు సలిపి

తే.గీ. దగ్గులకు తుమ్ములకు గుండె తల్లడిల్ల
మేలియత్నంబులకు వాయిదాలువేసి
పరము నరచేత జూపు సాపాటుగాండ్ర
బ్రతుకుదెరువుల వికృత సంస్కృతములు మావి

# పిలక

కం. కుచ్చుల క్రాపింగును గని
మచ్చరపడి పిలకజుట్టు మారుమొగంబై
కచ్చుకు తల కావలిదరి

ఉ. దువ్వెన వచ్చి ముచ్చటగ దువ్వుచు, జిక్కెడలించి, పిల్కకున్
బువ్వులు బెట్టి, పాపటిని ముంగలిజుట్టున దీర్చి, దిద్దుచున్
నవ్వి యితం డెవండొ, యధునాతన నూత్న విచిత్రజాతి మే
ల్పువ్వుల రంగడంచు దలపోయుచు బిల్కను బల్కరించుచున్

కం. నీకును ముంగలిజుట్టున
కేకాలమునందు చెలిమియే లేదుగదా
యేకముగ నొక్క తలపై
బ్రాకితిరి శుభంబటంచు పకపక నవ్వెన్

కం. అని పల్కు దువ్వెనం గని
యను నిట్టుల బిల్కజుట్టు యాగ్రహమున చా
లును చాలధునాతనతకు
సనాతనత కెన్నడేని జతపడగలదా?

కం. పడమటికి దూరుపునకున్
బడ దెన్నడు దొరలు దెచ్చి పడవైచిన త
ప్పుడు దది నడుమంతరపుది
మడితో నియమములతోడ మసలెదుదానన్

కం. నేనైన నుండవలయున్
దానైన న్నిల్వవలయు దలమీద నటుల్
గానియెడ నుభయ కులములు
ఖూనీగావలయు వట్టి గుండుండవలెన్

కం. సొగసుల దువ్వెన విని పం
డ్లిగిలించుచు ననియె నిట్టు లీకాలమునన్
దగ విట్టి యుగ్రనిష్ఠలు
పగల కివే దొడ్డ రాచబాటలు మిత్రా!

కం. అంగనల దృష్టి కిప్పుడు
ముంగలి జుట్టే ప్రియంబు ముమ్మాటికి, ని
క్కంగూడ దిపుడు పిలకలు
భంగము వాటిల్లు రచ్చపట్టుల కెక్కన్

కం. అని పలికి పోయి మరుచటి
దినమున నేతెంచి, పిలక తెగి దీనముగా
నణగారి ముందు జుట్టున
కనుకూలంబగుట జూచి యబ్బురపడియెన్

## శ్రద్ధాంజలి

ఉ. రెండవ బాపుజీ యన జరిత్రకు నెక్కినవాడు, జాతికిన్
గుండె, స్వతంత్రభారతికి గూర్చెదువాడు, పటేలుమంత్రి మా
ర్తాండుడు గ్రుంకినంత, భుజదర్పసమన్వితకున్ సవిత్రికిన్
గుండెలు జారె, మూడుపదికోట్ల కనుంగవ చెమ్మగిల్లగన్

ఉ. ఉక్కుమనుష్యుడన్న నుడి కుజ్వలభూషణమై, సబర్మతీ
భిక్కునెడంద నాచికొని, పేరు గడించినవాడ నీతికిన్
బక్కను బల్లెమైన వలభాయిపటేలుని సింహగర్జచే
నెక్కటి వీరులై నిలిచి రిప్పటి చప్పని దేశనాయకుల్

సీ. చండభాస్కరుని మచ్చరకించు తేజస్వి జహ్వారాఖ్యుని గుండె జారిపోవ
రాష్ట్రాధిపతి వీరరాజేంద్రబాబుని సహజగాంభీర్యంబు సన్నగిల్ల
ఆసేతుశీతనగాగ్రపర్యంతంబు పెనువిషాదచ్ఛాయ విస్తరింప
బాపుజీ కిత డనుప్రాసంబనుచు నూరడిలు పేదవాని కన్నులు చెమర్ప

ఆ.వె. కసటులవము లేని కన్నీటి మణిమాల
లఖిల భరతపుత్రులం జలింప
బారుడోలియోద్ధవీరుండు సర్దార్ ప
టేలు హేళి, పండి రాలిపోయె

కం. నూటికి సర్దా రందురు
మాటవరుస కంతెకాని మన మంతిరి ము
క్కోటికి సర్దా రగుచున్
నాటె న్నవభారతంబున న్నవశక్తుల్

ఆ.వె. కొండవంటి తనువు, కొండంత భుజశక్తి
గలిగియుండి, భరతఖండలక్ష్మి
వల్లభాయి మంత్రి పరమపదింపగా
గుండెలేనిదయ్యె గుండె గలిగి

శా. ఆ సర్దారుని భౌతికంబయిన దేహం బొక్కటే దిక్కులన్
మాసెన్ మాయదు మాయదాపుశుభరంహ త్సింహగర్జాధ్వనుల్
ధీసామ్రాజ్య ధురంధరత్వమును, తద్దీక్షామహాయజ్ఞవీ
క్షాసక్తి నడిపించుకొందుము స్వరాజ్య ప్రాజ్య సంసారమున్

మ. నడిసంద్రాన తుపానుదెబ్బల జడిన్ నానావ్యధల్ గుందు, నీ
కొడుకుం గుఱ్ఱల నౌకలో విడిచి సంకోచంబు లేకుండగా
యెడమైపోయితె వల్లభాయి బడభాయీ! గాంధి దర్శింప, నీ
యడుగున్ జాడలు దక్క మాకు నిక లేవా? యంతిమాదేశముల్

## తేనెపట్టు

కం. క్రొందేనెపట్టు నొక పూ
పందిటిలో జూచి యాసపడి హస్తంబున్
ముందునకు సాచి, కదిపితి
నందొక జిరుకొమ్మ నళుల నదలించుటకై

ఆ.వె. ఆదమరచి తేనియల ధనాగారంబు
కాలు గదపకుండ గాచియున్న
గండుటీగగములు కదలిక గమనించి
తతరమున ఝూంకృతములు సలిపె

కం. కత్తులు గొని రణమున కా
యత్తంబగు వీరయోధులట్లు మధుపముల్
మొత్తమయి లేచి పొడిచెన్
గత్తులతో నన్ను నొక్క క్షణకాలమునన్

ఆ.వె. నిప్పు సోకినట్లు నిఖిలాంగకంబులు
జర్జరించి, గుండె జారిపోవ
తేనెపట్టుమాట దేవు డెఱుగునంచు
తొలగిపోయినాడ దూరమునకు

కం. తుమ్మెదల దృష్టి కేనొక
తుమ్మెదనై దూరమునకు దొరగెడు నన్నున్
గ్రమ్ముకొని కుట్టసాగెన్
జుమ్ముమనుచు వెంటనంటి చురుకుచురుకుగన్

కం. నాలో నొక లక్షాంశము
బోలని తుమ్మెదల ధైర్యమును, సాహసమున్
నాలో లేదా యనుకొని
యాలోచనచేసి, హృదయ మారాటపడన్

ఆ.వె. తిరిగి వచ్చి పుట్టతేనెపట్టునుబట్టి
త్రెంచి నేలమీద ద్రెళ్లవయిచి
ఆలకించినాడ నళికుమారుల మనో
వేదనలను, ఆర్తనాదములను

కం. పదివేల గదులతో, ప్రతి
గది కొక చిన్నారి మాధుకరశాబముతో
చిదికిన మధుకోశము నా
మది కొక రాజాంతిపురముమాదిరి దోచెన్

కం. అందొక శిశుమధుకర మా
క్రందన ఝుంకారరవళి గావించుచు నా
ముందరకు నొరగి యశ్రుల్
జిందుచు నిట్లనియె, నింద సేయుచు నాతో

కం. ఓరీ! దురాత్మ! బిడ్డలు
లేరా? యొక్కింత కరుణలేదా? మమ్మున్
నోరెరుగనట్టి నిసుగుల
గారించుట నీకు వేడుకా? దౌష్ట్యంబా?

కం. యూయేల దిగని పసరుం
బ్రాయపు బిడ్డలను మమ్ము బాధించితి వ
న్యాయముగ, నేలపాలై
పోయెన్ మాబ్రదుకు లెంత పుణ్యాత్ముడవో!

కం. నరుడంటుకొన్న కొడుకులు
మరణితులని మామిళింద మాతలు మరలన్
గరుణించి పెంచరది మధు
కరకులమున కట్టుబాటు, కరుణారహితా!

కం. మనుజు డంటెనేని మధుకోశమున నొక్క
జుక్క తేనె మాకు జిక్కకుండ
త్రాగి పోవుచుంద్రు తల్లులు దండ్రులు
ప్రక్కమీద మమ్ము బారవైచి

కం. మాతీయని నగరంబును
ఘాతుకమతి వగుచు మంట గలిపితి వకటా!
మా తల్లులంద్రు "నరునకు
నీతి హుళిక్కను"చు నేడు నిజమయ్యెగదా?

కం. పొమ్మింక మేము నీదు మొ
గమ్మం జూడంగరాదు కలుషం బనుచున్
దుమ్మెద పిల్లలు తమ ప్రా
ణమ్ములు గోల్పోయె నశ్రునయనంబులతో

కం. వంచిన తల యెత్తక నే
త్రాంచలములు చెమ్మగిల్ల నపరాధము గా
వించితినని చెంపలు వా
యించుకొనుచు మరలి యింటి కేగితి నంతన్

## సదాచారము

కం. కలదొక పట్టణ మచ్చట
బలవంతుడు బక్కవానిపై నెక్కి హుళా
హళి స్వారిజేయు, నాతని
పలుకుబడికి దిక్కు లదరిపడి తలవంచున్

ఆ.వె. వారిపంచజేరి వ్రాయుచుండెదరు స
త్కవులు పెద్దపెద్ద గ్రంథములను
అందులోని చెత్త నాహార మొనరించి
నెమరువేయుచుండ్రు నిఖిల ప్రజలు

కం. ఋతమట నన్ృతంబగును న
నృతము ఋతంబగుచు తల్లక్రిందగుచుండున్
బ్రతుకులు ప్రజలకు, దొరుకును
మృతుల కచట పెద్దపెద్ద మేడలు మిద్దెల్

కం. కలిగిన బలవజ్జాతులు
పలావు దిని విసరు పత్రభాజనముల నెం
గిలికూటికొఱకు పేదల
కలహంబులు సాగు [illegible]

కం. అందొక దరిద్రు డచ్చటి
సుందరభవనమున మధుర సూపంబులతో
విందారగించు ధనికుల
ముందర బిట్టార్చి ప్రాణములు గోల్పోయెన్

కం. అన్నము దినునపు డన్యుల
కన్నులలో బడుట తప్పుగా దలచెడు సం
పన్నుల కాతని చావున
కన్నం గన్గొనుట పాతకంబై తోచెన్.

కం. ఈడిచివేయం డెవడో
గాడిద యిటజచ్చి నిష్ఠ గంగగలిపె నం
చాడుచు నుగ్రాకృతులై
కూడు విడిచి లేచి చల్లుకొనిరి జలంబుల్

చం. హృదయవిదారకంబయి సహింపని వేదన గూర్చి దేహమున్
కడుపుదరిద్రజన్ముని యకాలమృతిన్ గని కావ్యబాష్పముల్
వదలక వ్రాయుచుం డ్రచటిపండితకోటి యుగాలనాటి దు
ర్మదుల వసుంధరాధిప సురాసురవృద్ధ పరార్థగాథలన్

ఉ. చచ్చిన పేదవాడు కడసారి విదల్చిన కంటినీటిలో
వెచ్చదనంబు తత్పురము వీధుల నున్నత కుడ్యపంక్తిలో
జొచ్చి, సజీవమై యెదురు సూచుచునున్నది ధర్మదేవతన్
హెచ్చరికించుచున్ ఫలితమే యవతారము దాల్చి వచ్చునో

## కొడుకు

ఆ.వె. తినును, నిద్రవోవు, పనిబాట చేయదు
కలహములను దెచ్చి కాళ్లసాచు
వరుస దప్పకుండ ప్రతి పరీక్షయు దప్పు
తప్పు గురులమీద దగులవేయు

తే.గీ. చదువుకొమ్మంచు తల్లి హెచ్చరిక చేయ
గదిని శయనించి యభిసారికలను చదువు
వ్రాసికొమ్మని తండ్రి కోపంబుచేయ
కలము విరుగంగ ప్రేమలేఖలను వ్రాయు

ఆ.వె. పాఠ్యపుస్తకాలు బట్టలు తెగనమ్మి
పొరుగు పల్లెలెల్ల దిరిగివచ్చు
యెందు కీ షికారు లీవేష మేమన్న
బడికి సెలవులంచు బదులు సెప్పు

ఆ.వె. జాబు పోస్టుజేసి సరగ రమ్మని పల్క
వినయ ముట్టిపడగ స్వీకరించు
మరచినాడనంచు, మరునాడు కొనివచ్చి
చెక్కుజెదరకుండ చేతి కిచ్చు

ఆ.వె. వెడలిపొమ్ము తిండి బెట్టము నీకంచు
కోపగించి తండ్రి కొట్టబోవ
తిరిగి కొట్టబోవు దిట్టిన దిట్టును
పెండ్లి చేయుడంచు పెనుగుబెట్టు

ఆ.వె. శస్త్రమునకు గాక, సత్చికిత్సకు గాక
మంత్రతంత్రములకు మణగిపోక
యూరకున్న నెదిగి యురువై సతాయించు
కణితివంటివాడు కలికి కొడుకు

## కొత్తకాపురము

ఉ. ఆకటిచిచ్చుతో వలపుటారతు లిచ్చుచు, నీ దయారస
శ్రీకయికొంగు బట్టుకొని చెంగట నిల్చిన భారత ప్రజా
నీకము నేగతిన్ దనిపి నేర్పు నీ జాతి కభీప్సితార్థముల్
[illegible]

మ. ఒక యేడాది గతించిపోయినది నీవుద్భూతమై, యిప్పు డిం
కొక యేడాది గమించుచున్నయది, లేదొక్కింత సౌఖ్యంబు, కా
టకముల్ కర్వులు, కారుమబ్బులును నాట్యంబాడు నట్టింటిలో
మకుటంబుల్, మణిపీఠ మేమిటికి, భామా! నవ్యరాజ్యేందిరా!

ఉ. వచ్చె నవీన భారత రిపబ్లికు రాణి, యశోకచక్రమున్
బచ్చని శుద్ధఖద్దరు శుభప్రతిపాదకమైన గాగరా
కుచ్చుల చీరతో ప్రజల కోర్కెలు దీర్ప, కవన్మహేశ్వరుల్
గ్రుచ్చిన పుష్పమాలికలకున్ రసపుష్టి ననుగ్రహించుచున్

ఉ. మూడవ యుద్ధరాక్షసికి బూడిదరాసులు భుక్తిపెట్టి, యీ
రేడు జగంబులన్ గెలిచి, యేల్బడిచేయ దలంచువారికిన్
వ్రీడ ఘటించి, గాంధిముని పెట్టిన విశ్వసమత్వ ధర్మమున్
మూడు జగాల నాటుము, ప్రపుణ్యవతీ! నవభారతావనీ!

మ. క్రిమిబాంబుల్ త్రసరేణుబాంబు లనురక్తిన్ సృష్టి గావించుచున్
సమరజ్వాలలు రేచుచున్నయది పాశ్చాత్య ప్రపంచంబు, దు
ర్దమ సత్యాగ్రహ ఖడ్గధారిణి, ప్రమాదంబు న్నివారించి, నీ
కొమరుం గద్దియ నెట్లు నిల్పుకొని మాకున్ శాంతి సంధింతువో!

మ. గుడికిన్ గోటకు, బూలతోటలకు శంకుస్థాపనల్ సేయుచో
కడుపుల్ నిండ వమాయకంబయి బుభుక్షాపీడితంబైన, బో
లెడుదేశంబు విశుష్కితాంగమయి జాలిం దూలెడిన్ బాపుజీ
యడుగుంజాడల సాగనిమ్ము భవదీయస్యందన శ్రేష్ఠమున్

ఉ. రూకకు శేరుబియ్యమగు రోజులు లేవు పురాచరిత్రయం
దాకటిచావులున్ జిలిపిహత్యలు వార్నిక తారతమ్యముల్
జీకటి బేరసారములచే నపసవ్యముగా నటించు, నీ
పోకిరి కాలవాహరథమున్ మరలింతువొ! రాచబాటకున్

సీ. సంధింతువా? పరస్పర బంధుభావంబు సకల మానవ మనోబ్జములయందు
చెండింతువా? సంకుచిత మతోన్మాదంబు పరమార్థ విజ్ఞానపరులయందు
సమయింతువా? బుభుక్షాపిపాసల పెల్లు బడుగు దీనుల నాలి కడుపులందు
వెలిగింతువా? జ్ఞానవిద్యాప్రదీపంబు సంస్కార రహితాత్మ జన్మలందు

ఆ.వె. జాలి కనికరంబు సవరింతువా తల్లి!
నల్లబేరగాంధ్ర యుల్లమందు
రెండు వత్సరాలు నిండినిండనిదాన!
కొత్తరాచరికము కుఱ్ఱదాన!

## ఆశారేఖ

మ. ఖరవర్షం బతిదుష్టమైనదని వక్కాణించు కార్తాంతికుల్
శిరముల్ వంప, ఖరాబ్దపాదమున, ప్రాచీన ప్రతిష్ఠాలతల్
విరియంబూయగ గర్త పట్టణమునన్ విద్వత్కవీట్పూజలన్
జరుపన్ జొచ్చిరి, పచ్చబారు నిక భాషాభవ్యకాంతారముల్

శా. మున్నెన్నండు కళాసరస్వతులు సంపూజింపలేదంధ్రు సం
పన్నుల్ జైర్మను లీపురాన, నిపు డామచ్చున్ దొలంగించి శ్రీ
పున్నారాయవణిక్శిఖామణి కళాపూజారిరంసాత్ముడై
మన్నించెన్ గవులన్ రసజ్ఞతకు సన్మార్గంబు జూపించుచున్

మ. మొనమొన్నన్ జితకాశియై తెలుగుభూముల్ మెచ్చ విఖ్యాతిదా
ల్చిన మాజీ సచివప్రకాండుడగు సంజీవాఖ్యు డధ్యక్షుడై
కనువిందుల్ పొనరింప గర్తపురి విఖ్యాతాంధ్ర విద్వత్కవుల్
దనివిన్‌జెందిరి, పుష్పపత్రఫలమాత్ర ప్రేమదానంబులన్

## గాయకుడు

మ. జడధుల్ జుట్టలుచుట్టలై తిరిగి గర్జాడంబరవ్యాప్తి, పై
బడు చందంబున సూరిబాబుడు గళక్వాణంబు గావించినన్
జడముల్ జర్ఝరితంబులై కదలి యానందించు, వేయేల, పు

మ. గొనబుం గానకళాధిదేవత, సుధాకుంభంబుతో వచ్చి, ని
ల్చినదో యన్న భ్రమన్ సభాసదులు, హర్షీభూతచేతస్కులై
తనరన్ ఖంగున మ్రోయు కంఠమున నుద్యజ్జీవ సంగీతవా
హినులన్ జిమ్మెడు సూరిబాబునకు లే రీడైన విద్వన్మణుల్

# నరుడు

కం. పడమటి దీవుల మనుజుల
పొడసోకని యడవులందు బుట్టి పెరుగు వా
లిడికోతిపిల్ల యొకనా
డడిగె నిటుల్ దల్లికోతి నత్యాతురతన్

కం. మానవుడందు రెవం డత
డీనేలకు వచ్చినట్టు లెఱుగ మతడు వి
జ్ఞానముగలవా డందురు
వానికి మనకుండునంద్రు బంధుత్వంబున్

ఆ.వె. రూప మెట్టు లుండు నేపాటి పొడవరి?
యెట్లు నడచుచుండు నేమి గుడుచు?
వాని గుణములేమి? వర్ణింపు మమ్మరో
కనులజూడ నాసగలదు నాకు

ఆ.వె. బుడుతకోతి ప్రశ్నములకు వానరమాత
సంతసించి, చెప్పసాగె నిట్లు
మానవుండు గొప్ప జ్ఞాని నిక్కముకాని
యెంచిచూడ బుద్ధిహీను డతడు

కం. కలుగు నతని వదనంబున
కళామహిమ మంగకములు కమనీయంబుల్
పలుకులు తేనెలు, చూపులు
శిలీముఖము లంతరాత్మ చెడ్డది బిడ్డా!

కం. మృగములమగు మనలోగల
సుగుణంబులలోన గొన్ని శూన్య మతనిలో
మృగము లబద్ధములాడవు
భగవంతుని పేర నత డబద్ధములాడున్

కం. పాపములుచేసి, వానిని
గోపన మొనరింప, గుడులు గోపురములలో
దీపములుపెట్టి, దేవుని
దాపున నంజలి ఘటించి, తనివి వహించున్

చం. కవుల సమాదరించి, నిజకల్మషముల్ బెడబాపు కావ్యధే
నువులను సృష్టి చేయుడని, నూరులు నారు లొసంగు, దేవతో
త్సవములు చేయు తీర్థములు స్నానము చేయును జంతుకోటి ని
క్కువముగ ధన్యమైన దనుకొందు మనుష్యుని బోల్చి చూచినన్

మ. ప్రతిభావంతు డతండు భూతములు సేవల్‌సేయ బ్రహ్మాండమున్
జితుకంగొట్టి వశీకరించుకొను పుంజీభూతమేధాసమ
న్వితు దుగ్రుం డతిశాంతిమండితుడు సందేహంబు లేదెట్టి దు
ష్కృతికిన్ జంకని స్వార్థమాతని పురోవృద్ధిన్ ప్రభంజించెడిన్

కం. శకమున కొక గుణవంతుం
డకలుషధర్మప్రవక్తయై యుద్భవమై
వికటమతోత్కట దంష్ట్రా
క్రకచంబులవాత జిక్కి కాయమువాయున్

కం. అని పలుకు తల్లి మాటలు
విని మర్కటపుత్రి, మిగుల వేదనపడుచున్
వినజాలను వినజాలను
జననీ! యని కప్పుకొనియె శ్రవణయుగంబున్

## పత్రికలు

ఆ.వె. దేశజనుల మహిత ధీశక్తికిని పురో
గమనమునకు బ్రబలకారణములు
వార్తలందజేయు పత్రికలనుమాట
నొప్పుకొందు మతిశయోక్తిగాదు

ఉ. స్వీయకులోన్నతిన్ బలికి జిహ్వకలేని ప్రజాజగత్తు క
న్యాయముచేయు నోరుగలయట్టి ధనాఢ్యుల కగ్రపీఠముల్
వేయుచు విశ్వసత్యమును పిండి జగంబును మేలుకొల్పు మే
ల్ర్వాయసగాండ్ర మేటి ప్రతిభల్ తలపోయరు పత్రికాపతుల్

కం. సినిమాతారలు, నమృతాం
జనములు కలవారి పెండ్లి సంరంభంబుల్
గనుపించి పేద సుకవులు
కనుపింపరదేమొ పత్రికానేత్రములన్

మ. తలపోయం గులతత్వదృష్టిగల వార్తాపత్రికల్ వ్రాయు వ్రా
తలచే దేశ మసత్యమున్ మరిగి తీర్థంబాడు పోరాటముల్
విలపించున్ గళలైకమత్యమునకున్ విచ్ఛిత్తి ప్రాప్తించు ని
ష్కలుషస్వాంతులకు న్నమస్కృతులు మా సంపాదకశ్రేణికిన్

ఆ.వె. మట్టిముద్దగాదు మహిత సత్కవిశక్తి
మట్టుచున్న నణగిమణగి యుండ
రత్నఖచితమైన రబ్బరుబంతియై
వెంటవెంట నంటి మింటి కెక్కు

## బడిపంతులు

కం. బడుగుం గన్నులజోడున్
గడితిని తలపాగ, లొడుగు కోటుం గలమున్
పిడిలేని మొండిగొడుగును

కం. పదిమంది బిడ్డలును, యొక
ముది నులకల కుక్కిమంచమును గంచంబున్
జిదుగుం జిత్తడి కొంపయు
నెదిరించెడు పెండ్ల మతని గృహలక్షణముల్

కం. నల్లుల కుర్చీయును, బడి
పిల్లల యల్లరియు, చింతబెత్తము బెంచీ
నల్లసిరాబుడ్డియు, నొక
బల్లయు ముడిబొమ్మలతని బడిసామానుల్

కం. పైయధికారులు కోపము
సేయుట లదనునకురాని జీతపురాలున్
వేయా రిబ్బందు లుపా
ధ్యాయునకుం దిరుగులేని యాదాయంబుల్

కం. ఎంతెంతవారు నాదగు
చింతబరిక సోకకుండ సిరిగలిగి యశో
వంతులు కాగలరాయని
సంతృప్తి వహించు టతని సహజ గుణంబుల్

కం. ఎన్నో చిన్ని శిరస్సులు
మన్నించెడు దొడ్డ రాజమర్యాదలు నా
కున్నవని మురియు పంతులు
కన్న నమాయకుడు గలడె కలికాలమునన్

కం. తరుణోపాయము లేదా
పరమ దరిద్రునకు నేటి బడిపంతులు కా
మరణాంత కష్టజీవికి
పరహితమతికి న్నవీన భారతభూమిన్

# స్వాగతము

ఆ.వె. మనుజ రక్తభుక్తి మరిగి పోరాటముల్
తెచ్చిపెట్టు ధనికదేశములకు
జాలి కనికరంబు సంధించు బలమైన
శాంతి సైనికులకు స్వాగతంబు

ఆ.వె. విశ్వవినుతమైన ప్రేమ సందేశంబు
సకల భూతలమున జాటుచున్న
క్షత మెఱుంగనట్టి శాంతి కపోతంబు
బ్రదుకుగాక, నూరు వత్సరములు

ఆ.వె. మర్త్యభర్మరత్నమణి పీఠముల నెక్కి
రాజ్యమేలు రాచరక్కసులను
మానవులను జేయు మహిత శాంత్యుద్యమ
స్థాపకులకు వినుతిదామకములు

ఆ.వె. ఆత్మరక్షణార్థమను నెపంబున దుష్ట
కలహములకు దట్టి గట్టుకొన్న
కృతకధర్మములను కినిసివారణసేయు
శాంతిసంస్థ కగు దిగంతజయము

ఆ.వె. ఒక్కరక్తబిందు వుర్విపై జిందిన
కంటనీరు నించి కలతజెందు
వెన్నవంటి హృదయమున్న సుస్థిర వీర
శాంతి రచయితలకు స్వాగతంబు

ఆ.వె. అహరహంబు నూతనాణ్వస్త్రములు చేసి
గుప్తపరచు నాయకులను జూచి
విహ్వాలించుచున్న విశ్వమానవకోటి
కభయమిచ్చు శాంతి సభలమీద

ఆ.వె. గాంధి, క్రీస్తు, బుద్ధ కర్మందియోధుల
యమృత మానసంబులందు వెలిగి
ఖండపంచకమును గౌగిలించిన ప్రేమ
దీపదీప్తి రణము నాపుగాక

## ఉగాది

మ. దరియున్ దాపులేని కాల మనునంతర్వత్ని నీళ్ళాడగా
ఖరసంవత్సర బాలకుం డిపుడు సాక్షాత్కారమున్ జెంది, సో
దరవర్షం బతివృద్ధమై నవసి యంతర్ధానమున్ జెందె, జో
హరు లర్పించె దిగంతరాంతములు నూత్నాబ్ద క్షమాజానికిన్

శా. పట్టెండన్నములేక శోషిలిన నిర్భాగ్య ప్రజానీకపు
న్నిట్టూర్పుం బొగలందు వెచ్చనయి కుందెం బెక్కు వర్షంబు లీ
చెట్టన్మానిపి సర్వలోకములకున్ శ్రేయంబు చేకూర్చుచున్
గట్టెక్కించుత మీఖరాబ్దము భయగ్రస్త క్షమాసుందరిన్

ఆ.వె. ప్రాచిబట్టియున్న బహ్వాబ్దములనాటి
హ్రస్వదృక్పథంబు నవలి కనిపి
స్వాగతోత్సవాలు, సల్పుకొందము, నూత్న
వర్షమునకు భరతవర్ష మలర

ఉ. నిన్నలు మొన్నలు న్నరుని నీచకళంకితవర్తనంబునం
దన్నముబట్టలేక చటులార్తరవంబుల కాటపట్టులై
చన్నవి, వచ్చియున్నది ప్రశస్త ఖరాబ్దము, రేపులన్ని ముం
దున్నవి కట్టుకొందము సుఖోజ్వల శాంతి సుధాలయంబులన్

సీ. చిత్తసంస్కారంబు సృష్టింపజాలిన చక్కని సాహిత్య సభల కొఱకు
పొరుగింటివాని సోదరభావమున జూచి ప్రేమింపగల ధర్మదృష్టి కొఱకు
వైషమ్య భుజగంబు వాసంబుచేయని మాయమర్మములేని మనసుకొఱకు
అయథార్థవాణి జిహ్వాగ్రంబు సోకని మాననీయుల లసన్మైత్రికొఱకు

ఆ.వె. పుట్టెదాశతోడ బుట్టి నిరాశతో
దాటి చన్నయబ్దతతికి మ్రొక్కి
చిత్తశుద్ధితోడ స్వీకరింతు మఖండ
కౌతుకమున నీ యుగాది కాన్క

ఆ.వె. నీతిపథమునందు, నిత్యజీవితమందు
మాటనిరుకునందు మార్పులేక
కొత్తబట్ట గట్టుకొన్నంత నూత్నవ
ర్షంబు మహము సార్థకంబుగాదు

## అమ్మవారు

చం. మొగమున కక్కుగొట్టి మసిబూసి వికార మొనర్చు నీచపుం
దెగులున కమ్మవారనుచు తీయని పేరిడి, మేకపోతులన్
దగరుల జంపి, రక్తమున దాండవకేళి యొనర్చు వెట్టికిన్
దగిన జికిత్సచేయగలదా నవభారత మెన్నడేనియున్

కం. మితిమీరి తిన్నవారికి
ప్రతిఫలముగ వచ్చు నంటువ్యాధులకు శిలా
ప్రతిమలు చికిత్సలనుకొను
ముతకతెలివి మాన్పు పుణ్యపురుషులు గలరే?

సీ. ప్రసవించుచున్నవి పట్టభద్రుల నసంఖ్యాకంబుగాగ విద్యాలయములు
పలుకుచున్నది కవీశ్వరుల మంజులవాణి నవరసాలంకార నవ్యకవిత
చాటుచున్నది క్షణక్షణ లోకవృత్తంబు పగలు రాతిరి జగా గగనవాణి
క్రాలుచున్నది హిమగ్రావాగ్రమును మెట్టి బాపూజి వలపు స్వేచ్ఛాపతాక

తే.గీ. నాల్గుఖండాల ప్రేమభాండము ధరించి
అధిగమించుచునున్న దద్యతనయుగము
చదువనేర్చిన మా మానసములు వదలి
కదలిపోలేదు వెడనమ్మకాల భీతి

మ. తలకెక్కించిన ప్రాతపిచ్చి తనువాద్యంతంబు వ్యాపింప, గొ
ట్టెలువోలెన్ బరువెత్తి మృత్యువుదిశన్ నృత్యంబు గావించు, త
మ్ముల మౌఢ్యంబును జక్కదిద్దు యతనంబుల్ సేయ వెన్నండు, సూ
దులతో గ్రుచ్చెదనంచు వత్తువొక యాప్తుండట్టు లుద్యోగివై

## భిక్ష

సీ. ముంబాపురీరాష్ట్రమున పశ్చిమంబుగా పాయకట్టున సముద్భవము నంది
యుపనదీసఖులు కేయూత లీయగసాగి కదలిరాయనిమీద కన్నువైచి
అడ్డువారలకు లేదనక దాహము దీర్చి కరువుకాటకములు కాలరాచి,
పదియు రెండేండ్ల యౌవనము జారగనీక పుష్కరంబుల నిత్యపూజలంది

తే.గీ. ప్రతిఫలాపేక్షలేక భూప్రజలకెల్ల
తీర్థదానంబుచేయు నదీమతల్లి
కదలిరావమ్మ మా పేద గ్రామములకు
నతిశతంబులు నీకు కృష్ణాస్రవంతి!

సీ. కావేరిలో నిన్ను గలుపు ప్రయత్నముల్ కావించినారు సర్కారువారు
వ్రాయుచున్నారు సత్ప్రథకముల్ యోజించి నీటిత్రోవల నింజనీరు దొరలు
తలయూచినా రమాత్య ప్రకాండులు వెరసి డెబ్బదికోట్ల వెచ్చమునకు
కట్టించుచున్నారు ఘన రిజర్వాయరుల్ ముదమంది ద్రవిడభూములు ఫలింప

ఆ.వె. గడియ నిశ్చయించి కదలించుకొనిపోవు
సమయమందు కొర్తికనుమదాటి
పుట్టు పేద ప్రాంతముల కోర్కె లీడేర్చి
కదలిపోగదమ్మ! నదులరాణి!

సీ. 'అన్నమో రామచంద్రా' యంచు నల్లాడి పరదేశముల కేగి బ్రదుకువారు
యకర మొక్కటికి మానికగింజ రాలక 'హరిహరీ' యని యంగలార్చువారు
పన్నుగట్టుట కిండ్లు వాకిళ్లు తెగనమ్మి పైమీద బట్టతో వగచువారు
సుంకుబట్టిన కంకి సురిగి వర్షములేక యెండిపోవగ జూచి యేడ్చువారు

తే.గీ. నీకు దాపున నున్నారు నిశ్చయముగ
కొర్తికనుమను బ్రద్దలుగొట్టి వచ్చి
లక్షలాది ప్రజాక్షుధాక్షుత్తులెల్ల
దనిపి చనుమమ్మ! కృష్ణా సుధాస్రవంతి!

సీ. పండించుకొందు మిర్వదిలక్షలకు మించి క్షేత్రరాజములు నీచెమ్మ సోక
ఆకొన్న పేదతాలూకాల దుర్దశల్తొలగిపోగలవు నీచెలిమి కతన
కరుణ కొంచెములేని కరువు బెబ్బులి పండ్లు రాలిపోగలవు నీరాక కతన
ఆశోపహతితప్తమైన దీనుల చింత మాసిపోగలదు నీ మైత్రి కతన

ఆ.వె. నాల్గుపదులకోట్లు నగదు వెచ్చించుచో
యుభయ మండలముల కొదవుమేలు
దాపులోని యాంధ్రతతికి చేరెడు నీళ్లు
దానమిచ్చి చనుట తప్పుగాదు

సీ. తడుపుచున్నారు క్షేత్రములు కర్షకకోటి మానక మేని చెమ్మటలు గురిసి
కట్టుచున్నారు సర్కారువారికి శిస్తు లెట్టులో తలలు తాకట్టుబెట్టి
కడుపార మేత జిక్కక శుష్కితాంగమై బ్రదుకుచున్నది మాదు పశుగణంబు
త్రవ్వుచున్నారు పాతాళకూపశ్రేణి యేటేట బుంగెడు నీటికొఱకు

ఆ.వె. పాదమూని సిరులు పండించి, కష్టాలు
చెండివేయు దొడ్డ జీవనదివి
పొరుగుసీమ ప్రజల మొర లాలకింపవా?
హృదయ మున్న సర్వనదులరాణి!

## వంచిత

శా. అమ్మా! భారతనారి! నీ కడుపునం దావిర్భవంబంది, నీ
యెమ్ముల్ బిండి సుఖించు పూరుషుల నిం కెన్నాళ్లు సేవించి, కా
లమ్మున్ వ్యర్థము చేసుకొందువు? కరాళ స్వార్థధర్మాలలో
గమ్మత్తున్ గనిపెట్టి స్త్రీజగము దుఃఖంబు న్నివారింపుమా!

కం. ఇరువదినూరేండ్ల వయో
భరమున నడయాడు యణువుబాంబు యుగములో
తరుణీమణివై, కన్నులు
దెరువని నిను జూచి సర్వదిశలు హసించున్

చం. పురుషులు వంటయింటి కొరముట్టుగ నిన్ను గణించుచుండ, కి
క్కురుమనకుండ సంసరణకూపమునంబడి, మందభాగ్యవై
వరవుడమాచరించెదవు భారతపుత్రికనంచు రిత్తసం
బరపడుచుందు వింటి తలవాకిలి దాటని పుట్టు ఖైదివై

మ. అనసూయాదులు మూటగట్టుకొనినా రానాడు గంపంత చి
క్కని పుణ్యంబని వేదశాస్త్రములు వక్కాణింపగా నమ్మి గొం
తున కుచ్చుల్ దగిలించు సంఘమను శార్దూలంబు వ్యక్తిత్వమున్
దినుచున్నన్ జలియింప విప్పటికి నింతీ! యెంత శాంతాత్మవో!

కం. మగనికి మగువల గూరిచి
యగచాట్లంబడ్డ తొంటి యంగనలను, నా
భగవతులని పూజించెదవే
యెగతాళికొ లేక హృదయమే శూన్యంబో

చం. వలపులరాణిగా, చిలుకపల్కుల చచ్చెర పిండిబొమ్మగా
యలికులవేణిగా బొగడి యాకసమందొక మేడగట్టి యా
యెలనిడి యూచు నిప్పురుష డిన్నియుగంబులు నిన్ను కాళ్ళతో
నలుచుట లోనిగుట్టు లలనా! గ్రహింప విదేమి చిత్రమో

మ. హృదయం బెక్కడ నేడ్చె కాంతకనియో యింకేయభిప్రాయమో
హృదయేశుండనువాడు వోజిఋతనారి న్నిన్ను నీ యందమున్
బ్రదుకున్ బండలపాలు చేసెదరు నీ బాబుల్ దయాహీనులై
యెదురైన న్నిను దిట్టిపోతు రలివేణీ! ఘోర మెట్లోర్తువో!

తే.గీ. సతి గతించిన యుత్తరక్షణమునందే
తరుణికోసర మూరూరు బరుగులెత్తి
ప్రేయసీ వియోగంబును విస్మరించు
స్వార్థులేకద నీ నమ్ము శాస్త్రగురులు?

మ. పరదాలో నిను దాచిపెట్టుకొనుచున్ స్వాతంత్ర్య మావశ్యకం
బరవిందాక్షుల కంచువీధుల నుపన్యాసాలు సాగించు ట
క్కరులె హైందవకోడుబిల్లులకు పక్కా ద్వేషులై నిల్చుచుం
దురు, విద్యానయనంబులేని యలివేణుల్ గాన రీమర్మముల్

శా. నిన్నాకాశము దాకగా బొగడుచున్ నీ యందచందాలతో
వన్నెల్ దీర్చి కవిత్వ మల్లుకొనుచున్ పైపై పరామర్శలన్
నిన్నున్ నీదు శరీరమున్ హృదయమున్ ఛేదించి వేధించి యిం
తన్నంబుం బడవేయు సంఘమును బిడ్డా! యెట్లు హర్షింతువో!

చం. పతి మరణింప నాతని శవంబునకున్ సతి నంటగట్టి స
ద్గతి లభియించునంచు కనికార మొకించుకలేక యగ్ని కా
హుతి యొనరించు తొంటి పురుషోత్తము డెన్నటికేని నీ సము
న్నతికి బ్రసన్నుడై వదలునా జిరకాలపు టుక్కుపగ్గముల్

ఉ. స్త్రీలను పుట్టు బానిసలజేసిన సంస్కృతి చెప్పు వారి గ్రం
థాలు పఠించి నాటకశతంబుల నారసి బండవారి యా
శాలత లెండియున్న జలజాక్షికి నీకొకరీతిగా యప
థ్యాలయి గోచరించగల వద్యతనార్యకవి ప్రబోధముల్

సీ. అత్తమామల క్రూరమైన దాడికి లొంగి పలుకాడరాని కోడలితనంబు
మగని యాయువులతో దెగి ముండమోయించి గేలిగొట్టించు నిల్లాలితనము
పతిభక్తురాలన్న పదగౌరవముదక్క సౌఖ్యం బెఱుంగని చానతనము
అన్నదమ్ములవోలి నాస్తిపాస్తులమీద హక్కు లించుకలేని యాడుతనము

ఆ.వె. ఒక్క భరతవర్ష యువతీమణికి నీక
తగునటంచు బిట్టు బొగడుచుండు
మోసగాండ్ర నమ్మి పూజించు నిను జూచి
శిష్టజనుల కన్ను చెమ్మగిల్లు

సీ. పాములు సంతానవరదాయకములంచు ప్రార్థించు పెను వెఱ్ఱిబాగులమ్మ
ఔషధసేవజేయక సత్తులకు మ్రొక్కి ప్రాణాలు బలిపెట్టు పరమమూఢ
కృతకంబులైన పుక్కిటి కథానకములు సత్యంబులని మ్రొక్కు చపలహృదయ
వికట సాంఘిక శక్తులకు దేహ మర్పించి తలవ్రాత కేడ్చు విద్యావిహీన

ఆ.వె. పసుపు రాయుచున్న ముసుగు బెట్టుచునున్న
మారు పల్కలేని మందభాగ్య
ఖండపంచకమున కలికంబునకు లేదు
తలపవేల? భావదాసురాల!

ఉ. ఉక్కుపదాల సాంఘికపు టుగ్రపిశాచ మొనర్చు గర్జకున్
గ్రుక్కినపేనులై, ప్రతిభగోల్పడి, పూరుషజాతి చేయు యు
చ్చెక్కుల స్తోత్రపాఠములచే బరితృప్తి వహించు నీకు నీ
నిక్కపు సానుభూతులవి నీతులు గావుగదా? సహోదరీ!

ఉ. నీయెడ జాలిబూను మహనీయులు పుట్టరు, రామరాజ్యముల్
వేయి సముద్భవించి పదివేల స్వరాజ్యము లుప్పతిల్లినన్
తోయజనేత్రస్త్రీ జగము దుఃఖమువాపెడు శాసనాలకున్
నాయకులే విరోధులయినా రబలా! ప్రబలాపకారులై

శా. ఏనా డాడుది కూడుగుడ్డకొఱకై యీ క్రూర దాస్యాగ్నికిన్
మే నర్పించి బహిఃప్రపంచమునకున్ వేరై ప్రవర్తించెనో
ఆనా డాదిగ పిల్లపిల్లతర మవ్యక్తంబునం గ్రుంగుచున్
నానాబాధల కగ్గమై నవయుచున్నారమ్మ! బింబాధరల్

శా. పిల్లల్లేరని వంకబెట్టుకొని నీ ప్రేమన్ విసర్జించి, మా
రిల్లాలిన్ గొనివచ్చి నీదు తలపై నెక్కించి, నీ పక్కలో
బల్లెంబున్ సవరించు దుష్టులకు బ్రాపైవచ్చు ధర్మాలెటుల్
జెల్లన్ నేరవా నీవు కొండొక పతిన్ జేపట్టి పెండ్లాడినన్

చం. సహగమనాచార దహనంబు చల్లార్చినట్టి శ్రీరామమోహనునిమీద
విధవల నోదార్చి పెండ్లిండ్లు జేసిన వీరేశలింగ కోవిదునిమీద
అతిబాల్య వైవాహికాచార ముడిపిన హరిబిలాలను గుణోత్తరునిమీద
కన్నబిడ్డలను గంగాదేవి కర్పించు దొసగుమాన్పిన సీమదొరలమీద

తే.గీ. పండ్లు నూరిన పీఠికాస్వాము లిపుడు
సలుపుచున్నారు శాసనసభలముందు
ఘోరశపథాలతో నిరాహారదీక్ష
బిల్లులను మ్రింగు పెను జంగుబిల్లులగుచు

శా. మా యాడంగుల శీలమే భరత సంపద్దాయకంబంచు, స్వా
ర్థాయత్తుల్ పురుషుల్ విదేశములమధ్యన్ బిట్టు యూరింపగా
కాయంబుల్ పులకించి మెచ్చెదరు మీ కష్టాలు గుర్తింపలే
కా యీదేశప్రజల్, ప్రచారమున మిథ్యల్ దథ్యముల్ గావొకో!

ఉ. భారతదేశ సంస్కృతికి భంగము వాటిలునంచు విద్యకున్
దూరముజేసి మీబ్రదుకు దోపిడిచేయుటచేత లక్ష్యమున్
జేరక యన్యఖండముల శేముషికిన్ గను లప్పగించి ని
ట్టూరుపుల న్నిగుడ్తురు సహోదరి! నేటి స్వతంత్ర మానవుల్

మ. అనివార్యంబగు యౌవనం బుబికి సర్వాంగంబులన్ నిండి, వె
చ్చని రక్తంబును రెచ్చగొట్టి మధురేచ్ఛల్ రేగి వేధింప, తీ
రని వైధవ్యదవాగ్నిలోన బడి మర్మచ్ఛేదకంబైన వే
దనపాలై వ్రతముల్ పొనర్చెదు ననాథా! నీకు శ్రద్ధాంజలుల్

సీ. దయ్యంబు పూనకంబయ్యె నాకని లేచి నగ్నతాండవమాడు భగ్నచిత్త
గడ్డాలు మీసాలు గల్గి ఖొజ్జాయైన భర్తతో గలహించు బాలయువతి
కృపలేని మగని అంపపుకోత బడలేక యురిబోసికొని దేహమూడ్చు తరుణి
అత్తమామల క్రూరమై దాష్టకంబునోర్వక చిచ్చులో నురుకు రమణి

ఆ.వె. కరుణలేని శాస్త్రకారుల క్రోధాగ్ని
గుండమునకు మేలి గుగ్గిలాలు
కఱకుకాపురాల కెఱయైన వనితల
గణ్యరత్నఖనులు, పుణ్యవతులు

చం. 'మగడనువాడు ప్రేయసి నమానుష హింసలుపెట్టి కొట్టుటల్
మగువకు సౌఖ్యహేతువు సుమా' యని వాదనసేయు నీతిపా
రగులగువారునుం గలుగురాజ్యము నీదగు వేడియూరుపుం
బొగలగరంగునా? బిగిసిపోయిన యుచ్చుల నూడదీయునా?

ఆ.వె. అబలయన్న బిరుద మంటించి కాంతల
స్వీయశక్తు లదిమి చిదిమినారు
సబలయన్న బిరుదు సాధించి హక్కులు
గడనచేసికొమ్ము కష్టచరిత

# సంఘము

కం. కనికెదు, కనికెదు గ్రుడ్లన్
బెనుగొండంబోలు మేను, వికృతాకృతియున్
దనర నొకప్పుడు సంఘము
నను గని యిట్లనియె, ఘనఘనాఘనరవళిన్

కం. ఓరీ! యద్యతన కవీ!
నారాజ్యము గూలద్రోయ నవభావకృతుల్
కూరుపులు సేయగల మగ
ధీరుడవా! నేరవా? మదీయ ప్రతిభల్

కం. పుట్టితి నెపుడో దేశము
పుట్టినపు డనంతకోటి భుజశక్తులతో
జిట్టెడు వెధవవు జాగ్రత
మట్టెద నరకాల నిముషమాత్రములోనన్

మ. ఘనసంస్కార్లు, హెమాహెమీలు నను ధిక్కారించి, భీతాత్ములై
చనినా రస్మదయోవినిర్మిత సహస్రక్రూరపాదాహతిన్
విను మావంక మదీయ శాసనములన్ బ్రేమన్ దలన్ దాల్చి వం
దనముల్ సల్పి భజించు మానవసముద్రస్ఫార ఘోషార్భటుల్

శా. లక్షల్ లక్షలు బళ్లుబెట్టినను కాళ్ళన్ మట్టి చెండాడ, న
ధ్యక్షుల్, మంత్రులు దేశనాయకులు మేధావుల్ జయోపాయస
ద్దీక్షాకంకణధారులై నిలిచి సందేహించుచున్నా రహో
పక్షీ! నీతరమా ననున్ జెనకి నాపై దాడి సాగింపగన్

మ. పురుషుల్ కొందరు నన్ను గాదనిన పూవుంబోండ్లు నా ముద్దుకూ
తురులున్నారు గృహప్రపంచములయందున్ నాకు నేజెంటు లీ
తరహా నూతన సంఘసంస్కృతుల పాదంబూనగా నీదు మం
దిరమందున్ మగవారి నోళులను బంధింపగ బీగంబులై

ఆ.వె. సొంత రాచఱికము చొప్పడ్డదనుకొని
వెఱ్ఱివాండ్రు నేటి కుఱ్ఱవాండ్రు
సంస్కృతులను బైట చాటించెదరు నాయ
నమ్మవద్ద నాయనమ్మ లగుచు

## కళావిలాపము

శా. శస్త్రంబైన సమత్వమున్ దిశల సంస్థాపించు నీబోధ, వ్య
త్యస్తంబుం బొనరించి, రెండు తెగలై, యస్పృశ్యతారోగులై
కుస్తీల్ బట్టుచునున్నవా రిపు డనుంగుం గ్రైస్తవ భ్రాతలో
క్రీస్తుస్వామి! సలాముజేసెదను సంఘీభావమున్ గూర్పవే

మ. బలవంతంబుగ జెట్టబట్టుకొని యీపార్టీతగాదాల యు
చ్చులతో గొంతు బిగించి పల్కుమనుచున్ శోధించుచున్నారు, నా
కల మేవంకకువాలి ధర్మమునకున్ గాయంబు గావించునో
బలదర్పంబు లొసంగుమన్న! మరియాంబాగర్భముక్తామణీ!

కం. అందరు మనవారని నే
నందును, మావారు కూడదండ్రు తెగల్, మే
లందురు, నీ వేమందువు
తందానాపాట కవికి ధర్మంబగునా?

కం. నూరేండ్లనుండి బైబిలు
నూరుకొనుచు ద్రావుచున్న నూరింతలుగా
వేరూని పెరుగుచున్నవి
ఘోరంబుగ, నిమ్నజాతి కులకలహంబుల్

శా. అంటంగూడని మాలమాదిగల జాయంటుం గుటుంబాలలో
నంటున్ ముట్టుపరంజుకొన్నది, రహస్యవ్యాధి చందాన, నీ
కంటన్ జారెడు వేడిబాష్పముల లక్ష్యంబింత లేకుండ, నా
ఘంటంబున్ మరలింపమందు రిది యుక్తంబౌనె యేసుప్రభూ!

ఉ. నీపలుకుల్ సబర్మతిమునిర్షభు డొదలదాల్చి, శాంతిసం
స్థాపకుడై కులప్రళయదావములార్పి తరించిపోయె, నీ
ప్రాపు గడించి నీమతముబట్టిన బిడ్డల కెందు కీ మన
స్తాపకరంబులైన కులతత్వ విరోధము లేసునాయకా!

మ. కులగోత్రంబుల కొల్తతో కవులకున్ గొప్పందనం బిచ్చి, నూ
రులు నూరారు లొసంగి, సత్యమునకున్ ద్రోహంబు జేయించు పె
ద్దల స్నేహంబునకున్ నమస్కృతి, జగత్కర్తా! భవద్రక్తధా
రలలో జాతులు గోతగూలినవి సర్వక్షోణి రాణింపగన్

కం. మాలా? తోలా? యనుకొని
తేలుచుకొనకుండ కెడద తృప్తిపడరు మా
మాలలు మాదిగలు జగ
త్పాలక! మతబోధలేల? ప్రార్థనలేలా?

## ఆశీస్సులు

మ. ఎలమిన్ హూణకళాసముద్రమున బి.య్యే. తీరముందాటి, నీ
కులముప్పొంగఁ బరిశ్రమించితివి, తెల్గుందోటలో, శాశ్వతో
జ్జ్వల సంపత్తులఁ బుష్పితంబగు ప్రతిష్ఠావాటి నీభార్యతో
సలుపంబోలు సుఖస్థితిన్ మధురసంసారంబు శిష్యోత్తమా!

ఉ. నీవొక యింటివాఁడవయి నిల్చితి విప్డుడు, జన్మసార్థకం
బై విలసిల్లె, వంశము సహస్రముఖంబులఁ బ్రస్తుతింప, నె
త్తావులు జిమ్ము మీవలపుఁ దామరపూవుల తెప్పమీద, సౌ
ఖ్యావహమైన జీవిత మహాంబునిధానము నుత్తరింపుమీ!

శా. సేవించు న్నిను నీడయై హృదయరాజీవంబు పుష్పింప, నీ
భావోద్యానము పుల్కరించి చిగురింపన్ మేరికాంతమ్మ! నీ
యావాసంబున సర్వసంపదలు నాట్యంబాడ వర్ధిల్లు డ
న్నా! వాగర్థములట్లు; బొడ్డుకుల దీపా! సుప్రకాశాభిదా!

ఉ. ఈయమ కంధరంబున వహించిన పచ్చనితాలిబొట్టు నీ
యాయు రనామయంబులకు నాయువుపట్టు ప్రకాశరాయ! సు
శ్రేయము నీకు నీసతికి చెన్నలరారెడు బ్రహ్మముళ్లకున్
చాయలుదేరు మీప్రణయ సంసరణామృత తీర్థయాత్రకున్

సీ. సరస పండిత కవీశ్వర శుభాశీర్వాద విభవాదికము, కళావీర! నీకు
కవితాసుమంగళీకమనీయవీక్షణకుసుమహారము, పెండ్లికొడుక! నీకు
ఆయురున్నతి మీరు నైదువరాండ్ర కైవారంబు నవ్యసంసారి! నీకు
బహునిలింపుల పుష్పవర్షాభిషేకంబు పసుపుబట్టల చిన్నవాడ! నీకు

తే.గీ. బెళుకుఁచూపుల నునుసిగ్గు మొలకలురల
ప్రేమతోఁ దలంబ్రాలు ధరించియున్న
తరుణి గళమునఁ బుస్తెముస్తాబుసేయు
పూతవర్తన! సంతానభూతి నీకు

blank



గుంటూరు పురప్రముఖులు శ్రీ ఏకా ఆంజనేయులు
నవయుగ కవి చక్రవర్తి
శ్రీ జాషువా ఖండ కావ్య కృతిని
స్వీకరించినప్పుడు కృతి భర్త కృతి కర్తను నూతన
వస్త్రములతో సన్మానించుట.

# మనవి

కలలు నిక్కములు కావని లోక మంటుంది. నా కన్నకలల్లో కల్ల గాని కల శ్రీయేకా గారి పరిచయం. ఒకటి రెండుమార్లు వారి దర్శనం చేసుకొని నా అభిమతాన్ని తెలుపుకొన్నాను అంతే. వారికి నా యందు అవ్యాజము, అనన్యలభ్యము, అవర్ణ్యమైన వాత్సల్య మేర్పడినది. ఎందుకో చెప్పలేను.

"మాకన్నన్ మహనీయులైన కవులీ క్ష్మామండలిన్ లేకపోరీ కాలంబున" అని చెళ్ళపిళ్ళ కవి చెప్పినట్లు మహాకవులెందరో యుండ శ్రీవారు నాకు బ్రహ్మాండసన్మానం చేసి, గృహక్షేత్రదానం కనకాభిషేకం చేసి గుంటూరు పౌరుని చేసినా రంటే అది నా యదృష్టం కాని అన్యం కాదు. వారికి నా కవితా సర్వస్వాన్ని ధారవోసినా ఋణం తీరదు. సభ జరిగి పదేండ్లయింది. ఒక రచన వారి కంకితం చేసి, నా భక్తి వెల్లడించుకొన్న గాని నాకు మనశ్శాంతి కల్గదు. నెలకు దాదాపు అయిదారు మార్లు వారిని చూచి యేవో రచన్లు వినిపించి రావడం వారి చలోక్తులకు మైమరచి యిల్లు చేరడం నా అభీష్టం తెలుపుకోలేక సందేహించి మిన్నకుండడం పరిపాటయింది. అఖండపండిత కవులెందరో వారి కంకితమీయ ప్రయత్నించి విఫలులు కావడమే నా సంశయానికి కారణం.

నా సుకృతమో వేళావిశేషమో ఈ ఖండకావ్యాన్ని స్వీకరించడానికి శ్రీవా రంగీకరించి నన్ను ధన్యుణ్ణి చేశారు. వారు చేసిన ధర్మకార్యా లనంతాలు. వాటిని వర్ణిస్తే ఒక గ్రంథ మవుతుంది. ఇందులో 'నక్షత్రమాల' అనే శీర్షికలో దిక్సూచిగా పంతులుగారి ఔదార్యం వర్ణితమైనది. స్తుతివిముఖులయినవారీ పద్యాలు, ప్రకటనకు సమ్మతించ రనిభయం నాలో లేకపోలేదు. అయినా సాహసించి కావ్యంలో చేర్చాను. అనంత విశాలహృదయులైన ఆంజనేయులు గారు నా సాహసాన్ని క్షమిస్తారనుకుంటాను. వారికి నా ధన్యవాదాలు.

జి. జాషువ

# అక్షరవధువు

మ. ఘనదిగ్దంతుల వంటి పండితకవుల్ కామించి మా కావ్యక
న్యను మీ కిత్తు మటంచు వేడుకొనినన్ గాదన్న యేకాంజనే
యుని చిత్తంబు హరించి నా కృతి చిరాయుర్భాగ్యయై నా కలం
బునకుం జక్కిలిగింత పెట్టి హృదయంబున్ దోచె హర్షాంబుధిన్

ఉ. నీవొక మర్త్యకన్యవని, నీ వొక పెండ్లికుమార్తెగాగ సం
భావనచేసి పెద్దల సమక్షమునం దొక దాత కిచ్చు టాం
ధ్రావని సాంప్రదాయ మగునట్టుల ని న్నిపు డాంజనేయభూ
దేవున కిచ్చుచుంటిని, యదృష్టవతీ; కృతిపుత్రికామణీ!

మ. కల వేకాహృదయంబులో నమృతగంగావాహినుల్ సత్యవా
క్కులయుద్యానము, లార్ద్రవాగ్ఝరులు, నీకుం జీకులుం జింత లా
కులపాట్లుండవు, కావ్యగేహినులు నీకుం బూజలర్పింప, ప్రో
జ్వలసౌఖ్యంబును చూఱలాడగల వశ్రాంతంబు బాలామణీ!

శా. నా నీటుల్ నెరగోటునన్ వలచియున్నాడంచు గర్వించి అ
జ్ఞానంబున్ ప్రకటించుకోవల దనన్యంబైన వాత్సల్యమే
కానీ, యమ్మహనీయమూర్తి సకటాక్షశ్రీల నాశించు కా
వ్యానీకంబు సహస్రసంఖ్యగల దమ్మా! నమ్ము ముమ్మాటికిన్

మ. పరిశుద్ధంబగు నగ్నిసన్నిభ, యదంభస్వాంత! యేకామహా
పురుషప్రేయసి! గాజుమట్టియలతో ముత్తైదువై స్వర్గమం
దిరపూజల్గొను నాదిలక్ష్మి రమణీ దివ్యాత్మశాంతింప, ని
ర్ధరయేకాపదపద్మముల్ గొలిచి యుద్భాసింపు మాంధ్రావనిన్

చం. బలితపు టామయంబు పదివత్సరముల్ విడ కేకధాటిగా
పలలము నాహరించి బహుభంగుల కారియబెట్టుచున్న ని
శ్చలమగు మేరుపర్వతము చాడ్పున నేర్పుగ సర్వకార్యముల్
సలుపు ఛలోక్తిమండితవిశాలమనస్కుని చెట్టబట్టు నీ
పలుకుల బ్రహ్మబంధముల భాగ్యమె భాగ్యము కావ్యపుత్రికా!

కం. నీ యక్కయ్యలు పలువురి
జాయారత్నంబులయి యశస్సుం గనిర
మ్మా! యాంజనేయహృదయము
వేయంచుల ఖడ్గ మెట్లు పేరందెదవో!

చం. ఎడమచేయి యెరుంగ దేనాడు కుడిచేతిదానంబు లక్షలు దాటుచున్న
పెదవి గదల్చి చెప్పినది లే దేనాడు పుణ్యసంకల్పంబు ముగియుదాక
మెడవంచ దేనాడు పిడుగు లార్భాటించి బ్రహ్మాండగోళంబు బ్రద్దలైన
జారనీ డార్వేలవారి మీసపుతీవి సార్వభౌముల సమక్షమునయందు

ఆ.వె. గర్తపురికి తెల్గుగడ్డకు శ్రీయాంజ
నేయబుధుడు పూజనీయు డమ్మ!
అమ్మహాత్ముపదము లాశ్రయించిన నీకు
కొదువ లేదు కావ్యకోమలాంగి!

మ. హనుమాయమ్మకళానికేతనము బ్రహ్మాండంబుగా వృద్ధియై
కనువిందుల్ పొనరించు గౌరవము యేకా లక్షలార్జించి కూ
ర్చినదైనన్ హనుమాంబకే విడిచి తుష్టింజెంది హర్షించు మో
హనచిత్తున్ వరియించినావు కృతికన్యా! నీకు స్వర్ణాక్షతల్

## నక్షత్రమాల

కం. ఏకాయన నిర్వురుగా
రేకాయన నొక్కడే యదెట్లన కళా
లోకాయుస్సాధంబున
కేకైక స్తంభ మొక్క యేకాయే కా!

కం. వాకొన్నమాట యుక్కుం
బాకగు కార్యములపట్ల పదును చెడనిదై
వాకుం దప్పిన వారికి
యేకాలము గుండెగాల మేకాయే కా!

కం. ఒకనాటి భోజనమ కా
దొరక కవిజీవితము గడచునొక్కింత కృపా
శకలము విసరిన నతడే
యెకిమీడు కళావిధేయు డేకాయే కా!

కం. అనవరతహాస్యచతురత
జననుతకవితాభిలాష సర్వాంగములన్
దొణికిసలాడు మనీషుల
యినబింబం బెవ్వ రొక్క యేకాయే కా!

కం. చుక్కలు రాలిన, గగనము
వ్రక్కలయిన వక్రమార్గమున్ ద్రొక్కని వా
డక్కరకు శిరమువంచని
యిక్కాలపు ధర్మవీరు డేకాయే కా!

కం. నివసింప నిల్లు కవితా
వ్యవసాయంబునకు రెండుయకరాల్ పొలమున్
కవిచక్రవర్తి కిడు వా
రెవరున్నా రాంధ్రభూమి నేకాయే కా!

కం. తెలుగు నియోగుల సిసలగు
పలుకుల హుందాతనంబు బహుముఖప్రజ్ఞా
బలమున్ దేజము సింగపు
టెలుగుంగలపురుషసింహ మేకాయే కా!

కం. తలను కిరీటము గల రా
జులు లేరని దిగులుపడ్డ సుకవుల చింతా
నల ముడుప మకుట ముండని
యిలాతలాధీశు డెవ్వ రేకాయే కా!

కం. కులమతవార్గికపరతం
త్రుల నల్లనికండ్లజోళ్ళతో గుణగణముల్
బలిసేయక వెలిచేయక
యెలమిన్ వెలగట్టు సరసు డేకాయే కా!

కం. చెరసాలకేగె, ఖద్దరు
ధరియించెన్ స్వీయరాజ్యసమరస్థిరుడై
పరు లనుభవింత్రు ఫలితము
నిరీహుడై కోరడెప్పు డేకాయే కా!

కం. బాలికలపాఠశాల సు
ధాలయముగ లక్షలాది ద్రవ్యార్జనమున్
లీలన్ సల్పి వదాన్యుల
హేళి యనం బరగు వీరు డేకాయే కా!

కం. భూతములయందు దయగల
చేతముగల బుద్ధమూర్తి చేరినశునక
వ్రాతముల కన్నమిడు వా
డీ తరమున నెవ్వరన్న యేకాయే కా!

కం. ప్రతిపల్కున హాస్యము శో
భితముగ భాషింపగలిగి పెరవారి మనో
గత చింత లపనయించెడు
హితుడెవ్వం డీ యుగాన యేకాయే కా!

కం. తన యాధిపత్యగౌరవ
మున నడచెడు సంస్థలందు మోసమును దగా
మననీయ దుగ్రవహ్నికి
నెనయగు ఘను డెవ్వరన్న యేకాయే కా!

కం. బడబాగ్నివంటి దుఃఖం
బెడదన్ దహియించుచున్న నిసుమంతయు వె
ల్వడనీయ డబ్ధివలె నె
య్యెడ గంభీరతవహించు నేకాయే కా!

కం. సారస్వతచలనము గుం
టూరున గల్గుటకు కవుల కోగిరమును బం
గారపు టభిషేకంబులు
నీరోజున గల్గుహేతు వేకాయే కా!

కం. ఎన్నికకురాక పదవుల
నున్నారొక లక్ష, ధనికు లున్నారు సుఖం
బున్నా రుదరంభరులై
యెన్నిక కెక్కిన మహాత్ము డేకాయే కా!

కం. వీరులవీరత్వము, భూ
దారుల రాజసము ఋషుల తాలిమి నేకా
కారత నుదయం బందిన
దే రాజుంగా దతండు నేకాయే కా!

కం. ఆరోగ్యము చెడియున్నన్
ధీరత లక్షింప కుగ్రదీక్షన్ పరకా
ర్యారతుడై యుత్సాహం
బే రోజుం బాయ డాత డేకాయే కా!

కం. సీమపొగాకువణిక్కుల
లో మేటిగ నలజపానులో లండనులో
యే మహనీయుని నామము
హేమాహేమీలు తలతు రేకాయే కా!

కం. పదునైదురౌప్యములతో
బ్రదికిన బడిపంతు లౌర, వ్యాపారముచే
పదుగురికిబెట్టు కరుణా
హృదయుండై వెలసె నాత దేకాయే కా!

కం. పలు కాఖండలునస్త్రము
లలితము హృదయంబు వెన్నలాగున ననుచున్
బలికె న్నన్నయ మున్నే
యెలుగెత్తి తదీయవిప్రు దేకాయే కా!

కం. ప్రాయము డెబ్బదియేండ్లై
కాయము జీర్ణించి 'జబ్బు గారించిన, లే
బ్రాయపువాడై మెలగెడి
నే యవసరమున నతండు ఏకాయే కా!

కం. అయ్యౌదార్యోజ్జ్వలునకు
వెయ్యేండ్లాయుస్సు వలయు విశ్వం బిటువం
టయ్యలచే రాణించెడి
నెయ్యెడనం డ్రెవ్వ రాత దేకాయే కా!

కం. ఇరువదియేడగు నీ సుం
దరనక్షత్రాలమాల దానత్యాగ
స్థిరునకు గూర్చుత వేయేం
డ్లిరుగడలన్ సుకవిగోష్ఠ లేకాకే కా!

కం. కృతు లిమ్మన డెవ్వరి స
త్కృతికన్యలె వలచి క్రుమ్మరించున్ బహుళా
క్షతలం దల నెట్టిజగ
ద్ధితుడో! తలపోయ నాతదేకాయే కా!

కం. ఏకాకు నాకు మున్నే
ప్రాకృతమగు ఋణముగలదొ ప్రస్తుతయుగ మం
దీ కృతిమాలలు పదివే
లేకా ఋణమునకు వడ్డియే యగు తలపన్

# నేను

మ. కవిశక్రేశుడ గండపెండెరములన్ గాంగేయ తీర్థంబులన్
వివిధోపాయనసత్కృతుల్ గొనిన గాంధీశాంతిసిద్ధాంతమా
ర్ధవమార్గాటుడ, గబ్బిలంబులకు దౌత్యంబుల్ ప్రబోధించు మా
నవతాస్రష్టను నవ్యభావచతురుండన్ జాషువాభిఖ్యుడన్

మ. వినుకొండన్ జనియించితిన్ సుకవితావేశంబు చిన్నప్పుడే
నను పెండ్లాడె, మదీయకావ్యములు నానారాష్ట్రసత్కారముల్
గొని కూర్చెన్ సుయశస్సు, కల్గుదురు నాకున్ భక్తులై నేనెఱుం
గనివా రాంధ్రధరాతలాన బహుసంఖ్యల్, సాహితీబాంధవుల్

# వీరచానమ్మ

మ. తెనుగుంజోదుల యుక్కుపిండముల హేతిజ్వాల చల్లార, భం
డనరంగంబు దొలంగి, భీరువయి, యింటంబడ్డ ప్రాణేశ్వరున్
గని, క్రోధోజ్జ్వలమూర్తియై పసుపులుండల్ జూపు మా ఖడ్గతి
క్కనయర్ధాంగికి, వీరచానమకు రక్తస్వాగతాభ్యర్చనల్!

మ. కవితిక్కన్నకు సోదరుండవయి, యక్రౌరవ్యసంగ్రామ భా
ర్గవగాథల్ పదునేనుపర్వముల నాకర్ణించియున్ వెట్టి యా
దవసేనన్ గని పారివచ్చితని భర్తన్ దెప్పు నవ్యాంధ్ర భా
ర్గవి కాలూనిన నేలలో మొలుచు నింకన్ త్యాగదీపాంశువుల్

మ. ముగురాడంగుల మైతి మిప్పటికి నీ పుణ్యాన నింకెందు కీ
మగరాయల్ ధరియించుడాలును, డవాల్, మాణిక్యరత్నాంచితం
బగుఖడ్గం బని భర్తలో కఱకువీరావేశవహ్నిచ్ఛటల్

మ. అనిలోనన్ మరణించియున్న భవదీయంబైన దేహంబుతో
ననలంబున్ వరియించి, స్వర్గపుర సౌఖ్యంబున్ సమార్జించియుం
దును, దీనాకృతి బారివచ్చు మనుపీన్గుంగూడి జీవించు టె
ట్లని నిట్టూరుచు వీరకాంతను సమస్తాంధ్రంబు భూషించెడిన్

ఉ. సంగరభీరువై పురుషజాతి జనించిన యట్టి వింత యా
డంగిని పెండ్లియాడిన పడంతిని నే నొక వీరపత్నినై
పొంగు టబద్ధ మంచు, వలపుంబ్రియనాథు నుదగ్రరోషవి
ద్ధాంగుని జేయు బ్రాహ్మణకులాంగనకున్ గవితాసుమాక్షతల్

ఉ. ఎల్లని రక్తవాహినుల నీది రణస్థలి చెంగలించు నీ
గుఱ్ఱము గూడ నీ పిరికికొల్పు సహించని రీతి కళ్ళెపుం
బిఱ్ఱున మోము వంచి విలపించెడు నంచు నిజేశునంగముల్
జుఱ్ఱననాడు నప్పరమశూరసతిన్ మది నావహించెదన్

చం. గడెగడె కొక్క పుట్టెడు రక్త మర్పించి మనుమసిద్ధులసేన పెనగుచుండ
విజయుడైవచ్చు నా ప్రియపుత్రు డని పల్కి మీయమ్మ నన్ను నమ్మించుచుండ
ఖడ్గతిక్కన కత్తికఱకు దారుణ మంచు మా బావ తిక్కన్న డాబులాడ
మొక్కవోవని భవద్భుజశక్తిగరిమంబు వమ్ముగా దని రాజు నమ్మియుండ

ఆ.వె. "ప్రాణభీతి పరచివచ్చిన మగయాడు
దాన వింక నీకు మాన మేల?
పసుపు రాచుకొమ్ము ముసుగులో" నని భర్త
నెత్తిపొడుచు మహిళ కేటికోళ్ళు!

ఉ. వీరరసోక్తులన్ కినుక పెల్లయి లేచి ఉదగ్రమూర్తియై
క్రూరకరాసి నందుకొని గుఱ్ఱము నెక్కిన భర్తకు న్నమ
స్కార మొనర్చి కుంకుమము గంధము నద్ది సహర్ష బాష్పయై
పోరికి సాగనంపిన యపూర్వ చరిత్రకు కోటి జోహరుల్!

చం. ప్రియునిశిరంబుతో తిరిగి వేగమునం బరతెంచు పారసీ
హయమును జూచి ఖేదపడి యశ్రులు రాల్చి తెలుంగుతేజ మ
క్షయ మగుగాత మంచు నరుసంబుగ భర్తృశిరంబుతోడ ని
ర్భయముగ నగ్నిజొచ్చిన ధరామరగేహినికిన్ ప్రణామముల్!

మ. పసుపుం గుంకుమ మీది మోహమున కుద్వాసంబు గల్పించి, నీ
రసదర్పుండయి వచ్చు నాథునకు వీరస్వర్గ మర్పించి, ని
ర్వ్యసనస్వాంతత నగ్ని జొచ్చి సకలాంధ్రధ్యేయయై కీరితిన్
పసుపుంగుంకుమగా వరించితివి చానా! నీకు శ్రద్ధాంజలుల్!

## హెచ్చరిక

మ. బుసలన్ గొట్టుచు కొమ్ము లొడ్డుకొనిఆబోతుల్ జగద్భీకర
త్రసరేణ్వస్త్రరణస్థలిన్ బెనగ సంరంభంబు గావించి య
క్కసుతో అంకెలు బెట్టు చున్న యవి ఆకంపించె దిక్చక్రముల్
వసుధామానవదీనవత్సముల కాపద్బాంధవుండెవ్వడో

మ. మనుజత్వంబు నహింసయున్ ప్రబలధర్మంబున్ బ్రతిష్ఠించు బు
ద్ధుని గాంధిన్ గని పెంచినట్టి ఘనహిందూ శాంతిసందేశమం
డన! బ్రహ్మాండవిదాహదోహలుల యున్మాదాగ్ని చల్లార్చు సా
ధన మేదో భవదీయపుత్రకుల కందం జేయు మార్యావనీ!

మ. ప్రళయగ్రాహము విశ్వచక్రగజమున్ బంధింప నుగ్రాగ్ని జి
హ్వాలతో నాస్యమువిచ్చియున్నయది యయ్యబ్జాక్షుచక్రంబు భ
క్తుల రక్షించు నటంచు స్వీయభుజశక్తుల్ సర్వమున్ రిక్తపూ
జల కర్పించిన ముప్పువచ్చు భరతక్ష్మాచక్రచక్రస్తనీ!

మ. చనియెన్ నాడ దిగంబరప్రభు వహింసాఖడ్గవీరుండు హిం
సను ఖండించిన చక్రధారి పటుహింసాపండితాఖండలుల్
వెనుకొన్నారు నిరస్తశస్త్రవు; లసద్వేదాంత వేలీల నీ
పెనుమృత్యున్ దునుమాడి శాంతిరమ నుర్విన్ నిల్పిరక్షింతువో!

కం. అభిచారహోమధూమము
నభంబున న్నిండి, ఉగ్రనాట్య మొనర్చెన్
త్రిభువనజయప్రదాత్రీ!
అభయం బిడు మమ్మ! యిండియాఖండసతీ!

## శ్రద్ధాంజలి

మ. ముదిముత్తైదువు లై, నిజేశులమనంబుల్ పండ, సంతానసం
పదతో పుట్టినమెట్టినిండ్లకు సిరుల్ ప్రాపింప, సంపూర్ణస
మ్మద మింపారగ గాజుమట్టెల ప్రజామర్యాదలన్ దేవతా
సదనం బెక్కిన కామినీమణులకున్ శాంతిప్రసూనార్చనల్

శా. నాదేశం బిది, రత్నగర్భ, కవిరాణ్మత్తేభముల్ పూర్ణమ
ర్యాదల్ మేలిసువర్ణ వర్షముల నభ్యర్చావిధానంబులన్
మోదంబందిన తావు, వీరపురుషస్ఫూర్జత్ ప్రతాపాగ్నికిం
బాదంచున్ గళమెత్తి పాడుకొను నీభక్తుండ, హిందూరమా!

మ. తను వుప్పొంగగ మీసముల్ మెలిచి యౌద్ధత్యంబునన్ నీ చరి
త్రను నీ పుణ్యనదీనదంబులను నీ రాజ్యవ్యవస్థామహ
త్తును వర్ణించుట నాకు నీ సుతునకున్ దోషంబుగా దెందు జూ
చిన నుగ్రాకృతి నృత్యముల్ సలుపజొచ్చెన్ స్వార్థభేతాళముల్

మ. అని కంటన్ దడివెట్టు నన్ను గని "వత్సా! సావధానంబుగా
వినుమీ సంధియుగాన దేశమున నావిర్భావమున్ జెందుచుం
దును దుశ్శక్తులు, మేటిసంస్కృతులకున్ జోటైన యీహైందవం
బున వర్ధిల్లకపోవు సౌఖ్యవిభవంబుల్ శాంతిచంద్రాంశువుల్"

కం. అని దేశశాంతిసంపద
కనువగు మార్గమును మందహాసోజ్జ్వలితా
ననయై ఉపదేశము స
ల్పిన దది వాక్రుత్తు కుట్మలించిన కవితన్

ఉ. కత్తులు దాచిపెట్టుకొని కైతవపుం గవుగిళ్ళొసంగు గ
మ్మత్తు ప్రదర్శనల్ సలుపు మానవనాథుల నాటకాలచే
చిత్తము నొచ్చి సత్యసరసీరుహవాసిని శాంతిహంస, యెం
తెత్తున గూడు గట్టుకొని యే గగనంబున దాగియున్నదో!

చం. కలుషితమైన సాంఘికపు కట్టడులందు నశాంతిబీజముల్
మొలిచి, సమాజమున్ జెరచి ముప్పుఘటింప, స్వతంత్రభావముల్
గలిగి యెదుర్చువ్యక్తి నధికారబలంబున నొత్తిపట్టి, చి
క్కుల కెరజేయు సంఘమునకున్ బదివేలు కరాళకంఠముల్

ఉ. అక్కట! విశ్వశాంతికొరకై, బలియై చనినార లెందరో
భిక్కులు బుద్ధశిష్యు లవివేక మతోన్మదభండనంబులన్
నిక్కపు త్యాగదీక్షల పునీతములై నసియైన యమ్మహా
భిక్కుల మేనిమృత్తికల వెల్గు జగద్ధితశాంతిబీజముల్

శా. శాంతిజ్యోతి వెలుంగగావలె, సమస్తక్షోణిచక్రంబు, ని
శ్చింతన్ సౌఖ్యపయోధి దేలుననుచున్ జిత్రంబుగా శుష్కవే
దాంతంబుల్ వినుపించి, దుర్బలులమీదన్ స్వారి గావించు న
త్యంతస్వార్థపరాయణుల్ గలుగ, సౌఖ్యశ్రీ విరాజిల్లునే?

శా. నీ పాపాల్ దొలగించి ని న్నమరశాంతిక్షోణికిం జేర్చువా
డాపద్బాంధవు డున్నవా డొకడు నీ వందాక యీ కంచమున్
గౌపీనంబు ధరించి యోర్చుకొనుడంచన్నార్తు లౌవారికిన్
టోపీపెట్టు ప్రబుద్ధు లున్నభువి నెట్టుల్ వెల్గు శాంత్యంశువుల్?

శా. పుట్టల్ గుట్టల చెట్టు చేమల నొగిన్ బూజించినన్ గష్టముల్
గట్టెక్కించు నటంచు నమ్ము ప్రజ కింకన్ బిచ్చి రేగించు స
న్మాట్టుల్ దుష్కవులంధకారయుగధర్మంబుల్ ప్రబోధించుచో
నిట్టూర్చున్ ఘనసత్యవాణి కనులన్ నించుం గదుష్ణాశ్రువుల్

సీ. రాక్షసం బైన స్వార్థజ్వాల చల్లారి విశ్వధర్మము కండబెట్టు చోటు
వంచనాకవచంబు వ్రక్కలుగావించి అలఘుసత్యజ్యోతి వెలుగు చోటు
పసిపాపమోముపై కుసుమించు నవ్వులో వెలుగు సౌజన్యంబు మెలగు చోటు
గురితప్పనట్టి దాశరథిబాణమువోలి దృఢదీక్ష జయము సాధించు చోటు

ఆ.వె. ఎదిరి కష్టసుఖము లెల్ల స్వీయములుగా
కోరి నరుడు పంచుకొనెడు చోటు
చింతలేని చోటు, సిరులు పండెడు చోటు
వెదకికొందు గుండె కుదుటబడగ

కం. లలితకళోద్ధరణం బని
కులమతరహితాధికారగుంభిత స్వేచ్ఛా
నిలయం బని; సుఖదం బని
హుళిక్కి గావించి రీసహోదరమంత్రుల్

తే.గీ. కావలె బహుత్వమందు నేకత్వ మనెడు
మేలిపలుకులు మాటసామెతకు గాని
ప్రళయఝుంఝానిలోద్ధూతబహుళభంగ
సాగరమునందు సాగునే శాంతినౌక

సీ. కరుణానిధులు ధర్మపరు లైన దివ్యదంపతుల మానసముల బ్రజ్వలించి
పరహితార్థంబుగా బలియైన త్యాగమూర్తుల యంతరాత్మల తురగలించి
భూషణదూషణంబుల నేకరీతిగా– స్వీకరించెడు వారి చెలిమి సలిపి
కడచన్న యుగమహాకవుల జిహ్వాలమీద ప్రత్యక్షరంబున నృత్యమాడి

ఆ.వె. ఆది రాజచరితలందు ధర్మమునందు
సౌరభిల్లు నిండు సౌఖ్యలక్ష్మి
హాయిమీర భారతీయుల నట్టింట
వేయుగాలు తాండవించుగాక!

# జోతలు

శా. ఏ కాలంబున భాస్కరుం డుదయమై యీ నేల బాలించి, భా
షాకాంతారము దున్ని రామునికథాసస్యంబు బండించెనో
ఆ కాలంబున గర్తపట్టణము, సర్వాంధ్రక్షమాగౌరవ
స్వీకారార్హతలంది, గర్భమున గాంచెన్ సత్కళాసింహులన్

సీ. ఘనుడైన సుకవి తిక్కన శైశవమునందు గొనబుటూయేల లూగిన గృహంబు
నిజపితామహుని సన్నిధి భక్తి శ్రద్ధల నన్నివిద్యలు నేర్చుకొన్న యరుగు
మనుమసిద్ధ్యధిపు డంపిన తాటియాకుపై యంబూకృతము సల్పినట్టి చోటు
ప్రాతగుంటూరు దేవత నల్లసానమ్మ పాదాల నిలువు దీపాలకరుడు

తే.గీ. సుకృతులైనట్టి యే ధరాసురుల యింటి
కుడ్యములలోన దలదాచుకొనియెనొక్కొ!
నల్లసానమ్మ యుత్ఫుల్లనయనయుగళి
నొదిగియున్నది ప్రాతగుంటూరుమహిమ

ఉ. భారతకావ్యకర్త ప్రభవంబయి చిన్నతనంబునంద బం
గారపుఘంటమంది యిరుకక్ష్యల గొల్వయి యున్న శంభునం
భోరుహనాభులం గొలిచి పొల్చిన దొడ్డగృహంబు ప్రాతగుం
టూరున మట్టిలో నణగియున్నది సప్తశతాబ్దవృద్ధమై

కం. హరిహరుల కిర్వురకు నం
తరమే లేదంచు జిన్నతనమున దనలో
స్థిరవిశ్వాసం బేర్పడి
హరిహరుల కొసంగె భారతామ్నాయంబున్

ఉ. తిక్కయజ్వ జనించి తిరిగిన గడ్డలో కొమరారు పవనాంకురములు సోకి
కొమ్మనార్యుని ముద్దుకొడు కీత లాడిన ఘనతటాకపుటుదకంబు గ్రోలి
మంత్రిభాస్కరుని మన్మడు కోతికొమ్మచ్చు లాడిన వృక్షాలనీడ దగిలి
పెనుకవిబ్రహ్మ దిద్దిన యోనమాలచే పావనంబగు వీధిబడుల జదివి

తే.గీ. వాసిగాంచిన గుంటూరుపట్టణంబు
గర్వితోరస్కులై మీసకట్టు మెలిచి
గౌరవింపదు, ప్రోద్దండకవులనైన
కక్షగొననేల? యది వీరలక్షణంబు

చం. ఇతరు లెఱుంగరాక హృదినేర్చెడు వేదనలెల్ల మానవ
ప్రతతికి నుండు చెప్పుటకు పద్యము చాలదు, నేను నట్టి దు
స్థితి దలమీద దాల్చుకొని శ్రీగల గర్తపురంబు జొచ్చి పు
చ్చితి నయిదారుఏడులు కృశించితి కావ్యకళాప్రవాసినై

మ. కలవారిచ్చిన పట్టువస్త్రములతో గన్పట్టు నన్ జూచి, శ్రీ
గలవాడీత డటంచు నల్వురన, నాకర్ణించి, నాకన్న కొ
డ్కులు జుట్టాలును డబ్బులేదనిన సంకోచింతు రీనాటిక
న్యులమాటేల? ప్రచారమందుఋతమున్ శుద్ధానృతంబయ్యెడిన్

శా. పేరుల్ పెద్దటికంబులూడి, నిజరాట్పీఠాళి గోల్పోయి యు
న్నారీరాజులు, సత్కళారమణికింకం గూడు లేదంచు, పె
ల్లారాటంబున గుందు నా కవితకింతాధారమున్ జూపిరీ
యూరన్ గల్గు పొగాకువర్తక వదాన్యుల్, నవ్యరాజన్యులై

శా. పక్కాఖద్దరు శాలువల్ బిరుదముల్ పద్యప్రశంసావళుల్
నక్కీదండలు దక్క నక్కరలకున్ ద్రవ్యంబులేకుల్లమున్
ముక్కల్‌సేయు విచారభారమున నప్పుల్ జేసి జీవించు నా
చిక్కుల్ దీర్చిన దానశౌండుల బ్రపూజింతుం బ్రసూనావళిన్

మ. అనుమానించితిగాని కాదు మన మధ్యన్ గృష్ణభూపాలకుల్
ధనవంతుల్ రసికోత్తముల్ గలరుదాత్తస్వాంతు లాంధ్రోర్వి పె
ద్దనలం బెక్కుర గాంచి సత్కవుల కాధారంబు గల్పించు త
ద్ఘన విఖ్యాతి పొగాకువర్తకుల కేదక్కున్ యథార్థంబుగన్

మ. సుడిగుండాల ప్రమాదముల్ సరుదుకొంచున్ దొడ్డసంసారపుం
గడలిన్ మున్కలువేయు నాదు కథ నాకర్ణించి, కారుణ్య మే
ర్పడ గుంటూరు పొగాకువర్తకు లుదారస్వాంతులై నాకు పు
ట్టెడు సత్కార మొనర్చిరట్లు కవికోటిన్ దన్ప బ్రార్థించెదన్

ఆ.వె. అడిగియెఱుగనెన్న డాశించిచేరెడు
పొలముగాని, చిన్ని నెలవుగాని
యడిగియడుగనట్టివన్నియు గూర్చిన
దాతృతతికి గోటి జోతలిత్తు

శా. భారీయెత్తున నుత్సవాల్ జరిపి నాపాదాన రత్నాలపెం
డారంబుల్ గయిచేసి పంపిన వదాన్య శ్రేష్ఠులున్ సుంత యా
ధారంబున్ దలపోయలేదనిన నేతద్గౌరవం బెల్ల గుం
టూరుం బౌరుల కీయగా దలచిరేమో యీశ్వరప్రేరణన్

మ. మతముల్ వర్ణము లడ్డుగోడలయిప్రేమన్ రాక్షసత్వంబుతో
హతమార్పం బ్రయతించినన్ సహజధర్మాలంబులై, సత్కళా
రతులం గౌగిటబట్టి ముద్దుగొను ధీరప్రజ్ఞులీయూర జీ
వితులై యున్నకతాన నా కిచట నబ్బెన్ గౌరవాధిక్యతల్

మ. ఎవడీతండనికాని, యెందుకనికానీ, వంశగోత్రాలతో
సవరింపం దలపోయ కేకమతి భాషాభక్తి రూపింప నా
కవితావిగ్రహరూపరేఖల నెదన్ గామించి రీవర్తక
ప్రవరుల్ సర్వసమత్వ దృక్కులు, కళావ్యామోహధీమన్మణుల్

ఉ. లేరన నెందరో కవులులేమికి జిక్కి తపించువారలు
న్నారు, ప్రజానృపాలకులునా కొనరించినరీతి భూరి స
త్కారము సల్పితీరెదరు కాలము దొడ్డది, గడ్డుచింతలన్
దీరిచి, సేవకుం దగినతీరున సత్ఫలముల్ ఘటించెడిన్

మ. ఉడుకున్నెత్తురువంటి కారమునుయత్యుష్ణంబులీలం భరిం
చెదు ఘాటైన రసజ్ఞులున్న పెనుబస్తీలోన బంగారపుం
బిడికిళ్ళన్ మరియాద లందితినిగర్వించెన్ గళాలక్ష్మి ధ
న్యుడనైతిం గల వాడనైతి, సృజియింతున్ విశ్వసాహిత్యమున్

మ. సరవిన్నేడిట వెల్గుచున్న కవిపూజాజ్యోతి దిగ్దేశ భా
సురమై యూరక యజ్ఞతా ఘనతమస్సున్ జెంది నానా కవీ
శ్వర దారిద్ర్య విదారకంబయిస్వరాష్ట్రప్రాప్తి నుప్పొంగు గుం
టురుకుం గూర్చెదుగాక యిట్టలపుగండుం గీర్తిభాండారమున్

చం. కృతికి ఖరీదు లేదని వచింతురు పండితు లట్టి మేటి స
త్కృతులు సహస్రమల్లిననుదీరని మేలొనరించి కావ్యభా
రతి నలరించినట్టి గుణరత్నపయోధుల యప్పుదీర్ప యే
కృతులు రచించి యెట్టు లలరింతునొ? వీటి పొగాకు నేతలన్

సీ. ఋణపిశాచముల దారుణ బాధపడలేక గజ్జెగట్టని కావ్యకన్యనరసి
సంసారమహిషంబు హింసింప గుండెలో నింకిన భావవాహినుల గాంచి
అన్యోన్యవిశ్వాస మంతరించి స్వజాతి కాలూను కుటిలమార్గము నెఱింగి
కదనజ్వరంబుచే కలవరించుచునున్న ధరణిమండలము వృత్తాంత మెఱిగి

ఆ.వె. గుండె కలతజెంది నిండిన వ్యధచేత
నంజలించు నన్ను నాకళించి
చింతలెల్లదీర్చి చిత్తంబులోనిల్లు
గట్టుకొన్న దొరను గౌరవింతు

సీ. కవియన్న కోనుకిస్కాగాడు పొమ్మంచు పెనునిరాదరణ జూపించువారు
కళలన్న నంకమ్మకళ మొగంబునదోప మనకెందుకని తప్పుకొనెడివారు
సత్కావ్యమన్న నెచ్చుటదీరు మాకంచు విసరి యవ్వల బారవేయువారు
సంగీతసభయన్న యంగనామణిలేక ఫలము లేదని తూలబలుకువారు

ఆ.వె. కళలులేనిచోటు కళదప్పు ననుగుట్టు
నాకళింప, దౌష్ట్య మంతరింప
సాధనంబులైన సత్కళ లూరూర
వీధివీధి తాండవించు గాక

ఉ. కైతల సానబట్టి వెలగట్ట నెఱింగి కళాపయోధి యం
దీతలుగొట్ట నేర్చు గుణదృక్కు మృదూక్తిచణుండు, రెడ్డి వి
ఖ్యాతుడు రామచంద్రుడు సభాంగనకుం బతియయ్యె చిత్తము
ఖ్యాతలనూగె వారి కరుణోన్నతికిం గవితానమస్కృతుల్

## విశ్వకవి

ఉ. గంగను ముగ్గి మద్భరతఖండ మొనర్చు తపఃఫలంబుగా
వంగకవీ! భవన్మధురవాఙ్మయగంగ, యనంతశాఖలై
పొంగి, యఖండభూవలయ పూజల నంది ఘటించె మాకు స
ర్వాంగక రక్తనాళములయందు వినూతనగర్వబీజముల్

మ. తలయున్, గడ్డము, మీసముల్ నెరసి వార్ధక్యంపుగంభీరరే
ఖలతో ముచ్చట మీరు నీ సహజశృంగారాకృతిన్ నాటివ్యా
సులు, వాల్మీకులు గోచరింతురు మహర్షుల్, మాకు, నీ చేతిలో
కలమో! కల్పకమో! వెలార్చినది రంగత్కీర్తిగంగాఝరుల్

మ. తెలవారల్ తెలవారి నీ కవనశక్తిన్ మెచ్చి, నీ గీతికాం
జలినోబెల్ బహుమానమున్ నిలిపి పూజల్ సేయ విశ్వంభరా
జలజాతంబు ప్రఫుల్ల మైనది కవీశానా! రవీంద్రా! రవీం
దులకున్ గల్గును చావు పుట్టువులు నిన్నుం జెంద వేనాటికిన్

శా. ఏ పాళీ గొని, యే మషీరసముతో, ఏ యక్షరశ్రేణికిన్
రూపం బిచ్చి మనస్సులం గుదుపు నేర్పున్ నేర్పి, విశ్వంభరా
దీపజ్యోతులు సత్కృతుల్ సలిపి సందేశంబు లందించితో
ఆ పాళీ లెట జిక్కునో తెలుపు మన్నా! వంగభాషాకవీ!

మ. హృదయం బుండని, స్వార్థదూషితపు సాహిత్యంబు సృష్టించి శా
రదకున్ దాతల నాటి సొమ్ము లిడు గర్వగ్రస్తవిద్వాంసులన్
గదమాయించి, విదేశపండితుల సత్కారంబులంగొన్న నీ
మృదులంబౌ రచనావిధానమును మోహించు న్గవీణ్మండలుల్

మ. గురుదేవుం డని పిల్చి నీ మధురవాక్కుల్ మౌళి గీలింపడే
దొరలన్ దాతల లక్ష్యపెట్టని మహాత్ముం డుజ్వలఖ్యాతికిన్
గురియై భారతభూషవై వెలుగు నీకున్ స్వర్గమం దాపురం
దరు డీయంగల కాన్కలున్నవె? కవీంద్రా? నీకు శ్రద్ధాంజలుల్

మ. జగతీచక్రసమస్తమానవసమాజం బెల్ల నాత్మీయబం
ధుగణం బన్న విశాలభావమధుబిందుల్ జిందు నీ వాఙ్మహో
పగలో విచ్చిన హేమకావ్యలలితాబ్జంబుల్ కళాబ్రాహ్మికిన్
నగలై ముద్దులు గుల్కు చున్నవి కవీంద్రా! వంగవిద్వన్మణీ!

తే.గీ. అయిదు ఖండాల కేల్మోడ్పు లందు కొన్న
విశ్వకవి రవీందుని గన్న వీరభూమి,
మాది మా దని పల్కు దొమ్మలు గలావె
అల నమెరికాకు గాని రష్యాకు గాని

తే.గీ. అంబునిధికన్న గంభీరమై, నభోంత
రాళమునకన్న బహుళ విశాలమైన
తావకీనాశయముల సౌందర్యమునకు
స్తంభితం బయ్యె ఖండపంచకము సుకవి!

మ. అనువారంబు ప్రపంచచక్రమున ప్రత్యక్షించు ప్రత్యక్షరం
బున గీతాంజలియందు పండిన శిరంబున్ గడ్డముల్ బుద్ధి కం
దని యత్యున్నతభావరాశి, జగదానందస్వరూపంబు, నా
కనుమానం బగు కీర్తిశేషు డని నీ, కర్చావిధుల్ సల్పుటల్

# హేమలతాలవణాలకు (వార్ధాలో)

మ. ఘనవిజ్ఞాననిధుల్, సబర్మతిమునీట్కార్యణ్యసంప్రాప్తపు
ణ్యనిధుల్, లోకహితప్రవర్తకులు, కల్యాణోత్సవాధ్యక్షులై
తనరంగా లవణంబు హేమలత లాదర్శాంధ్రసంసారజీ
వనయాత్రారతు లై వెలింగి రిట సేవాగ్రామపూజ్యస్థలిన్

మ. అమలాహింసయు, ప్రేమయున్, గరుణ, యైక్యంబై లసత్సూత్రబం
ధముగా, మానసముల్ పెనంగొన ప్రశాంతంబున్ బవిత్రంబునై
అమృతస్వచ్ఛగృహస్థయాత్రమధురంబై ఆయురారోగ్య భా
గ్యము సంధింప వధూవరుల్ పొలుతు రుద్యద్భద్రదీక్షారతిన్

# ముఖ్యమంత్రి సంజీవయ్యకు

ఉ. పావనధర్మదేవత యపారముగా పదివేల యేడు లా
శావిలచిత్తయై సలిపి నట్టి తపంబు ఫలించె, హాసము
ద్రావదనంబునం గదు ముదంబు వెలారిచె గాంధితాత, సం
జీవయ ముఖ్యమంత్రి యయి, సింహపుపీఠ మలంకరించినన్

కం. తెరచిన నోళ్ళం గ్రైస్తవ
హరిజనకవిచాతకంబు లాశాదృక్కుల్
పరచెడి నమాత్యమేఘము
గురిసెడు నమృతంపు చినుకు కొఱ కాతురతన్

మ. పదివే లేం డ్లవమానదుఃఖశిఖలన్ భస్మంబు గాకుండ, ను
న్మదవర్ణాశ్రమధర్మకర్మగజదంతక్రూర సంఘట్టనా
పదలన్ క్రుంగి కృశించి యున్న దదె నీబంధుప్రజం బెట్టు లే
లెదొ! దామోదరవంశపద్మవనహేళీ! ముఖ్యమంత్రీశ్వరా!

మ. అవకాశంబు లభింప గాధిసుతు నట్లభ్రాంతమందేనిరెం
డవ బ్రహ్మాండము సృష్టి చేయగల ప్రజ్ఞాపాటవం బున్న స
త్కవులున్నారు, కరావలంబనము మృగ్యంబై విచారింత్రు సం
జివ మంత్రీశ్వర! పుష్పితం బగునె సుశ్రీ నీదు తమ్ముళ్ళకున్

## కవిగానిబ్రదుకు శ్రీరామరామ!

మ. ఋణబాధాక్రకచంబునన్ గుమిలిపోయెన్ గుండె, పాషాణకం
కణనిక్వాణ మొనర్చుచున్ గృహమునన్, గాలూనెరూక్షావిషో
ల్బణదృష్టుల్ ప్రసరించు చున్నది కరాళం బైన దారిద్ర్యమా
రణభూతం బెవ రాదరింతురు కవీంద్రా? నిన్ను నీ శేముషిన్

శా. పప్పున్ బియ్యము, దానికిం దగిన సంభారంబు లెన్నాళు లి
ట్లప్పుల్ జేసి, ప్రతిష్ఠ జారని రహస్య క్లేశ సంసారపుం
దెప్పన్ ద్రిప్పెద వోయి, నీ బిరుదముల్ నీ కాలి పెండారముల్
దుప్పట్లక్కర దీర్చునా? సుకవు లెందున్ మందభాగ్యుల్ గదా?

చం. అయినవి పెద్దపెద్ద సభ లాయన కే మని చప్పరింత్రునీ
వ్యయమును రాబడిన్ దెలియ నట్టి ధనాఢ్యులుదారులైన నీ
ప్రియసఖు లెల్ల నిర్ధనులు, ప్లేటును మారిచి కొత్త శాయిబా
బయ వయి కూరుచుండుము సహస్రములూడిపడున్ బదంబులన్

మ. అనరా దైన నిహంబు మాని పరమం దైక్యంబు గ మ్మప్డు చ
క్కని దేవాలయమందు నీదు ప్రతిమల్ గాంగేయఖండంబులై
జననం బంది హుళుక్కిభక్తులకు భోజ్యం బింత కల్పించు, నే
మని వాక్రుత్తు మనుష్య నైజ మపసవ్యం బై ప్రయాణించెడిన్

చం. కల దొక మాట నే డమెరికాఘనవైద్యుల నాశ్రయించి, తొ
య్యలు లగుచున్న వార్పురుషు లట్టియుపాయము లభ్యమైనచో
కలుగు ప్రవేశయోగ్యతలు, గట్టిగ నేటి సినీజగత్తులో
గులుక, కవిత్వ మేమిటికి కూటికి గుడ్డకు రాదురా కవీ!

## శిలువ

మ. పలుగాకుల్ పరమార్థవంచకులు లోభస్వాంతులున్ కొంగభ
క్తులు, వైదేశికవేషధారులు, కళాద్రోహుల్, మృషాప్రేమసూ
క్తులు వల్లించెడువా రనేకులు, ధరాగోళంబునం దుండగా
శిలువా! పాపమహాటవీదహనరాశిన్, గ్రీసు నాశింతువా!

మ. తెలుగుం గైతలలోన యేసుని కథాదివ్యప్రసాదంబు న
న్యులు కందించు మహాప్రయత్నమున కేవో సాకులన్ జెప్పువెం
గలులౌ కొయ్యతుపాకి గాంద్రుబహుసంఖ్యల్ దేశమందుండగా
శిలువా! పాపమహాటవీదహనరాశిన్, గ్రీస్తు నాశింతువా!

మ. తలయున్ దోకయు లేని వేల్పుల చరిత్రల్ కావ్యరత్నప్రదీ
ప్తుల శోభిల్లుచు నుండ, క్రీస్తుచరితంబున్ పచ్చి నిస్సారపుం
బలుకుం బుంతలు దాటనీయని దురాత్ముల్ దండిగా నుండగా
శిలువా! పాపమహాటవీదహనరాశిన్, గ్రీస్తు నాశింతువా!

మ. కులతత్త్వం బను దుష్టరాక్షసికి సద్గుల్ జంకలున్ జారి దు
ర్బల మైయున్న ప్రజాయుగంబున సువార్తావాహకుల్ దైవభ
క్తులు లో లోపల పక్షపాతమున యెగ్గుల్‌చేయువా రుండగా!
శిలువా! పాపమహాటవీదహనరాశిన్, గ్రీస్తు నాశింతువా!

మ. తలలో పెక్కు దురాశ లూర, ఉదరార్థంబై దగా వేషభా
షలతో లోకము కన్ను గప్పెదు తమాషా సోమరుల్ దొడ్డబొ
జ్జలవా రింతయు జాలి లేని పటుపాషాణప్రభుల్ గల్గగా
శిలువా! పాపమహాటవీదహనరాశిన్, గ్రీస్తు నాశింతువా!

## లైకా

కం. ఆకసపు బాటసారీ
లైకా! నీ మరణ మొక యలంకృతి రష్యా
రాకెటు సృష్టిచరిత్రకు
నీ కివె మా వేడి కంటి నీటి నివాళుల్.

ఉ. గుండెలు లేవు మానవులకున్ నినుబోలి యనంతరోదసీ
మండలయాత్రసేయ యజమానులాజ్ఞ శిరాన మల్లెపూ
దండగ దాల్చి కృత్రిమసుధాంశునితో పయనించి యీ జగ
త్కాండనుతుల్ గడించితివిగా, లయికా! శునకాంగనామణీ

## నాగార్జునుడు

శా. ఓ నాగార్జునసన్మునిప్రవర! నీ పుర్వీస్థలిం బాసి, యె
న్నో నూర్లబ్దము లంతరించినవి, ఆంధ్రోర్విన్ భవత్సత్కృతో
ద్యానం బిప్పుడు పూచి కాచి సువిశాలాంధ్రంబు సృష్టించి మా
కానందంబు ఘటించె పండినవి నీ యానాటిదీక్షావనుల్

మ. ఉరవళ్ళుం బరవళ్ళు ద్రొక్కుచు, ప్రగాఢోర్మిచ్ఛటాలాస్యసుం
దరివై చక్కని పిల్ల కాల్వలు మహేంద్రక్షోణికిన్ గోటివ
త్సరముల్ శ్యామలసస్యభూషణములన్ సంధింప, భాషాకవీ
శ్వరపూజావిధు లందుకొ మ్మమల, కృష్ణావాహినీమోహినీ!

## సంక్రాంతి

మ. ఒడలన్ జెమ్మట లూర కర్షకజన వ్యూహంబు రేయింబవల్
పుడమిన్ దున్నిన దీర్ఘకష్టఫలితంబున్ ధాన్యరూపంబుతో
నిడి విశ్రాంతి యొసంగు పండుగవు, దేవీ! నీవు ఆనందపుం
గడలిం దేలె సమస్తలోకమును సంక్రాంతీ! నమోవాకముల్.

మ. అలరారెన్ దెలిమబ్బు లున్నతధరేంద్రాగ్రంబులన్, బంతితో
టలు, చేమంతులు గుమ్మడుల్ పసుపుబట్టల్ దాల్చి, లే మొగ్గ న
వ్వులతో స్వాగతమిచ్చు చున్నవి, భవత్పుణ్యాగమం బెల్లసీ
మల విశ్రాంతికి కారణం బగు గదమ్మా! పర్వరాజ్ఞీమణీ!

మ. చలితో రేగిన రోగబీజముల దోషం బెల్ల నీ భోగి మం
టలతో దగ్ధము జేసి జీవితపుతోటల్ శుద్ధి గావించి, రా
గల సంవత్సర మెల్ల దేశమున సౌఖ్యశ్రీలు వర్షించి, ని
ర్మలధీశక్తు లొసంగు మమ్మ! శుభసంక్రాంతీ! దిగంతంబులన్

శా. వచ్చున్ సంకురుమయ్య భూతలికి నీ బంగారు తే రెక్కి మీ
కిచ్చున్ మేళ్ళని శాస్త్రముల్ బలుకు, నేదెట్లైన నీ రాకచే
పచ్చంబడ్డవి మా మనోబ్జములు సంప్రాప్తించె నీసత్కటా
క్షోచ్చచ్ఛాయల నన్న వస్త్రములు మాకో పర్వరాజేశ్వరీ!

ఆ.వె. నీళ్ళు మోసి మోసి నింగిని మేఘముల్
పర్వతాలిశయ్య పవ్వళించె
కలత లెల్ల బాసి కొలకులు పరిశుభ్ర
జలయుతంబు లై ప్రశాంతి నలరె!

ఆ.వె. కర్షకాళి బాహుకష్టంబు ఋణమీగి
క్షేత్రరాజి నిద్ర జెంద సాగె
కాడిమ్రాని బరువు గడచి పోవగ నెడ్లు
హాయి మీర నెమరు వేయు చుండె

ఆ.వె. మానవులకె కాదు మహి నెల్ల సృష్టికి
తలప నీదు రాక సెలవు రోజు
ప్రణతు లమ్మ సంకురాతిరి యింటింట
నడుగు మోపి విందు గుడిచి పొమ్ము

ఉ. రైతుల సేవకున్ కొలుచు రాసు లొసంగి ఋణంబు నీగు భూ
మాత విధాన మేలునకు మారుగ మే లొనరింప దీ నర
వ్రాతము ఎన్న డీనరుల ఊతి మనస్సులలో కృతజ్ఞతా
నైతిక ధాన్యబీజములు నాటి ప్రశాంతి ఫలంబు లిత్తువో

## ఖద్దరు

మ. శ్రమజీవుల్ జిలికించు చెమ్మటలలో స్నానంబు గావించి, క
ష్టము గుర్తించెడు కామధేనువవు మా సంపూర్ణస్వేచ్ఛావికుం
ఠము నీరాట్నపు ఝాంకృతిధ్వనులలోనం బండి ప్రాప్తించె, గాం
ధిమునీంద్రప్రియపుత్రికా ఖదరు రాణీ! నీకు కేల్మోడుపుల్

మ. కదు రాడించిన యింట నీవిచట సాక్షాత్కారమున్ జెందగా
పదిపండ్రెండగు కోట్లు దోచుకొను నప్పాశ్చాత్యయంత్రాళికిన్
మెదుకుల్ కట్టువడెన్ మహాత్ముని మనోనేత్రంబునన్ దోచి ఆ
పదవారించిన నీదు పుట్టువునకున్, బ్రహ్మోయురైశ్వర్యముల్

మ.	సిలుకుల్ సన్నని బొమ్మనూ ల్మదుపు లుజ్జీ చేయగా లేవు, బీ
దల కిం తన్నముబెట్టు నీ సహజసౌందర్యంబులో దంబమున్
తళుకుల్ బెల్కులు లేక జాతికి సముత్సాహంబు గల్పించి, ధీ
బలమున్ గూర్చు స్వరాజ్యదాయిని నమోవాకంబు ఖాదీరమా!

ఉ.	రాటపు ఝూంకృతుల్ భరతరాజ్యము నిండి ప్రతిధ్వనింప నా
రాటమునందె నుగ్రసమరస్థిరసీమ నృపాలసింహముల్
ఆటమబాంబుగోళచటులాగ్నికి జంకని మేటి శక్తి మా
పేటల పల్లెలందు ప్రభవించె స్వరాజ్య జయాభిరామమై

ఉ.	జాతులు వాని యాంత్రికపు సన్నని బట్టల జగ్గు నిగ్గు నీ
నేతల బట్టలం గలుగనేర దటంచు తిరస్కరించి మా
జాతినినుంపగజ్జల పిశాచి కౌసంగితి మర్ధ మయ్యె చ
ర్ఖాతఖిలీల మే ల్ఖదరు రాణి! భవద్గుణధర్మమర్మముల్

## బాప్టిస్టు వజ్రోత్సవము

సీ.	శ్రుతగిరీంద్రపురంబు నతమస్తకము గాగ పూచెనిచ్చట క్రీస్తు రాచరికము
గరిమతో మిషనరీ దొరలు పాదులు చేయ మొలిచె నిచ్చట వాక్యపుష్పవనము
ఆదిబోధకుల భక్త్యావేశబలమున విస్తృతం బయ్యె బాప్టిస్టు పొలము
ఆత్మీయనిత్యదైవారాధనల చేత, ప్రబలె నిచ్చట క్రైస్తవప్రశస్తి,

తే.గీ.	ప్రాప్తమైనది వజ్రోత్సవంబు యశసు
మృదుల మైనది బాప్టిస్టుమిషను మనసు
యేరుపడ్డది డెబ్బదై దేండ్ల వయసు,
అమరు గావుత ప్రభుకటాక్షముల గొలుసు

## ఊరడింపు

ఉ.	ఏ కవి వ్రాసినం బరమమీశ్వరమన్న పదాల గారడీ
పాకము రంగరించి, కడుపార భుజించి సుఖింపుమంచు నా
ఆకటి చిచ్చు లార్పగ ప్రయత్నము చేయు, యుగాల నుండి నా

ఉ. ప్రేమయు జాలియుం గరుణ, పెద్దలు పెద్ద లొౌక శ్లోకళ్ళపై
బాముకొనంగ నేర్పడిన స్వార్థనినాదము లంతెకాని యీ
ప్రేమకు దాసులై ప్రణయవారిధి నీతలుగొట్టు భావుక
స్వాములు దక్కనిత్తురె లవంబును నాకు దరిద్రమూర్తికిన్

ఉ. ఎండగుఱాలలోని జల మీ కృతిభాండములందు నింపి త్రా
వుం డని పల్కు చుందురు కవుల్, నవభారతభర్త లిందు బ్ర
హ్మాండరహస్య మున్న దని యొౌదల దాల్చిన పామరప్రజా
కాండమునందు చీకటి పొగల్ చెలరేగక వెల్గు సోకునే!

# నిర్వేదము

మ. అనుమానింప దొడంగినా రిపుడు నా ఆయంబు సర్వస్వమున్
తిని, ఆర్జించిన సుప్రతిష్ఠలను బూదిం బూడ్చినా రీ ఖలుల్
తను వర్ధంబు సమాధిలో జివుకుచుండన్ వెల్వలన్ దోచు త
క్కిన దేహంబు భుజింప వే శునకముల్ గృధ్రంబు లాత్మేశ్వరీ!

చం. కడుపు విరోధమై, విసముగ్రక్కుచు దుఃఖపయోధిగర్భమం
దడుగున కంటద్రొక్క నిజ మారయ లేని జగంబు సంశయం
పడ, అపరాధశూన్యమును పావన మైన మనస్సులోన గా
రడవులు కాలి భస్మమయి ఆవిరి జిమ్మెడి జీవితేశ్వరీ!

ఉ. ఈ తెరచాటు పోటులు సహింపగ సత్తువ లేదు గుండెలో
కోతలు కానుపింపవు దిగుల్వడి యున్నది సత్యవాణి, యీ
యాతన లెల్ల దీర్చు మహదౌషధ మైన మృతిన్ భజించి యు
ర్వీతలగర్భశయ్యలు వరించితివా, సుకవీశ్వరేశ్వరీ

చం. అరువదివేలదిన్నారము లస్త్రములై గళముత్తరింప దు
ర్భరపుదరిద్రతావ్యథల పాలయి పోయిన పారసీకవీ
శ్వరుని విధంబునన్ వయసు పశ్చిమదిగ్గమనంబుసేయ నీ
వరిగిన త్రోవ నిన్ను గలియం బయనించెద జీవితేశ్వరీ!

ఉ. ఆదరు వైన పిచ్చమకు నంత్యదినంబుల నన్ను జూపి, ఆ
వేదనతోడ నా వెనుక పెన్మిటిభారము నీ దటన్న నీ
సాదరవాక్కు నిల్పుటకు సర్వవిధంబుల తోడునీడ యై
వేదన మాన్పి నిన్ను మరపించుచు నున్నది జీవితేశ్వరీ!

## శారదా దర్శనము

కం. పలుకుల తోటం బూచిన
యలరులతో దండ లల్లి అఖిలాంధ్రకళా
విలసితవీరార్చనకై
కల మందితి నొక్క రేయి కౌతుకమతినై

మ. అనుకొన్నంత సమస్తశబ్దరుచిరాస్యభ్రాజియై వాఙ్మయాం
గన తోతెంచి నమస్కరించి కవిశక్రా కల్గు నా దొక్క ప్రా
ర్థన మాలించి కలంబు బట్టు మని చెంతన్ నిల్చె, నెమ్మేన నా
ధునిక ప్రాక్తనకావ్యభూషలప్రదీప్తుల్ స్నాన మాడింపగన్

ఆ.వె. కలము డించి యేమిగావలె? నీ కోర్కె
విన్నవించు కొనుము వేళ లేదు,
ఆరు నిముసములకు నదనంబుగా రెప్ప
పాటుమించ రాదు మాట వచ్చు.
అనిన చిత్తమట్లె వినుపింతు నని చిన్న
నవ్వు నవ్వి, వందనంబు సలిపి

సీ. వాల్మీకిముని నోటబడి ధన్యురాలనై చిరయౌవనంబు నార్జించు కొంటి
పోతనార్యుని వంటపుట్టినై కొన్నాళ్ళు ధారుణీశుల కాలదన్నినాను
ఘనకవిబ్రహ్మ కోరిన మాట లందించి హరిహరేశుని మెప్పు లందినాను
ముగురు రాజుల దండిమగని దర్బారులో క్రొంగొత్తనగలతో కులికినాను

ఆ.వె. భాషలందు దొడ్డ భాషనై పండితుల్
నిలువుమన్న చోట నిలిచినాను
సత్య రచయితలకు స్వాధీననై క్రమ్మ

సీ. ఆశింతు భువనకల్యాణకాముకు లైన త్యాగివీరుల గాథ లాలపింప
పరువు లెత్తెద కృపాపరుల పాదముల కెంధూళిలో ధూళినై తురగలింప
వలతు నెప్పుడు శాంతిపథికయోధుల రక్త మొలికి పోయిన నేల కొలువుదీర
కామింతు నజ్ఞాత కదనవీరుల ప్రాతగోరీల మీద కన్నీరునింప

తే.గీ. పుణ్యరతు లైన భారతపుత్రవరుల
త్యాగశక్తులు నర్తించు తరుణ మందు
నాశరీరంబు దరిగి ఖండము లొనర్చి
సరఫరా చేయగలనోయి సత్కవీశ!

కం. అని శాబ్దికరాజ్ఞీమణి
వినయవిధేయతల కోర్కె వినిపించిన స
జ్జననుతుని కర్ణవీరుని
వినుతించితి నిట్లువాణ్యభీప్సితసరణిన్

# నవక్రైస్తవ సన్మానము

మ. ఎలమిన్ మత్తమదేభవాహనములం దెక్కించి సన్మానముల్
సలిపెన్, బంగరు స్నానముల్ సలిపె కాలన్ గండపెండేరముల్
నిలిపెన్, నా కవితారసగ్రహణ కేళీలోలమై ఆంధ్రభూ
తల మస్మత్కవితాపరిశ్రమకృతార్థంబయ్యె దిక్పూజ్యమై

చం. పలుకుల రాణికిన్, తెలుగు బాసకు సల్పిన సేవ కాంధ్రభూ
ములు పదిరెట్లుగా ఫలితమున్ బహుభంగుల నా కొసంగెస్వః
కులజులు మిన్న కుండి రని గుందితి ఆ దిగు లెల్ల దీర నా
కలమును గౌరవించె నవక్రైస్తవ బాలసముద్భవించుచున్

ఉ. తెల్లని భాష నేర్చుకొని తెల్లని సంస్కృతి గౌగిలించి మే
మొల్లము తెల్గు బాస యనుచున్బహు, భాషల రాణియై విరా
జిల్లెడు మాతృభాష నిరసించెడు వారి తమోవిభావరిన్
భల్లున దెల్లవార్చె వహవా! నవక్రైస్తవభాస్కరప్రభల్

## వితండవాదము

తే.గీ. ఒకరు పట్టిన కుందేటి కుండ వచ్చు-
మూడు నాలుగు కాళ్ళు మామూలుగాను
నేను పట్టిన మింటి కుందేటి కసలు
కచ్చితంబుగ నున్నది కాళ్ళు రెండె

కం. ఎందుండు రెండు కాళులు
కుందేలని కారణాలు గోరుచు నిజమున్
సందేహించెడు మీకీ
కుందే లే రీతి నేత్రగోచరము నగున్

చం. కనుపడ దీ కనుంగవకు కావలె నాత్మసులోచనంబులీ
తనువు నశించి కొండొక యథార్ధశరీరము దాల్చి చూతు రీ
మనుజులు, హేతువాదపు దుమారమునం దగుపించ నంతమా
త్రన నిరసింపగూడ దజరామరదివ్యశశస్వరూపమున్

కం. పట్టిన కుందేటిని చూ
పెట్టుం డిల ననుచు చెవుల పిల్లుల నెల్లన్
వట్టివని కుండ బ్రద్దలు
గొట్టిన గతి బల్కి తిట్టి గ్రుడ్లురిమెదరా

కం. రెం డేమిటి ఒక టేమిటి
కుండవు కాళ్ళసలు యెందు కూరక మీతో
మొండి వివాదము పెను పా
షండుల కీ రెండు కాళ్ళ శశ మగుపడునే!

## పసితనము

కం. పసితనమున నెరుగను నే
నిసుమంతయు దుష్టగుణము లెదిగిన కొలదిన్
వసుమతి నేర్పిన యది దు
ర్వ్యసనంబులు, వయసు ముదిరి ప్రబలము లయ్యేన్

ఆ.వె. నాది గొప్ప జన్మ నావంశమే దొడ్డ
వంశ మన్న అహము బలిసె నిపుడు
యెంత చదువుకొన్న నీ భేద భావంబు
వదల దేమి చేయ వలయు నేను

కం. అందరు నావలె పసివా
రందరితో గలసి మెలసి ఆడెద నని యా
నందించు చిన్న తన మిపు
డందికలో లేక దూరమై గికురించెన్

కం. దినములు పైబడు కొలదిన్
మనస్సరసిజమున గల్గు మధువంతయున
ల్లననింకివిషమునిలిచెన్
చినతన మిపు డుద్భవించు శిశువుల జెందెన్

కం. నే నాడుకొన్న చోట్లున్
నే నాడిన బొమ్మరాళ్ళు నే నెక్కిన చె
ట్లీనా డెడమై నాతో
నానాళ్ళం జ్ఞప్తి చేయు నా యా గడెలన్

కం. ఏ పాపల ప్రాపించెనొ
నా పావనశైశవంబు నా సౌఖ్యంబున్
నా పరమానందంబున్
నా పాపములేని మనసు నా చిటిపల్కుల్

కం. అపు డెరుగని అపరాధము
లిపు డెన్నో చేయుచుంటి యిహపరములయం
దపరాధినైతి, కపటపు
జపములు దేవాలయాలు శరణము లయ్యెన్

కం. పూచిన వనముల జూచిన
పూచె న్నా మనసు బాల్యమున, నా కిపుడా
పూచిన వనముల కాలన్
రాచెడు నీర్ష్యానలంబు రగులు నదేమో

కం. అమ్మయె సర్వస్వం బపు
డమ్మయె స్వర్గంబు అమ్మ ఆలింగనసౌ
ఖ్యమ్మున కెనయగునే స్వ
ర్గమ్ములు పదివేలు వశముగాదు వచింపన్

కం. అమ్మయె నా దేవత నే
నమ్మకు దైవంబ నగుచు నమ్మ తనూ ర
క్తమ్మున ప్రతిచెమ్మను నం
దమ్ముగ నా రూపు ముద్రితంబై నిలిచెన్

ఆ.వె. అమ్మ జోల పాట యందు నా దేహంబు
సురిగి వెన్న వోలి కరిగిపోవు
నాదు కంటి నీరు నా తల్లి దేహాన
నరనరాల దుఃఖనదుల జిమ్ము

## రత్నాంజలి

చం. తెలుగు పొలంబు గన్న కవిధీరుల మంజుల కావ్యమాలికల్
జిలికిన తేనె బిందువులు చేరిచి కూరిచి శాంతినామకో
జ్వలఘన సంపుటిన్ గగనవాసినికిం గులకాంత ఆత్మకిం
పలరగ శాంతి గూర్చిన మహాత్మున కౌ కనకాభిషేకముల్

మ. గ్రహతారల్ గతి దప్పినన్ దిరుగ దేకావాక్కు యేతన్మహా
మహనీయు న్నుతియింప శేషునకు దొమ్మల్లేవు నిస్వార్థధూ
ర్వహుడై సల్పు నసంఖ్యసంఖ్యలగు దీవ్యద్ధర్మముల్ విశ్వలో
కహితార్థంబుగ నమ్మహాత్మునకు దిక్చక్రప్రశంసాంజలుల్

మ. ధనశాఖాసచివోత్తముండు ఘనవిద్యావారిధీశుండు స
జ్జనసమ్మాన్యుడు కాసువంశజుడు భాస్వద్రెడ్డిసమ్రాట్టు, చ
ల్లని హస్తంబున వెల్వరించెడిని బాలా! శాంతిసత్కావ్యమో
హిని! నీకౌ నఖిలాంధ్రపండితసభాహేరాళపూజావిధుల్

శా. యావద్భారతరాజకీయములు హస్తాబ్జంబునం గల్గు ప్ర
జ్ఞావారాన్నిధివైన నిన్ను గని ఆనందించె జన్మక్షమా
దేవీరత్నము గుంటూరు మండలము సందీపించెడిన్ శాంతికా
వ్యావిష్కారసభామహామహ మమాత్యా! కాసువంశప్రభూ!

శా. మున్నూర్గుర్ కవు లాలపించిన పదంబుల్ మీ కరస్పర్శచే
యిన్నా రేడులు శాంతిచంద్రికలు హాయిన్నించి యేకాకులా
ధ్యు న్నిత్యంబు స్మరించుగావుత చిరాయుర్భాగ్య సంపత్తులౌ
నన్నా! కాసుకులేశ! తథ్య మిది బ్రహ్మానందరెడ్డీశ్వరా!

## విజ్ఞప్తి

మ. పరిపాలింపుము యావదాంధ్రము నపూర్వప్రజ్ఞ దీపింపగా
పొరుపుల్ పొచ్చెము లెల్లమాన్పి, పెరభూముల్ మెచ్చగా పెద్దమం
తిరి గంభీర దయాసముద్రు డను కీర్తిన్ బొల్చి, నీలం కులే
శ్వర! జోహారులు నీ జయోన్నతి కివే! సంజీవరెడ్యగ్రణీ!

మ. జయనిర్ఘోషల ముఖ్యమంత్రివయి రాజత్పాలనా దండమున్
కయికొన్నా విరుమార్లు, మంత్రికుల లోకగ్రామణీ! సత్కవుల్
కయితల్ గూర్చి యలంకరించిరి భవత్కంఠంబు బాపుజి య
వ్యయ కారుణ్య కటాక్ష మాలికలు నీపై జల్లె సోల్లాసియై

ఉ. చంకలు గొట్టుకొన్నది, విశాల మహాంధ్ర ధరాతలంబు ర
త్నాంకిత హేమపీఠి, చరణాబ్జము నిల్పుచు, ముఖ్యమంత్రి తా
పంకరుహాక్షి కంఠమున బంగరుపుస్తె ఘటింప, యేలుకొ
మ్మింక, చిరాయురభ్యుదయ మేర్పడ సంజీవరెడ్డి గ్రామణీ!

ఉ. నాలుగు కోట్ల ఆంధ్రులకు నాయక రాయడవైన నీ మన
శ్శాల విశాలమైనది, ప్రజాసుఖజీవన భాగ్యమెల్ల, నీ
యోలగ మాకళించు, సచివోత్తములున్ గరుణావిశిష్టు, లె
ట్లేలెదొ, స్వార్థభూతములు నృత్య మొనర్చె దిగష్టకంబునన్

మ. అటు బొంబా యిటు చెన్నపట్టణము దా కాంధ్రంబు సర్వంబు ను
త్కట సన్మానము లాచరించె, సుకవీంద్రశ్రేణి మోదింప వేం
కట శాస్త్రీంద్రుడు గండపెండెరము సత్కారించె డా కాలికిం
కుటిలంబేమొ స్వరాష్ట్రదేవత సుదృక్కుల్ జిమ్మ దీనాటికిన్

సీ. కవిదిగ్గజం బన్న ఘనమైన బిరుద మర్పించె నాకుం జెళ్ళపిళ్ల సుకవి
కవిచక్రవర్తి సత్కవికోకిలం బన్న బిరుదాళి శిరమున దురమి కొమ్ము
టేనుంగుమీద నూరేగించి, కనకాభిషేకంబుచేసి యాశీర్వదించి
సకలాంధ్ర సీమంబు, సన్మానములు చేసె వేలువేల్ విశ్వవిద్యాలయాలు

తే.గీ. సుకవిగా గ్రంథకర్తగా సుప్రతిష్ఠ,
కలిగినది గాని యాస్థాన కవిగనన్ను
స్వీకరించని కొరత నా చిత్తమునకు
వ్యధను కలిగించు నీలము వంశ వృషభ

మ. భవదాస్థాన కవీట్పదం బొకటి సంప్రాప్తింప నా సాహితీ
వ్యవసాయంబుఫలించు, ప్రాయమునుదెబ్బైకందుబాటయ్యె, వా
స్తవమున్ ధర్మమెఱుంగు వీరుడ వమాత్యాదిత్య, సంజీవరె
డ్డివరేణ్యా! కరుణార్ద్రమైన శుభదృష్టి న్నాపయిన్నిల్పవే

మ. తమకున్ వందన పూర్వకంబయిన పద్యం బొందు పంపింప, శీ
ఘ్రమునన్ మారుజవా బొసంగితిరి అ క్కారుణ్య మస్మత్కవి
త్వముపై సోకిన పుష్పితంబగు నుదాత్తగ్రంథముల్, స్వీయరా
ష్ట్రమునుఱ్ఱూతలనూచెదన్ తెలుగుభాషన్నాట్యమాడించెదన్

శా. శ్రీనాథాదిమహాకవుల్ మునుపు మీ రెడ్ల ప్రభుత్వంబునం
దానందంబుగ నాంధ్రశారదకు దివ్యాలంకృతుల్ దీర్చినా
రేనున్ దిర్పతి వృద్ధపండితకవీడ్బృందంబుచే మాధురీ
శ్రీనాథాఖ్య గడించితిన్, రసికు లేరీ! నాటి భూపాలకుల్

## జయహారము

మ. మొదటన్ తాలుక బోర్డు నేత వయిదీప్తుల్ జిమ్ము విఖ్యాతి న
భ్యుదయంబుల్ ఘటించినావు ప్రజ కుబ్బున్ డంభమున్ గల్గు
దుర్మదశత్రూత్కరమున్ జయింతివి దుర్మార్గాంతరంగాలలో
నిదురంబోయితి వద్వకేటుమణి వాంధ్రీదేవతాపుత్ర సం
పదలో యెన్నిక కెక్కు రెడ్డికులరంహత్సింహపోతంబ! మే
ల్పదవుల్ యమ్మెలసీలునిన్ వలచిరావా? మాలకొండాభిధా!

మ. పిడుగుం బోలిన కంఠనిక్వణములో విశ్వంభరాప్రేమ పా
ల్కడలింబోలి యణంగి యుండు నిదినిక్కం బిట్టి నైజంబు చొ
ప్పడ దీనాటి ముఖస్తుతిప్రియులకున్ వాగ్మీ! భవత్కంఠమం
దిడె నుద్యజ్జయహార మీ పదవి భాయీ! సానెకొమ్మన్వయా!

## అభినందన మణిహారము

సీ. ఆడుబిడ్డలకు విద్యాభూష లాశించు ఉన్నతాశయుల చేయూత లంది
హనుమాంబికాహస్తవనజంబు వర్షించు భూరిదానంబున పొటమరించి
ప్రథితదానక్రియారతు లైన ధూమపత్రవణిజ్మణులచేత తనువు బెంచి
ధీసముజ్జ్వలు డైన శ్రీసదాశివరెడ్డిగారి ఆవిష్కార ఘనత నంది

తే.గీ. గర్తపురి పాఠశాలా నికాయమునకు
మేలుబంతివిగా చిట్టి బాలికలకు
జ్ఞాననేత్రం బొసంగి యనంతయశము
సంతరింపుము సత్కళాసదన రమణి

మ. వెలసె న్నేటికి గర్తపట్టణమునన్ విద్యార్థినీకోటి, వి
ద్యల నార్జించు సుధాలయంబు హనుమాయ మ్మాంకితజ్యోతియై
పలుకున్ పల్కులరాణి, బాలికల జిహ్వాపల్లవాగ్రంబులన్
కలకాలంబు పొగాకువర్తకుల దీక్షాదానపాండిత్యమున్

శా. ఆరోగ్యంబును చీరికిం గొనక నీ యభ్యున్నతిం గోరియే
కా రాజన్యుడు కొంగుబట్టుకొని భిక్షల్ సల్పి కూర్చె న్నిధిన్
గారుణ్యంబున, విస్మరింపకుము తత్కల్యాణమూర్తిన్, కళా
గారశ్రీరమణీ! యశశ్శిఖరి నాకల్పాంత మింపారుమా!

మ. తరిబీతుం బొనరింపు మమ్మ ఘనవిద్యాశారదామూర్తులన్
దరుణీరత్నములన్ దయాకలితలన్ నవ్యాశయభ్రాజలన్
మరలన్ మొల్లలు వేంకమాంబ లుదయింపన్ దేశముప్పొంగనె
క్కరణిం గూతుల కుగ్గు బెట్టెదవొ! అక్కా! పాఠశాలామణీ!

ఉ. అన్నెము పున్నెమున్ దెలియనట్టి లతాలలితాంతరంగ లీ
కన్నెలు భాస్కరాదికవిగండరగండల గడ్డముద్దుగా
గన్నశుభస్వరూపిణులు కాగలవారు కళాక్షుధార్తలై
నిన్నుభజింప వచ్చెదరు నిత్యము నేగతితీర్చి దిద్దెదో

శా. బొట్టుం గాటుక తీర్చి దిద్దుకొని సొమ్ముల్ దాల్చి గుంటూర్పురీ
పట్టంపుం దొరసాని మాదిరిగ శోభల్ జిందు నిన్ గాంచినన్
పుట్టున్ దీయని భావముల్ మనసు లుబ్బున్ సౌధకల్యాణి, నీ
కట్టుం బాటుకు కారణం బగు నుదగ్రస్వాంతులం గొల్వుమీ

మ. అభిమానించి సదాశివుం డసమవిద్యా రాజ్యసమ్రాట్టు నీ
సభకధ్యక్షత దాల్చి పౌరతతికిన్ కల్పించె నానందమున్
శుభముల్ గుత్తులు గుత్తులై నడచివచ్చున్ నిన్ను గన్నంత నీ
కభివాదంబు, యశోన్నతిం బొదలు మమ్మా! పాఠశాలామణీ!

సీ. నగలకై మగలతో జగడాలు నెఱపి సౌఖ్యము గోలుపోవు గయ్యాళితనము
పొరుగు సంసారాల సిరి కోర్వలేక నిందలు చెప్పుకొను చుప్పనాతి తనము
ముసలి మూఢాచారభూతాల మహిమ లోకము నెఱుంగని నూతికప్పతనము
కలవార మను నహంకారాన పని సేయ బద్ధగించెడు ఒళ్ళుబరువు తనము

ఆ.వె. ప్రబలి యున్న దెల్ల భామినీలోకాన
నెట్లు శిక్ష సలిపి, యేమి కఱపి
ముద్దియలను తీర్చి దిద్ది దీవింతువో
భారమెల్ల నీది పాఠశాల

కం. బాలామణికోటికి వి
ద్యాలయ మైనాము జన్మ దనిసె ననుచు కు
డ్యాలుంఊలీదాతల
నోలిం గీర్తించి మురియు చుండున్ సతమున్

మ. ముకురంబుల్ బలె నిష్కళంకములు మీ పూతాంతరంగాలు, వి
ద్యకు యోగ్యంబులు, జ్ఞానదేవతకు రత్నాగారముల్ సుమ్ము, బా
లికలారా! కరుణాసముద్రులయనల్పీభూతదానాగ్రభగం
గకు కేల్మోడిచి సేకరింపుడు జగత్కల్యాణసౌశీల్యమున్

## ఆశీర్మణిహారము

చం. అరువది యేండ్ల ప్రాయమను హాటకరత్న కిరీటధారియై
పరువును సుప్రతిష్ఠలనువారముపండి ప్రవర్ధమానమై
సిరులుఘటింప, సానెకొము సింహమురెడ్డివరేణ్యుడింకనూ
టరువది వత్సరంబుల మహస్సులగౌరవమందు గావుతన్

ఉ. పట్టినపట్టువీడని యభంగురశౌర్య ధురీణుడైన వా
గ్దిట్ట, సమున్నతాంగుడు, యెదిర్చినవాని యురస్థలాన కా
ల్మెట్టెడువాడు, స్నేహశబలీకృతచిత్తుడు, న్యాయవాదిసా
మ్రాట్టగు మాలకొండ బుధమండనుజెందుతమాయురున్నతుల్

మ. అది భల్లూకపుపట్టు మావశముగాదంచున్ భయభ్రాంతమై
చెదరున్ నీరిపుమూక, నీవొకపనిన్‌జేపట్టి జృంభించినన్
కదలున్ దారకలున్ గ్రహంబులు భవద్గంభీరకంఠంబునన్
బొదలున్ సింహకిశోరగర్జలనయంబున్ మాలకొండ ప్రభూ!

కం. కనిగిరికి మేరుగిరివై
కనికరమున దీనజనులగాచిన నీపా
లనమును దలపోయుదురీ
దినముం బ్రజలట్టి నిన్నుతింతురు సుకవుల్

కం. ఆజానుబాహుశాలివి
నీ జాతకచక్రమందు నిజముగ నేదో
తేజస్సుగలదు, గౌరవ
భాజన! శ్రీసానెకొమ్ము వంశాగ్రమణీ!

# సూర్యోదయం

సీ. కాకిపిట్టల గీతికారావమాలించి సమయంపు నిదురమంచంబుడిగ్గి
మలయాచలముమీది యలతివాయువులచే నిఖిలలోకంబును నిద్రలేపి
నెలతేని మెయిమీది వెలుగులుహరియించి పడమటికొండల పాలుజేసి
సేవించువారి దోసిటినీటబింబించి తనలోకబాంధవత్వంబు నెఱపి

తే.గీ. పద్మినీకాంత ప్రణయకోపము గుదింప
జలకణపు ముక్కుపుడక సొమ్ములనొసంగి
యమునసక్కునబూని యుయ్యాలలూచి
మిహిరమండలముదయాద్రిమీద మెరసె

# చంద్రోదయం

సీ. కడలిరాయనిమేలి కడుపునజన్మించి సిరితోడబుట్టిన చిన్నవాడు
నలిననాభుని పెండ్లినాడు సోదరినవ్వ పాదాలుగడిగిన బావమరది
పండువెన్నెలజింది పైరులుపండించి ధరణికన్నముబెట్టు ధర్మరాజు
రక్తసంబంధంబు రవ్వంతలేకున్న మానవావళికెల్ల మామగారు

తే.గీ. కులట లెంతెంతగా తిట్టుకొనుచునున్న
చింత కాసంతయును లేనిశాంతమూర్తి
జింకపిల్లను ప్రియమార చంకబెట్టి
పొదుపుకొండలకెక్కె వెన్నెలమగండు

## విజయధ్వజుడు

మ. రవిబింబంబున కడ్డమై పెరిగి గర్వగ్రస్తమై విశ్వ మా
నవ శ్రేయంబు గణింప నట్టి ఘన వింధ్యాద్రీశ్వరున్ గుంభ సం
భవునట్టుల్ దలదన్ని జహ్వారుని సన్మానంబు చేకొన్న మా
నవ మాన్యుండవు గోపరాజ కులచంద్రా! నీకు రత్నాంజలుల్

మ. చలియున్ వానయునెండయున్ బెదరి యుత్సాహంబుగల్పింప, బె
బ్బులులున్ సింహము లాద రేక్షణమున్ బూజింప ఢిల్లీకి ని
ర్మల దీక్షన్ పదయాత్ర సల్పితివి గోరా! బాపుజీ ఆత్మకున్
గలిగెన్ శాంతి ఫలించె నీ మహితసంకల్పం బమోఘంబుగన్

## సంఘం

ఉ. చెప్పుటెఱింగి చెప్పినది చేయ నెఱుంగక ధర్మ సూత్రముల్
కుప్పలుపోయు పత్రికలకుం దలవంపులు గూర్చి; దండియం
దుప్పుగడించి మానవత కూపిరి పోసిన తాత వాక్కులన్
జిప్పిలు సత్యమున్ బలికి చెన్ను వహింపుము సంఘ పత్రికా!

మ. వినదీవిశ్వము నగ్నసత్యము నెదో వేదాంత దుర్దాంత బం
ధన బంధీకృతమై, స్వలాభపరమై తార్మారుగానున్న వీ
పెనుచీకట్లెటువాపి, ఎక్కరణి? నీ విశ్వప్రజామోద మో
హనదీపంబు ఘటించి మేల్కొలిపి సత్యంబున్ బ్రతిష్ఠింతువో?

కం. కులమత కుహనావేష
జ్వలనంబున్ జిదిమి, భోగపరమైన మహీ
వలయమును త్యాగపరముగ
సలుపుము లవణాభిధాను సంపాదకతన్

# మనవి

నా కృతినొకటి తన కిమ్మని శ్రీ వాడపల్లి నన్నర్థించి మూడేండ్లయినది. నా మిత్రుడు కవితా ప్రియుడు మాజీ Executive Engineer శ్రీ ప్రత్తిపాటి సుబ్రహ్మణ్యంగారును నన్నిందుకు ప్రోత్సహించిన కారణంగా నా ఖండకృతిని, మహర్షి శ్రీ ఈలి వాడపల్లికిచ్చి కృతార్థుడనైనాను.

1926 సంవత్సరములో వ్రాయబడి కారణాంతరాలచేత జీర్ణమైన నా శివాజీ కావ్యంలోని కొన్ని ఘట్టాల నిందు పొందుపరచినాను. రసగ్రహణ పారీణులైన పాఠకులు, నా నాటి నేటి కవితకు గల తారతమ్యాన్ని గ్రహించి నా సాహసాన్ని మన్నింతురు గాక.

జి. జాషువ

# అంకితము

చం. కులజుల విద్యకై అనుగు కోమలి సొమ్ములనమ్మి కల్గు వా
రల గృహసీమలందు బికిరంబొనరించి, ప్రజాభిమాన మ
గ్గలముగనంది వేంగి ధరకాంతకు భూషణమై చెలంగు యీలి మే
ల్కులజుడు వాడపల్లి కొనగూడుతమాయురనామయోన్నతుల్

కం. ఏడవ కృతికన్యక కిపు
డీడుం జోడైన పురుషు డిమ్మొక కృతి నం
చాడె న్నా సఖుడాతని
తోడల్లుం డింజనీరు తోషితమతియై

ఆ.వె. ఈలి వాడపల్లి కీమధ్య నిచ్చినా
రాంధ్ర కవులు, ఘన మహర్షి బిరుద
మతని కిచ్చుచుంటి నతికుతూహలమున
ఖండకావ్య కన్యకాలలామ

ఆ.వె. రామచంద్ర పురవరంబున నా కల్లు
డైన వాడపల్లి అద్భుతముగ
జరుపుచున్నవాడు, సరస విద్యాశాల
నిమ్నజులకు ధర్మ నిరతితోడ

మ. తలిదండ్రుల్ మరణించినారతి శిశుత్వంబందె, బోషించె బి
డ్డలలో బిడ్డగ మేనమామ తన యింటన్ నిల్పి, పెక్కేడు ల
ర్మిలి, లే బ్రాయమునందె వాడపలిలో రేకెత్తె సచ్ఛీలమున్
పలుకుం దప్పని సత్యవాఙ్నిరతి నిర్భాగ్య ప్రజా సేవయున్

మ. పరమోదారుడు ప్రత్తిపాటికుల సుబ్రహ్మణ్య దాసంస్థ కా
దర చిత్తంబున ప్రిన్సిపాలయి, యనంత శ్రేయముంగూర్చె, బం
గరుకుం దావి రహించునట్టు లతిలోక స్వచ్ఛ సత్కీర్తితో
కరమింపారెడు వాడపల్లి బడి దిగ్గ్రామానుతి భ్రాజమై

కం. ఇనపత్ని ఛాయవలె తన
యనుగుం బెండ్లాము శంఖమాంబ మెలగగా
జన నుతుడు వాడపలి నే
డనంత గౌరవముగాంచు నాంధ్రక్షోణిన్

శా. అంబేడ్కారుడు, గాంధి మున్నగు ప్రపంచారాధ్యులున్ జూచి శ్రే
యంబే నీకని మెచ్చినారనిన స్వార్థాపేక్ష లేనట్టి నీ
గంభీరాత్మ ప్రశస్తమైనదని లోకంబెల్ల శ్లాంఘించె శ్రే
యంబే నీకును నీ సతీమణికి, మిత్రా యీలి వంశాధిపా!

ఆ.వె. ఈలి వాడపల్లి నెఋగనివారును
ఓడ నెఋగనట్టి వాడులేదు
మేటియైన గౌతమీ తీరభూముల
నాడు నేడు తెల్గునాడు గూడ

# తస్మాత్ జాగ్రత్త

మ. బుసలన్ గొట్టుచునున్న దిప్పుడును నిప్పుల్ గ్రక్కుచున్ సంగర
వ్యసన వ్యగ్రత వేయినాలుకలసర్పం బైన చైనీయ రా
క్షసి, సత్యాగ్రహమంత్ర శక్తులకు లొంగంబోదు, మేల్నాయకా
గ్రసరుల్ మంతురు లీ యుపద్రవసముద్రంబెట్లు దాటింతురో

సీ. చైనీయ రుధిరనిర్ఝరుల స్నానముజేసి భరత సైనికకోటి మరలుదాక
కుటిల నీతిజ్ఞుల గురుకపాలములతో అభవుండు తాండవ మాడుదాక
పగవాని క్రొవ్వుతో బసవశంకరమౌళి నిలయాన దివ్వెలు వెలుగుదాక
భారతీయుల భుజాబల శౌర్యసంపత్తి పంచఖండము లాకళించుదాక

తే.గీ. హైందవ మహోర్వి సరిహద్దులాక్రమించి
కాలుమోపిన కుటిలముష్కరుని శిరము
మంచుమలమీద దృష్టికెత్తించు దాక
నిద్రవోవదు భారత భద్రకాళి

# సింహనాదము

మ. నిదురంబోయెడు సింహమున్ జెనకి, చైనీయద్వీప శ్రేణి, ఆ
పద పాలై కడకాళ్ల బేరమునకున్ వచ్చెన్ భయభ్రాంతమై
నిదురంబోదిక వీరభారతము సందేహాస్పదంబైన దు
ర్మదశత్రూత్కర కంఠలుంఠన మొనర్పన్ లేచె నుచ్చండమై

మ. చరఖాసన్ముని నేర్పిపోయిన యహింసన్ నేర్చి నిర్వీర్య కే
సరియైయున్నది భారతంబని జయేచ్ఛన్ బైకి లంఘించితే
పరమద్రోహులపచ్చి నెత్తురుల నాస్వాదించు బాలెంత కే
సరియై మొన్నటి యుద్ధరంగమున పంజాదెబ్బ దిన్పింపదే

ఉ. మూడిన చావు ని న్ననికి బొమ్మని తొందరచేయ నిండియా
దాడికి సిద్ధమైతివి వృధాకలహానికి కాలుదువ్వి నీ
మాడదరంగ గొట్టిరి హిమాచలమందు జవాన్లు మంచులో
పూడ్చిపెట్టి తీరెదరు ముందుకు కాలిడలింప దుర్మతీ!

చం. కలవణు బాంబులున్ ప్రళయకాలశతఘ్నులటన్న బిఱ్ఱునన్
చలిమలమేల్మొసుంగు దొరసానిని భారతఖండ దేవతన్
గెలిచెదనంచు మిట్టిపడు ని న్నరకాలను పిండిపిండిగా
సలుపకపోము, నీ కపట సంధులు చెల్లవు రమ్ము క్రమ్మరన్

శా. రా దేశాస్త్రవు డిండియా పయికి ధైర్యంబూని, చీనా కిటన్
నేడో రేపో ప్రతాపసింధువులు నాగ్నేయోగ్ర జిహ్వాసముల్
మాదూదంబ్రహరింతు రుగ్ర నరసింహంబుల్ జవాన్లాలపుం
బ్రోదల్ లక్ష్యము చేయ రీ యుడుత యూపుల్, మేషగాంభీర్యముల్

ఉ. సన్నని నూలుపోగున విశాలజగత్తును గట్టి యింగిలీ
షన్నల సీమకుం దరిమినట్టి మహాత్ముని బిడ్డ నిండియా
కన్నెను ముచ్చిలించుటకు కాసె బిగించిననీకు పెండ్లిగా
నున్నది రమ్ము భీషణరణోర్వర నిండుశ్మశానవేదికన్

చం. అరువది కోట్ల సేన గలదన్న యహంబున పెచ్చుమీరి పై
కురికి తుపాకితో బెదరగొట్టి గ్రసింపగ నెంచినాడ వా
స్థిరతర హైందవక్షితికి జెందిన మోహనరేఖ హిందుకే
సరిగుహ నాక్రమింపగల సాహసముందునె గుంటనక్కకున్

మ. గజమాలల్ గళమందు నిల్పి నిను సత్కారింపరో మొన్న మా
ప్రజ లా తూర్యనినాదముల్ సమసిపోవన్‌లేదు ప్రత్యర్థివై
ధ్వజముంబట్టి పరాక్రమించితివి మాపై, నీమనస్తత్వ మ
క్కజమౌ, ముక్కిడిజంతువుల్ నయము నీకన్నన్ గృతఘ్నాధమా!

మ. ఇట నీయబ్బ గడించినట్టి ధరలేదేనాడు, నీపిచ్చి మ
ర్కట చేష్టల్ పని చేయవెన్నడును ధైర్యంబేది, నీకోర్కె దీ
ర్చుట కిచ్చో ముసలమ్మలై వెఱచువారున్ లేరు, నీ లాహిరీ
నటనల్ మాననిచో ప్రమాదమగు చీనా నాయకాగ్రేసరా!

సీ. శతయోజనాయతోన్నతమైన నీ పిచ్చిగోడ భూమిని ముద్దుగొనక మున్న
అతిపురాతనమైన యట్టి నీదు చరిత్రకుటిలమై మసిబూసి కొనకమున్న
వేలువేల్ పెనుపెగోడాలలో శాక్య సింహుడు కుంది కన్నీరు విడకమున్న
పసుపువన్నెల నీదు వాహినీ రాజముల్ పచ్చినెత్తుట నెజ్జబడకమున్న

తే.గీ. కపటమెరుగని జవ్హారు కౌగిలింత
లందుకొని చన్న మర్యాదలంతరించి
రాక్షసుండను దుష్కీర్తిరాకమున్న
సంధిసల్పుము భరతవర్షంబుతోడ

## మృతులు

శా. నీతో నిందుసమాధి శయ్యలపయిన్ నిద్రించు నిర్భాగ్యపుం
బ్రేతంబుల్ హితమిత్రబాంధవతతుల్ విచ్చేసి కన్నీటితో
జోతల్ సల్పుటెఱుంగ విట్టుల యహస్సుల్ రాత్రులెన్నేగునో
నాతీ! మీ మమకారముల్ జివికి జీర్ణంబయ్యెనే మృత్తికన్

మ. మృతుడైపోయి సజీవుడౌచు నెగసెన్ గ్రీస్తుండు మీకట్టులే
బ్రతుకుల్ భిక్షయొసంగునన్న ఘనవిశ్వాసంబు సంపూర్ణ దుః
ఖితులౌ బంధుల నూరడించిన దయాగ్ని మాన్పెడిన్ నేటి జీ
వితులున్ జత్తురు, నిద్రవోయెదరు దేవీ కల్పకల్పాంతముల్

ఉ. ఇందు చరిత్రహీనులయి, యెవ్వరెఱుంగక ఆప్తమిత్రులున్
బంధులు కాన్కచేయ నొక బాష్పలవంబును నోచనట్టి వా
రెంద రనామకుల్ గలరొ, మృత్యువు కోరలు చప్పరింపగా
గ్రమ్మందిన పేద లిక్కటికి మంటికరాళపు గౌగిలింతలన్

మ. నరజన్మంబను వ్యాధిబాధల కఖండంబైన దివ్యౌషధం
బరయన్ మృత్యువు, లేవు మీకు నిక దుర్వారోగ్ర సంసార సా
గర నైరంతరయాతనల్, కడపుడింకన్ దీర్ఘనిద్రా సుఖ
సిరయాత్రన్ పెనుడాకినీ తతులు గసీచేయ నిసంద్రులై

మ. తనువున్ క్షుద్రసృగాల జాలములు గృధ్రంబుల్ విదారించి భ
క్షణ సేయంబడియున్న భిక్షువునకున్ గైవల్య యోగంబులే
దనలేమాతడు చచ్చి భూతముల జిహ్వల్ దన్పి జీవద్ధనా
ధ్యున కన్నన్ గడుపుణ్యమూర్తియయి చాటున్ మూకసందేశమున్

ఉ. వెచ్చనియూర్పు గాడుపులు, వెచ్చని బాష్పఝురుల్ స్రవించి, లే
బచ్చికవ్రేళ్లతోనుడికి పచ్చిపొగల్ వెలిగ్రక్కుకాటిలో
పుచ్చులు నవ్వుచున్నవి ప్రమోదముతోడ విమోహరజ్జులన్
నిచ్చలు కుమ్మలాడు ధరణీ నరులంగని హేళనంబుగా

ఉ. ఆరడుగుల్ ధరాశకల మాస్తి గడించి అనంత దీర్ఘ ని
ద్రారతులైన వీరిది యథార్థ నివాసమటంచు చెప్పు చు
న్నారు. నిరక్షరంబున నినాద విహీన విచిత్రభాష, వే
మారును విశ్వమానవ సమాజముతో జితి నగ్ని జిహ్వలన్

ఆ.వె. ఏటి కొక్క రోజు హృదయాల పిండిగా
నలిచివేయు దుర్దినంబు గాక!
మంచి శుక్రవారమా! యెవ్వడీ పేరు
బెట్టినాడు శబ్దవిదులు దెగడ

## ఉగాది

మ. చనియెన్ పెక్కుయుగాదులీ వరకె విశ్వక్షోణిబాలించి చి
క్కని దౌష్ట్యాంధతమస్సులో వెలుగురేకల్ దీర్ప లే కీ వినూ
తన సంవత్సర దీధితుల్ కలుషితాత్మల్ శుద్ధిగావించి పూ
యని చిత్తంబులకున్ వసంతఋతుమర్యాదల్, ప్రసాదించుతన్

ఉ. ఈ మనుజాళినేలికొనియేగిన ప్రాత యుగాదులందు సాం
గ్రామిక ఘోషలుం గలుషకార్య పిపాసలచేత తప్తమై
ధూమముజిమ్ము మా హృదయతోయజ పుష్పములం దుగాది రా
జ్ఞీమణి! శాంతి సౌఖ్యముల నింపుము పెంపుము మానవత్వమున్

## కాలము

ఉ. కాలమునిర్ణయించెడి నొకానొక రోజున మేటియంద చం
దాలు గలట్టి దివ్యకవితల్ నుతికగ్గముగాక నేటి యీ
ర్ష్యాళుల వేడిచూపుల తిరస్కృతులం మదిగుంది చిమ్ము బా
ష్పాళి ఖరీదు నీదు విజయంబు ధృవంబు కళాసరస్వతీ

కం. చెత్తం చెదారమును తల
నెత్తి రసాభాస రచన లిక్కాలమునన్
బెత్తనము చేయుటే ఒక
కొత్తదనంబంచు తెలిసికొమ్ము కుమారీ!

కం. మడిగట్టు కొనుచు కవనము
మిడికెడు నీ ప్రతిభ నేటి మిడిమేలపు కా
రడవింబడి నిష్ఫలమై
కడగండ్లంగుడుచు నబ్జగర్భునిరాణీ!

ఆ.వె. కలము పేరుతోడ గదలింపుము కలంబు
అసలుపేరు చెప్పుటసలు తగదు
పుటకు నొక్కమాట ముట్టించి అట్టపై
అందమైన మగువ నతుకవమ్మ!

## రక్తతిలకము

మ. నలమందుందిని, కప్పల న్మెసవి చీనా సర్పముల్ భారతీ
యుల పోటుం జవిసూచి యుస్సురని ఆయుశ్శక్తు లూటాడగా
బిలముల్ సొచ్చెనటంచు నాయుధములన్ వీడంగరా దా విషా
హులకు న్నాల్కలు రెండుగావు పదివేలుండుం బ్రచండంబులై

మ. మన మువ్వన్నె పతాక శీతగిరి సీమన్ వెల్గునందాక యు
క్కున సృష్టించిన దొమ్మలుండిన నెదుర్కోడెవ్వడీ హైందవం
బును, చీనా భుజగంబు దగ్ధమయి పోవున్ యుద్ధయజ్ఞంబులో
అనుమానింపక లెమ్ము భారతకుమారా, వీరభద్రుండవై

శా. వేలున్ లక్ష లొసంగి నాడనని తృప్తింజెందినం గాదు ప్రా
ణాలర్పించి అఖండ భారత దిగంత శ్రాంత సత్కీర్తి క
న్యాలావణ్య కచంబునందు భవదీయ త్యాగ సౌరభ్యపుం
బూలన్నిల్ప బ్రతిజ్ఞ గైకొనుము, సంపూర్ణ ప్రతాపాగ్నివై

మ. భగవద్గీతను కర్మయోగబలమభ్యస్తంబు గావించి, పు
ష్టిగ భోంచేసి సుఖించుకాలము గతించెన్ వీర యోధుండవై
పగవానిన్ దెగటార్చ ఖడ్గము ధరింపన్ లెమ్ము, పార్థుండవై
భగవంతుండు రథంబుదోలి జయమబ్బన్ జేయు తథ్యంబుగన్

సీ. చీనా పిశాచంబు చిందులాడిన నేల అలతి పచ్చనిగడ్డి మొలవ లేదు
చౌవెనులై తనుచ్ఛాయ సోకినచోట బుడుతపాపడు పాలుగుడువలేదు
మండూక భక్షణోద్దండు లుండెడిచోట సత్యదేవతకు భోజనములేదు
వింత జంఘిష్కాను విహరించు పొలములో దైవంబు తలవాల్చు తావులేదు

తే.గీ. పదియు నాలుగు లోకాల పరమశాంతి
పుంజమగు బాపుజీ జన్మమున నహింస
నభ్యసించిన మన స్వరాజ్యంబు నందు
పచ్చి నరహంతకుల నీడ పనికిరాదు

## ప్రథమాస్థానకవి

ఉ. మీసము దువ్వి పండితులమీద సవాలొనరించి గెల్చు సిం
హాసన మెక్కినట్టి ప్రతిభాఢ్యుడ వీవు; భవత్కవిత్వ ది
వ్యాసవ మాని మత్తుగొననట్టి రసజ్ఞుడు లేదు! వే యుప
న్యాసము లేల? యీ పదవి కర్హుడ వీవ సుమీ కవీశ్వరా!

మ. మడమంద్రిప్పని యాంధ్ర పుత్రకులధీమా, నీ కళాసృష్టిలో
నుడికారమ్మున బట్టువడ్డ దనుకొందున్, భాషకున్ గ్రొత్త పో
కడ శిక్షించిన కింకవీంద్ర గజశిక్షాదక్ష హర్యక్ష! నీ
వడుగుల్ మెట్టినచోట బుట్టెడి కవితావేశ బీజావళుల్

సీ. తలవంపలేదు నీ పలుకు, రాజుల పజ్జ గందేభములమీద కాలుమోపి
చెదరిపోలేదు నీ మొదటి తాంబూలంబు సకలాంధ్ర సత్కవి సభలయందు
కనుమాయలేదు నీ కావ్యసౌందర్యంబు కొంగ్రొత్త రచనల గొడవలందు;
దసిలిపోలేదు నీ పసరు గంటపు చేవ, ముదిమిపై కొని పండిపోవు వఱకు;

తే.గీ. సమదలాస్థాన సుకవిరాజ్యంపు పదవి
పుట్టుకవివైన నిన్ను చేబట్టుగాని,
పుట్టి కవులైన వారి చేపట్ట గలదె
పలుకు మెలకువగల చెళపిళ కవీశ

# మిత్రస్మృతి

శా. ఏడీ నా నిజమిత్ర సత్తముడు శ్రీ మృత్యుంజయాఖ్యుండు నా
తోడంబుట్టని యన్నదమ్ముడు, మదాప్తుం దున్నతోద్యోగి, నా
నాడు న్నా కృతు లాలకించి మది నానందించు వా డక్కటా!
యేడీ నేడు చరిత్రలో గలసినాడే, దుఃఖ కావ్యంబుగన్

సీ. పనిదీరిపోయెనే భక్తితో పలువురు గావించు తొలి నమస్కారములకు
మాసిపోయెనె సోదరీ సోదరులకు చెన్నాపట్టణ ప్రయాణాల గొడవ
కూలెనే నేడయో నేలంటు వాయని అలతి బిడ్డల భవిష్యద్రథంబు
ఆరిపోయినదె రాజాచారి వీధిలో తెలుగు వీరుల ధైర్య దీపకళిక

తే.గీ. వసుధ శతవృద్ధు లెందరో బ్రతికియుండ
ఒక్క మా యేబదేండ్ల మృత్యుంజయునకు
నెడములేదని కాబోలు నీశ్వరుండు
గుండె జబ్బును నెపమున కొంచుపోయె

# ఉపాధ్యాయుడు

మ. కనుగొమ్మభ్రనదీపయోజ కుసుమార్ఘ్యంబిచ్చి, స్వర్గాధి నా
థుని సింహాసన సీమ వేలుపు పడంతుల్ గొల్వ విజ్ఞాన శా
సన గాంభీర్యత నొప్పు నాంగిరసు నైశ్వర్యంబు, నీ శాఖలో
పనివాడే సుమి శ్రీ బృహస్పతిసలవ్యత్యస్త మింతే గురూ!

మ. సరళశ్రీ విహితంబులై పొలుచు విజ్ఞానాక్షర శ్రేణులన్
గురియింపంగల నీ కరాబ్జమున నీకుంజెందు సద్విత్త మ
క్కరకుం జాలని కొద్ది మొత్తమని లోగంబోకుమోయీ! జరా
మర శూన్యంబగు పుణ్యవిత్తమును సంపాదింతు వశ్రాంతమున్

సీ. ఓనమాలు పునాదిగానిల్పి ఆమీద స్థాపింతు వమల భాషాగృహంబు
ఒకటి రెండంకెలల్లిక నేర్పి యామీద తేలింతు గణిత శాస్త్రీయ జలధి
సుమతి పద్యాల కూరిమినించి యా మీద పట్టింతు సత్కవిత్వ ప్రశస్తి
వంకర గీతలు వ్రాయించి యా మీద దాటింతు చిత్ర విద్యానగంబు

తే.గీ. వెన్నకెనయైన బాలుని చిన్ని మనసు
నేలుబడి సేయు నొక మహా పాలకుడవు
బాలుని పురోభివృద్ధి నీ పాటవమున
దాగుకొనియున్నయది యుపాధ్యాయవర్య

మ. సరళంబై జగమావరించిన సమస్త జ్ఞాన వైద్యుృత్యా
సరణిం బేదరికంబులో మునిగి సంసారంబు సాగించి పో
యిరి సుమ్మీ నినుబోలు నొజ్జలొక వేయిన్నూరు కోట్లి మ్మహా
త్తర విద్యా కమలంబు సంపదల కాస్థానంబు గా దెప్పుడున్

సీ. కోడి కుంపటి దింపుకొని పిల్లలను బిల్చి కొసరి గింజియ లేరుకొనుట నేర్పు
ఈని యీనకమున్నె మృగభామ పిల్లకు వెనువెంట చెంగులుబెట్ట నేర్పు
ముందుబుట్టిన తీవె పందిరి కెగబ్రాకి పసి తీవియకు వెంట బ్రాకనేర్పు
నడువ నేర్చినబిడ్డ బుడుత తమ్ముని ప్రేమ నడుగులో నడుగు లేయంగ నేర్పు

తే.గీ. ప్రకృతి సర్వంబు నీ గురుత్వంబు నందు
లీనమై యున్నయది నీవులేని సీమ
దీపమెత్తని వ్యర్థ మందిరము సుమ్ము
ప్రాభవంబోయి నీ నోటి వాక్యమునకు

ఉ. నీ రసనాంచలంబున జనించిన పల్కులు పిల్లవాని చి
న్నారి మనంబు నంటి ఒకనాడు ఫలించును వాని వృద్ధికిన్
కారణమైన నీవు ధనకాంక్ష శరీరము దాచుకొన్న నీ
నేరిచికొన్న విద్య హవణింపదు నింపదు ప్రాభవోన్నతుల్

సీ. చిగురుటాకులవంటి చిత్తంబు లొక కొన్ని నినునమ్మి నీచేత నిల్పినారు
కల్లోలమెడలని కన్నుదమ్ములు కొన్ని నీ చరిత్రమున కంటించినారు
పలుక నెరుంగని పసరు నాల్కలు కొన్ని నీయానలోన బంధించినారు
శైశవంబూడని శ్రవణంబు లొకకొన్ని నీ సమక్షమునకు నెట్టినారు

తే.గీ. కౌశలతమీర నీ యంగకములయందు
నీవు చిత్రించు విద్యయే నిలిచియుండు
వెనుకరానున్న వీరి జీవితమునందు
కీర్తి కపకీర్తి కీవు సాక్షివి నిజంబు

సీ. పాలిపోయిన నీతివల్లీవితానంబు విరిసి యగ్గలముగా పరిమళింప
వట్టిపోయిన దేశభక్తి గ్రమ్మర మ్రోగి దిగ్ధరేంద్రములు ప్రతిధ్వనింప
సగము జిక్కిన నిత్య సత్యసంపద్దేవి దర్పంబుమీర పెత్తనము సేయ
సాగి ముందుకురాని నాగరతా భూతి విచ్చి దిక్కులకెక్కి విస్తరిల్ల

తే.గీ. దేశ మానందవంతమై తేజరిల్ల
శక్తు లర్పించునవి పాఠశాలలోయి
దాచుకొననేల నీ సమర్థతల నిపుడ
సార్థకము జేసికొనవోయి చదువులయ్యా

శా. నీ విద్యా గురువృత్తి కొద్దిదని సందేహింప వద్దిందులో
ప్రావిర్భావము నందగా వలయు విద్వాంసుల్ కవుల్ గాయక
ప్రావీణ్యుల్, గురులింతయేటికి గురుత్వం బందుకొన్నట్టి నీ
కీవైశద్యము భిక్షపెట్టినది గాదే సద్గురూత్తంసులున్

# వీరకుమారి

కం. అసమాన ధీ సమేతా!
ప్రసిద్ధ వేధోండ విజయభాసిని, రషియా
వసుధా వీరకుమారీ!
ప్రణవాంజలి శతము నీకు వాలంటీనా!

కం. నీ ధైర్య సాహసములకు
రోదసి తలవంచె, నీ శిరోగ్రంబును బా
లాదిత్యేందు గ్రహములు
పాదార్చన సల్పెనౌర! వాలంటీనా!

కం. యావద్విశ్వాంగనలకు,
నీ వీరత్వంబు పూజనీయంబయి, నూ
త్నా వేశజనకమై పుం
భావ సరస్వతులజేసె, వాలంటీనా!

కం. గగరిను ప్రభృతుల సాహస
గగన విజేతలకు సాటిగా రాకెటుతో
నెగిరి జయించితి వబలా
ప్రగతికి నాదర్శవగుచు వాలంటీనా!

కం. గగనేందిర! నీ శిరమున
నగణ్య నక్షత్ర వజ్రహారము లిడి ము
ద్దుగ స్వాగతంబులిడె న
భ్రగములు గానంబుచేయ వాలంటీనా!

కం. భారతఖండాశీస్సుమ
హారంబులు నీకు నాయురానందము చే
కూరుచుగాత, తెరష్కో
వా! రషియా వీరపుత్రి! వాలంటీనా!

# ఆప్తస్మృతి

మ. అనువారంబు ప్రశాంత హాసరుచిరాస్యంబై ప్రకాశించు మో
హన హిందూ సుకళా నికేతము నేడయ్యయ్యొ, నిస్తేజమై
కనులన్ మూసి యఖండ దుఃఖముఖియై కన్పట్టె మా సుబ్బరా
యని ప్రాణేశ్వరు గోలుపోయి, బహుసంఖ్యల్ పుత్రు లల్లాడగన్

కం. కలమాడుట లేదశ్రులు
నిలుచుటలే దే విధాన నీ స్మృతి పద్యం
బుల గూర్తు సుబ్బరాయా!
పలుకుల నీ మృత్యువార్త బలిగొని పోయెన్

# బాష్పాంజలి

మ. ఒక నక్షత్రము రాలిపోయెననె గుంటూర్కంటనీరూర, ని
న్నొక సామాన్యునిగా దలంచి, అటుకాదో! ఆంజనేయ ప్రభూ!
ఒక నక్షత్రము క్రొత్తగామొలిచి, విద్యుత్కాంతుల న్నిక్కి మిం
టికి లేచెన్ మృతికాదు కాదనుచు చాటెన్ దాతృలేఖర్షభా!

మ. అదె నీ పీఠము శూన్యమై యిపుడు ప్రత్యక్షించి ఖడ్గాలతో
హృదయాలన్నరికెన్, కృపాజలధి! నీవిట్లైన నా కావ్య సం
పద సర్వస్వము వట్టిపోయినది నా వాగ్దేవియున్ మూగదై
నది, నీ విచ్చిన యింటనిండినవి సాంద్రంబైన క్రొంజీకటుల్

మ. పెనుభూతంబయి గావుబట్టినిను పిప్పింజేసి భక్షించు వ్యా
ధిని లక్షింపక, హన్మయాంబ బడి వృద్ధింజేసి, సాహిత్య ల
క్ష్మిని పోషించిన, దివ్యమూర్తివి, యశస్వీ! నేడు భూశయ్యపై
కనుగొన్నామిక కానరావుగద? ఏకా! ధర్మవారాన్నిధీ!

మ. అవతారించితివో యనాథకవిలోకాలంబనార్థంబు, మా
నవమాన్యా; కృతులంది సత్కవుల కన్నంబింతగల్పించు భూ
ధవులీకాలమునందు గల్గుదురె, విద్యాభోజ! నీపోకతో
దివిజక్షోణికవుల్ సుఖింతురు మదాంధ్రిన్ మందభాగ్యుల్కవుల్

ఉ. ఊరు సహస్రకంఠముల, నుమ్మలికింపగ ఆంధ్రవాణి క
న్నీరిడ నాంజనేయమహనీయుడు భౌతికదేహమూడ్చి, బృం
దారకభూమికిం జనె యుదారతయున్ సమదృష్టి వేడి ని
ట్టూరుపుజిమ్మసాగె నయయో! బహుభంగుల నంగలార్చుచున్

## గోరా!

శా. చేదై మేలుఘటించు నౌషధము నాస్తిక్యంబుజుమ్మీ మృషా
వేదాంత జ్వరపీడితంబయిన యుర్వీమాతకంచున్ పవి
త్రాదర్శంబులతోడ నారుపదు లబ్దంబుల్ సుఖత్యాగివై
యాధార్థ్యంబు స్థిరీకరించితివి గోరా! చారువాచానిధీ!

కం. నాస్తిక్య మంత్రశక్తిన్
హస్తులకును సింహములకు నన్యోన్యత న
భ్యస్తంబు చేయు నీదు ప్ర
శస్తోద్యమమునకు జయము, జయము మరందీ!

కం. ఉన్నారు విస్మృతాత్ములు
నిన్నర్థము జేసికొన్న నిస్వార్థులు, లే
కున్నన్ షష్ట్యబ్ద సభా
సన్నాహం బెట్లుగల్గు సత్య తపస్వీ!

## ఆరనికన్నీరు

శా. యావల్లోకము ఔమ్ము గ్రుద్దుకొని ఆహాకారముల్ సేయ, దుః
ఖావేశంబున రుద్ధ కంఠమయి, బ్రహ్మాండంబు స్తంభింప, స్వ
ర్గావాసంబున కేగెనే సచివలోకాదిత్యుడౌ జహ్వారుం
డావిభ్రాజిత శాంతి కర్షకు డమర్త్య స్వాగతాకాంక్షియై

ఉ. అక్కట! రాజఘాటుదెస కంతిమయాత్ర కుపక్రమించి మా
చక్కని జహ్వారుం డడుగుసాచ, మహాత్ముని రక్తమెల్ల వే
డెక్కి సమాధిలో కుమిలియేడ్వ నిగూఢముగా, శ్మశానమే
బిక్కు మొగంబువైచె నిక విశ్వము లుమ్మలికించుటభ్రమే

ఉ. హాయిగ నిద్రవోయె భరతావని నిన్నటిదాక, నీవు క
న్మూయ, ప్రపంచమే మునిగిపోయినయట్లయి దేశమెల్ల వా
పోయె, ప్రశాంతి సస్యరమ, మోము ముడించె నికేదిదిక్కు, భా
యీ, యఖిలంబు శూన్యమయి సృష్టిసమస్తము జర్జరించెడిన్

చం. పరమపదించె జహ్వారు విభాకరుడన్న పదంబు వ్రాయ య
క్షరములు సమ్మతింపక వికా వికలైనవి, యంధకార బం
ధురమయి లోకమే జవరు తోయజమిత్రుడు క్రుంకెనంచు నం
బరము ధ్వనింపగా, కవుల పద్యములేల ప్రచారమేటికిన్

చం. అనలజ్వాల విధాన నీదుమరణం బాసేతు శీతాద్రి బ్రా
కిన ఖండాంతరముల్ చలించినవి, నీ కీర్తి ప్రవాహంబు సో
కని తావేది మహానుభావ! భరతక్ష్మాచక్రమున్ మంద భా
గ్యనుగావించి యొసంగి పోయితివె? ఛాయాచిత్ర పత్రావళుల్

మ. శిలపై చెక్కిన బొమ్మవై పొడవి, భస్మీభూతమై చన్న నీ
విలసన్మంగళ కాయమున్, భరతదేవీ రత్నగర్భంబు లో
పల నిక్షిప్తమొనర్చి పోయితివె జహ్వార్భాయి; నీ కూర్మి త
మ్ములకున్ నల్బదికోట్ల కింక పరమాప్తుం డెవ్వడీ భూస్థలిన్

మ. బుసలన్ గొట్టుచునున్నదిప్పుడును నిప్పుల్గ్రక్కుచున్ సంగర
వ్యసనవ్యగ్రత వేయినాలుకల సర్పంబైన చైనీయ రా
క్షసి, నెహ్రూయను నక్షరద్వయము నాకర్ణించి లంఘింప సా
హసమేదన్ వెనుకాడు నిప్పుడెవరన్నా మాతృసంరక్షకుల్

సీ. అయోధనాయత్తమై కత్తి ఝుళిపించు పగవాని గుండెలో బాకుపోటు
కులమతోన్మత్త వాజుల నాట్య మరికట్ట కక్కులకళ్లెంబుగలుగు రౌతు
అంబరంబు పెటిల్లుమని వ్రీలి పైబడ్డ తమకని ధైర్య మందర నగంబు
బాపూజి వారసత్వమునకు బంగారు నీరువోసిన శాంతి వీరవిధుడు

తే.గీ. చలువ ఖద్దరుదాల్చి భూతలవధూటి
పక్కుమని నవ్వు నవ్విన పగిదిదోచు
జహ్వరుడు కన్ను మూసిన క్షణమునందు
హైందవము దిక్కులేనిదై అంగలార్చె

## తండ్రిదీవెన

చం. కలమున గన్న కూతులకు, గౌరవలీల వివాహ కార్యముల్
సలిపితి కద్పునం గనిన నా తనుజన్మకు నీకు నేడు పెం
డిలి యొనరించుచుంటి ధరణీ సురబాలునకిచ్చి, వార్ధిలో
గల లవణంబుతో యుసిరికాయకు పొత్తు ప్రసిద్ధమే కదా

చం. కలదని విశ్వసించెడు జగంబున లేదని విశ్వసించి ని
శ్చలమగు మానవత్వమును సత్యముతప్పక నభ్యసించు త్యా
గులయిన గోపరాజులకు కోడలివైతి వెటుల్ మెలంగెదో
బలితపుటుగ్రనిష్ఠ లలవాటొనరించు నమంగు భర్తతో

ఉ. ఒక్క విచారమే మిగిలియున్నది నాకు మహాసతుల్ తలన్
జెక్కిన రత్నమోయన ప్రసిద్ధివహించిన ధన్యురాలు ని
న్నక్కుననుంచి పెంచుకొనినట్టి భవజ్జననీమతల్లి లే
దిక్కడ నే దిశన్నిలిచి వీక్షణ హారతు లిచ్చుచున్నదో

ఉ. నాలుగు వర్షముల్ గడిచె నన్ను మెరాయి పరాయివానిగా
లీల త్యజించిపోయి మిగిలెన్ రసహీన కవిత్వ వాణియున్
తూలెను దేహదార్ఢ్యము, తనూభవ! తల్లిని తండ్రినౌచు, నీ
నాలుగు వర్షముల్ మనిపినాడ, సుఖింపుమికన్ గృహస్థవై

మ. కవితా క్షీరము గ్రోలినావు, రసవద్గాంధర్వముల్ నేర్చి నా
వవలం బట్టపరీక్షలో గెలువ విద్యాభ్యాసమున్ జేయు చుం
టివి, సద్బ్రాహ్మణు చెట్టపట్టితివి గాంధేయుల్ ప్రశంసింప, స
తువిపుత్రీ! నుతికెక్కు నీకతన గోత్రద్వంద్వ మత్యున్నతిన్

కం. అక్కలు నన్నలు కాదిట
చక్కని నాకన్న కావ్యసరసిజ నేత్రల్
పెక్కంద్రతోడ నడచెద
రక్కా చెల్లెంద్రు శుభములందుము తనయా!

# కన్నీటి నీరాజనము

కం. మనతల్లి పొత్తిగుడ్డల
గనుగొంటిన్ షష్ఠిపూర్తి గడచెనొ లేదో
కనుగొంటి తమ్ముడా వె
చ్చని కంటినీట భూమి జనని పొదిగిటన్

కం. విలువగల నీదు బియ్యే
యలటీ బిరుదంబు, మత మహాసంస్థలకున్
వలపులరాయని తనమున
మలగిన దీపంబులయ్యెనా? నా అనుజా!

ఉ. ఆకలిగొన్న పెద్దపులియై నినుబట్టిన పక్షవాతమే
నీ కమనీయ దేహరుచి, నీ బలదర్పములున్, ప్రతిష్ట ను
గ్రాకృతి చప్పరించి, కులమావురుమం చెలుగెత్తి యేడ్వగా
నాకముజేర్చెనా? దొరకునా? అనుజన్ముడు భిక్షమెత్తినన్

కం. బంగారు ధారసోకిన
భంగిన్ ముదమిచ్చునట్టి పట్టణమగు నీ
యొంగోలు పేరు చెవికొక
అంగార జ్వాలవోలె ఆత్మగలంచున్

కం. జననీ జనకుల గోరీ
లని యశ్రులు రాల్చుచుంటి వనుజన్మడ నే
డనిమిషలోకములో మన
జననీ జనకులకు ముదము నందించితివా?

కం. అమెరికకువచ్చె నాహ్వా
నము నాకని వ్రాసినావు నా చిత్తము మో
దమునందె కాని కాదది
సమాధికని యెఱుగనైతి సహజన్మమణీ!

కం. నా కనులముందు బుట్టిన
నీకా మునుముందు మృతి అనింద్య చరిత్రా
ఆకొన్న మృత్యువునకు
న్నీకాయమె రుచ్యమయ్యెనే? సోదరుడా!

ఉ. ఆడవు వేడిమాట లెపుడన్యుల కెగ్గుదలంప వాత్మలో
వీడవు దైవభక్తి ధృతివీడవు కష్టములందు, విద్యలం
బ్రోడవు, సింహసంహనుడవున్, మధురాకృతివైన నిన్ను పెం
డ్లాడిన మిత్తికిం గలుగునా దయ నీ సతిపై సుతాళిపై

ఆ.వె. ఒక్కగాని యొక్క చక్కని తమ్ముడ
వైన నీవుపోవ అక్కటకట
ఒంటిగాడనైతి నొకకాలు నొక బాహు
ఊడినట్టు, శక్తులూడినట్టు

ఉ. అన్నకు సేమమా! బలగ మాయురుపేతమె చిట్టితండ్రి, యం
చు న్నిను కౌగిటం బొదిగి చుంబనపంక్తులదేల్చి నన్నునున్
నిన్నును గన్న దొడ్డ జననీమణి లింగమ పృచ్ఛసేయ నీ
కన్నుల నీడలో శుభముగల్గెడి నెల్లరకంచు బల్కుమీ!

కం. అన్నా! యను తమ్ముడు నా
కున్నాడని మురిసితిని సహోదర! యిక న
న్నన్నాయన రెవ్వరు నే
నన్నాయని పిల్వకల్గ దగ్రజుడేనిన్

# ప్రశంస

కం. భూముల కాదర్శంబులు
నీ మానవతా సమత్వ నిఖిలోద్యమముల్
క్షేమంకరములు, విశ్వ జ
నామోదకరములు, సోవియట్‌భూరమణీ!

కం. నికతాకృశ్చేవుని ధా
ర్మిక దృక్పాలనమున, శ్రీ గలిగి యితో
ధిక కీర్తిగలిగి వెను దీ
యక ముందుకు జనుము సోవియట్‌భూరమణీ

కం. గగనమును గెలిచివచ్చిన
మగువల గర్భమునగన్న మహిరాణివి, చే
యగలేని దేమి గలదిక?
అగణ్యధిషణాఢ్య! సోవియట్‌భూరమణీ!

కం. నీమైత్రిన్ జహ్వారుడే
కామించెన్ భువనమేల కామింపదు, నీ
సామికి శాస్త్రజ్ఞులకు, మ
హామతులకు నతులు సోవియట్‌భూరమణీ!

కం. రోదసినికాదు మానవ
యాదోధి హృదంతరంగమందు మసలు క్ర
వ్యాదున్ గెల్చు నుపాయం
బేదో కనుగొమ్ము విశ్వమెల్ల సుఖింపన్

# వేట

ఉ. తీయని పండులం గుడిచి దీర్ఘ మహీరుహ విస్తృతచ్ఛద
చ్ఛాయల విశ్రమించి శుకజాతము ముచ్చటలాడుచున్మరా
టేయుల యమ్ముదెబ్బల వడింబడు ప్రాణుల జూచి, రామ రా
మా యని [illegible] పరితాపము వెల్లడింపుచున్

ఉ. క్రొవ్వున బ్రద్దిమానులను కోరలజెండుచు పోరుచేయ కా
ర్ద్రవ్వెడు పందు లమ్ముల గళ ద్రుధిరాంగములై, వనస్థలిన్
గువ్వలు కువ్వలైపడియె కూలెడు సింగపు రాచవానికిన్
పువ్వుల పానుపైన వనభూమికి నల్లని పట్టుదిండులై

# మావళీలు

కం. ఆ మావళీలు నిరత
స్వామి ప్రియకరులు, భూరిబలు లాశ్రిత ర
క్షామహిత మనస్కులు, సం
గ్రామ భయంకరులు కాని గర్భదరిద్రుల్

తే.గీ. బొక్కె దన్నముబెట్టిన పుణ్యమూర్తి
కొఱకు ప్రాణార్పణముచేయ గొంక రలఘు
కార్ముకము బూని రణభూమి కాలు నిలిచి
రేని వెన్నీయ రఖిల భూతేశ్వరునకు

సీ. విహరించుచుందురు విల్లెక్కుడించక అడవియేనుంగు తత్తడులమీద
కుడువబెట్టుదురు మక్కువమీర గారాబు బుడుతలేడిచిన బెబ్బులుల జున్ను
సాగించెదరు శివోత్సవవేళల రథాలు భయదంబులగు నెల్లుబంట్లమీద
పిదుకుచుందురు మూడువేళల పిల్లల నదిలించి పురిటిసింహముల పాడి

తే.గీ. పడగపాముల రత్నదీపముల నీడ
సంచరింతురు కొండల చఱులలోన
వారి విక్రమమింక చెప్పంగనేల
కాననము లెల్ల భీతిల్లి కట్టువడియె

సీ. ఎదిరించివచ్చిన మదపుటేనుగుల తొండములు తుండెములు గొట్టంగలారు
కోఱకత్తుల నెదుర్కొనివచ్చు మేటి సింగముల యంగములు చెక్కంగలారు
వాలముల్దూల పైబడివచ్చు పెద్ద బెబ్బులుల యుబ్బులు నేల గలపగలరు
కుఱుచకొమ్ములు దీటుకొనివచ్చు యడవిపందులకంధరంబులు ద్రుంపగలరు

తే.గీ. పవన జవమున పర్వులువారుచున్న
లేళ్ళ ముంగాళ్ళుగొట్టి డొల్లింపగలరు
అనఘ! ఆ మావళీల దివ్యాస్త్రమహిమ
వినుతికెక్కిన మన యర్జునునకు లేదు

## ఆఖేటము

కం. ఆలపుటన్నము గుడిచిన
వాలుంగత్తులకు పిండివంటలు గుడుపం
బోలు వనాళికి మృగయా
కేళికిజనె నొక్కనాడు కృతక కిరాతా!

శా. బారీటెల్ జిరుకత్తు లమ్ములపొదుల్బాణాసనంబుల్ జిరా
ల్బారల్ దప్పులుబూని యప్పరిజనంబుల్ గొల్చిరాఁగెంపు టం
బారీ యేనుగునెక్కి చక్కని జరీ మాంధాళిపాగా తురా
సౌరుంజిమ్ముచుబోయె కానలకు రాజన్యుండనన్యోద్ధతిన్

కం. ఖలుల మదంబణచెడు భూ
తలనాథుం డనుచు సమ్మదంబున దల కొ
మ్ములు గదలిచి పూవుం గ
న్నులువిచ్చి వనాంగనల్ గనుంగొనిరి శివా!

సీ. నిదురించు బెబ్బులిం గదలించి గుజ్జు కత్తుల జీరి చర్మంబు లొలిచి యొలిచి
అమ్ముటేటుల సరోషమ్ములై చెలరేగు సింహాల నాలుకల్ జించి చించి
గమకించి ముష్టియుద్ధము సేయు నెలుగుల వెన్నులు రెండుగా విరిచి విరిచి
అలిగిన యడవి యేన్గుల పుట్టియలు వ్రీల పెద్ద బల్లెంబులు విసరి విసరి

తే.గీ. చిరుతపులి మొత్తముల తలల్ జెండి చెండి
చిక్కణంబగు నవ్వనక్షేత్రమునకు
మెగము నెత్తురుమళ్ళు నిర్మించి రపుడు
భీమబలులగు మావళీ వేటకాండ్రు

కం. కరుణించి లేటిపిండుల
బొరిగొన రల దుష్టసత్వముల ద్రుంచియు, ని
ష్ఠురమైన రాతిగుండెం
గరగింపదె? సాధుజీవనంబు త్రిశూలీ!

తే.గీ. గాయములనుండి కాల్వలు గట్టి పారు
వేడి నెత్తుటదడిసిన ద్విపములంత
బరువులిడసాగె ఘీంకృతి ధ్వనులు సెలంగ
నడువగల కుంకుమంపు కొండలవిధాన!

తే.గీ. ఒడలు క్రొంజెమ్మటలు జిమ్ముచున్న గాని
కఠిన పాషాణ కలితమార్గములలోన
వేటమానరు కాసంత విసువుగొనరు
వ్యసనదేవికి కెంజేతి బంతు లగుచు

మ. తలచై చీకటులీను కిఱ్ఱుమను కాంతారంబునంజొచ్చి, చి
చ్చఱటమ్ముల్ గురియించుచున్ మెగములన్ జక్కాడి రావింటినే
ర్పరు లాజన్మ వనీవిహారులు మహారాష్ట్రక్షమాజాని క
బ్బురపాటున్నరుపా టమోఘముగ నుప్పొంగంగ గంగాధరా!

తే.గీ. అప్పటికి మట్టమధ్యాహ్నమై నభోంత
రాళమున విశ్రమించె మార్తాండు దధ్వ
గులకు మృగతృష్ణలంజూపి, సలిలరాశి
మాయమొనరించు టక్కరి మాంత్రికుండు

సీ. పలుచనలైన నీడల జాండములకు చిక్కని నీలిరంగు కల్పనముజేసి
బాటసారులకు నీర్వట్టును బుట్టించి తెలినీటి దిగుడుబావులకు దరిమి
మిసమిసలాడు క్రొంబసరుటాకుల డాలు వేడిచేతుల బిండి పిప్పిజేసి
తలయెత్తి చూచు ప్రాణుల కన్నుగవమీద కిరణంపు సూదులు పరపి పరపి

తే.గీ. సుజన దుర్జన భేదంబు జూడకుండ
నెల్లవారల నొకరీతి నేలుకొనుచు
యముని జనకునితనము నిక్కముగదోప
తపన మండలమయ్యె మార్తాండుడంత

## శ్రద్ధాంజలి

శా. భీమాభిఖ్యుడు న్యాయశాస్త్రంబూని, అంబేడ్కారు దస్పృశ్యతా
ధూమజ్వాలల గ్రాగు సోదరజన స్తోమార్థమై, శాంతి సం
గ్రామోద్దండులతో నెదిర్చి జయ శంఖంబొత్తి, యావజ్జగం
బామోదింపగ నిద్ర మేల్కొలిపె నా డాత్మీయ జాతీయులన్

ఆ.వె. శిలలు కరిగి బాష్పజలములు జిమ్మగా
పలికినాడు నిమ్నజుల చరిత్ర
అనుభవించె దుర్భరాస్పృశ్యతా క్రూర
కఠిన సింహ దంష్ట్రికల శ్రమంబు

కం. పది కోట్ల దీన జాతుల
హృదయ వృధ నౌదలం ధరించి స్వజాత్య
భ్యుదయార్థమై తపించిన
సదయురు కాలూను చోట సమత చిగుర్చున్

సీ. చటులాస్పృశ్యత కుగ్రరాక్షసికి దంష్ట్రల్ రాలి యొక్కింత చెం
గటి కేతెంచెడి; నీ యఖండ కృషియున్ గాంధీ దయాదృష్టి యొ
క్కట చేకూరుట చేత, లోక హిత దీక్షాదక్ష! నీవిప్పుడె
చ్చట నున్నావు పరిగ్రహింపుము నమస్కారాంజలీ గుచ్ఛముల్

శా. యావద్భారతభూమి కంపిలగ శంఖారావముం జేసి వీ
రావేశంబు ఘటించి పోయితివి, నీ ఆత్మయులం దిట్టి నీ
వీవిశ్వంబును బాసిపోయితివి గానీ నీ ప్రభావంబుచే
యావదేవత లాలయంబులకు నాహ్వానించె నీ తమ్ములన్

# సంకుల సమరము

శా. ఆనీతాత్మ శతాంగ సైనిక తురంగానీక మున్మీలిత
ధ్వానంబై నడువన్ మనంబున రణోత్సాహంబు మీరన్ జిజా
సూనుం డిద్దమరాట మేటి ధరణీశుం డంతనయ్యర్థ రా
త్రానన్ రావు పురంబుపై నడచె దోర్గర్వం బఖర్వంబుగన్

తే.గీ. మౌనము వహించు రేయను మానవతికి
అనుగుణంబుగ నడచు సైన్యముల నేర్పు
చకిత నక్షత్ర నేత్ర సంచయము విచ్చి
గగనభామిని విసువక కాంచుచుండె

తే.గీ. అయ్యనీకిని యందునెయ్యము దలిర్ప
నొరుల దృష్టికి గానరాకుండు కొఱకు
నిశల గారాడు నొక మోహినీ లతాంగి
తఱచు చీకటి రంగు దిద్దం దొడంగె

సీ. ప్రాణికోటులను నిద్రాదేవి పొత్తుల నుంచి యుయ్యాలల నూచువేళ
కాముకుల్ దనిసి సంగడికత్తియల గబ్బి గుబ్బలపై కన్ను గూర్కువేళ
సమయ పూరుషుని హెచ్చరికమై కొక్కురో కోయని తొలికోడి గూయువేళ
కునుకునిద్దుర మేలుకొని తూరుపున వేగుచుక్క కన్నులు విచ్చి చూచువేళ

తే.గీ. దీపికాశోభ మెలమెల్ల దెమలు వేళ
మంద పవనాంకురంబులు మసలు వేళ
కొఱవిదయ్యాల పటిమంబు దరుగువేళ
వైరిపురి ముట్టడించె శివాజి దండు

తే.గీ. కలహ భేరిని మ్రోయించి గవిని దాటి
పట్టణముచొచ్చు మావళీ బలము నరసి
తత్తరంబున లేచి మొత్తములు గట్టి
తురక లెదిరించి పోరసాగిరి, పురారి!

కం. ఇరువాగు గలసికొని భీ
కరలీల బెనంగు వేళ గాఢతిమిర వి
స్ఫురణంబున గురుతెరుగక
నరకికొనిరి తమ్ముదా మనంగ ధ్వంసీ!

కం. తరవారునఱకుడుల బలు
నెఱియలబడి చిలుప చిలుప నెత్తురుఱక న
క్కఱకు తురక లెఱుకసెడక
పిరుతివియక రణముజొచ్చి పెనగిరి కినుకన్

తే.గీ. దేవలోకపు వృద్ధ రంభావధూటి
పొందునందున్న చిత్రమేమో! మహేశ
ఫక్కు ఫక్కున శిరములు బగులగొట్టు
కొని బలంబులు గుట్టలై కూలుచుండె!

తే.గీ. బాహువీరులు యుద్ధదేవతకొసంగు
మ్రొక్కుబడులేమొ నెత్తుట మునిగి తేలు
చుండె మొండెముల్ బాహువు లూరువులు క
పాలములు గుండియలు నాటి భండనమున

తే.గీ. చిక్కుచీకటి పోరు వీక్షించుకొఱకు
గగనవీధిని బారులుగట్టి చూచు
సురల బుద్ధికిదోచె ముసుంగులోని
గుద్దులాట భావంబు సద్గుణ గరిష్ఠ

శా. హేతిచ్ఛాయల దాయలంగని భవానీ! శాంకరీ! యంచు, ని
ర్ఘాతంబుల్ బలె మావళీయు లెదురెక్కన్ నిక్కిరాలేక ప్ర
జ్ఞాతాత్పర్యము దక్కి పీనుగుల క్రిందన్ నక్కెనమ్లేచ్ఛ పా
దాతంబా తరుణంబునం దనలనేత్రా త్రస్త కోదండమై

సీ. బ్రహ్మాండమగలదీర్ఘములైనకోటకొమ్మలబ్రేలు ఘనపిరంగుల వెలుంగు
కఠినంపు టుక్కు ముక్కలు జిమ్ము నలమందు బొదివిన పెను చిచ్చుబుడ్లవెలుగు
గగనంబు చిత్తుచిత్తుగ గ్రమ్మికొనువచ్చు తులలేని యంపకోలల వెలుంగు
చెరలాడు మిణుగురుం బురువులట్లొరయు కత్తులబుట్టు నగ్గిరవ్వల వెలుంగు

తే.గీ. వ్రక్కలగుచున్న కుంభి కుంభములనుండి
తెమలిపడుచున్న మంచి ముత్యముల వెలుగు
లెడతెగక పెచ్చుమీరి నల్గడలగ్రమ్మి
తెల్లవారక మునుముందె తెల్లవారె

# శత్రు విజయము

తే.గీ. సింహమునుబట్టి రెండుగా జీల్చివేయ
జాలు తానాజి వెనువెంట సాగినడువ
చెలిమి దొలుకాడునట్టు లబ్జులుని కడకు
వచ్చె జిత్తులమారి శివాజిగుజ్జు

తే.గీ. దొంగవెఱపు మొగాన తుఱంగలింప
నెదురువచ్చుటగని యహంకృత మనస్కు
డైన ఖానుండు చిన్ని నవ్వాననమున
జెంగులిడ నల్లనల్లన జేరవచ్చె

కం. కనకకసిపు డల నరసిం
హుని డాసినలీల యవనయోధాగ్రణి, య
ల్లన డాసి శ్రీ శివాజీ రా
జును కౌగిట నొత్తిపట్టె శుండాలహరా!

ఉ. ఆతని బాహుబంధ మిసుమంత వదల్చి చలాకుజేసి, డా
చేతి నఖాంకురంబులు, కచిక్కున పొట్టకుగ్రుచ్చి చీల్చె భూ
నేత తురుష్క డాగ్రహము నెక్కొన నుక్కున చెంగలించి, సం
ఘాతము జేసె వైరి తలకాయ పయిన్ నిశితాయుధంబునన్

తే.గీ. తలనుదాల్చిన పటు శిరస్త్రాణ పటిమ
గాయపడనీయ దాతని కత్తివ్రేటు
వీరభూపతి తడవుగావింప కపుడ
వాలువీచి విరోధి గర్భము నగల్చె!

కం. ఆ యవనవీరు డపు డ
ల్లాయని పెనుకేకవెట్టి యవని బడియె, కా
లాయతన ద్వారం బిరు
పాయలుగా వ్రీలి తనకు బాటయొసంగన్

కం. అంతక నివాసమార్గం
బెంత యిఱుకు కన్నమో! మహేశ్వర! బలవ
ద్దంతిగతి దన్నుకొనె నొక
కొంతతడ వతండు మేను గోల్పోవు తఱిన్

ఉ. మోసము తెల్లమై కినుకబూనిన సయ్యదుబందు ఖడ్గమున్
దూసి, శివాజిపై కుఱక దోర్బలభీముడు తానుడంతలో
కాసె బిగించి పై కుఱికి గర్భము దూసి పడంగ నుగ్ర వ
త్రాసము గ్రుచ్చి కూల్చె తన పాలిరణంబు సగంబు దీరగన్

కం. వీర మరాటీ లంతట
వారి తలలు గత్తిరించి బారీటెలపై
నూరేగించిరి, రణభే
రీ రవముల కోటసత్తి ప్రీత్యర్థంబై

చం. బురుజులపై ధమీలుమని మ్రోసి ఫిరంగు లనుజ్ఞ సేయ, స
త్వరమ మరాట సేన నలువంకలగ్రమ్మి పెనంగి యేటు కి
ద్దరి నిహతంబు సేయ నరదంబులు నమ్ముల వాహనంబులన్
గరులదొరంగి పారె ననఘా! యవన ప్రతివీర సైన్యముల్

ఉ. వేడిమి వీడకున్న రిపువీరుని నెత్తురుబొట్లు గ్రక్కు క్రొ
వ్వాడి కటారితో తిరిగివచ్చు కుమారునిగాంచి, నవ్వు దొ
ల్కాడ జిజాసుమంగళి రయంబునబోయి కవుంగిలించి, ము
ద్దాడి ముదశ్రుపూరముల నాతనికిం దలయంటె నత్తటిన్

# పితృభక్తి

శా. సంతోషంబున నశ్రుపూరములు సంజాతంబులై చెక్కులన్
గంతుల్వేయగ, దట్టమై గగురు మొల్కల్ మేన జన్మింపగా
దంతిన్ డిగ్గి కవుంగిలించి నిజపుత్ర స్పర్శనానంద డో
లాంతస్సీమ శరీరమున్ మరచె నాథా! ప్రేమ జో కొట్టగన్

ఉ. దట్టపు టగ్గినేలెడు ప్రతాపము, మిట్టిపడంగ దాయలన్
గుట్టల పాలుజేసి, జనకుండును తల్లియు నందనుండగా
పట్టము గట్టుకోగల ప్రభాత విభాకరుడై వెలుంగు మే
ల్పట్టిని గన్న దంపతులు, స్వర్గము గోరుదురా మనోహరా!

కం. జనకుండును తనయుడు న
ట్లొనర గవుగిలించు నమ్ముహూర్తంబున నె
వ్వని కౌగిట నెవ రుం
డినదియు నొండొరు లెరుంగ నేరరు నాథా!

మ. భువనక్షేమము గోరి నందనుడు సంపూర్ణ ప్రభావంబు తాం
డవ మాడన్ నిడువాలు గత్తికి దిగంత ఖ్యాతి గల్పింప, శా
త్రవ సేనా పరితప్తుడై నవయుచున్ దానుండి, కన్నీటి బిం
దువులన్ గారిచె కానుపింపని మహా దుఃఖం బుదగ్రంబుగన్

కం. వరసుతుడు సద్గుణంబుల
గురుని గెలిచి కీర్తి పెండ్లికొడుకగు నన న
బ్బురమకదా "పుత్రా చ్ఛే
త్ప రాజయంబ"నుచు బుధులు పల్కుట వినమే!

ఉ. గుత్తపు జాళువా గొలుసు గుత్తులతో దులదూగుచున్న క్రొ
మ్మెత్తల పల్లకీల నుతిమీరు సమున్నత వైభవంబు ద
ళ్కొత్త ననుంగు తండ్రిని సహోదరునిం గొనితెచ్చె గొంగ వా
ల్కత్తుల నీడలో నిజబలం బిరువంకల వెంబడింపగన్

కం. జనకుని కనకపు టాసన
మున నునిచి హిమాంబు పూరమున పాదయుగం
బును గడిగె భక్తి నెమ్మన
మున నంకురమై మొగాన పూవులు పూయన్

తే.గీ. పుత్రుడొనరించు నుపచార పూజనముల
కుల్లమున ప్రేమవాహిని వెల్లివిరియ
ఆ శహాజీరాజు శివరేని నాదరమున
నంతికమునకు బిలిచి దీర్ఘాయువనుచు

ఉ. కూటికి విక్రమం బొరులకుం దెగనమ్మినయట్టి నీచ మా
ర్గాటుడనైన నాకు నుదయంబయి, తేమిటికోయి తండ్రి, మో
మోటముజూపి, నీ యొసగు పూజలు గైకొనబోవ మేనికిన్
గాటపు కత్తిపోటులయి నన్నుడికించుచునున్న వాత్మజా!

ఉ. హైందవ వీరసింహములకు నీ నామ మారిపోవని ప్రతాపాంకురంబు
కవిరాజ ఘంటికాగ్రములకు నీగాథ జారిపోవని యలంకారశక్తి
వసుధా సుమంగళీ వ్యధలకు నీ పల్కు బహుళధైర్యోత్సాహ వజ్రఘోష
వైరి భూపాలదోఃపటిమకు నీమూర్తి శివుని మోమునగల చిచ్చు కన్ను

తే.గీ. తల్లి దండ్రులుగోరు సద్గతులకెల్ల
నీ పవిత్రోదయంబె ఘంటాపథంబు
కొసరి పూజించు నీ తల్లి కొంగునందు
శాంభవి యొసంగు నమృతభిక్షంబవీవు

మ. నిను సామాన్యునిగా దలంచితిని గానీ! నీ భుజాదండ భం
డన పాండిత్యము భారతీయుల కనన్య ప్రాభవప్రాప్తిక
ల్పనగావించి దిగంత దేశముల నేలంజాలునం చేనెఱుం
గనురా! యింతకుముందు నీ వపర దుర్గాదేవి వాత్మోద్భవా!

## ఢిల్లీ ప్రయాణము

ఉ. సేయపు శృంఖలాచయముచే శివభూపతి నెట్టులేని కా
రాయతనంబులో నునుపనౌనని ఆ యవురంగజీబు, భూ
నాయకు డాత్మలోమురిసి, నన్నొకమారిట జూచిపొమ్ము ర
మ్మా! యని చెప్పిపంపె శివమానవనాథున కాదరంబునన్

కం. మురిపెంపు చీని చీనాం
బరములు రత్నములు తన కుపాయనముగా
తురకల యొడయడు చెలిమికి
గురుతుగ నంపించె నృపునకు న్నిటలాక్షా

కం. తన సరదారులతో మం
తనము సలిపి, వారి యభిమతంబున ఢిల్లీ
జననాథునికడ కేగదలం
చినవాడై పయనమయ్యె శివరాజు శివా!

తే.గీ. అనుగు సేనానులం దర్హులైన ముగురి
కాత్మరాజ్యంబు నర్పించి యైదునూరు
లశ్వములు వీరులొక్క సహస్ర సంఖ్య
గొనుచు ఢిల్లీకిజనె జిజావనిత కొడుకు

కం. ఆరట్టాశ్వమునెక్కి కు
మారుడు శంభాజి, మనకుమారునివలె, న
మ్మారునివలెరా! శివ భూ
దారుడు వైభవముతో గదలె భూతపతీ!

ఉ. ఆవల నర్మదానదమునం దవగాహన మాచరించి, బృం
దావనమందు నాలుగు దినంబులుబుచ్చి రమేశుదందు గో
పీ వనితా జనంబు వలపించిన చోటులు నేటి తిన్నెలం
దావులు గాయుచోటులు బ్రియంపడిచూచె, మహోక్షవాహనా!

కం. ఔరంగజీబెదుర్కొని
గౌరవమున గొంచుపోవగా సచివుల స
ర్దారుల బంపమికి కృధాం
కూరము శివతేని కన్నుగోనల మొలిచెన్

కం. భట సమితితోడ ఢిల్లీ
పుటభేదము జొచ్చి నెయ్యపుం గొమరునితో
స్ఫటిక శిలా భర్మమణీ
ఘటితమగు నవాబు మహలుకడ కేతెంచెన్

సీ. రతనంపు కంబాలజతలపై దాపిన బంగారు తీవెల పనితనంబు
తులలేని గతి జీవకళ యుట్టిపడు పచ్చరాతి టక్కరి పావురాల సొబగు
గుమ్మాలకడ నేన్గుకొమ్ముతో జెక్కిన సింగాల జంటల శిల్పవిద్య
యెదురైనవారి నెమ్మదినుంచి బంధించు దళమైన నిగ్గుటద్దాల మెఱుగు

తే.గీ. ద్వారముల జీరువారు ముత్యాల మేలి
నిడుద గొలుసుల జాలరీ నిగ్గు జగ్గు
ప్రేక్షకులమీద నొగి రాచఠీకము నెరప
దరిపి వెన్నెలగాయు భూధవుని మేడ

సీ. నడికొప్పులంట పుప్పొడిదువ్వ గుప్పించు మల్లెతోటలపూత పిల్ల నవ్వు
ఎండ కన్నెరుగనీకుండ నౌదల గప్పు నెలమామిగున్నల చలువ చూపు
పోతుటీగను జొచ్చి పోనీని మన్నీల అలుగు జోడింపుల ఆదరంబు
అరిని కన్నెత్తనీయక నాల్గు దిక్కులు పాలించు మరఫిరంగీల చెలిమి

తే.గీ. పవనపుత్రికా తతి సమర్పణము చేసి
శుద్ధ కాళింది నెఱపెడు చుట్టటికము
తలచి గర్వించి తారకాతతులతోడ
మంతనము చేయు పాదుషా మందిరంబు

కం. కొడుకుం దానుం దురకల
యొడయునకు సలాము చేసి యొకదెస నిలువం
బడి సెలవు నుడువునకు జిజ
పడతికొడుకు వేచియుండె బాలేందుధరా!

సీ. ముని బాహువుల ధరా పుణ్య కాంతామణి ఆసీనయై ఆటలాడువాని
కరవాలధార నుత్కటవిక్రమజ్వాల మొలకెత్తి పదనెక్కి వెలుగువాని
తొలిగుజ్జువేల్పు జిత్తులమారితనమెల్ల మూర్తిత్వమున వెళ్ళబోయువాని
కోర మీసములతో కూరిమి పాటించు ప్రజ్ఞ వైరులమీద బరపువాని

తే.గీ. విమత భూపాలకుల మంగలమున వైచి
విపుల శౌర్యానలంబున వ్రేల్చువాని
శివధరాజాని నౌరంగజీబు జూచె
గుండె ఝల్లన కఱకు చూపులు రహింప

చ. అరవెలిదోచు నిండగు ననాదరణంబున బాదుషా ధరా
వరు డెలనవ్వు నెమ్మొగముపై కడు మందముగా నటింపగా
శిరము గదల్చి గౌరవము చేయక సింగపు మేలిగద్దె ముం
దర నిలిపె న్మరాట జననాథుని సారయశో నభో ధునిన్

కం. ఆ సుల్తాను నరేంద్రుని
మోసము సర్వంబు డెందమున దోచి క్రుధా
భాసుర ముఖుడయ్యె, పథా
యాసము తోడై శివాజి అంధకవైరీ!

మ. కనుగోనల్చివురింప, రోమములు నిక్కన్ జెక్కు లల్లాడ వె
చ్చని యూర్పుల్ జనియింప, కెంపు వదనాబ్జంబందు వ్యాపింప, నే
చిన రోషంబున దంతముల్ గొరికి షాజీ నందనుం డా నవా
బునిపై జూడ్కి నిగిడ్చి యిట్లనియె నంభోభృన్నితాంత ధ్వనిన్

# కీ.శే. సత్యవోలు గున్నేశ్వరరావు గారు

సీ. మంత్రిభాస్కరయశోమహిమంబును బిరాన, సాధించిన వదాన్యచక్రవర్తి
కవిగజమ్ముల నేలఁగా బునర్భవుఁడై విరాజిల్లు శ్రీకృష్ణరాయమూర్తి
శత్రుకోటికి గర్భశల్యమై తనరి శిరాన కిరీటంబు లేనిరాజు
ఘనతపఃపరిపాకమున భారతాంగన, కడుపారఁ గన్న యఖండభోగి

తే.గీ. వేంగిరాజ్యాటవీచరద్భీమసింహ
మక్కటక్కట సత్యవో లన్వయాబ్ధి
రాజబింబము గున్నేశరాయవర్యుఁ
డస్తమించెను దాతృత్వ మస్తమింప

సీ. తనపోషణమున వృద్ధిని గాంచి మించిన, చిత్రలేఖకులకుంచియలనేర్పు
తనయాదరమున శస్తంబైన సత్కవి ప్రవరుల భావప్రపంచగరిమ
తనసాయమున నాటుకొని తేజముంగన్న, నటవిగాయకసారనైపుణంబు
తనదానపటిమఁ దృప్తినిగొన్న సకలయాచకమనోవిస్ఫుటాశాబలంబు

తే.గీ. అలయఖండగోదావరీజలతరంగ
ఘోషణంబునఁ గలసి దిక్కుంభిగములు
సీధునెపమునఁ గన్నీరు చిలుకరింప
నంగలార్చెదునమ్మ! యోయాంధ్రమాత!

శా. నీ కేపుత్రవతంస మిష్టుఁడయి శాంతిం గూర్చునో వాని కే
దో కాలాంతముసంభవించి చను నయ్యో! తల్లి! నీకర్మమే
మోకానీ హృదయంబు భిన్నములు గాదో, గర్భశోకంబు నీ
కాకల్పాంతము నిల్చుచో, భరతమాతా! యెంతదౌర్భాగ్యవే

శా. నానానాటకసంఘరాజములకన్నన్ మిన్నగాఁ జేసి య
ట్లానందించిననాయకుం డకట దేవావాసముం జేరెన
మ్మా! నీ విప్పుడనాథవైతివి గదే యాభోగ మామంజుల
శ్రీ నీకుండదు భర్తతోడనె చనెన్ జింతామణీసంఘమా!

(భారతి, మార్చి 1925)

# కృష్ణానది

సీ. గిరిరాజకందరాంతరవాసులైనట్టి, మునిచంద్రు లరసి దీవెనలొసంగ
తటవివర్ధితపుష్పి తక్షోణిరుహములు, పువుఁదేనియల ముదశ్రువులు గురియ
దృక్పర్వముగఁబండి యెండి యెన్నులువంచి, కేదారములు నమస్కృతు లొనర్ప
సతతంబుఁ దలమీఁద జలవిహంగముల బృందములు పత్రాతపత్రములు నిల్ప

తే.గీ. మవ్వపుందమ్మి పూవులమందభక్తి
సమధికామోదమిళితభా స్వద్రజంబు
కోర్కెతో నీకు దోసిళ్ల గ్రుమ్మరింప
నలరుచున్నావు కృష్ణా మహాస్రవంతి!

సీ. పగలురాత్రియులేక ప్రాక్పశ్చిమములకుఁ బారుచున్నావు కూపారమునకు
సుఖదుఃఖములులేక శుభ్రజలంబులు మోయుచున్నావు జీవులకు నీయ
జీతబత్తెములేక సితతరంగరథంబు నడపుచున్నా వబ్ధినాయకునకు
కాలుసేతులులేక ఘనభూములకు నీవు పంచుచున్నావు నీవారిధార

తే.గీ. ఇల్లువాకిలిలేక నీ వెసఁగుచుండి
ముందు సాధించినావు, సముద్రశాల
విశ్రమింతువుకాఁబోలు విభునితోడ
నందుఁ గొలువుండి కృష్ణా మహాస్రవంతి!

సీ. కంఠహారం బానకట్ట, భాసిల్లుకొండలు రెండు వలుదగుబ్బలయుగంబు
ప్రక్కలఁ బారుకాల్వలు చెలికత్తెలు భటులు కంబంబులు పదియునొకటి
దివ్యాతపత్రంబు దీపించుసేతువు విశ్రమస్థానంబు విజయవాడ
హిందూమహావార్ధి హృదయవల్లభుఁడు తైర్థికకోటి పుత్రకప్రకర మరయ

తే.గీ. నచలవాసిని కనకదుర్గాంబ పదమ
టింటివేలుపు, కొఱఁత నీ కెందుఁగలదు?
ధరణిఁ బ్రవహింపు మాచంద్రతారకముగ
అమ్మ! రావమ్మ! కృష్ణామహాస్రవంతి

సీ. పశ్చిమాహార్యదీవ్యన్మాతృవామాంక సీమానివాసంబు చెంగలించి
దర్శనాగతసముద్యజ్జలావహములౌ నుపనదీసఖులతో నుద్యమించి
క్రీడావనంబులై కెలఁకులఁ బెంపారు నుగ్రకాంతారంబు లుత్తరించి
ఆత్మయాత్రావరోధార్థమై పొడసూపు పర్వతంబులనెల్లఁ బగులఁదన్ని

తే.గీ. యనఘగాంధీమహాత్మదర్శనము సేయ
భీమభంగారవాచ్ఛగీతామృతప్ర
దీప్తశంబరభరితదిగ్దేశ మగుచు
నరుగుచున్నది కృష్ణామహాస్రవంతి (భారతి, మే 1925)

# వేమన యోగీంద్రుఁడు

మ. కనుఁగొన్నావుగదా? పరాత్పరుని శృంగారస్వరూపంబు ఛీ!
యనుకొన్నావుగదా? సమస్తమును దీవ్యత్స్వర్గసౌధంబులో
మనుచున్నావుగదా? సదా దివిజభామాచామరచ్ఛాయ వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. చనినా వెన్నఁడొ; కీర్తికాయము ధరాచక్రంబునన్ నిల్పి "వే
మన" యన్నామ సదక్షరత్రయము నాట్యంబాడెడిన్ సర్వస
జ్జన జిహ్వాగ్రములన్ విమోహలతికాశాతాస్త్రవిఖ్యాతి వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. మనుజాంతఃకరణంబునన్ గలుగు దంభంబెల్ల నీక్షించి చ
క్కని కావ్యామృతధారలోఁ గలిపి లోకశ్రేణికిన్ వెల్లడిం
చిన నీగంటము హస్తపద్మమున భాసిల్లన్ దివిన్ డిగ్గి వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. నిను నాకంబున గౌరవించెడు సురానీకంబు మేమిచ్చు న
ర్చనము ల్చేకొనఁగోరి భూమి కరుదేరం బోవరా నీయ రై
నను మార్గంబు లభించు నీకు మనసున్నన్ సత్కృపాసాంద్ర వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. ఘనయోగంబు వహించి మాకిపుడు సాక్షాత్కారమున్ బొందఁజా
లిన సామర్థ్యములేనివాఁడవె? నరాళిం గావఁగా నందనం
దనుఁడైపుట్టిన విష్ణుమూర్తి వనుకొన్నా మీవు కాదన్న వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. వినవా? మాయభివాదము ల్సురవధూవీణారటద్గీతికా
ని సదస్యందిమరందబిందుబలమందీభూత చిత్తుండవై
కొనవా? పద్యనవారవిందములు నీకున్ గానుకల్సేయ వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. నిను మన్నింపఁగ నీమహత్త్వమును వర్ణింపంగ దక్షుండు గ
ల్గునె? లోకంబునఁగాని నీయెడల మాకుం గల్గు సద్గౌరవం
బును బ్రత్యబ్దము వెల్లడించెద మిటుల్పుణ్యోత్సవం బొప్ప వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. మునుముం దెల్ల శరీరభోగవిషయాంభోరాశిలో మున్గి యీ
దిన నీస్వానుభవంబె మానవుల నీతిప్రాప్తి కాధార మ
య్యెను వేయేల మహోపకారియన నీవే వేఱుగాలేరు వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. అనుకూలింపని మాటలన్ గుజను లందందాడుచో నీకు వ
చ్చిన లోపం బదియేమి? శైవతతి లక్ష్మీనాథునిన్ గాదనన్
వినమో నీ కనుమాన మేమిటికి నీవే మాకు సర్వంబు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. కనకంపుందునుకల్గదా? భవదభంగజ్ఞానసూత్రంబు లె
ల్లను, ద్రాక్షా మధుమాధురీ సహితము ల్గాదా? కవీ! నీదు జీ
వనగాథావివిధాంశము ల్కవితచెప్పన్ జొప్పదంబోవు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. నిను గర్భంబునఁ గన్న కారణమునన్ నిక్కంబు మాభారతా
వనిపూతంబయి వెల్గుచున్నది, భవద్వాక్ప్రీయుషం బేమొకో
కన దాకాశతరంగిణీఘనతరాఖ్యంబూని పెంపారు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. పునరాకారత జన్మమెత్తిన దయాబుద్ధుండవో లోకమో
హన మర్త్యాకృతి సంచరించిన సముద్యద్భక్తి పుంజంబవో
యని నిర్ధారణ సేయనీయదు మహాత్మా! నీప్రభావంబు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. వనధివ్రాతము నీయనంతగుణము ల్వర్ణించెడిన్ వీచికా
ధ్వనులన్ బున్నమచందురుం డమలశీతజ్యోత్స్నలన్ నీయశో
ధనమున్ వెల్లడి సేయుచుండె నిదిగాదా? నీకు సాక్ష్యంబు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. అనయంబున్ గను రెప్పవేయక త్వదీయాకారము న్గాంచి కాం
చనగు న్నిక్కము దేవకోటు లనిమేషత్వంబు, మేమొక్క మా
రనిమేషస్థితిఁ దాల్పఁ గాంచనమణీయానం బధిష్ఠించి, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. ధనము న్గూర్చినవానితో నదియు నంతంబందు నంతంబునం
దని మూల్యంబు యశంబుగా నెఱిఁగి యేతన్మూల్యమున్ వేగ నా
ర్జనము న్జేసిన బుద్ధిమంతుఁడవు మర్త్యవ్యక్తివే నీవు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. మునులన్ బిడ్డలుగా గనుంగొనిన బూవుంబోఁడులందెల్ల నీ
జననీగర్భము ధన్యమైనది, భవత్సాన్నిధ్యమం దిప్డుడా
వనితారత్నము సంతసించునుగదా? స్వర్గాంగనాకోటి, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. మనుచున్నార లజాగళస్తనములై మర్త్యుల్ ధరామండలిన్
చనుచున్నారలు నీటిబుగ్గలవలెన్ సర్వంబుఁబోనాడి, నీ
జననంబట్టిదియా నయాచరణ పూజ్యం బార్య వేద్యంబు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. అనవేమన్న ధనంబు సత్కవుల కీయంజొచ్చి యొక్కింత కీ
ర్తినిఁ గొన్నాఁడట వాని కాసుగుణవర్తిత్వంబు నీనామవా
సనచేఁ గల్గుటగాక దాని కొకవ్యాజం బున్నదా? లేదు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. జనులానంద మనోరవిందులయి యశ్రాంతంబు నీపేరు బో
రనఁ గీర్తించుటకెల్లఁ గారణముగాదా నీప్రభావంబు, కా
దన నెయ్యంబున వియ్యమందికొనినావా? వారితోనీవు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. ఘనమందారవనీ విహారమణి మార్గస్వర్ణ సౌధాంగనా
జనము ల్పాదము లొత్త లేఁ జిగురుమేల్పయ్యావళింజేరి వ్రా
సిన నీనూతన దివ్యకావ్య మధురక్షీరంబు వర్షింప, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. కనుఁగో మన్నన గోరకున్న నరుఁడొక్కండేనియున్ లేఁడు లేఁ
డని ముమ్మా రెలుఁగెత్తి పల్కుటకు సాధ్యంబేకదా! భారతా
వని నీవే యుదయింపకున్న నిపు డాభావంబున బోనాడి, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. మనుజు ల్దివ్యపయోముఖోగ్రవిషకుంభ ప్రాయు లవ్యక్త న
ర్తను లిందుండగరాదు గండమని స్వర్గంబెక్కి దీపించు పా
వనమూర్తి న్నినుఁ బిల్వ నిట్టులుదెగింపన్ బ్రేమ మన్నించి, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. ఇనబింబం బపరాంబుధిన్ బడకమున్నే మత్సభాకన్యకీ
వనజాస్యంబు కళావిహీనత వహింపంబోకమున్నే ద్విజ
స్వనము ల్చెందకమున్నె మాకనుల చాపల్యంబు లోపింప, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. అనుమానించితి మట్లు నీకచట సౌఖ్యం బిం దసౌఖ్యంబు నుం
దునె? పంచాగ్నుల మధ్యమందయిన నుండు న్నీకు సచ్ఛాంత జీ
వన మానందములో నశాంతము సృజింపన్‌జాలవా నీవు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. అనయంబు న్గనుచూపులం దమల దైవాకారమున్నిల్పి బు
ద్ధిని బంధించి శరీరయాత్ర యొకరీతిన్ సాఁగిరాఁ గష్టభా
జనభూమీ నిలయంబు వాసి విబుధస్వర్గంబు గొన్నావు, వే
మనయోగీ! దయచేసి యందికొనుమయ్యా! గౌరవస్థానమున్

మ. అనఘా! నీకిడగా నిగారపు మణీహారంబులన్ దేము, భ
క్తినిబద్ధంబగు తారకాసరము నర్థిం దెచ్చియున్నాము, చే
కొని మందస్మిత మంకురింపఁగఁ గనుంగొ మ్మంతియేచాలు, వే
మనయోగీ! దయచేసి యందుకొనుమయ్యా గౌరవస్థానమున్

(భారతి, జూన్ 1926)

## శేషాద్రిరెడ్డి

సీ. శారదాసతికలంకార కల్పకమైన బంగారునగల గిడ్డంగిఁదెఱచి
లలిత సత్కవికోకిలముల కాశ్రయమైన తేటపల్కుల పూవుదోఁటనాటి
దోషైక దృగ్దోషదూష్య జాడ్యము వాయ సరళ శయ్యాసదం జనమునమ్మి
............. సత్తుల కూడిగము సేయు నారోగ్యదేవత నాదరించి

తే.గీ. లీలమై దిగంతముల హల్లీసకములో
నర్చుకున్నది నీశుచి నాటకంబు
నీకు బ్రహ్మాయువగుత మనింద్య చరిత
శ్రీల నేలుము శేషాద్రిరెడ్డి సుకవి

కం. నీశుచి నాటక రచనా
వైశద్యంబనుపమాన పాత్రాచితి, యూ
హాశక్యమె? కవికుల ధర
ణీశులకు భిషఙ్మణీ కవీంద్రద్యుమణీ

ఉ. అడ్డము లేని ధారలొాలయం బులకండము లొల్కు కబ్బపుం
బిడ్డలఁగన్న యట్టి గృహమేధి, ధనార్థులకెల్ల వేలుపుం
గిడ్డి, సరస్వతీరమణికిం జిలుగుంబడి నేర్పు నొజ్జ మా
రెడ్డి కవీంద్రుఁడన్న నెదిరింప విరోధికి గుండెలుండునే

ఉ. తావకబాహుదండమునఁ దాల్తుగదా చటులాస్త్రముల్ చికి
త్సావసరంబులందు భిషగగ్రణి దుష్కవినంటు మూఢవా
చావివిధ వ్రణంబులకు సత్కవితాస్త్రముఁజేతఁబట్టియు
న్నావను భావమిందులఁ గనం బడునయ్య, కవీంద్ర చంద్రమా

ఉ. మన్నెము వారి వంశమె సుమా యనుమానములేదు కీరితిం
గన్నది, సత్కవీశ్వరులఁగన్నది, వెజ్జుల ముజ్జగంబులం
గన్నది, కాంచనున్న దటుఁగాక యనర్థకవిత్వ దోషమున్
దన్నగలట్టి యిట్టి శుచినాటక సూర్యుఁడు మింటికెక్కునే

(మన్నెం శేషాద్రిరెడ్డి రాసిన 'శుచి' అనే నాటకంపై అభిప్రాయం, 1927)

# భారతవీరుఁడు

ఉ. సంగరసీమ నీకుఁ దొలిసాయకమైన భుజంగభర్త, పా
ర్థుం గుఱిచూచుచో నది విరుద్ధగతిం జని టెక్కెముం గిరీ
టాంగదము ల్దహించి, యినజా, ననుఁ గ్రమ్మఱ నేయుమన్న, ఛీ
యెంగిలిబాణ మేయ ననవే! రణవీరుఁడ వీవ యర్కజా!

ఉ. నిక్కపుఁ బేఁడబుఱ్ఱవలె నీ తొడ నింద్రుఁడు బొక్కసేయు నాఁ
డక్కట నెత్తురు ల్వరద లై ప్రవహించుచునున్న ధైర్యమున్
దక్కక నిద్రఁ జెందు జమదగ్ని కుమారుఁ గదల్పలేదు హా!
యెక్కడి చిత్తదార్ఢ్య; మిది యెక్కడి దీగురుభక్తి భానుజా!

మ. కురురా జొక్కఁడుగాక నీ దగు మహ త్కోదండపాండిత్యము
స్వరదాన ప్రతిభానిసర్గగుణ మెవ్వారేని గుర్తించిరే
యరవిందాప్తకుమార, చింతపడకయ్యా! నేఁటి కింకన్ దిగం
తరదేశంబులఁ బాఱుచున్నవి భవ ద్దానాంబుధారానదుల్

(భారతి, అక్టోబరు 1928)

# సఖి

ఉ. నీకనుగోనల న్నగవునిగ్గులు మొగ్గలు దీరినంతఁ జీ
కాకుపడున్ జగంబను నొకానొక టక్కరినమ్మకం బెదన్
రేకులు దీరియున్నయది, నీనునుజూపుల ముత్తియాలతో
నాకభిషేకమిమ్ము, తరుణం బికవచ్చునొ రాదొ నెచ్చెలీ!

(భారతి, జులై 1929)

# బుద్ధుడు

సీ. పరదూషణము సేయువారి నారయలేక ముద్దుకన్నుందోయి మూఁతవడఁగ
అనృతస్థిరుల నెయ్యము సహింపఁగలేక స్వాంతంబు విపినవాసంబుగోర
పసిఁడిచేలముల గర్వము నోర్చుకొనలేక తనువు కాషాయవస్త్రముల నరయ
కామచారుల మంటకము నంటుకొనలేక నాలుక ఫలభోజనంబు నెమక

తే.గీ. నవ్యమాణిక్యరాజదండమును వీడి
బూతిపూఁతయు సొరకాయబుఱ్ఱ నంది
చెట్టునీడలబంగారుకుట్టిమమునఁ
గాపుర మొనర్చితే ముక్తికన్యతోడ

(భారతి, ఆగష్టు 1929)

# తెలుఁగుతల్లి

సీ. రాముబాణమున ధైర్యము పెల్లగిల్లిన మున్నీరు తలవంచి మ్రొక్కునాఁడు
ప్రాయంబు జారిన బోయనాయకురాలు గుడిసెలో రాముని గొలుచునాఁడు
సీతమ్మకతన, సంపాతి శ్రీరఘురాము నరచేత వైకుంఠ మందునాఁడు
రామపాదుకలచే రాజ్యమేలించుచుభరతుండు కన్నీరు దొరఁగునాఁడు

తే.గీ. భక్తివైరాగ్యములు నన్ను వలచునేమొ
కోరుకొన్నంత పుణ్యంబు గూర్తునేమొ
గారవంబున నన్నేల గాంచవైతి
తెలుపఁగదవమ్మ! ననుఁగన్న తెలుఁగుతల్లి!

(భారతి, సెప్టెంబరు 1929)

# బాష్పసందేశము

శా. ఎన్నో వందలయేండ్లు దాటినదిగాదే? వీరు నీ స్వార్థపుం
బన్నాగంబునఁ గప్పి వేయఁబడి నీ స్వాంతంబు పాషాణమో!
"అన్నా! స్వాస్థ్య మొసంగుమీ" యనుచు నేఁ డర్థించుచున్నార లీ
కున్న న్నన్నునుఁ గౌరవాగ్రజునిగా నూహింపఁ గోపింతువే!

(భారతి, నవంబరు 1929)

# భీష్ముఁడు

శా. "ఈసత్యవ్రతుఁ డెంత? వీనిపస మాయింతుం జుమీ" యంచు నీ
పై సింహాకృతి నెత్తివచ్చు హరి నాహ్వానించి, "నాతండ్రి! రా
వే సంసిద్ధుఁడ" నంచుఁ బల్కితివి దేవేంద్రాదిబృందారకుల్
దాసోహ మ్మనకుండిరే? గగనకుల్యాపుత్ర! నీభక్తికిన్

(భారతి, ఫిబ్రవరి 1931)

# యుగంధరమంత్రి

సీ. తురకపౌఁజుల ఖడ్గతోమరంబుల నీడ భూపకేసరి కన్ను మూయఁగలదె?
మొగలాయిశృంఖలాపుష్పదామములకు నృపతి హస్తము ముద్దు లీయఁగలదె?
ప్రతిపక్షజన తీక్ష్ణ పరిహాసముల కోఁత యోరుగంటికటారి యోర్వఁగలదె?
ఖానుల జయపతాకాదీప్తివృష్టికి ఆంధ్రక్రుధాగ్ని చల్లారఁగలదె?

తే.గీ. తెనుఁగుభూమండలముతోడ జనన మంది
జీవనము ధారవోసి పోషించుచున్న
గౌతమీగంగ రుద్రభూకాంతు నయయొ
పగఱ కర్పించుకొని దాఁటఁ బంపఁగలదె? (భారతి, డిశంబరు 1931)

# మేఘుఁడు

మ. జలదా, యింద్రధనుస్సు వట్టుకొని నీసాన్నిధ్యమందున్న యా
విలుకాఁ డెవ్వఁడు? లక్ష్యమేమిటి? భవద్విద్యుల్లతాహాసలీ
లల యొయ్యారము లేమి? కర్షకుల కుల్లాసంబు గల్పించి, నె
మ్ముల నాడించెడు నీవిచిత్రచరితంబున్ మాకు బోధింపుమా!

సీ. అంభోధిజలమునం దవగాహనముసేయు భానుమంతునిచేతఁ బ్రభవమంది
ధరనున్న ప్రతిపదార్థమును జ్ఞప్తికిఁదెచ్చు లెక్కింపరాని పోలికలఁ బొల్చి
నెమిలికన్నుల రమణీయవర్ణములచే పచ్చని శక్రచాపములు వ్రాసి
శుక్తికన్యకల విశుద్ధగర్భములలో ముత్యాల సంతానమును ఘటించి

తే.గీ. చేతనాచేతనంబుల చిత్తమలర
నమృతదానంబుసేయు మోహనుఁడ వగుచు
భీకరములైన పిడుగులు విడిచెదేల?
యీస్వభావంబు మానుమోయీ పయోద!

తే.గీ. వితరణవిలాసివై యభ్రవీధి నేలు
ఘనుఁడవగు నీకు హంసతో కలహ మేల?
తగదు తగ దంబుదా, సమాధానపడుము
వానకోయిలచే రాయబార మంపి. (భారతి, ఆగస్టు 1933)

# రాయలు

సీ. రాజనీతిని కసరత్తు నేర్చిన దిట్ట అప్పాజిప్రజ్ఞ ని న్నాదరింప
చేయివీచిన లక్షసేన బారులుదీరి ముదల యేమని ఖడ్గమును వహింప
కవిసార్వభౌముల ఘనత రాశీర్వాదబలము నీముందువెన్కల నటింప
యినుపరోకళుల సాదనసేయు గజసేన ఆలానములను మల్లాడుచుండ

తే.గీ. ముగురురాజుల మగ డాంధ్రభోజు డనుచు
గఱచి నీయింటి గోరువంకలును బొగడ
క్రూరతరమైన నీదుకటారిపడుచు
నిదురబుచ్చవొ రిపులగుండియలలోన

సీ. తెలుగుగబ్బములు పూవులడోలికలుగాగ ఐహికస్వర్గసౌఖ్యముల దేలి
తుంగభద్రానదీభంగబాలికలకు యుడుకైన రిపురక్త ముగ్గుపోసి
కరము లీయక కత్తిగట్టురాజుల కిరీటము లూడ వామపాదమున దన్ని
కదలేని గజసేన నడిపించి వింధ్యగహ్వరమున నెఱదుమ్ము తెరలు దించి

తే.గీ. ఖడ్గమే ఘంటముగ రణగ్రంథరచన
మరణపర్యంత మొనరించి యరిగినావు
కృష్ణభూపాల, నీనామకీర్తనంబు
తెలుగుపుత్రిక వీణెతీగలకు గఱప

శా. బంగారంబువలెన్ గఱంగినది, భూపశ్రేష్ఠ, నీవిక్రమా
గ్నిం గ్రిగ్గాడి నృపాలమండలము నీకీర్తిద్యుతుల్ రోదసీ
రంగంబున్ గబళించివేసినవి, ఆంధ్రక్షోణి నీబాహుసీ
మం గైసేసిననాడు, నాటి చలిచీమల్గూడ ధన్యంబులే

(భారతి, మార్చి 1934)

# ప్రకృతినటన

చం. మిటమిట యెండ గాచినది, మేదిని బీటలువాఱిపోవ, నం
తట సుడిగాలి రేగి, వసుధారజమున్ గలగించి రేచె, బి
మ్మట నినమండలంబు తెలిమబ్బుల దాగుడుమూతలాడె, నా
దట, గఱులున్న కొండలవిధంబున బేరెములెత్తె మేఘముల్

తే.గీ. వానదడిసిన భూమిదర్పణమునందు
ప్రకృతిరమ తలక్రిందుగా ప్రతిఫలించె
ముసలిసూర్యుని పసలేని మోముజూచి
మూతిముడియించె బదుచు టంభోజవనము

చం. పడమట, నెఱ్ఱపట్టు జిగిపట్టుతివాచులమీద, వృద్ధసూ
ర్యుడు నివసించె, వీడ్కొలుపు టుత్సవగానము లాచరించుచున్
నడిచె శకుంతకోటి సదనంబుల కంతట బ్రొద్దు గ్రుంకె, సం
దడులు క్రమక్రమంబుగ నణంగె, వసుంధర కన్నుమూసినన్

(ఆంధ్రపత్రిక, ఉగాది సంచిక, 1934)

# కవి, కవిత

సీ. గీర్వాణకవులు ద్రొక్కినకావ్యపథముల నొడలు చెమ్మటలూర నడువవలయు
మనకవిత్రయము పెట్టినకావ్యభిక్షకుఁ బలుమాఱు దోయిలింపంగవలయు
నన్యదేశీయకావ్యాంబుధుల్ మథియించి గుణరత్నముల నేఱికొనఁగవలయు
నధునాతనకవీంద్రు లల్లుకబ్బముల తాలింపుసొంపుల నాకళింపవలయుఁ

తే.గీ. దెలుఁగుసాహిత్యసుందరీ దేహవల్లి
కెరవు సొమ్ముల సొగసు రానీక హృదయ
మెఱిఁగి మధురంపునడకలుగఱపవలయు,
నది కవిత్వంబతఁడు శారదకుగురుఁడు

(ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక, అక్టోబరు, నవంబరు 1934)

# సాక్షాత్కారము

తే.గీ. చిగురుఁబట్టిన పశ్చిమ గగనభూమి
నంబుదంబుల దోబూచు లాడుకొనుచు
ముద్దులొలికించు లేనెల పోరగాని
నొక్కసాయాహ్నమునఁ జూచుచుంటి నేను

తే.గీ. అరయుచున్నంతలోన బ్రహ్మాండమందు
దాండవశివుండు మ్రోలఁ బ్రత్యక్షమయ్యె
జాబిలికుమారుఁ డరనిముసంబునంద
ఈశ్వరుని జటాజూటాన నిమిడిపోయె

ఉ. ఏనుఁగుతోలుతోఁ, బడగలెత్తిన పాములకండువాలతో
మేనిఁ విభూతిపుప్పొడులు, మేదినిఁ జింద నటింపజొచ్చె నీ
శానుఁ దజాండగోళమును, క్ష్మావలయంబును, సంచలింప సం
ధ్యానవపల్లవారుణ విహాయస దీర్ఘజటాప్రచండుడై

తే.గీ. భవుని వికృతాట్టహాస ధావళ్యగరిమ
గగనజాహ్నవి నుఱువులు గ్రక్కుకొనియె
కరతలంబున నున్న బంగారులేడి
మిన్నరయుచుండె, ముంగాళ్లమీద నిలిచి

చం. మలచినమంచుగడ్డవలె మైపులకింపుల నిల్చియున్న, యె
ద్దులదొర నాని, భూతపతితొయ్యలి, పర్వతరాజపుత్రి, యొ
ప్పులపరసీమ తేపకడ బూచిన యెఱ్ఱగులాబితోఁట చె
క్కులు చెమరింప నాట్యమునకుఁ దలయూచుచునుండెఁ జెంగటన్

కం. అంగాంగకముల నొక్కొక
శృంగారరస ప్రబంధ మిమిడిన భవురా
ణిం గాంచి, మధువు నానెడు
భృంగీగణమయ్యె నా నిరీక్షణపంక్తుల్

చం. భవుని కపాలమాలికలు పండ్లిగిలించుచునుండె బ్రాణము
న్నవియనుబోలె, నావెడగుటాశయము న్గమనించెనేమొ, భా
ర్గవి, యొకయస్థిపంజరముగా నిలిచెం గనుమూసినంతలో
నవల నభస్సు గన్పడియె నాట ముగించినశూన్యరంగమై

తే.గీ. పత్రికాముఖంబున నచ్చువడిన బొమ్మ
కరయుగంబున మరల సాక్షాత్కరించె
చిత్రకారుని నేర్పు నైశిత్యమందు
నెంతకథయున్నదని నుతియించుచుంటి

# మధు కణాలు

హైదరాబాదు ఆంధ్రులు తన్నుసన్మానించినపుడు, కవిగారు అమృతసేచనంతో యీలాకృతజ్ఞత చూపారు–

తే.గీ. సహజసుందర చంద్రధ్వజంబు మెఱయ
నురుదుశారద యూరేగు ధరణిలోన
తెలుగుబిబ్బోకవతి పేరు నిలుపుచున్న
సరసులకు మీకు వలపుటంజలి ఘటింతు

తే.గీ. నాది వినుకొండ, హైదరాబాదు మీది;
స్నేహ మైనది వాఙ్మయ సేవకతన
పెరల వాత్సల్యమెల్ల గుప్పిటనుబట్టు
ఏమహాశక్తి గలదో! సాహిత్యవీధి

శా. మీ వాత్సల్యమె ముఖ్యకారణము సుమీ! నేటి మర్యాదకున్
నా వాచావిభవంబు గాదు; బళిరే! నైజాము రాష్ట్రాంధ్రు లా
రా! విఖ్యాత సమత్వ దృఙ్మహితు లారా! కొండివే పద్య పుం
బూవుం గాన్కలు, భక్తి గుంభితహృదంభోజాత గంధాఢ్యముల్

ఉ. రాయలవారితోడఁ గవి రాజులమన్నన స్వప్న గాథయై
పోయె, కళా పిపాసువుల మూపునఁ బడ్డది వీరపూజ, ఆ
దాయము రాజకీయపు విదాహమునన్ వెదజల్లుచున్ దివా
లా యయినారు ద్రవ్యముగలా రవలంబనమేది కైతకున్

మ. కవితా వాహిని చీలి, పాయలయి ఆగంబై, యధేచ్ఛారతిన్
బ్రవహింపం దొడఁగెన్, బురాతనపుఁద్రోవల్ బుంతలుం బాడువ
డ్డవి; ఛందోనియమాదికూలములు భ్రష్టంబయ్యె నీ మందు వే
సవియందింకునో? సంగమించునో? రస స్వర్గీయ పాథోనిధిన్

చం. ముసిరిన భావజలమును బూడిదలోపలఁ బుంపి, కుత్తుకల్
బిసికి, యగాధ శబ్దవన వీధుల దాచి, కవిత్వ మన్నచో
విసిగి, శపించిపోయెదరు వీనులు శూన్యములై సభాసదుల్;
రస మరికట్టు నీ గులకఱాల బిగింపుల కేమి హేతువో?

ఉ. మొత్తముమీద పూర్వకవి ముఖ్యులు పెట్టిన కట్టుబాట్లలో
నుత్తమ మధ్య మాధమము లున్నవి వానిని గొద్దిగా మరా
మత్తొనరింప నౌననెడు మాటకు నేనును సమ్మతింతు, నీ
చిత్తలతోక బీకుడు కవిత్వము ఫక్కి ననాదరించెదన్

మ. ఉరుదూ, ఫారశీ, ఆంగిలేయ, మరబీయు, న్నిన్ను స్నేహింప, నీ
సరసు ల్కింకరులై నినుంగొలువ, నిచ్ఛాలీల శ్రీ కృష్ణభూ
వరునాఖ్యం దనరారు సుందర సుధావాసంబులో మెట్లకి
న్నరమ్రోయింపుము, రేబవల్ దెలుగురాజ్ఞీ! రాజహంస ధ్వనిన్

కం. ముసిలిములు సోదరులవలె
మసలెదరు, నవాబుధర్మ మార్గాటుం డాం
ధ్రసరస్వతి! భాసిలుమీ
రసికులసంగతిని హైదరాబాదుపురిన్

సీ. కృష్ణరాయాలయ శృంగారవనసీమ దెలుగుకోయిలపిట్ట పలుకుచోట
నైజాముసుల్తాను నగరివైభవలక్ష్మి గరువంపు జూపులు బరపుచోట
ముసలిమానులు తెల్గుపుత్రులతో బొంది పొసగి కాలము వెళ్లబుచ్చుచోట
గోల్గొండ నేలిన మల్కిభరాముని ముసలికీరితిగాడ్పు విసరుచోట

తే.గీ. సాహితీబాంధవుల సమక్షంబునందు
చెలిమికాంద్రురవలపు టాశీస్సులంది
నూరు పదునార్లు వెలగలచీరె గట్టి
నా కవిత్వంబు గౌరవస్నాన మాడె

కం. ఇట మీకు నాకు గూరిమి
ఘటించి; సత్కారమునకుగాబిలిచిన వెం
కటరమణయాభిధుల కు
త్కటభక్తి నమస్కరింప గరము లెగసెడిన్

(జమీన్ రైతు, 20 ఆగస్టు 1937)

# ఆశంస

ఉ. నన్నయపుట్టినింట కవినాథుల నెన్నిక కెక్కి, కబ్బపుం
గన్నెలఁ గన్న వర్తకశిఖామణి! నాళము కృష్ణరాయ! నీ
మన్నన తెల్గుదేశకవిమండలికిన్ గరువంపుఁజూపు, వి
ద్వన్నుత! నీకు, నీ సుకవితాసుతకుం బహుళాయురున్నతుల్!

మ. కులుకున్ గీతము నీ కరాబ్జమున నిగ్గుల్ దేరి, క్రొంగొత్త శో
భలతో వాఙ్మయరంగ మెక్కినది; నీ'పాపాయి' కావ్యంబు ము
ద్దులముత్యా లెగఁజిమ్మె నిం దతిశయోక్తుల్ లేవు, నీ వాక్సుధన్
జలకంబాడిన తెల్గుకాశ్యపి ఋణస్థం బయ్యె నీకుం గవీ!

చం. అరువదియేండ్లు నిండె, మరియాదలు నందె నటంచు భాషకుం
బరిచరియల్ పొనర్చు పనిమానెదవో! వలగాదు నూరువ
త్సవరములవాఁడవై తిరుగఁ దాల్తువు గాక యశస్కిరీటమున్
శిరమునఁ గృష్ణరాయకవిశేఖర! కొమ్ము పసిండిలేఖినిన్

(శ్రీ కృష్ణదేవరాయాభ్యుదయ సంచిక –
నాళము కృష్ణారావు షష్టిపూర్తి ప్రత్యేక సంచిక, జనవరి 1941)

# జగజ్జయము

మ. సుదినంబియ్యది విశ్వమోహనశుభజ్యోత్స్నాతరంగాఢ్యమో
అదిగో! పూర్ణజయాపగాచయము, బ్రహ్మాండంబునంబొరే
కదన జ్వాల శమించిపోయినది రక్తస్వప్నముల్ మాసె, నీ
రదగంభీరజయధ్వనుల్, దిశలనార్భాటించెనొక్కుమ్మడిన్

మ. కుతలక్షోభకరాక్షసీ ప్రళయ శక్తుల్ బుద్బుదంబుల్ బలెన్
హతమై శాశ్వతధర్మశక్తి కడ పాదాక్రాంతముంజెందె, వి
స్తృత సత్యంబు గ్రహించుకొండనుచు మ్రోసెన్ దుందుభి×
మతిమంతుండగు జార్జిభూధవుని సంభావించి దీవించుచున్

మ. పొడిచెన్ జల్లని శాంతి సూర్యుడు జగంబున్ జుట్టుకొన్నట్టి దుం
దుడుకుంజీకటి దీర్ఘరాత్రిముగిసెన్ భూదేవి సానందయై
కొడుకుంగుఱ్ఱల వీరసైనికులచెక్కుల్ ముట్టిముద్దాడెడిన్
నడిమింటన్ వెలిగెన్ జగజ్జయము చంద్రస్వచ్ఛరోచిస్సులన్

ఉ. జారిజిరాజశేఖరుని స్వర్ణకిరీటమునాశ్రయించి చె
న్నారె జగజ్జయంబను మహత్తరరత్నము, శత్రురాజసం
హారకులైన వీరమణులంచిత కీర్తి రథాలమీద సం
చారము చేయసాగిరి దిశల్ వెలుగొందె ప్రశాంతి కాంతులన్

ఉ. ఆటమ బాంబు గోళపు భయంకరవహ్ని జపానులంకను
త్పాటనచేసి మానవ కబంధపు రాసులు జిమ్మకుండగా
మేటి దయాంతరంగులగు మిత్రనృపాలురుసంధిబీజముల్
నాటి ఫలింపచేసి భువనస్తుతులందిరి ధర్మమూర్తులై

శా. ఐదారేడుల నుండి యుద్ధహతి బట్టల్లాడు చున్నట్టి నా
నాదేశంబుల యంతరంగములలోనన్ శాంతిసౌరభ్య పుం
బూదేనెన్ జిలికించినా రమృతరూపుల్ సీమ భూపాలకుల్
లేదేలాటి రణంబు శత్రునరపు×లే రక్షరక్షోవిభుల్

ఆ.వె. గంతమోయననుచు గంతులు వైచిన
వెడగు జాపనీయవృషభ మిపుడు
గంతమోసి, త్రాడుగట్టించుకొన్నది
పలుకనగునె? మిత్రపతులచేవ

మ. ట్రుమనుం జర్చిలు స్టాలినున్ గలసి యెట్లో పోరు మాన్పించి గం
డము దాటించిరి పంచఖండములకున్ వర్షించెనానంద వ
ర్షము గోర్వెచ్చని సౌఖ్యసంపదలనిచ్చుల్ జక్రమింపార సా
యముగా రండు భవిష్యదుజ్వల సమస్యల్ గల్గు పూరింపగన్

తే.గీ. ఏమహావీరరక్త వాహినులయందు
గెలుపుతామర పుష్పంబు మొలిచెనొక్కో
అమ్మహాత్ముల కత్తుల కంజలించి
జరుపుకొనరయ్య విజయవాసర మహంబు

(రక్తగానము? 1943 అముద్రిత రాతప్రతి)

# విద్య

ఓయన్నలారా సరగున చదువుకొందాం పదరా
చదివినవాడు నరుడు
చదువని వాడు పశువు
చదువులో స్వర్గమున్నదిరన్నా ॥ఓ॥

చదువే నీదేహ బలము
చదువే నీ చక్కదనము
చదువే నీజాతి కాయువురన్నా ॥ఓ॥

చదివింది సర్వజగము
పొదలింది పొరుగు నేల
చదువంది మనము, మనయూరన్నా ॥ఓ॥

చేవ్రాలు చేతగాని
నీ వ్రాలు నిష్ఫలంబు
చదువరికి చావులేదురన్నా ॥ఓ॥

రతనాలరామచిలుక
కులుకుల గోరువంక
సరసన చదువుకొన్నదిరన్నా ॥ఓ॥

అంకమ్మ పూజకన్న
సరసోతి పూజమేలు
గుడిమాని బడులు గట్టుదమన్నా ॥ఓ॥

(రక్తగానము? 1943, రాతప్రతి)

# సైనికులు

పోరాటమాగె గదా జగమునకారాట ×××గద
గెలుపుజెండా వెలిగెనదిగో ॥పోరాట॥

వీరులారా వినుతి మీకు
శూరులారా శుభముమీకు
దొరతనంబున బిరుదములవిగో
అదృష్టవంతులుగా కనగా ॥పో॥

దేశభక్తి రాజభక్తి
బాహుశక్తి ధర్మరక్తి
నలుగెలంకుల కలకలలాడె
కష్టాలుగడచినవి కరకుల ॥పో॥

వీరకులము వీరమతము
వీరబలము వీర ×××
భారతమ్మకు బంగరునగలు
దేశాలుమెచ్చినవి నానా ॥పో॥

(రక్తగానము? 1943, రాతప్రతి)

# ఆశీస్సులు

శా. ఆనందించితి నీ వివాహ మహితోద్యానంబు పుష్పింపగా
నానందించితి కోరుకొన్నసతి నీకర్ధాంగియైనందుకే
నానందించితి నీప్రవర్తన కనన్యంబైన నీ భక్తికిం
కానందింపనిదేది నాకనుగుశిష్యా! నీకుదీర్ఘాయువౌ

శా. ఉగ్గంబాలిడు తల్లిపైగలుగు భక్త్యుత్సాహముల్ నాయెడన్
మ్రొగ్గంగొంచెమటో! యిటోతరుగుగా మూడేండ్లు సేవించినా
వెగ్గింతేనియులేని నీసహన సాహిత్యంబు మెచ్చుందగున్
జగ్గన్నా! యిఁక పెండ్లి జేసికొని సంసారంబు సాగింపుమా!

ఉ. చిక్కని పాయకట్టు వనసీమలఁ బుట్టిన ముద్దరాలు ని
న్నెక్కువ చూపుఁజూచికొని తృప్తిం వహించెదునన్నపూర్ణ, నీ
యక్కు నలంకరించె, నికసంచితమైన గృహస్థమార్గమున్
ద్రొక్కి తరింపవోయి! విబుధుల్ దలయూచఁ గుమార సంపదన్

ఉ. పెద్దల పాదపూజల లభించిన జ్ఞానము జారనీక, నీ
విద్దియ వృద్ధిఁ జేసుకొని పేరువహింపుము, క్రూరమైన పో
తెద్దులబండి సంసరణమేగతి లక్ష్యము చేరుకొందువో!
ముద్దియతోడ,ఁబెండ్లియన పుట్టెడుబువ్వపుఁ బంతికాదయా!

కం. జగ్గన్న వంశదీపం
బగ్గలముగ వెలుఁగుచున్నదని నలువురిని
న్నగ్గింప, గురులచల్లని
నిగ్గుంగను చూపులందు నెగడుముశిష్యా!

(పారెళ్ళ జగ్గారావు వివాహ సందర్భంలో,
20 ఏప్రిల్ 1946)

# రహస్యము

సీ. బహుదేశ మత మహాపరిషత్తు తలయూచ పలికివచ్చినది మా భరతసుతుడు
కండెబొట్టున నైదు ఖండాలనోడించి కొలువులందినది మా కోమటన్న
సీమలో నాచార్య సింహపీఠికమీద నిలచివచ్చినది మా తెలుగువాడు
విశ్వసన్మానంబు వెలయు నోబెలుకీర్తి రంగమెక్కినది మా వంగసుకవి

తే.గీ. చెట్టుచేమల సుఖ దుఃఖ జీవితములు
నిజముదేల్చినవాడు మా నేలవాడు
నన్ను దొలగించి లెక్కించినారుగాని
మొదట నెల్లర మన్నదమ్ములము మేము (అభ్యుదయ, అక్టోబరు 1946)

# కృష్ణార్జునసంవాదము

(శ్రీకృష్ణు డర్జునునితో, విమానారూఢుడై భూమికిదిగి, డిల్లీ రాజవీధులలో విహారం చేస్తూ ఉంటాడు. అర్జునుడు ఆధునిక నాగరికత, ప్రజాజీవితం ఆకళించుకొని ఆశ్చర్యంతో)

అర్జు: ఏదేశమిదికృష్ణ? ఎందుంటిమిప్పుడు?
హస్తినాపురమేది? ఆప్రజలేరి?
ధార్త రాష్ట్రుల రత్న ధామంబులేవి?
ధర్మనందనుని ఇంద్రప్రస్థమేది?

కృష్ణ: హస్తినాపురముగా దందాలఢిల్లి
నవ్యభారతమోయి నాబావమరది
జవ్హారుండనుమహా సచివశేఖరుడు
పాలించుచున్నాడు భరతఖండమును

కలియుగంబిది నాలుగవమహాయుగము
గాంధీమహాత్ముండు కఠినరాక్షసుల
సంహార మొనరించి శాంతివర్షంబు
కురియించిపోయిన గురునగరంబు

సర్వమానవులలో సమరత్వంబు
మొలకలెత్తించు మంజులరత్నగర్భ
ఖండఖండాల సంగ్రామాగ్ని శిఖలు
చల్లార్చుమేలి పచ్చలపంటచేను.

అర్జు: గాండీవమేల ఈ కవచంబదేల?
తెల్లగుఱ్ఱాలేల తేరదేమిటికి?
నన్ను తెచ్చిన కారణంబేమి? బావ
వివరింపుమెందుకో బిడి తప్పినాను

కృష్ణ: వద్దుశంకింపగా ముద్దుల మఱది!
శంఖమొత్తుము ప్రపంచము మారుమ్రోయ
విల్లందుకొమ్ము కంపిల్లభూతలము
గాంఢీవధారివై కట్టుము నడుము
పోరులేదని చింత పోకుమోపార్థ

ద్వాపరంబున భారతక్ష్మాతలమున
ఘనకురుక్షేత్రసంగ్రామంబునందు
కౌరవసైన్య రక్తపుటేళ్ళలోన
విహరించినవి నీదు శ్వేతవాహలు

నేటిపోరాటాన నీశస్త్రచయము
పటుదుర్గుణంబులు భంజింపగలవు
గాయంబుకాకుండ కారింపగలవు
హృదయాలపైరాజ్య మేలుకోగలవు

నిలుపగావద్దోయి నీస్యందంబున
పాతుమచ్చుటమూడు వన్నెలధ్వజము
సమర వీరత్వంబు చాలించి మరల
శాంతి వీరత్వంబు సాధించవోయి

అర్జు: అటుభీష్మబోలు మహారథుల్ గలరు
ద్రోణునంతటి జగద్గురువులున్నారు
పోరాడిగెల్తునా పుండరీకాక్ష
అదురుచున్నవి గుండియలుపద్మనాభ!

దుర్యోధనునికన్న దుష్టులున్నారు
దుశ్శాసనునికన్న దోషులున్నారు
నరునిముట్టని మహా దురితులున్నారు
నవనాగరికపు పిండారులున్నారు

మాయమార్కెట్ల బొజ్జాయులున్నారు
పయిపెత్తనపుగాండ్రు పలువురున్నారు
కనిపెట్టిశిక్షింపగా లేనుకృష్ణ
చేతగాదిది చిత్ర చిత్రయుద్ధంబు

అదిగాక నాదు దివ్యాస్త్రశస్త్రావళి
వేషధారులనంటి దూషితమగును
కపటుల మేనంటి కలుషితంబగును
సలుపలేనీ తమాషా శాంతిరణము

కృష్ణ: గురుభీష్మలనుబోలు గుణవంతులున్న
వెఱపులేదోయి చెప్పెదనింకవినుము
కలిశక్తిచేవారు కలుషవర్తనుల
కొలుచుచున్నారు నిచ్చలువారిమనసు
విశ్వాల శాంతి కన్వేషించునోయి

కలికాలదౌష్ట్యంబు ఖండించినీవు
విజయభూషణుడవై వెలుగొందగలవు
అక్షయతూణీర అస్త్రశస్త్రాళి

మృదువైనడెందాన బదిపికోవోయి
దయగలచూపులో దాచుకోవోయి
సద్ధర్మమార్గాన సద్దుకోవోయి

అదిగో! మహాత్ము దల్లదుగో తిలక్కు
స్వాతంత్ర్యమునుగన్న భారతావనికి
రక్షగా గగన మార్గంబుననుండి
చిలుకుచున్నార లాశీరక్షతలను

ఐదేండ్లప్లాను నే డవతరించినది
ప్రాజెక్టులెన్నియో ప్రభవమందినవి
గ్రామసంక్షేమ సంఘాలులేచినవి
అస్పృశ్యతాజాడ్య మంతరించినది

భారతంబొకవేల్పు పాడియావగుచు
పాడిపంటలుపిండి భాసిల్లగలదు
ఘనపంచశీల వికాసదీధితులు
వ్యాపించుచున్నవి పంచఖండాల

విల్లందుకొమ్ము నే వెంటనున్నాను
మేటిధర్మమునకు ఓటమిలేదు
పూరింపుమర్జునా భూరిశంఖంబు
సాగనిమ్మర్జునా సరగ నీరథము (భారత్ సేవక్, జనవరి 1960)

# శ్రద్ధాంజలి

తే.గీ. పలుకు లీవంక చేత లావంక నిలువ
వల్లెవేయుదు రురు ధర్మపన్నములను
చెప్పునది చేయువారి హర్షించ దెపుడు
నభము శుభ మెరుంగని యమాయకపు జగము

మ. తనుసాధించు సుఖంబు నల్వురకు జెందన్ గోరు సౌజన్యవ
ర్తను చిత్తంబు ప్రశాంతవారినిధిచందానన్ మహానందగా
హనసౌఖ్యంబును చూరలాడు భువనం బాధర్మవీరాగ్రణిన్
గని గర్వించు చరిత్రయుం దల నలంకారంబుగా దాల్చెడిన్

ఉ. ఆటమబాంబుగోళక భయంకరఘోషల దిగ్దిగంతముల్
బీటలువారుచుండ, పృధివీవలయంబున క్షామరాక్షసుల్
నాటకమాడుచుండ కబళంబున కేడుచు బక్కవాని క
న్నీటిఝురిన్ మునుంగవె వినిశ్చలశాంతిసుఖప్రచారముల్

మ. మును మున్యాశ్రమసీమలం బొలిచె సంపూర్ణ క్షమాశాంతి వా
హిను లాత్రేతలు, ద్వాపరాలు కథలయ్యెన్ స్ఫుట్నికుల్ సృష్టిస
ల్పిన శాస్త్రజ్ఞులు గల్గు నియ్యుగమునన్ విశ్వప్రపంచంబునం
దనుమానంబు భయంబు జుట్టుకొనె నౌరా! స్వార్థపుంబంటయై

కం. తనసంతోషమె స్వర్గం
బనుకొనువా డధము డఖిలధర్మజ్ఞులు భూ
జనసంతోషమ స్వర్గం
బని తలతురు, విస్మరింతు××× ×××

ఉ. గౌతమబుద్ధదేవుడును గాంధిమహాత్ముడు చన్న త్రోవలో
జాతి తరించు శాంతిశశి చల్లనివెన్నెల గాయుచుండగా
భూతల మమ్మహామహుల మూర్తులు శిల్పుల కప్పగించి త
న్నీతికి దూరమై తిరుగనేర్చె స్వలాభపథాభిగమ్యమై

(శాంతి ప్రత్యేక సంచిక, 1961)

## సింహనాదము

శా. కొమ్ముల్ లేనటువంటి దున్నలగు మీకున్ శాంతి మార్గంబు లే
శమ్మున్ నచ్చదు రక్తదాహమె యభీష్టంబైన రారమ్ము గ
ర్భమున్ జీలిచి ఆంత్రముల్ బెరికి నీరక్తంబు నల్దిక్కులన్
జిమ్మన్ జాలు నృసింహముల్ భరతరాజ్ఞీనందనుల్ దుర్మతీ.

శా. చీనామత్తమదేభకుంభములు విచ్ఛేదించి క్రొన్నెత్తుటన్
స్నానంబాడి త్రిలోకముల్గదల గర్జల్ సల్పిమస్తిష్కముల్
మేనందాలిచి పోరుచున్నవి హిమానీపర్వతంబూగి బి
ట్టానందీయగ భారతీయభట సింహంబుల్ మహోగ్రంబుగన్

(1962? అముద్రిత రాతప్రతి)

# పేరు తెలియదు

మ. పసుపుం బచ్చని సేసబ్రాల్విభునిపై వర్షించు పద్మావతీ
కుసుమాంగీమణి కోర్కెలై పసలు జిల్కుల్ పండినిండారు ని
ప్పసి జంటన్ బ్రభవింత్రుగాక కొమరుల్ భద్రాకృతుల్ ధర్మమా
నసు లాంధ్రీ పరిపాలనక్షములునూన ప్రేమ వారాన్నిధుల్

మ. ఒకయిల్లేర్పడి బిడ్డలుంగలుగ మీయుల్లంబులో నీతి బా
ధకమౌ స్వార్థము కాలుమోపెడు ప్రమాదంబుండు యీనాటి మీ
అకలంకంబగు చిత్తవృత్తి చెడనీ కాదర్శసంసారులై
సకలోర్వీశుభకాములై మెలగుడైశ్వర్యంబు మీకబ్బెడిన్

ఉ. అద్దములట్లు నిర్మలములై ప్రణయద్యుతులీనుచున్న మీ
యిద్దరి భావముల్ కలసి యేకమొనర్చిన స్నేహబంధమే
పొద్దుసడల్పకుండ నడపుండు సుఖంబుగ జీవయాత్రలో
ముద్దుల లేత ప్రాయమున బొల్చు వధూవరులార ధీరులై

మ. వలపుల్ జిమ్ము శుభస్వరూపములతో పద్మావతీదేవి కా
గల వాడైన యుమామహేశ్వరుడు నిక్కంబైన సంసారులై
నలువుర్మెచ్చ సహస్రవత్సరము లానందంబుగా జీవితం
బులు సాగింతురుగాక ధర్మరతులింపుల్ సొంపు చేకూర్చుచున్

ఉ. కావలె పచ్చికుంకుమ వికాసము జిందెడు సేసబ్రాలు ప
ద్మావతి దోసిటన్ విభుతి మౌళిన లంకృతి చేయ

(రచనాకాలం తెలియదు, అముద్రిత రాతప్రతి)

# పుష్పాంజలి

మ. తొలుతన్ విశ్వకవీంద్రు నాశ్రమమునందున్ సృష్టిసౌందర్య పే
శలసారస్వత మాకళించుకొని, విద్యావార్ధియై, పెక్కుసం
స్థల యధ్యక్ష సువర్ణ పీఠములకౌజ్వల్యంబు గల్పించి శో
భిలు మంత్రీంద్రు డుదారమానసుడుశ్రీ బెజ్వాడ గోపాల రా
ట్తిలకం బాశిషమిచ్చి మెచ్చె ననురక్తిన్ బాలికా పాఠశా
లలలో లభ్యమయ్యె గుణశీలా పాఠశాలామణీ

సీ. ముఖ్యమంత్రిత్వంబు బూని ఆంధ్రులకు నారాధ్యుడై వెల్గిన ప్రథిత యశుడు
కొత్త ఢిల్లీ నతుల్ గొని తెల్గు కౌటిల్యుడని కీర్తిగొన్న సత్యస్థిరుండు
వంగ వాఙ్మయము నభ్యస్తంబు గావించి కవితలల్లిన జగా గ్రంథకర్త

తే.గీ. కళకు జాతీయ సమర రంగంబు నందు
నిలిచి పోరిన శాంతిసైనిక విధుండు
భావజ స్వర్ణమూర్తి గోపాల మంత్రి
ప్రజ్వలించుత మయుత సంవత్సరములు

మ. నలసానమ్మగృహాన గర్తపురి జన్మంబెత్తి నెల్లూరిలో
కలమున్ బట్టి మహాంధ్రభారతము వక్కాణించు తిక్కన్నచే
గలిగెన్ మీకును మాకు బాంధవము నిక్కంబద్ది చుట్టాలపై
నిలుపంజెల్లు కటాక్ష లేశమును పాండిత్య ప్రభామండనా

మ. హనుమాంబాభిధనొప్పు యిత్తరుణ విద్యాశాల సర్వాంగపు
ష్టిని సాధించుట కాంజనేయుని కృపాశ్రీ కారణంబై సదా
తన బ్రాహ్మణ్యమునం దపూర్వమగు చైతన్యంబు సృష్టించి నా
టిన దాదర్శ నిగూఢ దానగుణ వాటిన్ లుబ్ధ చక్రంబునన్

శా. నాటె న్నిన్నొక మొక్కగా తొలుత హన్మాయమ్మ యీనాటి నీ
నీటుంగోటునకై యనంత ధనమున్ భిక్షించి రాత్రిం దివా
రాటంబోర్చి కృతార్థుడై మురియు ధర్మజ్ఞుండు యేకాను ము
ప్పూటల్ మ్రొక్కిన తీరదాయన ఋణంబున్ పాఠశాలామణీ!

కం. కేవల ఫలరసభుక్తిన్
జీవించుచు దీర్ఘరుజ కృశించుచు లక్షల్
ప్రోవొనరించు జగద్ధిత
భావుండై వీరాంజనేయ పంతులు దక్కన్

మ. నుదుటం గుంకుమముం ధరించుకొని హిందూత్వంబు చాటించు చ
చ్చుదిగాదీ భరతోర్వి శాత్రవు శిరస్సుల్ జీల్చి రక్తంబునె
న్నుదుటన్ దాల్చెడు భద్రకాళులను విశ్వఖ్యాతి నార్జించు మే
ల్ముదితల్గావలె బాలికామణులు ముమ్మందాంధ్రి మోదించెడిన్

మ. కలమేకాదిక ఖడ్గమున్ సతి కలంకారంబు లీనాడు దు
ష్టులు చీనా పెను రక్కసుల్ మన ఘన క్షోణిన్ స్వతంత్రాంగ దో
జ్వల భక్షించుట కాక్రమించిరలుకన్ ఝాన్సీ మహారాణులై
అలుగున్ దాలిచి యభ్యసింపుడు రణవ్యాపార పారీణులై

శా. ఈ నీ మేటి సభావిభుండయిన మంత్రీంద్రుండు శ్రీకాసు బ్ర
హ్మానందాఖ్యుడు రెడ్డిరాజు దయసేయన్ శారదాదేవి వీ
ణా నిక్వాణమొనర్చి పౌరతతి సన్మానించి వర్షించె హ
ర్షానూనాశ్రులు ధన్యవైతివి గదమ్మా పాఠశాలాసతీ!

శా. తోడంబుట్టని యన్నదమ్ముడయి ఆప్తుండౌచు నేకాకు క్రీ
నీడంబోలి చరించు రెడ్డి కుల మాణిక్యంబు ప్లీడర్ల మ
న్నీడుం బ్లీడరు మాలకొండ విభుడున్ నీ వృద్ధికై సల్పియు
న్నాడెన్నో యుపకారముల్ మరువకెన్నండాదయావారిధిన్

మ. పసరుంబిందెలవంటి బాలికలు సద్భావంబులన్ సద్దయా
రసముల్ జిప్పిలి భావిభారత హితార్థంబైన సద్విద్యన
భ్యసనంబుం బొనరించి శీలవతులై ప్రాచీన యోషిద్మణీ
విసరఖ్యాతి గణింత్రుగాక సకలోర్వీ గర్భరత్నంబులై

శా. నీరాహారము మాని దుర్ఘట తపోనిష్ఠా గరిష్టాప్తి నే
కారాజర్షి రచించినాడిట సుధీర్ఘ బ్రహ్మయజ్ఞంబుగా
యీ రాజద్భవనంబు నిల్చెనిట బ్రాహ్మిన్ బాలికా కోటి వి
ద్యా రత్నాంగదముల్ ధరించెడి మదాత్మజ్ఞాన సంపన్నమై

? రాజత్కాసు వంశాబ్ధి రాకాసుధాకరా స్వాగతం సుస్వాగతం
శ్రీమదాంధ్రప్రదేశ సామ్రాజ్య ఆర్థికామాత్య లేఖర్షభా హసాదు
మధుర మంజులస్వాంతా! బ్రహ్మానంద రాడాఖండలా జయీభవ! విజయీభవ!

(1962? అముద్రిత రాతప్రతి)

# శ్రద్ధాంజలి

ఆ.వె. నిజముపల్కు, త్రిపురనేని తనూజుడై
కథక చక్రవర్తిగా రహించి
తెలుగు వాణి బిట్టు విలపింప కథయయ్యె
ధీ పయోంబురాశి, గోపిచందు

మ. కథలెల్లన్ సుధలై మనోహరములై గంగా ప్రవాహంబులై
ప్రథిత ఖ్యాతి గడింప వాఙ్మయ సముద్రం బుబ్బి మిన్నంట, దు
ర్విధి, చూపోపక కొంచుపోయె, మహితాంధ్ర పుత్రముక్తామణిన్
మధురస్వాంతుని, గోపిచందును, మరంద స్వాదు వాచావిదున్

(త్రిపురనేని గోపీచంద్ స్మారక సంచిక, 1963)

# కొత్తయేడు

ఉ. ఎండిన తోటలెల్ల ననలెత్తి త్వదాగమనంబు చేత బ్ర
హ్మాండము పుష్ప హాస మధు రాస్యము దాల్చె యుగాదిరాజ్ఞి! మా
గుండెలలోన దాగిన యగోచర కల్మషముల్ హరించి మా
యెండిన జీవితాలు ఫలియించ శుభోదయముల్ ఘటింపవే!

(గుంటూరు పత్రిక, మార్చి 1963)

# ఆశీస్సు

కం. ఎరిచెర్లకులమునకు, బం
గరు భూషణమనగ, నాల్గు కాలంబులు మేల్
సిరులందేలి, కళాసుం
దరులంబెండ్లాడి బ్రతికెదవురా కుఱ్ఱా!

(యెరిచర్ల శ్రీకాంత్ అక్షరాభ్యాసము,
27 సెప్టెంబరు, 1964)

# పల్నాటి యుద్ధము

బ్రహ్మనాయుడు

ఉ. హింసలు దుండగంబులు నహింసనుగెల్చి ప్రజాసుఖంబు వి
ధ్వంస మొనర్చి సర్వసమతా వ్యతిరేకమత ప్రభావముల్
మాంసలమై అసూయల దుమారమురేగుచు నున్న దుష్ట స
ర్వంసహనేలజాలయిక వద్దివె నాయధికార చిహ్నముల్

చం. కలకలలాడు నీ తెలుగు గడ్డలపై పటురక్తనాట్యముల్
సలుపు దురాగతంబులకు స్వాగతమిచ్చుచు పల్లెనాటిలో
వలవలనేడ్చుదీనులనభాగ్యుల రక్తముద్రావుచున్న దు
ష్టుల నదిలింపలేని...

ఉ. ఎక్కడ జూచినంబ్రజల యేడుపులుం బెడబొబ్బలుల్లమున్
ముక్కలుసేయ రాచరికముం వెలిగించెడు వారు దుష్టులుం
కంచయెచేను మేసినటుగా పరిపాలకులే ప్రజాళివే
ధించెడు బందెపోటయి ప్రతిక్షణ హత్యలు చేయుచున్న మీ
పంచ వసింప మీ రొసగు స్వార్థపరాయణమైన కూడు భ
క్షించి మనస్సు చంపుకొని చేయగజాలను మంత్రి వృత్తి మ
న్నించి యొసంగుడీ సెలవు నేనిక పోయెద లాతి చోటికిన్

ఉ. మంతిరినై యధర్మముల మాపని యీ యధికార చిహ్నముల్
గంతలు బొంతలుం ప్రజల కన్నుల కారము గొట్టువేషముల్
సంతసమార మీరిక ప్రశాంతముగా ధరనేలకొండు భూ
కాంతమణీక్షమింపుడు ముఖాముఖి సత్యము పల్కినందుకున్

మ. పలనాడంతయు శాంతిపుష్పవనమై భాసిల్లె నాకత్తి నీ
డలలో సర్వజనుల్ సుఖించిన సురాష్ట్రంబన్న సత్కీర్తితో
వెలిగెన్ చక్కగ యిప్పుడీ యసమతా విద్వేష సర్పోగ్రజి
హ్వలతో నిప్పులు గ్రక్కుచున్నవి మనస్సారాటముంజెందెడిన్.
వలదీ మంత్రిపదంబు నాకునిక శుంభద్రాజముద్రాంకముల్

కన్నమదాసు :

ఉ. పంచమజాతి సోదరులపైనెనరూని కుమారునేని వ
ర్జించిన దివ్యమూర్తివి ప్రసిద్ధుడ మా పలనాటి సీమ జ
న్మించిన విష్ణుమూర్తివి సుమీ తమరాదరబుద్ధి తోడన
ర్పించిన సైన్యనాథపదవిం నిజభక్తి పరిగ్రహించెదన్

సీ.

అల– అలుకమై బ్రహ్మనాయుడు ఖడ్గమున్ దూయ సప్తసముద్రముల్ జర్ఝరించు
నాగ– చండాలురంగూడి చాపకూడు భుజించు క్షాత్ర హీనునకు మీసంబు గలదె
అల– అలుకరేగిన సింహమగు బాలచంద్రుండు అరుల పుఱ్ఱెల బంతు లాడగలడు
నాగ– వెలది సబ్బాసాని వలపుటుచ్చుల బడ్డ విటకాడహో దండి వీరుడగునె
అల– శాత్రవరక్త నిర్ఝరుల నీతలుగొట్టు కనమనీడమరభీకరుడు సుమ్మి
నాగ– సమరభీముండె కన్నమనీడు చాల్చాలు సొరకాయ లీరీతి నరుకవలదు
అల– ముక్కంటి కంటి నిప్పున దూక దమకని కొమ్మన్నజెనక బెబ్బులులు వెరచు
నాగ– కొమ్మన్న గుడి మీది తిమ్మన్న ××వాని చెప్పంగనీకెట్లు సిగ్గులేదు

సీ. మగవాడో ఆడుదొ తేల్చగరాని విచిత్రమైన సతి నొక్కరితం
దెగటార్చె బ్రహ్మనాయుడు తగునాయని నగరె శౌర్యధనులగు వీరుల్
వీరులపై కురికెడు నాబారీటెల కప్రతిష్ఠ వచ్చును నిన్నుం
బోర వధించిన పెనగంగోరక వైదొలగిపొమ్ము కొజ్జాదానా

శా. కన్నన్ ముట్టి వధించినారు మలిదేవాదుల్ మహారణ్యమం
దున్నారింత పరాభవంబునకు మీ యుల్లంబులెట్లోర్చునో
.... .... .... .... .... .... .... .... .... ....

మ. యనగారాడెదు శాంతి గాదిపుడవశ్యం బాజి రంగంబులో
చ్చని.......... బాలచంద్రుని సమస్తక్షోణి కొండాడగన్
.... .... .... .... .... .... .... .... .... ....

ఉ. దూతవుగాన నీతలను ద్రుంచక యుండితి మంతెకాని యా
కూతలు కూసి రమ్మనిన కూళలలో నొకడైన భూమిలో
పాతక నూరకుందుమె యపాత్రుడ కారెమపూడి యుద్ధమం
దేతల నిత్తుమో తెలియదెందుల కిట్టి వృథా ప్రగల్భముల్

కం. నరసింహుశిరము కరకర
నరికెద నలమాయలాడి నాగమప్రేవుల్
విరిదండగ దాల్చెద సం
గరమున మీ యాత్మశాంతి గల్పింతు చెలీ

మ. భళిరే మా యెంగిలిందినెదు మాలల...
కులగోత్రాలకు స్వస్తి జెప్పి కలహోగ్నుల్ ×× శాంతి వీ
రులు యుద్ధంబులు చేతురా? కడు విచిత్రంబయ్యె రారమ్మ మీ
బలగంబుల్ హతమార్చి కారమపురిం బాతింతు పాషండుడా?

భట్టు

ఉ. వచ్చితి దూతగా నిటకు, బ్రహ్మన బంప వినుండు, వారు వా
క్రుచ్చిన రాయబారమును, కోపము సేయక, అల్లనాడు మా
కిచ్చిన భాగమున్ మరలనిచ్చి, నృశింహుశిరంబు కాన్కగా
నిచ్చిన సంధి ఖాయమనిరీయక రమ్మనిరాజిలోనికిన్

చితివద్ద బంధుశ్రేణితో పేరిదేవి:

సీ. పాదాంబుజమ్ముల పారాణి సౌరు మాయకమున్నె నామనోహరుని జంపి
ముండరాల్నుదుటి పై బులిమి సంతోషించు కటికి రక్కసి గుండెకాయ జీల్చి
మా యాత్మలకు శాంతి జేయంగలుగు వీరసింహుడొకడు
పుట్టడా? పల్నాటి పుణ్యభూముల మీద పుట్టడా? పుట్టడా? పుట్టియున్న

తే.గీ. అగ్నిపర్వతములు పెటిల్లనుచు బగిలి
కాల్చు నా యంతరంగ విషానలంబు
నార్పి దీవింపరండు రండన్నలార
పోయెదను భర్తతో మోక్షభూమి దరియ

బాల

శా. ఉన్నాడిచ్చట బాలచంద్రుడను వీరోత్తంసమోసోదరీ
పన్నాల్గొ భువనంబులేకమయి నాపై యెత్తి లంఘించినన్
సున్నంబుంబొనరించి యప్పరమ నీచున్ జీల్చి యావేడి ర
క్తాన్నంబుల్ బలిపుష్పకోటులకు నాహారంబుగావింతు నా
చెన్నుండిందుకు సాక్షి నమ్ముమిదె ఆశీర్వాద మబ్జాననా!

కం. ఉన్నాడు వీరబాలుం
డున్నాడట బాలచంద్రుడుర్వీతల పగరన్
సున్నంబు జేయగల బ్ర
హ్మన్న కుమారుండు సంశయంబేలచెలీ!

పేరిందేవి

సీ. బుగ్గియైనది నాదు ముత్తైదువ తనంబు నల్లపూసలసౌరు నాగమయ్యె
గంగలోగలిసె నా గాజుమట్టెలశోభ ఆశలన్నియు నడుగంటిపోయె
నా కొంప గూల్చిన నరసింహుని శిరంబు ఖండించు వీరు డొక్కరుడు వీర
పలనాటి సీమ గర్భమున బుట్టడా జాలి గుండెల గల్గు శౌర్యధనుడు

తే.గీ. అమ్మహావీరు శపథంబు నాలకించి
స్వర్గమునకేగు దాన నాసామి తోడ
అగ్నిగుండాన దూకెద నన్నలార
మాన ధనులార పలనాటి మాన్యులార

బ్రహ్మనాయుడు

సీ. గర్భశత్రువుకాని కరుణింపుడన్నచో నెనరూని వాని మన్నింపవలయు
పసిపాపవలె భయంపడి యుద్ధరంగాన వ్రేళ్లు చీకినవాని విడువవలయు
పుట్టలెక్కిన భీరువులమీద కసిబూని పెనగరాదు, అలుగులు విసరరాదు
స్త్రీబాల వృద్ధుల చెరబట్టగారాదు చిరుగాయమేనియు చేయరాదు

తే.గీ. బ్రహ్మనాయని కదనధర్మములు తప్పి
సంచరించినవాని మస్తమును దరిగి
కోటసత్తికి కొప్పులో గ్రుచ్చగలను
మాధవార్చన రతులార, యోధులార!

బాలచంద్రుడు–

ఉ. ఎక్కడి శాంతి సంగరమిదెక్కడి చచ్చు సదూపదేశమో
అక్కజమయ్యె జూదమున నమ్మలిదేవుల మోసగించుటల్
రక్కసులై విషాగ్నినలరాజును జంపుట విస్మరింతురే
×××× వధింపకిటు లోర్మి వహించుట కేమిహేతువో

నాగమ్మ శపథం

మ. మన వర్ణాశ్రమధర్మముల్ చెఱచి యున్మాదంబునన్ చాపకూ
డును గల్పించిన బ్రహ్మనాయని కులంబున్ కట్టుపుట్టాలతో
వనికంపించెద వీర శైవమును విశ్వంబెల్ల స్థాపింతు శం
భుని పాదంబుల సాక్షిగా గురుపదంబుల్ ముట్టించెదన్

మ. తలపన్ మాయలమారి దుర్మదుల చేతన్ రెండు ఖండంబులై
కలతన్ చెందిన పల్లెనాటి ధరణీ రాజ్యేందిరాదేవి పెం
పలరన్ క్రమ్మర దాయభాగమిడి సంభావింపుడీ శాంతి సం
ధిల, యేడేడులరణ్యవాసమును పూర్తింజెందె నీనాటితో

మ. ఘన శాంతిప్రదుడై ప్రపంచ వినుతుల్ గైకొన్న శ్రీబ్రహ్మనా
యనికిం గ్రోధము రేగెనేని బహుళ బ్రహ్మాండ భాండంబులన్
వనధుల్ పిండిలి ××లై చను పరబ్రహ్మావతారంబతం
డనుమానింపకుడీ యథార్థమిది మామా! మాట పాటింపుమీ!

శా. ఔరా! అంత పరాక్రమ స్థిరుడె బ్రహ్మాభిఖ్యుడానాడు కాం
తారావాసముసేయనేల బడుగై యర్థార్థియై వైరి భూ
దారుంజేరగనేల బట్టువలె వ్యర్థాలాపముల్ పల్కి ద
ర్బారున్ మమ్మునగౌరవింపకుము మర్యాదం బ్రదర్శింపుమీ!

(1965? అముద్రిత రాతప్రతి)

# పేరు తెలియదు

మ. అలరుంబూపవయస్కులై తగునహల్యా జానకీరామరా
వులు కల్యాణకళాప్రభల్ వలయు సమ్మోదంబుతో పెండ్లి పీ
టలపై నెక్కన్ వికసించె వంశవనవాటిం జిరాయుస్సు మం
గళ గీతంబులు బాడె నాంధ్ర కవిలోకంబెల్ల సానందమై
ఆయురైశ్వర్యముల్ తలబ్రాలై కురిసెన్ వధూవరులమీదన్

కం. తీయని చిత్తముగల మీ
నాయన మాజేటి సత్యనారాయణ వం
శాయతనము (.........)
నాయుష్మంతులనుగను మహల్యాదేవీ!

ఉ. జానకిరామరావుని ప్రసన్న మనస్సు హరించి ఆంధ్రకాం
తా నివహంబులో మణివిధంబు సదా గుణవంతదివ్య సం
తానముగాంచి బంధుజనతా నుతులంది ప్రజాళి మిమ్ము...
జానకి రాములోయన ప్రశస్తి వహింపుము పెండ్లి కూతురా

మ. కలుగున్ నీదగు గాజు మట్టియలకున్ కల్యాణమున్ నీదు మం
గళ సూత్రంబునకున్ చిరాయువులుదగ్రశ్రీలు మాజేటి ము
ద్దుల పుత్రీ నిజ భర్తృనంకమున యందున్ నిల్చి శోభిల్లుము
జ్వల వంశోన్నత చంద్రరేఖవయి యశ్రాంతం బహల్యా సతీ!

మ. నుతికింజాలిన వైద్య శాస్త్రమున యందున్ పట్టముంగొన్న ధీ
యుతుడీ జానకి రామరావునకు ఆయుర్దాయముల్ కుండల
ద్వితయంబందుధరించి శాశ్వత శుభాప్తిన్ దేవి వర్ధిల్లు మీ
శతవర్షంబులు కుంకుమాంకిత ముఖాబ్జ శ్రీవిలాసంబునన్

(1965? అముద్రిత రాతప్రతి)

# పేరు తెలియదు

కం. ఆరయ సకలాంధ్ర కవీ
ద్భారతు లాశీర్వదింప స్వకులాంబుధి పొం
గారం బెండిలియగు సు
బ్బారాడ్దంపతులకగు నభంగుర శుభముల్

కం. పావనమగు శ్రీ లక్ష్మి
దేవీ హస్తమును బట్టి ధృతిమీర సుఖ
శ్రీవెలయ సుబ్బరాయడు
జైవాతృకుడగుత వేయి సంవత్సరముల్.

(1965? అముద్రిత రాతప్రతి)

## దామోదరం సంజీవయ్య
## మీద రాసిన పద్యములై యుండవచ్చు.

శా. యావద్భారత కీర్తి ముత్యముల యందభ్యంజనస్నానముల్
గావించెన్ గొమరుండు నా పుటువు ధన్యంబయ్యెనంచాంధ్రభూ
దేవీరత్నము మందహాసముఖియై దీవించెడిన్ నిన్ను సం
జీవాభిఖ్య హసాదు నీయశము పొల్చెన్ దిగ్ధరేంద్రంబులన్

శా. ఉన్నారెందరొ రాజకీయచతురుల్ యోధాగ్రణుల్ వృద్ధులై
యున్నారెందులకీయ× రబలులంచూహించి లేబ్రాయపుం
మాన్యనిన్నిను  బెండ్లియాడినది ప్రేమన్ కాంగ్రెసమ్మాయి నీ
యౌన్నత్యంబున కాయురభ్యుదయమన్నా ఆంధ్రముక్తామణీ

కం. దామోదరవంశంబున
కామోదము సంఘటించి అఖిలాంధ్రజన
ప్రేమాబ్ధి నోలలాడె య
శోమహితా నీకు కోటి జోహారులనా

మ. ఘనతంజెందిన మూడు వన్నెల పతాకచ్ఛాయలో వాడిత
గ్గని సత్యాగ్రహఖడ్గమున్ గరమునన్ గైసేసి సాబర్మతీ
మునితో ఆంగ్లమృగేంద్రమున్ గెలిచి సంపూర్ణస్వరాజ్యంబు దె
చ్చిన వీరాగ్రణి లేడొకండనుచు వాసిగన్న సంజీవయా
ఖ్యునకున్ కాంగ్రెసు ప్రాణనాథునకు వేయిన్నూరు పద్యాంజలుల్

(1965? అముద్రిత రాతప్రతి)

## అక్షరాక్షతలు

మ. చెలువుల్ జిమ్మెడు నీ సతీమణి జయశ్రీ యెర్రిజెర్లింటి ప్రో
జ్జ్వల మాణిక్యము, దీపమైవెలుగు నీ సౌధాన, యిక్కన్య దో
సిలిలోనం దలబ్రాలు నీకిడు జయశ్రీ లాయురభ్యున్నతుల్
భళిరే! పెండ్లికుమార! లేతవలపుం బ్రస్థాన దీక్షారతా!

కం. గానము నటనయుగల, వం
శానన్ జన్మించినట్టి జవ్వనిచుమి, యి
మ్మానిని, జయకరు కనుమిక
తనూభవుల కళలుగల యుదాత్తాశయులన్

కం. జయకరుడవు నీవను గుం
డ్రియ యుంజయ, కుదిరె నిర్వురికి పెండిలి, య
వ్యయ సుఖసంపద లింటన్
తయారగుట కేమికొదువ? దంపతులారా!

కం. మంగమ జేకబుల కుమా
రిం గోమున్నగన్న, గుణపరీమళచరితన్
బంగరు శలాక కౌరా
మాంగల్యము గట్టునీకు మహితాశిషముల్

ఉ. ఈయమ కంధరంబున వీవాంచిన పచ్చల తాళిబొట్టు, నీ
ఆయురు నామయంబులకు నాయువుపట్టు జయాభిధాన! సు
శ్రేయము నీకు నీసతికి చెన్నలరారెడు బ్రహ్మముళ్ళకున్
చాయలుదేరు మీ ప్రణయ సంసరణామృత తీర్థయాత్రకున్

సీ. సరస పండిత కవీశ్వర శుభాశీర్వాద విభవాదికము తెల్గు వీరనీకు,
కవితా సుమంగళీ కమనీయ వీక్షణ కుసుమహారము పెండ్లికొడుక నీకు,
ఆయురున్నతి మీరు నైదువరాంద్ర కైవారంబు కొత్తసంసారి! నీకు,
బహునిలింపుల పుష్ప వర్షాభిషేకంబు పసుపు బట్టల చిన్నవాడ! నీకు

తే.గీ. బెళుకుచూపుల నునుసిగ్గు మొలకలురల
ప్రేమతో తలంబ్రాలు ధరించియున్న
తరుణ గళమున పుస్తె ముస్తాబుసేయు,
జయక రాభిధ! దాంపత్య జయము నీకు

(బుల్లా బుల్లయ్య (జయకర్), జయశ్రీల
వివాహ మహోత్సవ సందర్భము, 15 జూన్ 1968)

# కాసుబ్రహ్మానందరెడ్డి (ముఖ్యమంత్రి) గారి జన్మదినోత్సవమునకు ఆశీరుపాయనము

ఉ. నాలుగుకోట్ల ఆంధ్రుల మనః ఫలకంబుల కాసువంశభూ
పాలునిపేరు ముద్రవడి భాసిలుచున్నది తెల్గురాణి మే
ల్మీజడలోధరించినది కీరితి పుష్పసరంబు రెడ్డి రా
ణ్మాళి, హసాదు నీదు చరణంబులకున్ కరుణార్ద్రదృష్టికిన్

మ. కలుగున్నీ జననాఖ్యవాసరములింకన్ నూరువేల్మాకు నీ
చలువల్ జిమ్మురసార్ద్రవీక్షణములన్ సర్వాంధ్ర ఖండంబు, భా
సిలుగాతం బదివేల వత్సరములుజ్జీ లేని నీపాలనా
బల సంపత్తికి కేలు మోడుపులివే బ్రహ్మాఖ్యరాణ్మండనా!

సీ. ప్రవహించునంద్రు ధర్మజునింటి ముంగిట పదివేల గజముల మదజలంబు
ప్రవహించు నీ యింటి ప్రాంగణంబున యందు సకలాంధ్రజన నమస్కారఝురులు
నినదంబు ........... ప్రదేశంబు నిత్య మాంధ్రప్రదేశమున బ్రహ్మానంద......
వారించునీదుమోటారు గుఱ్ఱపు హేష దీనమానవుల ఆర్తిజ్వరంబు

ఆ.వె. నీదు బాహుయుగళి నీడలో జీవించు
ఘనత జిక్కె తెల్గు ఖండమునకు
అమృతహృదయ యేలుమయుతవత్సరములు
ప్రతిభమీర కాసువంశహేళి!

ఉ. .......... ప్రసిద్ధులయఖండ ధరాపరిపాలనంబులో
............ ధర్మదేవతలు పాదచతుష్టయమూనునంచుటే
........... వహించి ఆంధ్రమ సహస్రముఖలచాల ప్రస్తుతించునా
యాస ఫలింపజేయుము దయానిధి రెడ్డి కుల ప్రదీపికా!

ఉ. ఏనుగునెక్కితిన్ నృపకులేశులు మ్రొక్కగ మొన్న వామ పా
దానధరించితిన్ మణులు దాపిన గగ్గెర వేలసంఖ్య స
న్మానములందితిన్ తెలుగునాడు ప్రశంసలు చేయనింకనా
స్థానకవీట్పదంబొసగు దాతవు నీవెటులాదరింతువో

ఉ. ఈ కులతత్త్వవారినిధి నీతలుగొట్టు విచిత్ర భూమిలో
నాకొక పేద జీవికిక న్యాయము గూర్చు మహామనీషులే
రీ కృపజూపువారు తమరే యధునాతన కొండవీటిరె
డ్లేకద? ఆంధ్రరాష్ట్రపతులిద్ధ చరిత్రులు రెడ్డి భాస్కరా!

శా. ఊరేగించిరి యేన్గు మీదనను మాన్యుల్ గండపేండార స
త్కారంబుంబొనరించి నార్పసిడిలోస్నానంబు గావించితిన్
ఓరెడ్డి ప్రభు నాకుమీమహితమౌ యొడ్డోలగంబందు శ్రీ
మీరన్ సత్కవిగానొనర్పుము దయామేయార్ద్ర చిత్తంబుతో

మ. కడచెన్ డెబ్బది మూడువత్సరములింకన్ నాలుగైదేండ్లు పై
బడినన్ జాషువ దైవ సన్నిధి బృహస్పత్యాదులంజేరుఁ మి
మ్మడుగన్ వాడు గదా కృపానిలయ బ్రహ్మానందరెడ్డి ప్రభూ
కడకాలంబున కోర్కెదీర్చ గదవే కాస్వంశ విద్వన్నిధీ! (28 జులై 1969?)

## ఉపాయనము

మ. కవిదిగ్దంతికి ముద్దుతమ్ముడవు భక్తశ్రేణిసత్క్రైస్తవ
ప్రవరుండన్న యశంబుచేకొనిన గుఱ్ఱంవీరయాభిఖ్యురెం
డవపుత్రుండవు మేటి క్రైస్తవసభా నాథత్వమున్ దాల్చినా
డవు నే డభ్యుదయంబునీకగు గుణాఢ్యా! ఇశ్రయేల్ధీమణీ!

(జాషువ తమ్ముడైన ఇశ్రాయేలుపై, అముద్రిత రాతప్రతి)

## రామిరెడ్డి (తిక్కవరపు?) మీద రాసిన పద్యములై యుండవచ్చు

శా. ఏకాలంబున మన్మసిద్ధినరపుండన్నేల బాలించి భా
షాకల్యాణికి శాశ్వతంబగుమణీసౌధంబు నిర్మించి లో
కైకఖ్యాతి గడించు తిక్కకవి కావ్యంబందు జీవించిన
ట్లీకాలంబున రామరాడ్విభుడు సాహిత్య ప్రపంచంబునం
దాకల్పాంత యశస్కుడై వెలసె బ్రహ్మాండంబుకొండాడగన్

ఉ. రామవిభుండు సింహపురి రాణికి రత్నవిభూషణంబు శ్రీ
రామవిభుండయాంధ్ర కవిరాజులకున్ దివిషద్రుమంబు శ్రీ
రామవిభుండు తిక్కనకెరాప్రగడన్నకు నన్నపార్య వా
గ్భముల కీర్తికాయువు లిఖించెడు బ్రహ్మ వితర్కమేటికిన్

మ. ఒకకొన్నేడుల భౌతికంబయిన ఆయుర్దాయముల్ దొంగిలిం
చుకుపోయెన్ మతిలేని యబ్జజుడటంచున్ చంద్రసూర్యాది తా
రకలున్నంత చిరాయువుం బొదిగి యర్ధాంగీ మణిన్ గీర్తివే
దిక నెక్కించిన రామరాడ్విభుని కీర్తించున్ దిశాచక్రముల్

ఉ. తీయని చిత్తమున్ ప్రబల ధీబలమున్, శుభవద్వితర్ణియున్
గాయముదాల్చి రామనరకాంతు సమాహ్వయమున్ ధరించెనో
ఈ యుగమందునంచు సుకవీశ్వరకోటి నుతింతురిట్టి మీ
కాయువు కోటివత్సరములౌ బుధమండన రామరాడ్విభూ

కం. లేడీ సింహపురంబున
నీడితగుణు రామరాణ్మహపాలునితో
నడగు వాడల తిక్కనతో
నీడగు కవి భోజనృపతి కడగు రాజున్

కం. పదివేల్దినముల కొకనెల
పదివేల్మాసంబులొక్క వత్సరమై దె
బ్బదివేల వత్సరంబులు
బ్రదుకవలెన్ రామిరెడ్డి భానుండు ధరన్

మ. జగమెల్లన్ జటులాంధకారమయి ఆశల్ సచ్చి జీవచ్ఛవా
లుగ దుఃఖించెడు కుష్ఠురోగులకు వెల్గున్ జీవితాశాలతల్
చిగురించెన్ కృపజూపి నీవు ధనరాశో లక్ష గుప్పింప, ల
క్షగుడుల్ గట్టిన పుణ్యమింతమరునే కారుణ్యవారాన్నిధీ

చం. పరమపదించినట్టి నిజపత్ని సుదర్శన దేవిత్వన్మనో
హరభవనాకృతిం బ్రభవమ్మై పరిరక్ష యొనర్ప, కావ్యసుం
దరులు భుజిష్యలై కొలువ ధర్మరతిన్ రసరాజ్యపీఠిపై
జరుపుము జీవయాత్ర నవసానదశన్ ఘనరామభూపతీ

మ. జరయున్ మృత్యువులేని వానివలె భాషాద్రవ్యభాండారమున్
గరమార్జించి వయోవిపాకదశ లక్షల్ లక్షలుత్సాహమే
దుర చిత్తంబున పెక్కు సంస్థలకు సంతోషంబునం గుప్పు మీ
తరహా కర్ణదధీచిమూర్తుల చరిత్రల్ భూషలీగడ్డకున్

మ. వడియున్ వంకయులేని రాముని వచోబాణావళింబోలి మీ
నుడులన్ సత్యవయారమల్ వెలయుచుండన్ రామభూపాల, మి
మ్మిడుమల్డాయవు రేబవల్ మధుర సాహిత్యామృతంబింపు సా
పడు మిమ్మంటదు వార్ధకంబు శుభరూపా! రామిరెడ్డి ప్రభూ!

కం. చటుల కుటుంబ గ్రోలెచా
త్కట దంష్ట్రలజిక్కువడ్డ కవి గజముల సం
కటములు వాపగ హరివై
పుటువందితి రామిరెడ్డి పుణ్యచరిత్రా

శా. నట్టింటన్ మహితేంద్ర భోగరమలున్నన్ సర్వసామాన్యపుం
బట్టల్ దాల్చి, మితాశనంబును మితవ్యాహారనిద్రాళితో
ఎట్లో కాలము బుచ్చు వింతయగు మౌనీంద్రుండవై త్యాగిరా
ట్పట్టంబందగజాలు నీచరిత సౌవర్ణాక్షరభ్రాజియే

మ. పదవుల్ గౌరవముల్లభించు ననుచున్ బాపూజి ప్రీత్యర్థమై
ఖదరున్ దాల్చిన మోసగాంద్ర కకలంకంబైన మీబాపుజీ
పదభక్త్యున్నతి త్యాగదీక్ష వివరింపన్ పెన్గదాఘాతమై
యెదసోకన్ దలవంచి సిగ్గిలెదరెంతే మ్లానితాస్యంబులన్

(రచనాకాలం తెలియదు, అముద్రిత రాతప్రతి)

తే.గీ. మహిత యెరిచెర్ల వంశ సామ్రాట్ కుమారా
తెలుగునేలకు ముత్యాలవలయమట్లు
కీర్తిమకుటముదాల్చి సంగీతమందు
తండ్రిపేరును నిలిపి ఉద్దండుడవయి
పాతగుంటూరు బాలకవర్గమందు
ప్రథవహింపుము నూరు సంవత్సరములు
వెల్గి కవిచక్రవర్తి దీవెనలబల్మి
శాశ్వతంబుగ వీరజాకబు కుమారా!

(1970? అముద్రిత రాతప్రతి)

# రాధాకృష్ణ 1939

## పాటలు-పద్యాలు

ప్రార్థన - మోహన

గరుడగమనా కమలనయనా భుజగపతిశయనా
దేవదేవా అమృతభావా శరణమిడలేవా? ॥గరు॥
ఘోరసురరిపు చకితభూమిన్ మనుపు మఖిలేశా
మేలుకొనవేలా? పరాకా? ముదితమునిలోకా! ॥గరు॥

రాధ - భీంప్లాస్

హే! నవమోహనమూర్తీ! ప్రణవాంబరపరివర్తీ!
గానలోల! స్వర్ణ చేల ॥హే॥
ఏమిసేతు నగధారి బ్రతుకజాల మురారీ
కామపితా కరుణలేదా? మోముజూపి, ననునేల ॥హే॥

రాధ - ముఖారి

నిగమనిలయా! నిగమనిలయా! నిగమనిలయా!
బ్రతికినది రాధా! శ్రీనాథా ॥నిగ॥
జగముపూచెన్ స్వాంతమలరెన్ సృష్టినిలిచెన్
సేమమాయెన్ నీహృదయవీధిన్ నేను నిలుతున్ ॥నిగ॥

రాధ - హిందూస్థాని కాఫి

హే! మాధవ నీరదశరీర విముక్తిసేయవో
యదువీర ॥హే॥
సుధామూర్తి నీకటాక్షము లభింపదేమొ బ్రదుక
నేమొ అనదనయితి నక్కటకటా ॥హే॥

రాధ - వసంతబిహార్

మొరవినవా మృదుభావా
గోపాల గుణానంద
పలుకవా? దయగనవా?

నీతోడు  నిను వీడరా
మురళీగానలోల ॥నీతో॥
వరసుగుణా కృష్ణా!
వనమాలీ నాగుండె నవసెరా
నాతాపంబు నడపరా ॥మొర॥

రెండవ కృష్ణుడు – భాగేశ్వరి
విరహ మెటులీద నగునోరాధా
తగునా నిర్దయ కన్నడసేయ
నీకృపలేదా? సఖినామీద ॥విరహ॥
చెలువుడుకాన చక్కనిదాన
కాయమునిల్చునెకౌగిలిలేక ॥విరహ॥

మూడవ కృష్ణుడు – తిలంగ్
రాధ? రాదాయెగా నామణీధామము
నాదు వికుంఠము ॥రాధ॥
ఆ యరవిందము అబలాముఖమో
విరుల విలాసము చిరునగవేమో
ఈమణి వేదిక బాధకమాయెన్
తొగల పరిమళము వెగటుగ దోచెన్ ॥రాధ॥

మూడవ కృష్ణుడు – సారంగి
గోకుల రమణీ లోకవినోదిని
రాకా చంద్రనిభాననా ॥రాధా॥
గోపవధూటీ గౌరవకోటీ గోకులా
నవమోహన మృదుపల్లవ పాణీ
బాలకోకిలవాణీ ॥రాధ॥
రూపమనోహర వివిధవిలాసినీ
రాజిత గుణమణియు తరమణి
మాయాతీత విలాస విహారిణీ ॥గోకు॥

డ్యాన్సుపాట - దర్బార్

కంసభూప రాజరాజ వందితచరణా ధీర
నిశిచరోరు వంశతిలక నిరవధి ముఖదాయక ॥కం॥
మేరుధీర మందగమన మారసుందరాకార
మకరకుండలా ధీరా వీర శుభాంగ
దానవకులనాథ ధీర ॥కం॥

గోపికల డ్యాన్సు పాట - దుర్గ

నందగోప సుకుమార
సుందరాంగ శుభకరా
యాదవకుల రజనికరా
రాసలోక దినకరా ॥నంద॥
కామితవరదా
దీనావనబిరుదయువతీ మద
కుధరవహన! ప్రకృతి
సదన మధురవచన ॥నం॥

గోపికలు-గ్రూప్‌సాంగ్

జో జో! జో జో!
సుజనవశంకర! మధుకర చికుర
మర్దిత నిశిచర
కపటనరహరీ ముక్తివిలాసినీ
రమణా సుగుణకలాప
శౌరి పరంతప ॥జోజో॥

యదువీరబాల
హృదయకుసుమమున బొదలు
మరందము పూజలుగొనవా?
ముద్దువానీవా?
ముత్తెపుకోవా? బాలవతంగా

గోపబాలురు

గోమాలచిమి తల్లీ! కోర్కెలీయవే
దీనులకు పేదలకు దిక్కునీవేనమ్మా ॥గో॥
చెలువుగ నీకు(మొక్కి సింగారిస్తే
వుగమూ జగమూ తరిచ్చుతాది ॥గో॥
నెయ్యా పాలూ నువ్వియ్యకుంటే
యగ్గెయాగములు నెగ్గవుతల్లీ
గగ్గోలైతది పెపంచమంతా
గొల్లలమూ కొడుకులమూ గంగమకూ బకుతులమూ
పిల్లా మేకా సుకిచ్చివాలి సల్లని సూపులు సల్లుము తల్లీ ॥గో॥

రెండవ కృష్ణుడు – రాధ, మి(శిపహాది

కృ॥ గుణయుతా కువలయవినుతా
సదమలచరితా సత్యాభిరతా ॥గుణ॥
(ప్రేమరాణి (ప్రాణమునీవ బలమునీవా
ధన్యుడనైతి ॥గుణ॥
రా॥ ఘనపాద జలజవీధీ చిరుతుమ్మెదనై
ఆడుదాన కావరా దేవకీ ముద్దులకూన
మోహనాకార దాసినికాన
కృ–రా॥ (ప్రేమపయోనిధి నీదుదామా
(ప్రేముడిడోలల నూగుదామా

రెండవ కృష్ణుడు – రాధ, పహాది

రా॥ ఆనందమాయెగదా యెడద
ధీవిశాల భవ్యశీల భళా వేదవిదా వరదా ॥ఆనం॥
కృ॥ అమలచరితా అభిజాతా
ధృతిగనలే గోకులదేవీ ॥ఆనం॥
రా॥ దేవాదిదేవుడవూ శుభదా
నవీనమదనుడవూ రమణా ఆహా శుభ
[illegible] ॥ఆనం॥

కృ॥ ఓ కల్యాణి నాహృదయములో
హాయిగా శయనింపుముదేవి
రా॥ వేదాభరణా రాధాకృష్ణా
కృ॥ సారసవదనా - స్వాగతమబల
రా-కృ॥ గానము సేయుదమా ప్రణయలత పెంపారన్ ॥ఆనం॥

నారద - వసంతబహార్
రాధా సమేతా కృష్ణా నయగుణ నందకుమార నవనితచోరా ॥రా॥
బృందావనచర సుందరాకారా గోపిమనోహర గోకులవాసా
శోభితమురళీ గానవిలాసా సుందర మన్మథ కోటి ప్రకాశారాధా ॥రా॥

నారద - దుర్గ
హే! హరే! నమో! భవహరే
భువనజరరే యదుకిశోరే
ఘనజఘనోజ్వల
కాంచనకింకణి నిక్వణ
పులకిత నిఖిలవసుంధర ॥హే॥

నారద
సీ. పసిగాపుజవరాంధ్ర ప్రణయ సామ్రాజ్యంబు పాలించు పావన బ్రహ్మచారి
పుట్టి పుట్టకముందె పూతనరక్తంబు జుట్టిన మాయాకిశోరమూర్తి
లోకంబులను బొజ్జలో దాల్చి, లోకాన జన్మమెత్తిన యైంద్రజాలికుండు
జలధివీరులదూగు చిలువమంచముమీద దొంగనిద్దరవోవు దొడ్డవేల్పు

ఆ.వె. పుడమికన్న ముందు బుట్టిన వృద్ధుండు
ముసలితనములేని ముద్దుశిశువు
అబ్జనాభుచరిత మర్థంబు గాదమ్మ
సురలకైన మౌని వరులకైన

నారద

సీ. పట్టుజిక్కిన తృణావర్తుని మర్దించి తల్లిరొమ్మునc బాలు ద్రావినాడు
బలు నఘాసురుని యెమ్ములు దుమ్ముగా ద్రొక్కి మోదంబుచే వేణు వూదినాcడు
నలకూబరుల శాపములు వాపి పెనుఱోటి బరువున గునగునcదిరిగినాcడు
యజ్ఞఘాతుకులగు నసురుల శిక్షించి దిక్కులకు శాంతి ముద్రించినాcడు

తే.గీ. మృత్యువును బిల్చికొన్నట్లు మేనమామ
కంసహతకురిందు చల్లగా కబురుసేయ
మొన్న మొన్నన మధురకు బోయినాడు
దంభగోపాలుడగు యశోదమ్మ కొడుకు

మూడవ కృష్ణుడు

సీ. వెలిగించితివి భూమివలయంబు కను విప్ప దిక్చక్రముల భక్తిదీపకళిక
వెలయించితివి నాకు వలపు వన్నెల మనోహరమైన భావసింహాసనంబు
నాటించితివి నీకు నాకు శాశ్వత శరణ్యంబైనకీర్తి బృందావనంబు
సహియించితివి బంధుజనము లాగము చేసి తలనెత్తు కటికి నిందాశతంబు

తే.గీ. ప్రమదమునc దేలి యొక్కొక్క రక్తనాళ
మూగుచున్నది నీ మహాత్యాగమునకు
స్వాగతము నీకు నాయాత్మ పంజరమున
గాపురంబుండు మింక బంగారురాధ

రెండవ కృష్ణుడు

చం. మడువున cదాగి వీడు పరిమార్చిన జీవుల దీనఘోష, నా
యెదదc బ్రతిధ్వనించెడి, నహీంద్రుని దగ్గఱచుట్టమైననే
విడువనుగాని, యో యురగ భీతమృగేక్షణలార! యూరడి
లుcడు, క్షమియింతు నీ చెనటి లోభుని మీపతిభక్తి కల్మిచే

అక్రూరుడు

ఉ. ఆ నవనీతచోరుని మహత్త్వము కొంచెము చిత్తగింపుమో
దానవనాథ నీదుభుజదర్పము వెన్నుని ముందుసాగదం
బోనిధులా మహామహుని ముత్తెపుటూయెల పట్టెమంచముల్
కానని వెన్నముద్దయగు క్ష్మాతలి వానివరాలబొజ్జకున్

# మహారథి కర్ణ (1960)

కృష్ణుడు

మ. నను బంధించుట కుద్యమించిరట విన్నావా? మహారాజ నీ
తనయుల్, దూతల, శాంతికాముల నిటుల్ దండింతురే భూపతుల్?
జననాథాగ్రణి! దారుణంబయిన నీ సంతాన దౌష్ట్యాగ్నియే
చిన, నీ వంశమహాటవిన్ బొదవి భస్మీ భూతమున్ జేయదే

నేపథ్యగీతం

మ. ఘనుడయ్యో మరణించెనే! కటకటా! కర్ణుండు మార్తాండనం
దనుడుద్ధండుడు, కర్ణకుండలములన్ దానంబుగా వజ్రికిన్
దనువుల్ జీల్చియొసంగు వీరుడు స్వమాతన్ పుత్రభిక్షావరం
బున ఆర్జించిన భూరిదాత బలియై పోయెన్ కుతంత్రాగ్నికిన్

# పల్నాటి యుద్ధం (1966)

బ్రహ్మనాయుడు

సీ. అంటరానితనంపు టడుసులో దిగబడ్డ కడజాతులకు ముక్తికలుగజేసి
ప్రజలరక్తము ద్రావు రణపిశాచంబుల దశదిశాంతములకు తరిమివేసి
పసివారలగు మిమ్ము పరిపాలకుల జేసి కులమత ద్వేషాలు కూలద్రోసి
సకల మానవులకు సౌఖ్యప్రదంబైన విశ్వశాంతి జ్యోతి వెలుగజేసి
పావనంబగు మానవత్వము సృజించి ధర్మమును ప్రతిష్ఠించు నుద్యమము నాది

తే.గీ. దానికపకృతిజేయు శాత్రవుల నడుమ
రాజభక్తిని శంకించు రాజ్యమందు
మంత్రిగా నుండజాలను మానవేంద్రా

అలరాజు

ఉ. వచ్చితి రాయబారినయి బ్రహ్మన యానతిమీద కయ్యపుం
జిచ్చు రగుల్తురో శుభము చేకుర భాగముతోడ మీరు పై
పెచ్చు వసూలు జేసికొని వెచ్చ మొనర్చిన సుంకమిత్తురో
కచ్చకు కాలుదువ్వి యని గావలెనందురో తేల్చి చెప్పుడీ!

అలరాజు – నాగమ్మ

సీ. అలరాజు : అలుకమై బ్రహ్మనాయడు ఖడ్గమున్ దూయ,
సప్తసముద్రముల్ జలదరించు
నాగమ్మ : చండాలురంగూడి చాపకూడు భుజించు
చవటకెట్లదరునో సాగరములు
అలరాజు : అలుక రేగిన సింహమగు బాలచంద్రుండు
అరులపుఱ్ఱెల బంతులాడగలడు
నాగమ్మ : వెలదిసబ్బాసాని వలపు టుచ్చులబడ్డ, విటకాడహో దండి
వీరుడగునె?

సీ. అలరాజు : పోరాడి పురిటి బెబ్బులి జున్ను గొనితెచ్చు,
కన్నమదాసు అమరభీకరుడు సుమ్ము
నాగమ్మ : కడజాతి వానితో కయ్యమా, శివశివా!
చెప్పంగ నీకెట్లు సిగ్గులేదు?
అలరాజు : ముక్కంటి కంటి నిప్పున దూకవెరవని,
కొమ్మన్న పగవారి దుమ్ము సేయు
నాగమ్మ : కొమ్మన్న గుడిమీది తిమ్మన్నయగు
నట్టి కుంక ప్రవేశింప లంకగాదు
అలరాజు : ఆడుదానవు నీకెట్టులర్థమగును,
యుద్ధగాంగేయులైన మాన్యులచరిత్ర
నాగమ్మ : అపరశాంభవియైన నాగాంబవద్ద,
తగదు పొగడంగ మాచర్ల మగతనంబు...

అలరాజు

మ. మగువల్ సిగ్గిల కత్తిబట్టి యెటులో, మంత్రిత్వమార్జించి, దే
వ గురుండుం తలవంచి మ్రొక్కదగు మా బ్రహ్మన్ననే దిట్టితే
పొగరుంబట్టి, కుతంత్రముల్ సలిపి, నిప్పుల్ చల్లి పల్నాటికిం
తగచాట్లం గలిగించు నీ శిరము, వ్రయ్యల్ చేతు దుశ్చారిణీ!

భట్టు

ఉ. వచ్చితి దూతగా నిటకు, బ్రహ్మన బంప వినుండు, వారు వా
క్రుచ్చిన రాయబారమును, కోపము సేయక, అల్లనాడు మా
కిచ్చిన భాగమున్ మరలనిచ్చి, నృశింహుశిరంబు కాన్కగా
నిచ్చిన సంధి ఖాయమనిరీయక రమ్మనిరాజిలోనికిన్

పేరిందేవి

సీ. బుగ్గియైనది నాదు ముత్తైదువతనంబు నల్లపూసలసౌరు నాశమయ్యె
గంగలో గలసె నా గాజు మట్టెలశోభ ఆశలన్నియు నడుగంటిపోయె
నా కొంప గూల్చిన నరసింహుని శిరంబు ఖండించు వీరుడొక్కండు వీర
పలనాటి సీమలోపల జన్మమెత్తడా జాలిగుండెలు గల్గు శౌర్యధనుడు

తే.గీ. అమ్మహావీరు శపథంబు నాలకించి
స్వర్గమున కేగుదాన నా స్వామి తోడ
నగ్నిగుండాన దూకెద నన్నలార
మానధనులార, పలనాటి మాన్యులార!

బాలచంద్ర

మ. పడవైతున్ నరసింహరాజు శిరమున్ పల్నాటి వీరత్వ మే
ర్పడగా కొమ్మన పాదపద్మములపై బ్రహ్మాదులడ్డైన, బా
లుడు గాడీతడు కాలుదౌననుచు వేల్పుల్ మెచ్చు నైతమ్మపు
త్రుడ, మీ యిర్వురకాత్మశాంతి గలిగింతున్ నమ్మవే, సోదరీ...

బహ్మనాయుడు

సీ. పుట్టింపగలవు నిప్పుకల కుప్పలమంట దరిలేని జలధి మధ్యంబునందు
కల్పింపగలవు మేఘములేని పిడుగులు అవధిలేనట్టి బ్రహ్మాండమందు
సృష్టింపగలవు దాక్షిణ్య పుణ్యగుణంబు కోడెబెబ్బులి మునికోరలందు
శాంతి నిండారు పచ్చని కాపురాలలో నెత్తుటి మడుగులు నింపగలవు
తల్లి పిల్లల నడుమ నంతంబులేని ఘోరతర విరోధము రగుల్కొల్పగలవు

తే.గీ. శాంతి హింసల పోరిప్డు సంభవించె
దేని గెల్పింతువో నీవు దివ్యచరిత
ఏమిచేతువొ నీ చిత్త మెవ్వడెరుగు
పావనార్ద్ర స్వభావ, శ్రీదేవదేవ!

బ్రహ్మనాయుడు

సీ. గర్భశత్రువుకాని కరుణింపుడన్నచో నెనరూని వాని మన్నింపవలయు
పసిపాపవలె భయంపడి యుద్ధరంగాన వ్రేళ్లు చీకినవాని విడువవలయు
పుట్టలెక్కిన భీరువులమీద కసిబూని పెనగరాదు, అలుగులు విసరరాదు
స్త్రీబాల వృద్ధుల చెరబట్టగారాదు చిరుగాయమేనియు చేయరాదు

తే.గీ. బ్రహ్మనాయని కదనధర్మములు తప్పి
సంచరించినవాని మస్తమును దరిగి
కోటసత్తికి కొప్పులో గ్రుచ్చగలను
మాధవార్చన రతులార, యోధులార!

నరసింహరాజు

ఉ. నా తలగొట్టి తెత్తునని నల్వురిలో శపథంబు చేయు వి
ఖ్యాత పరాక్రమ స్థిరుడవా, మిడిమేలపు కుఱ్ఱకుంక, ర
మ్మేతలగూలునో తెలియు నీ నరసింహుని బారుటీటెకున్
నీ తల గ్రుచ్చి పంపెదను నీ ప్రియురాలల సానియింటికిన్

యుద్ధరంగమున – నాగమ్మ

మ. కులగోత్రంబులు మంటగల్పితివి సంకోచంబు లేకుండ మా
లలతో యెంగిలికూడు తింటివి, మతాలన్ దొడ్డ, దైవమ్ములన్
వెలిగావించి, మహానుభావుడనుచున్ పెక్కుంద్రు విద్యావిహీ
నులు కీర్తింపగ విఱ్ఱవీగెదవు, నిన్నున్ నీదువంశమ్ము, ము
క్కలు గావించిన పాపమంటునె, యభాగ్యా బ్రహ్మనాయాధమా!

బ్రహ్మన్న

ఉ. ఆరయనాడు పెద్దపులివై నలగాముని యింటజేరి, మా
కూరిమి గంగలో గలిపి, గోతులు త్రవ్వుచు పండువంటి సం
సారములందు ఆరని విషానలమున్ దరికొల్పు నిన్ను సం
హారము చేసినం గలుష మబ్బును పొమ్ము దురంత పాపినీ

బాలచంద్రుడు

ఉ. కూతురి పుస్తెదెంచితివి కొండలు పిండిగ గొట్టజాలు వి
ఖ్యాత పరాక్రమ సిర్థునకల్లునకున్ విషమిచ్చి చంపి, దు
ర్నీతులపుట్టయై, వగలు నేర్చిన, మాయలనాయురాలికిన్
జేతులు మోడ్చి పెక్కురణసింహుల గాంచిన పల్లనాటికిన్
ఘాతుక మాచరించు కులఘాతుక, నీ తలగొట్టి కోటలో
పాతెదరా నృసింహ, ఘనపాతక కాలము దాపురించెరా...

# విజ్ఞప్తి

సహృదయులారా!

కాళిదాసుని మేఘసందేశమును మనస్సులో నుంచుకొని నేనీ కావ్యమును రచించితిని. గ్రంథనామము గబ్బిలము. శ్రోతల కిది కటువుగా దోఁపవచ్చును కాని యిందలి కథానాయకుఁడు మందభాగ్యుఁ డగు హరిజనుఁడు. కాళిదాసుని యక్షుఁడు ప్రణయసందేశము నంపును. ఇతఁ డంపునది తుక తుక నుడుకు నశ్రుసందేశము. అతని శిక్షాకాలపరిమితి యొక సంవత్సరము. ఇతని శిక్ష ఆజన్మాంతము. తరతరములు. దీని కవధిలేదు. అతఁడు మన్మథాగ్నితప్తుఁడు. ఇతఁడు క్షుధాగ్ని పీడితుఁడు. ఇరువురిలో నితఁడు దయనీయుఁడు.

'నాదు కన్నీటి కథ సమన్వయము సేయ

నార్ద్రహృదయంబుఁగూడ కొంతవసరంబు'.

అని యితఁడు వాపోవును. కులీనులగు రాజులకువలె హంసములు, చిలుకలు మున్నగు నుత్తమపక్షిదూత లితనికిఁ జిక్కుట అసంభవము. కావున నిట్టిడుల జీర్ణకుటీరములలో నిరంతరము దర్శనమిచ్చు గబ్బిలము నితనికి సందేశహారిఁగా పరిగ్రహించితిని. రసజ్ఞుల కిందలి యౌచితి సులభగ్రాహ్యము. ఇంటఁ బ్రవేశించి దీపమార్పిన గబ్బిలమును జూచి తన కన్నీటి కథ నీశ్వరునితోఁ జెప్పుమని వీఁడు ప్రార్థించెఁ గాని నిజమున కతని యుద్దేశ్యము దేశారాధన. కైలాసయానమునకు నా పన్నిన త్రోవ కొంత వక్రతకు గుఱియైనది. ఇది దోషము కాదనుకొందును. ఈ కృతి రసజ్ఞలోకాదరణ నందిన నా శ్రమ ఫలోన్ముఖము కాఁగలదు.

నేనీ గ్రంథమును ముగించు నవసరమున దైవ వశమున గుంటూరు జిల్లాబోర్డు ప్రెసిడెంటుగారును, దేశభక్తులును, కళాభిమానులు నగు మ.రా.రా.శ్రీ కల్లూరిచంద్రమౌళి చౌదరిగారు మా యూరుదయ చేసి గ్రంథము నామూలాగ్రముగా విని పతిత్వము వహించుట కంగీకరించుట నా యదృష్టము. వారికి నా నమస్కార సహస్రములు. ఈ విషయములో నన్ను ప్రోత్సహించిన జిల్లా కాంగ్రెసు ప్రెసిడెంటు గారగు మ.రా.రా. శ్రీ మంతెన వేంకట్రాజు గారికి వందన సహస్రములర్పించుచున్నాను. గ్రంథ ముద్రణ కార్యభారమును వారు వహించి చేసిన యుపకృతి మరువరానిది. వారికి నేను కృతజ్ఞుఁడను. మఱియు నడిగినంతనే సంతోషముగా నంగీకరించి యిందలి చిత్తరువులను వ్రాసియిచ్చిన శ్రీయుతులు పోట్లూరి హనుమంతరావు గారు నాకు స్మరణీయులు. ఈ సందర్భమున వారి సహజచిత్రరచనా కౌశల్యము నుగ్గడించుట అప్రస్తుతము కాదను కొందును. వీరి జన్మస్థలము వినుకొండ. వీరు నిరాడంబరులు. మిత భాషులు, చిత్రలేఖనము వీరి సొమ్ము. వీరి బొమ్మలలో జీవకళ యుట్టిపడుచుండును. కవి

కలము వలె వీరి కుంచ సూక్ష్మాతి సూక్ష్మములగు విశేషములను తీర్చి దిద్దుటలో దక్షమైనది. వీరు 'కొమరు బాలెంత' 'గరళ భిక్షువు' మొదలయిన చిత్రములను వ్రాసి భారతి పత్రిక నలంకరించి ఆంధ్రుల మన్నన లందినవారే. కష్టమునకుఁ దగిన ఫలములేక కళలు రాణింపవు కదా? వినుకొండ వంటి మారుమూలం బ్రకాశించు నిట్టి రత్నము నిప్పటికేనియు గుర్తించుచోఁ దెల్గువారు నిందార్హులు కారనినాయూహ.

జి. జాషువ

కం. కల్లూరి కులజునకు, బుధ
తల్లజునకుఁ జంద్రమౌళి, దాతృమణికి, మా
జిల్లాబోర్డు నియంతకు
నిల్లాలై యస్మదీయ కృతి భాసిల్లున్

# అంకితము

మ. ఘనతన్ జెందిన మూఁడు వన్నెల పతాకన్ గేలఁ గీలించి, జీ
వన సర్వస్వము దేశమాతృచరణద్వంద్వంబున న్నిల్పి యీ
తెనుఁగున్ గడ్డ ప్రశంసలందిన యశోబ్ధీ! చంద్రమౌళిప్రభూ
అనుకంపన్ గొను మస్మదీయ కృతికన్యన్ గూర్మి దేవేరిగన్

ఉ. ఈ కృతి నీ భుజార్గళము నెక్కి వసించి యనంత గౌరవ
శ్రీకి నివాసమై తనివిఁ జెందె శ్రమంబు ఫలించె సాహితీ
లోకశరణ్య! త్యాగిజనలోకశిరోమణి! సత్కవి ప్రశం
సా కమనీయ గీతముల స్నానము సేయుము దీనబాంధవా!

మ. చవులన్ జిమ్మెడు దేశభాషల సమాశ్వాసించి పోషించు భూ
ధవు లెల్లన్ గతియించినారు, పరవిద్యాభోగినీ కన్యకల్
చెవులం బిండ నటించు నేల నకటా! జీవచ్ఛవంబైన యి
క్కవితాధేనువు పిండునే మధురదుగ్ధంబున్ బ్రసిద్ధంబుగన్

ఉ. చల్లగ బోర్డు పాలనము సల్పుచు ధర్మపథానఁ బోవు నీ
వల్ల సుఖింపఁ జొచ్చినది పాలితవర్గము త్యాగమూర్తి! యు
త్ఫుల్లయశస్క! నీ మధురమోహనమైన భుజాంతరంబు, మా
పిల్లకు ముద్దరాలికి లభించుట భాగ్యముగాఁ దలంచెదన్

ఉ. ధీసముపేతుఁడై ఖదరు దీక్ష వహించిన దూత, శాంతి స
న్యాసి యనుజ్ఞలో మెలఁగు త్యాగివి, భోగవిసర్జనంబు న
భ్యాసము చేయునట్టి గుణవంతుఁడ వీ వటువంటివారి సా
వాసము కాంక్షనీయము ధ్రువంబు నవీన కవీంద్రకోటికి

సీ. పయనించితివి కళాభ్యసనంబు కామించి తెలవారి పాశ్చాత్యదేశములకు
వహియించితివి బోర్డుపాలనాభారంబు గుజరాతు కోమటి కోర్కిమీద
ధృతి నొసంగితివి జాతీయసంస్థార్థంబు పిడికెడు సభ్యతా వేతనంబు
గడియించితివి విదగ్ధజ్ఞాన విత్తంబు మునిమునిమీసంబు మొలుచునాఁడు

తే.గీ. సాధనము చేసినా వెట్టి శాత్రవునకు
మనసు నొవ్వని మధుర సంభాషణంబు
శాంతిసైనిక! భవదీయ సచ్చరిత్ర
తెనుఁగు తల్లికి మెఱుఁగుఁ గుందనపుఁ దొడవు

# గబ్బిలము

ఉ. చిక్కినకాసుచేఁ దనివిఁ జెందు నమాయికుఁ డెల్లకష్టముల్
బొక్కెడు బువ్వతో మఱచిపోవు క్షుధానల దగ్ధమూర్తి న
ల్దిక్కులుఁగల్గు లోకమున దిక్కరియున్న యరుంధతీ సుతుం
డొక్కఁడు జన్మమెత్తె భరతోర్వరకుం గడగొట్టు బిడ్డఁడై

ఉ. పూపవయస్సులో వలస పోయిన చక్కని తెల్గు కైతకున్
బ్రాపక మిచ్చినట్టి రఘునాథనృపాలకుఁ దేలియున్న తం
జాపురి మండలంబునకుఁ జక్కగ దక్షిణభాగ భూములన్
గాపురముండె నప్పురమ గర్భదరిద్రుఁడు నీతిమంతుఁడై

ఉ. ముప్పు ఘటించి వీని కులమున్ గలిమిన్ గబళించి దేహమున్
బిప్పియొనర్చు నీ భరత వీరుని పాదము కందకుండఁగాఁ
జెప్పులు గుట్టి జీవనము సేయును గాని నిరాకరింప లే
దెప్పుడు నప్పు వడ్డది సుమీ భరతావని వీనిసేవకున్

తే.గీ. వాని ఱెక్కల కష్టంబు లేనినాఁడు
సస్యరమ పండి పులకింప సంశయించు
వాఁడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు
భోజనముఁ బెట్టు వానికి భుక్తి లేదు

తే.గీ. వాని తలమీఁదఁ బులిమిన పంకిలమును
గడిగి కరుణింప లేదయ్యె గగనగంగ
వాని నైవేద్యమున నంటు వడిన నాఁడు
మూఁడు మూర్తులకును గూడఁ గూడు లేదు

తే.గీ. పాముకుఁ బాలు, చీమకుఁ బంచదార
మేపుకొనుచున్న కర్మభూమిం జనించు
ప్రాక్తనంబైన ధర్మదేవతకుఁ గూడ
నులికిపడు జబ్బు గలదు వీఁడున్నచోట

ఆ.వె. వాని నుద్ధరించు భగవంతుడే లేడు
మనుజుఁ డెట్లు వానిఁ గనికరించు
వాఁడు జేసికొన్న పాపకారణ మేమొ
యింతవఱకు వాని కెఱుకలేదు

తే.గీ. ఆ యభాగ్యుని రక్తంబు నాహరించి
యినుపగజ్జెల తల్లి జీవనము సేయుఁ
గసరి బుసకొట్టు నాతని గాలిసోఁక
నాల్గు పడగల హైందవ నాగరాజు

ఆ.వె. కులములేని నేను కొడుకులఁ బుట్టించి
యీ యఖాతమందె త్రోయవలెనె
భార్యయేలఁ బుట్టుబానిసకని వాఁడు
జరుపసాఁగె బ్రహ్మచర్య దీక్ష

ఆ.వె. ఉదయమాది రక్తమోడ్చి కష్టముఁ జేసి
యినుని సాగనంపి యిల్లు సేరి
యున్న గంజిఁ ద్రావి యొక్కనాఁ డాపేద
ప్రక్కమీఁద మేను వాల్చియుండె

ఆ.వె. భూనభములఁ గ్రొంజీఁకటు
లేనుఁగునకు మదము వోలి యెసక మెసంగె సం
ధ్యానాట్యకేళి మాని మ
హానటుఁడు శివారవముల నారంభించెన్

తే.గీ. ముక్కు మొగమున్న చీఁకటి ముద్దవోలె
విహరణము సేయసాఁగె గబ్బిల మొకండు
దాని పక్షానిలంబున వాని చిన్ని
యాముదపు దీప మల్లన నాఱిపోయె

కం. తిల్లిక నాటిపి దయ్యపుఁ
బిల్లవలెం దిరుగుఁ దబిసి పిట్ట నరయఁగాఁ
బల్లవితమయ్యె నాతని
యుల్లంబునఁ గ్రొత్తకొత్త యూహాంకురముల్

మ. చెలిమిన్ బక్షికి విన్నవించుకొనఁ జొచ్చెన్ స్వీయవృత్తాంత ము
మ్మలికన్ గందిన నెమ్మనంబున మదోన్మత్త ప్రపంచంబులోఁ
బులుఁగుం బుత్రలుఁగాఁకఁబేదలకునాప్తుల్ జుట్టపక్కంబులున్
గలరే! వాని కవోష్ణబాష్పములు వ్యాఖ్యానించెఁ జక్రాంగనల్

చం. ప్రవిమల దేవతాభవన వాసము చేయుచు మమ్మువంటి మా
నవులకు లేని గౌరవమునం దులఁదూఁగెడు గబ్బిలాల రా
ణివిగద నీవు స్వాగతము నీకు శుభంబకదమ్మ నీ తనూ
భవులకుఁ దల్లక్రిందుల తపంబులకున్ గుడి గోపురాలకున్

తే.గీ. గాఢనిద్రావలంబియై కన్నుమూసి
క్ష్మాతలము మేను మఱచిన కాళరాత్రి
నా గృహంబున వెదకుచున్నా వదేమి
దొరక దిచ్చట నానంద కిరణ లవము

తే.గీ. నిన్ను బహిష్కరించు నవనీవలయం బిది యంటరాని వాఁ
డున్న నిషిద్ధగేహము సహోదరి, నీవు సమస్త దేవతా
సన్నిధి నారగింతువు ప్రసాదము లంతటి పుణ్యురాలవై
యన్నములేని పేదల గృహంబులు సొచ్చితివేల బేలవై

చం. హృదయములేని లోకముసుమీ యిది మాపులఁబశ్చిమంబుగా
నుదయము తూర్పుగా నడచుచుండు సనాతనధర్మ ధేనువుల్
పిదికిన పాలు పేదకు లభింపవు శ్రీగలవాని యాజ్ఞలోఁ
బెదవిఁ గదల్పఁజాల రరవిందభవప్రముఖామృతాంధసుల్

చం. ప్రతిమల పెండ్లిసేయుటకు వందలు వేలు వ్యయించుఁగాని దుః
ఖితమతులైన పేదల పకీరుల శూన్యములైన పాత్రలన్
మెతుకు విదల్ప దీ భరత మేదిని ముప్పదిమూఁడుకోట్ల దే
వత లెగవడ్డ దేశమున భాగ్యవిహీనుల క్షుత్తు లాఱునే

మ. పరమార్థంబులు బోధసేయుదురు లోభస్వాంతులై నిత్యమున్
గురువుల్ ముక్కుకుసూటిగాఁదగులు యుక్తుల్ పన్ని కైవల్యపుం
దెరువుల్బాపి మహాపరాధివనుచున్ దీర్మానముల్ సేయుచుం
దురు వేదాంతరథంబు సాగదనుకొందున్ నేను లేకుండినన్

మ. ఒగి సంసారము దిద్దికొంచుఁ గర మత్యుచ్చస్థితిం దూఁగుచుం
బగలెల్లన్ మునివృత్తి నుండి యనుకంపన్ శర్వరీవేళలన్
వగలందూలు దరిద్రమూర్తుల సమాశ్వాసింప నేతెంచితే
ఖగసన్యాసిని! యర్ఘ్యరాల వకలంకంబైన మర్యాదకున్

తే.గీ. గిరుల గుండెలు కరఁగి నిర్ఝరము లట్టు
లుబుకుచున్నవి దిశల నన్నూఱడింపఁ
బక్షికళ్యాణి! సోదర ప్రజలకంట
నిర్గమించెనె యొక్క కన్నీటిచుక్క

శా. చుట్టాలేగద వాలఖిల్యు లినతేజుల్ యోగవిద్యానిధుల్
పుట్టుందాపసు లార్ద్రచిత్తులు మహాత్ముల్ వైనతేయస్తుతిన్
జెట్టుం గొమ్మఁ బరిత్యజించిన పరశ్రేయస్సుఖాకాంక్షు లో
పిట్టా! నీకు నమస్కరించెదను నా విజ్ఞప్తి నాలింపవే

ఆ.వె. ఈ ప్రశాంతరాత్రి యెల్లలోకంబును
బుజ్జగించి నిద్రఁ బుచ్చు కొనియె
నౌషధంబులేని యస్పృశ్యతాజాడ్య
మందభాగ్యు నన్ను మఱచిపోయె

తే.గీ. కర్మసిద్ధాంతమున నోరు కట్టివేసి
స్వార్థలోలురు నా భుక్తి ననుభవింత్రు
కర్మమన నేమొ, దానికీ కక్షయేమొ,
యీశ్వరునిచేత ఋజువు చేయింప వమ్మ

తే.గీ. ఆలయంబున నీవు వ్రేలాడు వేళ
శివుని చెవి నీకుఁ గొంత చేరువుగ నుండు
మౌనిఖగరాజ్ఞి! పూజారి లేనివేళ
విన్నవింపుము నాదు జీవిత చరిత్ర

శా. ఆ పూజారులు విన్న నీకగును బ్రాయశ్చిత్త మీశానుఁడున్
గోపించున్ వివరింప నేమిటికి నీకుం బొమ్ము వార్ధక్యమున్
దాపై పెంజెడ దెల్లనైనది నిశీథస్త్రీకి నా ఖేటక
వ్యాపారంబుముగించి నీ పొరుగుగూబల్‌గూండ్లకున్ బోయెడిన్

కం. పసమించు నీగరుత్తుల
విసరి శ్రమంబడపి నన్నుఁ బ్రేమించిన నీ
యసమోపకారమునకుం
బసదన మిడలేక నే ఋణస్థుఁడ నైతిన్

తే.గీ. నీ నమస్కారముల నిక్కి నిక్కి నడువఁ
బక్షిణీ! నాకు నుద్యోగబలము లేదు
మెచ్చఁదగు నీ కళాశక్తి మచ్చరింప
ఖగసతీ! నాకుఁ గులము యోగ్యతలు లేవు

తే.గీ. స్వార్థమున నిన్నుఁ గొఱముట్టువలె గణింపఁ
గడుపునిండిన భాగ్యవంతుఁడను గాను
దోషములు సూపి నీకు నీతులు వచించి
దొరతనము సేయఁగా మతస్థుఁడను గాను

మ. మృగపక్షిత్వ విచిత్రధర్మములు మూర్తిన్ దాల్చియున్నట్టి నీ
మొగముం జూడదు లోక మట్టి శకునంబుల్ ప్రాతపట్టింపులు
న్దగవీ పేదకు రమ్ము గబ్బిలపుచానా!నాదు స్వాంతంబులో
దిగులుంబాపి పినాకపాణి కొక సందేశంబు నందింతువా?

ఆ.వె. ధర్మమునకుఁ బిఱికితన మెన్నఁడును లేదు
సత్యవాక్యమునకుఁ జావు లేదు
వెఱవనేల నీకు విశ్వనాథునిమ్రోల
సృష్టికర్త తాను సృష్టి వీవు

చం. నరునకుఁ జేరరాని సదనంబున వాసముసేయు నీశ్వరే
శ్వరునకు నా నమస్కృతు లుపాయన మిమ్మొకవేళఁగారణాం
తరముల వెండి పర్వతమున న్నివసించుచు నున్నఁ బక్షిసుం
దరి! యొకపూట యానమకదా! యిది నీకుఁ బరోపకారిణీ!

శా. గౌరీనాథుఁడు కాశికిం జనెడు మార్గంబందు రా మేఘపుం
జాఱున్ జుక్కలతోఁట నాటుకొని మింట న్నీకుఁగన్పట్టు
దారిం బొమ్మొక వేళఁ జూచెదవు భూతస్వామిని న్నీకుఁ జ
త్వారం బేర్పడి దారిఁ దప్పెదవు గాదా! భానుఁడే తెంచినన్

తే.గీ. ఛత్రముల వంటి నీలి పక్షములు విచ్చి
నీవు బ్రహ్మాండమునఁ బయనించు వేళఁ
జిత్తజల్లుల ముమ్మాయి ముత్తియములు
జలధరస్వామి నీ మీఁదఁ జల్లఁ గలఁడు

సీ. మొలక సంధ్యారాగమునఁ గెంపు లెగఁజిమ్ముఁ జరమాచలంబునఁ జరణమూఁది
సెలయేటి నీట నీఁతలు గొట్టి విహరించు మరుదంకురముల సన్మాన మంది
కొండకొమ్ముల నెదుర్కొని తుత్తునియలైన తోయదమ్ముల మీఁదఁ దుఱఁగలించి
కలహంస పొదిగి పిల్లలుసేయు మిన్నేటి జాంగలంబుల మీఁద సంచరించి

ఆ.వె. చిలుక లెంగిలింపఁ జిటిలి తేనియలూరు
స్వాదుఫలము లెలమి నారగించి
కొన్నినాళ్లపాటు కుటిల సంసారంబు
దిగులు మఱచి రమ్ము ఖగ వధూటి

తే.గీ. సాత్వికాహారిణీ తపశ్చర్య కతన
నీ మనంబున జాలివెన్నెల రహించు
నాదు కన్నీటి కథ సమన్వయముసేయ
నార్ద్రహృదయంబుఁగూడఁ గొంతవసరంబు

కం. బిడ్డలఁగని పాలిచ్చెడు
దొడ్డతనంబున్న పుల్గుదొరసానివి, నా
కడ్డుపడ దిగిన వేలుపు
గిడ్డివి నా మనవి నాలకించెదవు గదా!

శా. నీ యౌదార్యగుణంబు మెచ్చెదరు సందేహంబు లేకుండఁగా
నాయుష్మంతులు నీ కుమారులు మగం దంగీకృతిం జూపి, నీ
వా యెత్తైన నగంబు కొమ్మల విహాయశ్కేశు నావాసమం
దూయేలూగి కృతార్థురాలవయి రమ్మో పుల్గు పుణ్యాంగనా!

తే.గీ. పక్షిసుందరి! నీ చిన్నికుక్షి నిండ
నిన్ని నీరంబుఁ బలహార మున్నఁ జాలు
నెన్ని దేశాలు తిరిగిన నేమి నీకు
నీవు నావలెఁ బుట్టు బానిసవు కావు

మ. తడవైనన్ గుడి గోపురంబులను సందర్శించుచుం బొమ్ము నీ
కడవుల్ కొండలు నడ్డుసేయవు గదమ్మా! వ్యోమయానంబునన్
సుడిగాల్పు ల్సెలరేఁగినన్ నిలువవచ్చుం ధర్మసత్రాలలోఁ
బిడుగుల్ వడ్డఁ బ్రవేశయోగ్యతలు పాపి న్నాకు లేవచ్చుటన్

కం. అందందు ఫలవనంబుల
విందుగుడుచు చల్ల నల్ల విశ్రామ మణీ
మందిరముల నిద్రించుచు
ముందుకుఁ జనఁ దోఁచు నెన్నొ పుణ్యస్థలముల్

కం. కొమరారు దంజనగరము
సమీపమునఁ గలదు తెలుఁగు సౌరభ్యంబుల్
గమగమ వలచిన చోటది
యమరున్ రఘునాథరాజు నాస్థానంబున్

సీ. కృష్ణరాయలవారి యెడఁబాటు చీఁకట్లు ముసరి దిక్కులలోన మసలువేళ
భూరి వాఙ్మయలక్ష్మి దారిబత్తెము తోడఁ దంజాపురము వంకఁ దరలు వేళ
వేంకటకవి తెల్గు పంకేరుహాక్షికి శ్లేషోక్తు లలవాటు సేయువేళఁ
బచ్చపచ్చని ముద్దుపళని ముద్దులకైత శృంగార రసము వర్షించు వేళ

తే.గీ. మువ్వగోపాల దేవుని పూజ సేయ
ఘనుఁడు క్షేత్రయ కల మందుకొనిన వేళ
నపరరాయలు రఘునాథనృపతి విభుఁడు
కట్టుకొన్నాఁడు సత్కీర్తి కుట్టిమంబు

మ. తను వుప్పొంగ సరస్వతీమహలు సందర్శించి తంజాపురీ
మనుజాధీశుల యోలగంబును పరామర్శించి పొ మ్ముత్తరం
బునకున్ ద్రావిడభూములంగడచిపోఁబోఁదోఁచెడిన్ వాఁడువా
అనిశౌర్యంబుసుమించుఁ దెల్గు పొలిమేరల్ నేత్రపర్వంబుగన్

మ. యతియుం బ్రాసయులేని సంస్కృతకవిత్వారణ్యమందున్న భా
రతవేదానఁ బదేనుపర్వముల కాంధ్రత్వంబు నేర్పించి శా
శ్వతుఁడై పోయిన తిక్కయజ్వకు నివాసంబైన నెల్లూరికిన్
నతులర్పింపుము స్నానమాడు మతిగణ్యంబైన పెన్నానదిన్

కం. ఒకపల్కు జాణతనమున
సకియలు నెల్లూరిసీమ సత్కవి వరులం
దికమకలు పెట్టఁగలరని
పుకారు గల దది యబద్ధమో నిక్కువమో

శా. హంపీక్షేత్రముఁ జూచి పోవలయు నమ్మా తెల్గురాజ్యంపు నై
లింపశ్రీల కొకానొకప్పు డది కేళీరంగ మేతద్రమా
శంపావల్లరు లాటిపోయిన ప్రదేశంబందు నీ బందుగుల్
కొంపల్గట్టి నివాసముండెదరు నీకుం గూర్తు రానందమున్

మ. పరదాపద్ధతి మాన్పిరో సిరికిఁ గుప్పల్వోసి యంగళ్ల యం
దురుమాణిక్యము లమ్మినా రచట మున్నో పక్షిణీ!మూరురా
యరగండండు మహేంద్రవైభవముతో నాంధ్రక్షమామండలిన్
బరిపాలించిన నాఁటి పెంపును దలంపన్ మేను గంపించెడిన్

చం. పగతు రసూయచేతఁ గరవాలములన్ దనువెల్లఁ జెండినన్
జిగిరిచియున్న యుగ్రనరసింహుని భీమదృగంచలంబులన్
బొగలుడి వోవలే దతని మ్రోల నిమేషము నిల్వఁజాలినన్
ఖగసతి! నిన్ను ధైర్యవతిఁగా గణియింతురు వీరయోధులున్

ఉ. ఏనికవంటి సాసువు గణేశుని నున్నని బొజ్జమీఁదఁ గా
లూనఁగ లేదు తుమ్మెద, తదుజ్వలశిల్ప మఖండ తుంగభ
ద్రానది కప్పగించుకొని దద్దమలైన తెలుంగువారి వి
ద్యానగరాన జిందుమొక యశ్రుకణంబు నుపాయనంబుగన్

చం. సరసుఁడు కృష్ణభూవిభుఁడు స్వారియొనర్చిన పారసీహుమా
దొరల ఖురాగ్రహల్యలను దున్నిన భూములలోన నాంధ్ర సుం
దరు లొకనాఁడు నాటుకొనినారు దిగంత జయ ప్రరోహముల్
గరిసెల నించినా రురువుగా ఫలియించిన సుప్రతిష్ఠలన్

సీ. మూరురాయరగండఁ డూ రేగ డీనాఁడు విద్యానగర రాజవీథులందు
మేలైన పట్టుడేరా లెత్తరీనాఁడు పారసీక గుఱాల బేరగాండ్రు
ఇనుపరోకళ్ల సాధన సేయవీనాఁడు కొమ్ము నిక్కిన భద్రకుంజరములు
తెలుఁగు స్కంధావారముల నిండ దీనాఁడు మరఫిరంగుల తెల్లదొరల దండు

తే.గీ. మణిమయంబైన యాంధ్రసామ్రాజ్య రథము
భువికిఁ గ్రుంగిన పదియు నాఱవ శతాబ్దిఁ
గృష్ణవిభు వీటఁ బ్రొద్దు గ్రుంకినది మొదలు
ఋషిఖగాంగన! తెల్లవారినది లేదు

సీ. కంచెర్ల శ్రీకృష్ణ గంధర్వుఁ డేలిన నగరంబు దున్నించి నారు వోసి
వినుకొండ విభుని రాయనిభాస్కరుని కోటబురుజులూపున నేల కొఱగఁ దన్ని
పల్నాటిదొరల శుంభత్ప్రతాపజ్వాల సాటికెక్కని నాగులేటఁ గలిపి
వినుతిఁ గాంచిన కొండవీటి సామ్రాజ్యంబు నుక్కుకత్తుల బావి కొప్పగించి

తే.గీ. యుడుకు నెత్తుటఁ జేతులు గడిగికొన్న
కాలపురుషుని పెను దుండగములు దలఁచి
మనసు నలిగిన గుంటూరు మండలంబు
నరసి పోవమ్మ జన్మ ధన్యత వహింప

కం. ప్రొద్దునకు వన్నెఁ బెట్టిన
యిద్దఱు భాస్కరులు పుడమి నేలఁగ సొగసుల్
దిద్దినది మేన, వయసునఁ
బెద్దది గుంటూరు సీమ పెఱ సీమలలో

మ. ఖరుచైపోయెఁ దెలుంగు రక్త మతిలోకస్వచ్ఛశౌర్యంబు సో
దరి! వ్యర్థంబగు కోడిపందెపు తగాదాలందుఁ బల్నాటిలో
నరుదారన్మివిలె న్వినోదముగఁ గార్యంపూడి తిర్నాళ్ల త
త్కరవాలంబులు త్రుప్పువట్టియిపుడున్ గల్పించునారాటమున్

కం. కృతులంది కృతులొసంగిన
వితరణ రతులైన కొండవీటి నృపుల యు
న్నతియుం బతనం బిప్పుడు
కృతులై కొండల నలంకరించి జితించెన్

చం. విసిగి విరక్తి చేఁ దెలుఁగు వీధులలో నొక పిచ్చివానిగా
మసలిన రెడ్డిరాజు మునిమాన్యుఁడు వేమన యాశుధారగా
విసరిన కావ్యముల్ శ్రవణపేయముగాఁ బ్రతిశబ్దమీనెడిన్
దెసల నలంతి పోలికలఁ దీయఁదనంబున భావసంపదన్

మ. జలదవ్రాతము తోఁడుగా యవలఁ గృష్ణాతీరదివ్యస్థలుల్
గలయం గ్రుమ్మరి సాగిపొమ్ము కవిలోకబ్రహ్మనన్నయ్యకున్
నిలయంబై తగు రాణ్మహేంద్రపురికిన్ విద్వత్సభారంజిత
స్థలికిన్ బూర్వచళుక్యభూపతుల రత్నస్థాపితాస్థానికిన్

ఉ. ఎచ్చటఁ జూచినన్ బ్రతిపదిందుకళంబలెఁ బచ్చపచ్చగా
రచ్చలకెక్కు గన్నడ సరస్వతి నారసి, మానసంబులో
మచ్చరకించి, నన్నకవి మాన్యుఁడు రాజమహేంద్రునానఁదా
నిచ్చటఁ జేయిజేసి కొనియెన్ బ్రథమాంధ్రకవిత్వ సృష్టికిన్

కం. రెండున్నర పర్వంబులు
పిండిన రస మొలుకునట్టి పెను జెఱకు గడన్
బాండవుల చరిత నన్నయ
పండించెన్ దెలుఁగు లోనఁ బ్రజ్ఞాన్వితుఁడై

తే.గీ. జనవిభుండైన విష్ణువర్ధనుని నాఁటి
గౌతమీగంగ నీకు స్వాగత మొసంగు
వీరమాగాణముల నుద్భవిల్లునట్టి
గతిక పోచయు నాకర్షకమ కదమ్మ

మ. తొలి సారంగధరుండు వట్టి యపవాదు న్నెత్తిపైఁ దాల్చి క
త్తులపాలైన విషాదగాథ వినలేదో నీవు చిత్రాంగి మే
డలలో మూలుగుచున్న విప్పటికిఁ గూడన్ బావురాల్, నీతికిన్
బలియైపోయిన రాజనందనుని దౌర్భాగ్యంబు నూహింపుచున్

శా. అజ్జాయింతువొ చుట్టుమార్గమని ద్రాక్షారామ భీమేశ్వరుం
డుజ్జీలేని దయాస్వభావుఁడు ప్రభావోల్లాసి ముప్పొద్దులున్
గజ్జంగట్టెడి నాట్యగాఁ డతఁడు సాక్షాత్కారమున్ జెందినన్
మజ్జాత్యుద్ధరణంబుఁ గల్గఁగల దమ్మా! పొమ్ము సేవింపఁగన్

కం. నిద్దంపు లేఁత కస్తురి
ముద్దవనుచు నిన్నుఁ జూచి, ముచ్చటపడి రో
ముద్దియలు ముచ్చటించెద
రొద్దిక శ్రీనాథకవి బహూకరణముగన్

కం. అరవింద రత్న మండిత
తరంగరథమెక్కి విభుని దర్శనమునకై
పరువెత్తుచున్న గోదా
వరి తోడుగఁ బొమ్ము దక్షవాటి నగరికిన్

కం. అమృతమ్ము విషము వాక్కున
నమరిన కవిరాక్షసునకు నావాసంబై
కొమరారు నపరకాశిక
సుమి కడుమహిమాఢ్యమైన చోటది పతగీ

మ. అల బుస్సీదొర కొల్లగొట్టిన యనన్యంబైన మా వెల్మవీ
రుల విఖ్యాతపరాక్రమజ్వలన మూర్పుల్ జిమ్ముచున్నట్టి బొ
బ్బిలి కోటం గని దాటిపొమ్ము చటులావేశంబు దేహంబునన్
మొలుచున్ బొల్చు కవోష్ణ వీర రుధిరంబున్ జీవనాళంబులన్

ఉ. నాయెడ జాలిలేక చరణంబునఁ గత్తులు గట్టి ప్రాణముల్
దీయఁ దొడంగు రాజవితతిం దెలవార్చితిఁ దెల్లవారునే
నాయులివాలకింపని యనంత విభావరు లంచుఁ గొక్కురో
కో యని కూయుచున్న దదిగో తొలికోడి బడాయికొట్టుచున్

ఆ.వె. పూసపాటివారి ముఖ్యపట్టణమైన
విజయనగరమందు విశ్రమించి
జగము దద్దరిల్ల సకిలించినది తొల్లి
రాయరావు తుల గుఱ్ఱాలదండు

తే.గీ. నీవు బొబ్బిలి మీఁదుగా నిర్గమించి
మన్యము తరించి కొన్ని యామడలు నడువ
పలుచఁ బడిపోవు మన జిల్లు తెల్గుశోభ
తావు లెగజిమ్ము నోఢ్రవాతావరణము

మ. కరవాలంబునఁ గొల్చిరాయలు పరిష్కారంబు గావించుచున్
సరిహద్దుల్ సవరించి నాఁ డటు లొరిస్సాదాఁక ఆరాజభా
స్కరుఁ డెత్తించిన బొట్టునూరి విజయస్తంభంబుపై వేలుపుం
దెఱవల్ నిల్చి పఠింతు రాంధ్రుల విభూతిన్ ముక్తకంఠంబునన్

ఆ.వె. తేటయైన తీపినీట దిక్కులదాఁక
విస్తరించి రుచులు గుస్తరించి
చిల్కసంద్ర మింపుసేయుచుఁ గన్పట్టు
స్వచ్ఛమైన తెల్గు భాష పోలె

కం. చిట్టిమరు దంకురంబులఁ
బుట్టిన కెరటాల మొత్తములు తీరములన్
గొట్టుకొని మరలిపోవును
గట్టులెగయఁ జూచు చిలిపికవనముల వలెన్

కం. తగులున్నీకట మార్గమధ్యమున బౌద్ధస్తూపశైథిల్యముల్
మగధోర్వీశుల రాణివాసములు లీలాభర్మహర్మ్యావళుల్
జగముల్ మెచ్చిన శాక్యసింహుని యహింసాసూక్తి మాధ్వీక ని
మ్నగలం దేలిన పుణ్యభూములు నలందా పాటలీపుత్రముల్

ఆ.వె. ముక్తిదంబులైన పుణ్యస్థలములందుఁ
బ్రథమగణ్య మమ్మ వారణాసి
అన్నపూర్ణసేయు నాహారభిక్షతో
ముక్తిభిక్ష నీకు ముట్టఁగలదు

ఆ.వె. నదుల తోడికోడ లుదధీశు పెదభార్య
జాహ్నవీస్రవంతి జలముదేర
అతిథిపూజసేయు నన్నపూర్ణాదేవి
వారణారిఁగూడి వారణాసి

చం. కలరు కళాసముద్రములు గట్టులురాయగ నీదినట్టి ధీ
విలసితులైన పండితులు పెక్కురు వేదపురాణశాస్త్రముల్
బలికిన సత్కవీశ్వరుఁడు వ్యాసమునీంద్రుఁడు శిష్యకోటితో
మెలఁగె నొకప్పు డుండు నట మేచకకంఠుఁడు విశ్వనాథుఁడై

కం. మొగలాయి చక్రవర్తుల
మృగాంక కేతనము నింగిమెఱసిన డిల్లీ
నగరంబు దృష్టిగోచర
మగు ప్రోన్నత సౌధచుంబితాంభోధరమై

శా. ఆ డిల్లీపురి హస్తినాపురి సమాఖ్యన్ ద్వాపరంబందుఁ గొం
డాడం బడ్డది, ధర్మజుం డచట రాజ్యంబేలి చేయించినా
డీడుం జోడును లేని జన్నముల నెన్నేఁ గన్ను లున్నందుకున్
జూడన్ దగ్గ పురంబు సుమ్మచట వీచున్ భోగసౌరభ్యముల్

సీ. ముడిచె నిచ్చట కుంతి కొడుకు ద్రోవది కొప్పు పగవాని రుధిరంబు పరిమళింప
మెఱసె నిచ్చోట నాదరుషా కుతారంబు నిఖిల భారతము కన్నీరునింప
వెలసె నిచ్చోట పచ్చల బర్హిపీఠంబు షాజానురాజు నాస్థానవాటి
పెండ్లాడె నిచ్చోట పృథ్విరాజొక రోజు జయచంద్రు సుతను దోస్సార గరిమ

ఆ.వె. యుగయుగాల కథల నుదరాన జీర్ణించి
రాజరక్త నిర్ఝరములఁ దేలి
నవ్వుచున్న డిల్లి నగరంబు నందంబు
తరుగలేదు శిరము నెరియ లేదు

మ. సులతానీ సులతానులున్ మణిగణాంశుల్ దట్టుమిట్టాడు మే
డలలో వాసము చేసినారు నిజరాష్ట్రం బాకటందూలఁ బే
దల నోరూర భుజించినా రిచట ముక్తారత్నపాత్రంబులన్
గలమాన్నంబు సుఖించినా రఖిల భోగశ్రీ మహాడోలలన్

కం. కుతుబుద్దీనుఁడు నిల్పిన
కుతుబుమినా రనెడు గొప్ప గోపురము సము
న్నతమయ్యుఁ జెక్కుచెదరదు
శతాబ్దములనాఁటి శిల్ప చకచకితంబై

కం. చామనచాయ గలట్టిది
కామజనకు ననుఁగు భార్య కాళింది, వినీ
లామలకోమల వీచీ
చామరములు వీచి నీకు స్వాగతమిచ్చున్

ఉ. సూనుని కాయిలా తనకుఁ జొప్పడు లాగు నమాజుజేసి, య
ల్లా నలరించి యాది మొగలాయి నరేంద్రుఁడు, బేబరుం డుమా
యూనున కాయురున్నతులు సృష్టియొనర్చిన చిత్రగాథ, ఆ
గ్రానగరంబు కర్ణశుభగంబుగ నీకు నుపన్యసించెడిన్

కం. షాజాను నశ్రుజలకణ
మీ జగముపురంధ్రి దాల్చు నేడవ నగ ముం
టాజమహలు నిద్రించెడు
తాజమహలు దృశ్య మద్భుతంబు పతంగీ!

తే.గీ. కుహనా గోపుం డాగమ
రహస్యమగు గీత బాహిరము చేసిన శ్రీ
మహిత కురుక్షేత్రంబున
విహార మొనరించి పొమ్ము విహగవధూటీ!

మ. సుజనస్తుత్యుఁడు బోధిసత్వధరణీశుం డర్ధరాత్రంబునన్
నిజవాసంబు పరిత్యజించి, యతిశాంతి స్థాపనేచ్ఛామనో
బుజుఁడై, బిచ్చఁపుగిన్నెఁదాల్చిన మహాపుణ్య ప్రదేశంబులన్
మజిలీసేయుము రెండునాళ్లు ఖగభామా! జన్మసిద్ధించెడిన్

తే.గీ. లుంబినీ వన పరిమళోల్లసిత మగుచు
నేఁగుదెంచెడు నీ కర్ణ మీయఁ గలదు
గౌతముం డాదరించిన కనకహంస
నీరు గలియని మధుర గోక్షీరధార

సీ. దర్శింపఁగలవు గౌతమబుద్ధదేవుని ప్రాచీన భరత శిల్పంబునందు
సాధింపఁగల వహింసా మంత్రరాజంబు శాక్యసింహుని కాలి జాడలందు
తెలిసికోఁగలవు బౌద్ధుల సాహితీసేవ అమరసింహుని కవిత్వమున యందు
వీక్షింపఁగలవు కపిలవస్తు నగరంబు నాశన దేవ్యధీనంబు నందు

తే.గీ. రెండువేలేండ్ల క్రింద నిద్రించుచున్న
మౌర్యరాజుల విపుల సామ్రాజ్య చరిత
యేకరువుపెట్టు ప్రకృతి యం దాకళించి
వెచ్చ వెచ్చని కన్నీరు విడువఁ గలవు

ఉ. అక్కడనుండి యుత్తరదిశాభి ముఖంబుగ నిర్గమించు నీ
దృక్కుల నడ్డుచున్ హిమగిరీంద్రము దర్శన మిచ్చు దానిపై
నెక్క యతించి తెల్లదొర లీలిగి రెందరొ! వారి దేహముల్
స్రుక్కవు నేఁటికిం బులుఁగు సుందరి మంచుమహత్వ మెట్టిదో

చం. కరఁగిన మంచు బండలు ప్రగాఢభరంబునఁ బట్టుదప్పి, త
ద్గిరి శిఖరాలనుండి తలక్రిందులుగా దిగజారి లోయలన్
దిరిగెడు జీవరాసుల వధించుచు నుండును, పేదవారికిన్
జెఱపె కదా! బలాధికుల సేయము సంయమి పక్షిభామినీ!

తే.గీ. అందు నెవరెస్టు శిఖరాన నధివసించి
వ్రాసికొనవచ్చు భరతవర్షంబు పటము
దాని యున్నతి తారకాధ్వమును మిగులు
సులలితము లైన కవుల యూహలకుఁ దఱుగు

మ. కలహంసల్ సను వాయుమార్గముల రేఖల్ పర్వతాగ్రంబునన్
గలవా త్రోవలొ దక్షిణోత్తర దిశాగ్రవ్యాప్తముల్ ప్రోన్నతం
బులు నీకుం జన గాదు నిచ్చలు నిలింపుల్ గుంపులై రాక పో
కలు గావించెడు వెండి కొండ తెరవుల్ గన్పట్టు నైమూలగన్

తే.గీ. విహిత కైలాసయాత్ర గావించు నిన్ను
మంచుకొండల విభుఁ డాదరించఁ గలఁడు
అల్లునకుఁ గూఁతునకు వార్త లంపునేమొ
సమ్మతింపుము నుడులు భారమ్ము గావు

తే.గీ. అస్త్ర విద్యాభ్యసన వేళ నద్భుతముగ
కొంచకొండకు రంధ్రంబు గొట్టినాఁడు
చినతనంబునఁ బార్వతి చిన్ని కొడుకు
తారకాగిరి కదియ యుత్తరపు గవిని

తే.గీ. గిరుల మగవాని చెలిమి వ్యక్తీకరింప
మస్తమునఁ దాల్పు మొక చిన్ని మంచు తునక
విసపుమేతరి కది సిఫారసుగ నుండు
వ్యర్థములుగావు పెద్దల పరిచయములు

ఉ. మంచు ఫలించు నగ్గిరుల మాడులఁ గాఱు మొయిళ్లపై నుడా
యించి గమింపు మవ్వల మహేంద్రుని వీడు త్రివిష్టపంబు గ
న్పించు దలాయిలామలను వింత నృపుల్ పరిపాలనంబు సా
గించెద రిప్పు డచ్చరలు క్రీడ యొనర్పరు నందనంబునన్

శా. ఆలామాలకుఁ బెండ్లి పేరటము లేదా జన్మసన్యాస దీ
క్షా లగ్నాశయులై, ధరింతు రతి దీర్ఘంబైన కుళ్లాయముల్
మౌళిన్, వారి యనుజ్ఞ లేక విహరింపంబోల దెవ్వారి కా
నేలన్ బక్షివి నీకుఁ బోఁదగని క్షోణీమండలం బుండునే

శా. ఆ రాజ్యంబును గూబపట్టుకొని బిట్టాడించుచుండున్ దురా
చారంబుల్, వెడ నమ్మకాల కది వాసస్థాన మస్పృశ్యతా
క్రూరవ్యాఘ్రము సంచరించుటకు సంకోచంబులే దైన బౌ
ద్ధారామంబులు సాగనీయవు గదమ్మా! దాని యౌద్ధత్యమున్

తే.గీ. అసమ రుచిరాంబువైన మానస సరస్సు
కన్న కూఁతురు బుడుత గంగాభవాని
యెక్కి దిగుచుండు కొండల చక్కఁదనము
ప్రేక్షణీయంబు సుమ్ము గబ్బిలపుదేవి

చం. బలిసిన మేనులన్ జడల బఱ్ఱెలు కొమ్ముల వింత సింహముల్
బలె విహరించుఁ గొండల యుపత్యకలన్ సెలయేటిబీళ్లఁ గ్రో
ల్పులుల కళేబరా లచటి లోయలలోఁ బొరలాడు వాని య
మ్ముల కెనయైన శృంగముల పోటులఁ దూటులుబడ్డ పొట్టలన్

చం. జడనిధివంటి మానసము సాటికిరావు సరస్సు లెల్ల నం
దుడుగక రేఁగు పేరలల యూపున గట్టులఁ దాఁకి ప్రాణముల్
విడిచిన గండు చేపలుఁ గుళీరము లెల్లడఁ దీర భూములం
దడుగిడ రాక చీకి వికలాంగములై పడియుండు గుట్టలై

మ. దమయంతీ నలులకు దూ
త్యముచేసిన తొంటి పసిఁడి హంస విభుని చు
ట్టములందు పంకజోద్యా
నములందున నాలపించు నైషధ కథలన్

ఉ. నిండిన దోరవెన్నెలల నిక్కిన పచ్చిక మేసి, చాందినీ
కొండ బయళ్లలోఁ దిరుగు గోపతి నీకగుపించు నందు వే
దండవిరోధి దాల్చిన జటాటవిఁ బూచిన పూవు చంద్రమః
ఖండము గోచరించు నెఱకల్గల నీ కెఱిఁగింప నేఁటికిన్

మ. విలు నమ్ముల్ ధరియించి చెంచులు తదాభీలాటవీమధ్య భూ
ముల గన్పట్టిన నంజలింపుము మహాత్ముండైన భర్గుండు, భ
క్తుల కిష్టార్థము లీయఁగోరిన గణస్తోమంబుతో మాయ పం
దుల వేఁటాడుచు భిల్లుఁడై నరుల కన్నుల్ గప్పి క్రీడించెడిన్

కం. అచ్ఛోటి తబిసి రాజులు
నిచ్చలుఁ దపమాచరించు నీ కాతిథ్యం
బిచ్చెదరు పరుల విద్యలు
మెచ్చెద రీ గుణము నేఁడు మృగ్యంబ కదా!

తే.గీ. ఇప్పటికిఁ గూడఁ గ్రొంబొగ లెగయుచున్న
త్రిపురముల ప్రాఁత బూడిద దిబ్బ లచటి
కనతి దూరాన నీకుఁ బ్రత్యక్ష మగును
చిత్రముగ, పాపమున కెంత చేవ గలదొ!

సీ. వలరాజు పగవానిఁ గొలిచి ముందుకు సాగు తొలకరించిన నీలి జలధరంబు
మహిషుని వనిత లుమ్మలికింప గర్జించు సితికంఠు నిల్లాలి సింహరమణి
కొసరి దిక్కులు మేలుకొలిపి గానము సేయు కొమరుసాముల వారి కోడిపుంజు
తలమీఁద రతనాలు మొలిచి ముద్దులుగార నటియించు సర్పంబు నటకురాలు

ఆ.వె. కనులఁ జూచి రమ్ము కైలాసభూముల
వింతలెల్లఁ దెలుప వేళలేదు
నీకు శుభము గల్గు నిఖిలామరశ్రేణి
సరసుఁ డమ్మ బాలచంద్ర ధరుఁడు

ఉ. రేగిన గంధపుం దరుపరీమళముం గని మోసపోయి యం
దాగి పదంబుమోప వలదచ్చట కొమ్మల నాశ్రయించి, మి
న్నాగులు తాండవించు మరణంబును బుక్కిటఁబట్టి, యాపదల్
డాగిన తావులే వలఁపులం దొణికించి మనస్సు నీడ్చెడిన్

చం. పుడమి ననంతకాల రథమున్ గదలించి మనుష్యకోటిపై
నడిపి నశింపఁ జేయు యతనంబులు నీ బెదరింపు లిచ్చటన్
బడవని రుండమాలికలు పండ్లిగిలించి వెదంద నోళ్లతో
మృడుని గళంబునన్ జెనటిమృత్యువుతో నెకసక్కెమాడెడిన్

తే.గీ. ఒలికిపోయిన పండువెన్నెలల పాలు
క్రోలుచున్నది తపిత చకోరకంబు
ప్రొద్దువోయెను నీ చిన్ని భోజనమును
వెదకికొనఁ బొమ్ము తబిసి గుబ్బెతలరాణి

ఉ. వీనులు చిన్నవోవ వినిపించు నదే డబుడుక్కువాని ధ
క్కానినదంబు తూరుపు ముఖంబుగ, హైందవవీధి సభ్యతా
స్థానము గల్గు తాను మన సఖ్య మెఱింగినఁ గంటగించునో
మౌనిశకుంతమా చను ముమాపతి మేడకుఁ గోడి గూసెడిన్

ఉ. నన్నొకమారు నీ దరిసెనంబున ధన్యునిఁ జేసి భర్గుఁ దే
మన్నది చెప్పి పొమ్ము విబుధాలయ వాసిని నాకు లేరు నీ
కన్న శరణ్యు లాప్తులు వికాసితమైనవి తూర్పు రేఖలున్
కన్నఁపు దొంగతోడ సదనంబునకుం జనుమమ్మ పక్షిణీ!

తే.గీ. ద్వారములు లేని నాదు కుటీర లక్ష్మి
స్వాగతం బిచ్చి నీకు మర్యాదచేయు
నా యనుజ్ఞకు వేచియుండంగ నీకు
వలదు వలదమ్మ రాత్రిం దివంబులందు

కం. నిద్దుర మేల్కొని యల్లన
ఖద్దరు రాట్నంబు పౌరకాంత వహించెన్
ప్రొద్దు పసివాఁడు తూరుపు
ముద్దియ పొత్తిళ్లలోన ముద్దులు గురిసెన్

తే.గీ. వాని యిష్టార్థములు కూర్చుదాని పోలె
విశ్వనాథుని గుడికి గబ్బిలము సనియె
వేయి చేతుల పెనుకాపు వేగిరింపఁ
గచ్చ బిగియించె నప్పేద కార్మికుండు

# తొలిపలుకు

గబ్బిలము కైలాసమునకు సందేశం తీసుకొనిపోయి చిరకాలమైనది. మన పేదవాఁ డెదురు తెన్నులు చూడసాగినాడు. వాని సందేశ ఫలితంగా నాల్గుమూలల నుండి ప్రసన్న వాయువులు వీవసాగినవి. దేవాలయ ప్రవేశం, హరిజనోద్ధరణ మని గాంధీదేవుని చరకార్ఘూంకరణము శ్రవణశుభగంగా గానము చేసినది. సర్వసమత్వ మను మంత్ర రాజాన్ని భరతదేశం వల్లెవేయసాగింది. అరుంధతీసుతుని నిరాశాకాశంలో నాశాతటిల్లతలు మోసులెత్తినయి. తన చిరకాల దాస్యక్లేశాన్ని విస్మరించినాడు: గబ్బిలం తిరిగిదర్శన మిచ్చింది. ప్రఫుల్లవదనుడై తీయనిస్వాగత మిచ్చినాడు. పండా, కాయాయని ప్రశ్నించినాడు. పండైనదని ప్రకృతి ప్రత్యుత్తరమిచ్చింది. ఆత్మదేశం, ఆత్మభారతాంధ్రజాతిలో గల అనైకమత్యం, స్వార్థలుబ్ధత, బహుకులమతావేశ వ్యాధిపీడ, కాబట్టనితనం, నే డవనిలోని తీరని వేదనలు. తనదాస్య ముక్తికి తోడుగా, దేశానర్థకములైన అనేక సమస్య లతనిని కారింప సాగినయి. తన యిష్టదేవత తనజాతికేతన చిహ్నమైన గబ్బిలాని కతడు మరికొన్ని చింతాసందేశాలను చెప్పు కొనసాగినాడు. గబ్బిల మామూలాగ్రంగా ఆలకించింది. నోరు లేని పక్షి–మారుపల్కుటకు శక్తిచాలని ప్రాణి–ఏమని యోదార్పగలదు? ప్రదక్షిణించి కన్నీరుకార్చి, శివాలయానికి తరలిపోయినది. అతని వాక్కులు చావులేనివై, వాయు మార్గమున ప్రతిధ్వనించుచున్నవి. గణబద్ధములైనవి. రెండవ గబ్బిలమను కావ్యమై నిలిచినది. నేడుగాక మరొకనాడు ఫలించును. ఫలిత మనుభవించు భాగ్య మతని కున్నదో లేదో.

జి. జాషువ

# కృతిపతి ప్రశంస

మ. తొలిసందేశము చంద్రమౌళికిడి, సంతోషంబుగల్పించి, తె
ల్గుల యాశీస్సులు చూరలాడితి వనుంగుంబక్షిణీ! యిప్పుడీ
మలి సందేశము, సింహపట్టణము సంపాదించుకొన్నట్టి, దా
తల పై చేతికి రామిరెడ్డి కిడుమా దర్శక్షమాశాలికిన్

మ. ఘనతంగన్న సుదర్శనాంబయెద, నేకచ్ఛత్ర సామ్రాజ్య పా
లనగావించిన చక్రవర్తి, కులజుల్, గర్వింప విఖ్యాతి మం
డనమున్ దాల్చినమేటి, తిక్కవరపుంవంశంబు, నైశ్వర్యపున్
ఖనిగా దిద్దిన రామిరెడ్డి మణికిం, గైవారమర్పింపుమా!

సీ. వదరుబోతులు సిగ్గుపడ్డ రసోత్కటమైనపలుకు లింపున సర్ది వాడు వాగ్మి
అలఘు టుత్సవ మింటగలుగునాడును జరీఖండువా లెఱుఁగని, కర్మయోగి
ప్రమదపేరిటి యాబ్దికమునాడు, పేదలమృష్టాన్నముల దేల్చు మేటిదాత
ప్రకృతి శ్రీకృష్ణరాయలోయనఁ గవీంద్రశేణి నేటేటఁ దనుపురసికుఁ

తే.గీ. డాదమఱచి రిపులనైన కొండొక వేడి
మాటయాడనట్టి యమృతమూర్తి
తిక్కవరపు వంశ దినమణి. కృతిభర్త
యయ్యె, ధన్యురాలవమ్మ! నీవు

మ. పహరాయిచ్చుచు సర్వభోగములు సేవావృత్తి గావింపగా
సహజంబైన పవిత్రవర్తనకు లోపంబింత రాకుండగా,
మహనీయంబగు న్యాయమార్గమున ధర్మస్యందనారూఢుఁడై
విహరించున్ మన రెడ్డిరాజుశుభలబ్ధిన్ వింతయోగీంద్రుఁడై

మ. విహగీ! సింహపురాన రెడ్డికులజుల్ పెక్కంద్రుదారాశయుల్
సహపంక్తిన్ భుజియింత్రుపంచములతోఁ, జల్లారె నస్పృశ్యతా
దహనంబందుల రామిరెడ్డివిభు నాదర్శాశయంబుల్, జగా
రహదారుల్, ధరణీశుభోదయ రథ ప్రస్థానలీలాప్తికిన్

ఉ. అంచితమైన భారతమహాకృతి ఖాద్యమునారగించి, జీ
ర్ణించిన బొజ్జతో మసలు, నిశ్చలనీరధి, స్తోత్రపాఠకుల్
వంచనచేసినన్ శివముబట్టి నటింపని రామిరెడ్డిరా
ట్ప్రంచముఖంబు, నీకు గృతిభర్తృతఁదాల్చెనికేమికావలెన్

శా. అల్లుంద్రున్ గొమరుల్ కుమారితలు కారాగారవాసంబుచేఁ
దల్లిన్ భారతమున్ దనించిన యుదాత్తత్యాగ వారాన్నిధుల్
నెల్లూర్వేల్పు కటాక్షవీక్షణ రుచుల్ నిండారఁ బ్రఖ్యాతిలో
నిల్లుంగట్టిన రామిరెడ్డి మణి, నీ యిష్టార్థముల్ గూర్చెడిన్

ఆ.వె. శ్రీసుదర్శనాంబ, చిగురు కెంగేలితో
నాటిచన్న పూలతోటలందు,
విహరణంబొనర్చి, విశ్వవిచారంబు
విస్మరింపగలవు, విహగ సకియ

ఆ.వె. కాందిశీకుఁడనెడు గ్రంథ మాయమపేర
వ్రాసె నొక్క సుకవి, పరభృతంబు
తిక్కవరపువంశ దీపాల నిశ్చల
తేజమునకు నదియ గాజుకుప్పె

ఉ. శాంతి రమావిలాసినులు, సఖ్యముదప్పక వాసముండు శు
ద్ధాంతము శ్రీసుదర్శనమహల్, గులభేద పిశాచరాజ మ
య్యంతిక మందు కాల్గదుపు నర్హతలేదు, సుదర్శనాంబ స
త్కాంతుని కంటి లోన సమతారస వాహిని పొంగిపారెడిన్

మ. కరవైపోయిన సాహితీసభల నాకాంక్షించు, సర్వాంధ్ర సుం
దరి డెందంబునఁబాలువోసి, కవిసన్మానంబు లేటేట నె
ల్లురి వీట న్నెలకొల్పినట్టి కవితాలోలుండు నీవాణికీ
శ్వరుడయ్యెం గడుధన్యురాలవు, మునీశప్రేయసీరత్నమా

ఉ. శాంతినికేతనంబనెడు చక్కనిధేనువుపాడిద్రావి మే
ల్సంతతి ప్రేయసీవిరహశల్యమువాపి ముదంబుగూర్ప, న
శ్రాంతము భారతాభ్యుదయ రమ్యదినంబులుగోరు మంజుల
స్వాంతునిఁ జెట్టబట్టిన రసత్కళకుం జలనంబు గల్గునే?

మ. భళిరా! సత్కవివన్నమాట నెపుడోభాషించె నన్నారదుం
డెలమిన్ మున్ మణికంధరోక్తులకుఁగానీ; యంతమాత్రాన, మే
ల్భళిరా! సత్కవివౌదువన్ననుడి సంపాదింతురే దుష్కవుల్
పలుకన్నేర్చిన రామరాడ్విభునిజిహ్వన్ ద్రచ్చి, పక్షీశ్వరీ

జి. జాషువ

# గబ్బిలము

కం. గబ్బిలమేమని చెప్పెనొ
గుబ్బలియల్లుండు, కన్నుగోనల నశ్రుల్
గుబ్బటిల లేచి, నల్లని
మబ్బులలో తక్షణంబ మాయంబయ్యెన్

కం. తిరువానుకూరు దేవుఁడు
తెఱచెం గుడితలుపు లితర దేవుండ్లును బి
త్తరవోయి నిమ్నజాతుల
దరిసెనమున దరిసి రాత్మదౌర్భాగ్యదశల్

సీ. అంటరాని తనంబునంటి భారతజాతి భువనసభ్యత గోలుపోయెననుచు
క్షమకుమించిన కత్తి జర్మనీయుద్ధాన గనుగొన్న మొనగాడు గలుగడనుచు
కదురు రాట్నము చేతగాక స్వేచ్ఛాస్వర్గ ముదము జిక్కుట నభః పుష్పమనుచు
నూరేండ్లుగాదు మున్నూరేండ్లు మనవచ్చు న్యాయమార్గంబున నడువుడనుచు

తే.గీ. నిమ్నజాతుల కన్నీటి నీరదములు
పిడుగులై దేశమును గాల్చి వేయుననుచు
రాట్నమును దుడ్డుగఱ్ఱ కరానబూని
దెసలదోతెంచె, గుజరాతు ముసలిసెట్టి

తే.గీ. సీమగుడ్డకు కన్నులు చెమ్మగిల్లె
ముతకబట్టకు మర్యాదపొటమరించె
నగరివెలుపలి మాలమాదిగలు గూడ
నరులుసుమ్మని దేశంబు గుఱుతుబట్టె

ఆ.వె. వెఱపువలదు నీకు హరిజన సోదరా
స్వీయరాజ్యరథము వెడలివచ్చె
లాగిపొమ్ము నీకు భాగంబు గలదంచు
బాడుచుండె రత్న భరతమాత

మ. ఒక నా డామునిపక్షి, తొంటి చెలికాడున్నట్టి గేహంబులో
నికి నేతెంచి యథావిధిం దిరుగుచుండెన్ మిత్రుడీక్షించి, యు
త్సుకతంబొంగిc దరస్మితంబున నిదే జోహారహోపక్షిణీ!
యకలంకంబగు నీ సహాయమున నా యర్థంబు పండాయెనే?

శా. నా వర్ణించిన పుణ్యభూములను సందర్శించినావే? మహా
దేవుం డాయనదేవియుం దగిన యాతిథ్యంబు నీ కిచ్చిరే?
నా వాక్కుల్ జెవినాటితే? మహితరత్న స్వర్ణకాంతిచ్ఛటా
దావద్దివ్యహిమాద్రికందర పవిత్రక్షేత్రముల్ సూచితే?

ఆ.వె. పుడమి కలుషరాశి ముగ్గిపోవుచు నుండ
నాట్యమాడుకొనుట న్యాయమగునె
భర్గదేవ! సృష్టి పరికించి పొమ్మంచు
బిలిచివచ్చినావె? పులుగు చెలియ

తే.గీ. కాళిదాసుని మేఘంబు గౌరవంబు
తెచ్చుకొన్నదె నీదు సందేశగాథ
ఘనులుచేకొను భూభృదగ్రముల పూజ
యసమ చతురత్వమున్న బానిసకురాదు

తే.గీ. వ్యాస వాల్మీకిముని మదేభములు రెండు
దిరుగుచుండెనె? కైలాస గిరులమీద
వారి వార్ధక్యమున నీకు స్పష్టమగును
భరత రామాయణంబుల పదుచుందనము

శా. ఆ వాల్మీకి నిసర్గజంతు కరుణావ్యాసక్తి యే సత్కవిన్
గావించెన్ వెడలించె రామునికథా గాంగేయముం గానిచో
త్రోవల్గొట్టెడు బోయ కేగురువు నేర్పుం దివ్యగీర్వాణమున్
ఆవేశించి కళాధిదేవి వరమీయన్ విద్యలేమాత్రముల్

మ. ఎదురై వచ్చెనె కాళిదాసుని లసచ్ఛృంగార సందేశ మం
బుదమార్గంబునఁ దద్రసంబులు ధ్వనుల్ ముత్యాలువర్షించెడిన్
పదినూరేండ్ల పురాణ మేఘమనుచున్ భావింతువోనిత్యముం
బదియా రేండ్ల వయస్సు కూర్పదె సుకావ్యస్పర్శ జేజెమ్మకున్

మ. జనముల్ మెచ్చు రసప్రసిద్ధమగు నా సందేశ భారంబుతో
జనముల్సచ్చు విమానమాలికల గర్జాభీషణంబౌ ప్రభం
జన మార్గంబున నీ ప్రయాణమెటులన్ సాగించి నెగ్గించితో
చెనుక న్నేరవు గండముల్ తబిసిపక్షిజన్మ సన్మార్గులన్

కం. కన్నులు ధన్యంబులుగా
కన్నావే మంచుకొండ గగనము శిరముం
దన్నెడు దాని నమరగవి,
వెన్నవలెం ధవళరుచులు బిందెడుదానిన్

సీ. ఆకొండయే యిండియా విరోధులదండు గుండెగాలంబైన వెండికోట
ఆకొండయే ముత్తియపుదండ భారతోర్వీమాతృమణికిఁ గిరీటభూష
ఆకొండయే పర్వతాగ్రగణ్యములైన కులపర్వతముల నిక్కులకునిక్కు
ఆకొండయే రజతాచలస్వామికి మణిమయ కల్యాణ మంటపంబు

తే.గీ. సింధు గంగా మహానదుల్ చిన్ననాడు
ప్రాకనేర్చిన యపరంజి ప్రస్తరములు
పాదచిహ్నాలు పరికించి వచ్చినావె
కలుషములు వాయ, కన్నుల కఱవుదీర

ఆ.వె. ఇంద్రధనువుబట్టి సాంద్రాబ్దవనవాటి
మెలగు చున్నవాడు మృగయుఁడొకఁడు
వాడు గొంతుబిసికి వసుధపై విసరిన
జంతుతతులు నిమ్నజాతి జనులు

శా. ఆగర్భప్రతిభా సముద్రులగు శిల్పాచార్యు లూహింపగా
మూగంబద్ధ శకుంతముల్ పలికి గుంపుల్ గట్టి కీర్తింపగా
వేగుంజామున రంగులద్దు నల శిల్పి బ్రహ్మ దేగ్రామమో
భోగట్టాగని వచ్చితే? రసమయంబుల్ తత్కళాపద్ధతుల్

మ. బెళుకుంజూపులు గుల్కుపోకడలు చూపీచూపకూరించుచున్
జలదాగారములందుదోచెదరు కన్యల్ కొందరీక్షించితే
పులుగుంజేడియ యబ్ధిగర్భములలో ముత్యాలుపండించి భూ
ములకర్పించెదరంట, మేటిగహనంబుల్ సృష్టివైచిత్ర్యముల్

సీ. ఎంత కోయిలపాట వ్యర్థమయ్యెనో కదా! చిక్కుచీకటి వనసీమలందు,
ఎన్ని వెన్నెలవాగు లింకిపోయెనో కదా! కటికి కొండలమీద మిటకరించి,
ఎన్ని కస్తురిజింక లీడేరెనోకదా! మురికితిన్నెలమీద పరిమళించి,
ఎన్ని ముత్తెపురాలు భిన్నమయ్యెనొకదా! పండిన వెదురు జొంపముల లోన

ఆ.వె. ఎంత గంధవహన మెంత తంగెటిజున్ను
యెంత రత్నకాంతి యెంత శాంతి
ప్రకృతి గర్భమందు! భగ్నమైపోయెనో
పుట్టరానిచోట బుట్టుకతన.

మ. నెలలోనున్నది వృద్ధురాలొకతె గాంధీ శిష్యురాల్నిచ్చలుం
జిలుగున్నూలు తయారుచేసికొనుచున్ జీవించు జేజెమ్మ, కొం
డలయల్లుండు శిరాననుంచుకొని సన్మానించెడిం బండు వె
న్నెల పూదోటల విశ్రమించి మన సందేశంబు నాలించెనే

శా. నాచిత్తంబునదక్క తోచ దెచట న్నాతల్లిరూపంబు ధా
త్రీచక్రంబున, దేహమూడ్చి నరు లుర్వింబాసి వైకుంఠమం
దో! చండీశ్వరుడుండు మండలమునందో! యుందురంద్రెల్లరా
యాచోకీగని వచ్చితే మృతి భవిష్యన్మార్గముల్ విశ్వముల్

ఆ.వె. చంద్రచండకరులు సన్మార్గ గతులయ్యు
నొకనిజూచి యొక్కరోర్వజాల
రెండు కింత వైరమిరువురిలో ద్రావి
డీ డెవండు? తెల్గువా డెవండు?

మ. పవలింపారెడు సృష్టిఁజీకటి సిరాపంకంబునంబుంపి యి
ట్లవమానించెడు కొంటెవాడెవడు ప్రొద్దల్లంత గన్పట్ట వే
కువ నేమూల నణంగియుండు తమ సిగ్గుంజేటు యోజింప రీ
యవివేకుల్, విరమింప రీ దినదిన వ్యర్థప్రయత్నంబులన్

ఆ.వె. శివుడు తాండవించి చేకొన్న సత్కీర్తి
తన ప్రయోజకత్వమని తలంచి
విఱ్ఱవీగడంద్రు పెక్కురు నటకులు
విఱ్ఱవీగి కవుల విస్మరింత్రు

మ. వెలవాక్రుచ్చగరాని భావముల నన్వేషించుచున్ సత్కవీం
ద్రులయూహల్ విహగంబులై తిరుగుచుండున్ బ్రోన్నతా కాశమం
డలమస్తంబున నాకళించితె? ప్రయాణశ్రాంతి నమ్మంచుకొం
డలకున్ డిగ్గెడి, నీవిశేషము రసజ్ఞజ్ఞేయ మూహింపగన్

ఆ.వె. వడుకునూలుచేత బగ్గాలు పేనించి
దొడ్డమృగయు డుచ్చు లొడ్డినాడు
తగులుకొనునొ! కాక తప్పించుకొనునొక్కొ
స్వీయరాజ్య మనెడు సింహరాజు

మ. నరులన్ ముట్టక నందులం గొలిచి పుణ్యంబెల్ల సాధించు న
ప్పరమంబైన రహస్యమున్ శివునితో ప్రస్తావముంజేసితే
పరమేశుం డివి నిమ్నజాతులకు సంప్రశ్నింపగా రాని వే
ద రహస్యాలని కోపగించుకొని స్వార్థంబుం బ్రదర్శించెనే

కం. బసుమంబు బూసికొని యే
రసికతలేకుండ బ్రదుకు ప్రమథుల నడుమన్
రసికుడగు సుకవి జీవిత
మసిధారావ్రతము వలవ దది శత్రులకున్

కం. ఎవరికివారై బ్రదుకుచు
నవీన ధర్మములు పిచ్చి నమ్మకములతో
సవరించి ప్రజల తలలో
ప్రవేశ మొనరించు స్వార్థపరులంగంటే?

మ. దిరుసుల్ మార్తురు కొందరాంధ్రులవురా, దేశాంతరంబేగి,వ
త్సరముల్ పుచ్చి, త్రివిష్టపప్రజలతో సఖ్యంబుగావించి యె
బ్బెరికంబైన విదేశ నాగరకతో విచ్చేయ కచ్చాంధ్ర సుం
దరవేషంబు ప్రతిష్ఠనిల్పితివి సన్మానార్హ వెంతేనియున్

ఉ. చెప్పక చెప్పుచున్నది విశేషములేదని నీమొగంబు నే
తప్పొనరించి యింతటి వృథాశ్రమయిచ్చితి మాయదృష్టముల్
దప్పిన దప్పని మ్మనుగుతమ్ముల శ్రేయముగోరిభర్గునిన్
గుప్పెడు గుండెతో యెదురుకొంటి విదే పదివేలుపక్షిణీ!

తే.గీ. అపజయంబులు విజయ గేహంబు నిలుచు
స్తంభములు సుమ్ము నీకు విచారమేల
కొద్ది కొద్దిగ నిక్కిన గోడవోలె
సగము సగములుగా పనుల్ ముగిసిపోవు

ఉ. ఓటమిలేదు నా యతన మూరకపోదు తుపానువోలె నా
మాట లుమా మహేశ్వరుల మానసముం గదలించితీరు, క
న్నీటమునింగి పైకుబుకు నిర్మలసూక్తి ఫలింపకున్నచో
రాటములో స్వరాజ్యము విరాజిలుటల్ కృతకప్రచారముల్

మ. పలనాటన్ మును బ్రహ్మనాయనికృపాబాహుళ్యనేత్రంబులో
పల నాటంబడి నాయురాలి కృతకవ్యాపారదావంబులో
పల భస్మంబయి సంఘసంస్కరణ దీవ్యద్బీజ, మీనాటికిం
ఫలియించెంగద? గాంధిచే, యతనముల్ వ్యర్థంబుగా వెన్నడున్

శా. నీకావించిన రాయబారమునకు న్ని త్యాభిషేకంబుగా
నాకన్నీటిని కాన్కగా యొసగుచున్నానో దయాశాలినీ!
చేకొమ్మింతకుమించి నావలన నాశింపంగ లేదిట్టి నీ
బాకీదీర్తు స్వరాజ్య సౌధమున నావాసంబుసిద్ధించినన్

కం. ఏజాతి కెంతవచ్చునొ
రాజత్వంబంత నాకు రావచ్చుగదా?
నాజాతియెత్తు కేతన
రాజంబున నీదుమూర్తి వ్రాయింతుఁజెలీ!

ఉ. పెల్లుతమస్సులోన దురపిల్లెదుమాబ్రతుకుం దమస్వినుల్
భల్లునదెల్లవార్చగల బాబులు పెద్దలనేకు లుండగా
దెల్లనివేల్పు భిక్షకుని దిండికి బట్టకులేని కొందరా
యల్లుని నాశ్రయించి యకృతార్థుడనైతిని పిచ్చివాడనై

చం. మరచితి నాదిదేవుని సమానుఁడు బుద్ధునియంతవాఁడు భా
సురదరహాస చంద్రికల శుభ్రత లోన గలట్టివాఁడు, య
ద్దొరలకుగాదు వారి చెవిదూరినవారిని లక్ష్యపెట్టఁడ
ప్పరమమునిన్ సబర్మతి నివాసిని జూచితివే తపస్వినీ!

శా. ముల్లోక్కించుక వాలిపోయినను బాపూజీకి దీటైన శ్రీ
వల్లాభాయి పటేలు దర్శనము సంప్రాప్తించెనే నీకు నే
డల్లంతన్ గనుపట్టుచుండెడు స్వరాజ్యార్థంబు సర్వస్వమున్
గొల్లంబెట్టిన త్యాగి తా నత డెఱుంగున్ నా మనఃక్లేశమున్

శా. ధిక్కారించెడు రాచగుఱ్ఱముల స్వాధీనంబు గావింపగా
యుక్కుంగళ్లెము జహ్వారుం డతని విద్యుచ్ఛారదామూర్తి న
ల్దిక్కుల్ నిండి నటించుచున్న దనుచున్ దేశంబు లగ్గించు మా
చిక్కుల్ దీర్చుటవిస్మరింపదుగదా? స్వేచ్ఛాజయాంతంబునన్

మ. పసుపుం బచ్చని పూతపూచినది మువ్వన్నెల్ పిసాళింపఁ గాం
గ్రెసు మందారమనంతశాఖికలునిక్కెన్ దిగ్దిగంతంబులన్
బసలేర్పడ్డవి సర్వవర్ణములకున్ దచ్ఛాఖిశాఖాతతిన్
వసియింపన్ మనకుండ దేస్థలము దీవ్యన్మౌని పక్షీశ్వరీ!

మ. కల డంబేత్కరు నా సహోదరుడు మాకై యష్టకష్టాలకుం
బలియై, సీమకువోయిక్రమ్మరిన విద్వాంసుడు వైస్రాయి మే
ల్కొలవందుంగలదొడ్డవాఁడతఁడు నీకున్స్వాగతంబిచ్చి పూ
వుల పూజల్ పొనరించెనేయతని మెప్పుల్ నీజయారంభముల్

తే.గీ. నేను నా కను నహము ఖండింపలేక
పదియు నెనిమిదిశాస్త్రాలు పదునులుడిగె
నీవు నేనను సమత సంధింపగలిగె
తీవ్రతరమైన చిన్న మౌనవ్రతంబు

ఉ. వచ్చినవారు సీమనరపాలురమంత్రు లభీప్సితార్థముల్
దెచ్చిరి ప్రేమతోభరతదేశజులం దనియింపవచ్చి పో
వచ్చు, స్వతంత్రభారత సువర్ణకిరీటము, నేడుగాక రా
వచ్చు మరొక్కనాడు నెలవాసినతొయ్యలి తీర్థమాడదే

మ. గుడిలోదేవుడు చూచిపొమ్మనుచు నాకున్వార్తలంపింపగా
దొడగెన్ నల్పురచేత నీవెనుకవత్తున్ నన్ను రమ్మందువా?
తడవైనన్ మరణింతురెందరొ విముక్తాహార దీక్షాపరుల్
నడుమన్, నేనుసహింపజాలనొకయాంధ్రప్రాణిశుష్కించినన్

తే.గీ. గబ్బిలమవయ్యు శివుని లోకంబునందు
వలయుకదలిక గలిగించి వచ్చినావు
నిశ్చలంబైన కాసార నీరమునను
నలతి శిల చాలదే వలయములుదీర్ప

సీ. అర్థించి చనుదెంతు నగ్రహారముకన్న సర్వేశ్వరుని యింటి చౌకదనము
అడిగివచ్చెద వీటి నడిబజారునకన్న గుడిగోపురముల తక్కువతనంబు
పలికించికొనివత్తు బంతిబువ్వలకన్న తీర్థప్రసాదాల దేబెతనము
ప్రశ్నించివత్తును రాచబావులకన్న పాతాళగంగమ్మ పలుచదనము

తే.గీ. నిజము దేలిచికొనివత్తు నిన్న నేడు
నన్ను జూచిన నల్లంత నడుచుతనము
గుడికిరమ్మనినంతనే యొడలుమఱచి
పరుగులెత్తుట నాకంత పరువుగాదు

శా. ఎంతోదూరము పోవనేమిటికి నేడింటింటికిం బ్రాకి యా
శాంతవ్యాప్తముగారహించెడు స్వరాజ్యస్వర్ణసూత్రంబు, చౌ
దంతి స్తంభన మాచరించెగద? యేతద్దివ్యసూత్రంబు, మో
కంతైనిక్కినకట్టివేయగలదా యస్పృశ్యతావ్యాఘ్రమున్

శా. చాటింపించి మదీయజాతికి నభీష్టంబుల్ ప్రసాదింపగా
పూటాపడ్డది కొంతభారతము, రేపో! మాపో! రావచ్చు, నీ
నాటంగాదని కొంతభారతముపంతంబొప్ప వాదించు నీ
వోటెవ్వారి కొసంగితో తెలిపి న న్నో దార్పవే నెచ్చెలీ!

చం. ప్రియములుగాని సత్యములు పెక్కులునేను వచించుచుంటి, నీ
దయకెడమై తపింతునొ! యధార్థ పిపాసువులైనవారి య
వ్యయ కరుణావిశేష రుచిరాత్త మనస్కుడనై సుఖింతునో
భయపడనేల నాపలుకుపల్కులు బాష్పకణాభిరామముల్

ఉ. ఏకవి పిచ్చిగానడుచు పృధ్వికిలోబడి కీర్తికోస ము
ద్రేకము సంహరించుకొని దేశమువోయిన త్రోవబోవునో
ఆ కవి పేదుమూతి మగ దంబుజగర్భుని రాణిగారికిన్
సాకుడుబిడ్డ డాస్తిగల సామికి బేరసికప్రదాతకున్

శా. పుట్టంగావలె సత్కవీశ్వరుడు నీ పుణ్యాన మావంశపుం
బుట్టంజీలిచికొంచు సంచితకళా పూర్ణప్రభారాశియై
పుట్టంగూడదు పుట్టినం గలుగవెప్డున్ నిండుసన్మానముల్
గట్టా! యుచ్చతనీచతాయుత వితర్కభ్రష్ట దేశంబునన్

మ. పిడికెండన్నము బెట్టలేదెపుడు మా వేమన్న జీవించి న
ప్పుడు ముద్దుల్ మురిపించు మేలికవనంపుంబుగ్గలుప్పొంగి కా
ఆడవుల్ మొద్దులు మోసులెత్తునపుడౌరా! నేడు గోరీపయిన్
నడచుంబూజలుపుణ్యకార్యములు వింతల్ మాదయాధర్మముల్

ఆ.వె. బ్రతికియున్న సాయబాబెన్నడునుగాడు
చావకున్న వట్టి సాయబయ్య
తిరుమలేశుడైన తెలియడీ యర్ధంబు
చావు బ్రతుకులోని సారమిదియ

చం. సమతలు సఖ్యముల్ బెదవిజారినమాటలు కట్టుబాట్లు చ
ట్టములు పటుత్వమూడిన గుడారపుదూముడి బంధనాలు ధ
ర్మములు దయారసాల్ మొసలిరాలుచు నశ్రుకణాలు చిత్రచి
త్రములు మతస్వభావము లురామరగా వివరింపగల్గితిన్

ఉ. ఇప్పుడు గుందురాతివలె నీశ్వరుడై ముడుపుల్ గ్రహించు కో
టప్పయొకానొకప్పుడు గృహస్థుడుమానవమాత్రుడైన రాల్
రప్పలు వేల్పులై సకలరాసులు మ్రింగక మిన్నకుందునే
యప్ప! పులుంగురాణి! యిక నాసలు లేవు క్షుధార్తజాతికిన్

చం. మరణము వార్ధకంబను ప్రమాదమెఱుంగని కైత లల్లు న
బ్బురపుఁ గవీంద్రు రెడ్డికులముఖ్యుని వేమన చాకచక్యమున్
మరచి పురాణకావ్యరసమత్తుడు వీరుడు సంఘసంస్కృతి
స్థిరుడురచించె నాంధ్రకవిజీవితముల్ బొరపాటు చేయుచున్

ఆ.వె. దొడ్డరాళ్ళగుండ్లు దొరలించి పఠితల
బెదురుబెట్టు కవితవిస్తరించి
పండితులకుదక్క పరులకందకపోయె
దేవతలకు కామధేనువట్లు

ఆ.వె. కవిత చచ్చుదయ్యు, గథ పేరుగలదైన
గవికి కొంతకీర్తి గలుగవచ్చు
నెలలు తక్కువైన బలమైనతిండిచే
నుసురునిల్పుకొన్న నిసుగువోలె

ఆ.వె. వ్యాకరణశాస్త్రకారులు
క్షాకుఁ గకారంబు విరతిగన్పడదని చీ
కాకుపరతు రంతెకానీ
పాకము రసమింపుసొంపుఁ బరికించెదరే

మ. వ్యవహారంబున భ్రష్టమయ్యు రసభావస్ఫూర్తిగల్పించి మా
ర్దవముల్ శబ్దములెన్నియోకలుగ శాస్త్రజ్ఞానమాత్రుల్ పురా
కవితోన్మత్తు లెఱుంగజాలుదురె కుగ్రామీణభాషాబ్ధిలో
జవులూరించు తెలుంగుపల్కుల జగాస్వారస్యరాహాస్యమున్

మ. కనుగొన్నావుగదమ్మ కృష్ణవిభు డక్కాలాన భాషావనం
బునసాగించిన యష్టదిగ్గజరథంబున్ శారదావాహమున్
తెనుగుందేశము విస్మరించినది తద్దిగ్దంతి దంతావళ
ధ్వని, యధ్వానపుటద్రిగర్భముల నిద్రంబోవునాంధ్రత్వమున్

సీ. తెల్గు తేజంబెల్ల దిక్కులకెగ(బ్రాకి పగవాని బెదిరించి వచ్చునపుడు
తెలుగుశిల్పుల సుత్తెదెబ్బ ఖంగునమోసి చీనాకుపయనంబు సేయునపుడు
తెలుగుకవిత్వంబు దిగ్దంతులముఖాన బృంహితధ్వనులు గావించునపుడు
తెలుగుజెండాశక్తి నలుదెసల్ ప్రసరించి విద్యానగరవీధి వెలుగునపుడు

తే.గీ. రామలింగని హాస్యకార్యములు దలచి
నాల్గుదిక్కులు కడుపుబ్బ నవ్వునపుడు
నాట్యమాడిన యానందనవ్యలక్ష్మి
కానుపించెనె? శిథిలదుర్గముల యందు

ఉ. అక్కట! తల్లికోట సమరాంగన యాఖరు తెల్గుపోటుచే
యుక్కిరి బిక్కిరై తురకయోధులవంకకు వాలునాడు భూ
భుక్కులగండడౌ తెలుగుభోజుని పూజలు చూరగొన్న యా
టక్కరిదేవతల్ తనువు డాచుటనాకు నసహ్య మయ్యెడిన్

ఉ. తొంబదియేండ్లవృద్ధుడతి దోర్బల భీముడు రామరాజు డెం
తెం బరగండడౌ నృపమణీ సుత భర్త, మహమ్మదీయ ఖ
డ్గంబులకున్ శిరంబొసగి కష్టముదెచ్చినమాట ఆంధ్ర వ
ర్గంబు సహింపనేరని పరాభవమై భవమై దహించెడిన్

తే.గీ. తెలుగులందను నగరంబు తెలుగుకోట
తెలుగుకవి దిగ్గజంబులు, తెలుగుదనము
పొట్టిగుఱ్ఱమునెక్కిన పొగరుబోతు
టళియ రామునికతన, ముక్కలయిపోయె

సీ. విహరింపనేభీతి విడిచి మస్తమునెత్తి సకల సామ్రాజ్యమహా సభలలోన
వాక్రుచ్చ నేరాలు వగిలి బుగ్గలుజిమ్మ నతి నిశాతప్రబంధాదికములు
కల్పింప నే తెల్గు కళ్యాణికొప్పున సొగసైన కీరితి పొగడదండ
ఎత్తింపనేమేటి హిమవద్గిరులమీద శాశ్వత విజయ రాష్ట్రధ్వజంబు

ఆ.వె. పగరగర్భకుహరిస్ఫారిగావింప నే
యింటి గుట్టు బయటి కెక్కకున్న
సమ్మతించి జాతి కుమ్మక్కుగానున్న
కొండలన్ని పిండి గొట్టనొక్కొ

మ. అది మారత్నము లారబోసికొను విద్యాశారదాపీఠ మ
ల్లది మా కత్తుల ఖారుకానమది యాంధ్రాదిత్యబింబంబు సం
పద సొంపారిన మాల్యవంతమని డంబంబొప్ప చాటించు స
మ్మదసౌఖ్యంబొక తెల్గువీరునకె సంప్రాప్తించెముమ్మాటికిన్

మ. కలవెన్నో విషయంబు లాంధ్రుల కళాకౌశల్యముల్ సాటు తా
వులు ప్రత్యర్థులగుండెలో వెఱపు నిప్పుల్ సల్లు గాథావళుల్
కలవిప్డున్ బలనాటిపౌరుషపురేఖల్ మాశరీరంబులన్
కలుపుంగోలుతనంబు లే దది కళంకంబంద్రుమాజాతికిన్

సీ. ముసలిమానులలోని యసమసమత్వంబు లంగోటిగట్టి చెలంగుచుండ
ఘూర్కాసిఫాయిాల కుటిలశౌర్యజ్వాల నట్టింట కాపలానడుపుచుండ
ద్రవిడుల కార్య సాధన, ధనార్జనదీక్ష సాంబారునోరెత్తిచాటుచుండ
రాష్ట్రాంతరములకు బ్రాకి హిందీభాష పదుగురినోళ్ళలోనెదుగుచుండ

ఆ.వె. అఖిల దేశములకు నవతంసకుసుమంబు
రాజతోగ్రకదనరక్తతిలక
మాన ధనికురాలు, మా తెల్గుటిల్లాలు
కలత జెందదౌర కాలమహిమ!

ఉ. గౌతమిగంగలోన మృతకాంతులతో నుదయంబుగన్న వి
ఖ్యాత మణీ వితానము మహమ్మదురాజుల దండుదెబ్బతో
తాతలనాడ పోయె నిక తాతలుబుట్టినరావు, రత్నదీ
పాతత కాంతులీను గృహమక్కట నూనెకు దేబెరించెనే

మ. రతనాల్ దొంగలు దోచుకున్నపుడు శౌర్యశ్రీలువిద్రోహిభూ
పతులేటేట మృదుక్తి చాతురులచే బంధించునాడేని, భా
రత చండీశ్వరి కోటిహస్తముల దర్పంబుంబ్రదర్శింపదో!
ధృతిహీనంబగు భిన్న భిన్న మత విద్వేషంబు పాటించెనో!

శా. గప్పాల్గొట్టిన నేమిలాభము ధరా గర్భాన నిద్రించు కృ
ష్ణప్పల్ దాతలు లేచివచ్చెదరె వీరావేశవిభ్రాజితుల్,
నిప్పుంబోలు తెలుంగువీరు లిపుడున్ జీవించియున్నారలీ
చప్పంబడ్డ యనుంగు సోదరుల కుత్సాహంబు సంధింపగన్

సీ. ఏనాడు మా కావ్య సృష్టికర్తల జిహ్వ విశ్వసత్యము నాలపింప గలదొ!
ఏనాడు మా జాతి దృష్టి మాంద్యమువాసి చుట్టుప్రక్కల దేరి చూడగలదొ!
ఏనాడు మా బుఱ్ఱ లీ జుట్టు తలలేని పుక్కిటి కథలలో జిక్కువడవొ
ఏనాడు మావిద్య లినుపసంఘమునందు చిలుముపట్టక ప్రకాశింపగలవొ

తే.గీ. తనువుదాచక సోమరితనముమాని
యెన్నడీమతంబులు బిచ్చమెత్తుకొనవొ
అట్టిశుభవేళకై కొంగుబట్టి నిలచి
నలిగి వాపోవుచున్నది నామనస్సు

సీ. ప్రభువుల పెండ్లి పేరంటాలు వర్ణించి కాలంబు పెక్కేండ్లు ఖర్చుపెట్టి
విరహవేదన మేనుమరచి మూర్ఛలువోవు రాణివాసంబును రచ్చకీడ్చి
అంగాంగ వర్ణనా వ్యసనంబు రెట్టింప యువకజీవిత కోటి కుచ్చులొడ్డి
పదియునెన్మిది మార్లు బాడిన శ్రీరాముచరితంబు వగరెక్క తిరుగబాడి

ఆ.వె. శరణు శరణటంచు బరుగులెత్తుచు వచ్చు
నార్తలోకరుత మనాదరించి
భువన హితముగోరు కవితాకళాశక్తి
స్వార్థజడధి నూరవైచినారు

ఉ. పెద్దలశల్యముల్ బలె వివేక మొసంగని గ్రంథరాసులే
విద్దియలైన నింక బదివేలయుగా ల్దలకాయలేని గం
గెద్దులు బుట్టి సార్థపరులెత్తిన గంతలుమోసి తీరెడిన్
బుద్ధి చిగుర్చునే యరుచి బుట్టుకథల్ దలమీదరుద్దినన్

ఉ. ఆడుది లేకయున్న గృతికందములేదని నమ్మి యెన్నడో
పాడి రనుత్తమ ప్రణయ బంధురగీతము లర్థతృష్ణ వె
న్నాడకవుల్, మహీపతి బృహన్నల వర్గము సంతసింప, నీ
నాడురచింతు, రిద్ధకరుణాపరిణద్ధ రసప్రబంధముల్

ఉ. మొన్నటియుద్ధదేవతకు బుట్టినకూతురు క్షామదేవి మృ
ష్టాన్నముగా భుజించిన క్షుధార్తుల డొక్కలు శల్యరాశి, సం
పన్నుల వీధులందు గనుపట్టెనె? వంగకవీంద్రకోటి చే
కొన్నకలాలెఱుంగ వనుకొందు దయారస నవ్యకాయముల్

మ. చలిచీమం బొలియింపనేరని యహింసానిమ్నగల్ ఊలలో
మొలిపించెం బహుబుద్ధవిగ్రహచయంబుం భారతం బంతటన్
కలయైపోయెనొ తత్కృపాగుణముబంగాళంబులోఁబ్రేమమూ
ర్తులు లేరో భుజియింపరో ద్రవిణవంతుల్ మేలిమృష్టాన్నమున్

ఉ. ఎట్టునశించిపోయె నితరేతర విశ్వసనంబు లెందుకీ
చట్టములుం బ్రమాణము లసార మషీరస పత్రలేశముల్
కొట్టిన గొట్టుమం చెదిరి గుండియలం గరగించు ధర్మముల్
బుట్టినగడ్డలో నకట ఫూత్కృతిసల్పు నశాంతిసర్పముల్

మ. అనఘం దశ్రు మషీజలంబున వివేకానంద సన్యాసి, వ్రా
సినవ్రాతల్ దడియారలే దిపుడు ప్రాచీనంపు టజ్ఞాన బం
ధన విచ్ఛేదమొనర్చి యే ఘనుడు విద్యాభిక్షగావించి, ప
చ్చని బంగారమువంటి మా భరతసంసారంబు నెగ్గించునో!

శా. గాలిందూలెడు శుష్క దేహములతో కాషాయవస్త్రాలతో
శూలంబుల్ సొరకాయబుఱ్ఱలు జటాజూటంబులుందాల్చియా
మూలాగ్రంబుగ భ్రష్టులైతిరుగు బాబుల్‌దొడ్డ గంజాయి భా
యీలున్నా రెదురైనవారె మునిపక్షీ! కుక్షిరక్షాపరుల్

మ. జపమోధ్యానమొ! యభ్యసించియతివేషంబూని క్రీడించుమో
సపు బార్థుల్ ప్రతి పల్లెటూర గలరీ సన్యాసి వర్గంబు నీ
కుపదేశింపదొ! యిష్టసిద్ధికని మాయోపాయ మంత్రంబు, భ
క్తిపరత్వంబొక సాధనం బిహ పరస్త్రీవంచక శ్రేణికిన్

శా. పాలుంబండులు, కందమూలములు మాభక్ష్యాన్నముల్ గోర మే
కాలం బన్యపదార్థముల్ రజతమో బంగారమో కొద్దిగా
జాలున్ మాకని సేకరించెదరు గోసాయీ లుపాయాలు మో
సా లెన్నేని నిరంతరాయముగ రాజ్యంబేలు నేడెల్లడన్

శా. వృత్తుల్ సర్వము త్రుప్పువట్టి చనగా భిక్షాటనంబుల్ జగా
వృత్తుల్‌గా, పలుజాతులై నిలువ దుర్భిక్షంబు రాకుండునే
యుత్తుంగాశయు లెందరోకలరు దేశోద్ధారకుల్ పూనరీ
చిత్తంబేర్చు కళంకమున్ దుడిచి సుశ్రీనేలకుంగూర్పగన్

తే.గీ. ఎన్ని సుక్షేత్రములు సార మిగిరిపోయి
ముండ్లతుప్పల బంజరభూములయ్యె
దృఢతరంబైన యెంతెంత దేహశక్తి
భిక్షకులమేన జీర్ణించి పృథివి గలిసె

చం. పదవులు పీటలెక్కి యనువారము లంచపు బాడిబట్టెలం
బిదికి గడించి కార్మికుల పేదల చెమ్మట దెచ్చి కాన్క లి
చ్చెదరు పరోపజీవులు విచిత్రపు భక్తులు వేషధార్లు నీ
కెదురయివచ్చిరే వలదిసీ చెయిసాచకుమమ్మ పక్షిణీ!

ఆ.వె. నరునికష్టపెట్టి నారాయణునిగొల్చు
ధర్మశీలురున్న ధరణిమీద
కాలుమోపలేక గబ్బిలమొక్కటే
చరణయుగళి దివికి సాచి నడచు

సీ. పూజారి బోషాణమును కాపలాకాయు చిల్లరివేల్పుల సేవజేసి
గొఱ్ఱెపోతులనల్ల జుఱ్ఱి గఱ్ఱునద్రేచు కరకు సత్తులకు జాతరలు సల్పి
ఏటేట పెండ్లి జేయించుకొంచుదయించు కృతకరాముల పల్లకీలు మోసి
నిలువుదోపిడిచేసి తలకాయగొరిగించు యేడుగొండలవాని మేడలెక్కి

తే.గీ. అంబుధీశుని కళ్యాణులని తలంచి
ముంచుగంగమ్మలకు డబ్బుపోసి పోసి
పాతకమువోలె నావెన్ను వాయకున్న
గోచితో నిల్చియున్నాడ పేచకంబ

కం. గుఱ్ఱాలకు ఱెక్కలుగల
వెఱ్ఱియుగాల్ దాటిపోయె, విజ్ఞానంబున్
బుఱ్ఱగల గాంధియుగమిది
కఱ్ఱలు ఖడ్గంబు లేలగాలేవు ప్రజన్

సీ. రాజుగారిగుఱాల రథచక్రములక్రింద మరణించురైతుకు శరణమిచ్చి
నరజాతిలో, ననంతరములుండుటకన్న నఘములేదను ధర్మమాకళించి
బహుమతాచార దుర్భర పదాహతిచేసి అసురుసురగువారి కభయమిచ్చి
రాజభాషలకన్న రాష్ట్ర భాషలలోన రసమున్నదను యథార్థతనెఱింగి

ఆ.వె. యుగయుగాలనాడ యూబిలోదిగబడ్డ
మహితమైనజాతి మత్తగజము
ప్రబలదాస్య నిగళబంధంబులగలించి
దెసల మసలుచున్న దినములివ్వి

మ. కలరే మోసపుదేశభక్తి పరులక్కైలాసదేశంబునన్
చలికిం ఖద్దరుధారులై యవల స్వేచ్ఛారాజ్యభాగంబు రా
గలదంచున్ విహరించుపెద్దలు? పతంగస్వామినీ! నిమ్నజా
తులపైవీరువెలార్చు బాష్పములుచిందున్ దియ్యగాపుల్లగా!

శా. మా దౌర్భాగ్యపుజాతిలోన నొకనిం బాధింపకున్నట్టి యీ
యాదివ్యాధికి నగ్నమై కుములుటేలా! నాకుఁ బోనిమ్ము నా
చేదస్తంబిది కష్టపెట్టితిని పక్షీ! రోషగాడెన్నడున్
ప్రాదుర్భావమునందరాదు పరసేవాభ్రష్టవంశంబునన్

మ. కలదమ్మా వ్రణమంటరానితన మాకర్ణింపుమీ యిండియా
పొలమందుగల మాలమాదిగలకున్ భూతేశుడేకాదు కృ
ష్ణులు, కృష్ణున్ని రసించు దైవములుక్రీస్తుల్, మస్తుగా బుట్టినన్
కలుపన్నేరరు రెండుజాతులను వక్కాణింప సిగ్గయ్యెడిన్.

ఉ. చాకిరిజేసితిం దెలుగుజాతికి నేబదివత్సరాలు నా
వాకిలిద్రొక్కిచూదవు శుభంబులుసౌఖ్యము లెంతకాల మీ
బాకి, వయస్సుతో నడుగుబట్టిన యాసలు తెప్పరిల్లునో
లేక, నశించునో, తెలుపలేదుగదా మదనాగవైరియున్

కం. శుభశిశువో! యదిగాక య
శుభశిశువో తెలియరాదు క్షోణీసతికిన్
ప్రభవించు బిడ్డ యకటా
యభంగుర ప్రసవబాధ కగ్గంబయ్యెన్

మ. అరవంగుత్తుకగోసి జంతువుల గర్భాగారముల్ జీల్చి నె
త్తురుటేళ్ళన్నటియించు మూఢతమజాతుల్ జాతరల్ సేయ, జూ
తురు, చూపింతురుప్రోత్సహింశ్రుతతివాదుల్ శాస్త్రపారంగతుల్
కరుణల్ కమ్మనిబోధలో పులుగుటక్కా! ఛీ! హుళుక్కుల్ గదా!

మ. కనిగంగార్పణమంచు ద్రోసిచనియెం గర్ణున్ బృథాదేవి, యా
తని విద్యాకులరూప సంపదలు వ్యర్థంబై ప్రలాపింపవో
కనియెన్ భారతకుంతి మమ్ముల నసంఖ్యాకంబుగా కర్ణులన్
మునిపక్షీ! యమనందనుల్ తెలియరిప్డున్ మాదు భ్రాతృత్వమున్

సీ. ఒకడు రుద్రాక్షమాలికలు నెత్తికిజుట్టి శివమూర్తియై భూమికవతరించు
ఒకడూర్ధ్వపుండ్రంబు లురువుగా దగిలించి శివలింగమునుజూచి చీదరించు
ఒకడు రెండునుగాని వికటవేషముదాల్చి పైవారిమీద సవాలు సేయు,
ఒకడు గంజాయిదమ్ముకు దాసుడైపోయి, బూడిదగురవడై పుట్టివచ్చు

ఆ.వె. మనుజులార మాది ఘనమైన మతమని
ఒకడు తరిమితరిమి యుగ్గడించు
పెక్కుమతములిట్లు పేచీలుసాగింప
మార్గమేది యైకమత్యమునకు

సీ. మొక్కుబళ్ళ నెపాన చక్కని పసిపాపలెందరు గంగలో నిమిడినారొ
సహగమనాచార దహనదేవత లెన్ని చిగురుగొమ్మల బూదిచేసెనొక్కొ
చదువుదాచెడు దురాచరణమెందరి కళాభ్యసనచాతురి గొంతుబిసికెనొక్కొ
పొందెఱుంగని వేరుబందాలచే బాహుబలమెంతగా చచ్చువడియెనొక్కొ

తే.గీ. చిలిపిరాలకు నగిషీలు చెక్కి చెక్కి
కాలమెంత యగంతాన గలిపిరొక్కొ
చదువనేర్చిన వెట్టిని జంపగలరె?
ఒక్కబుద్ధుడు నొకక్రీస్తు! ఒక్కగాంధి!

సీ. శిలవంటి యూరిసత్తులకు నెత్తుటికూడు రేపులుమాపులు మేపలేక
'ఆచారమని! తప్పదని' వెంటబడివచ్చు గురులదక్షిణ లిచ్చుకొనగ లేక
మంత్ర తంత్రముల సోమరిమాంత్రికుల బారిబడి ధైర్యమును చిక్కబట్టలేక
శతసహస్ర క్రూరమత సింహములు సేయు కుటిలగర్జకు తట్టుకొనగ లేక

తే.గీ. అనుగు తమ్ముల సిరు లోర్చుకొనగలేక
పిచ్చిపూజల మమతలు విడువ లేక
అమరనుతమైన మాదుదేశాభ్యుదయము
యుట్టికిని స్వర్గమునకెక్క కూగులాడు

ఉ. విందుభుజించి పొమ్మనుచు బిల్చుటకర్హతలేదునాకు క
ర్మంది పతంగినీ! పనికిమాలిన సంఘము సమ్మతించునే
పొందులు పొత్తులు న్మనకు ముప్పదినూర్ల కులాలవారికిన్
నందులనాగులంగొలిచి నవ్వులపాలగుచున్న జాతికిన్

ఉ. స్వయముగ నన్నపూర్ణ తనభర్తకు సిద్ధముజేసియున్న య
వ్యయరుచిరాన్నమున్‌శివుని పంక్తిభుజించిన పూజ్యురాల! వ
న్వయము తరించె నిట్టి మునిపక్షిణివై, కులభేదబుద్ధిచే
కయికొనకుందువే సఖుల గర్భదరిద్రులయాతిథేయముల్

మ. తులవాక్రుచ్చగరాని నెత్తుటిసిరాతో వ్రాయుచున్నారు మ
త్కులజుల్ దుఃఖరసోత్కటంబులగు పెక్కుల్‌గావ్యముల్ జాతి లు
బ్ధుల వజ్రస్థిరచిత్తముల్ గరగి, సంతోషించునో, యీప్సితం
బులుపండింపక సుంకుతో సమసిమామూల్‌త్రోవలంద్రొక్కునో

సీ. కవిగారికిదె నమస్కారంబనెడు వాడు కళకు లెమ్మని పరోక్షమునబలుకు
కవనంబునకు మేను గరిగి మెచ్చినవాడు కవిచెంత నెఱబెతికముగ మసలు
విద్యా కళంకంబు వెదకజాలనివాడు జాతిలేదని నోరు చప్పరించు
శాఖీయులకు సహస్రములు బోసినదాత అన్యుల మధుర వాక్యములదనుపు

ఆ.వె. జీవకళలుచెక్కు శిల్పిని నిరసించి
శిల్పమునకు పూజసేయునట్టి
వక్ర చరితులైన వ్యక్తులు గలచోట
కళలకకట! ప్రేత కళలగతులు

శా. పోటీసేయ సమర్థులయ్యెదరె మా ముక్కన్నతిక్కన్నతో
మేటుల్ షేకుసుపీయరుల్ బయిరనుల్ మిల్టన్లు గోల్డుస్మితుల్
నాటైనారు స్వకీయులైన కవు లీనాడన్యభాషాకవుల్
నేటై రక్కట! కాలమాంత్రికుని పాండిత్య ప్రభావంబునన్

శా. జాతీయోద్యమ యుద్ధరంగమహితోత్సాహ ప్రతిధ్వానముల్
కూతల్‌బెట్టుచు నాల్గుజాతులకు గగ్గుర్పాటు గల్పించెడిన్
స్వాతంత్ర్యంబను స్వర్గసౌఖ్యమున మా భాగంబుమాకిత్తురో
ఖాతాలేదని త్రోసిపుచ్చెదరో! వక్కాణింపవేచెల్లెలా!

మ. కలధౌతాద్రిగుహల్ ప్రతిధ్వనులెసంగన్ దెల్గు రాష్ట్రార్థమై
గలభా రేచిరి సోదరాంధ్రజను లాకర్ణింపవో నీవు? చె
ల్లెల! రాష్ట్రంబు గడించినారనుచు హోళిందేలితో! తెల్గు బి
డ్డలయత్నాలనరాదుగాని యవి సోడాబుడ్డి యుద్రేకముల్

మ. బలియైనాడు ధరాహితార్థము మహాభాగుండు యేసుండు త
త్ఫలితంబై కనుపట్టు భిన్నమత సిద్ధాంతంబులుం జీలికల్
కులముల్ గుట్రలనైకమత్యములు చిక్కుల్ జీదరల్, రిత్త
బోధలు వేదాలు పదాలురాల్ప వరచేతన్ముక్తి ముక్తామణిన్

సీ. భోగు లాహారించు భుక్తికన్నులజూచి పరమపేదలు దుఃఖపడని చోటు
సాంఘికాచార పంచాస్యగర్జనమున బెదరక జ్ఞానంబు పెరుగుచోటు
జాతివైషమ్య రాక్షస పదాహతిచేసి కందకళలు పెంపొందుచోటు
పరిపాలక క్రూరతర కరాసికి లొంగిపోక స్వేచ్ఛాలక్ష్మి పొదలుచోటు

తే.గీ. అనదబిడ్డలుజూడ నెయ్యంపుసుతుల
ముద్దులాడని గుణనిధుల్ బుట్టుచోటు
చెప్పగదవమ్మ చూచివచ్చితివె నీవు
నిశ్చయంబుగ వాసముండెదను నేను

మ. పయిపై నవ్వులు పల్కరింపులు మృషాబాంధవ్యముల్ సూపి యా
పయిశత్రుత్వము సేయు నాగరకతాభ్రష్టస్వభావాధముల్
సయితానుల్ చరియింపనట్టి ధర గోష్పాదంబు గన్పట్టినన్
దయతో నాకెఱిగింపుమమ్మ యచటన్నాయిల్లు గట్టించెదన్

మ. కళలందాచెడు చుప్పనాతితనమింకం దేశమందున్నచో
కలదేముక్తి, ప్రపంచసభ్యతకు మార్గంబుండునే జాతికిన్
తలయుం దోకయులేని తొంబది సమాధానంబులంజెప్పి పే
దలవంచించు కళానిహంతలె యనర్థం బీ శుభక్షోణికిన్.

మ. అసుశక్తింబనిసేయుచున్ మసలు దేహాపూర్వయంత్రంబులో
బిసలెన్నోకల వే నెఱుంగనివి నా విజ్ఞాన భాండారపుం
బసలెల్లం బనిసేయ విందలిమరల్ పాడైనచో, యెవ్వ డీ
బిసగాడెందుల కీ రహస్యములకున్ బీగంబు బంధించెనో

ఉ. అచ్చెరువున్ ఘటింపగల యంత్రములం గనుగొన్నజ్ఞానులుం
జచ్చిరి చావుపుట్టువుల జాడ లెఱుంగ కెటింగి దేవతల్
జచ్చిరి మృత్యువుం గెలుచుశక్తు లొసంగని చుప్పనాతి వే
ల్పెచ్చట డాగినాఁ డతని కెందుల కీ తెరచాటు మోసముల్

మ. మును మేనూడ్చిన వారియెమ్ము లెరువై భూదేవి పండించి నిం
చిన నానా ఫలవృక్షరాజముల కిచ్చెన్ దివ్య మాధుర్యమున్
తను రక్తంబును మేఘమై కురిసి యానందంబు గల్పించు చ
చ్చున దేదీ? ప్రతిజీవియుం తిరిగి వచ్చుం భిన్నరూపంబులన్

చం. మరణితులైన వారి తనుమాంసము కొన్నియుగాలు భూమిలో
మురిగి రసాయనప్లుతుల పూర్ణ పరీక్షల నిగ్గు దేలి యా
ఖరుకు, శిశూత్కరాదులకుఁ గాయముగా విలసిల్లకున్న నీ
సురుచిర దివ్యకాంతులు నిసుంగులు మేన రహింప నేటికిన్

శా. ఆజన్మంబు తపంబునం బెరిగి దేవావాస వాస్తవ్యవై
పూజాపద్ధతులెల్ల నేర్చితివి, నీ ముత్తాతలుం దాతలున్
జేజెమ్మల్ కులసంఘ బాహ్యులయి కస్తింగుందుచో దేవతల్
రాజీపెట్టిరె? పేదవారిమొర కర్ణక్లేశ మెవ్వారికిన్

సీ. మాతృభాషల కర్థ మర్యాద లొనరించు సర్వకళాశాల సాగుచోటు
ప్రజలనాహారించు బహుమత దేవతా దైనందినగ్లాని లేనిచోటు
నవనీతనిభమైన కవుల కమ్మని వాక్కు వెఱపులే కావిర్భవించుచోటు
సంతానమునకు వైషమ్యంబు నేర్పని తల్లిదండ్రులు విరాజిల్లుచోటు

తే.గీ. విసపునవ్వులలాహిరీవేషగాండ్ర
పాదచిహ్నాల మరక లేర్పడనిచోటు
తోడునీడయు లేనట్టి దుర్బలులకు
గబ్బిలపుచాన వాసయోగ్యంబుగాదె?

సీ. జాతీయపౌరుషజ్వలన మాబాల్యంబు సవరించు కావ్యరాజములులేక
విక్రమక్రమశిక్ష వెన్నతోనిడు జిజా సతివంటి మాతృదేవతలు లేక
ఒకజుట్టు నొకబొట్టు నొకకట్టుబడి నేర్పి పాలింపజాలు దేవతలు లేక
కులమెల్ల చెదరి తెంపులు తెంపులగుచుండ వారించి కాపాడుప్రభువు లేక

తే.గీ. బుద్బుదంబులకెనయైన మూడునాళ్ళ
పదవులకు ప్రతిష్ఠలకునై ప్రాకులాడి
నరులనమ్మించుకొనలేక నమ్మలేక
చిదికియున్నవి మాజాతిజీవితములు

శా. ఆసల్ చెప్పుదు రిప్పుడుం గురులు ముం దాకాశసింహాసనా
ధ్యాసీనత్వము సంఘటించునిది సత్యంబంచు రూపింతు రీ
బీసీనాటి పురాణగాథలు రుషావేషంబుతగ్గించి నా
దాసత్వంబుస్థిరీకరించెదు పరంధామంబు నాకేటికిన్

ఉ. పుట్టుకపూర్వ మే తలను జంపినజాతి మతప్రచండ సం
ఘట్టన జేసి నా సహజకౌశలముల్ నశియించిపోయె నీ
కట్టినకట్లు విప్పునధికారములేని గురుండెవండొ యీ
యుట్టికినెక్క లేని నను నూచెడి నంటవికుంఠడోలికన్

మ. నను సృష్టించినవాడె నావెనుక జన్మంబెత్తునే నోరెఱుం
గని నన్నీ పదివేలరూపములతో కంగారుగావించునే
కనకంపుంగుడి గోపురాల్తనకు నాకాంక్షించునే? కానుకల్
గొనునే! యిట్టివి మోసగాండ్రయినభక్తుల్ పన్నుపన్నాగముల్

సీ. అనినమాటను మార్చుకొనలేని శాస్త్రముల్ స్వాభిమానముదక్కి పలుకగలవె?
కులముంచుకొని నన్ను గొలుచుకొండను వేల్పు కడగి నా కన్నీరు దుడువగలడె?
మానవదాస్యంబు మరగినలోకంబు నెనరూని నా చెల్మి నెఱపగలదె?
అస్వభావికథావ్యాసంగ హతమైన పృథివి సత్యంబు నూహింపగలదె?

ఆ.వె. యుడుకురక్తమెన్నడో చచ్చుబడిపోయి
చేతులెత్తి మ్రొక్కు స్వీయజాతి
కఱకువీరసూక్తులరిగించుకొని వేచి
యెదుటనిలిచి పగర నదమగలదె?

తే.గీ. ధర్మసంస్థాపనార్థంబు ధరణిమీద
నవతరించెదననె నబ్జభవునితండ్రి
మునుపుజన్మించి నెత్తికెత్తినదిలేదు
నేడు జన్మింపకున్న మున్గినదిలేదు

చం. కనుపడలేదు దైవతముగాని పదార్థము భారతంబునన్
గనుపడలేదు సత్కులముకన్న మహాకళ భారతంబునన్
కనుపడలేదు వర్ణమునకన్న పిశాచము భారతంబునన్
గనుపడలేదు పంచమునికన్నను నీచపుజంతువేదియున్?

శా. హక్కుల్ దొంగలుదోచుకొన్నను మనుష్యత్వంబు జంతుత్వమై
చిక్కుల్ బెట్టెడు కాలమందును క్షమాసిద్ధాంతముల్ నేర్వనా
పక్కాపౌరుష వహ్నినార్పుమత రూపక్రూర సింహంబు నా
ప్రక్కంబందులునూరుచున్నది తలంపన్ శల్యసారథ్యమై

మ. జగముల్ మెచ్చు బియే లెమేలు బిరుదుల్ సాధించినామంచు నీ
లుగుమామాలలుమాదిగల్ గులమహాలోభంబు రెట్టింపగన్
తెగలంగట్టి తగాదలెంచెదరు గానీ సంధి గావింపరో
ఖగభామా! మతబోధలేల కుల కక్ష్యాభ్రష్టదుర్జాతికిన్

మ. అసలే ముక్కిడి దానిమీద పడిసెంబన్నట్లు మాజాతి బా
నిసలౌరా! కలహించుచుందు రుభయుల్ నీచోచ్చతానిర్ణయ
వ్యసనవ్యగ్రత సిగ్గుచేటగునయో యస్పృశ్యతాత్రాసమం
త్రసమేతుండగు గాంధినేర డివి యంతర్నాటకారాటముల్

శా. భీతింగొల్పెడు నస్వభావిక కథావేదాంత శాస్త్రాలకుం
జేతుల్ మోడ్చు నమాయక ప్రజలు సంసేవింపభోగాబ్ధిలో
నీతల్ గొట్టు కవిప్రకాండముల సాహిత్యప్రపంచంబులో
ప్రాతః కాంతులు జిమ్మునట్టి కవితాభానుండు జన్మించునే

చం. నటకుని వోలి కాలపరిణామవిధేయములైరహించు ను
త్కటమత ధర్మశాసననికాయము తీరుపుచేసి సంఘ సం
కటముల పాలొనర్చి యధికారముసేయు దరిద్రజాతిపై
కటకటనల్పురాదు నెడ కల్లయథార్థము గాకపోవునే

ఉ. రచ్చలకెక్కనీక సమరంబున బూడ్చిన కర్ణశక్తి నే
డెచ్చటజూచినం బ్రధవహించి సముజ్జ్వలమై వెలుంగదే
కచ్చ లసూయలుం గళ నొకానొక కాలముదాచియుంచినన్
హెచ్చితురంగలించి ధ్వజ మెత్తకపోదు యుగాంతరంబునన్

కం. కవ్వడి పరువున్నిల్పగ
నవ్వసుదేవాత్మజాతు డట్లనెగా నీ
కవ్వడి కర్ణుని గెల్చుట
నవ్వులపా టనెడుమాట నల్వురెఱుఁగనే

మ. వలదన్నన్ వెనువెంటనంటి నను నిర్బంధించి వేధించు వే
ల్పుల సిద్ధాంతములెల్ల నా సహజసంపూర్ణ ప్రతాపంబు లో
జిలికెం జిక్కని చచ్చుమందు మునిపక్షీ! యింక నీవంటి గ
బ్బిలముల్ సేయు హితోపదేశములు వేవేల్గాలికాహారముల్

సీ. అగుపించెనే యసూయాదుర్గుణజ్వాల సంహరించెడు శాస్త్రసముదయంబు
పరికించివచ్చితే పరమతసహనంబు భాషించు వేదాంతపాఠశాల
వీక్షించితే వర్ణభేదాల వ్యాధిచే శాంతిగా రాజ్యంబు సలుపునెలవు
కనుగొంటివే మనుష్యునిజూచి మనుజుండు మిట్టిమీనై దాటునట్టిసీమ

ఆ.వె. నేను చిందులాడి నేను డప్పులుగొట్టి
యలసి సొలసి సత్తికొలుపు గొలువ
ఫలితమెల్లనొరులు భాగించుకొనిపోవు
నీచమైనభూమి జూచినావె?

శా. క్రూరుల్కుత్సితు లస్మదీయములు హక్కుల్ దోచుకొన్నారు న
న్నూరింబైటకు నెట్టినా రిపుడు నన్నోదార్చుచున్నారు గాం
ధారేయుల్ నెలకొల్పినారు బహుసంస్థల్ లక్కయిండ్లక్కటా
మారుందమ్ములు నమ్మజాలని విశ్వాత్మశ్రీసమారంభముల్

మ. తనురక్తంబు వ్యయించి సత్కవికళాద్రవ్యంబు వెచ్చించి మ
ల్చినశిల్పాలువిమర్శక బ్రువుల కల్తీవ్రాతలం ఖ్యాతికె
క్కనివైపోయెనసూయచేబలుకునాల్కల్ సత్యమున్ జాటునే
అనుమానింతురు కొందరీశ్వరుని ధర్మాధర్మనిర్ణేతృతన్

మ. జనులం బీలిచి పిప్పిజేసెడు దురాచారంబులన్ గాలమ
ట్టని విద్యాబలమేల? విద్యయన మౌఢ్యవ్యాప్తికింపైన భో
జనమా? మోసపువ్రాతకోతలకు రక్షాబంధమా యెందుకీ
మనుజత్వంబు నొసంగలేని చదువుల్ మైరేయపుం మైకముల్

మ. చిరకాలంబును భిన్నజాతి మతముల్ జీవించు రాజ్యాన సు
స్థిరమై శాంతి రహించునన్ననుడి సందేహించెదం బక్షిణీ
తురకల్ హైందవులీ స్వరాజ్యరథమున్ దొర్లింతురే? దక్షిణో
త్తర దిగ్దంతులు రెండునుంగలసి మేతల్ మేయు తావున్నదే

ఉ. వీర వసంతరాయడను వేల్పొక డుద్భవమంది దుష్ట సం
హారమొనర్చి ధర్మము సహస్రముఖంబులు నాటునంచు నా
జారిన గుండెలో వెఱపుసల్లుదు రీ యనృత ప్రచారకుల్
కారణమమ్మ పిచ్చితలకాయలకున్ వెడ నమ్మకాలకున్

శా. పుట్టించెం దయలేని లోకమున నే పుణ్యాత్ముడో కుక్షిలో
ముట్టించెం బొగలేని యాకటిసొదన్ ముప్పూటలీచిక్కులో
నట్టిట్టై తపియించు నాకొదవు నాహారంబు భక్షింపగా
పుట్టంజొచ్చిరి దేవతల్ బహుళరూపుల్ బుట్టలైచెట్టులై

ఉ. అట్టు లెడందనేర్చెడు మహావ్యథనాతడు వెళ్ళగ్రక్కినన్
బిట్ట! కదుష్ణబాష్పములు నిండిన కన్నుల సానుభూతి చూ
పెట్టి ప్రదక్షిణించి సురభిక్షకు నింటికి లేచిపోయె గ
న్పట్టె స్వతంత్రభారత విభాకరబాలుడుతూర్పుడోలికన్

కం. మునిపక్షి రాకపోకల
ఘనసందేశముల కతన ఖర్చయి పోయెన్
దనురక్త మా దరిద్రుఁడు
చనిపోవునా! తత్ఫలంబు జవిజూచెడినో!

# భూమిక

సదాశయులారా!

“కలదేస్వర్గము లాతిచోఁ? గలుగ నిక్కంబిద్దియే, నీతిమంతుల విశ్రాంతి నికేతనంబు”

ఇవి తాజమహాలు కుడ్యములపై సువర్ణ పూజలందిన షాజహాను సూక్తులు. భారతీయ శిల్ప ప్రౌఢిని వేనోళ్లఁజాటు తాజమహాలును గనులారఁ జూడవలెనను కోర్కెనాకు బాల్యమునుండియుఁ గలదు. కాని ప్రాప్తి లేమికిఁ జింతించు చుందును. దేశదేశముల నమస్కృతుల కగ్గమై, శిల్పులకు గర్వకారణమైన ముంటాజమహాలుగోరి గడించిన కీర్తి యొక్క మొగలుచక్రవర్తికే కాక భారతీయులకు నందు ముఖ్యముగ నాంధ్రులకును దక్కుచున్నది. దాని సృష్టియందు పాల్గొన్న ముప్పదిముగ్గురు శిల్పాచార్యులలో నలువురు మచిలీపట్టణము నుండి యాహ్వానితులయినట్టు లేతన్నిర్మాణ కాలమున స్వయముగాఁ జూచిన బాగ్దాదు వాసియగు నొక చరిత్రకారుఁడు వ్రాయుచున్నాఁడు. అందలి ప్రధాన శిల్పియగు నొక యైటలేయుఁడు స్వదేశమున కేగి, తాజిసోయగము నూహించి, యద్దపు చట్రమున బిగింపనయితిని గదా యని విచారించెనన దాని మహిమ, దానికోమలత, స్పష్టము గాకపోదు. దీని నిర్మాణార్థ మిరువదిలక్షల కార్మికు లహోరాత్రము లిరువది వత్సరములు పనిచేసినట్లును, ఇరువదికోట్ల రౌప్యములు వెచ్చింపఁ బడినట్లును, చరిత్రలు ఘోషించుచున్నవి. ఒకదృష్టియందిది వృధా వ్యయముగాఁ దోప వచ్చును గాని లక్షలాది ప్రజ కిరువదిరెండేండ్లు పనిగల్పించి, యన్న దానముచేసిన సుకృతమిందు లేకపోలేదు. అన్నిటికిని మించిన యశస్సు నిది భరతవర్షమున కాపాదించినదనుట నిస్సంశయము.

ప్రణయమూర్తియుఁ దనయర్ధాంగియు నగు ముంటాజి నలంకరించు చున్నట్లూహించుచు నిరువది రెండేండ్లెత్తినతలవాల్చక కట్టడమును సమాప్తి చేయించిన షాజహాను చేతలోనొక పవిత్ర ప్రణయ సందేశము, ఒక కళా పోషణ దీక్ష, ఒక యావేశము, ఒకనిఱుకు ఒక మూగ సారస్వతము, దంపతి లోకమున కందించు చున్నదని నాయూహ. సతీవియోగమున నున్మత్తుఁడయిన షాజహాను గాఢాంధకార బంధురమై, సర్వ శూన్యమైన తన జీవిత బ్రహ్మాండమున సందర్శించిన తేజఃపుంజ మీ తాజమహాలు. ఆ మహాపదార్థ మునకితఁడు ప్రాణప్రతిష్టఁ జేసిశాశ్వతుఁడైనాఁడు. ఐశ్వర్యమత్తుండైయతఁడు శ్మశానమును స్వర్గముగా మార్చివేయఁ గలిగినాఁ డు. తచ్చంద్ర శిలాధౌతము లయిన కాళిందీ జలములయం దా శుభదంపతుల యాత్మలు గుసగుసలు వోవుచుఁ బ్రేక్షకుల కనంత భావపరంపరల బహూకరించుచున్నవి. తాజమహాలు సౌందర్యాకరనమున బొడమిన యావేశమే నన్నీ కావ్య రచనకుఁ బురికొల్పినది. కవితాజగతున

నా యూహకొాదవిన దృశ్యమే యిందు వర్ణితము. వాస్తవిక దృశ్యమునకును, దీనికి నంతరమెంతయు నుండకపోదు. సృష్టికర్తలదృష్టియందిది క్షమార్హము, రసపోషణమున కిందొక పిచ్చివాని కథను ప్రవేశపెట్టక తప్పినదికాదు. దానియుచితా నుచితములను రసజ్ఞులు తేల్తురు గాక.

తిక్కన జయంతి సందర్భమున నన్నాహ్వానించి మహాకవి సన్మానమును నాకొసంగి, తనజీవితేశ్వరి పేర నొకకావ్యము వ్రాయుమని యానతిచ్చి నాయందవ్యాజానురాగమును వ్యక్తీకరించిన విక్రమసింహపురీ వాస్తవ్యులును, మహోదార స్వభావులును, సహృదశేఖరులును విమర్శకాగ్రేసరులునగు, శ్రీశ్రీశ్రీ తిక్కవరపు రామిరెడ్డి గారు నేనీ కృతిని నా ప్రియ జనని కంకితమిత్తునని కోర, నందితాత్ములై, గ్రంథముద్రణ ద్రవ్యమును దయతో సమర్పించి వారి సర్వమానవ సమరస భావమును వెల్లడించిన రెడ్డి జమీదారులకు నానమస్కార సహస్రపూజ లర్పించుచున్నాను. వారికిని, వారి కుటుంబమునకును శుభమగుత.

జి. జాషువ

# జోతలు

ఉ. తిక్కవరాన్వవాయము ప్రదీప్తముగా నుదయించి, రెడ్డిభూ
భుక్కుల దానశీలతకు ముత్తెపుమేడలుగట్టి సింహపుం
బక్కణ సుప్రతిష్ఠలకు వన్నెలుదీర్చిన పుణ్యమూర్తికిన్
మ్రొక్కులొసంగెదన్ శుభసముత్కటవార్ధికి, రామిరెడ్డికిన్

శా. నూరున్నారులుమూడుమారులిడి, నన్నున్‌దన్పి, నావాంఛలన్
గారుణ్యంబునఁ దీర్పనెంచిన సుధాకల్ప ప్రజల్పుండు, ల
క్ష్మీరమ్యుండు, పరేంగితజ్ఞుఁడగు శ్రీ.శ్రీ. రామిరెడ్డిప్రభున్
నూరున్నార్లు సువర్ణగీతుల నుతింతు సాహితీసీమలన్

సీ. పలుకులోఁగలుగు నిశ్చలతఁజేతలవి నిర్ధారింపఁజాలు నాదర్శమూర్తి
విశ్వంబుమఱపించు నైశ్వర్యలక్ష్మి చేవిఱ్ఱవీఁగని క్షమావిస్తృతుండు
ఉన్నతోన్నతములై యుజ్వలించెడు వినూతన భావసత్కళావనధిరాజు
గణనకెక్కిన కావ్య గుణదోషములను విమర్శించు పాండితీ మండితుండు

ఆ.వె. స్వీయ దేశహితవిశిష్టాశయంబులు
గలుగు స్వచ్ఛమైన తెలుఁగువాఁడు
దొడ్డగుణములున్న రెడ్డిజమీదారు
ప్రబలుగాత వేయి వత్సరములు

శా. జాతీయోద్యమ దీక్షలంబ్రబలు సత్సంతానముంగాంచి, వి
ఖ్యాతింగన్న కుటుంబిచేత, రసవత్కావ్యాభిమానంబు, క్రొం
బూతల్ పూయురసజ్ఞ శేఖరునిచేఁ బూజింపఁగాఁబడ్డ నా
వ్రాతల్ ధన్యములై గడించెడిని, దీవ్యద్భావ భాండారమున్

చం. భువనహితార్థమై, యనుఁగుఁ బుత్రిక నాథునితోడ బందియై
చివుకుచునుండఁగాఁ గలఁతఁ జెందని డెందముతోడ, దీనమా
నవపరితాపతాపిత మనస్కత బొల్చిన రెడ్డిరాజు, తి
క్కవరపువంశమండనుఁడు, కాంచుఁజిరాయురనామయోన్నతుల్

ఉ. ఈ కృతి నస్మదీయ జనయిత్రికి నంకితమిత్తునంచు నే
వాకొనినంత ముద్రణకుఁ బైక మొసంగిన, త్యాగమూర్తి శు
భ్రాకృతి నెత్తిపెంచిన మహత్తరపుణ్య పురంధ్రికిన్ నమో
వాకమొనర్చినన్ బ్రబలుస్వార్థవిహీన విశాలభావముల్

కం. తనకో! తనతల్లికొ! తన
యనుంగులకొ! యంకితంబులగు కృతులకుగా
ధనమిత్తు రొరుల కృతులకు
ధనమిచ్చి బహూకరించు దాతలు గలరే?

ఆ.వె. అనుఁగుఁ దండ్రిపేర నలతిక్కయజ్వకుఁ
గ్రమతవార్షికోత్సవములు నెఱపి
కవుల సత్కరించు ఘను రెడ్డిమండను
గుండలీంద్రుఁ డోముచుండు గాక

# అంకితము

మ. జననీ! నీయనుఁగుం గుమారుఁడను నీ స్తన్యంబు సేవించి వ్రా
సిన కబ్బంబిది, నీకునౌ మనుమరాల్జేకొమ్మ చేఁదోడుగాఁ
ననుకూలించి, కవీంద్రమాతవగు నీయాశీస్సులందేలి, నీ
ఘనకీర్తింబ్రకటించెడిన్ సుగుణసక్తా! లింగమాంబాసతీ!

ఉ. "కన్నఋణంబుదీరెకొడుకా! కనుగొంటిని విన్నకొండలో
నిన్ను బహూకరించు మహనీయ మహంబును కన్నులార" నం
చన్న పదంబు జ్ఞప్తిగలదా? జననీ! యటులాడి నీ ఋణం
బున్నతిజేసి తిట్టికృతులూడ్చునె నీఋణమున్ సహస్రముల్?

ఆ.వె. నీవు బ్రతికియుండ నీవాంఛితార్థముల్
దీర్చుశక్తి లేక దిగులు వడితి
వేయి నగలకన్న వెలగల్గు కృతిభూష
నంపుచుంటి స్వీకరింపుమమ్మ!

జి. జాషువ

# ముంటాజమహలు

మ. వనితామండన! దృష్టిగోచర బహిఃప్రాణంబు, లోకైక మో
హినిముంటాజమహాలుతోడ మొగలాయీప్రాజ్యసామ్రాజ్యమున్
ఘనతం బాలనసేయుచుండెఁ బ్రజలానందింప, విఖ్యాతిఁ బొ
ల్చిన షాజానునవాబు శేఖరుఁడు, డిల్లీ బర్హిపీఠస్థుఁడై

ఉ. పోలికలేని శిల్పలత పుష్పితమై రస ముప్పతిల్ల ము
త్యాల మసీదు డిల్లి నగరాంతరమందుఁ బ్రతిష్ఠఁ జేసి, యు
న్మీల దుదారచిత్తుఁడయి నీతిపథంబున గాక, యన్యథా
కాలు చలింపనీక, యధికారము చేసె, మృదుస్వభావుఁడై

మ. తన యింటం గల రత్న రాసులను సార్థక్యంబు గావింపఁగాఁ
గనువిందు ల్పొనరించు సౌధవితతిన్ గట్టించి, స్వర్గంబుతోఁ
బనియే లేదనులీల వజ్రమణి దీపశ్రేణి ముట్టించి, యం
గనతోడన్ దులదూగసాగె నతి భోగశ్రీ మహాడోలలన్

మ. విమలస్వాంతుఁడు షాజహాను కులవిద్వేషోగ్రకల్లోలముల్
సముదాయించి, తురుష్క హైందవ సమస్యాపూర్తి గావింపఁగా
సమదృష్టిన్ విరజిమ్ముచుం గుటిల శిక్షాదక్షుఁడై, దిక్కులన్
సమకూర్చెన్ మొగలాయిరాజుల ప్రతిష్ఠాద్రవ్యభాండారమున్

మ. కృతులం బొందిన ధీవిశాలుఁడు, జహంఘీరుం డలంఘీరు భూ
పతికి న్నందనుఁడన్న పేర్నిలిపి, విశ్వస్తుత్యుఁడై, విశ్వభా
రత శిల్పంబు సముద్ధరించి పటుదర్పం బొప్ప సామ్రాజ్యవి
స్తృతి గావించి, రసజ్ఞుఁడై కవుల కందించెన్ భుజాదండమున్

కం. హాయికి లోపంబనియో
వేయేడుల నాఁటి రవల పీఠము లవలన్
ద్రోయించి కొలువు సేయన్
జేయించెం గలికి నెమిలి సింహాసనమున్

మ.	విలసద్రత్న మరీచిమాలికలచేఁ బెంపొందు పండ్రెండు నె
మ్ముల సింహాసన మొలగంబు సిరిపెంపున్‌జాట, దేవేశుఁడున్
దలవంపన్, రిపురాజగర్భముల నిద్రం బోవుచున్ దాత తం
ద్రుల కన్నం బయిచేయిగా నృపవరేణ్యుండొప్పుఁ దేజస్వియై

సీ.	బిరుదు లందిన యరబ్బీ కవీశుల వాణి ప్రసవించె మధుర కావ్యస్రవంతి
విఖ్యాతమైన జాబిలి పతాకచ్ఛాయ చివురించె నాసేతుశీతగిరుల
కడుదీనమైన బుక్కాఫకీరుల గిన్నె నిండారె పసిఁడిమానికపు సిరుల
చేయార పనిలేని శిల్పకారుల సుత్తె నాచికొన్నది దిగంత ప్రసిద్ధి

తే.గీ.	శ్రీపదాంకితమైన డిల్లీపురాన
తొలకరించిన దైదువేళల నమాజు
భోగపరమైన మొగలాయి నాగరకత
మూడుపూ లారుకాయలై ముమ్మరించె

కం.	గుడిగుడి, సేవింపఁడు; పా
ల్పడఁడు మజాసేయు మత్తువస్తువులకు న
య్యొడయఁడు పరికింపఁడు పెర
పడంతుకల, నెఱపు నేకపత్నీవ్రతమున్

మ.	మణు లల్లాకని మీదుగట్టి పనిపెన్ మక్కా మదీనాలకున్
గణనాతీతము లక్కజంబుగ ఖజానాకొట్లలో ద్రవ్యమున్
దొణికించెం బఠియించె నిత్యము ఖురానున్ శత్రుదుర్గాలఁ బా
ర్వణ చంద్రధ్వజమెత్తె నన్వయ సముద్రం బుబ్బి తబ్బిబ్బుగన్

సీ.	ఉదయ సంధ్యాదేవి యొడినిండి దిగజారి కుఙ్కుగాడుపు లాడుకొనెడు వేళ
ప్రియుఁడు కొండల కెక్క బెదరి యొక్కొక చుక్క వినువీధులను జారుకొనెడు వేళ
తమ్మిలోఁ జెరవడ్డ తుమ్మెద ఖయిదీలు ఆలు బిడ్డలఁ జూడ నరుగువేళ
అంభోజమిత్రుండు యమున చెక్కిలి మీఁద పసుపుఁ గుంకుమ సిరుల్ విసరు వేళ

ఆ.వె. పసిడిపాన్పు డిగ్గి పన్నీటి కోనేట
జలకమాడి, మేలివలువ గట్టి,
మహిత భక్తిమీర మజ్జీదునకుఁ బోవు
బాదచారియగుచు బాదుషాహ!

తే.గీ. క్రూరకర్మత మైనట్టి గోవధంబు
దన హయామునయందు బర్తరపు జేసి
సహనధనులగు తన పితామహులఁ బోలి
నిఖిల హైందవులకుఁ బూజనీయుఁ డయ్యె

ఆ.వె. మతరణంబు వొడమ దతని పాలనమందు
జుట్టుపన్ను పిలక పుట్ట లేదు
కుటిల రాజభీతిఁగుందు భారతభూమి
బెదరుమాని మఱచి నిదురవోయె

మ. రహివుట్టం బదివేల దూతిక లహోరాత్రంబు సేవింపఁగా
మొహరున్నీసకు మేనగోడలగు నమ్ముంటాజమాల్, పాదుషా
మహ లుద్దీప్తముగా నొకానొక లసన్మాణిక్య గేహంబునన్
మహిమన్ బ్రొద్దులు పుచ్చుచుండెఁ బతిసన్మానింప, సానందయై

ఆ.వె. అతివ చక్కదనము నభివర్ణనము సేయ
కలము సాగదెట్టి కవివరులకు
చేయి యాడదెట్టి చిత్రకారులకును
చెలువ చెలువమెల్ల జిలుకరింప

తే.గీ. అసమ సౌందర్యవతి నూర్జహానురాణి
కోడలి విలాసమునకు సిగ్గును వహించు
వలపు టిల్లాలు పల్లెత్తి పలుకరింప
తురక రాయఁడు నిలువున గరగిపోవు

శా. గాణిక్యంబు సహస్రసంఖ్య లొకవంకన్ భూరిలావణ్యపుం
గాణాచుల్ పనికత్తె లొక్కెడఁ గటాక్షశ్రీల నాశించి వి
న్నాణంబుల్ పచరించినన్ గలఁతజెందం దంతరంగాన నా
రాణీసాహెబమీఁది నిశ్చల పవిత్రస్నేహ మోహంబునన్

ఉ. "ముద్దులరాణి మాటకు విభుం డెదురాడడు, తేని యాన క
మ్ముద్దియ మాఱుపల్కు దదెపో! సహవాస" మటంచునిత్యమున్
బెద్దలు ప్రస్తుతింప నతివేల సుధాప్రణయైకరాజ్యపుం
గద్దె నలంకరింతురు మొగల్మగ లమ్మహనీయ దంపతుల్

సీ. ఆ సతీపతుల గాఢాశ్లేషములనుండి జారిపోయిన నిమేషంబు లేదు
ఆ దంపతులకు నాహ్లాదంబు గూర్పక తొలఁగిన వెన్నెల తునకలేదు
ఆ ప్రేమజీవుల యనురాగవృద్ధికై రుత మొనర్పని పరభృతము లేదు
ఆ శుభాకృతుల నెయ్యంపు ముద్దులచేత తీపి కెక్కని ద్రాక్షతీఁగ లేదు

ఆ.వె. అవధి లేని వారి యానంద కేళికిఁ
దోడుపడని పూలదోఁట లేదు
వారి కూర్మిపెంపు వలచి వర్ణనజేసి
సుప్రసిద్ధి గనని సుకవిలేఁడు

తే.గీ.. దొరతనపుఁ గల్మి నింతయు దొట్రువడక
ప్రథిత సంసార రాజమార్గమున నడచి
దంపతులకెల్ల నద్భుతాదర్శ మగుచు
జగము నలరించె నయ్యాలు మగల చెలిమి

తే.గీ. పుట్టి పైచిల్కు సంతానభూతి నలరి
కాంచె నుత్తమ మాతృత్వ గౌరవంబు
పాలితులయందు వత్సలత్వంబు నెఱపి
కాంచె నుత్తమ రాజ్ఞీత్వ గౌరవంబు

తే.గీ. మొగలు దొరసాని లావణ్య భూషణంబు
కన్నుమాయదు సంతాన ఘర్షణమున
జీవితంబున నొక దుష్టచింత లేని
సత్యవంతుల ప్రాయంబు జాఅదంద్రు

కం. పలువురు బిడ్డలు చుట్టుం
బలసి కొలువ మధుర మధుర బహుకావ్య విభూ
షల నొప్పు శారదాంగన
వలె, భారతరాణి నేత్రపర్వము సేయున్

తే.గీ. రత్న రుచులీను యవన సామ్రాజ్య రమకు
నగలు గీలించు రాణి సౌందర్యలహరి
ప్రభువు కన్నులు దాటి యీవలికి రాదు
వలపు లూరింపకుండ నవ్వలికిఁ బోదు

మ. పదియు న్మగ్గురు బిడ్డలన్గని యనల్పశ్రీ విడంబించుచున్
హృదయేశ ప్రణయాబ్ధిలోమునిఁగియుయ్యేలూగుముంటాజికిన్
పదియు న్నాల్గవగర్భ మేరుపడియెన్ భావింప దైవంబు సం
పదపై సంపద, లేమి లేమిపయి నాపాదించు చిత్రంబుగన్

ఉ. కాలు గదల్పనీక చెలికత్తియ లక్కరలెల్లఁదీర్పఁ జూ
లాలితనంబు కొండొక యలంకృతిగా, సులతానురాణి, ర
త్నాల మహళ్లలో నతిముదంబుగఁ బ్రొద్దులు పుచ్చుచుండె గా
రాల సుతాసుతుల్ మనసురంజిల నింటఁ జరించు చుండఁగన్

తే.గీ. ఉవిద లిరువంక నడచి కేలూఁతలీయ
ప్రమద మొనగూర్చు గమన గర్వంబుతోడ
భాగ్యబంధురమగు నిండు బండివోలె
చక్రవర్తిని నట్టింట సంచరించు

తే.గీ. రాజుతోఁగూడి, యొక శరద్రాత్రివేళ
కొంతకాలము సల్లాపగోష్ఠి నెఱపి
పూలపాన్పున నిద్దుర వోవుచుండె
నిండు చూలాలు మొగలురాజ్ఞీలలామ

ఆ.వె. ఒకటి రెండుమారు లురలి నేలకుఁ జాఱె
కాపలాజవాను కఱకుకత్తి
సురటి విసరు చేటి మరచి నిద్దురవోయె
ఖంగుమనుచు నొంటిగంట కొట్టె

ఆ.వె. ఐదు వత్సరాల యౌరంగజీబుండు
ప్రక్కమీఁద మసలి పలువరించె
చిదికి చిద్రుపలౌచు చెదరి భూమికిఁ జారె
ఆకసమున నొక్క తోకచుక్క

ఉ. వెన్నెల వెండినీట పృథివీవలయంబు మునింగె, రాత్రికిన్
గన్నులు వచ్చె మింట నధికారముచేసె నిరంకుశంబుగన్
బున్నమ చందమామ జగమున్ గనుమోడిచె, రాణిగర్భమం
దున్న కుమారకుండు తలయూచుచు నవ్వెనొగిన్ గికాకికన్

తే.గీ. ఉలికిపడి లేచి దిక్కులు గలయఁ జూచి
ఆత్మగర్భస్థ పిండంబు హాసమగుచు
నామహారాజ్ఞి విషయంబు నాకళించి
యశుభదం బని విహ్వలస్వాంత యయ్యె

కం. ఆ కాన్పుతోడఁ దనకుం
భూకాంతునితోడి చెలిమి ముగిసెననుచు నే
దో కలఁత నెమ్మనంబునఁ
బ్రాకి మహారాజ్ఞి బిట్టువగలం బొగిలెన్

కం. కంటఁ దడిబెట్టి యెఱుఁగని
ముంటాజమహాలు రాణి ముత్తెమునకు, లో
నంటిన చింతన్ జెక్కుల
వెంట నొకటి రెండు బాష్పబిందువు లురలెన్

కం. విమలంబులయిన చల్లని
హిమరుక్కుల జలకమాడి, హృద్యంబగుచుం
బ్రమదంబుగూర్చు నన్నిశి
యమవసనిశి యయ్యె రాణి కతి దీర్ఘంబై

తే.గీ. ఏమి మాయయొ కాని, సర్వేంద్రియములు
దఱుఁగుకొనిపోవునంత శీతజ్వరంబు
భూతలేశ్వరి నెమ్మేన ముమ్మరించె
బ్రసవ వేదనతోడ నారంభ మగుచు

మ. తన సంతానము మాతృహీనమయి, వంతం గుందుచున్నట్లుగా
తన రాయందు వియోగభారమునఁ జింతన్ మున్గుచున్నట్లుగా
తనకై దొడ్డసమాధి న య్యమున పొంతం గట్టుచున్నట్లుగా
ననుమానించుచునుండె సత్సుతులయూహల్ సత్యసామీప్యముల్

తే.గీ. భక్తి దైవార మానెడు వజ్రమణులు
భూతలేశ్వరుఁ డల్లాకు మొక్కికొనియెఁ
గాని, యిల్లాలు స్వస్థతఁ గాంచదయ్యె
చండతరుఁడైన విధి, లంచగొండి గాదు

తే.గీ. దాయ మన్నీల ప్రాణముల్ దీయఁగలిగి
యీయ లేడయ్యె నిజభార్య కాయువులను
చండశాసనుఁడగు మహాచక్రవర్తి
ఆత్మ కధికారి గాఁడు న్యాయంబుగాను

చం. కొడుకులఁగౌఁగిలించుకొని, గ్రుడ్లకు నీరముగ్రుక్కుకొంచు, వ్రా
న్వడి, పెనుశోకమూర్తియయి, పజ్జవసించు నిజేశునంగమున్
బుడుకుచు, బిట్టుగా మొగిడిపోయిన కన్నులువిచ్చి శబ్దముల్
దడబడఁ బల్కరించె, రుచిదప్పిన గద్గదరుద్ధ కంఠయై

ఉ. ఈ సుఖదుఃఖ మిశ్రమ మహీవలయంబను సత్రశాలలో
నీ సతినై ముగించితిని, నేటికి నాదు ప్రవాసయాత్ర, యో
ధీసముపేత! యిట్టి పరదేశుల చెల్మి తిరంబుగాదు, క్ష్మా
వాసకథావిశేషములు స్వాప్నికముల్, జపలావిలాసముల్

ఉ. ఈ తనువుండునంతవఱ కింతయు నెమ్మదిలేదు ప్రాణి కీ
భూతలమందుఁ గష్టసుఖముల్ జెలికత్తియలై భజింప నా
శాతరళాక్షి తాండవము సల్పుచు నుందును, మృత్యుదేవతా
ద్యూతవినోద రంగమిది, తోరపుసంపదలెల్లఁ బాచికల్

ఉ. ఆవిరి యోడలో, జలధియాన మొనర్చెడు బాటసారులో
భూవర! రేవులందు దిగిపోయెద రించుక వెన్క ముందుగా
నీవసుధాపణంబు పనియెల్ల ముగించి, స్వదేశగాములై
పోవుచు వచ్చుచుంద్రు సతమున్ బ్రజలీ నరజన్మ వర్తకుల్

ఉ. భూరిపరాక్రమోన్నతుల పుచ్చిన మేటికపాల పాత్రలన్
నీరము ద్రావుచున్నవి వనీవనభూములలోని సింహముల్
వారల యస్థిపంజరముల న్నివసించుచు నూర్ణనాభముల్
దారముదీసె, నింతియకదా? భువి నాల్గుచెఱంగు లేలినన్

ఉ. ఏ పుష్పంబునుజేసి వాడుకొనునో యీదేహమున్ దైవమో
భూపశ్రేష్ఠ! విచారమందకుము, మామూలేకదా? యీమృతి
వ్యాపారంబు సమస్త జీవులకు, విశ్వవ్యాప్తి గర్భంబునన్
మాపుల్ రేపులునెందరో; యిముడుచున్నారందునేనొక్కతెన్

మ. సమతా చిహ్నితమైన, యీ మరణ మీ సర్వంసహావేదనా
సమరశ్రాంతుల గౌఁగిలించుకొని, విశ్రాంతిన్ బ్రసాదించెడిన్
హుమయూనాదులు మీపితామహులబో లుర్వీధవుల్ పెక్కురీ
సుమశయ్యం బవళించి మేల్కొనరహస్సుల్ పెక్కులిట్లేగినన్

మ. మహమూదాదులు పాదముద్రికలచే మన్నింపఁగా, మింటికిన్
మహికి న్నిచ్చెనవోలి యేరుపడి, సమ్మర్దంబుగానున్న యా
రహదారిం జను భక్తులం గలసి స్వర్గక్షోణిఁ బ్రాపింతు నీ
సహరా మందుటెడారి వేదనల దౌష్ట్యంబున్ వినిర్జించెదన్

మ. కలుషం బింతయు లేని నీ మధురముగ్ధంబైన చిత్తంబు లో
పల నిద్రింతు ననారతంబు నదె యాహ్వానించుచున్నారు, వే
ల్పులు, నాకైచనుదెంచెమించులరథంబుల్, తెక్కలల్లార్చుచున్
సెల విప్పింపుమటంచు నేత్రములు మోడ్చెన్ భర్తృవక్షస్థలిన్

తే.గీ. పట్టు పరదాల చీఁకటి వనములందు
ప్రభవమును గాంచి, శోభిల్లి రాలిపోయె
పరిమళంబొందు లోకాన బారజిమ్మి
మొగలు రేరాణి ముత్తైదు ముత్తియంబు

శా. ఆ ముంటాజమహాలురాణి, కడకట్లన్యాయ్యమై పోయినన్
భూమీశాగ్రణి, దీనుఁడై, భుజబలంబున్ ప్రాజ్యసామ్రాజ్యమున్
లేమిన్ జెందినయట్లు బిట్టుదురపిల్లెన్ గ్రుంగి కూలారి యు
ద్దామైశ్వర్యము లింపుసేయునె? కళత్రజ్యోతి చల్లారినన్

మ. అతఁడున్మత్తుఁడువోలె, రేఁబవలు నిద్రాహారముల్మాని, త
త్సతి క్రీడించిన చోటులం దిరుగుచున్ సంతానముంజూచి, దుః
ఖితుఁడై, యూర్పులుసిమ్ముచున్ గడపసాగెంగాలమున్ బంధుసం
తతు లోదార్చిన నూరడిల్లక నిరుత్సాహాతిరేకంబునన్

తే.గీ. నిన్న మణిమందిరంబుల నిదురవోయి
నేఁడు నిద్రింతువే కాటినేల మీఁద
నిన్నినాళులవలెఁ గాక నిన్న నేఁడు
లెంత విషవహ్ని గ్రక్కిపోయినవి దేవి?

మ. కుతలం బంతయు భస్మరాశియయి నాకుందోచె, నాశాపరా
జితమై, జీవిత మంధకారమునఁ జొచ్చెన్ నీ సమావేశముల్
కతలైపోయె, సహింపఁజాలని వియోగజ్వాల కావింప ను
ద్గత దుఃఖాంకితమైన యీ శిథిల కంకాళంబు నెట్లీడ్చెదన్

ఉ. జీవన తారవై, యమరసీమల నీవు, సముజ్జ్వలింప, మా
యావృతమైన విశ్వవలయంబున, శాశ్వతశోకమూర్తినై
జీవితమూని, యీ చరమజీవిత నాటకరంగమెక్కి, వా
పోవుచునుంటి నీ విధురభూమికతోడ కిరీటధారినై

శా. ఆయుస్సారము లారగించి, మృతిపంచాస్యంబు, నీదేహమున్
నాయంకంబున డించిపోయె నకటా! నాశౌర్యసంపత్తియున్
జాయారక్షణ జేయఁజాలని యరణ్యాజ్యోత్స్నయై పోయెనే
యోయాత్మేశ్వరి! చక్రవర్తియు మనుష్యం డిట్టిఘట్టంబులన్

చం. ఉరుగతి నీవు దాల్చికొని యూడ్చిన వస్త్రమువోలి, నీ కళే
బరము పరేతభూతలము పాలయి చిత్తము నుత్తరించెడిన్
దిరుగ ధరించు నీ యమృతదేహముతో నగుపింతువందు ర
ప్పరమపదంబునందు నది వాస్తవమో! బులిపించుమాటయో!

మ. అయయో! దేహములూడ్చినారయుతసంఖ్యాకుల్ మహాత్యాగులై
పయగంబర్లు ముముక్షువుల్ ఘనతరస్వర్గంబు నాశించి యే
మయినారో! యెటువోయిరో! కబురుసేయండొక్కఁడీనాటికిన్
దయనీయస్థితి దుమ్ముగొట్టుకొని ప్రత్యక్షించుఁ దచ్ఛల్యముల్

మ. నిను సృష్టించుట దుర్ఘటంబగును రాజ్ఞీ! యమ్మహాశిల్పి కీ
శున కేహేతువుచేత, నీ ప్రతిమ నచ్చున్ భగ్నముంజేసెనో
నను శిక్షించుటకో; ప్రపంచమునకు న్వైరాగ్యమున్నేర్ప నెం
చెనో; యాయుర్బలమూడెనో మొగలురాట్సింహాసనశ్రీలకున్

తే.గీ. మృతికి నవ్వలియొడ్డు జేరితివి నీవు
యివలి యొడ్డున నిలిచిపోయితిని నేను
పలుకులందని భిన్నవాసులకు మనకు
పుణ్యగేహిని! స్నేహంబు పొసఁగు టెట్లు

తే.గీ. మానినీమణి! నీదు సమాధి మీఁద
కనులు గప్పుచు కిగ్గాడి కాలరథము
తీర్చిపోయిన చక్రముద్రికలు వోలి
కడచె నొక యహ స్సొక్క నక్తంబు నపుడ

సీ. పయనంబు సాగించు మొయిలు తిన్నెలమీఁద కనుపింపలేదు నీ కాలిజాడ
అరవిచ్చి మురిపించు మెరుపుల తోఁటలో మిట్టాడ లేదు నీ మేని కాంతి
కొమరారు నిండు పున్నమ చందమామలో భాసిల్లలేదు నీ హాసలవము
సచరాచరంబైన సర్వ సర్వంసహ వినిపింపలేదు నీ విమలవాక్కు

ఆ.వె. ఏ రహస్యసరణి, యే హరిత్తులజాడ
నీ నిలింపరథము నిర్గమించె
నాదు నేత్రయుగళి నాట్యమాడెడు నిన్ను
నెట్లు దొంగిలించె నీశ్వరుండు

ఉ. నీవు వసించుచోట వసియింతును నేనును దాచియుంపుమో
దేవి! యొకింత నేల, చనుదెంచెద రేపట మాపటన్, నిరా
శావిషదహ్యమానమయి సౌఖ్యపరాఙ్ముఖమైనయట్టి నా
జీవితశేష మంకితముఁ జేసెద నీ కవివాహితుండనై

శా. నాకట్టించు మసీదులన్ మసలుచున్ నాకాన్క లాసించుచున్
నాకుం గీడుఁ దలంచినాఁ డతి కృతఘ్నుత్వంబు వాటించుచున్
లోకాధీశుఁడు, దేవదేవుని దయాళుత్వంబు సందేహమై
నాకీ యచ్చపుభక్తి సేతలు, వృథా నాట్యంబులై తోఁచెడిన్

ఉ. అక్కటికంబు లేని దురితాత్ముఁడు మృత్యుకిరాతరాజు, వి
ల్లెక్కిడినాఁడు, తృప్తి వహియింపఁడు నీ మరణంబుతోడ, నీ
జక్కవ జంటలో నొకటి చాలదు వాని బుభుక్షదీర్ప న
న్నుక్కడఁగింపఁగాఁ దొడుగకుండఁడు రెండవబాణముద్ధతిన్

మ. అసుపేటిం బదిలంబుగాఁ బతిరహస్యంబెల్లఁ గాపాడు, వి
శ్వసనీయంబగు వ్యక్తి భార్యయకదా? క్ష్మాచక్రమందట్టి నీ
వసువుల్ వాసినయంతనే, ప్రబలసైన్యంబుండి భీతిల్లుదున్
వసుధారాజ్యము గల్గియుం గటికి నిర్భాగ్యుండనై పోయితిన్

తే.గీ. ఆరిపోవని నీదు శరీరశోభ
దీపమైనది కాళింది తిన్నియలకు
మంజులంబైన నీ సౌకుమార్యమెల్ల
పంచుకొన్నవి తన్నదీ పంకజములు

చం. గురుతర సత్యలోకమునకుం బయనించి సుఖించుచుంటివో
కరగి, యనంతమౌ ప్రకృతి గర్భమునందున లీనమైతివో
యెఱిఁగినవాఁడులేఁడు, హృదయేశ్వరి! దుర్ఘటమైన మృత్యనం
తర విషయంబయోమయ మనన్వయ కావ్యము మానవాళికిన్

శా. నీరూపంబను స్వర్గలోకమిచటన్ జీర్ణించె, జీర్ణించదే
స్వారాజ్యంబను సంశయంబునకు లోనైయున్న నాబుద్ధి కీ
గోరీమృత్తికఁ బచ్చగిల్లిన తృణాంకూరంబు నా కేదియో
వైరాగ్యాంశము లుగ్గడించెడి, తలం బంకించి జంకించుచున్

చం. ప్రియముగ దేవదూతలుచరించెడు మూఁడవమిన్ను దాఁటి య
వ్యయమగు జీవనిర్ఝరమువాఱు నొకానొకదీవికొంటిమై
బయనముగట్టితే యనుఁగు భర్తను నన్ను పరిత్యజించి యో
ప్రియతమ! తోడుగానెగయ ఱెక్కలుగల్గనె నాకుదేహికిన్

చం. అవనికిదూరమై యెదదకందని స్వర్గము నూహలోన మా
నవుఁడు సృజించినాఁడది యనాథులు పేదలు నిల్చుతావు, భూ
ధవులకు గాదు, నీమృదుపదంబులు కందుఁ గళిందజాతటిన్
జివుకని స్వర్గధామము రచించెదరమ్మ్మ శుభస్వరూపిణీ

కం. మృతులకు మరుజన్మంబులు
కృతులకదా? దేవి? యట్టి కృతి శతములచే
బ్రతికించి నీకుఁ జక్కని
రతనాల సమాధి, మందిరము గావింతున్

సీ. ఎల్లజీవులకు నత్యుల్లాసమొలికించి ప్రభవించె నీ సుప్రభాతసంధ్య
వలచు కమ్మని పరీమళము గుప్పిటఁబట్టి పూచె నీ సంపంగి పూలతోఁట
నిలువుటద్దమువద్ద నిలిచి జారిన కొప్పు సవరించె నీ వయస్యాజనంబు
తొలి నమాజుల మేలుకొలిపి లోకాధీశు మన్నించె బెడఁగు జమ్మా మసీదు

తే.గీ. మదన గోర్వంక నిద్దురమత్తువోవఁ
దనువు విదళించి యీశ్వర స్తవమొనర్చెఁ
బ్రాతరానందమున సృష్టి పరిఢవిల్లె
నీవు మాత్రము నిద్దుర లేవలేదు

మ. పదియుం దొమ్మిది యేడు లీడుగల దాంపత్యంబు నీనాటితో
యెదనొప్పించిపెకల్చిదోచుకొనిపోయెన్ దైవ మీగాయమున్
గుదిరింపగల వెజ్జులేదు, గత రాగుల్ వోవు మార్గంబునన్
బ్రదుకుందేరు మరల్చెదన్ గృతకవిశ్వశ్రీ విసర్జించెదన్

తే.గీ. జీవ రత్నంబవగు నిన్ను స్వీకరించి
వట్టి రతనాలు నా యింట వదలినాఁడు
యిచ్చి బులిపించి క్రమ్మరఁ బుచ్చుకొనుట
యేటి కలవాటుజేసెనో యీశ్వరుండు

మ. ప్రియమారన్ దినరాజబాలుఁ డుదయాద్రిన్నిక్కి బంగారు కుం
చియతో నీదు మహాళ్ళపైఁ జిలుకరించెం గుంకుమ శ్రీలవే
అయయో! యెందులకీయలంకృతులు చానా? నీవియోగాకులం
బయి, యాభీలవిషాద నీరదశరణ్యంబైన యిక్కోటకున్

చం. ఉడుగక మ్రోయుచున్న యమునోజ్వల నీలి తరంగపంక్తి క్రుం
గుడు వడియున్న నా హృదయగోళములోని విషాదవల్లకిన్
దడయక మీటసాగె, నొకనాడు ముదంబొడ గూర్చు సృష్టియే
బెడిసి, మరొక్కనాడు పరివేదన కగ్గము సేయు జీవులన్

తే.గీ. నిన్ను నుదరంబులో దాచుకొన్న మహికి
రత్న గర్భాఖ్యనేఁడు సార్థక్యమయ్యె
నీవుతలమీఁదఁ దాల్చి మన్నించు కతన
వసుధ నొకబొగ్గు కొహినూరు వజ్రమయ్యె

చం. పరుగులు వాఱునీసమయ వాహనమున్ నిముసంబు వెన్కకున్
మరలిచి, దాటిపోయిన సమంచిత సౌఖ్యములందు వేడ్కకున్
గురియగుచున్న నావెడఁగుకోర్కె నెఱింగెనొ! యశ్వరాజముల్
దరహసితం బొనర్చెడు విధాన సకిల్చెడి సాహిణంబులన్

చం. గుఱకలు లేని వింత కనుగూరుకులం బవళించి యెన్నఁడో
పరమ పదించి పోయిన నవాబుల రాణులు తోడునీడగా
జరుపుము నీ యనంతమగు స్వార్గికయాత్ర, పవిత్రమైన నీ
చరితమునాలపించుచుఁ బ్రశాంతివహింతుఁ గళిందజాతటిన్

కం. ఉల్లమున దుఃఖభారము
పెల్లింత శమింప రాజు విలపించి, మనో
వల్లభ సమాధి నిర్మా
ణోల్లాసము చెంగలింప నుద్యుక్తుఁడై

కం. చాటింపించె నరేంద్రుఁడు
పేటల పల్లియల శిల్ప విఖ్యాత కళా
వాటికలు కుట్మలింపగ
బోటీకి సమాధి మచ్చు బొమ్మలుసేయన్

కం. డిల్లీ రాజ్యంబున నొక
పిల్ల జమీదారు గిరియు, బెక్కు రతనముల్
వెల్ల గజారోహణమును
బల్లకియు న్నిర్ణయించె బహుమానముగన్

చం. యతనము మీఁద బొమ్మలు తయారొనరించిరి శిల్పులెల్ల భా
రత విషయంబునంతటను ఱాలను లోహములన్ సహస్రముల్
బ్రతిభలుజింద నమ్మొగలురాయని ప్రేమ రసచ్ఛవుల్ బహి
ర్గతమొనరించు బొమ్మగనరా దొకటేనియు వానిలోపలన్

కం. అనుభూత్యావేశంబుల
జనితములగు లలిత కళలు సాధ్యములగునే
కనకపుఁ బోటీలకు ని
మ్మనుజేశుల మెచ్చుకోలు మర్యాదలకున్

శా. ఆ దేశాన మహాదరిద్రుఁ డొకరుండ వ్యాహతంబైన భా
ర్యా దుఃఖంబున గుందు వాఁడెడఁద వైరాగ్యంబు రేకెత్త ను
న్మాదింబోలి చరించు దీనుఁడు శ్మశానక్షోణులం దుండుచున్
బూదిన్ ముద్దలు జేసి చేయు ననయంబుం బొమ్మలందమ్ముగన్

చం. అతని శిరస్సులోపల విహారముచేయు కళాధిదేవి య
ప్రతిహతమైన వాని విరహాగ్ని గరంగి సముజ్వలించినన్
జితికిన గుండెతో నతఁడు సృష్టియొనర్చె సమాధి బొమ్మలం
చితములు పెక్కు లందొకటి చిత్తములన్ గిలిగింత పెట్టెడిన్

ఆ.వె. షాజహాను బాదుషా యూహలోనుండి
మాటకందరాక మసలు ప్రతిమ
సృష్టి శిల్పరమకు సిగమీఁది నగవోలె
నవతరించె వాని హస్తమందు

తే.గీ. కళలు మోహించుటొక కులీనులన కాదు
కులము లేదన్నవానినిఁ గూడ వలచు
సత్కళాదేవతా కటాక్షంబు కతన
సమయుగావుత ముచ్చనీచతల బెడఁద.

తే.గీ. జీవితేశ్వరికిది ప్రేమచిహ్న గాఁగ
బసిఁడి రేకుల గట్టింప వలయుననుచు
దిరిపెమెత్తుచు వాఁడూర తిరుఁగుచుండు
ప్రేమ పొంగున విశ్వంబు విస్మరించి

తే.గీ. వాని కోరిక నాలించి స్వాంతమందు
నవ్వుకొని వాని బొమ్మ సౌందర్యమునకు
సంతసించిన యొకశిల్పి సత్తముండు
దానిఁ దెప్పించి మొగలు సుల్తాను కొసఁగె

కం. పనితనమున్ గుదిరికయున్
వినూతనత్వంబు గలిగి ప్రేక్షణ యుగమున్
దనియించుబొమ్మ నరపతి
మనస్సులోనునిచె హర్షమాధ్వీకంబున్

కం. 'వహవా! సెహబా' సియ్యది
బహుమతికిం దగినబొమ్మ ప్రజ్ఞాన్వితుఁడీ
మహనీయుఁ డనుచు నరపతి
బహుభంగులఁ బొగడె నిఖిల పండితుల సభన్

కం. అవమతియు లజ్జఁ బెనగొన
స్తవము సలుపు టెట్టులయినఁ దప్పని సరియై
"అవునవు జిత్తముచితమని"
నవాబునకు మాఱువల్కినా రీర్ష్యాళుల్

చం. నృపుఁడు రసజ్ఞుఁడందు రిదియెక్కడి వింతయభాగ్యునొక్కనిన్
శ్వపచుని గౌరవించి, తలవంపులుచేసె ననల్పకల్పనా
నిపుణులనంచు ధర్మము గణింపఁకొందఱు ముచ్చటించి రూ
రుపులు నిగుడ్చుచుం బతిపరోక్షమునన్ కులపక్ష పాతులై

ఉ. రాజు సతీవియోగి బయిరాగియు బెండ్లములేని దీనుఁడ
వ్యాజము లిట్టివారి సహవాసము లింతియకాని యీ పరి
వ్రాజకుఁడేటి శిల్పి నరపాలకుఁడేటి పరీక్షకుండు సా
మాజికులిందఱుండ నని మచ్చరకించిరి కొందఱుబ్బునన్

ఆ.వె. చదువవచ్చు గ్రంథ సముదాయమంతయు
కృతులలోని నెరసు లేరవచ్చు
రసము సృష్టిచేయు ప్రజ్ఞావిశేషంబు
సాధనమున రాదు చదువుగాదు

మ. పిరదౌసీ కవికన్న పండితులు సూఫీ కన్న విద్వాంసులుం
దురు భాషాజలధిన్ మథించినమహాత్ముల్, భావనిర్మాణచా
తురి మాధ్వీరససృష్టియుంజిలుఁగుముద్దుంబల్కుకుల్కింపులున్
గురుశుశ్రూషల నబ్బునే, యసమశక్తుల్ జన్మసాఫల్యముల్

శా. ఏదో కొంత కళావిశేషముగలా దీ చిత్రరాజంబునన్
గాదన్నన్ ఫలమేమి? యీ కళకు వాఖ్యానంబు లీ రిత్త వా
గ్వాదంబుల్ పనిసేయునే, యితని భిక్షా హస్తమం దేమహా
వైదుష్యంబు వసించునో యనుచు సంభాషించి రుద్యన్మతుల్

ఉ. ఆ నిఱుపేద వానిని మహాసభకుం బిలిపించి మంత్రులున్
దా నెదురేగి తెచ్చి తనదాపున నున్నత పీఠివాని నా
సీనునిఁజేసి క్రొంబసిడి చేలములుం బదివేల నిష్కముల్
గానుకఁ జేసె నమ్మొగలుకాంతుఁడు భూరికళావిధేయుఁడై

మ. సులతానాగ్రణి! మీకళాభిరుచికిన్ జోహారు, భార్యావియో
గులు మీకియ్యదెసానుభూతి, వినుతోక్తుల్ మీసభాశాలకున్
వలపుల్మీ సమదృష్టి దార్ఢ్యతకుఁ గైవారంబు మీ నేలకున్
కులుకు న్నెమ్ములతఖ్తుకుం దిశల నిగ్గుల్దేరు మీ కీర్తికిన్

శా. ఆనందించిరి మీపితామహులు వీరాగ్రేసరుల్ బూర్వసు
ల్తానుల్ బేబరుమాయునాదులు కృతార్థంబయ్యెమీవంశముల్
పూనెన్ జక్కని సౌధభూషణములన్ ముక్తాఫల శ్రేణితో
లేనవ్వుల్ విరజిమ్ముచున్న యది డిల్లీకన్య మీ కౌఁగిటన్

కం. హిందువులు ముసలిమానులు
బందుగులం బోలి "భాయి, భాయి" యనుచు నిం
పొందెదరుగాక మీ య
ర్ధేందు పతాకంబు నీడ నృపతి వతంసా!

ఉ. పొచ్చెమొకింతలేని పరిపూర్ణకటాక్షము విస్తరించి నా
బిచ్చపు గిన్నెలోఁబసిఁడి బియ్యముబోసిన దానవీర! నీ
పచ్చల బాహుశాఖి చలువం జెలువారి కళాలతాంతముల్
విచ్చి రహించి భారత సవిత్రికి బొల్చుతమంగదంబులై

ఉ. ఆసలు సంహరించుకొని యాకటికింత భుజించి యెట్టులో
వాసరముల్ గమించెదు నభాగ్యున కంగనగోలుపడ్డ స
న్యాసికి నాకు నీ పసిడినాణెము లేల కళా సరస్వతీ
దాసులు పెక్కులుండెదరు తన్పుమువారి శరణ్య శూన్యులన్

చం. మొగలు నవాబుశేఖరుల పూజ్యసభాంతరమందు సత్కళా
జగమున నా పరిశ్రమ ప్రశంసితమయ్యె, పసిండి పూజలన్
దిగులు సగంబుదీరె, గరుణించి పరిగ్రహ మాచరింపుఁడీ
నగదును క్రమ్మరం దమ ఘనంబునకున్న జరాన వెట్టుదున్

కం. నా వలె వియోగబాధా
జీవులయిన మొగలు రాజ శేఖరులకు మీ
కీ విప్రయోగి కాన్క ము
దావహమయి చిత్తశాంతి కనుకూలించున్.

కం. అతఁడట్టులాడి పసిఁడియు
రతనములు పరిత్యజించి, ప్రతిమవలె సభా
యతనంబంతయు నిశ్చే
ష్టితమై కనుచుండ నాలసింపక చనియెన్

చం. ఇతఁడొకదేవదూత, కలరే? యిటువంటి మహానుభావులీ
వితముగ పెన్నిధానము లభించిన దాని తిరస్కరించు ధీ
యుతులు, మదీప్సితంబును ఫలోన్ముఖముంబొనరింప మానవా
కృతి జనుదెంచియున్న జగదీశ్వరుఁడో, పయగంబరో యగున్

మ. అని యాశ్చర్యపరీత చిత్తుడయి రాజావగ్గు నగ్గించి, త
ద్ధనముం బేదపకీరు సాహెబులకుం దానంబు గావించి చ
య్యన దర్బారుముగించిలేచి, మణిశయ్యాగారమున్ జేరె, మ్రో
గె నగారానవుబత్తులాహ్నిక శతఘ్ని వ్రాతమున్ లగ్గలన్

మ. పిలిపించెన్ బహుదేశ తక్షకతతిన్ విఖ్యాతులౌ గ్రీకు శి
ల్పుల ముంటాజ సమాధి నిర్మితికి, ప్రోవుల్సేసె ముక్తామణుల్
నెలఱాల న్మలిపించె నద్దములకంటెన్ నిద్దముల్గాcగ, వె
న్నెలరేలన్ నెలతేని బింబమునకున్ దీప్తుల్ ప్రసాదింపగన్

మ. యమునాతీరము నిండినా రఖిల శిల్పాచార్యులున్ సత్కళా
సముదగ్రుల్ వరిగింజపై కలికి పూజల్ సెక్కcగాcజాలు ధీ
రమణీయుల్ ఘనవాస్తుశాస్త్రనిపుణుల్ ప్రాక్పశ్చిమావాసులు
న్నమితప్రజ్ఞులు నేలయీనిన విధానన్ తన్నుపాహూతులై

మ. పరిశీలింపc దొడంగినార లపరబ్రహ్మల్ మహాశిల్పు లీ
శ్వరసృష్టిన్ బహుపుష్పవల్లరుల సాజంబైన నిర్మాణమున్
గరమాకర్షకమైన వస్తుతతి లోనన్ డాగ లోకంబు న
చ్చెరువున్ గొల్పు విశేషముల్ దెలిసి హర్షీభూత చేతస్కులై

సీ. ఏ వన్నెగల తీవె కే పచ్చ సవరింప జెలువాఱునో దాని చికిలిజేసి
ఏ పుష్పదళమున కే పుష్యరాగంబు సరిపోవునో దాని సంఘటించి
ఏ కిసాలంబున కే కెంపు జోడింప కొమరారునో దాని కూర్పుజేసి
ఏ గులాబీమొగ్గ కేరవ్వ బొదిగింప నందగించునొ దాని నతుకు బెట్టి

ఆ.వె. ప్రకృతి సిద్ధమైన వన్నెతో వన్నెకు
చెలిమి గలిపి భావముల నిమిడ్చి
చలువఱాతి ఫలకముల దీర్పసాగిరి
చిత్ర చిత్ర గతుల శిల్పివరులు

తే.గీ. రసికుల విమర్శనా వితర్కముల కతన
బహు కవీశాన మోహన వర్ణనముల
బుడమిగల వాఙ్మయంబెల్ల బొగరుబట్టె
మడcతి ముంటాజి టాజియై పొడము వేళ

కం. శిలలకుఁ బ్రాణము గలదను
పలుకునిరూపింప నుపలఫలకమ్ములపై
మొలిపించినారు శిల్పులు
పలువన్నెల లతలు నేర్పుఁబరిమళమొలుకన్

ఆ.వె. కలమునందుకొన్న కవివరేణ్యునిబ్రోల
తలలువంచు శబ్దముల విధాన
నాటి శిల్పిచెంత నవనీతమును బోలి
మెత్తఁదనముఁ దాల్చె మేటి శిలలు

ఉ. తాకినఁగందునోయను విధంబున ఱాలకు సౌకుమార్యపుం
బోకడలద్దు నేర్పరులు ముప్పది ముగ్గురు శిల్పులాత్త లో
కైకచమత్కృతుల్ బొదిగి యిర్వదియేండ్లు శ్రమించి భారత
ప్రాకృతశిల్ప సంపదకుఁబ్రాణమువోసిరి శాశ్వతంబుగన్

చం. కుమిలిన పాదుషా హృదయకుండమునన్ దలక్రిందులైన వి
శ్వముల వికార నాట్యరభసంబున రేగిన వేదనా పరి
భ్రమణము నందుజింది వెలివాఱిన వెచ్చని కంటినీరు తా
జమహలుఱాలపై నుదయసంధ్యలఁబొల్చు హిమచ్ఛలంబునన్

ఉ. రాణిమనస్సువోలి మధురంబయి, ముత్తెపుఁజిప్పలోని పిం
గాణి చెమక్కులన్ ధవళకాంతులుజిమ్ముచు చంద్రకాంత పా
షాణపు టింపుసొంపుల దిశల్ వెలిగించెదు టాజిపొంత ని
ద్రాణములైనశించు నమృతాంశుని పున్నమనాటిపోడుముల్

మ. ప్రతిబింబించుగులాబి మొగ్గల కనుప్రాసంబులై, తచ్ఛిలా
లతలున్ గాలికిఁ దూఁగుపోలిక మహోల్లాసంబు గల్పించు న
ద్భుతమై, తాజమహాలు ద్వారములపై ముద్దారు శిల్పంబుతో
బ్రతిరాదీశ్వర శిల్పమున్ మనసులన్ రంజించు మర్యాదలన్

తే.గీ. ఏబదారక్షరంబుల నెసక మెసఁగు
కలికి భాషకు తెలుఁగున కలవిగాక
అలవియే తాజిలావణ్య మభినుతింప
తదితరంబైన భాషా వితానమునకు

మ. "కలదేస్వర్గము లాతిచోకలుగ నిక్కంబిద్దియే, నీతిమం
తుల విశ్రాంతినికేతనం" బనెడుసూక్తుల్ ద్వారబంధంబులన్
విలిఖింపించె నవాబుశేఖరుఁడరబ్బీపారసీ భాషలన్
గలిమిన్ జాటుచు తాజిసోయగము వ్యాఖ్యానింపఁగా నేటికిన్

కం. పున్నమకుటాజి కేగతి
సన్నిహితం బైనమైత్రి సమకూరిచిరో
కన్నెకు యౌవనమటులు
త్పన్నంబయి మిన్నుముట్టుతద్రోచిస్సుల్

ఆ.వె. తొడరి విశ్రమించు తుదిసుత్తెదెబ్బతో
వట్టిపోయె శిల్పవరుల ప్రతిభ
షాజహాను దీక్ష సఫలీకృతంబయ్యె
మొగలు కీర్తి మొదటి మొగ్గదొడిగె

తే.గీ. అది మహారాజు భగ్నాశయములయందు
పుష్పితంబైన నెలఱాల మూగకవిత
అది యమానుష భావనవ్యతలతోడ
ప్రజ్వలించెడు నజ్ఞాత వాఙ్మయంబు

సీ. అగుపించు నచ్చోట నవధిదాఁటిన పాదుషాల హేరాళ భాస్వద్విభూతి
నిండారు నచ్చోట నిత్యనూతన వికస్వరమైన యానంద పరిమళంబు
నినదించు నచ్చోట ననుకూల దాంపత్య విశద రహస్య గంభీర గీతి
విహరించు నచ్చోట విరహ వేదనతోడ మానవేంద్రుని భగ్నమానసంబు

తే.గీ. వేయిచంద్రుల చంద్రికా విలసనంబు
పరిసరక్షేత్రముల జింది ప్రతిఫలింప
హాయిగల్పించు తాజి కుడ్యముల మీఁద
గుసగుసలువోవు నైలింప కువలయంబు

తే.గీ. నరప మిథునంబు మృత్యనంతరమునందు
నాశ్రయములేక దిశల నల్లాడుచున్న
పావనంబైనప్రేమపారావతంబు
మొరయుచున్నది పెనుటాజి బురుజులందు

తే.గీ. అహరహము టాజిసౌందర్య మపహరింప
దడవుచున్నాఁడు కాలంబు తస్కరుండు
మొదటి క్రొత్తఁదనము చెక్కుచెదరదిపుడు
సత్కృతులపొంత సాగునేసమయబలము

మ. ఘనతన్జెందిన యందగత్తెయగునాగ్రారాణి ముంటాజి, చే
సిన పుణ్యంబును బోలి తాజమహలున్ సృష్టించి సంతృప్తులై
చనిరుద్యన్మతులైనశిల్పులు మహా షాజానుభూజానియున్
దనివింజెందెప్రియాముఖాంబుజము సందర్శించుచున్నట్లుగన్

తే.గీ. రాజుకడగొట్టు తనయుఁడౌరంగజేబు
అన్నల వధించి పీఠంబు నపహరించి
యనుఁగు తండ్రిని చెఱసాలయందు నునిచె
వికటములు సుమ్ము కాలమాంత్రికుని పనులు

తే.గీ. అగ్రజారుణ రక్తపంకాంకితమగు
పాణియుగమున నల్లాను ప్రస్తుతించె
నమ్మహాహత్య తనదిగాదన్నయట్లు,
సన్నుతులనంది దైవంబు మిన్నకుండె

తే.గీ. అతనిముత్తాత సుతునకైయసువులొసఁగె
నతఁడు దండ్రినిఁబట్టి బంధితునిఁజేసె
తాతసౌమ్యుఁడు మనుమడుద్దండమూర్తి
గుణములకు వంగడంబు కారణముగాదు

కం. జనకుండు భోగి కూరిమి
తనయుండువిరాగి, భిన్నతత్వంబుల నె
ట్లొనగూడిరొక్కొ తండ్రియు,
దనయుఁడు, విధి చిన్న కొంటెతనమొనరించెన్

కం. కళలు కళదప్పె, దేవళ
ములు మూలంబడియె, హిందుముసలిమ్ములలోఁ
దలసూపె భేదభావము
తలపన్నుదయించె, శాంతి తలక్రిందయ్యెన్

చ. అతఁడు ఖురానుఁవ్రాసి ధనమార్జనచేయుచు కష్టజీవియై
బ్రతుకుచు, నేలపై తనువువాల్చుచు, రాజ్యముచేయుచుండె నం
చితమగు భక్తితత్పరత స్వీయమతోద్ధరణైకదీక్ష, శు
ష్కితతనుఁడై సతం బుపవసించుచు రాచఫకీరు పోలికన్

కం. గుడి గుడి సేవింపఁడు, పా
ల్పడఁడు మజాసేయు మత్తువస్తువులకు న
య్యొడయఁడు పరికింపఁడు పెర
పడంతుకల నెఱపు నేకపత్నీవ్రతమున్

శా. చక్కాడెన్ విమతస్థులన్ గఱకు టీర్ష్యాస్వాంతుఁడై నిప్పులన్
గ్రక్కెన్ గాఫరులంచుహైందవులపైఁ, గల్పించెనానావ్యథల్
మక్కాయాత్రికులన్ దనించె విలసన్మాణిక్య భిక్షాప్లుతిన్
జిక్కెయౌఁదలతిక్క భక్తికతనన్ నిత్యంబు మర్త్యాళికిన్

మ. తనకుంబట్టినపిచ్చి నల్వురకురుద్దన్ జూచు వద్దన్న యా
తని నిందించి శపించిపోవు, బరమార్థంబెల్ల సాధించి తె
చ్చిన వానింబలె విఱ్ఱవీగు భువనశ్రేయో భరంబంతయున్
తన నెత్తింబడినట్టుదుఃఖపడు నాత్మన్ భక్తుఁడుద్రేకియై

ఆ.వె. సకలలోకమునకు సంతోషకరమైన
మధురమైనతాజమహలు హొయలు
పాదుషాహ మనసు వలపింపలేదయ్యె
బత్తితోడ కళకు పొత్తులేదు

తే.గీ. మనుజులకునెల్ల దైవంబు మహితుఁడనెడు
గౌరవార్థంబుగల యలంఘీరు బిరుదు
దాల్చెనౌరంగజీబు దుద్దండలీల
నృపతివలెనన్న బిరుదలకేమి కొదువ

ఆ.వె. అతని పేరువిన్న నఖిల భారతభూమి
దద్దరిల్లి కంట తడివహించు
నతని గుండెలోన ననయంబు నినదించు
ఘన శివాజి వాజి కఱకు హేష

ఉ. కట్టెదుటన్మహోజ్వలముగా వెలుగొందుచు తాజిమాలు చూ
పట్టుచు నూరడింప నలబంధన గేహమునందు వృద్ధ స
మ్రాట్టుమహేంద్రతుల్యుఁడవురంగునికూరిమితండ్రికాలమున్
నెట్టుచునుండె, జీవములు నిల్చినపీనుఁగువోలె దీనుఁడై

తే.గీ. ఎండగాసెడు ధారుణీమండలమున
కలికమునకైన పగవాఁడు గానరాని
చక్రవర్తికిఁ దనయుండ శత్రువయ్యె
విధివిరోధింప జరుగని వింతగలదె?

శా. ఏడేడుల్ జెఱసాలలో నవసి రా జీలోకముంబాసి, పూ
బోడిం బ్రేయసిఁ జూడఁబోయెదివికిన్ ముంటాజి గోరీకడన్
జోడింపంబడె షాజహానుతనువున్ స్రుక్కెన్ మొగల్ పీఠమి
ట్లేడుల్ పైకొనుచున్న టాజినిలిచెన్ స్మృత్యంకమైనేఁటికిన్

చ. ఇరువురు నొక్కచోటన శయించిరి తాజిమహాలునీడలం
దిరువురు విస్మరించిరి తరేతర పూర్వకథానకంబుల
య్యిరువురికీర్తిమూర్తులు మహీవలయంబును హెచ్చరించుచున్
మఱువక వారి నిశ్చలసమాధులమీఁద నమాజుజేసెడిన్

ఆ.వె. రాణి విడిచిపోయె రాజునొంటరిఁజేసి
రాజు విడిచిపోయె రాజ్యరమను
రాజ్యరమయు విడిచె రాజులఁ బెక్కండ్ర
తాజి విడువలేదు రాజసంబు

# భూమిక

రసజ్ఞులగు పఠితలకు–

ఇందలి కథ కేవలము కల్పితము: ఆంధ్రుఁడగు నొఁక బర్మా కాందిశీకుఁడు ప్రాణభీతి చేఁ బరువులిడి భయంకర గిరి గహన నదీనదములను నుత్తరించి కొండొక రేయి నొక కీకారణ్యమును బ్రవేశించి, చిక్కువడి కష్టములను దలపోసికొనుచు క్రూరసత్త్వముల నానావిధ భీషణఘోషణంబుల కులుకుచు నిట్టట్టు నడయాడుచుండ, మానవ కపాలమొకటి వానిపాదము లకు దగులఁగా, నులికిపడి కొంతవడికి నిబ్బరించి, దానివంకనారయుచు మరణ స్తవముచేయుచుండ, నప్పునుక పకపక నవ్వి కుశల ప్రశ్నముచేయును. పాంథుఁ డావైచిత్ర్యమున కద్భుతపడి దానితో ముచ్చటించును. అక్కపాల పాంథులకు జరిగిన వాదోపవాదములే యిందలి కథా వస్తువు.

నిరపరాధులగు మానవులను నిష్కారణముగా నాహుతిఁ గొనుచున్న నేఁటి ప్రపంచ యుద్ధభీషణకాలమున శాంత్యహింసల యౌత్కృష్ట్యములను స్థిరీకరించుటయే నా యాశయము.

“కేవల కల్పనాకథలు కృత్రిమరత్నములు” అని భట్టుమూర్తి సిద్ధాంతము; కాని, కాలపరిణామము ననుసరించి కవినావేశించిన సత్యమును వ్యక్తీకరించుట కత డెన్నియో పథకములను సృష్టించుకొనును; అవి హృదయంగమములై రసోత్పత్తిని గల్గింపఁజాలినచో, కల్పితాకల్పితకథావివక్షకు తావులేదని నాయభిప్రాయము. ఈ చర్చ రసజ్ఞులకు వదలి ప్రకృతమునకు వత్తును.

నేనీ గ్రంథమును నెల్లూరు వాస్తవ్యులును, రసికోత్తంసులునగు శ్రీయుతులు తిక్కవరపు రామిరెడ్డిగారి యర్ధాంగలక్ష్మియును, ప్రతివ్రతా తిలకమును, కీర్తిశేషురాలునగు శ్రీ సుదర్శనాంబగారి పవిత్రాత్మ కంకితము చేయుచున్నాను.

నాయం దవ్యాజమయిన యనురాగమును వహించి, నన్ను పలుమారు నాహ్వానించి సత్కరించి, యాకృతి రచనకు నన్ను బ్రోత్సహించిన శ్రీ రెడ్డిగారి కోమలహృదయము, వారి నిరాడంబర చరిత్ర, వారి విశ్వమానవ సమత్వదృష్టి, వారి విమర్శనా నైపుణ్యము, నాహృదయము నెంతయు నాకర్షించినవి. తిక్కన జయంతి సందర్భమున వారినలంకరించిన పద్యముల నిందు పొందుపరచుట యప్రస్తుతము కాదను కొందును.

చం. కువకువలాడు క్రొందెలుఁగుకోకిల కామనియైన యిమ్మహో
త్సవసమయంబునన్ జనయితన్ దనియింపగ నూరునార్లతో
కవుల బహూకరించు గుణగణ్యుఁ దుదారగుణైకశోభి, తి
క్కవరపు రామిరెడ్డి కవుగాత మనామయ సౌఖ్యసంపదల్!

మ. కలఁతన్ జెందక రెడ్డిభూపతుల ఖడ్గచ్ఛాయలన్ దెల్గు సీ
మలు శోభిల్లెడు నాఁటి సత్కవుల సన్మానోత్సవానంద రే
ఖలు రేకెత్తిడిఁ గ్రమ్మరన్, రసికలోకశ్రేష్ఠ! మీబోటి దా
తల చేయూతల నుద్భవిల్లెదరు గాదా నన్నయల్ దిక్కనల్!

మరియు, నిక్కావ్య రచనా సందర్భమున శ్రీ రెడ్డిగారు నాకొసంగిన సలహాలు అమూల్యములై నాకెంతయు నుపకరించినవి; అందులకు వారికి నేనెంతయు కృతజ్ఞుఁడను.

భాషాభిమానము సన్నగిల్లిన యిక్కాలమున నిస్సహాయులై చింతిల్లు కవుల కాశాజనకముగా శ్రీరెడ్డిగా రేటేట తిక్కన జయంతి మహామహముల నత్యుత్సాహముతో నెఱపుచు తండ్రిగారి పేర నూరార్లొక తెలుఁగు కవికి సమర్పించుచు, విశాలకీర్తి నార్జించుచున్నారనుట ప్రశంసా పాత్రము. ఈ గ్రంథము భృత్యబాంధవ కామధేనువై, సకల సద్గుణ గుణములచే విరాజిల్లి చన్న శ్రీసుదర్శనాంబగారి కంకితము చేయబడుటచేత, నే నుదార గుణ సనాథులగు రెడ్డిరాజులతో శాశ్వత బంధుత్వము నెఱపిన వాఁడనైతిని.

శ్రీ రామిరెడ్డిగారు మత్కృతి స్వీకృతికి ప్రతిఫలముగా నాకు సముచిత భూదానమును సలిపి, ఆదరించి నాకవితావేశమునకు నవనవోత్తేజమును కూర్చిరని చెప్పుకొనుట కెంతయు గర్వించుచున్నాను. వారికి నా హృదయ పూర్వక నమస్కార సహస్రములు. భగవంతుఁడు శ్రీ రెడ్డిగారికిని, వారి సంతానమునకును దీర్ఘాయురారోగ్యములను ప్రసాదించుగాక!

నెల్లూరు రెడ్డివర్యులఁగూర్చి నేను ఒకప్పుడు వ్రాసిన క్రింది పద్యములనిట నుద్ధరించుట అప్రస్తుతము కానేరదు.

తే.గీ. మునుపు పలెనాటి బ్రహ్మనాయని గృహాన
దళములెత్తిన యస్పృశ్యతా నివార
ణోద్యమ ప్రరోహము పూయుచున్న దిపుడు
రెడ్డిరాజుల నెల్లూరి గడ్డమీద!

తే.గీ. సిరులు గల్గియు గర్వదూషితులుగారు
దేశ దారిద్ర్యవారణ దివ్యదీక్షఁ
బరితపింతురు రెడ్డి భూపాలవరులు
కరుణగలవారు మధుర విగ్రహులువారు

జి. జాషువ

# అంకితము

ఉ. పైదలి మిన్నయుం గడుపు పండిన చల్లనితల్లి, దొడ్డము
త్తైదువ రామిరెడ్డ్యలఘుదాతృసతీమణి కీర్తిశేషురా
లాదరణీయ మంజుల గుణాలయ! సాధ్వి! సుదర్శనాంబ స
మ్మోదమెలర్ప నాదుకృతి పుష్పవనంబు నలంకరించుతన్!

మ. వినుతింపందగు నీమనోహరుఁడు గంభీరస్వభావుండు నీ
కనుల న్నిత్య నివాసముండిన శుభాకారుండు నీపేర నీ
తెనుఁగుంగబ్బముఁ(వ్రాయఁబంచె ననురక్తిన్ దాల్పుమమ్మా! సుద
ర్శనదేవీ! ఘనదేవభూముల మహేంద్ర జ్యోతిముట్టింపఁగన్.

మ. పొలిచెన్ (గమ్మరసింహపత్తనమునన్ ముత్యాలపందిళ్ళు క్రొం
దెలుఁగుంగైతకు నీ మనోహరుని దాతృత్వ (ప్రభావంబునన్
నెలవేర్పడ్డది నా కవిత్వమునకు న్నీవంగడంబందు ధీ
గల తల్లీ! నినుఁగూడి నేర్పఁగలదింకం (బ్రోన్నతాకూతముల్

శా. సంతానంబులనీడలన్ విరులసెజ్జల్ నీకుఁ గల్పించుచున్
బంతుల్ దీరి నిలింప కన్యకలు నీ పాదంబులొత్తన్ సతం
బంతుంబొంతును లేని సౌఖ్యముల నైక్యంబందు నీవెట్లుగా
సంతోషింతువో! తల్లి! మత్కృతి భుజిష్యాసాహచర్యంబులన్

శా. పూజాభాజనమైన తిక్కవరపుం బుణ్యాన్వవాయంబునన్
దేజోరేఖలు దిద్ది నావలఘుపాతి(వ్రత్య ధర్మంబునన్
సౌజన్యంబున నోసుదర్శన మహాసాధ్వీ శిరోరత్నమా!
గాజున్మెట్టియగల్గు నీమృతి యలంకారంబు నీకీర్తికిన్

ఉ. భౌతికమైన యీ తనువువాసి యనంతయశశ్శరీరవై
యాతనలేని స్వర్గవిషయంబునఁ గాపురముండియున్ దయా
శీతలదృష్టి నాదుకృతిఁ జేకొన నాథునిలోననుండి కెం
జేతులు సాఁచు నిన్నునుతిసేయుదునమ్మ సుదర్శనాంబికా!

ఉ. చల్లని చూపులం బడుచు సంపద నిత్యము నృత్యమాడు నీ
యిల్లు సమస్తభోగములకెల్లగదా? త్రిదశాలయంబు నె
ట్లొల్లితివమ్మ? నీకు నయి యుమ్మలికింపనివేళ లేదు నీ
వల్లభుఁడున్ సుతాసుతులు బాంధవులుం బరివార మాప్తులున్

మ. ప్రతిబింబించెడి నీ స్వరూపము దివారాత్రంబులు న్నేటికిన్
బతినేత్రంబులఁ గర్ణవీధులఁబ్రతిధ్వానించు నాలాపముల్
మతి లోకోత్తరులైన మీ మధురదాంపత్యంబు వర్ణించి మా
నితమయ్యెం గవికోటి రెడ్డిదొరసానీ నీకుఁ గైవారముల్.

మ. చెరయందున్నది చిన్నకూతురు కళాస్వీకార దీక్షానిరం
తరుఁడై పుత్రుఁ డమేరికాకుజనియున్నాఁడమ్మ! నీ పెద్దకూ
తురుఁ దక్కుంగల బిడ్డలుంగొలువ నీ దుఃఖంబునన్ జీవితే
శ్వరుఁడున్నాఁ, డెటు కాలు నిల్చినది దేవస్వామి లోకంబునన్?

మ. అరవిందుం బరిపూర్ణ మానసమునన్ ధ్యానించి యేత న్మునీ
శ్వర సందర్శనలబ్ధిచే సకలతృష్ణావార్ధులింకించి త
చ్చరణస్పర్శఁ బునీతవై, స్వకులకాసారంబు శోభిల్లగా
అరవింద ప్రభనుల్లసిల్లితివి ధన్యా! గేహినీ రత్నమా!

సీ. రామకృష్ణుని కృపా రమణీయ దృక్కుల సంచార మొనరించు చలువదనము
రమణ మహర్షుల కమనీయవాక్కుల కాపురంబొనరించు కమ్మఁదనము
ప్రథిత పోతన భాగవత కథారచనలో చింది చిల్కిన చిదానందబలము
జీవితేశుని సమంచిత చరిత్రమునందు గర్భితంబైయున్న కరుణరసము

ఆ.వె. అలవరించు కొంచు నాదర్శ గృహిణివై
చల్లినావు ప్రేమ సౌరభంబు
నీవు నిల్పిచన్న నిత్య నూతనకీర్తి
దసిలిపోదు శ్రీ సుదర్శనమ్మ!

మ. ఎలబ్రాయాన ధరాహితార్థమయి మున్నేసాధ్వి సంతాన మీ
తెలుగుం దేశములోఁ గఠోరమగు బందీగేహముంజేరి ని
శ్చల కీర్తింగడియించె? సద్గుణగరిష్ఠా! సుస్థిర త్యాగ శ
క్తులు నీ స్తన్యములో రహించు నను కొందున్ రెడ్డిరాజ్ఞీమణీ

మ. కలహ జ్వాలలఁ గ్రాగు పేదలకు భిక్షాదానమున్ జేయుచున్
జెలిమిన్నీపతి రెండుపక్షములపైఁ జిల్కెన్ సమానత్వమున్
గలఁతన్ జెందక యావదాంధ్రమెలమిన్ శంసింప నెల్లూరిలో
పొలఁతీ! యీశుభవర్తమానము నిలింపుల్ మెచ్చఁజాటింపుమా!

మ. ఎలిమి న్నీపతి పంచభక్ష్యములతో నేటేట దన్పున్ దరి
ద్రుల నీపేర నుగాది పుణ్యదినమందున్ వస్త్రదానంబులన్
సలుపున్నేటికిఁ దృప్తజిహ్వలు సహస్రంబుల్ నినున్, నీ కుమా
ర్తెల నీపుత్రుల నీ మనోహరునిఁ గీర్తించున్ సమంచద్గతిన్

కం. దంపతుల కిరువురకు నను
కంపాగుణమొక్కలీలఁ గలుగదు ధర పు
ణ్యంపుం దంపతులకు మీ
కింపారుట ప్రజల సుకృతమే హేతువగున్

మ. నిరతంబున్ నిరుపేదలందలఁచి కన్నీరించుచున్ సత్కళా
దరణవ్యగ్ర మనస్కతం దనరు నాత్మస్వామికి న్నీడగా
ధరణి న్నిల్వక దాటి పోయితి మహేంద్రక్షోణికి, న్నీ హృదయం
తరమందున్న రహస్యమున్ దెలియ సాధ్యంబౌనె మాబోంట్లకున్?

ఉ. నీ చరితంబు సత్కవుల నిర్మల వాణికి గూర్చె వర్ణనా
ధీ చతురత్వముం గులసతీమణి కోటికి గౌరవంబు నీ
పూచిన కీర్తిచేఁ దెలుఁగుపుణ్య పురంధ్రి సముజ్జ్వలించియున్
దాచికొనెన్ భవత్తనులతం గబళించి కృతఘ్న చిత్తయై

ఉ. నీ నిజనాయకుండు కరుణించిన సత్కవికోటిలోపలన్
నేనొకరుండ నాదుకృతి నీదుగళంబు నలంకరించి స
న్మానితమైనచో దివిజనాథుని సంస్కృత సత్కవీశ్వరుల్
బూని ప్రశంస సేయుదురు పూత మెఋంగు తెలుంగుఁ బోదుముల్

చం. మగని మనో విశుద్ధమణి మంటపసీమల నచ్చువడ్డ నీ
యగణిత సుస్వరూపమున కచ్చట నిచ్చట పూజసేయఁ గ్రొ
న్నగవులతో నెదుర్కొనెడు నాకృతి నీపతి మేలి మన్ననన్
మిగిలిన పూజ్యవర్తన సుమీ! ప్రమదంబున నాదరింపుమీ!

సీ. అలఘు పట్టాభి రామాభిధానుని మేలిబంగారు కడుపునఁ బ్రభవమంది
రామిరెడ్డి గుణాభిరాముని ప్రణయంపు దొరసానియగుచుఁ గాపురముచేసి,
కొడుకులుం గూతులుం దొడవులుగా దొడ్డ మాతృతా విభవ విఖ్యాతి నలరి
ఘనతరంబగు శీలమున సింహపురిరెడ్డి ననబోండ్లలో ఘరానావహించి

తే.గీ. తనివిఁ జెందిన భృత్య బాంధవ సహస్ర
భావసీమల నిత్యనివాసమున్న
శ్రీ సుదర్శనదేవి మంజీరరవళి
సతము నినదించుగాత మత్కృతి ముఖమున

మ. సరవిం బెండిలియాడె రెండవ తనూజన్ నీదు తమ్ముండు మం
తిరి గోపాల మనీషి నేడతఁడు జాతీయోద్యమావేశ బం
ధురుఁడై బంధితుఁడైనవాఁడు చెరయందున్ భర్తతో భార్యయున్
జెరకుంబోయె సతీత్వ గౌరవశుభశ్రీలం బ్రతిష్ఠించుచున్

శా. నీవున్ ఖద్దరుదీక్షతో మెలఁగి గాంధీశాంతిసన్న్యాసి యా
జ్ఞావర్తిం బ్రియునంపవో చెఱకనూనంబైన హర్షంబునన్!
నీవైరాగ్యముఁ ద్యాగము బ్రబలమై నీసంతతిం జెందె, నీ
కీవృత్తాంతము కర్ణపేయమగుగాదే వీరపుణ్యాంగనా?

మ. గొనముల్ పొంపిరిపోవు నీవలపుటుగ్గుంబాలతో బోల్చి నీ
యనుగుం గూతులునుం గుమారకులు విద్యాబుద్ధులన్నేర్చి తం
డ్రిని మెప్పించిరి వంశముం దనివిజెందెన్ దల్లి! నీవంటి సా
ధ్విని సేవించి మదీయ కావ్యము శుభాప్తిందేలి వర్ధిల్లుతన్

కం. నియతిమెయి జరుగు తిక్కన
జయంతి సందర్భమందు సత్కవులకు నీ
ప్రియుఁడొసఁగు నూరునారులు
స్వయముగ నేటేటఁ గూర్మి జనకునిపేరన్

సీ. నివసింపదమ్మ! నీధవుని మానసమందు విశ్వనాశక కుల ద్వేషలవము
విహరింపదమ్మ! నీగృహమేధి కడకంట నిందార్హమగు గర్వనీరదంబు
ప్రభవింపదమ్మ నీప్రాణేశ్వరునినోట వెగటైన యొక చిన్ని వేడిమాట
యెడబాయదమ్మ నీ హృదయేశ్వరుని జిహ్వ స్తవనీయమగు సత్యసౌరభంబు

తే.గీ. సాగదెన్నఁడు జీవితేశ్వరుని పదము
కలుషితములైన వక్రమార్గములయందు
ప్రేమితం బైన నీదు పవిత్రమూర్తి
మాసిపోలేదు తల్లి నీ మగనియెదద

మ. గురుదేవుండని గాంధిచే నుతులు మ్రొక్కులు గాంచి విశ్వంభరా
భరితోద్గాథ యశస్సుఁగాంచిన కళాపాథోధి ఠాగోరు న
క్కఱదీరం భజియించి నీకొమరితల్ గారాబుఁ బుత్రుల్ సహో
దరుఁడున్ లీలగడించినారలు ప్రసిద్ధంబైన విజ్ఞానమున్

ఉ. శాంతినికేతనంబున బ్రశాంతమరుత్తులు వీచుచోట, భా
స్వంత సమానతేజుఁ డలవంగకవీంద్రుఁడు విశ్వభారతీ
కాంతకు గీతికాంజలిని కంఠమునన్ గయిసేయువేళ నీ
సంతతి యభ్యసించె కవిసన్నిధి దేశహితైక దీక్షలన్

ఉ. శ్యామలదేవి నీవలపు చక్కని పెద్దతనూజ భూరివి
ద్యామహనీయయై యనుఁగుఁ దండ్రి మనస్సుహరించి, స్వీయ వం
శామలకీర్తికిన్ దళుకులద్దినదమ్మ సుదర్శనాంబికా,
నోముల నోచినమ్మల తనూభవ లజ్జులుగా జనింతురే?

కం. ఏపారు ముక్కుపచ్చల
పూపవయస్సుననఁ దెల్గుఁబువుబోడులలో
దీపమయితాల్చె నతి వి
ద్యా పుష్పిత సుప్రతిష్ఠ యం. యే.; బిరుదున్

తే.గీ. అమెరికాఖండ దివ్యసభాంతరముల
బత్రిక లలంకరింప నుపన్యసించె
ప్రథమపుత్రుండు పట్టాభిరామిరెడ్డి
మొన్న మొన్నన, సుతుల యభ్యుదయగాథ
నీశ్రవోలంకృతంబుగా నెగడుగాదె?

కం. ఇంతులకు నెల్లమేలిమి
బంతియగుచు విభుని మెప్పువడసిన లక్ష్మీ
కాంతమ్మ త్యాగమునకున్
సంతోషించెదరు నేఁడు జాతిప్రముఖుల్

కం. అనసూయ కుద్దియగు నీ
యనసూయాంబిక సముజ్జ్వలాదర్శగుణో
ద్ఘన, యనుఁగుఁ దండ్రి కన్నుల
యనురాగము జూరలాడు ననవరతంబున్

కం. శ్రీమతి శకుంతలాంబ సు
ధామంజులవాఙ్నిధాన! దాతృత్వగుణ
శ్రీమహిత సేమమిచ్చుట
నీమానసవరి విభుఁడు నెగడున్సుఖియై

ఆ.వె. శివకుమారరెడ్డి చిన్నినీకడగొట్టు
ముద్దుపుత్రుఁడెల్ల విద్దియలను
గడనసేయుచుండె ఘనతరంబైన నీ
ప్రేమవృష్టి, విస్తరింపుమమ్మ!

కం. పరహితమతి గోపాలయ
చెరసాలకు నగ్గమగుచు జీవితమెల్లన్
గఱకులఁబడియెడి నీసో
దరులు న్నినుఁబోలె పుణ్యతములుపురంధ్రీ!

కం. పసితనమునఁ దనమెయిఁగల
పసిండి నగలెల్ల దేశభక్తులకిడి వం
గసమునకింపొనరించిన
ప్రసిద్ధకథ నీ మనస్సుఁబండించెఁగదా?

# కాందిశీకుఁడు

ఉ. తొక్కలతో నభంబున జరించుచు దిక్కులనిండ నిప్పులన్
గ్రక్కుచునున్న నేఁటి రణమృత్యువు సేయు దురాగతంబులన్
బిక్కబలంబుసూపి ధృతివీడిన కొండొక పౌరుఁ డొంటిమై
జిక్కువడెన్ మహాగహనసీమల రబ్బరుబండు కొండలన్

కం. భయవిహ్వల చిత్తుఁడు మన
ప్రయాణికుం డొక్క నీపపాదపమునకున్
మెయిజేర్చి మూర్ఛ మునిఁగెన్
వయసుడిగినప్రొద్దు నపరవనధి మునింగెన్

తే.గీ. కాందిశీకుఁడు వనసింహ గర్జనములఁ
దెలివి దళుకొత్త పెనుమూర్ఛఁ దేరి లేచె
నంధకారంబు దిక్కుల నావరించి
యదిమి భూనభంబుల ముద్దులాడుచుండె

కం. పొక్కిన పదములఁ జెమ్మట
గ్రక్కుశరీరంబుతోడ కాఱుటడవిలో
దిక్కరి కన్నులనీరము
గ్రుక్కుకొనుచు గడపసాగె ఘోరనిశిథిన్

సీ. వనసత్వముల బంచ బంగాళమొనరించు సింహమ్ములకు నమస్కృతులొనర్చి
జడల దయ్యములకైవడి గాలిఁదూగాడు వృక్షరాజికిఁ జేతులెత్తిమ్రొక్కి,
యూరకూరకన గ్రుడ్లురిమి నిప్పులుగ్రక్కు గుడ్లగూబల కేటికోళ్లు నెరపి,
కదలు దివ్వెలబోలు కనులఁ గొండలుడిగ్గు మువ్వన్నె మెకములఁ బూజఁజేసి

తే.గీ. అడవి సత్తికిఁ బలుమరు నంజలించి
యేడుగొండల దేవుని నెదభజించి
ఆపదలలోన భక్తి రెండంతలగుట
వాస్తవముజేసె ధృతిజారి బాటసారి

కం. వాఁడెక్కి దిగనికొండయు
వాఁడీదని యేరు, తినని వన్యఫలంబుల్
వాఁడు భజింపనిదేవుఁడు
లేఁ డంతటి దీనమూర్తి లేఁడు ధరిత్రిన్,

సీ. అతఁడా సాము గమించి యుత్తరముగా యానంబుసాగించి భా
రతమున్ జొచ్చి యఖండ జాహ్నవితటప్రాంతోరు కాంతార సం
తతులన్ దాటి మహానదిన్గడచి యాంధ్రక్షోణిఁబ్రాపించి శో
భితజన్మస్థల పుణ్యవాయువులు సేవించెన్ గత శ్రాంతుఁడై

ఆ.వె. పర్వతములు నదులు ప్రతిపదార్థంబును
స్వాగతంబొనర్చి పల్కరించి
ఆదరించినట్టు లై యింపుగావించె
కన్నతల్లిగాదె కన్నభూమి!

తే.గీ. నల్లమలకొండలం దొకనాఁటి రాత్రి
ప్రొద్దుగ్రుంకిన కతమునఁ బ్రొద్దుబుచ్చె
కాందిశీకున కత్యుగ్ర కాననములు
దోస్తికతమునఁ దనయింటి తోఁటలయ్యె

కం. ఆకటిసొద ముమ్మరమై
చీకాకయియున్న యతనిచిత్తమున క్షుధా
వ్యాకులిత సర్వమర్మ్యా
నీకము గన్పట్టె నెదుట నిల్చిన కరణిన్

మ. "చెలువుల్ జిమ్మెడు పాలఱాలపయి ముచ్చెల్ కుచ్చులల్లాడ ని
చ్చలు క్రీడించెడు నాకు గర్కశ శిలాసంతాన కాంతార భూ
ములలో నన్వయమయ్యె నిప్పుడనయంబున్ గట్టియల్ గొట్టు పే
దల పాదాలస్రవించు రక్తగత బాధా దీర్ఘ సందేశముల్

శా. ఆడంగుల్ కలవారి తొయ్యలు లసూర్యంపశ్యలై హాయిగా
మాడీలం బరదాలలో మెరయు శంపావల్లులైయొప్పఁ నా
నాడుం గొండల కోనలన్ గృషిక కాంతల్ మూపులం బాపల
ల్లాడం గష్టము చేయు దృశ్యములు నాయాత్మం బ్రపీడించెడిన్"

కం. అని తలఁచుచుండ మానిసి
పునుకయొకటి వాని పాదములకుఁ దగులఁగాఁ
గనుగొని చిత్తము ఝల్లన
వెనుకకొదిగి నిలిచె నారవిచ్చిన కనులన్

తే.గీ. "వసుధ ననుఁబోలు నొక మందభాగ్యుఁడెపుడొ
తనువుచాలించియుండుఁ గాంతారసీమ
యుదిత భీషణ విపదబ్ధు లుత్తరించి
దైవసన్నిధిఁజెన్నారు ధన్యుఁడితఁడు

తే.గీ. ఉభయ లోకాల యనుభూతి నుల్లసిల్లి
శాశ్వత సమాధి నున్న నిశ్చలుఁడితండు
ఐహిక విలాస సంతత వ్యగ్రమయిన
బ్రతుకు సాగించు నాశోపహతుఁడ నేను

చం. చలనములేని యీతని ప్రశాంతిని భంగముసేయ నేర్చునే
ప్రళయ సహస్రముల్? యుగపరంపర మారుపుసేయుచున్న భూ
తల నటనా కథాంక సముదాయములెన్ని నటించిపోయెనో
మెలకువలేని యీ పునుకమీదుగఁ గాలసముద్ర కుక్షికిన్!"

కం. అని పలుకు కాందిశీకుని
తనువు పులకరింప గుండెఁ దడయెత్తఁగ, గా
ననమెల్ల మారుమ్రోయఁగ
నను నిట్లు కపాల మట్టహాసోత్కటమై

కం. "విరమింపవోయి! పాంథా
మరణస్తవమింక, దీన మానవకోటిన్
మురిపించు మాటలివి దు
ర్భరము లనాధారరిక్త వాదాంశంబుల్"

కం. అచ్చెరువు పడుచు పాంథుఁడు
బచ్చెన బొమ్మట్లు కొంతవడి నిలిచి "యహో!
పుచ్చెగదా! భాషించుట
యచ్చెరు!" వని గుండె యాని యానక లోనన్

ఆ.వె. దయ్యమనుచు గుండెదడయెత్త మృదువైన
పల్కు తీరుచూచి భయముదక్కి
నమ్మి నమ్మలేక నలుదెసల్ సూచుచు
బాటసారి మారుపలికె నిట్లు

మ. "నను దౌర్భాగ్యుని గాసిపెట్ట వెనువెంటన్ బడ్డ కర్మంబవో!
వనభూమిన్ జరియించు రక్కసివొ! నీవాసస్థలంబెద్ది? చ
చ్చిన నీవేగతి పల్క నేర్చితివొ! యీచిత్రంబు వాక్రుచ్చి నా
యనుమానంబు శమింపజేయుము మహాత్మా! దేహమల్లాడెడిన్"

తే.గీ. అనిన పకపక నవ్వి యప్పునుకపలుకు
"కర్మమునుగాను చిలిపి రక్కసినిగాను
జగతి నినుఁబోలి యొకనాఁడు జన్మమెత్తి
క్షోణివాసిన బౌద్ధభిక్షుకుఁడ నేను

తే.గీ. భయద మానవ భ్రష్టకపాలములను
నా హయామున జూచియున్నాఁడ నేను
నా కపాలాస్థి అటువలె నీకుదోచు
సృష్టి పరిణామమున కింత చింతయేల?

మ. అనుమానించెదవేల? రమ్మిటు వయస్యా! రేపు నన్నుంబలెన్
దనువుంబాసి శ్మశాన భూముల ననంతప్రేత భూతాళితో
మనవో! చూడవొ! రుండపంక్తులు భయోన్మగ్నాంత రంగుండవై
వనభూమిన్ జరియించు నీ చరితమున్ వాక్రుచ్చు మాద్యంతమున్

శా. దుమ్మైపోయె సుఖాను కూల్యమగు విద్యుద్దేహ మేనాఁడొ! యీ
యెమ్ముల్ నిల్చె నెడారి గాడ్పులయిపోయెన్ బ్రాణముల్, సర్వశూ
న్యమ్మున్ బ్రేక్షణ భీషణంబగు శ్మశానక్షోణి వేదాంతమున్
నమ్మింపంగల సాధనంబనయి యున్నా నీ కపాలాస్థినై

ఉ. జీవితులైన బందుగులు చిందిన బాష్పనదీనదాలలో
ప్లావితమైన మాదగు కపాలపరంపర తారహారమై
భూవనితామతల్లి ఋణమున్ దుదముట్టఁగఁదీర్చి జీర్ణమై
పోవు యుగాంతరానఁ గృతపుణ్యాల బంగరుపంట చేలకున్

సీ. అది మొన్న మొన్న దేహంబూడ్చి విశ్వంబు వాసి వచ్చిన పిల్లవాని శవము
అది, రాజ్యకాంక్ష నాహవభూమిలోనఁ గూలిన రాచవాని కళేబరంబు
అది, మనుష్యులఁ జూచి బెదరి యవ్వలబడ్డ ఆచారవంతుని యస్థిపేటి
అది, బిట్టు టాకఁటి సొదకు నగ్గంబైన కడు పేదరాలి కంకాళయష్టి

తే.గీ. అది, మహార్తుల ప్రబల దాహములు దీర్పఁ
గనులు దడిసిన యార్ద్రచిత్తుని సమాధి
మృత్యువశమైన మా తనూమృత్తికలను
వాయు ధూర్తుఁడు తూర్పారఁ బట్టఁదొడఁగె

మ. పరలోక రత్న కవాట దర్శనలబ్ధి కలుగలేదింక మా కన్నుఁగవకు,
జగములాశించు నీశ్వరకంఠ నినదంబు వినుపింపదింక మా వీనుగవకు
మహితనందన గంధవహ కిశోరశ్రేణి తాకలేదింక మా తనులతలకు
అనిమిషుల్ భక్షించు నమృత భోజనతుష్టి చెందలేదింక మా జిహ్వికలకు

ఆ.వె. అబ్ధశతకచయము లంతరించెనుగాని
అమరలోకవాస మమరలేదు
అమరునట్టివేళ యరుదెంచునో ముందు
కలుగదేమొ మాకు క్షపణకులకు"

కం. మతము నిషా యంగంబున
జితించియున్నట్టి కాందిశీకుఁడు క్రోధో
ద్ధతుఁడై యిట్లను బునుకం
బ్రతికిన వాఁడన్న పిచ్చిభ్రమ కగ్గంబై

శా. వేదంబుల్ తలక్రిందుగాసలిపి బైబిల్ ప్రేమ సిద్ధాంతమున్
బూదింబుంపి ఖురాను సత్యమును వమ్మున్ జేసినా వక్కటా!
లేదా స్వర్గము? సృష్టికర్తయును ఖాళీయయ్యెనా? యెందుకీ
దూదింబోలినపల్కు? లింతటి వినీతుల్ చచ్చి సాధించితే?

కం. పుట్టెవుగద! మరచితినౌ
పుట్టెన్ జన్మించు బుద్ధి బోదంద్రయయో!
వెట్టికపాలమ! హృదయము
చుట్టుమనెడి నీవిచిత్రసూక్తులు విన్నన్"

కం. అని క్రోధ రుద్ధకంఠ
స్వనమున వాక్రుచ్చు బాటసారింగని య
ల్లన స్వర్గనరకముల నిం
పున నిట్లని నిర్వచించెఁ బున్క మృదూక్తిన్

తే.గీ. "శాంతి స్వర్గంబు నరక మశాంతి యనుచు
నిర్వచింతురు మాబౌద్ధనియమరతులు
స్వర్గసృష్టికి బుద్ధుండె స్రష్టయంద్రు
సర్వమతముల సిద్ధాంత సారమిదియ.

తే.గీ. బుద్ధదేవుని సత్కళాపుంజమెల్ల
నీశ్వరాకారమని బౌద్ధులెన్నుచుండ్రు
స్వర్గ నరకాలు రెండు నీ జగతియంద
నరుడు సృష్టింపగలడని నమ్మగలను

సీ. ఎనలేని దుఃఖవహ్నికి ధాయ్యయైనట్టి తృష్ణ నెల్లరును హరించుచోటు
నిరపాయకరములై తిరుగు ప్రాణుల మేను కత్తుల కగ్గము గానిచోటు
ఎల్లజాతులవార లేకోదరులయట్టు ముద్దుముద్దుగపొంది పొసఁగు చోటు
వెలితిచే శుష్కించు పేదసాదలడొక్క ముప్పూట లనువుగాఁ బూడుచోటు

తే.గీ. ఇంద్రియవిజేతలైన మునీంద్రకోటి
మానసముబోలి కలఁతలు లేనిచోటు
ప్రేమరసవాహినులు వెల్లి విరియుచోటు
పరమగును దానికొక స్థలాంతరములేదు

కం. ఆ దివ్య లోక సృష్టియె
వేదాదులు పల్కుచుండు వివిధగతుల దు
ర్వాదోపవాదములచే
భేదోద్దేశములు జగతివెలసినవి సఖా!

సీ. కనుపింపరాదన్న కఱకుటాకటఁ దూలి క్షుభితమౌ దీనభిక్షుక చయంబు
ప్రవహింపరాదన్న స్వార్థబీజములఁబోషణసేయు దీర్ఘతృష్ణాఝరంబు
సాగరాదన్న రాచరికంబుసేయు తుచ్ఛంబైన యిచ్ఛ నీచతలదాడి
మనగూడదన్న దుర్మతములపేరటఁ దలయెత్తు నెత్తుటి కలహరభస

తే.గీ. బ్రదుకరాదన్న టక్కరి పన్నుగడలు
సాగరాదన్న ఘన నిరుద్యోగధాక
ధనము ధాన్యంబు నొకని పెత్తనముక్రింద
కట్టువడి వ్యర్థముగ తుప్పుబట్టరాదు

ఆ.వె. నేను పుట్టి గిట్టి నేఁటికి దాదాపు
పుష్కరములు నూరు ముగిసియుండు
ఏమతాలు వొడమె? నేపోకడలు వోయె
కట్టుబొట్టులేని కాలరథము?

సీ. సవరించినా నహింసా దివ్యతరముద్ర క్రొవ్వాడి సింగంబు కోరమీద
వారించినాఁడ నూరూర నెత్తుటికూటి శాక్తేయులొనరించు శక్తిపూజ
పర్యటించితి మంచువలచు కొండలదాక చిరుచీమ తలకాయ చిదుకకుండ
సంధించినాఁడ నిశ్చల సమత్వజ్యోతి జాత్యహంకార దౌష్ట్యము శమింప

తే.గీ. ఆశ లుపసంహరించి సన్న్యాసినగుచు
పట్టుకొన్నాఁడ భిక్షా కపాలపాత్ర
వెనుక నాగార్జునుండు స్థాపించినట్టి
స్థూపములమీద నాపేరుఁ జూడఁగలవు

శా. నా చేతన్ విరచించితిన్ మును పజంతా గహ్వరశ్రేణులన్
భూచక్రేశుని బుద్ధదేవుని మహాత్మున్ జిత్రవర్ణంబులన్
ప్రాచీనంబగు నాంధ్రశిల్పమున కాపాదించితిన్ శాశ్వత
ప్రాచుర్యంబును శాక్యసింహుని పదవ్యాసంగినై పొంగితిన్

శా. చీనా మున్నగు మిత్రభూముల జిగిర్చెన్ బౌద్ధ సిద్ధాంతముల్
నానాదేశము లాదరించినవి, మానాగార్జు నాచార్య శి
ష్యానీకంబును స్థాపితంబులగు సంఘారామ సంతానముల్
మీ నేలన్ గలవే? త్యజించెదరె భూమీశుల్ రణేచ్ఛారతుల్?

ఉ. ఎట్టు పరిష్కరింపఁబడియెం బలనాటి రణంబు? నాయురా
ల్చెట్టిన చిచ్చులారిచిరె? పెద్దన బ్రహ్మన లైతమాంబ మే
ల్పట్టి పొటేటి గుల్లములపై విహరించిన వీరభూమిలోఁ
బుట్టిన యాంధ్ర యోద్ధలకు బుద్ధుని బోధలు బుద్ధికెక్కనే?

తే.గీ. బ్రహ్మనాయని నట్టింటఁ బ్రభవమైన
యంటుదోష నివారణోద్యమ సమస్య
మొగ్గదొడగెనె మహదాంధ్రభూతలమున?
నన్వయించెనె ప్రజ కనైక్యపుటశాంతి?

సీ. మృతినందెనే నాగులేటి మిట్టలమీద పీడాకరంబైన కోడిపోరు?
వారింతురే మీరు పచ్చినెత్తుటిపూజ మాచెర్లచెన్నుని మందిరమున?
చల్లారెనే మహాసతుల నాహుతిగొన్న సహగమనాచార దహనకీల?
మానిరే ప్రజలు సంపచ్ఛాయలణఁగించు నీతిమాలిన త్రాగుబోతుతనము?

తే.గీ. ఖరుఁడు దూషణుఁ డిరువురు మరణమైన
కఱకు కార్యమపూడి మార్గములయందు
నణగిపోయెనె పశ్యతోహరులభీతి?
శాంతి నెలకొల్పెనే బుద్ధశాసనములు?

ఉ. న్యాయపథంబునన్ నడచునా భువనం? బటుగాక యాజులన్
గాయమునొవ్వ రక్తతిలకంబు ధరించునొ! ప్రాక్తనాజ్ఞతా
వాయుహతిన్ స్వధర్మమును వాసి చరించునె ప్రేమతత్త్వ ది
వ్యాయుధశక్తి విశ్వ విజయప్రదమై తమమున్ హరించునే?

కం. మీయుగ విశేషమేమిటి?
యేయేభూపతులు రాజ్యమేలెదరు? మతా
లేయవి? నేడెల్లప్రజల్
హాయిగనున్నారె? యాంధ్రి కానందంబే"

కం. అనిన పునుక పల్కు లాలించి పాంథుండు
కినుకదక్కి కొంత తనువుదెలిసి
బుద్ధబోధకతన మూడినసేగియు
ప్రకృత యుగచరిత్ర బలుకసాగె

తే.గీ. "పులుల మేకలఁ గావించి పోయినట్టి
వెడఁగు బుద్ధుని యనుఁగు శిష్యుఁడవు గాన
నెఱపుచున్నావు నిర్వీర్య నిగమబోధ!
మెట్టవేదాంతమిది కట్టిపెట్టవోయి

ఉ. ఎక్కడ నాయురాలి కథ? యెక్కడి బ్రహ్మనమాట? మాయుగం
బెక్కడ? భూతధాత్రి ధరియించిన పుష్పవసంత వస్త్రముల్
లెక్కిడవచ్చునే? నిదురలేవని నీ తలపుట్టెమీదుగా
చక్కఁగ దాటిపోయినవి శాంతములైన సహస్రవర్షముల్

కం. శిలలై, దేవతలై మ్రొ
క్కులకుం గురియై, తెలుంగు గుమ్మెటకతలై
కలలై నశించిరప్పటి
నలగాముఁడు బ్రహ్మనయును నాయకురాలున్

కం. పలనాటి భారతంబున
జలజాక్షుండయిన బాలచంద్రునిపిత దో
ర్బలశాలి బ్రహ్మనాయఁడు
కలడందురు గుత్తికొండ గహ్వరములలో

సీ. శ్రీనాథసుకవి భక్షించిన పలనాటి యలనాఁటి జొన్నకూడారగించి
కారెమపుడి గొడ్డుగారంబుధాటికి తాళజాలక గింగిరాలు దిరిగి
నాఁపబండలక్రిందఁ గాపురంబొనరించు మండ్రగబ్బల పరామర్శలంది
గురిగింజలంతేసి గురిజాల దోమల గానంబునకు మేను కంపమెత్తి

ఆ.వె. నాగులేట దాఁగినారు బాలుఁడు బ్రహ్మ
నాది తెలుఁగుమగ లనన్యయశులు!
తలఁచుకొన్న గుండె లలనాడు నీనాఁడు
పల్లెనాడు మురికి పల్లెనాడు

తే.గీ. శాక్యసింహుండుబోసిన చచ్చుమందు
కారణంబుగ నిమ్మహా కదనవేళ
నొక్కగుజ్జారి జాపనీయునకు వెఱచి,
పరుగులిడుచుంటిమోయి కపాలమిత్ర!

చం. ముగిసెఁ జరిత్రలో శుభ సముత్కటమైన యుగంబు, లాలపుం
బొగ లెగజిమ్ముచుం బ్రళయ భూమికదాల్చి యనంతవేదనా
యుగ మరుదెంచె నుగ్ర నటనోద్ధతి, తత్పద ఘట్టనంబునన్
దెగిన యభాగ్యులన్ మిగిలితిన్, హతశేషుఁడఁ గాందిశీకుఁడన్

తే.గీ. గర్భవతియైన చిరకాల కలుషరాశి
యుదకలాడిన దిప్పు డాయోధనంబు
భజన కసరత్తు చేత దుర్బలములయిన
శాంతిదేశాలకిది పరీక్షాయుగంబు

తే.గీ. శాక్యసింహుని మీ యహింసా సుధోక్తు
లాలపించెదు పెను పెగోడాలముందు
సలుపుచున్నారు కదనంపు సత్తికొలుపు
లనపరాధుల రక్తగాహనము సలిపి

సీ. అది శివాజీవీరుఁ డహితుని కడుపులోఁ గత్తులాడించిన కదనభూమి
అది ప్రతాపుని వీరకదన సైంధవహేషప్రతిశబ్ద మీనిన పర్వతంబు
అది త్రిలోకీ పూజ్యుఁడగు చితోడ్గడరాజు స్తంభమెత్తించిన శాసనంబు
అది తెల్గురాణి దాయల రక్తపంకంబు తిలకంబు దిద్దిన దివ్యభూమి

తే.గీ. అక్కటా! భారతంబు ప్రత్యణువునందు
స్వీయ పౌరుష విశ్రాంతి చిమ్మిరేగు,
నట్టివీరుఁడు సింహసంహననుఁడిపుడు
దేబెరించెడి నర్థవిధేయుఁడగుచు!

ఆ.వె. బూచిబూచి యనుచుఁ బుత్రుల వెరపించు
పిరికితల్లి మున్ను బెంచదెవని
క్రోలినార లుగ్గుబాలతో లోకాల
వీరరసముఁ దల్లి నూరిపోయ

సీ. ముత్యాల తలఁబ్రాలు బోయించుకొన్నారు ఘనముగా జయపరిగ్రహణవేళ
ముదము దైవార నెన్నుదుట దాలిచినారు దురములో రక్తసిందూరరజము
అందుకొన్నారు రాయలవారు స్వయముఁగా నందించు తాంబూల చందనంబు
కైసేసినారు బంగారుమువ్వలతోడ బిరుదు టొడ్డాణంబు వీరదట్టి

ఆ.వె. నాఁటి తెలుఁగువారి మేటిజాతీయత
నాఁటి విజయనగర నగరభూతి
తలఁచుకొన్న మేను పులకించి పొంగారు
కాలమిట్టు మమ్ము గాసిపెట్టె

కం. దిగ్గజము లిపుడు గ్రమ్మర
దిగ్గజముల లోనఁ గలసె నచటి దేవుండ్లయయో!
వగ్గులయి పరిభవంబున
సిగ్గిలుచున్నారు భ్రష్ట శిల్పాంగదులై

తే.గీ. బ్రహ్మనాయని పలనాటి రణచరిత్ర
తిరిపెమెత్తుచు నూరూర దిరుగసాగె
కసమసీని మహోగ్ర హుంకారరవళి
గుమ్మెటల కుత్తుకలయందు నుమ్మలించు

ఆ.వె. నాఁడు పలుచవడ్డ నవ్యాంధ్రతేజంబు
లీలఁ బ్రజ్వరిల్ల లేదు మరల
వెట్టిగొల్లఁడొకఁడ వీరులపూజించి
శివముబట్టి యిపుడు చిందులాడు

శా. ఏదేశం బల బుద్ధదేవుని కృపాదృష్టిం బ్రశంసించి త
త్పాద ద్వంద్వము నాశ్రయించి, ఘన భూతప్రేమ శాసించెనో
యాదేశంబ మనుష్యరక్తనదులం దాప్లావముంజేసె నీ
వేదాంతంబులు బూటకంబులనుచున్ విశ్వంబు చింతించెడిన్

కం. గీతాకృష్ణుఁడు గావలె
నీ తరుణమునందు గాంధి యేమిటికి? మహా
గౌతమ బుద్ధుండేటికి?
మా తనువల్లికలు పిరికిమందులఁ జివికెన్.

మ. ఇది నాజూకు యుగంబు పూర్వులకు లేవీలాటి సౌకర్యముల్
హృదయాహ్లాదక యంత్ర వాహన శతం బీలాహిరీ గాన సం
పద లీ బొమ్మలనేత సన్నపని మేల్మాంధాళి వస్త్రావళుల్
నిదురింపన్గలవేల్పు లిప్పటినరుల్ నిక్కంబువాక్రుచ్చినన్

తే.గీ. బుద్ధునంతటి యేమహాత్మునకొ కాని
పలుక దానాఁటి యాకాశవాణి మీకు
ఇరువదియు నాల్గుగంటలు మెరయుచుండు
వాడవాడల జెవియొగ్గువాఁడు లేఁడు

తే.గీ. శాస్త్రములలోన నెన్నడో చదివియుందు
రమరు లెక్కిన ఘన విమానముల కథలు
మెలఁగునిప్పుడు నిరతంబు తలలమీద
మిన్ను మార్మోయ నినుప తుమ్మెదల కరణి

తే.గీ. కవుల కుపమాన సామగ్రిగా రహించి
మేఘ సౌధాలు వెలిఁగించు మెరుపు లతలు
వలసినప్పుడ మాయిండ్లఁ బ్రజ్వరిల్లుఁ
బరువుతక్కువ లితర దీపములుమాకు

ఆ.వె. సకియ మీయుగాన సంతానయంత్రంబు
కామతృప్తి సేయఁగలుగు దినుసు
అద్యతనవధూటి విద్యావిభూషిత
తెరమరుంగు వాసి మెరయుమెరుము

మ. చదువు న్మా ముసలమ్మయున్ సకలశాస్త్రశ్రేణి యింపై ముదం
బొదవన్జేసెడు నచ్చుపుస్తకచయం బూరూర నేపారెడిన్
చదువుం గొందఱ కంటరానిదయి దాచంబడ్డ మీ కాల సం
పద మాకిప్పుడు నింద్యమై యతి జుగుప్సాహేతుకంబయ్యెడిన్

మ. వ్రతముల్ సల్పి కుమారులంగను ననర్థంబైన మీకాల దు
స్థితి లేదిప్పుడు కూటిపేదలకు నుద్దేశించినన్ జూలు సం
తతికిన్ లోపములేదు మేమిపుడు సంతానావరోధార్థమై
వ్రతముల్ సల్పు నవస్థచేకురె యథార్థంబన్న! ముమ్మాటికిన్

ఉ. మా కలవారు త్యాగు లసమానులు, దేశహితైక దీక్ష బం
దీకృతులై తపింత్రు శయనింతురు కర్కశభూమిశయ్యలన్
మా కవులాలపింతురు సమంచిత నవ్యయుగోచితంబులై
యాకటి చిచ్చు లార్చు హృదయ ప్రవిదారి దయాకథాంశముల్

మ. అనుఁగుం భర్తలతోడ దేశమునకై త్యాగంబు గావించి బం
ధనగేహాలఁ దపించు వీరసతు లున్నా రీయుగంబందు మా
తెనుఁగున్ దేశపు రెడ్డి రాజులకు జాతిద్వేష లేశంబు లే
దనురాగోన్నతముల్ విశాలము లనన్యంబుల్ దదాకూతముల్

మ. అపుడున్నంతటి నిష్ఠ లేదిపుడు బ్రాహ్మణ్యంబునన్, గొంతనే
రుపుగా నున్నటు లేనటుల్ జరుపువారుం గొందఱున్నారు ధ
ర్మపరుల్ సర్వకళాభిమాను లనుకం పాయత్తులుం బొల్తు రో
రుపు లేనట్టిఁడు లెప్పుడుంగలరు ధూర్తుల్ సర్వవర్ణంబులన్.

చం. కొడవటి టెక్కెమున్ దలను గూరిచి కార్మిక కర్షకాళితో
నడుముబిగించె నీయుగము నందొక నూతన సామ్యవాద మ
న్గడిబిడి దానిదెబ్బకు వికావికలైనది స్వార్థజర్మనీ
జడనిధి నేటిమారుపు లసంఖ్యము లంచితముల్ విచిత్రముల్

మ. సుకవిబ్రహ్మ దిగంతకీర్తి రుచిరాంశుశ్రేణిచే భారతాం
బకు ముత్యాల మహళ్లు దీర్చిన మహాప్రజ్ఞాసముద్రుండు వం
గకవీశానుఁడు మాయుగంబున కలంకారంబు టాగోరు నా
మక విద్వద్ఋషి కాంచె 'నోబెల'ను సన్మాన ప్రతిష్ఠాఢ్యతల్

శా. శాంతిస్యందన మాగబట్టుటకు శస్త్రంబుల్ విసర్జించి రం
డంతేవాసులు గా నటంచు పెనుశంఖారావమున్ జేయుచున్
శాంతిజ్ఞాన దయాకదంబిత కళాసన్యాసి నూరేండ్ల వాఁ
డంతశ్శాత్రవజేత లేచె నొకరుండాశా భ్రమాపాదియై

సీ. వెలితిపడ్డది మాకు విశ్వసౌభ్రాత్రంబు మధురాతిమధుర సమత్వదృష్టి,
అరగొరంతయ్యె మా కార్థిక సౌఖ్యంబు నట్టింట నవ నిధానంబులుండి,
తక్కువైనది మాకు దానపరత్వంబు కర్ణుండు కన్నుల గదలుచుండి,
అన్వయింపదు మాకు నైకమత్యవిభూతి తలమీదపగవాఁడు మెలఁగుచున్న

ఆ.వె. కొంత స్వేచ్ఛతోడఁ గొంత యస్వేచ్ఛతో
కొంతకలిగియుండి కొంతలేక
సర్వమున్న దనుచు సరిపుచ్చుకొందుము
చిత్రమైన బానిసీంద్ర మగుచు

సీ. ఆశించుచున్నార మఖిలదేశాల యుత్తమమైన నిరత బాంధవ్యలబ్ధి
వలతు మేనాఁడు వాక్స్వాతంత్ర్య విభవంబు జబ్బెరుంగని గుండెనిబ్బరంబు
నుతియించెదము మత స్వాతంత్ర్య మాత్మలాభములేని సానందభక్తిపదము
కంటగించెదము భిక్షలకుఁ జేతులుసాచు చేవమాలిన దాస్యజీవనంబు

ఆ.వె. జ్ఞానవిభవమెల్ల మానవ హింసకై
వ్యయమొనర్చు భూమిదయితకోటి
తలలువంప శాంతి ధర్మదయా సస్య
కర్షకతకు సల్పగలము నతులు!"

కం. అనిపలుక; నక్కపాలపు
కనుగుంటలనిండ నీరుగ్రమ్ముకొనఁగ వె
చ్చని యూర్పుబుచ్చి నిక్కఁపు
మనుజునివలె మూల్గి యిట్లుమారువచించెన్

శా. "ఆకర్ణించితి నీవిచిత్రపుటుపన్యాసంబు దుర్దాంత చిం
తా కాలుష్యము చిమ్మిరేగినది, మిత్రా! శుష్కచిత్తంబునన్
నా కంకాళమునందు మున్నెపుడొ జీర్ణంబైన జీవాణువుల్
బ్రాకఁజొచ్చెఁ గదుష్ణరక్తచలన వ్యాపారదీప్తంబులై

తే.గీ. గౌతముని శుభోత్కట కటాక్షములఁదడిసి
ఆరవిచ్చిన శాంతి వాతావరణము
కలుషితంబయ్యెనే జగత్కాండమందు?
ప్రభవమందెనె క్రమ్మర రక్తఋతువు?

మ. స్తవనీయంబగు బుద్ధదైవతము భిక్షాపాత్ర కన్నీటిచే
చివుకంజొచ్చెనె? బోధివృక్ష మకటా! జీర్ణించెనే? లుంబినీ
సవిధస్తూపము బూడెనే? చటుల హింసారాక్షసీ లాస్యముల్
భువనంబున్ వలపించెనే? అసహనంబున్ స్వార్థ ముప్పొంగెనే?

శా. అన్నా! నీ వధునాతన క్షణిక సౌఖ్యాకాంక్షివై విశ్వశాం
తౌన్నత్యంబు నెఋంగఁజాలని విమూఢాత్ముండవైనట్లుఁగా
నున్నా; వెక్కడిపోరు? యెక్కడి ప్రతాపోద్రేకముల్? కూర్చెనే
మున్నేభూపతియేని పూర్ణవిజయంబున్ గత్తులన్ గట్టలన్?

చం. వలసినదాని కిబ్బడిగ భాగ్యము గూరిచి భోగులౌదు దు
ర్బలులగు దీనమానవులపై యధికారము సేయుచుండు రా
ట్కలభులు దాహశాంతికి జగత్ప్రళయంబు సృజింత్రు వారి వీ
నులు వినవార్త సోదర మనుష్యుల ఊలుగరంగు ఘోషణల్

శా. ఈ విజ్ఞానము పూర్వమున్ గలుగు నోయీ, ధ్యానమాత్రంబునన్
శ్రీవైకుంఠము సృష్టిజేసిన మహర్షిశ్రేణి జన్మింపదో!
దైవం బొక్కొక మారొసంగెడు మహత్వప్రజ్ఞ విశ్వంభరా
దేవీ తాపకరార్థమా? హృదయ మార్తిం గుందు మీగాథలన్

కం. అలుగుల జయమాశింపకు
మలుగులచే నలుగుశాంతి యఖిలజగంబున్
నలుగున్ సద్ధర్మంబే
యలుగు సుమీ! ముజ్జగ జ్జయాకాంక్షులకున్

ఆ.వె. సృష్టిలోన నరుఁడు సృష్టియైజన్మించి
సృష్టి భంగపుచ్చ నిచ్చగించు
చిరుతచీమ శిరసు చిదిమి క్రమ్మర దాని
నదుకుబెట్ట శక్యమగునె దనకు?

ఆ.వె. కాలు సేతులున్న నాలోన విజ్ఞాన
మలరుగాని జంతువులకు గలుగ
దేలుబడియొనర్తు హింసింతు ననుకొని
బేలయగుచు నరుఁడు విఱ్ఱవీగు

శా. కనుగొమ్మా! గిజిగానిగూ డొక తృణాగ్రం బెట్టులంటించి క
ట్టినదో చెట్టు చిటారుకొమ్మలకు! బాండిత్యాదులచ్చోట ను
ప్పునకుం బోలవు; గాలివానల శతంబున్ దూచి నిర్మించు చ
క్కని కౌశల్యము దాని చంచువునకున్ గల్గున్ యథార్థంబుగన్

తే.గీ. ఆడుతనమును మగతన మమరియున్న
చిన్ని సాలీఁడు పిల్లల జేసికొనుచు
కట్టుకొన్నాఁడు సన్నని పట్టుపంచె
యిముడునో లోన వేయిరాట్నములగరిమ

ఉ. తేనియగూర్చి మానవతతిన్ దనియించు ద్విరేఫకోటి వి
జ్ఞాన కదంబకంబు సుమి! న్యాయము దప్పక రాజ్యపాలనం
బూని రహించు నందు మహిమోన్నతిఁ గొండొక రాణియాగ; యా
తేనియ పట్టునం గల దతీత మహత్తర మంత్రమెంతయున్

తే.గీ. కందువుల బాయలేక పక్షములుగప్పి
కారుచిచ్చున బెళగువ్వ గరగిపోయె
సకలమానవ సహజవాత్సల్య గుణము
నిండియుండెడి నలఁతి ప్రాణికినిగూడ

ఆ.వె. కొమ్మకొమ్మ కెగురు క్రోఁతిఱొమ్మున నున్న
హరి కిశోరమున కనన్యమోహ
రజ్జుపటిమదక్క రహించునే వేరు
పట్టుగాని జోలెతొట్టిగాని?

ఉ. పెట్టినగ్రుడ్డుజారి పృథివింబడి తుత్తుము రైనజూచి యా
చెట్టున నాడు పావురము; చింతిలుచుండు టెఱింగి చేరువన్
నట్టువ ద్రొక్కుచున్ గుణగుణధ్వనిసేయుచు నూరడించెడిన్
జట్టుపలార్చుచున్ వలపుజాయను పోతు కపోతి నేర్పునన్

తే.గీ. ఆచరణయోగ్యములుగాని వఖిలలోక
వృత్త మొక బెత్తసాగని క్రొత్త క్రొత్త
వింతసిద్ధాంతములు వినిపించినావు
తీర్పగదవోయి! కలదు సందేహమొకటి

కం. హింసాత్మకమగు లోక మ
హింసాత్మక మగుట సాధ్యమే మిత్రమ? యీ
మాంసాశనులకు మానవ
హింసకులకు జాలిమందు లెట్లు రుచించున్

చం. అది గుజరాతుకోమటి దయారసదఘ్న విశాలదృష్టిలో
మెదలెడు స్వప్నలోకము సుమీ! యధునాతన నూత్న ధాత్రికం
దదు, రుచియింప దీప్రజకు దానికి యత్న మొనర్చి సాధువుల్
బదుగురు రెంటికిం జెడిరి భక్తులు రిక్తవిరక్త మార్గులై

శా. ఆశావార్ధి గభీరమై యుబికి బ్రహ్మాండ ప్రజానీకమున్
నాశంబు బొనరించు దుష్టయుగ మన్నా; యిప్పు డీనీతి వి
ద్యాశీతాంశు కళాప్రసారమునకున్ దావున్నదే? శాంతికిం
కాశల్ లేవు, గతించిపోయితిరి మీరత్యంత పుణ్యాత్మకుల్

తే.గీ. ప్రేమతో ముట్టుకొన్నను వృశ్చికంబు
కుట్టి మిక్కుటముగ బాధపెట్టితీరు
పాపమని చేరదీసిన పాపరాజు
చెనకకుండఁడు మరణదంష్ట్రికలచేత

ఉ. ఏగతి పాదమూని చరియింత్రు మనుష్యులు చీమజచ్చునం
చాగిన? సాగునే భువనయాత్ర? పవిత్రములయ్యు బుద్ధరా
డాగమముల్ విచిత్రము లనాచరణీయము, లెట్టి సత్కృపా
సాగరుఁడేనియు న్నెరపజాలఁడు జాలి సమస్తవేళలన్

ఉ. నేనును బుద్ధబోధ తలనిల్పినవాఁడన; క్రీస్తుప్రేమ త
త్వాన నొకింత బుద్ధికదపంబడి యూగిన వాఁడనే సఖా!
కాని, ప్రపంచధోరణి యఖండ భుజాబల దుష్టదౌష్ట్య ము
ద్రానతమై, మహావిభవ దర్పితమై నడచున్ బ్రచండతన్"

మ. అనినన్ బుట్టె యొకింతకాలము శిరంబట్టిట్టులాడించి పాం
ధునితో నిట్లను గానలో మెలఁగు జంతువ్రాతమాలింపఁగా
"వినుమో పాంథ! యహింస భోగులకుఁ బృథ్వీపాలక శ్రేణికిన్
దనరున్ సాధన కందరాని యొక స్వప్నక్లిష్ట వృత్తాంతమై

చం. ఎలమి, నహింసనేర్చుకొనదే మును బెబ్బులికోడె సన్మునీం
ద్రుల పదసన్నిధిన్? ఋషివిధుండగు బుద్ధుని యాశ్రమంబులో
మెలఁగిన సర్పరాజు తలమీద వసించిన కప్ప లిప్డుదున్
గొలుచుఁ దటాకగర్భముల గుంపులుగూడి తదార్ద్రచిత్తునిన్

సీ. ఫల పవనాహార భక్షణంబునఁజేసి బ్రతుకదే మును మునీశ్వరచయంబు?
తృణకందళంబులు దిని పశుప్రచయంబు దేహదార్ఢ్యంబు సాధించుకొనదె?
అలారగించి పారావతంబుల పిండు కాననంబులఁ బూటఁ గడపుకొనదె?
పలుచని గాలి గర్భమునిండ బూరించి దృంభూవిభుఁడు నూరేండ్లుమనఁడె?

తే.గీ. సింహ శార్దూల క్రూరతాజీవనమున
కివ్వసుంధర మనుజుండ హేతువగును
నరునినైజంబ తత్పరిసరవిహార
సకల జంతూత్కరంబున సంక్రమించు

తే.గీ. పంచ భూతాత్మకంబైన ప్రకృతి సుఖము
ననుభవించెడు హక్కు మర్త్యునక కాదు
కలదు ప్రతి చిన్న ప్రాణభృత్తులకుఁగూడ
బలము గలదంచు దోపిడి సలుపఁదగదు

కం. చితుక దహింసాజ్యోతి
ర్లతిక ధరాచక్రమెల్ల లయమైన సమం
చిత బుద్ధ దివ్యచరణ
ద్వితయము మన్నించియున్న దిగ్దేశములన్

కం. ఘటికాయంత్రం బొక్కటి
ఘటియింపంబడియె నీదు కాయమునందున్
బుటుకునఁ జెడిపోయినచో
కటకట! నీ మేను మృత్తికాభాండమగున్

చం. పొగులకు మన్న! మీ భరత పుత్రులు దుర్బలులైరటంచు ము
జ్జగమున కార్యధర్మములు చాటిన పుణ్యుల కన్నదమ్ములై
మిగిలినమీరు శాశ్వతుల, మిత్రుల యుగ్ర నిశాతహేతులం
దెగని యహింస మి మ్మమృత దేహులఁజేసి జయించు నుర్వరన్

సీ. ఘన వివేకానందముని యమేరికసీమ సన్నుతింపఁగ జయస్తంభమెత్తె
అరుణాచలము మీద నరుణ తేజశ్శాలి రమణర్షి శత్రుషట్కమునణంచె
అరవిందముని నిరంతర సమాధిన్నిల్చి లోకత్రయంబు వశీకరించె
మూడుగాళుల దొడ్డ ముసలికోమటిసెట్టి స్వేచ్ఛా వికుంఠంబు బేరమాడె

ఆ.వె. నాల్గు ఖండములకు నవనవోజ్జ్వలములౌ
ధర్మమార్గములకు దారిసూపి
ఘనత నాచికొన్న ఖండంబు మనదన్న!
పౌరుషంబు మనది ప్రజ్ఞ మనది!

చం. స్థిరత దయాపరిశ్రమఁ బ్రసిద్ధివహించిన భారతాంబకున్
మురిపెపు బిడ్డ లాంధ్రు, లుడివోని మహత్తర త్యాగదీక్షలోఁ
బెరిగినవార లీ భువనపీడ సహింపరు, ధర్మచింతయున్
బరహితమున్ భవన్మని జనంబులు క్రోలిన పాలుమీగడల్

ఉ. ఊరకపోదు బుద్ధుని మృదూక్తి పటుత్వము క్రీస్తుప్రేమవా
క్సారము, రామకృష్ణ మునిచంద్రుని తాత్త్విక సౌరభంబు, ని
స్సారము లీకటారుల ద్విషజ్జయముల్ దుదిలేని తృష్ణకున్
గారణభూతముల్, తెరపిఁ గానని చింతలకున్ జిరాయువుల్

చం. ఉడుగని సత్యధర్మముల కూపిరిసల్పని యట్టివేళ లే
ర్పడియెడి నొక్క మారపుడు భక్తి హుళిక్కి ఋజుప్రవృత్తి గా
రడి, కరుణాగుణంబు వృథరా యనిపించు సముత్థితంబులై
చెడుగు నదల్చి రాజ్యమును సేయకతీరదు ప్రేమ మిత్రమా!

శా. ఆనందించితి మీ యుగోన్నతి కసాధ్యంబైన మీయాంత్రిక
జ్ఞానాభ్యున్నతికిన్ ధనాధిపుల సాంద్రత్యాగ రాజాప్తికిన్
దీనంబై విలపించు లోకమునకున్ విశ్రాంతి గల్పించి పెం
పూనుంగావుత! మీ పురాణ నిగమ ప్రోద్గాఢ ధర్మార్థముల్

కం. గౌతమ బైరాగి కృపా
స్ఫీతేక్షణపంక్తి విశ్వవిశ్వానంద
ప్రాతఃకాంతుల జిమ్మెడు
గాత! శమించెడును గాత! కదనదవాగ్నుల్"

కం. అనిపలికిన పుత్త్రికు ని
ట్లను బాంధుం డంజలించి "యనఘా! నీ తీ
యని బోధ తప్తమానస
మునకుం జడివానవోలి ముదముఘటించెన్

శా. ఎన్నం డీరణవహ్ని చల్లవడు నింకెన్నండు దిగ్దేశముల్
కన్నుల్ విచ్చెడి విశ్వలోక సమతా కల్యాణసంపత్తు లిం
కెన్నండబ్బెడి? నానతీయ గదవే యేదేని మార్గంబు మా
కన్నా! జ్ఞానకపాలమిత్రమ! దయావ్యగ్రాంత రంగుండవై."

కం. అని, పాంథుఁడు పృచ్ఛించిన
పునుక యొకింతాగి "కల దమోఘంబగు చ
క్కని మార్గమొకటి విను" మని
వినుపింప దొడంగె మధుర విస్ఫుట ఫణితిన్:

శా. ఆచారాంతరముల్, నిరంకుశ మతవ్యత్యస్తముల్ వర్ణముల్
నీచత్వోచ్చత లంటరానితనమున్ బీజంబులై విశ్వధా
త్రీ చక్రప్రళయంబు రేచెడి విచారింపంగ నేలా? వృథా
వాచాలత్వములున్ బ్రలోభ నటనల్ వారింపఁగా నేర్చునే?

మ. తలనూపంబనిలేదు సాంఘిక మతౌద్ధత్యంబు లెందేని భా
షలకున్ సర్వకళాలతాంతమున కౌజ్జల్యంబు సిద్ధింపఁగా
వలె; విశ్వైక్యత విశ్వసోదరత విశ్వప్రాజ్యజాతీయతల్
వెలయంగావలె హిందుముస్లిములకున్ విఖ్యాత బాంధవ్యముల్

సీ. సమరసభావ నిశ్చల పరిశ్రమకు బ్రహ్మాండంబు లున్ముఖంబయినదాక
వ్యత్యయంబైన తీవ్రాస్పృశ్యతాజాడ్యమన్నివిధాల రూపడినదాక
నాజాతి నాయూరు నాదేశమని పొంగు స్వాభిమానము శూన్యమయినదాక
విశ్వసౌభ్రాత్రంబు వెలయించు నైక్యసంఘావాప్తి దిశల పెంపారుదాక

తే.గీ. జ్ఞానమత సాంఘికస్వేచ్ఛ నల్వురకును
నేకరీతి లాభించునందాక రాదు
భావిభారత కల్యాణ పరమసుఖము
కాకచల్లారదెపుడు సంగ్రామమఖము

మ. ఇది నాలో నగుపించు నూతన మహద్దృశ్యంబు లేదింతకుం
బదకంబొందు ప్రపంచశాంతికి ప్రజాస్వచ్ఛంద రాజ్యంబు నం
గదయున్ జింతయు లేని భారతసమాఖ్యంబైన వైకుంఠ సం
పద సంపాదనసేయవోయి నడుమున్ బంధించి మిత్రోత్తమా

కం. కనులుం గర్ణము లూడిన
పునుకనగుట జూడనయితి పొలయు న్నల్లన్
విననైతి ప్రజలయార్త
ధ్వనులన్ దలఁపోయ నేను ధన్యుఁడనయితిన్

శా. ఏమైనారు కళత్ర పుత్రకులు? నీవిట్లొంటిమైఁ గానకున్
నీ మేన్సేరిచి తప్పుకొంటి" వనినన్ జింతాకుల స్వాంతుఁడై
యేమాటాడక మూర్ఛమున్గి పడిపోయెన్ గాందిశీకుండు త
త్సామీప్యంబుననున్న చెట్టుమొదటన్ సర్వాంగ నిశ్చేష్టుఁడై

ఆ.వె. అతని మూర్ఛదేర్చి యరుణుండు పకపక
నవ్వసాగెఁ దూర్పు నగముమీద,
పునుక పలుకదయ్యె భూరివిషాదంబు
గుండెనిండి కన్నుగొనల వెడలె

తే.గీ. నిసువుల దలంచి కొన్ని కన్నీళ్లు సిమ్మి
పునుకమిత్రుని విజ్ఞాన బోధఁజేసి
గుండెలోఁ గొంత విశ్రాంతి కుదురుకొనఁగ
జరిగిపోయిన కథకు నచ్చెరువు పడుచు

మ. "ఇది నాలోఁగల చిత్రవిభ్రమముగానీ యిక్కపాలంబు ప
ల్కదు, దేశాభ్యుద యాభిలాషినయి రక్తక్షోభ వారించెదన్
సదయంబై యనఘాత్మకంబగు నహింసా ఖడ్గమున్ బూనెదన్
గుదియింతుం గదనోగ్రభూతమును దిక్కుల్ మ్రొక్కులర్పింపఁగన్"

కం. అని తలఁచి పాంథు డింటికి
జనియెఁ గపాలంబు నొక్కసన్యాసి కరం
బునబూని బిచ్చమునకున్
జనియెన్ శుభరుతమొనర్చె శకున ద్విజముల్

# భూమిక

దాదాపెనిమిదేండ్లకు ముందు, ప్రజామిత్ర సంపాదకులయిన శ్రీయుతులు గూడవల్లి రామబ్రహ్మంగారు–ఒక సాంఘిక నాటకాన్ని నాల్గంకాలలో వ్రాసిన యుత్తమ రచయితకు, వేయిన్నూట పదహార్లు బహూకరింతుమని పత్రికలో ప్రకటించినారు. నాటి పోటీకి వ్రాసిన 43 రు రచయితలలో నేనొకడనై ఈ నాటకాన్ని వ్రాసినాను. వారే కారణంచేతనో గ్రంథము లన్నీ మూడుమాసాలుంచుకొని తగిన పరీక్షకులు చిక్కలేదను నెపంతో నెవరిగ్రంథాలు వారికి ముట్టజెప్పినారు.

నా మనస్సును వేధిస్తూయున్న పెక్కు విషయాలను సమకూర్చుకొని నేనీ నాటకాన్ని వ్రాసినాను. సంస్కరణాభిలాష నాకు మిక్కుటంగా కలదు. కథ కేవలం కల్పితము. బాలవితంతువుల హృదయావేదన, తత్ఫలితంగా కలుగు ననర్థాలు నేటి యింగ్లీషు వైద్యుల నిష్కరుణ, సనాతనుల స్వార్థపరత్వం, ముసలి మగళ్ళు, పడుచుపెండ్లాలతో అనుభవించు కష్టాలు మున్నగు విషయాలను లోకానికి వెల్లడించడమే నా ముఖ్యోద్దేశం. నాటకంలో స్వగతాలుగాని, పద్యప్రాబల్యంకాని లేదు. మూడు గంటలకాలంలో నాటకం ముగిసి, ఏరవంత అభినయం చేయ శక్తిగల, కళాప్రియులైనా ప్రదర్శించుకొనగల సౌలభ్యంకల విషాదాంత నాటకమిది. భాష వ్యావహారికం. కేవలం వచన నాటక మనవచ్చును. సహజ రసోత్పత్తికి ఆహతి కలుగునని నాటకాలలో పద్యములకు తావీయరాదను రసజ్ఞులవిమర్శకీ నాటకాన్ని వదులుచున్నాను.

జి. జాషువ

## ఈ నాటకమున వచ్చు పాత్రలు

పురుషులు :

ప్రమోదుడు–సంఘ సంస్కర్త

బ్రహ్మశాస్త్రి–ప్రమోదుని తండ్రి సనాతన బ్రాహ్మణుడు

కామశాస్త్రి–ఒకానొక సనాతనుడు

రామచయనులు–సనాతనుడు

కిశోర కుమారుడు–ఒక ఆధునిక కవి

డాక్టరు

గిరి–ఒక షోకిలా

స్త్రీలు :

బుచ్చిరామమ్మ–బ్రహ్మశాస్త్రి గారి భార్య

రాజ్యలక్ష్మి–కామశాస్త్రి భార్య

శ్యామల–బ్రహ్మశాస్త్రి కోడలు–ప్రమోదుని భార్య

కల్యాణి–బ్రహ్మశాస్త్రి గారి కూతురు–బాల వితంతువు

# తెరచాటు

ప్రథమాంకము

(ఒకటవ రంగము)

(బ్రహ్మశాస్త్రిగారి యిల్లు–ప్రమోదు డీజీచేర్లో కూర్చుండి, 'భారతి' చదువుచుండును)

ప్రమో : (భారతి తిరుగవేయుచు–వికసించిన ముఖంతో) ఏమేవ్! ఒకమారిలారా?

(శ్యామల ప్రవేశించి)

శ్యామల: ఏమిటండీ! (పుస్తకమువంక చూచి) ఏమిటా పుస్తకం (భారతి అని చదివి) ఈ నెల భారతేనా?

ప్రమో : ఈనెల్దే! (బొమ్మచూపుచు) ఈబొమ్మను చూడు! ఎంతర్థముందో!

శ్యామ : (చూచి) (మూతి విఱచి) ఏమిటీబొమ్మ! అబ్బే! అంగమొలతో! చీ! చీ! ఆకళ్లేమిటి! ఆచేతులన్నీ వంకర! ఏమిటండీ! భారతియిప్పుడు బాగుండడన్లేదంటారు

ప్రమో : అయితే, యీ బొమ్మలోయున్న అందం నీకు బోధపడలేదన్నమాట.

శ్యామ : (అనిష్టమున) మీకు బోధపడ్డదేదో చెప్పరాదూ?

ప్రమో : పిచ్చిదానా! ఇదీ రోమన్ శిల్పం; శిల్పానికి ప్రాణం తెచ్చినవారుకదుటే, రోమన్లూ! అసలు ఏకళైనా కొంత పరిచయం కలవారిక్కాక అందరికి బాగా యుండదు. కళను గుర్తించడంకూడ ఓకళ.

శ్యామ : మీరు మరీ నన్నంత మూర్ఖురాల్ని చేయకండీ! ఇందులోయున్న కళేమంటే ప్రేతకళ. కూరలోయుప్పు లేదంటే, దానిరుచి నీకు తెలియదంటారూ.

ప్రమో : అట్లా అనడంకాదు. ఇప్పుడు భాగవతం చదువుతూ యుంటే కలిగే ఆనందం భారతం చదువుతూ ఉంటే కలగదు. అంతమాత్రంచేత భారతంతో భాగవతం సాటౌతుందా? కవిత్వానికి భారతకవిత్వమే ప్రమాణం.

శ్యామ : ఏమో! ఆ మెలుకువలన్నీ నాకు తెలియవు. చెవికి కంటికి యింపుగాయుంటేనే మాకు నచ్చుతుంది.

ప్రమో : అంతలో యున్నది మీ ఆడవాళ్ళ తెలివి. మోదుగు పూవు ఎఱ్ఱగా, అందంగా ఉన్నంత మాత్రంచేత సంపంగికి సాటిచేస్తావూ? దాన్లో గుణాన్ని బట్టి.

శ్యామ : పోనీలెండి, మీ మగవాళ్ళదే తెలివి. ఆడవాళ్ళదేమున్నది? యీ అయోమయ పర్థాలు చెప్పికాదూ! మనవారు మోసం చేస్తున్నదిలోకాన్ని. మీరుకూడ సంఘ

ప్రమో : సంఘసంస్కరణకు దీనికేం సంబంధం. ఇవి లలిత కళలు, కళాప్రసంగం వచ్చింది కాబట్టి అంటున్నా. ఆడవాళ్ళకు తెలివిలేదని కాదు, ఆడవాళ్ళిప్పుడిప్పు డెంతెంత చదువుల్చదివి ఎంతెంత పనుల్చేస్తున్నారో నాకు తెలియదూ! గృహలక్ష్మి పత్రికాడవాళ్ళ రాతలేగా జీవంపోస్తున్నది.

శ్యామ : మరేలెండి, మీరొక్కరు పీకులాడ్తే అవుతుందటండీ! సంఘసంస్కరణ మంటే, యెంతబలం, ఎంత ధనముండాలి! ఈ కాకులు మిమ్మల్ని గెలువనిస్తారూ! ఏమిటో మీగోల మీది. వినేవారేరి అయ్యేపనులవుతునే యున్నై. మీ చెల్లెలు బ్రతుకు చూచారుగా! పుట్టిపుట్టకముందే ముసుగేసి కూచోబెట్టారు. మీ నాయన గారికీ విషయాల్లో మహావిశ్వాసం; నోరు మెదపడానికి వల్లకాదు.

ప్రమో : మా కల్యాణి పెండ్లే నాకీ పాఠం నేర్పింది. అప్పుడూ! నాకింత మాత్రం ధైర్యం లేకపోయింది. (కోపము తెచ్చుకొని) ఇప్పుడైతేనా! డొక్క బద్దల్జేసేవాణ్ణి! (అని పుస్తకమవ్వలికి విసరును)

శ్యామ : (నవ్వుచూ) ఎవరిమీద, ఈకోపమంతా? భారతి మీదనా?

ప్రమో : ఎవరిమీదనా? చూస్తుంటావుగా రోజూ మా నాయనగారినీ! నన్నూ! ఆయన యెడ్డెమంటె నేను తెడ్డెం.

శ్యామ : (విచారంతో) మీనాన్నగారు మీరు వాదించుకోవడం, ఆయన కోపమంతా నామీద చూపడం మధ్యనాకొచ్చింది చావు.

ప్రమో : ఒసేవ్! నీకిదేచెప్పడం విను. నీవేమి భయపడనవసరం లేదు. అయినమట్టుకు కానీ నేను యుండదలచుకోలేదు. కాకపోతె వేరే కాపురం పెట్టుకొందాం, నాభాగం నాకిమ్మంటే రోగం కుదుర్తుంది.

శ్యామ : అప్పుడూ నలుగురూ అంటారుగా! పెండ్లాంరాగానే చీలదీసిందనీ! అదీ నాకే.

ప్రమో : మనకూ! ఏమోవ్. నలుగురితో పనిలేదూ పదుగురుతో పన్లేదూ. అభిప్రాయ భేదాలొచ్చాక ఆ ఇంట్లో యుండరాదు. లోకానికేం అనేక విధాల మాట్లాడుతుంది. నా ఉద్యమన్లో నన్నడంలే?

శ్యామ : మీకేమండీ! మగవారు, చెల్లించుకొంటారు!

ప్రమో : నాకూ ఏమీలేదూ, నీకూఏమీలేదూ ఈయన వాలకం నాకేం బాగాలేదు. సత్రాలకని సంతర్పణ్లకనీ ఇప్పటికే బోలెడుసొమ్ము గుండన్లోబోసాడు. ఇంకాయుంటే ఉన్నకాస్తపోతుంది. లేనిరోజు పెట్టేవాడెవడు? చేతిలో బెల్లమున్నంతమట్టుకే.

శ్యామ : అసలు మీకూ ఈ యూరు తగదండీ! ఇది అనాచారపు కొంప. చదువుకొన్నవాళ్లా ఏమన్నానా! వట్టిమాయముండాకొడుకులు. మీరు మీ ఉన్నతాశయాలన్నీ, వీళ్లతో చెప్పబోతే, వీళ్లకు ఒళ్లు మండుతుంది. పైగా శపిస్తారూ! ఏ మద్రాసులోనో, ఏ బొంబాయిలోనో యుంటేగాని మీ బోటివాళ్ల ప్రయత్నాలెగ్గవు.

ప్రమో : ఈయూరివాళ్లకు చదువెందుకు; పొట్టపోసుకోవడమే చదువు. చూస్తున్నావుగా ఒక్క స్కూలుంటేనే పుట్టిన్నాటినుంచి ఎట్లున్నదో, ఇప్పుడూ అట్లానేఉన్నది. గొఱ్ఱెతోకకుమలే. పాప మా కిశోరకుమారుణ్ణిచూడు. అతడొక్కడూ ఊరికల్లా కవి. వాడిమొహంచూచేవాడెవడూ? బ్రతికినవాళ్లం చూచి మనవాళ్లు సంతోషించరుగా! వట్టికుళ్ళు.

శ్యామ : మరచా! ఆ అబ్బాయి, పద్యాలూ భారతిలోపడుతూ యుంటయిటగా!

ప్రమో : ఒహ భారతిలో యేమిటి! అన్ని పేపర్లల్లోనూ పడుతూ ఉంటయి. నిజం మాట్లాడితే కవి అంటే అతన్నే చెప్పాలి.

శ్యామ : అట్లాగుటండీ! పిచ్చిబాగులవాడల్లేయుంటాడు. ఆ తల్లి చేసుకున్న పుణ్యం.

ప్రమో : అతనంటే ఈ బ్రాహ్మలకు మంట.

శ్యామ : అయ్యో! యెందుకు?

ప్రమో : ఎందుకూ? మన కులం కాదుగా!

శ్యామ : రామ!రామ! కులానికి తెలివితేటల కేమిలంకె?

ప్రమో : సరే కులానికొక తెలివి, కులానికొకరంగు, కులానికొక రూపంగాదూ; మనవారు నిర్ణయిస్తా. ఇప్పుడీపార్టీలు, దెబ్బలాటలు, ద్వేషాలు, యుద్ధాలు వచ్చేదంతా ఈ వర్ణద్వేషంనుంచేగా ఇప్పుడిటలీకి అబ్సీనియాకు యుద్ధం.

శ్యామ : (వింతగాచూస్తూ) మళ్లా! యుద్ధమొచ్చిందీ? దేనికా తగాదా?

ప్రమో : ఇంకేముంటుంది. నల్ల, తెల్ల రంగుభేదమే! ఇంతటితో యుద్ధమాగ దంటున్నారు. దీన్తో ప్రపంచయుద్ధ మొస్తుందట.

శ్యామ : రానివ్వండి! అట్లన్నా నాశనమైపోతుంది పాడు భూమి. లెండి, భోజనానికివేళైంది.

(ఇద్దరు నిష్క్రమింతురు.)

## రెండవ రంగము

(అయిదేండ్ల వయసుగల కళ్యాణికి తలదువ్వుచు బుచ్చిరామమ్మ వసారాలో కూర్చుండి యుండును.)

బుచ్చి : (కూతురు వెండ్రుకలు ముద్దుపెట్టుకొని హీన స్వరముతో) నీలాల వంటి మా అమ్మ వెంట్రుకలు మంగలివానికత్తి కర్పించాలి కాబోలు. ఒక్కగాని ఒక్క ఆడు నలుసు. నా చేతులారా మా అమ్మకీ యగచాట్లుతెచ్చా. పాపిష్టిదాన్ని, బ్రతికిన న్నాళ్లు దీనికడుపునకత్తులు దాచాను. కళ్యాణి, కన్నీళ్ళె యింట తిరుగుతుంటే, ఎట్లాభరించాలో ఈ దుఃఖం.

కళ్యా : (తిరిగి తల్లివంక చూచి) అమ్మా! నా వెంట్రుకలు తీయిస్తారుటే?

బుచ్చి : ఇప్పుడుకాదమ్మా, ఇప్పుడుకాదు.

కళ్యా : (గోమునభినయించుచు) ఆ పాపం, ఏం బాగుంటుందమ్మా! బోడితల! పాడూ? (మురిపముతో) మరే! అమ్మా మరే! అన్నయ్యలాగ క్రాపుచేస్తే బాగుం టుందే! చొక్కా వేసుకుని, బూడ్సులు పంట్లాంవేసుకోవాలని ఉందే.

బుచ్చి : (మెటికలువిఱచి ముద్దుబెట్టుకొని) ఎంత పిచ్చితల్లివే! ఎంతమాయకురాలివే! అమ్మా, (అని విచారపడును.)

కళ్యా : అమ్మా! నాయనమ్మా వారానికొకమాటు బోడిగుండు చేయించుకొంటుందే! ఎందుకే, చీ! పాడూ! నున్నగానూ! అందానికటే!

బుచ్చి : అందానిక్కాదుతల్లీ! మొగుడు చచ్చినవాళ్ళకూ వెంట్రుక లుంచరు మనకులాల్లో

కళ్యా : నాయనమ్మ మొగుడు చచ్చాడటే? ఎప్పుడూ? కాబట్టే నేనెఱిగినాక ఎన్నడూ మనింటికి రాలా!

బుచ్చి : (నవ్వి) ఛీ! కొంటెముండా! ఎఖ్ఖణ్ణో! నీకెందుకే పెద్దవాళ్ళ పోకిళ్ళు, నాపసా నిమాటలూ! ఎఱిగినాకట... ఎన్నాళ్ళనుంచెరుగో!

కళ్యా : (గోమునభినయించుచు) అమ్మా! నాకూ బొట్టూ, కాటుక బెట్టుకొని మనదొడ్లో పూలన్నీ పెట్టుకోవాలని యుందే, ఏమే, అమ్మా! పెట్టవూ? పండగనాడూ!

బుచ్చి : (చింతతో బుజ్జగిస్తూ) తల్లీ! నీ అచ్చట ముచ్చట లగ్గిపాలై శాన్నళ్లైందే. నా బంగారుతల్లీ! అట్లా అనకు.

కళ్యా : ఆ!ఆ! మీరంతా పెట్టుకుంటున్నారుగా అమ్మా!

బుచ్చి : ఆ భగవంతుడు నీకర్మమిలాకాల్చి మాకన్నుల్లో నిప్పుల్చెలిగాడుతల్లీ! నువ్వు

కల్యా : ఆ, ఆ. ఎందుకేమిటి?

బుచ్చి : నువ్వుముండమోశావు తల్లీ! ముండరాత రాశాడే భగవంతు ణ్ణీకూ

కల్యా : పోద్దూ! ముండమోశానా! ఎప్పుడమ్మా! నేనే మ్మోయాలా! మొన్న నా చిన్న బిందెతో నీళ్లుమోశా!

బుచ్చి : కాదే! అమ్మా, కాదు. ముండ మోశావంటే నీ మొగుడు చచ్చాడన్నమాట.

కల్యా : (జ్ఞాపకము తెచ్చుకొని) ఆ.. ఆ వేళ.. ఆ వేళా, మామయ్య చచ్చిపోయాడనీ, మీరంతా యేడ్చారే ఆయనా?

బుచ్చి : ఆ. ఆ మామయ్యే మా కొంప ముంచిపోయింది.

కల్యా : అమ్మా! మామయ్యల్చస్తే ముండమోస్తారుటే? వదినెకూ అన్నయ్య మామౌతాట్టే

బుచ్చి : కాదమ్మా! మేనటికమని, నిన్నిచ్చిచేస్తే మేనటిక మేట్లో కలిసింది.

కల్యా : అమ్మో! మరే! మరే! మామయ్యే ఒహమారొచ్చి నన్నెత్తుకతిప్పాడే. ఇంక నన్నెత్తు కతిప్పేమామయ్యల్లేరూ?

బుచ్చి : (తనలో) అయ్యో! ఈ వెఱ్ఱితల్లి నెట్లా ఓదార్తునో తెలియదు.

(శ్యామల ప్రవేశించి)

శ్యామ : అత్తయ్యా! నీకొడుకు నొక్కమారు కేకేయి! కాఫీకూడ పుచ్చుకోకుండా ప్రొద్దున వెళ్లాడు. ఇంట్లో కూరలేమీలేవు.

బుచ్చి : (విసుక్కుంటూ) ఏంకూరల్లే, ఏదో ఒహటి తగలెయ్యి (కల్యాణితో) అమ్మా! అన్నయ్యను పిలుచుకొస్తావూ?

కల్యా : ఉ, హూ, నేను వెళ్లనూ.

బుచ్చి : (గడ్డము పట్టుకొని) వెళ్లమ్మా! వెళ్లు!

శ్యామ : కళ్యాణీ! వెళ్ళవూ? మీ అన్నయ్యవచ్చాక మనం గ్రామఫోను పెట్టుకొందాష్లే

కల్యా : (సంతోషపడుచు) నాతోడూ? ఒట్టెయి!

శ్యామ : నీతోడు, ఒట్టు.

కల్యా : (పరుగెత్తును)

బుచ్చి : (నవ్వుతూ) అమ్మాయో! ఇదీ మహ పెంకిముండసుమా! నాతో యేమేం ప్రసంగిస్తుందో విన్నావూ? అన్నీ మూదూసులు.

శ్యామ : వింటూనే యున్నా! ఏమయితే, యేం సుఖం. ఈ తనువెలా తెల్లార్చుకుంటుం

## మూడవ రంగము

(కామశాస్త్రి యిల్లు తాళము వేసి యుండును)

కామ : (ప్రవేశించి తాళంతీసి) ఏమేవ్! పలుకవూ ఉన్నావా? (తెరలో భార్య రాజ్యలక్ష్మి) ఊ, ఉన్నా! చావలా?

కామ : (కాళ్ళబాధ నభినయించుచు) అబ్బా! ఊరంతా తిరిగి కాళ్ళుపొక్కులెత్తినై (అని మంచము మీద కూలబడును.)

(రాజ్యం ప్రవేశించి)

రాజ్య : అవునుగానండీ! నన్నింట్లో పెట్టి, బయట తాళం వేసుకుపోతారే? నేనెలుగు ననుకొన్నారా? పులుగుననుకొన్నారా? యింత పాపమెక్కడా లేదే?

కామ : నీకూ బయటికి రావలసిన పనేమున్నది. కావలసినవన్ని తెచ్చి పడవేశాగా? హాయిగా వండుకొని, నాకింత పెట్టి, నీవింత తినూ, రాణిలాగుండూ! అమ్మాయికూడ యింట్లో లేదాయె; ఇంక నాలుగు రోజుల్దాకారాదు. నీకు పని కొంత సలీసుగా యుంటుంది.

రాజ్య : (చేతులు జాడించి) ఆహా! ఇంకేం కావాలి రాణ్ణై పోయా! నా హాయి ఏం జెప్పను. (మూతి విఱచి) ఈ కూటికి మొగంవాచి కాబోలు వచ్చింది, ముష్టి కూడూ, నాలుగిండ్లడుక్కుంటే దొరకదూ! అబ్బా ఎంత చక్కగా చెప్పారూ!

కామ : ఒశేవ్! కేకలు వేయకు సుఖంగా కూడూగుడ్డయుంటే చాలదుటే. లోకమంతా దానికేగా పాకులాడేది? నీవు కోరినసొమ్ములు చేయిస్తిని, కోరిన బట్టలు కొని యిస్తిని. నీకున్నన్ని నగలీ వీధిలో యెవరికున్నాయ్యో చెప్పు? ఇంకా నీకు లేందేమిటి? అమ్మాయినెట్లా చూస్తున్నానో నిన్నలా చూచుకొంటున్నా!

రాజ్య : అవును! సత్యంగా బ్రతుకు. నేనొక అమ్మాయినే మీకు. సొమ్ములట, ఎందుకీ సొమ్ములు. బరువుచేటు. నా యొళ్ళే నాకు బరువై యేడుస్తున్నా! మొగుడనీ, మొద్దులనీ, మంచనీ, చెడ్డనీ, లేనప్పు డెందుకీ సొమ్ములు. (కొంచెము రూక్షంగా) అసలు నీ యీడుకు పెళ్ళేమిటి? పెటాకులేమిటి? మాయుసురు పోసుకోవడాని క్కానీ.

కామ : ఒశేవ్! అమ్మాయికి సంబంధాలకని ఊరంతా తిరిగితిరిగొచ్చా! కాస్త ఒత్తగిలనీ!

రాజ్య : నిన్ను చేసుకొని సుఖిస్తున్నాగా? ఇక అమ్మాయిని గుంటలో దించడానికా తిరుగుచున్నావు. (మెటికలు విఱచి) హర! హర! ఎన్నిప్రాణాల కెసరుబోస్తున్నారా మీపాడె గట్టా!

కామ : నీతాడుతెగా! నీకు సుఖమెందుకులేదే? పూవులాగా పూజించుకొంటూంటే నాకన్న మంచి మొగుడు దొరుకుతాట్టే నీకూ!

రాజ్య : (మూతి పొడిచి) ఊఁ; హూ! యీడూజోడైన వాళ్ళని ముచ్చట పడుతున్నారు లోకులు! సిగ్గులే నీకూ!

కామ : ఈడుజోడైనవాడే అయితే, నాకుమల్లే కూచోబెట్టి మేపుతాడేమిటి?

రాజ్య : అంతభాగ్యమే కలిగేయుంటే పాదపూజచేసుకోలేకపోయానూ?

కామ : మరి, నే జేసిన పాపమేమిటే? నన్ను పూజించుకోరాదూ?

రాజ్య : నిన్ను పూజించిన చేతులు పుచ్చిపోతై.

కామ : రామ!రామ! నీకేమన్నా పోగాలమేమే. ఆఖరుకు నా కొంప ముంచేట్టున్నావే.

రాజ్య : మా వంశానలేదూ, వంగడానాలేదూ?

కామ : (సంతోషపడుచు) అది. అదేకావాలి! నేనూ! పెద్ద వాణ్ణైపోయానా? నాకూ దిక్కూ మొక్కూ లేదూ; ఆ ఒక్కబిడ్డ, దాన్నేఅయ్య చేతుల్లోన్నపెట్టి సంసారం నీచేతిమీదుగా జరుపుతుంటే అదే నాకు పదివేలు.

రాజ్య : నా కెందుకూ పాడుపీడ! ఒక్కదాన్నీ. ఎవరి సంసార మేయేట్లోకలిస్తే నాకేం, నాకుమాత్రం బిడ్డలా? పాపలా?

కామ : నీవు చూడకున్నా మానెగాని, ఇంతలో సంసారాన్నెందు కేట్లో కలుపుతావు, ఊరుకో?

రాజ్య : ఊరుకోక, ఎవరూ ఇక్కడ ఉరిబోసుకోవడం లేదూ.

కామ : మాట్లాడితే పీడ, ఇదీవరస, సరసమైన మాటవిందామంటే ఎన్నడూ లేదుగదా! అంతాపెళుసు.

రాజ్య : (చీదరించుకొనుచు) అవ్వతో వసంతాలాడినట్టు నీతోనే సరసమాడాలీ? (అని బుగ్గనలుపును)

కామ : (మంచమునుండి లేచి కూర్చుండి విసుగుకుంటూ) ఈ మూతిపోట్లు పడలేక ఊళ్ళో పొద్దుబుచ్చుకొని వస్తూయుంటా! పిశాచిముండా! నా ప్రాణానికి లేనిపోని అవస్థ పెట్టుకున్నానుగదే! నీ పాడె బిగించా!

రాజ్య : ఎన్నడంత పుణ్యం! నీబోటి ముసలి మొగుడ్తో కాపరం చేసేకన్నా.

కామ : నిన్నన్న లాభం లేదు. (తలయూచి) కాలాన్ననాలి. ఒసేవు నీకెంత పొగరున్నా? భర్తనిలా ఎదిరించకూడదూ. పూర్వం పతివ్రతలంతా ముసలి భర్తలో

కాపరాల్చెయ్యలేదూ! నీ నొష్టనే ప్రొద్దుపొడిచిం దనుకున్నావూ? చ్యవన మహర్షి వేయ్యేండ్లు తపస్సుచేసి, సుకన్యం చేసుకున్నాడట! పంద్రెండేళ్ళ దాన్ని (నమస్కారం చేసి) పరమయిల్లాలు, ఆ పెనిమిటికి అడుగులకు మడుగులొత్తి, శుశ్రూషల్చేసి ఆయన అనుగ్రహం సంపాదించుకొన్నదట. ఆ కథలన్నా చదువుకోరాదూ బుద్ధి వస్తుంది.

రాజ్య : ఈ కథలేగా ఆడవాళ్ళ కొంప దీసింది. వెయ్యేళ్ళు బ్రతకడం వట్టిదే? పెండ్లాడ్డం వట్టిదే? పాపమీ కథ చదివేనా, నా కోసం తాము పెండ్లికి తయారైంది.

కామ : (ఆశ్చర్యముగా చూచి) వట్టిదీ! వట్టిదీ! భారతమే వట్టిదిగా? హరి! హరీ!

రాజ్య : వట్టిదిగాదూ! గట్టిది. ఎట్టిదైతేనాకేం? ఎవరికో కావలెనన్న వారితో చెప్పు యీ కథలన్నీ.

కామ : నీకవసరంలే? పుణ్యకథల్తో?

రాజ్య : పుణ్యాలూ? పాపాలూనా? ఈ కథలే, వినీవినీ, ఇదిగో స్వర్గంలోపడ్డా!

కామ : అయితే నాతో నీకు కష్టంగానేయున్నదీ? ఒశేవ్! నీచావు మూడిందనుకో! ఊరుకొంటున్నానని నోరుమహాపారేసుకుంటున్నావే? నీకష్టమెంతజేసు, నీవెంతజేసు, తస్సగొయ్యా! స్తంభానికి విఱిచికట్టేస్తా (అనిహుంకరించును)

రాజ్య : (లేచి రూక్షస్వరంతో) వణుకుతున్నారూ, నువ్వు కొట్టనూ, నేనుపడనూ! అబ్బో! మొనగాడు బయలు దేరాడు. పైన దెబ్బపడనీ! బావిలోనో, చెర్లోనోపడి నీకొంప వేలాంవేయించకపోతే మారుపేర్లబిలువు ఆహా!!

కామ : (భయం నభినయించుచు మంచందిగి భార్య కాళ్ళు పట్టుకొని) ఒశేవ్; నీ కాళ్ళకు మొక్కుతా. నన్ను రక్షించు ఊరకేఅన్నాను. నిన్నుకొట్టడానికి చేతులొస్తాయిటే!

రాజ్య : (విదలించుకొనుచు) ఇదా నీబండారం? మాటంటే చెల్లించుకోవాలి, అదీ పౌరుషం.

కామ : లేదు లేవే, ఇకననను. చెంపలు వేసుకుంటా.

(తెరలో)

కామశాస్త్రులుగారూ! ఓ కామశాస్త్రులుగారూ!

కామ : (వినుట నభినయించి) ఎవరండీవారూ!

(తెరలో)

నేను కరణంగారబ్బాయిని

కామ : ఏమిటి? నాయనా?

(తెరలో)

మీదొడ్లోకి పామొచ్చిందండీ!

కామ : (కంగారుపడి అటునిటుపరుగెత్తుచు మంచమెక్కి) అమ్మబాబో! పామే? (భార్యతో) ఒశేవ్! ఆ తలుపు వేయవే. ఇంట్లోకి వస్తుందేమో!

రాజ్య : (అటునిటు పాలించిచూస్తూ) మీరే వెయ్యండీ.

కామ : నీదుంపతెగా! మగవాళ్ళనన్నా పిలవ్వే!

రాజ్య : నువ్వు మగవాడవుకావూ?

(తెరలో)

నన్ను రమ్మంటారా? అండీ?

కామ : వద్దండీ? వద్దు (రాజ్యలక్ష్మితో) కుఱ్ఱవాడా? పడుచువాడా!

రాజ్య : ఎవరైతేనేమండీ? ఆపదకు.

కామ : నీవలాయింట్లోన్నాచావరాదూ! ఎవరినన్నా పిలుస్తా!

రాజ్య : నేనుంటేయేం ఇప్పుడుకూడానాకు ఘోషాతప్పదూ?

(తెరలో)

(తలుపుకొట్టును, భార్యతీయబోవవారించి)

కామ : వద్దండీ! రావద్దండీ! (భార్యతో) అట్లాఇంట్లో చావు.

రాజ్య : మీరు మంచందిగి కాస్త ఎవరినన్నా పిలవండి. అయ్యో! యేయింట్లో జొరబడిందో!

కామ : నాయనా! కాస్త మీనాయనగార్ని కేకవేయి.

(తెరలో)

ఆయనకు పామంటే భయమండీ!

రాజ్య : ఆ అబ్బాయి? కొద్తాడేమో! రానియ్యండి!

కామ : (నోరు, నెత్తి బాదుకొనుచు) అబ్బ! వద్దే? నీదుంపతెగా పడుచుముండాకొడుకూ (కంఠమెత్తి) నాయనా! మీనాయనగారినే పిలువు. మేమిద్దరమేదో విధంగా తంటాలుపడ్తాము.

పోనివ్వండి! నాకెందుకు మీరే చావండి!

రాజ్య : ఇదేం పాపమండీ! పామునింట్లోపెట్టుకొని పడుచు వాళ్ళన్నానియ్యనంటా రేమిటంటా కర్మం? రామ! రామా! బూబునాయేంటి? పోనీ; నే నాయింట్లో చస్తాలెండి. ఆ పాము నన్నే పీకుతుంది. (అని గదిలోనికి పోవును)

కామ : (రుద్ధకంఠంతో) ఏమండీ! కరణంగారూ! ఓ అబ్బాయీ (తనలో) వెళ్ళారు కాబోలు (భార్యనుద్దేశించి) నీవిక బయిటికిరావే? నా మంచంక్రింద ఏందో జర, జర మన్నట్లుంది! (అని తొంగి తొంగి చూచుచు ఎగిరిపడి) ఓయి బాబోత్రాచుపాము (అని మంచందిగివీధిలోనికి పరుగెత్తును)

రాజ్య : (నవ్వుచు ప్రవేశించి) పాము గాదుటండీ నలికండ్ల పామట. వేళాకోళానికలా చెప్పాట్ట. వట్టి కొంటెబ్బాయి లెండి, నీ సంగతి బాగా కనిపెట్టాడు.

కామ : (ప్రవేశించి) ఓరీ వీడిదుంప తెగా (భార్యపైనురుముచు) నీ విచ్చిన చనువ ల్లేయున్నది. వెధవ, వెధవంటానూ, ఎక్కణ్ణో! నేను బయటికొచ్చేదాకా ఉన్నాడు గాడు ప్రేగుల్దీసి జందాలు వేసుకునేవాణ్ణే! (ధైర్యము తెచ్చుకొని వీపు చఱుచు కొంటూ) కాలాంతకుల్లాగున్నాడే! ఎంత కంగారు పెట్టాడు అమ్మయ్యా (అని కూర్చుండును)

రాజ్య : ముసలివాడికి నీకే ప్రాణాలమీద ఇంతాపేక్షయుంటే పడుచుదానికి నా కెంతుండాలి? నిజంగా పామైతే ఆ గదిలో విరగబడి చావాలనిగదూ మీకోరిక.

కామ : (నవ్వుచూ) పిచ్చిదానా! నిజంగా పామే అయి నిన్నే కరుస్తూయుంటే; చూస్తూ యూరుకుంటానూ, చించి చెండాడకపోయానూ!

రాజ్య : ఇదిగో మీ ప్రతాపం.

కామ : ఆఖరుకు నా ప్రతాపానికే వంకపెట్టావూ? అదీ విషజంతువు. దానితో ప్రతాపమేమిటి? మనిషి మనిషి మీద ప్రతాపం చూపించాలి.

రాజ్య : నీప్రతాపమంతా నా ఒక్క దానిమీదనే పనికివస్తుంది.

కామ : నేనేదో! మే, మే అంటున్నానని నీకు వేళాకోళంగానే యున్నది. (తలయూచి) ఆహా! నా మొదటిభార్యనామీద ఏమాపేక్ష. నన్నుచూచి యేం మురుసుకునేది. గదిమానంటే గడగడ లాడిపోయేది! చేయెత్తి దండంపెట్టుకోవచ్చు.

రాజ్య : అప్పుడు నీవు పడుచువాడవు. తాను పడుచుది కాబోలు. ఇప్పటికి మూడైనవి. నీవు కాట్లోకిపోయేవఱకు కల్యాణాల్చేసుకుంటూయుంటే మురుస్తూ యుండాలి? అబ్బ! ఏమండీ మీచుప్పనాతితనం; ఇట్లా ఆడుదాని నెత్తురు పిండుకుతాగే

సంఘం మరొకటి లేదనుకొంటా. ఈసంఘమింతట్లో బాగుపడదు. (కొంత తాళి) బ్రహ్మశాస్త్రులవారి కుమారుడు సంఘసంస్కరణానికికృషి చేస్తూన్నాడందంటారు. నిజమో! వట్టిదో! ఆలాటివాళ్ళు పదిమందిచేర్తే చాల్దా మమ్ము నుద్ధరించడానికి. మాకు లేకపోయినా ముందువాళ్ళ కన్నా చిక్కుతుందేమో ముక్తి.

కామ : (ఉలికిపడిలేచి) బ్రహ్మశాస్త్రులవారంటే జ్ఞాపకానికొచ్చింది. పాపం వారి కోడలికి చాల జబ్బుచేసిందట! మఱచిపోయాను. (అని లేచి) చూచివస్తా నీవిల్లు కదలకూ! (నిష్క్రమించును)

రాజ్య : పరధ్యానంమీద తలుపు తాళం వెయ్యడం మఱచి పోయాడే! (విచారంతో) వీడితాడెట్లాన్నా తెంచుకోనీ. (అని వెళ్ళిపోవును)

# ద్వితీయాంకము

మొదటిరంగము

(డాక్టరుగారియిల్లు. డాక్టరుగారు స్నేహితునితో చీట్లాడుచుండును.
తత్తరముతో ప్రమోదుడు ప్రవేశించును.)

ప్రమో : డాక్టరుగారూ! డాక్టరుగారూ! నాభార్యను రక్షించండి! బాబూ! రక్షించండి!

డాక్ట : (చీట్లముక్కలు వేయుచు) ఎట్లాయున్నది నీ భార్యకు?

ప్రమో : బాబూ మనస్మరంతిలో లేకుండా పోయింది. కాళ్ళు చేతులు చల్లబడ్డవి. తాము బిన్నా దయచేయాలి.

డాక్ట : (ఆగమని సైగచేసి) ఇక దిగి రండి!

స్నేహి : తురుపూ?

డాక్ట : తురుపిస్పేటు

ప్రమో : అయ్యా! ఆలస్యంలేదు. బాబూ! బాబూ!

డాక్ట : ఉండవయ్యా మంచాటపడింది.

ప్రమో : అయ్యా తామి మళ్లావచ్చి ఆడుకోవచ్చు బాబూ! ఆపదలోనున్నాం (గుమ్మం దాక పోయివచ్చి) బాబూ! దయచేయండి.

స్నేహి : (ముక్కలు చూచుకుంటూ సంతోషంతో) ఆడండి ఇక దిగండి చూతాం.

ప్రమో : (డాక్టరుగారి స్నేహితునితో) అయ్యా! తామాగితేగాని వారు లేవరు. కాస్త మానుకోవాలి.

స్నేహి : (సైగచేస్తూ) ఎందుకల్లా కంగారుపడ్తావు?

ప్రమో : అవతల మనిషికి వచ్చేప్రాణం పొయ్యేప్రాణంగా వుంటే ఆగమంటా రేమిటంటా! మా కర్మ బాబూ! బాబూ! ఒక్కనిమిష మూరుకోండి.

స్నేహి : నాదేమున్నదయ్యా! రమ్మనువారిని.

ప్రమో : డాక్టరుగారూ! (రొమ్ముకొట్టుకొని) నా భార్య నాభార్య! ఇంకేమి భార్య; ఈపాటికి! అయ్యా! దయచేయాలి.

డాక్ట : (రూక్షంగా) ఉండు, ఉండవయ్యా! ఏమిటల్లా అరుస్తావు. నువ్వు పరుగెత్తినట్టు మమ్మల్ని కూడా పరుగెత్త మంటావా? ఈవేళాదివారం రా వీలుకాదు.

ప్రమో : శివ శివ. కొంపమునిగింది (డాక్టరుతో) తమదయ తమదయ.

డాక్ట : కాస్త ఆగవయ్యా అంటే గంతులేస్తావేం!

ప్రమో : చిత్తం; చిత్తం.

డాక్ట : (ముక్కలుచూచుకొని స్నేహితునితో) ఏదీ? రా! ఈమణేలాహుకుం, గెలుస్తావ్టా!

స్నేహి : ఇదిగో! స్పేడాసు (అని పకపకనవ్వును)

డాక్ట : (వింతగాచూచి పట్లు లెక్కబెట్టుకొని) అయితే తామిందాకటి పట్లో ముక్క వేశారూ!

స్నేహి : సరి, సరి బాగున్నది చూడండి పట్లల్లో!

డాక్ట : (ముక్కలు వెదకుచు) ఇవన్ని కలిసిపోయినవి.

స్నేహి : అయ్యో వేశానండీ! స్పేడురాణీని.

డాక్ట : (విసుగు నభినయించి) నాకు మతినిలవడంలేదు. పాడు గొడవవచ్చింది సమయానికి (స్మృతినభినయించి) మీరు వేసింది క్లావరుముక్కండి!

స్నేహి : పొరబడుతున్నారు. అడగండి ఆయన్ను. చూస్తున్నాడుగా (ప్రమోదునివంక చూచి) ఏమండీ! నేను స్పేడురాణీని వేయలేదూ?

ప్రమో : నేనుచూడలేదండీ! బాబూ! ఇకమానేయండి

డాక్ట : (ప్రమోదునితో) చూచావటయ్యా! ఆయన వేసిన ముక్క.

ప్రమో : నాకసలీయాటే రాదండీ (దోసిలిబట్టి) బాబూ! యిక దయచేయాలి.

డాక్ట : ఆట రాదూ! మూడుముక్కలాటవచ్చూ?

ప్రమో : నాకేయాటరాదండీ!

డాక్ట : (చిరాకుపడి) రూపాయివదలింది (ప్రమోదునితో) నేనిచ్చిన మందిస్తున్నారూ?

ప్రమో : చిత్తం. రాత్రి తెల్లవార్లు మీరుచెప్పిన టైం ప్రకారం గంట, గంటకూ ఇస్తూనే యున్నామండీ!

స్నేహి : (డాక్టరుతో) బ్రహ్మశాస్త్రిగారి కుమార్డుగదండీ ఈయన!

డాక్ట : (తలయూచుచు, ముక్కలు చూచుకొనుచుండును)

స్నేహి : ఎట్లాగూ! (రహస్యంగా) మాంచిపద్దేపడ్డది, చాల భాగ్యవంతుడుసుమండీ! (ప్రమోదునితో) వారికేదో చెప్పవలసింది చెప్పండి. అంత మాత్రం గ్రహించలేరాఏమి?

ప్రమో : చిత్తం; అట్లాగే పట్టుకువచ్చాలెండి (అని డబ్బు చూపును)

స్నేహి : (సైగచేస్తూ) ఇహ ఆలస్యమెందుకు?

ప్రమో : (వందరూపాయలనోటు ముందుపెట్టి) అయ్యా! చిత్తగించండి.

డాక్ట : (లేనికోపం తెచ్చుకొని) ఏం, భిక్షమా? వెధవనోటు (అని ఆవలికినెట్టి) నాలుగు వందలకు తక్కువవీలుకాదు.

ప్రమో : చిత్తం! మానాన్నగారితో మాట్లాడుదురుగాని దయచేయండి.

డాక్ట : నాకేం. నీవే మాట్లాడుకో? మీనాన్న గారినే రమ్మను.

ప్రమో : మీదయ మీఋణముంచుకోం లెండి (సమ్మతి చూపుచు) అలాగేలెండి. దయచేయండి (భయము సూచించి) అమ్మో! అమ్మో! ఆలస్యమైంది.

స్నేహి : (డాక్టరుతో) సలీసుగా పోనీచ్చారేం.

డాక్ట : ఆ, ఏదోఏడుస్తున్నాడులెండి (అని ఇంట్లోకివెళ్లును.)

స్నేహి : (ప్రమోదునితో) తొందరపడ్డావయ్యా, వందరూపాయలకు భాగ్యమా అంటూ వచ్చేవాడూ. ఈ కాలన్లో నాలుగొంద లూరకున్నాయేమిటి?

ప్రమో : పోతేపోయింది, నాభార్య నాకు దక్కితేచాలు.

స్నేహి : ప్రాణంపోయడానికి ఈయన భగవంతుడా? మన భయమే?

ప్రమో : వేసేచికిత్సలు వేసే మీదట మన అదృష్టం

డాక్ట : (డ్రెస్సువేసుకొని ప్రవేశించి స్నేహితునితో) తామింక పదండి. సాయంకాలం క్లబ్బులో మీటౌదాం.

స్నేహి : (లేచివెళ్ళుచు) ఆల్‌రైట్. గుడ్‌బై (నిష్క్రమించును)

డాక్ట : బండితెచ్చావుటయ్యా!

ప్రమో : చిత్తం. తెప్పిస్తా.

డాక్ట : కానీమరి! ఆలస్యమెందుకు?

(ప్రమోదుడు పరుగెత్తును)

(బ్రహ్మశాస్త్రిగారి యిల్లు, శ్యామల మంచంలో మూల్గుచు పండుకొని యుండును. బ్రహ్మశాస్త్రి, బుచ్చిరామమ్మ, కల్యాణి దుఃఖముతో కూర్చుండి యుందురు)

బుచ్చి : (కోడలి కాళ్ళుపట్టుకొని చూచి కార్తస్వరమున) అంతా చన్నీళ్ళ కుండైపోయింది. కోడలా! కోడలా! ఇంకేం కోడలు (అని చేతులు నలుపుకొనుచుండును)

కల్యా : వదినా! వదినా! (అని యేడువబోవ బ్రహ్మశాస్త్రి వారించి)

బ్రహ్మ : ఊరుకోండర్రా కాసేపు-ఊరుకోండి! (గుమ్మం దాకవచ్చి అటునిటుచూచి) డాక్టరుగారింకా రాలేదు. నేనన్నా వెళ్ళివస్తా. (అని వెళ్ళబోయి మళ్లా మంచం దగ్గిరకు వచ్చి) వెళ్ళితే! ఇక్కడెవరు.

(కామశాస్త్రి ప్రవేశించును)

కామ : ఏమండీ! బ్రహ్మశాస్త్రిగారూ! ఎలావున్నది?

బ్రహ్మ : ఇంకేమున్నది. (అని నిట్టూర్పువిడచి) శాస్త్రుల వారూ! మావాడొస్తున్నాడేమో కాస్త చూడండీ! బాబూ!

కామ : ఆ. చూస్తా (అని గుమ్మందాకవెళ్ళి చూచి) ఏదీ రావడం లేదే! డాక్టరుకోసం వెళ్లాడేమిటి? ఆయన లంచ మీయందే మంచమెక్కనంటాడే? పానకాల రాయుడు.

బ్రహ్మ : యిచ్చి పంపేనండీ! ఆలోపం లేకుండా!

కామ : (చప్పరించుచు) ఆ, ఎందుకు, దండుగ, ఈయింగ్లీషు వైద్యులకు తెలుగు రోగా లేం తెలుసు? నాటువైద్యుణ్ణి చూడలేక పోయారూ?

బ్రహ్మ : నేనదే మొత్తుకొన్నా! మావాడూ కాదంటే కాదని.... ఇవాలిటికి పదిరోజులు ఆసుపత్రికి తిప్పి చంపుతున్నాడు. ఎన్నాళ్ళిచ్చినా! ఆ క్వైనాతప్ప కొత్తమందు లేదాయె. మాటాడితే మండిపోతాడు. వాళ్ళు ఒళ్ళుబలిసినవాళ్ళండి!

కామ : మొన్న చూడరాదండీ! బంగారయ్యగారూ! ఒంట్లో సుస్తిగాయుండి కాస్త చెయ్యి చూడండంటే చెవుల్లో ముక్కుల్లో యేవో ఆయుధాలుపెట్టుకొని ఘంటసేపు పరీక్షచేసి నీకళ్ళల్లో నెత్తురులేదు. రొమ్మొండి పోతూంది. కవ్వంప్షన్‌వస్తుంది జాగ్రతపడుమంటూ యుపన్యాస మారంభించాడూ! పాపం వెఱ్ఱిబ్రాహ్మడు బెంగెట్టుకొని మంచమెక్కాడు. ఇవ్వాల్టి కారులంఖణాలు. ఏమని చెప్పనూ డాక్టర్లతంతు. ఈ వేళ కాబోలు నాటువైద్యుణ్ణి పిలిపించారు.

శ్యామ : (అటు ఇటూ కొట్టుకొంటూ) ఊ, ఊ, ఊ

బ్రమ్మ : అమ్మా! శ్యామలా! శ్యామలా!

శ్యా : ఊ.

బ్రహ్మ : ఎలా యుందమ్మా?

(డాక్టరు, ప్రమోదుడు ప్రవేశింతురు)

డాక్ట : ఆడవాళ్లనందర్ని యవతలకు వెళ్ళమనండి.

బ్రహ్మ : అంతా! పదండి, పదండి.

డాక్ట : (శ్యామల నెగాదిగ చూస్తూ సిగరెట్టు చేత పట్టుకొని) అమ్మాయీ? అగ్గిపెట్టె పట్టుకురా.

కల్యా : (తలయూచి) ఇంట్లోకివెళ్లి తెచ్చియిచ్చును.

డాక్ట : కుర్చీమీద కూర్చుండి సిగరెట్టు ముట్టించి, నాడీ పరీక్ష చేసి, ఈవేళ విరేచనమైందా?

ప్రమో : లేనట్లున్నది. సార్

డాక్ట : (పరీక్ష చేస్తూ) ఆలస్యమైపోయింది. మీరు వెంటనే వస్తే బాగుండేది.

ప్రమో : ఆయాసంగా యున్నదనంగానే వచ్చానండీ! తామే ఆలస్యం చేశారు.

డాక్ట : (కోపంగా చూచి) డోన్‌టాక్, మరియాద లేకుండ మాట్లాడుతావు.

ప్రమో : చిత్తం (అని భయం నభినయించుచు) ఎలాగున్నదండి.

బ్రహ్మ : (నమస్కరించి) రక్షించాలి బాబూ?

ప్రమో : మీ దయయుంటే నాభార్య బ్రతుకుతుంది. నాలుగొందలు కాదు. ఇంకా!

బ్రహ్మ : (కొడుకువంకజూచి (గుడ్లురిమి) ఉండ్రా వారేదో చెప్పుతుంటే.

కామ : ఏమన్నా! ఆశ! డాక్టరుగారూ!

డాక్ట : ఎడమతట్టు, ఊపిరితిత్తి ఎఫెక్టైంది. హోప్లెస్.

కామ : లాభం లేదన్నమాట?

డాక్ట : ఊ, హూ, రాత్రి పదింటికి. (అని లేచును)

ప్రమో : హా భగవంతుడా (అని కూలబడును)

(బుచ్చి రామమ్మ కల్యాణి పైఁబడి యేడ్చుచుండును. బ్రహ్మశాస్త్రిగారొక మూలకొరుగును)

బుచ్చి : కోడలా? నీ కెంతలో పోగాల మొచ్చెనే? భగవంతుడా? ఈ పాపిష్టిరోగం నీకెక్కడ దాపరించెనే? అమ్మా! నీవంటి కోడలు మాకు ఈజన్మలో దొరుకు తుందిటే తల్లీ! ఈ పండుగనాడూ! పండుగనాడూ! అత్తయ్యా! పట్టుచీర కట్టు కొంటానంటే, ఎందుకులేవే! ఆ చీరె చాల్నంటినిగదే. తలదువ్వకొని జడనిండా మల్లెపూలు పెట్టుకొని బొట్టూ, కాటుకా, దిద్దుకొనిగుమ్మంలో నుంచుంటే చూడకండ్లు లేకపోయేవిగదే, తల్లీ! ఈశాస్త్రి గారి కోడలు బుద్ధిమంతురాలని యూరంతా చెప్పుకొంటుంటే యెంత పొంగిపోయామే! ఏ! దేముడా? హాం.

కామ : (డాక్టరుగారితో రహస్యంగా) డాక్టరుగారూ? గట్టిగా బ్రతుకదన్నమాటేనా? అండీ?

డాక్ట : చాలా పెద్దజబ్బు, ఈ రోగం చాల అరుదుగా కనుపడుతూ యుంటుంది. సౌతాఫ్రికన్ స్లీపింగ్ డిసీజంటారు దీన్ని.

కామ : ఆలాగా! అండీ (బ్రహ్మశాస్త్రితో) ఇంకా చూస్తా రేమిటండీ క్రిందపెట్టరూ (విచారము నభినయించి) పాపం మహాయోగ్యుడు కష్టాలన్నీ మంచివాళ్ళకే.

డాక్ట : (వెళ్ళిపోతూ కామశాస్త్రిని పిలిచి) తక్కిన పైకం పంపించమని చెప్పండి.

కామ : (చేతులు నలుపుకొంటూ) దుఃఖాల్లో యున్నారు. తామడగమంటే అడుగుతానులెండి.

డాక్ట : అయితే నాకేం. లేకపోతే దావావేసి పుచ్చుకొంటానని చెప్పండి.

కామ : అందాక ఎందుకులెండి అయితే! చావడంనమ్మకమే నంటారూ.

డాక్ట : ఆ, ఇక బ్రతకదు. (అని వెళ్ళిపోవును)

శ్యామ : (అటునిటు పొరలి) అ–త్త–య్యా.

బుచ్చి : (ఆత్రంతో) మొండాయుష్యు లాగున్నది.

శ్యామ : దా, దా, హ హ... ...

బ్రహ్మ : దాహమటే, దాహమట! (కామశాస్త్రితో) ఏమండీ దాహమంటుంది

ఇమ్మంటారూ?

కామ : నాకు మాత్ర మేమి తెలుసునండీ? (అసమ్మతిని చూపుచూ) ఇంకా దాహమేమిటి? అదీ గుణచర్యలెండి.

ప్రమో : దాహమియ్యక చంపుతారేమిటి? తేవే అమ్మా నీళ్ళు (అని నీళ్ళిచ్చును)

కామ : (బ్రహ్మశాస్త్రిని సైగచేసి పిలిచి)

(బ్రహ్మశాస్త్రి గుమ్మముదాక వచ్చును)

బ్రహ్మ : (చీదివేయుచు) మాత్రాత! మారాత!

కామ : అయిపోయిందానికి చేసే దేమున్నదిలెండి, దుఃఖపడి లాభమేమున్నది. మనది మాత్రం శాశ్వతమా?

బ్రహ్మ : మహాఇల్లాలు! కామశాస్త్రిగారూ! అది వచ్చినాక మాసంసార మెంత కలిసి వచ్చిందనుకొన్నారూ. ఆ మొగుడిమీద యేమాపేక్ష, ఏమాపేక్ష.

కామ : విధీ! ఉన్నదేనండీ! మంచివాళ్ళనే ఏరుకుపోతూ యుంటాడు. నేనికవస్తా. (అని కొంతనడచి మళ్ళీవచ్చి) డాక్టరుగారు పోతూ, పోతూ మిగతాపైకం పంపమన్నారు. మీయిష్టం.

బ్రహ్మ : (నోటిమీద చేయివేసుకొని వింతగాచూస్తూ) రామ! రామ! ఇప్పుడే! ఇప్పుడే! చూచారూ! కొంపకూలి మేమేడుస్తుంటే, వీడిజిమ్మడా! వాడిది గుండా! చెరువా!

కామ : నేను చెప్పలేదుటండీ! వట్టి కర్కోటకపు ముండాకొడుకు.

బ్రహ్మ : బాగైతే ఇస్తామన్నాంగానీ శివ, శివా?

కామ : పోనిత్తురూ! వాడి త్రాడెల్లానో త్రెంచుకోనియ్యండి. దావాలు గీవాలు వేస్తానని అఘోరించారు లెండి.

బ్రహ్మ : పీనుగుమీదనా వీని ప్రతాపం, ఏమిధర్మమండీ?

కామ : మరినాకు సెలవు. (అటుఇటుచూచి) చూడండి! అమ్మాయికి పదేండ్లొచ్చాయి. తాము చూచేయుంటారు. కొద్దిగా ఇంగ్లీషదీ చెప్పించాము! హార్మనీకూడ వాయించుతుందిలెండి తామింకోచోట మాట ఇస్తారేమో; అని అంటే మీమీద మాకు పూజ్యభావం సంబంధాలు లేక కాదు.

బ్రహ్మ : (తలయూచి) చూతాంలెండి – కట్నము

కామ : తామేసెలవివ్వాలి?

కామ : ఆ, ఆ, అలాగే? అంటే మీసమ్మతికోసం. అది అది చెప్పొద్దూ.

బ్రమ్మ : కానివ్వండి. (అని వెళ్లును.)

(కామశాస్త్రి నిష్క్రమించును)

బుచ్చి : కాస్తఅణగి పడుకొన్నదండి! నిద్రపోతుందేమో?

కల్యా : ఈపాడురోగం నాకన్నవచ్చిందికాదు.

బ్రహ్మ : అమ్మా! కల్యాణీ! మన మవతలికి వెళ్లుదాంరండి. అమ్మ చూస్తుంటుంది. క్రింద పెట్టిస్తే బాగాఉండు.

ప్రమో : వల్లగాదూ. (అని నిష్క్రమించును)

(తెరపడును)

రెండవ రంగము

(రామచయన్లగారి యిల్లు, అరుగుమీద రామచయన్లు కూర్చుండి యుండును. కిశోరుఁడు ప్రవేశించును)

కిశో : మీ అబ్బాయి యున్నాడా అండీ!

రామ : (దృష్టిమాంద్యమునభినయించి) ఎవరునాయనా? నీవు?

కిశో : నేను కిశోరుణ్ణి.

రామ : ఆ, నీవా! నాయనా! నాయుడిగా రబ్బాయివా?

కిశో : అవునండీ!

రామ : మావాడూ! ఎక్కడకో వెళ్లాడు. నాయనా నీవు కవిత్వం బాగా చెప్పుతావట మావాడంటూ యుంటాడు. బుద్ధిమంతుడవు. నూరుమంది కొడుకుల్ని కని యేం లాభం. వంశాన్నుద్ధరించేవాడు ఒక్కడుచాలు. మావాణ్ణిచూడు. వట్టి ఆకతాయైపోయాడు. (సమ్మతిసూచించును) ఏది! నాయనా! ఏదీ! నీవురాసిన పద్యం ఒక్కటి వినుపించు. ఈపాడు చెవుల్తో వింటా. నాకూ కవిత్వమంటే ఆపేక్ష. ఈ పాడుకొంపలో విద్యాగోష్ఠా? ఏమన్నానా? ఏది నాయన? ఏదీ.

కిశో : మీకు మాకవిత్వాలు బాగుండవులెండి.

రామ : బాగుండకేం అట్లనకు. వాణి ఒక్కొక్కరినోట ఒక్కొక్క రూపంతో ప్రత్యక్ష మవుతుంది.. దానికేంలే.

కిశో : మీరుకూడా పండితులేగా!

రామ : పండితులంటే నేనూ సంస్కృతంలో కావ్యాలయి చూచాను. వేదం చదువు కొన్నాను. కాస్త కాణాదతర్కం, పూర్వమీమాంస, సిద్ధాంతకౌముదిదాక పాఠం చెప్పుకొన్నవాణ్ణే! ఏమిటో మాకాలం వెళ్లిపోయింది. నాయనా! మావాణ్ణి నీవెంట తిప్పుకొంటూవున్నావుగదా! కాస్త కవిత్వంలో ప్రవేశపెట్టరాదూ?

కిశో : చెపితే వస్తుందటండీ! కవిత్వం. తాముకూడా అలా సెలవిస్తారు.

రామ : నిజమే! నాయనా! నిజమే! అది పురాకృత సంచితం. తల్లిదండ్రులుచేసిన పూజా ఫలం. నేర్చుకొంటే వస్తూందీ! కవితయున్నదే నాయనా స్వభావసిద్ధంగా పుట్టుకువచ్చే ఆవేశ ప్రవాహం. ఈ పండితులంతా రాస్తు యుంటారే చొప్పదంటు కవిత్వాలు.

శ్లో. కింకవేస్తస్య కావ్యేన కిం కాండేనధనుష్మతః
పరస్యహృదయే లగ్నం నఘూర్ణయతి యచ్ఛిరః

అన్నట్లు, మాట బయలుపడితే ఒళ్ళు పులకరించాలి. ఏదీ నాయనా నీనోట ఒక్క పద్యం.

కిశో : వినండి ఈ మధ్యరాశా; భారతిలో కూడ పడ్డదిలెండి

రామ : ఏ దేదీ?

కిశో :

ఉ. చీకటినవ్వుతోడ తమసీ మధురంబగు నాయెడందలో
తేకులు తేకులై కలువరించుచు నున్నది భావహంస, భృం
గీ కలనాదఝుంకృతుల గేరెడు ముగ్ధగళంబు వీణెతో
నేకముజేసి వాలగదవే; తలక్రిందుగ గుండెశయ్యకున్.

రామ : ఏ దేదీ? నాయనా! ధార మనోహరంగా యున్నది. కాస్త అర్థం చెప్పి, తాత్పర్యం కానీ.

కిశో : అర్థాలకు తాత్పర్యాలకు తయారవుతారనే మీవద్ద మా కవిత్వాలు వినిపించంది. ఆరోజులు పోయినవి. విన్నారూ? పద్యం వింటే పగులగొట్ట మన్న మాటే, పద్యమంటే అదొక జీవమున్నవ్యక్తి. దాన్ని ముక్కలు చేయడం కూడా జీవహింస.

రామ : ఏమిటీ! ఇక తాత్పర్యాలు అర్థాలే యుండవా! యేమిటి మీ కవిత్వాల్లో?

కిశో : హృదయానికి మాత్రమే తెలియాలి. తాతగారూ! తాము తియ్యని మామిడి పండు నారగించారను కొండి. దాని రుచి యెట్లుంటుందో చెప్పగలరా? అది జిహ్వాకే తెలియాలి, అంతే ననుకోండి.

రామ : (తనలో) ఆహా!కుఱ్ఱవాడు నాకేదో టోపీవేయబోతున్నాడూ! ఔరా! పిడుగా!

(కిశోరునితో) నాయనా! నేను కాస్తడొక్కశుద్ధి గలవాడనే గాని కేవలం శుంఠను గాను. అన్నిటికీ తలూచడానికి అర్థంలేని పద్యమేమిటంటా. ఇక కవిసమయం మాత్రముంటుందీ! ఏదీ! ఏదీ! చీకటి నవ్వూ (యోచించి) నీ పేరే మన్నావూ, నాయనా.

కిశో : కిశోరకుమారుడు

రామ : కిశోరూ! నవ్వును తెల్లనిపదార్థాలకు పోలుస్తారే, చీకటితో పోల్చావేమిటి?

కిశో : అందుకే మీకు తెలియదన్నది. కవి సమయాలకు స్వస్తిచెప్పి చాలకాలమైంది. మేము వ్రాసేదే ప్రమాణం, సమయమూనూ.

రామ : సరి, సరి నాయనా! అది ఆదరణీయ మౌతుందా?

కిశో : ఆదరించే దెవరు? కవి యొకరి ఆదరణకోరడు, కోరాడంటే వాడు కవిగాడని మా సిద్ధాంతం.

రామ : పండితాదరణ లేదూ?

కిశో : ఎవడు పండితుడు? వాడి ఆదరణ మెవరిక్కావాలి? పండితుడంటే మాకు మంట. అతడొక పాతపుంత, తాతలనాటి తాటాకు, ఒక నిఘంటువు, సంస్కృత సరస్సులో నొక యెనుబోతు.

రామ : నీ మాటలు నాకాశ్చర్యంగా యున్నవి.

కిశో : అవునండీ! మీకు రాళ్ళు గుండ్లు దొర్లించాలి, బొప్పి కట్టించాలి. బంధాలు, అలంకారాలు, సర్కసుఫీట్లు కావాలి. అప్పుడుగాని నచ్చదు.

రామ : వ్యాకరణమేమన్నా చదువుకున్నావూ?

కిశో : ఎందుకూ? వ్యాకరణం ఏడవనా?

రామ : అయిపోయె. వ్యాకరణమూ చదవక, చంధస్సు చూడక కవిత్వమా? ఇక కవి కానివాడెవడు?

కిశో : అయ్యేనాటి కందరు కవులవుతారు. మీతో నాకు వాదనెందుకు?

రామ : అబ్బాయీ! నీవెంత ప్రజ్ఞగలవాడివైనా పెద్దలను తిరస్కరించరాదు. నాయనా! వారు పెట్టిందే భిక్ష. నీ వాద ధోరణిచూస్తే పూర్వం కవులే లేరని తేల్తుంది. పూర్వం వాల్మీకులవారు కోపావేశమున నిశాదుణ్ణి శపిస్తే

శ్లో॥ మా నిషాద ప్రతిష్ఠాం త్వ మగమశ్శాశ్వతీ స్సమాః
యత్క్రౌంచమిథునా దేక మవధీః కామమోహితమ్

అనుశ్లోకమై వెడలివచ్చిందట. ఒక్క నిషాదుణ్ణిసంహరించే అర్థమే కాకుండా రామాయణము, షట్కాండలు, భాగవతార్థములు గల కావ్యారంభశ్లోకమై పరిణమించిందట. విన్నావూ? నాయనా! చిన్నవాడవు ఆలోచించకుండా చెపితే నూరర్థాలు ఆలోచిస్తే వెయ్యర్థాలు ఉండేవి. వారికి మనకు పోలికా?

కిశో : మీతో నాకెందుకు వాదన. మీ అబ్బాయివస్తే ప్రమోదుడితో మాట్లాడుతూయుంటానని చెప్పండి సెలవు (అని లేవబోవ)

రామ : మంచిది. నాయనా! ప్రమోదుడి భార్య కెలా ఉన్నదో! పాపం, మొన్న క్రింద బెట్టారన్నారు.

కిశో : ప్రమోదుడదృష్టవంతుడు; కాస్త నెమ్మదిగానున్నదట.

రామ : (వింతగాచూచి ముక్కునవ్రేలుపెట్టుకొని) చూచావు నాయనా! ఆయుర్బలం హాయ్! హాయ్! మొన్న కామశాస్త్రి వారింటికెళ్ళివస్తా చెప్పాడు; నాకూ తెలియదు.

కిశో : ఎవరూ! కామశాస్త్రి గారా! ఆయన తిరిగిందానికి కారణమున్నది లెండి; దయతలచికాదు. ఆంజనేయస్వామి కాకుపూజకూడ మ్రొక్కుకొన్నాట్ట. వట్టి దుర్మార్గుడు.

రామ : ఏం కారణం (స్మృతినభినయంచి) ఊ, హూ. అమ్మాయికి సమర్తాడే యీడు వచ్చిందని ఈమధ్య సంబంధాలకని తిరుగుతూ యున్నాడులే.

కిశో : అదే! ప్రమోదుడికిత్తమని

రామ : వారి సంబంధం మంచిదేకాని తూగేవాడేనా!

కిశో : తూక్కేం. ఈమధ్య ప్రైవేట్లుచేసి బాగా సంపాదించాడులెండి. మరినేనువస్తా (అని వెళ్ళిపోవును)

రామ : (తనలో) కుఱ్ఱవాడుబుద్ధిమంతుడే! పూవుపుట్టంగానే వాసన (దృష్టిమాంద్యము నభినయించి) ఆ వెళ్ళేదెవరు చెప్మా! ఎవరండీ! వెళ్ళేది?

(కామశాస్త్రి ప్రవేశించి)

కామ : ఆ చయన్లుగారూ! నేను కామశాస్త్రిని

రామ : ఆ మీరా! మాట, దయచేయండి. ఇప్పటిదాక మీ సంగతే మాట్లాడుతూ యున్నాం. అలా కూర్చోండి.

కామ : (కూర్చుంటూ) పనిమీదవెళ్తూయున్నాను, విన్నా. కానివ్వండి.

రామ : ఆంజనేయాలయానికా అండీ! ఈవేళ శనివారమా?

కామ : ఆలయానిక్కాదు, వల్లకాటిక్కాదు. అయినా ఈవేళ శుక్రవారంలెండి.

రామ : బ్రహ్మశాస్త్రిగారమ్మాయి కేలాయున్నదో, భోగట్టా చేశారూ?

కామ : (మొగంచిట్లించుకొని) ఏందానికి గుణంతిరుగుమొగమైందట, ఇదిగో! చచ్చె అదిగో చచ్చెనన్నారు. చావనూ లేదూ, పాడూ లేదూ.

రామ : ఇక పరవాలేదన్నమాట?

కామ : ఆ దానికిక రాళ్ళబొడిచినా చావులేదు.

రామ : పోనివ్వండి! పాపమా మగడదృష్టవంతుడు. అది చస్తే మనకేమొస్తుంది. "సర్వేజనాస్సుఖినో భవంతు" అన్నాడు.

కామ : మనకొస్తుందని కాదు. మాటసామెతకన్నా

రామ : మీరేదో ఆశపెట్టుకొన్నారని విన్నాలెండి.

కామ : ఆ! అన్నీ మన మనుకొన్నట్లే జరుగుతాయటండీ, ఏమిటో అంతా తల రాతకొద్దీ.

రామ : అంతేలెండి. తామేమో శనివారన్నాడు ఆకుపూజ చేయిస్తామన్నారని ఆచార్యుల వారన్నారు. నిజమేనాఅండీ?

కామ : (చిరాకుపడి లేచి వెళ్ళుచూ) ఆకుపూజా లేదు. అధ్వాన్నం లేదు. వస్తా (అని నిష్క్రమించును)

రామ : (ఆశ్చర్యంగా చూస్తూ)

ఇదీ మావారి తంతు.

తే.గీ. అతివ మరణంబు తథ్య మిథ్యానభమున
వీడునిర్మించె కూఁతురి పెండ్లిమేడ
అక్కటా! కాలమహిమ, స్వార్థాతిశయత
మానవుండెంచునో! చావులేని తనము.

(తెరజారును)

# తృతీయాంకము

ఒకటవ రంగము

(నవయౌవనవతి కల్యాణి పెరటిలో పూలచెట్లకు నీళ్ళుపోయుచుండును. శ్యామల గడపలో నిలచి చూచు చుండును)

కళ్యా : నువ్వు మృత్యుముఖంనుంచి బయటపడ్డావంతేచాలులేవదినా! మా అన్నయ్య కన్న నేనే అదృష్టవంతురాల్ను. నువ్వుతప్ప నన్నోదార్చేవారేరి? మాఅమ్మ నాస్థితికి అప్పుడప్పుడు కన్నీరువిడుస్తుందిగాని రామ! రామ! మా నాయన నా అతిగతి ఆలోచిస్తాడూ? (వదినవంక తిరిగి దీనవదనయై) వదినా! మొన్న అందరికి అన్ని పట్టుచీరెలు తెచ్చి, ఈసైనుపంచలు నా మొగానపారేసి ముండా ఇక నీవివి కట్టుకోమని... ... (కంటనీరు పెట్టుకొనును. శ్యామల తన పైట కొంగుతో కండ్లుతుడుస్తూ)

శ్యామ : పోనీవే. తల్లీ! ఏడవకు; ఒకనాటిదా!

కళ్యా : (తిరుగ నీళ్లుబోయుచు) ఈ మల్లెమొక్క గుబురు గట్టి గుమ్మటంలాగ ఎంత ముచ్చటగానున్నదో చూడు వదినా!

శ్యామ : పసిపిల్లలకుమలె చిన్నప్పటినుంచి పెంచిందినీవేగా! అమ్మా! నీకడుపులో కోరిక లెట్లాపూచాయో! అవి అలా పూచినవి.

కళ్యా : (సంతోషపడుచు) వదినా! ఈ సంపంగి మొగ్గ వేసింది. (వాసనచూచి) ఒళ్లు పులకరించేవాసన దొడ్డంతా చిమ్ముతుంది. (నిదానించి కలయజూచి) పాప మీపారిజాత మెండిపోయింది. ఏమే! పారీ! నీ మొగుడు చచ్చాడూ?

శ్యామ : నీకర్మమిలాకాలిందికాని? వాటికేమి? వితంతువులను వేధించుకుతినే హిందూ సంఘములాగా ఈ ఎఱ్ఱ గన్నేరు ఎట్లా ధుమ ధుమలాడుతూ పుట్టిందోచూడు.

కళ్యా : అచ్చుమెరుపుకూడాకాదు. ఆకోపంలో నవ్వుకూడా యున్నది. (అని నవ్వి నీరుపోయుచుండును)

శ్యామ : (కల్యాణి శరీరశోభను పాలించిచూచి) (తనలో) ఆహా! మాకళ్యాణి రూపమెంత దర్శనీయంగా యున్నది.

తే.గీ. జిలుఁగు మాంధాళి జలతారు చీరలోనఁ
బొదివి సేవింపఁ దగు మల్లెపూలగుత్తిఁ
బీనుఁగుల మీద గప్పు పాపిష్టికలుష
వస్త్రపు ముసుంగులోఁ జుట్టి వయిచినారు

తే.గీ. లోక మెఱుఁగకముందె, ఈలోల నయన
పసుపుఁ గుంకుమ సిరిఁగాల్చి వయిచినారు
విశ్వమోహనముగ మొగ్గ వేయుచున్న
యౌవన విలాసమును మాన్ప నలవియగునె

తే.గీ. అప్రసన్నేక్షణముల శైత్యంబునందు,
నుబుకుచున్నవి, వేడి పయోధరములు
ఆ వినూతన యౌవనోద్యాన సీమ
క్రక్కుచున్నాడు సూర్యుఁడంగారవృష్టి
(కన్నీరు తుడుచుకొని) కల్యాణీ! ఇక నీళ్ళు మానేయి; నీరుచిచ్చు పడుతుంది.

కల్యా : వదినా! నువ్వు జబ్బుపడ్డాక వీటి మొకము చూచిన వాళ్లెవరు? మళ్లా ఈ వారంనుంచేగా పోయడం, అంత వరకు మొక్కలు కొన్ని యెండిపోయినవి.

శ్యామ : కల్యాణీ! ఏచెట్టుపూస్తే నీకేంలాభం. నీ అచ్చట ముచ్చటలణిగి ఆరేండ్లయినవి.

కల్యా : (నీళ్లుపోయడంమాని ఒకచోట కూర్చుండి) నాకు లాభం లేకపోతే మీరున్నారుగా వదినా! మిమ్మల్ని చూచి సంతోషించ కూడదూ? మాపుణ్యం మంచిదవడం చేత గాని వదినా! నీవు దక్కుతావనుకున్నామా? పూలు పెట్టుకొని మా కండ్ల పండువు చేస్తావనుకొన్నామా? (రహస్యంగా) వదినా! మానాన్నటా? డాక్టరుగారు లాభం లేదనంగానే! వాడెవడో సంబంధానికి వస్తే కట్నాలు కూడ బేరం చేశాట్ట. ఇంతపాప మెక్కడన్నా యున్నదీ? (అని ఆశ్చర్యము నభినయించును)

శ్యామ : హిందూ సంఘమంటే మనుషుల్ని ప్రాణాలతో పీక్కుతిను క్రూర పిశాచంగాదా! వెఱ్ఱిదానా? ఆడదై పుట్టడమే మహాపాపమనుకో. అందులో బ్రాహ్మణ కొంపలో పుట్టడం నీచాతినీచం. ఈ దుర్మార్గులు చేసే పాపాలన్నా యిన్నా. పట్టు పరుపుల మీద మహాసున్నితంగా గోమునబెంచిన కన్నకొడుకును, ప్రాణం పోతూయుంటే విసరి నేలమీద పారవేయడమేగా? ఆ మంచం మీద చావనీయరాదూ - వీళ్ళపుట్టేం మునుగుతుంది?

కల్యా : (జ్ఞాపకము తెచ్చుకొని) అయ్యో! మొన్న నిన్ను క్రిందపెట్టమని మొదలు పెట్టారుగా? ఎవరో ఒహాయన.

శ్యామ : ఎవరో ఒహాయనేమిటి? ఆయనే సంబంధానికి వచ్చింది. మీ అన్నయ్యకు మామకాబోతూ మానివేసినాడు (అని నవ్వును)

కల్యా : (నవ్వి) ఎట్లాగూ! నీ కప్పుడే తెలిసిందీ.

శ్యామ : ఊరంతా యెఱుగుదురు.

కల్యా : అట్లానా! వదినా! ఆయనామాటనంగానే! అన్నయ్య వల్లగాదని గ్రుడ్లురిమాడు. మానాన్నకూడ పెట్టించాలనే క్రింద.

శ్యామ : మంచాలమీద చస్తే తక్కిన కులాలకు లేని అరిష్టం వీరికెక్కడనుంచొస్తుందో,

ఎవడయినా మీ అన్నయ్యబోటి కాస్త బుఱ్ఱగలవాడు కాదన్నాడా? చూడు వాని బ్రతుకు. ఇనపముక్క కాకుల్లాగా పట్టుకొని దుంపతెంచి గంపకెత్తుతారు. జంధ్యాలు తెంచుకొంటారు. నాలుక కాలుస్తామంటారు. నోరెత్తితే శాస్త్రాలు పురాణాలు, ఓ స్నానం చేయిస్తారు. శ్లోకాల్తో, ఆతాటాకుకట్టలే నీకీతిప్పలు తెచ్చినవి.

కల్యా : వదినా! నీవెంత ఆలోచన గలదానివి? నీకడుపులో ఎంత విషయముంది? అమ్మో! అమ్మో! ఈ జ్ఞానమంతా బుగ్గిపాలు చేసుకొనేవాళ్ళము కాబోలు (అని కౌగలించుకొనును)

శ్యామ : అమ్మాయీ! ఆయుష్షుంటే, రోగమేంచేస్తుంది (కండ్లవంకజూచి) కల్యాణీ! కళ్లెం దుకమ్మా! ఎఱ్ఱగా యున్నవి. నిద్రపట్టదూ?

కల్యా : (కన్నీళ్ళు పెట్టును)

శ్యామ : ఏమిటమ్మా! చెప్పవు? నీ కష్టమేమిటి నాతో చెప్పు; నీ తల్లిని నేనే ననుకో (బుజ్జగించును)

కల్యా : (చీదివేయుచు) ఏమున్నది నారాతకే.

శ్యామ : దానికెవరేం చేయగలరు? ఊరుకో అమ్మా, ఊరుకో.

కల్యా : ఇన్నాళ్ళు నాకేమి తెలిసేదికాదుగాని... ...

శ్యామ : ఆ, ఆ. ఏమిటమ్మా? చెప్పు.

కల్యా : రెండేళ్లయింది. రాత్తిర్లు నిద్రపట్టదు వదినా?

శ్యామ : (ఆకళింపు నభినయించి) అవునుతల్లీ! అవును. నీ యౌవనము, నీచక్కదనము, నీసుఖము కూకటివేళ్ళతో పెరికి ఆహుతి చేసుకొన్నారీ దుర్మార్గులు. ఈ సంఘ శక్తికి కన్నులున్నవి గాని కరుణలేదు. హృదయమున్నది గాని వజ్రకల్పం.

కల్యా : వదినా! అన్నయా, నీవు చిలకా–గోరువంకల్లాగ యుంటుంటే మా వదినె ఎంత అదృష్టవంతురాలని అనుకొంటా, నే...ను ఎవరితో ముచ్చటాడేదని.. నా చక్కదనము చూచి మురిసే వ్యక్తేదీ? (సంతోషము నభినయించుచు) మొన్న నేవదినా! మొన్ననే మీరంతా గుడికెళ్లారే ఆవేళే. అద్దం చూచుకొంటే నాయొళ్లు నాకళ్లు నాకే ముద్దొచ్చింది. (చనువు చూపుచు) కడుపులో పెట్టుకోవాలిసుమా! (అని చేతులు పట్టుకొనును)

శ్యామ : (బుజ్జగిస్తూ) కల్యాణీ! నన్ను నమ్మవూ కడుపుచించుకుంటే కాళ్ళమీద పడదూ!

పెట్టుకొన్నా! అబ్బా, ఏమని చెప్పేనే వదినా! అప్పుడు నాలోపొంగిపోయిన దుః ఖాన్ని అంతలో ఎక్కణ్ణుంచొచ్చిందో, దయ్యంలాగా మానాయనమ్మ. గబాలున యింటజొరబడి నగలన్నీ తీసేశా; ఆతొందరమీద కమ్మగూడా గీచుకుపోయింది. చూడూ. (అని చూపును)

(సమ్మతిని సూచించి)

శ్యామ : పోనీలే అమ్మా! పోనీలే! ఈ రాక్షసులకంట బడ్డావుగావు.

కల్యా : వదినా నాకు మొగుడట, వాడుచచ్చాడట! ఎవరే? ఈ తతంగమంతా ఎప్పుడో జరిగింది.

శ్యామ : (విచారము నటించుచు) ఎందుకులే! అమ్మా!

కల్యా : చెప్పువదినా!

శ్యామ : నేను కాపరానికి వచ్చి నేడూ! నీవు మూడేండ్లదానివి. మీ మేనమామ ఒహడుండేవాడు. డెబ్బైయేండ్లకోతి. పెండ్లామేమో చచ్చిందిట వాడికి. మీ అమ్మ నా అన్నయ్య దూరమైపోతాడూ, దూరమైపోతాడూ నా కల్యాణి అచ్చట ముచ్చట చూచుకుంటానంటూ సాగించింది మీ నాన్నగారితో పోరు, సరే, యికనేముంది బ్రాహ్మణ్ణి పిలిపించి, శుభముహూర్తం పెట్టించి, కండ్లు తెరవని కసిగందున్నిన్ను వారి మొహాన బెట్టి నీళ్ళు విడిచారు. ఎందుకా కథంతా; దాని ఫలితంగా నీకు...

కల్యా : (వింతగా చూస్తూ) మా అమ్మే నన్నమాట నా గొంతుకోసింది?

శ్యామ : అమ్మే! ఇంకెవరూ? మేనటికం మేనటికమని నిన్నేట్లో ముంచింది.

కల్యా : ఎంతపని జరిగించింది మా అమ్మ!

శ్యామ : పోనియ్యమ్మా! అయినపెండ్లికి మేళమెందుకు?తలచుకొనే కొద్ది దుఃఖం (అత్త నుద్దేశించి) తానుమట్టుకు నీరాత యిట్లైందని లోపల్లోపల కుమిలి కూలారిపోతూనే యున్నది.

కల్యా : వదినా! ఇంతపాప మొడికట్టుకొంటున్నారే; తెగించిన వాళ్ళ నేమిచేస్తారో! వీరు, వీరి ఆచారాలు.

శ్యామ : సింగినాదం. చూస్తున్నాముగా ఒకరొకరిమిడుకులు. అమ్మాయీ! అంతా చిదంబర రహస్యం.

కల్యా : (కొంచెము తాళి పూల మొక్కలవంకచూచి) వదినా? ఆపూలొక్కమారు తల్లో పెట్టుకోనా? చూస్తూ యుంటావూ అమ్మ వాండ్లొస్తారేమో!

కల్యా : (లేచివెళ్ళి పూలుకోసుకొనియేడుస్తూ నిలుచుండును)

శ్యామ : (దగ్గరకుపోయి) అమ్మా! ఏడవకూ నీవొక అభాగినివి. నిన్నుచూచి నీతో పాటు యేడ్చేవారమే గాని, నీ రాతతుడిచేవారమా తల్లీ! ఈ మహాప్రవాహానికి కట్టవేసే మహానుభావుడెవడు? (అని పూలు కొప్పున బెట్టును.) మహానుభావుడు చచ్చి యే లోకానున్నాడో, వీరేశలింగం పంతులుగారు. వితంతు శరణాలయాలు పెట్టి ఎన్ని ప్రాణాల్ని నిలిపాడు. ఆయన్ను మట్టుకొక అవస్థ పెట్టి యొక అవస్థపెట్టక విడిచారూ, ఈనరమాంస భక్షకులు ఆంక్షలేనా! వ్యాజ్యాలేనా? వీళ్ళ తాళ్ళుతెగ.

(బుచ్చిరామమ్మ ప్రవేశించును)

బుచ్చి : (పారజూచి) అయ్యో! అయ్యో! అదేమిటే! శ్యామలా నీకేం మతిపోయిందా యేమే. రామ! రామా! మీమామచూస్తే బ్రతుకనిస్తాడా! (అని గబగబ వెళ్లి పూలన్నీ తీసిపారవేయును)

శ్యామ : (తొలగి నిలుచుండి) ఎవరూలేరని అత్తయ్యా తాను ముచ్చటపడుతుంటే...

బుచ్చి : (కోపముతో) ముచ్చటపడుతుందని మొగుణ్ణికూడా తెచ్చే దానివి లాగున్నావే! ఇవేంపనులే? ఎవరన్నా చూస్తే నవ్విపోతారు. మనకొంప కెవరైనా వస్తారటే.

కల్యా : (పూలన్నీయేరి) ఇవిగో నీమొహాన్న పోసుకో. నేను నీళ్ళుపోసి పెంచాలి. మీరు పెట్టుకొని కులకాలికాబోలు.

బుచ్చి : (కౌగిలించుకొనిఓదారుస్తూ) నీకర్మమలా కాలిపోయిందిగాని అమ్మా! కల్యాణీ! నీవికావంటే ఇవన్నీ (అని తీసుకొని వెళ్ళును).

(అవనిక పడును.)

రెండవ రంగము

(ధుమధుమలాడుచు బ్రహ్మశాస్త్రి వసారాలో తిరుగుచుండును)

బ్రహ్మ : వెధవకొంపైపోయింది. వెధవకొంప (భార్యనుద్దేశించి) పొద్దువారి పోయిందే. ఒశేవు. ఆచార్యులవారు నాలుగుమార్లు కబురంపాడు. ఈ ప్రమోదుదెక్కడ చచ్చాడూ? వీడిపెత్తనాలేమో? వీడేమో? స్నానంలేదు సంధ్యలేదు. మాల వెధవల్తోస్నేహం. మైలగుడ్డల్తో యింట్లో జొరబడడం. వీడిమూలాన పావన మైన నా ఆచారం గంగపాలౌతుంది.

(తెరలో)

ఉండండీ! అలాగే కేకవేస్తారు. పనింకా తెమల్లేదూ. గుడికింకా ఎవరు

బ్రహ్మ : ఛీ భ్రష్టముండా! మాలముండా! వాగుతావు మళ్లా (అని పండ్లు గొఱికి) నువ్వే కొంపకు చేటయ్యావు.

(సైకిల్‌తో ప్రమోదుడు ప్రవేశించును)

ప్రమో : ఏమిటినాన్నా! కేకలు

బ్రహ్మ : ఏమిటా ఏవరైంది పూజకు బయల్దేరమని మొత్తుకోవడం. పాడుముండలన్నీ యింట్లోచేరి ఒక్కపని సక్రమంగా సాగనిస్తారుట్రా, వీళ్ళతాడుతెగా!

ప్రమో : (సైకిలుగోడకు జేరవైచి ఒక కుర్చీలో కూర్చుండి) వస్తారులేనాన్నా.

బ్రహ్మ : ఒరేవ్ ప్రమోదా! నీకూ దేవుడూ దయ్యమంటూ ఏమక్ఖర్లే? ఆ మైలబట్టలు విడచి స్నానంచేసిరారా మాకర్మమేమోగాని రామ!రామ! ఎన్నడన్నా కృష్ణా! రామా, గోవిందా! అనుకొంటాడేమో మా అబ్బాయి శ్రవణానందంగా విందా మంటే ఎన్నడూ, వట్టి ఆకతాయివైపోయా వేమిరా?

ప్రమో : (మొగము చిట్లించుకొని) నువ్వనుకొంటున్నావుగా పొద్దుకు పదిసార్లు దేముళ్లూ దయ్యాలూనూ. ఈ దేముళ్ళనుంచే దేశమిలా పాడైపోయింది.

బ్రహ్మ : (ఆశ్చర్యముతో) అయిందే ఇక దేముడేలేదుట్రా! నీ చదువు చట్టుబండలుగానూ అనిపించావే ఆఖరుకు. (అని ముక్కుపై వ్రేలు నుంచుకొనును.)

ప్రమో : ఎవరాదేముడు. ఇప్పుడుమీరు పూజకు బయల్దేరే దేముడేనా? అక్కడ దేముడు లేడూ? మీది పూజకాదు.

బ్రహ్మ : అయితే ఈ పూజంతా వ్యర్థమేనా?

ప్రమో : వ్యర్థమో! కాదో నాకు తెలియదు. నేనుమట్టుకు పూజించను.

బ్రహ్మ : ఓరి మాలవెధవా! మాలవెధవలు, మాలచదువుల్చదివి బొల్లి వేదాంతాలు పెడవాదన్లూ చేస్తూఉంటారు. పాలసముద్రంలో విషంలాగ పుట్టావేమిరా!మా కడుపునా!

ప్రమో : మాలవెధవలు మాలవెధవలంటావే వాళ్ళు మనుష్యులుకారూ! వాళ్లది చదువు కాదనా? నీదే చదువు, నీవేనా మనిషివి? ఒక ప్రక్క సోదర మానవుణ్ణి యేడిపించడం మరోవంక పూజలూ పునస్కారాలునా! ఇంతలో యున్నది. మన విజ్ఞానం.

బ్రహ్మ : (తలయూచుచు) మొత్తానికి గాంధిబోధ బాగా పట్టిందే! చండాలుల్ని నెత్తికెక్కించుకొంటా నంటావేమిరా! వాడెవడో కూశాడనీ.

ప్రమో : మొన్ననా పెండ్లానికి జబ్బొస్తే డాక్టరుకాళ్ళకు నమస్కారం చేశావే! మందులన్నీ

బ్రహ్మ : (ఉలికిపడి) డాక్టరేకులస్తుడూ! నాయుడు కాదూ!

ప్రమో : ఇదీ మన వివేకం, నాయుడుట, అరవమాలవాడు, తెలిసిందా? యింకనైనా?

బ్రహ్మ : (ఆశ్చర్యపడుచు) ఓరి వీడితస్సాగొయ్యా! మాల ముండాకొడుకూ, పిళ్లేగారు పిళ్లే గారంటుంటే... మరి నీవన్నా చెప్పగూడదుట్రా, కొంప ముంచేశావూ. (సైగ చేసి) ఇకనూరుకో, ఎవరన్నా వింటారు. కాబట్టే ఏమో తెలిసినవాడిలాగా అది ఇది పరీక్షచేసి నాలుగొందలూ మ్రింగి రాత్రి పది గంటలకు చస్తుందన్నాడూ, చావనూలేదూ! పాడులేదూ. వీడిమాటనమ్మి నే నవతల మాట కూడయిచ్చా! మాలచదువులంటే మావాడికి కోపమొచ్చింది. ఇంతలో యుంటవి వీరి తెలివి తేటలు. (కొంత యోచించి తలయూచి) మొన్నవెళ్ళాడే డాక్టరు! భేష్! ఎట్లనైన బ్రాహ్మడు, బ్రాహ్మడే! పున్నమ్మగారమ్మాయి చస్తుందంటే, చచ్చితీరింది. (ప్రమోదునితో) ఎట్లాగో ఒహట్లాగు ఆపదగడిచాం.

ప్రమో : ఏమిటి, నాయనా? నాకు తలదిమ్మెక్కిపోతుంది. మీ వ్యవహారాలు చూస్తుంటే అవసరాన్నిబట్టి సర్దుకుపోతుండాలీ? అవసరంతీరినాక నిష్ఠతోనీల్గాలి? కాస్త జ్ఞానంగలవాడికి తెలుస్తుందే మీస్వార్థం (జ్ఞప్తినభినయించి) మరిగాంధియుద్య మాని కనగానే, వేయిన్నూటపదార్లిచ్చి నీపేరుకూడ దేశభక్తుల చిఠాలో వేయించుకొన్నావే అదేమిటి?

బ్రహ్మ : ఆ. ఏదో వేశాం అయిపోయింది. స్వరాజ్యం స్వరాజ్యమని అంతా అంటుంటే ఆశపడ్డా. పుటిక్కిన వస్తుందేమో, నేనొక ప్రక్కయేలవచ్చుగదా అని. స్వరాజ్యం స్వరాజ్యమని గోలపెట్టినముండాకొడుకు మధ్యహరిజనోద్ధరణము, దేవాలయ ప్రవేశమని చొప్పించాడేమిటి, వర్ణసంకరం చేయడానికి.

ప్రమో : స్వరాజ్యమేమో కావాలికాని, దేవాలయాల్లోకి మాత్రం హరిజనులు రాకూడదూ? అప్పుడు వర్ణ సంకరమౌతుంది. ఎంతక్రూరమైందినాన్నా, మన సంఘం! ధర్మమో ధర్మమో అని అఘోరిస్తారుమళ్లా మన ధర్మమిలా తగులడి పోతుంది. ధర్మదేవతకు నాలుగు కాళ్ళని శాస్త్రాలలో రాశారే. ఆపోల్కి మహాకుదిరింది. పశుధర్మంగనుక.

బ్రహ్మ : నువ్వుకూడా ఆరునెల్లు జైలుకెళ్ళి వెలిగించావుగా? మరిమానేశావేం. అంత ధర్మాత్ముడివి.

ప్రమో : నీబోటి మోసగాళ్ళంతా చేరితేనూ! నా ఒళ్లు మండి మానేశా.

బ్రహ్మ : (చురచుర జూచి) మోసగాడివీ! మోసగాడివి. ఆ! ఆ! ఒరే! మాటల్తిన్నగారానీ.

ప్రమో : మునుపాటికి మోసగాడివి; సనాతనంతానూ

బ్రహ్మ : ముష్టివెధవ్వు నువ్వంటే అవుతుంది. ఈసనాతన్లంతాయుండబట్టే, హిందూ మత మింతవఱకు నిలువగలిగింది. నీబోటి పాషండవాదు లెందరు పుట్టి గిట్టలా? పెద్దల్ను దూషించ రాదురా? నీకెంత అహంకారం తలకెక్కినా ఆయుక్షీణమంటారూ ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే, అన్నాడే కృష్ణపరమాత్మ! తాను మళ్లా అవతారమెత్తిందాకనే మీవాగుడు.

ప్రమో : (తిరస్కారంగా) అబ్బో! కృష్ణ పరమాత్మగా దవతరించేది. పాపమా కృష్ణ డేకాలాన్నో తెల్లవార్చుకుపోయి కథావశేషుడయ్యాడుగాని కర్మంజాలక మళ్లా పుట్టడమే నిజమై మీమధ్యనే కాపురం పెట్టేడా సరి మూడో నాటికి వెలివేసి కూచోబెట్టి తీర్తారు. భారత యుద్ధంలో చక్రంపట్టనివాడు చక్రంపట్టి, మీకు పిండిపెట్టేవాడే.

బ్రహ్మ : కృష్ణపరమాత్మనే తిరస్కరిస్తున్నావు. ఒరేవ్ కళ్ళు పోతవిసుమా!

ప్రమో : ఒక్క కృష్ణుడణ్ణేమిటి? రూపరహితుడని, నిరంజనుడని, నిర్వికారుడని, అవాఙ్మానసగోచరుడని ఏవేవో పేళ్ళుపెట్టి మీరు పిలుస్తుంటారే! వాడెవడేకాని, దర్శనమీయలేని, దీనుల నుద్ధరింపలేని, మీ ఆడిన ఆటలకు, పాడిన పాటలకు తలయూస్తూ తాళం వేస్తూంటాడే వాణ్ణినేను ధిక్కరించి తీర్తా. మీ మతములతో నాకు పనిలేదు.

బ్రహ్మ : హరి! హరీ! (అని చెవులు మూసుకొని) ఇక మావన్ని దురాచారాలన్నమాట.

ప్రమో : కాక సదాచారాలా? అదిగో మీ సనాతనులల్లిన మహా మాయా వ్యూహ్యంలో పడి నీకూతురు నా సహోదరి కృంగి, కుమిలి, అసురుసురై దీనాతిదీనయై పోయినది. దాని నుద్ధరించువారేరీ! నందికి నమస్కారము మానవునికి తిరస్కారమా? ఎన్నిమతాలు, ఎన్నికులాలు ఎన్ని శాఖాభేదాలు ఎవరికి వారే యమునాతీరై పగఱకత్తులకాహారమై పోతూఉన్నారు. ఆత్మనాశనమునకు, పరవంచనకు మాత్రమే యక్కరకువచ్చు సంఘముంటే నేమి? పోతేనేమి? నాకు ఒళ్ళు భగ్గున మండుతున్నది.

బ్రహ్మ : (చెవులు మూసుకొని) ఓరి వీడితస్సగొయ్య! పెద్ద లెక్చరు కొట్టాడే! వెధవముండ లకు పెండ్లిండ్లు చేయవలసిందేనా? హరి!హరీ! కొంపకెసరు పోసేవాడయ్యాడే. (ప్రమోదునితో) నీసంఘ సంస్కరణోద్యమ మంతా, ఎవరికో ననుకొన్నా; చివరి కింటమీదనే విఱచుకు పడ్డది! ఒరేవ్! నీవిక నాకొంపలో తగవు; నీదారి నువ్వు చూచుకో. ఈవఱదాక యింత ప్రతిష్ఠగా బ్రతుకుతూ ఉన్నాం.

ప్రమో : నీకన్నముందే నేనూ తయారుగాయున్నా!

ప్రమో : నీవెధవ కొంపలో ఉంటె, పాపంకూడ చుట్టుకుంటుంది.

బ్రహ్మ : గడచి గట్టెక్కావు. ఇక నువ్వనేవాడవు – మేము పడేవాళ్ళము కావద్దు.

ప్రమో : (కోపంతో లేచి) ఈప్రసంగమంతాకట్టిపెట్టి నా ఆస్తి నాకు రాసియ్యి. నేను వెళ్ళిపోతా.

బ్రహ్మ : ఆస్థి లేదూ; పాస్థి లేదూ; వెళ్ళు, పౌరుషంగలవాడవైతే దావావేసుకో పో, నేనివ్వను.

ప్రమో : నీతల్లో పేనిస్తుంది. నీదేందక్కడ.

బ్రహ్మ : మాటలు ముదురుతున్నవి. జాగ్రత విఅగతన్ని పంపుతా.

బ్రహ్మ : ఇక నంతటితో పరువు నిలుపుకో.

బ్రహ్మ : (పంచె పైకెగజెక్కి జందెము సర్దుకుని ప్రమోదునిపైకి దూకి జట్టుపట్టుకొని) ఏమిట్రా! నువ్వుచేసేది? భడవా! పండ్లురాల్తవి. ఆయి, ఆయి, (అని వీపున చరువబోవ)

ప్రమో : (విదలించుకొని) మహాపైకి వస్తున్నావే! ఏదీ, రా! (అని కఱ్ఱకోసమై వెతుకు చుండును).

బ్రహ్మ : (భయపడుచు దూరంగా తొలగి) కపర్దార్! నీ పొగరణుస్తాను. (అంటూ యింట్లోకి వెళ్ళిపోవును.)

(అవనిక పడును)

మూడవ రంగము

(కామశాస్త్రి యిల్లు తాళంవేసియుండును. ఇనుప కడ్డీలకిటికీ యొద్ద కటకటాలు పట్టుకొని రాజ్యలక్ష్మి నిలచియుండును. షోకిలా గిరిరావు సైకిలు ఆనుకొని నిలచి యుండును.)

గిరి : (వారచూపుచూస్తూ, సిగిరెట్టుముట్టించి త్రాగుచు) కామశాస్త్రి గారెక్కడకెళ్లారు?

రాజ్య : కోర్టుకెళ్లారు.

గిరి : బయట తాళము వేశారెందుకు?

రాజ్య : (ఊరకుండును)

గిరి : ఇది చాలా చిత్రంగా ఉన్నదే.

రాజ్య : చిత్రమేమున్నది. వారి సొమ్మువారుదాచుకొన్నారు.

గిరి : వారు మీసొమ్ముకాదా?

రాజ్య : అవును అయితే.

గిరి : ఆ సొమ్ము వీధుల్లో తిరుగుతూ ఉందేమి?

రాజ్య : వారికది చెలామణౌతుంది?

గిరి : నీకు?

రాజ్య : నాకెట్లాఅవుతుంది?

గిరి : ఎందుక్కాదూ.

రాజ్య : సంఘమలా నిర్ణయించింది.

గిరి : సంఘమలా టోపీవేసిందంటే బాగుంటుందేమో?

రాజ్య : ఎవరికి?

గిరి : స్త్రీలకు

రాజ్య : కాదు. స్త్రీలకిది విషమపరీక్ష. ఇందులో గెలిచి పతివ్రత యనిపించుకుంటుంది

గిరి : (వికటంగానవ్వి) ఎందుకా సర్టిఫికేట్! పుణ్యమా, పురుషార్థమా? పాతివ్రత్య సమస్య ఒక నిషావస్తువు అది మీ ఒంట నినికిపోయింది. మీరిక బాగుపడరు.

పిచ్చిదానా! అర్హమైన స్త్రీకి, అర్హమైన పురుషుడు పతి. అట్టి పతిని సేవించుటయే పాతివ్రత్యము.

రాజ్య : అర్హతా నర్హతల కేమిలెండి.

గిరి : నీభర్త నీకర్హుడేనా?

రాజ్య : కాక?

గిరి : కుమ్ము! దుమ్ము!

రాజ్య : అర్హుడు కా దనర్హుడు, తప్పుతుందా?

గిరి : నిమిషంలో (అని చిటిక వేయును) ఈరోజుల్లో పాతివ్రత్యం పాతివ్రత్యమంటా వేమిటి? ఇవన్నీ పెద్దలనాటి సుద్దులు. రతనాల రామచిలుకవు. విహరించ డానికి కెన్నివనాల్లేవు. ఎన్ని సౌధాల్లేవు. పాపం పంజరబద్ధవైపోయావే?

రాజ్య : ఎందుకా వనాలు? అప్రతిష్ఠకా?

గిరి : ఇది ప్రతిష్ఠా?

రాజ్య : కాదూ?

గిరి : నువ్వు వట్టి నిర్భాగ్యురాలివని యువకలోకం కసరి కంటగిస్తూ ఉన్నది. అది అప్రతిష్ఠ కాదా? జ్ఞానదృష్టికి కీర్త్యపకీర్తులు సమానములే. కీర్తికాముడపకీర్తిని, అపకీర్తికాముడు కీర్తిని నిరసిస్తాడు. ఇందులో యేది ప్రమాణము, ఏది సంపాద్యము, ఏది త్యాజ్యము?

రాజ్య : మీ మాటల్లో పుణ్యపాపాలు, ధర్మాధర్మాలు, నీతినియమాలు తుడిచిపెట్టుకు పోతూయున్నవి.

గిరి : నామాటల్లో బోలెడంత ధర్మమున్నది. నీతి ఉంది. ముందు ముందు నీవేగ్రహిస్తావు. నిన్ను చూస్తే నాకు జాలి వేస్తున్నది. నీ మేలుకోరి చెపుతూవున్నా? నేను మోసగాణ్ణిగాను.

రాజ్య : సంసారం పాడుచేసుకోమనడం మోసం గాక మరేమిటి.

గిరి : సుఖములేని సంసారం విడచి, మంచిసంసారం చూచుకోమంటున్నా! ఇది మోసమెట్లౌతుంది. పరోపకారి ఇంత కన్న విశేషమేం బోధిస్తాడు.

రాజ్య : నాకు సుఖమెందుకులేదు?

గిరి : ముసలి మొగుడుగన్క.

రాజ్య : ముసలిమగడుకాడు. పడుచుమగణ్ణి పీక్కుతింటారా? అంతా మనస్సులోనే యున్నది. కోర్కెపట్టుకుంటే నిలుస్తుంది. విడిస్తే పరుగెత్తుతుంది ఇంతే.

గిరి : కోర్కెను కొనసాగించాలిగాని పట్టుకొంటె పాపం.

రాజ్య : మళ్లా పాపమంటున్నారే పాపమేమిటి? పుణ్యమేమిటి? పుణ్యపాపాలు సమానాలనిగదా? మీరిందాక సిద్ధాంతం చేశారూ.

గిరి : (వింతగాచూచి) ఆహా! దెబ్బకు దెబ్బతీర్చుకుంటున్నావే?

రాజ్య : మీరన్నమాటేగా?

గిరి : అయితే నాహితమంతా పరిహాసంగా పరిణమించిందన్నమాట. ఇదే ఆడతెలివి.

రాజ్య : (రూక్షంగా) పరిహాసంకాదు. నిజమే. నేనుచేయ వలసిందేమున్నది.

గిరి : ఏమున్నది! నీకు తెలియదూ? మగడే.

రాజ్య : ఎవడామగడు? నీవేనా? (చీదరించుకొనుచు) ఛీ!ఛీ!పో! నీకు బుద్ధిలేదు. ఈ హితబోధలన్నీ నీచెల్లెంద్రతో అక్కల్తో చెప్పుకోవెళ్ళి. పాపం కుఱ్ఱవాడూ కడుపులో ఊహల్లాలాడున్నవే. ఏం ప్రసంగిస్తాడో చూతామని ఊకొద్దూవుంటే, ఆహా!

బజారుదాన్ననుకొన్నావా? సంసారిననుకొన్నావా? అంతటితో వెళ్ళు, నీచెమ్డా లొలిపిస్తా; జాగ్రత్తవెళ్ళువెళ్ళు. మాఆయనవచ్చేవేళైంది. పరువు నిలుపుకో.

గిరి : (భయపడి తనలో) నేనెక్కడా మంచికిపోతే చెడుగు ఎదురుగా వస్తుంది (రాజ్యంతో) కేకలు వేయకు తెలియకన్నాను (అనినడుస్తూ) మీవారువస్తే డాక్టరుగారు రమ్మన్నారని చెప్పండి.

రాజ్య : ఏమో నువ్వు చెప్పుకో గాడిద. పెద్దమనిషిలాగా వచ్చి... ...

(కామశాస్త్రి దూరం నుండి చూచి నిర్ఘాంతపడి నోరుకొట్టుకుంటూ గిరిరావు కెదురునడచి)

కామ : ఎవరికోసం?

గిరి : (జంకుతూ హీనస్వరమున) ఆ. డాక్టరుగారొచ్చారేమో అని... ... ...

కామ : ఆడవాళ్ళతో నీకేంపని?

గిరి : మీరున్నారేమో అని అడిగినానులెండి?

కామ : (ఏమేమో గొణిగి కోపం తెచ్చుకొని మీదికి వెళ్ళుచు) ఈ వీధిలో నీకేంపని?

గిరి : (కొంచెము నిబ్బరించి పరుషంగా) ఏం రాకూడదా? వీధి కొనేశావేం?

కామ : మళ్లామాట్లాడ్తావు! బడవా? నోరుముయ్యి, తన్నిస్తా?

గిరి : నీకేమన్నా మతిపోయిందా ఏమయ్యా! అన్యాయంగా తిడ్తావ్.

కామ : నీకు పోయింది. ఒళ్ళుకొవ్విన పనుల్చేస్తున్నావు. మెడకాయ విరిచేస్తాన్. చూడునాదెబ్బ (అని మీసాలు దువ్వుచు పైకి పోవును.)

గిరి : కోపం తెచ్చుకొని, నీకు ఒళ్ళు సిమసిమలాడ్తూ ఉన్నట్లున్నది.

కామ : ఆట్టే వాగావంటే పూడ్చిపెట్టిస్తా.

గిరి : పో పో! అంతటితో పో. ఊరుకొంటున్నానని దూకుతున్నావే!

కామ : ఏమిచేస్తావురా, వెధవ రా. పేగుల్తీసేస్తాన్. (అని నెట్టును)

గిరి : ఆ, ఆ. ఏమిటి? (అని జుట్టుపట్టుకొని క్రిందపడవేసి వీపున గ్రుద్దును.)

కామ : ఏమేవ్. ఓశేవ్, బయటికిరావూ వీడుచూడూ.

గిరి : (గ్రుద్దును)

కామ : చావు గాడిదకొడకా?

కామ : చావు గాడిదకొడకా?

గిరి : (విడిపించి జారుకొనుచుండును)

కామ : (లేచి దుమ్ము దులుపుకొంటూ గిరినిచూస్తూ, ఇంటి వంక నడుస్తూ) మొనగాణ్ణనుకొన్నాడు. ఆయ్ గ్రుడ్లుతోడేస్తాను కపర్దార్! (భార్యనుద్దేశించి) దీంతస్సగొయ్యా, దీని పనిపట్టాలి. (నిష్క్రమించును).

# చతుర్థాంకము

## మొదటి రంగము

(కల్యాణి పెరటిబావివద్ద నీళ్లు చేదుకొనుచుండును. కిశోరుఁడు ప్రవేశించును)

కిశో : (నవ్వుచు) నీళ్ళు నేను చేదిపెట్టనా?

కల్యా : అవసరము లేదులెండి! మాచేత నౌను.

కిశో : కోపమా?

కల్యా : కవు లబద్ధమాడరు గాబోలు?

కిశో : అవసరాన్నిబట్టి ఆడవచ్చునని అధార్టీలున్నవి. "వారిజాక్షులందు వైవాహికము లందు" వినలేదా యెప్పుడు. అందులో మొదటి మెట్టు మీరే.

కల్యా : అవీ, మీరు రాసుకొన్నవేగా!

కిశో : మీరంటే

కల్యా : కవులు

కిశో : కవులకు ప్రధానపరికరాలు మీరు. ఆడుది లేక కవిలేదు, కవిలేక ఆడుది లేదు. కవికి స్త్రీకి అవినాభావ సంబంధం తెలుసునా?

కల్యా : అబ్బ! ఏంమాటల్నేర్చారండీ! ఎందుకూ? ఆడుది ఏడవనా. మీరు పొగడ్డానికేం.

కిశో : కల్యాణీ! సౌందర్యా న్నుపాసించేవాడు కవి. ఆ సౌందర్యాని కాశ్రయంస్త్రీ. అట్లానే కవిత్వానికి నీఅలాంటి దానివి నీవు. నీవు లేక నేనూ లేను నా కవిత్వమూ లేదు. నీవు నేను ఒహటి. అర్థమైందా?

కల్యా : (నవ్వుచూ) ఆహా! తేల్చారే చివరికి?

కిశో : తేల్చేదేమున్నది. ఇది ముమ్మాటికి సత్యం.

కల్యా : సత్యం పేరెత్తకండి. సత్యానికి మీకుచాలాయెడం.

కిశో : అదెట్లా వీలవుతుంది. సౌందర్యమే స్త్రీ, స్త్రీయే సౌందర్యమన్నానా? ఆ స్త్రీకి కవికి అవినాభావసంబంధ మన్నానా? అప్పుడు కవి-కాంత ఒకటౌతా రన్నానా? కాబట్టి కవికూడా సౌందర్యమవుతాడు, "Truth is Beauty, Beauty is truth" అన్నాడు టెనిసన్. ఇక సత్యం కవికి దూరమెట్లౌతుంది.

కల్యా : అబ్బా! ఏమి తప్పుకొంటారండి. మొన్న బావిదగ్గఱ కలుస్తానని చేతిలో చేయి వేసి పోయివచ్చారూ.

కిశో : అందులో ఒక రహస్యముంది. వృద్ధిపొందుతూయున్న మన ప్రేమకున్నదే. మాధుర్యం రావాలంటే మధ్య ఒక రోజైనా ఒక పూటైనా యెడముండాలి. అతి సర్వత్ర వర్జయేత్తన్నాడు.

కల్యా : ఏమి మాటల్లెండి. అందుకే మీ కవుల్తో వేగలేమంటారు. మగవారెన్నైన చెబుతారు. అందులో కవులంటే ఇహ చెప్పాలీ.

కిశో : నీవొహ కవయిత్రివి కారాదూ?

కల్యా : అది మీరే చేయాలి.

కిశో : చేయడమేమున్నది. కవి కావ్యాల్తో లోకాన్నెలా ముగ్ధం చేస్తున్నాడో, నీవు కూడ సహజలావణ్య సుందర మూర్తితో లోకాన్నలా ముగ్ధం చేస్తున్నావు. పుట్టుకతోనే నీచూపుల్లో ఎన్ని భావకావ్యాలు లేవు? అడుక్కొక ఉత్పలమాల, నీనడక్కొక మత్తేభం, ముక్కుకో చంపకం; ఆహా! నీవొక ఛందశ్శాస్త్రినివి. నీవొక సజీవ కావ్యానివి. పుష్పవనానివి. నీలోలేని దేదీ? కల్యాణీ! నాదృష్టికే ప్రపంచమంతా నీలోనే కనపడుతుంది. నీముందు కవులే వెఱ్ఱెత్తి తిరుగుతుంటే, ఇక నీకు కవిత్వమెందుకు? నీ సాంగత్యం చేత నా కవిత్వానికి మెఱుక్కూడా వచ్చింది. నీతోడు నమ్మునామాట.

కల్యా : అయితే! నేను ధన్యురాల్నన్నమాట?

కిశో : ముమ్మాటికి.

కల్యా : (విచారముతో) ఎందుకీ పాడుచక్కదనం, అడవిగాచిన వెన్నెల.

కిశో : కాయవలసిన చోటనే కాస్తున్నది. కల్యాణీ! నీమగడు చావడమే నీకు మేలయింది. లేకుంటే ముసలివనములో కాసేదేగా యీ వెన్నెలంతా?

కల్యా : ఆ నువ్వు నాకు శాశ్వతమా?

కిశో : ఎందుకు కాదు?

కిశో : నీకు దొంగ బ్రతుకుగా నున్నదేమోగాని, నాకుమట్టుకు దొరబ్రతుకుగానే యున్నది. నేను గడిపే ప్రతినిమిష మమృత భాజనము; తినే దమృతము; త్రాగేదమృతము. ప్రపంచమంతా ఆనందమయం. నీవల్ల నేను మధురజీవినయ్యా. కల్యాణీ! ఒక్కొక్క మాఱున్నదే ఱెక్కలు కట్టుకొని నీమీద వాలాలనిపిస్తుంది.

కల్యా : (స్మృతి నభినయించి) అవునుగానండీ! ఆ కవి అల్లారాశాడు, ఈకవి ఇల్లా రాశాడనడమేకాని ఒక్కమారైనా మీపద్యాలు వినిపించరు. నేను వినదగనా?

కిశో : పద్యాలువినిపించేంత సమయమేది?

కల్యా : ఏదేదీ? ఒక్కటి మెల్లగా చదవండీ మా అమ్మవాళ్లు గుడికి వెళ్లారులెండి ఇంతలో రారు.

కిశో : (ఒక కాగితము తీసి) ఇవిగో నిన్ననే రాశా!

కల్యా : ఎవరిమీదా?

కిశో : నాకింకెవరిమీద రాయడానికి వస్తుందీ? నీమీదనే.

ఉ. పాలకులై ప్రపంచ విభవంబునుజుఱ్ఱిన గొప్పవారి, గో
రీలవిగో శ్మశానమునఁ బ్రేయసి వారి ప్రశంసలెల్ల ని
ర్మూలములయ్యె, బొందివిడిపోవక ముందు సుఖించువారిదే
మేలనుకొందు గాలము గమింతమురమ్ము కవుంగలింతలన్

చం. హృదయము శాంతిలేని బ్రతుకెందులకూరట జెందుమంచు బ
ల్కుదు రపవర్గవాదులు, తలోదరి! లాభముగానరాదు, నీ
పెదవులనుండి చిందిపడు పిన్ననినవ్వును తేనెమాటలో
మెదిపిన భుక్తిపాత్రను సమీపము సేయుము కోడిగూసెడిన్.

కల్యా : పద్యాలెల్లాయున్నయో కాని మనబోటివాండ్లకు పనికి వస్తవని మాత్రమర్థమైంది. మీరు చదవడం మాత్రం బాగాయున్నది.

కిశో : బాగున్నదంటే! శృతా! ఏమన్నానా!

కల్యా : మా అన్నయ్యతో మా యింటికి రారాదుటండీ! ఒకరోజు హార్మనీమీద బాగా చదువుదురుగానీ! ఈ పద్యాలు మాత్రం చదువకండి. మానాన్న కసలుగిట్టవు.

కిశో : ఇప్పటి కావ్యాలున్నవే మీనాన్నగారికి గిట్టవంటే ఇవి వెనుకటి వారివంటి పిచ్చి రాతలు కావు. అసలు వాళ్ళు మాచుట్టూ బలాదూరు.

కిశో : (నవ్వుచు) అదీ! నా అదృష్టమే నన్నుతప్ప నీవెవరిని ఎఱుక్కుండా ఉండాలనేగా నాకోరిక.

కల్యా : (యోచించి) ఏమీ ఎఱుగనంటే! ఈయర్థంతీశారూ బలేబాగున్నది మీతోను.

కిశో : అంటే కోప్పడకు కల్యాణీ! నీసౌందర్య కావ్యాల్లో నాకు నానార్థములు, సర్వాలంకారాలూ గోచరిస్తుయుంటవి. నానిస్సార జీవనలోకంలో నీవొక ఆనందకు సుమవృష్టివి. ఆబ్రహ్మ నీకుచితమైన కల్యాణీ! నామమే కూర్చాడు.

కల్యా : ఆ! నా కల్యాణం కాటికిపోయింది. ప్రపంచానికి నేనొక ముచ్చిబొమ్మను, వంటింటియంత్రాన్ని (కన్నీరు పెట్టి) ఈపాటి రూపంకూడా లేకుండ చేయాలని ఇంటికి వచ్చిన ప్రతివ్యక్తి నా వెంట్రుకలు చూచి కళ్ళల్లో కారం పోసుకొనిపోతూయుంటాడు. నా పాలిటదేవుడై మా అన్నయ్య అప్పుడిప్పుడని సమాధానాలు చెప్పి పంపుతూ ఉంటాడు. (కొంతతాళి) ఆనాడు నీకుగూడ నే నసహ్యమౌతాగాబోలు.

కిశో : పిచ్చిదానా! రూపాన్ని ప్రేమించేవాడు కాముడు. పవిత్రప్రణయకామి రసికుడనబడతాడు, సౌందర్యము క్షణక్షణము వాడు వాఱుతూ ఉంటుంది. దానికి చ్యుతి కలదు, గాని ప్రణయానికి లేదు. అది వృద్ధిబొంది బ్రహ్మాండాన్ని మ్రింగుతుంది. దాన్ని కొలిచేవాడేడి? దాని గర్భమున మహాపదార్థములు, త్రిలోకాలు నల్లపూసలైపోతవి ఆ ప్రణయభిక్షకే నా కవితావీణ మ్రోయించడము. "గతించిన తెప్పపాటులో ఇప్పటి నీ విలాసమొకియించుక లేతగదా వయస్సునన్" అన్నాడు వుమరుఖయాము విడిచి పోవలేక.

తే.గీ. ప్రేయసీ! నీ విముగ్ధగంభీర భావ
గుంభితారంభ వీక్షణాంకుర శరంబు
మొనమొదలు గాగ ఆపుంఖముగ నెడంద
గ్రుచ్చుకొనిపోయె, వెడలించుకొనుట సున్న

కల్యా : నాకేమీ అర్థం కాలేదు. చివరికి సున్నాపెట్టారేమిటి. స్నేహానికిక్కాదు గదా?

కిశో : ఆరంభంలో నీ వాడిచూపు బాణమై నాహృదయములో దిగిపోయింది. అది యూడి రావడం వట్టిదని దీని భావం.

కల్యా : చూస్తే పద్యం, నడిస్తేపద్యం, పలికితేపద్యం. మా బ్రతుకంతా పద్యమేనా. ఆడవాళ్లనిల్లా బజారు చేస్తున్నందుకు మీమీద దావా వేయవచ్చు ననుకుంటా.

కిశో : దానికిశిక్ష మీదాస్య మౌతుందేమో?

కల్యా : (నవ్వి) మీరూ? ఎల్లకాల మాసౌందర్య వర్ణన్లే రాయకపోతే స్త్రీస్వాతంత్ర్య మని ఒక్కనాటకంరాయరాదూ. వీళ్ళకు బుద్ధివస్తుందేమో?

కిశో : రాతల్తో సంఘసంస్కరణ జరుగుతుందనుకొన్నావూ వట్టిది, బాగుపడ్డానికెన్ని గ్రంథాల్లేవు, చదివితే. దానికి కాలమే దివ్యౌషధము.

కల్యా : అందాక మాగతి యింతే?

కిశో : మన హయాములో సంస్కరణ కలగక పోవడమూ ఒక విధంగా లాభమే అయినది.

కల్యా : ఏమిలాభమేం?

కిశో : నీవునాకు దక్కడమే?

కల్యా : (విసుగుకొని) మాగోల మాది.

కిశో : నాయుద్దేశం మంచిదంటావా కాదంటావా?

కల్యా : స్వేచ్ఛగా పెండ్లాడక పోయామూ?

కిశో : ఇది పెండ్లికాదూ!

కల్యా : (సిగ్గుతో) ఊ, ఊరుకొండి.

కిశో : స్త్రీ పురుషుల ప్రణయమాధుర్యానికి వివాహమొక విచ్ఛిత్తి. దానిలో స్వేచ్ఛలేదు. కోరికలీరికలెత్తవు. వారు ఱెక్కల్లేని పిట్టలు.

కల్యా : మీమాటలు నాకు ఇప్పుడు వింతగానున్నవి.

కిశో : ఈ చెలిమికి మేరయేదీ? ప్రేమపుష్ప మందులో అనుక్షణము మొగ్గవేయును. నా హృదయానికి నీవు రాణివి. నీసన్నిధి నేనొక చక్రవర్తిని.

కల్యా : ప్రపంచ మామోదించవద్దుటండీ?

కిశో : లోకముగ్రుడ్డిది, కుంటిది. దానికి వేయి నాలుకలు, వేయినోళ్ళు, నీతిలేదు, నియమములేదు. నేడు తూర్పుగా రేపుత్తరంగా నది పరుగులెత్తుతుంది. దానికి హృదయము లేదు. ముసలిగడియారము, నా ఆమోదానికి నా ఆత్మ సానఱాయి. అది నీలో నిలిచిపోయినది. తుడిచివేయుట కెవరితరము.

(తెరలో)

ఒశేవ్ కల్యాణీ! పెరట్లోనే చచ్చావుటే. ఇంకా నీనీళ్ళు నాశనంగానూ రావేమే!

కల్యా : (ఉలికిపడి) అదిగో! మానాయనమ్మ కేకవేస్తున్నది. దీనిపోరు పడలేకపోతూ

కిశో : నీకు బాడీగార్డన్నమాట.

కల్యా : అంటే

కిశో : కాపలాబంట్రౌతు

కల్యా : బాగా చెప్పారు. (అని బిందెఎత్తుకొనలేమి నభినయించి) కాస్త బిందె ఎత్తుతారూ?

కిశో : (బిందెఎత్తి ముద్దుపెట్టుకొనును)

కల్యా : (నీళ్లుచల్లును) నిష్క్రమించును.

రెండవ రంగము

(బ్రహ్మశాస్త్రిగారు, రామచయన్లు ఇంటిముందు అరుగులమీద కూర్చుండి యుందురు)

రామ : పాపం! కామశాస్త్రిగారి అల్లుడికి కాళ్ళు వాపు చూపినవట.

బ్రహ్మ : (ఆతురతతో) ఏమిటి! మొన్నపెండ్లైన

రామ : ఆ. ఆ. పాటుబోయినవాడు లెండి. పుట్టినబిడ్డ ఎక్కడ సమర్తాడ్తుందో అని తెచ్చికట్టాడు.

బ్రహ్మ : ఏమటీ! చెప్పరూ!

రామ : మూలిగే నక్క తలమీద తాటికాయ పడ్డదని ఇందులో కేసులు, కోర్టులకు తిరగడం, నానాక్షోభగా యున్నదిలెండి.

బ్రహ్మ : కేసేమిటి?

రామ : ఎవడోగిట్టనివాడు, శారదాఆక్టుక్రింద అర్జీపెట్టాట్ట.

బ్రహ్మ : మన బ్రాహ్మలే ననుకొంటా?

రామ : కామశాస్త్రి వట్టి దుర్మార్గుడులెండి, విరోధుల కేం బోలెడుమంది.

బ్రహ్మ : దుర్మార్గుడూ? పెద్దమనిషనే నా ఊహ.

రామ : వాడు కాల్చిన కొంపలెన్ని

బ్రహ్మ : నాకీ గొడవలన్నీ పట్టవండీ! నేనేమో! నా కొంపేమో.

రామ : నేనెఱుగనూ! మీ యోగ్యత చిరకాలం నుండి మీ వంశం సదాచారాలకు నిలయం. మీతండ్రిగారు బ్రహ్మయజ్ఞంచేసిన రోజుల్లో నేను స్వయంగా చూచాను. వారి ఔదార్యం. వారి యోగ్యత. వారి విగ్రహపుష్టి! సాక్షాద్బ్రహ్మ

తేజస్సు ఆ మొగాన తాండవిస్తూఉండేది.

(స్మృతి నభయినయించి) అడుగమఱచా! మన కల్యాణికి వెంట్రుకలెప్పుడు తీయించాలనుకొంటున్నారు.

బ్రహ్మ : నాదేమిలేదు! మావాడిదే!

రామ : వద్దంటాడా?

బ్రహ్మ : వద్దంటేమానేస్తామా; చదివించింది. తెల్లచదువు కాదుటండీ!

రామ : వీళ్లతోనేమి గానండీ! రోజులు మంచివికావు. త్వరగా ఆ ముత్తెమంతా పని కానియ్యండి. నిందలు, నిష్ఠురాలూను! మళ్లా.

బ్రహ్మ : ఈమధ్య నాభాగం నాకు రాసియ్యమని కాస్త తోకాడించాడు లెండి. అది అటో ఇటో తేల్చి తరువాత,

రామ : అంతవాడయ్యాడూ!

బ్రహ్మ : కాల మలా ఏడుస్తున్నది. ఎంతవాడన్నా అవుతాడు.

రామ : (తలయూచి) ఆ. హా! సంఘసంస్కరణవాదికదూ! తెలిసింది. ఆమాత్రం లేకపోతే ఎట్లా! ఒకమారు మా యింటికి వచ్చి అదీ, ఇదీ, మాట్లాడుతూ చల్లంగా సంస్కరణమంటూ సాగించాడు. ఉపన్యాసం కాస్త సాగనిచ్చి ఆపాళంగా లంకించుకొని శాస్త్రవాదన్లోకిదింపి, ఎడాపెడా నాలుగు పెట్లుపెట్టా. వీరి తెలివితేటలు మాముందరసాగుతవటండీ. హనుమంతుడి ముందు కుప్పిగంతులనీ! దాన్తో గుక్కతిప్పుకోలేక బయటపడ్డాడు.

బ్రహ్మ : (సంతోషపడుచు) అయిందీ! అంతపని, అదీ!

రామ : కాకపోతే! శంకరభాష్యంలో ఈ కుక్కకాట్లకు చెప్పుదెబ్బలు బోలెడన్ని.

బ్రహ్మ : (సమ్మతిజూపుచు) మీ పాండిత్యం అబ్బో! జగద్విఖ్యాతం. అలాంటి పరాభవాలు జరగాలండి. వీడికితోడు ఎవడో కిశోరుఁడట శూద్రముండా కొడుకు. ముంగలిజుట్టు వాడు, వాడివాలకం, నా కరికాలిమంట నెత్తికెక్కుతుంది. కవిట, కవి. (అని చిరాకుపడును)

రామ : ఆ, ఆ కిశోరుడి విషయమే చెప్పొచ్చా! వాడు నాతో మొన్నమాట్లాడ్తూ పూర్వం కవులేలేరు. నేనొక్కణ్ణే స్వర్గం నుంచి ఊడిపడ్డానంటూ నీల్గాడు. వాడికెంత గర్వమో చూచారు, వట్టి బడాయికోరు, కోతర్లాయుడు వాడి ప్రవర్తనమే మీబాగు లేదంటారు. మీ గుమ్మం లోకి రానియ్యకండీ.

బ్రహ్మ : ఏదీ! నేనుండగా ఎన్నడూ రాలేదు. మావాడు మీవాడు ఎక్కణ్ణోక్లబ్బులో అఘోరిస్తారట.

రామ : మావాడితో చెప్పా! ఈవారమంతా ఇల్లు కదలనీయకుండా కాదంబరి వల్లె వేయిస్తూయున్నా.

బ్రహ్మ : మంచిపనిచేశారు. మావెధవకు మీచేత వేదమన్నా చెప్పించాను గాను.

రామ : తెల్లకూతల రుచి మఱిగినవాడి కున్నదే అండీ, సంస్కృతాంధ్ర భాషలంటే కన్నుకుట్టుతుంది. ఇంగ్లీషు బళ్ళల్లో పండితులకు స్థానమెక్కడిది? బంట్రోతుకు తగ్గకుండా, డ్రిల్లు మాష్టరుకు మించకుండ గిరిగీచిపెట్టారు.

బ్రహ్మ : ఆ, వీళ్ళమొహం, వీళ్ళెంతేడిచినా, పండితుడి కీర్తి వీళ్ళకు వస్తుందటండీ, పాండిత్యానికి విలువేమిటి శబ్దశాసనుడు. అతని కదుపాజ్ఞ లెక్కడిది.

శ్లో॥ అధిగత పరమార్థాన్ పండితాన్ మౌవమం స్థా
స్తృణమివ లఘు లక్ష్మీర్నైవతాన్ సంరుణద్ధి
అభినవ మదరేఖా శ్యామగండ స్థలానాం
నభవతిబిసతంతుర్వారణం వారణానామ్

అని భర్తృహరంత వా దభినందించాడు.

రామ : చిత్తం. ఆ మహాత్ముడు రాయని విషయమేమున్నది.

బ్రహ్మ : రామచయన్లవారూ! మనశాస్త్రాల్లో ఎంతెంత విషయమున్నదండీ, కుంకలకు తెలియదుగానీ?

రామ : (భక్తి నభినయించి) అయ్యో! అట్లంటారేమిటి? ఈ వాయు విమానాలు. ఈయంత్ర సామాగ్రి, మెఱపు దీపాలు ఒకటేమిటి. ఇప్పుడు మనంచూచే విచిత్రాలన్నీ పూర్వముండేవి సుమండీ? ఆవాఙ్మయమంతా జర్మనీవాళ్ళకు చిక్కిందట, ఆవెధవలకు మనవాండ్లు పెట్టిందే ఈ భిక్ష.

బ్రహ్మ : సంస్కృతం వాళ్ళ కేలాగొచ్చిందండీ?

రామ : అహో! మహాపండితులైపోయారు,

బ్రహ్మ : (వింతపడుచు) హాయి! హాయ్! ఇదంతా రాసి పెట్టారూ ఋషులు శాస్త్రాల్లో.

రామ : ఒకసారి పూర్వం ఆంజనేయస్వామివారు సీతాన్వేషణార్థమై సువేలాద్రి నెక్కి ఒక్కమారు వాలచాలనంచేశారట. ఆవేగానికి ముల్లోకాలాకులములైపోయినవట. ఆకుదు పిప్పటికి అక్కడక్కడ కనపడుతూ యుంటుందిగా పేపర్లలో

బ్రహ్మ : (ముక్కున వ్రేలునిల్పి) మహానుభావుడు సుమండీ! స్వామివారు.

రామ : ఏమిటలా సెలవిస్తారు. అఖండ కవీశ్వరుడు గదూ నవవ్యాకరణ పండితుడు.

బ్రహ్మ : ఈవెధవలంతా! భూగర్భ శాస్త్రజ్ఞులమని తెగ నీల్గుతారూ ఇదా రహస్యం.

రామ : వీళ్ళ పిండాకూడు.

బ్రహ్మ : అయితే మన ప్రాంతాలక్కూడా యీ కుదుపు వస్తుందంటారూ.

రామ : (అసమ్మతితో చేయి యూచుచు) రాదు. రాదు. క్వెట్టా అంటే అక్కడ రామాలయమా? ఆంజనేయాలయమా? మ్లేచ్ఛరాజ్యం, విన్నారూ పూర్వం గరుత్మంతుడు తల్లి దాస్యాన్నీగడానికి అమృత హరణార్థమై వెళ్ళవలసి వచ్చిందట. అప్పుడా మహానుభావుడికి ఆకలైందట. కశ్యపబ్రహ్మ యున్నాడే కుమారుని కరుణించి నాయనా సముద్రాల్లో నిషాదులున్నారు. వారి నాహరించి వెళ్ళమంటూ, అందులో బ్రాహ్మడున్నాడు అతన్నిమట్టుకు ముట్టుకోవద్దని శాసించాట్ట చూచారూ! ఏకష్టాలు వచ్చినా మ్లేచ్ఛముండా కొడుకులకే సుమండీ!

బ్రహ్మ : అది, అదీ? బ్రహ్మానందమైంది.

రామ : (లేచి వెళ్లుచూ) నేనికవస్తా! అమ్మాయికి శీఘ్రుంగా వపనం... ...

బ్రహ్మ : ఆ, ఆ (నమస్కరించును) (నిష్క్రమించును)

## మూడవ రంగము

(కల్యాణి పసిబిడ్డను పొత్తుల్లో నుంచుకొని శ్యామలతో ప్రవేశించును)

కల్యా : (పొత్తులలోని బిడ్డను చూస్తూ కన్నీటితో) వదినా! నాకొడుకును ప్రాణాలతో పారవేస్తావా! వదినా! ఏడుస్తున్నాడు. వదినా! ఏడవడానిక్కూడా హక్కులేదు కదూ? వదినా నా తండ్రికి అబ్బో! ఈచేతుల్తో అద్వానాన (అని వణుకు చుండును)

శ్యామ : (కల్యాణిని కౌగిటపట్టుకొని) ఏడవకు.

(పిల్లవానినిచూచి) నాయనా! ఈ చక్కదన మడవిపాలు చేసుకుంటున్నాము. బ్రతుకనిబిడ్డ బారెడని, ఈశ్వరుడు నీకెంత చక్కదన మిచ్చాడురా! తండ్రీ!

కల్యా : వదినా! లోకంలో పుట్టే పిల్లల్లాంటివాడు కాడూ? నాకొడుకు? నాబాబుల్ని రక్షించేవారే లేరూ వదినా! నాకడుపులో కత్తులు దూసుకొని పోతూయున్నవి. ఫిరంగులు ప్రేల్తున్నవి.

శ్యామ : అమ్మా! నీవు పుత్రప్రేమచేత మన రహస్యం మఱచిపోతున్నావు. పిల్లవానికి

వచ్చిన పరవాలేదు. ఏ తల్లైనా! నా భాగ్యమా అంటూ పెంచుకొంటుంది. అమ్మా! ఏడవకు.

కల్యా : నిజమా! వదినా! నిజమా. నాకొడుక్కు బ్రతికే రాత యున్నదంటావూ వదినా! ఈ రాళ్ళమీద నావెన్నముద్ద నుంచుతావూ?

శ్యామ : (పిల్లవానిని బలవంతంగా యెత్తికొని) ఏడవకు! నాయనా! ఏడువకు.

శా. ఊరుం బేరును లేక యే గగనమందో లీనమైయున్న ఆ
త్మారాము న్నినురక్తమాంసయుత కుంభంబందు బంధించి ని
స్సారంబైన మనుష్య మండల నివాసప్రాప్తి కల్పించి నా
దేరాజో! అతడే సమర్థుడగునోయీ ముక్తి నీకీయగన్

ఆ భగవంతుడు మాకన్నా నీయకూడదా నీలాంటి కొడుకును. సంసారము చేస్తున్న మాకులేని సంతానం కల్యాణీ! నీకిచ్చి యపవాదు మోయించి, అడవి కర్పిస్తూ ఎంత చుప్పనాతితనం చూపించాడే! అమ్మా!

కల్యా : వదినా! నాకొడుకును విడిచి నన్నొక్కదాన్నే తీసుకుపోతావు గాబోలు. ఆ.ఆ! నేనురాను. నా చిట్టి తండ్రితో వుంటా. మా నాన్నను విడువను. చంపు చంపి (స్మృతినభినయించి) ఎన్నడూ మొగుడిమొగమెఱుగని వెంకటేశ్వర్లుగారి కోడలు కొడుకును గంటే! బ్రహ్మాండమైన యుత్సవాలూ, ముద్దులు, ముచ్చట్లు, గంతులు, గల్లంతులూ! వదినా! నా కొడుక్కూ మూతి విఱుపులు, ముక్కు విఱుపులా వదినా! నీక్కూడ! నీక్కూడ నాతండ్రిమీద ద్వేషమే! ద్వేషమే. మా అన్నయ్యా, మానాన్న ముద్దులాడ దగడూ? తగడూ?

శ్యామ : కల్యాణీ! పుత్రపేమచేత నీవేమేమో అంటున్నావు. అప్రతిష్ఠ కేడుస్తున్నాముగాని అమ్మా! ఎంత సంతోషించేవాళ్లమో! అమ్మా! ఇక నీవు కాస్తగుండె నిబ్బరం చేసుకోవాలె, తెల్లవారవస్తుంది.

కల్యా : నేనొక్కదాన్నే! అమ్మబాబో! ఒంటరిగానాతండ్రికి పాలో, ఎవరిస్తారూ. మిణుకు మిణుకుమను నాచిట్టితండ్రి ప్రాణం యే కౄరజంతు గర్భాన మలగిపోతుందో వదినా (వికారంగా మిన్ను చూస్తూ) అమ్మయ్యో! అదిగో రాక్షస సంఘం నాకడుపుచిచ్చుమీద పండ్లునూర్తు యున్నది. (ఱొమ్ము కొట్టుకొని) అయ్యో! వేయినోళ్లతో, వేయినాల్కలతో వదినా! ఘోరము! ఘోరము! యీ సంఘానికి నాశనం రాదూ; ఎప్పుడు, ఎప్పుడు; ఇంకెప్పుడు (తాళి) రానీ! రానీ! పాషాణహృదయులు, స్వార్థపరులు (భయ పడుచు వెనుకకు నడచి) అదిగో! నాస్వర్గాన్ని నా ముక్తిని, ఈపుట్టుపేదను, నా తెఱచాటు కొడుకును, కరకర

నమలి చప్పరించు రాక్షససంఘం, అదిగో! ఆ యుక్కురథాన్ని వాయువేగాన దొర్లించుచున్నారు. పసిబిడ్డల ప్రాణాలారతులు. వితంతువుల గుండెలు గుగ్గిలాలు. ఒహో! (కన్నులు మూసికొని) ఆదృశ్యం కన్నులూడిపోతూఉన్నవి.

(అవనిక పడును)

సమాప్తము.

# భూమిక

శ్రీ సుబాసుబోసు చరిత్ర మద్భుతమైనది. అతని అజ్ఞాత పలాయనముతో నాసేతు హిమాచల మాశ్చర్య చకిత నేత్రమైనది. ఒక భరతదేశమే కాదు-ఖండాంతరములు, కన్ను దెరచినవి. బోసు మహా త్యాగి. అతని త్యాగముతో దేశమతనికి ఋణపడ్డది. గగన మగ్నివర్షములు కురియు కాలాన, మన కతడాతపత్రమై నిలిచి ఆదరించినాఁడు. నేఁడు మనము చూఱలాడు స్వేచ్ఛా స్వర్ణ రాజ్యమునకు సుబాసుబాబు రత్నస్తంభమై నిలిచినాఁడు, అతఁ డభినయించినది మహోత్తమపాత్ర, నేఁడత డవని కాభ్యంతరమున నున్నాఁడు. బోసు శాశ్వతుఁడు, ఆ మహనీయునకు- కావ్య నమస్కారము చేయక నాచేతు లూరకొనకపోయినవి. పరమపదించిన నా తండ్రిగారికి యీ కావ్యము నంకితము చేయుచున్నాను. వీర గాథాకర్ణన కుతూహల స్వాంతులయిన మా నాయనగారి యాత్మకీ కావ్యము శాంతి సమకూర్చుగాక.

జి. జాషువ

# అంజలి

సీ. పాలిత ప్రజల ప్రాణాలు పన్నిదములుగా నధిపతుల్ జూదంబు లాడువేళ
ప్రళయ సంగ్రామదేవత మింటి కెగబ్రాకి చిచ్చర పిడుగులు జిమ్మువేళ
పేరైన బ్రిటిషు నౌకా రాణివాసంబు ముక్కలై మున్నీట మునుఁగువేళ
అఖిల జాతీయ నాయకకోటి గుజరాతు సెట్టితోఁ జెరసాలఁ జేరువేళ

తే.గీ. గుండె లరచేతిలోఁ బట్టుకొని, జపాను
పొట్టి తోడేటి ధాటికిఁ బొక్కుచున్న
దేశ జనయిత్రి కభయ సందేశమంపి
ఆదరించిన నేతాజి కంజలింతు.

ఉ. నాలుగు దిక్కులం గమిచి నాట్యముసేయు బ్రిటీషు నేత్ర దీ
పాల వెలుంగునం బడక భారతభూములు నిర్గమించి కా
బూలునఁ గాలు మెట్టిన యపూర్వ చమత్కృతివార్ధి బోసుతో
బోలుదురే? యుగంధరుడు మున్నగు తొంటి యమాత్య శేఖరుల్.

సీ. అడుగడ్డునకు వెంటనంటి వాసనబట్టు కఱకు సి.యై.డీల కన్ను మాపి
సహజ గంభీర వర్చస్సు గుప్తముసేయు చక్కని మొలక మీసములు బెంచి
అనుమానమున కింతయును దావుసూపని ప్రకృతి సిద్ధంబైన పలుకుమార్చి
నాడెంపు లొడుగు చల్లాడంబు దాలిచి కాబూలు వాని పాగా ధరించి

తే.గీ. ఖర్చుకై చేత నొక చిల్లిగవ్వలేక
కడుపులైవచ్చు నాపద లెదురుకొనుచు
భరత జనయిత్రి శిరమున భారముంచి
బోసు గావించినాడు కాబూలుయాత్ర.

సీ. సెలవందుకొన్నది కలకతా నగరంబు నిండిన వేడి కన్నీటితోఁడ
సాగనంపినది రోషము వోసి వంగంబుఁ బాలింప నెలకొన్న భద్రకాళి
చిన్నవోయినది, కుంచిత కళాపుంజమై మేలైన నిలువు టద్దాలమేడ
దీవించినది రత్నదీపాంకురములతో మర్యాద లొనరించి మంచుకొండ

ఆ.వె. దేశదాస్యదళన దీక్షానిబద్ధోగ్ర
కంకణంబు మెరయ కత్తిబట్టి
కటికి రాత్రి బందిఖానా నుడాయించి
బోసుబాబు దాటిపోవువేళ

## కన్నతండ్రి

శా. కాలుంజేయియుఁ బక్షవాతమున శుష్కంబై బలాఢ్యున్ నినున్
దూలింపన్ మనుమల్ దనూభవులు ముద్దుం గోడలున్ సర్వ సౌ
ఖ్యా లోలిన్ సమకూర్ప నిత్యమును శయ్యం బండి కన్పట్టు నీ
వేలోకంబునఁ బ్రక్కవైచితివి? తండ్రీ! నేఁడు వీరాభిధా!

శా. నా సన్మానముఁ గన్నులార గని ఆనందించు నీ జన్మమున్
నీ సంతాన విభూతి మెచ్చుకొనుచున్నీ మూర్తికిన్ ఠీవికిన్
"దాసోహమ్మని" యంజలింపదె? కవీంద్రశ్రేణి? యే గొల్ల వాఁ
డేసూక్రీస్తుని భక్తుఁ డందుకొనె తండ్రీ! యిట్టి మర్యాదలన్

శా. సుద్దుల్ సెప్పుచు వీర గొల్లల యశంబున్ బాహు పాండిత్యమున్
ముద్దుల్గారు విలక్షణం బయిన యేద్పుం బాణితో బాడి మా
పెద్దల్ వీరని పొంగి పోయెడు భవ ద్వీరోత్సుకత్వంబ కా
ప్రొద్దుల్ నిండిన కైతయై వలచె బాబూ! నన్ను బాల్యంబునన్

శా. ముక్కుల్ నొక్కి కుమాళ్ళ మ మ్మిరువురన్ ముద్దాడి పొంగారు నీ
పక్కా మోహము మా యనుంగు జననీ వ్యామోహమం దైక్యమై
గ్రుక్కం బట్టెనె యేడుపున్ జనక! నీకు న్మాకు సంబంధమున్
ముక్కల్ చేసిన దుర్దినంబు హృదయంబున్ జీల్చి చెండాడెడిన్

ఉ. ఎక్కడ కేగుచున్న సెలవీక శిరాన కరంబునుంచి పె
న్మక్కువ నాశిషంబిడకమానని నీవు శ్మశానవాటి ని
న్నొక్కని నుంచి దుఃఖమున నూరి మొగంబయి పోవుచున్న మా
దిక్కును చూడవైతివిగదే? ముది తండ్రి! ఋణంబు దీతెనే

ఉ. తానమునంది క్రైస్తవ మతంబున జేరి కులంబు గోత్రమున్
మానిన వెట్టి గొల్లఁడ వమాయక మూర్తివి గాని తండ్రి! యి
ట్లేనుఁగు నెక్కు పుత్రుని కవీశుని పుట్టువు గుట్టెఱుంగు వి
జ్ఞానివి నీవు నీదు చరణంబులకుం గవితా నమస్కృతుల్

ఉ. గుఱ్ఱమువారి వంశమున గొఱ్ఱెల కాపరివై జనించి యీ
మొఱ్ఱి కులంబునం గలసి భూప సభాంతర గౌరవాఢ్యులన్
కుఱ్ఱల గాంచి నీవిచట గూర్చిన కీరితి చందమామలో
నిఱ్ఱిని గొఱ్ఱెగా సలిపె యెట్టి తపస్సు ఘటించినాడవో!

చం. వెలగల పట్టభద్రుఁడు వివేకి చలాకి గలట్టి దొడ్డ పం
తులు తులలేని భక్తి భరితుం డిశరాయెలు నామకుండు నీ
మలి కొమరుండు నీ మరణ మార్గణఘాత సహించలేక శో
షిలి విలపించెడిన్ జనకజీ! తను జన్మల నూరడింతువా?

సీ. బహుకాల భక్తి సంపత్తి వెంబడిరాగ సాగెనే నీ స్వర్గ సదనయాత్ర?
ప్రత్యక్షమయ్యెనే ప్రత్యహం బీవు సంభావించి మోహించు పారదైసు?
సంతసించితివె మోక్షస్వామి సభలోన యర్హాసనంబున నధివసించి?
కొడుకుల యెడబాటు పిడుగుసోకిన నిన్ను నోదార్చెనే మింటనున్నవాఁడు?

తే.గీ. జగము గ్రుంగిన గాని నీ జపతపంబు
మానని యనంతభక్తి సంభరితమతివి
భాగ ముండకపోదు కైవల్య ధరణి
వల్లవులరాయ! ముక్తి రంభావిధేయ

జి. జాషువ

# నేతాజీ

## తొలినిట్టూర్పు

కం. జాతీయ సభాపతియై
నేతాజి సుబాసుబోసు నిఖిల భరత వి
ఖ్యాతిం గడించి గాంధీ
చేతంబునకెక్కె సాహసిక సింహంబై.

కం. వలచెన్ జాతీయసభా
లలనామణి మూడు మార్లలంకారముగా
వలపుల పతిగా బోసుఁడు
వలపించెన్ భరతవర్ష భక్తగణంబున్

కం. పెండిలినిమాని భారత
ఖండమునకు సేవసల్పి కారాగృహముల్
గండములు గడచి జాతికి
గుండెయగుచు మెలగె పగర గుండెలలోనన్

కం. మాతృ పరాధీనస్థితి
శాతాయుధ మగుచు మానసమున గలింపన్
నీతులకు వేళగాదని
తాత నెదుర్కొనుచు క్రొత్తదారిన్ ద్రొక్కెన్

శా. కత్తుల్ బట్టక స్వేచ్ఛరాదెపుడు చర్ఖా పద్ధతుల్ పూర్తిగా
చిత్తైపోవు నటంచు గాంధిమునితో సిద్ధాంతమున్ జేసి భూ
భృత్తుల్ దెల్లని చక్రవర్తులు భయాప్తిన్ గ్రుంగి కంగారుగా
నెత్తించెన్ యవరెస్టు నెత్తములపై హిందూరణస్తంభమున్

సీ. పలుకు పల్కున నిప్పులొలికి రక్తముపొంగు పౌరుషాంశంబు లుపన్యసించి
అడుగుజాడలలోన నడచి చెప్పినచోట నిలిచి పోరాడు సైనికుల గూర్చి
దరిదాపులేని దుర్భర దాస్యమున గుందు తల్లికన్నీరు ప్రత్యక్షపఱచి
విస్మృతమైన గంభీర భారత బాహు పాండిత్య పటిమ జ్ఞాపకము చేసి

ఆ.వె. స్వీయసంస్థ దిశల జెలగి ప్రోజ్వలముగా
పల్లెపల్లియలకు పర్యటించి
శ్రీ సుబాసు వంగ సింగంబు జాతికి
వీరరసము నోలి నూరిపోసె

కం. తెలవారి దొరతనంబుల్
దెలవాఱచు వంగ వీర దినమణి నౌరా
యిలుదాటని ఖైదీగా
నిలిపెన్ దొరతనము గుండె నిబ్బరమునకై

ఆ.వె. శ్రీ సుబాసుబోసుఁ జెరసాల యందుంచి
పీడ వదలెననుచు విశ్వసించి
అగ్ని రణములో నిమగ్నమై రక్తాలు
గురియుచుండె సీమదొరతనంబు

తే.గీ. యుద్ధ శబ్దంబు ప్రతిపల్లెటూరి పూరి
గుడిసెలో మారుమ్రోగిన గడియలవ్వి
కదనదేవత మానవ గర్భపటలి
జీల్చి చెండాడు రక్త నిశీథమద్ది

ఆ.వె. అగ్ని పర్వతంబు లంతరంగంబున
పగలు రేయి బ్రద్దలగుచునుండ
పొంగులీను రక్త గంగల నరికట్టి
కాళరాత్రు లతడు గడిపినాఁడు

ఆ.వె. తాపుగొన్న కోడెత్రాచు పోలిక వేడి
బుసలు జిమ్ముచున్న బోసుబాబు
నీచమైన స్వీయ నిర్బంధమున్ దప్పు
కొనెడు త్రోవ లల్లుకొనుచునుండ

మ. ఒక స్త్రీమూర్తి నిశీథమధ్యమున విద్యుత్కాంతులన్ జిమ్ము దై
వికసమ్మోహనరూపధేయమున నావిర్భావమున్ జెంది ఆ
గక గంగా యమునానదుల్ గనుల సాక్షాత్కారముం జెందగా
నికటక్షోణి నతాస్యయై నిలచియుండెన్ జీర్ణవస్త్రాలతో

మ. నదులుం గొండలు సింగముల్ బులు లరణ్యంబుల్ శరీరంబునన్
బొదలన్ దెల్లని మంచుకొండ మకుటంబున్ బూని యంభోధిపై
పదముల్ మెట్టి యనంతభాషలు ముఖాబ్జంబందు జన్మింపగా
యెదురన్ నిల్చితి వెవ్వరమ్మ! ఘనవేణీ! నన్ను గన్నమ్మవా!

కం. అనిపలుకు బోసుబాబుని
గనుగొని యమ్మధురమూర్తి కరమెత్తివెసన్
వినుపింప దొడగె నిట్లని
తనదగు సుఖదుఃఖయుత కథానక మెల్లన్

కం. ఆరుగురు చక్రవర్తులు
దారాశయులేని నన్ను దనిపిరి నేనే
భారతమాతను, కవితా
భారతి నా లచ్చిసుతుల భార్యకుమారా!

కం. పాండవకథ రామునికథ
మండనములు నాకు నా కుమారులు ప్రజ్ఞా
మండితులు హస్తినాపురి
గుండియ నాబొట్టు రక్తకుంకుమము సుతా!

కం. పిల్లనగ్రోవిందాలిచి
గొల్లెతలకు వలపునేర్పి కువలయవినుతుల్
కొల్లగొట్టిన టక్కరి
గొల్లండు నా పెద్ద కొడుకగుం దనుజన్మా!

సీ. వర్ణించినాడు నా బాహుపాండిత్యంబు గరిమతో యోజనగంధి కొడుకు
చాటించె నా యహింసా మహామంత్రంబు సన్న్యాసి యయి శాక్యచక్రవర్తి
సృష్టించినాడు నా ప్రేమ సామ్రాజ్యంబు నవఖండముల యేసునాథమౌళి
స్థాపించె నా శాంతిసమర దిగ్విజయంబు రాటాలదొర బోసినోటి తబిసి

ఆ.వె. నిన్ను గన్న దాన నీ తండ్రి తాతల
గన్నదాన గాంధి గన్నదాన
బ్రతికి చెడినదాన భావాలుగలదాన
ధనికురాల దుఃఖ దగ్ధురాల

చం. పిదికితి రత్నరాసులు నవీనములెల్ల నదీనదాలలో
బ్రదికితి సాటి భూతలపురంధ్రులకుం దల మానికంబుగా
యదను దొలంగనీక మధురాన్నపురాసుల పంటబండితిన్
చిదికి పరాయి భూపతుల చేతికి జిక్కితి చిక్కిపోయితిన్

మ. అలుగున్ బట్టని ధర్మవీరుడు దయా యత్తాంతరంగుండు భ
క్తుల తాతయ్య సబర్మతీ తబిసి దిక్కుల్ జెక్కలైపోవు బాం
బుల కయ్యంబును కంటగించుకొని రేపుల్ మాపులున్నాలు పో
గులతో నా కభయప్రదానమిడి పల్కుం బ్రేమసిద్ధాంతముల్

మ. కనుగొంటి న్మహనీయులన్ గొడుకుల గాంధిన్ మహాబుద్ధ దే
వుని హింసాత్మకమైన సప్తభువనంబుల్ మ్రొక్కి మోహింపగా
తనయా! నేటికి వర్ణభేద మతభేద స్వార్థదేవేరి పూ
నినదో విప్లవ గర్భిణీ తరుణినై నిత్యంబు శోకించెదన్

మ. తొలుతన్నల్వురు నాల్గుత్రోవలయి పుత్రుల్ నాటుకొన్నారు మొ
క్కలుగా వర్ణచతుష్టయం బిపు డసంఖ్యాకంబులై యైక్యతా
బల విచ్ఛిత్తి యొనర్చి నన్నోరులకున్ బట్టించె నీహెచ్చు త
గ్గుల కయ్యాలొక తల్లి పిల్లలకు సిగ్గుంజేటు యోచింపగన్

మ. కడ చూడంబడరాని నాపరిభవోగ్రజ్వాల చల్లార్చు మే
ల్కొడుకుం జండకర ప్రతాపసముదగ్రన్ నిన్ను గాంక్షించి నే
ముడుపుల్ గట్టితి నెల్ల వేలుపులకున్ మున్నూరు వర్షాల నా
కడగండుల్ వడగండులై కరగె వంగక్షోణి గంగాసుతా!

మ. నను వేధించు సమస్యలన్నిను మనంతంబుల్ మహాలోపముల్
వినిపింతున్ గనుమీ స్వరాజ్య జయలబ్ధిన్ నీవు నీవార లం
దిననాడే సరిదిద్దుకోవలయు కాదే రక్తవర్షాలలో
మునుగుం దేశము చుట్టబెట్టుకొనిపోవున్ శాంతి కైవల్యముల్

సీ. విసిగి వేసారడే వేమన్న ఘనయోగి భరతవిజ్ఞాన దౌర్బల్యమునకు
వాపోవడే మొన్న శ్రీ పోతులూరయ్య భావి భారత మత ప్రళయమునకు
అంగలార్చడె వివేకానంద సన్యాసి తల్లి దేశపు దరిద్రత్వమునకు
ఘుక్తిమానడె దేశభక్త మార్తాండుండు నిమ్నజాతుల దాస్య నిర్భరతకు

తే.గీ. అన్య దేశాభ్యుదయ గాథ లాలకించి
భారత క్షీణదశ కన్నులార గాంచి
యెంద రెందరు పుణ్య మునీంద్రు లకట
బాధ పడిరొక్కొ జీవ సమాధులందు

మ. తొలుతన్ గాంధి ఫకీరు మాకు భగవంతుండంచు పూజించి భ
క్తులలో గొందరు పంచమోద్ధరణమున్ దూషించు చున్నారు నిం
దలు నీలాలు సృజించి యీ కళకు సంతానంబు నా కడుపునం
దలుగు ల్నాటి నటించుచున్నయది మాయా నాట్య కౌశల్యమై

శా. జుట్టుం బొట్టు ధరించి సీమదొర దుస్తుల్ దాల్చి క్రీడింతు ర
ట్టిట్టుం గాని విచిత్ర వేషములతో యే యెండ కా గొడ్గులం
బట్టన్ జాలిన పొట్టపోతల గుణ భ్రష్టాధముల్ నీవు కాల్
మెట్టంబోవు స్వరాజ్య రక్త రణభూమిం దోడుగా నిల్తురే!

శా. అంటంగూడదు ముట్టకూడ దను వాక్యం బాత్మ గారింప న
ట్టింటం గుందు నభాగ్యజీవులను మున్నే రాము డే కృష్ణు డి
ట్లంటం గాలిడ నిచ్చిరో తెలుపు మోయీ! వారి కన్నీటి ని
ప్పంటం గాలిన గుండెతో బొడమె నన్నా! గాంధి కర్మందియై

ఉ. మైనపు టుండవంటిది యమాయకమైనది నా యనుంగు సం
తానము స్వార్థశీలురు సనాతన శిల్పులు మల్చుచుండ్రు కా
లాను గుణంబుగా పెడ మతాంతరులన్ మను కీలుబొమ్మలన్
మానవుల న్మరామతుకు మాలిన కొమ్ములులేని దున్నలన్

శా. సత్యంబన్న హుళిక్కి, ధర్మము తమాషా మాటయేకాని, యే
సత్యంబేడిచె, వర్ణభేద విషదూష్యంబుల్ మహా ధర్ముల్
వ్యత్యస్తంబుల నైకమత్యము లసూయా ద్వేష భావంబులే
సత్యాల్, చచ్చినవాడు శాయి యగు మస్తానౌ మరేమో యగున్

ఉ. పెద్దలనాటివన్న యవివేకపు టుక్తులు వంకబెట్టి బో
డెద్దులు విద్యలేని ప్రజ లెల్లెడ సత్తుల పూజసేయుచో
వద్దని యడ్డగించెడు కృపాపరు డొక్కడు గానరాక నా
ఖద్దరు చీర గాంధి మొనగాని తనంబును వ్యర్థమే కదా?

సీ. ఒకఁ డేడ్చియేడ్చి పాతకు లేద్వలేదంచు కోపించి తెలివి తక్కువకు వగచు
ఒకఁడాత్మజాత్యున్నతికి ముప్పు రాకుండ మాటిమాటికి రామకోటి వ్రాయు
ఒకఁడు ముత్యాల మాలిక లల్లుకొని వచ్చి అమ్ముడువోక లో నుమ్మలించు
ఒకఁడు దిక్కరి రాజునూరేగు సమయాన పెడకన్ను కులికించి వెక్కిరించు

ఆ.వె. ప్రణయ కవియొకండు పాషాణ కవియొక్క
డేడ్చుకవి యొకండు నేకమగుచు
నొండొరులను జూచి యోదార్చు కొనుచున్న
బాగుపడునె భావి భరతజాతి

ఆ.వె. కడుపు మంటచేత పెడమొగంబయియున్న
జాతి భేదమను పిశాచి మ్రోల
నాల్గుచేతులున్న నలువ కౌశలమేని
నిక్కువముగ వన్నె కెక్కబోదు

సీ. దోచుకొన్నారు ముద్దులు మూటగట్టించు నవరత్న దివ్య భాండారభూతి
అరికట్టినారు సింహమ్ముల కెదురెక్కు భువనైక వీరుల భుజబలంబు
కాజేసినారు దిక్కరి దంతకుంతాలు మెరుగు బెట్టిన కళాభరణములను
కలిపినా రఘ మెరుంగని తనూభవులకు నడుమంతరపు రిత్త నాగరకత

తే.గీ. ప్రశుభములు జిందు నా తనూ రక్తమెల్ల
పిండుకొన్నారు ముప్పూట లెండగట్టి
జాతి మతభేద మద పిశాచములుగూడ
తానకము లన్న! నాపరాధీనదశకు

ఉ. ఎంతటి దాస్యమేని సహియింతును గాని సహింపజాల, నీ
స్వంత సహోదర ప్రబల బంధుర దాస్యము గబ్బిలాల శు
ద్ధాంతము లైన వేల్పుల సుధా భవనాలకు దూరమైన నా
సంతతి నుద్ధరింపగల సత్పురుషుం డుదయింపకుండినన్

ఉ. జీవితమెల్ల భారత విశిష్ట సమత్వ జయాభిలాషియై
సేవలు సల్పినట్టి మునిసింహము గాంధి ఫకీరు గుండెలో
నావము లుప్పతిల్ల నవురా! యలతిర్పతి వేల్పు నింటిలో
దావు నొసంగ లే దనుగు తమ్ముల కీ నరరూప రాక్షసుల్

శా. హిందూధర్మము లంటువద్దవని నే డింగ్లీషు చట్టాలలో
సందుల్ సాకులు వట్టి పంపిరి మఠస్వాముల్ నిరోధింపగా
సందేశంబులు తెల్లవారికి తనూజా! మానవ ద్వేషులై
పందిన్నందిని గొల్చువారి కయి నీ ప్రాణంబు లర్పింతువే

మ. బ్రదుకెల్లన్ దమలాభ నష్టముల బేరా లాడుటేగాని న
 చ్చదు తద్భిన్న విశేష మిందొకతెగన్ జన్మించినన్ విద్యకుం
బ్రదుకుల్ లేవిట పంతులయ్య లిచటన్ వ్యర్థుల్ దరిద్రుల్ కళా
సదనాలెమ్ముల గూడులై చివికి బాష్పశ్రేణి వర్షించెడిన్

మ. ఇలుదీర్పం బనిచేయు యంత్రములుగా సృష్టించి పర్దాల లో
పల బంధించుటజేసి భారత సతుల్ స్వార్థాశయుల్ సెప్పు నీ
తులలో స్వర్గము జూఅలాడెదరు సంతోషింత్రు నెమ్మేని సొ
మ్ములతో యెమ్మెలతో పురాతన కథా పుణ్య ప్రసంగాలతో

సీ. తల బొప్పిగట్టు పెద్దలనాటి బూజు బట్టిన దొంగ ధర్మాలు వినిచి వినిచి
సర్వాంగములందు జలువ నెత్తురు జిందు అబల మున్నగు పేళ్ల నంటగట్టి
కాంతు డెంతటి దురాగతము సల్పుచునున్న పల్లెత్తరాదని భయము సెప్పి
కడుపులో కోర్కె వెల్లడిచేసి యెదిరింప జాలని చిలుకల చదువు నేర్పి

తే.గీ. వ్రతములని నోములని బుద్ధి బలము నదిమి
బత్తి చెరసాలలోనుంచి బందిజేసి
సతుల నైసర్గిక జ్ఞాన సస్యరమను
చిత్రచిత్రంబుగా హత్యచేసినారు

ఆ.వె. గొప్ప దేవుడంచు గుండ్రాళ్లు జూపించి
బాగుపడెదువారు పలువురుండ
ప్రాణమున్న బీదవాని కన్నుల జూచి
బాగుచేయు ధర్మపరుడు లేడు

ఉ. ఈ కులవాహినీ ప్రళయ మీ నవఖండములందు లేదు మా
చాకలివాడు మంగలియు జాతుల గొప్పదనాల కోసమై
బాకులుబట్టి నిల్చెదరు పంచమజాతియు రెండు ముక్కలై
తాకదు ముట్టదీ దుడుకు తత్వము లెట్లు పరిష్కరింతువో

ఉ. మోసమెఱుంగనట్టి పరిపూత మనస్కుడు పెండ్లమున్న స
న్యాసి ఫిరంగికిం దమక నట్టి యఖండుడు బందిఖాన యా
వాసముగా వయఃపటిమ పండిన గాంధి ఋషిర్షభుండు నా
యాస ఫలింప శాంతి విజయధ్వజ మెత్తకపోడు పుత్రకా!

మ. హృదయంబున్న జగన్నియంత యను వాడే స్వర్గమందున్న ము
ప్పది వందల్ తెగలుండునే? మతవిషవ్యాళంబు లాటాడునే?
చదువుల్ సంధ్య లొకేకులంబున నివాసంబుండునే? భారతా
భ్యుదయ స్థాపక! విశ్వసించవలదెప్డున్ మెట్ట వేదాంతముల్

శా. నీతోబుట్టువు లీ యుదగ్రకదనాగ్ని వ్యాప్తి నీక్షించుచున్
భీతిన్ బిత్తరవోయినా రిపుడు గాంధిన్ బంది గావించి రీ
శ్వేతస్వాములు మాతృభక్తుడవు గంభీరుండ వీ వక్కటా!
నేతాజీ! నిదురింప రా దిపుడు తండ్రీ! వీరమార్తాండుడా!

ఉ. దాయలు దేశభక్తి సముదగ్రుని నిన్ను గ్రహింపలేక ము
ద్దాయిని జేసి నారని వృథం దపియింపకు మన్న పంచమా
మ్నాయముతోడు నీ ప్రతిభ నాలుగు దిక్కుల విస్తరించు లే
వోయి! ధరింపవోయి! జగదుగ్ర సమున్నత మండలాగ్రమున్

మ. బ్రదుకుల్ బందికి ధారవోసికొని సర్వత్యాగులై గాంధితో
బదవల్ బడ్డ పటేలు పండితుడు జవ్హార్‌లాలుడు న్నీ యెదం
బదనుల్ దీరి బహిర్గమించు పలుకుం బ్రహ్మాస్త్రముల్ జూచి మే
నెదుగం బొంగి నమస్కరించెదరు తండ్రీ! బోసువీరాగ్రణీ!

ఉ. కోరిక నీవు నా శుభము కోసము ద్రొక్కిన త్రోవలం దసృ
గ్ధారలు జిమ్మి నీ యనుగు తమ్ములు నాటగలారజాదు గం
భీర పతాక లెమ్మఖిల విశ్వము నీకు నమస్కరింప నా
పేరు ప్రతిష్ఠల న్నిలువ బెట్టుము శీతనగమ్ము కొమ్మలన్

చం. వెరవకుమన్న! నీవెనుక వీపుల మోపుల వెంబడించి నీ
తెరవుల నడ్డగించెడు ప్రతి క్షణ భూరి విపత్పరంపరల్
నరికి జపాను దాస్య దహనంబున వ్రేగెడు భారతీయ సో
దర పృతనాసహస్ర పరితాపము దీర్చి జయమ్ము గూర్చెదన్

మ. సకలోర్వీతలి దద్దరిల్ల విజయస్తంభంబు నాటించి ఢి
ల్లికి నీ తల్లి పతాకతో సుఖము లుల్లేఖింప యత్నించు పు
త్రక! నీ మేనికవోష్ణనాళములలో రంజిల్లు నారూపు పా
యక నీ వెంటనటించు రెమ్మచల ధైర్యస్థైర్య! యోధాగ్రణీ!

శా. చింతారుద్ధ గళంబుతోడ నెడదన్ ఛేదించుచున్నట్టి వృ
త్తాంతంబుల్ వినిపించి తక్షణమ యంతర్ధానమున్ జెందె న
క్కాంతారత్నము బోసుబాబు తనురక్తం బుత్సుకత్వంబునన్
గంతుల్ వేయగ నిర్ణయింప దొడగెన్ గత్యంతర ప్రక్రియల్

## మలినిట్టూర్పు

ఉ. గడ్డము బెంచి పచ్చి తురకంబలె వేషము మార్చి కాపలా
గడ్డ జవాను తండముల కన్నులు దాటి యనుంగు వంగ పు
న్గడ్డ నతిక్రమించె నొడికంబుగ కొండొకనాటి రాత్రి మా
దొడ్డ సుబాసుతోడ దులదూగునె తచ్ఛివరాట్సహస్రముల్

శా. అంతర్ధానమునందె బోసనుచు, బ్రహ్మాండంబు మార్మోయగా
గొంతుల్ రాయగ తంతులొక్క మొగి నుద్ఘోషించె లోలోపలన్
సంతోషించిరి దేశభక్తులు ప్రజా సన్న్యాసికిన్ గాంధికిన్
దంతాల్లేని యలంతి నవ్వు లగముల్ దళ్కొత్తె నెమ్మోముపై

కం. రైలెక్కి పెషావరులో
వ్రాలి దినద్వయము గడపి పరమాప్తులు మి
త్రాళీ సహాయ్యమున గా
బూలునకు బ్రయాణమయ్యె మోటారుపయిన్

కం. భగవంతు రాము డను నొక
సగంధ రత్నంబు తోడు జనుదేరంగా
పగలనక రేయనకునూ
భగవంతుం డెఱుగకుండ ప్రస్థానించెన్

సీ. పనిలేక పలుమారు ప్రశ్నించి విసికించు బాటసారులకు జవాబులిచ్చి
అపరాధ పరిశోధకాధికారులఁ జూచి బెదరు జూపుల ప్రక్కకొదిగి నడచి
ఆలస్యభీతి లారీలెక్కి పయనించి ముప్పూట లుపవాసములఁ దపించి
కాబూలు వాగు వంకలనెల్ల తరియించి అడుగడ్డు గండాల నధిగమించి

తే.గీ. కూర్మి తమ్ముల నలువది కోట్ల ప్రజకు
దాస్య దళనంబు గావించు త్యాగమూర్తి
పడిన కడగండ్లు కాబూలు పంట వలతి
వ్రాసికొన్నది గర్భ గహ్వరమునందు

కం. వేషము మార్చి పఠానుల
వేషంబుం బూని వంగ వీరుండు యశో
భూషణుడు కాలగతిచే
భాషణములు రాని మూగవలె నటియించెన్

కం. అద్దాషరీఫమను నొక
పెద్ద మసీదునకు బోయి, పేర్మార్చి జియా
యుద్దీ నయి దేశపు సరి
హద్దులు లంఘించె రహమతాఖ్యుడఁ దానున్

కం. మరునాడు లాలుపురా
పురిదాక పఠానుభటులు ముగ్గురురాగా
గిరిగహనమార్గ దుర్భర
నరకము రహమతుని తోడ నడచి తరించెన్

మ. ఘనకష్టంబున తోలుసంచులపయిన్ గాబూల్ నదిందాటి య
ష్ఘను పోలీసులబారి దప్పుకొని వక్రంబైన మార్గాలలో
తనిఖీసేయు స్థలాలుదాటి యవలన్ దాకా ప్రవేశించి ర
య్యనఘుల్ దేశ హితాభిలాషులు మహాత్యాగుల్ నిరాహారులై

శా. లారీపైబడి టీ కషాయమున కాలక్షేపమున్ జేయుచున్
దారింబ్రోన్నత వృక్షశాఖల ప్రమాదాల్ దాటి పానీయ మా
హారం బందని భూములంగడచి గమ్యస్థానమున్ జేరె, ఖా
దీ రాటాల జయేతి ఝూంకృతులు సందేశంబు లందించగన్

కం. సుకుమారి త్యాగి వీరుడు
సుకములకెడమై పరాయిక్షోణీస్థలిలో
చకితస్వాంతత కొండొక
బికారియయి తిరిగె విశ్వవిహితాసక్తిన్

మ. అది కాబూలు తుషారవర్షములచే నాచ్ఛాదితంబై, మహా
సదనంబుల్ జలిచే వడంకెడిని పర్షా పుస్తు భాషావళుల్
కదమున్ ద్రొక్కుచు నన్యదేశజుల వంకన్ వారగా జూచుచున్
బెదురుంబెట్టెడు పట్టణంబభిరుచుల్ భేదించు తావెంతయున్

మ. ఖరముల్ లొట్టిపిటల్ గుఱాల్ మెలగ దుర్గంధంబుతో నిండి దు
ష్కరమై చీకటి చిందులాడుకొను నక్కాబూలు సత్రాలలో
జరపెం గొన్నిదినాలు జీవితము నుజ్జీలేదు వాత్రుచ్ఛగా
భరతక్షోణి సుబాసుబోసొకడె సర్వత్యాగి ముమ్మాటికిన్

మ. కునుకుం గూరుకు మాని రే బవలు మాస్కోయాత్ర గావింప ర
ష్యను కాన్సల్ జనరల్ కటాక్ష లవ మభ్యర్థించి వేసారి జ
ర్మను దేశస్థుల నాశ్రయించి గడపె న్మాసార్ధమల్లాడు వె
చ్చని చిత్తంబున నష్టకష్టపు నిమేష బ్రహ్మకల్పంబులన్

కం. సీయైడీ యొకడు సుబాస్
భాయీపయి కన్నువేసి ప్రతిదినముం గా
జేయఁదొడంగె ధనం బే
దోయొక నేరంబుమోపి దుశ్చరితుండై

సీ. ఠాణాకురండు శీఘ్రంబంచు బెదిరించి యొకనాఁడు గడియార మూడగొట్టి
అధికారి పిలిచినాఁడని హడావిడిజేసి బక్షీసుగా కొంత పైకమడిగి
పురివీడి చనకున్న పరువుదక్కదటంచు స్వాపతేయము కొంతచప్పరించి
మొదటమోపిన నేరమును క్రమ్మరంజుట్టి ఆయంబు దెమ్మంచు చేయిసాచి

ఆ.వె. పిడుగువంటి బోసువీరుని ప్రచ్ఛన్న
వేషధారి గరిమ నెఱుగలేక
నివురుగప్పియున్న నిప్పుతో జెలగాట
మాడదొడగె నా సియైడి భటుఁడు

ఆ.వె. ఉన్నతాధికారి చిన్నియుద్యోగియు
చేయిసాచకుండ సాయపడరు
లంచమీయకున్న మంచమెక్కనివారి
వ్రేళ్ళమీద లెక్కపెట్టవచ్చు

మ. చెలగున్ లంచములాగు దుర్గుణము రాజీవాక్ష ముఖ్య త్రిమూ
ర్తులయందున్ ఫలపుష్పతోయముల నేదో యిచ్చుకోకుండ వే
ల్పుల నట్లుంచి మహానుభావులగు నప్పూజారులేపల్కు ర
న్యులమాటల్ దడవంగనేల? ధనహీనుల్ జల్ది పీన్గుం గముల్

మ. ధనికుల్ సోమరిపోతులై కటికిపేద న్నెత్తురుల్ బిండి కూ
ర్చిన విత్తంబును వెచ్చపెట్టి ధరణిన్ జీర్ణించియున్నట్టి రా
మునకో రంగనికో నిఖా లవసరంబుల్ సల్పుచున్నారలే
గొనబుం గైతలచే గుదుర్పనగు నీ ఘోరప్రమాదోద్ధతిన్

మ. ఘన సంకల్ప నిమగ్నమై యుడుకురక్త ధ్వస్తమై యున్న వీ
రుని చిత్తం బతి లోకయాతనల యోర్పున్నేర్పునో బోసుబా
బుని వెన్నాడు విరోధి రాడ్భటచయంబున్ బోలి వేధించుచున్
వెనువెంటన్నడచెన్ ప్రతిక్షణ మకుంఠీభూత దీర్ఘవ్యధల్

ఉ. పుట్టినగడ్డలో భరత భూములలో గజదొంగవోలి కా
ల్మెట్టుటకింత నేలయును లేక తపించు సుబాసు వీర స
ప్రాట్టుని జూచి తద్ధిమ ధరాధర మెంత కఱంగి యేడ్చెనో
గట్టులు దన్నిపారు నలగంగ యెఱుంగు నెఱుంగ రెవ్వరున్

కం. ఉత్తమ చందను కొండొక
యుత్తమజాతీయ వీరుఁ డుత్సుక మతియై
యెత్తుకొనె బోసురక్షణ
మొత్తముఁ దలమీద నెంత పుణ్యాత్ముండో

కం. బోసుని భగవత్ రాముల
వేసమ్ములు జూచి యతని పెండ్లాము మదిన్
బోసని యెఱుఁగక యాత్మా
వాసంబున వలదటంచు వారణచేసెన్

మ. అమరుల్ మెచ్చ సుబాసుబోసునకు సాహాయ్యంబు గావించు ను
త్తమచందుండు నిజాంగనామణికి యాథార్థ్యంబు వాక్రుచ్చినం
బ్రమదంబంది ప్రసన్నచిత్తయయి సర్వస్వంబు వెచ్చించి గం
డము దాటింతమటంచు నిల్పుకొనె నింటన్ వింతనేరస్థులన్

శా. ఆలోకించి సుబాసుగా దలచి మేనల్లాడ నిల్లప్పుడే
ఖాళీజేసి యొకండు దుర్గ్రహణి రోగగ్రస్తుడైపోయె భూ
పాలాఖండల చండశాసన భయోత్పాతంబు జాతీయ ఖై
దీలన్ ద్యాగుల వీరమూర్తులను సందేహించు దయ్యాలుగా

తే.గీ. అమలు నందున్న నేటి ధర్మములు రేపు
కూలిపోవచ్చు కాలానుకూలముగను
రాజధర్మాల దుష్ప్రచారముల కతన
త్యాగియు నొకా నొకప్డు ముద్దాయి యగును

తే.గీ. ముసలివాడును మిత్రుండు ముసలిమాను
కులజుడైనట్టి హాజీకి గుట్టువిడిచి
శ్రీ సుబాసుని విషయంబు జెప్పిచూచి
శరణ మర్థించె నుత్తమచందురుండు

ఉ. సింగము బోసుబా బతని జీవిత దివ్యచరిత్రచే మహా
వంగము ధన్యమయ్యెనని పల్మరు మెచ్చి నుతించు హాజి మా
తంగము సింహనాదమున దత్తర బిత్తరాలడు రీతిగా
కొంగరవోయి పల్కె ననుకూలముగాని మృషాపదేశముల్

శా. ఆయాసం బిడకుండ లభ్యపడు సభ్యత్వంబు సాధించి కు
ర్చాయిల్దాలిచి శుద్ధఖద్దరు జగా లాల్చీలతోవచ్చి జా
తీయ స్వర్గ ముపన్యసించెదరు గాంధీభక్తులట్లెందరో
మాయాశీలురు దేశభక్తులనుచున్ భావింప రా దెప్పుడున్

శా. డబ్బుల్ కోట్లు గడించి సంస్థలకు బేడల్ మాడ లర్పించుచున్
డబ్బాదాతలు దేశనాయకుల చిత్తాకెక్కుచుం ద్రుర్వికిన్
జిబ్బీబాపతు మర్త్యరూప ధర రక్షఃశ్రేణి చేవ్రాలుగాం
ద్రుబ్బున్ గర్వము గండరించిన హతాయుష్కుల్ బ్రజా శాత్రవుల్

కం. అటు లుత్తమచందుని ఘన
కటాక్షమున బోసుబాబు గడపం దొడగెన్
బ్రిటిషు భటకోటి వీక్షణ
కుటిలాగ్నిం బడక తప్పుకొని కొన్నాళుల్

కం. బోసుండు పట్టువడె స
న్న్యాసి యగుచు హరిద్వారమం దను వార్తల్
బోసు విని నవ్వుకొనె పో
లీసు భటుల వట్టి తెలివిలేని తనంబున్

తే.గీ. అక్షరాజుల చెలికార మాసపడక
సోవియట్టుల గడ్డకుం బోవc దలచి
నెరపిన ప్రయత్న మంతయు నీటిమీది
వ్రాతయై పోవ శ్రీ బోసుబాబు కలcగి

కం. ఇటలీ కార్యాలయపతి
కటాక్షమున రోము యాత్ర గావించి హుటా
హుటి రషియా భూముల కే
గుట సుకరంబనుచు వాని కూర్మి గడించెన్

కం. సీనారుకరోనీ యను
వాని రమణి దెచ్చురిత్త వార్తలు వినుచున్
మానసము కలతపడగా
మాని ప్రయత్నాంతరముల మగ్నుం డగుచున్

మ. శ్రమ లెక్కింపక పాదచారి యయి రష్యాకుం బ్రయాణించు చి
త్తముతో నుత్తమచందునిం బిలిచి మిత్రా! యింకc గాబూలులో
నిముసం బుండుట క్షేమదాయకము కానేకాదు మాస్కో ప్రయా
ణము గావింతును నేర్పుతో వలయు సన్నాహంబు గావింపుమీ

శా. నీకు న్నీసతికి న్నమస్కృతులు మీ నిత్యోపచారాళికిన్
మీ కాలుష్యము లేని చిత్తములకున్ మీ భక్తి సంపత్తికిన్
బాకీపడ్డది నాదు జీవితము ప్రాప్తంబున్నదో లేదొ! నా
కీ కాయంబున మీ సమాగమము భాయీ! దేశభక్తాగ్రణీ!

తే.గీ. ప్రళయ ఝంఝూహతంబైన జలదమట్లు
క్రాలుచున్నది నాయంధకారయాత్ర
దిక్కులేనట్టి నా చేరు తీరభూమి
నాకపురి యౌనొ! దుర్భర నరకమౌనొ!

శా. నాలోనం బరువెత్తుచున్నవి విమానా లెన్నియో చిత్త మాం
దోళింపన్ జెరసాలలోన మను పీన్గుంబోలి జీవించి న
న్నాళుల్ వెచ్చని యూరుపుల్ విడుచు కన్నన్ సోవియద్భూములన్
గూలీనై నివసించుటే సుఖము నాకున్ దేశభక్తర్షభా

ఉ. నూరు గుఱాల వేగమున నూత్న పథంబులు ద్రొక్కు నాత్మ దీ
క్షారథ మాగబట్టుకొన నిమేషము దేశ మాతృ సం
సారమునం బ్రశాంతము ప్రచార మొనర్చినదాక వేడి ని
ట్టూరుపు టగ్నిలో గుములు టోర్వదు నా తుది రక్తబిందువున్

మ. తడవయ్యెన్ మన కెన్నడో వలపు స్వాతంత్ర్యోత్సవాల్ జూఅలా
డెడు భాగ్యంబు ప్రమాద దంబయిన గాడింబడ్డ యీ మేలి పు
త్తడి తేరిన్ మరలించు నుత్తమ నియంతల్ లేరు రాటాలతో
ముడివస్త్రంబులతోడ రాగలవె? సంపూర్ణ స్వరాజ్యార్థముల్

సీ. అర్ధచంద్ర ప్రయోగాంతంబునం గాని తొలగి పో దీ తెల్లదొరతనంబు
త్యాగివీరుల రక్త దానంబునం గాని దర్శనం బిడదు స్వాతంత్ర్య సంధ్య
నెనరింతలేని శాసన శస్త్రమున గాని తగ్గ దీ కులవిభేదాల కణితి
కులము కల్తీలేని కలము పోటున గాని చావ దీ యజ్ఞాన సర్వధాటి

తే.గీ. మేలి ఖద్దరు పగటి వేషాలుజూచి
బెదర దెన్నడు పగవాని పెత్తనంబు
బహు మతాంతర చంచలాశ్వముల మీద
సాగునే స్వరాజ్యానంద స్వర్ణరథము

శా. నా సృష్టింప దలంచుకొన్న యతి నూత్నంబైన జాతీయ హిం
దూ సామ్రాజ్యము నందు సర్వులు మహేంద్రుల్ సోదరుల్ లేదు వ్య
త్యాసం బున్నత నిమ్నతల్ తగవు బ్రహ్మత్వంబొ! శూద్రత్వమో
భాసిల్లవలెనట్లుగా కఖిల విశ్వంబుల్ నశింపన్ వలెన్

సీ. తలిదండ్రు లెపుడు బిడ్డలకు నేర్పగరాదు కులగోత్రముల వారి గొప్పతనము
చదివింపగారాదు చదువు లయ్యలు పాఠశాలలలోన వర్ణాల గొడవ
రచియింపగారాదు రచయితల్ శాశ్వత దాస్యంబు నిలుపు కథానకములు
సలుపరాదెట్టి ప్రచారంబు లీ దినం బమలు నందున్న కృత్రిమపుసంస్థ

తే.గీ. లన్నదమ్ముల తనమున కడ్డువచ్చు
శబ్దజాండంబు సర్వంబు చావవలయు
స్వర్గ మఱచేతియందూడి పడగవలయు
మోక్షరాజ్యంబు బొందితో పొందవలయు

కం. ఒకజాతి రక్త మిచ్చిన
నొకజాతికి సానుభూతి యుండని ధరలో
నొకబోసు డొక్క నెహురూ
యొ గాంధీ మరణ మెవని యుల్లము గలచున్

శా. పర్దా పద్ధతి చించివైచిన కెమాల్పాషా యొకం డిండియా
సర్దుంబాటునకై జనించుట యవశ్యం బట్లుగాకున్న నీ
పర్దా లోపలి గ్రుద్దులాటలు సమాప్తం బెన్నడుం గావు నా
నిర్దేశం బిది నిశ్చితార్థమిది సందేశం బిదే మిత్రమా!

శా. ఆపద్వార్ధి తరించి నాడను వయస్యా! నేను కాబూలునన్
మీపుణ్యంబున పుణ్యదంపతులు జుమ్మీ! మీరు మీ సత్కృపా
దీపజ్వాల వెలుంగున న్నెఱపెదన్ దీక్షా మహాయజ్ఞమున్
రేపో! మాపో స్వతంత్ర భారత శుభోర్వీం గన్నులం జూచెదన్

శా. అన్నా! యుత్తమచందు! విప్లవ మహాయజ్ఞంబు సాగించి నా
యన్నా దమ్ములతో స్వరాజ్య మధురా హారంబు భక్షింతునో
మన్నైపోయిన దేశభక్తులకు సంప్రాప్తించు రిక్తోత్సవాల్
గన్నుల్లేని కబోదినై యపర లోకంబందు వీక్షింతునో

శా. ఆటంబాంబు సహస్ర గోళముల తీవ్రాటోపభీమంబులై
బైటంబడ్డ సుబాసుబోసుని పటు వ్యాహారముల్ వైరికిన్
జేటుంగూర్చుట నిశ్చయంబని మదిన్ జింతించి వాక్రుచ్చగా
మాటల్ జాలక యుత్తముం డెడద సంభావించె గేల్మోడ్చుచున్

శా. ఇన్నూరేడులు నిద్రవోయినది మా హిందూ ధరాదేవి మా
యన్నా! నేటికి నిద్రలేచినది దాస్యభ్రష్టులైయున్న నీ
యన్నా దమ్ముల కర్థమైనది మనుష్యత్వంబు నీ చెల్మిచే
కన్నుల్ విచ్చితి మేను నా సతి జగత్కాండంబు కొండాడగన్

ఉ. నా యిలుసొచ్చి నా సతికి నాకు ఘటింపగజేసినావు నీ
సేయము దీర్ఘదాస్య తమసీవృతమైన నిశీథమిప్పుడే
హాయిగ దెల్లవార్చిన సుధాంశుడ వీవు సుబాసుబాబు దీ
ర్ఘాయువు నీకు నీదు హృదయస్థిత దీక్షకు నీదుమూర్తికిన్

సీ. వర్థిల్లుగాక నీ ఫార్వర్డుబ్లాకు సంస్థారాజ మాచంద్రతారకముగ
ముద్రణం బగుగాక ముందు నీ శుభమూర్తి భరత పుత్రుల మనః ఫలకసీమ
లేచుగా కలఘు డిల్లీ గుండెకాయపై నీ వెత్తు మూడువన్నెల పతాక
నీళ్ళాడుగావుత నీ పలాయనగాథ నవకవీ శాన ఘంటములయందు

ఆ.వె. మింట మెఱయుచున్న మృత్యుదేవతనోట
నుమియు నగ్ని గోళకములనుండి
జన్మదేశమునకు సంపూర్ణభద్రత
భిక్ష పెట్టుమన్న విశ్వవీర!

ఉ. యమ్మను వా డొకండు రషియా వివరంబు లెఱుంగువాడు సా
యమ్ముగ వచ్చునట్టులు ప్రయత్నము జేసి యతండు కోరు ద్ర
వ్యమ్మిడి యుత్తముం డది సుబాసునకున్ వివరించి చెప్పగా
సమ్మతి జూపె వచ్చె నల జర్మనువారి కరావలంబమున్

కం. బోసునకు దారి జూపెడు
కాసంత శ్రమంబు వంకగా వందలు వే
లాసపడె యమ్ము మదిరా
దాసులకు ధనంబుకన్న దైవము గలదే?

కం. చుక్క కల్లులోన బెక్కు స్వర్గంబులు
దనువుతోడ గాంచు త్రాగుబోతు
యమ్ముగాని దృష్టియందు, బోసుం డెంత
దేశమెంత! దేవ దేవుడెంత!

తే.గీ. మానుకొన్నాడు నేతాజి మాసుకో ప్ర
యాణ యత్నం బనెడుమాట యమ్ముతోడ
నుగ్గడించుట వీరున కుత్తమునకు
గండమయితోచె బోసు రక్షణముకన్న

మ. ఇటలీ కేగుట నిష్టమైన నల మధ్యేమార్గ యానంబునం
దటు రష్యా చెలికారమున్ సలుపగా నౌనంచు యోజించి య
ప్పటి రష్యా పయనంబు మానుకొని సర్వజ్ఞుండు నేతాజి, య
య్యిటలీ యాత్ర కుపక్రమించె ఘన దైవేచ్ఛల్ మహాశ్చర్యముల్

తే.గీ. భగతు రామాభిధుని పెషావరున కంపి
యుత్తమునిమేలు నెమ్మది పెత్తనింప
జర్మనుల విమానాశ్వరాజంబు నెక్కి
రివ్వుమని వ్రాలె బోసు బెర్లిను పురాన

మ.	పొగరుంబోతు నియంత నాజిజపు నిప్పుం బంచఖండాలపై
నెగజిమ్మించిన హిట్లరుం డెదురుగా నేతెంచి సెల్యూటు సే
యగ శార్మణ్యుల మండలాగ్రముల ఛాయన్ వెండి మోటారు టే
నుగు నెక్కించిరి బోసు వీరుని సమానుల్ లేరు భూమండలిన్

సీ.	జరమనీయులు బరాబరులిచ్చి కొనియాడ స్వాగతోత్సవ గౌరవముల నంది
ఆది భారత శౌర్య మభివర్ణనము చేసి కరతాళ నినద నిర్ఝరులదేలి
హెరు హిట్లరుని శిలాహృదయంబు ద్రవియింప దేశభక్తుల పాట్లు తెలియపరచి
భరతఖండ స్వేచ్ఛ నురిమాని కెక్కించు కఱకు రాజుల మోస మెఱుకజేసి

ఆ.వె.	ఖండ పంచకమును గడగడ లాడించు
నుగ్ర జర్మనీయు లొడలు మరచి
పలువరింప బోసుబాబు బెర్లినువీట
నాటినాడు కీర్తి వాటికలను

కం.	పదివేల కంఠములతో
పది దిక్కులు నిండగ గగనవాణి వచించెన్
బెదురింతలేని బోసుని
కదనాశయు నన్యదేశ గౌరవవార్తల్

చం.	ఒక చిరుబాంబు భారత మహోర్విపయిం బడనీయ బొంది యం
దొక చిరురక్తనాళమున నూపిరి నిల్చిన నంచు దేశ నా
యకులకు గాంధి నేతకభయంబని వార్త లొసంగె బోసుబా
బొకడకదా! జగద్ధిత మహోద్యమ వీరుడు దారుడారయన్

శా.	పొద్దుం గ్రుంకని రాజ్య మేలెడు బలాబ్ధుల్ సీమ సమ్రాణ్మణుల్
గద్దెన్ డిగ్గి స్వరాజ్య మిత్తురని యాకాంక్షించి కేల్మోడ్చుచున్
బ్రొద్దుల్ బుచ్చితి మాసలేదిపుడు సంపూర్ణ కృపా దృష్టితో
మద్దత్తిచ్చినచో నియంతృమణి సామ్రాజ్యంబు సాధించెదన్

కం. అని ప్రార్థించిన హిట్లరు
మనస్సు పొంగారి మారు మాటాడక జ
ర్మను బంది గుందు హిందూ
వినుత మహావీరసేన విడుదల చేసెన్

కం. ముక్కోటి దైవతములకు
మ్రొక్కితి మొక్కనికి గరుణ పుట్టెనె? యౌరా!
యొక్కటి వీరుడు బోసుడె
నిక్కమయిన వేల్పటంచు నిండిన భక్తిన్

కం. ఆ నేతాజి పదంబుల
నానందాశ్రువుల స్నాన మాడించి తలం
బూని నుతించిరి హిందూ
సైనికులు ససంభ్రమ ప్రసన్నాశయులై

కం. క్రొంగొత్త పద్ధతులతో
సంగర కళ నేర్పి భరత సైనికులకు శౌ
ర్యాంగార మూది బెంగాల్
సింగము జపనీయ లంక జేరం జనియెన్

మ. మికడో మేలికరాని మోటారుపయిన్ మిత్రున్ సుబాసేంద్రు న
ట్టొకియో వీధుల స్వాగతోత్సవములన్ టోజో ముఖామాత్య నా
యకు లుత్సాహ సమేతులై కొలువ బ్రహ్మాండంబుగా సల్పి కా
నుక లర్పించి భజించె ముజ్జగములన్ జుట్టాలకా త్యాగికిన్

ఆ.వె. ఒడ్డుపొడవు గల్గి యుజ్వలంబయి యున్న
బోసుబాబు దివ్యమూర్తి నరయ
నీననుభూతుపూర్వమైన కొండొక భక్తి
కిరణ మెడద మెరసె హిరొహిటోకు

ఆ.వె. ఎంత మచ్చుమందు ఏ మహత్తర శక్తి
శ్రీ సుబాసు వదనసీమ గలదొ
జాపనీయరాజు జర్మనీ నియంత
తలలు వంచి నతులు సలిపినారు

చం. మును పొక బుద్ధదేవుడు ప్రభూతమునంది యహింసనేర్పె హిం
సను ప్రకటించుచున్ మరల జన్మము నందె సుబాసు బుద్ధ డీ
తనికి జపాను రాజ్యమును దత్తమొనర్చి తరింతునంచు బో
సునకు నమస్కరించె సరసుండగు నమ్మికతో వినమ్రుడై

శా. సేనానాయకుడై మహా మహిమతో శ్రీ సింగపూర్లంకలో
నే నేరంబు నెఱుంగనట్టి సఖులన్ హిందూప్రజన్ బంధన
గ్లానింబాపి తయారుజేసె రణశిక్షాదక్ష సైన్యంబుగా
శ్రీ నేతాజి యజాదు హిందుపవుజున్ జెండాల్ నభంబంటగన్

కం. ఒక లక్షసేన సంశ
ప్తకులై నెత్తుటి సిరాను వ్రాసి యిడంగన్
మకుటంబులేని రాజై
ముకు ద్రాడై పొలిచె జానుబులు భూములన్

ఉ. మూడు జగాలు దద్దరిలు బోసు వచోనల మింత కర్ణ సం
తాడితమైనయంత భరత క్షితి పుత్రిక లుక్కుమీరి నీ
ల్లాడిన బెబ్బులుం బలె దళంబున జేరి యలుంగుదాల్చి వెం
టాడిరి లక్ష్మి మున్నగు నవాబ్జముఖుల్ దరిబీతులీయగన్

మ. డిలనున్ సైగలు షానవాజుదును కెప్టెన్లై జగాయుద్ధ వి
ద్యలు శిక్షించి యధైర్యముం జిదుమనైయన్ యే మహాసేన ని
ప్పులు వర్షించుచు కౌరవేంద్రుని బలంబున్ గాల్చు దివ్య వ్యూహ
న్నల వోలెన్ దెలిసేనపై కుఱుకు కిన్కన్ దూలె నుచ్చండమై

మ. అదిగో! వచ్చె సుబాసు బోసనెడు భీతాహంబు గర్భంబులో
బదివేల్గాడిద తన్నులై మెలగ సప్తద్వీప సామ్రాజ్య సం
పద సాధించిన రాచవారలకు సింహ స్వప్నముల్ సేసె చా
లది మా జాతి చరిత్ర యందొక సువర్ణాధ్యాయమై నిల్చెడిన్

ఆ.వె. బాబు వచ్చునంచు పదివేల కనులతో
నెదురు సూచుచున్న హిందుధరణి
స్వేచ్ఛ నందుకొన్న చేతులతో నేడు
బయలు కవుగిలించి వగచుచుండె

సీ. కలుగునే మాకూర్చు కల్హార మాలకు వంగ వీరుని గళాలింగనమ్ము
ప్రాప్తించునే వీర భరతనందనులకు నేతాజి మధురసాన్నిధ్య సుఖము
చెందునే స్వచ్ఛంద సింహపీఠమునకు బోసుని పాదాల భూరజంబు
అమరునే కావ్య కన్యాసహస్రములకు యజదు పటాల నాయకుని చెలిమి

ఆ.వె. పుణ్యనదుల చల్వ భూమిదేవత చల్వ
మంచుకొండ చలువ మాకు గలుగ
శ్రీ సుబాసు బోసు సింగంబు క్రమ్మర
వచ్చి దర్శనంబు నిచ్చుగాక

# భూమిక

గుంటూరు బాలమిత్ర సమాజమువారి కోర్కెమీద నేనీ నాటకమును 1926లో వ్రాసితిని. కారణాంతరములచేత ఆసమాజము భిన్నాభిన్నమైపోయినది. ప్రదర్శనమున కెక్కక నిలిచి పోయి నేటికి దాదాపు ఇరువది వత్సరములయినది. ఈ మధ్యకాలమున నెందరో నాటక సమాజములవారు 'మాకిందు, మాకిందు, మేము ప్రదర్శింతు'మని నన్నడుగుచున్నను, తాచ్చారముచేసి, తగిన నటకులకీయక మిన్నగొంటిని. అజ్ఞాతవాసము యిప్పటికి ముగిసిపో వుటయే హేతువు.

నాటకము చరిత్రాత్మకము. హిందూ ముస్లింమైత్రిని మనస్సున నుంచుకొని నేనీ నాటక రచన కుపక్రమించితిని. ఉదయసింహుని హృదయేశ్వరి వీరాబాయి శౌర్య ప్రతాపము లిందు వర్ణితములు. కులమతద్వేష దూషితుడుకాని యక్బరుచక్రవర్తిగుణగ్రహణ పారీణత, బనబీ రుని శత్రుసంహారదీక్ష, చిత్తూరు రాజ్యనాశనార్థ మతడు పన్నిన పన్నాగములు, మొగలు రాజును వివాహమాడి తనసర్వసమతా పవిత్రాశయాన్ని ప్రకటించిన మధురాదేవి శీలము వీలయినంతమట్టుకీ నాటకమున పోషించితిని. ప్రదర్శనానంతరమున గాని యిందలి గుణాగుణములు వ్యక్తములు కావు. నాకు నిర్వచనపద్యకావ్య రచనారజ్జువు మిక్కుటమగుట చేత దీని యనంతరాన వ్రాసిన తెరచాటు నాటకము తక్క మరి నాటకాలను నేను వ్రాయలేదు. రసజ్ఞులయిన విమర్శకులు దీనికి వెలకట్టగలరు.

నా అంగీకారమును పొందక యెవ్వరును దీనిని ప్రదర్శింపరాదు. అట్లు ప్రదర్శించిన వారిపై తగిన చర్య జరుపబడును.

జి. జాషువ

## పురుషులు

1. ఉదయసింగు
2. అక్బరు
3. రాజా మానుసింగు
4. బనబీరుడు
5. అఫుజుల్ ఫజుల్
6. జయమల్లు
7. రాణా
8. మంత్రి

## స్త్రీలు

1. వీరాబాయి
2. మధురాదేవి
3. కురంగి
4. లవంగి
5. నాగవల్లి

# వీరాబాయి

ప్రథమాంకము

(సీను-బనబీరుని శయ్యామందిరము)

ఒకటవ రంగము

(బంధింపఁబడి వీరాబాయి మూర్ఛిల్లియుండును)

వీరా : (మూర్ఛతేరి దిక్కులుచూచుచు దుఃఖముతో) అయ్యయ్యో! నన్నెవ్వరు బంధించిరి? ఢిల్లీకిఁబోవుదాన నిచ్చటి కెప్పుడువచ్చితిని? నా బోయీలు, నా మేనాయు నేమాయె? కలగను చుంటినాయేమి? (లేచి నలుదిక్కులు చూచి) హా! పరమేశ్వరా! నేను నిజముగా దుర్మార్గులకుఁ జిక్కితిని. ఇది యొక శయ్యా మందిరము. నే నీ గృహమునుండి వెలువడు మార్గమేది? తలుపు లన్నియును మూయఁబడి యున్నవి. ఏమి యవమానము వాటిల్లునో! ఇది చిత్తూరునగరమో మరేమో? (సమీపమునఁ గల పటమును జూచి) ఇది కాముకుఁడగు బనబీరుని పడకటిల్లు. హా!హా! మనోహరా! ఉదయసింహా! నీ యర్ధాంగికి సంభవించిన దీనదశ నీ వెఱుంగవుకదా? నన్నువలచి తెచ్చిన యీ జార శిఖామణి నిన్ను బ్రదుక నిచ్చెనా! (దుఃఖించి) నన్ను రక్షించి నా మానము కాపాడువారెవరు? కుమారా! రాణా! నీవు భద్రముగా నుంటివా. కాదు, కాదు! నాకుమారుఁడును భర్తయును నాకింకలేరు. నేనేమి చేయుదును. (భగవంతు నుద్దేశించి) ఓపరాత్పరా! అనపరాధుల కింత కష్టములను సృష్టించిన నీకు యశమో! గౌరవమో? (బాధ నభినయించి) అబ్బా! ముప్పురిం బెనచిన యీ బంధకములు నన్ను తీవ్రముగా బాధించుచున్నవి. మహాభూతము వలె నెన్నఁడు లేని నిద్ర నాకు నేఁడేల దాపరించెను? అరిష్ట కాల మాసన్నమగునపుడు శనిగాఁడు జీవి కన్నిదెసల తాండవ మాడుచుండును.

(బనబీరుఁడు ప్రవేశించును)

వీరా : (ఉలికిపడి) ఈ కవాటము తెఱచిన చప్పుడయినది. తొలుత నాదృష్టి పథము నఁబడు వ్యక్తి పురుషుఁడో, స్త్రీయో!

బన : (వీరాబాయిని జూచి స్వగతము) ఆహా! చిరకాలము నుండి నన్ను వేధించు నా యాశాదేవతకు నేఁడు గదా ప్రతిష్ఠ, సమర్థులగు నా భటులు ఢిల్లీనౌరోజోత్స వార్థమై పోవు యీ వీరాబాయిని బంధించి తెచ్చి నాయింటఁజేర్చిరి. చిత్తూరి రాచతికమునకుఁ దోడీ సౌందర్యవతి నాకు లభించినచో స్వర్గభోగము నా దృష్టికి రేణు కల్పకమగును. (పలుకరించెదను.) దేవీ! నీసుందర స్వరూపము నకు

బానిస యగుచున్న బనబీర సార్వభౌముఁడు నీ విలాసము నాశీర్వదించు చున్నాఁడు.

వీరా : (తత్తరపడి లేచి తనలో) అకటా! యీ కాముకుఁడు నన్ను బలాత్కరించునా! (కోపముఖియై ప్రకాశముగా) ఓరీ! ఛండాలుడా! దూరముగా నుండుము. లేనిచో నీప్రాణములు నీకు దక్కవు. మగనాలినగు నన్ను మానభంగము చేయనెంచిన నీకుత్తుక నుత్తరించుట కీబంధకములు ప్రతిబంధకము లగుచున్నవి.

జన : (ఆశ్చర్యపడి తనలో) ఏమి! యీమె ధైర్యము. (ప్రకాశముగా) సుందరీ! కోపింపకుము. నేను నిన్నేమియును జేయను. నీతో ముచ్చటించి నా యభిమతమును తెలియఁజేయుటకై నిన్నిటకు దెప్పించితిని.

వీరా : దుర్మార్గుఁడా! నాతో ముచ్చటించు స్థలమంతఃపురమా? సభర్తృకలతో పరపురుషుల కేకాంత సంభాషణమేమి?

బన : ఓ కాంతామణీ! నన్ను తూలనాడకుము. నేను సార్వభౌముఁడను.

వీరా : ఛీ! ఛీ! జారుఁడా! నిన్ను తూలనాడుటయే కాదు. ఈ బంధకములే లేకున్న నీనెత్తుట నోలలాడియుందును. నన్ను విడువుడు. పురుషవేషముననున్న యో యాడుదానా! నీ సార్వభౌమత్వము మమ్ముబోటి పతివ్రతల మానభంగ ప్రయత్నమునకా యుపకరించుచున్నది?

బన : రమణీమణీ! క్రీఁగంట గౌఁగిలించి మీదట దూషించిన నా కింపుగానుండును. కల్యాణీ! ఇటు చూడుము. ఈ పాపిష్ఠి యుదయుసింహుఁడే నిన్ను వివాహ మాడకున్న నిక్కముగా నేనే నిన్నుఁ జేపట్టియుందును. నిన్ను నేను పిన్న నాటి నుండి కోరియుంటిని. ఈయనురాగము కొత్తదికాదు. నీతండ్రి నన్నొకమారు మీ యింటి కాహ్వానింపగా విందు గుడుచుచు పరిహాసముగా నిన్ను నా కిమ్మని యడుగ నెల నవ్వునఁ బదునుబెట్టిన నీ వాల్గంటి చూపు టీటె నాఱొమ్మునం గ్రుమ్మలేదా? జప్తికిఁదెచ్చుకొనుము. ఆ వలపుగాయము మానినదను కొంటివా? దిరిసెనపుఁ బూవును బరిహసించునీ నెమ్మేని మార్దవమునకు ముత్తెఁపు నీటివలె ముద్దుగురియు నీ విలాసమునకు నుదయసింహుఁడా పట్టభద్రుఁడు? పట్టభద్రుఁడే యగునుగాక నన్ను వంటి యనాది బంధువున కొక్కగడియ భిక్షచేయు టనుచితమా? భిక్షకునియెడ నింత కఠినముఁ బూనరాదు.

వీరా : ఓరీ! నీ కాముక ధర్మములు గరితలకడ నుపదేశింపకుము. ఈ యవినీతి పాండిత్యమును వెల్లడించి యెన్ని కుటుంబముల కెసరువోయ నుంటివి? ఈ విషయము నా భర్త విన్నచో నీరక్తముఁ ద్రావకమానఁడు.

పతివ్రతలమని చెప్పుకొను నీవంటి స్త్రీలు కేవలము బుద్ధిహీనలై యనర్హులగు భర్తలయం దభిమానమును వదలక మాబోటి వీరుల నలక్ష్యము చేయుట నాకాశ్చర్యముగానున్నది. ఆ యుదయసింహుఁడు చంపు వాఁడును నేను చచ్చువాఁడనా? కామినీ! నీకడ దీనాలాపము లాడినంతమాత్రమున చిత్తూరు రాజు నెంతలో వ్యర్థునిఁజేసితిని?

వీరా : నీవు పరాక్రమవంతుఁడవే యగుదువుగాక. ఇందెవరి కావశ్యకము. నాపతి పిరికివాఁడా? ఆడుదానికి వెఱచి కట్టుకట్టించి తెచ్చిన నీవు ధీరుఁడవా?

బన : ఆ ఏమంటివి? నీకు వెఱచి బంధింపలేదు. నీవు స్వహత్యకు బాల్పడెదవేమోయని.

వీరా : ఆత్మహత్య చేసుకొనుటకు నే నబలనుగాను; సబలను.

ఉ. పాపుల రూపుమాపు ననవద్య పరాక్రమ పాండితీ సము
ద్దీపిణులీ చితోద్గడ సతీమణు లీవు నెఱింగి యుందు వీ
కాపురుష ప్రయత్నమునకై ఫలమిప్పుడ చూపుదాననో
రీ పరి కామినీహరణ! యించుక నన్ను వదల్చిచూడుమీ!

బన : అట్లయిన వధింపుము. స్మరశిలీముఖములచే సగముచచ్చి యేయుంటిని. ఆ కొదు పూర్తిఁజేసి పుణ్యముఁ గట్టుకొనుము. (అని చేరబోయి) కట్లువిప్పుదునా?

వీరా : నీవు నన్ను ముట్టుకొనకుము.

బన : సరే, ఓసీ, దాసీ! యిటురమ్ము.

(ఒకదాసీ ప్రవేశించును)

బన : ఆకట్లు విప్పుము. (దాసి కట్లువిప్పును)

బన : నీవిక పొమ్ము. (దాసి నిష్క్రమించును)

బన : అదిగో ఖడ్గము (అని తలయొడ్డును)

వీరా : (కత్తినెత్తి నఱుక బోయి శాంతించి) ఛీ!ఛీ! మోహాంధుఁడయిన వీఁడు మిక్కిలి హీనతకు లోనగుచున్నాఁడు (ప్రకాశముగా) ఓ కాముక చక్రవర్తీ! నిన్ను కరుణించితిని యింతనుండి బుద్ధిగా ప్రవర్తింపుము.

బన : (సంతోషమునభినయించుచు) ఓప్రణయలక్ష్మీ! నీవే కరుణించినచో నాకు బుద్ధి రాకుండునా? ఒరులనాశింతునా? నీకీరాజ్యమునంతయును గట్టిపెట్టెదను. దేశముతోఁబాటు నన్ను బాలింపుము. నీపాద సంవాహనమున శరీరయాత్ర

నీయది, నీపై నీగ వాలనీయను నీసౌఖ్యవైభవవాల్లభ్యార్థమై దివారాత్రులు తపింతును. ఈహేమడోలికలనూగుచు, నీపూవుఁదోటల విహరించుచు నీయనర్ఘ్యమణి భూషలదాల్చి నానందకంధి నీదులాడుచు మహా రాజ్ఞివగుము. నీసెలవైనచో నేటిరాత్రి నీపతిని.... ...

వీరా : (మహాకోపమున) ఓరీ! ఏమనుచుంటివి? నాపతి నేమిచేయుదువు. కలుషకర్మతా! ఈమారుపలికిన నీ నాల్క శతధా భిన్నములుగాకపోదు. నీ రాచఱికము, నీ సామ్రాజ్యము, నీయున్నత విభవము మానవతులకు తృణ ప్రాయములు. కరుణించితి నన్నపదమున కెంతవాఖ్యానము వ్రాసితివి. దాసీకుల సంజాతుఁడవయిన నీకు రాజపదవి లభించుటచేఁ గన్నులు నెత్తి కెక్కినట్లున్నది. జాగ్రత్త. (అని కత్తి సారించుచుండును)

బన : (రౌద్రమూర్తియై) ఆ! నేనెంతబ్రతిమాలినను సాటిచేయక నోటికి వచ్చినట్లు ప్రేలుచుంటివి. ఓసీ నీకిపుడు దిక్కెవ్వరు?

ఉ. సామముచేత నాకిటవశంవదవయ్యెద వన్నయాసమై
నీములుకుం దురూక్తులు గణింపమిఁ గ్రొవ్వి తిరస్కరింతువే
భామిని! చూడుమింక బలవంతముగాఁ బయికొందువేడుకొ
మ్మేమగఁడడ్డమో తెలుపవే గురుమీనవిలోచనీ మణీ!

(అని పైకిఁబోవ వీరాబాయికత్తి విసరుచు)

వీరా : ఓరోరీ! బనబీరుఁడా ఈమారుచచ్చితివి.

(తెరలో)

ఓరోరీ మాతృద్రోహి! అంబికా సమాన చరిత్రయగు మావీరాబాయినా నీవాసించితివి? నీయహంకారమును గుండమున వ్రేల్చెదను. నిలువుము. (అని తలుపులు పగులగొట్టి జయమల్లు ప్రవేశించును.)

బన : (తత్తరపడుచు) మోసమువచ్చినది. నేనికఁబాఱిపోయెదను (పాఱిపోవును)

(అవనిక పడును)

## రెండవ రంగము

(సీను–ఢిల్లీపురము నౌరోజోత్సవ రంగము)

(కురంగియను చెలికత్తెతో స్త్రీవేషధారియై అక్బరు ప్రవేశించును)

అక్బ : (దిక్కులు వెదకుచు) కురంగీ! నేటి యుత్సవమునకు జయపురాధీశ్వర పుత్రి మధురాదేవి వచ్చినదని తెలిసినది. నీనేర్పు నెఱపి యెట్లేని యా లతాతన్విని నాకడకుఁదేవలయును.

కుర : చిత్తము, నేనుపోయివచ్చెదను. మీరిందుండుడు. (అనిపోవుచుండ)

అక్బ : (పిలిచి) కురంగీ! యొక్కమాట; యిటురమ్ము; మాటలమధ్య పాదుషాయని పొరబాటున బలికెదవేమో? అవునుగాని పేరడిగిన నేమని చెప్పెదవు?

కుర : మారాణిగారని చెప్పెదను.

అక్బ : సరోజనీదేవియనియు నుత్సవదర్శనార్థమై దక్షిణదేశమునుండి వచ్చినదని చెప్పుము. పొమ్ము

కుర : సరే! (కురంగి నిష్క్రమించును)

అక్బ : (తనలో) మొన్నటి యుద్ధమున జయపురపతి నాకుఁ బాదాక్రాంతుఁడై నాకుఁ గూతునిచ్చెదనని వాగ్దానమిచ్చె. ఈ వివాహము హిందూముసల్మానుల మైత్రి కెంతయు ననుకూలించును. ఈహైందవ బాంధవ్యము నాకీర్తికి వన్నెబెట్టకపోదు. నా జీవన మనేకుల కాదర్శప్రాయమై నూతనజ్ఞాన జ్యోత్స్నఁ బ్రకాశింపఁజేయఁ గలదు. నేఁడీ కన్యతో భాషించి హృదయమును బరీక్షించెదను. (తొంగి చూచి) అదిగో! ఆవచ్చెడునది మధుర; భళి! భళీ! కురంగీ! నీవేచమత్కారిణివి? ఓహో! ఈ ముగుదసోయగమెంత రమణీయముగా నున్నది. ఈ రమణీమణిని నాకు బట్టపుదేవినిగా నొసంగనున్న సూర్యభగవానునకు సహస్ర నమస్కారములు.

తే.గీ. మరుని చిగురాకుఁగత్తిని మచ్చరించు
ముదితనెమ్మేని సౌందర్యమున జనించి
మా పరమపుణ్యవశత ఢిల్లీ పురానఁ
బారుచున్నది క్రొత్త లావణ్యగంగ

నేనిట దాగియుండి యీామె పలుకు లాలించెదను.

(అని యొక చోట నక్కియుండును)

కుర : అమ్మా! మీరిందుండుఁడు నేనుపోయి మాదేవిగారిని బిలుచుకొని వచ్చెదను. (కురంగివెళ్ళిపోవును.)

మధు : (స్వగతము) ఆహా! యీ ఢిల్లీపుర వైభవంబు నేమని తలంతును. ఇదికదా హస్తిన. పాండవేయాది వీర భుజాభి రక్షణంబై, శ్రీకృష్ణ భగవానుని పాదవిన్యాసమునఁ బవిత్రవంతమై, వ్యాసకావ్యామృత వృష్టియందు మునిఁగితేలి భరతవర్షమునకు నిరంతరయశము నార్జించిన నగరరాజమును నేఁడుగదా కనులారఁ గాంచితిని. ఈ పురపాలకుండగు నగ్బరుచక్రవర్తి కడురూపవంతుఁ డనియు, శూరాగ్రేసరుఁ డనియు వినియుందును. మాతండ్రి నన్నీ ఢేని కీయనున్నాఁడట. చిత్తరువున నా మహానుభావునింజూచుటాది నామనంబేలనో పాదుషాయందు లగ్నమైనది.

అక్బ : (వెడలివచ్చి) దేవీ! ధన్యుఁడనైతిని. (తిరిగి దాగియుందును.)

మధు : ముఖాముఖింజూచు భాగ్యము లభింపదాయను నాసచేత నుత్సవదర్శన మిషచే నిటకుఁ జనుదెంచితిని. నాకా సుందరపురుషుని దర్శనమెట్లు కల్గును. ఎవరితోఁ జెప్పుకొందును. (కొంచెముతాళి) పరమ దయార్ణవుండగు పాదుషా నన్ను నిజముగా వివాహమాడినచో నాకేమి కొదువ? అవధిలేనిసౌఖ్య సామ్రాజ్యమును హాయిగా ననుభవింపఁగలను. కాని, యీ మతాంతర వివాహమున సాటిరాజన్య కాంతలలో నాకపకీర్తియని విచారించెదను. (తలయూచి) నిష్కళంక ప్రణయదేవత వధూవరుల నిరువురిని వశీకరించినపు డెక్కడి మతము? ఎక్కడి కులము? విద్యాకీర్తికాంతలు తమంతవలచి యక్బరుచక్రవర్తిని వెన్నాడి తిరుగుచుండ నే నేల వెనుదీయవలెను? అజ్ఞాన వాదులగు పూర్వాచారపరాయణుల లెక్కచేయనేల? పురాణయుగమున నెన్ని వర్ణసంకర వివాహములు జరుగవు? (పారజూచి) అదిగో! కురంగి తన రాణింగొని వచ్చు చున్నది.

(అక్బరు కురంగులు ప్రవేశింతురు)

అక్బ : ముద్దరాలా! నీవు జయపురాధీశ్వరుని కుమారితవు గదా?

మధు : అవును. మీరు నన్నెట్లెఱుంగుదురు?

అక్బ : (కౌగిలించుకొని) మధురా! ఎంతలో పెద్దదానవయితివి? నీవు మూడేండ్ల దానవయి యుండగా నాపతితో తీర్థయాత్రార్థమై పోయివచ్చుచు నేను మీ యింట నొక వారము బసచేసితిని. అప్పుడు మీయన్న మానుసింగుఁడే డేండ్లవాఁ డు. నీవు నన్ను గుర్తింపజాలవు. మధురా! మీ జననీజనకులకు సేమమా?

అక్బ : నేను నుత్సవమునకే వచ్చితిని. నేటి యుదయమున నీ మేనాబోయీలు మా కురంగితో ముచ్చటించుచుండ జయపురమను మాటవిని యందొకనిఁ బిలిచి నీరాకను వారివలనఁ దెలిసికొంటిని. మధురా! నాకొక ముద్దిమ్ము. చిన్ననాఁడు నిన్నుమోసి ముద్దులాడినదానను నన్ను పరాయి పడంతినిగాఁ దలంపకుము. (అని కౌగిలించుకొని ముద్దు బెట్టుకొనును) మధురా! నీకు వివాహమెప్పుడు నిశ్చయించిరి? ఎవరికిచ్చెదరు? నీ పెండ్లినాఁడు నన్ను బిలువుమని మీతల్లితోఁ జెప్పితిని. నేను తప్పక వచ్చెదను.

మధు : (సిగ్గు నభినయించును)

అక్బ : మధురా! యిక్కడ నెవ్వరును లేరు. సిగ్గుపడకుము. నేనును నీకుఁ దల్లివంటి దానను. మధురా! చెప్పవా!

మధు : అ... క్బ... రు... (అని గోళ్ళు గిల్లుకొనును)

అక్బ : (తనలో నవ్వుకొని కోపము తెచ్చుకొని) ఎవరికీ! అక్బరు చక్రవర్తికా? మహ మ్మదీయునకా? అయ్యో! అయ్యో! యిదేమివింత? నాతో పరిహాసమాయేమి మధురా?

మధు : అమ్మా! పరిహాసము కాదు వాస్తవమే?

అక్బ :

ఉ. కొంకక యాలఁజంపితిను క్రూరతురుష్కులె రాచవారి వి
య్యంకులు నేటినుండి యకటా! యిదియెక్కడి చిత్రగాథ!
పంకజలోచనీ! ధరణిపై రసపుత్రి యశోంబురాశి ని
ట్టింకులు సేయ నీజనకుఁ డెక్కడదాపరమయ్యె నియ్యెడన్

చీ! చీ! కులభ్రష్టవయిన నీతో భాషించుట మహా పాతకము (అని పోవుచుండును)

మధు : (తిరుగఁబిలిచి) అమ్మా! శాంతింపుము. నా అభిప్రాయమును పూర్ణముగాఁ దెలిసికొని మీదట కోపింపుడు.

అక్బ : తురక చుట్టఱికమేకదా? నీ యభీప్సితము.

మధు : అయిననేమి?

అక్బ : తురకవానిం బరిణయమయిన నీకు సాటివారిలో నపఖ్యాతిగదా? నీకేకాదు మమ్ముబోంట్ల కెల్లరకును తలవంపులుగదా!

మధు : (తనలో) ఈమెకు నా నైర్మల్య హృదయ నిశ్చయమును వెల్లడించెదను.

నేనొక నూతన ధర్మమును లోకమున వెలువరించి కొండొక ఖ్యాతిని గడింతునని విశ్వసించుచున్నదాన. కాకున్నను అక్బరుచక్రవర్తిదయా గాంభీర్యపయోనిధి యనుటయు, పరాక్రమ గాంగేయుఁడనియు విన్నదాది నామనం బాయనతో నేకీభవించినది. ఈ ప్రణయబంధమునుండి నేను వెలువడజాలను. దాచనేల! వినుము. శరీరములు దూరములయి యున్నను యొండొరుల కౌగిలించుకొంటిమి. ముద్దాడికొంటిమి. నిక్కముగా నేనాతని దానను, చక్రవర్తి నావాఁడు. నీవంటి వెడగువాదుల బోధలకులొంగి మా జననీజనకులు నన్నుఁ దనకీయ తెగింపకున్నను నేనే స్వయముగావచ్చి పాదుషాపాదము లాశ్రయించెదను. నన్నడ్డుపెట్టువారెవ్వరు?

ఉ. ఆయన సార్వభౌముఁడు మతాంతరుఁడేయగుగాక సంతత
న్యాయవిదుండు, సంగరధనంజయుఁడట్టి మహానుభావు న
న్యాయముగా తిరస్కృతి యొనర్పకుమమ్మ! సరస్వతీమనో
నాయకుఁడస్మదీయ వదనంబున వ్రాసినయంతతప్పునే?

అక్బ : (తనలో)

ఆహా! యీయనవద్యగుణాకర, యీపవిత్రప్రణయ విగ్రహము, యీ యదంభతత్వ విద్యాకల్పవల్లిక నిక్కముగా నాసొమ్ము. ఈ జ్ఞానయోగినీలోచన ప్రపంచమున శుద్ధసాత్త్విక తరంగిణులు ప్రవహించుచున్నవి.

సీ. కులమత ద్వేషము ల్ఘోరభూతంబులై యొండొంటితోఁ బోరుచుండినపుడు
పరులసంపదలకో ర్వని స్వాభిమానంబు కారము మిరియాలు నూరునపుడు
అఘముకల్పనఁజేయు నపకారదేవత స్వేచ్ఛగా రాజ్యము సేయునపుడు
కూటికై పడియుండు క్షుక్షింభరిత్వంబు మితిమీరి తనువులమ్మించునపుడు

తే.గీ. ధర్మదేవత మూడుపాదములుదునిగి
యొంటిపాదాననల్లాడు చుండినపుడు
ధరణి విజ్ఞానమునకెందు తావులేక
యీ సరోజాక్షి నిట్లాశ్రయించెనేమొ!

ఈమె పలుకులలోని సుధామాధుర్యము నన్నింకను విషమ పరీక్షకు బురి కొల్పుచున్నది. (ప్రకాశముగా) మధురా! నీయపూర్వ నిర్మాణగాథా ప్రపంచమున నాకు దిక్కు దోచుటలేదు. నీతో వాదించుటకును విరమించు టకును నాడెంద మీయకొనకున్నది. పోనిమ్ము యొకవేళ పాదుషాయే–నీవు ముమ్మారు ముద్దుగొన్న పాదుషా...

మధు : (ఉలికిపడి జుఱజుఱఁజూచి) ఎప్పుడు ముద్దుగొంటిని అమ్మా! నీవు నన్నుడికింప సాగినట్లున్నది.

అక్బ : ఇంతకుముందు నీవు చెప్పలేదా?

మధు : ఓహో! అది నా హృదయ చుంబనము. దానిని ప్రత్యక్ష చుంబనముగా లెక్క చేయుచున్నావే?

కుర : (జనాంతికముగా) ఈ వెఱ్ఱిపడుచున కింకను భ్రమ తొలంగనట్లున్నది.

అక్బ : మధురా! హృదయమున ముద్దుగొన్నదానవు ప్రత్యక్షముగా నయిన ముద్దాడ కుందువా? ఈ యుత్సవ కాలమున నదియును జరిగియే యుండును. ఏమో యెవ్వరెఱుఁగుదురు. ప్రయాసపడి ఢిల్లీకివచ్చినదానవా రవంతకు వెనుదీయుదువా?

మధు : (తనలో) ఓహో! ఈమె నన్ను మెల్లగా పరిహాసరంగమున బ్రవేశపెట్టుచున్నది. (ప్రకాశముగా) అమ్మా! మీతో మర్మము విడిచి భాషించుటచేత నన్ను చులకన జేసితిరి. మీప్రసంగమునుబట్టి నాగుట్టు బయటబెట్టవచ్చిన టక్కరి రాచపడంతి వలె తోచుచున్నది. కానిండు.

అక్బ : (నవ్వి ముద్దు బెట్టుకొని) మధురా! మీతల్లిదండ్రులతో నాకుఁగల చనవున నింతగా మాటలాడ సాహసించితిని. నీ వేమనుకొనకుము. రేపు నేను లేని పెండ్లి నీకు జరుగునా? నీ తల్లి నేను లేక నీ వివాహ ప్రయత్నము చేయునా? మధురా! యింతకుఁ బాదుషా దర్శనము లభించినదా?

మధు : ఈ స్త్రీ మండలమున నతని దర్శన మెట్లుగలుగును?

అక్బ : అట్లయిన నీ ప్రయాసము వ్యర్థమే? మధురా! నీకొక యుపాయముఁ జెప్పెదను వినుము. ఈ కురంగిని ప్రార్థించినచో నీకాతని నెట్లయినఁ జూపఁగలదు.

మధు : కురంగికెట్లు సాధ్యము.

అక్బ : కురంగి నాదాసికాదు; పాదుషా దాసి.

మధు : (కురంగిని బిలిచి) ఔరా! మరి నాతో నసత్యమాడితివేమి?

కుర : అవునమ్మా! నే నసత్యము పలుకలేదు.

మధు : సరోజినీ దాసి నంటివే?

కుర : అవును. ఇం దసత్యమేమున్నది. సరోజినీదేవి ఎవరనుకొంటివి?

మధు : ఎవరు?

కుర : పాదుషా చెల్లెలు. మీరీమె దర్శనముచేసిన పాదుషాను చూడనవసరము లేదు. స్త్రీ పురుషభేదముతప్ప వీరిరువురు నొక్కరూపే.

మధు : (విభ్రాంతిపడుచు తనలో) ఆహా! నేనెంతగా వంచింపఁబడితిని. ఈ పన్నుగడ పాదుషా కల్పితమో మరేమో తెలియదు.

ఉ. ఈమె పరాయిరాజహృదయేశ్వరిగాఁ దలపోసి మన్మనో
ధామమునందు గుప్తముగ దాచినమర్మము వెల్లడించి యే
మేమొ వచించితిన్ హరిహరీ! యిపుడేమని తప్పుకొందు యీ
(కొంచెము సంశయించి)
చామ, స్వరంబునందు! బురుషత్వ మొకింత తుఱంగలించెడిన్.

కాకున్న నగ్బరుచక్రవర్తికిఁ జెలియండ్రు కలరా?
(సరోజిని కురంగిచెవిలో నేమోచెప్పును.)

కుర : (చేరవచ్చి) అమ్మా! ఈమాటలు నిజముగా విశ్వసించితివా? మాదేవిగారు పరిహాసమున కట్లనిరి గాని పాదుషాకు చెల్లెండ్రుగలరా?

అక్బ : (సమీపించుచు) అయ్యో! పిచ్చిమధురా! నేను పాదుషా చెల్లెలునుకాను (అని పట్టుకొనఁబోవ దూరముగాబోయి)

మధు : నీ వెవరయినను సరే! నన్ను ముట్టుకొనకుము.

అక్బ : ముట్టుకొన్ననేమి?

మధు : ఏమో నీచరిత్ర నాకు సందేహముగా నున్నది.

అక్బ : మధురా! నన్నువిశ్వసింపవా! నావంకచూడుము.

మధు : విశ్వసింపను.

అక్బ : ముమ్మాటికి

మధు : ముమ్మాటికేకాదు, వేయిమారులకు

అక్బ : అట్లయిన నేనే పాదుషానైనచో నింతకు ముందు జరిగిన కౌఁగిలింతలు, ముద్దులు నేమగును.

మధు : స్త్రీలు పాదుషాలెట్లగుదురు?

అక్బ : (నవ్వుచు) నీభువనమోహన సుందరవిగ్రహమునకు దాసుఁడై యక్బరు నిజముగా స్త్రీయేయయినాఁడు.(అని స్త్రీ వేషమును దీసివేయును.) మధురా! మఱొక ముద్దిమ్ము

(మధుర ఆశ్చర్యబిడియములతో నవ్వుచు నిష్క్రమించును.)

అక్బ : కురంగీ! మనమిక పోవుదమురమ్ము. (అక్బరు కురంగులు నిష్క్రమింతురు)

మూడవ రంగము

(సీను-ఉదయసింహుని సభామందిరము)

(ఉదయసింహుఁడు, బేదునూరు జయమల్లుఁడు, మంత్రి పీఠముల నలంకరించి యుందురు.)

ఉద : బేదునూరు మహీతలేంద్రా! చిత్తూరు వీరులు నాకుఁ బ్రసన్నులై సమర్పించిన రాజ్యలక్ష్మి కన్న దురాత్ముఁడగు బనబీరుని చేఁజిక్కిన నా సతీ మానసం రక్షణముచేసి నా కర్పించిన నీయుపకార ముత్తమోత్తముగాఁ బరిగణించు చున్నాఁడ. నీకు నేను జన్మాంతముఁ గృతజ్ఞుండను. నేటికి నా చిత్తమున శాంతి నెలకొనినది. అభిమానధనులగు మన రాజ్యప్రజల కింపుసేయు సత్పరిపాలన మున కుద్యుక్తుఁడ నయ్యెదను. కాని ఢిల్లీ పురాధీశ్వరుండయిన యక్బరు చక్రవర్తి చితోడుపైఁ గన్నువేసినట్లు తెలియుచున్నది. కలనైనఁ దనరాజ్యము నకుఁ గీడుతలంపని మనపై నేనెపమున నెత్తిరాగలఁడు.

జయ : పాదుషా ధర్మజ్ఞుఁడు. నిష్కారణముగా కయ్యమునకు నిలువఁడు. కాకున్న నాసేతుహిమాచల పర్యంత మహీమండలము నేకచ్ఛత్రముగాఁ బాలించు చక్రవర్తి యీ కొద్ది రాజ్యము నభిలషించునా?

మంత్రి : మీరట్లనకుఁడు; రాజుల రాజ్యతృష్ణ కంతమెక్కడిది? స్వాధీనములుకాని రాజ్య ములపై చక్రవర్తులకు వలపు మిక్కుటము.

ఉద : (యోజించి) మంత్రీ! మరచితి. మరచితి. రాజ్యభ్రష్టుఁడయిన బనబీరుఁడుండ లేదా? ఆతఁడీమధ్య ఢిల్లీకిఁబోయెనని తెలిసినది. ఘాతుకమతియగు బనఁబీరుఁ డు పాదుషా యాప్తిత మీడేరుట కేదేని వింత నాటకమును సృష్టింపఁ గలఁడు. మాయా కల్పనమున నతఁడద్వితీయుఁడు.

జయ : ఉదయసింహమహీపాలా! క్షమింపుఁడు. ఇది పిఱికి ప్రసంగము. బనబీరుఁడు ఢిల్లీకిఁ బోయినం బోవనిండు. వేయిమంది పాదుషాలతోఁ గుట్రలుపన్నిన పన్ననిండు. సహస్రనేత్రములతో చితోడు సంరక్షణము చేయు మముబోటి వీరులుండగా! యేల యూరక యులికిపడియెదరు? అసంఖ్య సేనల కధిపతియగు నగ్బరునకోడి రాజ్యము నతని పాలొనర్పుమనియా మీ సందేశము.

సీ. కుంభరాణారాజకుంభి నిర్భయలీల కారాడి చన్న కాంతారసీమ
రసపుత్రరక్తవర్షములు కాల్వలుగట్టి ప్రవహించినట్టి దివ్యస్థలంబు
పద్మినీదేవ్యాది భామామణుల నెల్ల నాహుతిం గొన్నట్టి యజ్ఞభూమి
చెంగలించుచు భీమ సింగు సింగఁపుబిల్ల గర్జిల్లి యున్న సంగ్రామధరణి

తే.గీ. శత్రురాజుల వదన దేశములమీద
దృష్టినిల్పని ఘనపురంధ్రీలలామ
మిట్టి మనరాజ్యమునకు ముందెన్నఁడేని
లేని దుర్గతి నూహింపకో నరేంద్ర

ఉద : (తనలో) ధన్యోస్మి! ధన్యోస్మి! కుంభరాణా సంగరాణాది మహావీరుల భుజా స్తంభముల నెక్కిన చిత్తూరు రాజ్యలక్ష్మి నీకు దీర్ఘాయువగును గాక! అట్టి వీరాధివీరుల వంశమున బిఱికిమానిసినయి పుట్టిన నన్నేల వరించితివి. ధీరుఁ డగు జయమల్లుని వీరవాక్యములకు నాదేహ ముప్పొంగుచున్నది. ఇతనినింక నిట్టి ప్రసంగమున దించి వీని శౌర్యస్థైర్యములను బరీక్షించెదను. (ప్రకాశముగా) జయమల్లూ! నీవు పల్కినది వాస్తవమేకాని యెదిరిశక్తి సామర్థ్యములను మన మరయవలయునుగదా? అక్బరుండఖండ ప్రజ్ఞానిధి. యొకసాటి రాజాతనిఁ గలన నోడింపఁ గలఁడా? ఈ మధ్యఁ బాదుషా నెదిరించిన రాజన్యులు సామాన్యులనుకొంటివా? వారిగతియే మయ్యె! పాదుషా మనపై కెత్తిరాకున్నఁ జెప్పఁజాలను గాని వచ్చినచో మన పని సున్న.

ఉ. సూర్యసమాన తేజుఁడగు జోదుసుమీ మొగలాయిఱేడు, దో
ర్వీర్యఖనుల్ జమూపతులు వెన్నిడ పారెడు మేకపోతు గాం
భీర్యము స్వప్నమందుఁ దలపెట్టని నిశ్చల ధైర్యమందరా
హార్యులు బంటులట్టి విభవాఢ్యునితోఁ గలహంబు సెల్లునే?

నీ పడుచుదనం బగ్బరుని సేనా విభవమును లెక్కసేయ కున్నది.

జయ : (స్వగతము) అకటా! ఈపిఱికిరాజు నీశ్వరుఁడు చిత్తూరునకేల సమకూర్చె. ఈతని కతమున రసపుత్రుల కెన్నఁడు లేని కళంకము వచ్చుచున్నట్లున్నది. ఒకవేళఁ బాదుషా దండెత్తివచ్చినచో యీ భీరుని ఱేనిగాఁగలిగిన మా సరదారు లెంతని పోరఁగలరు. ఈశల్యసారథ్యముతో మాయోధులు నిరుత్సాహులు కాకుందురా? శృంగార వీరమాల యవతారమగు వీరాబాయి వంటి పరమ పతివ్రత కీతఁడెక్కడ దాపరించెను. ఇతనితో ప్రసంగము కోపకారణము (ప్రకాశముగా) రాజా! సమర మాసన్నమయిన బలాబలసంపదలు వెలువడక

మంత్రి : వీరుఁడా! రాజేంద్రునివాక్యములు శత్రుస్తవములు కావు. ఇవియును విచారణీయాంశములే!

జయ : (కోపమున మంత్రితో) పొట్టకూటికై ముఖప్రీతి కొడిగట్టకుము. రాజ్యాభిషిక్తుఁడయిననాఁడే రాజుగారికీ పిఱికిదయ్య మావహించినది.

ఉద : ఔనౌను. నాకు నిజముగా పిఱికిదయ్యమేపట్టినది.

జయ : ఏలినవారి సంశయమే ఫలించినచో;

ఉ. ఊపిరిగొంతులో నిలిచి యుండినఁజాలు మహీతాంధ్ర ఢి
ల్లీపతిసేనలన్నుఱిమి! లీల చితోడ్గడ రాజ్యలక్ష్మిని
న్నీ పరముంబొనర్చుటకు నేనొకరుండనెచాలువాఁడ బా
హా పటిమంబు జెప్పి కొన నయ్యెభవద్భయకారణంబుగాన్

(అని నమస్కరింప నుదయసింహుఁడు పీఠముడిగ్గి కౌఁగిలించుకొని)

ఉద : శూరాగ్రణీ! నీదేశభక్తికి మెచ్చితిని. నీవంటి విక్రమ గాండీవుల నెందరినో కని మన చిత్తూరు శాశ్వతకీర్తి నందు గాక! నీమనస్థైర్యమును బరీక్షించుట కట్లంటిని గాని పావనంబైన రసపుత్ర వంశసంజాతుఁడనయిన నేను కయ్యమునకు వెఱతునా?

జయ : పార్థివేంద్రా! అట్లయిన మారాజ్యము పూజ్యముగాకపోదు. నేను ధన్యుఁడను. మాతల్లి వీరాబాయి వీరపత్ని! చిరకాలార్జితమగు రసపుత్రుల కీర్తిడిండిమ తేజరిల్లును.

(అందరు నిష్క్రమింతురు)

నాల్గవ రంగము.

సీను- (అరణ్యము)

(దుఃఖముఖుఁడై బనబీరుఁడు ప్రవేశించును)

బన : కటకటా! నావంటి మందభాగ్యుఁడు విశ్వప్రపంచమున మరియొకఁడు లేఁడు. పేదకు పెన్నిధానమువలె చిత్తూరు సామ్రాజ్యము నాకు లభించినపుడెంత మిడిసిపడితిని. సుఖదుఃఖములయందు పూర్వ పశ్చిమ పర్వతముల నధిష్టించితిని. (తాళి) ఆహా! ఎంతద్రోహము. ఎంత కృతఘ్నత. నా యుప్పుపులుసు తిని నాకొంప కెసరుబోసిన పాషాణ హృదయులగు చిత్తూరు వీరుల మహాపకారము నీజన్మమున మరువగలనా? తడిగుడ్డతో నా కుత్తుక కుదివేసి నన్నంతులేని విషాద పాతాళ గహ్వరమున త్రోబడవేసి

యుదయసింహునకు పట్టముగట్టు దుష్టయత్న మీషణ్మాత్ర మెఱుంగనైతిని. ఈవేదనారథము నన్నగాధకూపముల కీడ్చుకొనిపోవుచున్నది. ఈప్రళయ వేదనా జంఝూమారుత మెట్లు శాంతించును. దీనికి మార్గమేది? (తలయూచి) ఆ నీచుండగు నుదయసింహుని సపుత్రకళత్రముగా నిర్మూలించి నగదా శాంతించును. ఆపాపిష్ఠి పన్నాదాయి నాటిరాత్రి యా రాజపశువును స్థలాంతరమున దాచకున్న నేఁడీ దుర్గతినాకురాదు. ఓసీ! పన్నాదాయీ! చిరకాలమునుండి చితోడ్గడపాలనా చక్రమును కౌశలముమెఱయ నడపుకొను నాకన్న గవ్వకుఁగొరగాని యుదయసింహునియందు నీకు దోచిన సుగుణమేమీ? (పండ్లుగొఱికి) కానిమ్ము. దీనికి ప్రతీకారమే చేయఁజాలఁడా బనబీరుఁడు. (రాజునుద్దేశించి) ఓరీ! యుదయసింహపశూ! నీ నెత్తురుబొట్టు నాలలాటమునఁ దళుకొత్తుటకు నీప్రాభవంబు నేటిపాలు చేయుటకు, నీ నగర వైభవము భస్మరాసులలో నంతర్ధానమందుటకు. నీ యంతిపురమున భీమధూమము లుప్పతిల్లుటకు సమర్థంబయిన యభేద్య మాయావ్యూహ మును పన్నుటకిదే నీ గర్భశాత్రవుఁడు కంకణముఁ గట్టుకొనుచున్నాఁడు. నా హృదయమున భయంకరముగాప్రజ్వరిల్లు పరాభవ దవానలజ్వాలలు నీ పౌరకాంతల యశ్రుధారా వాహినులగాని జల్లారవు. చిరకాలమునుండి చిత్తూరు రాజ్యసౌఖ్యమును సపుత్రమిత్రబాంధవంబుగా చూరలాడు నన్ను మహారణ్యములపాలు జేసితివి. నిర్ధయుండవై నాచిత్తము నగల్చితివి. నా జీవన చరిత్రనేటితో నంతరించుగాక! సర్వలోకములు నన్నాచంద్రార్కము బ్రువ్వదిట్టుగాక! కాలయముఁడు నన్నగ్నిగంధక కుండములనిడి దహించుగాక! ఏమయిననగుగాక. కాక పోవుగాక, యొకవిషాద నాటకమునకు భరతవాక్యము పఠింపవలె. హాహారావములు ప్రభవింపవలె! శత్రుక్షయముకావలె, నాకసితీరవలె! నాకింక రాజ్యమువద్దు, సౌఖ్యమువద్దు. గౌరవముతో నాకుఁ బనిలేదు, అభిమానమునకు నాకుఁ గడుదూరము, ఆహార నిద్రలు నిమిత్తమాత్రములు, విశ్రాంతిఁగోరను, నిక్కముగా నేటినుండి బనబీరుఁడు లేఁడు. ముమ్మాటికి లేఁడు. పూర్వము సార్వభౌముండయిన బనబీరుఁడిప్పుడు దాసుఁడు. నాహృదయసింహాసనమున ప్రతీకారదీక్షకుఁ బట్టము గట్టుచున్నాను. ఓ విరోధమా! నా మధురమోహన ద్వేషమా! నాపై రాజ్యము సేయుఁడు. ఈ మహోద్యమ స్యందన చక్ర సంఘట్టనమున నాకు మరణమే ప్రాప్తించుగాక. వెనుదీయను. వెనుదీయను (కొంచెము తాళి) నేను కృతార్థుఁడనగు మార్గమేమి? (విచారించి) భళి భళీ! చక్కనియూహ తట్టినది. జయపురరాజు ఢిల్లీ చక్రవర్తి కిటీవలఁబిల్లనిచ్చి చుట్టరికము నెఱపెనని వినియుంటిని. మానుసింగు

దూషించి యగ్బరుని విరోధియగు మహమ్మదుఖానుతో చెలిమి చేయుచున్నట్లు మృషావిషయములను సృష్టించి యమోఘమయిన విరోధమును రవులుకొల్పెదనుగాక. ఇదియే నా యిష్టా ర్థసిద్ధికిఁ దగిన సోపానము.

సీ. చిత్తూరు సామ్రాజ్య సింహాసనముక్రింద విషగ్ని శిఖలుద్భవించువఱకు
యుదయసింహుని మేనిముదురునెత్తురుజల్లుబహుముఖంబులఁజిందిపాఱువఱకు
రసపుత్రశుద్ధాంత రామామణులఘోష శ్రుతిమార్గయుగళంబు జొచ్చువఱకు
పడఁతివీరాబాయి పసుపుఁ గుంకుమ సిరి పుస్తెతోఁదెగి ముండమోయువఱకు

తే.గీ. మృత్యుదేవత రణసీమ నెల్లకడలఁ
బీన్గుపెంటలపైఁ దాండవించువఱకు
దాయమన్నీలకుత్తుక ల్గోయువఱకు
నిశ్చయంబుగ నాకింక నిదురరాదు.

(నిష్క్రమించును)

# ద్వితీయాంకము

ఒకటవ రంగము

(సీను-ఉదయసింహుని శయనాగారము)

(నిద్రించు భర్త పాదము లొత్తుచు వీరాబాయి శయ్యపై గూర్చుండియుండును)

వీరా : (స్వగతము) నేటికి మూడు దినములనుండి నాకుడి కన్నదరుచున్నది. దీన మా కెట్టివిపత్తు వాటిల్లునోయని హృదయము కలవరపడుచున్నది. ఓ పరమేశ్వరా! నీ సంకల్పమున మా భావి పరిణామదశకు శరణ్యమగునది సుఖమో! దుఃఖమో!

సీ. పుట్టింపగలవు నిప్పుకల కుప్పలమంట దరిలేని జలధి మధ్యంబునందు
కల్పింపగలవు మేఘములేని పిడుగుల నవధిలేనట్టి బ్రహ్మాండమందు
కావింపగలవు చిక్కని సుధారసధార కోడెత్రాచుల ముని కోరలందు
సృష్టింపగలవు దాక్షిణ్య పుణ్యగుణంబు నలిగిన పురిటి బెబ్బులులయందు

తే.గీ. తల్లి పిల్లలనడుమ నంతంబులేని
ఘోరతర విరోధము రవుల్కొల్పఁగలవు
చెలిమి చేయింపఁగలవు రక్షింపఁగలవు
యేమిచేయవు! నీ చిత్త మెవ్వఁడెఱుఁగు.

ఎట్టి యాపదలకయిన నేను తల యొడ్డగలనుగాని నా ప్రాణనాథునకు గాని నీ వొసంగిన మాయొక్క మొగ నలుసునకు గాని సంభవింపకుండఁ జేయుము. (భర్త వంకజూచి) మన్నాథున కెంతలో నిద్రపట్టినది. నేనికశయనింతును (అని లేవబోవ)

ఉద : (ఉలికిపడిలేచి) ఆ. ఆ. ఆ. చచ్చితి, చచ్చితి! ఓయీ నన్ను చంపకుము, నేననపరాధిని. అనపరాధిని.

వీరా : (భర్తను గౌఁగిలించుకొని) నాథా! ఇదియేమి? భయపడకుడు. నేను నీ యర్ధాంగి నిందేయున్నాను.

ఉద : (గడగడ వడకుచు దిక్కులు చూచుచుండును.)

వీరా : మనోహరా! ఏమిప్రమాదము? ఇది మన శయ్యాగారము. ఏమికలగంటిరి. అయ్యో! అయ్యో! ఇట్లువణకుచున్నారేమి? (దేహమంటి) మేనముచ్చెమటలు చిమ్మినవి.

ఉద : ప్రా–ణే–శ్వ–రీ–, ప్రా–ణే–శ్వ–రీ.

వీరా : నాథా! సెలవిందు, నీసతీమణి నిందేయుంటిని.

ఉద : ఒకవ్యక్తి! నాఱొమ్ముపైఁగూర్చుండి, “యోరోరీ! యుదయసింహా! యిదే కాచుకొమ్మ”ని పెద్ద బల్లెముతో నాగుండెలలో పొడిచినట్లు కలగంటిని. నాకల వ్యర్థము కాదు. దీనికేమిగతి?

వీరా : (తనలో) నాయపశకునమున కీదుస్వప్నము దోహదముచేయుచున్నది. సహజముగా పిరికిమానిసి యగు నా యాత్మేశ్వరు నెట్లు ధైర్యపరపఁగలను.

(తెరలో)

ఉ. క్రూరములైన బాణములకుం బలిపెట్టెదరోరి నిన్ను నీ
వారిని వారి బంధుగుల రివాజలోచనుఁ డడ్డమైన, ని
ద్రారతినున్న నాయనుఁగు తండ్రిని దొంగవిధానఁ దాకి, దో
స్సారముఁ జూపవచ్చితివె? చచ్చితివింక నళీక పౌరుషా

(పై పద్యమును జదువుచు పట్టారాణా ప్రవేశించును)

పట్టా : ఓరోరీ! చోరుఁడా! రసపుత్ర సింహకిశోరము పట్టారాణా నీప్రాణముల నపహరింపక మానఁడు. నేటితో నీ తల్లికి నీవు లేవు. (అని కోపదృష్టులు బ్రస రించుచుండ వీరాబాయి చేరవచ్చి)

వీరా : నాయనా! ఇదేమిరా! నీవేల నిద్రలేచితివి?

సర్పమునకు మృష్టభోజనము గావించెదను. (వీరాబాయిా యుదయసింహు లు ముద్దు బెట్టుకొందురు.)

వీరా : కుమారా! రాణా! ఇం దేవిరోధులునులేరు. మీ తండ్రి పీడకలగని పలువరించెను. మాకే ప్రమాదమును లేదు. నీవుపోయి పండుకొనుము.

రాణా : చిత్తము. (అని రాణా నిష్క్రమించును)

వీరా : (తనలో) నానాథుని భీరుత్వవిచార మీవీరబాలునిచే దొలఁగింపఁబడుచు నాకింత శాంతి నెలకొల్పుచున్నందుకు భగవంతునకు నేను కృతజ్ఞను. (ప్రకాశముగా) మనోహరా! కలలు నిక్కువములుకావు. మీరిక శయనింపుడు.

ఉద : కాదుకాదు ప్రేయసీ! ఇది మనకేదో యనర్థకల్పనము చేయకపోవదు. నాకిపుడు బనబీరుఁడు స్మరణకు వచ్చుచున్నాఁడు.

వీరా : (తనలో) కటకటా! ఈ పిరికి నాభర్తనువదలునట్లు లేదు. ఏమని ధైర్యము చెప్పఁ గలను (ప్రకాశముగా) మనఃకాంతా! బనబీరుఁడేమి చేయఁగలడు?

ఉద : కుటిలచరిత్రుఁడగు వాఁడేదోమహాసంగ్రామముఁ దెచ్చి పెట్టఁజాలఁడా?

వీరా : మనతోఁబోరి గెలుచు రాజెవ్వఁడు?

ఉద : లేఁడా; అక్బరు

వీరా : ఆ పాదుషాకు మనమేమి కీడుచేసితిమి? వచ్చిన రానిందు.

చం. తలకరురాజపుత్ర సరదారులు పోరులకో నరేంద్ర! య
గ్గలఁపుఫిరంగిగుండ్లు చురకత్తులునూ మనవీరు లింతకు
న్వలపలదాపల న్జిలుముపట్టి విలాసముడిందియున్న బా
కులకశనంబు జిక్కెనసుకొందు భయంబుఁ దొలంగుడాత్మలోన్

ఉద : (తనలో) ఆహా! ఈసతీతిలకమున కున్నపాటి ధైర్యము నాకులేదుకదా? ఛీ! ఛీ! యుదయసింహా! నీవువట్టి మందభాగ్యుఁడవు. (ప్రకాశముగా) దేవీ! నీచిత్తదార్ఢ్యమునకు నేను ముగ్ధుఁడనగు చున్నాను. (అని కౌగిలించుకొనును.)

వీరా : ప్రాణప్రియా! నాదొక ప్రార్థనకలదు. దయతో నంగీకరింపుఁడు.

ఉద : అవశ్యము చెప్పవలసినది.

వీరా : మీరు సార్వభౌములరు. విశేషించి రసపుత్రకుల సంజాతులరు. రాజులకు పొంకమే భూషణము. పిరికి పదమును చెవినిబెట్టని మనరాచ కొలమునకు వన్నెదెచ్చి ధీరోదాత్తులరగుఁడు. నన్ను వీరపత్నినిం జేయుఁడు.

ఉద : ప్రేయసీ! యెంతబేలవు. నాభయము నిజమని విశ్వసించితివా? నిన్ను బరీక్షించుట కట్లంటిని. సమరసింహము లనం దగినక్షత్రియ యోధులకునికి పట్టయిన చిత్తూరున కధినాథుండనై నీవంటి వీరవనిత కాత్మేశ్వరుండనై వజ్ర కిరీటధారణము జేయు నేనా యుద్ధమునకు వెఱచువాఁడను వినుము.

ఉ. ఆలముసేయ నగ్బరు ధరాధిపుఁడొక్కడకాదు శత్రుభూ
పాల సహస్రమొక్క పరిఁబైకొనివచ్చిన భండనోర్విఁ గీ
లాలతరంగిణు ల్జలజలం బ్రవహింపఁగ వ్రచ్చి పంచబం
గాళ మొనర్తుసేనలను గంధగజేంద్ర సమానగామినీ!

వీరా : (నమస్కరించి) నేనిపుడు నిజముగా వీరపత్నిని. తెలియక యూహించిన నా యవివేకమును క్షమింపుఁడు.

ఉద : దేవీ! మనమీ యరిష్టభంజనార్థ మీశ్వరపూజజేసి వత్తము రమ్మి.

(ఇద్దరు నిష్క్రమింతురు)

రెండవ రంగము

(సీను–ఢిల్లీలో అక్బరుని సభామందిరము)

(అఫుజులుఖాను, రాజామానుసింగు, అక్బరు, పీఠముల నుందురు)

అక్బ : కవీంద్రా! నాకు దాయాదియగు మహమ్మదుఖానుఁడు పంజాబున హిందూ యువతులను చెరబెట్టుచు, దేవళముల బడగొట్టుచు, ప్రజాక్షోభము సేయు చున్నట్లు తెలియుచున్నది. నారాజ్యమున సర్వమానవ సమానత్వమే ప్రధాన స్థానము నలంకరించవలె. ఎట్టి వేళలందుగాని, యేకారణమునగాని మత ద్వేషము నెఱపు నజ్ఞానికి ద్వీపాంతరశిక్షగా శాసించితిని. ఈశ్వరసృష్టియందు మానవు లెల్లరు సమానులే. ప్రతివాని కగ్రస్థాన మీయబడినది. హీనుఁడు, ఘనుఁడను తారతమ్యమే ప్రళయజాడ్యములను బుట్టించుక్రిములు. ప్రజా సౌఖ్యమును గోరనిరాజు నిర్భాగ్యుఁడు. ఇతఁడునాకు ప్రతిపక్షులగు రాజులను రణమునకుఁ బురికొల్పుచున్నట్లు వినుచుందును. నాసత్పరిపాలనమునకుఁ గంటకమువలెనున్న వీనిని మట్టుపెట్టకున్న నాకీర్తికి భంగము కల్గును.

అఫు : సార్వభౌమా! "జ్ఞాతిచ్ఛేదన లేనకిమ్మ"ని పెద్దలు పలుకుదురు. దీనికి భిన్నమేల కలుగును. నాటి పంజాబుయుద్ధమున దమరుచూపిన దయయే దీనికి హేతువు.

మాను : (తనలో) సర్పమునకుఁబాలువోయ విషముగదా వృద్ధియగును?

అక్బ : కవీ! నీవు రేపు సేనలతో పంజాబునకు బయలు దేరుము. మానుసింగు నిన్ను

(తెరలో)

(రాజా! యొకరాయబారి ద్వారమున వేచియున్నాఁడు)

అక్బ : (ఆలించి తనలో) ఈతఁడాదంఖానుఁడు పంపిన బంటు (ప్రకాశముగా) ఓరీ! లోన బ్రవేశపెట్టుము.

(ఒక తురకబంటు ప్రవేశించి నమస్కరించును.)

అక్బ : ఓరీ! మాళ్వాప్రాంతమున నేమిరావార్త? జయమెవరికి?

భటు : సర్కార్, మన్కిజయం.

అక్బ : బాజ్ బహదూరు వశుఁడయ్యెనా?

భటు : ఆరాజ్కి పట్టి బందిచేసినాం.

అక్బ : ఆతని నేమేని హింసించిరా? మనవారు?

భటు : లేదుసర్కార్. లేదుకాని,

అక్బ : కాని ఏమిచేసితిరి?

భటు : ఆ రాజ్‌భార్యాకి అయ్యకుషిచేసినాడు. దాన్కి అమ్మా కోపం చేసి హిసం తిని చచ్చిందిసర్కార్.

అక్బ : (చెవులు మూసికొని) హరిహరీ! దుర్మార్గుఁడెంతపని చేసినాడు. ఆపతివ్రత నన్నెంత దూషించెనోకదా!

ఆఫు : (తనలో) తొలుతనుండియు నీయాదంఖానుని స్త్రీ లోలతయే నేడీ పతివ్రతకు మరణము సృష్టించినది.

అక్బ : (సేవకునితో) ఓరీ! స్త్రీల చెరపట్టరాదనికదా? నా శాసనము.

మాను : (తనలో) కాముకునకు మేధాశక్తి యెక్కడిది.

భటు : హో సర్కార్.

అక్బ : ఓరీ! నీవుపోయి యాదుష్టుని బంధించి ఖైదు చేయుమని నా మంత్రితోఁ జెప్పుము. (భటుఁడు నిష్క్రమించును.)

అఫు : అవునవు నితఁడు వధ్యుఁడు.

(ఒకసేవకుఁడు ప్రవేశించి)

సేవ : సర్కార్ చిత్తూరునుండి యొక సర్దార్ వచ్చినాడ్.

(సేవకుఁడు నిష్క్రమించును. బనబీరుఁడు ప్రవేశించి)

బన : (సభవంకఁజూచి తనలో) తగినసమయమునకేవచ్చితిని. ఇతఁడు జయపురాధీశ్వరుఁడగు మానుసింగునివలె గన్పట్టుచున్నది. ఇఁక నా మాయానాటకమును ప్రదర్శింతును. (అని రాజుకు నమస్కరించును.)

అక్బ : ఓయీ! నీవెక్కడనుండి వచ్చితివి?

బన : అక్బరురాజా! మీకుఁ బాదాక్రాంతముగాక దివారాత్రులు మీ యభ్యుదయమునకు వేడి కన్నీరువిడుచుచు గర్వమునఁగన్ను గానక త్రుళ్ళిపడు చితోడ్గడమునుండి.

అక్బ : (వెఱగుపడి తనలో) ఇతనిపలుకులు వినోదముగానున్నవి. అవును. చితోడ్గడము నాయాశాలతకు చిగురించనిపుష్పము.

అఫు : (తనలో) ఇతని ముఖమున పంచమహా పాతకములు వ్రేలాడుచున్నవి.

అక్బ : ఆర్యా! నీ పేరేమి?

బన : సుల్తానులలామా? అదియే నన్నడుగకుఁడు. నేను చిత్తూరువాసిని. ఉదయసింహుని కడ నొక యుద్యోగిని.

మాను : (తనలో) ఈగాథ చిత్రముగానున్నది.

అక్బ : మీరాకకేమి కారణము?

జన : ఏలినవారిపై నాకు గల యభిమానము.

చ॥ తురక కులంబునం బొడమి దుష్ట నరేంద్రుల కన్నుగుట్ట, మ
ద్ధురత ధరా పతివ్రతకు బంగరు భూషణమైన హస్తినా
పురి కధి నాయకుండ వయి, పూజ్యుఁడవైతివి సాహెబేంద్ర! నీ
కరుణకు దోసి లొగ్గుటకుగా జనుదెంచితి నాదరింపవే!

నేటికి ఢిల్లీనిఁ బాలించిన చక్రవర్తులలో మిమ్మువంటి ధర్మైకదృక్కు లేడు. మీరే యీఢిల్లీ రాజ్యలక్ష్మి కనురూపులగు భర్తలు. మీభుజాస్తంభములకు భూర్యబ్దములు దీర్ఘాయువగు గాక! మీ కతంబున జాతిమత ద్వేషములు నిర్మూలములగు గాక! ఇట్టి మీ యనుగ్రహము నభిలషింపని వాఁడు దౌర్భాగ్యుఁడు, దౌర్భాగ్యుఁడు.

అక్బ : సంతోషము. ఆర్యా! నాయందింత భక్తితాత్పర్యములుగల మీచరిత్ర వినవలయునని యాసపొడముచున్నది.

బన : (తనలో) నా ప్రయత్నమున కంకురార్పణమైనది. (ప్రకాశముగా) రాజేంద్రా!

నేనొక నిఱుపేదను. నా చరిత్ర మాట యటుండనిండు. ముందు నా వచ్చిన చరిత్ర వినుఁడు. తమవంటి ప్రభువులను జూచి గర్వపడవలసిన దానికి మారుగా మా భారతీయులు కొందరు లోలోనఁ గుట్రలు పన్నుచున్నారు. దూషించుచున్నారు. ఈ విషయములను ప్రత్యక్షముగాఁ జూచుచున్న నాకు దుర్భరముగా నున్నదని మనవి చేసికొనిన గదా నా కథను వినుపించుట.

అక్బ : (సభవంక జూచి యాశ్చర్యముతో) అయ్యా! అట్టి ద్రోహులెవరు?

బన : మీ రీమధ్య హిందూస్త్రీని వివాహ మాడితిరిగదా?

అక్బ : అవును. అయిన?

బన : (అనిష్టమును సూచించి) ఊ! పోనిండు. కుక్కలు మొఱిగిన సింహమున కేల? మఱొకసంగతి మహమ్మదుఖాను పంజాబులో...

(అనునంతలో)

మాను : ఏమీ? పాదుషా వివాహ విషయమును చెప్పరయితిరి?

బన : చెప్పెదను రవంత తాళుఁడు.

అక్బ : ఏమి పంజాబువార్త?

బన : అతఁడొక మహాసైన్యముతో ఢిల్లీని దాకనున్నాఁడు. యీమధ్య నతని దండనాథుఁ డుదయసింహుని సహాయము గమ్మని కోరుచుఁ జిత్తూరున మూడు దినములు వసించె. ఆ రాజు మీపేరెత్తిన భగ్గున మండిపోవును. ఉదయసింహుని కొలువున నగ్బరు చక్రవర్తి యని ఘనముగా పలికి మురిసికొను భాగ్యము మాకు లేదుగదా? దివారాత్రులతనికి మొగలాయి రాజ్య ధ్వంసన యత్నములుగాక మఱొండు కార్యములేదు. ఎవరో మాను సింగని మీకు మఱంది కలఁడట గదా?

అక్బ : అవును. అతడు మానుసింగు.

మాను : (కోపముతో) ఆ మానుసింగు. అయిన

బన : (ముక్కువిరచి) పోనిండు. ఆ దూషణవాక్యము మీయెదుట వచించుటకు నాకు నోరురాకున్నది. ఛీ! ఛీ! యీ హిందూరాజులకు మీవంటి సత్పురుషులపై నింతద్వేషబుద్ధిజనించుట చిత్రముగానున్నది.

మాను : (తనలో) కావుననే యుదయసింహుఁడు మునుపటివలె శుభకార్యములకు మమ్మాహ్వానింపఁడు.

ఉ. నిండుమనంబుతోడ ధరణీధరు లన్యగుణంబుమానినా
పెండిలికేఁగుదెంచి సరవి న్నను మన్ననజేయువేళ రా
కుండుట తెల్లమయ్యె నిటు లూరక కయ్యము రేచినావు, నీ
గుండెలనిద్రపోవు ననుకొమ్ము తురుష్కవిభుండు భాండికా!

(మానుసింగుతో) మఱదీ! మనకు చిత్తూరుముట్టడి యవశ్యకర్తవ్యము. (అపుజుల్ఫజులునుజూచి) పండితోత్తమా! మానుసింగు నీవెంటరాఁడు. నీవు రాజాబీరుబ నును సహాయముగాగొని మహమ్మదునెదిరింపుము. నేను మానుసింగుతోఁ గలసి ముందీతనిఁదాకెదను.

బన : (తనలో) భేష్! సుల్తానుగారికి చక్కగాపురి యెక్కించితిని.

అపు : పార్థివేంద్రా! శాంతింపుము. నిజానిజములు తెలిసికొనిన మీదట కార్యమున కుపక్రమింపుఁడు.

బన : (తనలో) పానకములోని పుడకవలె నీపీచుగడ్డపువ్యక్తి నాకెక్కడదాపరించెను.

అక్బ : (శాంతించి) అట్లయిన ప్రస్తుతాచరణీయమేమి?

అపు : రేపుసలీమునకు జననదిన మహోత్సవముఁ జేయనున్నారుగదా? దాని కాహ్వానించు నెపమున మానుసింగు వీరునిఁ జిత్తూరునకుఁ బంపుఁడు. సూక్ష్మగ్రాహియగు మానుసింగుఁ డచ్చటివారి ప్రయత్నములు చక్కగా గమనించి రాఁగలఁడు.

అక్బ : ఔను యిది సముచితాభిప్రాయము. (మానుసింగుతో) మఱదీ నీవు రేపుదయ మునఁ జిత్తూరునకుఁ బయనమైపోయి యుదయసింహుని సకుటుంబముగా నాహ్వానింపుము. కలహ ప్రయత్నములు గమనింపుము.

బన : (తనలో) ఇంక నేనిటనుండరాదు. దీనికిఁదగినపన్నుగడ నిశ్చయింపవలెను. (ప్రకాశముగా) అక్బరు సార్వభౌమా! నాకిక సెలవిండు. నేనుపోయి వచ్చెదను. మరొకమారు తమ దర్శనముఁజేసి నా దీనచరిత్ర వివరించెదను.

అపు : (తనలో) వీనికిదే యుద్యోగమైయుండును. ఉదయసింహునికడ నుద్యోగ భ్రష్టుఁడై సంచరించు విప్లవకారకుఁడని, సందేహింతును.

అక్బ : ఓ సత్పురుషా! నీయుపకారము మరువఁజాలను? మఱొకపరి తప్పక దర్శనమీయవలయును.

బన : అవశ్యమువచ్చెదను.

అక్బ : మీకు వేయిహారమును కృతజ్ఞతాసూచకముగా నీయఁదలంచితిని. గ్రహింపుఁడు

(అని హారమీయబోవ)

బన : రాజసత్తమా! నేను బహుమతులుకోరువాఁడనుకాను; తమరు శాశ్వత కాలము మమ్ముఁబరిపాలించుటయే నాకుఁబదివేలు. మీకు శుభమగుగాక. (అని పోవుచు)

ఉ. మోసముఁజేసి మానవుల ముంచుటయో! యిటుగాక దుర్భరా
యాసములోర్చి జీవులకు నభ్యుదయం బొనగూర్చునేర్పొ! య
భ్యాసముఁ జేయగావలయునంచు విధాతృఁడు లెక్కజేసి యీ
మీసలు రెండు నిల్పెనుసుమీ మగవానికి నిశ్చయంబుగన్

(నిష్క్రమించును)

(అవనికపడును)

మూడవ రంగము

(సీను–ఒక బహిరంగస్థలము హకీం, కల్లు)

(ఇద్దరు తురకబంట్లాదంఖానుని తెక్కలు విఱిచికట్టికొని ప్రవేశింతురు)

ఆద : (దుఃఖించుచు) ఖెమ్మదేముఁడు నాకి మొఖం మీఁద హిస్మంటి రాతచేశాడ్. అగ్బర్ సర్కార్కిదగ్గ మాకి బది సమచ్చురాల్ నుంచి కొలువు చేస్తాం. నాకి ఘాచారం యియ్యాల సర్కార్కి కోపంచేసింది.

హకీ : (గత్తితో పొడువబోవుచు) నడూ, నడూ బే నడూ

కల్లు : అరే హకీం నీకీ మన్సికాదుబే నిన్న మొన్న మన్కిమీదసర్దార్ హుండింది లేదుబే!

హకీ : నిన్నమొన్న సర్దార్ యియ్యాల ముర్దార్. కొలూపోయింది హోన్క ఏమి చెప్పాలామల్లా!

కల్లు : పెద్దమన్సికి చెప్తావుబే ముర్దార్.

హకీ : అరేకల్లూ! పెద్దమన్సిహుండిందితో చిన్నమన్సిలాగ రానీకి రమ్మన్నాల హెందుకుబే!

కల్లు : రమ్మనాలహంటే అది అయ్యాకి తప్పుకాదుబే! దేమ్డుకి తప్పు.

హకీ : ధేముడు హేమిచేశాడ్బే!

కల్లు : ఇస్మంటి ఘునం తిరిగివచ్చింది మన్సుల్కి.

హకీ : (పకపకనవ్వి) అరే దివానాలాగ హుండావుబే, ఎంత మంచిమాట ఇన్పిచ్చావుబే!

హకీ : నాకీభి దివానారే!

కల్లు : అచ్చా! హరే! హకీం మన్కి భిన్నాపోవాలెయుంది సర్కార్ ఘుసాచేస్తాది నడూరా!

ఆద : (తనలో) ఇద్దర్కి డబ్బు ఆశచేసి మేము దౌడు చేయ్యాల నాకీ హగ్బర్ సర్కార్ మొఖం చూసింది. యురిసిచ్చ యేస్తాది (హకీమును చూచి) అరేభాయి మాట. (అని దగ్గరకు పిలుచును).

హకీ : క్యా! బోలండి.

ఆద : (చెవిలో యేమో చెప్పుచుండ కల్లు ఆలకించునట్లు నటించి) ఆ. తెల్సింది. తెల్సింది, అరే! హకీం, నాకీ మోషం చేసి పైసా కాజేయాల హని గుడ గుడ చేస్తావు. కపర్దార్. అగ్బర్ సర్కార్కి హినిందితో మనయిద్దర్కి కొంప మున్గింది మాటనిజం.

హకీ : అరే! కల్లూ! ఘోలచేస్తా క్యాబే, నీకి నాకి భాగం భోత్ పైసా దొరుకుతాదిభే.

కల్లు : అరేభాయీ, ఎంత? ఎంత?

హకీం : హజారారూపయ్యా!

కల్లు : (చంకలు తాటించి) హకీం మన్కియింక తఖ్వాహేంటి చోడోబే చోడో!

హకీం : (ఆదంఖానుతో) పైసా యియ్యండి.

ఆద : (సంచి చేతికిచ్చి పారిపోవును)

హకీం : అరే కల్లూ! నీకీ నాకి యికడ యుండింది ప్యాణం తీస్తాది సర్కార్. మక్కాకి పోదాంభే.

కల్లు : నీకీ మక్కాకిపో. నాకీ మదీనాకి పోదం.

హకీ : అచ్చా!

కల్లు : అరే భాగం యియ్యిబే

హకీ : భాగం హంటే ఎంత?

కల్లు : సగం.

హకీ : నాకీ ఎఖ్వారావద్దురా.

కల్లు : ఎందుకుబే?

హకీ : భేరంచేసింది మేము.

కలు : నీకీబేరం చేసింది నాకీయిడిపిచుంది మేమ్యిదుహొకి.

హకీ : జా! బే, జా (అనిపోవుచుండ)

కల్లు : అరే! హకీం హన్నాలం. అరేహకీం నీకీప్రాణంతీస్తా. పైసాదగ్ర మొఖ్మాటంలేదు. (అని పట్టుకొని పెనగులాడును.)

హకీ : (కొంచెముతాళి) కల్లూ! నీకీనాకీ ప్యాణసెనిహితంహుంది. ఈపైసా చూసింది షైతాన్‌లాగ హిరోదం చేస్తాది థూ! థు! నాకీదమ్డిభివద్దూ (అని సంచి విసరి వేయును)

కల్లు : హోరే! హో! అరేహకీం నాకుభివద్దు (అని హకీముచేయిపట్టుకొని పోవుచుండ హకీము తిరిగి చూచుచుండును.)

హకీ : కల్లూ నీకీ యిటుపో నాకీ యిటుపోతాం (అని యిద్దరు రెండు ప్రక్కలకుపోయి సంచికడకువత్తురు. ఒకరొకరు యెకాలపోయి చూచుకొందురు)

కల్లు : అరే! యింట్కిపోతాను చెప్పలేదు బే.

హకీ : నీకీచెప్పలేదుబే.

కల్లు : నాకీలెక్క పెట్టాలహుంది హుద్దేషం

హకీ : నాకీభి అదేహుద్దేషం.

కల్లు : (తనలో) హకీంగాడ్కి మోషం చెయ్యాలహంటే యీడు నాకీ చెయ్యాలహని యుండాడ్. (హకీమునిచూచి) అరేభాయీ నాకీ దారు ఫియ్యాలయని హుందిబే.

హకీ : హోరే! హో పైసా యిస్తాం నీకీ తెస్తావుబే (అని నాలుగు రూపాయలిచ్చును. కల్లుపోవుచుండ హకీం సంచి విప్పుటకు ప్రత్నించును. కల్లు తిరిగి చూచి సంచి బిగువుగాకట్టి పోవుచుండ హకీం తిరుగ తీయబోయి కల్లుచూడగనే చేయిగోకి కొనుచుండును. కల్లు తిరిగి వచ్చి హకీం చేతులు గోకిచేతులు వెనుక కట్టించి వెనుకగానడచిపోయి)

కల్లు : హేసావుకార్. సారాబాటల్ రెండు యిచ్చిపో.

(తెరలో)

(వచ్చి తీసుకొనిపో)

కల్లు : తెచ్చి యీయి వోయి

(ఒకఁడు రెండు బుడ్లుతెచ్చి యిచ్చి డబ్బుతీసుకొనిపోవును)

కల్లు : (కల్లుబుడ్లుతెచ్చి) నీకిబుడ్డి నాకీబుడ్డి ఫీవో!

కల్లూ రెండుబుడ్డి నీకితాగు. నాకీహల్వాటులేదురా? (అని అనిష్టము సూచించును.)

కల్లు : (చిటుకవేసితనలో) నాకీటోపీఎయ్యాలహని(హకీముతో)నాకుభి హల్వాటులేదు.

(ఒక రాజభటుండు ప్రవేశించును)

భటు : అరే! బద్మాషిలుచ్చా! లంచాలుతీసుకొని ఖైదీలను విడిచి భాగాలకు పోట్లాడుచున్నారురా? మీపని పట్టించెదనుండుండు. (అని భయపెట్టుచు పైకుఱుకును)

(హకీము కల్లులిద్దరు గడగడవడకుచుందురు)

హకీ : మారాజ్ నీగులాంవాండ్లకి రచ్చిచ్చండి. నీకి భాగం యిస్తామ్. మాకి బత్కిచ్చండి. (అని కాళ్ళపైబడును.)

భటు : ఏదీ ఆసంచినిటుతెండు (అని సంచిచంకబెట్టి పిలుచుకొని ముందు నడచుచుండును)

(హకీము కల్లులొకరినొకరు కౌగిలించుకొని యేడ్చుచుందురు. హకీము కత్తి దూసి, భటునిసంహరించి సంచిలాగుకొనును. అంతలో కల్లు హకీమును చంపి సారాయి బుడ్లిద్దరి నోళ్ళలోనుంచి కల్లు పాఱిపోవును

(అవనిక పడును)

# తృతీయాంకము

సీను-సభామందిరము

(ఉదయసింహుండు జయమల్లు, తురకవేషమున

బనబీరుండు పీఠములనుందురు)

ఉద : (బనబీరునితో) అయ్యా! మీరెంత కాలమునుండి ఢిల్లీ రాజులను గొలుచుచున్నారు.

బన : నాతాతతండ్రులు మొగలాయిరాజుకడ నున్నత పదవుల నలంకరించినవారు. నాపదునెనిమిదవయేట మా తండ్రి పాదుషా కొలువున నన్నుం బ్రవేశపెట్టినాం డు. తురక సేన నాకు కష్టమైనను మాజనకుని దుర్బోధచే స్వీకరింపవలసిన వాండనయితిని.

ఉద : (తనలో) దుర్భోధ లెట్టివానినైన వశపఱచుకొనును.

జయ : (తనలో) ఈతఁడు చిత్తూరున కపరిచితునివలె తోచదు.

ఉద : ఆర్యా! అక్బరు సార్వభౌముఁడు ధర్మపరుఁడును, స్వమత పరమత ద్వేషము లేని నిర్మల మనస్కుడుగదా? మీకాయనకొలువు సౌఖ్యదాయకమని తలంతును.

బన : (టక్కరి నవ్వునభినయించి) దూరవాసులగు మిముబోంట్ల కతఁడు ధర్మజ్ఞుని వలె గన్పట్టుట వింతకాదు. నీట దిగినగదా లోతుతెలియును. కాని మఱొక మారు నా యెదుట నా యవినీతుని బ్రశంసింపకుఁడని ప్రార్థించుచున్నాఁడ.

ఉద : (నివ్వెఱపడి జయమల్లువంకజూచి) అయ్యా! పాదుషా రాజ్యము రామరాజ్య మని చెప్పుదురు. మీవిపరీతప్రసంగమేమి?

బన : (ఎలనవ్వుతో) కావుననే మిమ్ములను జనులు పిచ్చిరాజని పలుకుదురు. సార్వభౌమా! మీరునామాటలు విశ్వసింపకున్న చెప్పఁజాలనుగాని అక్బరు చక్రవర్తి లోలోన నెఱపు దుండగము లనంతములు. వానినొకటొకటిగా వివరించుటకు వత్సరములు పట్టును. నారోజాయురుసు నెపమున నతఁడెన్ని కాపురముల కెసరువోయుచున్నాఁడో యెఱుగరు. నేనతని యుప్పు పులుసు దినువాఁడనయ్యును తరుణమువచ్చుటచేఁ జెప్పకతప్పదు. పవిత్రమైన హిందూకులమునఁబుట్టి ప్రజాక్షేమముగోరువాఁడనగుట నాకిట్టి కార్యము లసహ్యములు. ఈతనిదుష్ప్రయత్నములు మున్ముందుగా మన రాజుల కెఱుకజేసి నేను సంపాదించిన పుణ్య మగణ్యము. నామూలమున నెందరి హిందూరాజుల ప్రాణములు దక్కినవి. ఎందరు నన్నభినందించు చున్నారు. ముందు ముందు మీరేగ్రహింపఁగలరు. నేనామొగలాయి కొలువు నిప్పటికిని విడువలేకున్న కారణము మీరిపుడు గ్రహింతురుగాక! ఇప్పటినారాక కిదియే కారణము. (కొంచెము యోజించినట్లు నటించి) ఈమధ్య పాదుషా వివాహమునకు మీరురాలేదుకదా?

ఉద : (భయపడి ఆతురముతో) అవును రాలేదు. అయ్యా! దానికేమి?

బన : (అగ్బరునుద్దేశించి కోపముతో) నేను తలంచినంత.. ఓరీ తురుష్కకులకళంకా!

ఉ. విమల విచారవృత్తిఁ బసిబిడ్డయనందగు ధర్మమూర్తి యు
త్తముఁడు చితోడ్గడాధిపతి దాంతుఁడు రా కలుషాత్మ నీ వివా
హమునకు రానిహేతువునదా? యపరాధినిఁజేసి యింతద్రో
హము నొడిగట్టుచుంటివకటా! భగవంతుఁడు చూడకుండునే!

పాదుషాద్రోహము తలంచినట్లీతని సంభాషణమున గోచరించుచున్నది. నేనేమి చేయుదును.!

జయ : (తనలో) ఆపాదుషా బహుకాలమునుండి చిత్తూరు నాశించి యున్నాఁడు. ఇప్పుడొకవంక చిక్కినది. దీని యాధారమున నతఁడు రణగ్రంథమొండు నిర్మించును. ఈ యుద్ధమున మాయుదయసింహునకు క్షత్రయోధుల సమర సమర్థతలు బోధపడును.

ఉ. నూటికొకండుగా నిలిచి నుగ్గొనరించి విరోధివాహినీ
కోటిని రూపుమాపురణకోవిదులీ రసపుత్రు లాల పుం
గూటికి బాహు దండములు కోరికతోఁ గనిపెట్టి యుండ నీ
నాటికిఁ బాదుషా ధరణి నాథునకుం దయవచ్చెనో కదా?

ఉద : అయ్యా! నీ వెవ్వఁడవో నా పాలిటి పెన్నిధానమువలె నున్నావు. ప్రస్తుతము పాదుషాకు మాయందుగల యభిప్రాయమేమి?

బన : హఠాత్సమరము.

జయ : (తనలో) భేష్. ఈ యుద్ధమున విజయులయిన గదా రసపుత్రులు వీరుగలగుట.

ఉద : (హీనస్వరమున తనలో) నా స్వప్నము సత్యమాయె. ఈ మహా సంగ్రామము నుండి ప్రాణములతో బయటపడుట వట్టిమాట (బనబీరుని చూచి) అనఘా! పాదుషా క్రోధమున కొక్క వివాహాహ్వాన నిరాకరణమే కాదు. పదభ్రష్టుండయిన బనబీరుఁడును కారణంబని తలంతును.

బన : (ఉలికిపడి తనలో) కొంపతీసి నన్ను గుర్తింపఁడుగదా? (ప్రకాశముగా) ఆ బనబీరుఁ డెవరు?

ఉద : ముందు చిత్తూరు సార్వభౌముడు.

జయ : (తనలో) మారాజుగారి పిఠికిపుండు నితఁడు బాగా గోకిరేచినాఁడు (ఉదయ సింహునితో) రాజా! పర్యాలోచన చేయుఁడు.

బన : పదభ్రష్టునకు శత్రుసాధనమే ప్రధాన కార్యము. కాని రాజ్యమూడినవాఁ డాత్మహత్య చేసికొన్నమేలు నేనేవాఁడ నయిన నట్లొనర్చియుందును.

ఉద : అప్పుడా! నన్నిపుడేమి చేయమందువు?

బన : నేను చెప్పినట్లు చేయుదురా?

ఉద : అవస్యము చేయ సంసిద్ధులము.

యత్నమున సుల్తాను తన మఱందిని మీకడ కంపుచున్నాఁడు. అతఁడిప్పుడో యింక గడియకో వచ్చును. మీ రతని మాటలు పాటిచేయకుఁడు. లేదా మోసము వచ్చును.

ఉద : ఢిల్లీకిపోయినచెరసాల, లేకున్న యుద్ధముకదాసిద్ధించును.

బన : ముందీగండము గడచిన పిమ్మట యుద్ధమును గూర్చి మాటాడుదము. నేనిట నుండరాదు. నన్నామానుసింగు చూచిన ననుమానించును.

ఉద : సరే మీరిక దయచేయుఁడు. త్వరలో దర్శనమిచ్చి యీ విపత్కాలమునఁ దోడ్పడుఁడు.

బన : (పోవుచు తనలో) ఉదయసింహా! ఈ బనబీరుఁడు జీవించియుండ రాజ్యము నీకు దక్కుననుకొంటివా? తుచ్ఛా! కీలుబొమ్మవలె నిన్నాడింతును. చూడునా దెబ్బ! (నిష్క్రమించును)

ఉద : దండనాథాగ్రణీ! ఈ పురుషుఁడు మనపాలిటి భగవంతునివలె నున్నాడు.

జయ : రాజేంద్రా! మనకేమివిపత్తు వాటిల్లెనని యీతఁడు భగవంతుడయ్యె; నీడ చూచి తత్తరిల్లు మీవంటి వారికెల్లరు భగవంతులే యగుదురు. పాదుషాతో యుద్ధమన్న నీకు ప్రళయముగానున్న నాకుఁబండుగ వలెనున్నది.

ఉద : (తనలో) ఈ వీరుని సమక్షమున నేను వ్యర్థజీవి నగుచున్నాను

(తెరలో)

(రాజా! ఢిల్లీనుండి యొకరాయబారి వచ్చినాఁడు.)

ఉద : చమూనాథా! ఇతఁడు మానుసింగు. వీనికేమి సమాధానము చెప్పుదము.

జయ : నిరాకరణమే సమాధానము.

ఉద : ఓరీ! సేవకా! ఆ పురుషుని లోనఁ బ్రవేశపెట్టుము.

(మానుసింగు ప్రవేశించును)

(ఉదయసింహుఁ డెదుర్కొని యొకపీఠమున గూర్చుండ నియమించును).

మాను : ఉదయసింహభూధరా! మీ రాజ్యమునకు సేమమా?

జయ : అక్బరుపాదుషావంటి జగత్త్రయవీర సార్వభౌమునకు బావమఱందులగు మిమ్మువంటి యుత్తమప్రతాపశాలుర యనుగ్రహమునకుఁ బాత్రీభూతుల మయిన మాకును మా రాజ్యమునకును క్షేమమునకుఁ గొదువయేమి?

చున్న యితఁడెవరు? (తల యూచి) ఓహో! చితోడ్గడమున వీరాధివీరుఁడని పేరుగన్న జయమల్లుఁడని తలంతును.

ఉద : (తనలో) మా జయముల్లుఁడు సమయమునకు సభ నలంకరించుటయు నా దురదృష్టమే. ఇతఁ డెట్లేని కలహము రేచునట్లున్నది. (మానుసింగుతో) మానుసింగు వీరాగ్రణీ! ఏ కారణము మాసభారంగము మీకు శ్రమ గలిగించెను.?

మాను : ఉదయసింహ ధరణీశ్వరా! తమరు మాయందింత దయజూపుటచే ధన్యుల మగుచున్నాము.

జయ : అగ్బరుచక్రవర్తుల దయమిమ్మును పూర్ణముగా ధన్యులను జేయుచుండ మాదయ నిమిత్తమాత్రము గదా?

మాను : (తనలో) ఇతడు హేళనమునకు ప్రారంభించినాఁడు.

ఉద : (తనలో) మా జయమల్లు కలహబీజమునకుఁ బాదులు త్రవ్వుచున్నాఁడు. నేనిపు డేమిచేయవలెను.

మాను : (తనలో) నాటి ప్రచ్ఛన్నపురుషుని పలుకులు క్షర సత్యములుగా నెఱవేరు చున్నవి. ఈ యుదయసింహుఁడు వెన్నబొదివిన కత్తివలె నెయ్యము నెఱపుచుఁ దన యనుచరులను పురికొల్పుచున్నాఁడు; కానిమ్ము మరికొంత సేపు సహించి చూచెదను.

(రాణా ప్రవేశించును)

ఉద : (బెదరిచూచుచు తనలో) శివశివా! జయమల్లు దవాగ్నికి నా కుమారమారుతము తోడైనది కదా?

రాణా : (తండ్రికి నమస్కరించి) జనకా! ఈ నూతన పురుషుఁడెవరు?

ఉద : ఢిల్లీ నుండి వచ్చిన యోధాగ్రేసరులు.

రాణా : (మానుసింగుతో) అయ్యా! మీరు మహమ్మదీయులా?

మాను : కాదు; క్షత్రియులము

జయ : (నవ్వుచు) పాదుషాగారి క్రొత్త బావమర...

రాణా : (ఆశ్చర్యముతో) ఓహో! అక్బరు సుల్తానుల కన్యాదానకర్తలా?

ఉద : (తనలో) శ్రుతి ముదురుచున్నది.

రాణా : అయ్యా! మీ తురక చుటాలకు భద్రమా! గంగానది చవిటిపఱమీఁద

ప్రవహించినట్లు తమరేల యిట్లుదయ చేసితిరి? (తండ్రివంక జూచి) జనకా! జనకా! వీరి కీ సామాన్యపీఠ మర్హమా?

జయ : (సంతోషించుచు) బేష్, బేష్, రాణా, నాపలుక నెంచిన వన్నియుఁ బలికితివి.

మాను : (కనులెఱ్ఱజేసి యుదయసింహునితో) రాజా! పూజ్యభావమున నింటికి వచ్చిన వానిని యొడ్డోలగమున నవ్వులాడుట భావ్యమా!

ఉద : వీరాగ్రణీ! శాంతింపుఁడు, యీపడుచువారి మదాలాపములు పాటిసేయకుఁడు. (రాణాతో) కుమారా! ఇతఁడు మనకు విరోధికాఁడు. ఎట్టివాడైనను యింటికి వచ్చిన వానిని పరాభవించుట సజ్జనలక్షణము కాదు.

రాణా : జనకా! నీ నిరభిమానవాక్యములు చాలింపుఁడు.

ఉ. బీరముదక్కి మ్లేచ్ఛునకుఁ బిల్లనొసంగిన వీని కా సభా
గౌరవడంబరంబు జనకా! కులహీనుఁడు వీఁడు వీనితోఁ
గూరిమి పాపకారణమగు న్నరపుత్రులకింక ని న్నరా
కారపశూత్తమంబును ని కారము సేయక గౌరవింతుమే

ఈయర్ధహిందువును ఖండించినఁగాని దేశమునకు కీర్తి రాదు.

జయ : (తనలో) భళి! భళీ! రాణా! నీవురా! మా వీరాబాయి పుత్రుఁడవు.

(మానుసింగు త్రాచువలె లేచి)

మాను : ఛీ! తుచ్ఛా

ఉ. స్థానబలంబునం దనుమదంబు శిరంబునకెక్కి కన్నుమి
న్గానక ప్రేలు నీ చిలిపినాలుకఁ జీల్చెదరోరిద్వేషి, యె
వ్వానిగ నెంతువో ననుభవాదృశ తుచ్ఛులపచ్చినల్లబి
ట్లానిన సింగపుంగొదుమరా! యిదివైరికిఁ దోకచుక్కరా

నీ పురవైభవంబు నిదే నా ఖడ్గకాలాహి నిమిషమాత్రమున రుధిరసముద్రమున ముంచివేయఁ గలదు. వీరున కెక్కటికయ్యమునకన్నఁ బబ్బములేదు. నాయొంటరితనమే నా ప్రతాప క్రోధశిఖా కలాపమునకుఁ బాణింధమం బగుచున్నది. (అని కత్తి యొరనుండి తీయుచుండ రాణా కత్తి సారించుచు)

ఉ. లావరిసోదరీమణిని లంచమొసంగి తురుష్కునింటికిం
గావలియున్న మీసములు గల్గు విచిత్రపుటాడుదాన నీ
వా వితతప్రతాప రణపండితులం బెదిరింతు మమ్ము నీ

ఉద : (తత్తరపడుచుచు తనలో) కటకటా! మారాణాకిశోరము నిష్కారణముగా సింగునకు క్రోధమద్యములు ద్రావించెగదా?

జయ : (సంతోషమునభినయించి) భళిరా! రాణా! సింగునకు చక్కగా వాత బెట్టితివి.

రాణా : (తండ్రిని చూచి) తండ్రీ! యితని యుత్తరప్రగల్భములకు భయపడుచుంటి రాయేమి?

మాను : నావి యుత్తరప్రగల్భములు నీవి తాటియాకుల తటతటలు. శూరుని సమర్థతలు నిర్ణయించు తులాసాధనము సమరముకదా?

జయ : నీవూ నొక శూరుఁడవేనా?

రాణా : ఇదివరకు

మాను : (రౌద్రమూర్తియై) ఓరోరీ! పరనిందా పరాయణులారా! మీకాలము సమీపించి నట్లున్నది. ఇప్పుడే మిమ్ముబరిమార్చి నాశౌర్యమును ప్రకటింతును చూడుడు. (అని జయమల్లు నెదుర్కొనఁ బోవ యుదయసింహుఁడువారించి)

ఉద : మానుసింగురాజా! ఈ పసివాని మాటలకు కినుక నందకుఁడు. నామోముఁ జూచి వీనిని క్షమింపుఁడు.

మాను : (తిరస్కరించుచు) ఓరీ! ధూర్తుఁడా! నీకృతక వినయవిద్యా కౌశలత నాకడ బ్రదర్శింపకుము. ముచ్చువలెగూర్చుండి నిండు సభలో నన్నవమానించిన నీ యనీతి ప్రవర్తనమునకు శీఘ్రమే ఫలముననుభవింతువు. తాళుము.

సీ. నీకోటకొమ్మల న్నిలిపినబంగారు కుండలు కుంభినింగూలునపుడు
నీదండునుండి ఖండిత చమూనాథుల తలపుఱ్ఱియలు మిన్నుఁదాకునపుడు
నీరాహుతుల పచ్చినెత్తురు సెలయేటఁ గొదమగుఱ్ఱాలీతఁ గొట్టునపుడు
నీరథంబులఁబోరు బారీటెమొనగాండ్ర మొండెము ల్గెంధూళి మ్రింగునపుడు

తే.గీ. పాదుషాసేన నీకోటఁ బగులగొట్టి
వీటి విభవంబు గుండాల వ్రేల్చినపుడు
నీకుమారుండు నీవు నే నేస్తగాఁడుఁ
బరిహసింతురు తాళుఁ డగ్గరుని నన్ను (నిష్క్రమించును)

బన : (చాటుననుండి వెడలివచ్చి) నేనుబుట్టించు ప్రళయాగ్నికి నూనెతోఁ బనిలేదు. (అని నిష్క్రమించును)

ఉద : (తనలో) కటకటా! ఇది కలయో! నిక్కువమో!

ఉద : కుమారా! అట్లనకుము. పాదుషాకితఁడు నచ్చిన చుట్టము. ఇతని గౌరవ తిరస్కారము లగ్బరు తనవిగా భావించును.

జయ : పాదుషా చెలిమి కోరినగదా! మనము తలఁకుట. అతని స్నేహ వైరములు రెండును నాకు సమానములే.

రాణా : నాకు నంతియే!

ఉద : (తనలో) వీరి సమరోత్సాహమేమో నాకర్థము కాకున్నది. కానిమ్ము పరమేశ్వరుఁడే కలఁడు. ఇపుడు నేను వీరికడ పిరికి నభినయించిన నన్ను వ్యర్థునిగా భావింతురు. (ప్రకాశముగా) వీరులారా! నే నగ్బరును లక్ష్యం చేయను గాని...

రాణా : కాని యేమి సందేహము?

ఉద : అకారణ వైరమేలాయని?

జయ : అట్లయిన రాయబారిపలికిన యగ్బరుని యపకార యత్నముల కేమికారణము?

ఉద : (తలయూచి) అవునౌను. మనము పర్యవసానము యోచింతము రండు. (అందఱు నిష్క్రమింతురు)

# చతుర్థాంకము

(సీను-పాదుషామందిరము)

(కురంగి సమీపమున గూర్చుండియుండ మధురాదేవి విచారముతో నొక పీఠమున గూర్చుండి యుండును)

కుర : అమ్మా! చక్రవర్తులకు చిత్తూరురాజుపై నిట్టి వైరమేల జనించెను.

మధు : మా సలీముని జననదిన మహోత్సవమునకు విందు గుడువ రమ్మని పిలువఁ బోయిన మాయన్న నొడ్డోలగమునఁ బరాభవించెనట.

కుర : శాంతమూర్తియగు మానుసింగుపై యతని కేమి ద్వేషము.

మధు : (మూతివిఱచి) నావివాహము.

కుర : అట్లనా! ఈయుదయసింహునకు రాజ్యమువచ్చి మూనాళ్ళయినదో లేదో! ఇంతలో నింత మిట్టిపడవలయునా! భార్యను చెరబట్టినవానిఁ దునుమజాలక ముసల మ్మవలెమూలనుగూరుచున్న ప్రతాపశాలికి వర్ణపిశాచమువదలలేదు కాబోలు.

మధు : కురంగీ! ఆ పవిత్ర దంపతుల నిందింపకుము. వారు నాకుఁ బితృసములు. ఈ బుద్ధి సహజమైనది గాదు. ఎవడోనీచుఁడు వారికి దుర్బోధఁజేసి తన్నట్లు బల్కించి యుండును. వారు మమ్మునవమానించిరని విచారింపను కాని నా పతిచే వారికేమి కీడుమూడునోయని చింతింతును. కురంగీ! చక్రవర్తిని సమరవిముఖుని జేయుమార్గమేది? మాయన్నగారు ద్రావించిన క్రోధరసమున నతఁడున్మత్తుడై చిత్తూరు విధ్వంసమున కుఱ్ఱూతలూగుచు సేనల నంపియున్నాఁడు. మా తురకసరదారులచే వారి కేమాయెనో తెలియదు. కురంగీ! నీ వెఱుంగవుకాని యా వీరాబాయి నిజముగా మూర్తీభవించిన విజ్ఞాన వివేక సమూహముసుమా!

కుర : (ఆలోచన నభినయించి) నిన్నటి సేనా కోలాహలము చిత్తూరు ముట్టడికిఁ గాఁబోలు. (మధురతో) అమ్మా! అట్లయినఁ బాదుషాగారిని రణము వలదని బ్రతిమాలరాదా? మీ ప్రార్థనమునకు బ్రసన్నులు కారా?

మధు : నాశక్తికొలది ప్రయత్నించి వేడుకొందును. యొక వేళ నంగీకరింపకున్న?

కుర : నన్నేమి చేయమందురో సెలవిండు.

మధు : ఏమైనను చేయుదువుగదా?

కుర : మీ సెలవైనచోఁ బ్రాణములకేనిఁ దెగింతును.

మధు : దానికొక మంచి యుపాయమున్నది. (ఆలించి) రాజు గారు వచ్చుచున్నట్లున్నది. తరువాత చెప్పెదను.

(అక్బరు ప్రవేశించును)

అక్బ : (తనలో) ననుఁజూచినంత నెదురునడచి కౌఁగిట గౌరవించి భుజంతావలయములచే నాకంఠము నలంకరించు నా చిన్నారిముద్దు ముద్దియ, నా చైతన్య సామ్రాజ్యలక్ష్మి నేఁడేలనో యెదురునడువదు. (సమీపించి ప్రకాశముగా) దేవీ! నిరంతర మందహాస భూషితమగు నీ వదనచంద్రునిపై నేఁడు విచారమేఘము క్రమ్మినదేమి?

మధు : (తలవంచుకొనును)

అక్బ : (కురంగివంకజూచి) కురంగీ! మీదేవిగారికి కోపము వచ్చినట్లున్నది.

కుర : ఏమో మీరేయడుగుడు.

అక్బ :

ఉ. ఘోర రణప్రదేశమునకుం జనుచుంటిని సేనతోడఁ జి
త్తూరును ముట్టడించుటకు తొయ్యలి నీ యధరామృతంబు నిం
పారఁగఁ గ్రోలనిమ్ము సమరాంగణమందొకవేళ దాహమై
కాఱియబెట్టినం బిదప కష్టమువచ్చును మోసమయ్యెడిన్

మధు : (చిరునవ్వుతో) నాప్రార్థన మాలించినచో,

అక్బ : నావీనుల కంతకన్న సేవకలదా?

మధు : ఆలించి తిరస్కరింపరుకదా?

అక్బ : అఁగీకారయోగ్యమైన!

మధు : అంగీకార యోగ్యమైనదే.

అక్బ : అయిన నింక వెనుదీయనేల?

మధు : చిత్తూరుదండయాత్ర మానుఁడు

అక్బ : (అచ్చెరువంది) ప్రేయసీ! ఇదియేమికోరిక? దీన నీకేమి వచ్చును.

మధు : ఒరుల కేరికి లభింపని మహాపుణ్యము.

అక్బ : ఎందువలన?

మధు : అనపరాధ రక్షణమున

అక్బ : (కొంచెము రూక్షముగా) ఏమీ! చిత్తూరుజనులు నిరపరాధులా! బేలా! నీ హితబోధయందు స్వకీయ బాంధవనింద బింబించుచున్నట్లున్నదే? తేనె బూసిన కత్తివంటి యుదయసింహుఁడు మన రాజ్యమునకు గుండములు త్రవ్వుచున్నాఁడు. మొన్న మీయన్నమానుసింగు నతఁడు సభలో నగౌరవించిన విషయ మీ వెఱుంగనట్లున్నది. ఆవు, పులులగు రసపుత్రులయందు నీకీ యభిమానమేల? మొత్తముమీఁద హిందూజాత్యభిమానమును గను పరచితివిగదా?

మధు : ప్రాణేశ్వరా! నాయందు హిందూగౌరవమే ప్రధానమైయున్న మిమ్ము వివాహ మాడియుందునా? తమరట్లనకుఁడు. సజ్జనపక్షపాతముతప్ప నాలో నొందుగుణము నివసింపజాలదు. ఆయుదయసింహదంపతులు ధర్మ స్వరూపులు. అందువీరాబాయి పరమసాత్త్విక స్వరూపిణి. ఉదయసింహుని కాపాటి ధైర్యమెక్కడిది? చిన్నప్పటినుండియు నాకు వారియందు భక్తి తాత్పర్యములుమెండు. నేనును క్షత్రియకులసంజాతను. మాయన్నకు

నిక్కమయిన యవమానము ఘటించియున్న మీకన్నముందు ఖడ్గమును బాణి నలంకరించియుందును. దీనికెవ్వడో కారకుఁడు నిజముగా నుండి తీరవల యును. సత్యాసత్య నిరూపణమునకుఁ దమరు కొంతకాలము తామసించియున్న శ్రేయస్కరమని నాప్రార్థన. మనసేన యీపాటికి చిత్తూరున కేమిచెట్ట సంఘటించిరోయని నా హృదయము కలవరించుచున్నది.

అక్బ : (తనలో) నేనిపుడేమిచేయుదును. ఈమెకు చిత్తూరు రాజులయందు పూజ్య భావమున్నట్లు తోచుచున్నది. (ప్రకాశముగా) కల్యాణీ! నేను చిత్తూరురాజ్య సంపాదనమునకుఁ జిరకాలము నుండి వేచియుంటిని. ఇప్పుడు సమయము వచ్చినది. నేనారాజదంపతులకు హానిచేయను. మన కంకితులయినచో నాయభిమతమీడేరును.

మధు : ఆజన్మప్రతాపజలనిధులగు రసపుత్రు లంకితులగుట వట్టిమాట.

ఉ. పౌరుషహీనులై పరులపంచలఁ గూటికివేచియుండు ని
స్సార నరస్వరూప తనుజన్ములఁ గన్నదిగాదు వీర చి
త్తూరుపురంధ్రి! విక్రమనిధుల్జరియించెడు పోతుగడ్డ మా
భారతమాత కాపురముపై నభిమానముమెండు భూవరా!

నాథా! నన్నుమన్నించి రణవిముఖులరగుఁడు (అని నమస్కరించును).

అక్బ : (తనలో) ఆహా! ఈసతీస్వరూపవిరోధిని నన్నెంతగా శోధించుచున్నది. ఇంక నాసామయత్న ముపకరింపదు. (రౌద్రముతో నవలద్రోచి) ఓసీ! క్షత్రకులపక్ష పాతినీ! నోరు మూయుము. సర్పమువలె నాయిల్లుసొచ్చి శత్రుస్తవము సేయుచు నావీరపాండితి కన్నుమూయుటకై పిటికిమందులు నూరిపోయు చుంటివా? ఆడువారి యానల కడుగు దాటని నవనాగరికపు టర్ధనారీశ్వరుండ ననుకొంటివా! ఛీ! ఛీ! పౌరుషములేని పసరమా! నీవు నన్ను వివాహమాడితివని బొమ్మగట్టి యూరూర నేకుచున్న యనాచారపండితులగు రాజపుత్రులను భగవంతులని పూజించుచుంటివి.

మధు : (కోపమునలేచి) ఆ! ఏమేమి? నా రాచబిడ్డతనము మీకెట్లు తేటపడఁగలదు. పాపము లోకనిందకు సహించుకొని నిన్ను చెట్టబట్టిన దానికీపాటి బిరుదము నీయకుందువా? నేనధర్మమును బోధింపలేదు. దుష్టశిక్షణము శిష్టరక్షణము చేయుఁడని బ్రతిమాలితిని గాని మిమ్మును శాసింపలేదు. మీసమరైక పరాయ ణత్వమున నా వేడికోలు నిష్ఫలమైనది. పత్నీ గౌరవమును విడిచి నా హృదయ విదారకములయిన తిరస్కార శూలములచే నొవ్వనాడితిరి. మీ రఖండధారుణీ

నాయుద్దేశమును వెల్లడించుపాటి స్వాతంత్ర్యమేలేదా? అట్లయిన పురుషులకడ స్త్రీలు లక్కబొమ్మలవలె నోరులుగట్టి వైచికొని యూడిగమున కూగులాడ వలయునా! ఈ మౌఢ్యము మాహిందువుల నింతటితో వదలునట్లులేదు. మనః కాంతా! వినుఁడు నే నీశ్వరసాక్షిగా నకల్మష హృదయను. నా యవివేకమో వివేకమో తగవు నెఱుకపరచి మిమ్మును కష్టపెట్టియే యుందును. దానికి క్షమింపుఁడు. ఆ యుదయసింహ వీరాబాయిలు మమ్ము దూషించియే యుందురుగాక! మీరేమేని తలంపుఁడు. నేను వారికిఁ గీడుసేయనోపను మీరు చేసిన నేను సహింపను.

కుర : (చేరవచ్చి) అమ్మా! అయ్యగారికి కోపము వచ్చినది; శాంతింపుడు.

మధు : (కోపమున జురజురజూచుచు) ఛీ! అయ్యగారికి కోపం వచ్చిన భయపడుట కిందు దోషులెవ్వరును లేరు. మనము పోవుదమురమ్ము. (కురంగి, మధురలు నిష్క్రమింతురు)

అక్బ : అక్కటా! ఈ గుణరత్నమంజూషము నూరక కలత పరచితినిగదా!

(తెరలో)

(సర్కార్, రథము హజారమున సిద్ధముగా నున్నది)

అక్బ : (ఆలించి) ఓహో! సేన చిత్తూరునుదాకి నేటికి రెండు దినములయినది. నేనిక యాలసింపరాదు. (నిష్క్రమించును)

## రెండవ రంగము

(సీను–యుద్ధరంగమున చెరసాల)

(ఉదయసింహుఁడు కారాగారముననుండ నిద్దరు తురకబంట్లు కావలియుందురు.)

ఉద : అక్కటా! నాగతి యెంతవఱకు వచ్చినది.

సీ. ప్రతిచెప్పగారాని రసపుత్రధారుణీ శాసనోద్ధతిఁ బ్రశస్తత వహించి
ఆదిశాంకరి కుద్ధియైన వీరాబాయి పూతకంఠమునందు పుస్తెగట్టి
అపర గాండీవియో యనఁ బోరికెదురెక్కు ముద్దురాణానంకమున ధరించి
ప్రాణాలనిచ్చి మాబాహువీరులుగొన్న యశము మొన్నటిదాక యనుభవించి

తే.గీ. సంగరాణాది రాజ భాస్కరులు దాల్చు
స్వర్ణమకుటంబు తలమీఁద సంతరించి
వీరచిత్తూరు వేడికన్నీరుజిమ్మ
నేడుపగవారిచేత బంధితుఁడనయితి

నాటి నా స్వప్నవృత్తము ప్రత్యక్షముగా కొనసాగుచున్నది. నా సతీసుత లీ ప్రళయ సంగ్రామ దేవత కాహుతిగాక సజీవులై బయటబడఁగలరా? కలహమునకుఁ గాలుద్రవ్వు మా రాణాకిశోరము నీ కరుణలేని తురక బెబ్బులులు ప్రథమకబళముగా చప్పరించి యుండును. ఆహా! రాణాకుమారా! నాడు నా మాటలు ధిక్కరించి మాను సింగును గేలిచేసి మృత్యువును బిలిచి యెంతకష్టముఁ దెచ్చిపెట్టితివి. (కొంచెముతాళి తలయూచి) దుర్మార్గుఁడగు బనబీరుఁడు క్షమాసముద్రుఁడగు పాదుషాకు మాపై నక్కసు బుట్టించి కసిదీర్చుకొని యుండును. (అక్బరు నుద్దేశించి) ఓ యగ్బరు చక్రవర్తీ! నీవు జాతిమత వివక్షతాశూన్యుఁడ వయిన రాజర్షివే! న్యాయాన్యాయ నిరూపణచణుండవే! ఇట్టి నీదివ్యకల్యాణగుణములు చిత్తూరు రాజుల దురదృష్టవశమున విపరీతదశం జెందెనా? (ముందుకుతూలి) ఆహా! నేడు నా కెన్నడులేని నిద్రామేఘము కన్నులపై నాట్యముచేయుచున్నది. (భటులవంకజూచి) పాప మీ భటులు కూరుకుచున్నారు. ఇప్పటి కర్ధరాత్రమయినది. యొక్క గడియ తలవాల్చెదను. (అని శయనించును)

(బనబీరుఁడు ప్రవేశించును)

బన : (మీసము దువ్వుచు) భేష్! నాకృత్రిమ నాటకము నిరాఘాటముగా నడచి పోవుచున్నది. నా మాయా మహావ్యూహ మిట్టిదని యెఱింగినవాఁడొక్కఁడు లేఁడు. ఈరాత్రి కడచినచో యెల్లి మధ్యాహ్నమునకు చిత్తూరు సంపూర్ణముగా దహించి కృతార్థతా విమానమున సూర్య మండలమును జూచివత్తును. కసి కడుపునఁ బెట్టుకొని పగ సాధింపనివాఁడు నిరర్థకుఁడు. అట్టివానిని భగవంతుఁ డెన్నఁడో నరకమున ద్రేల్చునని యాస్తికజనులు బొల్లి వేదాంతములు బలుకుచుందురు. క్రోధపరవశుడగు నావంటి వానికడ వేదాంతమును, గీదాంతమును దలయెత్తుటకు స్థానములేదు. ఇప్పుడొక యుక్తిపన్నివీరినివంచించి విరోధిని బరిమార్పవలయును. వీరిద్దరు తురక బంట్లు. వంచనకు సారాయికన్న సాధనములేదు. (నిష్క్రమించును)

హకీ : (కలగనుచు) ప్యారీ! ప్యారీ (అని మురాదును ముద్దు బెట్టుకొనును).

మురా : (దిగ్గున లేచి) అరే బద్మాష్! నీకీ కండ్లు లేదుభే!

హకీ : (మేలుకొని కండ్లు నులిమికొనుచు) అరే! భాయీ! నాకి ఆలాపన్మే పెళ్లామున్కున్నానురే! (అని చెంపలు వేసుకొనును)

మురా : (నవ్వుచు) నాకీ కల్మంత కల్లోకి వచ్చిందిరే!

(తెరలో)

(పారాహుషార్)

(మురాద్ హకీములు తత్తరమున కత్తులుపట్టుకొని నిలిచి యుందురు)

(సేనానాయకుని వేషమున బనబీరుఁడు ప్రవేశించును)

బన : (తనలో) ఈ భటశిఖామణుల సమర్థతలు బయలుపడినవి. ఇందొకనికి కల్లు ముంతయు రెండవ వానికి భార్యయు గావలయునట. (ప్రకాశముగా) మురాద్ యిటు రమ్ము. (అని సైగ చేయును)

మురా : సాబ్ (అని చేతులు కట్టుకొని వచ్చును)

బన : ఓరీ! నీవు మన స్కంధావారమునకు సమీపమున నున్న నాగవల్లియను వేశ్యను నాడేరాకు దీసికొనివత్తువా?

మురా : (ఆలోచన నభినయించి) ఓహో! రావాలా!

బన : అవునవును. భేష్‌మురాద్ అచ్ఛావుండావు. దాని నౌరులకంటఁ బడకుండ తేవలయును. పాదుషాకు తెలిసినచో మన యిద్దరిపని పట్టును. నీకు మంచి బహుమాన మిచ్చెదను.

మురా : నిమిసంలో తెస్తాంమారాజ్. (అని చిటికెవేయును)

బన : నేనెవరో యెరుగుదువా?

మురా : మా కొత్త సర్దారు కాదండీ!

బన : (వీపుదట్టి) ఆ. హుషారావాలా! ఇదిగో యిప్పుడీ పైకము నీవు తీసుకొని వేశ్యకీ రెండువరహాలిమ్ము.

(మురాద్ నిష్క్రమించును)

బన : (తనలో) ఒకనిని దాటబంపితిని (హకీమునుబిలిచి) మీరిద్దరు వచ్చువరకు నేనిందుకావలియుందును. నీవుపోయి రెండు బుడ్లు సూరత్కా దారు లావు.

హకీ : చిత్తం సాబ్.

బన : నీ వీ వరహాపుచ్చుకొని వలసినంత త్రాగుము. నేను త్రాగెదనని యెవరితోనైనఁ జెప్పితివా నీప్రాణములు దీసెదను.

హకీ : లేదుఅయ్యా! తప్పుకాదండీ!

బన : సరేపొమ్ము. (హకీం నిష్క్రమించును) ఇది నా శత్రుగర్భనిర్భేదనా తరుణము. (అని బొడ్డునదాచిన తాళపు చెవులగుత్తి తీసి తలుపుతెఱచి లోనఁ బ్రవేశింపఁ బోవ యుదయసింహుండు కదలుచు)

బన : (తనలో) పాపమీతఁడు పుత్ర వ్యామోహమున కలవరించుచున్నాఁడు ఉదయ సింహా! ఇంక నెక్కడి రాణా! ఇదిగో నాఖడ్గము నిన్ను ముద్దుగొననున్నది. (అని కత్తెత్తి సంశయించి) ఆహా నన్ను కలనైన నిందింపని నిరపరాధియగు నీవెట్టి బాగులతేని నధ్వానమున హతముచేయనాకు జేతు లాడకున్నవి. అనుంగు ప్రేయసిని చెఱబట్టిన నన్ను సాధించుటకు వెఱచి రామశాంతమును బ్రదర్శించిన గోవువంటి వీనిని వధించిన నాకేమివచ్చును. తన దుర్దశనెంచి శోకించి శోకించి మేనుమఱచి నిద్రించుచు దిక్కఱియున్న యీ యసహాయుని చంపజాల, చంపజాల, ఛీ! ఛీ! పాపిష్ఠి రాజ్యమోహమా! రాజరక్తమును భోజనముగా ననుభవించుచు శతాబ్దములనుండి వేలకు వేలు జీవములను దిగమ్రింగిన చిత్తూరుసింహాసనమా! నీవెన్నడు నాశనమయ్యెదవు. (క్రోధమూర్తియై) ఔరా! నాయుద్యమమును మరచియెంతలో కరుణారసాధి దేవతకు వశుఁడనైతిని. (పండ్లు నూరుచు) నాజీవన సర్వస్వమును హరించి క్షణ కాలమున నా వజ్రకిరీటమును మూర్ధమునఁబూని నన్ను వేదనా ప్రపంచమున కభిషిక్తునిఁ జేసిన పాషాణహృదయుని, నాయనవద్యవాల్లభ్య హర్తను, నా హృదయశల్యమును సంహరింపక విడువను, విడువను. ఎవని మరణము నా క్రోధదేవతకు విజయకేతనమో! ఎవని క్రొన్నెత్తురు నా స్వేచ్ఛాకల్యాణమునకు గాశ్మీరపంకమో, ఎవనిమేనిమాంసము నాయాశా కమలాక్షికి మధురభోజనమో! ఎవని ప్రేవులు నా ప్రాభవ రమారమణీ శాలంబ మాలికలో, అట్టి ప్రతిపక్షమూర్ధన్యుని కడతేర్పని నాపౌరుషము వ్యర్థము. వ్యర్థము. (తాళి) నిద్రా ముద్రాభిరతుండయిన వీనింజంపిన నసమర్థుండ నయ్యెదనా! భువనములు గర్హించునా! అభిమాన గౌరవములకు స్వస్తిజెప్పి కేవలము వైరి నిర్మూలనోద్యమమున నహర్నిశలు తపించు నాకు లోకముతోఁ బనియేమి? ఇట్టి యత్నములయం దప్రమత్తులై సంచరించుచుఁ బ్రచ్ఛన్నులై యుండు సోదరు లెంద రిందులేరు.

సీ. అనలాక్షుఁ డలిఁగి ముమ్మొన బల్లెమున గ్రుమ్మి చిచ్చు కన్నున బుగ్గి జేయనిమ్ము
శమన కింకరులు దుర్దమ దండములమోది యినుప బాణలుల వేయించనిమ్ము
కీనాశుఁడలుక రేఁగిన కాసరఁపు టుక్కు గిట్టల చేతఁ ద్రొక్కింపనిమ్ము
కుల పర్వతములు వేల్పుల పంపున న్నింగి వ్రేలి నాతలమీఁదఁగూలనిమ్ము

తే.గీ. ప్రళయ జంఝానిలంబు సర్వంబుగూడి
భువన సప్తాంతములకుఁ గొంపోవనిమ్ము
యీ యపాత్రుని కంఠంబుఁ గోయకున్న

ఖడ్గమా! నీవిక స్వేచ్ఛగా విహరింపుము. (అని లోన ప్రవేశించి యుదయ సింహునిఁ జంపి నెత్తురు కత్తితో వెడలివచ్చి) ఇప్పటికి నాకు మనశ్శాంతి కలిగినది. (అనునంతలో పురుష వేషములతో మధురా కురంగిలు ప్రవేశించి హఠాత్తుగా బనబీరుని బంధించి కొంపోవుదురు.)

(నాగవల్లి యను వేశ్యతో మురాదు ప్రవేశించును)

మురా : (వెదకుచు) భోగమ్మిదిపిల్వ మన్నాడ్ సర్దార్ అయ్యావచ్చిండు లోగా మంచి చెయ్యాల దీన్కి హకీం చూసిండు దీన్కి మన్సుచేస్తాడ్.

నాగ : సాహేబుగారు! మీ సర్దారుగారి డేరాకు రమ్మని కదా పిలిచితిరి?

మురా : (కొంచెము తీవ్రముగా) హో

నాగ : మరి నన్నిటకు దెచ్చితిరేమి?

మురా : సర్దార్కి చూడాలవద్దూ, ఎకడా యెకడాయుండింది అయ్యా అకడా అకడా పోతాం నీకీ హుంటావులేదు.

నాగ : దేశమంతా త్రిప్పుతారాయేమి?

మురా : మా యిష్టం నీకీ పైసా యిచ్చాముగా.

నాగ : అట్లయిన నేను వెళ్ళిపోయెదను. ఇదిగో మీడబ్బు మీరు తీసుకొనండి.

మురా : భోగందాన్కి యిచ్చింది పైసామల్లా తీస్కుంటాముబే. నీకీ బదామస్కీహుంది లాగహుండావ్.

నాగ : నన్నాడేరాకుఁ గొనిపొండు; లేదా నన్ను విడువుడు. మేమెంత వేశ్యలమైనా యింతగుట్టుగా బ్రతుకువారము.

మురా : అబ్బసొమ్ములాగ డబ్బుతీస్కోని హెక్డికిపోతావ్. సర్దార్కి లేకపోతే మేం యుండిందిగా.

నాగ : మంచిపనియాయె. ఈనాడు నాలుగు రూపాయలిచ్చి నారని కులము చెడమంటారా యేమి? మేముసాహేబుల వద్దకురాము.

మురా : అరే భోగందాన్కి కులంయేంటి? మాసాహెబుల్ యెంతమంది యుంచు కుందిమీకి.

నాగ : ఎవతో నీతిలేనిది చేసెనని మేమట్లు గడ్డితిందుమా?

మురా : (కోపముతో) తినీది అంతాగడ్డీకాదుబే. ఇందులో నీతినీమం, జాతిగీతి, కులం తలం ఏంది నీకీకులంకావాలా బుద్ధిహుండిందితో నాకీరేపు భామ్మర్లు మేం

నాగ : చాల్చాలు లెమ్ము. నన్నొంటరిగా తెచ్చి మోసము చేయజూచుచున్నారు. రేపు మీపాదుషాగారితో చెప్పి నీపనిఁబట్టించెదను. కుడియెడమ భేదం లేకుండా కులము చెడగొట్టుఁడని మిమ్ము బంపినారేమో కనుగొందును.

మురా : (పకపక నవ్వి) సర్కార్ కులంగిలం బేదం హనింది. చెప్పుతీస్కోని మొఖం మీద కొడ్తాం. నీకియిప్పుడు నాచేతిలో చిక్కింది ఎకడాపోతాం. (అని పైకిబోవును.)

నాగ : (దూరముగా పోయి) దూరముగా నుండుము. బుద్ధి చెప్పించెదను.

మురా : నాకీబుద్ధి సెప్పేవాలా ఎవురూ. నాకీపైల్వాన్ హై కుష్టీగిష్టిచేస్తాం. అంతపని ఎందుకుబే. నీకియొప్పుకుంది. హంటేనాకు బుద్ధివచ్చింది. ప్యారీ!ప్యారీ నీకిమీద నాకి మన్సుతగిలించి నీకి సలాంచేస్తాం. హకీంవచ్చాడు నాకీ గోల చేస్తాడ్. (అని బ్రతిమాలును.)

నాగ : (తనలో) వీనికి తోడు మరియొకఁ డున్నట్లున్నది. నేనెంతలో చిక్కుపడితిని. ఇప్పుడీతనిని మోసముచేసిన గాని బయటపడనీయఁడు. (ప్రకాశముగా) బావ గారూ! మీమనసు కనుక్కొనుట కట్లంటిని అయితే నాకేమిచ్చెదరు (అని నవ్వును)

మురా : (చంకలు తాటించి) ప్యారీ! నాకీ మీద మన్సు హుండింది అని పరమాన్నం చేయి.

నాగ : (చేతిలో చేయివేయుచు) అబ్బే! నిజముగా నీవంటి చక్కనివానిని జూచి విడిచి పోగలనా? నీ పీచుగడ్డము వేయివరహాలు చేయదా?

మురా : నాకి ఒక్కముద్దు తినిపియ్యి. (అని ముద్దుపెట్టుకొనబోవగా వారించి)

నాగ : అదిగో యెవరోవచ్చుచున్నారు. కొంచెము తాళుము.

(పూర్తిగాత్రాగి తూలుచు హకీంప్రవేశించును)

మురా : (వ్రేలుకఅచుకొని) సమయాన్కి చచ్చాడ్బేహకీం.

హకీ : (నాగవల్లినిచూచి నిర్ఘాంతపోయి చూచుచుండును)

మురా : అరే హకీం ఎకడాపోయావుబే?

హకీ : భోగమ్దికాదుబే యీమన్సి. భోత్ మజాచేస్తా హుండావు! (అని తలయెగుర వేయును)

మురా : సంసారిబే. ఎర్గినమన్సి.

హకీ : (గుడ్లుమిటకరించి) ఎరిగినమన్సుల్కి ముద్దుపెట్టుకుంటంనీకీ హల్వాటుబే.

మురా : (వ్రేలుకఅచుకొని) సర్కార్ పిల్చిచ్చిందిబే!

హకీం : ఇంక ఎక్డాసర్దార్ మన్కిహుండాంగా! (అనియొక సారాయిబుడ్డి నీయబోవుచు) నాకీ యొక్డుతాగుతాంరా! నీకుభితాగు. (అని తన సీసాలోని సారాయి నాగవల్లి నోట బోయును.)

నాగ : (ఓకళించుకొనుచు) మంచివాఁడవు. నన్నల్లరిచేయించుచున్నావా? (మురాదు తో) నిన్నువరించినందుకా యీ ఫలితము.

యురా : క్యా! బే హకీం హోళ్ళుబల్సిందీ నీకీ నామన్సికి పట్కుంటావుబే.

హకీ : జాబేజా! భోగందిహుంది. నాకి పట్కుంటాం. నీకి పట్కుంటాం. నీకీకొన్పెట్టింది రా దేషంహంతా!

మురా : నాకి చక్దనంచూచి దీన్కి కుషిచేసింది. నీవు ఓ(్రా నడుంగా.

హకీం : నాకిచక్కదనంచూసింది బుద్దిచేస్తాది. (అని మీసము దువ్వుచు నాగవల్లిని సమీపించి) బాలా! నాకీ అందం చందంచూడు.

నాగ : (మురాదు చాటుకు బోవుచు) మొద్దువలె నూరకుందువేమి? నీకుపౌరుషము లేదా! మగవాడవుగావా?

మురా : (కోపము తెచ్చుకొని) అరే! నీకీప్యాణం తీస్తా! కపడదార్!

హకీ : (చొక్కా సవరించుకొనుచు) నీకీప్యాణం తీస్తా! నీ రకతంతున్గాలా! నర్మల్ చిందాలా! (అనికలియబడును. హకీం మురాదులు పోరాడుచుందురు)

నాగ : (తనలో) నేను తప్పించుకొనుట కిదేసమయము. (అని దౌడుతీయును) (హకీము మురాదును పడవేసి వెదకికొను చుండును)

హకీ : అరే మురాద్ నాగ్వల్లి మోషంచేసి పోయిందిభే.

(తెరలో) పారాహుషార్.

(ఇద్దరాలించి తబ్బిబ్బున కత్తులుధరించి జైలుకడ రక్తముచూచి చనిపోయి యున్న యుదయసింహుని చూచి గుండెలు కొట్టుకొనుచు)

హకీ : అరే! భాయీ! కొంపమున్గిందిభే

మురా : అరే! నాకీపిల్లల్కి కూడు తీసిందిరే!

హకీ : అరే! నిన్నేభే నీకీ పుట్టింది నాకీ మూడునెల్లు అయింది నాకీ యెంత ఘూచారం వచ్చిందీగే ఏ-ఏ-ఏ.

మురా : అరే బావా అరేషీద్ నీకిపుట్టింది నాకి దలిద్రంచుట్టుకొందిలేదురే. నీకి మొఖం నాకి చూసాది లేదుబే. ఉదయసిముడురాజా! నీకీ చంపింది ఎవరూ సెపూజీ!

ఈ–ఈ–ఈ

హకీ : ఇయ్యాల పొద్నా ఎవురిమొఖం చూసింది యింతపని అయిందిరే!

మురా : నీదీముఖం చూసిందిరే నాకీ యీా–యీా–యీా

హకీ : అరే! అల్లా! ఖుదా నాకి కడుపుఅంతా గంగాళం చేసినావురే నాకొంప మీద దీపం తీసిందీ!

మురా : ఇంక నాకీ బత్కుతాంలేదు (అని కత్తినూరి హకీం గొంతు కోయబోవును)

హకీ : నాకుభిచచ్చిపోతాం (అని సారాయి త్రాగుచుండును)

మురా : (ఆలోచన నభినయించి) అరే! అరే! హకీం. సర్కార్ నీకీ చంపింది మన్కి అడిగిందు ఏం చేస్తావురా!

హకీ : ఏం చేస్తావునీకి

మురా : తేల్కరిసింది అని.

హకీ : తేల్కరిసిందితో రకతం వస్తాదిబే దివానా! మాటా చెప్తావు.

మురా : (సంతోషము నభినయించి) నాగ్వల్లిబే నాగ్వల్లి.

హకీ : మీకీయుండిందిగా అంటే!

మురా : మాకుభి చంపింది అని.

హకీ : అచ్ఛా! అచ్ఛా! యిది మంచిహాలోచన్

మురా : పోతాం రా బే.

(ఇద్దరు నిష్క్రమింతురు)

# పంచమాంకము

సీను–అంతఃపురము.

(లవంగి యను చెలికత్తె పట్టుకొనియుండ వీరాబాయి మూర్ఛిల్లి యుండును)

వీరా : (మూర్ఛతేరిభర్తనుద్దేశించి) ప్రాణేశ్వరా! ప్రాణేశ్వరా! ఇంక నెక్కడి ప్రాణేశ్వరుండు. అయ్యో! అయ్యో! నాథా! నీయనుంగు ప్రేయసి నెడబాసి యెంతలో పగవారికిఁజిక్కి కారాగార బద్ధుండవైతివి. ఎంత ప్రలాపించితివో! నవెంత దూరితివో! ఎటి పగవానివేనియుఁ జంపజేతులాడక స్త్రీకను

ముమ్మరంగులు జాలిపడు వెన్నవంటి కోమల మనస్కుండవే? పరమ ధార్మిక మహాపురుషుండవగు నీకా బందీగేహవాసము. అక్కటా! నిష్కారణవైరి నిర్మాత లును, శిలాకర్కశ చిత్తులగు తురకలు నిన్నెన్ని శ్రమలు పెట్టుచున్నారోకదా!

తే.గీ. తళుకుఁ జెక్కుల లేనవ్వు మొలక లురల
సింహపీఠికమీఁద నాసీనుఁడవయి
వసుధ శాసించు నీతొంటి వైభవంబు
గాంచునో లేదొ మరల నా కన్నుదోయి

(తత్తరపడుచు) లవంగీ! లవంగీ! నా యాత్మేశ్వరుఁడు నాకర్ణవీధుల నార్తధ్వా నముఁ జేయుచున్నాఁడు అతని కేమాయెనో (యొడలు చూచుకొని) ఇదియేమి నాకు రోమాంచము కలుగుచున్నది.

లవం : అమ్మా! శాంతింపుడు. ఊరడిల్లుము. చక్రవర్తులు సజీవులై యుందురు.

వీరా : కాదే! నా పసుపుఁ గుంకమము పాడుపడినట్లున్నదే.

లవ : అమ్మా! భగవంతుడు మీపాలగలఁడు. మీ కట్టి పాటు కలుగదు.

వీరా : ఇప్పుడు నా పతిని రక్షించుటెట్లు?

లవం : పాదుషాతో సంధిచేసికొనుట కన్న మార్గము లేదు.

వీరా : (క్రోధమూర్తినియై లేచి) ఛీ! ఛీ! యపౌరుష ప్రలాపినీ! ఏమంటివి? సంధియా, కాలవశమున నాభర్త బందీకృతుడైనంత మాత్రమున నసమర్థనై పరుల నాశ్రయింతునా! నాగొంతున నూపిరి యున్నంతవఱకు కోటి యగ్బరుల మధ్య నాభర్త చిక్కియున్నను బంధముక్తి చేసికొనలేనా! ఈ ఖడ్గరాజము వీరాబాయి కరమున మెఱయునంతకాలము పరాధీననై మా తల్లికి చిత్తూరు రాజ్యలక్ష్మి కవమానము ఘటింతునా! మహిషాసుర మర్దన మొనర్చిన భార్గవి నా యుపాసన దేవత. నరక నాశంకరియైన సత్యభామకుఁ బాలిచ్చి పెంచిన భరత వర్షము నా జన్మసీమ.

సీ. ముద్రింతు నా పేరు ముల్లోకములు మెచ్చ నాలిముష్కరుల గోరీలమీఁద
చిత్రింతు కన్నీటి చిత్తజల్లుల పెల్లుకొమరుబిబ్బీలగండములమీఁద
ఆడింతు లోకమల్లాడ నా చురకత్తి దుశ్చరిత్రకుల కుత్తుకలమీఁద
నటియింతు నగ్నిగంధక ధూమపటలంబు బాలిశాధముల డేరాలమీఁద

తే.గీ. పరువులెత్తింతుఁ బాదుషా బలములెల్ల
జగతిమూయంగఁ బొరలుఁ పీనుఁగులమీఁద
విజయకేతనమెత్తింతు విస్ఫుటముగ
కలికి! చిత్తూరు వజ్రదుర్గములమీఁద

(అని ఖడ్గహస్తయై పరువిడును)

(లవంగి నిష్క్రమించును)

## రెండవ రంగము

(సీను–యుద్ధరంగమున నగ్బరుని గుడారము, అక్బరు అఫుజులు ఫజులు పీఠములనుందురు)

అక్బ : (విచారముతో) కవీ! సురాపాన నిరతులగు మన భటులు లంచముఁగొని యుదయసింహుని సంహరించి యుందురు.

అఫు : అనఘా! నాకొక సందేహము వొడముచున్నది. నాఁడు మన సభారంగమున చిత్తూరుపై నిందలు మోపిన యనామక పురుషుఁడే యీ యకృత్యమున కొడిగట్టియుండును.

అక్బ : పాపమీ యుదయసింహున కిట్టి పాటువచ్చునని యెఱింగియున్న కారాగారమునఁ ద్రోయించియుండను. విభుని చావువిని దివ్యచారిత్రయగు వీరాబాయి నన్నేమి శపించునో! ఎంత దుఃఖించునో! పతివ్రతాశాపమును బండితవాక్యమును రిత్తవోవునా? దూరాలోచనదక్షయగు నా భార్య మధురాదేవి నన్నెంత బ్రతిమాలినను తిరస్కరించి యొకపతివ్రత కంఠసూత్రమును ఛేదించితిని.

అఫు : సుల్తానువరేణ్యా! కడచిన దానికిఁ జింతింపనేల? తమ రిప్పటికేనియు రణమును జాలించి ఆకలుషకర్మతుని మట్టుబెట్టు యతనమున కుపక్రమింపుఁడు. రణమిప్పటికే యసంఖ్యాయోధుల నాహారించినది.

అక్బ : అవును. (త్వరపడి) ఓరీ! ఎవఁడురా అక్కడ!

(సేవకుఁడు ప్రవేశించి)

సేవ : స్వామీ! ఏమి ముదల?

అక్బ : ఓరీ! నీవు పోయి యాలముఁ జాలింపుమని మానుసింగుతోఁ జెప్పుము.

సేవ : చిత్తము (నిష్క్రమించును)

అఫు : దేవా! మన రాజా బీరుబనుఁ డపరాధ పరిశోధక వ్యాపారమున నారితేరిన వాఁడు. మీరీతని నీకార్యమునకు నియోగింపుఁడు (బనబీరుని ఱెక్కలు విఱిచి కట్టి మధురాకురంగులు పురుషవేషములతోఁ గొనివత్తురు)

అక్బ : (ఆశ్చర్యపడుచు నఫుజుల్ఫజులుతో) కవిరాజా! యితడుగదా మన... ...

అఫు : రాజకుంజరా! అవును. దైవవశమున నీతడీ వీరద్వయమునకుఁ జిక్కినట్లున్నది.

అక్బ : (మధుర నవలోకించి) ఓవీరుఁడా! మా నిర్ణీత యత్నము బాలుగొన్న నీ వెవరవు? ఈ మాయానాటక సూత్రధారుఁడు మీకెట్లు చిక్కెను?

మధు : ధరాకళత్రా! మాగాథ నిగూఢము. ఈ రాజహంత చెరసాలబద్ధుఁడగు యిప్పు రాధినాథుని సంహరించి వెడలి వచ్చుచుండఁ జూచి యాకస్మికముగా పట్టి కట్టితిమి. ఒక గడియ ముందుగా వచ్చియున్న నా నిద్రాపరవశుఁడగు దీన పురుషుని రక్షించి యుందుము. మా యత్నము పూర్ణముగా ఫలింపమికి చింతించుచున్నాము. కాని యీ ప్రచ్ఛన్న బాడబానలమున ప్రపంచ మింకను దగ్ధము గాకమున్న మా చేతికిఁ జిక్కెనని సంతసింతుము.

అఫు : (తనలో) ఇతని కంఠస్వరము నాకు చిరపరిచయముగా నున్నది.

కుర : (తనలో) మాదేవిగారి కైతవకథాకల్పన మెంత చక్కగానున్నది.

అక్బ : (సంతోషపడుచు) ఓవీరులారా! మీరు దేశమున కెంతయో పుణ్యము చేసితిరి మీకేమి కావలెనో యడుగుఁడు.

మధు : ముందీతని శిక్షనిర్ణయింపుఁడు.

అక్బ : (అఫుజులుని చూచి) ఆర్యా! ఈ చండాలునేమి చేయవలెనో తోచకున్నది. ముందీతని ఘోరకార్యమున లభించిన భాగ్యమేమో పృచ్ఛింపుఁడు. వీనితో భాషించుట నా కసహ్యముగా నున్నది.

అఫు : ఓయీ! జగదపకార దీక్షాపరాయణా! నీవెవరు?

బన : అనఘా! రాజ్యమోహ పిశాచపీడితుఁడనై, వైరిహననమున కుద్యుక్తుఁడనై, సంచరించు నొకానొక దంభ విద్యాగహన సంచారిని. నాకు ఢిల్లీనగరమున మీసమక్షముననిలిచి చిత్తూరుపై దురాగతములు పలికి ద్వేషము పుట్టించిన కపటవేషధారిని. వాస్తవముగా నేను హంతవ్యుఁడను. నిష్కారణముగా చితో డ్సామ్రాజ్యమున కగ్ని దరికొల్పితిని. నా ప్రయత్నములన్నియు నిరాఘాటము గా కొనసాగినను నా హృదయమునకు శాంతిలేదు. నాదౌష్ట్యము నన్ను వేధించుచు కులపర్వత శిఖరముల నుండి నన్నగాధకూపములకు విసరివేయు

చున్నది. నా పంచప్రాణములు భయంకర బడబానల జ్వాలలంబడి కుమిలి పోవుచున్నవి. నేనెవ్వఁడనోకాను, పూర్వపుఁజిత్తూరుసార్వభౌముఁడను. నాపేరు బనబీరుఁడు. మీ పట్టాభిషేక మహోత్సవమునకు వచ్చి భద్రవేదండ పంచకము నుపాయనముచేసినది నేను. మీరిపు డధిష్ఠించు గజము నాయది. ఈ పిశాచస్వరూపమున నున్న నన్ను మీరు గుర్తింపజాలరు. (దుఃఖముతో) ఓ యగ్బరురాజా! నన్ను శీఘ్రమేవధింపుఁడు. నేనీ మనోవేదనను భరింపలేను.

(అక్బరుఁ డపుజులుఫజులు లొకరిమొగము లొకరు చూచుకొందురు)

అక్బ : (అపుజులుతో) ఇతని యుదంత మాశ్చర్యముగా నున్నది.

అపు : (తనలో) పదభ్రష్టతా సంజనితకోపమున నితడు కేవలము బానిసీఁడయ్యెను.

అపు : ఇపుడు కర్తవ్యమేమి?

అక్బ : ఏమున్నది. ధర్మ శాసనానుసారముగా నితఁడు వధ్యుఁడు.

మధు : (తనలో) పాపమితనిని జంపెదరు కాఁబోలు (ప్రకాశముగా యపుజులుతో) అయ్యా! మీ ధర్మనిరూపణము కఠినముగా నున్నది. హంతకుఁడగు వీడింకను పశ్చాత్తప్తుడగుటకు ద్వీపాంతరశిక్షయే యుత్తమము. నా ప్రార్థనమాలించి యట్లొనర్పుఁడు.

కుర : (తనలో) ఆహా! మాదేవిగారి హృదయమున కరుణా కాఠిన్యములు సమానస్థానమునలంకరించుట శోచనీయము.

అక్బ : అవు నీ వీరుని యభిప్రాయ ముచితముగా నున్నది. ఓరీ! సేవకా యిటురమ్ము (సేవకుఁడు ప్రవేశించును)

అక్బ : ఓరీ! ఈతని గొంపోయి చెరసాలయం దుంచుము. (అపుజులునితో) మీరు పోయి చెరసాల నాయకునితో వీని శిక్షావివరము నివేదింపుడు.

అపు : చిత్తము (అపుజులు ఫజులు, బనబీరుఁడు, సేవకుఁడు నిష్క్రమింతురు)

అక్బ : (తనలో) ఈతనిముఖమున మానుసింగుని కవళికలున్నవి. (ప్రకాశముగా) ఓవీరుఁడా! జయపురరాజులతో మీకు బాంధవ్యమున్నదా?

మధు : కలదుఁగాని దూరపుచుట్టఱికము.

అక్బ : (సంతోషమున) కావుననేనిన్నుజూచిన నాకు మధుర స్మరణకు దట్టుచున్నది.

మధు : (కురంగివంకజూచి చిరునవ్వునవ్వి) ఏమధుర?

అక్బ : ఎరుగవా జయపురరాజనందన?

మధు : (ఆలోచననభినయించి) ఆ, ఆ, తెలిసినది. మధురయు నేను నొక గురువు కడఁ జిన్నవాడు చదువుకొంటిమి. పార్థివేంద్రా! ఇప్పుడామె మీతోవచ్చినదా? నన్ను గుర్తించునేమో?

అక్బ : లేదు. ఈదండయాత్ర తనకిష్టములేదు.

మధు : మధుర కడుపట్టుదలమనిషి. మిమ్మును వదలియుంట చిత్రముగానున్నది. మీతో వచ్చియున్న దేమో కనుగొనకపోతిరా!

అక్బ : తే.గీ. మగని యానతిలేక స్వేచ్ఛగఁజరించు
వ్రాతమాదేశ జనులకు పట్టలేదు
పాడునవనాగరికతా ప్రపంచగాథ
నాకు వినుపింతువేల? రణప్రవీణ!

కుర : (తనలో) చక్రవర్తుల కింకను కలవరము వదలనట్లున్నది. (ప్రకాశముగా) ధరణీశ్వరా! మీపట్టమహిషియును జిత్తూరువచ్చినట్లున్నది.

అక్బ : ఆ. ఆ. నీవు చూచితివా? వాస్తవమా?

మధు : అగత్యములేక మీరన్నట్లు శుద్ధాంతస్త్రీయగు మధుర రా సాహసించునా? మీకిప్పుడామెను జూపిన మాకేమిచ్చెదరు.

అక్బ : ఏమడిగిన నిచ్చెదను. ఎక్కడనున్నది? పోవుదము రండు.

మధు : ఎక్కడకో పోవలయునా! మధుర నావంటిదేనా? (అని ప్రత్యక్షమగును)

అక్బ : (విభ్రాంతిపడి కౌఁగిలించుకొని) దేవీ! నన్నెంతమోసగించితివి.

మధు : ఉరుసులో నాఁడు మీరు మోసగించిన దానికి

అక్బ : ఈ పురుషుఁ డెవరు?

మధు : మన కురంగికాదా?

అక్బ : కురంగియా? కురంగీ! మీదేవిగారికి తగినట్లే దొరకితివి. మనము శీఘ్రమే పోయి వీరాబాయిని రక్షింతము రండు.

(నిష్క్రమించును)

మూడవ రంగము

(సీను-యుద్ధరంగము) (రణభేరీలు మ్రోయుచుండ రౌద్రమూర్తులై కత్తులు ద్రిప్పుచు రాణా జయమల్లులు ప్రవేశింతురు)

రాణా : ఓరోరీ! మ్లేచ్ఛాధములారా! రండు రండు, మీ పసబట్టెదను.

మాను : (పరుగెత్తుకొని వచ్చి) ఓరోరీ! వాచామూర్ధన్యా!

ఉ. నాఁడు సభాంతరాళమున నన్నుఁదృణంబుగ నెంచి తండ్రియు
న్నాఁడని తూలనాడు వచనంబులు కొంచెము వెళ్ళబెట్టి నీ
పోడిమిఁ జూపుమేది? రణభూమికి నీతల బొమ్మగట్టిచెం
డాడెద తోడు దెచ్చుకొనరా! తులువా! యల నాటివీరునిన్
(అని యెదుర్కొనును) (తెరలో)

ఉ. నన్నువధించి యావెనుక నా సుకుమారుని దాకినన్ బలా
భ్యున్నతి గానవచ్చు నిలు మొక్క క్షణంబున నీదు రక్తము
న్గన్నులఁ జూతు నిట్టి పసికాయ నెదిర్చుటగాదు శౌర్య సం
పన్నతయుక్కుతున్కలగు మమ్మెదిరింపుము మీసముండినన్

(పై పద్యమును చదువుచుఁ బురుషవేషధారిణియై వీరాబాయి ప్రవేశించును)

వీరా : విరోధి కబంధ విచిత్ర సౌధాంగణముల భూతభేతాళ గణములకు బువ్వంపు బంతులు సాగించెదను. రండు, రండు.

(కొంతవఱకు పోరి గాయపడి ప్రేవులు జీరాడ బిగియగట్టి తిరుగ పోరి నేలగూలుచు) ఓ రసపుత్ర యోధులారా! చెంగలింపుఁడు. మీ నామములకు శాశ్వతకీర్తి నార్జింప వలెనన్న రణరంగమే దివ్యసాధనము. ఈ మహాసంగ్రామ భయంకర నాటకమునకుఁ బ్రేక్షకులై దివ్యులు మేఘపంక్తుల నాసీనులై మందార మాలికలు బట్టియున్నారు. మీ సార్వభౌముఁడు శృంఖలాబద్ధుఁడై బందీగేహమున నవయుచుండ, మీచితోడ్గడ మనాథయై మూల్గుచుండ, వైరిశిరములను వ్రక్కలింపరేల? నీహారలేశముల వంటి తనువులనాశించి యమమహిషరింఖాటంకారముల నాకర్ణింపకుఁడు. ఇదిగో భూమ్యాకాశములు సాక్షిగా నా శరీర సర్వస్వము, నాపవిత్ర రక్తమును దేశ సంరక్షణార్థము ధారవోయుచున్నాను. బ్రహ్మాండము బ్రద్దలగుగాక! సముద్రములు మిన్నుముట్టుగాక, చుక్కలూడిపడుగాక, వెన్నుజూపకుఁడు. ఆజ్యముబోసిన యగ్గులై, కసరరేగిన సింగములై జన్యక్షేత్రమున రుధిర వృష్టియందు యశోబీజములను వెదజల్లుఁడు. చిత్తూరుగవనికిఁ గపాలతోరణములను గైసేయుఁడు. మీనామ సంకీర్తనమునకై దిగంగనలు వీణెలు శ్రుతి చేయుచున్నారు. నేనును మీకు సాయపడియెదను. (అని లేచి నడువబోయి కూలిపడి) ఆహా! వీరాబాయి ఖడ్గము విశ్రమించుచున్నది. నా జీవన గేహమున నిరంతరము ప్రజ్వరిల్లు ప్రతాపజ్యోతి దీర్ఘనిశ్వాసము విడిచినది. ఉదయసింహుని మహానంద సాగర మధ్యమున విధి కఠోరాట్టహాసము చేసినాఁడు (రక్తము జూచుకొని) ఆహా! నామేన నెన్ని గాయములు

పడినవి. ఈరక్తవసములతో స్వర్గ యాత్రాభిముఖి నయిన నాకొఱకు నిలింపులు కాంచన కిరీటమును గొని వచ్చుచున్నారు. దేశమునకై దేహము లుపాయనములు గావించిన భారత వీర పతివ్రతల యందు వీరాబాయి కీర్తి కిరీటము ధరించుచున్నది. ఏమి నాభాగ్యము. (అని మూర్ఛిల్లును)

(అక్బరు ప్రవేశించి)

అక్బ : (అబ్బురపడి) ఆహా! ఈమె ప్రతాప మనివార్యము. ఇంక నిమిషకాల మీశక్తి స్వరూపిణి రణవిహారము చేసియున్న నా సర్వసేనావారము నాహుతిఁ గొనియుండును. ఇట్టి కాంతలు మా భరతఖండమున జన్మించియుండుట జూచి యుప్పొంగవలసిన నేను అవివేకినై కయ్యము రేచి యెంత పాతకమున కొడిగట్టితిని. నా ధర్మపరిపాలనము గంగపాలయినది. ఈవీరవనితా పాదములను పూజించిన నాకు ముక్తికల్గును. హిందూ మహమ్మదీయ విరోధము లను నిర్మూలింప నిశ్చయించుకొన్న నా తెలివి తెల్లవారినట్లున్నది. మా భరత మాతృకాసంతానమహిమ దలంచుకొనగా మేనుఁ బులకరించుచున్నది. ఓ భరతఖండమా!

సీ. ప్రమథనాథుని నీరు ద్రావింపజాలిన వజ్రాల కొడుకుల బడసినావు
నరకాధిపతిగుండెఁ గరగింపఁజాలిన వెలదిమిన్నల కుగ్గుపెట్టినావు
బ్రహ్మమంతటివాని వణకింపఁజాలిన మునులమూపుననిడి మోసినావు
అంటి నంతన బాపమడగింపఁ జాలిన తీర్థకోటులమున్గి తేలినావు

తే.గీ. యుర్విబుట్టక ముందె నీవుంటివేమొ
సకలశాస్త్రపురాణము ల్జదివినావు
గొనబుసిరిగల భాగ్యశాలినివి నీవు
భారతాంబామణీ నమస్కారమమ్మ!

సీ. జలకంబులాడించు చెలికత్తెగద నీకు కనకాంబుజాఢ్య గంగాభవాని
తలమీఁది గుండుమల్లెల దండగదనీకు నత్యున్న తోగ్రహిమాలయంబు
పూఁతబంగారు సొమ్ములపెట్టెగదనీకు సిరివెలంది చరించు సింహళంబు
ముద్దుగారెడు నిగ్గుటద్దంబుగద నీకు నింపారు హిందూమహాంబురాశి

తే.గీ. ఇట్టి నినుఁజూచి బిచ్చంబుబెట్టుమనుచు
నన్నిదిక్కులు యాచించు చున్నవమ్మ!
యైకమత్యంబుగలిగి నిన్ననుభవించు
కొఱతపూరింపవే మాకు భరతమాత!

(వీరాబాయి వంకజూచి తనలో) ఈ శాంకరీస్వరూపిణి బలుకరించుటకు నాగుండె నిబ్బరింపకున్నది. (సమీపించి ప్రకాశముగా) ఓ ప్రతాపసుందరీ! భారతవీర సోదరీ లలామా! నీజీవనప్రళయ కారకుండగు పరమపాతక చక్రవర్తి యగ్బరు నీ సుగుణ శృంఖలాబద్ధుఁడై యోడి నీ వీరమూర్తికి నమస్కరించుచున్నాఁడు.

వీరా : (క్రోధోచ్ఛలితయగుచులేచి కత్తిని వెదకుచు) ఏమీ! అక్బరు రసపుత్రభువన కంటకుడయిన అక్బరు అనంతక్షమా సంపన్నుఁడగు నానాథుని జాలిలేక చెరసాలపాలొనర్చిన యా నిర్దాక్షిణ్య కలుష కర్కశ హృదయుఁడగు అ-క్బ-రు ఏఁడీ యేఁడీ! (అని పండ్లు కొఱకుచు) ఈ కరవాలము నతని గర్భమున చీల్చి, హాయిగా నిర్విచారముగా స్వర్గ మలంకరింతును.

అక్బ : (తనలో) అయ్యో! నేనేమి చేయుదును. అమాయినియగు నీదొడ్డముత్తైదువనకు భర్తృమరణము నెఱింగించిన వారు లేనట్లున్నది. (ప్రకాశముగా) తల్లీ! నిజముగా నేను ఘోరపాపిని. నీపవిత్రహస్తమున నాకంఠముగోసి నన్ను ధన్యునిఁ జేయుము. (అని తలయొడ్డును) (వీరాబాయి కత్తి జారవిడిచి) ఆహా! పశ్చాత్తప్తుఁ డగు యీతనిం దునుమరాదు. (ప్రకాశముగా) ఓ చక్రవర్తీ! నీకు శుభము, మా ధర్మజుని చరణతలస్పర్శనమున ధన్యమైన హస్తినాపురీ సింహాసనాధ్యాసివైన నీవు సంస్తవయుఁడవు. విధికృతము మాపై స్వేచ్ఛావిహారము చేసినది. ఇందు నీ దోసము లేదు. నాభర్తకు బంధముక్తి గావింపుము. నాకుమారుని (దుఃఖము నభినయించి) ఇంకనుఁ గుమారుఁడా! రాణా! నీవేమైతివి?

అక్బ : అమ్మా! నీకుమారుఁడు క్షతగాత్రుండయ్యె! అతఁడిప్పటికి మరణించి యుండును. నీ భర్తనెవరో విరోధులు బందీగృహమున సంహరించె. అతనిని పట్టి శిక్షించితిని. నన్ను క్షమింపుము. నేనేమియు నెఱుగను. నీ పవిత్రక్రోధమున నన్ను శపింపకుము. తల్లీ! నీకు నమస్కారము.

వీరా : (కలవరపడి తన్నుకొనుచు) ఘోరము, ఘోరము. ప్రాణేశ్వరా! నీవు బందీ గేహమున నున్నను సజీవుఁడవై యుంటివని నా హృదయమునకింత శాంతిఁ జేసికొంటినే! రాణా కుమారా? నీవు స్వర్గమలంకరించితివా? మిమ్మును విడచి యింకను మొండినై బ్రతికియుండి యెంతపాపము చేసితివి, బనబీరుఁడా! నీ కనులు చల్లబడెనా! మాకుటుంబము నెంతలో దిగమ్రింగి నీళ్ళుత్రాగితివి (త్వరపడి లేచి మిన్ను జూచుచు) మనోహరా! మనోహరా! ఏమి యాజ్ఞ, రమ్మనుచుంటిరా! ఆ-ఆ లేదు. నేనా! కొడుకా! కొడుకా! ఆలసింపను. (అని

కత్తితో బొడిచికొని) భరతఖండము, నాభాగ్యము, దుఃఖము, చిత్తూరు, దాహము, సంతోషం, యుద్ధము అ-క్బ-రు.

(అని ప్రాణములు విడుచును)

(అవనిక పడును)

సమాప్తము.

# వినతి

మహాత్ముని యకాలమరణమునకు విశ్వంభరానేత్రము చెమ్మగిల్లినది. భారతస్వేచ్ఛకై వ్యయించక మహాత్ముడు దాచుకొన్న రక్తకణములేదు. అతడే భరతవర్షము; భరత వర్షమే బాపూజీ. ఒక ప్రత్యేక వ్యక్తికాదు. నలుబదికోట్ల భారతీయు లతడు. "అతడొక మధుర ప్రకృతి గాని మానవ వ్యక్తిగాద"ని జార్జి బెర్నార్డుషా నుతించినాడు. ప్రపంచ చరిత్రలో నెట్టివాడు నేయుగమున గడింపని యమరకీర్తి నత డార్జించి, అనుగుబిడ్డలగు భారతీయుల కంకితమొనర్చినాడు. ప్రతిఫలముగా తనకు లభించినది బలవన్మరణము. భస్మస్వరూపము. అది తలంపరాని విషమఘడియ. నాడు రాలిన యశ్రుకణములే యీ కావ్యము. భారతకవు లిప్పటికే పరిపరి విధముల వాపోయి తాతనర్చించి ఋణ విముక్తులయినారు.

మహాత్ముని భక్తులలో ప్రథమగణ్యులై యసహాయోద్యమక్లిష్టకాలాన సకుటుంబముగా నమ్మహాముని ననుగమించిన సింహపుర రెడ్డి కులాలంకారులయిన శ్రీశ్రీశ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారి కీగ్రంథము నంకితమొనర్చుచున్నాను. ఈ కృతి స్వీకృతికి రెడ్డిగా రెంతయు నర్హులై గాంధి మహాత్ముని యాత్మశాంతి కుపకరింతురని నా విశ్వాసము. రెడ్డిగారిక్కావ్యమును విని సంతసించి, ముద్రణార్థమై ధనమొసంగి, కృతినందుట కంగీకరించి నాకు మహోపకారము చేసినారు. వారికి నే నెంతయు కృతజ్ఞుడను.

జి. జాషువ

# కృతిపతి ప్రశంస

మ. అనుమానింపక నీస్వరాజ్యరణ శంఖారావ మాలించి క
మ్మని భోగాలు పరిత్యజించి ద్రఢిమన్ మైమీది వస్త్రంబుతో
నిను వెన్నాడిన రామరాడ్విభునకున్ నీకావ్యమర్పించి వ్రా
సిన కష్టంబును విస్మరించితి మహర్షీ! గాంధి స్వేచ్ఛారతా!

సీ. బెడగారు నీమేలి యడుగుజాడలలోన నడుగుసాగించు దయారతుండు
కులమతద్వేషముల్ మొలకలెత్తిన వన్న కటకటంబడు క్షమాకాముకుండు
సమసి పోయిన పూర్వజాతీయ కళల కాలంబంబు చూపు కళాపిపాసి
గుణమున్న కృతులన్న కోరియాహ్వానించి సత్కారములు చేయు సజ్జనుండు

ఆ.వె. నీతి నియమములను నినుబోలి పాటించు
తిక్కవరపు కులుడు దీనహితుడు
యెలమి నీచరిత్ర కృతి నందికొన్నాడు
సమ్మతంబు కాదె జాతి జనక!

చం. హరిజన సేవకై బ్రదుకు నమ్మిన నీమనమూరడిల్ల నం
తరములు విస్మరించి నిజధామమునన్ సహపంక్తి భుక్తిచే
హరిజనులం దనించెడు మహత్తర సంస్కృతికర్త రామ రా
డ్వరుడు మహాత్మ! నీదు కృతిభర్తృత కన్యులనర్హులేకదా?

మ. ఒక రాష్ట్రంబున కొక్కవర్గమునకై యుత్పత్తిగావించు సాం
ఘికపుం జట్టముగిట్టదెన్నడు త్రిలోకీశ్రేయముంగోరు ధా
ర్మికసింహున్నిను గొల్చువాని కివి సంతృప్తిం బ్రసాదించునే?
మొకమోటంబునకున్ సహింపడొకతప్పున్ రెడ్డి స్వేచ్ఛామునీ

శా. మిన్నుల్‌గూలిన తత్తరంపడని గంభీరస్వభావుండు వ
ర్ణౌన్నత్యంబున విఱ్ఱవీగని ప్రశాంతాకారు దేకాలమున్
నిన్నాదర్శముగాదలంచు విబుధున్ శ్రీ రామిరెడ్డిప్రభున్
మన్నించుం గవితాప్రపంచము మహాత్మా! కావ్యపుష్పాంజలిన్

శా. అల్లుంద్రున్ గొమరుల్ గుమారితలు దేశారాధనాసాధనో
త్ఫుల్లాంతఃకరణుల్ నిగర్వులు కళాపూర్ణేంద్రులై కొల్వగా
యిల్లాల్లేని విచారమున్ మరచి సాహిత్యంబు పోషించుచున్
నెల్లూర్సీమకు రామిరెడ్డి యొక మాణిక్యంబుగా వెల్గెడిన్

ఆ.వె. ఒకరు చెప్పకున్న నున్నవాడని సంశ
యింప జోటుజిక్కదింతయేని
వేయిమాటలేల వేషభాషలగాన
రాదహంబు రామిరెడ్డియందు

సీ. ధరియించినాడు ఖద్దరుబట్ట తొలుదొల్త కదురు తుమ్మెదతెక్క గదలునాడు
భుజించినాడు సమ్ముదితాంతరంగుడై జైలుఖానాల ఖైదీలబువ్వ
అంపించినా డసూర్యంపశ్యనిల్లాలి కిగ్గాడి బంధనగేహమునకు
పోసినాడెన్నియో దోసిళ్ళకొలది రూపాయ లారంభజాతీయనిధికి

ఆ.వె. వడియువంకలేని భవదంతరంగంబు
చూఱలాడినట్టి సుజనహితుడు
సింహపురనివాసి శ్రీ తిక్కవరవంశ
తుహినకరుడు మధురసహనపరుడు.

ఆ.వె. నిలువుదోపాసంగి నీయంతరంగాన
ముద్రవడ్డ రెడ్డిముద్దరాలు
శ్రీ శకుంతలాంబ శ్రీ రామిరెడ్డిగా
రాలబిడ్డ ఖదరు రాచతపసి!

ఉ. మోమున వీరకుంకుమముబొట్టు రచించి పతివ్రతల్ నిజ
స్వాముల బందిఖానలకు పైనమొనర్చెడువేళ రామరా
డ్భామ సుదర్శనాంబిక భవన్నుతులంది ధరించె శాంతిసం
గ్రామసుదర్శనాయుధము రాట్నము సింహపురాంగనావళిన్

ఉ.  ఆర్థికమంత్రియై ప్రకృతమాంధ్రిని పాలనసేయుచున్న ని
స్స్వార్థమనస్కుడైన బెజవాడ కులాభరణంబు రామరా
డర్ధపమౌళికిన్వలపుటల్లుడు సుమ్ము భవత్కటాక్షసం
వర్ధితులయ్యు తిక్కవరవంశజు లక్కజపుం గళానిధుల్

జి. జాషువ

# బాపూజీ

మ. ఎవడీ యర్ధదిగంబరేశ్వరుడు మా యింట్లంప్రవేశింప నం
చవమానంబుగ చర్చిలాడగ బకింగ్‌హాం సౌధమున్ ద్రొక్కి హైం
దవజాతీయత లీను మేల్పిలక నాట్యంబాడ శ్రీ జార్జి భూ
ధవునింటన్ ఫలహారముల్ సలుపు తాతన్ గాంధినర్చించెదన్

ఉ. భగ్గునమండు సీమ నరపాలురతోడ నెదిర్చి వెన్కకున్
దగ్గక రక్తపుంజినుకు నష్టముగాని స్వరాజ్య యుద్ధమున్
నెగ్గిచినట్టి భారతముని ప్రవరుండు క్షమాప్రవాసి యా
ముగ్గిన పండు బోనమయి పోయెనె నేడు తుపాకిగుండ్లకున్

మ. జగమొక్కుమ్మడి ఔమ్మొగ్రుద్దుకొని మూర్ఛన్‌దేలి తబ్బిబ్బు జెం
దగ చేజిక్కిన మొన్న మొన్నటి స్వతంత్ర స్వర్గసౌధంబులో
పొగరేగన్ బగవాడులేని భువనంబున్ గన్నబాబున్ భవత్
భగవంతున్ దయమాలి చంపుకొనినావా? భారతాంబామణీ

శా. నీ యంకంబున లాలితంబగుచు శాంతిన్గాలమున్ బుచ్చు న
మ్మాయిన్ జిట్టి స్వరాజ్యబాలికను సామ్రాజ్యేందిరన్ లేతలే
తాయుష్మంతులు తండ్రిలేని యల జవ్హార్ లాలమాత్య ప్రభుల్
మోయన్గాలుదురే? జగజ్జనక! బాబూ! గాంధిమున్యగ్రణీ!

శా. ఇదియే పోవడమా! జగజ్జనక! రానేరావుగా! నూట ము
ప్పదియేడుల్, మనువాడనన్న నుడికిన్ భంగంబు వాటిల్లెనే?
ముదితాతా! ప్రతిరక్తబిందువును మా పూర్ణస్వరాజ్యార్థమై
కొదలేకిచ్చిన నీ విషాదమరణాగ్నుల్ గాల్చె ముల్లోకమున్

శా. ఏ లేనవ్వులు లోకలోకముల మోహింపించి నిర్జించి స్వే
చ్ఛా లావణ్యవతీ కరగ్రహణ పూజల్‌గాంచి పుష్పించెనో
ఆ లేనవ్వుల రాశి! ఆ యపరవిద్యావార్ధి! ఆ పండుటా
కీలోకంబును వాసెనే! భరతరాజ్ఞీ! యెంత దౌర్భాగ్యవో!

సీ. ఆగిపోయెనె ప్రపంచానందదంబైన ఖదరురాటాల ఝుంకారరవళి
ఇంకెనే శాశ్వతాస్పృశ్యుల నోదార్చి నెనరూను వేడి కన్నీటి బుగ్గ
పడిపోయెనే నేటివరకింత లభియించు గండుపేదలనోటి కబళరాశి
విరిగిపోయెనె నేటివరమంత్రికోటికి నవలంబనంబైన యమరతరువు

తే.గీ. గంటకొట్టినమాదిరి మింటియందు
మండుచున్నాడు చండమార్తాండమూర్తి
భారతజ్యోతి గప్పున నారిపోవ
ముజ్జగంబున జీకటి ముమ్మరించె

మ. కలికాలమ్మున కేసుక్రీస్తువని వక్కాణించె దిగ్దేశముల్
తులువల్ సల్పిన గాయముల్ మరల నీలో దోచి యేసుప్రభున్
దలపించెన్ ఋజువయ్యె నీదగు మహత్వశ్రీ భవత్త్యాగ శ
క్తులలో నెన్ని స్వరాజ్యముల్ భువనవైకుంఠంబు లింపారునో

మ. అవతారమ్ములు దాల్చినాడు పదిమార్లబ్జాక్షుడం చూరకే
చవులూరించు సమస్తశాస్త్రములు సాక్షాదబ్జనాభుండవై
యవతారించిన నిన్నెఱుంగుదుము బ్రహ్మాండం బెఱుంగన్ జగ
ద్భువమున్ చెండితివీవు కొండొక మరంద ప్రేమహాసంబునన్

తే.గీ. అలిగి కూర్చుండు చిన్ని బిడ్డల విధాన
నుపవసింతువు భువనముఝ్ఝాతలూగ
విశ్వములకెల్ల గారాలబిడ్డ వకట
చంపుకొన్నది భారతక్ష్మాతలంబు

చం. పగతుర రక్తమున్ దిలకపంకముగా ధరియించు భండనా
ధ్వగులగు పుత్రులంగనెడు భారతదేవత కడ్పుచల్లగా
పగతుర చిత్తముల్ గెలిచి పాలనసల్పిన బుద్ధదేవునిన్
మిగిలినవానిగాంచె మహనీయుని మోహనచందు గాంధినిన్

చం. అదితలపోయరాని హృదయప్రవిదారి విషాదవాత్యా కా
స్పదమయి, పంచఖండములు బావురుమన్న పిశాచివేళ, ము
ప్పది పదికోట్లభారత తపస్సముదాయము భస్మరాశియై
చిదికిన ఘోరదుర్దినమిసీ! వచియింపగ జిహ్వాలాడునే

సీ. భరతవర్షంబీను వజ్రాలధనరాశి తూకంబునకు పెచ్చుదూగువాడు
మూడుమూర్తుల దయాభూతి ప్రత్యంగాన తాండవించెడు పవిత్రస్వరూపి
పదివేలయేండ్ల లోపల ధరాదేవత కనియెఱుంగని జగన్మునివరుండు
అనుగు దమ్ములు కోరుకొను స్వరాజ్యార్థమై పస్తుండి శుష్కించు పండుముసలి

ఆ.వె. గోచిపాత గట్టుకొని జాతిమానంబు
నిలిపినట్టి ఖదరునేతగాడు
విశ్వసామరస్య విజ్ఞాన సంధాత
కామితప్రదాత గాంధితాత!

సీ. విమత భూపతుల దోపిడిగుందుజాతిలో దీపంబుబెట్టిన దినకరుండు
మానవత్వమును భూమండలంబున నెల్ల చాటిన యాచార్యచక్రవర్తి
సత్యాగ్రహంబను శస్త్రచాలన విద్య భువికిదెచ్చిన మహాపురుషమౌళి
నిమ్నజాతుల కంటి నీరంబుదుడిచి యాశ్వాసించు నిఱుపేద బాంధవుండు

ఆ.వె. పండ్లు నూరుచున్న బహుమతంబులలోన
సహనవిద్య నేర్పు సాధకుండు
భార్యబిడ్డలున్న ప్రత్యక్షదైవంబు
కామితప్రదాత గాంధితాత

మ. ఉపవాసంబుపసంహరించుకొని యెన్నోనాళ్లుగాలేదు తా
నుపలాలించు ప్రపంచ శాంతిరమకాయుర్భూతి సిద్ధింప లే
దపరాహ్ణంబున గ్రుంకెనే! భరతమున్యాదిత్యబింబంబు తూ
రుపుఖండంబున నస్వాభావికముగా రోదస్సురోదించగన్

మ. కలముల్ కైతలు మూగవోయినవి శోకధ్వాంత ముప్పొంగి క
న్నులువోయెన్ సకల ప్రపంచమునకున్ దోడ్తో భయభ్రాంతమై
బలహీనంబయి తూలెభారతము విశ్వవ్యాపి బాపూజి గుం
డెలలోనుండి పవిత్రరక్తము చితాగ్నిన్ గ్రాగి ఘోషింపగన్

శా. వేయేడుల్దలక్రిందులైన భరతోర్వీచక్రమీ వింత గో
సాయిన్ సామి దిగంబరేశ్వరు నహింసామూర్తి శాంతిక్షమా
వ్యాయామ స్థిరునెత్తి పెంచుకొను భాగ్యంబున్నదే? మాన దీ
గాయంబీ మతమత్తచిత్తుల తలల్ఖండించి కాల్పించినన్

మ. అదిగో! రాట్నముచేత నిమ్నజుల కాహారంబు గల్పించి య
భ్యుదయాపాదక సామరస్యమున కాయుర్దాయముంబోసి, ఆ
పదపాలై మరణించి భస్మచయమున్ భాగించి దేశాలపై
వెదజల్లించిన గాంధితాత ఋణమున్ విశ్వంబెటుల్దీర్చునో?

సీ. అవతరించిన స్వరాజ్యప్రాజ్యబాలిక కక్కటా! ముకుపచ్చలారలేదు
సకుటుంబముగ వీడి చనుచున్న తెలిరాజు నిజసీమలో కాలునిలుపలేదు
హస్తినాపురిమీద హైందవ ధ్వజమెత్తి నిండుగా యేడాది నిండలేదు
స్వాతంత్ర్యఘనమహోత్సవ జయధ్వానంబు మాఱ్ఱ్మోతలూరూర మాయలేదు

తే.గీ. సింహపీఠిక నధివసించిన యనుంగు
మనుమలం జూచుకొనుచు నమందహర్ష
పులకితస్వాంతుడగు దొడ్డ ముసలివాడు
మాయమయ్యెనె? లోకాల గాయమగుచు

ఉ. ఆకటిచిచ్చునం గుమిలియార్చెడు ప్రేవులుమూటగట్టి ధ
ర్మైక మహారణంబున నహీనజయంబుగడించి దాస్యపుం
జీకటివాపి తమ్ములకు స్వేచ్ఛయొసంగిన తాత జాతికిన్
జీకుడుబెట్టి స్వర్గపురిజేరెనె? భారతబాష్పబిందువై

ఉ. అచ్చపు గ్రైస్తవుండనుచు నంజలిబట్టిరి క్రైస్తవోత్తముల్
పొచ్చెములేని బౌద్ధుడని పూజలొనర్చిరి బౌద్ధభిక్షుకుల్
మచ్చరకించి మా ముసలమానని పల్కెఁదురుష్కలోకముల్
అచ్చ మహాత్ముడన్ననుడికర్హుడు గాంధిఫకీరుడెంతయున్

సీ. ఆఫ్రికాఖండంబునందు బోయరులకై చిందిన నెమ్మేని స్వేదధార
హరిజనావళి సముద్ధరణార్థమనయంబు వగచి చిమ్మిన బాష్పవారిధార
బహుకాల శృంఖలాబంధనాలయమున వృధపుచ్చుకొన్నట్టి రుధిరధార
సీమరాజుల శిలాచిత్తాల నగలించి లాలించు స్మితసుధాలాపధార

తే.గీ. నేల నాలుగు చెఱగులు నిండిపాఱి
మొలకలెత్తించె దేశాల పుష్పపూజ
హరహరా! నేడు బాపూజి మరణవార్త
కత్తులాడించె భారత గర్భకుహరి

శా. "హారామా!" యని నేలపైకొరగి నిర్యద్రక్తసిక్తాంగుడై
వీరస్వర్గమలంకరించిన యశస్విన్ గాంధికర్మంది గ
న్నారం జూడగలేక ఢిల్లినగరం బాబాలగోపాల మా
కారంబెత్తిన శోకమై ప్రకృతిముగ్ధంబయ్యె నిర్జీవమై

మ. నవఖాలీ నరమాంసభక్షణ దురంతశ్రేణి నాలించి మా
నవధర్మంబునశించెనే యనుచు జింతాక్రాంతుడైపోయి త
ద్దవధూమంబును శీతలోక్తి మధురార్ద్రప్రేమ చల్లార్చు సా
ధువరేణ్యుం గబళించిరే యనుగుపుత్రుల్ దైవభక్తబ్రువుల్

మ. గొడిసే చేతి తుపాకితో శిథిలితాంగున్ బ్రేమపాథోనిధిన్
బుడమింగూలిచి మూర్ఛవోవునెడ 'బాబూ నొచ్చెనే దేహమం'
చడిగెన్ లేనగవుల్ శమింపని యపాంగాలోకనంబుల్ కటా!
పిడుగుల్గూలెడి నంతరంగమున నీ వృత్తాంత మూహించినన్

కం. చెప్పులు కఱ్ఱయు నన్నపు
జిప్పయును సులోచనములు చిత్తంబులలో
నొప్పిగలిగించె జూపర
కప్పాజీగృహము శూన్యమై దుస్సహమై

శా. శ్రీవైస్రాయి సతీసమేతముగ నర్చించెన్ సుమశ్రేణిచే
నావిర్భూత కవోష్ణబాష్పములచే నత్యంతభక్తిన్ బ్రజా
సేవాశుష్కిత వృద్ధమూర్తిని ధరాక్షేమంకరున్ బుణ్యపుం
బ్రోవున్ గాంధి నకాలమృత్యు సుఖసుప్తున్ రక్తసిక్తాంగునిన్

శా. ఐదార్మైళ్లు ప్రజాసమూహమిరుపార్శ్వమ్ముల్గట్టి వెంటాడ ము
న్యాదిత్యుండు వికుంఠసీమకు మహాయానంబు సాగించె మై
మీదంబూవుల వర్షముల్ గురియ గంభీరస్మితచ్ఛాయలన్
బూదేరెక్కి కళిందజాతటికి మామూల్దివ్య తేజంబునన్

ఉ. మంతురులెల్ల నప్పరమ మౌనిశవంబరుదేరు నేనుగుం
దంతపుదేరులాగ గవనర్ జనరల్ బహరాయెనర్పగా
యంతములేని మానవమహానది సూర్యసుతాస్రవంతి ప
ర్యంతము నేలయీనిన దెరంగున బొంగిరహించె నెంతయున్

తే.గీ. ఎందరో నాటిరక్తంబు జిందుచున్న
నేనుకొనని యహింసా ప్రసూనలతిక
బాపుజీరక్తబిందు సంస్పర్శనమున
నాటుకొన్నది ఖండఖండములయందు

శా. ఏ జన్మాంతర పుణ్యశాలుర తనూమృత్సంచయంబంటి యా
రాజాఘట్టము ధన్యమయ్యెనో! పవిత్రంబై ప్రకాశించు బా
పూజీ సంచయనక్రియాసమధికంపుం బుణ్యమార్జించి ది
గ్రాజీదంతురిత ప్రతిష్ఠ కిపు డగ్గంబయ్యె సుక్షేత్రమై

కం. మందంజొొచ్చెం బడమట
దండకరుని చితి యదెట్టి సంఘటనం బో
మందంజొొచ్చెం గాంధీ
చండకరుని చితి కళిందజాతీరమునన్

ఉ. ద్వాదశపుణ్య తీర్థములు భారత భాగ్యవిధాత మేని కొం
బూదితరంగహస్తముల ముద్దిడి యొద్దిక నాణిముత్తెపుం
గాదెల నింపుకొన్నవి సగర్వముగా కలుష ప్రపంచపుం
బూది స్పృశించి యంటువడిపోయిన కల్మష మూడిపోవగన్

ఆ.వె. బూదిబంచుకొనుచు భూరిచింతాక్రాంత
వదనులగుచు దిరిగివచ్చినారు
మంత్రిమణులు భరతమౌనీంద్రమణి లేక
వగల బొగులు ఢిల్లినగరమునకు

సీ. నిమ్నజాతుల మేనునిమిరి పైపై చెల్మి నటన సాగించిన నైష్ఠికుండు
ప్రాతవారిన సీమవసన మొక్కటిదెచ్చి దహనంబుజేసిన త్యాగధనుడు
ఖదరుగట్టనివాని గని వేడినిట్టూర్పు విడిచి కుందిన భక్త వేషధారి
మాలవాడలకు నామడదూరమునగాని నిలువని శాంతిసందేశహరుడు

ఆ.వె. నడుపుచున్న దొంగనాట్యరహస్యంబు
స్పష్టమయ్యె గాంధి చావుతోడ
భరతభూమినింక భగవంతుడుండునా
దేవళంబు లుత్త తిత్తులయ్యె,

సీ. పోరుబందరు పురంబున బుట్టి గుజరాతు సీమకు గౌరవశ్రీఘటించి
ఆబాల్యముగ సూనృతాలాపములునేర్చి సన్మార్గమున కాలుసాచి నడచి
మూడులోకంబుల నోడింపజాలు చిత్రంబైన నవ్యసాధనము జేసి
మనుజుడైపుట్టి సంపాదింపగాలేని సహనంబు పదిపుట్లు సంతరించి

తే.గీ. బలముగలిగిన గంపంత బలగముండి
వెతలపాలైన మాతృభారతినిజూచి
యెంత చింతించెనో సుంత హింసలేని
బవరమునులేచె శ్వేతభూపతులతోడ

చం. పదుగురినోళ్లలోన గుణవంతుడితండను శబ్దరత్నముల్
బొదిగి సమస్తవిద్యలను పూర్ణముగా గ్రహించి సీమకున్
గదలి వినీతికిం జిఱుతగాయము సోకని న్యాయవాదియై
సదనముజేరె ప్రాయముబుసల్ పచరించెడు యౌవనంబునన్

కం. అనుగుంగస్తురిబా గీ
చినగీటు దొలంగనట్టి చెలువ మనసులో
మనసై, మెలంగ భారత
జనకత కనువైన గుణము సంపాదించెన్

సీ. మగనిచిత్తంబగుర్పగ నెగ్గులేకుండ హరిజనాళికి పరామరిక నెఱపి
విభు డుపాధ్యాయుడై వినుచు నహింసా మహాధర్మసూత్రంబు లభ్యసించి
పతిపదంబులు మెట్టుబాటలో వెలుగు నిశ్చలశాంతి రమకు పుష్పములు సల్లి
భర్తృజిహ్వా పల్లవమున బూచిన సత్యమధుకోశ మధువు కమ్మగ భుజించి

ఆ.వె. ఆడురూపమెత్తినట్టి రెండవగాంధి
యనగ భరత జనని యనుప్రతిష్ఠ
గడనచేసి సాధ్వి కస్తూరిబా యభ్య
సించె నద్వితీయ శీలవిద్య

కం. కడుపునబుట్టిన కొడుకుల
నడుగంగానేల నమ్మహాజంపతికిన్
గడుపున బుట్టని కొడుకులు
గొడిసేతో మూడుపదుల కోట్లటునిటుగా

ఉ. తిండికిలేక భారతసతీసుతులెల్లరు దక్షిణాఫ్రికా
ఖండముజేరి సీమసరకారుల వేడికటాక్ష వీక్షణో
ద్ధండనిదాఘతప్తులయి దాస్యముసేసెడువేళ నండగా
నుండి యెదిర్చె శ్వేత వదనోగ్ర పిశాచుల వర్ణదౌష్ట్యమున్

సీ. అతిథికి పరిచర్యలాచరించుటగాక పాయఖానాశుభ్రపరచినాడు
నిష్కారణముగ తన్నిన తెల్లదొరగుండె నలిగిపో జిరునవ్వు నవ్వినాడు
అంతరాత్మకుభిన్నమైన పాపపులేశమేని ప్రాణాల బోనీయలేదు
తగవుదప్పినవాడు భగవంతుడేకాని యురమిచ్చి యెదిరించకుండలేదు

ఆ.వె. తెలుపు నలుపువన్నె కులభేదపరమైన
సీమ పెద్దపులికి చెలిమిగరపి
భరత సుప్రతిష్ఠ బహుదేశములమీద
చల్లినాడు మాట చెల్లితీర

సీ. సత్యాగ్రహ స్వర్ణశంఖంబు పూరించి స్వాతంత్ర్యసమరబీజములు నాటి
సీమబట్టలు ధరించెడు పుట్టుభోగికి చేనేతమగ్గాలు చేతికిచ్చి
దొరలచేజిక్కిన భరతసామ్రాజ్యంబు నుపవాసములచేత నూచియూచి
స్వీయదేశీయ సిపాయి ఖైదీయౌట గౌరవంబను సుద్దు గట్టిజేసి

ఆ.వె. పొదలు మంచుకొండ మొదలు సేతువుదాక
భారతంబు వెంటబరుగులెత్త
జడుపుగిడుపులేని శాంతిపటాలంబు
సిద్ధపరచె ధర్మబద్ధుడగుచు

కం. ముద్దతరుగయ్యె పాపము
ఖద్దరుచే సీమనేతగాండ్రకు గుండెల్
దద్దరిలె రాచవారికి
ఖద్దరు ముని మ్రింగరాని కబళంబనుచున్

సీ.	ముసలమ్మ మొదలుగా పసివాపవరకు ఖద్దరుబట్ట నెమ్మేనగట్టినారు
పాలకుండాదిగా బంట్రౌతువరకు గాంధీటోపి ధరియించి తిరిగినారు
ధనికుండు కోలె, ముద్దకులేని పేదయు కడగి సన్నని నూలు వడికినారు
ఆస్తికుండును వీరనాస్తికుండును గూడ బాపూజి కంజలిబట్టినారు

ఆ.వె. గాంధినామకంబు గాంధి సందేశంబు
మారుమూలలందు మారుమ్రోగె
ఖండపంచకమును గౌగిలించినవాని
సీమశక్తు లేమిసేయగలవు?

ఉ.	రోజు సబర్మతీమునివరుంగని ప్రార్థన మాలకింపగా
హాజరుజెందు దైవము మహాత్ముని హత్యను కండ్లజూచి యి
పూజలకాసజెంది చనిపోవుట తథ్యమటంచులేచి యా
రోజె ప్రయాణమై చనె గురుఘ్నులులేని పరాయిభూమికిన్

మ.	అసహాయోద్యమ మాంగ్ల రాజ్యరథ రథ్యస్తంభనాపాదియై
దెసల న్నిండి నినాదముల్ సలుప ఖాదీయూనిఫారాల సా
హసికంబైన స్వతంత్రసైనిక నికాయభ్రాజియై గాంధితా
పసి సాగించె నిరాయుధంబగు నపూర్వంబైన పోరాటమున్

కం.	లాలాలజపతిరాయ్, మో
తీలాల్ నెహురూ తిలక్కు దేశాయిపటేల్
మాళవ్య ప్రభృతి ప్రముఖులు
మౌళిం దాలిచిరి గాంధి మహితోద్యమమున్

సీ.	ఆశీర్వదించి దేహంబు చాలించె సంగరరంగమందు గంగాధరుండు
లాటీల కగ్గమై లజపతిరాయండు నొరిగె నుత్కట వీరమరణశయ్య
ఇల్లువాకిలి దానమిడి పండితుడు మోతిలాలువీరుండు కాలంబుజేసె
సహచరాగ్రేసరుండు మహదేవ దేశాయి తనచేతుమీదుగా దహనమయ్యె

ఆ.వె. జహ్వారాది బాలసత్యాగ్రహులు వెంట
నడువ నుగ్రమై యనంతమైన
శాంతిభండనంబుసాగించె గాంధిజీ
పిలకతోడ నవ్వుమొలకతోడ

ఉ. ఏమనరానిదై హృదయమేర్చు మహాత్ముని ప్రేమతత్వ సం
గ్రామ విచిత్రపద్ధతికి గందరగోళము జెంది యిండియా
స్వాములు రౌలటాది పటుశాసనశక్తుల కాసదీరగా
నామెతపెట్టినా రదయులై బలహీనుల వేడిరక్తమున్

ఆ.వె. ఉద్యమములు సత్తులుత్తుత్తమాటల
ఫలితమునకు రావు వాస్తవముగ
త్యాగులైనవారి తనురక్తమునదక్క
సాధురక్తమునకు జయము ధ్రువము

చం. నలుబదికోట్ల వక్త్రములు, నల్బదికోట్ల శిరాలుగల్గి చు
క్కలు తలపూవులై పెరిగి కమ్మని నవ్వులతోడ నుజ్వలో
జ్వలమగు గాంధిరూపమనివార్యమజేయమునై బ్రిటీషురా
జుల భయభక్తితత్పరత జూఱగొనెన్ సహనాభిరామయై

శా. మౌలానాయజదున్ గఫూరుడు ముసల్మాన్నాయకశ్రేష్ఠుల
య్యాలీసోదరులంజలించి హృదయం బర్పించి వెంటాడగా
చాలాకాలమునాటి జాతిమత భాషాద్వేషముల్ మాన్పుచున్
బాలు స్నీరముగా నొనర్చె నుభయవ్యత్యస్త సిద్ధాంతముల్

శా. ఆవేశంబునగాంధి పాదముల నభ్యర్చించి వెంటాడుచున్
యావద్భారతభూమి కట్టుకొనియెన్ ఖాదీజగావస్త్రమున్
బ్రోవుల్ వెట్టి దహించె సీమవసనంబున్ జీల్చి చెండాడుచున్
జైవెట్టెన్ బసిపిల్లయున్ భరతదేశ స్వేచ్ఛనాశించుచున్

సీ. కటికిచీకటి బందిఖానాలలోనుంచి కఠినశిక్షలు ప్రయోగంబుజేసి
కీల్తుపాకులు ఫిరంగీలు మింటికిగాల్చి బ్రిటనుపటుత్వంబు వెల్లడించి
గాభరాపెట్టు బందోబస్తులొనరించి వెలయిచ్చికొన్న దోర్బలము జూపి
రాజన్యవిద్రోహ వ్యాజంబుగల్పించి యొక్కరినిద్దరి నురికి బంపి

ఆ.వె. భూమిపతులకుండు మొనగాని తనమెల్ల
నిఖిలచిత్రగతుల నెరపినారు
మౌనముద్రగాని మందస్మితముగాని
చెదరదయ్యె గాంధిజీముఖాన

శా. వేళాకోళము సిగ్గుచేటగుచు నవ్వించెన్ దిశాగోళమున్
పోలీసన్నలమొద్దుకత్తి బెదరింపుల్ దేశభక్తాళికిన్
గేళీసౌధములయ్యె జైల్లకట! యాంగ్లేయ ప్రభుత్వ ప్రతి
ష్ఠా లీలావతి చిన్నబుచ్చుకొనియెన్ స్వాంతంబునన్ గుట్టుగన్

సీ. అడుగు వేయిన్నూరులడిగి బేరముసేయ సకల భారతభూమి సంచరించి
నగవు ముప్పదికోట్ల జగము నాకర్షించ స్వాంతముల్ కరుగ నుపన్యసించి
పలుకు పందుము రత్నములకు తూకము దూగ పరిపాలకులతోడ వ్యవహరించి
వేషమాశాతాపవిశిఖంబు చల్లార్ప మూరెడు వసనంబు మొలకుజుట్టి

ఆ.వె. బట్టలుదుకుకొనుచు బట్టలునేయుచు
పాలుపండ్లు గుడిచి బ్రదుకునీడ్చి
సుకముమరగియున్న సోమరిభూమికి
కరవులేని బ్రతుకుదెరవుసూపె

సీ. బాపూజి నామరూపములు సొమ్ములుగాని దినపత్రికలకు జీవనము లేదు
గుజరాతు మునిపాదరజము సోకని పురీరత్నాల కర్హమర్యాదలేదు
ఘన సబర్మతి మునీంద్రుని సమ్మతికిగాని ధర్మసంస్థకు ప్రజాదరణలేదు
కస్తూరిబాభర్త పస్తులారంభింప జగతి వృత్తము బెత్తసాగలేదు

ఆ.వె. తకిలి చేతబట్టి తాత ఖైదుకుబోవ
ప్రభుల సభకు నిబ్బరంబులేదు
రాజుగాని రాజు ప్రతిగాని ప్రతియౌచు
నేల నాల్గుచెరగు లేలసాగె

తే.గీ. ఉప్పు సత్యాగ్రహంబున కుత్సహించి
కట్టమోపున జలధికి గదలునాడు
శాంత గంభీర భంగహస్తములు సాచి
యంజలిఘటించె బాపూజికబ్ధిరాజు

ఉ. పిల్లలవెంటబెట్టుకొని భిక్షకుబోవు కుటుంబివోలె మా
చల్లనితాత విశ్వపరిచారకు డర్ధదిగంబరేశ్వరుం
డల్లన నబ్ధియాత్రకు బ్రయాణమొనర్చెడువేళ జిత్తముల్
వెల్లువలై స్రవించినవి ప్రేక్షకులౌ సరకారువారికిన్

చం. జలనిధిలోని యుప్పొకరి స్వాస్థ్యముగాదు ప్రభుత్వశాసనం
బులకు శిరస్సులేదు ప్రభువుల్ దయమాలినవారు సూర్యచం
ద్రులవలె నబ్ధులు బుడమి రోదసి పేదలసొమ్ము భారతీ
యుల నిఱుపేద గంజికయయో! కరవయ్యెనె యుప్పురవ్వయున్

చం. జయజయనాదముల్ దశదిశాతటపాటనమాచరింప న
క్షయమగు సర్వభారత భుజాబలసంపద సంతరించి భూ
దయితులతో నెదుర్కొను సుధాచరితుం గుజరాతుసెట్టి తా
తయగని హైందవంబు ముదితంబయిపొంగె మహాసముద్రమై

ఆ.వె. పన్ను కట్టరాదు పరిపాలకులకు శి
క్షింపనిందు కడకు చెరకు బొందు
జాతి ముక్తికిదియ సరియైన వెరవంచు
హెచ్చరించి రెచ్చగొట్టసాగె

చం. అలఘు ఫిరంగి దెబ్బకెదురై తలయొడ్డిన శాంతియోద్ధలన్
గెలుచుట దుస్తరంబు తలక్రిందులుగావలె ముజ్జగంబు క
త్తులకసరత్తు ప్రేమరణదూతలవద్ద నిరర్థకంబగున్
సలిలముపొంత నిప్పునకు సాగునె ప్రోన్నతసప్తజిహ్వికల్

కం. కదురును రాటము దాలిచి
యెదిరింపుడు రాచవారి నీయాయుధముల్
ముదమిచ్చు నన్నవస్త్ర
ప్రదములు భీ ప్రదములాంగ్ల పార్థివతతికిన్

కం. మనరాచవారు మనపై
గనుపరచెడు సవతితల్లి కరుణాప్రేమల్
జలియన్‌వాలాబాగున
యనదల రక్తమున దేలి యాప్లావించెన్

ఉ. కత్తులొసంగి హస్తములుగట్టిన టక్కరి పార్థివేంద్రులన్
మెత్తగసాగనంపగల మేలియుపాయములేదు శాంతియే
యుత్తమ మిందు స్త్రీ పురుషయోద్ధలు చేరగవచ్చు బావుటా
యెత్తి విశాలభారతికి నీ రణపద్ధతు లందజేయరే!

చం. తిరిపెపుజోలెబట్టి చనుదెంచితి గర్జుని గన్న తల్లియై
మురిసిననేలనింక జనిపోవదు నేడు నుదారబుద్ధి సో
దరులకు నిమ్నజాతులకు దానముచేయుడు చేతులార మీ
పొరుగున దీనులై కుమిలిపోవు దరిద్రజనావనార్థమై

ఉ. ఏటికి తెల్లసేన మనకిచ్చుట శాత్రవభీతి మాన్పి యా
రాటమణంచి దేశపరిరక్షయొనర్చెదమంచు దృప్తిగా
మాటలు చెప్పుచుందురు క్షమాపతు లొక్క సిపాయిమేత ము
ప్పూటల భత్య మీభరతపుత్రుల కార్గుర కించుమించుగన్

ఉ. ఇంటను బైట పాదుకొనియెం బరభాష నిషాపదార్థమై
యంటిపరంజుకొన్నది హిమాచలశృంగముదాక జ్ఞానపుం
బంట స్వదేశవాఙ్మయము బట్టకు బొట్టకు లేని లేమి వా
ల్గంటికి నగ్గమై తెరవు గానక కన్నుల నీరునించెడిన్

మ. ఎపుడో మీకు స్వరాజ్యమిత్తుమనినారింగ్లీషురాజుల్ దదా
లపనంబుల్ గృపనంబులైనవిక నాలస్యంబు గావింపరా
దపకారంబు ఘటిల్లె నిప్పటికె ప్రాచ్యజ్ఞాన సంపత్తి యూ
రపు వాతావరణ ప్రభావమున గార్శ్యంబందె నిద్రాణమై

మ. దొర లీదేశము వాసి సీమ సరిహద్దుల్ ద్రొక్కినంగాక సా
గరపర్యంత విశాలభారతికి సౌఖ్యంబుండ దప్డే పర
స్పర విశ్వాసము భారతీయులకు సంప్రాప్తించు సత్యాగ్రహ
స్థిర దీక్షారతులై యెదుర్కొనుడు ఖాదీచక్రచండాంశులై

చం. కదలక నిల్చి నా వెనుక గచ్చబిగించి స్వరాజ్యయాత్రకున్
గదలు డహింసయే నిశితఖడ్గముగా నడుగడ్గు విఘ్నపుం
గదుపుల నుత్తరించి చరఖాశుభగీతము లాలపించుచున్
ముదుసలి దేశమాతకు బ్రభుత్వకిరీట మలంకరిచెదన్

చం. ఒక తలిపిల్లలై యొకమహోన్నత జాతికిజెంది భారతాం
బికప్రసవించు సంపదలు వెల్లువ లన్యుల జెందుచుండ ను
ప్పుకు గొఱగాని వర్ణములపోరుల కాయువు బోయు శాంతి హం
తకులకు దావు లేదు సమతాక్రమబద్ధ స్వరాజ్య సంస్థలో

శా. ఢాకాలో నొకనాడు మేల్జిలుగుబట్టల్ నేసి చీనా జపాన్
దాకన్ గీర్తిరథాలపై మసలు ప్రజ్ఞావర్తకుల్ నేడు నా
నా కష్టంబుల కగ్గమై చివుకుచున్నా రుగ్రదారిద్ర్య పుం
జీకట్లన్ దొలగించు భారతకళాశ్రేణిన్ వెలింగింపుడీ!

మ. తనరంగావలె దేశదేశముల కాదర్శంబుగా భారతీ
యుని సత్యాగ్రహ సచ్చరిత్రము చిరాయుర్భాగ్యమింపారుతన్
మన జాతీయ కళాసరస్వతులకున్ జాతీయ సాహిత్య గో
వునకున్ దావులు జిమ్ముప్రేమరసదీప్తుల్ సల్లుక్ష్మామాతకున్

ఆ.వె. మనము బానిసలము మనకును బానిసల్
శాశ్వతముగ నిమ్నజాతివారు
బానిసీంద్రక్రింద బానిస లున్నచో
బలము ముమ్మరించు పాలకులకు

సీ. క్రొంగొత్త గుళ్ళు పెక్కులు నిక్కనేకాని మతదురాచారముల్ మారలేదు
విద్యాలయశ్రేణి పెంపొందెనేకాని అస్పృశ్యతారోగ మణగలేదు
న్యాయస్థలాలు జన్మంబెత్తెనేకాని లంచాల నిప్పు చల్లారలేదు.
సభలుపన్యాసాలు ప్రభవించెనేకాని ఆచరణంబున కాసలేదు.

తే.గీ. అన్ని దేశాల పరిచయమయ్యెగాని
మూఢవిశ్వాసముల చావు మూడలేదు
ప్రభువుగలడని సంతృప్తిపడుటకాని
సుకము గల్పించునన్న నమ్మకము లేదు

సీ. చెర్చిపై కన్నెట్టజేయు హైందవుని సంధ్యావందనమున కర్థంబుగలదె!
దేవాలయమును నిందించు సాహెబుగారి యేకాంతపూజ లల్లాకు సుకమె?
పరుల దోషముల నల్లరిచేయు క్రీస్తుబోధకున కావల బారదైసుగలదె?
స్త్రీలవిజ్ఞానంబు చిదిమి బందీజేయు దేశాన సిరులు వర్ధిల్లగలవె?

ఆ.వె. గుళ్లు గోపురాలకొఅకు చందాలెత్తి
పొట్టబోసికొనుట పుణ్యమగునె
అన్నమునకు నీటి కంటుజాడ్యం బున్న
చుప్పనాతి మతము గొప్పదగునె?

ఆ.వె. అంటరానివారి యంతరంగంబున
ప్రేలు నగ్నిపర్వతాల ఘోష
అంటరానివాడనై ఆఫ్రికాయందు
తెల్లవారినడుమ దెలిసికొంటి

మ. ధనమున్ దొంగిలు దొంగలుంద్రు భగవద్దత్తంబుదాత్తంబునౌ
మనుజత్వంబును దొంగిలించి యతి నిమ్నత్వంబునంటించి త
మ్ముని నేపాపమెఱుంగనట్టి పరమాప్తుం బంచమున్ మంచిగా
దినుచున్నాడ వహింస కింక బ్రతుకేదీ? హిందుసంఘంబునన్

ఉ. ఆస విశేషమై చిలిపి యంతరముల్ చెలరేగి యాత్మవి
శ్వాసము వ్యర్థమై పిరికి వర్ధిలి భారతజాతి స్వార్థమున్
మోసము నభ్యసించిన దభూత కథానకకల్పనా కవి
వ్యాసుల సూదిమందుల ప్రభావమునం దలకాయ లేనిదై

కం. సత్యాహింసలు రెండే
ముత్యాలసరాలు సకల పుణ్యంబులకున్
గత్యంతరములు ప్రేమ
వ్యత్యస్తము లేని మోక్షపతి నేత్రంబుల్

కం. నిజమునకు కులమతంబులు
సృజించలే దీశ్వరుండు హిందూసఖు డీ
గజిబిజికి కారణంబని
గుజగుజలు పురాణశాస్త్రకోటి ధ్వనించున్

చం. యుగములనుండి మొత్తుకొనుచున్నవి వేదపురాణముల్ జగ
న్మృగమును ప్రేమతోడ నెదిరించి సమత్వము సంఘటించగా
పగలకు గాలుదువ్వెడు స్వభావమభావముగా నహింసచే
జగము జయించి జాతిమత శాశ్వతసఖ్యము నుద్ధరింపరే

కం. మన యింట శాక్యసింహుడు
మునుపే గుప్తంబుజేసిపోయె నహింసా
ఘనతర శస్త్రం బయ్యది
మన కాధ్యాత్మిక బలంబు మన విజయంబున్

కం. దశకోటి పంచముల దు
ర్దశకై కన్నీటి చుక్కదాల్పని వేల్పుల్
దశలక్షలేల? వెన్నుని
దశావతారంబులేల? ధర్మములేలా?

ఉ. న్యాయముగా చరాచర నియంతకు మర్త్యున కాది నుండి పే
చీ యిసుమంతలేదు భ్రమచేత విభిన్న మతాభిమానులై
హాయిగనున్న లోకమున నగ్ని రగిల్చెదరేల? ప్రేమత
త్త్వాయతనంబులో శతసహస్రవికుంఠము లుల్లసిల్లెడిన్

ఉ. మాటలుదక్క చేత లనుమానముగా తమ పట్టుకొన్న కుం
దేటికి మూడుకాళ్ళనుచు దేవునియంతటివాని కీర్తికిన్
గాటొనరింపజూచు మతగర్వితచిత్తుల భక్తి శాంతికిన్
జేటకు వారి బుఱ్ఱకు రుచింపవు కోటిపరాయిధర్మముల్

ఆ.వె. భక్తిపరుడుగాడు భగవంతు డీతని
మొగము చూడడంచు పొరుగువాని
విమలచరితలోన విషముజిల్కుట గూడ
సుకరమైన నాగరికపు హింస

చం. కులములు మెట్లుగామలిచి గొప్పతనాలను గోపురాలపై
నిలిచి యవిద్యలోపల మునింగిన నాలుకలేని తమ్ముగు
ఱ్ఱల నొక తల్లిపిల్లల చిరంతన వత్సలతాసుఖంబులో
కలతలుబెట్టువారి కధికారములేదు స్వరాజ్యపీఠిపై

శా. ఘోషాలోబడి క్రుళ్ళిపోయినది దిక్కున్ మ్రొక్కులేకుండ నీ
యోషామండలి యెండకన్నెఱుగ కీ యుత్తుత్తధర్మాలకున్
బోషాణంబయి బూజుపట్టినది హిందూజాతిచిత్తంబునం
దీషత్ప్రేమ వహించి స్వేచ్ఛ యిడవోయీ! అక్కచెల్లెంద్రకున్

తే.గీ. ప్రొద్దుగ్రుంకని సామ్రాజ్యభూతిగలిగి
సీమరాజుల చిరకాలసింహపీఠి
నొక్క ముసలయ్య యుఱ్ఱూత లూచసాగె
ఆత్మశక్త్యున్నతులకు ప్రాయంబులేదు

కం. నేరములేనిది భీకర
కారాగారములచేత కట్టువడనిదై
భారతము నాక్రమించిన
పోరుం గని బ్రిటిషువారు పూర్ణభయాప్తిన్

ఉ. బందికిబోవుచుం దిరిగివచ్చుచు గ్రమ్మర రాజ్యచక్రమున్
బందియొనర్చుచుం గటికి పస్తులుసేయు విచిత్రవృద్ధు కా
మందుల కాలిబంధమయి మంచితనాన బ్రిటీషువారి ని
బ్బందులపాలుజేసె తలవంచక వీరస్వరాజ్యభిక్షువై

మ. మదమన్ద్రిప్పక దేశభక్తులు ముసల్మానుల్ స్వరాజ్యార్థమై
నడుముల్ గట్టి సబర్మతీ ముని పిఱుందన్ బందిఖానాలకున్
నడువన్జొచ్చిరి భాయి భాయి యనుచున్, నల్దిక్కులన్ స్వేచ్ఛకున్
గడియల్సొచ్చిన సూచనల్దెలిపె చర్ఖాచక్ర సంగీతముల్

చం. ఇతడొక పీడరాక్షసి, మహేంద్రుని వజ్రసహస్రధారలన్
వ్రత మొనరింపజాలిన తపస్థిరుడింక బ్రిటీషు బావుటా
బ్రతుకదు భారతీయులకు రాచరికంబును కట్టబెట్టుటే
హితమని నిశ్చయించుకొనియెన్ బరిపాలక మంత్రివర్గముల్

మ. అవలన్ గుండ్రనిబల్ల లేర్పరచి యాహ్వానంబు లంపించె పా
ర్థివఖండం బిరుమూడుమారులనురక్తిన్ నౌకలంబంపి య
ర్ణవముల్ దాటి బ్రిటీషు దేశజుల కార్యస్థానముల్ ద్రొక్కి హైం
దవమర్యాదలునాటె నంచిత బకింగ్ హాం సౌధరాజంబునన్

తే.గీ. పంచభూతాల పిడికిట బందిజేసి
వలవుడములందు లండనుపురవరంబు
ముతక బట్టల యిండియా ముసలితబిసి
కడుగులకు మడ్గులొత్తి వెంటాడి నడచె

మ. జలజాప్తుం జని పోవనీయక మహాసామ్రాజ్యమున్ గీర్తినీ
డలలో నిల్పిన యింగిలీషులప్రచండ ప్రజ్ఞ నీవెట్టి బా
గుల బైరాగి జయించినాడనుచు సిగ్గుం జీదరం జెంది ని
శ్చలమై చూడదొడంగె లండను మహాశ్చర్య స్ఫురన్నేత్రమై

కం. ఈడుడిగి దుష్టశక్తుల
నోడించెడువాని వలపులొలికెడు వానిన్
మూడుం గాళుల ముదుసలి
నోడదిగినవాని జగము నూచెడు వానిన్

శా. ముక్కద్దంబులతో బ్రశాంతకళతో ముత్యాల లేనవ్వుతో
పక్కా ఖద్దరు టంగవస్త్రమున్ కటిన్ బంధించి మేయెమ్ములన్
లెక్కం బెట్టగ జాలు వార్ధకముతో జెన్నారు గాంధీ మునిన్
పక్కె పండినవాని విస్మయ రసాపాదిన్ దయామేదురున్

ఉ. బట్టల మిల్లు వర్తకము బాడొనరించి బ్రిటీషు సింహమున్
దట్టి లడాయి రేచిన యుదగ్రపరాక్రమశాలి ముజ్జగ
జ్జెట్టి సబర్మతీముని ప్రసిద్ధుడు వచ్చెనటంచు నంజలుల్
బట్టిరి స్వాగతం బొసగి లండను నాగరు లోడరేవునన్

కం. హరి హరుల లక్ష్యపెట్టని
బెరనారుడుషా మహాకవి ప్రవరుండున్
దరిసెనము జేసికొనియెన్
నెరసిన తలవంచి వచ్చి నెచ్చలికాడై

తే.గీ. రాముసేమేగ్దనాల్డు సర్ సాముయేలు
హోరుమున్నగు నున్నతోద్యోగివరులు
హర్ష పులకితగాత్రులై యర్ఘ్యమిచ్చి
గౌరవించిరి గాంధి మేకకును గూడ

చ. ఒకడననేల పేరుగల యూరపుఖండపు వాసి నల్లవా
నికి తలవంచరాదనెడు నిష్ఠురహించెడు స్వాభిమాని య
య్యకలుషమూర్తి చిర్నగవుటమ్ములు టొమ్ములనాటి కేలుమో
డ్చుకవిరమింప దయ్యేనన జాలుగదా? భరత ప్రతిష్ఠకున్

ఉ. పుట్టనినేల కేల్మోగిచి పూవుల పూజలు సేయుచుండగా
పుట్టినగడ్డ పుత్రకుని భూరియశస్సు గణింపకుండ కా
బట్టక మిన్నకుండుట శుభప్రద మచ్చటి మానవప్రభువుల్
పుట్టును పుట్టి గిట్టు చెదపుర్వులుసుమ్ము వివాద మేటికిన్

సీ. తేనీటి విందు కాహ్వానించి పూజించి చరితార్థుడైపోయె జార్జిరాజు
సలహాల నెపమున చెలిమికాండ్రైనారు రాష్ట్రపాలురు వయిస్రాయివరులు
ఇండియా ముని కోర్కె నీడేర్పుడనిమాట గలిపినా రమెరికా ఖండప్రజలు
దరిసెనం బొకమారు దయచేయుడని మెచ్చి ప్రణుతించినా రక్ష రాజవరులు

తే.గీ. ఘనతకెక్కిన పాశ్చాత్య ఖండమెల్ల
ప్రేమతో గాంధిమూర్తి ముద్రించుకొనియె
జాతిజనకుని విశ్వవిఖ్యాతిదలప
నరనరంబున గర్వంబు మెరసిపోవు

సీ. లండనుపోలీసుకాండరవీరులు వేయిగన్నుల కాపలా యొనర్ప
ఇనుప ముక్కలను లోగొనజాలు సూదంటుఱాతి యంత్రాలు సంరక్షసేయ
ఇరుకెలంకులను మోటరు గుఱ్ఱముల మీద రాజకీయోద్యోగి రాజి నడువ
భీకరార్భటులతో నాకాశమార్గమధ్యమున దోడుగ విమానములు దిరుగ

ఆ.వె. హిందుజాతి జనకు డితని కెట్టి ప్రమాద
మంటదగదటంచు నధికభక్తి
పూలలోన నుంచి పూజించి రౌదార్య
భూషులైన యింగిలీషునృపులు

ఉ. పుట్టువుతో ధరావలయముం బరిపాలనసేయు హక్కు జే
పట్టినదీ బ్రిటీషు పరిపాలకవర్గమటంచు డంబముల్
గొట్టిన మంతురుల్ ముతుక గోచులరాయని యాత్మశక్తి క
ట్టిట్టయి యంజలించిరి మహత్తర భారతధర్మదూతకున్

తే. గడియలో సీమదుస్తులు గట్ట బెట్టి
నల్లదొరలను జేయు లండను పురంబు
విశ్వ భారత జాతీయ వేషవహుని
కాలి చెప్పులు దీయించ జాలదయ్యె

ఉ. చెప్పుల కాళ్లతోడ జని సీమనృపాలుని సౌధసీమలో
గొప్పగ గౌరవింపబడి కూరిచినాడు యశస్సు జాతికిన్
దుప్పటి దుడ్డుగఱ్ఱగల తోరపు వృద్ధుడు గాంధి యిండియా
తిప్పలు దీర్ప బుట్టిన యతిర్షభుడంచు నుతించె దేశముల్

## రాయబారము

శా. హిందూ దేశము రాజభక్తి నిలయం బిన్నాళ్లు మీపాలనా
బందీగేహములో కృశించినది మా బంగారమున్ రత్నముల్
సంద్యైనంతగ దోచికొంటిరి నమస్కారంబు మీకింక మా
యందొక్కింత యనుగ్రహించి దొరలారా! పొండు మీ యిండ్లకున్

తే.గీ. ప్రకృతి యూడిగ మాచరింపగ యనంత
బలము సాధించినట్టి భూపతులు మీరు
ధర్మదేవత పాదపద్మములవద్ద
యూడిగము జేసికొను నిరాయుధుల మేము

శా. స్వాతంత్ర్యంబును రాజదండమును మీస్వాధీనమున్ జేసి మా
భ్రాతల్ దాస్యము చేయసాగి కడచెన్ బహ్వబ్దముల్ జుట్టు మీ
చేతన్ జిక్కె దయాంతరంగమున నాశీర్వాదముల్ సల్పి మా
జాతీయ ధ్వజమెత్తుకొందుమిక స్వేచ్ఛా భిక్ష గావింపుడీ!

ఉ. పాలకులైన మీరు పరిపాలిత జాతి శిరస్సు నెక్కి గు
ఱ్ఱాల రథాలు దోలుకొను ఱాతిమనస్కులుగారు కోటియం
త్రాలకు సాటియౌ కదురురాటము తోడ సహస్రకోటి వ
ర్షా లెదిరించి తీరెదము జాలి యెఱుంగని దుష్టశక్తులన్

మ. తెలుపున్నల్పను రంగు భేదమున నంధీభూతమైయున్న క
న్నులలో ధర్మము కాలుమోపదు కృతజ్ఞుల్ నేటికిన్ భారతీ
యులు మీ మారటతల్లి ప్రేమలకు మీయూరించు స్వర్గాలకున్
తలిభాషన్ మరపించు భోగపు నెలంతం బోలు మీభాషకున్

శా. ఊడల్ బ్రాకిన పిచ్చినమ్మకము లెన్నో పట్టి వేధింప మా
యాడంగుల్ పరువెత్తుచుండెదరపత్యార్థంబు తీర్థాలకున్
తేడాలుం దెగదెంపులున్ మధురశాంతిన్ జంప నజ్ఞానపుం
బీడైయున్నది భారతక్షితి దగా వేదాంతకాంతారమై

శా. ఈ తబ్బిబ్బుల పిచ్చి పోకడలతో నీ స్వార్థవారాశిలో
నీతల్ గొట్టెడు నాసహోదరుల నింకెన్నాళ్లు బంధించి మా
స్వాతంత్ర్యం బరికట్టజూతు రనుకంపంబూను డొక్కింత వే
జోతల్ మీకు సహింపజాలమిక విచ్చుంగత్తి రాజత్వముల్

మ. అలవాటైనది హింస మానవున కీ యాపత్తు వారించి బె
బ్బులికిం బ్రేమతపస్సు నేర్పి భువనంబున్ దిద్ది, యాధ్యాత్మికో
జ్వల విద్యన్ వెలయింపగా వలయునీ సత్యప్రచారార్థమై
బలియిత్తుం దుదిరక్త బిందువును దైవంబాన ముమ్మాటికిన్

తే.గీ. హిందువుల జుట్టు తోడ సాహెబుల దాడి
పెనచి ముడి వైచి రాజీకి బిలిచినారు
రాజనీతిజ్ఞులగు తెల్లరాచవారు
జములు మాటల రాయబారములు నెఱపి

శా. నోరూరించు ప్రియోక్తులం బలికి యిన్నూరేండ్లు పాలించి బం
గారుంబిచ్చుకలైన భూపతులు వాగ్దానంబు పాటింతురే
దారా లుచ్చులుగా రచించు నవధూతన్ గాంధి మన్నింతురే
క్ష్మారాజ్యంబును గట్టి పెట్టగ బ్రిటీష ర్లాహరిశ్చంద్రులే

మ. పలుమారుల్ వలపార లండనున కాహ్వానించి పేచీలు చి
క్కులు గల్పించుచు రిక్తహస్తముల వీడ్కోలిచ్చి పంపించినన్
గలతం జెందక సత్య ధర్మఘన దీక్షాదివ్యమార్గంబునన్
బలగంబున్ నడిపింపసాగె మహితస్వాతంత్ర్యలగ్నాత్ముడై

మ. తెనుగుందేశము నందు గర్తపురి గాంధీ దివ్యసందేశ శం
ఖనినాదంబున కాసెగట్టి రణరంగక్షోణి లంఘించి స
ల్పిన పోరాటమునం దఖండ బహుళ క్లేశంబులం గుంది కం
దిన యోధుల్ గల రిప్పుడుం బురమునన్ దేశక్షమారాధకుల్

మ. ఘనభక్తిన్ గుజరాతు సాధునకు భిక్షాపాత్రలో చిత్తమున్
గనకంబున్ గురియించి యేలికల ఖడ్గచ్ఛాయలం బందియై
తనువర్పించిన త్యాగభూమి సుమి యాంధ్రంబన్న సత్కీర్తి తె
ల్లని కుళ్ళాయము లల్లి యిచ్చినది తొల్తన్ తోడుదేశాలకున్

సీ. నిలిచి లాటీలదెబ్బలకు మస్తములొడ్డి స్వాతంత్ర్యదుందుభుల్ సఱచినారు
ప్రాయంబులో మూడుపా ళ్ళిట్టునట్టుగా కిగ్గాడి చెరకప్పగించినారు
చెరసాల కుడ్యముల్ కరగి ఖంగునమ్రోయ జాతీయగీతముల్ సదివినారు
మువ్వన్నె జెండాల ముదురునీడలలోన స్త్రీదళంబులు నూరద్రిప్పినారు

తే.గీ. పేదవడియున్న మాతృకవిత్వమునకు
సభలు సన్మానములు చేయసాగినారు
గాంధి వీరర్షి శాంతిశంఖారవంబు
దెసల మార్మ్రోగినంతన తెలుగువారు

శా. క్రమ్మెన్ ఖద్దరు కొత్తబట్టల జగాగంధంబు నల్దిక్కులన్
గ్రమ్మెన్ దొంటి స్వదేశనాగరకతా కల్యాణ వాతూలముల్
గ్రమ్మెన్ బల్చని రక్తనాళములు ధైర్యస్థైర్యశౌర్యాంశువుల్
గ్రమ్మెం గమ్మని గాంధిసూక్తులు ప్రజాకర్ణప్రమోదంబునన్

శా. ఇల్లున్ వాకిలివీడి త్యాగధనులై యిల్లాండ్రతో బందియం
దుల్లాసంబుగ కాలమున్ గడపి మాన్యుల్ ద్రావిడాంధ్రప్రజల్
కొల్లంగొట్టిరి గాంధిసన్నుతుల నక్కుంజూపి పోరాడుచున్
జెల్లెన్ శ్రీ హనుమంతు ప్రప్రథమ గాంధీ శాంతియుద్ధంబునన్

మ. ఖయిదీలై కృశియించి ప్రాయమున రోగగ్రస్తులై తీరి య
క్షయకీర్త్యబ్జకిరీటధారులయి నక్షత్రంబులై విశ్వవి
స్మయముంగొల్పు తెలుంగువీరులు శిరోమాణిక్యమున్ బ్రాహ్మణా
న్వయ రత్నంబును కృష్ణయం దలచి యాంధ్రంబిప్డు శోకించెడిన్

## జిన్నా

ఉ. దెబ్బకు రెండుముక్కలగు ధేనువుగావలె భారతంబు మా
లబ్బి కులంబు హైందవుల లాతితనంబు సహింప దెందు కీ
జబ్బు సమిష్టిపాలనము సాగదు మాకనుచుం దగాయిదా
మబ్బులు రేగదీసె మతిమంతుడు జిన్నయ శాంతికామియె

శా. జిన్నా కోరిక రెండుగా నెడదవిచ్ఛేదించినట్లే కటా!
యిన్నాళ్ళుందినపాటులెల్ల వితయయ్యెన్ రెండుగా జీల్తురే
కన్నమ్మన్ బహుళాద్రిరాజములతో గంగాదితీర్థాలతో
గన్నుల్ పండువుచేయు దేశమును లంకాపీఠికాదేవతన్

మ. అని కన్నీటికషాయనేత్రములతో నారాటమున్ జెంది, భో
జనమున్ ముట్టక పస్తులుండదొడగెన్ సర్వంసహాచక్ర మ
ల్లన భీతిల్లగ నాశ్వినేయులను కాలంద్రోయగాజాలు మేల్
ఘనవైద్యుల్బనులందజొచ్చి రెలమిన్గాంధ్యాయురాకాంక్షులై

కం. నిరశన దీక్షారతుడగు
నరాల ముసలయ్య యొక్క నాడును మూర్ఛా
భరమున దూలక సోలక
దరహాసము వంటి మేలి దారము వడకెన్.

ఆ.వె. క్రిప్సువచ్చి రాజకీయ నాయకులతో
సంప్రతించి సంధి సలుపలేక
వ్యర్థయత్నుడగుచు భారతీయుల మీద
నేరమంత రుద్ది దారిబట్టె

మ. ప్రళయాగ్నింబలె చుట్టుముట్టుకొని సంగ్రామంబు వాటిల్లె కా
వలె మీ ఖుమ్మకు మాకు నుమ్మడిగ జాపాన్ జర్మనీ నాజిజ
జ్వలనం బార్పుదమంత మీ కధినివేశస్వేచ్ఛనర్పింతు మం
చలరుందేనియలూర క్రిప్సుదొర యభ్యర్థించె సాహాయ్యమున్

సీ. నరమాంస భక్షకుల్ జరమనీ దేశజుల్ కరకుందనంబు హిట్లరుని సొమ్ము
జాపనీయులు జగజ్జన కంటకులు వారి నరపాలకుడు శుద్ధ నాస్తికుండు
ముసులోని నిలువెల్ల విసమూరి వెలికెక్కు నైటలేయులకు న్యాయంబుసున్న
టోజోకు మీ మీద నా జన్మవైరంబు గోరింగు పాపాలభైరవుండు

ఆ.వె. ప్యారచూటు దళము లగ్ని చల్లకముందె
మంద భాగ్యమైన హిందు ధరణి
కాంగిలేయ ప్రభువు లభయంబు బంపిరి
లెండు రండు వేళ లేదు మనకు

మ. అని క్రిప్సుం డుపదేశమీయ విని దూరాలోచనా చాతురీ
వనధీశుండగు గాంధి క్రిప్సు సలహా బాటింప కీ దాస్యబం
ధన బంధీకృత మైన దేశమునకున్ సాంగ్రామికంబైన భీ
తి నిరాధారమటంచు తద్విముఖతన్ దెల్పెన్ వినిర్భీకుడై

చ. కదనముచేయు భారతము గాదిది రక్తచరిత్ర చేత నా
పదలకు నగ్గమై కటికి పార్థివ కోటిని మేపి వెఱ్ఱిదై
బెదరి నమస్కరించు నలపెద్దలనాటిదిగాదు మానవా
భ్యుదయము గోరు నూతన మహోదయ భూమి సుమీ సహోదరా!

సీ. చిరపరాధీనబంధుర శృంఖలంబును రక్తపాతము లేక ద్రక్కలించి
మానవత్వము నాదమఱచిన జాతిలో చెలికారమున కింత నెలవు సూపి
ముదురు సోమరితనంబున మ్రగ్గగడ్డలో దేశీయకళలకు దీపమెత్తి
అజ్ఞానమున నీతలాడు సోదరులకు విద్యాపరిజ్ఞాన భిక్షబెట్టి

తే.గీ. పరిహసించెడు పొరుగుదేశములతోడ
సభ్యతాగౌరవంబు నార్జనముచేయ
సిద్ధపడుచున్న దస్మత్ప్రసిద్ధభూమి
వలదు మాకింక సీమభూపతుల చెలిమి

శా. ఆ నాజీలును జప్పనీయులును మమ్మాగ్నేయ గోళాలతో
ఖూనీచేయ పురావిరోధములు మాకున్ వారికిన్ లేవు క
య్యానన్నిల్చి పెనంగినం దొరుకు భాగ్యంబెల్ల మాకీపరా
ధీనంబైన యదంత్రపుం బ్రతుకు గాదే? క్రిప్సుమంత్రీశ్వరా!

శా. జాతింబీలిచి పిప్పిజేసెడు సమస్యల్ పెక్కునట్టింటిలో
సైతానుల్ బలె గూండ్లుగట్టుకొని సంసారంబు సాగించెడిన్
శాంతంబై సుఖదాయకంబగు నహింసాఖడ్గమున్ బట్టి మ
ద్భ్రాతల్ సాధనసేయు రోజులివి పోరాటంబు లాశింతురే

కం. హరిజనుల యంటుదోషపు
మురికిం దొలగించుకొన్న ముడిబట్టలతో
కరుణాపరిణత మతియగు
భరతక్షితి సాయపడదు భండనములకున్

కం. పోరికి సాయము గండని
కూరిమి పాటించు క్రిప్సు కోరిక వృధగా
మారాడి పంపి యావ
ద్భారతికి విధించె సమరవైముఖ్యంబున్

చం. నలుదెసలం గరాళ దహనంబు రగుల్చుచు విస్తరించి య
గ్గలపు కపాలమాలికలు గజ్జెలుగా రణరక్తలాస్యమున్
సలిపెడు నక్షరాజుల కషాయ కటాక్షము సోకదయ్యె సిం
హళము మొదల్ హిమాద్రివరకంచిత గాంధి తపోబలంబునన్

శా. పోరైదేడులు మర్త్యమాంసమును సంపూర్ణంబుగా మెక్కి నా
నారాజ్యంబుల నస్థిపంజరములన్ గావించి యాంగ్లేయ భూ
దార గ్రామణులన్ వరించు వరకాదర్శ క్షమాశాంతి వి
స్తారున్ బందియొనర్చి తృప్తిపడియెన్ సర్కారు చర్మామునిన్

సీ. పచ్చినెత్తురు ద్రావు ప్రళయ సంగ్రామంపు టురుములంతికమున నురుముచుండ
జాతీయ సేన ఘూర్జరసాధుతో గూడ ముద్దాయిలై క్రుళ్లిపోవుచుండ
క్షామదేవత భుభుక్షాశాంతికై నోరు దెఱచి పేదల గొంతు గొఱుకుచుండ
ఆహవనిధికి ద్రవ్యము గావలయునంచు సర్కారు చేతులు జాచుచుండ

తే.గీ. తరుణ మమరినదని కులాంతరమతాంత
రముల నెడమైన నల్లమార్కట్లవారు
వెలలు మింటికి బెంచి దీనుల రుధిరము
బిండుకొన్నారు బెబ్బులిపిండువోలె

ఉ. చిట్టెడు గంజికై వగచి చేతులుసాచి కృశించి పాపపుం
బొట్టలతో ననంతధనమున్ గడియించిన సాహుకార్ల కా
బట్టని జాలిసోకని యపాంగతిరస్కృతులంది కల్కతా
పట్టణవీధులందఱచి ప్రాణమువీడిరి దీనమానవుల్.

తే.గీ. మానవుల రక్తమాని సంపన్నులయిన
పరమభక్తాగ్రణుల మ్రొక్కుబళ్ళకతన
నాపదల కడ్డపడు గుళ్లుగోపురాలు
కడుపునిండినవారికి గుడువబెట్టె

కం. ఆగస్టు విప్లవానల
మాగించెన్నాల్గు చెఱగు లుర్వీతలమున్
రాగల స్వరాజ్యలక్ష్మికి
త్యాగుల రక్తంబు తిలకమై విలసిల్లెన్

కం. పరమాణు గోళ మొక్కటి
పరిష్కృతము జేసె ప్రళయఖండన జయమున్
మెరసెం బ్రిటీషు జెండా
పరాఙ్ముఖంబైన భరత వర్షమునందున్

మ. చెరబట్టంబడి పంచవర్షములు శుష్కీభూతులై యున్న జ
హ్వారులాల్ మున్నగు దేశభక్తులకు నిర్బంధంబు మన్నించిరా
దర మేపారగ సీమభూపులు సమాధానంబుతో మోమునన్
జిరునవ్వుల్ జెరలాడు త్యాగధనులన్ స్వేచ్ఛారణోద్దండులన్

ఆ.వె. బందియందు గాని భవనంబునం గాని
ముదముతోడ నేండ్లు పూండ్లు గడపు
పరమసాధుమూర్తి బాపుజీ దృష్టినం
తరము లేదు స్వర్గనరకములకు

మ. నిముసంబుండగరాదు తెల్లదొరలీ నేలన్ ప్రజాభీష్టమున్
సమయింపం బనిచేయజాలవు భుజాసారంబు శస్త్రాస్త్రముల్
క్షమ మాసొమ్మెడబాసి పొండనుచు గర్జత్సింహమోనాగ నం
తిమసందేశము నంపె భూపతులకున్ గ్విట్టిండియా కాండమున్

మ. కినుకన్నేరని గాంధి బంపిన మహాక్విట్టిండియా వీరశా
సనమాయంబున గాయమున్ సలుప పాశ్చాత్యప్రభుల్ మెత్తనై
మొనగాంద్రన్ దలయెత్తిచూడని కళాపూర్ణోజ్వలున్ గార్యద
ర్శిని లారెన్సును బంపి రింపలరు రాజీరాయబారాలకున్

చ. వరములు చేతబట్టుకొని వచ్చిన రాజుల కార్యదర్శి సా
దరముగ దేశనాయక సదస్య సదీప్సితముల్ ఫలింపగా
సరగ స్వరాజ్యసిద్ధికగు సత్పదకంబు తయారుచేసి చె
చ్చెరజనె గోచిపాతల ఋషిర్షభునాశిషముల్ గ్రహించుచున్

కం. ఎన్నికలలోన బాల్గొని
మిన్నంటిన జయముతోడ మేధానిధులై
యున్నతపదవుల నెక్కిరి
కన్నులపండువుగ గాంధి కాంగ్రెసుభక్తుల్

శా. నేరగ్రస్తముగా గణించబడు యన్నేతాజి సిబ్బందికిన్
గారాగార విముక్తిజేసి పదవుల్ గల్పించి మన్నించి స
త్కారంబుల్ సభ లాచరించి రెలమిన్ గాంధీశుభాశీర్వచః
శ్రీరమ్యుల్ ఘనదేశభక్తులు స్వదేశ న్యాయవాదీశ్వరుల్

మ. చిరకాల శ్రమముల్ ఫలింపగ లభించెన్ స్వీయరాజ్యంబు సా
గరపర్యంతవసుంధరారమణి శృంగారించె మస్తంబునన్
గరిమన్ గల్కితురాయిగా ఖదరు జెండా దేహ ముప్పొంగగా
వరియించెం బ్రథమ ప్రధాన సచివత్వ శ్రీ జవర్పండితున్

శా. పాకీస్థానముగా సగంబు నరికింపంబడ్డ నెమ్మేనితో
ఆకారంబు వికారమై మనసునం దారాటమున్ గూర్చుచున్
చీకాకై కలహప్రమాదములతో చేజిక్కియున్నట్టి స్వే
చ్ఛాకల్యాణిఘటించె నించుక నిరుత్సాహంబు తాతయ్యకున్

ఉ. కుంఫినివారు కేతనముగ్రుచ్చినచోటన జాతి బావుటా
యింపలరారుచున్నదను తృప్తి యొకింత తురంగలింపగా
కొంపయు గోడిలేని ఋషికుంజరు డెల్ల మతాలవారు మ
న్నింపగ నుద్యమించె మరణించిన హిందు తురుష్క మైత్రికిన్

సీ. కాశ్మీరమున నాలుకలుసాచు ప్రబల సంగరవార్త మనసును కలతపెట్ట
హైదరాబాదులో పాదుకొన్న యశాంతి యంతరంగమున గాయంబు చేయ
కలకతానగరాన మొలకలెత్తిన వర్గకలహంబు గుండెలు నలిచివేయ
సకుటుంబముగ బారి చనుదెంచి మొరపెట్టు కాందిశీకుల కాత్మకళవళింప

తే.గీ. కోటికొమ్ములతో నెదుర్కొనుచునున్న
మతమహామూర్ఖ మహిషాల మలుపలేక
శాంతి రణరంగదూత స్వేచ్ఛాప్రదాత
తపితచిత్తాన గ్రమ్మర నుపవసించె

కం. ప్రతి రక్తకణము భరత
క్షితికై వెచ్చించి స్వేచ్ఛ జేకూర్చిన యా
శతవృద్ధునాహరించెన్
ధృతిహీనమతస్వరూప మృత్యువుకినుకన్

ఆ.వె. గాంధి దేశసేవ కాసుకు రాకుండ
నిరసనంబు సేయు దురితరతుల
ఊతి గుండె లూషర క్షేత్ర మృత్తిచే
సృష్టి చేసెనేమొ సృష్టికర్త

మ. ప్రతిమల్ సెక్కి శిలాసహస్రముల నారాధించినన్ గాదు భా
రతదేశాన ననైకమత్యములు నీర్ష్యాద్వేషముల్ స్వార్థమున్
గతమై దోషపుజాఅలేని యొక సాక్షాత్ స్వర్గమింపారినన్
బ్రతుకుం గ్రమ్మర శ్రీ సబర్మతి మునిబ్రహ్మంబు ముమ్మాటికిన్

శా. ఆ కన్నుంగవలో వెలింగెడు సుధాహాసంబుతో నా ప్రశాం
తాకారప్రభతో నిటాలతటవిన్యస్తాబ్జహస్తాలతో
వైకుంఠంబుననుండి జాతిపిత సంప్రార్థించుచున్నాడు హిం
సాకాలుష్యము లేని భారతభవిష్యద్దివ్యసామ్రాజ్యమున్

కం. నా మేనిభస్మచయమున్
నీమంబుల బుణ్యనదుల నిల్పినయంతన్
నా మనము చల్లవడదని
ప్రేమోక్తులతోడ హెచ్చరించున్నేడున్

కం. పరరాజహస్తగతమై
వరవుడ మొనరించు హైందవంబున కదియే
మెరుగనిపించినచో నిక
స్వరాజ్యసంపాదనంబు వ్యర్థంబకదా?

చ. గుడులకుబిల్చి పంచములకున్ బెనుఊలను జూపి యూరిలో
నెడముగ సంచరించు ధృతిహీనములైన సమత్వధర్మముల్
బుడిబుడి సానుభూతులును మూర్ఖునిచేతి తుపాకిగాయముల్
దడవుటగాక గాంధి మునినాథుని యాత్మకు శాంతిగూర్చునే?

ఆ.వె. గాంధి రక్తధార క్ష్మాతలంబున జింది
ప్రభవమంద డొక్క బాపుజీయు
బాపుజీకి బదులు పదివేల గోడిసేల్
ప్రబలిరందు రేమి పాపమొక్కొ!

తే.గీ. పూర్వ పశ్చిమగోళాలు మోకరించి
యే మహావ్యక్తికొగి నమస్కృతులు సలిపె
నట్టి బాపూజీ మనమధ్య బుట్టుకతన
సభ్యతాస్ఫూర్తి భరతవర్షమున కమరె

సీ. చెదరిపోయినది నీ చిత్తవైశాల్యంబు బహుకాల పరదాస్యబంధనమున
నీటిపాలయ్యె నీ నిస్వార్థనియమంబు యినుపగజ్జెలతల్లి కనికరాన
సడలిపోయినది నీ సర్వసమత్వంబు దృఢమైన వర్ణభిత్తికలకతన
మొక్కవోయినది నీ భుజదర్పగరిమంబు రిక్తవేదాంతపరిశ్రమమున

తే.గీ. జాతిపితచూపి చన్న విశాలమైన
నమృతఘంటాపథంబున నడుగుమోపి
సాగనీవోయి స్వాతంత్ర్యసంసరణము
బ్రతికిచెడియున్న వీరభారతకుమార

మ. పదునై యున్నది భారతంబిపుడు శ్రీ బాపూజి రక్తంబునన్
వెదబెట్టందగు శాంతి సస్యమును ప్రాప్తించెం గిరీటంబు నీ
కుదుటంబడ్డ కుటుంబమందు కలహాంకూరంబులన్ మాన్పి యా
పదపాల్గాక సుఖింపవోయి భరతాంబా గర్భముక్తామణీ!

సీ. త్రావుచున్నది వినిర్దయత పేదల నల్ల ప్రాకిన దొంగవర్తకపు జలగ
ఉరుముచున్నది పండ్లుగొరికి మార్మూలల నంటుజాడ్యంపు టంకమ్మసత్తి
జననమందినది భాషారాష్ట్రవర్ణాల మరుగున స్వార్థంపు టెరుసుదనము
సోకుచున్నది కళాశుద్ధాంత కాంతకు నీతిదప్పిన పక్షపాతదృష్టి

తే.గీ. శ్వేతరాజుల చేతుల జిక్కువడ్డ
వసుధ సాధించి యిచ్చిన ముసలివాని
పచ్చి నెత్తుటి ఋణమెట్లు బాపగలవొ!
నిక్కి సామ్రాజ్యహరి నెట్టు లెక్కగలవొ!

మ. కలుపుంగోలుతనంబు గోలుపడి ముక్కల్ ముక్కలై హెచ్చుత
గ్గుల తత్వాల మహాపిశాచముల యుక్కుంగోరలం జిక్కి శో
షిలు మర్త్యత్వము నుద్ధరించి చనియెన్ శ్రీ గాంధిరాజర్షి! కా
గల హిందూసఖ! నిల్పుకొమ్మిక నిజాంకప్రాప్తరాజ్యేందిరన్.

చం. తురకల ఖడ్గపాతమున తుండెములైన యఖండభారతో
ర్వర! చిరకాల శాంతిసమరశ్రమ క్రమ్మర సంఘటింపగా
పరమపదించినట్టి యుపవాసవిశుష్కితవృద్ధు సృష్టిసా
గరమున లీనమై భరతగౌరవకాంక్ష దపించు నిప్పుడున్

# అవతారిక

పఠితలకు!

చం. అనుకరణంబు నందు తెలుగయ్యలు నమ్మలు దొడ్డవారు కా
వున నివసింప సాగినవిపో పెరవారి పసందుపోకడల్
తెనుగుదనంబు రాట్నమున దీసెడు దారముతోడ మూల్గసా
గినది పురాతనాంగనలు గేయములన్ శ్రుతిగల్పి పాడుచున్

ఆంధ్రుల కనుకరణమునం దభిరుచి విశేషమని వాడుక, నేడు మన వాఙ్మయరంగము నలంకరించిన నవలలు నాటకములు కావ్యములు విశేషభాగ మన్యదేశ చారిత్రాత్మకములే. తెలుగు దేశమును, తెలుగు సాంప్రదాయమును, తెలుగువీరులను పరిచయము చేయుకథలు బహుస్వల్పములు. విద్యార్థుల లేతమనస్సులలో ప్రప్రథమమున మాతృమూర్తిని ముద్రించి, మాతృదేశ వీరకథానకముతో వారి రక్తనాళములను కదలించినచో, వారిలో స్వీయ భాషాభిమాన మేర్పడి, స్వీయ ప్రతిభావిస్మృతికి తావీయదని నావిశ్వాసము. ఇట్లని యన్యదేశ చరిత్రరచన ఖండించుచుంటినని తలపరాదు. విజ్ఞానదాయకములయిన కథానకములే దేశమునకు సంబంధించినను గ్రాహ్యములే యగును. విద్యార్థుల కందుబాటున గల రంగస్థలములతో, కథానాయకులతో కథలు వ్రాయుట మిక్కిలి సమంజసమని నాయూహ.

యావద్భారతమునకు కిరీట ప్రాయమైన యాంధ్రదేశమునకు గుంటూరు మండలము నాయకమణి.

ఈ కథ గుంటూరు మండలమునకు సంబంధించినది. ఇందలి కథానాయకులగు కన్నమ, చిన్నానాయకులు వినుకొండ సీమకు జెందినవారు. కన్నముడు కట్టించుకొన్న కోట బురుజు నేటికిని బొల్లాపల్లె సమీపారణ్యమున శిధిలావస్థ యందున్నది. చరిత్రకెక్కక ప్రజా జిహ్వల నాశ్రయించి చిరకాలమునుండి జీవించుచున్న వీరగాథతో విద్యార్థిలోకము నలంకరించి, వారిలో వీరబీజములునాటి జన్మస్థలాభిమానమును రేకెత్తించుటయే నాయభీష్టము. నామనస్సును చిరకాలము నుండి కలంచుచున్న జంతుబలుల నొసంగు దొంగపూజారులను, మద్యపానమును, కోడిపందెములను, మెట్ట వేదాంతులను దుర్వైద్యులను ఖండించి దేశమును హెచ్చరించ దలచి కొన్ని పాత్రలను కల్పించితిని. స్వరాజ్యోదయమైన యిమ్మధుర శతాబ్దమున నిట్టి యనర్థములంతరించ గలవని యాశించుచు సత్యమునకు వెఱువక విశ్వశ్రేయమును కోరి సంఘసంస్కరణ కనువగు జాను తెనుంగు కావ్యములను రచించి తెనుగు కవులు దేశాభ్యుదయమునకు తోడ్పడుదురు కాక.

జి. జాషువ

# చిన్నానాయకుడు

కన్నమదాసు పేరు మ్రోగిన పశ్యతోహరుడు, ఉగ్రస్వరూపి, ఉరుమువంటి కంఠస్వరము గలవాడు, ఆజాను బాహుడు, నేరేడుపండువలె నిగనిగలాడు దేహచ్ఛాయతో, నిప్పులుగురియు నేత్రములతో, పెడదిరిగిన కండపుష్టితో, కోరమీసములతో, పట్టెడు వాలుసిగతో నతడు వాలుదాల్చి నట్టడవిని బ్రత్యక్షమైనచో, నెట్టిజగజెట్టికిని శరీరముకంపింపక పోదు. కరుణా లేశమతని కన్నులలో గాలూనుటకు తావులేదు. మెరికలవంటి నూర్గురనుచరు లితనికి నీడవలె కొలువు చేయు చుందురు. దారులుగొట్టి సముపార్జించిన ధనముతో నీతడొక చిన్న కోటను గట్టించుకొని బొల్లాపల్లి యరణ్యమధ్యమున వాసముచేయుచు భువన భీకరుడై విహరించు చుండును. దాసేజాతికి జెందినవాడో, యెరిగినవా రాప్రాంతములయం దెవ్వరును లేరుగాని, అతని వేషభాషలను బట్టి యతడు, నిషాదుడనియే నిశ్చయించవచ్చును. పల్లెనాటి ప్రయాణికులతనికి మేమానుగా నొక చింబోతును గాని యతని భార్యలకు జరీచీరలుగాని యొసంగి యాజ్ఞవడసి ప్రయాణము సాగించుచుందురు. దాసునాజ్ఞ లేక ఆ యరణ్యములలో ప్రయాణించుట బ్రహ్మకయినను కానిపని యన్న నతిశయోక్తికాదు. ప్రయాణికు లతనికంట బడినచో ధనమున్నను లేకున్నను ముందాతని ఖడ్గమొకరిద్దరి రక్తమును చవిజూడక విడిచిపెట్టజాలదు. పసిబిడ్డల నఱకుట అతని కొక వినోదక్రీడ. దారిదోపిడి వేళలయందతడు చెరగొన్న సుందరాంగులెందరో యతని శుద్ధాంతమునగలరు. దాసు మద్యపానము నందందె వేసిన చేయి. దివాణమున మూడు గట్టు తొట్లలో కల్లు కదలియాడుచుండును. దివారాత్రు లనుచరులతో నతడా మద్యమును సేవించుచు నొకయున్నతాసనమునగూర్చుండి పరివారమునకు పనుల నాదేశించుచు, భార్యలతో సరససల్లాపము లాడుచు, వంటలక్కలు వండి తెచ్చిన నంజుళ్ల నారగించుచు, కొట్టుచు, తిట్టుచు, కొలువు సేయుచుండును.

కన్నమదాసుని క్రౌర్యములకు గురియైన పల్లెప్రజల యార్తధ్వానము ప్రతి పల్లెయందును ప్రతిధ్వనించుచుండును. అంతుపంతులేని దాసుదుండగము లాంధ్రదేశము కడల వరకు వ్యాపించి దేశమును భయార్ణవమున ముంచితేల్చుచుండెను. కన్నమదాసు కటికి పాపాత్ముడైనను వీరగాథాకర్ణన కుతూహలమతనికి కలదు. తనబారిబడ్డ కథకులచేత నతడప్పుడప్పుడు పల్నాటివీర చరిత్రము చెప్పించి సత్కరించి పంపుచుండును భాగవతులచేత నాటకములాడించుచుండును. కంఠస్వారస్యములేని నటకులను పార్ష్ణిఘాతలతో చపేటములతో సత్కరించుటయును తరచు తటస్థించుట కలదు. బాలచంద్రుని యుద్ధమునతడు పలుమారు విని సంతసించి ప్రశంసించినాడు; బాలచంద్రు డీతనిలో వీర పూజాబీజము నాటి దాసున కారాధ్యదైవమయ్యెను. ఆ కారణముచేత కన్నమ దాసేటేట కారంపూడి తిరునాళ్ళకు సపరివారుడై కదలిపోయి, తిరునాళ్లు పూర్తియగువఱకు కారంపూడిలో గడిపి తిరిగివచ్చుట

కన్నమదాసు మ్రొక్కుకొని యొసగి తన వీరాభిమానమును వ్యక్తపరచి తృప్తిపడి వచ్చుచుండు వాడు.

బొల్లాపల్లికి కారంపూడి దాదాపు పదునైదుమైళ్ళ దూరమునకలదు. ఆగ్రామమునకు దరిదాపున ప్రసిద్ధమయిన నాగులేరు ప్రవహించుచుండును. అందు గంగధారి మడుగున బాలచంద్రు డడిదమును కడిగినాడని చెప్పుదురు. బ్రహ్మనాయాది మహావీరు లందరును నాగులేటి యొద్దున నసువులువాసి తెలుగువారి పౌరుషమునకు పదనుబెట్టి చిరస్మరణీయు లైనారు. ఆ వీరయోధులు ధరించిన ఆయుధముల కాలయములనిర్మించి పల్నాటిసీమవాసులు ప్రతివత్సరము కారంపూడిలో తిరుణాళ్లజరిపి వీరపూజారు లనిపించుకొందురు. ఉత్సవ కాలమున నాయూర కొన్నివేల ప్రజలు చేరుదురు. ఉత్సవప్రదర్శనార్థమై వచ్చిన ప్రజలలో విశేష భాగము విద్యా గంధము లేనివారగుటవలన మద్యపానమున మత్తెక్కి బండబూతులాడు పల్లె ప్రజల కోలాహలములతో, కోడిపందెములతో దయారహితమైన జంతుబలులతో ఆ తిరుణాళ్ళ పురాతనపు టనాగరకతను పుక్కిటబట్టి యుమియుచుండును. ఆ బీభత్స దృశ్యములను కనులారగాంచి శ్రీనాథునివాణి చిమ్మిన పద్యరత్నములు నిదర్శనములుగా నిలిచియున్నవి. ఈ సందర్భమున హృదయ విదారకమైన జంతుబలిని గూర్చి కొంతవర్ణించుట అనావశ్యము కాజాలదు. తొమ్మిదవనాటి యుత్సవములో పసుపుగుంకములతో నభిషేకింపబడిన దున్నపోతులను తొమ్మిదింటినిగొనివచ్చి బలియిత్తురు. బిగువైన మోకును కొమ్ములకు బంధించి వధ్యస్థానమున నిలిపి కొందరు బలాఢ్యులు ముందుకులాగి పట్టుకొని యుండ కొందరు వాలమును బట్టి వెన్కకులాగు చుందురు. హంతకుడతి దీర్ఘమైనిశితమైన ఖడ్గమును బూని 'కోబలి' యని యఱచి హుంకరించి దూకి వచ్చుచుండ పాప మాదీనజంతువు తను వాపాదమస్తకము కంపింప 'నంబా' యని యఱచుచు గడగడలాడుచు పెనగులాడు దృశ్యమెట్టి ఱాతిగుండె నయినను కఱగింపకమానదు. అతడామహిష కంఠము నొక్క వేటునకు దెగవేయ కున్న పుణ్యము మొక్కపోవునని జాగరూకులై చూచుచు గుదియలుచేబూని భక్తులుకొందరు హంతకుని ప్రహరించుటకు సంసిద్ధులైయుందురు. మహిష బలిచే లభించు పుణ్యము తనకు దక్కనీయక పంచుకొను ధనవంతుల కులవంతుల ధాకకు దున్నపోతు కన్నను పదిమడుంగులు భయగ్రస్తుడై వడకుచున్న ఆ దీనుడు శక్తికొలది ప్రహరించి శిరచ్ఛేదనము చేయును, ఆ దెబ్బతో గొట్టమునగొట్టినట్లు మింటికెగసిన రక్తధారలతో వధ్యస్థలమరుణారుణమైపోవును. ఆశ్చర్యమును గ్రుక్కబట్టి గాజుబిల్లలవలె వెలుగుచున్న యే తద్దీన జంతునేత్రములలో సప్తలోకములు నల్లపూసలై నగ్గు నుగ్గైపోవును. మహాత్మునివంటి దివ్యపురుష లవతరించిన భరత దేశము నేటికి నిట్టి జంతుబలులకు తావొసంగు చున్నదనిన సహృదయములు తలయెత్తి తిరుగవలెనో తలవంచి తిరుగవలెనో దెలియకున్నది. విజ్ఞులగువారిట్టిశక్తి పూజారులు చేయు జంతుబలులను నిలిపి వేయకున్న భరతదేశ చరిత్ర నన్యాల కరము గాక మానదని మనవి చేయుచున్నాము.

ఒకయేడు కన్నమదాసు సతీసమేతుడై కదలివచ్చి నాగులేటితీరమున ముత్యాల గుడారములు వేయించి మహా వైభవముతో విడిసెను. కరకర ప్రొద్దుబొడుచులోపల కమ్మని కల్లుకావిళ్లతో నందించుటకును, వలసిన భోజనపదార్థములను సిద్ధముచేయుటకును, విలువ గలిగిన పందెపుకోళ్ళను గొనితెచ్చి యిచ్చుటకును, అనుంగుసతుల నలరుమాలికలతో నలంక రించుటకును గుడారములనిర్మించుటకును దాసెందరినో నియమించెను. దిశాంచలములను తన యపకీర్తి కజ్జలమున జలకమాడించి, పసిబిడ్డలను సహితము పాలుద్రావనీయని చోరశిఖామణి యగు కన్నమదాసుని జూచుటకు జనులు తండోపతండలుగా వచ్చి భయభ్రాంతులై చూచి పోవుచుండిరి. “లోకకంటకుడైన చోరశిఖామణిని మట్టుపెట్టి దేశమును నిష్కంటకముగా చేయ గల రాజులు లేరుగదా” యని కొందరు నిట్టూర్పు విడిచిరి. కొందరు లోలోపల దూషించిరి. స్త్రీలుమెటికలు విరిచిరి. కొందరు పండ్లునూరుకొనిరి. కొంద రదృష్టజాతకుడనిరి. ఎందరెట్లు కంటగించుకొన్నను దాసు నెదరించుట సామాన్యుల మాటయటుంచి సార్వభౌములకే సాధ్యము గానిపని. అతనింజెనకుట మృత్యువును జెనకుట. పట్టావిసరునందుగాని కత్తి సామునందు గాని అతడసమానుడు. గజ్జెలచెడ్డీధరించి నడుమున కాశెకోక బిగించి, బారీటెచేతదాల్చి దాసురంగమున నిల్చెనా గంగానందనునకును గుండెయానదు. అతడేకాదు అతనియనుచరులును గాళకులు. పిడుగులవంటివారు. వారొకరిద్దరుగారు నూర్గురు. ఖడ్గహస్తులై భృత్యులు పిఱుందనడువ దా సగ్రగామియై యుద్ధమునకు తారసిల్లినచో రెండవపల్నాటి యుద్ధమంత కథ నడచినగాని కాదు. అతడజేయుడని యెఱింగిన వారగుట కతననానాటిసంస్థానాధిపతులలో నొక్కండునతనినిదాక సాహసించలేదు. ధైర్యమున మంచుమలవంటి కన్నమదాసు దొంగలకు దొంగ దొరలకు దొరయై నిర్భయముగా పల్లెలలో పట్టణములలో సంచరించి పోవుచుండును.

కారంపూడి తిరునాళ్ళలో కోడిపందెగాండ్ర పటాటోప మనుపమానము. వారి వాచాలతకు తలయును తోకయు నుండదు. కాలికి కత్తిగట్టి కదన రంగమున కోడిని విడుచు లోపల పందెగాని వాగుడు పట్టనలవి గానిది. అక్కడ కోళ్ళన్నియును నెమిళ్ళు, డేగలు, హంసలయి పోవును. గెలుపందినజూదగాడు మీసము దువ్వి ముల్లోకములపై ‘సై’ యనును. పండ్లు గొరుకు కొనును. గ్రుడ్లురుమును. వేయేల వాడొక పిశాచ గ్రస్తుడు, పిశాచి. ఈ పిశాచులు మద్యపిశాచ గ్రస్తములై మై మఱచి యుండును. ద్యూత వ్యసన పరీత చేతస్కుడై యొడలు మరచియున్న జూదరి సహజముగా మానవత్వము గోల్పోయి యుండును. దానికి సురాపానము తోడై అతనిని కేవలము పశుప్రాయుని చేసివైచును. దేశానర్థకములలో త్రాగుడు ప్రథమ గణ్యమైనది, దీని చెఱుపపారము; స్వర్గసుఖము నరచేత నిల్పినట్లు లాలించి తదనంతరము వేయి నరకములలో గూలద్రోయును.

మద్యపాయి యెట్టి యకార్యా చరణమునకును వెనుదీయడు. వానిలో సింహములు,

జంతు స్వభావముల సమ్మేళనము సుర. మొదటి ముంతతో చిలుక పలుకులు, రెండవ ముంతతో కోయిల పాటలు, మూడవ ముంతతో కొంగమెడలోని కొంగరలు క్రమక్రమముగా పొడసూపును. పిమ్మట హనుమంతునివంటి భుజబలము, విభీషణునివంటి చుట్టరికము, కర్ణునివంటి దానగుణము, కుంభ కర్ణునివంటి తిండిబోతు తనము. అంతటి నిద్రాభారము నావేశించును. సురాపాన లక్షణములనంతములు. ఏతత్సేవాతత్పరులగు కుక్కుటకితవులలో కన్నమదాసు తొమ్మిదినాళ్లు వినోదించి, ఒకనాడనుగుటెలనాగలతో నాగులేట స్నానమాడి, చెన్న కేశ్వర స్వామివారి ఆలయమునకు బోయి, అర్చించి, తనకును తన పరివారమున కాయురారోగ్యములును తన చోరవ్యాపార విజయమును వరమిమ్మని మ్రొక్కుకొని సతీమణుల చేత మ్రొక్కించి ప్రదక్షిణ నమస్కారములాచరించి స్కంధావారమునకు తిరిగి వచ్చెను. భారతదేశ మెవరికి దగిన దైవములను వారికి ప్రసాదించ గలదు. కులదేవతలు, గోత్రదేవతలేగాక హంతకులకు, హర్తలకు నభయమిచ్చి ఆదరించు దేవతలును వలసినప్పు డిందవతరించు చుందురు. ఇట్టి పరిస్థితులయందు భగవంతుడు దయామయుడో క్రూరుడో, కుత్సితుడో, కుటిలుడో నిర్వచించుట దుస్సాధ్యము. కుజన దుర్జనులను సమానముగా సత్కరించు మహోన్నత ప్రేమ స్వరూపుడగు భారత భగవంతుడు. అంటరాని వారలననాదరించుట శోచనీయము.

ఉత్సవానంతరమున కన్నమదా సాత్మీయుల నెల్లరం గదలించుకొని ప్రియకాంతలు మేనాల నధిరోహించి వెనుక వచ్చుచుండ నున్నతాశ్వము నధిష్ఠించి రాజఠీవితో స్వస్థానమునకు మరలివచ్చుచుండెను. దాసు నాయకురాలికనుమదాటి నల్లగుండ్ల కనుమ ప్రవేశించు చుండగా, ఒక చెంచిత రెండేండ్లీడు గల పసిబిడ్డను చంకనిడుకొని వృద్ధుడగు జనకునితో, ఐదేండ్ల యీడుగల బాలుడు వెంటనడచిరా కన్నమదాసు కెదురు నడచి వచ్చుచుండెను. ఆ యాటవిక యువతి యిరువది రెండేండ్ల జవ్వనమున నింపు లొలుకు చుండెను. నల్లమల చెంచితలు ధరించు బండిగురివెంద పూసలు మెడనిండ దాల్చి, యేన్గు దంతపు కడియాలు, కంకణాలు గలుగలుమని ధ్వనింప, వారకొప్పుబెట్టి, తంగేడుబూలు గీలించి, ముక్కున ముద్దులుగారు ముత్యాలముంగర సవరించి విశాల నేత్రములకు కాటుకదీర్చి, యువకుల యుల్లములను కొల్లగొట్టు మధుర మంద గమనముతో మార్గాయాసము వలన నుస్సురనుచు కన్నమదాసుని భీకరాకారమును జూచి యించుక జంకి ప్రక్కకు నడచి నిలిచి చూచుచుండెను, కన్నమదాసా యువతిం జూచిన తోడనే యెవరుమీరు? మీరెక్కడనుండి వచ్చుచున్నారు? నా యనుజ్ఞదీసికొంటి రా? యని కనుమ ఖంగనమ్రోగునట్లు బిగ్గరగా నరచెను. అంతలో వృద్ధుడు "దొరా! మేము చెంచులము నల్లమలనుండి నడిచి వచ్చుచున్నాము. సమీప గ్రామమున బంధువులున్నారు. ఈబిడ నా మనుమరాలు. అత్తగారింటికి వెళ్ళుచున్నది. మీ రెవరో మే మెఱుగము. తెలియక తప్పుజేసియున్న క్షమింపుడ" ని దీనముగా వేడుకొనెను. "నాపేరు కన్నమదాసు. నా పేరు మీ రెరుగరా! నా ఆజ్ఞ లేక ఈ మార్గమున పథికులు నడువరాదు. మీ

యపరాధము క్షమింపదగినది కాదని" దాసు గద్దించి పలికెను. అంతలో తన పరివారము దాసుని సమీపించి నిలిచెను. మేనాలోనుండి ఆ బాలిక రూపమును జూచుచున్న పెద్ద భార్య ఆ యువతి ధరించిన ముక్కు ముంగరపై కన్నువైచి ముందు ముంగర గాజేయుడని సైగచేసెను. ఆ మాటతో దాసుగుఱ్ఱము నుండి చివాలున నేలకురికి చటాలున కత్తిదూసి, తల్లి ఱొమ్మున సుఖనిద్ర జెందుచున్న పసిగందును బలాత్కారముగా లాగుకొని మింటికెగురవైచి కత్తి నొడ్డెను. ఖండితమైన వెన్నముద్దవలె ఆ బిడ్డ రెండు తుండెములై క్రిందబడెను. ఆ దృశ్యమును జూచి హోరామా! యని బాలిక నేలకొరగి మూర్ఛపోయెను. నేల కొరగిన బాలిక ముంగరను తాటాలున లాగి భార్యకిచ్చి–ముసలివాని నొక్క తన్నుదన్ని గుఱ్ఱమునెక్కి తరలిపోయెను. చివరి మేనాలో నుండి ఆ ఘోరకార్యమును కన్నార జూచుచున్న యొక కన్యక రెండు కన్నీటి చుక్కలను రాల్చెను. సహచరులు సెహబాసనిరి. తలవని తలంపుగా జరిగిన ఈ భయంకర సంఘటనమును జూచుచున్న ముసలివానికి నోట మాటరాక కొంతవడికి తెప్పరిల్లుకొని రక్తసిక్తములై పడియున్న శిశు శకలములను చేత నెత్తుకొని గోదు గోదున నేడువ సాగెను. అంతలో మనుమడు గానరామి భయమంది, చిన్నానాయకుడా! చిన్నానాయకుడా! యని కేకవేసెను. ప్రాణభీతిచే బరుగిడి వెదురు గుమ్మున దాగియున్న బాలుడు వడకుచు వచ్చి, ఆ ఘోరదృశ్యమును జూచి నిశ్చేష్టుడై నిలిచి చూచుచుండెను. ముసలివాడా శిశు శవమును నేలపై నుంచి మనుమరాలినితట్టి లేఅమ్మా! లే మనకర్మమిట్లు కాలిన దని యోదార్ప బ్రయత్నించుచుండెను. ఎంత పిలచినను మనుమరాలు కదలకుండుటజూచి వృద్ధుడామెను నిదానించి చూచి అయ్యో! ఇంకేమున్నది నాయనా కొంప మునిగినదిరా! బిడ్డాయని బిగ్గరగా నేడ్చెను. పాపమా లేత యిల్లాలు పిల్లదాని పిట్ట పిడుగువంటి చిత్రవధ నారసి మూర్ఛిల్లి నపుడొక నూది రాతిపై బడి ఆయువుపట్టైన కణతను ఛేదించుట జేసి ప్రాణములు విడిచెను. దీర్ఘ ప్రయాణములచేత మే నలసిపోవుట చేతను క్రిందటి నాడు జ్వరము తగిలి బడలి యుండుట చేతను శోకక్రోధములు ముప్పిరిగొని సర్వాంగ కంపనము గావించి కారించుట చేతను ముసలివానికి తీవ్రమైన జ్వరము వచ్చెను. అతడు మనుమరాలిపైబడి యేడ్చి స్మృతి తప్పి పడిపోయెను.

కన్నమదాసుని భీతిచే ప్రయాణికులా మార్గమున నడుచుట మానుకొని చిరకాల మయినది. ఆపసిబాలు డొక్కడా యరణ్యమధ్యమున శవజాగరణము చేయవలసిన వాడయ్యెను. చిన్నానాయకుడేండ్లకు చిన్నవాడైనను తెలివిగలవాడు. తండ్రి పూజానాయకునివలె సాహసము కలవాడు. పూజా నాయకుడు చెంచుగూడెమున పలుకుబడిగల కులపెద్ద. బాణ ప్రయోగమున నరుని యంతటివాడు. ధైర్యసాహసములకు పుట్ట. అతడట్టి తరుణమున నుండినచో కన్నమదాసు రక్తమును కనులజూచియుండును. ఇప్పటికైనను మించిపోయినది లేదు. ఈ వార్త విన్నచో నతడు కసిదీర్చుకొను వరకును కనుమూయువాడుగాడు. చెంచుల కతవినమాట సుగ్రీవాజ్ఞ. అట్టివీరుని కడుపున బుట్టిన పులిపిల్ల చిన్నానాయకుడు. తల్లిశవము

పిల్ల శవము నతడు కన్నార్పక చూచుచు తాతశరీరమును పట్టి చూచుచు పలుకరించుచు అర్ధరాత్రము వరకు కాపలాకాయుచుండెను. అది మహారణ్యమధ్యము. నల్లగుండ్లకనుమ. పట్టపగలే చీకట్లు గ్రమ్ముకొను భయదమైన కారుటడవి. సమీపమున బెబ్బులి కాండ్రించుచు పర్వతాగ్రమునుండి దిగి వచ్చుచు, జ్యోతులవంటి కనులతో నంధకారమును చీల్చి వేయుచున్నది. పైన గగనదేవత క్రింద భూదేవత దక్క అతని కన్యమయిన శరణ్యము లేదు ఆ బాలునిలో భయ లేశమునులేదు. హృదయమున వయసుకుదగ్గ క్రోధ బీజములు ప్రతీకార యత్నబీజములు సన్నసన్నగా బెనచుకొని కలువర పెట్టసాగినవి, కన్నమదాసు, కన్నదాసను నాల్గక్షరములతని శరీరమున విద్యుల్లతలవలె నల్లుకొనిపోయినవి. చిన్నానాయని చిన్నతల శోకక్రోధముల నాగబట్టలేకపోయినది. తొలికోడి కూసినది. చుక్కపొడిచినది. నిద్రాదేవత యొడిలోని కొరిగి కన్నుమూసికొనెను. ఇప్పుడతడు స్వప్నలోకమున నుండెను. తన రెండేండ్ల చెల్లెలు, కన్నమదాసునికత్తి కెరయై రెండు ఖండములై సమీపమున బడియున్నది. ఆశకలములు సజీవములై కదలివచ్చి కలసికొన్నవి. లేచినిలుచున్నది సోదరి, అన్నా! యని పిలిచినది. బాలుడు కన్నులుమూసికొనియే సోదరీ! యనిపలికినాడు. ఇదిగోనారక్తము బొట్టుపెట్టు కొనుము. నీకుజయమని పలికినది. తిరుగ రెండుశకలములై జగతికొరిగినది. చిన్నానాయకు డులికిపడి లేచెను. తాతను పలకరించెను. తాత మనుమరాలిని గలిసికొని అరజాము గడచినది. ఘోరము! ఘోరము చిన్నానాయకునకిప్పుడు దిక్కెవ్వరు.

2

సీ. శ్రీరాము దేకొండశిఖరాన కన్నీటనాలించె సీతాపహరణగాథ  
దాటించె నేవీటి దాపున నైతమ్మ పట్టి మేల్పొట్టే లివాహనంబు.  
కోట కొమ్మలమీద గ్రుచ్చి నా రేవీటి తెలుగురాజులు విరోధులశిరాలు  
ముత్యాలతో నారబోసి నారేవీటి నృపతు లేటేట పండిన యశస్సు

తే.గీ. భాస్కరుని దాన ధార లేపట్టణంబు  
చారు చరితకు బంగారు నీరువోసె  
అట్టి వినుకొండ పురమున బుట్టుకతన  
ధన్యుడనునేన యుత్తమోత్తముడ నేన (ఖండకావ్యము)

మన కథాకాలమునాటికి వినుకొండ రాయని భాస్కర పరిపాలనా గౌరవమును గోల్పోయి పచ్చి వైధవ్యము ననుభవించుచున్నది. కాని యతని దాన జలధారచేత పరిపోషితమై వికసించిన యశోదాన్యము కమ్మని నెత్తావులను జిమ్ముచున్నది. పురలక్ష్మి ధవుని

పటుత్వము సడలినజాడ లట్టె గోచరించుటలేదు. భాస్కరునిచేత చరిత్ర ప్రసిద్ధిని–రామునిచేత పురాణప్రసిద్ధిని చూరలాడినది వినుకొండ. రాముదు సీతాపహరణ వార్త నీచోట వినుట కతన వినుకొండయని వ్యవహరింప బడుచున్నదని ప్రజలు చెప్పుచుందురు. కొండమీద, రామలింగేశ్వరాలయము సీతారామ కుండములు, కనకదుర్గాలయమును కలవు. టిప్పు సుల్తాను కాలమున నిర్మితమైన గొప్పమసీదు పురమధ్యమున మహమ్మదీయుల దైవభక్తికి నిదర్శనముగా వెలయుచున్నది. 5,6వందల వైశ్య కుటుంబములును, 4, 5 వందల మహమ్మదీయ కుటుంబములు, ఎనుబది డెబ్బది బ్రాహ్మణ కుటుంబములును, తదితరజాతులు కలిగి కేవలము పట్టణము గాక కేవలము పల్లెగాక, పురాతన వైభవస్మరణతో వినుకొండ కాలక్షేపము చేయుచున్నది. శ్రుతగిరి కిరువది నాల్గు మైళ్లదూరమున, నరసరావుపేటయను నగరమునకు మల్రాజు గుండారావధినేతయై పరిపాలించు చుండెను. వినుకొండ యమ్మహీధవుని కంకితమై ప్రభువులేదన్న కొఱంతను వాపు కొన్నది. గుండారాయ ప్రభువు ప్రజాక్షేమమునుకోరి పరిపాలన సాగించురాజులలో నొకడు. కవితాప్రియుడు కరుణాళువు. దిట్టకవి నారాయణకవి, రంగరాయ చరిత్ర నీరాజున కంకితము చేసి ఘనముగా బహూకృతుడైనాడు. కన్నమదాసుని దుండగములచే నుచ్చలితమై యుడుకుచున్న తెలుగు దేశమునుండి గుండారాయని కెన్నియో మహజర్లు దినమును వచ్చుచుండును. గుండమహీపాలు డీదుష్టుని మట్టుబెట్టుట కెన్నియో యత్నములు చేసెను. కాని అవి నిష్ఫలములైనవి, అతనిని సంహరించినవానికి శేరు బంగారు కంకణములు బహూకరింతునని ప్రకటించెను. బలాఢ్యులయిన మల్లులను బిలిపించి అడిగి చూచెను. తన ప్రయత్నములన్నియును వమ్మైనవని పుడమిఱేడు నిరుత్సాహికాలేదు. మార్గాంతరములను యోజించుచునేయుండెను. కొలది దినముల క్రితము నల్లగుండ్ల కనుమలో దాసుకావించిన చిత్రవధా వృత్తాంతము పాదరసమువలె నలుదెసలకు ప్రాకిపోయెను. రాజీవృత్తాంతము విని మిక్కిలి క్రుద్ధుడయ్యెను. ఒకానొక వెలమకన్య నతడప హరించుకొని పోయి, తన రాణివాసమున జేర్చుకొన్న సమాచారమును రాజు వినియుండెను, ఆబాలిక నృపతికి సమీప బంధుకోటికి సంబంధించినది. ఆ కన్యకాముక్తికై కత్తికట్టి వెళ్ళిన వెలమవీరుల కన్నమదాసు సంహరించి వారి శిరస్సులను రాజదివాణమున బారవేయించినాడు. ఆక్రోధజ్వాల భూజానియందు ప్రజ్వరిల్లుచున్నది. ఇంతలో వనచర కుటింబినీహత్య; దాసుని దుష్కృత్యమును జూచి మేనాలో నుండి కన్నీరుగార్చిన దాకన్యకయే; కన్నమదాసునిబట్టి తెచ్చుటకై ఉక్కు మేనా నొకదానిని తయారుజేయించుకొని తగిన సన్నాహముతో కార్యంపూడి తిరునాళ్లకు ప్రయాణమైపోయిన దివాను లక్ష్మణసింగు రిక్తహస్తములతో తిరిగివచ్చెను. గుండారాయనిగుండె జారిపోయినది. లక్ష్మణసింగు, ప్రయత్నము విరమించరాదు, ఉపాయాంతరము వెదకి మరుచటి యేడు తప్పక బంధించి తెచ్చెదనని రాజునోదార్చెను.

ధనిసెట్టి వినుకొండవైశ్యులలో దొడ్డవాడు. మహా ధనవంతుడు. సత్యభగవద్భక్తుడు.

జాలిగుండెలవాడు. భారతదేశమునకు వేరు పురుగులైన వర్ణ వైషమ్యముల నతడసహ్యించు కొనును. నిమ్నజాతుల దుస్థితి కతడు కన్నీరు వహించును. సహజముగ వణిక్కులకుండు స్వార్థ లక్షణముల కత డతీతుడు. సరకులను న్యాయమైన ధరలకు విలిచి, న్యాయమైన లాభములకు విక్రయించి అతడు లక్షలార్జించెను. అనాథుల కతడు కన్న తండ్రివంటివాడు. కన్యాకాపరమేశ్వరిని దేవతగా నతడు విశ్వసింపడు. శీలవతియనును, సప్తాహములు, సంతర్పణలన్న నతనికి గిట్టవు. మనుష్యులను జూచి నంతనే అతడు మానవుడని గుర్తించును. నీ వెవరని ప్రశ్నించి ప్రక్క చూపులు చూచి యెరసుగా ప్రవర్తింపడు. క్రీస్తు ప్రేమతత్త్వమును ప్రచారముచేయు ఒకానొక ఫాదిరి కుక్కలను గాల్చుచుండగా నతడతని వారించి భూతదయకు ప్రేమకు గల యంతరార్థమును వివరించి సమ్మతింపజేసెనన్న యతని విశాలహృదయ మర్థమగును. భగవంతుని నిర్వచనమునందతడనేక మతగురువుల అభిప్రాయములతో నేకీభవింపడు.

తే.గీ. పరుల దుర్గతిగని గుండెగరగి వగచు
సదయ హృదయుల వీక్షణాంచలమునందు
పుట్టుచుండును కన్నీటి బొట్టువోలె
యేడి భగవంతుడని సంశయింతు వేల?

అనే సిద్ధాంతము నతడు రాయిగ్రుద్దీ స్థిరీకరించును వాఙ్మయ సంస్కారమున దేశసంస్కారము జరుగునను, తెగకు జెందిన విద్యాప్రియుడు ధనిసెట్టి. కవన మన్న చెవిగోసి కొనును. కృతులందుమని కవులెందరో యతని నాశ్రయించుచుందురు. చర్విత చర్వణములై కాలయాపనమున కుపకరించు కావ్యముల నత డాలకింపడు. సహజకవితా కళాకలితుడైన ఒకానొక యేనాది కవి వ్రాసిన కావ్యమును స్వీకరించి అతనికి జీవనోపాధిని గల్పించి తన సర్వసమతా దృష్టిని వెల్లడించెను. ధనిసెట్టి విశాలాశయము తనకు విరోధులను కొందరిని సంపాదించి పెట్టకపోలేదు. కాని సమక్షమున నతని ప్రతిఘటించుటకు సాహసము లేక చాటున మాటున దుష్ప్రచారము చేయుచు కసిదీర్చు కొందురు. ధనవంతులను సహజముగా పీడించు సంతాన దారిద్ర్య మతనికి లేదు; ధనిసెట్టి అనితల్లి వలన నలుగురు కుమారులను, ఇరువురు కుమార్తెలను కనెను. అనితల్లి భర్తవలె విశాలహృదయ కాదు. తద్వ్యతిరేకము లయిన సకల దుర్గుణము లామె యందు మూర్తీభవించినవి. అనితల్లి గుణములెంత వక్రములైనవో రూపమంత వక్రమైనది. శరీరచ్ఛాయ మసిబొగ్గుతో మల్లయుద్ధము చేయుచుండును. కేవలము పొడగరికాక కేవలము పొట్టిదిగాక యారాసిగా నుండును. తలమీది వెండ్రుకలన్నియు నూడిపోయినవి పోక పార్శ్వముల పలుచ పలుచగా మిగిలిన కురుచ వెండ్రుక లనితల్లి వికృతాకృతికి దోహదము చేయుచుండును. దంతములు దీర్ఘములై వెలుపలికి వ్యాపించి

వేసినవి. అనితల్లి కోపగించి నపుడు దక్క అన్ని వేళలయందు కన్నులున్నవో పూడిపోయినవో యను సంశయమును కలిగించుచుండును. ఈ లక్షణము లన్నింటిని మించిన స్థూలకాయ మా యిల్లాలినిల్లు గదలనీయక వేధించుచుండును. సంపన్నుని భార్య గావున నాపాదమస్తకము న పరంజి భూషణములు ధరించి అనితల్లి శనివారముల యందు దైవపూజకు బోవు చుండ చూచువారికి ధనిసెట్టి ధనము కాలుసేతులతో కదలి పోవుచున్నదా యనిపించును. తైల సంస్కారమున సాధన జేసిన కుఱుచ వెండ్రుకలను కూడ గట్టుకొని జడయల్లి చుట్టజుట్టి జరీచీర గట్టుకొని పట్టురెవిక దొడిగి పూజా పళ్ళెరమును ధరించి అనితల్లి వీధిలో నడచునప్పుడు భూమి కవతరించిన సాక్షాదాది వరాహదేవత వలె గోచరించునన్న యత్యుక్తిగాదు. "ఆజానుబాహువు. అంద చందముల కాణాచి యమృతాశయుడునగు ధనిసెట్టికా కట్టడి బ్రహ్మ యిట్టి యిల్లాలిని ప్రసాదించి, ఎంతకొంటెపని చేసెరా" యని విచారించని వారిని వినుకొండలో వ్రేళ్ళమీద లెక్కింప వచ్చును.

ధనిసెట్టి సేవకద్వితీయుడై కార్యాంతరముల మీద మాచెర్లకు బోయి తిరిగి వచ్చుచు యటవీమధ్యమున నల్లాడు చున్న చిన్నానాయకుని జూచి కట కటంబడి, వృత్తాంత మంతయు విని బాలునోదార్చి సమీప గ్రామవాసులను రావించి శవదహనమునకు తగిన సదుపాయములు చేసి చిన్నానాయుని వెంటబెట్టుకొని పోయి, తన పశుల కాపరులలో నొకనిగా నియమించి అన్న వస్త్రములిచ్చి పోషించుచుండెను, ధనిసెట్టికి రమారమి నూరావులు, నేబది గేదెలు, నరువది డెబ్బది కోడెదూడలు గలవు. వానిని మేపుకొని వచ్చుటకు, పశువులను పరామర్శించుటకు పదునైదుగురు పశుల కాపరుల నియమించెను. చిన్నానాయకునితో నేడు పదునారుగురు. చిన్నా నాయకుడు కొన్నాళ్లు జననీ దుఃఖమున నన్నపానములు సరకు గొనక దుఃఖించుచున్నను కాలక్రమమున పనిపాటల ధోరణిలోబడి బెంగమాని కాలము గడపుచుండెను. కాని ప్రతీకార దీక్ష దినదిన ప్రవర్ధమాన మగుచు బాలుని వయస్సువలె పరిపక్వ మగుచుండెను. చిన్నానాయనికిప్పుడు పది నొకండవ యేడు గడచుచున్నది. చిన్నానాయకుడు తల్లి నోట నూడి పడినవాడు. విశాలములయిన కనులు. కోటేరు వేసినట్లున్న ముక్కు, తీర్చినట్లున్న కనుబొమలు, ఉంగరాలు దిరిగిన వెండ్రుకలు గలిగి యాకర్షణీయమైన మూర్తితో ముచ్చట గొలుపు చుండెను. పనిపాటలయందు చుఱుకు దనము ఋజువర్తనము, స్వామికార్యతత్పరత నరసిన ధనిసెట్టి కతని యందు గాఢానురాగ మేర్పడెను. చిన్నానాయకు డనుటకు మారుగా ధనిసెట్టి బాలుని చిన్నవాడాయని ముద్దుగా బిలుచుచుండును. అనితల్లికి చిన్నవాడన్న గిట్టదు. అతడెంత నమ్రత వహించి, యెంత మట్టసముగా పనులు చక్కబెట్టుచున్నను చీదరించుకొని, కసరుకొని తన యనిష్టమును వ్యక్తము చేయుచుండును, ఏనాది ముండకొడుకులను, ఎఱుకల ముండకొడుకు లను చేరదీయరాదు. వాండ్రు దొంగలు, చెఱుపు చేయుదురని ధనిసెట్టితో ననుచుండును. ఆ మాటలను పాటిచేయక ధనిసెట్టి ప్రత్యుత్తరించక వినుకుండును. ధనిసెట్టి కొడుకులు తల్లి చాయంబట్టి, తల్లియందమునకు

మెరుగు బెట్టినను, కుమార్తె లిరువురును, తండ్రినిబోలిన దివ్యరత్నములు. చక్కని చుక్కలు. అందు చిన్నకూతురు చుక్కమ్మ మిక్కిలి యందగత్తె. అందమే కాదు. అనుగు దండ్రిగుణము లన్నియు చుక్కమ్మలో మొలకలెత్తినవి. చిన్నవానిం దల్లి కసరుకొను వేళలలో ముద్దుమాటలతో "అమ్మా! అనాథులపై యలుగరాదు వారి మనసు చివుక్కుమన్న నోదార్చువా రెవరు? భగవంతునకు వారు ప్రేమపాత్రుల"నిపలుకును. ఆ మాటలకనితల్లి ఆగ్రహించి, "చాల్చాలులే, పెద్ద నాపసానివి, నీ తండ్రికి బుట్టిన పుండే నీకును పుట్టినదా? పో, అవతలి" కని గర్జించును. చుక్కమ్మ చురచురజూచి దాటి పోవుచుండును. ఇంట పిండివంటలు చేసినపుడు చుక్కమ్మ తల్లి కనుమలపి చిన్నవాని యొడిలో బడవైచి పరుగిడు చుండును, అనితల్లి కుమారులు తల్లిని తలదన్నిన పిసిని గొట్టులు, దొంగపద్దులు వ్రాయుటయం దారితేరినవారు, దయా రహితులు, ఉదారస్వభావుడైన ధనిసెట్టికడుపున బుట్టిన వైశ్యబాలకుల కిట్టి గుణము లేల కలిగెనాయని యడుగ వచ్చును. బిడ్డల కెప్పుడును తండ్రిగుణములకన్న తల్లిగుణములు పట్టువడుట కవకాశము మిక్కుటము. శారీరకముగా బిడ్డలలో తల్లిరక్తమే మిక్కుటముగా ప్రవహించుచుండును; వారిలోని ప్రతిరక్త కణము, ప్రతినాడి, ప్రతికండరము, తల్లి వైపునకు మ్రొగ్గియుండును. తల్లి నాటిన మాటలవలె తండ్రి మాట నాటుకొనలేదు. తండ్రిది రెండవస్థానము. తల్లియంకమున జేరి స్తన్యమాను బిడ్డదృష్టిలో మాతృమూర్తి యిల్లుగట్టుకొనును. పితృమూర్తికందు రెండవస్థానమే మిగిలియుండును. ఇది సృష్టిరహస్యము. కావున తల్లి ప్రథమోపాధ్యాయియై బిడ్డకు శీలవిద్యను నేర్పుకొన కున్నమీదట గురు ముఖమున కాంచిన విద్యరాణింపనేరదు. భారతదేశమీరహస్యమును గ్రహించనంత కాలమునునుత్తమ భారతీయులుద్భవిల్లుట కవకాశము శూన్యము. సమభావము, అహింస, దయాగుణము, త్యాగ బుద్ధి మున్నగు, దివ్యగుణముల నుగ్గుబాలతో తన సంతానమునకు నూరిపోసుకొను భారము తల్లిది. తల్లిమూఢమతియై తనమూఢ విశ్వాసముతో, తనదురాచార పరత్వముతో తన స్వార్థ చింతతో బాలురను పెంచి పాఠశాల కంపిన ఆదర్శపౌరులు తయారగుట కలలోని వార్త. శశవిషాణము గగనకుసుమము. స్త్రీ విద్యా ప్రయోజనమును ఇప్పటికైనను భారతభూమి గ్రహించిన జాలును. కష్టసుఖము లక్కచెల్లెండ్రవలె పరస్పరము ప్రేమించుకొనుచు నొక నియమమునకు పట్టువడి నడచుచుండును. కష్టములు తలసూపెనా సుఖములు సేదదీర్చుకొను చుండును. కష్టములలసి కూర్చున్న గాని సుఖములు రంగములలంకరించవు. కష్టము లొంటరిగా రావు. అదొక పరంపర, ఒకవరుస, ఒకబారు. అట్లేసుఖములు. చిన్న వానితండ్రి పూజానాయుడు తనకుటుంబ మరణవార్త విని భృగుపాతము చేసి మరణించినట్లు వార్తవచ్చినది. చిన్నవాడు తండ్రి మరణవార్తచే మరింత తల్లడిల్లి పోయెను. ధనిసెట్టికి చిన్నవానియందు కరుణా వాత్సల్యములు ముమ్మరించినవి. బాలు నతడనేక విధముల నోదార్చెను. గుండెఱాయి జేసికొని చిన్నవాడు జీవితము సాగించుచుండెను.

ఒకనాడు బెపేడివాండ్రు ధనిసెట్టి యింటివద్ద కాటమరాజు కథను చెప్పిరి

కాటమరాజు తం(డ్రి పెద్దిరాజు ఆర్లపెంట రణమున గూలిన ఘట్టమును కథకుడు రౌ(ద్రరస ముట్టిపడునట్లు చెప్పెను. చిన్నవానిలో తం(డ్రిమరణము తళుక్కున మెరసి మూర్ఛితుని జేసివైచెను; అక్కడనున్న వారతనికి శైత్యోపచారములు చేసిరి. చిన్నవాడు తెప్పరిల్లెను. శ(త్రుశిరచ్ఛేదనము చేసి కాటమరాజు తం(డ్రి పాదములవద్ద నుంచుట. తం(డ్రిసజీవుడై సంతసించుట మొదలయిన ఘట్టములు చిన్నవానిలో వీరోత్సాహమున కూపిరివోసినవి. కన్నమదాసుని కడతేర్చుట కతడాత్మలో కంకణము గట్టుకొనెను.

వినుకొండకు పడమటి దిక్కున పర్వత పాదమునానుకొని ఆంజనేయాలయము గలదు. శనివారము లందక్కడ పూజా పునస్కారములు విరివిగా జరుగుచుండును. (ప్రజలు స్వామివారి మహిమను గూర్చి విచి(త్రములైన కథలనెన్నింటినో చెప్పుకొను చుందురు. కపివీరస్వామికి గుంటి యాంజనేయులనియు, టపాలాంజనేయులనియు నామాంతరములు గలవు. ఒకానొక కాలమున మరున్నందనుడు భక్తులకు లేఖావాహకుడుగా నుండి మహోపకారములు చేయు చుండువాడట. భక్తులుత్తరములు (వ్రాసి శ్రీ వారి పాదముల వద్దనుంచి వచ్చిన తెల్లవారులోపల (ప్రత్యుత్తరములు వచ్చుచుండెడివట. నేడట్టి మహత్కార్యములు జరుగుటగాని జరుగగా చూచిన వారుగానిలేరు. కాని స్వామికైంకర్యము నంద(ప్రమత్తుడై నిరంతరము గొలుచుచుండు వామనాచార్యుల వారిని గదలించినచో, పవన నందనుని (ప్రభావమును పద్య గద్య రూపములతో వర్ణించి (ప్రజలకు పంచిపెట్టు చుండును. భక్తిలోపము చేతనే యట్టి (ప్రమాదము వాటిల్లిన దనియు, కలికాల భక్తులు కలుషాత్ములనియు, నిదర్శనము చూడగోరువారు ఖర్చులు భరించ గలిగినచో వాయునందన వైదగ్ధ్యమును చూపింప గలననియు, అసలు మాతం(డ్రిగారి హయాములో నాంజనేయులవారనుదినము నిష్టాగోష్ఠి సలిపి సెలవు పుచ్చుకొని వెళ్లుచుండు వారనియు, మా పెద్దన్న గారు పుట్టినపుడు జబ్బుచేయగా స్వామివారే స్వయముగా (ద్రోణాద్రి కేగి సంజీవి దెచ్చి వైద్యముచేసి (బ్రతికించి నాడనియు, నిన్ని మాటలేల నాచిన్న తనములో శ్రీవారొకానొక సందర్భములో మా తం(డ్రిగారికి సిద్ధాంత కౌముదిలో నొక సందేశము కలుగగా శత (ప్రమాణములు చూపి సందేహ నివృత్తిచేయుచుండుట నేను స్వయముగా చూచితిననియు నెన్నియో కథ లేకరువుపెట్టును. కాళ్ళులేని కథల మాట లెట్లున్నను వి(గ్రహమును గండశిల మీద వీరత్వ ముట్టివడుచున్నట్లు మలిచిన శిల్పిమటుకు పూజార్హుడు. "నగము సగంబు(గుంగ కపినాథుడు నింగికిదాటెటివ్వనన్" అని మొల్ల వర్ణించినట్లు రామకార్యార్థమై సము(ద్ర లంఘనము కుద్యుక్తు డగుచున్న యొక కపిరాజు స్మృతి పథమున గోచరించినట్లుండును. వారు శనివారము లయం దాంజనేయ స్వామివారి నాపాదమస్తక మూర్ధ్వ పుం(డ్రములతో నలంకరించి, వారునలంక రించుకొని, పూజకు సిద్ధముగా స్వామివారి చరణ సన్నిధి నాసీనులయి యుండ, హఠాత్తుగా జూచిన వారు స్వామివా రెవరో ఆచార్యులవా రెవరో తేల్చుకొనుటకు రవంత తికమక పడవలసి వచ్చును. శరీరచ్ఛాయల యందును, నామ ధారణము నందును పోలికము నందును,

సౌందర్యము నందును, ఆచార్యులవారు స్వామివారికి తగిన యుజ్జీ యగుటచేతనే యిట్టిచిక్కు తటస్థించు చుండును. రండు దయచేయుడు స్వామివారు ప్రసన్నులై యున్నవారని భక్తుల నాచార్యుల వారాహ్వానించుట చేతను, లాంగూల లోపము చేతను అట్టి సంశయ మెక్కువ కాలము నిలుచుట కవకాశ ముండదు.

వామనాచార్యులవారు గీర్వాణ భాషార్ణవమునకు కుంభసంభవునివంటి వారని యూరివా రనుకొనుచుందురు. కాని విద్వాంసులు సమ్మతింపరనువదంతికూడ కలదు. అత డెప్పుడు పురాణము చెప్పినను ఎక్కడ ప్రమాణశ్లోకము చదివినను వాల్మీకి రామాయణములోని సుందరకాండము నతిక్రమించని కారణముననను, సమాసములకు విగ్రహము చెప్పునపుడు సంధులను విడదీయుటలో కొన్ని సందులు గోచరించుట చేతను, ఒక్కొక్క మారు చదివిన శ్లోకమునకు చదవని శ్లోకములోని యర్థము నుగ్గడించుట చేతను, ఉచ్చారణ దోషములు తరచు గోచరించు చుండుట చేతను, అన్వయము చెప్పునప్పుడు "ముక్కశ్చముక్కః" యను సిద్ధాంతముననుసరించుట చేతను విద్వల్లోక మాచార్యులవారి పాండిత్య ప్రకర్ష ననుమానించుట కవకాశము కలిగినదని కొందరందురు. ఆచార్యులవారి కాంధ్రభాషా పరిచయ మేమాత్రమున్నదో తెలిసికోదలచి యొకానొక పండితుడు భారతములోని, "అంగదనాథు జంపిన వృకావళి" యను పద్యమునకర్థము సెలవీయుండని మనవిచేయగా వారు అంగదనాథుడు భారత కథలో లేడు, అంగనాథుడు కర్ణుడున్నాడు, ఇందలి దకారమచ్చు పొరపాటని యదలించుటచేత వారి యుభయభాషా పాండిత్య మూహించుట కవకాశము కలిగెనని ప్రజలాడుచుందురు. ఏది యెట్లున్నను వామనాచార్యులవారు భక్తి ప్రపత్తులయం దగ్రగణ్యులై సమస్త లోపములను పూరించుకొని కుక్షిపూరణమునకు కొదువ లేనన్ని కొబ్బెర కాయలను శనివారముల నాడు సేకరించి యిల్లు జేర్చుకొను చుందురు.

పర్వదినముల యందు ధనిసెట్టి గారి యింట పురాణము చెప్పుట కాచార్యులవారు చిరకాలము క్రిందటనే నియమితులయిరి. పురాణ కాలక్షేప కాలమున కథ యేమార్గమున నడుచుచున్నను ఆచార్యులవారంకెకుదెచ్చుకొని అనితల్లిగారి కన్వయించి స్తోత్రపాఠము చేయక విడుచువారు కారు. సౌందర్య సౌశీల్యముల యందు దయాపరత్వము నందు పాతివ్రత్యము నందనితల్లిని వనితామ తల్లియైన సీతాదేవిగా, ధనిసెట్టిని రామునిగా సమర్థించి కథను సాగించు చుందురు. ఇంగితజ్ఞయైనయనితల్లియు ఆచార్యులవారి ఋణము నుంచుకొనక రహస్యముగనో, బహిరంగముగనో కొంత ముట్టజెప్పకుండ నూరకుండునది గాదు.

ఆచార్యులవారియం దనితల్లికి భక్తిభావము మెండు. అనితల్లియే కాదు. అనితల్లి కొడుకులును నాచార్య దర్శనమున చంద్రు పొడుపునకు సముద్రమువలె నుప్పొంగిపోయి వినయ వినమిత శరీరులై నమస్కరింతురు. ధనిసెట్టి కాచార్యులవారి యందు భక్తిగాని

ఆచార్యులవారు ధనిసెట్టిచే భక్తిమద్యమును ద్రావించి తైతక్కలాడించి వశీకరించుట కనేక పర్యాయములు ప్రయత్నించి విఫలుడయ్యెను. ధనిసెట్టి యెదుటి వారి మనస్సును నొప్పించుటకు గాని అట్లు ప్రవర్తించుటకు గాని ప్రయత్నించు స్వభావము కలవాడు కాదు. చెప్పుటకన్న చేసిచూపుట వేయి పురాణములకు సాటియను విశ్వాసము కలవాడు. కావున నాచార్యుల వారితో ప్రసంగించు తరుణములయందు "గుడిలోని దీపమునకన్న గుణదీప ముత్తమ మైనదండీ" యని మృదువుగా బలికి సాగనంపుచుండును. ఆచార్యులవారందలి యంతరార్థమును గ్రహించక చిత్తము, చిత్తము. అదే అదే! ఆ దీపమే స్వామివారు మనకు ప్రసాదించునది యేతద్దీపారోపణము బ్రాహ్మణులచే కలుగవలె. ఆ బ్రాహ్మణులలో నుత్తములు, వైఖానసులు, అని సెలవు పుచ్చుకొను చుండును. ధనిసెట్టి యతని స్వార్థమునకు లోలోన నవ్వుకొనుచుండును.

ఒకనాడాచార్యులవారింట దొంగలుపడి తాతముత్తాతల కాలమునుండి ఆర్జించిన వెండి బంగారు నగలును, నాణ్యములను దోచుకొని పోయిరి. అందాచార్యులవారు ప్రాణప్రదముగా బంగారముతో చేయించి పూజించుకొను చున్న సీతారామ విగ్రహములను ఆంజనేయ విగ్రహము నెత్తుకొనిపోయిరి. పాప మాచార్యులవారు నెత్తినోరు బాదుకొనుచు ధనిసెట్టి వద్దకు పరుగెత్తు కొనుచు వచ్చి గోడుగోడున విలపించి సంగతి వివరించిరి. ఊరివారెంతయు విచారించి, చౌర్యము కన్నమదాసునదని నిర్ణయించిరి. ధనిసెట్టి వామనాచార్యులవారికి కలిగిన యన్యాయమునకు వగచి తోచిన సాహాయ్యము చేసెదనని యోదార్చి పంపివైచెను. అనితల్లి గురువులకు జరిగిన మహావిపత్తు నాలించి మిక్కిలి చింతించి, విగ్రహములను చేయించి యిచ్చెదనని భూసురునకు వాగ్దానము చేసెను. అనితల్లి వాగ్దానమును విని అయ్యవార్లంగారా నందించి పోయిన విగ్రహముల విలువ పది పండ్రెండు తులములకు మించకున్నను, నాలుగయిదు రెట్ల దనముగా బంగారము నిల్లుజేర్చు కొనవచ్చునని అందుల కనుకూలముగా ననితల్లి దర్శనముచేసికొన్నప్పు డెల్లను, "తల్లీ! స్వామివారి నేత్రములకు నీలములు చెక్కించితిని. వాలమునకు మేలిమి బంగారమెంత బెట్టించితినో జ్ఞప్తిలేదు. శాశ్వతముగా నుండవలెనని నాభార్య యొడ్డాణమును కరగించి పోతబోయించితిని, మజూరి మూడు వందలయినది. డబ్బుపోయిన పోయినదిగాని ఆ పాపిష్టి ముండ కొడుకుల చేతులలో బడి, తల్లి సీతాదేవి యెంత విలపించెనో," యని రాని దుఃఖము నభినయించు చుండును. అనితల్లి "ఆచార్యులవారూ! దుఃఖింపకుడు, నేనుమావారితో జెప్పి యొప్పించి మీచింత మాన్పింతును. సీతారాములనే కాదు. భరత శత్రుఘ్నులను గూడ చేయించి యిచ్చెదను. మావారు సమ్మతింపవలెగాని మీయిల్లు బంగారముతో గట్టింపనా" యని యోదార్చిపంపుచుండును.

నాడు మొదలు కన్నముని భయము కలువరింతలు కల్పింపగా వినుకొండ పురవాసు

నట్టుడికి నట్లుడికి పోసాగినది. కన్నమదాసు కడముట్టిన పోలేరమ్మకు నూరు పొట్టేళ్ళను, బలియిత్తు మని మ్రొక్కుకొను వారును, కోటప్పకు ప్రభలు కట్టెదమను వారును, కనక దుర్గమ్మకు కనక ప్రాకారము గట్టింతు మను వారునై ప్రజలు సమస్త దేవతల నూరించు చుండిరి. "ఇట్టి దుష్ట శిక్షణమునకు క్షుద్రదేవతలకు శక్తి చాలదు. ముంచినను తేల్చినను, వీర హనుమంతుడొక్కడే సమర్థుడని ఆచార్యులవా రూరివారికి నచ్చజెప్పి, ఆకుపూజలు చేయించి కొంత ధనమార్జించెను.

చిన్నవా డుదయమున లేచి పశువుల దోలుకొని సమీపారణ్యమునకు బోయి పగలెల్ల గడిపి, సాయంకాలముల యం దిల్లుజేరు చుండువాడు. కలుష కర్మరుడగు కన్నమదాసుని కఱకు విగ్రహము చిన్నవాని చిత్తమును బాయక రోషావేశ పరవశునిగా జేయుచుండెను. సహజ సాహస మూర్తియైన చిన్నవాడు తన చెలిమికాండ్రతో నాటపాటలయందు పాల్గొనక, ఆత్మవంశీయుల కభిమాన విద్యయైన యస్త్రవిద్య నభ్యసించు చుండెను. అడవియందొక లక్ష్యమునుంచుకొని ఉండ వింటితో భేదించుచు ధనుస్సులను సిద్ధము జేసికొనుచు, అల్లెత్రాళ్ళను బిగించుకొనుచు, కాలముగడుపు చుండెను. అచిరకాలములో చిన్నవాడెంత దూరము నందున్న లక్ష్యము నైనను భేదించు సమర్థుడయ్యెను. ఒకనాడొక చిరుతపులి గోవునుబట్ట నుంకించు చుండగా జూచి యుండవింటిలో బలమైన రాయి సంధించి పులి లలాటమును గురిచూచి విడిచెను. అదిసూటిగాసోకి ఫాలమును వ్రక్కలించుటచేత నా చిఱుత ధరణింగూలి విలవిల దన్నుకొని తెప్పరిలి లేచి రోజుచు బోయి సమీపమునన్న వెదురుపొదలో దూరెను. చిన్నవాడు నిర్భయముగా నటకుంజని తాకుసోకి కుపితమైయున్న యమ్మచ్చల మెకమును రెచ్చగొట్టి లేపి పైకి లంఘింపక ముందే యుండవింటిని వదలి ధనుస్సు నెక్కిడి బొట్టెకట్టెను ప్రయోగించెను. ఆదెబ్బతో నది గిరగిర దిరిగి పడిచచ్చెను. అతని సాహసకార్యమును కనులారజూచు చున్న సహచరు లతని వేనోళ్లగొనియాడి బాలుని ప్రతిభను పురజనుల కెఱింగించిరి; ధనిసెట్టివిని సంతసించెను. నాటినుండి చిన్నవాడన్న నూరివారు ముచ్చట పడుచుండిరి. చుక్కమ్మ అభిమానుడైన చిన్నవానిని ఆనాడింట తయారుచేసిన నేతి పిండివంటలను దండగ్రుచ్చి యలంకరించి మందహాసము జేసెను. అనితల్లి చూచి మహాపరాధమని మందలించి చుక్కమ్మ తలమీద నాలుగు మొట్టికాయలువైచి చిన్న వానిని నోటికివచ్చినట్లు దూషించెను. చిన్నవాడు చిన్న బుచ్చుకొని పశుశాలలోనికి బరుగెత్తెను.

చిన్నవాడు పేరుకు చిన్నవాడు కాని బుద్ధియందు బృహస్పతి యంతవాడు. అతడు నిరక్షరాస్యుడయ్యును అక్షరాస్యులకు గూడ లేని మేధాశక్తి మిక్కుటముగా నుండెను. ధనిసెట్టి యింటి ముసద్దీల పరిచయమున నతడెంతటి లెక్కనైనను నిముషమున చెప్పగలిగి యుండెను. వినికిడివలన నతడు భారతకథ నంతయు నాకళించుకొనెను. అందతని కనుకూలించి యాకర్షించిన కథ యేకలవ్యునిది, కర్ణునిది. ఏకలవ్య కర్ణుల వంటి యెక్కటి వీరత్వము

వినిపించుచుండును. ఇప్పుడు చిన్నవాని ధనుస్సంపద కర్ణుని మించిపోయినది. ఏకలవ్యునితో యెకసక్కెమాడు చున్నది. చిన్నవాడొకనాడు పశుశాలలో బరుండి చిన్ననాటి మాతృమరణగాథను తలంచుకొని కంటికి కడవె డేడ్చెను. తల్లి మీద మరలతనిలో కలకవేసెను. ఎవరు తల్లిని చూపగలరు? తల్లిరూపము తిరిపెమెత్తిన దొరకునా? పాపము చిన్నవాడా రాత్రి జాగరణము చేసెను. తల్లి మరణించిన ప్రదేశము చూడవలెనని అభిలాష రేకెత్తి ఒకనాడతడు ధనిసెట్టి వద్ద సెలవుపుచ్చుకొని కనుమకుబోయి కాఱుమేఘములవలె కదలి వచ్చు దుఃఖమును మ్రింగికొనుచు పూర్వము తనతల్లిని వధించిన ప్రదేశమున గూర్చుండి గుండె నిబ్బరించు కొని పరిసరములను పరికించు చుండెను. అందొక తంగేడిచెట్టు మొదట చిలుముపట్టి పడియున్న ఖడ్గమొకటి యతనికి గోచరించెను. అతడది తీసికొని పరిశీలించి చూచెను. కన్నముడనుంగుమాత నాహరించి హయారోహణము, చేయునప్పుడా జమదండ అతని బొడ్డునుండి జారిపడుట జ్ఞాపకము నకు వచ్చెను. పేదకు పెన్నిధివలె ఆ కరవాల మతని యంతరాత్మ నూరడించెను. చిన్నవాడు సాయంకాలమున కిల్లుజేరి పొరుగున నున్నయొక కంసాలి కాకత్తినిచ్చి "దీనితో ఒక చక్కని బాణమును జేసినాకిచ్చిన నీయావులను చక్కగా మేపుకొని వత్తును. అనుగ్రహింపు" మని బ్రతిమాలెను. ఆసొన్నారి చిన్నవానిపై నత్యంతాదరాభిమానములు కలవాడగుట వల్లెయని పక్షము దినములలో బ్రహ్మాస్త్రమును ధిక్కరించు బాణమును నిర్మించి, చిన్నవానికిచ్చెను. చిన్నవాడు మహా ప్రసాదమని స్వీకరించి తీసికొనిపోయి పశువుల పాకలో నొకరహస్య స్థలమున దాచుకొనెను.

వినుకొండవీట పశ్చిమముగా జాండ్రపేట గలదు. అందలి సాలెజాండ్రలు పుట్టుపేదలు. జలమహాత్మ్యమో స్థలమహాత్మ్యమో ఆగడ్డనబుట్టిన స్త్రీపురుషులుముప్పదేండ్లకే ముసలివార య్యెదరు. చేనేత వస్త్రపరిశ్రమ, చేపలవేటతక్క వారి కన్యమయిన వృత్తిలేదు. వయసు మీరుకొలది వారి శరీరములు వంచుకొని పోవుటచేత యెక్కుబెట్టిన విండ్లవలె వికృతములై పోవుచుండును. క్షుద్ర దేవతారాధనము నందు వారిభక్తి మాన్పరానిది. తినదిండియు కట్టబట్టయు లేకున్నను వారు సత్తికొలుపులకు వందలు వేలు వ్యయము చేయుదురు. హైందవులు సమష్టిగా గొలుచుకొనుటకు భద్ర దేవతలు పలువురున్నను కుల దేవతలు కొందరు భూతములవలె పట్టి వేధించువా రింటింటను వెలయుచుందురు. చౌడమ్మ వీరి కుల దేవత. సంవత్సరమున కొకనాడు చౌడమ్మను రక్తస్నానము చేయించిన సకలైశ్వర్యములిచ్చి ఆశీర్వదించునని వారి విశ్వాసము. చిరకాల పూజాఫలితముగా చౌడమ్మ సంప్రాప్తింప జేసిన దుర్భర దారిద్ర్య భాగ్యముదక్క వారికి లభించిన భాగ్యాంతరము లేదు. సహజదుర్భల శరీరములతో సకల దారిద్ర్యముతో కుంచిత శరీరములతో దయనీయముగా తడపలవలె, దిరుగాడు చౌడమ్మ భక్తు లుత్సవమునాడు కరవాలములను దాల్చి వీరావేశముతో వీరంగము వేయునపుడు చూచువారికి వినోదముగా నుండును. బ్రహ్మాండములయిన భూచక్ర గొడుగులతో వాహనారూఢయై, వెతుటి కూడువెగ జల్లుచు పిచికేకలతో భక్తులు కొలుచుచుండ

చౌడమ్మ యూరేగుచు నడుగున కొకవేట నాహుతిగొనుచు వచ్చు చుండ మానవత్వము మంటగలిసె నాయనిపించును. గొఱ్ఱెలు, మేకలు, కోడిపుంజులు గుట్టలు గుట్టలుగా నరికివేయబడు చుండును. మార్గమున కిరుపార్శ్వముల యందు రక్తసిక్తమైన యన్నపురాసులు హృదయ ద్రావముగా గోచరించు చుండును. భక్తవీరులు ఖడ్గధారులై తమ్ముతాము బొడుచుకొను చుందురు. ఎన్ని మారులు పొడుచుకొన్నను భక్తులకెట్టి విపత్తును సంభవింపదు గాని, నోరులేని జంతువులు మట్టుకు తునాతునకలై పోవుచుండును. ఈ జాతర కనులార జూచి నా వ్రాసిన పద్యము నిందుదహరించుట యప్రస్తుతము కాదనుకొందును.

తే.గీ. "ఆ శిలావిగ్రహంబున కాహుతియయి,
పోవుచున్నది నా పేదభోజనంబు,
నోరెరుంగని జీవజంతువుల తలలు,
పొరలుచున్నవి దానిమందిరమునెదుట"

ఇట్టి చౌడమ్మ కొలుపును ధనిసెట్టి యొకనాడు చూచుట తటస్థించినది. గొఱ్ఱెలను మింటికెత్తి పట్టుకొని గొంతు కరకరగోసి వెచ్చనెత్తురన్నమున గలిపి నాల్గుదిక్కులకు వెదజల్లు భీభత్స దృశ్య మతని హృదయమున నగ్ని పర్వత సహస్రములు బ్రద్దలు చేసెను. ఘోరము, ఘోరమని యతడఱచి కనులుమూసి కొనెను. నిసర్గ కరుణా సాంద్రుడగు ధనిసెట్టి రెండుమూడు కన్నీటి బిందువులను రాల్చి, "అన్నలారా! బలి నాపివేయుడు. ఆపివేయుడని కేక వైచెను. ధనిసెట్టి మాటనూరివారు పూదండవలె ధరింతురు, అతడన్ని జాతులవారియాదరణమునకు గుఱియైనవాడు, వధకింకనుకొన్ని జంతువులు మిగిలియున్నవి. మచ్చిక జేసి పెంచిన యజమాని సత్తికి బలియిచ్చుటకు కొనిపోవు చున్నాడనిగాని, చుట్ట పక్కములకు ప్రళయము సంభవించినదని గాని యెఱుగని దీన జంతువులు పసుపు గుంకుమల పూతతో పెండ్లికూతుళ్ళ వలె తలవంచుకొని స్వాములవెంట నడిచి వచ్చుచుండెను. ఆ దీన జంతువుల యమాయకత్వమును తలచికొని ధనిసెట్టి మిక్కిలి కరగిపోయెను. "అయ్యలారా! మీకు హృదయము లేకున్నను మీ దేవతకు హృదయములేదా? ఏపాప మెరుగని జంతువులను బలియిచ్చిన మీకు లభించునది పాపము గాని పుణ్యముగాదు. ఈ పూజా విధానములు నాదేశించిన వాడెవడు? రెండువేలేండ్ల వయస్సుగల యహింసా శంఖధ్వని మీకింకను శ్రవణ గోచరము గాకుండుట శోచనీయము. మీ కొక నమస్కారము. మీదేవతకు నే నాహుతి యయ్యెదను. నన్ను బలియిండు. ఆ చింబోతు కూన తనకు రానున్న విపత్తు నెఱుంగక గడ్డిపరకలకై అఱ్ఱు సాచుచున్నది. అదిగో, ఆ పొట్టేలికబంధము నుండి ప్రవహించు రక్తము బుద్ధదేవునితో మొరపెట్టుకొనుచున్నది. అన్నలారా! ఇది వెఱ్ఱిపూజ. వెడగుభక్తి, మీ చౌడమ్మయే కాదు. మా కనకమ్మయును కలుష కార్యములకు హర్షించదు, జాతరలు మీ పేదరికమున

నున్నతాశయముల నుద్భవింపజేసి దేశమాత విశ్వసభ్యతా స్థానము నలంకరించు శుభదినములు రాకపోవు. నా ప్రార్థనము నాలించి, పసుపు గుంకుమలతో, ఫలములతో, పుష్పములతో, పవిత్రచిత్తములతో, దేవతల నారాధింపుడ" ని కంఠమెత్తి యుపన్యసించెను. తుపాకి దెబ్బకు పిట్టలవలె కొలుపుకాండ్రు నిరుత్తరులై నిలిచిపోయిరి. కులపు పెద్దలు ధనిసెట్టికి నమస్కరించి, అయ్యా! ఇది పెద్దకాలము నుండి జరుగుచున్న ఆచారము. కాదని వారించినవా రెవ్వరును లేక యీ చీకటిలో చిందులాడు చున్నాము. మీ యాజ్ఞాను బద్ధులమై కొలుపు సమాప్తము చేయుదుమని పలికిరి. ధనిసెట్టి ముదితాత్ముడై జాండ్రపేట వాసుల కొఱకై యొక పాఠశాలను స్థాపింప, పదివేల రూపాయలు విరాళమును వాగ్దానము చేసెను.

ఊరిలో గుసగుసలు ప్రారంభమైనవి. ధనిసెట్టి ప్రవాహమున కెదురీదుచున్నాడు. పెద్దలనాటి ధర్మములను ధనమిచ్చి ధరణిపాలు చేయుచున్నాడు. ఈ యంతరాయమును చౌడమ్మ సహించదు. ఏదో అనర్థము తెచ్చిపెట్టునని పలువురు పరిపరి విధముల ముచ్చటించుకొన సాగిరి. బొట్టుబెట్టినట్టా మరుచటి దినముననే అజీర్ణ వ్యాధిచేత నిరువురు ముసలమ్మలు వాంతులు చేసికొని మరణించిరి. వారి యనుమానమునకా ఘటన యుపబలమైనది. ధనిసెట్టి గర్హణీయుడయ్యెను. అది సాకుగా జేసికొని ఆచార్యులవారు ధనిసెట్టి ధర్మదృష్టి యుపద్రవ కరమైనదని యుపన్యాసములు సాగింప జొచ్చెను. ధనిసెట్టి ధనమును పలుకుబడిని చూచి యోర్వలేని వైశ్యు లాచార్యులవారితో తాళములు వేయసాగిరి. వామ నాచార్యుల వారనితల్లి దర్శనమును చేసికొని "ధనిసెట్టి గారు జాండ్రజాతి కిచ్చిన విరాళమును గూర్చి ప్రస్తావించుచు శూద్రవెధవలకు పదివేలు, పదివేలు, యజ్ఞము చేయించ వచ్చునే. పుణ్యమా పురుషార్థమా. హనుమంతున కపరంజి కిరీటమును చేయించిన నెంతకీర్తి వచ్చి యుండెడిది"ని పలికెను. అనితల్లి ఆచార్యులవారితో నేకీభవించును. "అయ్యవారులుంగారూ! మావారు! వట్టి పిచ్చివారండీ! ఆవేశంతో యేదో అనుచుందురు. నా అభిప్రాయం తీసి కొనక వా రేపని జేయరు. పదివేలుకాదు. పదికాసులు కూడనీయనీయను. విరాళముమాట నటునుండ నిండు, చౌడమ్మ యుత్సవాన్ని ఆపు చేయించిరట. ఎంత అపరాధము. అమ్మయ్యో! చౌడమ్మయన్న సాక్షాచ్ఛాంకరీ స్వరూపిణి. ఆ తల్లి కెక్కడ కోపమువచ్చినదో, ఏ యనర్థము వాటిల్లునో యని భయపడుచున్నాను. మా కులస్థులంతా మా కెన్నడీ కష్టము రావలెనా, యెన్నడు వ్రేలుపెట్టిచూపి పరిహసించెదమాయని వేయిగన్నులతో జూచుచున్నారు." అని రుద్ధ కంఠముతో బలుకుచున్న యనితల్లినిజూచి ఆచార్యులవారు ఆ భయము మీకేమియు నవసరము లేదు. ఆంజనేయ స్తవము చేయువారి వంకకన్నెత్తిచూచు నధికారము చౌడమ్మలకు గివుడమ్మలకు నుండదు. స్వామివారు భక్తవిధేయుడమ్మా! దండకము ధనిసెట్టిగారిచే పారాయణము చేయించుడని ఒక పుస్తకమునిచ్చి వామనాచార్యులవారు వెడలిపోయిరి.

ఆ మరునాడుదయమున ధనిసెట్టి యింటి వసారాలో విశ్రమించి జరిగిన

యుత్సవమును, ప్రజల మౌఢ్యమును దలపోయుచుండెను. అనితల్లియు నల్లన జేరవచ్చి "తంతు కారులకు వాగ్దానము చేసిన భూరి విరాళము లూరిలో ననేకుల కసూయా కారణమైనది. ఆ ధనమును మరొక పుణ్యకార్యమున కుపయోగించుట సమంజసము పాప మాచార్యుల వారు యపహృత సర్వస్వుడై యల్లాడు చున్నారు. విగ్రహములకు కలవరించు చున్నారు. సాలె జాంద్రలను చదివించి చట్టుబండలను చేయకున్న సద్బ్రాహ్మణులను సత్కరించరాదా? "చదువుకొన్న శూద్రుడు పొడిచేదున్నవంటి వాడ"ట మొన్న ఆచార్యులవా రేదోశ్లోకం కూడా చదివినారు. చెంచు ముండకొడుకును చేరదీసి సదాచారాన్ని చదనుజేసి కులమును భ్రష్టు చేయుచున్నాడనిసాటి సాహుకారు లిప్పటికే తిట్టిపోయుచున్నారు. కులము మహాసముద్రముకదా పెద్దమ్మాయి పెండ్లీడుకెదిగి యున్నది. తగిన సంబంధము వెదకి యొకింటిదానిని చేయుదమని తలపోయరు. మీరేవ్యవహారమును పట్టించుకొనరు. ఆడుదానను నేనెక్కడకు పోగలను. ఏమి చేయగలను, మీ వాలకమునాకేమి బాగుగలేదు. నాకుపుణ్యతీర్థాటనము చేయవలెనని గంపెడాశయున్నది. పిల్లల పెండ్లిళ్లు ముగించుకొని ప్రయాణసన్నాహములు చేసికొనవలెనని యున్నది ఎంత ధనమున్ననేమి? ఎంత యైశ్వర్య మున్ననేమి? కాశీవిశ్వనాథుని గుడిగంట మ్రోయింపని జన్మజన్మగాదని పెద్దలు చెప్పెదరు. కన్యకామ్మ వారు నా కలలో పలుమారు కనపడి యేమోయుపదేశమిచ్చి పోవుచున్నది. జ్ఞాపకమునకు రావటములేదు. తామికనైన దైవభక్తి మార్గము నవలంబింపుడు. ఈతనువులు శాశ్వతములా! ఈధనమంతయు మూపున గట్టుకొని పోయెదమా"యని! యుపన్యాసము నారంభించెను. ధనిసెట్టి నిరుత్తరుడై యాలకించి చివాలున లేచి శయ్యాగృహమునకు బోయి తలుపులుబంధించుకొని శయనించెను. అనితల్లి రుసరుస లాడుచు నింట ప్రవేశించెను. చిన్నవాడు అమ్మా! నాకు వేళయైనది. చలిది యన్నము బెట్టిన మందవెంట బోయెదనని కేకవైచెను. "చల్ది లేదు, గిల్దిలేదు పో! ఎవడవురా! నీవు–మా కొంపలో దాపురించినావు చెంచువెధవా! మంచాలు ముట్టుకోకు ఇప్పటికే మా మడి మంటగలిసినదని" మండిపడెను. పై నుండి వినుచున్న ధనిసెట్టి చిన్నవాని నిరసనను సహించలేక, చరచర క్రిందికి దిగివచ్చి, అనితల్లి సిగబట్టుకొని యీడ్చి పెళ్ళు పెళ్ళున నాల్గు చరపులు చరచెను. అనితల్లి గోడుగోడున నేడ్చుచు "ఓరి చెంచుగాడిద కొడుకా! నీమూలమున నా కొంప కూలిందిరా! నీ పాడెగట్టా," యని దూషింప నారంభించెను. "ఆ దుర్మార్గముననే నీకు శాస్తి జరిగినది. చిన్నవానిని నొక్క మాటయన్న నే నోర్చుకొనను. వాడు దిక్కులేనివాడు. ఆశ్రితుడు, వేషాంతరమున మనకులభించిన తిన్నడు, శివుడు. వానికున్న యుత్తమ గుణము నీ కొడుకులకున్న వంశము బాగుపడును. నోరు మూయుమని ధనిసెట్టి హుంకరించుచుండెను. చిన్నవాడు, "స్వామీ! తల్లిగారన్నంత మాత్రమున నాకు పోయిన దేమి? ఆ యమ్మ అనదగును, నే నవి పడగలను. తాము తొందరపడ్డారు. ఆమె చేతిచలువయే నన్నింతవర కాదరించినది. మీరు నాకు తలిదండ్రులు, నేను మీకు బిడ్డన"ని చిన్నవాడు తరలిపోయెను. చుక్కమ్మ మనసు

గాక నిమ్న జాతీయుల కొక శరణాలయమును కట్టించి యిచ్చుటకు నిశ్చయించుకొని యూర దండోరా వేయించెను.

ఇంకేమున్నది. ఆచార్యుల వారి యాశలు అనితల్లి యాశలతో నడుగుబట్టినవి. ధనిసెట్టి దాన ధర్మములక్కాలమున నొక్క యవనీసురులకే గాక అగ్రజాతుల వారికందరకు నాగ్రహ కారణము లయ్యెను. అదే యదననుకొని వామనాచార్యుల వారు బహిరంగముగా ధనిసెట్టిని విమర్శించుచు వైశ్యుల యసూయా జ్వాలకు గుగ్గిలపు నూనెబోసి పోవుచుండెను. వైశ్యులెల్ల రేకమై సభలు, సమావేశములు జరిపి, ధనిసెట్టి కుటుంబముపై సమ్మెజేసి, వివాహాది శుభకార్యములకు పిలుచుట మానివేసిరి. ఆపదలయందు ధీరుల హృదయములు వజ్రములవలె నధిక కార్కశ్యము వహించుట సహజము గదా? ధనిసెట్టి నిమ్నజా త్యుద్ధరణము నకై కంకణము గట్టుకొని వారి పల్లియకు బోయి సదుపదేశములు చేయుచు, వారి నిత్య జీవితమునకు వలయు సదుపాయములు చేయవలెనని బావులు, చెరువులు త్రవ్వించుచు నింటి కాహ్వానించుచు, పెట్టుచు, పోయుచు, పల్నాటి బ్రహ్మనాయని వలె పంచమీయుల బహుళ భక్తితత్పరతకు బాత్రుడయ్యెను. అనితల్లి ధనిసెట్టి ననేక విధముల వేధింపసాగెను. పెద్దకుమారు డాస్తిపాస్తులను భాగించుకొని గ్రామాంతరమునకు బోయి కాపురము పెట్టెను. ధనిసెట్టి ధర్మ తత్పరతకు చుక్కమ్మ సంతసించుచున్నను ఊరి వారి నిందకు గురియయ్యెనే యని యుమ్మలించుచుండెను.

వినుకొండ వర్తకులలో మెట్టవేదాంతమున మేటి యనిపించుకొని గురుపాదము నాశ్రయించిన గురుమూర్తి సెట్టి యొకడు గలడు. ఊరి వెలుపలనున్న యొకానొక మార్గమున జేరి దండ కమండలములను దాల్చి, కాషాయవస్త్ర కషాయచ్ఛాయలు కన్నులలో గోచరింప నిరంతరము పత్రిని సేవించు పరమసన్యాసి మాత్రము కాడు. కొంప, గోడి, పెద్ద సంసారము, వ్యాపారము, వ్యవహారదక్షత గలిగి గార్హస్థ్య ధర్మము నిర్వహించు చుండును. సర్వాశ్రమములలో గృహస్థాశ్రమ ముత్తమ మైనదిగదా? వర్తక శిఖామణియై, వర్ణాశ్రమ ధర్మముల నవలంబించు ప్రతివరేణ్యుడైనను, మోహరము పండుగల యందును, వనభోజనావసరములయందును, సురాపాన సమాజముల యందును, సర్వమత సర్వవర్ణ సామరస్యమును నిష్ఠగా నవలంబించు చుండునందురు. మెడలోని రుద్రాక్షపేరులు శివభక్తు డేమోయను సంశయమున కెడమిచ్చుచున్నను మొగమున నున్న త్రిపుండ్రములు కాదు కాదు విష్ణుభక్తుడని సందేహనివృత్తి చేయుచుండును. గురుమూర్తిగారి వేదాంత పాండిత్య మనుపమాన మైనది. తన కనుకూలమైన అన్ని దిక్కులకు నది రబ్బరువలె సాగగలదు. చిన్నతనమున వీధి బడిలో చదివిన పెద్ద బాలశిక్ష తక్క సెట్టిగా రన్యగ్రంథములు చూడకున్నను వేదములకు, నుపనిషత్తులకు భాష్యకారుల వలె, నన్యసాధ్యములైన చిక్కు సమస్యలను వారు చిటుకలో విడగొట్టి చెప్పుచుండును. గురుమూర్తి గారు గుండ్రగా గుమ్మటమువలె నుండు కురుమట్టపు బొజ్జతో నిగనిగలాడు బట్టతలతో

యుదయ సాయంకాలముల యందు దర్శనమిచ్చు చుందురు. వ్యాపారమున దండిగా లాభములు వచ్చిననాడు మూర్తి సెట్టిగా రేకనాదమును వహించి వీధి వితర్దికపై నాసీనులై కన్ను లఱమోడ్చి, భక్తి పారవశ్యమున నొడలు మఱచి మీటుచు “మంటి ఘటమురా మన తనువు మానరా మదము మానరా! యను” నెడ్ల రామదాసుగారి గీతమున వ్యక్త ఘుర్ఘుర ధ్వనితో బాడుచు లేత వితంతువుల కందలి యంతరార్థము నన్వయించి చెప్పుచు పరమ భాగవతోత్తము లనిపించు కొనుచుందురు. గురుమూర్తిగారే గురువు పాదము నాశ్రయించిరో యెరిగిన వారెవ్వరును లేరు. కాని శిష్యురాండ్రలో నొకరిద్దరు మట్టుకు గురుమూర్తి గారి పాదము బట్టి భవబంధముల బాసితి మని సంతసించు చుందురు. ఆ భక్త శిఖామణి ఒక తిరునాళ్ళ పుణ్యకాలమున నన్నదానము చేయవలెనని సంకల్పించుకొని చందాలు వసూలు చేయుచు ధనిసెట్టి దర్శనము చేసికొని సంగతి వివరించెను. ధనిసెట్టి దమ్మిడీ విరాళము నీయక పోవుటయేగాక తల వాయునట్లు చీవాట్లు పెట్టి ఇట్టి కొంగ భక్తి ప్రపంచమున కనర్థదాయక మనియు, మీ వేదాంతము నకు తలయు తోకయు నుండదనియు, ప్రజా సేవకన్న పరమార్థము లేదనియు, మీ తారకములు, మీతంత్రములు భావదాస్య బంధకము లనియు, నానా విధముల నఱచి సాగనంపెను. గురుమూర్తి సెట్టిగారు, మానరా మదము మానరా! యను తత్వబోధకు లైనను వారి కార్యమున కంతరాయము గల్గుటచేత నాగ్రహించి, మదము మానక ధనిసెట్టిగారి మద మణచుటకు నిశ్చయించుకొని తగిన తరుణమునకై వేచియుండిరి.

గురుమూర్తి సెట్టిగారి బాల్యస్నేహితులయిన యిద్దరు మహమ్మదీయులు కటికి దారిద్ర్యమున క్రాగి క్రాగి తుదకు దొంగతనములకు దిగి సిద్ధహస్తులై కన్నమదాసుని గుంపులో జేరుకొనిరి. పీర్లపండుగ వినుకొండలో పేరుగా జరుగును. సెట్టిగారి మిత్రులగు తత్తురుష్కులు విధిగా మొహరమునకు వచ్చి జూచి పోవుచుందురు. ఆ తరుణములయందు గురుమూర్తిగారు వారిని మద్యశాలలయందు కలసి యోగక్షేమముల నారసి వచ్చుచుందురు. సెట్టిగారు వారి ద్వారా కన్నమదాసునకు కబురుచేసి దోపిడికి తగినగుట్టుమట్టుల నెఱింగించెను. కన్నమదాసు కన్నువేసిన సంపన్నుల జాబితాలో ధనిశెట్టి ప్రథమస్థానము నలంకరించియుండుట కతన నీ వృత్తాంతమును విని అపరిమితానందము ననుభవించి సపరివారుడై ధనిసెట్టి యింటిదోపిడికి పయనమై అప్పటికి కార్యంపూడి తిరునాళ్ళు కలసివచ్చుటచేత నా ప్రయత్నము విరమించి పల్నాటికి ప్రయాణమై పోయెను.

3

వినుకొండకు పదిక్రోశముల దూరమున నొకబ్రాహ్మణాగ్రహారము గలదు. ఆయూర వైదిక నియోగి కక్షలు పక్షములు గట్టుకొని పచారి చేయుచుండును. వారి నాదర్శముగా పెట్టుకొని గాబోలు పంచములును మాల మాదిగలను రెండు తెగలై చీలి పరస్పరము పోరాడుచుందురు. ఆ యగ్రహారమున పెదిబొటను వైదిక బ్రాహ్మణుడు మృష్ట భోజనమున

పేరందినవాడు. సంతర్పణ మెక్కడ జరుగుచున్నను నిమిషమున వచ్చివాలును. రాబందు కన్నెంత తీక్ష్ణమైనదో సంతర్పణములయందీతని కన్నంత నిశితమైనది. కందిపప్పు నా హరించుటలో నతడందెవేసిన చేయి, పూటకు మూడుతవ్వల పప్పు నీతడనాయాసముగా నారగించును. అరిగించుకొనును. పప్పునకు దగిన పాయసము, పాయసమునకు దగిన యపూపములు, అన్నింటికిమించిన యన్నరాశి నత డమాంతముగా చప్పరించి వేయును. పెద్దిభొట్లవారు తన భోజన పరాక్రమమునరసి హర్షించి సత్కరించు సార్వభౌములు లేరుగదాయని నిట్టూర్పులు బుచ్చుచుండును.

ఒకనాడు మల్రాజు గుండారాయణిం గారాయగ్రహారమున మజలీచేసెను. నియోగి వైదిక పండితులు, కవులు, రాజదర్శనము చేసికొని స్వీయ పాండిత్యములచే రాజును మెప్పించి సత్కరింపబడుచుండిరి. పెద్దిభొట్లును రాజును సందర్శించి ఆశీర్వదించి, "పేదవాడను, తినగలవాడను, మహాకుటుంబీకుడను జీవనోపాధి చూపిన మీ పేరు చెప్పుకొందు" నని ప్రాధేయపడెను. రాజార్ద్రచిత్తుడగుట "ఆర్యా! మీరే శాస్త్రమున ప్రవీణులు. కవనము చెప్పగలరా! వేద మెంతవరకు చదివితిర"ని ప్రశ్నించెను. "ప్రభూ! నేను ఏశాస్త్రమును పఠించలేదు కవన మల్లజాలను; పాండిత్యములేదు; కబళ పాండిత్యమున ఘనత కెక్కితి"నని సవినయముగా విన్నవించుకొనెను. రాజు పకపకనవ్వి "కబళ పాండిత్యమా! చిత్రముగానున్నదే. ఏదీ! వివరింపుడని" యడిగెను. "నృపతీ! పూటకు మూడుదవ్వల కందిపప్పును, వీశెడు వంకాయలు, ఒక్క కూష్మాండము, అరవీశె నెయ్యి, రెండుమానికల అన్నమును భక్షించగల"నని చెప్పెను, రాజాశ్చర్యపడి "ఇది నిజమా? వేడుకకు బలుకుచున్నారా?" యని ప్రశ్నించెను. భూసురోత్తముడు కరములు జోడించి "లేదు ప్రభూ! తమ సమక్షమున నారగింతును పరీక్షింపుడ"ని చెప్పెను. మల్రాజొక మామిడితోటలో బ్రాహ్మణునకు వలయు సమస్త పదార్థముల నిప్పించి తానొక యాసనమున నాసీనుడై చూచుచుండెను. పెద్దిభొట్లు మహాప్రసాదమని స్నానము చేసి వంట చేసికొనుట కారంభించెను. మధ్యాహ్నమునకు వంట పూర్తియైనది. బ్రాహ్మణుడొక విశాలమైన విస్తరి సిద్ధము జేసికొని సెలవు పుచ్చుకొని భక్షణకారంభించెను. కమికడేసి కందిపప్పుముద్దలు బ్రాహ్మణునికంఠమున బడియాహుతియగుచుండెను. మల్రాజు గుండారాయనికి నోట మాటరాలేదు. మైమరచి "మర్ఝారే!" యని ప్రశంసింపసాగెను. అరగంటలో నన్నపురాశి మటుమాయముజేసి కుంభకర్ణుని వలె త్రేపుచులేచి రాజునకు నమస్కరించి, "దేవరవారు చిత్తగించితిరి. ఈ ఘటమెట్లు నిండవలె, ఏది మార్గమ" నిపృచ్ఛించెను. రాజాశ్చర్య ప్రపంచము నధిగమించుటకు రెండు గడియలు పట్టెను. పెద్దిభొట్లకు 'మహాభోక్త'యను బిరుద మనుగ్రహించి సారవంతమైన నూరెకరముల భూమిని దానవిక్రయాధికారములతో దానమిచ్చెను. దానికి 'కందిపప్పు మాన్య మ'ని నామధేయము. అతని వంశీయులిప్పటికి నే తద్భూమి ననుభవించుచున్నారు. భూదయితుడావాడు సత్కరించిన కవివరులు శతఘంటకవి సరస్వతి శాస్త్రులువారు.

పుడమితేడక్కవి సింహుని మధుర కవితా వైశారద్యమునకు ముదమంది వేయి నిష్కములు కాన్క చేసెను. "మల్రాజు మహీపాలుడుత్తమకవిపోషకు డేకాక యెవరెట్టి కళయందు నిష్ణాతులో పాత్రమెఱింగి దానమిచ్చు ధర్మవేత్త. పెద్దిభొట్ల భోజన పరాక్రమమును బహువిధముల కొనియాడి యఖండ భూదానమిచ్చి విశేష ఖ్యాతి నార్జించె"నను, వృత్తాంత మాంధ్రదేశమున నన్నికడలకు వ్యాపించెను. పాకశాస్త్ర నైపుణిగల పరిచారికులను, పరిచారికలను సహితము సార్వభౌముడు సత్కరించు చుండె ననుట కతడు కొండొక కుగ్రామమున మజిలీచేసి యొక బ్రాహ్మణి తయారొనరించిన యులవపప్పు కమ్మందనమున కుత్సుకమతియై యామెను బహూకరించినట్లు ప్రజలిప్పటికిని జెప్పుకొను చుండుట నిదర్శనము.

నాడు సన్మానితుడైన సరస్వతి శాస్త్రులవారు వైదిక శాఖకు జెందినవారగుట నియోగులకు తలగొట్టినట్లై రాజును పరిపరి విధముల దూషించుటయే గాక శాస్త్రులవారి నవమానింప వలయునని యొక మంగలివాని నలంకరించి గొప్పగరిటె యొసంగి అతనికి 'శతగంటె కవి' యని బిరుదు నొసంగి గార్దభము మీద నూరేగించిరి. సరస్వతీ శాస్త్రుల వారు ఘంటకు నూరు పద్యములు చెప్పుచో నితడు నూర్గురు భోక్తలకు తన గరిటెతో నేర్పుమీర నిముసమున వడ్డన చేయగలడని చాటించిరి. దానితో వారి యసూయాజ్వాల శమించిపోయినది. ఈవర్ణ వైషమ్య మహా పిశాచము భారతాభ్యుదయమునకు ప్రతిబంధకమై సమస్త కళా సుందరుల కంఠములను నిర్దాక్షిణ్యముగా నులిమి వేయుచున్నది. ఆ సేతు హిమాచల వ్యాప్తమై జాత్యున్నతినరికట్టుచు చిరకాల భావ దాస్యమునకు పరాధీన పరాభవములకు పాణింధ మంబైన యీ దారుణ విషజ్వాలను సహృదయులచిరకాలమున నార్పి దిగంతఖ్యాతి నార్జించిన గాని భారతీయ కళా ప్రపంచము శాశ్వతమై వెలయదు.

వామనాచార్యుల వారును రాజదర్శనము చేసికొని కన్నమదాసుని దుండగములును, తనయిల్లు దొద్దవోవుటయు, విగ్రహ చౌర్యమును వివరించి, మహాభక్తునివలె నభినయించి విగ్రహ నిర్మాణమునకై కనకదానము చేయవలసినదని యాచించెను. సంస్థానపతియు జాలి వహించి, కన్నముని కడతేర్చుటకు తగిన సన్నాహములు చేయుచుంటి ననియు, నచిర కాలమున నాంధ్రి కానందము గల్గించి శాంతి నెల కొల్పెదననియు నభయ దానముచేసి కొన్ని బంగారు నాణెము లాచార్యుని కిచ్చి సాగనంపెను. ఆచార్యులవా రపరిమితా నందము నంది దోపిడి సాకుగా తనకు గురియుచున్న కనక వర్షమున కుప్పొంగుచు, విగ్రహసృష్టికి మారుగా వివిధా భరణ సృష్టిచేయించి, భార్య నలంకరించుచుండెను. తన ఆరాధ్య దేవతాకైంకర్యమున సముపార్జించిన విత్తమున కన్న పది మడుంగులు పదినాళ్ళలో గడించి పెట్టిన కన్నమదాసుడే నే దారాధ్య దేవుడని యాచార్యులవా రంతరంగమున నుతించుచు వినుకొండకు ప్రయాణమైవచ్చుచు కానలో కన్నమదాసునిచేత బడెను. ఏ కారణముచేతనో కన్నమదాసా నాడు ప్రసన్నమతియై యుండి యాచార్యుల వారి కవనీపతి దానమిచ్చిన ద్రవ్యమును దోచికొని

నాచార్యుల వారి కంటగట్టి పెండ్లి తంతు నడిపి పసుపుబట్టలతో పట్టణమునకు బంపెను. వృత్తాంత మెట్టులో యూరివారికి దెలిసి వింతగా జెప్పుకొని కడుపుబ్బ నవ్వసాగిరి. వామనాచార్యుల వారు గంపెడు పరాభవమును తలపైవైచుకొని యిల్లుసేరి, తలయెత్తి యూర తిరుగలేక దాగికొనెను. నిషిద్ధ రజకరమణీ సంపర్క దోషము నాచార్యుల వారిపై నాపాదించి వినుకొండవీటి విప్రులతని బహిష్కరించి కొన్నాళ్ళకు ప్రాయశ్చిత్తము చేసి యర్చకునిగా నంగీకరించిరి. గుండారాయణిం గారు వామనాచార్యుల వారికి జరిగిన మహాపరాభవ మాలించి మిక్కిలి చింతించెను.

కన్యకాపరమేశ్వరీ మందిరము జీర్ణావస్థయందుండుట చేత వైశ్య ప్రముఖులెల్లరు నొకనాడు సమావేశమై పునర్నిర్మాణమునకై విరాళములను ప్రోగుచేయవలెనని తీర్మానించు కొనిరి. మహాసంపన్నుడును మాటకారియు, వదాన్యశిరోభూషణంబునగు ధనిసెట్టి నిట్టి యవసరములందాహ్వా నించుటుచితమా యనుచితమాయని చర్చించి తుదకు ధనిసెట్టి పైవైచిన ఆంక్షను దొలగించి, యే తన్మహాకార్య నిర్వహణ భారమును వహింప వలసిన దని ప్రార్థించిరి. ఎంతటి ధర్మదీక్షా ప్రియుడైనను. ఎంతటి శ్రీమంతుడైనను ఎంతటి నిరంకుశసత్యపథగామి యైనను నొక్కొకపరిసాంఘిక శక్తికి తలవంచక తప్పనిసరి యగుచుండును. ధనిసెట్టి దూర మాలోచించి వివాహములు కావలసియున్న కూతుళ్ళ భవిష్యత్తునకు భంగము వాటిల్లునోయని సందేహించుచున్న వాడగుటచేత ఆలయ నిర్మాణమున కంగీకరించెను. దక్షులయిన తక్షకులను రావించి మేలురకములయిన నల్లఱాలను నునుపులుదీర మలపించి అమ్మవారి యాలయము నంద చందములతో గట్టించు చుండిరి. బూతుశిల్పపుంబొలకువ యుండరాదని ధనిశెట్టి పట్టుబట్టుట చేత, ద్వార బంధములు స్థంభములు వలభులు మనోరంజకములైన కుసుమలతా పుంజ ములతో జీవముట్టిపడ జెక్కి శిల్పులు తమ నైపుణ్యమును ప్రకటించుచుండిరి. ధనము పుష్కలముగా వెచ్చబెట్టి పెక్కు పనివాండ్రను నియమించుటచేత దేవాలయ నిర్మాణ మచిర కాలముననే పూర్తియయ్యెను. ప్రతిష్ఠా మహోత్సవమునాడు సమస్త జాతులకు మృష్టాన్నదానము చేయబడెను. ధనిసెట్టి ప్రేరేపణమీద నిమ్నజాతుల కన్నదానమును అంబరదానమును జేయబడెను. బ్రాహ్మణులకు భూరి సన్మానములు లభించెను. ఆ యవసరమున ననితల్లి యాచార్యులవారికి కాంచన హనుమమద్విగ్రహమును కానుక పెట్టెను. వర్తకులెల్లరును యథా విధిగా ధనిసెట్టియింటికి వచ్చుచు బోవుచుండిరి. తగిన తరుణమని ధనిసెట్టి పెద్దకూతురునకు వివాహము చేయవలెనని నిశ్చయించుకొని తగిన సంబంధములకై వెతకుచుండెను. కడకు పాయకట్టున మందాదిలో సంబంధము కుదిరెను. మందాది కృష్ణాతీరమున నిజాము సంస్థానమునకు సమీపమున నున్నది. ఆ యూరి వర్తకులలో రత్నగుప్తుడు కుబేరుని వంటివాడు. అతని కుమారులలో కడగొట్టువానికి ధనిసెట్టి తన కూతునీయదలచెను. రత్నగుప్తుడు నిజాము నవాబుల మర్యాదలందినవాడు. అతనివద్ద విలువగల వజ్రములు కలవని వాడుక. గోలొండ

నవాబొకపర్యాయము కళత్రసమేతుడై కృష్ణలో జలకమాడవచ్చి రత్నగుప్తునిచే సత్కృతుడై తనివి సెంది ఒక జాగీరునిచ్చెనట. నాటి నుండి గోల్కొండనవాబుల కొలువులో నిరాఘాట ప్రవేశార్హత లేర్పడెను. రత్నగుప్తుడు వినుకొండకు వచ్చి ధనిశెట్టియింట నాల్గయిదునాళ్ళుండి ఆస్తిపాస్తులను స్వయముగా చూచి ముదితుడై ముహూర్తము నిశ్చయించుకొని మందాదికి మరలిపోయెను. రత్నగుప్తునికోర్కె మీద వివాహము మందాదియందే జరుపుటకు ధనిసెట్టియంగీకరించెను. వివాహ సన్నాహములు చురుకుగా జరుగుచున్నవి. చుట్టపక్కములకు శుభలేఖలు పంపబడినవి. ధనిశెట్టి వివాహమును మహా వైభవముగా జరిపి రత్నగుప్తునకు సరియైన యుజ్జీ యనిపించుకొనదలచి వలయు సంభారములను పుష్కలముగా సమకూర్చుచుండెను. రత్నగుప్తున కెందునుదీసిపోరాదను నభిలాషగలవాడగుట ధనసెట్టి పెండ్లికుమారున కేబదివేలు వరకట్నమును వాగ్దానముజేసెను. కుమార్తెకు లక్షరూప్యములు వెచ్చించి నవరత్నఖచితమైన కంఠహారమును చేయించెను. ధనిసెట్టిపై కసి దీర్చుకొనుటకు వేచియున్న గురుమూర్తిసెట్టి తగిన తరుణము వచ్చినదని సంతోషించి కన్నమదాసున కీవార్త నెఱింగించెను. సమీపించుచున్న యాహారమునకై గమకించుపెద్దపులివలె కన్నముడు సిద్ధపడుచుండెను. చుట్టపక్కములను చూచివచ్చుటకై నల్లమలభూములకేగి చిన్నవాడు తిరిగివచ్చెను. చుక్కమ్మసోదరీ వివాహము నిశ్చయమైనదని విని చిన్నవాడు సంతోషించెను. కానియేకారణముననో ఆలోచనా నిమగ్నుడై, ఆలమందను దోలికొని యడవికేగెను.

కన్నమదాసుని కట్టి బంధించి కొనివత్తునని ప్రతిన బట్టిన గుండారాయణింగారి దివాను లక్ష్మణసింగుచిత పరికర పరివార సమేతుడై కార్యంపూడికింబోయి కన్నమదాసు మజిలీకి సమీపమున నాగులేటియొద్దున గుడారము వేసెను. కన్నమునితో పరిచయము జేసికొని తన దేరాకు రావించి మైమరచియున్న తరుణమున మేనాలో నుంచి బంధించి కోటకెత్తించుకొని పోవలయునని సింగుగారి యభిమతము. దానికై యతడుక్కుతోబలిష్ఠమైన మేనాను తయారుచేయించెను. అది యుక్కుతో చేయబడ్డ మేనాయైనను చెక్కమేనావలె రంగులద్దబడి నగిషీలతో నవనవలాడుచుండెను. మేనా మిక్కిలి బరువైనదగుట బలిష్ఠులయిన పదునారుగురు మోయుట కనువుగా నిరుదెసలయందు దీర్ఘములైన వేణుదండము లమర్చబడియుండెను. కార్యమపూడి నుండి నర్సారావుపేట వరకు రెండు మైళ్లకొక అంచె చొప్పునను, అంచెకు పదునార్గురు చొప్పున బోయీలు నియమింపబడిరి. కన్నముని మోసగించి తన విడిదికి రావించి నప్పుడతనికొసంగుటకై నానావిధములయిన నిషా వస్తువులను, నంజుళ్లను విలువగల విదేశ మద్యములను సింగు తన వద్ద తయారుగా నుంచుకొనెను.

ఆనాడు కన్నముని యనుచరులు సురను సేవించి సోలుచు దూలుచు పలువిధము లయిన వినోదములను పరికించుచు ప్రమత్తులై యుండిరి. కన్నముడు నించుమించుగా

కన్నమునిచే చెఱబట్టబడ్డ వెలమకన్నెకు సింగు రహస్యముగా తనయాగమనము నెఱుక పరచి, ఆమెవలన కొన్ని రహస్యములను తెలిసికొని సమయమునకై వేచియుండెను. కనుసైగ జేసినంతనే చోరుని మేనాలో వైచి తటాలున ప్రయాణము సాగించుటకు తగిన మల్లుల నతడక్కడ కాపలా యుంచెను. సింగు కన్నముని గలసికొని, స్నేహము చేసి, తనది దక్షిణ దేశమనియు తీర్థ యాత్రార్థమై యమరావతికి వచ్చి–ఉత్సవ దర్శనార్థమై కార్యంపూడికి వచ్చితి ననియు వ్యాపారము చౌర్యమనియు తన కనుచరబలము వలసినంత కలదనియు నచ్చబలికి తాను సేవించినట్లు నటించి మాజిమి యను నొక నిషావస్తు నతనికి మిఠాయితో గలిపి తినుమని యొసంగెను. అతడది యారగించిన వెంటనే కూనరాగములు దీయ నారంభించెను. ఒక గడియలో నతడు పక పక నవ్వుచు ప్రాణమిత్రమా! నీవు నీ పరివారములతో నావద్దకు రమ్ము. తెలుగు ప్రాంతములలో నిన్ను పాళెగానిం జేసెదనని తడబడుచు వదర నారంభించెను. ఇదే యదనని సింగు గుడారముకడకు దీసికొని వచ్చి, విదేశ మద్యముల నయిదారు రకములను మిళిత మొనర్చి యొసంగెను. త్రాచుబాము విషమువలె తలకెక్కిన నిషావలన కన్నముడు కన్నులు దేలవైచి సోఫాలో సోలిపడెను. సింగు కృతకృత్యుడయ్యెనని తెలిసి కొన్న వెంటనే వెలమకన్య తన మేనాలోనుండి యుడాయించెను. ఆ యద నెఱింగి అనుచరులకు సింగు కన్ను గీటెను. నిముషకాలములో మేనా పిడుగురాళ్ల మిట్టలమీద వ్రాలెను. సింగు ఖడ్గహస్తుడై బోయీల వెంట నడచు చుండెను. అంచెమారుట కరమైలు నడువ వలసియున్నది. యుక్కు వాహనము భారమైన దగుట ప్రయాణము మందముగా సాగుచున్నది. ఇంకను ముప్పది మైళ్లు నడచినగాని మేనా కోటకు రాదు. అప్పటికి రాత్రి రెండు జాములు దాటినది, సరియైన యాహారము లేక వాహకుల కాళ్లు తేలిపోవు చుండెను. విషమునయిన హరించుకొనగల కన్నమదాసును, సింగొసంగిన మత్తుపానీయములు విశేషకాలముకై వసము చేసికొనలేకపోయినవి. కన్నమున కప్పటికి స్మృతి వచ్చినది. అతడొక వాహనముపై నున్నట్లు గ్రహించుకొన గలిగెను. తడవిచూచి అది మేనాయని తెలిసికొనెను. భూమ్యాకాశములను మ్రింగివేయునంతటి కోపమును, వేయి యేన్గుల బలము నతని శరీరములో నొక్కసారిగా ప్రవేశించెను. కన్నముడు నిప్పులు చెరగు నిట్టూర్పు బుచ్చి “ఎంతపనిజేసితివిరా” యని సింహనాదము జేసెను. సింగు దొంగకు మెలకువ వచ్చినదని గ్రహించి “నాపేరు లక్ష్మణసింగు, గుండారాయణింగారి దివానును అర్థమైనదా” యనిప్రత్యుత్తరించెను. కన్నముడు పకపక నవ్వి! “గుండారాయుడు, ముండారాయుడు, దివాను దివాను; నా పేరు కన్నమదాసు, ఓరీసింగా! కన్నమసింగము బోనులో కట్టుబడునటరా” యని బలముకొలది యొక్క తన్నుదన్నెను. ఆ దెబ్బతో బోయీలు మేనాతో పది గజముల దూరమున తూలిపడి భూదేవికి సాష్టాంగ నమస్కారము జేసిరి. సింగు గుండెలు తటతట గొట్టుకొనెను. బోయీలను లేవదీసి మరల నెత్తుకొనుడని తీవరించెను. ముక్కుచు మూల్గుచు బోయీలు వాహనమును మరల నెత్తికొని యమర బట్టి ప్రయాణము సాగించిరి. కన్నముడు మరల లేచి తూర్పు దిక్కుగానున్న

దూరమునబడి పునః ప్రణామమాచరించిరి. వాహనాంచలములు సోకుటచే నొకరిద్దరి శిరస్సులు గాయపడి లొడలొడ రక్తము గారజొచ్చెను. కన్నమునకు కాలమాసన్నము కాకుండుట చేతను, సింగునకు క్షితిపై నూకలు లేనికారణము చేతను, రాజభటులు రవంత నిషా రుచిచూచి యుండుట చేతను, మేనా తలుపులను బంధించు నప్పుడొండు రెండు గొళ్ళెముల నసమముగా బంధించిరి. ఇనుపదూలములవంటి కన్నముని కాలితన్నులచేత కదలి ఆ గొళ్లెములు తటాలున నూడిపడుట చేత నందొక తలుపుటెక్క తెఱచుకొని కన్నముని బయటి కాహ్వానించెను. కన్నముడు బోనులోనుండి వెడలివచ్చు సింగమువలె దూకి, సింగు నెదుర్కొనెను. ఖడ్గపాణియై యున్న సింగతనిమీద కత్తి విసరెను. కన్నముడా దెబ్బ తప్పించుకొని యొక గండశిలను సింగుపై విసరెను. ఆ తాకు సింగుని శిరంబును దాకుటచే లక్షణసింగు కన్నులు బైరలుగ్రమ్మి నేల కొఱగెను. సింగురొమ్మును మోకాట నదిమిపట్టి కన్నముడు కత్తి నందికొని తిరిగి చూచునంతలో బోయీలు పిక్కబలము జూపిరి. కన్నముడు సింగునికంతము నొక వ్రేటుకు తెగనరికి గడియలో కార్యంపూడికి వచ్చెను. కన్నమునకు సంభవించిన ప్రమాదము నెఱుంగక గాఢ నిద్రావలంబులై పడియున్న యనుచరుల నెల్లర ననేకరీతుల దూషించి కళత్ర పుత్రులం గదలించుకొని తెలవారులోపల స్వస్థానమునకు జేరికొనెను. కికురించిపోయిన వెలమకన్యను వెదకుటకై కొందరిని నియమించి సమీపగ్రామము కంపెను. గుండారాయణిం గారికి లక్ష్మణసింగుని మరణవార్త మరునాడు తెలియవచ్చెను. రాజు మంత్రిమరణమునకు వగచి కన్నముని పరాక్రమమును ప్రస్తుతించెను.

కన్నముని రాణివాసము నుండి తప్పించుకొన్న సుధాదేవి బంధుకోటి బహిష్కరించునని భయపడి గత్యంతరము గానక యాయూర నాయూర తలదాచుకొనుచు నొక్కనాడు వినుకొండ గ్రామము ప్రవేశించి తన దీనదశ నొక రిద్దరికి జెప్పి శరణమర్థించి నిరాకృతయై యభిమాన వతిగాన యాత్మహత్య కాయత్తయై యొకనాడు పురమధ్యమున నున్న కోనేటి నీట నురికెను. సమీపవర్తి యగు నొకపుణ్య పురుష డాధ్వని విని పేరెమువారుచు వచ్చి గుభాలున కోనేట లంఘించి వెలమ కన్యను కొనప్రాణముతో వెలికి తీసికొని వచ్చి ప్రథమచికిత్స జెసెను. సుధాదేవి మృత్యువును జయించెను. సుధాదేవి మూర్ఛితయై యున్నపుడు గుమికూడిన మూకలో గురుమూర్తి సెట్టిగారొకరు. సెట్టిగారా కన్యారూపమును కామించి, యవ్యాజాను రాగమును వెల్లడించి బుజ్జగించి యింటికి దీసికొనివెళ్ళి కుడువబెట్టి యన్నవస్త్రముల నిచ్చి యాదరించెను. మాయింట నుండి తారకము నభ్యసింపుము. ముక్తి నా యరచేత నున్నదని యొప్పించి వెలమ కన్యను తన శిష్యురాలినిగా జేసికొనెను. అమాయిని యగు సుధాదేవి మహాప్రసాదమని భక్తి మార్గమునకన్న తరణోపాయము లేదని విశ్వసించి. గురుమూర్తి సెట్టిగారి నతిభక్తితో గొలుచుచు సమస్త పరిచర్యలు చేయుచు, వారి యుపదేశములను శ్రద్ధగా నాలించుచు నొక వారము నాళ్ళుండెను. గురువుగారు మాయాఘటముల మీద మమకారమును వదలి పరిపూర్ణ వైరాగ్య పథమున ప్రయాణము చేయుచునా రయ్యెను సుధాదేవి

సమక్షమున నున్న కాలమున నొక్కొక్క పరి భక్తి పారవశ్యమున నేక నాదముతో సుధాదేవిపై కొరగుటయు. కను లరమోడ్చి గానము చేయునపుడు క్రీకంటచూచుటయు, గురువు లీశ్వరునితో నైక్యమందినట్లు శిష్యురాండ్రు గురువుతో నైక్యమందక ముక్తికర్హులు గారని వింత వేదాంతములను వెల్లడించుటయు, సుధాదేవి కనుమానాస్పదము లగుటకతన నామెకు గురుభక్తి సడలి ఒకనాటి యర్ధరాత్రమున సుధాదేవి గురుగృహమును విడిచి యెదురుగానున్న ధనిసెట్టి మేడ యరుగుపై శయనించెను. సుధాదేవి చక్కగా చదువుకొన్న సౌందర్యవతి. సంగీతమున మంచి ప్రవేశము గలది. ఉబికి వచ్చుచున్న యౌవనమున నుజ్వల గుణములతో నొప్పారు మధుర హృదయ. రజస్వలయై పెండ్లీడు కెదిగి జననీ జనకులు వివాహయత్నములు చేయు సమయానకన్నమునిచే నపహృతయై కడగండ్ల పాలయిన కరుణచరిత్ర. చిన్నానాయని యనుగుదల్లిని, చంటిపాపను కన్నమదాసుడు కనుమలో కత్తికెరజేయు నపుడు కన్నీరునించిన కమనీయ మానస. విధిచే నిడుమల పాలైనది.

దీనాతి దీనయై ప్రస్తరమున బరుండియున్న సుధాదేవి నుదయమున జూచి ధనిసెట్టి జాలివహించెను. "అమ్మా! ఎవరి బిడ్డవు? ప్రతిష్ఠగా బ్రదికిన దానవని నీ రూపమును జూచి గ్రహించితిని. నీ కీకర్మమే" మని, త్యాగమూర్తియైన ధనిసెట్టి పృచ్ఛించెను. సుధాదేవి సుధాబిందువుల వంటి ధనిసెట్టి పల్కులచే ధైర్యము తెచ్చుకొని తన చరిత్ర నాతని కెఱిగించెను. ధనిసెట్టి పరిపూర్ణ కరుణా తరంగిత చేతస్కుడై, "బిడ్డా! నీవు నాయింట నుండుము. నాకిరువురు కుమార్తెలు గలరు; నీవు మూడవ దానవు. నీ కేలోపమును రానీయను. తగిన వరునిజూచి నీకు వివాహము చేయుదును. మా అమ్మాయిలకుపాధ్యాయివై గాంధర్వమును కఱపు చుండు" మని తీయగా వచించెను. సుధాదేవి వల్లెయని ధనిసెట్టియింట నేలోపము లేక కాలము గడుపుచుండెను. సుధాదేవిసత్ప్రవర్తనము. మధురవాచాలత, మట్టుమర్యాదలచిరకాలముననే ధనిసెట్టి కుటుంబాభిమానము నాకర్షించెను. చుక్కమ్మ సుధాదేవి నక్కయ్య యని సంబోధించుచు సర్వకాల సర్వావస్థలయందు సుధాదేవి నెడబాయక ఆమె చెప్పు కథ లాలించుచు సంగీతవిద్య నభ్యసించుచుండెను. వారి పరస్పర ప్రణయాతిరేకమునకు ధనిశెట్టి లోలోన సంతసించెను.

సుధాదేవి చిన్నవాని దీన చరిత్రమును చుక్కమ్మ ముఖమున నాలకించి నాడు కార్యంపూడి కనుమలో కన్నముని కరవాలమునకు కబళాయమానమైన చెంచుకుటుంబిని యా చిన్నవాని కన్నతల్లియని నిశ్చయించి యెంతయు జాలిపడెను. చిన్నవాడు సుధాదేవి, పుట్టుపూర్వోత్తములు సవసవగా వినియున్న వాడగుటవలన కన్నమ హంతకుని కతననెన్ని యాత్మలల్లాడి పోవుచున్నవి! దేశమున కెట్టి చెట్టకలిగినదని పండ్లునూరుచుండెను. తీరుబడివేళలయందు సుధాదేవిచేత పాటలు పద్యములు చదివించుకొని చిన్నవాడానందించుచుండెను. సుధాదేవియు చిన్నవాని ప్రవర్తనమునకు ముచ్చట

కన్నమదాసు లక్ష్మణసింగుచే కడతేరియుండునని నిశ్చయించుకొన్నదగుట నాత్మలో నానందించుచు నూరివారతని దౌష్ట్యములనుగ్గడించుకొను సమయములయందు, "ఇక నెక్కడి కన్నముడు, యమపురిని దోచుకొనుట కతడరిగి చిరకాలమైనద"ని వచించుచుండును. కన్నముడు లక్ష్మణసింగును సంహరించి తప్పించుకొని పోయెనను వార్తను సుధాదేవి యొకనాడు విని స్తంభించిపోయెను. అతడఖండ ప్రజ్ఞాన్వితుడు తన్నెట్లయినను సాధించి చెరబట్టగలడని భయపడుచు నిలుదాటి రాక జాగరూకయై మెలగుచుండెను. సుధాదేవి కన్నమునిచే చెరబట్టబడి కార్యంపూడి తిరునాళ్ళ నాటికెక్కువ కాలము గడవలేదు. అతడామెనుబలాత్కరింపబోగా తనకొక వ్రతము కలదు. ఆ వ్రతము పూర్తియయినపిమ్మట వరింతునని యతనికి నచ్చజెప్పి శీలమును కాపాడుకొనెను. కన్నముడామె కొక ప్రత్యేక పటకుటీరమును నిర్మించి యుపచరించుటకు గొందఱు దాసీలను నియమించి వ్రతసమాప్తి కెదురుచూచుచుండెను. చిన్నవాని సోదరీ హత్యసమయమున మేనాలో సానుభూతి చూపిన వ్యక్తి సుధాదేవియే.

ఆ యేడు వినుకొండలో మొహరము దసరామహోత్సవము లేక కాలమున తటస్థించుట చేత హిందూ మహమ్మదీయులకు చిన్న కలహము సంభవించెను. ఆ యూరి మహమ్మదీయులు నిరుపేదలగుటచేతను వేగిలేచిన వర్తకుల నాశ్రయించి జీవించువారగుట కతమునకు తగాదా తీవ్రరూపమును దాల్చక పడావులు వుడావులతో తుదముట్టి పోవుచుండెను. ధనిసెట్టి సహజ శాంతస్వభావుడును పరమత సహనపరాయణుడయిన కారణమున కలహమునకు దోహదము చేయక యిరువాగుల వారిలో సామరస్యము సమకూర్చుటకు ప్రయత్నము చేయుచుండును. కాని కలహమునకు కాలుదువ్వు బుద్ధిమంతుల వలన నప్పుడప్పు డిట్టి మతకలహములు నఖానఖీతో, ముష్టాముష్టీతో కడ ముట్టుచుండును. అట్టి వారిలో నగ్రగణ్యుడు గురుమూర్తి సెట్టిగారు. సెట్టిగారు దిట్టలైన కోమటి బొట్టెలను రెచ్చగొట్టి తా నగ్రగామియై నాటి యుత్సవము నందు గరుడ వాహనమునకు ముందు నడచుచు "అటోయిటో తేలవలె, తురకపీనుగులు, తునాతునకలుకావలె, పుఱ్ఱెలు పుచ్చకాయలవలె మింటికెగురవలె. రక్తము, చిందవలె, నరములు తునుగవలె" ననుచు నడచి వచ్చుచు పిండుగట్టిచూచు వేదండయానలముందు పిల్లవినాయకుని వలె గంతులు వేయుచుండెను. ఉత్సవము ధనిసెట్టి మేడసమీపించినది. పీర్లనూరేగించు కొనుచు ముసలుమాను తండము లెదరు నడచుచుండెను. ఏదో ప్రమాదము వాటిల్లునని ప్రజలు భయపడుచుండిరి. రాజభటులు ప్రజల నిరుపార్శ్వములకు నెట్టుచు, వాహనములకు దారిచేయుచుండిరి. ధనిసెట్టి కుటుంబము పిఱుందనుండి కోలాహలమును జూచుచున్న విభీతహరిణేక్షణ యగు సుధాదేవిని జూచి, మూర్తి సెట్టిగారుత్సాహపూరితులై "వ్రేటుకు రెండు తుండెములు, అటో యిటో తేలవలె" ననుచు నెదుటనున్న యొక ముసలిసాహెబును ముందు వెనుకలరయక ముందుకు నెట్టెను. సమీపమున నున్న పెల్వానొకడు సెట్టిగారిని నాలుచఱపులు

చఱచి కుత్తుక నొక్కిపట్టెను. సెట్టిగారూపిరాడక యుక్కిబిక్కిరియై పెనుగులాడుచుండిరి. నిముషములో వర్తకవీరులు చేతిబడియలు మహమ్మదీయుల కరములను వరించెను. ధనిసెట్టి కలుగజేసికొని కలహమాపుజేసెను. గురుమూర్తి సెట్టిగారు మాయఘటము నిల్లుచేర్చుకొని తలుపులు బంధించుకొని భద్రము చేసికొనెను. ఉభయోత్సవములును శాంతముగా కడచిపోయెను.

కన్నముని గుంపులోని తురకచోరుడు ధనిసెట్టి యింట నున్న సుధాదేవిని గుర్తుపట్టి యా వార్తను కన్నమున కెరింగించెను. వంటయింటి కుందేలెందు బోగలదని కన్నముడు తరుణమునకు వేచియుండెను.

## 4

ఆ గ్రామము కశ్వినీ దేవతలవలె వాసికెక్కి అమిత ధనమార్జించిన రాజయ్య భోజయ్యయను వైశ్యులిద్దరువాసము చేయుచుండు. అందు రాజయ్యను ప్రత్యక్షధన్వంతరిగా ప్రజ లారాధింతురు. రాజయ్య పడమటి వీధికిని భోజయ్య తూర్పు వీధికిని కుటుంబ వైద్యులై వైద్యము చేయుచుందురు. రాజయ్య నిరక్షర కుక్షియైనను బసవరాజీయము, చరకసంహిత, ధన్వంతరివిజయము మరికొన్ని నాడీగ్రంథములను సంపాదించి చంకనిడుకొని తిరుగు చుండును. రాజయ్య రాజవైద్యముననే గాక భూతవైద్యమునందు నారితేరిన వాడని ప్రజల విశ్వాసము. రాజయ్యగారి దమృత హస్తమనియు, నాడీ పరీక్షలో నిపుణు లనియు, రోగ లక్షణములను నిర్ణయించుటలో ప్రవీణు డనియు పురజనులు నమ్ముచుందురు. ఎక్కడ నెవరికి తల నొచ్చినను, ఎవరి పిల్లవానికి జబ్బు చేసినను రాజయ్యను రావించి పరీక్ష చేయించక పౌరులు ధైర్యమును చిక్కబట్టి యుండజాలరు. తెల్లని తలపాగాచుట్టి మోమున విష్ణుపాదములు తీర్చి యూర్ధ్వపుండ్ర ధారణము చేసి కుప్పడపుపంచెలుకుచ్చులల్లాడ ధరియించి, కుక్కమూతి వెండిపిడి వైచిన చేతి బెత్తముతో, కిఱ్ఱు చెప్పులతో ప్రత్యక్షమగుచుండును. రాజయ్యకు వినుకొండలో పలుకుబడి మెండు, రాజయ్య యనుకూలుర కనుకూలముగా ప్రతికూలురకు ప్రతికూలముగా వ్యాధులు నిర్ణయించి చికిత్స చేయుచుండును. ఆయుర్బలము లేని కారణమున నచ్చాడీలవంటి యువకు లెందరో రాజయ్య చేతిమీదుగా దివ మలంకరించు చుందురు. పథ్యములో పొరపాటు జరిగిన దనియు, పసరు తలకెక్కినదనియు, పట్టు సరిగా పట్టింపలేదనియు నేవో లోపముల నింటివారి తలపై బులిమి రాజయ్యగారు సమర్థించు కొనుచుందురు. శరీరమున నుష్ణము ప్రవేశించినది. పైత్యము ప్రకోపించినది, తగినమందు వాడకున్న ప్రమాదము సంభవించునని రాజయ్యగారెందరినో భయపెట్టి రోగగ్రస్తులనుగా తయారు చేయుచుండును. అన్ని వ్యాధుల కతడు విధిగా లంఘణము చేయించుచు కటికి పథ్యములను బెట్టి యేనుగు వంటివానిని సహితము పీనుగుల వంటివారిగా జేయుచుండును.

రాజయ్య తెలికలవాడయ్యును సదాచారముల యందు బ్రాహ్మణులను తలదన్ను చుండును

వినికిడిచేత కంఠస్థము చేసిన యొకటి రెండు శ్లోకముల నింటింట వల్లించి సంశయ నివర్తి చేయుచు, చంకనున్న వైద్య గ్రంథములను జూపించి వశీకరించు కొనుచుండును.

రాజయ్య గా రెంతటి భక్తి తత్పరులై, యెంతటి నిష్ఠాగరిష్ఠులయినను ప్రాణాపాయ వేళలందును పంచములకు వైద్యము చేయరాదని శపథము చేసి సంచరించుచుండును. ధనిసెట్టి రాజయ్య నా విషయము నాల్గయిదుమార్లు మందలించి, సోదర మానవుల నట్లు క్రూరముగా జూచుట మహా పాతకమని వచించెను. పంచములు మహా పాపాత్ములు, వారికి మందులు పనిచేయవు. దివ్యౌషధము లన్నియు దేవతా ప్రసాదములు. వారి వాసన సోకిన మందులలో ప్రభావము మందగించును. 'సవర్ణులకు దక్క యన్యులకు చికిత్స చేయుట మహాపరాధమ'ని ధన్వంతరి యాజ్ఞ, యనియేవో శ్లోకములు చదివి తప్పించుకొని పోవుచుండును.

తురకలచే ప్రహరింపబడిన గురుమూర్తిసెట్టి గారానాడు మొదలూరిలో నడుగు బెట్టక, మహమ్మదీయ మర్దితమైన కంఠము వాయగా కాపు బెట్టుకొనుచు నొకనాడు చిరుజ్వర లక్షణములు గోచరించ భీతిజెంది రాజయ్యగారికి కబురంపెను. రాజయ్యగారు వచ్చి నాడీ పరీక్ష జేసి గాలి సోకినదని విభూతిపెట్టి, రోగ మేమార్గము త్రొక్కునో తెలిసి కొనుట కష్టము జాగ్రతగా నుండవలెను, మందు చాలా ఘాటైనదని రెండుమాత్రలిచ్చి పులుసు తగులరాదని చెప్పి వెడలిపోయెను. రాజయ్య మాటలలో ప్రమాదమును శంకించి సహజ భీరువైన సెట్టి చిట్టి జ్వరమును గట్టిజ్వరము చేసికొనెను. వైద్యుడు గాలి సోకెనన్నమాట మరింత కలత పెట్టగా గురుమూర్తిసెట్టి వరాహమూర్తివలె గురు గురు లాడుచు పలువరింతలుసాగించి చూడవచ్చిన చుట్టపక్కము లను భూతములవలె చూడసాగెను. రోగము వృద్ధియైనదని రాజయ్యను తీసికొనివచ్చి చూపిరి. రాజయ్య గ్రంథము లన్నియు దిరుగవేసి రోగిని పరీక్షించి, వ్యాధి యర్థమగుట లేదు, భార్య బిడ్డల యదృష్ట మెట్లున్నదో తెలియదు. దీనికి వసంత కుసుమాకరము పడవలె. మందు నావద్ద సిద్ధముగా లేదు. తయారు చేయవలె, దినుసులు చెప్పెదను తెప్పింపు డనెను. ఆ వాక్యము లాలించి బెదరి మూర్తిగారి యాప్తులు చుట్టపక్కములు రాజయ్యగారి ననేక విధముల ప్రార్థించి "మీరే మాకు రక్షకులు, భగవంతులు! మూర్తిగారిని బ్రతికింపు" దని నూరు రూపాయలు తెచ్చి గలగలనెంచిరి. రాజయ్య యనిష్టమును సూచించువానివలె "వెధవడబ్బు డబ్బెందుకు రోగి సుఖస్నానముచేయుట నాకు పదివేలు. మాట దక్కవలెనని చూచుచున్నాను. పాపము పరమభక్తుడు. ఆ పరమేశ్వరుని కృప యెట్లున్నదో"యనుచు పైకమును సంచిలో పదిలముచేసికొని "నావద్ద నౌషధము కొద్దిగానున్నది. మొన్న నొకరికొరకై తయారుచేసితిని ఇప్పటికిది సేవించమనుడ"ని మరి రెండు మాత్రలిచ్చి తలగొరిగించి నాభితో మాదున పట్టు వేయించి రాజయ్య వెడలిపోయెను.

నాడర్థ రాత్రమున కంబరము నలంకరించెను. గురుమూర్తిగారి మరణము విని యూరివారు "మహాభక్తుడు, మహాభక్తు" డని పలవరించిరి. సెట్టిగారి కత్యంత సన్నిహితు రాం(డయిన శిష్యరాం(డలో నొక రిద్దరు "గురువరా! మాకిక తారకము నుపదేశించు వారెవరు? నీ సమక్షము మాకు స్వర్గతుల్యము గదా! గురువు లెందరైనను నీ కొనగోటికి సాటి రాగలరా? మాయా పంకిలములైన మా శరీరములు నీ పరిచర్యకతన పావనము లగుచుండెడివి గదా? మీ యేకనాదము వలె మేమే కాకులమైతి" మని మిక్కిలి వగచిరి.

చిన్నవాని కిప్పుడు పండ్రెండేండ్లు గడచుచున్నవి. ఎక్కడికకండ లక్కడ గూడుకొని బలిష్టములగుచు కౌమారదశలో కాలూనుచుండెను. తల్లివలె చక్కని వాడును, తండ్రివలె ధైర్యశాలియునై ఆ కాలపు యువకుల కాదర్శప్రాయుడై యుండెను. ధనిసెట్టి యాదరణమున నతడు చింతావర్జితుడై స్వకార్యనిమగ్నుడై చెలికాండ్ర ప్రేమకు పాత్రుడై యన్న వస్త్రములకు లోటు లేకుండుట వలన నవనవ లాడుచు నెక్కి వచ్చుచుండెను. చూపర కతడు వ్యాధబాలకుని వలె దోపక కులీనునివలె గన్పట్టుచుండెను. సుధాదేవికి తొలుత చిన్నవాని చరిత్రా కర్ణనమున జాలియు, వినయ సంపదచేత వాత్సల్యమును, ఆకార విశేషములచే నభిమానమును క్రమ క్రమముగా వృద్ధియయ్యెను.

## 5

వినుకొండకు పడమరగా మహమ్మదీయులు నమాజు జేసికొనుటకై యొక 'దరఘా' చిరకాలమునాడు నిర్మింపబడినది. దానికి కొలది దూరమున నొక మఠమును నిర్మించుకొని యొక ఫకీరు వాసము చేయుచుండెను. అతడొకనాడు తిలకమును, ఒకనాడు పంగనామములును, ఒకనా డడ్డ బొట్టును, మరొకనాడు శూన్య ముఖమునను గోచరించుట చేత నేమతమునకు జెందినవాడో నిర్ణయించుట దుర్ఘటము. అడిగిన వారికి కతడు దినమున కొక నామధేయము, దినమున కొక మతమును, దినమున కొక కులము నుగ్గడించును. పకీరులో దుర్వాసుని కోపము, అగస్త్యుని యాకలి, భీష్ముని బ్రహ్మచర్యము, లొట్టిపిట్ట సహనము, ఉష్ట్రపక్షి మంద బుద్ధి, యన్నింటికి మించిన వాచాలత్వము రాచటికము చేయుచుండును. అతడు భక్తుడో రక్తుడో గ్రహించుట కవకాశ మీయని వింత ప్రవర్తనము గలిగి ఫకీరు ప్రజల యనుమానమునకు పాత్రుడగుచుండును. ఒక్కొక్కమా రతడు తంబురా మీటుచు చిటికెలు చేతబట్టి యర్ధరాత్రములయం దూర బ్రవేశించి, తానల్లుకొన్న తత్త్వగీతములను బాడుచు వీధులన్నియు గలయదిరిగి మఠమునకు బోవుచుండును. భిక్షకు జోలెగాని, సాధులు ధరించు తాళపాత్ర గాని యతని కడ నుండవు. ఫకీరు చిరకాలమునుండి వినుకొండ పరిసర ప్రాంతములను వాసస్థలములుగా జేసికొని జీవించుచున్నను, అతనికి మిత్రులుగాని శత్రువులు గాని శ్రుతగిరి పురముననే గాక సమీపగ్రామము లందు నున్నట్లు గోచరించదు. అతడేమి తినునో యేమి త్రాగునో తెలిసికొనవలెనని యపుడపుడు దూరివారు మఠమునకు బోయి విధిగా

చూచివచ్చు చుందురు. ఫకీరట్టి తరుణముల యందు కనులు మూసికొని యొక తావళమును బట్టికొని జపమారంభించును. అతని వృత్తాంతము నెఱుంగగోరి, యెందరో పలుకరించి చూచిరి గాని యతడు నిరుత్తరుడై మందస్మితము చేయుచుండును. తుద కతడొక పిచ్చివాడని తీర్మానించుకొనిరి. ఒకనాడా ఫకీరు జందెపుబెట్లగా నరుకబడి పర్వతపాదమున బారవేయబడి యుండెను. ఎవరి కెట్టి యపకారమును జేయక జపతపో నిష్ఠచే చిరకాలము నుండి మతమును గనిపెట్టుకొని బ్రదుకుచున్న సాధు మరణ మూరివారి నెంతయు కలత పెట్టెను. గ్రామ గ్రామముల నుండి ప్రజలు వేలకొలది వచ్చి ఫకీరుని దురవస్థకు నిట్టూర్పులుబుచ్చి వెడలి పోవుచుండిరి. రక్షకభటులు పరీక్షించగా నతని చొక్కా జేబులో నొకలేఖ లభించెను. అందిట్లున్నది.

వినుకొండ పౌరులకు :-

ధనిసెట్టి యింట నా యుంపుడుగత్తె దాగి యున్నదని రూఢి వార్త వచ్చినది. రాబోవు పున్నమ నాటికి దానిని గొనివచ్చి నా కప్పగింపకున్న ధనిసెట్టి కిట్టి గతియే సంభవించును. నా ఖడ్గ మెంత క్రూరమైనదో స్పష్టము చేయుట కీసాధువును సంహరించడమైనది. జాగ్రత!

కన్నమదాసు.

ఈ లేఖా వృత్తాంత మూరుజుట్టి వచ్చుటకు విశేష కాలముబట్టలేదు. రాజభటులు ధనిసెట్టి కాయుత్తరముజూపి "కన్నముడు కఠినకర్ముడు. మీద మీచిత్త" మని వెడలి పోయిరి. ధనిసెట్టి చుట్టపక్కములు, భార్య, బిడ్డలు నేడువసాగిరి. "సుధాదేవి నింటినుండి వెడలనడచి ప్రాణము దక్కించుకొనుట శ్రేయస్కరమ"ని బలవంతపెట్టిరి. సుధాదేవి కీవృత్తాంతము వజ్రాఘాతమైనది. ధనిసెట్టి పాదములపై బడి "మహానుభావా! నా వంటి వ్యర్థజీవికై మీ రాపదల పాలగుట భావ్యము కాదు. మీ కేపాపము రాదు. నన్ను పంపివేయుడు. ధర్మచరిత్రులగు మీరు జీవించియున్న ధర్మముజీవించును. అనాథుల కన్నము చిక్కును. సత్యము సౌరభిల్లు"నని యేడ్చెను. ధనిసెట్టి చలించలేదు. దీర్ఘముగా నాలోచించి తలపంకించి "ఏమీ! ఒక దుర్మార్గుని బెదిరింపులకు వెఱచి యాశ్రయించిన యనాథబాలిక నడవిపాలు చేయమందురా మందులారా! పొండు నా ప్రాణమైననొడ్డి సుధాదేవిని రక్షించితీరెద"నని గంభీరముగాపలికి తనవారిసాగనంపి సుధాదేవి నోదార్చి "అమ్మా! భయపడకుము, కన్నముడు నేడు నిన్నడిగినాడు. రేపు నా కుమార్తెలను కాన్కసేయుమనును, మరునాడూరనింకొక సుందరాంగిని కోరును. పిరికివానికి ప్రపంచమున నిలువనీడయుండదు. కన్నముని దౌష్ట్యము పండిపోయినది. ఇట్టి వ్రాతలతని మరణవాణి వ్రాతలు, లేచి నిర్భీతిగా నీపనులు నీవు చేసికొను" మని ధైర్యపరచెను. చిన్నవాడు ధనిసెట్టి పాదములంటి ముద్దాడి దాటిపోయెను. చుట్టపక్కములు ధనిసెట్టి శపథము నాలించి చల్లగా జారుకొనిరి.

ఆనాడు గోలె చిన్నవాడు రాత్రులయందు కన్నుగూర్కి యెఱుగడు. ధనుర్బాణములు దాల్చి ధనిసెట్టి యింటికి కాపలా గాయుచుండెను. ధనిసెట్టి యింటినే కాదు, ఊరంతయు నతడు సహస్ర నేత్రములతో దిరిగి వచ్చుచుండెను. పకీరును జంపిన ప్రదేశమున చిన్నవా డయిదారు రాత్రులు కాచెను. అన్నా నీకు జయమని యానాడు తన సోదరి స్వప్నమున నాశీర్వదించిన శబ్దమతని కర్ణవీధులలో ఖంగున మ్రోగుచుండెను. కన్నముని రక్తతిలకముతో ధనిసెట్టి నారాధించి వానిరక్తముతో యజమాని పాదముల నభిషేకించి ఋణము తీర్చవలెనని చిన్నవా డుబలాట పడుచుండెను. ఏకత్తితో కన్నముడు తన చెల్లిలిని సంహరించెనో ఆ కత్తియే నేడతని తూణమున నుగ్రబాణమై వేచియున్నది. ఆ సమయముల యందతని రుద్రుడైన నెదుర్కొనజాలడు. బాలచంద్ర బ్రహ్మనాయక కాటమరాజులలోని శౌర్య సంపదలు పుంజీభవించి యుండెను. తేజోనిధికి వయస్సు కారణము కాదుకదా? కన్నముడు పెట్టిన గడువు సమీపించినది. పాపము ధనిసెట్టి కేమి విపత్తు వాటిల్లునోయని యాప్తమిత్రులు భయపడుచుండిరి. ధనిసెట్టి కుటుంబము చింతా భయాక్రాంతమై యుండెను. అనితల్లి తన భర్త కెట్టి యాపదరాకుండ వలెనని యెల్ల వేల్పులకు మ్రొక్కుకొనుచుండెను. ధనిసెట్టి చలించక యెప్పటి యట్లు స్వీయకార్య తత్పరుడై యుండి ప్రొద్దుగ్రుంకిన తోడనే భోజనముచేసి శయ్యాగారము ప్రవేశించి సుఖ నిద్రచెందెను. చిన్నవాని స్వామికార్యమున కదిపరీక్షా నిశీథము. బాణాసన బాణపాణియై యతడొక పర్యాయము నాల్గు గవునుల నరసివచ్చి, ధనిసెట్టి మేడనతి జాగరూకుడై కాచియుండెను. తొలిజాము గడచినది మలిజామున నూరి వెలుపట కుక్క మొరిగినది. ఆటవికులకు కుక్క మొరుగునం దనుభవము విశేషము. వారు ధ్వని భేదమును బట్టి మసలుచున్న జంతు వెట్టిదయినది గ్రహింపగలరు. చిన్నవానికది వెన్నతో బెట్టిన విద్య దొంగలూర ప్రవేశించిరని చిన్నానాయకుడు గ్రహించెను. ధనిసెట్టి సంహారమును కన్నముడు స్వయముగా సాధించ నెంచక తన పరివారమున ప్రవీణులయి పట్టణ పరిచయము గల తురుష్కులను వినుకొండ వాస్తవ్యుల నిరువురి నియమించి మరిద్దరిని తోడుగా బంపెను. చోరచతుష్టయము పురప్రవేశము చేసి ధనిసెట్టి మేడకుదరియ వచ్చి, ప్రాకారలంఘనముజేసి నిశ్రేణిక సాహాయ్యమున మేడకెగబ్రాకుచు చిన్నవానితీక్ష్ణ దృష్టిపథమున బడిరి. కాఱు మేఘములువంటి హంతకుల శరీరములు కటికి చీకటిని కబళింప జాలమి, చిన్నా నాయకుని లక్ష్యభేదన కౌశల్యమునకు లక్ష్యములై విలక్షణముగా గనుపించు చుండెను. చిన్నవాడు చిన్నతనమునుండి యెన్నియో బాణముల చేయించి తూణీరమున దాచుకొని యుండెను. సజ్జకార్ముకుడు తూణాహృతచండకాండోజ్వలుడై యుండి చిన్నవాడు పైకెగ బ్రాకి వచ్చుచున్న వానినేసెను. దివి నుండి జారి పడుచున్న చీకటిరాశివలె నత దుర్వింగూలెను. ప్రమాదము నెఱింగి రెండవవాడుర్వి కురుకులోపల చిన్నవాని శర మతనికి కపాలమోక్షమును ప్రసాదించెను. కడమవారు కాలికి బుద్ధి చెప్పిరి. ఆ చప్పుడు విని చిన్నవాడు వారి ననుసరించెను. ఊరు దాటులోపల వ్యాధబాలుని క్రూరకలంబములు వారి

యుసురులపహరించెను. చిన్నవాడు శవముల మేని శరములను పెకలించి పొదిలో గుప్త మొనర్చుకొని నిర్విచారముగా పశుశాల ప్రవేశించి నిద్రించెను. తెల్లవాఱినది. ధనిసెట్టి కెట్టి చెట్ట గలిగెనోయని నాటిరేయి తలంకుచున్న యాప్తవర్గ ముదయమున ధనిసెట్టిని జూడవచ్చెను. మేడ క్రింద మానవశవములు గోచరించినవి. అవి ధనిసెట్టి ప్రాణహరణార్థమరుదెంచిన కన్నముని యనుచరుల వని స్పష్టమైనది. చిన్నవాడు వెంటాడి వేటాడిన చోర ద్వితీయ కళేబరములు గవిని కుత్తరమున గాన్పించినవి. ఆశ్చర్యము, ఎవడా మహావీరుడు. ధనిసెట్టి నిట్టి మహావిపత్తున కగ్గము గానీక రక్షించిన యజ్ఞాత శూరుడెవడు? చిన్నవాడాత్మస్తుతి పరాయణుడు కాడు. సింహమును జీల్చివచ్చినను అతడొకరికి జెప్పడు, గంభీరత చిన్నవాని కాజన్మ సహజ స్వభావము. అగణితధర్మస్వరూపుడైన ధనిసెట్టిని అనవరతము రక్షసేయుటకు వేల్పులు వేచియుందురని పౌరు లూహించిరి. ఆ యజ్ఞాతమిత్రు డెవ్వడో ధనిసెట్టి యూహింపజాలక పోయెను. కొందరు చిన్నవాడే యిట్టి సాహసము జేసియుండు నని తలంచిరిగాని, ఉక్కు తున్కలవంటి హంతక చతుష్టయమును పసిబాలుడయిన చిన్నవాడు సంహరించుట పొసగదని మిన్నకుండిరి. సుధాదేవి పెందలకడ చలిది యొసంగుటచేత చిన్న వా డారగించి మందతో మహారణ్యమునకు బోయెను.

6

తరవారికి గ్రుచ్చిన ధనిసెట్టి తలకాయతో తెల్లవారక ముందే బొల్లాపల్లికి రావలెనని పరిచారకుల కానతిచ్చిన కన్నమునకు సేవకుల దుర్దశ మూడవనాడు తెలిసినది. కన్నముడు కల్లు ద్రాగిన కపీంద్రమువలె గంతులు వేయుచు, మండిపడుచు, పరివారమును దూషించుచు, బాదుచు, రోజుచు, పరి పరివిధముల నారాటపడసాగెను. పరాభవ మెఱుంగని తనకును తన పరివారమున కిది శిరచ్ఛేదమువలె చిత్తమును జీల్చి వేయసాగినది. అతడానాడే ధనిసెట్టి గృహ మును దగ్ధపటలము చేసిరావలెనని సన్నద్ధుడయ్యెను. కాని యనుచరవర్గమున నొకరిద్దరు "వేగిరపడరాదు. నేటి సంఘటనమును బట్టి ఏదో ప్రబలమయిన ప్రయత్నము జరిగి యున్నదని రూఢియగుచున్నది. ఏలినవారు నిదానించవలె" నని వారించిరి.

చిన్నానాయకుని ధనుస్సారము చిరుతపులి వేటచే రవంత రాణింపునకు వచ్చి యొకనాడు పురప్రజల నాకర్షించినను కళాభిరుచి గలవారా యూర లేని కారణమున కాలక్రమమున కన్ను మఱగైయుండెను. చిన్నవాడెట్టి సాధనము జేసి యెట్టి ధనుష్మదగ్రణియయ్యెనో నాటి హంతక విజయమున పాఠకులు గ్రహింపగలరు. రసజ్ఞులు లేనిచోట కళావీరులయునికి నిరర్థకముగదా?

తన పూజాఫలమున ననుగుభర్త గండము గడచి గట్టెక్కెనని యనితల్లి లోలోన గర్వించు చుండెను. ధనిసెట్టికి ధనబలమే కాక దైవబలమును వలసినంత కలదని ప్రజలూహించి మిక్కిలి

భక్తితో ధనిసెట్టి యాజ్ఞను శిరసావహించు చుండిరి.

చిన్నవాడన్న సుధాదేవి శరీరమంతయు సుధయై పోవును. ఎన్ని విధముల తఱచిచూచినను చిన్నవాని చరిత్రమున కళంకము కానరాకుండెను. సుధాదేవి ప్రస్తావ వశమున చిన్నవాని గుణగణములను ధనిసెట్టితో పలుమారు లుగ్గడించెను. అట్టి రత్నము గృహమున కలంకారమనియు గృహమునకు కాదు, నేల కలంకారమనియు పొగడి యుండెను. అట్టి బాలుడనాథుడగుటకు వగచి యాదరించిన ధనిసెట్టిని ప్రస్తుతించు చుండును. చిన్నవాడు ధనిసెట్టి యింటి ముసద్దీల నాశ్రయించి రాత్రివేళలయందు కొంచెము చదువను వ్రాయను నేర్చుకొనెను. సుధాదేవిని ప్రార్థించి కొన్ని పాటలు, పద్యములు జెప్పించుకొని వల్లెవేసెను. సుధాదేవి దీన చరిత్ర దలచి చిన్నవాడు చింతపడుచుండును. సుధాదేవి చెప్పు నీతికథల మూలమున ననితల్లి కూడ చిన్న వానిని మునుపటివలె కసరుకొనక యనురాగముతో చూడ నారంభించెను.

కన్నమదాసుని నివాసమున బురుజుకెదురుగా నొక యున్నతమయిన వటవృక్షము కలదు. దాని యూడలు నలు పార్శ్వములనావరించి బలిసి పెనగొని భూమిలోనికి జొచ్చుకొని పోయి దారుకుడ్యకలితమైన యొక గృహముగా నేర్పడియుండెను. అందొక శిలావేదిక కలదు. అందొక కాళికా విగ్రహమును జెక్కించి ప్రతిష్ఠింపించి కన్నముడు కష్టకాలములలో దేవిని పూజించుచుండును. పరాభవదహనదందహ్యమాన మానసుడగు దాసానాడు దేవీదర్శనము చేసికొనుటకై ఆగృహమును ప్రవేశించెను. దేవిపాదముల వద్ద తన యనుచరుల ఖండిత శిరస్సులు దండగ్రుచ్చబడి నివేదింపబడి యుండెను. దేవికంఠమున నొక తాళపత్రము రక్తాంకితమై పట్టెడవలె బంధింపబడి యుండెను. దాసాశ్చర్య చకితాక్షుడై ఆ పత్రమును దీసి చూచెను. అందక్షరములు గోచరించినవి.

కన్నముడిట్లు చదివెను :-

కన్నమా! అనుచరుల చావున కాగ్రహించితివా? రేపు నీ చావునకు వగచువా రెవరు? కన్నమ కుధరమును పిండిజేయు వజ్రము పెరుగుచున్నది. నీ గుండెలలో నిద్ర వోయెదను జాగ్రత! దేవితో జెప్పికొని జాగ్రతగానుండుము.

నాపేరు - చిన్నానాయకుడు.

చిన్నవా డానాడు తస్కరుల మస్తకముల నుత్తరించి కొనిపోయి దేవిగుడిలో నుంచి ఆ లేఖను కాళీ కంఠమున నలంకరించి వచ్చెను. నా దూరివారు చూచినది తస్క రకబంధములే, కొండవంటి కన్నముడు బెండువలె బెగ్గడిల్లెను. ఎవడీ చిన్నానాయకుడు? ఈ పేరు చెంచులకుండును. విరోధులయిన చెంచులు తనకున్న ట్లతడెఱుంగడు. ఆరేండ్ల నాటి నిషాద

సుందరీ వృత్తాంతము నతడు తరచి తరచి జ్ఞాపకము చేసికొనెను. నిజప్రాణాపహరణమునకు హేతుభూతమగు పులిపిల్ల పొదలో పొంచియున్న సంగతి నతడెరుగడు. కృష్ణనామధేయము కంసునకువలె కన్నముని కర్ణవీథులలో చిన్నానాయకుడు వికటాట్టహాసము చేయుచుండెను. ధనిసెట్టిని సంహరింప బోయిన యనుంగు భటులు చిన్నానాయకునిచే నెట్లు కడతేర్చ బడిరో యతని కర్థమగుట లేదు. చెంచులకు ధనిసెట్టితో నేమి సంబంధము? చిత్రముగా నున్నది. ఎవడీ చిన్నానాయకుడని అతని యంతరాత్మ యారాటపడ నారంభించినది. కన్నమున కిది చిక్కు సమస్యయైపోయినది. యుత్తరములోని ప్రతియక్షర మతని నాడీ మండలమున నాటుకొని పోయి వేధింపసాగినది. పులికన్న గిలి గొప్పదిగదా? కన్నమనాయని బ్రతుకు గందరగోళమున బడ్డది. చిన్నానాయకు డేయూర నుండెనో వెదకి వచ్చుట కతడు తన యనుచరులను చుట్టుపట్ల నున్న గ్రామముల కంపెను. మారు వేషములతో నొకరిద్దరిని వినుకొండకు బంపెను. వారు జాగరూకులై వినుకొండ ప్రవేశించి చిన్నానాయకుని గూర్చి పలువురితో ప్రసంగించిరి. ఆ పేరు వినలేదనియు, చిన్నవాడను బాలు డొకడు ధనిసెట్టి పసుల కాపరి కలడనియు జెప్పిరి. వారు చిన్న వానిం జూచి సందేహమునకు తావీయని యతని పసితనమునకు మోసపోయి కన్నమునితో చిన్నవాని ప్రసక్తి యెత్తక వినుకొండలో నా పేరుగలవారు లేరని కన్నముని కెరింగించిరి. కన్నముడు కన్నుమూసినను తెరచినను చిన్నానాయకుడే కనుపించుచుండెను. చిన్నానాయకుని ఆకృతిని కన్నము దూహలో కల్పించుకొను చుండెను. నల్లని శరీరము, చింత నిప్పుల వంటి కన్నులు, కోర మీసములు, ఉక్కుటర్గళముల వంటి భుజములు, సింహము వంటి కంఠధ్వని, విశాలమయిన యురము, పట్టెడు గుండె గలిగిన యొక భయంకరాకారము సిద్ధమై కట్టెదుటనిచ్చి హుంకరించినట్లయ్యెను. తనతో పోల్చి చూచుకొనెను. తనపరాక్రమ ప్రకర్ష లాతని ముందు దీసిపోయినట్లు తోచెను. కన్నముడు కోరలూడిన కోడెత్రాచువలె బుసలు గొట్టుచుండెను. ఆకోపమున నతడనుచరులచే బట్టుబడ్డ చిన్నారెడ్డియను నొకానొక మార్గస్థుని చిన్నా శబ్దవాసనచేత సకుటుంబముగా సంహరించెను.

వినుకొండ రజకులలో గురువులను వాడు దుండగులలో నొకడు. దెబ్బలాటయన్న నతనికి పబ్బమువలె నుండును. నూతనాగంతుకులతో నతడుగిల్లి జగడము పెట్టుకొని ప్రహరించును. మానాభి మానములు వానికి నీషణ్మాత్రములు. తెల్లని తలపాగ విధిగా ధరించి పైనొక జరీ యుత్తరీయము దాల్చి భాగ్యవంతులు ధరించు విలువగల ధోవతిని గట్టుకొని చేత నొక బెత్తమును బూని, తరవాణి నా కంఠముగా నాస్వాదించి ఘరానా గల వానివలె నూర సంచరించు చుండును. భార్యకు సుస్తి జేసి నప్పుడును, కల్లునకు కాసులు చేత లేనప్పుడును, గురువులు మలీమ సాంశుకములు మూపునబూని గార్దభము మూపున మూటలు బిగించి, స్వయముగా రేవుకు ప్రయాణమగును. గురువులకు పురాణ శ్రవణము నందమితమగు మక్కువ. గురువులకు సోమయాజుల వారన్న నమిత భక్తి. గురువు లిల్లు గదలిన సోమయాజులు గారింటి మీదుగా రావలసి యుండును. సోమయాజులు వారుదయమున

లేచి కార్యములను దీర్చికొని ప్రత్యహము నేదో యొక శాస్త్రార్థమును మిత్రులకును, దర్శనార్థమై వచ్చిన పురవాసులకు నుపదేశించు చుందురు. గురువు లా తరుణమున రేవున కుద్యుక్తుడై పోవుట తటస్థించెనా మూపుననున్న గుడ్డలమూటతో దయారయి యాలకించు చుండును. ఆ తరుణములయందు దన ఖర మేమైపోయినదో యతడు గమనింపక యవసరమును మరచి యాలకించు చుండును. గార్ధభము సమీపమున నున్న క్షేత్రమున బ్రవేశించుటయు, క్షేత్రాధిపతులు గాడిదను బందెల దొడ్డికిం దోలుటయు సంభవించు చుండును. గురువులు రెంటికిం జెడిన రేవడయై నాడు రేవుమాని యిల్లు సేరుటయు సంభవించుచుండును. రజకకులాలంకారమైన గురువులు పెద్దల సాంగత్యముననను, తన వేషభాషల చేతను, బ్రాహ్మణ సంపర్కముచేతను చాకలివాడనుశబ్దమును చదును జేసి పౌరుల ప్రశంస కగ్గము గావలెనను నభీష్టము నభివృద్ధి జేసికొని బ్రతుకుచుండెను. పాపము గురువు లెంత ప్రయత్నించినను బ్రాహ్మణజిహ్వాలట్టి స్థానమును గురువుల కనుగ్రహింప జాలక పోయెను. కారణాంతరములచేత తన తండ్రి రజకుడైనను తల్లి బాహ్మణ కులోద్భూతయని చెప్పుకొనుచున్నను గురువుల కభీష్టసిద్ధి ప్రాప్తించలేదు.

గురువులు ధనిసెట్టి యిల్లు నుదుకుచుండెను. ఆనాటి చోరహంతకునినిదమిద్ధమని యూరివారు నిర్ణయింపజాలక పోవుటచేత గురువు లాకీర్తి నతడే యార్జించవలెనని, ఆమహ త్కార్యము తన వల్ల జరిగినదని ప్రచారము చేయుచుండెను. యుక్తాయుక్త విచక్షణ జ్ఞానశూన్యమైన పనికిమాలిన భరతదేశమున నుదయించుట తనవంటి వీరవరేణ్యుని ప్రతిభ రాణింపక మరుగుపడి యున్నదనియు, రజకజాతి లేక భరత దేశము మురికిదై మూల్గుచు పారిశుధ్యమును గోలుపోయి యుండుననియు, రజకుని వలననే సామాన్య లోహము రజిత మయ్యెననియు, రజితాచలము రాణకెక్కుటకు తనకులమే కారణమనియు గురువు లుగ్గడించుచుండును. మహావీరులకు రజకజాతియే పుట్టినిల్లనియు, గంగాధరుడైన శివుడు రజకులకు దగ్గర చుట్టమనియు గురువుల వాదన. గంగలేక క్ష్మాసురుల కంగవస్త్రము లుండ వనియు, గంగకు రజకాంగనలకు కావలసినంత సంబంధము కలదనియు గురువులు చెప్పుచుండును. ధనిసెట్టిపై తన కెంతయు భక్తి కలదనియు, తా నా రాత్రి కల్లుపాక నుండి కదలివచ్చు చుండ చోరదర్శనమై వీరావేశమున నల్గురిని నలచివేసితి ననియు గురువులు ప్రచారము చేయుచుండెను. ధనిసెట్టితో గురువు లొకనా డీ విషయమును జెప్పుచుండ చిన్నవాడు విని నవ్వుకొనెను. పుర ప్రజలు ననుమానించు చుండిరి.

కన్నముని జంపినవాని కపరంజి కంకణ బహూకరణ చేసెదనని మల్రాజు గుండారాయడు వాగ్దానముచేసి చాటింపించుట విన్నవాడగుట గురువు లొకనాడు రాజదర్శనము చేసికొని తస్కరులను తానే స్వయముగా జంపితినని తేని కెరింగించెను. రాజాలించి కన్నమ హంతకునకు కనక సత్కారముగాని యనుచర హంతకులకు గాదని

మొదలతని వాచాలత మితిమీరి పట్టపగ్గములు లేక పోసాగినది. కులస్థులయిన మడివేళ్లు మందులనియు, వంశోద్ధారకులగు తనవంటి వీరయోధుల నింకను గుర్తింపక జాతి గొడ్డువోయెననియు ప్రచార మారంభించెను.

గురువులూర నారంభించిన వింత ప్రచారము కర్ణాకర్ణిగా కన్నముడు విని, కటాకటా! ఆరునెలలు సాముజేసి మూలనున్న ముసలమ్మను సంహరింపలేక మూలబడెనన్నట్లు తన యనుచరు లొక చాకలివానిచే సంహరింపబడుట తన తాహతునకు దగని యపకీర్తిగా దలచి యొకనాడు గురువుల శిరమును నరికించి తెప్పించి దేవి కుపహారముగా నర్పించెను. గురువుల మరణము నాలించి ధనిసెట్టి మిక్కిలి వగచి యతని కళత్రమునకు తగిన జీవనభృతి ననుగ్రహించెను. చిన్న వాడది విని చీదరించుకొనెను. ఒకానొక మహమ్మదీయకవి గురువుల పరాక్రమము నభివర్ణించుచు నొక పాట వ్రాసెను. అది ప్రచారమునకు వచ్చెను.

"కుక్షింభర కవుల నరసిహసింతు" నని తాతంభట్లు వాక్రుచ్చినట్లు కీర్తికాములయిన కాకవులు వివేచనా శూన్యులై ముందువెనుకల నాలోచించక మూర్ఖాళిసంభావింప సత్యమును మరుగు పరచి యసత్కావ్యములను వ్రాయుచుందురు.

ఉ. "ఆసవిశేషమై చిలిపి యంతరముల్ చెలరేగి యాత్మవి
శ్వాసము వ్యర్థమై పిరికి వర్ధిలి భారతజాతి స్వార్థమున్
మోసము నభ్యసించిన దభూత కథానక కల్పనాకవి
వ్యాసుల సూదిమందులు ప్రభావమునం దలకాయలేనిదై"

చిన్నావాడు గుండారాయణింగారి యసంప్రేక్ష్యకారిత్వము నధిక్షేపించుచు నాకాశ రామన్న పేర నొక యుత్తరమును వ్రాసెను. రాజాయుత్తరము నరసి ముందు వెనుకలు యోజింపచక తాను రజకుని బహూకరించుట భావ్యము కాదని సిగ్గుపడి మిన్నకుండెను. లక్ష్మణ సింగుని మరణానంతరము గుండారాయణింగారు సాహసోపేతుండును, సకల శాస్త్ర పారంగతుండును, సమర విద్యా విద్వాంసుడునయి యపర యుగంధరుడని వన్నె కెక్కిన యొక క్షత్రకుల సంభూతుని సచివునిగా నియమించుకొనెను. అతని నామధేయము రూపసింగు, అపర యౌగంధరాయ, రాక్షసులవంటి వాడని ప్రజలతని ప్రస్తుతింతురు. రూపసింగు రూపమున బాహుకుని పరిహసించుచున్నను, బుద్ధియందు తిమ్మరుసుని ధిక్కరించు వాడు, ఆవులించిన నాంత్రములను లెక్కింపగల యతుల మేధాసంపన్నుడు. మడివేలు మాణిక్యమయిన గురువులను రాజానాడు మర్యాద చేయునప్పు డతడనుమానించి వారించెను. ముసుగున దాగియున్న సిసలైన వీరుడెవ్వడో నిర్ణయించలేక రాజు మంత్రి మాటను త్రోసిపుచ్చి గురువులకు మర్యాద లొనరించెను.

కన్నముడొక యత్తమ క్షత్రియ కులమున బుట్టి దుస్సహ వాసదోషమున వివిధద్యూత క్రియా దక్షుడై, హృదయ మిచ్చి చెలిమిజేసిన చెలిమికాంౘ్రచే బహువిధముల మోస పుచ్చబడి పరస్పర విరుద్ధ ధర్మ ప్రబోధకములైన నాటి ధర్మ శాస్త్రములపై నమ్మకము దప్పి విసికి వేసారి విరక్తి జెంది, ఆప్త బంధుమిత్ర పరిత్యక్తుడై తుదకు మహీమండలమొక మాయానాటకరంగమని మతిచెడి చోరవృత్తి నవలంబించి మన కథాకాలమునాటికి కరుణలేని కటికి కన్నమదాసుగా పరిణమించెను.

మానవుల మంచి చెడ్డలు, సచ్ఛీల దుశ్శీలములు. వారి హయామున నమలునందున్న రాజులయు, రాజశాసనములయు, ఆచార వ్యవహారములయు, సంఘములయు సత్కవులయు, శాస్త్రములయు, సంపర్కములను బట్టి సంప్రాప్తములగు చుండును. మానవుల యభ్యున్నతికి నధః పతనమునకు దేశము, కాలము, కవులు, పండితులు, పార్థివేంద్రులు కారణభూతులగు చుందురనుట సత్య సమీపమైన నగ్న ధర్మము. ఒకనికి మతావేశము, ఒకనికి మాయమంత్ర తంత్రావేశము, ఒకనికి కులావేశము, ఒకనికి ధనావేశము, ముమ్మరింప పరస్పర ద్వేషవహ్నికి పాణింధమంబులైన పన్నాగములతో జీవితములను సాగించుచు, ఘోరమైన యశాంతి సస్యములకు పాదులను ద్రవ్వుకొనుచు, పలుత్రోవలను బట్టి ప్రయాణముసేయు జాతి యిహపరములకు దూరమై యిక్కట్టులపాలు గాక మానదు. కన్నముడు కన్నపు దొంగయై కటికి కసాయివాడయిపోవుటకు నాటి సంఘవ్యవస్థ, నాటి వాతావరణము, కారణము లయ్యెనని యూహింప వచ్చును. కన్నముడు చిన్ననాడొక గురువువద్ద విద్యాభాసము చేయుచు కొంత విజ్ఞానము నార్జించెను. గురువుగా రే కథ జెప్పినను ఏ ధర్మమును బోధించినను, అది గురువుగారికిని గురువుగారి వంశమునకును, గురువుగారి చుట్టపక్కముల శ్రేయములకే పనికివచ్చుచు నన్యజాతీయుల కపకారమును కలిగించునవియై యంతరంగము నల్లలాడించునవిగా గోచరించుట చేత కన్నమున కాగ్రహమువచ్చి యొకనాడు గురువును బరువైన బడియతో మోది విద్యాభ్యాస్యము మాని వేసెను.

"గురుఘ్నులకుసంప్రాప్తమగు ఘోరనరకమే కన్నమునకు ప్రాప్తించున" ని గురువుగారు కన్నముని శపించిరి. తచ్ఛాప ఫల మనుభవించుకాలము సమీపించెనోయని కన్నముడు శంకించ నారంభించినాడు.

చిన్నవానికి పగలు పశుపాలకత్వమును రాత్రులందు పురపాలకత్వమును నిత్యకృత్యము లైనవి. ఆ కారణమున జిన్నవాని చిగురు శరీరశోభ వన్నె దరిగి యుండెను. చిన్నవాని యందు శ్రద్ధయు, వాత్సల్యము గల సుధాదేవి చిన్నవాని మేని కృశత్యమునకు హేతువేమని రెండు మూడు మార్లు ప్రశ్నించెను. అతడేవో కారణములు జెప్పుచుండెను. చిన్నవాడొకనాడు జ్వరపీడితుడయ్యెను, ధనిసెట్టి రాజయ్యకు కబురుచేయబోవ వారిహస్తవాసి,

జూచినదగుట చేతను సుధాదేవి వలదని వారించి నాడీపరిజ్ఞానము తనకు తెలియునని ధనిసెట్టికి నచ్చ జెప్పి తానే స్వయముగా చిన్నవానికి చికిత్స ప్రారంభించెను. చికిత్స కన్న సుధాదేవి సుధాలాపములు చిన్నవానికి దివ్యౌషధములై ఆరోగ్యము ననుగ్రహించెను.

చిన్నవాని తల్లి ధరించియున్న ముత్యాల ముక్క ముంగరను దొంగిలించి కన్నముడు మున్ను ముక్కుపచ్చులారని ముద్దు చెల్లెలిని, కన్నతల్లిని కరకుకత్తి కెరజేయుట కన్నారజూచి యున్న చిన్నవాని మనఃఫలకమున ముద్రితమైన మాతృరూప దేహముతో నచ్చుయియున్న జననీ భూషములలో ముంగర ముఖ్యమైనది. దానిని నేడు కన్నముని రాణివాసము ధరించుచున్నది, ముంగర ముత్యాలూడి పోయిన కతమున నద్దానికి మెరుగుబెట్టి ముత్యాలతికించి తెచ్చి పెట్టుమని కన్నముని ప్రధానజీవితేశ్వరి యొక పరిచారకున కిచ్చి వినుకొండకుబంపెను. వినుకొండలో మాసాబత్తులవారు రత్నపరీక్షయందును మంత్రతంత్రముల యందును కాంచన భూషా నిర్మాణమునందును, నగిషీ పనులయందును ప్రసిద్ధి కెక్కినవారు. వీరాచార్యులందు మేటి. కన్నమదాసు పరిచారకు డా ముంగరను వీరాచార్యుల కడకు గొనివచ్చి తగిన ధన మిచ్చెదను నగను సవరించి యిమ్మని నతని కిచ్చెను. ఆచార్యులా ముంగరను పరిశీలించుచు బత్తుని పనితనముకు తల పంకించుచుండెను. చిన్నవాని బాణములు వీరాచార్య నిర్మితములే. చిన్నవాడప్పుడప్పు డాచార్యుల వారి యంగడిలో విశ్రమించి లోకాభిరామాయణమున కొంత కాలమ గడపి పోవుచుండుట వాడుక. ఆచార్యుల వారును చిన్నవానిని ప్రేమపురస్సరముగ నాహ్వానించి యాదరము చూపుచుండెను. చిన్న వాడాతరుణముననం దుండుట తటస్థించి ముంగరను జూచి యది తన తల్లిదని గుర్తుపట్టెను. తోడనే వేడి యశ్రుమేఘములు దృష్టినవరో ధించనతడు తటాలున లేచిపోయెను. మారు వేషమున నున్న దొంగవాడు గాని, కార్యాయత్తుఁడయి యున్న కంసాలిగాని చిన్నవానిని గమనించలేదు. మరునాడు ముంగర చిన్నవాని కన్నీట జలకమాడి జాలెసంచిలో జేరినది. కన్నముని పరివారమున నింకొక్కడు లెక్కకు తక్కువయ్యెను. నేడు కన్నముని భటసంఖ్య తొంబది యయిదు. ముంగరంగొంపోయిన వీరభటుడు తిరిగి రాలేదని రాణి కన్నమున కెరుక జేసెను. కన్నముని హృదయము మరొకమారు కంపించెను.

## 7

గుండారాయణింగా రొకపర్వదినమున రామలింగేశ్వరు నర్చించదలచి కళత్ర సమేతముగా పచ్చల పల్లకీనధిరోహించి వినుకొండకు వచ్చుచుండెను. చిన్నవా డొక చిట్టడవిలో నావులను మేపుకొనుచుండి యస్త్రవిద్యాభ్యాసమును జేసికొనుచు రాజని యెఱుంగక రాజూతగా బట్టుకొనియున్న పల్యంకికలోని పట్టుకుచ్చు నొక వాడిబాణమున దెగవేసెను. అంత నేర్పుతో బాణమును వదలిన వాడెవ్వడాయని రాజాశ్చర్యపడి. పల్లకి నాపి, శబరబాలుని బిలిపించి

చేయుచుంటి ననియు తనలక్ష్య భేదన పాటవమును పరీక్షించు కొనుటకై శరప్రయోగము చేసితి ననియు ఏలినవారని యెఱుంగక చేసిన యపరాధమును మన్నింపు"డనియు చిన్నవాడు మనవిజేసికొనెను. రాజుబాలుని కళాకౌశల్యమునకు, వినయసంపత్తికి, చక్కదనమునకు నలరి బాలుని కులగోత్ర నామధేయము లెఱుంగగోరి పృచ్ఛించెను. తానొక యనాథ శబర బాలకుడ ననియు, ధనిసెట్టి పశుల కాపరిననియు, ధనిసెట్టి తనకు జీవన ప్రదాత యనియు కొంత చరిత్రను మరుగు పరచి క్లుప్తముగా జెప్పెను, రాజతని కొక బంగారు నాణెము నొసంగి తరలిపోయెను. చిన్నవాడా వృత్తాంతము నేరికిని జెప్పక పసిడికాసును సుధాదేవి కిచ్చి "యడవిలో దొరికినది. పాప మెవరో పారవేసుకొనిరి. అడిగిన నిచ్చి వేయుదును. అంత దనుక దాచియుంచు" మనెను. సుధాదేవి చిన్నవాని శీలమును మెచ్చుకొనెను.

సంస్థానపతి వినుకొండకు వచ్చెనని విని. పలుకుబడి గల పౌరులువచ్చి దర్శనము చేసికొని రాజు ననేక విధముల గొనియాడి యవసరములను జెప్పుకొని యాదరింపబడి పోవు చుండిరి. ధనిసెట్టి యిల్లు దోచుటకై వచ్చిన తస్కర వధా వృత్తాంత మపూర్వమైనదై విభ్రమాశ్చర్యములను వెల్లివిరియించి యెన్నోనాళ్ళు కాకుండుటచేత, రాజు ధనిసెట్టిని రావించి, "ఆయుష్మంతుడవు. నీ ప్రాణదాతయెవరు? చిత్రము సుమా" యని సానుభూతిని ప్రకటించి, మార్గమధ్యమున తాను సత్కరించిన చిన్నవాని శరసంధానకుశలతను కొనియాడి అట్టివాని నాదరించి నందులకు ధనిసెట్టిని ప్రశంసించెను. ధనిసెట్టి చిన్నవాని కళాభినివేశము రాజు మన్ననల నందినందుల కాత్మలో మురిసికొని ఆబాలునిదీనచరిత్రమును రాజున కామూలా గ్రముగా వచించెను. చిన్నవాని వలెనే సుధాదేవియను మరొక కన్యక కన్నముని బారి నుండి తప్పించుకొనివచ్చి తనయింటనున్నదనియు. చెప్పి ఆ బాలికకు శరణమిచ్చితినని బెదరించుచు కన్నముడు తనకు వ్రాసిన లేఖను రాజునకు జూపెను. గుండారాయుడు సుధాదేవి సుఖముగా నున్నదని విని ధనిసెట్టి యౌదార్యము నెంతయు బొగడి "ఆవీరుడెవ్వడో కన్నమునకు తగిన పాఠము గరపినాడు. పాఠము కరపుట చాలదు. నరకుట అత్యావశ్యక" మనియు. తాను వాని హననమున కెన్నియో ప్రయత్నములను జేయుచున్నాననియు, జెప్పెను. ప్రసంగవశమున ధనిసెట్టి తన కుమార్తె వివాహ వృత్తాంతమును జెప్పి. "కదు దూరపు సంబంధము కుదిరినది. కారడవులు దాటిపోవలె, కన్నముని కంటబడిన ప్రమాదమని జంకుచున్నాను. ప్రభువుగారి పటాలము సాయపడ్డ భయము లేదు. తమ సెలవైన ముహూర్తము నిశ్చయించుకొందు" మని ప్రార్థించెను. రాజు తక్షణమంగీకరించి "తప్పకసాయము జేసెదను. ముహూర్తము పెట్టుకొనుము. దండిభటులను రెండు వందల మందిని వెంట నంపెదన"ని యభయ మిచ్చెను. ధనిసెట్టి ధైర్యము వహించి సెలవు పుచ్చుకొని తరలిపోయెను.

గురుమూర్తిసెట్టి ధనిసెట్టి తనయా వివాహమును గూర్చి కన్నమునకు కబురంపిన దాది యతని గూఢచారులను దినమును పురమునకు వచ్చి వివాహ ప్రయత్నములెట్లున్నది.

తెలిసికొనిపోయి, కన్నమున కెరింగించు చుండిరి. రాజభటులను సాహాయ్యముగా బంపుటకు రాజశేఖరు డంగీకరించి యభయ ప్రధానము జేసిన వార్తయు కన్నముని చెవి బడెను.

ఒకనాడు కన్నముడు కాళికాపూజను ఘనముగా చేయదలచి ఆ ప్రదేశమును శుభ్రము చేయించి యనుగు సతులచే నలికించి ముగ్గుబెట్టించి పది పొట్టేళ్ళను దేవికి బలియిచ్చి, ధనిసెట్టి ముట్టడికి తోడ్పడి విజయము చేకూర్చవలెనని భక్తితో ప్రణమిల్లెను. సమీపమున నున్న జీర్ణవృక్ష శాఖనధిరోహించి యొకగ్రుడ్లగూబ "గుగ్గూ" యని కూసెను. కన్నముడు కలతపడెను. కాంతలు కంటతడిబెట్టిరి. అపశకునము లగుచున్నవి. ఆ ప్రయత్నము విరమింప వలసినదని వేడుకొనిరి. కన్నముడు వారి మాటలను త్రోసిపుచ్చెను.

కన్నమదాసునకు ధనిసెట్టిపై దాడి చిక్కు సమస్యయైనది. ఈ ప్రయత్నమున నతడు ధనమునే కాక సుధాదేవిని కూడ సాధింప నెంచెను. సుధాదేవి తన్ను గికురించి కృతకప్రేమను చూపి యంతర్థానమై పోయినందుల కాగ్రహము కలిగినను సుధాదేవి సౌందర్యమునకు ముగ్ధుడై యుండెను. రాజసాహాయ్య సమేతుడైన ధనిసెట్టి తనకు వశుడగునో లేదో! యని యతడనుమానించు చుండెను. నాడు తన భటుల నాహరించి లేఖాముఖమున తన్ను బెదరించిన చిన్నానాయకు దండయై ధనిసెట్టి వెంటనుండుట నిశ్చయమని వాడూహించెను. అగుచో గెలుచుట దుస్సాధ్యమని యించుక జంకెను. తిరుగ తనలో చిన్నానాయకుని విగ్రహము చిందులు వేయసాగెను. చౌర్యసన్నాహమున కింకను సమయమున్నది. ఈలోపుగా నుపాయాంతరము లూహింప వచ్చుననుకొనెను. కుంతములకు, కుఠారములకు పదును బెట్టించి అనుచరుల కాయుధచాలనమున గల మెలకువల నెఱింగించుచు, ఎట్లు పొంచునది, ఎట్లు మసలునది, ఎట్లు లంఘించునది, మున్నగు చౌర్య కళారహస్యములను వివరించుచు ధైర్యము చెప్పుచుండెను. ఆనాడెవ్వరును మద్యమాన రాదనియు, అట్లు త్రాగిన వాని తల నరికెదననియు ఖండితముగా నాజ్ఞాపించెను.

కన్నము దశ్వారోహమునం దారితేరిన రేవంతులలో నేరికిని దీసిపోడు. మహారణ్యములలో కొండలలో నతడు సునాయాసముగా గుఱ్ఱములను నడిపించ కలడు. కన్నముడు చిన్ననాటి నుండి మచ్చిక చేసి పెంచిన యుత్తమాశ్వ మతని వద్ద గలదు. దాసు దానిని ప్రాణప్రదముగా జూచుకొనుచుండును. కన్నముని వియోగము నది గడియయును సహించదు. నిలివెడెత్తు గలిగి నిగనిగలాడు నల్లని యున్నితో మలచినట్లున్న సర్వాంగ పుష్టితో భ్రూమధ్యమున బొలుచు తెల్లని మచ్చతో, నా సైంధవము కన్నముని హజారమున కట్టివేయబడి నేత్రపర్వము చేయుచుండును. కన్నము నెదిరించి కదియవచ్చు విరోధుల నది గుర్తించి యల్లనల్లన జేరవచ్చి తన్నును, వనముల యందది ఖురాఘాతధ్వని రానీయక నడచి కన్నముని చౌర్యలీల కెంతయు నుపకరించుచుండెను. అద నెఱింగి స్వామి కపాయము వచ్చు వేళ

సూచకముగా సకిలించుచు మెడయెత్తి కులుకుచు, కదను ద్రొక్కుచు నడచుచుండ సప్తలోకములపై "సై" యనుచున్న ట్లెంతయు గర్వముతో నడచుచుండును. ప్రభువుల స్వభావములు పరిచారకులకు పట్టువడినట్టు లాయుత్తమాశ్వమునకు కన్నముని దొంగ బుద్ధియు పట్టుబడినది. రాత్రులయందది కంటికింపైన పంటచేలలోబడి కడుపార కసవారగించి వచ్చి దివాణమున బ్రవేశించును. పొలము కాపుల కాలిజాడల నది కడుజాగరూకతతో గనిపెట్టి జారుకొనును. కన్నముడాహుమాదొరకు కంఠమున బంగారు పూసలు, తలపై కల్కితురాయి, కాళ్ళకు కనకకంకణాలు, నలంకరించి ముత్యాల గవుసెనవైచి, ముద్దు దీర్చుకొనును. కన్నముడా గుఱ్ఱమునెక్కి కటికి చీకటిలో బోవునప్పుడు సమీప వర్తులకుదక్క దూరవర్తులకు గోచరించదు. రాత్రివేళలందు ప్రయాణికులకు కన్నముని దర్శన మంతక దర్శనమువలె హడలుపుట్టించును. కన్నముడాగుఱ్ఱము నెక్కి యొకనాడు కారుటడవులలో వాహ్యాళివెడలి కాకిరాల కనుమ నడుమనున్న అంబరాజ సరస్సు తీరముననించుక విశ్రమించెను. సమీపమున కట్టెలేరుకొనుచున్న పేదలిరువురు ముచ్చటించుకొనుట గ్రహించి నిదానముగా నాలించెను. "దయారహితమతియైన కన్నముని కంటబడిన మనపని యేమగును. నీవెన్నడైన జూచితివా? యమధర్మజుని జూడనవసరము లేదు. చేయెత్తు మనుష్యుడు కన్ను లెఱ్ఱగ కాల్చిన యినుప గుండ్లవలెనుండు" నని యొకడనెను. "వాడు మనవద్ద నేమి దోచుకొనును. కటికి పేదలము. ఈ శుష్క కాష్ఠము నతడాశించునా? ఆశించిన నట్లే వాని కాష్ఠము గాల్చుకొమ్మనియిచ్చి వేయమా? వానికి రోజులు సమీపించినవి. విక్రమార్కునకు శాలివాహనునివలె కన్నముని కంఠవిచ్ఛేదనము చేయగల వీరుడుండక పోడని" రెండవ వాడనెను. నిర్జనారణ్యమగుట వారి సంభాషణము గంటకొట్టినట్లు కన్నమునకు స్పష్టముగా వినిపించెను. ఆ మాటలు మామూలుగా ప్రజలాడుకొనుట దాసనేక పర్యాయములు వినియున్నవా డగుట పాటిచేయకున్నను అందు విక్రమార్కుడు, శాలివాహనుడను, మాట చిన్నానాయకుని జ్ఞప్తికెలయింపగా కన్నముని మనస్సు చురుక్కు మనెను. తన యనుచరవర్గ మాంధ్ర దేశమునంతను గాలించి యెంతపరిశీలించినను చిన్నానాయకుని జిక్కించుకొనలేక పోయిరి గదాయని చింతించెను. చిన్నా నాయకుడిప్పుడతనికి చిన్న దయ్యమై చిత్తమున బ్రవేశించి, చిత్తక్షోభకు కారణభూతుడయ్యెను. కన్నమదాసునకు పెక్కం డ్రుంపుడుగత్తెలున్న నతని యంతరంగము నాకర్షించినది పెద్ద భార్య ముమ్మక్క, ముమ్మక్క మగనివలె దయాశూన్య, గౌద్రాలగుట కతన నది పసిబిడ్డల చావునకు పరితపించదు. నల్లగుండ్ల కనుమలో నాడు కన్నముడు జరిపిన ఘోరశిశు హత్యను ముమ్మక్క వారింపక పోవుటయేగాక చెంచుయువతి ముంగరను వలచి వలపులరాయని పురికొల్పెను.

ముమ్మక్క మాటకు కన్నముడడుగుదాటడు. అనుచరుల మానప్రాణములు ముమ్మక్క నిగ్రహానుగ్రహములపై నాధార పడియుండును. కన్నముని భటులే కాక కన్నముడును ముమ్మక్క నలరించుట కుబలాట పడుచుందురు. మగనివలె ముమ్మక్కయును మదిరాతపస్విని.

ముప్పూటలును ముమ్మక్క మద్యదేవతాపూజను నియమము దప్పక నిర్వర్తించు చుండును. మొగమున చిన్ననాడు వోసిన స్ఫోటకపుమచ్చలు లేకున్న నందగత్తెయనుటకు సందేహముండదు. మేను చామనుచాయ గలది. కుందకుట్మలములవంటి పలువరుస ముమ్మక్క యందమును వృద్ధిచేయుచుండును. తాంబూల సేవనమున దంతములు గారబట్టి యాబిడకొక వింతసింగారము నాపాదించుచుండును. దొంగలదొరసానిగారానాడు కన్నమునితో కలహమాడి భోజనము మానివేసెను. సుధాదేవియే వారి కలహమునకు హేతువు. సుధాదేవి యందతనికి గాఢానురాగము కలదని గ్రహించి మున్నుతరచు కలహించుచుండెడిది. కార్యమపూడి తిరునాళ్లలో సుధాదేవి తప్పించుకొనిపోవుట విని యాత్మలో నానందించినది ముమ్మక్క. నేడు సుధాదేవి పునస్సమాగమమున భర్త సుధాదేవికి వశుడైపోయి, తన కన్యాయము చేయునేమోయని ముమ్మక్క భయము. సుధాదేవిని సంహరించి శిరస్సును దెచ్చి తనకు జూపిన గాని కాపురము చేయనని ముమ్మక్క పట్టుబట్టెను. సుధాదేవిని కన్నముడు చెరగొన్న కాలమున ముమ్మక్క తద్యత్నమునకుద్యుక్తయైనది. అవకాశమునకు వేచియున్నంతలో సుధాదేవి తప్పించుకొని పోయినది. అంతటితో ముమ్మక్క మనస్సు కుదుటబడినది. నేడాప్రబల సపత్ని సజీవురాలై యున్నదనువార్త నెఱిగి యీ పన్నాగము బన్నినది.

కన్నము డెన్నియో విధముల భార్యనోదార్చినాడు. ముమ్మక్క మూర్ఖపుపట్టుమానుట కేడు గాడిదలు కూయవలెనని కన్నము డెఱుగును. సుధయందు కన్నమునకు వలపు మిక్కుటముగా నుండెను. భార్యాప్రణయమతనికి సర్వాంగ వేష్టితమైన యుక్కు రజ్జువు వంటిది. కన్నముడెంత యోజించినను యొక నిర్ణయమునకు రాజాలకుండెను. సరస్తటమున గూర్చుండి యతడాలోచనా సూత్రము నంబరమంటునట్లు పేనుకొనసాగెను.

తన సోదరీ వివాహమునకు సుధాదేవిని తప్పక ప్రయాణము కమ్మని చుక్కమ్మ పట్టు బట్టెను. కన్నముని భయమున సుధాదేవి చుక్కమ్మ కోర్కెను మన్నింపజాలక పెక్కు నెపములు చెప్పి క్షమింపుమని బుజ్జగించెను. చుక్కమ్మ పసితనపు దెప్పులతో నొప్పించుచు సుధాదేవిని కౌగిలించుకొని ఏడుపు సాగించెను. అనితల్లి వచ్చి చూచి కారణమడిగి తెలిసికొని "సుధాదేవి పెండ్లికి రాకుండునా? పెండ్లిపాటలు బాడువారెవరు? సుధాదేవి రాకున్న మీతండ్రి యూరకుండునా? దంపతులకు సుధాదేవి యాశీరక్షతలు చల్లవలదా?" యని చుక్కమ్మ నోదార్చెను. చిన్నవాడీ వృత్తాంతమును విని సుధాదేవి సంశయము నెఱింగినవాడై చేరవచ్చి "ఒక్క కన్నముడే కాదు. వేయిమంది కన్నమదాసులును నిన్ను కన్నెత్తి చూడజాలరు. నిర్భయముగా రావచ్చును. కనుమలో కన్నముని పెండ్లి, ఖాయమని" చిన్నవాడనెను. సుధాదేవి నివురుగప్పిన నిప్పువలె నున్న చిన్నవాని చరిత్ర నెఱుంగని దగుట యతని మాటలకు చిరునవ్వు నవ్వి, కన్నముని పెండ్లికి పెద్దలు, పెద్దవాండ్రుగాని చిన్నవాండ్రుగారని కేరడమాడెను. చిన్నవాడు ముసిముసి నవ్వులతో వెలుపలికి వచ్చి, చల్ది చిక్కములతో మందవెంట నడచెను.

చిన్నవాని యమ్ముల పొదిలో పదును బెట్టబడి తళతళ లాడుచున్న బాణము లెన్నియో కలవు. అందొక యర్ధ చంద్రబాణ మతినిశితమైనది కలదు. దానికి పసుపు రాచి, పికిలి యీకల కుచ్చు లలంకరించి పట్టుదారము పుంఖమున బంధించి పదిలము చేసికొనెను. కడమ బాణములలో నైదింటిపై యొకటి మొదలయిదువర కంకెలు చెక్కబడి యుండెను. వాని యర్థము చిన్నవానికి దక్క యన్యు లెఱుగరు.

ధనిసెట్టి సామాన్య ధనికుల వలె భీరువుగాడు, ధీరుడు. వ్యాయామమున స్థిరపడిన సంధిబంధనములు గలవాడు, చిన్నతనమున నతడు తన యింటి సమీపమున నున్న తురకల తాలింఖానాలో కసరత్తుజేసి కొంత బలము నార్జించెను. అవసరమయిన పరులతో పెనంగ గలడు. అందుచేత కన్నముని బెదిరింపులతని కదలింపలేకపోయినవి. ధనిసెట్టి సర్వకాల సర్వావస్థలయందు నెడబాయక తలవారును బొడ్డున గుప్తముగా నుంచుకొనును. శత్రువు లెదుర్కొన్నచో నొక రిద్దరి ప్రాణముల నపహరింపగలడు. శాకాహారులయందును శౌర్యవంతు లుందురనుటకు ధనిసెట్టి నిదర్శనము. మాంసాహారులయందును పిరికివా రెందరో కలరు. దొంగల హడావిడి విశేషముగా నున్నది పెండ్లి నిప్పటికాపుజేయ వలెనని ఆప్తమిత్రులు ధనిసెట్టిని వారింపజూచిరి. ధనిసెట్టి వారి మాటలను పాటిసేయక వివాహ సన్నాహములు చేయుచుండెను.

వాగ్దానమును పాటింపుడని ధనిసెట్టి వ్రాసిన మనవి లేఖతో గుండారాయణింగారికి శుభలేఖ వచ్చినది. తక్షణమే రాజిన్నూరుమందిని వివిధాయుధవిద్యలయందారితేరిన యోధులను వినుకొండకు బంపుచు, "కన్నమదాసెదుర్కొన్నచో నతని సంహరించి తలను గొని తెచ్చినవానికి నూరు కుచ్చెళ్ళ సుక్షేత్రమును బహూకరింతు న"ని యాసగొలిపి పంపెను. తన సేనకు నాయకునిగా గట్టివాడయిన గాజుద్దీనను మహమ్మదీయుని నియమించెను. గాజుద్దీను పరాక్రమవంతుడు, స్వామి కార్యదీక్షారతుడయినను కొంచెము బుద్ధిహీనుడు, భోగలాలసుడు, చక్కని స్త్రీలతని కంటబడినచో చింబోతులక్షణము లేర్పడును. అతని సంపాదన సారాయమునకును, గుడిగుడి యుండలకును సరిపోవును. ఉదయమున లేచి గాజుద్దీనింటి వసారాలో నొక యాసనమున నాసీనుడయి హుక్కాద్రావుచు, బోడితలను దడవికొనుచు, అతి దీర్ఘమై నల్లగా మిసమిసలాడుచున్న గడ్డమును సవరించుకొనుచు, ధూమపాన విఘూర్ణమాన నేత్రములతో వీధివంక దృష్టిసారించి జలము గొనిపోవు సుందరాంగులను జూచుచు, "వారెవా! సెహబా" సని శిరః కంపము జేయుచు లంబోదరమును దువ్వుకొనుచుండ ప్రేక్షకుల కతడు గడ్డమున్న గణపతి దేవుని వలె గానుపించును. గాజుద్దీనూరిబైట సపరివారుడై విడిసి, ధనిసెట్టిని బిలిపించి, నాటి రాత్రియే ప్రయాణమని తెలిసికొని తనకును తన పరివారమునకు దగినభోజన పదార్థములను బంపవలసినదిగా ముదలయిచ్చి తనకు దినమునకు నాల్గు దుత్తల సారాయము ఖర్చుగుననియు ముందా ప్రయత్నము చేయుమనియు జెప్పెను. ధనిసెట్టి ఆ

మాట కాగ్రహించియు కోపమునడచుకొని నిరుత్తరుడై వెడలివచ్చి వలసిన సరుకులను కావళ్లతో గట్టి పంపెను. "సాహేబుగారు సారాయమున కవసరపడుచున్నా" రని భటులు ధనిసెట్టి కడకువచ్చి కొంచెము కఱకుగా మాట్లాడిరి. "ఆ యాటలిక్కడ సాగవు. ధనిసెట్టి త్రాగుబోతుల కాబాల్య విరోధి" యని కబురంపెను. గాజుద్దీను వ్రేటుదిన్న పులివలె లేచి ధనిసెట్టి ననేక విధముల తూలనాడి తక్షణమే తన సైనికుల దరలించుకొని మరలి పోజూచెనుగాని రాజాజ్ఞ ప్రబలమైనదని యెఱిగినవాడగుట కొంతయోజించి మిన్నకుండెను. నాటి సాయంకాలమున నూరిలోనికి వాహ్యాళివెడలివచ్చి కోనేటియొద్దున నొక శిలావేదికపై విశ్రమించి కోనేటినీటిపై వచ్చు వనగజ యానలను వారకంట జూచుచుండెను. సుధాదేవి చుక్కమ్మతో కలసి నీళ్ళుతెచ్చుచు తురకరాయని చూపులకు గురియయ్యెను. ఆ బాలికా వృత్తాంతము నచ్చటివారి నడిగి తెలసికొని గాజుద్దీను డబ్బాలికం గోరి కామాంధు డగుట నట్టి పనులయం దారితేరి యధికారి దయకు బాత్రులయిన భటుల నిద్దరిని బిలిచి తన కోర్కెను సుధాదేవి కెఱిగింపించెను. సుధాదేవి వ్యధనంది మిక్కిలి విలపించి ఆ విషయము ననితల్లితో జెప్పెను. అనితల్లి ధనిసెట్టికి ముట్టించెను. గాజుద్దీనుని కలుషవర్తనమునకు ధనిసెట్టి దవానలమువలె మండిపడి "వివాహానంతరమున నతని విషయము రాజున కెఱిగించి తగినశాస్తి జేయించెదను. మనకు వారితో పనియున్నది. ప్రస్తుతము శాంతించుటుత్తమ" మనిసుధాదేవి నోదార్చెను.

ధనిసెట్టి బంధుమిత్ర పరివారముతో మహావైభవమున మండాదికి పయనమయ్యెను. దాదాపు నూరు శకటములపై పూచిన తంగేళ్ళవలె సకలాభరణ భూషితలైన యోషిన్మణులు పరిణయమునకు వచ్చుచుండిరి. పెండ్లి కుమార్తెతో సుధాదేవి చుక్కమ్మలు శకట మధిరోహించి వచ్చుచుండిరి. తుపాకులు, కత్తులు, బాకులు, బల్లెములు ధరించి సాముకాండ్రిరువంకల నడచుచుండిరి. రాజుగారి సేన ముందు బారులుదీరి గమించుచుండెను. ఒక దివ్యాశ్వము నెక్కి గాజుద్దీను దండునకుముందు నడచుచుండెను. తుడుము, తప్పెట, కాహళము, రుంజ మున్నగు నానావిధ వాద్యముల ఘోషతో భూనభోంతరములు మార్మ్రోగుచుండెను. స్త్రీలయు, బురుషులయు, బిల్లలయు, పేరంటాండ్రయు, పెండ్లి పెద్దలయు, కోలాహలమున బదిరీభూతములైన పురవీధులం దొకరిమాట యొకరికి వినబడుట దుర్ఘటమయ్యెను. చూపర కమ్మహోత్సవము పెండ్లిపయనమువలె గాక పల్నాటిపైకి దండెత్తిపోవు ప్రళయసంగ్రామము వలె గోచరించెను.

చిన్నవా దంతకుముందు నాటి రాత్రి నుండియే యూరు విడిచిపోయెను. ధనిసెట్టి చిన్నవానిని వెదకించి, యతనిజాడ తెలియమి, చింతాక్రాంతుడై, యిట్టి శుభసమయమున మన సార ప్రేమతో బెంచుకొన్న యనాథబాలుడు లేడుగదాయని వగచెను. సుధాదేవి చుక్కమ్మ యనితల్లులు చిన్నవాని వృత్తాంత మాలించి కంటతడిబెట్టిరి. అతడు పశువులశాలలో

చిన్నవాని కథ యనూహ్యమయ్యెను. తనయాజ్ఞలేక యేపనియుజేయని చిన్నవాడట్లంతర్ధానమై పోవుట ధనిసెట్టి కాశ్చర్య కారణమయ్యెను. చిన్నవాడు కృతఘ్నుడు గాడు, బుద్ధిశాలి, ధనిసెట్టి నతడు ప్రత్యక్షజనకుని వలె భావించును. అట్టి చిన్నవాడదృశ్యమై పోయెను. చిన్నవాని కెవరైన హానిచేసి యుందురా? అట్లెన్నడును జరుగదు. చిన్నవాడూరివారికి తలలోని నాల్క.

ధనిసెట్టి గృహసంరక్షణమునకు దగినవారిని నియమించి పెండ్లి కార్య మాపరానిదగుట తానొక మేనాలో పెండ్లి జనము ననుసరించెను. మార్గమధ్యమున గాజుద్దీను నాల్గయిదు మారులు సుధాదేవిని జూచుట తటస్థించెను, అప్పుడతని లక్షణములు విపరీతములుగా నుండెను. సకిలించుట, గడ్డము దువ్వుట, యొడలు విరచుకొనుట, నోరచూపులు విసరుట, దుస్తులుసర్దుకొనుట భటుల నదలించుట సేయజొచ్చెను. వేయి మాటలేల కోతులు కొండముచ్చు లతనిలో నావేశించినవి. సుధాదేవి చకిత హరిణివలె చుక్కమ్మచాటున నక్కిపోవుచుండెను. ధనిసెట్టి యతని విపరీత ప్రవర్తనమును గనిపెట్టి కోపము నాగబట్టలేక రవంత మందలింపవలెనని తలచి, "గాజుద్దీను గారూ! తమకు కామినీ దర్శనమున కావలసినంత కై పెక్కును గదా. కల్లునకు కబురంపితిరేల" అని హేళనముగా బలికెను. సర్దారుగారు సిగ్గుపడి "కామూ"షని గుఱ్ఱమునదలించి దూరముగా బోయిరి.

ధనిసెట్టియాడిన మాట సాహేబుగారికి శిలీముఖము వలెనాటి వేధించసాగెను. అతడు ధనిసెట్టిని తన యధికారముతో కొంత యదలింపజూచెను. గాని రాజునకు ధనిసెట్టికిని గల లావాదేవిని తలచుకొని తగ్గిపోయెను. నాల్గునాళ్ల దీర్ఘ ప్రయాణానంతరమున పెండ్లివారు మందాది గ్రామమును ప్రవేశించిరి. దొంగల బారిబడక, యెట్టి యలజడికి నగముగాక ఆత్మీయులెల్లరు గమ్యస్థానము జేరినందులకు ధనిసెట్టి యెంతయు సంతసించెను. వివాహమేడు నాళ్ళెనలేనివైభవముతో సక్రమముగా జరిగిపోయెను. ఆ వేడుకను కన్నారజూచి చిన్నవాడెంత యానందించి యుండెడివాడో యని తలపోసి ధనిసెట్టియు నతని కుటుంబమును పలుమారు నిట్టూర్పులు నిగుడించెను. సుధాదేవి కన్నులలో చిన్నవాడు దక్క వివాహమహము విహరింపలేక పోయినది. చుక్కమ్మ సుధాదేవులు చిన్నవాని సంగతి పలుమారు తలచుకొని కలతపడిరి. సదస్యమునాడు బ్రాహ్మణ్యమునకు సంభావనలు పంచిపెట్టబడెను. ఉదాత్త భావభరితములైన సందేశములతో వధూవరుల నాశీర్వదించిన విశంకటశాస్త్రిగారిని ధనిసెట్టి కనక కంకణములతో దుశ్శాలువులతో సత్కరించెను. వసంత కోకిలా కలకంఠ కాకలీధ్వనిని కాదను కలికి కంఠస్వమున పెండ్లిపాటలు పాడి వివాహమునకు శోభదెచ్చిన సుధాదేవికి ధనిసెట్టి జలతారు చీరలు చదివించెను. అడిగినవారికడిగినంత లేదనక దానమిచ్చిన ధనిసెట్టిని ప్రజలెంతయును శ్లాఘించిరి. ధనిసెట్టి కీర్తి పాయకట్టున బ్రాకిపోయెను.

చుట్టపక్కములతో వినుకొండకు బయనమయ్యెను. నడచిపోవుచున్న మహానగరమువలె రక్షక భటరక్షితమై వచ్చుచున్న ప్రజా సమూహమునకు దొంగ భయము తొలినాడే తొలగిపోయెను. మార్గమధ్యమున వారొండు రెండు మజిలీలు చేసిరి. ఈతకల్లు పుష్కలముగా లభించుటచేత దండనాథుడగు గాజుద్దీను భటవర్గముతో కడవలు కావిళ్ళు ఖాళీజేసివైచుచు, కథలు చెప్పుచు. గానము చేయుచు, సోలుచు, దూలుచు ప్రయాణము సాగించుచుండెను. "కన్నమదాస్ కౌన్‌హై!, కాహై!, ఏక్‌మార్ దో టుకడా! మేరా నామ్ గాజుద్దీన్! దీన్!" యనిపలుమారు చర్చించుచు దెసలుపరికించుచు, "అరేబిలాల్! అరేనూర్! హుషార్! హుషా" రని భటశ్రేణిని హెచ్చరించుచు, తన తురంగముమీదనే కాక సురాతురంగమునను స్వారి సాగించుచుండెను. భట కందబమును యజమానితో నేమర్యాదయందును తీసిపోనివారగుట కత్తులు ఝుళిపించుచు నాత్మస్తుతి పరాయణులై నడచి వచ్చుచుండిరి. ధనిసెట్టియు, నాత్మీయులును, రాజయోధుల ప్రగల్భముల నాలించుచు నిట్టి వాచాశూరుల తోడ్పాటు ప్రమాదజనకమని యెరింగినవారగుట చుట్టుప్రక్కన గలయ జూచుచు ప్రమాదము శంకించుచు ప్రయాణము చేయుచుండిరి.

ఒకనాడుదయ కాలమున నాయకురాలికనుమ ప్రవేశించి నల్లగొండలకు సమీపమున నాగులేటి తీరమున కార్యములు దీర్చుకొని చల్దులారగించవలెనని పెండ్లివారు మజిలీచేసిరి. నాగులేరక్కడ నాగుబాముచవలె మెలికలు తిరిగి ప్రవహించుచుండును. తత్తీరారణ్యము నానావిధ గుల్మలతాదులచే దట్టముగా నల్లుకొని యరణ్యాంగన దాల్చిన యల్లికజడ వలె మార్గస్థులకు చొరరానిదై యుండును. బాలచంద్రుడా నల్లగొండలపై యురుమై యురిమి నాగులేట పిడుగై తన పొట్టేలి గుఱ్ఱమును దూకించెనని కథకులు గానము చేయుచుందురు. నాయకురాలు బ్రహ్మనాయు నెదుర్కొని యవమానించగా బ్రహ్మనాయడచ్చుటి కొండను భేదించుకొని దాటిపోయెనట, తచ్ఛిహ్నమయిన గండోపల మొండు రెండుగా నఱుకబడి యిప్పటికిని నిలిచి యున్నది. రాజభటులూ ప్రదేశమును జూచు కుతూహలమున నాయుధముల నొకచోట నిక్షిప్తము చేసి యెవరికి దోచిన త్రోవను వారు బోయిరి. పురుషులు గుములు గట్టి విశ్రమించి దంతధావనము చేసికొనుచు లాభ నష్టముల గొడవలో బడియుండిరి. స్త్రీలు, పిల్లలు, శకటములను దిగి వికసించి వేడుకచేయుచున్న నానావిధ పుష్ప సౌరభముల నాఘ్రాణించుచు చిదిమి సిగలో బెట్టుకొనుచు, చిటిమిటి, జాన, కందురు, నెమ్మి, మున్నగు నపూర్వములయిన వన్యఫలములను గోసికొని భక్షించుచు నాదమరచి విహరించుచుండిరి. ధనిసెట్టి యట్టి తరుణమున జాకరూకులై యుండక, నిరాయుధులై రాజభటులు వనవిహారము చేయుట ప్రమాదమనియు మద్యపానము కిది యదను గాదనియు, కై పెక్కి యసంబద్ధ ప్రలాపములాడుచు, గుఱ్ఱము నానుకొని వనితామండలమును పరకాయించి చూచుచున్న గాజుద్దీనును కఠినముగా మందలించు చుండెను. ధనిసెట్టి తన మాట మన్నింపక యనాదరించుటయేగాక నీతులుపదేశించుచున్న కారణమున గాజుద్దీను మండిపడి

తూలనాడుట ప్రారంభించెను. ధనిసెట్టి యతని పెడసరపు ప్రత్యుత్తరమున మరింత కోపించియు శాంతించి రవంత వివాదమునకు దిగవలసిన వాడయ్యెను.

అమావాస్యనాటి యంధకారములవని కవతరించినవో యన్నట్లు కన్నముని దండు హఠాత్తుగా ప్రత్యక్షమై ప్రళయహుంకారములను చేయుచు ఆయుధములను ఝళిపించుచు, చేతి కందించినట్లు రాజభటులొక్క చోట నిక్షిప్తము చేసిన సమస్తాయుధములను స్వాధీనము చేసికొని దండనాథుడగు గాజుద్దీనుని కాలుసేతులు బంధించి యొక చెట్టునకు గట్టిరి. కవచ ఖడ్గధారియై కన్నముడు కట్టిగుఱ్ఱమునెక్కి సేవకులకు వీరావేశము నూరి పోయుచుండెను. గడియలో కనక భూషణములు రాసులై నదీతీరమున కనక చ్ఛాయలతో కలయంపి జల్లుచుండెను. త్వక్కుదీసిన నారింజపండువలె నిరస్తభూషణమైన వైశ్యవనితా మండలి దీనాతిదీనముగా రోదనము చేయనారంభించెను. రాజభటు లాకోలాహలమునాలించి మరలివచ్చుచు కార్యముమించి పోయినదని తెలిసికొని కాలికి బుద్ధిసెప్పిరి. అట్టి తరుణమున నూరకుండు టుచితముకాదని ధనిసెట్టి చేతతలవారు బట్టుకొని కన్నముని దాకెను. కన్నముడు ధనిసెట్టిని గుర్తుపట్టి కరవాలము నతనిపై విసరెను. వ్రేటు దప్పించుకొని ధనిసెట్టి సమీపించుచుండ కన్నము డతిదీర్ఘమై మూపున సంధింపబడియున్న బల్లెము నందుకొని పగతుని గ్రుచ్చి యెత్తవలెనని గుఱ్ఱముపై నుండి గురిజూచుచుండెను, చిత్రమేమని చెప్పుదము తీవ్రవాత్యార్భటులతో నొక బాణము వాయుమార్గమున బఱతెంచి కన్నముని కరమును మణికట్టువఱకు దెగనఱికెను. బల్లెము భూమిపై బడినది. కన్నముడు సింహనాదము జేసెను. యజమాని హస్తమును ఛేదించిన ధనుష్మంతు డెవడో, బాణమేదిశనుండి వచ్చెనోయని తస్కరులు నిర్ఘాంతపడి నిలిచి చూచుచుండిరి. బాణములు పుంఖాను పుంఖములై వచ్చి చోరుల శిరఃపాటనము చేయుచుండెను. దొంగలు, దొరలు, విభ్రమాశ్చర్యభరితులై చూచుచుండిరి. గడియ కాలము కోలాహలము వానవెలిసిట్లు నిలిచిపోయినది. ఎవడీ యజ్ఞాత రక్షకుడు? ఆశ్చర్యము ధనిసెట్టి నలుదెసలు బారజూచు చుండెను. ఇంకెవరు? మన చిన్నానాయకుడు! నాడు నల్లగొండలపై మెరిసిన బాలచంద్రుని వలె పర్వతాగ్రమున నుదయించి పక్కున నవ్వుచుండెను. బాణబాణాసనహస్తుడై మంచుమలపై యస్త్ర విద్యాభ్యాసము చేయు కుమారునిలె శబర కుమారుడు చక్షురానందము చేయుచుండెను. ధనిసెట్టికి బెండ్లివారికి బ్రహ్మానందమైనది. సుధాదేవి చుక్కమ్మలు చిన్నవాని సహజ వీరమూర్తి నానాడు కన్నార జూచి యుప్పొంగిపోయిరి. కన్నమదాసు చిన్నవానిని తేరిపార జూచెను. పండ్లు పటపటగొఱికి "క్రూరాత్మా! నిన్ను నమలి మ్రింగెదన"ని గుఱ్ఱమునుడాయించెను. గుఱ్ఱము నాల్గడుగులు వేసెనోలేదో శిలీముఖమొకటి సైంధవము శిరస్సునుండి దూసుకొనిపోయెను. అశ్వమునకు చందనపు తిలకముగానున్న తెలిమచ్చ మాసిపోయినది. గుఱ్ఱమాదెబ్బతో ముంగాళ్లపై మోమునానించి చిన్నవానికి నమస్కరించుచున్నదో యన్నట్లు నేలకొఱిగెను. కన్నముడును బిళ్లబీటుగాదొరలి తక్షణమే లేచి నిలిచెను. పాపము! నేలపై బడి చిరకాలమునుండి వీపున

నంటి పెట్టుకొని వేధించుచున్న కలుషరాశియైన కన్నముని సేవకిది ఫలితముగా భారవాహము పరమ పదించెను, కొండకెగ బ్రాకి వచ్చుచున్న కన్నముని చిన్నవాడు సంహరించక, "కన్నమా! ఆగుమాగుము, నీకంత ప్రయాస వలదు, నేను దిగి వచ్చుచున్నా" ననుచు నతిశీఘ్రముగా కొండ దిగివచ్చి దిక్కు దోచక చూచుచున్న కన్నముని సరదారులకు కన్నమునకు నూరు బారల దూరమున నిలిచెను. అడుగు గదలించిన యొక రిద్దరు చోరులకు గుఱ్ఱపుగతియే సంప్రాప్త మగుటచేత నోట మాటరాక కత్తులను వ్రేలాడవైచికొని పశ్యతోహరులు పదమెత్తుటకు సాహసించక పరికించుచుండిరి. పెండ్లి వారికిని ధనిసెట్టికిని స్వప్నమో! నిక్కువమో యను ననుమానము కలిగి యనిమిష నేత్రములతో నిశ్శబ్దముగా చూచుచుండిరి. చిన్నానాయకుడు చివాలున పొదినుండి యర్ధచంద్ర బాణము నందికొని వింటసంధించి "కన్నమా! నేనెవ్వరో యెఱుగుదువా? లేఖాముఖమున నొకపరి నీకు దర్శనమిచ్చితిని. నేడు ముఖాముఖి దర్శనమిచ్చుచున్నాను. నా పేరు చిన్నానాయకుడు. ధనిసెట్టి సంహారార్థమై నీవంపిన హంతకుల నంతరింపజేసిన చెంచుబిడ్డను. వారి ప్రాణవాయువుల నపహరించి తనివి గొన్న శరసర్పములు నా పొదిలో దాగియున్నవి. చూడుమని అంకెలతో నలరారుచున్న బాణచతుష్టయమును వాని పాదములవద్దకు విడిచెను. 'ఇదిగో నాతల్లి ముంగరను కంసాలి దుఖాణమునకు గొని తెచ్చిన పరిచారకుని పచ్చినెత్తు రానిన పంచమబాణ' మని మరొండు బాణమును వదలెను. 'కన్నమా! అర్థమైనదా? కథ పూర్తికాలేదు వినుము. నా చేత నున్న యర్ధచంద్రకాండము నరసితివా! ఇదినీసొత్తు, నిన్ను మున్ను సేవించుచుండెడిది. కసిగందైన నారెండేండ్ల చెల్లెలిని కరుణ మాలిన నీ యాజ్ఞచే ఖండించి కలుషమార్జించినది. కర్ణుని సర్పబాణమువలె నిన్ను బొలిగొనుటకు నాతూణమును ప్రవేశించినది. నేడు నిన్ను సంహరించి కలుషము వాపికొనగలదు. జ్ఞాపకము వచ్చినదా? నల్లగుండ్ల కనుమ కన్నీరు పెట్ట నీవు కావించిన ఘోరకార్యము? ఆనాడసువుల బాసిన మందభాగ్య మాతల్లి, కన్నమా! కాచుకొను'మని కన్నుల నదరులు చెదర కర్ణాంతముగా లాగి శరమును విడిచెను. కన్నముని కంఠము గరుక్కున నరుకుకొని రక్తసిక్తమైన శరమవ్వల నరువది బారల దూరమున బడినది. బండపైగొట్టిన కుండ పెంకులవలె బదాబదలై పారిపోవుచున్న కన్నమానుచరుల నుద్దేశించుచు, "తస్కరులారా! తిరిగి చూచితిరా మీ ప్రాణములు మీవి కావు పొండు. చూపుమేర దూరమున మీ పొడ కనుపించరాదు. ఇదిగో నేనీ కొండ శిఖరమున నుండి చూచుచుందు" నని కొండ కొనపై నిలిచి చూచుచుండెను.

చిన్నవాడు కొండదిగివచ్చి ధనిసెట్టికి నమస్కరించి నిలిచెను. ధనిసెట్టి ఆనందాశ్రువులతో బాలుని కౌగిలించుకొని "కుమార రూపమున మమ్ముద్ధరింప బుట్టిన కుమారుడ" వనికొనియాడెను. ధనిసెట్టి ఆప్తులు బంధుమిత్రులు చిన్నవాని శౌర్య సాహసముల నెంతయు మెచ్చుకొనుచు పులినోటబడి ప్రాణముల దక్కించుకొన్న హరిణములవలె పయనము సాగించిరి. చిన్నవాడు బంధితుడైన గ్రాజుద్దీనుని కట్లు విప్పి కరములు మోడ్చెను. అప్పటికి

నిషా పూర్తిగా దిగిపోయిన సర్దారు కడచిన వృత్తాంతమును కనులార జూచుచున్న వాడగుట. లజ్జావనత ముఖుడై శబరబాలుని సద్గుణ శౌర్య సంపద కాశ్చర్యపడుచు తన భటులుం దానును చేసిన పొర పాటునకు నొచ్చుకొనుచు నక్కడ నుండియే సెలవు పుచ్చుకొని స్వస్థానమునకు బోయెను. చిన్నవాని వీరచరిత్ర చిటుకలో నానాదిక్కులకు నడచిపోయెను. దేశభద్రతకు రాచపుండై వేధించుచున్న కన్నమ హంతకుని మరణమున ప్రజలు నిర్భీతులై నిద్రించుచుండిరి.

వినుకొండ పౌరులు చిన్నవానికి బ్రహ్మరథము బట్టిరి. నాటి నుండి వినుకొండ వీరపూజ కలవాటుపడి కళాతత్వము నవగతము చేసికొనసాగినది. గుండారాయణిం గారీ యద్భుత వృత్తాంతము నాలించి తానానాడుగాంచిన వ్యాధ బాలుడే చిన్నవాడని తెలిసికొని కొలువుకూటమునకు బిలిపించి "గండరగండ" డనుబిరుదమునొసంగి బహుమాన శతములచే తృప్తిజేసి తన కొలువున నుండవలసినదని బలవంతము చేసెను. చిన్నవా దంగీకరించక "తనకు మారట తండ్రియై బాల్యమాది పోషించిన ధనిసెట్టిసేవ తనకాచరణీయమనియు వారినెడ బాసి నిముషముండజాల" ననియు చెప్పెను. రాజతని గుణశీలముల కచ్చెరువంది గుణములకు కులము కారణము గాదని గ్రహించి సగౌరవముగా సాగనంపెను. తన సేనాపతి చేసిన చిలిపిచేష్టలకు కొని తెచ్చిన యవమతికి, సహించక పదవీభ్రష్టుని చేసెను. ధనిసెట్టి చిన్నవాని ఋణ మెట్లు తీర్చుకొందునాయని చింతించి తన యాస్తిలో నైదవభాగ మతనికి వ్రాసియిచ్చి నల్లమలకు బోయి ఒక చెంచుకన్యం గొని తెచ్చి చిన్నవాని కిచ్చి వివాహము చేసి అయిదవ కుమారునిగా స్వీకరించెను. అనితల్లికి చిన్నవా డిప్పుడనుగుబిడ్డ డయ్యెను. చుక్కమ్మ చిన్నవాని 'నన్నా'యని పిలుచుచు నత్యంత సన్నిహితత్వమును జూపుచుండెను.

సుధాదేవి మాతృవిహీన, జీవత్తాతపాద కన్నమునిచే నపహృతయైన సోదరిని వెదకుచు సుధాదేవి సోదరులు కన్నముని చేత కడతేర్చబడిరి. తండ్రి కడు వృద్ధుడయిన కారణమున, కొన్నాళ్లు కూతురి దుఃస్థితికి వగచి నిరాస చేసికొని కుమార మరణమున కృశించుచుండెను. సుధాదేవి పూర్వికులు సంస్థానపతులై చిరకాలము ప్రతిష్ఠగా బ్రతికినవారు. మల్రాజు గుండారాయనివంశీయులకు సమీపబంధువులు. కాలక్రమమున వారి యైశ్వర్యము చిదికిపోయినది. నేడు సుధాదేవి కుటుంబము నిండు పేదఱికము ననుభవించు చున్నది. అభిజాత్య గావున సుధలో మెచ్చదగిన మేలిగుణములు వలచి కాపురము చేయుచున్నవి. సుధాదేవికి చిన్నవాని యందు భ్రాతృ భావ మేర్పడినది, సుధ వర్ణ వైషమ్యములను పాటించదు. మానవులెల్లరు నేక జననీ సంభూతులను సిద్ధాంతము గలది. చిన్నవాని వివాహకాలమున సుధాదేవి పెత్తనము గట్టుకొని యెగ్గులేక సమస్త కార్యములను నిర్వర్తించినది. ధనిసెట్టి కాబిడయం దధికానురాగ మేర్పడినది. సుధాదేవి కుటుంబము దారిద్ర్య మనుభవించు చున్నదని విని అతడు సుధాదేవి తండ్రికి కబురుచేసి పిలిపించి కొన్నాళ్లు తనవద్ద నుంచుకొని సుధాదేవి తస్కరహస్తగత యయినను నఖక్షత మంటని నవపల్లవమువలె పవిత్రమైనదని తండ్రి

ప్రస్తుతించెను. ధనిసెట్టి సుధాదేవికి వివాహము చేయవలసిన దనియు, వ్యయము తానొసంగెదననియు వాగ్దానము చేసి కొంత పైకమిచ్చి సుధాదేవిని తండ్రితో స్వగ్రామమున కంపెను. ఆనాటి సుధావియోగమున ధనిసెట్టి శకుంతలను సాగనంపు కణ్వునివలె కలతనందెను. సుధాదేవికి చుక్కమ్మనోదార్చుట ప్రత్యేక సమస్యయయ్యెను. సుధాదేవిపోక చుక్కమ్మకేకాక ధనిసెట్టి కుటుంబమునకును దుఃఖదాయక మయ్యెను. చిన్నవాడక్కా! యని కంటతడి బెట్టెను. సుధాదేవి త్వరలో తిరిగి వత్తునని గద్గదస్వరమున నతని నోదార్చి సెలవు పుచ్చుకొని తండ్రి వెంట పయనమైపోయెను.

గుండారాయణింగా రొకనాడు చిన్నవానిని, ధనిసెట్టిని రావించి సముచిత పరివారముతో కన్నముని కోటకుబోయి స్వాధీనము చేసికొని పలాయనమయిన కన్నముని భార్యలను బట్టించి బందిజేయించి అందలి వస్తువాహనములను చిన్నవాని కర్పించి చుట్టుపట్ల నున్న సుక్షేత్రముల నతనికొసగి చిన్నపాళెగాని గావించి యతని నభిషిక్తుని జేసెను. చిన్నవాడాకోటలో చిరకాలము వాసము చేసి మహాకుటుంబియై గండర గండడను బిరుదుదాల్చి పల్నాటివాసుల వాత్సల్యమును చూఱలాడి నూతేండ్లు జీవించి కాలధర్మము నందెను. బొల్లాపల్లి యడవిలో నేటికిని కన్నమదాసు కట్టించిన బురుజు శిధిలావస్థనంది స్మృతి చిహ్నముగా నిలిచియున్నది. మహావీరుడయిన చిన్నవానిని పల్నాడు మరచిపోయినది.

# ఒక్కమాట

శ్రీ వేంకట సుబ్బమాంబగారు–సింహపురి సుప్రసిద్ధ న్యాయవాదులలో వీను మిగిలిన శ్రీ రావుసాహెబు సానెకొమ్ము మాలకొండారెడ్డిగారి ధర్మపత్నులు. ఆ శుభదంపతులకు నేను కడుపునబుట్టని కన్నపుత్రుణ్ణి–వారు నాకు జీవత్తాతపాదులు, వారి హృదయకుహరంలో నేనిల్లుగట్టుకొని పాతికేండ్లయినది. కనిగిరిసీమలో శ్రీ రెడ్డి దంపతుల ప్రజాహిత కార్యపరత్వం, దీనజనాదరణ, ధర్మనిష్ఠ, ప్రత్యణువులో ఖంగునమ్రోగినది. కైమోడ్పులందుకొన్నది. రెడ్డిగారి హృదయమెంతటి యుదారమైనదో సుబ్బమాంబగారి శీలమంతటి యుదాత్తమైనది. రెడ్డిగారెంత కళాభక్తులో, వేంకట సుబ్బమాంబగారంతటి చుట్టాలసురభులు. కార్యాలపట్ల రెడ్డిగారెంతటి భగీరథులో వారంతటి ధర్మనిరూఢలు. శ్రీ వేంకటసుబ్బమ్మగారి శీలసంపత్తి, దైవభక్తి, సహనం, సత్కార్యాచరణపరత్వం, కనిగిరి, సింహపురిమండలాలకు మండలాయమానాలై యింటింట ముత్యాలముగ్గులు తీర్చినయి. శ్రీ రెడ్డిగారసహాయోద్యమంలో ఖద్దరుధారులై జాతీయ రణంలో కాలుమోపి సలిపిన సేవకు శ్రీ సుబ్బమాంబగారి సుస్థిర గృహిణీత్వం–వజ్రకవచమై దోహదం చేసింది. ఆనాడు, వారి ప్రతిష్ఠాలలితలతలు సింహపురి మండలంలో సౌరభిల్లి–నలుదిశల నల్లుకొన్నాయి, ఒకానొక సందర్భంలో శ్రీ రెడ్డిగారిపైనే వ్రాసిన ప్రంశంసాపద్యగుచ్ఛాన్ని స్థలాంతరాన ప్రకటించడం అప్రస్తుతం కాదనుకుంటాను. నాకావ్యోపాయనం, వారి ఋణాన్ని శతాంశమైనా తీర్చగలిగితే ధన్యుణ్ణికాగలనని నా నమ్మకం– అట్టి దివ్యదంపతుల వియోగం – ఎవరి హృదయాన్ని కదలించదు? శ్రీ సుబ్బమాంబా మరణవార్త నాలో నిప్పుకొండల్ను రేగించి, కారించింది. నేడు మారెడ్డి విధురమూర్తి, నిరాలంబుడు. కలిగిన పేద. బలగమున్న బలహీనుడు, సజీవకంకాళం. గాజుపూసలకనకగేహినీత్వవిలాసంతో, భర్తృనంకాన, గంపెడు బలిగంపూల వానలో, పరమపదించిన పరమసాధ్వికిదే నాశ్రద్ధాంజలి, కావ్యకుసుమాభిషేకం–కన్నీటికాన్క.

జి. జాషువ

# అంకితము

ఉ. అంకితమిత్తు నాహృదయ మాసవవాగ్మికి, మాలకొండ నా
మాంకిత రెడ్డివీరున కహార్యసమంచిత ధైర్యశాలికిన్
పంకజబంధుతేజున కవారిత నిస్తుత సత్యవాక్య ని
శ్శంకునకున్ గభీరగుణ సౌరభ సాహస దివ్యమూర్తికిన్

మ. నినుఁగాదన్న విరోధులందలలు దన్నెన్ నీజయం బెందుఁజూ
చిన, నీకీరితి కన్నియల్ వలచి హర్షించెన్, హరిద్భాగముల్
నినుఁగొండాడఁదొడంగె నో యమృతవాగ్మీ! మాలకొండప్రభూ!
అనుకంపాయుతమైన నీచరిత మా కభ్యర్చనీయంబగున్

చం. కనిగిరిసీమ నీ వలపు కౌఁగిట మన్ననలందునాఁడు, పూ
చిన సుయశస్సు, నేఁటికిని జిన్నెలువన్నెలు దాల్చుచుండె, మా
తెనుఁగు సవిత్రియక్కునగదించి, ముదంబునముద్దులాడ నె
త్తిన యడిదంబుదించక ధృతిన్ రథముంగదలింపు ముద్ధతిన్

సీ. నిలుచునే నీముందుపలికి బొంకు విరోధి పటలంబు గుండెనిబ్బరముసూపి
పలుకునేవెడ నోటిజిలదీర లోకాపకార లాలస పత్రికాచయంబు
ఆగునే నీదారికడ్డంబుగా కత్తి బట్టిన పగవాని వాహనంబు
సాగునే రిక్తవాచావిశారదుల జంఝూటంబు కృత్రిమనాటకంబు

ఆ.వె. నీ కృపావిభూతి! నీ ధర్మశీలత
నీకు వజ్రకవచ నియతిసుమ్ము!
చిలుగు లెన్ని యేని చెనకవు నిన్నేటి
కోళ్ళు నీకు మాలకొండరాయ?

మ. అది భల్లూకపుపట్టు మావశముగా దంచున్ భయభ్రాంతమై
బెదరున్నీయరిమూఁక నీవొకపనిం బ్రేమించి చేపట్టినన్
గదలుందారకలుం గ్రహంబులొక సత్కార్యంబు సాధించుచో
సదయా! నీ హృదయంబు వెన్నయును పాషాణంబు కార్యంబులన్

ఆ.వె. పురుషసింహ! నీవు పురమేగ నినుఁజూచి
మొరగవచ్చు శుని సముత్కరంబు
నీకుఁ గొఱతఁలేదు, నీస్యందనధ్వని!
దుండగీంద్రకెల్ల గుండెదిగులు

జి. జాషువ

# అశ్రుమంజరి

మ. మఱుమాయంబయిపోయెనే సుగుణసంపత్పేటి, పూబోండ్లపా
పటబొట్టాసవదివ్యవాణి, శుభరూపజ్యోతి యందాల వేం
కటసుబ్బాంబికసానెకొమ్ముకుల నక్షత్రేశునిల్లాలు ప్రో
త్కటపుంజీకటి నెల్లి దూలికుల మాకంపించి శోకింపగన్

శా. మామాల్కొండమనీషికబ్బిన యదంబప్రాభవ శ్రీలకున్
నీమాంగల్యబలంబకారణముగా నిత్యంబు మోదింతు మ
మ్మా! మైరేయసమానశీలవతి దేవావాసముంజేరి మా
స్వామింగల్గిన పేదగా సలిపినావా? రెడ్డిరాజ్ఞీమణీ!

ఉ. నీవొక దేవకాంతవని నిత్యమునమ్మి స్మరించునట్టి నీ
దైవము ప్రాణనాథుడు సుధామధురస్థిరసచ్చరిత్రు డాం
ధ్రావనిగన్న రెడ్డిదొరలందునమేటి భవద్వియోగచిం
తావిలచిత్తుడై నవయునమ్మ! యొకానొక పిచ్చివానిగన్

శా. ఛాయాచిత్రమునందు మీమధుర సంసారప్రయాణంబులో
చాయల్గోచరమై నిరంతరము బాష్ప శ్రేణివర్షించుచున్
గాయంబైన మనస్సుతోడ నిను శృంగారించుచున్నాడు త
ల్లీ! యాత్మేశ్వరుడూరడించుకొనవమ్మా! దొడ్డముత్తైదువా!

ఆ.వె. వెన్నపూసకన్న వేయిమడుంగులు
మెత్తనగుచు కరుణమిట్టిపడెడు
గుండెగల్గు మాలకొండరాణ్మణిచిత్త
మోర్వగలదె? నీవియోగధాక

ఆ.వె. అదరమున నీవు యన్నంబుబెట్టగా
తిన్నవాడు పలుకువిన్నవాడు
మరచిపోగలాడె? మాటలేటికి పతి
వ్రతవునీవు ధర్మరతివితల్లి!

కం. కొడుకులకన్నన్నను పది
మడుంగు లధికముగజూచి మన్నించిననీ
యొడయనికి నీకు నే ఋణ
పడిన కవిని తల్లి జాషువానుపురంధ్రీ!

చం. తెలుగుజగంబు గర్భమున జన్మములెత్తిన సత్కవీశ్వరుల్
గలరు సహస్రసంఖ్యలు ప్రగల్భములాడుటగాదు జాషువా
పలుకున ప్రాణమున్నదని బ్రహ్మకు జంకక పల్కు రెడ్డిరా
ట్కలభుని పత్నికిన్ గలుగుగాక వికుంఠజయప్రవేశముల్

మ. అనుగుంగూతుల పెండ్లిపేరటములానందంబు మిన్నంటగా
గని, యల్లుంద్రును బంధుమిత్రులును వీకన్నిన్ను గొండాడ, చ
క్కనిమర్యాదలనంది ప్రాణవిభునంకంబందు మాంగల్యపుం
గొనబుంగుంకుమ రేఖతో చనిన నీకుం గోటి పుష్పాంజలుల్

ఉ. కూతుల కండ్లలోన ననుగుం దనుజన్ములమోములోన నీ
పూత ముఖారవిందమున బోల్చెదు పోలికలించుకంతగా
ద్యోతకమై మనోహరుని కూఱటగూరిచి మెల్లమెల్లగా
చేతమునూచి కన్నుగవ జెమ్మలునించికలంచు నమ్మరో!

సీ. నిజభర్తృవదనంబు నిలువుటద్దంబుగా తిలకంబుదిద్దిన దివ్యచరిత!
జీవితేశుని వాక్కు జిలుగుపూదండగా తలమీదదాల్చిన ధర్మశీల!
భర్తృనుచ్ఛిష్టంబు భగవదంధస్సుగా వ్రతము సల్పిన రడ్డి రాచనెలత
మగనిచేతోవీధి మణిమందిరంబుగా కాలంబు నెట్టిన గరితమిన్న

ఆ.వె. మాల కొండరెడ్డి మానమర్యాదల
కాలవాలమైన యమృతచరిత
పృథివివాసి దివికివేంచేసె వేంకట
సుబ్బమాంబ వంతగుబ్బటిల్ల

సీ. విరమించెనమ్మ! నీ విభుడు ప్లీడరువృత్తి యుడుమండలమున నీవడుగుమోప
మానినాడమ్మ! నీ మగడెల్లభోగముల్ తెరచాటునకు నీవు మరలిపోవ
చాలించినాడు నీ స్వామి ద్రవ్యాపేక్ష నీవులేవనిదీర్ఘనిద్రవోవ
తలపోయడమ్మ! నీ ధవుడు రెండవపెండ్లి నీవు కీరితికొండ నిలిపిపోవ

ఆ.వె. యేముహూర్తమందు నిర్వురిప్రణయైక
కుసుమలతలు పెనచుకొన్నవొక్కొ
కాంతు జీవితమును గాయపర్చనితావు
లేదు తల్లి! నీవులేని కతన

చం. ఎఱుగుదునమ్మ! నీదుహృదయేశుడు నీదుపరోక్షమందు, నీ
పరమపవిత్ర శీలమును ప్రస్తుతిసేయుట, నిట్టి గౌరవా
దరములు చూఱలాడి, పతి దండవసింపగ గాజుమెట్టెతో
పరమపదించినట్టి ఘన భాగ్యము నీదికదా? పతివ్రతా?

మ. నడయాడున్ సిరి నేడు నీగృహములోనన్ గజ్జెలల్లాడ, నీ
యొడయండున్ సుతలుం గుమారుడు బలాయుర్భ్రాతులై యింట సం
దడి నిండార రహింతురిప్పుడును సౌందర్యప్రభారాశి, నీ
యడుగున్‌జాడలులేని పెన్గొఅత ప్రత్యక్షించి కారించెడిన్

చం. మరణితులందరున్ గగన మండలి, కొండొకచోట రత్నమం
దిరముల నిచ్చలున్ సురనదీతట పుష్పవనాళి హాయిగా
దిరుగుచునుందురంద్రు సుదతీమణి! యయ్యది నిక్కమైన న
ప్పరమసుఖంబులో ప్రథమభాగమునీకగు సుబ్బమాంబికా!

ఆ.వె. కలిమిదెచ్చి పెట్టు గర్వంబు నుబ్బను
నీయుపాంతసీమ డాయలేక
కదలిమెదలలేని కలవారియిల్లాండ్ర
యంగకములనెల్ల నాశ్రయించె

ఆ.వె. రడ్డిశబ్ద మందురాజనుశబ్దంబు
జన్మమయ్యె నాంధ్రజగతియందు
రాజవంశమందు ప్రభవంబుగన్నట్టి
యతివవీవు, ధ్యేయవమ్మ మాకు?

కం. కనిగిరి తాలూకా బో
ర్డునకుం బతి భర్తయైనరోజులో నీ
ఘనమాంగల్యబలంబే
యినుపకవచమగుచుబ్రోచె హృదయేశ్వరునిన్

చం. పులివలె గావుబట్టి, తనువున్ దినివేయుచు దేవతాభిష
క్కుల కెనయైన వైద్యులను గూడ తిరస్కృతిజేసి, రోగమ
గ్గలమగుచుండ, నీవలపు కాంతుని గుండెలలోన నెన్నిభూ
ములు తలక్రిందులై కరగి పోయినవో దవధూమ ధగ్ధమై

సీ. సంజీవివంటి యౌషధరాజములశక్తి నీవ్యాధిధాకకు నిలువనపుడు
సురభిషక్కులవంటి వరచికిత్సకకోటి వెనుకాడి నిట్టూర్పు విడుచునపుడు
బంగారువంటి నీ పచ్చనిమైచాయ గడెకొక్కతుల మెత్తుగరగునపుడు
పరులకర్థముగాని బాధాసముద్రాన మునిగి నీలోనీవు మూల్గునపుడు

తే.గీ. ఆశలడుగంటి మౌనముద్రాంకితుడయి
వెఱ్ఱిచూపులుజూచు నీవిభునికనుల
రాలుప్రతిబాష్పమొక యక్షరముగ మారి
వ్యక్తపరచినదమ్మ! మీప్రణయగాథ

ఉ. ఒక్కకుటుంబికెంత వలయున్ ధనమంతగడించి, యింక నా
కక్కరలేదు ద్రవ్యమని యార్జనమానిన న్యాయవాది భూ
భుక్కుభవన్మనోహరుడు పుట్టెడుదుఃఖము గుండెకెక్కగా
చిక్కని వేడియూరుపులు జిమ్ముచునుమ్మలికించు నమ్మరో!

మ. తతసాంసారిక చింతలన్నరికి యాత్మ(శాంతి గల్పించు దే
వతవీవల్లన గీర్తిశేషవయి పోవన్ గొండలం బిండిగా
జితుకంగొట్టగలట్టి ధీరమతి నీ చేతోవిభుండక్కటా!
యతిదీనుండయి భీతచిత్తుడయినాడమ్మా! పురంధ్రీమణీ!

మ. అరికిం గీడుదలంపకలేదెపుడు నీ యాత్మేశుడున్నీవు ని
ర్దరునార్ద్ర స్థిరచిత్తులిట్టిడుల మేల్ దాంపత్య బంధంబు ని
ష్కరుణన్ ద్రుంచి, యకారణంబగు యసత్కార్యంబు గావించి, న
ల్వురినోళ్ళంబడినాడు దుష్టవిధి వేల్పుం బెద్దయెట్లయ్యెనో!

మ. ఒకయేడాది గతించిపోయినది నీ పుర్వీస్థలింబాసి, మా
నక రాత్రింబవళుల్ యథావిధి యనంతంబైన కాలాబ్ధి వీ
చికలైవచ్చుచు బోవుచున్నయవి, మా చిత్తంబులో, కన్నుమా
యక నీరూపము వెల్గుచున్నది దయాయత్తప్రసన్నాస్యమై

మ. తగదమ్మా! నినుబోటి శీలవతికింద్రక్షోణివాసంబు, త
జ్జగతిం గాంతలవర్తనంబు కడు దూష్యంబంచు శాస్త్రాళి బి
ట్టుగ వాక్రుచ్చుటవిందు మిట్టి పువుబోడుల్ జుట్టి కావించు, యూ
డిగముల్ నీకు రుచించునా, శుభవధూటీ! ధర్మ దీక్షారతీ!

సీ. నెనరారు నీవిలోకనము సోకినచోట ప్రభవింపజాల దాగ్రహపురేఖ
శుచిగల నీవాక్కుసోకిన కర్ణంబు వినజాలదెన్న డప్రియపుబలుకు
సిరిగల నీకాలి చెలిమిజెందినచోట చెరలాడదినుపగజ్జెలపడంతి
ఒకరవ్వ నీ స్నేహశకలమందిన లేమ మెచ్చదు నీచకామినులపొత్తు

ఆ.వె. నీ సతీత్వమునకు, నీ ధర్మనిరతికి,
నీ ప్రశాంత దివ్యనేత్రములకు
నిత్యపుష్పపూజ నెరపుచున్నారు నీ
కన్నవారు, నిన్నువిన్నవారు

సీ. ఆనాటి జిగిమందహాసమంజుల రేఖ మాసిపోయినది నీ మగనిమోవి
ఆనాటి సింహగర్జాగళధ్వానంబు తగ్గిపోయినది నీ ధవునినోట
ఆనాటి ప్రబలకార్యారంభ గాంభీర్యమంతరించినది నీ కాంతు నెడద
ఆనాటి సత్కళావ్యామోహ దార్ఢ్యంబు సన్నగిల్లినది నీ స్వామియందు

ఆ.వె. ఇన్ని మాటలేల ఈ వజ్రయాత్రకై
పయనమైన దుష్టవాసరమున
అద్రిమహిత ధైర్య దాజానుబాహుండు
నీవిభుండు భగ్నజీవియయ్యె!

కం. నీనోట నూడిపడ్డ వి
ధానన్ గన్పట్టు ముద్దుతనయులలోనం
గానబడు నీ శుభాకృతి
నీ నాథునకాత్మ తృప్తినించు బురంధ్రీ!

మ. దినమున్నీపతి జిమ్ము బాష్పములు గుత్తింగట్టి, సత్కావ్యకాం
చన పేటింబిగియించి, తద్హృదయ లాక్షాముద్రతో నంపు, కుం
దనపుంగాన్క బరిగ్రహించి, దివిషద్రాజన్య విద్వత్సభా
వనముల్ పూయ బఠింపుమందముల కుప్పా! రెడ్డి రాజ్ఞీమణీ!

# భూమిక

కావ్యం పేరు స్వయంవరం. వధువు స్వరాజ్యం. పెండ్లి కొడుకులు ప్రజలు. మహాత్ముని సత్యాగ్రహ మహాయజ్ఞంలో స్వరాజ్యబాల జన్మిస్తుంది, ప్రతిఫలంగా బాపూజీ బలవన్మరణాన్ని స్వీకరించి పరమపదిస్తాడు. ఉరుసులు, తిరునాళ్ళలు, ఊరేగింపులు చేసి దేశీయులు బాలకు బారసాల జరిపి, తాతగారి ప్రతిమలు, పల్లెల్లో పట్టణాల్లో ప్రతిష్ఠిస్తారు. స్వరాజ్యబాల అంతై, యింతై పెండ్లీడు కెదుగుతుంది. స్వయంవరం ప్రకటిస్తారు, నీతిమంతులు, అవినీతిమంతులు, ధనవంతులు, దరిద్రులు, దొంగలు, దొరలు పెండ్లికొడుకులై వస్తారు. సత్యాహింసలనే చెలికత్తెలు పెండ్లి కొడుకుల్ని పేరు పేరు వరుసల వర్ణిస్తారు. కలకల నవ్వుతూ కళ్యాణవేదిక నలంకరించిన స్వరాజ్యకన్యక వలవల యేడుస్తూ సభారంగం విడిచిపోతుంది. అనురూపుడైన భర్తకోసమై కన్యక దేశాటనం చేస్తుంది. అకృతార్థయై విసిగి వేసారి మంచుకొండల సమీపారణ్యాలు చేరి ఒకానొక బోయపల్లెలో వసిస్తూ మనశ్శాంతి చేసికొని కాలం గడుపుతుంది. ఒకనాడు స్వప్నంలో మహాత్ముడు దర్శనమిచ్చి సదుపదేశంచేసి బాల నోదారుస్తాడు. ఒకానొక యువకుని వివాహమాడి స్వరాజ్యం రాజ్యమేలుకొంటుంది. నవ యుగారంభమౌతుంది. దేశంలో శాంతి నెలకొంటుంది. స్వరాజ్య సుఖాన్ని ప్రజలు చూఱలాడ్తారు. ప్రకృతిలో, విజ్ఞానంలో, విద్యలో, కళాలోకంలో, సంఘంలో వలసిన మార్పు లిందు వర్ణించబడ్డయి.

నేనీ కావ్యాన్ని వ్రాసి ముగించి, ముద్రణకు ధనమెట్లు లభించునా యని విచారిస్తుండగా శాంతస్వభావులు, కళాప్రియులు, మదరాసు శాసనసభా సభ్యులు, నిరాడంబర జీవులైన శ్రీ మేడూరి నాగేశ్వరరావుగారు, ఒకనాడు నా కావ్యం విని సంతోషించి, వలయు ధనాన్ని సేకరించి, నాకిచ్చి మహోపకారం చేసినారు. కడచిన వత్సరం వారు నా కయాచితంగా ఒకానొక మిత్రునిచేత రూ 400 రహస్యంగా నంపి, వారి గుప్తదానపరత్వంచేత నా కమితాశ్చర్యాన్ని కలిగించినారన్న వారి హృదయ మెట్టి పవిత్రమైనదో పాఠకు లూహించకపోరు. వారికి నా ధన్యవాదాలు. అట్టివారు పదుగురున్న కళాప్రపంచం కడగండ్లపాలు కాదని నా విశ్వాసం. వారికి దీర్ఘాయు వగుగాక.

జి. జాషువ

మ.	నను ప్రేమించు కళాప్రియుల్ బలువురున్నా రాంధ్రదేశంబునం
దను సంతృప్తివినా వచింపదగు నొండాదాయమేలేని నా
కనుకంపం బదివందలంపిన యుదారాత్మం బ్రశంసించెదన్
వినుతుల్ గోరని గుప్తదానరతునిన్ మేడూరి నాగేశ్వరున్

మ.	అని చెల్లించుకొనంగలేని కపటవ్యక్తుల్ దలల్ వంపసా
చని నా హస్తము నిండిపోవగ సహస్రద్రవ్య దానంబు స
ల్పిన నాగేశ్వరరావువంటి బుధులుర్విం గొందరున్నారు లె
మ్మని ధైర్యంబువహించి పొంగెదను సాంద్రానందమగ్నుండనై

# స్వయంవరం

- బాల్యము
- స్వయంవరము
- దేశాటనము
- హిమగిరి యాత్ర

# అంకితము

సీ. లలిత వాణికి, నిరాలంబాంధ్ర కవితకు త్రోవలు సూపించు దొడ్డవాడు
ఆరిపోనీక నెల్లూరి గడ్డలమీద నీవి తిర్లిక పంక్తు లెత్తువాడు
బాపుజీ మహదహింసా పాఠశాలలో నుత్తీర్ణుడైన ధీసత్తముండు
ఘన సుదర్శనదేవి కమనీయ చరితకు వడివంక లేనట్టి వల్లభుండు

ఆ.వె. మనుమ సిద్ధిరాజు మణిపీఠదీప్తులు
చెలగి కీర్తిగన్న సింహపురికి
రత్నభూషయైన రామరాడ్విభు డస్మ
దీయకృతికి నర్హనాయకుండు

కం. పిల్లలు గలవాడెడదన్
జల్లదనం బున్నవాడు సత్యాహింసా
వల్లరుల కాలవాలము
వల్లభుడై నాదు కృతికి వన్నె ఘటించున్

ఉ. నిస్తులధీవిశాలరమణీయత, సత్కవికోటికింగథా
వస్తువు చాలినంత సులభంబుగ జిక్కుటకిక్క, యావదా
ర్యస్తవనీయమంజులగుణార్ణవుడై తగు రెడ్డిరాణ్మణీ
హస్తము నందుకొన్న కృతులన్నివిధాల నదృష్టవంతముల్

ఉ. తిక్కనభారతాగమము దేశికవీశుల లేతవాణికిన్
దిక్కయి కండపుష్టిని గదించినరీతి, ప్రసిద్ధమైన శ్రీ
తిక్కవరాన్వవాయ మొకదిక్కయి, ఆశ్రయమైరహించెడిన్
దిక్కునుమొక్కు లేక కడు దీనతగుందుకవీంద్రజాతికిన్

మ.	అదియేదొడ్డసుదర్శనాంబ మహలందాసీనుడై, సత్కళా
భ్యుదయధ్యానరతిన్ నిరంతరకవీట్పుష్పాంజలీ పూజలన్
ముదితుండై, విలసిల్లు రామవిభుడ, ప్ప్రాజ్యున్ గనుంగొన్నచో
బొదలున్మేలిమరందభావములక్రొంబుగ్గల్ గవిశ్రేణికిన్

మ.	కృతులెన్నోసతులై, సతీవిరహవహ్నిజ్వాలచల్లార్ప, నం
చితసాలంకృతభావగీతములనర్చింపన్ గతక్లేశుడై
సతమున్ బ్రస్తుత కృష్ణరాయలన భాషాచర్చలందేలునూ
ర్జితతేజస్విని రామిరెడ్డిగని హర్షించున్ గళాదేవతల్

ఉ.	నాకవితాప్రరోహము ననల్దొడుగందగుచెమ్మ లీయసూ
యాకఠినోగ్రభూముల రవంత లభించుట కాటపట్టుగా
వాకొనువాడ సింహపురి భాగ్యఖనిన్ ఘనురామరాడ్విభున్
శ్రీకలితుం బ్రశాంతుని, విశిష్ట కవిత్వకళాపరీక్షకున్

ఆ.వె.	కృతక దేశభక్త వితతి కారణముగా
నటమటించు గాంధియంతరాత్మ
తిక్కవరపుకులుని, చక్కనిశీలంబు
కారణముగబొదలి యూరడిల్లు

జి. జాషువ

# స్వయంవరం

## బాల్యము

కం. కులభేదము, మతభేదము
కలికమునకు లేనివాడు, కలకండముతో
దులదూగు సత్యసూక్తులు
బలుకు సుతుం డొకడు బుట్టె భరతాంబికకున్

కం. అత డష్టకష్టములుపడి
బ్రతుకంతయు ధారవోసిఁ పరహస్తగతన్
మతిమంతురాలి నొకరిత
స్వతంత్రతాశిశువు బడసె సచ్చరితుండై

కం. అడుగులకు మడుగులొత్తిరి
బుడుతంగొని తెచ్చినట్టి ముసలయ్యకు పు
త్రడినీట జలకమాడిచి
సిడమెత్తిరశోక చక్రచిహ్నాంబులతో

కం. వరలబ్ధయైన బిడ్డకు
నురుసులు తిరుణాళ్ల సలిపి రూరూర నెదన్
మురిసికొని దేశవాసులు
మరచి రఖిలవర్గ కలహమాలిన్యంబుల్

శా. ఆయమ్మాయిని జూచినంత విరళంబై పంచబంగాళమై
పోయెన్ బానిసలక్షణంబులు, భయంబున్ శబ్దగాద్గద్యమున్
వేయిన్నూరుగజాల దివ్యబలమున్, స్వేచ్ఛాసుఖావేశమున్
గాయంబందు సముద్భవించె సకలక్ష్మాచక్రచంద్రాస్యకున్

కం. చిరకాల పరాధీనత
విరుగడ గావించి, శాంతి వెలయించిన య
చ్చిరునగవుల చినదానిని
స్వరాజ్యమని పిలిచి రెల్ల జగము నుతింపన్

చం. నిసుగున కేడుమాసములు నిండియునిండకముందె పాపమా
ముసలిని పొట్టబెట్టుకొనిపోయె నొకానొక పుణ్యమూర్తి త
ద్వ్యసనవినీలనీరదమహాంధతమస్సు విశాలవిశ్వమున్
ముసరి, చరిత్రలో గరగిపోసె నఖండకళంకపంకమున్

ఆ.వె. హత్య కగ్గమైన యమ్మహాత్మునకునై
చిన్న బాష్పకణము జిమ్మదయ్యె
పారమార్థ మద్యపానంబు గావించి
మత్తు గొన్న కళకు మతము కన్ను

ఆ.వె. కంచువిగ్రహాలు కాంచనవిగ్రహాల్
మంటివిగ్రహాలు మహిని వెలసె
ధర్మసంస్థలెల్ల తాతయ్యబొమ్మలు
శిరముమీద నెలమి దురుముకొనియె

తే.గీ. తాత మరణంబునకు గుండె దరిగిపోవ
రోదనముసేయు బిడ్డ సమ్మోదమొంద
తాత బొమ్మలు జూపి యోదార్చినారు
మడత భజనలతో కండ్లు దుడిచినారు

సీ. ఎత్తించి రెత్తైన యెవరెస్టు శిఖరాన ప్రియమార మూడు వన్నియలసిడము
చిత్రించిరల సేతుశీతశైలముదాక తోరంపు ముత్యాల తోరణాలు
మ్రోయించినారు భూములు దద్దరిలిపోవ ఘనమైన శంఖాలు కాహళాలు
అల్లించినారు తీయని గీత మాలికల్ సకల భారత కవీశ్వరులచేత

తే.గీ. హరిజనుల పల్లియలలోని కరిగినారు
సర్వసమతకు విత్తనాల్ సల్లినారు
దేవళంబుల తలుపులు దెరచినారు
చక్కగా స్వరాజ్యము బారసాలనాడు

కం.	కలకల నవ్వెడు తాతయ
శిలయై, కలయై యనంత శిల్పంబునకున్
బలమిచ్చి, మాయమయ్యెన్
కుల మత తత్వములు పుంజుకొని తలయెత్తెన్

కం.	అందరు బిడ్డలవలె గా
దందాల స్వరాజ్య బాల, యవినీతి లవం
బెందేని గోచరించిన
కుందుండెందాన పాలు గుడువక యేడ్చున్

సీ.	స్వచ్ఛంద పవన శాబకము లుల్లసమాడు హిమశైల శిఖరాన నృత్యమాడి
స్వేచ్ఛాప్రభాత రంజిత శాద్వలములపై కాలూని చిన్ని షికారుజేసి
గళిత శృంఖలములై యలరు జాతీయ సంస్థాబాలికలతోడ సరసమాడి
భయవిహీనంబులై, భావముల్ వెలిబుచ్చు సకల శారదల కానుకల నంది

ఆ.వె.	దేశమాత కొఱకు దేహముల్ విడిచిన
త్యాగివరుల రక్తధార దడిసి
పూతమైన వీరభూములు ముద్దాడి
జరుపసాగె బాల శైశవంబు

కం.	చలనంబులేని నడవడి
కలుషము లేనట్టి మాట గట్టితనంబున్
బలముగ, నహింస రవ్వల
యలంకృతులుగా ధరించు ననవరతంబున్

ఉ.	ఎట్టి ప్రశాంతి, యెట్టి సుఖమెట్టి శుభోన్నతి, గోరి త్యాగులై
పుట్టి, తపించిరో మునుపు బుద్ధుడు, క్రీస్తు, మహాత్మగాంధి, క
న్పట్టె, స్వరాజ్యలక్ష్మి వదనంబున నట్టి కళావిశేషముల్
పుట్టిననాడ, యీ భరతపుత్రుల భాగ్యవిశేష మెట్టిదో

సీ. అరికట్టబడె, శాంతి నరికట్టి సాగించు అవినీతిపరుల విహారకలన
బంధింపబడియె, దైవముపేర పెళుసెక్కు పూజారిమూకల బూటకంబు
విరమింపబడె, దయావిరహితాత్మకమైన నల్లమార్కెటుగాండ్ర నాటకంబు
ఖండింపబడె, నహంకార కారకమైన భీషణవర్గ విద్వేషవహ్ని

తే.గీ. గరుడుగట్టిన వెడ నమ్మకాల బిగువు
సడలి విజ్ఞానమల నల్ల సౌరభిల్లె
కడచె, కడలేని కళుకు సంగ్రామ భీతి
దివ్యబాలిక దిశల వర్ధిల్లువేళ

ఆ.వె. బాల బడికి బోయి పఠియించె దేశ సౌ
భాగ్యమునకు వలయు పద్ధతులను
స్వేచ్ఛ నడ్డగించు విద్యావిధానంబు
మార్పు లేమి జూచి మథనపడియె

శా. ఆనవ్యాశయ పాఠశాలల సువిద్యాభ్యాసమున్ జేయు కా
లానన్ స్వార్థపరాయణంబులయి యల్పత్వంబు గల్పించు య
జ్ఞానాపాదకమైన కట్టు కథలన్ లక్షింప కేనాడు వి
జ్ఞానాపాదకమైన సత్య కథలన్ వల్లించు సోల్లాసయై

మ. బడిలో జెప్పెడు నీతిపాఠములకున్ బాహ్యంబునం జేయు, దుం
దుడుకుం బోకడ కించుకంతయును పొత్తుం గానరాకుంట, ని
క్కడపుంగూటి కళాలయంబుల బహిర్గాంభీర్యముల్, మాయపు
త్తడి వ్యాపారపు సంస్థలంచు మది సంతాపించె నత్యంతమున్

తే.గీ. అనుభవముమీద గుజరాతు మునివరుండు
వ్రాసిపోయిన ధర్మసూత్రములు చదివి
ఆటపాటల జెలికత్తియలకు నేర్పు
చిలిపి సిద్ధాంత భాష్యముల్ చీదరించు

చం. చదువ దఖండ భారత విషాద పురాతన రక్తగాథలన్
పదములు మెట్ట దెన్నడు నభాగ్యుల కందని క్షుద్రదేవతా
సదన సమీప సీమల నసన్మత సాంఘిక సింహగర్జలన్
బెదరదు, విశ్వసించ దల పెద్దలనాటి పిశాచ ధర్మముల్

సీ. మధు భర్తకై పుష్పరథము సిద్ధముచేయు భూపురంధ్రీ శీలమునకు మెచ్చి
గొంతు బొంగురువోవ ఘోషించు నంబుధీశుని యీశ్వర ధ్యానమునకు మెచ్చి
జలదంబు కడుపులో జన్మమెత్తిన మంచి ముత్యాల సృష్టి కబ్బురము నంది
కొండలతో నెదుర్కొని తుత్తునియలైన మబ్బు దున్నల బుద్ధిమాంద్య మరసి

తే.గీ. నిమ్న భూములు గుర్తించి నింగినుండి
పరుగు లిడి వచ్చి తమ సమత్వమును దెలుపు
తేట సెలయేటి దివ్య సందేశములకు
హృదయ ముప్పొంగి తన్వంగి చదువు నేర్చె

సీ. ఆశింప దిష్ట మృష్టాన్నంబు దేశ దారిద్ర్యంబు మనసు గారించుచుండ
మేనదాల్పదు చీనిచీనాంబరంబులు ప్రేలికల్ గట్టు ప్రాంతాల నరసి
పలుక దెన్నడు చిన్ని పరుష వాక్యంబును పొరుగు బాలిక లాడి పోసుకొన్న
తమక నీయదు మనోద్రఢిమంబు ప్రళయంబు వికటాట్టహాసంబు విసరుచున్న

ఆ.వె. కరము చందు గాంధి దరహాసలవములో
దాగియున్న త్యాగ తత్వమునకు
క్షతము సోకనీక కన్యావతంసంబు
బాల్య చాపలము నుపక్రమించె

సీ. క్షామ దంష్ట్రాంకురక్షతికి నగ్గము గాని సుఖసంపదల మోము సొగసుతోడ
ఈతి బాధల పదాఘాతంబు సోకని పైరు పంటల మేని పసరుతోడ
నిమ్నోన్నతముల నంధీభూతములుగాని సమదృష్టి దీర్ఘ నేత్రముల తోడ
ఎఱుసు పోకడకు చోటీక గుప్పిటి కందు తఱచైన కేశబంధంబు తోడ

తే.గీ. ప్రబల వింధ్యాద్రి ధైర్య సర్వస్వ మెల్ల
కమిచి పట్టిన పెనుచనుకట్టుతోడ
యువక భూపుల చిత్తంబు లూగియాడ
యంబుజాస్యకు యౌవన మంకురించె

చం. మదగజయానమున్, మెరుపుమాదిరి మేను, సరోజపత్రసం
పదగల కంటిసొంపితరభామల వంటి యొయార మందమున్
వెదకిన గానరాని యలవింతవధూమణి గాంచి సత్కవుల్
పదములు సాగకందు బడవైచిరి ప్రాగుపమాన వస్తువుల్

ఉ. అందరి రాజకన్యకల యక్షుల నేలెడు గర్వరేఖలున్
మందికి దూరమౌ దురభిమానము నే పని లేక యంటినం
గందు శరీరకోమలత కన్పడ దయ్యె లతాంగి మూర్తిలో
మందున కట్టి లేమల సుమా! మణిమండనముల్ సవిత్రికిన్

మ. పనిచేకాయలు గాచియున్న కరముల్ స్వచ్ఛంద రక్తంబుచే
ననుమానింపని దొడ్డ భావములు సత్యస్ఫూర్తి జెన్నారు చ
క్కని జిహ్వల్, క్షమచే విరోధమును చక్కందిద్దు సద్వర్తనం
బును విస్పష్టముగా గనంబడియె నప్పూబోడి రూపంబునన్

కం. బహిరింద్రియముల సొగసుల్
బహిర్గతము చేయజాలు పైపై సుకవుల్
సహజానుభూతి చాలక
బృహదంతశ్శోభ లాలపింపం గలరే!

ఆ.వె. నగలు లేక మెరయు మగువ లావణ్యంబు
చెడ్డవారి కింపు చేయదయ్యె
నగల కెల్ల దొడ్డ నగయైన శుభవేణి
అధికమతుల మనసు నాక్రమించె

సీ. పొడచూపె నక్కన్య యడుగు మోపినచోట నక్షయదృఢవీరలక్షణములు
తలయెత్తెనా బాల పలుకు పల్కినచోట సత్య ధర్మములకు చలన శక్తి
చిగురించెనా రాణి, నగువు నాటిన చోట సమరస ప్రబల నిష్కపట భూతి
గతియించెనా లేమ కన్ను లెత్తినచోట మేను బెంచిన యంటరాని తనము

ఆ.వె. ధనము గ్రుమ్మరించి ధనిక వర్గము గప్పి
పెట్టు దుండగములు గుట్టలగుచు
విబుధ నేత్రములకు విస్పష్టముగ దోచె
సుందరాంగి గాలి సోకుచోట

# స్వయంవరము

మ. ప్రకటింపం బడియెన్ స్వయంవరము యావద్భారత క్షోణి, క
న్యక కర్పొందు గుణాభిరాము దెవడైనన్ జాతిపట్టింపు లె
న్నక సుస్వాగత మిత్తురంచు, చెలగెన్ సన్నాహముల్, పెండ్లివే
దిక రత్నాంకితమై ప్రకాశిలె, జయేతిధ్వాన ఘూర్ణోద్ధతిన్

సీ. చెరసాల యినుపపంజరమందు మూన్నాళ్ళు గడపిన ముద్రికల్ గలుగువారు
పోలీసు లాటీల పోటులు చవిజూచి కాయలేర్పడ్డ యంగములవారు
రాటాలుగొని యింట రమణిమోమున వైచి విహరించు గాంధి టోపీలవారు
పావలా సభ్యులై ప్రక్కపాటున నుండి వల్లదప్పిన నింట బడెదువారు

ఆ.వె. ఈగ కాలుసోకనీకుండ నిజవర్ణ
రక్షణంబు గోరి బ్రతుకువారు
మరుగుపరచనేల దొరలు దొంగలుగూడ
కూడి రెలమి బెండ్లికొడుకులగుచు

ఉ. పెద్దహడావిడుల్ సలిపి పెండ్లి యొనర్చి, బడాయిగొట్టుటల్
బుద్ధికి లోపమంచు బసుపుం గుసుమంబులు నాకు తోరణాల్
దిద్దిన కాయమానములు దీరుపబంచి, గుణాభిరాములన్
బెద్దల బిల్వనంపి తనవింగొనె కన్యక నీతిపారమై.

మ. మతముల్, వర్ణములున్ ధనవ్యసనముల్ మాద్యద్దురాచారముల్
సతులై, పేరట మాచరించుటకు ముస్తాబై సువర్ణంపు ట
క్షతలం గుప్పిట బట్టి రానరసి యక్కన్యావతంసం బస
మ్మతి జూపించె, వివర్తితాస్యయయి కంపంబెత్తు నెమ్మేనితో

చం. హరిజన కన్యకల్ వలపుటారతు లిచ్చుచు బేరటింపగా
జురచుర జూచుచుం దొలగు సుందరులం గనినంత, నాఫ్రికా
దొరల సమాజ మధ్యమున తోరపు జిక్కులనందు గాంధిజీ
దరిసెనమిచ్చె, కన్యకమదంబులముందు మెరుంగు చాదువన్

ఉ. పెండ్లికుమాళ్ల గుండె పురివిచ్చిన నెమ్మివలెన్ నటింప, పె
ల్లిండ్లును, మట్టియల్ గదలి లేతసుధల్ గురియింప, గుబ్బ పూ
జెండ్లు నటింప, క్రొంబసుపుచీర ధరించి, సఖీద్వితీయయై
పెండ్లికుమార్తె వచ్చె మణివేదిక చెంతకపేతభూషయై

శా. పూదండం గరమందు బట్టుకొని యొప్పుల్ కుప్పలై కూలగా
దాదుల్ వెంబడిరాదరస్మితము సిందన్ గుంచితగ్రీవయై
పాదాబ్జంబుల నందియల్ ఝణఝణధ్వానంబు గావింపగా
ఆదర్శాశయ చేరవచ్చె, నిజ కల్యాణాంతిక క్షోణికిన్

ఉ. మేలి ముసుంగు తూంట్లుపడ మిక్కుటపుం దమకంబుతోడ, భూ
పాల కుమారకుల్ బఱపు వాడివిలోకన బాణ పంక్తికిన్
బాలిక మారుచూపుల నుపాయనమిచ్చె, లతాంగు లెప్పుడున్
మేలును స్వీకరించి విరమింపరు ప్రత్యుపకార ముగ్ధలై

చం. "జయము! స్వరాజ్య కన్యకు! హసాదు! మహద్భరతావనీ సద
న్వయకు! శుభప్రదాత్రిక"ని, నాలుగుదిక్కులు ప్రస్తుతింప దు
ర్ణయపరతంత్రులై కపటనాటకమాడు వరావతంసముల్
భయవిచలాత్ములై తలలు వంచిరి గుమ్మడికాయదొంగలై

ఉ. తాతయ పెంపునం బెరిగి తావులు జిమ్ముచు బాల్యమాది చే
యూతగనున్న ధర్మరమ యోర్తుక బేరట మాచరింపగా
నీతి యహింసయున్, గలికి నిగ్గులబొట్టు ధరింప జేయగా
లేత స్వరాజ్యరాజ్ఞి కదలించె మనంబులు పెండ్లికూతురై

తే.గీ. సరస నిలిచిన మహదహింసాభుజిష్య
కన్యకామణి కరపరిగ్రహణకాంక్ష
భ్రమసి వచ్చిన రాజలోకమును జూపి
యోలి వివరింపజొచ్చె నొక్కొకని చరిత

కం. పెంచిన గాంధి మునీంద్రును
దంచ న్మధురాస్యబింబ హాసద్యుతి లో
పించిన పరిణయ మనుకొని
పంచానన మధ్య ఖేదపడియె నెడందన్

సీ. శాసనసభలలో సభ్యతాపదవికై వింత సంస్థలను స్థాపించువారు
కాలానుసరణంబుగా తొండలనుబోలి మాటిమాటికి రంగు మార్చువారు
యుద్యోగమూడగా యుక్కు రోషముతోడ నట్టింటిలో జిచ్చు పెట్టువారు
నిమ్నజాతుల మీద నిప్పులు చెరగుచు విధిలేక కన్నీరు విడచువారు

తే.గీ. చిరుత విధవల కన్నీటి వరదలందు
హాయిగా కుమాళ్ళకు పెండ్లిచేయువారు
వచ్చియున్నారు నీ స్వయంవర జిగీష
బిడియములు మాని ముదిపెండ్లికొడుకులగుచు

ఉ. ఎంతటి వృద్ధుడుం బరిణయేచ్ఛకు నగ్గముగాకపో దహో
యింతి, భవత్స్వయంవర మొకించుక వీనులు సోకినంతనే
పంతము మీరగా నడచివచ్చెద రల్లదె చూడుమమ్మ య
క్కంతుని కొంటెచేతలకు కట్టలపైబడి కాటియాత్రికుల్

శా. ఆగాఖానుడు సాటిరాడితనితో నైశ్వర్యసంపత్తి ని
న్నాగింపంగల డెల్లభోగముల యందుల్లంబు లేకుండగా
లాగుం బేదల పచ్చిమాంసమును బాలా! జంటవడ్డీల నీ
సోగల్దీరిన వాలుకన్గవ చెమర్చున్ వీని వీక్షించినన్

మ. అనువారంబును దేవపూజలకుగా నర్థంబు వెచ్చించి, చే
సిన పాపంబు హరించిపోయెనని హర్షించున్ మహర్షీంద్రు డి
చ్చిన సందేశము విస్మరించి, ప్రతిమల్ జెక్కించి యమ్మించు నీ
కనుకూలించిన జూచుకొమ్ము శుభనేత్రా! వీని సంబంధమున్

మ. తెలవా రేల్పడిసేయునా డితడు మంత్రిత్వంబు సాధించి, యా
ప్తులకుం దగ్గరిచుట్టపక్కముల కుద్యోగంబు లిప్పించి, య
న్యుల కన్యాయముచేసినా డనుచు విందున్ వర్ణవిద్వేషముల్
పులులై, యెంతటి సత్కళారమల గొంతున్ నొక్కి భక్షించెనో!

మ. అటకాయించెడు శాసనాల చెవు లల్లాడించుచున్ బ్లాకుమా
ర్కెటుసాగించు బెహారిమిన్న యిత డార్వెన్ బెక్కుసంసారముల్
జిటికెండంత దయారసం బితని కుక్షిన్ జీల్చినన్ గాన మి
క్కుటిలుందుత్తమ దేశభక్తుడని పల్కున్ బత్రికారాజముల్

మ. కనుగొమ్మా జలతారుటంచు తలపాగాదాల్చియున్నట్టి న
ల్లని యాసామి నతండు కొండొక దివాలాఖోరు, జాతీయ నూ
తన సంరంభము వర్ణసంకరపు సంస్థారాజమం చాగ్రహిం
చిన హిందూమతమద్యపాయి, యిపుడాశించున్ స్వరాజ్యార్థముల్

మ. మురవిధ్వంసకుడున్న దేవళమునన్ బూజారిగానున్న భూ
సురముఖ్యుండదె రత్నకుండలపు రోచుల్ దట్టు మిట్టాడ నీ
వరబింబాధర ద్రాక్షపానకము నాస్వాదింపగా వచ్చె సుం
దరి! పూజారిణివై సుఖింప వలెనన్నన్ వీని బెండ్లాడుమీ!

ఉ. మానవుడై యితం డెదిరి మానవులంగని గుర్తుపట్టగా
లేని విమూఢచిత్తుడు చలింపదు వీని మనస్సు లోక మే
మైన, కృపారసంబు నడయాడని వీని కఠోరదృష్టిలో
బూనుచునుండు పంచశర భూతములేమల దర్శనంబున్

శా. తాలూకా కధికారియై ప్రజల రక్తంబాని మర్యాదగా
కాలంబీడ్చిన వా డతండు బిరుదుల్గాజేసి, యీనాడు స
చ్ఛీలోక్తుల్ వచియించుచుం గదలివచ్చెన్ జూడుమా బుజ్జిమీ
సాలున్నాతని తాల్చినాడిపుడు సాక్షాదాంగిలేయాకృతిన్

శా. స్త్రీవిద్యావ్యతిరేకవాదములు కాశీదాక బారించి, మి
ధ్యావేదాంత మహాసముద్ర జఠరాంతర్మగ్న భగ్నాత్ముడౌ
నీవర్ణాశ్రమధర్మకర్మ నిరతుం దేతెంచె బెండ్లాడగా
నీ వాల్గన్నులలోన నెంతటి స్మరాగ్నిజ్వాల లేపారునో!

శా. వైకుంఠ మ్మరచేతజూపగల తత్వజ్ఞానపీఠాధిపుం
డాకన్పట్టు ప్రలంబగర్భుడు, త్వదీయాపాంగ వీక్షాలవ
స్వీకారార్థము వచ్చెనమ్మ! యతనిన్ జేపట్టినం బాపముల్
సోకన్నేరవు నిన్ను, లభ్యపడవచ్చున్ బొందితో స్వర్గమున్

చం. మతమొక కంచుకోటవలె మానవదుష్కృతి గప్పిపుచ్చి, యం
చితమగు నైకమత్యమును చిందరవందరజేసి, భిన్నదై
వతములనీని, సంకుచిత భావములం బురికొల్పి, స్వార్థదూ
షితులగు పీఠికాపతుల జీవితయాత్రకు తోడుసూపెడిన్

కం. ఇరుదెగలై, పెడ మొగముల
పరస్పరము కలహమాడు పంచములకు వా
డెరుసుం బోకడ గరపెడు
హరిదాసుడు, దాసుడెల్ల యవగుణములకున్

చం. పొగలెగజిమ్ము శాత్రవము బొజ్జలలోపల డాచి, మోములన్
నగవు లలంకరించుకొని నాటకమాడెడు లౌకిక బ్రువుల్
భగవదఖండ ప్రేమవిభవంబును నిత్య ముపన్యసింతు రీ
సగము మనుష్యులే, యధికసంఖ్య సుమీ మతధర్మసంస్థలన్

చం. కులములవారిగా ప్రజలకున్ మరియాదలు పంచి పెట్టినం
గలహము లుండబోవని యొకానొక వర్గమువా రుపాయముల్
బలుకుదు రైకమత్య బలవర్ధనరజ్జువునుండి భిన్నమై
తొలగిన నూలుపోగులకు తోరపుజిక్కులు రాకపోవునే

శా. అచ్ఛోగాంధిమృతిం దలంచుకొని మిథ్యాబాష్పముల్ సింధుచున్
మ్రుచ్చుల్ కొందరు మూగినారరయుమంభోజాక్షి, వారెల్ల నీ
పచ్చంబద్ద స్వతంత్ర భారత సుఖస్వర్గంబునన్ జల్లగా
చిచ్చుం బెట్టు విషస్వభావులు శిలాచిత్తుల్, ప్రజాభక్షకుల్

మ. ముదముల్ గూర్చెదుక్షుత్సుఖంబెఱుగకుబ్బున్ గర్వముంగూర్చు సం
పదప్రత్యంగము నావరించుకొని సామ్రాజ్యంబు సాగింపగా
కొదమేనుంగు విధాన నీ కెదురుగా గూర్చున్న పిళ్ళారి, నీ
మృదుబింబాధర మానవచ్చె కను మింతీ! యీడుజోడైనచో

ఉ. నూతనరాజ్యముల్ పదులు నూరులు బుట్టి గతించిపోయినన్
తాతలనాటి పచ్చిబురదంబుడకొట్టుచునుండు కుంభజ
భ్రాతను జూడుమమ్మ! ప్రతిభాసముదగ్రములైన నీ కళా
జ్యోతులు మాన్పలే వితని చూపుల, సంకుచిత స్వభావమున్

మ. కులదర్పంబుల మర్దలధ్వనులతో కూపస్థమండూక జా
తులు ఖండాంతర సంస్కృతిం దెగడుచున్ దుష్టిం బ్రదర్శించుచో
తలవంపుల్ గద నీచరిత్రకు, పవిత్రంబైన నీ మూడు వ
న్నెల జెండాల కళావిలాసములకున్ నీ సభ్యతా స్ఫూర్తికిన్

చం. అని పల్కుచున్న నెచ్చెలి
గనుగొని విరమింపుమంచు కనుగొల్కుల నిం
డిన యశ్రుజలము నల్లన
కొనగోటంజిమ్ము పెండ్లికూతుం గనుచున్

కం. వేదికకు నెదముగా మేల్
ఖాదీ ధరియించి వేడుకంగను గాంధీ
పాదాంకచరుల జూపుచు
దాది మరల చెప్పసాగె తరళోక్తులచే

చం. కలధనమంతయుం గరగి గండు దరిద్రత చుట్టుముట్టినన్
దలకక బందిఖానల వ్యధామదదంతుల నోర్చి ధీరులై
నిలిచిన శాంతిదూతల ననింద్యచరిత్రుల జూడుమమ్మ నీ
వలపుల కౌగిలింతలకు వన్నెలు దేగల దేశభక్తులన్

సీ. ఆడంబరములేని యాదర్శజీవితాశ్రమున కాతం డబ్జబాంధవుండు
వలదన్న వెనువెంటబడు సనాతనమైన కటికి చీకటికి ఖడ్గం బతండు
ఉదరంభరితకు చేయూతలు గల్పించు మతమున కతడు శాశ్వత విరోధి
కాసుచేయని యద్దకపు వర్ణముల పురా రభస కితడు మంచి రజక రాజు

తే.గీ. జీవకారుణ్య మకరంద జీవఝరుల
కాలవాలంబు లితని నేత్రాంచలములు
నీకు నచ్చిన మగవాని, నీతిపరుని
నేరుకొనుమమ్మ కలికి బంగారుబొమ్మ

కం. ఆమాటలు విని కన్యక
యేయనుమానంబుదట్టి యేమనుకొనెనో
రోమాంచము సోకనిదై
మోముమలపి వేడియూరుపులు పొగలెగయన్

చం. జలజల నశ్రువుల్ ధరణిజార, స్వరాజ్యము పుష్పహారమున్
నలిచి, వివాహమంటపమునం బడవైచి, వరాళిచిత్తముల్
కలతవహింప నందియలు గజ్జెలు తీవ్రముగా నటింపగా
నిలయము సొచ్చెనంత రమణీమణి, దుఃఖముతో, నిరాశతో

శా. ఆ వైవాహికవేదికం దొలగి కన్యారత్నమట్లేగ, కో
పావేశంబులతోడ పెండ్లికొడుకుల్ వ్యర్థప్రలాపుల్ వధూ
లావణ్యంబు హసించి, మోపిరి కరాళంబైన నిందోక్తులన్
వేవేలోటమి సమ్మతింపదుగదా స్త్రీయాసమర్థత్వమున్

సీ.	నాకన్న నీటుగాం(డును గోరునోయంచు నూర్చె కొండొక్క లంబోదరుండు
పక్షపాతపు స్వయంవరమంచు (క్రుద్ధుడై గొణిగె వేరొక దగాకోరు మౌళి
పదుగురిలో నవ్వుబాటంచు తలయూచి చనియె నింకొక రావుసాహెబుండు
లజ్జాదవాగ్ని యుల్లమునేచ లేచి మోటారెక్కె నొక సాహుకారిమిన్న

తే.గీ.	విషము వెలి(గక్కు చూపులు విస్తరించి
హాసమొనరించె నొక యున్నతాధికారి
నా సమర్థత లెఱుగదీభాసురాంగి
బేల లెమ్మనె నొక్క వకీలుబేల

శా.	సాంకర్యంబు సహింప నేరక జ్వలజ్వాలాభమై, కర్మపున్
సంకెళ్ళన్ దొలగించు వేదమతసంస్థల్ నేడు ఛండాలపుం
బంకానంబడి, దీనిమూలమున నానా కూళ్ళు భక్షించెడిన్
సంకోచించెదరేల లెండని సభాస్తారుల్ సరోషాస్యులై

తే.గీ.	అభిజాత్యంబు, కలిమి, విద్యావిభూతి
తగిన హోదాలు గల సాం(ప్రదాయకులను
మమ్ము గాదని యీగాంధి మనుమరాలు
కాపురంబెందు వెలిగింప గలుగు నింక

తే.గీ.	అనుచు నైరాస్యకోపతా(మ్రాక్షు లగుచు
నాసనంబులు వీడి, సభాంతరాళ
గురు శతఘ్నిక చిమ్మినగుండ్లు వోలె
వెడలివచ్చిరి మస్తముల్ దడవికొనుచు

# దేశాటనము

కం. తన వీలునామయందున్
మునిముఖ్యుడు వ్రాసి చన్న మూర్తిత్వంబున్
గొనములు గల పెనిమిటికై
ననబోడి చరించె నేల నాలుగు చెఱగుల్

కం. కులవిద్యా ధనములచే
తలనిక్కినవారి దెగడి, ధర్మాఢ్యగులై
కులవిద్యా ధనములచే
తలవంచిన వారికొరకు తరుణి చరించెన్

చం. మునిముని మీసపుం బొగరు పొంగులువార ప్రవృద్ధమానమౌ
తునకగలట్టి యౌవనుల తోరపుటుచ్చుల కంది చాపులన్
మనమును సాగనీక, పరిణామ వికారము లంటనట్టి యౌ
వనముగలట్టి శీలమును భామవరించి చరించె దేశముల్

మ. చెలికత్తెల్ వెనువెంటరా దిరిగె కాశ్మీరంబు పంజాబు నా
వల బంగాళము దక్షిణోత్తరదిశా పర్యంత భాగంబులన్
బలదర్పాల వివాద మోహములతో వంశ ప్రతాపాలతో
తలక్రిందైన విశాల భారతము ప్రత్యక్షించె నున్మత్తమై

కం. జంబూ ద్వీపంబునకున్
జాంబూనద భూషలైన జనపదములు, గ్రా
మంబులు పక్కణములు పా
దంబులు కందంగ దిరిగె దయితుని కొఱకై

సీ. లుంబినీవనము లాలాపించు బుద్ధుని జాలిగుండియల కంజలి ఘటించి
రాణాప్రతాపు డారావళీ గుహలలో నిడుమలందిన సీమ లెల్ల నరసి
శివరాజు పులిగోళ్ళ చెండాడి పగవాని యుసురు దీసిన చోట నుమ్మలించి
జలియను వాలాఖ్యవనము లాహుతిగొన్న నిరపరాధులకు కన్నీరుసల్లి

తే.గీ. స్త్రీలపాలిటి ప్రత్యక్ష దేవుడైన
రామమోహనరాయలు బ్రహ్మసమితి
కంకురార్పణ చేయు దివ్యస్థలాలు
దర్శనము చేసికొని భామ తనివిజెందె

ఉ. ఇక్కడ సాంఘికక్రమ సహింపగలేక టిబెట్టు భూమికిన్
బొక్కిన కాళ్ళతో నడచిపోయిన రాయనిపాదయుగ్మమున్
మక్కువతో ధరించినది మస్తమునన్ మహిళాజగం బతం
డెక్కిన కొండలెక్కి యెద తృప్తి వహించె లతాంగిభక్తిమై

శా. బొట్టుంగాటుకలేని వృద్ధుని బలంబున్ నమ్మి స్వేచ్ఛార్థమై
కట్టుం బట్టలతో నిరాయుధముగా కయ్యంబు సాగించి రా
ట్పట్టంబున్ గడియించి స్వర్గ పదవిం బ్రాపించు జాతీయ పుం
జుట్టాలం దలపోయ కన్నుగవ నశ్రుల్ నిండె తన్వంగికిన్

శా. భాషాభేదముచేత మానవకుటుంబ శ్రేయమూటాడగా
వైషమ్యంబులు వృద్ధిజేసికొని ప్రాప్తంబైన స్వేచ్ఛారమా
యోషన్ జిక్కులపాలుజేసికొను రాష్ట్రోన్మత్తులం జూచి శ్రీ
భూషాలంకృత సిగ్గుచేత వదనంబున్ వంచె దాక్షాక్షియై

ఉ. వంగము జేరి విశ్వకవివర్యుని విశ్వకవిత్వ సాహితీ
భంగిమ లన్యదేశముల ప్రస్తుతులం గొనితెచ్చి, దేహ ము
ప్పొంగ స్వతంత్ర భారతికి పూజలు సల్పుట లాకళించి, సా
ష్టాంగ నమస్కృతుల్ సలిపె హర్షనిమీలిత లోచనంబులన్

సీ. బోనుబ్రద్దలుకొట్టి బోసుబెబ్బులిపిల్ల కన్నభూములు వాసి చన్నచోటు
గంగాధరుడు వీరగంధంబు మైదాల్చి స్వచ్ఛంద బీజముల్ సల్లుచోటు
లజపతిరాయి కీలాలంబు చవిజూచి సీమక్రోల్పులి సంతసిలిన చోటు
వేనవేల్ వర్షించు ప్లీడరీపట్టంబు చిత్తరంజనుడు వర్జించు చోటు

తే.గీ. బాల్యమున యందు జహ్వారుపండితుండు
తండ్రితోగూడ జాతీయదళమునందు
ఖదరు దాలిచి యోధుడై కదలు చోటు
బాల పరికించి, గర్వ సంభరితయయ్యె

కం. ప్రత్యేక రాష్ట్రమునకై
వ్యత్యస్తావేశ రభస లడ్డమురాగా
నిత్యము పోరాడు కళా
దిత్యుల కాంధ్రులకు భామ దీవెనలిచ్చెన్

ఆ.వె. మతము కతనఁసాటి మనుజుల కెడముగా
బ్రదుకుచున్న ప్రజల హృదయమందు
బందియైన మానవత్వంబు పోరు గా
వించు గుట్టు గోచరించె సతికి

తే.గీ. వేష భాషలు తొలగించి వేయు నెడల
ఖండఖండాంతర ప్రజాకాండమందు
నంతరములేని నగ్న సత్యము గ్రహించి
కన్యకామణి ప్రజల కుపన్యసించె

శా. ఆతిథ్యంబును స్వీకరింపుమని యాహ్వానించు ముత్తైదువుల్
చేతుల్ సాచి 'జయోస్తుతో' యనుచు నాశీరక్షతల్ సల్లుచున్
జాతీయాంగన లిచ్చు కాన్కలు భుజిష్యల్ జేతి కందీయగా
స్వాతంత్ర్యాంగన దర్శనం బిడియె యావద్భారత క్షోణికిన్

శా. పేరుల్ మారిన పట్టణాల్ జనపదాల్ వీధుల్ శిలా విగ్రహా
లారామంబు లడావిడుల్ గలిగి బ్రహ్మానందమున్ గూర్చు హిం
దూరాజ్యంబున దీనమానవుల గొంతుల్ బిండి లాభాలతో
పూరా పడ్డ కుబేరులం గనియె నంభోజాక్షి తప్తాత్మయై

కం. నిండారు శాంతితో, నల
గూండా భయ ముడిగి, కన్నుఁగూర్కిన నైజాం
ఖండా వాసుల గని వే
దండ గమన! సంతసించి తనివి వహించెన్

కం. అల బ్రహ్మయంతవానికి
సలాము గావింపనట్టి సమ్రాట్టు నిజాం
సులతాను డిచ్చు విందులు
చెలికత్తెలతోడ భామ స్వీకారించెన్

కం. చండాంశు కాంతితో, బ్ర
హ్మాండంబున కభయమనుచు, నాకసమున గో
ల్కొండలపై శోభిలు తన
జెండా నీక్షించి భామ శిరము గదల్చెన్

మ. ఇటలీభాషవిధాన కమ్మనయి, మున్నే బ్రౌనుచిత్తంబు గు
ప్పిట సంధించిన తెల్గుచక్కదనమున్ బెంపుం బ్రశంసించి యా
కటిపెల్లాడని గ్రంథకర్తల యభాగ్యశ్రీకి జింతించి బా
సట గల్పింతునటంచు నిం డభయహస్తంబిచ్చె, సంశప్తయై

ఉ. అట్టుల దేశదేశముల యర్చనలందుచు, కూటిపేదలై
బట్టలులేక యెండలకు వానలకోర్చి, స్వరాజ్య మేదియో
పెట్టి సముద్ధరించునచు వెట్టికి లోనయి, జీవితంబులన్
నెట్టు యభాగ్యులం గనియె నిండిన బొజ్జలవారి పజ్జలన్

ఉ. వచ్చె స్వరాజ్యలక్ష్మి మనపల్లెలకన్న కులాసమోములం
దచ్చుపడంగ రాచమరియాద లెఱుంగమి, జీర్ణవస్త్రముల్
విచ్చిన కొప్పులుంగలిగి పిల్లలు జెల్లలు గోలచేయగా
వచ్చి నమస్కరించకయ ప్రశ్నలువైచి రనేకరీతులన్

కం.	ఇదిగో! వచ్చె స్వరాజ్యం
బదిగో! యని భారతీయు లాశించిన య
భ్యుదయాపాదిని, కరుణా
హృదయా! కొనుమమ్మ యీదరిద్రస్తవముల్

ఆ.వె.	తొలగిపోయినారు దొరలింక మనవారి
దొరతనాన సేగిజరుగదంద్రు
దొరలు దాటిపోవ దొంగలు మిగిలి రా
వృద్ధియైన సేగికేమికతము?

మ.	తమదీనస్థితి విస్మరించి మతసంస్థల్ సెప్పు గమ్మత్తు భా
గ్యములన్నమ్మి, శరీరకష్టమున లభ్యంబైన యర్థాన్న లా
భమునన్ దృప్తివహించి, గంపెడు కుటుంబంబున్ బరాయించు త
చ్ఛ్రమజీవుల్ లలితాంగిలో జొనిపి రారాటాగ్ని గోళంబులన్

కం.	కుశల ప్రశ్నము చేయుచు
విశేషములు పృచ్ఛసేయు స్వేచ్ఛా సతికిన్
విశదముగ జెప్పి రెడదల
యశాంతి యావేదనంబు లధిదైవతముల్

తే.గీ.	హరిజనులచేతి నైవేద్య మభిలషించు
వేలుపులమగు మా విశ్వవిహితసమత
భ్రష్ట మొనరించి రమ్మ! దైవముల బ్రదుకు
కటకటా! నేడు సంశయగ్రస్తమయ్యె

ఉ.	శాపముచేత శిల్పుల ప్రశస్తచమత్కృతి జేసి, యేదియో
రూపముదాల్చియుందుము, నరుల్ దలబ్రద్దలుగొట్టుకొన్న నా
లాపము లాడజాలము శిలామయముల్ దనువుల్ కదల్పగా
నోపికలేక క్రుమ్మరెద ముత్సవవేళల వాహనాలపై

శా. అంటంగట్టిరి వాహనంబులని మా కాబోతులన్ దున్నలన్
గంటల్ గజ్జెలు గట్టి, క్షుద్రమగు నానాజంతు సంతానమున్
జంటల్ జంటల నాంధ్ర నాత్మజుల నీ సంసార కూపంబులో
కంట న్నీరిడుచున్న మే మొకరి పంకంబెట్టు వారింతుమో

శా. నైవేద్యంబుల నారగించితిమి నానావర్ణముల్ పెట్టగా
మావల్లన్ ఫలమించుకంతయును సంప్రాప్తింపలే దేరికిన్
మా వైశిష్ట్యము మా ప్రభావ మనుచున్ వర్ణించి దేశంబునం
దావేశంబు రచించు భక్తుల కదమ్మా! మా భటాగ్రేసురల్

శా. ఆదర్శంబులు గాంధి జీవిత చరిత్రార్థంబు లాశాంత శాం
త్యాదిత్య ప్రభలర్చనీయము లటం చాకాశవాణీ ముఖ
ప్రాదుర్భావ విదేశ సంస్తుతులు శ్రావ్యంబై నినాదింపగా
దాదుల్ దాను భజించె కంచుకితగాత్ర స్వార్గికానందమున్

మ. బహిరాడంబరదంభ గౌరవమునం బాలించి దారిద్ర్యపుం
దహనంబున్ దరికొల్పి చన్న దొరలన్ దద్గౌరవస్థాన దూ
ర్వహమై పాలనచేయు నాధునిక మంత్రంబున్ విలోకించి య
మ్మహదాదర్శచరిత్ర తేల్చుకొనె నాత్మన్ దారతమ్యంబులన్

చం. అడిగిన స్వీయ రాజ్యమున కడ్డులు చెప్పుచు నేబదేండ్లు పె
క్కిడుమలు పెట్టి తుట్టతుదకిచ్చి తొలంగిన తెల్లవారి చి
క్కడమగు రాజనీతికి నఖండ మనోధృతికి న్ముదశ్రువుల్
విడిచి ప్రశంస చేసె నరవింద నిభాస్య విశాల చిత్తయై

సీ. కాంక్షింతు మొక తటాకంబంచు మొరబెట్టు రాతి ప్రాంతాలు సర్వము చరించి
వ్రాసికొన్నా మమ్మ! రహదారి కొఱకంచు బరువెత్తు సీమల బాదమూని
కొలత గింజల బాధ దొలగించి పొమ్మంచు గోల పెట్టెడు పట్టణాల నరసి
క్షేత్రాలు పంచి యిచ్చిన గాని కాదను సత్యాగ్రహుల మహజరులు సూచి

తే.గీ. స్వీయ రాజ్యార్థమై యిచ్చు సెలవునాడు
పెరటి బేరాలు సాగించి ధరలు బెంచు
మాయ మార్కెట్లవారి గమ్మత్తు లరసి
దేశభక్తుల కన్నీట దేలిపోయె

కం. అవినీతి ప్రబలెనని, పె
ల్లవినీతికి బాలుపడెడు నటునిటు గాంధ్రన్
గువలయ కంటకులంగని
కువలయహిత మనసు పగటికువలయమయ్యెన్

సీ. బలమైన మిత్రమండలిసేన సెలవంది సీమకు పయనంబు చేయునాడు
అతినిరాడంబరంబైన రాజసముతో ఖదరుజెండా మింట గదలునాడు
అధికార దండంబులంది మంతురు లెల్ల సింహాసనము లధిష్టించునాడు
అనశవ్రతుని తాతయశక్తి దలపోసి సుర లద్భుతంబంది చూచునాడు

ఆ.వె. ఏయుదాత్త దృష్టి, యేసామరస్యంబు
ప్రతిపదార్థమందు ప్రతిఫలించె
సన్నగిల్లె నాటి చైతన్యమని భామ
యశ్రుపూరితాక్షియై, తపించె

చం. పరమతపోధనుల్, సుకవిపండిత మండనులల్లి చన్న సా
గరసమమైన వాఙ్మయముగల్గిన గడ్డలుగన్న కాన్పులై
హరిజనులన్న ముట్టదగనట్టి వ్రణంబు కుదర్పరానిదై
పెరుగుట దుస్సహంబని తపించె వధూమణి మానసంబునన్

చం. హలము రవంత సోకిన సుధాన్నపురాసులు గుమ్మరించు భూ
తలసతి, యన్నపూర్ణగళదఘ్నదరిద్రత వస్త్రహీనయై
నిలువున నెండియున్న దయనీయపరిస్థితి కంతరంగమా
కులపడజింతచేసె ననుకూలములైన సహస్రమార్గముల్

సీ. ఐశ్వర్యరమ మనుష్యత్వంబు మరపింప దయ దప్పియున్న నేత్రములవారు
ఆచార కవచంబు లభయహస్తము జూప తెరచాటు నేరాలు జరుపువారు
పట్టభద్రత్వంబు వడసి సామాన్యుల చెలిమికి దూరమై చెడినవారు
తాత తండ్రుల భుజాదర్పాలు వర్ణించి అధినేతృతకు పీకులాడువారు

ఆ.వె. నిన్న చెల్మిజేసి నేడు విరోధులై
చిత్రచిత్ర ప్రకృతి జెలగువారు
ప్రకృత నాగరికత పదిమాసములు మోసి
కడుపు చల్లవడగ గన్న సుతులు

చం. ఒకదెస మానవత్వము సహోదరభావము లాగుచుండ, నిం
కొక దెస కాదు కాదని మతోగ్రపిశాచి బలాత్కరించగా
వికట విభిన్న వేషములు వేసి చరించు ననంతకోటి వా
ర్గిక రసహీన జీవిత పరిస్థితు లాత్మగలంచె భామకున్

చం. మగడు గతించె నంచు నొక మాటలు రానటువంటి బాలకున్
జిగురు శిరోజముల్ నరికి, సిగ్గు ఘటించి, ముసుంగు వెట్టి, సో
యగమును హత్యజేసెడు భయంకరచర్య, యనార్యతామహా
మృగవికటోగ్రచేష్టయని యింతి మనస్సు గలంచె నెంతయున్

చం. హరిజన వాడలం దిరిగి యచ్చటి కష్ట చరిత్ర గుండెలన్
నరుక, విషణ్ణ రక్త వదనంబున నశ్రులు జింది, దేవమం
దిరములు సొచ్చి, పూజరుల నీతివిహీనత కన్నులార గా
నరసి, గ్రహించె నందు పరమార్థము, పూజలలోని పుణ్యముల్

మ. అలుకన్మాలల పేరునంబసుల యందావేశరోషంబులన్
మొలిపింపంగ నవాచ్యముల్ బలుకు హిందూసంఘమున్ గొల్చుచున్
కలతంజెందని పంచమీయుల యభాగ్యత్వంబు నూహింప, గుం
డెలలో మెండుగ నగ్ని కుండములు మండెన్ గాంధి దౌహిత్రికిన్

మ.	ఒకచో వర్ణవివాదకారణముగా నుద్రేకులై దెబ్బలా
టకు దట్టీలు బిగించు మూర్ఖుల గలాటాజూచి, చింతించి, యం
తికమందున్ మధుర స్వభావములతో తేడాలు లేకుండ బా
లకు లాటాడుట జూచి నవ్వుకొనె నుల్లంబందు సంతృప్తయై

కం.	భగవత్పూజా నెపమున
నగణితముగ జంతుహింస లాచారముగా
యుగముల తరబడినెరపెడు
తెగలంగని భామ గుండె తెగి రెండయ్యేన్

సీ.	పసిపాపలకస్వర్గపదవిగా కన్యుల కందబోదని యేసు డన్నమాట
అధికుండ నన్నవా డధమాధముం డంచు మతము లుద్ఘోషించు మంచిమాట
సహనంబు సర్వవిశ్వము నేలగలదంచు గుజరాతుముని మొత్తుకొన్న సూక్తి
ఆశయే దుఃఖాల కాది కారణ మంచు శాక్యసింహుడు పల్కి చన్న హితవు

తే.గీ.	స్వార్థపరమైన కపట రూపములు దాల్చి
సకల దిక్కుల నాట్యంబు సలుపుచుండ
కంట తడిపెట్టు గాంధి విగ్రహము నరసి
కోమలాంగికి చిత్తంబు గ్రుంగిపోయె

ఆ.వె.	నలుగు బెట్టవచ్చు నవయుగాంగనలతో
చెలిమి నెరపి కలసి మెలసి తిరిగి
వెడలి రాక వారియెడదగాయము చేయు
నభిమతంబు లెల్ల నాకళించె

# హిమగిరి యాత్ర

కం. వారాణసికింజని, శివు
నారాధన చేసి గంగయందు మునిగి కాం
తారములు గడచి, హిమగిరి
చేరువ నొక రమ్య వన్యసీమకు జనియెన్

ఉ. ఆళియుగంబుతోడ గమనాలసయైన స్వరాజ్యరాజ్ఞి య
ప్పూల వనంబునం బదము మోపిన యంతన జాతి వైరముల్
దూలి, మృగావళుల్ జెలిమితో విహరించుట జూచి జంతువుల్
మేలు సుమీ! మనుష్య నుపమింపగ నంచు దలంచి రంగనల్,

ఉ. స్వాగతమిచ్చె కోకిలము చక్కగ బూచి, పరీమళించు పూ
దీగల నూగుచుం భరతదేశ తపఃఫలమైన కన్యకున్
కాగల దానికిన్ బ్రజల కష్టములం గడతేర్చు దానికిన్
త్యాగుల ముద్దు బిడ్డకు మహాత్ముని ఖద్దరు యాజ్ఞసేనికిన్

ఉ. తీయని పండులం గుడిచి దీర్ఘమహీరుహ విస్తృతచ్ఛద
చ్ఛాయల విశ్రమించి, శుకజాతము ముచ్చట లాడుచుండి, స్వే
చ్ఛాయువరాజ కన్య కగచాటులు వచ్చెనటంచు, “రామ! రా
మా!” యను పల్కులం దెలిపె నాదరణాంచిత సానుభూతులన్

ఉ. ఆవనసీమలందు గుసుమాంజలిబట్టి మరుత్కుమారకుల్
సేవలు సేయ నెచ్చెలులు శీతల వాక్కుల నూరడింపగా
త్రోవగమించినట్టి శ్రమధూతముగా వడదేరి, శాంతికిన్
దావిడ కేచుచున్న యలదారుణ దృశ్యములం దలంచుచున్

సీ. కబళించునో! పరాక్రమము నుంకువ జేసి క్రమ్మర నాంగ్లేయ ఖడ్గసేన
బంధించునో! మతవ్యాజంబు గల్పించి చీలిపోయిన పఠాణీల పౌజు
కారించనో! యగ్నికణములు వెదజల్లి నాలిగూండా గొరిల్లాల దండు
వెతల పాల్జేయునో! పతకంబు మారిచి చెరదప్పివచ్చు రాష్ట్రీయప్రతన

ఆ.వె. వలచి వచ్చినట్టి వరులలో నాదృష్టి
కాని నట్టివరుని గానసైతి
మగడు లేకయున్న మగువ రాణించునా!
చక్రవర్తి యింట జననమయిన

మ. జననంబందితి, దేశభక్తుల యహింసా యుద్ధరంగంబునన్
దనువుం బెంచితి గొన్నినాళ్లు శుభవద్గాంధీ కరాబ్జంబులన్
ఘనతం జెందితి; దేశదేశ రసనాగ్ర స్వర్ణపీఠంబులన్
ననబోండ్లార? విపత్పరంపరలు గన్పట్టున్ భవిష్యంబునన్

ఉ. ఆకలిదప్పులుం వెఱపు లాసలు డాయని యట్టి సత్య ధ
ర్మైకసమీక సాహసులు నింద్రియనిగ్రహవేత్తలైన, శు
శ్లోకుల పెండ్లికూతునకు శోకముకూడదు రాచబిడ్డవై
ప్రాకృత కాంతవోలె నెదవందురు దమ్మ! స్వరాజ్య కన్యకా!

ఉ. నిండుగ దెల్లవారి రమణీయ విభాకర బింబదీధితుల్
పండుపసిండినీరుదయ పర్వతభూముల జల్లలేదు, ప్రో
చ్ఛందతమో వికారపు నిషాపసదగ్గనిగడ్డలో, సుధా
భాండము జిక్క లేదనుచు వందురు దెంతటి పిచ్చిపిల్లవో!

ఉ. చిన్నతనంబు నీది, హృది చిన్నది, నీపదమూను పీఠ మ
త్యున్నతమెల్ల దేశముల నుండక పోవవినీతిభూతముల్
సున్నితమైన నీ హృదయశుద్ధికి జోడగు జీవితేశు డు
త్పన్నమునందకుండడు ముదంబు ఘటింపకపోదు నెచ్చెలీ!

శా. నీ వాశించిన కొత్తకాపురము గాంధీ భస్మ దేహంబుతో
దేవావాసము జేరిపోయినది, తద్దివ్యాశయశ్రేణి, నా
నావేషాలు ధరించి లోభుల మహాంతర్నాట్య రంగంబునన్
గావుంబట్టి నటించుచున్నది భయోత్కంప క్షమాదేవతన్

ఉ. కాలము గారడీనివలె కల్పనచేయగలేనిదేది! యీ
కాలములో గవర్నరులు గాదె యొకానొకనాడు ప్రాతకే
డీలు! లతాంగి! యిప్పటికడింది జగత్తొకనాడు మెత్తనై
వాలకపోవదభ్యుదయ వర్ధకమైన భవత్పదద్వయిన్

సీ. చక్రవర్తిని, నిమేషమున భృత్యునిజేసి మిడసిపాటుననున్న చెడుగు తెలిపి
బంట్రౌతు నొకనాడు పరిపాలకునిజేసి యధికారగర్వ మద్యం బొసంగి
రూపవంతులను కురూపవంతులజేసి వైరాగ్య బీజముల్ పాదుకొల్పి
మసిబొగ్గులను వజ్రమణిరాసుల నొనర్చి తీపికోర్కెలకు పందిళ్ళమర్చి

తే.గీ. మంచిచెడ్డను, చెడ్డను మంచిజేసి
నిముష వేగాశ్వముల నెక్కి నేర్పుమీర
సృష్టిపై పెత్తనము జలాయించుచున్న
కాలమునకన్న తుంటరి గానరాడు

ఉ. నేడు స్వతంత్ర భారతము నిందల పాలయి, దుష్కృతంబు నీ
ళ్ళాడిన దన్న, శాసన మహాసభలో గుడితోడ లింగమున్
గూడ గ్రహింపగల్గు ఘటికుల్ పదమూనుట హేతువందురో
చేడియ! నీ సమాగమముచే సమయున్ గడకెల్ల లోపముల్

మ. సలుపంగావలె దొడ్డకాపురము, హస్తంబందు గీలింపగా
వలె, బంగారపు రాజ దండమును, దీవ్యత్సేతు శీతాచలో
జ్వల భూఖండము నేలగావలె, మహాసంతానమున్ గాంచగా
వలె, బాలామణి, నిస్పృహోప హతవై వాపోవుటల్ సెల్లునే

చం. ఇది విజనస్థలంబు, మన మిచ్చట నున్న విపత్తు వచ్చు, నీ
సదమలసంస్కృతిం జెరచి సంతసమందు వృథాపకారు లీ
పొదలను బొంచి యుండ్రు నరమూర్తి వహించిన సింహరాజముల్
హృదయములేని ధర్మములు సృష్టి యొనర్చు విషప్రచారకుల్

ఉ. స్త్రీల యభీష్టముల్ జివికి జీర్ణములై మరణింప గొంతుకున్
దాలి బిగించు సాంఘికపు దానవినూత్నయుగప్రభూత వా
తూలసదాశయ ప్రణయదోహలవైన నినున్ యథేచ్ఛగా
గాలిడనిచ్చునే? వలచు కాంతుని గూరిచి ముద్దు దీర్చునే

చం. పురుషుల లోభపుం బిరుసు బుద్ధికి లోబడి భారతీయ సుం
దరి దరిదాపులేని పరదా చెరలోబడి క్రుగ్గిపోయెడిన్
దరుణి; స్వతంత్ర భారత రథంబొక బెత్తెడు దూరమేనియున్
జరుగునె? కామినీ పురుష చక్రయుగంబు భరింపకుండినన్

ఉ. వ్యాకులమంది, పక్షి మృతి కశ్రులు రాల్చి కలంబునందు వా
ల్మీకికవిప్రకాండుని, యమేయదయామధురస్వభావ ర
త్నాకరు లుద్భవింత్రు భవదన్వయమంజుల గర్భశుక్తి, హిం
సాకలనాపురాతనపు జాడ్యము వాపు కుమార రత్నముల్

ఉ. ఆమని సామికిన్ వలపుటారతు లిచ్చుచు కంఠ మెత్తి యా
రామము పల్లవింప మధురంబుగ గానముసేయు కోకిలా
భామను బోలి, నీభయము వాసిన రాజ్యమునందు సత్కవి
గ్రామణు లాలపించెదరు గాత వినిర్భయ విశ్వగీతికల్

సీ. దట్టంబులగు దేవదారు వృక్షములతో సురభిళంబైన యిగ్గిరి తటముల
బ్రవహించు సెలయేటి పాయల కిరుచక్కి బూచిన గేదంగి పొదలయందు
నిప్పపూదేనె మత్తెక్కి పాటలు పాడు గండు తుమ్మెదల ఝుంకార రవళి
శ్రుతిగల్పి కెంజేతి రతనాల వీణియల్ మ్రోయించి కడు జగన్మోహనముగ

తే.గీ. నృత్యగాన వినోద పాండిత్య కలన
ధవుల నలరించు సిద్ధ గంధర్వ సతుల
డెందముల నిండిపారు నానందలక్ష్మి
కాపురము చేయుగాక నీ కాపురమున

మ.	తలలో మారుపురాని రిత్తచదువుల్ ధర్మంబులుం బూజ లెం
దులకీ చీకటి జీవయాత్ర కొక హద్దున్ పద్దు గన్పట్టదా
చెలి! క్షుద్బాధితమై కరద్వయము సాచెన్ దేశ మేలాటి సం
స్థలు స్థాపించి దురంత దుర్ఘట సమస్యాపూర్తి గావింతువో

మ.	అరుణంబైన విరోధి నేత్రమును ప్రేమాయత్తముంజేసి దు
స్తరనైరాస్య విభావరీమధుర చంద్రజ్యోత్స్న నిన్నల్లనన్
దిరిపెంబెత్తితిమమ్మ! శోభిలు ప్రశాంతి చ్ఛాయలో, కీర్తి సుం
దరి సేవింప రహింపవమ్మ బహుసంతానాంగదభ్రాజవై

సీ.	అక్షరజ్ఞానశూన్యతన ధన్యతనందె భాసురాంగుల చేరదేసికన్ను
తిరిపెంబు మరగి వ్యర్థీభూతమైపోయె వెయ్యేండ్లు మగవారి చియ్యపుష్టి
ఊహాకషణయోగ మొక్కింతలేక త్రుప్పుంబట్టె దేశీయ బుద్ధిబలము
పక్షపాతపు దృష్టిబారి వృద్ధికిరాక పతనమైనది పండు వంటి ప్రతిభ

తే.గీ.	అనుభవజ్ఞపు ఖండఖండాతరముల
వలపు కానుకలందిన భాగ్యశాలి
వాదుకొనుమమ్మ శుభములు పాదుకొల్పి
విశ్వసన్నుతమగు శాంతి విస్తరిల్ల

మ.	కరుచైపోయిన వీరలోకమునకై కన్నీరు వర్షించుచున్
గరముల్ మోడుచు మందభాగ్యదశ కింకన్ దావులేకుండగా
దొరికె న్మాకు విచిత్ర దిగ్విజయ వస్తుశ్రేణి బాపూజిచే
తరమే మ మ్మెదిరింప నన్యులకు రక్తగ్రాహి ఖండాలికన్

ఉ.	ఉన్నత పీఠమెక్కి తలయున్ మొలయున్ గురితింపలేని మృ
ష్టాన్ను దఖండ పండిత మహాపరిషత్పతియై రహించి వి
స్పన్నయగున్ వచించెడు నదంతయు వేదమగున్ వికారపున్
దెన్నున సాగుచున్న జగతిం దలసూపని వింత లుండునే?

తే.గీ. ఆరయనరయంగ మౌనముద్రాంకితమయి
హాయి గల్పించు యీ శీతలాద్రిసీమ
శాంతిసందేశముల పాఠశాలవోలె
నలవరించెడు నేదొ రహస్య విద్య

ఉ. హాయిగ నిమ్మహానగ భయంకర సాంద్రవనీవనంబులం
దేయపకారచింత కెడమీని వినిర్మల చిత్తశుద్ధితో
బోయలు వాసముంద్రు శరపూరితతూణధనుర్ముఖోగ్ర ది
వ్యాయుధధారులై, భుజబలాఢ్యులు కొండదొరల్ ప్రచండులై

కం. గురిదప్పని బాణమువలె
గురిదప్పదు వీరి పలుకు గురిదప్పినచో
గురుదైవతముల నేనిన్
సరకుగొన రనాది ధర్మసత్య స్థిరతన్

ఉ. మూడిన పీడ నాగరకపుం బ్రదుకుల్ దొరలింప దేహముల్
బాడుగ కిచ్చివైచి బదవల్ బడు పట్టణపుం గమార్ల ప
ట్టాడని దాహబాధ పదమూనదు వీరి గృహాంగణంబులన్
మేడల దాంబికంపు మెడనిక్కులు టక్కులు వీరి దృష్టికిన్

ఉ. పచ్చి వెదుళ్ళతోటల నవారిగ బండిన ధాన్యరాశితో
నెచ్చట చేయిసాచిన లభించెడు పక్వఫలాసవాళితో
లచ్చిని జంక బెట్టుకొని లాస్య మొనర్చెడు నివ్వనంబులన్
మచ్చున కుందునే కడుపుమాడిన ప్రాణిచయంబు నెచ్చెలీ

ఆ.వె. అలతి హింస చేయ దధికార కాంక్షచే
చియ్యబట్టి మసలు సింహరాజు
కడుపు నిండెనేని గర్జింప దెన్నడు
తనివిసననిమేటి ధనికునట్లు

సీ. నడయాడి యెఱుగ వెన్నడు వీరి పాదాలు ధర్మేతరములైన దారులందు
విని యెఱుంగవు వీరి వీనులేకాలాన నేలాటి రాజకీయాల గొడవ
కని యెఱుంగదు వీరి కన్నుదమ్ముల జంట నవనాగరకుల మాంద్యప్రవృత్తి
ఎఱుగ వెన్నడు వీరి తృప్తాంతరంగముల్ ఆశాశరప్రచండాభిఘాత

ఆ.వె. అసహజంబులైన యాడంబరంబుల
నంటనీవు వీరి యాకుటిండ్లు
చీకు చింతలేని జీవుల దరిజేర
కుటిల మృత్యువునకు గుండె సున్న

చ. ముసలితనంబు మృత్యువును ముట్టవు తీయని కోర్కెలూరు మా
నసముగలట్టి వారిననువ్యరహస్య మెఱుంగదీయ స
ద్వ్యసన పిపాసితంబయిన ప్రాకృతలోకము దీర్ఘసత్త్వపో
భ్యసనమునన్ లభించు పరమార్థము జాఱని యౌవనంబగున్

ఉ. తంగెటి జున్నుకై గిరిపథంబుల నెల్ల పరిభ్రమించు, భి
ల్లాంగన మూపునం బుడుత డల్లరిచేయక చిన్ని చేతులన్
నింగికి సాచి సృష్టిరమణిం గబళించెడి వాని స్వర్గమున్
భంగము సేయలేదు భగవంతుడు గూడ వివాద మేటికిన్

ఉ. పోకిరిమేఘముల్ దినము బోవుచు వచ్చుచు మస్తకంబులన్
దాకి తగాద రేచిన సుధారసమున్ వెలిగ్రక్కి చల్లనై
వ్యాకులపాటులేని హృదయద్రఢిమంబును వెల్లడించుచున్
నాకు హిమాద్రి, గాంధిమునినాథు చరిత్ర స్ఫురింపజేసెడిన్

చం. ఎఱకలువిచ్చి మింట జరియించుచు నక్కిన క్షుద్రపక్షులన్
కఱకు నఖావళిం జెలగి కండలు సాపడుచున్నయట్టి య
గ్గరుడుని రాజకీయములు గర్భ విదారకమై యెడాల్పు హి
ట్లరుని స్ఫురింపజేసెడి కటా! యధికారము లాత్మశూన్యముల్

ఉ. కోయిల హాయిగా మధుర కూజితముల్ పచరించుచున్న మా
ర్మ్రోయుచు వెక్కిరించు నలభూధరగహ్వరపాళిదక్క వే
రే యుపకార మిందు లభియింపదు రక్తపరాయణంబు లీ
లోయల సింహరాజులు పులుల్ కలనాదము కాంక్షచేయునే

ఆ.వె. కమల పుష్పచయము కన్నెత్తి చూడదు
చందమామ మోము చక్కదనము
పేదవాని కళకు పెద్దపీకం బిచ్చి
గౌరవింప దెపుడు కటికజగము

తే.గీ. కుంజరంబుల ప్రోత్తుంగకుంభయుగళి
జీల్చి మేధస్సు గమిచి భక్షించువేళ
నవని దొరలెడు మంచిముత్యాల విలువ
హరి యెఱుంగదు, రక్తతత్పరులు నృపులు

ఉ. మంచుశలాక మాదిరిగ మంగలకత్తి విధాన, కొమ్ము రెం
డంచులు సానబట్టుకొని యద్రిగుహాంతరసీమవాసి యే
తెంచు వరాహ ముద్ధతి వధింప నెదుర్కొను బెబ్బులిన్ గదా
యించి పెనంగుచున్నది, సహింపరు ధీరులు క్రూరచర్యలన్

తే.గీ. అద్రినెత్తాల మధువు నాప్యాయనముగ
గ్రోలుచున్నదీ, యెలుగు నీగ్రోకులంబు
మంచుకొండల శ్వేత సామ్రాజ్యఫలము
సమత లభియించు వర్ణభేదములులేక

మ. వలపుం గాటుకదీర్చి గజ్జెలును మువ్వల్ గట్టి పూజించి క
త్తుల పాల్సేయు మనుష్య సింహముల పొత్తుంబాసి పెక్కాలమం
దలు జీవించెడి నియ్యరణ్యములలోనన్ బచ్చికల్ మేసి, లే
గలు ముప్పూటలు పాలుద్రావి మదివొంగన్ జెంగనాల్ దీయగన్

మ. బదరీనాథుని కాపలాభటకదంబం బట్లు మార్గస్థులన్
బెదురున్ బెట్టుచు గోపురాగ్రములపై నిత్యంబు క్రీడించు బ
ల్లిదపుంగ్రోతులలోన హాస్యపునిధుల్ బెంపారెడిన్, నవ్వుతొం
బదిపాళ్ళౌషధమై, కుదుర్పగల దాత్మక్లేశ రోగోద్ధతిన్

మ. అదిగో చూడుము రత్నరంజితకషాయచ్ఛాయలన్ జిమ్ముచున్
బదిపంద్రెండు హిమాద్రిశృంగములు కన్పట్టున్ సముచ్ఛ్రాయమై
ముదురుం బాకపుమంచుకాంతు లొలయన్ బొల్పారు నక్కొండపై
గదలు న్నేటి త్రివర్ణకేతనము ప్రోద్గాఢ ప్రజాహంకృతిన్

ఉ. ఎక్కటి వీరుడై, దొరల యేల్బడితోడ నెదిర్చి, రక్తపుం
జుక్క విరోధిమేన జవిచూడక, ఘూర్జరవృద్ధు, గెల్చి గ
ట్టెక్కిననాడు, దేశజనయిత్రి ముదంబున వాలుకొప్పునన్
జెక్కిన పుష్పరాజమది, నీ జననస్మృతి చిహ్నమంగనా?

ఉ. నివ్వరి ధాన్యమున్ మెసవి, నిగ్గులు దేలిన కండపుష్టితో
మువ్వలు గజ్జెలుం బసిడిపూసలు గల్లున మ్రోయుచుండగా
రివ్వన మింటికి న్నెగసి శృంగయుగంబున నద్రిణాలతో
జివ్వయొనర్చునంది; పురజిత్తుని వాహనమంబుజాననా

తే.గీ. ఎద్దు నడయాడు సీమలం దెల్లకడల
క్రొవ్వు వెలివడ్డ గాయాల గుఱుతులట్లు
కానుపించెడి కొన్ని కక్కసపుగంట్లు
చెలియ! యవిదాని యుక్కుగిట్టెల క్షతాలు

మ. అతిస్నిగ్ధంబయి పట్టుజిక్కని తదీయాద్రి ప్రదేశంబులం
దతి సౌలభ్యము మీర బ్రాకెదరు బోయల్ కొండ రాదివ్య గో
పతిరింఖాంకము లిందు కాంతమణి సోపానంబులై క్రాల, స
ద్గతికి న్నిచ్చెనలంద్రు శైవులు తదుక్షస్వామి పాదాంకముల్

సీ. అగుపించె శిఖరాలు దిగివచ్చు సెలయేటి తరగలో నడయాడు దానదీప్తి
కనుపట్టె స్వాతిమేఘాల గర్భమునందు తప్తభూతలము నోదార్చు చలువ
దీపించె ప్రతి చిన్నితీవ సుందరియందు నాలింగన ప్రణయానురక్తి
తోచె ప్రభాతవాతూల బాలకులందు ముట్టిమూపులు దట్టిపోవు మైత్రి

ఆ.వె. త్యాగులైన వారి ధర్మసందేశంబు
లాచరించు ప్రకృతి నభినుతించి
ఆస్వరాజ్యకన్య యాత్మలోగల చింత
లెల్లమరచె మేను పల్లవింప

శా. ఆ జెండాపయినున్న రాట్నమున గాయాల్వ్రడ్ల నెమ్మేన బా
పూజీ దీయుచునుండు నేటికిని సంపూర్ణ స్వరాజ్య ప్రతి
ష్ఠా జైవాతృకరోచిరంచిత విరాజచ్ఛాంతి సూత్రంబులన్
మాజీభారత భావదాసులకు సన్మార్గంబు సంధింపగన్

చ. అని చెలికత్తె బల్కు సమయంబున చేరువ పల్లెనుండి హ
మ్మని వినిపించె మేటి కదురాడిన సవ్వడి గాలిపాటునన్
కనులకు గోచరించె నలనాటి మహాత్ముని మూర్తి కట్టితో
కనకపు కాంతితో, తుహినకాంతుల కమ్మని హాసరేఖతో

ఆ.వె. తాత వచ్చెనంచు తడబాటువడి చూచి
కలికి, వట్టి బయలు కౌగిలించి
యీషదీషదర్థహీన శబ్దంబుల
నుచ్చరించి నేల కొరగి పడియె

ఉ. ఒక్కనిమేషకాలమటు లుర్విపయిం బడియుండి, మోమునన్
జక్కని కాంతిరేఖ విలసిల్ల, దటాలున లేచి, తాత యీ
దిక్కున కేగినాదని నదీనదముల్ గిరులుత్తరించుచున్
జెక్కిన కొంగుతోడ బరచెన్ జెలికత్తెలు వెంట నంటగన్

కం. మోజుపడి తాతకోసము
రోజులు వారములు దిరిగి రోజుచు తుదకున్
రాజాఘట్టము జేరి ప
యోజానన! మే నెటింగి యూర్పులు చిమ్మెన్

కం. శిలయైన తాత చెంగట
తలవాలిచి మ్రొక్కి కొంత తాపముడిగి, కా
గలవాని, జాలిగుండెలు
గలవానిని, తాత కవళికలు గలవానిన్

సీ. పంచేంద్రియముల దర్పమును గుప్పిటబట్టి హూంకరించెడు మీసమున్న వాని
ప్రాగ్దురాచారదుర్భర సింహగర్జకు నురమొడ్డి యెదిరించి యోర్చువాని
అంబికాధవుని పశ్యన్నేత్రమును బోలి తడబాటులేని వర్తనమువాని
కష్టానుభూతి విశ్వంబు నాహరించి పదుగురి హృదయాల మెదలువాని

ఆ.వె. కరముచెందుగాంధి కత్తివాదరమీది
కఠినతపము చేయగలుగువాని
హృదయమున్నవాని నీడుజోడగువాని
ప్రేమమీర భామ పెండ్లియాడె

శా. ఈడుంజోడని మెచ్చె నయ్యమెరికా, యింగ్లండు చీనా జపా
నోడల్నించి యవారిగాబనిపెనెన్నో కాన్క లాశీస్సులన్
దాడీదువ్వి సెబాసనెన్ బరిషియాస్థానాఫ్ఘనిస్థానులే
కీడు న్మేలనకుండ నంపుకొనె పాకీస్థాన్ బ్రసూనాక్షతల్

ఉ. లేత స్వరాజ్యరాజ్ఞి సఫలీకృతదీవ్యదభీష్టయై సుఖ
జ్యోతులు ప్రజ్వరిల్ల వివిధోర్వీరమాప్రణతుల్ గ్రహించి ఢి
ల్లీ తపనీయపీఠి శుభలీల నధిష్ఠితయైనయంత ని
ర్భీతి పచారుసల్పి, సరవిందదలయెత్తె విశాల ధర్మముల్

కం. ఆస్తిక్యము మాటలుగా
నాస్తిక్యము పనులుగాగ నటియించు వృథా
ప్రస్తుత వాతావరణము
వాస్తవ సచ్ఛీలధర్మపథమున నడచెన్

కం. జాతీయ కళలు రాకా
శీతాంశుని కరణి నుల్లసిల్లె సుభిక్షా
శీతాంశుకధారిణియై
భూతలము రహించె గాజుపూసల సిరులన్

ఆ.వె. హలముసోకి నేల విలసిల్లె బంగారు
తీగయగుచు డిల్లిభోగయగుచు
కలము చేతబట్టి, జలజాక్షి విద్యావి
భూషయయ్యె సత్యభాషయయ్యె

చం. స్వయముగ జూచివచ్చిన యశాంతపరిస్థితి చక్కదిద్ది దు
ర్ణయము నడంచి, ప్రాజ్ఞులు ధురంధరులైన యమాత్యశేఖరుల్
క్రియము ఘటింప భారత చరిత్రకు నూతనశోభగూర్చి ము
త్తయిదుతనంబుతోడ, ప్రభుత న్నెరవేర్చె సహస్రవర్షముల్

కం. తెల్లని రాజులు కీరితి
వెల్లువలై సీమవరకు బేరెమువారన్
ఢిల్లీ హస్తినగాగా
చల్లని పాలనము రాణి సంస్థాపించెన్

సీ. మనవాడు కాదులెమ్మని కార్యములపట్ల పక్షపాతపు జూపు బరపువారు
కర్మశాస్త్రములకు గరములు జోడించి భుజశక్తులను నిద్రబుచ్చువారు
చిన్ని నా బొజ్జకు శ్రీరామ రక్షయం చొరుల పచ్చనకు నిట్టూర్చువారు
నవయువానుల భావ నవ్యవాహినులు శంకించి సేతువులు బంధించువారు

ఆ.వె. దేశసేవ మఱచి, దేశంబు సేవకై
గొప్ప పదవు లందుకొనెడువారు
స్వార్థచింతలేని జాతీయ ప్రభ్విణి
పొలుచునాడు కలికమునకు లేరు

ఉ. ఆపదనున్నవాడు తనకంతల పొంతల జుట్టమైన సం
తాపము వెల్లడించు గిరిదాటని ధర్మము విశ్వసౌహృద
వ్యాపృతికి న్నిరోధమని యారటమంది ప్రపంచమైత్రి సం
స్థాపనకై సమత్వము బ్రచార మొనర్చె సమస్త జాతులన్

చం. పరిణతికి న్సహింపక యపారశతాబ్దవయోభరంబునన్
నరముల కెక్కిపోయిన సనాతన సాంఘిక దుష్టదృష్టిచే
సరసులు సత్యశీలుర యశస్సునకుం బలియౌటెటింగి, యీ
తెరమరుగుం బ్రమాదమును దీర్చు నుపాయము లేక దుఃఖిలెన్

సీ. స్తంభితంబగు వయోజన మహాజడనిధి జలధిగా నక్షరాస్యత ఘటించి
క్షేత్రసుందరికి నచ్చిన వ్యావసాయిక దోహదంబులకు చేదోడొసంగి
త్రికరణంబులకు పొందికపొత్తు చేకూర్చు సత్కళావిద్య కాశ్రయము జూపి
ముదిరిపోయిన నేటి ముమ్మాయి ముత్యాల యధమ సంస్కృతికి సన్యాస మిచ్చి

తే.గీ. మధుర వర్తనులగు మేటి మంత్రిమణులు
గృహముదీర్ప ప్రజారాజ్య వహనయగుచు
బసుపుగుంకాల సిరిలోడ భరత పీఠి
పాలనము చేసె వేయేండ్లు ప్రతిభమీర!

శా. గాంధిన్ జంపి మిఠాయి బంచిన యుయుక్త క్రూరవర్గాలతో
బంధుత్వంబు పరిత్యజించి యలఘు ప్రత్యక్ష వైరంబులన్
సంధానించు మతాలు చూపు నలమోక్షశ్రీ విసర్జించుచున్
సంధించె న్నవభారతంబున క్షమాసస్యాంకురజ్యోతులన్

# రాష్ట్రపూజ

సీ. భక్షించితివి రాష్ట్రదీక్షా మహాయోగి పొట్టిరాముని రక్తభోజనంబు,
జరిపించితివి వీరసత్యాగ్రహోద్యమ యజ్ఞముల్ తెలుగు సింహములచేత
కారించితివి నిరాహారవ్రతజ్వాల గొలపుడి సన్యాసి కుంజరమును
తినిపించినావు బందీగేహముల రాష్ట్ర భక్తకోటికి ముక్కపచ్చిపులుసు

ఆ.వె. మూడుకోట్ల తెల్గుపుత్రులపటురక్త
నాడులందు నీతలాడినావు
పడ్డకష్టములను పాటింపమిక చేతి
కందినావు, రాష్ట్రసుందరాంగి!

మ. పొలయున్నెత్తురు యాభదెన్మిది దినంబుల్ క్షుత్పిపాసాగ్నిలో
బలిగావించిన పొట్టి రాముల యనల్పత్యాగ మమ్మాడు కొం
డలలింగాలగదల్ప, దిగ్విజయ ఘంటారావముల్ సేయుచున్
జిలుగుంబల్కుల తెల్గురాష్ట్ర మరుదెంచెన్ నేడు పుట్టింటికిన్

శా. బంగార్తీవలు, జిట్టిముత్తెములురో భాగంబునంబచ్చగా
సింగారించి, భవచ్ఛుభాగమము నీక్షింపన్నదీ దేవతా
సంగీతంబులుతో నెదుర్కొనగ ముస్తాబైన నీరాష్ట్ర హే
మాంగీమస్తమలంకరింపుము, విశాలాంధ్ర ధ్వజాంభోజమున్

శా. ఆరేండ్లైనది భారతీయుడు స్వరాజ్య స్వర్ణసింహాసనం
బారోహించి, చరిత్ర కెక్కగల కార్యశ్రేణి యందాంధ్ర రా
ష్ట్రారంభోత్సవమందుకొన్నదిపు డర్హస్థాన మర్యాదలన్
నీరత్నాలరథ ధ్వజంబునకు మాణిక్యప్రపూజాంజలుల్

మ. ప్రజలాశించిన శాంతిసౌఖ్యములు సంప్రాప్తించలేదాంగ్లభూ
భుజులట్లేగి, స్వరాజ్య కేతనపు దీప్తుల్నిండి శోభిల్లినన్
గుజరాతీయ తపస్వి చిత్తమునకున్ మోదంబు సంధించి నీ
ధ్వజమెత్తింపుము యావదాంధ్రము సుఖింపన్ స్వీయరాష్ట్రాంగనా

సీ. ఇచ్చోట, రాలిపోయినది శాత్రవవీర దంతిదంతాల ముత్యాలసరకు,
ఇచ్చోట, పండిపోయినది కొమ్మనపట్టి, దివ్య లేఖినిజగా తెలుగుకైత
ఇచ్చోట, నిలిచిపోయినవి నాగార్జునాచార్యుని ప్రాచీన చైత్యనిధులు
ఇచ్చోట, చిందిపోయినది సీతావిప్రయోగి రాఘవుని యాశ్రూదకంబు,

తే.గీ. అవసరమువచ్చెగాన పూర్వాంధ్రగాధ
తలచుకొందుము స్వకుచమర్దనముగాదు
నీకు నచ్చిన నగరాన నిశ్చలముగ
కట్టుకొనవమ్మ! కలికి బంగారుమహలు

సీ. అంబర సింహాసనాసీనుడైమూరురాయరగండండుప్రస్తుతింప
చిరకాలమైత్రి విచ్ఛిత్తి నోరువలేక అరవమిత్రుల గుండెగరగిపోవ
అవమానపరచి తక్కువచూపు ప్రసరించు పొరుగురాష్ట్రాల యుబ్బులుశమింప
ద్రావిడాంధ్రులను మద్రాసీయులని పల్కు యుమ్మడి తాంబూలమూడిపోవ

ఆ.వె. తెలుగుశబ్ద మహిమ, తెలుగుధీగరిమంబు,
తెలుగు ధర్మనిరతి తేటపడగ,
ప్రభవమందియున్న ప్రత్యేక వీరాంధ్ర
రాష్ట్రమునకు కోటిప్రణుతిపూజ

సీ. గుజరాతుముని పాదరజమంటి జీవించు ధృఢశాంతిలతకు పందిళ్ళువయిచి
బింబిసారుని సభావీధుల నినదించు, బుద్ధబోధలు మస్తమున ధరించి,
కమనీయమణిశిలాఖండాల నిద్రించు, మృదుశిల్పరమణుల మేలుకొలిపి
రాణించు నీ మాతృవాణి చేతులమీదుగా రాజ్యపాలనాకాండ నెఱపి,

ఆ.వె. ప్రజలలోన నీవు ప్రజలు నీలోనిల్వ
సురచిరప్రశాంతి సురభిళింప
గతచరిత్రలోని కష్టాలు మరపించి,
పెంపుదనర పెత్తనింపుమమ్మ

సీ. ధనధాన్యములు దోచుకొని, మొన్నమొన్ననే శమియించినట్టి యుద్ధములచేత
సత్యాగ్రహములచే సంప్రాప్తమైన స్వేచ్ఛారాజకీయ ఘర్షణలచేత
భరతధేనువువెన్ను నఱికి రెండుగజేసి, కినిసిఖానులు పంచుకొనుటచేత
ప్రాణాలతో నిండ్లువాకిళ్లు పెకలించి, వనధిపాల్సేయు నుప్పెనలచేత

ఆ.వె. దేశమెల్ల దెబ్బదినియున్న సమయాన
చిల్లిగవ్వయేని చేతలేక
కదలివచ్చి దొడ్డకర్నూలు గడ్డపై
ధ్వజమునిల్పి తెట్టి ధైర్యవతివొ?

సీ. మాననీయంబసుమ్మా తెల్గుజాతికి ముగురురాజుల దండిమగనినెలవు
ఆదరణీయంబయగు నాయకులకెల్ల విస్మృతంబగు కృష్ణవిభుని పొలము
దయనీయమగు దయార్ద్రస్వాంతులకునెల్ల వెలిగి చల్లారిన వీరభూమి,
అభ్యర్చనీయంబయగు నేటికవులకు, అష్టదిగ్గజ విహారాగ్రభూమి

ఆ.వె. యున్నమాటయన్న నులుకునిక్కమకాని,
వెఱపులేక విన్నవించుచుంటి
దత్తమండలాల, దైన్యంబుమాయించి,
తరలిరమ్ము సమ్మతంబుమాకు

సీ. ఆదిలో నీజన్మకంకురార్పణజేసి, పోరాడినట్టి గుంటూరునందొ,
బహువిశాలాంధ్రదేవత గుండెకాయయై భాసిల్లు విజయాలవాడయందొ,
మరియాదగల రెడ్డిదొరలు వాసముచేయు సిరిగల నెల్లూరు సీమయందొ,
పూసపాడ్విజయ భూపుల విక్రమజ్యోతు లలరు కళింగ రాజ్యంబునందొ

తే.గీ. నేడు నీవున్న కర్నూలు నేలయందొ
నాల్గుమూలల తెలుగునందనులయందు
కలతలెడబాపి, వసతులు గలుగుచోట
వేసుకొనుమమ్మ! దీర్ఘసింహాసనంబు

సీ. హలముసోకిన ముత్యములురాల్చి యింటింట సిరిగ్రుమ్మరించు సుక్షేత్రరాజి
మరణమంటక నిరంతరము జీవనముతో ప్రవహించు పెన్న దీరత్నచయము
అంబుదంబులయానమరికట్టి వర్షదానముచేయు బహుళకాంతారపాళి
మహనీయ ఖనిజసంపత్తితో నవరత్న గర్భలై తొణుకు బంగారుఖనులు

ఆ.వె. నాల్గు దెసలయందు నైసర్గికంబుగా
పెంపుదనరు, ప్రకృతిసంపదలకు
నిలయమైనసీమ నిఖిల భారతమందు,
నిశ్చయముగలేదు, నీకుదక్క,

సీ. మహితజాతీయోద్యమ క్లిష్టరణములో చెంగలించినది నీ సీమవాడు,
సీమగుడ్డల బహిష్కృతినాడు మైమీది వలువ గాల్చినది నీకొలమువాడు,
ఇంగిలీషు ఫిరంగి కెదురెక్కి ఱొమ్మిచ్చి గర్జ సల్పినది నీగడ్డవాడు,
చిలిపి లాటీల దెబ్బలకగ్గమై పచ్చి నెత్తురోడ్చినది, నీనేలవాడు,

ఆ.వె. మిన్నువిరిగి నెత్తిమీద గూలినకత్తి
దించనట్టివాడు తెలుగువాడు,
నిండుప్రాణమిచ్చి నిన్నుపుట్టించిన
బ్రహ్మలందుమిన్న రాములన్న!

సీ. రాజధాని సమస్య రభసరేచిన యట్టి, ప్రతివాడు, నీభక్తిపరుడుగాడు,
గౌరవోద్యోగి వర్గము లెక్కలోబడ్డ, ప్రతివాడు నిస్స్వార్థపరుడుగాడు,
అలరుమాలికలు నీయరుతనిల్చినయట్టి ప్రతివాడు నమ్మినబంటుగాడు,
పదిమందితో నీకు నెదురేగి తలవంచు ప్రతివాడు నీ కాప్తహితుడుగాడు,

ఆ.వె. నోరువాయిలేని వారమాయకులు ల
క్షోపలక్షలాంధ్రు లున్నవారు,
ప్రజల సౌఖ్యములకు భంగంబురాకుండ
తేరు నడుపువారి నేరుకొమ్ము!

సీ. దృశ్యమాన జగత్తునెల్ల మిథ్యావాద పాండిత్యమున తూలబలుకువారు,
భాషాసముద్ర గర్భముజొచ్చి రేబవల్ బుడకొట్టి కాలంబుగడుపువారు
స్వీయవిద్యలు చుట్టబెట్టి మోకులుపేని గోత్రాలు బిగియించుకొనెడువారు
పటుకష్టహతిదేశ మటమటించుచునుండ వేదాంతములు వల్లెవేయువారు

తే.గీ. ప్రగతి నరికట్టు మంత్రతంత్రాలచేత
చింతకాయల పతనమాశించువారు,
యుపకరించరు నీకు నీయోలగంబు,
సురుచిరజ్ఞాన భాండారశోభితంబు!

సీ. అధికారమోహజాడ్యమున దుర్బలుల నెత్తురుద్రావు మానవేతరుల నడచి,
పెనుదురాచారాల బెదిరింపులకులొంగి తలవంచు పిరికి తత్త్వమునదల్చి
ప్రతి రక్తకణమున జితియించిపోయిన యుచ్చనీచతల పెంపుత్తరించి
కాలకూట విషంబుకన్న ఘాటగుముఠా రాజకీయాల దర్పము గుదించి,

ఆ.వె. మానవాభ్యుదయము మనసులో నూహించి
చాటిచెప్పి చన్న మేటిమునులు
సంతసింప నీవిశాలాంధ్ర చక్రంబు
నడుపుకొమ్ము, పెక్కునుడువులేల?

సీ. నీ కటాక్షమునోకి నిముషాన నుతికర్నూ రాలయ్యె నేడు కర్నూలువీడు,
నీవు కన్నుంగీట నిక్కె వేనకువేలు, జములునేతల గుడారములగములు
నీ స్వాగతమహంబు నెఱపి సంతోషింప నేతెంచె ఢిల్లి మంత్రీశ్వరుండు,
నీవు మాతృగృహంబుత్రోవ బట్టినయంత చెన్నాపురము కన్ను చెమ్మగిల్లె,

ఆ.వె. అవధిలేని నిండుటధికార ముద్రతో
పరిఢవిల్లు నీదు కరుణగల్ల,
తెలుగు దేశమునకు తిండికి బట్టకు
తక్కువేమిగలుగు చక్కనమ్మ?

మ.  కడుపుల్నిండవు దేశవాసులకు నక్కర్నూలులో నీవు పు
త్తడి పీఠంబు నలంకరించి మణిరత్నస్తంభ సౌధాలలో
నడుగుల్నిల్పినయంత మానవత నాహారించు పైపూతగా
రడినెయ్యాల పరిశ్రమంబు బరి మార్పంబూనుకోకుండినన్

శా.  ఛందోబద్ధముగా, శ్రవస్సుఖముగా జాతీయ శబ్దాలతో
యందంబుల్ దొణుకాడునాంధ్ర కవనం బట్లాంధ్ర వంశంబులో
పొందుం గూరిమి యైకమత్యమును పెంపుం దేజమున్ గూర్చి యా
నందజ్యోతులు నింపుమెల్ల కడలన్ నవ్యాంధ్రరాజ్ఞీమణీ!

చ.  ఋతమువచింప నాంధ్రులెపుడేని తలంపని రాజధానియై,
నుతులకు నగ్గలమైన కరునూలునకుం నెహురూప్రధాని, స్వా
గతముల వృష్టిలోభరతకాంచన కేతన మెత్తవచ్చుటల్
కతలుగ జెప్పుకొందురఖిలప్రథితాంధ్ర కుమారవర్గముల్

సీ.  సంగమింపగరాదు జలధియందొకచుక్క దివ్యాంధ్ర మధురనదీ జలంబు,
జారిపోరాదు సస్యశ్యామలముగాక దేశానకడకు బెత్తెడు పొలంబు
తపియింపగూడదదంధఃక్షామహతిజేసి పనిచేయగల కూలివానిడొక్క
యాచింపరాదు గృహచ్ఛిద్రదుఃఖాన మృదులాంధ్రవిమల సాహిత్యలక్ష్మి

తే.గీ. రాయవేశ్యాభుజంగుని రాజ్యమందు
ననుభవించిన భోగభాగ్యములు మరల
కోరుచున్నారు ప్రజలు నీ గొడుగునీడ
ప్రతిభగలిగిన నవ్యాంధ్ర రాష్ట్రలక్ష్మి!

మ.  అవధుల్ సెప్పగరాని భూరివిభవం బందింపగాజాలు నీ
యవకాశాల్ఫలియించినంగొదువ లేదాహార వస్త్రాలకున్
భువికిన్ డిగ్గిన యన్నపూర్ణవయి నీవున్నీ సుతుల్ మిత్రభాం
ధవ రాష్ట్రాలకునింత పెట్టగలరా దర్శార్ద్రచేతస్కులై!

మ. ఉరుగోదావరి తాండవారభటితో నుప్పొంగి వేంగీధరా
నరులన్ దోపిడిజేసి పక్షుల విధానన్నిల్పి చన్నట్టి భీ
కరగాథల్ వినియుందువీవు హతభాగ్యంబై ప్రలాపించు సో
దర సీమం గరుణించియెక్కరణి తద్దైన్యంబు వారింతువో!

ఉ. అంకెలు వేయుచున్నవి కరాళరవంబున వీధులెక్కి ని
శ్శంకననంతరూపముల స్వార్థపిశాచము లేవిధంబుగా
నంకెకుదార్చి, మానవత కాయురనామయముల్ ఘటించి యీ
పెంకెఘటాలలోన మొలిపించెదవో సుఖశాంతి సస్యమున్

మ. నరమాంసంబు భుజించు క్రోల్పులుల కన్నం గ్రూరమైనట్టి దు
ష్కరపుంబార్టివిభేదముల్ విజయ కాంక్షన్ ఖడ్గముల్దూసి రా
చటికంబుం గబళింపజూచెదు నికృష్టంబైన కాలంబు దా
పురమైయున్నదెటుల్ మెలంగెదవొ సంపూజ్యాంధ్ర రాష్ట్రాంగనా!

సీ. ఒకమాట పట్టింపునకు తట్టుకొనలేక పచ్చినెత్తురుద్రావు పౌరుషాలు,
పదవుల వ్యామోహమెదనంటప్రతిపక్షి, యుసురులాశించు కక్కసపుపనులు
జాతిప్రతిష్ఠకై చదివిన చదువెల్ల, కోర్టులకెక్కించు కుత్సితాలు,
కష్టజీవులనాలి కంకాళములమీద స్వారిగావించు పాశవికచర్య

తే.గీ. లాంధ్రమండలకీర్తి కభ్యంతరాలు,
కృష్ణరాయనిహృది కనంగీకృతాలు,
జాతిదేవత కధికలజ్జాకరాలు,
రాష్ట్రమా! నీకునివి మ్రింగరాని కడులు!

సీ. హరతాళమొనరించు సరకారుజిల్లాల ఆగ్రహజ్వాల చల్లార్చివైచి,
వ్యవహారములకు నిబ్బందిగల్గనిరీతి, రాకపోకలకు మార్గములువయిచి
దత్తమండల నిరంతరదీర్ఘదారిద్ర్య హతభాగ్యులకు శరణ్యములుసూపి
నిర్హేతుకంబుగా నిక్కినయుభయసీమల సందియంబులమాపివయిచి

తే.గీ. ప్రతిభగలమంతురులు గవర్నరులుగొలువ
యచ్చమైస్వచ్ఛమైన దివ్యాంధ్రరాష్ట్ర
భవ్యకేతనమును తుంగభద్రతటుల
నాటుకొనుమమ్మ రాష్ట్రకాంతాలలామ!

సీ. నీరాజధానియై పేరందిపెంపొంద వలచియున్నవి దొడ్డపట్టణాలు
ప్రాజెక్టులైనిన్ను పండించియలరింప వేచియున్నవి పెద్దపెద్దనదులు
నీరథోత్సవవేళ నృత్యంబుగావింప పొంగుచున్నవి సమస్తాంగకములు
నీ యాగమమును వర్ణించి గానముచేయ కామించుచున్నవి కవిపికములు

ఆ.వె. వట్టిమాటలేల పుట్టినింటికి నీవు
కదలివత్తువన్న క్షణమునుండి
యననుభూతపూర్వమైన చైతన్యంబ
వెల్లివిరిసె తెల్గువీధులందు!

మ. పొరపొచ్చెంబులు మోసులెత్తె మునుపెప్డో రాయలాంధ్రాళికిన్
సరకార్వారికి నన్నదమ్ముల మనస్పర్ధల్ విదారించి యి
ర్వురకున్నెయ్యముగూర్ప నీ నెలవు కర్నూల్వీట నిర్మించు నీ
సరళస్వాంతసమత్వదృష్టికి నమస్కారంబు రాష్ట్రాంగనా!

సీ. నిజము వక్కాణింప నీతల్లి భాషతో ప్రతిచెప్పగాజాలు భాషలేదు,
అత్యుక్తిగాదన్న యసమశౌర్యమునందు నీకత్తికెదురైన నేలలేదు,
నిక్కుగాదనిపల్క నీకట్టుబొట్టుతో సరితూగి నిలుచు రాష్ట్రంబులేదు
అతిశయంబనకున్న నందచందాలలో నీకుపోటీచేయు నెలతలేదు,

ఆ.వె. అన్నియున్నవైన యల్లునినోటిలో
శనిగలాదటన్న సామ్యమట్లు
కలుపుగోలుతనము, కఱవయ్యెనందురు
రత్నమకుటభూష! రాష్ట్రయోష!

మ. అలబుద్దాకులదాతృ భాస్కరుడు నుయ్యాల్వాడసంవాసి, వేం
గళరెడ్డి ప్రభుడాంధ్రు××డకలంకంబైన సత్కీర్తికు
ప్పులువోయించిన దివ్యగాథలు ధ్వనింపంబొల్పు కర్నూలు గ
డ్డలపైనాటిననీ జగాతెలుగు జెండాకు న్నమోవాకముల్

సీ. అర్థులకెంగేలి నపరంజినవర్షాన పండించి సంతృప్తిపడినవాడు
తనకులేదన్న చింతకులోనుగాకుండ పరులలేమికి దుఃఖపడినవాడు
సర్వస్వమును పేదసాదలకర్పించి కలవాడనని గర్వపడినవాడు
పుచ్చుకొన్నధనంబు నిచ్చి రాబయనించి మరచి పేదలకిచ్చి మరలువాడు

ఆ.వె. రాయలాంధ్రసీమ ప్రత్యంగుళమునందు
నచ్చువడ్డ దొడ్డత్యాగమూర్తి
బుడ్డవేంగళాఖ్యరెడ్డి నీ తలమీద
గురియగలడు కల్పకుసుమవృష్టి!

సీ. అభ్యాసమొనరింపుమమ్మ! నీ రాష్ట్రాన మహనీయమగునైకమత్య విద్య
ఆచరింపగజేయుమమ్మ నీసీమచే అన్నమాటను దప్పనట్టి చదువు
నాటింపుమమ్మ నీ నవపతాకచ్ఛాయ సమసిపోవని ప్రజాశాంతిలతిక
ఎత్తింపుమమ్మ నీ పుత్తడిగద్దెపై పాపభంజక దయాదీపకళిక

ఆ.వె. సీమరాచతికముచే దెబ్బతినియున్న
భారతీయ మానవత్వమునకు
బ్రతుకుదెరువుచూపి పాలించుకొనుమమ్మ!
విశ్వవినుతరాష్ట్ర వీరనారి!

సీ. ధనధాన్యమదసముద్రస్నానమొనరించి పై చూపుకలవాటు పడ్డవారు
వ్యాపారలోకలాభాల నిచ్చెనలెక్కి క్రిందిదీనతవిస్మరించువారు
రాజకీయాల దీర్ఘవ్యాధిమైనంట నాస్తిపాస్తుల తెగనమ్మువారు
తాతతండ్రుల బాహుదర్పాల మైకంబు వదలక డంబాలువలుకువారు

ఆ.వె. ప్రొద్దుబారెడెక్కి భూములుమేల్కొన్న
అలరుశయ్యనిద్ర సలుపువారు
నీయభీప్సితాలు నెగ్గనీయరు వేయి
కనులతోడ మెలగవలయునమ్మ!

సీ. నవ్యాంధ్రమునకు ప్రాణప్రతిష్ఠలుసల్పి సవరించితివి తెల్గుజాతిపరువు
రప్పించినావు సర్కారుసోదరుకోటి చెలిమిమైనీవిందుస్వీకరింప
చేపట్టితివి ఘనాశీఃకల్పసుమరాజి జహ్వారుసచివ భాస్కరునిచేత
ధరియించితివి రాజధాని నామకభూష యావదాంధ్రంబు నీకంజలింప

తే.గీ. ఐదువందలయేండ్లనాడస్తమించి
యస్తమించని యాంధ్రరాజ్యప్రతిష్ఠ
నుద్ధరించిన నీకు శుభోదయంబు
మగసిరిగలట్టి కర్నూలు నగరలక్ష్మి

# ఒకమాట

మ. జననం బందిన దాది నాకనిన యీ సర్వంసహా నాటకం
బున నానావిధ పాత్రధారులయి రేపుల్మాపు లాటాడి పో
యిన పోనున్న నటీ నటోత్తముల ఆయా ఘట్టముల్ నీవెరుం
గని దేముండు జగత్ప్రభూ! అయిన నాకర్ణింపు మూ కొట్టుచున్.

ఈ మహానాటకాన్ని అరువదేళ్ళు చూచాను. అంక పరిమితిలేక యుగయుగాలు నటన సాగుతూనే యున్నది. ప్రత్యక్షరం, ప్రతిపదం రసభరితం, భావస్ఫోరకం. అన్ని ఘట్టాల్లో హృదయ ద్రావకాలైన దృశ్యాలున్నయి. ప్రధాన నాయకుడు పంచజనుడు. కవి హృదయాన్ని గమనించని కఱకు పాత్రధారులు వందలు వేలు. సత్యం దెబ్బతిని, ధర్మం దసిలి నాటకం రసాభాసమయింది. రంగస్థలంలో కల్లోలం, రభస చెలరేగింది. పాపం మహా నాటక కర్త నిందాబద్ధుడై వాఖ్యానాలకు గుఱైనాడు. పునర్ముద్రణంలో కొన్ని సవరణలు సృష్టికర్తకు మనవి చేసుకోవలెననిపించింది. మహాస్రష్టకెదురై హృదయావేదన నివేదించుకునేపాటి గుండె నిబ్బరం లేకపోయింది.

తే.గీ. "సృష్టికర్తవు నీవు నీ సృష్టిలోని
మానవుడ నేను-ఇద్దరిమధ్య మనకు
ముసుగులో గ్రుద్దులాటలు పొసగవింక
హక్కుగలదయ్య ప్రశ్నసేయంగ నిన్ను."

అన్న ఒక సూక్తి జ్ఞప్తికి వచ్చింది. గుండె దిటవుపడ్డది. ఆ తెరచాటు నాటక కర్త నర్థించే వాంఛితాలే ఈ "కొత్తలోకం". ఈ కృతి పరలోకగత అర్ధాంగి, మధుర హృదయ మరియామానిని కంకితం చేసి ఋణవిముక్తుణ్ణి కాదలచాను.

జి. జాషువ

# ఋణ విముక్తి

ఉ. నేను కవీశ్వరుండనని నీవొక బానిస వన్ననాడు గ
ర్వాన శరీరమున్ మరచి–స్వర్గనివాసము వీడివచ్చి నా
మేను సగంబు పంచుకొని మేటి యశస్సు గడించు దివ్యవా
గ్ధేనువ వీవటంచు గురుతించగ లేనయితిన్ సతీమణి!

ఉ. నీవటు కాటిదిక్కు పయనించిన నాటి మరుక్షణాన స
ర్వావయ సంధి బంధనములన్నియు వీడె, కవిత్వభారతీ
దేవత మూగవోయె, సుదతీమణి నాదు కళాస్రవంతియున్
నీవెనుకన్ శ్మశానధరణిన్ నిదురించినదో! సతీమణీ!

ఉ. నా తను యష్టి, ప్రత్యణువునన్ గల పుష్టికి కారణంబు నీ
చేతి సుధాశనంబకద! చిక్కునె నాకనరాదుగాని, నా
మాతకు మారుగా, యనుగు మానిని రూపముదాల్చినట్టి నా
జాతక పుణ్యరేఖవొ! ప్రశస్తశుభైకవరప్రదాత్రివో!

–ప్రియభర్త

# ఆవేదన

మ. నను గన్నమ్మకు భారతాంబ కెపుడైనన్ బశ్చిమస్వర్ణ జీ
వన సౌభాగ్యము జిక్కునాయని మనోజ్ఞం బారటం బంద వె
చ్చని కన్నీటి ఝరంబులం బడకమున్గన్‌బిట్టు శోకించి పో
యిన మాసాదు నరేంద్రబాబు పురమాయించున్ జగత్సంస్కృతికిన్

మ. ఒక నూల్పోగున సీమభూధరగజవ్యూహంబు బంధించి యిం
చుక రక్తచ్యుతిలేని రాచటికమున్ జూపించి ఖండాంతర
ప్రకటఖ్యాతి గడించినట్టి మునిమూర్ధన్యుండు బాపూజి దా
చక మాకిచ్చిన విశ్వసంస్కృతి ప్రపంచంబెల్ల శోభిల్లుతన్

మ. ఘన భూదాన మహాధ్వరంబున జగత్కల్యాణ మాశించి, క
ల్గినవారిం గరగించి పేదలకు భుక్తిం గూర్చు సాబర్మతీ
వనవాసిన్ మునిచక్రవర్తిని వినోబాభావె నీక్షించి వా
కొను మే సంస్కృతి నభ్యసించెదవొ నిక్కుల్‌మాని స్వార్థప్రభూ!

మ. సమశీతోష్ణ సుఖాభిరామము నహింసాధర్మ సిద్ధాంత వం
తము, నానావిధ రత్నరంజిత సముద్రప్రావృతం బస్మదీ
య మహాభారత ఖండరాజము, కులవ్యాళోగ్రఫూత్కార ధూ
మము నామూలముగా నణంచి సుఖసంపత్తిన్ సమార్జింపుమా

# కొత్తలోకము
# వ్యత్యయము

ఆ.వె. సౌధరాజమందు జన్మించె నొక బిడ్డ
పూరిగుడిసెలోన బుట్టె నొకడు
ప్రబలి రందు నిందు; రాజయ్యె నొక్కడు
నొకడు రానురాను సుకవియయ్యె

ఆ.వె. అతని రాజదండ మధికార ధన మయం
బితని కలము కావ్య శతకమయము
అతని యిల్లు మేటి రతనాలరుచిమయం
బితని యిల్లు గండ వితతిమయము

కం. కవి యెఱుగు రాజు, రాజున్
గవి యెఱుగున్, గవిని రాజు గణియింపం డా
కవి, రాజు గణన సేయడు,
కవియును రాజిద్ద రాత్మగౌరవ కాముల్.

ఆ.వె. భయముతోడ రాజు ప్రస్తుతింతురు ప్రజల్
భక్తితోడ కవిని ప్రస్తుతింత్రు
జీతమిచ్చి రాజు సేవింపబడుచుండు
జీతమీక సుకవి సేవలందు

ఆ.వె. రాజు చేతి కత్తి రక్తంబు వర్షించు
సుకవి చేతి కలము సుధలు గురియు
ఆత డేలగలుగు యావత్ప్రపంచంబు
నీత డేలగలుగు నిహము పరము

తే.గీ. రాజు మరణించె నొక తార రాలిపోయె
కవియు మరణించె నొక తార గగనమెక్కె
రాజు జీవించె ఱాతి విగ్రహములందు
సుకవి జీవించె ప్రజల నాలుకలయందు

మ. సమసెన్నేటికి తెల్గుజాతికి సమస్తక్లేశముల్, సింహ పీ
ఠము నిక్కెన్ నయిజాముసీమల, ప్రతిష్ఠాభేరి భాంకారనా
దము లుప్పొంగ సువర్ణదండమును హస్తంబందు గీలించె లో
పము లేదేమిట నైకమత్యమును సంపాదించి పాలించినన్

సీ. నాగార్జునుని దయా నయన ద్వయమునందు జన్మించె సౌభాగ్య సాగరంబు
బ్రహ్మనాయని చిత్త పద్మంబు వికసింప నుదయించె హరిజనాభ్యుదయ సంధ్య
వర్ష పంచక రత్నపథక కల్పకమందు చిగురించె నగర సంక్షేమ శాఖ
ఆంధ్రప్రదేశంబు నాశ్లేష మొనరింప నేతెంచె రసవాణి కృష్ణవేణి

తే.గీ. అక్షరాక్షర మధురసస్యందు లగుచు
కూయుచున్నవి సుకవితా కోకిలములు
తెలుగుగద్దె ప్రజాభీష్టములు ఘటించి
ప్రబలుగావుత మయుత సంవత్సరములు

ఉ. నేను స్వతంత్రజీవినయి నిల్చితి నేడు స్వరాజ్య రాష్ట్రయు
ద్ధాన విజేతనై యభిమతంబులు తీరినవాడనై తెలం
గాణమునందు శాశ్వతముగా మణిపీఠము నెక్కబోవుచు
న్నాను జగత్ప్రభూ! వినుము నా యధికార కథాప్రణాళికల్

ఉ. ఆడిన మాట తప్పను, మహాత్ముని చెప్పులజాడలోన కా
లాడ చరించెదన్, ప్రజల కన్నము బెట్టెద, వర్ణభేదపుం
జీడ నణంచెదన్, గటికిచీకటి వాపెద, వెట్టి నమ్మకా
లూడని బాడ హస్తమున నూనెద శాత కళాకుఠారమున్

ఉ. నా కవచం బహింస, సహనంబు మహాయుధ, మెక్కిరింత ధ
ర్మైకనిరూఢి, సత్యము నియంత, యనంతజగత్తు మొత్తమై
నాకెదురైన గెల్తును వినాశపుబాంబుల గుండెకాయలో
బాకును, లోకమోహన సబర్మతి సన్మునికిం గుమారుడన్

సీ. నాగార్జునాచార్య సాగరం బేటేట రత్నాలు పండించు రైతు నాకు
చలిచీమ మృతికి కన్నులు చెమ్మగిలు శాక్యధరణి నాయక మౌళి గురువు నాకు
తెలుగు తెలంగాణములకు పొత్తొనగూర్చు హైదరాబాదు రాజ్యంబు నాది
కోలారు గనులు వజ్రాలు పండు పొలాలు సాటికెక్కిన బొక్కసాలు నాకు

ఆ.వె. అవల గోలుకొండ యివల శ్రీశైలంబు
క్రీడ సల్పు రత్నగిరులు నాకు
వెఱపు గిరపు లేని వీరవిక్రమశాలి
బాలచంద్రు సాటివాడ నేను

శా. ఊరూరన్ శరదిందుచంద్రికలు విద్యుద్వాహినుల్ పారగా
భారీయెత్తు పరిశ్రమల్ నడచి ద్రవ్యక్షామమున్ దీర్ప, ము
క్కారుంబంటల దెల్గురాణి మెయిసింగారింప, గర్వంబుగా
నూరేగింతు నశోకముద్రికల నాంధ్రోర్వీ ప్రపంచ ప్రభల్

మ. పలికింతున్ గవికోటిచే హృదయపుష్పంబుల్ వికాసించి యూ
హలకుం దావులొసంగి, పుక్కిటి కథావ్యాధి న్నివారించు ధీ
బలమున్ గూర్చు కృతుల్ ప్రలోభ కవిదుర్వాసుల్ దగా నమ్మకం
బులు రొంపిం దలబుంపరింక పడిపోవున్ జల్దిపాండిత్యముల్

ఉ. కొట్టిన గొట్టరాదనెడు గొప్ప నినాద మనంత విశ్వ స
మ్రాట్టగు నేసునాథు రుధిరంబున కల్వరికొండ కొమ్ములన్
బిట్టుగ మ్రోగుచున్నది తపించుచు సర్వ దిగంతరాళముల్
కట్టువడున్ తదీయ ఘన కారుణికత్వ పటుత్వ శక్తికిన్

మ. కృతముల్ పల్కులు రామలక్ష్మణుల భ్రాతృత్వంబుపోలెన్ జగ
ద్ధితమున్ గూర్పని శుష్కపండితులు భక్తిశ్రద్ధలున్, శౌచముల్
బ్రతుకీడ్వన్ దృఢసాధనంబులగుచున్ రాణించునేకాని సం
స్కృతికిం జిన్నెలు కా వితరు లేరీతిన్ సమర్థించినన్

ఆ.వె. పదవి జిక్కెనంచు ప్రజలకు దూరమై
సన్నుతులకు చేయి సాచలేను
చదువుకొంటినంచు సాటిమానవుని ప్రే
మించకుండ నీసడించలేను

సీ. పలుకవేనాడు మా పత్రికల్ వార్గిక వ్యామోహమున నసత్యప్రశంస
కాలూన జాల దే కాలాన మా వినూతన రాజ్యమున నవిద్యా పిశాచి
తలసూపదింక నాంధ్రప్రదేశమున దుర్భిక్షా వధూటీ కటాక్షలవము
ప్రవహింపకుండ దుజ్జ్వల సాహితీ గంగ గ్రామీణ జనకుటీరములమీద

ఆ.వె. బోధిసత్వమూర్తి భూగర్భమున మాకు
దాచి చన్న ప్రేమతత్వ నిధుల
నడుగువారి కడిగినంతగా నర్పింప
గలము, మాది కలికి తెలుగుకులము

మ. క్రమతన్ విచ్చిన వేయి రేకుల దళత్కంజాత మాంధ్రప్రదే
శమునం దిప్పటి పల్లెనాటి ప్రజలైశ్వర్యంబు నీక్షించి ఘం
టము చేపట్టుము, నైషధ ప్రముఖ నానాకావ్యనిర్మాతృ చం
ద్రమ! శ్రీనాథ మహాకవీ! దొరుకవన్నా నీకు జొన్నన్నముల్

మ. కలనాదంబున నందికొండ శిఖరాగ్రంబెక్కి, కృష్ణాపగా
జల ముప్పొంగి తెలుంగుభూముల కభీష్టంబుల్ ప్రసాదించెడిన్
పలుకుల్ నేర్చితినంచు దిట్టితివి మాపల్నాటి గడ్డన్ భళా
భళి! నీ నవ్విన నాపచే నిపుడు జాజ్వాపంటలం బండెడిన్

కం. నాగార్జున సాగరమున
కేగుము శ్రీనాథసత్కవీశ్వర! యట ది
వ్యాగారాంతరమందు త
థాగతుడగు బుద్ధనృపతి దర్శనమిచ్చున్

కం. ఊలు కృతార్థములయ్యె త
దాలయ కుడ్యంబు లగుచు నాతని రూప
శ్రీలం దాలిచి పరిసర
కేళీకలనాభిరామ కృష్ణాపగయున్

ఉ. నీరవమైన యగ్గిరి వనీవన భూములనుండి దివ్య శం
ఖారవమొందు, స్తూపశిఖరాగ్రముల న్నినదించుచుండు, సం
సార దవాగ్ని తప్తులకు శాంతి ఘటించుచు నిద్రబోవుచు
న్నా రనరాదు, భిక్షువులు నాడును నేడు జగత్ప్రభోధకుల్

చం. పులులు ప్రదక్షిణించినవి ముద్దిడుకొన్నవి నందికొండ లో
యల చరణాంకముద్రికలు స్వాగతగీతములాలపించి ప
క్షులు తమిమీర తెక్కగొడుగుల్ ఘటియించిన విందు బుద్ధ శి
ష్యులకు, పవిత్రచైత్యపరిశోభితముల్ పలనాటి క్షేత్రముల్

మ. మణిభూషల్ మణిసౌధముల్ సకలసామ్రాజ్యంబు బోనాడి దా
రుణ సన్యాసము స్వీకరించిన నరేంద్రుండీ నగంబందు ప్ర
త్యణు మధ్యంబున గోచరించెడిని, బ్రహ్మాండం బహింసా పరా
యణమై పాదము లాశ్రయించె నది పుణ్యక్షేత్ర మాంధ్రాళికిన్.

మ. అది చల్లారని జ్యోతి ప్రోజ్జ్వలిత మాయా మానినీగర్భ సం
పద, సిద్ధార్థ మహావతారమిట నావాసంబుగావించు కొ
న్నది పెక్కేడులనాటి నిద్రిత మహా నాగార్జునాచార్య న
భ్యుదయశ్రీ వెలిగ్రక్కుచున్, నవయుగంబున్ ధన్యముం జేయుచున్

ఉ. కాలకఠోరభూరి పరిఘాహతిగూలిన నాటి బౌద్ధ వి
ద్యాలయ భగ్న శేషములయందు ననంత శతాబ్ద గర్భ ని
ద్రాలస సంస్కృతీరమ తథాగతు పుణ్యకథానకంబులన్
జాలిగ బాడుచున్నది దిశల్ పులకింప విపంచి మీటుచున్

# తొలికోర్కె

చం. కనుపడవేమిరా జగము కల్పనచేసిన గారడీడ నీ
యునికియు రూపమున్ దెలియ కున్నది లేనిది నిర్ధరింపలే
కనుపమ సంశయగ్రసితమైనది విశ్వము, సాగవింక ద
ర్శన మిడకున్న నీ తరతరంబుల దాగుడుమూత వేషముల్

కం. ఎవరడిగినారు నిన్నీ
అవక తవక సృష్టి సేయుమని? చేసితిబో
దివి దాగుకొన్న లోక
వ్యవహారంబెట్లు సాగురా? బిసకాడా!

ఆ.వె. సకల కష్టములను జగతి మీదికి నెట్టి
శాంతి సౌఖ్యములను చంక బెట్టి
అందుబాటుగాని ఆకసంబున జేరి
కులుకుచుంటివా? నిగూఢ చరిత!

ఆ.వె. యుగము లెన్ని గడచెనో! యెంద రెందరు
భూమిపతులు పుట్టి పోయినారొ!
నీకు చావురాదు, మాకు సౌఖ్యములేదు
అలుక వలదు నిజము పలుకుచుంటి

శా. నీ యేజంటులు కొందరేరుపడి, సందేహించుమాలో భయ
చ్ఛాయల్ కల్పనచేసి నేర్పిరి తమాషాభక్తి తాత్పర్యముల్
వేయిన్నూరు మతాలు వర్ణములు మొల్చెన్ బొల్చె వైషమ్యముల్
భాయీ! వాయి గదల్చి యాబెడద మాన్పన్ డిగ్గిరమ్మూర్వికిన్

శా. ఏనాడో పడుచుందనంబున ధరన్ సృష్టించి మిన్నెక్కి ని
త్యానందంబున నీతగొట్టుకొను వృద్ధవ్యక్తి వీనాటి మా
యా నాట్య ప్రళయ ప్రపంచగమనం బర్థంబుగా దైన నీ
మౌనంబున్ విడనాడి రమ్ము పరికింపన్ నేను వర్ణించెదన్

శా. నాకున్ భక్తులసంఖ్యసంఖ్యలుగ నున్నారన్న గర్వంబుతో
నాకంబున్ విడనాడి భూతలము సందర్శింపగా వత్తువా
యీకల్ తోకలు దుల్చి పంపెదరు నిన్నీనాటి నానా మతో
ద్రేకుల్, వాకొననేల పెట్టరొకరున్ దీర్ఘప్రసాదంబులన్

ఉ. నాలుగు మోములున్ దలలు నాలుగు దాలిచివత్తువేమొ! యీ
కాలమువారు, మానిసిమొగంబిది, పద్మము కన్నదంచు జం
త్వాలయమందు జేర్తురుసుమా! కమలాసన, స్రష్టనంచు నీ
నాలుగు నోళ్ళ మొత్తుకొనినన్ వినరొక్కరు, విశ్వసించరున్

సీ. ధరణిపై భక్తులెల్లరు రవాణాచేయు నైవేద్యముల నప్పనముగ దినుచు
అందిచాపులజిక్కు నమృతంబు భక్షించి పెక్కేండ్లచావు తప్పించుకొనుచు
కనుసన్న మెలుగు చక్కని దేవగాయినీ సుందరాంగుల కొల్వులందుకొనుచు
ముడుపులుగట్టి పంపెడు కానుకలనెల్ల నట్టింటిలో దాచిపెట్టుకొనుచు

ఆ.వె. చీకు చింత లేక జీవించు నీమీద
భక్తి బదులసూయ ప్రబలమయ్యె
పొగడజాల నాకు మొగమోటములు లేవు
స్రష్ట కింత రాజసంబు తగదు.

కం. పొగడుటలుదక్క నావలె
దెగడుటల నెఱుంగవీవు-నేటివరకు, నీ
పగతుడనుగాను, నీలో
సగమంశగలట్టి కావ్యజగతీ స్రష్టన్

ఆ.వె. మతపిచ్చిగాని వర్ణో
న్నతిగానీ స్వార్థ చింతనముగానీ నా
కృతులం దుండదు, శబ్దా
కృతి బ్రహ్మానందలక్ష్మి నృత్యమొనర్చున్

సీ. సృష్టిలో నీవు దాచిన రహస్యము లెల్ల ప్రత్యక్షముగ బట్టబయలు చేసి
చక్షురింద్రియములు సాధించలేని నీ యాకారమును పల్కులం దిమిడ్చి
వాయు మండలమున బల్కించు నీ మూక దొంగవీణెలకు తంత్రులు బిగించి
ఎవరెఱుంగనిచోట బవళించి నిద్రించి గుఱుపెట్టు నీగుట్టు నెఱుకపఱచి

తే.గీ. కలుషభోజనమగు ధరావలయమందు
విసిగి వేసారు నరుని మానసమునందు
అమృతముం జిల్కి చింతల నపనయించు
హృదయముగలట్టి రస రచయితను నేను

సీ. కలవోయి ప్రతి పుష్ప గంధ గర్భములందు నీదయామకరంద నిర్ఝరములు
కలవోయి ఘనఘనాఘన నిక్వణములందు ననలెత్తు నీదు కంఠస్వరాలు
కలవోయి గగన నక్షత్ర నేత్రములందు పొటమరించెడు సానుభూతి నదులు
కలవోయి సాంధ్యరాగ ప్రభాంబుదులందు నీ రూపగత నైగనిగ్య కళలు

తే.గీ. ఉరుములందున మెరసెడు మెరుములందు
దాగికొనియున్న నీ యదంతరపు రూపు
కలవరము పెట్టుచున్నది క్ష్మాతలమును
ఎందు కీ గోల? కన్పింపు మందగాడ!

ఉ. రోజులు మారిపోయినవి, రోజుకురోజుకు దేవపూజపై
మోజులు సన్నగిల్లినవి, మోక్షము కద్దను నమ్మకాలపై
బూజు పరంజుకొన్నది, ప్రభుత్వము సాగదు, కంచుకోట ద
ర్వాజలు దాటిరమ్ము బహిరంగముగా రతనాల తేరుపై

మ. జపమో ధ్యానమొ చేసికోదగు మనుష్యప్రాణివై యుండి వి
శ్వపతి న్నన్న విధేయతన్ బలుకరించన్ గుండెలెట్లబ్బె నీ
యపరాధంబు సహింపరాదనుచు శాపాగ్నిం బ్రయోగించి నా
కపకారంబు దలంతువో తగని కార్యంబద్ది నీ శక్తికిన్

కం. నీ విచ్చినదే యనుకో
నా విద్యారేఖ, దాని నాశనమునకున్
నీవే కారణ మగుచో
నీవెంతో నేను నంతియేకద ప్రకృతిన్

కం. నీమీద నీగవాలిన
భూమీవలయంబు క్రుంగిపోయినగతి నెం
తో మధన పడెడు భక్తుల
కీ మాటలలోని లోతు లెట్లర్థమగున్

ఆ.వె. నీ చరిత్రలోని నిగ్గు జగ్గులు దేల్చి
సర్దినారు కొన్ని సందియములు
తత్వవిదులు, వీరి తరహా బరీక్షింప
కొద్ది స్వార్థమందు కద్దు కద్దు

ఉ. గంపెడు నోటితోడ నధికారముచేయుచు చాటుగా దబా
యింపులు సేయు నీ వొకడ వీశ్వరశబ్ద కిరీటధారివై
పెంపెసలారుచుండ బహువేష విశారదులైన గుర్వులం
బంపెదవేల నీ తరపునం నిరుపేదల కొంపలార్పగన్

కం. నీవున్నావని కానీ
లేవనికానీ వచింపలేక యహింసా
సేవలు చేసిన బుద్ధుడు
నీ వెఱుగనివాడుకాదు నిక్కువమ కదా?

చం. మతములు సారమున్ బిడిచి మానవశాంతికి నౌషధంబుగా
జతపడ కీర్ప్యలం బెనుచు సాధనముల్ గనుపింప సంశయా
న్వితుడయి స్వీయరాజ్యమును వీడి దయారసదిగ్ధముద్రికా
మతియయి యాలపించె నసమాన జగద్ధితరత్న సూత్రముల్

ఉ. ఓటుకు పెట్టినం గెలుతు, వోటమి నాకు నిజంబు, నల్వురే
బాట చరింతురో యవి యవశ్యము నా కటుగాక వాదనా
పాటవమున్ వ్యయించి తల వ్రక్కలుగా యొనరించుకొన్న నీ
కోట పునాదిఱాతి మొనగూడ చలింప దొకింతయేనియున్

కం. ఉన్నావో లేవోయని
తన్ను కొనుటకన్న నభతలమున నెందో
యున్నా వనుకొనుటే నా
కన్నిట శుభమని తలంతు నద్భుత చరితా!

కం. అడుగడగు నాల్గు మాటల
నడుగక నే మిన్నకుండ నడుగక మదియం
దుడుకెట్టు లుడుగు? లోకము
పడు పాట్లెటు దీరు? నిజము పై కెట్లుబుకున్

మ. తనువుల్ గోసి కవోష్ణరక్తమున భక్తశ్రేణి పెక్కేడు ల
ర్చనముల్ సల్పిన దర్శనంబిడని పాషాణ స్వభావుండవై
దినముల్ బుచ్చెదునీవు, నిన్నసలు సందేహించుచున్ నమ్మిన న
మ్మని మాబోంట్లను లెక్కసేయుదువె, సన్మానంబు లాశింతువే?

శా. లేవన్నన్ గలవన్న మాకు నిచటన్ లే వెట్టి యిబ్బందులున్
నీవల్లన్ సుఖదుఃఖముల్ సమముగానే పంచుచున్నావు గా
నీ వైకుంఠము నుండి యూడిపడిన ట్లిందెందరో ముక్తికిన్
త్రోవల్ సూపుదు రంది పొందని వినీతుల్, నీమముల్ నేర్పుచున్

ఆ.వె. నిన్ను చూపుమంచు నే నర్చకుని వేడ
చూడుమంచు గుడిని జూపినాడు
గుడికి బోయి చూడ గుండ్రాయి వైనాడ
వెందు కిట్టులైతి వేడ్పు వచ్చె

శా. ఉన్నాడొక్క డఖండు డభ్రమున నం చూహింతుమేకాని యె
ట్లున్నావో, యెటులుందువో తెలియకేవో కొన్ని రూపాలతో
నిన్నందందు ప్రతిష్ఠజేసికొనుచున్ నీ సన్నిధానంబులో
నున్న ట్లెంచి తరించుచుంటిమి క్షణాయుష్కక్షమాజన్మముల్

సీ. త్రావుచున్నా రెండమావులలో నీరు వెడగులై నాలుకల్ పిడుచగట్ట
తిరుగుచున్నారు కుందేటి కొమ్ములుదేవ యాత్రికుల్ జరణంబు లరిగిపోవ
కూర్చుచున్నా రభ్రకుసుమ మాల్యంబులు జోగులై దేహముల్ స్రుక్కిపోవ
సృష్టించుచున్నార లిసుములో తైలంబు ముగ్ధులై తలకాయ బూజుబట్ట

ఆ.వె. తలపులందుకొనని నెలవున్నదని పల్కు
వెఱ్ఱిమొఱ్ఱి కథలు విశ్వసించి
అట్టిచోటు దాచిపెట్టుకో వలదిట్లు
కష్టపెట్టవలదు క్ష్మాతలమును

సీ. ఊహించితిమి నీకు నాహారమగునంచు నోరులేనట్టి జంతువుల తలలు
కట్టించితిమి నీవు కాపురం బొనరింప పాలఱాగచ్చు దేవాలయాలు
నియమించుకొన్నాము నీకు మాకును మధ్య రాజీకుదుర్ప నర్చకుల మూక
తలపోసినాము నీ విలసితాకారంబు పందిగా పెనురాతి నందిగాగ

తే.గీ. జాతులు మతాలు గల్పించు సమరములకు
పుట్లకొలదిగ రక్తంబు బోసినాము
నాల్గు దిక్కులలో ప్రయాణంబు సల్పి
తెలిసికొని పొమ్ము నీవల్ల గలుగు సేగి

శా. అల్లావో! మరియాతనూజుడవొ! యబ్జాక్షుండవో! శాంబరీ
భిల్లస్వామివొ! బుద్ధదైవతమవో! వేదాంతశాస్త్రాళిలో
వల్లింపంబడు శబ్దరూపుడవొ! విస్పష్టంబుగావించి మ
మ్మల్లాడింపక తేల్చి పొమ్ము భవదీ యాజ్ఞాత రూప స్థితుల్

కం. ఒక్కొక మతస్థు డొక్కొక
ఫక్కి న్నామములు పెట్టి బహువిధములుగా
వక్కాణించెద రిందలి
నిక్కంబును తెల్చిపొమ్మనింద్యచరిత్రా

సీ. కవ్వింపగలము నీకన్నను మిన్నగా చక చక నడచు యాంత్రిక జగత్తు
బందిచేయగలము పంచభూతములను క్రమముగా మా కూడిగములు సేయ
తెలుసుకోగలము మిన్నులమీద నడయాడు గ్రహతారకముల సంగ్రహచరిత్ర
కాలూని విహరింపగల మభ్ర మార్గాన తేలికగా విమానాలమీద

ఆ.వె. నీవు గల్గియున్న దైవ శక్తులయందు
మూడుపాళ్ళు మాకుగూడ గలవు
నిన్ను చూడగలుగు నేత్ర మొక్కటిదక్క
పూని నరుడు చేయలేనిదేమి?

సీ. ఒకప్రాణి కొకప్రాణి యోగిరంబైపోవు క్షణిక జీవుల సృష్టి సలుపకుండ
హత్య చేయుటకు వీలయిన నెత్తురుచియ్యె జెలగు దేహంబులు జేయకుండ
మనసులో మొలుచు కల్మషము దాపనజేయు హృదయపేటికలు నిర్మింపకుండ
పసితనంబున ప్రేమరసమయంబై వెల్గు సాధుస్వభావంబు జారకుండ

తే.గీ. ప్రజల నిర్మించి, మాకందుబాటునందు
కాపురముబెట్టి సేవకాగణము తోడ
జగతి కేతెంచి యేల్బడి సలుపు మనఘ!
మూగవలె మింట నొకచోట దాగకుండ

మ. అనలజ్వాలల సర్వలోకమును సంహారంబుగావించి నూ
తన విశ్వంబు సృజింతువందు రది తథ్యంబైన నా ప్రార్థనం
బును మన్నించి సృజింపగోరెద జగంబున్ నేటి దౌష్ట్యంబు సో
కని బంగారపు మంటితో సమరసైక్య స్వాదు భావాలతో

సీ. పొదలు కల్మషభావములు పెత్తనముచేయ వసతి జిక్కని తేనెవంటి మనసు
అలసుందనపు టసూయా ఘర్షణంబున వేడికెక్కని దయా వీక్షణంబు
అపకారమునకు బ్రత్యపకార మొనరింప తీవరింపని క్షమా దివ్యగుణము
పరిపూర్ణ మానవత్వము తట్టుమిట్టాడ మృత్యుదేవతను జయించు తనువు

తే.గీ. సర్వసర్వంసహాచక్ర సహనశక్తి
తొణికియాడగ ప్రతి రక్తకణమునందు
నింపి సృష్టింపుమోయి! నిలింపనాథ
మర్త్యలోకంబు, నీ మాట మఱవకోయి

ఆ.వె. విశ్వమందుగల్గు ప్రేమసర్వస్వంబు
ముద్దజేసి హృదయములను మలచి
మెరయు సత్యమెల్ల గరగి రేకులు గొట్టి
సృష్టి చేయుమయ్య జిహ్వికలను

సీ. మకరందమున తేటులకు భోజనముపెట్టు సుమవల్లరుల వింత చుట్టఱికము
ఆలిచిప్పలకు ముత్యాల పాపలనిచ్చు స్వాతి మేఘాల దాంపత్య మహిమ
కష్టజీవుల మేని గండుచెమ్మట లూడ్చి యోదార్చు పిల్లవాయువుల నెనరు
తలిరాకు హస్తాల బిలిచి నీడల నిచ్చు ధరణిజంబుల దాన ధర్మ దీక్ష

తే.గీ. జ్ఞానధనుడైన మేటి మానవున కీక
ప్రకృతి నిండారు జడ పదార్థముల కిచ్చి
నరసమాజంబు నవమాన పరచినావు
దానగుణ హీనమైన విజ్ఞాన మేల?

మ. అణుశస్త్ర ప్రళయంబు దెచ్చుకొని దుమ్మైపోవ సంసిద్ధమై
రణభేరిన్ మొరయించు క్రూర మద గర్వగ్రస్తమై బంధు రా
రుణ నేత్రంబయియున్న లోకమున నెహ్రూవంటిశాంతిప్రియుల్
మణిపూసల్ గద నీ యనంత కరుణా మాణిక్య హారాళికిన్

ఉ. కోరికలూర దుఃఖమునకుం గురియై మృతిసింహముల్ ఫలా
హారము చేయ విశ్వవలయాంగమునం ద్రసరేణురాశిలో
జేరు మనుష్య కీటకపు చెన్నటి చేష్టలు లేక శాంతి పెం
పారు జగత్తు మాకిపు డవశ్యము సృష్టియొనర్పు మీశ్వరా!

సీ. వాడువాఅని పుష్పపరిమళా సారంబు చిలికించి తనువులు సృష్టిజేసి
నగ సహస్రములలో బిగియెల్ల గొనివచ్చి పసరు పాలిండ్లలో పాదుకొల్పి
ఆణిముత్యపు చిప్పలందున్న నైగనిగ్యమును లావణ్యంబుగా బిగించి
తీపిజారని పుట్టతేనె వాకల మూక అధర బింబంబులయం దమర్చి

తే.గీ. కాంతలను సృష్టిచేయని కారణమున
పెండ్లియాడిన భార్యల పిప్పిజేసి
తరుముచున్నవి పురుష భూతములు కొన్ని
స్త్రీత్వమిడి యట్టివారి శిక్షింపవోయి!

మ. పురుషుల్ నిర్మితిచేయు సాంఘిక మహాభూతంబు పెన్గోరలం
దిరికింపంబడి దుష్ట భర్తల కృపాహీన ప్రవృత్తుల్ హృదం
తరమున్ అంపపుకోతగోయ నిజహత్యానేరముల్ చేయు సుం
దరుల న్నీవెటు లూరడింతువొ మహాత్మా! ప్రేమవారాన్నిధీ!

మ. సుకముల్ చచ్చినగాక లభ్యపడవంచున్ బెట్టు నీ వాయిదా
లకు నాశించి కరస్థ భౌతిక సుఖాలన్ బ్రక్కకున్ నెట్టు నా
స్తికపు న్మండుటెడారిలో మొలిచె నాస్తిక్యంపు కుళ్ళీ యమా
యకపుం బోరులు సృష్టిచేయవలదన్నా కొత్తలోకంబునన్

మ. అధికారంబను నల్లమందు తిని దేహంబెల్ల నున్మత్తమై
బధిరత్వంబును దృష్టిమాంద్యము వరింపం బాలిత శ్రేణికిన్
వ్యధ గల్పించెడు దుర్విదగ్ధులను నవ్యక్షోణిలో నీ మహా
రథమున్ లాగెడు వాహనంబులుగ నిర్మాణంబు గావింపుమా!

శా. స్త్రీకంటెం బురుషుండు శ్రేష్ఠుడనుచున్ సిద్ధాంతముల్ చేసి తా
టాకుల్ కంఠము లెత్తి స్త్రీజగతి కన్యాయంబు గావించెనో
యేకాలంబున పుట్టినింటయిన లేవేనాటి స్వాతంత్ర్యముల్
స్త్రీ కీమారు సమాన గౌరవవిభూతిన్ గాంతకుం గూర్పుమా!

చం. వలపుల బిడ్డలం గటికి పస్తులతో హతమార్చి గడ్డిదూ
డల సృజియించి తెచ్చి యెదుటన్నిలబెట్టెడు క్రూరమర్త్యమం
డలముల మోసమున్ దెలిసి నవ్వు మొగంబుల బాలొసంగు గో
వుల సహనస్వభావమును పొందొనరింపుము మామనస్సులన్

ఉ. మానవ జిహ్వలన్ దనిపి మాబ్రతుకుల్ జరితార్థమయ్యె నం
చానన సీమలన్ బ్రమదహాసరుచుల్ గనుపట్ట నిత్యమున్
గూనలతోడ వధ్యశిలకున్ బరువెత్తెడు గొఱ్ఱెమందలో
గానగవచ్చు త్యాగమును కల్పన చేయుము మా మనస్సులన్

మ. కమికెండన్నము పెట్టకున్నను బుభుక్షాశుష్కితంబైన దే
హమునందుం బ్రతిరక్తబిందువున నెయ్యంపు న్నిజస్వామి రూ
పము దీపింప భజించు శ్వానముల విశ్వాసంబు రవ్వంత చు
ట్టములందు న్నెలకొల్పు మింకొక యజాండ సృష్టి గావించినన్

మ. కలుపుంగోలుతనంబు తేటపడ నుత్కంఠన్ మొగాలెత్తి మూ
తులు మూతుల్ గదియించి ముద్దుగొని సంతోషించు చిన్నారి చీ
మలయందున్న పరస్పర ప్రణయసంపత్తిం బ్రసాదించి మ
ర్త్యుల బుట్టింపుము కొత్తలోకమున కొల్తున్ నిన్ను ముప్ప్రొద్దులన్

ఉ. అంగవిహీనులై జననమంది యథేచ్ఛ చరించునట్టి వా
రింగని మాకు నంతటి యదృష్టములేదని దుఃఖభారమున్
మ్రింగి తపించు దీనులకు మృత్యువుముట్టని నీ జగత్తు నం
దుం గృపతోనొసంగుము మనోహరరూపసుఖేప్సితార్థముల్

చం. కుల మత రాజకీయములకున్ గురిగాక సమస్త లోక మం
గళకరమైన సత్యమును కమ్మని వాక్కుల నిర్భయంబుగా
బలికినదే కవిత్వమను వాస్తవమున్ గురితించు దృష్టి మా
కలవడజేయ కేల సమయాంగన నెత్తిని నంటగట్టితో?

ఆ.వె. కలము బట్టినట్టి కవులెల్ల నీలోని
సుగుణగణములెల్ల బొగడుచుండ
ప్రజల కష్టములను బలుకువారెవ్వరు?
పలికిరేని పలుకువారలెవరు?

కం. ఉన్నవి మూడే కళ ల
భ్యున్నతము లఖండ శక్తియుతములు, నీవే
కొన్నావేమో ప్రజల
న్గన్నెత్తియు జూడ వేమి గతి దీనులకున్?

మ. కలలోనన్ గనిపించినాడవని వక్కాణించుచుంద్రెల్లభ
క్తులు, సాక్షాన్మనుజాకృతిం ధరణియందున్ దోచిన ట్లొక్కరున్
బలుకంగా విన మద్వితీయుడవు సర్వవ్యాపివై స్వప్నభూ
తల సంచారములేల? మా కివి వివాదగ్రస్త వృత్తాంతముల్.

ఉ. అన్నము దైవమా యని యహర్నిశలున్ దురపిల్లు పేదకున్
గన్నులు చెమ్మగిల్ల చిరకాలము నీ పరమార్థ మిష్టమృ
ష్టాన్నముగా భుజింపుమని యాకలి దీర్పగ జూతువేల ఆ
పన్నుల కేమి మేలు? ధనవంతుల మేలుకె మంత్ర తంత్రముల్

మ. గుడిలో నున్నని బండవై అనుగు భక్తుల్ నీకు చూపించి సా
పడినట్లెంచి ప్రసాదముల్ గుడిచి తత్పార్శ్వంబులం బిచ్చమె
త్తెడు కంకాళ సహస్రమున్ గసరి గద్దింప న్నివారించి తో
ద్పడగా దొమ్మలు లేనివాడవయినావా? శక్తిహీనుండవై

ఉ. వట్టి యమాయకంబులయి, పట్టెడు మేతకు రక్తమాంసముల్
కట్టిడి మానవావళి సుఖంబులకై వ్యయపెట్టి, తిట్టినన్
గొట్టిన నోర్చు జంతువుల గొంతుల నూడిచి సత్తికొల్పులన్
బెట్టెద రజ్ఞు లెప్పటికి నీ హృదయంబు ద్రవించునో ప్రభూ!

చం. అగుపడవా? ప్రభూ! తనువు లాహుతిజేసి సహస్రవర్షముల్
జగములు తల్లక్రిందయిన శాశ్వతకాలము మాకు ముక్కునున్
మొగమును లేని కొండపయి ముచ్చియొనర్చిన లక్కబొమ్మలే
భగవతులా?అభాగ్యములు పాపయుతంబులు మర్త్యజన్మముల్

ఉ. ఆదినరున్ సృజించుటకునై యొక తట్టెడు మన్ను నప్పుగా
మేదిని నుండి పుచ్చుకొని, మృత్యునెపంబున మానవాళియం
దూదిన గాలి పీల్చుకొని యుర్వికొసంగి ఋణంబు నీగు నీ
మైదు గ్రహింపలేక పరమార్థము పల్కుదు రీ మునిబ్రువుల్

మ. నిను గన్గొంటకు శక్తి చాలదట యీ నేత్రాల కేవో మన
స్సున నాధ్యాత్మిక నేత్రముల్ మొలిచి చూచున్నిన్నటంచ్రట్టి లో
చనముల్ పుట్టువుతో నొసంగక వృథా చక్షుల్ ప్రసాదించి యి
ట్లనుమానంబున ద్రోయనేల? పెనుమాయానాటకం బేటికో?

శా. ఆలోచింప జుగుప్స గొల్పెడు వరాహాద్యాకృతుల్ దాల్చి నీ
వీ లోకాన సముద్భవించిన కథల్ సృష్టించి చాటించినన్
హాళిందేళి నివేదనల్ గొని యభీష్టార్థంబులం గూర్చు నీ
బోళాబుద్ధి ప్రశంసనీయము జగత్పూజ్యంబు లోకేశ్వరా!

ఉ. ఒక్క పొగడ్తతో హృదయముబ్బి యఘంబులు పిండిపిండిగా
ద్రొక్కి వరంబులిత్తువట, దొంగలు మానవహంత లిట్టి నీ
చక్కని చిత్తముల్ దెలియజాలక, టక్కరి మొక్కుబళ్ళతో
చక్కలిగింత బెట్టెదరు స్వార్థపరుల్ నిజకార్యసిద్ధికై

చం. అణువును వ్రక్కలించి ప్రళయాగ్నుల నిద్దుర లేపి విశ్వ మా
రణమున కుద్యమించినవి రాక్షసభూము లకారణంబుగా
నణువునగూడ నీవు కలవందురు, సృష్టిరహస్యదృష్టి దు
ర్గుణుల కొసంగి యెంత చెడుగున్ ఘటియించితి వభ్రమందిరా?

శా. మా జాతీయత మా కళా ప్రతిభ సామాన్యంబు కాదంచు వా
చాజాడ్యమ్మున నన్యులందెగడు నస్తావిస్తముం బాపి నా
నాజాతీయ గుణైకదృష్టి నిడి మా నవ్య స్వతంత్రోర్వరా
రాజీవంబును దిద్ది తీరుపు మ నీర్ష్యాసౌరభశ్రీలతో

మ. త్రసరేణ్వంతరమందు డాగిన యనంతంబైన శక్త్యున్నతుల్
వసుధారాజ్య పిపాసపీడితుల కేలం జిక్కె విశ్వంభరన్
మసిగావించుట కుద్యమించిరి మహాత్మా! గుండెలల్లాడ సా
ధ్వసభుగ్నంబయియున్న దెల్ల జగ మేఘక్కి న్నివారింతువో?

చం. ఒక చలిచీమకూన తనువూడ్చిన నేడ్చు దయాపయోనిధుల్
సకల జగత్ప్రబోధకులు శాక్యమునుల్ ప్రభవించి జాతిగుం
డెకు నవనీతభావములు నేర్పిరి సృష్టిరహస్య మమ్మహా
సుకృతుల కందనీక గుణశూన్యుల కిచ్చితివేల బేలవై?

ఉ. ఆశల కెక్కసాగె భరతావని బంపు ననంత శాంతి సం
దేశము, లస్త్రశస్త్రముల నీచ రణప్రళయంబు లార్పు మా
ఆశయముల్ సుధామయము లాత్మపరాయణమైన క్రూరపుం
బాశవిక ప్రవృత్తిగల మానవతల్ ననలెత్త విచ్చుటన్

చం. మరుగొనరింపనేల యొకమాట జగత్పరిరక్షణార్థమై
ధరకొకమాటు నీదగు రథంబు మరల్చిన గొప్పవారి మం
దిరముల స్వాగతంబుగొను నేటి నియంతలయట్లుగాక, మా
హరిజనవాడలం దొలుత నర్ఘ్యముగొమ్ము దయాపయోనిధీ

సీ. పన్నీటితో నీకు పాద్య మీలేరైన కన్నీట పాదాలు గడుగగలరు
మణిపీఠముల నిన్ను మన్నింపలేరైన హృదయాసనములు వేయింపగలరు
పరమాన్నమున దృప్తి పరుపంగ లేరైన కాయకష్టపు గంజి బోయగలరు
టెంకాయతో నిన్ను బొంకింప లేరైన తలకాయ లిడి నిన్ను గొలువగలరు

ఆ.వె. అట్టివారి కాసు లపహరించుచు గుళ్ళు
గోపురాలు గట్టుకొనెదు నీకు
మొగము చెల్లదేమొ తగుదునమ్మాయంచు
నళుకు బెళుకు లేక పలుకరింప

చం. గణనకురాని యీ పరమ గర్భదరిద్రులమూక యేమికా
రణమున భిన్న మయ్యెనొ పరాత్పర! గ్రాహ్యముగాదు దేవతా
గణమున కేని, మాదిగలుగా యొకగుంపు జగంబులో చలా
మణి యగుచున్నదీ రుజనుమాన్పు మహౌషధముల్ లభించునా?

తే.గీ. కలిమి లేములలోన టక్కరితనంబు
కలిమికేగాని లేమికిగాదు తలప
పంచముల పేటలో జేరి పడకవయిచి
లేచిపోలేదు నేటికి లేమి నెలత

ఉ. ఆదట ఫాలనేత్రుడు స్వయంభువు డెల్లపు డన్నపూర్ణతో
వేదయుగాలనుండి పదివేల గణంబులు కొల్వుచేయగా
పాదము క్రమ్మరింపక నివాస మొనర్చెదు వారణాశిలో
పాదము మెట్టినన్ బరమభక్తుల వైఖరు లర్థమయ్యెడిన్

శా. లంగాగట్ట నెఱుంగనట్టి యతిబాల్యం బందె కామించి ఖ
ట్వాంగస్వామిని పెండ్లియాడి ఘనజూటాగ్రంబునందెక్కి భం
గాంగస్పర్శల తైర్థిక ప్రజకు పుణ్యంబుల్ ప్రసాదించు న
గ్గంగా దేవత నిన్నుజూచి యెదబొంగం బూల పూజించెడిన్

ఉ. తప్పక వచ్చిపోవలయు ధారుణికి న్నవభారతంబునం
దుప్పర మంటగా వెలసియున్నవి బంగరు గుళ్ళు గోపురాల్
కుప్పలు తెప్పలై నరునకుం దలవాల్పగ తావుజూపి మా
యప్పనముల్ గ్రహించి చనుమా! అనుమానములెల్లదీరెడిన్

ఉ. ఇక్కడ నిండ్లుగట్టుకొని యిచ్చు ప్రసాదము లారగించు నీ
ముక్కిడి వేల్పులెల్లరును ముక్తినొసంగ సమర్థు లౌదురో
టక్కరి సేతురోయని యెడంద లొకించుక సంశయించెడిన్
నిక్కము దేల్చిపొమ్ము కరుణించి ప్రపంచము సంతసించెడిన్

మ. హిమవత్పర్వత పంక్తిపైగలవు నీ కిండ్లందు కైలాసభూ
ధ్రముపై నెక్కిన భారతోర్వర సమస్తం బక్షియందుండు ని
త్యము నీకై తపమాచరించు మునిబృందం బందు గన్పట్టు ను
త్తమమౌ సృష్టివిలాసమెల్ల నట బ్రత్యక్షించు నుచ్చండమై

సీ. కాళిదాసుని జగా ఘంటాన నొలికిన మధురాక్షరముల సన్మానమంది
శూలాయుధుని దొడ్డ యాలపోతుల తేని మహిత భాంకృతులతో మారుమ్రోగి
మూడువేళల నృత్యములు సల్పు శివుని పాదాఘాత ముద్రిక లఖితదాల్చి
గగనాపగా తరంగాల దూకుడుచేత ఘోషించు బంగారు గుహలతోడ

ఆ.వె. దట్టమైన దేవదారు తోటలనుండి
ప్రసవమైన దివ్య పరిమళమున
స్వాగతం బొసంగ సకల భారతము నీ
కనులముందు నిల్చు క్షణములోన

ఉ. కొండలయల్లుడై నగము కొమ్ముల కొండొకచోట భద్ర వే
దండపు చర్మధారియయి దర్శనమిచ్చు భవానితోడ భ
ర్గుండు త్రిమూర్తులందతని గొప్పగ నెంతురు శైవకోటి వి
ష్ణుండురువంద్రు వైష్ణవజనుల్ జగడాలు పరిష్కరింపుమా!

కం. అచ్చటి సన్మునికోటికి
నచ్చవు పెను రాజకీయనాటకములు, రా
లచ్చులకు బెనుగులాటలు!
కచ్చలు కార్పణ్యములు దగాజీవనముల్

మ. అదిగో చక్కని పద్మరాగముల చాయల్ కుప్పగా బోయుచు
న్నది బ్రహ్మాండము నేత్రపర్వముగ, సంధ్యం దాండవంబాడుచు
న్నది విశ్వంబు మయూరమై హృదయపింఛంబుం ప్రసారించి, యి
ట్లెద నూరించెడు దృశ్యముల్ గలవె స్వామీ! స్వర్గధామంబునన్

మ. వలపుల్ నింపుచు కన్నుగీటుచు ప్రతిప్రాణిన్ విదాహాబ్ధి లో
పలికిన్ నెట్టు ప్రపంచమోహినికి నీ స్వర్గా లసంఖ్యాకముల్
తులరా వభ్రము డిగ్గి రమ్మిటకు మాతోగూడి బంగారు మే
డలలో సౌఖ్యము చూరలాడుము ధనాఢ్య శ్రేణి సేవింపగన్

మ. వెలుగున్ జీకటి కష్టమున్ సుఖము నుర్విన్ సృష్టిగావించి ఆ
శలకుం బాదులునిల్పి శాశ్వత సుఖస్వర్గంబు బ్రహ్మాండ మం
డలమం దెచ్చటనో సృజించుకొని యానందించు నీ వింత చే
తలె మమ్మీగతిపాలుజేసినవి వేదాంతాటవీ వల్లభా!

ఉ. పోరున గూలినన్ దొరుకు పుణ్యజగత్తున రంభతోడ సం
సారసుఖం బటన్న నుడి శ్రావ్యముగా వినుపింప రాజబృం
దారకకోటికై తనువు దానముచేసిన యోధకోటి కీ
మారు శతాయురభ్యుదయ మంజుల జీవితముల్ ఘటింపుమా!

చం. మతకలహాగ్నిలో గరగి మన్నయిపోయిన మూర్ఖమానవ
ప్రతతుల రక్తనిర్ఝరుల ప్రత్యణువున్ బరిషిక్తమైనదీ
క్షితి కరుణాపయోనిధివి సృష్టినియంత వెటుల్ సహించి యీ
పతితజగత్తుమీద పదపద్మములూని చరింతువో ప్రభూ!

మ. తిన గూడుండని పేద సాదుల మహార్తిన్ గ్రాగి పెల్లుబ్బు వె
చ్చని నిట్టూర్పుల దూషితంబయి ప్రపంచప్రాణమన్ పేరుగాం
చినదీ గాడ్పు పుటంబునంబడక సంసేవ్యంబు గాదెట్టి పా
వన వాతావరణంబు గూర్చెదవొ దేవా! నీ పునఃసృష్టిలో

ఉ. గుండెలలో నెదో గుబులుకొల్పు నొకానొక మూగభాషతో
నండకు జేరబిల్చు మధురాంగకముల్ బిగియించి, యెందు కీ
వండజయానలన్ సలిపి యాసలు గొల్చితి వబ్జపుష్పకో
దండుని గెల్వగల్గు బలదర్పములున్నవె పూరుషాళికిన్

మ. బిగి గుబ్బల్ వెలికుబ్బి బుగ్గల గులాబీవన్నె రాణింప చి
ర్నగవుంజూపుటలుంగులం బరపి యారాధించు దుర్గమ్మ యొం
టిగ చేజిక్కగ పాపకచ్చడములన్ ఛేదించి చేపట్టడే
సెగకన్నున్న శివయ్య మారుని శరార్చిజ్వాల సామాన్యమే

సీ. నిండు జాబిలిలోన పండిపోయిన హాయి చిరునవ్వు తునకలో జిలికినావొ
పుట్టతేనియలోన మిట్టాడు మధురిమ నధరబింబంబులం దదికినావొ
కులపర్వతములలో నెలకొన్న బిగువెల్ల గుబ్బపాలిండ్లలో గ్రుక్కినావొ
ఆణిముత్యాలయందలరారు మెరుగును మేనుదీవెలలోన మెదపినావొ

ఆ.వె. హృదయవేద్యమైన ఎంతతీపి బిగించి
మగువ నద్భుతముగ మలచినావొ!
నాడు శతమఖుండు కోడిపుంజైనాడు
మేనుమరచి ఆడుదాని కొఱకు

ఉ. కోటి యుగాలకున్ రసము గ్రుంగని నీదు వసుంధరా మహా
నాటక కావ్యరాజమున నాలుగునాళుల పాత్రధారినై
చాటునకేగు నా వెడగు సాహసమున్ క్షమియింపు మిందులో
లోటులు దిద్దుకొమ్ము కవిలోకము మెచ్చ జగత్కవి ప్రభూ!

ఆ.వె. కవుల సృష్టిలోన గనుపించు ప్రతి పదా
ర్థంబు రసమయంబు నమృతమయము
విశ్వకవివి నీవు విషమయంబగు నుర్వి
గోళ మేకతాన గోచరించె?

ఆ.వె. సగము తెలివి, గుణము సగము, సంతోషంబు
సగము, కలిమి సగము, సగము శక్తి
సగము బ్రదుకు నిచ్చి సగముంచుకొన్నావు
నిండుభక్తుడెందు నీకు దొరుకు?

శా. నీ రత్నాల వికుంఠభోగ గరిమల్ నీ శాశ్వతానందముల్
నోరూరించు కథల్ పఠించి జగమిందున్ దీర్ఘనిశ్వాసముల్
సారించున్ దివి కెక్కజూచు మృతిపంచాస్యంబు నడ్డంబుగా
పారాబెట్టితి వీశరీరమున నా భాగ్యంబు ప్రాప్తించదా?

కం. భవ ముత్తరింప నపుడపు
డవతారం బెత్తనేల? ఆ స్వర్గంబున్
భువికిం దరలించినచో
వివిధ మతోన్మత్త రుజలు విరమించుగదా

ఉ. బత్తెము చేసినావుగద ప్రాణులనెల్ల దయావిహీనమౌ
మిత్తికి, హాయిగా సకలమేదిని మీద నిరంకుశంబుగా
పెత్తన మాచరించెడిని పేదకు బొక్కెడు కూడొసంగ నీ
చిత్తము సమ్మతింపదొ విచిత్రము లీ వలపక్షపాతముల్

సీ. బలమైన నగరాలు నలిగి రక్తముగ్రక్క దెసల భూకంపాలు తెచ్చి పెట్టి
వేలవే ల్నిండు ప్రాణాలు నీటైపోవ అగ్గికొండల గుండియల నగల్చి
ప్రతిరక్తకణము నాహుతిజేసి భక్షింప సకలజాడ్యాలకు సైగజేసి
జనపదంబులు నీటమునిగి ముక్కలుగాగ గాలివానల కింత కన్నుగీటి

తే.గీ. హృదయముండని కిగ్గాడి మృత్యువునకు
విందులు వినోదములను గావింతువేల?
తలప కాకులగొట్టి గ్రద్దలకు వేయు
పనులు తగవయ్య బ్రహ్మాండ పాలకునకు

ఉ. నీవు జగత్తుమీద పయనించి పరిస్థితు లాకళించుకో
లేవనుకొందు, సత్యము హుళిక్కి, నిజాయితి సున్న యైక్యతా
భావము శూన్య మిట్టి దురవస్థకు లోనయియున్న భూమిలో
నీవు పదంబు మోపకుము నిక్కము గుండియలాగి పోయెడిన్

ఉ. స్వాగతమీయ వచ్చెదరు స్వార్థపరుల్ దయలేని దొడ్డ యు
ద్యోగులు సీమసంస్కృతులతో గరచాలన మాచరింపగా
త్యాగపరాయణుల్ బలె, సభాలయ కుడ్యము లూడియాడి మా
ర్మ్రోగ నుపన్యసించెదరు భూమికి డిగ్గిన దేవతల్ బలెన్

మ. పరదైసుం గనినాడ స్వప్నమున తత్పార్శ్వంబునం దగ్ని సా
గర మభ్రాంత నటత్తరంగములతో గన్పట్టె నం దీ వసుం
ధర పుణ్యాత్ముల జాబితాలగల పెద్దల్ కొందరున్నా రదే
నరకంబౌనని యూహజేసితి జగన్నాథా! యదార్థంబకా!

ఉ. ఆకట తూలితూలి జఠరాగ్నికి నింధనమై జగంబులో
నీకు శిరంబువంచక జనించినదాది దరిద్రదేవతా
భీకర దంష్ట్రలన్నలిగి విశ్వము వాసినవారు కొంద ర
వ్యాకుల చిత్తులై సుఖములందుట గంటి వికుంఠ సీమలన్

ఉ. వాక్కును మానసం బెగసిపట్టిన నందనివాడు, కంటికిన్
జిక్కనివాడు, భక్తికి వశీకృతుడై సచరాచరంబున
న్నక్కి వెలుంగువాడెపుడు నాశములేని స్వయంభువుండు న
ల్దిక్కుల గోచెరించె రవిదీప్తుల నాతని కంజలించితిన్

చం. మత కలహోపదేశమున మానవరక్తము ద్రావుచున్న దీ
క్షితి శమియింపలే దిపుడు దీర్ఘ విదాహ మికెంతకాల మీ
వితముగ మిన్నకుండెదవు బెల్లముగొట్టిన ఱాయివోలె నె
న్నితరము లీ యనూహ్యసరణి న్నడిపించెదవో ప్రపంచమున్

ఉ. గుంపెడు బిడ్డలన్ మెడలకుం గుదిగట్టి నివాసముండగా
కొంపలు గోడులుం దినుటకుం బిడికెం డశనంబు నీక పూ
జింపనివారల న్నరకసీమల ద్రోయుదు నంచు వార్తలం
బంపెదవేల నీ యనుగు భక్తులచేత నిలింపనాయకా!

మ. మరణం బందినవారి యాత్మ లవి యేమార్గాన నీ చెంతకుం
బరువుల్వారు ననంతకోటి విగతప్రాణంబు లెచ్చోట నే
తరహా జీవన మాచరించు, నిట సంతానంబు గావించు ను
త్తర కర్మల్ పరలోక యాత్రికుల ఆత్మక్లేశముల్ మాన్పునా?

మ. కవులున్ గాయకులెందరో గగనలోకం బెక్కినా రీకళా
వ్యవసాయం బట సాగునా? అమర విద్వద్గోష్ఠులం దెట్టి గౌ
రవ మర్యాదల కర్హులయ్యెదరు? తద్రంభాప్సరః కామినీ
నివహాశ్లేష సుఖంబు వీరులక కానీ? యొడ్లకుం జిక్కదా?

మ. కవి దేహంబు త్యజించి మింట నొక నక్షత్రంబుగా మారి త్వ
ద్భువనంబున్ వెలిగించు దీపమయి యుద్భాసిల్లు నంద్రట్టి వా
డవని న్నిత్యదరిద్రుడయ్యు నిజకావ్యానందలోకంబునన్
దివులున్నాని సుఖించు నల్పతరతృప్తిన్ రిత్తమర్యాదలన్

చం. బ్రతికిననాడు లేని భగవన్మహిమల్ దగిలించి మృత్యుదే
వత జఠరంబుజొచ్చిన యభాగ్యులకుం గుడిగోపురాలు ని
ర్మితి యొనరించి పేదల పరిస్థితి నెంచని వింతపుణ్యదూ
షితుల సృజింపబోకు మిక చెల్లవు నీ ధనికాభిమానముల్

మ. పలువన్నెల్ కనువిందుసేయ వనదేవస్త్రీల కౌగిళ్ళలో
కలనాదంబొనరించుచున్ గగనమార్గంబందు క్రీడించు పి
ట్టలలో కొండొకపిట్టనై బ్రదుకుటిష్టంబయ్యెడిన్ దుష్టచిం
తలతో జింతిలు మానవుండ నగుకన్నన్ లోకలోకేశ్వరా?

ఉ. నవ్వవు జంతువుల్, నరుడు నవ్వును, నవ్వులు చిత్తవృత్తికిన్
దివ్వెలు, కొన్ని నవ్వు లెటుతేలవు, కొన్ని విషప్రయుక్తముల్,
పువ్వులు వోలె ప్రేమరసమున్ వెలిగ్రక్కు విశుద్ధమైన లే
నవ్వులు నాకుని మ్మఘవినాశక! వ్యాధులు సోకవెన్నడున్

ఉ. మున్ను విషామృతోక్తి పరిపూర్ణ విశిష్టతగల్గి సత్కవుల్
మన్నన లందినారని తమాషకథల్ వచియించుచుండ్రు నే
డున్న కవిప్రబుద్ధు లనృతోక్తులు నాటివిషోక్తులెన్నగా
యన్నలుదమ్ములన్న విషయంబు మనంబున విస్మరించుచున్

చం. కలరు పతివ్రతల్ కలియుగంబున గూడ, గయాళులైన య
త్తల కఱకుందనమునకు దాళి పొగల్ సెగలన్ వెలార్చు భ
ర్తల పదపద్మముల్ గొలుచు దైవతకాంతలు, వారి వేదనా
జ్వలన శిఖావళిం జిదుమజాలవు నీ వివిధావతారముల్

మ. కరముల్ మోడిచి గౌరవింతు రనురాగంబుం బ్రదర్శింతు రీ
శ్వర భక్తిం బ్రకటింతురన్న ప్రతిశబ్దంబందు నేదో మహ
త్తర భావంబు గ్రహించినట్లు నయనాంతస్పందనల్ సేతు రీ
తరహా మాయకులాయి దాసుల ప్రమాదం బెట్లు వారింతువో?

ఆ.వె. ఆవుపెరుగు గోరకర్థించె మును కాళి
దాసు గేదెపెరుగు ధరణిపతిని,
ఆవునట్లు గేదె నాదరింప రదేల
వెన్న దొంగ! మన్నుదిన్న రంగ!

శా. గోశాలల్ నెలకొల్పినార మిట పెక్కుల్ గోశరీరాలతో
నాశాదేవత శల్యరూపమున గ్రాసార్థంబు ఘోషించెడిన్
నైశాకుంకుమ పూజలన్ దనుపుచున్నం బాపమా మూక గో
రాశిం బెత్తెడు కండచేర దిక మార్గం బేది లోకేశ్వరా?

తే.గీ. కలికిప్రాయంబు తనువల్లికలకు గూర్చి
కోర్కెలకు గుల్కు ప్రాయంబు గూర్తువేల?
ఈడుజారిన వార్ధక్య పండితులకు
ఆశలకు సాటి శిక్ష లన్యములు గలవె?

మ. మన మత్యుత్తమ వంశజాతులము సుమ్మా! నీచులంజేర వ
ద్దని లేబ్రాయమునందె బిడ్డల కసూయాద్వేషముల్ నేర్పి, క
మ్మని బుద్ధుల్ విషతుల్యముల్ సలుపునమ్మల్ నమ్మరీనాటి నూ
తన సామాజిక సత్య శాంతి సమతా ధర్మ ప్రబోధమ్ములన్

మ. మనుజుం దుగ్గ్రరణంబులో మడిసి రంభంగూడు నం ద్రాజిలో
తనువుం బాసిన వీరకాంతలకు నేతద్భోగ మెట్లబ్బునో
యని ప్రశ్నింప జవాబురా దబల కిందందున్ గతుల్ దుల్చి వం
చనగావించు కథాప్రణేతలను పశ్చాత్తప్తులం జేయుమా!

## మలికోర్కె

మ. కవి బ్రహ్మాండము నేలువా డతని యంకంబెక్కి యర్ధాంగి రెం
డవ స్వర్గంబయి యేలుచుండు నతనిన్ సాంసారిక క్లేశముల్
తవుల న్నీకటువంటి దంపతుల నేస్తంబున్ విదారించి స
త్కవితా కంఠము నుత్తరింతు విదియుక్తంబౌనె భక్తప్రియా!

శా. నా సృష్టించు జగత్తుకుం బ్రతిగ జింతల్ జీకులున్ లేని భా
షా సౌందర్య సుధాజగంబులు నిమేషంబందు గల్పింతు రం
చీసుంబూని సతీవియోగములతో హింసించుచున్నా విదే
నా? సాహిత్యవనీ తపస్వులకు సన్మానంబు లోకేశ్వరా?

శా. సంసారంబను క్రూర సింహమునకున్ సర్వంసహాచక్రమున్
మాంసాహారముగా నొనర్చిన మహామాయాసముద్రుండవై
హింసింపందొరకొంటి వేమిటికి స్వామీ! యొక్క మా రీమను
ష్యాంశంబుట్టి సతీవియోగ విషభక్ష్యం బింత భుజింపుమా!

మ. కడిమి న్నీవు ధరించు మారణ గదాఘాతంబు సోకం బొడిం
బొడియై దేహములూడ్చు ప్రాణి నిచయంబున్ జూచి పాషాణముల్
జడముల్ బిట్టుగరంగి యేడ్చెడిని నిశ్శబ్దంబుగా నీ కనుల్
తడిగా వీకఠినస్వభావ మెపు డార్ద్రంబౌ? నజాండాలయా!

సీ. పచ్చ పచ్చని పతివ్రతల జీవితరేఖ గడియలో నడుగంట దుడిచివైచి
శాంతి భాజనమైన సంసార జలధిలో బడబాలన జ్వాల పాదుకొల్పి
సత్కళాపరులైన సత్కుటుంబముల మేను సగమూడ్చి మృత్యురాక్షసికి నిచ్చి
పరిపూర్ణ స్త్రీత్వ సంపదకు మేల్బంతులౌ పసిడిబొమ్మల కాటి పాలుచేసి

తే.గీ. బంధుకోటుల క్రొవ్వేడి బాష్పనదుల
స్నానమాడుచు పరుషదూషణములెల్ల
భూషణంబులుగా దాల్చి మురిసికొందు
వెందుకీ యపఖ్యాతి యదృశ్య చరిత?

ఉ. జాలికి పుట్టినిండ్లయిన చల్లని నీ నయనంబులన్ విష
జ్వాలకు తావులేదని ప్రవక్తలు బల్కుదు రెందు కీ కవీం
ద్రాలయ రత్న దీపశిఖనార్పితి వంధ తమస్సులో కళా
బాలిక తల్లిలేనిదయి భగ్న మనోరథయై తపించెడిన్

ఉ. అంతములేని సంసృతి మహాంధ తమోగ్ర నిశీథమందు కా
సంత వెలుంగుగా హృదయశాంతి ఘటించు చిరత్నరత్నపుం
బంతిని దొంగిలించితివి భర్త గృహంబున లేనివేళ, వే
దాంత రహస్య వాసివిగదా కికురించుట సాజమేకదా?

సీ. బలమైన యాధారములు లేక జీర్ణించు నీ చరిత్రకు పైడినీరువోసి
పతన దుర్గతికి బాల్పడి యండ లెడబాయు దుర్గాల కిన్ని మెత్తులు దగిల్చి
తలతోక లేక గందరగోళమున ద్రోయు తత్వ బోధకులకు నర్థాలు గూర్చి
పనిపాటు లేక ఆపద లుర్వి కెగజిమ్ము సృష్టిలోగల గుట్టు చివికి చూపి

ఆ.వె. నీకు శిరము వంచి నీ పాదయుగళికి
యూడిగంబు చేయుచున్న యట్టి
వశ్యవాక్కులైన వరకవీశులు జంట
బాపినావు–దొడ్డవాడవోయి!

శా. నీ వేదాంత వనాటనత్వమును సందేహించువారిన్ సుధా
భావాలంకృత శబ్దజాలములతో వాకట్టుగావించి నీ
దైవత్వంబు స్థిరీకరింతురు కవుల్ తద్బంధువర్గంబు వా
చావైదుష్యము దెబ్బతిన్న నవకాశంబేది? నీగద్దెకున్

మ. ఒక యేడాది ధరాసుతావిరహవహ్నుల్ జిత్తమున్ గాల్ప దై
విక శక్తుల్ గల రామునంతటి జగద్వీరాధివీరుండు కం
టికి ముప్పందుముగాగ నేడువడె యీనిర్భాగ్య సంసారి వా
ర్ధక భారాలను నోర్చుకోగలడె భార్యాజ్యోతి జల్లార్చినన్

ఉ. నిన్నొక పెద్దజేసి యవనిం బదిమందికి చాటిచెప్పి యె
న్నెన్నొ సమాఖ్యలుం బిరుదులిచ్చి నభంబున దాచిపెట్టు వి
ద్వన్ని చయంబు గుండియలపై పెనుకుంపటు లెత్తినావు నీ
కన్నము జిక్కునా ధరణియందు? కవుల్ కల మందుకొన్నచో

శా. దాంపత్యం బిది దైవదత్తము సుఖాంతంబౌ జుమీ యంచు లా
లింపుల్ బల్కి పురోహితుల్ పనసవల్లింపింతు రీ తంతు నీ
కింపైయున్నది యోగమెట్టులగు నిట్లీజంట బాపంగ నై
లింపాధీశ్వర! ఆగ్రహింపవల దల్పీభూత చేతస్కుడన్

శా. నా యర్ధాంగిని నాకొసంగు మభిమానంబుంచి యింకొక్కమా
రాయుర్దాయముబోసి కోరను త్వదీయ స్వర్ణవైకుంఠమున్
నీ యూరింపు టమర్త్య భోగములు నా నెయ్యంపు టిల్లాలు నా
కీ యుర్విన్ సమకూర జేయగలదోయీ! లోకలోకేశ్వరా!

మ. సుకృతుల్ శుద్ధమనస్కులున్ గుణగరిష్ఠుల్ దేహముల్ వాసి పా
యక నీగద్దియ కీవ లావలను దివ్యజ్యోతులై పొల్తురం
ద్రకలంకాశయ! నా సతీమణి త్వదీయాగారమందుండి త
ప్పక కూర్చున్ నవరత్న దీపముల శోభం బ్రాభవోపేతయై

సీ. ఆత్మజాయా వియోగాగ్ని తప్తంబైన కన్నీట దడిసిన కలముతోడ
అనుకూలవతి ప్రియాంగన దాటిపోవ శూన్యంబైన భిన్న మనస్సుతోడ
అనుగుటిల్లాలు వండిన వంటకోస మాశించి చప్పబడ్డ జిహ్వతోడ
ప్రేయసీ మధురాస్యబింబ దర్శనకాంక్ష దశదిశల్ నెమకు నేత్రములతోడ

ఆ.వె. సతిని సాగనంపి షష్టిహాయన వయో
భరముతోడ పలితశిరముతోడ
కలము దాల్చునాడు పలుకుతోడై చిత్త
శాంతి చేయుమయ్య! చక్కనయ్య!

ఉ. తేనియలూరు పుష్పమును తేటులు జుమ్మని క్రమ్ము రీతి నే
వో నవకంపు భావశతముల్ జెలరేగి శిరస్సులోన గా
లూని తుపానురేచ మది కూరటజిక్కక శబ్దరాశిలో
స్నానము చేయు సత్కవికి సాగవు దీర్ఘ కుటుంబభారముల్

చం. తెలుగు కవిత్వమన్న నొక తెన్నునబోయెడు పద్దుగాదు ప్రా
సలు గణముల్ యతుల్ పదము సాగగనీయవు కట్టుబాట్ల సం
కెలలు విదల్చి భావమతికించుట దుర్ఘట మక్కటక్కటా
వలదు విరోధికిన్ దెలుగు వాక్కవితల్ కడు వేదనానిధుల్

మ. జననంబందినదాది నే కనిన యీ సర్వంసహా నాటకం
బున నానావిధ పాత్రధారులయి రేపుల్మాపు లాటాడి పో
యిన పోనున్న నటీనటోత్తముల ఆయాఘట్టముల్ నీ వెఱుం
గని వేముండు జగత్ప్రభూ అయిన నాకర్ణింపు మూకొట్టుచున్

సీ. పూజలో మోజులో పోల్చుకోలే రిప్డు దైవాలు పెనుభక్తి తత్పరతలు
వట్టివో గట్టివో వర్ణింపలేదిప్డు దేశంబు తత్త్వోపదేశములను
కష్టమో యిష్టమో గ్రహియింపదీనాడు సంఘంబు పెడ నమస్కారములను
కల్లలో బొల్లులో కనుగొనలేరిప్డు ప్రజలింక వేదాంత భాష్యములను

తే.గీ. ఉక్కులొక వంక కార్యంబు లొక్కవంక
పయన మొనరింప జీవితభ్రష్టనౌక
నడుపుచున్నారు నీ యనంత ప్రశాంత
చిత్తమేలాగు మమ్ము శిక్షింపగలదొ!

---

ఉ. ఏగితి నొక్కనాడు కవియింటికి దోసిలిబట్టి కావ్యముల్
ప్రోగులువెట్టి తీసికొనిపొమ్మిది నాధనమంచు పాపమా
జోగి వచించె నేను పరిశోధనజేసితి నాకు నందులో
త్రాగుట కింత గంజి కనరా దవి జీర్ణముగాని ఖాద్యముల్

ఉ. గానము శిల్పమున్ గవిత కష్టములందెగటార్చు సాధనా
లైన దినాలకోసము సహస్ర యుగంబులనుండి విశ్వ మా
శా నయనంబులన్ దశదిశల్ పరికించుచునున్న దీ జగ
ద్గ్లాని యడంగునా తపితగర్భములం దమృతంబు సోకునా

శా. సానల్ దీరిన రత్నరాసులయి సాక్షాత్ స్వర్గమున్ దించు నీ
నానాకావ్య జగత్తులో దివిజకాంతల్ కాంతులున్ భోగులై
ఆనందించుచు ధారుణీ నరక మందల్లాడు దౌర్భాగ్యపు
న్మానుష్యంబును విస్మరింతురు గదన్నా! సాహితీ కర్షకా!

కం. భూవరుల జెందె మును నీ
పావన కవితామృతంబు, ప్రకృతమునందున్
దేవతల జెందుచో మా
కేవిధి లభ్యంబులౌ నభీష్టార్థంబుల్?

మ. కవి నా మాటకు కంట నీరిడుచు వక్కాణించె నీరీతి ని
క్కువముం బల్కితి వీ మహాకృతులు నీ ఘోరక్షుధాశాంతి చే
యవు శృంగార రసాంచితంబులు పరార్థాసక్తముల్ దేవ మా
నవ రాజన్య కథాపరాయణములన్నా! లాంగలీ పాకముల్

కం. పూదోట లంతిపురములు
వేదాంతార్థములు మాకు ప్రియతమములు, మీ
వేదన పేదఱికమ్ములు
కా దవి నాజూకు నరుల కర్ణజ్వరముల్

కం. నాస్తికుల సామ్యవాదుల
మస్తిష్కమునందు పతితమానవతతికిన్
గాస్త జగా కలదేమో
నాస్తి సుమీ కరుణ కీదినాలం గృతులన్

ఉ. మా కవితా సమాధి పరమావధి యప్పరమార్థ మిందులో
నీకును మాకు ముక్తిరమణీమణి యుమ్మడి భార్య పాప పం
కాకులమైన యైహిక మహార్ణవముం దరియింప నోడయై
చేకొనిపోవు వేల్పులు వసించు నగోచర పుణ్యభూమికిన్

ఉ. పాపుల పూర్వజన్మ పరిపాకమె పేదఱికంబు దైవ శా
పోపహతిం గృశించు నరు నుర్వి భరింపదు వాని కిచ్చినన్
పాపముగా గణించెదరు భక్తులు దైవము కోపగించు నం
చా పరమాత్మయే శరణమందర కెందులకీ కుతర్కముల్

కం. కవియై పుట్టిన ప్రతి మా
నవుడుం భగవంతు నింట నౌకరుజుమ్మీ
కవితా సత్రములో పు
ట్టవు గ్రుక్కెడు నీళ్ళు నీకు డాపగనేలా?

చ. కలవు శిలల్ పురాతనయుగంబుల శిల్పులకౌశలాలకున్
నెలవులు భారతీయ కమనీయ విభూతులు శాసనంబు ల
క్షుల కలుషంబువోవ గనుగొమ్మని నాకుపదేశమిచ్చె ప్రా
సలు యతు లొప్ప పల్కుల పసం దెసగంగ కవిత్వధోరణిన్

ఉ. ఆకలిగొన్న నా హృదయ మందెవియో మకరంద బిందువుల్
సోకిన యట్టులై సుకవి సూక్తులు వీనుల విందు చేయగా
ప్రాకృత కర్మపాకమును భావన చేయుచు నూరడిల్లు నా
పాకకు జేరితిం గటికిపస్తులతో భగవంతు నింటికిన్

---

సీ. భరతనర్తకి కాలి పసిడిగజ్జెల మంజు మంజీరరవళి కమ్మందనంబు
పలికిన పలుకెల్ల బలికించి కులికించు కలికి కిన్నెర కేళి కౌశలంబు
ఘన దుఃఖమయ జగత్తును మింటికెగజిమ్ము సుకవి రాజన్యుల సూక్తిగరిమ
ముడి ఱాతి నందాల పడతిగా నిర్మించి చూపు శిల్పుల చేతి సుత్తెనేర్పు

తే.గీ. అద్భుతానంద జనకంబులై క్షుధార్తి
నింత చల్లార్ప చింతలనెల్ల మరచి
గర్వితుడనైతి జాతి సంస్కారమునకు
కానబడె జంకలో శూన్యమైన జోలె

చం. అరిగితి నంత శిల్పనిలయంబున కందొక దొడ్డశిల్పి సుం
దరముగ జెక్కుచుండె వివిధ ప్రతిమాశతముల్ మహోపలాం
తరముల దాగియున్న సురనాగవియచ్చర కామినీమణుల్
ధరణికి డిగ్గిరా నభిమతంబులనీయ వరంబు లీయగన్

తే.గీ. హరి హర బ్రహ్మలతని హస్తాంబుజమున
మొలిచివచ్చుచునుండి రబ్బురము గొలుప
సరళ దృక్కుల నభయ హస్తములతోడ
శిల్పిదేహాన బిడికెడు చియ్య లేదు

కం. గుంపెడు బిడ్డలు చినిగిన
కొంపయు బెండ్లాము చింపిగుడ్డలు మూలన్
గంపెడు ఊతి శలాకలు
తుంపలు సుత్తెలును యులులు దోచెం జెంతన్

కం. ముక్కద్దంబుల చట్రపు
ముక్కలనేదోవిధాన ముడిబెట్టి చెవిన్
జెక్కి శిలాఖండంబుల
జెక్కదొడగె శిల్పి మేన చెమ్మటలూరన్

ఉ. ఒక్కొక సుత్తెదెబ్బ కొక యుజ్జ్వల మానవమూర్తి మెల్లగా
నిక్కి శిలాంతరాళ కమనీయ శరీరము దాల్చుచుండగా
అక్కజ మంది యింతటి కళాంబుజ సూతి దరిద్రదేవతా
దృక్కుల కగ్గమై నవసెనేయని కన్నుల నీరు నించితిన్

చం. హరి హర పద్మగర్భులు సుధాంధసు లాతని సుత్తెదెబ్బతో
కర చరణాంగికాభినయ గర్భిత భంగిమ లుల్లసిల్లగా
దరిసెన మిచ్చి భక్తసముదాయ వరప్రదులై వెలుంగుచుం
దురు, తమ సృష్టికర్తకతిదుర్భరపుం బ్రతుకుల్ ఘటించుచున్

ఆ.వె. శిల్పి చక్రవర్తి శిల్పి సమ్రాట్టను
బిరుదు లెన్నో వాని యఋతగలవు
ఊలు రప్పలతని ప్రబల సామ్రాజ్యంబు
చింకి చాప వాని సింహపీఠి

మ. పసుపుం గుంకుమ పూజలందుకొని యప్పాషాణదైవంబు లా
కసపుం బుష్ప వికుంత పుణ్యములు భక్తశ్రేణి కర్పించి సం
తసమున్ గూర్చుట కన్నులారగని యేతచ్ఛిల్పి చిత్తంబునన్
వ్యసనం బంతయు విస్మరించె కృషి ధన్యంబయ్యెనం చెంచుచున్

మ. జరిగెన్నాలుగునాళు లొక్కెడ ప్రతిష్ఠల్ రాఘవస్వామి కు
ర్వర నీళ్ళాడినయట్లు తైర్థిక సహస్రంబుల్ సమావేశమై
హరి సందర్శన మాచరించె మరునా డబ్జాక్షు దూరేగు పె
న్నరదంబున్ గదలించి రర్చకులు తూర్యధ్వానపూర్వంబుగన్

ఉ. రక్కసి చక్రముల్ కదలి రథ్యలు బెత్తెడుగ్రుంగి దుమ్ము మి
న్నెక్కగ స్వామివా రరదమెక్కి ప్రజల్ జయవెట్ట కానుకల్
మ్రొక్కులు గొంచు నూరి నలుమూలల గ్రుమ్మరువేళ నెవ్వడో
యొక్కబికారి చచ్చిపడియుండె దదుద్భట చక్రఘట్టనన్

ఉ. ఈడిచి పారవైచి రొకరిద్దరు స్వామిరథాని కడ్డ ము
న్నాడని పుణ్యమూర్తి తిరుణాళ్ళ మహోత్సవవేళ జచ్చి యు
న్నాడని పాపమెవ్వడొ యనాథుడు లేచిన వేళ యెట్టిదో
నేడని కర్మలెమ్మని రనేకు లనేక విచిత్రరీతులన్

ఉ. ఆతని రక్తమాంసముల నాహుతిగొన్న రథంబుగాని వి
ఖ్యాతుడు రాఘవప్రభుడుగాని తదర్చకకోటిగాని యా
ప్రేతము శిల్పిదం చెఱిగి వెచ్చని బాష్పకణంబు రాల్ప లే
దీ తరహా కృతఘ్నత సహించెదవా? జగదేక నాయకా!

ఉ. ఊరికి నుత్తరాన బడియున్నది శిల్పి శరీర మూర్వికిన్
భారముగాగ రాపులుగు పంక్తులమధ్య తదుజ్జ్వల త్కళా
భారతి తత్కళేబరముపజ్జ రసజ్ఞుల హెచ్చరించుచున్
బోరున నేడ్చుచున్నయది పుట్టెడు దుఃఖముతో ననాథయై

కం. ముసిలిము దంపతులిద్దరు
వసియించుచునుండి రొక్క పల్లియలోనన్
సిసలైన నీతిమంతులు
పసిపిల్లలవంటివారు పరమ దరిద్రుల్

ఆ.వె. ఉరుదురాదు వారి కూర రెండవ ముస
ల్మానుగీము వేరలేని కతన
యెఱుగ దాకుటుంబ మెట్టి దోషంబు న
ల్లానుగాని తమ ఖొరానుగాని.

కం. మృగయా జీవన మా యా
ల్మగలకు నాధార, మయ్యమాయకుల పయిన్
బగలుం గక్షలు లేవట
పగలుం బార్టీలు గల్గు పల్లీయులకున్

సీ. పండిన గడ్డాల పసమిట్టిపడువారు నిగ్గైన షేరువాణీలవారు
కరపచ్చి పసరు పాగాలు దాల్చినవారు మేలైన మొగలిటోపీలవారు
ఐదువేళల నమాజాచరించెడివారు జాళువా పిళ్ళబెత్తాలవారు
వలుద చల్లాడాలు మొలనుదాల్చినవారు సతతము కల్మాలుజదువువారు

తే.గీ. కరమున ఖొరాను వేదాలు గలుగువారు
కుచ్చుల చడావు లంగ్రముల గులుకువారు
కనుగొలంకుల సురమాలు గలుగువారు
అందముగలారు దీర్ఘ దేహములవారు

మ. ఇసలాం వీరమత ప్రచారమునకై యేతెంచి రా యూరికిన్
ముసిలిం భక్తులు ముప్వ్ రా తురకయున్ బూబున్ మహాభక్తిమా
నసులై కొల్చి మృగామిష ప్రముఖ నానారుచ్య భోజ్యాదులన్
వెస సంతుష్టులజేసి పొందిరి తదుద్వేలాశిషప్రాప్తులన్

కం. మరునాటి వంటకై రా
తిరిశేషము నేదుతల వధించుట గని య
గ్గురువులు క్రోధోద్ధురులై
మురదా రని కేకలెట్టి మూర్ఛితులగుటన్

కం. కనుగొని గుండియ లాగం
తినరాదా స్వామి యంచు దెరచిన నోరన్
ధరణి కొఱగి మరణించెన్
దురక, యమాయకుడు దిక్కుతోచనివాడై

చం. గురువులు మూర్ఛదేరుకొని, గొల్లున నేడుచు బూబు నక్కళే
బరమును జూచి గుండెలు గుబాలన నోటను మాటరాక ని
వ్వెరపడి యూరిపెద్దలను బిల్చి యదార్థము విన్నవించి న
ల్వురి సలహాలపై యతని పూడిచివైచిరి వల్లకాటిలో

కం. ఆ దీన యవన మానిని
నోదారిచి సాగిపోయి రూరు విడిచి య
ప్పేదల దుర్గతి హృదయము
ఛేదింపం గురువులశ్రు చిత్రితముఖులై

కం. వారు ఖొరానును యవన శ
రీరముతో బూడ్చి విస్మరించు టెఱిగి కం
గారెత్తి వచ్చి చూచిరి
గోరీ పెకలించి యినుప గునపమ్ములతో

ఉ. లేదు ఖొరానుగ్రంథ మట, లేదు దరిద్రుని దేహమందు నా
చ్ఛాదన జేసినట్టి చిటిచాపయు కట్టిన త్రాళ్ళజాడయున్
లే దతి విస్మయంబున వలీలు శిలాప్రతిమానులై మహో
న్మాదుల రీతి నిల్చిరి సమాధికడన్ మదులల్లలాడగన్

కం. అల్లా భక్తుడు గా డిత
దల్లాయే భక్తుడితని, కథము శుభంబున్
కల్లాకపటం బెఱుగని
వల్లీ యగు నంచు గగనవాణి వచించెన్

---

ఆ.వె. చలన చిత్రమునకు జని యొక్క నడిరేయి
సదనమునకు జేర జనుచు నుంటి
చెరువు గట్టుమీద శిశురోదనం బొందు
శూలమగుచు చెవుల శోకెనంత

చం. బలిసిన కాఱుచీకటిని బర్విడుచున్నది స్త్రీ స్వరూప మ
క్కలియుగ కర్ణునిం జెరువుగట్టునకుం బలిజేసి వేశ్యగా
తలచితిగాని కాదు, కడు దారుణదానవ దుష్టసంఘపుం
బులి తినివేయుచున్న యొక పూర్వసువాసిని నిస్సహాయయున్

మ. కొన ప్రాణంబుననున్న బాలకుని యాక్రోశంబు నాలించి వె
చ్చని కన్నీరు వెలార్చితిన్ సరసు వెచ్చంబారె, మండూకముల్
పనవెన్ జిత్రవిచిత్ర నాదములతో బంగారుపాపండు సా
చిన సర్వేశుని హస్తపద్మముల మూసెన్ జిట్టి నేత్రంబులన్

ఉ. అగ్గలమైన పుత్రవిరహానలకీల హృదంతరాళమున్
బుగ్గి యొనర్చుచుండ వలపుం దనుజన్ముల కింపుమీరగా
నుగ్గులుబెట్టు గేహినుల కూడిగమూనుచు లోన కోరికన్
మ్రగ్గినశింప నప్పతితమానిని యెందు తపించుచున్నదో

ఉ. ఆ పసిబిడ్డ దుర్మృతికి నాతనిజన్మకు హేతువై మహా
పాపముగట్టుకొన్న మగవాడు సమాజమునందు డాగి సం
తాపముజూప కా నిసుగు తల్లిపయిన్ కల నేరమంతయున్
మోపి చనెన్ నిజాత్మజుని మూపునదాల్చి వినీతిశాలిగా

ఉ. బాలుని దేహమున్ నికట వైద్యకళాలయమందు ఖండఖం
డాలుగ జేసి తద్గురుజనం బుపదేశము చేయుచుండె శి
ష్యాళికి దేహశాస్త్ర విషయంబులు ప్రేక్షక రోగి వర్గముల్
జాలివహింప గుండియలు ఝల్లన కన్నులు చెమ్మగిల్లగన్

ఉ. కెవ్వున కేకవేసి యొరిగెం ధర కందొక జోగురాలు లే
జవ్వని మూర్ఛపోయె పరిచర్యలు చేసిరి మంత్రసాను లా
బువ్వకు బట్టకు న్నవసి పొక్కెడు నక్కలికిన్ దదంబగా
సవ్వడిబట్టి నిర్ణయము సల్పిరి హంతకిగా భిషఙ్మణుల్

శా. ఆరా తీసిరి రక్షక ప్రముఖు లందం దక్షి సాక్ష్యాలతో
నేరారోపణచేసి దలమోపి రప్పడతియున్ నిక్కంబు వాక్రుచ్చె క
న్నీరోడ్చెన్ దెరచాటునన్ మసలు నన్నీచున్ మనుష్యాధమున్
సైరించెన్ కరుణాక్షమాగుణ నివాసంబుల్ సతీచిత్తముల్

కం. ఉరికంబ మెక్కి చూచెం
దరుణి యసత్కరుని సంఘదైవతము సదా
మరియాదజేయు పూజా
పరునిం దూరమున శిరమువాల్చి గతించెన్

ఆ.వె. నగ్నసత్యలక్ష్మి నాలుకలేనిదై
మూర్ఛపోయె రుద్రభూమియందు
ఉర్విజములు రాల్చుచుండె నీహార బా
ష్పములు లలితపల్లవములనుండి

---

ఆ.వె. భూత పంచకంబు పొట్టలు బెకలించి
సృష్టిశక్తులెల్ల సేకరించి
గర్వితాత్ముడగుచు గావించె బ్రహ్మాస్త్ర
శస్త్రచయము నొక్క శాస్త్రవేది

ఉ. ఒక్కొక యస్త్రగోళము ప్రయోగము చేయ నమాయక ప్రజల్
ముక్కలు ముక్కలై కరగిపోయిరి బూడిదరాసులైన య
ప్పక్కణకుడ్యముల్ శిథిలపంక్తులు ప్రేక్షణ భీషణంబుగా
నిక్కి శపింపసాగినవి నేటికి మానవ దుష్టశక్తులన్

శా. ఆ మేధానిధి ఆత్మదేశజుల మర్యాదల్ సమార్జించి సం
గ్రామోత్సాహము రేగ నూతన విషాస్త్రంబుల్ వినిర్మింపగా
భూమీశుల్ పురికొల్ప యంత్రనిలయంబున్ జొచ్చి వీక్షించె నే
త్రామోదంబుగ మేరినందనుని ఛాయాచిత్రమున్ భిత్తికన్

తే.గీ. పెదవి గదలించి కన్నుల తుదలయందు
అశ్రువులురాల గుండియలదర ప్రావు
డబ్ద గంభీరఘోష ఛాయాపటంబు
నందుగల క్రీస్తుబొమ్మ యిట్లనియె నంత

మ. "ప్రకృతిజ్ఞానము నీ కొసంగినది యీ పాపక్రియార్థంబుగా
దిక చాలింపుము నీకృపారహిత దుష్కృత్య ప్రయత్నంబు ప్రే
మకు పాదుల్ నెలకొల్పి రక్తరుచిరాంభస్సుల్ ప్రవర్షించి ముం
డ్ల కిరీటంబు ధరించితిం బటు కృతఘ్నా! మృత్యుభృత్యాధమా!

కం. రేణువులలోన నీవొక
రేణువవను మాట మరచి సృష్టించెదవా
ప్రాణాంతకముల నాగ్నిక
బాణా లధికారకాంక్ష పరమద్రోహీ!

మ. తల పంకింతువు గాంధి బోధలకు సిద్ధార్థప్రభుంజూచి యం
జలిగావింతువు రంగుభేదమని యీర్ష్యన్ దీన నీగ్రోప్రజన్
వెలిగావింతువు నీస్వభావమును నిర్భేదించు నణ్వస్త్రముల్
వలయున్ వాని తయారుజేసికొను మల్పజ్ఞాన చూడామణీ!

ఉ. గౌతమబుద్ధు నస్థికలు గాంధిమహాత్ముని మేనిబుగ్గి నీ
పాతకముల్ హరింపవు ప్రపంచము గ్రుడ్డిది నీతిలేని నీ
జోతల మర్మమున్ గపటసూక్తు లెఱుంగదు విశ్వమానవ
భ్రాతృత నభ్యసింపుము స్వరాజ్య సుఖంబులు చూరలాడుమీ"

కం. చిత్రముగ బలుకు యేసుని
చిత్రంబును జూచి వాడు సిగ్గిలి విచల
ద్గాత్రుడయి తాను జీవ
చ్ఛిత్రంబై నిలిచె ముగ్ధ చిత్తుండగుచున్

మ. మెరుపుందీపిక లారిపోయినవి క్రమ్మెన్ జీకటుల్ మందిరాం
తరమందుం గల యంత్రసాధన పదార్థంబుల్ పిశాచంబులై
వెరపించెన్ వికటాట్టహాసముల దద్విజ్ఞాని సుజ్ఞానియై
చిరకాలంబు స్వకీయ శక్తులు వ్యయించెన్ లోకసౌఖ్యార్థమై

# ఒకమాట

సాధారణంగా విఖ్యాత మహాపురుషులు స్వీయచరిత్రలు వ్రాసుకొంటూ యుంటారు. అట్టివారి మనుగడలు సమగ్రంగా తెలిసికోవలెనని ప్రజలుబలాటపడుతూ యుంటారు. అందుత్తమ గ్రంథాలకు సాహిత్య రంగంలో అర్హస్థానం కూడా యుంటుంది. ఆత్మకథాకర్తలు పెక్కురు ప్రాయికంగా వారి వార్ధక్యంలో కథారచనకు పూనుకోవడం అప్పటివారి హోదాకు పలుకుబడికి పదవికి తగిన యుదాత్తఘట్టాలే వ్రాసికొంటూ తమదొక విశిష్ఠజన్మగా నిరూపించుకొంటూ, సత్యగోపనం చేస్తూ కథ సాగించడం పరిపాటి. అట్టి రచనలు పాఠకలోకాన్ని ఆకర్షించలేవు సరికదా కొంత అనుమానాలకు హాస్యానికి గుఱియై నిరుపయోగా లౌతాయి. మహాపురుషులు నిత్యజీవితంలో వారనుభవించిన కష్టసుఖాలు పొందిన గౌరవాగౌరవాలు, వయఃపరిపాకంలో నెదుర్కొన్న క్లిష్టసమస్యలు యథాతథంగా చిత్రించి, తాము నడచినత్రోవ సర్వజన సులభమని వారార్జించిన కీర్తి ప్రతిష్ఠ లనన్యసాధ్యాలు గావని నిరూపిస్తూ ఒక ఆశాకిరాణాన్ని వెలిగిస్తూ యుంటారు. ప్రపంచ మహాపురుషుల జీవిత చరిత్రల్ను పరిశీలిస్తే ఈ సత్యం ఋజువౌతుంది. గాంధీ, నెహ్రూ, బోసు, టాగోరు ప్రభృతుల ఆత్మకథ లీకోవలోవి. వారి బాల్యయౌవన కౌమారఘట్టా లాదర్శాలవలె స్వచ్ఛమై ఆయాకాలాలలో వారి మూర్తులను కన్నులగట్టుతూ హృదయంగమంగా యుంటయి. గౌరవ భంగ భయంతో వారు దాచుకొన్న స్వీయదోషా లందుండవు. స్వీయచరిత్రలకీ లక్షణా లాయుర్దాయాలు–అలంకారాలు.

అట్టి ప్రసిద్ధపురుషుల జాబితాలో చేరవలెననే ఆశతో నేనీ గ్రంథరచన చేయడం లేదు. 'క్షుభిత మనశ్శాంతికి గత చరిత్ర ధ్యానంకన్న బ్రహ్మానందం లేద'న్న ఒకానొక ఆంగ్లకవి వాక్రుచ్చినట్లు ఏకాతంగా నేను నా జీవిత గ్రంథాన్ని మనస్సులో చదువుకొంటూ సింహావలోకనం చేసుకొంటూ మైమఱచిన నిశీథా లసంఖ్యాకాలు. దాదాపు నలుబదేండ్ల నా భాషా పరిశ్రమలో అనుభవమిది. ప్రసిద్ధాంధ్రకవులు మ్రోయించిన కవితావీణెలు నా పసితనంలో నన్నా కర్షించినయి. ఊగించినయి, ఊరించినయి, నేనూ ఒక వీణెమ్రోయించాలి అనుకొన్నాను. ప్రయత్నంమీద నాకు లభించింది. వీణెకాదు. సితార, అది నా కవిత. దాన్ని మ్రోయిస్తున్నాను. వినిపించింది ప్రజలకు కాని ప్రభువులకుకాదు. అట్లు నా సాగించిన కవితాప్రవాసంలో కొన్ని తీగెలు తెగినయి. ముడులు పడ్డయి, బెట్లుతప్పినయి, మూగవోయినయి. కాని నిరుత్సాహినిమట్టుకు కాలేదు. పైపెచ్చు పూర్ణోత్సాహవంతుణ్ణయి మ్రోయిస్తూనేయున్నాను. లోకం నావంక కోరగా వారగా చూచింది. అనాదరించింది. అసత్కరించింది. సత్కరించింది. దూరపర్చింది, చేరదీసింది. ఇతరేతర ఘర్షణోన్ముఖాలైన అభిరుచులు, ఆశయాలు, దృక్పథాలు అడుగడ్డున వర్ణాభిమాన వర్గాభిమాన మతాభిమానాలతో స్వేచ్ఛావిహారం చేసే వేళలో అకలంక కళాకల్యాణులకు న్యాయం

జరుగుతుందని ఆశించడం శశవిషాణప్రాయం, పరరాజ్యంపోయి, ప్రజారాజ్యమై పాముకున్నది లేదు. కొందరికి ప్రజారాజ్యంగా కొందరికి మజారాజ్యంగా కొందరికి క్షుధారాజ్యంగా తయారై అష్టకష్టాల కాలవాలమైంది. విద్యాభివృద్ధితప్ప విజ్ఞానవృద్ధి శూన్యమై వింతప్రకృతులతో విఱ్ఱవీగుతుంది. నిజాయితి నిండుకొన్నది. మూఢతాజలనిధి జడనిధియై స్తంభించి పోయింది. మేడలు పెరిగి మేథస్సు తరిగింది. ఫలశూన్యాలైన పైపై నవ్వులు పల్కరింపులు ప్రణామాలు సభ్యతాచిహ్నాలైనయి. వనప్రతిష్ఠలు, శిథిలశిలాఖండ పునరుద్ధరణలు, ఉరుసులు, ఉత్సవాలు, దేశాభ్యుదయ సాధనాలై బక్కపేదల డొక్కలనూరించి కారిస్తూయున్నయి. పురోగమనం తిరోగమనమైంది. ఆంధ్రకవు లంతఃపురాంగన కలరు మాలలల్లి యలంకరణలుచేస్తూ పాతపుంతలో పల్లటీలు కొడుతూ పచార్లు సారిస్తూన్నారు. ఎవరికివారై యమునాతీరాన మున్నుకట్టుకొన్న గుడిసె లిప్పుడున్నత సౌధాలై కంచెలు వైచికొన్నయి. పూర్వ మన్నాదమ్ములు, నేడు బ్రదర్లు భాయీలు, భాషలో మార్పుతప్ప ప్రకృతిలో మార్పులేదు.

ఈనవ్యయుగం చేసే విచిత్రనగ్ననాట్య రభసచే నాలోరేగిన వృథా వాత్యకుక్కిరి బిక్కిరై ఒకానొకరాత్రి నాజీర్ణజీవిత గ్రంథాన్ని సింహావలోకనం చేసికొన్నాను. జన్మస్థలాన్ని, జననీజనకుల్ని, నాటి నేటి రాజకీయ సాంఘిక వ్యవస్థల్ని పరిశీలించి చూచుకొన్నాను. మనశ్శాంతికై కలము పట్టుకొన్నాను. అందలి ప్రథమ నిశ్వాసమే – నాకథ.

నేనీ కావ్యాన్ని నా ఆప్తమిత్రులైన శ్రీ మాధవరెడ్డి రాజయ్యగారి కంకితం చేస్తున్నాను. శ్రీ రాజయ్యగారు రాజులుగారు, జమీందారులు గారు, కలవారునుగారు, ధూమపత్ర వ్యాపారులు, రసమయ హృదయులు, చక్రవర్తులకుండే హుందాతనం, ఠీవి, ఔదార్యం, త్యాగదీక్ష కళాభక్తికలవారు. వారికి నా కవితపై అపారమైన ప్రేమ. చేసేది పొగాకు వ్యాపారం కాని, సాధించేది రసానందం. రసజ్ఞమైత్రి భట్టుమూర్తి చంద్ర దూషణంలో అన్నట్లుగాక మా రాజయ్యగారి రాజశబ్దవాసనచేత రంజిల్లి సంతతుల్ తేజంబందినయి. "మీ కావ్యాన్ని నాకంకితం చేసి నను కళాజగత్తుకు పరిచయం చేయండి కవిగారూ" అనినారు. స్వయంగా కోరిన కోర్కె నాకెంతో ఆనందం కలిగించింది. కాదనటానికి నా నాల్కకు బలం లేకపోయింది. ధనమదాధికారాలతో కవులను, కవితల్ను బేరం చేసే కిరీటధారియైన రాజుకన్నా రసజ్ఞుడై యర్థించిన కిరీటరహిత రాజయాఖ్య రాజన్యుని బాంధవ్యం వేయిరెట్లు మేలుగదా?

జి. జాషువ

# అంకితము

కం. నవనీతహాస్యచతురవ
చోవిలసితు దమృతమూర్తి, సుకవిహితుడు మా
ధవరెడ్డి రాజయాఖ్యుడు
ధవుడై యలరించె నాకథా కావ్యంబున్

కం. ఎరుగనివాడై పిమ్మట
నెఱిగినవాడగుచు, మనసు నెఱిగినవాడై
పరిచితుడై, వరసఖుడై
బరగుచు రాజయ్య తుదకు బాంధవుడయ్యెన్

ఆ.వె. మాటలందుగాని మనసునందునగాని
దుస్తులందుగాని దోషలవము
కానరాని ఠీవిగలవాడు, కపటంబు
లేనివాడు కలఁకు లేనివాడు

శా. ఆకర్షింపవు రాజయాఖ్యు నితరవ్యాపారముల్ సత్కళా
లోకంబట్టు లహర్నిశంబును కవుల్ సొన్నాయి కాంఢ్రింటికిన్
రాకల్ పోకలు సేయ మైమఱచి హర్ష స్వాంతుడై వారి వి
ద్యాకౌశల్య మెచ్చుచున్ గడపు రాజాఖ్యుండు సౌజన్యుడై

కం. పీరుని సొనాయి గొడవో
ద్వారమునాయని ఫిడేలు వాద్యంబో, నా
పేరో తేక పొగాకును
బేరము సేయండదెట్టి ప్రేమాదరమో

సీ. పల్కెనా ప్రతిమాట వాఙ్మనస్సులనంటి విశ్వజనీనమై వెడలివచ్చు
రచియించెనా యక్షరములు ముద్దులుగారు ముత్యాల కోవలై పుట్టివచ్చు
ధరియించెనా మచ్చదాకని మడతసోకని దుకూలముల నంగమున దీర్చు
పదమూనెనా మానవతకు భిన్నముగాని కమనీయ నవ్యమార్గమున నడచు

ఆ.వె. మనసుకుదిరెనేని యనుమానములు మాని
యన్నదమ్ములట్టు లాదరించు
రాజయాఖ్యు నెనయు రసికులాంధ్రంబున
నలువురున్న లలితకళలు బ్రదుకు

ఆ.వె. మాకులస్థుడన్న మమకారమున వచ్చి
వరుస దిరుగవేయు వారిలోని
సంకుచిత గుణంబు సహియింప డెన్నండు
ధర్మమునకు దెబ్బతగులనీడు

ఆ.వె. మంచిగుణములున్న మానవుండెవడేని
కంటబడ్డచేరి గౌరవించు
మానధనులమంచు మౌనంబుదాల్చు గ
ర్వోన్నతుల మనస్సు చిన్న వోవ.

చం. దొరల పొగాకుబేరములతో దులదూగుచు భూరిలాభముల్
మరిగి, క్షుథార్తలోకములమాటదలంపని మేటితెల్గుబే
హరులకు సాహితీపరిచయంబు ఘటించు కళాభిమానబం
ధురుడగు రాజయాఢ్యునకు దోసెడు పద్యసుధాభిషేకముల్

జి. జాషువ

# నా కథ

# కుశలప్రశ్నలు

కం. ననుగాంచి పెంచి నాలో
గౌనబుం గవనమును, పాదుకొల్పిన తల్లీ!
నను మరచిన నిను మరవను
వినుకొండా! నీకు నా పవిత్ర ప్రణతుల్

కం. వీరయకు లింగమాంబకు
గారాల సుతుండ కవిని గంధగజముపై
నూరేగి చరణమున పెం
డారంబు ధరించినాడ నలువురు మెచ్చున్.

శా. క్షేమంబేకద? నీకు నీ సుతులకున్ శ్రీకన్యకాండాళికిన్
రామక్ష్మాపతి పాదముద్రల పవిత్రంబైన నీ కొండకున్
నీ మేల్గోరెడు వాయునందనునకున్ నీ పూర్వమర్యాదలన్
సామర్థ్యంబు వచించు భాస్కరుని జీర్ణ స్వర్ణదుర్గాళికిన్

సీ. టిప్పుసుల్తాను గట్టించిన నట్టింటి మజ్జీదుమణికి సేమమ కదమ్మ?
రామలింగేశ్వరస్వామి సౌధమునందు వెలిగింతురే యఖండమును దినము?
ఆరోగ్యవంతుడే మారుతాత్మజుడు పశ్చిమ దిశావాసి గస్తీజవాను?
ఆగ్రహింపదుగదా అంకాళిదేవత అలతి సత్తులకు పెద్దక్కగారు?

ఆ.వె. తీగబావి పొంత తిష్ఠవేసిన యట్టి
కనకదుర్గ యింటి కడప ద్రొక్కి
తొంగి చూచువారు తొల్లి లేరిపుడైన
పలుకరింతురమ్మ! పౌరజనులు

ఉ. ఊరికి దూర్పుగా నిలిచియున్న మసీ దొకనాడు నిత్య కే
ళీరతులైన బాలుర కళీకకళా కితవ ప్రజాళికిన్
జారుల కాశ్రయంబయి ప్రశస్తికి నెక్కినదమ్మ! దాని ప్రా
కారపుటాల్ మసీదనిన కాదని చూపు శివాలయాంకముల్

ఉ. రామచరిత్రచే తెలుగురాజులచే పలనాటి వీర సాం
గ్రామిక దుందుభి ధ్వనుల కాయలుగాచిన వీను దోయిచే
సీమలరాణియై చెలగు సీమను బుట్టితినన్న యేదియో
ఆము మనస్సులో మెలగు నప్పుడు నిప్పు డదేమి చిత్రమో

సీ. చెప్పికొంటిమి గండశిలల జేగురు రంగు సీతా మహాదేవి చీరలనుచు
వాదించినా మంజనీదేవి తనయుండు తనయుల బుట్టించు దాతయనుచు
ఆశించితిమి గుబ్బలమ్మ గుట్టలవద్ద గజ్జెల ధనలక్ష్మి గదలు ననుచు
వాకొంటి మల్ల సీతాకుండ తీర్థాన నమరదంపతి స్నాన మాడు ననుచు

గీ. ఔను గాదనలేని ప్రాయంబు నందు
మనసులో నీవు కరగిపోసిన చరిత్ర
మసలు చున్నది బురదలో మహిషమట్లు
ముదిరి పోయిన జన్మ భూమోహ పటిమ

కం. ముచ్చి యొనర్చిన బొమ్మల
మచ్చరకించెదు విధాన మాపటి వేళన్
మచ్చుల మెకములు నీ గిరి
పుచ్చెల విహరించునే ప్రభుత్వ స్ఫురణన్

కం. కొదలేని వ్రాత కలముల
పొదులోయన మేన వాడిముండ్లు రహింపన్
నిదురించునె లోయలలో
కదుపులగుచు నేదుబందిగములు సవిత్రీ

ఉ. కమ్మదనంబుతో చవులు గ్రక్కుచు బుగ్గలు దీసిపోని, నీ
నిమ్మలబావి నీరము కనిష్ఠకుమారులకంద కగ్ర జ
న్మమ్ములవారికే దొరుకునా? బులిపించుచు, నారికేళపా
కమ్మున బద్ద పిచ్చి తలకాయల వారి కవిత్వముం బలెన్

శా. బాటల్ తోటలు నీటిపట్టులు సమీప గ్రామముల్ క్షేత్రముల్
చోటాచిత్రములై సమీపమున చక్షుఃపర్వముల్ సేయ నే
టేట న్నీగిరులెక్కి చూచితిమి మున్నే కాసికేకాసి కా
గాటంబైన ముదంబు జిక్కునె హిమగ్రావాగ్రమున్ మెట్టినన్

మ. నలుపుం దెల్పను రంగు భేదపు ఘరానా చచ్చియున్ జాక, పే
దల గోరీలను వెక్కిరించు గతి పొంతన్ బొల్చు ఆనాటి జా
తుల వార్తెల్లదొరల్ శయించిన సమాధుల్ బాలరాగచ్చు ని
గ్గులతో నేటికి నిల్చియున్నయవె? నీకుం గంఠహారంబులై

మ. మును జిల్లాయధికారి పెద్దపులితో బోరాడి దేహంబు వా
సిన వృత్తాంతము నాలకించి పులకించె న్నాశరీరంబు నా
చిననాడా దొరగారి గోరి తలపై స్మృత్యంకమై క్రీస్తునా
థుని సిల్వాంకము గోచరించు నెద నేవో యూహలందించుచున్

మ. గుటకల్ మ్రింగుచు పేదతండము క్షుదాక్షుబ్ధార్తమై నీ కుఅం
గట వీక్షింప మతాపదేశమున సంకల్పించి సాగించు న
ప్పటి సంతర్పణ లిప్పుడున్ జరిపి సంపాదింతువే? వట్టి పు
క్కిటి పౌరాణిక పుణ్యమున్ నగరలక్ష్మీ నిర్దయస్వాంతవై

ఉ. భిక్షము వృత్తిగా వికృత వేషములన్ ధరియించు సోమరుల్
కుక్షిపరుల్ నిరర్థకులు గుప్పెడు గింజల వారు నీకు బ్ర
త్యక్ష శివస్వరూపులు మహాత్ములు మంత్రవిదుల్ సుఖింతురే
దక్షిణవీధి సత్రములు తావులుగా నగరీవతంసమా!

ఉ. చేతబడుల్ పొనర్చి నిరసించిన వారిని సంహరించు న
జ్ఞాత కళా ప్రచండులని నమ్మి యొకప్పుడు మాయదారులన్
కోతలరాయలం గుఋచ గోచుల దొంగలమేపుకొంటి వా
భీతి నశించెనో బలిసి పిల్లలు సేయ తలంకు చుంటివో

ఉ. ఉన్నతపాఠశాల యిపు డుజ్జ్వల భూషణమాత్ర మయ్యెనో
నిన్న మనుష్యలోక మహనీయ మహాసభ సభ్యురాలిగా
నెన్నుకొనంగ జాలు తలయేర్పడగా తరిబీతు సేయునో
యన్న సమస్య నాదు హృదయాన బలీయముగా నటించెడిన్

తే.గీ. అక్షరజ్ఞాన మలవడ్డ యంతమాత్ర
తేజరిల్లదు విజ్ఞాన దీపకళిక
భరత పురుషోత్తముని జంపి యురికి చన్న
గోడిసే కూడ చదువుకొన్నాడు లెస్స

మ. కడిమిన్ గల్పిత నాకభోగములపై కామంబు బుట్టించి త
ప్పుడు సిద్ధాంత శిలామయంబయి లసద్వ్యుత్పత్తుల న్నిల్వుదో
పిడి గావించు స్వజాతితో వలపు దివ్వెల్ దీర్చలేనట్టి రు
ద్దుడు విద్యల్ రుచియింప నీ యుగమునందుం బాలవిద్యార్థికిన్

సీ. అనుభవింతువె? స్వరాజ్య ప్రభాకర నవ్యరమణీయ కిరణ హారముల సుఖము
స్థాపించితివె? గాంధితాత విగ్రహములు గవినిసత్తుల కలంకారములుగ
మసలుచున్నవె? బ్లాకు మార్కెట్ల జలగలు నరమాంస రక్తపానమున దనిసి
దొరుకునే నీవీటి నిఱుపేద జాతికి? చిట్టెడు కొలత గింజియలకూడు

తే.గీ. చదువు చున్నావె పత్రికా చయము నందు
నాంధ్రమంత్రుల రాజకీయాల రభస
అర్థమైనదె? స్వేచ్ఛా మహా యుగాన
దళితమైనట్టి ధనతత్వ తాండవంబు

ఉ. సంచులు నిండిపోవ ధన సంచయమున్ గడియించి కాసు ల
ర్పించి దరిద్ర జాతు లొనరించు ప్రశంసల చాటునన్ ప్రజా
వంచన స్వేచ్ఛగా సలుపు వారిని నేటి స్వరాజ్యలక్ష్మి శి
క్షించక మానదంద్రు కలికీ! యిక సాగవు మోసకార్యముల్

కం. డంకాపలాసలకు ని
శ్శంక సహస్రములుగుప్పి సత్కర్మలకున్
వంకల బెట్టు కుమారుల
కుంకల గనవలదు విన్నకొండవధూటీ!

చం. మురుగు లొసంగి తాత యశముం బ్రదికించిన రాచబిడ్డ భా
స్కరుని యనుంగు మన్మనికి శైశవమంద యుదారభావముల్
గరపి చరిత్రలో వెలుగు కంజదళేక్షణ నీదు కౌగిటం
బెరిగినదే కదమ్మ! వినుపింతువె కూతుల కీ విశేషముల్

ఉ. మొగ్గలవంటి బాలకుల పూత మనస్సును ద్వేషవహ్నిలో
నుగ్గున రంగరించి యిడుచున్న యభాగ్యపు తల్లులున్నచో
నెగ్గవు పాఠశాలల యనింద్య సదాశయముల్ గురూత్తముల్
బుగ్గలు బిండినన్ చెడినబుజ్జులు విద్యకు తావొసంగునే

కం. మొహరము దసరాల్ హిందూ
మహమ్మదీయుల నిసర్గమానవప్రకృతిన్
సహనమును బాదు చేయక
సహవాసము గూర్చునే ప్రజా సుఖదములై

మ. అరబీ కైతల పోకడల్ దురక కావ్యచ్ఛాయ లేపారగా
పరభాషా సహనం బెఱుంగని కళాపాషండ పాషాణముల్
గరుగన్ దీయని గేయముల్ దెలుగునన్ గల్పించి విన్పించు ఖా
దరుఖానున్ స్మరియింతువే కవుల ప్రస్తావంబులందేనియున్

శా. ఆడుంబిడ్డల నీ కుమార్లవలె విద్యాశాల కంపింతువో
యీడేరం గులమొప్పు దన్న వగతో నిల్లాండ్ర గావింతువో
నాడు న్నేడభివృద్ధి లేక ధనధాన్యైశ్వర్యమోహం బెదం
బేడెక్కన్ బ్రతు కీడ్చు చుంటివో! నిరావేశాధ్వమధ్యంబునన్

ఉ. చౌడమ సత్తికిం బడుగు జాండ్రలు నెత్తుటి కూటి కొల్పు లీ
నాడును సల్పుచుండ్రె? కరుణాళువు లార్ద్రమతుల్, జనింపరే?
నేడు ననాది కీర్తిరమణీయ! మహాత్ముఁడహింసచేత వే
టాడిన హింసకుం దిరుగ నాయువు బోయుట సిగ్గు చేటగున్

కం. గొరియల మేకల నెత్తుటి
ఝురముల నిర్ఘోషమునను జర్జరితంబై
కరిగినవి గిరులు శ్రుతగిరి
కరుగదనిన అపయశంబు గాదే మనకున్

సీ. కృపలేని నీదు కొంచెపు దృష్టి బాధింప కన్నీరు చిందిన కవనపటిమ
దరిలేని నీ యనాదరణ మాటున గ్రుగ్గి మంటి పాలైన సమత్వ సుఖము
ముక్కిపోయిన నీదు మూఢతా జడనిధి మునిగి యిప్పటికి కోల్కొనని చదువు
ఫలమింతలేని నీ భజన కూటములచే ఖర్చైన యౌవన కాల నియతి

తే.గీ. కలుషితములైన నీ దురూహల కతాన
నుడిగి పోయిన బంధు రాయుర్బలంబు
గోచరించునె? నేడు దిక్కుల వెలుంగు
నవ్య గాంధేయ శకదర్పణంబు నందు

శా. ముద్దుం గూతులు సారెచీరెల మదింపుల్ గట్టు ముచ్చట్లతో
ప్రొద్దుల్ పుచ్చక యన్యదేశ మహిళాభూతిం బ్రశంసింతురే?
మిద్దెల్ మేడలు వృద్ధి జెందిన గతిన్ మేధస్సు పెంపొందెనే?
యుద్దేశాల్ మరుగుజ్జులై నవయ కత్యుచ్చస్థితిం జెందెనే

సీ. ఏట్రింతపిట్ట పైకెగసి పల్టీగొట్టి యొయ్యారముగ నేల కుఱుకుచుండ
పీకె తుమ్మలనుండి బెళగువ్వ జంటలు సనసన్న గుడగుడ ధ్వనులు సేయ
చెట్ల కొమ్మల డాగి చెవులు గింగురువోవ యీల పుర్వుల పిండు గోల వెట్ట
పొలముగట్టుల కాపుపొలతుకల్ పొలికేక బెట్టుచు వడిసెలల్ విసరుచుండ

తే.గీ. అతి నిరాడంబ రానంద మాటలాడ
పండిన పొలాలతో నేత్ర పర్వమగుచు
ప్రబలునే నీదు పరిసర ప్రాంతలక్ష్మి
పెద్దనగరాల పెను హడావిడులు లేక

మ. అనువారంబును చేలలో బెసరగాయల్ దొంగిలింపంగ జ
ట్టును గూపెట్టి చరించు న న్నలిగి తిట్టుల్ దీవెనల్ బెట్టు న
ల్లని బూబమ్మ సజీవయే యిపుడు? లీలా స్వప్న రేఖాకృతిన్
గనుపట్టున్ ముసలమ్మ రూప మెద జీర్ణంబైన వస్త్రాలతో

మ. పలుజీరంగుల పచ్చపట్టు టెఱకల్ బంగారు రంగారు కం
కులు దూగాడెడు జొన్న కఱ్ఱలకు నిగ్గుల్ గూర్ప ఆకొన్న పే
దల కాహారము మూటగట్టుకొని ప్రత్యక్షించు దాతల్ బలెన్
పొలముల్ పండి రహించునే సరస నిష్టున్ ప్రేక్షణీయంబులై

ఉ. చిట్టితనాన నుండ విలు చేకొని యంకమ కన్నులొట్టవో
గొట్టితి వెంబడించు ననుగుం జెలికాండ్రు ప్రశంససేయ నీ
గుట్టు నెఱుంగ రిప్పటికి గూడ నొరుల్, క్షమియింపుమమ్మ, నా
కట్టిడిచేత, శైశవ వికారపు చేష్టల కర్థ ముందునే?

కం. మాదిగలు, మాలలని మ
ర్యాదల కాస్పదము లేని యభిదలతో సం
బోధింప బలుకు దీనులు
పేదలు సుఖమున్నవారె? వినుకొండపురీ

కం. చండాలత్వం బొకదెస
గుండెలు దినివేయుచుండ గొప్పల కొఱకై
యొండొరులు కలహమాడుచు
నుండెదరా నేడు దైవ మొక్కండనుచున్

ఉ. దీను లనామకుల్ గుడువ దిండియెఱుంగక యే యుగాననో
మేనులువాసి రా పులుగుమేసి త్యజింప విశీర్ణ శల్య సం
తానములై రహింప నెడదన్ గదలించెడు వల్లకాటి కీ
శానుదిశన్ మదీయ మగు జాకికి మున్ను సమాధి జేసితిన్

శా. సూరేకారపు టుప్పు మట్టి పెనురాసుల్, వీటి పెద్దమ్మ క్రీ
డా రంగస్థలు లట్లు నీ వసతి కాటంకంబు గల్పించినన్
బారన్ద్రవ్వక మ్రగ్గుచుందువుకదా? బాజారులుం గొందులున్
మూరెండై అభివృద్ధి నేరక తలంపుల్ లేని శీర్షంబునన్

ఉ. కాలము జేసి నీ మసన గర్భమునన్ నిదురించి రమ్మ! యా
కాలమునాటి నా చెలిమికాండ్రొక కొందరు; వారి రూపరే
ఖా లలితోక్తి హాసములు కన్నులముందు నటించు నేటికిన్
బోలిక చెప్పలేని తెగిపోయిన స్వప్న శలాకలుం బలెన్

మ. సరవి న్మక్కున వ్రేలు నిల్పుకొని యాశ్చర్య స్ఫుర న్నేత్రమై
పుర మగ్గింపగ నేను నాయనుజుడున్ బూర్వంబు నీ వీటి మం
దిర మందునం బొనరించినాము గరిమన్ నేత్రావధానంబులన్
బొరపాటింతయు సోకనీక నవకంపుం బచ్చిబాల్యంబునన్

చం. కొడుకుల కన్న స్వర్గములు గొప్పవి గావను నాడెమైన ప్రే
ముడి నవనాడులం దొణికి పొంగులు వార స్వకీయ రక్తమున్
బిడిచి కుమాళ్ళ నోలి కనిపెంచిన గుబ్బము లింగమాంబ మేల్
కడుపున బుట్టితిన్ గరుడుగట్టిన తెల్గుదనంబు డంబునన్

శా. క్రీస్తు న్నమ్మిన భక్త సత్తముడు నా క్రీస్తుండు పొమ్మన్న మేల్
రస్తాలం బయనించు సజ్జను దహోరాత్రంబు వేదార్థముల్
బ్రస్తావించు వ్రత ప్రచండుడగు వీరయ్యాభిధానుండు నీ
బస్తీ పౌరుడు నా యనుంగు పిత పూర్వ ప్రాభవాలంకృతా

ఉ. జ్ఞాపకమున్నదా! చినతనంబున నీ గిరులెక్కి నేను నా
బాపును బ్రహ్మమేడి విషపక్వ ఫలంబులు మెక్కి తల్లక్రిం
దై పడినట్టి పాటులు పురాంగన! నాడు గతింపకుండ న
న్నాపినవేమొ మత్కృతములై ప్రభవింపగనున్న కావ్యముల్

శా. ఆ కాలాన నమేరికా దొరల దాస్యం బైహికాముష్మిక
శ్రీకిం జక్కని రాజమార్గమని హర్షీభూత చేతస్కులై
దూకుల్ బెట్టు ననాదిక్రైస్తవుల యందున్ బాష్టరుద్యోగియై
నాకు న్నేరిపినాడు మత్పిత యఖండస్వర్గ సాహిత్యమున్

సీ. పఠియించినాడను పలుమారు చర్చిలో బైబిలు సిద్ధాంత భాష్యములను
ప్రార్థించినాడ సద్భక్తిమై తలవంచి అస్పృశ్యతా వారణాభిలాష
ధరియించినాడ నందరువోలె ఱొమ్మున బిరుదుగా నరిది బాప్తిస్మ ముద్ర
ప్రేమించినాడ నొప్పించు వైరిని గూడ ననుబోలి తోబుట్టువుని విధాన

ఆ.వె. అన్నమాట దప్ప కాచరించితి గాని
అన్నమాట దప్పి యాచరించు
కొంగభక్తి పుంజుకొన్న పోకడ జూచి
చెదరి నామనస్సు చివుకు మనియె

కం. సోదరులము మన మనుచుం
బాదిరు లందరకు నేర్పి బ్రదుకున నెడమై
పోదు రిదే ధర్మం? బని
వాదించితి పెక్కుమార్లు భయరహితుడనై

తే.గీ. ఊరకొమ్మని నన్ను గ్రుడ్లురిమి చూచు
టొక్కటే కానుపించె బ్రత్యుత్తరముగ
క్షత మెఱుంగని నా ధర్మ సంశయంబు
లూరకొనబోకు మనుచు గ్రుడ్లురిమి చూచె

మ. మెరుగుం దీవెలటుల్ దళుక్కు మనుచున్ మేధస్సులోబుట్టు సు
స్థిర విజ్ఞాన లతా ప్రరోహములు నిర్జీవంబులై గుండెకున్
బరువై పెద్ద తుపానురేచి కలచెన్ స్వాంతంబు నీనాటికిన్
దరి కెక్కించిన వారు లేక వగచున్ నాలోన సందేహముల్

ఆ.వె. ఒరులుగారు ముక్తి నొనరించు ప్రభువులు
కూడు గుడ్డ గాదు కొఱత మాకు
సమతలేని రిత్త చదువేల? పదివేల
మతములేల? నూరు వ్రతములేల?

చం. మురిగిన పాటలున్ మనసు పూయని చచ్చు కథానకాల్ పున
శ్చరణ మొనర్చుచున్న దిగజారునె స్వరము నేలమీదికిన్
నరుని మనస్సులో కలుషనాటక వహ్ని శమింపకుండినం
బరమను మాట కర్థము సమత్వ సుఖంబని విన్నవించెదన్

మ. అయదార్థంబు వచింపనెన్నడు రహస్యంబన్న నాకెందుకో
భయ మానాటి స్వకీయ దోషములు లోపాలిప్పుఁడుం జెప్పి మ
త్ప్రియురాలిం బ్రియులం దనూభవుల నవ్వింతున్ వినోదించుచు
న్గయితల్ సెప్పెదువానియం దిముడ వెన్నండున్ రహఃపంకముల్

ఉ. నచ్చిన మిత్రుడుం దెలుగునాటి సనాతన భూసురుండు శ్రీ
పిచ్చయశాస్త్రి మాపొరుగు వీటి నివాసి వయస్సునందు నే
పెచ్చను కొందు నిర్వ్వరము పిల్ల కవిత్వ పరిశ్రమంబు నీ
పచ్చని కొండబీళ్ల ననువార మొనర్చితి మీ వెఱుంగవో

ఆ.వె. లలితకళలయందు బలమైన యభిరుచి
చిన్నతనమునందె చిగురుబెట్టి
లీల నెదిగి చిత్రలేఖనంబయి మారి
కట్టకడకు నాంధ్ర కవనమయ్యె

ఉ. భూతదయానదుల్ వొడమి పొంగెడు మెత్తనివెన్నవంటి నా
చేతమునం బరోపకృతిచేయు స్వభావము చిన్ననాట క్రొం
బూతలు పూచి కాచినది; మూక మృగాల చరిత్రలోపలన్
ద్యోతకమౌ హృదంబుజము నూచెడు మానవమాన్య చిహ్నముల్

సీ. గమనించినాడ చక్కని వన్నియల తోడ విహరించు బహుకోటి విహగచరిత
సాకినాడను తమాషా కోసమైకాక ముంగి పిల్లల, గన్న బుడుత లట్లు
చదువుకొన్నాడను సాలీని గూటిలో దాగిన గాంధీ కథానకంబు
ఆకళించితి రవంతన్నదానము చేసి శ్వానంబు లందున్న స్వామిభక్తి

తే.గీ. మేటి జన్మంబు నాదని మిట్టిపడెడు
మానవుని కన్న శాంతి సంపాదనమున
జంతుజాలంబు మెఱుగన్న సత్య మింత
బోధ పడ్డది పదివేల గాథలేల?

సీ. దర్శనంబిచ్చె సీతాకోక చిల్క టెక్కలలోన నాకు స్వర్గముల గములు
కన్పట్టె నాకు నాకటి వేళ మరపించు రమ్య లోకములు జీరంగి యందు
మెరసె నాలోన తొమ్మిది రత్నముల శోభ నడయాడు పొన్నంగి నడకయందు
తాండవించె ననంత ధర్మాలు పలువన్నె పికిలి పిట్టల నాటి వేటలోన

తే.గీ. గడ్డి పూలలోన కాదంబముల లోన
ప్రతిఫలించె నాకు ప్రణయ లతలు
కొదమనేత్ర మిపుడు ముదిరి ప్రకృతిమీద
మోజుదప్పి మనసు బూజు పట్టె

ఉ. కాలపయోధర ప్రళయగర్జన లింద్రుని జింక బండి చ
క్రాల విఘట్టన ధ్వనులుగా నెదనమ్మిననాడు స్వర్గ ఖం
డాలయి కానుపించినవి నా పసికంటికి నీ గిరిప్రదే
శాలు నదీనదాలు సహజంబులుకా స్వపురాభిమానముల్

మ. ఎనుబోతుంగములట్టు డీకొనుచు నీశృంగంబులన్ ముక్కలై
చను నాషాఢ పయోదమాలికల గర్జద్ఘోష లేదో మహా
ర్తుని యాక్రందనలంచు నమ్ముకొని యూర్పుల్ సిమ్ము పాపంబెఱుం
గని బాల్యంబు దలంప నిప్పటికి పుల్కల్ మేన జన్మించెడిన్

మ. జన సామాన్యము నందు రామునికథా సస్యంబు పండించు సా
ధనముల్ దొల్లిటి బొమ్మలాటలు దిగంత వ్యాప్త విఖ్యాతి రా
ముని కన్నం బదిరెట్లు గూరిచెడి నిప్డున్ జుట్టుపోల్గాని; కా
తని పేరెత్తిన నవ్వనట్టి యొక యాంధ్రవ్యక్తి గన్పట్టునే

కం. చీకటి వ్యాపారస్తులు
నీకడుపున బడకముందు నేటి ముఠా త
త్వాకాంక్ష దేశమున నెగ
బ్రాకని కాలంబు తిరుగరాదుకదమ్మా!

సీ. స్వపరిపాలనమన్న శబ్దంబు దేశంబు వీనుల విందుగా వినక ముందు
సత్యాగ్రహోద్యమ జ్వాల పశ్చిమదిశా కుటిల శక్తుల కంటుకొనక ముందు
ప్రతివాని స్వస్వరూపజ్ఞాన సంపత్తి కునుకు నిద్దుర మేలుకొనక ముందు
ఘనదురాచార సాగర మగ్నమై ప్రజాబాహుళ్య మొద్దున బడక ముందు

తే.గీ. కొలత గింజల శాసనంబులకు వెఱచి
కొట్లలో పంట తలదాచుకొనక ముందు
వడిదుడుకు లేని మన్మథాబ్దంబు నందు
ప్రభవమందితి నమ్మ; నీ పట్టణమున

ఉ. అప్పటికింక నీ గిరిగుహా శ్రవణా లలవాటుచేయ లే
దిప్పటి రాజకీయముల కింపుగ తాళము వేయు చెయ్దముల్;
ముప్పది యెన్మి దేడులకు బూర్వ మెఱుంగని వింతపోకడల్
కుప్పలు కుప్పలౌచు నెలకొన్నవి దేశము నాల్గుమూలలన్

ఉ. కుంచియ బూని మానవులకున్ భగవంతుడు వర్ణముల్ విభా
గించి రచించినాడనుచు గీతల కర్థముజెప్పి యిండ్లకున్
గంచెలు నాటుకొన్న భయకంపిత చిత్తుల పోడుదక్క, నీ
మంచితనంబులో మదతమాటల ధోరణి మున్ను గల్గెనే

ఉ. టిప్పు గజంబు నీ గిరులు డీకొని కొమ్ముల గుమ్ములాడగా
కుప్పలు కుప్పలై విరిగికూలిన దుర్గ కవాట ఖండముల్
తప్పుసుమీ విభిన్న మతతత్వము జాతికటంచు నిత్యమున్
జెప్పక చెప్పుచున్నయవె నీ గుడి గోపురముల్ మసీదులై

శా. అడ్డం బాకయులేని స్వార్థ నిలయంబై బాంబు యుద్ధాలకున్
జెడ్డీ గట్టెడు నేటి యాంత్రిక యుగాగ్ని జ్వాలికల్ రేగు నీ
గడ్డుంగాలపు ధాక నోర్చుకొని నీ గంపంత సంసార మె
ట్లొడ్డెక్కించుచు నుంటివో చిరతరాయుష్కీర్తి భూషావతీ

కం. గురువులను జూచి శిష్యులు
వెరచెడు కాలాన నాదు విద్యార్థి దశన్
నెరపితి నీ వీటం గీ
డెరుగని పోకిరుల జట్టు కెల్ల గురువునై

ఉ. చచ్చిన ప్రొద్దు తూరుపున జన్మము నెత్తు టెఱుంగకుండ నా
నెచ్చెలికాండ్రతో గలసి నేను చతుర్ముఖ శాస్త్రకేళిలో
బుచ్చితి కాలమున్; 'గటికి పోకిరి' వీ దని యూరివారు వా
క్రుచ్చుట మొన్న మొన్న వరకున్ నినదించె శ్రవోయుగంబునన్

చం. ఎదుగని గొట్టితోకవలె నేడులు పూండ్లు వయస్సు వచ్చినన్
బొదలక రామచిల్క చదువుల్ బలికించెడు పాఠశాలలో
జదివితి నేను నాదు ననుజన్మునితో మును; పయ్యవార్ల బె
ట్టిదమగు పేప బెత్తము నటింపని తావులు లేవు వీపునన్

ఉ. అప్పటి పంతులయ్యలు భయంకరు లచ్చము విద్యగాక యే
తప్పొనరించినన్ దనువు దద్దురు లెత్తగ మోది నెత్తికిన్
బొప్పులు భిక్షపెట్టు పరిపూర్ణదయాపరు లమ్మ! తద్గురుల్
జెప్పిన విద్యతోడ నిలిచెన్ భయబీజము లక్షరంబులై

ఉ. చేసిన దోషమున్ దెలియజేసిన దోషము వాయునంద్రు రా
కాసితనంబునం పలు ఖగంబుల జంపితి పిన్ననాడు బా
ణాసన ధారినై పొడము నశ్రు జలంబులతో క్షమార్పణల్
దోసెడు పంపుచుంటి, దయతో ఖగ బంధుల కందజేయవే

మ. ప్రకృతి స్వర్గముగా రహించినది నా పాల్గారు ప్రాయాన చిం
తకు లోన్గాక బజారు బాలకులతో నానా విధానూనకే
ళికలం దేలుచు సంచరించితిని తల్లీ! నేటి చిన్నారి బా
లకు లారంగ మలంకరింత్రుగద కాలస్వామి హోమీపయిన్

చం. ఇతడు ఫలానివాడనుచు నెన్నిక కెక్కని రోజు, లుక్తులన్
జతురతయుం, గనుంగవ రుషా రస రేఖలు, బుద్ధియం దహం
కృతియును, చీకటుల్ పొటమరింపని రోజులు దాటిపోయె; చి
న్నతనపు సౌఖ్యలీలల నణంగిన గుజ్జనగూండ్ల సంగతిన్

మ. ఇసరాయేలను నా సహోదరుడు బియ్యే. యల్టి. యు న్నీ కృపా
రస సంపర్కమునం బ్రయోజకుడునై రాణించు చున్నాడు నీ
ముసిలిం బర్వదినాల వైభవ కథాముద్రల్ మనో వీధులన్
మసల న్మేన వహించు నిప్పుడును రోమాంచం బుదంచద్గతిన్

కం. చదువున సంతానంబున
బొదుపున శీలమున దైవ పూజానిరతిన్
బదియారాకులు నాపై
జదివిన వాడతడు, బుద్ధిశాలి లతాంగీ!

మ. ఒక కన్నీటి కణంబు రాలినచో నుద్దేశంబులన్ దీర్చు క
ల్పకముల్ మాత పితల్ సజీవు లగుచున్ బ్రత్యక్షనాకంబులై
సుకముల్ గూర్ప నిరాకులంబయి మనస్సూనంబు విప్పార మై
త్రికి కెంజేతులు సాచు శైశవ సుఖశ్రీ క్రమ్మరన్ జిక్కునే

ఉ. కాలికి జెప్పులేక తలకాయకు జిన్ని కుళాయి లేక వ
ర్షాలకు మందు టెండలకు జంకక విల్లు ధరించి యూరి న
ల్మూలలు సంచరించుచు బులుంగుల పిచ్చికి నగ్గమై, క్షుధా
జ్వాల గణింపనైతి నటువంటి దినాల్మరలన్ లభించునే

## బాల్యస్మృతులు

ఉ. గుబ్బలవెండికంటె మెడకున్, గుడిముక్కున పోగు, నేనెదో
జబ్బున బడ్డయప్పు డతిశైశవమందున భిక్షమెత్తి, పె
ల్లుబ్బెదు పుత్ర మోహమున నుంచిన దంట, మదీయమాత, నా
కెబ్బెరమై త్యజించితి నిటీవల; జిహ్వములున్న విప్పుడున్

మ. పులివేషంబులు వీధిభాగవతముల్ పోట్లాటలుం బొమ్మలా
టలు కుస్తీల్ బలువేటలున్ మనసునాటన్ మిత్రులంగూడి నా
యిలు రంగస్థలిగా నటించితిని నా యీ పాత్రలన్ దాల్చి, బె
బ్బులిగా, రాజునుగా, కిరాతకునిగా, బుంగాఫయిల్మానుగా

శా. గేదెల్ గాయగబోవు బాలకులతో క్రీడింపగా నెంచి, మ
ర్యాదా భంగభయంబునన్, జనని కాదంచు న్నివారించినన్
ఏదోరీతి ననుజ్ఞ నందుకొని, నీశృంగారపుం దోటలో
గేదెల్ కాచితి కొన్నినాళు, లనురక్తిన్ కొంటెకోణంగినై

శా. పుత్రప్రేమము రోమరోమమున దీప్తుల్ జిమ్ముచుండంగ నే
మాత్రంబైన శ్రమంబు బిడ్డలకు సంప్రాప్తింపగా నీ కహో
రాత్రంబు న్నిజదేహ సౌఖ్యములు, సర్వస్వంబు వెచ్చించు, మా
స్తోత్రార్హన్ జననీమణిన్ దలప జిందు న్నేడు దుఃఖాశ్రువుల్

ఉ. ఎక్కడ నేరిబిడ్డల కొకింత ప్రమాదము సంభవించినన్
పొక్కుచు నట్టికీ డనుగు పుత్రుల కంటగనీకుమంచు పె
న్మక్కువ నేసుక్రీస్తు బ్రతిమాలుచు కన్నులు మూసి భక్తిమై
మ్రొక్కులు బెట్టుచుండు భయభూత విజర్జరితాంతరంగయై

ఉ. మాన కనారతంబును గుమార శుభోదయ కాంక్ష నీశ్వర
ధ్యానసమాధినుండు సమయంబున, కప్పల గాలిమీదుగా
బోనిడి, దాగికొందు మొకమూలను దమ్ముడు, నేను; నట్టి హో
స్యానకు నాగ్రహింపదుగదా? యదియెట్టి కుమారమోహమో

మ. ఒక పర్యాయము తమ్ముడిశ్రయెలు దేదో సర్పమున్ సంహరిం
పక గాయంబొనరించి వచ్చెనని చెప్పన్, దేహమల్లాడ మాం
త్రికునిం బిల్చి గృహాంగణంబున విభూతిన్ మన్నుజల్లించి త
త్సికతం గుప్పెడు మూటగట్టి తగిలించెన్, వాని మంచానకున్

చం. అదిగని నవ్వునన్నును, బ్రియానుజునిన్ విషసర్ప గాథలన్
బెదిరిచి, జాగరించి, కనిపెట్టుచునుండె గృహంబునల్లడల్;
కదలిన దెబ్బతిన్న భుజగంబునకుం బ్రతిసర్పమోయనన్
గదుముచు, నిద్రబుచ్చె నిజకాయము వేయికనుల్ ధరింపగన్

తే.గీ. అలతి పొరపాటు నేని పామనదు ఫణిని
పురుగులని బుర్రలని మాట బిరుసులేని
పారిభాషిక శబ్దాలు బలుకుగాని
సుతులు వెఱచెదరను భయోన్నతికి లొంగి

ఉ. మూసినకన్ను విప్ప కిరుమూడునెలల్ జ్వరపీడితుండనై
గాసిలు నేను, నేలపయి గాలిడి లేచినదాక, గంగయే
గ్రాసముగా తపించిన పురాతనమాతృచరిత్ర, ప్రేక్షక
స్త్రీ సముదాయ మిప్పుడును జెప్పి నుతించెడి తల్లి ప్రేముడిన్

శా. నేను, న్నాయనుజుండు దక్క, తనకున్ నేత్రాలు లేవంటకున్
నా నగ్నంబగు జిహ్వ చాల దుపమానంబంచు వెన్కాడినన్;
నా నాడుల్ పదివేలు తీవియలుగా, నా దేహమే వీణగా
యేనాడో సవరించి పాడితిని; మాతృ శ్రీవిలాసంబులన్

ఉ. ఐదవయేట, నన్ను బడికంపిరి మంచిమిఠాయిపొట్లముల్
సాదరుగా నొసంగి, యవి సాంతము చేసిన దాక నోనమాల్
సాధనచేసి, యొంటి కనుసాకున నింటికి దారిబట్టు నా
కైదుబడుల్ పఠింప, వ్యయమయ్యె గ్రమంబుగ రెండువర్షముల్

చం. గురవమ పంతులమ్మ, నను గొట్టక, తిట్టక, బుజ్జగించి, నా
నెరపెడు కొంటెచేష్టలు గణింపక, మాటలు దిద్దబెట్టి, యా
దరణము సూపుచున్, క్రమత దారికి దారిచి, యల్లనల్లనన్
దరగతు లొండు రెండెలమి దాటగజేసె కృపాంతరంగయై

మ. బడిలో పాఠము విన్న పాపమున బోవన్లే దుపాధ్యాయులన్
బడి సామానుల, తోడిబాలకుల, నానా జంతు సంతానమున్
ముడిబొమ్మల్వడ గీయుచున్, దినదినంబుం బీరువోకుండ, బు
ట్టెడు చీవాట్లకు దిట్ల కగ్గమగుచుంటిం గోడకుర్చీలతో

ఆ.వె. గరికపాటికులు దఖండుడు నడయాడు
కొండ వంటివాడు, కోప ధారి
పిడుగువంటివాడు విచ్చేసె మా బడి
కయ్యవార్ల కెల్ల నయ్యవారు

చం. తడబడు మాటలుం, బనుల తత్తరపాటులు, రిచ్చచూపులే
ర్పడ, నెదురేగి తోడుకొని వచ్చిరి మా బడిపంతులయ్య ల
య్యెడయని, మావటీని ప్రణయోక్తుల మచ్చికపడ్డ యేనుగుం
బుడుత విధాన, నాతడును బొజ్జ గదల్చుచువచ్చె రీవితో

ఆ.వె. మోహ మూరకొనదు, ముద్దుముద్దియ చెంత;
కవిత మంచిదైన గదలు తనువు;
ఎదుటబడ్డ వస్తు, వింపైన దైనచో
యూరకొనదు చిత్రకారికలము

ఉ. ఆతనివాలకంబు వికృతాకృతి బొమ్మలమీది నాదు కం
డూతికి దోహదం బగునటుల్ బొడచూపుట, వాని రూపమున్
భీతి రవంత లేక గమనించి లిఖించుచునుంటి, ధీయుతుం
డాతడు, దొల్త నా పలకనందుకొనెం బగబట్టి నట్లుగన్

కం. పొలించి చూచి యది తన
పోలికగా గుర్తుబట్టి, ముదితుం డగుచున్
కాలాంతకుండు వీడని
వ్రేలిడి ననుజూపె; గురులు విస్మయమందన్

ఉ. పిట్టలమీద నాకుగల ప్రేముడి నన్నొక చిట్టి దొంగగా
నెట్టిన చిత్రగాథ జననీ! వినుపింతు తిరస్కరింప కూ
కొట్టి క్షమింపు మప్పటికి కొంచెము చీకటిబడ్డ బైటకా
ల్బెట్టగ జంకునట్టి కడు పిన్నవయస్కుడ గ్రామరత్నమా!

చం. జనకుడు లేడు వీట ననుజన్ముడు నేనును కన్నతల్లి భో
జనములు చేసి యింటిమొగసాల బరుండితి మంత నేదియో
దినుటకు తిండిలేని యొక దీన కుటుంబము మా గృహంబు పం
చను తలదాచుకో దలచి, సంజకడం జనుదెంచె దీనతన్

ఆ.వె. ఆ కుటుంబి కొడుకు నాకన్న కొంచెము
లేతవాడు, నోరులేనివాడు;
సాకుచుండె నొక్క చక్కని కౌజును
ప్రాణసమత పంజరాన నుంచి

ఉ. పక్షినిజూచి నాకది యవశ్యము కావలెనంచు, నుమ్మి రెం
దక్షుల మీద రాచుకొని, యంబకుజాలి జనింప, మంద మం
దాక్షర గద్గదోక్తి వినయంబుగ గోము నటించి కోరితిన్;
వక్షము మీద వ్రాలి బహుభంగుల నేడ్చితి; సన్నసన్నగన్

కం. చక్కగ నన్నోదారిచి
మక్కువ దీర్పంగ, ననుగుమాత మృదువుగా,
'రొక్కమున కిత్తురా మీ
పక్కిని మావాని?' కనుచు పాంథుల నడిగెన్

కం. విత్తమనుమాట, కించుక
మెత్తంబడి, రధ్వగులును; మిథ్యానిద్రా
యత్తుడయియుండి కథ యా
వత్తునువిని లేచి కొడుకు బావురుమనియెన్

చం. కుదిరిన బేరమున్ జెదరగొట్టిన పాంథుల పిల్లవాని చం
పుదమనునంత యాగ్రహము ముమ్మరమై విధిలేక, కోపపుం
బదను నణంచుకొంచు దల వాల్చితి పంజరమందు పక్షికా
ల్గదలిన యప్పు డెల్ల గదలందొడగెన్ హృదయంబు చింతతో

శా. ఆలోచించితి పక్షికోసర ముపాయా లర్ధరాత్రంబు దా
కా లోన్‌బాంధకుటుంబమున్ గమనదీర్ఘాయాస భారంబునన్
దూలెన్ గాఢసుషుప్తిలోన; నపు డిందుం దంధుడై యస్తమ
త్క్ష్మాలాగ్రంబున విశ్రమించె; బెళుసెక్కెన్ గ్రమ్మరన్ జీకటుల్

తే.గీ. కూసె నడిజాము కోడి దిగ్గోళకములు
ముమ్మరించిన చీకటి ముసుగు జొచ్చె
పేట నిశ్శబ్ద జడనిధి మాటుమణిగె
నప్పటికి నాకు నొక యుపాయంబు దట్టె

చం. నిసుగును నిద్రబుచ్చి కడునేర్పున మంచము డిగ్గ మాతకున్
బొసగని నేర్పునన్ వెనుక ముందులు సూచుచు శయ్యడిగ్గి, మా
నసమున రైలుబండ్ల పయనంబొనరింప, విహంగ చౌర్యసా
హస మొనరించితిన్, దనివినందితి; రెండవకోడి కూతతో

ఉ. పిట్టను గూటితో నొక వివిక్తతలంబున దాచి, యేమి లే
నట్టుల శయ్యపై నొరగి నవ్వలికీడుదలంచి, గుండియల్
దిట్టము చేసికొంచు కడతేర్చితి నాటి నిశీథకాలమున్
పిట్టలు గూసె నల్గడల వేకువదోచె హరిత్తటంబులన్

కం. నిద్దుర మేల్కొని, పాంథులు
ప్రొద్దెక్కిన దనుచు లేచి పోవుచు, గుండెల్
గ్రుద్దుకొని వెదుక సాగిరి
ముద్దుకవుజు కొఱకు నాల్గు మూలలు వగతో

శా. నేనుం గొంచెము సానుభూతిపిలకన్ నేత్రంబులందుంచి, లో
నానందించుచు, వారితోడన విహంగాన్వేష గావించితిన్;
దీనుండై విలపించు బాలకుని యార్తిన్ జూచి, మాయమ్మయున్
గానీ కాసిడినట్టి దృశ్య, మిపుడున్ గండ్లం బ్రవర్తించెడిన్

ఉ. వారు నిరాశ జేసికొని, పైనముగట్టుచు పక్షిపోక ని
ర్ధారణచేయలేక బహుధా తలపోయుచునుండునంత, నా
నేరము బైటబెట్టు పనిచేర్చినదోయన గూయసాగె చి
న్నారి విహంగమంబు సదనంబుననుండి గికాకికధ్వనిన్

కం. తెలవారినట్లు, నేనుం
దెలవారిన మోముతోడ, ధృతిచెడి, భీతిన్
వలవల నేడ్చుచు, నల్లన
నిలుజొచ్చితి పక్షిగొంచు నేగిరిపాంథుల్

ఆ.వె. తల్లి నన్ను బిలిచి, దండించి, వినిపించె
దొంగతనములోని దొడ్డసేగి;
తల్లిబోధకన్న దట్టంబుగా పిట్ట
నేర్పిపోయె నాకు నీతిగీతి

## కొంటెపనులు

సీ. చెలికాండ్రతో నుండవిలుబట్టి విహరించి పొన్నంగిపిట్టల పొడవడంచి
చిలుకల గోరువంకల కూనలబట్టి పంజరంబులనుంచి బందిజేసి
చెట్టుచెట్టునకెక్కి శృంగార మొలికించు యుడుతల కంతాల కుచ్చులొడ్డి
కంటికింపై ముద్దుగా బొద్దుగానున్న కూనకుక్కలను మక్కువను బెనిచి

ఆ.వె. కూర్మికాండ్రతోడ కుస్తీలు పట్టుచు
కొట్టుకొనుచు నలిగి తిట్టుకొనుచు
చీకుచింతలేని చిన్నారి స్వర్గంబు
ననుభవించినాడ–చినతనమున

చం. చిలిపితనంబునందును బ్రసిద్ధికినెక్కినవాడ, శైశవో
జ్వల మధురాభిరామ శుభవాసరముల్ దలపోయ మేనికిన్
బులకలు కోరగించెడిని, పోకిరిబాలురు తోడురా బురిం
గలహములేనిరోజు కలికంబున కుండదు లెక్కజూచినన్

చం. వినుమొకనాడు నేను బురవీధిని బోవుచునుండ వైశ్యనం
దనులొ ధరామరాత్మజులొ నన్గని ముట్టకుమంచు వెన్కకున్
జని, రపు డేను కోపమున నల్వురి ముగ్గురి గొట్టి, పేరెమె
త్తిన ఘటనంబు నేడును మదిం బెడబాయదు దొడ్డ గాయమై

ఉ. ఏడిచిచెప్పితిన్ విషయమెల్లను, నా జనయిత్రి గ్రుచ్చి ము
ద్దాడుచు నాయనా! యిది భయంకర దేశము; వర్ణభేదముల్
గూడులు గట్టుకొన్న వనగూడదు, పంచమ జాతివారికిన్
కూడుహుళిక్కి, మానవతగూడహుళిక్కి, హుళిక్కి జన్మమున్

ఉ. ఇక్కడి దేవతల్ వరము లీయరు పంచమజాతివారికిన్
మ్రొక్కిన స్వీకరింపరు, ప్రభుండగు యేసు డొకండ వారికిన్
దిక్కు, భజింపుమన్న! కరుణించు నతం దని యూరడించి, నా
చెక్కుల జారు బాష్పములు జిమ్మె వ్యధామథితాంతరంగయై

సీ. చదివించు చున్నావుగద కుమార్తెల నిటీవల వాసికెక్కిన పాఠశాల
రానిచ్చునే కృపా రసముప్పతిలు కంట హరిజనప్రజల గ్రంథాలయంబు
పలుకరించెదరె శ్రీవైష్ణవ ప్రముఖులు మనసిచ్చి నీ మాల మాదిగలను
స్వాగతంబిచ్చునే యఖిలజాతులకు కాఫీ దుకాణాలు నిండాదరమున

తే.గీ. మురికి బట్టలతో నీట మునిగివచ్చి
మడులు మడులని యులికుల్కిపడెడువారి
మచ్చికయొనర్చి చెంతకు మలపుకొనెనె
నవయుగారంభ గాంధేయ నాగరికత

ఉ. హేళన చేయుచుంటినని యెంచకు మీ విషయంబు లన్నియున్
శూలములై మనోబ్జమునజొచ్చి ప్రగాఢముగా కలంచి, ప్రో
ద్వేల విషాద కావ్యరసబీజములై యభివృద్ధిజెంది, నా
పాలి వరప్రదాత్రులయి భాసిలు చున్నవి పచ్చపచ్చగన్

ఆ.వె. దొరలతిండిలోన బరమార్థమేదియో
యణగియుండునన్న యాసజేసి
కుసిని వాని చెలిమి కొన్నాళ్లు సలిపితి
నీప్సితంబు వాని కెఱుక పరచి

చం. బటలరుమిన్న, మేలయిన వంటలలో మొనగాడు, మాటలో
ఘటికుడు, తంగవేలను నొకానొక ద్రావిడసీమవాడు, మా
విటికిరుమిస్సి వంటపని పెత్తనదారుగవచ్చి, చూపరుల్
గుటకలు మ్రింగ వాసనలు ఘుమ్మన వండు ననేక పాకముల్

శా. పాపుండాతడు, గిన్నెలం గడుగు వ్యాపారంబు సర్వస్వమున్
నాపై నెట్టి, తొలంగు, నేదియొ నెపానన్; ప్రాకృతంబైన నా
పాపంబో యన వాని యానతులు నిర్వర్తింతు గన్నీళ్లతో;
నాపై జాలివహింపదాయె, సహజాంధ్రద్వేషకుల్ ద్రావిడుల్

ఆ.వె. స్వాభిమానమునకు సడి సన్నవాడు, దో
ర్బలుడు, ప్రళయ వహ్నివంటి వాడు
నా యనుంగుతండ్రి కీ యభాగ్యపు చేత
నొక్కనాడు చెవిని నూదెనెవడొ!

ఉ. బట్లరుగాని కర్మ పరిపక్వము నందెనొ, పట్టియిచ్చి చ
న్నెట్లెదురయ్యె నాదు పిత కంగడికిం జనుచుండి గుండియల్
జిట్లి సగంబుజచ్చి యొకచెంపకు నక్కిన ద్రావిడీడు చీ
వాట్లును తన్నులుం గుడిచి బైటపడెన్ నడివీధిలోపలన్

ఆ.వె. అరవవానికైన యవమతి కోర్వక
నా మనస్సు బిట్టు నలిగిపోయె
గర్భశత్రువేని క్షమియించితిని గాని
తగులనీయనైతి తండ్రిచెవికి

చం. బొమికలదాక నింకిన యపూర్వ మహత్తర దైవభక్తి త
త్వమున వికుంఠధామమును దాపున జూచుచు, భోగభాగ్యముల్
భ్రమలని నమ్మి క్రీస్తుమత భక్తులతో, పిననాట ముక్తిమా
ర్గమున జరించి, పాదిరుల రాజ్యరహస్యము నాకళించితిన్

ఆ.వె. దొరలకొడుకుల పాదాల ధూళిదుడిచి
బ్రదుకుదరియించె ననుకొన్న ప్రాయమద్ధి
వారి దేహాన చిక్కని పాలుగాక
రుధిర మెక్కడి దనుకొన్న రోజులవ్వి

ఉ. చక్కగ శైశవంబు దిగజారి, ప్రపంచము కొద్దికొద్దిగా
దృక్కుల కెక్కువేళ గురుతించిన మా పరదాస్య ముద్రచే
ముక్కలుముక్కలై చెదరిపోయిన గుండెలు వెచ్చనూరుపుల్
గ్రక్కని రోజులేదు, నగరంబులరాణి! యబద్ధ మేటికిన్

సీ. సహియింపదయ్యె శైశవమందె నాచిన్ని చిత్తంబు తెలవారి పెత్తనంబు
హర్షించదయ్యె నాయంతరంగము నిసర్గజ్ఞాన మరికట్టు కట్టుకథలు
ఓర్చుకోదయ్యె నా యుల్లంబు కులమదగ్రస్తుల క్రీగంటి నేస్తమునకు
ఊకొట్టదయ్యె నా యుక్తి నేరని జిహ్వ దరిలేని కర్మ సిద్ధాంతములను

ఆ.వె. విశ్వసుఖము లనుభవింప జేతులుసాచి
పేరెమెత్తు నాయభీప్సితముల
గాయపఱుచు మాయ కట్టుబాట్లకు నంజ
లింపదయ్యె నాదు లేతమనసు

ఉ. నాయనగారు చెప్పు పలనాటికథల్, మదిలోన 'కొక్కరో
కో!' యని కూసి, నా కవితకున్ దొలిసంధ్య ఘటించునాటి లే
బ్రాయమునందు, మాతరమువా ర్పురికొల్పిన యాంక్షలిప్పుడున్
గాయలుగాచి నిల్చినవి కన్పడకుండ హృదయంబుజంబునన్

ఉ. మా పొరుగింటి బాలిక, రమామణి నామక, చన్నుచంకయున్
గాపుకురానిపిల్ల, చెలికత్తియగా, తలిచాటువారమై
రేపులు మాపులుం గలసి క్రీడయొనర్చితి, మా లతాంగి నే
డేపురి నున్నదో! మెలగు నిప్పటికిన్ స్మృతిదర్పణంబునన్

మ. ఒకనా డిర్వుర మాటలాడుకొనుచేదో మాటపై, భార్య భ
ర్తకు పాదార్చనమాచరించవలె, భార్యన్ భర్త శిక్షించు నం
చొక బెత్తంబున మోదితిన్, గినిసి యేవో శాపముల్ బెట్టి త
త్సికతా నిర్మితమందిరంబులను గూల్చెన్ గాళ్లమట్టాడుచున్

కం. సిగబట్టి లాగి, భూరజ
మొగజిమ్మెడు నాదు బుగ్గ లెఱవారంగా
జిగిగోళ్లరక్కి, బాలిక
బిగువుగ నాపొట్ట గొరికి, పేరెము వాఱెన్

చం. గరుడుని తన్నులన్ దనువు గంటులు వార, బిరాన లంకకున్
బరువిడు రావణాసురుని భాతి, కనుంగవ నశ్రుమాలికల్
గురియ, పరాభవంబు, జిగిగోళ్ల చుఱుక్కుల కన్న కష్టమున్
నెరప, గృహంబు జొచ్చి జననీమణి చెంగట నిల్చి యేడ్చితిన్

ఆ.వె. కన్నతల్లి కన్నుగవకు, నెచ్చెలికత్తె
రక్కినట్టి గోటి నొక్కులెల్ల
సాటిలేని కత్తిపోటులై కనుపట్టె;
అనుగు మాతృదృష్టి కవధి గలదె!

కం. ఇటు నన్ను గన్న తల్లియు,
నటు నా చెలికత్తె తల్లి, యగ్గులగుచు, ప
య్యెటలం బిగించుకొని, ది
క్తటులదరగ కలహములకు దలపడి, రంతన్

ఉ. ఏడుపుమాని మేము, జనయిత్రుల చెంగట నిల్చి, మేనుల
ల్లాడ భయంబుతో, ననుగుటమ్మల నోటిలడాయి హాయిగా
వేడుకగా గనుంగొనుచు, పిన్నని నవ్వులలో విరోధమున్
బూడిచిపెట్టి, యాడుకొనబోయితి మల్లన కన్ను సన్నలన్

ఉ. 'రక్కసిముండ? నాకొడుకు రక్తము కన్నులజూచి క్రమ్మరన్
బ్రక్కను జేరితే?' యనుచు నా పొరపాటును గప్పిపుచ్చి, నా
నిక్కపు జెల్మికత్తె నటు నెట్టి, ననుంగొనిపోయె నింటికిన్
గ్రక్కున కూర్మిమాత కినుకన్ దనదే జయమన్న పోలికన్

ఉ. మాయమపల్కు నక్కఱకుమాటల కన్న, పదారు రెట్లుగా
నాయెడబాటు, బాలవదనంబున దీర్ఘ విషాద నీరద
చ్ఛాయ ఘటింప, 'నీది మగజన్మము గాద' నునట్లు జూచుచుం
బోయె, శపించుచున్; ముదురుముత్తయిదుంబలె మూతిద్రిప్పుచున్

ఉ. నా చెలికత్తె చూపులు మనంబున నాటి, రహస్య వేదనన్
రేచిన నేడ్చి, తొల్త ప్రహరించిన వానిని నన్ను మాని, సం
కోచము లేక తిట్టితివి క్రూరత నాబిడ, నంచు సత్యమున్
దాచక వెల్లడించితిని తల్లికి నుల్లము పల్లవింపగన్

చం. ఋతము వచించి కన్న ఋణమీగితి వీవు కుమార! నీ మనం
బతిసుకుమార, మోర్చుకొన దన్యుల కష్టము, లంచు కౌతుకాం
చిత రుచిరాశ్రుమాలికలచే నభిషేక మొనర్చి తప్పు జే
సితి నని కౌగిలించుకొని, చెక్కులు ముద్దుకొనెం బ్రసన్నయై

చం. పగయను దుష్టసర్పము నివాసముచేయగ తావులేని, మా
చిగురు వయోవికుంఠసుఖజీవన మట్లొక కొన్నివర్షముల్
దిగు లిసుమంతలేక, తెగదెంపు లెఱుంగక, సాగిపోయె హా
యిగ; నిపు డా దినా ల్బికిరమెత్తిన జిక్కవుగా! పురాంగనా

ఆ.వె. వయసు ముదురు కొలది, బాల దేహమునందు
మాటతీరునందు, మార్పుదోచె
ఆటపాటలందు నభిరుచుల్ జారి, న
న్నావహించె దోర యౌవనంబు

ఆ.వె. తప్పుజేసినట్లు, తరుణి యంగకములు
తొంగి చూడదొడగె దుస్తులందు;
పక్వమైన తరుణి ప్రాయమందేదియో
వెదకసాగె నాదు వీక్షణములు

కం. ఎడమయ్యె జెలిమి; కొంచెము
బిడియం బేర్పడియె; జారి వెనుకటి చనవున్
మిడిమేలపు యౌవనదశ
పొడసూపిన యంత, జీలిపోయెం బ్రతుకున్

కం. పరిణయమునాడు, నెచ్చెలి
వరుని సరస, పెద్ద పూలపాలకి లోనన్
బురి నూరేగుట గనుగొను
వర, కెన్నడు జూడనైతి బాలిక మొగమున్

ఉ. బుట్టెడుసొమ్ములో బసుపుపూతలలోన, మునింగి యానవా
ల్బట్టగరాని నెచ్చెలి విలాసము నారయు నన్ను మెల్లగా
దట్టుచు బల్కరించెడు విధంబున నోరగ జూచి మైత్రి జూ
పెట్టె దరస్మితం బదర బెండిలికూతు రుదారచిత్తయై

తే.గీ. సమవయస్కులమగుచు శైశవమునుండి
కేళి సల్పెడు మమ్మిట్లు జీలదీసి
కొమ్మెర గొంపోవు నప్పెండ్లికొడుకు నరసి
పట్టరానంత కోపమేర్పడియె నెడద

ఉ. ఎక్కడదాపరించె హృదయేశ్వరుడై ముదికోతి యందపుం
జుక్కకు? లేతమొగ్గ? కనుచున్ గుమిగూడిన పౌరభామినుల్
ముక్కులు మూతులున్ విరిచి పోవుట, లమ్ముది పెండ్లికొడ్కుపై
యక్కసుదీరినట్లయి, గృహంబున కేగితి సంతసించుచున్

కం. బురదం బొరలాడుటయున్
సరదాయగు నాటి మధుర శైశవ దశయం
దెరుగదు నా హృదయం బీ
పరాయి నరులన్న నేవపడు దుర్గుణముల్

కం. సృష్టికి నాకుంగల్గు వి
శిష్టంబగు పొత్తు నిట్లు చెండాడి, గుణ
భ్రష్టత గూరిచి, శాంతి
నృష్టపరచె వయసు నంగనాచి విధానన్

ఉ. గుజ్జనగూండ్లుగట్టి పడగొట్టుచు బొట్టెలగూడి యాడు నా
బుజ్జివయస్సులో కడచిపోయిన కమ్మని కాలమందు నా
పజ్జకురాని శత్రుగుణవర్గము నాకిపు డందుబాటులో
గజ్జెబిగించి వేయితలకాయల తాండవ కేళి సల్పెడిన్

ఉ. ఆ పసిపిల్లవానితన మా నవనీత ప్రవృత్తియున్ వయః
కూపమునందు గూలి పయికొన్నది దుర్మద మంతరింద్రియ
వ్యాపన దక్షమై తిరుగ బాల్యము రావలెనన్న గ్రీస్తుగా
బాపుజిగా ప్రవర్తిలు టవశ్యము విశ్వమనుష్య కోటికిన్

తే.గీ. తనువు దాలిచి పంచభూతముల నుండి
ప్రభవమందిన చిన్నారి పాలపాప
యవని రజమన్న జలమన్న నభిలషించి
కేళిసల్పును ప్రాత చుట్టాలుగాన

కం. పాదిరిబడిలో క్రమముగ
యైదవ తరగతిని గెలిచి యస్పృశ్యతకున్
గాదిలి చెలియగు హిందూ
సోదరుల కళాలయంబు జొచ్చితి నంతన్

కం. హరిజనులని యిప్పటివలె
సరుదుకొనుట కుపకరించు సాధనమింకన్
భరతపిత పంచిపెట్టని
కఱకు దినములవ్వి నిఖిల క్రైస్తవ తతికిన్

శా. పంతుళ్ళెల్ల సవర్ణ హిందువులు మాపై గోపమున్ రోతయున్
గొంతుంబంటి గలట్టివారును దయాంకూరోజ్వల న్మంజుల
స్వాంతుల్ రెండును లేనివారును గలా ర్బంట్రౌతుసాహేబు మా
కిం తంత న్నడయాడు హక్కుగల పెన్ వృద్ధుం డుదారాత్ముడున్

చం. వెలయు నలాదుగా ముసలిబెంచియ పంచమజాతి కోసమై
పలకలు పుస్తకాలు బలపంబులు భద్రముజేసి కొంటకున్
గలదొక హద్దు మా గురువుగారికి కోపము వచ్చువేళ పెం
పలరెడు నంటరానితన మడ్డమువచ్చె నదొక్క మేలుగా

ఉ. అన్ని కులాల బాలు రిసుమంతయు భేదములేక స్వేచ్ఛగా
అన్నలుదమ్ము లట్లెదుట నాటల పాటల నొప్పుచుండగా
కన్నులజూచి నా చిఱుతగర్భములో నపుడెంత బాధ యు
త్పన్నము నందెనో! యదుగవచ్చు కళాసదనాంగనామణిన్

కం. వీరేశలింగకవి బం
గారు కృతులు పాఠ్యపుస్తకంబులగుచు మా
కా రోజుల నాంధ్రోక్తుల
సారము రుచిజూపి వలపు చారఘటించెన్

ఉ. బొమ్మలు గీకుచుం గటికిపోకిరి చేష్టలొనర్చు నేను క
న్నమ్మకు దక్క, నన్యులకు వ్యర్థుడనై కనుపట్టుచుంటి ప్రా
యమ్ము క్రమంబుగా ముదిరి యంతయి యింతయి గోటికందు మీ
సమ్ముల వాడనై, పదము సాచితి నూతనయౌవనంబునన్

కం. ఒకకన్ను చదువుమీదికి
నొకకను సుందరులమీది కురుకుచు నెదలో
తికమకలు పెట్టసాగెన్
చకచక మెయి బ్రాకు యౌవనం బొకకళయై

సీ. పదునుగా చూపుల బాణాలు గురిబెట్టి విద్యార్థినుల మీద విసరివైచి
చదివిన చదువెల్ల, చాపచుట్టగ జుట్టి పంతుళ్ల మోమున బారవైచి
మాతాపితల నీతిమాటలు, గుదిగట్టి పాతాళ గంగలో బారవైచి
నీ మార్గమున కడ్డునిలుచు వాడెవడైన చెలికాండ్ర బురికొల్పి చిదుకగొట్టి

తే.గీ. 'చదువుకొనవోయి ప్రణయ శాస్త్ర ప్రపంచ
మధురమంజుల సాహిత్య మధన' మనుచు
గట్టిగా, నన్ను బలవంత పెట్టసాగె
గుండెలో జేరి, యెవ్వడో కొంటెవాడు!

## భాషాపరిశ్రమ

చం. చదువుముగించి, 'మేరి'యను సద్గుణరాశిని, నాయెడందలో
మెదలెడు దాని రూపవతి మేనటికంబను జన్మహక్కుతో
నెదిగినదాని మాతపిత లిర్వురు కూర్చినదాని పెండ్లియై
బ్రదుకుచు పల్లెటూరి బడిపంతులు వృత్తి నలంకరించితిన్

ఉ. తల్లియు దండ్రియుం బరమధామము జేరి గతించె నప్పుడే
జల్లగ దొమ్మిదేండ్లు సడిసన్నది చాటరగడ్డపాడు నీ
పల్లియలందు మత్పితల భవ్య సమాధు లురంబునందు రం
జిల్లెడు రత్నభూషణవిశేషములైన కతాన మానినీ

శా. క్రాలుం జాటరగడ్డపాడనెడు కుగ్రామంబు మా కందు జు
ట్టాలున్నా రిపుడుం దరిద్రులయి మాటల్నేర్చి దద్దమ్మలై
చాలీచాలని యన్నవస్త్రములతో సంపూర్ణ దాస్యంబుతో
పైలోకంబు లభించునన్న మతగర్వగ్రస్త చిత్తాలతో

కం. వాతావరణం బాంగ్ల
ప్రాత స్సంధ్యారుణ ప్రభానిమ్నగలం
దీతలు గొట్టుచు తెలుగుం
గైతన్నిరసించు వేడి గడెలవి జననీ

ఆ.వె. ఆగ్రహించిరేని ఆంగ్లంబునం దక్క
దెలుగు భాషలోన దిట్టరెవరు
మకరకుండలాల మహితవిద్వద్వర్యు
డేని నాగరకతలేని పశువు

కం. తిరుపతికవి వేంకటకవి
యిరువురు మీసములు మెలచి యెల్లకవులు బి
త్తరవోవ పన్నిదంబులు
సరచి సవాల్చేసి చెప్పసాగిరి కవితల్

కం. ఆ జంటకవుల కవితా
తేజము నల్గడలగ్రమ్మి దీపించెడు నా
రోజులలో భాషాసతి
నాజూకులు నేర్చి, వలపు నడకలు నడచెన్

ఉ. మీసముదువ్వి యక్కవు లమేయగతిన్ బహుళావధానముల్
జేసి యఖండ పండిత విశిష్ట సభాజయకీర్తి ధాన్యమున్
రాసులు జేయుచో దెలుగురాణి శరీరము పుల్కరించి ప్ర
జ్ఞా సముద్రగులైన కవినందనులన్ గనె పల్లెపల్లెలన్

కం. శ్రవణానందము చదివిన
యువకులలో నుబికె వలపు టూహల తోడన్
నవనవకవితాకోకిల
కువకువ నినదించె బ్రజల కుత్తుకలందున్

కం. అప్పటి కాశుకవిత్వము
జెప్పుచు పేర్గన్న సాహసికవీరవరుల్
కొప్పరపుకవులు రాజుల
మెప్పించుచు నుండి రసమ మేధానిధులై

కం. తిరుపతికవులకు నలకొ
ప్పరపుగవుల కెవ్వడో యభాగ్యుడు కలహం
కురమొకటి నాటె నది దు
ర్భర ఝంఝానిలమువోలె బ్రాకెం దిశలన్

కం. వైదిక నియోగికక్షలు
ప్రాదుర్భవమంది, నర్సరాట్పురమందున్
బాదుకొని నాటి కవుల త
గాదాలకు దోహదంబుగా సాయపడెన్

శా. దట్టీల్‌గట్టి నియోగి వైదిక కవుల్ దార్సిల్లి రన్యోన్యమున్
జుట్టుంబట్ల కళార్హనైక విజిగీషుల్ స్వీయపాండిత్యముల్
గుట్టల్‌గుట్టలు ద్రిమ్మరించి రలుకన్ గొన్నేడు లాదెబ్బతో
తిట్టుంగైతలు మారుమ్రోగె సకలాంధ్రిన్ గోటికంతాలతో

మ. తెలుగుం దేశచరిత్ర సాంఘికముగా దీనస్థితిం గ్రుంగి తా
తల ముత్తాతల నాటి వర్గకలహ ధ్వాంతంబునం దూలగా
కులకక్షల్ బలుపెక్క, సత్కవుల వాక్కుల్ గూడ ఖుమ్మక్కుగా
నిలువన్ జాతికి ముక్తి లేదనుచు కన్నీర్నింతు రుద్యన్మతుల్

శా. సీతారాముల పెండ్లి పేరటములున్ శ్రీకృష్ణరాధారతుల్
త్రేతాద్వాపరయజ్ఞకర్మలు వినా లేవో కథావస్తువుల్
చేతన్ ఘంటము బట్టు నెట్టి కవియున్ జింతింప డీనాడు నీ
భ్రాతృక్లేశము లీక్షుధార్త భరతాంబా దీర్ఘదారిద్ర్యమున్

ఉ. తేలికశబ్దముల్ గలిగి తీయని శయ్యలతోడ నాటగు
ట్టాల విధంబునం బిరబిరన్ బరువెత్తు కవిత్వమల్లగా
జాలిన యక్కవిద్వయము సల్పిన వాఙ్మయ జైత్రయాత్ర పె
న్గాలిదుమారమై కదలికం గలిగించె కళాధరిత్రికిన్

కం. జూపుడి హనుమచ్ఛాస్త్రి ద
యాపరుడు శతావధాని యవ్యాజకృపన్
నాపైని నెఱపి కఱపెన్
దాపరికములేక కాళిదాసత్రయమున్

మ. మొదటన్ నైషధ కావ్యమందు తలబొప్పుల్ గట్టు పద్యంబులన్
పదిపంద్రెంటిని వల్లెవేసుకొని, నాప్రాయంపు మిత్రావళుల్
బెదరన్ దప్పులు నొప్పులుం గలిపి యావేశంబు రోమాంచమై
పొదలంగా వినిపించ జొచ్చితి కళా మోహాతిరేకంబునన్

శా. త్రోవంబోయెడు పల్లెవార్ప్రకృతి ముగ్ధుల్, గుంపులై చూచి "వీ
డా వీరయ్యకుమారకుండుగద భేషం"చున్ శిరఃకంపమున్
గావింపన్ విని యుబ్బుచుంటి నెదదన్ నా ప్రజ్ఞ నా యజ్ఞతా
భావోద్రేకము నేడు జ్ఞప్తికెలయింపన్ గుండెలల్లాడెడిన్

సీ. నాతోడి బాలురందరు పృచ్ఛకులుగాగ తలతోకలేని పద్యములు చెప్పి
కుతిదీరకనుపట్టు ప్రతి పదార్థము మీద కృతులల్ల కలము గాగితము దడవి
ఆలకింపుడు పద్దియముల నల్లితి నంచు వలదన్నవారి వీనులకు బులిమి
పదిమందిగల రచ్చపట్ల నల్లన జేరి కవితాప్రసంగంబు గదలవైచి

ఆ.వె. ఒక్క పదముసాగి తక్కినపాదముల్
పెకలిరాక ధార బిగిసిపోవ
చెలులు పరిహసింప జెప్పితి నష్టావ
ధానములను శతావధానములను

సీ. గణబాధ రవ్వంత గడచి ముందుకుసాగ 'తగ్గవో' యని యతిస్థాన మురుము
యతిని మచ్చిక జేసి యడుగు ముందుకుసాగ ప్రాసంబు కుత్తుక బట్టినిలుపు
ప్రాసవేదనదాటి పయనంబు సాగింప భావంబు పొసగ కిబ్బంది పెట్టు
భావంబు పొసగించి పద్యంబు ముగియింప రసలక్ష్మి కినిసి మారాముసేయు

ఆ.వె. ఇట్టి ప్రతిబంధకంబుల నెల్లగడచి
గట్టుకెక్కుదమన్న వ్యాకరణశాస్త్ర
మాదరింపదు శబ్దమర్యాద గాన
రాక కవిగాని బ్రదుకు శ్రీరామరామ!

మ. యతులుం బ్రాసలు బుఱ్ఱలోన సకల వ్యాపారముల్ మాన్పి శా
శ్వత సంచారము జేయుచున్ బ్రకృతి దృశ్యశ్రేణి వర్ణించి, మ
మ్మతికింపంగల వేమొ చూడుమని దయ్యాలట్లు వేధించు దు
స్థితి కగ్గంబగు కైతగాని బ్రదుకిస్సీ! వద్దు ప్రత్యర్థికిన్

ఉ. మానస గోచరంబగుచు మాటలకందని భావరాశి ఛం
దో నియమాంతికంబగుచు దోచుచు కూరుపు చేయబోవ స్వా
ధీనముగాక దూరమయి, తిప్పలుబెట్ట కవిత్వకర్దమ
స్నాన మొనర్చుచుం గడపినాడ ననంతనిశాపరంపరల్

సీ. వేగి లేచినదాది, వినుకొండ, కొండసింగరకొండ కంట కాపురముచేయ
చిన్నారి భూగోళ చిత్రదర్శనమున మిడిమిడి జ్ఞానంబు మిటకరింప
ఆదివారాలయం దాముదంబును బోలు ముసలిపాటలు కర్ణముల జరింప
వీధిభాగవతాలు పెట్టినభిక్షగా కల్పనాకథలు రక్తమున నినుక

తే.గీ. పరిమితంబైన కుఱుచ దృక్పథముతోడ
నితర నగరాల పరిచయంబింతలేక
కవులపేరులు విని పుస్తకములు చదివి
కలమునడిపితి కవిని గావలయు ననుచు

కం. పట్టెడు పట్టెడు మాటలు
గట్టివి సాధించి పద్యగద్యశతఘ్నుల్
దట్టించి శ్రోతలెల్లరు
పిట్టలవలె బెదర నాలపించుచు నుంటిన్

తే.గీ. ఇంటనొక చిన్నపని చేయనీక వేళ
కన్నమునుబెట్టు తలిదండ్రులున్నకతన
దిగులెఱుంగక వాఙ్మయాధ్వరమునందు
సంచరించితి నభిలాష జారనీక

ఆ.వె. కంటబడ్డ పద్యకావ్యంబు సాధించి
చదువకుండ నెపుడు వదలలేదు
కవితచెప్పువాడు గనుపింప నేయంబు
సేయకుండ వెడలనీయలేదు

కం. వ్రాసినవ్రాతలు గని సెహ
బాసను వాడొకడులేక వ్యధగుందితి సా
వాసంబు సేయు కొండొక
దాసరి భాగవతుడొకడు దక్క పురానన్

శా. ఊరం బండితు లొక్కరిద్దరు గలారుర్వీసురుల్ దొడ్డయా
చారగ్రస్తులు సంస్కృతాబ్ధి నిరతస్నాతుల్ పురాణప్రియుల్
సారాంధ్రోక్తుల నుల్లిపాయలవలెన్ శంకించు వార్కర్మలం
బూరా నమ్మకమున్నవారు పెనునిప్పుల్ నిమ్నజశ్రేణికిన్

## వ్యధాఘట్టములు

ఉ. నా నిజమిత్ర సత్తముడు నా సహపాఠులలోనమేటి సా
తాని కులుండు మంచి సరదాగలవా డదిగాక చక్కగా
గానము చేయువా డతడు కాలము చేసి యనంతకాలగ
ర్భాన గతించిపోయినవి పాతికకుం బయిచిల్కు వర్షముల్

కం. నీ వెఱుగుదు వనిలాత్మజు
కోవెలకడనున్న పెద్దగుండ్లెఱుగును నీ
గ్రావంబెఱుంగు మాదగు
సావాసము శ్రుతగిరీ! లసద్భద్రకరీ!

కం. ఆ వేంకటప్పయాఖ్యుని
కేవల గంధర్వమధురగీతామృతమున్
ద్రావి కరంగినవిగదా
నీ విమలప్రస్తరములు నీ పరిసరముల్

చం. వినుమొకనాడు నీతలను వేయికరంబులవాడు కుంచెతో
గొనబుకుసుంభరాగమును గూరిచి పశ్చిమపర్వతంబునం
దనువు త్యజించువేళ కపినాథుని కోవెలపొంతనున్న తో
పునకు షికారుచేయుటకు బోయితి నెచ్చెలికాడు తోడుగన్

ఉ. అచ్చటి లేతపచ్చిక బయళ్లపయిం బొరలాడి మెల్లగా
వచ్చి కవుంగిలించుకొను బాలసమీరుని నోరులేని మే
ల్మెచ్చుట లింపుసేయ గళమున్ సవరించి సమీప యాత్రికుల్
బచ్చెన బొమ్మలై నిలువ బాడదొడంగె సగంధు డల్లనన్

సీ. పనిగట్టుకొని నల్లబల్లపై చిత్రలేఖకుడు దీర్చిన బొమ్మగము లనంగ
నరచేతిమందాన నఖిలాంగకముల దట్టంబుగా నూర్ధ్వ పుండ్రములు దీర్చి
భసలంబునకు గాలుబెసుకు నున్నని మేను నిగనిగలాడు కందెనలు జింద
బ్రహ్మకమ్మీలచే బహుళ ముద్రలు వద్ద గావంచ బొజ్జపై గదలియాడ

ఆ.వె. బొమలుదక్క సొంతముగ రోమరహితమై
పిలకతోడ గుండుతళుకులీన
తొండమూడిపద్ద దొడ్డపిళ్ళారినా
వచ్చెనటకు నొక్క వైష్ణవుండు

కం. నీపాటకు నాపూజా
వ్యాపారముమాని కదలివచ్చితి నకటా!
బాపన కులమున బుట్టక
పాపపు సాతానికులము పాలైతిగదా?

కం. వింటి న్నీ విషయము మును
కంటి న్నేదనుచు పొడుముకాస్త కపాలం
బంటం బీలిచి శేషము
నొంటికి నంటించుకొనుచు నుపవిష్టుండై

ఆ.వె. తేరిపార నన్ను దిలకించి మాటల
నడుమ లలితకళల గొడవదెచ్చి
పృధివిసురులుదక్క నితరజాతులు కైత
లల్లరాదు నేరమండ్రు బుధులు

కం. ధరణీసురు నిల్లాలిన్
జెఱబట్టినవాని కైతలల్లినవానిన్
నరికిన పాపములేదని
పురాణయుగధర్మసూత్రములు ఘోషించున్

కం. అని నాకు గొంత మిత్రున
కును గొంత చురుక్కుమనగ కుత్సితమతియై
వినుపించె వింతనీతులు
సనాతనంబైన పరమ చాదస్తమునన్

ఉ. వాదనచేసి కాదనెడిపాటి సమర్థత లేక నేను నా
గాదిలి మిత్రుడప్పరమఘాతుకధర్మము లాలకించి ఆ
మోదముజూపి క్రుంకినది ప్రొద్దను వంక వచించి లేచి య
వ్వేదజడుందొలంగి పురవీధుల జొచ్చితి మల్లనల్లనన్

ఉ. పొఱుడసూయచే విసరివైచిన వాక్శరముల్ మనంబునం
దారని నిప్పుబెట్టినటులై యెటుదోచక క్రూరధర్మముల్
వేరులునాటియున్న పృధివిన్ ననుబోలు కళాతపస్వికిన్
బేరుప్రతిష్ఠరాదనుచు నిస్పృహనందితి వెచ్చనూర్పితిన్

కం. ఎడనెడ నాలో మ్రొగ్గం
దొడుగు కళాలతకు పండితుని నిరసన పె
ల్లుడుకుంబోతుతనం బ
ప్పుడు జడ్డిగమందు మిడతపోటై కలచెన్

కం. ఎచ్చోట నాత డెదురై
వచ్చిన పెదపెద్ద పట్టెవర్ధనములు ఆ
కచ్చగల చూపు లచ్చము
మచ్చలమెకములను నాదు మదికిం దెచ్చున్

శా. తోకాడించుచువచ్చి పైకెగసి యేదో మూక వాత్సల్యమున్
నాకుం జూపుచు నాకుచున్ హృదయచింతంబాపి యోదార్చు నా
జాకీకుక్కను కౌగిలించుకొని విశ్వంబెల్ల ద్వేషించినన్
నీకు న్నా కెడబాటు లేదనుచు కన్నీరూర ముద్దాడితిన్

కం. ఉడుకుంబోతుతనం బె
న్నడు నెఱుగనివాని జడధినాథుని కొడుకున్
పడుచు శశాంకుని జూచుచు
కడపితి నారేయి మనసు కలత శమింపన్

కం. ఆడినదాటై వేడుక
పాడినయది పాటగాగ ప్రత్యర్థుల న
ల్లాడించినట్టి వేముల
వాడ మహాకవిని గూర్చి పలుమరు వినుచున్

శా. ఛందశ్శాస్త్రముమీద నేర్పడిన విశ్వాసంబునన్ దుష్టులన్
మ్రందింపం బరుషాక్షరంబులిడి కూర్పంబూనితిం బద్యముల్
సందేహింపక దద్విరుద్ధముగ నస్మజ్జీవితంబందు ని
బ్బందుల్ దాపరమై కలంచె హృదయ స్వాస్థ్యంబు నత్యంతమున్

ఆ.వె. జంటకవులమై విశాలాంధ్రమున సంచ
రించి సద్యశంబు గాంచదలచి
ఆశుకవనరచన మలవాటుచేసితి
సఖుడు పిచ్చయాఖ్య శాస్త్రితోడ

కం. నాపేరు ముందు నిల్పం
బాపం బదియేమొ జాషువా పిచ్చులగున్
నాపేరు చివర నిల్పిన
శాపం బిడినట్లు పిచ్చజాష్వాలయ్యెన్

కం. ఏరీతి మలపి చూచిన
బేరులు వికటించి పొత్తు విచ్ఛేదింపన్
దారులు రెండై కవితా
ధోరణులు న్నడచె మారు త్రోవలయందున్

శా. ఒప్పుల్ తప్పులు దేల్చి చెప్పగల వాడొక్కండు లేదుండినన్
నిప్పుల్ గ్రక్కెడు వర్ణభేదములు సందేహించు నాంగ్లేయపుం
డప్పిం దూలు స్వజాతి కాంధ్రకవులన్నన్ గిట్ట దానాటి నా
తిప్పల్ నీవు నెఱింగియుందువు శ్రుతాద్రీ! చెప్పగా నేటికిన్

కం. కొప్పరపు సుబ్బరాయ డొ
కప్పుడు వినుకొండవీట నాశుకవనమున్
జెప్పుటగని యాతని పై
జెప్పితి పద్యములు భీతచేతస్కుడనై

మ. కవికిం బద్యము లందజేయుటకు మార్గంబేమియున్ లేక చే
రువ తారాడెడు నన్ను భూమిసుర మిత్రుం డొక్క డీక్షించి ర
మ్మవల న్నిల్చెదవేల! బాలకవిమిత్రా! రేపు నీ జిహ్వాయం
దవతారించెడు వాణి యెట్టి నుతికర్హంబై ప్రకాశించునో

కం. కులమత విద్వేషంబుల్
తలసూపని తావులే కళారాజ్యంబుల్
కళలాయుష్మంతములై
యలరారెడు నెలవు స్వర్గమగు చెలికాడా!

ఉ. ఈ గుమిగూడియున్న ప్రజలెల్ల రసజ్ఞులుగారు కొంద రు
ద్యోగులు కొంద రర్థమదితుల్ శ్రుతిమోక్షములేని బద్ధ బై
రాగులు కొంద రుజ్జ్వల సరస్వతిమూర్తులమాట పొంకమీ
లాగని నిర్ణయించెడు తలల్ హుళుళుక్కి తలంకనేటికిన్

కం. అని తెట్టబట్టుకొని నా
యనుమానము దీర్చి సభ్యు లబ్బురపడగా
గొనిపోయి ఆశుకవికిని
ననుజూపుచు విన్నవించె నాయభిమతమున్

కం. బంగారు చిరుతగంటలు
ఖంగన హస్తంబుసాచి కాగలవార్వీ
టంగలరు యువకులని న
వ్వెం గాగితమంది చూచి విమలాశయుడై

కం. సభలోని కెట్టు జొరబడె
నభాగ్యు డీ నిమ్నజుం డటంచుం దమలో
గుభగుభలాడి తటాలున
సభికులు పదిమంది లేచి చని రుద్ధురులై

చం. నలుగురు నాల్గుమాటలనినన్ బదులాడక నాయనుంగు నె
చ్చెలి తలవంచి తోకముడిచెన్ వగతో బగబట్టియున్న త్రా
చుల కెనయై సభాసదుల చూపులు నా వెనువెంటనంటగా
నిలయము జొచ్చితిం గటికినేరము సల్పినవాని కైవడిన్

శా. ఆనాడంతయు నిల్లుదాటక కుకూలాగ్నింబలెన్ మానస
గ్లానిం గూర్చు పరాభవంబు సకలాంగవ్యాప్తమై రోమరో
మానన్ వెచ్చని క్రొంబొగల్ గురియ మర్మచ్ఛేదకంబైన దుః
ఖానన్ దూలుచు బ్రొద్దుబుచ్చితిని ముక్తాహారవారుండనై

ఉ. కంటికి కూర్కురాక పడకం బొరలాడుచు నాటిరాత్రి లో
నంటిన చింతవాయ రుచిరాంధ్రకవిత్వ మరందధార లిం
టింటను జిల్కరించిన కవిత్రయనిర్మిత కావ్యరాజ మొం
డుంట బఠింపజొచ్చితి రసోత్కటఘట్టములన్ గ్రమంబుగన్

మ. నను నాలోగల దుఃఖముల్ మఱచుచున్ శస్త్రాస్త్రవిద్యాప్రద
ర్శన ఘట్టంబున నింద్రనందనుని దర్పారెల్ల గీర్తించు ప
ట్టున పోటీ కెదురెక్కి వచ్చిన గుణాఢ్యున్ బుట్టు నిర్భాగ్యు క
ర్ణుని దైన్యంబు పఠించుచుం గునికితిన్ గొంచెంబు ప్రాల్మాలుచున్

సీ. ఉన్నతంబై కండ లుబికి విశాలమై వెరపెఱుంగని దొడ్డయురముతోడ
కమనీయముగ మీసకట్టేరుపడుచున్న పచ్చనికోడె జవ్వనము తోడ
మసృణంబులగు చందమామ బేడిసలట్టు దనరారు నింతింత కనులతోడ
వెడదయై సగము జాబిలికి వంకలుదిద్దు చెలువు లీనెడు ఫాలతలముతోడ

తే.గీ. ఐదుగురు పాండవుల తేజ మపహరించి
ప్రజల వలపించు దివ్యరూపంబుతోడ
కుంతి ఔమ్ముున దుగ్ధంబు గంతులిడగ
నర్కతనయుండు రంగమధ్యమున నిలిచె

ఉ. దట్టపు నీలిమబ్బు పరదాల మరుంగుదొలంగి మింట గ
న్పట్టె ప్రసన్నుడై కమలబాంధవు డాత్మజు జూచువేడ్క న
న్నట్టు లకారణంబయిన యాదరభావ మెదం జనింప న
ట్టిట్టన లేక చూచిరి దినేశతనూభవునిన్ సభాసదుల్

చం. మరుగునగాంచి యమ్మధురమంగళమూర్తిని జ్యేష్ఠనందనున్
గరుణ రవంతలేక యమునన్ బడవైచినదాది దృప్తిగా
నరయుట కెంతయున్ దహతహంబడుచున్న పృథావధూటి య
క్కరముగియం గనుంగొనియె కర్ణుని శస్త్రకళాప్రచండునిన్

మ. కలితీ యించుకలేక దర్పణమునన్ గన్పట్టుచున్నట్లు ని
శ్చల తేజోబల దర్పసంపదలు పజ్జన్ గర్జగావించి మీ
సలు సారించి సవాలు సేయ నలభీష్మద్రోణు లీర్ష్యాళులై
తలవంపుల్ ఘటియించి పంపి రభిజాత్యబ్రహ్మ బాణంబులన్

శా. కాయంబున్ బదివేల అంపములతో ఖండించినట్లై రుషా
చ్ఛాయారక్తభయంకరాస్యమున లజ్జాకుంచిత గ్రీవుడై
న్యాయంబెచ్చట నేడ్చెనంచు హృదయం బారాటమున్ జెంద రా
ధేయుం డచ్చోటు వాసిపోయె చరమాద్రిం గ్రుంకె మార్తాండుడున్

కం. చెలికాని పరిభవక్రియ
కలిగి సుయోధనుడు చనియె ననుజన్ములతో
కొలువు విడి కుంతి కడుపున
నలుగులు పదివేలు మెరసె నతిదుస్సహమై

శా. ఈడుంజోడునులేని వీరుడవు నిన్నీరేడులోకాలు కొం
డాడున్ ధర్మము చావ దెన్నటికి కర్ణా! నీధనుశ్శక్తి య
ల్లాడించుం బదివేల పార్థులను రమ్మంగ ప్రభున్ జేసెదన్
నేడే దుఃఖము విస్మరించి రిపులన్నిర్జించి గర్జింపుమా

ఉ. సత్యము విస్మరింపదు ప్రజాభువనం బసమాన సత్కళా
దిత్యకుమార నీ సహజతేజము నార్పగజాలునే పృథా
జాత్యహ ముమ్మలింపకుము సత్కవికోటికలాల నిత్యసాం
గత్యముగల్గి రాగల యుగంబులు నీచరిత న్నుతించెడిన్

కం. అని దుర్యోధను డినజుని
మనోవ్యధం బాపు తీపిమాటలు నాతో
ననినట్లె వినినట్లె
కనువిచ్చితి నొడ లెఱింగి కలయనుకొంటిన్

ఉ. భారతకావ్యకర్తల స్వభావములన్ కవితాస్వభావముల్
తీరికగా బఠించి గురుతించుచు తిక్కన కల్పనాచమ
త్కారములన్ తెలుంగునుడికారములుం గమనించి మెచ్చుచున్
బూరితిజేసితిన్ జెరకుముక్కలవంటి దశాష్టపర్వముల్

శా. ఆజన్మంబుగ జిత్రబంధకవితా వ్యాయామముల్ సల్పు భ
ట్రాజుల్ సంస్కృతిలేని భిక్షుకకవుల్ గ్రామాలయందుండి యా
రోజీరోజనకుండ వచ్చి తుదకున్ రూపాయకున్ మాడకున్
బాజార్లం గవితా ప్రదర్శనములన్ గావించుటన్ సూచితిన్

ఉ. బంధులజూచిరా యొకదఫా యొకపల్లెకు బోయి వీటి ఖా
మందుతనంబు భూవసతి మస్తుగ గల్గిన యొక్క రెడ్డి యా
నందపడంగ నైదుచరణంబుల పద్యము వ్రాసి రెడ్డిపే
రం దిఱికించి విన్చితి మహాకవివోలి ప్రజాళి మెచ్చగన్

కం. ఊరుంబేరడగి మహో
దారగుణము తేటపడగ తనపాలేరున్
జీరి కవి కొసగరా పది
సేరులు పెసలంచు నాజ్ఞచేసెం బ్రీతిన్

కం. ఆపల్లెనున్న కొండొక
బాపనగవి పద్దియంబు పఠియించి కవీ
లోపా లున్నవి కనుమని
చూపెన్ వ్యాకరణశాస్త్ర సూత్రానుమతిన్

ఉ. అల్లగవచ్చు పద్దియము లల్లినదెల్ల కవిత్వమై విరా
జిల్లదు వృద్ధికాముడవు చెప్పెద సత్యము నాలకింపుమో
పిల్లకవీ! పురాతన కవిత్వము నిర్మోగమోట మేర్పడన్
జల్లెడ బట్టినన్ నిలువజాలిన కావ్యము లల్పముల్ జుమీ

కం. హృదయం బావశ్యకమగు
సదా మహాకవికి విశ్వసత్యపరతయున్
బెదరని గుండెయు హాస్యము
బొదిగిన చతురోక్తి ముఖ్యములు తలపోయన్

కం. వర్ణితపదార్థ మాత్మన్
జీర్ణము గావలయు వేయిచెప్పగనేలా
వర్ణితవస్తువు తానై
పూర్ణంబుగ గరగి మారిపోవలయు కవుల్

చం. మరియొకమాట భావములు మచ్చికగా వనుకూలశబ్ద సుం
దరుల కరావలంబనముదాపుట జిక్కగ రిక్తహస్తముల్
సరచిన పిండిలేక కొనసాగునె రొట్టెల వంటకంబు నీ
మరుగు లెటింగి సల్పుము ప్రమాదములేని కళాప్రయాణమున్

చం. ఎవడు సుఖించెనో తెలుపుమీ కవితాకళ నభ్యసించి భా
రవి భవభూతి బాణకవిరాజులు వోలె మదాంధ్ర సత్కవి
ప్రవరులదాక పొట్టకును బట్టకు జాలని యార్జనంబుతో
నవసినవారి సంఖ్య యదనంబుగ దోచు గణించి చూచినన్

సీ. పరిపూర్ణ నవ్యయౌవన విలాసమున నాంగ్లేయ శారద కన్నుగీటుచుండ
వెలలేని రత్నకుండలమండితుల ప్రజ్ఞ నగుబాట్ల కగ్గమై నవయుచుండ
స్వస్థాన వేషభాషామోహ మొకవంక నేరమై చెరసాల జేరుచుండ
పొగయోడ లెక్కి యబ్ధులుదాటిపరతెంచి సీమసంస్కృతి చెల్మిచేయుచుండ

ఆ.వె. ఉరుదుకున్నపాటి కఱకుందనములేని
కలికి భాష నెవడు కాంక్షసేయు
ఆపదలకుగాని యందచందములున్న
ఆడుదానివంటి దాంధ్రకవిత

ఉ. ఆ యుపదేశ మింపయిన యాముదమట్లు గ్రహించి యిట్టి భ
ద్రాయిత లక్షణంబు లవురా! యివి యిట్టిపరీక్ష నిప్పుడీ
వ్రాయసగాంధ్రు తట్టుకొనువారె? కవిత్రయమేని భారతా
మ్నాయము నిట్టి యుగ్రనియమంబులతో విరచించియుండునే

కం. గాడిదవర్ణనమున గవి
గాడిదయై యొంద్రపెట్టగావలెనట యే
నా డిట్టి వింతవిషయము
నేడను విననంచు నగితి హృదయమునందున్

మ. అని తద్దివ్యహితోపదేశమును హాస్యజ్వాలపాల్జేసి బా
పన విద్వాంసులు మెచ్చ రన్యుల కళావైదగ్ధ్యమం చాత్మలో
ననుమానించుచు నిల్లు జేరితిని; నేడా దొడ్డవిజ్ఞాని ప
ల్కిన ప్రత్యక్షర సత్యమున్ దెలిసి యగ్గింతుం ద్రపంగుందెదన్

# ఒక మనవి

ఇది నా కథలో రెండవ ఘట్టం. ఆత్మకథలు విఖ్యాతపురుషులు వ్రాసుకోవడం పరిపాటి. నే నాకోవకు చెంది లేక చెందగోరి యీ కావ్యాన్ని వ్రాయలేదు. నేను భాషాపరిశ్రమ మిక్కిలి చిన్నవయస్సులో నారంభించడం, కవిగా గుర్తింపపడడం, ఆదరణ ఆలంబం లేక పడ్డపాట్లు యథాతథంగా బాల కళాసేవకుల దృష్టికి తేవడం నా ముఖ్యోద్దేశం. సాధారణంగా స్వీయకథలన్నీ గద్యాత్మకాలై యుంటాయి. పద్యంలో యుంటే గద్యపద్య ప్రియుల కిరువుర కుపకరిస్తుందని పద్యంలో కథ సాగించాను. మొదటిభాగ మిప్పటికి పలుమార్లచ్చయి ప్రచారంలో యున్నది. సహృదయుల ఆదరాభిమానాలె నన్నీరచనకు పురికొల్పినయి. నలుబదేండ్ల క్రింద

మ. "అలదిగ్గంతులవంటి పండితుల కావ్యాంభోధులం దూర్మిశ
యాల నుయ్యాలలు నూగు మీచరణ దీవ్యద్దర్శనార్థంబు రా
తలకెన్ నాకవితాకుమారి నరనాథా! ముద్దరా లేమి సొ
మ్ములుతో రావలెనో యెఱుంగదు భయంబున్ దీర్చి మన్నింపవే."

అని పిఠాపురీశుని దర్బారున చెప్పుకొన్నట్లు, లోకమెరుగని ముద్దరాలైన నాకవితాబాలికను సమాశ్వాసించి ఆదరించి, చేయూత నిచ్చిన శ్రీసత్యవోలు గున్నేశ్వరరావు, శ్రీ రావూరి శ్రీశైలపతి, శ్రీ జాగర్లమూడి కుప్పుస్వామిచౌదరి, శ్రీ సానెకొమ్ము మాలకొండారెడ్డి ప్రభృతుల సహాయ సానుభూతు లీకావ్యంలో వర్ణితాలైనయి. జీవితాన్ని నాల్గుభాగాలుగా పూర్తి చేయదలచాను. మిగతా రెండుభాగాల్లో నాకు పోషకులుగా ప్రోత్సాహకులుగా తోడ్పడ్డ రసజ్ఞులను. అభిమానులను సన్మానాదికాలను కష్టసుఖాలను తెలుపుకోగలను. ఈ కావ్యాన్ని విద్యాధికులు, కళాపిపాసువులు అయిన కీర్తిశేషులు శ్రీ ప్రత్తిపాటి ఆదినారాయణగారికి అంకితం చేస్తున్నాను. ఈ కావ్యం బహుజనామోద మందగలదని ఆశిస్తాను.

జి. జాషువ

ఉ. శ్రీయుతుడుం దయాగుణవిశిష్ఠు డుదారుడు ప్రత్తిపాటివం
శీయుడు లక్ష్మయాభిధుని జ్యేష్ఠతనూభవు డైన యాదినా
రాయణు డస్మదీయకృతి రత్నమనోహరుడై కళాజగ
ద్గేయులయం దమర్త్యజగతిన్ జిరకీర్తి వహించుగావుతన్

# అంకితము

కం. ఓ నవ్యభావదీవ్య
న్మానస! శుభరూప! ఆదినారాయణ! కొ
మ్మా! నాకథ నమరా
స్థానంబున జదువు మాత్మశాంతి ఘటించున్

కం. కృతులన్ మృతజీవులు శా
శ్వతులై జీవింత్రు చంద్రభాస్కరముగ, ధీ
యుత; మృతిలే దిక నయుతా
యుతయుగములు తెల్గువాఙ్మయోద్యానమునన్

కం. తమ్ముడు సుబ్రహ్మణ్యం
డుమ్మలికం గుందు నీవియోగమ్మున నీ
కొమ్మయు సంతానము ని
త్యమ్మూం బెనుశోకతప్తమై తూలు నిటన్

కం. నందనవనములలో నా
నందంబుగ నుండి ఆదినారాయణ నీ
బందుల మరువక ప్రశుభము
లందింపుము నిరత మమరు లభినందింపన్

కం. ఇది గండపెండెరంబులు
పదమున గయిచేసినట్టి పండితకవి క
న్నది ముద్దరాలు పలుకున్
విదితంబుగ సుకవివరుల వివిధావస్థల్

# ప్రత్తిపాటి వంశము

మ. సిరి నిండారగ ప్రత్తిపాటికులరాజీవంబు సంఫుల్లమై
మెరయన్ స్వీయచరిత్ర జాతినయనోన్మేషంబు గల్పింప సుం
దరరూపంబును దీర్ఘ దేహమును సత్యస్థైర్యమున్ గల్గి న
ల్వురిమెప్పుల్ గొని చన్నలక్ష్మయ యశోభూతిం బ్రశంసించెదన్

కం. కొండేపుడి చుక్కావం
శుం డగు శ్రీ సుబ్బయాఖ్య సూనుండై ద
త్తుండయ్యె ప్రత్తిపాటికు
లుం డగు స్వామికి స్వధర్మలోలుపమతికిన్

కం. చుక్కలు రాలిన, గగనము
వ్రక్కలయిన సత్యవాక్యపరిపాలనమున్
జక్కగ నెరపి ప్రశంసకు
నెక్కెన్ లక్ష్మాభిధాను డింటం బయటన్

మ. ఒక సందర్భమునందు కొండొక ధనాఢ్యున్ బట్టి మర్దించి శి
క్షకు భీతిల్లక నేరమొప్పుకొని మేజిస్ట్రేట్లకున్ న్యాయవా
దకబృందంబున కబ్బురంబును ప్రమోదం బెంతయున్ గూర్చి ధా
ర్మికుడై లక్ష్మయ యాదిమాంధ్రులకు కూర్చెన్ సుప్రతిష్ఠాఢ్యతల్

కం. చిలకలపుడి హరిజనులకు
తిలకమగుచు కులమువారిదీనతకు మదిన్
గలత వహించుచు నీచపు
కులవైషమ్యముల నెదురుకొనుచుండె ధృతిన్

తే.గీ. ఆదిమాంధ్రులదీర్ఘదైన్యమును తలచి
మొసలికన్నీరు విడిచెడు మోసగాండ్రు
స్థాపనము చేయు కపటసంస్థల వినిర్భ
యంబుగా విమర్శించి సత్యమును చాటె

కం. ఆ యలమేలున కీడౌ
శ్రీ యలమేలాంబకరము జేపట్టి కనెన్
ధీయుతుల సుతల విబుధవి
ధేయుల, విద్యావివేకదీప్తాశయులన్

తే.గీ. ఆదినారాయణుండు జ్యేష్ఠాత్మజుండు
ఆది బీ.ఏ. మహద్బిరుదాంకితుండు
నగుచు బందరుసీమయం దాదిమాంధ్ర
జాతి కాదర్శచరితుడై ఖ్యాతిగాంచె

కం. తహసీల్దా రుద్యోగము
వహించి పే రందె ధర్మపరిపాలన ధూ
ర్వహుడై మేజిస్ట్రేటై
శహబా సనిపించుకొని ప్రశస్తికి నెక్కెన్

మ. తొలుతన్ బందరు సీమలో కులము సంతోషింప విద్వద్వరే
ణ్యులు మెచ్చన్ తొలిపట్టభద్రు డగుచున్ ముద్దార చిన్నారికై
తలు సెప్పెన్; ప్రతిభావిశేషమున నధ్యక్షత్వమున్ బూని మె
ప్పులనందెన్; మహదాదిమాంధ్రసభ సమ్మోదించి మోహింపగన్

కం. శ్రీ సుబ్రహ్మణ్యాఖ్యుం
డాసతిపతులకు కనిష్ఠు డగు నందనుడై
భాసురనిజాన్వవాయ మ
హాసౌధస్వర్ణభూషయై జన్మించెన్

ఆ.వె. ఇంజనీరు డగుచు నింజనీర్పదవికి
పసిడిసొమ్మనంగ ప్రథ వహించె;
అభివసింపగలుగు యత్యున్నతోన్నత
రత్నపీఠముల నయత్నముగను

తే.గీ. కొంచె మధికారమద్యంబు గ్రోలినంత
మేనుమరచి నిషా రేగి మిట్టిపడెడు
గర్వితస్వాంతులకు బుద్ధిగలుగునట్లు
సర్వసామాన్యుడై తగ్గి సంచరించు

చం. పదవు లొసంగి పేదల కభాగ్యుల కన్నము బెట్టి ధర్మపు
న్మొదవు ముదశ్రువుల్గురిసి పుష్టివహింపగ సత్యవాగ్విశా
రదు డయి ప్రత్తిపాటికులరత్న మితం డన తండ్రికీర్తికిన్
కుదురయి నేర్పె దుర్మదులకున్ సిసలైన పవిత్రశీలమున్

మ. వదరుంబోతుల బోలి పెక్కుపలుకుల్ భాషింప డేనాడు నె
మ్మదిగా కమ్మగ నొండు రెండు పలుకుల్ మాటాడు నమ్మాటలం
బొదువు న్నిండుదనంబు శ్రోతలకు సమ్మోదంబు గల్పించు ఆ
పదలందున్ దొణకండు సాజ మిది సుబ్రహ్మణ్యధీశాలికిన్

తే.గీ. అట్టి రత్నద్వయంబునం దగ్రరత్న
మాదినారాయణుండు బ్రహ్మైక్య మంది
గూర్చె నారనిశిఖి గర్భగోళమందు
బలగమునకును సోదరతిలకమునకు

ఉ. అన్న గతింపగా భువన మంధతమస్సున మున్గ గుండియల్
భిన్నముగా తపించి పలవించి కృశించి "ఖిలమ్ముగానిదై
మన్నన కెక్కునట్టి యసమం బగు సత్కృతి నంకితంబుగా
అన్నకొసంగి నాదు హృదయవ్యథ తీర్పు" మటంచు కోరినన్

కం. నాకథ యను నూతనకృతి
నాకావాసునకు నాదినారాయణను
శ్లోకున కంకిత మిచ్చి శు
భాకార మొసంగినాడ నమ్మహితునకున్

# నా కథ

కం. యౌవనమున వేధించెడు
పూవులవిలుకాని నేస్తమును సల్ప్రితి నే
నేవో ప్రణయకలాపము
లావీటన్ రసికకవిమహాశయులవలెన్

తే.గీ. అందరము పుట్టుపాపుల మని యహేతు
కముగ భయబీజములు నాటి కలతపెట్టి
బ్రతుకు మతబోధకుల యనుగ్రహము తప్పి
సంఘబాహ్యుడ నైతి క్రైస్తవులయందు

ఆ.వె. పాపి వీ డటంచు పదుగురు గుమిగూడి
యేసుక్రీస్తుప్రభున కెఱుకజేసి
బాగుచేయుమంచు ప్రార్థింపసాగిరి
మేటిబోధకులును మిషనరీలు

కం. ముమ్మాసంబులకును రౌ
ప్యమ్ములు మూ డొసగుచుండు పంతుళ్ళకు జీ
తమ్మపుడు దొరలు నా కీ
కుమ్మడ్డముబెట్టి మానుకొన్నా రదియున్

కం. ఊడెం బడిపంతులు పని
యూడె న్మర్యాద యూడె నుత్సాహము లో
నూడని సంసారము వెం
టాడం దిరిగితిని పల్లియలు పట్టణముల్

కం. ఆరోజుల నమలున గల
టూరిం గ్సినిమాలలో కడుంగడు శ్రమతో
జేరితి నొక సినిమాలోన క
థారచయితగాను తత్కథాకథకునిగా

కం. వేతనము పదియు నైదును
చేతోమోదంబె కాని చేతికి నిడ డా
నేతృమణి చిల్లిగవ్వయు
ఖాతే ప్రాప్తంబు రెండు పర్యాయంబుల్

చం. ఇది యొక శిక్షలె మ్మనెడు తృప్తివహించి సమస్తచింతలన్
జిదిమి ముదంబు గూర్చి పరసీమలకుం గొనిపోవు కావ్యశా
రదను భజించుచున్ దుదకు రాజమహేంద్రమునందు నౌకరీ
వదలితి నాప్తమిత్రుసహవాసబలం బవలంబనంబుగన్

తే.గీ. గౌతమీతీరకోటిలింగాలవద్ద
ప్రాథమికపాఠశాలలో పంతులునయి
జీవనము చేసినాడ నేత్రోవ లేక
ఎనిమిదిన్నర మాసవేతనము మీద

శా. క్రూరంబైన ప్రపంచయుద్ధపు ఫిరంగుల్ నిప్పులన్ గ్రక్కు సబ్
మైరిన్లున్ మదరాసుపట్టణముపై బాంబుల్ ప్రయోగించి కం
గారెత్తించిన రోజు లవ్వి మనయాంగ్లస్వాములున్ జర్మనీ
క్ష్మారాజుల్ శిగపట్లగోత్రమయి మీసల్ దీటు దుష్కాలముల్

కం. ఇద్దరుసుతలుం గూరిమి
ముద్దియ మేరాంబతోడ ముట్టెడు జీతం
బద్దెకు ముద్దకు చాకలి
పద్దుకు సరిపోక పెక్కుపాట్లం బడితిన్

కం. గంటాశారా యను వా
ల్గంటిసహాయమున కష్టకాపుర మెట్లో
గెంటితి నొకయే దప్పటి
తంటాల్ దలపోయ గుండె దడయున్ గల్గున్

కం. కదనమున సైనికుడనై
బ్రదుకుట మేలంచు సిద్ధపడి రిక్రూటింగ్
సదనమున కేగ ముగిసెం
గదనం బానాడె యేమి గ్రహచారంబో

కం. నాకవితాకండూతియు
నాకూర్పున్ నేర్పు జీవనపు టొడిదుడుకుల్
నాకష్ట మాకళించిన
ధీకవితుం డొక్కభూమిదేవుం డుండెన్

ఉ. మాటలపుట్ట నాస్తికు డమాయకుడుం గవి పండితుండు తో
లేటికులుండు ప్రాయము ఫలించిన వృద్ధుడు సుబ్బరావు నా
గాటపు కష్టజీవనము గాంచి విచారము నంది మత్కళా
పాటవము న్నుతించి బహుభంగుల ధైర్యము చెప్పు నెప్పుడున్

కం. ఇరువుర మఖండగౌతమి
సరిత్తటిం జేరి వివిధసత్కావ్యనిరం
తరగోష్ఠి ప్రొద్దుబుచ్చెద
మరుణారుణసంధ్యలందు ననువారంబున్

కం. ఆసుబ్బారాయం డొక
వాసరమున చెప్పు మొక్కపద్యంబును గో
దాసరిదభివర్ణన మని
ఆసక్తిం గోరె మందహాసానుడై

ఉ. పుట్టి గతించిపోయెడు నృపుల్ ధరణీవిభవంబు గోరి నీ
గట్టున నుగ్రసంగరముబాంబున నెందరు గ్రుంకినారొ నీ
పొట్టకు వారియస్థికలు భోజన మయ్యెగదమ్మ చావులే
నట్టి సుధాశరీరమహిమాన్వితవందన మమ్మ గౌతమీ!

కం. అని చెప్పిన విని, "వహవా!
మొనగాడవు జాషువా! యపూర్వంబగు క
మ్మనిపాకము నుడికారము
తెనుగుందన" మంచు బొగడి దీవెనచేసెన్

కం. "గున్నేశరాయ డను సం
పన్నుం డీయూర గలడు బ్రహ్మణ్యుడు వి
ద్వన్నుతుడు నటవిగాయకు
లన్నం గవు లన్న నాశ్రయం బిచ్చు కవీ?

కం. చను మీయుత్తర మి" మ్మని
యనురాగం బొలుక బలికి యంపిన నేనుం
జని యా గున్నేశ్వరు
గని సుబ్బారావుగారికమ్మ నొసగితిన్

కం. అరనెరసి యున్న గుప్పెడు
బిరుసగు మీసములు వదనబింబమ్మున రా
చఱికపు హుందాతనమున్
వరభూషలు సత్యవోలు వంశేందునకున్

చం. పిడికెడు మీసముల్ నయనవీధుల రాజస, మాననంబునన్
జడధిగభీరతాగుణము చామనుచాయశరీరదార్ఢ్యమున్
నడిమివయస్సు చూపరమనంబులు లోగొను మూర్తితోడ నా
యెదద చలింప నిట్టు లనియెన్ మృదువాక్పరిపక్వచిత్తుడై

కం. "ఊ రెయ్యది? పే రేమి? కృతుల్
కూరుతువా? భేష భేష! గురు వెవ్వరు? మా
ధరణీసురులు సనాతను
లేరీతి సహింత్రు బ్రాహ్మణేతరప్రతిభల్

ఆ.వె. కావ్యపంచకంబు కన్నావె? గీర్వాణ
వాణిపరిచయంబు బడసినావె?
అల్లగలవె పద్య మాశువుగా? యేది
పలుకు మొక్క చిన్నిపద్దియమును."

కం. అని కట్టెదురం గుడ్యం
బున వ్రేలెడు చిత్రఫలకముం జూపిన చ
య్యన నాశుధార నొడివితి
వినుకొండవిశిష్టతయును వివిధాంశంబుల్

తే.గీ. గౌడడిండిమభట్టుని కంచుఢక్క
పగులగొట్టించు కవిసార్వభౌమునిల్లు
భాస్కరుని కత్తి మెరసిన ప్రధనభూమి
శిరము నెరసిన వినుకొండసీమ మాది

కం. మగ డడవి డింప బంపిన
వగ గుంది కృశించినట్టి వైదేహి కయో
ఖగమృగ సంతతియే బం
ధుగణంబై యూరడించి తోడై నిలిచెన్

ఆ.వె. చిత్రపటములోని సీతను వర్ణించి
కొన్ని పద్దియములు కూర్చి చదువ
మందహాసరోచు లందమౌ నమ్మీస
కట్టు దాటి మిట్టిమిట్టిపడియె

మ. చెలిమి న్నాదుభుజాగ్రమున్ గుదుపుచున్ చింతామణీ నాట్యమం
దలికి న్నాటకముల్ రచింపుము కవీంద్రా! ముందుగా కొ మ్మిదే
నెలజీతం బని రౌప్యవింశతి నిడెన్ చిత్తంబు పొంగార నా
పలుకుందొయ్యలి తాండవించె నవభావస్వర్ణభూషాఢ్యయై

ఉ. వేయిగజాలశక్తి ప్రభవించె మనంబున నభ్యసించితిన్
రేయిబవల్ మహాకవివరేణ్యులపోకడలున్ చమత్కృతుల్
నాయకనాయకీవివరణంబులు రాయలదిగ్గజాష్టకో
చ్ఛాయరసోజ్జ్వలత్కృతుల సంహితలన్ ఘనబృంహితంబులన్

కం. సాయంసంధ్యారక్త
చ్ఛాయారుచిరాంబరములు చక్షుర్ముదమున్
జేయు మహాగౌతమితటి
హాయిగ నొక పులినసీమ నాసీనుడనై

కం. విరచించితి 'శ్రీరుక్మిణి
పరిణయ' మను నాటకమును పండితులు కవీ
శ్వరులుం దలలూచగ మె
చ్చరు నే డానాటకా లసారము లనుచున్

మ. తనమేధస్సును దేహదార్ఢ్యము సమస్తంబున్ వితంత్వాలయం
బునకున్ సాంఘికవిప్లవంబునకు సంపూర్ణంబుగా నిచ్చి ము
గ్గిన పండై పరలోకయాత్ర కనురక్తిన్ సిద్ధమై మంచమె
క్కిన వీరేశకవీశుదర్శనము జిక్కె న్నాదు భాగ్యంబునన్

కం. స్త్రీజనసంక్షేమార్థం
బాజన్మత్యాగదీక్ష నమృతకృతమై
తేజరిలు నమ్మహాత్ముని
సౌజన్యాంకితహృదంబుజం బే్రొద్దున్

ఆ.వె. క్రైస్తవుండ కవిని కడుపేదవాడ నా
లంబనంబు నాదరంబు లేని
ఆదిమాంధ్రకులుడ నని నమస్కృతి జేసి
విన్నవించుకొంటి స్వీయచరిత

తే.గీ. ఆదరచ్ఛాయ లాస్యంబు నలమికొనగ
పడకపై లేచి కూర్చుండి గడియ గడియ
దగ్గుతెర లడ్డుపడ గద్గదస్వరాన
"రమ్మి కూర్చుండు" మని సమక్ష మ్మొసంగె

కం. వినిపింపుము నీకవనం
బను కమ్మనిమాట విని భయంబును దడయున్
బెనగొన వినిపించితి రు
క్మిణికల్యాణమును చాటుకృతి లిక్కరిణిన్

'రుక్మిణీవిరహబాధకు కుంది తల్లి కృష్ణుని ధ్యానించుఘట్టమున'

మ. "అనయంబున్ దవనామమంత్రపవనం బన్నంబుగా చండకుం
డినకాంతారమునం దయోగ్యమృగకోటిన్ నీదుజాయాతప
స్విని కాలంబు నుపక్రమించెడిని నీ చిద్రూపసందర్శనం
బున ముక్తిన్ గలిగింపవే! తనయ నామోదింపవే శ్రీహరీ!"

'దుర్గపూజాఘట్టంలో'

మ. "గడిసే పొక్క యుగంబుగా గడపితిన్ కంజాయతాక్షా! దివం
బులు రాత్రుల్ ఘటికాసహస్రములు రేపో! మాపో! యేతెంచి కా
వడె నాథుం డని యిప్పు డేమని తలంపన్ జాలుదున్ నాథ! నా
ల్గడుగుల్ సాగెడు కాల మున్నది మహాత్మా! ముంతువో తేల్తువో"

'యుద్ధఘట్టంలో'

శా. "ఆవంకం బరువెత్తుడీ! అడుగొ కన్యాతస్కరుం డేమి సా
ళ్వా! వెంటాడవు? పౌండ్రకా! కలసిరా వాలస్యమా? దంతవ
క్త్రా! వారింపు విదూరదా? కదన మారంభింపుడీ! యోధులా
రా? వైళంబ అదల్పుమీ నడుపుమీ రథ్యంబులన్ సారథీ!"

శా. "మంధాద్రిప్రతిమానధైర్యబలవన్మాంసాశనోన్మత్తదు
ర్గంధేభోన్నతకుంభభేదనకళాప్రావీణ్యు డీతండు గ
ర్వాంధత్వంబున తూలనాడితివి మాయన్నన్ మురారిన్ జరా
సంధా! నీమద ముక్కడంతు నిలుమీ సంగ్రామరంగంబునన్"

సందేశం

తే.గీ. "ఎఱిగియుందువు సర్వంబు నెఱిగియుండి
ఎఱుగన ట్లుండి యెఱుగని నరులచేత
నెఱుకపరపించుకొందు వే నెఱుకజేయ
నెంతదానను కడ కింతి నేలుమనుము"

చం. చదివినపద్యముల్ విని ప్రసన్నమృదూక్తుల "మేలు మేల్ మహా
భ్యుదయము ముందుముందు గలదోయి కవీ! కులభేదశాకినుల్
మెదలెడు దేశ మిద్ది నిను మెచ్చదు మెచ్చిన మెచ్చుకున్న శా
రద నిను మెచ్చె మానకుము ప్రాప్తకవిత్వపరిశ్రమంబులన్

కం. గున్నేశరావుగారు ప్ర
సన్నులగుట మెచ్చదగ్గ సంగతి యిది నీ
యున్నతికి మొదటిమె ట్టగు
కన్నెకళల కతడు కల్పకంబంద్రు కవీ!"

కం. వ్రాసి ముగించితి కతిపయ
వాసరముల నాటకమును వహవా! వా! శహ
బా సనె గున్నేశ్వరుడుం
వాసికిరా దొడగె పేరు పదుగురిలోనన్

కం. శ్రీపాదవారి బొబ్బిలి
నాపురి నాటకసమాజ మాడుచునుండన్
మోపుగచూచితి నక్కవి
తాపద్ధతి నచ్చదయ్యె తథ్యము సుమ్మీ!

కం. పడికట్టురాళ్ళతో గ్రిం
గుడువడని పదాలతోడ గురువీరకథా
జడనిధియగు బొబ్బిలికథ
ముడిబెట్టి ముగించినట్లు బుద్ధికి దోచెన్

శా. ఏ దెట్లైనను వీరబొబ్బిలి పదంబే ఆంధ్రరక్తంబునం
దూదున్ బౌరుషబాడబానలము వీరోత్సాహ ముప్పొంగి యు
న్మాదం బెత్తి యువాను డొక్కడు సభామధ్యంబునం జంపె దా
యాది న్నే నలపాపరాయడనురా యంచున్ గఠోరంబుగన్

కం. కవిహృదయ మెరిగి నటక
ప్రవరు లభినయింప రసము రంజిలు కథ వా
స్తవమగు ప్రేక్షకు లెల్లరు
నవుదురు నటకులుగ పొల్తు రభ్రాంతమునన్

శా. కొండ్రాయడు పాపరాయ డయి యుద్ఘోషించి రోషించి యు
ద్ధండాకారత రంగమధ్యమున ప్రత్యక్షించి రామక్షమా
ఖండాధీశ్వరు సంహరించు కరకుంఘట్టంబునన్ బ్రేక్షకుల్
బండంబారెద రిప్పుడున్ మది తలంపం గంప మేపారెడిన్

కం. మల్లమ్మదేవియై నట
తల్లజు డగు జగ్గరాజు దర్శన మిడగా
యొల్లెల్ల కండ్లుగల సుర
వల్లభు డగుచుండు తత్సభాస్థల మెల్లన్

మ. యమునాతీరపు సైకతస్థలుల క్రీడాసక్తులై వేణుగా
నములన్ సల్పుచు సత్కవుల్ ప్రణయసౌందర్యంబు లర్చించుచో
సమరోన్మత్తజగంబునన్ వెలుగు నాశాంత్యంశువుల్ ప్రేమకా
వ్యము లీదేశదరిద్రతాదవము లార్పంజాలునా! కాముకా!

మ. పరమార్థం బను నభ్రపుష్పమునకున్ వన్నెల్ విలాసాల్ రచిం
తురు వేదాంతులు దృష్టిగోచరజగత్తున్ మిథ్యగా బల్కి గం
దరగోళంబున ద్రోతు రీప్రజ నవిద్యామగ్నులన్ దుష్కవీ
శ్వరు లమ్మాయిలకై రచింతురు తమాషాగేయవిజ్ఞప్తులన్

తే.గీ. హృదయపరివర్తనంబును సృష్టిచేయు
హృదయ మావశ్యకం బగు కృతుల కెపుడు
రాజుకొని కాల్పగల నిప్పురవ్వ లేక
యెండపెల్లున గాలునే యింధనములు

ఉ. కన్నులు లేక కండగల కమ్మనికావ్యము లల్లి భాషకున్
కన్ను లొసంగి నట్టి గుణగణ్యుడు లింగకవీంద్రుశిష్యులన్
మిన్న నృసింహనామకమనీషివరేణ్యుడు చిల్కమర్తి వం
శోన్నతు జూడబోయితి యశోజ్వలు కొండొకనాటిమాపునన్

కం. దూరముననుండి యెవ్వరు
వా రని చనుదెంచునట్టివారు ఫలానా
వా రని గుర్తించెడు ప్ర
జ్ఞారాజన్నేత్రు దాత్మనయనుండు జుమీ

తే.గీ. వీధిగుమ్మములో గాలుబెట్టి లోని
కరుగకయముందు రండు రండంచు చెలిమి
కాని నామంత్రణము చేయుకరణి బిలిచె
చక్షు లేటికి విజ్ఞానచక్షువులకు

తే.గీ. ఆదిమాంధ్రుడ కవనంబు నల్లగలను
పేరు జాషువ రఘురామవీరవరుడు
పృథివిజాతాపహరణంబు విన్నచోటు
శ్రుతగిరిపురంబు నాది నృసింహసుకవి!

తే.గీ. అని విన్నవింప నాదర
మును ముద మాననసరోజమున వెల్గగ నా
సనమున గూర్చుండుము ర
మ్మని పల్కెన్ మధురమందహాసం బొలుకన్

మ. తల పంకించుచు మేలు మేలనుచు నుత్సాహంబు గల్పించు న
య్యలఘుస్వాంతున కస్మదీయకృతు లాయాఘట్టముల్ నిర్భయం
బలరారన్ వినిపింపంగా నలరి నేత్రాబ్జంబులన్ సమ్మదా
శ్రులు వర్షించి వచించె ధన్యుడ వటంచున్ బూర్ణవాత్సల్యతన్

కం. శ్రుతగిరి వాస్తవ్యుడ మీ
కృతు లెరిగినవాడ చూడ నేతెంచితి సం
స్కృతిగల్గువాడ బుధసం
గతిచే కవనంపుదురదగలవాడ నయా

కం. అని నాకథ క్లుప్తముగా
వినిపింప ముదంబు నంది పీఠం బిడి య
ల్లినపద్దియములు నాలుగు
వినుపింపు మటంచు బల్కి వీను లొసంగెన్

కం. మత విద్వేషం బను ప్రో
ద్ధతమదదంతావళంబు దంతంబులతో
చితుకం బొడిచిన యొక ప్రా
కృతదేవాలయము మత్పురిం గల దొకచో

కం. అం దొక పాషాణముపై
సందెకడన్ విశ్రమించి జారిన కాల
ధ్వాంతాంతరాళగతవృ
త్తాంతవిచారంబు మదిని తళుకొత్తంగా

శా. "ఏరాజన్యుని పాలనంబునను నీ కీదివ్యదేవాలయ
ప్రారజ్యప్రతిరూప మబ్బినది మీయానాటిపూజాపున
స్కారాచారము లేమి? భూమిజ సమాచారంబు రాముం డిటన్
బ్రారంభంబున విన్నవా డట నిజంబా? వృద్ధపాషాణమా!"

కం. అని వ్రాసిన పద్యంబును
వినిపించితి నారసింహవిబుధుడు వదనం
బున హాసరోచి వెలుగం
ఘనసంతోషమున నన్నుకౌగిట జేర్చెన్

ఆ.వె. చిలకమర్తి నారసింహు నాశీర్వాద
బలము నాదుకళకు బల మొసంగ
ధృతివహించి వ్రాసితిని 'మదాలస'నాట
కమును మాసపంచకంబునందు

ఆ.వె. ఒకడు ప్రోత్సహింప నొక్కడు నిరసింప
నొకడు చేరబిలువ నొకడు తరుమ
మిట్టపల్లములను మెట్టుచు నెట్టులో
పలుకులమ్మ సేవ సలిపినాడ

మ. నలత్రాచుల్ బలె వర్ణభేదములు నాల్కల్ సాచుకాలంబునన్
వలచెన్ నన్ను కవిత్వవాణి పసరుం బ్రాయంబునన్ వెట్టిబా
గులదై బన్నము లందుకొన్నది విడాకుల్ గోర దీనాదు, బి
డ్డలు పాపల్ గలదై చరించెడిని రాష్ట్రఖ్యాతి నార్జించుచున్

ఆ.వె. ఆంగిలేయ భయదహర్యక్షమును నూలు
పోగు లుచ్చులొడ్డ యోగివరుని
శంఖరవము లింక సకలదిక్కుల మారు
మ్రోయనట్టి ప్రాతరోజు లవ్వి

ఆ.వె. రాణ్మహేంద్రపురి నురామరగా మూడు
వత్సరాలపాటు వాసముండి
కాలజలధిలోన గలసిన వేంగిభూ
భుజులకథలు చిత్తమునను మెరయ

సీ. సారంగధరుని వెచ్చని రక్త మింకిన మెట్టకు కన్నీటిబొ ట్టొసంగి
చిత్రాంగిచిత్రాతిచిత్రగాథను జ్ఞప్తి కందించు జీర్ణహర్మ్యముల నరసి
నన్నయభట్టు స్నానంబాడి చనురేవు లిదమిత్థ మని నిర్ణయింప దిరిగి
రాజరాజాంధ్రభారతకృతిం గైకొన్న కొలువుకూటపు చోటుకొరకు నెమకి

తే.గీ. పండితులు రచ్చచేసి వివాదపడుచు
ఘనుని శ్రీనాథుదృష్టి కెక్కిన స్థలంబు
యిది యి దౌనంచు నెది నిర్ణయించలేక
మధురమధురస్మృతుల మేను మరచినాడ

ఉ. గట్టులు దన్ని పారుచు నఖండరయంబున వచ్చు నబ్ధిరా
ట్పట్టపురాణి గౌతమికి భక్తులు కానుక లిచ్చి క్రుంకులన్
బెట్టి చరించు పుష్కరపువేళల వైభవమెల్ల కన్నులన్
గట్టినయట్టు లుండు గతకాలము వచ్చునె భిక్ష మెత్తినన్

కం. ఆనాటిపుష్కరోత్సవ
మానందముగొల్ప పద్దియము లల్లి యిదే
కానుక నీకని పత్రము
నానదినీరమున త్రోసి తావేశమునన్

శా. ఆలోచించితి నిల్లు జేరి నదికి ట్లర్చావిధుల్ సల్పుటల్
మేలే? మేలు ఘటించునే ప్రకృతికిన్ మేధస్సు పెంపారునే
వేలున్ లక్షలసంఖ్యసంఖ్యలు ప్రజల్ విచ్చేసి సద్భక్తితో
పూలుం బండులు కాన్కలిత్తు రిదిజబ్బో! లేక ఆరోగ్యమో!

తే.గీ. ఇరుగడల తీరభూముల విరగ దన్ని
పల్లియల పక్కణముల గర్భమున గ్రుక్కి
భయదరూపిణియై మహోర్భటి నటించు
కటికినీటికి తలకాయ గలదె తలప!

ఆ.వె. పొట్టకోస మారెబట్టి గట్టున నున్న
మానవులకు పుట్టుబానిసలకు
వచ్చిపోవువారి పాదరక్షలధ్యాస
తప్ప పుష్కరాలధ్యాస సున్న

ఉ. డబ్బు లఖండగౌతమిజడంబుల జిమ్ముచు భక్తకోటి పె
న్జబ్బులతో తపించెడు ననాథులు చేతులు సాచి మ్రొక్కినన్
కొబ్బరిముక్కలన్ విసరికొట్టుచు తిట్టుట జూచి గ్రుడ్లనీ
రుబ్బ మొగంబు త్రిప్పుకొని యూర్పులు జిమ్మితి వెచ్చవెచ్చగా

ఆ.వె. ఒక్కభక్తవరుని నొడిసి యెత్తుకుపోయె
మొసలి యొకటి నీట మసలుచుండి
"మేలు మేలు పర్వకాలాన జచ్చుట
పున్నె"మనిరి చూచుచున్నవారు

ఆ.వె. ఇన్నివేలమంది కేయభీష్టము లిచ్చి
యెట్లు తృప్తిపరచు నీ స్రవంతి
జడపదార్థములకు సచ్ఛక్తు లిండియా
ఖండమందె డాగి యుండునేమొ?

మ. అని పృచ్ఛించితి మిత్రు నొక్కని నతం డాలించి యొక్కింత హే
ళన గావించి "మహానుభావులు ఋషుల్ సంధ్యాద్యనుష్ఠానముల్
మునుకల్ సల్పి తరించిపోయిన మహాపుణ్యాపగాదేవి ద
క్షిణగంగాఖ్య స్రవించు నబ్ధిసతి వేంగీకొంగుబంగార మౌ"

ఆ.వె. అనుచు చెప్పసాగె నాతండు పుక్కిటి
కతలు నాకు కొంత మతిచలింప
గ్రుడ్డినమ్మకాల కడ్డుచెప్పుటకన్న
కొఱవితోడ గోకికొనుట మేలు

తే.గీ. "కవనమేడ్తువు గాబో లఖండు డైన
శబ్దశాసను డిన్నదీజలము గ్రోలి
వ్రాసినా దండ్రు భారతగ్రంథ మెల్ల
భీమకవిజిహ్వా కిదె వాక్కు భిక్షపెట్టె

కం. అస లీనది పగలెల్లన్
రసరూపు ధరించి నిశల రమణీయదివౌ
కసనతియై యర్చించెడి
నసమనయను కలువపూల నశ్రాంతంబున్

కం. గౌతమసన్ముని కీనది
కూతురు జలరాశి పెండ్లికొడుకై మునుపీ
గౌతమి జడ నుంచిన కం
జాతసరాల్ నేటి కుదయసంధ్యల పూయున్

కం. గగనంపుపూవు లరచే
నగుపించెడు" నంచు భక్తు లల్లినగాథల్
తెగవాగు నతనితో నిక
సిగప ట్లగునంచు బదులు చెప్పక వింటిన్

చం. వినివిని ఉత్తమంబగు కవిత్వపటుత్వమఖండగౌతమీ
ఘనతరస్నానపానముల గల్గు రహస్యము చెప్పి జన్మపా
వన మొనరించినాడవు సెబా సని కౌగిట జేర్చి ఖడ్గవా
దన కెడమీక పంపితి, నతండును పోయె సలాము గొట్టుచున్

కం. ఖాయములగు భిన్నాభి
ప్రాయములే ద్వేషమునకు రహదార్లని నే
నాయువక సఖునిహృదయము
గాయముగా కెదురుపల్కకయ వినుచుంటిన్

కం. పదివేలగొంతు లొకటై
వదరు నబద్ధప్రచారవాహిని కెదురై
బ్రదుకుట దుర్లభ మెంతటి
యథార్థమున్ దుదకు నగ్నమగుహేళనకున్

## భూతపీడ

కం. భూతము సోకెం గొండొక
రాతిరి నాసతికి ముద్దరా లెదురాడన్
భీతిలు మితభాషిణి వా
క్చాతురి గల దగుచు లేచె శాంభవికరణిన్

ఆ.వె. పాలు ద్రావుచున్న పాపనవ్వల వైచి
పండ్లుగొరికి గుండెబగులనరచి
వెఱ్ఱినవ్వు నవ్వి భీకరాకారయై
చిందులాడసాగె చిటుకలోన

కం. దయ్యాలపేరు జెప్పిన
నుయ్యాలై యూగిపోవుచుండెడు నాకే
తొయ్యలియే పెనురక్కసి
దయ్యంబై పట్టె విధినితప్ప వశంబే?

కం. యాదాలాపముగా నే
నేదో రచియించుచుండి యిల్లాలిభయో
త్పాదక మగు నాకారం
బదాటుగా జూచి స్తంభితాంగుడ నైతిన్

కం. నట్టింట బాతిపెట్టెద
ముట్టెపొగ రడంతు నంచు భూరిక్రోధం
బుట్టిపడ బల్కి నామెడ
బట్టుకొనె న్యాయవస్థ పరము దెరుంగున్

కం. పట్టువిడిపించుకొని నే
నెట్టో పసిబిడ్డతోడ నీవలబడుచుం
బెట్టిన కేకలు విని నన్
జుట్టుకొనిరి పౌరు లనుగు జుట్టాలవలెన్.

ఆ.వె. భూతమంత్రగాడు మొగదల నున్నాడు
భయము వలదు పిలువబంపినాము
నిబ్బరింపు మంచు నెన రూని నావీపు
జరచి ఇరుగుపొరుగు పురుషవరులు

కం. ఎఱ్ఱని కుంకుమతిలకము
నెఱ్ఱని కనుగ్రుడ్లు గడ్డ మెఱ్ఱనిపంచల్
గుఱ్ఱపు పిడిగల వంకర
కఱ్ఱం గొనివచ్చె మంత్రగా డురుఠీవిన్

మ. అత డుగ్రాకృతిదంతముల్ గొరికి ఆహోకారముల్ చేసి మం
త్రితభస్మంబున బొట్టుబెట్టి "యిట కేదేశంబునం దుండి వ
చ్చితివే భ్రష్టపిశాచిముండ! యిదిగో సీసాల బంధింతు దు
ర్మతి! లే" లెమ్మని హుంకరించి గదిమెన్ హ్రాంహ్రాము ధాంధూములన్

కం. విడ్డురపునవ్వు నవ్వుచు
గ్రుడ్డు లురిమి లేచి మాంత్రికుని దిట్టుచు నా
గుడ్డా! ఎవడుర నీ వని
గడ్డము లంకించుకొనియె కరయుగ్మమునన్

కం. గుప్పెడు గడ్డం బూడన్
జప్పున దప్పించుకొని "యసాధ్యపు దయ్యం
బప్పా!" యని మెలిమెల్లగ
దప్పుకొనియె గుంపునుండి ధైర్యచ్యుతుడై

కం. తల విరియబోసికొని కే
కలు పెట్టుచు లేచి చుట్టు గ్రమ్మిన జనమున్
దొలగుం డని గోదావరి
వలనునకుం బరచె వెంటబడి రంగనలున్

కం. మొలబంటినీట బడి ని
శ్చలముగ నిలుచుండి యేమి జరిగినదే నెం
దుల కిందు నీట మునిగితి
తెలుపు డనుచు నడుగ సాగె దీనాననయై

ఉ. గండము దప్పె నాంధ్రకవిగానికి రాజమహేంద్రువీట నె
న్నండొ యెఱుంగ నీదినమునన్ బ్రియకాంతకతాన నెంతయున్
గండముదప్పె పిల్లకవిగానికి నా కని సంతసించితిన్
గుండె దిటంబు జేసికొని కోమలి నింటికి జేరవైచితిన్

## నోట్లకేసు

కం. "చెరసాల కేగె గున్నే
శ్వరరాయడు నాట్యశాల బంధిత మయ్యెన్
పరువుగలవాడు నూరికి
కరణము కలవాని కెంతకష్టము వచ్చెన్"

తే.గీ. అనుచు బౌరులు గుమిగూడి యాడుకొనెడు
నవసరంబున విని గుండియలు చలింప
పాఠశాలకు చనక తద్వాస్తవంబు
నారసితి చింతతో నిల్లు జేరుకొంటి

మ. నడచెన్ గే సిరువత్సరంబు లల చెన్నాపట్టణంబందు పే
ర్వడి వేవే ల్గడియించు లాయరులు నాంధ్రన్యాయవాదీశ్వరుల్
సడిసన్నట్టి తెలుంగుకేసరి ప్రకాశాఖ్యుండు శ్రీ టంగుటూ
ర్విదుగుం గోర్టు నలంకరించిరి సమరీభూతన్యాయజ్ఞులై

కం. ఆయన చేసిన నేరం
బేయదియో నాటివరకు నెరుగ దగానో
ట్లాయనయింటన్ ముద్రణ
చేయించుట వాని నూర చెల్లించుటయున్

కం. వడుగుల పెండ్లిం డ్లెన్నో
నడిపిన పెనుదాత బ్రాహ్మణప్రవరుడు నే
డిడుమల బడె నని కటకట
పడి రెంతయు రాణ్మహేంద్రపౌరప్రముఖుల్

ఉ. నాటకసత్కళావనము నాటిన మేటి దయాసమగ్రు డీ
నాటికి జైలుపాలబడి నా డని కన్నులు చెమ్మగిల్లగా
పేటలు పల్లెలున్ వగచి పిన్నలు పెద్దలు వేనవేలు తీ
ర్థాటన కేగువారివలె న్యాయనివేశము నిండి రెంతయున్

కం. అచ్చెరువు వడుచు నెంతటి
సచ్చరితుడు గాక యింత జనవాహిని నే
డిచ్చటికి వచ్చునే యని
మెచ్చుకొనెన్ సీమజడ్జి మృదులాశయుడై

కం. నటులకు రచయితలకు సం
కటికరవై పొసగె నష్టకష్టములు యె
ప్పటివలె బడిపంతులునై
యటమట బడుచుంటి జారె నాదాయంబున్

శా. కట్టుంబుట్టములెల్ల నమ్ముకొని మా కష్టాలకుం దోడు జూ
పెట్టెన్ రిక్తకరంబు లొక్కమడివేల్ విత్తంబు నర్థింపగా
దట్టిగట్టి లడాయికిం దిగియె శాంతంబూని లోలోపలన్
పుట్టెం దేడుపు పొంగిపోవ నిలయంబున్ జొచ్చి నిట్టూర్చితిన్

కం. వేసగి సెలవులలో నిజ
వాసమునకు జనుచు విజయవాడను రైల్వే
స్టేసనులొ గలసితి ఫిలిప్
లైసనురింగనెడు నొక కళాకాముకునిన్

తే.గీ. తమ్ముడును నేను నేత్రావధానవిద్య
గర్తపురి ప్రదర్శించినకాలమందు
పరిచయం బైన విషయంబు నెరుకపరచి
చనవుజూపుచు హస్తచాలనము జేసె

కం. ప్రస్తావవశమునం దొక
క్రైస్తవపండితుడు మాకు గావలె గుంటూర్
బస్తీ ట్రైనింగ్‌బడికిన్
"వస్తారా" యంచు నతడు ప్రశ్నించుటయున్

కం. అంగీకరింప నతఁడు
పొంగుచు మరుమాసమందె ముట్టు మెకాలీ
యంగన ద్వారా ఆర్డ రొ
సంగుడు సెలవంచు మిత్రసత్తము దరిగెన్

కం. యాదృచ్ఛికముగ గల్గిన
యాదైవికఘటన నాదు నభ్యుదయకళా
వేదికి రెండవమెట్టని
మోదం బందితిమి కూర్మి పొలతియు నేనున్

కం. గడియలు విఘడియలు లె
క్కిడుకొంచుం బోష్టుమ్యాను లెదురైన హడా
విడిపడుచు నుండవచ్చెన్
ముడికవ రార్డమ్మిడీలు ముదరా గొనుచున్

కం. ఎవరో యనామకుడు క్రై
స్తవు డొక్కడు వధువు తల్లిదండ్రులపేళ్ళన్
వివరముకొరకై వ్రాసిన
కవ రది నాపేర నొకడు గల డావీటన్

ఉ. ఆగితి కొన్నినాళు లపుడార్డరు వచ్చె తెలుంగుమాష్టరో
ద్యోగము చేయ రమ్మనుచు తొయ్యలితో పయనంబు గట్టి యా
శ్రీగల గర్తపట్టణము జేరి మెకాల్డొరసాని జూచితిన్
స్వాగత మిచ్చి యర్హ మరియాదలుచేసిరి పంతులయ్యలున్

కం. వయసున నరుబది యేబది
పయిబడి ట్రైనింగు జదువువారిం బంతు
ళ్ళయియుందు రని భ్రమించుచు
నయి దార్గురికి నమస్సు లని సిగ్గిలితిన్

చం. తెలుగుమహాసముద్రమున తీరము జేరుటగాదు గట్టునన్
గిలకలబంటి నీరమున నిల్చిన నే నొకపండితుడనై
కులుకుట యాత్మలో భయము గొల్పుచు నున్నను పైకి బిఱ్ఱుగా
మెలగి ప్రతిష్ఠ నిల్పుకొని మెప్పుల నందితి పాఠశాలలో

కం. వంగర సుబ్బయ సినిమా
రంగమున నేడు మిగుల రాణించు కళా
చంగుండు నాగురుత్వపు
రం గంటిననాటి శిష్యరత్నంబ జుడీ!

కం. నాపేపబెత్తములచే
తాపులు దిని నెరసియున్న తలతో కవియై
యేపారు వేమరెడ్డియు
కోపించుం గురుత నొప్పుకొన కీనాడున్

కం. డంబాల ఆడుపెత్తన
ముం తంబళదొరతనంబు పోలిక మేకా
ల్యంబాదొరతన మతిక
ష్టం బా బడిగురుల దయకు సాయాహ్నములన్

కం. పంతుళ్ళమీద నూరక
గంతులువెట్టుచును చిన్నికారణములు పె
ద్దింతలుగ దలచి నెల కొక
పంతులుపని యూడగొట్టి పంపుచు నుండన్

కం. నాకు నిరుమూడుమారు ల
దేకర్మము సంభవించి యే దైవదయా
లోకనబలమో శ్రీముఖ
మీకుండె మెకాలిదొరకు నిష్టుడ నగుటన్

కం. డీయీవో బడితనిఖీ
జేయుటకై వచ్చు చలువజేసిన డ్రసు నొం
డీయంగలవా యని రా
జా యను పక్కింటిమిత్రు నర్థించుటయున్

కం. టిక్కెటు కలెక్ట రాతం
డక్కాలమునందు పెట్టె లన్ని వెదకి యీ
చొక్కా షరాయి తాల్పుము
పక్కాదొర వగుదు వంచు వాక్రుచ్చుటయున్

ఉ. నల్లనిసూటుతో మిగులనల్లని నెక్టయితోడనంతకున్
నల్లనిబూట్లతోడ నొకనాడు తయారయి స్కూలు కేగితిన్
బళ్లకు వల్లభుం డయినవాడు గుణాఢ్యుడు వచ్చె డీ.యి.వో.
తెల్లని తాంసనాఖ్యుడు విదేశజు డెంతయు శాంతమూర్తియై

శా. డీయీవో తనిఖీ ముగించుకొని యేడీ పండితుం డంచు న
న్నే యాహ్వానము జేసె నేను చని సాన్నిధ్యంబునన్ నిల్చితిన్
నాయాకారము సూటు బూటు గని తీక్ష్ణంబైన కంఠాన "నాం
గ్లేయాచార్యుని గాదు పో" మ్మనుచు బల్కెన్ నన్ను కోపించుచున్

కం. "ఇత డాంధ్రపండితుం డని
కృతులున్ రచియింపగల కవీశ్వరు" డంచున్
బ్రతిచెప్పె పెద్దపంతులు
నతదేహుం డగుచు గడు విన మత దొరకున్

ఆ.వె. "గుండుమీద పిలక కుండలమ్ములజోడు
పండితులకు సహజమండనాలు
పైన నింగిలీషులో నాంధ్రమా? పాత
పండితుం" డటంచు బలికె దొరయు

కం. యేసూక్రీస్తునిపుట్టువు
వ్రాసితి నాటకముగా యభాగ్యపుమతస
న్యాసులయనాదరణమున
భాసింపకపోయె నదియు పనితనమునసే

తే.గీ. భారతీమాసపత్రిక ప్రభవమంది
పలుకులవెలందికందాలు జిలుకు వేళ
వ్యాసకర్తగ కాశీకులాభ్రహేళి
యెలమి న న్నెన్నుకొనియె నాగేశ్వరుండు

మ. ప్రకటింపంబడె భారతిన్ దొలుత కర్ణవ్యాస మైదారునా
ళ్ళకు నీపద్యము లింపుచేయగ విరాళం బంపుచున్నారు పా
తికరూపాయలు విశ్వదాతలని యాంధ్రీపత్రికాఫీసు ము
ద్రికతో ద్రవ్యము నుత్తరం బొకటిచేరె న్నా కనూహ్యంబుగన్

తే.గీ. కన్న కలలెల్ల నిజములే గావుగాని
నాయదృష్టంబుకతన స్వప్నంబు లిట్లు
తథ్యమై విశ్వదాతృనాదరణమునకు
నన్ను గురిజేసె ననుచు నానందపడితి

శా. అచ్చొత్తించితి రుక్మిణీపరిణయం బచ్చోట నిచ్చోట నే
బిచ్చంబెత్తి క్రమక్రమంబుగ ప్రజాప్రేమాదకం బబ్బె నీ
కుచ్చస్థానము జిక్కు నన్న హితవర్యుల్ బంధు లాడాడ వా
క్రుచ్చున్ వించు పరిశ్రమించితి తెలుంగుందోట పుష్పింపగన్

కం. చాలీచాలని రాబడి
ఆలికి నా కనుగుసుతుల కటునిటు కాగా
కాలము గడపుచు నాలుగు
నాళుల విలిఖించినాడ నవల నొకందున్

చం. కలరు తెనాలిలో ధనము గల్గిన పుస్తకవర్తకుల్ కొనం
గల రని సిద్ధమై దిగులుగా పయనించుచు రైలుపెట్టెలో
గలసితి మేల్మిబంగరు జగాజిగి గల్గిన మేనివన్నెలన్
గలిగిన ధారుణీసురుని కామశతప్రతిమానవిగ్రహున్

కం. భట్టిప్రోల్కులవీరుడు
రట్టడి సూర్యప్రకాశరాయడు రౌడీ
జట్టులనాయకు డింకొక
తట్టున గూర్చుండి యుండి దరికిం బిలిచెన్

కం. నాకవన మెపుడొ యొక్కిం
తాకర్ణించిన సుపరిచయంబున యితడే
నీకు న్నే జెప్పిన జా
ష్వాకవి యని చెప్పి నన్ను పరిచయపరచెన్

కం. శ్రీశైలపతియితండు క
వీశుల ప్రేమించు త్యాగి వీరుడు కలవా
డాశువుగా నీకవితా
ప్రాశస్త్యము దెలియ పలుకు పద్యం బనియెన్

కం. చెవి గోసికొను నితండున్
కవనం బన నన్నుబోలి కవివర! మేలే
యవు మంచివేళ వచ్చితి
వవురా! యని పల్కి మెదిమె నాశాంకురముల్

కం. భారతవీరుం డని నే
"భారతి" కిం బంపినట్టి పద్యంబులు నా
ధోరణిలో జదివితి గం
భీరగళస్వనముతో విస్ఫుటఫణితిన్

కం. ఆనందబాష్పబిందువు
లానవనీతాత్ము దక్షులం దొలికి భళీ!
ఆనాటికర్ణశరములు
గానీ యివి పద్దియములుగావు కవీంద్రా!

ఆ.వె. అనుచు మెచ్చుకొనెదు నంతలోన తెనాలి
ప్లాటుఫారమందు బండి నిలిచె
పోయివత్తు నంచు బోవు నన్నుం గౌగి
లించి కొంచె ముందు మంచు బలికి

మ. కరుణావీరరసాలు నీకలమునం గంగాప్రవాహంబులై
పరువుల్వారు శివాజికావ్యము రచింపన్ గోరెదన్ దానికిన్
వరుడ న్నే నని పచ్చనోట్లయుగళిన్ నాహస్తమం దుంచి, య
చ్చెరువున్ గొల్పి ప్రయాణమై చనియె శ్రీశ్రీశైలపత్యాఖ్యుడున్

కం. కృప నన్ను నేల శ్రీ శై
లపతియె రావూరి సత్కులద్యోమణియై
యుపకృతి చేయం బుట్టెనో
కపటార్యమనందనుండొ కద యనుకొంటిన్

కం. కృతిపతివంశము శివభూ
పతివంశము కొంత వ్రాసి బాపట్లకు బో
యితి నొక పర్యాయము వినిపిం
చితి శ్రీ శ్రీశైలపతికి శీలవ్రతికిన్

## కుప్పుస్వామి పరిచయము

కం. జిల్లాబోర్డధిపతియై
కొల్లగ టీపారిటీలు గొనుచుండె యశం
బుల్లసిల క్రమకులరా
ట్తల్లజు డగు కుప్పుసామి దానస్థిరుడై

మ. ఘనసన్మానసభామహోత్సవము సంకల్పించి ఆనాడు మా
వినుకొండం గల బోర్డుమెంబరులు తరద్వృత్తాంత మాలించి ర
మ్మని ఆహ్వానము రాకపోయినను పద్యశ్రేణి సృష్టించి హె
చ్చిన యుత్సాహముతోడ బోయితిని సంసిద్ధుండనై వేళకున్

కం. చదివిరి పెక్కురు కవు ల
య్యదనున నాపద్దియముల కాత్మ నలరి నూ
ర్పదియారుల్ చదివించె సభా
సదు లచ్చెరువంద కుప్పుసామియు బ్రేమన్

తే.గీ. ఉభయభాషాప్రవీణు లుద్యోగములకు
ప్రాకులాడెదు పండితుల్ పలువురుండ
యోగ్యతలు లేని నాకు నుద్యోగ మిచ్చి
పండితుని జేసి పంపె బాపట్లబడికి

చం. క్రమముగ నెన్మిదేడులు మెకాల్డొరసాని నిరంకుశాధికా
రమునకు లొంగిపోయిన శిరంబు నిటారుగ నిక్క దాస్యపా
శము విడినట్టు లామిషనుసర్విసు కాళ్ళకు మ్రొక్కి నిండు మో
దమున పరిగ్రహించితిని తత్పదవిన్ హితు లుల్లసిల్లగన్

తే.గీ. పదియునారేండ్ల లేలేతప్రాయమందె
మా కుపాధ్యాయుడై తెల్గుమధురిమంబు
నోలి తెల్పిన శ్రీ యోగిరాల శాస్త్రి
పీఠమే యబ్బురముగ నబ్బినది నాకు

కం. పంచాపకేశు డను గా
వంచాల ద్రావిడీడు పంతుళ్ళను పా
లించు బడాపంతులుగా
పంచాశద్వర్షములకు పైగా నుండెన్

కం. నాపద్యపఠనవైఖరి
నాపాఠము చెప్పుతీరు నచ్చినదేమో
రేపులు మాపులు క్లాసున
కోపికతో వచ్చి వినుచునుండు దినంబున్

కం. ఏమియ! యేమియ్యా! కుపు
సామీ! అడడడడ వీ డసాదు డనుచు నా
సామర్థ్యము నుతిచేయుచు
ప్రేమించెన్ గుప్పుసామి విస్మయమందన్

తే.గీ. వినుకొండకు పదవి మార్పించుకొంటి
కతిపయదినాల కాయూరిమెతుకు పడక
సుగుణములవెల్లి నాకూర్మిసుదతిమిన్న
గృహము దీర్చంగ కృతులు నిర్మించుచుంటి

ఉ. కేలను డబ్బులేదు సురిగెన్ సహజన్మునిపెండ్లి నాపయిన్
నాలుగువేలు గావలయు నాకనినన్ మరుమాట లేక శ్రీ
శైలపతిప్రభుండు సహజన్ముడు గాని సహోదరుండు నా
నాలుగువే లొసంగె కరుణన్ నెరవేర్చితి పెండ్లికార్యమున్

కం. ఇరువురుకూతులు తనుభవు
లిరువురు నిల్లాలు పితలు యే కలతలకున్
గురిగాక హాయిగా కా
పురమును సాగించినా మపూర్వైక్యతతో

ఆ.వె. గోపరాజుగారి కోడలై మొనమొన్న
పట్టభద్రయైన చిట్టితనయ
లలితహృదయ హేమలతయు నా పిరదౌసి
కృతికుమారి యొక్కయీడువారె

ఉ. అచ్చుకు డబ్బులేక కథయం దొక కొంత రచించి యెందుకో
నచ్చక పూర్తిచేయకయె నాలుగునెల్లు సగంధగోష్ఠలం
దచ్చట నిచ్చటన్ జదువు టప్పటి మా బడిపెద్దపంతులు
దృచ్చరితుండు నా యభిమతంబు గ్రహించి కృపాంతరంగుడై

కం. నా తండ్రికి కృతియి మ్మిది
ఖ్యాతికి రాగలదు మంచికావ్యం బని నా
చేతం బుత్సాహ స
మేతముగా బలికి దొడ్డమే లొనరించెన్

ఆ.వె. ప్రథను గొన్న సింగరాజు మల్లపరాజు
కల్ల కపటమునకు కానివాడు
పరహితార్థమునకు పనికివచ్చెడువాడు
పలికి బొంకుపనికి పనికిరాడు

మ. తొలి ముద్రాక్షరరూపురేఖలపసందుల్ సింద పిర్దొసి ప
ల్కులకల్యాణికి భూషగా సకలదిక్కుల్ ద్రొక్కి క్రీడించి పె
ద్దల వ్యాఖ్యాతల మన్ననల్ వడసి విద్యాశాలలం బట్టణం
బుల నార్జించె ప్రజాదరంబును యశంబున్ యావదాంధ్రంబునన్

కం. చందురునిలోని నల్లని
కందును ముసలమ్మ యంద్రుగద యొకదినమున రా
కేందుని గనుగొని కవితా
స్పందనమై స్వప్నకథను వ్రాసితి నెలమిన్

కం. ఘను డగు పీఠపురీశుం
డనాథజనతాశరణ్యు డదిగాక కవీ
డ్జనతాపోషకు డని విని
చనిచూచితి చెన్నపురి ప్రసన్నుం డగుచున్

మ. వినియెన్ నాకృతులన్ సదాదరణ జూపెన్ తీయగా ముచ్చటిం
చెను, నవ్వించెను నవ్వె నా కవిత మెచ్చెన్ మెల్లగా సాగనం
పెను, పంపున్ బహుమానమంచు మది నువ్విళ్ళూరుచుండంగ వ
చ్చెను బొచ్చెం దభివందనంబులు ఘనాశీర్వాదలేఖాంశముల్

కం. అంగుష్ఠము మొదలుగ స
ర్వాంగకములు చచ్చువడ్డయట్లై యాశా
భంగంబై పంపితి ను
ప్పొంగువిచారమున పద్యమును భూపతికిన్

మ. ఒకరాజన్యుని దర్శనార్థమయి యెన్నోయత్నముల్ చేసి నూ
టికి పైగా వ్యయపెట్టుకొంటి కనుగొంటిన్ గాని లాభింపలే
దొక యేగానియు పిమ్మటం బనిపినా దోదార్పువాక్యాలు లె
క్కకురానన్ని సలాము లిప్పటికి నింకన్ పెట్టెలన్ మూల్గెడిన్

# రెడ్డిగారి పరిచయము

కం. కనిగిరి తాలూకా బో
ర్డునకుం బతియగుచు బ్లీడరుల రత్నంబై
ఘనుడగు మాల్కొండాభి
ఖ్యుని పరిచయ మయ్యె నాకు నొంగోలుపురిన్

కం. అరుదె మ్మొకపరి మా స్వః
పురికిం గనిగిరికి యాచభూపతికి నినున్
బరిచయము చేతు నని యు
త్తరువున నుత్తరము వచ్చె దానిం గొనుచున్

మ. మరునాడే పయనంబు గట్టి చని శ్రీమాల్కొండరెడ్డింట చు
ట్టరికంబున్న యటుల్‌భరీగతిని యిష్టాగోష్ఠి గావించి వీ
రరసోదంచితఘట్టముల్ శివధరారాజన్యకావ్యంబులో
మెరుగున్ రెడ్డికడం బఠింప నతడున్ మెచ్చెన్ రసాస్వాదియై

కం. పిరదౌసికావ్యమునకున్
బరిచయమై సరసులయిన పఠితలకు కవీ
శ్వరులకు నెరిగిన నెరుగని
విరసులకుం జూపె న న్నవేలోత్సుకతన్

ఆ.వె. ఎరుకపరచె నన్ను నెదురైనవారికి
యెదురుపడనివారి కిండ్ల కేగి
ఊర నున్నవారి కున్నవారికి లేని
వారి కేమనందు వారిప్రేమ

ఆ.వె. బుచ్చిరెడ్డిపాలెమున దొడ్డరెడ్డి యా
నాటి పార్లమెంటునాయకుండు
సుజనబాంధవుండు బెజవాడ రామచం
ద్రునకు నాకు గొంత దోస్తి కలిసె

కం. ఇరువురు రెడ్లున్ వేంకట
గిరినృపునకు నన్ను జూపి కృతినందు మితం
దురువిద్వాంసుడు కవి యని
యురువుగ నగ్గింప నాత దుత్సాహమునన్

శా. మా యాచేంద్రకుమారభూపుల యశోమర్యాద లేలాటివో
మా యౌదార్యగుణంబుల బలుకుమీ మత్తేభవృత్తంబులో
నీయాశీర్వచనంబు యెన్నికలలో నెగ్గింపగా నా(శవః
పేయంబౌ కృతి నల్లుమం చడిగె పృథ్వీనేత సాపేక్షుడై

కం. చెప్పితి నాలుగు పద్యము
లప్పటి కప్పటికి నృపతి యానందించెన్
తప్పుం దడికలు స్మృతియం
దప్పటికే మాసె బుద్బుదాళివిధానన్

కం. నిందించి పీఠపురిరా
జేందున కంపించినట్టి కృతి చదివితి త
త్సందర్భ ముగ్గడించుచు
మందిర మదరంగ నవ్వె మహిపాలుండున్.

శా. న న్నీరీతి బజారుచేయకయ మున్నన్ గొంచు పొమ్మంచు న
న్నిన్నూరారుల సత్కరించె నొగి సంతృప్తిన్ ధరానేత రె
డ్లు న్నా సాహస మెంతయుం బొగడి నెల్లూరెల్ల చాటించి రెం
దున్నాడో యిపు డాధరారమణు డాయుస్సారసంపూర్ణుడై

కం. నెల్లుట్ల సుకవి కబ్బపు
బిల్లన్ 'సురబాల' దెచ్చి పెండ్లాడు మిదే
యల్లునకు గట్నమని నా
యుల్లము పుష్పింప నిచ్చె నొకనూరారుల్

చం. నతులు సహోదరా! నిను మనంబున జూచితి నీకృతుల్ సమం
చితరసికోత్తమభ్రమరసేవితమంజులపుష్పమంజరీ
తతులు సుమార్చయే తెలుగుతల్లికి భేషర! జాషువా సువా
సితసకలాంధ్రభూవలయ సిద్ధకవిత్వవసంతవైభవా!

కం. కృతు లి ట్లాయాకవి స
న్నుతులం గొని వచ్చుచుండె నూరా ర్లాప్యా
యత నిచ్చి సభలకధ్య
క్షత కాహ్వానించువారు గల్గిరి దిశలన్

కం. తుమ్మలకవి నాదగు కా
వ్యమ్ములదోషములు జూపి ప్రకటించె నసా
రమ్ముల వ్యాకరణపురం
ధ్రమ్ముల పత్రికల రసికతతి వెలగందన్

ఉ. మానుడు మీరు మీకు నభిమానుల ముంటిమి వారికిన్ సమా
ధానము మే మొసంగెదము దండి కఖందున కుండవే కవీ
శానుడు కాళిదాసునకు సాధు లసాధులు తూచి శబ్దసం
ధానము చేయునట్టి కవితల్ రసగంధవిహీనపుష్పముల్

కం. అభిమాను లట్టు లని నా
కభయం బిడి ప్రతిజవాబు లందించిరి మా
యుభయులభాషాయుద్ధము
రభసకు రాకుండ నెల్లరకు మోదముగన్

కం. సరసుడు తుమ్మలచౌదరి
విరమించి సగంధుడయ్యె విరమింపం డా
నెరసున్నా లరసున్నా
ల్వెరపించెడు త్రోవలందు విహరించుటలున్

తే.గీ. పండితోద్యోగ మూడు నుద్దండలీల
కవనమల్లెడు సుకవిరాక్షసునకైన
ఉభయభాషాప్రవీణ లేకున్న నంచు
హెచ్చరించుచు తాఖీదు వచ్చె నాకు

కం. ప్యాసయితి నదియు భాషా
వ్యాసంగము నెరపుచుంటి పవలున్ రేయున్
నాసతి కాదొక దేవత
చేసెదు పరిచర్య లెడద స్తిమితం బిడగా

తే.గీ. ధీవిశాలుండు విక్రమదేవవర్మ
జయపురీశ్వరు డఖిలశాస్త్రప్రవీణు
డాదరంబున నాకు నాహ్వాన మంపె
'భారతీతీర్థసంస్థో'త్సవంబు నాడు

కం. 'కవితా విశారదా' యను
నవీనబిరుదంబు వేయినాణెములు మహా
కవిపండితచండమహా
ర్ణవ మలరగ సత్కరించె రా జవ్వేళన్

## ఇంటిగెలుపు

కం. చతురుడు విశాలహృదయుడు
మతిమంతుం డైన శ్రీ రమాకాంతుండు మా
శ్రుతగిరి తహశీల్దారుడు
కృతు లల్ల సమర్థు డాంధ్రగీర్వాణములన్

కం. చదివె న్నాపిరదౌసికావ్యము నపేక్షన్ మోదితుండై యిదే
కద నీ పుట్టినయూరు నీ కిచట సత్కారంబు చేయించి పో
యెద నంచున్ వినుకొండలోన తొలి సాహిత్యార్చగా నాకు నూ
ర్వదియా ర్చిచ్చి బహూకరించె సకలాంధ్రం బెల్లన్ వ్యాపింపగన్

మ. కవితోద్యాన వసంతకోకిలవు! త్వత్కంఠస్వరోద్యన్మహా
సవ మింతే చవిజూచినన్ ద్విజతతుల్ సన్మార్గమున్ ద్రొక్కి మా
ధవసేవాపరతంత్రతన్ నవరసోన్మాదంబునన్ నీదు చెం
త వసంతోత్సవ మాచరించు టొక వింతా? జాషువా సత్కవీ!

కం. నవరత్నంబుల నిడె న
య్యవసరమున ప్రేమతోడ నాచార్యుడు త
త్కవితాశక్తి కిదే యొక
రవ నిందున్ మాసరాకు వ్రాయుచునుంటిన్

కం. పిసుపాటికులుడు కవితా
రసలోలుం డచ్చమైన బ్రాహ్మణుడు భిష
గ్బిసరుహబంధుడు సుజనా
గ్రసరుడు పిలిపించె హైదరాబాదునకున్

తే.గీ. కృష్ణరాయాంధ్రభాషానికేతనమున
నెలమి సత్కార మొందు చేయించి పంపె
నాటికిని నేటికిని భాగ్యనగరమందు
వారియాతిథ్యమున తృప్తిపడక రాను

## దండపరిచయము

కం. ఏకా దండయ యెవరో
నా కవితంగూర్చి చెప్పినా రని యొకమా
ర్నా కగపడిపొ మ్మని ప్రే
మాకలితమనస్కు డగుచు నాహ్వానించెన్

చం. అతడు రహస్యదానమున యందు ప్రసిద్ధిని గన్నవాడు పా
త్రత గణియింపకుండ యొకదమ్మిడి వమ్మొనరింప నట్టి యం
చితు డిసుమంతమాట తబిసీలు పొసంగిన నేటివారితో
నతకని చిత్రమగు వ్యక్తి మహోఘటికుండు వాదనన్

కం. నను జాషువ యందురు ర
మ్మని లేఖ లిఖించినారు మాట్లాడగ వ
చ్చినవాడ నన్ను; 'నౌ నౌ'
నని ఆసన మిచ్చి సస్మితానను డగుచున్

తే.గీ. "రైలుఖర్చుల కిద్ది రిక్షాల కిద్ది
ఆకుబీడీల కిది తిండి కగున దిద్ది
మొత్తమగు మూడు రూకలమూడణాలు
మొదటకొ" మ్మని నాహస్తమున నొసంగె

ఆ.వె. "అసలు కవనమన్న అందలి రస మన్న
ముక్కుమొగ మెరుంగ నిక్కముగను
కవనమందు నీవు ఘటికుండ వని వింటి
చేతనయినమేలు చేయ నుంటి

ఉ. అచ్చుకు సిద్ధమైన కృతి హాజరుగా కలదేని దాని నే
నచ్చున కిత్తు నాపితల కంకితమి మ్మది పూర్వజన్మమం
దెచ్చట నాకు నీకు నెపుడే ఋణబంధము సంఘటించెనో
యిచ్చట దీర్చుకొందు నిది ఈశ్వరునాజ్ఞ జుమీ కవీశ్వరా"!

ఆ.వె. కలవు రెండుభాగములు ఖండకావ్యాలు
వాని నచ్చుకీయవచ్చు నంచు
దండయార్యతల్లిదండ్రుల వినుతించి
కృతి యొసంగినాడ నతిముదమున

కం. ఉచితం బని తోచినచో
ప్రచురింపుండు జాషువాకృతులంచున్
రచియించె విల్లునం దా
సుచరిత్రుం డేజగాన శోభిల్లెడినో

తే.గీ. ఉచిత మని తోచలేదు తత్ప్రచురణంబు
చాలు నొకమా రనుచు ట్రస్టీలు రసికు
లా మహాత్మునియాత్మ స్వర్గాలయమున
నలిగి విలపింప మానుకొన్నారు నేడు

## స్వాతంత్ర్యోద్యమము

తే.గీ. అది స్వరాజ్యోద్యమప్రరోహంబు దిశల
మొలకలెత్తినవేళ బాపూజి పేరు
సేతుశీతాద్రివరకు భాసించి ఆంగ్ల
గజము నెదిరించి తొడగొట్టు గడియె లవ్వి

కం. మిడుగురులు లేచె నణగిన
బెడిదపు శౌర్యాగ్ని శిఖలు మాంచాలపురిన్
బడబానలమన 'హనుమం
తుడు' వీరుడు తెల్లదొరలతో నెదిరించెన్

ఉ. బాలుడు పల్లెనాటి నెలబాలుడు, శత్రుగజాలగుండియల్
వ్రీల నటించి నుగ్రరణవీధుల నర్వదియారుబారుభ
ల్లాలకు నగ్గమై మడయు లాగున నా'హనుమంతు' డాంగ్లభూ
పాల శతఘ్నులన్ గరగి పౌరుషభిక్ష యొసంగె నాంధ్రికిన్

మ. అవనీనాథులు బెగ్గిలన్ తొలుత బ్రహ్మాండంబుగా స్వాగతో
త్సవమున్ గర్తపురాన జాతిపితకున్ సత్యాగ్రహుల్ చేయునా
డవరోధించు ప్రభుత్వసైనికుల దౌష్ట్యంబెల్ల నీక్షించి క
న్గవ నీరూర రచించినాడ నరపక్రవ్యాదచర్యావళిన్

శా. కొండా యున్నవ దేశభక్తులగు త్యాగుల్‌వీరసత్యాగ్రహో
ద్దండుండైన తెలుంగుకేసరియు, సీతారామశాస్త్ర్యాదివే
దండంబుల్ చెరసాలబద్ధులయి స్వాతంత్ర్యార్థమై పోవుచో
గుండెల్ నీరయి దుఃఖపడ్డయవి దిక్కుల్ గ్రుక్కిళుల్ మ్రింగుచున్

కం. బలిజేపల్లికవీంద్రుని
బలిమిం బంధించి రతడు వ్రాసినకృతికిన్
వలవలయేడ్చెనతం డిక
విలిఖింపనటంచు, కవులు భీరువులు గదా?

కం. అది గని నేవ్రాసినకృతి
పదిలంబుగ జేబులోన భద్రపరచితిన్
పదుగురిలో జదివిన నా
పద వచ్చునటంచు హితులు భయముంగొలుపన్

కం. నాచేసినయపరాధము
దాచుకొనక చెప్పుకొంట ధర్మం బని సం
కోచింప కెఱుకపరచితి
ధీచతురత లేనిగడుసు దేరని చర్యల్

# మనవి

నా కథ మూడవభాగం. ముప్పదియేండ్ల తీయని పరిచయం గల నా కవ్యాభిమాని శ్రీ బొడ్డు ప్రకాశ కవి ఆత్మేశ్వరుడు గావడం నాకెంతో హర్షదాయకమైంది. సచ్ఛీలుడు, సదాశయుడు, రసపిపాసి యైన వీరుడు తన బిడ్డకు దొరికిన గృహస్థు పొందినంతటి ఆనందం కలిగింది. సర్కారులో గుమస్తాగా ప్రవేశించి, తన నిజాయితి, సమర్థతచేత సముద్ధారై, మేజిస్ట్రేటై, తహశీల్దారై ప్రకాశించు ప్రకాశరావుగారు నేడు నాకు జామాతగా లభించడం శ్లాఘాపాత్రమైన విషయం. వీరు తన వివాహకాలమున నన్నాహ్వానించి సత్కరించినపుడు నేను వ్రాసిన ఆశీర్వాద పద్యాలలో వారి యందు నాకు గల వాత్సల్యం ద్యోతకమౌతుంది. నాడు తాను నాకు మిత్రుడు. ఈనాడు బంధువు. వాఙ్మయజగత్తులో యేర్పడ్డ మాయీా చుట్టఱికము శాశ్వతకీర్తి కగ్గము కాగలదని నా విశ్వాసము. ఆనాటి దీవెన ఈ పెండ్లివేళ కూడ సముచితమని వానినిం దుదాహరిస్తున్నాను. శ్రీ ప్రకాశరావు గారు భవిష్యత్తులో ఉన్నతోన్నత పదవుల నధిరోహించి, దీర్ఘాయుష్మడై ప్రకాశించి తన నామమును సార్థకం చేయగలడని అక్షరాక్షతలు చల్లుచున్నాను.

 మ. "ఎలమిన్ హూణకళాసముద్రమున బియ్యేతీరముంజేరి, నీ
కులముప్పొంగ పరిశ్రమించితివి, తెల్గుందోటలో శాశ్వతో
జ్వలసంపత్తుల బుష్పితంబగు ప్రతిష్ఠావాటి నీభార్యతో
సలుపంబోలు సుఖస్థితిన్ మధురసంసారంబు శిష్యోత్తమా!

ఉ. నీవొక యింటివాడవయి నిల్చితివిప్పుడు జన్మసార్థకం
బై విలసిల్లె వంశము సహస్రముఖంబుల ప్రస్తుతింప నె
త్తావులుజిమ్ము మీవలపుదామరపూవుల తెప్పమీద సౌ
ఖ్యావహమైన జీవితమహాంబునిధానము నుత్తరింపుమీ!

శా. సేవించున్నినునీడయై, హృదయరాజీవంబుపుష్పింప, నీ
భావోద్యానము పుల్కరించి కుసుమింపన్ మేరికాంతమ్మ నీ
యావాసంబున సర్వసంపదలు నాట్యంబాడ వర్ధిల్లు డ
న్నా! వాగర్థములట్లు, బొడ్డుకులదీపా! సుప్రకాశాభిదా!

ఉ. ఈయమకంధరంబున వహించిన పచ్చనితాలిబొట్టు నీ
యాయురనామయంబులకు నాయువుపట్టు ప్రకాశరాయ, సు
శ్రేయము నీకునీసతికి చెన్నలరారెడు బ్రహ్మముళ్ళకున్
చాయలుదేరు మీప్రణయ సంసరణామృత తీర్థయాత్రకున్

సీ. సరసపండిత కవీశ్వర శుభాశీర్వాద విభవాదికము కళావీర! నీకు
కవితాసుమంగళీ కమనీయవీక్షణ కుసుమహారము పెండ్లికొడుక నీకు
ఆయురున్నతిమీరు యైదువురాంధ్ర కైవారంబు నవ్యసంసారి నీకు
బహునిలింపుల పుష్పవర్షాభిషేకంబు పసుపుబట్టల చిన్నవాడ నీకు

తే.గీ. బెళుకుచూపుల నునుసిగ్గు మొలకలురల
ప్రేమతో తలంబ్రాలు ధరించియున్న
తరుణి గళమున పుస్తెముస్తాబు చేయు
పూతవర్తన! సంతానభూతి నీకు

జి. జాషువ

# అంకితము

మ. ఒకసాయాహ్నము విన్నకొండపురియందుండన్ యువానుండొకం
డకలంకంబగు భక్తిభావమున జోహారించి మీ దర్శనో
త్సుకతం వచ్చితి మీకృతుల్ చదివి సంతోషించితిన్ విన్నకొం
డకు నన్నుంబదిలీయొనర్చి రనుచున్ బల్కెన్ సముత్సాహియై

కం. మీ రచనలపై నాకుం
గౌరవమభిమాన మన్ని కావ్యంబులు నే
నారసినాడం గవివర!
యీ రోజునజూచి మనసు తృప్తివహించెన్

కం. పేరుకు ప్రకాశమందురు
యూరైదరుపేట కొద్దియుద్యోగములో
జేరితి సర్కారున భా
షారంగమునందు కొంత చవిగలవాడన్.

కం. బొడ్డింటిపేరు వంశము
దొడ్డది మాయన్న మేటిదోర్బలు డుక్కుం
గడ్డలువిరిచియు కడు పే
ర్వడ్డ యపరరామమూర్తి భాషాసుకవీ

కం. పేరేసురత్న మాయన
గారే నాయగ్రజుండు క్రైస్తవులందున్
గౌరవమార్జించి యెహో
వా రాజ్యాభీష్ట భక్తవరుడై వెలయున్

మ. దొరగారొక్కడు చేయమన్నపని కేదోవంక వైముఖ్యుడై
నిరసింపన్ గడునాగ్రహించి ప్రళయాగ్నిన్గ్రక్కి వెన్వెన్క మో
టరు వాహంబును బల్మిబట్టి నిలుచుండన్ బండిచక్రాలు ముం
దరికిన్ బెత్తెడుసాగ వంతరపు యంత్రశ్రేణి ఘోషించినన్

కం. ఆమిషనరి యచ్చెరువున
భీమబలుడవీవు నీ యభీష్టముదీర్తున్
కామకయని మెచ్చిన తా
నామోదమునంది విడిచె నాశకటంబున్

కం. అని తన వంశచరిత్రన్
వినిచెన్ ప్రత్యహమువచ్చి ప్రియవచనములన్
నను తనిసిపోవు నతడీ
దినమున కృతిభర్తయై మదిందనియించెన్

కం. మేజస్ట్రేటై న్యాయ
భ్రాజితుడై నర్సరాయపట్టణ జనసం
పూజితుడై, కావ్యకళాం
భోజాక్షీకృషిని విడువబోడేనాడున్

కం. మేరీ సుమంగలీమణి
దారయి నిలుదీర్ప సుతసుతాసంపత్తిన్
భారీగుణముల తహసీ
ల్దారయి సర్కారువారిదయ నార్జించెన్

మ. అనుమానింపగరాని మిత్రులుగలారాంధ్రంబులో నాకు న
న్ననయంబున్ గురుభక్తిమైగొలుచు మాన్యశ్రేణి చుట్టాలు చ
క్కని ధర్మాధ్వగులందు బొడ్డుకులజున్ కావ్యప్రియున్ మెచ్చినా
యనుగుం గావ్యకుమారి సల్పినది దివ్యంబైన బాంధవ్యమున్

ఉ. అల్లురు కొందరుండెదరు స్వార్థపరుల్ శిగపట్లగోత్రజుల్
చల్లగనిల్లు సొచ్చి పెనుచందలకెక్కెడువారు, నేడుమా
పిల్ల వరించి తెచ్చిన కవీంద్రుడు బొడ్డుప్రకాశరావుతో
చెల్లరు వేవురల్లురు విశిష్టగుణంబులు లెక్కకట్టినన్

కం. వెరువడు మొనగాండ్రకు, ము
ష్కరులగు యధికార్ల కేని సజ్జనులగుచో
యెరగుందలవంచు మనో
హరములు శ్రీబొడ్డుకుల సుధాంశుని గుణముల్

మ. తనవైవాహికవేళ భక్తిమయి సత్కారించి నా దీవెనల్
గొనియెన్ ముప్పదియేండ్లనా డపుడునాకు న్నేమనుపొంగారి వ్రా
సిన పద్యాశిషముల్ వినూతనములై చిత్తంబునూగించెడిన్
ననలెత్తించెడు వత్సలత్వపురుఘరుల్ నానాటికిన్ నేటికిన్

మ. తొలుతన్నా కవితాభిమానయయి మిత్రుండై తుదంజుట్టమై
నిలిచెం బొడ్డుప్రకాశరాయకవి యాంధ్రీమండలాశీస్సులన్
దలపై దాల్చి తెలుంగువాఙ్మయచరిత్రన్ గావ్యసంసారియై
పొలుచుంగాక సహస్రవర్షము శతంబుల్ శ్రీసుఖోపేతుడై

# నా కథ

శా. చండంబై యణుబాంబు గోళములు సంచారంబుగావించి భూ
ఖండంబున్ గదలించుకాలమున సత్కారుణ్య మేపార మా
ల్కొండాఖ్యం దలసింహ పట్టణములో కొన్నేండ్లు నిశ్చింతగా
నుండంబిల్చి యొసంగెనాకు మహితోద్యోగంబుదారాత్ముడై

కం. తిక్కన జయంతి దినమున
పెక్కుగతుల బొగడి గౌరవించిన ప్రముఖుల్
గ్రక్కిరి విషాగ్ని నాపై
నక్కడి యుద్యోగ మూడునట్టి యతనముల్

ఆ.వె. దేశభక్తుడైన, తిక్కవరాన్వయ
రామిరెడ్డిగారి ప్రస్తుతించి
వ్రాసినాడు పద్యరత్నాలితండంచు
'హారివేకు' వ్రాసి రనృతమతులు

మ. అతడాంగ్లేయుడు చారచక్షువుగదా ఆలేఖ వీక్షించి యు
ద్ధత కోపంబున శ్రీముఖంబునిడియే తజ్జాషవన్ బంపుమం
చతి తీవ్రంబుగవ్రాసె డీదొరకు బ్రహ్మానందముం జెందినా
ప్రతిపక్షుల్ విషకుక్షులై విజయగర్వగ్రస్త వాచారులై

మ. మొలచెన్గ్రోధము రోమరోమమున నిప్పుల్ గ్రక్కమాల్కొండరా
ట్కల భంబక్షర పంక్తిలో మిణుగురుల్ గ్రోలంగ హార్వేకు గుం
డెలు చల్లంబడి నాంధ్రసత్కవుల పాండిత్యంబు వర్ణించి, "ప్రో
జ్వల సౌవర్ణఖనుల్ కవుల్ వలయుచో బంగారముంద్రవ్వుడీ

మ. వలదన్నం జనువారు కాదనిన ఆ బంగారముం ద్రవ్వకో
గలవారుందురు, పిచ్చివారయి దొరల్ గాదన్న బంగార మ
న్యుల పాలయ్యెనటంచు లోకములు మిమ్మూరూర జాటించు దు
ష్టుల మాటల్ విని జాషువాకవిని భ్రష్టున్ జేసి పంపింతురా?"

కం. అనుచున్ పద్దైదుపేజీల్
ఘన లేఖన్ వ్రాసిపంపె, కరుణాన్వితుడౌ
ఘనుడగు మాల్కొండాఖ్యుడు
అనంతరము వచ్చె నిల్పుమను తాఖీదుల్,

ఉ. నల్లని బొగ్గులయ్యె మును నవ్విన మోములు వీటి పత్రికల్
బెల్లుగ మెచ్చివ్రాసె పదివేల విధంబుల సన్నుతించె భూ
వల్లభుడంత చెన్నపురి 'పబ్లిసిటీ' పదమందునిల్పి యీ
కల్లలమారి దుష్టులకు గర్వమణంచె, నఖండవీరుడై

మ. పిదపన్ జెన్నపురాన దొడ్డపని నిప్పించెన్ బ్రభుత్వంబులో
కదనంబున్ గడముట్టె తెల్లదొర లింగ్లాండుం బ్రవేశించి ర
భ్యుదయారంభ స్వరాజ్యవేతనము లూరూరం బ్రతిష్టించి స
మ్మదముం జెందిరి భారతప్రజలు సామ్రాజ్యంబు చేజిక్కినన్

ఉ. తిక్కవరాన్వయంబు గణుతింగన సత్కవితామతల్లికిన్
దిక్కయి యుద్ధరించెడు సుధీజనవంద్యుడు రామిరెడ్డి న
న్మక్కువ చేరబిల్చి యొకనవ్యకృతిన్ విరచించి యిమ్ము మేల్
పక్కిని నా సతీమణికి స్వర్గకవాసిని కంకితమ్ముగా

ఆ.వె. రామిరెడ్డిగారి రాణి సందర్శన
దేవి పేరకొన్ని దివసరములకు
కథరచించినాడ కాందిశీకుండను
పేరబరగు కృతిని వేగిరమున

కం. తగినట్లు వేయినారులు
నగదిచ్చి బహూకరించె నన్నిప్పటికిం
బొగడున్ ధనమిడి పంపున్
సుగుణాఢ్యుడు రామిరెడ్డి సుమి సింహపురిన్

కం. అవలం బెజవాడ పురీ
కవితాకాముకులు బిల్చి కావించిరి కిం
కవి గజసింహుండఖండు
డవు చెళపిళశాస్త్రి సభకు నధ్యక్షింపన్

మ. ఎలమిన్ నన్ను గజేంద్రవాహమున నూరేగించి బంగారు ము
వ్వల పెండారము కాలికిం దొడిగి సంభావించి పూజించి ర
వ్వల పూనానగరంబు బొంబయి మహాపట్నాల ఆహ్వాన లే
ఖలు వచ్చెంజని యందుకొంటినట సత్కారార్హ సన్మానముల్

మ. అల ఢిల్లీపురి చెన్నపట్టణము మధ్యన్ తెల్గుదేశంబులో
పల వేలాదిగ సత్కృతుల్ జరిగె నా ప్రజ్ఞావిశేషంబు కా
ద లఘుల్ భూరి దయాసముద్రులగు బ్రహ్మణ్యుల్ ధరాదేవతా
దులు, శ్రీ రెడ్డికుల ప్రసిద్ధులగు నాంధ్రుల్ కారణం బింతకున్

కం. నా కవితకు నా ప్రతిభా
శ్రీకిం గారణము నాదు ప్రేయసి మహిళా
లోకశిరోమణి మేరీ
చాకిరి నన్నింతవాని సలిపెం దలపన్

మ. నను నాకైతను నా ప్రతిష్ఠయును గుండంగొట్టి బంగారు నీ
టను మేదించి పదాలకుం బులిమి నిష్ఠన్ పూజగావించి మ్రొ
క్కిన నా ప్రేయసి యప్పుదీర దనురక్తిన్ నల్బదారేండ్లు స
ల్పిన సేవం దలపోయ నా హృదయ మీ వేళం బ్రకంపించెడిన్

ఆ.వె. ఆకివీడుపురికి నరిగి సత్కృతినంది
వచ్చినాడ ధనము దెచ్చినాడ
కాంతిహీనమగుచు కళ దప్పియున్న నా
గృహము దోచె నందు గృహిణిలేదు

శా. ఏకావంశసముద్ర చంద్రుడవనీబృందారక శ్రేష్ఠులం
దేకైక స్థిరకీర్తివర్ధనుడు బ్రాహ్మీబాంధవుండన్న వా
క్కేకాలంబును తప్పనట్టి విభుదుండీ గర్తపట్టానకున్
నాకున్ మెచ్చిన సత్యసంధుడొకడున్నా డాంజనేయాభిధన్

ఉ. ఆయనదృష్టిలోబడియె నాదిని నాకవితాలతాంగి, యే
దో యుపకారమున్ సలుప వూహయొనర్చుచు కొన్ని వేలరూ
పాయలు సేకరించి పెనుపండితకోటి సమక్షమందు ది
వ్యాయతనంబులోనొసగె నన్నుమిబెట్టెదు క్షేత్రరాజమున్

శా. నూరున్నారులు పద్యరత్నములతో నూరార్లు రొక్కంబుచే
యారన్నాకు బహూకరించి రొకనాడత్యంత హర్షంబు నిం
డారన్ దిర్పతి వేంకటేశ్వరుని యభ్యర్ణంబునన్ సాహితీ
ధౌరంధర్యులు పండితుల్ కవులుదాత్తప్రేమసంపన్నులై

తే.గీ. పదియునాలుగు భాషల భరతజగతి
మేటిపండిత సుకవి సమ్మేళనమున
పాలుగొన్నాద గౌరవభాజనముగ
భాసురాంధ్రికి ప్రతినిధిత్వమువహించి

తే.గీ. చెన్నపురి రేడియోలోన కొన్నివత్స
రంబులు లుద్యోగినై ఆదరంబులేని
ఆంధ్రమిత్రుల నైజంబు నాకళించి
కటకటంబడి వచ్చితిగర్తపురికి

మ. అరవల్ మన్ననచేయరంచు ద్రవిడం బభ్యాసముం జేసికొం
దురు భాషింపరు తెల్గులోన నది చెన్నాపట్టణవ్యాధియో
మరియే మంత్రమహాత్మ్యమో! తెలుగుకర్మంబో యటంచున్ మనం
బెరియఁ గష్టముతో వసించితిని మూడేదుల్ కుటుంబంబుతోన్

కం. సాంబారు రసము చేతం
బెంబేలైపోయె మనసు వేలకువేల్ ద్ర
వ్యంబీక దొరకదొక స
వ్యంబైనగృహంబు చెన్నపట్టణమందున్

కం. గానమునకున్న మన్నన
గానమచట కవనమునకు కలరందు కవీ
శానులు కొందరు ఘన స
న్మానార్హులు తిరుగుచంద్రనామకులవలెన్

కం. 'భారతి'యను కవి దుర్భర
దారిద్ర్యంబనుభవించి దైవముకడకుం
జేరిన 'రాజాజి'కళా
పారుగుడై జరిపె నుత్సవము మొనమొన్నన్

కం. ఆ'సుబ్రహ్మణ్యుడు' మును
వ్రాసిన కావ్యంబులచ్చువడి దేశములో
భాసిల్లునిపుడు చీకటి
వాసివిచారింతు రిపుడు భాషాకాముల్

ఉ. నాకడగొట్టుకూతురు గుణాలయ 'హేమలతా' భిధాన బి
య్యేకడముట్టగా జదువుటే మదరాసున లభ్యమైన యే
కైకప్రయోజనంబనుచు తృప్తివహించి స్వదేశగామినై
వ్యాకులపాటుతో 'గగనవాణికి' మ్రొక్కి గృహంబుజేరితిన్

శా. 'గోరా'గారి కుమారుడైన 'లవణా'ఖ్యుం బెండ్లియాడెం గుమా
రీరత్నంబల వారధానగరిలో శ్రీగాంధికావాసమై
పేరుంగాంచిన ఆశ్రమస్థలములో పెక్కంద్రుదీవింప హా
హా రావంబులుసల్పి గ్రుడ్లురిమె వర్ణాభీలశార్దూలముల్

కం. ఖద్దరుదండలతో నొక
గిద్దెడు తేనీటితో ముగించిన పెండ్లిం
డిద్దరకు శుభముగాదా
వద్దని జన్మించు సుతుల వారించెదునో

శా. పప్పన్నాలని లాంఛనంబులనుచున్ బంధుల్ కులస్వాములున్
తిప్పల్ వెట్టి ఋణాలుపై బులిమి ఆస్తింబాస్తు లమ్మించుచున్
జిప్పల్ జేతికొసంగిపోయెదరు పేచీలెన్ని యోపెట్టి యీ
ముప్పుంగూర్చెడు పెండ్లిపేరటపుడాబుల్‌వోవు టేనాటికో

కం. కాంతామణి పద్మిని తొలి
సంతానము నాకు నవల జన్మించె క్షమా
వంతుండు పద్మనాభుం
డంత'న్వలరాజు'పుట్టె నలవలరాజై

కం. ఐదవకుమార్తె లవణము
గాదిలియర్ధాంగి సహజకరుణాన్విత ది
వ్యాదర్శచరిత హేమల
తాదేవి మితప్రలాప ధర్మజ్ఞజుమీ

ఆ.వె. గోగుమళ్ళలోతు కొడుకు ప్రకాశము
స్వాభిమానియగు ప్రభాకరుండు
అర్హపదవులందు నలరారుచున్నారు
అల్లురగుచు శుభములందుకొనుచు

కం. ఆనందంబున మధుర
శ్రీనాథుండనెడు బిరుదుచేతను నను స
న్మానించినారు తిరుపతి
లోనన్ వైష్ణవకవీంద్రులుం బండితులున్

కం. చెన్నాపురి పట్టణమున
నన్నికళాశాలలొక్కటై హర్షమునన్
నన్నున్ మన్ననజేసెం
బ్రన్ననిశాలువుల గద్యపద్యస్తుతులన్

కం. నలుమూలలనుండి 'భళా
భళి' నీ కావ్యములు మేలివజ్రములని జా
బులువచ్చు కవులువ్రాయం
తెలియని ప్రాంతములనుండి దినదినమిపుడున్

ఉ. ఏనుగుపాడిగా ధనమునిచ్చు వదాన్యుడు నోఢ్రరాష్ట్రభూ
జాని కవీంద్రులన్న పడిచచ్చెడు విక్రమదేవవర్మ ఆ
హ్వానమునంపి వేయిపదునారు లొసంగి బహూకరించె నా
స్థానములో 'హవామహలు'దగ్గర నబ్ధిగభీరచిత్తుడై

మ. 'సమయేలుం'దను మిత్రసత్తముడు భాషావేత్త పెన్మాకవం
శమునంబేర్గల క్రైస్తవప్రవరు డాసక్తిన్ గవీశానకా
వ్యములన్ బారణచేయు సచ్చరితు డాహ్వానించి నూరార్లవి
త్తము నాకిచ్చి బహూకరించె నమితోత్సాహాభిమానంబునన్

కం. ఏసాముయేలు మరియొక
రాసిక్యముగల్గుబుధుడు రావించి సునా
యాసమగుతమకు ఘన శ్రీ
యేసుని చరితంబువ్రాయుడీ శుభమనుచున్

కం. అవిరళ పరమార్థము క్రై
స్తవులకు లభియించు ఘనప్రశస్తియు ధనమున్
గవితాశక్తి లభించున్
నవయుగ కవిచక్రవర్తి నామమునిలుచున్

కం. అని ప్రోత్సహించి రిరువురు
అనూన వాత్సల్యహృదయులై సామ్యేలుల్
మనముత్సహించె నంతం
దనువున ఘంటమున క్రీస్తుదయ నిండారెన్

ఆ.వె. దేవరాజుగారు దైవభక్తులలోన
గణనకెక్కియున్న గట్టివాడు
గ్రంథముద్రణంబు గావింప బైబిలు
సంస్థవారితోడ సంప్రదించి

కం. ఒప్పించి ప్రూఫుదిద్దుట
కొప్పించెన్ సాముయేలు నుత్సాహపరున్
గొప్పలు చెప్పుటకాదే
నప్పటికి ముగించినాడ నక్కావ్యంబున్

శా. నా సోదర్యులుకొన్న గ్రంథములకున్ నాకిచ్చుభాగంబులో
కాసేనిన్ లభియింపలేదు మిగిలెంగష్టంబు శ్రీయేసు నా
ఆసల్ మొగ్గలువేయ మేల్ఫలమునీయన్ వచ్చె ఢిల్లీ యవా
ర్డీసంవత్సర మైదువే ల్సమసిపోయెన్ జింతలుంజీకులున్

ఉ. నీకొకసింహపీఠము మణీమయసౌధము సిద్ధమయ్యెనీ
నాకమునందు యేర్పరచినారము నీకిట నన్నయాది భా
షాకవులున్నవారు పరిషత్సభలున్నవి రమ్మటంచు 'యే
కా'కొక చీటివచ్చె ననగా చనె నాఘనుడభ్రవీధికిన్

కం. నిరతం 'బేకా' కూర్చును
కురిచీవీక్షించి గ్రుడ్లకున్నీరూరన్
'హరిహరి' యని దుఃఖింతురు
భరింపజాలక కవీంద్రపండితకోటుల్

ఆ.వె. మాలకొండరెడ్డి మనసులో మసలుచు
నామనస్సులోన నవ్వుచుండు
బయటగానరాడు పయనించుచున్నాడు
నింగియందు నాంజనేయుడిపుడు

మ. చరకానూలు సరాలు శాల్వలు ప్రశంసాపత్రముల్‌దక్క య
క్కరకుంద్రవ్య మొసంగనట్టి సభలున్ కల్యాణముల్ పెక్కుచీ
దర బుట్టింపగ జీవయాత్రకయి, యర్థంబప్పుగా దెచ్చి సం
సరణాబ్ధిందరియించుచుంటి బహువర్షంబుల్ సుఖత్యాగినై

కం. శుభదినములు రావాయని
నభః కుసుమమందకుండునాయని హృదయం
బభయంబిడి యూరింపక
నభాగ్యుడుం బ్రదుకగల్గునా మహిమీదన్

కం. సకల కళాకారుల పో
షకులై సర్కారువారు సాయపడెద ర
ట్లొక యేబదిరూకలు నెల
కొకసారి యొసంగుచుందు రుద్యన్మతులై

మ. అమృతస్వాంతుడు కాసువంశజుడు బ్రహ్మానందరెడ్డీంద్రు డాం
ధ్రము పాలించెడు ముఖ్యమంత్రి ముదమారన్ యావదాంధ్రప్రదే
శములో శాసనమండలిం గరుణతో సభ్యత్వమిప్పించి దు
ర్గమ సాంసారికయాత్ర సవ్యముగ సాగంజేసె భద్రాత్ముడై

తే.గీ. పరమ వాత్సల్యబీజంబు ప్రభవమందె
మాలకొండాభిధుని లసన్మానసమున
అలముకొన్న దనంతశాఖలుగ నేడు
ఫలితమగు కొమ్మలందు 'యమ్మెలసి' యొకటి

కం. హైందీకరింప గబ్బిల
ముం దేశము సంతసించిపూజించును ము
న్ముం దద్దిచేయ నేనా
నందించెదనంచు రెడ్డి నర్థించుటయున్

ఆ.వె. హిందిపండితుండు హృదయంబుగలవాడు
రామమూర్తి రేణు వ్రాయగలడు
ఆంజనేయునాత్మ కది యింపు గావించు
నంచురెడ్డి నిర్ణయించుకొనుచు

కం. అనువాదముచేయుము చ
క్కని హిందీభాషలోన గబ్బిలమును ద
క్కును కీర్తినీకు స్వర్గం
బున పంతులుగారి ఆత్మమోదమునందున్

చం. అని నియమించి రేణు ముదమంది రచింపనుపక్రమించి ప్ర
న్నని పదజాలమున్ బొదివి నాలుగుమాసములన్ ముగించి యి
చ్చిన సభజేసి యంకితము జేసితి నెహ్రూతనూజయిందిరా
వనిత సభాధిపత్ని యయివచ్చిన జెచ్చెర ముఖ్యమంత్రికిన్

శా. ఇల్లాల్లేని గృహంబులో సుఖములేదెవ్వారికే నింటిలో
నల్లుండ్రున్ గొడుకుల్ కుమారితలు సౌఖ్యశ్రీలు చేకూర్చి పూ
ర్ణోల్లాసంబు ఘటించినన్దుదకు నాయుశ్శక్తులూటాడు నా
డిల్లాలన్నిట తోడునీడయయి గట్టెక్కించెడిన్ బూరుషున్

ఉ. మట్టసమైన ఆడుది యమాయిని నాసతికన్న కొద్దిగా
పొట్టిది వంటలోఘటిక బుద్ధిగలట్టిది ధర్మవాదనన్
గట్టిది మాటనేరుపరి కారుణికత్వమునందు సాటిలే
నట్టిది, నాకుగూర్చు విమలాంబను పత్నిగస్వీకరించితిన్

కం. అమెరికకువచ్చె నాహ్వా
నము నాతమ్మునకు నతనివారికి కడుమో
దమునన్ ప్రయాణ సన్నా
హములం గావించుకొని తయారగుచుండన్

మ. కరకుంగోరల పక్షవాతమను వ్యాఘ్రుంబంతలోపట్టి దు
ర్భరలీలన్ బలశక్తులన్ మెసవి స్వర్గక్షోణికింజేర్చె చూ
పరకీమార్పొక యింద్రజాలమయి విభ్రాంతిన్ ఘటించెన్ కృపా
పరుడా దేవునిచేతలెమ్మనుచు నాశ్వాసించిరుద్యన్మతుల్

కం. 'ఎమ్మెలసీ'యైనావు శు
భమ్మగునీకనుచు నాకువ్రాసెన్ గమ్మన్
తమ్ముడు మరునాడే స్వ
ర్గమ్మునకుం బోయె వింతకథయైపోయెన్

కం. తొమ్మిది మందినిగని తన
కొమ్మయుబందుగులు చెంతగోడాడగ శాం
తమ్ముగసమాధిపేటిం
దమ్ముడు కనుమూసినాకు దర్శనమిచ్చెన్

మ. హృదయద్రావకమైన దృశ్యమిది తానీ'ఒంగవో'ల్పేట ము
ప్పదిరెండేడులు పాఠశాలను మహోపధ్యాయుడై భక్తుడై
పదుగుర్మెచ్చగ మంచిపేర్వడసె నాపాండిత్య మాజ్ఞానసం
పదయేమూల నణంగెనోయనుచు నాత్మన్గుంది వాపోయితిన్

చం. అనుజుని మట్టిజేసుకొని ఆఖరుసారిగ 'ఒంగవోలు' ప
త్తనమునకున్ సలామని నితాంతమనోవ్యథ వెంబడింప, వె
చ్చని హృదయంబుతోడ ననుజన్ముని పచ్చనికాపురంబు వా
డిన వనమై తపించుసరణిం దలపోయుచు నిల్లుజేరితిన్

కం. స్మృతిపద్యంబులు వ్రాసితి
బ్రతికినకాలమున నేను భ్రాతయు నెంతో
కుతుకమున దిరిగిసల్పిన
కతలం గన్నీట మనసు గాయముమానన్

కం. జననంబు కన్నులారం
గనుగొంటిని జిన్ననాడు కన్గొంటిని చా
వును మొన్ననేను నా త
మ్ముఁనకున్నే దేండ్లు ముందుబుట్టిన కతనన్

కం. కళనాదరించు డిప్టీ
కలెక్టరగు సాముయేలుగా రొకపరి న
న్నలరించె మచిలిబందరు
బిలిపించి యొసంగె నారువేల్కట్నముగా

కం. సరసుడు గొట్టిపాటికులచంద్రుడు బ్రహ్మయగారు తత్సభా
తరుణికి నాయకుండయి విధానసభన్నడిపించుచుండు, మం
తురులును సభ్యులన్ గరిమతోడ కిరీటము లేని రాజభా
స్కరుడన కొన్నిగంట లధికారముచేయుచు నగ్రపీఠిపై

కం. చేసితి ప్రమాణస్వీకృతి
శాసనసభ్యుండనయి ప్రజాహితకార్య
వ్యాసక్తిననుచు నాకొక
ఆసనమేర్పరచి రమ్మహాసభయందున్

మ. సరసన్ కాంగ్రెసుపారిటీయనెడు నశ్వశ్రేణినాడింపగా
కొరడాదాల్చిన రింగుమాస్టరుడుగల్గున్ హద్దులోనిల్పగా
పరపక్షీయుల కెంతయోగలుగు వాక్స్వాతంత్ర్యమాసత్సభాం
తరమందున్ జరుగున్ స్వరాష్ట్రహితసంధానార్థ చర్చావిధుల్

శా. విందేర్పాటొనరించి స్వగృహమునన్ ప్రేమన్మహోల్లాసియై
బందుల్ మిత్రులు పాత్రికేయులను ఆహ్వానించి మారెడ్డి ఆ
నందాత్ముండయి ముఖ్యమంత్రియగు బ్రహ్మానందుడున్ వచ్చి న
న్నుందీవించె ప్రసన్నుడై వెలిగె నిందుండభ్రమార్గంబునన్

కం. పెల్లుగ రాజొచ్చిరి చే
ర్వాళ్ళని రికమెండు చేయవలెనని బిడ్డల్
బళ్ళోచేరుటకని మా
యూళ్ళోబడికనుచు పెక్కురుత్సుకమతులై

కం. పోటీచేసితి తమరొక
యోటిచ్చిన గెల్చుననుచు నొకరిద్దరికే
నోటితి కాంగ్రెస్సునకే
యోటీవలెననుచు 'విప్పు'దురిమెన్ గ్రుడ్లన్

ఆ.వె. చేతులెత్తుడన్న చేతులెత్తెడువారు
నిలువుడన్న లేచినిలుచువారు
చదువుకొన్నవారు చదువెఱుంగనివారు
నుభయసభలలోన నుందురచట

చం. వెనుకనుముందుబడ్డ యటవీజనకోటి సముద్ధరించు శా
సనముగలట్టి హేతువున జాతికొకండుగ నెన్నికైన వా
నిని తలమీదనుంచుకొని నిత్యముగొల్తు రమాయకప్రజల్
ఘనముగ నట్టివాడచట గౌరవసభ్యుడుగా వెలింగెడిన్

కం. పరిమిట్లిప్పించెదనని
ఖరుచుంబెట్టించిపంపు ఘనులుందురు పై
మెరుపులదొరలచ్చట మో
టరుకార్లందిరుగు పచ్చిటక్కరిసభికుల్

మ. దొరలందోలి స్వతంత్రులై నిలిచి యాంధ్రుల్ రాజదండంబు దా
ల్తురు నాపెత్తనమూడునంచు నెపుడాలోచించెనో పాపమా
సరసుండైన నిజామసాహెబుడు రాజశ్చంద్రకాంత ప్రభా
స్ఫురితప్రోన్నతసౌధమున్ నిలిపెనిచ్చో మిత్రభావంబునన్

తే.గీ. ఆంధ్రసాహిత్యపరిషత్తు నందునన్ను
సభ్యునొనరించి ఆదరస్వాంతుడగుచు
పరిషదధ్యక్షుడౌ బెజవాడకులుని
ప్రీతినర్చింతు గోపాలరెడ్డివిభుని

కం. పరిషత్తు కార్యదర్శిగ
చిరకాలమునుండి కీర్తి చేపట్టిన భూ
సురుడగు రామానుజునిన్
కరుణాహృదయునకు నతులు గావింతునొగిన్

శా. మాయింటం బసచేయరండనుచు ప్రేమన్ లేఖలన్ వ్రాసి ఢి
ల్లీ యందల్లననాకు నాసతికి పేర్మిన్ సర్వసౌకర్యముల్
జేయించెన్ నిజపత్ని పుణ్యవతి లక్ష్మీకాంతమాభిఖ్య మా
కేయేకూరలు నచ్చునోయెటిగి చేయించెన్ సుధాభోజ్యముల్

ఉ. ఇక్కడ శీతబాధసహియించుట దుర్భరమంచునెంచి మా
ప్రక్కలకున్ రజాయిలును రగ్గులు హీటరులిచ్చి తల్లియై
అక్కటికంబుతోడ మరియాదలుసల్పిన చేత లాత్మలో
చక్కగముద్రితంబులయి స్వాంతములందు నివాసముండెడిన్

సీ. బాపూజికనుమాయు భస్మసమాధికి కేలుమోడిచి గులాబీలుసల్లి
నెహ్రూవియోగాన నిశ్శబ్దముగ, నంగలార్చెడు శూన్యగేహమునుజూచి
గగనమండలిమోయగట్టిన యున్నతోన్నతమైన కుతుబుమినారునరసి
కోటీశ్వరత్వంబు చాటిచెప్పెడు పాలఱాతి బిర్లామందిరమున దిరిగి

తే.గీ. రాష్ట్రపతిచేత విజయగర్వంబుమెరయ
పదియునాలుగుభాషల భారతీయ
వరకవీంద్రులుజూడ'నవార్డు'నంది
భూరిహర్షంబు చిత్తానబూనినాడ

తే.గీ. పసిడిరేకులతో ముఖద్వారములకు
మెరుపులీనెడు దొడ్డయగ్బరుసమాధి
నరసి యచ్చెరువంది తదంతికమున
పూరిగుడిసెలుజూచి వాపోయినాడ

ఆ.వె. మేటియైన యెట్టికోటచుట్టునగడ్త
లోతుకొలిచి చెప్పగాతరంబె
కోటతలుపు లినుపగుబ్బలబిగువుతో
పరబలాలతో సవాలుచేయు

ఉ. బేగముసాహెబా లుభయవేళల పాచికలాడ పూవులన్
తీగలుచెక్కినట్టి రమణీయములౌ తెలరాతిశాల లా
భోగులవైభవం బరయబోయిన ప్రేక్షకకోటిచిత్తముల్
లాగి మొగల్నవాబుల విలాసములన్ వివరించిచెప్పెడిన్

మ. పరిఖల్ప్రోన్నతకుడ్యముల్ భవనముల్ ప్రాకారముల్ నాటిసం
గరముల్ శాత్రవదండయాత్రలు భయోత్కంపంబులన్ దెల్పున
క్కరకుంగాలములో నిరాయుధులరక్తం బెన్నిపుట్లుర్వి కా
హరమైపోయెనొ యన్నచింతయగు దేహంబున్ ప్రకంపించెడిన్

మ. ఒకనాడాయెటకోటలో జరిగెనెన్నో యుద్ధముల్ వీరసై
నికులుంబౌరులు తత్తరిల్లి రిపుడో నిర్మానుషంబై భయా
నకమై చీకటికోనయై మునులశాంతస్వాంతభావంబు పో
లిక సుల్తానుల బుద్ధిహీనతకు జాలింజెంది శోకించెడిన్

మ. ఘనతంజెందిన షాజహాను డల ఆగ్రాకోటలో కన్నపు
త్రునిచే బంధితుడైన చోటుగని ముద్దుంగాంతముంటాజి బే
రనుకాళింది తటంబునన్ గరిమమీరన్ మూడులోకాలకీ
ర్తిని జేపట్టిన టాజ్మహాలను సమాధింజూచి హర్షించితిన్

చం. ముదిరినప్రేయసీప్రణయమూర్తి తిరోహితమైనవెంటనే
యెదనపుడగ్ని పర్వతము లెన్ని ఫెటిల్లున బ్రద్దలయ్యెనో
కద సులతానురాజు తెలిగన్నులరాల్చిన బాష్పధారలే
పొదలిఘనీభవించినవి ముద్దులతాజమహాలు పోలికన్

మ. అలఘుస్స్వర్గము భూమికిం దిగియెనోయన్నట్లు విఖ్యాతిశి
ల్పులచాతుర్యము మూటగట్టుకొని యింపుంగూర్చుకాళింది తి
న్నెలపైబూచిన పుండరీకమన కాంతిజ్యోతులన్ దిక్కు ది
క్కులకుంజిమ్మెడు తాజ్మహాలు భరతక్షోణీయశఃఖండమై

కం. గోవర్ధనహోటలు నం
దావేళశయించి దానియధిపతికి నతుల్
గావించి పయనమైనా
మావలఢిల్లీకి వాసరారంభమునన్

మ. ప్రమదంబారగ ప్రత్తిపాటికుల సుబ్రహ్మణ్యనామాంకుడు
త్తమమిత్రుండల నల్లగొండను నుదాత్తంబైన సన్మాన య
త్నముగావించి సహస్రరూప్యశతమున్నాకు న్సమర్పించి య
చ్చము భక్తింబ్రకటించి యందుకొనె భాషాదేవి ఆశీస్సులన్

ఉ. ఆయువులేక మధ్యమవయస్సున బోయినభ్రాత ఆదినా
రాయణు నాత్మశాంతికయి ప్రాజ్ఞుడు నాకథనంకితంబుగా
చేయుమటంచు విన్నపము జేసిన నిచ్చితి నిచ్చె వేయిరూ
పాయలు కాన్కగా 'మచిలిబందరు' నం దతి వైభవంబుగన్

ఆ.వె. ఘనమహర్షి బిరుదుగాంచి గోదావరి
తీరమందు ప్రజలగౌరవంబు
బడసినట్టి ఈవి వాడపల్లియు నాదు
కృతినిగొనుచు తగినభృతినొసంగె

మ. అలతెన్నాలిపురంబునన్ జరిగె బ్రహ్మాండంబుగా నాంజనే
యులుగా రగ్రసనాధినేతయయి నా కుత్సాహముంగూర్ప మి
త్రులు భాషాప్రియులైన భావనఋషీంద్రుల్ కాకుమాన్సుబ్బరా
వులు వేనూటపదార్లొసంగిరి కవీట్పూజార్హ సన్మానమున్

ఆ.వె. సుబ్బరావుసతి విశుద్ధకర్ణాట సం
గీతమందు మంచిఖ్యాతిగాంచి
పొల్చు మధురవాణి పుష్పావతీదేవి
పాటపాడి సభకు వన్నెదెచ్చె

తే.గీ. కండ్లబెదిరింపుతో నెట్టికార్యమైన
కడగిసాధింపగల్గు 'జేకబు'డు నటుడు
గాయకుడు నాదు తొలిశిష్యగణమునందు
చెప్పదగువాడునై నాదుమెప్పుగాంచె

కం. కనిగిరికిబిలిచె నన్నుం
గనికరమున రెడ్డి నాకు ఘనసన్మానం
బును సల్పగ మాల్కొండా
ఖ్యుని ఆతిథ్యంబునందుకొంటి ముదమునన్

శా. ఊరంగల్గిన సాహితీప్రియుల నుద్యోగస్థులంబిల్చి స
త్కారంబుం బొనరించిపంపు డితడాంధ్రంబందునన్ గండపెం
డారంబుంగొనె చెళ్ళపిళ్ళ సుకవీడ్గందేభ మర్పింప బం
గారంపుం గుసుమాభిషేకమున విఖ్యాతుండటం చెంతయున్

కం. సభలోనబొగడి నన్నున్
నభంబుపైకెత్తి చెప్పె నల్వురకుశ్రవః
శ్శుభగముగ నాకళా వా
గ్విభవముజోడించి ప్రజలు విభ్రాంతిపడన్

మ. కరణాలుందహసీలుదారులు కవుల్ గ్రామాధికారుల్ మహా
దరభావంబున గ్రుమ్మరించిరపుడే ద్రవ్యంబు నూరార్లుగా
మురిసెన్ రెడ్డిమనీషి నాహృదయముం బూర్ణప్రమోదంబుతో
మెరసెన్ దోసెడు డబ్బుతోతిరుగబంపెన్నన్ను గుంటూరుకున్

కం. వలచెన్నాకృతి బొల్లా
కులజుండున్ గుప్తదానగుణరమ్యుడు మం
గళగిరివాస్తవ్యుడు ధీ
బలయుతుడైనట్టి శ్రీనివాసుండెలమిన్

చం. కొమరునిపెండ్లిలోన గయికొందును మీకృతినొందు గొప్పక
ట్నమునిడువాడ యెంతటిధనంబుగడించిన కావ్యభర్తతో
సమమగుకీర్తిరాదు కవిసత్తములేకద చావులేని భా
గ్యము సమకూర్చుబ్రహ్మలు జగంబుననంచు నమస్కరించినన్

కం. మంచిశుభమనుచు మనసున
నెంచి యొసంగితిని నాదుకృతికాతని దీ
వించెన్ గరుణశ్రీ యే
తెంచి ప్రశంసించె మత్కృతింగల గుణముల్

కం. కవులకు పండితులకు శా
లువలుం జెమికీసరంబులుం దత్కావ్యో
త్సవవేళ శ్రీనివాసుం
డవారిగానొసగె సమ్మదాశ్రులు గురిసెన్

తే.గీ. సరవి వినుకొండపౌరు లాశ్చర్యపడగ
భూరి సన్మానమొకటి మేడూరికులుడు
శశ్వదౌదార్యరతుడు నాగేశ్వరుండు
పరిషదధ్యక్షు డభిమానభరితుడగుచు

కం. నిడుబ్రోలుసమితి కధ్య
క్షుడు పాములపాటి వంశజుండైన ప్రసా
దుడు సల్పె గొప్పకట్నం
బిడి సన్మానంబు మధురహృదయుం డగుచున్

ఆ.వె. కారుమంచి వంశకరుడు సుబ్బయ దాన
పరుడు సోదరుని వివాహమునకు
నన్నుపిల్చియొసగె నాల్గువందలు ద్రవ్య
మమ్మహోత్సవంబునందు మెచ్చి

శా. పూనా ఆంధ్రమహాజనుల్ పిలిచి సంపూర్ణాభిమానంబు నా
పై నిండారగ నాతిథేయములతో పద్యప్రశంసాళితో
నానా రీతుల గౌరవించిరి యఖండప్రేమతో నాకు స
న్మానంబచ్చట గూర్చినట్టి నరసింహాచార్యు నూహించెదన్

ఉ. ఆసమయాన బొంబయిమహానగరాంధ్రులు సత్కరింప పే
రాసలు వ్యక్తపర్చి మరియాదగవ్రాసిన కమ్మజూచి న
న్నా సభకేగి రావలయునంచు నృసింహుడు సమ్మతింపగా
జేసిన బోయి బొంబయికి జేరితి నాటి నిశీథవేళలన్

కం. హిందూ ముసిలిమ్ములలో
గందరగోళంబురేగి ఖడ్గంబులతో
గొందరజంపిరి పోలీస్
బందోబస్తన్నిచోట్ల సాగుచునుండెన్

తే.గీ. ఏముకల్యాణుస్టేషను కేగినపుడు
ముమ్మరంబుగ వర్షంబుగ్రమ్మియుండె
గస్తిసల్పెడు పోలీసొకండు వచ్చి
కసరిగద్దించి మామేనుపిసికిచూచె

ఉ. ఎవ్వరుమీర లీనగరికెందుకువచ్చితి రీపురంబులో
చివ్వలురేగి ఖడ్గములుచేకొని ముస్లిముహైందవాళి పో
నివ్వరు మిమ్ము ప్రాణములకిక్కడ భద్రతలేదటంచు వా
డవ్వలికేగనీక హృదయంబున భీతిరగిల్చెనెంతయున్

కం. భీతికిలోనై గడగడ
మా తనువల్లికలువణకి మాటలువడి మా
వ్రాతయని కూలబడి యీ
రాతిరితో తీరిపోయెబ్రదుకులటంచున్

కం. నాతో వచ్చిన శిష్యుడు
చేతంబున భీతినంది చెప్పకయేదో
రీతిగనటించె నల చిం
బోతువలెన్ భీకరంబుబూనెన్ బైకిన్

మ. కనులన్ నీరిడునంత నంతికమునన్ గన్పట్టెమోటారు పి
ల్చినమిత్రుల్ పదిమందివచ్చి కవిజీ లేటయ్యె మన్నింపుడీ
యని ఆప్యాయతతోడతోడ్కొని సుధాహర్మ్యంబులో జేర్చిరం
తన మేమూపిరిబీల్చుకొంటిమి సుఖాంతంబయ్యెమారాకయున్

ఆ.వె. పోస్టుచేయుమంచు పూనాపురంబున
జాబొసంగినాడ జాకబునకు
మరచినాడనంచు మరలనాకునొసంగె
గర్తపురమునందు గౌరవముగ

మ. జననంబందిన విన్నకొండపురిలో సన్మానమేర్పాటుచే
సి నితాంతాదరచిత్తుడై తొలుతనిచ్చెన్ వేయినూరార్లు నా
కును మేదూరికులుండు తొంటిప్రతిపక్షుల్ నన్ను ద్వేషించువా
రును నాయభ్యుదయాభిమానులయి మార్పుజెందిరత్రంబుగన్

కం. కురిసిరి పద్యసుమంబులు
చిరుతకవులు ముదురుకవు ల శేషంబుగ నా
శిరమున మనకవికిసభన్
పరాయిలాచేయుటంచు వనరిరి పౌరుల్

తే.గీ. చిన్నతనమున నాతోడ చెలిమిజేసి
క్రీడసల్పిన మిత్రు లీనాడులేరు
వారి గోరీలమీద కన్నీరుచిలికి
వచ్చినాడను హృదయంబు వెచ్చబడగ

మ. తలిదండ్రుల్ నిదురించుకాటికడ చింతం గొంతసేపుండి పూ
వులు పై జల్లి త్వదాత్మజాతుడను బాబున్నీవు స్వర్గంబులో
కలకాలంబు సుఖింపుడంచొక నమస్కారంబుగావించి య
మ్మలకాదర్శవు దీవెనల్ కురియుమమ్మా! యంచుప్రార్థించితిన్

కం. ఊరేగించి 'రొరంగల్'
పౌరులు కొండొక్క మంత్రివరునిన్ నన్నున్
భారీవాహనమున ము
న్నూ రారులనిచ్చి దృఢమనోరథులగుచున్

తే.గీ. కంకిపాడను నొక్క కుగ్రామమందు
హరిజనులు క్రైస్తవులు బరాబరులుచేసి
మేలి పన్నీటితోడ పాదాలుగడిగి
గౌరవించిరి నూటపదారులిచ్చి

కం. అడుగులకు మడుగులొత్తిరి
కడిగిరి పాదాలు మంచిగంధపు నీటన్
బిడియపడి వలదువలదని
బడాయిస్వాములకు దగినపనులివి యనుచున్

కం. కవియు నొకమానవుండే
కవి నొకదైవముగదలచి కాళ్ళుగడుగు మీ
రవివేకులనుచు నతి మా
ర్దవముగ చీవాట్లుపెట్టి తరలితి పురికిన్

తే.గీ. పగటిదివిటీల పల్లకీవాహనమున
వీటిలోద్రిప్పిరానందపేటవారు
యే మెరుంగని బాలకులీ దినమున
పెండ్లికొడుకంద్రు నను వ్రేలుబెట్టిచూపి

తే.గీ. దండిపల్నాటియుద్ధ చిత్రంబునందు
పద్యములు వ్రాయ నాకు నాహ్వానమంపి
ప్రతిఫలము రెండువేలైదువందలనుచు
ప్రేమతో నన్ను నియమించె 'రామినీడు'

తే.గీ. సర్వసౌకర్యములుగల్గు సదనమొకటి
చెన్నపురిలోన నేర్పాటుజేసి మమ్ము
ఆదరించిరి నిర్మాత లాత్మనలరి
కొంచెమేనియు కొరతగావించకుండ

కం. విరచించితి నక్కథకుం
సరిపడు పద్యములు పెక్కుసవరింపులతో
కర్ణమలర విని 'రాజే
శ్వరరావు'ను మెచ్చె 'ఘంటసాల'యు మెచ్చెన్

కం. పదునైదువందలిడి పై
పదివందలబదులు పదులుపదులు నమస్సుల్
పదిలముగబెట్టి నను నె
మ్మదిగా పురికంపి రీక మాదిరి కొదుకన్

ఉ. చిత్రము తెల్గుసీమల నశేషజనంబు నుతింపగా దివా
రాత్రులుసాగె ప్రేక్షకులు బ్రహ్మనపాత్రయు నాగమాంబికా
పాత్రయు మేలుమేలనిరి, పద్యములింపుగనున్న విట్టి చా
రిత్రక గాథలే కడువరిష్ఠములంచు వచించి రెల్లరున్

ఆ.వె. రామినీడుగారి ప్రతిభావిశేషముల్
రాణకెక్కె నాంధ్రరాష్ట్రమందు
కర్మమేమొ చిత్రనిర్మాతలందరు
నష్టపడుట వింటి కష్టపడితి

మ. నను శ్రీమాధవరెడ్డి రాజయ సువర్ణస్నానమాడించె నం
దనులుం బ్రేయసి ఆరతుల్ సలుప యేతత్సభన్ నాకు చ
క్కని సౌధంబును క్షేత్రరాజమును సత్కారించి స్వర్గస్థులై
చని రేకాన్వయు డాంజనేయుడును రాజాభిజ్ఞుడీమధ్యనే

కం. బెజవాడ రామచంద్రుడు
ప్రజాహితుడు రెడ్డిరాజు పరతెంచి సభాం
బుజమునకు సూర్యునింబలె
అజాతశాత్రవుడు సలిపె నద్భుతలీలన్

చం. జరిగిన సత్కృతుల్ బ్రదుకుసాగుట కిచ్చిన ద్రవ్యరాశితో
జరిగెను గాని యిట్టులొక సత్కవివంశము శాశ్వతంబుగా
స్థిరముగ నిల్పినట్టి గుణధీరులు వేరొక దేవదూత యు
ర్వర నవతారమెత్తెనని ప్రస్తుతిజేసితి నంజలించితిన్

చం. చెళపిళ వేంకటేశ్వరుని జన్మదినంబున వారికాంధ్రభూ
వలయమునందు చొప్పడిన భవ్యయశస్సును తద్వధాన కౌ
శలమును ప్రస్తుతించిన లసత్కవివర్గమునందు నా ప్రశం
సలకు గరంగివ్రాసె నరుసంబుగ నాపయి కొన్ని పద్యముల్

తే.గీ. "జాషువాకవికాబోలు షష్టిపూర్తి
నాడు బిరుదంబులందున నా యనాస్థ
గురించి యొకసీసపద్యాన సరసగతి వ
చించె నితరులేమన్న నాకేమి లెక్క

తే.గీ. ఎంతదూరమో యెందుల కెవఁడు జాషు
వాయను కవిప్రవరుడు? కవనమునందు
వానిబోలెడివారె యెవ్వారలేని
విప్రకవులందు యెవ్వఁడో వేత్తదక్క"

కం. జాతకచర్యాఖ్యం దా
నా తరుణమునందు వ్రాసినట్టికృతిన్ న
న్నీ తెరగున వ్రాసెన్ దు
ర్జాతులకే యీర్ష్య విప్రజాతికి దగునే

ఉ. కోరిక కాకినాడసభకుం జనినాడను వీటిలోన స
త్కారములెన్నియో జరిగె గౌరవమొప్ప పిఠాపురీమహో
ర్వీరమణాభిధానమున పెంపలరారు కళాలయంబులో
భూరికవీంద్రగోష్ఠికిని బోయితినొజ్జలు కోరిపిల్వగన్

మ. పురుషాకారత దాల్చియున్న పలుకుంబూబోడినాబొల్చు భూ
సుర ముఖ్యండగు వేంకటేశ్వర కవీశుండున్ ద్రిపుర్నేని పె
క్కురు విద్వాంసులు గూడియున్న సభలో కొంచెంబుగానన్ను నా
గరిమన్హేళనచేసె నొక్కకవి ధిక్కారంబుగావించుచున్

శా. లేలెమ్మోయికవీ! సభాంతరములీలీలన్ నినున్ నీదుగ్రం
థాలంగొంచెపు జూపు చూచెదరు స్వార్థస్వాంతు లేనుండగా
జాలింజెందెదవంచు నా నిరత భాషాసేవ నాజబ్బపై
కేలందట్టగ గ్రుమ్మరించితి కృధాగ్నిం బద్యరూపంబునన్

ఉ. గవ్వకుసాటిరాని పలుగాకులమూక లసూయచేత న
న్నెవ్విధిదూరినన్ ననువరించిన శారదలేచిపోవునే
యివ్వసుధాస్థలింబొడమరే రసలుబ్ధులు ఘంటమూనెదన్
రవ్వలు రాల్చెదన్ గరగరల్ సవరించెద నాంధ్రవాణికిన్

కం. సభవీడిలేచితిని నా
యభిమానులుకినిసి రా మహాసభలోనన్
రభసగలిగె గుభగుభమని
సభాధినాయకుడు లేచి సముదాయించెన్

చం. కవులు దరిద్రులంచెరిగి కల్గినవాడు వివాహవేళ గౌ
రవముగబిల్చి నాలుగువరాలకుమించని కాన్కతోడ శా
లువలు బహూకరించు కవిలోకము తృప్తివహించి గొప్ప దా
తవనుచు సన్నుతించు కవితాసతి కన్నులనీరు నించగన్

చం. సుకవులు భాగ్యవంతులగుచో తమ మోసపుటార్జనంబు డాం
బికత బజారుసేతురను భీతికిలోనయికాక పేదలై
సుకము లెఱుంగ కాకటను స్రుక్కెడు సత్కవిగాంగ్రకింత భు
క్తికి సరిపోవగానిడక తెంపుగనిత్తురు పెండ్లికట్నముల్

కం. జవ్వాది వంగడములో
జవ్వాదినగంబు జలధిశయనుని వలపుం
జవ్వనిసుతుడగు లక్ష్మయ
మవ్వపుగుణరాశి పిలిచి మన్ననచేసెన్

కం. అంకితమిచ్చితి లక్ష్మయ
పంకేజాననకు గగనవాసినికి యశ
స్సంకలిత కసమ సహనా
లంకృతకొక కావ్య మాది లక్ష్మాంబికకున్

మ. ధృతిమీరం బెనుగొండకుంజని తదాతిథ్యంబులంబొంది వి
శ్రుతవిద్వాంసులు కైతలల్లు హరిదాసుల్ పెక్కురేతెంచి స్వా
గత పద్యాశిషపత్రముల్ సదివి సత్కారింతురీనాటికం
చితమౌ లక్ష్మయగారి ప్రేమ మెదలోజీర్ణించి వెంటాడెడిన్

కం. హేలాపురిలో గంపెదు
పూలం దలనుంచి ప్రేమపుష్పములై పై
వ్రాలెనన తెలుగుదర్బా
రాలయమున పూజసేసి రాంధ్రప్రముఖుల్

కం. కొందరు కవితాప్రియులగు
బృందావనపురములోని విద్యార్థులు నా
యందభిమానము కడు పెం
పొందంగా సత్కరింప పూర్ణోత్సుకతన్

మ. అనుకూలుండని తత్సభాధిపతిగా నాహ్వానముంజేసి రో
క్కనివిద్వాంసుని నొందు రెందు కృతులన్ గల్పించి గర్వించు వా
నిని సన్మానితుడైన నాకవిత సందేహించెనో చెప్పసా
గె నతండన్యులపాండితీప్రతిభలన్ గీర్వాణనాట్యోన్నతుల్

చం. వదలక మూడుగంటలు సభాసదులన్ విసిగింపసాగె నా
హృదయమునందు కోపముసహించనిదై చెలరేగెనంతలో
పదుగురులేచి మానుకొనవాయిక సత్కృతినందు వక్త పే
రుదయమునుండి పేర్కొన వహో యనిపల్కి రుదగ్రకోపులై

చం. అనదగు నాల్గుమాటలని ఆగ్రహమున్ వెలిగ్రక్కి లేచి భో
జనమొక ప్లీడరింట దిని చల్లగ జేరితి విన్నకొండకున్
ననుతొలినుండి గౌరవమునం గణియించు రసజ్ఞుడెవ్వరో
మనమున ఖేదమంది యవమానదవాగ్ని శమింపజేయుచున్

కం. వ్రాసెను కృష్ణాపత్రిక
వ్యాసము నూల్పోగు కమలవైరికనుచు నా
యాసముశమింప గొందరు
వ్రాసిరి లేఖలను స్థిమితపడె మానసమున్

ఉ. ఈదితి వాఙ్మయాంబునిధి నేబదియేడులు సర్వ పండితా
మోదముగా రచించితివి ముప్పదికావ్యము లిట్టినీవు ని
ర్వేదముగల్గు ధిఃకృతిలభించెడు దేశములోన నీకు మా
కేది శరణ్యమంచు తలయెత్తకచింతిలె కావ్యకామినుల్

# ప్రాశస్త్యము

కం. నిస్తుల శుభదాయకము, ప్ర
శస్తము, కలుష ప్రపంచ చంద్రోదయమున్
ఆస్తిక కర్ణాభరణము
క్రీస్తుచరిత విబుధమణి కిరీటంబు జుడీ!

కం. మహిమోపేత ముదాత్తము
సహన సుధాలయము, ఆత్మ సామ్రాజ్య సుఖా
వహము, యెహోవా దేవుని
సహవాసాత్మకము, క్రీస్తుచరితంబు జుడీ!

కం. జననమరణ రహితము, పా
వనము, మహోన్నతము, సత్యపరిమళ భరితం
బనఘంబు, శాశ్వతము, స
జ్జన నుత మతులంబు క్రీస్తు చరితంబు జుడీ!

కం. యుగయుగ వయోవిశిష్టం
బగణిత మహిమాభిరామ, మఖిలాఘ మహా
నిగళచ్ఛేద కుఠారము
జగదుద్ధారకము, క్రీస్తు చరితంబు జుడీ!

కం. అక్షయ పరమార్థ కథా
నిక్షేపము, సర్వదుఃఖనిష్ఠురగజహా
ర్యక్షము, సద్భక్తులకున్
సాక్షాన్మోక్షంబు, క్రీస్తు చరితంబు జుడీ!

# ఖండ ప్రశంస

సీ. సకల మానవ కిల్బిషము లూడ్చ నరమూర్తి చేకొన్న నజరేతు చిన్నవాడు
దశలక్షకోటి దూతలు గొల్వ పరదైసు రాజ్యంబు పాలించు రాచవాడు
చావు పుట్టువులకు సంకెలల్ బంధించు నధికార మరచేత నమరువాడు,
నక్షత్ర దీపంపు నడుమింట బయనింప భూమి బుట్టిన బేతలేము పాప

తే.గీ. ఏమి నోములు నోచితో యేసుప్రభువు
డాబు దర్పాలు గల్గు ఖండాతరముల
జన్మమెత్తక నీ గడ్డ జన్మమెత్తె
ఆసియా ఖండమా! ధన్యవమ్మ నీవు!

# ఒక మనవి

క్రీస్తు చరిత్ర కావ్యంగా వ్రాయాలన్న నా చిరకాల వాంఛితం తీరింది. మతగ్రంథాల్ను అందులో బైబిల్ను ఛందోబద్ధం చేయడం కత్తిమీద సాముమంటిది. “నిరంకుశాఃకవయః,” అన్న ఆర్యోక్తి యిక్కడ పొసగదు. తీగమీది నడక, ప్రత్యక్షర ప్రాధాన్యాన్ని పాటించే క్రైస్తవ మిత్రులు, కథకు తప్ప కవనానికట్టే చోటీయరు.

ఇది ఫలానా కవికలమేనా యని పాఠకు లనుమానించే ఘట్టాలిందులో చాలా యున్నయి. పై కారణాలు పాటించి పాఠకులు నన్ను మన్నింతురు గాక. రచనా సౌలభ్యం కోసం అద్భుతాలు, ఉపమానాలు, కొన్ని మాత్ర మభివర్ణించగలిగాను. తెలుగు బైబిలు భాష నీసడించు హైందవ మిత్రులకు, కళాభిరుచిగల ఆధునిక యువక్రైస్తవ లోకాని కీకావ్యం రుచిస్తుందనే ధైర్యం నాకున్నది.

అయిదారేండ్ల క్రింద సికిందరాబాదుకు నన్ను పిలిపించి మహాసభ చేయించి సన్మానం చేసి కావ్యరచనకు పురికొల్పిన నా మిత్రులు శ్రీ ఎ. సమూయేలు, బి.ఎ. ఎల్.టి., గారికిన్ని, ఇందులో మార్పులు కూర్పులు సూచించి, సలహాలిచ్చి తోడ్పడ్డ శ్రీ బి.ఇ. దేవరాజు, ఎం.ఎ. ఎల్.టి. గారికిన్ని, ప్రకాశకులైన యస్.పి.సి.కె. సంస్థ వారికిన్ని నా ధన్యవాదాలు.

జి. జాషువ

# క్రీస్తు చరిత్ర
## సృష్టి

ఆ.వె. ఆదియందు దైవ మాకసంబును భూమి
నహము రాత్రి నర్కుతుహినకరుని
ఆరునాళ్ల సలిపి, యవల నేడవనాడు
విశ్రమించె, మహిమ విస్తరింప

ఆ.వె. మన్ను ముద్దజేసి మనుజుని సృష్టించి
వాని కంఠమందు ప్రాణమూది
వాని ప్రక్కటెమ్ముతో నారి గల్పించి
నిలిపె వానితోడు నీడగాగ

కం. ఆదిమ దంపతులగు న
య్యాదా మవ్వలను, రమ్యమగు భూముల యం
దేదోను తోటయం దిడి,
ఆదరమున సర్వ సుఖములం దమరించెన్

ఆ.వె. మేలుకీళ్లు తెలుపు మేదినీరుహముల
ఫలము లారగింపవలదు మీరు
ఆరగింప దగు దదన్య ఫలంబుల
నని యెహోవ వారి కానతిచ్చె

ఉ. కొండొక పాము హవ్వకడకుం జనుదెంచి, భుజింపవచ్చు న
ప్పండులు, మేలు కీళ్లెరుగవచ్చు నటంచు కుబోధచేయ న
య్యండజయాన నమ్మి, తిని, యందొక పండు నిజేశుకిచ్చె నా
తండు భుజించె; జారె తమ దైవ సమాన పవిత్రతాధ్యతల్

మ. జగదారాధ్యుని ఆజ్ఞమీరి పెను లజ్జా కుంచిత గ్రీవులై
దిగులున్ జెందుచు నాకు జొంపముల భీతిన్ డాగి యున్నట్టి య
య్యుగళిం బ్రాక్తన దంపతిన్ దెగడిపొం దుద్యానమం దుండగా
తగరంచున్ బహుధా శపించి తరిమెన్ దైవంబు క్రోధోద్ధతిన్

తే.గీ. గర్భము ధరించి బిడ్డల గనుదుగాక
ప్రసవవేదన ననుచు హవ్వను శపించె
నేల నాగట దున్ని పండించు కొనుచు
మనుము సతితోడ నని యాదమును శపించె

కం. పొట్టంబ్రాకుచు పుడమిని
మట్టిందిను దీవు నీదు మస్తమును నరుల్
మట్టెదరు కాల చిదుకం
గొట్టెదరని సర్పనాయకుని శపియించెన్

ఉ. ఆకలి దప్పులుం జిలుగు లామయముల్, భయ సంశయంబు లు
గ్రాకృతి వెంటనంట, హృదయ వ్యథతో, భగవద్దయా శుభ
శ్రీకెడమై యెదోను వనసీమలువాసి, వసించి పాపులై
యీ కడగండ్లుగూర్చిరి మహీ వలయంబున కాదిదంపతుల్

ఉ. నా డెడమైన దేవుని సనాతన సఖ్యము నుద్ధరించి, యీ
రేడు జగాల శాంతి వెలయించి విముక్తి ఘటింప, కిల్బిషం
బూడ, నరావతారుడయి ఉర్వి జనించె యెహోవ నందనుం
డీడిత ప్రేమరూపి, ప్రభు యేసు, ప్రవక్తలు పల్కినట్లుగన్

## యోహాను జన్మవృత్తము

తే.గీ. యాజకుడు, నీతిమంతుడునగు జెకర్య
యెలిజబేతులు సంతానహీను లగుచు
వగచుచుండిరి పరిపూర్ణ వార్ధకమున
దైవ వాక్యంబునకు గీటుదాటకుండ

కం. దేవాలయమున నొక నా
డా వృద్ధుడు పూజ సలుపు నవసరమున యే
హోవా దూత కనంబడె
నా వేదికపొంత నాత డచ్చెరు వందన్

సీ. ఆలించె నీ ప్రార్థనావళుల్, భగవంతుడానందపడియె విశ్వాత్మకుండు
ఎలిసబేతనెడు నీ యిల్లాలు సంతానవంతురాలై తనుభవుని గనును,
యోహానెనెడు పేర నొప్పునాతండు, మోక్షాధీశ్వరుని దృష్టి నధికుడతడు,
మద్యమైరే యాదిమత్తు పదార్థముల్ చవిచూడ దమృత స్వాంతుడగుచు,
ప్రభువు మార్గము సిద్ధపరచి యజ్ఞానుల సదసద్వివేకుల సలుపగలడు

తే.గీ. అనిన జకరయ్యవిని విస్మితాత్ముడగుచు,
వృద్ధుడను నేను, నా భార్య వృద్ధురాలు,
సంభవంబౌనె మా కని సంశయింప,
ననియె నిట్లని జకరియా యాజకునకు

మ. విను, నా నామము గాబ్రియేలుడు జుమీ విశ్వంభరాస్రష్ట దా
పున వర్తించెద నప్పరాత్పరుని పంపున్ సేతు, నామాట న
మ్మని నీవాయమతీర్థమాడు వరకున్ మాటాడగా నాల్క సా
గని మౌనంబు వహించియుందువని వక్కాణించె నుద్వేగియై

కం. గుడివెడలివచ్చి, నాలుక
పిడుచై నుడు వెడలిరాక పెనుమూగవలెన్
గడువడి సంజ్ఞలు చేయుచు,
గడపెం గాలంబు సతియు గర్భముదాల్చెన్

## క్రీస్తు జననము

చం. గొనములకున్ విలాసములకున్ భగవంతుడు ప్రాణమూది చే
సిన నవపుష్పరాశియన జెల్లు విముగ్ధను మేరి కన్యకన్
దనకు ద్వితీయగా గొన ప్రధానము జేసికొనెన్ యథావిధిన్
జననుతుడైన యోసెపను సజ్జను డొక్కడు నీతిమంతుడై

కం. మరియమ కొకనాడింటన్
పరిశుద్ధ ప్రభువుదూత ప్రత్యక్షంబై
కరమెత్తి శుభము దేవుని

కం. అని కట్టెదుట న్నిల్చిన
ఘనదూతన్ గాబ్రియేలుగని మరియమ య
ల్లన గుండె ఝల్లుమనగా
తనువుగదల నోటిమాట తడబడుచుండన్

శా. దావీదెక్కిన పీఠమెక్కి, ఘన యూదా వంశ సామ్రాజ్యమున్
దైవోదాత్త శుభోదయంబు గదురన్ కల్పాంత కల్పాంతముల్
సేవింపంబడి యేల్బడిన్ సలుపు యుజ్జీ లేని సర్వేశ్వరుం
డావిర్భావమునందు నీకు పరిశుద్ధాత్మ ప్రభావంబునన్

చం. పురుష నెరుంగనట్టి, కడు ముగ్ధను, కన్నియనైన నాకు నె
త్తెరగున సంభవించు నిది తెల్పుమనన్ విని గాబ్రియేలు సుం
దరి, భగవత్కృపం గలుగుదానవు దేవుని పావనాత్మ నీ
శిరమున నిల్చెడిన్ భయము జెందకు మాదరణీయ వన్నిటన్

కం. పరిశుద్ధుండై దేవుని
వర తనయుండగుచు, యేసుప్రభువను పేరం
బరగెడు; నీ బందుగురాల్
గరిత, యెలిజబేతుకూడ గర్భముదాల్చెన్

కం. అని దూతతెల్ప, మరియమ
మనమున నుప్పొంగి నమితమస్తకయై, దే
వుని దాసురాలి కట్లే
ననె, దూత యదృశ్యమయ్యె నా క్షణమందున్

ఉ. కన్నెకు గర్భ చిహ్నములు గన్పడ యోసెపు డంతరంగమం
దెన్నియొ, వింత సందియము లేరుపడన్ విడనాడ జూచుచుం
డె న్నిజ దైవకార్యమని నేరక దేవుని దూతస్వప్నమం
దు న్ని జముగ్గడించి పరితోషిత చిత్తునొనర్చె నాతనిన్

మ. అనలంబట్లు పవిత్ర చిత్తజుమి, నీ యర్ధాంగి, శ్రీదేవ నం
దను గర్భమున దాల్చెనీయమ, విశుద్ధాత్మ ప్రభావంబునన్
విను మాచంద్ర సరోజబాంధవముగా విశ్వంబు కొండాడి, దే
వునకుం దండ్రితనంబు నీకు నిడి సల్పున్ నిండు మర్యాదలన్

ఆ.వె. సంశయంబులెల్ల సమసి యోసేపుండు,
చేరి మేరినింట జేర్చుకొనియె
ప్రసవమైనదాక పరిచర్య లొనరించె
నింతి కన్య మాత దెరుగకుండె

ఆ.వె. గరిత యెలిసబేతు గర్భంబు దాల్చిన,
ఆరు మాసములకు మేరికన్నె,
వచ్చె నొక్కనాడు బంధుభావంబున
ఎలిసబేతు నాతి నిలయమునకు

ఉ. వందన మాచరించె నిజబందుగురాలి కెలీసబేతు కా
నందముతో నెలీసబెతు నాతియు ప్రత్యభివాదమిచ్చె నా
సుందరి గర్భమందెదుగు, సూనుడు గంతులువైచె బిట్టు టా
నందముతో మెసీయ జననంబును బిండమెటుల్ గ్రహించెనో

మ. మరియాంబా! కడు ధన్యురాలవు గదమ్మా! దేవునాశీర్వచః
స్ఫురణంబొల్చితి, నేడు నా గృహము నీ పుణ్యాగమ ప్రాప్తి, పొం
పిరివోయెన్, భవదీయవాణి విని నా బిడ్డండు గర్భంబు నం
దురు మోదంబున గంతులన్ వయిచె నభ్యుత్థాన మర్యాదలన్

కం. అనిన విని, మరియ మురియుచు,
నను నిజముగ కనికరించె, నా ప్రభువిదె నా
మనమానందపయోనిధి
మునిగెం గడుధన్యురాల భూతలమందున్

కం. కరకు దురాలోచనముల
నెరిగి యహంకారులను సహింపక తరిమెన్
గురుసింహపీఠముల భూ
వరులంబడగొట్టి యిచ్చె బలహీనులకున్

కం. లలిత పదార్థంబుల నా
కలిగల వారల కొసంగి కలిగినవారిన్
వెలలిచె రిత్తకరంబుల
నెలమి బలికినట్టు లిశ్రాయేలున కిచ్చెన్

కం. పిమ్మట మరియామానిని
ముమ్మాసము లెలిసబేతు భూరితరాతి
థ్యమ్ములు గైకొని తన గే
హమ్మునకుం జనియె, మంజులాశయములతో

చం. ప్రసవము హాయిగా గడచి బాలునిగాంచె నెలీసబేతు, సం
తసపడి రాత్మబందుగులు, దైవముమెచ్చి ప్రసన్నుడయ్యె, న
న్ని సుగున కష్టవాసరము నిండగ సున్నతిజేసి దూత వా
క్య సరణి, యోహనుండను సమాఖ్య నొసంగిరి తల్లి కోరికన్

కం. ఏ పేరు పెట్టగావలె
నీ పాపకు చెప్పుమంచు నేస్తులడుగగా
ఆ పేరే వ్రాసె జక
ర్యాపల్కక పల్కమీద, నా క్షణమందున్

కం. సడలె న్నాలుక, మాటలు
వెడలె నిరాఘాటధాటి, వినుతించె ప్రభున్
గడుభక్తి బోధచేయం
దొడగెం జెకరయ్య ఆత్మతోడై నడపన్

సీ. స్తవనీయుడగుత మిశ్రాయేలు దేవుడు దర్శనం బిడి ముక్తిదాన మిచ్చె
సేవకుండైనట్టి దావీదు కులమందు కల్పించె మేటి రక్షణనగంబు
పరిశుద్ధులైన ప్రవక్తలు ముందుగా పలికిన పలుకులు పండెనేడు
శాత్రవజాతి హస్తంబులు తప్పించి బ్రతికించి మనకు నిర్భయత నెరపె

తే.గీ. ఓయి, బాలక నీవు సర్వోన్నతునకు
భక్తుడవు, దాసుడవును ప్రవక్తవగుదు
ప్రభుని మార్గంబు నొగి సిద్ధపరచగలవు
అంధకారంబులో సూర్యుడవతరింప

తే.గీ. కైసరౌగూస్తుడను రాజశాసనమున
ప్రథమ జనసంఖ్యలో వ్రాయబడుట కొఱకు
ఇంతితో యోసెపల బెత్లెహేముపురికి
బోయె, దావీదు రాజన్య పుణ్యపురికి

కం. ప్రసవించెనందు మరియమ,
నిసుగున్ సత్రమున జనము నిండిన కతనన్
పసరముల తొట్టి నుంచెన్
అసమాన చరిత్రు, నేసునాథు మహాత్మున్

మ. ఘననక్షత్ర మహామణిన్ దలను శృంగారించె నాకాశ గే
హిని, బంగారపు మెట్ల కిన్నరలు మ్రోయించె న్నిలింపాంగానా
జనమానంద పయోధి దేలె సకలాశల్, మేరి గర్భంబునన్
జననంబంది ప్రభుండు దీనుడయి, కోష్ఠంబందు పన్నుండగన్

కం. పొలములలో గొందరు గొ
ల్లలు కాపరులుండ, నాటి రేవెల్గె మహో
జ్వల కాంతి వారి నికట
స్థలి, దేవునిదూత వారి సన్నిధి నిలిచెన్

చ.	వలదు భయంబు మీకు; శుభ వార్తను దెచ్చితి, లోకరక్షకుం
దలఘుడు బేతలేము పురియం దుదయించె నతండె క్రీస్తు; ము
ద్దులుగురియించుచున్ బసుల తొట్టి నొకానొక పాపపొత్తి గు
డ్డల శయనించి పాల్గుడుచుటం గనుగోగల రానవా లిదే

తే.గీ. తారసిలుగాక భువిసమాధాన భాగ్య
ముర్వి తన కిష్టులైనట్టి సర్వవరుల
కున్నతోన్నతస్థలుల, మహోన్నతునకు
కలుగు గావుత మహిమ మంచలఘు దేవ
సైన్య మాదూతతో గూడి స్తవమొనర్చె

సీ.	అంధకారము గుండియలమీద కాలూని పకపక నవ్వె నంబరతలంబు,
వలపుల తల్లి ఔక్కల ముసుంగెడలించి కిలకిల నవ్వె రాచిలుకకూన
అరవిచ్చు రేకులచిరునవ్వు లొలికించి పూదోట లాసవ పూజసల్పె
మలయజంబలది దిగ్వలయాంగనలతోడ కొదమ తుమ్మెద గుసగుసలు వోయె

ఆ.వె. ఇహము పరము రూపమెత్తిన ఆనంద
పుంజమయ్యె, ప్రకృతి పులకరించె
సిరులుదొరగి మోక్ష సింహాసనము వీడి
ప్రభువు భూమిమీద పాదమూన

కం.	ఆ దివ్యరాత్రితో సరి
రాదే రాత్రియును యేసురాడ్భానుండీ
మేదిని జన్మించిన మరి
యాదకు గుర్తైన వేళయై నుతికెక్కెన్

కం.	యుగయుగ చరిత్రలో ము
జ్జగములు జీవించువరకు, సత్క్రైస్తవ భ
క్త గణముల గేహముల నా
భగవ ద్రాత్రంబు పట్టపగలై వెలుగున్

తే.గీ. వాలముల కుచ్చులూచి యబ్బాలకునకు
స్వాగతంబిచ్చి పశువు లుత్సాహపడియె
కోడెదూడలు గజ్జెలల్లాడ పొదుగు
పాలుద్రావక నొగి చెంగనాలుదీసె

ఉ. మానవ లోకమున్ గలుష మార్గమునంబడదన్నుదుష్ట సై
తాను దభిస్సునంబడి పదచ్యుతుడై, ధృతిదూలి స్వీయసే
నానులతో నగాధ భువనంబున డాగె, ప్రభూదయంబుతో
భానుడు తోచినన్ బరుగు బట్టవె దుష్టదివాంధ సంఘముల్?

సీ. ఎదురుచూచినది శ్రీ యేసుని పాదాలనంటి ముద్దిడ యూదియా ధరిత్రి,
దినములు లెక్కించుకొనుచున్న దెరుషలేమ్ నగరేసునంద చందముల నరయ,
పొంగుచున్నది సముత్తుంగ తరంగాల గలలీయ జలధి స్వాగతమొసంగ
కనకకవాట శృంగార నేత్రముల హర్షాశ్రువుల్ గురిసె దేవాలయంబు;

ఆ.వె. ఎపుడు ప్రభువువచ్చు నెపుడు మా జన్మముల్
ధన్యమగు నటంచు తలచితలచి
యుత్సహించు చున్నదో యన్నరీతిగా
ఘన వసంతశాటి గట్టెప్రకృతి

కం. కన్నారు గొల్ల లేసుం
జిన్ని జగత్కర్త ముదముజెందిరి మరియా
కన్నియ పొదిగిటి బుడుతన్
గన్నామనిచాటి రుత్సుకత నెల్లరకున్

## జ్ఞానుల రాక

కం. చుక్కం గనుగొని తూరుపు
దిక్కునగల జ్ఞానివరులు దేవతనూజున్
మ్రొక్కి భజింపగ నొంటెల
నెక్కి ప్రయాణించివచ్చి రిద్ధాశయులై

ఉ. ఎక్కడనున్నవాడు జనియించిన యూదుల రాజు; అల్లదే
చుక్క జనించియున్న దదిజూచి రయంబున వచ్చినాము; భూ
భుక్కువరేణ్య, మేమతని పూజ యొనర్చెదమన్న, హేరొదుం
దక్కజమందె, తత్తరిలిరాతనితో నగర ప్రజాతతుల్

మ. సరగన్‌రాజు ప్రధాన యాజకుల శాస్త్రజ్ఞాతలన్ గూర్చి, యి
ప్పూరి నెచ్చో నుదయించె క్రీస్తు డెరిగింపుండన్న శాస్త్రంబులన్
పరిశీలించి ప్రవక్తలన్న పలుకుల్ వ్యర్థంబుగా విశ్రాయేల్
నరులన్ బాలనచేయువాడు పురి జన్మంబెత్తె నిక్కంబుగన్

కం. అని సత్య ముగ్గడించిన
విని హేరోదుండు, కినుక పెల్లాంతర్యం
బునడాచి, వెలికి కౌతుక
మున జ్ఞానులజూచి కపటమున నిట్లనియెన్

ఆ.వె. పోయి, బాలరాజు పుట్టిన గేహంబు
నరసి కబురుచేయు డాక్షణంబ
అమ్మహానుభావు నర్చింపగా నేను
వత్తునంచు వారి బంపివైచె

ఆ.వె. చుక్కముందు నడచి, చక్కగా శిశువున్న
ఇంటివరకు సాగి మింటనిలిచె,
జ్ఞానివరులు బిట్టు టానందమున దేలి
ఇల్లు సొచ్చిచూచి రేసుసామి

సీ. ఆనాడు పసుల శాలాంతరంబున వెల్గు చిరు దీపకళిక నాశీర్వదించి
ఆనాడు కోష్ఠంబునందు బంధితమైన ఆలమందల గంగడోలు నిమిరి
ఆనాడు మేఘ మార్గాన కారాడిన జలద ఖండాల కంజలిఘటించి
ఆనాడు మేరి కన్యాకుమారుని గన్న గొల్లల శిరము లక్కునగదించి

తే.గీ. పూత బంగారు సాం(బ్రాణి బోళములను
(ప్రభువు పాదాలకడ సమర్పణ మొనర్చి
మోద ముప్పొంగి దేహముల్ పులకరింప
ధ్యాన మొనరించి రీరీతి జ్ఞానివరులు

సీ. తెగదెంపులై చన్న దేవమానవ మైత్రి కడగి (క్రమ్మర మొగ్గదొడిగె నేడు
(ప్రథమ పాపమున దైవము నోటవెలువడ్డ పటుశాపశిఖిచల్లబడియె నేడు
చైతన్యవంతమై సర్వసర్వం సహ (ప్రతి రజఃకణము పెంపారె నేడు
కాయంబుపొంగి మోక్షద్వారమున నిల్చి ఘన యెహోవా నవ్వుకొనియె నేడు

ఆ.వె. తూర్పుదిశ వసించు దూరవాసుల మమ్ము
తారచేత రాయబార మంపి
దర్శనం బొసంగి తనియించితివి తండ్రి
(మొక్కులందుకొమ్ము బుజ్జిదేవ

శా. లేరా? (ప్రోన్నత వంశజాతు లిచటన్ లేరా? ధరాధీశ్వరుల్
లేరా? రక్షకు నాగమంబునకు హోళిందేలు భక్తాళి, ని
న్నారాధింపగ నల్ప చిత్తులకు మా కాహ్వాన మంపించితే
(ప్రారంభంబున, చి(త్రముల్ జుమి త్వదీయ (ప్రేమ రాహస్యముల్

కం. గొల్లలకును మాకును నీ
చల్లని జననంబుజూచు సద్భాగ్యంబున్
గొల్లగ నొసగితి విదె మా
యుల్లములే గుడులు వాసముండుము దేవా

ఉ. మిన్ను నగల్చుకొంచు నల మెస్సియ వచ్చునటన్న పిచ్చిలో
నున్నది లోక మిట్లెదుట నుండు టెరుంగక, అందిచాపు లం
దున్న యనర్ఘరత్నమణి ఊర్ధ్వ ముఖుండయిపోవు గర్వ సం
పన్నున కబ్బునా? పరమపావన! కొమ్ము హృదంబుజాంజలుల్

సీ. పవలురేల్ దివిటీలుబట్టి దృష్టిప్రాప్తి గల్పించు చంద్ర భాస్కరులు గలిగి
జీతబత్యంబు లాశింప కంబుధినీరు వర్షించు మేఘ సేవకులుగలిగి
జిలిబిలి కూజితంబుల మింటనడయాడి అలరించు పక్షి గాయకులుగలిగి
దశదిశల్ నిండి, సంతతము ప్రాణమువోయు మేలైన గాలి పంకాలుగలిగి

తే.గీ. దైవనిర్మిత భువన సత్రంబునందు
వాస మొనరించు మూన్నాళ్ల బాటసారి
స్వార్థపరతంత్రుడై, తోడి యాత్రికులను
తరుముచున్నాడు కష్ట కాంతారములకు

మ. అవనీ చక్రమునందు ప్రత్యణువునే డానంద మాధ్వీ మహా
ర్ణవమందున్ జలకంబు లాడినది స్వర్గంబుంప్రవేశింపగా
నవకాశంబు లభించె సర్వులకు మున్నాదాముచే విశ్వ మా
నవులన్ గ్రమ్మిన శాపమున్ సమసె నన్నా, నీదు జన్మంబునన్

చం. అనుచు లలాటముల్ పదములంట నమస్కృతులాచరించి, భూ
పున కెరిగింపకే తరలి పొండని దేవుని దూత ఆన తి
చ్చిన విని, మారు మార్గమున శీఘ్రముగా పురివీడిపోయి ర
య్యనఘులు, బాల యేసునకు నారతులెత్తె ప్రభాతభానుదున్

మ. అవమానించిరి జ్ఞాను లంచలిగి, క్రూరాత్ముండు హేరోదు భూ
ధవు దయ్యూదియ బెత్లెహేము పురిపొంతంగల్గు ప్రాంతంబులన్
పువుబంతుల్ బలెముద్దుగారు నవకపుం బ్రాయపుం బాపలన్
వివిధాస్త్రాహుతిగా వధింపుడని పంపెన్ హంతక వ్రాతమున్

ఉ. పాపను సంహరింప నరపాలకుడుద్యుతుడయ్యె; భార్యతో
పాపనుగొంచు పొమ్ము పురి వాసి తటాలున; వాసముండు మీ
యాపదదాటుదాక, నిలుమా అయిగుప్తున నంచు భక్త యో
సేపుకు దూత స్వప్నమున జెప్పె నతండును సంభ్రమంబునన్

కం. అతడా రాతిరి శిశువున్
సతీమణిని గొంచువేగచని కొన్నేడుల్
ధృతి నయిగుప్తున ప్రభు వా
నతిచేసిన దాకనుండె, నవ్యాశయుడై

కం. పిల్లల దుర్మరణంబున
నల్లాడెడు పౌరసతుల ఆర్తస్వనముల్
పెల్లై చూపర గుండెలు,
చిల్లులుగావించె, గండశిలలు గరంగెన్

కం. నిసుగుల జంపిన పాతక
మసియై వేధింపక్రూరుడగు హేరోదుం
డసువుల్ వాసెన్ వ్యాధుల్
గ్రసింప, దేశమున శాంతికళ రాజిల్లెన్

ఆ.వె. మీ విరోధి రాజుమృతుడయ్యెరాదగు
నంచుదూత వార్తనందజేయ,
మరల వచ్చెనతడు మరియతో, శ్రీయేసు
నాథుతోడ స్వీయనగరమునకు

## బాల్యము

కం. పరివేషమండలంబల
శరదిందుని జుట్టుముట్టు చాడ్పున కన్యా
మరియాంబా వర సుతునకు
పరిశుద్ధాత్మాంశు మాల పరివేష్టించున్

సీ. అసమానమగు ప్రేమరస నిమ్నగల జాలు ప్రతి పల్కులోన నుద్భవమునంద
ప్రత్యంగకమునందు భగవ దాకారంబు ఇంచుకించుక గోచరించుచుండ
పాపినంచెద దుఃఖపడువాని కభయంబు వదన మండలమున ప్రతిఫలింప
భువన పాపంబెల్ల మోయజాలిన శక్తి బాహు పీఠముల నేర్పడుచునుండ

తే.గీ. తల్లిదండ్రుల మధుర వాత్సల్యమెల్ల
జూఁటిలాడుచు ప్రజల కుత్సుకత గూర్చి
గొనములకు వెల్లి, దేవుని గొట్టెపిల్ల
అల్ల నజరేతులోన వర్ధిల్లుచుండె

మ. కనులన్ మోడ్చి, జగన్నియంతకు నుతుల్ గావించు, వడ్రంగపుం
బనులన్ దండ్రికి తోడ్పడున్, జనని యాజ్ఞల్ మౌళిగీలించు, నె
మ్మనమందున్ నెనరూని పేదల పరామర్శించు, మెస్సీయ రా
కను చాటించు గురు ప్రబుద్ధుల సభల్ గాంచున్ విచారించుచున్

శా. దైవంబెవ్వడొ! దయ్య మెవ్వడొ! వినిర్ధారింపగా లేక, నా
నా వేదాంత విచిత్ర వాఙ్మయ మనంతంబై, జగంబెన్నియో
త్రోవల్ ద్రొక్క, గురుప్రబువుల్ బ్రజల యందున్ బిచ్చి సిద్ధాంత వీ
రావేశంబు సృజింప సాగిరి, స్వలాభాయత్త చేతస్కులై

తే.గీ. ఎదురు సూచెడు మెస్సియా యెదుటనుండ
నెరుగ జాలక శాస్త్రులు పరిసయులును
వడ్లవాడని, తమ యూరి బాలు డల్ల
మరియ కొడుకని మరియాద జరుపరయిరి

మ. పదురెండేండ్ల వయస్సునం దెరుషలేం పట్నానకుం బోయి, య
య్యదనన్ దేవుని గేహమందు గల శాస్త్రాధ్యాపకుల్, దార్కికుల్
ముదిమిందూలు కళా సమగ్రులు శిరంబుల్ వంచ వాదంబునం
దెదురై తప్పుడు ధర్మసూత్రముల సాహిత్యంబు ఖండించి, యొ
ప్పిదముల్ సూపి వినిర్ధరించె భగవద్వేదాంత భాష్యాంతముల్

మ. పరిశుద్ధంబగు ధర్మశాస్త్రమునకున్ భాష్యాలు వల్లించి, న
ల్వురిలో నున్నత పీఠముల్ గొనెడు బాబుల్ దొడ్డగడ్డాల వా
ర్పరిసయ్యుల్, శత వృద్ధులా యుగములో ప్రత్యర్థి లేడన్న దు
సర గర్వ గ్రసితుల్, మదంబుడిగి లజ్జామగ్నులై రెంతయున్

శా. ఉమ్మున్ దంబము మీరనిక్కు పరిసయ్యుల్ శాస్త్రు లీజిప్షియన్
మమ్మీలై, ప్రతి చెప్పలేరయి రహో! మామూలు బాలుండు గా
డిమ్మర్త్యాకృతి భూమికిం డిగిన సర్వేశుండు జుమ్మంచు హ
స్తమ్ముల్ మోడ్చి నమస్కరించిరి, సభాస్తారుల్ భయభ్రాంతులై

కం. ఎవడీ బొడ్డూడని నవ
యువానుడకటకట! జగము నోడించు కళా
ర్ణవులన్ మనల నెదుర్కొని
యవమానము చేసెనంచు నాగ్రహమతులై

కం. గడ్డాలు దువ్వి, వీడీ
గడ్డం దగడంచు, దంత ఘట్టనములతో
విడ్డురపు టీర్ష్య పెనగొన
నడ్డాడక లేచి పోయి రావిద్వాంసుల్

తే.గీ. ప్రేమయను నద్భుతాక్షర ద్వితయమునకు
ప్రాణములువోసి పంపెనో పరమగురుడు
దైవతనయుని వదన సందర్శనమున
ఖలుల గుండెల ననురాగజలము లూరె

కం. నా దేశము స్వర్గంబని
యేదో అభిమాన మేడ్చుటేకాని కళా
వైదుష్య మున్నయూరం
జేదై రాణింప దిది విచిత్రంబు జుమీ!

కం. మేరీ యోసెపులా నా
దూరందనయుండు లేమి నుద్భ్రాంతత కం
గారెత్తి వెదకి దైవా
గారంబున జూచి యైహిక ప్రణయమునన్

కం. మరియయు, యోసెపు పండుగ
కెరూషలేమునకు వచ్చి రేసునితో, క్ర
మ్మరి చనుచు, సుతుని గానక
కరమన్వేషణ మొనర్చి కనుగొనిరి గుడిన్

ఉ. ఒంటిగ నేలనిల్చితి వయో! పసివాడవు రా కుమార! ర
మ్మింటికటన్న, యేసు హసియించి, అమాయకులార! మంటికిన్
మింటికి కర్త నాదుపిత, నేను తదాజ్ఞ తలన్ ధరించి, యి
ప్పంటవలంతికిన్ దిగిన వాడ మనుష్య కుమార భూమికన్

తే.గీ. దురవగాహంబులగుచు నచ్చెరువు గొలుపు
ప్రభువు పల్కుల భావ మర్థంబుగాక
బాల్య చాపల్య సహజ శబ్దంబులనుచు
తలచి ముదమంది రావెట్టి తల్లి, దండ్రి

## యోహాను సేవ

కం. వనమధువును, మిడుతలు, భో
జనముగ యోహాను డొంటె చర్మపు దట్టీ
తనువున దాలిచి యూదా
వనముల చాటించుచుండె పరమార్థంబుల్

ఉ. దగ్గరె దైవరాజ్యము, విడంబన కూడదు వాని మార్గమున్
నిగ్గొనరించి సత్యము గణింపుడి మారుమనస్సు పొందుడీ!
అగ్గికి సాటియైన పరమాత్ముని యుగ్రతనుండి తప్పుకో
దగ్గ విధానమే పరమతత్వ విదుండెరిగించె తెల్పుడీ!

తే.గీ. ఇన్నదీనీరమున స్నానమిత్తు నేను
స్నాన మీగలడతడు కృశాను కీల
పావనాత్మల నాతని పాదరక్ష
లంటిమోయంగ నాకు యోగ్యతలు లేవు

కం. నా వెనుక వచ్చువాడతి
పావనుడే నమ్మహాత్ము పదసేవకుడన్
భావింపు దమ్మహాత్ముని
సేవింపగ రండు ఆలసింపకు డదిగో

ఉ. పట్టిన చేటతో నతడు పండిన పంటను తూరుపారగా
బట్టి, దహించి వైచెడి నభాగ్య మయోగ్యము నైన వట్టి పై
పొట్టును దుష్ట సర్పకుల భూషణులార! కుతార మున్న ది
ప్పట్టున జెట్టువేళ్ళ నపవర్గపథంబున గాలు నిల్పుడీ!

## స్నానము

కం. కడచినవి ముప్ప దేడులు
నడిమి వయస్సమరె క్రీస్తు నాథునకిక నా
గడియ సమీపించినదని
నడచెన్ భూలోక రక్షణ స్థిరదీక్షన్

కం. స్నానం బందుటకై యో
ర్దాను నదికివచ్చి క్రీస్తు, తనభక్తుడు యో
హానున్ స్నానం బిమ్మని
ఆనతి గావించె నాతడబ్బురపడుచున్

కం. నాకున్ స్నానంబీ గల
శ్రీకరుడవు, గురుడ వతి విశిష్టుడ వౌరా!
నాకెటు చేయాడెదు నని
వాకొన, కానిమ్మటంచు ప్రభువు వచించెన్

ఉ. స్నానము నంది తత్తటమునం బదమూన నితండు నాప్రియుం
డైన తనూభవుం డితని యందు మదీప్సిత మాలకింపుడీ
వీని నటంచు నంబరము ప్రీలివినంబడె నొక్క యద్భుత
ధ్వానము, యేసు నాథుతల పై నిలిచెన్నవ పావనాత్మయున్

# శోధన

ఆ.వె. ఉపవసించె నేసు డొంటిగా నలువది
వాసరంబు లుగ్రవనములందు
అదనెఱింగి వచ్చెనటకు సైతాను శో
ధించి ప్రభు జయించగోరి

తే.గీ. శిలల రొట్టెలు జేసిభక్షింప వచ్చు
పస్తులుండెడు శిక్ష నెవ్వడు విధించె
ఊరకొననేల యిన్నాళు లుపవసించి
దేవుని కుమారునకు పిల్లదైవమునకు

ఉ. రొట్టియ గాదు భూతలి నరుం బ్రతికించు పదార్థముర్వరన్
బుట్టగ గిట్టగం బలము బొందగ దేవుని దివ్యవాక్కులే
గట్టి సుధాశనాల్ వెడగు కారులు గూయకు మంచుమోముపై
గొట్టినయట్లు బల్కె ప్రతికూలముగా సయితాను సిగ్గిలన్

కం. పిమ్మట ప్రభువున్ గుడి శిఖ
రమ్మునకుం గొంచుపోయి, రక్షింతురు గా
య మ్మంటకుండ దూతలు
సుమ్మూర్వికి దూకి శక్తి జూపింప దగున్

కం. కల దా లాగున లేఖన
ములయం దన, ప్రభువు దైవమును శోధింపన్
వలదంచు లేఖనములం
గలదంచు నిరాకరించి గద్దించుటయున్

మ. ఒక భూధ్రాగ్రముమీదికిన్ బ్రభువు నెట్లోలీల గొంపోయి యీ
సకలోర్వీవలయంబు నాముదల మస్తంబందు కీలించు, నా
కొకమార్ ఏెక్కిన నిత్తునీకు భువన వ్యూహాధిపత్యంబు మా
నకు మన్నన్ ప్రభువా గ్రహించి తరిమెన్ వైరిన్ తమో వాటికిన్

## ప్రథమ శిష్యులు

తే.గీ. అంద్రియ, యెహోను పేత్రుండు యాకొబుండు
నసెడు కైవర్తులేసు రమ్మన్న యంత
ప్రథమ శిష్యులుగా పాదపద్మయుగళి
నాశ్రయించిరి భక్తి మర్యాదలమర

మ. నరమత్స్యంబులు పాప వారినిధిలో నన్ దండిగానుండ, యీ
చిరుచేపల్ నెమకంగనేమి పనివచ్చెన్, రండు నా వెంట స
త్పరమార్థంబను దివ్యజాలమున విశ్వంబున్ వినిర్జించు జా
లరులై పొల్తురు భక్తులై, భువన కల్యాణంబు సాధించుచున్.

శా. ఆ మాటల్ వినినంతనే వలల నందందే విసర్జించుచున్
సీమోనాంద్రియ ప్రభృతుల్ గురుని ఆశీర్వాదముల్ పొంది, నిం
డామోదంబున నాస్తి పాస్తులను భార్యా పుత్రులంబాసి, ఆ
శామోహచ్యుతులై వరించిరి, ప్రశస్త క్రీస్తు శిష్యత్వమున్

## మొదటి అద్భుతము

కం. శ్రీ యేసును, శిష్యులు కా
నా యను కొండొక్కపురమునన్ బెండిలికిం
బోయిరి, యేసుని తల్లియు
నాయింటికి వచ్చె బెండ్లి కాహ్వానితయై.

కం. ఆ యింటన్ ద్రాక్షా పా
నీయము లేకుండుటెరిగి, నిజతనయునకున్
శ్రీ యేసు న కెరిగించె న
మాయిని మరియమ్మ తత్సమాచారంబున్

ఆ.వె. పెండ్లి యింటనున్న పెనురాతి బానల
నిండ స్వచ్ఛజలము నింపబంపి
అసమమైన ద్రాక్షరసముగా జేసి వి

ఉ. ఏసు కపెర్నహూమునకు నేగి నివాసము జేసె కొన్ని నా
ళ్లాసమయాన యూదుల మహంబగు పస్క, సమీపమౌట, యు
ద్భాసిత రత్న సౌధ విభవాంచితమైన యోరూషలేము ది
వ్యాసమ దైవమందిరము నారయ బోయె పవిత్రభావుడై

మ. గుడిలో జూదములాడు వారి, గృకవాకుశ్రేణి నంగళ్ల న
మ్మెడి వారిం గొనువారలంగనియె నమ్మేరీ తనూజుండు, బం
డెడు దుఃఖంబును క్రోధమున్ గదుర నగ్నింగంట వర్షించుచున్.
బడదన్నెన్ వివిధాపణంబులు వణిగ్వర్గంబు స్తంభింపగన్

కం. బంగరు నా జనకునియిల్
దొంగల గుహసలిపినారు తొలగి చనుండం
చుంగెంటి తరిమివైచెన్
దొంగల జూదరుల స్వార్థదూషిత మతులన్

కం. ఈ కార్యంబొనరించితి
మాకుంజూపింపు మొక యమానుషమని యూ
దా కులజులడుగ ప్రభువ
వ్యాకులమతి వారికిట్టులని వాక్రుచ్చెన్

ఉ. కట్టుదు దేవళంబు నొడికంబుగ మూడు దినాలలో పడం
గొట్టి, యటన్న క్రీస్తు పలుకుల్ విని గ్రాహ్యముగాక యూదు లి
ట్టట్టన లేక యొండొరుల ఆస్యములం బరికించు చుండిరా
గుట్టును శిష్యసత్తములకున్ వివరించె స్థలాంతరంబునన్

ఉ. కాల గదాహతిన్ నిలువ గల్గినదేదియు లేదు సర్వమున్
గూలి ధరిత్రి గర్భమునకున్ జను నిక్కనువిందుచేయు, దే
వాలయ కుడ్యముల్, శిథిలమై యొకనాడు చరిత్రకుం గథాం
శాలయి నిల్చి చాటును మహత్తర సృష్టిరహస్య పద్ధతుల్

తే.గీ. అందమైనట్టి యీ శరీరాలయమును
ధరణి బడగొట్టి వాసరత్రయములోన
తిరుగ నిర్మింపగలను సందియమువలదు
శిష్యవరులార! సోదర శ్రేష్ఠులార!

# నికొదేము

కం. ఒకనాడు క్రీస్తు నొద్దకు
నికొదేమను వాడువచ్చి, నేనెట్టుల స్వా
ర్గికమైన నిత్యజీవము
నకు పాత్రుడ నగుదునని వినమ్రత నడిగెన్

కం. అనినం బ్రభువొక మర్త్యుండు
పునరుద్భవ మందకున్న పొసగదు చిరజీ
వనమన నర్థంబవగా
హనగా కత డిట్టులనియె నాశ్చర్యమునన్

చం. ఉరుగుణ! తల్లి గర్భమున నుద్భవ మందినవాడు, వృద్ధుడై
మరల జనించునా? యనిన మర్త్య శరీరము కారణంబుగా
ధర నుదయించు నీతనువు దైవికమై వెలుగొందు సర్వ సుం
దరమగునాత్మ కారణమునన్ జనియించిన దాత్మయై తగున్

కం. అడవిని మోషే ముని పి
త్తడి సర్పము నెత్తినట్లు ధరణిం బ్రతి మ
ర్త్యుడు నిత్యజీవసంపద
వడయ న్నరపుత్రుడెత్త బడవలయు నొగిన్

ఆ.వె. ఎట్లు సాధ్యపడెడు నివియన్న ప్రభు విశ్ర
యేలు నేలువాడ వెరుగ వేల
ఐహికంబు లెరుగునట్టి వానికి నెట్టు
లరమగును పారమారికములు

మ. అనఘుండైన యెహోవ లోకమునకై యర్పించె నేకైక నం
దను, విశ్వాసముగల్గినంగలుగు నేతన్నిత్య జీవంబు నా
తనిచే రక్షణగల్గు లోకమునకున్ ధ్వాంతంబు ద్వేషించి వ
చ్చును సన్మార్గుడు వెల్గునొద్దకు నశించున్ రానివా డెప్పుడున్

## యోహాను చెరసాల శిక్ష

కం హేరోదు రాజు, తమ్ముని
కూరిమి పెండ్లాము నుంచుకొని, నిశ్శంకన్
నేరముగా దనుకొన్న ట్లవి
చారుండై యేలుచుండె క్ష్మారాజ్యంబున్

ఉ. గుండెలులేవు మంత్రులకు గూడ నరేంద్రుని హెచ్చరింప, పి
ల్పుండను రాజ సోదరుడు మూర్ఖపుటగ్రజు నుగ్రశాసనో
ద్దండత కోడి, కాదనెడు ధైర్యము చాలక ప్రేయసీ విధే
యుండయి యుండె నూరు నగుచున్న తలంకక నిర్వికారుడై

కం. ముంచే యోహాను నృపతిం
గాంచి యసమ్మతి వెలార్చి క్ష్మాపాలురకున్
మంచిది గాదిటు తమ్ముని
వంచించుట విడువుమతని వలపుంబడతిన్

కం. అని నిర్భయముగ రాజున్
గనలుట తెరచాటునుండి గన్నయువతి, భ
క్తుని నీతి వాక్యములకున్
గనలి ప్రతీకార దీక్షగైకొని యుండెన్

ఉ. భోగసుఖాను భూతి వలపుంబసనేరని గోచిపాత బై
రాగి యొకండు రాజులకు రాజగు నన్నెదిరించి ధర్మ సూ
త్రాగమముల్ వచించునె యహంకృతినంచు, కృధాగ్ని రేగ, బం
దీగృహ బదుజేసె, సువినీతుని భకికళాపయోనిధిన్

# సమరయ స్త్రీ

కం. నరపాలుడు యోహానుం
జెరయందిడె నన్నవార్త చెవిసోకి మనం
బెరియం బ్రభువటు గలిలయ
కరుగుచు మార్గమున దాహమైనికటమునన్

ఆ.వె. జలముతోడుచున్న సమరయ సతిజూచి
యేసుసామి దాహ మీయుమనియె;
ఇతడు యూదుకులజు డీరాదనెడు చింత
నింతి సుంత సంశయించుచుండి,

శా. ఏనస్పృశ్యను యూదవంశజులు మీ రీబావి నీరంబు తా
మానంగూడదు దోషమం చనిన యేసాత్మన్ విచారించి, ఆ
మ్మా నీవిచ్చుజలంబు దాహదహనం బార్పన్ సమర్థంబు గా
దే నిత్తుంబరిశుద్ధ జీవజలముల్ దృప్యత్సుఖారంభముల్

మ. జలముల్, వాయువు, నగ్నియున్బరమ రాజన్యుండు, భూలోక వా
సులకుం బంచి యొసంగిపోయిన స్థిరాస్తుల్, స్పృశ్యతాస్పృశ్యతల్
కులగోత్రాలు ప్రపంచసభ్యతకు సిగ్గుంజేటు జుమ్మిమ్మహా
కలుషంబెల్లమహా పదార్థములకున్ గల్పింతు రల్పాశయుల్

కం. కడుదూరం బీనూతికి
నడచుటమాకనఘ! దివ్యమగు తజ్జలమున్
తడయక నాకిమ్మన నీ
యొడయని గొనిరమ్మటన్న యువిదయు చింతన్

కం. పతిలేడన శ్రీయేసుం
పతులైదుగురుండి, రున్నవాడున్ నీకున్
బతిగాడు నిజము వల్కితి
వతినా? యనవాకె విస్మయావిర్భాతిన్

కం. నీవా క్రీస్తను పేరన్
రావలసిన మెస్సియావు, ప్రభువా! యననే
నౌ వాస్తవముగ నేనే
రావలసిన మెస్సియాను రమణీ! యనియెన్

కం. ఆ వనిత భాండమందే
బోవిడిచి, పరుంగువారి పురిజొచ్చి, మెసీ
యా వచ్చె నిటకురండని
వేవురు సమరయుల గొంచువేగమవచ్చెన్

ఆ.వె. వారి ప్రార్థనమున ప్రభువుసమరయ్యుల
యూరరెండు నాళులుండి పిదప
గలిలయాకుచనియె, పలువురు విశ్వాస
ముంచి, పదములాశ్రయించినారు

## ప్రధాని కుమారుని స్వస్థపరచుట

తే.గీ. జబ్బుపడి యుండెనాతనూ జన్మడింట
స్వస్థపరపుము వచ్చి చావకయముందు
దయవహింపు మటంచు ప్రధానియొక్క
డంజలిఘటించె క్రీస్తు పదాంతికమున

తే.గీ. బ్రతికియున్నాడు పొమ్ము నీసుతుడటంచు
ప్రభువువచియించె నాతండు ప్రముదితమతి
తరలిచనుచుండ మార్గ మధ్యంబునంద
విన్నవించిరి దాసులు ప్రియసుతుండు,
స్వస్థత వహించెనంచు, నేసమయమందు
వ్యాధిమరలినదని వేళపరిగణింప,
ప్రభువుపల్కిన ఘడియగా వ్యక్తమయ్యె

కం. గలిలయలో వ్యాధిగ్ర
స్తులనంధుల కుష్ఠబాధితుల బెక్కుర న
ర్మిలి స్వస్థపరచి దేశము
పలుతావులలో సువార్త ప్రకటనజేసెన్

## పక్షవాత రోగి

ఉ. ముద్దులు మూటగట్టగ ప్రభుం డుపదేశముచేయు నొక్క పెన్
మిద్దియ జుట్టు ముట్టుకొని మేటి ప్రజాతతి నిల్చియుండ, నా
పద్దశయందు మోసికొని వచ్చిరి కొందరు వాతరోగియై
ముద్దగ నున్న వాని, పదముం గదలింపగలేని దీనునిన్

ఆ.వె. గుంపునుండి వాని గొంపోయి ఆయన
ముందునుంప సుంత సందులేక
ఇంటికప్పువిప్పి, యేసునాథుని సమీ
పమున దింపి రతనిపడకతోడ

కం. క్షమియించి నాడ నీ పా
పములని ప్రభువనియె; వీడు భగవంతుడె? పా
పములన్ క్షమింపనౌరా,
క్షమింపరా దిత డఖర్వగర్వితుడు జుమీ

కం. అని కొందరందు సణుగుట
గని ప్రభువిట్లనియె గనలి కల దధికారం
బును శక్తి నాకు మానవ
తనయున కిదె చూడుడంచు ధైర్యస్థిరుడై

కం. లెమ్మా! పడకం జేకొని
పొమ్మనె, తక్షణమతండు ముదితుండై, మం
చ మ్మెత్తు కొంచు చనియెన్
కిమ్మనక జనాళి ప్రభుని కీర్తించెనొగిన్

కం. యూదయలో నానామయ
వేదనల కృశించువారు పెక్కురురా యే
సాదరమున గుదిరిచి ఆ
మోదంబు ఘటించుచుండె పూజలు గొనుచున్

కం. పెక్కు పిశాచ గ్రస్తుల
జక్కపరచి పేతురత్త జ్వరపీడితయై
దిక్కరియుండన్ గుదిరిచె
నక్కాంతయు నొసగె ప్రభున కాతిథ్యంబున్

చం. గురుతర కుష్ఠ రోగమునకున్ గురియై, పురబాహ్య సీమలన్
గరము తపించు దీనులనుగాంచి స్పృశించి కుదిర్చె తద్భయం
కర దురితామయాల్, ప్రభుని కాలి రజోలవమింత సోకినన్
గరగె నఖండ కిల్బిషపు గండశిలల్ విషఖండ చండముల్

కం. పన్నిద్దర శిష్యులుగా
నెన్నుకొని యపోస్తలాఖ్య నిచ్చెంబ్రభువా
పన్నిద్ద రెల్ల వేళల
సన్నిధినుండన్ సువార్త చాటించుటకున్

## పర్వతముమీది ప్రసంగము

కం. అకలుష మనస్కు లందరు
సుకముగ దేవాదిదేవు జూచెదరతి సా
త్వికులైన వారు ధన్యులు
సకలోర్వీచక్రతలము సాధింతురొగిన్

కం. కనికరము నెనరుగల మె
త్తని చిత్తము గల్గువా రుదారులు ధరణీ
జనవినుతు లగుచు కనికర
మునకుం గురియగుదు రఖిల భూచక్రమునన్

కం. ఎవ డీశ్వరాజ్ఞ లెల్లన్
బవిత్రముగ నాచరించి బ్రతుకునతండే
దివి నున్న తోన్నతుండగు
భవిష్య దానందమునకు పాత్రుండునగున్

కం. సోదర మానవునిం గని
ఆదమరచియేని ద్రోహివనరా దను వా
డాదట నరకాగ్నిం బడి
వేదనజెందు న్నిజంబు పెక్కుయుగంబుల్

కం. విమలాత్మార్థము దీన
త్వము దాల్చిన వారిదగును పరలోకము దుః
ఖమునందు వారు ధన్యో
త్తములయి యోదార్పబడుట తథ్యముజుండీ

ఉ. చేరి విరోధితో చెలిమి చేయక యర్పణ చేయరాదు, ని
ష్కారణ హింసచేయు నిజ శాత్రవులం గరుణించి ప్రేమతో
వారల నాదరించి భగవంతుని ప్రార్థన చేయుమెట్టి దు
ర్వైరియు నమ్రుడై యొదిగి వచ్చి భవద్ధిత మాచరించెడిన్

ఆ.వె. ఒట్టుబెట్టుకొనకు ముర్వితోడని సృష్టి
విభున కదియ పాదపీఠమగు, వి
శాలమైన ఆకసంబు తోడనకుడు
సింహ పీఠమదియ సృష్టిపతికి

కం. ప్రేమించు వారి మరలం
బ్రేమించిన ఫలములేదు ద్వేషించునరున్
బ్రేమింపు డపుడు మోక్ష
స్వామి సమక్షమున గొప్పఫలము లభించున్

కం. కుడిచేయి చేయుధర్మం
బెడమకరం బెరుగగూడ దితరుల కంటం
బడకుండ జరుపునట్టిద
కడుధర్మంబగు ఫలంబు గల్గున్ మింటన్

కం. చూపర కుపవాస వ్యధ
దోపగ వర్తింపరాదు, దొసగగు బహిరం
గపు దంభ భక్తి నటనలు
జపములు నిష్ఫలములవి ప్రజావంచనముల్

కం. కుహనా గౌరవకాంక్షన్
సహోదర ప్రజల పేదసాదల కరుణా
రహితత ననాదరించెడు
నహంకృతాత్ములు విషోరగాగ్ర తనూజుల్

కం. నాకై హింసింపం బడి
నాకై, యవమతులగుంది నవయునపుడు మీ
రాకుల పడక సహింపుడు
మీకగు ఫలమధికమగు నమేయంబునగున్

కం. ఇప్పుతిత భూతలికి మీ
రుప్పైయున్నారు సారముండక యుప్పే
చప్పనయియున్న, సారం
బెప్పగిదింగల్గు దానికీ లోకమునన్

మ. పులుగుల్ దున్నవు, విత్తవెన్నడు, ధనంబున్గూర్చుకో వట్టి ప
క్షుల కాహార మొసంగు దైవత మనుంగుం బిడ్డలౌ మిమ్ము ప
స్తులు చేయించునె? యేమి తిందుమని ఆదుర్దా రవంతేనియున్
వలదా పక్షులకన్న శ్రేష్ఠులు గదన్నా! మీర లూహించినన్

ఆ.వె. పెరలు తమకు మేలు జరుపగోరెడువాడు
పెరలకటుల తొలుత జరుపవలయు
కొలిచినంత తిరుగ గొలుచుకొందురు మీరు
కొలువకుండ కోరుకొనుట తగదు

కం. సువినీతికొఅకు హింసం
జవిజూచిన వారు ధన్యజన్ములు జుమి, ని
క్కువముగ వారిద స్వర్గం
బవు నన్యు లనర్హులమర వపవర్గనిధుల్

కం. ఒక యల్పమైన దైవా
జ్ఞకు బద్ధుడుగాక, కపట నాటకుడై, యొ
ర్లకుచెప్పి చేయుడను బో
ధకు డల్పుండగును స్వర్గధామమునందున్

మ. అరుదారన్ లభియించు ముత్యముల వేయం గూడ దెన్నండు సూ
కరపుంబిండుల ముందరన్, కినిసి ముంగాళ్ళన్ ప్రమర్దించి క్ర
మ్మర మిమ్మున్ చెలగున్ మహానిశిత దంష్ట్రాఖడ్గ జాలమ్ములన్
పరిశుద్ధంబగు దాని వేయదగ దెన్నండున్ శునిశ్రేణికిన్

కం. బలవంతంబుగ నీ మై
వలువం గొంపోవునట్టి వానిన్ లలితో
క్తుల బిలిచి యొసగు మింతయు
నలుగక యంగీనిగూడ నమరున్ శుభముల్

కం. ఒకవేళ నీదు కుడికను
వికటించిన బెరకి పారవేయందగు నం
బకములు రెండుండియు నా
రక వహ్నింబడుటకన్న ప్రశుభంబ కదా?

కం. నీ కంట దూలముండగ
వాకొనకుము నలుసు నెదుటివాని కనులలో
నీ కంటి దూలమూడ్చిన
వీకంగను గొందువెల్ల విస్పష్టముగన్

శా. ఉండు న్నీ ధనమున్న చోట హృదయం బోరంత ప్రొద్దుల్ సుఖం
బుండన్నేరదు త్రుప్పువట్టు, తినివేయున్ జిమ్మటల్ గ్రూరులు
ద్దండుల్ జోరులు దొంగిలింతురు ధరా ద్రవ్యంబు, స్వారాజ్యపుం
భాండారంబు ధనంబు గూర్చుకొను డాత్మన్ శాంతి నిండారెడిన్

కం. క్షితి మండలంబు గగనము
గతించినన్ బొల్లుగాని గడకొక సున్నేన్
గతియింపవు నా పల్కుల్
బ్రతుకున్ ఘనలేఖ నాళి పండెడువరకున్

కం. తపసిని యోహాను నెదో
యపరాధము మోపి బందియందుంచెన్నృప
శ్వపచుండని విని యేసుడు
కపెర్నహూమునకు వచ్చి కాపురముండెన్

ఉ. దైవకుమారుడై భువనతాపము దీర్పజనించినట్టి మే
రీవరపుత్రకుండయిన క్రీస్తు ప్రభుండటనుండ, సద్గురూ!
కావుము, వ్యాధిజిక్కి కడు కష్టదశం బలవించుచున్న నా
సేవకు నంచు దీనత వచించె శతాధిపు డొక్కడచ్చటన్

కం. కనికరము మొలకలెత్తం
గని ప్రభు వభయంబొసంగి కలతవలదు వ
త్తును స్వస్థపరతునని యా
తని హృదయాందోళనంబు తరుగవచించెన్

చం. తగదు ప్రభూ! మదీయమగు ధామమునీవు పదంబు మోప, ము
జ్జగమును నీయనుజ్ఞ, శిరసావహియించు వచింపు మొక్కనీ
యగణిత శక్తి సంకలితమైన మృదుక్తి, బిరాన స్వస్థుడై
నెగడు మదీయ భృత్యుడిది నిక్కము నిక్కము దైవనందనా!

ఉ. ఏనును రాజభృత్యుడ, వహింతు శతాధిపతిత్వ ముద్ర నే
నానతిచేసి రమ్మనిన యంత నొకండిటువచ్చు, పొమ్మటం
చానతి చేయబోవు, మహితాత్మ సమస్త మెరింగియున్న వి
జ్ఞాన పయోనిధీ, యెఱుగనా భవదీయ పవిత్రశక్తులన్

ఉ. అచ్చెరువయ్యె, నిశ్రయెలు నందును లేడిటువంటి భక్తుడం
టచ్చపు బ్రేమమీరగొనియాడి యవశ్యము రోగముక్తుడై
వచ్చి యెదుర్కొనున్నిను భవత్పరిచారకు డేగు మంచు వా
క్రుచ్చెమనుష్యనందను డకుంఠితవాగ్విభవాంబుధీశుడై

## నాయీనులో విధవ పుత్రుని బ్రతికించుట

ఆ.వె. ఒక్క పేదరాలి కొక్కడేతనయుండు
కాలధర్మమందె, కన్నతల్లి
పనవి పనవి దుఃఖపడుచుండె హృదయవి
దారకముగ నశ్రుధారలురల

కం. బాలుని కాటికిగొనిచను
వేళంబ్రభువెదురుపడియె వీటి గవనిలో
బాలుడు మరణించినయ
వ్వేళా సువిశేషమేమొ విదితంబగునే

కం. అదృశ్యంబుంగనుగొని
ఆదీనాంగనకు తల్లి కభయంబిడి నిం
పాదిగ పాడెపయిన్ గర
మూది యువానునకు బ్రాణమూదెంబొందిన్

చం. మరణము సాజమెల్లరక మానుష మిట్లు పునశ్శరీరమున్
గరముధరించి లేచుటది గాక జగత్తున క్రీస్తునాథు స
చ్చరిత ప్రతిధ్వనించెడు దిశావలయంబున వీనినామమున్
మరణములేనిదై ప్రజల మన్ననలందుగదా యథావిధిన్

కం. అని ప్రభువుంగొనియాడుచు
జనమంజలి సంఘటించి చనియె, ననాథాం
గన ప్రభువు పాదముల నం
దనుడుందా వ్రాలెభక్తి తత్పరమతియై

## యోహాను శిష్యులు

కం. నీవే మెస్సియవో, యటు
గావో! యని యడిగి తెలియగా యోహనుడం
తేవాసులనంపించెన్
దైవసుతుని కడకు నొక్కనాడుదయమునన్

కం. వారేసుంగనుగొని తమ
కూరిమి గురుడడుగు దన్నగురు సంశయమున్
ధీరత వినిచిరి ప్రభువున్
వారలకిటు జెప్పిపంపె పరమాదరణన్

కం. ఆ గడియలోన పెక్కురు
రోగులురా స్వస్థపరచి రూఢిపరచె నా
త్మాగమన మహిమ, యితడే
రాగల మెస్సీయయంచు ప్రజలు గ్రహింపన్

సీ. బధిరులు వినుచున్న వారు జాత్యంధులు కన్నార వీక్షించుచున్నవారు
నడయాడుచున్నారు గడుపిచ్చుకుంటులు సమయుచున్నవి పిశాచముల గములు
రాజయక్ష్మామయగ్రస్తులు శుద్ధులై పోవుచున్నారు సమ్మోదమంది
ప్రకటింపబడుచున్న దకలంకమగునటి దేవుని వాక్యంబు దీనతతికి

తే.గీ. నన్నుగని సందియం బందకున్నవాడు
యుర్వి ధన్యుండటంచు బ్రత్యుత్తరించె
చూచి నవియును, ప్రభువన్న సూక్తులెల్ల
గురున కెరిగించి రాశ్చర్యభరితులగుచు

ఆ.వె. స్త్రీలుకన్న వారిలో లోకమున నీ యొ
హానుకన్న నధికుడైనవాడు
జననమందలేదు, సత్యంబుగానంచు
ప్రభువు చాటిచెప్పె ప్రజలకపుడు

కం. యూదయలో శ్రీయేసుని
ఆదర్శములైన బోధ లద్భుతములు, మ
ర్యాదకు గురియై, సకలప్ర
జాదరణంగాంచి వ్యాప్తమయ్యెన్ దెసలన్

కం. ఏ నగరంబుల యందున్
తానద్భుతముల నొనర్చితన బోధలచే
వీనుల విందొనరించెనొ
ఆ నగరాల్ మారుమనసునందమి గనుచున్

మ. అయయో! బేత్సయిదా! కొరాజిను పురంబా! యద్భుతా లెన్ని మీ
కయి కావించి అనంత సత్యరమ నుద్ఘాటించి చాటించి, య
వ్యయ రాజ్యార్థ రహస్యముల్ తెలిపి బిట్టాసించితింగాని సుం
తయు భక్త్యంశువు మీ మనోబ్జముల లోనన్ వెల్గదీనాటికిన్

ఉ. తూరు సిదోనులం దిటుల దొడ్డ మహత్క్రియ లాచరించుచో
నేర మెరింగి యెన్నడొపునీత మనస్కములై, ప్రవర్తనల్
మారుచుకొన్నవై మొలను మాసిన చీరధరించి యుండవో
తీరుపునాడు మీదగు గతిన్ దలపోయ విచార మయ్యెడిన్

# అత్తరుతో నభిషేకించిన స్త్రీ

ఆ.వె. పరిసయుం డొకండు ప్రభువున కాతిథ్య
మిచ్చి గౌరవింప నెంచి పిలిచె;
ఆ పురాననున్న పాపురా లొకలేమ
ఆ సువర్తమాన మాలకించి

కం. విలువగల మేటి యత్తరు
శిలాభరణి గొంచువచ్చి శ్రీ యేసుని యం
ఘ్రులనంటి తుడువ జొచ్చెన్
తలకురులన్ ముద్దుగొంచు తత్పదయుగళిన్

కం. ఆ పరిసయుడా యింతిన్
గోపంబున జూచి ముట్టుకొన్నది క్రీస్తున్
పాపిని యనుకొను చుండ ద
యాపరుడగు ప్రభువు ప్రముదితాత్ముండగుచున్

కం. క్షమియించినాడ నీదగు
సమస్త పాపముల నంబుజాననయని, యా
రమణికిన్ దెగడెడు పరిసయు
నమృతోక్తుల మందలించె నా సమయమునన్

ఆ.వె. ఈవునాకు పాద్యమీయ లేదీలేమ
పాద్య మిచ్చె నాకు బాష్పవారి
కోరి నీవు ముద్దుగొనవు, నా పాదాలు
ఈమె ముద్దుగొని తనించె నన్ను

ఆ.వె. పరిమళ తైలంబుననా
శిరమంటవు నీవు; నాదు శిరమున నంటెన్
పరిమళ తైలం బీయమ
విరివిగ ప్రేమించె పాపవిశిఖశమించెన్

కం. పాపక్షమ చేయుటకె
ట్లోపెడు నితడంచు గొణిగి రుల్లంబులలో
కోపంబు రగుల కపట
వ్యాపారులు సహజ శత్రులగు పరిసయ్యుల్

కం. చనుము సమాధానంబున
వినుతార్థవు కాచె నీదు విశ్వాసము ని
న్నని సాగనంపె, నాబిడ
చనియెన్ జరితార్థ యగుచు స్వగృహమునకున్

## యోహాను మరణము

కం. తన జన్మ దినోత్సవమున
జనపతి హేరోదువిందు సలిపెన్ దన పా
లనమున గల ఉద్యోగుల
కును పురియందున్న బందుగుల కాప్తులకున్

ఉ. కొట్టిన కక్షబూను ఫణి కోమలివోలి హెరోదియా పగం
బట్టి యొహాను జంపు తరి వచ్చినదంచు, పదాల గజ్జెలన్
గట్టి, దుకూలముల్ దొడిగి, కన్న కుమార్తె నలంకరించి, స
మ్రాట్టు సభన్ నటించి, బహుమానము గొమ్మని పంపెనాకెయున్

చం. కలికి పికాంగనా లలిత కంఠ కుహూకలనాద మాధురీ
కలిత మృదూక్తులన్ ధరణి కాంతున కారతు లెత్తి పెక్కుభం
గుల చిరుకాలి గజ్జియల కోమల తాళలయానుకూలమం
జులగతి నాట్యమాడె, నృపు సోదర పుత్రి సభాంగణంబునన్

శా. సారామత్తున మేనెఱుంగక, ధరా స్వర్గంబునందున్న, భూ
దారుండాడిన యాటలోగల చమత్కారంబు గుర్తించికా
కారాజీవ దళాక్షి జారసతిక న్నమ్మాయిగా మెచ్చి, వ
హ్వారే! వారె, యటంచు లేచి పరిపూరానందనిర్మగ్నుడై

కం. బాలంగౌగిట జేరిచి
ఫాలము ముద్దాడి. "ఏమి వరము వలయు నం
దాలవయారీ," యని యు
ద్వేలో ద్వేగమున బలికె బ్రియురాలలరన్

శా. ఆ యమ్మాయియు మాతృ నాజ్ఞగొని జోహారించి యాచించె, ముం
చే యోహాను శిరస్సు; రాజపుడు శుష్కీ భూత దేహున్ జగ
చ్ఛ్రేయ శ్శాంతి సుఖప్రవక్తను, తపస్విన్నాడె చంపించి, దు
ర్జాయాపుత్రి కొసంగి పంపె ముని మస్తంబున్ సతీప్రీతికై

## విత్తువాడు

కం. లలితోపమాన ముకురం
బులతో నాకాశ రాజ్యముం జక్కగ క
న్నులగట్టినట్లు తేలిక
పలుకుల బోధించె శత్రువర్గముతలకన్

ఆ.వె. విత్తువాడుపోయి విత్తనంబులు చల్లె;
రాచబాట కొన్ని రాతినేల
కొన్నిముండ్ల పొదల గురుసారతరభూమి
కొన్నిబడియె వానగురిసెనంత

తే.గీ. దారివారను బడ్డ విత్తనములెల్ల
చిన్న పక్షులువచ్చి భక్షించివయిచె
వర్షజలమున మొలకెత్తివాడిపోయె
పెనుశిలాంతర నిక్షిప్తబీజరాజి

ఆ.వె. పెరిగెముండ్లపొదల దొరగిన విత్తనాల్
నవనవోజ్వలముగ నాల్గునాళ్లు
అదిమివైచె ముండ్లపొదల యొత్తిడిజేసి
యెదుగు బొదుగులేక యెండిపోయె

తే.గీ. అక్షిపర్వంబుగా పండి, అవనిదేవి
గరుడపచ్చల భూషగా క్రాలదొడగె
సారతరభూమి బడ్డ బీజములరాజి
రైతుహృదయంబు పూర్ణహర్షమునదేలె

కం. ఒకచోట మొలకలెత్తెడి
నొకచో నొక్కింత పెరిగియున్నశియించున్
ఒకచోపండి ఫలించున్,
సకల మనుష్యాంతరముల, సత్యసువార్తల్

## తుపాను నిమ్మళించుట

ఉ. కొండొక దోనెలోన ననుగుంప్రియ శిష్యులు తోడురాగ, క్రీ
స్తుండొకనాడు గాలిలయ తోయధిదాటుచు గాఢనిద్రలో
నుండె పరుండి; భీకర రయోద్ధతి పెద్ద తుపానురేగి ప్రో
చ్చండ విఘూర్ణమానమయి సాగరముండె నటత్తరంగమై

ఆ.వె. చండవాయువునకు సరిజోడుగా లేచి
హుంకరించుచుండె నుదధి రాజు
బాహులప్పళించు వస్తాదు నెదిరింప
మారువలుకు సాటిమల్లువోలి

కం. అంతేవాసులు భయవి
భ్రాంతత "మాంపాహి గురువరా!" యని చింతా
క్రాంతులయి రభస సల్పిర
నంతజగన్నేత్ర శక్తినాద మరచుచున్

తే.గీ. త్రుళ్లిపడిలేచి, మించి ఘూర్ణిల్లుచున్న
అంబుధింజూచి ప్రభువు కోపంబు గదుర
సంద్రమా! ఊరకొమ్మని సంజ్ఞ జేసె
తనయు నదలించు దయగల తండ్రివోలె

కం. కిమ్మనక మిన్నకుండె
న్నెమ్మదిగా నబ్ధిరాజు, నృపవరుని సమ
క్షమ్మున భృత్యుడువోలె, న
భమ్మున్ దెలుపాయె, గాలివాన శమించెన్

కం. తలదాల్చునె ప్రకృతిసతి
బలవద్రాజన్యులొక్క పదివేల్ కత్తుల్
ఝళిపించి ముదలయిచ్చిన
భళిరే! ప్రభుయేసు సృష్టి పతినిక్కముగన్

కం. అని శిష్యులేసు నాథుని
అనంత శక్తులు దలంచి అద్భుతపడి రా
దినమున పడవన్ నడిపిం
చిన మేటి సరంగు జన్మ సిద్ధించెగదా?

సీ. చిరుతరంగాల క్రొన్నురువు ముత్యాల దండలతోడ పాదార్చనంబు సలిపి
పసమించు గండుబేడిసలత్రుళ్లింతల హర్షాతి రేకంబు వ్యక్తపరచి
వలపులూరించు శీతల వాయువులు వీచి సహనస్వభావంబు, స్పష్టపరచి
యుగయుగంబుల నుండి యొడ్డుదాటనిస్వీయ నియమనిష్ఠాదీక్ష నిజము జేసి

తే.గీ. తప్పు క్షమియించుమని జగద్దైవమునకు
అంజలి ఘటించుచున్నదో యన్నయట్లు
లలిత తరగల కులుకుల తళుకు లొలయ
నతుల శాంతంబు వహియించె నబ్ధిరాజు

# దయ్యము పట్టినవాడు

కం. దయ్యము పట్టినవా డొక
డయ్యైతావులను దిరుగు చతిభయదముగా
కుయ్యిడుచు నగుచు, దిక్కులు
వ్రయ్యలుగా నార్చుచుండు బవలున్ రేలున్

కం. ఏసూ క్రీస్తుంగనుగొని
మీసంబులు మెలచి గ్రుడ్లు మిటమిట మెరయన్
యేసూ! నను వేధింపకు
దాసోహమ్మనుచు వచ్చి దండము పెట్టెన్

కం. నా పేరు సేన నాలో
పాపపు దయ్యాల మూక వసియించును నీ
దాపున నిలువంజాల, ద
యాపర రక్షింపుమనియె నతినమ్రతతో

ఉ. ముందర మేయు సూకరపుమూకను జొచ్చి యదంతరంబుగా
చిందరవందరన్ సలువ చిందులు ద్రొక్కుచు ఘుర్ఘురించుచున్
పందులు రెండువేల్ పెనుప్రపాతమునంబడిచచ్చె కాపరుల్
గందరగోళమై బెదరి కాళ్ళకు బుద్ధులు చెప్పిరార్చుచున్

ఆ.వె. గెనెసరేతు నేలగల వారి విజ్ఞప్తి
శరధి దాటి శిష్యచయముతోడ
నవలి దరికి బోయె నా ప్రాంతప్రజకేసు
రాక, నిశ్చయముగ రాకయయ్యె

## యాయీరు కూతురును బ్రతికించుట

కం. ప్రథగల సమాజధామపు
టధికారి యొకండు యాయురను వాడుదిత
వ్యధిత మనస్కుండై, కరుణా
నిధియగు శ్రీయేసు పదవనేజముల బడెన్

కం. మరణింప సిద్ధమై, దు
స్తరరోగ గ్రస్తయగుచు బాధపడెడు నా
చిరుతనయను రక్షింపుము
కరుణాకర రమ్ము నా యగారంబునకున్

కం. అని కంట నీరు నింపం
కనికరపడి ప్రభువు శిష్యగణమున్ దానున్
జనుచుండె నతని వెంటన్
జననివహము జుట్టుముట్టె సంరంభమునన్

మ. తరుణీరత్న మొకర్తు దుస్తరపు రక్తస్రావ రోగంబునన్
చిరకాలంబు తపించుచుండి ప్రభువున్ జేరంగ శంకించి యం
బరమున్ ముట్టిన జాలునంచు ఘన విశ్వాసంబుతో పెక్కు వా
సరముల్ లెక్కిడుచుండె రక్షకుని సాక్షాత్కార మాశించుచున్

కం. ఆనలినాక్షియు మూగిన
మానవతతి జొచ్చి భీతిమల్లడిగొన నం
గీనంటి, వణక జొచ్చె మ
హానేర మొనర్చినట్టు లంగము గదలన్

కం. కట్టెన్ రక్త స్రావము
ముట్టిన తక్షణమనెలత మోమున జిరు న
వ్వుట్టిపడె, గుట్టెఱుంగుచు
నిట్టనె శ్రోతలు వినంగ యేసుత్సుకుడై

కం. నాతేజోలవ మొకటి ప్ర
జాతతి యందొకరిలోన జారినదన న
న్నాతి భయోద్ధతి వణకుచు
చేతులు జోడించి ప్రభువు చెంగట నిలిచెన్

ఆ.వె. వెఱవవలదు నీదు విశ్వాసమే నిన్ను
స్వస్థపరచె పొమ్ము చానమిన్న
పరిహరింపబడ్డ గురుతరామయముతో
సమసె నీదు పాపచయముగూడ

కం. చనిపోయె నీ తనూభవ
చనుదెమ్మికనింటికేల శ్రమపెట్టెదు క్రీ
స్తును వలదని దాసులు ప
ల్కిన విని యధికారితోడ క్రీస్తిట్లనియెన్

కం. నమ్మిక నిల్పుము వెఱువకు
రమ్మని తద్గృహమునకు బిరానంజని, ద్వా
రమ్ముం గ్రమ్మిన జనమున్
బొమ్మని యిలు సొచ్చిచూచె ముద్దియమోమున్

కం. నిదురించుచున్న దీబిడ
బ్రతికిన బాలికను జూచి పలవించుచునూ
దెద రేల వేణువులనిన
పదుగురు నిరసించి రేసుప్రభునజ్ఞానుల్

కం. తలితాకుమీ యటంచున్
బలికె నరామిక్కు భాష బాలిక ప్రాణో
చ్ఛలితాంగ యగుచు శయ్యా
తలమున గూర్చుండి అద్భుతము గల్పించెన్

ఉ. దైవకుమారు డీతడు యథార్థముగా మనుజుండుగాడు, లో
కావన పావనుండనుచు నంజలిబట్టిరి ప్రేక్షకుల్ విషా
దావిలచిత్తులై వగచు నాబిడ బందుగు లబ్బురంపు ము
ద్రావదనాబ్జులై ప్రభు పదంబుల నించిరి హర్షబాష్పముల్

## అయిదువేలమంది కాహారము పెట్టుట

తే.గీ. ప్రభువు గలిలయవార్ధి కావలగలట్టి
ప్రాంతములలో సశిష్యుడై పర్యటించి
బహువిధ వ్యాధి పీడిత ప్రజల కరుణ
స్వస్థపరచుచు బోధలు సలుపసాగె

కం. గుములగుచువచ్చి పలుప్రాం
తములంగల ప్రజలు, పరమ తత్వార్థంబుల్
ప్రమదమున వినుచు విశ్వా
సమునం గొండాడి కొలువ సాగిరి భక్తిన్

ఆ.వె. అయిదువేలమంది కన్న దానము జేసె
యేసునాథు డొక్క వాసరమున
రొట్టెలైదు రెండు చిట్టి చేపలతోడ,
అద్భుతముల కెల్ల నద్భుతముగ

కం. కొదలేకుండ భుజించిన
పిదపన్ దచ్చుకల చయమువెసబ్రోవులిడన్
పదిరెండు గంపలై, స
మ్మదమాశ్చర్యంబు గూర్చి మహిమందెలిపెన్

## సముద్రముమీద నడుచుట

చం. గలిలయ వారిధిం బ్రభువౌ కానొకరాతిరి పాదచారియై
కలియగ వచ్చుచుండె త్వరగా ప్రియ శిష్యులదోనె చెంతకున్
జలధియు వీచికా విమల చామరపంక్తుల గౌరవింప, శి
ష్యులుగని భూతమో యని, భయోద్ధతి కేకలుబెట్టి రంతటన్

కం. భూతంబను గానోయీ
భీతిలవలదంచు చేయి వీవగ, శిష్య
వ్రాతంబద్భుత పడుచున్
చేతులు జోడించె భక్తిచిహ్నితమగుచున్

కం. ఆవేశ పరుడు పేతురు
నావవిడిచి నీటిమీద నడచెదనని పూ
ర్ణావేశ మొదవ దుమికెన్
దెవసుతుని కడకుజల నిదాన పథానన్

మ. నడచెన్నాలుగు బార లేసుప్రభు నాజ్ఞన్ నిండు విశ్వాస మే
ర్పడ, నుత్తుంగ తరంగమాలికల ఆర్భాటంబునన్ భీతుడై
అడుగుల్ సాగక నీటమున్గుచు మహాత్మా నన్ను రక్షింపు మె
క్కడ నున్నావని యార్చె క్రీస్తు ప్రభువున్ గారుణ్యభావంబునన్

చం. సరగ కరావలంబము నొసంగి అనర్థపు టల్ప భక్తిచే
నరుడు దురంతదుఃఖ దహనంబున గ్రుంగి నశించి పోవు ని
క్కరణి నటంచు, ముమ్మరపు కంపమునన్ గురుపాద యుగ్మమా
దరువుగ వ్రేలు పేతురును తట్టివచించె విముక్తితత్త్వమున్

## సురోపెనికయ స్త్రీ

కం. ఒకనా డొక్క సురోపె
న్నిక స్త్రీయేతెంచి ఆవనింపుము నా పు
త్రికను, పిశాచగ్రస్తను
బ్రకట దయాభరణయంచు పదములబడియెన్

కం. అనుగుం బిడ్డల రొట్టెలు
శునకములకు వేయదగునె సుందరియన, నౌ
తినుగద కుక్కలు పిల్లలు
తినివైచిన ముక్కలంచుదెరవ వచించెన్

కం. నీవిశ్వాసము దొడ్డది
కావున నీకోరినట్లుగా నవునన న
ప్పూవుంబోడి కుమార్తె య
థావిధి స్వస్థత వహించెనా క్షణమింటన్

## రూపాంతరము

కం. రూపాంతరంబు దాలిచె
నా పరమ నివాసుడొక నగాగ్రంబున నా
రూపము నీక్షింపంగా

సీ. ధవళంబులై హిమచ్ఛవులతో ప్రేక్షణీయంబులై శోభిల్లెనంబరములు
వలువల నారీతి చలువ సల్పెదు ప్రజ్ఞ పొసగదే రజకోత్తమునకు నవని
పదియునారవవన్నె బంగారునీటిలో నగరాజ శిఖరంబు స్నానమాడె
ఇతడు నా ప్రియపుత్రుడితని వాక్యము శుభోత్కటమంచు మ్రోసె నాకాశతలము

తే.గీ. శతసహస్రభాను సమదీప్తి వదన బిం
బమున నాట్యమాడ నమృతకరుని
కిరణమాలపుష్ప సరముగా రూపాంత
రంబుబొందె క్రీస్తురాజ మౌళి

కం. ఏలియ మోషేలా కు
త్కీలాగ్రంబందు దోచి, క్రీస్తేసునితో
ఆలోచించి రదేదో
ఆలోక విశేష మతిరహస్యంబునగున్

కం. సీమోనా దృశ్యము గని
యేమనుటకు నోరురాక యిటునుండుదమా
స్వామీ! నివాస యోగ్యం
బౌమన కనిపల్కె విచలి తాత్ముండగుచున్

## జారస్త్రీ

చం. గెలన నొకర్తు నొక్కపరి క్రీస్తుని చెంతకు గొంచువచ్చి, శా
స్త్రులు, పరిసయ్యులమ్మగువ జూపి నిరంతరపాపవృత్తిచే
కలుషితమయ్యె నిత్తరుణి గండశిలాహతి సంహరింపగా
వలెనని చెప్పుచున్నవి ధ్రువంబుగ యూదుల ధర్మశాస్త్రముల్

కం. ఏ మందు వంచుస్వార్థ
స్వాములు పృచ్ఛింప నేసుసామి వినుచు మీ
లో మంచివాడు తొలుతన్
భామపయిన్ రాయి విసరవలెనని యేదో

కం. నేలపయిందన చూపుడు
వ్రేలన్ లిఖియించుకొంచు శ్రీయేసు తలన్
వాలిచి యుండెన్ గొండొక
వేళకు దల యెత్తిచూచి వెలదింగనుచున్

కం. ఓయమ్మ! యెవరు నీపై
రాయి విసరలేదె? కల్గరా నిష్కలుషుల్
నీయపరాధము లెన్నిన
ధీయుతు లెందేగినారు తెలుపుమటన్నన్

కం. ఆ సతి కన్నీరోడ్చుచు
యేసు ప్రభూ! రాయి విసరడెవ్వడును నీ
యూసు విని జారు కొన్నా
రాసలు విడనాడి, కావుమా! అని మ్రొక్కెన్

కం. ఏనును నిను శిక్షింపను
మానిని, దుర్వృత్తినింక మానుము పొమ్మం
చానతి నిచ్చెం బ్రభుయే
సా నాతియు బ్రతుకు జీవుడాయని చనియెన్

## తప్పిపోయిన కుమారుడు

కం. సిరిగలయొక సంసారికి
నిరువురు సుతులుండి రందుహీనగుణుడు, సో
మరిపోతు జూదగాడున్
సరదారాయండుగల్గు జనకంటకుడై

ఆ.వె. ఆస్తి పంచుకొంచు నరిగె దేశాంతరం
బనుగుతండ్రి వలవదన్న వినక
వ్యయమొనర్చె ద్రవ్యమంత పోకిరులతో
చెలిమిచేసి, భోగములకు మరగి

ఉ. ముందును వెన్కలారయక మూడు దినంబులలోన ద్రవ్యమున్,
బొందనుబెట్టి భోజ్యమొక పూటకు లేని మహాదరిద్రుడై
పందులగాయసాగె కలవారికి పాదములొత్తు భృత్యుడై
కుందుచు, నట్టి దీనదశకుం జడబుద్ధులు యోగ్యులే కదా?

చం. జనకుని యింటిలో సకల సౌఖ్యములన్ విడనాడి దుర్మదం
బున కనుమిన్ను గానని కుబుద్ధికి నా కిటువంటి నీచ జీ
వనదశరాకయన్య మెటువచ్చు, భయంకరమైన యీక్షుధా
గ్ని నెటుల నోర్తు ప్రాణములు నిల్పునుపాయ మికేమిదైవమా!

సీ. కబళమింత యొసంగి కరుణింపడా తండ్రి తన యింట నొక్క భృత్యునకు వోలి
కడకింత వెచ్చని గంజి వోయింపడా పసరాల కోష్ఠాన కసవు జిమ్మ
ఐశ్వర్యవంతుడై యలరునా యన్నేని మిన్నకుండునె పట్టెడన్న మిడక
నా తండ్రి యింటి వంటలవాడు దయజూప కుండునే చిన్ని యుద్యోగమిచ్చి,

తే.గీ. ఏది యెట్లైన నీ బొంది నిల్పజేర్చి
జనకుని పదాలు వేడి బాష్పములలోన
స్నాన మాడింపకున్ననా సలిపియున్న
ఘోర కలుషానలంబు చల్లారదింక

కం. అని పశ్చాత్తప్తుండై
కనుగొనలన్నిండు నశ్రుకణములతో, వం
గిన మేనితోడ లజ్జా
వనతాస్యముతోడ మరలి వచ్చెంబురికిన్

చం. కొడుకు పరాయి దేశమునకున్ జనె నెక్కడ నెట్టి కష్టముల్
బడియెడినో యటంచు బహుళవ్యథ నెమ్మది నేచ, కన్నులన్
దడియిడుచున్ నిరంతరము దారులు తెన్నులు జూచుచుండె ని
క్కడ జనకుండు, ప్రేముడికి గట్టులుగల్గునె కొల్చిచూచినన్

ఆ.వె. గురుతు పట్టరాని క్రుంగిన యంగాన
మురికి నిండియున్న కురులతోడ
కాళు లీడ్చుకొంచు కనిపించె నల్లంత
దూరమందు చినకుమారకుండు

చం. ముదిమి భుజింపగా వణకు బూనిన శుష్కశరీర యష్టిలో
పదిపదివేల యేన్గుల యపార బలోద్ధతి చెంగలింప న
మ్ముదుసలి హర్ష బాష్పజల పూరిత లోచనుడై, తనూభవున్
గదియగ బేరెమెత్తి బిగి కౌగిట దాల్చె హసన్ముఖాబ్జుడై

ఆ.వె. తండ్రి కాళ్ల బెనగిదగదీర ముద్దాడి
కంట నీరు నించి గాద్గదికత
తొమ్ము గ్రుద్దుకొంచు రోదించి ఖిన్నుడై
పల్కలేక యిట్లు పలుకజొచ్చె

చం. పరమ కృతఘ్నుడన్ గఱకు పాపిని ద్రోహ మొనర్చినాడ న
ప్పరమ నివాసికిన్ కనిన వానికి నీకును, తండ్రి! నేను నీ
సరసకు రానయోగ్యుడను సాటివచింపగరాని నీ దయా
కరుణల కాలదన్నుకొని కష్ట సముద్రమునందు దూకితిన్

కం. నీ కొమరునిగా నెంచక
నీకుం బరిచర్య చేయు నీ భృత్యులతో
నాకుం జోటిమ్మదియే
నా కోరిన ప్రతిఫలంబు నాయనుగుపితా!

ఉ. లావుగ భక్ష్యరాసులు పులావులు సిద్ధము జేయబంచి, ఆ
దైవము పుత్రకున్ మరల దాన మొసంగె నటంచు ప్రీతుడై.
సేవక సేవికాతతికి జీతము లిబ్బడిగా నొసంగి, తూ
ర్యావళి ఘోషలన్ బురము నందొనరించె మహోత్సవంబులన్

ఆ.వె. కినిసి పెద్దకొడుకు తనకు నెన్నండేని
ఉత్సవాలుసేయ వున్నయాస్తి
పంచుకొన్న కొంటెవాడిల్లు చేరగా
సంతసించువేమి సబబునీకు

కం. అని కంట నీరు నించిన
తనయుని నోదార్చి నీదు తమ్ముడు మృతుడై
జనియించె మరల నీ ధన
కనక మణీచయము నీదిగాదె కుమారా!

## శాస్త్రులు, పరిసయులు

కం. ఉండకు మిచ్చట హేరో
దుండు నినున్ జంపదలచె తొలగి చనుము క్రూ
రుం డాతడనగ విని క్రీ
స్తుం డాత్మంగుంది వారితో నిట్లనియెన్

కం. విందుల నగ్రస్థానము
లందుచు నడువీధులందు నభివందనముల్
పొందుచు బోధకులనబడు
చుందురయో శాస్త్రి నామకోన్మదులారా!

సీ. కట్టించెదరు ప్రవక్తలకు గోరీలనందంబుగా సన్న సున్నంబుజేసి,
కొట్టించెదరు దొడ్డ కొరడాలతో ప్రవక్తలబట్టి, నీతిమంతుల నదల్చి
కలుపుకొందురు మహాబ్ధుల నెల్ల గాలించి వెతకి కొండొకని మీ మతమునందు
కష్టపెట్టెదరు దుర్గతి పాలుగావించి హస్తగతుండైన యనపరాధి

తే.గీ. మశకముల నెల్ల దులిపి యమాంతముగను
మ్రింగివేయంగలారు క్రమేలకమును
ఘోర నరకాగ్ని తప్పించుకొనరు మీరు
సర్పవంశసులగు పరిసయ్యులార!

మ. అలహేబేలుని రక్తధారలు జెకర్యారక్తధారల్, మహా
త్ముల, సద్భక్త జనాసృగాపగతతుల్ మున్నీరమై పొంగి, మి
మ్ముల నుగ్రాకృతి మ్రింగివేయును జుడీ ముందెన్నడో కాదు, రా
గలదీ దుప్ప్రళయంబు శీఘ్రముగ నిక్కం బీతరం బందునన్

మ. అయయో! దొడ్డ యెరూషలేము నగరంబా! ఆశ్రిత శ్రేణి కా
శ్రయమీకంచితులౌ ప్రవక్తలగు వారింజంపు దానా! భవ
త్ప్రియ సంతానము నుద్ధరింప ననుర క్తిన్ హస్తముల్ సాచితిన్
కయికో వైతివి మత్కృపానిధి, తిరస్కారంబు గావించుచున్

కం. ఱెక్కలు సాచుచు పిల్లల
కొక్కొక్కో యనుచు బిలుచు కుక్కుటము క్రియన్
ఱెక్కలు సాచితి మీకై
పెక్కేడులు చేరరల్ప విశ్వాసమునన్

మ. జనుషాంధుల్ గనుచున్నవారు బధిరుల్ స్పష్టంబుగా సర్వమున్
వినుచున్నారు, మృతుల్ సజీవులగుచున్ విశ్వంభరా సృష్టి క
ర్తను కీర్తించుచునున్న వారకట! కర్ణంబుల్ కనుల్ గల్గియున్
వినరున్ జూడరు మీయుగ ప్రజలయో విద్రోహిదర్వీకరుల్

## ధనవంతుడు, లాజరు

చం. కలడొక భాగ్యవంతుడు ధగద్ధగితాంబరచుంబి సౌధపం
క్తుల వసియించు భోగి, పదుగుండ్రు సపర్యలు చేయ దైవమున్
దలపక సౌఖ్యవార్ధి బహుధా నిలువీతలు గొట్టుచుండు, వె
ల్పలనొక పేదలాజరను వాడు క్షుధార్తి తపించుచుండెడిన్

ఆ.వె. అతడు చీకి వేయునస్థి ఖండాలకై
యెదరు సూచుచుండు నింటిముందు
ఊరికుక్కలట్టి యుచ్ఛిష్టమును గూడ
దొరకనీయవతని దోషమేమొ

కం. కురుపులతో, మక్షికముల
చురుకులతో, నోర్వరాని క్షుధతో, వ్యధతో
కరుణకు నిరవగు దీనుని
కరుణించి యొసంగ డొక్క కబళంబేనిన్

చం. పరమపదించె పేద, ధనవంతుడు పిమ్మట మేనువాసి పె
న్నరకము జేరె, లాజరుడు నాకమునందు మణీ కిరీటమున్
శిరమున దాల్చి మోక్షపతి చెంగట నబ్రహామన్ మహాత్ము పె
న్నురమున విశ్రమించె మహి మోజ్వలుడై విగళద్విచారుడై

ఉ. క్రాగినయుక్కు నీట నుడుకం దొడగెన్ దనువెల్ల, గొంతులో
రేగె దవానలార్చులు, భరింపగ రానిపిపాస నాలుకన్
లాగెడు, నబ్రహామ! యల లాజరు నంపుము నీటిచుక్కలన్
నాగళసీమ జిల్క కరుణం బ్రకటింపుము నీకు మ్రొక్కెదన్

శా. ఆనందించితి వెల్ల సౌఖ్యములతో నైశ్వర్యవంతుండవై
ఈ నిర్భాగ్యుడు ఘోరకష్ట జలధిన్ పృథ్వీ స్థలిన్ బ్రుంగి నే
డానందించెడి, నాయనా! కలదు మధ్యన్ మీకు మాకున్ గభీ
రానంతంపు టగాధ మంచనియె నబ్రాహాము డార్ద్రోక్తులన్

కం. కలరైదుగురు సహోదరు
లిలపై నా కనఘు వారికీ నరకోగ్ర
జ్వలనవ్యధ తప్ప, ధరా
స్థలికంపుము వాని నొక్కి సాక్ష్యంబీయన్

కం. కలరందు సాక్ష్య మీయం
బలువురు మోషేయు, సత్ప్రవక్తలనిన ధీ
జలధీ! మృతులందొక్కం
డిల గ్రమ్మర బ్రదికి తెల్పుటే దగవనియెన్

తే.గీ. క్షితినిగల ప్రవక్తల విశ్వసింపకున్న
విశ్వసింపరు మృతులు చెప్పిన నటంచు
తిరుగ బ్రత్యుత్తరించె సందియము దీర
నర్థనాధ్యున కురుభక్తు డబ్రహాము

## లాజరును లేపుట

కం. మరియా మార్తాఖ్యలు గల
తరుణులు గలరిరువు రేసు దైవ సుతునకున్
పరిచర్య చేయు చుందురు
తరచుగ నురుభక్తిరస సుధామయమతులన్

ఆ.వె. ప్రభువు పదయుగంబు పరిమళతైలాన
పూజ సల్పినట్టి పొలతిమిన్న
కూర్మిసోదరుండు, గుణవంతుడగు లాజ
రాభిధుండు రోగియయ్యెనన్న

ఆ.వె. వార్తనాలకించి ప్రభువిది తన మహి
మార్థ మరుగుదెంచెనని వచించె
మరియ సోదరుండు మరణించె బేత నీ
పురమునందు; వచ్చెమరియ కడకు

ఆ.వె. ప్రభువు రాకవించు పరువెత్తుకొని వచ్చి
పాదయుగళి మీదపడి వచించె
ననుజు మరణవార్త ఘనతరశోక సం
తప్తయగుచు, మారతావధూటి

కం. చావడునాదు సహోదరు
డీ విచ్చటనున్న యిప్పుడేనియు దేవున్
నీవడిగినట్టి వన్నియు
నీవల నీగల డటంచునింతి వచించెన్

కం. బ్రతుకున్నీదు సహోదరు
డతివా! యని ప్రభువుపల్క ఔనాస్వామీ!
బ్రతుకుం బునరుత్థానపు
టతుల శుభానంద వేళననుచుంబల్కెన్

కం. నేనే పునరుత్థానమ
నేనే జీవమను ముక్తినిలయము నేనే
చానా, నను నమ్మిన వా
డేనాడున్ జావడనుచు నేసు వచించెన్

కం. మరియయు ప్రభుపాదంబుల
నొరిగి ప్రలాపించె కూడియుండిన బందుల్
పురజను లేడ్చుటగనుగొని
మరియా సుతుడేడ్చె స్వర్గమండల మేడ్చెన్

ఉ. ఏసు శ్మశానవాటికకు నేగి సమాధిని డాసి దానిపై
మూసినరాతి నెత్తుడన పొల్తుకలించుక సంశయించుచున్
వాసన బట్టియుండును శవంబు, గతించెను నాల్గు నాళులం
చాసలు జచ్చి పల్క ప్రభువ మ్మరియా సతితోడ నిట్లనెన్

ఉ. నమ్మినజూతు వీవు గెలనా! జగదీశునిశక్తి సంపదల్
జుమ్మని, కన్నులెత్తి దివి జూచుచు తండ్రి! ప్రజాతతుల్ ననున్
నమ్మగ నీదయాలవము నా కిడుమంచు వచించి లాజరూ!
రమ్మిక లెమ్మటంచు ఘనరావమునన్ బిలిచెన్ మహోద్ధతిన్

తే.గీ. కాలు సేతులు ప్రేతవస్త్రాలతోడ
కట్టబడియున్న లాజరుండిట్టెలేచి
వెలుపలికి వచ్చెనచ్చోట నిలిచియున్న
ప్రజలు స్థాణువులైరి నిర్ఘాంతపడుచు

# మంచి సమరయుడు

ఉ. దొంగలు గొట్ట రక్తమున దోగుచు కొండొక బాటసారి, స
ర్వాంగ శరక్షతంబుల మహా వ్యధతో పలవించుచుండ వా
నింగని సుంతయేని కరుణింపక నల్లన దాటిపోయె, యు
ష్ట్రాంగననెక్కి యాజకధనాఢ్యుడొకండు, కులాభిమానియై

కం. లేవీయుండొక్కం డా
త్రోవంజను చుండి బాధితుంజూచి దయా
భావమున పలుకరించక
వేవేగంజనియె నలతి వీక్షణములతో

కం. సమరయు డొకరుండు నదే
సమయంబున బోవుచుండి క్షతగాత్రుని, దుః
ఖమునం దోగెడు వానిన్
ప్రమాదమున కగ్గమైన పథికుంగనుచున్

మ. కరుణా సంగ మనస్కుడై అతని ప్రక్కంజేరి యోదార్చి, య
క్కరకున్ గంటుల గోస్తనీరసము చుక్కల్ బిండి, మైమీది యం
బరమున్ జించి స్రవించు రక్తమును సమ్మార్జించి యుష్ట్రంబుపై
పురికిన్ దోడ్కొనిపోయి చేర్చె రుచిరంపుం బూటకూటింటికిన్

కం. దీనుం డీతడు దయతో
మానక పరిచర్యచేసి మనుపుడు మరలన్
నే నరుగుదెంతు ననుచున్
దీనారద్వితయ మిచ్చి తెరువరి చనియెన్

ఆ.వె. పొరుగువా డెవండు ముగ్గురిలోనంచు
యేసుక్రీస్తు వారి పృచ్ఛ చేసె
సమరయుండొకండె సాటిమానవులకు
పొరుగువాడు ప్రేమ భరితుడనిరి

# నిత్యజీవము కోరిన ధనవంతుడు

కం. ధనవంతు డొకడు ప్రభువుం
గనుగొని దైవాజ్ఞ లెల్లగావించితి, దే
వుని రాజ్యమందు చిర జీ
వనమున కింకేమి చేయవలెనని యడిగెన్

ఉ. ఉన్నది ముఖ్య కార్యము, సహోదర! నీ ధనమెల్ల నూరిలో
నన్నములేని వారికిడి, ఆసలువీడి, సువార్త చాట ర
మ్మన్న నతండు ఖేదపడి అవ్వలికింజనె నంత యేసు సం
పన్నులగూర్చి చెప్పె నుపమానమొకండట నున్న వారికిన్

ఉ. ఓరిమి సూది బెజ్జమున నొంటెను గ్రుచ్చగవచ్చు, స్వార్గికా
గారములో ధనాఢ్యునకు గాలిడరాదు, దరిద్ర మాన వా
హారమె ద్రవ్యమై యొకని హస్తగతంబగువాడు మానవా
కార కఠోర భల్లుకముగా తినివేయు మనుష్య మాంసమున్

# పుట్టు గ్రుడ్డివాడు

మ. జనుషాంధుండను, దీనుడ న్నరసమాజంబందు, నీలోక సృ
ష్టిని కన్నారగ జూడనోచని వృథా జీవిం బ్రభూత్తంస, చ
క్కని నీ మూర్తిని జూచు భాగ్యమును భిక్షంబెట్టి రక్షింపవే,
కనులిమ్మో నజరేతువాస మరియా కన్యా కుమారాగ్రణీ!

ఉ. చీకటి రాశిలో మునిగి చిందులు ద్రొక్కు ధరిత్రి కెల్ల నీ
రాక ప్రభాత భాస్కరుని రాకగ కన్నులొసంగలేదొ, ప్రే
మాకర! పుట్టుగ్రుడ్డికి, నిరంతర పాప తమో విహారికిన్
నాకు భయప్రపంచ నయనంబు లొసంగి సముద్ధరింపవే!

ఆ.వె. పుట్టుగ్రుడ్డివాని భూరి విశ్వాసంబు,
ముదము గొలిపి హృదయమును గదల్ప,
అమృత కరయుగాన నతని కన్నులనంటె

ఉ. పుట్టి జగంబు ముక్కు మొగమున్ గననట్టి కబోది వాని క
పుట్టునవిశ్వమెల్ల కనుపండువుగా నగుపింప, మోదమున్
బట్ట వశంబుగాక, భగవంతుని జూచితినంచు కేకలన్
బెట్టుచు, పల్లటీ లెలమి వేయుచు బర్వులు వారె వీధులన్

చం. గురుతర కుష్ఠ రోగమునకున్ గురియై పురబాహ్యసీమలన్
గరము తపించు దీనులను గాంచి స్పృశించి కుదిర్చె తద్భయం
కరదురితామయాల్, ప్రభుని కాలి రజోలవ మింత సోకినన్
గరగె నఖండ కిల్బిషపుగండ శిలల్ విషఖండ చండముల్

## ఎరుషలేము ప్రవేశము

కం. ఒలివా నగాంతికంబున
గల బేత్పగె బేతనీయ గ్రామమునకు శి
ష్యులతోడ వచ్చి కౌతూ
హలమున నిట్లనియె చట్టులందిరువురితో

చం. ఎదురుగనున్న గ్రామమునకేగుడు గర్దభ శాబకంబు జూ
చెదరటతోడి తెండిటకు జెచ్చెర, నేమిటికన్న వానితో
నిది ప్రభుయేసు కంచు వచియింపు డతం డెదురాడకుండ, స
మ్మదమున దోలి పంపు ననుమానము లేదని పంపెవారలన్

ఆ.వె. ప్రభువు చెప్పినట్టి ప్రతిమాట సత్యమై
జరుగ శిష్యయుగము సత్వరముగ
కట్టితెచ్చి రేసుకడ కన్యులెక్కని
మేలుజాతి మంచి గాలిగాని

ఆ.వె. పయనమయ్యె నేసు ప్రభువు గర్దభ శాబ
కంబుమీద రాజసంబు మెరయ
దారినిండ బరచినారు మార్గస్థులు
అడుగులకును మడుగు లమిత భకి

మ. హాలెలూయా! మన రాజు లేత ఖరవాహంబెక్కి యేతెంచె, క
న్నుల విందౌ కనుడంచు హస్తముల యందున్ బెద్ద ఖర్జూర శా
ఖలు సంధించి, జయధ్వనుల్ సలిపి కేకల్ వెట్టుచిన్నారి పా
పలు వెంటాడ నెరూషలేము పురికిన్ వచ్చెం బ్రభుండంతటన్

## అంజూరపు చెట్టు

ఉ. ఆరజమైన క్రొంబసరు టాకులతో కనువిందొనర్చు నం
జూరపు వృక్షముం దవుల జూచి ఫలప్రదమంచు నెంచి నో
రూర సశిష్యుడై యరిగి యూరక నిష్ఫలమై, యలీక శృం
గారపు టేపుగా నెరిగి కష్టముదోచి ప్రభుండు క్రుద్ధుడై

ఆ.వె. పండకుండు గాక వసుధ నీ వృక్షంబ
టంచు శాపమిచ్చె నక్కుజంబు
మరుదినంబ వేళ్లవరకెండి పడియుండు
టరసి శిష్యవర్గ మదరిపడుచు

ఆ.వె. ఎట్టి మహిమగలదొ, యేసునాథుని వాణి,
చిత్రమనుచు వినుతి జేసిరపుడు
పచ్చి డాంబికులకు వచ్చు శిక్షకు నుదా
హరణ మనుచు నేసు డానతిచ్చె

శా. ఏసూక్రీస్తు మహాద్భుత క్రియలు నుత్కృష్ట ప్రబోధంబు లీ
ర్ష్యాసూయాగ్నిరగుల్ప, నాటికుల గర్వావేశు లేవోమిషల్
దోసంబుల్ బొరలించి, వట్టి యపవాదుల్ పుంపి, నిస్సార వా
చా సామర్థ్యము జూపుచుండిరి జిఘాంసన్ సత్య విధ్వంసకుల్

సీ. భగవంతునకు తనూ భవుడౌనె నజరేతు వాస్తవ్యుడగు వడ్లవాని కొడుకు
ధర్మశాస్త్రార్థముల్ తలక్రిందు సేయునే బొడ్డూడి పోవని పోరగాడు
జాలరుల్ పలువురు సచ్ఛాత్రులైనంత వంద్యుడే ఘోటక బ్రహ్మచారి
బయలు జెబూలుండు పరువులెత్తించడే దయ్యాల మంత్ర తంత్రములచేత

ఆ.వె. ఎవ్వడిచ్చె వీని కిమ్మానుయేలన్న
దొడ్డ బిరుదు దేవదూషకునకు
లేఖనములలోన లేని సిద్ధాంతముల్
పలుకువాడు ధరణి బ్రతుకదగడు

## పదిమంది కన్యకలు

కం. అదనున బెండ్లి కుమారకు,
నెదుర్కొనగ సిద్ధమైన యిందు ముఖులకున్
పదుగురు కన్యకలకు బో
ల్పదగుం బరలోక రాజ్యభాగ్య ప్రాప్తుల్

కం. ఐదుగురు తెలివిగల వా
రైదుగు రజ్ఞానలుండి రప్పుదుగురిలో
ఐదుగురు తెలివిగలవా
రాద మరవ కప్రమత్తులై, ముస్తాబై

కం. దివిటీలు నూనెసిద్దెలు
నవసరమగు వస్తు చయము నమరుచుకొని, క
న్గవమూయ కెదురు సూచుచు
నవసథములు వాయకుండి రత్యాసక్తిన్

కం. అవివేకలైన కన్యక
లవసరమగునపుడు జూడనగునని, సిద్దెల్
దివిటీలు సిద్దపరుపక
యవిచారత నిద్రవోయి రలసత్వమునన్

ఆ.వె. వచ్చె పెండ్లికొడుకు పట్టుదారతు లెదు
ర్కొను డటంచు కేక వినుచులేచి,
తెలివిగల్గు కన్యకలు, పెండ్లికొడుకుతో
నుత్సవమునగలసి రులసమున

ఆ.వె. తెలివిలేని కన్యకలు కేక నాలించి
తత్తరమున లేచి తడవుకొనుచు
తెలివిగల్గు కన్యకల వద్దకుంబోయి,
తైలమిందు దివ్వటీల కనిరి

కం. చాలదు మాకును మీకీ
తైలము కొనితెచ్చుకొండు తడయకనిన న
య్యాలరి కన్యక లేవురు
తైలార్థంబూరు సొచ్చి తడసిరి బేలల్

కం. ఆలో పెండ్లి కుమారుని
పాలకి చనుదెంచె, జ్ఞానవతులగు కన్యల్
బాలేందుఫాలలేవురు
పాలుగొనిరి విందులోన పదుగురితోడన్

ఆ.వె. తలుపు మూయబడ్డ తదుపరి నల బుద్ధి
హీనలైన కన్య లేగుదెంచి,
తలుపు తీయుడంచు బిలువ మిమ్మెరుగను
వెళ్లుడంచుబల్కె పెండ్లిపెద్ద

## ద్రాక్షతోట

ఆ.వె. మేటి ద్రాక్షతోట నాటించి, వీటి కా
పులకు గుత్తకిచ్చి పోయెనొక్క
డన్యదేశమునకు, ననిపెదాసుల సొంత
పాలుదేర, పండ్లకాలమందు

కం. పాలిడక కాపులెల్లరు
ఆాలన్ మర్దించి, చంపి, ప్రతిచెప్పక ప్రో
ద్వేలాహంకృతి ద్రాక్ష ఫ
లాళిన్ సర్వంబు మ్రింగి రజానమునన్

కం. అది విని యజమానుం డొక
పదుగురు దాసులను బంపి పాలడిగింపన్
మదమున వారల నట్లే
తుదముట్టించిరి దురంతదుష్టుల్, కృషికుల్

ఉ. పంపె తనూభవుం బిదప వా రతనిం గని వీని నిచ్చటన్
జంపిన హక్కు భుక్తములు సర్వము దక్కునటంచు సుంత మ
న్నింపక జుట్టుముట్టి కరుణింపక పట్టి వధించి వార్తలం
బంపిరి తండ్రికిన్, వనము మాదని కాపు లపారపాపులై

ఉ. డెందము నేచు కాపుల కడింది యకృత్యము నాలకించి, ఖా
మం దరుదెంచి, వారి బరి మారిచి, నమ్మకమైన వారికిన్
గొందరకుం గృషీవలులకున్ దన ద్రాక్షలతోట నిచ్చి, పో
యెం దనుజన్ము దుఃఖదవ మేర్చు మనంబురవంత శాంతిలన్

కం. గుమ్మడికాయల దొంగ భు
జమ్ములు స్పృశియించుకొన్న సామెతగా న
క్కమ్మని వ్యంగ్యోక్త్యుపమా
నమ్మమ్మెయాజకుల మనమ్ముల నాటెన్

కం. ఈతడు ఖామందట మన
మాతోటను గుత్తగొంటిమట కాపులమై
యేతెంచు నంట యీతని
తాతెవడో మనలబట్టి దండించుటకున్

మ. ఇతడున్నన్ మన గుట్టు బట్టబయలై, యీ గౌరవాధిక్యతల్
జితుకున్; దక్కవు యాజకత్వము లికన్ జీవింపరా దీ యసం
గత వాచాటుడటంచు నేసు ప్రభువున్ గర్హించి నిర్హేతుక
ప్రతిపక్షుల్ దలపోయ సాగిరి వధింపం బెక్కు యత్నంబులన్

కం. ఉపమానపు నెపములతో
నపహాస్యముచేయ దొడగెనొరా చిరకా
లపు టస్మదీయ కీర్తుల
కపాయ మీ బోధ దేశమాలించినచో

కం. ఏ యధికారోద్ధతి నీ
వీ యద్భుతముల నొనర్తు వెవ్వడొసగె నీ
కీ యధికారంబని యీ
ర్ష్యాయత్త స్వాంతులగుచు నడిగిరి ప్రభువున్

ఆ.వె. నీతి మార్గగాని నిజ తపోధనుడు యో
హాను డొసగినట్టి స్నానకార్య
మెవనివలన కలిగె, దివినుండి కలిగెనా
నరులవల్ల కలిగెనా వచింపు?
డనిన తెలియదనుచు నా నంబులు వంచి
రంత ప్రభువు దుఃఖితాత్ముడగుచు
పలికె నిట్లు తీవ్ర పరుషఫణితి

ఉ. నమ్మినవారుగారు మునినాథు యొహాను మహాను భావునిన్
నమ్మిరి సుంకరుల్, కలికి నట్టువకత్తెలు వేశ్య లభ్రరా
జ్యంబు లభించి తీరెదు నిజంబుగ వేశ్యల కస్మదీయ వా
క్యమ్ములు నమ్మరిప్పటికి కల్గవు మీ కపవర్గ భాగ్యముల్

కం. విందుల నగ్రస్థానము
లందుచు నడువీధులందు నభివందనముల్
పొందుచు బోధకు లనబడు
చుందురయో శాస్త్రి నామకోన్మదులారా!

# లోకాంతము

కం. ప్రియ శిష్యు లెరుషలే మా
లయమున్ జూపించి చిద్విలాసంబగు నా
లయ నిర్మాణం బతులంబ
వ్యయము, కళామహితమంచు నభినందింపన్

కం. ఒక రాయి నిలువ బోదిం
కొక రాపయి, శిథిలమగు మహోన్నతమై దృ
ష్టికి నందుకున్న దేవళ
మొకనాడు నశించి ధరణి కోగిరమునగున్

ఆ.వె. ఎపుడు సంభవించు నివియెల్ల ముందుగా
జరుగువేళ దోచు గురుతు లేమి?
ఆనతీయు మంచు నడుగు శిష్యులకు బో
ధించె నిట్టు లంత్యదినపు కథలు

శా. లేచున్ రాజ్యము రాజ్యమున్ కలహ కేళీలోలమై, నాలుకల్
సాచున్ భూరికరాళ దంష్ట్రికలతో క్షామంబులుం గాటకాల్
పూచున్దోటలకాలమందు, నశుభంబుల్ బుట్టు పోరాటముల్,
పేచీ లేర్పడి తండ్రి పుత్రకుని నర్పించున్ వధా వేదికన్

శా. న్యాయ స్థానములందు నిల్పెదరు నా నామ ప్రచారార్థమై
దాయల్, భూరికశాభిఘాతములతో దండించి హింసింత్రు, మీ
రా యాపత్క్షణంబునన్ పుటము వేయంబడ్డ మేల్వన్నె గాం
గేయంబుంబలె తేజరిల్లెదరు ముక్తి శ్రీలకుం బాత్రమై

ఆ.వె. గొఱ్ఱెతోళ్లు గప్పుకొనివచ్చు మాయా ప్ర
వక్తలుంద్రు, రిత్త భక్తిపరులు
కరము జాగ్రతజుమి, నరరూపమున జన్మ
మెత్తి తిరుగు క్రూరవృకము లవియ

మ. పరుగుల్వారెద లుర్వి భృత్తులకు శాపగ్రస్తుల య్యాదియా
నరులుద్భ్రాంతత ఁ్రొమ్ము గొట్టుకొనుచున్ కాంతల్ ప్రలాపింతు రం
బరవీధిన్ గనుపట్టు పెక్కులు మహోత్పాతంబులా కష్ట వా
సరముల్ దీర్ఘము లప్పరాత్పరు నిరూక్ష ప్రేక్షణాభీలముల్

ఆ.వె. ఒక్కచోట నిద్దరుందు రందొక్కడు
కానుపింప డొక్క గడియలోన
ఒకడు రక్షింతుడు నొకడు శిక్షితుడగు
నెరుగరాదు జగతి నీశ్వరాజ్ఞ

ఆ.వె. పూర్వ దిశను మెరుముబుట్టి పశ్చిమహరి
ద్భాగమునకు త్రుటిని బ్రాకిపోవు
లీల జరిగిపోవు లీలతో నంతంబు
రాకడయును దాని పోకడయును

శా. చుక్కల్రాలు, ధరాతలంబు నెరవిచ్చున్ దట్టపుం జీకటుల్
నిక్కున్ చంద్రదినేశ బింబగతులున్ నిల్చున్ భయోత్పాతముల్
పెక్కుల్ దోచు, అనూహ్య దుష్ప్రళయమున్ వీక్షించి యుద్భ్రాంతమై
యక్కున్ మోదుకొనుం బ్రజావితతి బ్రహ్మాండంబు ఘూర్ణిల్లెడిన్

మ. అవిలంఘ్యంబు లసహ్యముల్ ప్రళయ కాలారంభ సంభూత దు
ర్దివసంబుల్ బరిపూర్ణ గర్భిణుల కుద్వేల శ్రమోపేతముల్
భువనం బుద్భవమైనదాదిగ, యుగంబుల్ జీర్ణమైచన్న మా
నవ ప్రాచీన చరిత్రలో పొసగ వెన్నం డా విపర్యాసముల్

కం. పరిశుద్ధాత్ముడు గానీ
పరలోకమునందు దూతవర్గముగానీ
వరసుతుడు నెరుగరగ్గడె
పరాత్పరుం డెరుగు మరుగు పరుపగనేలా

కం. యుగములు కాల సముద్రపు
టగాధమున గలిసిపోవు నక్షత్రతలంబున్
జగమున్ నశించు, సత్య
స్థగితములగు నాదునుడులు చావవు జుండీ!

మ. పదియార్వన్నె పసిండి తెక్కల యెహోవా దూత యభ్రాంత మం
దుదయాదిత్య ధగద్ధగ ప్రభలతో నుర్వీ తలంబంతయున్
గదలంభూరి భయంకరంబయిన బాకానాదమున్ జేయ, నం
బుద మార్గంబు తరించి డిగ్గెదను సంపూర్ణాధికారంబునన్

చం. మనుజ కుమారకుండు మహిమన్ ధవళాంబుద సింహపీఠిపై,
తనరి జగత్ప్రభుత్వ మహితం బగుముద్రవహించి, దూతలన్
బనిపి, సమస్తమానవ సమాజము నుద్ధతి బిల్వబంచి ప
ల్కును చలదంబుధి ప్రకటఘోషనిటుల్ ఘనభక్తకోటితో

సీ. చెరసాలయందున్న తరుణంబులో నన్ను జూడవచ్చిన పరిశుద్ధులార!
ఆకలిగొంటి నా కాహారమిడి ప్రేమ నాదరించిన పావనాత్ములార!
కడుపేదనైయున్న కాలాన ననుజూచి కన్నీరు నించిన యన్నలార!
పరదేశినైన నన్నరసి యాశ్రయమిచ్చి సమదృష్టి నెరపిన సదయులార!

తే.గీ. సృష్టి మొదలుగ మీకయి సిద్ధమైన
రాజ్యమదె యేలుకొండు నిరంతరంబు
పరమ జనకుని ఆశీశ్శుభంబు లంది
పావన స్వాంతులార! సద్భక్తులార!

కం. ఎన్నం డాకలిగొన్నా
వెన్నడు చెరసాలనుంటి వెరుగము నిన్నున్
గన్నది లేదన ప్రభువు ప్ర
సన్నోక్తుల నిట్లు దీర్చు సందేహంబుల్

కం. ఒక నా సోదరునకు పే
దకు సల్పినదెల్ల నాకుదక్కు నిజముగా
ఒక నా సోదరునకు పే
దకు చేయనిదెల్ల నాకు దక్కదు జుండీ!

కం. అని తన దక్షిణ పార్శ్వం
బున నిల్చినవారి స్వర్గమున కంపించున్
దనవామ పార్శ్వమునగల
జనకోటిం ద్రోయ బంపుజటు లాగ్నిశిఖన్

## పస్కా

కం. పులియని రొట్టెల పండువు
తొలివాసర మిది మహాత్మ తోడ్తోనీకే
సలమున విందేర్పరుపగ
వలెనంచున్ శిష్యులడుగ ప్రభు విట్లనియెన్

ఉ. ఆ కనుపించు పట్టణము నందొక మర్త్యుడు కానుపించు, ప
స్కాకయి విందు సల్పుకొనగా ప్రభు విచ్చుటికంపె నంచు నా
రాక నెరుంగ జెప్పిన కరంబు ముదంబున నాతడెల్ల సం
భారము లిచ్చి తోడ్పడు ధ్రువంబుగ పొందని పంపె వారలన్

కం. పన్నిద్దరు శిష్యులతో
నన్నిశి పస్కా భుజించు నవసరమున మీ
పన్నిద్దరలో నొక్కడు
నన్నర్పణ చేయు శత్రు నరులకు నేడే

మ. అని వాక్రుచ్చు మనుష్య నందనుని వ్యంగ్యాలాపముల్ గుండెలో
సునిశాతాస్త్రము లట్లు గ్రుచ్చుకొన శిష్యుల్ చేష్టలన్ దక్కి, క
న్గొనలన్ నీరుబుకన్, భయప్రకటి తాన్యో న్యావలోకంబులన్
తనువుల్ కంపిల నేన? నేన? యనుచున్ బ్రశ్నించి రేసుప్రభున్

ఆ.వె. చెలిమి మెరయ నెవడు చేరి నా పాత్రలో
మొట్టమొదట చేయి ముంచువాడె
చెప్పనేలయన్న శ్రీ యేసుమాట కి
స్కారియేతు గుండె జలదరింప

మ. తన దౌష్ట్యంబను చిక్కు చీకటివలెన్ దట్టంబుగా భూతలం
బును బ్రహ్మాండము నావరించి యనయంబున్ జారచోరాది దు
ర్జనులన్ దాచెడు నంధకారమునకున్ జారెన్ మహా దుఃఖ వే
దనతో క్రోధముతో గురుఘ్నుడయి యూదా కుంచిత గ్రీవుడై

చం. స్థిరములు లేఖనాల్, జరిగితీరు మనుష్య కుమారు నిట్టు లి
స్కరియెతు లోభియై పరమదుష్టులకమ్మి యపప్రథాగ్నియం
దురికె, భరింప దట్టిదుల నుర్వరవాడు జనింపకుండినన్
మెరుగగు మేలగున్ జలధి నీట మునింగి నశించి పోయినన్

శా. భక్షింపుండిది నా శరీరమనుచున్ భక్ష్యంబు లందించి స
ద్రాక్షాసార మొసంగి త్రాగుడిది నా రక్తంబు పాపక్షమా
దక్షంబానరు నన్ను గూడి భగవద్రాజ్యంబునం దక్క, యి
య్యక్షుద్రాచరణంబునన్ గలుగు మీ కాశీశ్శుభారంభముల్

కం. ముగిసెన్నా పని నేడే
పగతురు ననుబట్టికొట్టి పాలార్తురు నే
నగుపింతు మరల మృతినిం
దెగటారిచి లేచి మూడు దివసంబులలో

ఉ. కాపరి వోవ గొఱ్ఱెలు వికావికలై పరచున్ ఘటించు పె
క్కాపద లూపునన్, కపటులైన ప్రవక్తలు మాయ క్రీస్తులున్
జూపుదు రద్భుతంబులను చూపెద మల్లదె యేసుక్రీస్తు మా
దాపున నున్నవాడని వృథల్ వచియింతు రబద్ధ పండితుల్

ఉ. వచ్చితి సాత్వికుండనయి వచ్చెద క్రమ్మర నుగ్రరూపినై
తెచ్చితి ప్రేమ తత్త్వమును తెచ్చెద గ్రమ్మర శాపతాపముల్
ఇచ్చితి ప్రాణముల్ మృతుల కిచ్చెద నారక వహ్ని శిక్షలన్
అచ్చెరువుల్ మదీయ పునరాగమ కార్యగత ప్రణాళికల్

## శిష్యుల పాదములు కడుగుట

ఆ.వె. ఎవడు గొప్ప మనుజు డెవడు తక్కువ నరుం
డని వివాద పడెడు ననుగు శిష్య
వర్గమునకు బోధపరచె పాదములద్ది
అంతరముల నిర్ణయం బొనర్చి

ఆ.వె. ప్రేమమీర యేసు ప్రియ శిష్యులకు గాళ్ళు
గడిగి తుడిచె మేని మడువుతోడ,
ఎంత ధన్యతములో! యెంత పుణ్యాత్ములో
ప్రభువు శిష్యులెంత భాగ్య ఖనులో!

ఉ. అక్కజ మయ్యెడిన్ గురువరా! గురు లెందును శిష్యకోటిచే
మ్రొక్కులు స్వీకరింతురు, గురుల్ నిజ శిష్యుల కాళులంటి యీ
ఫక్కి యొనర్తురా? తెలియ బల్కుము దీని రహస్యమంచు నొ
క్కొక్కరు ప్రశ్న సేసిరి భయోద్ధతి గద్గదిత స్వరంబులన్

శా. సేవా ధర్మమె యుత్తమోత్తమ మగున్ సేవ్యంబు హీనంబగున్
దైవాభీష్టము నిద్దియే, యెదిరి పాదం బంటి యెవ్వాడు ప్రే
మావిర్భూత మనస్కుడై, కడిగి ఆత్మానందమున్ జెందు నా
సేవా తత్పరు డప్పరాత్పరుని దృష్టిన్ దొడ్డవా డయ్యెడిన్

## చివరి రాత్రి, తుది బోధ

కం. కొంచెము కాలంబుందు, ప్ర
పంచంబున మిమ్ముగూడి పాయుదునట క
న్పించన్నాచను చోటు వ

కం. సీమోనది విని రాగల
స్వామీ! మీ వెంట నాదు ప్రాణము నేనిన్
జామీ నీగల నీకై
నా మాటన్నమ్ముమని ప్రణామ మొనర్చెన్

ఆ.వె. కోడి రెండుమార్లు గూయకమును ముంద
యెరుగ క్రీస్తు నెరుగ నేసునంచు
మూడు మార్లు కల్లలాడెద వీరేయి
మరచిపోకు మంచు మారు పలికె

కం. పండించువాడు నాజన
కుండే నే ద్రాక్షలతను కుసుమితమగుచుం
పండని ప్రతి వల్లరి యుం
ఖండితమై యుగ్రవహ్ని కాలినశించున్

కం. లలిత లతావలయములై
ఫలియింపుడు మీరు నన్ను బాయక బహుధా
ఫలియింప మహిమ కలుగున్
జెలులారా! తండ్రి కఖిల సృష్టి విభునకున్

కం. పోయెద నెలవులు సిద్ధము
జేయగ మీ కొఱకు మీకు శ్రేయంబగునే
బోయిన పంపెద మిమ్మా
ప్యాయతతో నాదరింప పరిశుద్ధాత్మన్

కం. ప్రేమించు కొనుం డొండొరు
ప్రేమించితి మిమ్ము నట్లు ప్రేమించుటయే
క్షేమంబగు నా తండ్రిన్
బ్రేమించినవాడు నన్ను ప్రేమించు నిలన్

కం. నా గడియ వచ్చె ధైర్య
శ్రీగల వారగుచు సంచరింపుం డిదిగో
భూగగనముల జయించెన్
మీ గురువని రాజఠీవి మెరయ వచించెన్

## గెత్సెమనే తోట

మ. చనియెన్ గెత్సమనే వనంబునకు పస్కా విందు గావించి, స
ర్వనరాభీల కరాళ పాపవిష భారంబౌదలం దాల్చి, తం
డ్రిని ప్రార్థించి యనుజ్ఞ నందుకొన గుండెల్ నిండి పెల్లుబ్బు వే
దనతో, విచ్చిన తారకాలలిత నేత్రల్ దూత లీక్షింపగన్

తే.గీ. అనుసరించెడు ననుగు శిష్యత్రయంబు
నొండుకడ నిల్పి వెరపు మానుండు తిరుగ
నరుగు దెంచెదనని స్థలాంతరమునందు
భగవ దారాధనమున కుపక్రమించె

మ. తగవైనన్ దొలగింపు మీ విషమ పాత్రన్ తండ్రి! నీ చిత్తమే
యగు, నా యిష్టము కాదు, దుర్బలతరం బైదేహమున్నన్ ధృతి
స్థగితంబై హృదయంబు మృత్యువునకున్ సంసిద్ధమైయుండె, తో
డుగ రానిమ్ము భవత్కటాక్షమల దుష్టున్‌గూల్తు సృష్టి ప్రభూ!

కం. చింతంగొండొక గడె, భగ
వంతుం బ్రార్థించి తిరిగివచ్చి పరమ ని
శ్చింతన్ నిద్దురవోయెడు
నంతే వాసులనుగాంచి వ్యాకులపడుచున్

కం. ఓపిక నిద్రమేలుకొని యుండుడు కొండొక సేపు త్వద్గురుం
డాపద లోననుండె, మరణాంతము దాక తొలంగదీ మన
స్తాపము నాకటంచని యథావిధి ప్రార్థన సల్పె మూడు మా
రాపగిదిన్ వనాంతరమునందు మహోపలముల్ కరంగగన్

కం. లోకముల కన్ను గప్పుచు
నా కలుషాత్ములకు సాయమగుదురె యన్న
ట్లాకసము మెరుము కత్తుల
చీకట్లన్ జీల్చెవిగత జీమూతంబై

కం. ప్రీతిన్నే ముద్దిడుకొను
నాతడ మద్గురు డెరుంగుడని ముందుగ సం
కేతించు కొన్న విధము
పాతకు డిస్కారియేతు వక్రాశయుడై.

ఆ.వె. శిలలు వెచ్చనయ్యె, చిమ్మటకంతాన
కటికిరాత్రి గుండె గరగివగచె
నేరమెరుగనట్టి నిజదైవ సుతునకు
ప్రాప్తమైన కరకు పాటుజూచి

మ. విసపుంజూపుల క్రోధమన్ గొలిమిలో వ్రేగన్ వికారంబుగా
మసిబొగ్గుంబలె నల్లనై, పటుతమో మగ్నంబునై, బిట్టు ట
క్కసకక్ష్వేవల క్రొంబొగల్ జిలుక, మూకల్ మూకలై వచ్చిరై
వసుతున్ గ్రమ్మె విరోధిసేన విచల ద్భల్లాయు ధోచ్చండమై

కం. పగయను విషానలంబున
తగులబడు న్నరుని చక్కదనముం గుణమున్
బిగిగల సౌహృదమున సో
యగమున్ సుగుణంబు వృద్ధియై రాణించున్

మ. సకలోర్వీతల రక్షకున్ బెనుధనాశన్ ద్రాసునం దూచి తే
లికగా ముప్పది వెండిరూకలకు నల్పీభూత చేతస్క జా
తికి పట్టింప ఖరారుపడ్డ కపటాంతేవాసి యూదా, సుబో
ధకుడా! యంచరుదెంచి ముద్దుగొనె నాత్మస్వామి కెంజెక్కిలిన్

మ. అనఘుంబౌ ప్రభుపాద సన్నిధిని వేదార్థ ప్రబోధాంబుధిన్
మునకల్వైచి, తదంఘ్రి పద్మయుగళం బున్ గొల్చి, ద్రోహం బొన
ర్చిన యూదాయను మర్త్యరూప పశుమూర్తిన్ దున్నినంబంట పం
డని యేమన్నన సృష్టికర్త తొలుతన్ గల్పించి పుట్టించెనో!

మ. అసహాయుండను నన్ను బట్టుకొన శస్త్రాస్త్రంబులం దాల్చి, బా
లిసమౌ దొంగలగుంపుపై గవియు పోల్కెన్ గ్రమ్మినా రెందు కిం
త సమారంభము చిక్కియుందును గదా దైవాలయంబందు న
ప్పిసమున్ వచ్చుచు బోవుచుండనె వినిర్భీతిన్ ద్రికాలంబులన్

కం. కత్తిదూసి ప్రభువు కడనున్న పేతురుం
డాగ్రహించి యాజ కాగ్రగణ్యు
భృత్యుకర్ణ ముత్తరించె, యేసది జూచి
యుల్లమున నొకింత యుమ్మలించి

కం. ఉపసంహరింపు మేటికి
కృపాణమని కనలి కర్ణ మెప్పటివలె న
య్యపకారి కమరిచెం బ్రభు
వపార కరుణా రసాంకితా లోకమునన్

మ. పరమందుంగల తండ్రి నే నడిగినన్ పంపింపడో, యగ్ని భీ
కర చండాయుధమైన సేనల నసంఖ్యాకంబుగా, లేఖనా
క్షర పంక్తుల్ నెరవేరి తీరవలె, సాకల్యంబుగా సాధనాం
తరముల్ లేవు మనుష్య నందనుడు రక్తంబీక జీవించినన్

ఉ. పిక్కబలంబు జూపిరి విభీత మనస్కత శిష్యు లెల్ల న
ల్దిక్కుల పేతురుండు గురుదేవుని వీడని చిక్కు చీకటిన్
నక్కుచు వెంబడించె, కరుణా రహితాత్ములికెట్టి కష్టముల్
జిక్కులు గూర్తురో యనుచు యాజక ముఖ్యు గృహంబు నొద్దకున్

# తొలి విచారణ

తే.గీ. ఒక మహా[ద్రోహిలోక కంటకుని బట్టి
కట్టి కొని తెచ్చినామన్న గర్వరేఖ
వదనముల దోప, యాజక [ప్రవరునెదుట
నిలిపి రరిమూక పరలోక నిలయపతిని

ఉ. అందు వినోద తత్పరులు నా పురి పెద్దలు శా[స్త్రులూర పే
రందిన [ప్రాడ్వివాకులు, ధనాఢ్యులు పేదల కొంపలార్చి దై
నందిన దైవ పూజల నొనర్చునలీక మత [ప్రలోభు లా
నందము మీర నిండిరి సనాతన వర్ణపిశాచ సేవకుల్

కం. గుమిగూడియున్న పౌరుల
సమక్షమున పేతురుండు చలిమంట కడన్
జలివాచు కొనెడు నెపమున
గమనించుచునుండె [ప్రభుని కష్ట దశాప్తిన్

కం. అక్కసు దీరబలాత్కృతి
తెక్కలు వెనుదివిచికట్టి శ్రీ యేసు పయిన్
కక్కసపు టీర్ష్య నెన్నో
[ముక్కిడి నేరముల నల్లి మోపిరి శ[త్రుల్

కం. యూదులకు విరోధముగా
వాదించు చనర్థకాలు [ప్రవచించితివా
యేదీ బోధింపుము నీ
ఆదర్శ సుబోధలంచు యాజకు డడిగెన్

కం. పలికితి సమాజ మందిర
ముల బాహాటముగనిత్యమును విన్నారల్
పలువురు వారల నడిగిన
దెలియుననుచు బలికె నేసు ధృఢ ధైర్యమునన్

కం. మదమున యాజక ముఖ్యుని
నెదిరించెదవా యటంచు యేసూక్రీస్తున్
గదమాయించుచు చరచెన్
సదస్సునం దొకడు శత్రుజన మగ్గింపన్

కం. కట్టెద దేవళము పడం
గొట్టి దినత్రయమునందు క్షోణికి నే స
ద్రూట్టున్ దైవమునకు మే
ల్పట్టి ననుచు బల్కె ఘోర పాపాత్ముండై

కం. అని యంటి యంటనివి, యుః
పున నూదిన బోవునవియు మూఢతకు నిద
ర్శనమైన నేరములు క్రీ
స్తున కంటంగట్టి రసమదుర్మత్సరతన్

కం. ఆ యపరాధ పరంపర
న్యాయాధీశ్వరుని ప్రశ్న లాలించి జవా
బీయక నిరాకులంబగు
తోయధివలె నేసు ప్రోన్నతుండై యుండెన్

ఉ. మోపిన దోషముల్ ప్రభువు మోమను పూర్ణశశాంక బింబ సం
దీపిత కౌముదీవలయ దీప్తి యథాతథలై నశించుటల్
కైప గ్రహించియుం బ్రజల గాఢ విరోధ భయాతిరేక సం
వ్యాపిత చిత్తుడై పనిపె యాజక ముఖ్యు విచారణార్థమై

కం. నేరములు నమ్మ సాక్ష్యా
ధారంబులు లేక, కల్పితములని కైపా
తీరుపు చెప్పక నిజమా
వీరనునవి చెప్పుమనుచు పృచ్ఛించె ప్రభున్

కం. కరముల నిర్మితిగాని శ
రీరంబను దేవళమును త్రిదినంబులలో
తిరుగం గట్టెద నిజమిది
పరాత్పరుని సుతుడ వేయి పల్కు లికేలా

మ. జలదారూఢుడనై పరాత్పరుని పార్శ్వంబం దధిష్ఠించి, భూ
తలికిన్ డిగ్గెదచూతురంచు కయిపా దర్బారు సన్నిద్ర స
భ్యులు నిర్ఘాంతత జూచుచుండ బలికెన్ పూర్ణాధికార స్ఫుర
ద్గళ గాంభీర్యమునన్ బ్రభూత్తము డుదాత్తస్వీయ ధీరోద్ధతిన్

మ. కరకున్ జూపుల జిమ్ముచున్ ప్రభుని రక్తం బక్షులంజూడ నా
తురమైయున్న సభంగనుం గొని దురాత్ముండీతడౌరౌర! విం
టిరె మీరెల్ల రటంచు జించుకొనియెన్ నెమ్మేనికెం బట్టు టం
బరముల్ యాజక ముఖ్యుడక్కయిప దుర్వారాగ్రహోదగ్రుడై

కం. మరణార్హుడితడని యం
బర మంటగనార్చుశాస్త్రి పరిసయ్యుల క
ప్పరమాత్మ నందనుని ని
ష్కరుణం బంధించి యిచ్చెకచ్చుశమింపన్

కం. అరచేతుల జరచుచు నో
మరియమ్మ కుమార! నిన్ను మర్దించిన దె
వ్వరు చెప్పుమంచు తిట్టుచు
పరిహాస మొనర్చి యుమ్మివైచిరి శత్రుల్

సీ. దళమైన దివిటీల వెలుగుమోమున సోక జిలుగు దుప్పటి చాటు జేసికొనుచు
సరస నిల్చినవారు పరికింతురో యంచు నులుకుచు ప్రక్కప్రక్కలకు జనుచు
గురుని దుర్దశగుండె దరిగి గాయము చేయ గ్రుడ్లకు నీరంబు గ్రుక్కుకొనుచు
దర్బారు చొరబడు ధైర్యంబు చాలక అక్కడక్కడ నిక్కినిక్కి కనుచు

తే.గీ. తిరుగు పేతు నొకకన్నె గురుతుబట్టి
వీడునాతని శిష్యుడే చూడుడనిన
యేసు నెరుగనంచదలించి బాసచేసె
కుక్కురో కోయనుచు దొలికోడిగూసె

ఆ.వె. ఏసుక్రీస్తు శిష్యు డితడంచు నలమల్కు
కూర్మిచుట్ట మొకడు గురుతు బట్ట
కాదు కాదటంచు గట్టిగా నమ్మింప
నొట్టు బెట్టుకొనుట కుద్యమించె

ఉ. ఆ యెడనున్న ప్రేక్షకులయందొక డీతడు గూడ నన్న జో
రీయుని శిష్యుడంచు బెదరింపగ బెగ్గిలి సిగ్గుసిగ్గు, నే
నాయన యెవ్వరో యెరుగ నంచు వచించె సిమోను, కొక్కురో
కోయని కూసెనంత మలి కోడి త్రిభంగిగ భుగ్నకంఠమై

కం. మలికోడి గూసె నన్నృత
మ్ములు ముమ్మారాడ రిపుల మూకలనడుమన్
నిలిచిన శ్రీ యేసుని క
న్నులు వాలెంగ్రమత సీమోనుని ఆస్యమునన్

ఆ.వె. మెరపు మెరసినట్లు మెరిసె జిత్తమున దా
నన్నమాట క్రీస్తు దన్నమాట
కల్లలాడినాడ కటకటాయను కోత
కొసరి హెచ్చరించు కోడికూత

కం. గురు నెఱుగనంచు బొంకితి
గురుఘ్నుతా పాపమంటు కొనెనయ్యయ్యో
నరకమ నాకని గుండెల్
గరగ ప్రలాపించె గుట్టుగా నొంటరిగా

# యూదా ఆత్మహత్య

కం. యూదా యిష్కరి యేతుం
డా దారుణ ఘటన లెల్లనారసి, అయ్యో
నాదికదా పాతకమని!
రోదించుచు మూడు పదులు రూకలు గొనుచున్

కం. పరిసయుల శాస్త్రులంగని
గురురక్తద్రవ్య మిద్దికొనుడని చింతా
భరమున దేవా వాసాం
తరమున వెదజల్లి, జీవితము చాలించెన్

# పొంతి పిలాతు తీర్పు

కం. తెచ్చిరి పొంతి పిలాతుని
రచ్చకు బంధించి యేసుప్రభువును, మోపం
జొచ్చి రకారణ వైరం
బచ్చుపడన్ శుష్కమైన అభియోగంబుల్

కం. పొంతి పిలాతుం డతుకుల
బొంతల నేరముల సాక్ష్యముల కల్పనముల్
సాంతముగ విని విచారణ
తంతున్నడిపించె, న్యాయ తత్వజ్ఞుండై

కం. భగవంతుని పుత్రుడనని
భగవద్దూషణ మొనర్చిపరిసయ శాస్త్రా
ద్యగణిత విద్వజ్జనముల
పగకుం గురియైతివంట వాస్తవమగునా!

కం. నా దిహలోకపు రాజ్యము
కాదది భిన్నంబు స్వార్గికంబన, నీవీ
యూదులకు రాజువా యన

ఉ. అంత పిలాతు లేదితని యందొక దోషము వీని నెట్లు శి
క్షింతు వచింపుడన్న నిరసించుచు వీడు మహాపరాధి, యా
ప్రాంతమునం బ్రజాతతి నభాగ్యపు విప్లవ వహ్ని రేచి, దు
శ్చింతలు నేర్ప జొచ్చెనని చెప్పుచు నార్చిరి క్రోధమూర్తులై

కం. గలిలయ దేశపు వాడని
పిలాతు హేరోదుకడకు వెసనంపె ప్రజా
వళి చేయు రభసకించుక
తలకుచు, శిక్షించు తప్పిదము, గన్పడమిన్

కం. పరిసయులు శాస్త్రు లెన్నో
దురాగతము లుగ్గడించి తొందర చేయన్
గరమదరి పంపె మరలన్
హెరోదు డంతిప, పిలాతు నెదుటికి ప్రభువున్

కం. నేరము కనుపడ లేదని
హేరోదున్ మరలనంపె నీతని నిటకున్
మీరెన్ను నేరములు ని
ష్కారణములు, నేర మొందుగానన్ నేనున్

ఉ. ధీయుత, యేసునాథుని ప్రతీతి నెఱింగిన యప్పిలాణ్ణిజ
ప్రేయసి, లోక పావన చరిత్రుడు క్రీస్తు మహానుభావు డ
న్యాయము చేయ బోకుము సుమా! యనుచుం గబురంపె భర్తకున్
రేయిని స్వప్నమందు గమనించిన సత్యము నుగ్గడించుచున్

ఉ. పొంతి పిలాతు యూదుల యభూత విరోధ కథావిధానముల్
సాంతముగా గ్రహించి పరిషజ్జనమున్ గని వీని నెట్లు శి
క్షింతును దేవదూషణము చేసినవాడు వధార్హుడైన దే
వాంతకులున్ వధార్హులుకదా? యితడే భగవంతుడైనచో

ఉ. మానక పర్వకాలమున మానవ నాథు ననుజ్ఞ నొక్క ఖై
దీని విముక్తి చేయు మన దేశపు దొడ్డ రివాజు నెంచి యె
వ్వాని విముక్తి సల్పెదరు ప్రస్తుత మీ యపరాధినా? బర
బ్బాన! వచింపుడన్న బరబా నని రెల్లరు నైక్య కంఠులై

కం. కలువరి గిరిపై వీనిని
శిలువను వ్రేలాడదీసి శిక్షింపుము త
త్కలుషంబు మాకు మా పి
ల్లలనంటిన నంట నీ పిలాతువరేణ్యా!

మ. వధకున్ గొఱ్ఱెను కొంచు పోయెడు గతిన్ బాపాత్ములా యూదు లా
యుధ పంక్తుల్ ఝళిపించుచున్ భువన మాన్యున్ రాజమార్గంబునన్
పథికుల్ జూడ నవాచ్యముల్ పలుకుచున్ బాధించుచున్ బెక్కు దు
ర్వ్యథలంబెట్టుచు కొంచుపోయి రొక సౌధాంత శ్రుతుశ్శాలకున్

సీ. కఱకుమేకుల కుచ్చుగల కశల్గొని మేన క్రొన్నెత్తు రెగజిమ్మ కొట్టికొట్టి
కనులగంతలుగట్టి గదిమి వీపునగ్రుద్ది చెప్పుమీ పేరంచు చీరిచీరి
ఉమ్మి మోమునవైచి దుమ్మునెత్తిన జల్లి వేడి దుర్భాషల నాడియాడి
భగవదాత్మజుడవా? వడ్రంగి కొడుకువా? పలుక వేమని చెవుల్ నులిమినులిమి

తే.గీ. తిట్టగల్గిన తిట్లన్ని తిట్టితిట్టి
పెట్టగల హింసలన్నియు పెట్టిపెట్టి
క్రక్కగల అక్కసంతయు గ్రక్కిక్రక్కి
విశ్రమించిరి యూదు లోపికలు జారి

ఉ. కట్టిరిమౌళి దారు ఫలకంబును హేళనగాగ యూద స
మ్రాట్టని వ్రాసి, వస్త్రములు మార్చి ధరించిన చేతికుట్టులే
నట్టి విచిత్రపు న్నిలువు టంగిని జూదమునం బణంబుగా
బెట్టిరి చేతనైన శ్రమబెట్టిరి దుష్టమృగాల కైవడిన్

మ. తలపై ముండ్లకిరీటమున్ నిలిపి వస్త్రంబూడ్చి, జీరంగి తె
క్కలవన్నెల్ గల రాజ వస్త్రములు శృంగారించి, జోహారు యూ
దుల రాజాయని తెల్లుగట్టు కరమందున్ నిల్పి, నానావిధం
బుల హింసింపగ నుద్యమించిరి దురాత్ముల్ గ్రీస్తు లోకేశ్వరున్

తే.గీ. సంక్షుభితవార్ధివలె ప్రజా సముదయంబు
ఆర్చి గంతులు వేయ న్యాయాధికారి
తలకి వారింపలేక యూదుల యభీష్ట
మనుసరింపక నిక తప్పదనుచు దలచి

శా. ఈ నిర్దోషి యసృజ్మహాకలుష వహ్ని జ్వాల మీరే తలం
బూనుండంచు జలంబునం గరయుగంబున్ శుద్ధిగావించు కొం
చా నిర్భాగ్యుడు శత్రుసింహముల కాహారంబుగా నిచ్చె లో
కానంద ప్రదు, స్వర్గరాజ్యమణి పీఠాధీశు నేసు ప్రభున్

ఆ.వె. మూపుక్రుంగిపోవ పాపాత్ములొక శిల్వ
మ్రాను మోపిరమర మానవునకు
ఓపలేక భూమి కొరగ గ్రమ్మరబట్టి
కొట్టి నడిపి రొక్క కొండదరికి

ఆ.వె. ఱొమ్ము గ్రుద్దుకొనుచు నుమ్మలించుచు వెంట
నడచివచ్చు స్త్రీజనంబు నరసి
యేసుప్రభువు పలికెనిట్లు చిత్తముగందు
చింతతోడ జాలి గొంతుతోడ

కం. విలపింపవలదు నాకై
విలపింపుడు మీరుకన్న బిడ్డలకై, రా
గల నాశకోగ్ర దుష్ట
ప్రళయార్థం బెరుషలేము బాలికలారా!

# సిలువ వేత

కం. కరచరణాంగకములలో
నరములు నెమ్ములును జిదికి నవనాడులలో
మెరుములు మెరయ బిగించిరి
మరమేకులతోడ శిలువ మానున గ్రీస్తున్

కం. ఇన్నరు లేమి యొనర్చుచు
నున్నారో యెరుగరనుచు యుమ్మలికమునన్
గన్నీటం బ్రార్థించెన్
మన్నింపుము తండ్రి! వీరమాయకులనుచున్

కం. ఇరుప్రక్కల నరహంతల
నిరువురనట శిల్వమ్రాని కెక్కించిరి, చూ
పర కితడు హంతకుండను
దురూహ కవకాశమీయ దుశ్చారిత్రుల్

ఉ. దైవ కుమారకుండవు కదా? దిగిరమ్మదిగాక భూరి దే
వా వసథంబు కూలిచి స్వయంబుగ మూడు దినాలగట్టు మే
ధావివి, చావనేల? పరదైసున నున్న యెహోవ దేవుడున్
గావడొ! పిల్వ నంపుమని కారులు కూసి హసించి రధ్వగుల్

ఆ.వె. దైవసుతుడ వంట తస్కరాధములతో
మరణశిక్షనంది మ్రగ్గనేల
ప్రతిభనిన్ను నీవరక్షించుకొను మంచు
సపహసించె చోరులం దొకండు

శా. చాలుంజాలును కట్టిపెట్టుము ప్రపంచ స్రష్ట, మర్త్యాకృతిన్
భూలోకంబున జన్మమెత్తిన మహాత్మ్ముం దర్హుడే శిక్షకున్
పోలున్నీకును నాకు నంచతని నుద్బోధించి, శ్రీ యేసు మో
మాలోకించి కటాక్షముంచుమని యభ్యర్థించె దీనాస్యుడై

కం. నేడే పరదైసున నా
తోడ న్నీ వుందువంచు, తుదిగడియలలో
గూడ కృపామయ దృక్కుల
నాడిపరంబొసగె చోరు డానందింపన్

మ. చిరునవ్వాననసీమ తప్పదు, కృపా శ్రీ నేత్ర గోళంబులన్
దరుగన్ లేదు కశాభిఘాతములకున్ సంతాపమున్ జెంది, యు
స్సురుమంచున్ జలియింప లేదవుర యేసూ క్రీస్తునం దెంత య
బ్బురపుంగష్ట సహిష్ణుతా మహిమ సంపూర్ణత్వమున్ జెందెనో!

మ. ప్రియ శిష్యుల్ చనినారు, భూరి కరుణార్ద్రీభూత చిత్తుండెహో
వయు నెమ్మోము మరల్చినా డకట! మా పాపంబు మా దుశ్చరి
త్రయు, నీకీగతి తెచ్చి పెట్టెనని చింతన్ మున్గి వెంటాడి ర
మ్మయు, మార్తా మరియమ్మలున్ బురముకొమ్మల్ గొల్లతా కొండకున్

కం. శిలువ సమీప స్థలమున
నిలిచిన ప్రియశిష్యు నొకని నిజ జననికి క
న్నుల సంజ్ఞ జూపి, అమ్మా
యిల నీకు కుమారు డీతడే యని పల్కెన్

## తల్లి శోకము

కం. అలఘు స్వార్గిక శక్తులు
గలిగి విశుద్ధాత్మచేత కడుపున బడి, నిం
దలు మోసి, శిలువ మ్రానికి
బలియైతే పుత్ర! లోక పావన చరితా!

కం. జడనిధి యైనది జలనిధి
యదుగిడగా పెను తుఫాను ఆనతి తలపై
నిడుకొని వినమ్రమైనది
కొడుకా! మృతి నిన్ను జేర గుండెటులబ్బెన్

కం. పాపులకు బ్రదుకు లుండగ,
పాపము లేనట్టి నీకు బ్రదుకులు లేవా
నా పట్టీ! నా సల్పిన
పాపమె నీ జీవితమును భక్షించినదా?

ఆ.వె. బ్రతికియున్నదాన పాలిచ్చి పెంచిన
కన్నతల్లి నేను కాయమూని
బ్రదుకుమాని శిల్వపై వ్రేలుచుంటివా
భక్తకోటి పుడమి బ్రతికియుండ

కం. క్షమియింపుము తండ్రీ! వీ
రమాయకులు తెలియజాలరభము శుభమునం
చమృతము వర్షించిన నీ
క్షమా ఋణము నీగునే జగజ్జన కోటుల్

మ. శరదిందు ప్రతి మానమై కరుణతో జాజ్వల్య మానంబుగా
పరమ ప్రేమ సుధారసంబొలుకు నీ బంగారు నెమ్మోము నె
త్తురు ముద్దయ్యెనె తండ్రి! యద్భుతపు శక్తుల్ గల్గు నీ కెట్లు దు
ర్మరణ ప్రాప్తి ఘటిల్లె, నాయనుగు పుత్రా! మృత్యు సంహారకా!

మ. పరిశుద్ధాత్మ వరంబునన్ సకల పాపధ్వంసి, రారాజ భా
స్కరు డొక్కండు జనించు నీ కడుపునన్ సర్వంసహా చక్ర సుం
దరులందుం గడు ధన్యురాలవని ఆనాడా మహాదూత నీ
మరణోదంతము దెల్పదయ్యె కొడుకా! మా పాపమో! శాపమో

సీ. ముండ్లకిరీటంబు ముద్దాడెనే తండ్రి మణికిరీటోజ్వల న్మస్తకమున
కరకు బల్లెపు మొనల్ జొరబారెనే తండ్రి ప్రేమ నిండారు నీ హృదయ కుహరి
కుటిలంపు టుక్కు మేకులు చొచ్చెనే తండ్రి! చక్కని పాదాంబుజముల యందు
మోయజాలని శిల్వ మోయించిరే తండ్రి! దివి నేలు నీదు బాహువులచేత

తే.గీ. జీవజల సంతతస్నాన పావనమగు
వదనమున నుమ్మి వైచిరే సదయ హృదయ
చావునుం బుట్టువులులేని దేవు నయయొ
చావు పుట్టువుల్ గల నరుల్ జంపినారె

## మరణము

కం. ప్రభు "వేలియేలి లామా
సభక్తనీ" యంచు బలికె, జగతిందమమున్
ప్రభవించి క్రమ్మె, రవియుం
బ్రభలుడిగి యదృశ్యుడయ్యె బ్రహ్మాండమునన్

కం. ననునేల చేయివిడిచితి
వనఘపితా! యన్న యర్థమది వేరే భా
షను శ్రోతలెల్లరది విని
అనుకొన్నా రేలియాకు నాహ్వానముగా

కం. ఉప్పర మంధతమస్సున
గప్పంబడి యబ్జబంధుడగపడమి జనుల్
ముప్పనుకొను నవసరమున
దప్పిన్ గొనుచుంటిననియె డగ్గుత్తుకతో

కం. చిరకను ముంచిన స్పంజీ
తొరపడి హిస్సోపు పుడకతో నందించెం
బరుగున జనియందొక్కడు
కరుణ గలిగినట్లు, ప్రేమగల వానివలెన్

కం. అయినది సమాప్తమని, య
వ్యయుడు జగద్రక్షకుండు ప్రభువో తండ్రీ!
గయికొమ్మిదె నీ హస్త
ద్వయమున నా ఆత్మనంచు తనువుత్యజించెన్

శా. కొండల్ బండలు బ్రద్దలయ్యె, పెను చిక్కున్ జీకటుల్ గ్రమ్మె, వే
ధోండంబున్ ధరణీ తలంబదరె, వార్ధుల్ ఘూర్ణిలెన్ జండ మా
ర్తాండుండున్ గతి దప్పె, మానవ శరీరంబున్ విసర్జించి క్రీ
స్తుండాత్మన్ బరమాత్ము హస్తముల యందున్నిల్పి నిద్రింపగన్

ఉ. సృష్టి సమస్తమున్ గదలి చెప్పక చెప్పిన సత్యమున్ మతి
భ్రష్టులు యాజక ప్రభువుల పాలకులం గదలింప నీత దు
త్కృష్ట నరావతారు దరరే! భగవంతుని పుత్రు దుర్వికే
నష్టము వచ్చునో యని మనంబున గుంది రపేత ధైర్యులై

సీ. స్తంభితంబై పోయె స్వర్గధామమునందు ననుదినానంద గానామృతంబు
మ్లానమయ్యె ననంత మహిమోజ్వలంబైన పరిశుద్ధ దూతల వదనపాళి
ఉపసంహరించె పెల్లుబ్బు కారుణ్యంబు నిహపర బ్రహ్మాండ సృష్టి నేత
ధవళద్యుతుల చెన్ను దరిగి పావులమట్లు పావనాత్మదిగాలు పడిరహించె

తే.గీ. నిక్కమగు దేవు నొక్కగా నొక్క కొడుకు
కక్కసపు శిల్వమ్రానిపై కన్ను మూయ
ప్రాకె నిజభక్త మండలి శోకరేఖ
నమరె నపవాది మోమున హాసరేఖ

మ. బలియై పోయెనె గొల్గతాగిరి యెహోవా ముద్దుబిడ్డండు, దు
ష్టుల దుశ్చర్యల కగ్గమై, భువనముల్ శోకింప స్వర్గాన దూ
తలు కన్నీటమునుంగ, నక్కట పవిత్రంబైన తద్రక్త ఘో
షలకున్ రాల్గరగెన్, కరంగవె మనుష్య క్రూర పాషాణముల్

ఆ.వె. జనన మరణములను శాసించు నధికారి
శిరమువంచె జనన మరణములకు,
ఎంత ప్రేమగలదొ యేసునాథునకు మా
నవులయందు, పాప భవులయందు

కం. కలువరిగిరి నెత్తమ్ముల
శిలువను వ్రేలాడు క్రీస్తు జీమూతము భూ
తలమున గురిసిన నెత్తుట
మొలిచెన్ సన్ముక్తి సస్యమును భక్తులకున్

మ. తెరువంగా బడె మోక్షరాజ్యమున బంధీ భూతమైయున్నబం
గరు రంగారు కవాటముల్, విషఫణి గ్రస్త ప్రపంచంబు క
ల్వరిపై దేవుని గొఱ్ఱెపిల్ల మరణింపన్ స్వస్థ మయ్యెం గృపా
వరముల్ గుప్పిటబట్టి సజ్జనుల నాహ్వానించె శ్రీ దేవుడున్

ఉ. క్రూరనిశాత భల్లమున గ్రుచ్చె నొకానొక బంటు భక్తమం
దారుని నల్లగుండెలు బదా బదలై, యొకటెట్ట లావు ర
క్తారుణ నిమ్నగల్ గుబగుభార్భటి నుర్వికి డిగ్గ, సంజ కెం
జారల కోపగించి జలజాప్తుదునుం జనె పశ్చిమాశకున్

మ. తమ దౌష్ట్యంబను దారుణాశ్వమున యూదా దేశమం దెల్ల న
డ్డము లేకుండ సవారి చేయు పరపీడా సక్త వర్గంబు గ
ర్వమున న్నిమ్మకు నీరమెత్తిన గతిన్ ప్రత్యర్థి సంహార కా
ర్యము నిర్విఘ్నముగా నొనర్చిఘన హర్ష స్వాంతులై రంతటన్

ఉ. ఏసు శరీర మేసెపను నిర్ధచరిత్రు డమూల్య తైలమున్
బూసి, ప్రశస్త వల్కలములో పదిలంబుగ జుట్టి, భక్తితో
మోసి, సుధోపలాంచితము పూజ్యమునైన సమాధిలోన వి
న్యాసముజేసె, బాష్పకుసుమార్చనలన్ చరణంబు లంటుచున్

ఉ. మూడు దినాలు క్రీస్తు ప్రభువున్ నిజగర్భమునందు డాచి, యీ
రేడు జగాల ముక్తి సవరింపక తప్పని దౌట, కాలుజే
యాడక మృత్యువెంత హృదయ వ్యధనందెనొ, స్వామిప్రాణముల్
వీడెడు వేళయెంత పలవించెనొ భద్రముచేయు వేళలన్

చం. గురుని కళేబరంబు ననుగుం బద శిష్యులు కొంచుపోయి, స
ద్గురుడు సముద్ధితుండయి యగోచరుడై దివి కేగెనంచు, ద
బ్బర ప్రకటింతురో యని యభాగ్యులు సందియమంది, కాపలా
నెరప సమాధి పార్శ్వముల నిల్పిరి సాయుధమైన రాణువన్

## పునరుత్థానము

కం. మరియా సలోములను ని
ద్ధరుభక్తస్త్రీల్ సుగంధ తైలముగొని, స
త్వరముగ సమాధి తోటకు
పరుగిడి రతిభక్తి భాను వారముఖమునన్

ఆ.వె. మంచువంటికాంతి మించుతీవను బోలు
నసమ దివ్య రూప మమరియున్న
ప్రభువు దూతవచ్చి బండను తొలగించి
గోరి పార్శ్వమందు కూరుచుండె

కం. వెరగున కావలి గాచెడు
సరదారులు మూర్ఛమునిగి స్తంభించిరి, యు
ద్ధురలీల ధరణి వణకెన్
మరణమును జయించి నరకుమారుడు లేవన్

కం. పగతురు కొంపోయిరి నా
భగవంతు నటంచు నేడ్చువనితామణి క
మ్మగదలనే మరియకు ముం
దగుపించెం బ్రభువు! తీర్చె ననుమానంబున్

కం. సంతసమున జని మరియమ
యంతేవాసులకు ప్రభువు నరసితినని వృ
త్తాంతంబు దెల్ప శిష్యులు
వింతలు వెడమాటలని రవిజ్ఞత్వమునన్

కం. ఆనందోద్ధతితో యో
హానున్ సీమోనులతి రయంబునజని రు
ద్యానమున కేసు నుంచిన
మానిత పూజార్హమగు సమాధి స్థలికిన్

ఆ.వె. ఆ సమాధి శూన్యమై నారబట్టలు
గోచరించె నేత్ర గోళములకు
నమ్మలేక నమ్మిరమ్మహాత్ముడు నిశ్చ
యముగ మరణ విజయమందె ననుచు

కం. ఎమ్మాయి యనెడు కుగ్రా
మమ్మునకుం జనుచు క్రీస్తు మరణ సమాచా
రమ్మను కొనుచుండ్రి విచా
రమ్మున క్లయిపాయు నతని ప్రాణసఖుండున్

కం. వారికి తోడై నడచుచు
యూరికి జని విందుగుడుచుచుండ ప్రభుండౌ
నౌరా! యని గుర్తించిరి
వారంత నదృశ్యుడయ్యె ప్రభువచ్చోటన్

ఆ.వె. ఎరుషలేము నగరి కేతెంచి యగుపించె
ప్రభువు మాకటంచు బలికినారు
పదునొండు గురికి ప్రభువు శిష్యులకు స
ర్వమ్ము వమ్మటంచు నమ్మరైరి

కం. అగుగాక సమాధానం
బగును శుభంబంచు నొక గృహాంతరమునయే
సగుపడి దీవెనలీయన్
దిగులున్ భయమమరె శిష్య నిచయంబునకున్

ఉ. కాదుగురుండు, భూతమని గందరగోళము జెందుచుండ, నిం
పొదిగ బల్కరించి, యనుమానము మానుడు, చూడవచ్చు నా
యొౌదల హస్తపాదముల యందలి గాయపు టానవాళు లు
న్మాదమ దేల? రక్తమును మాంసము గల్గునె భూతమూర్తికిన్

కం. అన్నము పెట్టుడు మీకడ,
నున్ననను చునడుగ, కాల్చియుంచిన మత్స్యం
బున్నదని యొసగవారల
సన్నిధి భక్షించి సంతసము గల్పించెన్

కం. సీమోను పేతురు నకుం
దోమాకుం జబదయీతనూ జన్మలకున్
బ్రేమం బ్రత్యక్షించె కృ
పా మహితుడు తిబెరియాభిధాంబుధి చెంతన్

మ. గురుతుంబట్టక సంశయించెదు ననుంగున్ శిష్యులంగూడి, స
త్వరమిచ్చో వలవేయుడంచు బహు మత్స్యశ్రేణి బట్టించి య
చ్చెరువున్ గొల్ప, గురూత్తముండని వెసన్ సీమోను గుర్తించి సా
గరమందున్ దుమికెంగురుంగలియ నౌకం బాసి, ఆసక్తిమై

కం. నమ్మను ప్రభుయేసును గా
యమ్ముల నీక్షింపకుండ ననుదిదుమకు, పా
ర్శ్వమ్మున హస్తమ్ముల గా
యమ్ములివేచూడు మంచునతనికి జూపెన్

కం. కడువడి క్షతముల గరమున
తడివెడు తోమానుజూచి ధరణిం గని న
మ్మెడు వారికన్న విని న
మ్మెడువారే ధన్యులనియె మృదు వచనములన్

ఆ.వె. భక్ష్యముల మత్స్యముల నేను పంచియిచ్చి
ఆరగింపుడు మీరంచు నానతీయ
క్రీస్తు సుమ్మంచులోన గుర్తించి చూచె
నబ్బురపు టీక్షణముల శిష్యవ్రజంబు

## ఆరోహణము

కం. ఒలివలయను కొండొక గిరి
తలమున పదునొక్కరైన తన శిష్యులకున్
తెలిపెన్ దుదిపల్కులు తా
నిల నవతారించినట్టి వృత్తాంతంబున్

మ. చిరకాలంబున నుండి నా గురిచి మోషే ధర్మశాస్త్రంబు, నీ
శ్వరభక్తుల్, ఘనులౌ ప్రవక్తలతి విశ్వాసంబుతో పల్కు హె
చ్చరికల్, నా యవతార కార్యము రహస్యంబెల్ల నీ నాటికిన్
నెరవేరెన్ బ్రియ శిష్యులార, మిగిలె న్మీ మీద కర్తవ్యముల్

మ. ప్రకటింపుండు సమస్త భూతలి సువార్తన్ సర్వమర్త్యంబు మా
మక నామంబున స్నానమంది, పరమాత్మన్ గొల్చి పాపక్షమా
ప్రకటాంతఃకరణ ప్రదీప్తి రహియింపన్, జేయుడీ, నేను మా
నక మీతో యుగముల్ యుగంబులును వెంటన్నిల్చి తోడయ్యెదన్

కం. కుదిరింపగలరు వ్యాధుల
నదలింపంగలరు మొండివగు దయ్యములన్
కదలకుడీ పురమున పం
పెద శక్తింబరమునుండి, ప్రియసఖులారా!

మ. అని యాశీస్సు లొసంగుచుండ నిజశిష్య శ్రేణియందుండి, చ
య్యన వేరై, గగనాంతరాళమున మేఘా రూఢుడైపోయి, దే
వుని సింహాసనసీమ దక్షిణ భుజా పూర్వాశ గూర్చుండె, ప
త్తనమున్ జొచ్చిరి శిష్యులుంగురు సుదాత్త ప్రజ్ఞ నూహించుచున్

# ఒక మనవి

శ్రీ ఏకాగారి గోష్ఠి ఆత్మక్లేశాలకు దివ్యౌషధం, అనుభవజ్ఞుల కీమాట అత్యుక్తికాదు. వారొక ఛలోక్తి సాగరం. మూర్తీభవించిన ఆనందపుంజం. అలంకార శాస్త్ర రీత్యా ధీరలలితులు. ప్రమత్తమై పడియున్న నా కవితాకళను మేల్కొల్పి నన్నీ కావ్యసృష్టికి పురికొల్పిన వారికి నా ధన్యవాదాలు.

ఇహానికి, పరానికి ప్రయాణించే రెండాత్మల సమావేశమే ఇందలి కథా వస్తువులు. అద్యతన ప్రపంచవ్యవస్థ దిఙ్మాత్రంగా ఇందు వర్ణితమైంది. పాఠకులు నా సాహసాన్ని మన్నింతురుగాక.

నా అభిమానులు, కార్యదీక్షాదక్షులు, ప్రజ్ఞానిధులు, హైదరాబాదు హైకోర్టు అడ్వకేటులైన శ్రీ సానెకొమ్ము మాల్కొండారెడ్డిగారి కీ కావ్యాన్ని అంకితం చేస్తున్నాను. వారికి దీర్ఘాయు వగుగాక.

జి. జాషువ

# అంకితము

ఉ. అంకితమిత్తు నా హృదయమాసవవాగ్మికి మాలకొండ నా
మాంకిత రెడ్డివీరున కహార్యసమంచిత ధైర్యశాలికిన్
పంకజబంధు తేజున కవారిత నిస్తుల సత్యవాక్య ని
శ్శంకునకున్ గభీరగుణ సౌరభ సాహస దివ్యమూర్తికిన్

మ. నినుగాదన్న విరోధులందలలు దన్నెన్ నీజయం బెందుజూ
చిన నీకీరితి కన్నియల్ వలచి హర్షించెన్ హరిద్భాగముల్
నినుగొండాడదొడంగెనోయమృతవాగ్మీ! మాలకొండ ప్రభూ!
అనుకంపాయుతమైన నీచరిత మాకభ్యర్చనీయంబగున్

చం. కనిగిరిసీమ నీ వలపు కౌగిట మన్ననలందునాడు పూ
చిన సుయశస్సు నేటికిని జిన్నెలువన్నెలు దాల్చుచుండె మా
తెనుగు సవిత్రియక్కునగదించి ముదంబునముద్దులాడ నె
త్తిన యడిదంబుదించక ధృతిన్ రథముంగదలింపు ముద్ధతిన్

సీ. నిలుచునే నీముందు పలికి బొంకు విరోధి పటలంబు గుండె నిబ్బరము సూపి
పలుకునే వెడనోటి జిలదీర లోకాపకార లాలస పత్రికాచయంబు
ఆగునే నీదారికడ్డంబుగా కత్తి బట్టిన పగవాని వాహనంబు
సాగునే రిక్తవాచావిశారదుల జంఝాటంబు కృత్రిమ నాటకంబు

ఆ.వె. నీ కృపావిభూతి నీ ధర్మశీలత
నీకు వజ్రకవచ నియతిసుమ్ము!
సిలుగులెన్ని యేని చెనకవు నిన్నేటి
కోళ్లు నీకు మాలకొండరాయ!

మ. అది భల్లూకపుపట్టు మావశము గాదంచున్ భయభ్రాంతమై
బెదరున్నీయరిమూక నీవొకపనిం బ్రేమించి చేపట్టినన్
గదలుందారకలుం గ్రహంబులొక సత్కార్యంబుసాధించుచో
సదయా! నీహృదయంబు వెన్న యునుపాషాణంబు కార్యంబులన్

ఆ.వె. పురుషసింహ! నీవు పురమేగ నినుజూచి
మొరగవచ్చు శుని సముత్కరంబు
నీకు గొఱతలేదు నీ స్యందనధ్వని
దుండగీంద్రకెల్ల గుండెదిగులు

(ఈ పై పద్యములు శ్రీరెడ్డిగారు కనిగిరి తాలూకా బోర్డు
ప్రెసిడెంటుగా నున్నప్పుడు వ్రాసినవి)

శా. ఏకాగారి ఛలోక్తులం బొడమి నా కీ మాలకొండాఖ్యవి
ద్యాకల్పద్రుమ మల్లుడై యెడద కాహ్లాదంబుగల్గింప భా
షాకాంతారముజొచ్చినావిక విరాజత్కీర్తిగంధాఢ్యవై
ఆకర్షింపుము దేశదేశముల బిడ్డా! కావ్యయోషిన్మణీ!

మ. మునుపద్దంకిపురాన నా కృతుల సొంపుంబెంపు నీక్షించి మె
చ్చిన మాల్కొండమనీషి ప్రేయసిగ నిన్ జేపట్టియున్నాడు చ
క్కనిదానా నినుగన్న కష్టమునకున్ గల్గెం ఫలం బాత్మనా
థుని దర్బారున రెడ్డిరాణివయి సంతోషింపు మశ్రాంతమున్

కం. ఇప్పించె దొడ్డపదవులు
మెప్పించె న్నన్ను స్వీయమిత్రుల సభ లం
దెప్పటి నా పుణ్యంబో
అప్పురుషవరేణ్యు డల్లుడయ్యె కుమారీ!

ఉ. మాటఖణిల్లుమన్న సుకుమారము చిత్తము కన్గిరిప్రజా
కోటి నతుల్గడించిన యకుంఠిత ధైర్యగభీరమూర్తి వా
గ్ధాటి ననన్యసాధ్యుడనుఖ్యాతికి నెక్కిన సానెకొమ్ము వం
శాటవి సింహరాజు సతివైతివి ధన్యవు కావ్యసుందరీ!

ఉ. నాకొక పిల్లనిచ్చితి ఘనంబుగ నాదగు నన్నగారికిన్
నీకృతి నిచ్చి మమ్ముల దనింపుమటంచు కుతూహలంబుతో
వాకొని పెండ్లిపెత్తనపు భారముదాల్చిన త్యాగమూర్తి - ఏ
కాకు నమస్కరింపుము ప్రగాఢమతిన్ గృతిసుందరీమణీ!

చం. అలఘుపతివ్రతాతిలకమై నిజనాథుని చిత్తపద్మమే
నిలయముగా వసించిమరణించిన ప్రేయసిలేనిలోటు శీ
తల మృదువా క్ప్రసూన రసధారల తీరిచి సానెకొమ్ము రా
ట్కులజుని కొల్వుకూటమునకున్ మణిదీపమవై వెలుంగుమీ

కం. నిండారు దీర్ఘవిగ్రహు
పండినయశమున్న వాని ప్రజ్ఞానిధి మా
ల్కొండాఖ్యు రాణివైతివి
పండె న్నీ పంట కావ్యపద్మదళాక్షీ !

-o-

జి. జాషువ

# ఈ క్రింది పద్యములు
# శ్రీ రెడ్డిగారి షష్టిపూర్తి సన్మానసభలో చదువబడినవి.

చం. అరువదియేండ్లప్రాయ మను హాటకరత్నకిరీట ధారియై
పరువును సుప్రతిష్ఠ లనువారము పండి ప్రవర్ధమానమై
సిరులుఘటింప సానెకొముసింహము రెడ్డివరేణ్యుడింక నూ
టరువది వత్సరంబుల మహస్సుల గౌరవమందుగావుతన్

ఉ. పట్టినపట్టు వీడని యభంగుర శౌర్యధురీణుడైన వా
గ్దిట్ట సమున్నతాంగుడు యెదిర్చినవానియురస్థలాన కా
ల్మెట్టెడువాడు స్నేహశబలీకృత చిత్తుడు న్యాయవాది స
మ్రాట్టగు మాలకొండబుధమండను జెందుతమాయురున్నతుల్

మ. అదిభల్లూకపుపట్టు మావశము కాదంచున్ భయభ్రాంతమై
చెదరున్ నీ రిపుమూక నీవొకపనిన్ జేపట్టి జృంభించినన్
గదలున్ తారకలున్ గ్రహంబులు భవద్గంభీర కంఠంబునన్
బొదలున్ సింహకిశోరగర్జ లనయంబున్ మాలకొండప్రభూ!

కం. కనిగిరికి మేరుగిరివై
కనికరమున దీనజనుల గాచిన నీ పా
లనమును దలపోయుదు రీ
దినముం బ్రజలట్టి ని న్నుతింతురు సుకవుల్

కం. ఆజానుబాహుశాలివి
నీ జాతకచక్రమందు నిజముగ నేదో
తేజస్సుగలదు గౌరవ
భాజన శ్రీసానెకొమ్ము వంశాభ్రమణీ!

-o--o-

జి. జాషువ

# శ్రీ రెడ్డిగారి సతీస్మృతి

మ. మటుమాయంబయిపోయెనే సుగుణసంపత్పేటి పూబోండ్ల పా
పటబొట్టాసవదివ్యవాణి శుభరూపజ్యోతి యందాల వేం
కటసుబ్బాంబిక సానెకొమ్ము కులనక్షత్రేశునిల్లాలు ప్రో
త్కటపుంజీకటి వెల్లిదూలి కుల మాకంపించి శోకింపగన్

ఉ. నీవొక దేవకాంతవని నిత్యమునమ్మి స్మరించునట్టి నీ
దైవము ప్రాణనాథుడు సుధామధురస్థిరసచ్చరిత్రు డాం
ధ్రావనిగన్న రెడ్డిదొర లందునమేటి భవద్వియోగ చిం
తావిలచిత్తుడై నవయునమ్మ! యొకానొక పిచ్చివానిగన్

సీ. నిజభర్తృవదనంబు నిలువుటద్దంబుగా తిలకంబుదిద్దిన దివ్యచరిత
జీవితేశుని వాక్కు జిలుగుపూదండగా తలమీద దాల్చిన ధర్మశీల
భర్తృనుచ్ఛిష్టంబు భగవదంధస్సుగా వ్రతముసల్పిన రడ్డి రాచనెలత
మగనిచేతోవీధి మణిమందిరంబుగా కాలంబునెట్టిన గరితమిన్న

ఆ.వె. మాలకొండరెడ్డి మానమర్యాదల
కాలవాలమైన యమృతచరిత
పృథివివాసి దివికివేంచేసె వేంకట
సుబ్బమాంబ వంతగుబ్బటిల్ల

చం. పులివలె గావుబట్టి తనువున్ దినివేయుచు దేవతాభిష
క్కుల కెనయైన వైద్యులనుగూడ తిరస్కృతిజేసి రోగమ
గ్గలమగుచుండ నీవలపుకాంతుని గుండెలలోన నెన్నిభూ
ములు తలకింద్రులై కరగిపోయినవో దవధూమ దగ్ధమై

సీ. సంజీవివంటి యౌషధరాజములశక్తి నీవ్యాధిథాకకు నిలువనపుడు
సురభిషక్కులవంటి వరచికిత్సకకోటి వెనుకాడి నిట్టూర్పు విడుచునపుడు
బంగారువంటి నీ పచ్చనిమైచాయ గడెకొక్క తులమెత్తు గరగునపుడు
పరులకర్థముగాని బాధాసముద్రాన మునిగి నీలో నీవు మూల్గునపుడు

తే.గీ. ఆశలడుగంటి మౌనముద్రాంకితుడయి
వెఱ్ఱిచూపులుజూచు నీ విభునికనుల
రాలు ప్రతిబాష్ప మొక యక్షరముగమారి
వ్యక్తపరచినదమ్మ! మీ ప్రణయగాథ

మ. అరికిం గీడుదలంప లేదెపుడు నీ యాత్మేశుడున్నీవు ని
ర్దరునార్ద్ర స్థిరచిత్తులిట్టిడుల మేల్ దాంపత్య బంధంబు ని
ష్కరుణన్ ద్రుంచి యకారణంబగు యసత్కార్యంబుగావించి న
ల్వురినోళ్ళంబడినాడు దుష్టవిధి వేల్పుం బెద్దయెట్లయ్యెనో?

మ. ఒకయేడాది గతించిపోయినది నీ వుర్వీస్థలింబాసి మా
నక రాత్రింబవళుల్ యథావిధి యనంతంబైన కాలాబ్ధి వీ
చికలైవచ్చుచు బోవుచున్నయవి మాచిత్తంబులో కన్నుమా
యక నీరూపము వెల్గుచున్నది దయాయత్త ప్రసన్నాస్యమై

సీ. ఆనాటి జిగి మందహాస మంజుల రేఖ మాసిపోయినది నీ మగనిమోవి
ఆనాటి సింహగర్జాగళధ్వానంబు తగ్గిపోయినది నీ ధవునినోట
ఆనాటి ప్రబలకార్యారంభ గాంభీర్య మంతరించినది నీ కాంతునెడద
ఆనాటి సత్కళావ్యామోహ దార్ఢ్యంబు సన్నగిల్లినది నీ స్వామియందు

ఆ.వె. ఇన్నిమాటలేల ఈవభ్రయాత్రకై
పయనమైన దుష్టవాసరమున
అద్రిమహిత ధైర్యు డాజానుబాహుండు
నీ విభుండు భగ్నజీవియయ్యె!

జి. జాషువ

# మాతృక

శా. ఏకాగారిని చూడబోయితిని నేనీ మధ్య చిర్నవ్వుతో
నాకుం బీతముజూపి సాజమగు నానాహాస్య లేశంబులన్
నా కానందముగూర్చి నీ కుశలమున్ ప్రశ్నించె శ్రీరెడ్డి నే
దే కావ్యంబు రచించు జాష్వయనె సాహిత్యాభిమానంబునన్

ఆ.వె. ఏమి వ్రాయగలుగు నీ వయస్సున నేమి
వ్రాయగలడొా అదియె వ్రాసినాడు
కలము వృద్ధమయ్యె కవివృద్ధుడైనాడు
క్రొత్తకబ్బమెట్లు కూర్పగలడు

కం. అని వ్రాసినాడ నని న
న్నని యననట్లనియె నాదు నసమర్ధత తీ
యని దెప్పిపోటుపోట్లన్
అనంత వాత్సల్యపూరితాంతర్యమునన్

కం. కవితాశారద నాకిది
యవమానము వృద్ధనౌదునా నేనయితే
అవుదువు నీవని నాలో
కువకువమని కలమునందుకొమ్మని కుదిపెన్

ఉ. ఇంటికివచ్చి కబ్బమెదియేని రచింప దలంచి మెల్లగా
గంటముబట్టి వస్తువునకై తలపోయుచునుండ మాకు ప్ర
క్కింటివినూత్నదంపతుల కింపుజనింప జనించె కల్మషం
బంటని ముద్దుపాప మధురాకృతి నాకొక కావ్యవస్తువై

# ముసాఫరులు

శా. చీనా మానవమాంసభక్షకులతో శీతాద్రి బోరాడి నె
మ్మేనింబాసిన యోధుడొక్కడు శరన్మేఘాధ్వముందాటి తా
రానాథాంతిక సీమనున్న యొక సత్రంబుం బ్రవేశించి ఆ
సీనుండైయట సేదదీర్చుకొనజొచ్చెన్ మార్గమధ్యంబునన్

తే.గీ. కాయమున గాయములు లే
వాయాసములేదు హృదయమవ్యక్తంబై
హాయింజెంది సుఖించె వి
హాయసమొక కాంతిగోళమై రుచులీనెన్

తే.గీ. చుట్టములుగాని తనకన్నసుతుడుగాని
తల్లిదండ్రులుగాని యర్ధాంగిగాని
తోడుగా వెంబడించిన జాడలేదు
వీరమరణంబునం గల్గు పేరుగాక

ఆ.వె. ఇంద్రధనువులోని యేడువన్నెలు మేన
నంటి కొంతకాల మాత్మనలరి
తారకాకిరీటధారియై మెరుముల
పూలతోటలోన వాలె నతడు

శా. భూలోకంబున పుత్రసంతతికినై పూజావిధుల్ దాన ధ
ర్మాలన్ సల్పుగృహస్థులన్ దనుప జన్మంబెత్తగా క్రొత్తగా
నీలాభ్రంబు తరించివచ్చునొక ప్రాణింజేరగాబోయి ప్రే
మాలాపంబుల బల్కరించి దరికాహ్వానించె సంప్రీతిమై

కం. జగతికి ప్రయాణమాయిది?
భగవంతుడు పంపెనా? సెబాసని వానిం
బిగియార కౌగిలించెన్
మొగిళులు నానందబాష్పములు వర్షింపన్

కం.  కుశలమె సర్వేశ్వరునకు?
కుశలమె స్వర్గమునకమరకోటికి? రంభా
ప్రశుభాస్య కుశలమేనా?
దిశాధిపతులెల్ల నేడు ధృతినున్నారే?

కం.  ఆయువు నీ కెన్నేడులు
వ్రాయంబడె నుదుట భరతవర్షంబుననా
నీయునికి? యే కులంబున
కాయము ధరియించి బ్రతుకగాబోయెదవో?

కం.  అని పృచ్ఛసేయు వీరున
కనె నా చిరుప్రాణి యెరుగ నావివరము లో
యనఘా! భూతలజీవన
మనుకూలంబగునె తెల్పుమని ప్రార్థించెన్

మ.  ధరణీచక్రమువంకకున్ నను బలాత్కారించి పొమ్మన్న య
ట్లురువేగంబున తోయుచున్నయది యేదోశక్తియోజింప దు
స్తరమై యర్థముగాదు నాయవలి కర్తవ్యంబు నీవీ యదం
తరపుంజన్మ తరించినాడవుగదా? నాకుంబ్రబోధింపుమీ?

కం.  పో మ్మవనికి తాల్పుము దే
హమ్మని కర్తవ్యమిద్దియని చెప్పదెవం
డిమ్మహికిం జనుచుంటిని
పిమ్మట ఫలితం బదేమి? వీరవరేణ్యా!

ఆ.వె. జన్మ సార్థకతకు సల్పుకార్యము లేమి?
పాప పుణ్యములకు ఫలిత మేమి?
తల్లిగర్భమందు తలదాచుకొనుటేమి?
విశదపరపు మంచు వేడుకొనియె

చం. తనువులులేవు వస్త్రములుదాల్పని జీవులు వాయుమండలం
బున బృహదగ్నిగోళమన బొల్చునొకానొక జ్యోతికిం బ్రద
క్షిణములు సల్పి కొన్ని భువికిం జనుచుండును నేను నాగతిం
జని తనువుం ధరించి మనుజత్వరుచిం జవిజూచి వచ్చెదన్

ఆ.వె. స్వర్గమనగనేమొ భగవంతుడెవ్వడో
యెరుగ నెరిగినట్టు లింతగురుతు
మాటకందరాని మరియొక లోకంబు
కలదు మనసులోన మెలగుచోటు

కం. ఎక్కడినుండిక్కడికే
చక్కిం బయనించి యెవని శాసనమున నే
నిక్కడకు వచ్చినాడనొ
నిక్కముగా నెఱుగ చెప్పనేరను సఖుడా!

మ. కనులున్నం గనలేని తీక్ష్ణమగు నుగ్రజ్యోతి వెల్గొందు తా
వున నజ్ఞాత జగత్తు నం దణువునై ముందెన్నడోపుట్టి మిం
టను వాతాహతి సంచరించు చిరుప్రాణంబు న్ననుం భూతలం
బునకున్ నెట్టెనెవండో ఆతడగునేమో స్రష్ట నా జన్మకున్

ఆ.వె. నరుడు పుట్టిపెరిగి నాకలోకపు కథల్
చెప్పగలుగు నూహ చేయగలుగు
పుట్టిపెరుగనట్టి చిట్టిపాప లివేమి
చెప్పగలిగి యూహ చేయగలరు?

కం. పదునాల్గు గగనములునుం
బదునాలుగు లోకములను బయనించితి నే
నుదయించెదు భూమికి నె
న్ని దినాల్ బయనింపవలె వినీతచరిత్రా!

ఆ.వె. ఎవరి కడుపుపండి యీ వుద్భవించితి
వవనిమీద నెన్ని హాయనములు
జీవయాత్రసల్పి చేసిన క్రియలేమి?
చావదే విధాన సంభవించె?

కం. తనువను కవచంబేగతి
ననుజెందెడి యెన్ని హాయనంబులలో నీ
తనువూడిపోవు నవనిన్
మనుగడ యెట్లుండు తెల్పుమా మహనీయా!

ఆ.వె. ఇంద్రధనువు మకుట మింపార నక్షత్ర
రత్నఖచిత మందిరంబు నందు
మెరుపుదీపశిఖలు మెరయు వేదికలపై
విశ్రమించి రభ్ర వీధులందు

ఆ.వె. నేను పుట్టి పెరిగి నేర్చిన విషయముల్
తొలుతనుండి తెలుపగలను వత్స!
ఆలకింపు మంచు నా వీరయోధుండు
చెప్పదొడగె స్వీయ జీవితంబు

ఉ. భూవలయంబునం గల యపూర్వ విశేషములెల్ల చెప్పుచో
కావలె నేండ్లుపూండ్లు ఫణికాంతుని నాల్కలువేయిగావలెన్
నీవు మహీతలంబునకు నేను వియత్తల సీమ కెట్టులుం
బోవలె తప్పదిర్వురకు పుట్టువు నీకు విలంబమయ్యెడిన్

మ. అగునీకున్ శుభముద్భవింపదగువత్సా! భారతంబందు ము
జ్జగమున్ మెచ్చిన త్యాగమూర్తులగు రాజర్షుల్ లసద్ధర్మపా
రగులున్ శాంతిసముద్రనాథుల పవిత్రంబైన జన్మంబు మే
ల్నగవైవెల్గు పవిత్రఖండము నఖండ శ్రీ నివాసంబగున్

మ. కడచెన్ నల్వదివత్సరాల్ మనుజలోకంబందు జన్మించి యె
క్కడ యేరూపముతోడ నిర్గుణరజః ఖండంబునైయుండి యె
ప్పుడు పిండాకృతిదాల్చి తల్లియుదరంబున్‌జొచ్చి నిద్రించి యి
ప్పుడమిన్ జేరితినో యెఱుంగ నిది మామూలెల్ల మర్త్యాళికిన్

ఉ. నీవును మాతృగర్భ రమణీయ సుకోమలశయ్య రక్తమాం
సావయవంబు లేర్పడెడునందనుకన్ నిదురించి యోగివై
జీవసమాధి నుందు వొక చీకటి చర్మకుటీరమందు వ
త్సా! వివరింపనేల నరజన్మ విశేష విచిత్ర గాథలన్

కం. పదినెలలునిండి యటునిటు
గదలుచు జన్మించు వేళ గదసిన ధరణిన్
సదనముజేరెద వేడ్చుచు
మొదట న్నవ్వుందు దేవ పుత్రుం డేనిన్

కం. కంటంబడు ప్రతివస్తువు
నంటుచు భక్షింపబోవు నభముశుభము లో
నంటని శిశుత్వదశ ని
ష్కంటక వైకుంఠమై ప్రశాంతి ఘటించున్

ఉ. పుట్టువు గుట్టుదాచుకొని పుట్టిన పిమ్మట నేటికీధరన్
పుట్టితినంచు పెక్కు యుగముల్ తలపోసిన తేల్చలేని యీ
మట్టిశిరస్సునిచ్చి పరమంబున డాగిన నాథుడొక్క డు
న్నట్టుగ దాఖలాల్ దొరక వప్పటి కిప్పటి కద్భుతంబగున్

ఉ. ఈ యనుమానమందుబడియే జనియించె నసంఖ్యసంఖ్యలా
మ్నాయములుం బురాణములు నల్వురు లేదన నల్వురౌననం
గా యుగ చక్రముల్ సమయగర్భమునంబడి మండలాకృతిన్
బోయెడి యస్తినాస్తులివి మూలము లేని వివాదమగ్నముల్

కం. నరకము స్వర్గం బవనిని
సరిసమముగ సాగుచుండు సత్యమసత్యం
బిరుగడల మ్రోగుచుండున్
కరుణయు కాఠిన్యమెదురుగా నడయాడున్

కం. మతములు పెక్కులు గలవిల
సతతము సర్వేశ్వర ప్రసంగంబులతో
సతమతమగు భక్తులుగల
రిత రేతర కలహ రభసలే తొడజరచున్

కం. పిలిచిన బలికెడు దైవము
గలిగినచో వీడు మోసగా డనియెద రే
పలుకుం బలకని వాడే
బలశక్తులు మహిమలున్నవా డగు ధరణిన్

ఆ.వె. నామ రూప రహితులై మంటిపాలైన
మానవాళిలో మహానుభావు
లైన దివ్యపురుషులే నిల్తు రనయంబు
గగనమందు విశ్వజగము నందు

కం. వారి పవిత్ర చరిత్రల
సారంబంతయును గ్రోలి సంతోషముతో
ఆరాధింతురు చేతల
మారుపు హుళుక్కి నేటిమానవులందున్

మ. అరుగోకొందరు నీవలెం బయనమై ఆవంక చిన్నారి బం
గరు బంతుల్ బలె ముద్దుచేయు శిశువుల్ గన్పట్టుచున్నారుభా
సుర నిర్దోష మనస్కులై ఘనతరక్షోణీ మహామాత యే
తరహా విద్యలునేర్పి యే గుణములన్ తర్ఫీతు గావించునో

కం. ముసలితనం బనియెదు నీ
రసదశ దేహంబునందు ప్రాప్తంబగుచో
వసుధాస్థలి ఆప్తులకే
విసువగు నిన్నాదరింప ప్రేమించుటకున్

కం. సత్తువ దరిగిన దేహపు
తిత్తులు వేలాడుచున్న తీరవు కొర్కెల్
సత్తువగలవై పదనగు
కత్తులవలె మెదలి మెదలి కారించునెదన్

ఆ.వె. బ్రతికియున్న వేళ మెదుకు బెట్టనివారు
చచ్చెనేని దినము సల్పగలరు
స్వర్గలోకమందు సద్గతుల్ గల్గగా
విందు గుడువగలరు బందుజనులు

మ. ఒకచో నొక్కడు పెండ్లిపల్లకులపై నూరేగు నొక్కండు కా
టికిబోవున్ పతితోడ నొక్కసతి క్రీడించున్ గతాత్మేశయై
ఒక యిల్లాలు తపించు విశ్వధరణీవృత్తం బుదాత్తంబు దీ
నికి నాద్యంతము లూహచేయగల పాండిత్యంబు లే దేరికిన్

తే.గీ. స్వర్గముననుండి భూమిపై బడ్డ ప్రాణి
చచ్చి స్వర్గంబునకు బోవ నిచ్చగింప
డిచ్చటి ప్రకృతి సౌందర్య మిచటి మధుర
జీవితానందములు మింట లేవుగాన

ఉ. ఇక్కడి యిండ్లు వాకిళులు నిక్కడి వాంశిక మోహజాలముల్
ఇక్కడి కొండలు న్నదులు నిక్కడి పున్నమనాటి వెన్నెలల్
ఇక్కడి మందవాయువులు నిక్కడి పుష్పవన ప్రదేశముల్
మక్కువ పుట్టనీయ వనుమానపు స్వార్గిక జీవితంబుపై

మ. పదిమారుల్ జనియింపడే భరతభూభాగంబునన్ గృష్ణ దే
హృదయాకర్షకమైన శక్తిగలదో యీ నేల యం దెన్నడో
సదనంబొండు హిమాద్రిగట్టుకొని యీశానుండు సత్పుత్ర సం
పదతోనుండడె సాంధ్యనర్తన కళాపాండిత్య శౌండీర్యుడై

మ. నెలయుం బ్రొద్దును రేబవళ్ళ నెలమిన్ నిర్మింపగా వెండి వె
న్నెలతో బంగరుపూతతో జిలుగువన్నెల్దాల్చి బ్రహ్మాండమం
డలి నక్షత్రసుమాభిరామమయి ఆనందాబ్ధి దేలించు భూ
తలమున్ వీడుట కిచ్చగింప రురు వృద్ధాప్యంబునన్ మానవుల్

కం. ప్రళయమున నాశమై య
వ్వల నేదో సృష్టితోడ ప్రభవించు జగ
ద్వలయంబు స్థిరము గాదన
గలమా యను సంశయంబు గలదెల్లరకున్

కం. పెరిగినది వాఙ్మయం బం
బర మంటం బెద్దగ్రంథభాండారంబుల్
పెరిగినవి మానవత్వము
పెరగదు కారణము తమ్మిబిడ్డడెరుంగున్

కం. పెదవుల తీయదనంబున్
హృదయంబున చేదుగల్గి ప్రేమమహిమ చె
ప్పెదరుర్వి నైచికీమృదు
వదన వ్యాఘ్రములు భక్తభల్లూకంబుల్

కం. ఆది న్నాలుగు జాతులు
ప్రాదుర్భావంబునందె భారతమున నే
దేదేవుని దయవలనో
పాదుకొనియె వేనవేలు వర్ణాంతరముల్

కం. మనవాడా కాదాయను
యనుమానము దీరకున్న అబ్జభవుని య
బ్బనుగూడ లక్ష్యపెట్టని
అనాది పండితులు కొంద రగుపింత్రు ధరన్

కం. ఆదరణలేక దుస్సహ
వేదనలం గ్రుంగి మానవీయత కెడమై
యే దెసలేక తపించెదు
ఐదవ వర్ణంబుగల్గు నస్పృశ్యంబై

కం. జాతిపితచేత నీ కడ
జాతిని పీడించు నంటుజాడ్యం బేదో
రీతిగ నయమై స్వేచ్ఛా
వాతసుఖం బమరి మానవత సిద్ధించెన్

కం. హరిజను డెదురైనం గ్రు
డ్లురుము సవర్ణుడు గ్రహించియున్నాడిది పెన్
దురితంబని ఖద్దరు ముని
వరుని కటాక్షేక్షణ ప్రభావము కతనన్

కం. విజ్ఞానమున్నదుర్వర
నజ్ఞానం బున్నయంత అవసరములలో
విజ్ఞానప్రజ్ఞలు లో
కజ్ఞానం బున్నవానికడ వ్యర్థంబుల్

కం. అనుదినము లక్షలాదిగ
జనియింతురు స్వర్గమునకు జనుచుండుదు రీ
మనుజులు తుదిమొదలుండని
అనిత్యభూగోళ యాత్ర కర్థంబేమో!

కం. అద్యతన జీవకారు
ణ్యోద్యమ రతులైన బుద్ధులున్నారు కృపా
విద్యాంభోధులు హింసా
మద్యవ్యతి రేకులైన మహితచరిత్రుల్

కం. పెంచెడు యజమానికినై
పంచత్వంబంద సిద్ధపడు కుక్కల బ్రే
మించెద రన్నంబిడి పో
షించు దయాపరులు నుల్లసిల్లెద రుర్విన్

చం. కలరు జగత్తునం గలుషకర్మఠ రాక్షసకోటి కాంజనే
యులు దృఢధర్మకార్య వినియుక్తులు అంధతమస్సులోన వె
న్నెల సృజియించుకోగలుగునిశ్చల ధైర్యహిమాలయుల్ ధరా
వలయ హితాభిలాషులు కృపారసపూర్ణ కటాక్షభూషితుల్

సీ. తనతనూస్వేదంబు ధారవోసి గడించు ధన మర్థిజనులకు దానమిచ్చి
తమసౌఖ్య మొరుల సౌఖ్యమున కంకితమిచ్చి అతిరహస్యంబుగా బ్రతుకునడిపి
రోగులై పెరవారి బాగౌషధంబుగా భావించి సత్కార్య పరతనలరి
న్యాయంబునకు చిన్నిగాయంబుగానీక క్రూరకర్ముల నెదుర్కొని యదల్చి

ఆ.వె. అహము నంటనీక స్వార్థం బధిగమించి
గండరించియున్న కరుణ లగుచు
ధరణి వాసమున్న దైవంబు లందందు
గోచరించుచుంద్రు కువలయమున

ఆ.వె. ఎంత మంచివాని కేని గుప్పెడు మసి
పూయగలరు దుష్టపురుష లచట
ఎంత చవట నేని యింద్రుగా చంద్రుగా
ఘన ప్రతిష్ఠ పులుమగలరు నరులు

మ. అరయన్ రోదసిలో మనుష్యుడు సునాయాసంబుగా జొచ్చిదు
స్తరవేధోండ రహస్యముల్ తెలుపు ప్రజ్ఞాశాలియయ్యున్ పర
స్పర విద్వేషవిషాదచండశిఖి నార్పంజాల డింకెన్న డీ
ధరణీ సుందరి మోము శాంతిదళ పద్మంబై వికాసించునో

మ. హృదయద్రావకమైన దృశ్యములతో ఇంపై మనఃక్లేశముల్
గదమాయించు మనోజ్ఞచిత్రములతో గమ్మత్తుగా ఏండ్లుపూం
డ్లుదయింపన్ మరణింప రేబవళు లెన్నో కాలగర్భంబులో
నొదుగున్ అంతములేదు భూతలపుటాయుర్భూతి నిష్పారమై

కం. అందాలరాణియై కను
విందులు గావించు విశ్వవిశ్వమునకు దై
నందిన ప్రదక్షిణల సూ
ర్యేందులు పూజింత్రు మేటి గృహదీపములై

కం. ఒక విధముగ నర జన్మము
సుకకరమగు నొక్కరీతి శోకమయంబై
వికటించు నుభయములు క
ర్మకు లోనైయుండు నంద్రు బ్రహ్మజ్ఞానుల్

చం. పుటమున వన్నె యేర్పడిన పూతమెరుంగు పసిండివోలి యు
త్కటమగు కష్టమున్ గొలిమిగాలి మనుష్యుడు పెక్కుజన్మలన్
స్ఫటికమువోలి శుద్ధుడయి బ్రహ్మమునందున లీనమై సుఖిం
చుట నిజమైన క్రమ్మర వసుంధరకున్ జనుదెంతు నాదటన్

మ. సమరంబందు ఫిరంగిగుండ్ల కెరయై చైనీయు లైదార్గుర
భ్రమున న్నా వెనువెంటవచ్చి సఖులై భాషించి రా వైర భా
వము దేహాంతరమందు గల్గదని సద్భక్తుల్ ప్రశంసింతు రీ
విమతవ్యాధి నశించినం గలుగు నుర్విన్ గోటి వైకుంఠముల్

కం. మగతెగయు నాడు తెగయను
తెగలున్నవి రెండు ఆడుతెగలేకున్నన్
మగ తెగకు పుట్టుగతి లే
దగణ్యములు రెండు తెగల అనుబంధంబుల్

కం. ఆడుది లేకుండిన నీ
రేడు జగంబులను శోభయేలేదు నరుం
డూడిగపు యంత్ర మనుకొని
చేడెను బంధించి వ్యర్థజీవి నొనర్చెన్

చం. అసమ విమాన చోదక మహాకళ నభ్యసనం బొనర్చి ఆ
కసమున సంచరించు మొనగాండ్రగు పూరుషు లబ్బురింప రో
దసి విహరించి రష్యను లతాలలితాంగి దృఢాంగలంగనల్
వసుధ గ్రహింపుడంచు మగవాండ్ర అహంకృతి నూడగొట్టదే

కం. భూషణ సంతృప్తిం దన
ఘోషా చెరసాల నోర్చుకొను గాని మదిన్
రోషం బూనదు భారత
యోషామణి కున్న సహన ముర్వికిగలదే?

కం. జ్యోతిష్కులు నీ కెదురుగ
నేతెంత్రు భవిష్యదర్థ మెరిగించుట కీ
కైతవ శాస్త్రజ్ఞులు తమ
వ్రాత ఫలంబెరుగ రధిక వాచాలచణుల్

చం. వెలుతురు వాయువున్ జలమువిశ్వమునం బ్రతివానియాస్తిపా
స్తులు లభియింపవేరికిని సుంకముగట్టక రాచవారి యం
డ్రుల రజ మంటకుండ వెలుగుం గనజాలవు సంస్థ లిట్టి విం
తలు విపరీతముల్ బహువిధంబులు గల్గు ధరాతలంబునన్

సీ. ప్రేమవాహిని విశ్వవిశ్వంభరము నందు ప్రవహించు నన్న క్రైస్తవము నమ్మి
కలుషశక్తులను జక్కాడి పెక్కుయుగాలు అవతరించెద నన్న హరిని నమ్మి
బృహదహింసా మంత్ర దహనంబుచే హింస దగ్ధమౌ నన్న గౌతముని నమ్మి
రాటంబె నిఖిల ఝంఝాటముల్ సవరించు నన్న గాంధేయ వాక్యములునమ్మి

ఆ.వె. ఎంత దౌష్ట్య మెంత హింసా విధానంబు
చెలగుచున్న సుంత చింతపడక
సాగిపోవుచుండు శత సహస్రాబ్దముల్
యుగయుగంబు లీ మహోర్వి రమణి

కం. వీర ప్రతాపములు ని
స్సారము లీనాడు శాంతిసహనము లలం
కారము లను సత్యంబున్
నేరిపి చన్నారు పరమ నీతిచరిత్రుల్

మ. అరుగో శాశ్వత ధర్మకర్మరతి నీరాహారముల్ మాని దు
స్తర బందీగృహ బద్ధులై మృతికి భోజ్యంబైన వారుజ్జ్వల
స్థిర నక్షత్రములై సుఖింతు రెలమిన్ దివ్యత్వముంజెంది దు
శ్చరితుల్ భూతములై చరించెదరు నిచ్చల్ నిప్పునంగాలుచున్

తే.గీ. విశ్వమానవ గోత్రేయ వీరులైన
కవులకున్ కర్మబంధంబు కట్టబెట్టి
పులుముచుందురు తలమీద కులమురంగు
తొలగిపోవదు లక్ష సబ్బులకు గూడ

కం. మానవుల కొక ముసాఫరు
ఖానాభువనంబు కొంతకాలము తనువుం
బూని వసించి యనంతర
యానమున కుపక్రమింతు రనవరతంబున్

కం. మతపిచ్చి ముదిరి యన్యుల
మతము న్నిరసించి స్వీయమత గౌరవమున్
హతమార్చి నిత్యకలహము
ప్రతిఫలముగ దెచ్చుకొనెదు వారుందురటన్

మ. చదువున్నంతన బుద్ధిమంతులయి విశ్వశ్రేయముం గోరు భూ
రి దయాపూర్ణులుగారు కొందరు యనర్థీభూత దుష్కార్యకో
విదులై ద్రవ్యముసేకరించి ప్రజలం బీడించువారుం జెలం
గుదురత్యున్నతగౌరవార్థము కుయుక్తుల్ పన్నుమాయావిదుల్

తే.గీ. మంచివాడొక్క తెగకు దుర్మార్గు డగును
దుష్టు డొక వర్గమున మహాశిష్టు డగును
ఒక్క డౌనన్న కాదను నొక్కరుండు
బుట్టు లన్నియు నొకమారు వెట్టివగును

తే.గీ. ధర్మమును సత్యమను పదార్థములు రెండు
కలవు దొరకవు నీకు నంగళ్ళ యందు
నిత్యము లభించు రత్నమాణిక్యమణులు
అనుగమింపవు నిన్ను దేహాంతరమున

ఆ.వె. ఒకడు పుణ్యమన్న నొకడు పాపంబను
పాపపుణ్యభీతి బహుళ మచట
ఇరువు రొక్కరీతి మృత్యు గర్భంబున
లీన మగుదు రెపుడు లేచిరారు

ఆ.వె. పూర్వ సంప్రదాయములకు దేవతలకు
వెట్టినమ్మకాల విస్తృతులకు
చావులేని విద్య చదివింత్రు తద్భిన్న
మైన చదువు సంధ్య లతక వచట

కం. భారత భాగవతంబులు
పౌరాణిక యుగములోని వసుధాధిప శృం
గారక్రీడలు నీకుం
గారెలు తిన్నట్లు శ్రుతియుగమును తనించున్

మ. ప్రతిపల్లెం దపనీయ విగ్రహములం బాపూజి ప్రత్యక్షమై
హితమాదేశము చేయ భారతప్రజాభీష్టానుసారంబుగా
ధృతిమంతుల్ పరిపాలనారథము మంత్రిశ్రేణి సాగింప సా
ధితశాత్యంగద భూషితాంగియగుచున్ దేశంబు శోభిల్లెడిన్

కం. వేదాంత జలధిలో బడి
యీదు నరుడు సంసరణము నీదగ బహుధా
రోదించు వాని తనతో
నీదగరమ్మనుచు పెట్ట డింత కబళమున్

కం. పసితనమునందు హృదయము
కుసుమము వలె పరిమళించు గుణగణములు నిం
పెసలారుచుండు నాదశ
ముసలి తనంబునను గల్గ ముక్తిఘటించున్

చం. కొమరుల కోసమై భరతగోరమణీమణి పించుదున్న క్షీ
రము పరరాజధూర్తులకు ప్రాప్తముగాదిక చీని రాజ్య మే
ఘము హిమశైల భూముల నకారణగర్జలు సల్పసాగె ద
ర్పముగల భారతప్రళయ వాయుహతిం దుమురై నశించెడిన్

కం. పగవాని నల్లగుండెల
నగలించి కదుష్ణరక్తమాపోసన ప
ట్టగజాలు వీరసింహము
లగణితముగ గలరు భారతావని యందున్

సీ.  ఒక త్యాగమూర్తి ప్రేమకు పాదు లొనరించి స్వీయ రక్తమును వర్షించినాడు
ఒక మహాత్ముండు స్వేచ్ఛకు ప్రాణ మర్పించి మైమీద బట్టతో బ్రతికినాడు
ఒక రాచవా డహింసకు సర్వరాజ్యంబు విడనాడి భిక్షకు నడచినాడు
ఒకడు ఖొరాను వ్యాప్తికి దేశ దేశాల తలదాచుకొని దీక్ష నిలిపినాడు

తే.గీ. వారి దివ్యాత్మ లుభయ ప్రపంచములకు
జ్యోతులై ప్రజ్వలించు నచ్యుతము లగుచు
వారి పగవారు మృత్యుగర్భమును జొచ్చి
భస్మమైనారు నామ రూపములు లేక

కం.  అలుకయు రోషంబును దు
ష్ఫలితంబులు గలుగజేయు బహువిధ దుఃఖం
బుల కాటపట్టులగు వి
జ్ఞుల దరిజేర వీ పశూత్కర ప్రకృతుల్

కం.  ధనమార్జింతురు దాతురు
తిన రేరికి బెట్టరింత తిరిపంబు మహా
ధనికులు కొందరు వారిం
గనుగొనుచున్ మృత్యు వంతికంబున నవ్వున్

ఆ.వె. ఇంటనున్న ద్రవ్య మెరువు గుట్టను బోలు
వ్యాప్తి జెందెనేని ఫలము నిచ్చు
పారుచున్న నీరు పంటలు పండించు
పారకున్న నీరు ప్రాచి బట్టు

కం.  ఆరోగ్యము లేకున్న య
థారీతి పరోపకారతత్పరులై పెం
పారు నుదారాశయు లు
న్నా రాంధ్రంబు నందు నవయుగభూషల్

కం. ఈ తనువు విడిచి నరుడొక
భూతంబై తిరుగు నని యభూత కథలతో
భీతిం గొల్పెడు మాంత్రిక
జాతి యొకటి గల్గు నుర్వి స్వార్థపరంబై

కం. నేనే విస్సన్నను నా
ఆనతియే వేదమను సహంకారులు న
జ్ఞానులు గల రుర్విన్ స్వ
ర్గానికి నిచ్చెనలు వేయగల్గు ప్రబుద్ధుల్

కం. అన్నము నీరము మాని మ
హోన్నతముగ తపము చేయుచున్నాడని భ
క్త్యున్నతి నొక సామాన్యుని
సన్నుతి గావించు వా రసంఖ్యాకంబుల్

మ. తలిదండ్రుల్ సతియుం గుమారుడును సద్బంధుప్రజల్ నేను శ
త్రుల నిర్మూల మొనర్చి వత్తునని సంతోషించి రీ నా మృతి
జ్వలనజ్వాలల నాశలన్నియును భస్మంబౌచు నే లీల శో
షిలిరో యన్న విచారమిప్పుడు నశించె న్నా శరీరంబుతో

కం. భువనం బొక రణరంగము
కవియుం దినదినము నైహికపు టిచ్ఛలు మం
చివియుం జెడ్డవి విజయం
బవసర మీనాడు ధీరులగు మర్త్యులకున్

కం. కోటాను కోట్లు నరు లొక
మేటి జగన్మాతృ సుతులు మిత్రులని మదిం
బాటింపు మీ సువార్తన్
జాటింపుము జీవితంబు సార్థక్యమగున్

# ఆంధ్రదేశము

కం. అవసరము నీకు తెలుగుల
వివిధ కళాప్రియత కదనవీరత్వము న
ర్ణవ గాంభీర్యం బ
య్యవారితో ద్రేక తత్వ మభ్యున్నతియున్

ఆ.వె. మెచ్చ రొకరి ప్రతిభ మెచ్చిన గగనమా
ర్గమున కెత్తి సల్పగలరు నతులు
నిజము పల్క ఆంజనేయునివలె శక్తి
మరచి నిశ్చలముగ తిరుగగలరు

కం. లలితకళా భారతులకు
నిలయము గుంటూరు పురము నేడు ఏకా క
న్నుల చల్వ రచ్చ కెక్కని
కళలేదీ విస్తృతాంధ్ర కాశ్యపియందున్

ఉ. గుంటురు మండలాన తెలుగుల్ పలనాటి ప్రతాప మింత మై
నంట స్వజాతి వీరరస మంగములం దళుకొత్త రాజసం
బింటను బైట జూపెద రదెట్టుల నైన మహాంధ్ర జాతి ము
క్కంటిని లక్ష్యపెట్ట దను ఖ్యాతిగడించె వివాద మేటికన్

కం. కవులని యొక తెగగల దట
భువికిన్ మింటికిని త్రాళ్ళు ముడివైచి మహీ
ధవు లిచ్చు ఖదరుశాల్వల
పువుదండల మురిసిపోవు పుట్టుదరిద్రుల్

కం. ముసిరిన మూఢత్వమునే
యుసికొల్పుచు ప్రాచిబట్టి యున్న దివౌ
కస కథలు గిలికి పఠితల
విసికింతురు కుండలాల విద్వద్గజముల్

కం. అక్షరముల గారడితో
అక్షులపై మచ్చుజల్లి అల్లుదురు కవీ
దుక్షములు కృతులు శతములు
లాక్షణిక కవీంద్రకోటులకు పోటీగా

కం. పూదోటల మదబంభర
నాదముల విలాసవతుల నడబెడగుల నా
హ్లాదించు కవుల కీ నిరు
పేదల ఆక్రందనములు వీనులబడునా?

ఆ.వె. కవులు పేదలైన గ్రంథవిక్రయశాల
నడుపువారు బాగుపడెద రచట
కవితలోని రసము కన్న లాభరసంబె
కమ్మదనము సాహుకారికెందు

ఆ.వె. కరుణరస మొకండె కఠిన రాక్షసములౌ
హృదయములను గలచి ముదము గూర్చు
వేడికంటినీటి విలువ సహజమైన
చలువ లీను యశ్రువులకు లేదు

మ. గురు శృంగారరసంబునన్ గృతిమెఱుంగుల్ దిద్దుకోకుండ న
ల్పురిమెప్పుల్ గనదంచు లాక్షణికు లెప్డోచట్టముల్ జేసి పో
యిరి వీరీ నియమంబునన్ వనితనెట్లే రచ్చకెక్కించుచుం
దురు కవ్యగ్రణులుం ప్రధానకథ యేత్రోవం బ్రయాణించినన్

మ. ఎలపై నిల్చి సవాలుచేయ దొడగెన్ జృంభించి ముత్యాల దం
డలతో గేయకవిత్వవాణి నవఖండ ఖ్యాతితో రాజరా
జుల సన్మానములందు పూర్వకవితా శుండాలమత్తేభ పం
క్తులు కాంతారగిరీంద్రకందరములందున్ జొచ్చి వెన్నిచ్చునో!

ఆ.వె. లలితకళలు దేవతల కంకితంబులై
ప్రజల కెప్పు డందుబాటు గావు
కాళిదాసు మొదలు కవిరాక్షసుని దాక
మానలేదు రాజమందిరాలు

కం. కలవు పలుభాష లెన్నో
గలిగిన గీర్వాణభాష కనిపెంచిన ఛా
యలు దోచు నెల్లభాషల
తెలుగౌ నను కినిసి సమ్మతింప వితరముల్

ఉ. ఏలిరి మొన్న మొన్న వర కేలికలై తెలవార లిండియా
నేల నిరంకుశంబుగ వినీతిసముద్రుడు గాంధి నూలుతో
తేలికగా జయించుకొని తెచ్చియొసంగెస్వరాజ్యమున్ మహో
త్తాల హిమాలయంబున స్వతంత్రపతాక సముజ్జ్వలించెడిన్

ఆ.వె. కవుల కలములాడె కాలగజ్జెంగట్టి
నాల్గుదెసల భరత నాట్యలక్ష్మి
శంఖరవళి సల్పి సాగె దేశంబున
దిగులు వాసి క్రొత్త ప్రగతి రథము

కం. పండితజహ్వారిలాలు డ
ఖండుం డభ్యుదయకామి ఘనశాంతి సము
ద్రుండే ప్రధానమంత్రీం
ద్రుండై పాలించు నేడు భరతసవిత్రిన్

కం. మొనమొన రాజేంద్రుడు వో
యిన పిమ్మట రాష్ట్రపతిగ యెన్నికయైనా
దనఘుడు రాధాకృష్ణుడు
మనీషిమణి భక్తిభరిత మహితాశయుడై

తే.గీ. ఆశ్రయము లేని వివిధ పరిశ్రమములు
పంచవర్ష ప్రణాళికా భాగ్యవశత
గ్రామగ్రామాన నింటింట కాలుమోపి
తరుముచున్నవి క్షామ భూతాల బెడద

చం. వివిధ విదేశముల్ భరతవీరవిలాసిని ముద్దుబిడ్డనిన్
జవహరుపండితుం బిలిచి సత్కృతులం దనియించి విశ్వమా
నవ సుఖశాంతి దూత యని సన్నుతిచేయదొడంగె తద్యశః
ఛ్ఛవులు ముదంబు గూర్పనిరుసంధ్యల భర్గుడు తాండవించెడిన్

తే.గీ. స్వంత పరిపాలనం బేరుపడిన యంత
గౌతమీకృష్ణ లురు తరంగములతోడ
ఊసరక్షేత్రముల మీది కురుకు లెత్తి
సస్య హేమాంగదముల ముస్తాబుజేసె

తే.గీ. దుర్గమారణ్యముల సముత్తుంగ గిరుల
వాస మొనరించు నిఖిల దేవవ్రజంబు
శిథిలమైయున్న గోపుర శిఖరములకు
యెలమి బంగారునీరు వోయించుకొనియె

కం. శ్రీగల హంసీగమన
ప్రాగల్భ్యముతోడ యేరుపడ్డది సౌభి
క్షాగమ వసంత దీప్తుల
నాగార్జున సాగరంబు నవ్యాంధ్రమునన్

కం. ఇరువది శతాబ్దముల సుం
దర సంస్కృతితోడ దేవతా గాథలతో
నెరసిన తలతో హిందూ
ధరారమణి నేడు నీకు దర్శమిచ్చున్

# నా జననం

కం. ఒక తల్లి గర్భమున పొం
దికగా నిర్మించియున్న తిత్తింబడి యం
బకములు తెరువక గడిపితి
నొక పదిమాసములు చలనమున్న సుషుప్తిన్

కం. ఉదయించి కనులు దెరచితి
మొదట న్నను గన్నతల్లి మోమగుపించెన్
సదమల సౌహార్దముతో
ముదమున సొంపారు ప్రేమ పూర్ణద్యుతులన్

కం. నేలంటు వాసి యల్లన
కాలూని చరించు నన్ను కౌతుకమున నే
వేళన్ ముద్దిడుకొనుచున్
హాళిం బొంగార దొడగి రాప్తులు బందుల్

కం. ఏడొకటి గడచి రెండవ
యేడుం జొరబడియె తెలిసె నించించుక నే
నేడిచిన నాకు జోలలు
పాడు న్నాతల్లి పాలు బట్టెడు ననుచున్

కం. ఎదిగిన కొలంది నాకున్
విదిత మగుచునుండె లోకవృత్తము సుఖసం
పద లొక్కపాలు దుఃఖము
పదిపాళ్ళని యర్థమయ్యె వసుధాస్థలిలో

ఆ.వె. చదువుకొంటి కొన్ని సంవత్సరంబులు
శ్రద్ధతోడ పాఠశాల కేగి
చెప్పినారు గురువు లుప్పు కారములేని
రస విహీనమైన ముసలి కథలు

కం. అటు పెద్దవారి చెలిమికి
నిటు పిన్నలతోడ చెలిమికెడమై పటుసం
కటమైన యౌవనపు దశ
ఘటించె నూనూగు మీసకట్టేరుపడెన్

ఉ. కన్నుల నేర్పడెన్ జిరుత కామవికారము తీపికోర్కెలు
త్పన్నములై శరీరమున దర్పముజేరె భుజార్గళంబులన్
గన్నెల పిండిగా సలుపగా మనసయ్యె పవిత్రబాల్య మీ
చిన్నెలు జూచి జారుకొనిచేరె మరొక్క కుమారునండకున్

ఆ.వె. కులము పల్కరించి తెలిపె వంశోన్నతి
మతము స్వర్గనరక గతులు బలికె
సర్వసౌఖ్యములకు సాధనంబును నేను
గడన చేయుమంచు నుడివె ధనము

ఆ.వె. పనియుపాట లేక పండ్లారగించుచు
కావి వసనములను గట్టవోయి
ప్రజలు బ్రహ్మరథము బట్టి పూజింతురు
జడలు దాల్చుమనియె జపము తపము

ఆ.వె. వివిధ రాజకీయ వేషాలతో దేశ
భక్తి నభినయించి బ్రతుకుమోయి
పూలమాలికలను పూజించెదరు నిన్ను
మనుజు లంచు నుడివె మంత్రిపదవి

కం. మంచివి చెడ్డవి యగు ప్రా
పంచక సంబంధ వివిధప్రకృతులు నన్నున్
బొంచుచు వశీకరింపన్
సంచారము చేయసాగె నాలుగు దెసలన్

ఆ.వె. బ్రతుకు దెరవు లిట్లు ప్రత్యక్షమై హెచ్చ
రించి మోహ లతలు పెంచుచుండె
అస్మదీయ హృదయ మన్య మార్గంబున
నడచుచుండె నేండ్లు గడచుచుండె

చం. పరిణయ మాడినాడ నొక బంగరు బొమ్మను పెద్దలెల్ల సం
సరణము దొడ్డదందు రని చక్కని పుత్రుని గంటి మోహ వా
గురులు క్షణక్షణం బెదిగి కుత్తుకకుం బిగియం దొడంగె నా
గరిత విలాసలీలలకు కట్టువడెన్ మన సిట్టికూనయై

ఉ. గట్టిపతివ్రతా బిరుదు గావలె నన్న యభీష్టమాకె ని
ట్టట్టసియాడనీక హృదయంబున శాశ్వత తిష్ఠవేయ నే
నెట్టు చరించుచున్న హృదయేశ్వరు డీశ్వరు డన్న నమ్మకం
బుట్టిపడంగ సల్పు నెపు డోపికతో చరణార్చనావిధుల్

ఉ. చచ్చినముండమోసి పతిచావక యుండిన గాజుమెట్టెతో
పచ్చగనుండు కాంతల యభాగ్యదశన్ దలపోసి మానసం
బుచ్చలితంబుగా కరుణయున్న మహాత్ములు కొందరిప్పు డీ
యుచ్చు సడల్చి యిచ్చిరెటులో పునరుద్వహ నాధికారమున్

తే.గీ. మాతృ దేశంబు చైనీయ భూతకోటి
కబళన మొనర్చునోయన్న ప్రబల మైన
సంశయంబున స్వీయ సంసార రజ్జు
బంధములు త్రెంచుకొని యుద్ధభటుడనయితి

చం. మతసహనంబు నేర్పినది మానవకోటికి నీ యుగంబు ము
మ్మతముల కుమ్ములాటలు సమాప్తములైనవి శాత్రవంబు ని
ర్జితమగు శాంతిచే ననుచుజెప్పి మహాత్ముడు దాటిపోయె నం
చితసుఖ జీవనంబు విలసిల్లెడు చిన్నెలు గోచరించెడిన్

కం. మనుజుడు మనుజుని గనుగొని
మనుజుం డని గుర్తుపట్టి మసలెడు శుభసూ
చన లెల్ల దిశల గాంధీ
మునిచంద్రు ననుగ్రహమున పుష్పిత మయ్యెన్

కం. అమెరిక రషియా లను దే
శముల సుహృద్భావములను సాధించి ప్రపం
చమునకు శమ దమ ఋజు మా
ర్గములం జూపించె భరత ఖండము గురువై

కం. ధ్వజములతో పలురకముల
యిజముల తలసూపి విశ్వహితనాదములన్
గజిబిజి చేయుచు నున్నవి
ప్రజలను రాచరిక మెవరి పాలంబడునో

ఉ. పుట్టినవాడు పుట్టుటకుబోయెడు నీవునుగూడ నేడు స
మ్రాట్టులు లేరు భోగులగు మానవనాథులు తొంటిడంబముల్
గిట్టవు వంచనల్ తగవళీకసమత్వము మెల్ల మెల్ల కా
ల్మెట్టినచో విరోధి కబళించెడునందురు ధర్మతత్పరుల్

కం. నలమందు భాయిగా డొక
డలంతి తలకాయగా డహంకృతి హిందూ
విలసద్రత్నోదర కా
వలెనని దండెత్తినాడు బలదర్పములన్

మ. మన సేనానివహంబు రక్తరణశుంభచ్ఛౌర్యవిజృంభణం
బున మెక్ మోహనరేఖ దాటదరిమెన్ భూతేశుడుం గంటి ని
ప్పున భస్మీపటలంబొనర్చె రిపులన్ ముప్పాళ్లు గంజాయి మ
త్తునుజారెన్ పరచెం బెకింగునకు నుద్ధూతాత్మవిశ్వాసియై

కం. తూరుపు టిటలేయం బని
పేరందిన తెల్గుభాష పెంపారు ధరన్
వీరకులంబున బుట్టితి
పౌరుష గుణ ముగ్గుబాల బడసినవాడన్

కం. ఒక పుట్టెడుక్కుగద తే
లికగా చేబట్టి చెంగలించితి ననిలో
ఒకరిద్దరు గా దొక నూ
టికి సర్దారుండ రణపటిష్టుడ నెందున్

కం. భారత కథయే నాలో
వీరావేశంబు ప్రోద్భవించి రుధిర మం
దారని నిప్పై సేనా
వారంబున జేర్చి యుద్ధభటుని నొనర్చెన్

కం. ఇది యాత్మస్తుతిగా నెం
చెదవేమో కాదు నేను చీనీయులతో
కదనము సల్పిన తీరుం
చదువగలవు తెలుగుకవుల సత్కావ్యములన్

కం. లేదు బలాబల భుజ సం
పదల విభేదంబు తెల్పు భండన మొకడే
పదివేల సైనికుల బూ
డిద సేయుం బాంబు నొక్కటిం బడవేయన్

కం. చీనాసేనల రుధిరం
బానితి భీముని విధాన నాయువు కురుచై
మేనూద్వవలసె విధికిం
బానిసగద మానవుండు బలయుతుడేనిన్

కం. చనిచూచి రమ్ము లోకం
బనుభవమగు సద్యశస్సు నార్జింపుము నీ
మనుగడ నలువురి శ్రేయ
స్సునకై వెచ్చింపు మదియ సుఖముఘటించున్

చం. తెలుగులసంస్కృతింబొరుగు దేశములంగల మేలిసంస్కృతుల్
దెలిసి విశిష్టమానవత దిక్కులనిక్కగ జీవయాత్ర భూ
తలమున నిర్వహించి ఘనతం గడియించి జగత్కుటుంబివై
మెలగిసుఖించి ర మ్మవల మింటికి మించు గుణాల తేరిపై

ఉ. ఊపిరియాడనీక వివిధోత్కట మోహపిశాచకోటి ని
న్నేపున జుట్టుముట్టుకొను నింక సుధామయ నూతనాత్మ వే
పాపమెరుంగనట్టి పసిపాపవు నీదుచరిత్ర సద్యశో
దీపమునెత్తునో వసుమతిన్ జలబుద్బుదమై నశించునో

కం. నీరంటకుండ నీటన్
స్వారిసలుపు నీతపర్వువలె సంసృతి కా
సారము తరించి శుచివై
పేరందుము లోకహిత కవిప్రవరుడవై

తే.గీ. ఆవలి కథ జెప్ప నుంకించునంతలోన
బెట్టుదప్పిన కిన్నెర విధముగాను
ఆగిపోయిన దతని వాక్యస్రవంతి
విస్మరితమయ్యె నేమో పృథ్వీ చరిత్ర

చం. ఎగసె నతండు మింటిదెస కిద్ధరయం దొక కొన్ని మాసముల్
ముగిసె సముద్భవించె నొక ముద్దులబాలుడు నేలమీద పె
ల్లుగ విలపించుచున్ గడువులోపల నాకటి చిచ్చు రేగ హా
యిగ నిదురించె తల్లియొడి నీగతి జోలల నాలకించుచున్

మ. పురుటింటన్ జరణంబు మెట్టి భువనంబున్ జూచి కంఠంబు బొం
గురువోవం బలవింతువేమిటికి నీకున్ నాకలోకంబు క్ర
మ్మర రాదోయి దిగంబరీ యిచటి కామక్రోధలోభాలకుం
గురియైపోవక తప్ప దూరడిలి బంధువ్రాతముం గాంచుమా!

శా. ఊరుం బేరును లేక యే గగనమందో లీనమైయున్న ఆ
త్మారాము న్నిను రక్తమాంసయుత కుంభంబందు బంధించి ని
స్సారంబైన మనుష్యమండల నివాసప్రాప్తి గల్పించి నా
డేరాజో యతడే సమర్థుడగునోయీ! ముక్తి నీకీయగన్

ఉ. ఏడువకన్న నిన్నువలె నేడిచినా రొకనాడు భూపతుల్
గూడ మహీతలం బనెడు కుంపటిలోబడినాడ వప్పుడే
మూడు నిమేషముల్ గడచె ముందిక నీకుదయించి యెంద రి
ట్లేడుతురో గ్రహింపుమిది సృష్టిరహస్యమురా స్తనంధయా!

ఆ.వె. చందమామవంటి నందనుం డుదయించె
కులసముద్ర మింపు గులికె ననుచు
కన్నవారు పొరుగునున్న వారును గూడ
హర్షజలధి నీదులాడినారు

కం. చింతామణి బొడ్డున గల
దెంతయు శుభమనుచుబొగడి రెంతేనియు కా
ర్తాంతికులు తల్లిదండ్రుల
స్వాంతము లలరంగ హస్తశాస్త్రజ్ఞాతల్

కం. నీతియు నిజాయితియు వా
క్చాతురియుం గార్యదీక్ష కారుణ్యంబున్
పూతమగు నతని కోమల
చేతంబున మొలకలెత్తె చిన్నతనానన్

మ. చదివెన్ శాస్త్రములుంబురాణములుభాషావారిధిన్ ద్రచ్చిశా
రద నభ్యర్చనచేసి దొడ్డకవియై ప్రాచీప్రతీచీ యశోం
గద విభ్రాజితుడై రచించె రసవత్కావ్యంబులన్ మానవా
భ్యుదయాకాంక్ష విశాలదృక్పథమునన్ భూర్యంతరంగంబునన్

కం. నిరసించె నిఖిల కుక్షిం
భరు లగు రచయితల స్వార్థపరులను లోకో
ద్ధరణోద్యమ ప్రసిద్ధుల
చరితల గొండాడె విశ్వజన హితమతులన్

కం. మోమోటపడక కుహనా
స్వాముల గర్హించి దుష్టసంస్థల కవితా
ధూమాంకున కెరజేసి కవీ
డ్భీముం డను చిత్రమైన బిరుదువహించెన్

ఆ.వె. పసిడి గరిటెతోడ ప్రభవించెనేకాని
పాలుపడదు భోగలాలసతకు
దమ్మిడీ లొసంగి దాతగా పేరంది
విఱ్ఱవీగి తిరుగు వెఱ్ఱిగాడు

కం. కవితా జగమున రాత్రిం
దివమును విహరించు నతని దృష్టింబడు పే
లవమగు పదార్థమున గల
సువిశేషము నాకళింప జూచున్ సతమున్

కం. ఏదే నొక వస్తువులో
తాదాత్మ్యంబంది యద్భుతంబగు రస ము
త్పాదించు చూపరుల కు
న్మాది గదా సుకవి వింతమానవుడుజుడీ

మ. తన కావ్యంబులు సర్వరాజ్యముల యాత్రల్ చేసిసత్కీర్తి నా
ర్జన గావించి కళాభిమానుల నమస్కారంబులన్ గాన్కలన్
గొనిరా కొండొక చక్రవర్తివలె వేనూరార్లు సత్కారముల్
గొని యిల్దాటడు స్వాభిమానమున భక్తుల్ వత్తురీక్షంపగన్

కం. కవనము నిర్దుష్టంబై
వివిధ రసోత్కృష్టమైన విధమున కవియుం
బ్రవిమల చరిత్రుడౌటయు
నవసర మని ఋజువుచేసె నమృతాశయుడై

తే.గీ. వీరయోధుని యుపదేశ బీజకోటి
క్రమత నాతని హృదయరంగమున మొలిచి
ప్రబలమై కుట్మలించి పుష్పములు దొడిగి
పండి నిండారి మానవత్వము సృజించె

కం. అత దెదిగి పెద్దవాడై
శతవర్షాయుష్కుడై యశాశ్వతమగు నీ
క్షితితలము విడిచి చనె శా
శ్వతమగు పరమునకు నొక ముసాఫరుడగుచున్.

## యోధుడు

ఉ. ఆతడు దేహమున్ విడిచి అంబరవీధుల విద్యుదుజ్జ్వల
జ్యోతి విధాన లేచి చనుచో నిట నాప్తులు బంధుకోటి దుః
ఖాతురులౌచు నేడ్చుసమయంబున నైహికమోహబంధముల్
చేతమునుండి జారిపరచెన్ నలుమూలలకుం ఖగంబులై

కం. ఊహింపరాని దగు నొక
మోహన సూక్ష్మాతిసూక్ష్మ పుష్పనిభంబౌ
దేహమున జొచ్చె నతని ని
రీహాతుకమైన జీవ మింపు గొలుపుచున్

చం. తరగలు లేక స్వచ్ఛమగు దర్పణముం బలె పారిజాత పు
ష్పరజముతో విభాసిలి ప్రశాంతముగా ప్రవహించు నాక ని
ర్ఝరము దరిన్ చిరత్ననవరత్నరుచుల్ వెలిగ్రక్కునొక్క మం
దిరమున విశ్రమించె నవనీతల దుఃఖము విస్మరించుచున్

తే.గీ. పసిడి ఱెక్కలతో విహాయసము నుండి
వాలె నొకదూత యోధుని పార్శ్వభూమి
ధారుణీమానవుల జాబితాలు గల్గు
పుస్తకంబును నిజహస్తమున ధరించి

కం. సరసులయు విబుధులయునగు
చిరునామా లున్న వందు జీవితములలో
నెరపిన సత్క్రియులు ననం
తరబహుమానములు పెక్కుతరముల చరితల్

కం. ఏ మతవర్ణప్రముఖుల
నామము లివి వారి కిందినాములు లేవా
ప్రేమ న్నా కెరిగింపుము
స్వామీ యని యతడు ప్రశ్నసలిపె న్నతుడై

ఉ. లేవిటవర్ణభేదములు లేవిటనెట్టి మతాలు సత్క్రియా
పావనమూర్తులే యిట నివాసమొనర్తురు డాంబికాలకుం
దావు లవంబులేదు కులతత్త్వము చెల్లదు చెల్లనేమొ పృ
ధ్వీవలయంబునందు నవివేకులు గీచిన పుస్తకాలలో

ఆ.వె. స్వీయ దేశరక్షకై యుద్ధరంగాన
యుసురు లిచ్చి వచ్చియున్న నిన్ను
వంటి దేశభక్తి పరతంత్రులకు గూడ
స్థలము చూపగలదు స్వర్గసీమ

ఉ. ఎట్టివివేకశాలు రుదయించిన లోకమునెల్ల మూటగా
గట్టు ప్రతాపవారిధులు గల్గిన మానవు లొక్కతల్లికిం
బుట్టిన యన్నదమ్ము లను భూరివివేకము లోపమైనచో
పుట్టనుబుట్టిగిట్టు చెదపుర్వులు వార లనర్హు లిచ్చుటన్

ఉ. తుమ్మెద కాలుసోకని మధూళిమ జిందని నందనప్రసూ
నమ్ములు దండలల్లి సురనారులు కంఠ మలంకరింప దే
శమ్మునకై సమస్తసుఖసంపదలుం దనువున్ త్యజించి స్వ
ర్గమ్ము నలంకరించె నని గానము చేసిరి దేవగాయకుల్

కం. హిందూ దేశ చరిత్ర య
మందానందమున వీరమాన్యుని దగునా
ఖ్యం దలనుదాల్చి కీర్తి
స్యందనమున నతని మూర్తి స్వారి యొనర్చెన్

# నాగార్జున సాగర్

శా. ఓ నాగార్జున సన్మునిప్రవర! నీ పుర్వీస్థలిం బాసి, యె
న్నో నూర్లబ్దము లంతరించినవి, ఆంధ్రోర్విన్ భవత్సత్కళో
ద్యానంబిప్పుడు పూచికాచి సువిశాలాంధ్రంబు సృష్టించి, మా
కానందంబు ఘటించె, పండినవి నీ యానాటి దీక్షావనుల్

మ. ఉరవళ్ళున్ బరవళ్ళు ద్రొక్కుచు ప్రగాఢోర్మిచ్ఛటాలాస్యసుం
దరియై, చక్కని పిల్లకాల్వలు మహాంధ్రక్షోణికిన్ కోటి వ
త్సరముల్ శ్యామల సస్య భూషణములన్ సంధింప భాషా కవీ
శ్వర పూజా విధు లందుకొమ్మ లఘు కృష్ణావాహినీ మోహినీ!

మ. పుడమిం బావన మాచరింప కరుణాపూర్ణుండు శ్రీ శాక్యసిం
హుడు జన్మించె నఖండభారతికి, దివ్యుల్ మెచ్చ, లోకంబులో
నుడిగెన్ హింస అహింస మేల్కొనె శుభంబొప్పారె స్వాతంత్ర్యభా
నుడు క్రొన్నవ్వుల నుద్భవించె సుఖశాంతుల్ నిండె దేశంబునన్

మ. ఘన నాగార్జున సాగరంబు వెలసెన్ గంగమ్మ కాల్సాచి యెం
డిన క్షేత్రంబుల నిద్ర మేల్కొలిపె పండించెన్ సువర్ణంబు, చ
క్కని ప్రాజెక్టులు నిక్కె, దేశము సుభిక్షంబై ప్రకాశించె, బు
ద్ధుని శిష్యావళి పాద పద్మముల యందుం బుణ్య మెంతున్నదో!

మ. క్రమతన్ విచ్చిన వేయి రేకుల దళత్కంజాత మాంధ్ర ప్రదే
శము నందిప్పటి పల్లెనాటి ప్రజలైశ్వర్యంబు వీక్షించి ఘం
టము చేపట్టుము నైషధ ప్రముఖ నానాకావ్యనిర్మాతృచం
ద్రమ! శ్రీనాథ మహాకవీ! దొరక వన్నా నీకు జొన్నన్నముల్

ఉ. అంగడి యూరలేదు, వరియన్నము లేదు శుచిత్వమేమిలే
దంగన లింపు లేరనుచు నప్పుడు వల్కితి విప్పుడందువా
అంగన లంద రిందు దమయంతులుగా వరియన్న మంతయుం
బంగరు బువ్వగా బలికి వ్రాయవె నైషధ కావ్యముల్ కవీ!

మ. కలనాదంబున నందికొండ శిఖరాగ్రం బెక్కి కృష్ణాపగా
జల ముప్పొంగి తెలుంగు భూముల కభీష్టంబుల్ ప్రసాదించెడిన్
పలుకుల్ నేర్చితి నంచు దిట్టితివి మా పల్నాటి గడ్డన్ భళా
భళి! నీ నవ్విన నాపచే నిపుడు జాల్వాపంటలం బండెడిన్

ఉ. నీరవమైన యగ్గిరి వనీ వనభూముల నుండి దివ్యశం
ఖారవ మొందు స్తూప శిఖరాగ్రముల న్నినదించు చుండు సం
సారదవాగ్ని తప్తులకు శాంతి ఘటించుచు నిద్రపోవుచు
న్నారనరాదు భిక్షువులు నాడును నేడును బౌద్ధబోధకుల్

చ. పులులు ప్రదక్షిణించినవి, ముద్దిడుకొన్నవి నందికొండలో
యలు చరణాంక ముద్రికలు స్వాగత గీతము లాలపించి ప
క్షులు తమిమీర రెక్కగొడుగుల్ ఘటియించిన విందు బుద్ధ శి
ష్యులకు, పవిత్రచైత్ర పరిశోభితముల్ పలనాటి క్షేత్రముల్

మ. అదిచల్లారని జ్యోతి, ప్రోజ్వలిత మాయా మానినీ గర్భసం
పద, సిద్ధార్థ మహావతార మిట నావాసంబు గావించుకొ
న్నది పెక్కేడుల నాటి నిద్రిత మహా నాగార్జునాచార్యు న
భ్యుదయశ్రీ వెలిగ్రక్కుచున్ నవయుగంబున్ ధన్యమున్ జేయుచున్

మ. మణిభూషల్, మణిసౌధముల్ విడిచి సామ్రాజ్యంబు బోనాడి దా
రుణ సన్యాసము స్వీకరించిన నరేంద్రుం డీ నగం బందు ప్ర
త్యణు మధ్యంబున గోచరించెడిని బ్రహ్మాండం బహింసా పరా
యణమై పాదము లాశ్రయించె నిది పుణ్యక్షేత్ర మాంధ్రాళికిన్

ఉ. కాల కఠోర భూరి పరిఘూహతి కూలిన నాటి బౌద్ధ వి
ద్యాలయ భగ్నశేషముల యందు, ననంత శతాబ్ద గర్భని
ద్రాలస సంస్కృతీ రమ తథాగతు పుణ్యకథానకంబులన్
జాలిగ బాడుచున్నది దిశల్ పులకింప విపంచి మీటుచున్

సీ. నాగార్జునాచార్య నయనద్వయము నుండి జన్మించె సౌభాగ్య సాగరంబు
బ్రహ్మనాయని చిత్త పద్మంబు వికసింప నుదయించె హరిజనాభ్యుదయసంధ్య
వర్ష పంచకరత్న పథక కల్పక మందు చిగురించె నగర సంక్షేమ శాఖ
ఆంధ్రప్రదేశంబు నాశ్లేష మొనరింప నేతెంచె రసవాణి కృష్ణవేణి

తే.గీ. అక్షరాక్షర మధురస స్యందు లగుచు
కూయుచున్నవి సుకవితా కోకిలములు
తెలుగు గద్దె ప్రజాభీష్టములు ఘటించి,
ప్రబలు గావుత మయుత సంవత్సరములు.

సీ. ముంబా పురీ రాష్ట్రమున పశ్చిమంబుగా పాయకట్టున సముద్భవము నంది
ఉపనదీ సఖులు చేయూత నీయగ సాగి కడలి రాయని మీద కన్నువేసి
అడుగు వారలకు లేదనక దాహముదీర్చి కరువు కాటకముల కాలరాచి
పదియు రెండేండ్ల యౌవనము జారగనీక పుష్కరంబుల నిత్యపూజ లంది

తే.గీ. ప్రతిఫలాపేక్ష లేక భూప్రజల కెల్ల
తీర్థదానంబు చేయు నదీమతల్లి
కడగి నాగార్జునాఖ్య సాగర సమాఖ్య
నవతరించితె కృష్ణా మహాస్రవంతి!

సీ. అన్నమో రామచంద్రా యంచు నల్లాడి పరదేశముల కేగి బ్రదుకువారు
యకర మొక్కటికి మానిక గింజ రాలక హరిహరీ యని యంగలార్చు వారు
పన్నుగట్టుట కిండ్లు వాకిళ్ళు తెగనమ్మి మైమీది బట్టతో మసలువారు
సుంకువట్టిన కంకి సురిగి వర్షము లేక యెండిపోవగ జూచి యేడ్చువారు

తే.గీ. నీకు దాపున నున్నారు నిశ్చయముగ
నిన్ను కన్నార వీక్షించి నిబ్బరించి
సంతసించిరి నీకు నిచ్చలును పూజ
జరుగు నాగార్జునాచార్య సాగరంబ!

సీ. తడుపుచున్నారు క్షేత్రములు కర్షకకోటి మానక మేని చెమ్మటలు గురిసి
కట్టుచున్నారు సర్కారు వారికి శిస్తు లెట్టులో తలలు తాకట్టువెట్టి
కడుపార మేత చిక్కక శుష్కితాంగమై బ్రదుకు చున్నది మాదు పశుగణంబు
త్రవ్వుచున్నారు పాతాళ కూప శ్రేణి యేటేట బుంగెడు నీటికొరకు

ఆ.వె. పాదమూని సిరులు పండించి కష్టముల్
చెండివేయ నిందు చేరినావు
పల్లనాటి సీమ ప్రఖ్యాతి గలదమ్మ
శ్రీ గలట్టి దొడ్డ సాగరంబ!

సీ. పండించు కొందు మిర్వది లక్షలకు మించి క్షేత్ర రాజముల నీ చెమ్మసోక
ఆకొన్న పేద తాలూకాల దుర్దశల్ తొలగిపోగలవు నీ చెలిమి సోక
కరుణ కొంచెము లేని కరువు బెబ్బులిపండ్లు రాలిపోగలవు నీ రాకచేత
ఆశోపహతి తప్తమైన దీనుల చింత మాసిపోగలదు నీ మైత్రి కతన

తే.గీ. యెన్ని తరముల నుండియో యెదురుచూచి
నిలుపుకొన్నాము నిన్ను సాన్నిధ్యమందు
దిగులువాసెను మా కష్ట దినము లెల్ల
చనియె నాగార్జునాచార్య సాగరంబ!

మ. సరవి న్మున్ను పునాది వైచి చనియెన్ జాతి ప్రభుండైన జ
హ్వారు మంత్రీశుడు పంచవర్షములు మూడైపోయె నింకైదు వ
త్సరముల్ పూర్తిగ నిందులోపల మదాంధ్రక్షోణి ఆశించు బం
గరుపంటల్ ఫలియించు నీ నగము ప్రక్కన్ బుద్ధశిష్యాగ్రణీ

శా. మూడైదేండ్ల ప్రణాళికల్ ముగిసి నీ పుణ్యాన దేశంబు డొ
క్కాడెన్ బెక్కభివృద్ధి సంస్థలును యంత్రాగారముల్ నిక్కె మే
ల్గాడిం బడ్డది జాతి జీవనము సంగ్రామంబులో నిల్చి పో
రాడం గల్గు జవాను శిక్షలకు విద్యాశాల లేపారెడిన్

మ. పులులుం బందులు రేచు లేలు వన భూముల్ నేడు యద్దాల మే
దలతో నిద్దపు రాజమార్గముల తోడన్నిండి విద్యుల్లతా
నిలయశ్రేణుల నేత్రపర్వముగ ఆంధ్రీదేవతా మస్తకో
జ్వల రత్నాభరణంబుగా వెలసె స్వేచ్ఛా రాజ్య చిహ్నంబుగా

ఆ.వె. పొదుపు జేసి కొనుట కుదయించినవి పెక్కు
సహకరించు బ్యాంకు లహరహంబు
విద్య నేర్పు బడులు, వేనవేల్తలసూపె
ఊర నూర పెద్దవారి కొఱకు

మ. పరదేశాలకు చేయిసాచక యలభ్యంబైన యంత్రాళి స
త్వరమిచ్చోట తయారు చేసికొను సంస్థారాజముల్ కూర్చు యెం
దరికో జీవనముల్ చరిత్రనొక యధ్యాయంబు బంగారు ట
క్షర శోభన్ వెలుగొందు నిక్కముగ వక్కాణింప నాగార్జునా!

సీ. స్థాపించినావు విద్యాలయం బిచ్చటి నందికొండల యరణ్యముల యందు
కట్టించితివి పెక్కు కట్టడంబులు విహారములు చైత్యములు స్తూపముల గములు
చేర్పించితివి తక్షశిల నలందాల విద్యార్థుల విశ్వవిద్యాలయముల
కరపినాడవు భిషగ్వరుల కాయుర్వేద విద్యారహస్యముల్ వివిధ గతుల

తే.గీ. యేండ్లు పూండ్లును కడచిపోయినవి గాని
మాసిపోలేదు నీ యశోమహిమ నేడు
నీవు పాదంబు మెట్టిన నేల యందె
కడకు జన్మించె గొప్ప సాగరము బుగ్గ

మ. ఘన శైలంబును ప్రక్కలించిరి సొరంగం బొందు నిర్మించి రు
ద్ధన శబ్దంబున కృష్ణనీ రుబికి ఆనందంబు గల్పించు వ
ర్ణనకు న్మించిన మానవోత్తముని విజ్ఞానంబు కీర్తించుచుం
దును నోరుండని కొండలు న్మనసుపండు న్నిల్చి వీక్షించినన్

చం. తలపరు తెల్లవారు భరతక్షితి కభ్యుదయంబు వారి క
త్తుల ఝుళిపింపుచే బెదరి దుర్దశ పాలయి యున్న జాతిలో
చలనము నించి పౌరుషరుషల్ దరికొల్పిన శాంతిదూత నీ
జలములు గ్రోలి దీవెనలు సల్పగ లేదుగదమ్మ సాగరా!

కం. కల దింజనీర్ల ప్రతిభకు
వలసిన పని చేతినిండ ప్రాజెక్టులలో
జల విద్యుద్యంత్రాలయ
ములలో నద్యతన సౌధముల నిర్మితిలో

ఉ. లోపములెత్తిచూపు పెనులోభుల మాటల కేమిగాని దే
శోపకృతుల్ సహస్రము సముద్భవ మైనవి కొత్తకొత్తదీ
కాపుర మిర్వదేండ్ల యధికారము నందు స్వరాజ్య గేహమీ
రూపు వహించె తీర వొకరోజున కోరిక లాంధ్ర సోదరా!

ఉ. నీవొక సాగరంబవయ నిల్చితి గంగమతల్లి వార్ధికిన్
సేవలు చేయు బాధ ముగిసెన్ ఘనమైనది దేశసేవ నీ
పావనమైన తోయము లవంబు లభించిన లక్షభూములే
కావొకలక్ష జిహ్వలు సుఖంపడు పుణ్యము నీకు దక్కెడిన్

ఉ. నిన్నిట నిల్పి నీ మధుర నీరము గ్రోలు ప్రజాళికెల్ల యిం
తన్నము బెట్టినా వయిదు నారగు వర్షము లింకముందు రా
నున్న తరాలవారికి సహోదరివై కడుపార నిష్ట మృ
ష్టాన్నము బెట్టుమమ్మ సుఖమబ్బును రాష్ట్ర ప్రజాళికంతకున్

చం. జవహరువోయె శాస్త్రి దివిషత్సభ కేగె మహాత్ము డెప్పుడో
యవని త్యజించె జహ్వారుని యాత్మజ దండము చేతబట్టె మా
ర్దవమతి కోమలంబగు హృదబ్జము గల్గిన యిందిరమ్మ హైం
దవ ధరణీ శుభోన్నతికి తప్పక తోడ్పడు దేశ సోదరా!

# ఆంధ్రకవుల భావచిత్రములు

వాఙ్మయసరస్వతి తనమంజీరధ్వను లొలయ మురిపములు మీఱ సంచరించు నేఁటిపరిషత్సభకు నేనాహ్వానింపఁబడి, కృతపుణ్యుఁడనయితిని, నా యల్పవ్యాసమును బండితకోటి కరుణమెయి నాలించి నన్నుఁగృతార్థునిఁ జేయుఁగాక.

నా వ్యాసాంశము "ఆంధ్రకవుల భావచిత్రములు" ఆంధ్రశబ్దము చెవుల సోఁకినంత వివశుండ నయిపోవుచుందును. ఆంధ్రకవులు నాకు సేవనీయులు. ఇది నా దేశము. నాపలుకునది యాంధ్రము. Italian of the East అనుబిరుదంబు నురంబునఁ బూని "సంస్కృతంబు తల్లి సకలభాషలకును, బాసలలోఁ దెలుంగుబాస లెస్స" యనిపించుకొన్న భాషాశిరోమణి, మఱి నేనేల పొంగిపోవకుందును?

సీ. బహుదేశములను బేర్వడసి మీసముదీటు భరతఖండంబు నాపాఠశాల
స్తనయుగంబున గానసాహిత్యములుపిండు భాషావధూటి నాపంతులమ్మ
సాందీపముని సమక్షమున విద్యగణించు వనమాలి నాసహపాఠకుండు
భక్తివైరాగ్యభావములఁ దావలమైన భాగవతంబు నాబాలశిక్ష

తే.గీ. ఘంటము ధరించి మోహనాక్షరము లెనయఁ
బ్రతిఫలించెడు నామహోన్నతవిభూతి
వ్రాసికొందును దశదిశాఫలకపంక్తి
గడనకెక్కిన యాంధ్రపుత్రుఁడను నేను

అని నేనాలపించుచు జీవయాత్ర గడపెదను. ఇంకఁ బ్రకృతమునకువత్తము. ప్రప్రథమమన నెట్టిది? కవిత. సృష్టికర్త యగుకవి యెట్టివాఁ డనురెండంశములను గూర్చి విచారింతము.

కవిత : చరాచరాత్మక మైనప్రకృతిని దనప్రజ్ఞాబలంబున వడియఁగట్టి కవి స్వాధీనముచేసికొను నొకానొక యద్వితీయసమ్మోహనవిద్య. దాని నతఁడు పరిశుద్ధభాషా వాహినియందు స్నానమాడించి ఛందం బనుచట్రమున బిగించి మనకుఁజూపును. దానికి శ్రోతలును బఠితలును దన్మయు లగుదురు. అది నవరసస్యందియై భువనములను శాసించును. దాని సౌందర్యమునకుఁ బెదవి విఱువని వాఁడును, జెమ్మగిల్లనివాఁడును ముల్లోకముల లేఁడు. భూమ్యాకాశములను బొమ్మలవలె నాడించుకాలమున కది లొంగదు. కాలము కవితకు దాస్యము చేసితీరును. అది యొకరసప్రపంచము. దానిలోని ప్రత్యణువు నమృతమయమును శాశ్వతికంబ. అందలి నదులు, పర్వతములు తిర్యగ్జంతువులు పాడనేర్చి

నవి. దానికధినాథుఁడు కవి. ఆతఁ డాకవితాప్రపంచమధ్యమున దివ్యసింహాసనము నధిష్టించి పరిపాలించును. వానికి శత్రుభీతి లేదు. అతనియైశ్వర్య మొకరిచే సపహృతము కాదు. అతఁడు మహాభోగి; తా నది యనుభవించుచుఁ బ్రజలకుఁ బంచిపెట్టును. దాన నతఁడు దాతయు.

ఇట్టిగుణములు గలిగి రసాత్మకమైన యొకవాక్యమే కావ్య మని విశ్వనాథపండితుఁడు నుడువుచున్నాఁడు. ఈకవిత కంగసౌష్ఠవమును గూర్పఁదలఁచి భామహోద్భటమమ్మటాదు లలంకారశాస్త్రములను నిర్మించిరి. కవితకుఁ బ్రధానాంగమును జీవము నయినది భావచిత్రము. సౌరకవి యగుబృహస్పతిచే నుప లాలింపఁబడిన కవిత్వచరిత్ర మన కనూహ్యంబు, కాని, వాల్మీకిముని భావచిత్ర రచనాదక్షుఁడై, దీనిని సర్వాంగశోభితను గావించి నాఁడు

కవి యెట్టివాఁడు – వానిమనస్తత్త్వమేమి?

A poet is born but not made అని షేక్సుపియరు మహాకవి. కవి సామాన్యుఁడు మానవ ప్రకృతికి నతని కెట్టివ్యత్యాసమును లేదు. కాని స్వతస్సిద్ధ మైనయొకశక్తి నీశ్వరుఁ డతనికిఁ బ్రసాదించియుండును.

శ్లో॥ యానేవశబ్దాన్ వయమాలపామః । యానేవ చార్థాన్ వయముల్లిఖామః
తైరేవ విన్యాసవిశేషభవ్యైః । సమ్మోహయంతి కవయో జగంతి. అనునది.

కాని యాయాశబ్దార్థములను భవ్యస్థానములయందు న్యస్తముచేయుటకుఁ గవి యనుష్ఠించునది చింతనము; మఱియు నతనిలో సునిశితమై రమ్యతమపదార్థములలోని సృష్టిస్వభావము నెఱుంగఁజాలిన విజ్ఞానము పొంగులువాఱుచుండు. అతని యంగకములలో నుడుకు నెత్తురు పిలిచినఁ బలుకుచుండును. కావుటంబట్టి కవి పరాధీనజీవనమును సహింపఁడు. సార్వజనీనమైన సత్యమును వచించుటకు వెనుదీయఁడు. తనహృదయతంత్రి కదలెనా యతఁడు గానము చేసితీరును. దాన నతనికి మరణమే ప్రాప్తించుఁగాక. వానినాల్క రహస్యగోపనము నెఱుంగదు.

వీరోత్సాహపూరితులై, రాజానుచరులను జించిచెండాడుచున్న ఫ్రెంచి దేశీయులలో నొకానొక విప్లవకారుని సంహరించి తనువుఁ గోల్పోయిన యొకసుందరి నారసి యొక ఫ్రెంచికవి, She is greater than Brutus (ఆమె బ్రూటసుకన్న గొప్పది) అని కేకలిడి పద్యముల నల్లి వాని నాలపించి యసువులను బోఁగొట్టుకొన్న కథ, కవి యెట్టివాఁడో స్పష్టపఱుచుచున్నది.

భావచిత్రములు : భావచిత్రములనఁగా భావములను బొమ్మలు. చిత్రములను రచించువానికి రంగులు, కుంచె, కాగితము, పరికరములు. లక్ష్యముల నతఁడు వ్రాయును.

గగుర్పాటులకును నగ్గమగును. చిత్రకారునకువలెఁ గవికిని సేకరింపవలసిన పరికరము లెన్నియో కలవు. అవియే రీతులు, శయ్యలు, పాకములు, అలంకారములు. అలంకారము లనుటచేత ఛేకానుప్రాస లాటానుప్రాస యమకములని నాయభిప్రాయము కాదు. కాళిదాస వాల్మీక్యాదులు స్వీకరించిన యుపమా రూపకోత్ప్రేక్షాదులు. కవి వీనిని బురస్కరించుకొని తన దివ్యలేఖని నుండి బొమ్మలను వ్రాసి లోకమున కర్పించును. కవివ్రాయుచిత్రములు చిత్రకారుని బొమ్మలవలెఁగాక హావభావములతోఁ బ్రాఁతవడక చివికిపోక వికలములుగాక వివర్ణతనందక మనమనో నేత్రముల నక్షరవపుర్విలాసభాసమానములై తాండవించు చుండును.

అగుచో నిది సాధ్యమగునా? నేఁడు మనము కవు లనువారలలో నెవఁడీ భావచిత్రములను రచింప దక్షుఁడయ్యె ననుమీమాంసకు నిలుచునది కొలఁది మంది మాత్రమే యని ప్రతి సహృదయుఁడు నొప్పికొనితీరును. ఎవనికవితయందు వ్యర్థాలంకారరచనా వ్యాప్తి గోచరించునో యతఁ డలసుఁ డనంబడును. భావ చిత్రరచనా రహస్యజ్ఞుల కీయలంకృతు లౌకవిధముగా నుపకరించినను వారు ప్రధానాంగముగా నిల్పునది భావము. అది లేనివాని వ్రాఁతలలోఁ గథాచిత్ర మొక్కటియే గన్పట్టును. లేదా? అలంకార శిల్పము కవితను గూర్చి పురాతన కవులకుఁ గలయభిప్రాయభేదము లసంఖ్యేయములు.

కం. మదమున సత్కవికావ్యము, నదరఁగవిలుకాని పట్టినమ్మును బరహృ
ద్భిదమై తలయూఁపింపని, యదికావ్యమె? మలరిపట్టినదియుం గరమే?

మ. పదబంధంబుల నగ్గలించి, బుధశబ్దభ్రాజియై, సద్గుణా
స్పదమై, దుష్కవిహృత్సరోజవనముల్ భంజింపుచున్ భూరిస
మ్మదలీలన్ విలసిల్లి, సత్కృతిజగన్మాన్యప్రభావంబునన్
మదనాగంబును బోలెఁగ్రాలవలదా? మా ఱెందు లేకున్నతిన్ – నన్నెచోడుడు

చ. ఘనతరగూర్జరీకుచయుగ క్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుఁగవలీల గూఢతయుఁ జాటుఁదనంబును లేకయుండఁ జె
ప్పినయదెపో కవిత్వ మనిపించు నగిం చటుగాకయుండినన్ – చాటువు

ఉ. అల్లన విచ్చుచెంగలువలందు రజంబను గప్పురంబు పైఁ
జల్లఁగఁ జల్లనై వలచుసౌరభముల్ వెదచల్లుభావముల్
పల్లవహస్తచన్నుఁగవపయ్యెదజీబునఁ దోఁచుభాతిగాఁ

సీ. పొసఁగ ముత్తెపుసరుల్ పోహళించినలీలఁ
దమలోన దొరయు శబ్దములఁ గూర్చి - సూరన

రమణీయార్థప్రతిపాదకః కావ్యమ్ - పండితరాయలు

కవిత యట్టిదని నిర్ధారించిన యిక్కవులయభిప్రాయము లన్నియు దాదాపుగా భావచిత్రములనే ఘోషించుచున్నవి.

భావము - దీనియర్థ మే మని చర్చించినచో, నేదో యొక భావము పద్యమున కుండవలెను. భావవిరహితముగాఁ గవిత కలదా? యని కొందఱు వాదింతురు. ఆభావము సామాన్యులకు వశ మగునది గాక నవనవోన్మేషశిరీష కుసుమపేశలతయును గప్పురపుఁ బల్కుల శైత్యమును జుంటి తేనెల మాధుర్యమును, విలుకాని యమ్ముకొననున్న నిశితత్వమును గలిగి చదివినంతనే పాఠకునకు సర్వాంగీణ మైన యొకానొక తన్మయతను గొనివచ్చునదయి, యభినవం బైనదయి యుండవలయును. ఇట్టిభావములను బ్రకృతి నుండి సేకరించుటయు వానినిఁ దగురీతిని జిత్రించుటయును నుత్తమకవికి లక్షణము. ఆలంకారికులు కావ్యమునకు ధ్వని ప్రధాన మనియు, నలంకారము ప్రధాన మనియు, నోజస్సు ప్రధాన మనియును భిన్నరీతుల నుగ్గడించిరి. రాజశేఖరుని కావ్యమీమాంస సాహిత్యపురుషునకును గావ్యేందిరకును మఱొక విధముగా శరీరసృష్టిఁ జేయుచున్నది. ఇమ్మహనీయులమతమునకు నావ్యాస మిసుమంత భేదించుచున్నను నానిశ్చితాభి ప్రాయమును వెల్లడింపఁబూనిన నాసాహసమును బండితులు మన్నింతురుగాక.

పురాతన కవులు-భావ చిత్రములు

భావచిత్రములు కుప్పలు తెప్పలుగా గోచరించుచుఁ బాఠకులహృదయముల నొక చలనపట ప్రదర్శనశాలయం దుంచి విభ్రమాశ్చర్యములతో ముంపఁజేయఁ జాలిన కావ్య సృష్టికర్తలలో నెన్నఁదగినవారు వాల్మీకికాళిదాస ప్రభృతులు. వాల్మీకి చూపిన మార్గము ననుసరించి, రసగ్రహణపారీణుఁ డగు కాళిదా సలంకారరత్న మనందగిన యుపమానమునకే ప్రాముఖ్య మొసంగి కవి లోకపట్టభద్రుఁడైనాఁడు.

ఉపమానము లనుట చేత నలంకారముల కిక్కడ విశేషప్రసక్తి లేదు. భావ చిత్రములను రచించుచు, వానికి మెఱుంగుపూతఁగా నలంకారములలో నుపమలను విశేషముగా స్వీకరించెనన్నమాట.

శ్లో. ....మందానిలోద్ధూతకమలాకరశోభినా
గురుం నేత్రసహస్రేణ చోదయామాస వాసవః॥

ఇందు దేవేంద్రుఁడు వేయిగన్నులతో సైగ చేయుట గమనింపఁదగినది. సమయమునకుఁ దగినట్లు బృహస్పతిని గనుసైగ చేసె ననుటలోఁ గలగంభీరతయే భావము. దీనిని యుక్తమైనయుపమానమునఁ జికిలీచేసి, "నీవు చెప్పవయ్యా!" అను పేలవ మైన యంశమును రసభరితము గావించినాఁడు. ఇట్టిచిత్రములు సంస్కృతకవులరచనలలో లెక్కకు మిక్కిలిగా నున్నవి.

తిక్కన – ఇంక నాంధ్రకవులవంకకు మరలి భావచిత్రములను వ్రాసిన కవిచక్రవర్తులను బేర్కొనవలసివచ్చినపుడు తొలుత, తిక్కనార్యుఁడు మన మన్ననకుఁ దగియున్నాఁడు. తిక్కన భావముల కిచ్చినంతప్రాధాన్యము నలంకారమునకుఁ గాని, పాకమునకుఁగాని కథకుఁ గాని యొసంగఁడు. కేవలమలంకారప్రియులైన కొందఱకు దిక్కన కవిత తిక్కతిక్కగానే కనిపించును, గాని కవిలోకచక్రవర్తి యతఁడే యని ప్రతిపద్యమును గేకలిడుచుండును.

చ. కడుఁ బసిబిడ్డ వీఁడొకటి గా దవు నా నెఱుగండు ముంద రె
యెడ నొకపా టెఱుంగఁ డెదయెంతయుఁ గోమల మెప్పుడైన నే
గుడువఁగఁ బిల్తుఁగాని తనకుం గలయాఁకటిప్రా ద్దెఱుంగఁ డీ
కొడు కిటు వోకకున్ మనసు గుందెడి నిన్గని యూఱడిల్లెడిన్

ఈ పద్యమున నరణ్యముల వసింపఁబోవు పాండవులలోఁ గనిష్ఠుఁ డగు సహదేవుని ద్రౌపదికిఁ జూపి కుంతి పలికినమాతృప్రేమ వెల్లివిరియుచున్నయది. వేయిమాట లేల యిక్కడఁ దిక్కనార్యుఁ డొక నిస్సీమం బైన మాతృప్రేమవాహిని జిత్రింపఁదలచి, కుంతీమానసమున నైక్య మంది వెలువరించిన కరుణారసదిగ్ధం బైనశబ్దజాలము గాని యిది పద్యము గాదు. ఇది సహదేవుని పసితనము, కుంతి కొడుకులఁ బెంచుకొన్నవిధము, తాను లేనిలోటు దీర్చి, ద్రౌపది పతులను సంరక్షించుకొనుటయందలి యప్రమత్తత, ప్రత్యక్షరమునను గోచరించుచుఁ దిక్కనార్యునికళా ప్రతిభను సహస్రముఖములఁ జాటు చున్నది. రెండవవాఁడు నాచనసోముఁ డు –

మ. అరిఁజూచున్ హరిఁజూచుఁ జూచుకములం దందందమందారకే
సరమాలామకరందబిందుసలిలస్యందంబు లందంబులై
దొరుఁగన్ బయ్యెదకొం గొకింత దొలఁగం దోర్ద్దోశరాసారమున్
దరహాసామృత సారమున్ గురియుచున్ దన్వంగి లీలాగతిన్

ఇందొకవంక సత్యభామ కినుక రెండవవంక కృష్ణునియం దనురాగమును ప్రదర్శించుటను గవి చిత్రించినాఁడు. శృంగారవీరము లనురెంటి నొకచోట

నాట్యమాడించుచున్న యీపద్య మెవ్వని ముగ్ధునిఁజేయలేదు? ఇది భావచిత్రము. మూఁడవవాఁడు కృష్ణ దేవరాయలు-

మనవారు క్లిష్టకావ్యమని యనాదరించిన యితని యాముక్తమాల్యద భావచిత్రములకు ఖని. అనన్యసామాన్యము లయినతన భావములను బరిపూర్ణముగా వ్యక్తము చేయుటకును - ఆభారమును వహించుటకును - సరళమైన భాష యోరువలేకపోయినది. అందుచేతనే తా నట్టి భాష నుపయోగించె నని నాయూహ.

మ. అసురేంద్రాశయకుండికాచ్ఛరుధిరవ్యాప్తస్వకచ్ఛాయఁ గాం
చి సముద్యత్ప్రతిసింహమత్సరమిళచ్చేష్టన్ దదుద్దామదీ
ర్ఘసటాఝూటముఁ బెళ్ళగించుక్రియ నాంత్రశ్రేణిఁ గిన్కం బెఱం
జు సితక్రూరభవన్నఖావళులు ప్రోచున్ మర్త్యపంచాననా

ఇందలిభావచిత్రము హృదయవిదారకమై హిరణ్యకశిపుని హృదయ విదారణ వ్యాపారమున భయంకరాకారుఁడైన నరసింహుని శాశ్వతకాలము చిత్రించివేసినది. రంగులతోఁ జిత్రకారుఁ డీబొమ్మను వ్రాయలేఁడు. ఒక వేళ వ్రాసినను నీభయానకదృశ్యము స్వాధీనము కాదు. తన ప్రతిబింబమును నీట నారసి కుందేటిచే మడిసిన పంచతంత్రమునఁ గల సింహపుకథ నాకు జ్ఞాపకమునకు వచ్చుచున్నది. సింహస్వభావము నవగతము చేసికొన్న జంతు శాస్త్రవేత్తలకుఁ గాక మఱొకని కీవర్ణన దురవగాహము.

మ. మునుమున్ దెల్పును దూఱఁదూఱ మఱికెంపున్ వెండియుందూఱఁ గం
దనగాయం గల నల్పు దోఁప, నఖకోణశ్రేణిచే విక్రమం
బున వాఁడుగ్రతఁ గొన్నయట్టి విలసన్మూర్తిత్రయీతేజమున్
గొనులీలన్ విదళింపవే యసురవక్షోభిత్తి మిథ్యాహరీ!

ఇందు కవియొక్క శరీర శాస్త్రజ్ఞానము, బహువీరవిరోధి వక్షఃపాటన పరిశ్రమంబును స్పష్టముగా నుల్లేఖింపఁబడినది. శరీరము గాయపడుచోఁ దొలుతఁ దెల్పు దోఁచుట సహజము. శరీరశాస్త్రజ్ఞులు దీనినే ప్రభాసిని యందురు. తదుపరి రక్తమూరి యెఱుపు దోఁచును. కందనగాయ నల్లని దగుట ప్రసిద్ధము. ఈవర్ణత్రయమును మూర్తిత్రయీతేజమునకు సంధించి హిరణ్యకశిపుని సంహారవ్యాపారమును ముగించిన యిమ్మహనీయు నేమనవచ్చును?

ఎక్కడి దానవేశ్వరుని దేహప్రకృతి? యెక్కడి మూర్తిత్రయీతేజము? ఇట్టి వర్ణన వీరాధివీరుఁడును గవియు నగుకృష్ణరాయనికిఁగాక యొరులకు సాధ్యముగాదు. నాల్గవ వాఁడు పెదన:-

"కులిశధారాహతిపొలుపునఁబయినుండి యదుగుమోవఁగజేగురైన తటుల"

అనుపద్య మొక నిసర్గసిద్ధం బయిన కొండకొనను సృష్టించి, తనువులను హాయి హాయి యని జోకొట్టుచున్నది.

"క్రోధైకధురీణతన్ గఱచి యేసినసింగిణికోలయో యనన్"

"తతనితంబాభోగధవళాంశుకములోని యంగదట్టపుఁగావిరంగువలన"

మొదలగుపద్యములలోని భావములసొం పప్రతిమానము. అయిదవవాఁడు చేమకూర వేంకటకవి :

మ. తనకున్ గౌఁగిలి యీవొకప్పుడును నాథా! నీకరస్పర్శనం
బున గిల్గింత లటంచుఁ బద్మిని కరాంభోజంబునన్ మందమం
దనటద్వాయుచలద్దళాంగుళులుఁ కన్పట్టంగ నవ్వెల్గురా
యని రారా! యని పిల్చె నాఁదగె, ద్విరేఫాద్యంతదీర్ఘధ్వనుల్

సరోవరమునఁ బద్మిని మందమందనటద్వాయుచలద్దళాంగుళులతో రారా! యని సూర్యభగవానుని బిలుచుచున్నయది. కాని వ్యంగ్యముగాఁ బద్మినీ జాతిస్త్రీల లజ్జావతిత్వమునకు లోపమో యని సందేహింతును. తెలుఁగుకవుల వ్రాఁతలలోని యనేక వర్ణనలలో నిదిసమస్తఁ విధముల భేదించుచున్నది. విస్తరభీతి చేత నేనొక్కొక్క కవివ్రాఁతల నుండి యొకటి రెండు పద్యములను మాత్ర ముదాహరించినాఁడను.

-: ఒకానొక యాధునిక కవి :-

గీ. పూలబిడ్డల వలపుటుయ్యాలలూఁచు
పవనుఁడెఱుఁగఁడు తొడిమెలు వదలుననుచు"

ఈ పద్యమును జూడుఁడు. పూఁబాపల నుయ్యాల లూఁచఁ బూని వాయుమాణవకుఁ డుద్యమించెనఁట, ఇతఁ డెవరు? ఈ బిడ్డలెవరు? అచేతన ములయిన పదార్థముల కన్యోన్యప్రేమను గల్పించుట స్వభావవిరుద్ధముకదా? పాప మతఁ డూఁచును. కాని బిడ్డలు రాలిపోవుచున్నారు. వాయుకుమారుఁడీకీ లెఱుంగని యమాయికుఁడు; బిడ్డ లల్పజీవులు. ఈ విచిత్రభావచిత్రరచనము నారసి సహృదయుఁడు కన్నీళ్లు నించుచున్నాఁడు. ఇందలి కథావస్తువులు ప్రకృతి నుండి గ్రహింపఁబడినను గర్భితమై యున్న కథ మానవునిది. ఇట్టి రచనాదక్షు లగుకవులనే (ఌజీరివీరిదీబిజి ఆళిలిశిరీ) ఉపజ్ఞగల కవులందురు.

ఉపసంహారము

భావచిత్రములకు ధ్వనిగాని, ధ్వని కర్థస్ఫురణము గాని దేని కెయ్యేది సహాయ్య మొనర్చిన నొనరింపకున్నను మొత్తము మీఁదఁ బద్య మానందరస సిద్ధికి మూలమై యుండకున్న నది కవిత కాఁజాల దని నాయాశయము.

శ్లో. కింకవే స్తస్య కావ్యేన కిం కాండేన ధనుష్మతః
పరస్య హృదయే లగ్నంనఘూర్ణయతి యచ్ఛిరః అనుటసార్థకము కావలె.

భావచిత్ర బాహుళ్యము కావ్యమున గోచరించినపుడే రసోత్పత్తి యగును. కావున రసమునకు భావము, భావమునకు రసముఁ బోషకములై యుండును. దానికిఁ బఠిత దాసుఁ డగును – ఇట్టిశక్తి పూర్వ వాసనావశమునఁ గవికి లభ్యమగును. “సుకవితా య ద్యస్తి రాజ్యేన కిమ్” అనువాక్య మతని కన్వయించును.

ఉ. ఆరయ నీయజాండవలయంబు నొకానొక నల్లపూసగా
మాఱిచి నీవు గ్రుచ్చుమణిమాలికయం దిమిడించునేరు పె
వ్వారికిఁ గల్గురా! జగతి! స్వర్భువనంబులలోన నీ చమ
త్కారమునం దడంగనిపదార్థము లేదుగదా కవీశ్వరా?

(ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, ఫిబ్రవరి, మార్చి 1934)

# తిర్లిక

బ్రహ్మశ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు ఆంధ్రపత్రికలోఁ బ్రచురించిన 'తిరిక' శబ్దవ్యాసమునకుఁ బ్రతివిమర్శగా శ్రీయుతులు శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు ఆషాఢమాస భారతిలోఁ వ్రాసిన వ్యాసమును జూచితిని. "తిల్లిక" యచ్చ తెనుఁగుపదముగాదు, 'తిర్వళిఘ' యను నరవపదము వ్యవహారభ్రష్టమై 'తిర్లిక' యైపోయినది. శాస్త్రిగా రేదోవిధముగా వారివాదనను బలపఱచుకొనిరి. ఈశబ్దమెన్ని వేషములువేసి ఆంధ్రులలో 'తిర్లిక' యై నిలిచెనో చర్చించుటకు వీరిచ్చిన ఆధారములు చాలవు. భాషలన్నిటియందును శబ్దముల కిట్టి సమీపసంబంధము గోచరించుచునే యుండును. ఇట్టి మీమాంసకు దిగుచో తిరువళక్కలు వంటలక్కలయ్యెదరు. 'ఆనె' (అరవమున నేనుఁగు) వ్యవహారభ్రష్టమై 'ఏనుఁగు, ఏనిక' యగును. తిర్వళిఘలనుండి తిల్లికలకన్న తిరుగళ్లధ్వనియే విశేషముగా వినఁబడుచున్నది. ఇట్లే ప్రతిమాటయు నన్యభాషాపదమై తేలిపోయి, ఆంధ్రభాష ముక్కుమొగము లేనిదై యెంగిలిభాష యైపోవును.

"ఆపదము గ్రంథస్థము కాలేదు, వాడుకలో లేదు. రామచంద్రశాస్త్రిగారు గుంటూరు మండలవాసులు వ్యవహరించుచుందురని వ్రాసినారు. అది ఆ ప్రాంతములోనూ లేదు, గుంటూరు పండితుల నిద్దఱినడుగ మే మాపదము వినలేదండీ అన్నారు." అని శాస్త్రిగారు వ్రాసినారు.

'తిల్లిక' మావైపునఁ బసిపిల్లలకును గొట్టినపిండి, 'తిల్లికలో నూనె లేదు. తిర్లిక పెద్ద జేయుము' అని మేము వ్యవహరింతుము. పెద్దజేయుమన్న నార్పుమని యర్థము. ఆర్పుమన్న నందశ్లీలార్థము కలదనికాఁబోలు మా తెలుఁగు లిట్లనుచుందురు. పసుపు, కుంకుమ, బియ్యము మున్నగు పదార్థములు 'లేవు. అయిపోయినవి' అనుట కూడదని కాఁబోలు గంజాముమండలవాసులు పసుపు నిండుకొన్నది. బియ్యము నిండుకొన్న వని సదర్థమున వాడుచుందురు. పెద్దజేయుమనుటయు నిట్టిదే యగును. గోదావరి మండలమునఁ బుట్టి పెరిగిన శాస్త్రిగారు, నిఘంటువుల నాధారము చేసికొని, యెండకన్నెఱుఁగని పండితులపలుకులు ప్రమాణములను గాఁగొని చిరకాలము నుండి వెలుఁగుచున్న మామండలము 'తిల్లిక' నార్పివేయఁబోయి, దేవుఁడు మేలుచేసి, 'వాడుకలో నుండిన నుండవచ్చు'నని కొంత'కన్‌సేషన్' చూపినారు. సంతసము. ఆంధ్రశబ్దము లేప్రాంతముల నేయేవిధముగా వ్యవహరింపఁబడుచున్నవో తెలిసికొన వలయు నన్న గ్రామీణుల నిత్యజీవనము, వారి యాచారవ్యవహారములు స్వయముగాఁ బరిశీలించిన వారికిఁగాని కేవల గ్రంథచక్షువులకు దుస్సాధ్యము. శ్రీనాథుఁడు ప్రయోగించిన 'కూర్పాసము' 'తగటుకూసము' వాడుకలో లేదని నిన్న మొన్నటివఱకుఁ దలంచుచుంటిని కాని అది రేనాటిరెడ్లకు

"దేవపూజాసమయముల వెలిగించు దీపములని యర్థముగాని, సామాన్యముగా వెలుగునకై పెట్టుకొను దీపములు అని యర్థముగాదు." అని వ్రాసిరి. ఇక్కడి పూజారుల కీమాట వాడుకలో లేదు. ఇంటిదీపమే తిల్లిక. ఈ'తిల్లిక' నాగరజనులమాట. పండితుల కొక వేళఁ దెలిసియును బలుకరు. పలికిన నవమానమేమో! కావ్యనాటకాదులయందును, నిఘంటువులయందును లేని పదము లనేకములు నేఁడు వాడుకలో వినఁబడుచున్నవి. ఈ శబ్దమునకు మూలపద మిదమిత్థమని నిర్ణయించుటకు నిఘంటువు లుపకరింపవు. నైఘంటికులలో నొక్క బ్రౌనుదొరగారు మాత్రమే తిల్లిక దీపమని వ్రాసి తెలుఁగువారి మన్ననకు గుఱియైరని సంతసించుచున్నాఁడ, సాంఘిక వర్ణనలకుఁ బ్రసిద్ధివడసిన హంసవింశతికారునకు 'తిర్లిక' నుడి చెవినిబడలే దనుట వింత గాదు. వినఁబడియుఁ బ్రయోగింప నిష్టపడియుండఁడు. జిగటాతో, పంజులతో, సూర్యప్రభలతో, మొంబత్తులతో నూరేఁగిన శ్రీమంతుఁడేమో వ్యవహారమునలేని, సామాన్యులకు గ్రాహ్యముగాని వికృతపదములతోఁ బాఠకులను కలవరపెట్టుటలలోఁ గలరసము 'తిల్లిక' లోఁగలదని గ్రహింపఁగలఁడా? మహాకవులు ప్రయోగింపనంత మాత్రమున శబ్దము లంతరించునా? పాండిత్యమునకును, లోకజ్ఞానమునకును గడుదూరము, నాశివాజీ గ్రంథము నిటీవల నొకానొక పండితునకు వినిపించుచుండ నందలి"చిక్కని పచ్చినెత్తురులు చేరలతో దిగఁద్రావి, మాంసమున్ మెక్కి, కపాలపాత్రికల నించిన క్రొవ్వు భుజించి, యెమ్ములన్ ముక్కలు చేసి, అందుగల మూలుగుబీలిచి," అనుపద్యమును విని "మూలుగు" క్రొత్తమాట మీవలననే విన్నానండీ యనుట విని విభ్రాంతిపడితిని. నాయెఱిఁగినంతమట్టుకు పండితులలో ననేకులకు మాలమాదిగభేదమే తెలియదు. మాలలను మాదిగలనుగా, మాదిగలను మాలలనుగా వ్రాయుట పరిపాటియై పోయినది. శంకరకవి హరిశ్చంద్రలో మాతంగికన్యలను మాలకన్యలనియు, వీరబాహుని మాలవాఁడనియు వ్రాయుట కడుంగడుచిత్రము. మాతంగి మాదిగది గాని మాలది గాదు. కొలుపులలో మాతతుడుపులకు మాలకన్యలు వత్తురా? కాటికాపరి మాలవాఁడగునా? విచారింప నిది గొప్పప్రమాదము. అది ప్రమాణముగా గ్రహించుచు నాధునిక హరిశ్చంద్రనాటక కర్తలందఱును బప్పులోఁ గాలువైచినారు. పండితులు ముందేనియు నీతారతమ్యమును గ్రహించి, యిట్టి స్వల్పదోషములను సవరించుకొందురుగాక. 'తిల్లిక' వాడుకలో జీవించి యున్నదని తెలిసికొని రచయితలు తమ కావ్యములలో నుచిత స్థానము నిచ్చి యాదరింపవలయునని ప్రార్థన.

(భారతి, ఆగస్టు 1936)

# వీలునామా

Document No. 66 of 1968. Dated 24 April 1968

1968 సంవత్సరం యేప్రిల్ 22వ తేదీన గుంటూరు టౌను గోపాలకృష్ణయ్య తోటలో కాపురము వుంటూ వున్న గుఱ్ఱం వీరయ్యగారి కుమార్డు జాషువా మనఃస్ఫూర్తిగా వ్రాయించిన విల్‌నామా. నాకు యిప్పటికి 73 సంవత్సరములు వయస్సు కలదు. నా ప్రథమ భార్య యిప్పటికి షుమారు 12 సంవత్సరములపై కాలము క్రిందట చనిపోయినది. ఆమె వలన నాకు యిద్దరు కుమారులు, ముగ్గురు కుమార్తెలు కలిగినారు. వారందరూ వివాహములుచేసుకొని వారి వారి కాపురములు చక్కబెట్టుకుంటూ సుఖముగా వున్నారు. నా ప్రథమ భార్య చనిపోయినదరిమిలా నేను జి.విమలమ్మ అను ఆమెను వివాహము చేసుకొని ఆమెతో వివాహ సుఖములను అనుభవించుతూవున్నాను. ఆమెనాకు అన్ని సపర్యలుచేయుచూ నాకు అత్యంత ప్రేమపాత్రురాలైనది. నాకుమాళ్ళు యిద్దరు పద్మరాజు వలరాజులు, నా కుమార్తెలు పెద్దవాళ్ళు యిద్దరు కాంతామణి పద్మినిలు నామీద ఎట్టి ప్రేమను కనపరచకపోగా నాకు కష్టము కలిగించు అనేక పనులు చేసి నా మనసును కలత పెట్టిరి. నా చిన్నకుమార్తె అయిన హేమలత సుగుణములరాశియై నాకు అత్యంత ప్రేమ పాత్రురాలైనది. నాకుమార్తెలుపెద్దవాళ్ళు యిద్దరు మంచిస్తితి కలిగియున్నారు. నాకు గుంటూరు టౌను గోపాలకృష్ణయ్యతోటలో ఒక డాబాయిల్లు కొలకలూరు గ్రామంలో య.1.62 సెంట్లు మాగాణి భూమి కలదు. ఇవి గాక నేను రచించిన పుస్తకములు షుమారు 25 పై నాకు కాపీరైటు హక్కు వున్నది. ఇదిగాక క్రిష్టియన్ బైబిలు సొసైటీవారు నాకు వ్రాయించి పబ్లిష్ చేసిన క్రీస్తుచరిత్ర అను పుస్తకమునకు వారు రెండు సంవత్సరములకొక పర్యాయము షుమారు 200.00 రెండు వందల రూపాయలు రాయల్టీ పంపుతూవున్నారు. నా తదనంతరం నా ఆస్తిని గురించి యీ క్రింది విధముగా యేర్పాటు చేయడమైనది. నేను నివశించుచున్న డాబా యిల్లు గుంటూరు అరండల్‌పేట పాతవార్డు3, క్రొత్తవార్డు 3 బ్లాకు 12 టవున్ సర్వే నెం. 713/1 రు 519.1/2 చ॥గ॥స్తలములో గల 10.1/4 డాబాయిల్లు వెనుకముందుపంచలు తలుపులు ద్వార బందములు చుట్టూ వున్న స్తలముతో సహా నాతదనంతరం నా భార్య విమలమ్మ స్వాధీన పరచుకొని దానవిక్రయాది సంపూర్ణ హక్కులతో అనుభవించవలయును. నా తాలూకు కొలకలూరి గ్రామము డి. నెం. 1429.3 య. 0.76 సెంట్లులోని య. 0.70 సెంట్లు మాగాణి భూమి నాతదనంతరం నాభార్య విమలమ్మ స్వాధీనపరచుకొని దాన విక్రయాది హక్కులతో అనుభవించవలయును. నా తాలూకు కొలకలూరు గ్రామ డి.నెం. 1429.1బి య. 0.2 సెంట్లు 1429.1ఎ య. 0.90 సెంట్లు వెరశి య. 0.92 సెంట్లు మాగాణి భూమి నా తదనంతరం నా కుమారులు పద్మనాభుడు వలరాజులు సమానంగా పంచుకొని పూర్తి హక్కులతో అనుభవించవలయును. నేను రచించిన పుస్తకములన్నిటి

యందును కాపిరైటు హక్కును నా కుమార్తె గోపరాజు లవణం భార్య హేమలత నా తదనంతరము పూర్తి హక్కులతో అనుభవించవలయును. క్రీస్తుచరిత్రపై వచ్చు రాయల్టి నా కుమార్తె హేమలత తీసుకొని తన యిష్టము వచ్చినట్లు బీద పిల్లల దుస్తులకును నోరులేని జంతువుల ఆహారము కొరకున్నూ వినియోగపరచవలయును. యీ విల్‌నామా మార్చుకునే హక్కు రద్దుచేసుకొనే హక్కు నాయందే వుంచుకోవడమైనది. యీ విల్‌నామా నా తదనంతరం అమలులోనికి రావలయును. యీ విల్ నామా నా బుద్ధిపూర్వకముగాను నా ఆస్థిని నాకు అత్యంత సన్నిహితులకు చెందచేయువుద్దేశ్యముతో వ్రాయించడమైనది. యిది నా సమ్మతిన వ్రాయించిన విల్‌నామా

సాక్షులు

1. బి. ప్రకాశమ్,

రిటైర్డ్ తహశీల్దార్,

2. కె. బశివిరెడ్డి,

అడ్వకేట్

దస్తూరి గుండ్లపల్లి కృష్ణమూర్తిది

# జాబులు

వినుకొండ
7-3-47

ఆర్యా! వందనములు,

మీ లేఖ ముట్టినది. నా కావ్యాలపై విమర్శలు వ్రాసే వారిపై నేను ప్రతి విమర్శలు వ్రాయను. నేను విశ్వహితార్థం వ్రాయువాడను. విశ్వము నన్నెరుంగును. దానికి విశ్వమే ప్రత్యుత్తరించగలదు. మా విమర్శకుడు తాను వ్రాసిన పుస్తకంలో "ఏనుగు వెడలుచున్న కుక్కలు మొరుగును. చింతించవల" దని వ్రాసుకొన్నారు. అట్టి వ్రాతలు సాటి చేయుట పరువు కాదుకదా!

చిత్తగించవలెను,
జాషువ

My Dear Prakasam,

Guntur,
24-3-1956

ఇక్కడ అంతా క్షేమం. నీ యుత్తరం చేరింది. సంగతులు తెలిసినవి. మణిదగ్గరనుంచి నిన్న యుత్తరం వచ్చింది. బాగున్నారట. ఈ రోజు ఉత్తరం వ్రాస్తున్నాను. నా ఆరోగ్యం యింకా బాగులేదు. దగ్గు ఆయాసం వస్తూనే యున్నది. రోజులు పేరట తగ్గుతుందన్నారు. బద్వేలు ప్రాంతాల్లో జాగ్రత్తగా మెలగవలసినది. అక్కడ నీ తిండి వగైరా సరిగా యున్నది లేనిది రాయవలసినది. వలరాజు ఆరోగ్యం ఇంకా బాగులేదు. ఈ రోజు X-Ray తీసినారు. కుటిలమున్నదట. అవసరమైతే ఆపరేషన్ చేస్తారట. విశేషాలు లేవు.

ఇట్లు
మామ
జి. జాషువ

కార్డుమీద చిరునామా:
G.L. Prakasam
Sub-Inspector,
Police Station
Badvelu, Cuddapah. D.P

My Dear Mani,

గుంటూరు

24-3-1956

నిన్న తారారాసిన యుత్తరం చూచాము. ఇక్కడ అంతా క్షేమం-వలరాజు ఆరోగ్యం యింకా బాగాలేదు. నాకు దగ్గు ఆయాసం యింకా యున్నది. మెరాయి, హేమలత బాగున్నారు. ప్రకాశం వద్ద నుంచి మొన్న యుత్తరం వచ్చినది. ఈ రోజు నేను కూడా వ్రాశాను. మీ మంచిచెడ్డలు వ్రాస్తూండ వలసినది. నేను వ్రాయడం ఆలస్యమైనా తొందరపడవద్దు. విశేషాలు లేవు. ఏప్రిలునెల్లో ఒంగోలు వెళ్లే అవసరం వస్తుందేమో. మావాడు వ్రాశాడు. పిల్లలకు ప్రేమలు.

ఇట్లు

Father

Joshua

కార్డుమీద చిరునామ:

G.L. Kantamani

C/o. G.L. Prakasarao

Police Line I Street,

Chirala

Guntur

24-4-1956

Dear Prakasam,

ఇక్కడ అంతా క్షేమం. చీరాలలోమన వారంతా బాగున్నట్లు మొన్న తార వ్రాసింది. నా ఆరోగ్యం యింకా బాగులేదు. ఆయాసం వస్తునే యున్నది. మే నెల 5వ తేది ఒంగోలులో సన్మానం చేస్తామని ఆంధ్రశాఖవారు వ్రాసినారు. వలరాజు, నేను, హేమలత వెళ్తాము. బద్వేలు పోలీసు వచ్చి అక్కడ పరిస్తితులు చెప్పినాడు. మెరాయి ఆరోగ్యం కూడా అంతా బాగులేదు. ప్రభాకరు, పద్మిని, పిల్లలు అంతా క్షేమంగాయున్నారు. విశేషాలు లేవు.

Yours xxx

Joshua

కార్డుమీద చిరునామ:

G.L. Prakasam

Sub-Inspector

Town Station

బద్వేలు, కడపజిల్లా.

My Dear Prakasam,

గుంటూరు

22-5-1956

ఇక్కడ అంతా క్షేమం. మీ క్షేమం నాగమణి వ్రాసింది. మీకక్కడ అన్ని వసతులు బాగున్నట్లు మణివ్రాసింది. సంతోషం. నాకు దగ్గు ఆయాసం తగ్గిపోయింది. మెరాయి ఆరోగ్యం కూడా బాగానే యున్నది. మొన్న ఒంగోలులో గొప్ప సన్మానం చేశారు. వలరాజు, హేమలత కూడా ఒంగోలు వచ్చినారు. మా తమ్ముడి యింట్లోనే యున్నాము. జీవ వచ్చి ఒక పూటనాతో మాట్లాడి వెళ్ళింది. సీతయ్యవచ్చి నాసభ చూచి చెప్పినాడట. ఒంగోలులో అంతా బాగున్నారు. ఇక్కడ రాజయ్యగారు ఈ నెల 10వ తేది చనిపోయినాడు. చాలా విచారించినాము. ఆయన చావు ఒక కలలాగున్నది. వలరాజు వాళ్ళను మీవద్దకు రమ్మన్నారు. వాళ్ళు రాదలచుకుంటే తప్పక పంపుతాను. వలరాజు నిరుద్యోగంతోనే కాలం గడుపుచున్నాడు. కడపజిల్లాలో ఏ సభకు పిలిచినా మీ దగ్గరకు వస్తాను. పద్మిని వాండ్లను పొన్నూరు మార్చినారు. విశేషాలు లేవు.

మామ

జాషువ

కార్డుమీద చిరునామ:

G.L. Prakasam

Sub-Inspector

Town Police Station

బద్వేలు, కడపజిల్లా

My Dear Prakasam,

All India Radio, Madras.

12-2-1957

తారా యుత్తరం చూచాము. మణి అనారోగ్యంగా యుండడం చాలా విచారం కలిగించింది. నేను మీకు రాసిన యుత్తరం ప్రకారం 16 బయలుదేరిరావడం లేదు. పంతులుగారి యుత్తరం ప్రకారం 18 రాత్రి బయలుదేరి 19 ఉదయం పొన్నూరులో దిగి మధ్యాహ్నానికి ఇంటికి వస్తాను. 20 రాత్రికి తిరిగి రావలసియున్నది. హేమలత కూడా నాతో వస్తున్నది. తలకాయ వండించి అమరన(?)ను పిలవండి, వెంకణ్ణి తయారుగా యుండమని చెప్పండి.

మా తమ్ముణ్ణి గూడా రమ్మన్నాను. వస్తాడోరాడో తెలియదు. ఈ ప్రోగ్రాము మారదు.

కార్డుమీద చిరునామ:

Sri G.L. Prakasa Rao

జాషువ

Gopalakrishnaiah Thota

Guntur

My Dear Prakasam, All India Radio, Madras.

26-3-1957

2nd April G.T. లో బయలుదేరి ఢిల్లీ వెళ్తున్నాను. తిరిగి 10. 11. వస్తాను. గుంటూరులో దిగి అన్ని విషయాలు మాట్లాడుదును. మీ క్షేమం వ్రాయండి.

వెంకడిని వెళ్ళి బొమ్మలాటవాళ్ళతో మాట్లాడి మద్రాసుకు వాళ్ళు వచ్చేటట్లు ఒప్పించి నేను వచ్చేవరకు సిద్ధంగాయుండ వలసిందని చెప్పవలసినది. వాళ్లకు రానుపోను చార్జీలు, తిండిఖర్చు-యిచ్చి యింతని బొమ్మలాటకిచ్చే యేర్పాటుచేసినానని చెప్పి వాళ్లను ఒప్పించి రావలసినదని చెప్పవలసినది. ఇది అత్యవసరము.

కార్డుమీద చిరునామా:
G.L. Prakasa Rao
H.C
Gopalakrishnaiah Thota,
GUNTUR

Father-in-law
Joshua

My Dear Prakasam, All India Radio, Madras.

29-3-1957

మీ క్షేమలేఖ చేరింది. సంతోషం. ముకుందరావు విషయంలో రాసిన విషయం నాకింతకు ముందు తెలియదు. యుత్తరాలలో అట్టి విషయాలు వ్రాయరాదు. నేను వచ్చిన తర్వాత ఆలోచిద్దాము.

బొమ్మలాటవాళ్ళను పిలిపించి మాట్లాడినానన్నావు. మంచిది. నేను 13వ తేదీకి ఢిల్లీ నుంచి వస్తాను. వాళ్ళను ఆరోజుకు వచ్చి నాతో మాట్లాడవలసిందని చెప్పవలసినది. అన్ని వివరాలు వాళ్ళకనుకూలంగా మాట్లాడుతానని చెప్పవలసినది. 10వ తారీకు దాకా యుంటే లాభంలేదు. వాళ్ళు వెళ్ళి మళ్ళా రావచ్చునుగదా? వాళ్ళకు మంచి Chance అని గట్టిగా చెప్పవలసినది. హేమలత, వలరాజు అంతా బాగున్నారు.

Father-in-law
Joshua

కార్డుమీద చిరునామా:
Prakasam
H.C
Gopalakrishnaiah Thota,
GUNTUR

My Dear Prakasam,

All India Radio, Madras.
4-4-1959

నీ యుత్తరం యిప్పుడే అందింది. మీరు క్షేమంగా యూరు చేరినందుకు సంతోషము. మణివాళ్ళు యిక్కడికి రావడం కొంత కాలముండడం నాకిష్టమే. నేను 9వ తేదీ ఢిల్లీ వెళ్తున్నాను. తిరిగి 21, 22 తేదీలలో మద్రాసు చేర్తాను. అప్పులన్నీ నిలిపి రూ. 400 పట్టుకొని వెళ్తున్నాను. నా ఆర్థిక పరిస్థితులు మణితో చెప్పినాను. ఈ నెలాఖరులోగాని వచ్చే నెల్లోగాని వ్రాస్తాను. అప్పుడు వాళ్ళు రావడం అనుకూలిస్తుంది. వలరాజు యథా స్థితిగా యున్నాడు. హేమలత చక్కగా చదువుకుంటుంది. పద్మనాభుడు చేతులు సాచి దేబెరించే(?) యుత్తరాలు రాస్తున్నాడు. ఈ యెండల్లో దూరప్రయాణాలు చేయడం ఈ వయస్సుకు ఆఘాతం అయినా తప్పదు. సుఖంగా కూర్చుండే భాగ్యం లేదు. పిల్లలకు ప్రేమలు.

Father -in -law
Joshua

కార్డుమీది చిరునామా:
G.L. Prakasa Rao,
Sub Inspector of Police, Tsodayapalem, Repalli Taluq, Guntur (Dist.)

My Dear Prakasam,

AIR, Madras,
29-8-1959

నీ యుత్తరం చేరింది. సంగతులు విచారకరంగా యున్నయి. వలరాజు వల్ల నాకు నిరంతర విచారం తప్ప సుఖంలేదు. వాడు సహజంగా కలహప్రియుడు. నేను వాణ్ణి బాగుచేయలేని నిస్సహాయుణ్ణి. పరిస్తితులు కూడా అట్లాగే యున్నయి. మిమ్ములను ఇతరులు అసలే××చుకోరంటే మీకేమి లోపం రాదు. లెక్క చేయకుండా ఉండడమే వారికి శిక్ష. మణి, వాళ్ల పిల్లలు మద్రాసు నుండి క్షేమంగా ఒంగోలు చేరినారంట. నీవు నెలాఖరున ఒంగోలు వెళ్తానన్నావు. మంచిది. నేను సెప్టెంబరులో ఒకసారి వెళ్తాను. విశేషాలు లేవు. నీకు తిండి తిప్పలు అక్కడ కష్టంగా యున్నవని విచారించాము. వెన్నెల మళ్లా వస్తుంది.

మామ
Joshua

కార్డుమీద చిరునామా:
G.L. Prakasa Rao
Sub Inspector
Nandivargam Police Station
Banaganapalli Taluq.
Kurnool Dist.

Guntur
9-12-1966

Dear Ammaye,

శ్రీశైలం నుండి నీ వద్దకు వచ్చిన ఇంజనీరు నిన్ననాతో మాటాడి వెళ్ళాడు. ఈ నెల 18వ తేది సభయేర్పాటు చేయమని చెప్పాను. అదే నిర్ణయించి రెండుమూడు రోజుల్లో కృష్ణ మూర్తి గారి చేత యుత్తరం వ్రాయిస్తానని వెళ్ళారు, కారు కూడ పంపుతామన్నారు. 17వ తేది యుదయం బయలుదేరాలి అని నిర్ణయించుకున్నాము. నీవు ఒకసారి చూచావుకదా? మరల యెందుకని నే జనవరి తేదీలు తిరస్కరించాను. కుక్కపిల్లలు కులాసాగా యున్నాయి. వెంకోబురావు మీసాలు మెలవేస్తున్నాడు. డింభీ శరత్తునవలలు నమిలివేస్తున్నది. నిన్న పద్మనాభుడు వచ్చి వెళ్ళినాడు. విశేషాలు లేవు.

Father
Joshua

కార్డుమీది చిరునామ:
G. Hemalatha, Nastikakendram,
Patamata, Krishna District.

Guntur
21-12-1966

Dear Ammaye,

శ్రీశైలం వెళ్ళి సభ ముగించుకొని చూడవలసిన స్థలాలన్నీ చూచి, మార్కాపురంలో రమణమ్మ, చిన్నమ్మల ఆతిధ్యం స్వీకరించి నిన్న 3 గంటలకు గుంటూరు చేరాము. అక్కడి వారు చూపిన ప్రేమాభిమానాలు అనన్యమైనవి. 4,5 వేల ప్రేక్షకులు. 5 గంటలు సభ జయప్రదంగా జరిగినది. శ్రీ వీరయ్య - రాజారావు - మాధవరావు, గోపాలకృష్ణమూర్తి గార్ల అభిమాన గౌరవాదులు మనస్సులో ముద్రపడిపోయినయి. దేశంలో నాకు జరిగిన సభలన్నిటిలో ఈ సభ మకుటాయమానమైనది. ఈ వారంలో పేపర్లో చూడగలవు. మాలకొండారెడ్డి గారు కూడా వచ్చారు. జనవరి 10వ తేది వినుకొండలో అంకితం సభ జరుగుతుంది. శ్రీశైలం వారికి అభినందన లేఖ వ్రాయవలసింది.

Father
Joshua

కార్డుమీది చిరునామ:
G. Hemalatha, Nastikakendram,

Guntur

2-1-1967

Dear Ammaye,

6, 7లో హైదరాబాదు నేను ప్రకాశరావు గారు వెళ్లాము. కారో రైలో నిర్ధారణ కాలేదు. ఒక్కనాటికి నీవు రావడం ఎందుకనుకున్నాము. డింభీ రావడం లేదు. శ్రీశైలం సభ పేపరులో యింతవరకు వేయలేదు. వీలయితే ప్రభ యెడిటరుతో మాట్లాడి శ్రీశైలం వారికి కూడ వ్రాయవలసింది. పేపరు వారు నాయందు కానరాని పక్షపాతము చూపడం ఆశ్చర్యంగా యున్నది. నీవు 12,13 లోనా వచ్చేది? ఏసంగతి వ్రాయవలసింది. వినుకొండ సభ 15దాకా వాయిదా పడ్డది. వెంకమ్మవాండ్లు 13 వస్తారట.

Father

Joshua

కార్డుమీది చిరునామ:

G. Hemalatha, Nastikakendram,

Patamata, Krishna District.

Guntur

18-1-1967

Dear Ammaye,

నీవు సుఖంగా చేరడం సంతోషం. దగ్గు తగ్గింది. ఉభయకవి వచ్చెన్. చూచితి చూచితి వ్రాసెన్ జక్కగ చనియెం జనియెన్ వెంకండెందేని జనియె. డింభివెంకి గౌతమాదులకు భద్రమే. శునకమార్జాలంబులు, కుక్కుటంబులుం బిచ్చుకలుం గుశలంబె, పనిపిల్లయుం లచ్చియుక్షేమము, వింతలు విశేషంబులు లేవు.

Father

Joshua

కార్డుమీది చిరునామ:

Smt. G. Hemalatha, Nastikakendram,

Patamata, Krishna District.

Guntur

1-3-1967

Dear Hemalatha,

Leaving for Hyderabad today VimaLatha and my self to attend a meeting on 2nd March. We may return back on 3rd or 4th. You may come here on 4th. Every thing in person.

Father

Joshua

Address :

Smt. G. Hemalatha, Nastikakendram,

Patamata, Krishna District.

Dear Hemalatha,

Guntur

19-11-1967

మేము ముక్త్యాల నుండి 17 మధ్యాహ్నం వచ్చాము. సభ బాగా జరిగింది. రాజాగారు ఆరోజుండి ఉదయం వెళ్ళవచ్చునని నిలిపినారు. నీవు వ్రాసిన యుత్తరం చేరింది. నీటాకు వినలేదు. బాగా యుంటుందని అనుకున్నాము. నిన్ను మాతో తీసుకొని వెళ్లడానికి వ్యవధిలేదు. అందుకు కలతపడ్డాము. మళ్ళీ ముక్త్యాల వెళ్ళడం ఉన్నది. నిన్ను తప్పక తీసుకొని వెళ్తాము. మించిపోయింది లేదు. భువన విజయం పెడతారట. నా ఆరోగ్యం O.K. లవణం వచ్చాడా? కౌన్సిలు ఈ సారి యుంటుందో లేదో ఇంకా తెలియలేదు. నీ వెప్పుడు వచ్చి కథ చెప్పుదువు?

Father

Joshua

కార్డుమీది చిరునామ:

Smt. G. Hemalatha, Nastikakendram,

Patamata, Krishna District.

Dear Hemalatha,

Guntur
3-2-1968

తలవని తలంపుగా 31 హైదరాబాదు వెళ్లి 1, 2 అక్కడ సభలకు హాజరై రాత్రి 2 గంటలకిల్లు చేరాము. వ్రాయవలసిన పుస్తకాలు. 1.2. ఫారాలకు లేదు 1.2 పిల్లల వాచకాలు. మొదటి క్లాసు వాచకము నెలాఖరుకు పంపవలెనట -

నీవుంటే కొంత సాయపడగలవు. తేనెలో చిక్కిన మక్షికానివికదా? సాయమెట్లు చేయగలవు. రెండవ పుస్తకము జూన్ నెలాఖరులో పంపవచ్చును. మేలో నీవు వస్తావు కదా? లవణం కనిపించాడు. ఒకరోజు వచ్చి మర్నాడు రాలేదు. ముఖ్య విషయం - నీ talk విన్నాము. అఖండంగా - అనన్య సాధ్యంగా యున్నది. విమల మూర్చాపరవశయైనది. - భేష్, ఘట్టా ఎట్టని వర్ణింతునని గౌతమ్ దిలీపులు నీ greeting card చదివి, ఆచ్చి అన్నారు. ఈ మారు వానిని  బౌద్ధ క్షపణకాకారంతో చూస్తావు.

Father
Joshua

కార్డుమీది చిరునామ:
Smt. G. Hemalatha, Nastikakendram,
Patamata, Krishna District.

Guntur
11-9-1968

Dear Ammaye,

నీ జాబు నిన్న చేరింది. 21 రాలేనన్నావు. 28 తప్పక శర్మగారు లవణం నీవు రావలసినది. డింభీ బాగున్నది. నాకు మొన్న జ్వరం వచ్చి -పొరపాటు పొరపాటని చెంపలు వేసుకొని పోయింది. కొంచెం బలహీనంగా యున్నది. చిన్నానాయకుడు, బాపూజి పట్టుకు రావలసింది. బర్త్ డే కాస్త బాగా చేయదలచాము.

Father
Joshua

కార్డుమీది చిరునామ:
Smt. G. Hemalatha, Nastikakendram,
Patamata, Krishna District.

Guntur
19-11-1968

ప్రకాశానికి, మణికి,

ప్రకాశం వ్రాసిన కవరు వచ్చింది. అంతా బాగానే యున్నది. 29వ తేది పెండ్లి నన్నడక్కుండా నిర్ణయించినారు. 22 నుండే కౌన్సిలున్నది. మేము కౌన్సిల్లో ఎన్నాళ్ళుంటామో తెలియదు. వెళ్ళిన తరువాత కాని తెలియదు. కారు వృధాగా పంపవచ్చు. మేము ఎప్పుడు తిరిగి వచ్చేది వెళ్ళి వ్రాస్తాను. అది చూచి తారీకు మార్చుకుంటే రాగలను. పెండ్లికి రాలేదని ప్రయోజనం లేదు. ఈ చిక్కు సమస్య నెట్లు సర్దుబాటు చేస్తారో ఆలోచించి నాకు యే సంగతి తంతి ద్వారా తెలుపండి.

మామ
Joshua

కార్డుమీది చిరునామా:
G.L. Prakasam
Clough pet, Ongole

Guntur
25-1-1969

Dear Tara,

నీ యుత్తరము చేరింది. ఇక్కడ అందరికి కుశలం. మీరంతా క్షేమంగా యున్నందుకు సంతోషం. నాకు రేపు మునిసిపాలిటీ వారు Free Citizenship ఇస్తున్నారు. ముకుందును అచ్చంపేట వేశారా? మంచిది. హేమలత ఈ వేళ వస్తుంది. వాకాడు కాలేజికి నన్ను పిలిచారు. వెళ్ళేటప్పుడు ఒంగోలు వస్తాను. చాలా Invitations వస్తున్నయి. దూరం వెళ్ళడంలేదు. దగ్గరయితే కారు పంపితే వెళ్తున్నాను. విమల, లక్ష్మి బాగున్నారు.

తాత
Joshua

కార్డుమీది చిరునామా:
Miss G. Taravali, Clough pet, Ongole

Guntur

12-11-1969

Dear Jacob

నీవు వచ్చి కనపడిపోవలసినది. బీదవాణ్ణయ్యాను. పిరికివాణ్ణయ్యాను. తప్పక రేపు రాగోర్తాను. నాకు బుల్లెయ్య గారు కళా ప్రపూర్ణ బిరుదు ఇచ్చారు.

Father

Joshuva

కార్డుమీది చిరునామ:

Y. జాకబ్,

టీచరు,

పాతగుంటూరు, గుంటూరు

Guntur

22-12-1969

My Dear Son,

నీవు రాక 4 రోజులైనది. నాకు మనసు బాగులేదు. ముస్తాఫా కారు మీద రావలసినది. విమల కూడ రమ్మనుమంది.

Father

Joshuva

కార్డుమీది చిరునామ:

జాకబ్,

టీచరు,

పాతగుంటూరు

Mrs. & Mr. Yerciharla Jacob

Old Guntur, GUNTUR.

request the pleasure of your Company with family & friends on the occasion of the

Nuthana Gruhapravesam

on the 15th Aug. 1960 at 6-30 p. m.

Opening Ceremony:-

'Navayuga Kavi Chakravarthi'

Sri G. Jashuva

# అభిప్రాయము

గుఱ్ఱం జాషువ, M.L.C.

గుంటూరు

ఉభయ కవిమిత్రా ఆశీస్సులు, మీ కృషిమెచ్చదగ్గది. ఆదరణీయమైనది. మీ ద్విపద రచన ప్రతిపద రమణీయమై తీయగా నున్నది. నాయికా నాయకుల శృంగారాలు నేడుపకరింపవు. జృంభించిన దుష్టశక్తుల నున్మూలించు శిలీముఖాలవంటి నవ్యరచనలు నేడెంతయు నవసరములు. ఒక జాతికి, మతానికి, వర్ణానికి మాత్రమే యింపుచేయు వీలునామా కవిత్వములకు స్వస్తిచెప్పి, నీ కలాన్ని నిర్భయంగా నడుపగోర్తాను. అట్టి కృతులకు చావులేదు. నీకు శుభము.

జాషువ.

(జగవీరపాండ్యనార్ రాసిన ఒకతమిళ ద్విపద కావ్యముపై అభిప్రాయం 9 జూన్ 1967)

యువకవీంద్రా! చేరెడ్డి మస్తాన్‌రెడ్డీ! ఆశీస్సులు.

ముగ్ధమోహన సౌందర్యవతియై మీకావ్యసుందరి కలికిపలుకులచేత, నూతన ఒయ్యారములచేత, పఠితృలోకమును మోహింపజేయుచున్నది. భవత్కృతమై శ్రీలక్ష్మణకవిచేత విమృష్టమై ఉజ్వలనక్షత్రవజ్ర ఖచితమైన దివ్యహారముచేత నలంకృతయై ముద్దులొలుకుచున్నది. మీ లేతకలమునుండి వెలువడ్డ కోదండరామ కావ్యము కోదండ రామునిగూడ మోహింపజేయుచున్నది. ముందుముందు మీ వాక్కు ప్రౌఢమై సత్కావ్యరచనలు ప్రసవింపగలదు సందియములేదు. మీకు దీర్ఘాయువగుగాక. స్ఖాలిత్యాలు లేక గుహాంతర సంచారము చేయక రాజమార్గమున నడచుచు చదువరుల నాకట్టుచున్నది, యువకవీ! పరిశ్రమింపుము. నీకు కవులలో ప్రథమస్థానమున్నది.

గుంటూరు–2 భవదీయుడు
22 ఏప్రిల్ 1969 జి.జాషువ

(చేరెడ్డి మస్తాన్‌రెడ్డి 'కోదండ రామనక్షత్రమాల' పై అభిప్రాయము)

# ఆంధ్రప్రదేశ్ శాసనమండలిలో జాషువ ప్రసంగములు

1st July, 1964

Motion of Thanks on the Address by the Governor

శ్రీ జి. జాషువ (నామినేటెడ్) :- అధ్యక్షా, నన్ను పద్యోపన్యాసం చేయవలసిందిగా అడిగారు. కాని అది చాలా టైమ్ పడుతుందని, నేను కొద్దిగా పద్యములు చదివి నా అభినందనలు చెప్పుకోదలచాను. నన్ను యీ పదవిలో నియోగించినటువంటి విశాల హృదయులైన ముఖ్యమంత్రిగారికి నేను కృతజ్ఞుడను. గవర్నర్‌గారికి కృతజ్ఞుడను. అయితే నాకు ఒక అనుమానము ఉన్నది; విధి నిర్వహణలో నేను ఏమైనా పొరపాటు చేస్తానేమోననే భయము. దేశానికి ఏదైనా ఉపకరించే కార్యము నేను చేస్తే అది పుణ్యకార్యము అవుతుంది. నేను నా కార్యములు నిర్వహించుటలో అప్రమత్తుడనై వుంటాను. 1947లో భారత దేశానికి స్వాతంత్ర్యం వచ్చినపుడు స్వయవరం - అని ఒక గ్రంథం వ్రాశాను. ఆ పద్యాలు చదివితే నేను చెప్పబోయేది మీకు కొద్దిగా సూచనగా తెలుస్తుంది. అది చిన్న కథ. స్వయవరం - అంటే - స్వరాజ్య బాలికను వివాహం చేసుకొనటానికి రాజకుమారులు అంతా వస్తారు. దేశంలో ప్రతివాడు రాజకుమార్తెను చేసుకొనటానికి అర్హుడు. అందుచేత అందరూ వస్తారు. వీరికి పూలదండలు వేస్తూ రాజకుమార్తెకు చెలికత్తె ఆ వచ్చిన వారియొక్క యోగ్యతలను చెబుతుంది. ఈ చెలికత్తె ఒక్కొక్కరిని చూపించి, యీ స్వరాజ్య బాలికను వివాహము చేసుకొనటానికి వారి యోగ్యతలను చెబుతుంది. మంచివారు, చెడువారు, దొరలు, దొంగలు కూడ ఆ వివాహానికి వస్తారు. అందులో ఒకరిని గురించి ఇలా చెబుతుంది.

ఆగాఖానుడు సాటిరాడితనితో నైశ్వర్య సంపత్తి ని
న్నూగింపంగల డెల్లభోగముల యందుల్లంబు లేకుండగా
లాగుం బేదల పచ్చి మాంసమును బాలా, జంటవడ్డీల నీ
సోగల్దీరిన వాలుకన్గవ చెమర్చున్ వీని వీక్షించినన్
అటకాయించెడు శాసనాల చెవులల్లాడించుచున్ బ్లాకు మా
ర్కెటు సాగించు బెహారిమిన్న యితడార్పెన్ బెక్కు సంసారముల్
జిటికెడంత దయారసం బితని కుక్షిన్ జీల్చినన్ గాన మి
క్కుటిలుండుత్తమ దేశభక్తుడని పల్కున్ బత్రికా రాజముల్.

ఈ విధముగా వచ్చిన వారిలో వివాహము చేసుకొనుటకు తగిన పురుషుడు లేడని ఆ బాలిక ఆ సభనుండి వెళ్లిపోతుంది. తర్వాత బాపూజీ వారసుడైన నెహ్రూను వివాహము చేసుకొంటుంది. అటువంటి మహాపురుషుడు మనకు లేకుండా యీ మధ్య ధృవతారయై

ఆకాశంలో మరొక నక్షత్రమై నిలచినాడు. ఆయనకి శ్రద్ధాంజలిగా 'ఆరని కన్నీరు' అని కొన్ని పద్యాలు వ్రాశాను. ఛైర్మన్‌గారు ఐదు నిమిషాలు టైమ్ ఇస్తే ముగిస్తాను.

"ఆరని కన్నీరు"

యావల్లోకము ఔమ్ముగుద్దుకొని ఆహాకారముల్ సేయ దుః
ఖా వేశంబున రుద్ధకంఠమయి, బ్రహ్మాండంబు స్తంభింప, స్వ
ర్గావాసంబున కేగెనే, సచివలోకాదిత్యుడౌ జవ్హారుం
డా విభ్రాజిత శాంతి కర్షకుడమర్త్య స్వాగతాకాంక్షియై
అక్కట! రాజఘాటుదెస కంతిమయాత్ర కుపక్రమించి, మా
చక్కని జవ్హారుం దడుగుసాచ, మహాత్ముని రక్తమెల్ల వే
డెక్కి, సమాధిలో కుమిలి యేడ్చె నిగూఢముగా, శ్మశానమే
బిక్కమొగంబువైచె, నిక విశ్వములుమ్మలికించుటబ్రమే.
పరమపదించె జవ్హారు విభాకరుడన్న పదంబు వ్రాయ న
క్షరములు సమ్మతింపక వికావికలైనవి, దుఃఖవహ్నిచే
గరగిన గుండెతో జలజగర్భుని రాణియు మూర్ఛవోయి య
ప్పరమ పవిత్రమూర్తి చితిపై బడి, పల్కు విషాదకావ్యముల్
హాయిగ నిద్రవోయె భరతావని నిన్నటిదాక, నీవు క
న్మూయ ప్రపంచమే మునిగిపోయిన యట్టయి, దేశమెల్ల వా
పోయె, ప్రశాంతిసస్యరమ మోము ముడించె, నికేది దిక్కు భా
యీ! యఖిలంబు శూన్యమయి, సృష్టి సమస్తము జర్ఝరించెడిన్
అనలజ్వాల విధాన నీదు మరణం బాసేతు శీతాద్రి, బ్రా
కిన ఖండాంతరముల్ చలించినవి, నీ కీర్తి ప్రవాహంబు సో
కవితావేది మహానుభావ! భరతక్ష్మాచక్రమున్ మందభా
గ్యను గావించి; యొసంగి పోయితివె ఛాయాచిత్ర పత్రావళుల్
బుసలన్ గొట్టుచునున్న దిప్పుడును నిప్పుల్ గ్రక్కుచున్ సంగర
వ్యసనవ్యగ్రత వేయినాలుకల సర్పంబైన చైనీయ రా
క్షసి, నెహ్రూ, యను నక్షరద్వయము నాకర్ణింప లంఘింప సా
హసమేదన్ వెనుకాడె నిప్పుడెవరన్నా? మాతృ సంరక్షకుల్
ఆయోధనాయత్తమై కత్తి ఝుళిపించు పగవాని గుండెలో బాకుపోటు

కులమతోన్మత్తవాజుల నృత్యమరికట్ట కక్కుల కళ్ళెంబు గలుగురౌతు
అంబరంబు పెఠిల్లుమని వ్రీలి పైబడ్డ తమకని ధైర్య మంధరనగంబు
బాపూజి వారసత్వమునకు బంగారు నీరువోసిన శాంతి వీరవిధుడు
చలువ ఖద్దరు దాల్చి భూతలవధూటి
ఫక్కుమని నవ్వు నవ్వినపగిది దోచు
జహ్వారుడు కన్నుమూసిన క్షణమునందు
హైందవము దిక్కులేనిదై యంగలార్చె
శిలపై చెక్కిన బొమ్మవై పొడమి, భస్మీభూతమైచన్న నీ
విలసన్మంగళ కాయమున్ భరతదేవీ రత్నగర్భంబు లో
పల నిక్షిప్త మొనర్చి పోయితివె? జహ్వార్భాయి! నీ కూర్మిత
మ్ములకున్ నల్బదికోట్ల కింక పరమాప్తుం డెవ్వడీ భూస్థలిన్

ఇంత వరకు సమయము ఇచ్చినందులకు చైర్మన్‌గారికి నమస్కారములు.

27th July, 1964 — Condolence Resolution
Demise of Sri Alapati Venkataramiah
former Minister for Municipal Administration.

శ్రీ జి. జాషువ (నామినేటెడ్):- అధ్యక్షా, వెంకట్రామయ్యగారి మరణం దేశంలో చాలా వరకు అలజడి కలిగించింది. ఆయన వయోవృద్ధుడు కాదు. వయో భాస్కరుడు పడమటికి కుంగకముందే వెంకట్రామయ్యగారు మరణించారు. ప్రపంచంలో యిటువంటి ఘటనలు అప్పుడప్పుడు సంభవిస్తూ వుంటాయి. వెంకట్రామయ్య గారు చాలా ప్రతిభావంతులు దయార్ద్రహృదయులు, శీలవంతులు, కార్యదీక్ష కలవారు. అంతకుముందు ఆయన చాలా సంస్థలలో పనిచేస్తున్నట్లుగా వింటూ వుండేవాడను. వారితో నాకు పరిచయం అంతగా లేదు. కాని ఆయన చాలా మంచివారని ప్రజలు చెప్పుకొంటూ వుండేవారు. తెనాలిలో నేను కొన్నాళ్లు వున్నప్పుడు నేను ఆయనను ఎక్కడ చూసే వాడిని అంటే, గుడిసెల దగ్గర చూసేవాడను. పేదల గుడిసెల వద్ద నిలబడి వాళ్ళ కష్టసుఖాలు ఆయన పరిశీలిస్తూ వుండేవారు. దాని వల్ల ఆయన ఆర్ద్ర హృదయుడని నాకు అర్థమైనది. ఆయనప్రతిభాశాలి అని నేను గుర్తించాను. ఆయన గొప్ప పండితుడు కాదు. ఎక్కువగా చదువుకోలేదని ముఖ్యమంత్రిగారు సెలవిచ్చారు. నిజమే కాని ప్రతిభకు చదువుకు సంబంధం లేదు. అది సాధనం కాదు. చదువు కూడా కాదు. జామరిన్ అని ఒక రాజు వుండేవాడుట. అతను వాస్కోడిగామా వచ్చినప్పుడు ఇండియా దేశ పటం గీసి ఎర్రసిరా చుక్కలు అక్కడక్కడ పెట్టినారుట. అవి బ్రిటిష్ వారి గుర్తులు. అంటే సబ్

లాల్ హోజాతె అని. యిండియా అంతా కూడ ఎరుపై పోతుంది అన్నమాట. ఆయనకు చదువు ఏమీ లేదు కాని చాలా ప్రతిభ కలవాడు. అటువంటి శక్తి ఆయనకు వున్నది. వెంకట్రామయ్యగారికి మంత్రిపదవి వచ్చిన తర్వాత ఆంధ్రదేశంలోని యావన్మంది కూడా ఆయనను తెలుసుకోవడానికి ఆయన మంచితనాన్ని గుర్తించడానికి అవకాశం కల్గింది. ఎవరికైనా ఒక పదవి ఒక ఆశ్రయం ఉండాలి. మనకు ఒక సామెత వుంది. "నిజాశ్రయా న శోభంతే పండితా వనితాలతా". ఆ మాదిరిగా మంత్రి పదవి అనే ఒక సహాయం, ఒక పీఠం రాగానే ఆయన ప్రతిభ అందరకు తెలిసినది. అవినీతి పోగొట్టడానికి ఆయన చాలా చోట్ల దేవాలయాలలో ఏమేమి గమ్మత్తులు జరుగుతున్నాయో గుర్తించి దేవాలయ నిర్వహణను సక్రమమైన మార్గాలలో పెట్టాలని ఆయన ప్రయత్నిస్తున్నట్లుగా పేపర్లలో చాలాసార్లు చదివాము. అలాంటి వెంకట్రామయ్యగారు మరణించారు. వారు కళాభిమాని, కళాప్రియులు కూడా. వారు చాలా సభలు చేయించారు. సంగీత సభలు కూడా జరిపించారు. నేను కూడ అప్పుడప్పుడు హాజరయ్యేవాడను. దీనివల్ల ఇటువంటి ఉత్తమ పురుషులు దేశానికి ఉపకరించగలిగినటువంటి వ్యక్తులు అప్పుడప్పుడు అకస్మాత్తుగా పోతూ ఉంటారని అనుకోవలసి ఉంది. దీనిని గురించి నేను ఆలోచిస్తే యీ ప్రకృతి రమకు ఒక విధమైన చుప్పనాతితనం ఉన్నదనిపిస్తున్నది. ఏదో ఒక మంచి పువ్వులదండ కట్టాలనుకొని మానవ వనంలోనికి వచ్చి మంచి వాళ్ళనందరను త్రెంచుకొని పోతున్నదనిపిస్తున్నది. ఆ విధంగా ఈయన మరణం నా మనసుకు ఒక విధమైన అఘాతం అయింది. వీరి కుటుంబానికి నా సానుభూతి గాఢంగా తెలుపుతున్నాను. ఈ సభ ఇక్కడ ఏర్పాటు చేసినందుకు మీ అందరిని అభినందిస్తున్నాను. అట్టి మహాపురుషుని యొక్క సంతాప సభ అవసరం కూడా. వారి కుటుంబానికి వారి ఆత్మకు శాంతి కలుగవలెనని నేను ఎక్కువగా ఆశిస్తూ విరమిస్తున్నాను.

24th November 1965 — Oral answers to questions

Centenary Celebrations of great poets

శ్రీ జి.జాషువ (నామినేటేడ్) :- వీరందరి గ్రంథాలూ ప్రజలకు అందుబాటులోకి తేవడం సాధ్యం కాదనుకుంటాను. ఎందుకంటే ఆదిభట్ల నారాయణదాసుగారు కేవలం అచ్చ తెలుగులో ఒక గ్రంథం వ్రాశారు. అది తెలుగులో ఎవరికీ అర్థం కాదు. ఇంగ్లీషులోకి అనువదించడానికి వీలులేదు. కాని తెలుగులో అర్థం అయ్యే భాషలో వ్రాసిన పానుగంటి వారిని, తిరుపతి కవులని – అవి మాత్రం సాధ్యమైనవే. కనుక వాటిని సామాన్య ప్రజలకు అందుబాటులోకి తీసుకువస్తే అవి దేశానికి కూడా ఉపయోగకరంగా ఉంటాయని నా ఉద్దేశ్యం.

# రక్త గానము

ద్వితీయ ప్రపంచ సంగ్రామ కాలంలో జాషువ 'నేషనల్ సాంగ్సు పబ్లిసిటీ ఆర్గనైజరు'గా మద్రాసులో పనిచేశారు. ఆ కాలంలో ఆయన రచించిన ప్రచార గీతములు 'రక్తగానము' అనుపేరుతో వెలువడినవి. ఇందులో మొదటి భాగము ముద్రితము (Madras Government Press, 1943), రెండవ భాగము అముద్రితము. దీనిలో పద్యములు, గేయములు, బుఱ్ఱకథలు, తోలుబొమ్మలాటలు వంటి సాహిత్య ప్రక్రియలెన్నో కలవు.

అయితే ఈ పుస్తకముల కోసం ఎంత ప్రయత్నించినా ఇప్పటివరకు దొరకలేదు. కావున గుదిమెళ్ల భావనారాయణాచార్యులు గారి పిహెచ్.డి. పరిశోధన గ్రంథము 'జాషువా కృతులు: సంప్రదాయము–నవ్యత' (1977), ఆంధ్రవిశ్వవిద్యాలయము నందు ఉటంకించిన ఈ భాగములను పొందుపరచడమైనది.

గుదిమెళ్ల భావనారాయణాచార్యులుగారు రక్తగానము ముద్రితా ముద్రితములు పారెళ్ల జగ్గారావు, మాచర్ల నుండి సేకరించినట్లు తన పరిశోధన గ్రంథంలో రాశారు. ఈ పరిశోధన గ్రంథమును సేకరించి మాకు పంపిన శ్రీ జి.ఎస్. చలం, విజయనగరం గారికి మరొకమారు కృతజ్ఞతలు–సంపాదకులు.

సీ. చండశాసనుడన్న జర్మనీయుడు నేడు దర్పంబు రషియాకు ధారవోసి
దృఢశౌర్య ధనుడన్న ఇటలీల మన్నీదు మొనమొన్న మగడుండి ముండమోసె

సీ. మృతిలెక్క గానడన్న ముతక జాపులరాజు హడలెత్తి వెనుక ముందాడుచుండె
దుముదారు దారల నుత్తముడన్నరో మేలు తామేలువలె మేనుదాచుకొని యె

ఆ.వె. అసమతేజ మొలయు నాంగిలేయుల కత్తి
నిముస నిముసమునకు నిగ్గుదాగె
విశ్వమెట్టులున్న విఖ్యాత విజయంబు
ధర్మమున్న దెసకె తరలివచ్చు

జపాను నిల్చునా జర్మనీ జయించునా
రోముసీమ రామ్ము సూపునా ఓ తెలుగన్నా
అదనుమించె అలుగు నూరుకో
దేశంబు నీది గదా, ధీశక్తి నీదిగదా –

బలగముండి పారిపోదువా వీరుడా
పండువంటి కాపురంబు పరులపాలు గాక
ముందె కనువిచ్చి కలయజూచుకో ఓ తెలుగన్నా
అదను మించె అలుగు నూరుకో ॥జ॥

కత్తిబట్టి కదలిరావోయీ, నాజీపిశాచుల
చిత్తుజేసి చీల్చవలెనోయీ ॥కత్తి॥
గుత్తికొండ బిలాన యోగపు మత్తులోన
నిద్రించు బ్రహ్మన
పుత్రుడగు నెలబాలచంద్రుడు నల్లగొండల సానబట్టిన ॥కత్తి॥

ఆడవే ఖడ్గమా! అఖిల భీకరలీల - మూడు
వేళల నిన్ను పూజించుకొంటాము
ఆజి భారతసేన కాయుస్సుగా నిల్చి
నాజీల పసరాన నల్లగుండెల్లోన ॥ఆ॥

సీ. రెండువందల యేండ్లనుండి ఆపదలేక భోగాలు పెరిగిన బొజ్జవాడ!
చదువు సంధ్యలు నేర్పి సర్వం బెరింగియు పెడదారిలో తేరు నడుపువాడ!
పాపంబెరుగని ప్రజలలో భయవహ్ని దరికాల్చు పంచమ దళము వాడ
ఏదెట్టులైన నాకేమిలెమ్మని భీతి మాని క్రుమ్మరు విద్యలేనివాడ!

తే.గీ. కొండ లగలించు యెనుబదికోట్లదాక
కండ నిక్కిన బాహువుల్ గలుగువాడ
బక్క జిట్టెడు జాపనీయునకు గూడ
పలుచనైతివి కొండంత బ్రతుకు బ్రతికి

సీ. చిరునవ్వు లెగజిమ్ము చిరుత పాపల బోసి నోటిలో కత్తులు నాటినారు
ముత్తైదువుల స్తనంబులగోసి బంధించి గాయాలలో గుండ్లు గాల్చినారు
కళ్ళపైబడి వచ్చు కదువృద్ధజనమును బయనెట్లతో క్రుమ్మివైచినారు
నిరపరాధులచేత బరువులు బట్టించి మ్రొక్కించుకొని తన్నిపోయినారు

తే.గీ. తారుబూసి అగ్గిదరిగాల్ప మానవ
దీపకాంతిలోన తిరిగినారు
కాలుసేతులున్న కరకు బెబ్బులిపిందు
నిశ్చయమ్ముగ జపనీయదండు

సీ. సకల నాజీల కత్తికి కండ గావించి విలయాగ్నికీలల వ్రేల్చుదాక
చెడుగు జపాను బెత్తెడు లంక పెకలించి నలిచి అంబుధిలోన గలుపుదాక
ఫ్యాసిస్టు పులికి రక్తాన్నంబు మేపిన ఐటలేయుని రక్తమానుదాక
ప్రాణాల నరచేతబట్టి తత్తరపోవు పృథివిదేవత నిబ్బరించుదాక

ఆ.వె. ఇంగిలీషు కాల్వ కీవల నావల
విజయ సస్యరాజి వెలయుదాక
ఆంగిలేయనేతలడిదంబు దించరు
వీర కంకణంబు విప్పరమ్మ

'Dinner song'
చెలిమికి మార్గమురా సహభుక్తి,
రమ్ము రమ్ము సఖుడా పంక్తికి

గెలుపు కేతనము నెత్తక పోదు
శత్రులభస్మము సలుపక పోదు
జలధుల జల్లెడ బట్టకపోదు
స్వేచ్ఛ మనకు దయసేయక పోదు
.. ... ... ... ....

'Seller at Black Market'
శిక్షపడతాదోయి బాబు
చింతపోతావోయి
పెరటిదారి బేరగాడా ॥శిక్ష॥

కయ్య మొకదెస కసరుచుంటె
నాటకము చెలరేగుచుంటే
దయ్యమై లాభాలకోసము
దారితప్పి గడింతువేల ॥శిక్ష॥

ఓ దుక్కిదున్నే బక్కవాడా దున్నరా నీదొడ్డ క్షేత్రాలు
ఓ నిక్కమైన చెలిమికాడా - నింపరా నీయింటింట ధాన్యాలు

గొఱ్ఱునాగలి యాడుచుంటే కొల్లగా
ధాన్యాదులుంటే వోటమికి మరిచోటులేదురా

ఆగరా భరతసోదరా - కొంచమాగరా భరతసోదరా
యుద్ధ మాగనిచ్చి ఖర్చుసేయరా-అన్ని వస్తు
వులు సోదరా మిన్నంటియున్నాయి తమ్ముడా

జుట్టు: యుద్ధాని కెళతానె పిల్లా
విమాన మెక్కుతానె
విమాన మెక్కితె గమ్మత్తుగుంటది ॥యు॥

బంగా: విమాన మెక్కుతె - ప్రమాదమొస్తది
జమానువౌరాదా-యుద్ధపు జమాను వౌరాదా మామా

జుట్టు: చక్కనిముద్దులు చద్దిగట్టవె
విజయము దెస్తానే పిల్లా
వీరుణ్ణవుతానే పిల్లా ॥యు॥

దున్నర చిన్నోడ - వన్నెల్ల నీచేను
పట్టర కుర్రోడ - బంగారు నీమేడి
పోరు నిల్చిందాక - పొట్టనిండిందాక ॥దు॥

కూరలేనికూడు కూడు గాదంటారు
కూరగాయలు నాటరన్నయా! మంచి
కూరల్లు పండించ రన్నయా
వంకాయ, బీరకాయ, బలమైన బెండకాయ
చిన్నారి పొన్నారి చిక్కుడు-మేలి ముల్లంగి
బీటురూటు గుమ్మడి-ఉల్లి-సొరకాయ
క్యాబేజి, కాకర, చామ, రాంమొలక్కాయలు
మేలి బటాణి బంగాళ దుంపలు - గందు విటమిన్లు
గల మంచి కమ్మని దినుసుల్లు ॥కూర॥
పొట్లకాయనిండ భూరిసారంబుండు
హిట్లర్ను సాధించగలవురా-రక్తవృద్ధి కిదె మంచితిండి
పగతు రీకూర భక్షింపలేరురా
ఒక్క హిందూదేశీయులకె లభ్యమౌనీపంట ॥కూర॥
సీమ చిక్కుడుగాయ - సీమ మెరపకాయ
సీమ కందగడ్డ నాటరా - అందు సీమరాజుల శక్తిగలదు
నీవు సీమరాజుల చెలిమి చేసినట్లుంటాది

విజయము మాది విజయకాంత మా
మిత్రమండలిని వరించెరా విజయము మాది
కత్తుల నీడన కవాతు సల్పుతు
ఎత్తిరి మా వీరులు జెండా
చిత్తయినవి ఫాసిస్టు రథంబులు
విజయము మాది విజయకాంత మా
మిత్రమండలిని వరించెరా

# ANDHRA UNIVERSITY



This is to certify

*That the Honorary Degree of*

## KALĀ-PRAPŪRNA

*of this University was conferred*

*on*

## Sri GURRAM JOSHUA

*at*

*the Convocation of the Senate*

*held on Friday, the 26th December 1969*

*Given under the Seal of the University.*

Waltair

CHANCELLOR




ఫారం-6

FORM NO. 6

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

GOVERNMENT OF ANDHRA PRADESH



వైద్య మరియు ఆరోగ్య శాఖ

## DEPARTMENT OF MEDICAL & HEALTH SERVICES (VITAL STATISTICS)

మరణ ధృవీకరణపత్రము

A NO : 43275/2012/90/5

# CERTIFICATE OF DEATH

జనన మరణ నమోదు చట్టము 1969, 12/17, విభాగము ప్రకారము, ఆంధ్రప్రదేశ్ జనన మరణ నమోదు నిబంధనలు 1999, 8/13 నిబంధన క్రింద జారీ చేయబడినది.

(Issued under Section 12/17 of the Registration of Births and Deaths Act 1969 and Rules 8/13 of the Andhra Pradesh Registration of Births and Deaths Rules 1999)

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రము, గుంటూరు జిల్లా, గుంటూరు నగర పాలక సంస్థ 1971 లో వున్న మరణ రిజిష్టరు ప్రకారము ఈ క్రింద తెలిపిన సమాచారము ఇవ్వబడినదని ధృవీకరించుచున్నాము.

This is to certify that the following information has been taken from the original record of deaths of GUNTUR of Municipal Corporation, GUNTUR, GUNTUR District of ANDHRA PRADESH state, INDIA.

1. నమోదు నెంబరు
REGISTRATION NO. 1971-60-46

2. నమోదు తేది
DATE OF REGISTRATION 27-07-1971 (27 JULY 1971)

3. మరణతేది
DATE OF DEATH 24-07-1971 (24 JULY 1971)

4. పేరు
NAME OF THE DECEASED GURRAM JASHUA

5. సెక్సు
SEX MALE

6. తండ్రి/భర్త పేరు
NAME OF THE FATHER/HUSBAND VEERAIAH

7. తల్లి పేరు
NAME OF THE MOTHER

8. చనిపోయిన ప్రదేశము
PLACE OF DEATH VALLURIVARI THOTA GUNTUR GUNTUR .

9. మరణించినపుడు మృతుని చిరునామా
Address of the Deceased at the time of Death * * * * * *

10. మృతుని స్థిరనివాసపు చిరునామా
Permanent Address of the Deceased * * * * * *

తేది :
DATE [illegible] OCTOBER 2012)

సీలు :
SEAL

Office of the Registrar of Births & Deaths, Municipal Corporation GUNTUR

తయారు చేసినవారు
PREPARED BY

Authorised Signatory

జనన మరణ రిజిష్ట్రారు
REGISTRAR OF BIRTHS & DEATHS &
మున్సిపల్ ఆరోగ్యశాఖ అధికారి
MUNICIPAL HEALTH OFFICER
నగరపాలక సంస్థ, గుంటూరు
Municipal Corporation, Guntur

గమనిక: మరణరిజిష్టరులో నమోదు చేయబడిన మరణకారణము వెల్లడించబడదు.
Note: In the case of death no disclosure shall be made of particulars regarding the cause of death as entered in the Register